# యోగవాశిష్ఠ హృదయము

## ఈ గ్రంథం గురించి

పన్నెండేళ్ళ శ్రీరాముడిలో పెల్లుబికిన తత్త్వ విచికిత్సా కల్లోలానికి
వశిష్ఠమహర్షి చూపించిన పరిష్కారం
ఆత్మతత్త్వావగాహనకై కురిపించిన యుక్తుల వర్షం
గజిబిజి అల్లికలైన ఉపనిషత్తులను వింగడించి నిరూపించిన సారం
రామాయణ రచనానంతరం
వాల్మీకి మహర్షి మహాకవి చేతిలో
కవితా రసమయంగా రూపొందిన తాత్త్విక కావ్యం
అదే యీ యోగవాశిష్ఠం!
దీని సారాన్ని
అటు సనాతన సాంప్రదాయిక విద్యతోనూ
ఇటు అధునాతన విజ్ఞానశాస్త్రంతోనూ సమన్వయించి
కవి హృదయం శ్రోతలకు అందే లాగా
అవధూత దత్తపీఠ విద్యాధికారి

**శ్రీ కుప్పా వేంకట కృష్ణమూర్తిగారు**

(+91 40−24035013, E-mail: vedakavi@serveveda.org, web: www.serveveda.org)

జెమినీ **T.V** లో చేసిన ప్రవచనాలకి
అక్షరరూపమే
ఈ
**యోగవాశిష్ఠ హృదయము**
ఇది మొత్తం ఏడు ప్రకరణాల ఉద్గ్రంథం.

ఆధ్యాత్మిక విద్యాతపన గల ఈ వెబ్‌సైట్ పాఠకులందరికీ ఈ కవి హృదయకమలం
పూజాకుసుమంగా సవినయ సమర్పితం.

# రచయిత మనవి

కవి తన హృదయాన్ని ఎందుకు దాచుకుంటాడు?

దొరికినవారికి అది మరింత మహోజ్జ్వలంగా ప్రకాశించేందుకోసమే దాచుకుంటాడు!

అందుకనే కవి తన హృదయాన్ని ఇనప పెట్టెలో దాచడు, పదాల పూరేకుల్లో దాస్తాడు!

తన హృదయం పఠితలకు అందాలి. కానీ, కొంత కృషి చేసినవారికే అది అందాలి. ఇది మహాకవుల దృష్టి! వారి సృష్టిలోని అంతర్దృష్టి!!

యోగవాశిష్ఠం విషయంలో నా కృషి చాలా స్వల్పమే అయినా, శ్రీగణపతి సచ్చిదానంద గురుదేవుల కృపాబలం, వాల్మీకి మహాకవి హృదయాన్ని నాకు అనాయాసంగా తెరిచి చూపించిన అనుభూతి అడుగడుగునా వుంది. ఇది నా అదృష్టం. దీన్ని నా సోదరులందరితోనూ కలసి పంచుకోవాలనే ఆశయంతోనే జెమినీ T.V లో యోగవాశిష్ఠ ప్రవచనాలు జరిగాయి.

"మధుమయ ఫణితీనాం మార్గదర్శీ మహర్షిః" అన్నాడు కవికుల గురువైన కాళిదాసు, వాల్మీకి మహాకవిని గురించి ప్రస్తావిస్తూ. ఈ వాక్యం అసలు రామాయణ విషయంలో కంటే, వాశిష్ఠరామాయణ విషయంలో మరింతగా అక్షర సత్యం.

శ్రీరాముడు లాంటి మహానాయకుణ్ణి, రావణవధవంటి మహాకథనీ, ఎంచుకున్నప్పుడు, సామాన్య కవికైనా సరే, కవిత్వాన్ని పండించటం పెద్ద కష్టం కాకపోవచ్చు. కానీ, సాక్షాత్తుగా శుష్కవేదాంతాన్ని విషయంగా తీసుకొని, దాన్ని అతినిశితమైన శాస్త్రచర్చలతో నింపి, 32 వేల శ్లోకాలకు సాగదీసి, అయినా కూడా దానిలో కావ్యత్వాన్ని, కవితాత్మనూ, సజీవంగా నిలబెట్టగలగటం వాల్మీకి మహాకవికి ఒక్కడికే చెల్లింది. ఆయనతో పోటీపడి అలాంటి పని సాధించగల కవి మరొకడు ఇంతవరకూ పుట్టలేదు.

గురుదేవుల కృపతో ఈ గుర్తింపు కలగటంవల్ల, ఈ మహాగ్రంథంలో ఆ మహాకవి హృదయమేమిటని అన్వేషించాలని ఆరాట పడ్డాను. ఈ విషయంలో నన్ను నిజంగా "పదే పదే" ఆదుకొన్న మహానుభావుడు "పరమహంస శ్రీమదానంద బోధేంద్ర సరస్వతీ యతివరుడు". ఆయన రచించిన "తాత్పర్య ప్రకాశ వ్యాఖ్య" నాలాంటి మరిగుజ్జును సాలప్రాంశువుగా మార్చి, యోగవాశిష్ఠ రసాల ఫలాలను చేతికందించింది. ఆ బలంతోనే యోగవాశిష్ఠ హృదయాన్ని అందుకొనే ప్రయత్నం నేను చెయ్యగలిగాను.

ముందుగా ఈ యోగావాశిష్ఠమంటే యేమిటో పఠితలకు పరిచయం చెయ్యటం సముచితం. ఈ రోజుల్లో పరిచయాలన్నీ "ఫార్మాట్" రూపంలో వుండటం పరిపాటి కనుక, నేనూ అలాగే చేస్తాను.

**యోగవాశిష్ఠ పరిచయము:**

1. **రచయిత** – వాల్మీకి మహర్షి
2. **రచన కాలం** – రామాయణ రచన పూర్తి అయిన తరువాత కొద్ది కాలానికి
3. **గ్రంథానికి ఇతర పేర్లు** – జ్ఞానవాశిష్ఠము, వాశిష్ఠ రామాయణము, ఉత్తర రామాయణము, మహారామాయణము, వాశిష్ఠము, వాసిష్ఠము మొదలైనవి.
4. **గ్రంథ పరిమాణము** – 32 వేల శ్లోకాలు. (అసలు రామాయణం 24 వేల శ్లోకాలే)
5. **విషయం**–పరమాత్మ తత్త్వ విచారణ. 12 సంవత్సరాల శ్రీరాముడికి విశ్వామిత్ర మహర్షి, వశిష్ట మహర్షి, చేసిన తత్త్వ బోధలు. హృదయంలో తత్త్వ విజ్ఞానం కలవాడు మరింత వ్యవహార దక్షుడు అవుతాడని నిరూపణ.
6. **రచనా శైలి, ప్రత్యేకతలు** –

ఎ) చెప్పదలచుకొన్న సిద్ధాంతాన్ని ముందు సంగ్రహంగా చెబుతారు.

బి) అదే విషయాన్ని మళ్ళీ అందమైన కథ ద్వారా వివరిస్తారు.

సి) ఈ కథలోని సంకేతాలను మళ్లీ గ్రంథ కర్తే వివరిస్తారు.

డి) ఏ సిద్ధాంతాన్నీ ఖండించడం వుండదు.

ఇ) వాద ప్రతివాదాలు వుండవు.

ఎఫ్) అనేక రకాల సందేహాలను లేవదీసి సమాధానాలు చెబుతారు.

జి) విషయం శుష్కమైన వేదాంతం అయినప్పటికీ, రచనలో అడుగడుగునా కవితా సౌందర్యం ఉట్టిపడుతూనే వుంటుంది.

హెచ్) అడుగడుగునా ఊహకందని ఉపమానాలంకారాలు విందులు చేస్తూ ఉంటాయి.

7. **సంగ్రహాలు** – ఈ గ్రంథం చాలా విస్తారమైనది అవటంచేత ఉత్తర భారతంలోనూ, దక్షిణ భారతంలోనూకూడా, దీనికి కొన్ని సంగ్రహ ప్రతులు ఏర్పడ్డాయి. వీటిలో ప్రసిద్ధమైనవి–

ఎ) కాశ్మీర దేశీయుడు అభినందన పండితుడి సంగ్రహం.
ఇది ఆరు వేల శ్లోకాలు.

బి) కాళహస్తి శుక బ్రహ్మ ఆశ్రమ అధిపతి
శ్రీవిద్యాప్రకాశానందగిరి స్వామివారి సంగ్రహం. దీని పేరు వశిష్ఠ గీత.
సుమారు 8 వేల శ్లోకాలు

8. **అనువాదములు** – అన్ని జాతీయ భాషలలోనూ దీనికి అనువాదాలున్నాయి. తెలుగులో 5 వచనానువాదాలను, ఒక పద్యానువాదాన్ని, నేను చూశాను. వీటిలో బ్రహ్మశ్రీ మల్లావఝ్ఝల సుబ్బరాయశర్మగారి అనువాదం ప్రామాణికమై వుండి నాకు ఎంతో ఉపకారం చేసింది. వీరందరికీ నా కృతజ్ఞతలు.

9. **పెద్దల అభిప్రాయాలు** – ప్రాచీనులు మాత్రమే గాక నవీన సద్గురువులు కూడా ఈ గ్రంథాన్ని విశేషంగా అభిమానించారు. ఉదాహరణకు

ఎ) శ్రీ స్వామి రామతీర్థ ఇది ప్రపంచంలోని ఆధ్యాత్మిక
గ్రంథాలన్నిటిలోకీ "Most Wonderfull" అన్నారు.

బి) ఏర్పేడు వ్యాసాశ్రమ పీఠాధిపతులు
శ్రీమళయాల స్వామివారు ఈ గ్రంథాన్ని విశేషంగా ఆదరించారు.

సి) శ్రీ గాయత్రీ పీఠాధిపతులు తత్త్వ ప్రతిపాదక గ్రంథములలో ఇది మొదటిది అన్నారు.

10. **గ్రంథంలోని ప్రకరణాలు** – ఇవి ఆరు.

1. వైరాగ్య ప్రకరణము (1,500 శ్లోకాలు)
2. ముముక్షు వ్యవహార ప్రకరణము (1,000 శ్లోకాలు)
3. ఉత్పత్తి ప్రకరణము (7,000 శ్లోకాలు)
4. స్థితి ప్రకరణము (3,000 శ్లోకాలు)
5. ఉపశమ ప్రకరణము (5,000 శ్లోకాలు)
6. నిర్వాణ ప్రకరణము (పూర్వార్థము,ఉత్తరార్థము) (14,500 శ్లోకాలు)

వైరాగ్య ప్రకరణంలో శ్రీరాముడికి కలిగిన వైరాగ్య ప్రకారాన్ని వివరంగా వర్ణించారు.

రెండవదైన ముముక్షు వ్యవహార ప్రకరణంలో –ముముక్షువుకు వుండవలసిన సాధనా సంపత్తిని గూర్చి విస్తారంగా చర్చించారు. దీనిలోనే మోక్షం కోసమై పురుష ప్రయత్నం చేయ్యాలా? అక్కర్లేదా అని విచారణ చేసి, పురుషప్రయత్నం చెయ్యాలి – అని సిద్ధాంతం చేశారు.

ఉత్పత్తి ప్రకరణంలో – కనిపించే ఈ ప్రపంచానికి ఉత్పత్తి వున్నదా? లేదా? అనే విచారణ చేశారు.

స్థితి ప్రకరణంలో జగత్తుయొక్క స్థితిని వివరించారు.

ఉపశమ ప్రకరణంలో జ్ఞానం ద్వారా అంతఃకరణోపశమనం కలిగించే విధానాలను వివరించారు.

చిట్ట చివరిది, నిర్వాణ ప్రకరణం. ఇది చాలా పెద్దది. దీనిని రెండు భాగాలుగా విభజించారు. నిర్వాణం అంటే మోక్షం. మోక్ష ప్రాప్తిని గూర్చి దీనిలో కూలంకషంగా చర్చించారు.

**11.వ్యాఖ్యానాలు** – దీనికి సంస్కృతంలో అనేక వ్యాఖ్యానాలు ఉన్నాయని ప్రసిద్ధి ఉన్నప్పటికీ, ఆనందబోధేంద్ర సరస్వతీ యతి రచించిన తాత్పర్య ప్రకాశికా వ్యాఖ్యానం మాత్రమే ముద్రితమై లభిస్తోంది. దీనిని 1937లో నిర్ణయ సాగర్ ప్రెస్‌వారు ముద్రించారు. ఈ వ్యాఖ్యానం బహు విపులమై పండిత ప్రశంసలు అందుకొంది.

**ఈ వాల్మీకి ఎవరు?:**

యోగవాశిష్ఠ రచయిత అయిన వాల్మీకీ, సుప్రసిద్ధ రామాయణ రచయిత అయిన వాల్మీకీ, ఒకరు కాదని కొందరు ఉత్సాహంగా వాదిస్తున్నారు. అలా వాదించే వారిలో రెండు రకాలవారున్నారు.

అద్వైత సిద్ధాంతాన్ని అతి స్పష్టంగా ప్రతిపాదించే ప్రాచీనతర గ్రంథాలలో యీ యోగవాశిష్ఠం చాలా ప్రబలమైనది. అందువల్ల అద్వైత సిద్ధాంత వ్యతిరేకులు కొందరు దీని ప్రామాణ్య బలాన్ని తగ్గించేందుకోసం ఇది వాల్మీకి రచన కాదని ఆరాటంతో పోరాటానికి దిగుతూ వుంటారు. వీరు ఒక రకం.

ఇక రెండవ రకంవారు – "ఆధునిక విమర్శ దృష్టితో గ్రంథాలను పరిశీలించాలే గానీ, సాంప్రదాయక దృష్టితో కాదు"– అని భావించేవారు. మొదటి రకం వారుగూడా, అటుతిరిగి, ఇటుతిరిగి, యీ రెండవ రకం వారి అండకే చేరుతూ వుంటారు కనుక, వీరి వాదన యేమిటో కొంచెం పరిశీలిద్దాం. ఈ వాదనలో ముఖ్యమైన అంశాలు రెండే.

శైలి విషయంలో మామూలు రామాయణానికీ, యోగవాశిష్ఠానికీ, పెద్ద భేదాన్ని ఎవరూ ఆపాదించలేరు. విమర్శకు లెవరూ ఆ విషయంలో పెద్దగా వాదాలు చెయ్యటం లేదు. కానీ, "ఈ యోగ వాశిష్టం గురించిన ప్రసక్తి అసలు రామాయణంలో నామ మాత్రంగా గూడా లేదు కదా! ఎందుకు లేదు?" –అని నవీన విమర్శకులు ప్రశ్నిస్తున్నారు. దీనికి విపులమైన సమాధానం అసలు గ్రంథంలోనే వైరాగ్య ప్రకరణ ప్రారంభంలోనే వుంది. దయచేసి పరిశీలించండి.

ఇక రెండవ ముఖ్యాంశం! "ఈ గ్రంథంలో అనేకచోట్ల వ్యాసుడి ప్రసక్తి, శుకుడి ప్రసక్తి, భగవద్గీత, అర్జునుడు, కృష్ణుల, ప్రసక్తి, విస్పష్టంగా వున్నాయి కదా! వీటిని బట్టి యీ గ్రంథం భగవద్గీతానంతర రచన అని ఖాయం కావటం లేదా?" అని వారు ప్రశ్నిస్తున్నారు.

ఇందులో వ్యాస శుకుల ప్రసక్తి గురించి, ప్రశ్న సమాధాన రూపమైన చర్చ మూలగ్రంథంలోనే వుంది. దీన్ని శ్రీరామ వశిష్ఠుల చర్చగా వాల్మీకి మహర్షి నిర్వహించాడు.

ఇక భగవద్గీత ప్రసక్తి గురించి ఆలోచించేముందు, ఒక ముఖ్య విషయాన్ని పాఠకుల దృష్టికి తీసుకు రావలసి వుంది.

ఇది భగవద్గీతానంతర రచన అని గదా, మనం ఆలోచిస్తున్నాం! అంటే, భగవద్గీతానంతర కాలంలో ఎవడో ఒక కవి వాల్మీకి శైలిని ఎంతో కొంత అభ్యాసం చేసి, ఆ శైలిలో అద్వైత ప్రతిపాదన చేసే గ్రంథాన్ని వ్రాసి, దానికి విలువ పెరిగేందుకోసం వాల్మీకి మహాకవి పేరున ఆ గ్రంథాన్ని ప్రచారంలోకి తెచ్చాడు – అని గదా మన ఆలోచన!

అలా తన గ్రంథానికి వాల్మీకి పేరు పెట్టిన కవి పేరు గూడా వాల్మీకే అయి వుండవచ్చు, కాకపోనూవచ్చు. పేరేదైనా, ఆయన వేదాంత శాస్త్రంలో గట్టి పండితుడు. చెయ్యి తిరిగిన మహాకవి, 32వేల శ్లోకాల గ్రంథాన్ని అందంగా పూర్వాపర విరోధం లేకుండా, నిర్వహించగల సమర్థుడు. యుక్తి యుక్తంగా విషయ ప్రతిపాదన చెయ్యగల తార్కికుడు! ఇలాంటి వ్యక్తి ఒక గ్రంథం రచించి, దాన్ని వాల్మీకి కృతంగా లోకానికి అందించాలని సంకల్పించాడు. అలాంటివాడు లోకులకు అనుమానం కలిగే ఘట్టాలను తన గ్రంథంలో చేరుస్తాడా? "ఆయనకు అంత ఆలోచన వచ్చి వుండదు" అనుకుందామంటే, ఆ వ్యక్తియొక్క సామర్థ్యం ఎటువంటిదో ఇపుడే చెప్పుకున్నాం కదా! అంతటి సమర్థుడు, తెలిసి తెలిసీ, ఇలాంటి లొసుగు పనులు చేస్తాడా? అది అసంభవం. కనుక భగవద్గీతానంతరం కవులలో ఎవడో ఒకడు ఇలాంటి పని చేశాడని ఊహించటం మన తెలివి తక్కువ తనమే అవుతుంది.

"ఐతే, రామాయణ వాల్మీకే యీ యోగవాశిష్ఠాన్ని రచించివుంటే, ఎప్పుడో ఒక యుగం తరువాత, ద్వాపరయుగాంతంలో రాబోయే భగవద్గీత ప్రసక్తిని యీ గ్రంథంలోకి ఎందుకు తెస్తాడు? ఎలా తెస్తాడు?" అంటారా?

**వాల్మీకీ స్వభావం:**

వాల్మీకి మహాకవి స్వభావంలోనే అలాంటి గుణం వుంది. ఎలాగంటారా? చూడండి.

పూర్వరామాయణంలో వాల్మీకి మహాకవి తన కావ్యావతరణ ఘట్టాన్ని స్పష్టంగా వర్ణించాడు. దైవయోగంగా ఆయన నోటి వెంట కవితాధార మొదలైంది. ఈ కవిత్వంతో ఏం చేయాలా అని ఆలోచిస్తూ ఉండగా, నారద మహర్షి వచ్చి అప్పటికి రాజ్యపాలన చేస్తూ వున్న శ్రీరామచంద్ర ప్రభువును గురించి పరిచయం చేసి, "ఇక మిగిలిన కథా వివరాలన్నీ నీ దివ్య దృష్టితో నువ్వే దర్శించి, ఒక మహాకావ్యం రచించు" అని ప్రోత్సహించి వెళ్ళిపోయాడు. ఆ తరువాత బ్రహ్మదేవుడి ప్రోత్సాహం కూడా తోడైంది. దాంతో ఉద్దీపన పొందిన వాల్మీకి మహర్షి, తన దివ్య దృష్టితో రామకథలోని ప్రతి అంశాన్నీ

పరిశీలించి చూశాడు. ఆ వరుసలో వరుసగా, భవిష్యత్ ఘట్టాలను కూడా ఆయన దర్శించాడు. తను దర్శించింది దర్శించినట్లే కావ్యంగా వ్రాశాడు. అదే శ్రీమద్రామాయణ మహాకావ్యం.

అందుకే ఆ కావ్యంలోని మొట్టమొదటి సర్గలోనే, వాల్మీకి మహాకవి కొంతవరకూ భూతకాల క్రియా పదాలను ప్రయోగించి, ఆ పైన వర్తమానకాల క్రియా పదాలను, ఆ పైన భవిష్యత్ కాల క్రియా పదాలను, ప్రయోగించాడు. చూడండి.

**నంది గ్రామే జటా హిత్వా భ్రాతృభిస్సహితోఽ నఘః।**

**రామస్సీతా మనుప్రాప్య రాజ్యం పునరవాప్తవాన్ ॥**

(బాలకాండ 1వ సర్గ 89వ శ్లోకము)

(తా॥ రాముడు తమ్ములతో గూడిన వాడై, నందిగ్రామ మందు జడలను విడిచి, సీతను చెంతకు తీసికొని, మరల రాజ్యమును పొందెను.)

దీనిలో "అవాప్తవాన్" (= పొందెను) అనే భూతకాల క్రియ వుంది.

**న చాగ్నిజం భయం కించి న్నాప్సు మజ్జన్తి జన్తవః**

(బాలకాండ 1వ సర్గ 92వ శ్లోకము)

(తా॥రాముడు రాజ్యం చేస్తూ వుండగా ప్రజలకు అగ్ని భయం లేదు. ఎవరూ నీళ్ళల్లో మునిగి మరణించటం లేదు.) ఇక్కడ "న మజ్జన్తి" (= మునగటం లేదు) అని వర్తమాన కాల క్రియా పదం వుంది.

**రాజవంశాన్ శతగుణాన్ స్థాపయిష్యతి రాఘవః।**

(బాలకాండ 1వ సర్గ 96వ శ్లోకము)

(తా॥ శ్రీరాముడు వందలకొలదీ రాజవంశాలను స్థాపించగలడు.) ఇక్కడ "స్థాపయిష్యతి" (= స్థాపించగలడు.) అని భవిష్యత్ కాల క్రియా పదం వుంది.

ఇలా తన దివ్య దృష్టితో చూసిన ప్రకారంగా, భూతకాల కథను భూతకాలంగానూ, వర్తమానకాల కథను వర్తమాన కాలంగానూ, భవిష్యత్కాల కథను భవిష్యత్ కాలంగానూ, యథాతథంగా ప్రతిపాదించే అలవాటు వాల్మీకి మహర్షికి స్వతస్సిద్ధంగానే వుందనే విషయం పూర్వ రామాయణంలోనే మనకు తెలుస్తోంది.

రామాయణంలోనే ఉత్తర కాండలో మరో ఘట్టం వుంది. సీతాదేవి భూప్రవేశం చేసినాక, శ్రీరాముడు దుఃఖంతోనూ, క్రోధంతోనూ, ఉడికిపోగా, బ్రహ్మదేవుడు స్వయంగా ప్రత్యక్షమై, ఆయన్ని ఓదారుస్తూ ఇలా అన్నాడు–

**ఏతదేవ హి కావ్యం తే కావ్యానా ముత్తమం శ్రుతమ్।**

**..........................................................**

**భవిష్యదుత్తరం చైవ సర్వం వాల్మీకినా కృతమ్।**

**..........................................................**

**శేషం భవిష్యం కాకుత్స్థ కావ్యం రామాయణం శ్రుణు।**

**..........................................................**

**న ఖల్వన్యేన కాకుత్స్థ శ్రోతవ్యమిదముత్తమమ్॥**

(బాలకాండ 98వ సర్గ, 16నుంచి 22దాకా శ్లోకాలు)

(తా॥ రామా! నీ గురించి రాసిన ఈ కావ్యాన్ని నువ్వు విన్నావు. ఇది చాలా గొప్పది. దీనిలో వాల్మీకి భవిష్యత్ కథ కూడా చెప్పాడు. ఆ భాగాన్ని పూర్వమే నేను విన్నాను. రామా! నువ్వు ఇప్పుడు ఆ రామాయణంలో మిగిలిన భవిష్యత్ భాగాన్ని విను. ఇది నువ్వు తప్ప ఇతరులు వినరాదు.)

బ్రహ్మదేవుడు ఇలా ఆజ్ఞాపించగా , శ్రీరాముడు కొద్దిమంది బ్రహ్మర్షులతో కలిసి, తన భవిష్యత్ కథను విన్నాడు – అని అక్కడ వుంది. ఈ ఘట్టం కూడా వాల్మీకియొక్క భవిష్యత్ కథారచన శీలాన్ని వ్యక్తం చేస్తోంది.

వాల్మీకి మహర్షి మహాకవికి ఇలాంటి స్వభావం వుంది కనుకనే, యోగవాశిష్ఠంలో కూడా కొన్ని సందర్భాలలో అతి ప్రాచీన పూర్వగాథలను, మరికొన్ని సందర్భాలలో సుదూర భవిష్యత్ కథలను కూడా, ఆయన పొందుపరచటం జరిగింది. అలాంటి సన్నివేశాలు వచ్చినప్పుడు పఠితలకు సందేహాలు వస్తాయని ఆయనకు ముందే తెలుసు. అందుకే, ఆయా సందర్భాలలో శ్రీరాముడిచేతనే ప్రశ్నింప చేసి, ఇది ఎప్పటి కథో , ఇది ఇక్కడ ఎలా అతుకుతుందో తనే వివరించాడు.

వ్యాసమహర్షి ఘట్టం వచ్చినప్పుడు అలాగే చేశాడు. భగవద్గీతాఘట్టం వచ్చినప్పుడు కూడా ఆ కవి దాన్ని అలాగే వివరించాడు. ఆ ఘట్టం నిర్వాణ ప్రకారణంలో రాబోతోంది.

ఇలా భవిష్యత్ ఘట్టాలను, సుదూర భూతకాల ఘట్టాలను, ప్రస్తావించే పద్ధతి మహర్షులైన ఇతర కవుల రచనలలో కూడా కనిపిస్తూనే వుంటుంది. ఋషుల రచనాశైలితో బాగా పరిచయం వున్నవారికి ఇది కొత్తగా వుండదు. అగస్త్య సంహితలో పుట్టబోయే రాముణ్ణి గురించి అగస్త్యమహర్షి సుతీక్ష్ణమహర్షికి వివరించాడు. ఈ విషయం ఈ గ్రంథంలోనే వైరాగ్య ప్రకరణంలోనే ప్రస్తావనకు వచ్చింది. వ్యాస భగవానుడి రచనలలో భవిష్య పురాణమని ప్రత్యేకంగా ఒక పురాణమే వుంది.

లోకంలో ఈనాడు మనకు తెలిసివున్న కవులంతా సాంసారిక కవులే. ఆర్ష వాఙ్మయాన్ని బాగా వంటపట్టిచ్చుకోవటం ద్వారా, వారిలో ఋషిత్వ రేఖ తాత్కాలికంగా ప్రవేశించి, మహాకావ్యాలు ఉద్భవిస్తూ వుంటాయి. వాల్మీకి వ్యాసాదులు స్వతస్సిద్ధంగా మహర్షులు. కవిత్వం వారిని తాత్కాలికంగా ఆవేశించగా, వారిలోంచీ విశ్వజనీన, విశ్వకాలీన, మహా కావ్యాలు ఆవిష్కృతములవుతూ వుంటాయి! మామూలు కవులను కొలిచే కొలబద్దలతో ఋషి కవులను కొలవాలనుకోవటం, మూరలతో హిమాలయాన్ని కొలవాలనుకోవటమే కాగలదు.

కనుక ఈ విధమైన, ఆర్షశైలీ పరిచయ సంపన్నమైన, విమర్శన దృష్టితో పరిశీలించి చూసినప్పుడు, ఈ యోగవాశిష్ఠం రామాయణ కర్తయైన వాల్మీకి రచించినదే అనటంలో సందేహించవలసిన పని వుండదు. ఆర్షశైలితో పరిచయం వుండి కూడా, అద్వైత సిద్ధాంతం మీద వ్యతిరేకతతో దీన్ని అవాల్మీకి కృతంగా నిరూపించాలనే పట్టుదలతో వున్నవారికి మౌనంగా నమస్కరించటమే ఉత్తమం.

**హృదయము:** ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే, ఈ గ్రంథ రచయిత వాల్మీకి. ఈయన మహాకవి. అంతకుమించి మహర్షి. ఋషి అంటే తత్త్వాన్ని దర్శించేవాడు. కవి అంటే కాంతా సంమితంగా పలికేవాడు. ఈ రెండు లక్షణాలూ వాల్మీకిలో కలిసి వున్నాయి. కనుకనే, పైకి మామూలుగా కనిపిస్తూనే లోపల అంతులేని రత్నాలను దాచి వుంచగల వాక్యశైలి ఆయనకు వంటబట్టింది. రామాయణంలో అడుగడుగునా ఆ లక్షణం వుంది. గోవిందరాజ వ్యాఖ్యానమే లేకపోతే, ఇక్కడ శ్లేష వుంది. ఇక్కడ అర్థాంతరం వుంది, అని మనం కలలో కూడా ఊహించం. ఆ మహాకవే ఈ యోగవాశిష్ఠాన్ని రచించాడు. కనుక, ఇక్కడ గూడా ఆ లక్షణమే వుంటుంది. ఆ నిగూఢ కవి హృదయాన్ని పట్టుకుంటేనే ఆయన దర్శించిన తత్త్వాన్ని మనం అందుకోగలుగుతాం.

ఈ దృష్టితోనే ఈ గ్రంథాన్ని, దీని వ్యాఖ్యానాన్నీ కూడా, నేను అధ్యయనం చేశాను. పెద్దలనడిగాను. గురుదేవులను ప్రార్థించాను. పూర్వాశ్రమంలో మాకు పితృపాదులు, ప్రస్తుతాశ్రమంలో బ్రహ్మవిద్యా గురుదేవులు అయిన ప్రాస్స్మరణీయులు శ్రీశ్రీశ్రీ **జనార్దనానంద సరస్వతీ యతీంద్రుల** బోధలను అనుసంధానం చేసుకొన్నాను. నేను గ్రహించగలిగినది జెమిని టెలివిజన్ వారి ప్రాతఃకాల ప్రవచనాల్లో ప్రజలకు విన్నవించాను. దానినే ఇప్పుడు ఈ గ్రంథంగా మీ ముందు వుంచుతున్నాను. అందుకే దీని పేరు "యోగవాశిష్ఠ హృదయము."

**వాశిష్ఠమా? వాసిష్ఠమా? :** ఈ గ్రంథంలో వశిష్ఠ, వాశిష్ఠ పదాలు వచ్చినప్పుడు నేను "మెలిక శ"ని (శివలోని "శి"ని) వాడాను. కొందరు గ్రంథకర్తలిక్కడ దంత్య "స కారం" (సీతలోని సకారం) వాడారు. రెండూ ఒప్పే, రండూ ఒకటే. శబ్ద కల్పద్రుమంలో ఈ రెండు శబ్దాల వ్యుత్పత్తినీ విస్పష్టంగా ప్రదర్శించారు. అక్కడ ఇలా వుంది –

**వశవతాం - వశినాం శ్రేష్ఠః ఇత్యర్థే ఇష్ఠన్‌ప్రత్యయః - విన్మతోర్లుక్ ఇతి లుక్ -**

**వశిష్ఠః - పృషోదరాదిత్వాత్ శస్య సః వసిష్ఠః–** అని.

ఆ శబ్ద కల్పద్రుమంలోనే, మహాభారత శ్లోకం వొకటి ఉదహరించారు–

**వశిష్ఠోఽస్మి వరిష్ఠోఽస్మి వశే వాసగృహేష్వపి ।**
**వశిష్ఠత్వాచ్చ వాసాచ్చ వసిష్ఠ ఇతి విద్ధి మామ్॥**

ఇది 13వ పర్వ– 63వ అధ్యాయం – 96వ శ్లోకం –అని అక్కడే చేప్పారు. ఇంద్రియనిగ్రహం గలవాళ్లలో శ్రేష్ఠుడు గనుక వశిష్ఠుడనీ, గృహస్థులలో శ్రేష్ఠుడు గనుక వసిష్ఠుడనీ, రెండూ నా పేర్లే – అని ఈ శ్లోకంలో వశిష్ఠుడే స్వయంగా చెపుతున్నాడు. కనుక ఆ రెండు పేర్లల్లో దేన్ని వాడుకున్నా తప్పులేదు. వేదాంత విద్యలో ఇంద్రియ జయం ప్రధానం కదా అని, నేను వశిష్ఠ పదాన్ని (మెలిక శ వున్న పదాన్ని) ఎక్కువగా అభిమానించాను.

విషయ ప్రతిపాదనలో, సర్గల సంపుటీకరణంలో, ఆధునిక విజ్ఞాన సమన్వయంలో, కొన్ని కొత్త దారులు తొక్కాలని ప్రయత్నించాను. ఈ విషయంలో నేనెంతవరకు కృతకృత్యుడినో విజ్ఞులైన పఠితలే నిర్ణయించాలి. ఎక్కడైనా దోషాలు కనిపిస్తే దయచేసి తెలుపండి. ఉత్తరోత్తరా వాటిని సవరించుకుంటాను. అయితే, ఈ గ్రంథాన్ని మూల గ్రంథానికి అనువాదంగా గానీ, సంగ్రహీకరణంగా గానీ, దయచేసి దర్శించకండి. కవి హృదయాన్ని అందుకునే ప్రయత్నంగా మాత్రమే దర్శించండి–అని మరోసారి మనవి చేస్తున్నాను. ఇప్పుడు ఈ గ్రంథంలోని వైరాగ్య ప్రకరణం ప్రథమభాగంగా మీ చేతిలో వుంది.

నేనూ ఈ ప్రవచనాలకు ఒక శ్రోతనే! ఈ సంకలనానికి పఠితనే!! లోపల వుండి పలికేవాడూ, కలంలో దూరి గిలికేవాడూ, ఎవడో ఉన్నాడు!!! వాడి కరుణను ఆత్మానుభూతిగా మాకందరికీ పంచమని గురుదేవులు శ్రీగణపతి సచ్చిదానంద స్వామీజీవారిని వేడుకొంటున్నాను.

జయగురుదత్త

ఇట్లు

బుధజన విధేయుడు

**కుప్పా వేంకట కృష్ణమూర్తి**

తేది. 18.11.2015

హైదరాబాదు
+91 40–24035013,
E-mail: vedakavi@serveveda.org,
web: www.serveveda.org

# యోగవాశిష్ఠ హృదయము

## వైరాగ్య ప్రకరణము

## విషయ సూచిక

# యోగవాశిష్ఠ హృదయము

## వైరాగ్య ప్రకరణము

ఆధ్యాత్మిక గ్రంథాలన్నింటిలోకి రెండు గ్రంథాలు విశిష్టమైనవి. ఒకటి – నరుడు తన తత్త్వవిద్యను నారాయణుడికి నివేదించుకొన్న గ్రంథం **"యోగవాశిష్ఠము."** రెండవది – నారాయణుడు నరుడికి తత్త్వవిద్యను ఉపదేశించిన గ్రంథం **"భగవద్గీత"** వీటిలో శాస్త్రవాదాలు వుండవు. విషయ వివరణ వుంటుంది. వీటిలో విశ్రాంతిగా రోజుల తరబడి చేసిన బోధ– యోగవాశిష్ఠము. అందుకే ఇది 32వేల శ్లోకాల గ్రంథం. యుద్ధ సమయంలో హడావిడిగా చేసిన బోధ భగవద్గీత. దానికి తగ్గట్టే అది సంగ్రహంగా వుంటుంది.

ఈ గ్రంథానికి యోగవాశిష్ఠమనీ, జ్ఞానవాశిష్ఠమనీ, ఉత్తర రామాయణమనీ, మహారామాయణమనీ, వాశిష్ఠరామాయణమనీ, పేర్లు ఉన్నాయి. సాంప్రదాయిక విద్వాంసుల అభిప్రాయం ప్రకారం, ఈ గ్రంథాన్ని రచించినవారు వాల్మీకిమహర్షి. కొందరు ఆధునిక విమర్శకులు ఇది భగవద్గీత తరువాత వెలసిన గ్రంథమని ప్రతిపాదన చేస్తున్నారు. కానీ, వారు చూపే కారణాలు అంత బలంగా కనిపించడం లేదు. భగవద్గీత సంగ్రహంగా చేసిన ఉపదేశం అవటంవల్ల, ఆ ఉపదేశాలు కొన్ని చోట్ల విస్పష్టంగా లేక, వేరు వేరు విధాలుగా వ్యాఖానాలు చేసేందుకు అవకాశం వుంది. ఈ యోగవాశిష్ఠంలో వాల్మీకిమహర్షి అలాంటి అవకాశం ఏ మాత్రం మిగల్చ లేదు. ప్రతి విషయాన్నీ విస్పష్టంగా, వివరంగా చర్చించడం మాత్రమే కాక, సిద్ధాంత విషయాలను అందమైన కథల రూపంలో ఆ మహాకవి మనకు అందించారు. అందువల్ల ఎక్కడా సందేహాలకు తావుండదు. భగవద్గీతానంతర కాలంలో వేదాంత శాస్త్రమంతా పారిభాషిక పదాలతో కట్టుదిట్టం చేయబడివుంది. ఆ గ్రంథాల్లో, అధ్యాస, ఉపాధి, సవిశేషము, నిర్విశేషము, బాధ, అనిర్వచనీయము, మొదలైన పారిభాషిక పదాలు మనకు విస్తారంగా కనిపిస్తూ వుంటాయి.

ఈ యోగవాశిష్ఠంలో అటువంటి పారిభాషిక పదాల ఆడంబరం ఏమాత్రమూ వుండదు. ఈ గ్రంథంలో స్పందన, స్ఫురణ, వాసన, ఉల్లాసము, లీల,వివర్తము, ఆభాసము, మొదలైన పదాలను ప్రకరణ శుద్ధితో వినియోగించడం కనిపిస్తుంది. ఇవన్నీ సనాతనంగా ఉపనిషత్తులలో కనిపించే పదాలే.

ఈ పదాలను బట్టీ, ఈ గ్రంథంలో చేసిన విషయ ప్రతిపాదనబట్టీ కూడా, ఇది సాక్షాత్తూ వాల్మీకి మహర్షియొక్క రచనే అని మనం నిర్ణయం చేయవచ్చు.

### 1. గ్రంథావిర్భావము

ఇక, ఈ గ్రంథాన్ని వాల్మీకి మహర్షి ఎప్పుడు వ్రాశాడో, ఎందుకు వ్రాశాడో, పరిశీలిద్దాం. శ్రీమద్రామాయణంలోనూ, ఈ వాశిష్ఠంలోనూ, వున్న సాక్ష్యాధారాలను పరిశీలిస్తే, మనకు ఈ విషయాలు స్పష్టమవుతాయి.

శ్రీరాముడు రాజ్యాధికారంలో వున్న సమయంలో జగద్గురువైన నారద మహర్షి వాల్మీకి మహర్షికి రామకథా సారం బోధించాడు. అప్పుడే బ్రహ్మదేవుడు వాల్మీకిమహర్షిని రామాయణం రచించమని ప్రోత్సహించాడు. లవకుశులు జన్మించేనాటికి వాల్మీకిమహర్షి రామాయణ రచన చేస్తూనే వున్నాడు. ఆయన మొదట బాలకాండ మొదలు యుద్ధకాండ వరకూ ఆరు కాండలు వ్రాసి, గ్రంథం పూర్తి చేద్దామని అనుకొన్నాడు. దానికి తగ్గట్టే యుద్ధకాండ చివర ఫలశ్రుతి కూడా చెప్పేశాడు. కానీ, కుశలవుల జన్మ తరువాత ఆ మహాకవి మనస్సు మార్చుకొని, ఉత్తరకాండ కూడా రచించాడు. తరువాత ఆయన ఈ రామాయణ గ్రంథాన్ని లవకుశులకు, తన ముఖ్య శిష్యుడైన భరద్వాజుడు మొదలనవారికి ఉపదేశించాడు.

ఈ రామాయణ రచన చేసేటపుడు వాల్మీకి మహర్షికి బాలకాండంలోనే ఒక చిక్కు వచ్చిపడ్డది. విశ్వామిత్రమహర్షి యాగరక్షణ అనే నెపంతో రాముణ్ణి తన వెంట పంపమని అడగటం అందరికీ తెలిసిన కథే. ఆ సమయంలో శ్రీరాముడు వైరాగ్యంలో మునిగిపోయి, ఏమీ పట్టకుండా వుంటున్నాడు. అప్పుడు వశిష్ఠ, విశ్వామిత్రులిద్దరూ కలసి శ్రీరాముడియొక్క తత్త్వ సందేహాలను తొలగించి, ఆయనయొక్క అకర్మణ్యతను తొలగించారు. ఆ తరువాతనే శ్రీరాముడు తాటక సంహారం, సీతా కళ్యాణం, మొదలైన విశిష్ట కార్యాలు నిర్వర్తించాడు. ఈ రామ వైరాగ్య ఘట్టాన్ని బాలకాండలోనే ప్రవేశ పెట్టినట్లైతే, ఆ మహర్షులు చేసిన బోధ అంతా అక్కడ చెప్పకపోతే అందం రాదు. చెబితే, గ్రంథం మొదట్లోనే వేదాంతచర్చ పెరిగిపోయి, మున్ముందు తను చేయబోయే కావ్య వర్ణనలు, రస పోషణలు, మొదలైనవన్నీ పేలవమైపోతాయి. అంటే, మొత్తంమీద కావ్య శరీరంలో సమతూకం దెబ్బ తింటుంది.

అందువల్ల, వాల్మీకిమహర్షి తెలివిగా పూర్వరామాయణంలో ఈ వశిష్ఠబోధ ప్రసక్తే లేకుండా, ఆ సన్నివేశమే ఎత్తేశాడు. కానీ, ఆ మహామనీషి హృదయంలో తత్త్వవిద్యా రసమయమైన ఈ ఘట్టం మెదులుతూనే వున్నది. అందువల్ల, తరువాత కొంత కాలానికి ఈ ఘట్టాన్నే వేరే ఒక గ్రంథంగా వ్రాద్దామని సంకల్పించి, నిదానంగా వ్రాయసాగాడు. కానీ, అప్పటికే కొంత వయస్సు మళ్ళడంవల్ల, సీతాదేవి భూగర్భంలో కలిసిపోవటం మొదలైన ఘట్టాలవల్లా, ఆయనలో చురుకుదనం చాలా సన్నగిల్లింది. అందువల్ల, రచన మందకొడిగా సాగుతోంది. ఇలాంటి మహత్తర గ్రంథ రచనలు, మానవులను అదృశ్యంగా నడిపించే దివ్య ప్రేరేపణకు ఫలితంగా ఆవిర్భవిస్తాయే గానీ, ఆయా కవులయొక్క ఉత్సాహంవల్ల సంభవించవు. వారి నిరుత్సాహంవల్ల ఆగిపోవు కూడా.

వాల్మీకిమహర్షి వద్ద తపో విధానాలలో శిక్షణ తీసుకొంటున్న భరద్వాజుడు అనే శిష్యుడు తన గురువుగారివల్ల, పూర్వ రామాయణ గ్రంథాన్ని ఉపదేశం పొందాడు. ఆ కుర్రవాడు గురువుగారి కవితామాధుర్యానికి పరవశించి, దేశదేశాలకూ వెళ్ళి, ఆ గ్రంథం గానం చేసి వస్తూ వుండేవాడు. అతను అప్పటికే అనేక యోగసిద్ధులు సాధించినవాడు గనుక, దేశ దేశాలకు మాత్రమే కాక, లోక లోకాలకూ కూడా పోయి, రామాయణ గానం చేస్తూ వుండేవాడు.

అలాగే ఒకసారి అతను మేరు శిఖరాగ్రాన, దేవ సభలో, రామాయణ గానం చేశాడు. అతని అదృష్టం పండి, ఆ సభకు బ్రహ్మదేవుడు స్వయంగా విచ్చేశాడు. తన ప్రోత్సాహంవల్ల ఉద్భవించిన రామాయణ మహాకావ్య సౌందర్యాన్ని చవిచూసిన బ్రహ్మదేవుడికి, మహానందం అయిపోయింది. ముని కుమారుడి గానరీతి ఆయనకు బాగా నచ్చింది. దాంతో ఆయన ఆ కుర్రవాణ్ణి అభినందించి "ఏదన్నా వరం కోరుకోవోయ్!" అన్నాడు. అది విన్న భరద్వాజుడు మేధావి గనుక "దేవదేవా! సమస్త జీవులకూ దుఃఖం పోయే ఉపాయం చెప్పు. ఇదే నాకు కావలసిన వరం" అన్నాడు. బ్రహ్మగారు నవ్వి, ఇలా అన్నాడు. "దానికి నన్నడగడం దేనికయ్యా? మీ గురువుగారు

క్రొత్తగా గ్రంథం మొదలు పెట్టాడు గదా! ఆయన్నే ప్రార్థించు. ఆ గ్రంథాన్ని ఉపదేశం పొందితే, సముద్రాన్ని వంతెనతో దాటినట్లు, సంసారాన్ని అవలీలగా దాటవచ్చు.

**తస్మిన్ శ్రుతే నరో మోహాత్ సమగ్రాత్ సంతరిష్యతి।**

**సేతునేవాంబుధేః పారం అపారగుణ శాలినా॥** (వై.ప్ర.స.2,శ్లో.10)

అని బ్రహ్మదేవుడు గ్రంథరచన పూర్తికాక ముందే సర్టిఫికేట్ ఇచ్చేశాడు. కానీ, ఆ రోజుల్లో శిష్యులు ఇప్పటి శిష్యుల వంటివారు కాదు. వాళ్ళకు గురువుగారి దగ్గర ఎంత చనువు వున్నా, "నాకు ఫలానా ఉపదేశం చెయ్యండి" అని అడిగే ధైర్యం వుండేది కాదు. భరద్వాజుడి లాంటి మహా సిద్ధపురుషులు కూడా బ్రహ్మదేవుడితోనైనా నిర్భయంగా మాట్లాడగలరు కానీ, గురువుగారి దగ్గర నోరు తెరవ గలిగేవారు కాదు. అది భయం కాదు. భక్తికి విహితమైన లక్షణం. వారి గురుభక్తి అంత ఆదర్శప్రాయంగా వుండేది. భరద్వాజుని సంకటాన్ని గమనించిన బ్రహ్మదేవుడు సంతోషపడి "సరే! నేనే మీ గురువుగారితో చెబుతాలే. నడు" అని, ఆ కుర్రవాణ్ణి వెంటబెట్టుకొని, సరాసరి వాల్మీకి ఆశ్రమానికి వచ్చేశాడు. బ్రహ్మదేవుణ్ణి చూసేసరికి వాల్మీకి మహర్షికి వొళ్ళు తెలియలేదు. ఆయన బ్రహ్మదేవుడికి అనేక విధాల పూజ చేశాడు. కానీ, భక్తి ఆవేశంవల్ల తనేం చేస్తున్నాడో తనకే సరిగ్గా తెలియటం లేదు.

బ్రహ్మదేవుడు ఆ ఉపచారాలను అంతగా పట్టించుకోకుండా ఇలా అన్నాడు. "ఓ మునివర్యా! నువ్వు ఇప్పుడు రచిస్తున్న గ్రంథం చాలా గొప్పది. అది ఏదో వేదాంత చర్చ అనుకుంటున్నావేమో, కాదు. శ్రీరాముడియొక్క అసలైన స్వరూపాన్ని నీవు ఆ గ్రంథంలో వర్ణిస్తున్నావు. అందువల్ల, నీవు విసుగుపడి ఆ గ్రంథాన్ని మధ్యలో ఆపెయ్యరాదు. ఈ గ్రంథంవల్ల సమస్త లోకాలకూ ఉపకారం జరుగుతుంది. సంసార సాగరానికి ఇది పడవ లాగా పని చేస్తుంది. లోకులు ఈ పడవతో ఆ సాగరాన్ని అవలీలగా దాటుతారు. ఈ మాట చెప్పటం కోసమే నేను ఇక్కడి దాకా వచ్చాను. నువ్వు చేసేది లోకహితార్థమైన పని, దానిని మానబోకు." ఈ మాటలు చెప్పేసి, బ్రహ్మదేవుడు అంతర్ధానమైపోయాడు.

వాల్మీకి మహాకవికి ఏం జరిగిందో సరిగ్గా అర్థం కావడం లేదు. గాలికి సముద్రంలో ఒక కెరటం లేచి, చూసే లోపలే అణిగిపోయి, ఆ సముద్రంలోనే కలిసిపోయినట్లుగా వుందిట ఆ పరిస్థితి. కొంత సేపటికి వాల్మీకి మహర్షియొక్క భక్తి ఆవేశం తగ్గింది. అప్పుడు ఆయన మెల్లగా తేరుకొని, శిష్యుణ్ణి పిలిచి, "అబ్బాయీ! బ్రహ్మదేవులు ఏదో చెప్పార్రా! వారేం చెప్పారో నువ్వు నాకు సరిగా చెప్పు" అన్నాడు. భరద్వాజుడు బ్రహ్మగారి మాటలన్నీ యథాతథంగా చెప్పాడు. వాల్మీకిమహర్షికి బ్రహ్మగారి భావం అర్థమైపోయింది. దాంతో ఆ గ్రంథం గురించి ఆ కుర్రవాడితోనే కొద్దిగా చర్చించసాగాడు.

అప్పుడు భరద్వాజుడు మెల్లిగా "గురుదేవా! పూర్వ రామాయణం పరిశీలన చేస్తే ఒక్కొక్కసారి రాముడు సాంసారిక సుఖదుఃఖాలలో కొట్టుకు పోయాడేమో అనిపిస్తుంది. కొన్ని చోట్ల చూస్తే ఆయన మహాజ్ఞానేమో, తత్త్వజ్ఞుడేమో, అనిపిస్తుంది. ఆ మహాతల్లి సీతాదేవి ప్రవర్తనా అంతే. గురుదేవా! శ్రీరాముడు, సీతాదేవి, లక్ష్మణాది సోదరవర్గమూ, వీరంతా ఈ సంసారయాత్రలో జ్ఞానులుగా ప్రవర్తించారా? అజ్ఞానులుగా ప్రవర్తించారా? ఆ వివరం నాకు ఉపదేశించు" అని అడిగాడు. వాల్మీకిమహర్షి బ్రహ్మగారి ఆజ్ఞ మేరకు, గ్రంథాన్ని ప్రప్రథమంగా తన శిష్యుడైన భరద్వాజుడికే ఉపదేశించాలని నిశ్చయించుకొని, అప్పటివరకు రచించిన గ్రంథమంతా శిష్యుడికి వినిపించి, ఇక ముందు ఏ రోజు వ్రాసింది ఆ రోజు తాను శిష్యుడికి ఉపదేశిస్తూ వుండేవాడు. ఆ విధంగా బ్రహ్మదేవుడి ఆజ్ఞ, వాల్మీకి మహర్షియొక్క తత్త్వతపన, భరద్వాజ మునికుమారునియొక్క జిజ్ఞాస, మూడూ ఏకీభవించగా, ఉద్భవించిన మహాగ్రంథమే యోగవాశిష్ఠము.

## 2. గ్రంథపఠనార్హత

గ్రంథావిర్భావ క్రమాన్ని ఈ ప్రకారంగా వర్ణించటంవల్ల మనబోటివాళ్ళకి ఏమనిపిస్తుందంటే "ఆనాటి భరద్వాజ మునికుమారుడి లాగా అనేక దివ్య శక్తులు సాధించి, సాక్షాత్తుగా బ్రహ్మగారితో మాట్లాడగలిగేటంత శక్తి సంపాదించిన వారికోసం మాత్రమే ఈ గ్రంథం వ్రాయబడిందన్న మాట. అయితే ఈ గ్రంథాన్ని ముట్టుకొనేందుకు మనకు అర్హత ఎక్కడ వుంటుంది?" అని. ఈ సందేహంతో మనం ఆ పుస్తకాన్ని ముట్టుకొనే ముట్టుకోం. కానీ, వాల్మీకి మహర్షి ఉద్దేశ్యం అది కాదు.

ఈ గ్రంథ రచనలో తనయొక్క కర్తృత్వం నామమాత్రమేనని, సాక్షాత్తు బ్రహ్మగారియొక్క సంకల్పబలంవల్లనే ఈ గ్రంథం ఆవిర్భవించిందని, సవినయంగా చెప్పుకోవాలన్నదే వాల్మీకి మహర్షి ఉద్దేశ్యం. అందుకే ఆ ఘట్టాన్ని ఆయన మనకు చెప్పాడు. ఉద్దేశ్యం బాగానే వుంది కానీ, "ఈఘట్టంవల్ల ఈ గ్రంథానికి మనం పనికిరాం బాబూ" అనే అపార్థం కలిగే సావకాశం వచ్చింది. దాన్ని పోగొట్టటం కోసం మరొక సన్నివేశాన్ని ఈ గ్రంథారంభంలోనే వాల్మీకి మహర్షి వర్ణించాడు.

## 3. అరిష్టనేమి కథ

పై సంఘటనకు కొద్ది కాలం తరువాత. అరిష్టనేమి అనే మహారాజు పెద్దవాడై రాజ్యం కొడుకులకు అప్పచెప్పి, తాను తపోవనాలకు వెళ్ళాడు. అక్కడ ఆయన మంచి తీవ్ర తపోనిష్ఠలో కాలం గడపసాగాడు. దేవేంద్రుడికి ఈ వ్యవహారం తెలిసింది. ఎవరైనా తీవ్ర తపస్సులు చేస్తూ వుంటే, వారిని పరీక్షించవలసిన బాధ్యత దేవరాజుగా ఇంద్రుడికి వుంది. ఈ విషయం తెలియక, ఈ కాలంలో కొందరు, దేవేంద్రుడు అసూయాగ్రస్తుడని చులకన చేసి మాట్లాడుతూ వుంటారు. ఇప్పుడు చెప్పబోయే కథలో ఇంద్రుడియొక్క పరీక్షాతత్త్వం కూడా మనకు అవగతం అవుతుంది.

అరిష్టనేమి మహారాజుయొక్క తపస్సు ఒక స్థాయికి వచ్చేసరికి, దేవేంద్రుడు ఒక దేవదూతతో ఒక విమానాన్ని పంపి, "హే రాజర్షీ! నీకు సశరీరంగా స్వర్గంలో నివసించే యోగ్యత వచ్చింది. కనుక ఈ దేవ విమానం మీద సరాసరి స్వర్గానికి విచ్చేయ వలసింది" అని కబురు చేశాడు. ఆ దేవదూత వచ్చి ఎంతో వినయంగానూ, ఆదరంగానూ, ఈ వార్త ఆ మహారాజుకు చెప్పాడు. అయితే ముసలి మహారాజు చాలా గట్టివాడు. ఆయన దేవదూతకి, దేవేంద్రుడికి, కూడా చాలా వినయంగా కృతజ్ఞతలు చెప్పి, మెల్లిగా ఇలా అన్నాడు. "అయ్యా! దేవదూతా! మీ స్వర్గంలోవుండే విశేషాలేమిటి? ఈ భూమికంటే స్వర్గంలో వున్న గొప్పతన మేమిటి? ఆ స్వర్గంలో నన్ను శాశ్వతంగా వుండనిస్తారా? మధ్యలో పంపేటట్లయితే ఆ పంపే విధానమేమిటి?"

ఇది విని దేవదూత కొద్దిగా ఆలోచించి ఇలా చెప్పాడు. "రాజేంద్రా! నువ్వుతపస్సులో వున్నావు. కనుక, నీ దగ్గర అబద్ధం చెప్పకూడదు. స్వర్గం సుఖాల మయం. భూలోకంలో చేసుకొన్న పుణ్యాన్నిబట్టి, స్వర్గలోకంలో సుఖాల స్థాయి పెరిగిపోతూ వుంటుంది. అయితే, స్వర్గంలో అసూయల బాధ ఒకటి కనిపిస్తూ వుంటుంది. దానివల్ల ఒకోసారి పోట్లాటలు, కొట్లాటలు కూడా వుంటూ వుంటాయి. ఎక్కువవాళ్ళకు తక్కువ వాళ్ళను చూస్తే సంతోషం. తక్కువవాళ్ళకు ఎక్కువవాళ్ళను చూస్తే కడుపు మంట. తమకు ఎంత పుణ్యం

మిగిలివుందో ఎవరికీ తెలియదు. పుణ్యం అయిపోయిన రోజున, వున్నట్టుండి స్వర్గం నుంచి గెంటిపారేస్తూ వుంటారు. ఆ సమయం వచ్చేసరికి వెళ్ళం అని మొండికెత్తి, మెడబట్టి గెంటించుకొని, ఏడుస్తూ అవతలికి పోతూ వుంటారు. కనుక, మహారాజా! శాశ్వతంగా స్వర్గంలో స్థానం నీకే కాదు. ఎవరికీ వుండదు. వెళ్ళేటప్పుడు ఎవరైనా ఏడుస్తూ పోవలసిందే. నువ్వైనా అంతే. నేనైనా అంతే. స్వర్గంలోకి వచ్చాక మాత్రం సుఖాల్లోపడి కొట్టుకుపోవడమే తప్ప, ఇక వేరే తపస్సులు, ఏమీ కుదరవు. సంగ్రహంగా ఇవీ విషయాలు. ఇక విమానం ఎక్కండి."

దేవదూత చెప్పిన అంశాలన్నీ విని, అరిష్టనేమి మహారాజు పెద్ద సంస్కారం పెట్టి, ఇలా అన్నాడు. "దేవదూతా! మీ స్వర్గానికో దండం. నీకో దండం. మీ దేవేంద్రుడికో దండం. అలాంటి స్వర్గం నాకు వద్దే వద్దు. శరీరం వున్నంత కాలం ఇక్కడే తపస్సు చేసుకొంటూ పడుంటాను. చేతనైతే ఈ జన్మలోనే పరమాత్మలో ఐక్యం పొందుతాను. చేతకాకపోతే మళ్ళీ జన్మ ఎత్తి, మళ్ళీ తపస్సే చేస్తాను. నాకు భూలోక రాజ్యాలూ వద్దు, స్వర్గలోక రాజ్యాలూ వద్దు. దయచేసి నన్ను అపార్థం చేసుకోవద్దు. నన్ను ఆశీర్వదించు. దేవేంద్రులవారి ఆశీస్సులు ప్రార్థిస్తున్నానని మనవి చేయి."

ఇది విని, "ఇదెక్కడి వెట్టి మారాజు రా! బాబూ!" అనుకొంటూ, దేవదూత వెనక్కి వెళ్ళి, జరిగిందంతా దేవేంద్రుడికి చెప్పాడు. దేవేంద్రుడికి చాలా ఆనందమయింది.

అరిష్టనేమి రాజు నిజాయితీ, నిష్కామత, నిర్మలత, ఆయనకు బాగా నచ్చాయి. ఆ రాజుకి ఏదైనా సహాయం చేయాలనిపించింది. ఇదే దేవేంద్ర పదవిలోని బాధ్యత.ఎవరైతే నిష్కామంగా తపస్సు చేస్తారో, వారికి ఆయన సహాయం చేస్తాడు. ఎవరైతే సకామంగా తపస్సు చేస్తారో, వారి విషయంలో ఆయన పరిశోధన చేస్తాడు. ఏమని పరిశోధన? వీడి కోరిక లోకానికి మేలు చేస్తుందా? కీడు చేస్తుందా? అని. కీడు చేస్తుందనుకొంటే తపస్సును చెడగొట్టేందుకు ప్రయత్నం చేస్తాడు.

అలా కాక, ఆ తపస్సు లోకానికి మేలు చేస్తుంది అనుకొంటే, ఆ వరాన్ని పొందే యోగ్యత ఈ వ్యక్తికి వుందా, లేదా అని, బంగారాన్ని ఒరిపిడి రాయి మీద గీసినట్లు, ఆ తపస్విని పరీక్షలకు గురి చేస్తాడు. ఇది దేవేంద్రుడి బాధ్యతా విధానం. ప్రస్తుత సందర్భంలో అరిష్టనేమి మహారాజు నిస్స్వార్థంగా తపస్సు చేస్తున్నాడని తేలిపోయింది. కనుక, ఆయనకు సహాయం చెయ్యవలసిన బాధ్యత దేవేంద్రుడి పైన పడ్డది.

పూర్వం మేరు శిఖరం మీద దేవసభలో భరద్వాజ మునికుమారుడు శ్రీమద్రామాయణం గానం చేసిన సందర్భం ఆయనకు గుర్తుకొచ్చింది. ఆ మహాసభలో సాక్షత్తుగా బ్రహ్మదేవుడు, ఇంకా పూర్తికాని యోగవాశిష్ఠ గ్రంథాన్ని గూర్చి అంత గొప్పగా మాట్లాడే సరికి, దేవేంద్రుడి దృష్టి ఆ గ్రంథం మీద పడ్డది. అందువల్ల, వాల్మీకి మహర్షి ఆ గ్రంథంలో ఏమి వ్రాశాడా అని, దేవేంద్రుడు ఎప్పటికప్పుడు పరిశీలిస్తూనే వున్నాడు. పరిశీలించి, ఎప్పటికప్పుడు పరమానందపడుతూనే వున్నాడు. ఇప్పుడు అరిష్టనేమి విషయంలో దేవేంద్రుడికి ఆ గ్రంథం మాట గుర్తొచ్చింది. అందువల్ల దేవేంద్రుడు ఆ దేవదూతతో ఇలా అన్నాడు. "నువ్వు వెంటనే అదే విమానంలో ఆ రాజు దగ్గరకే వెళ్ళు. ఆయనను ఎక్కించుకొని వాల్మీకి మహర్షిగారికి ఆయనను అప్పచెప్పు. వీరికి ఆయన వ్రాసిన యోగవాశిష్ఠం ఉపదేశించమని నేను ప్రార్థిస్తున్నానని వాల్మీకి మహర్షి గారికి మనవి చెయ్యి."

దేవదూత సరే అని, మళ్ళీ అరిష్టనేమి మహారాజు దగ్గరకు వచ్చి, ఆయనను వాల్మీకిమహర్షికి అప్పజెప్పి, తాను వెళ్ళిపోయాడు. ఆ మహారాజు కూడా దేవేంద్రుడి ఉపకారానికి చాలా సంతోషపడి, వాల్మీకి మహర్షి పాదాల మీద పడి, "ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే" – అంటూ తనను శిష్యుడిగా స్వీకరించి, తత్త్వబోధ చేయవలసిందిగా ప్రార్థించాడు. వాల్మీకి మహర్షి ఆయనకు తాను రచించిన ఈ యోగవాశిష్ఠ మహాగ్రంథాన్ని అనుపూర్విగా ఉపదేశించాడు.

ఈ ఘట్టాన్ని చెప్పడంవల్ల నిష్కామ ప్రవృత్తి గల మానవులందరికీ ఈ యోగవాశిష్ఠ గ్రంథం పఠనార్హమే అనే విషయం చెప్పినట్లయింది. కాగా, నిష్కామత్వాన్ని అభ్యసించకపోతే వేదాంతవిద్య మనస్సుకు ఎక్కదనే విషయం కూడా చెప్పినట్లయింది. అంత వరకూ బాగానే వుంది కానీ, ఈ కథవల్ల కూడా మనకు ఒక చిక్కు వచ్చి పడుతోంది. అరిష్టనేమి మహారాజు లాగా సశరీర స్వర్గం వచ్చేటంత తపస్సు చేసినాకనే ఈ గ్రంథం పఠించడానికి యోగ్యత వస్తుందని, ఈ కథ సూచిస్తోంది. అప్పుడు కూడా, దేవ విమానం ఎదురుగుండా వచ్చినా సరే, వద్దు పొమ్మని తిరస్కరించేటంత వైరాగ్యం వుంటేనే, ఈ గ్రంథం ముట్టుకోవాలి– అని కూడా ఈ కథ సూచన చేస్తోంది.

మరి మనం ఎక్కడున్నాం? ఈ షరతులకు మనం సరిపోతామా? ఈ గ్రంథానికో దండం– అనుకొనే ప్రమాదం ఈ అరిష్టనేమి కథవల్ల మనకు కలుగుతోంది. దీనిని నివారించేందుకోసం వాల్మీకి మహర్షి మరో చిన్న సన్నివేశాన్ని కూడా గ్రంథారంభంలో చేర్చాడు.

## 4. అగ్నివేశ్యుడు- కారుణ్య కుమారుడు

"అగ్నివేశ్యుడు" అని ఒక సత్పురుషుడు వుండేవాడు. ఆయన గృహస్థుడు. కానీ, నిరంతరం తపశ్శీలిగా వుండేవాడు. ఆయనకు "కారుణ్యుడు" అని ఒక కొడుకు వుండేవాడు. వాడు తెలివైన వాడు. చిన్న వయస్సులోనే విద్యలన్నీ పూర్తి చేసి, గురుకులంనుంచి ఇంటికి వచ్చాడు. ఇంకా వివాహం కాలేదు. ఈ పిల్లవాడు చదువు పూర్తి చేసుకొని ఇంటి దగ్గరకు వచ్చినప్పటి నుంచీ విచిత్రంగా వుంటున్నాడు. కనీసం నిత్యపూజలు కూడా చేయడం లేదు. ఎప్పుడూ బద్ధకంగా పడుకొంటున్నాడు. మనిషిలో ఉల్లాసమే కనిపించటం లేదు. చూసి చూసి, ఒకరోజు తండ్రి అతనిని నిగ్గదీశాడు. అతడు మెల్లిగా తన మనస్సులో వున్న కల్లోలాన్ని వివరించసాగాడు–

**"కుర్వన్నేవేహ కర్మాణి**

**జిజీవిషే చ్ఛతగ్ం సమాః** – అని వేదంలో ఒకచోట వుంది.

ఇలా శాస్త్రాలలోనూ, వేదాలలోనూ, కొన్ని చోట్ల మనిషి మరణించే దాకా సత్కర్మలు చేస్తూనే వుండాలి అని వుంది. వాటిల్లోనే మరికొన్ని చోట్ల –

**న కర్మణా న ప్రజయా ధనేన**

**త్యాగేనైకే అమృతత్వమానశుః"** – అని వుంది. అంటే చిట్టచివరి ఫలితమైన మోక్షం ఎన్ని కర్మలు చేసినా రాదని ఈ వాక్యం చెబుతోంది. నేను అన్ని వేదాలూ చదివాను. అన్ని శాస్త్రాలూ చదివాను. ప్రతిచోటా ఈ విషయంలో సందేహమే వస్తోంది. అందువల్ల ఏ కర్మలూ లేకుండా, ఏ వేదాంతాలూ లేకుండా, మౌనంగా వుంటున్నాను" అన్నాడు కుర్రవాడు.

అతని మాటలు విని తండ్రి బాగా ఆలోచించి, ఇలా అన్నాడు. "నాయనా! ఈ విషయంలో నీకు సంపూర్ణమైన సమన్వయాన్ని ప్రదర్శించ గల ప్రామాణిక గ్రంథం వాల్మీకి రచించిన యోగవాశిష్ఠం మాత్రమే.

నీకు నేను ఆ గ్రంథాన్ని ఉపదేశిస్తాను. అది విన్నాక నీకు ఎలా తోస్తే అలా చేయి.”

ఆ విధంగా తండ్రి అయిన అగ్నివేశ్యుడి ద్వారా ఈ గ్రంథాన్ని ఉపదేశం పొందిన కారుణ్య కుమారుడు, సమన్వయాన్ని బాగా గ్రహించి, ముందు సత్కర్మల ద్వారా చిత్తశుద్ధిని సాధించి, ఆ పైన జ్ఞానయోగం ద్వారా జీవన్ముక్తి సాధించాడు.

ఈ కథ ద్వార వాల్మీకి మహర్షి చెప్పదలచింది ఏమంటే? “ఈ యోగవాశిష్ఠం శ్రవణం చెయ్యటానికి విద్యావంతులై, ఆధ్యాత్మిక జిజ్ఞాస కలవారందరూ అర్హులే” – అని ఇంతవరకు చెప్పిన కథలవల్ల ఈ గ్రంథం బ్రహ్మదేవుడికి, దేవేంద్రుడికీ, కూడా సమ్మతమైనదనీ, అరిష్టనేమి వంటి ఉత్తమస్థాయి సాధకులకు, కారుణ్య కుమారుడి వంటి సామాన్య సాధకులకు అందరికీ కూడా ఉపయోగపడే గ్రంథమే– అని తేలుతోంది.

## 5. గ్రంథ ప్రాశస్త్యము

అయితే, ఎక్కడో స్వర్గంలో వున్నవారి మాట మనకు సరీగా తెలియదు. వాల్మీకి నాటి సాటి మహర్షులు, పండితులు, ఈ గ్రంథాన్ని గురించి ఏమని భావించేవారో మనకు తెలిస్తే, అప్పుడు మనకు ఈ గ్రంథం మీద ప్రామాణిక బుద్ధి ఏర్పడుతుంది. అందుకోసం, వాల్మీకిమహర్షి అలాంటి ఘట్టాన్ని ఒక దానిని ఈ గ్రంథంలో మొదట చేర్చాడు.

పూర్వరామాయణంలో, అరణ్యకాండలో, వనవాస సమయంలో, శ్రీరాముడు యే యే మహాత్ములను దర్శించాడో ఆ వివరాలు కొన్ని వున్నాయి. భారతదేశ దక్షిణాపథాన ఆ నాటి సుప్రసిద్ధ మహర్షులలో అగస్త్యమహర్షి అత్యంత ప్రముఖుడని చెప్పటంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు. త్రేతాయుగ ప్రారంభంలోనే దండక మహారాజుకు సంక్రమించిన గురుశాపంవల్ల ఉత్తర దక్షిణ భారతదేశాల మధ్యలో దండకారణ్యమనే భయంకర అరణ్యం ఏర్పడింది. ఈ అరణ్యంవల్ల దక్షిణ భారతదేశం ఆనాటి రాక్షసులకు స్థావరంగా మారింది. దానివల్ల దక్షిణ భారతదేశంలో వైదిక సంస్కృతి దెబ్బతింటూ వచ్చింది. ఈ పరిస్థితిని సరి చేయటం కోసం, ఆ నాటి మహర్షులెందరో రాజకీయాలకు రాజులకు, అతీతంగా కృషిచేశారు. వారిలో అగస్త్యమహర్షి చాలా ప్రముఖుడు. ఆయన కృష్ణా, కావేరీ, గోదావరీ నదీ తీరాల వెంట పాద సంచారాలు చేసి, లెక్కకు మించిన స్థలాలలో అగస్త్యేశ్వర ఆలయాలను ప్రతిష్ఠ చేసి, ఆ యా ప్రాంతీయ భాషలకు సాంస్కృతిక జీవనం పోసి, సనాతన ధర్మోద్ధరణకై అపార కృషి చేశాడు.అది గాక కొన్ని వేలమంది సాధకులకు సాధన మార్గ నిర్దేశనం చేశాడు. శ్రీరామచంద్రుడు తన అరణ్యవాస క్రమంలో అగస్త్య మహర్షిని ప్రత్యేకంగా దర్శించాడు. ఇందులో ఆశ్చర్యమేమీ లేదు. కానీ, ఆ సందర్భంలో వాల్మీకి మహర్షి

**సుతీక్ష్ణం చాప్యగస్త్యం చ**

**అగస్త్య భ్రాతరం తథా॥** – అని ముగ్గురి పేర్లు వరుసగా చెప్పాడు.

సుతీక్ష్ణుడు, అగస్త్యుడు, అగస్త్యభ్రాత, అని. వీరిలో అగస్త్య భ్రాత పేరేమో ఇంతవరు మనకు తెలియదు.అందుకనే విద్యావంతులై కూడా పేరు ప్రతిష్ఠలు లేకుండా వున్నవారిని “అగస్త్యభ్రాతలు” అనటం పండితులలో సామెతగా మారిపోయింది. అగస్త్యుడు సుప్రసిద్ధుడే.

## 6. సుతీక్ష్ణుడు

మరి వాల్మీకి మహర్షి ప్రత్యేకంగా పేర్కొన్న ఈ సుతీక్ష్ణుడు ఎవరు? దీనికి సమాధానం, పూర్వరామాయణంలో ఎక్కడా కనిపించదు. ఇతర పురాణాలలోనూ ఆయన చరిత్ర దొరకదు. అగస్త్య సంహిత అని ఒక మహాగ్రంథం వుంది. ఇది ప్రధానంగా రామోపాసన పద్ధతులను బోధించే గ్రంథం. ఈ గ్రంథంలో సుతీక్ష్ణ మహర్షి చరిత్ర వుంది. శ్రీరామావతారానికి చాలా కాలం ముందుగానే దండకారణ్యంలో వుంటూ, అగస్త్యమహర్షి గురుత్వంలో తపస్సాధన చేస్తున్న మునికుమారులలో సుతీక్ష్ణుడు ఒకడు. దైవయోగం ఏమిటో కానీ, అగస్త్య శిష్యులలో సుతీక్ష్ణుడొక్కడికి ఎన్నాళ్ళికీ ఏకాగ్రత కుదరలేదు. ముసలితనం వచ్చాక ఆ ముని చాలా విసిగిపోయి, సరాసరి గురువుగారి వద్దకు వెళ్ళి, తన వయస్సు అయిపోతున్నదనీ, తనకు చిత్తైకాగ్రతే కుదరటం లేదనీ, గోల పెట్టాడు.

అప్పుడు అగస్త్య మహర్షి ఆయనను కరుణించి "నాయనా సుతీక్ష్ణా! శ్రీహరి శ్రీరాముడుగా అవతరించబోతున్నాడు. ఆయన దర్శనం అయ్యేదాకా నీకు మరణం లేదు. ఈ లోగా నువ్వు, అవతరించబోయే ఆ స్వామిని ఉపాసన చేస్తూ వుండు అన్నాడు.

సుతీక్ష్ణ మహర్షికి ఏడుపొచ్చినంత పనైంది. ఆయన "అయ్యా! ఇప్పటికి నాకు ఇంత వయస్సు వచ్చింది. రక రకాల సాధనలు చేశాను. ఇప్పుడు కొత్తగా మరో ఉపాసనా? అది కూడా ఇంకా జన్మించని రూపాన్ని గురించి నేనేమని ఉపాసన చేసేది? అదలా వుంచినా, ఈ వయస్సు వచ్చాక నాకు ఉపాసనలేమిటి? ఏ యోగసాధనో, ఏ తత్త్వచింతనో చెయ్యాలి గానీ" అన్నాడు. అప్పుడు అగస్త్యమహర్షి, సుతీక్ష్ణ మహర్షికి వివిధ సాధనా ప్రక్రియలలో గల సమన్వయాన్ని అద్భుతంగా వివరించాడు. అగస్త్య సంహితలో సగం భాగం ఈ సమన్వయమే వుంది. ఆ తరువాత రామోపాసన విధానాలున్నాయి. ఆ విధంగా అగస్త్య సంహిత ఉపదేశం పొందిన సుతీక్ష్ణమహర్షి చాలా కాలం రామోపాసన చేశాడు.

## 7. కర్మ జ్ఞాన సమన్వయము

అట్టి సుతీక్ష్ణుడు కొంత కాలం పోయాక, ఒకసారి, తన గురువుగారైన అగస్త్యమహర్షి ఆశ్రమానికి వెళ్ళి ఇలా ప్రశ్నించాడు – "గురువర్యా! మోక్షానికి కావలిసింది కర్మా? లేక జ్ఞానమా? ఈ రెండూనా? మీరు నాకు ఉపాసనా సమన్వయాలు చెప్పారు. జ్ఞానమూ చెప్పారు. మళ్ళీ నన్ను ఉపాసనారూపమైన కర్మలో ప్రవేశపెట్టారు. మోక్షం మాత్రమే కావాలనుకొనే నాలాంటి ముముక్షువులకు, కర్మ మంచిదా? జ్ఞానం మంచిదా? ఏదో ఒకటి తేల్చి చెప్పండి".

అప్పుడు అగస్త్యమహర్షి ఇలా చెప్పాడు. "నాయనా! ఒక పక్షి ఆకాశంలో ఎగరాలంటే దానికి రెండు రెక్కలు వుండాలి. ఆ రెక్కలవల్ల దానికి గాలి కదలిక అనే ఉపకారం జరుగుతుంది. నిజంగా ఆకాశంలోకి పక్షిని ఎగరేసేది ఈ గాలి కదలిక. ఈ గాలి కదలిక అనే ఉపకారం, రెండు రెక్కలూ వుంటేనే సంభవిస్తుంది గానీ, ఒక రెక్కవల్ల సాధ్యం కాదు. అలాగే మోక్షానికి చేరాలనుకొనే మానవుడికి కర్మమూ, జ్ఞానమూ అనేవి రెండు రెక్కలు. వీటిలో కర్మము అనే రెక్కవల్ల చిత్తశుద్ధి అనే ఉపకారం లభిస్తుంది. జ్ఞానము అనే రెక్కవల్ల అవిద్యానివృత్తి అనే ఉపకారం లభిస్తుంది. ఈ రెండు ఉపకారాలూ కలసి, అతనిని మోక్షానికి చేరుస్తాయి.

"మరొక ఉదాహరణ చెబుతాను విను. అద్దంలో ముఖం చూసుకోవాలంటే, రెండు ఉపకరాలు కావాలి. ఒకటి, అద్దం మీద వున్న దుమ్ము దులపాలి. రెండు– నీ ముఖంమీద వెలుతురు పడాలి. అలాగే మోక్షానికి నీ చిత్తమనే అద్దం మీద వుండే దుమ్ము దులపాలి. ఈ ఉపకారం కర్మ చేస్తుంది. ఆ తరువాత జీవాత్మ అనే నీమీద వెలుతురు పడాలి. ఈ ఉపకారాన్ని జ్ఞానం కలిగిస్తుంది. కనుక, కర్మా, జ్ఞానమూ, రెండూ కావలసినవే.

"అయితే, నీవు వీటిల్లో ఏది ముఖ్యమో తేల్చి చెప్పమంటున్నావు. ఇది తెలియాలంటే ఒక కథ చెబుతాను విను. నీవు ఉపాసిస్తున్న శ్రీరామచంద్రుకి ఈ సందేహం వచ్చింది. ఆయనకు వశిష్ఠమహర్షి ఉపదేశం చేశాడు. విషయమంతా వాల్మీకి మహర్షి యోగవాశిష్ఠ గ్రంథంగా రచించి వుంచాడు. నీకు ఆ గ్రంథం ఉపదేశిస్తాను. నీకు పరిపూర్ణమైన సమన్వయ దర్శనం కావాలంటే ఆ గ్రంథమే ప్రశస్తం." ఆ విధంగా అగస్త్య మహర్షంతటివాడు తన శిష్యులకు ఈ గ్రంథాన్ని బోధించాడంటే, ఈ గ్రంథ ప్రాశస్త్యం గురించి ఇంకేమి చెప్పాలి?

ఈ విధంగా మహాకవి వాల్మీకి– భరద్వాజ కథను, అరిష్టనేమి కథను, కారుణ్య కుమారుడి కథను, సుతీక్ష్ణ మహర్షి కథను, గ్రంథ ప్రారంభంలో చేర్చడం ద్వారా, ఈ గ్రంథంయొక్క ప్రాశస్త్యాన్ని మనకు తెలపడం మాత్రమే గాక, ఈ గ్రంథ పఠనానికి ఎవరు అధికారులో, ఆ విషయం కూడా స్పష్టం చేస్తున్నాడు. కథా సూచనలవల్ల వచ్చే విషయాలను విస్పష్టం చేయడం కోసం ఆయన ఆ విషయాలను వాచ్యంగా కూడా చెప్పాడు.

శాస్త్ర గ్రంథాలలో **అనుబంధ చతుష్టయం** అని, ఒకదాన్ని నిర్వచనం చేసి చెబుతూ వుంటారు. వాటినే విషయం, ప్రయోజనం, సంబంధం, అధికారి, అని అంటారు. ఈ యోగవాశిష్ఠ గ్రంథంలో విషయం – ఆత్మ తత్త్వజ్ఞానం. ప్రయోజనం – మోక్షప్రాప్తి. సంబంధం – జ్ఞాన ప్రతిపాదనం. అధికారి – అంటే ఈ గ్రంథాన్ని ఉపదేశం పొందటానికి యోగ్యుడు. ఎవరెవరికి ఇట్టి యోగ్యత వున్నదో, ఇప్పటి వరకు మనం చెప్పుకొన్న కథలలోనే వున్నది. దానినే మరింత విస్పష్టం చేస్తూ వాల్మీకి మహర్షి ఇలా అన్నాడు–

**అహం బద్ధో విముక్త స్స్యాం ఇతి యస్యాస్తి నిశ్చయః।**

**నాత్యన్తమజ్ఞో నోత జ్ఞః సోఽస్మిన్ శాస్త్రేఽధికారవాన్ ॥**

**భావం** –నేను సంసారబంధంలో వున్నాను. నాకు దీని నుంచి విముక్తి కావాలి – అనే ధృఢనిశ్చయం వుండాలి. ఈ బంధమోక్షాల గురించి ఎంతో కొంత జ్ఞానం వుండాలి. అలాంటివాడే ఈ గ్రంథ పఠనానికి అధికారి. బొత్తిగా ఏ మాత్రమూ వేదాంత విషయం తెలియని అల్పుడు దీనికి పనికి రాడు. విషయమంతా తెలిసిన తత్త్వవేత్తకు ఈ గ్రంథం అక్కరలేదు. అందుచేత మధ్యమ జ్ఞానస్థితిలో వున్న మధ్యమాధికారుల కోసమే ఈ గ్రంథం వ్రాశానని వాల్మీకి మహర్షి స్వయంగా చెబుతున్నాడు.

ఈ గ్రంథంలో వాల్మీకిమహర్షి అనుసరించిన శైలి ఇదే. ఆయన తత్త్వవిషయాలను కథారూపాల్లో చెబుతాడు. ఆ కథారీతివల్ల ఆయన చెప్పదలచుకొన్న విషయమేమో మనకు స్పష్టమవుతుంది. అయినా కూడా ఆయన ఈ విషయాలను మళ్ళీ మనకు వాచ్యంగా చెప్పేస్తాడు. దీనివల్ల గ్రంథం కొంచెం పెద్దదైనా, సందేహానికి తావు లేకుండా పోతుంది. విషయం కథా రూపంలో వుంటుంది కనుక, ఆసక్తికరంగా వుంటుంది. రాబోయే గ్రంథమంతటా ఇదే శైలి నడుస్తూ వుంటుంది. అందువల్లే, అధునాతన మహాత్ములంతా యీ గ్రంథాన్ని బాగా ఆదరించారు.

**ఉదా** – కాంచీ పరమాచార్యులు, మళయాళ స్వామివారు, శ్రీగణపతి సచ్చిదానంద స్వామివారు.

## 8. శ్రీహరికి శాపాలు

శ్రీరాముడు సాక్షాత్తు విష్ణుమూర్తి అవతారం కదా! ఆయనకు తత్త్వ విషయం మరొకరు బోధించడమేమిటి? అని మనబోటి వాళ్ళకు సందేహం కలగవచ్చు.అయితే ఆ నాడు వాల్మీకి మహర్షి దగ్గర సాక్షాత్తుగా ఉపదేశం పొందిన అరిష్టనేమి మహారాజుకి ఇంతకంటే బలమైన సందేహమే వచ్చింది. ఆయన ఇలా అడిగాడు– "గురుదేవా! ఒక ప్రక్క మీరు శ్రీరాముడు విష్ణుమూర్తి అవతారం అంటున్నారు. మరో ప్రక్క వశిష్ఠుడు ఆయనకు ఉపదేశించాడు అంటున్నారు. ఇంతకూ ఈ రాముడు సంసార బద్ధుడా? లేక నిత్యముక్తుడైన శ్రీహరియా? నిత్యముక్తుడైతే ఆయనకు ఉపదేశం అక్కర లేదు. సంసార బద్ధుడైతే ఆయన మాలాంటి రాజే. ఇక ఆయన గురించి గొప్పగా చెప్పుకొనేదేమిటి?"

దానికి వాల్మీకి మహర్షి చక్కని సమాధానం చెప్పాడు. "రాజా! రాముడు శ్రీహరి అవతారమే. కొన్ని శాపాల మిషతో ఆయన మానవుడిగా అవతరించాడు. ఆ శాపాలలో ఒక శాపాన్ని గౌరవించడం కోసమే, ఆయన కొంతకాలం పాటు అజ్ఞానాన్ని కూడా ఆహ్వానించాడు. అందువల్లే ఆ సమయంలో ఆయనకు ఉపదేశం అవసరమైంది. ఆ ఉపదేశంవల్ల సాధకులందరికీ పరమోపకారం జరిగింది. ఇంతకూ ఆ శ్రీహరికి నాలుగు శాపాలు తగిలాయి.

### ఒకటవ శాపం

ఒకసారి విష్ణుమూర్తి బ్రహ్మలోకానికి వెళ్ళాడు. బ్రహ్మదేవుడితో సహా ఆ లోకంలో వుండేవారంతా విష్ణుమూర్తికి బ్రహ్మరథం పట్టారు. కానీ, అక్కడే వున్న సనత్కుమార మహర్షి ఒక ప్రక్కన మౌనంగా కూర్చుండి పోయాడు. విష్ణుమూర్తికి సనత్కుమార మహర్షి నిష్కాముడని తెలుసు. కానీ, నిష్కామత్వంవల్ల గర్వం వహించి, పెద్దలను తిరస్కరించటం తగదు. అందువల్ల ఇతనికి బుద్ధి చెప్పాలని విష్ణుమూర్తికి తోచింది. దాంతో విష్ణుమూర్తి ఆగ్రహించి "ఓ సనత్కుమారా! నీవు నిష్కాముడ్ణని గర్విస్తున్నావు. కనుక, నీవు కుమారస్వామి అనే పేరుతో జన్మించి కామార్తుడవై ఒకరికి ఇద్దరిని వివాహం చేసుకో" అని శపించాడు. ఈ గద్దింపుకి సనత్కుమారుడు సమాధిలోనుంచి బయటకు వచ్చాడు. సనత్కుమారుడంటే సామాన్యుడు కాడు. ఆయన విష్ణుమూర్తికి తిరుగు శాపం పెట్టాడు. "హే విష్ణో! నువ్వు, సర్వజ్ఞుడనని గర్విస్తున్నావు. నేను సమాధిస్థితిలో దేహస్మృతి లేకుండా వున్నానని గ్రహించలేక పోయావు. పైగా రోషించి శపించావు. కనుక, కొంతకాలం పాటు నీ సర్వజ్ఞత్వం నిజంగానే నశించి, అజ్ఞానివి కా!"– ఇది విష్ణుమూర్తికి తగిలిన మొదటి శాపం.

### రెండవ శాపం

ఒక సారి దేవదానవ సంగ్రామంలో విష్ణుమూర్తి దేవతల పక్షాన విజృంభించి, రాక్షసులను వెంటబడి తరమ సాగాడు. రాక్షసులకు భయం వేసి, భృగుమహర్షియొక్క భార్యను శరణు పొందారు. ఆమె వారిని తన ఇంటిలో దాచి, శ్రీహరి ఇంటిలోనికి పోవటానికి వీల్లేకుండా వాకిట అడ్డంగా నిలబడింది. ఇప్పుడైతే రాక్షసులంతా ఒకే చోట దొరికారు. ఇప్పుడు వీరిని వదిలివేస్తే లోకాలకు చాలా ఉపద్రవం తెస్తారు. ముని పత్ని అయివుండి, ఈమె శ్రీహరికి ఎదురు తిరుగుతోంది. పైగా పాపాత్ములకు సహాయం చేస్తోంది. అందువల్ల శ్రీహరి ఒక్క క్షణం ఆలోచించి, పాపం వస్తే రానిమ్మని, లోకక్షేమం కోసం అడ్డు వచ్చిన భృగుపత్నిని సంహరించేసి, ఆ

తరువాత రాక్షసులను కూడా సంహరించేశాడు. భృగుమహర్షికి తన భార్య చేసింది తప్పని తెలుసు. అయినా దుఃఖంతో వొళ్ళు తెలియక, "శ్రీహరీ! నీకు కూడా నాలాగే భార్యా వియోగం కలుగు గాక!" అని శపించాడు. ఇది రెండవ శాపం.

**మూడవశాపము**

మరొకప్పుడు బృంద అనే గోలోక కన్యక శ్రీహరి పొందు కావాలని వరం కోరింది. భర్త కావాలని కోరలేదు. అది విని, రాధాదేవి ఆగ్రహించి రాక్షసకన్యవు కమ్మని శపించేసింది. ఆ జన్మలో కూడా ఆమె పేరు బృందయే. ఆ జన్మలో ఆమె జాలంధరుడనే రాక్షసుడికి భార్యయై మహాపతివ్రతగా వుండేది. జాలంధరుడు మహాదుర్మార్గుడై లోకాలను పీడిస్తూ వుండేవాడు. కానీ, బృందాదేవియొక్క పాతివ్రత్య మహిమవలన వాడికి చావు లేకుండా పోయింది. అందువల్ల ఆమెయొక్క పాతివ్రత్యాన్ని భంగపరచవలసిన అవసరం ఏర్పడింది. పూర్వ జన్మలో ధర్మ భంగకరంగా ఆమె శ్రీహరి పొందు కోరింది కనుక, ఆమెకు ఈ జన్మలో ఇట్టి సంకట పరిస్థితి ఏర్పడింది.

ఇట్టి విషమపరిస్థితిలో, రాబోయే ప్రమాదాలు తెలిసి కూడా, శ్రీహరి జాలంధరుడి రూపం ధరించి, బృందాదేవిని మోహింప జేశాడు. పాతివ్రత్య భంగం జరగగానే జాలంధరుడు యుద్ధంలో మరణించాడు. అపుడు విష్ణుమూర్తి చేసిన మోసాన్ని గ్రహించిన బృందాదేవి దుఃఖావేశంలో పడిపోయి, తాను పూర్వజన్మలో చేసిన తప్పును గుర్తించలేక, తప్పంతా శ్రీహరిదే అని భావించి, "నాకు భర్తృవియోగం కలిగినట్లే, నీకు భార్యా వియోగం కలుగుగాక!" అని శపించింది. ఇది మూడవ శాపం.

**నాలుగవ శాపము**

పూర్వం పయోష్ణీనదీ తీరాన దేవదత్తుడు అనే గృహస్థు నివసిస్తూ, నరసింహోపాసన చేస్తూ వుండేవాడు. ఒక రోజున ఆయన తపస్సుకు సంతోషించి నృసింహస్వామి మంచి ఆర్భాటంగా సాక్షాత్కరించాడు. సామాన్యంగా దేవతల సాక్షాత్కారాలు ఎవరికోసం జరిగాయో, వారికే కనిపిస్తాయి. ప్రక్కవారికి కనిపించవు. అటువంటిది ఈ నృసింహ సాక్షాత్కారం దేవదత్తుడి భార్యకు కూడా విస్పష్టంగా కనిపించింది. దైవలీల ఏమో గానీ, ఆమె ఈ భయంకరాకారాన్ని చూసి, అప్పటికప్పుడే గుండె ఆగి మరణించింది. దేవదత్తుడు సాక్షాత్కార మహానందంలో మునిగి, కొంత సేపటికి ఇహలోకంలోకి వచ్చాడు. వస్తూనే ఈ సాక్షాత్కారంవల్ల తన భార్య మరణించిందని గ్రహించి, దుఃఖావేశంలో పడిపోయి, వివేకం కోల్పోయి, "విష్ణుదేవా! నీకు కూడా నాకుమల్లే భార్యావియోగం సంభవించు గాక!"– అని శపించాడు. ఇది నాల్గవ శాపం.

ఈ నాలుగు శాపాల్లో మూడు విష్ణుమూర్తికి భార్యా వియోగాన్ని కలిగించేవే. ఈ ముగ్గురి మీదా ప్రేమవల్ల, శ్రీహరి వారి శాపాలను మన్నించి, మానవుడై జన్మించి, మూడు సార్లు భార్యావియోగాన్ని అనుభవించాడు. రావణుడు సీతాపహరణం చేసినప్పుడు మొదటిసారి భార్యావియోగం. మళ్ళీ కలిశారు. తరువాత లోకుల అపవాదువల్ల సీత గర్భవతిగా వుండగా రెండవసారి వియోగం. మళ్ళీ యజ్ఞశాలలో కలిశారు. ఈమాటు సీతాదేవి భూప్రవేశం చేయటంతో శ్రీరాముడికి మూడవసారి భార్యా వియోగం. ఇలా మూడు శాపాలూ చెల్లినాయి.

## 9. శ్రీరామ వైరాగ్యం

ఇక సనత్కుమారుడు పెట్టిన మొట్టమొదటి శాపం వుంది కదా! నీకు కొంచెం సేపయినా సరే అజ్ఞానం కలగాలని ఆయన శపించాడు కదా! శ్రీహరి ఆ శాపాన్ని కూడా మన్నించాడు. అందువల్ల, శ్రీరాముడు 12 ఏళ్ళవాడై వుండగా, ఆయనను తత్త్వవిషయకమైన అజ్ఞానం ఆవరించి వేసింది. అందువల్లే వశిష్ఠమహర్షియొక్క బోధ ఆయనకు అవసరమైంది. అది ఎలా జరిగిందంటే–

రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు నలుగురు పన్నెండో ఏడు వచ్చేసరికల్లా, వశిష్ఠమహర్షి దగ్గర విద్యలన్నీ పూర్తి చేశారు. నాలుగు వేదాలు, ఆరు శాస్త్రాలు, 64 కళలు, ఇవి గాక యుద్ధ విద్యలు మొదలైన అన్ని విద్యలలోనూ వారు ఆరితేరారు. వారికి గురూపదేశం అనేది కేవలం లాంఛనప్రాయమే తప్ప, విద్యలన్నీ వాటంతట అవే సాక్షాత్కరించినట్లుగా వుంది పరిస్థితి. 12 ఏళ్ళకే వాళ్ళు స్నాతకోత్సవం పూర్తి చేసుకొని, పట్టభద్రులై, స్వగృహానికి చేరుకొన్నారు. ఇంటి దగ్గర వారికి ఏ బాధ్యతలూ లేవు. సరదాగా కాలక్షేపం చేస్తూ వుండేవారు. అంతా బాగానే వుంది గానీ, శ్రీరాముడిలో ఏదో తెలియని మార్పు రాసాగింది.

ఒకరోజు ఆయన తన తండ్రి వద్దకు వెళ్ళి, తనకు తీర్థయాత్రలు చేసి రావాలని వుందనీ, తనను పంపించమనీ, అడిగాడు. దశరథుడికి ఆ విషయం సరిగా అర్థం కాలేదు. ఇంత చిన్న వయసులో తీర్థయాత్రలేమిటి? తను అనుమతించాలా, వద్దా? అని ఎటూ పాలుపోక, వశిష్ఠ మహామునిని పిలిచి సలహా అడిగాడు. ఆ ముని, కొడుకులు నలుగురినీ తీర్థయాత్రలకు పంపించమని చెప్పాడు. ఇక రాముడు సోదర సమేతుడై, వైభవోపేతంగా బయలుదేరి, పుణ్యక్షేత్రాలు, ఋషి ఆశ్రమాలు, మొదలైనవన్నీ తిరిగి వచ్చాడు. ఆ వచ్చిన దగ్గరనుంచి శ్రీరాముడు మరింత ఏకాంతంగా రోజులు గడిపే ప్రయత్నం చేస్తున్నాడు.

వశిష్ఠమహర్షి రాముణ్ణి జాగ్రత్తగా గమనిస్తూనే వున్నాడు. అందుకే ఆయన శ్రీరాముడి తీర్థయాత్రలకు ప్రోత్సాహమిచ్చాడు. శ్రీరాముడిలో తత్త్వవిషయ విచికిత్స బయలుదేరిందని వశిష్ఠుడు గుర్తించాడు. తత్త్వ పరిశోధన చేసేవాడికి చిత్తశుద్ధి చాలా ముఖ్యం. ఆ చిత్తశుద్ధి యజ్ఞయాగాది సత్కర్మానుష్ఠానం వల్ల సిద్ధిస్తుంది. కానీ, శ్రీరాముడికి ఇప్పుడు యజ్ఞ యాగాదులకు అనుకూలమైన వయస్సు రాలేదు. తత్త్వజిజ్ఞాస మాత్రం వచ్చింది. మరి చిత్తశుద్ధికోసం రాముడు ఏమి చేయాలి?

రాముడి విషయమే కాదు. యజ్ఞయాగాదులు చేయటం అందరికీ సాధ్యం కాదు. కొందరికి వయస్సు దాటిపోవచ్చు. కొందరికి పరిస్థితులు కలిసిరాక పోవచ్చు. మనబోటి కలికాల జీవులకు యజ్ఞయాగాలనేవి అసలు సాధ్యమే కాక పోవచ్చు. మరి వారికి చిత్తశుద్ధి కలిగే మార్గమే లేదా? తప్పకుండా వుంది. అలాంటివారికోసమే పరమేశ్వరుడు భూమండలం మీద మహాక్షేత్రాలను ఏర్పాటు చేశాడు. ఒక్కొక్క తీర్థయాత్ర చేస్తే ఒక్కొక్క యజ్ఞఫలం వస్తుందని, మహర్షులు నిర్ణయం చేశారు.

**ఏతే భౌమామ్మయా యజ్ఞాః**

**తీర్థ రూపేణ నిర్మితాః ॥** (వ్యాఖ్యానంలోని శ్లోకం)– అని నిర్ణయం చేశారు. అంటే, ఈ తీర్థాలు, క్షేత్రాలు అనేవి భూమి మీద జలమయమైన యజ్ఞాలు. అందుకోసమే వాటిని బ్రహ్మదేవుడు సృష్టించాడు అని భావం. మనిషి తరించటానికి కర్మ, జ్ఞానమూ, రెండూ వుండవలసిందేనని, వాల్మీకి మహర్షి మొదట్లోనే చెప్పాడు కదా! అది సత్యం కనుకనే తత్త్వజిజ్ఞాసలోకి ప్రవేశించిన శ్రీరాముడిచేత వశిష్ఠమహర్షి తీర్థయాత్రారూపమైన యజ్ఞాలు చేయించాడని మనం గ్రహించాలి.

తీర్థయాత్రలై తిరిగి వచ్చాక దశరథ పుత్రులు మళ్ళీ మామూలు వ్యవహారంలోకి వచ్చారు. శ్రీరాముడు ప్రతిరోజూ నిత్యానుష్ఠానం పూర్తి చేసుకొని, మధ్యాహ్నం వరకూ తండ్రిగారి దగ్గరే వుండి, రాజ్యవ్యవహారాల్లో శిక్షణ పొందుతూ వుండేవాడు. దేని విషయంలోనూ బాధ్యత పెట్టుకొనేవాడు కాదు. అప్పటికి ఆ అవసరమూ రాలేదు. మధ్యాహ్నం భోజనాలైన తరువాత, తమ్ములతో కలసి అడవిలోకి పోయి, వేట అభ్యాసం చేసి వస్తూ వుండేవాడు. మిగిలిన సమయమంతా మిత్రులతో ఉల్లాసంగా గడుపుతూ వుండేవాడు.

ఇలా కొద్ది రోజులు గడిచాయి. రాముడికి 12 యేళ్ళు నిండాయి. భరతుడు అప్పుడప్పుడూ మేనమామ ఇంటికి పోయి వస్తూ వుండేవాడు. మిగిలిన ముగ్గురూ అయోధ్యలోనే వుంటూ వుండేవారు. దశరథుడికి, పిల్లల అభివృద్ధిని చూశాక, వారి వయస్సు చిన్నదైనా, త్వరగా పెళ్ళి చేస్తే బాగుండు అనిపిస్తూ వుండేది. ఆ విషయమే మంత్రులతో చర్చిస్తూ వుండేవాడు.

ఇలా వుండగా, రాముడు క్రమంగా ప్రాతఃకాల రాజసభలకు రావడం తగ్గించేశాడు. తమ్ములతో ఆటలూ తగ్గించేశాడు. మనిషి చిక్కిపోతున్నాడు. పాలిపోతున్నాడు. ఎప్పుడు చూసినా తన గదిలో చెంపకు చెయ్యి పెట్టుకొని, ఏదో ఆలోచిస్తూ వుండేవాడు. సేవకులు బతిమాలగా కాలకృత్యాలు తీర్చుకొంటాడు. ఇతని పరిస్థితి చూసి దశరథుడు గుచ్చి గుచ్చి అడిగేవాడు. ఎన్ని సార్లు అడిగినా ఏమీ లేదనేవాడు రాముడు. అంతకన్నా ఏమీ చెప్పడు. దశరథుడు వశిష్ఠుణ్ణి సంప్రదించాడు. వశిష్ఠుడు రాముణ్ణి పరిశీలించి, దశరథుణ్ణి విడిగా పిలిచి, "గొప్పవాళ్ళకు అల్పమైన విషయాలవల్ల కోపమూ రాదు, సంతోషమూ రాదు, సుఖమూ రాదు, దుఃఖమూ రాదు. శ్రీరాముడుమహాత్ముడు. అతని దిగులుకు గొప్ప కారణమే వుంటుంది" అన్నాడు. ఈ మాటలతో దశరథుడికి కొత్త దిగులు పట్టుకొంది. రాజభవనంలో ఎవరికీ సంతోషంగా లేదు. రాముడు రోజు రోజుకీ చిక్కిపోతూనే వున్నాడు.

ఇంతలో ఒక రోజున మబ్బులేని పిడుగు లాగా, విశ్వామిత్ర మహర్షి వూడిపడ్డాడు. ఆయన వస్తూనే తన యాగరక్షణ కోసం , అనగా మహారాక్షసులతో యుద్ధం చేసేందుకోసం, రాముణ్ణి తనతో పంపించమన్నాడు. దశరథుడు ఏవో వంకలు పెట్టి తప్పించుకోవాలని చూశాడు. కానీ, విశ్వామిత్రుడు మండిపడ్డాడు.

పరిస్థితిలోని తీవ్రతను గుర్తించి, వశిష్ఠమహర్షి జోక్యం చేసుకొని, విశ్వామిత్రుడు కోరినట్లుగా రాముణ్ణి పంపించమని దశరథుడికి నచ్చ జెప్పాడు. అప్పుడు దశరథుడు తేరుకొని, రామలక్ష్మనులను తీసుకురమ్మని ఒక పరిచారకుణ్ణి పంపాడు.

వెళ్ళిన పరిచారకుడు ఒక్కడే తిరిగి వచ్చి ఇలా చెప్పాడు. "మహారాజా! మీ అబ్బాయి పరిస్థితి ఏమిటో మాకేమీ అర్థం కావటం లేదు. మీ నాన్నగారు పిలుస్తున్నారండీ అంటే, కాసేపు వస్తానంటాడు, కాసేపు రానంటాడు. మొన్న తీర్థయాత్రలకు పోయి వచ్చిన దగ్గరనుంచీ మీ అబ్బాయి పరిస్థితి మరీ విడ్డూరంగా వుంది. సంధ్యావందనమే సరిగా చెయ్యటం లేదు. ఏవైనా విలాస వస్తువులను చూస్తే ఏడుస్తున్నాడు. ఈ సుఖాలన్నీ ఆభాస సుఖాలనీ, ఈ భోగాల మోజులో పడవద్దనీ, మిత్రులకు పదే పదే బోధిస్తున్నాడు. చేతిలో ఎంత వుంటే అంత యాచకులకు దానం చేసేస్తున్నాడు. మంచి బ్రాహ్మణోత్తములు ఎవరైనా కనిపిస్తే ఈ ప్రపంచమంతా నశ్వరమంటూ పకపకా నవ్వుతున్నాడు. అమ్మా, నాన్న, బంధువులంటే మండిపడుతున్నాడు. ఈయన్ను చూసి, ఈయన తమ్ముళ్ళు లక్ష్మణ శత్రుఘ్నులు కూడా ఈయనకు నకలుగా తయారవుతున్నారు. మహారాజా! బిడ్డల్ని ఇలా వదిలేస్తే లాభం లేదు. ఎవరైనా మంచి మహానుభావుణ్ణి పట్టుకొని బిడ్డల్ని బాగు చేయించుకోండి."

పరిచారకడు చెప్పిన మాటలను విశ్వామిత్రుడు కూడా విన్నాడు. ఆయన గట్టిగా ఆలోచించి, "దశరథా! ఇదంతా స్వచ్ఛమైన వైరాగ్యంవల్ల కలిగిన పరిణామమే గానీ, అజ్ఞానం కాదు. రాముణ్ణి ఇక్కడకు రప్పించు. అతని సంశయాలన్నీ నేను దూరం చేస్తాను. అతనికి అఖండానందం ప్రాప్తిస్తుంది" అన్నాడు. అది విని దశరథుడు ప్రతీహారిని పంపాడు. కానీ, ఇంతలో రాముడే అల్లంత దూరంలో కనిపించాడు.

వచ్చిన రాముడు క్రమం తప్పంకుడా పెద్దలందరికీ నమస్కారాలు చేశాడు. దశరథుడు రాముణ్ణి వొళ్ళో కూర్చోబెట్టుకొని, "నాయనా! నువ్వు వివేకివి. కానీ, తెలివితక్కువవాడి లాగా మనసును కల్లోల పరచుకొంటున్నావు. మనసులో సమస్యలు తలయెత్తితే, తగిన పెద్దలతో చర్చించాలి. అంతేగానీ, కల్లోలపడి అవివేకిలాగా ప్రవర్తిస్తే ఆపదలే సంభవిస్తాయి"– అన్నాడు. వశిష్ఠ విశ్వామిత్రులిద్దరూ, దశరథుడికి వత్తాసు పలికారు. విశ్వామిత్రుడు రాముణ్ణి మరింత గుచ్చి గుచ్చి ప్రశ్నలు వేయసాగాడు.

అప్పుడు శ్రీరాముడు నిట్టూర్చి, తన మనసులోని కల్లోలాన్ని వ్యక్తం చేశాడు. "మహర్షీ! నేనెలా జన్మించానో నాకు తెలియదు. పుట్టినప్పటినుంచీ పెద్దవాళ్ళు నేర్పిన అలవాట్లే నేర్చుకొన్నాను. వాళ్ళు చదివించిన చదువులే చదివాను. ఆ తరువాత లోకమంతా తిరిగాను. తీర్థయాత్రలు చేశాను. ఇలా చదువులు చదివిన కొద్దీ, లోకాన్ని చూసిన కొద్దీ, ఈ జీవితం ఏమిటో నాకు బొత్తిగా అర్థం కావటం లేదు. ఈ లోకంలో ప్రతివాడూ సుఖం కోసమే వెంపర్లాడుతున్నాడు. గట్టిగా మాట్లాడితే ఈ సుఖాలకోసం వెంపర్లాటే జీవితం. ఇదే ప్రపంచం.

**కిం నామేదం బత సుఖం యేయం సంసారసంతతిః।**
**జాయతే మృతయే లోకో మ్రియతే జననాయ చ॥** (వై.ప్ర.స.12 శ్లో.7)

సుఖం సుఖం అంటారు. ఏమిటయ్యా సుఖం? ఈ ప్రపంచంలో ప్రతివాడూ పుడుతున్నాడు. ఎందుకు పుడుతున్నాడు? చావటానికి పుడుతున్నాడు. ఎందుకు చస్తున్నాడు? మళ్ళీ పుట్టటానికి చస్తున్నాడు. ఈ ప్రపంచ యాత్రలో ఇంతకంటే సారం నాకేమీ కనిపించడం లేదు. ఇలాంటి లోకంలో నేనొక రాజునను కొంటున్నాను. ఎవడు రాజు? ఎవడికి రాజు?

**కిం మే రాజ్యేన కిం భోగైః కోఽహం కిమదమాగతమ్।**
**యన్మిథ్యైవాస్తు తన్మిథ్యా కస్య నామ కిమాగతమ్॥** (వై.ప్ర.స. 12 శ్లో. 15)

"ఈ రాజ్యంవల్ల నాకు ప్రయోజనం ఏమిటి? రాజ భోగాలు ఎక్కువంటారా? ఎందుకు ఆ భోగాలు? అసలు నేనెవరిని? ఈ ప్రపంచం ఎవరు? నేను మిథ్యా? ఈ ప్రపంచం మిథ్యా? ఈ ఇద్దరిలో ఏ ఒకటి మిథ్య అయినా ఫలితం ఒకటే. ఏది మిథ్యో దాన్ని మిథ్యగానే వుండనీండి. మిథ్య అయినదానివల్ల రెండవదానికి లాభం ఏమిటి? నష్టం ఏమిటి?

"నేనే మిథ్య అంటారా? మిథ్య అయిన వాడికి రాజ్యాలేందుకు? శరీర మెందుకు? ప్రపంచమే మిథ్యంటారా? ఈ మిథ్యా ప్రపంచంలోని మిథ్యా సుఖాలకోసం నేను వెంటపడటం దేనికి? కనుక, ఓ మహర్షీ! ఎన్ని రకాలుగా చూసినా, నాకు ఈ ప్రపంచంలో సారం గల వస్తువే కనిపించటం లేదు. ఎడారిలో నడిచే బాటసారి, కొత్తలో, దూరపు ఎండమావులను చూసి నదులనే ఆశతో పరుగులు తీస్తాడు. ఎంతకాలం తీస్తాడు? క్రమంగా వాడికే అర్థమవుతుంది. ఇక కళ్ళకు ఎదురుగా మహానదుల వంటివి కనిపించినా, వాటికోసం పరుగులు పెట్టడు. ప్రస్తుతం నా పరిస్థితి అలాగే వుంది.

"ఇంతకీ ఈ ప్రపంచంలో పుట్టేదెవరు? చచ్చేదెవరు? నాకు చూడగా కొన్ని పదార్థాలు కొంత కాలం కనిపించడం, ఆ తరువాత కనిపించకుండా పోవడం, ఈ రెండే వున్నాయి. ఈ ప్రపంచంలో. ఇంతకు మించి ఎవడూ పుట్టడం లేదు. ఎవడూ చావడం లేదు.

"మరి నేను బ్రతికిలేనా? నేనే కాదు, లోకంలో బ్రతికి వున్నామనుకొనే వారి పరిస్థితి అంతా ఇంతే.

**అచేతనా ఇవ జనాః పవనైః ప్రాణానామభిః**

**ధ్వనంతః సంస్థితా వ్యర్థం యథా కీచక వేణవః ॥** (వై.ప్ర.స. 12, శ్లో.20)

"ఏమిటా స్థితి అంటారా? అడవిలో వెదురు చెట్లున్నాయి. ఆ వెదురు బొంగుల్లో కొన్ని ముదిరి పగిలాయి. ఆ పగుళ్ళలోకి హోరు గాలి జొరబడింది. అలా గాలి జొరబడే సరికి, బొంగులనుంచి కీచు కీచుమనే శబ్దం బయటకు వచ్చింది. ఆ వెదురు బొంగుల శబ్దాలకు ఎంత అర్థం వుందో, ఈ మానవులు పలికే మాటలకూ అంతే అర్థం వుంది. ఆ వెదురు బొంగులలోకి గాలి దూరినట్లే, ఈ మానవుల శరీరాలలోకి ప్రాణవాయువు దూరుతోంది. దానితో వీరు కూడా, వెదురు బొంగుల్లాగానే, ధ్వని చేస్తున్నారు. ఈ ధ్వనులకు అర్థమేమిటి?

"మహర్షీ! ఈ లోకపు పరిస్థితిని చూడగా నాకు కళ్ళలో నీళ్ళు, గొంతులో ఏడుపు, ముంచుకొస్తున్నాయి. అయినా నేను ఏడిస్తే ఇంట్లో గోల అవుతుందని పైకి ఏడవటం లేదు.

**నిజలోక భయాదేవ గలద్బాష్పం న రోదిమి"** (వై.ప్ర.స.12, శ్లో.22)

అని, ఈ విధంగా ప్రారంభించి శ్రీరాముడు, తను ప్రపంచాన్నంతా ఏ విధంగా పరిశీలన చేశాడో, ప్రపంచంలోని ప్రతి ప్రధాన వస్తువు గురించి తనకు ఏ రకమైన విశ్లేషణ కలిగిందో, అవన్నీ అంశాల వారీగా వివరించాడు.

యోగవాశిష్ఠ గ్రంథంలో ఒక భాగం అంతా ఈ శ్రీరామ వైరాగ్య వర్ణనకే వినియోగించారు. ప్రతి విషయాన్ని అనేక కోణాల్లో పరిశీలించి, విస్తారంగా వివరించటమే యోగవాశిష్ఠంలోని ప్రత్యేకత. అందువల్లే ఈ గ్రంథంలో అనేక చోట్ల పునరుక్తి లాగా కనిపిస్తుంది.

## 10. గ్రంథ విభాగములు - వివరణ

ఈ గ్రంథం మొత్తం 32 వేల శ్లోకాలని ఇదివరకే చెప్పుకొన్నాం. అసలు రామాయణం కంటే మరో 12 వేల శ్లోకాలు ఎక్కువన్నమాట. ఇంతటి విపులమైన ఈ గ్రంథాన్ని వాల్మీకి మహర్షి ఆరు ప్రకరణాలుగా విభజించాడు. వీటిలో మొదటి ప్రకరణం పేరు **"వైరాగ్య ప్రకరణం".** 12 యేళ్ళ శ్రీరాముడికి కలిగిన వైరాగ్యాన్ని విపులంగా ఈ ప్రకరణంలో వివరించారు. ఆ తరువాతి ప్రకరణం పేరు –**"ముముక్షు వ్యవహార ప్రకరణం"**. దీనిలో ముముక్షువుకు వుండవలసిన సాధన సంపత్తిని గూర్చి విస్తారంగా చర్చించారు. దీనిలోనే 'మోక్షం కోసమై పురుష ప్రయత్నం చెయ్యాలా? అక్కర్లేదా?' అని విచారణ చేసి, పురుష ప్రయత్నం చెయ్యాలి అని సిద్ధాంతం చేశారు. ఆ తరువాతి ప్రకరణంపేరు **"ఉత్పత్తి ప్రకరణం".** దీనిలో కనిపించే ఈ ప్రపంచానికి ఉత్పత్తి వున్నదా? లేదా? అనే విచారణ చేశారు. ఆ పైది **"స్థితి ప్రకరణం."** దీనిలో జగత్తుయొక్క స్థితిని వివరించాడు. ఆ పైది **"ఉపశమ ప్రకరణం."** దీనిలో జ్ఞానం ద్వారా ప్రపంచోపశమనం కలిగించే విధానాలను వివరించారు. చిట్ట చివరిది **"నిర్వాణ ప్రకరణం."** ఇది చాలా పెద్దది. దీనిని రెండు భాగాలుగా విభజించారు. 1. పూర్వార్థం 2. ఉత్తరార్థం అని. నిర్వాణం అంటే మోక్షం. మోక్షప్రాప్తిని గూర్చి దీనిలో కూలంకషంగా చర్చించారు.

మొదట **వైరాగ్య ప్రకరణం** చెప్పారు. వైరాగ్య కలిగితేనే మోక్షం కావాలనే పట్టుదల కలుగుతుంది. ఈ మోక్షకాంక్ష పేరే ముముక్షుత్వం. అందుకనే ముముక్షు వ్యవహారాన్ని రెండవ ప్రకరణంగా పెట్టారు. ఈ

కనిపించే ప్రపంచానికి ఉత్పత్తి వుందా? స్థితి వుందా? వుంటే, ఆ ఉత్పత్తి ఎటువంటిది? ఆ స్థితి ఎటువంటిది? అనే విషయాలు నిగ్గు తేలితే, ఈ ప్రపంచంయొక్క మూలస్వరూపం తెలుస్తుంది. అందుకే ముముక్షు ప్రకరణం తరువాత **ఉత్పత్తి ప్రకరణాన్ని, స్థితి ప్రకరణాన్ని** వుంచారు.

ఈ ప్రపంచాన్ని పరిశీలిస్తే చాలు, ఇంకేమీ చెయ్యక్కర్లేదు. కేవలం పరిశీలిస్తే చాలు– ఈ ప్రపంచం ఉపశమించి పోతుంది. ఇది ఎక్కడ ఉపశమిస్తోందో ఆ స్థానం పేరే పరమాత్మ. అందుకే నాల్గవ ప్రకరణం పేరు **ఉపశమ ప్రకరణం**. దృశ్యమానమైన ఈ ప్రపంచం ఉపశమిస్తే ఏమి జరుగుతుంది? ఈ ప్రపంచం దేనియందు ఉపశమించిందో, అది మిగులుతుంది. ఉదాహరణకు సముద్రంలో ఒక అల లేచింది. అల లేచింది, వుంది, అనుకొనే లోపలే, అది ఉపశమించింది. అది ఎక్కడ ఉపశమించింది? సముద్రంలో ఉపశమించింది. అలాగే ఈ ప్రపంచమంతా ఆనందరూపియైన పరమాత్మలో ఉపశమిస్తోంది. ఈ స్థితి పేరే నిర్వాణం. ఇదే చిట్టచివరి స్థితి. అందుకే చిట్టచివరి ప్రకరణం పేరు **నిర్వాణ ప్రకరణం.**

## 11. వైరాగ్య స్వరూప విచారణ

ఈ విధమైన ప్రణాళికతో వాల్మీకిమహర్షి యోగవాశిష్ఠాన్ని మనకు ఉపదేశిస్తున్నాడు. ఇందులో ఇప్పుడు మనం వైరాగ్య ప్రకరణంలో వున్నాం. ఈ వేదాంత విద్య మొత్తానికి మూలస్తంభం వైరాగ్యమే కనుక, శ్రీరాముడికి కలిగిన వైరాగ్యమనే నిమిత్తంతో వాల్మీకి మహర్షి వైరాగ్య స్వరూపాన్ని పరిపూర్ణంగా మన ముందు పరిచి వేస్తున్నాడు.

వైరాగ్యం అంటే ఏమిటి? రాగము అంటే ప్రేమ. దానికి వ్యతిరేకమైనది విరాగం. విరాగమే వైరాగ్యం. ప్రేమకు వ్యతిరేకమైనది ద్వేషమే కదా! కనుక విరాగమంటే ద్వేషమేనా? ఇక్కడే చాలా మంది పప్పులో కాలు వేస్తూ వుంటారు. కొందరు భార్యను ద్వేషించి, అదే వైరాగ్యమనుకొని, ఆ కోపంతో బైరాగుల్లో కలుస్తూ వుంటారు. అలాగే కొందరు మీదపడే దుఃఖాల పరంపరను తట్టుకోలేక, ఆ దుఃఖభారంవల్లే బైరాగుల్లో కలుస్తూ వుంటారు. మరి కొందరు "మోక్షమనేది ఏదో గొప్ప పదవి వున్నదట, కట్టుకున్న భార్యను వదిలేస్తే ఆ పదవి దొరుకుతుందట" అని విని, అత్యాశవల్ల బైరాగుల్లో కలుస్తూ వుంటారు. ఇలాంటివి ఏవీ కూడా వైరాగ్యం కావు. ఎందుకు కావు? భార్య మీద కోపంతో సంన్యాసం పుచ్చుకొన్నవాడు, కోపం చల్లారగానే మళ్ళీ సంసారి అవుతాడు. దుఃఖంవల్ల సంన్యాసం పుచ్చుకొన్నవాడు, మళ్ళీ సుఖాలు కలుగగానే వాటియందు రమిస్తూ వుంటాడు. పదవిమీద ఆశపడి సంన్యాసం పుచ్చుకొనేవాడికి, పదవి మీద ప్రేమ పోలేదని స్పష్టంగా కనిపిస్తూనే వుంది కదా! అందవల్ల, ఇది ఏవీ వైరాగ్యం కావు.

## 12. సద్విచారణ

తత్త్వ పరిశీలనవల్ల ఈ ప్రపంచం అస్థిరమనీ, అనిత్యమనీ, గుర్తింపు కలగాలి. ఇది కలిగాక తమకీ, ఈ ప్రపంచానికీ, సంబంధం ఏమిటనే విచారణ తనలో తనకే జరగాలి. ఇట్టి సద్విచారణవల్ల ఈ ప్రపంచంలోని ప్రతిపదార్థం మీదా అనాసక్తి ఏర్పడాలి. ఇట్టి సద్విచారణ జనితమైన అనాసక్తి పేరే వైరాగ్యం. విచారణవల్ల ఏం జరుగుతుంది? ముందుగా ప్రపంచం అశాశ్వతం అని నిర్ధారణ అవుతుంది. శాశ్వతమైతే అగుగాక! వున్నంత కాలం వీటిలో మంచివాటిని అనుభవించ రాదా? మనిషికి ఇలాంటి ఆశ కలగటం సహజం. కానీ,

ఈ దృశ్యమాన పదార్థాలలో నిజంగా మంచివి అనుకోదగ్గ పరార్థాలు వున్నాయా? లేవా? ఈ విషయం తేల్చుకొనేందుకోసం విచారణ కావలసి వస్తుంది. "ఈ డొంక తిరుగుడంతా దేనికండీ? ప్రాపంచిక విషయాలలో ఏవీ మంచివి కావు - అని చెప్పాలనేగా మీ ఉద్దేశ్యం? ఆ మాట ఒక్క మాటలో సూటిగా చెప్పెయ్యరాదా?" - అంటారేమో! ఒకరు చెప్పడం సమస్య కాదు. నీ హృదయం నీకు ఏమి చెపుతోంది అనేది సమస్య. నీ హృదయం నీకు సరైన మాట చెప్పాలంటే, దానిచేత సద్విచారణ చేయించాలి.

సద్విచారణ అంటే ఏమిటి? లోకంలో ప్రతి వస్తువులోనూ కొంత మంచి వుంటుంది. కొంత చెడు వుంటుంది. ఒక దృష్టిలో ఒక రకం మంచి వుంటుంది. మరొక దృష్టిలో మరొక రకం చెడు వుంటుంది. లోకదృష్టిలో మనం చూసే దృష్టులన్నీ పరస్పరం సాపేక్షికాలే. అలాంటప్పుడు వీటిలో ఏది నిజమైన మంచి? ఏది నిజమైన చెడు? మనం ఇప్పుడు లోకాన్ని పరమార్థ దృష్టితో పరిశీలన చేస్తున్నాం కనుక పరమార్థ సిద్ధికి అనుకూలమైనదే - నిజమైన మంచి. అలా కానిది- నిజమైన చెడు. ఇలాంటి మంచి చెడులను విచారించేందుకు విధానం ఏమిటి? ఆ విధానం సామాన్యులకు అందటం కొంచెం కష్టం గనుకనే, ఉత్తమ మానవుడైన శ్రీరాముడిలో ఆ విచారణ ధార ఏ విధంగా కొనసాగిందో, దానిని ఆదర్శంగా చూపిస్తూన్నాడు వాల్మీకి మహర్షి. అందుకనే యోగవాశిష్ఠంలోని మొట్టిమొదటిదైన వైరాగ్య ప్రకరణంలో శ్రీరాముడి వైరాగ్య విధానాన్ని 13వ సర్గలో మొదలుపెట్టి, అక్కడినుంచి మొత్తం 19 సర్గలలో అంశాల వారీగా వర్ణించడం జరిగింది.

### 13. సంపద

13వ సర్గలో ఐశ్వర్యాన్ని గురించి, అనగా సంపదల గురించి, శ్రీరాముడు ఎలా విచీరణ చేశాడో వర్ణించారు. దీనిలో శ్రీరాముడు సంపద రాకడా పోకడా, రెండూ కూడా దుఃఖాలకు హేతువే అని నిరూపించాడు. డబ్బు దాచుకున్నా ప్రమాదమే. ఖర్చు పెట్టినా ప్రమాదమే అన్నాడు. ఐశ్వర్యంలో వున్న దోషాలను సుమారుగా 20 కోణాల్లోంచి పరిశీలించి చెప్పాడు. చివరికి సారంగా -

**న శ్రీస్సుఖాయ భగవన్**
**దుఃఖాయైవ హి వర్ధతే** (వై.ప్ర.స. 13, శ్లో. 10)

అని తేల్చాడు. అంటే ఈ సంపద వల్ల కనీసం లౌకికసుఖం కూడా లేదు. కనుక, దీనివల్ల నిరంతరం దుఃఖమే ఖాయం అని తేల్చాడు.

ఈ విధంగా లోకంలోని వ్యామోహం కలిగించే అంశాలను ఒక్కొక్కటిగా తీసుకొని, వాటిని వివిధ కోణాలలోంచి శ్రీరాముడు విశ్లేషించిన విధానాన్ని, వాల్మీకిమహర్షి కవితామయంగా ఈ ఆధ్యాయాలలో విస్తారంగా వర్ణించి వున్నప్పటికీ, మనం రేఖా మాత్రంగా విచారణ చేసుకొంటూ పోతున్నాం కనుక, ఈ విషయాలను సంగ్రహంగా మాత్రమే చెప్పుకొంటున్నాం.

### 14. ఆయుష్యం

సంపద తరువాత లోకులకు ఆకర్షించేది ఆయుష్యం. ప్రతివాడికీ దీర్ఘకాలం జీవించి వుండాలని కోరిక వుంటుంది. అయితే దీర్ఘకాలం బతికి వుండి ఫలమేమిటి? ఆ మాట ఏమోగానీ, ప్రతివాడూ తాను దీర్ఘకాలం బతికి వుంటానని ఒక నమ్మకంతో వుంటాడు. ఆ నమ్మకంతోనే ఎన్నో పనులు చేస్తూ వుంటాడు. చేసి చేసి దుఃఖాన్ని పెంచుకొంటూ వుంటాడు.

**భారో వివేకిన శ్శాస్త్రం భారో జ్ఞానం చ రాగిణః।**

**అశాన్తస్య మనో భారో ౽ భారో నాత్మ విదో వపుః॥** (వై.ప్ర.స.14, శ్లో. 13)

మహర్షీ! మనిషి జీవించి ఏం చేస్తాడు? చాలా శాస్త్రాలు చదువుతాడు. కొందరికి ఎంత చదివినా గ్రంథాలు కంఠస్థం అవుతాయి కానీ, ఆ జ్ఞానం వంట పట్టదు. అలాంటివాడికి చదివిన శాస్త్రాలన్నీ నెత్తిన కట్టెల మోపు లాగా బరువుగా తయారౌతాయి. ఎప్పటికప్పుడు చదివిన శాస్త్రాలు మరిచిపోకుండా వుండడం కోసం, మళ్ళీ మళ్ళీ నూరుకొంటూ వుండడమే వాడికి సరిపోతుంది. ఒక వేళ కాస్తో కూస్తో వంట బట్టినా, ఈ జ్ఞానంవల్ల నాకు ఆ లాభం కలగాలి, ఈ లాభం కలగాలి, అని వాడికి ఒకటే ఆశగా వుంటుంది. అలాంటి ఆశాపరుడికి "నేను ఇంత జ్ఞానం సంపాదించాను. దానికి తగిన ప్రతిఫలం రాలేదు" అని ఒకటే తపనగా వుంటుంది. అందువల్ల వాడి జ్ఞానమే వాడి నెత్తిన భారమై కూర్చొంటుంది. దీనివల్ల పై వాళ్ళిద్దరికీ – అనగా శాస్త్రాలు కంఠతా పట్టిన వాడికీ, కొంత శాస్త్రజ్ఞానం పొందినవాడికీ, ఇద్దరికీ కూడా – మనశ్శాంతి లేకుండా పోతుంది. శాంతి లేని మనస్సు పుండు మొలచిన అవయవం వంటిది. అది ఎప్పుడూ అక్కర లేని, అంతూ పొంతూ లేని, ఆలోచనలు చేస్తుంది. కనుక, వాడి మనస్సే వాడికి భారం అవుతుంది. ఈ గందరగోళం అంతా ఎందుకు వచ్చిందంటే, తానెవరో వాడికి తెలియదు. ఎందుకోసం ఈ శాస్త్రాలు చదువుతున్నాడో, ఎందుకోసం ఈ ఆశలు పెంచుకొంటున్నాడో, ఎందుకోసం ఈ ఆలోచనలు చేస్తున్నాడో, ఇదేదీ వాడికి తెలియదు. అందుకే వాడు చేసే ప్రతిపనీ వాడికి భారమే అవుతుంది. అంటే మొత్తం మీద, వాడి శరీరమే వాడికి భారం అయిపోతుంది. కనుక, ఓ మహర్షీ ఈ శరీరాన్ని నిలబెట్టే ఆయుష్యంవల్ల ప్రయోజనం ఏమిటి? – అని ఈ విధంగా శ్రీరాముడు మానవులకు ఆయుష్యంపై గల ఆశను విశ్లేషణ చేసి, అది నిస్సారమని నిరూపించాడు.

## 15. అహంకారం

ఆ పై ప్రకరణంలో శ్రీరాముడు అహంకారం గురించి విశ్లేషణ చేశాడు. అహంకారం రెండు రకాలు. వాటిలో ఒకటి అందరికీ తెలిసిందే. నేనింత గొప్పవాణ్ణి అని అనుకోవటం. ఇది అందరికీ తెలిసిన అహంకారం. దానికి కూడా మూలమైన మరో అహంకారం వుంది. ఈ దేహమే నేను అనుకొనే అహంకారం. దీనివల్లే మానవులు ఎన్నో ఘోరకృత్యాలు చేస్తున్నారు.

ఇది మానవులకు దీర్ఘకాల శత్రువు. ఇది మనిషికి సమతాబుద్ధి లేకుండా చేస్తుంది. అంటే ఎవరినీ తనతో సమంగా భావించనీయదు. అందువల్లే, ఆ మనిషికి శాంతి మిగలదు. మనిషి ప్రపంచంలోని జీవులంతా తనలాంటి వారే అనుకోడు. అలా అనుకొని వుంటే, ఆ జీవులకు కూడా తన లాగానే కష్టసుఖాలు వుంటాయని గ్రహింపు వస్తుంది. ఆ గ్రహింపు రాకుండా అడ్డుపడేదే అహంకారం. ఆ గ్రహింపు తొలగిపోయిన మనిషి తనకంటే తక్కువ జీవులను పీడిస్తాడు. ఈ పీడవల్ల తనకు సుఖం కలుగుతుందని భ్రమిస్తాడు. కానీ, దానివల్ల తాత్కాలిక సుఖమే కలుగుతుంది తప్పితే, పర్యవసానంలో దుఃఖమే అతనికి లభిస్తుంది. ఇక తనకంటే బలవంతులైన జీవులను తను కాకాబట్టి, వారిని బుట్టలో వేసుకొని, వారి ద్వారా కూడా సుఖం పొందాలని చూస్తాడు. అది కూడా అనుకొన్నట్లు నెరవేరక చివరకు దుఃఖమే మిగులుతుంది. కనుక, ఇతర జీవులు తనకంటే ఎక్కువవారనుకొన్నా, తక్కువవారనుకొన్నా, మిగిలేది దుఃఖమే. ఇలాంటి అసమానత్వ దృష్టికి మూలకారణం ఏమిటయ్యా అంటే, అది అహంకారమే.

కనుక, ఓ మహర్షి! ఈ విషయంలో శూన్యవాది అయిన బౌద్ధుడే సయమేమో అనిపిస్తోంది. ఎందుకంటే, అతడు చేసే శూన్యవాదం యుక్తియుక్తంగా లేకపోయినా, అతడు జీవులందరిపట్లా సమతా భావం పెంచుకోమని బోధిస్తున్నాడు. అన్ని జీవులూ తమతో సాటివే అని భావించమంటున్నాడు. ఈ బోధ బాగుంది. ఓ మహర్షీ! ఇలా దుఃఖాలకు హేతువైన ఈ అహంకారం నన్ను కూడా ఆవరించింది. కానీ, నేను, నా వివేచనా బలం వల్ల దానిని దూరంగా తోసిపారేస్తున్నాను.

**నాహం రామో న మే వాంఛా భావేషు చ న మే మనః ।**

**శాంత ఆసితు మిచ్ఛామి స్వాత్మనీవ జినో యథా ॥**(వై.ప్ర.స.15, శ్లో.8)

అందువల్ల ఓ మహర్షీ! నేను రాముణ్ణి కాదు. నాకు ఏ కోరికలూ లేవు. నా మనస్సులో ఏ భావాలూ లేవు. నేను ఎవరో నాకు సరిగా తెలియకపోయినా, ఆ బౌద్ధవాది లాగా నేను కూడా జీవులందరూ నాలాంటివారే, ఎవరూ ఎక్కువా లేదు, ఎవరూ తక్కువా లేదు. అని భావిస్తూ ఎవరి మీదా వైరభావం లేకుండా, ప్రశాంతంగా వుండాలని ప్రయత్నం చేస్తున్నాను.

మహర్షీ! బౌద్ధుడి లాగా సర్వసమతా భావనచేసి, తద్ద్వారా అహంకారాన్ని సంపూర్ణంగా తొలగించుకొన్నా కూడా నేనెవర్నో నాకు సరిగా తెలియడం లేదు. ఈ అజ్ఞానంవల్ల నాకు దుఃఖం కలుగుతోంది. కనుక, నాకు ఏమి బోధ చేయాలో మీరే నిర్ణయించండి. తగిన బోధ చెయ్యండి.

**గమనిక –**

ఇక్కడ బుద్ధుడి ప్రసక్తి వచ్చింది కనుక, ఈ గ్రంథ రచన బౌద్ధమత వ్యాప్తి తరువాత జరిగిందని కొందరు అనుకొంటూ వుంటారు. అలాంటివారు తెలుసుకోవలసిన విషయమేమంటే, శుద్ధోదన పుత్రుడైన బుద్ధభగవానుడు బోధించిన భావాలన్నీ, అయనతో కొత్తగా పుట్టినవి కావు. అలాంటి భావాలు తనకు ముందే ఎంతో కాలంగా వున్నాయని బుద్ధభగవానుడే స్వయంగా చెప్పాడు. అయితే ఆ భావాలను ఆయన విశేషంగా ప్రచారం చేశాడు. కనుక, ఈ నాటి పండితులు కొందరు అవి ఆయనతోనే మొదలయ్యాయని పొరపాటు పడుతున్నారు. ధమ్మపిటకంలోనూ, జాతక కథలలోనూ కూడా, ఇప్పటి బుద్ధుడికి వెనకాల అనేకమంది బౌద్ధాచార్యులు వున్నారని స్పష్టమైన సాక్ష్యాలు వున్నాయి. అందువల్ల, భౌద్ధ భావాల ప్రసక్తి వచ్చినంత మాత్రంచేత, ఈ గ్రంథం శుద్ధోదనబుద్ధుడి తర్వాతిదే అనటం తగదు. శ్రీరాముడి కాలంలో కూడా అలాంటి భావాలు కొన్ని వున్నాయి. వాటిలో సమతాభావం మాత్రం బాగుందని శ్రీరాముడు ఇక్కడ మెచ్చుకొంటున్నాడు, అని మనం గ్రహించాలి.

## 16. మనస్సు

ఆ తరువాత 16వ సర్గలో శ్రీరాముడు మనస్సుయొక్క స్వభావాన్ని గురించి విపులంగా విశ్లేషించాడు.

మహర్షీ! ఈ మనస్సుకీ, ఊరకుక్కకీ, పెద్ద తేడా లేదు. ఊరకుక్క లాగే ఈ మనస్సు కూడా ఇటునుంచి అటూ, అటు నుంచి ఇటూ, ఏదో గొప్ప పని, వున్నట్లు వేగంగా పరుగులు తీస్తూ వుంటుంది. దానికి పని లేదు. దాని పరుగులకు ఫలితమూ లేదు. మనస్సు గతీ ఇంతే. మహాత్మా! సింహాన్ని బోనులో పెట్టడం ఎంత కష్టమో, ఈ మనస్సును అదుపులో పెట్టడం అంత కష్టం.

ఈ మనస్సు చేసే అపకారాలలోకల్లా గొప్ప అపకారం ఏమిటంటే, అన్ని శరీరాలలోనూ ఒకే పరమాత్మ వ్యాపించి వున్నాడని అది ఒప్పుకోనీయదు. ఎప్పటికప్పుడు భేదదృష్టిని తెచ్చి నెత్తిన రుద్దుతూ వుంటుంది. ఈ భేదదృష్టివల్ల దుఃఖం తప్పదని నేను తెలుసుకొన్నానని, ఇది వరకే మనవి చేశాను కదా! ఈ మనస్సు సామాన్యంగా అలవాటు ప్రకారంగా నడుస్తూ వుంటుంది. కానీ, ఒక కొత్త ఆశ చూపించామంటే చాలు, యేళ్ళ తరబడి చేస్తూ వస్తున్న మంచి అలవాట్లను క్షణంలో మరచిపోతుంది. సముద్రమంతా తాగేయవచ్చు. మేరుపర్వతాన్ని పెకలించి నెత్తికి ఎత్తుకోవచ్చు. భగభగా మండే నిప్పును మింగవచ్చు. కానీ, ఈ మనస్సును నిగ్రహించడం మాత్రం సాధ్యం కాదు.

ఈ చిత్తాన్ని నిగ్రహించాలని అంత పట్టుదల ఎందుకు అంటావేమో? నాకు చూడగా, చూడగా, ఈ జగత్తు మొత్తానికీ, అనగా ఈ జగత్తులో ఉండే పదార్థాలన్నిటికీ, మనస్సే కారణం అనిపిస్తోంది.

**చిత్తం కారణ మర్థానాం తస్మిన్ సతి జగత్త్రయమ్।**
**తస్మిన్ క్షీణే జగత్ క్షీణం తచ్చికిత్స్యం ప్రయత్నతః॥**

(వై.ప్ర.స.16, శ్లో.25)

అవును, దృశ్యమాన పదార్థాలన్నిటికీ కారణం ఈ మనస్సు. మనస్సు పని చేస్తూ వుంటేనే, ఈ మూడు లోకాలూ వుంటాయి. ఆ మనస్సు క్షీణించిపోతే, ఈ జగత్తు గూడా క్షీణించిపోతుంది. (ఇందుకు సుషుప్తి అవస్థే మంచి నిదర్శనం.) కనుక, ఎంత ప్రయత్నమైనా చేసి, జగత్తు మొత్తానికి మూలమైన ఈ మనస్సుకు ప్రతి మానవుడూ చికిత్స చేసుకొని తీరాలి.

## 17. తృష్ణ

తృష్ణ అంటే అంతు లేని అత్యాశ. 17వ సర్గలో శ్రీరాముడు దీన్ని విశ్లేషిస్తున్నాడు. మనస్సూ, తృష్ణ, మొగుడూ పెళ్ళాల లాంటివని, వెనుకటి సర్గలో శ్రీరాముడు ఒకసారి చెప్పాడు. ఎందుకంటే వాటి సంబంధం అంత సన్నిహితమైనది. ఇప్పుడు రాముడు ఇలా అంటున్నాడు.

మహర్షీ! తృష్ణ అనేది ఒక చీకటి రాత్రి వంటిది. చీకటి రాత్రి మనుషుల కళ్ళు కప్పేస్తుంది. తలక్రిందులుగా వేళ్ళాడే గబ్బిలాలకు కళ్ళు తెరుస్తుంది. అలాగే ఈ తృష్ణ అనే రాత్రి వివేకాన్ని కప్పివేసి, రాగద్వేషాలనే గబ్బిలాలను లేపుతుంది.

మునీంద్రా! ఎంత బలిష్ఠమైన ఎద్దైనా ముక్కుకు తాడు వేసి లాగితే లొంగిపోయినట్లుగా, నేను ఈ తృష్ణకు లొంగిపోతున్నాను. ఈ తృష్ణ మనుషులలో సుగుణాలను మిగలనీదు. వారికి మూర్ఖత్వాన్ని అంటగడుతుంది. ఇది ఒక మహావ్యాధి వంటిది. అన్ని సుఖాలనూ ఏర్పాటు చేసి, అంతఃపురంలో సుఖంగా కూర్చోరా బాబు అన్నా కూర్చోనీయక, కారడువుల్లో పరుగెత్తిస్తుంది.

లోకంలో ప్రతివాడూ ఆరోగ్యం కోసం తహ తహలాడిపోతూ వుంటాడు. ఇది కూడా తృష్ణయొక్క కార్యాలలో ఒకటే. ఆడదాని కోసం పడే తృష్ణ కూడా ఇటువంటిదే.

**రోగార్తి రంగనా తృష్ణా గంభీరమపి మానవమ్।**
**ఉత్తానతాం నయన్త్యాశు సూర్యాంశవ ఇవాంబుజమ్॥** (వై.ప్ర.స. 17, శ్లో.45)

అప్పటిదాకా ఎంతో గంభీరంగా వుండే మనిషి కూడా, ఆరోగ్యం చెడిపోయిందంటే, వెల్లకిలాబడి

వెలవెలాబోతాడు. అలాగే ఎంతో ఉన్నతుడిగా కనిపించిన వ్యక్తి, ఆడదాని మోజులో పడేసరికి నోరు ఆవలించి, దాని ముందు వెల్లకిలా పడిపోతాడు. వాడు మేరునగధీరుడైనా సరే, అన్నీ చదివిన ప్రాజ్ఞుడైనా సరే, అరివీర భయంకరుడైనా సరే. తృష్ణ తలచుకుంటే, వాడ్ణి నిమిషంలో గడ్డిపరకను ఊదేసినట్లు, ఊదేస్తుంది.

మహర్షీ! తృష్ణ ఒక వ్యాధి అని ఇదివరకే చెప్పాను. ఇది మామూలు వ్యాధి కాదు. మశూచి వ్యాధి. మశూచి వ్యాధికి మందు వేసినకొద్దీ పెరుగుతుంది. అందుకే దానికి మందులు వెయ్యవద్దనీ, దాని మాట మరిచిపోతే అదే తగ్గిపోతుందనీ, వైద్యులు చెపుతూ వుంటారు. ఈ తృష్ణ పరిస్థితి కూడా అంతే.

**తృష్ణా విషూచికా మంత్రః।**

**చింతాత్యాగో హి కథ్యతే।।** (వై.ప్ర.స. 17, శ్లో. 43)

మశూచి వ్యాధి లాగానే, తృష్ణా వ్యాధికి కూడా ఒక మంత్రం వుంది. ఆ వ్యాధికీ, ఈ వ్యాధికీ కూడా, అదే మంత్రం అదే చింతా త్యాగం. అంటే, భోగ్య విషయాలను స్మరించకుండా వుండటం. ఎందుకంటే? – విషయానుస్మరణమే తృష్ణకు మూరకారణం.

**ధ్యాయతో విషయాన్ పుంసః**

**సంగస్తేషూప జాయతే**

**సంగాత్సంజాయతే కామః**

అని పెద్దలు నిర్ణయించారు. విషయాలను గూర్చి ఆలోచిస్తూ వుంటే వాటిమీద సంగం పెరుగుతుంది. సంగం అంటే స్నేహం. సంగంవల్ల వాటిపై కోరిక కలుగుతుంది. అది ముదిరితే దాని పేరు తృష్ణ.

## 18. దేహము

ఇక 18వ సర్గంలో శ్రీరాముడు మానవ శరీరతత్త్వాన్ని గూర్చి విశ్లేషణ చేస్తున్నాడు. ఆశ పనికిరాదని చెప్పేసినాక, శరీరం మీద ప్రత్యేకంగా ఆశ పనికిరాదని చెప్పవలసిన పని లేదు. ఇంకా కొంచెం వెనక్కు వెళితే మానవులకు తమ అయుష్యం మీద గల ప్రీతిని, శ్రీరాముడు 14వ సర్గలోనే విశ్లేషించి చూపాడు. ఆయుష్యమన్నా, శరీరమన్నా, ఇంచుమించు ఒకటే గదా! ఇక దేహం మీద ప్రత్యేకంగా విశ్లేషణ చేయడం ఎందుకు? ఎందుకంటే, జీవులకు శరీరం మీద ప్రత్యేకాభిమానం వుంటుంది కాబట్టి.

**"జీవన్ భద్రాణి పశ్యతి"** అని సామెత వుంది. అంటే బతికి వుంటే అదృష్టం అదే కలసి వస్తుంది అని అర్థం. అదీ గాక మన సుఖాలన్నింటికీ మన శరీరమే ఆధారం అనే భావం జనంలో ప్రబలంగా వుంది. ప్రతివాడికీ శరీరం మీద అధిక ప్రేమ వుంటుంది. అందువల్ల శ్రీరాముడు ఈ శరీరం తత్త్వాన్ని గూర్చి 62 శ్లోకాల్లో ప్రత్యేకంగా చర్చించాడు.

దీనిలో వుండే మంచినీ, చెడునీ కూడా, విమర్శించి చివరికి శ్రీరాముడు ఏమన్నాడంటే–

**సతత భంగరు కార్యపరంపరా**

**విజయ జాత జయం హరవృత్తిషు।**

**ప్రబల దోష మిదం తు కలేవరం**

**తృణ మివాహమపోహ్యా సుఖం స్థితః।।** (వై.ప్ర. స. 18, శ్లో.62)

అంటే లోకంలో అతి త్వరగా నశించిపోవడం అనే విషయంలో ఒక దానితో ఒకటి పోటిపడే పదార్థాలు కొన్ని వున్నాయి. అటువంటి పోటిలో విజయం సాధించినవి కొన్ని వున్నాయి. ఉదాహరణకు మెరుపులు,

శరత్కాలపు మేఘాలు, గంధర్వ నగరాలు మొదలైనవి ఆ కోవకు చెందుతాయి. వాటిమీద కూడా పోటీ చేసి గెలిచిన పదార్థం ఈ శరీరం. దీనికి ఈ విజయం ఎందుకు దక్కిందంటే, ఆ మెరుపులు మొదలైనవాటిలో యే యే దోషాలు వున్నాయో, ఆ దోషాలతో పాటు, అంతకన్నా ప్రబలమైన దోషాలు దీంట్లో వున్నాయి.అందువల్ల ఓ మహర్షీ! ఈ శరీరం గడ్డిపోచకంటే హీనమని నేను నిర్ణయం చేశాను.

## 19. బాల్య, యౌవన, వార్ధక్యాలు

ఆ తరువాత శ్రీరాముడు 19, 20, 21,22 సర్గలలో ఈ శరీరానికి గల బాల్యం, యౌవనం, వార్ధక్యం మొదలైన విషయాలన్నీ విశదంగా విశ్లేషణ చేశాడు.

కొందరు బాల్యావస్థ అమాయకత్వంతో కూడింది గనుక, నిర్మలమైందని చెపుతూ వుంటారు. మరి కొందరు పసిపిల్లలు దేవుడితో సమానమని పొంగిపోతూ వుంటారు. మరి కొందరు పసిపిల్లలను చూస్తే ఆనందంగా వుంటుంది అంటూ వుంటారు. పసిపిల్లలను చూస్తే ఎదుటివారికి ఎలా వుంటుంది? – అనేది ప్రశ్న కాదు. పసితనంలో జీవుడికి ఏ రకమైన అనుభూతి వుంటుంది, అనేది ముఖ్యం. ఆ దృష్టితో పరిశీలించినప్పుడు, పసితనం అజ్ఞానానికి, చాంచల్యానికి, కామక్రోధాలకూ, నిలయమై వుంటుంది. కనుక, ఆ దశలో జీవికి సుఖం చాలా స్వల్పమని శ్రీరాముడు నిర్ణయించాడు. అందుకే ఆయన **“ శైశవం భయ మందిరం”** (స. 19, శ్లో. 30)– బాల్యం అనేది అన్ని భయాలకు నిలయం – అని నిర్ణయం చేశాడు. బాల్యదశ – మూర్ఖత్వం, ఆశక్తి, పరాధీనత్వం, ఆజ్ఞానం అనే దోషాలకు నిలయం – అని ఆయన నిరూపించాడు.

అయితే, యౌవనదశ వచ్చేసరికి, ఈ దోషాలన్నీ ఎగిరి పోతాయి గదా! కనుక, యౌవనం ప్రశస్తం కాకూడదా? అనే ప్రశ్న వేసుకొని, శ్రీరాముడు యౌవనం విషయంలో తన విశ్లేషణ కొనసాగించాడు. యౌవనంలో అత్యాశ, ద్వేషం, మదము, అసూయ, గర్వం, అతికామం మొదలైన దోషాలు మితిమీరి వుంటాయనీ, అందువల్ల ఆ దశలో కూడా జీవికి సుఖం లేదనీ నిర్ణయం చేశాడు. చివరిగా అలాంటి దోషాలు లేని యౌవనం ఎవ్వరికీ వుండదా అంటే, ఆకాశంలో అడవులు వుండటం ఎంత అసంభవమో, అలాంటి యౌవనం వుండటం గూడా అంత అసంభవమే అని తేల్చివేశాడు.

యౌవనం ప్రధానంగా కామావేశానికి ముఖ్య స్థానం. ఈ దశలోనే స్త్రీ పురుషులకు పరస్పర ఆకర్షణ తీవ్రస్థాయిలో వుంటుంది. దానివల్లే వారు అనేక పొరపాట్లు చేస్తూ వుంటారు. అందువల్ల శ్రీరాముడు ఈ సందర్భంలో స్త్రీల పట్ల పురుషులకు గల ఆకర్షణ గురించి ప్రత్యేకంగా విశ్లేషణ చేశాడు. ఆధ్యాత్మిక గ్రంథాలలో ఇలా స్త్రీ ప్రసక్తి వచ్చిన చోటల్లా, దానికి మనం స్త్రీ పురుషుల పరస్పర ఆకర్షణ విషయంగానే అర్థం చేసుకోవాలి. అంతే గానీ, స్త్రీజాతి నిందగా దానిని మనం భావించరాదు. జాతిగా స్త్రీనింద అనేది మన సిద్ధాంతానికే వ్యతిరేకం. భోగ వస్తువుగా స్త్రీని దర్శించేటప్పుడు మాత్రమే అలాంటి నింద ప్రసక్తమౌతుంది. భోగమనేది స్త్రీ పురుషులకు పరస్పరం ఒకరివల్ల ఒకరికి కలుగుతుంది. ఆధ్యాత్మ శాస్త్రంలో మనం ఆ భోగతృష్ణ గురించే చర్చిస్తూ వుంటాం. కనుక, ఇలాంటి సందర్భాల్లో వచ్చిన చర్చలన్నీ, స్త్రీ పురుషులిద్దరికీ సమానంగానే అన్వయిస్తాయని మనం అర్థం చేసుకోవాలి. ఈ చర్చలో శ్రీరాముడు –

**ఆపాత రమణీయత్వం కల్ప్యతే కేవలం స్త్రియాః** (స. 21, శ్లో.8)– అని సిద్ధాంతీకరించాడు. అంటే, స్త్రీ పురుషులు ఒకరి పట్ల ఒకరు అవిచారిత రమణీయతను కల్పించుకుంటారు. తప్పితే, నిజమైన రమణీయత్వం

అక్కడ ఏమీ లేదు - అని నిర్ణయించాడు.

ఆ తరువాత శ్రీరాముడు వార్ధక్యాన్ని గురించి పరిశీలన చేసి, ఇలా విశ్లేషణ చేశాడు.

**అపర్యాప్తం హి బాలత్వం బలాత్పిబతి యౌవనం।**
**యౌవనం చ జరా పశ్చాత్ పశ్య కర్కశతాం మిథః॥**

(వై.ప్ర.స. 22, శ్లో. 1)

జీవి బాల్యదశలో ఆటల మీద ఆసక్తితో వుండి, వాటి మీద ఇంకా ఆసక్తి తీరకుండా వున్న సమయంలోనే, యౌవనం వచ్చి మీద పడి బాల్యాన్ని మింగేస్తుంది. ఈ యౌవనంలో కామోపభోగాల మీద ఆశ ఇంకా తీరకుండానే, వార్ధక్యం మీద పడి యౌవనాన్ని మింగేస్తుంది. చూశావా మహర్షీ! ఈ బాల్య, యౌవన, వార్ధక్య దశలే ఒకదాని మీద ఒకటి ఎంత క్రూరంగా వ్యవహరిస్తున్నాయో! ఆ తరువాత - **"వార్ధకే వర్ధతే స్పృహా"**-(స. 22, శ్లో. 8) వార్ధక్యంలో అనుభవించే శక్తి వుండదు కానీ, కోరికలు మాత్రం పెరిగిపోతూ వుంటాయి. అందువల్ల ఈ వార్ధక్యం శోకానికీ, మోహానికీ, వియోగాలకూ, విషాదాలకూ, చింతలకూ, అవమానాలకూ, ప్రముఖ స్థానంగా వుంటుందని శ్రీరాముడు నిర్ణయించాడు.

ఈ విధంగా శ్రీరాముడు తన దేహంతో సహా ప్రపంచంలో గల సమస్త వస్తువులలో వుండే దోషాలను విస్పష్టంగా దర్శించడంవల్ల, ఆయనకు తన సూక్ష్మదేహం మీద కూడా ఏ రకమైన వ్యామోహమూ లేదని చెప్పినట్లయింది. సూక్ష్మశరీరం మీద మోహం లేదంటే, దాని అర్థమేమిటంటే - సూక్ష్మశరీరం ద్వారా జీవులు లోకాంతరాలలో అనుభవించేటువంటి స్వర్గసుఖాదుల మీద కూడా శ్రీరాముడికి ఏ రకమైన వ్యామోహమూ లేదని దీనివల్ల స్పష్టమవుతోంది. కాగా, ఇప్పటి వరకు శ్రీరాముడు చెప్పిన మాటలను బట్టి, శ్రీరాముడికి ఇహాముత్ర ఫలభోగ విరాగం అనేటటువంటి సాధన సోపానం సంపూర్ణంగా స్వాధీనం అయిందని విశ్వామిత్రమహర్షికి అర్థమయింది.

వేదాంతవిద్యలో ప్రవేశించటానికి ముఖ్యంగా నాలుగు అర్హతలు కావాలని శాస్త్రనిర్ణయం. వీటినే వరుసగా-

ఒకటి - ఇహాముత్ర ఫల భోగ విరాగం
రెండు - నిత్యానిత్య వస్తు వివేకం
మూడు - శమాది షట్క సంపత్తి
నాలుగు - ముముక్షుత్వము - అని అంటారు.

వీటిలో ఇప్పటికి మొదటి సోపానమైన అహాముత్ర ఫలభోగ విరాగాన్ని వర్ణించినట్లు అయింది. ఇక పై సర్గలలో శ్రీరాముడు తనయొక్క నిశిత పరిశీలన ద్వారా, తనకు కలిగిన నిత్యానిత్య వస్తువివేకాన్ని, విశ్వామిత్ర మహర్షికి మనవి చేసుకొంటున్నాడు. ఇందుకోసం ప్రప్రథమంగా అయన కాలతత్త్వాన్ని వివేచన చేస్తున్నాడు.

## 20. కాలము

మహర్షీ! ఇప్పటి వరకూ నేను మనవి చేసిన బాల్యాది దశలన్నీ కాలం వల్ల వచ్చేవే. బాగా పరిశీలిస్తే ఈ సంసార చక్రంలో కలిగే ప్రతిభ్రాంతినీ వృద్ధి చేసేది కాలమే. ఈ కాలం ఇప్పుడు నాకు కోరిక కలుగుతోందని, ఇక ముందు ఈ కోరిక తీరేందుకై నేను సాధనాలను సమకూర్చుకోవాలనీ, ఆ తరువాత ఫలాలను నేను అనుభవించాలనీ, ఈ రకంగా కోరికలను పెంచుతూ వుంటుంది. అందువల్ల మానవుల కోరికలు పెరిగే ప్రక్రియలో కాలానికి ప్రముఖ స్థానం వుంది. కానీ, మానవుల భోగాలన్నిటినీ మింగేసేది కూడా ఈ కాలమే.

ప్రపంచంలో ఈ కాలమంత క్రూరమైన వస్తువు మరొకటి లేదు. ఇది మింగలేని పదార్థం లేదు.

"ఇంకా రాజ్యభారం నెత్తిన పడకుండా వున్న రాజకుమారుడు ఎంత బాధ్యతారహితంగా ప్రవరిస్తాడో, కాలం కూడా అలాగే ప్రవర్తిస్తుంది" అని – ఇక్కడ రాముడు చమత్కారంగా వర్ణిస్తూ పరోక్షంగా తమవంటి రాజకుమారుల ప్రవృత్తిని కూడా నిందించాడు. ఈ విధంగా శ్రీరాముడు కాలతత్త్వాన్ని నాలుగు సర్గలలో అతి విస్తారంగా వుశ్లేషణ జరిపి, చివరకు కాలస్వభావ పరిశీలన వల్ల, తనకు ఈ సంసారం మీద ఏ మాత్రమూ అభిలాష లేకుండా పోయిందని చెప్పాడు.

## 21. దోష దర్శనం

ఆ తరువాత 27వ సర్గలో శ్రీరాముడు జగత్తులో కనిపించే పదార్థాలయొక్క అనిత్యత్వాన్ని మరింత స్పష్టంగా వివరించి చెప్పాడు. ఆ తరువాత 28వ సర్గలో శ్రీరాముడు జగత్తత్త్వాన్ని మరొక కోణంలో పరిశీలన చేస్తూ, సుఖాన్ని కలిగిస్తాయనుకొన్న పదార్థాలే పర్యవసానంలో దుఃఖాన్ని కలిగిస్తూ వుంటాయనీ, నిజంగా సుఖాన్ని కలిగించే పదార్థం ఈ ప్రపంచంలో ఒక్కటి కూడా లేదనీ నిర్ణయించాడు.

అలాగే ఈ జన్మపరంపరకు కూడా అంతు కనిపించడం లేదనీ, పుణ్య విశేషంవల్ల మానవ జన్మ లభించిదని సంతోష పడుతుంటే, ఇంతలో ఆ జీవి ప్రబల పాపాలు చేసి, మళ్ళీ జంతువై జన్మించడం కనిపిస్తోందనీ చెప్పాడు. బ్రహ్మ, విష్ణు, రుద్రులు కూడా నాశం వైపే పరుగులు తీస్తున్నారని చెప్పాడు. ఇలా చెప్పి చెప్పి, చివరికి శ్రీరాముడు ఇలా అన్నాడు –

**ఇతి మే దోష దావాగ్ని దగ్ధే మహతి చేతసి।**

**ప్రస్ఫురన్తి న భోగాశాః మృగతృష్ణా స్సరస్స్వివ॥** (వై.ప్ర.స. 29 శ్లో. 1)

మహర్షీ! ఈ విధంగా ప్రపంచంలోని ప్రతి పదార్థంలోనూ దోషమే కనిపిస్తోంది నాకు. ఆ దోషాలు దావాగ్నులై, వాటి వేడికి నా మనస్సే మాడిపోయింది. అందువల్ల నాకు ఏ భోగకాంక్షలూ మొలకెత్తడం లేదు– అని తన తీవ్ర వైరాగ్యాన్ని స్పష్టం చేశాడు.

**నాభినందామి మరణం నాభినందామి జీవితం।**

**యథా తిష్ఠామి తిష్ఠామి తథైవ విగత జ్వరమ్॥** (వై.ప్ర.స. 29, శ్లో.8)

నాకు మరణించాలనీ లేదు.నాకు జీవించాలనీ లేదు. ఎలా వున్నానో అలాగే వుంటాను. బాధలు పోయేందుకు అదే మంచిదనిపిస్తోంది. అన్నాడు. కానీ, ఈ సంసారంలో వుండే అనర్థాలను చూసి, తెలిసి తెలిసి, జీవులు వ్యామోహంలో పడటాన్ని చూసి, నా బుర్ర గిర్రున తిరుగుతోంది. నా మనస్సుకు కొంత వివేచన కలిగినా, ఆ వివేచనలో సరైన పట్టుచిక్కక, నా మనస్సు మళ్ళీ గుంటలో పడిపోతుందేమోనని భయంగా వుంది. నా వివేచన పట్లా, నావిజ్ఞానం పట్లా నాకు సరైన ధైర్యం కలగడం లేదు. బలం లేని భర్తను కట్టుకొన్న ఆడది తన రక్షణ విషయంలో భయపడ్డట్టు, నా మనస్సు విషయంలో నేను భయపడుతున్నానే వున్నాను. కానీ, మహాత్మా! లోకంలో కొందరు సుజనులు లోకవ్యవహారంలో వుంటూ కూడా ఉత్తమ ప్రశాంతిలో వున్నట్టు కనిపిస్తోంది. దీనికి జనక మహారాజే ఉదాహరణ. ఇది ఎట్లా సంభవమవుతోంది? అట్టి ప్రశాంతిని సాధించటానికి ఆ మహాత్ములు ఏ ఉపాయాన్ని ఆశ్రయించారు?

**అథవా వ్యవహారస్య బ్రూత తాం యుక్తి ముత్తమాం।**

**తత్కథం కేన వా కిం వా కృత ముత్తమ చేతసా॥**
**బ్రూహి మే సాధవో యేన నూనం నిర్దుఃఖతాం గతాః॥**

(వై.ప్ర.స. 31, శ్లో.19)

మహాత్మా! వారు దుఃఖరహిత స్థితిని ఎలా చేరుకున్నారో, ఆ ఉపాయం నాకు చెప్పవలసింది. ఒక వేళ అలాంటి ఉపాయమే లేదంటారా? వున్నా, నాకు చెప్పమంటారా? ఆ ఉపాయం నాకు దొరికే వరకు, నేను ఏ పనీ చేయను. తిండి తినను, బట్ట కట్టను, మాట మాట్లాడను. క్రమంగా వూపిరి కూడా పీల్చను. ఇదే నా నిశ్చయం.

## 22. మహర్షుల అభినందనలు

12 యేళ్ళ శ్రీరామచంద్రుడు మహా తపస్వుల కన్నా మిన్నగా, ఇంతటి తత్త్వవివేచన చేసే సరికి రాజసభలో వున్న బ్రహ్మవేత్తలంతా ఆశ్చర్యపోయారు. ఆకాశంలో సిద్ధులు, గంధర్వులు మొదలైనవారు దీని కోసమే ఎదురు చూస్తున్నారు కాబోలు, ఈ మాటలు విని శ్రీరాముడి మీద పుష్పవర్షం కురిపించారు. ఇంతే కాదు. నారద, వ్యాస, పులహాది మహర్షులు కూడా ఆ సమయానికి ఆకాశమార్గాన అక్కడికి విచ్చేసి, శ్రీరాముడి ప్రసంగం విని "సాధు సాధు" అని మెచ్చుకొన్నారు. ఇట్టి సంకట పరిస్థితిలో వశిష్ఠ, విశ్వామిత్రులు ఏ రకంగా సమాధానం చెపుతారా అని, మహావేత్తలైన వ్యాసాది మహర్షులే ఉత్కంఠంగా ఎదురు చూస్తూ వున్నారు. ఇంతలో దశరథాదులు ఆకాశంలో వున్న మహర్షులను చూసి, వారందరికీ స్వాగతం పలికి, సభలో ఉచితాసనాలమీద వారిని కూర్చోబెట్టారు.

ఇక్కడ మనకు ఒక సందేహం వచ్చే అవకాశం వుంది. శ్రీరాముడేమో త్రేతాయుగాంతంలో జన్మించినవాడు. వ్యాసమహర్షేమో ద్వాపర యుగాంతంలో జన్మించినవాడు. శ్రీరామసభలోకి వ్యాసుడు వచ్చాడని చెపుతారేమిటి? – అని. కొందరు ఆధునికులు దీనివల్లనే యోగవాశిష్ఠ గ్రంథం భగవద్గీతానంతర రచన అని ఒక నిర్ణయానికి దూకేస్తున్నారు.

అసలు విషయం ఏమిటంటే? వ్యాసుడు అనేది ఒక పదవే గానీ, ఒక వ్యక్తియొక్క పేరు కాదు. ప్రస్తుతం బ్రహ్మదేవుడియొక్క 51వ సంవత్సరంలో మొదటిదయిన శ్వేతవరాహ కల్పం నడుస్తోంది. దానిలో ఇప్పటికీ 6 మన్వంతరాలు గడిచి, 7వ దైన వైవస్వత మన్వంతరం గడుస్తోంది. ఈ వైవస్వత మన్వంతరంలో 27 మహా యుగాలు గడిచి, 28వ మహా యుగం నడుస్తోంది. ఈ 28వ మహాయుగంలో కృత, త్రేతా, ద్వాపర యుగాలు గడిచిపోయాయి. ఈ ద్వాపర యుగాంతంలో జన్మించి, వ్యాస పదవిని స్వీకరించిన మహానుభావుడి పేరు కృష్ణ ద్వైపాయనుడు, లేక బాదరాయణుడు. ఇప్పటి ఈ వేదవ్యాసుడే రాబోయే సావర్ణి మన్వంతరంలో సప్తర్షులలో ఒకడుగా పదవిని పొందుతాడని భాగవతంలో చెప్పారు, కాగా, ప్రతి ద్వాపర యుగాంతంలోనూ ఒక వ్యాస భగవానుడు జన్మిస్తూనే వుంటాడు. అలా వ్యాస పదవిని స్వీకరించిన మహానుభావుడు దీర్ఘజీవియై ఏవో ఉత్తమ పదవులను, ఉత్తరోత్తర కాలల్లో, పొందుతూనే వుంటాడని పురాణాలు మనకి బోధిస్తున్నాయి.

కనుక, వ్యాసుడనే మాట వినగానే అది వ్యక్తి పేరనుకొని నిర్ణయాలు చేయటం ఎంతవరకు సముచితమో మనం ఆలోచించుకోవాలి. వెనుక ఎప్పుడో జరిగిన సమావేశానికి జిల్లా కలెక్టరు అధ్యక్షత వహించాడని చెప్పంగానే, ప్రస్తుతపు కలెక్టరే ఆ సభకు అధ్యక్షత వహించాడని అనుకోవటం బాగుంటుందా? అలాగే

రామసభకు వ్యాసుడు వచ్చాడనంగానే మొన్నటి ద్వాపరాంతంలో పుట్టిన వ్యాసుడే వచ్చాడు అనుకోవడం బాగుండదు. ఆ వెనుకటి యుగాలలో వ్యాసులలో ఒకానొక వ్యాసుడు రామసభకు విచ్చేశాడని మనం తెలుసుకోవాలి. ఈ విషయం గురించి అసలు ఈ గ్రంథంలోనే, శ్రీరాముడే, ఒక ప్రశ్న వేస్తాడు. అది రాబోతోంది. అక్కడ మరింత విపులంగా సమాధానం వస్తుంది.

వాల్మీకిమహర్షి ఈ సందర్భంగా, ఆ సభకు విచ్చేసిన మహాత్ముల పేర్లును ఒక పెద్ద పట్టీగా ఇచ్చేశాడు. దేవతలు, మునులు, గంధర్వులు మొదలైన వారంతా యెన్ని రకాలుగా తనను ప్రశంసించినా, శ్రీరాముడు అందుకు ఏ మాత్రమూ సంతోషించ లేదు, గర్వించనూ లేదు. అప్పుడు నారదమహర్షి, వశిష్ఠ విశ్వామిత్రుల వంక చూసి, శ్రీరాముడికి సదుపదేశం చేయవలసినదిగా ప్రోత్సహించాడు. జగద్గురువైన నారదమహర్షి ప్రోత్సాహాన్ని ఆజ్ఞగా స్వీకరించి, ముమ్మందుగా విశ్వామిత్ర మహర్షి నోరు తెరచి, శ్రీరాముడికి సమాధానం చెప్పసాగాడు.

ఈ విధంగా వాల్మీకిమహర్షి తన గ్రంథంలో మొట్టమొదటిదైన వైరాగ్య ప్రకరణాన్ని ముగించి. ఇక శ్రీరాముడికి ఉపదేశ రూపమైనటువంటి ఉత్తర గ్రంథానికి పీఠికగా, అనగా వశిష్ఠమహర్షి చేయబోయే ఉపదేశ రూపమైన ఉత్తర గ్రంథానికి పీఠికగా, మొదట విశ్వామిత్రమహర్షి చేసివ బోధనను వర్ణించాడు. ఈ బోధతోనే రెండవదైన ముముక్షు వ్యవహార ప్రకరణం ప్రారంభం కాబోతుంది. పూర్వం సాధన చతుష్టయ సంపత్తిని గురించి ప్రస్తావించుకొన్నాం. అందులో శ్రీరాముడియొక్క ఇహాముత్ర పలభోగ విరాగాన్ని, నిత్యానిత్య వస్తు వివేకాన్నీ గూడా ఇప్పటి వరకు జరిగిన వైరాగ్య ప్రకరణలో వాచ్యవృత్తితోనే వర్ణించాడు. అంటే సూటిగా బహిరంగంగానే వర్ణించాడు.

మరి మిగిలిన రెండు సోపానాల మాటేమిటి? అంటే శమాది షట్క సంపత్తిని, ముముక్షుత్వాన్ని, వాల్మీకిమహర్షి ఎందుకు ప్రత్యేకంగా వర్ణించలేదు. ఎందుకంటే? వాల్మీకి వేదాంతి మాత్రమే కాక మహాకవి కూడా. కవికి అన్ని విషయాలూ సూటిగా చెప్పే గుణం వుండదు. చెప్పే విషయం అందంగా చెప్పాలనే తపన వుంటుంది. అందుకే వాల్మీకి వాటిని వ్యంగ్య వృత్తితో చెప్పాడు. అంటే సజెస్టివ్‌గా చెప్పాడు.

రాముడు తన వైరాగ్యమంతా చెప్పి చెప్పి, నాకు తత్త్వ విషయం తెలిసేదాకా తిండి తినను, బట్ట కట్టను, చివరికి ఊపిరి కూడా ఆపేస్తాను, అన్నాడు. ఈ మాటవల్ల శ్రీరాముడికి అంతరింద్రియ, బహిరింద్రియ, నిగ్రహాలు పరిపూర్ణంగా లభించాయని తెలియడం లేదా? ఇదే గదా శమాది షట్కసంపత్తి అంటే. క్రమంగా ఊపిరి కూడా ఆపేస్తాను అనడంవల్ల శ్రీరాముడికి గల మోక్షకాంక్ష ఏ స్థాయిలో, ఎంత తీవ్రంగా వుందో, తెలియటం లేదా? ఇదే గదా ముముక్షుత్వం అంటే. కనుక, సాధన చతుష్టయ సంపత్తిలో గల నాలుగు సోపానాలూ శ్రీరాముడికి పరిపూర్ణంగా సిద్ధించాయి అని, అందువల్ల ఆత్మవిద్యోపదేశం పొందే అర్హత శ్రీరాముడికి పరిపుర్ణంగా వుందని, ఈ వైరాగ్య ప్రకరణంలో వాల్మీకిమహర్షి నిరూపించాడు.

## 23. వైరాగ్య ప్రకరణ సింహావలోకనము

యోగవాశిష్ఠ మనే ఈ మహాగ్రంథాన్ని వాల్మీకి మహర్షి (1) వైరాగ్య ప్రకరణము (2) మముక్షు వ్యవహార ప్రకరణము (3) ఉత్పత్తి ప్రకరణము (4) స్థితి ప్రకరణము (5) ఉపశమ ప్రకరణము (6) నిర్వాణ ప్రకరణము అని ఆరు ప్రకరణాలుగా విభజించాడు. ఇందులో మొదటి రెండు ప్రకరణాలూ ఉపోద్ఘాత స్థానీయమైనవి. అసలైన ప్రతిపాద్యాంశం ఉత్పత్తి ప్రకరణంతో ప్రారంభం కాబోతోంది.

కానీ వేదాంత విద్యలోకి ప్రవేశించటమంటే, కథలు, నవలలు చదివినట్లు చదవటం కాదు. ఈ విషయాలు గ్రహింపుకు రావాలంటే, మున్ముందుగా నిర్మలమైన వైరాగ్యం పాఠకుడి హృదయంలో కుదురై వుండాలి. ఈ గ్రంథంలోని ప్రవచనానికి ప్రధాన శ్రోత అయిన శ్రీరాముడికి ఈ వైరాగ్యం స్వయంసిద్ధమై, సుస్థిరమై వుందని నిరూపించటం అనే నెపంతో, వైరాగ్యమంటే ఏమిటో మనబోటి పాఠకులకు వివరించటం కోసం, వాల్మీకి మహర్షి తన గ్రంథాన్ని వైరాగ్య ప్రకరణంతోనే ప్రారంభించాడు.

దానితోపాటు తన గ్రంథంలో రాబోయే బోధనవిధానము, ప్రధాన పరిభాష, మొదలైన విషయాలను గూడా ఈ ప్రకరణంలో మహర్షి పరామర్శించాడు.

ఏ శాస్త్రగ్రంథానికైనా, మొదట్లో అనుబంధ చతుష్టయ నిర్ణయము – అని ఒక విధానం సుప్రసిద్ధంగా వుంది.

(1) ఈ గ్రంథంలోని ప్రధాన ప్రతిపాద్యాంశమేమిటి? (విషయము)

(2) ఈ విషయాన్ని గ్రహించగల అర్హులెవరు? (అధికారి)

(3) ఈ గ్రంథానికీ ఆ విషయానికీ గల సంబంధమేమిటి? (సంబంధము)

(4) ఈ గ్రంథంవల్ల కలగబోయే ప్రధాన ఫలమేమిటి? (ప్రయోజనం)

– అనే ఈ నాలుగు అంశాలనే అనుబంధ చతుష్టయము అంటారు. ఈ నాలుగు అనుబంధాలను వాల్మీకి మహర్షి ఈ ప్రకరణంలో పరోక్ష విస్పష్టమైన కావ్యశైలిలో ప్రతిపాదించాడు.

ఈ ప్రకరణారంభంలో చెప్పిన భరద్వాజోపాఖ్యానం ద్వారా "సమస్త దుఃఖ నివారణోపాయ ప్రదర్శమే" ఈ గ్రంథానికి విషయమని సూచించాడు.

ఇక ఈ గ్రంథ పఠనార్హత గల అధికారి ఎవడు?– అనే విషయాన్ని ఆయన అరిష్టనేమి కథ, కారుణ్య కుమార గాథ, సుతీక్ష్ణ కథ – అనే ఉపాఖ్యానాలద్వారా వివరిస్తూ – **"నాత్యంతమజ్ఞో నోత జ్ఞః సోఽస్మిన్ శాస్త్రేఽధికారవాన్॥** (వై.ప్ర.స.2,శ్లో. 2) (మరీ అజ్ఞానీ కాదు, పూర్తిగా జ్ఞానీ కాదు– అలాంటివాడే ఈ గ్రంథాన్ని చదవాలి) – అని తేల్చి చెప్పాడు.

ఆ తరువాత గ్రంథానికీ, ప్రతిపాద్యాంశానికీ గల సంబంధాన్ని ప్రదర్శించేందుకోసం శ్రీమహావిష్ణువుకు పూర్వకాలంలో కలిగిన నాలుగు శాపాలను గురించి ప్రస్తావించి, వీటిలో సనత్కుమార శాపంవల్ల 12 సంవత్సరాల బాలరాముడికి అజ్ఞానం ఆవరించి ఆత్మతత్త్వం మరపుకు వచ్చిందనీ, కానీ, అంతర్గతంగావున్న సత్త్వగుణ ప్రాబల్యంవల్ల వైరాగ్యం కలిగి, దానివల్ల ఆతడు జగత్పరిశీలన ప్రారంభించాడనీ, జగత్తును పరిశీలించిన గొద్దీ శ్రీరాముడికి వైరాగ్యం మరింత పెరిగిపోయి ఆత్మవిద్యోపదేశానికి అర్హత లభించిందనీ, వివరణ చేశాడు.

దీనివల్ల గ్రంథానికీ, తత్ప్రతిపాద్యాంశానికీ గల సంబంధం వ్యక్తమవటం మాత్రమే గాక, వేదాంత విద్యకు పునాదిరాయి వంటిదైన వైరాగ్యాన్ని గురించి వివరించే అవకాశం ఆయనకు అందివచ్చింది.

దాన్ని అందిపుచ్చుకున్న ఆ మహర్షి శ్రీరామ విశ్వామిత్ర సంవాద రూపంగా జగత్తులోని ప్రధాన విషయాలన్నింటినీ తీసుకుని, ప్రతిదాన్నీ పరిశీలించి, దీనిలో కోరదగ్గ అంశమంటూ ఏదీ లేదు –అని నిరూపించటం ద్వారా పాఠకులలో వైరాగ్యవృద్ధికి మార్గాలు పరచాడు.

ఈ క్రమంలో శ్రీరాముడి పరిశీలనలుగా – సంపద, ఆయుష్యము, అహంకారము, మనస్సు, తృష్ణ, దేహము, బాల్యయౌవన వార్ధకాలు, కాలము, వంటి అంశాలలోని దోషాలను ఉగ్గడించి, దోషదర్శన ప్రక్రియ ద్వారా సాధకులు వైరాగ్యాన్ని పెంపొందించుకోవాలని వాల్మీకి మహర్షి సూచించాడు.

ఆ తరువాత శ్రీరాముడిలో పరిపక్వమై ఉన్న ఇహాముత్ర ఫలభోగ విరాగాన్నీ, ముముక్షుత్వాన్నీ గూడా గుర్తించిన నారదమహర్షి సంతృప్తుడై, శ్రీరాముడికి సదుపదేశం చేయమని వశిష్ఠ విశ్వామిత్రులను ప్రోత్సహించటంతో ఈ వైరాగ్య ప్రకరణం సమాప్తమైంది.

# విషయ సూచిక

# యోగవాశిష్ఠ హృదయము
# ముముక్షు వ్యవహార ప్రకరణము

ఆత్మ విద్యోపదేశానికి కావలసిన అర్హతలు నాలుగింటిలోనూ చిట్టచివరిది ముముక్షుత్వం. ముముక్షుత్వం అంటే తీవ్రమైన మోక్ష కాంక్షను కలిగి వుంటటం. ఇట్టి ముముక్షువులు తమకు గల సాధన సంపత్తిని ఏ విధంగా ఉపయోగించుకోవాలో తెలుసుకోకపోతే, వాళ్ళ దగ్గర వుండవలసిన సంపత్తి ఎంత వున్నా సరే, ఆత్మానుభూతి లేకుండా తొలగి పోతుంది. చిత్త విశ్రాంతి లభించకుండా తొలగిపోతుంది. ప్రస్తుతం శ్రీరాముడికి వున్న పరిస్థితి ఇదే. తత్త్వవివేచనమంతా ఆయన చేయనే చేశాడు. చేసిన వివేచనను ఆత్మానందంతో సమన్వయం చేసుకోవటం శ్రీరాముడికి కుదరటం లేదు. కనుక, ముముక్షువైనవాడు ఏ రకంగా వ్యవహరించాలి, అనే విషయాన్ని ప్రత్యేకంగా జిజ్ఞాసువుల కోసం ఉపదేశించాలని, వాల్మీకి మహర్షి సంకల్పించాడు. అందుకోసమే ఈ ముముక్షు వ్యవహార ప్రకరణాన్ని ఆయన ప్రారంభిస్తున్నాడు.

రకరకాల దృక్కోణాలనుంచి ముముక్షుత్వానికి చేరుకొన్న సాధకులు ఏ విధమైన సందేహాల్లో, ఏ విధమైన కల్లోలాలలో, ఉయ్యాల లూగుతూ వుంటారో, వాటిన్నిటినీ అధిగమించి, నిజమైన తత్త్వాన్ని దర్శించే విధానాలు ఏమిటో, ఆ విశేషాలను వాల్మీకి మహర్షి ఈ ముముక్షు వ్యవహార ప్రకరణంలో మనకు ఉపదేశించబోతున్నాడు. మున్ముందుగా ముముక్షువులలోకెల్లా శ్రీరాముడితో పోల్చదగిన ఉత్తమాధికారి అయిన శుకమహర్షియొక్క అనుభవాన్ని ఈ విషయంలో వర్ణించబోతున్నాడు.

ఇక్కడ కూడా త్రేతాయుగంలోని రాముడికి, ద్వాపరయుగంలోని శుకుడి కథను ఎలా చెప్పారు? అనే ప్రశ్నకు సమాధానం వ్యాసమహర్షి యొక్క ఆగమనం దగ్గరే మనం చెప్పుకుని వున్నాం. ప్రతి కల్పంలోనూ, ప్రధాన పురుషుల జన్మలూ, చరిత్రలూ ఇంచుమించు ఒకే రీతిగా వుంటాయని పురాణ వాఙ్మయంలో విస్పష్టం చేయబడి వుంది. అందువల్ల, ఇప్పటి వ్యాసుడికి శుకుడనే పుత్రుడు ఎలా వున్నాడో, అలాగే వెనుక ద్వాపరయుగం నాటి వ్యాసుడికి కూడా శుకుడనే పుత్రుడే వుంటాడు. ఈ చక్రం ఇలా పరిభ్రమిస్తూనే వుంటుంది. అందువల్ల యోగవాశిష్ఠంలో ఇప్పుడు చెప్పబోయే శుకచరిత్ర, పాత ద్వాపర యుగంనాడు వ్యాసపుత్రుడైన శుకుడి చరిత్ర అని మనం అర్థం చేసుకోవాలి. ఈ అవగాహనతో ఇక కథలోకి ప్రవేశిద్దాం.

## 1. శుక చరిత్ర

శ్రీరాముడు తనకు వైరాగ్యం కలిగిన విధానమంతా వివరించి చేప్పేసరికి, ఆ సభలోవున్న నారదాది మహర్షులంతా ఆనందపడి, శ్రీరాముడికి సదుపదేశం అందించ వలసినదిగా వశిష్ఠ, విశ్వామిత్రులను ప్రోత్సహించారు. మొదటినుంచీ విశ్వామిత్రుడు కొంచెం బోళామనిషి. భావాలను దాచుకోవటం ఆయనకు అలవాటులో లేదు. ఆయనకు ఇప్పుడు శ్రీరాముడి పరిస్థితి చూసి చాలా సంతోషమైంది. దానికితోడు నారదాదుల ప్రోత్సాహం కలిసే సరికి, ఆయన పొంగిపోయి "శ్రీరామా! విషయమంతా నీవు గ్రహించేశావు. నీ పరిస్థితి ఇప్పుడు ఎలా వుందంటే జనకమహారాజు దగ్గరకు వెళ్ళకముందు శుకమహర్షి లాగా వుంది. ఆ జనకమహారాజు రెండు మాటలు చెప్పేసరికి ఆ శుకుడి మనస్సు మీద పట్టిన పైపై ధూళి ఇట్టే ఎగిరిపోయింది. ఇక అతనికి

శాశ్వతశాంతి లభించింది. మేము కూడా నీ హృదయమనే అద్దం మీద పట్టిన ధూళిని తుడిచెయ్యాలి. అదేమీ పెద్ద పని కాదు” అన్నాడు.

ఆయన ఇలా అని, ఏదో విషయం అందుకోబోయేసరికి, శ్రీరాముడు అడ్డు తగిలి, “అగండి మహర్షీ! శుకుడి మనస్సు మొదట విశ్రాంతిని పొందలేదనీ, తరువాత పరమ ప్రశాంతిని పొందిందనీ, చెప్పారు. అది ఎలా జరిగిందో దయచేసి వివరించండి” అని వినయంగా ప్రార్థించాడు. విశ్వామిత్రమహర్షి శుకచరిత్రను వివరించ సాగాడు.

శ్రీరామా! వ్యాసపుత్రుడైన శుకుడు తండ్రి దగ్గరే వుండి తపస్సు చేసుకుంటూ వుండేవాడు. అయితే అతనికి త్వరలోనే ఈ లోకయాత్రను గురించిన విమర్శ బయలుదేరింది. అచ్చం నీలాగే ఆలోచించాడు. అచ్చంగా నీలాగే ఆయనకు కూడా వివేకం కలిగింది. అద్వితీయమైన తత్త్వం అవగాహనకు వచ్చింది.

ఆ తత్త్వం తెలిశాక ఇక తాను చేయవలసిన కర్మ గానీ, కర్మలవల్ల తాను పొందవలసిన ఫలాలు గానీ, ఆయనకు కనిపించటంలేదు. ఎవరైనా సరే, పొందవలసిన ఉత్తమ తత్త్వజ్ఞానం ఇదే. కానీ, ఇక్కడ ఒక చిక్కు వచ్చి పడ్డది. తన వివేకబలంతో తాను సాధించుతున్న ఈ తత్త్వజ్ఞానం మీద ఆ కుర్రవాడికి నమ్మకం కుదరలేదు. కలిగిన జ్ఞానమేమో ఏ తపస్సును చేయనీదు. మనసులో వున్న అపనమ్మకమేమో కర్మ లేకుండా కూర్చోనీదు. ఈ సంకటంలో కొన్నాళ్ళు నలిగిపోయాడు. ఈ స్థితి వచ్చేసరికి వ్యాసుడు, శుకుడు, ఇద్దరూ కూడా పాంచభౌతిక దేహాలను పరిత్యజించి, తేజోమయమయిన దేహాలతో మేరుపర్వతం మీద నివాసం చేస్తూ వుండేవారు.

వ్యాసమహర్షికి గొప్ప తత్త్వజ్ఞుడని పేరు. కానీ, ఆయన ఎప్పుడూ తపస్సు చేస్తూ, తీరిక లేకుండా వుండేవాడు. నిజంగా తత్త్వజ్ఞానం కలిగినవాడికి ఇంత తపస్సు ఎందుకు? ఏమి కోరి తండ్రి ఈ తపస్సు చేస్తున్నాడో, శుకుడికి అర్థమయ్యేది కాదు.

చివరికి ఒకరోజు మేరు శిఖరంమీద తండ్రి కొంచెం తీరికగా కనిపించాడు. వెంటనే శుకుడు తండ్రి దగ్గరకు వెళ్ళి, సాష్టాంగ వందనం చేసి, ఇలా అడిగాడు “నాన్నగారూ! నన్ను ఒక సందేహం పట్టుకొని పిశాచంలా పీడిస్తున్నది. దయతో తీర్చండి. మానవలోకంనుంచి బ్రహ్మలోకం వరకు ప్రతి జీవికీ సంసారం కనిపిస్తోంది. ఈ సంసారం ఎలా పుట్టింది? ఎలా పోతుంది? ఇంతకన్నా చిక్కు ప్రశ్న మరొకటి వుంది. అసలా సంసారం ఎవరికి పట్టుకొంది? నా దేహానికా, నా ఇంద్రియాలకా, నా మనస్సుకా, నా ప్రాణానికా? లేక వీటి సమూదాయానికా? ఇవేవీ కాక, ఆ నిర్వికార చిన్మాత్రానికే ఈ సంసారం పట్టుకొందంటారా? దేనికి సంసారం పడితేనేమి? దుఃఖం నాకు పడుతోంది. ఇది పోయేదెలా?” దయచేసి వివరించండి.

వ్యాసుడు తన కుమారునిలో కలిగిన తత్త్వజిజ్ఞాసకు చాలా సంతోషించాడు. వ్యాసుడు తలచుకుంటే మహాభారతం లాగా విస్తారంగానూ మాట్లాడగలడు, వద్దనుకుంటే బ్రహ్మసూత్రాల్లాగా ముక్తసరిగానూ మాట్లాడగలడు. ఇప్పుడు కొడుకుతో ఎలా మాట్లాడాలా– అని కొంచెం ఆలోచించాడు. ఆలోచించి అటూ ఇటూ కాకుండా మధ్యమంగా మాట్లాడితే మంచిది అనుకొన్నాడు. ఆయన ఇలా చెప్పసాగాడు.

### 2. యుక్తి విచారణ

నాయనా! నువ్వడిగిన ప్రశ్నల్లో ముఖ్యమైనవి రెండు ఏమంటే– ఈ సంసారం ఎవరికి పట్టిందనేది– మొదటిది. అది ఎలా పోతుందనేది– రెండవది. పోయే మాట తరువాత చూద్దాం. ముందు ఎవరికి పట్టిందో ఆలోచిద్దాం. నువ్వు కూడా ఆలోచన చేశావు. ఈ సంసారం ‘నా దేహానికా, నా ఇంద్రియాలకా? నా మనస్సుకా,

నా ప్రాణానికా? వీటి సముదాయానికా? లేక నిర్వికార చిన్మాత్రానికా?' అని నువ్వు అడిగావు. వీటిలో ఎవరికి సంసారం పడితే మాత్రం నీకెందుకు ఏడుపు? నీకు ఏడుపు ఎందుకో తెలియాలంటే– నువ్వు ఎవరివో తేలాలి. అదాలోచించు.

ఈ దేహం నువ్వు అయ్యే అవకాశం వుందా? వుంది. ఈ దేహానికి దెబ్బ తగిలితే నీకే బాధ కలుగుతుంది కదా! కానీ, బాగా పరిశీలించి చూస్తే, ఈ దేహం నేనే అనుకునేందుకు కూడా వీల్లేదు. ఎలాగంటావా? ఒక్కొక్కసారి నువ్వే 'ఇది నా దేహము' అని వ్యవహరిస్తున్నావు. 'ఇది నా ఇల్లు' అన్నప్పుడు నేను వేరు, ఇల్లు వేరు– అని స్పష్టంగా తెలుస్తోంది కదా! 'ఇది నా పుస్తకం' అన్నప్పుడు పుస్తకం, నేను, ఒకటి కాదు గదా? అలాగే "ఇది నా దేహము" అని మనమే అంటున్నాం కనుక, నేను, దేహము ఒకటయ్యే అవకాశం లేదు. మరొక కారణం కూడా వుంది.

లోకంలో నువ్వు దేన్నయినా చూస్తున్నావు అంటే, ఆ దృశ్యం నీకంటే వేరైనది– అనడంలో సందేహం లేదు కదా! నీవు ఆ చెట్టును చూస్తున్నావు. ఆ చెట్టు దృశ్యం. నీవు ద్రష్ట. ఆ చెట్టూ, నువ్వూ, ఒకటవుతారా? కారు గదా! చూడబడే ఈ దేహం దృశ్యం అవుతుంది. చూసే నువ్వు ద్రష్టవవుతావు. ద్రష్ట, దృశ్యం ఒకటి కావు గదా! అందుచేత నువ్వు దేహం కావటానికి వీలు లేదు. ఈ దేహంలో నేను కలిసిపోయి వున్నానంటావేమో! ఇలా అన్నావంటే ఈ దేహం వేరు, నేను వేరు, అని ఒప్పుకున్నట్టే.

ఒక ఉదాహరణ చెబుతా, విను. అడవిలో వేసవి కాలంలో రెండు చెట్టుకొమ్మలు రాచుకొన్నాయి. మనం తరచుగా చూస్తున్న దృశ్యమే గదా ఇది. అక్కడ వున్నవి రెండు కొమ్మలు. అవి రాచుకొన్నాయి. మధ్యలో ఈ నిప్పు ఎక్కడనుంచి వచ్చింది? ఆ కొమ్మల ఘర్షణవల్ల వేడి పుట్టి నిప్పు వచ్చిందంటావా? నిప్పన్నా, వేడన్నా ఒక్కటే. ఆ వేడి ఎలా వచ్చిందనేదే మన ప్రశ్న.

ప్రపంచంలో ఏ వస్తువూ శూన్యంలోనుంచి ఊడిపడదు. ఒక మట్టిముద్దలోంచి కుండ వచ్చిందంటే, కుండగా మారే స్వభావం ఆ మట్టిముద్దలోనే స్వతహాగా వుందని మనం తెలిసుకోవాలి. అలాగే కొమ్మల రాపిడివల్ల అగ్ని పుట్టిందంటే, ఆ అగ్ని ఆ కొమ్మల్లో అంతర్లీనంగా మొదటినుంచీ వుందని మనం తెలుసుకోవాలి. కొమ్మలలో అంతర్లీనంగా వున్న అగ్ని, రాపిడి అనే ప్రక్రియవల్ల బహిర్గతమవుతోంది. సరే, ఇప్పుడు కొమ్మ అగ్ని అనే రెండు వస్తువులు వున్నాయి. వీటిలో అగ్ని ఆ కొమ్మలో పూర్తిగా కలిసిపోయివుంది. ఇప్పుడు అగ్ని, కొమ్మ అనేవి వేరు వేరు వస్తువులు అంటారా? ఒకే వస్తువు అంటారా? అగ్నియొక్క స్వభావం కాల్చడం. కొమ్మయొక్క స్వభావం కాలడం. ఈ రెండూ ఒకటనటం సాధ్యం కాదు. కొమ్మలోనే అగ్ని కలసిపోయి వున్నా కూడా, అగ్ని– కొమ్మ ఒకటి కావు. అలాగే, ఈ దేహంలో నీవు కలసిపోయి వున్నా కూడా, నీవూ ఈ దేహమూ ఒకటి అనటానికి వీలు లేదు.

ఈ విధంగా మూడు దృక్కోణాలతో దేహము, నేను అనేవి వేరు వేరు పదార్థాలని, మనకు నిశ్చయమైపోయింది. వీటిలో 'నేను' అని దేన్ని మనం వ్యవహరిస్తున్నామో, అది చైతన్యంగల పదార్థం. అంటే అది స్వతంత్రంగా ఆలోచించగలదు, కదల గలదు, సుఖదుఃఖాలను అనుభవించ గలదు. దేహానికి ఈ లక్షణాలు ఏవీ లేవు. శరీరంలోనుంచి జీవుడు ఎగిరిపోయాక, అది శవమై పడివుంటుంది. మనం చూస్తూనే వున్నాం కదా! కనుక, ఈ శరీరం జడం. జడానికి ఎక్కడైనా సంసారం వుంటుందా? రాతి ముక్కకు సుఖదుఃఖాలు వుంటాయా? కనుక, సంసారం ఈ దేహానికి సంబంధించినది కావటానికి వీలు లేదు.

ఇక ప్రపంచంలో పనులన్నీ చేసే ఇంద్రియిలు వున్నాయి. అవి నువ్వా? నేను చూస్తున్నాను, నేను వింటున్నాను, అని నీవు అంటున్నావు కదా అంటే, నువ్వన్నా కన్నన్నా, నువ్వన్నా చెవి అన్నా, నువ్వన్నా

నోరన్నా, ఇలా ఏ ఇంద్రియమైనా సరే, ఒకటేనని నీ అభిప్రాయం లాగా కనిపిస్తోంది. కానీ, కంటికి కొంచెం జబ్బు చేసింది, అది సరిగా చూడలేకపోతోంది. అప్పుడు నువ్వేమంటున్నావు? "ఈ ఇప్పుడు నా కన్ను సరిగా పని చేయడం లేదు" అంటున్నావు. ఇందాక ఇది నా దేహము అన్నట్లుగానే, ఇప్పుడు ఇది నా కన్ను అంటున్నావు. ఇది నా పుస్తకం అన్నట్లుగానే వుంది కదా ఆ మాట. అందువల్ల నువ్వు, కన్ను ఒకటి కావటానికి అవకాశం కనిపించటం లేదు.

మరొక మంచి అంశం కూడా వుంది. మనం ఇక్కడ కూర్చొన్నాం. మన ఎదురుగుండా ఒక పక్షి ఇటునుంచి అటు వెళ్ళి అటునుంచి ఇటు వచ్చింది. అంటే దాని రాకపోకలను మనం చూశాం. అలా చూశామంటే ఆ పక్షి మనకన్నా వేరని చెప్పడానికి వేరే ఋజువు కావాలా?

అలాగే ఈ కన్ను మెలకువగా వున్నప్పుడు పని చేసింది, నిద్రలో పని చేయలేదు. ఆరోగ్యంగా వున్నప్పుడు పనిచేసింది, ఆరోగ్యంగా లేనప్పుడు పని చేయలేదు. ఈ కన్ను పనిచేసిందని, పనిచేయలేదని, నీ కెవరు చెప్పారు? "ఎవరో చెప్పటమేమిటి? నా అంతట నాకే తెలుస్తోంది" అంటావా? మంచిది.

అలా అంటే నువ్వు, కన్ను అనే ఇంద్రియంయొక్క రాక పోకలను తెలుసుకొంటున్నా వన్నమాట. పక్షి రాకపోకలను తెలుసుకొన్నప్పుడు ఏమని నిర్ణయం చేశావు? ఆ పక్షి వేరు, నేను వేరు అనలేదా? అలాగే ఇప్పుడు ఈ కన్ను వేరు, నేను వేరు అనక తప్పదు. ఇలాగే మన జ్ఞానేంద్రియాలు ఐదు, కర్మేంద్రియాలు ఐదు, కలిపి మొత్తం – పది ఇంద్రియాలు. ఇవి ఏవీ కూడా నేను కాదు. అని పై చర్చవల్లనే మనకు తేలిపోతోంది.

సరే, ఇంద్రియాలు నేను కాదు. అవి జడమా? చైతన్యమా? మనిషి చనిపోయినప్పుడు ఇంద్రియాలన్నీ అక్కడే వున్నా, అవి పనిచేయడం లేదు. అందువల్ల, ఇంద్రియాల్లో ఇప్పుడు కనిపిస్తున్న చైతన్యం వాటిలో వ్యాపించి వున్నదే గానీ, ఆ ఇంద్రియాల సొంత చైతన్యం కాదు– అని నిరూపణ అవుతోంది. అందువల్ల, ఇంద్రియాలు జడాలు అని తేలింది. జడాలకు సంసారం వుంటుందా? రాతికి సంసారం వుంటుందా? కనుక, ఈ సంసారం దేహానికీ చెందినది కాదు. ఇంద్రియాలకూ చెందినది కాదు.

అయ్యా! అన్నిటికన్నా ముఖ్యమైన ఇంద్రియం మనస్సండీ, దాన్ని వదిలేసి మీరు ఇంద్రియాలు పదే అని లెక్క వేస్తున్నారు. ఆ మనస్సువల్లే ఈ మిగిలిన పది ఇంద్రియాలు పనిచేస్తున్నాయి. ఇంద్రియాలలో కనిపించే చైతన్యం ఆ మనస్సుదే. దాన్ని వదిలేశారేమిటి? అని సందేహంగా వుందా నీకు? దాన్ని మరచిపోలేదు, వదిలేయలేదు. ఆ మనస్సు దగ్గరకే ఇప్పుడు వస్తున్నా. మనసు ఇంద్రియమా? కాదా? అనే చర్చ ఇప్పుడు మనకు అనవసరం. మనకు కావలసిన చర్చ ఏమంటే – ఆ మనసూ, నేను ఒకటేనా? లేక వేరు వేరా? ఈ సంసారం ఆ మనస్సుదేనా? ఇదే మనకు కావలసిన చర్చ! ఆలోచిద్దాం.

ఒకోసారి మనం ఇక్కడ కూర్చొని ఎదురుగుండా వుండే అడవిలోని సౌందర్యాలు చూస్తూ వుంటాం. కొంతసేపయ్యాక ప్రక్క మునివాడలోని మహర్షి వచ్చి, చప్పట్లు కొడుతూ– "ఏమిటయ్యా, కళ్ళు తెరచుకొనే వున్నావు, చూస్తూనే వున్నావు, పలకరించవు, నేను పలకరించినా పలకవు, ఏమైంది నీకు?" అని అడుగుతాడు. అప్పుడు మనం ఏమంటున్నాము? "అయ్యా! ఏమీ అనుకోకండి. నా మనస్సు ఎటో పోయింది. అందుచేత నేను మిమ్మల్ని చూడలేక పోయాను, క్షమించండి" అంటాం. దీన్ని బట్టి ఏం తెలుస్తోంది? ఈ మనస్సు ఇందాకటి దాకా ఎటో పోయిందనీ, ఇప్పుడా మనస్సు చప్పట్లవల్ల వెనక్కు తిరిగి వచ్చిందనీ, నీకు తెలుస్తోంది. అంతే కదూ? అంటే పక్షియొక్క రాకపోకలను తెలుసుకున్నట్లుగా,నువ్వు నీ మనస్సుయొక్క రాకపోకలను తెలుసుకుంటున్నావు. అంటే, నువ్వు వేరు, నీ మనస్సు వేరు, అని నిరూపణ అయినట్లు కాదా?

ఒక సారి నీ విద్యార్థి దశను గుర్తుకు తెచ్చుకో. ఒక రోజున "నాన్నగారూ! ఇవాళ ఎందుకో నా మనస్సు అంత చురుగ్గా లేదు. ఇవాల్టికి ఈ పాఠం చాల్లేండి" అనేవాడివి. ఒకో రోజున "ఇవాళ నా మనస్సు మంచి హుషారుగా వుంది. ఇంకా ఇంకా పాఠం చెప్పండి" అనేవాడివి. అంటే మనస్సుయొక్క స్వస్థతను, అస్వస్థతను, నువ్వు తెలుసుకుంటున్నావని అర్థమవుతోంది కదా!

ఈ విధంగా నువ్వు నీ మనస్సుయొక్క రాకపోకల్నీ తెలుసుకొంటున్నావు. మనస్సుయొక్క స్వస్థత, అస్వస్థతలను కూడా నీవు తెలుసుకొంటున్నావు. అంటే – ఎదురుగుండా వున్న చెట్టును చూసినట్టే నీవు నీ మనస్సును చూడగల్గుతున్నావు. అంతే కదూ? అందువల్ల ఈ మనస్సు నువ్వు కావటానికి వీలు లేదు. మనస్సు వేరు, నువ్వు వేరు, అంత వరకూ ఖాయం.

ఇక మనస్సుయొక్క చైతన్యం ఇంద్రియాల్లో వ్యాపించింది అని నువ్వు అంటున్నావు. అంటే మనస్సు స్వతంత్రంగా చైతన్య వస్తువు అని నువ్వు భావిస్తున్నావు. అది నిజమైతే, మనిషి మరణించినప్పుడు ఈ మనస్సు ఏమవుతుంది? అక్కడి దాకా ఎందుకు? నువ్వు గాఢనిద్రలో వున్నప్పుడు, అంటే– ఏ స్వప్నాలూ లేని గాఢనిద్రలో వుండగా, నీ మనస్సు ఏమైపోయింది? గాఢనిద్రలో వుండగా మనస్సు పనిచేస్తోందా? చేయడం లేదు. ఆ సమయంలో అది స్తబ్ధంగా జడంగా పడివుంటుంది. మనస్సుయొక్క స్వభావం చైతన్యమే అయితే, అది కొంత సేపు స్తబ్ధంగా వుండగలదా? సూర్యుడు కొంతసేపు వెలుగు లేకుండా వుండగలడా? అది సాధ్యం కాదు. మనస్సు స్తబ్ధంగా వుండటాన్ని మనం గమనిస్తున్నాం కనుక, జడత్వమే మనస్సుయొక్క స్వభావం. నువ్వు చైతన్యస్వరూపుడవు కనుక, నీ చైతన్యం నీ మనస్సులో ప్రతిఫలించినంత సేపూ అది చేతనం లాగా ప్రవర్తిస్తోంది. అంతే తప్పితే, అది స్వతహా జడమే. ఈ విధంగా మనస్సు నీకంటే భిన్నమనీ, ఆది జడమనీ తేలిపోయింది గదా. జడపదార్థానికి సంసారం వుండగలదా రాతికి సంసారం వుంటుందా? కనుక, ఈ సంసారమనేది దేహానికీ కాదు, ఇంద్రియాలకీ కాదు, మనస్సుకీ కాదు.

ఇక పోతే ప్రాణం అనేది ఒకటి వుంది. ప్రాణం వున్నంత సేపూ ఆ మనిషి బ్రతికి వున్నాడు అంటున్నారు. ప్రాణం వున్నంత సేపూ నేనున్నాను, అనే జ్ఞానం కూడా వుంటుంది. ప్రాణం పోతే మనస్సు పని చేయదు. ఇంద్రియాలూ పని చేయవు. కనుక, జడాలైన దేహేంద్రియ మనస్సులతో పని చేయించే శక్తి ప్రాణమే అని తేలితోంది. "కాబట్టి ఈ ప్రాణమే నేను, అదే చైతన్యం. బహుశా ఈ సంసారం ఆ ప్రాణనికే అంటిపెట్టుకొని వుందేమో"–అని నీకు అనిపిస్తూ వుండవచ్చు. కుమారా! ప్రాణమే నేను అనుకోవటం యుక్తియుక్తంగా వున్నట్లే కనిపిస్తుంది. నువ్వు ఇందాక చెప్పిన యుక్తులన్నీ పైకి కనిపించే యుక్తులే. నేను మరొక కోణం చూపిస్తాను. చూడు.

నువ్వు గాఢవిద్రలో వున్న సమయంలో నీ ప్రాణం పని చేస్తోందా? లేదా? చేస్తోంది. చెయ్యకపోతే నిద్రా సమయంలో రక్తప్రసరణ వగైరాలు ఎలా జరుగుతున్నాయి? కనుక, గాఢనిద్రా సమయంలో ప్రాణం బాగానే పనిచేస్తోంది. నువ్వేమన్నావు? ఈ ప్రాణమే చైతన్యం అన్నావు. ఈ చైతన్యం ఇంద్రియాలలో ప్రసరిస్తోంది అన్నావు. గాఢనిద్ర సమయంలో నీ ప్రాణమూ అక్కడే వుంది. నీ ఇంద్రియాలూ అక్కడే వున్నాయి. మరి నీ ప్రాణచైతన్యం ఆ ఇంద్రియాలలోకి ఎందుకు ప్రసరించడం లేదు? సూర్యుడూ అక్కడే వుండి. అద్దమూ అక్కడే వుంటే, కిరణాలు ప్రతిఫలించకుండా వుంటాయా? రాజుగారు సింహాసనంలో కూర్చొని వున్నప్పుడు, భటులు మేము విశ్రాంతి తీసుకుంటామంటే రాజు వూరుకుంటాడా? కనుక, ప్రాణచైతన్యం మనస్సులోకి, ఇంద్రియాల్లోకీ, ప్రసరిస్తోంది అనటం కుదరదు.

ఇయితే ఇంద్రియాలు ఒకప్పుడు చైతన్యవంతంగా వుంటున్నాయి. మరొకప్పుడు జడాల లాగా వుంటున్నాయి. ఇనుప గుండు ఒక్కోసారి వేడిగా వుంటుంది. ఒక్కొసారి చల్లగా వుంటుంది, ఎందుకని? అగ్నితో సంపర్కం ఏర్పడినప్పుడు ఇనుపగుండు వెచ్చగా వుంటుంది. ఆ సంపర్కం లేనప్పుడు. అది తన స్వభావానుగుణందా, చల్లగా వుంటుంది. అలాగే మనస్సు, ఇంద్రియాలూ, అనేవి ఒకానొక చైతన్నంయొక్క సంపర్కం కలిగితే, అవి తామే చైతన్యవంతాలు లాగా కనిపిస్తున్నాయి. ఆ చైతన్య సంపర్కం తొలగిపోతే, తమకు స్వతస్సిద్ధమై వున్న జడత్వాన్ని బయట పెట్టుకుంటున్నాయి. సరేలే, ఈ చైతన్యం ప్రాణానిదే అనుకొందామంటే, ఇందాక చెప్పిన చిక్కులన్నీ వచ్చి పడతాయి. ప్రాణం వుండగానే ఇంద్రియాలు పనిచేయక పోవడం మనకు కనిపిస్తోంది. దీనిని బట్టి ఏమి చెప్పాలంటే, చైతన్యం అనేది ఈ ప్రాణానికి సంబంధించినది కూడా కాదు. ఆ చైతన్యం అనేది స్వతంత్రంగా, దేని మీదా ఆధారపడకుండా, తనంత తాను ప్రకాశిస్తూ, అన్నిటికంటే సూక్ష్మంగా, లోపలిదిగా, వున్నది. ఆ చైతన్యమే ప్రాణంలోకి ప్రసరిస్తే ప్రాణం పనిచేస్తుంది. మనస్సులోకి ప్రవేశిస్తే మనస్సు పనిచేస్తుంది. ఇంద్రియాలలోకి ప్రవేశిస్తే ఇంద్రియాలు పని చేస్తున్నాయి.

కాబట్టి చైతన్యం అనేది ప్రాణంయొక్క స్వభావం కాదు. అంటే ప్రాణం కూడా జడమే అని తేలింది. ఇది ఒప్పుకోవడానికి కష్టంగా వుంటుంది. కానీ, ఇప్పుడు చెప్పుకున్న కారణ పరంపరకు పరిశీలిస్తే, ప్రాణం జడమే అని చెప్పక తప్పదు. జడానికి సంసారం వుంటుందా? రాతికి సంసారం వుంటుందా? కనుక, ఈ సంసారం అనేది దేహానిది కాదు. ప్రాణానిదీ కాదు. ఇక మిగిలిందేముంది? అన్నిటికన్నా సూక్ష్మంగా స్వతంత్రంగా వున్నదని చెప్పుకున్నామే, ఆ చైతన్యం ఒకటి మిగిలి వుంది. ఈ సంసారం అనేది వుంటే దానికి వుండాలి.

కానీ, సంసారం అంటే ఏమిటి? సుఖ దుఃఖాలే కదా? సుఖ దుఃఖాలు అనేవి ఎప్పుడు వస్తాయి? రెండు వస్తువులుంటే ఒక దానివల్ల మరొకదానికి సుఖమో, దుఃఖమో, రావచ్చు. కానీ, మనం చెప్పుకున్న చర్చ ప్రకారంగా, ఈ శుద్ధ చైతన్యం అనేది ఒకే ఒక వస్తువు. "ఏకమేవా ద్వితీయం" – ఉన్నది ఒకటే అయితే దానికి సుఖ దుఃఖాలు ఎలా కలుగుతాయి? అలా కాకుండా, ఒక ఇంట్లో గదికీ గదికీ వేరే వేరే దీపాలున్నట్టుగా, ఒక ఊళ్ళో ఇంటింటికీ వేరే వేరే దీపాలు వున్నట్టుగా, స్వతంత్రమైన చైతన్యాలు అనేకం వుండవచ్చు. అప్పుడు వాటిలో ఒకదానికికొకటి విరోధి కావచ్చు. అప్పుడు ఆ విరోధంలో గెలిచినవారికి సంతోషమూ, ఓడిపోయినవారికి దుఃఖమూ, రావచ్చు. అప్పుడు ఈ సంసారమంతా ఆ శుద్ధ చైతన్యానికే పట్టిందని చెప్పవచ్చు – అని నీకనిపిస్తోందా?

శుకకుమారా! కొంచెం జాగ్రత్తగా ఆలోచించు. నువ్వు చెప్పినట్లుగా నీ శుద్ధ చైతన్యాలు ఒకదానితో ఒకటి విరోధించుకున్నాయి అంటే – వాటికీ మనస్సుతో సంపర్కం వుందని చెప్పినట్లే కదా? మనస్సే, లేకపోతే విరోధాలు, స్నేహాలు, ఎక్కడనుంచి వస్తాయి? అలాగే ప్రాణం లేకపోతే, వ్యవహారం ఎలా వస్తుంది? కనుక, నువ్వు ప్రతిపాదిస్తున్న చైతన్యంగారికి మనఃప్రాణాలతో సంపర్కం వుంది. కాబట్టి, నువ్వు చెప్పే చైతన్యం శుద్ధ చైతన్యం కాదు. శుద్ధ చైతన్యం గూర్చి మాట్లాడుతున్నాననుకొని, ప్రాణ మనస్సంపర్కం గల చైతన్యాన్ని గురించి నువ్వు మాట్లాడుతున్నావు. సరిగ్గా గమనించుకో.

ఇంటింటికీ దీపాలు వేరే వున్నాయి అంటున్నావు. నీ వుద్దేశ్యం ఏమంటే, ఇంటింటికీ వేరే దీపపు బుడ్లు వున్నాయి– అని. అంటే వేరే వేరే బల్బులు వున్నాయని, ఈ బుడ్లు, బల్బులు, అవన్నీ లోపల వున్న వెలుగుకు శరీరం వంటివి. లోపల వున్న వెలుగు మాత్రం అన్ని చోట్లా ఒక్కటే. ఆ వెలుగు ఎర్రబల్బు వున్న చోట ఎర్రగా, పచ్చబల్బు వున్న చోట పచ్చగా, వ్యక్తం అవుతూ వుంటుంది. లోపల వున్న వెలుగుకు ఏ రంగూ

లేదు. అలాంటి వెలుగే పరిశుద్ధమైన వెలుగు. మనం ఇందాక పరిశుద్ధమైన చైతన్యం అని చెప్పుకున్నప్పుడు కూడా, ఇలాంటి ఏకాకారమైన చైతన్యం గురించే మాట్లాడుకొన్నాం.

ఈ విధంగా బల్బులన్నింటి ద్వారా వ్యక్తమయ్యే వెలుగు లాగా, మనస్సులన్నింటి ద్వారా వ్యక్తమయ్యే చైతన్యం వుందే, అది సర్వకాల సర్వావస్థలలోనూ ఏకాకారమైనది. ఏ వికారాలూ లేనిది. ఏ మార్పులూ లేనిది. అలాంటి వస్తువుకి సుఖ దుఃఖాలు వచ్చే అవకాశమే లేదని చెప్పుకున్నాం. అందువల్ల, ఈ సంసారమనేది ఈ శుద్ధ చైతన్యానికి కూడా సంబంధించినది కాదు. అయితే ఏమి తేలినట్టు మనకు? ఈ సంసారమనేది దేహానిదీ కాదు, ఇంద్రియాలదీ కాదు, మనస్సుదీ కాదు, ప్రాణానిదీ కాదు. చివరికి శుద్ధ చైతన్యానిది కూడా కాదు.

ఇలా దేనిదీ కాకుండాపోతే, ఏ ఆధారమూ లేకుండాపోతే, ఆ సంసారమనేది అసలు వున్నట్లా? లేనట్లా? ప్రపంచంలో ఎక్కడైనా చూడు. సత్యవస్తువు ఏదైనా వుందంటే, అది ఆధారం లేకుండా వుండదు. ఏ ఆధారమూ లేకుండా ఒక వస్తువు కనిపిస్తున్నదీ అంటే. అది నిస్సందేహంగా అసత్య వస్తువునీ, భ్రాంతివల్ల అది కనిపిస్తోందనీ, మనం చెప్పవచ్చు. ఎడారిలో పోయేవాడికి ఎండమావులు కనిపించాయి. అవి నదులు అనుకొన్నాడు. ఆ నదులు దేనిమీద ఆధారపడి వున్నాయి? దేనిమీదా ఆధారపడి లేవు? ఏ ఆధారమూ లేకుండా అవి కనిపిస్తున్నాయి కనుక, ఆ నదులు నిజమైన నదులు కాదనీ, భ్రాంతివల్ల పుట్టిన నదులనీ, మనం చెబుతున్నాం. చూడంగానే చెప్పట్లేదు. చూడంగానే వాటిని నదులే అన్నాం. అని పరుగులు పెట్టాం. ఎంత దూరం పోయినా అందలేదు. అప్పుడు మెల్లిగా పరిశీలించడం ప్రారంభించాం. బాగా పరిశీలించగా, ఎడారిలో కనింపించే ఈ నదులకు ఏ ఆధారమూ లేకుండా కనిపిస్తున్నాయి కనుక, ఈ నదులు కనిపిస్తూ వుండగానే లేని వస్తువులు, అసత్య వస్తువులు, భ్రాంతివల్ల పుట్టిన వస్తువులు, మాయ వస్తువులు, అని అంటున్నాం. అలా అని, వాటికి ఎండమావులు అని పేరు పెట్టాం. ఎండమావి అంటే ఎండలో కనిపించే లేని వస్తువు.

శుకకుమారా! ఈ విధంగా సంసారమనేది ఒకటి వుందనుకొని దాని వెంట పరుగెత్తాం. ఎన్నాళ్ళు పరిగెత్తినా దాని స్వరూపం మనకు తెలియలేదు. ఇక పరుగులు ఆపేసి, అసలు ఈ సంసారమంటే ఏమిటబ్బా– అని పరిశీలన చేశాం. చేస్తే దీనికి ఏ ఆధరమూ లేదని తేలింది. ఏ ఆధారమూ లేకుండా కనిపించే వస్తువును అసత్య వస్తువు అనటంలో సందేహం లేదు కదా? మరి అప్పుడు ఈ సంసారమనేది నిజంగా వుందంటావా? లేదంటావా? హేతువుల మీద నిలబడి మాట్లాడే వాడెవడూ రెండో మాట మాట్లాడటానికి వీల్లేదు. సంసారమనేది అసత్య వస్తువనీ, భ్రాంతి జన్యమనీ, చెప్పక తప్పదు.

శుకకుమారా! ఈ సంసారం ఎట్లా పుడుతుంది? ఎట్లా పోతుంది? – అని అడిగావు. భ్రాంతి వల్ల పుడుతుందని ఇప్పుడు తేలిపోయింది. భ్రాంతివల్ల పుట్టిన వస్తువు అసలు వుంటే కదా, పోవడానికి. ఎండమావులు ఎప్పుడు పోతాయి? ఎండమావులు పోవడానికోసం సూర్యాస్తమయం వరకు కూర్చోని కాచుకోవలసిన పని లేదు. అనుభవం గల బాటసారికి ఎండమావులను చూసి, పరిశీలించి, నిశ్చయం చేసిన క్షణంలోనే, వాటిల్లో వున్న నదీత్వం ఎగిరిపోతుంది. అలాగే ఈ సంసారం భ్రాంతిజన్యం అనే జ్ఞానం కలిగిన వెంటనే ఈ సంసారంలోని సంసారత్వం ఎగిరిపోతుంది. ఇది లేని వస్తువు అని నిశ్చయం చేసుకుంటే చాలు, దాన్ని సంహారం చేసేందుకు వేరే ప్రయత్నం చేయక్కర్లేదు.

శుకకుమారా! ఒక కుర్రవాడికి కనుచీకటిలో పాము కమిపించింది. వాడు “పాము పాము” అని అరిచాడు. ఇంతలో వాడి తండ్రి వచ్చి, వెన్ను నిమిరి, “అది పాము కాదురా! తాడు ముక్కరా, సరిగా

చూడరా" అన్నాడు. తండ్రి మీద విశ్వాసంతో ఆ కుర్రవాడు పారిపోకుండా ఆగి, ఇటూ అటూ వంగి, జాగ్రత్తగా చూశాడు. అది తాడే అని ఖాయం చేసుకున్నాడు. ఒక కోణంలోంచి చూస్తే ఇప్పటికీ అది పాము లాగానే కనిపిస్తోంది. అందువల్ల ఆ పాముని చంపటానికి వాడేదయినా దుడ్డుకర్ర తీసుకురావాలా? ఏమీ అక్కరలేదా? పరిశీలనవల్ల ఈ పాము భ్రాంతిజన్యమని తెలిసిన తక్షణమే, ఈ పాము పాము కాకుండా పోయింది. అలాగే ఈ సంసారాన్ని గూర్చి విచారణ చేస్తే చాలు, దీనికి ఏ ఆధారమూ లేదు కనుక భ్రాంతిజన్యం అని నిశ్చయం అవుతుంది, అంతకంటే సంసారం పోయేందుకోసంగా ఏమీ చెయ్యక్కర్లేదు. ఇది ఎప్పుడు పోతుందని ప్రశ్నించక్కర్లేదు.

### 3. వేదవాక్య విచారణ (శ్రుతి విచారణ)

మేడమీదికి మెట్లు కట్టినట్లుగా, గణిత శాస్త్రంలో స్టెప్పు వేసినట్లుగా, వ్యాసమహర్షి ఇంత సుదీర్ఘంగా మహోపదేశం చేస్తే శుకమహర్షి ఔనన లేదు, కాదన లేదు, మధ్యలో ప్రశ్నలు వేయలేదు. వినడం మాత్రం శ్రద్ధగా వింటున్నాడు. ఇంత విన్నా మనిషిలో ఏ వికాసమూ రాలేదు. అది చూసి వ్యాసమహర్షి కొత్త మార్గంలో మళ్ళీ ఉపదేశం మొదలు పెట్టాడు.

శుకకుమారా! వేదం పరమప్రమాణం అని నువ్వు అంగికరిస్తావు కదా. ఆ వేదంలో యజ్ఞాలు చేస్తే స్వర్గం వస్తుందనీ, దొంగతనం వంటి పాపాలు చేస్తే నరకం వస్తుందనీ, వుంది. దానర్థం ఏమిటి? ఈ భూలోకంలో ఒక మానవుడు ఒక యజ్ఞం చేస్తే, దాని ఫలితాన్ని వాడు కొన్ని సంవత్సరాల తరువాత, ఈ దేహాన్ని వదిలేసినాక, ఇంకో లోకాన్ని చేరినాక, అక్కడ మళ్ళీ వేరే శరీరాన్ని ధరించినాక, ఆ శరీరంతో ఆ సుఖమూ, ఆ దుఃఖమూ, అనుభవిస్తాడు. ఇది వేద శాసనం. అంటే జీవి అనేవాడు భూమిమీద వుండే స్థూలదేహాన్ని వదిలేసినాక, ఒకానొక సూక్ష్మశరీరాన్ని ధరించి, స్వర్గంలో మరొక స్థూలదేహంలోకి ప్రవేశిస్తాడు. అలాగే స్వర్గంలో వాడికి నూకలు చెల్లిపోయాక, అక్కడి స్థూలశరీరాన్ని వదిలేసి, మళ్ళీ సూక్ష్మశరీరం ధరించి, మళ్ళీ భూమిమీద మరో స్థూలశరీరం ఆశ్రయిస్తాడు. దానిని బట్టి ఏమి తేలింది? ఈ స్థూలదేహంలో సూక్ష్మ శరీరధారి వేరే ఇంకొకడు వున్నాడు – అని తెలుస్తోంది కదూ! ఈ సూక్ష్మ శరీరధారి భూలోకంలో శరీరం ధరిస్తే, భూలోకసుఖాలు అనుభవిస్తున్నాడు. స్వర్గలోకశరీరం ధరిస్తే, స్వర్గలోకసుఖాలు అనుభవిస్తున్నాడు. ఏ లోకంలో వున్నా, వీడికి సంసారం తప్పటం లేదు. ఏ లోకంలో వున్నా, ఏ శరీరంలో వున్నా, సంసారం అనుభవించేది ఆ సూక్ష్మ శరీరధారి మాత్రమే కానీ, ఆయా స్థూల శరీరాలు కావు. సూక్ష్మ శరీరధారి సంసారం అనిభవిస్తున్నాడు అంటే – వాడికి ఇంద్రియాలు, శరీరము, మనస్సు, వున్నాయన్న మాట. అంతే గదా! అవన్నీ వున్నాయి అంటే, వాటిలోని అసలు చైతన్యం ఆ ప్రాణేంద్రియాల కన్నా, మనస్సు కన్నా, వేరుగా వున్ననట్లే కదా? ఇప్పుడు మరో దారిన కూడా వద్దాం.

లోకంలో ఎవడైనా ఉద్యోగం చేశాడంటే, ఎన్ని రోజులు చేస్తే అంత జీతం ఇస్తారు. ఒకడు వ్యవసాయం చేశాడంటే, ఎన్ని ఎకరాలు దున్నితే అంత పంట వస్తుంది. అంతే గానీ, ఒక రోజు పని చేస్తే జీవితమంతా జీతం ఇస్తూనే వుంటారని కానీ, ఒక గజం పొలం దున్నితే ధాన్యరాశి వర్షిస్తూనే వుంటుందని కానీ, ఎవరూ చెప్పలేరు. అది సాధ్యం కాదు.ఇదే విధంగా ఎవరైనా పెద్ద పెద్ద యజ్ఞాలు చేస్తే కొంత దీర్ఘకాలం స్వర్గంలో వుండగలరని చెప్పవచ్చునేమో గానీ, శాశ్వతంగా స్వర్గంలో వుండి, శాశ్వతంగా స్వర్గసుఖాలు అనుభవిస్తారని చెప్పడానికి వీలు లేదు. అందుకనే వేదమాత–

**పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో**

**నిర్వేదమాయాత్ – నాస్త్యకృతః కృతేన** – అని చెప్పింది. అంటే, ఒకానొక తత్త్వపరిశీలకుడు లోకంలో ఎక్కడ చూసినా సరే,చేసిన పనికి అనుగుణంగా ఫలితం రావటం కనిపిస్తోంది – అని గమనించాడు.

**తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే**

**ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే** – అని కూడా వేదం చెప్పింది. అంటే లోకంలో శ్రమపడి సంపాదించుకున్న సంపదలన్నీ కొంత కాలానికి తరిగిపోతాయి గదా! అలాగే ఎన్ని పుణ్యాలు చేసి, ఎంత స్వర్గం సంపాదించినా సరే, ఏదో ఒకనాటికి ఆ పుణ్యం తరిగిపోతుంది. ఆ స్వర్గసుఖాలు ఎగిరిపోతాయని వేదం చెబుతోంది.

ఇలాంటి వేదవాక్యాలన్నీ పరిశీలించి, ఆ తత్త్వపరిశీలకుడు చాలా దిగులుపడిపోయాడట. "**నిర్వేద మాయాత్**" దిగులుతో దిగాలుపడి, "ఎంత చేసినా దానివల్ల శాశ్వతమైన పదవి లభించదు. అనగా శాశ్వతమైన సుఖం, శాశ్వతమైన మోక్షం, లభించదు. **"నాస్త్యకృతః కృతేన"** అన్నాడట. అలా నిర్వేదంలో పడినవారికి వేదమాతే ఉపాయం యోప్పింది. **తరతి శోకమాత్మవిత్**, అని అంటే ఈ శోకాన్ని, అనగా ఈ సంసారాన్ని, పూర్తిగా తరించాలంటే, దానికి ఒకటే ఉపాయం. వేరే ఏ పనీ చెయ్యకూడదు, నీ ఆత్మతత్త్వాన్ని నీవు తెలుసుకోవాలి – అని వేదం శాసిస్తోంది.

కనుక, శుకకుమారా! వేద ప్రామాణ్యంవల్ల తేలిందేమంటే, ఈ సంసారం అనేది పోవటానికి నువ్వు చెయ్యవలసిన ఒకే ఒక పని, ఆత్మజ్ఞానం సంపాదించటం. ఏమని జ్ఞానం? – ఆత్మ అనేది శుద్ధ చైతన్యమనీ, దానికి దేనితోనూ సంపర్కం లేదనీ, అట్టి శుద్ధచైతన్యమే సర్వత్రా వ్యాపించి వుందనీ, ఆ శుద్ధచైతన్యం ఒక్కటే ఈ ప్రపంచంలో సత్యవస్తువనీ, అదే నువ్వనీ, నువ్వు గ్రహించాలి.

**సన్మూలా స్సోమ్యేమా స్సర్వాః ప్రజాః**

**సదాయతనాః సత్ప్రతిష్ఠాః** – (ఛాందోగ్యం) అని వేదమాత శాసిస్తోంది.

అంటే – ఈ ప్రపంచమంతా ఆ శుద్ధచైతన్యంలోంచే వచ్చి, ఆ శుద్ధ చైతన్యంలోనే వుండి, ఆ శుద్ధ చైతన్యంలోనే లయిస్తుంది ఆ శుద్ధ చైతన్యానివి నువ్వే.

శుకకుమారా! ఈ విధంగా వేద ప్రామాణ్యంవల్ల కూడా సంసారమనేది నిజంగా వున్న వస్తువు కాదనీ, ఆత్మజ్ఞానంవల్ల పోతుందనీ, మనకు నిరూపణ అవుతోంది. కనుక, ఓ కుమారా! నీ శుద్ధమైన ఆత్మస్వరూపాన్ని గూర్చి నువ్వు మననం చేసుకో. దేహాదుల మీద వుండే భ్రాంతి దృష్టిని వదలిపెట్టు. ఇంతకంటే నువ్వు చెయ్యాల్సింది లేదు.

అని వ్యాసమునీంద్రుడు ఇంత సుదీర్ఘంగా ఉపదేశం చేస్తే, శుకమహర్షి నీళ్ళు చప్పరించేసి, "మీరేమయినా కొత్త విషయాలు చెపుతారేమో అనుకొన్నా" అన్నాడు.

వ్యాసమహర్షింటే సామాన్యుడు కాదు. సమస్త విద్యలూ మూర్తీభవించిన విగ్రహం వ్యాసమహర్షి. అంత మాత్రమే కాదు, రాజకీయాలలో కూడా మంచి అనుభవంగల వ్యక్తి. అందుచేత కొడుకు ఎప్పుడైతే నాలుక చప్పరించేశాడో, ఆయన వెంటనే ప్లేటు ఫిరాయించేశాడు. ఆయన ఏమన్నాడంటే – " శుకకుమారా! నువ్వు మంచి మేధావివి, మంచి పరిశీలనాశీలివి. నాకు ఈ వేదాంత విషయాలు గురించి అంత బాగా తెలియదు. అనుభవం కూడా తక్కువ. నాకు తెలిసినంతలో నీకీ విషయాలను గూర్చి అనుభవ పూర్వకంగా చెప్పగలవాడు, ప్రస్తుతం భూలోకంలో రాజుగా జీవిస్తున్న జనకమహారాజు ఒక్కడే. కావాలనుకొంటే ఆయన దగ్గరకు వెళ్ళి ప్రయత్నం చేసి చూడు" అన్నాడు.

తండ్రిగారు అంత సూటిగా నిజం చెప్పేసినందుకు శుకమహర్షి చాలా సంతోషించాడు. ఆయన వెనువెంటనే మేరుపర్వతం మీదనుంచి దిగి, తన యోగశక్తితో, ఒక పాంచభౌతిక రూపం ధరించి, భూలోకంలో జనకమహారాజు రాజ్యం చేస్తున్న మిథిలా నగరానికి వచ్చాడు.

## 4. జనక మహారాజ బోధ

మంచి బ్రహ్మతేజస్సుతో వున్న శుకమహర్షి మిథిలానగరం వచ్చే సరికి, అక్కడ వుండే ద్వారపాలకులు అటకాయించేశారు. కానీ, శుకమహర్షి కోపం తెచ్చుకోకుండా. తన వివరాలన్నీ చెప్పాడు. "నేను వ్యాసమహర్షిగారి అబ్బాయినండీ! నన్ను శుకుడు అంటారు. మా నాన్నగారు జనకమహారాజు గారి దర్శనం చేసిరమ్మని పంపారు. అందుకే వచ్చాను. నా విషయం మహారాజుగారికి మనవి చెయ్యండి" అన్నాడు.

జనకమహారాజంటే సామాన్యుడు కాడు. సామాన్యుడైతే వ్యాసమహర్షి తమ కొడుకును ఆయన దగ్గరకెందుకు పంపిస్తాడు? జనకమహారాజుయొక్క జ్ఞానసంపద ఎంతటి గొప్పదంటే, ఆ రాజ్యంలో పనిచేసే ఉద్యోగులందరూ కూడా ఆత్మజ్ఞాన సంపన్నులే. అక్కడి ప్రజలందరూ కూడా మహర్షితుల్యులే. అలా వుండేది ఆయన రాజ్యపాలన. వచ్చింది వ్యాసమహర్షి పుత్రుడని తెలిసేసరికి, ద్వారపాలకులు అటెన్షన్‌లోకి వచ్చేశారు. అయినా వాళ్ళేమీ తొట్రుపడకుండా శుకమహర్షిని అక్కడే నిలబెట్టేసి, మహారాజుగారికి కబురు చేశారు.

జనకమహారాజు అంతకంటే లోకాంతకుడు. ఆయనకు శుకమహర్షి ఎందుకు వస్తున్నదీ, ఎలా వస్తున్నదీ, అన్నీ తెలిసిపోయాయి. అయినా సరే, బ్రహ్మవిద్యా ఉపదేశం పొందే యోగ్యత ఇతనికి ఎంతవరకు వుందో చూద్దామని ఆలోచించి, వచ్చిన వార్తాహరులకు ఏ సమాధానమూ చెప్పలేదు. అలా 7 రోజులు గడచిపోయాయి. ఈ 7 రోజులూ ఊరి వాకిలి వెలుపల శుకమహర్షి అలా నిలువు కాళ్ళ ఉద్యోగం చేస్తూనే వున్నాడు. 8వ రోజుకు కబురు వచ్చింది, కొత్త మునిగారిని రాజమందిరంలోకి తీసుకురమ్మన్నారు – అని.

శుకమహర్షి జనకమహారాజు భవనంలోకి ప్రవేశించాడు. అతనికి మంచి బస ఏర్పాటు చేశారు. అక్కడ ఆయనకు అంతులేని ఉపచారాలు జరిగిపోతున్నాయి. సపర్యలు జరిగిపోతున్నాయి.ఆ సేవలు చేసేవారంతా అప్సరసల్లాంటి స్త్రీలే. ఆ స్త్రీలే వద్దన్నా వినకుండా సంగీతాలు వినిపిస్తున్నారు, నాట్యాలు చూపిస్తున్నారు, పిండివంటలు పెడుతున్నారు, ఏమిటేమిటో చేస్తున్నారు. శుకమహర్షికి ఇవేవీ అక్కర లేదు. అయినా సరే, ఎవరినీ ద్వేషించలేదు.

కనిపించిన ప్రతివాడినీ "జనకమహారాజు ఎక్కడ?" అని అడుగుతున్నాడు. ఈ ప్రశ్నకు మాత్రం ఎవరూ సమాధానం చెప్పడం లేదు. అయినా సరే, శుకుడి మనస్సులో రవ్వంత కూడా కలత కలగ లేదు. అటు ఆకర్షణా లేదు. ఇటు విరోధమూ లేదు. అలా మరో 7రోజులు గడిచిపోయాయి.

ఆ మర్నాడు తెల్లారే సరికల్లా జనక మహారాజు గారు సరాసరి వచ్చేసి శుకమహర్షి పాదాలకు నమస్కారం పెట్టాడు.ఆ మహారాజుకు శుకమహర్షియొక్క అర్హతను గూర్చి పరిపూర్ణమైన తృప్తి కలిగింది. మొదట కొద్దిగా కుశలప్రశ్నలు నడిచాయి. ఆ వెనువెంటనే జనకమహారాజే నోరు తెరిచాడు. "నాయనా శుకమహర్షీ! చిట్టచివరికి దేన్ని పొందాలో, అలాంటి ఆత్మానందాన్ని నువ్వు పొందేశావయ్యా! నీ ముఖంలోనే కనిపిస్తోంది. అయినా ఎందుకు ఇక్కడి దాకా వచ్చావు? ఏం కావాలి నీకు?" అని అడిగాడు జనకమహారాజు.

శుకమహర్షి తమ తండ్రిని ప్రశ్నించినప్పుడు మొత్తం ఎనిమిది ప్రశ్నలు వేశాడు. కానీ, వ్యాసమహర్షి "వాటిలో రెండు ప్రశ్నలే ముఖ్యం. తక్కినవన్నీ పనికిరానివి" అన్నాడు. ఆయన చాలా యుక్తియుక్తంగా సమాధానం

చెప్పాడు. అందువల్ల ఈ మాటు శుకమహర్షి జనకమహారాజును రెండే ప్రశ్నలు వేశాడు. "అయ్యా, జనకమహారాజా! ఇంత ఆడంబరంగా కనిపిస్తున్న ఈ సంసారం ఎలా పుట్టింది? ఇది ఎలా నశిస్తుంది? నా సందేహం తీర్చండి" అన్నాడు శుకుడు.

జనకమహారాజు రెండు, మూడు గంటలు సేపు మహోపన్యాసం చేశాడు. శుకుడు మొహంలో తృప్తి కనిపించలేదు. ఆ మహారాజు మళ్ళీ మరో రెండు, మూడు గంటలు మహోపన్యాసం చేశాడు. అయినా శుకమహర్షి ముఖంలో తృప్తి కనిపించలేదు. "ఏమిటయ్యా నీ సందేహం?" అన్నాడు జనకమహారాజు. శుకమహర్షి ఇలా చెప్పాడు.

"జనకమహారాజా! నాకు మీరేమీ కొత్త విషయాలు చెప్పలేదు. చిన్నప్పుడు పాఠాలు చదువుకునేటప్పుడు శాస్త్రాలలో ఈ మాటలే చెప్పారు. ఆ తరువాత నేనే స్వయంగా ముల్లోకాలనూ పరిశీలన చేసుకున్నాను. అప్పుడూ ఈ విషయాలే నాకు తోచాయి. ఆ తరువాత మా నాన్నగారి నడిగాను. ఆయనా ఈ విషయాలే చెప్పారు. ఇప్పుడు మిమ్మల్నడిగాను. మీరూ అదే చెబుతున్నారు. వాక్యాలు వేరు. విన్యాసవిధానాలు వేరు. అంతమాత్రపు తేడాలే తప్ప, విషయంలో ఏమీ తేడా లేదు. అందుచేత నాకు కొత్త విషయం ఏమీ దొరకడం లేదు.

"మహారాజా! మీరు పెద్దలు. నా పరిశీలనలో నాకు ఒక మాట గట్టిగా తోస్తోంది. ఈ మనస్సు నిండా కామకర్మ వాసనలు నిండి వున్నాయి. అలాంటి మనస్సువల్లే ఈ సంసారమంతా ఆడంబరంగా దర్శనమిస్తోంది. ఆ మనస్సును సంపూర్ణంగా నాశనం చేసేస్తే, ఈ సంసారమంతా నశిస్తుంది. ఈ సంసారంలో ఇంతకంటే సారమేమి లేదు. ఇదే నా గట్టి నమ్మకం. ఇది నిజమా? కాదా? మీరు తేల్చి చెప్పండి. మీరు చెబితే నీకు నమ్మకం కుదురుతుంది. మీరు ఔనంటే, ఇక ఈ నా మనస్సును, నా మనోబలంతోనే నిర్మూలం చేసేస్తాను. శాశ్వతమైన ప్రశాంతితో నిలబడిపోతాను. మీరు ఏదో ఒక మాట నిష్కర్షగా తేల్చి చెప్పండి"

ఇది వినేసరికి జనకమహారాజు మొహం పద్మం లాగా వికసించింది. ఆయన వెంటనే ఇలా అన్నాడు–

**స్వసంకల్పవశాద్బద్ధో నిస్సంకల్పశ్చ ముచ్యతే** (ము.వ్య.ప్ర.స. 1శ్లో. 36)

భేష్! ఇంతకంటే తెలుసుకోవలసింది ఏమీ లేదయ్యా, ఇంతకంటే చెయ్యాల్సింది కూడా లేదు. ఇంతకంటే వేరే నిర్ణయం లేదు. మానవుడు తన సంకల్పంవల్ల తాను బద్ధుడవుతున్నాడు, "**స్వసంకల్ప వశాద్బద్ధః**" – సంకల్పాలు పోతే, వాడు ముక్తుడు అయిపోతున్నాడు, "**నిస్సంకల్పశ్చ ముచ్యతే**" – దీనికి మించిన మాట లేదు. దీనిని నువ్వు తెలుసుకున్నావు, తెలుసుకొని భోగాలను విడిచిపెట్టేశావు. నీకీ దృశ్యప్రపంచం మీద ప్రేమా లేదు, ద్వేషమూ లేదు. నువ్వు ఇక ఈ ప్రపంచంలో పడమన్నా పడవు. నువ్వు ముక్తుడవైపోయావు. సందేహం లేదు."

అని జనకమహారాజు ఇలా అంటూ వుండగానే, శుకమహర్షి తన మనస్సును లయింపజేసి బ్రహ్మసమాధిలోకి ప్రవేశించాడు. అలా కొంతసేపు వుండేసరికి అతనికి అంతకు ముందు దాకా వున్న సందేహాలన్నీ పూర్తిగా పటాపంచలైపోయాయి.

కొంత సేపయ్యాక, ఆ మహర్షి జనకమహారాజు దగ్గర సెలవు తీసుకొని, సరాసరి మేరుశిఖరానికి చేరి, 10 వేల సంవత్సరాల పాటు, ఏకధాటిగా నిర్వికల్ప సమాధిలో వుండి పోయాడు. ఈ కథంతా చెప్పి చివరికి విశ్వామిత్రుడిలా అన్నాడు.

## 5. విశ్వామిత్ర బోధ

"శ్రీరామా! వ్యాసపుత్రుడైన శుకమహర్షికి జనకమహారాజుగారి ఉపదేశం ఎలా పనిచేసిందో, నీకు కూడా మా ఉపదేశం అలాగే పనిచేస్తుంది. అంత మాత్రమే పనిచేస్తుంది. ఆ శుకమహర్షి తన వివేకబలంచేతనే విషయమంతా తెలుసుకొన్నాడు. అయినా సరే, బుద్ధియొక్క మాలిన్యం అవిశ్వాసమనే రూపంలో, తన మీద తనకే అవిశ్వాసమనే రూపంలో, ఆ మహర్షియొక్క మనస్సనే దర్పణం మీద కొద్దిగా పొగమంచు లాగా పారింది. అందువల్లనే, జనకమహారాజు ఆ స్వల్పమాలిన్యాన్నీ తుడిచి వేయగలిగాడు. శ్రీరామా! నీ పరిస్థితి కూడా అంతే. నీకు కూడా మా ఉపదేశంవల్ల శాశ్వతశాంతి లభిస్తుంది, సందేహం లేదు."

విశ్వామిత్రమహర్షి ఈ విధంగా శుకమహర్షి కథంతా చెబుతూ వుంటే, ఎదురుగా వున్న సభలో వ్యాసభగవానుడు అక్కడే వున్నాడు. అందుచేత విశ్వామిత్రమహర్షి శుకుడ్ని గురించిన ప్రసంగం పుర్తి కాగానే వ్యాసాదిమహర్షుల వంక తిరిగి, శ్రీరాముడియొక్క వైరాగ్యవిశేషాన్ని, వివేక విశేషాన్ని, మరొక సారి స్తోత్రం చేశాడు. ఆయన ఇలా అన్నాడు –

"వ్యాసాది మహర్షులారా! చూడండి. ఆ శుకుడి లాగానే ఈ శ్రీరాముడికి కూడా భోగ్యపదార్థాల మీద రుచి ఏ మాత్రం కలగలేదు. ఒకడు ఆత్మతత్త్వాన్ని దర్శించాడా, లేదా, అనడానికి ఇది ఒక్కటే గుర్తు. ఏమిటి? భోగ్య పదార్థాల మీద రుచి లేకపోవడం. చూశారా! అది ఈ శ్రీరాముడుకి పరిపుర్ణంగా లభించింది."

విశ్వామిత్రమహర్షి మళ్ళీ శ్రీరాముడి వంక తిరిగి, ఇలా చెప్పసాగాడు – రామా! బంధము, మోక్షము, అంటే అవేవో దూరపు వస్తువులు కావు.

**వాసనాతానవం రామ మోక్ష ఇత్యుచ్యతే బుధైః ।**
**పదార్థవాసనాదార్ఢ్యం బంధ ఇత్యభిధీయతే॥** (ము.వ్య.ప్ర.స.2,శ్లో.5)

రామా! మనస్సుకు పట్టిన వాసనలు బాగా ముదిరితే, అదే బంధం. ఆ వాసనలు ఇంకిపోతే, అదే మోక్షం. జీవితంలో భోగవాసనలు పెరిగిన కొద్దీ, బందం పెరిగిపోతూ వుంటుంది. అంటే, ఆ బంధం గట్టిపడిపోతూ వుంటుంది. భోగవాసనలు తగ్గిన కొద్దీ, బంధం సడలిపోయి, మనిషి మోక్షానికి చేరువవుతూ వుంటాడు.

శ్రీరామా! తత్వజ్ఞానం రెండు రకాలు. ఒకటి– అపాతజ్ఞానము. రెండు – యథార్థ జ్ఞానము. ఆపాత జ్ఞానమంటే – సామాన్యంగా మంచి కుటుంబాలలో వుండే మానవులకు ఆత్మతత్త్వాన్ని గురించిన సాధారణ అవగాహన వుంటూ వుంటుంది. దీని పేరే ఆపాతజ్ఞానం. వీరికి విషయం తెలుస్తుంది. ఉపన్యాసాలు చెప్పగలరు. కానీ, వైరాగ్యం మాత్రం కలగదు. ఎంత తన్నుకున్నా వాసనాబంధం తగ్గదు. వైరాగ్యపూర్వకంగా ఆత్మజ్ఞానం కలిగితేనే, అది యథార్థ జ్ఞానం అవుతుంది. వాడే పండితుడు. వైరాగ్య పూర్వకంగా జ్ఞానం కలగడమంటే ఏమిటి? ఎర్రబట్టలు కట్టుకోవటమా? గడ్డాలు పెంచుకోవటమా? గుండు గీయించు కోవటమా? ఇవి కాదు. వైరాగ్యం కుదిరిందనటానికి, ముఖ్యమైన గుర్తులు నాలుగున్నాయి.

ఒకటి – వాడికి బలవంత పెట్టినా సరే, భోగాల మీద రుచి కలగకూడదు.

రెండు – వాడికి ఏ వస్తువుల మీద గానీ, ఏ పుణ్యాల మీద గానీ, లాభాపేక్ష వుండకూడదు.

మూడు – ఈయన గొప్ప మహాత్ముడు, విరక్తుడు, అని తన చుట్టుప్రక్కలవారి దగ్గర గౌరవం పొందాలనే దృష్టి వుండకూడదు.

నాలుగు – కీర్తిమీద ఏ రూపంలోనూ కాంక్ష వుండ కూడదు.

వైరాగ్యనికి పై నాలుగూ లిట్మస్ టెస్ట్ వంటివి కెమిస్ట్రీలో లిట్మస్ టెస్ట్ అని వుంటుంది. లిట్మస్ పేపరును వుపయోగించి చూస్తే, ఆ ద్రావకం ఎసిడిక్ ద్రావకమా? అల్కలైన్ ద్రావకమా? అని తేలిపోతుంది. అలాగే పై నాలుగు పరీక్షలు చేస్తే, వాడి వైరాగ్యం ఎటువంటిదో తేలిపోతుంది.

అయితే విశ్వామిత్రుడు అక్కడితో ఆగలేదు. ఈ నాలుగు పరీక్షలనూ మించింది మరో పరీక్ష వుందన్నాడు. ఏమిటంటే– పైన చెప్పిన లక్షణాలుగల వైరాగ్యం ఆ వ్యక్తికి సహజసిద్ధంగా లభించాలి అన్నాడు. అంటే – "మోక్షమనేదేదో చాలా గొప్పది వుందట, ఈ నాలుగు లక్షణాలు గల వైరాగ్యాన్ని సాధిస్తే ఆ మోక్షం లభిస్తుందట. అది లభిస్తే తాను అందరికన్నా గొప్ప వాడయిపోతాడట. అందుచేత ఏం చేస్తాం? ఆ మోక్షంకోసం, ఈ వైరాగ్యాన్ని అవలంబించక తప్పదు కదా!" అనుకొంటూ ఎవడైనా పై నాలుగు లక్షణాల వైరాగ్యాన్నీ సాధన చేసినా, అది వైరాగ్యం కాదు – అంటున్నాడు విశ్వామిత్రుడు. మోక్షం మీద కోరికవల్ల కాక, ఐహిక పదార్థాలయొక్క నిస్సారత్వాన్ని గ్రహించడంవల్ల మాత్రమే ఎవడికైనా వైరాగ్యం కలిగితే, అదే సహజవైరాగ్యం.

దూరంగా సముద్రపు ఒడ్డున గల ముత్యపుచిప్ప వున్న చోట, వెండిముద్ద వున్నట్టు ఒకడికి కనిపించింది. వాడు దాని కోసం పరిగెత్తాడు. తీరా చూస్తే అక్కడ ముత్యపు చిప్ప వుంది. ఇంతలో మరో ప్రక్క అల్లంత దూరంలో మరో వెండిముద్ద కనిపించింది. మళ్ళీ పరిగెత్తాడు. అక్కడా ముత్యపు చిప్పే వుంది. ఇలా కొంత అనుభవం వచ్చేసరికి, వాడికి దూరాన వెండిముద్దలు కనిపిస్తున్నా, అవి వెండి ముద్దలు కావనీ, అవి ముత్యపు చిప్పలే అనీ, సూర్యకిరణాలవల్ల అవి వెండి ముద్దల్లాగా కనిపిస్తున్నాయనీ, సందేహం లేని జ్ఞానం కలుగుతుంది. ఇక ఆ జ్ఞానం కలిగాక, వాడు ఆ వెండి ముద్దను చూసినప్పుడల్లా వైరాగ్య సాధన చెయ్యాలా? ఏ సాధనా అక్కర్లేదు. వాడికి ఆ వెండిమీద వైరాగ్యం సహజంగానే కలుగుతుంది. అలాగే, ఐహిక సుఖాల మీద కూడా వైరాగ్యం సహజసిద్ధంగా కలిగితేనే, అది నిజమైన వైరాగ్యమని విశ్వామిత్రమహర్షి నొక్కి చెపుతున్నాడు.

విశ్వామిత్రమహర్షి మళ్ళీ మరొకసారి మహర్షుల వైపు తిరిగి ఇలా అన్నాడు – " మహాత్ములారా! ఒక నేలలో ఉప్పు వుంటే, అక్కడ ఏ మొక్కా ఒక పట్టాన మొలవనే మొలవదు. ఒక వేళ మొలిచినా, ఎక్కువ కాలం బ్రతకదు. ఒక వేళ బ్రతికినా, ఏపుగా రాదు. కనుక, ఒక నేలలో మొక్కలు సరిగ్గా బ్రతకటం లేదంటే, ఏపుగా రావడం లేదంటే, దానిని బట్టి ఆ నేలలో ఉప్పు వుందని గ్రహించాలి. ఇదే విధంగా, ఒక మనిషి మనస్సులో తత్త్వజ్ఞానమనే ఉప్పు చేరితే, ఇక అక్కడ భోగవాసనలనే మొక్కలు సరిగ్గా బ్రతకవు. సరిగ్గా ఎదగవు. ఇప్పుడు ఈ శ్రీరాముడిలో ఆ లక్షణాలు కనిపిస్తున్నాయి. అందువల్ల ఇతని హృదయంలో తత్త్వజ్ఞానం ఉదయించిందని మనం అర్థం చేసుకోవాలి.

"ఆ జ్ఞానబలంవల్ల రాముడిప్పుడు ఒక్క కైవల్యాన్ని మాత్రమే కోరుకుంటున్నాడు. ఇక దేన్నీ కోరుకోవడం లేదు. ఐతే, శ్రీరాముడు కోరుకొనే కైవల్యం అతని చేతికి అందాలంటే, అతని మనస్సును ఆవరించివున్న కొద్ది పాటి మాలిన్యం కూడా పోవాలి. అది పోవాలంటే మంచి హేతువులతో కూడిన యుక్తులు కావాలి. అలాంటి యుక్తులను వశిష్ఠమహర్షి ఒక్కడే ఉపదేశించ గలడు. ఆయన ఈ రఘువంశరాజులకు తరతరాల కులగురువు. ఈయన సర్వజ్ఞుడు. ఆయనే ఉపదేశం చెయ్యాలి."

అప్పుడు విశ్వామిత్రుడు వశిష్ఠుడి వైపు తిరిగి ఇలా అన్నాడు. " వశిష్ఠా! నీకు గుర్తున్నది కదా! మనకు ఒకప్పుడు విరోధంగా వుండేది. ఆ విరోధాన్ని పోగోట్టడం కోసం బ్రహ్మదేవుడు నిషధ పర్వతం మీద ఒక

మునిసభను ఏర్పాటు చేసి, ఆ సభలో మనకిద్దరకి తత్త్వజ్ఞానం ఉపదేశం చేశాడు. జ్ఞాపకం వుంది కదా! ఆ జ్ఞానం సంసార వాసనలన్నిటినీ రూపుమాపగలదు. ఆ ఉపదేశమే ఇప్పుడు శ్రీరాముడికి అందించు. ఈ శ్రీరాముడు నీ శిష్యుడు. నీబోటి వీతరాగులైన తత్త్వజ్ఞులు చెప్పిన ఉపదేశమే ఫలిస్తుంది. రాముడిలాంటి ఉత్తమశిష్యుడికి చేసిన ఉపదేశమే సార్థక మవుతుంది. అందుచేత మహర్షీ! నీవు శ్రీరాముడికి ఉపదేశించు.” తనే ఉపదేశిస్తానన్న విశ్వామిత్రుడు, వున్నట్టుండి బంతి కాస్తా వశిష్ఠుడి చేతిలో పెట్టేసరికి, సభలో వున్న మహర్షులంతా “భేష్ ! భేష్ ! భళీ భళీ!” అని చప్పట్లు కొట్టారు.

విశ్వామిత్రుడు ఎంత అనుభవజ్ఞానైనా, ఉపాధ్యాయుడిగా అనుభవం వున్నవాడు కాదు. అందుకే మాటి మాటికీ శిష్యుడ్ని స్తోత్రం చేస్తున్నాడు. ఏమి చెప్పాలో మనస్సులో ప్రణాళికతో చెప్పడం లేదు. ఈ విషయం సభలోని మహర్షులంతా గ్రహించారు. విశ్వామిత్రుడూ గ్రహించాడు. భోధన విషయంలో వశిష్ఠమహర్షికి వున్న సామర్థ్యమేమిటో, విశ్వామిత్రుడికి స్వయంగా తెలుసు. ఎందుకంటే– ఒకప్పుడు, ఆయన రాజుగా వుండిన రోజుల్లో, ఆయన కూడా వశిష్ఠుడి శిష్యుడే. అందుకే విశ్వామిత్రుడు హృదయ పూర్వకంగా వశిష్ఠమహర్షిని ఉపదేశించమని కోరాడు.

వెంటనే వశిష్ఠమహర్షి చిరు నవ్వులు నవ్వుతూ “చిత్తం మహర్షీ! నీ ఆజ్ఞ ప్రకారమే చెబుతాను. నీలాంటి పెద్దల మాట దాటకూడదు కదా!” అన్నాడు. విశ్వామిత్రుడు ఇప్పుడు ఎంత మహర్షై చేతిలో కమండలం పట్టుకు తిరుగుతున్నా, ఒకప్పుడు చక్రవర్తిగా వెలిగినవాడే. అప్పుడు వశిష్ఠమహర్షి ఆయన దగ్గర మంత్రిగా వుండి “చిత్తం ప్రభూ”! అన్నవాడే. అందుకే ఆ పాత అలవాట్లు పూర్తిగా పోక, విశ్వామిత్రుడు తన ప్రార్థనను కూడా ధాటిగానే చేసి వశిష్ఠుడ్ని ఉపదేశం చెయ్యమన్నాడు. దానికి తగ్గట్టే వశిష్ఠమహర్షి కూడా “ చిత్తం మీ ఆజ్ఞ” అంటూ ఉపక్రమించాడు.

## 6. వశిష్ఠోపదేశం

అయితే వశిష్ఠమహర్షికి, ఏమేమి బోధించాలో, ఏలా భోదించాలో, మనస్సులో ఒక ప్రణాళిక వుంది. శ్రీరాముడిలో, శ్రీరాముడి ఆలోచనలో, ఎక్కడ దోషం వుందో ఆ గుర్తింపు కూడా వుంది. ఇది బాధ్యతగల ఉపాధ్యాయుల లక్షణం. శ్రీరాముడిలో కలిగిన వివేకోదయానికి వశిష్ఠమహర్షి కూడా సంతోషిస్తూనే వున్నాడు. కానీ, ఆ వివేకంలో, ఆ వైరాగ్యంలో, శ్రీరాముడుకి శాస్త్ర రహస్యాలు కొన్ని పట్టుబడకుండా జారిపోతున్నాయి. అందుచేత ఒక్కో సారి శాస్త్రాలను కూడా నిందిస్తున్నాడు. ఇదిగాక తనకు కలిగిన ఆలోచనలను ఆయన క్రమబద్ధం చేసుకోలేక పోతున్నాడు. అందుచేత, వశిష్ఠమహర్షి మున్ముందుగా మోక్షేచ్ఛ కలిగిన ముముక్షువు ఏ రకంగా ఆలోచించాలో, ఏ రకంగా ప్రవర్తించాలో, ఏ రకంగా సాధన చెయ్యాలో, ఆ విధానమంతా క్రమబద్ధంగా బోధించాలని నిశ్చయం చేసుకొన్నాడు. ఆ ప్రణాళికతో వశిష్ఠమహర్షి తన ఉపదేశం ప్రారంభించాడు.

“శ్రీరామా! భగవంతుడైన బ్రహ్మదేవుడు సృష్ట్యాదికాలంలో, ఆయన మానసపుత్రుడుగా జన్మించిన నాకు, రాబోయే సృష్టిలోని జీవులంతా ఉత్తమ శాంతిని అందుకోగల ఉత్తమ జ్ఞానాన్ని ఉపదేశించాడు. అది నేను నీకు ఇప్పుడు అందిస్తున్నాను” ఇన్నాడు వశిష్ఠమహర్షి.

విశ్వామిత్రుడేమో నిషధ పర్వతం మీద బ్రహ్మదేవుడు ఉపదేశించిన జ్ఞానాన్ని రాముడికి చెప్పమన్నాడు. వశిష్ఠుడేమో అంతకు చాలా పూర్వం సృష్టి మొదట్లో బ్రహ్మ నాకు ఇలా ఉపదేశించాడు, అంటూ మొదలెట్టాడు. అందుచేత, ఈ సమన్వయాలన్నీ చాలా దూరం సాగిపోయేటట్లుగా వున్నాయని శ్రీరాముడు అర్థం చేసుకొన్నాడు.

అందువల్ల వశిష్ఠమహర్షిని ఆపి, "గురుదేవా! ముందు నాకొక సందేహం వుంది. అది తీర్చండి. కొడుకైన శుకమహర్షికి అలాంటి మోక్షం పొందాడనీ, ఆయనకు తండ్రైన వ్యాసమహర్షికి అలాంటి మోక్షం ఇంకా లభించలేదనీ, నేను విన్నాను. శుకుడికి వ్యాసుడే గురువు. ఆయన సర్వజ్ఞుడని ప్రతీతి. మరి ఆ తండ్రికి ఎందుకు మోక్షం రాలేదు? ఆయన శిష్యుడైన శుకుడికి మోక్షం ఎలా వచ్చింది? ఇది చెప్పండి" – అన్నాడు.

వశిష్ఠుడు ఈ ప్రశ్న విని, ఒక క్షణం ఆలోచించాడు. ఎందుకంటే, ఆయనకు ఇక్కడ రెండు చిక్కులు వచ్చాయి. ఏమంటే, ఈ ప్రశ్నకు తను చెప్పే సమాధానం కూడా, తను చేయదలచుకొన్న బోధప్రణాళికలో కలిసిపోవాలి. ఇది ఒక అంశం. రాముడు వేసిన ప్రశ్నకి సమాధానం తృప్తికరంగా వుండాలంటే మోక్షలక్షణము, సృష్టిలక్షణమూ, రెండు చెప్పాలి. ఇది రెండవ అంశం. ఈ రెండు అంశాలు సమన్వయం కావాలి. వాటికి తోడు జీవన్ముక్తికి, విదేహముక్తికి, గల తేడాను చెప్పాలి. ఇదంతా ఆలోచించుకొని వశిష్ఠమహర్షి ఇలా ప్రారంభించాడు.

"శ్రీరామా! పరమాత్మన్నా, చైతన్యమన్నా, ప్రకాశమన్నా, ఒకటే. అందుకే ఆ పరమాత్మను చిత్ప్రకాశుడు అని కూడా అంటూ వుంటారు. ఆ పరమాత్మలో ఇంతవరకూ ఎన్ని కోట్ల బ్రహ్మాండాలు లీనం అయిపోయాయో, వాటికి లెక్క చెప్పలేం. ప్రస్తుత కాలంలో కొన్ని బ్రహ్మాండాలు జీవించి వున్నాయి. ఇవి కూడా ఇన్ని అని, మనం లెక్కపెట్టి చెప్పలేం. భవిష్యత్కాలంలో ఇంకా ఎన్ని కోట్ల బ్రహ్మాండాలు ఉద్భవించి, లయించి, తరంగాలు తరంగాలుగా సాగిపోతాయో, ఆ లెక్క అసలే చెప్పలేం."

ఈ మాటలు విని మధ్యలో అడ్డుతగిలి, రాముడు ఇలా అన్నాడు.– "గురుదేవా! ప్రస్తుతకాలంలో వున్న బ్రహ్మాండాలకు ఇటూ, అటూ రెండు కట్టలున్నాయి. ఏమంటే, భూతకాలమని ఒక కట్ట, భవిష్యత్కాలమని ఒక కట్ట, ఈ కట్టలకు మధ్య ఈ నాటి బ్రహ్మాండాలు వున్నాయి. వీటి సంఖ్య అనంతంగా వుంటుందని మీరు చెబుతున్నారు. కానీ, వీటి సంఖ్య భూతకాలపు బ్రహ్మాండాల కన్నా తక్కువ వుంటుందనీ, అలాగే భవిష్యత్ కాలంలో రాబోయే బ్రహ్మాండాల సంఖ్య కంటే తక్కువే వుంటుందనీ నిశ్చయంగా చెప్పవచ్చు కదా! ఎందుకంటే , భూతకాలపు బ్రహ్మాండాలకి ఎడం చేతి వైపు గట్టు లేదు. భవిష్యత్కాల బ్రహ్మాండాలకి కుడి చేతి గట్టు లేదు. రెంటు ప్రక్కలా గట్టులున్న వర్తమాన బ్రహ్మాండాల సంఖ్యే అనంతమంటుంటే, ఇక మిగిలిన వాటి సంగతి వేరే చెప్పాలా?" అని.

### 7. మూడు ఆకాశాలు

వశిష్ఠుడు అది విని సంతోషించి ఇలా అన్నాడు. "శ్రీరామా! ఈ నాటి వర్తమాన బ్రహ్మాండాలన్నీ ఎక్కడ వున్నాయి? ఆకాశంలో గదా! ఆకాశమంటే ఏమిటి? చోటు. చోటు అంటే ఏంటి? ఏది వుంటే రెండు వస్తువులు విడి విడిగా వుండటచం సాధ్యమవుతుందో, అది చోటు. ఇది ఒక నిర్వచనం. దీనినే మరొక రకంగా త్రిప్పితే – మనకు తెలిసిన పదార్థాలన్నీ దేనిలో వుంటాయో అది ఆకాశం. మంచిది, నీకు తెలిసిన పదార్థాలలో నీ స్వప్నప్రపంచం కూడా వుంది కదూ! నీ స్వప్న ప్రపంచంలోని నదులు, కొండలు, మొదలైనవన్నీ ఇప్పుడు కనిపిస్తున్న ఈ ఆకాశంలో ఎక్కడ వున్నాయో చెప్పగలవా?"

అంటే, ఒక త్రీడైమెన్షనల్ గ్రాఫ్ వేస్తే, ఆకాశంలో ఏ వస్తువు ఏ పొజిషన్‌లో వుందో, నిఖరంగా చెప్పవచ్చు. కలలోని కొండ వగైరాలు బహిరాకాశంలో ఎక్కడున్నాయో చెప్పగలవా? అని– వశిష్ఠుడు అడుగుతున్నాడు. అవి, ఈ ఆకాశంలో ఎక్కడా లేవు. అయితే, "నువ్వు వాటిని చూశావు గదా! చూసినప్పుడు

అవి ఎక్కడ వున్నాయి"– అని అడిగితే నువ్వేమి చెబుతావు? "ఎక్కడ వుండేదేమిటండీ? అవన్నీ మనసులోంచే పుట్టాయి. మనసులోనే వున్నాయి. మనసులోనే లయించాయి"– అంటావు కదూ! నిజమే కానీ, అవి ఎక్కడ్నుంచీ పుట్టాయి, ఎక్కడ లయిస్తున్నాయి. అనే ప్రశ్న మనకు ఇప్పుడు వద్దు. అవి ఎక్కడ వున్నాయనేది మనకు కావాలి. మనస్సులోనే వున్నాయి. అన్నావు కదా! స్వప్నంలో నువ్వు చూసిన నదులు, కొండలు, మబ్బులు, ఆకాశమూ, నక్షత్రాలూ, అవన్నీ కలిసి నీ మనస్సులో వున్నాయి. అంటే, నీ మనస్సు అన్ని రకాల పదార్థాలకు చోటిస్తోంది.

పదార్థాలకు చోటిచ్చేది ఆకాశం అని ఒక నిర్వచనం చెప్పుకొన్నాం కదా! ఆ నిర్వచనం ప్రకారం, నీ మనస్సు కూడా ఒక ఆకాశమే అవుతుంది కదూ! అందుచేత మనస్సును **మానసాకాశం** అని పిలుస్తూ వుంటారు.

నువ్వు నీ స్వప్నంలో ఒక ఆకాశాన్ని చూశావు. అది ఈ బాహ్యాకాశం కాదు. అది వేరే ఆకాశం. నువ్వు నీ స్వప్నంలో చూసిన ఆకాశం కూడా, నీ మానసాకాశంలోనే ఇమిడి వుంది. అది బాగా గమనించు.

బాగా పరిశీలించి చూస్తే స్వప్నంప్రపంచమే కాదు, బయటి ప్రపంచం కూడా నీ మనస్సు మీదే ఆధారపడి జీవిస్తోంది. నీ మనస్సు వుంటే నీకీ ప్రపంచం వుంది. నీ మనస్సు లేకపోతే, నీకీ ప్రపంచం లేదు. కనుక, ఈ బయటి ప్రపంచం కూడా నిజానికి నీ మనస్సులోనే వుంది. ఈ బయటి ప్రపంచంలో దేన్ని నువ్వు ఆకాశం అని పిలుస్తున్నావో, అది కూడా నీ మనస్సులోనే ఇమిడి వుంది.

### 8. సూక్ష్మము- అంటే

ఈ బయటి ప్రపంచంలో కనిపించే వస్తువులన్నింటికంటే, ఆకాశం చాలా సూక్ష్మమైనది. సూక్ష్మమైనది అంటే ఏమిటి? ఈ ప్రకరణంలో ఏ పదార్థం ఎక్కువ ఇంద్రియాలతో గ్రహింపబడుతుందో, అది స్థూలం. ఏ పదార్థం తక్కువ ఇంద్రియాల చేత గ్రహింపబడుతుందో, అది సూక్ష్మం. ఉదాహరణకు భూమిని తీసుకో. భూమిని కంటితో చూసి గుర్తుపట్టవచ్చు. చేతితో తాకి గుర్తుపట్టవచ్చు. ముక్కుతో వాసన చూసి గుర్తుపట్టవచ్చు. నాలుక మీద వేసుకొని రుచిచూసి గుర్తుపట్టవచ్చు. రెండు భూఖండాలను, అంటే రెండు రాళ్ళను, ఒక దానికాకటి కొడితే వచ్చే శబ్దంవల్ల గూడా గుర్తు పట్టవచ్చు.

అంటే–భూమిని నువ్వు కన్ను, ముక్కు, చెవి, చర్మము, నాలుక, అనే ఐదు ఇంద్రియాలతో కూడా గుర్తు పట్టగలవన్న మాట. అదే వాయువును తీసుకో. దాన్ని కంటితో గుర్తుపట్టలేవు. ముక్కుతో గుర్తుపట్ట లేవు. నాలుకతో గుర్తుపట్టలేవు. గాలి కదలిక నీ చర్మానికి తగిలితే గుర్తుపట్ట గలవు. లేదా గాలి హోరు నీ చెవులకు వినబడితే గుర్తుపట్టగలవు. అంటే, గాలిని చర్మము చెవులు, అనే రెండు ఇంద్రియాలు మాత్రమే గుర్తుపట్ట గలవు. భూమినేమో ఐదు ఇంద్రియాలు గుర్తుపట్ట గలవు. వాయువునేమో రెండు ఇంద్రియాలు మాత్రమే గుర్తుపట్ట గలవు. అందువల్ల భూమికన్నా వాయువు సూక్ష్మం అంటారు.

### 9. ఆకాశమూ పదార్థమే

ఇక ఆకాశాన్ని ఎలా గుర్తుపట్ట గలవు? దాన్ని గుర్తుపట్టడానికి ఒకే ఒక పరోక్ష మార్గం వుంది. ఏమిటంటే, రెండు వస్తువులు కొట్టుకుంటే శబ్దం వస్తుంది. శబ్దం వినిపిస్తే, దానిబట్టి, రెండు వేరు వేరు

వస్తువులు వున్నాయనీ, అవి ఒకప్పుడు దూరంగా వుండి ఇప్పుడు ఒకదానికొకటి కొట్టుకున్నాయనీ, మనకు తెలుస్తుంది. ఎందుకంటే, ప్రపంచంలో ఎక్కడైనా సరే రెండు వస్తువులకు ఘర్షణ వుండాలంటే, మొదట అవి దూరంగా వుండాలి. తరువాత దగ్గరకు రావాలి. అవి దూరంగా వున్నాయంటే వాటి మధ్యలో ఆకాశం వుంది అని అర్థం. కనుక, ప్రపంచంలో శబ్దం పుట్టాలి అంటే, వాటి మధ్యలో ఆకాశం వుండి తీరాలి.

పుట్టిన శబ్దం మరొక చోటికి ప్రసారం కావాలంటే వాయు సహాయం కావాలి. అది వేరే విషయం. శబ్దం పుట్టాలంటే మాత్రం వస్తువుల మధ్యలో ఆకాశం వుండి తీరాలి. అందుకే పెద్దలు శబ్దం అనేది ఆకాశంయొక్క గుణం అన్నారు. ఆ విధంగా ఒక శబ్దం పుట్టినప్పుడు, చెవుయొక్క సహాయంతో ఆ శబ్దాన్ని గ్రహించి, తద్వారా మనం ఆకాశాన్ని ఊహిస్తాం. అలాగే ఇంటి కప్పుకీ, మనకీ, మధ్యలో వేరే వస్తువేదీ మనకు కనిపించడం లేదు. కనుక, మధ్యలో ఆకాశం వుందని ఊహిస్తాం. అందుకే ఆకాశం అప్రత్యక్షం అన్నారు పెద్దలు. అంటే ప్రత్యక్షం కాదన్నమాట. ఈ విధంగా పంచ జ్ఞానేంద్రియాల్లో, ఏ ఇంద్రియానికీ సూటిగా దొరకదు కనుక, పంచభూతాలలో ఆకాశము సూక్ష్మతమము అన్నారు.

### 10. వ్యాపకత్వం

వస్తువు సూక్ష్మమైన కొద్దీ, ఇతర వస్తువులన్నిటి చుట్టూ వ్యాపించి వుండగలుగుతుంది. వాయువు భూమి చుట్టూరా వ్యాపించి వుంటుంది. భూమికన్నా వాయువు సూక్ష్మం కదా! ఆకాశం అన్నిటి కంటే సూక్ష్మతమం కనుక, అది మన ప్రపంచంలోని పదార్థాలన్నిటినీ ఆవరించుకొని వ్యాపించి వుంటుంది. అంతవరకు బాగానే వుంది. మనకు తెలిసిన పదార్థాలలో మనస్సనే పదార్థం కూడా ఒకటి వుంది కదూ. అది మన ఈ ఆకాశంలో ఎక్కడ వుందంటావు? తలలో వుంది అంటావా? తలలో మాత్రమే వుంటే, అది ఎక్కడో నక్షత్ర మండలంలో వున్న విషయాలను గురించి ఎలా తెలుసుకో గలుగుతుంది? కనుక, తలలో గల మస్తిష్కమనే మాంసఖండంలో అది అభివ్యక్తమవుతున్న మాట వాస్తవమే కానీ, అది అంతకంటే పెద్దదేనని చెప్పాలి. అలాంటి ఈ మనస్సులో, ఈ బ్రహ్మాండమైన ఆకాశంతో సహా, సృష్టి అంతా ఇమిడి వుంది, అని ఇందాక మనం చెప్పుకొన్నాం.

ఏది ఎక్కువగా వ్యాపించి వుంటుందో అదే సూక్ష్మమనీ, దానిచేత ఏది వ్యాపింపబడుతుందో, అది సాపేక్షికంగా స్థూలమనీ కూడా, ఇప్పుడు మన చర్చలో చెప్పుకున్నాం. ఆ లెక్కన చూసినప్పుడు, బయట కనిపించే ఈ బ్రహ్మాండమైన ఆకాశంకంటే కూడా, మానసాకాశం అనేది ఇంకా సూక్ష్మమైన ఆకాశం అవుతుంది. ఈ చర్చవల్ల ఏం తేలింది? ఈ సృష్టిలోని వస్తువులన్నీ బయటి ఆకాశంలో వున్నాయి. బయిట ఆకాశంతో సహా, ఈ వస్తువులన్నీ కలిసి మానసాకాశంలో వున్నాయి. మానసాకాశము అంటే మనస్సు అనే ఆకాశం. ఇదీ ఇప్పటికి తేలింది.

### 11. చిదాకాశం

ఈ మనస్సనేది కూడా మనం గుర్తుపడుతున్న పదార్థాలలో ఒకటి. ఒక్కొక్కప్పుడు ఈ మనస్సు వుంటోంది. ఒక్కొక్కప్పుడు ఈ మనస్సు వుండటం లేదు. ఈ మనస్సుయొక్క రాక పోకలను నువ్వు గుర్తుపడుతున్నావు. ఈ మనస్సు స్వయంగా జడం అయినప్పటికీ, చైతన్యవంతం లాగా ప్రవర్తిస్తోంది. ఎందుకు అలా చేయగలుగుతోంది? ఎందుకంటే– ఈ మనస్సు కంటే వెలుపల పరమాత్మ చైతన్యం అనేది స్వయంప్రకాశమానంగా ప్రకాశిస్తోంది.

దాని ప్రకాశం ఈ మనస్సులో ప్రతిబింబించినప్పుడు ఈ మనస్సు చైతన్యవంతం లాగా ఆటలాడుతోంది. మనస్సుకీ, ఆ  చైతన్యానికీ, మధ్య తమస్సు అనే తెర అడ్డుపడ్డప్పుడు, ఈ మనస్సులోకి ఆ  చైతన్యం ప్రసరించదు. అందుచేత అప్పుడు ఆ మనస్సు చైతన్యవంతం లాగా ఆడదు. జడం లాగా పడి వుంటుంది. కనుక, పరమాత్మచైతన్యం అనే వెలుగు మనస్సులో వ్యాపించి వుంటోంది. మనస్సు దానిచేత వ్యాపించ బడతోంది, అని తెలుస్తోంది గదూ! ఏది వ్యాపిస్తోందో అది సూక్ష్మమనీ, వ్యాపించబడేది స్థూలమని చెప్పుకొన్నాం కదా! ఆ దృష్టితో చూసినప్పుడు మనస్సుకంటే పరమాత్మ చైతన్యం ఇంకా సూక్ష్మమైనది. మనస్సుకే మరో పేరు మానసాకాశం అని చెప్పుకొన్నాం. దీనికంటే కూడా సూక్ష్మమైనది కనుక, మానసాకాశాన్ని తనలో ధరించి వుంటుంది కనుక, ఆత్మచైతన్యాన్ని **చిదాకాశము** అని పిలుస్తారు.

## 12. మనోరాజ్యం

శ్రీరామా! ఇప్పటికి మూడాకాశాలు తేలాయి. మొదటిది చిదాకాశం. దీనిలో మానసాకాశం వుంది. దీనిలో బహిరాకాశం వుంది. దీనిలో సమస్త బ్రహ్మాండాలూ వున్నాయి. శ్రీరామా! ఇప్పుడు నేను చెప్పబోయేది నువ్వు మరింత జాగ్రత్తగా గమనిస్తే కానీ అర్థం కాదు. ఈ లోకంలో ఒకడు చచ్చిపోయాడనుకో. నువ్వు ఇందాక మాట్లాడుతూ "ప్రపంచంలో పుట్టటం, చావటం, అనేవి లేనే లేవు. కనిపించటం కనిపించకపోవడం, అనేవి మాత్రమే వున్నాయి" అని చెప్పావు. ఒక దృష్టితో అది సత్యమే కానీ, లోకంలో మరణించాడనే వ్యవహారం వుంది కదా! ఒకడు మరణించాడు అనేటప్పుడు ఏమి జరుగుతోంది? ఏమవుతోందంటే – ఒక ప్రాణి మరణించే సమయం వచ్చేసరికి, వాడి ఇంద్రియాలు వెళ్ళి ప్రాణంలో కలుస్తాయి. ప్రాణం వెళ్ళి తేజస్సులో కలుస్తుంది. తేజస్సు ఆకాశంలో కలుస్తుంది. ఆకాశం పరమాత్మలో కలుస్తుంది.

అలా కలిసే సమయంలో వాడియొక్క మానసాకాశంలో పూర్వజన్మ వాసనలు మిగిలివుంటే, వాడు మళ్ళీ జన్మ ఎత్తుతాడు. ఆ సమయంలో వాడికి పరిపూర్ణమైన తత్త్వజ్ఞానం వుంటే, అంటే నేనే పరమాత్మను అనే పరిపూర్ణమైన జ్ఞానం వుంటే, వాడు మళ్ళీ జన్మించడు. ఒకడు తన మానసాకాశంలో పూర్వజన్మ వాసనలు ఇంకా వుంచుకొని, పరమాత్మ చైతన్యంలోకి వెళ్ళాడనుకో, మళ్ళీ వెనక్కి వచ్చేలోపల వాడి స్థితి ఏమిటి? వాడు బహిరాకాశాన్ని, మానసాకాసాన్ని, దాటి చిదాకాశంలోకి వెళ్ళాడు కనుక, ఆ క్షణంలో వాడు చిదాకాశంలో అంతర్గతంగా వున్న మానసాకాశాన్ని, దానిలో అంతర్గతంగా వున్న బహిరాకాశాన్ని, దానిలో అంతర్గతంగా వున్న మూడు లోకాలమూ, అన్నిటినీ ఏకకాలంలో దర్శించ గలుగుతున్నా డన్నమాట.

అలా దర్శించి, మళ్ళీ తన మనస్సులో వున్న సంస్కారాల బలంవల్ల వెనక్కి వచ్చి, ఏదో ఒక శరీరాన్ని స్వీకరిస్తున్నాడు. శరీరంతో పాటు దాని చుట్టూ వున్న ప్రపంచాన్ని కూడా స్వీకరిస్తున్నాడు. దీనివల్ల ఏం తేలుతోందంటే, ఇవాళ జన్మించివున్న ప్రతివాడూ తన పుర్వపు మానసిక సంస్కారాల ప్రతిఫలంగానే, ఇవాళ్టి ఈ ప్రపంచాన్ని పొందుతున్నాడు. దీన్నే మరొక రకంగా తిప్పి చెప్పితే, ఇవాళ్టి  ఈ ప్రపంచమంతా వాడి పూర్వపు మనస్సుయొక్క సృష్టే. అందుకనే పెద్దలు ఈ ప్రపంచాన్ని "మనోరాజ్యం" అని పిలుస్తూ వుంటారు.

## 13. జీవవులు జన్మించే విధానం

ఇక్కడ ఒక విశేషం వుంది. మరణించిన దశలో వున్నవాడు, తాను మళ్ళీ శరీరాన్ని స్వీకరించే ముందు కొంతసేపు, పరమాత్మ చైతన్యంలో ఏకీభావం పొందుతాడనీ, అప్పుడు వాడీ ముల్లోకాలనూ ఏకకాలంలో దర్శించగలుగుతాడనీ, చెప్పుకొన్నాం. కానీ, అలా మొత్తంగా కనిపించే ఈ లోకత్రయంలో, ఈ జీవుడు కొంత భాగంమీద ఏక్కువ అభిమానం పెట్టుకోవటంవల్ల, వాడి అజ్ఞానం బలపడి, ఆ మేరకే వాడికి ఆ ప్రపంచం స్తూలప్రపంచంగా దర్శనమిస్తోంది. ఉదాహరణకు, వాడి పూర్వవాసనలవల్ల వాడికి భూలోకంమీద అధికప్రీతి ఏర్పడితే, వాడికి భూలోకమే  స్థూల లోకంగా మారి, ఆ భూమిమీద ఒక జీవిగా వాడు జన్మిస్తాడు మరొకడికి స్వర్గలోకం మీద అభిమానం పెరిగితే, వాడికి అదే స్థూలలోకంగా మారిపోతుంది. వాడికి అక్కడే జన్మ కలుగుతుంది.

జీవులకు వాసనలయొక్క మార్పులవల్ల వారి అభిమానాలు మారిపోతూ వుంటాయి. కనుక, వారు పై లోకాలకూ, క్రింది లోకాలకు ప్రయాణాలు చేస్తూనే వుంటారు. ఈ ప్రయాణ ప్రవాహానికి అంతూ పొంతూ వుండదు. ఈ ప్రవాహన్నే కల్పాలనీ, యుగాలనీ, పెద్దలు లెక్కలు కడుతూ వుంటారు. సముద్రంలో అలలకి కొంత వరకూ పోలిక వుంటూనే వుంటుంది. అంత మాత్రంచేత అలలకు మధ్యన తేడా ఏమీ లేదనీ చెప్పేందుకు వీలులేదు. అలాగే, సృష్టిలోని కల్పాలు అనే ఈ అలల్లో కూడా,అనేకమంది జీవులు ఒకే పోలికతో మళ్ళీ మళ్ళీ జీవిస్తూ వుంటారు. మళ్ళీ కొన్ని చోట్ల ఏ పోలికా లేనట్లు నడుస్తూ వుంటారు.

## 14. వ్యాసజన్మ పరంపర

శ్రీరామచంద్రా! అలాంటి సృష్టి ప్రవాహంలో, ఇప్పుడు మన సభలో కూర్చుని వున్న వ్యాసభగవానుడు, నాకు గుర్తున్నంతలో, 32వ వ్యాసుడు. ఎలా చెబుతున్నానంటే, ఇతడు వ్రాసిన మహాభారతాన్ని బట్టి, ఇతను వ్రాసిన బ్రహ్మసూత్రాలను బట్టి, అతనికి వున్న శాస్త్రజ్ఞానాన్ని బట్టి, నేనీ మాట చెబుతున్నాను. ఎందుకంటే, ఇప్పటి వరకు జన్మించిన 32 మంది వ్యాసులలో ఆకారంలో, అధికారంలో, కులంలో, చేసిన పనుల్లో, అందరూ   సమానంగానే వున్నారు. కానీ, జ్ఞానం విషయం దగ్గరకు వచ్చేటప్పటికి మాత్రం, వీరిలో 12 మంది కొంచెం విశేషస్థాయిలో వున్నారు. మిగిలిన 20 మందిలో 10 మంది మాత్రం వేరే కులంలో పుట్టారు. కులం అంటే వంశం. వ్యాసుడు ఒక్కడే కాదు. వాల్మీకి, భృగువు, అంగిరసుడు మొదలయినవారు కూడా ఇలాగే ప్రతి కల్పంలోనూ జన్మిస్తూవుంటారు. మళ్ళీ మరణిస్తూ వుంటారు. వాళ్ళలో గూడా ఒక్కొక్కప్పుడు సామ్యాలూ వుంటాయి. ఒక్కొక్కప్పుడు భేధాలూ వుంటాయి.

కల్పం అంటే బ్రహ్మగారి జీవితంలో ఒకరోజు. దాంట్లో 72 సార్లు త్రేతాయుగం వస్తుంది. వాటిలో కొన్ని త్రేతాయుగాలు ఇప్పటికి గడిచిపోయాయి. ప్రస్తుతం ఒక త్రేతాయుగం నడుస్తోంది. ఇంకా కొన్ని త్రేతాయుగాలు రాబోతున్నాయి. వీటిలో ప్రతి త్రేతాయుగమూ ఇంచుమించు ఒకే విధంగా నడుస్తూ వుంటుంది. అలా అన్నామని అచ్చుగుద్దినట్లుగా అన్ని త్రేతాయుగాలూ ఒకే విధంగా వుంటాయని భావించరాదు. కొన్ని తేడాలు కూడా వుంటూ వుంటాయి. ఈ విషయం బాగా అర్థం కావడం కోసం ఒక ఉదాహరణ చెబుతాను విను.

## 15. కల్పం అంటే

మనమంతా జీవులమే కదా! ఎవరి సంగతో నీ కెందుకు? నీ సంగతే తీసుకో. నువ్వు జన్మించింది మొదలు మరణించే దాకా రోజులు గడుస్తూ వుంటాయి. నిన్న అనే రోజు ఎలా వుందో, ఇవాళ అనే రోజూ అలాగే వుంటుంది. రేపు అనే రోజూ అలాగే వుంటుంది. పొద్దున్నే సూర్యోదయం అవుతుంది. మధ్యాహ్నం అయ్యేసరికి ఆకలి వేస్తుంది. సాయంకాలం అయ్యేటప్పటికి సూర్యాస్తమయం అవుతుంది. రాత్రయ్యేసరికి నిద్ర వస్తుంది. మళ్ళీ మర్నాడు ఇలాగే జరుగుతుంది. ఇలా ప్రతిరోజూ జరుగుతూనే వుంటుంది. నిన్న కలిసిన మనుష్యులనే ఇవాళా కలుస్తూ వుంటాం. నిన్న చేసిన ఉద్యోగమే ఇవాళ కూడా చేస్తూ వుంటాం. ఈ విధంగా మన జీవితంలో ఒక రోజుకూ, మరొక రోజుకూ చాలా పోలిక వుంటుంది.

అది నిజమే కానీ, మన జీవితంలో ఒక రోజుకీ, మరొక రోజుకీ తేడా ఎంత మాత్రమూ లేదని చెప్పగలమా? నిన్నటి దాకా నీలో నీవే కుమిలి పోతున్నావు. ఇవాళ విశ్వామిత్ర మహర్షి వచ్చి నీ మనస్సులోని మాటలన్నీ బయటకు లాగుతున్నాడు. నిన్నటికీ, ఇవాల్టికీ మార్పు లేదా మరి? అందుచేత నిన్నటికీ, ఇవాల్టికీ చాలా పోలిక వుంది. కొంత భేదమూ వుంది. ఇది మన జీవితంలో మనం గమనిస్తున్న విషయమే.

సరీగా ఇదే విధంగా బ్రహ్మగారి జీవితంలో, అనగా చతుర్ముఖ బ్రహ్మగారి జీవితంలో కూడా, ప్రతిరోజూ ఇంచుమించు ఒకే రకంగా సాగుతూ వుంటుంది. కొంచెం తేడాలు కూడా వుంటూ వుంటాయి. బ్రహ్మగారి రోజుకు కల్పమని పేరు. అందుచేత ప్రతి కల్పంలోనూ, సృష్టి ఇంచుమించుగా ఒకే రకంగా జరుగుతూ వుంటుందని శాస్త్రాలలో పెద్దలు చెప్పారు. అందుచేత ఈ వ్యాసుడే కాదు, నువ్వూ నేనూ కూడా అనేకసార్లు ఈ పేర్లతోనే జీవితం గడిపాం. అయితే ఆ వివరాలన్నీ నాకు తెలుసు. నీకు తెలియటానికి ఇంకా కొంచెం సమయం వుంది.

శ్రీరామా! మరొక రహస్యం కూడా వుంది. ఈ కల్పంలో వ్యాసుడుగా జన్మించిన వ్యక్తే, మళ్ళీ పై కల్పంలో కూడా అదే వ్యాసుడుగా జన్మించడం కూడా వుంది. ఎందుకంటే, కొన్ని కర్మ శేషాలవల్ల, వచ్చిన జన్మలే మళ్ళీ మళ్ళీ వస్తూ వుంటాయి. నిజానికి ఇప్పుడు మన సభలో కూర్చొన్న వ్యాసుడు ఇప్పటికి 10వ సారి వ్యాసజన్మ ఎత్తాడు. ఈ వ్యాసుడు ఇంకా 8 సార్లు మళ్ళీ వ్యాసుడుగానే జన్మించి, ప్రతిసారీ మహాభారత రచన చేస్తాడు. ప్రతిసారీ వేదవిభాగం చెస్తాడు. ఆ తరువాత ఇతను చతుర్ముఖ బ్రహ్మపదవిని పొందుతాడు. బ్రహ్మగా జీవితం పూర్తి అయిన తరువాత, అప్పుడు, పరిపూర్ణమైన విదేహకైవల్యం పొందుతాడు.

ఈయన ఒక్కడే కాదు, నేను, వాల్మికీ, భృగువు మొదలైన మహర్షులు అనేక మందిమి ఇప్పటికి అనేక సార్లు అనేక పేర్లతో జన్మించాము. ఇంకా అనేకసార్లు అవే పేర్లతో జన్మించబోతున్నాం.

## 16. జీవన్ముక్తి

ఇదంతా ప్రారబ్దశేషంవల్ల వచ్చే జన్మపరంపర. ప్రస్తుతం మాత్రం ఆ వ్యాసుడు గానీ, మేము గానీ జీవన్ముక్తులమై జీవిస్తున్నాం. మాకు పరిపూర్ణమైన పరమాత్మ విజ్ఞానం కలిగింది కనుక, మాకు ఈ సంసారబంధాలవల్ల భయం గానీ, దుఃఖం గానీ, అహంకార మమకారాలూ గానీ, ఎంత మాత్రమూ లేవు. ఎడారిలో దూరంగా కనిపించేది నది కాదనీ, ఎండమావనీ నిశ్చయమైనాక, దానిమీద మోహం ఇంకా

వుండమన్నా వుండదు, కదా! కంటికి కనిపిస్తూనే వుంటుంది. అయినా బాధ వుండదు. జీవన్ముక్తుల స్థితి కూడా అటువంటిదే.

శ్రీరామా! మాకిప్పుడు మాయావరణం తొలగిపోయి, పరిపూర్ణమైన స్వస్వరూప దర్శనం జరగుతూ వుంది. కానీ, ఇంతకు పూర్వం మేము చాలా తీవ్రమైన యోగసాధనలు చేసి వున్నాం. ఆ యోగఫలంవల్ల మాకు కొన్ని అధికారిక శరీరాలు ఇంతకు ముందే సిద్ధించి వున్నాయి. కనుక, అవి ఇప్పుడు పొమ్మన్నా పోవు. పొమ్మనవలసిన పనీ లేదు. ఒక ఉదాహరణ చెబుతా విను.

నువ్వు మంచి విలుకాడివే కదా! బాణాలు నేర్పుగా వేయగలవాడనే గదా! చిటారు కొమ్మన ఒక పక్షి కూర్చొని వుంది. ఆ పక్షిని కొట్టాలని నువ్వు ఒక బాణం వేశావు. నీ బాణం వెళ్ళి ఆ పక్షికి తగిలింది. పక్షిగొంతులో నీ బాణం గుచ్చుకొన్న తక్షణమే నీ బాణం ఆగిపోతుందా? ఆ పక్షితో సహా ఆ బాణం ఇంకా కొంచెం ముందుకు పోతుంది. "ఓ బాణమా! పక్షి మెడలో గుచ్చుకోవడం కోసం నిన్ను వేశాను. ఆ పని పుర్తి అయిపోయింది కదా! అనవసరంగా ఇంకా ముందుకు సాగి, ఎందుకు శ్రమపడతావు?" అని నువ్వు ఆ బాణానికి బోధించావనుకో, ఆ బాణానికి అర్థమవుతుందా? ఆగుతుందా? అర్థమూ కాదు, ఆగనూ ఆగదు. ఎందుకంటే, అది జడం. జడవస్తువు సొంతంగా పని చెయ్యనూ చెయ్యలేదు, ఆగిపోనూ లేదు.

నిజానికి ఒక జడవస్తువు ఎప్పుడూ స్తబ్ధంగానే పడి వుంటుంది. ఒక సచేతనమైన జీవిలోంచి కొంత చైతన్యం దీనిలోకి ప్రవేశిస్తే, ఆ చైతన్యం వున్నంతవరకు ఇది అట్లా సాగిపోతూనే వుంటుంది. అది జడవస్తువుయొక్క స్వభావం.

పాఠకులకు ఇక్కడ ఒక చిన్న మనవి. ఈ నాటి విజ్ఞాన శాస్త్రంలో "న్యూటన్స్ లాస్" అని మూడు సూత్రాలున్నాయి. వాటిలో మొదటి సూత్రంఏమని చెబుతోందంటే – ఏదైనా ఒక పదార్థం కదులుతూనే వుంటే, అలాగే కదులుతూ వుంటుంది. స్తబ్ధంగా వుంటే అలాగే స్తబ్ధంగానే వుంటుంది. దానియొక్క పరిస్థితిని మార్చాలంటే, దానికంటే వెలుపలనుంచి వచ్చిన ఏదైనా ఒక శక్తి దానిమీదకి వచ్చి పడితేనే ఆ పని జరుగుతుంది. అంటే కదులుతూ వున్న పదార్థాన్ని ఆపాలంటే. ఇంకొక శక్తి అడ్డంపడితే ఆగుతుంది. కదలకుండా వున్న ఒక పదార్థం కదలాలంటే ఏదైనా ఒక బయటి శక్తి వచ్చి దానిమీద పడితేనే అది కదులుతుంది – అని చెబుతోంది.

ఇప్పుడు వశిష్ఠభగవానుడు చెప్పేది కూడా ఇంచుమించు అలాంటిదేనని మనం గ్రహించాలి. న్యూటన్ సూత్రాలు భౌతికశాస్త్రంలో చెప్పిన విషయాలు. అందుచేత ఆయన చేతనము, జడము అనే పదాలు ఉపయోగించలేదు. పదార్థము, శక్తి అనే పదాలు ఉపయోగించాడు. వశిష్ఠమహర్షి ఆత్మతత్త్వ విచారణ చేస్తున్నాడు కనుక, జడము, చేతనము అనే పదాలను ఉపయోగిస్తున్నాడు. పదాలలో భేదం తప్పితే విషయంలో భేదం లేదు.

ఇంతకూ అసలు విషయంలోకి మళ్ళీ ప్రవేశిద్దాం. వశిష్ఠమహర్షి బాణం ఉదాహరణ చెబుతున్నాడు. వేసిన బాణం జడం కనుక, పక్షి తలను నరికినాక కూడా ఇంకా ముందుకు పోతూనే వుంటుంది – అని చెప్పాడు. ఎప్పటిదాకా పోతుందంటే, దానిలోకి ప్రవేశించిన చైతన్యాంశం క్షీణించిపోయే దాకా, అది అలా పోతూనే వుంటుంది అని చెప్పాడు. వేటివల్ల క్షీణిస్తుందో చెప్పలేదు. న్యూటన్‌గారు భూమ్యాకర్షణ, వాయుతరంగాల ఘర్షణ, మొదలైన వేరే శక్తులవల్ల బాణంలోని వేగశక్తి క్షీణిస్తుందని చెప్పాడు. ప్రస్తుత ప్రకరణంలో వశిష్ఠమహర్షిగారికి ఆ వివరాలు అక్కర్లేదు. అందువల్ల తమలో వున్న వేగం క్షీణించేవరకు బాణం ముందుకు పోతూనే వుంటుంది– అని చెప్పాడు. ఎందుకంటే, జడపదార్థాం యొక్క స్వభావం అలా వుంటుంది కనుక.

ఈ ఉదాహరణ చెప్పాక వశిష్ఠమహర్షి శ్రీరాముడికి దీన్ని దార్ష్టాంతికంలో అన్వయించి ఇలా చెప్పాడు.

రామా! బాణం ఎలా జడమో, అలాగే కర్మలూ, కర్మలవల్ల వచ్చే దేహాలు, కూడా జడపదార్థాలే. వాటిని ప్రయోగించే చేతనుడు వేరే వున్నాడు. వ్యాసుడిలాంటి జీవన్ముక్తుడి విషయంలో ఆ చేతనుడు పూర్వం యోగబలం ఉపయోగించి చాలా తీవ్రంగా, చాలా ప్రయోగాలు చేశాడు. ఆ చేతనుడు అప్పట్లో ఈ యోగం ఎందుకు సాధన చేశాడు? ఎందుకంటే ఆత్మజ్ఞానం పొందాలనే ఉద్దేశ్యంతోనే చేశాడు. కానీ, ఆ అదుర్దాలో బహుతీవ్రంగా యోగసాధన చేసేశాడు. కావాలనుకొన్న ఆత్మజ్ఞానం మధ్యలో ఒక జన్మలో సిద్ధించేసింది. బాణం పిట్టగొంతులో గుచ్చుకొన్న పరిస్థితి ఇది.

## 17. ఆధికారిక పురుషులు

ఆత్మజ్ఞానం కలిగినా కూడా వెనుకటి యోగబలం ఇంకా కొనసాగుతోంది కనుక, వాడి జన్మలు ఇంకా కొనసాగుతూనే వున్నాయి. ఇలా జ్ఞానసిద్ధి కలిగినాక కూడా దేహధారణ కలిగివుండేవాడిని జీవన్ముక్తుడని పిలుస్తారు. ఒకడు జీవన్ముక్తుడు అయినాక కూడా, ఇంకా దేహధారణ చెయ్యవలసిన పని వుంటే, అలాంటి మహానుభావులవల్ల బ్రహ్మదేవుడియొక్క సృష్టిప్రక్రియల్లో కొన్ని ఆధికారిక కృత్యాలు నిర్వహింప బడుతూ వుంటాయి. అందువల్ల వారి శరీరాలని 'ఆధికారిక శరీరా' లని, ఆ శరీరాలను ధరించి వున్నవారిని, 'ఆధికారిక పురుషు' లనీ పిలుస్తూ వుంటారు. ఇందాక నీకు చెప్పా గదా! ఈ వ్యాసభగవానుడు ఇంకా 8 సార్లు మహాభారతం వ్రాయవలసి వుంది.ఆ తరువాత చతుర్ముఖ బ్రహ్మశరీరం ధరించవలసి వుంది.

ఈ పనులవల్ల కోట్ల కోట్ల జీవరాశులకు ఉపకారం కలిగించవలసి వుంది. ఇలా ఆధికారిక పురుషత్వయోగం వ్యాసుడికి వుండడంవల్ల, ఇతనికి పరిపూర్ణమైన ఆత్మజ్ఞానం కలిగినా కూడా, నిరంతరం నిర్వికల్ప సమాధిలో వుండిపోవడం గానీ, దేహాన్ని పూర్తిగా వదిలేసి విదేహ కైవల్యంలోకి వెళ్ళిపోవడం గానీ, సాధ్యం కాదు. ఎందుకంటే, ఈ సృష్టి ప్రక్రియకు ఇలాంటి ఆధికారిక పురుషులు కావాలి. అందువల్ల, వారు పైకి శరీరధారులు లాగా కనిపించినా కూడా, పూర్వ యోగబలంచేత ఏవోవో పనులు చేస్తున్నా కూడా, వారు అజ్ఞానులేమోనని మనం భ్రమించ కూడదు. వారు పరిపూర్ణ జ్ఞానులే.

ఇక శుకుడంటావా! ఇలా ఆధికారిక శరీరధారణ చెయ్యవలసిన అవసరం అతనికి లేదు. అతనియొక్క పూర్వ కర్మయోగంలో ఈ రకమైన యోగం లేదు. అందువల్ల అతడు జనకమహారాజు దగ్గర చిత్తనైర్మల్యాన్నీ, పరిపూర్ణ జ్ఞానాన్నీ, పొందిన వెంటనే మేరుశిఖరానికి చేరి, తన జీవితశేషమంతా నిర్వికల్ప సమాధిలో గడిపేసి, ఆ తరువాత శాశ్వతమైనటువంటి విదేహకైవల్యంలోకి ప్రవేశించాడు. అందువల్ల అతడు పరిపూర్ణ జ్ఞానవంతుడని ప్రజలు త్వరగా అర్థం చేసుకోగలుగుతున్నారు. అంతే తప్ప, జ్ఞానవిషయంలో వ్యాసుడికీ, శుకుడికీ ఏ మాత్రమూ తారతమ్యం లేదు.

## 18. మోక్షప్రాప్తి

శ్రీరామా! శుకుడికి కలిగిన జ్ఞానం వ్యాసుడికి ఎందుకు కలగలేదు – అని అడిగావు. దానికి సమాధానం చెప్పేశాను. ఇక్కడ నువ్వు అడక్కపోయినా, ఒక ప్రశ్న పుట్టేందుకు అవకాశం వుంది కనుక, దానికి కూడా సమాదానం చెప్పేస్తాను విను.

ప్రశ్న ఏమంటే, ఇలా క్రమక్రమంగా జీవులకు ముక్తి కలిగిపోతూ వుంటే, కొంచెం వెనకా ముందుగా అందరు జీవులకీ జీవన్ముక్తి వచ్చేయ్యాలి. అంటే కొన్ని కోట్ల కల్పాలు అయ్యేసరికి, సృష్టిలో వున్న జీవులందరికీ ముక్తి వచ్చేయ్యాలి. అందరికీ ముక్తి వచ్చిందంటే మాయ అనేది పుర్తిగా అంతరించి పోయినట్లే. ఆ తరువాత ఇంక ఏ జీవీ పుట్టదు. ఈ స్థితి ఎప్పటికో ఒకప్పటికి వచ్చి తీరుతుంది. దానంతట అదిగా వచ్చితీరుతుంది. కనుక, ఈ నాడు బ్రతికివున్న జీవులలో ఏ జీవీ కూడా మోక్షం కోసం పని చెయ్యవలసిన పని లేదు. మోక్షమేమిటి పుణ్యం కోసమే పనిచెయ్యవలసిన పని లేదు. హాయిగా ఇంద్రియ సుఖాలు అనుభవిస్తూ, మళ్ళీ చచ్చిపోతూ, మళ్ళీ పుడుతూ వుంటే, ఎప్పటికో ఒకప్పటికి మోక్షం వచ్చి తీరుతుంది. కనుక, నేను మోక్షం కోసం కృషి ఎందుకు చెయ్యాలి?

ఇదీ ప్రశ్న. ఇది నేను చెప్పిన జీవన్ముక్తి ప్రక్రియ వల్ల కలిగే అవకాశం వుంది. కానీ, అది నిజం కాదు. శ్రీరామా! ఈ సృష్టిలో జీవులు అనంతమని చెప్పాను. అనంతజీవులలో కొంత మంది జీవన్ముక్తులైనా, విదేహముక్తులైనా మళ్ళీ మిగిలివుండే జీవుల సంఖ్య అనంతమే అవుతుంది. వీరిలో కొందరు జీవులు ఎంత కాలానికీ మళ్ళీ జన్మించక, వారి కర్మానుభవానికి అనుకూలమైన సమయం కలసిరాక, అలాగే స్తబ్ధంగా పడివుంటూ వుంటారు. వీరి పరిస్థితి ఎట్లా వుంటుందంటే, మీరు మహారాజులు గదా! మీకు బాగా తెలుస్తుంది.

పెద్ద ధాన్యపు రాశి వుందనుకో, దానిని పనివాణ్ణి పెట్టి ఒక శేరుతో కొలవమంటారు. వాడు ఒక శేరు గొట్టం తీసుకొని కొలచి ప్రక్కన పోస్తూ వుంటాడు. ఈ పోయటంలో ఆ శేరుగొట్టంలో పైన చేరిన గింజలు క్రింద పడిపోయి. గొట్టంలో అడుగున వున్న గింజలు రాశిలో పైకి చేరుతూ వుంటాయి. ఇప్పటి ఈ రాశిలో ఈ గింజలు పైకొచ్చాయి అనుకొంటూ వుంటే, వాడు ఇంకా నాలుగు శేర్ల గింజలు దాని నెత్తిన పోస్తూ వుంటాడు. దాంతో పైన వుందనుకున్న గింజ క్రిందకు పోతుంది. కొంతసేపటికి ఆ కొలత కొలచే వాడి పైఅధికారి, ఇన్స్పెక్టరు, వస్తాడు. వాడు మరొకసారి కొలిపిస్తాడు.

ఇలా శేరుగొట్టంతో కొలచినప్పుడల్లా ధాన్యపుగింజలు పైకి క్రిందకి మారిపోయినట్లుగా, జీవుల జన్మలు పైకీ, క్రిందకీ తిరుగుతూనే వుంటాయి. స్వర్గాలూ, నరకాలూ, తిరుగుతూనే వుంటాయి. జీవులు అనంతం కనుక, ఈ ప్రక్రియ అనంతంగానే సాగుతూనే వుంటుంది. అందుచేత మాయ అనేది పూర్తిగా దానంతట అది ఇంకిపోయే పరిస్థితి కనిపించదు. అందుచేతనే మాయను దానంతట దానికి వదిలిపెడితే అంతం కాదని పెద్దలు చెప్పారు. ఏ జీవి తనను ఆవరించుకొని వున్న మాయను నశింప చెసుకోవాలని కృషి చేస్తాడో, వాడికి మాత్రమే మాయ నశిస్తుంది. వాడికి మాత్రమే మోక్షం లభిస్తుంది. కనుక, రామా! ప్రతి మానవుడూ తన మోక్షం కోసం తను పురుషప్రయత్నం చేసి తీరవలసిందే.

వశిష్ఠమహర్షి చాలా నేర్పుగల ఉపాధ్యాయుడని చెప్పుకొన్నాం. ఆయన ఏమి బోధించాలో ప్రణాళిక వేసుకొన్నాడని కూడా చెప్పుకొన్నాం. మధ్యలో శ్రీరాముడు వేరే ప్రశ్న వేసినా కూడా వశిష్ఠుడు తన ప్రణాళికనుంచి తొలగి పోలేదు. పోలేదు సరికదా ఆ ప్రశ్నను కూడా తన ప్రణాళికకు అనువుగా వినియోగించికొని, ఆ సమాధానాన్ని తను చేయబోయే ఉపదేశానికి పీఠికగా వాడుకొన్నాడు. ఆ పీఠిక చివరిలో ప్రతి మానవుడూ మోక్షంకోసం పురుషప్రయత్నం చేసితీరవలసిందేనని చెప్పాడు. ఈ పురుషప్రయత్నం అనేది ఆ మహర్షి చెప్పబోయేటటువంటి ఉపదేశప్రణాళికలో మొదటి మెట్టు. ఈ విషయం బాగా అర్థం కావాలంటే, ఈ ముముక్షు వ్యవహార ప్రకరణంలో, ఆ మహర్షియొక్క ఉపదేశప్రణాళిక ఏమిటనేది మనం తెలుసుకోవాలి. లేకపోతే గ్రంథమంతా చదివేసినా సరే, విన్నా సరే, ఎటు వచ్చామో, ఎటు పోయామో, మనకు తెలియదు. అందువల్ల ఇప్పుడు వశిష్ఠమహర్షియొక్క ఉపదేశ ప్రణాళిక తెలుసుకొనే ప్రయత్నం చేద్దాం.

## 19. ఉపదేశ ప్రణాళిక

తన బోధనా ప్రణాళికలో వశిష్ఠమహర్షి పురుషప్రయత్నానికి మొట్టమొదటి స్థానం ఇచ్చాడు. అందు నిమిత్తమై ఆయన ఆరు సర్గలు కేటాయించేశాడు. "ఏదో కర్మ ప్రకారం జరిగిపోతుందిలే" అనే మాటను ఏ మాత్రం ఒప్పుకోలేదు. సామాన్యంగా లోకంలో కాస్తో కూస్తో దైవభక్తిగా, వైరాగ్యంగా వుండేవాళ్ళను చూస్తే , వాళ్ళలో చాలా మంది మట్టిముద్దల్లాగా సోమరిపోతులుగా వుంటూ వుంటారు. మోక్షం కావాలనుకొనేవాడికి అలా సోమరిపోతుగా వుండే సావకాశం ఎంతమాత్రమూ లేదని వశిష్ఠమహర్షి ఈ 6 సర్గలలోనూ నిరూపించాడు.

సరే సోమరితనం వుండరాదు, ఒప్పుకున్నాం. సాధకుడు ఏం చెయ్యాలి? వ్యాపారాలు చెయ్యాలా? యుద్ధాలు చెయ్యాలా? యజ్ఞాలు చెయ్యాలా? ఇవేవీ మోక్షానికి సూటిగా పనికొచ్చేవి కావు. సాధకుడు నిరంతరమైన చురుకుదనంతో సూటిగా ఆత్మ విచారణ చెయ్యాలి. ఇది రెండో మెట్టు. ఈ ఆత్మవిచారణ విధానాన్ని వశిష్ఠమహర్షి ఇక్కడ సంగ్రహంగా మాత్రమే ప్రతిపాదించాడు. ఎందుకలా సంగ్రహంగా చెప్పాడంటే దానికో ముఖ్య కారణం వుంది.

ఈ రోజుల్లో కూడా మనం చూస్తున్నాం. చాలా మంది చదువుకున్న వాళ్ళు–యస్. రాధాకృష్ణన్‌గారు వ్రాసినవని, వివేకానందగారు వ్రాసినవనీ, శ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీవారు వ్రాసినవి, ఇవి అవి అని లేకుండా, దొరికిన వేదాంత పుస్తకాలన్నీ తెగ చదువుతూ వుంటారు. కానీ, ఎంగిలి చేత్తో కాకిని కూడా తోలరు. అంత పీనాసిగా వుంటారు. పరమస్వార్థంగా వుంటారు. చూసేవాళ్ళకు అనిపిస్తుంది,"ఈయన ఇన్ని వేదాంత గ్రంథాలు చదువుతున్నాడు గదా, ఈయనకు ఇంకా వేదాంతం పట్టినట్లు లేదేమని?" నిజమే, ఆయనకేమీ వేదాంతం పట్టలేదు. ఎందుకంటే, వేదాంతం వంట పట్టాలంటే ముఖ్యంగా కావలసింది గ్రంథాలు చదవటం కాదు. చదవటం కన్నా ముఖ్యమైనవి 4 మెట్లు వున్నాయి. వాటిని వశిష్ఠమహర్షి తన బోధనా ప్రణాళికలో 2 వ మెట్టుగా స్వీకరించాడు. ఆ నాలుగు అంశాలు ఏమంటే,

1. **శమము**
2. **ఆత్మవిచారణము**
3. **సంతోషము**
4. **సత్సంగము**

ఇవి నాలుగూ కలిసినప్పుడు ఆత్మ విచారణ ఫలవంతం అవుతుంది. ఈ మిగిలిన అంశాలకు కూడా ప్రాధాన్యం ఇచ్చేందుకే వశిష్ఠమహర్షి ఇక్కడ ఆత్మ విచారణను సంగ్రహంగా ప్రతిపాదించాడు.

ఈ నాలుగింటిలో **శమము** అంటే – శాంతిని కలిగించే గుణము. **ఆత్మవిచారణ** అంటే – ఆత్మతత్త్వాన్ని మననం చేసుకోవటం. **సంతోషము** అంటే – వెనుక జన్మల కర్మలవల్ల వచ్చిన ఐహికములైన కష్టసుఖాలను సంతోషంగా స్వీకరించటం. అంటే కష్టాలొస్తే పోవాలనే ఆరాటము, సుఖాలొస్తే మళ్ళీమళ్ళీ ఇలాంటి సుఖాలే కావాలనే ఆరాటమూ, ఈ రెండు ఆరాటలూ లేకుండా వుండాలి. ఇదే సంతోషం. ఇక **సత్సంగం** అంటే – సద్గురువులను, సత్పురుషులను ఆశ్రయించడం. అలా రెండవ మెట్టులో ఆత్మవిచారం అనేది ఒక అంశంగా వశిష్ఠమహర్షి పెట్టాడు.

ఆత్మవిచారణ చేసేటప్పుడు ఆ విధానంలో అనేక దృష్టాంతాలను ఆలోచించవలసి వుంటుంది. అందుచేత దృష్టాంతం అన్నది ఏలా వుండాలి? దాన్ని ఎలా అర్థం చేసుకోవాలి, అనే విషయాన్ని తన బోధనా

ప్రణాళికలో 3వ మెట్టుగా ఆ మహర్షి స్వీకరించాడు. ఈ 3 మెట్ల మధ్యలోనే తను చెప్పబోయే గ్రంథంలో ఎన్ని శ్లోకాలు వుంటాయో, ఎన్ని అధ్యాయాలు వుంటాయో, ఆ సంఖ్యను కూడా వాల్మీకిమహర్షి ఇక్కడ వశిష్ఠమహర్షి నోటి ద్వారానే చెప్పించేశాడు.

ఇలా ప్రణాళికాబద్ధంగా ఈ బోధనంతా చేసిన తరువాత చివరిలో వశిష్ఠమహర్షి ఈ బోధకు ఫలితమేమిటో అందంగా చెప్పాడు.

**దేహాత్మ జ్ఞానవత్ జ్ఞానం దేహాత్మ జ్ఞాన బాధకం।**
**ఆత్మన్యేవ భవేద్యస్య స నేచ్ఛన్నపి ముచ్యతే॥**

(ము.వ్య.ప్ర.స.20,శ్లో.15 దగ్గర వ్యాఖ్యానంలో)– అన్నాడాయన.

ప్రతివాడికి ఈ దేహం నేనే అనే జ్ఞానం గట్టిగా వుంది. వశిష్ఠమహర్షి చెప్పినరీతిలో 3 మెట్లుగా ఆత్మవిచారణ చేస్తే, వాడికి దేహమే నేను అనే ఆలోచన పోతుంది. పరమాత్మనే నేను అనే జ్ఞానం కలుగుతుంది. పూర్వం దేహమే నేను అనే జ్ఞానం ఎంత బలంగా వుండేదో, ఇప్పుడు పరమాత్మనే నేను అనే జ్ఞానం అంత బలంగా ఏర్పడుతుంది. అలా ఏర్పడితే వాడు వద్దన్నా ముక్తి పొందుతాడు – అని వశిష్ఠమహర్షి చెప్పాడు. అలాంటి లక్ష్యంతో ఆయన శ్రీరాముడికి చేసిన ముముక్షు వ్యవహారోపదేశాన్ని మనం ఇప్పుడు ఒక్కొక్క మెట్టుగా పరిశీలిద్దాం.

## 20. పురుష ప్రయత్నం

వశిష్ఠమహర్షి ప్రణాళికలో మొదటి మెట్టు పురుషప్రయత్న స్థాపన. దాని గురించి ఆయన ఈ విధంగా ప్రారంభించాడు. "శ్రీరామా! ఊళ్ళో ఒకడు మంచి ఉద్యానవనం పెంచాడనీ, దానిలో రంగు రంగుల పూల మొక్కలు తీర్చి దిద్దాడనీ తెలిసింది. దాని గురించి విని చూడాలని నువ్వు వెళ్ళావు. కానీ, ఆ వెళ్ళడం అమావాస్యనాడు అర్ధరాత్రి వెళ్ళావు. నీకా అందాలేమైనా కనిపిస్తాయా? రంగు రంగుల పూల అందాలను చూడాలనే కోరిక నీకు వుంటే, నీవు పగటి పూట పోవాలి. అంతే గానీ, రాత్రి పూట వెళితే ఉపయోగం లేదు. అసలు వెళ్ళకుండానే ఇంట్లో కుర్చొని "ఆ పూలు బాగున్నాయట, ఆ పూలు బాగున్నాయట" అని కలవరిస్తే అసలే లాభం లేదు.

లోకంలో ఎవడికైనా సరే, ఏదైనా ఒకటి కావాలని కోరిక వుంటే, దానికి తగిన కృషి చేయాలి. ఈ తగిన కృషికే శాస్త్రీయ ప్రయత్నం అని పేరు. రాత్రి పూట తోటకు వెళ్ళడం లాగా తగని కృషి చేస్తే దానికి అశాస్త్రీయ ప్రయత్నం అని పేరు. కాబట్టి లోకంలో ఎవడైనా సరే శాస్త్రీయమైన కృషి చేస్తే సత్ఫలితాన్ని పొందుతాడు. అశాస్త్రీయమైన కృషి చేస్తే శ్రమే మిగులుతుంది కానీ, ఫలితం దక్కదు. ఏ కృషీ లేకుండా కూర్చుంటే ఏ ఫలమూ వుండదు. ఇది లోకంలో వున్న నియమం. లౌకిక విషయాల్లోనే కాదు, పారలౌకిక విషయాల్లోనూ ఇది ఇంతే. ఈ నియమానికి తిరుగు లేదు.

## 21. విధి అంటే కర్మే

కానీ, లోకంలో కొంతమంది "ప్రతిదీ దైవం ప్రకారమే జరిగిపోతూ వుంటుంది. విధి ఆడించినట్లు ఆడేవాళ్ళమే మనమంతా. మనుషులంతా దేవుడి చేతిలో కీలు బొమ్మల"ని ఇలాంటి మాటలు మాట్లాడుతూ

వుంటారు. అలా మాట్లాడేటప్పుడు వారి వుద్దేశ్యమేమంటే, మానవులు ఎంత ప్రయత్నం చేసినా ఏమీ లాభం లేదనీ, దైవం అనబడే రౌడీ ఒకడు ఆకాశంలో కూర్చుని, వాడికి తిక్క పుట్టినట్టుగా, వాడి ఇష్టానుసారంగా, కష్టసుఖాలు మన నెత్తిన రుద్దుతూ వుంటాడనీ. కానీ, కొంచెం జాగ్రత్తగా గమనిస్తే అలా మాట్లాడేవాడి జీవితంలోనే మనకు కొన్ని సన్నివేశాలు కనిపిస్తాయి. ఏమంటే, అనుకోని పెద్ద కష్టం వాడి నెత్తిన వచ్చి పడితే వాడు ఏడుస్తూ "నా కొడుకు పెద్ద ధనవంతుడై నన్ను పోషిస్తాడనూకున్నాను, నా కర్మ ఇలా కాలింది" అని శోకాలు పెడుతూ వుంటాడు.

దీనిని బట్టి, నా కర్మ అన్నా, దైవం అన్నా, విధి అన్నా, ఇలాంటి మాటలన్నీ ఒకటే అని మనకు అర్థం అవుతోంది. వాడు "నా కర్మ" అన్నాడు. ఏమిటి కర్మ? వాడు పూర్వజన్మలో చేసుకున్న కర్మ అన్నమాట. ఇప్పుడు వాడు సరదా కోసమో, తన గొప్పతనం చూపించుకోవడం కోసమో, నిప్పురవ్వను చేత్తో పట్టుకున్నాడనుకోండి. వాడి చెయ్యి కొంచెంగా కాలింది అనుకోండి. అప్పుడు వాడు నా కర్మ అనడు. ప్రత్యక్షంగా చేసిన పనికి ప్రత్యక్షంగా ఫలితం కనిపిస్తే, దాన్ని వాడు నా కర్మ అనడు. అన్నం తింటే ఆకలి పోయిందనుకోండి. నా కర్మ అనడు. పూర్మజన్మలో ఎప్పుడో చేసుకొన్న కర్మని వాడు "నా కర్మ" అని పిలుస్తాడు.

కనుక, ఓ రామా! ప్రతివాడూ నా కర్మ అని పిలిచేది, దైవం అని, విధి అని, పిలిచేది ఒకటే, కాకపోతే ఇప్పుడు ప్రస్తుతం చేస్తున్న కర్మనీ– "కర్మ" అనే అనాలి, పాతజన్మలో జరిగిన కర్మనీ– "కర్మ" అనే పిలవాలి. ఇది కొంచెం గందరగోళంగా వుంది. కనుక, పాత కర్మకు విధి, అని పేరు పెట్టాడు. కానీ, కొంతకాలం అయిన తరువాత, ఈ పేరు పెట్టాననే విషయం మరచిపోయి, విధి అనే దాదా ఒకడు ఆకాశంలో వున్నాడని వాడే భ్రాంతిలో పడుతున్నాడు. ఇదీ లోకం తీరు.

## 22. పురుషప్రయత్నంలో రకాలు

కనుక, రామా! సరీగా పరిశీలించి చూస్తే, పూర్వం చేసుకున్న కర్మ, ఇప్పుడు చేస్తున్న కర్మ, అని రెండు రకాల కర్మే వుంది తప్పితే, విధి అనేది లేనే లేదు. అది పేరు మాత్రమే. ఎప్పుడైనా సరే, నీ కర్మతో నువ్వే ఫలితాలు సాధించాలి. ఈ నియమానికి తిరుగులేదు. నువ్వు చేసే పని వుందే, దానికి మరో పేరు పురుషప్రయత్నం. దానికే మరో పేరు పురుషకారం. మరో పేరు పురుషార్థం. మరోపేరు పౌరుషం. పౌరుషం అంటే మగతనం అని పిలుస్తున్నారు. కానీ, పౌరుషం అనే పదానికి శాస్త్రీయమైన అర్థం పురుషప్రయత్నం అనే.

రామా! ఈ పురుషప్రయత్నం రెండు రకాలు.

1. ఉచ్ఛాస్త్ర పురుషప్రయత్నం 2. శాస్త్రిత పురుషప్రయత్నం.

**ఉచ్ఛాస్త్రం శాస్త్రితం చేతి ద్వివిధం పౌరుషం స్మృతం।**
**తత్రోచ్ఛాస్త్ర మనర్థాయ పరమార్థాయ శాస్త్రితమ్॥** (ము.వ్యప్ర.స.5, శ్లో. 4)

ఉచ్ఛాస్త్ర పురుషప్రయత్నం అంటే – నియమ నిబంధనలు లేకుండా, రాత్రిపూట తోటకు వెళ్ళటం లాంటి పని. దీనివల్ల ఫలితం లేని శ్రమ మిగులుతుంది. అక్కడితో ఆగినా పరవాలేదు. ఒక్కొక్క సారి ప్రాణాంతకమైన ప్రమాదాలు నెత్తిన బడుతూ వుంటాయి. ఒకడికి నది దాటాలనిపించింది. దగ్గరలో వంతెన లేదు. వాడికి ఈత రాదు. అయినా సరే నదిలోకి దూకాడనుకోండి. అది **"ఉచ్ఛాస్త్ర పురుషప్రయత్నం"** అవుతుంది. అలాంటి ప్రయత్నాన్ని ఎవడూ చేయకూడదు.

ఇక శాస్త్రిత పురుష ప్రయత్నం అంటే, ఏ ఫలితం కావాలంటే ఏ పని ఎట్లా చెయ్యాలో, ఆ వివరాలన్నీ శాస్త్రాల్లో వుంటాయి. ఆ శాస్త్రాల ప్రకారంగా చేసే పనిని **"శాస్త్రిత పురుష ప్రయత్నం"** అంటారు. పరమ పురుషార్థం విషయంలో కూడా శాస్త్రిత పురుషప్రయత్నమే అనుకొన్న ఫలితాన్ని సాధించగలదు.

## 23. పాత కర్మ - కొత్త కర్మ

శ్రీరామా! ఇందాక కర్మ గురించి చెప్పుకొంటూ, ఇప్పుడు చేసే కర్మ, వెనుక జన్మలో చేసిన కర్మ, అని రెండు రకాల కర్మల గూర్చి చెప్పుకున్నాం. ఒక్కొక్కప్పుడు ఆ రెండు కర్మలూ ఒకదానికొకటి అనుకూలంగా వుంటాయి. ఒకడు మంచి కుటుంబంలో పుట్టాడు. వాడ్ణి మంచి బడిలో వేశారు. వాడు ఇప్పుడు మంచి చదువు చదువుతున్నాడు. వాడు వెనుకటి జన్మలో కూడా మంచి విద్యకు అనుకూలమైన కర్మ చేశాడు. అప్పుడు పాత కర్మ, కొత్త కర్మ రెండూ ఒకదానికి ఒకటి అనుకూలమై, వాడు ఈ జన్మలో సులభంగా మంచి పండితుడవుతాడు.

ఒక్కొక్కప్పుడు పాత కర్మ, కొత్త కర్మ, ఒకదానికొకటి ఎదురుపడి పొట్టేళ్ళు కొట్టుకున్నట్టు కొట్టుకుంటాయి. పై ఉదాహరణలోనే, వాడిప్పుడు మంచి పాఠశాల్లో చదువుకుంటున్నాడు. కానీ, పూర్వజన్మలో వాడు పాఠశాలలు తగులబెట్టి, పుస్తకాలు తగులబెట్టి, అరాచకాలు చేసి వున్నాడు. ఆ కర్మ వాడికిప్పుడు విద్య రాకుండా అడ్డుపడుతూ వుంటుంది. చదవటం అనే కర్మ – అనగా మంచి పాఠశాలలో చదవటం అనే కర్మ – వాడికి చదువు వచ్చేటట్టు కృషి చేస్తూ వుంటుంది. ఇప్పుడు పాత కర్మ, కొత్త కర్మ, ఒకదానికొకటి విరోధులై కుస్తీ పడుతూ వుంటాయి. పోట్టేళ్ళ పోట్లాటలో ఏ పొట్టేలుకు బలం వుంటే అది గెలుస్తుంది. అలాగే ఒక్కొక్కసారి పాత కర్మే జయిస్తుంది. ఒక్కొక్కసారి కొత్త కర్మే జయిస్తుంది. ఒక్కొక్కసారి రెండూ సమబలంతో వుండి. ప్రత్యేక ఫలితమేదీ కనిపించకుండా వుంటుంది. లోకంలో శాస్త్రం ప్రకారం నియమబద్ధంగా జీవించేవాళ్లకు కూడా రోగాలు మొదలైన కష్టాలు వస్తూనే వుంటాయు. అంటే అక్కడ వెనుకటి కర్మ బలంగా వుండి జయిస్తోందన్నమాట.

ఈ విషయం మనం తెలుసుకోవడంవల్ల మనకు వచ్చిన ప్రయోజనమేమిటి? వెనుకటి కర్మ బలంగా వుంటే కర్మ జయిస్తుంది. బలం తక్కువగా వుంటే ఓడిపోతుంది. ఈ మాట తెలుసుకున్నా ఒకటే, తెలుసుకోకపోయినా ఒకటే. ఇది నాకు చెప్పి ప్రయోజనమేమిటి – అంటావేమో? మేము ఆ మాట ఒక్కటే చెప్పి ఊరుకోలేదు. ఇప్పటి కర్మ బలంగా వుంటే, ఇదే జయిస్తుంది అని కూడా చెప్పాం. ఇది ముఖ్యమైన మాట. సాధకుడు దీన్ని పట్టుకోవాలి. వాడు పట్టుబట్టి తీవ్రతరమైన పురుషప్రయత్నం చేసి, అనర్థాలు కలిగించే పాతకర్మను పటాపంచలు చెయ్యాలి. సాధకుడు అలా చెయ్యగలడు. అందుకే మేము నీకు ఈ మాట ఉపదేశిస్తున్నాం.

ఇప్పటి పురుషప్రయత్నం సరిగా సాగకుండా అడ్డుపడేవి ఏమిటంటే– నీ పాతజన్మలో నీవు చేసుకున్న కర్మలే అని చెప్పాం. కొందరు దాన్ని సరిగా అర్థం చేసుకోక– "వెనుకటి కర్మలను బట్టి ఇప్పటి కర్మలు జరుగుతాయి. కాబట్టి, ఇప్పుడు కర్మలు స్వతంత్రంగా జరగమంటే జరగవు" – అనే పాడు ఆలోచనలో పడుతూ వుంటారు. దాన్ని రూపుమాపుకోవాలి. పై రకంగా మాట్లాడే వారి ఉద్దేశ్యం ఏమిటో కొంచెం విచారిద్దాం.

## 24. కొత్త కర్మే ప్రబలం

పాత కర్మా తను చేసిందే. కొత్త కర్మా తను చేస్తున్నదే. అయినా సరే పాత కర్మ గీసిన ఒరవడి ప్రకారమే కొత్త కర్మ నడుస్తుంది – అని వాడు అంటున్నాడు. అంటే కొత్త కర్మ కంటే పాత కర్మ చాలా ప్రబలమైనది – అని వాడు భావిస్తున్నాడు. ఇలా భావించడానికి వాడికి ప్రత్యేకమైన కారణం గానీ, ప్రమాణం గానీ లేదు. నిజానికైతే, ప్రత్యక్షంగా ఇప్పుడు నాకు కనిపిస్తున్న ఇప్పటి జన్మే ప్రబలం కావాలి. నీకు దురంగా వున్న శత్రువు బలంగా కొట్టగలడా? కనుక, పాత కర్మ ఎక్కువ బలం గలది అనే మాట కేవలం వాడి వూహే గానీ, సత్యం కాదు.

**ప్రాక్తనః పురుషార్థో సౌ మాం నియోజయతీతి ధీః।**

**బలాదధస్పదీకార్యా ప్రత్యక్షాదధికా న సా॥**(ము.వ్య.ప్ర.స.5,శ్లో.10)

కాబట్టి సాధకుడు మున్ముందుగా ఈ దురభిప్రాయాన్ని వదులుకోవాలి. వదులుకొని పాత కర్మ నశించేంతవరకు, విరామం లేకుండా ఇవాల్టి ప్రయత్నం కొనసాగించాలి. నిన్న రాత్రి అజీర్ణం చేసింది. తేల్లవారేటప్పటికల్లా కడుపంతా ఉబ్బరంగా వుంది. నొప్పి కూడా మొదలైంది. ఇవాళ మనం ఏం చెయ్యాలి? లంకణమే చెయ్యాలి. ఆ లంకణం కూడా ఎలా చెయ్యాలి? వైద్యశాస్త్రం చెప్పిన విధంగా చెయ్యాలి. ఇదే రీతిగా ఆధ్యాత్మిక విషయం కూడా. "నాకు విఘ్నాలు వస్తున్నాయి. నేను ఇంద్రియ నిగ్రహం చేయలేక పోతున్నాను, ఇది నా కర్మ" అని సాధకుడు ఎప్పుడూ అనుకోరాదు, అనరాదు.

ఇక సాధకులలో వున్న మరొక లోపం ఏమిటంటే, తనకంటే సోమరిపోతులతో తనను పోల్చుకోవటం. ఇది ఎంత మాత్రమూ తగదు. సాధకుడు ఎలా వుండాలంటే, బోనులో పెట్టిన సింహం లాగా వుండాలి. వాడి చుట్టూ వుండే విఘ్నాలే వాడికి బోను. సింహం అనుక్షణమూ బోనులోనుంచి బయటపడాలని ప్రయత్నం చేస్తూనే వుంటుంది. అలా మరణించే దాకా ప్రయత్నం చేస్తూనే వుంటుంది. అలాగే సాధకుడు కూడా చివరి శ్వాస వదిలే వరకూ, ఈ సంసారకూపంనుంచి బయటపడడానికి ప్రయత్నం చేస్తూనే వుండాలి. అదే సాధన.

## 25. సాధన

సాధన అంటే ఏమిటి? చెబుతాను విను. వాడు ప్రతిరోజూ కూడా ఈ శరీరం నశించిపోయేదే అని గుర్తు చేసుకొంటూ వుండాలి. తెలివి తక్కువ తనాన్ని దగ్గరకు రానీయ కూడదు. సత్పురుషులతోనే స్నేహం చెయ్యాలి. మంచి గ్రంథాలే చదవాలి. వాడికి సంసారం వుంటుంది, పిల్లలు వుంటారు. కథంతా నడుస్తూనే వుంటుంది. కానీ, ఆ సూఖాలే సర్వస్వం అని వొళ్ళు మరచి పోకూడదు. ఇదే సాధన.

మనం ఇందాకటినుంచీ అనేక రకాల యుక్తులు ఉపయోగించి, విధి అనేది వేరే లేదనీ, నీ పాత కర్మ అనీ, నిరూపించుకున్నాం. ప్రస్తుత కర్మ అంటే పాత కర్మ బలవత్తరం, అనే మాట కూడా ఊహాగానమే తప్పితే సత్యం కాదని నిరూపించుకొన్నాం. వేదం కూడా ఈ మాటే చెబుతోంది. అందుకే ప్రతిచోటా కూడా ప్రాయశ్చిత్తాలు ఇలా వుంటాయి అని చెప్పింది. ఇలా యుక్తిని బట్టి, శ్రుతిని బట్టి, కూడా పురుష ప్రయత్నమే తప్పితే, విధి అనేది లేనే లేదని ఎంత చెప్పినా, కొందరికి విధి మీద నమ్మకం పోదు.

వాళ్ళు ఎటువంటివాళ్ళంటే ఒకానొక మహామేధావిగారికి, ఒక రోజున నిద్ర మెలకువ వచ్చేసరికి, తనకు రెండుప్రక్కలా రెండు పాములు పడుకొని కనిపించాయట. ఆ మేధావిగారు 'పాములు పాములు' అని

అరుస్తూ పరుగు లంకించుకొన్నాడట. ఆ పాములు అయన్ను వదిలిపెట్టకుండా వెంటబడుతున్నాయట. ఆయన అరుపులు విని, వీధిలోవారు ఆయన్ను పట్టుకుని ఆపి 'పాములెక్కడ్రా' అని అడిగారట. ఇవిగో అని చూపించాడట. "ఓరి, నీ మొహం మండా! అవి నీ చేతులురా" అన్నారట వాళ్ళు. "ఛీ ఛీ ఇంత పొడుగ్గా వుంటే, చివరిలో పడగ ఇంత వెడల్పుగా వుంటే, అవి నాచేతులంటారేమిటి? మీకేమైనా మతిపోయిందా?" అని ఆ మేధావిగారు దబాయించారట! దైవం వుందని నమ్మే మేధావులు కూడా ఇలాంటి మేధావులే. విజయలక్ష్మి అలాంటి వారి చుట్టు ప్రక్కలకు కూడా రాదు. వాళ్ళ మొహం చూస్తేనే పారిపోతుంది.

కనుక, ఓ శ్రీరామా! సాధకుడు తన పురుషప్రయత్నంచేత, సాధన చతుష్టయ సంపత్తిని సాధించాలి. ఇక్కడ వాల్మీకి మహర్షి, సాధన చతుష్టయ సంపత్తి అనే మాటను వుపయోగించ లేదు. కానీ, వివేకము, శాస్త్రవిచారం, సత్సాంగత్యం అనే పదాలను మాత్రము వినియోగించాడు. ఈ సందర్భంలో ఆ మహర్షి సాధన చతుష్టయ సంపత్తిని మనస్సులో పెట్టుకునే, ఆ శ్లోకాలను రచించాడని మనకు అర్ధమవుతుంది. అందువల్ల మూలగ్రంథంలో లేకపోయినా, సాధన చతుష్టయ సంపత్తి అంటే ఏమిటో మనం ఇక్కడ తెలుసుకుందాం. సాధన చతుష్టయం గురించి, వైరాగ్య ప్రకరణంలో శ్రీరామ వైరాగ్య సందర్భంగా ప్రసక్తి వచ్చింది. కానీ, మనం అప్పుడా పదాలను వివరించుకోలేదు. ఇక్కడ వివరించుకొందాం.

## 26. సాధన చతుష్టయం

సంగీత సాధన చెయ్యాలనుకొంటే, రాగాల పేర్లు బట్టీపడితే చాలదు. త్రిస్థానాలను పలికే గొంతును సాధించాలి, ముందు. అలాగే, ఆత్మవిద్యలో (వేదాంత విద్యలో) గూడా అనుభవం రావాలంటే, కొన్ని యోగ్యతలను ముందుగా సంపాదించాలి. శాస్త్రపరిభాషలో యీ యోగ్యతను అధికారం అని పిలుస్తారు. ఆ యోగ్యత గలవారు 'అధికారి' . ఆత్మవిద్యలో అడుగు పెట్టటానికి యోగ్యతను కలిగించే అధికారంలో నాలుగు మెట్లున్నాయి. అందుకే దీన్ని **సాధన చతుష్టయం** అంటారు. చతుష్టయం అంటే నాలుగు.

1. **నిత్యానిత్య వస్తు వివేకము**
2. **ఇహాముత్ర ఫలభోగ విరాగము**
3. **శమదమాది షట్కసంపత్తి**
4. **ముముక్షుత్వము** – అనేవే ఆ నాలుగు మెట్లు.

ఒక్కొక్కదాని అర్థం తెలుసుకొందాం.

### 1. నిత్యానిత్య వస్తు వివేకము

ప్రపంచంలో నిత్య వస్తువేది? అనిత్య వస్తువేది? – అనే వివేకమే 'నిత్యానిత్య వస్తువివేకం.' వివేకం అంటే విమర్శవల్ల వచ్చిన జ్ఞానం. మామూలు లోకవ్యవహారంలో మనం బ్రతికి వున్నంత కాలమూ స్థిరంగా వుండే వాటిని నిత్యవస్తువుల కింద భావిస్తూ వుంటాము. కొన్ని వస్తువులు కొంత కాలం పోయినాక నశించిపోతాయని తెలిసినా కూడా, అవి వున్నంత కాలమూ వాటిమీద ప్రేమతో వ్యవహరిస్తాం. అవి కావాలని ఆరాటపడతాము. ఉదాహరణకు తలలో పెట్టుకొనే పువ్వు సాయంకాలానికి వాడిపోతుందని తెలుసు. అయినా దాన్ని చూచి మోహపడుతూనే వుంటాం.

ఒక వస్తువు కొంత కాలం వుండి, తరువాత అంతరించిపోతే, అది వున్నంత కాలమూ, దాని ఉనికి నిజమైన ఉనికే గదా! అని మనం భావిస్తూ వుంటాము. కనిపించింది కనుక, కనిపించిన సమయంలో దాని ఉనికి సత్యమే, అని వాదిస్తాం. ఇలా వాదించే మనమే కలలో కనిపించిన నిధి, సత్యమైన నిధి అని అంగీకరించం. అది కనిపించినప్పటికీ, దాని ఉనికి సత్యమైనది కాదు. అది కనిపిస్తూ వుండిన సమయంలో గూడా ఆ నిధికి నిజమైన ఉనికి లేదు – అని మనం ఖచ్చితంగా చెపుతాము. అంటే, మనం ఒక చోట ఒక రకంగా వాదిస్తున్నాం! మరొక చోట మరొక రకంగా వాదిస్తున్నాం. ఇది తప్పు కదా!

ఒక వస్తువు కనిపించినంత కాలం అది నిజంగా వున్నట్లేనని అంగీకరిస్తే, కలలో కనిపించిన నిధి గూడా ఆ సమయంలో సత్యమే అని అంగీకరించు. అలా అంగీకరిస్తే ఆ నిధి అక్కడికి ఎలా వచ్చింది? మళ్ళీ ఎక్కడికి పోయింది? వగైరా ప్రశ్నలకు సమాధానం దొరకదు. కనుక, ఆ నిధి ఆ సమయంలో గూడా సత్యమని అంగీకరించటం సాధ్యం కాదు. కనిపించినంత మాత్రాన సత్యం కానక్కరలేదని అంగీకరించేటట్లయితే, కొంతకాలం కనిపించి, తరువాత కనిపించకుండా పోయే ఏ వస్తువైనా సరే, అసత్యమే (లేనిదే), కనిపిస్తూ వుండిన సమయంలో గూడా లేనిదే, అని అంగీకరించాలి. తప్పదు.

అందుకనే, భూత భవిష్యద్వర్తమాన కాలాలు మూడింటిలోనూ అవిచ్ఛిన్నంగా నిలబడి వుండే వస్తువు మాత్రమే నిజంగా అస్తిత్వం వున్న వస్తువు. అదే నిత్యమైన వస్తువు – అని వేదాంతశాస్త్రం నిర్వచిస్తోంది. ఏ ఒక్క క్షణంలో అయినా అది లేనిదయితే, అది త్రికాలాలలోనూ గూడా పూర్తిగా లేనిదే– అని గూడా వేదాంతశాస్త్రం వివరిస్తోంది.

ఈ చర్చ ప్రకారం ఆలోచిస్తే, పరబ్రహ్మపదార్థం ఒక్కటే నిజమైన నిత్య వస్తువు. మనకు కలిగే ఊహకంటే, యీ జగత్తంతా అనిత్యమే అని వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, స్మృతులు మొదలైనవన్నీ ఏకకంఠంగా నిర్ణయించి చెపుతున్నాయి. ఈ జ్ఞానం మనస్సుకు పట్టటమే నిత్యానిత్య వస్తువివేకం. ఇది సాధన చతుష్టయంలో మొదటి మెట్టు.

## 2. ఇహాముత్ర ఫలభోగ విరాగం

ఇది రెండవ మెట్టు. పేరు పెద్దదే కాని, దీని సారాంశం వైరాగ్యం. దేనిపట్ల వైరాగ్యం? ఈ లోకసుఖాల పట్ల, పరలోక సుఖాల పట్ల గూడా వైరాగ్యం! వైరాగ్యమంటే యేమిటి? కోరిక లేకపోవటమే వైరాగ్యం. కోరిక ఎందుకు కలుగుతుంది? ఏదైనా వస్తువును చూచినప్పుడు కానీ, దాన్ని గురించి విన్నప్పుడు కానీ, “ఇది సత్యమైనది. దీనివల్ల నాకు లాభం కలుగుతుంది” అని విశ్వాసం ఏర్పడితే, దానిమీద ప్రేమే కలుగుతుంది.

సముద్రతీరాన వెండి ముద్ద కనిపించింది. ఎగిరి గంతువేసి దూకబోయాడు. ప్రక్కనున్న ఆప్తుడు చూసి, “ఎందుకు వురుకుతున్నావు?” అన్నాడు. వెండికోసమని వాడు చెప్పాడు. “అది వెండి కాదురా, ముత్యపు చిప్ప. ఎండలో అలా మెరుస్తోంది” అని ఆప్తుడు చెప్పాడు. వీడు కూడా పరిశీలించి చూశాడు. అది ముత్యపు చిప్పే! కానీ, వెండి లాగా కనిపిస్తోంది. ఇక వీడికి ఈ వెండిమీద రాగం (కోరిక) వుంటుందా? వుండదు. ఎందువల్ల? కనిపించకనా? కాదు. కనిపిస్తోంది. కనిపించినా, అది అసత్యమని అర్థమయింది. కనుక, ఇక దానిమీద కోరిక వుండదు. ఇదే వైరాగ్యం! ఈ వైరాగ్యానికి కారణమేమిటి? ఆ కనిపిస్తూ వున్న వెండి నిజం కాదని జ్ఞానం కలగటమే!

మరో అంశం కూడా వుంది. ఒక మంచి కుర్రవాడు వచ్చి నీకో మామిడి పండు ఇవ్వజూపాడు. నువ్వు అంగీకరించి తీసుకోబోతున్నావు. ఇంతలో " ఆ మామిడిపండులో బాంబు వుందనీ, నీ శత్రువులు ఆ కుర్రవాడికి యిచ్చి పంపారనీ" ఫోను వచ్చింది. ఇక నీకు ఆ పిల్లవాడు కానీ, మామిడి పండు కానీ, ప్రియమైనవి అవుతాయా? కానేకావు. ఆ మామిడిపండు తియ్యగా వుంటుంది, అది మంచి రుచిని కలిగిస్తుంది, అని భావించినంత కాలం దాని మీద ప్రేమ వుంటుంది. దానివల్ల సుఖం రాదనీ, పైగా ప్రమాదం వస్తుందనీ, తెలిసినపుడు, ఇక ప్రేమ వుండదు. ఇదే వైరాగ్యం. ఈ వైరాగ్యానికి కారణమేమిటి? వస్తువువల్ల లాభం రాదని తెలియటమే. ఈ దృశ్యప్రపంచంలో కనిపించే వస్తువులు, వాటివల్ల కలిగే భోగాలు, అన్నీ కూడా ఆ వెండి లాగానే అసత్యాలనీ, ఈ మామిడిపండు లాగానే ప్రమాదకరాలనీ, మనకు జ్ఞానం కలిగినపుడు నిజమైన వైరాగ్యం కలుగుతుంది.

ఫలభోగాలు రెండురకాలు.

1. ఇహలోక ఫలభోగాలు.
2. పరలోక (అముత్ర) ఫలభోగాలు.

ఈ లోకంలో వచ్చే ఫలాలు, వాటి భోగాలు కూడా మనం చేసే కృషినిబట్టి లభిస్తాయి. బాగా శ్రమించి పొలంమీద పనిచేస్తే, ఎక్కువ బస్తాల ధాన్యం వస్తుంది. వచ్చిన ఈ ఫలం కొన్నాళ్ళు అనిభవించేసరికి అయిపోతుంది. మళ్ళీ శ్రమించి సంపాదించుకోవాలి. పరలోక సుఖాలు కూడా, మనం శ్రమించి సంపాదించుకొనే పుణ్యఫలాల మీద ఆధారపడి వుంటాయి. బాగా శ్రమిస్తే స్వర్గలోక ఫలితాలు అందుతాయి. ఇంకా, ఇంకా శ్రమిస్తే బ్రహ్మలోక, వైకుంఠ, కైలాసాది ఫలితాలు లభిస్తాయి. ఇవి కూడా, ధాన్యపు బస్తాల లాగానే, మన శ్రమకు ఫలితాలే కనుక, అనుభవించగా అనుభవించగా ఒక నాటికి అయిపోక తప్పదు.

ధాన్యపు బస్తాల విషయంలో అయితే, అవి వుండగానే ఒక ప్రక్క కొంచెం అనుభవిస్తూ. మరొక ప్రక్క కొంచెం శ్రమిస్తూ, ప్రోగు చేసుకొనేందుకు వీలు వుంది. పరలోక ఫలాల విషయంలో ఈ వీలు లేదు. ఆ పుణ్యాలను అనుభవించే కాలంలో మళ్ళీ పుణ్యాలను చేసుకొనే వీలు లేదు. కనుక, పూర్తిగా అనుభవించేసి, దివాళీ తీసి, భూమికి వచ్చి, మళ్ళీ పుణ్యం కోసం ప్రయత్నించవలసిందే. అందువల్ల ఈ పరలోక ఫలాలు, అశాశ్వతాలు మాత్రమే కాక, మనకు మరింత చిక్కులు తెచ్చి పెట్టే స్వభావం కలవి. ఈ జ్ఞానం కలిగిన నాడు, ఇహలోక సుఖాల మీదా, పరలోక సుఖాల మీదా కూడా విరక్తి పుట్టుకొస్తుంది. ఎంత తీవ్రంగా పుట్టాలంటే నీకు బ్రహ్మపదవి ఇస్తారయ్యా అంటే, కుక్కవాంతిని చూసినట్లు అసహ్యించుకొని అవతలకు పోవాలి. కడుపు బాగా నిండినప్పుడు లడ్డు వద్దని పక్కన పెట్టడం వైరాగ్యం కాదు. పైన చెప్పినట్టుగా తీవ్రమైన ఇచ్ఛారాహిత్యం కలగటమే నిజమైన వైరాగ్యం. ఇదే ఇహాముత్ర ఫలభోగ విరాగం.

## 3. శమదమాది షట్క సంపత్తి

అలాగే శమము మొదలైన ఆరు అంశములను కలిగి వుండుట. అవి–

1. శమము
2. దమము
3. ఉపరతి

4. తితిక్షా
5. శ్రద్ధా
6. సమాధానములు

ఇవి సిద్ధించటమే శమాది షట్క సంపత్తి. దీనినే శమదమాది షట్కసంపత్తి అని కూడా వ్యవహరిస్తూ వుంటారు. ఇప్పుడు ఈ ఆరు అంశాలను విడివిడిగా తెలుసుకొందాం.

**1. శమము**

శమము అనగా అంతరింద్రియ నిగ్రహం. అంతరింద్రియం అంటే మనస్సు. మనస్సులోకి పూర్వజన్మ వాసనవల్ల అనేకరకాల ఆలోచనలు వస్తూ వుంటాయి. మనస్తత్వ శాస్త్రప్రకారం ఈ మనస్సుకు మంచి చెడ్డలతో పని లేదు. అన్ని రకాల ఊహలనూ చేస్తూనే వుంటుంది. ఈ ఆలోచనా ప్రవాహాన్ని మనోబలంచేతనే అరికట్టడం పేరు శమం. పూర్వజన్మ వాసనవల్ల వచ్చే ఆలోచనా పరంపరను నిర్లక్ష్యం చేసి, తను భావించదలచుకున్న మంచి విషయానికి సంబంధించిన భావనా పరంపరనే నిలబెట్టుకోవటమే శమమని తాత్పర్యం. మనోబలం తీవ్రంగా వున్నవారు సంకల్పబలంచేతనే దీనిని సాధించవచ్చును. ఇతరులు దమం ద్వారా దీనిని సాధించాలి.

**2. దమము**

దమమంటే బహిరింద్రియ నిగ్రహం. బహిరింద్రియాలు పది. వాటిలో జ్ఞానేంద్రియాలు ఐదు, కర్మేంద్రియాలు ఐదు. పూర్వజన్మ వాసనవల్ల మనసులోకి కోరికలు ప్రవేశించినపుడు బాహ్యేంద్రియాలు ఆయా కోరికలు తీర్చుకొనే పనులను ప్రారంభిస్తాయి. వీటిలో చెడు పనులేవో శాస్త్రం ద్వారా తెలుసుకొని, మనసు వాటిని కోరుతున్నా సరే, ఇంద్రియాలు ఆ పనిని చేయకుండా నిరోధించటమే దమము. ఈ నిరోధం కూడా మనోబలం ద్వారానే జరగాలి.

అయితే మనస్సులోని సంకల్పాలను సరాసరి నిగ్రహించే దానికన్నా, బయట ఇంద్రియాలను నిగ్రహించటానికి తక్కువ మనోబలం సరిపోతుంది. సరైన శ్రద్ధతో దమాన్ని అభ్యాసం చేస్తే, మనోబలం పెరిగి శమం సులభంగా సిద్ధిస్తుంది.

అలా కాక వంచన కోసమో, డాంబికం కోసమో, దమాన్ని అభ్యసిస్తే, సమయం చూసుకొని మనసులోని సంకల్పాలు పెట్రేగి, శమం పూర్తిగా దూరమై, దమం కూడా ధ్వంసమైపోతుంది. కనుక, దమాన్ని నిజాయితీతో, శ్రద్ధా విశ్వాసాలతో, సాధన చేయటం చాలా అవసరం.

**3. ఉపరతి**

ఉపరతి అంటే విరమించుకోవటం. లోకంలో శబ్దాలు, రూపాలు మొదలైనవి మనసును ఆకర్షించి బంధిస్తూ వుంటాయి. ఆ కనిపించే వస్తువులలో ఏదో గొప్పదనం వుందని విశ్వాసం కలగడంవల్ల, వాటి ఆకర్షణలో పడతాం మనం. వివేకజ్ఞానంవల్ల వాటిలో మనమనుకొన్న గొప్పదనం లేకపోగా, అవి శాశ్వతాలు కావని, పైగా వాటి అనుభవంవల్ల చివరిలో మనకు దుఃఖమే కలుగుతుందని, ఈ రకంగా వాటిలోగల దోషాన్ని దర్శించటం అభ్యాసం చేసుకొన్నకొద్దీ, వాటికి గల అకర్షణ శక్తి సన్నగిల్లి, ఇంద్రియాలు వాటివైపు పరిగెత్తటం విరమించుకొంటాయి. ఇలా విరమించుకోవటమే ఉపరతి.

వివేకంవల్ల కలిగిన ఉపరతి ద్వారా దమాన్ని సాధించినపుడు అది శమానికి దారి తీస్తుంది. అలా కాక భయంవల్ల కానీ, కాసేపు దీనిని నిగ్రహించుకుంటే గొప్ప లాభం వస్తుందని కానీ, దమాన్ని సాధించినట్లైతే అది మొదటికే మోసాన్నితెస్తుంది. ఉదాహరణకు పట్టుబడితే తంతారని భయపడి దొంగతనం

మానినవాడు, దుర్బలుల దగ్గర దొంగతనం చేయనే చేస్తాడు. బ్రహ్మ ప్రత్యక్షం కావాలని గొప్ప ఇంద్రియనిగ్రహంతో తపస్సు చేసిన రాక్షసులు, వరాలు పొందాక ఘోరంగా వ్యవహరించారు. కనుక, వివేకం ద్వారా ఉపరతిని, దాని ద్వారా దమాన్ని సాధించినపుడే సత్ఫలితం లభిస్తుంది.

**4.తితిక్ష**

తితిక్ష అంటే సహనం. దుఃఖాలు, శీతోష్ణాది వైషమ్యాలూ, వచ్చినపుడు, వాటికి తగిన ప్రతిక్రియను చేయాలని కోరుకోవటం జీవులకు సహజం. ఈ కోరికతోనే మానవులు పాపాలు కూడా చేస్తారు. ఎన్ని చేసినా పూర్వకర్మ ఫలం అనుభవించక తప్పదని, ఈ నాటి దుఃఖానికి వెనుకటి తన తప్పులే కారణమని, వివేకం కలిగినవాడు, అన్యాయమైన మార్గాల ద్వారా తన దుఃఖాలను పోగొట్టుకోవాలని చూడడు. ఇంకొక అడుగు ముందుకు వేసి, ఈ దృశ్యప్రపంచం అనిత్యమని, అల్పమని, అసత్యమని, గ్రహించినవాడు, ఈ లోకంలో లభించే సుఖాల లాగానే దుఃఖాలు కూడా నిస్సారమని గ్రహిస్తాడు. వాడు ఇంద్రియ సుఖాలను సంపాదించాలనే ప్రయత్నం మానినట్లే, ఇంద్రియాలవల్ల కలిగే దుఃఖాలను పోగొట్టుకోవాలనే ప్రయత్నం కూడా మానుకుంటాడు. ఇదే తితిక్ష. తితిక్ష ఉపరతికి ద్వారంగా పని చేస్తుంది.

**5. శ్రద్ధ**

శ్రద్ధ అంటే విశ్వాసం. పైన చెప్పిన నాలుగు అంశాలలోనూ ప్రతి చోటా వివేకం ద్వారా ఆ అంశం లభిస్తునట్లు మనకు అర్థమైంది కదా! ఆ వివేకం శాస్త్రవాక్యాలవల్ల కలుగుతుంది. ఆ వాక్యాలను గురువులు వివరిస్తారు. గురువుల పట్ల, శాస్త్రముల పట్ల, విశ్వాసంతో వున్నప్పుడే, ఆ భావాలు మనకు సరిగా అర్థమౌతాయి. అనుభవంలోకి కూడా వస్తాయి. కనుక, పై నాలుగు అంశాలకీ మూలమైనది శ్రద్ధ.

మనకు విభిన్న అనుభూతులు వుంటాయి. ఉదాహరణకు, ఈ దేహం నాది అని, నేనే ఈ దేహమని, రెండు అనుభూతులూ మనకే వున్నాయి. ఈ అనుభూతులను విశ్లేషించి సత్యాన్ని అన్వేషించేటప్పుడు, ఒక్కొక్కప్పుడు గురువులు, శాస్త్రాలు, మన అనుభవానికి విరుద్ధంగా మాట్లాడుతున్నట్లు కనిపిస్తూ వుంటుంది. కానీ, వారు చెప్పినట్లు విశ్వసించి పరిశీలిస్తే, మన అనుభవాలలో గల తికమకలు తొలగి, వారు చెప్పిన నిర్ణయానికే మనమూ వస్తాము. అప్పుడు సత్యజ్ఞానం కలుగుతుంది.

ఇది కలిగే ముందు విశ్లేషణ దశలోనే, గురువుల, శాస్త్రాల వాక్యాలను తిరస్కరిస్తే, మన తికమక మరింత జటిలమే అవుతుంది. కనుక, గురుశాస్త్ర వాక్యాలు సత్యాలే. నాకు కలిగే సందేహాలు సరీగా ఆలోచించక పోవటంవల్ల కలుగుతున్నాయి, అనే దృఢభావన వున్నప్పుడే సత్యజ్ఞానం సిద్ధిస్తుంది. అట్టి దృడభావన పేరే శ్రద్ధ.

**6. సమాధానం**

సమాధానం అంటే ఏకాగ్రత. లోకంలో కోరిక, భయము, మొదలైన వాటి బలంవల్ల ఏకాగ్రత ఏర్పడుతుంది. ఉదాహరణకు పరీక్షలు దగ్గరకు వస్తున్నకొద్దీ విద్యార్థికి ఏకాగ్రత పెరుగుతుంది. ఇది సమాధానం కాదు. నాయొక్క మూల స్వరూపం ఏది, ఈ జగత్తుయొక్క మూలతత్త్వమేది, అనే జిజ్ఞాసవల్ల లౌకిక విషయాల పట్ల అశ్రద్ధ ఏర్పడి, తత్త్వవస్తువుపై ప్రీతిపూర్వకమైన ఏకాగ్రత ఏర్పడుతుంది. దీని పేరే సమాధానం.

సమాధానం జన్మసంస్కారంవల్ల తనంత తానుగా మొలకెత్తుతుంది. దీనివల్ల వివేకం పెరుగుతుంది. పెరిగిన వివేకం సమాధానాన్ని మరింత పెంచుతుంది. ఈ రెంటివల్ల శ్రద్ధ పెరుగుతుంది. శ్రద్ధా సమాధానాలు

తితిక్షను, తితిక్ష ఉపరతిని, ఉపరతి దమాన్ని, దమం శమాన్ని, కలిగిస్తాయని మనం గ్రహించాలి. ఈ ఆరు అంశాలూ కలిపి శమదమాది షట్కసంపత్తి. ఇది సాధన చతుష్టయంలో మూడవ మెట్టు. నాలుగవ మెట్టు పేరు ముముక్షుత్వం.

## 4. ముముక్షుత్వము

ముముక్షుత్వము అంటే మోక్షం కావాలనే కోరిక, అని వ్యాకరణ ప్రకారం అర్థం. వేదాంతశాస్త్ర పారిభాషికంగా దీనికి మోక్షంపై తీవ్రమైన ఇచ్ఛ అని అర్థం. తీవ్రమైన అంటే ఏమిటి? అర్థరాత్రి నిద్రిస్తుండగా ఇల్లంటుకుంది అనుకోండి. మెలుకువ వచ్చిన యజమాని డబ్బును, పెళ్ళాం పిల్లల్ని, తీసుకొని బయటపడాలని ప్రయత్నిస్తాడు. ఇది సాధ్యం కానప్పుడు డబ్బును వదిలి, పెళ్ళాం పిల్లల్ని బయటకు తీసుకురావాలని ప్రయత్నిస్తాడు. కొంప పూర్తిగా కూలిపోతున్నపుడు ఇక లాభం లేదని అన్నీ వదిలేసి, అందర్నీ వదిలేసి, తను బయటపడితే చాలని ఆరాటపడతాడు. ఆ సమయంలో వేరే ఏదైనా సంపాదించు కుందామని గాని, నిలబెట్టుకుందామని గాని, ఆలోచన వుండదు. ఈ మంటల్లోంచి తను బయటపడితే చాలని ఆలోచిస్తాడు. ప్రయత్నిస్తాడు. ఇదే తీవ్రేచ్ఛ.

ఇదే రీతిగా సంసార తాపాలు పెచ్చు పెరిగినపుడు కోరికలన్నీ వదలి, పరమాత్మ తాదాత్మ్యాన్ని పొందాలని, తీవ్రంగా ఆరాటపడటం పేరు ముముక్షుత్వం (లేక) ముముక్షా.

ముముక్షుత్వం కలగాలంటే, ఇతర విషయాలమీద కోరికలు పోవాలని చెప్పుకున్నాం కదా! ఈ ఇతర కోరికలను ఏషణలు అంటారు. వీటిని మూడు రకాలుగా పెద్దలు విభజించారు.

1. దారైషణ
2. పుత్రైషణ
3. ధనైషణ

వీటినే ఏషణాత్రయం అంటారు. దారైషణ అంటే భార్యపై కోరిక. ఇది అన్ని ఇంద్రియాల కోరికలకూ సంకేతం. పుత్రైషణ అంటే పిల్లలపై కోరిక. ఇది సమస్త బంధుజన ప్రీతికీ సంకేతం. ధనైషణ అంటే డబ్బుపై కోరిక. ఇది అన్ని విధాల ఐశ్వర్య, అధికార, కీర్తులపై కోరికకూ సంకేతం. ఏషణాత్రయాన్ని పరిత్యజించి, "భగవన్! నాకీ సంసారబంధంనుంచి ముక్తి (విడుదల) ఎలా వస్తుంది? ఎప్పటికి వస్తుంది?" – అని అరాటపడటం పేరే ముముక్షుత్వం. ఇది వున్న వారికే ఆత్మవిద్యలో ప్రవేశించేందుకు అర్హత వుంటుంది. మూడవ మెట్టుగా చెప్పుకున్న శమదమాది షట్కసంపత్తికి ఫలితంగా మానవులలో ముముక్షుత్వం పరిపాక దశకు చేరుకుంటుంది.

ఇప్పటివరకూ ఆత్మవిద్యలో అడుగు పెట్టడానికి గల యోగ్యతను కలిగించే నాలుగు మెట్లను (సాధన చతుష్టయాన్ని) గూర్చి చెప్పుకున్నాం. ఈ నాలుగు మెట్లకూ గల పరస్పర సంబంధాన్ని కూడా అక్కడక్కడా ప్రస్తావించు కున్నాం. స్పష్టత కోసం ఆ సంబంధాన్ని మరో సారి చర్చించుకొందాం.

మొదటి మెట్టు నిత్యానిత్య వస్తువివేకం. ఇది పాండిత్యం గలవారికి గ్రంథ పరిచయంవల్ల తేలికగా లభిస్తూనే వుంటుంది. కానీ, వారిలో చాలా మందికి దీనివల్ల, కేవలం నిత్యానిత్య వస్తువివేకం చాలదని, దీనికి తోడుగా ఇహాముత్ర ఫలభోగ విరాగం వుండి తీరాలని, రెంటవ మెట్టు చెప్పబడింది. కొంత తపస్సాధన చేసినవారికి పై రెండూ వుంటాయి కానీ, ఏదో సందర్భంలో కోపతాపాదులు కొమ్ము విసురుతూనే వుంటాయి.

మహర్షుల కథల్లో ఇలాంటి ఘట్టాలనేకం చూశాం మనం. ఈ దశ కూడా దాటాలి. అందుకే శమదమాదిషట్క సంపత్తి అనే మూడో మెట్టు ఏర్పడింది. పై మూడు మెట్లూ వుంటే, చాలా మటుకు యోగ్యత లభించినట్లే, కానీ, ఈ దశలో కూడా కొందరు ఆలోచనా రాహిత్యంలో పడి తత్త్వచింతనకు దూరమయ్యే అవకాశం వుంది. అందుకోసం ముముక్షుత్వమనే నాలుగవ మెట్టును కూడా స్వీకరించడం జరిగింది.

శ్రీరామా! సాధకుడు నిరంతర పురుషప్రయత్నంతో ఈ సాధన చతుష్టయ సంపత్తిని సంపాదించాలి. సాధన సంపత్తిని గూర్చి ఇలా వర్ణించి చెప్పేసరికి, కొంత మందికి గండె గుభేలు మంటుంది. ఇంత పని మావల్ల అవుతుందా, అనిపిస్తుంది. కానీ, ఉపాయం తెలిసినవాడికి ఈ సాధన సంపత్తిని సాధించడం ఏమీ కష్టమైన పని కాదు. ఉపాయాన్ని పట్టుకోవాలి. అది ముఖ్యం. రత్నాల పరీక్షకుడు నానాజాతుల రాళ్ళను కలిపి వాడి ముందు పోసినా సరే, జాతి రత్నాన్ని ఇట్టే పసిగట్టేస్తాడు. ఎందుకంటే, ఆ ఉపాయం వాడికి పట్టుబడ్డది. అలాగే సాధన చతుష్టయ సంపత్తి కావాలి అనుకునేవాడు కూడా, దానికి తగిన ఉపాయాన్ని పట్టుకోవాలి.

## 27. మూడు ఉపాయాలు

ఆ ఉపాయాలేమిటంటే – **సదాచారము, సత్సాంగత్యము, సచ్ఛాస్త్రము.** ఇవే ఆ ఉపాయాలు. ఈ ఉపాయాలను పట్టుకుంటే సులభంగా సాధన సంపత్తి లభిస్తుంది. ఇక ఈ సాధన ఎంత కాలం చేస్తూవుండాలి? – అని కొందరికి భయంగా వుంటుంది. సాధన చేస్తున్నంతసేపు మాత్రమే జ్ఞానం నిలబడుతుందేమో, సాధన ఆపేస్తే ఆ జ్ఞానం జారిపోతుందేమో, అని కొంతమందికి భయం. మేము చేప్పే సాధన అటువంటిది కాదు. మా సాధన అనంతమైనది కాదు. పరిమితమైనదే. ఒక్క సారి ఆత్మసాక్షాత్కారం కలిగింది అంటే, ఇక ఏ సాధనలూ అక్కర్లేదు.

ఈ పురుషప్రయత్న సిద్ధాంతం అనేది నేనేదో కొత్తగా చెపుతున్న సిద్ధాంతం కాదు. పూర్వం నలుడనే చక్రవర్తి వుండేవాడు. ఆయనను కలి పురుషుడు ఆవేశిస్తే, ఎంత పట్టుదల బట్టి ఆ కలి పురుషుణ్ణి తనలోంచి తరిమి వేసుకున్నడో నువ్వు వినే వుంటావు. అదే పురుషప్రయత్నం అంటే. అలాగే హరిశ్చంద్ర మహారాజు కథ నువ్వు విన్నదే. ఆయన తన పట్టుదలతో సత్యాన్నే ఆశ్రయించికొని వుండి చివరికి ఇంద్రుడితో సమానమైన స్థాయికి చేరాడు.

కనుక, ఓ రామా! పురుషప్రయత్నాన్ని వదిలి పెట్టరాదు అనేది, పెద్దలంతా అంగీకరించి ఆచరించిన సిద్ధాంతమే.

రామా! తత్త్వవిద్యను సాధించటానికి కేవలం మొండితనం పనికిరాదని, ఉపాయం వుండాలని నీకు పూర్వమే చెప్పాను. సదాచారము, సత్సాంగత్యము, సచ్ఛాస్త్రము, ఈ మూడే ఆ ఉపాయమని కూడా చెప్పాను. అయితే ఈ మూడూ మనిషికి చినప్పట్నుంచే అలవాటు కావాలి. అప్పుడే అవి వాడికి ఫలిస్తాయి. అంతే గానీ, ఎప్పుడో వయసు మళ్ళిపోయినాక, అప్పటికప్పుడు సదాచారం పాటిస్తాం, సత్సాంగత్యం చేస్తామంటే, ఉపయోగం వుండదు. కొందరు ఈ సదాచారాది ఉపాయాలను చివరి నిమిషంలో ఆచరించి, దానివల్ల ఫలితం కనిపించక పోయేసరికి, విధి నాకు వ్యతిరేకంగా వుందని బాధ్యత అంతా విధి నెత్తిమీదకు తోసేస్తూ వుంటారు. అలాంటి వాళ్ళు కేవలం మూర్ఖులే.

## 28. సోమరితనం

చిన్నప్పట్నుంచి సదాచారాదులైన ఉపాయాలను పాటించక పోవటానికి మానవులలో ప్రధానకారణం సోమరితనమే. రామా! ఆధ్యాత్మిక విషయంలోనే కాదు, లౌకికవిషయాలలో కూడా మానవులకు సోమరితనమే బద్ధశత్రువు.

**ఆలస్యం యది న భవేజ్జగత్యనర్థః**
**కో న స్యాద్బహు ధనికో బహుశ్రుతో వా ।**
**ఆలస్యాదియ మవనిస్ససాగరాన్తా**
**సంపూర్ణా నరపశుభిశ్చ నిర్ధనైశ్చ ॥** (ము.వ్య.ప్ర.స. 5, శ్లో. 30)

ఓ రామా! సోమరితనమనేదే పోతే ఈ భూమిమీద వున్న ప్రజలలో ఎవడు ధనవంతుడు కాడు? ఎవడు విద్యావంతుడు కాడు? ఈ భూమి నిండా దరిద్రులు, విద్యాహీనులూ, కనిపిస్తున్నారు. ఎదుకంటే, కేవలం సోమరితనంవల్ల వీళ్ళంతా నరపశువులుగా తయారయ్యారు– అన్నాడు వశిష్ఠుడు.

వశిష్ఠుడు చాలా శాంత స్వభావుడని ప్రతీతి. అంతటివాడికి కూడా కడుపు మండిపోయి, సోమరిపోతులను గట్టిగా తిడుతున్నాడు. ఎందుకంటే, నీకు జ్ఞానం వచ్చిందా, లేదా అన్నది మొదటి ప్రశ్న కాదు. నీకు చురుకుదనం వుందా, లేదా అనేది మొదటి ప్రశ్న. చురుకుదనం వుంటే, నువ్వెందుకు డబ్బు సంపాయించలేవు? సోమరితనంలో మట్టిముద్దల్లాగా పడివున్న అధములకు వైరాగ్యం కూడా రాదు. వైరాగ్యమనేది ఎప్పుడైనా వస్తే సమర్థులైనవారికే వస్తుంది కానీ, అసమర్థుడైనవాడికి రాదు. అసమర్థులు తమ సోమరితనాన్నే వైరాగ్యంగా భావించుకొని, ఆత్మవంచన చేసుకుంటూ వుంటారు. సమర్థుడైనవాడికి వైరాగ్యం లేకపోయినా పెద్ద నష్టం లేదు. ఎందుకంటే – వాడు సత్సాంగత్యం అనేది వదిలి పెట్టకుండా పాటిస్తుంటే, ఏదో ఒక రోజున వాడి మనస్సు తత్త్వం మీదికి మళ్ళుతుంది. అలా మళ్ళితే పూర్వం వాడు ఎంత పట్టుదలగా డబ్బు సంపాయించాడో, అంత పట్టుదలగా ఇప్పుడు జ్ఞానం సంపాయిస్తాడు. కనుక, ఓ రామా! సాధకుడు సోమరితనాన్ని దగ్గరకు రానివ్వకూడదు.

పైన చెప్పిన సదాచారాదులలో, సత్సాంగత్యం – అంటే, మంచివారితో స్నేహమనేది ఇంకా ముఖ్యం. బాల్యం గడచి యౌవనంలో ఆడుగుపెడుతున్న దగ్గరనుంచి మానవుడు ఈ సత్సాంగత్యాన్ని పాటించాలి. సత్సాంగత్యం వుంటే ప్రతి విషయంలోనూ వుండే సద్గుణాలేమిటో, దుర్గుణాలేమిటో, మనిషికి అర్థమవుతుంది.

వశిష్ఠమహర్షి బోధ ఇక్కడి దాకా వచ్చేసరికి సూర్యాస్తమయం దగ్గరకు వచ్చేసింది. ఆ రోజుల్లో వేదాంత చర్చలు, ఈ రోజుల్లో లాగా, నియమాలు లేకుండా వుండేవి కావు. సంధ్యా సమయం వచ్చేసరికి సంధ్యోపాసన అనేది అందరికీ ముఖ్యం కనుక, మహర్షులు ఆ నాటికి సభ చాలించేశారు. మరునాడు అనుష్ఠానాలు పెందలాడే పూర్తిచేసుకొని, అందరూ సభకు చేరారు. వశిష్ఠమహర్షి తన ఉపదేశం కొనసాగించాడు.

## 29. విధి వుందా? లేదా?

***వశిష్ఠుడు***:– "శ్రీరామా! నిన్ననే చెప్పాను. ప్రపంచంలో విధి అనే మాటే లేదు. ఉన్నదల్లా నీ పాత కర్మా, నీ కొత్త కర్మా, రెండే. ఒకడు నిన్న పాపం చేశాడు. ఇవాళ ఆ విషయం గుర్తుపట్టాడు. వెంటనే నాలిక కరుచుకొని శాస్త్రంలో చెప్పిన ప్రాయశ్చితం చేశాడు. దాంతో నిన్నటి పాపం పోతుంది. అలాగే క్రిందటి జన్మలో చేసిన పాపకర్మకు, ఈ జన్మలో చేసిన పుణ్యకర్మ విరుగుడు.

**రాముడు**: – ఒకడు ఒక మంచి పని చేద్దామని మొదలుపెట్టాడు. ఇంతలో గిట్టనివాడు ఒకడు వచ్చి దాన్ని చెడగొట్టాడు. అనుకొన్న మంచి పని చెడిపోవడం విధిబలం కాదంటారా?

**వశిష్ఠుడు**: – రామా! ప్రత్యక్షంగా రెండు వస్తువులు కనిపిస్తున్నాయి. ఒకటి పని చేద్దా మనుకొనేవాడి పౌరుషం. రెండవది చెడగొడదా మనుకొనేవాడి పౌరుషం. వీటిలో చెడగొడదా మనేవాడి పౌరుషం ఎక్కువ బలంగా వుంది. అందువల్ల, చేద్దామనుకొనేవాడి పౌరుషం వోడిపోయింది. ఇంత ప్రత్యక్షంగా జయాపజయాలు కనిపిస్తుంటే, మధ్యలో అప్రత్యక్షంగా, ఎవడకీ కనిపించకుండా, వున్న విధిబలాన్ని కల్పన చేస్తావు ఎందుకయ్యా? ప్రత్యక్షంగా ఉపపత్తి కుదరకపోతే అలాంటి కల్పన చాశావనుకోవచ్చు. కూదురుతోంది గదా! ఇంక ఎందుకీ కల్పన?

**రాముడు**: – ఏమండీ, ఒకే తొడిమకి రెండు కాయలు కాచాయి. అందులో నేనొకటి తీసుకున్నా, నా మిత్రుడొకటి తీసుకొన్నాడు. కొరికి చూస్తే నా పండు నిండా కండ తియ్యగా ఉంది. నా మిత్రుడు తీసుకున్న పండునిండా తొర్రే, పైగా వగరు. ఒకే తొడిమకు పుట్టిన రెండు పళ్ళలో ఈ బేధం విధిబలం కాక మరేమంటారు?

**వశిష్ఠుడు**: – ఇక్కడ కూడా విధి లేదు. ఎందుకంటే, తినేవాడి పుణ్యం కొద్దీ వస్తువులు దొరుకుతూ వుంటాయి. పుణ్యం అంటే పూర్వం చేసుకున్న కర్మ. నీ మిత్రుడికి అది సరిగా లేదు. వాడి అభవం కోసం ఆ తొర్ర పండు పుట్టింది. అందుచేత ఆ పండు నీ మిత్రుడియొక్క పూర్వఫలం తప్పితే మరొకటి కాదు.

**రాముడు**: – లోకంలో జగత్ప్రసిద్ధంగా వున్న నదులూ, పర్వతాలూ, నక్షత్రాలూ కూడా నశించి పోతున్నాయి. అది విధి కాదా?

**వశిష్ఠుడు**: – రామా! అది విధి కాదు. పైన శివుడనే ఒక విశిష్ట జీవి వున్నాడు. ఆయనకు అలాంటివాటిని నశింపజేయటమే పని. ఆయన ఒక నియమం ప్రకారం వాటిని నశింపజేస్తూ వుంటాడు. అంటే ఆ శివుడియొక్క పురుషప్రయత్నంవల్లనే అవి నశిస్తున్నాయి. అంతే కానీ వేరే విధి అంటూ ఏమీ లేదు.

**రాముడు**: – అయ్యా! కొన్ని దేశాలలో ఒక ఆచారం వుంది. రాజవంశం పూర్తిగా అంతరించిపోతే, మంత్రులంతా చేరి, పట్టపుటేనుగు తొండానికి ఒక పూలమాలను అందించి, ఊరి వీధుల వెంబడి తిప్పుతారు. ఆ ఏనుగు తిరిగి తిరిగి చివరికి ఏ ముష్టివాడి మెడలోనో ఆ మాల వేస్తుంది. దాంతో ఒక్క క్షణంలో ముష్టివెధవగారు మహారాజుగా మారిపోతాడు. ఇది విధి కాదంటారా?

**వశిష్ఠుడు**: – రామా! దీంట్లో విధి ఎక్కడ వుంది? ఆ సంప్రదాయాన్ని ఆ పౌరులంతా అంగీకరించారంటే, ఆ అంగీకారంలో ఆ పౌరులయొక్క పురుష ప్రయత్నం వుంది. ఏనుగుని వీధుల వెంబడి త్రిప్పడంలో మంత్రులయొక్క పురుష ప్రయత్నం వుంది. ఆ పూల మాలను ఒకడి మెడలో వేయడంలో ఏనుగుయొక్క పురుష ప్రయత్నం వుంది. ఇంకా విధి ఎక్కడ వుంది?

**రాముడు**: – అయ్యా! ఈ చివరి అంశంలోనే విధి వుండవచ్చు. ఆ ఏనుగు పూల దండను వీడి మెళ్ళోనే ఎందుకు వెయ్యాలి? ఇంకోడి మెళ్ళో వెయ్యరాదా? అక్కడే విధి పని వుంది అంటాను. అక్కడే విధి పనిచేస్తోందేమో?

**వశిష్ఠుడు**: – రామా! సరిగా ఆలోచించు. ఆ పౌరులు ఏనుగుకే పూలదండ ఎందికిచ్చారు? కుక్కకో, నక్కకో ఎందికివ్వలేదు? ఏనుగులో సహజసిద్ధమైన అంతర్జ్ఞానం ఒకటి వుందనీ, దానివల్ల అది యోగ్యుడైన వ్యక్తిని గుర్తుపట్టగలదని, వారు అనుభవంవల్ల గ్రహించారు. అందువల్లే, వారు దాని చేతికి దండ ఇచ్చారు. ఆ ఏనుగు తనకు సహజంగా సంక్రమించిన, అంతర్గత జ్ఞానాన్ని ఉపయోగించి, వాడి మెడలో దండ వేసింది. ఇది ఏనుగుయొక్క పురుష ప్రయత్నమే గాని, మరొకటి కాదు. రామా! ఇక్కడ ఏనుగు యొక్క పురుషకారానికి

తోడు, ఆ ముష్టివాడు చేసుకున్న సత్కర్మ కూడా ఏనుగుయొక్క పురుష ప్రయత్నానికి సహకారం చేసింది. అందువల్ల ఏనుగు పురుషకారాన్ని, ముష్టివాడియొక్క పాతజన్మ పుణ్యాన్ని మించి, అక్కడ వేరే విధి ఏమీ లేదు.

ఇక్కడ పాఠకులకు చిన్న మనవి. ఈ రోజుల్లో మనకు ఏనుగుల్లో రాజు కాగల మనిషిని గుర్తుపట్టే శక్తి వుందంటే నమ్మబుద్ధి కాదు. ఏనుగు ఒకడి మెడలో దండ వెయ్యటం కేవలం "ఫ్లూక్" అని మనకనిపిస్తూ వుంటుంది. కానీ, ఒక్కొక్క జంతువులో ఒక్కొక్క విశేషమైన అంతర్జ్ఞానం వుంటుందని ఈనాటి సైన్సు బాగా గుర్తించింది.

ఉదాహరణకు, కుక్కలకు వాసనను గుర్తు పట్టే జ్ఞానం ఎక్కువ. దీనిని ఉపయోగించి ఈ నాడు పోలీసు శాఖవారు దొంగలనూ, హంతకులనూ, పట్టుకుంటున్నారు. గుర్రాలకు శత్రువుల్నీ, మిత్రుల్నీ, గుర్తుపట్టే జ్ఞానం ఎక్కువ. దీనిని ఉపయోగించి మొన్నటి దాకా, యుద్ధాలలో గుర్రాలను వాడుకొంటూ వుండేవారు. వాన రాకను చాలా ముందుగానే గుర్తుపట్టగల జ్ఞానం గాడిదలకు ఎక్కువ. దీనిని ఉపయోగించి పల్లెటూర్లలో రైతులు వ్యవసాయపు పనులు చూసుకోవడం మొన్న మొన్నటి దాకా వుండేది.

గడియారం లేకుండానే కాలాన్ని గుర్తుపట్టగల జ్ఞానం కోడికి ఈనాటికీ వుంది. కోడి కుయ్యంగానే నిద్రలేవటం పల్లె పట్టుల్లో అక్కడక్కడా ఇంకా మిగిలి వుంది. ఇలాంటివన్నీ గమనించినప్పుడు, ఏనుగుకి అలాంటి విశేష శక్తి వుందనడంలో అసంభవమేమీ లేదు. అయితే ఆ శక్తి వుందో, లేదో, పరీక్ష చేసి చూద్దామంటే, ఇవాళ మన సమాజంలో రాజరిక వ్యవస్థ లేదు. కనుక మనం ఏమీ చేయలేము. అందువల్ల, ఏనుగుకి ఆ శక్తి లేదని కూడా మనం చెప్పలేము. పాతకాలంలో అలాంటి అలవాటు వుందని గట్టి సాక్ష్యాలు వున్నాయి గనుక, ఏనుగుకి అలాంటి శక్తే వుందని మనం విశ్వసించవచ్చు.

సరే, ఏనుగు ప్రశ్న అయిపోయిన తరువాత, రాముడు మరొక ప్రశ్న వేశాడు.

**రాముడు**:- అయ్యా! ఒక రైతు సంవత్సరమంతా కష్టపడి పంట పండించాడు. కోతలు కోశాడు. కుప్పలు వేద్దామనుకొంటూ వుండగా, ఉన్నట్టుండి కుంభవృష్టి కురిసి, కోసిన పంటంతా నాశనమైపోయింది. ఒక్క రోజు ఆగితే కుప్పలు వేయటం అయిపోయేది. కుప్పలు వేస్తే ఎంత వాన వచ్చినా పరవాలేదు. కానీ, కోతలకీ, కుప్పలకీ, మధ్యలో వాన వచ్చేసరికి, రైతు సంవత్సరమంతా పడ్డ కష్టమంతా నాశనమైపోయింది. ఈ నాశనానికి కర్త ఎవరు? ఇది విధి కాక మరేమిటి?

**వశిష్ఠుడు**:- రామా! ఈ నాశనానికి కర్త మేఘదేవతే. మేఘాలని అధిష్ఠించి ఒక దేవత వుంటాడు. వాడికి ఏ సమయంలో ఎక్కడ వర్షించాలో, కొన్ని నియమాలు వున్నాయి. వాడు తన పురుష ప్రయత్నంతో తన నియమాలను కాపాడుకొంటూ వుంటాడు. అందుచేత ఇది మేఘాల పురుషప్రయత్నమే కానీ, మరొకటి కాదు.

**రాముడు**:- గురుదేవా! మేఘాలను అధిష్ఠించి వున్నవాడు దేవత. నేలమీద వున్న రైతు మానవుడు. ఈ అల్పమానవుడి కృషిని ఆ దేవత అలా నాశనం చేస్తూ వుంటే, ఇక మానవుడేం చెయ్యగలడు? మళ్ళీ పండించుకుందామంటే ఆ మేఘుడు మళ్ళీ నాశనం చేస్తాడేమో? పోనీ, ఆ మేఘాల్ని ఎదిరించి పోరాడదామంటే, అది మానవులకు మించిన పని. అలాంటి పరిస్థితుల్లో ఏం చెయ్యాలి?

**వశిష్ఠుడు**- రామా! మానవుడు తన విధ్యుక్తధర్మం తను చెయ్యాలి. అలా చేస్తూ, తనకంటే బలవంతుడెవడైనా వచ్చి తన చెడగొడుతాడేమో– అని వాడు ఆలోచించకూడదు. ఒక్కొక్కప్పుడు అలాంటి ఆపద రానే వస్తుంది, మీ రైతుకి వచ్చినట్టు. అలా వస్తే, మానవుడు దాన్ని గురించి బాధ పడకూడదు. నా శక్తి వున్నంతవరకూ నా పని సరిగ్గా చేశానా, లేదా? అని చూసుకోవాలి. మన శక్తికి మించిపోయి ఆపద నెత్తిన పడితే, దాన్ని గురించి దుఃఖపడకూడదు.

**యన్న శక్నోమి తస్యార్థే యది దుఃఖం కరోమ్యహం**
**తదమారిత మృత్యోర్మే యుక్తం ప్రత్యహరోదనం॥** (ము.వ్య.ప్ర.స.6,శ్లో.22)

ఎందుకేడవ కూడదండీ అంటావా? నా శక్తికి మించి పోయిన దాని గురించి కూడా నేను ఏడుస్తూనే వుండాలని నువ్వు నియమం పెట్టేటట్లైతే, నేను మృత్యువుని జయించలేను కనుక, నేను ప్రతి రోజూ ఏడుస్తూనే వుండాలి. అది యుక్తం కాదు. కనుక, శాస్త్రబద్ధంగా చేసిన కృషి విఫలమైనప్పుడు మానవుడు మళ్ళీ మళ్ళీ కృషి చేస్తూ వుండాలి. అంతే గానీ, విసుగు చెందకూడదు. కనుక రామా! మానవుడు తన సుఖానికీ, తన దుః ఖానికీ, తనే కారణమని గుర్తించుకోవాలి.

## 30. స్పందత్రయము

రామా! చెప్పిందే మళ్ళీ చెబుతున్నాననుకోకు. లోకంలో అందరూ కూడా విధి అని దేన్ని అంటున్నారో, ఇది వాళ్ళు వాళ్ళు చేసుకున్న పూర్వ కర్మ తప్పితే మరొకటి కాదు. ఆ ఉద్దేశ్యంతోనే మేము విధి అనే పదాన్ని ప్రయోగిస్తున్నామండీ అని ఎవరైనా అనేటట్లయితే, మాకేమీ విరోధం లేదు. అలాంటి విధిని మేం కాదనం, తిట్టం. లోకంలో సామాన్యులంతా చెప్పుకొనే విధినే నను ఇందాకటి నుంచీ తిడుతున్నాను. ఎందుకంటే అలాంటి లేనిపోని విధిని నమ్మి, పాపం, వాళ్ళు చెడిపోయారు. కనుక, రామా! నువ్వు అలాంటి భ్రాంతిలో పడి, నీ పురుషకారం మానబోకు.

రామా! పురుషప్రయత్నం అంటే– ఏమిటో నీవు బాగా అర్థం చేసుకోవాలి. ఇది బాగా గ్రహించు. ప్రయత్నం అంటే కదలిక. దానికే మరోపేరు స్పందము. ఈ కదలిక మూడు రకాలు.

**సంవిత్ స్పందో మనస్స్పందః ఐంద్రియ స్పంద ఏవ చ!**
**ఏతాని పురుషార్థస్య రూపాణ్యేభ్యః ఫలోదయః ॥** (ము.వ్య.ప్ర.స.7,శ్లో.4)

1. సంవిత్స్పందము
2. మానస స్పందము
3. ఇంద్రియ స్పందము – అని కదలిక మూడు రకాలు.

ఎక్కడైనా సరే, ఎప్పుడైనా సరే, ఒకడు ఒక పని చేశాడంటే, ఆ పనికి వెనకాల వాడి కృషి వుంటుంది. ప్రయత్నం వుంటుంది. ప్రయత్నం అంటే ఏమిటి? జ్ఞానేంద్రియాలూ, కర్మేంద్రియాలూ ఇటూ అటూ కదలటమే గదా! దీనినే నేను "ఇంద్రియ స్పందము" అంటున్నాను. ఇంద్రియాలను కదల్చటం అంటే ఇష్టం వచ్చినట్లు గంతులు వేయటం కాదు గదా! తను అనుకొన్న పని జరిగేటట్లు ఇంద్రియాలు కదలాలి.

ఒక చిత్రకారుడు మంచి చిత్రం గీయాలి అనుకున్నాడనుకోండి. అతడు ఏ చిత్రం గీయాలనుకొన్నాడో, దానికి అనుగుణంగా వాడి ఇంద్రియాలు కదలాలి. అంటే, ఈ ఇంద్రియాల కదలికకు వెనకాల ఒక కోరిక వుందన్నమాట. కోరికంటే ఏమిటి? ఈ వస్తువు నాకు కావాలి, ఈ పని నాకు కావాలి, అనే ఆలోచనే కదా కోరికంటే. కనుక, కోరిక అంటే మనస్సులో కదలిక. దీనినే నేను "మానసిక స్పందము" అంటున్నాను.

ప్రపంచంలో ఎవడికైనా దేనివల్ల కోరి పుడుతుంది? నాకు ఫలానా వస్తువువల్ల, లేక ఫలానా పనివల్ల, సుఖం కలుగుతుంది– అనే జ్ఞానం కలిగితే, ఆ జ్ఞానంవల్ల వాడికి ఆ వస్తువు మీద కోరిక పుడుతుంది. ప్రపంచంలో అనేక రకాల జ్ఞానాలు వుండగా, వీడికి ఈ క్షణంలో ఈ జ్ఞానం బయటకు వచ్చిందన్నమాట.

ఫలానా వస్తువు నాకు అనుకూలిస్తుందనే జ్ఞానం ఇప్పుడు కలిగిందన్నమాట. ఇది వాడికున్న జ్ఞానాల్లో ఒక కదలిక. అందుకే నేను దీన్ని "సంవిత్ స్పందం" అన్నాను. సంవిత్ అంటే జ్ఞానము. సంవిత్ స్పందమంటే జ్ఞానంలో కదలిక.

ఒక క్రియ వెనకాల ప్రయత్నం, దాని వెనకాల ఒక కోరిక, దాని వెనకాల ఒక జ్ఞానం, ఇవి వుండి తీరుతాయి. అలా వుంటేనే చివరికి ప్రత్యక్షమైన క్రియ ఏర్పడుతుంది. ఈ చెప్పుకోవడంలో వెనక్కి వెనక్కి వెళ్ళి చెప్పుకున్నాం. నిజంగా అవి వుండే వరుస మాత్రం మొదట జ్ఞానం, తరువాత ఇచ్ఛ, తరువాత ప్రయత్నం, తరువాత క్రియ. వీటినే శాస్త్రజ్ఞులు జ్ఞాన, ఇచ్ఛా, ప్రయత్న క్రియలు అని పిలుస్తారు. నేను వీటినే సంవిత్, మానసిక, ఇంద్రియ స్పందాలనీ, వీటి ఫలితాన్ని క్రియ అనీ, పిలుస్తున్నాను.

ఇలా ప్రతిదానికీ స్పందము అని పేరెందుకు పెట్టానంటే, ప్రపంచంలో ఏ పనైనా సరే దానియొక్క అసలు స్వరూపం స్పందమే. ఎంత లోతుగా వెళ్ళి ఆలోచించినా, అన్ని చోట్లా స్పందమే వుంది. సోమరితనం వున్న చోట స్పందం వుండదు. కనుక, ప్రతి సాధకుడూ సోమరితనాన్ని వదిలి, ఈ స్పందాన్ని ఆశ్రయించాలి. ఈ మాట స్పష్టం కావటంకోసమే నేనీ పేర్లు పెట్టాను. లౌకిక ఫలితాలు కావాలన్నా, ఈ స్పందమే కావాలి. పారలౌకిక ఫలితాలు కావాలన్నా, ఈ స్పందమే కావాలి. కనుక, పురుషకారం అనేదానియొక్క మూలరూపం ఈ స్పందమే. సోమరితనం దీనికి పరమ విరోధి.

కనుక, రామా! నువ్వు సోమరితన్నాన్ని పరిత్యజించి, దేహానికి ఆధులు, వ్యాధులు, లేకుండా చూసుకో. అలా దేహాన్ని సరిగ్గా పెట్టుకొని, ఇక నీ చిత్తాన్ని ఆత్మతత్త్వం మీద ఏకాగ్రం చెయ్యి. ఇప్పుడు నువ్వు చెయ్యవలసిన పురుషప్రయత్నం ఇదే.

ప్రపంచంలో ఎప్పుడైనా సరే, పని ఎంత బాగా చేస్తే, ఫలితం అంత బాగా వుంటుంది. దానికి తిరుగు లేదు. బృహస్పతి దేవతలకు గురువయ్యాడంటే, ఎట్లా అయ్యాడు? తన ప్రయత్నబలంవల్లే అయ్యాడు. ఒకానొక జీవి ఇంద్రుడయ్యాడంటే, ఎట్లా అయ్యాడు? తన ప్రయత్న బలంవల్లే అయ్యాడు. మన కళ్ళ ఎదురుగుండా కనిపించే ప్రపంచాన్నే చూడు. కొంతమంది కేవలం ముష్టివాళ్లుగా జీవితం ప్రారంభించి ఆ జీవితంలోనే కోటీశ్వరులవుతున్నారు. అలాంటివాళ్ళు ఎంత కష్టపడి ఆలోచిస్తారో, పని చేస్తారో అర్థం చేసుకో. దీనికి భిన్నంగా కొంతమంది కోటీశ్వరులుగా పుట్టి, ఆస్తంతా తగలేసుకొని, చివరికి ముష్టివాళ్ళుగా మారుతున్నారు. వీళ్ళెంత సోమరిపోతులుగా వుంటున్నారో చూసుకో. దీన్ని బట్టి పురుషప్రయత్నం ఎంత ముఖ్యమో అర్థం చేసుకో.

రామా! ఇక పురుషప్రయత్నం ఫలించే తీరు అర్థం కావడం కోసం దాన్ని మరింత విశ్లేషణ చేస్తాను. విను–

**శాస్త్రతో గురుతశ్చైవ స్వతశ్చేతి త్రిసిద్ధయః ।**

**సర్వత్ర పురుషార్థస్య న దైవస్య కదాచన॥** (ము.వ్య.ప్ర.స.7, శ్లో.11)

పురుషప్రయత్నం ఒకప్పుడు శాస్త్రాలవల్ల ఫలిస్తుంది. మరొకప్పుడు గురువుల అనుగ్రహబలంవల్ల ఫలిస్తుంది. కొన్ని సార్లు అది స్వయంగానే ఫలిస్తుంది. ఇలా దాని ప్రవృత్తి మూడు రకాలుగా వుంటుంది. దైవం అనే దానికి ఫలితమే లేదు.

ఒకప్పుడు మానవుడి చిత్తం చెడు పనుల మీదికి ప్రవేశిస్తూ వుంటుంది. అప్పుడు శాస్త్రజ్ఞానం వచ్చి అడ్డుపడుతూ వుంటుంది. వాడు చదువుకొన్న శాస్త్రాలలోని వాక్యాలను గుర్తుతెచ్చుకొని, తన దురభ్యాసాలవల్ల రాబోయే కష్టాలను గ్రహించుకొని, పట్టి, బలవంతాన, తన మనస్సును మంచి మార్గంలోకి త్రిప్పుకొంటాడు.

శాస్త్రాలవల్ల పురుషప్రయత్నం ఫలించే తీరు ఇదే.

శాస్త్రాలలో అనేక విషయాలుంటాయి. వాటిలో ఏది ఉత్తమమో, ఏది నీకు మిక్కిలి అనుకూలమో, నీకు లక్ష్యాన్ని సాధించుకునేందుకు ఏది సులువైన మార్గమో, ఈ కిటుకులను బోధించేవారే గురువులు. వారు చెప్పినట్లు నీ ప్రయత్నం సాగిస్తే, ఫలితం త్వరగా మరింత పుష్టిగా లభిస్తుంది. పురుషకారం గురువుల ద్వారా ఫలించే విధానం ఇదే.

శాస్త్రాలు, గురువులు, ఎన్ని చెప్పినా, చెప్పింది చెప్పినట్టు కష్టపడి ఆచరించవలసినవాడివి నువ్వే. నువ్వెంత చురుగ్గా పని చేస్తే, ఫలితం అంత చురుగ్గా వస్తుంది. పురుషకారం స్వయంగా ఫలించే విధానం ఇదే.

రామా! నేనీ పురుషకారాన్నే నమ్మి, నాకు కావలసిన ఫలితాలను పొందాను. అంతేగానీ, విధి బలంవల్ల నేను ఒక్కటి కూడా పొందలేదు.

## 31. విధి అనేది ఓదార్పుమాట

ఐతే లోకంలో విధి అనే మాట ఎందుకు పుట్టింది?– అని అడుగుతావేమో?

**దైవ మాశ్వాసనా మాత్రం దుఃఖే పేలవ బుద్ధిషు॥** (ము.వ్య.ప్ర.స.7,శ్లో.15)

గుండెబలం లేని మనుషులకు, దుఃఖాలు వచ్చి మీద పడినప్పుడు, వారికి వున్న మతి కూడా పోతూ వుంటుంది. అలాంటి తేలిక మనుషులను ఓదార్చటంకోసం విధి అనే మాట పుట్టింది. అంతే గానీ, విధి అనేది సత్య వస్తువు కాదు.

రామా! మానవులు తమ అనర్థాలను, ఆపదలను, కూడా తాము చేసే పనులవల్లనే తాము తెచ్చుకుంటున్నారు. అలాంటి పిచ్చి పనులు చేయటానికి కూడా పురుష ప్రయత్నం చేస్తారు. అలాంటి ప్రయత్నాన్ని ఉన్మత్త చేష్ట అంటారు. దాన్ని పౌరుషం అనీ, పురుష ప్రయత్నం అనీ, పిలవకూడదు. సజ్జన సాంగత్యం, శాస్త్రాభ్యాసం, వివేకవృద్ధి, వీటి సహకారంతో చేసే ప్రయత్నమే పురుషప్రయత్నం అనాలి. అదే సత్ఫలితాలనిస్తుంది. గురుసేవ చేస్తూ శాస్త్రాధ్యయనం చేసిన కొద్దీ, జ్ఞానం పెరుగుతూ వుంటుంది. చదివే పాఠాలను అభ్యాసం చేస్తున్న కొద్దీ, జ్ఞానం ఇంకా పెరుగుతుంది. జ్ఞానం పెరిగే కొద్దీ, పురుషప్రయత్నం పెరుగుతుంది. పురుషప్రయత్నం పెరిగిన కొద్దీ ఫలితం పెరుగుతుంది. రామా! నువ్వీ పురుషకారాన్నే ఆశ్రయించు.

రామా! కొంతమంది అన్నీ దైవమే చూసుకొంటుంది, అన్నీ విధి ప్రకారమే నడుస్తాయి– అని వాదిస్తూ వుంటారు. అలాంటి వాళ్ళు దైవాన్ని నమ్మి నిప్పులో దూకితే బావుండును. ఆ పని వారు చేయరు గదా! ఈ దైవ వాదన చేసేవారికి ఏ పూజలూ, పునస్కారాలూ, అనుష్ఠానాలూ, ఇవేవీ అక్కర్లేదు. వాళ్ళకి అన్నీ దైవమే చూసుకుంటుంది. పుణ్యలోకాలన్నీ దైవమే ఇస్తుంది. అలా అని వాళ్ళు నోరుమూసుకొని కూర్చుంటారా? ఏ జపమో, తపమో, చేస్తూనే వుంటారు. చేసేది ఇంకా సరిగా చెయ్యవయ్యా అంటే, దైవం అంటారు. కానీ, వీరు జపమూ, తపమూ ఎంతో కొంత చేస్తారు కదా! వారికి ఆ మంత్రం దైవమే ఉపదేశించిందా? ఎవడో ఒక గురువు అనేవాడు తన దవడలు, నాలుక మొదలైనవి కదిలించే ప్రయత్నం చెయ్యబట్టి కదా, వీడికి ఆ ఉపదేశం వచ్చింది. ఆ గురువుయొక్క పురుషప్రయత్నంవల్ల తను మంత్రం పొంది, ఇది దైవం వల్లే వచ్చిందని వాదనుకున్నాడంటే, అదేమి తెలివి?

లోకంలో ఎక్కడైనా ఒక పని జరిగిందంటే, ఎవడో ఒకడికి అవయవాల్లో చలనం కలిగి, ఆ చలనంవల్ల పని జరుగుతుంది. ఒక శిల్పికి పక్షవాతం వచ్చిందనుకో, వీరు చెప్పే దైవం వచ్చి వాడి శిల్పాలను చెక్కి పెడుతుందా? కాబట్టి ఎన్ని రకాలుగా చూసినా, దైవం అనేది ఎక్కడా ప్రత్యక్షంగా కనిపించడం లేదు. శాస్త్రాలలో ఎక్కడా లేదు. అందువల్ల, దైవమనేది లేనే లేదని గట్టిగా చెప్పవచ్చు.

## 32. విధి అనేది కర్తా? సాధనమా?

రామా! దైవం వుందనేవాళ్ళూ, దైవమే పని చేస్తుందనేవాళ్ళూ, మరొక విషయం ఆలోచించాలి. వారు చెప్పే దైవం ఆ పనికి కర్తగా పని చేస్తోందా? సాధనంగా పనిచేస్తోందా? ఇవేవీ కాకుండా దూరంగా వుండి పని చేస్తోందా? జరిగే పనికి కర్త ఎదురుగుండా కనిపిస్తున్నాడు. కనుక వేరే ఎవరో దైవమనేవాడు కర్తగా వున్నాడనటం సబబు కాదు.

పోనీ, ఈ దైవమే ఈ క్రియకు సాధనమంటారా? సాధనం కర్తకి లోబడి వుంటుంది. వీరు చెప్పే దైవం అట్లా వుండదు కదా! ఇవేవీ కాదు, దైవం విడిగా వుందంటారా? కర్త, వాడి సాధనం, వీరిద్దరివల్ల జన్మించే క్రియ, ఈ మూడూ ప్రత్యక్షంగా కనిపిస్తుండంగా, వీటితో ఏమీ సంబంధం లేని దైవాన్ని కల్పించడం ఎందుకు? వ్యర్థం కదూ! అందువల్ల, తార్కికంగా చూసుకున్నా సరే, దైవమనేదాన్ని కల్పించడం పొరపాటు.
**రాముడు**:- గురుదేవా! ఇద్దరు విద్యార్థులు ఒకే గురువు దగ్గర చదువుతున్నారు. ఇద్దరూ తెలివైనవాళ్ళే, మంచివాళ్ళే, గురువుకి ఇద్దరూ కావలసినవాళ్ళే. కానీ, ఒకడికి శాస్త్రం బాగా పడుతుంది. ఒకడికి అంతగా పట్టదు. అన్నీ సమానంగా వుండి కూడా, శాస్త్రం పట్టటంలో తేడా కనిపిస్తోంది.కనుక, దానికి ఏదో కారణం చెప్పాలి కదా. ఆ కారణమే దైవమని వారు భావిస్తున్నారేమో? అలా ఎందుకు అనుకోరాదు.
**వశిష్ఠుడు**:- రామా! అన్నీ సమానంగానే ఉన్నాయి. చదువు మాత్రం సమానంగా రాలేదు. దీనికి కారణం మనకి అర్థం కావడం లేదు. అలాంటప్పుడు ఏదో ఒక కారణాన్ని కల్పన చేసి చెపుతున్నావు. ఏమిటయ్యా అంటే, దైవమనే కారణం ఒకటి వుంది. అది ఒకడికి అనుకూలించింది. రెండవ వాడికి అనుకూలించలేదు– అని. అంతే కాదు! తెలియని దానిని కల్పించేటప్పుడు యుక్తియుక్తంగా కల్పించాలి. పూర్వం చేసుకున్న కర్మ సరిగా లేదు. కనుక, వాడికి విద్య సరిగా లేదు అని చెబితే, ఆ మాట యుక్తియుక్తంగా వుంటుంది. ఎందుకంటే – పూర్వకర్మ అనబడేటటువంటి ఈ కారణం ఒకానొక సమయంలో, ఒకానొక ప్రదేశంలో, వుండింది. ఆ వున్నదాన్నే మనం ఇక్కడ కారణంగా కల్పన చేస్తున్నాం. దీనికి శాస్త్రప్రమాణమూ వుంది.

దైవవాదులు దీన్ని వదిలేసి, దైవాన్ని కారణంగా కల్పిస్తున్నారు. ఆ దైవం ఎక్కడ వుంది? ఎప్పుడు వుంది? దానికి ఏ శాస్త్రప్రమాణం వుంది?– అని అడిగితే వారి దగ్గర సమాధానం లేదు. కనుక, నువ్వు చెప్పిన ఉదాహరణలో కారణాన్ని కల్పించడం కోసం దైవాన్ని తీసుకు రావడం అర్థహీనం.

రామా! మరో విషయం కూడా వుంది. ఒక వేళ దైవం వుందనే అనుకుందాం. ఆ దైవమే మొదటి విద్యార్థికి సహకారం చేస్తోందనుకుందాం. లోకంలో సహకారం చేసేవాడికి, సహకారం పొందేవాడికి, ఏదైనా సంబంధం వుండాలి కదా!

ఇక్కడ సహకారం పొందేవాడు విద్యార్థి. వీడు మూర్తుడు. అంటే వీడికి ఒక ఆకారం వుంది. వాళ్ళు చెప్పే విధి అమూర్తం. అంటే ఆకారం లేనిది, ఆకాశం లాంటిది. ఆకారం గల వస్తువులకీ, ఆకారం లేని వస్తువులకీ, మధ్యలో సంబంధం ఎలా కుదురుతుంది? ఆకాశం ఎవరిచేతైనా, ఏ పనైనా, చేయించగలదా?

కనుక, నీవు చెప్పే దైవం ఎవరికీ ఏ రకమైన సహకారం గానీ, అపకారం గానీ, చేసే అవకాశమే లేదు. అలాంటి దైవం వుంటే ఏం? లేకపోతే ఏం? లేదని చెప్పడమే మంచిది కదూ! కనుక, దైవమనేది లేనే లేదు.

కొంతమంది జాతకాలు చూసి, నీకు దైవానుకూలం బాగా వుంది. నీకు 90 ఏళ్ళు ఆయుర్దాయం వుంది. అని చెబుతారు. ఆ ఆయుర్దాయం దైవంవల్లే అయ్యేటట్లయితే, వాడి తల నరికేసినా వాడు 90 ఏళ్ళు బ్రతికే వుండాలి. అలా ఎవడైనా బతికితే, దైవం వుందని మనం నమ్మవచ్చు.

రామా! ఇంతెందుకు? ఈ విశ్వామిత్రమహర్షిని చూడు, బ్రహ్మర్షిత్వాన్ని స్వయంగా సాధించాడు.దైవంవల్ల సాధించాడా? కాదే, తిరుగులేని తన పురుషప్రయత్నంవల్ల సాధించాడు. ఈయన దైవాన్నసలు లెక్కే చేయడు.

మాబోటి వాళ్ళం కొంతమందిమి ఇవాళ ఆకాశగమనం చేస్తున్నాం. ఇలాంటి శక్తులన్నీ దైవంవల్ల మాకు వచ్చి పడ్డాయా? వాటికోసం ఎన్నో సంవత్సరాలు గట్టి కృషిచేశాం. ఆ కృషి ఫలితంగా ఇవాళ ఈ విద్యలు వచ్చాయి. ఇలా ఎన్ని ఉదాహరణలైనా చెప్పవచ్చు.

రామా! ఎండిపోయిన వేరుముక్కలో అయినా కొంత శక్తి వుందేమో గానీ, ఈ దైవమనే దాంట్లో ఏమీ శక్తి లేదు.

**సకలకారణ కార్యవివర్జితం**
**నిజవికల్ప వశా దుపకల్పితమ్।**
**త్వమనపేక్ష్య హి దైవ మసన్మయం**
**శ్రయ శుభాశయ పౌరుష ముత్తమమ్॥** (ము.వ్య.ప్ర.స.8,శ్లో.26)

రామా! ఈ దైవానికి కారణం లేదు. కార్యం లేదు. ఇది కేవలం కొందరి ఊహవల్ల పుట్టింది. అందుచేత కేవలం శూన్యాకారమైన ఈ దైవాన్ని ఉపేక్షచేసి, ఓ శుభాశయా! మంచి ఆశయాలు కలవాడా! ఉత్తమమైన పురుషప్రయత్నాన్ని నువ్వు ఆశ్రయించు- అని చెప్పి, వశిష్ఠమహర్షి కొంచెం ఊపిరి పీల్చుకున్నాడు.

## 33. విధి ఆకాశం వంటిది

వెంటనే రాముడు గడ్డురాయి వంటి ప్రశ్న వేశాడు.

“గురుదేవా! ఒక సారేమో మీరు దైవమనేది అసలు లేనే లేదంటున్నారు. మరో సారి మనిషి పాతజన్మల్లో చేసుకున్న కర్మ పేరే దైవం అంటున్నారు. ఇప్పుడు మీరు దైవం ఉందని ఒప్పుకున్నట్లా? లేదని చెప్పినట్లా? అదీ గాక గురుదేవా! మీరిందాక చెబుతూ పూర్వజన్మ కర్మ, ఇప్పటి కర్మ, ఒక్కో సారి పరస్పర విరోధులుగా వుంటాయని చెప్పారు. పొట్టేళ్ళ లాగా కొట్టుకుంటాయని చెప్పారు. కానీ, ఈ జన్మలో ఈ మనిషికి కలిగే అభిరుచులు, ఆకాంక్షలు, మొదలయినవన్నీ వాడి పూర్వజన్మ బట్టే వస్తాయి. అలాంటప్పుడు పూర్వ కర్మ, ప్రస్తుత కర్మ, విరోధులుగా వుండటం ఎలా సంభవిస్తుంది?

“కొన్ని సందర్భాలలో మానవుడి పూర్వకర్మ, ప్రస్తుత కర్మ రెండూ, ఒకదానికొకటి అనుకూలంగా వుంటాయని మీరు చెప్పారు. పూర్వకర్మను బట్టి వాడి స్వభావాలు, అభిరుచులు, ఏర్పడుతాయనే మాట మీరూ ఒప్పుకుంటున్నారు. ఆ స్వభావాలను బట్టి వాడీ జన్మలో నడుస్తున్నాడన్నమాట. ఇలా ఒప్పుకుంటే, వాడివాళ ఈ జన్మలో చేసే కర్మలన్నీ కూడా, పూర్వజన్మ కర్మలకు ఫలితంగా చేస్తున్నాడని ఒప్పుకొన్నట్లైంది. అలా అయితే- మానవుడికి స్వతంత్రమనేది ఏమున్నట్లు? స్వాతంత్ర్యమే లేనివాడికి నువ్వు పురుషప్రయత్నం చెయ్యి, పురుషప్రయత్నం చెయ్యి, అని చెప్పి ప్రయోజనం ఏమిటి?

"అదీగాక, గురుదేవా! లోకంలో పెద్దల వ్యవహారంలో దైవమనేది వుందని ఒక ప్రసిద్ధి వుంది. మీరు దాన్ని అంగీకరిస్తారా? అంగీకరించారా? తేల్చి నిష్కర్షగా ఒక మాట చెప్పండి.

అని ఈ విధంగా రాముడు నిగ్గదీసి అడిగేటప్పటికి, వశిష్ఠమహర్షి కూడా అంత నిష్కర్షగానే సమాధానం చెప్పాడు.

***వశిష్ఠుడు***:– రామా! ఆకాశం ఎలా వుందంటే నువ్వేం చెబుతావు? నీలంగా వుంది అంటావు. ఆకాశం నీలంగా వుందంటే, ఆకాశం ఏదన్నా ఒక వస్తువా? కాదే. కాకపోతే నీలంగా వుందని ఎలా అన్నావు? ఎలా అన్నావంటే, లోకంలో అందరూ సామాన్య దృష్టితో చూస్తారు. అంత లోతుగా పరిశీలించరు. ఆ సామాన్య దృష్టితో ఆకాశం నీలంగా వుంది అంటారు. నువ్వు కూడా అలాంటి సామాన్యదృష్టినే పట్టుకొని, ఆకాశం నీలంగా వుంది అనేస్తావు. గట్టిగా నిగ్గదీస్తే, ఆకాశం అనేది అసలు లేనే లేదండీ, అది శూన్య వస్తువు. మేఘాలు మొదలయిన వాటియొక్క కాంతి సంక్రమించడంవల్ల దూరంగా ఏదో నీలకాంతి మనకు కనిపిస్తుంది. అది దూరంగా కనిపిస్తోంది కనుక, ఆ రంగు ఆకాశానిదే అని భావిస్తూ వుంటాం. పరమార్థంలో మాత్రం ఆకాశానికి రూపం లేదు, రంగూ లేదు– అంటావు. ఇప్పుడు ఆకాశం నీలంగా వుందని అన్నదీ నువ్వే, ఆకాశానికి ఏ రూపమూ లేదన్నదీ నువ్వే.

రామా! అలాగే నేను దైవం గురించి మాట్లాడాను. నా సిద్ధాంతంలో దైవమనేది ఆకాశం వంటిది.

**దైవమాకాశరూపం హి**

**కరోతి న కరోతి చ ॥** (ము.వ్య.ప్ర.స.9, శ్లో. 7)

దైవమనేది లోకంలో ఎవరికీ ఏమి చెయ్యదు. చెయ్యకుండానూ వుండదు. ఇదేమిటంటావా?– వివేకదృష్టితో చూసినప్పుడు ఏమీ చెయ్యదు. వివేకరహితమైన దృష్టితో చూసినప్పుడు చేస్తుంది. లోకంలో దైవం వుందనే పెద్దలు ఏమని చెబుతున్నారు? ఎవడికైనా ఒకడికి అనుకోని లాభమో, అనుకోని నష్టమో, జరిగితే, దానికి ఈ లోకంలో ఏ కారణాన్నీ కనిపెట్టలేక, ఇంకా లోపలికి పోయి వెతుకుతున్నారు. అలా వెతకగా వాళ్ళకి వీడి పూర్వ జన్మలో జరిగిన కర్మల మీద గమనింపు వచ్చింది. అప్పుడు "ఓహో! వీడు ఫలానా పూర్వ కర్మవల్ల ఇవాళ ఇలాంటి ఫలితాన్ని పొందాడురా" అని గ్రహిస్తున్నారు. గ్రహించి ఆ పూర్వకర్మకి దైవం అని పేరు పెడుతున్నారు. కనుక, పురాకృత కర్మ, దైవం అనేవి పర్యాయపదాలే తప్పితే వేరే వేరే కాదు. ఇక పోతే దైవాన్ని ప్రశంసిస్తూ, అక్కడక్కడ కొందరు పెద్దలు చెప్పిన వాక్యాలు కనిపిస్తాయి. అవన్నీ కూడా దైవవాదులను ఓదార్చేందుకు చెప్పిన మాటలు తప్పితే, నిజంగా నిష్కర్షైన మాటలు కావు. రామా! ఇదే నా నిశ్చయం.

## 34. విధినింద ఎందుకు?

***రాముడు***:– గురుదేవా! అలా అయితే పురాకృత కర్మ, దైవమనేవి పర్యాయపదాలే అంటున్నారు కదా! అంటే దైవం వుందని మీరు ఒప్పుకున్నట్టే కదా! మరి ఇందాకటినుంచి దైవాన్ని తిట్టి పోస్తున్నారెందుకు?

***వశిష్ఠుడు***:– రామా! మంచి మాట అడిగావు, విను. పూర్వ కర్మే విధి అని చెప్పాను. కర్మ అంటే ఏమిటి? పనే కదూ. పని అంటే ఏమిటి? ఇందాక చెప్పానే స్పందత్రయమని, వాటిలో ఇంద్రియస్పందమే పని. దాని వెనకాల మనస్పందము, సంవిత్ స్పందము అనే రెండు స్పందాలు వుంటాయని చెప్పాను. విశ్లేషణ కోసం ఈ రెండింటిని విడదీసి చెప్పాను. కానీ, నిజానికి ఈ రెండూ కూడా మనస్సులోని బాగాలే కనుక, ఇంద్రియ

స్పందానికి వెనుక వుండేది మనస్సే. దీన్ని మరో రకంగా చెబితే, కర్మకు వెనక వుండేది మనస్సే. మరి మనస్సంటే ఏమిటి?

**తన్మనోకురుత– ఆత్మన్వీస్యామితి–** అని వేదం చెబుతోంది. పరమాత్మ యొక్క వివర్తమే మనస్సు, అని దీని భావం. వివర్తమంటే? భ్రాంతివల్ల తాడును చూసి పాము అనుకుంటామే, అలాంటి చోట్ల భ్రాంతివల్ల పుట్టిన వస్తువుని వివర్తమని అంటారు. కాగా, వివర్త విధానంలో పుట్టిన వస్తువులన్నీ కూడా, అసత్య వస్తువులే అవుతాయి. అంటే, లేని వస్తువులే అవుతాయి. పామనే భ్రాంతి కలగాలంటే, సత్యమైన తాడు ఒకటి వుండాలి. అలాగే మనస్సు అనే వివర్తం ఒకటి పుట్టాలంటే, దానికి ఆధారమైన సత్య పదార్థం ఒకటి వుండాలి. పరమాత్మ ఒకటే సత్యవస్తువు. నిజంగా వున్న వస్తువు పరమాత్మ ఒక్కటే. పరమాత్మ మీదినుంచి వివర్తంగా మనస్సు వచ్చింది. మనస్సుయొక్క పరిణామంగా కర్మ వచ్చింది. కర్మనే దైవము అంటున్నాము. ఇప్పుడు నువ్వు చెప్పు, ఈ దైవమనేది సత్య వస్తువా? అసత్య వస్తువా? నిజంగా వున్న వస్తువా? లేని వస్తువా? వేరే చెప్పేదేముంది? కర్మ కూడా వివర్తమే కనుక, అది లేని వస్తువే. అందుకే దైవం లేనే లేదని నేను గట్టిగా చెబుతున్నాను.

తాడును చూసి పామని భ్రమించిన చోట, నిజంగా సత్య వస్తువేది? తాడే. ఆ తాడునే వాడు భ్రాంతి దశలో పామని పిలుస్తున్నాడు. అలాగే, నిజంగా వున్నది పరమాత్మే. ఆ పరమాత్మనే భ్రాంతిదశలో వున్న జీవుడు మనస్సనీ, కర్మనీ, దైవమనీ, పేర్లు పెట్టి పిలుస్తున్నాడు– పాము అనుకొని అరచినట్లుగా! ఈ కర్మనూ, ఈ మనస్సునూ, చూసి, వాటికి లోబడి, మానవుడు ఏవేవో పనులు చేస్తూ వుంటాడు. పనులు చేసిన కొద్దీ ఫలితాలు పొందుతూ వుంటాడు. పనులు చేయకపోతే ఫలితాలు పొందడు. అందుకే నేను సత్ఫలితాల కోసం సత్కార్యాలు చేయమని చెపుతున్నాను. దీనినే పురుషకారమనీ, పురుషప్రయత్నమనీ, పిలుస్తున్నాను.

## 35. జీవులకు కొంత స్వాతంత్ర్యం వుంది

***రాముడు*:–** గురుదేవా! మీరు చెప్పిన ప్రకారంగానే నేను భ్రాంతిలోకి లోనై ఈ మనస్సుయొక్క మోహంలో పడ్డా. ఎన్ని జన్మలుగానో ఆ మనస్సుకు లోబడి కర్మలు చేసుకొంటూ వస్తున్నాను. అంటే నేను పూర్తిగా మనస్సు యొక్క స్వాధీనంలో వున్నట్లే గదా! నేను పరాధీనుడ్నే గదా! దీనుడ్నే గదా! ఈ మనస్సులో వున్న పూర్వ వాసనలు ఎట్లా ఆడిస్తే అట్లా ఆడవలసినవాడ్నే గదా! ఇక, ఈ జన్మలో నాకు స్వాతంత్ర్యం ఎక్కడ వుంటుంది? అలాంటప్పుడు మీరు నన్ను పట్టుకొని పురుషకారం చెయ్యి, పురుషకారం చెయ్యి, అని ప్రాణం తీస్తే నేనేమి చేయగలను?

***వశిష్ఠుడు*:–** రామా! ఒక రహస్యాన్ని నువ్వు పట్టుకోలేక పోతున్నావు. చెపుతా విను. పూర్వజన్మవల్ల ఈ జన్మలో కొన్ని ఫలితాలు నీకు వస్తాయి. ఆ ఫలితాల మీద నీకు స్వాతంత్ర్యం లేదు. అయితే ఆ ఫలితాలు కాకుండా, రాబోయే జన్మలో నువ్వు ఏ ఫలితాలు అనుభవించాలని అనుకుంటున్నావో, అలాంటి ఫలితాలకు అనుకూలమైన కర్మను చేసేందుకు, ఈ జన్మలో నీకు స్వాతంత్ర్యం వుంది. ఇదే శాస్త్రరహస్యం. కనుక, ఏ మానవుడూ కూడా సత్కర్మ చేయటానికి నాకు స్వాతంత్ర్యం లేదు అనుకోకూడదు. ఇప్పుడు చేసే సత్కర్మ ఇప్పుడే ఫలితం ఇవ్వాలంటే కుదరక పోవచ్చు. దీనికి నీ వెనుకటి పాపఫలం అడ్డుపడవచ్చు. అంతే గానీ, రాబోయే సత్ఫలితం కోసం ఇవాళ నువ్వు సత్కర్మ చేయటానికి నీకు స్వాతంత్ర్యం లేకపోవటం అనే మాట లేదు.

రామా! నీ వ్యక్తిగత విషయం దగ్గరికి వస్తే, నువ్వు మంచి కుటుంబంలో పుట్టావు. విద్యావంతుల కుటుంబంలో పుట్టావు, ధనవంతుల కుటుంబంలో పుట్టావు. దీనిని బట్టి, నీయొక్క పూర్వ కర్మ మంచి పనులు చేయటానికి అనుకూలంగా వుందని అర్థం చేసుకోవాలి. నీయొక్క పూర్వజన్మ వాసనలు కూడా, అంటే, నీ పూర్వ జన్మ కర్మవల్ల నీ మనస్సులో ఏర్పడిన అభిరుచులు కూడా సత్కర్మకే అనుకూలంగా వున్నాయని మనం ఊహించాలి. అలాంటి పూర్వకర్మ దుష్టఫలితాలకే అడ్డుపడుతుంది కానీ, సత్ఫలితాలకు అడ్డుపడదు. ఇలాంటి అనుకూల జన్మలో వున్నప్పుడు కూడా సత్కర్మలు చేయటానికి స్వాతంత్ర్యం లేదు అనే సిద్ధాంతం చెప్పినట్లయితే, ఈ కర్మలు చెయ్యాలి, ఆ కర్మలు చెయ్యాలి, అని చెప్పే కర్మబ్రహ్మశాస్త్రం వుండే, అదంతా వ్యర్థమైపోతుంది. అందుకే, ఇందాక, రాబోయే జన్మల ఫలం కోసం, ఈ జన్మలో కర్మ చేసే స్వాతంత్ర్యం నీకు వుంటుందని చెప్పాను.

నీ పూర్వ జన్మ వాసనంతా సత్కర్మలకు అనుకూలంగా వుందని గ్రహించాం గదా– అని, ఇహ చేతులు ముడుచుకొని కూర్చుంటే, రాబోయే జన్మలో సత్ఫలితాలు వస్తాయా? ఇంట్లో అన్నీ వున్నాయి. ఒంట్లో ఓపికా వుంది. అయినా అన్నం వండుకోకుండా కూర్చుంటే, ఆకలి తీరుతుందా? అలాగే నీకు అనుకూల పూర్వవాసన వున్నా సరే, ఉత్తమ పురుషప్రయత్నం చేసే తీరవలసిందే అని చెప్పాను.

## 36. దుర్వాసనలను ఆపడమెలా?

రామా! ఇక నీ విషయం వదిలేసి, సామాన్య విషయానికి వస్తే పూర్వజన్మ వాసనలు, అంటే పూర్వజన్మ సంస్కారాలు, అంటే పూర్వకర్మవల్ల ఈ జన్మలో మనస్సులో కలిగే భావాలు, రెండు రకాలుగా వుంటాయి. 1.శుభవాసన 2. అశుభ వాసన. ఒక వేళ నీకు శుభవాసనలే వారసత్వంగా సంక్రమించి వస్తే నువ్వు త్వరగా మోక్షాన్ని చేరుకోగలుగుతావు. ఒక వేళ అశుభవాసనలే నీకు సంక్రమించి వస్తే, అవి నిన్ను సంసార బంధనలోకి అధికంగా తోస్తూ వుంటే, వాటిని నువ్వు బలాత్కారంగా జయించాలి. దానికోసమే నీవు ఈ జన్మలో మంచి వాసనలు సంపాయించుకోవాలి. మంచి కర్మలు చెయ్యాలి.

అదేమిటండీ? వెనకాల జన్మనుంచి వారసత్వంగా వచ్చిపడుతున్న దుస్సంస్కారాలు ఇప్పుడు నేను వద్దంటే అగుతాయా? ఇప్పటి నా ప్రయత్నాలకు లొంగుతాయా?– అంటావేమో? ఇక్కడ ఒక రహస్యం వుంది. ఏమిటంటే– పూర్వ సంస్కారాలన్నీ విత్తనాల వంటివి. విత్తనాలు వాతావరణం అనుకూలిస్తేనే మొలకెత్తుతాయి. అలాగే విత్తనాల వంటి నీ పూర్వజన్మ దుస్సంస్కారాలు ఈ జన్మలో నీకు వారసత్వంగా వచ్చినా, వాటికి అనుకూలమైన వాతావరణం కలసి వస్తేనే అవి కార్యరూపంగా మొలకెత్తగలవు. ఉదాహరణకు, ఒకడికి పూర్వసంస్కారంవల్ల దొంగతనం చేసే ప్రవృత్తి వుందనుకో, సంస్కారరూపమైన ఆ ప్రవృత్తి కార్యరూపంలోకి రావాలంటే, వాడికి దుస్సాంగత్యం అనే వాతావరణం కలిసి రావాలి. అలాంటి దుర్జన సాంగత్యం వాడికి దొరక్కపోతే, వాడికి చెడు సంస్కారం వున్నా చెడు పని జరగదు.

అందుచేత, ఎవడైనా ఒకడు తనకు దుస్సంస్కారాలు వారసత్వంగా పూర్వజన్మనుంచి సంక్రమించాయని గుర్తు పట్టగలిగితే, వాడు తక్షణమే సత్సాంగత్యం చెయ్యాలి. సచ్ఛాస్త్రాలు అభ్యసించాలి. అలా నిరంతరంగా వదిలి పెట్టకుండా చేస్తే, లోపల వుండే దుస్సంస్కారాలనే విత్తనాలు క్రమక్రమంగా ఎండిపోయి, చివరికి తాలు, తప్ప కింద మారిపోతాయి. అలా మారిపోయిన తరువాత, ఇక మళ్ళీ చెడు వాతావరణం కలసి వచ్చినా కూడా, అవి మొలకెత్తవు.

కాబట్టి, రామా! నేను జన్మాంతర సంస్కారాలకు బానిసనై పడివున్నాననే బెంగ, దిగులు, నీకు అక్కర్లేదు. ఇలాంటి బెంగవల్ల ఒక ప్రమాదం వుంది. ఈ బెంగ వున్నవాడు చవటతనంలో పడిపోయి, ఈ జన్మలో మంచి సంస్కారాల కోసం కృషి చెయ్యడు. అందువల్ల, ఓ రామా నువ్వు అలాంటి బెంగలో పడక దృఢ చిత్తంతో మంచి ప్రయత్నం చెయ్యి.

## 37. అంతర్యామి నడిపిస్తున్నాడనవచ్చా?

ఇంత చర్చ జరిగాక, రాముడు మరో సందేహాన్ని బయటపెట్టాడు.

**రాముడు**:– అది కాదు, గురుదేవా!– బృహదారణ్యకోపనిషత్తులో

**యో మనసి తిష్ఠన్**

**మనసోఽ ంతరః**

**యం మనో న వేద**

**యో మనోఽ ంతరో యమయతి–** అని వుంది.

అంటే– నా మనసులోనే ప్రేరకుడైన చేతన పురుషుడొకడు వున్నాడు. వాడు మనస్సుకంటే సూక్ష్మమైనవాడు. వాడ్ణి మనస్సు కూడా గుర్తు పట్టజాలరు. అలాంటి ప్రబలుడైన ప్రజ్ఞాత్ముడొకడు నా మనసులో వుండి. నన్ను నడిపిస్తున్నాడని వేదం చెబుతూ వుంటే, లోకంలోని పండితులు వాడ్ణే దైవం అని పిలుస్తూ వుంటే, మీరు దైవమే లేదు పొమ్మంటారేమటి? అంత ప్రబలుడైన ప్రజ్ఞాత్ముడు నా మనస్సుకు కూడా తెలియకుండా దానిలోనే తిష్ఠ వేసి,దాన్ని తోలుబొమ్మ ఆడించినట్లు ఆడిస్తూ వుంటే, ఇక నేనేమి చేయగలను? అలాంటి నన్ను పట్టుకొని నువ్వు ఇలా చెయ్యి, అలా చెయ్యి, అని శాసిస్తే ఉపయోగం ఏముంది?

**వశిష్ఠుడు**:– రామా! నువ్వు చెప్పిన వేదభాగాన్ని అంతర్యామి బ్రాహ్మణం అంటారు. దాంట్లో నువ్వు చెప్పిన ప్రజ్ఞా పురుషుడు నీ మనస్సులో మాత్రమే తిష్ఠ వేసుకుని కూర్చొన్నాడని చెప్పలేదు. భూమి లోపల వుండి, భూమికి తెలియరాకుండా వుండి, ఆ భూమినే తనకు శరీరంగా స్వీకరించి, ఆ భూమిని తనే నియమిస్తూ వుంటాడనీ, అలాగే పంచభూతాలన్నిటినీ గూడా ఇదే ప్రకారంగా నియమిస్తూ వుంటాడనీ, అంతే గాక, నీ ప్రాణంలోనూ, నీ ఇంద్రియాలలోనూ కూడా, వాడే అంతర్గతుడై వుండి, వాటిని నియమిస్తూ వుంటాడనీ, చెప్పారు. నీ దేహంలోనూ, నీ ఇంద్రియాలలోనూ, నీ మనస్సులోనూ, నీ ప్రాణంలోనూ, అన్నిటిలోనూ అనుగతంగా వ్యాపించి వున్నవాడవు నువ్వేనా? నీకంటే వేరే ఎవరైనా వున్నారా? నీలో నువ్వు గాక వేరే ఎవరైనా వున్న అనుభవం నీకుందా?

**రాముడు**:- నాకలాంటి అనుభవం లేదండి. నాలో నేను కాకుండా వేరే ఎవరైనా వున్నారంటే, ఒప్పుకో బుద్ధి కాదు. అయితే మాత్రం, వేదం చెబుతుంటే కాదని ఎలా అనగలం?

**వశిష్ఠుడు**- నువ్వు ఈ ప్రశ్న వేస్తావని నాకు తెలుసయ్యా! విను చెబుతాను. నువ్వు చెప్పిన అంతర్యామి బ్రాహ్మణమే, ఆ ప్రజ్ఞాపురుషుడు అన్నిటినీ నియమిస్తూ, నీలోనే వున్నాడని పెద్ద పట్టీ చెప్పి చెప్పి, చివరికి ఏమంటోందంటే–

**నాన్యోతోఽ స్తి ద్రష్టా నాన్యోతోఽ స్తి శ్రోతా**

**నాన్యోతోఽ స్తి మంతా నాన్యోతోఽ సి విజ్ఞాతా॥–** అంటోంది.

అంటే, నీలో వుండి చూసేవాడూ, నీలో వుండి అనుభవించేవాడూ, ఒక్కడే గానీ, ఇద్దరు కాదంటోంది.

అందుచేత నువ్వను కొంటున్నట్లుగా ఈ అంతర్యామి బ్రాహ్మణం నీలో నీకంటే భిన్నంగా వేరే జ్ఞాత వున్నాడని చెప్పటం లేదు. పైపెచ్చు నువ్వే ఆ ప్రజ్ఞాత్ముడవు, అని చెపుతోంది. రామా! దీనినిబట్టి ఏమి తేలిందంటే, ప్రజ్ఞాత్మ అనీ, విధి అనీ, రకరకాల పేర్లు పెట్టి, మీరంతా పిలిచేవాడు, వేరెవడో కాదు, నువ్వే. నిన్ను ప్రేరేపణ చేసుకొనేది నువ్వే. ఈ మాట కాదంటే మరొక చిక్కు కూడా వస్తుంది. ఏమంటావా?

సరే, వాదనకోసం నిన్ను ప్రేరేపించే ప్రజ్ఞాత్ముడు నీలో వేరే వున్నాడనుకో. వాడు ప్రేరేపిస్తున్నాడు అంటే, వాడు స్వతంత్ర చేతనుడు అని అర్థం. నువ్వు వాడిచేత నిరంతరం ప్రేరేపింప బడుతున్నావంటే, నువ్వు స్వతంత్ర చైతన్యం లేనివాడవని అర్థం. నీ అనుభవంలో నువ్వు జడానివా? చైతన్యానివా? నిస్సంశయంగా చేతనానివే కదా! కానీ, నువ్వు చేసిన వాదనవల్ల నువ్వు జడపదార్థానివి అని తేలుతోంది. ఈ గందరగోళం ఎందుకు వచ్చిందంటే, నీలో వేరే చేతనుడు ఒకడు వున్నాడని నువ్వు భావించినందువల్ల వచ్చింది. కనుక, ఆ భావన తప్పు.

**రాముడు**- అయ్యా! నన్ను వేరొకరు ప్రేరేపించినంత మాత్రాన నేను జడాన్నే అయిపోవాలనే నియమేమిటి? గొల్లవాడు గోవులను తోలుక పోతున్నాడు. అక్కడ గొల్లవాడూ చేతనుడే. గోవులూ చేతనాలే. అలాగే అంతర్యామి నన్ను తోలుకుపోతూ వుంటాడు. ఐనా నేను చేతనుడ్నే. ఇందులో తప్పేమిటి?

## 38. స్వాతంత్ర్యం అంటే?

**వశిష్ఠుడు**:- రామా! సరిగ్గా నిర్వచనాలు తెలుసుకొని మాట్లాడితే ఈ చిక్కురాదు. చేతనుడు అంటే ఏమిటి? ఎవడికైతే స్వతంత్రమైన క్రియాశక్తి వుంటుందో, వాడు చేతనుడు. స్వతంత్రమంటే ఏమిటి? ఎవడైనా సరే, ఒక పని చేయాలంటే, వాడికి కొన్ని క్రియాసాధనాలు కావాలి. ఆ సాధనాలు వాడు చెప్పినట్టు వింటూ వుంటే, వాడు స్వతంత్రుడు. అలా గాక, ఆ సాధనాల ఇష్టప్రకారం వాడు నడుచుకొంటూ వుంటే, వాడు అస్వతంత్రుడు. ఎలాగంటే, నువ్వు రాజువి. నీకు పక్క రాజుమీద యుద్ధం చేయాలనిపించింది. కానీ, నువ్వొక్కడివే యుద్ధం చేయగలవా? నీకు సహాయకులు కావాలి. మంత్రులు, సేనాపతులు, సైనికులు కావాలి. నువ్వు, "ఆక్రమణ్" అని ఒక్క అరుపు అరవంగానే, నీ మంత్రులూ, సేనాపతులూ, సేనలూ, అందరూ ముందుకు దూకి యుద్ధం చేస్తున్నారనుకో, అప్పుడు ప్రజలంతా నిన్ను "ఈయన చాలా స్వతంత్రుడండి, ఈయనకి ఎవరి సలహాలు అక్కర్లేదు" అంటారు. నువ్వు "ఆక్రమణ్" అనగానే, నీ సైనికులు నీ దగ్గరకు వచ్చి, "మహాప్రభో! ఇప్పుడు యుద్ధం చేయడం మంచిదికాదు. మాకు పండుగలు వస్తున్నాయి. తరువాత యుద్ధానికి వెళదాం లెండి" అని వాదించసాగారనుకో, అప్పుడు ప్రజలు "ఈ రాజుగారు స్వతంత్రుడు కాదండీ, సైనికులు చెప్పినట్లు ఆయన నడుచుకోవలసిందే. స్వతంత్రంగా ఏ నిర్ణయాలూ తీసుకోలేడు" అంటారు. కనుక, ఓ రామా! క్రియాసాధనాలమీద పరిపూర్ణమైన అదుపాజ్ఞలు కలవాడే స్వతంత్రుడు. అలాంటి స్వతంత్రమైన క్రియాశక్తి కలవాడే చేతనుడు.

**రాముడు**- గురుదేవా! కొంచెం ఆగండి, మీరు. చేతన పద నిర్వచనంలోకి వెళ్ళే ముందు, స్వాతంత్ర్య పద నిర్వచనంలోనే నాకు కొంచెం సందేహం వుంది. ఏమంటే, తనయొక్క క్రియా సాధనాల మీద పూర్తిగా ఆధిపత్యం వుండటం పేరే స్వాతంత్ర్యం అని మీరంటున్నారు. నాకేమో ఆ నిర్వచనం అంత రుచించడం లేదు. ఏ సాధనాలతోనూ పనిలేకుండా తనంతట తానుగానే పనులు చేసుకొనేవాడే స్వతంత్రుడు, అని చెబితే బావుంటుందని నా అభిప్రాయం.

ఒక సూర్యుడున్నాడు. ప్రకాశించడానికి ఎవరి సహాయం తీసుకుంటున్నాడు? ఆయన స్వతంత్రంగా ప్రకాశిస్తున్నాడు. సృష్టికర్త అయిన భగవంతుడున్నాడు. ఈ పంచభూతాలానూ సృష్టి చేయటానికి ఆయన ఎవరి సహాయం తీసుకున్నాడు? ఆయనే స్వతంత్రంగా సృష్టి చేస్తున్నాడు. అలాంటివాళ్ళనే స్వతంత్రులు అనాలి. అంతే గానీ, ఏవేవో సాధనాలను ఉపయోగించే రాజులు మొదలైనవాళ్ళను స్వతంత్రులనటం బాగా లేదు. కనుక, స్వతంత్రం అనే పదానికి ఏ క్రియాసాధనాలూ లేకుండానే పని చేసేవాడు, అనే నిర్వచనం చెప్పితే బాగుంటుందేమో!

## 39. క్రియ అంటే?

***వశిష్ఠుడు:-*** "రామా! లోతుగా ఆలోచిస్తున్నావు. అది మంచిదే. కానీ, నువ్వు ఉపయోగించే ప్రతిపదాన్నీ నిర్వచనం చేసి ఉపయోగించుకోవాలి. నువ్వు స్వాతంత్ర్యం అనే పదానికి కొత్త నిర్వచనం చెబుతూ, సూర్యుడ్ణి ఉదాహరణ ఇచ్చావు. సూర్యుడు ప్రకాశించటం అనే క్రియను స్వతంత్రంగా చేస్తున్నాడు అన్నావు. స్వతంత్రం, అస్వతంత్రం మాట తరువాత చూద్దాం. సూర్యుడు ప్రకాశించటం అనే క్రియను నిజంగా చేస్తున్నాడా?

ఇది తేలాలంటే క్రియ అంటే ఏమిటో తెలియాలి. నువ్వు బాగా ఆలోచించు. లోకంలో ఎన్ని రకాల క్రియలు వున్నాయో, అవన్నీ బాగా ఒక సారి నెమరు వేసుకో. ఆ క్రియలన్నిటినీ జాతులు జాతులుగా విభజించుకో. ఆ క్రియాజాతులన్నిటిలోనూ సామాన్యాంశంగా (కామన్‌గా) ఏముందో పరిశీలించు. ఆ కామన్ ఫ్యాక్టరే క్రియ అనే దానియొక్క మూలరూపం అవుతుంది.

ప్రపంచంలో ఎక్కడైనా సరే, ఏదైనా క్రియ జరిగిందంటే, అక్కడ కదలిక వుండి తీరాలి. దీనినే స్పందన అంటారు. స్పందన లేకపోతే క్రియే లేదు. ముందు మనసులో స్పందన రావాలి. మనసు ద్వారా ఇంద్రియాలలో స్పందన రావాలి. మనసు ద్వారా ఇంద్రియాలలో స్పందన రావాలి. ఇంద్రియాల ద్వారా పనిముట్లలో స్పందన రావాలి. అప్పుడే క్రియ జరుగుతుంది. కనుక, క్రియ అంటే నిర్వచనం స్పందనే.

నువ్వు చెప్పిన సూర్యుడిలో ప్రకాశించటం క్రియ అయితే, ప్రకాశించడం కోసం అతను స్పందిస్తూ వుండాలి. అంటే కదులుతూ వుండాలి. అలా జరుగుతూ వుందా? పోనీ, ఒక దీపం ప్రకాశిస్తోంది అంటే, ఆ దీపం కదులుతోందా? దీపజ్వాలలోని అణువులు స్పందిస్తున్నాయండీ, అంటావేమో! ఈ సందర్భంలో ఆ మాట చెల్లదు. ఎందుకంటే, మనం ఉదాహరణ తీసుకొనేటప్పుడు ఆ వస్తువును ఏ దృష్టితో తీసుకుంటున్నామో, ఆ దృష్టితోనే మాట్లాడాలి. ఇక్కడ దీపము, సూర్యుడు, అన్నప్పుడు లోకసామాన్యంగా ఉండే దీపాన్నీ, సూర్యుడ్ణీ, ఉదాహరణగా తీసుకున్నామే తప్ప, రసాయనిక శాస్త్రంలోనూ, కాంతి శాస్త్రంలోనూ, వుండే సూర్యుడ్ణి ఉదాహరణగా తీసుకోవడం లేదు. కనుక, నువ్వు చెప్పిన సూర్యుడు కానీ, దీపం కానీ, ప్రకాశించడం కోసం ప్రత్యేకంగా కదలికను పొందడం లేదు. కనుక, నువ్వు చెప్పిన సూర్యుడు ప్రకాశించటం అనే క్రియకు కర్త కాడు.

## 40. కర్త అంటే

రామా! ఇక్కడ మరొక అంశం కూడా వుంది. పోనీ, కాసేపు వాదం కోసం సూర్యుడు ప్రకాశించడమనే క్రియకు కర్తగా వున్నాడనుకొందాం. లోకంలో ఏ కర్తకైనా సరే, కొన్ని అంతర్గత సాధనాలూ, కొన్ని బహిర్గత సాధనాలూ, వుండాలి. అలాంటి సాధనాలతో పని చేసేవాడు ఒకే కాలంలో అన్ని పనులూ చేయలేడు. అంతే

గాక, వాడియొక్క పనితీరు వాడియొక్క సాధనాలను బట్టి, మారిపోతూ వుంటుంది. ఒక్కొక్క సారి సమర్ధవంతంగా పని చేస్తాడు. మరొక్క సారి చెయ్యలేడు. ఇది ప్రపంచంలో ఏ కర్తకైనా తప్పదు. నీ వాదం ప్రకారం, సూర్యుడు ప్రకాశన క్రియకు కర్తైతే, వాడు కూడా తన సాధనాలు బాగుంటే, బాగా ప్రకాశిస్తాడు. అవి బాగా లేకపోతే, తను బాగా ప్రకాశించ లేడు. అని చెప్పవలసి వస్తుంది. ఇది లోకవిరుద్ధమైన మాట కదా! ఈ గందరగోళం ఎందుకు వచ్చిందంటే, సూర్యుడు ప్రకాశన క్రియకు కర్త అనుకోవటంవల్ల వచ్చింది. కనుక, ఆ మాట తప్పు.

**రాముడు**:- ఎన్ని చెప్పినా ప్రకాశన క్రియకు సూర్యుడు కర్తకాకపోతే ఇంకెవడౌతాడండీ?

**వశిష్ఠుడు**:- రామా! జాగ్రత్తగా విను. ప్రకాశనం అనేది క్రియ అయితే, దానికి కర్త ఎవడనే మాట తరువాతి ప్రశ్న. సూర్యుడు ప్రకాశించడమనేది క్రియే కాదని నేను చెబుతున్నాను. ప్రకాశించడం సూర్యునియొక్క స్వభావం. స్వభావం వేరు, క్రియ వేరు. క్రియకు స్పందన వుండాలి. స్వభావానికి స్పందన వుండక్కర్లేదు. ఈ స్తంభం ఇక్కడ వుంది– అన్నామనుకో! వుండడమనేది ఆ స్తంభానికి స్వభావమే తప్ప, ఆ స్తంభం చేసే క్రియ కాదు.

**రాముడు**:- మరి లోకంలో పెద్దలంతా సూర్యుడు ప్రకాశిస్తున్నాడు అని, క్రియాపదాన్ని ప్రయోగిస్తున్నారు కదండీ.

**వశిష్ఠుడు**:- ప్రయోగిస్తున్నారయ్యా! అది లోకులు వాడే తేలిక మాటే తప్పితే, లోతైన మాట కాదు. అసలు సూర్యుడు ప్రకాశిస్తున్నాడు అనే మాట ఎలా వచ్చింది, అంటావా? లోకంలో మనకు ఒక వస్తువు కనబడాలంటే, సూర్యుడు ప్రక్కన వుండాలి. సూర్యుడు ఏమీ చెయ్యక్కర్లేదు. వొట్టిగా ప్రక్కన వుంటే చాలు. ఈ వస్తువులన్నీ ప్రకాశిస్తాయి. సూర్యుడు లేకపోతే ఇవి ప్రకాశించవు. ఈ విధంగా వస్తువులన్నీ ప్రకాశించటానికి సూర్యుడియొక్క సన్నిధి కారణమవుతోంది కనుక, సూర్యుడి సన్నిధిలో వస్తువులు ప్రకాశిస్తున్నాయి– అని చెప్పాలి. అలా చెప్పకుండా లోకులు సూర్యుడు ప్రకాశిస్తున్నాడు, అని చెప్పేస్తున్నారు. అందువల్ల, ఇక్కడ ప్రకాశిస్తున్నాడు అనే క్రియాపదం వున్నప్పటికీ, సూర్యుడిలో ఏ క్రియా కూడా లేదు. తన చుట్టుప్రక్కలలో వున్న వస్తువులనన్నిటినీ నిరంతరం ప్రకాశింప చేస్తూ వుండటం సూర్యునియొక్క స్వభావం. దానికోసం ఆయన ఏ పనీ చెయ్యడు.

## 41. భగవంతుడు స్వతంత్రుడే

రామా! మనం స్వతంత్రం అంటే ఏమిటి– అని విచారణ చేసున్నాం. ఏ పనిముట్లూ లేకుండా పని చేయడమే స్వతంత్రం అని నువ్వు అన్నావు. దానికి ఉదాహరణగా సూర్యుడ్ణి ఇచ్చావు. ఈ ఉదాహరణలో సూర్యుడు చేసేది పనే కాదని ఇప్పుడు నిరూపణ అయిపోయింది.

ఇహ పోతే, నువ్వు నీ రెండవ ఉదాహరణగా భగవంతుడ్ణి ఇచ్చావు. దీన్ని విచారిద్దాం.

భగవంతుడు సృష్టి అనే క్రియను చేస్తున్నాడు. కానీ, ఎలా చేస్తున్నాడు? ఏ ఏ జీవులు, ఏ ఏ కర్మలు చేసుకొన్నారో, ఆ కర్మలకు ఏ ఏ ఫలితాలను అందించాలో, దానికి తగిన విధంగా సృష్టి, స్థితి, సంహారాలను చేస్తున్నాడు. ఇది శాస్త్రాలన్నీ అంగీకరించిన విషయమే. అంటే ఏమిటి? భగవంతుడు తను సృష్టి చేయడానికి జీవులయొక్క కర్మలనే సాధనాలుగా తీసుకుంటున్నాడు. సాధనాలు లేకపోతే ఆయనకి సృష్టి, స్థితి, సంహారాలు చేయవలసిన పని లేదు. చేసే వీలూ లేదు. కనుక, నువ్వు చెప్పిన భగవంతుడు కూడా సాధనాలు లేకుండా పని చెయ్యడం లేదు. నువ్వేమో ఏ సాధనాలూ లేకుండా పని చేసేవాడే స్వతంత్రుడు అన్నావు. కనుక, నీ నిర్వచనం ప్రకారం భగవంతుడు కూడా స్వతంత్రుడు కాడు. భగవంతుడే స్వతంత్రుడు కాకపోతే, మనకు

ప్రపంచంలో వేరే స్వతంత్రుడు దొరుకుతాడా? మనం చెప్పే నిర్వచనానికి ఉదాహరణగా చెప్పదగ్గవాడు ఒక్కడు కూడా దొరక్కపోతే, అలాంటి నిర్వచనంవల్ల ప్రయోజనం ఏమైనా వుంటుందా? కనుక, ఓ రామా! నీ నిర్వచనం సరి కాదు. అంటే, ఏ సాధనాలూ లేకుండా పని చేసేవాడే స్వతంత్రుడు– అనే నిర్వచనం సరి కాదు.

అందువల్ల ఓ రామా! సాధనాలను ఉపయోగిస్తూ కూడా, సాధనాలకు లోబడి వుండకుండా, సాధనాలను తన స్వాధీనంలో వుంచుకో గలవాడే స్వతంత్రుడని మేము చెప్పాం. ఈ నిర్వచనం ప్రకారం. భగవంతుడు అస్వతంత్రుడు కాడు. ఎందుకంటే, ఆయన సృష్టి, స్థితి, లయలు చేయటానికి జీవులయొక్క కర్మలను సాదనాలుగా వాడుకుంటాడు. అంతే గానీ, ఆ కర్మలకు లోబడి తను ప్రవర్తించడు. కనుక, మేము చెప్పినట్టుగా సాధనాలను వాడుతూ కూడా వాటికి లోబడకుండా, వాటిని తన అధీనంలో, వుంచుకునే వాడే స్వతంత్రుడు– అని నిర్వచనం చెప్పడం మాత్రమే బాగుంటుంది.

రామా! ఇంతకూ మనం స్వతంత్రం అనే పదం గూర్చి ఇంత చర్చ ఎందుకు చేశామంటే, స్వతంత్రమైన క్రియాశక్తి గలవాడే చేతనుడు అని, చేతనుడియొక్క నిర్వచనాన్ని చెప్పుకొంటూ, దానికోసం ఈ చర్చ చేశాం. చేతన నిర్వచనం గూర్చి ఎందుకు చర్చిస్తున్నామంటే, చేతనం అంటే ఏమిటి? జడం అంటే ఏమిటి?– అని తెలుసుకోవడం కోసం చర్చిస్తున్నాం. ఈ చర్చ ఎందుకంటే, ఇద్దరు చేతనులు ఒకరినొకరు ప్రేరేపించుకోవటం కుదురుతుందా? అనే అంశం తేలడం కోసం. అదెందుకయ్యా అంటే, నాలోనే అంతర్యామి అనేవాడు ఒకడు వేరుగా వుండి, వాడు అనుక్షణమూ నన్ను నియమిస్తూ వున్నాడేమో, అనే అనుమానం నీకుంది. "కారును నడిపినట్టుగా వాడు నిన్ను అనుక్షణమూ నడుపుతూ వుంటే, నువ్వు కారు లాగా జడమే అయిపోతావు గదయ్యా!"– అని మేమన్నాం. నువ్వేమో "నన్ను నడిపేవాడు గొల్లవాడిలాంటి వాడు. నేనేమో గోవులాంటివాణ్ణి, ఇద్దరమూ చేతనులమే" అన్నావు. అక్కడ నుంచి జడమంటే ఏమిటి? చేతనం అంటే ఏమిటి? – అనే చర్చ సాగింది. ఇప్పటికి నిర్వచనాలు తేలాయి. ఇక నువ్వు చెప్పిన ఉదాహరణ గూర్చి విచారణ చేద్దాం.

## 42. నువ్వే స్వతంత్ర కర్తవ్వు

రామా! గొల్లవాడు– గోవు, ఉదాహరణగా చెప్పావు. ఇద్దరూ చేతనులే అన్నావు. చేతనుడు అంటే స్వతంత్రుడైన క్రియాకర్త, అని చెప్పుకున్నాం కదా! నీ ఉదాహరణలో గోవును గొల్లవాడు 24 గంటలూ తోలుతూనే ఉంటాడా? అది సాధ్యం కాదుగదా! గొల్లవాడు తోలినప్పుడు అది కొన్ని పనులు చేస్తుంది. కొన్ని పనులు ఎవడూ తోలకుండానే, స్వతంత్రంగా, చేసుకొంటుంది. అంతే గదూ?

ఇంక నీ విషయంలోకి రా. నీ వాదం ప్రకారం– నీలో నువ్వు, అంతర్యామి, అనే ఇద్దరు చేతన వ్యక్తులు వున్నారు. వీటిలో నువ్వు గోవులాంటి వాడివి. ఆ అంతర్యామి గొల్లవాడి లాంటివాడు. అంతే గదూ! అయితే, నువ్వు ఆ గోవు లాగానే కొంతసేపు, ఈ అంతర్యామితో పని లేకుండా, నీకు తోచిన పనులు నువ్వు చేసుకుంటూ వుండాలి. కానీ, నువ్వేమో దానికి ఒప్పుకోవడం లేదు. "24 గంటలూ, 360 రోజులూ, ఆ అంతర్యామి నన్ను ప్రేరేపిస్తూనే వున్నాడు. వాడు ఎలా ప్రేరేపిస్తే నేను అలా నడవ వలసిందే, వాడు ప్రేరేపించకపోతే నోరు మూసుకుని, అలా పడి వుండవలసిందే. నాకు అంతకంటే వేరే గతి లేదు" అంటున్నావు. నీ పరిస్థితి నిజంగా ఇదే అయితే, నీకు గోవుతో పోలిక కుదరదు. నువ్వు కారులాంటి వాడివే అవుతావు. అంటే, నువ్వు జడానివే అవుతావు. అది తప్పదు. అందుకే, "నిన్ను నిరంతరమూ ప్రేరేపించే అంతర్యామి అని

వేరే ఒకడు వుంటే, నువ్వు జడానివే కావలసి వస్తుందయ్యా!" అని నేనన్నాను. నువ్వు జడం కావటం సాధ్యం కాదు కనుక, లోపల వున్న అంతర్యామీ, నువ్వూ, ఒక్కటే తప్ప వేరు కాదు. కనుక, ఓ రామా! నిన్ను ప్రేరేపించేవాడు వేరే ఎవ్వడూ లేడు. నువ్వే స్వతంత్ర కర్తవు. కనుక, విధి అనే భ్రాంతిలో పడకుండా నీ పురుషప్రయత్నం నువ్వు చెయ్యి.

**రాముడు–** ఒక చేతనుడ్ని మరొక చేతనుడు ప్రేరేపించటం సాధ్యం కాదంటారా?

**వశిష్ఠుడు –** రామా! ఒక దీపాన్ని మరొక దీపం ప్రకాశింప చెయ్యటం సాధ్యమే కాదంటారా? – అని అడిగినట్లుగా వుంది నీ ప్రశ్న. చేతనుడు అంటే, దీపం లాగా స్వతంత్రంగా ప్రకాశించేవాడు అని అర్థం. ఒక దీపాన్ని ప్రకాశింప చేయటానికి మరొక దీపం కావాలని ఒప్పుకొంటే, దాన్ని ప్రకాశింప చేయటానికి మరొక దీపం కావలసి వుంటుంది. దానికి మరొక దీపం కావలసి వుంటుంది. ఇలా ఈ వరుసకే అంతు వుండదు. అప్పుడు దీపం ప్రకాశిస్తోంది, అనే మాటే అర్థరహితమై పోతుంది. కనుక, చేతనుడు స్వతంత్ర ప్రకాశశీలుడు, అని అంగీకరించినప్పుడు, ఇక మళ్ళీ వాడికి నిరంతరమూ ప్రేరేపించేవాడు మరొకడు వున్నాడనడం సాధ్యం కాదు. కనుక, రామా! ఎన్ని విధాలుగా చూసినా, నీలో వున్న చేతనుడవు నువ్వే. కనుక, నీయొక్క విధివి నువ్వే. అందువల్ల, విధి మీది భయాన్ని వదిలిపెట్టి, నిర్భయంగా నీ పురుషప్రయత్నాన్ని కొనసాగించు.

## 43. మనస్సును మంచికి మళ్ళించడమెలా?

***రాముడు***:- గురుదేవా! మీ విస్తారమైన చర్చవల్ల, విధి విషయంలో నాకున్న భ్రమలన్నీ తొలగిపోయాయి. అయితే, నా పూర్వ జన్మ వాసనలు నన్ను ప్రబలంగా దుష్కర్మల వైపే లాగుతూ వుంటే, నేను నా మనస్సును సత్కర్మలలోకి ఎలా ప్రవేశ పెట్టాలో, ఆ ఉపాయం తెలియడం లేదు. దయచేసి ఆ విషయం వివరించండి.

***వశిష్ఠుడు***:- రామా! ఇందులో పెద్ద కష్టమేమీ లేదు. మన మనస్సుందే, అది పసిపిల్ల వంటిది.

**అశుభాచ్చాలితం యాతి శుభం తస్మా దపీతరత్।**

**జంతోశ్చిత్తం తు శిశువత్ తస్మాత్తచ్చాలయే ద్బలాత్॥** (ము.వ్య.ప్ర.స.9,శ్లో.32)

పసిపిల్లలు చూడు. అమ్మ కేకలేస్తే, నాన్న దగ్గరికి పోతారు. నాన్న, కేకలేస్తే, అమ్మ దగ్గరికి పోతారు. అలాగే ఈ మనస్సు కూడా ఒక్కొక్క సారి శుభవాసనల దగ్గరికి పోతుంది. మరొక సారి అశుభవాసనల దగ్గరికి పోతుంది. మనస్సు సహజంగానే అశుభవాసనల దగ్గరికి వెళ్ళిందనుకో, అప్పుడు దాన్ని అక్కడ గల అశుభ వాసనలు కసురుకున్నాయనుకో, అప్పుడా మనస్సు రెట్టింపు వేగంతో, శుభవాసనల దగ్గరికి వచ్చేస్తుంది. అలాగే మనస్సు శుభ వాసనల దగ్గరికి వెళ్ళిందనుకో, అప్పుడు దాన్ని అక్కడ గల శుభవాసనలు కసురుకున్నాయనుకో, అప్పుడా మనస్సు రెట్టింపు వేగంతో, అశుభవాసనల దగ్గరికి పోతుంది. ఇక్కడ దుర్వాసనలు కానీ, శుభవాసనలు కానీ, కసురుకోవడం అంటే, వాటికి అనుకూలమైన వాతావరణం లేకుండా పోవటమే, వాతావరణం అనుకూలంగా లేకపోతే, మనస్సు బుడుంగున రెండో దిక్కుకు పారిపోతుంది.

కనుక, రామా! నీ మనస్సు సహజసిద్ధంగా సద్వాసనల వైపుకు పోతోందా, దుర్వాసనల వైపుకుపోతోందా, అని పరిశీలించుకో, సద్వాసనలవైపే పోతోందనుకో, నీ పని తేలికైనట్లే, దానికి అనుకాలమైన వాతావరణం నీ చుట్టూ వుండేటట్లు చూసుకొంటే చాలు. సద్వాసన దానంతటదే బలపడి పోతుంది. ఒక వేళ నీ మనస్సు సహజంగానే దుర్వాసనల వైపు పోతోందనుకో, అప్పుడు కొంచెం గట్టిగా కృషి చెయ్యాలి. కృషి అంటే నువ్వు నీ మనస్సుతో ఏమీ కుస్తీ పట్టక్కర్లేదు. దుర్వాసనలకు అనుకూలమైన దుర్జనుల సాంగత్యాన్ని, దుష్ట వాతావరణాన్ని

మాత్రం దగ్గరకు రానీయకుండా వుంటే చాలు. నీ మనస్సుని సద్వాసనల వైపు మళ్ళించడానికి, అయినా, బలంకోసం సత్సాంగత్యాన్నీ, సత్పురుషుల వాతావరణాన్నీ, నీ చుట్టూతా వుండే ఏర్పాటు చేసుకో. ఇక నీ మనస్సు పొమ్మన్నా దుర్వాసనల దగ్గరకు పోదు.

అయితే, రామా! నీకు ఇక్కడ ఒక హెచ్చరిక కూడా చెయ్యాలి. ఏమంటే, మనస్సు పసిపిల్లవాడి లాంటిదని చెప్పుకున్నాం కదా. పసిపిల్లవాడికి మొదట్లో తల్లిదండ్రులు కొన్ని అలవాట్లు చేసి, వున్నట్లుండి ఆ పద్ధతులు మార్చేసి, కొత్త పద్ధతులు మొదలు పెట్టమని గోల గోల చేశారనుకోండి. వాడికి అదీ అర్థం గాక, ఇదీ అర్థం గాక, పిచ్చెక్కిపోతుంది. అలాగే, నువ్వే నీ పూర్వజన్మలో చేసిన అభ్యాసబలంవల్ల, నీ మనసుకి దుష్ట వాసనలు పట్టి వున్నట్లైతే ఆ మనస్సుని నీవీనాడు మంచి మార్గంలోకి తిప్పవలసి వుంటే, పిల్లవాడికి నోట్లో వేలు మాన్పించినట్లు, ఉపాయంగా నేర్పుగా, మెల్లి మెల్లిగా, మార్పు తీసుకురావాలి కానీ, మూర్ఖంగా, క్రూరంగా, అతి వేగంగా, ఆ పని చేయరాదు.

**సమతాం సాంత్వనేనాశు న ద్రాగితి శనైశ్శనైః।**
**పౌరుషేణైవ యత్నేన పాలయేచ్చిత్త బాలకం॥** (ము.వ్య.ప్ర.స.9, శ్లో.33)

పురుషప్రయత్నం చెయ్యమన్నాం గదా అని, ఉపాయం లేకుండా మోటుగా మనస్సుని విరుగ గొట్టరాదు. ఈ హెచ్చరికను మనస్సులో పెట్టుకొని, రామా! నీ మనస్సును శుభవాసనల వైపుకు మళ్ళించు.

## 44. సద్భావనే మందు

**రాముడు**:- గురుదేవా! నా మనస్సు ఒక్కో సారి శుభవాసనల వైపుకు పోతోంది. ఒక్కో సారి అశుభవాసనల వైపుకు పోతోంది. వీటిలో ఏది బలంగా వుందో, ఏది బలహీనంగా వుందో, నాకే సరిగా అర్థం కావటం లేదు. ఇలాంటప్పుడు నేనేం చెయ్యాలి?

**వశిష్ఠుడు**:-

రామా! మంచి ప్రశ్నే వేశావు. పూర్వ జన్మలో శుభవాసనో, అశుభవాసనో, ఏదో ఒకటి నువ్వు గడ్డకట్టించుకున్నావు. అది నువ్వు చేసుకున్న పనే. అది ఏదైనా, నీకు ఇవ్వాళ కావలసింది మాత్రం శుభవాసన. అందుకోసమని నువ్వు వెనకాల జన్మలో ఏమి చేశావు, నీ పాత ఖజానాలో ఏ ఏ కర్మలున్నాయి, అనే ఆలోచనలను మానేసి, ఇప్పుడు సద్వాసనలకు అనుకూలమైన వాతావరణం పెంచుకో. అనగా, ఇప్పుడు దుర్జన సాంగత్యం వదిలేసి సజ్జన సాంగత్యాన్ని బాగా పెంచుకో. ఆ సజ్జనులు చెప్పిన రీతిగా నీ ఆలోచనలను మలచుకో. సజ్జనులు చెప్పిన రీతిగా మంచి మాటలు నేర్చుకో. సజ్జనులు చెప్పిన రీతిగా నీ చేతలు సరిదిద్దుకో. ఆ రకంగా ఇప్పుడు, ఈనాడు, ఇక్కడ, నువ్వు నీ సద్వాసనలను గట్టిగా గడ్డకట్టించు.

**వాసనౌఘుస్త్వయా పూర్వం అభ్యాసేన ఘనీకృతః।**
**శుభో వాప్యశుభో వాపి శుభమద్య ఘనీకురు॥** (ము.వ్య.ప్ర.స.9,శ్లో.34)

పూర్వం నువ్వు శుభాన్ని గడ్డకట్టించావో, అశుభాన్ని గడ్డకట్టించావో, తెలియదు. ఒకటి మాత్రం తెలుసు. దేన్ని గడ్డకట్టించినా, నీ అభ్యాసబలంతోనే గడ్డకట్టించావు. అంతవరకు ఖాయం. ఇప్పుడు నువ్వు ఆ అభ్యాసబలాన్నే ఆశ్రయించు. అయితే ఈ మాటు "శుభమద్య ఘనీకురు" శుభాన్ని మాత్రమే గడ్డకట్టించు.

రామా! పూర్వం చేసిన అభ్యాసబలంవల్ల ఒక రకమైన వాసనలు ఘనీభవించి, ఇవాళ దుష్ఫలితాన్ని

స్తున్నాయి. ఈ ఫలితాలను చూసి, "అయ్యో! పూర్వం ఎలాంటి పాడు పనులు చేశానో" అని విలపించే బదులు, ఒక సత్యం గ్రహించు. ఏమంటే, గట్టి అభ్యాసంతో ఏ పనులు చేసినా సరే, వాటికి కొంచెం వెనుకో, ముందో, ఫలితాలు వచ్చి తీరుతాయని, మన అనుభవమే మనకు నిరూపిస్తోంది. ఇలా గ్రహిస్తే, మనకు వచ్చే లాభం ఏమిటంటే, ఇవాళ మనం చేసే మంచి ప్రయత్నాలకు వెంటనే ప్రత్యక్ష ఫలితాలు కనిపించక పోయినా, పూర్వ జన్మలో చేసిన అభ్యాసాలయొక్క ఫలితం ఈ జన్మలో అందుకున్నట్లుగా, ఇప్పుడు మనం చేసే అభ్యాసాలయొక్క ఫలితం కనీసం వచ్చే జన్మలోనైనా మనకు అంది తీరుతుంది అనే విశ్వాసం మనకు దృఢపడుతుంది. అప్పుడు " "అయ్యో! ఎవరో ముసలివాళ్ళు చెప్పిన మాటలు పట్టుకొని ఇంత శ్రమపడుతున్నానే, దీనికేమైనా ఫలితం వుంటుందో, వుండదో", అనే సందేహం నీకుండదు. సందేహం లేకుండా సత్కర్మల చేస్తే, ఆ సత్కర్మ మరింత వేగంగా ముందుకు సాగుతుంది. కనుక, ఓ రామా! అన్ని రకాల సందేహాలనూ వదిలి, గట్టి పురుష ప్రయత్నాన్ని ఆశ్రయించి, నీ మనస్సును సద్భావనల వైపు మళ్ళించేందుకు, కృషి చెయ్యి.

### 45. మన ఊహ తప్పైతే?

***రాముడు***:- గురుదేవా! మీరు చెప్పింది చాలా యుక్తి యుక్తంగా వుంది. కానీ, ఒక చోట మాత్రం యుక్తి కొంచెం దుర్బలంగా వుందేమో అనిపిస్తోంది. ఎక్కడంటే, పూర్వజన్మలో చేసిన అభ్యాసబలంవల్ల, ఇవాళ ఈ ఫలితాలు మనకు వస్తున్నాయనీ కనుక, ఇవాల్టి ఫలితాలను బట్టి మన వెనుకటి కర్మలు ఎలాంటివని ఆలోచించకుండా, ఆ నాటి అభ్యాస బలమే ఇవాళ ఫలితాలిస్తోందనీ, ఇదే విధంగా మనం సాధించిన అభ్యాసాల బలం పై జన్మకు సత్ఫలితాలను ఇస్తుందనీ, గ్రహించాలని మీరు చెప్పారు. దీనిలో ఇవాల్టి ఫలితాలు వెనుకటి అభ్యాసాలవల్లే కలిగాయని రుజువు ఏమిటి? ఏదో ఊహిస్తున్నాం. ఆ ఊహలు పట్టుకొని. ఇవాళ నానా కష్టాలూ పడి సదభ్యాసాలు చేస్తున్నాం. ఒక వేళ మన ఊహే తప్పనుకోండి. ఆ ఊహ మీదే ఆధారపడి ఇవాళ మనం చేసే శ్రమంతా బూడిదలో పోసిన పన్నీ రైపోదా? కనుక, సందేహాస్పదంగా వున్న పరిస్థితుల్లో, మనం ఇంత కష్టపడటం సబబేనంటారా?

***వశిష్ఠుడు***:- రామా! ముమ్మాటికీ సబబే. ఇవాల్టి ఫలితాలు నిన్నటి జన్మలోని అభ్యాసాలవల్ల వచ్చినవే అని, నేను నిరూపించగలను. అయినా, ఇప్పుడా పని చెయను. నీ యుక్తి మీదే ఆధారపడి, నీకు సమాధానం చెబుతాను. నువ్వన్నట్టుగానే, ఇప్పటి ఫలితాలు వెనుకటి అభ్యాసాలవల్ల వచ్చాయని మనం ఊహిస్తున్నాం. ఈ ఊహ నిజం కావచ్చు, కాకపోవచ్చు.

ఒక వేళ నీ ఊహ నిజమే అయిందనుకో, అప్పుడు నువ్వు చేసే ఈ నాటి అభ్యాసాలన్నీ, సఫలాలే అవుతాయి. ఒక వేళ నీ ఊహ నిజంగా నిజమైవుండి, నువ్వు మాత్రం ఆ ఊహ తప్పనే భ్రాంతిలో పడి, ఇవాళ అభ్యాసాలు సరిగ్గా చెయ్యలేదనుకో, అప్పుడు నీకు రాబోయే నష్టాన్ని ఎవ్వడూ ఆపలేడు. ఒక వేళ నీ ఊహ – పాత అభ్యాసాలవల్లే ఈ నాటి వాసనలు వస్తాయనే ఊహ నిజంగానే అసత్యం అనుకో. అయినా సరే ఈ నాడు నువ్వు సదభ్యాసాలు చేస్తున్నావనుకో. దీనివల్ల ఏ రకమైన నష్టమూ వచ్చే అవకాశం లేదు.

కాగా, ఈ నాడు సదభ్యాసాలు చేస్తే, ఏ రకమైన నష్టమూ వచ్చేందుకు వీలు లేదు, చెయ్యకపోతే మాత్రం నష్టం వచ్చే అవకాశాలు మాత్రం వున్నాయి. అంటే, ప్రాబబిలిటీ వుంది. ఇలాంటప్పుడు రిస్కు తీసుకొని, సదభ్యాసాలు ఎగగొట్టడం మంచి దంటావా? ఆచరించడం మంచిదంటావా? విజ్ఞుడెవడైనా సరే,

సదభ్యాసం చేసే తీరుతాడు. అందుకే, వెనుకటి వాసనల గురించి ఆలోచించకుండా, ఈ నాడు సదభ్యాసాల బలం పెంచుకోమని నేను చెప్పాను.

రామా! ఇక అభ్యాసాలవల్ల ఫలితం వస్తుందనేది ఊహ కాదనీ, సత్యమనీ, నీకు సులభంగా రుజువు చూపిస్తాను.

**యద్యదభ్యస్యతే లోకే తన్మయేనైవ భూయతే।**

**ఇత్యాకుమారం ప్రాజ్ఞేషు దృష్టం సందేహవర్జితం॥** (ము.వ్య.ప్ర.స.9, శ్లో.39)

లోకంలో చిన్న పిల్లలకు పెద్ద పెద్ద పాఠాలు చెబితే త్వరగా రావడం లేదు. అలాంటి పిల్లలు గట్టిగా ఆభ్యాసం చేస్తే, పెద్ద పెద్ద పాఠాలు కూడా గడగడా అప్పజెపుతున్నారు. ఇలా పాఠాలను అభ్యాసం చేసే ముందర ఆ పిల్లలకు గానీ, ఆ పిల్లల తల్లిదండ్రులకు గానీ, ఆ పిల్లల గురువులకు గానీ, " ఈ అభ్యాసంవల్ల ఫలితం వుంటుందో, లేదో" అనే సందేహం ఏ ఒక్కరికీ ఉండటం లేదు. ఎవరికీ లేని సందేహం నీకెలా వచ్చింది? కనుక, రామా! ఏ సందేహాలకూ తావు లేదు. నీవు ఆచరించ వలసిన మార్గాన్ని స్పష్టంగా నిర్దేశిస్తున్నాను, విను. ఇప్పుడు నువ్వు పరమసత్యం ఏదో తెలియని స్థితిలో వున్నావు. ఇప్పుడు నీలో శుభవాసనలు, అశుభవాసనలు, కలగా పులగంగా వున్నాయి. అందుచేత నువ్వు నీ సొంత ఆలోచనలకు ప్రాముఖ్యం ఇవ్వబోకు.

**గురు శాస్త్ర ప్రమాణైస్తు నిర్ణీతం తావదాచర।** (ము.వ్య.ప్ర.స.9,శ్లో41)

గురువులు, శాస్త్రాలు, ప్రమాణపూర్వకంగా ఏ నిర్ణయాలు చేశారో, ఆ నిర్ణయాల ప్రకారం నడుచుకో. అలా చేస్తూ పోతే, నీలోని అశుభవాసనలు తొలగిపోయి, శుభవాసనలు మాత్రమే మిగులుతాయి.

**తతః పక్వకషాయేణ నూనం విజ్ఞాత వస్తునా॥** (ము.వ్య.ప్ర.స.9,శ్లో.42)

అలా శుభవాసనలే మిగిలివున్న దశలో నీ మనస్సు పరిపక్వమవుతుంది. దానివల్ల పరతత్త్వదర్శనం లభిస్తుంది. "విజ్ఞాత వస్తునా" అలా పరతత్త్వ దర్శనం లభించినాక, నువ్వు నీలోని శుభవాసనలను కూడా అప్రయత్నంగానే పరిత్యాగం చేస్తావు. అప్పుడు నీవు సుఖదుఃఖాలు రెండూ లేని ఆనంద స్థితికి చేరుకుంటావు. రామా! నీవు అనుసరించ వలసిన ఆచరణ ప్రణాళిక ఇది.

## 46. సుఖం - ఆనందం

ఇక్కడ పాఠకులకు ఒక సూచన. వశిష్ఠుడి మాటల్లో, చివర్లో, సుఖదుఃఖాలకు అతీతమైన అనందస్థితి – అనే మాట వచ్చింది. సుఖమన్నా, ఆనందమన్నా, ఒక్కటే గదా! సుఖానికి అతీతమైన ఆనందస్థితి అనే మాట ఎలా కుదురుతుంది? అదే సందేహం కలగవచ్చు. దీని గురుంచి చిన్న వివరణ వుంది. లోకంలో సామాన్యంగా మనకు కలిగే సుఖాలన్నీ ఇంద్రియాలవల్లే కలుగుతున్నాయి. అయితే, ప్రతిరోజూ గాఢ నిద్రలో సుషుప్తి అవస్థను అనుభవించి బయటకు వచ్చాక, "హమ్మయ్యా! హాయిగా, సుఖంగా, నిద్రపోయాను" అని మెలకువ వచ్చాక చెపుతున్నాడు. ఈ సుషుప్తి అవస్థాసమయంలో ఇంద్రియాలు గానీ, మనస్సు గానీ, పనిచేయడం లేదు. అయినా సరే, ఆ సమయంలో ఒక హాయి, ఒక సుఖము ఏదైనా అనండి, అనుభవానికి వచ్చింది. ఇది మామూలుగా ఇంద్రియాల ద్వారా అనుభవానికివచ్చే సుఖం లాగానే, మళ్ళీ మళ్ళీ కావాలనే కోరికను కలిగిస్తుంది. అంటే, నాకు మళ్ళీ నిద్రాసుఖం కావాలని ప్రతివాడూ కోరుకుంటున్నాడు. అందువల్ల ఇది కూడా సుఖాల జాతిలో చేరిందే. కానీ, మామూలు సుఖానికీ, దీనికీ, ఒక ప్రబలమైన భేదం వుంది. ఏమంటే, ఈ సుషుప్తి సుఖం, ఇంద్రియాలవల్ల కానీ, మనస్సువల్ల కానీ కలగదు. ఈ భేదం స్పష్టంగా తెలిసేందుకోసం, దీనికి

అనందమని ప్రత్యేకంగా పేరు పెట్టారు.

ఈ దృష్టితో చూసినప్పుడు సుఖం వేరు, అనందం వేరు, ఆత్మానందమని మనం వ్యవహరించుకొనే ఆనందం కూడా ఇలాంటిదే. అంటే, ఇంద్రియాలతో నిమిత్తం లేకుండా కలిగేదే. అందువల్ల, వశిష్ఠుడు సుఖదుఃఖాలకు అతీతమైన ఆనందస్థితి అన్నప్పుడు, ఆనందం అంటే, ఆత్మానందమని మనం అర్థం చేసుకోవాలి. వేదాంత గ్రంథాలలో ఒక్కొక్కప్పుడు ఆనందము, సుఖము అనే పదాలను సమానార్థకాలుగా గూడా వాడుతూనే వుంటారు గానీ, ఎక్కువగా ఆనందం అనే పదాన్ని పారిభాషిక పదంగా స్వీకరించి, ఆత్మానందం అనే అర్థంలోనే ఉపయోగిస్తూ వుంటారు. వేదాంత గ్రంథాలు చదివేటప్పుడు ఈ విషయాన్ని మనం గుర్తు పెట్టుకోవాలి.

## 47. చర్చలో మలుపులు

ఇంతకూ వశిష్ఠుడు  చెప్పిన అసలు విషయం ఏమంటే, శ్రీరాముడియొక్క కార్యాచరణ ప్రణాళిక, దానీ ఫలితమూను. ఈ ముముక్షు వ్యవహార ప్రకరణంలో వశిష్ఠమహర్షియొక్క బోధనా ప్రణాళిక ఏమిటో, మనం పూర్వం చెప్పుకొన్నాం. ఒక సారి గుర్తుచేసుకోండి. ఈ ప్రణాళిక ప్రకారం వశిష్ఠమహర్షి మున్ముందుగా పురుషప్రయత్నంయొక్క ప్రాధాన్యాన్ని వివరించదలచుకున్నాడు. ఆ తరువాత ఆయన ఆత్మవిచారణ గురించి చెప్పదలచుకున్నాడు. అందులో నాల్గవ సర్గ దగ్గర నుంచి తొమ్మిదవ సర్గ దాకా, ఆరు సర్గల్లో, పురుష ప్రయత్నంయొక్క ప్రాముఖ్యాన్ని విస్తరించారు. ఇప్పుడు మనం తొమ్మిదవ సర్గ చివరిలో వున్నాం.

అయితే వెనక్కి తిరిగి చూసుకుంటే, పురుషప్రయత్నాన్ని గురించి ఇంత చర్చ చేశారు కదా, చివరికి ఏమి తేలినట్లు? ఈ చర్చ ఎన్ని రకాల మెలికలు తిరిగినట్టు ? ఆ వొంపు సొంపులన్నీ తెలియాలంటే మనం మళ్ళీ ఒక సారి విషయాన్ని సింహావలోకనం చెయ్యాలి. ఆ పని ఇప్పుడు చేద్దాం.

మామూలుగా మానవులు తామనుకున్నట్లుగా  పనులన్నీ జరిగాతే, ఇది మా ప్రతాపం అంటారు. అనుకున్నట్లు జరక్కపోతే, "దైవానుకూలం కలిసిరాలేదయ్యా! దానికి ఎవడేం చేస్తాడు?" అంటారు. పని చెడిపోయినప్పుడు మాత్రమే దైవం సంగతి ఎత్తుతున్నారు. పని సాగినప్పుడు దానిపేరే ఎత్తట్లేదు. అందువల్ల, ఆ దైవం అంటే ఏమిటి? ఇది నిజంగా స్వతంత్రమైన శక్తి అవునా, కాదా, అనే సందేహాలు వస్తాయి. ఈ ప్రశ్నతోనే వశిష్ఠుడు చర్చ ప్రారంభించాడు.

లోకంలో మామూలుగా ఏం చెప్పకుంటారంటే, కొందరికి అనుకున్న పనులన్నీ చకచకా జరిగిపోతూ వుంటాయి. మరి కొందరికి మాత్రం అంతకంటే శక్తియుక్తులు ఎక్కువే వున్నా, పనులు కలిసిరావు. ఎందుకంటే–వీరికి దైవానుకూలం లేదు. కాబట్టి, దైవమనే ఒక స్వతంత్ర శక్తి వుంది, అది అనుకూలించినవారికి పనులు బాగా జరుగుతాయి. అది అనుకూలంగా లేని వాళ్ళకు  పనులు జరగవు. అంటారు. ఇది లోకసామాన్యంగా అందరూ చెప్పుకునే మాట.

ఇక్కడే వశిష్ఠమహర్షి ఒక ప్రశ్న లేవదీశాడు. దైవమనే ఒక స్వతంత్రశక్తి వున్నట్లయితే, అది కొందరికి మాత్రమే అనుకూలంగా వుండి, మరి కొందరికి వ్యతిరేకంగా వుండవలసిన పని ఏమి వచ్చింది? – అని. దానిమీద బాగా విచారణ చేసి, మానవులు పూర్వజన్మలో చేసుకొన్న కర్మల సముదాయాన్నే దైవమని పిలుస్తున్నారు తప్పితే, వేరే దైవమనే శక్తి ఏదీ లేదని నిరూపించాడు. లోకులంతా దైవము, విధి, అనుకునేది, ఒకప్పుడు నీవు చేసుకున్న కర్మే కనుక, ఈ నాడు నీవు చేసుకోనే కొత్త కర్మతో పాతదానిని జయించవచ్చు– అని నిరూపించాడు. అలా నిరూపించి, ప్రతి మానవుడు ఈ జన్మలో మంచి వాసనలు కలిగేటట్టుగా కృషి చేసుకోవాలి, అని

కార్యాచరణ మార్గం దగ్గరకు వచ్చాడు. గత ఆరు సర్గలలోనూ జరిగిన చర్చకు సారాంశం ఇదే.

ఇక జ్ఞానాన్ని సాధించుకొనే విధానాన్ని చెప్పబోతూ, మున్ముందుగా బ్రహ్మగారి దగ్గరనుంచి తన దాకా, ఈ జ్ఞానం దిగి వచ్చిన క్రమాన్ని వర్ణించాలని సంకల్పించాడు. దానికి పీఠికగా వశిష్ఠుడు ఒక కొత్త విషయాన్ని ఆవిష్కరించాడు. ఏమంటే–

## 48. నియతి

రామా! ఈ సృష్టిని బాగా పరిశీలించి చూడు. ఈ భూమి, ఈ సూర్యుడు, చంద్రుడు, గ్రహాలు, నక్షత్రాలు, మొదలైనవన్నీ వాటి వాటి నియమిత మార్గాలలో, నియమిత వేగాలలో, క్రమం తప్పకుండా, సంచరిస్తున్నాయి. అలాగే మనిషికి మనిషే పుడతాడు. ఆవుకి ఆవే పుడుతుంది. అగ్ని దహిస్తోంది. వాయువు కదిలిస్తోంది. ఈ నియమాలు ఏవీ  కూడా ఎక్కడా తప్పడం లేదు.

ఇలా ప్రపంచంలో మహాభూతాలన్నీ, వేటి పని అవే చేసు కుంటున్నాయి. ఎక్కడా నియమం తప్పడం లేదు. ఋతువులు తమ నియమం ప్రకారం నడుస్తున్నాయి. సృష్టి ప్రళయాలు తమ నియమం ప్రకారం నడుస్తున్నాయి. ఇలా సృష్టిలోని ప్రక్రియలన్నీ నియమబద్ధంగా నడిచే ప్రక్రియను –"నియతి" అని పిలుస్తారు. లోకంలో ప్రతి వైజ్ఞానికుడూ కూడా తను పరిశోధనలు చేయదలచుకున్న విషయంలో "నియతి" ఏమిటో కనిపెట్టాలని ప్రయత్నం చేస్తాడు. అంటే ఉదాహరణకు, ఒక వైద్యశాస్త్రజ్ఞుడు ఒక ఔషదాన్ని తీసుకొని పరిశోధన మొదలు పెట్టినప్పుడు, ఈ ఔషధం వల్ల ఆవశ్యంగా వచ్చే గుణాలేమిటి అని పరిశోధన చేస్తాడు. అంటే, ఆ ఔషధానికి సంబంధించిన "నియతి" కనిపెడతాడు. ఈ ఔషధం ఫలానా వ్యాధిని పోగొడుతుంది అనే సత్యమే నియతి. ఆ నియతిని కనిపెట్టాక, ఇక వాడు మాటిమాటికీ ఆ విషయం పరిశోధన చెయ్యక్కర్లేదు. ఆ వ్యాధి వున్న చోటల్లా ఈ ఔషధం వేస్తాడు. వ్యాధి తగ్గిపోతూ వుంటుంది. ఈ నియతిని కనిపెట్టినాక, ఈ పరిశోధకుడు మాత్రమే గాక, ఎవడు ఆ ఔషధాన్ని ఉపయోగించినా, ఆ ఫలితం అలాగే వస్తూ వుంటుంది. అలా వస్తేనే అది "నియతి" అవుతుంది.

రామా! ఇంతకూ చెప్పదలచుకున్న దేమంటే, ఈ సృష్టిలో ప్రతి అణువు, ప్రతి గోళము, ప్రతి జీవి, ప్రతి బ్రహ్మాండము, అన్నీ గూడా ఒకానొక "నియతి" ప్రకారమే నడుస్తున్నట్లు మనకు స్పష్టమవుతోంది. ఆ నియతి అంటే ఏమిటో ఇప్పుడు నువ్వు ఆలోచించు.

**రాముడు**:- గురుదేవా! మీరు నియతిని గురించి వివరించిన విధానాన్ని బట్టి చూస్తే, లోకం ఒప్పుకొనే దైవం, మీరు చెప్పే నియతి, రెండూ ఒకటేనేమోనని మొదట్లో అనిపించింది. కానీ, దైవమనేది జీవియొక్క పురాతన కర్మ తప్పితే, మరొకటి కాదని, నిరూపణ జరిగిపోయింది కనుక, అదీ ఇదీ ఒకటే అనుకోవడం కుదరదు. కనుక, మీరు చెప్పే నియతి అనే పదానికి, 'వస్తుస్వభావం" అనే అర్థం చెబితే సరిపోతుందేమో అనిపిస్తోంది.

**వశిష్ఠుడు**:- రామా! విషయానికి బాగా దగ్గరగా వచ్చావు. కొంచెం తేడా వుంది. చెబుతాను విను.

**యథాస్థితం బ్రహ్మతత్త్వం సత్తా నియతి రుచ్యతే।**

**సా వినేతుర్వినేతృత్వం సా వినేయ వినేయతా॥** (ము.వ్య.ప్ర.స.10,శ్లో.1)

ప్రపంచంలో యథార్థంగా వున్న సత్యపదార్థం పరబ్రహ్మ ఒక్కటే. మనకు కనిపించే దృశ్య ప్రపంచంలోని వస్తువులన్నిటికీ సత్యమైన సత్త లేదు. కానీ, ఆ పరబ్రహ్మలో గల సత్తాయే వీటికి కూడా సంక్రమించి, ఇవి కూడా వున్నట్టుగా కనిపిస్తుంటాయి. "ఈ వర్తమాన కాలంలో కొన్ని వస్తువులు మన ఎదురుగుండా వున్నాయి"

అంటున్నాం. ఇక్కడ "వున్నాయి" అనే వర్తమానకాల క్రియాపదంతో మనం వ్యవహరిస్తున్నాం. భవిష్యత్ కాలంలో మరికొన్ని పదార్థాలు జన్మించబోతున్నాయి. వాటిని గురించి మాట్లాడవలసి వస్తే, "అవి వుండబోతున్నాయి" అని భవిష్యత్‌కాల క్రియా పదం వేసి మనం మాట్లాడుతాం. "వున్నాయి, వుండబోతున్నాయి," అనే రెండు పదాల అర్థాల గురించి కొంచెం ఆలోచించు. వుండడమనే క్రియ రెండింటిలోనూ సమానంగానే వ్యాపించి వుంది. భేదమల్లా కాలంలోనే. కాలమనేది, ఇదమిత్థమని నిర్వచించి చెప్పేందుకు వీలున్న పదార్థం కాదు. ఆ కాల సంబంధాన్ని తీసేస్తే, "వున్నాయి, వుండబోతున్నాయి" అనే రెండు పదాలలోనూ గల అర్థాలకి భేదమేమీ లేదు. అప్పుడు దానిని 'ఉనికి' అని పిలుస్తాం. ఈ ఉనికియే నియతి. ఇంకా బాగా అర్థం కావటం కోసం ఒక ఉదాహరణ చెబుతాను, విను.

మట్టిముద్ద వుంది. దానిలోంచి వచ్చిన కుండ వుంది. మట్టిముద్దలోంచి కుండ వస్తుంది– అనేది లోకంలో వున్న నియతి. ఇప్పుడు ఆలోచించు, నియతి అంటే ఏమిటో. మట్టి వుంది, కుండ వుండబోతోంది. కాలం ప్రకారం వరుస ఇది. మట్టి కారణం, కుండ కార్యం. కారణ, కార్యాల వరుస ఇది, మట్టి నియామకం, కుండ నియమ్యం. అంటే– రూపాన్ని ఇచ్చేది మట్టి, రూపాన్ని పొందేది కుండ.

మట్టి వున్నది అన్నప్పుడు నిజంగా దానిలో వుండేది మట్టే. వర్తమాన కాలం కాదు. కుండ వుండబోతోంది అన్నప్పుడు కూడా దానిలో వుండబోయేది మట్టే గానీ, భవిష్యత్ కాలం కాదు. కనుక, ఈ ఉదాహరణలో "వున్నది, వుండబోతోంది," అనే రెండు పదార్థాలలోనూ అనుగతంగా వున్నది మట్టే.

అలాగే మట్టి కారణమని పిలిచినప్పుడు, కారణత్వం అనేది దానికి మనం పెట్టుకున్న పేరే గానీ, అక్కడ నిజంగా వున్నది మట్టి మాత్రమే. అలాగే, కుండ కార్యము అని చెప్పినప్పుడు, కార్యత్వం అనేది మనం పెట్టుకున్న పేరే గానీ, అక్కడ వున్నది మట్టి మాత్రమే. కనుక, ఇక్కడ కార్య కారణాలు రెండింటిలోనూ అనుగతంగా వున్నది మట్టి మాత్రమే.

అలాగే, మట్టి నియామకము అన్నప్పుడు, అక్కడ నిజంగా వున్నది మట్టే, కుండ నియమ్యము అన్నప్పుడు, అక్కడ నిజంగా వున్నది మట్టే. కనుక, యీ రెంటిలోనూ అనుగతంగా వున్న "నియతి" మట్టే.

రామా! ఇప్పుడు చెప్పిన దాన్నే వెనక్కి తిప్పి చెబుతాను చూడు. నియతి అనుగతంగా వుంది కనుక, నియామక, నియమ్యాలు రెండింటిలోనూ అనుగతంగా వున్నది నియతి. కారణ కార్యాలు రెండింటిలోనూ అనుగతంగా వున్నది నియతి. వర్తమాన భవిష్యత్ కాలాలు రెండింటిలోనూ అనుగతంగా వున్నది నియతి. మన ప్రస్తుత ఉదాహరణలో నియతి అంటే– మట్టి.

అదే న్యాయాన్ని ప్రపంచమనే కార్యానికీ, పరబ్రహ్మమనే కారణానికీ సమన్వయం చెయ్యి. అక్కడ ఆ రెండింటిలోనూ అనుగతంగా వున్నది సత్త. అందువల్ల లోకం మొత్తంమీద నియతి అంటే– సత్త ఒక్కటే. ఆ సత్తయే యథార్థమైన బ్రహ్మతత్త్వం. అందుకే, ఇందాక నేను నీకు

**యథాస్థితం బ్రహ్మతత్త్వం**

**సత్తా నియతి రుచ్యతే–** అని చెప్పాను.

కారణ కార్యాలలోనూ, వర్తమాన భవిష్యత్తులలోనూ, నియామక నియమ్యాలలోనూ, అనుగతంగా వుండేది నియతే కనుక, నేను నీకు ఇందాక చెప్పిన శ్లోకంలో

**సా వినేతు ర్వినేతృత్వం**

**సా వినేయ వినేయతా–** అని చెప్పాను.

కారణ రూపంలోనూ, కార్య రూపంలోనూ, వుండేది ఒకే ఒక పదార్థం కనుకనే, లోకంలో ఎవరైనా

సరే, ఒక కారణానికీ, ఒక కార్యానికీ, గల సంబంధాన్ని కనిపెడితే, వాటిలో వున్న నియతి, అనగా సత్తాలక్షణం, ఏ మార్పూ లేకుండా శిలాశాసనం లాగా వుండిపోతుంది.

రామా! ఈ నియతి గురించి నీకు ఇంత గట్టిగా ఎందుకు చెప్పానంటే, పురుషప్రయత్నానికీ, ఫలితానికీ, ఇలాంటి నియతి వుంది. నియతిని ఈ రకంగా అర్థం చేసుకోక, కొందరు నియతి అంటే దైవమే అనీ, విధి అనీ, పొరపాటు బడుతూ వుంటారు. నువ్వు ఆ పొరపాటు పడలేదు. సంతోషం. పురుషకారానికీ, ఫలితానికీ గల సత్తారూపమైన నియతిని నువ్వు బాగా గుర్తించు. అంటే, కారణమే కార్యం. రెంటికీ భేదం లేదు. మట్టీ కుండ రెంటికీ భేదం లేదు. అలాగే, నువ్వు చేసే పురుష ప్రయత్నానికి, నువ్వు పొందే ఫలితానికీ, భేదం లేదు. కనుక, ఓ రామా!

**అతః పౌరుష మాశ్రిత్య శ్రేయసే నిత్యబాంధవమ్।**

**ఏకాగ్రం కురు తచ్చిత్తం శృణు చోక్తమిదం మమ॥** (ము.వ్య.ప్ర.స.10,శ్లో.2)

పురుషప్రయత్నము, శ్రేయస్సు, అనేవి కారణ కార్యాల లాగా నిత్య బంధువులని గ్రహించు. నా మాట విని, నీ మనస్సును సద్వాసనల మీద ఏకాగ్రం చెయ్యి.

## 49. బ్రహ్మోపదేశము

రామా! మనస్సుకి, ఇంద్రియాలకీ, ఒక స్వభావం వుంది. అవి ఎంత సేపటికీ మోక్షం కంటే క్రింది మెట్టులో వున్న ఇహలోక సుఖాల మీదా, పరలోక సుఖాల మీదా, ఆశతో ఆరాటపడుతాయే గానీ, అంతకన్నా పైకి పోలేవు. అది వాటి స్వభావం. అందుచేత నువ్వేం చెయ్యాలంటే, నీ ప్రయత్నంతో వాటిని నీ స్వాధీనంలోకి తెచ్చేసుకోవాలి. అలా చేసుకుంటే, మోక్షోపాయాలను గురించి నేను ఇప్పుడు చేయబోయే ఉపదేశం ఉపయోగిస్తుంది. నేనిప్పుడు చెప్పబోయే ఈ ఉపదేశ గ్రంథమంతా నా స్వకపోలకల్పితం అనుకుంటున్నావేమో. ఎంత మాత్రమూ కాదు. ఈ శ్వేతవరాహ కల్పంయొక్క ప్రారంభంలో, బ్రహ్మదేవుడు ఈ మహోపదేశాన్ని నాకు చేశాడు. ఆ ఉపదేశం వలననే నాకు సమస్త దుఃఖాలూ నశించిపోయాయి. కనుక, ఆ ఉపదేశాన్ని నీవు గూడా వింటే, ఇక తిరుగులేని శాశ్వతానందం పొందుతావు.

***రాముడు***:- గురుదేవా! బ్రహ్మదేవుడు మీకీ మహావిద్యను ఎందుకు ఉపదేశించాడు? దానిని మీరెలా స్వీకరించారు? దయచేసి ఆ వివరాలు గూడా నాకు చెప్పండి.

***వశిష్ఠుడు***:- రామా! చిదాకాశమని ఒకటి వుంది. చిదాకాశం అంటే ఏమిటో అనుకోకు, పరమాత్మకే ఇది మరో పేరు. నీకు పూర్వమే ఒక సారి బాహ్యాకాశము, చిత్తాకాశము,చిదాకాశము, అనే విషయాలను గురించి కొంత వివరించాను. అక్కడ గూడా చిదాకాశము అంటే పరమాత్మేనని నీకు చెప్పాను.

**అస్త్యనంతవిలాసాత్మా సర్వగ స్సర్వ సంశ్రయః ।**

**చిదాకాశోఽ వినాశాత్మా ప్రదీపః సర్వజంతుషు ॥** (ము.వ్య.ప్ర.స.10,శ్లో.11)

ఈ చిదాకాశమే సృష్టి అంతటా వ్యాపించి వుండేది. ఈ సృష్టిలో కనిపించే మాయావిలాసాలన్నింటికీ అధిష్ఠానమై వున్నది గూడా ఈ చిదాకాశమే. దీనికి నాశనమే లేదు. ప్రతి జీవిలోనూ జీవాత్మ అనే పేరుతో వెలిగే దీపం కూడా ఈ చిదాకాశమే.

ఈ చిదాకాశాన్నుంచి విష్ణువు జన్మించాడు. ఇక్కడ విష్ణువంటే ఎవరనుకుంటున్నావు? సూక్ష్మ

పంచభూతాలలోనూ, స్థూల పంచభూతాలలోనూ, ఆ భూతాలవల్ల ఉత్పత్తి చెందిన భౌతిక లోకాలలోనూ, ఆ లోకాలలో వుండే జీవులలోనూ, అన్నిటిలోనూ సమంగా వ్యాపించి వుండే విరాట్పురుషుడే విష్ణువు. ఇక్కడ చిదాకాశాన్నుంచి విష్ణువు పుట్టాడంటే, తండ్రి నుంచి కొడుకు పుట్టినట్లుగా, వేరే వ్యక్తి పుట్టాడు– అనుకుంటున్నావేమో, అలా అనుకోకు.

**స్పందమానరసాపూరాత్**

**తరంగస్సాగరాదివ!** (ము.వ్య.ప్ర.స.10, శ్లో. 12)

ఆ చిదాకాశం వుందే, అది "స్పందాస్పందసమాకార" (స.10,శ్లో.12) మైనది. స్పందమంటే కదలిక. అంటే సృష్టి. అస్పందమంటే కదలిక లేకపోవడం. అంటే లయం. చిదాకాశమనేది సృష్టి దశలోనూ, లయదశలోనూ, కూడా ఒకే రకంగా వుంటుంది. అంటే, కదలిక వున్నప్పుడు, లేనప్పుడు, కూడా ఒకే రకంగా వుంటుంది. తుఫాను వచ్చినప్పుడూ, రానప్పుడూ, కూడా సముద్రం సముద్రమే కదా! తుఫాను వస్తే సముద్రం "స్పందమాన రసాపూరం" అవుతుంది. అంటే, సముద్రమనబడే జలం కదులుతుంది. అప్పుడు దానిలోంచి తరంగం – టైడల్ వేవ్– జన్మిస్తుంది. ఇప్పుడు చూడు– సముద్రం వేరు, ఈ తరంగం వేరూనా? అదీ జలమే. ఇదీ జలమే. కానీ, వేరు వేరుగా వున్నట్లు కనిపిస్తాయి. ఇలా సముద్రంలోంచి తరంగం ఎట్లా పుట్టిందో, అదే విధంగా చిదాకాశంలోనుంచి విరాట్పురుషుడు అనబడే విష్ణువు జన్మించాడు.

ఆ విష్ణుమూర్తియొక్క హృదయం ఒక పద్మం లాగా విచ్చుకొంది. మేరు పర్వతమే ఆ పద్మంలోని నడి బొడ్డు. అష్టదిక్కులే ఆ పద్మంలో దళాలు. నక్షత్రాలే ఆ పద్మంలోని కేసరాలు. అలాంటి ఆ పద్మంలోంచి బ్రహ్మ జన్మించాడు. ఆయన వేదవేదార్థవేత్తలైన దేవతలకూ, మునులకూ, కూడా నాయకుడు. మనం మన మనసులలో ఆలోచనలను సృష్టిచేసినట్లుగా, ఆ మహానుభావుడు ఈ జీవసమూహాన్ని సృష్టి చేశాడు. ఆ సృష్టి పరంపరలో ఆయన ఈ జంబూద్వీపంలో ఒక మూల, భారతవర్షమనే ప్రాంతంలో, ఆధివ్యాధులతో కూడిన జనసమూహాన్ని సృష్టి చేశాడు.

ఈ జనులంతా ద్వంద్వ పదార్థాలతో బాధలు పడుతూ, అల్పమైన ఆయుర్దాయంతో ఎప్పటికప్పుడు నశించిపోతూ, వున్నారు. వారి దీన పరిస్థితి చూసే సరికి బ్రహ్మగారికి మనస్సు కరిగింది. "అయ్యో! వీళ్ళకి ఆయుష్షూ లేదు. ఆలోచనా లేదు. వీళ్ళకు ఈ దుఃఖం పోయే ఉపాయం ఏమిటబ్బా?" అని ఒక్క క్షణం సేపు ఏకాగ్రంగా ఆలోచన చేశాడు. ఆయన సర్వ సమర్థుడు కనుక,

**తపో ధర్మం చ దానం చ సత్యం తీర్థాని చైవ హి।**

**ఏతత్సృష్ట్వా పునర్దేవః చింతయామాస భూతకృత్॥** (ము.వ్య.ప్ర.స.10,శ్లో.19)

మానవుల ఉద్ధరణకోసం ముందుగా ఆయన తపస్సును సృష్టి చేశాడు. చేశాక కొంచెం పరిశీలించి చూస్తే, దానిని ఎక్కువ మంది అందుకోగలిగినట్లు కనిపించలేదు. అందువల్ల ఆయన దానము, ధర్మము, సత్యము, వరుసగా సృష్టించుకుంటూ వెళ్ళాడు. అయినా, ప్రజలు అందుకొనేటట్లు కనిపించలేదు. అందుచేత వాళ్ళు యాత్రలు చేసుకొనేందుకోసం తీర్థాలు, క్షేత్రాలు, సృష్టిచేశాడు.

అవన్నీ సృష్టి చేశాక, మళ్ళీ ఒక నిమిషం ఆగి ఆలోచించాడు. "తపస్సు, దానము, ధర్మము, సత్యము, తీర్థాలు, క్షేత్రాలు ఇవన్నీ గూడా మానవులకు తాత్కాలిక పుణ్యాన్ని కలిగించి తద్వారా తాత్కాలిక సుఖశాంతులను కలిగిస్తాయే గానీ, దుఃఖం పూర్తిగా తొలగిపోయే శాశ్వతానందాన్ని కలిగించే మోక్షాన్ని మాత్రం అందించ లేవు" అని ఆయన గుర్తించాడు.

**సంసారోత్తరణే జంతోః ఉపాయో జ్ఞానమేవ హి-** (ము.వ్య.ప్ర.స. 10, శ్లో. 22) అనుకొన్నాడాయన.

శాశ్వతానందం కలగాలంటే జనులకు మోక్షం లభించాలి. మోక్షంవల్ల జనన మరణాలు రెండూ పోతే గానీ, శాశ్వతానందం అందదు. మోక్షం రావాలంటే, సంసారం పోవాలి. కనుక, "ఈ జనులు తరించేందుకోసం నూతనంగా ఒక ఉపాయం ఉపదేశించాలి" అని ఆయన ఆలోచించాడు.

## 50. వశిష్ఠసృష్టి

రామా! బ్రహ్మదేవుడు అలా ఆలోచించి, వెంటనే తన మనోబలంవల్ల ఇదిగో ఈ నన్ను సృష్టి చేశాడు. ఒక అలలోంచి మరో అల పుట్టినట్టుగా, నేనాయనలోంచి జన్మించాను. నేను జన్మించేసరికే నా చేతిలో ఈ కమండలం వుంది. మెడలో ఈ రుద్రాక్షమాల వుంది. మా తండ్రిగారికీ అలాగే రుద్రాక్షమాల, కమండలాలున్నాయి. నేను పుడుతూనే ఆయనకు వంగి నమస్కరించాను.

ఆయన వెంటనే, "బాబూ, రా!" అంటూ దగ్గరకు చేరదీసి, బుడుంగున నన్ను చేత్తో పైకెత్తి, తను కూర్చొన్న పద్మంలోనే తనకు ఉత్తర ముఖంగా వున్న దళం మీద కూర్చోబెట్టాడు. నేనూ తెల్లగానే వున్నాను. ఆ పద్మదళమూ తెల్లగానే వుంది. నేను దళం మీద కూర్చొనే సరికి, తెల్ల మబ్బుతునక మీదకి చందమామ ఎక్కినట్లుగా వుంది. నేనొకసారి నా వంకా, మా నాన్నగారి వంకా చూసుకున్నాను. ఆయనా జింక చర్మమే కట్టుకున్నాడు. నేనూ అదే కట్టుకున్నాను. ఇద్దరం ఒక్క పోలికగానే వున్నాం.

ఇక మా నాన్నగారు నన్ను ఆశీర్వదిస్తారు అనుకునే లోపలే, వున్నట్టుండి మా నాన్నగారు కరకుదేలి "అబ్బాయీ! ఒక ముహూర్తకాలం పాటు నీ మనస్సులోకి అజ్ఞానం ప్రవేశించుగాక! నీ మనస్సు కోతి లాగా చంచలమైపోవు గాక! చంద్రుడిలోకి మచ్చ ప్రవేశించినట్లుగా, నీలోకి అజ్ఞానం ప్రవేశించు గాక" అని శపించేశారు.

నేను ఇదేమిటని అడగడం కూడా మరచిపోయి, తెలివంతా మరచిపోయి, ఒక్కసారిగా వున్నట్టుండి దివాళా తీసిన షావుకారు లాగా దుఃఖంలో మునిగిపోయాను. నాకీ దుఃఖం ఎందుకొచ్చిందో కూడా నాకు తెలియలేదు. మామూలు సంసార మానవుడికీ పట్టినట్లే, చంచలమైన ఆలోచనలన్నీ నాకు పట్టాయి. "ఇదేమిరా? నాకిలా దుఃఖం పట్టుకుందే," అని నాలో నేనే కుమిలిపోతూ మౌనంగా వుండిపోయాను. పక్కనున్న మా నాన్నగారిని అడగాలని కూడా నాకు తోచలేదు.

అలా కొంత సేపయినాక, మా నాన్నగారే నన్ను దగ్గరకు తీసుకొని, "నాయనా! అలా దుఃఖిస్తున్నావెందుకు? దుఃఖంపోయే మార్గమేదో నన్నడగరాదా? అడిగితే నేను చెపుతా గదా! నువ్వు శాశ్వతంగా సుఖిస్తావు" అన్నారాయన.

అప్పటికి కానీ, నాకు అడగాలని తోచలేదు. అప్పుడు నేను చేతులెత్తి నమస్కరించి, "మహాప్రభో! ఈ దుఃఖస్వరూపమైన సంసారం నా నెత్తిమీద పడ్డది. ఇది ఎట్లా వచ్చింది? ఇది ఎట్లా పోతుంది? నాకు చెప్పండి" అని ప్రార్థించాను. అప్పుడు మా తండ్రి నాకు ఆ జ్ఞానాన్నంతా చాలా విస్తారంగా చెప్పాడు. పరమపావనమైన ఆ బోధ వినేసరికి, నేను ఆయన బోధించిన జ్ఞానం లాగానే నిర్మలుడ్నైపోయాను.

ఆ విధంగా నాకు మళ్ళీ పరిపూర్ణజ్ఞానం కలిగింది. నేను స్వస్థితిలోకి వచ్చాను. అప్పుడు సమస్తజీవులకు తండ్రి అయిన మా తండ్రిగారు ఇలా అన్నారు.

"నాయనా! నా శాపంవల్ల నిన్ను అజ్ఞానిని చేసి, నిన్ను ప్రశ్న వేసేవాడ్ణిగా తయారు చేశాను. ఎందుకిలా

చేశానంటే, సృష్టిలో రాబోయే జనులందరికీ ఈ జ్ఞానసారం నీ ద్వారా అందాలని ఇలా చేశాను. నేనీ ఉపదేశం చెయ్యక ముందు మకిలి పట్టిన బంగారం లాగా వున్నావు నువ్వు. ఈ ఉపదేశం చేశాక మేలిమి బంగారం అయిపోయావు. కనుక, ఓ పుత్రా! ఇక నీవిప్పుడు భూమిమీద జంబూద్వీపంలో భారతవర్షానికి వెళ్ళు. అక్కడ వుండి లోకులందరినీ అనుగ్రహించు.

" ప్రస్తుతం భారతవర్షంలో జనులంతా వేదోక్త కర్మకాండ తత్పరులై వున్నారు. వాళ్ళందరికీ నువ్వు తెలివిగా జ్ఞానబోధ చెయ్యాలి. తెలివిగా అని ఎందుకంటున్నానంటే, ఒక రకమైన మంచి అజ్ఞానంలో పడి, సత్కర్మలు చేసేవారి మనసులను ఒక్క సారిగా విరిచేయకూడదు. అందువల్ల, వారికి కర్మకాండ ద్వారానే, ఆ క్రమంలోనే, బోధచేసి, వారి మనస్సులకు వైరాగ్యం కలిగేటట్టు చేయ్యాలి. వారి ప్రజ్ఞ వికసించి, జ్ఞానవిచారణ చేసేటట్టు చెయ్యాలి. ఆ విచారణవల్ల వారికి యథార్థజ్ఞానం కలిగి, శాశ్వతానంధం లభించే లాగా చెయ్యాలి. నువ్వీ రకంగా ఉపదేశం చెయ్యాలి."

రామా! మాతండ్రిగారు ఈ కల్ప ప్రారంభంలో నాకు ఈ విధంగా ఆజ్ఞ చేశారు. అందువల్ల, ఈ కల్పం చివరి దాకా ఇలాగే అర్హులైనవారికి జ్ఞానోపదేశాలు చేస్తూనే వుంటాను. ఇదే నా కర్తవ్యం.

**కర్తవ్యమస్తి న మమేహ హి కించిదేవ**
**స్థాతవ్యమిత్యతిమనా భువి సంస్థితోఽస్మి।**
**సంశాంతయా సతతసుప్తధియేహ వృత్యా**
**కార్యం కరోమి న చ కించిదహం కరోమి॥** (ము.వ్య.ప్ర.స.10,శ్లో44)

రామా! నిజానికిది నా కర్తవ్యమేమీ కాదు. నాకసలు కర్తవ్యమే లేదు. ఎందుకంటే, నాకు కర్మవల్ల పొందవలసింది ఏమీ లేదు, నేను మనస్సుని దాటి వెళ్ళిపోయాను. అయినా వుండాలని ఇక్కడ వుంటున్నాను. బుద్ధివృత్తి పూర్తిగా శాంతించిపోయింది. అంటే, అణగారిపోయింది అయినా, అజ్ఞులైన ఈ జనులయొక్క బుద్ధిని అనుసరించి, ఏవేవో పనులు చేస్తున్నాను. అంటే, వారి దృష్టిలో కర్తగా కనిపిస్తున్నాను. అంతే గానీ, నా స్వబుద్ధితో ఏమీ చేయటం లేదు. రామా! ఇదే నా స్థితి.

## 51. విద్యావతరణ ప్రక్రియ

***రాముడు:-*** గురుదేవా! మీ తండ్రిగారు లోకుల ప్రవృత్తిని చూసి, బాధపడి, వారిని ఉద్ధరించటానికి ఆత్మవిద్యను వారికి అందించాలని భావించారని మీరు చెప్పారు కదా, అయన అలా ఎందుకు చేయవలసి వచ్చింది? విద్యావతరణ ప్రక్రియ ఆయన ఎలా నిర్వహించారు? కొంచెం వివరంగా చెప్పండి.

***వశిష్ఠుడు:-*** రామా!మా తండ్రి నన్నెందుకు సృష్టించాడో, సృష్టించి నాకు పని ఏమి ఒప్ప చెప్పాడో, ఆ వివరాలను నీకు చెప్పాను. ఇలాగే మా తండ్రి సనత్కుమారులు మొదలైన మహత్ములనూ, నారదాది దేవర్షులనూ కూడా, ఈ పని కోసమే సృష్టిచేశాడు. వాళ్ళందరికీ కూడా నాకు బోధించినట్లే, కర్మ మార్గాన్నీ, ఉపాసన మార్గాన్నీ, జ్ఞానమార్గాన్నీ కూడా, విస్తారంగా బోధించి, మానవులను ఉద్ధరించమని ప్రేరేపించాడు.

కృతయుగం వున్నంత వరకు మా పని సులభంగానే జరిగిపోయింది. కృతయుగం వెళ్ళి త్రేతాయుగం ప్రవేశించే సరికి, ప్రజల్లో చాలా మార్పు వచ్చింది. వేదోక్తమైన కర్మానుష్ఠానం ప్రజల్లో తగ్గిపోయింది. అప్పుడు మహర్షులంతా ఆలోచించి, లోకంలో ధర్మమార్గాలను నిలబెట్టడం కోసం, భూమిని పరిపాలించే రాజులను ఏర్పాటు చేశారు. ఒక్కొక్క రాజుకి దేశాలను పంచి ఇచ్చారు. ఆయా దేశాలలో ఆయా రాజులకీ, ఆయా

ప్రజలకీ, మధ్య నడిచే వ్యవహారాలూ, సంబంధ బాంధవ్యాలూ ఎలా వుండాలో నిర్ణయం చేస్తూ ధర్మశాస్త్ర గ్రంథాలు రచించారు. ఆయా రాజులకూ, అయా ప్రజలకూ, ధర్మర్థకామాలు సాధించడంకోసం యజ్ఞశాస్త్రాలను రచించారు. ఇలా మహర్షులు ఏర్పాటు తేసిన ధర్మవ్యవస్థలవల్ల త్రేతాయుగ ప్రజలకు మంచి ప్రయోజనం కలిగింది.

కానీ, కాలచక్రగమనంలో కొన్ని వేల సంవత్సరాలు గడిచి పోయేటప్పటికి, ప్రజలకు ధర్మాసక్తి తగ్గి, భోగాసక్తి పెరిగింది. రాజులకు అంతకు ముందు దాకా రాజ్యపాలన అంటే అది ఒక ఉపాసన లాగా వుండేది. ఆ భావన పోయి, క్రమంగా రాజ్యపాలనంటే, ఆధికార జులుంగా మారింది. దాంతో రాజులు ఒకరి రాజ్యాలను మరొకరు ఆక్రమించుకోవడం మొదలు పెట్టారు. రాజ్యాల కోసం యుద్ధాలు మొదలైనాయి. ఈ యుద్ధాలవల్ల రాజులకూ, రాజులనుంచి ప్రజలకు, అష్టకష్టాలు వచ్చి పడ్డాయి. ఇలాంటి దశ వచ్చే సరికి, మాబోటి మహర్షులంతా ప్రజలకు వివిధ మార్గాలలో జ్ఞానోపదేశాలు చేశారు.

రామా! మేము మొట్టమొదట ఈ ఆధ్యాత్మిక విద్యను రాజులకే ఉపదేశం చేశాం.

**అధ్యాత్మవిద్యా తేనేయం పూర్వం రాజసు వర్ణితా।**

**తదను ప్రసృతా లోకే రాజవిద్యేత్యుదాహృతా॥** (ము.వ్య.ప్ర.స.11,శ్లో17)

అందువల్లే, ఈ విద్యకు రాజవిద్య అని ప్రజల్లో నానుడి ఏర్పడిపోయింది. రాజగుహ్యం అనే పేరు గూడా వచ్చింది. ఈ విద్యవల్ల గొప్ప గొప్ప రాజులెందలో జ్ఞానసంపన్నులై, అత్యంత సమర్ధవంతంగా రాజ్యపరిపాలన చేస్తూ కూడా, తమలో తాము అత్యంత సుఖంగా వుండేవాళ్ళు. వాళ్ళ మనస్సుల్లో ఏ కల్లోలమూ వుండేది కాదు.

## 52. వివేకంలో రకాలు

అటువంటి రాజవంశంలో ఇవాళ నీవు జన్మించావు. నీకు వైరాగ్యం కలిగింది, వైరాగ్యం రెండు రకాలు.

**1. రాజసిక వైరాగ్యం**

**2. సాత్విక వైరాగ్యం**

నీలో కలిగింది సాత్విక వైరాగ్యం. జీవితంలో ఉపద్రవకరమైన సన్నివేశాలు జరిగి, ఆ సన్నివేశాల నిమిత్తంగా వైరాగ్యం కలిగితే, అది రాజస వైరాగ్యం, అలాంటి నిమిత్తము లేకుండా, కేవలం వివేకబలంచేత వైరాగ్యం కలిగితే, అది సాత్విక వైరాగ్యం.

**తవానిమిత్తం వైరాగ్యం**

**సాత్వికం స్వవివేకజమ్।** (ము.వ్య.ప్ర.స.11,శ్లో.22)

రామా! నీలో కలిగిన వైరాగ్యం అటువంటిదే. దానికి వేరే నిమిత్తాలు లేవు. కేవలం వివేకబలంవల్లే నీకు వైరాగ్యం పుట్టింది. అందువల్ల, నీది సాత్వికవైరాగ్యం. ఇలాంటి సాత్విక వైరాగ్యం కలిగినవాడే మహాత్ముడు.

రామా! సరిగ్గా పరిశీలించి చూసేవాడికి ఈ ప్రపంచమంతా గారడీగాక మరేమిటి?

**స్మశాన మాపదం దైన్యం**

**దృష్ట్వా కో న విరజ్యతే ॥** (ము.వ్య.ప్ర.స.11, శ్లో.28)

స్మశానంవంటి ఆపద ఎదురుగుండా కనిపిస్తుంటే, విరక్తి కలగని వాడెవడైనా వుంటాడా? ఇలాంటి ఉత్తమ

సాత్విక వైరాగ్యం నీకు కలిగింది కనుక, జ్ఞానోపదేశానికి నీవు అర్హుడవవుతున్నావు. ఇలాంటి వివేకపూర్వకమైన సాత్వికవైరాగ్యం అందరికీ కలగమంటే కలగదు. పరమేశ్వరుడి అనుగ్రహం వున్నవాళ్ళకే అది కలుగుతుంది. అనేక జన్మలలో సత్కర్మలు చేసి, గొప్ప తపస్సు చేసి, నియమాలు పాటించి, దానాలిచ్చి, తీర్థయాత్రలు తిరిగి, వీటన్నిటివల్లా బహుజన్మలుగా పోగుపడి వున్న పాపాలన్నీ క్షీణించిపోతే, ఇప్పుడు ఆ జీవికి ఇలాంటి పరమార్థ విచారణ చేసే వివేకం కలుగుతుంది. ఈ వివేక వైరాగ్యాలు కలిగే సమయంలో ప్రత్యేక నిమిత్తమేదీ వుండదు. కనుక, కాకతాళీయంగా జరిగిపోయినట్టుగా వివేక వైరాగ్యాలు వచ్చేస్తాయి.

కాకతాళీయమంటే, ఒక తాడిచెట్టు మీద ఒక తాటిపండు బాగా పండి, రాలటానికి సిద్ధంగా వుంది. ఇంకేముంది, అది తొడిమనుంచీ రాలిపోవలసిన క్షణం దగ్గర పడుతుండగా, ఇంతలో ఆ చెట్టు మీద ఒక కాకి వాలింది. ఆ క్షణానికే తాటిపండు రాలి క్రింద పడిపోయింది. దూరాన నిలబడి చూసే మనిషి "ఈ బండ కాకి ఆ తాటిపండు మీద వాలింది. ఆ బరువుకి తట్టుకోలేక, తాటిపండు రాలిపోయింది." అనుకొంటూవుంటాడు. కానీ, నిజానికి జరిగింది అది కాదు. కాకి వాలడానికీ, పండు రాలడానికీ, సంబంధం లేదు. రెండూ ఒకే క్షణంలో జరిగిపోయాయి. అంతే.

అలాగే, చిరకాలం పుణ్యాలు చేసి, ఈశ్వరానుగ్రహం సంపాదించిన వారికి, వున్నట్టుండి వివేకము, తద్ద్వారా వైరాగ్యము, కలుగుతూ వుంటాయి. చూసేవాళ్ళు మాత్రం దీని వెకాల జరిగిన సంఘటనకు, దీనికి, ముడిపెట్టి, ఫలానా సంఘటనవల్ల వీడికి వైరాగ్యం కలిగింది – అని అంటూ వుంటారు. నీలాంటి ఉత్తముల విషయంలో ఈ సంఘటనకీ, వైరాగ్యానికీ, మధ్య సంబంధం కాకతాళీయం వంటి సంబంధమే కానీ, మరొకటి కాదు.

రామా! ఇలాంటి వివేక జ్ఞానాన్ని పొందటం చేతకానివాళ్ళు, కేవలం కర్మతత్పరులై, బండి చక్రం తిరిగినట్టుగా స్వర్గానికీ– భూమికీ, భూమికీ– స్వర్గానికీ, తిరుగుతూ వుంటారు. అంతే గానీ, పరమపదాన్ని చూడలేరు. జ్ఞానశక్తే గనుక లేకపోతే, ఈ సంసారంలో వుండే ద్వంద్వ దుఃఖాలను– అనగా శీతోష్ణాలు, కలిమి లేములు, మొదలైనవాటివల్ల వచ్చే దుఃఖాలను సహించడమనేది ఎవడికీ సాధ్యం కాదు.

**ప్రాజ్ఞం విజ్ఞాత విజ్ఞేయం సమ్యగ్దర్శన మాధయః।**
**న దహన్తి వనం వర్షా-సిక్తమగ్ని శిఖా ఇవ॥** (ము.వ్య.ప్ర.స.11,శ్లో.41)

తేలుసుకోవలసిన జ్ఞానాన్ని తెలుసుకొంటే, ఆ తరువాత సంసారంలో ఎన్ని ఉపద్రవాలు వచ్చినా, వాడికేమీ కాదు. బాగా వాన పడి. చెట్లన్నీ ముద్దగా తడిసిపోయి వున్న సమయంలో, కారు చిచ్చు పుట్టమంటే పుడుతుందా? ఇప్పుడు అడవును కాల్చమంటే కాల్చ గలుగుతుందా?

## 53. గురుశిష్య లక్షణాలు

కనుక, ఓ రామా! తెలివిగలవాడు ఇలాంటి జ్ఞానం సంపాదించేందుకు ప్రయత్నం చేయాలి. ప్రయత్నమంటే, ఏమి చేయాలి అంటావా? ఒక మంచి జ్ఞానిని పట్టుకోవాలి. అతడు నేర్పిరి అయి వుండాలి. అలాంటివాడ్ని పట్టుకుని "నాకు ఆ జ్ఞానం ఉపదేశించమని" అడగాలి. వాడు చెప్పింది గ్రహించాలి. తత్త్వం

తెలియనివాడ్ణి అడగటం మూర్ఖత్వమే అవుతుంది. బాగా తెలిసినవాడు చెప్పిన మాటను తిరస్కరించడం గూడా మూర్ఖత్వమే అవుతుంది. కనుక, రామా! నీలాంటి జిజ్ఞాసువు, ఎవడు తత్త్వజ్ఞుడో, ఎవడు తత్త్వజ్ఞాన రహితుడో, మున్ముందుగానే నిర్ణయించుకోవాలి. అంతే గానీ, కనిపించిన ప్రతివాడ్ణీ తత్త్వం గురించి చెప్పమని వెంటబడ కూడదు.

రామా! ప్రశ్న అడగదలచుకున్నవాడు తీసుకోవలసిన జాగ్రత్తల గూర్చి చెప్పాను. ఇక సమాధానం చెప్పేవాడు తీసుకోవలసిన జాగ్రత్తలను చెబుతా, విను. తత్త్వజ్ఞానం కలవాడు నాకు తెలుసు కదా అని, అడిగిన ప్రతివాడికీ చెప్పకూడదు. చెబితే, చేప్పింది చెప్పినట్టు గ్రహించగల శక్తి ఎదుటివాడిలో వుందో, లేదో, చూసుకొని, అవసరమైతే తగిన పరీక్ష చేసుకొని, వీడికి చెప్పినది గ్రహించగల వివేకబుద్ధి వుందని రుజువైనప్పుడే, అడిగిన తత్త్వం భోధించాలి. రామా! ఈ విధంగా నీకు , ప్రశ్న వేసేవాడి లక్షణము, జవాబు చెప్పేవాడి లక్షణము, రెండూ వివరించాను.

ఇక్కడ ఆ లక్షణాలన్నీ నీకు, నాకు బాగా సరిపోయాయి. నువ్వు మంచి పృచ్ఛకుడివి. నేను కూడా సమాధానం చెప్పగలవాడ్ణే. కనుక, నేను చెబుతాను. నువ్వు జాగ్రత్తగా విను. అంతకు ముందే ఒక రంగు వున్న గుడ్డకు మరో రంగు వేస్తే, బాగా పట్టదు. తెల్లగా వున్న గుడ్డకు రంగు వేస్తే బాగా పడుతుంది. నువ్వు తెల్లని గుడ్డ లాంటివాడివి. నీకు చేసిన ఉపదేశం సార్థకమవుతుంది. నేను చెప్పేదాన్ని బాగా విను. మనస్సులో బాగా ఆలోచించుకో. వివేచన చేసుకో. మనస్సులో ధారణ చెయ్యి. చెప్పింది నీ మనస్సుకు పట్టకపోతే మళ్ళీ అడుగు. అంతే గానీ, నేను చేయబోయే ఉపదేశాన్ని నిరర్థకం చేసుకోబోకు.

## 54. ఆత్మతత్త్వ విచారణ

వశిష్ఠమహర్షి తనయొక్క విద్యాబోధన ప్రణాళికలో రెండవ అంశమైన **ఆత్మతత్త్వ విచారణ** గురించి ప్రస్తావన చేస్తున్నాడు. ఆ సందర్భంలోనే ఆత్మతత్త్వజ్ఞానం బ్రహ్మగారి దగ్గరనుంచి తన దాకా ఎలా అవతరించిందో, ఆ జ్ఞానావతరణ ప్రక్రియను వివరించాడు. ఆ తరువాత, ప్రశ్నించేవాడు ఏ దృష్టితో ప్రశ్న వేయాలి? సమాధానం చెప్పేవాడు ఏ దృష్టితో సమాధానం చెప్పాలి? అనేదాన్ని గూడా వివరించాడు. ఇక ప్రస్తుతం ఆయన సాక్షాత్తుగా ఆత్మతత్త్వ విద్యను చెప్పబోవడం లేదు. “అదేమిటి? అసలు విషయం చెప్పదలచుకోక పోవడం ఏమిటి?” అనుకొంటున్నారా? ఏ విషయం అర్థం కావాలన్నా, వినేవాడు కొన్ని అర్హతల్ని సంపాయించాలి. “ అంతర్జాతీయ మార్కెట్లో ధన వినిమయం ఎలా జరుగుతుందో చెప్పండి” అని, నేను వెళ్ళి ఒక ఎకానమీ ప్రొఫెసర్ గారిని అడిగాననుకొండి. అడిగిందే తడవుగా అయన ఉపన్యాసం దంచుతాడా? ముందు నాకు ఆర్థికశాస్త్రం గురించి ఏ మాత్రం తెలుసో అంచనా వేసుకుంటాడు. ఆ తరువాత గంభీరమైన ఆర్థికశాస్త్ర విషయాలు చెబితే విని అర్థం చేసుకోగల మానసిక శక్తి వుందో, లేదో చూసుకుంటాడు. అప్పుడు సమాధానం ప్రారంభిస్తాడు. అంతే గదా!

అలాగే, వశిష్ఠమహర్షి రాముడికి అసలైన తత్త్వోపదేశం చేసే ముందు, దానికి అవశ్యమూ కావలసి వున్న ముందు షరతులు ఎలా వుండాలో, రాముడికి ఉపదేశించాలని నిశ్చయించుకున్నాడు. ఎకానమీ ప్రొఫెసర్‌గారి దగ్గరకు వెళ్ళి, నేను ఏవో పిచ్చి ప్రశ్నలు వేస్తే, నీకు సరైన యోగ్యత లేదని ఆయనకు అనిపిస్తే, ఆయన నన్ను బయటికి పొమ్మంటాడు. అంతే గానీ, నన్ను కూర్చోబెట్టి ఎకనామిక్స్‌లో పాఠాలు చెప్పాలని

చూడడు. ఎందుకని? నేను ఆయన శిష్యుణ్ణి కాదు గదా! అందుకని.

ఇక్కడ రాముడు అలా కాదు. రాముడు వశిష్ఠుడికి ప్రియ శిష్యుడు. పైగా యోగ్యత గల శిష్యుడు. అందువల్ల, వశిష్ఠుడు ఆత్మజ్ఞానం సంపాదించడానికీ, సంపాదించిన తరువాత అది వంటబట్టటానికీ, కావలసిన సాధన సంపత్తిని గురించి ప్రత్యేకంగా హెచ్చరించ దలచుకుంటున్నాడు. అందుకే వశిష్ఠుడు ఇలా అన్నాడు.

**మనో హి చపలం రామ సంసారవన మర్కటమ్।**

**సంశోధ్య హృది యత్నేన శ్రోతవ్యా పరమార్థ గీః॥** (ము.వ్య.ప్ర.స.11,శ్లో.56)

రామా! తత్త్వబోధ చెయ్యండని అడగంగానే సరిపోదు. ఈ మనస్సనే కోతి ఏమి చేస్తుందంటే, తత్త్వ విషయాలను గురించి బోధ వినటం మొదలు పెట్టగానే, ఇటూ అటూ గంతులు ప్రారంభిస్తుంది. అడిగించేదీ అదే, చెప్పటం మొదలు పెట్టాక గంతులేసేదీ అదే. అందువల్ల తత్త్వ శ్రవణం చేసే ముందు ఆ మనస్సుకి సంశోధన చెయ్యాలి. అంటే- సత్సంస్కారం కలిగించాలి. సంస్కారం అంటే, దానిలో వున్న దోషాలను తొలగించి, దానికి సద్గుణాలను కలిగించటం. వినేవాడు మొదటగా ఈ పని చేసుకోవాలి. దానికి సర్వసామాన్యంగా అందరూ చేయవలసిన పనులు రెండు.

1. దుష్టులకు దూరంగా వుండడం
2. సజ్జనులకు దగ్గరగా వుండడం

వీటిని గురించి పూర్వం గూడా చెప్పాను. వాటితోపాటు ముఖ్యమైనవి, సాధకుడు సేవించవలసినవి, నాలుగు వున్నాయి. నువ్వు చక్రవర్తి పుత్రుడవు గనుక, నీ పరిభాషలోనే వాటిని గురించి వివరిస్తాను. విను.

**మోక్షద్వారే ద్వారపాలా శ్చత్వారః పరికీర్తితాః।**

**శమో విచారస్సంతోషః చతుర్థస్సాధు సంగమః॥** (ము.వ్య.ప్ర.స.11,శ్లో.59)

రామా! మోక్షమనేది పెద్ద కోటనుకుంటే, ఆ కోట గుమ్మానికి నలుగురు ద్వారపాలకులు వున్నారు.

1. శమము, 2. విచారము, 3. సంతోషము 4. సాధుసంగమము.

ఒక రాజు దగ్గరకు మనం పోవాలంటే, ముందు ద్వార పాలకులను మంచి చేసుకోవాలి. ద్వారపాలకులు షిఫ్టుల ప్రకారం మారుతూ వుంటారు. అందుచేత, అందరు ద్వారపాలకుల్నీ మంచి చేసుకుంటే, మనం ఎప్పుడుబడితే అప్పుడు రాజభవనంలోకి పోవచ్చు. అలా అందరినీ బుట్టలో వేసుకోవటం సాధ్యం కాకపోతే, కొందర్నైనా బుట్టలో వేసుకోవాలి. అదీ కుదరకపోతే, కనీసం ఒకడితోనైనా స్నేహం చెయ్యాలి. ఒకడితో స్నేహం చేస్తే వాడు వున్నప్పుడు లోపలకు పంపిస్తాడు. అంతే గాక, వాడి ద్వారా ఇతర ద్వారపాలకులతో స్నేహం పెంచుకొనేందుకు అవకాశం ఎక్కువగా వుంటుంది. అంతే కదూ!

అలాగే ఓ రామా! మోక్షాన్ని కోరేవాడు శమ, విచార, సంతోష, సాధుసంగమాల అనేటటువంటి ఈ నలుగురు ద్వారపాలకులనూ స్వాధీనం చేసుకోవాలి. అంత పూర్తిగా చేతకాకపోతే, ముగ్గురినో, ఇద్దరినో, కనీసం ఒక్కడినో స్వాధీనం చేసుకోవాలి.

## 55. శ్రవణ మనన నిదిధ్యాసలు

రామా! తత్త్వశ్రవణం చేయదలచుకున్నవాడు మూర్ఖత్వాన్నీ, జడత్వాన్నీ దగ్గరకు రానీయరాదు. వాడు శాంతి, సౌజన్యము, ఆర్జవము, తప్పక సంపాదించుకోవాలి. ఆర్జవం అంటే, కుటిలత్వం లేకుండా, సూటిగా వుండటం. రామా! నువ్వు మంచివాడివి, నాకు తెలుసు. చెప్పింది చక్కగా గ్రహిస్తావని గూడా తెలుసు.

అందుకే నీకు చెప్పడానికి సిద్ధపడుతున్నాను. అయినా వినటంలో వుండే కష్టాలు, వినేటప్పుడు తీసుకోవలసిన జాగ్రత్తలు, నీకు తెలియాలి. అందుకోసం చెబుతున్నా, విను.

**రజస్తమోభ్యాం రహితాం శుద్ధసత్త్వాను పాతినీం।**

**మతిమాత్మని సంస్థాప్య జ్ఞానం శ్రోతుం స్థిరో భవ॥** (ము.వ్య.ప్ర.స. 12,శ్లో. 2)

వినేటప్పుడు మనస్సులో రజోగుణం వుంటే, మనస్సు ఇటూ అటూ చలిస్తుంది. వినేటప్పుడు మనస్సులో తమోగుణం వుంటే ఏదీ బుర్రకెక్కదు. చెప్పేది ఒప్పుకోబుద్ధి కాదు. కనుక, ఆ రెండు గుణాలనూ దూరంగా పెట్టి, శుద్ధమైన సత్వగుణాన్ని మనసులోకి తెచ్చుకో. తత్త్వబోధను వినేవాడికి ఇలాంటి తత్త్వవిచారణవల్ల సకల దుఃఖాలూ పోయి, శాశ్వతానంద స్థితి కలుగుతుందనే విశ్వాసం వుండాలి. ఈ తత్త్వవిచారణ మీద హేళనాదృష్టి వుండకూడదు.

ఇక్కడినుంచి ఒక ఏడు పేరాల వరకు వాల్మీకి మహర్షి శ్లోకాలలో కాకుండా గద్యాలలో రచన చేశాడు. ఈ గద్యాలలోనూ, తరువాతి శ్లోకాలలోనూ కూడా, సంసారం వల్ల వచ్చే అనర్థాలను కవితామయంగా వర్ణించాడు. తత్త్వవిచారణయొక్క ఆవశ్యకతనూ, ప్రయోజనాన్నీ కూడా, వివరించాడు. చెప్పి చెప్పి చివరికి–

**ధియా దృష్టే తత్త్వే రమణ మటనం జాగతమిదమ్**– అన్నాడు.

(ము.వ్య.ప్ర.స. 12,శ్లో. 20)

అంటే, రామా ! ఆత్మతత్త్వ శ్రవణం చేశాక, దాన్ని మననం చెయ్యాలి. మననంవల్ల ఆత్మతత్త్వ విషయంలో వున్న అసంభావన తొలగి పోతుంది. ఆ తరువాత అదే తత్త్వాన్ని నిదిధ్యాసన చేయాలి. దానివల్ల ఆత్మతత్త్వం పట్ల వున్న విపరీత భావన పోతుంది.

అసంభావన అంటే, యుక్తియుక్తంగా ఒక నిర్ణయాన్ని చేశాక, దాన్ని కాదనలేక, ఒప్పుకో బుద్ధి కాక, గిలగిలలాడడం. విన్న తత్త్వాన్ని మననం చేయడంవల్ల ఈ అసంభావన పోతుంది. విపరీత భావన అంటే, నిర్ణయం చేసుకున్న తత్త్వం అనుభవానికి రాక, అనుభవంలో మాత్రం తలక్రిందులుగా భావిస్తూ వుండటం. ఇది పోవాలంటే నిదిధ్యాసం చెయ్యాలి. నిదిధ్యాసమంటే, ఇంచుమించుగా ధ్యానమే. తత్త్వ విషయం మీద ధ్యానం చేస్తే నిదిధ్యాసం అవుతుంది– అని చెప్పవచ్చు. ఇలా మనన నిదిధ్యాసలతో కూడినటువంటి వివేక బుద్ధితో తత్త్వాన్ని అవగాహన చేసుకొంటే, **"ధియా దృష్టే తత్త్వే"**, ఆ తరువాత, అంటే, అలాంటి జ్ఞానం కలిగిన తరువాత, వాడు ఈ లోకంలో చేసే పనులన్నీ కేవలం చిన్న పిల్లల ఆటల వంటివి. **"రమణ మటనం జాగత మిదం"**. ఆటలవల్ల పిల్లల మనస్సుకు ఏ మాలిన్యమూ పట్టదు కదా! అలాగే, తత్త్వజ్ఞాన సంపన్నుడికి ఈ జగత్క్రీడవల్ల ఏ దుఃఖమూ పట్టదు. అందుకే–

**ధియా దృష్టే తత్త్వే రమణ మటనం జాగతమిదమ్।**

రామా! పెద్ద పెద్ద మహాత్ములంతా ఈ సంసారంలో సంచరిస్తూ కూడా, ఇలాంటి భావంతోనే క్రీడించారు, క్రీడిస్తున్నారు. వాళ్ళు మంచి పొందాలనీ అనుకోరు, చెడు పోవాలనీ అనుకోరు. అంతా చేస్తారు, ఏమీ చెయ్యరు. అన్ని కర్మలూ చేస్తూనే వుంటారు. వేదోక్త కర్మలూ చేస్తూనే వుంటారు. లౌకిక కర్మలూ చేస్తూనే వుంటారు. కానీ, దేనికీ అంటుకోరు. అంటే దాని అర్థం ఏమిటి? ఇతరుల దృష్టిలో వారు చేస్తున్నట్లు, ఏదో పొందుతున్నట్లు, కనిపిస్తూ వుంటారు. అంతే గానీ, వారి దృష్టిలో మాత్రం వారు ఏమీ చెయ్యనూ చెయ్యటం లేదు. ఏమీ పొందనూ పొందటం లేదు. వాళ్ళు పరిపూర్ణమైన ఆత్మానందంలో వుంటారు. మనస్సుకు ఇలాంటి స్థితి పట్టాలంటే, ఆత్మతత్త్వ జ్ఞానం ఒక్కటే దానికి సాధనం. కనుక, మనిషన్నవాడు బ్రతికి వున్నంత వరకూ, ఆత్మతత్త్వ విచారణ చెయ్యాలి. దీన్నే శ్రవణం అంటారు. దానినే మననం చెయ్యాలి. దానినే నిదిధ్యాసం

చెయ్యాలి.

రామా! ఈ ప్రక్రియలో మూడు మెట్లు వున్నాయి.

1. శాస్త్రాలు చేసే బోధ
2. సద్గురువు చేసే బోధ
3. తన సొంత అనుభవం

ఈ మూడూ వేటికవిగా వున్నంతకాలం వీసమెత్తు కూడా ఉపయోగం లేదు. ఆ మూడూ ఒకటైపోవాలి. అప్పుడు వీడు చేసే తత్త్వవిచారణ సఫలమైందని అర్థం. ఎప్పుడైతే ఈ రకంగా స్వానుభవ, శాస్త్రోపదేశ, గురూపదేశాలయొక్క ఏకీభావాన్ని అనుభవించగలుగుతావో, అప్పుడు నువ్వు జీవన్ముక్తుడివి అవుతావు. హరిహర బ్రహ్మాదులు, బ్రహ్మర్షులూ, మొదలైన వాళ్ళు జీవన్ముక్తులై వుండి, ఎలాగైతే ఈ లోకవ్యవహారాన్ని నడిపిస్తున్నారో, అలాగే నువ్వు కూడా జీవన్ముక్తుడవై ఈ లోక వ్యవహారం నడిపించ గలుగుతావు.

**56. శమము**

రామా! ఇటువంటి మోక్షాన్ని అందుకోవటానికి నలుగురు ద్వారపాలకుల్ని ఆశ్రయించాలి– అని నీకు చెప్పాను. వాటిలో మొదటిది శమము. శమమంటే శాంత గుణము. సాధన చతుష్టయ సంపత్తిలో శమం వచ్చింది. అక్కడ శమమంటే అంతరింద్రియ నిగ్రహము, అని చెప్పారు. ఇక్కడ శమమంటే శాంతి.

**శమేన సాధ్యతే శ్రేయః శమో హి పరమం పదమ్।**

**శమ శ్శివ శ్శమ శ్శాంతిః శమో భ్రాంతినివారణమ్॥** (ము.వ్య.ప్ర.స.13,శ్లో.52)

రామా! పరమశ్రేయస్సయిన మోక్షం ఈ శమంవల్లనే లభిస్తుంది. ఒక విధంగా చూస్తే, ఈ శమానికీ, ఆ పరమపదానికీ, భేదమే లేదు. ఈ శమమే ఆ పరమపదం. శమమే శివుడు. శివుడంటే మంగళప్రదుడు. శమమే శాంతి. భ్రాంతిని పోగొట్టేది శమమే. ఈ శమాన్ని సాధించినవాడికి రాగద్వేషాలూ ఉండవు. కోపతాపాలూ ఉండవు. వాడికి శత్రువులు కూడా మిత్రులవుతారు. హృదయంలో శమమనేది వికసిస్తే, వాడు విష్ణుమూర్తితో సమానుడవుతాడు. త్రిలోక ఐశ్వర్యంవల్ల కూడా కలగని ఆనందం శమంవల్ల కలుగుతుంది. రక రకాల తృష్ణలు, మనోవ్యాధులు, ఇలాంటివన్నీ కూడా నశించిపోతాయి. హృదయంలో శమం వికసించినవాడికి, ఒక అపూర్వమైన ఉత్సాహం పొంగుకొస్తుంది. శమం కలవాడికి ఆత్మతత్త్వం అనాయాసంగా అవగతం అవుతుంది. శమగుణం హృదయంలో సరిగా స్థిరపడితే, క్రూరమృగాలు కూడా వాడ్ని సొంత తల్లిని విశ్వసించినట్లు విశ్వసిస్తాయి. ఇలా శమంయొక్క మహత్వాన్ని 20 శ్లోకాల్లో రకరకాలుగా వర్ణించాడు వాల్మీకి మహర్షి. అలా వర్ణించి వర్ణించి శమమంటే ఏమిటో 9 శ్లోకాలలో నిర్వచనం చేశాడు.

**శ్రుత్వా స్పృష్ట్వా చ దృష్ట్వా చ భుక్త్వా ఘ్రాత్వా శుభాశుభమ్।**

**న హృష్యతి గ్లాయతి యః స శాన్త ఇతి కథ్యతే॥** (ము.వ్య.ప్ర.స.13,శ్లో.72)

ఇష్టం వున్నవీ లేనివీ, పనికొచ్చేవీ రానివీ, మంచివీ చెడువీ– ఇలాంటివాటిని వేటినైనా సరే, విన్నా, ముట్టుకున్నా, చూసినా, తిన్నా, వాసన చూసినా, ఏ రకంగా వాటిని అనుభవవించినా సరే, వాడికి సంతోషమూ కలగకూడదు. దుఃఖమూ కలగ కూడదు, అలా ఎవడైనా వుంటే, వాడిలో శమం వున్నట్టు లెక్క.

జీవులందరి మీదా సమబుద్ధితో వుండేవాడూ, నాకు భవిష్యత్తులో ఇది కావాలి, అది కావాలి, అని కోరిక లేకుండా వుండేవాడూ, ప్రారబ్ధవశాన వచ్చిన సుఖాలనూ, దుఃఖాలనూ గూడా వద్దు పొమ్మని తిరస్కరించకుండా వుండేవాడూ, అలా ప్రారబ్ధవశాన వచ్చి పడ్డవాటిని అనుభవించే సమయంలో ప్రయత్న

పూర్వకంగా జితేంద్రియుడై వుండేవాడూ, ఎవడైనా వుంటే, వాడిలో శమం వున్నట్టు లెక్క.

ఎవరైనా మనల్ని మోసం చేస్తున్నారని తెలిస్తే, మనకు కడుపు మండి పోతుంది. కానీ, ఒక్కొక్క సారి ఆ మంటను బయట పెడితే బాగుండదని, పైకి మాత్రం చల్లగా వుంటూ వుంటాం. ఇలా కాకుండా ఎవడైనా ఒకడు, తనను మోసం చేస్తే వారిపట్ల కూడా, వారు మోసం చేస్తున్నారని తెలిసినా కూడా, లోపలా బయటా కూడా, స్వచ్ఛంగా, చల్లగా, వుండగలిగితే, అలా చల్లగా వుంటూనే, తన మానాన తన సాధన ఆపకుండా కొనసాగించుకుంటూ పోగలిగితే, వాడిలో శమం వున్నట్టు లెక్క.

దగ్గరి బంధువుల మరణ సమయంలోనూ, ఇంట్లో పండుగలు చేసుకొనేటప్పుడూ, బయట యుద్ధాలు చేసేటప్పుడూ కూడా, మనస్సులో ఏ కల్లోలాలూ లేకుండా, చందమామ లాగా, చల్లగా వుంటే, వాడిలో శమం వున్నట్టు లెక్క.

సంతోషం కలిగేందుకు అవకాశం గల చోట వుండి కూడా, అక్కడ లేనట్టే వుండాలి. అంటే, ఆ సంతోషమేమీ అనుభవానికి రాకూడదు. అలాగే దుఃఖం కలగటానికి అవకాశం గల చోట వుండి కూడా, అక్కడ లేనట్టే వుండాలి. ఆ దుఃఖమేదీ అనుభవానికి రాకూడదు. ఇదెలా కుదురుతుంది అంటావేమో? గాఢనిద్రలో వున్నవాడు పూలతోటలో వుంటే మాత్రం సువాసన అనుభవిస్తున్నాడా? పోనీ, శ్మశానంలో వుంటే భయాన్ని అనుభవిస్తున్నాడా? అలా గాఢనిద్రలో వున్నవాడి లాగా మెలకువలో కూడా ఎవడైనా వుండగలిగితే, వాడిలో శమం వున్నట్టు లేక్క.

తన చుట్టూతా వున్న జీవులందరిమీదా, తనవారు– పరాయివారు అనే భేదం లేకుండా, గిట్టేవారు– గిట్టనివారు అనే భేదం లేకుండా, మంచివారు– చెడ్డవారు అనే భేదం లేకుండా, అందరి మీద సమంగా అమృత ప్రవాహం వంటి చల్లని చూపు చూప గలిగితే, వాడిలో శమం వున్నట్టు లెక్క.

వ్యవహారాలు చేస్తూ కూడా ప్రాపంచిక వ్యవహారాల్లో మునిగి పోకుండా, ఆ మోహాల్లో పడిపోకుండా, లోపల చల్లగా వుండ గలిగేవాడు ఎవడైనా వుంటే, వాడిలో శమం వున్నట్లు లెక్క.

ఈ కల్పాంతం దాకా తరిగిపోనంత మహా ఆపదలు వచ్చినా సరే, వాడి హృదయంలో మిథ్యా భూతాలైన శరీరాదులమీద "ఇది నేనే" అనే భ్రాంతి లేకుండా వుంటే, అంటే, "ఈ దేహం నేనే" అనే భ్రాంతి లేకుండా వుంటే, అప్పుడు వాడిలో శమం వున్నట్టు లెక్క.

**ఆకాశ సదృశీ యస్య పుంసః సంవ్యవహారిణః।**

**కలంక మేతి న మతిః స శాంత ఇతి కథ్యతే॥** (ము.వ్య.ప్ర.స.13,శ్లో.80)

చివరిగా ఈ శ్లోకంలో మరో నిర్వచనం చెబుతున్నాడు వశిష్ఠుడు. ప్రతివాడికీ పూర్వప్రారబ్ధంవల్ల ఏవో వ్యవహారాలు వస్తూ వుంటాయి. ఆ వ్యవహారాలు చెయ్యడంవల్ల వాడి మనస్సులో ఏవో ముద్రలు పడుతూ వుంటాయి. అలా ముద్రలు పడనివాడెవడైనా వుంటే, వాడిలో శమం వున్నట్టు లెక్క.

ఈ విధంగా శాంతులైనవారి లక్షణాలు చెప్పడం ద్వారా, శమంయొక్క నిర్వచనాలను చేశాడు వశిష్ఠుడు. సంస్కృత వ్యాకరణ ప్రకారం శమం కలవాడ్ని **'శాంతుడు'** అంటారు. అందుకనే ఈ నిర్వచనాల్లో ప్రతిచోటా 'న శాంత ఇతి కథ్యతే" అని వచ్చింది. ఈ విధంగా శమ నిర్వచనం చేశాక, అలాంటి శమసాధన చేసినవాడికి ఏమి ఫలం వస్తుందో కూడా చెప్పాడు. యజ్ఞాలు చేసిన వారందరికన్నా, శాస్త్రాలు చదివినవారికన్నా, తపస్సులు చేసినవారందరికన్నా, బలమూ, సద్గుణాలూ సాధించినవారికన్నా, శమవంతుడే శ్రేష్ఠుడు– అని చెప్పాడు. ఈ విధంగా శ్రేష్ఠత్వాన్ని చెప్పి, ఆ తరువాత శమంయొక్క ఫలితాన్ని సూటిగా ఇలా చెప్పాడు–

రామా! చంద్రుడు వస్తే, వెన్నెల వచ్చి లోకమంతా వ్యాపిస్తుంది. అలాగే, శమవంతులైనవారు తాము

ఆనందం అనుభవించడం మాత్రమే కాక, తమ సన్నిధియొక్క ప్రభావంచేత తమ పరిసరాలన్నింటినీ గూడా ఆనంద తరంగాలలో నింపుతారు. రామా! పూర్వకాలపు పూజ్యులంతా, ఈ శమాన్నే ఆశ్రయించి పరమపదాన్ని అందుకున్నారు. ఆ మహానుభావుల మార్గంలోనే నువ్వూ నడచి, శమాన్నే సాధించు. దాని ద్వారా ఆత్మ సిద్ధిని అందుకో.

ఈ విధంగా మోక్ష ద్వారపాలకులలో మొదటి వాడైన శమాన్ని గూర్చి వివరించడం పూర్తి చేసిన వశిష్ఠమహర్షి, ఇక రెండవ ద్వారపాలకుడైన విచారాన్ని గూర్చి బోధ ప్రారంభించాడు.

### 57. విచారణ

ఇక్కడ వ్యాఖ్యాత విచారణ గురించి కొన్ని విశేషాలు చెప్పాడు. యోగవాశిష్ఠానికి గల వ్యాఖ్యానాల్లో "ఆనందబోధేంద్ర సరస్వతి" అనే మహానుభావుడు రచించిన "తాత్పర్యప్రకాశం" అనే వ్యాఖ్యానం ప్రసిద్ధమైనది, మనోహరమైనది. ఈ విచార నిరూపణ ప్రకరణ ప్రారంభంలో ఆనంద బోధేంద్ర సరస్వతిగారు విచారాన్ని ఐదు రకాలుగా విభజించి, వివరించారు.
ఎలాగంటే–

1. అర్థానర్థానుబంధి విచారము
2. సారాసార విచారము
3. హేయోపాదేయ విచారము
4. ప్రమాణ తాత్పర్య విచారము
5. ఆత్మతత్త్వ పరీక్షా విచారము.

వ్యాఖ్యాత ఈ విధంగా విచారాన్ని ఐదు విభాగాలుగా విభజించాడంటే, అది కేవలం సొంత కవిత్వం గాదు. ఈ 14వ సర్గలో వశిష్ఠమహర్షి చేయబోయే విచార చర్చను పూర్తిగా పరిశీలించి, ఈ సర్గలో వశిష్ఠమహర్షి ఈ ఐదు రకాల విచారణలను వరుస క్రమంలో జరిపాడనే విషయం గ్రహించి, వ్యాఖ్యాత ఈ విభాగం చేశాడు. రాబోయే వివరణయొక్క తాత్పర్యం బాగా తెలిసేందుకు, ఈ వివరణ బాగా ఉపకరిస్తుంది. అందువల్ల ఈ ఐదు విభాగాలనూ అర్థం చేసుకొనేందుకు ప్రయత్నిద్దాం.

### 1. అర్థానర్థానుబంధి విచారం

అర్థమంటే మంచి ప్రయోజనం. అంతే గాక, అర్థమంటే మంచి ప్రయోజనాలను కలిగించేది. శాస్త్రీయమైన ప్రవృత్తి అంతా అర్థంలోకే వస్తుంది. వైరాగ్యము, శమము, దమము, మొదలైనవన్నీ కూడా ఈ కోవలోకే వస్తాయి. వీటినే పురుషార్థసాధనాలు అంటారు. వీటికి విరుద్ధమైనవి అనర్థాలు. ధర్మవిరుద్ధంగా ప్రాపంచిక సుఖాలను అనుభవించటం, మొదలైనవి అనర్థాలు. మనం చేసే పనులలో, లేదా చెయ్యవలసిన పనులలో, అర్థాలేవి? అనర్థాలేవి?– అనేది మనం విచారణ చేసుకోవాలి. ఇలాంటి విచారణ పేరు– అర్థానర్థానుబంధి విచారణ.

### 2. సారాసార విచారము

సారము అంటే, విలువ గలది. అసారము అంటే, విలువ లేనిది. మనకు కనిపించే విషయాలలో విలువ గలది ఏది?– విలువ లేనిది ఏది? – అని విచారించుకోవాలి. ఆత్మతత్త్వ ప్రకరణం కనుక, ఇక్కడ

సారమైనది సుఖం, అసారమైనది దుఃఖం. సుఖ ప్రదమైనది సారం. అసుఖప్రదమైనది అసారం. ఈ మానవలోకంలో దుఃఖస్పర్శలేని సుఖం కనిపించడం లేదు కనుక, ఈ సుఖం అసారం. పోనీ, స్వర్గలోకం నుంచి బ్రహ్మలోకం దాకా గల సుఖాలను తీసుకుందామంటే, వాటికి కొంతకాలం పోయాక అంతం వుంటుంది. కనుక, అవీ అసారాలే. అంత పెద్ద ఆలోచన ఎందుకయ్యా? మనం ప్రేమించే భార్యాపుత్రాదులున్నారు కదా! లోకంలో ప్రేమ విలువైనది కదా! కనుక, మనం ప్రేమించే భార్యాపుత్రాదులే సారం– అందామంటే, ఆ భార్యా పుత్రాదుల శరీరాలన్నీ కూడా స్వతహా అపరిశుద్ధాలు. ఆ శరీరాలు ఎట్లా జన్మించాయా– అని ఆలోచిస్తే, అవి అసహ్యకరాలు. ఈ శరీరాలు చివరికి ఏమవుతాయా– అని ఆలోచిస్తే, చివరికి మట్టిలో పడి దుర్గతి పాలవుతాయి. ప్రస్తుతకాలంలో ఆ శరీరాలన్నీ పైకి అందంగానే కనిపిస్తున్నా, లోపల మలమూత్రాలతో నిండిపోయి వున్నాయి. అందుచేత ఏ రకంగా, చూసినా, ఇవేవీ గూడా సారవస్తువులు కావు. శాశ్వతానందాన్ని కలిగించే పరమాత్మ ఒక్కటే సారవస్తువు. ఈ రకమైన విచారణ పేరే సారాసారవిచారణము.

### 3. హేయోపాదేయ విచారం

హేయము అంటే, వద్దని అవతల పారేయవలసింది. ఉపాదేయము అంటే, కావాలని స్వీకరించవలసింది. మన ప్రకరణంలో మనకు కావలసింది మోక్షం. దాని సాధనకోసం మనం ఏ సాధనాన్ని స్వీకరించాలి? ఏ సాధనాన్ని అక్కర్లేదని అవతల పారేయాలి? మోక్షం కావాలంటే, వేదోక్తకర్మ చెయ్యాలా? లేక, ఏదైనా దేవతోపాసన చెయ్యాలా? లేక, ఈ రెండూ కలిపి చెయ్యాలా? లేక, కొంచెం జ్ఞానాన్ని కూడా కలుపుకొని, జ్ఞానమూ, కర్మోపాసనా కలిపి చెయ్యాలా? లేక, జ్ఞానం ఒక్కటే మోక్షానికి సాధనమా? మిగిలినవన్నీ అక్కర్లేనివేనా? ఈ రకమైన విచారణ పేరే హేయోఎదేయ విచారము. ఒక్కొక్కప్పుడు పై మూడూ, అనగా అర్థానర్థానుబంధి విచారము, సారాసార విచారము, హేయోపాదేయ విచారము, అనేవి మూడూ, ఎవరి ఉపదేశమూ లేకుండానే స్వయంగా పుట్టవచ్చు. అది ఒక అదృష్టమే. కానీ, అలాంటి అదృష్టవంతులు కూడా గురువులయొక్క , శాస్త్రాలయొక్క సహకారంతో తమ విచారణను దృఢపరచుకోవాలి.

### 4. ప్రమాణ తాత్పర్య విచారము

ప్రమాణము అంటే యదార్థ జ్ఞానాన్ని కలిగించే సాధనము. తాత్పర్యము అంటే, ప్రమాణ వాక్యాలను ఉచ్చరించేవాడి హృదయంలో వున్న భావం. మన ప్రకరణంలో మోక్షాన్ని గురించిన యథార్థజ్ఞానాన్ని గూర్చిన ప్రమాణాలు ఏవి? వేదాలా? సాంఖ్య వైశేషికాది శాస్త్రాలా?– అనే చర్చ పేరు ప్రమాణ విచారము. వేదాలే పరమప్రమాణాలని నిర్ణయం చేశాం. అయితే, వేదవాక్యాలు అనేక రకాలుగా వుంటాయి. ఈ వాక్యాలన్నింటికీ కలిపి మొత్తం మీద తాత్పర్యం ఏమిటి? జీవుడు వేరు, పరమాత్మ వేరు, అనటమే వేదానికి తాత్పర్యమా? వారిద్దరూ ఒక రకంగా వేరు, ఒక రకంగా ఒకటే, అనటం తాత్పర్యమా? నిస్సంశయంగా జీవాత్మ, పరమాత్మ లిద్దరూ ఒక్కటేనని చెప్పటం వేద వాక్యాలకు తాత్పర్యమా? ఈ రకమైన విచారణ పేరు ప్రమాణ తాత్పర్య విచారము.

### 5. ఆత్మతత్త్వ పరీక్షా విచారము

ఆత్మ అంటే తాను. జీవాత్మ, పరమాత్మ, ఇవన్నీ కూడా ఎక్కడో దూరపు పదాలుగా అనిపిస్తున్నాయి. నా తత్త్వం ఏమిటో నేను పరీక్షించుకోవాలి. రత్న పరీక్షకుడు రత్నాన్ని పరీక్షించినట్లుగా నన్ను నేను

పరీక్షించుకోవాలి. రత్నపరీక్షకుడు మరొకరి దగ్గర శిక్షణ పొందుతాడు. అలాగే, నేను అనుభవజ్ఞాని అయిన గురువును ఆశ్రయించి, శాస్త్రాలయొక్క తాత్పర్యాన్ని ఆ గురుబోధకు జోడించి జగత్తు, జీవుడు, ఈశ్వరుడు, అనే మూడింటియొక్క తత్త్వాన్నీ పరీక్షించుకోవాలి. పరిపూర్ణమైన, అనుభవాత్మకమైన నిర్ణయం వచ్చే దాకా, ఈ పరీక్షను కొనసాగించాలి. దీని పేరే ఆత్మ తత్త్వ పరీక్షా విచారము. ఈ చివరి రెండు విచారాలు– అనగా ప్రమాణ తాత్పర్య విచారము, ఆత్మ తత్త్వ పరీక్షా విచారము, అనేవి రెండూ – గురువుల, శాస్త్రాల, సహకారం వుంటేనే లభిస్తాయి.

ఈ ఐదు రకాల విచారాలనూ మనసులో పెట్టుకొని, వశిష్ఠ మహర్షి తన విచార బోధను ఇలా ప్రారంభిస్తున్నాడు.

**శాస్త్రావబోధామలయా ధియా పరమపూతయా।**

**కర్తవ్యః కారణజ్ఞేన విచారోఽనిశమాత్మనః ॥** (ము.వ్య.ప్ర.స.14,శ్లో.1)

రామా! సాధకుడు తనను గురించి తాను విచారణ చేసుకుంటూ వుండాలి. అలా అన్నాం గదా అని, అడ్డదిడ్డంగా విచారణ చేస్తే లాభం లేదు. వాడు ముందుగా శాస్త్రజ్ఞానం ద్వారా తన బుద్ధిని పదును చేసుకోవాలి. ఆ తరువాత సత్కర్మాచరణ ద్వారా తన బుద్ధిని శుద్ధం చేసుకోవాలి. ఆ తరువాత ప్రమాణాలేవి? ఆ ప్రమాణాలవల్ల తెలుసుకోదగ్గ ప్రమేయాలేవి? ఈ రెంటినీ బోధించే ఉపాయాలేవి?– అని, ఇవన్నీ తెలిసిన సద్గురువును ఆశ్రయించాలి. అప్పుడు ఈ మూడిటి సహకారంతోనూ – అనగా శాస్త్రజ్ఞాన సంపన్నమైన మేధ, పరిశుద్ధమైన బుద్ధి, సమర్థుడైన గురువు అనే ఈ మూడిటి సహకారంతోనూ– ఆత్మ విచారణ చెయ్యాలి. తత్త్వజ్ఞానం కావాలనుకున్నవాడికి ఇది ఒక్కటే కర్తవ్యం. ఈ విచారధార పెరిగిన కొద్దీ, సాధకుడి బుద్ధి పదునెక్కుతుంది. సంసారమనే దీర్ఘరోగానికి ఈ తత్త్వవిచారం ఒక్కటే మందు.

సంసారమే అడవి అనుకుంటే, విషయప్రవృత్తులే దీంట్లో చిగుళ్ళు. ఈ అడవిని విచారమనే రంపంతో అడుగంటా కోసెయ్యాలి. అలా కోస్తే, ఆ అడవి మళ్ళీ చిగురించదు. బంధునాశం జరిగినప్పుడూ, సంకటాలు వెంటపడ్డప్పుడూ, మనస్సును ఒక రకమైన మోహం ముంచి వేస్తుంది. మనిషికి ఏమీ తోచదు. అలాంటి పరిస్థితుల్లో ఈ ఆత్మవిచారం ఒక్కటే గతి. ఈ ఆత్మవిచారంవల్ల మనస్సులోని దుర్వాసనలు తొలగిపోతాయి. శుభ సంపత్తి లభిస్తుంది. శరీరబలము, బుద్ధిబలము, తేజస్సు, ప్రతిభ, కర్మఫలము, ఇలాంటివన్నీ కూడా ఆత్మవిచారణవల్లే ఫలిస్తాయి.

రామా! ఆత్మవిచారమనేది ఒక దీపం; అది యుక్తా యుక్తాలను విడదీసి చూపిస్తుంది. ఆత్మ విచారమనేది ఒక కాగడా; అది మంచి చెడులను చూపిస్తుంది. అది ఒక కల్పవృక్షం;కోరికలను తీరుస్తుంది. అది ఒక నావ;సంసార జలధిని దాటిస్తుంది. అది ఒక సింహం;మానవులలోని వివేక పద్మాలను తుంచిపారేసే ఏనుగుల మదాన్ని అణిచి వేస్తుంది. రామా! ఆత్మ తత్త్వం ఒక్కటే కాదు, రాజ్యాలూ, భోజ్యాలూ, స్వర్గమోక్షాలూ, ఇవన్నీ కూడా ఈ విచారమనే కల్పవృక్షం మీద పండే పళ్ళే! ఎండు సొరకాయ బుర్రలు నీళ్ళలో మునగనట్లుగా, ఆత్మ విచారం గల బుర్రలు ఆపదల్లో మునగవు.

రామా! మూర్ఖుల హృదయాలే అడవులు. అక్కడ అవిచారం– అంటే, ఆత్మతత్త్వ విచారం లేకపోవటమే, గచ్చపొద. ఈ గచ్చపొద పాకిందంటే ముముక్షుత్వం అనే మొక్కను పుట్టనీదు. పుట్టినా పెరగనీదు. ఈ పొదకు పుట్టిన ముళ్ళే మానవుడి దుఃఖాలు.

రామా! లోకంలో సామాన్య మానవులందరినీ విచార రాహిత్యమనే నిద్ర, ఎప్పుడూ ముంచేస్తూ

వుంటుంది. అది నిద్ర లాగా వాళ్ళ కళ్ళు మూసేస్తూ వుంటుంది. మద్యం లాగా మత్తెక్కిస్తూ వుంటుంది. నీ లాగా విచారపరుడైన మానవుడు, అలాంటి నిద్రలో, అలాంటి మత్తులో, పడడు.

**విచార వికలా యస్య మతిర్ మాంద్య ముపేయుషః**

**తస్యోదేత్యశనిశ్చంద్రాత్ ముధా యక్షశ్శిశోరివ॥** (ము.వ్య.ప్ర.స.14,శ్లో.17)

మనిషి మందమతి అయిపోయి, విచారించటమే మానేస్తే, వాడికి చంద్రుడిలోంచి పిడుగులు పడతాయి. ఎక్కడా లేని పిశాచాలు వాడి ముందు వాలుతాయి. వాడి పని పసివాడి తంతై పోతుంది.

రామా! పసివాడు తన అజ్ఞానంవల్ల చీకట్లో దయ్యం వుందని గోల చేస్తాడు. అది వాడు కల్పించుకున్న దయ్యమే. దాని భయం పెరిగిపోయి, వాడు కల్పించుకున్న దయ్యం వాడిని ప్రాణాపాయ స్థితికి తెస్తుంది. ఆ పిల్లవాడే కొంచెం పెద్దవాడవుతాడు. వాడికి కొంచెం ఆలోచన పెరుగుతుంది. దాంతో ఆ దయ్యం ఎక్కడిదిరా? ఇక్కడికి ఎలా వచ్చింది? అనే విచారం మొదలు పెట్టాడా? అంతే, ఆ దయ్యం ఎటు పోతుందో కానీ, మళ్ళీ కనిపించదు. రామా! ప్రపంచంలోని పదార్థాలన్నీ కూడా ఇంచుమించు ఇలాగే వుంటాయి. సరీగా విచారణ చెయ్యనంతవరకు చాలా రమణీయంగా వుంటాయి. అందుకే వాటిని అవిచారిత రమణీయాలు అంటారు. వాటిని విచారించటం ప్రారంభించామా, అవి అసలు కనిపించకుండానే పోతాయి.

రామా! ఇందాక చెప్పానే, పిల్లవాడు కల్పించుకున్న దయ్యమని. ఈ పెద్దవాళ్ళ సంసారం కూడా, ఆ దయ్యం లాంటిదే. పిల్లల అజ్ఞానంవల్ల పుట్టేది– దయ్యం. పెద్దల అజ్ఞానంవల్ల పుట్టేది– సంసారం. విచారమనే ద్వారపాలకుడ్ని ఆశ్రయిస్తే, ఆ దయ్యమూ నిలవదు; ఈ సంసారమూ నిలవదు. విచారం అనే ద్వారపాలకుడి ద్వారా మరో అధికలాభం ఏమంటే, కైవల్యానందం కూడా లభిస్తుంది. రామా! ఈ విచారంవల్ల అవిద్యానాశం జరిగి, మనస్సు నిశ్చలం అవుతుంది. ఈ సిద్ధి పొందినవాడు **"నాభివాంఛతి నోర్ఝతి"** (ము.వ్య.ప్ర.స.14, శ్లో.30) ఏదీ కోరదు, ఏది వద్దనదు.

### 58. అభాస చిత్తము

రామా! ఇక్కడ ఒక సందేహం వచ్చే అవకాశం వుంది. ఆత్మవిచారంలో సిద్ధి పొందినట్లయితే, మనస్సు నిశ్చలమై పోతుందని చెబుతున్నారు. స్పందం వుంటేనే మనస్సు వున్నట్టు లెక్క. ఎందుకంటే, స్పందమే మనస్సుయొక్క స్వభావం. వేడి అనేది వెళ్ళిపోయాక, నిప్పనేది అక్కడ వుంటుందా? అలాగే, స్పందం పోయి నిశ్చలమైందంటే, మనస్సే లేకుండా పోతుందన్నమాట. మనస్సే లేకపోతే మనిషి జీవిస్తాడా? కనుక, ఈ పైన చెప్పిన ప్రకారం చూస్తే, ఒకడు గట్టిగా విచారణ చేసి దాంట్లో పట్టు సంపాదిస్తే, ఇక వాడు బ్రతకడన్నమాట. ఆత్మ విచారమన్నది మోక్షానికి ఒక సాధనం మాత్రమే. సాధనం చేతిలోకి వచ్చేసరికి వీడు ఢాం అనేటట్టయితే, ఇక వీడికి మోక్షం ఎలా వస్తుంది?– ఇదీ సందేహం.

రామా! దీనికి సమాధానం ఏమంటే, మామూలు మనిషికి అనుభవంలో వుండే మనస్సు నిత్యము స్పందనశీలంగానే వుంటుంది. అది సత్యమే కానీ, ఆత్మవిచారణవల్ల ఆత్మ తత్త్వాన్ని పరిపూర్ణంగా ఆశ్రయించిన మనస్సు పూర్తిగా మరణించదు. కానీ, స్పందించనూ స్పందించదు. ఆ దశలో మనస్సనేది ఒక విచిత్ర స్థితిలో వుంటుంది. పెద్దలు అలాంటి స్థితిలో వున్న మనస్సుకు "ఆభాస చిత్తము" అని పేరు పెట్టారు. ఈ పేరు అర్థం కావటానికి ఒక ఉదాహరణ చెబుతా విను.

ఒక రైతు తన పొలంలో నాటటం కోసం, మరొక రైతు దగ్గర విత్తనాలు కొనుక్కున్నాడు. ఆ రైతుకి

వీడిమీద అంతర్గతంగా అసూయ వుంది. అందుచేత వాడు ఏం చేశాడంటే, వీడి దగ్గర డబ్బు పుచ్చుకొని, “విత్తనాలు రేపిస్తా రా” అని పంపించాడు. ఆ రాత్రి ఆ అమ్మకందారుడు విత్తనాలన్నీ బూర్లెమూకుడులో వేసి, సన్నగా వేయించి, మళ్ళీ మూట గట్టాడు. మర్నాడు కొనుక్కునే రైతు వచ్చి, విత్తనాలను పరిశీలించి చూసుకొని, బాగానే వున్నాయనుకొని, తీసుకెళ్ళిపోయాడు. తీరా నాట్లయ్యాక చూస్తే, ఒక్క గింజ కూడా మొలకెత్త లేదు.

ఇక్కడ ఏం జరిగింది? కొనుక్కునే రైతు కళ్ళు మూసుకొని విత్తనాలు తీసుకుపోలేదు. విత్తనాలు పైకి చూట్టానికి మంచి విత్తనాల లాగానే వున్నాయి. కానీ, వేయించడంవల్ల అవన్నీ చచ్చిపోయి వున్నాయి. పూర్తిగా మాడిపోయేటట్టు వేగిస్తే కొనుక్కునే రైతుకు తెలిసేదే. అవతలివాడు అట్లా వేయించలేదు. పైకి చూస్తే మామూలుగానే వుండేటట్లూ, లోపల విత్తనం మాత్రం మాడిపోయేటట్లూ, సన్నగా వేగించాడు. కనుక, ఆ విత్తనాలు పైకి మాత్రం మంచి విత్తనాల్లాగానే కనిపిస్తున్నాయి గానీ, నాటితే మొలకెత్తటం లేదు. అలాంటి విత్తనాలను లోకులు “అభాస విత్తనాలు” అంటున్నారు. అలాగే, ఆత్మ విచారణలో సిద్ధి సాధించినవాడి మనస్సు కూడా “ఆభాస మనస్సయి” పోతుంది. అది బయటికి మనస్సు లాగానే కనిపిస్తుంది గానీ, దాని లోపల వుండే వాసనా సమూహమంతా మాడిపోతుంది. అందుచేత అది కొత్తగా విక్షేపాలను పుట్టించజాలదు. కానీ, దానికి మనస్సనే ఆకారం వుంటుంది గనుక, అది పూర్తిగా చచ్చినదానికింద లెక్క గాదు. అందువల్లే ఆ జీవికి మరణం రాదు. అందుచేత, ఆత్మవిచారంవల్ల మరణం వస్తుందేమోనని సందేహించవలసిన పని లేదు. అయితే అలాంటివాడికి వేగించిన విత్తనం లాగా, ఆభాసమనస్సే వుంటే, వాడి ప్రవర్తన లోకంలో ఎలా వుంటుంది?– అని అడుగుతావేమో, విను. అలాంటి మహానుభావుడు ఈ సువిశాల మహాప్రపంచంలో అన్నిటినీ వట్టిగా చూస్తూ వుంటాడు. వాటి మీద అనురాగమూ పెట్టుకోడు, ద్వేషమూ పెట్టుకోడు. వాటిల్లో కొన్ని పవిత్రమైనవనీ, సత్యాలనీ, భావించి, అలాంటివాటిని అనుభవించాలని అనుకోడు. మరికొన్ని చెడువనీ, అపవిత్రాలనీ, భావించి, వాటిని తొలగించుకోవాలనుకోడు. వస్తువులు దొరికినప్పుడు పొంగిపోడు, దొరకలేదని కుంగిపోడు.

రామా! ఆ మహానుభావుడి ప్రవర్తన లోకానికి విచిత్రంగా కనిపిస్తూ వుంటుంది. వాడు గాఢనిద్రలో వున్నట్టుగా, ప్రపంచంలో ఏదీ తెలియనట్టుగా, వుంటాడు. కానీ, వాడు అజ్ఞానంలో వుండదు. వాడేదో స్వాప్నిక లోకంలో వున్నట్టుగా, తన ధోరణే వేరు అన్నట్టుగా, తిరుగుతూ వుంటాడు. కానీ, వాడికి లోపల వాసనలు గానీ, వాసనాప్రపంచం గానీ, అసలే వుండవు. వాడు బాహ్య ప్రపంచంలో తక్కినవాళ్ళ లాగా గంతులు వేయడు.

**న చ నైష్కర్మ్య మాదత్తే**

**న చ కర్మణి మజ్జతి ॥** (ము.వ్య.ప్ర.స. 14,శ్లో. 33)

వాడు కర్మ సన్యాసి కాడు. కర్మ ఆసక్తుడూ కాడు. వాడు జరిగిపోయిన వాటిని గూర్చి పట్టించుకోడు. జరిగే వాటిని జరగనిస్తూ వుంటాడు. మనస్సును కలవరపెట్టుకోడు. అలాగని, కదలిక లేకుండా కూర్చోడు. స్వభావసిద్ధంగా జరిగిపోయే పనులను జరగనిస్తూ వుంటాడు. వాడు నిండు సముద్రం లాగా వుంటాడు. రామా! కొందరు మహానుభావులైన యోగులు, ఈ శరీరం వుండగానే జీవన్ముక్తులై, ఇలా ఆభాసరూపమైన మనస్సుతో కొంత కాలం జీవించి, చివరికి విదేహ కైవల్యాన్ని పొందుతారు. ఆత్మవిచారణ ఇంతటి మహాఫలాన్ని అందిస్తుంది.

కనుక, రామా! ప్రతి మానవుడూ కూడా ప్రతిరోజూ **"కోహం కస్య చ సంసారః"** (ము.వ్య.ప్ర.స.14, శ్లో.37) నేను ఎవడ్ని, ఈ సంసారం ఎవడ్ని పట్టుకొంది?– అని ఈ విధంగా తనలో తానే విచారణ చేసుకుంటూ వుండాలి. లోకవ్యవహారంలో వున్నవారు కూడా ఇబ్బందులు వచ్చినప్పుడు, వెనుకా ముందు చూసుకొని, జాగ్రత్తగా విచారణ చేసుకుంటూ వుంటారు. మామూలు మనుషులే కాదు, మహారాజులు కూడా విచారణ చేసుకుంటూ వుంటారు. ఏ యుద్ధాలో వచ్చినప్పుడు, నేను మహారాజుని కదా అనుకుంటూ, మూతి ముడుచుకు కూర్చొనే రాజు నశించిపోతాడు. అలాంటి సమయాల్లో తెలివి గల రాజులు మంత్రుల్ని పిలిచి, పూర్వాపర విచారణ చేసి, నిర్ణయాలు తీసుకుంటూ వుంటారు. మహారాజులే ఈ పని చేస్తుంటే, మామూలు మనిషికి తప్పుతుందా? మామూలు లోకవ్యవహారానికే విచారణ కావలసి వుంటే, అత్యంత గంభీరమైన పరమాత్మ విషయానికి ఇంకా గట్టి విచారణ వుండదా?

కనుక, రామా! ప్రతిమానవుడూ **"కోహం కస్య చ సంసారః"** నేనెవడ్ని, ఈ సంసారం ఎవరికి?– అని ఇలా విచారణ చేసుకోవాలి. వేదంలో కర్మకాండ, బ్రహ్మకాండ అని రెండు భాగాలున్నాయి. వీటిలో కర్మకాండ– ధర్మ సిద్ధాంతాలను ఉపదేశిస్తున్నది. అంటే, ఏ సత్కారం చేస్తే ఏ సత్ఫలితం వస్తుందో, ఆ ఉపాయాలను చెబుతున్నది. ఇక బ్రహ్మకాండ వుంది. దీనినే వేదాంతాలనీ, ఉపనిషత్తులనీ, పిలుస్తుంటారు. ఈ భాగం పరబ్రహ్మ తత్త్వాన్ని ఉపదేశిస్తూ వుంటుంది. ధీశాలి అయిన మానవుడు, ఈ రెండుభాగాలనూ కూడా విచారణ చెయ్యాలి. అజ్ఞానం అనే చీకట్లో వున్న మానవుడికి విచారణ అనేది ఒక దీపం వంటిది. రామా! మనకు కన్ను వున్నా, చీకటి మీద పడితే అది పని చేయదు. పోనీ, కాంతిని సూటిగా కన్నులోకి కేంద్రీకరించినా, కన్ను పని చేయదు. వెలుతురు సమంగానే వున్నా మధ్యలో అడ్డం వుంటే వాటిని చూడజాలదు. కానీ, విచారణ అనే నేత్రానికి ఇలాంటి దోషాలు ఏమీ లేవు. అది చీకట్లోనూ చూడగలదు. వెలుతురు లోనూ చూడగలదు, అడ్డం వున్నా చూడగలదు. అందువల్ల విచారణ లేనివాడే పుట్టు గుడ్డివాడని నేనంటాను.

**"వివేకాంధో హి జాత్యంధః"** (ము.వ్య.ప్ర.స.14,శ్లో.41)

రామా! విచారణలలో పరమాత్మ విచారణ చాలా గొప్పది. అది పవిత్రమైనది. కనుక, దాన్ని ఒక క్షణం కూడా వదిలి పెట్టరాదు. పెద్ద పెద్ద రోగాలతో వచ్చే దుఃఖం కంటే కూడా, విచారణా రాహిత్యంవల్ల వచ్చే దుఃఖమే గొప్పది. విషం తినటంవల్లా, కత్తి పెట్టి కోసుకోవడంవల్లా, వచ్చే దుఃఖం కంటే కూడా, విచారణా రాహిత్యంవల్ల వచ్చే దుఃఖమే గొప్పది. ఇదేమిటి, ఇలా చెబుతున్నారనుకొంటున్నావేమో! రోగంవల్లా, విషంవల్లా, కత్తివల్లా వచ్చే దుఃఖం, ఈ ఒక్క జన్మకే ఉంటుంది. విచారణా రాహిత్యంవల్ల వచ్చే దుఃఖం జన్మజన్మలకూ వదిలి పెట్టదు. అందువల్ల, దాని గురించి అంత గట్టిగా చెబుతున్నాను.

ఇంత చెబుతున్నారు గదా! అసలు విచారణ అంటే ఎలా వుంటుంది– అంటావేమో? ఇది వరకే చెప్పాను. మళ్ళీ చెబుతాను.

**కోహం కథమయం దోషః సంసారాఖ్య ఉపాగతః ।**

**న్యాయేనేతి పరామర్శో విచార ఇతి కథ్యతే॥** (ము.వ్య.ప్ర.స.14,శ్లో.50)

నేనెవడ్ని? ఈ సంసారమనే దోషం నాకెలా వచ్చింది? అని ఏడుస్తూ కూర్చోవటం కాదు. యుక్తి ప్రతియుక్తులతో పై ప్రశ్నలకు సమాధానాన్ని అన్వేషించాలి. ఆ ఉక్తి ప్రత్యుక్తులను అల్లుకునేటప్పుడు వేదశాస్త్రాల సహాయం తీసుకోవాలి. అలాంటి ఆలోచన పేరే విచారణ.

రామా! వ్యవహార ప్రపంచంలో ప్రతివాళ్ళూ **హేయోపాదేయ విచారణ** చేసుకొంటూనే వున్నారు.

అంటే, ఇది పనికొచ్చేది. ఇది పనికిరాదు, అని విచారణ చేసి నిర్ణయించుకుంటున్నారు. తత్త్వజిజ్ఞాస కలవాడు కూడా ఆ పనే చెయ్యాలి. అలాంటి విచారణవల్లనే వాడికి జ్ఞానం లభిస్తుంది. జ్ఞానంవల్ల శమం లభిస్తుంది. రామా! నేను నీకు వెనుకటి అధ్యాయంలో శమాన్ని గూర్చి చాలా వివరించాను. ఆ శమం రావాలంటే ఉపాయం ఈ విచారణే.

**సఫలతాం ఫలతే భువి కర్మణాం**
**ప్రకటతాం కిల గచ్ఛతి ఉత్తమాం।**
**స్ఫుటవిచార దృశైవ విచారితా**
**శమవతే భవతే చ విరోచతాం॥** (ము.వ్య.ప్ర.స.14,శ్లో.54)

ఓ రామా! నీవు ఇప్పటికే కొంత శమాన్ని సాధించావు. అందువల్ల నీకు ఈ విచారణ మీద రుచి మరింత పెరుగుగాక! రామా! ఇక నీకు మూడవ ద్వారపాలకుడైన సంతోషాన్ని గూర్చి వివరిస్తాను.

## 59. సంతోషము

సంసారంలో ఎన్ని ఒడుదుడుకులు వచ్చినా, అదంతా దైవసంకల్పమని నిశ్చయం చేసుకొని, మనస్సులో దుఃఖం లేకుండా, మంచి వచ్చినా, చెడు వచ్చినా ఒకే రకంగా వుండగలగడమే సంతోషం. దీన్ని సాధిస్తే, దీన్ని మించిన ఆనందం వుండదు. మోక్షానికి ఇదే దగ్గర దారి. ఈ సంతోషంవల్ల చిత్తానికి విశ్రాంతి లభిస్తుంది. వాళ్ళకి అఖండ భూమండాలాధిపత్యం కూడా గడ్డి పరక లాగా కనిపిస్తుంది. ఈ సంతోషమనే అమృతాన్ని అందుకున్నవాడికి, భోగాలు విషాల్లాగా వుంటాయి. దొరకనివాటి మీద కోరిక వుండదు. దొరికినవాటివల్ల పొంగు వుండదు. సంతోషానికి ముఖ్యశత్రువు తృష్ణ. అంటే అత్యాశ. అందువల్ల,

**పౌరుషేణ ప్రయత్నేన తృష్ణాం సర్వత్ర వర్జయేత్** (ము.వ్య.ప్ర.స.15,శ్లో.14)

కనుక, పురుషప్రయత్నంతో ఏ విషయంలోనూ గూడా తృష్ణను వుండనీయరాదు. సంతోషంవల్ల మనస్సుకి ఒక పుష్టి కలుగుతుంది. ఆ పుష్టి కలిగిన తరువాత, భృత్యులంతా రాజు వెంట తిరిగినట్టుగా, సంపదలన్నీ వాడి చుట్టూ తిరుగుతాయి.

సంతోషానికి శత్రువు లోభమని చెప్పుకున్నాం. ఇక సంతోషానికి ముఖ్యమిత్రుడు సమత్వం. హృదయంలో సమతాభావం స్థిరపడితే, వాడి ముఖంలో ఒక కళ వస్తుంది. వాణ్ణి చూసేటప్పటికే ఎదుటివాడికి సంతోషం కలుగుతుంది.

**సమతయా మతయా గుణశాలినాం**
**పురుషరాడిహ య స్సమలంకృతః।**
**తమమలం ప్రణమంతి నభశ్చరాః**
**అపి మహామునయో రఘునందన॥** (ము.వ్య.ప్ర.స.15,శ్లో.20)

ఓ రఘునందనా! గుణవంతులందరికీ కూడా సమతాభావం సమ్మతమై వుంటుంది. మానవులకు సమతాభావమే నిజమైన అలంకారం. ఈ అలంకారాన్ని ధరించినవాణ్ణి చూస్తే, దేవతలు, మహామునులు, కూడా గౌరవంతో నమస్కరిస్తారు.

## 60. సాధుసంగమము

రామా! ఇక, సంసారాన్ని తరించటానికి సాధు సంగమమే విశేషసహకారి. సజ్జన సాంగత్యమే ఒక చెట్టు అనుకొంటే, దాని పుష్పం వివేకం. ఈ పుష్పాన్ని రాలిపోకుండా కాపాడుకుంటే, మోక్షమనే పండు దక్కుతుంది. సజ్జనసాంగత్యం వుంటే అది అడవైనా ఊరు కిందే లెక్క. ఎందుకంటే, సజ్జనులు వుంటే బంధువులు వున్నట్టే కదా. సజ్జనులు పక్కన వుంటే, ఆపదలు గూడా సంపదల్లాంటివే అవుతాయి. ఎందుకంటే, వారు వాడికి అటువంటి వివేకాన్ని కలిగిస్తారు.

**వివేకః పరమో దీపో జాయతే సాధుసంగమాత్** (ము.వ్య.ప్ర.స.16,శ్లో.6)

అంతకుముందే వివేకం వున్నవాడికి, సత్సాంగత్యం ఆ వివేకాన్ని పెంచుతుంది. అందువల్ల–

**దరిద్రేణేవ మణయః ప్రేక్షణీయా హి సాధవః ।** (ము.వ్య.ప్ర.స.16,శ్లో.12)

సంపదలు కావాలనుకొనేవాళ్ళు మణుల కోసం వెతుకుతున్నట్టుగా, వివేకం కావాలనుకొనేవారు వాడు సాధుపురుషుల కోసం వెతుక్కోవాలి.

వశిష్ఠమహర్షి ఈ విధంగా నలుగురు ద్వారపాలకులనే పేరుతో, నాలుగు మోక్షోపాయాలను వర్ణించి, చివరికి మరో సారి ఇలా అన్నాడు–

**సంతోషః పరమో లాభః సత్సంగః పరమా గతిః।**

**విచారః పరమం జ్ఞానం శమో హి పరమం సుఖమ్।**

**చత్వార ఏతే విమలా ఉపాయా భవభేదనే।।** (ము.వ్య.ప్ర.స.16,శ్లో.19,20)

మనిషి పొందగల లాభాలన్నిటిలోకీ సంతోషమే గొప్ప లాభం. మనిషికి వున్న మార్గాలన్నిటిలోకీ సత్సంగమే గొప్ప మార్గం. మనిషి పొందగల జ్ఞానాలన్నిటిలోకి ఆత్మ విచారమే గొప్ప జ్ఞానం. మనిషి పొందగల సుఖాలన్నిటిలోకీ శమమే– అనగా శాంతత్వమే– గొప్ప సుఖం. సంసారాన్ని నశింప చేయటానికి ఇవి నాలుగే మంచి ఉపాయాలు.

రామా! ఈ నాల్గింటిలోనూ ఒక విశేషం వుంది. ఏమిటంటే– లోకంలో సామాన్యంగా ఒక కారణమూ, దానివల్ల పుట్టే కార్యాలూ వుంటాయి. ఈ నాల్గింటిలో మాత్రం ప్రతి ఒక్కటీ కూడా, తక్కిన మూడింటికి కారణం కాగలదు– అదీ చిత్రం.

**ఏకోప్యేకోపి సర్వేషాం**

**ఏషాం ప్రభవభూరిహ।।** (ము.వ్య.ప్ర.స.16,శ్లో.22)

అంటే, వీటిలో సంతోషాన్ని బాగా పట్టుకుంటే, అది సత్సాంగత్యాన్నీ, ఆత్మ విచారాన్నీ, శాంతినీ, కలిగించగలదు. కొందరికి సంతోషం అంత సులభం కాదు. వారు సత్సాంగత్యాన్ని బాగా పట్టుకుంటే– అదే సంతోషాన్నీ, ఆత్మవిచారాన్నీ, శాంతినీ, ఇవ్వగలదు. కొందరికి ఆత్మ విచారమే సులభం. అలాంటివారు దాన్ని బాగా సాధిస్తే, వారికి అదే సంతోష, సత్సంగ, శమాలను కలిగించ గలదు. కొందరికి పై మూడూ చేతకావు. వారు పరిపూర్ణంగా శాంతంగా వుంటే చాలు. ఆ శమమే వారికి సంతోషాన్నీ సత్సాంగత్యాన్నీ, ఆత్మ విచారణనూ అందించగలదు. కాబట్టి, రామా! గట్టి పురుషప్రయత్నాన్ని ఆశ్రయించి, మనస్సును జయించి, నేను చెప్పిన నాలుగు ఉపాయాల్లో ఏ ఒక్కదాన్నైనా సరే, గట్టిగా ఆశ్రయించు. అలా ఒక్క గుణాన్నైనా నువ్వు సాధించలేకపోతే, దేవుడివైనా ఒకటే, యక్షుడవైనా ఒకటే, మనిషివైనా ఒకటే, చెట్టువైనా ఒకటే.

ఇక్కడ వశిష్ఠుడు మోక్షోపాయాల సాధనాల విషయంలో, దేవతలైనా ఒక్కటే, చెట్టైనా ఒక్కటే అని

చెప్పడంవల్ల, సంసారం తరించటానికి జన్మ కారణం కాదనీ, జన్మ ఎలాంటిదైనా ఆత్మజ్ఞానం కోసం కృషి చెయ్యవచ్చుననీ, అంతేగాక, ఎంత గొప్ప జన్మ వున్నా ప్రయత్నం చెయ్యనివారికి ఆత్మజ్ఞానం రాదనీ, తెలుస్తోంది.

కనుక, ఓ రామా! ఇంత వరకూ నేను చెప్పిన విషయాలన్నిటికి పలితార్థమేమిటో చెబుతాను విను. రామా! మానవుడి మనస్సే అడవి. వాడి ఆలోచనలే చెట్లు. ఈ అడవిలో వాడి పూర్వజన్మ వాసన అనే నది రెండు పాయలుగా ప్రవహిస్తూ వుంటుంది. శుభవాసన ఒక పాయ, అశుభవాసన రెండవపాయ. ఈ పాయలలో దేన్ని ఎండగడతావో, దేన్ని పెంచుతావో, అది నీ ప్రయత్నం మీద ఆధారపడి వుంటుంది. **'యథేచ్ఛసి తథా కురు"** (ము.వ్య.ప్ర.స.16,శ్లో.34) నీకు ఎలా కావాలనుకుంటే అలానే చెయ్యి. నా అభిప్రాయంలో నువ్వు నీ అశుభ ప్రవాహాన్ని మాత్రం ఎండగట్టుకోవాలి. నీవు శుభమతివి. నీ పురుషప్రయత్నంవల్ల నీ శుభవాసన ప్రవాహాన్ని పెంచుకో.

## 61. గ్రంథ సంఖ్య

రామా! శాస్త్రం రాజులకే చెప్పాలి. తత్వాశాస్త్రాన్ని సహజమైన అతర్వివేకం కల నీ బోటి మహానుభావులకే చెప్పాలి. నీకు చక్కని ప్రణాళికతో ఈ తత్త్వవిద్యను ఉపదేశించాలని అనుకుంటున్నాను. అందువల్ల, నా గ్రంథ ప్రణాళిక ఏమిటో నీకు ముందుగానే చెప్పేస్తాను. నిద్రపోయేవాడి ముందర దీపం పెట్టినా లాభం లేదు. మెలకువగా వున్నవాడికి ఎదురుగుండా దీపం వుంటే, వద్దన్నా వస్తువులు కనిపిస్తూనే వుంటాయి. నీలాంటి సహజవివేకం గలవారికి, నేను చెప్పబోయే ఈ మోక్షసంహితను వింటే చాలు, మోక్షం లభించి తీరుతుంది. ఈ ప్రపంచభ్రాంతి తొలగుతుంది. నేను ఉపదేశించే ఈ మోక్షసంహితలో మొత్తం 32వేల శ్లోకాలు వుంటాయి. దీనిలో ఆరు ప్రకరణాలు వుంటాయి. ప్రతి ప్రకరణంలోనూ మంచి కథలు వుంటాయి. అవి మేము యుక్తులతో చెప్పిన విషయాలకు దృష్టాంతాలుగా పనిజేస్తాయి. నేనుపదేశించే ప్రకరణాలేవంటే–

### మొదటిది- వైరాగ్య ప్రకరణం

వాన లేని చోట మొక్కలు సరిగా పెరగవు. అయినా, రోజూ శ్రద్ధగా నీళ్ళు పోస్తే అలాంటి చోట కూడా పెరటి మొక్కలు బాగానే పెరుగుతూ వుంటాయి. అలాగే, ఎంతటి అనురాగబద్ధుడైనా సరే, ఈ వైరాగ్యప్రకరణం జాగ్రత్తగా వింటే, సరిగ్గా మననం చేస్తే, వైరాగ్యసంపన్నుడు కాక మానడు. ఈ ప్రకరణంలో 1500 శ్లోకాలున్నాయి.

### రెండవది- ముముక్షు వ్యవహార ప్రకరణం

దీనిలో వెయ్యి శ్లోకాలున్నాయి. దీనిలో మోక్షం కావాలనే కోరిక గలవారు ఏ రకమైన వ్యవహారం చెయ్యాలో, దానిని వివరించాను.

### మూడవది- ఉత్పత్తి ప్రకరణం

దీనిలో ఏడు వేల శ్లోకాలున్నాయి. ఈ ప్రపంచానికి ఉత్పత్తి ఎలా జరుగుతోందంటే, కలలోని పదార్థాలకు ఎలా జరుగుతోందో అలానే జరుగుతోంది. ఇది ఒక మనోరాజ్యం. ఇది ఒక గంధర్వ నగరం. ఇది గోడలేని

బొమ్మ. ఆ బొమ్మలో కనిపించే నిప్పుకి అగ్నిధర్మం ఎంత వుందో, ఈ జగత్తుకి సత్యత్వం అంతే వుంది. రామా! మరో ఉదాహరణ చెబుతాను. ఓ మేధావి ఆరుబయట పట్టెమంచం వేసుకొని, దానిమీద వెల్లకిలా పడుకొని, నోటినిండా నీళ్ళు పోసుకుని, ఉఫ్ అని బలంగా ఆకాశంలోకి ఉమ్మేశాడు. ఆ తుంపరలన్నీ గాలిలోకి ఎగిరి చెల్లా చెదరైనాయి. అది చూసి ఆ మహామేధావి "ఆహా ఆకాశంలో గొప్ప సరస్సు వెలిసింది" అని గంతులు వేశాట్ట. ఈ ప్రపంచంయొక్క ఉత్పత్తి కూడా అలాంటిదే. ఉత్పత్తి ప్రకరణంలో ఇట్టి యీ జగదుత్పత్తిని గూర్చి వివరించ బోతున్నాను.

**నాలుగవది స్థితి ప్రకరణం**

దీనిలో మూడు వేల శ్లోకాలుంటాయి. ప్రపంచంయొక్క స్థితి ఇంత విస్తారంగా కనిపిస్తోంది గదా, ఇదేమిటని ప్రశ్న పుడుతూ వుంటుంది. ఈ ప్రపంచంలో కనిపించే ద్రష్టా-దృశ్యము, భోక్తా- భోగ్యము, కర్తా- కరణము, అన్నీ ఆ పరబ్రహ్మమే అని, అధిష్ఠానంలో వున్న చైతన్యమే ఈ ప్రపంచస్థితికి హేతువనీ, ఆ ప్రకరణలంలో నేను వివరిస్తాను.

**ఐదవది- ఉపశమ ప్రకరణం**

ఇది పరమ పవిత్రమైనది. ఇందులో ఐదు వేల శ్లోకాలుంటాయి. అదీ-ఇదీ, వాడూ- వీడు, నువ్వూ- నేనూ, అనే ఈ భ్రాంతులన్నీ ఈ ప్రకరణంవల్ల ఉపశాంతి పొందుతాయి. ఈ ప్రకరణంలోని విషయాలు మనస్సుకి పడితే, ఈ సంసారమంతా రాతిమీద సుద్దముక్కతో వేసి చెరిపేసిన బొమ్మలాగా, కనిపించీ కనిపించకుండా వుంటుంది. అంటే- ఈ ప్రకరణం మనస్సుకు పట్టినవాడు జీవన్ముక్తుడవుతాడు. కనుక, వాడు శరీరాన్ని ధరించివున్నా కూడా సంసారమోహాలు వాడ్ణి బంధించవు. అంతే గాక, ఈ ప్రకరణం బాగా మననం చేసినవాడికి, ఈ సంసారమంతా కుందేటి కొమ్ము లాగా అసలే లేనిదని అవగతమవుతుంది.

**ఆరవది- నిర్వాణ ప్రకరణం**

ఇదే చివరిది. ఇదే అన్నిటికన్నా పెద్దది. దీనిలో 14,500 శ్లోకాలున్నాయి. దీన్ని సరీగా తెలుసుకుంటే సకల సంకల్పాలూ అంతరించి, నిర్వాణమనే శ్రేయస్సు లభిస్తుంది. వాడికి శరీరం వున్నా సరే అశరీరుడవుతాడు.

## 62. పరమాణు గర్భంలో ప్రపంచం

ఈ 17వ సర్గయొక్క చివర్లో, జగన్మిథ్యాత్వాన్ని గురించి చాలా అందమైన శ్లోకాలున్నాయి. కానీ, ఆ విషయాలన్నీ మళ్ళీ ఆయా ప్రకరణాల్లో రాబోతున్నాయి గనుక, ఇక్కడ ప్రస్తావించడం లేదు. అయినా, ఒక శ్లోకాన్ని మాత్రం వదలలేకుండా వున్నాను.

**పరమాణౌ పరమాణౌ చిదాకాశః స్వకోటరే।**

**జగల్లక్ష్మీ సహస్రాణి ధత్తే కృత్వాథపశ్యతి॥** (ము.వ్య.ప్ర.స.17,శ్లో.49)

ఈ శ్లోకానికి మామూలు అర్థం ఏమిటంటే "చిదాకాశమనే పేరుగల పరమాత్మ, తనలో తనే ఒక చిల్లిని- అనగా ఆకాశాన్ని- కల్పించుకొని, దానిలోని ప్రతి పరమాణువులోనూ, వేల కొలది జగత్తులను సృష్టించి, ధరించి, చూస్తూ వుంటాడు" అని. ఈ వాక్యమే చిత్రంగా వుంది. సాంప్రదాయకులైన వ్యాఖ్యాతలు

దీన్ని వివరిస్తూ, చిన్న అద్దంలో పెద్ద కొండ కనిపిస్తూ వుంటుందనీ, కొండేమిటి– ఆకాశమే కనిపిస్తూ వుంటుందనీ, కనుక, మాయా విలాసానికి అసాధ్యం లేదనీ, చిదాకాశంలోని ప్రతి అణువులోనూ అనేక బ్రహ్మాండాలు కనిపించడం మాయా విలాసమేననీ, వ్రాశారు. అది సత్యమే. కాదనటం లేదు. కానీ, నవీన వైజ్ఞానిక దృష్టితో పరిశీలించినప్పుడు, ఈ శ్లోకానికి మరొక విశేషార్థం కనిపిస్తోంది. ఆ అర్థం కూడా ఈ గ్రంథంలో ప్రతిపాదించబోయే సిద్ధాంతానికి అనుకూలమే కనుక, ఈ అర్థాన్ని కూడా మనం భావించుకొందాం.

బాహ్యాకాశమూ, మానసాకాశము, చిదాకాశము, అనే పదాలను గూర్చి ఈ ముముక్షు వ్యవహార ప్రకరణంలోనే ఒకసారి చర్చించుకున్నాం. రాబోయే ఉత్పత్తి ప్రకరణంలో ఈ చర్చ మరింత విస్తారంగా వస్తుంది. ఇంతకూ చిదాకాశం అంటే– చైతన్యం– అని తేల్చారు. చలించే జీవులంతా తమ సొంతమని భావించే చైతన్యమే చిదాకాశం. ఈ చైతన్యం ఎక్కడ వున్నదనే చర్చ వేదాంతశాస్త్రంలో విస్తారంగా వుంది. ఆ చర్చకు ఫలితాంశమేమంటే, ఈ జగత్తులోని ప్రతి అనువుకీ గూడా అధిష్ఠానంగా వున్నది ఆ చైతన్యమే– అని. అంతే కాదు, జడాలని మనం భావించే అణువులన్నిటిలోనూ వ్యాపించి వున్నది ఈ చైతన్యమే. ఇది వేదాంత సిద్ధాంతం.

ఇక ఈ నాటి వైజ్ఞానిక పరిశోధనల్లో ష్రోడింగర్, మార్క్స్ బోస్, రిచర్డ్ ఫిన్‌మన్, మొదలైన నోబుల్ బహుమతి గ్రహీతలు అనేకమంది, పరమాణువుల గర్భంలో వుండే అణుఖండాలు జడపదార్థాల్లాగా కాకుండా, స్వేచ్ఛ ప్రకారంగా సంచరించే సూక్ష్మజీవుల్లాగా వున్నాయని నిరూపించారు. అంతేగాక, ఆ అణుఖండాలు కొంత సేపు తరంగాల్లాగానూ, మరికొంత సేపు ఘనపదార్థాల్లాగానూ, ప్రవర్తిస్తూ వుంటాయని కూడా నిరూపించారు. అందుకే ఆ పదార్థాలకు "వేవికల్స్" అని పేరు పెట్టారు. అంటే వేవ్స్ మరియు పార్టికల్స్– రెండూ కలిపి వేవికల్స్ అన్నారు. అలాగే, ఈ వేవికల్స్ అనేవి నియమబద్ధంగా కాక స్వేచ్ఛగా సంచరిస్తున్నాయి. అంటే, సచేతన పదార్థాల్లాగా వ్యవహరిస్తూన్నాయి. కనుక, వీటికి ప్రాబబిలిటీ వేవ్స్ అనే పేరు కూడా పెట్టారు. అన్ని రకాల పరమాణువులకీ మూల పదార్థాలైన ఈ అణుఖండాలు, సచేతన పదార్థాలైనప్పుడు, ఈ అణువులు జడాలెట్లా అయినాయి? అంతే గాకుండా, అణువును విడదీస్తే అపారమైన శక్తి బయటకు వస్తోంది. కనుక, శక్తిని కంప్రెస్ చేస్తే అణువు తయారు కావలసి వుంటుంది. అనంతాకాశంలోని మహాశక్తిని ఎవరో ఒకరు కంప్రెస్ చేసి, అణువులుగా చేయబట్టే, మనం ఈ నాడు జడాలైన అణువులను చూడగలుగుతున్నాం. ఈ విధంగా జడాలని మనం భావించే అణువుల లోపల వున్న పదార్థం చేతన పదార్థమే. ఆ చేతన పదార్థానికి అణు స్వరూపాన్ని కలిగించేది కూడా చేతన పదార్థమే. ఇది ఈ నాటి నవీన విజ్ఞాన శాస్త్రం నిరూపిస్తున్న విజ్ఞాన విషయం. ఈ విజ్ఞానాన్ని దృష్టిలో పెట్టుకొని పై శ్లోకాన్ని విశ్లేషిద్దాం.

**పరమాణౌ పరమాణౌ చిదాకాశః స్వకోటరే।**
**జగల్లక్ష్మీ సహస్రాణి ధత్తే కృత్వాథ పశ్యతి॥**

ముందు ప్రతి పదార్థం చెబుతాను.

పరమాణౌ పరమాణౌ – ప్రతి పరమాణువులోనూ

స్వకోటరే– దాని కడుపులో

చిదాకాశః – చైతన్యమనే ఆకాశం వుంది

సః చిదాకాశః – అట్టి ఆ చైతన్యము

జగత్ లక్ష్మీ సహస్రాణి – వేలకొలది జగత్తులను

కృత్వా– సృష్టి చేసి,

ధత్తే- వాటిని ధరించి వుంటోంది

అథ- మరియు

పశ్యతి - వాటిని చూసే ద్రష్టగా కూడా తానే వుంటోంది.

ఇక తాత్పర్యం పరిశీలిస్తే- అన్ని పరమాణువుల్లోనూ అంతర్గర్భంలో వున్న మూల ద్రవ్యం చైతన్యమే. ఆ చైతన్యమే వేల వేల బ్రహ్మాండాలుగా విస్తరిస్తోంది. ఆ బ్రహ్మాండాలలో కొన్ని పదార్థాలు జడాలనీ, కొన్ని పదార్థాలు చేతనాలనీ, నేను చేతనజాతిలో చేరినవాడిననీ, నేనీ ప్రపంచాన్ని చూసే ద్రష్టననీ, భావించే జీవుడు కూడా ఆ చైతన్యమే- అని ఈ శ్లోకం చెబుతోంది. ఆ తాత్పర్యం నవీన విజ్ఞాన శాస్త్రానికి అనుకూలంగా వుంది. అలాగే, మన ఉపనిషత్తుల సిద్ధాంతానికి కూడా అనుకూలంగానే వుంది. ఎలాగంటే, ఛాందోగ్యోపనిషత్తులో ఆ మూల చైతన్యపదార్థం పంచభూతాలనూ సృష్టి చేసి-

**హన్తాహ మిమాస్తిస్రో దేవతా**

**అనేన జీవేనాత్మనానుప్రవిశ్య**

**నామరూపే వ్యాకరవాణీతి॥** అని సంకల్పించింది.

"సేయం దేవతైక్షత" అని వుంది. అంటే, ఆ చైతన్యదేవత ఇలా భావించింది. ఏమంటే, ఈ పంచభూత పరమాణువులోకి నేనే జీవాత్మగా ప్రవేశిస్తాను. నేనే వీటికి నామరూపాలను కల్పిస్తాను. అని.

బ్రహ్మాండంలో గల శక్తిని కంప్రెస్ చేసి, అణువులను తయారు చేసిందెవరు? అని ఇందాక మనం ప్రశ్నించుకున్నాం. ఆ ప్రశ్నకు ఈ ఉపనిషత్తు సమాధానం చెబుతోంది. మూల చైతన్యమే ఆ పని చేసిందనీ, చేసి, తాను సృష్టించిన పరమాణువుల్లోకి తనే ప్రవేశించిందనీ, ఈ ఉపనిషత్తు చెబుతోంది. ఇవాల్టి విజ్ఞాన శాస్త్రమూ అదే చెబుతోంది. ఇక్కడ ఈ వాల్మీకి శ్లోకం కూడా అదే చెబుతోంది. ప్రతి పరమాణువు గర్భంలోనూ ఆ చైతన్యమే వుందనీ, ఆ చైతన్యమే అధిష్టానంగా వుండి వేలకొలది బ్రహ్మాండాలనే జగత్కల్పనకు ఆధారమవుతోందనీ, ఈ శ్లోకం చెబుతోంది. ఈ విధంగా చూసినప్పుడు అధునాతన విజ్ఞానానికీ, సనాతన విజ్ఞానానికీ, గల సంబంధం మనకు అర్థమవుతుంది. ఈ శ్లోకానికి ఈ రకమైన అర్థమే ఎందుకు చెప్పాలని అడిగేవారికి, పై సర్గలో రెండు శ్లోకాలు రాబోతున్నాయి, అక్కడ వివరించుకొందాం.

ఇక, అసలు గ్రంథంలోకి పోదాం. వశిష్ఠమహర్షి ఇలా కొన్ని విశేషాలను సంగ్రహంగా అందించి, చివరికి ఇలా అన్నాడు-

***వశిష్ఠుడు***: రామా! ఇలాంటి విషయాలన్నీ కూడా నిర్వాణ ప్రకరణంలో నేను వివరించబోతున్నాను.

రామా! నేనీ ముక్తిశాస్త్రాన్ని యుక్తులమీద ఆధారపడి నిర్మించాను. అందుచేత పురుషకృతమైనా సరే, ఈ శాస్త్రాన్ని ప్రమాణంగా స్వీకరించవచ్చు.

**అపి పౌరుష మాదేయం శాస్త్రం చేద్యుక్తిబోధకమ్ ।** (ము.వ్యప్ర.స.18, శ్లో.2)

యుక్తులను బోధించే శాస్త్రం, యుక్తియుక్తంగా వున్న శాస్త్రం, మానవులు రచించినదైనా సరే, ప్రమాణమే అవుతుంది. ఈ మాట ఎందుకు చెబుతున్నానంటే, అపౌరుషేయమైన వేదాన్ని ప్రమాణంగా స్వీకరించాలి గానీ, మానవ ప్రోక్తమైనదాన్ని ప్రమాణంగా ఎందుకు స్వీకరించాలి?- అని నీకు సందేహం కలగవచ్చు. వేదోక్తమయిన విషయాన్నే నేను యుక్తులతోనూ, దృష్టాంతాలతోనూ, జోడించి మనస్సుకు నచ్చేలాగా నీకు ఉపదేశం చేయబోతున్నాను. అందుకే, ఈ శాస్త్రం ప్రమాణమవుతోంది.

యుక్తియుక్తమైన మాట పసిపిల్లవాడు చెప్పినా వినాలి. యుక్తియుక్తం కాని మాటను బ్రహ్మదేవుడు చెప్పినా, లెక్క చెయ్యనక్కర్లేదు.యుక్తి యుక్తమైన మాట చెబుతుంటే వద్దనేవాడు ఎలాంటి వాడంటే, గంగ

నీళ్ళిచ్చి "తాగరా బాబూ" అంటే "నాకొద్దు, ఇది మా తాతగారు తవ్వించిన బావి, ఉప్పగా వున్నా సరే ఈ నీళ్ళే తాగుతాను" అనేవాడు ఎటువంటివాడో అలాంటివాడు.

రామా! నేను చెప్పబోయే ఉపదేశం ముందు వినాలి. తరువాత మననం చేసుకోవాలి. దీనివల్ల ఆత్మజ్ఞానం కలిగే లోపుగా, ముందు సభారంజకంగా మాట్లాడే నేర్పు వస్తుంది. దానికంటే మరో ముఖ్యమైన విశేషమేమంటే, ఇతరులు గంభీరమైన విషయాలు చెప్పినప్పుడు మరింత సులువుగా అర్థం చేసుకోగల శక్తి వస్తుంది. ఆ తరువాత నీకంటే పెద్ద పండితులతో స్నేహం ఏర్పడుతుంది. ఆ తరువాత లోభ మోహాది దోషాలు తగ్గిపోయి, అనుభవ జ్ఞానం కలుగుతుంది.

తత్త్వ శాస్త్రాధ్యయనం చేసేవారికి కూడా ఈ సంసారంలో జన్మ మొదలా? కర్మ మొదలా? దైవం ప్రధానమా? పౌరుషం ప్రధానమా?- అని ఇలాంటి సంశయాలన్నీ పీడిస్తూ వుంటాయి. అవన్నీ కూడా ఈ మోక్ష సంహితవల్ల నశిస్తాయి.

నేను ఉపదేశించే ఈ మోక్ష శాస్త్రాన్ని అధ్యయనం చేసే వాడియొక్క బుద్ధి- సచ్ఛాస్త్రాలకీ, సత్పురుషులకీ, సమ్మతమైన విషయాల మీద మాత్రమే రమిస్తుంది. అందువల్ల వాడికి అసంగ అద్వితీయ పరమాత్మ సాక్షాత్కారం లభిస్తుంది.

వెనుకటి సర్గలో ప్రతి పరమాణువులోనూ చైతన్యం వున్నదని ఒకానొక శ్లోకానికి నవీన విజ్ఞానశాస్త్ర పరంగా అర్థం చెప్పుకున్నాం. అక్కడ ఇలాంటి అర్థంగల శ్లోకాలు రెండు పై సర్గలో రాబోతున్నాయని అప్పుడు చెప్పుకున్నాం. అవి ఏవంటే-

**జగతాం కోటి లక్షేషు యావంతః పరమాణవః ।**

**తేషామేకైకశోఽ ంతస్థాన్ సర్గాన్పశ్యత్యసంగ ధీః॥**

**పరమాణౌ పరమాణౌ సర్వవర్గ నిరర్గలాః॥**

**యే పతంత్యుత్పతంత్యంబు వీచివ త్తాన్స పశ్యతి॥** (ము.వ్య.ప్ర.స. 18,శ్లో. 27,28)

ఇవి 18వ సర్గలో 27, 29 శ్లోకాలు. వీటిలో మొదటి శ్లోకం ఏం చెబుతోందంటే, లక్షల కోట్ల బ్రహ్మాండాలున్నాయి. వాటిలో అంతకు మించిన లక్షల కోట్ల పరమాణువులున్నాయి. వాటిలోని ప్రతిఒక్క అణువులోపలా అనేక లక్షల కోట్ల కొద్దీ సృష్టులున్నాయి. నేను ఉపదేశించే మోక్షశాస్త్రం విన్నవాడు అలాంటి సృష్టులన్నింటినీ అసంగబుద్ధితో దర్శించగలుగుతాడు- అని 27వ శ్లోకం చెబుతోంది. వెనుకటి సర్గలోని శ్లోకానికి మనం అర్థం చెప్పుకుంటూ, ప్రతి అణువుయొక్క గర్భంలోనూ చైతన్యం వుందనీ, ఆ చైతన్యమే సృష్టిమొత్తానికీ అదిష్ఠానమనీ, విజ్ఞానశాస్త్రపరంగా వివరించుకున్నాం. ఇక్కడ ఈ 27 శ్లోకంలో ఆ అర్థాన్ని మరింత సూటిగా వాల్మీకి మహర్షి మనకు అందిస్తున్నాడు. అందిస్తూ "అసంగ ధీః" అని మరో విశేషం చేర్చాడు. అంటే, ఈ రకంగా చైతన్యతత్త్వాన్ని గ్రహించినవాడికి నిస్సంగత్వం వస్తుందని-ఆయన చెబుతున్నాడు.

ఇక 29 శ్లోకం-

**పరమాణౌ పరమాణౌ సర్వవర్గ నిరర్గలాః**

**యేపతంత్యుత్పతంత్యంబు వీచివత్తాన్స పశ్యతి॥**

ఈ శ్లోకంలో నిస్సంగ బుద్ధికలవాడు సృష్టి స్థితిలయలను ఏ విధంగా దర్శిస్తాడో వశిష్ఠమహర్షి చెబుతున్నాడు. ఎలాగంటే, సముద్రంలోని అలలు అడ్డూ ఆపు లేకుండా ఎలాగైతే లేస్తూ పడుతూ, మళ్ళీ లేస్తూ పడుతూ వుంటాయో, అలాగే, ప్రతి పరమాణువులోనూ అడ్డూ ఆపు లేకుండా సృష్టి స్థితి లయలు లేస్తూ పడుతూ, మళ్ళీ లేస్తూ పడుతూ, వుండటాన్ని వాడు దర్శిస్తాడు- అంటున్నాడు, ఆ మహర్షి.

రామా! ఈ మోక్షశాస్త్రాన్ని విన్నవాడికి ఎన్నో మోక్షరహస్యాలు లభిస్తాయి. అయినాకూడా, వాడు సాధారణ మానవుడి లాగా వుంటాడు. రామా! ఇలా వర్ణించి చెప్పేసరికి, ఈ బ్రహ్మవిద్య ఎంతో కష్టమైందేమోనని కొందరనుకుంటారు. కానీ, అది పొరపాటు. ఇది ఒక రసమయమైన కావ్యం. దీనిలో దృష్టాంతాలు దీపాల్లాగా ప్రకాశిస్తూ వుంటాయి. కాస్త భాషాజ్ఞానం వుంటే చాలు, సులువుగానే అర్థమవుతుంది. దీన్ని బాగా అభ్యసిస్తే, మోక్షం కోసం ఇహ వేరే తపస్సులూ, ధ్యానాలూ, జపాలూ, అక్కర్లేదు.

ఇందాకట్నుంచీ పురుషప్రయత్నం చెయ్యాలన్నారు, గదా! అంటావేమో? ఆ ప్రయత్నమంతా రాగద్వేషాది దోషాలను పోగొట్టుకునేందుకు మాత్రమే, అవి పోయాక ఈ శాస్త్రం వినటం, దానివల్ల మోక్షం పొందటం అనేవి అత్యంత సులభమైన విషయాలు. దీనికన్నా చిగురాకుల్లో సూది గుచ్చడమే కష్టం.

ఇలా చెప్పేసరికి రాగ ద్వేషాదులన్నీ పూర్తిగా తొలగిపోయిన తరువాతనే ఈ శాస్త్రాలన్ని వినాలనుకుంటావేమో! అలా కాదు. సదాచారానికీ, శాస్త్రానికీ, విరోధం లేకుండా, యథాశక్తిగా భోగాలను అనుభవిస్తూనే, దేశకాలాలను బట్టి సత్సంగము, సదాచారము, మొదలయినవి ఆచరిస్తూ, ఈ శాస్త్రాన్ని అధ్యయనం చేస్తే, జ్ఞానబోధ లభిస్తుంది.

## 63. దృష్టాంతము

రామా! ఇక మేము ఎలాంటి దృష్టాంతాలతో, ఎలాంటి పరిభాషలో, ఎటువంటి విధానంలో, విషయ ప్రతిపాదన చెయ్యబోతున్నామో, వాటిని కొంచెం వివరిస్తాను. దృష్టాంతమంటే, మామూలు భాషలో పోలిక. వివరంగా చెప్పాలంటే, అంతము అంటే ఫలం. ఫలం అంటే చెప్పదలుచుకున్న విషయం. దృష్టము అంటే– తెలియబడినది. దేన్ని చెబితే చెప్పదలుచుకున్న విషయం తెలియబడినది అవుతుందో, అట్టి విషయం పేరు దృష్టాంతం.

ఎలాగంటే, వ్యాపారం చేసుకొనే మిత్రుడికి ఒకడికి అంగట్లో కూర్చొని నిద్రపోయే అలవాటుంది. అది తప్పు, ప్రమాదకరం, అని మనం చెప్పదలుచుకున్నాం. అప్పుడు వాడితో "చిటారుకొమ్మన కూర్చొని కునికిపాట్లు పడటం ఎటువంటిదో, దుకాణంలో కూర్చొని నిద్రపోవటం కూడా అటువంటిదే" అని చెప్పాం. ఇక్కడ చిటారు కొమ్మకీ, దుకాణానికీ ఏ మాత్రమూ పోలిక లేదు. అయినా, చెట్టుమీద నిద్రా ప్రమాదకరమే, దుకాణంలో నిద్రా ప్రమాదకరమే. ఈ పోలిక వుండటంవల్ల చిటారుకొమ్మ మీద కూర్చొని నిద్రపోవడం– అనే ప్రస్తావన రాగానే, అంగడిలో నిద్రపోవడం ప్రమాదకరమనే విషయం మిత్రుడికి స్పష్టంగా బోధపడుతుంది. మనం చేయదలచుకున్న బోధకు ఫలం ఇదే. ఫలమన్నా, అంతమన్నా ఒకటే అని చెప్పుకున్నాం. చిటారుకొమ్మ మీద నిద్ర– అనే ప్రసంగంవల్ల అంతం దృష్టమైంది. కనుక, అంటే– మనం చెయ్యదలచుకున్న బోధ వాడికి తెలిసింది కనుక, చెట్టుమీద నిద్ర అనేది దృష్టాంతం. ఈ దృష్టాంతంవల్ల మనం వాడికి చెయ్యదలచుకున్న బోధ ఏమిటి? "దుకాణంలో నిద్ర పోరాదు" అని. ఈ అసలు విషయం పేరు– దార్ష్టాంతికము.

నీ మోహం చంద్రుడి లాగా వుందన్నామనుకో. ఇక్కడ చంద్రుడు ఉపమానం, ముఖం–ఉపమేయం. దేన్ని గురించి వర్ణిస్తున్నామో అది ఉపమేయం. దృష్టాంతం ఉపమానం వంటిది. దార్ష్టాంతికం ఉపమేయం వంటిది. ఉపమానానికీ, ఉపమేయానికీ, కొన్ని సమాన గుణాలు వుంటాయి. అలాగని నూటికి నూరు పాళ్ళూ సమానత్వం వుండదు. నీ ముఖం చంద్రుడి లాగా వున్నది– అన్న చోట, చంద్రుడెలాగయితే ఆహ్లాదకరంగా

వున్నాడో, ముఖం కూడా అలాగే ఆహ్లాదకరంగా వున్నదని అభిప్రాయం. అంతే గానీ, ముఖం కంచం లాగా గుండ్రంగా వుందని అభిప్రాయం కాదు. కనుక, పోలికను ఏ దృష్టితో చెప్పామో గమనించుకోవాలి.

అలా అన్నాం గదా అని, ఏదో ఒక అప్రధాన గుణాన్ని ఆధారంగా చేసుకొని, అడ్డదిడ్డంగా ఉపమానాలు చెప్పరాదు. అందుకే శాస్త్రజ్ఞులు దృష్టాంతాలలో అసిద్ధి, విరోధము అనేవి ప్రధానదోషాలని చెప్పారు. అసిద్ధి అంటే, అసలు దృష్టాంతమే దొరకకపోవడం. ఎలాగంటే– "గోడలు లేకుండానే ఇళ్లు కట్టవచ్చు, ఆకాశభవనం లాగా!" అని ఒకాయన అన్నాడనుకోండి. ఇక్కడ ఆకాశభవనం అనేది కవితా కల్పనే తప్పితే, ఆకాశమనే భవనం ఎక్కడా లేదు. కనుక, గోడలు లేని ఇంటికి, ఎక్కడా దృష్టాంతం దొరకనే దొరకదు. ఇది దృష్టాంత అసిద్ధి. దృష్టాంతం అసిద్ధమైతే అతడు చేసిన ప్రతిపాదనే తప్పన్నమాట. గోడలు లేని ఇళ్ళు, అనేది తప్పే గదా.

దృష్టాంతంలో విరోధం ఎలా వుంటుందంటే– "నిప్పు, మంచుముక్క లాగా వుంది" అన్నాడనుకోండి. "అదేమిటయ్యా, అలా చెబుతావు అంటే– దాన్నీ పట్టుకోవడం కష్టమే, దీన్నీ పట్టుకోవడం కష్టమే– అన్నాడనుకోండి. అది సరైన మాట కాదని చిన్న పిల్లవాడైనా చెబుతాడు. ఇలా పరస్పర విరుద్ధ వస్తువులకు పోలిక చెబితే, అది **దృష్టాంత విరోధం,** లేక **విరుద్ధ దృష్టాంతం**. దృష్టాంత విరోధం వస్తే, చేసిన ప్రతిపాదన వీగిపోతుంది. కనుక, విషయ ప్రతిపాదన చేసేటప్పుడు ఉపయోగించే దృష్టాంతాలలో ఇలాంటి దోషాలు లేకుండా చూసుకోవాలి.

ఇక మన తత్వశాస్త్రంలో యోగ్యమైన దృష్టాంతాలు ఎలా వుంటాయంటే ఉపమేయం కారణమైతే, నువ్వు చెప్పే ఉపమానం కూడా కారణ రూపంగానే వుండాలి. లేదా నీ ఉపమేయం కార్యమైతే, నీ ఉపమానం కూడా కార్యంగానే వుండాలి. ఎలాగంటే, "శాస్త్రాధ్యాయనంవల్ల తెలియని విషయాలు తెలుస్తాయి. దీపంవల్ల ఇంట్లో వస్తువులు కనిపిస్తాయి"– అన్నారనుకోండి. ఇక్కడ దీపంవల్ల ఇంట్లో వస్తువులు కనిపిస్తాయి, అనేది దృష్టాంతం. శాస్త్రాధ్యాయనంవల్ల కొత్త విషయాలు తెలుస్తాయనేది దార్ష్టాంతికం. వీటిలో దీపము, శాస్త్రము, అనేవి ఉపమాన ఉపమేయాలు. ఇవి రెండూ కూడా కారణరూపంలో వున్న ఉపమాన ఉపమేయాలు. వస్తు ప్రకాశానికి కారణం దీపం. జ్ఞానప్రాప్తికి కారణం శాస్త్రం. వీటిలో కారణాలైనటువంటి దీపానికి, శాస్త్రానికీ, పోలిక చెప్పారు. అలాగే ఈ కారణంవల్ల జన్మించే కార్యాలు–వస్తు ప్రకాశమూ, జ్ఞానసిద్ధి. ఈ రెండు కార్యాలకూ ఉపమాన ఉపమేయ భావం చెప్పారు. ఇలా వుంటే, ఆ దృష్టాంతం మంచి దృష్టాంతం అవుతుంది. దీనికి విరుద్ధంగానే వుంటే, పిచ్చి దృష్టాంతం అవుతుంది.

కానీ, రామా! తత్త్వశాస్త్రంలో పెద్ద చిక్కు వుంది. ప్రపంచంలోని ఏ దృష్టాంతాలూ కూడా ఆత్మ తత్త్వాన్ని సరీగా బోధించలేవు. ఎందుకంటే ప్రపం
చంలో కనిపించే వస్తువులూ, వాటిని ఆధారంగా చేసుకొని చెప్పే దృష్టాంతాలూ, ఇవన్నీ కూడా అవాస్తవాలు. ఇవన్నీ కూడా ఆ పరబ్రహ్మకు కార్యరూపాలు. ఆ పరమాత్మ ఏమో పరమార్థసత్యం. పైగా అది ఎప్పుడూ కారణరూపమే కానీ, దేనికీ కార్యం కాదు. ఇప్పుడు చూడు, వాస్తవమైన పర్మబ్రహ్మకు అసత్యాలైన వస్తువులతో దృష్టాంతం చెప్పడం కుదరదు. అలాగే ఎల్లప్పుడూ కారణ రూపంగా వుండే పరబ్రహ్మకు, ఎల్లప్పుడూ కార్యరూపంగా వుండే ప్రాపంచిక వస్తువులతో దృష్టాంతం చెప్పడం కుదరదు. ఏ దృష్టాంతమూ కుదరకపోతే, ఇక బ్రహ్మను గూర్చి చెప్పేదెలా?

## 64. సాపేక్షిక దృష్టాంతము

అందుకే మేమీ తత్త్వశాస్త్రంలో సాపేక్షిక సిద్ధాంతాన్ని స్వీకరిస్తాం. సాపేక్షికంగా చూస్తే- మట్టి కారణం, కుండలు కార్యాలు. సాపేక్షికంగా చూస్తే మట్టి నిత్యం, కుండలు అనిత్యాలు. సాపేక్షికంగా చూస్తే- మట్టి సత్యం, కుండలు అసత్యాలు. అదే విధంగా సాపేక్షికంగా చూసినప్పుడు బంగారం కారణం, దానిలోంచి వచ్చే ఆభరణాలు కార్యాలూ, అనిత్యాలూ, అసత్యాలు. ఇలాంటి సాపేక్షిక దృష్టాంతాల్ని తీసుకుని వాటి ఆధారంతో, ఈ జగత్తు మొత్తానికీ మూలమైన పరబ్రహ్మ, సర్వకారణము, నిత్యమూ, పరమార్థ సత్యము-అని, దీనిలోంచి వచ్చిన ఈ ప్రాపంచిక వస్తువులన్నీ కార్యాలూ, అనిత్యాలూ, అసత్యాలూ, అని మేము ప్రతిపాదన చేస్తాం.

ఇక్కడ-మట్టి, బంగారం మొదలైనవి ఉపమాన స్థానంలో వున్నాయి. పరబ్రహ్మ ఉపమేయ స్థానంలో వుంది. దీన్ని చూసి కొందరు మొండి వాదం కోసం ఆక్షేపిస్తూ వుంటారు. "మీ పరబ్రహ్మేమో కారణమాయె. ఆ కారణంవల్ల వచ్చే కార్యాలలో మట్టీ బంగారం కూడా వున్నాయాయె. అలాంటప్పుడు, కారణానికీ కార్యానికీ ఉపమాన ఉపమేయ భావం ఎలా కుదురుతుంది?" అని. కానీ, ఇక్కడ సాపేక్షంగా చూసినప్పుడు- మట్టీ, బంగారాలలో కారణత్వం వుంది.

ఈ సాపేక్షిక కారణత్వాన్ని పురస్కరించుకొని, పరమార్థ కారణమైన పరబ్రహ్మకు వీటిని ఉపమానాలుగా వర్ణించడంలో తప్పు లేదు. పరమార్థ దశలో మట్టీ, బంగారమూ కూడా కార్యాలే గదా- అంటే, నిజమే కానీ, మనం సాపేక్షిక స్థితిని శ్రయించి మాట్లాడుతున్నాం గనుక, పరమార్థ రూపంగా అవి కార్యాలే అనే అంశాన్ని ఉపేక్ష చేయవచ్చు. అది దోషం కాదు. ఎందుకు దోషం కాదంటే, ప్రపంచంలో ఏ ఉపమాన ఉపమేయాలకీ నూటికి నూరుశాతం పోలిక వుండదని చెప్పుకున్నాం కదా. ప్రధానమైన అంశంలో పోలిక వుంటే చాలు.

ఉదాహరణకు, "తాడుని చూసి పాముని భ్రమించినట్లుగా, పరబ్రహ్మను చూసి జగత్తు అని భ్రమిస్తున్నారు" అనే ప్రతిపాదన తీసుకోండి. ఇక్కడ తాడును అధిష్ఠానము అంటారు. పామును అధ్యస్తము అంటారు. అలాగే బ్రహ్మ అధిష్ఠానము, జగత్తు అధ్యస్తము, అంటారు. ఇక్కడ తాడుకీ, బ్రహ్మకీ, ఉపమాన ఉపమేయ భావం పట్టింది. బ్రహ్మ సత్యవస్తువనీ, తాడు అసత్య వస్తువనీ మాక్కూడా తెలుసు. ఆ దృష్టితో పోలిక చెప్పలేదు. తాడూ అధిష్ఠానమే, బ్రహ్మ అధిష్ఠానమే. మన తత్త్వశాస్త్రంలో ప్రధానాంశమిదే, అందుకోసం ఆ రెంటికీ పోలిక చెప్పడం జరిగింది.

అలాగే, పాము- జగత్తు, అనే రెంటిలోనూ అధ్యస్తత్వము అనే సమానాంశం వుంది. అందువల్ల ఆ రెంటికీ పోలిక చెప్పడం జరిగింది. ఈ ప్రధానాంశాన్ని గ్రహించలేక, కొంతమంది- పరబ్రహ్మకీ, తాడుకీ, పోలిక బెట్టారు గదా, ఈ తాడు కూడా సర్వవ్యాపకమేనా? ఆనందాత్మకమేనా?- అని అడుగుతూ వుంటారు. అలా అడిగే వాళ్లకి- "అయ్యా? ముఖం చంద్రుడి లాగా వుందన్నారు గదా! మీ ముఖం చపటా లాగా నున్నగా వుందా? కంచం లాగా గుండ్రంగా వుందా? మబ్బుల వెనకాల వుందా?"- అని ప్రశ్నించాలి. అప్పుడు వారి నోరు మూతపడుతుంది.

కాబట్టి రామా! బోధించాలనుకునే విషయం బోధపడేవరకు, ఒక బోధకుడు, ఒక బోధ్యాంశము ఒక ప్రబోధితుడు, అనే భేదాన్ని అంగీకరించి, ఆ వ్యవహారిక సత్యం మీద ఆధారపడి, బోధ చెయ్యాలి. అంటే, సాపేక్షిక సత్యం మీద ఆధార పడి బోధ చెయ్యాలి. సాపేక్షిక సత్యాన్ని నేను అంగీకరించను పొమ్మంటే, బోధచేసే విధానమే వుండదు. అందువల్ల, సాపేక్షిక సత్యాన్ని స్వీకరించి, సాపేక్షిక దృష్టాంతాలతో బోధ చేసినప్పుడే, ఈ బోధ సఫలమవుతుంది.

## 65. కలకూ మెలకువకూ పోలిక వుందా?

ఈ సాపేక్షికత్వాన్ని ఆధారం చేసుకొనే, మేము ఈ ప్రపంచాన్నంతా స్వప్నతుల్యమని చెప్పుతూ వుంటాం. కానీ, మరికొందరు వాదశీలురు– ఈ ప్రపంచమంతా స్వప్నతుల్యం అని మీరు అంటారు గదా, దాన్ని బట్టి జగత్తంతా అసత్యమే అంటారు గదా, దీన్ని బట్టి బ్రహ్మ సత్యమని నిర్ణయం చేస్తూ వుంటారు గదా, అసలు స్వప్న ప్రపంచానికీ జాగ్రత్ ప్రపంచానికీ, పోలిక ఎలా కుదురుతుంది?– అని ప్రశ్నిస్తూ వుంటారు. దీని గురించి నీకు కొంత వివరిస్తాను.

స్వప్నం అబద్ధమని ప్రతివాడు అంటున్నాడు. పండితుడూ అంటున్నాడు, పామరుడూ అంటున్నాడు. ఎందుకు అంటున్నాడు? స్వప్నంలో కనిపించిన వస్తువులన్నీ స్వప్నానికి ముందరా లేవు, తరువాతా లేవు. వున్నట్టుండి వచ్చాయి. వున్నట్టుండి పోయాయి. అందువల్ల, "అవి స్వప్నవస్తువులు, అసత్యాలు" అని వాడు చెబుతున్నాడు. దీన్ని బట్టి ఏం తేలుతోందంటే, ఏ వస్తువులైతే వెనక, ముందు కాలాల్లో లేకుండా, వున్నట్టుండి వచ్చి, వున్నట్టుండి పోతాయో, అలాంటి వస్తువులు అసత్యవస్తువులు, అని వాడు నిర్వచనం చేస్తున్నాడు. అలా నిర్వచనం చేసి, దాన్ని బట్టి స్వప్నవస్తువులు అసత్యవస్తువులని చెబుతున్నాడు.

ఇక్కడ మరొక విషయం కూడా వుంది. ఒక గారడీవాడు వచ్చి మన ఇంట్లో బండరాళ్ళ మీద మామిడి టెంక విసిరేశాడు. మనం చూస్తుండంగానే ఆ టెంకలోంచి మొక్క మొలిచింది. ఇదేమిట్రా? అనుకునే లోపలే ఆ మొక్క చెట్టై కాయలు కాచింది. అవన్నీ చెట్టుమీదే పండిపోయాయి. గారడీవాడు ముక్కలు కోసి మనందరికీ పెట్టాడు. ముక్కలు తియ్యగా ఉన్నాయి. అయినా సరే, ఆ ముక్కలు తిన్న పెద్దవాళ్ళంతా ఇదంతా మాయ అనేశారు. ఈ చెట్టూ అబద్ధమే, ఈ పండ్లూ అబద్ధమే, ఈ ముక్కలూ అబద్ధమే, అనేశారు. ఆ గారడీవాడికి కోపం వచ్చింది. వాడు వెంటనే పెరట్లోకి వెళ్ళి, అక్కడ మామిడి చెట్టుమీద వేళ్ళాడుతున్న పండొకటి కోసి, అందరికీ ముక్కలు పెట్టాడు. అందరూ తిన్నాక, "ఇవి కూడా అబద్ధమేనా?" అని అడిగాడు. పెద్దలంతా "ఇవి మా చెట్టు కాయ ముక్కలు, ఇవి నిజమైన ముక్కలు, నీ ముక్కలు మాయ ముక్కలు" అన్నారు. "అదేమిటండీ? అవి మీ దొడ్లో ముక్కలు. ఇవి మీ ఇంటి ముందు చెట్టుమీది నుంచి వచ్చినవే. వీటిలో ఒకటి సత్యమనీ, మరొకటి అసత్యమనీ, చెబుతున్నారు. ఇదేం న్యాయమండీ" అన్నాడు గారడీవాడు. అప్పుడు పెద్దవాళ్ళన్నారు గదా– "అది కాదయ్యా! మా పెరట్లో చెట్టు మా తాతగారు నాటింది. క్రమంగా పెరిగి పెద్దదైంది. ఇప్పుడు కాయలు కాస్తోంది. నువ్వేమో బండరాతి మీద టెంక పారేస్తివాయె. రాతిమీద విత్తనాలు వేస్తే, మొక్క మొలవటం ఎక్కడయినా కద్దా? ఒకవేళ మొలచినా, చూస్తుండగానే మానైపోతుందా? నీ చెట్టు అలా అయింది కనుక, నీ చెట్టు, నీ కాయలు, అన్నీ అబద్ధాలే."

"మరి, నా చెట్టు కాచిన పండు ముక్కలు మీరూ తిన్నారు గదండీ! తియ్యగా వున్నాయన్నారు గదండీ! తిని గూడా అబద్ధం అంటారేమిటి?"అని గారడీవాడు గద్దించాడు. పెద్దలు ఏమీ భయపడలేదు. "చూడయ్యా! మేము తిన్నా సరే, నీ చెట్టు, నిమిషాల్లో కాచిన చెట్టు, అబద్ధం గాక నిజమవుతుందా?" అన్నారు పెద్దలు.

పై మామిడిచెట్టు కథవల్ల మనకు తెలిసిందేమంటే– ఏదయినా ఒక వస్తువు జన్మించిందంటే, దానికి వెనకాల సరైన కారణసామగ్రి వుండాలి. ఆ కారణసామగ్రిలోంచి ఈ వస్తువు పుట్టేందుకు తగిన చోటుండాలి. తగినంత కాల వ్యవధానం కూడా వుండాలి. అలా వుండి, ఏదైనా వస్తువు జన్మిస్తే, అప్పుడా వస్తువును సత్య వస్తువు అంటారు. ఏ కారణమూ లేకుండానే వస్తువు పుడితే, ఒక వేళ కారణం వున్నా – సరైన చోటు, సరైన

కాలమూ లేకుండా ఒక వస్తువు పుడితే, ఆ వస్తువు కనిపించినా సరే, అబద్ధమంటారు. ఇది లోకంలో అందరూ అనే పరిభాష.

ఈ మాటల్నే కొంచెం శాస్త్రీయపు మాటల్లో చెప్పుకోవాలంటే– దేశ కాల హేతువులు ఉపపన్నంగా వుంటే, వాటివల్ల జన్మించిన కార్యం సత్యం అవుతుంది.దేశ కాల హేతువులు అసంగతంగా వుంటే, అప్పుడు ఒక కార్యం పుట్టినట్టు కనిపించినా, అది అసత్యమే అవుతుంది. ఈ నిర్వచనాన్ని పట్టుకుని స్వప్నాన్ని పరిశీలించండి.

స్వప్నంలో కొండలూ, నదులూ, ఏనుగులూ, కనిపించాయి. ఈ వస్తువులన్నీ ఎక్కడ్నుంచి వచ్చాయి? వీటికి వెనకాల కారణసామగ్రి ఏది? ఒకవేళ కారణసామగ్రి వుందనుకొన్నా, ఇలా కను మూసి నిద్రపోయే లోపల వీటిని ఎవడు తయారు చేశాడు? ఎలా తయారు చేశాడు? ఈ ప్రశ్నలకు సమాధానాల్లేవు. ఈ విధంగా చూసినప్పుడు, స్వప్నంలో కనిపించే వస్తువులకు సరైన కారణసామగ్రి లేదు కనుక, ఆ వస్తువులు తయారయ్యేందుకు కావలసిన దేశము, కాలము, అక్కడ లేవు కనుక, దేశకాల హేతువులు అనుపపన్నంగా వుండగా ఆ వస్తువులు జన్మించాయి కనుక, స్వప్నంలో కనిపించినా సరే ఆ వస్తువులు అసత్యమే– అని లోకంలో ప్రతివాడూ అంటున్నాడు.

కాగా,స్వప్న పదార్థాలు అసత్యాలు అనటానికి రెండు కారణాలు తేలాయి. ఏమిటంటే– వెనకా ముందూ లేకుండా అవి వున్నట్టుండి పుట్టి, వున్నట్టుండి పోతున్నాయి. ఇది ఒక కారణం. దేశకాల హేతువులు అనుకూలంగా లేకుండానే స్వప్న వస్తువులు జన్మిస్తున్నాయి. ఇది రెండవ కారణం.

ఒప్పుకున్నామండీ! ఆ రెండు కారణాలనూ ఒప్పుకున్నాం. అయితే, ఈ జాగ్రత్ప్రపంచం, అనగా, మెలకువలో వుండగా మనం చూసే ప్రపంచం, మీరు చెప్పిన పై రెండు కారణాలను బట్టి సత్యమౌతోందా? అసత్యమౌతోందా? కొంచెం ఆలోచన చెయ్యండి.

ఈ జాగ్రత్ప్రపంచంలో కనిపించే వస్తువులన్నీ పంచభూతమయంగా వున్నాయి. కానీ, ఆ పంచభూతాలు ఎక్కడ్ణుంచి వచ్చాయి? దీనికి సమాధానం మనకు తెలియదు. ఈ ప్రపంచ వస్తువులకు కారణభూతాలైనటువంటి పంచభూతాల గురించి మనకు ఎంతో కొంత తెలిసినా, వాటికి కారణభూత వస్తువులేమిటో మనకు తెలియదు కనుక, ఈ పంచభూతాలు అసత్య పదార్థాలేనని చెప్పాలి. అవి అసత్యాలైతే, వాటివల్ల తయారయ్యే ప్రాపంచిక పదార్థాలన్నీ కడా అసత్యాలేనని చెప్పాలి. పై నిర్వచనాన్ని అంగీకరించాం గనుక, అంగీకరించి దాన్ని స్వప్న పదార్థాలకి అన్వయం చేశాం గనుక, మనకు ఇష్టం వున్నా లేకపోయినా, ఈ నిర్ణయాన్ని కూడా అంగీకరినిచవలసిందే. ఈ విధంగా మొదటికారణాన్ని బట్టి ఈ జాగ్రత్ ప్రపంచం స్వప్నంతో సమానమని తేలింది.

ఇక రెండవ కారణాన్ని తీసుకుందాం. దేశకాల హేతువులు అనుకూలంగా వుండి, తద్వారా వస్తూత్పత్తి జరిగితేనే, ఆ వస్తువు సత్యమని చెప్పాలని ఈ రెండవ కారణం శాసిస్తోంది. వీటిలో పంచభూతాల వెనకాల కారణం తెలియదని చెప్పుకున్నాం. కనుక, హేతువు అసంగతమై పోయింది. దేశ కాలాల విషయంలో కూడా, ఒక మామిడి చెట్టు పదేళ్ళు పెరిగితే అది సత్యమనీ, నిమిషాల్లో పుట్టి పెరిగిపోతే అది అసత్యమనీ, మనం చేసుకున్న వ్యవస్థ మన ఊహవల్ల జన్మించినదే తప్ప, దానికి నికరమైన రూలంటూ లేదు. ఒక్కో మేధావి చెట్టుకి అంట్లు తొక్కి, రెండు మూడు నెలల్లోనే కొత్త మొక్కకు కాయలు కాయిస్తున్నాడు. అయినా దానిని మనం అసత్యమనటం లేదు. కనుక, ఒక చెట్టు పెరగటానికి ఐదు సంవత్సరాలు కావాలని కానీ, ఐదు నెలలు కావాలని గానీ, మనం వ్యవస్థ చెయ్యలేము. చెయ్యలేనప్పుడు, ఐదు సెకన్లలో చెట్టు పుట్టరాదని వ్యవస్థ

మనం ఎలా చెయ్యగలం? అలాగే, చెట్టూ పెరిగే దేశాన్ని గురించి గూడా వ్యవస్థ చేయలేం. గనుక, దేశ కాలాలయొక్క ఔచిత్యాన్ని గురించి స్పష్టమైన నిర్వచనం చెప్పడం సాధ్యం కాదు. కనుక, ఈ ప్రపంచంలో కనిపిస్తున్న వస్తువులన్నీ కూడా దేశ కాల విరుద్ధములే అని చెప్పక తప్పదు. ఈ విధంగా చూసినప్పుడు, రెండవ కారణంవల్ల కూడా జాగ్రద్వస్తువులు స్వప్నసమానాలే అని చెప్పక తప్పదు.

స్వప్న వస్తువులు వున్నట్టుండి వస్తాయి, వున్నట్టుండి పోతాయి– అని చెప్పుకున్నాం. నిష్పక్షపాతంగా పరిశీలించి చూస్తే, ఈ ప్రాపంచిక విషయాలు కూడా అలాంటివే. నిద్ర పట్టేసరికి ఇంత బ్రహ్మాండమైన ప్రపంచం మాయమైపోతోంది. మర్నాడు కళ్లు తెరిచే సరికి, సరీగా నిన్న వున్న ప్రపంచమే ఇవాళ కనిపించదు. నిన్న రాత్రి నిద్దర బట్టే ముందు మన చుట్టూ వున్న చెట్లమీద మొగ్గలున్నాయి. తెల్లారే సరికి మనం చూస్తున్న ప్రపంచంలో చెట్ల నిండా పూలు వున్నాయి. దీనికీ దానికీ వున్న భేదం– స్వల్పమే కనుక, మనం ఆ భేదాన్ని త్వరగా గుర్తు పట్టలేకపోతున్నాం. మనం నిద్రపోతున్న సమయంలో ఈ ప్రపంచం ఎటు పోతుందో మనకు తెలియదు. కనుక, ఈ ప్రపంచం కూడా మనం నిద్రపోగానే వున్నట్టుండి పోతుంది. మనం నిద్రలేవగానే వున్నట్టుండి వస్తుంది. కాగా, వున్నట్టుండి రావటం, వున్నట్టుండి పోవటం, అనేవి స్వప్న ప్రపంచానికీ, జాగ్రత్ప్రపంచానికీ, కూడా సమానమే.

రామా! ఈ విధంగా స్వప్న ప్రపంచానికీ, జాగ్రత్ప్రపంచానికీ, పోలిక వుందని మేము బాగా గ్రహించాం. కనుక, ఈ పోలికలను దృష్టిలో పెట్టుకొని, జాగ్రత్ప్రపంచం స్వప్న ప్రపంచం వంటిదే అని, మేము అంటున్నాం. అందుకే మేమిలా అంటున్నాం.

**అవస్తు పూర్వాపరయోః వర్తమానేఽవిచారితమ్।**
**యథా జాగ్రత్ తథా స్వప్నః సిద్ధమాబాల మాగతమ్॥** (ము.వ్య.ప్ర.స.18,శ్లో.58)

## 66. ప్రాతిభాసిక సత్త - వ్యావహారిక సత్త

రామా! స్వప్న ప్రపంచానికీ, జగ్రత్ప్రపంచానికీ, పోలిక చెప్పడంలో, ఇప్పటివరకు, సామాన్య మానవుడి అవగాహనను తీసుకొని దానిని బట్టి నిర్ణయం చేశాం. ఇప్పుడు శాస్త్ర దృష్టితో మరొక కారణాన్ని కూడా జోడిస్తాను, విను.

ప్రపంచంలో వస్తూత్పత్తి రెండు రకాలుగా వుంటుంది. మట్టిముద్ద లోంచి కుండ వచ్చింది. ఇక్కడ కుండలో కూడా మట్టి వుంది. అంటే, కార్యంలోకి కారణం అనుగతమై వచ్చింది. దీన్నే మరో రకంగా తిప్పి చెప్పితే, కారణంలో వున్న సత్తకీ, కార్యంలో వున్న సత్తకీ, భేదం లేదు. అంటే మట్టిముద్దలో వున్న సత్త మట్టే. అది కుండగా మారాక, కుండలో వున్న సత్త కూడా మట్టే. ఈ రెండు వస్తువులకూ భేదం లేదు. ఇలాంటి కార్యోత్పత్తి ఒకటి. దీనికి భిన్నంగా– తాడుని చూసి సర్పమని భ్రమించిన సందర్భాన్ని తీసుకో. ఇక్కడ సర్పము అనే వస్తువు కనిపిస్తోంది. దానికి కారణం ఏమిటి?– తాడు. కుండలోకి మట్టి ప్రవేశించినట్లుగా, సర్పంలోకి తాడు ప్రవేశిస్తోందా? మట్టి ముద్దయొక్క ఆకారం మారినట్టుగా, తాడుయొక్క ఆకారం ఏమన్నా మారుతోందా? అలాంటిదేమీ లేదు కనుక, ఇక్కడ కారణంగా వున్న తాడులో వున్న సత్త వేరు. కార్యంగా వున్న సర్పంలో వున్న సత్త వేరు. ఈ సత్తకూ ఆ సత్తకూ సంబంధం లేదు. ఇది రెండవరకం వస్తూత్పత్తి.

రామా! మట్టిముద్దకూ కుండకూ వున్నట్టుగా, కారణానికీ కార్యానికీ ఒకే సత్త వున్నట్లయితే, అలాంటి

కార్యాన్ని లోకులు సత్యవస్తువులని పిలుస్తారు. కుండ సత్యవస్తువు అని ఒప్పుకొన్న విషయమే గదా. అలా కాక, కారణానికి కార్యానికి వేరే వేరే సత్తలు వున్నట్లయితే, ఇలాంటి కార్యాన్ని అసత్యవస్తువు అని లోకులు పిలుస్తారు. తాడున్న చోట కనిపించే సర్పాన్ని అసత్యవస్తువని అందరం అంటున్నాం గదా. రామా! ఇది లోకంలో వున్న వ్యవహారమే కానీ, మేము కల్పించింది కాదు.

ఇప్పుడు ఈ సూత్రాన్ని స్వప్నానికి అన్వయించి చూడు. స్వప్నంలో కనిపించే కొండలకు కారణమేది? మనస్సే అని చెప్పాలి. మనస్సు ఆ కొండల్లోకి ప్రవేశించిందా? లేదు. కనుక, మనస్సుయొక్క సత్త, స్వప్న పర్వతంయొక్క సత్త వేరు వేరుగా వున్నాయి. అందువల్ల స్వప్నం అసత్యమని చెప్పడం సబబుగానే వుంది.

కానీ, రామా! ఎవరైనా ఈ సూత్రాన్ని జాగ్రత్ప్రపంచానికి అన్వయించాలని అనుకుంటున్నారా?

**స్వప్నాభత్వం చ జగతః శ్రుతేశాస్త్రేఽవబోధ్యతే।**

**శీఘ్రం న పార్యతే వక్తుం వాక్కిల క్రమవర్తినీ॥** (ము.వ్య.ప్ర.స.18,శ్లో.61)

రామా! శాస్త్రాధ్యయనం చేసి, కారణ సత్త ఏమిటి? కార్య సత్త ఏమిటి? ఈ రెంటికీ ఏకత్వం వుందా, భిన్నత్వం వుందా? అనే విషయం ఆలోచించాలి. ఆలోచిస్తే– మెలకువ, కల, అనేవి సమానాలా, కాదా, అనే విషయం తేలుతుంది. ఆ బోధ త్వరగా పూర్తి కావాలంటే కాదు. "వాక్కిల క్రమ వర్తినీ"– మాటలు ఒకదాని తరువాత ఒకటి వస్తాయి గానీ, అన్ని మాటలూ ఒకే సారి పలకడం సాధ్యమా? అందువల్ల, దృష్టాంతాలతో క్రమక్రమంగా విషయాన్ని బోధ చేసుకుంటూ వెళతాను.

బోధకోసం చెప్పేటటువంటి దృష్టాంతాలలో ఉపమానానికీ, ఉపమేయానికీ అన్ని అంశాలలోను సమానత్వం వుండదని పూర్వమే చెప్పాను. ఇక్కడ "జాగ్రత్ప్రపంచం స్వప్న ప్రపంచం వంటిదే" అని చెప్పినప్పుడు కడా ఈ రెంటికీ ఏ మాత్రమూ భేదం లేదనేది మా అభిప్రాయం కాదు. వాటిల్లో వున్న భేదమేమిటో చెబుతాను విను.

స్వప్న ప్రపంచంలో వున్న సత్తను **ప్రాతిభాసికసత్త** అంటారు. అంటే, స్వప్నంలోని వస్తువులు కనిపిస్తున్నప్పుడు మాత్రమే వుంటాయి.జాగ్రదవస్థలో గల సత్తను **వ్యావహారికసత్త** అంటారు. అంటే, జాగ్రదవస్థలోని వస్తువులు శాశ్వతాలు కాకపోయినప్పటికీ, మనం నిద్రపోయి లేచాక మళ్ళీ కనిపిస్తూ వుంటాయి. స్వప్నపదార్థాలు ఆ విధంగా కనిపించవు. ఇది జాగ్రత్ స్వప్నాలకు గల భేదాలలో ఒకటి. మరో విచిత్రమైన భేదం కూడా వుంది. సర్వ సామాన్యంగా మనకు వచ్చే కలలన్నిటికీ, మెలకువలో మనకు కలిగే అనుభవాలే కారణాలు. మెలకువలో మనం అనుభవించిన విషయాలే మనస్సులో సంస్కారంగా ఏర్పడి, కొన్ని మార్పులు పొంది, కలలుగా వస్తూ వుంటాయి. ఆ విధంగా చూసినప్పుడు మెలకువ కారణమౌతోంది. స్వప్నం కార్యమౌతోంది.

దీనికి భిన్నంగా కలలో కనిపించే కొన్ని దృశ్యాలు రేపు మన నిజజీవితంలో జరగబోయే సంఘటనలను సూచిస్తూ వుంటాయి. ఉదాహరణకు– ఒకడికి తను ప్రయాణం చేస్తున్నట్టు, దారిలో ప్రమాదం జరిగినట్టు, కల వస్తుంది. వాడు దాన్ని నమ్మకుండా ప్రయాణం చేస్తాడు. దారిలో నిజంగానే ఏదో ప్రమాదం జరుగుతుంది. ఇలా రెండు మూడు సార్లు జరిగేసరికి వాడు తన కలలో వచ్చే సూచనను బట్టి, మర్నాడు తన కార్యక్రమాలను మార్చుకుంటూ వుంటాడు. ఈ అనుభవం అందరికీ కాకపోయినా కొందరికైనా వుంటుంది. ఇలాంటి అనుభవాల్ని బట్టి చూసినప్పుడు, స్వప్నమే కారణం, మెలకువే కార్యం, అవుతున్నాయి.

## 67. స్వప్నం గూర్చి నవీన పరిశోధనలు

ఇక్కడ పాఠకులకు కొంత వివరణ ఇవ్వాలి. స్వప్న సూచనలను గురించి వశిష్ఠ మహర్షి చెప్పినది ఈ నాటి మనకు మూఢనమ్మకంగా కనిపించవచ్చు. కానీ, వైజ్ఞానిక దృష్టితో చూసినప్పుడు అది మూఢనమ్మకం కాదు. ఆంగ్ల సాహిత్యంలో "షిప్ రెక్" అనే నవల గురించి చాలా మందికి తెలుసు. ఆ నవలలో కవి స్వప్నంలో తాను దర్శించిన ఓడ ప్రమాదాన్ని గురించి విపులంగా వర్ణించాడు. కొన్ని సంవత్సరాల తరువాత నిజంగానే ఆ ఓడ ప్రమాదం జరిగింది. ఓడ నెంబరు, కెప్టన్ పేరు, ప్రయాణీకుల సంఖ్య మొదలైన వివరాలు ఎన్నో సరిగ్గా సరిపోయాయి. మనస్తత్వశాస్త్రంవారు స్వప్నాల తీరు గురించి, కొందరు వ్యక్తులు తమ స్వప్నాలలో భవిష్యత్‌ను దర్శించగల విచిత్రశక్తి గురించి, బాగా పరిశోధనలు చేస్తున్నారు. ఆ పరిశోధనలు ఇంకా ఒక నిశ్చయస్థాయికి చేరకపోయినప్పటికీ, వివిధ దేశాలలో స్వప్నాలపై గల విశ్వాసాలను వైజ్ఞానికంగా అధ్యయనం చేసి, విశ్లేషణ చేసినప్పుడు, వాటిని కొట్టిపారేయటం అంత సులభంగా కనిపించటం లేదని మనస్తత్వవేత్తలు అంటున్నారు.

ఒక వ్యక్తి తనలోని పాపాలను గుర్తించి, వాటిని తొలగించుకోవాలని ప్రయత్నిస్తూ వుంటే, అంతకు కొద్ది రోజులు ముందు, ఆ వ్యక్తికి స్నానం చేస్తున్నట్టుగా కలలు వస్తున్నాయని డేటా రికార్డ్ అయిందట. కలలో కనిపించే స్నానం ఆత్మ ప్రక్షాళనకు గుర్తు అని, యూరోప్ దేశాలలో విశ్వాసం వుందట. పై డేటా రికార్డింగ్‌వల్ల, ఈ విశ్వాసం సత్యం కావచ్చుననే నిర్ణయానికి వైజ్ఞానికులు వస్తున్నారు. ఇలాంటి పరిశోధనలు అనేకం ఇంకా జరుగుతూ వున్నాయి. దీనిలో మనకు కావలసిన అంశం ఏమంటే– కొన్ని స్వప్నాలు జాగ్రత్ప్రపంచంలో భవిష్యత్ కాలంలో జరగబోయే సంఘటనలను సూచించగలగటం– అనేది అశాస్త్రీయమైన విషయం కాదు, మూఢనమ్మకం కాదు– అన్నంత వరకే.

## 68. స్వప్న జాగ్రత్తుల సామ్యాంశలు

ఇక పోతే, వశిష్ఠమహర్షి చెప్పదలచుకున్న అసలు విషయం ఏమంటే– స్వప్నము, జాగ్రత్ అనే రెంటికీ పరస్పరము కార్యత్వము, పరస్పరము కారణత్వము, కూడా పడుతున్నాయి. అంటే, దానికి ఇది కారణం అవుతోంది, దీనికి అది కారణం అవుతోంది. అలాగే దానికి ఇది కార్యం అవుతోంది, దీనికి అది కార్యం అవుతోంది. మనం కారణవస్తువుకి కారణవస్తువుతోనే ఉపమానం చెప్పాలని, కార్య వస్తువుకు కార్యవస్తువుతోనే ఉపమానం చెప్పాలని చెప్పుకున్నాం. ఇప్పుడు జాగ్రత్స్వప్నాలకి పోలిక చెప్పచ్చునా? చెప్పకూడదా?

మేము జాగ్రత్స్వప్నాలకి పోలిక చెప్పినప్పుడు వాటి అనిత్యత్వాన్ని ప్రధానంగా తీసుకుని పోలిక చెప్పాం. అలాగే, రామా! స్వప్న వస్తువులయొక్క సత్త వాటి కారణ సత్తకంటే భిన్నమైనదని నీకు ఇదివరకే నిరూపించాను. అదే విధంగా జాగ్రత్ప్రపంచంలో కూడా, ఈ ప్రాపంచిక వస్తువులయొక్క సత్త, వీటియొక్క కారణ సత్తకంటే భిన్నమైనదే. ఆ విషయాన్ని నిరూపించే పని ఇప్పుడు పెట్టుకోవడం లేదు. పై ప్రకరణంలో దాన్ని నిరూపిస్తాను. ప్రస్తుతానికి దాన్ని కాసేపు ఒప్పుకో. కారణసత్తకూ, కర్యాసత్తకూ, భేదం వుండటం అనే విషయంలో స్వప్నానికి, జాగ్రత్‌కి, తేడా ఏమి లేదు. ఆ దృష్టితో కూడా అవి సమానాలు అని చెప్పాం.

కొన్ని భేదాలు వున్నాయి కదా అని, స్వప్నానికీ, జాగ్రత్‌కీ, వున్న పోలికను చెప్పకపోతే ఈ జాగ్రత్ప్రపంచం యొక్క అనిత్యాన్ని గురించి వివరించేందుకు విధానమే లేదు. ఇంతకంటే మంచి దృష్టాంతాలు అసలే లేవు. అందువల్ల దీన్ని కాదనడం మొండివాదమే అవుతుంది.

## 69. బ్రహ్మకు పరిణామం లేదు

"అదేమిటండీ? బంగారం ముద్దలోంచి ఆభరణాలు వచ్చినట్టుగా, పరబ్రహ్మలోంచి జగత్తంతా వచ్చింది" అని దృష్టాంతం చెప్పవచ్చు గదా, అంటావేమో. నీలాగా ఆలోచించిన కొంతమంది పరిశీలకులు "వేదంలో కూడా

**"ఏకేన మృత్పిండేన విజ్ఞాతేన సర్వం**

**మృణ్మయం విజ్ఞాతం స్యాత్" (ఛాందోగ్యం)**– అని వుంది.

అంటే, ఒక మట్టిముద్ద తెలిస్తే, దానిలోంచి వచ్చే కుండలన్నీ తెలిసినట్లే గదా, అని వేదంలో వుంది. ఆభరణాలకి బంగారం ఎలాగో, అలాగే, ఈ ప్రపంచానికి పరబ్రహ్మ ఉపాదాన కారణమవుతుంది" అని వర్ణించారు.

కానీ, వారు మరచిపోయిన విషయం ఏమంటే– వేదంలో అనేకచోట్ల బ్రహ్మ దేనికీ కారణం కాదని, అది దేనికీ కార్యం కూడా కాదనీ, "ఏకమేవా ద్వితీయం" అనీ, అది ఒకే ఒక వస్తువని వుంది. అలాగే స్మృతులలో గూడా ఆ బ్రహ్మ "అవికార్యము" అని వుంది. బంగారుముద్ద వికారం పొంది ఆభరణం అయినట్లుగా, పరబ్రహ్మ వికారం పొంది జగత్తుగా రూపొందిందని మీరు చెప్పేటట్లయితే "బ్రహ్మ దేనికీ కారణమూ కాదు, దేనికీ కార్యమూ కాదు" అనే వేదవాక్యాలతో విరోధం వస్తుంది. అలాంటి వేదవాక్యాలు వందల కొద్దీ వున్నాయి. అందుచేత బ్రహ్మకు పరిణామం వుందని చెప్పడానికి వీలు లేదు.

ఒక వేళ గట్టిగా పట్టుబట్టి, బ్రహ్మకు పరిణామం వుందని అంగీకరించినా, మరో చిక్కు వచ్చిపడుతుంది. బంగారు ముద్దలోంచి బంగారు ఆభరణాలే వస్తాయి గానీ, కుండ పెంకులు రమ్మంటే రావు. పరబ్రహ్మమో శుద్ధ చైతన్య పదార్థం. ఒకవేళ దానికి పరిణామం వున్నా, దానిలోనుంచి వివిధరూపాలు గల చైతన్యపదార్థాలు రాగలవే గానీ, జడపదార్థాలు ఎక్కడ్నుంచి వచ్చినట్లు? ఈ చిక్కులు తప్పించుకొనేందుకు మార్గం లేదు. కనుక, ఎన్ని విధాలుగా కుస్తీ పట్టినా, పరబ్రహ్మకు పరిణామం వుందని చెప్పడం కుదరదు. కనుక బంగారము– ఆభరణాలు అనే దృష్టాంతంతో పరబ్రహ్మను గురించి వివరించడం సాధ్యం కాదు. మరి వేదంలో మట్టిముద్దనూ, బంగారుముద్దనూ, పరబ్రహ్మకు దృష్టాంతంగా ఇచ్చారు గదండీ– అంటావేమో, చెప్పేదదే, ఉపమానానికీ, ఉపమేయానికీ, సర్వాత్మనా– నూటికి నూరు పాళ్ళూ– పోలిక కుదరటం సాధ్యం కాదు కనుక, బ్రహ్మకు పరిణామిత్వం లేకపోయినా, జగన్మూలత్వం అనే సామ్యం వుంది గనుక, వేదం ఆ దృష్టాంతాలను చెప్పింది.

రామా! నీకు మరో ఉదాహరణ కూడా చెబుతాను. మిల మిలా మెరుస్తున్న మణిని చూసి "ఆహా! ఇది దీపం లాగా వుందోయ్!" అన్నామనుకోండి. అప్పుడు ఆ మణికి అడుగున నూనె వుందని అర్థమా? కాదు గదా! అలాగే, పరబ్రహ్మకూ, సువర్ణానికీ, పోలిక జెప్పినంత మాత్రాన పరబ్రహ్మకు పరిణామత్వం వుందని పట్టుబట్టకూడదు. అలాంటి పట్టుదలను **"అపవిత్రైర్ వికల్పితైః"** (ము.వ్య.ప్ర.స.18, శ్లో.68) పాపిష్ఠి ఊహలు అంటారు.

## 70. ఏకవాక్యత

రామా! అయితే కొన్ని వేదవాక్యాలలో పరబ్రహ్మను బంగారంతో పోల్చి, మరి కొన్ని వేదవాక్యాలలో అది దేనికీ కారణం కాదన్నారంటే, ఏ వాక్యాన్ని ప్రమాణంగా తీసుకోవాలి? అనే- ప్రశ్న తలెత్తుతుంది. ఇక్కడే పర్మరబహ్మానుభవవేత్తలైన పెద్దల సహాయం మనకు కావాలి.

**అస్మాకమస్తి మతిరంగ తయేతి సర్వ**
**శాస్త్రైకవాక్య కరణం ఫలితం యతో యః।**
**ప్రాతీతికార్థ మపశాస్త్ర నిజాంగ పుష్టాత్**
**సంవేదనా దితర దస్తి తతః ప్రమాణమ్॥**

వేదవాక్యాలలో ఏదీ అప్రమాణం కాదు. ఒకటి ప్రధానం. మరొకటి అప్రధానమూ లేదు. వాటన్నిటికీ కలిపి ఏకవాక్యత వుంటుంది. ఏకవాక్యత అంటే, పరస్పర విరుద్ధంగా కనిపించే వాక్యాలకు ఒక తాత్పర్యం వుంటుంది. ఆ తాత్పర్యమే ఏకవాక్యత. ఒక ఉదాహరణ చెబుతాను, విను.

పరీక్షలు దగ్గరకొస్తున్నా చదువు మీద శ్రద్ధ లేని ఒక కొడుకుని చూసి తండ్రి "ఒరే! నీకు చదువుమీద శ్రద్ధుంటే నిద్రెట్లా పడుతుందిరా?" అని గట్టిగా అరిచాడు. దాంతో ఆ కుర్రవాడికి బుద్ధి కలిగి, ఇక రాత్రులలో నిద్రపోకుండా చదవడం మొదలుపెట్టాడు. తండ్రి మళ్ళీ కొడుకుని పిలిచి "ఒరేయ్! నీకు బుద్ధుందా?రాత్రల్లా నిద్రమానితే చదువు బుర్రకెక్కుతుందా?" అని తిట్టాడు. నిద్రపోకుంటే శ్రద్ధ లేదంటాడు. నిద్రమానితే అతి వెర్రి అంటాడు.

ఈ తండ్రి కేమైనా బుర్ర వున్నట్టేనా? బుర్ర లేదంటే, ఆయన చెప్పిన వాక్యాలూ అప్రమాణాలే అవుతాయి. అనుభవం గలవాడెవడూ ఆ తండ్రికి బుర్ర లేదనడు. బుర్ర వుంటే, మొదటి వాక్యంలో నిద్ర మానమనీ, రెండవ వాక్యంలో నిద్రపొమ్మనీ, పరస్పర విరుద్ధంగా ఎందుకు మాట్లాడతాడు? ఎందుకంటే, ఆ తండ్రికి ఓ తాత్పర్యం వుంది. "ఆరోగ్యం చెడిపోకుండా చూసుకుంటూ, వీలయినంత తక్కువ నిద్రపోతూ, వీలైనంత ఎక్కువ చదువుకోవాలి"- అనేదే ఆ తండ్రి హృదయంలో వున్న తాత్పర్యం.

పరస్పర విరుద్ధంగా వున్న ఆ రెండు వాక్యాలను సానుభూతితో సమన్వయించి చూస్తే, ఆ తాత్పర్యం మనకు అర్థమౌతుంది. ఆ కుర్రవాడికి త్వరగా అర్థం కాలేదు. ఎందుకంటే కాలేదంటే వాడికి అనుభవం లేదు. అనుభవం గలవాళ్ళకు ఆ తాత్పర్యం వెంటనే తెలుస్తుంది. పైకి విరుద్ధంగా కనిపించే వాక్యాలకు సమన్వయాన్ని చూపించే తాత్పర్యం పేరే **ఏకవాక్యత.**

రామా!వేదాలలో గల వాక్యాలకు కూడా ఈ రకమైన ఏకవాక్యతను సాధించాలి. చెప్పాను గదా, అనుభవం వున్న వారికి ఈ ఏకవాక్యత త్వరగా పట్టుబడుతుంది. అనుభవం లేకుండా కేవలం తర్కం మీద ఆధారపడ్డవాళ్ళు. వాళ్ళ రుచికి అనుకూలంగా ఒక సిద్ధాంతాన్ని తయారు చేసుకుంటారు. ఆ సిద్ధాంతానికి అనుకూలంగా వున్న వాక్యాలను ప్రధాన వాక్యాలు అంటారు. వ్యతిరేకంగా వున్న వాక్యాలను అప్రధానవాక్యాలు అంటారు. పూర్వం కపిల కణాదాది శాస్త్రకారులు అనేకమంది ఈ పద్ధతినే అనుసరించి, వేరువేరు మతాలను స్థాపించారు. మాబోటివాళ్ళు అట్లా చెయ్యలేదు. మాకు మా తర్కంతో, మా ఊహతో, మేము ముందుగా కల్పించుకున్న సిద్ధాంతం అంటూ ఏమీ లేదు. పెద్దల అనుభవం ఆధారంగా, విభిన్నరీతులుగా కనిపిస్తున్న వేదవాక్యాలకు తాత్పర్యం ఏమిటా- అని, వీటి ఏకవాక్యత ఏమిటా అని, మేం అన్వేషణ చేశాం. ఆ తాత్పర్యాన్ని గ్రహించి, దానినిబట్టి సాధన చేసి, మా స్వానుభవంతో ఈ తాత్పర్యం సత్యమైనదే అని, మాకు మేమే రుజువు

చేసుకొన్నాం.

రామా! మాది తర్కవాదం కాదు. అంటే, ఊహల మీద, యుక్తుల మీద, ఆధారపడి చేసేది కాదు. మాది ప్రమాణవాదం. అంటే, అనుభవం మీద, వేదవాక్యాల తాత్పర్యం మీద, ఆధారపడిన వాదం. కనుక, రామా! నేను నీకు మున్ముందు చెప్పబోయే దృష్టాంతాలను, వేదవాక్యాలనూ కూడా, నువ్వు ఈ రకంగానే సమన్వయం చేసుకుంటూ ముందుకు సాగాలి.

రామా! దృష్టాంతం ఎలా వుండాలి? పరబ్రహ్మకు దృష్టాంతం అనేది కుదురుతుందా? అనే అంశాల మీద చాలా చర్చ చేశాం, నిజానికి తెలివి గలవాళ్ళు దీని మీద ఇంత చర్చ చేయకూడదు. తెలివి గలవాళ్లు తమకు ప్రధానమైన అంశం మీద ఎక్కువగా కేంద్రీకరణ చేస్తారు. అప్రధాన విషయాలు ప్రాసంగికంగా వచ్చినప్పుడు, వాటివల్ల గ్రహించవలసిన విషయాన్ని గ్రహించి, అక్కడితో వదిలేస్తారు. అంతే కానీ, వాటిమీద చర్చ సాగదీస్తూ కూర్చోరు. అది తెలివి గాదు. ఆకలేసి నకనకలాడేవాడికి అన్నం పెడితే ఆవురావురుమని తింటాడు. అంతే గానీ, అవి ఏ జాతి బియ్యం? ఈ జాతి బియ్యం ఈ ఊళ్ళో దొరకడం సాధ్యమేనా? అన్నం కట్టెలమీద వండారా? బొగ్గుల మీద వండారా?– అని, లేనిపోని చర్చలు సాగదీయడు.

## 71. తల్లి చెప్పే దృష్టాంతాలు

మనకు ప్రధానంగా కావలసింది పరబ్రహ్మను గురించిన విజ్ఞానం. "తత్త్వమసి" మొదలైన మహావాక్యాలలో ఆ విజ్ఞానం వుంది. "తత్త్వమసి" మహావాక్యంలో తత్, త్వం, అసి– అని మూడు పదాలున్నాయి. తత్ అంటే అది. త్వం అంటే నువ్వు. అసి అంటే అయివున్నావు. 'తత్త్వమసి' అది నువ్వై వున్నావు– అది మహావాక్యం. ఏమర్థమైంది మనకు? ఏమీ అర్థం కాలేదు. ఇది అర్థం కావాలంటే, తత్ అంటే ఏమిటో, త్వం అంటే ఏమిటో, అసి అంటే ఏమిటో, తేలాలి. దీనిని **తత్ త్వం పదార్థ శోధన** అంటారు.

మనకు ప్రధానంగా కావలసింది ఇది. ఈ పద అర్థ శోధన ఏ ఉపాయంతో చేసినా మనకు ఇష్టమే. ఈ సందర్భంలో పద అర్థ శోధనకు ఉపాయంగా శాస్త్రకారులు దృష్టాంతాలను చెప్పారు. కనుక, ఆ దృష్టాంతాలను ఆసరాగా చేసుకొని, మనం అసలు విషయంలోకి వెళ్ళిపోవాలే గానీ, దృష్టాంతాలు పట్టుకొని వేళ్ళాడకూడదు.

లోకంలో దృష్టాంతాలు చెప్పే పెద్దలు ఒకప్పుడు ఆ దృష్టాంతంలో కొంత అసత్యాంశం వుందని తెలిసే చెబుతూ వుంటారు. ఎలాగంటే, పసివాడికి జ్వరం వచ్చింది. మందు చేదుగా వుందని తాగనంటున్నాడు. అప్పుడు తల్లి "ఒరేయ్! ఈ మందు తాగితే మీ అన్నయ్యకు ఎంత కండలున్నాయో, నీక్కూడా అంత కండలు వస్తాయి. అప్పుడు నువ్వు అన్నయ్యను కొట్టవచ్చు" అని చెబుతుంది. దాంతో ఆ కుర్రవాడు కండలమీది ఆశతో చేదుగా వున్నా సరే, మందు తాగేస్తాడు. ఇక్కడ ఈ మందువల్ల కండలు పెరుగుతాయని తల్లి చెబుతోంది. దానికి అన్నను దృష్టాంతంగా చూపిస్తోంది.

ఇక్కడ నిజానికి– మందుకీ, కండలకీ, కారణకార్య భావం లేదు. అయినా కూడా పసివాడు మరీ మూర్ఖంగా వున్నాడు కనుక, తల్లికి వాడి మీద ప్రేమ ఎక్కువగా వుంది కనుక, వాడిచేత మందు తాగించడం కోసం ఇలా చెప్పింది. ఇక్కడ తల్లికి అసత్యదోషం లేదా అంటే, లేదు. ఎందుకంటే, పిల్లవాడి హితం కోసం ఆమె చెప్పింది కనుక ఆమెకు దోషం లేదు. అదీ గాక మందువల్ల జ్వరం తగ్గడం ద్వారా పిల్లవాడికి ఉత్తరోత్తరా కండలు వస్తాయి గనుక, పరంపరగా మందు కండలకి కారణం అవుతుంది. అందువల్ల కూడా తల్లికి అసత్య దోషం లేదు. ఈ తల్లి లాగానే, వేదమాత కూడా, ఈ దేహమనే భ్రాంతిని వదలిపెట్టలేని మూర్ఖుల కోసం,

వారిని ఉద్ధరించాలనే ప్రేమతో, ఏవేవో దృష్టాంతాలు తీసుకొచ్చి, వాటి ద్వారా విషయబోధ చేస్తూ వుంటుంది. అందువల్ల, మనం ఆ దృష్టాంతాలను సరిగ్గా అర్థం చేసుకున్నప్పుడే మనకు శాస్త్రాల్లో వున్నటువంటి ప్రామాణికత అర్థమవుతుంది.

### 72. విచారణ ఎప్పటి దాకా?

కనుక, రామా! మానవుడు నిరంతరమూ శాస్త్రీయమైన విచారణ చేస్తూ వుండాలి. ఎప్పటిదాకా విచారణ చెయ్యాలని కొలతలేమీ లేదు. ఎంతవరకు చెయ్యాలంటే, మనస్సు సంపూర్ణంగా సందేహాలు లేకుండా ప్రశాంతి పొందేవరకు విచారణ చెయ్యాలి.

**తావద్విచారయే త్ప్రాజ్ఞో యావద్విశ్రాంతి మాత్మని।**

**సంప్రయాత్యపునర్నాశాం శాంతిం తుర్య పదాభిదామ్॥** (ము.వ్య.ప్ర.స.19,శ్లో.9)

రామా! ఈ సందేహ రహితమైన శాంతిని తురీయావస్థ అంటారు. దీనినే సప్తమభూమిక అంటారు. ఈ తురీయావస్థను పొందినవాడికి ఇహలోక, పరలోకాల్లో చెయ్యవలసిన పనేమీ లేదు. వాడు గృహస్థైనా, సంన్యాసైనా, వాడికి కర్తవ్యమేమీ లేదు. వాడు జీవించినా, మరణించినా, ఏదైనా పనులు చేస్తున్నా మానినా, వాడిలో ఏ విక్షేపాలూ వుండవు. ఏ మార్పులూ వుండవు. అప్పటి వాడి పరిస్థితి ఎలా వుంటుందంటే, **"నిర్మందర ఇవాంభోధిః"** (ము.వ్య.ప్ర.స. 19, శ్లో.11) సముద్ర మథనం అయిపోయి, మందర పర్వతాన్ని బయటకు తీసేశాక, పాలసముద్రం ఎలా వుంటుందో అలా వుంటుంది. అంటే, మందరపర్వతం చిలుకుతున్నంత సేపూ కల్లోలంగా వున్న ఆ సముద్రం, ఆ పర్వతాన్ని తీసి బయట పెట్టేశాక ఎలాగైతే ప్రశాంతంగా వుంటుందో, అలాగే మనస్సులో సందేహాలు శాంతించిన ఆ తురీయనిష్ఠుడు కూడా **"స తిష్ఠతి యథాస్థితం"** (ము.వ్య.ప్ర.స.19, శ్లో.11) తను యథాస్థితిలో వుండిపోతాడు.

ఇలాంటి బోధలు చేసేటప్పుడు ఉపమానాలయొక్క తాత్పర్యాన్ని గ్రహించకుండా, వాటిలో వుండే దోషాలను పట్టుకుని వేళ్ళాడే వాళ్ళను బోధ చుంచువులు అంటారు. ఈ బోధచుంచుత్వంవల్ల రెండు దోషాలు వస్తాయి. ఒకటి– అలాంటివాడు తన దుస్తర్కాలతో బోధించిన జ్ఞానానికీ, జ్ఞాన సాధనాలకీ కూడా, వికృతరూపం కల్పిస్తాడు. దానివల్ల పరమాత్మ జ్ఞానమే అనర్థమని వాడు వాదిస్తాడు. ఇక రెండవ దోషం ఏమంటే, వాడు ప్రపంచాభిమానాన్ని వదులుకోలేక, ఇంద్రియనిగ్రహం వంటి జ్ఞాన సాధనాలను లేనిపోని కుతర్కాలతో నిందిస్తాడు. కనుక, రామా! బుద్ధిమంతుడైనవాడు ఇలాంటి బోధచుంచు లక్షణాలను దగ్గరకు రానీయకుండా, ప్రమాణ పూర్వకంగా శాస్త్రవిచారం చెయ్యాలి.

### 73. ప్రత్యక్ష ప్రమాణము

రామా! ప్రమాణాలు అంటే ఏమిటి?

**సర్వప్రమాణ సత్తానాం పదమబ్ధి రపామివ।**

**ప్రమాణమేక మేవేహ ప్రత్యక్షం– తదత శ్శృణు॥** (ము.వ్య.ప్ర.స. 19, శ్లో.16)

రామా! నిజానికి అసలైన ప్రమాణం ప్రత్యక్షం ఒక్కటే. "ఏకమే వేహ"– మరి ఇతర ప్రమాణాలు లేవా? వున్నాయి. కానీ, అవన్నీ ప్రత్యక్షం మీదే ఆధారపడి వున్నాయి.

ఆ ప్రపంచంలో ఎన్నో చోట్ల నీళ్లున్నా, ఆ నీళ్ళన్నీ సముద్రంలోంచి మేఘాల ద్వారా వచ్చి, ఆయా చోట్లలో చెరువులుగా, నదులుగా, ఏర్పడి, మళ్ళీ వివిధ రూపాలలో సముద్రంలోనే కలుస్తున్నాయి. నదులు సూటిగా సముద్రంలో కలుస్తాయి. చెరువులు వేసవికాలంలో ఎండిపోయి, మేఘాలలోకి చేరి, అక్కడ్నుంచి పరంపరగా సముద్రంలోకి చేరుతాయి. అలాగే లోకంలో వున్న ప్రమాణాలన్నీ కూడా ప్రత్యక్షంలోంచి జన్మించి, చివరికి ప్రత్యక్షంలోకే చేరుతాయి. అందుకే, ప్రత్యక్షం ఒక్కటే ప్రమాణమని నేనంటున్నాను. మరి ప్రత్యక్షం అంటే ఏమిటి?

యథార్థజ్ఞానాన్ని కలిగించే సాధనాలను ప్రమాణాలంటారు. అలాంటి సాధనాలలో అతి ముఖ్యమైన సాధనాలు మన పంచేంద్రియాలు. కనుక, ఈ పంచేంద్రియాలే ప్రత్యక్షప్రమాణాలు. ఇది ఒక స్థాయి. అయితే ఈ ఇంద్రియాల యొక్క రాకపోకలను, పని చేసే తీరును, మనం ఇతర సహాయం లేకుండానే, మనంతట మనం, గానే తెలుసుకుంటూ వున్నాం. అలా తెలుసుకునే జ్ఞానమేదయితే వుందో, దాన్ని "వేదనము" అని పిలుస్తారు. ఇంద్రియాలను కూడా తెలుసుకునేది వేదనమే కనుక, ఈ వేదనమనేది ఇంకా ముఖ్యమైన ప్రత్యక్షమవుతోంది.

ఈ వేదనం కేవలం ఇంద్రియాలను మాత్రమే కాదు, ద్రష్టలైన ఇంద్రియాలను, దృశ్యాలైన విషయాలను, వీటికి అనుకూలంగా వున్న దర్శనక్రియను, ఈ మూడింటినీ కూడా మనకు అనుభవింప జేస్తుంది. ద్రష్ట, దృశ్యము, దర్శనము– అనే వాటిని "త్రిపుటి" అంటారు. కాగా త్రిపుటిని మనకు తెలియజేసేదే వేదనం– అన్నమాట.

వేదనమనే పేరు పెట్టేసరికి అదేదో కొత్త వస్తువు లాగా వుంది కానీ, ఇంద్రియాలయొక్క రాక పోకలను తెలుసుకునే వాడు ఎవడు? అని ఆలోచిస్తే, ఇంకెవడు? ఈ శరీరంలో వున్న జీవుడే! కనుక, వేదనం అన్నా జీవుడన్నా ఒకటే. ప్రత్యక్షమంటే వేదనమని చెప్పుకొన్నాం. వేదనమంటే జీవుడని తేల్చాం. కనుక, ఈ జీవుడికే అసలైన ప్రత్యక్ష ప్రమాణం అని పేరు పెట్టాం, అంతే.

**ప్రత్యక్షమితి నామేహ**

**కృతం జీవస్య ఏవ సః ॥** (ము.వ్య.ప్ర.స.19, శ్లో.18)

ఈ జీవుడికే సాక్షి అని మరోపేరు వుంది. సాక్షి చైతన్యము అని మరో పేరు. అనుభూతి అని మరో పేరు. ప్రతిపత్తి అని మరో పేరు. ప్రత్యక్షం అని మరో పేరు. అన్నీ పేర్లే, వున్నది ఒక్కటే, అదే చైతన్యం. ఆ చైతన్యమే ప్రత్యక్ష ప్రమాణం. ఇప్పటికి మనకి ప్రస్తుతం ఐదు పేర్లు తేలాయి.

1. ప్రత్యక్షము
2. అనుభూతి
3. ప్రతిపత్తి
4. జీవుడు
5. వేదనం

ఈ ఐదూ సమానార్థకాలే అయినా, ఒక్కొక్క సందర్భంలో ఒక్కొక్క పేరును ఉపయోగిస్తూ వుంటారు. ఆ వివరం చెబుతాను. విను.

ద్రష్ట, దృశ్యం, దర్శనం– అనే త్రిపుటి వుంది కదూ! దీనిని సాక్షి చైతన్యం వ్యాపించి వుండి, జ్ఞాన వ్యవహారాన్ని కలిగిస్తూ వుంటే, ఆ వ్యవహారావస్థలో, ఆ చైతన్యాన్ని **ప్రత్యక్షము** అనే పేరుతో పిలుస్తారు.

అదే చైతన్యం అదే త్రిపుటిని అనుసరించి, జ్ఞానస్వరూపంతో వుంటే, అప్పుడు **అనుభూతి** అని పిలుస్తారు.

అదే త్రిపుటిని ప్రకాశింపజేసే పనిని నిర్వర్తిస్తున్న సమయంలో ఆ చైతన్యాన్ని **వేదనము** అని పిలుస్తారు.

అదే త్రిపుటిని ఆ చైతన్యం ప్రకాశచైతన్యంతో వ్యాపించి వుంటే, అప్పుడు **ప్రతిపత్తి** అని పిలుస్తారు. అదే చైతన్యం ప్రాణవాయువును ధరించి వుంటే **జీవుడని** పిలుస్తారు.

## 74. ఇంద్రియం ద్వారా జ్ఞానం కలిగే విధానం (చిత్తవృత్తి)

ఇక్కడ వశిష్ఠమహర్షి చెప్పిన విషయాలు అర్థం కావటం కోసం కొంచెం అధికంగా వివరణ చెయ్యాలి. మానవుడు ఒక వస్తువును చూస్తున్నప్పుడు ఇంద్రియాల ద్వారా ఆ జ్ఞానం వాడికి ఎలా కలుగుతోంది?– అనే అంశంపై వేదాంత శాస్త్రంలో చాలా పరిశోధన చేశారు. వివరాల జోలికి పోకుండా సారాంశం చెప్పుకోవాలంటే, ఆ సిద్ధాంత సారం ఇలా వుంది.

మనస్సన్నా, అంతఃకరణం అన్నా, ఒకటే. దానికి సొంత ఆకారమంటూ ఏమీ వుండదు. ఈ అంతః కరణంయొక్క స్వభావం తైజసం. అంటే అది సూర్యకిరణం లాగా అతి స్వచ్ఛమైన, ప్రసరణ శీలమైన, తేజోమయ ద్రవ్యం. అందువల్ల, అది శరీరంలోని పంచేంద్రియాలనే తూముల ద్వారా నిరంతరమూ బయటకు ప్రసరించాలని ప్రయత్నం చేస్తూ వుంటుంది. వేరే ప్రతిబంధకమేదీ లేకపోతే బయటకు ప్రసరించి, ఆ ఇంద్రియానికి సంబంధించిన విషయాన్ని ఆక్రమిస్తుంది.

ఉదాహరణకు కన్ను తీసుకుందాం. కన్నుకు సంబంధించిన విషయం రూపం. ఒక పెద్ద చెరువును, దాని క్రింద కొంచెం పల్లంగా వున్న స్థలంలో పొలాలను, ఊహించండి. చెరువుయొక్క తూముకు వున్న బిరడాను తీసేస్తే, నీరు ఒక్కసారిగా బయటకు వచ్చి, ప్రక్కన వున్న పొలంలోకి పారి, దాన్ని నింపివేస్తుంది. ఆ పొలం చతుష్కోణాకారంగా వుంటే, ఈ నీరు కూడా చతుష్కోణాకారంగానే తయారవుతుంది. పొలం త్రికోణాకారంగా వుంటే, ఈ నీరు గూడా త్రికోణాకారంగానే వుంటుంది.

ఇదే విధంగా, లోపలి అంతఃకరణమే చెరువు అనుకోండి. కళ్ళు తూములనుకోండి. రెప్పలు బిరడాలు అనుకోండి. రెప్పలను తొలగించగానే, లోపలి అంతఃకరణం బయటకు ప్రవేశించి, ఎదురుగా ఏది వుంటే ఆ విషయం దాకా ప్రయాణం చేసే, ఆ విషయానికి ఎలాంటి ఆకారం వుంటే అలాంటి ఆకారాన్నే ఇది కూడా పొందుతుంది. ఎదురుగుండా చెట్టు వుందనుకొందాం. కళ్ళలోనుంచి ప్రసరించిన అంతఃకరణం చెట్టు దాకా ప్రయాణం చేసి, (చెరువులోని నీరు పొలంలో పడ్డట్టుగా) చెట్టుమీద పడి, చెట్టుకు ఏ ఆకారం వుంటే అట్టి ఆకారాన్నే తను కూడా పొందుతుంది. అప్పుడు ఆ జీవికి 'నేను చెట్టును చూస్తున్నాను'– అనే జ్ఞానం కలుగుతుంది.

అలాగే చెవి అనే తూము ద్వారా అంతఃకరణం బయటకు ప్రసరించినప్పుడు, దూరంలో ఒక గంట మ్రోగుతోంది అనుకొందాం. అప్పుడు చెవి ద్వారా బయటకు వచ్చిన అంతఃకరణం గంట శబ్దం వున్న ప్రదేశానికి వెళ్ళి, అక్కడ వున్న శబ్దానికి ఏ ఆకారం వుందో అట్టి ఆకారాన్ని పొందుతుంది. ఇలాగే ఆయా ఇంద్రియాల ద్వారా అంతఃకరణం బయటకు ప్రసరించి, ఆయా విషయాలు వున్న స్థలానికి వెళ్ళి, ఆయా విషయాలయొక్క ఆకారం వంటి ఆకారాన్ని పొందుతూ వుంటాయి. ఇలా అంతఃకరణం ఇంద్రియాల ద్వారా బయటకు ప్రసరించి, ఆయా విషయాలయొక్క ఆకారంగా పరిణామం పొందినప్పుడు, అట్టి పరిణామాన్ని అంతఃకరణ వృత్తి అంటారు. దీనినే తేలిక భాషలో చెప్పాలంటే ఒక విషయం గురించి మనస్సులో వచ్చిన ఆలోచన పేరే వృత్తి, లేక చిత్తవృత్తి, లేక అంతఃకరణ వృత్తి.

## 75. ఆధునిక విజ్ఞానం ఏమి చెబుతోంది?

**ప్రశ్న –** ఆధునిక విజ్ఞానంలో ఒక వస్తువును కన్ను ఎలా చూడగలుగుతోందని పరిశోధనలు జరిగాయి. కంటికి ఎదురుగా ఒక వస్తువు వుంటే, కాంతి కిరణాలు ఆ వస్తువుపై పడ్డప్పుడు, వాటిలో కొన్ని కిరణాలు ఆ వస్తువుమీంచి పరావర్తనం చెంది, కంటిలోకి ప్రవేశిస్తాయి. అప్పుడు కంటిగుడ్డుయొక్క వెనకాల ఆ వస్తువుయొక్క ఆకారం ప్రతిబింబంగా ఏర్పడుతుంది. ఆ ప్రతిబింబాన్ని బట్టి, ఎదురుగుండా వున్న వస్తువును మనస్సు గ్రహించ గలుగుతోంది– అని ఆధునిక విజ్ఞానం ప్రయోగ పూర్వకంగా నిరూపిస్తోంది. మీరు మనస్సే బయటకువచ్చి, ఎదురుగా గల వస్తువుయొక్క ఆకారాన్ని పొందుతోంది అని చెబుతున్నారు. ఇది ఎలా కుదురుతుంది?

**సమాధానం –** వైజ్ఞానిక ప్రయోగాలను వేటినీ మేము కాదనటం లేదు. అదే విషయాన్ని మేము మరొక పరిభాషలో చెపుతున్నాం. భాష మారిందే కానీ, భావం మార లేదు. ఎలాగంటే?

వస్తువునుంచి పరావర్తనం చెందిన కిరణాలవల్ల కంటి పాపలో ప్రతిబింబం ఏర్పడింది. ఆ ప్రతిబింబం ఏర్పడిన తెరకూ, మనస్సుకూ, మధ్య అనుసంధానంగా కొన్ని నరాలు వున్నాయి. ఆ నరాల ద్వారా ఇక్కడ ప్రతిబింబం ఏర్పడింది– అనే వార్త మనస్సుకు చేరుతోంది. దానిని బట్టి ఆ మనస్సు (అంతఃకరణం) వస్తువును చూసిన అనుభవాన్ని పొందుతోంది. ఆధునిక విజ్ఞానశాస్త్రం చెప్పేది ఇదే కదా!

మనస్సు పరధ్యానంగా వుందనుకోండి. అప్పుడు కంటిలో ప్రతిబింబం పడినా కూడా, ఆ వార్తను నరాలు మనస్సుకు చేరవేసినా కూడా, మనస్సు మాత్రం వస్తువును చూసిన అనుభూతిని పొందలేకపోతోంది. ఎందువల్ల? ఎందువల్లంటే, నరాలు అన్ని ఇంద్రియాలనుంచీ వార్తలను ఎంత చేరవేసినా, వాటిని స్వీకరించేందుకు, మానేందుకు, కూడా స్వాతంత్ర్యం మనస్సుకే వుంది. ఇంద్రియాలకు అలాంటి స్వాతంత్ర్యం లేదు. కంటికి ఇష్టం వున్నా, లేకపోయినా, వస్తువుయొక్క ప్రతిబింబం దానిలో పడుతుంది. చెవికి ఇష్టం వున్నా, లేకపోయినా, బయటి ధ్వనులయొక్క ప్రతిధ్వనులు దానిలో పడుతాయి. కానీ, మనస్సు తనకు ఇష్టమైతేనే వాటిని తీసుకొంటుంది. మనస్సుకి ఇష్టమైతే, అది తన దృష్టిని ఆయా నరాలు తెచ్చే వార్తలవైపు పెడుతుంది. తద్వారా ఆయా నరాలతో అనుబంధం వున్న ఇంద్రియాలవైపు దృష్టి పెడుతుంది. తద్వారా ఆయా విషయాల మీదికి దృష్టి పెడుతుంది. అప్పుడు ఆయా విషయాలను మనస్సు గ్రహిస్తుంది.

ఈ ప్రక్రియ విజ్ఞాన శాస్త్రం చెప్పే ప్రక్రియకు వ్యతరేకం కాదు. ఈ ప్రక్రియను మనస్సులో వుంచుకొనే మన వేదాంత శాస్త్రం మనస్సు ఇంద్రియం దగ్గరకు, ఇంద్రియం ద్వారా వస్తువు దగ్గరకు, ప్రసరిస్తోందని వర్ణిస్తోంది. కిరణాల పరావర్తనం, కంటి పాపలో ప్రతిబింబం, వగైరా ప్రక్రియలన్నీ, కంటి చూపు వరకు మాత్రమే వర్తిస్తాయి. వేదాంత శాస్త్రం చెప్పే ప్రక్రియ అన్ని ఇంద్రియాలకూ సమానంగా అన్వయించే ప్రక్రియ. అన్ని ఇంద్రియాల విషయంలోనూ మనస్సు నరాల ద్వారా ఇంద్రియాల వార్తలను గ్రహిస్తోంది. అది కూడా తనకు ఇష్టమైనప్పుడు మాత్రమే గ్రహిస్తోంది. అందువల్ల, మనస్సే నరాల ద్వారా ఇంద్రియాల దగ్గరకు వచ్చి, తద్వారా విషయాల దగ్గరకు కూడా ప్రసరిస్తోందని చెప్పడం హేతుబద్ధతకు వ్యతిరేకం కాదు.

అంతే కాదు, మనస్సే బయటకు వచ్చి విషయాలను గ్రహిస్తోంది– అని చెప్పడంవల్ల, మనస్సుకు ఇష్టం వున్నప్పుడు మాత్రమే విషయాలను గ్రహిస్తుంది, ఇష్టం లేనప్పుడు ఇంద్రియాలు, నరాలు, ఎన్ని వార్తలు చేరవేసినా మనస్సుకు చేరవు– అనే విషయం మరింత స్పష్టంగా చెప్పినట్లవుతుంది. మనం ప్రస్తుతం చర్చ చేస్తున్న ప్రకరణం మనస్సుకు సంబంధించిన ప్రకరణమే గానీ, ఇంద్రియాలకు సంబంధించినది కాదు.

అందువల్ల ఈ ప్రకరణంలో మనస్సుయొక్క ప్రాధాన్యాన్ని వ్యక్తం చేసే రీతిగా, మనస్సే బయటకి వచ్చి విషయ గ్రహణం చేస్తోంది– అనే ప్రక్రియను ప్రతిపాదించడమే అధిక సముచితంగా వుంటుంది. అందుకే వేదాంతశాస్త్రం ఈ ప్రక్రియను ఇలా ప్రతిపాదించింది.

## 76. వృత్తివ్యాప్తి-ఫలవ్యాప్తి

రామా! వృత్తి అంటే ఏమిటో తెలిసింది గదా! సాక్షిచైతన్యం ఇలాంటి అంతఃకరణవృత్తిని ఉపాధిగా చేసుకొని వున్నప్పుడు, అంటే అంతఃకరణ వృత్తిలోకి అది వ్యాపించినప్పుడు, ఆ చైతన్యాన్నే **సంవిత్తు** అని పిలుస్తారు. అంతఃకరణ వృత్తిలోనే అహంవృత్తి అని ఒక వృత్తి వుంది. 'నేను' అని స్ఫురించడమే ఆ వృత్తియొక్క లక్షణం. చైతన్యం ఈ అహంవృత్తిలోకి ప్రవేశిస్తే అప్పుడు దాన్ని **ప్రమాత** అనీ, **పురుషుడనీ** పిలుస్తారు.

రామా! ఈ చైతన్యానికే విషయమనీ, పదార్థమనీ కూడా పేరుంది. ఆ పేర్లు ఎప్పుడొస్తాయో తెలియాలంటే కొంచెం వివరణ చెప్పాలి. ఒక మనిషి ఎదురుగుండా చెట్టువుంది. వాడి కళ్ళు బాగానే వున్నాయి. తెరిచే వున్నాయి. వెలుతురు బాగుంది. అయినా ఆ చెట్టు వాడికి కనిపించటం లేదు.

ఎందుకంటావు? వాడు పరధ్యానంగా వున్నాడండీ, అంటావు నువ్వు. పరధ్యానం అంటే ఏమిటి? వాడియొక్క అంతఃకరణం వాడియొక్క కన్ను ద్వారా బయటికి ప్రసరించి, చెట్టుయొక్క ఆకారాన్ని పొందలేదు. పొందివుంటే వాడికి ఆ చెట్టు కనిపించేది.

అంతఃకరణవృత్తి చెట్టు ఆకారం పొందినప్పుడు మాత్రమే చెట్టు కనిపించడానికి కారణమేమిటి? ఇది తెలియాలంటే, చెట్టంటే ఏమిటో తెలియాలి. నిజానికి ఈ సృష్టిలోని పదార్థాలన్నీ కూడా పరబ్రహ్మయొక్క రూపాంతరాలే. భేదమేమిటంటే, అసలు పరమాత్మ చైతన్య ప్రకాశస్వరూపుడు. ఆయన స్వయంప్రకాశస్వరూపుడు. ఆయన జడవస్తువుల స్వరూపాన్ని పొందేటప్పటికి, వాటన్నిటి చుట్టూ కూడా అజ్ఞానం అనే చీకటి ఆవరించుకొని వుంటుంది. అందుచేత అవి వాటంతటవిగా ప్రకాశించవు. ఒక వ్యక్తియొక్క అంతఃకరణ వృత్తి ఒకానొక విషయం దగ్గరకు వచ్చేసరికి, ఆ విషయాన్ని ఆవరించుకొని వున్న అజ్ఞానం తొలగిపోతుంది. దీనినే **"వృత్తివ్యాప్తి"** అని పిలుస్తారు.

ఆ ఆవరణం తొలగిపోయినాక, ఆ వృత్తియందు ఉపహితమై వున్న చైతన్యం దీపం లాగా పని జేసి, అక్కడ వున్న విషయాన్ని ప్రకాశింప జేస్తుంది. దీన్ని **"ఫలవ్యాప్తి"** అంటారు.

వృత్తివ్యాప్తి, ఫలవ్యాప్తి అనేవి పాఠకులకు బాగా అర్థమయ్యేందుకోసం, మనం ఒక ఉదాహరణ చెప్పుకుందాం. మిమ్మల్ని ఒక చీకటిగదిలో కూర్చోబెట్టారు. మీ ముందు ఒక టేబులు, దానిమీద ఒక రత్నమూ వున్నాయి. టేబులుకూ, మీకూ మధ్యలో ఒక తెర వుంది. మీకు ఇప్పుడు ఆ రత్నం కనిపిస్తుందా? కనిపించదు. కనిపించడం లేదని మీరు చెప్పగానే, ఒకడొచ్చి తెర తీసేశాడు. ఇప్పుడు కనిపిస్తోందా– అని అడిగాడు. ఇంకా కనిపించడం లేదని మీరు చెప్పగానే, వాడు లైటు వేశాడు. అప్పుడు మీకు రత్నం స్పష్టంగా కనిపిస్తోంది. లోకంలో ప్రతి జడపదార్థాన్నీ ఆవరించుకొని వున్న అజ్ఞానం, ఈ కథలోని తెర వంటది. అంతఃకరణ వృత్తి వచ్చి ఈ తెరను తొలగిస్తుంది. ఇదే వృత్తివ్యాప్తి. అయినా ఆ విషయం ప్రకాశించదు. అప్పుడు అంతఃకరణ వృత్త్యుపహితమైన చైతన్యం– ఈ కథలోని లైటు లాగా పనిచేస్తుంది. అప్పుడు మీకు విషయం కనిపిస్తుంది. ఇదే ఫలవ్యాప్తి. కాకపోతే కథలో తెరతీయటం, లైటు వేయటం, ఒకదాని తరువాత ఒకటి జరిగినట్లు చెప్పుకున్నాం. మన వృత్తివ్యాప్తి, ఫలవ్యాప్తి అనేవి మాత్రం ఏకకాలంలోనే జరిగిపోతాయి.

## 77. ఒకే వస్తువుకు అవస్థను బట్టి అనేక పేర్లు

రామా! ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే, ఒక చోట ఒక పదార్థం వుంటే, నీయొక్క అంతఃకరణ వృత్తి దాని దగ్గరకు వెళితే, అప్పుడు ఆ పదార్థం చుట్టూరా వున్న అజ్ఞానమనే చీకటి ఆవరణం తొలగిపోతే, అప్పుడు ఏమవుతుంది? అప్పుడు నీకు "నేను ఫలానా పదార్థాన్ని చూశాను" అనే జ్ఞానం కలుగుతుంది. ఇంతకూ అక్కడ పదార్థాకారంలో వున్నది ఎవరు? చైతన్యమే. అందుకే, అంతఃకరణ వృత్తిచేత బాహ్యావరణ తొలగిపోగా, అలాంటి స్థితిలో వున్న చైతన్యానికి విషయమని లేక పదార్థమని పేరు పెట్టారు పెద్దలు.

కాగా, రామా! ఆ సాక్షి చైతన్యం సామాన్యతహా, అంటే ఇన్ జనరల్‌గా, అంతఃకరణవృత్తిని ఉపాధిగా చేసుకొంటే, దాన్ని సంవిత్తు అంటారు. ఆ సాక్షిచైతన్యమే అంతఃకరణ వృత్తిలోని భాగమైన అహంవృత్తిని ఉపాధిగా చేసుకొంటే, దాన్ని **ప్రమాత** అంటారు. అంతఃకరణవృత్తిచేత సాక్షి చైతన్యానికున్న బాహ్యావరణ భంగం జరిగితే, ఆ సాక్షి చైతన్యాన్నే **విషయం** అంటారు. ఇలా ఒకదానికే మూడు రకాల పేర్లు.

ఇదేమిటండీ, కొత్త కొత్త పేర్లన్నీ జెప్పి గందరగోళం చేస్తున్నారే, అనుకోబోకు. సముద్రంలో అలలు లేచాయి. అవి విరిగి పడ్డాయి. అందువల్ల కొంత నురుగు, కొన్ని బుడగలు, కొన్ని తుంపర్లూ, వచ్చాయి. ఇక్కడ తుంపర్లన్నా, నురుగన్నా, బుడగలన్నా, సముద్రమన్నా, అంతా నీరే. అంతా నీరే గదా అని, తుంపరను చూసి సముద్రమనలేము. సముద్రాన్ని చూపించి బుడగ అనలేము. ఒకే జలానికి ఒక అవస్థలో సముద్రమని పేరు. మరో అవస్థలో నురగని పేరు. ఒక్కొక్క అవస్థలో ఒక్కొక్క పేరు. అలాగే చైతన్యానికి కూడా ఒక్కొక్క అవస్థలో ఒక్కొక్క పేరు. ఆ చైతన్యంయొక్క తత్త్వం మిక్కిలి దురవగాహం కనుక, దాన్ని అర్థం చేసుకోవాలంటే ఇన్ని రకాలుగా వింగడించి పేరు పెట్టుకుని అధ్యయనం చేయాలి.

## 78. మోక్షదశలో విచారణ వుంటుందా?

ఇంతకూ రామా! మనం ఏ అంశం నుంచి వచ్చామంటే, ప్రమాణ పూర్వకంగా విచారణ చెయ్యాలి– అని చెప్పుకున్నాం. ప్రమాణం అంటే ఏమిటో తెలియడం కోసం ప్రమాణ చర్చ చేయడంలో, అసలు చైతన్యం యొక్క తత్త్వమే మనకు కొంత తెలిసింది. తరంగాది రూపాలేమీ లేకముందు సముద్రం ఏకాకారమై వున్నట్లుగా, ఈ సృష్టికి ముందు ఆ చైతన్యం కూడా ఏ వికారాలూ లేనిదై, ఏకాకారంగా వుంది. అప్పుడది ఏ వస్తువుకీ, కారణం కాదు. ఆ తరువాత అది తనకు తానే కారణత్వాన్ని కల్పించుకొని, అంటే తనలో లేని కారణత్వం తనలో వున్నట్లుగా గోచరింప చేసుకొని, ఈ ప్రపంచ రూపంగా వ్యక్తమైంది. కనుక, ఈ ప్రపంచమంతా పరమాత్మ చైతన్యంమీద అధ్యస్తమైందని మనం అర్థం చేసుకోవాలి. అది అర్థమైతే ఈ ప్రపంచమంతా కల్పితమేనని మనకు తెలుస్తుంది. ఇదంతా ఎవడికి వాడు స్వయంగానే విచారణ చేసుకొని, ఈ ప్రపంచ కల్పనకు కారణమైన అజ్ఞానాన్ని నశింప జేసుకోవాలి. అదే పరమపురుషార్థం. ప్రమాణపూర్వకమైన శాస్త్ర విచారణకు ఫలితమిదే.

రామా! విచారణవల్ల అజ్ఞానం పోతుందనీ, మనస్సు ప్రశాంతం అవుతుందనీ, చెప్పుకున్నాం. అదే మోక్షమనీ చెప్పుకున్నాం. దీన్ని బట్టి చూస్తే, మోక్షదశలో గూడా ఈ విచారణ అనేది వెంటబడి వుంటుందేమో– అని కొందరికి సందేహంగా వుంటుంది. అలా వుండే అవకాశమే లేదు. ఎందుకంటే, విచారణ అనేది

శబ్దాలమీద, వాటి అర్థాలమీద, ఆధారపడి వుంటుంది. శబ్దాలు, అర్థాలు, అనేవి ఈ ప్రపంచంలో భాగాలు. అంతే గాక శబ్దార్థాలు జ్ఞానేంద్రియ కర్మేంద్రియాధీనాలై వుంటాయి. ఇలాంటి ఈ శబ్దార్థాల ద్వారా చేసే విచారణవల్ల ఇంద్రియాలు, మనస్సు, ప్రపంచము, మొత్తం అన్నీ గూడా శాంతించిపోతాయి. ఇక్కడ శాంతించడమంటే కదలిక లేకుండా పోవటం. ఇలాంటి స్థితి వచ్చాక, దానిలో ఇక శబ్దార్థాలకు తావెక్కడుంటుంది? శబ్దార్థాలు లేకపోతే విచారణ ఎక్కడుంటుంది? కనుక, మోక్షస్థితిలో విచారణ అంటిపెట్టుకొని వుంటుందనే భయం అర్థరహితం.

ఒక సారి అలాంటి మోక్షస్థితి వచ్చాక, ప్రారబ్దకర్మచేత శరీరం జీవించి వున్నా, అలాంటి జీవికి ప్రపంచం గానీ, ప్రపంచంలో భాగమైన దేహం గానీ, దేహంలో భాగమైన ఇంద్రియాలకు చలనం గానీ, ఆభాస మాత్రంగా వుంటుంది గానీ, నిజంగా వుండదు. ఇంద్రియాల చలనం ఆభాస మాత్రమే గనుక, అప్పుడా జీవికి కర్తృత్వం గానీ, భోక్తృత్వంగానీ, వుండవు.

**మనస్యనీహితే శాంతే న ప్రవర్తన్త ఏవ తే।**
**కర్మేంద్రియాణి కర్మాదా-వసంచారిత యంత్రవత్॥** (ము.వ్య.ప్ర.స. 19,శ్లో.26)

ఆ దశలో మనస్సులో కదలిక వుండదు. అందువల్ల దానిలో కోరికలు వుండవు. మనస్సులో కోరికలు లేకపోయే సరికి, కర్మేంద్రియాలన్నీ స్టార్ట్‌గాని కార్లు లాగా, కదలకుండా పడివుంటాయి. ఈ స్థితినే **జీవన్ముక్త స్థితి** అంటారు. పూర్వం ఒకసారి ఈ స్థితిని వేయించిన గింజతో పోల్చి మనకు వివరించారు. ఇప్పుడు కీ ఇవ్వని యంత్రంతో పోల్చి మళ్ళీ చెబుతున్నారు. మరొక ఉపమానంలో, జీవన్ముక్తుడి ప్రాణేంద్రియాల చలనాన్ని చెక్క పొట్టేళ్ళ పోట్లాటకు పోల్చారు. రెండు చెక్క పొట్టేళ్ళను తయారు చేసి, వాటి కాళ్ళ క్రింద చక్రాలు పెట్టి, తోకలకి దారాలు కట్టి, తోలుబొమ్మలాటలో లాగా ఆ పొట్టేళ్ళను ఆడిస్తుంటే, అవి కొట్టుకుంటూ వుంటాయి. నిజంగా కొట్టుకునే పొట్టేళ్ళ హృదయాల్లో ఆలోచనలు వుంటాయి. ఈ చెక్క పొట్టేళ్లలో ఆలోచనలు వుండవు. జీవన్ముక్తుడియొక్క ప్రవర్తన ఇలాంటిదే. అందువల్ల, జ్ఞానోత్పత్తి తరువాత వుండే జీవన్ముక్తి అవస్థలో కూడా విచారణ వుండే సావకాశం లేదు. కాబట్టి, జ్ఞానం కలిగినా కూడా విచారణ వెంటబడుతుందేమోననే సందేహానికి తావు లేదు.

### 79. మనస్సు ముందా? పదార్థం ముందా?

రామా! చెక్క పొట్టేళ్ళ ఉదాహరణవల్ల మరో ప్రశ్నకు తావొస్తోంది. చెక్క పొట్టేళ్ళు కదలటానికి, తాడు గుంజేవాడు కారణం. మరి జీవన్ముక్తిడిలో ఇంద్రియాలను కదిలించేవాడెవడు? మామూలుగా అయితే మనిషిలో ఇంద్రియాలను కదిలించేది మనస్సు. ఆ మనస్సుని కలిదించేది కోరిక. ఆ కోరికను కదిలించేది విషయాలమీది జ్ఞానం. వీటినే నేను పూర్వం త్రివిధ స్పందాలు అని చెప్పాను. ఇంద్రియ స్పందము, మనస్పందము, సంవిత్ స్పందము అని అక్కడ పేర్లు చెప్పాను. పేర్లేవయినా, మొత్తం మీద తేలిందేమంటే, మనిషిలో ఇంద్రియాలు కదలాలంటే, వాడికి విషయజ్ఞానం కలగాలి. అంటే, ఆయా విషయాలను గూర్చిన జ్ఞానం వాడికి కలగాలి. అంటే, వీడికంటే ముందర అక్కడ విషయాలు వుండాలి.

ఇంతవరకు బాగానే వుంది గానీ, లోగడ చేసిన చర్చలో ప్రపంచంలోని విషయాలన్నీ మనోమయాలే అని చెప్పారు. అంటే పదార్థం మనస్సువల్ల తయారైంది. మనస్సు కదిలితే కదా, పదార్థాలు తయారయ్యేది. కనుక, విషయానికంటే వెనుక మనస్సులో కదలిక వుందన్నమాట.

ఇందాకేమో విషయాల వెనుక మనస్సులో కదలిక వుందన్నారు. ఇప్పుడేమో మనస్సుయొక్క కదలిక వెనుక విషయాలున్నాయి అంటున్నారు. ఇదెక్కడి గోల? నేలమీద నేనున్నాను, నామీద నేల వుంది– అన్నట్టుగా లేదూ? దీన్నే అన్యోన్యాశ్రయ దోషం అంటారు.

రామా! కొంతమందికి ఇది చాలా చిక్కు ప్రశ్న లాగా కనిపిస్తుంది. కానీ, చిక్కేమీ లేదు. ఈ ప్రపంచం అనేది ఆత్మ చైతన్యంలో అనాదిగా వుండనే వుంది.కానీ, అది సంవిత్ స్పందం కలిగినప్పుడు బయటకు ఆవిర్భవిస్తోంది. ఆత్మ చైతన్య స్వభావంలోనే ఇలాంటి లక్షణం వుంది. అనాది మాయా ప్రవాహంవల్ల, పూర్వకాలీన విషయాలకు సంబంధించిన సంవిత్ స్పందంవల్ల, మనస్పంద మేర్పడుతుంది. మనస్పందంవల్ల పరంపరగా మళ్ళీ విషయోత్పత్తి జరుగుతుంది. ఈ చక్రం ఇలా సాగుతూ వుంటుంది. ఇది అర్థం కావటం కోసం ఉదాహరణ చెబుతాను విను.

ఇక్కడ గాలి వుంది, అని నీకెట్లా తెలుస్తుంది? ఆ గాలిలో కదలిక వచ్చి, నీ చర్మానికి తగిలితే, నీకు తెలుస్తుంది. దాన్ని బట్టి నువ్వు చలనం వుంటే గాలి వుంది అంటావు. కానీ గాలి వుంటే కానీ, చలనం వుండదు. ఇది అన్యోన్యాశ్రయం లాగా కనిపిస్తూ వుంటుంది. తనలో స్పందనం కలిగించుకొనే గుణం గాలిలోనే వుంది. వుండబట్టే అది కదిలి, కొత్తగా గాలి వచ్చినట్టు నీకు అనుభూతిని కలిగిస్తోంది. గాలికి అలాంటి స్వభావం వుంది కనుక, ఇక్కడ అన్యోన్యాశ్రయదోషం లేదు.

ఈ ఉదాహరణబట్టి అన్వయం చేసుకొంటే, పరమాత్మ చైతన్యం విషయంలో కూడా అన్యోన్యాశ్రయ దోషం ఏమీ లేదు. గాలి సర్వత్రా వ్యాపించి వున్నట్లే, పరమాత్మ చైతన్యం సర్వత్రా వ్యాపించి వుంది. ఒకానొక వ్యక్తికి చల్లని గాలి అనుభవించ వలసిన కర్మ కలసి వచ్చేసరికి, ఏదో నిమిత్తంగా గాలిలో చలనం ఏర్పడి, వాడి వంటికి గాలి తగులుతోంది.

అలాగే, ఒకనొక జీవికి కర్మభోగం జరగవలసిన సమయం వచ్చేసరికి, ఆ పరమాత్మ చైతన్యంలో ఒకానొక జీవి రూపం పుట్టినట్టుగా కనిపిస్తోంది. గాలిలో అల కలగటానికి కావలసిన సన్నివేశాలన్నీ తోడైనట్లుగా, ఆ జీవి రూపం ఆవిర్భవించడానికి కావలసిన దేశము, కాలము, మొదలైన పదార్థాలన్నీ ఆ జీవి రూపంలో సమావేశమవుతాయి. అప్పుడు జనమంతా 'ఫలానావాడు పుట్టాడు" అంటారు. లోకులు సరే, ఆ జీవుడు ఏమనుకుంటాడు? వాడు విచార జ్ఞాన సంపన్నుడైతే, తను శుద్ధచైతన్యాన్నేననీ, తనలోనే అల లాగా ఈ రూపం పైకి ఉబ్బిందనీ, గ్రహించగలుగుతాడు. కానీ, సామాన్యజీవుడు అజ్ఞానావృతుడై వుంటాడు. కనుక, ఈ రూపమే తానని భావిస్తూ, ఆ రూపాన్ని చూసుకొని ఉల్లాస పడుతూ వుంటాడు.

రామా! మన చర్చ ఎటునుంచి , ఎటు వెళ్ళిందో ఆలోచించు. ఆత్మవిచారణ మోక్షదశలో కూడా వుంటుందా? వుండదా? అనే ప్రశ్న దగ్గరనుంచి వస్తున్నాం. అలా వుండదు– అని చెప్పడానికి జీవన్ముక్తి స్థితి అంటే కీ ఇవ్వని యంత్రం వంటిదని నిరూపించాం. ఇలా చెప్పేసరికి మనస్పందానికీ, విషయస్పందానికీ, అన్యోన్యాశ్రయ దోషం రాదా?– అని సందేహం వచ్చింది. అది లేదని ఇప్పటికి నిరూపణ అయింది. కనుక, ముక్తి దశలో విచారణ వెంట వుండదని మరొకసారి నిరూపణ అయింది. ముక్తిదశలో విచారణ వెంటబడదు కనుక, నువ్వు నిర్భయంగా ప్రమాణపూర్వకంగా ఆత్మ విచారణ చెయ్యి.

## ౭౦. ప్రపంచం బ్రహ్మయొక్క వివర్తం

రామా! అన్యోన్యాశ్రయ దోషాన్ని నివారించేందుకు మనం చెప్పుకున్న యుక్తి పరంపరలో ఒక చోట నీకు అపార్థం వచ్చే సావకాశం వుంది. ఎక్కడంటే, గాలియొక్క స్వభావంలోనే స్పందన వున్నట్లుగా, శుద్ధచైతన్యంయొక్క స్వభావంలోనే ఈ విషయప్రపంచమంతా అంతర్గతంగా వుంది– అని మనం ఇప్పుడు చెప్పుకున్నాం. అలా చెప్పడంవల్ల కుండకి మట్టి కారణమైనట్లుగా, ఈ ప్రపంచం మొత్తానికి శుద్ధచైతన్యమే పరిణామకారణమని చెప్పినట్లవుతోంది.

అలా చెప్పినట్లయితే, పరమాత్మ చైతన్యానికి కారణత్వము అనే గుణం పడుతుంది. అలా పడితే "బ్రహ్మ దేనికీ కారణం కాదు" అని పూర్వం మనం చెప్పుకున్న మాట ఎగిరిపోతుంది. పోతే పోనీ అందామంటే, కారణత్వం పట్టడంవల్ల దాని ప్రక్కన కార్యం అనేది అనివార్యంగా వచ్చి కూర్చుంటుంది. దీన్ని ఒప్పుకొంటే, బ్రహ్మ అద్వితీయము అనే మాట ఎగిరిపోతుంది. కాగా, బ్రహ్మ దేనికీ కారణం కాదనే మాట, బ్రహ్మ అద్వితీయం అనే మాట, రెండూ ఎగిరిపోతాయి. అవి పోతే బ్రహ్మలక్షణాలకే విరోధం వస్తుంది.

ఈ గందరగోళమంతా ఎందుకు వచ్చిందంటే, ఈ ప్రపంచానికి "శుద్ధచైతన్యమే పరిణామ కారణము" అనుకొని మనం బయలుదేరాం, అందువల్ల వచ్చింది. కనుక, ఈ ప్రపంచానికి ఆత్మచైతన్యమనేది పరిణామ కారణం కావటానికి వీల్లేదు. అందువల్ల, ఈ ప్రపంచానికి బ్రహ్మ వివర్తకారణమని అంగీకరించక తప్పదు. వివర్తకారణమంటే ఇదివరకు చెప్పుకున్నాం. తాడుని చూసి పాముని భ్రాంతి పడినప్పుడు, ఆ పాముకి కారణమైన తాడును వివర్తకారణము అంటారు. అలాగే, ఈ ప్రపంచానికి పరబ్రహ్మ వివర్తకారణమే. వివర్తకారణంవల్ల జన్మించే కార్యం తప్పని సరిగా భ్రాంతి రూపమే అవుతుంది. అంటే మిథ్య అవుతుంది. రజ్జు సర్పంలో సర్పం మిథ్యే కదా!

అలాగే పరబ్రహ్మనుంచి వివర్త రూపంలో జన్మించిన ఈ ప్రపంచమంతా కూడా అనివార్యంగా మిథ్యే తీరుతుంది. ప్రపంచం ఎప్పుడైతే అసత్యమైందో, అప్పుడు దానివల్ల పరబ్రహ్మకు వచ్చే కారణత్వం కూడా అసత్యమవుతుంది. అది అసత్యమైతే "బ్రహ్మ దేనికీ కారణం కాదనీ, అది అద్వితీయమనీ" చెప్పే శ్రుతి వాక్యాలకు సమనవ్యయం కూడా కుదురుతుంది.

రామా! ఈ దృశ్యప్రపంచం వివర్తరూపంగానే జన్మించిందనీ, ఇది మిథ్యారూపమేననీ, నిరూపించేందుకు మరో దారి కూడా వుంది. పరబ్రహ్మ అనేవాడు ద్రష్ట. వాడు వివర్తరూపంలో కాకుండా పరిణామరూపంలో ఈ దృశ్య ప్రపంచంగా మారాడని కాసేపు అనుకుందాం. అప్పుడు ద్రష్ట అయిన పరబ్రహ్మ ఏమవుతాడు? కొంచెం ఆలోచించు. కొయ్యబొమ్మలు చేసే శిల్పిని పిలిచి, ఏకాండీ చెక్కతో ఏనుగు బొమ్మను చెయ్యమన్నాం. వాడు సరేనని మన పెరట్లో వున్న పెద్ద చెట్టును నరికి, దాని కాండంతో మంచి ఏనుగు బొమ్మ చేశాడు. అంటే, ఇక్కడ చెట్టు ఏనుగు బొమ్మగా పరిణామం చెందింది. అలా చెందిన తరువాత, "మా ఇంటి పెరట్లో చెట్టు వుంటే, దొడ్డంతా నీడగా వుండేది. కనుక, నాకు ఇప్పుడా చెట్టు కావాలి"– అంటే వస్తుందా? "మా చెట్టులోంచి వచ్చావు గనుక, ఓ ఏనుగా! నువ్వే నీడ నివ్వు" అంటే, ఆ ఏనుగు బొమ్మ నీడ నిస్తుందా?– అసాధ్యం. పరిణామ ప్రక్రియలో కార్యం జన్మించాక ఇక కారణస్వరూపం వుండదు. అందువల్ల ద్రష్ట అయిన బ్రహ్మలోనుంచి పరిణామ ప్రక్రియలో దృశ్య ప్రపంచం కనుక ఉద్భవించి వుంటే, ఇది ఉద్భవించినాక ద్రష్ట అయిన బ్రహ్మ అక్కడ వుండడు. వుండకపోతే పోనీండి. అంటావేమో, వుండకపోతే, ద్రష్ట లేకుండా దృశ్యం వున్న స్థితి ఏర్పడుతుంది. ఈ ప్రపంచమంతా దృశ్యం. దీనికి ద్రష్ట కాదగిన బ్రహ్మ అక్కడ లేడు. ద్రష్ట లేని

దృశ్యం ప్రపంచంలో ఎక్కడైనా వుంటుందా? ఆ గందరగోళం ఎందుకొచ్చిందంటే, పరబ్రహ్మలోంచి ఈ దృశ్య ప్రపంచమంతా పరిణామ ప్రక్రియలో ఉద్భవించింది– అనుకోవడంవల్ల వచ్చింది. కనుక, అది తప్పు.

ఇక పోతే మిగిలిన అవకాశం ఒకటే. పరబ్రహ్మలోంచి ఈ ప్రపంచం వివర్త ప్రక్రియ ద్వారానే పుట్టింది– అని ఒప్పుకోక తప్పదు. అది ఒప్పుకుంటే, ఈ దృశ్యప్రపంచమంతా రజ్జుసర్పం లాగానే మిథ్యాభూతమని ఒప్పుకోక తప్పదు. ప్రపంచం మిథ్యాభూతం కనుక, దీనివల్ల బ్రహ్మకు కారణత్వమూ పట్టదు, సద్వితీయత్వమూ పట్టదు.

కనుక, రామా! మనస్స్పంద, విషయ స్పందాలకు అన్యోన్యాశ్రయ దోషం లేదని చెప్పడం కోసం, ఈ ప్రపంచం పరబ్రహ్మలో అంతర్లీనంగా వుందని మేము చెప్పామే, అక్కడ ఈ జగత్తుకు పరబ్రహ్మ వివర్తకారణంగా వుందని నువ్వు అర్థం చేసుకోవాలి. మరో రకంగా పొరపాటు పడకూడదు. అందుకోసమే ఇంత వివరణ ఇచ్చాను.

కనుక, రామా! ప్రత్యక్ష ప్రమాణంయొక్క నిర్దుష్ట స్వరూపం అయిన ఆత్మతత్వాన్ని పరిశీలించడం ద్వారా, ఈ విధంగా ప్రమాణ పూర్వకమైన ఆత్మ విచారం కొనసాగించాలి. అనుమాన ప్రమాణము, శబ్ద ప్రమాణము, మొదలయిన ప్రమాణాలు లేవా? వాటికి ఉపయోగమే లేదా?– అని అడుగుతావేమో? అలాగని మేము అనటం లేదు. తక్కిన అనుమానాది, ప్రమాణాలు అన్నీ కావలసిందే. కానీ, పర్యవసానంలో ప్రత్యక్షానుభవ పూర్వకంగా ఏ విషయాన్ని మనం ధృవపరచుకుంటామో, ఆ విషయంలోకే ఈ అనుమానాది ప్రమాణాలు కూడా మనని తీసుకెళతాయి. అంతే గాక, ఈ అనుమానాది ప్రమాణాల జీవనమంతా ప్రత్యక్షప్రమాణం మీదే ఆధారపడి వుంది. ప్రత్యక్షప్రమాణమంటే పరబ్రహ్మ చైతన్యమే. అందుకే ఆ పరబ్రహ్మ చైతన్యాన్ని గురించి వివరించాం.

## 81. ముముక్షువుల కర్తవ్యం

**విచారయాచార్య పరంపరాణాం**
**మతేన సత్యేన సితేన తావత్‌।**
**యావద్విశుద్ధం స్వయమేవ బుద్ధ్యా**
**హ్యనూన రూపం పరమభ్యుపైషి ॥** (ము.వ్య.ప్ర.స. 19,శ్లో.35)

కనుక, ఓ రామా! నువ్వు మంచి పురుష ప్రయత్నాన్ని ఆశ్రయించు. గురుపరంపరకు సమ్మతమైన పరిశుద్ధమైన సత్యమార్గంలో విచారణను కొనసాగించు. ఎప్పటిదాకా అంటే, ఏ అవధులూ లేని శుద్ధ బ్రహ్మతత్వాన్ని నీ బుద్ధితో నువ్వే ఎప్పుడు సాక్షాత్కరింప చేసుకోగలుగుతావో, అప్పటి దాకా నీ విచారం కొనసాగించు.

ఈ విధంగా ఇప్పటివరకు తన బోధనా ప్రణాళికను, తను చెప్పబోయే సిద్ధాంతంలోని ప్రధాన భాగాన్ని, ముందుగానే సూచించిన వశిష్ఠుడు, ఇలాంటి ఉత్తమజ్ఞానం గల సద్గురువులను గుర్తించు– అని చెప్పదలచుకున్నాడు. ఎందుకంటే, గురుపరంపరకు సమ్మతమైన విచారాన్ని కొనసాగించాలని చెప్పాడు గదా! అంతే గాక, ఆ గురుపరంపర ద్వారా జ్ఞానాన్ని ఎలా అందుకోవాలో, ఆ విధానాన్ని గూడా ఆయన బోధించ దలుచుకున్నాడు. దాని కోసం 20వ సర్గలో సద్గురువులయొక్క శమదమాది సదాచార లక్షణాన్ని వివరించడానికి ఉపక్రమించాడు. వశిష్ఠుడు ఇలా అన్నాడు–

“రామా! మనిషికి ఆత్మతత్త్వజ్ఞానం వృద్ధి పొందాలంటే, రెండు ముఖ్య మార్గాలున్నాయి. ఒకటి– ఆర్యసంగమము, రెండు– శాస్త్రయుక్తి. ఇవి గాక శమదమాదులను కూడా సంపాదించుకోవాలి. మానవుడు మున్ముందుగా తన ప్రజ్ఞనంతా సత్సంగము, శాస్త్రయుక్తి, మొదలయినవాటిని పెంచుకోవటంలో వినియోగించాలి. అలా చేస్తే, ఆ సత్పురుషులలో వున్న మహా పురుషలక్షణాలు వీడికి అబ్బుతాయి. అన్ని సద్గుణాలూ ఒకే సత్పురుషుడిలో వుండటం సులభసాధ్యం కాదు. అందువల్ల, ఎవరెవరిలో ఏ ఏ ప్రశస్తగుణాలు ప్రకాశిస్తూ వుంటాయో, వాళ్ళ వాళ్ళ దగ్గర వాటిని నేర్చుకోవాలి. తద్వారా తన బుద్ధిబలం పెంచుకోవాలి. సత్పురుషులంటే ఎవరు? మహాపురుషులంటే ఎవరు? శమదమాది సద్గుణాలతోపాటు సమ్యగ్జ్ఞానం వున్న వారే సత్పురుషులు. వారే మహాపురుషులు. రామా! శమదమాదులూ వుండాలి, జ్ఞానమూ వుండాలి. ఏ ఒక్కటీ చాలదు, రెండూ కలవందే సిద్ధి రాదు.

రామా! శమదమాదులు, జ్ఞానం, అనే ఈ రెంటికీ పరస్పర పోషకత్వం వుంది. శమదమాదులవల్ల జ్ఞానం పెరుగుతుంది. జ్ఞానంవల్ల శమదమాదులు పెరుగుతాయి. ఎలాగంటే వానలు బాగా పడితే పంటలు బాగా పండుతాయి. పంటలు బాగా పండితే యజ్ఞయాగాదులు జరిగి, వానలు బాగా పడుతాయి. ఇలా వానలకు, యజ్ఞాలకు పరస్పర పోషకత్వం వున్నట్టే, శమదమాదులకు– జ్ఞానానికీ, సదాచారానికీ, అన్యోన్యాశ్రయం వుందని ఇప్పుడే చెప్పుకున్నాం కనుక, సాధకుడు వీటిలో ఏ ఒక్కదాన్ని గట్టిగా ఆచరించినా, రెండోది దానంతట అదే వస్తుంది.

పల్లెల్లో రైతుపిల్లల్ని చూడు. రైతుల్లో మగవాళ్ళంతా కష్టపడి పనిజేసి, పొలాలు పంటలమీద వున్నప్పుడు, పిట్టలు కంకులు కొరికి వేయకుండా తోలటం కోసం, ఆడపిల్లల్ని కాపలా పెడతారు. ఆ పిల్లలు మంచెలమీద నిల్చొని, పక్షులు వచ్చినప్పుడల్లా చప్పట్లు కొడుతూ వుంటారు. ఇలా పక్షులకోసం కాచుకొని కూర్చొని చప్పట్లు కొట్టడం విసుగ్గా వుంటుంది. తాము చేసే పని బోర్ కొట్టకుండా, సంతోషంగా వుండేందుకోసం, ఆ పిల్లలు చేతులతో గట్టిగా తాళం వేసుకొంటూ, బిగ్గరగా పాటలు పాడుకుంటూ వుంటారు. దానివల్ల ఒక ప్రక్క పిట్టలను తోలినట్లూ అయింది. మరో ప్రక్క సంగీత సాధన చేసినట్లూ అయింది.

అలాగే సాధకుడైనవాడు సంతోషపూర్వకంగా శమ దమాదులు సాధన చేస్తే, చప్పట్లతో సంగీతం వచ్చినట్లు జ్ఞానం కూడా దానంతట అదే వస్తుది. లేదా ఆ సాధకుడు జ్ఞాన సాధనే చేస్తే, సంగీతంతో పాటు చప్పట్లు లాగా, శమదమాదులు వాటంతట అవే వస్తాయి.

రామా! ఇప్పటికి నేను నీకు మోక్షాన్ని పొందగోరే ముముక్షువు ఏ రకంగా వ్యవహరించాలో, ఆ ముముక్షు వ్యవహారమంతా కూడా వివరించాను. నా ప్రణాళికలో ముముక్షు వ్యవహార ప్రకరణం ఇక్కడికి పూర్తయింది.

**తథోపదిశ్యతే సమ్యక్**

**ఏవం జ్ఞాన క్రమోఽ ధునా॥** (ము.వ్య.ప్ర.స. 20,శ్లో.12)

ఇక నీకు జ్ఞాన క్రమాన్ని ఉపదేశిస్తాను. ఈ జ్ఞాన క్రమంలో మొట్టమొదటిది – ఉత్పత్తి ప్రకరణం. ప్రపంచమంతా మనస్సంకల్పం వల్లే విడుదల అవుతోందనీ, ఇది మనోరాజ్యం లాగా విజృంభిస్తుందనీ, ఈ ఉత్పత్తి ప్రకరణంలో వివరిస్తానని నీకు పూర్వమే చెప్పాను. ఇక ఉత్పత్తి ప్రకరణంలోకి ప్రవేశిద్దాం.

## 82. ముముక్షువ్యవహార ప్రకరణ సింహావలోకనము

ఆత్మ విద్యా ప్రవేశానికి ముమ్ముందుగా సాధన చతుష్టయ సంపత్తి ఉండాలని వేదాంత గ్రంథాలన్నీ ఉగ్గడిస్తూనే వుంటాయి. యోగవాశిష్ఠం గూడా ఆ పనిని తన దైన శైలిలో వైరాగ్య ప్రకరణం ద్వారా నిర్వహించింది.

సాధన చతుష్టయంలో శిఖరాయమాణమైనది ముముక్షుత్వం. లోకంలోని సాధకులు వివిధ సాధనామార్గాల ద్వారా, వివిధ దృక్కోణాలనుంచీ ఈ ముముక్షుత్వాన్ని అందుకుంటూ వుంటారు. అందుచేతనే వారు వివిధమైన కల్లోలాలలో, వివిధమైన సందేహాలలో, ఊగిసలాడుతూ వుంటారు. అలాంటి సాధకులు తమ జీవితాన్ని ఎలా తీర్చిదిద్దుకోవాలి? తమ శేష జీవితంలో ఎలా వ్యవహరించుకోవాలి? – అనేవి సాధకులకు చాలా సంకటమైన ప్రశ్నలు. సామాన్య వేదంత గ్రంథాలలో ఈ ప్రశ్నకు ఎక్కువగా ప్రాధాన్యాన్ని ఇవ్వరు. కానీ వాల్మీకి మహర్షి సాధకుల మీద గల దయతో, ఈ ప్రశ్నకోసం ఒక ప్రకరణాన్నే కేటాయించాడు.

సాధనామార్గ వైవిధ్య ప్రదర్శనకోసమే ఈ ప్రకరణాన్ని వాల్మీకి మహర్షి శుక వ్యాస, శుక–జనక సంవాదాలతో ప్రారంభించి, ఆ సంవాదాల సారాంశాన్ని –

**"స్వసంకల్ప వశాద్బద్ధో నిస్సంకల్పశ్చ ముచ్యతే"** (ము.వ్య.ప్ర.స. 1, శ్లో. 36)
(సంకల్పాలుంటే బంధం వుంటుంది, సంకల్పాలు పోతే ముక్తి లభిస్తుంది)– అని తేల్చి చెప్పాడు.

ఇది సిద్ధాంత వాక్యం. ఈ వాక్యం ఇంత ముందుగానే ఎందుకు వచ్చేసిందంటే, ఇది విశ్వామిత్రబోధ కావటంవల్లే! నారద మహర్షి ప్రోత్సాహానికి ఉత్తేజితుడై ముమ్ముందుగా తత్త్వోపదేశం ప్రారంభించిన విశ్వామిత్రమహర్షి త్వరలోనే తన బోధన ప్రణాళికా బద్ధంగా సాగటంలేదని గమనించుకుని, వశిష్ఠమహర్షినే శ్రీరాముడికి ఉపదేశించమని ప్రార్థించాడు.

అక్కడితో వశిష్ఠోపదేశం ప్రారంభమైంది. ఆయన తన మనస్సులో ఒక బోధనా ప్రణాళికను నిర్మించుకొని ముమ్ముందుగా, భూతాకాశ, మానసాకాశ, చిదాకాశాల నిర్వచనంతో తన బోధను ప్రారంభించాడు.

ఆ తరువాత వశిష్ఠమహర్షి సాధనయొక్క ప్రాముఖ్యాన్ని తీవ్రంగా నొక్కి చెప్పి, ఆ పైన తన అనంతర బోధకు కావలసిన పారిభాషికాంశాలను, సిద్ధాంత సూత్రాలను, విస్పష్టం చేయదలచుకున్నాడు.

అందుకే ముమ్ముందుగా "సాధన గూడా దైవాధీనమే" అనే సోమరితనపు వాదాన్ని ఖండించటం కోసం ఆయన ఈ ప్రకరణంలో అనేక సర్గలను వినియోగించాడు.

దానికి భూమికగా, వ్యాస, శుక, విశ్వామిత్ర, వశిష్ఠాదులైన ఆధికారిక జీవన్ముక్తుల జన్మ ప్రక్రియను కొంత వివరించి, ఆ పైన శమము, ఆత్మవిచారణ, సంతోషము, సత్సంగము అనే నాలుగు సాధన సోపానాలను విస్తారంగా ఉపదేశించాడు. ఈ సాధనసోపానాలను సాధించటానికి – సదాచారము, సత్సాంగత్యము, సచ్ఛాస్త్రము అనే ఉపాయత్రయాన్ని గూడా ప్రతిపాదించాడు.

ఈ ఉపాయాల సాధనకు ఆటంకంగా వుండే సోమరితనాన్ని నిరసించేందుకోసం ఆయన ఈ ప్రపంచం అంతా స్పందాత్మకం అని ప్రతిపాదిస్తూ, సంవిత్స్పంద, మానసస్పంద, ఇంద్రియ స్పందాలనే నూతన పరిభాషను ప్రవేశపెట్టాడు.

ఆ తరువాత "విధి"(అదృష్టం) అనేది ఆకాశం వంటిది– అని నిరూపించి, సాధకుడు తన దుర్వాసనలను నిరోధించుకోవటానికి ప్రయత్నించి తీరవలసిందే నన్నాడు. దీనికి సద్భావనే మార్గమన్నాడు.

ఇలా సద్భావనాబలంవల్ల దుర్వాసనలను నిగ్రహించుకుంటున్న సాధకుడు అందుకోవలసిన ఆత్మజ్ఞాన విద్యను అందించబోతూ, ముందుగా దాని మీద శ్రద్ధ పెరగటంకోసం, ఆత్మవిద్య పరబ్రహ్మ దగ్గరనుంచీ తన దాకా అవతరించిన విద్యావతరణ ప్రక్రియను వివరించాడు. దానికి పీఠికగా, ఉత్తరోత్తర కాలంలో తను తరచుగా ఉపయోగించబోయే "నియతి" అనే మౌలిక సత్యంయొక్క తత్త్వాన్ని ఒకింత విపులంగా వివరించాడు.

ఆ తరువాత పూర్వం తను ప్రస్తావించిన శమ, విచార, సంతోష, సాధు సంగమాలను రాజద్వారపాలకులతో పోలుస్తూ, వీటిలో ఏ ఒక్కటి పట్టుబడ్డా, మిగిలిన మూడూ అవే లొంగిపోతాయి అన్నాడు. దాన్ని వివరించటం కోసమే శ్రవణ, మనన, నిదిధ్యాసలను పరోక్షంగా ప్రతిపాదిస్తూ, శమానికీ, విచారానికీ పెద్ద పీటలు వేశాడు.

ఇక్కడి దాకా వచ్చాక, వాల్మీకి మహర్షి తన గ్రంథ రచనా ప్రణాళికను, వశిష్ఠమహర్షిగారి ప్రబోధ ప్రణాళికరూపంలో ప్రకరణ విభాగంతోనూ, శ్లోకసంఖ్యలతోనూ, సహా వివరించాడు.

ఇక ఇక్కడినుంచీ వశిష్ఠమహర్షి సూటిగా ఆత్మవిద్యావిషయంలోకి అడుగు పెట్టదలచుకుని, దానికి పీఠికగా ప్రపంచ మిథ్యాత్వాన్ని గూర్చి ప్రస్తావిస్తూ, ప్రతి అణువు గర్భంలోనూ వేల కొలది ప్రపంచాలున్నాయి అనే వింత ప్రతిపాదన చేశాడు. దీన్ని ఆయన కొంత వివరించాడు గానీ, దీన్ని గురించిన పూర్తి వివరణ నిర్వాణ ప్రకరణంలో రాబోతోందన్నాడు.

ఆ తరువాత మళ్ళీ ఒకింత పారిభాషిక ధోరణిలోకి వెళ్లి, దృష్టాంతము, పోలిక, ప్రాతిభాసిక సత్త, వ్యావహారిక సత్త వంటి– పరిభాషను వివరించే నెపంతో జాగ్రత్ప్రపంచం అంతా స్వప్న ప్రపంచం వంటిదే– అనే మరో నూతన ప్రతిపాదన చేశాడు.

దీన్ని నిరూపినిచటానికి కొన్ని ప్రమాణాలు కావాలి. కానీ తన దృష్టిలో ప్రత్యక్షం ఒకటే ప్రమాణం **(ప్రమాణమేకమేవేహ - ప్రత్యక్షం)** (ము.వ్య.ప్ర. స.19,శ్లో.16) అంటూ మరో నూతన ప్రతిపాదన గూడా చేసి, ప్రత్యక్షమంటే ఏమిటో ప్రత్యేకంగా వివరించాడు.

ఈ ప్రతిపాదన ఆధారంగా చర్చను కొనసాగించి, ఈ ప్రపంచం పరబ్రహ్మయొక్క వివర్త రూపం అని సంగ్రహంగా నిరూపించాడు.

ఇంతవరకు కొంత తత్త్వ విషయ ప్రతిపాదన చేసిన వశిష్ఠ మహర్షి, మళ్ళీ ఒకింత వెనక్కి తిరిగి, ముముక్షువులైన సాధకులు, సద్గురువుల ద్వారా సచ్ఛాస్త్రాన్ని శ్రవణం చేసి, ఆ తత్త్వం తమ బుద్ధిలో తమంతట తమకే అనుభవసిద్ధం అయ్యే దాకా శ్రుతిసమ్మతమైన మార్గంలో ఆపకుండా పునఃపునర్విచారణ చేస్తూ వుండవలసిందే అని పునరుద్ఘాటిస్తూ ఈ ముముక్షు వ్యవహార ప్రకరణాన్ని ముగించాడు.

---

# యోగ వాశిష్ఠ హృదయము

## తృతీయ భాగము

## ఉత్పత్తి ప్రకరణము



శ్రీ కుప్పా వేంకట కృష్ణమూర్తి

## విషయ సూచిక

# యోగవాశిష్ఠ హృదయము

## ఉత్పత్తి ప్రకరణము

### 1. గ్రంథప్రారంభము

యోగవాశిష్ఠాధ్యయనంలో మనం ఇప్పటికి మొదటి రెండు ప్రకరణాలను పూర్తి చేసుకొన్నాం. వాటి పేర్లు 1. వైరాగ్య ప్రకరణము 2. ముముక్షు వ్యవహార ప్రకరణము. ఇక మూడవదైన ఉత్పత్తి ప్రకరణంలోకి మనం ప్రవేశించాలి. ఇది ఏడు వేల శ్లోకాల గ్రంథం. వశిష్ఠమహర్షి ఉత్తముడైన బోధకుడు గనుక, తన బోధ అంతా ఒక ప్రణాళిక ప్రకారం నడుపుతున్నాడు. ఆ ప్రణాళిక ఏమిటో కొంచెం ముందుకు పోతే సుగమంగా అర్థమౌతుంది. మనం ఇప్పుడు వశిష్ఠమహర్షియొక్క ప్రబోధన ప్రణాళికా సూత్రాన్ని అందుకుంటూ, ఉత్పత్తి ప్రకరణంలోకి ప్రవేశిద్దాం. ఇది ఏడు వేల శ్లోకాల విస్తృత ప్రకరణం అని చెప్పుకున్నాం కదా! దీనిలో అనేక విషయాలు ఎంతో లోతుగా చర్చించ బడ్డాయి. మనం వీలైనంత సంగ్రహంగా దీన్ని చెప్పుకొందాం. వెనుకటి ప్రకరణంలో శ్రీరాముడు–

**తదేతద్ భగవన్బ్రూహి కిమిదం పరిణశ్యతి।**
**కిమిదం జాయతే భూయః కిమిదం పరివర్ధతే।।** (వై.ప్ర.స.12, శ్లో.17)

అని అడిగాడు. అంటే “ భగవన్! చచ్చేది ఏది? పుట్టేది ఏది? పెరిగేది ఏది?” అని అడిగాడు. దానికి సమాధానంగా వశిష్ఠమహర్షి ఈ ప్రకరణాన్ని ప్రారంభించాడు. దీనిలో మొదటి సర్గలో ఏడవ శ్లోకంలో ఆయన ఇలా అన్నాడు–

**ఉత్పద్యతే యో జగతి స ఏవ కిల వర్ధతే।**
**స ఏవ మోక్షమాప్నోతి స్వర్గం వా నరకం చ వా।।** (ఉ.ప్ర.స.1, శ్లో.7)

ఎవడు పుడతాడో వాడే పెరుగుతాడు. వాడే స్వర్గాన్నో, నరకాన్నో, మోక్షాన్నో, పొందుతాడు.

ఇంతకూ పుట్టటమంటే ఏమిటి?– ఈ ప్రశ్నకు సమాధానమే ఈ ఏడు వేల శ్లోకాల ఉత్పత్తి ప్రకరణం. ఈ ప్రకరణమంతా ఒక అడవి లాగా వుంటుంది. కొంత దూరం పోయాక, మనం ఎటునుంచి వచ్చామో, ఎటు పోతున్నామో, మనకే అర్థం కాదు. అందుకే వశిష్ఠమహర్షి తనే స్వయంగా మొదట సంగ్రహ సర్గ చెప్పాడు–

**ఇదంప్రకరణార్థం త్వం సంక్షేపాచ్ఛృణు రాఘవ।**
**తతస్సంకథయిష్యామి విస్తరం తే యథేప్సితమ్।।** (ఉ.ప్ర.స.1, శ్లో.9)

అంటే, ఈ ప్రకరణం యొక్క అర్థాన్ని మొత్తం ముందు సంగ్రహంగా చెపుతాను. తరువాత దాన్నే మళ్ళీ విస్తరించి చెపుతాను– అన్నాడు.

ఈ సంగ్రహ సర్గ చదివినాక కూడా రాబోయే ప్రకరణం గందరగోళంగానే వుంటుంది. ఎటునుంచి ఎటు పోతున్నామో అర్థం కాదు. అందువల్ల ఈ ప్రకరణాన్ని అర్థం చేసుకోవటంలో మనం ఒక కొత్తదారి తొక్కుదాం.

## 2. దేశకాలాలు

ఈ ఉత్పత్తి ప్రకరణంలో వశిష్ఠమహర్షి నిజంగా చెప్పదలచుకున్నది ఏమిటంటే, అసలు ఉత్పత్తి అనేది లేనే లేదు – అని. ఇది ఎవడూ ఒక పట్టాన నమ్మే మాట కాదు. ప్రపంచంలో ఏ వస్తువును తీసుకున్నా, ఇది ఫలానా చోట, ఫలానా సమయంలో, పుట్టింది, అంతకు ముందు లేదు, అని నిక్కచ్చిగా చెప్పచ్చు. దీనినే ఐన్‌స్టీన్ మహాశయుడు **ఫోర్ డైమెన్షనల్ గ్రాఫ్** అన్నాడు.

ఫోర్ డైమెన్షనల్ గ్రాఫులో x,y,z యాక్సిస్‌లు మూడూ స్పేస్‌లో ఆ వస్తువు యొక్క లొకేషన్‌ను ఫిక్స్ చేస్తాయి. దీన్నే మన వేదాంతపరిభాషలో 'దేశము' అంటారు. కాగా x,y,z యాక్సిస్‌లు మూడూ కలిసి ఒకానొక వస్తువుయొక్క దేశాన్ని నిర్ధారణ చేస్తాయి – అన్నమాట. ఇక నాల్గవదైన T యాక్సిస్, ఆ వస్తు ఉత్పత్తియొక్క టైమ్ ఫ్యాక్టర్‌ని ఫిక్స్ చెస్తుంది. దీన్నే మన వేదాంత పరిభాషలో కాలము అని పిలుస్తారు. ఈ నాలుగు యాక్సిస్‌లను ఆధారం చేసుకొని ఒక స్పాట్‌ను నిశ్చయం చేస్తే, అది ఆ వస్తువు యొక్క ఉత్పత్తిని నిర్ధారణ చేస్తుంది – అని ఆధునిక విజ్ఞానం మనకు బోధిస్తుంది.

అయితే ఈ విజ్ఞానంలో ఆధునికత్వం ఏదీ లేదు. కొన్ని లక్షల సంవత్సరాలుగా మనుషులు ఇట్లాగే ఆలోచిస్తున్నారు. కొత్తగా వచ్చిందల్లా ఫోర్ డైమెన్షనల్ కాన్సెప్ట్ మాత్రమే.

మనం ఈ ఉత్పత్తి ప్రకరణాన్ని బాగా అర్థం చేసుకోవాలంటే, దీనిలో దేశము అనే పదం వచ్చినప్పుడల్లా x,y,z యాక్సిస్‌లను గుర్తు చేసుకోవాలి. కాలము అనే పదం వచ్చినప్పుడల్లా T యాక్సిస్‌ను గుర్తు చేసుకోవాలి. ఇలా అయితే వశిష్ఠమహర్షి చెప్పబోయే విషయం మనకు తేలికగా బుర్రకెక్కుతుంది.

వశిష్ఠమహర్షి ఈ ప్రకరణంలో ఒక విప్లవాత్మకమైన ప్రశ్నను లేవనెత్తదలచుకొన్నాడు. ఏమనంటే – నువ్వు యాక్సిస్‌లు అంటున్నావు కదా! అవి దేనిమీద ఆధారపడి వున్నాయి?– అని.

గణితశాస్త్రంలో దీనికి సమాధానం లేదు. ఆ శాస్త్రానికి, ఆ ప్రశ్న అక్కర్లేదు. 0 అనే పాయింట్ వుందనుకో, ఇది యాక్జియమ్ (Axiom)– అంటుంది గణిత శాస్త్రం. యాక్జియమ్ అంటే, అది వుందని ఒప్పుకొన్నాం. దానిమీద చర్చ లేదు – అని అర్థం. వశిష్ఠమహర్షి అక్కడే తన చర్చను కేంద్రీకరించాడు. నీ నాలుగు యాక్సిస్‌లకి మూల కేంద్రమైన ఆ బిందువు ఎక్కడ వుంది? – అనేది ఆయన ప్రశ్న.

ఆ చర్చ చాలా మెలికలు తిరుగుతుంది. చివరికి వశిష్ఠమహర్షి చెప్పబోయే తీర్పు ఏమింటే – ఆ మూల బిందువనేది నిజంగా లేనే లేదు. ఉందనుకోవడం నీ భ్రమ. ఆ భ్రమలో పడి, అది వుందనుకొని, దానిమీద ఆధారపడి, గీతలు గీశావు. వాటిని Axis అని పిలిచావు. ఆ గీతల మీద ఆధారపడి వస్తువుయొక్క ఉత్పత్తిని నిర్ణయం చేశావు. ఈ మొత్తం కథంతా నీ భ్రాంతిమీద ఆధారపడి సాగిందే గానీ, లేని బిందువు మీద కాదు. కనుక, ప్రపంచంలో ఉత్పత్తి అనేది లేనే లేదు. అనగా సృష్టి అనేది లేనే లేదు – అని వశిష్ఠమహర్షి చెప్పదలుచుకొన్నాడు.

వశిష్ఠమహర్షియొక్క పారిభాషిక పదాలేమిటో ఇప్పుడే చెప్పుకున్నాం కదా. ఆయన యాక్సిస్‌లు అనడు. దేశము, కాలము అనేవి లేనే లేవు అంటాడు. అంటే చోటు, సమయము అనేవి లేనే లేవు అంటాడు.

చోటు లేని పరిస్థితిని మనం ఊహించగలమా? పోనీ కాలం లేని పరిస్థితిని మనం ఊహించగలమా? చాలా కష్టం. ఇలాంటి ఊహకందని విషయాలను ఆయన ప్రతిపాదించదలచుకొన్నాడు గనుక, ఆయన ఈ విషయంలో **"లీలో పాఖ్యానము"** అనే పెద్దకథ చెప్పదలచుకొన్నాడు. దీనికే **"మండపోపాఖ్యానము"** అని మరో పేరు. ఆయన దానిని 15వ సర్గలో ప్రారంభించాడు. వెనుకటి 14 సర్గలలోనూ ఆ కథ వెనకాల సిద్ధాంత భాగాన్ని తర్క జటిలమైన పద్ధతిలో చర్చించాడు.

కాగా, ఉత్పత్తి ప్రకరణంలోని మొదటి 14 సర్గలూ కూడా రాబోయే **"లీలోపాఖ్యానానికి"** పీఠిక వంటివి అని మనం గ్రహించాలి. వాటిల్లో కూడా మొట్టమొదటి సర్గలో మొత్తం ప్రకరణసారాన్ని సంగ్రహంగా చెప్పాడు. అందుకే దీన్ని 'సంగ్రహసర్గ' అని పిలుస్తూ వుంటారు.

### 3. సృష్టి ఎప్పుడు జరిగింది?

ఈ సర్గలో వశిష్టమహర్షి ఒక మెలిక పెట్టాడు. ఏమంటే, "ఈ జగత్తు యొక్క సృష్టి ఎప్పుడు ఎలా జరిగింది?" – అని రాముడి ప్రశ్న. ఎవడు చూశాడు? ఎవడు చూశానని చెబితే నమ్మాలి? ఇది చూసే విషయం కాదు. నమ్మే విషయం కాదు. ఎవడికి వాడు ఊహతో నిర్ధారణ చేసుకోవాలి. అందుకే వశిష్ఠమహర్షి ఒక కొత్త ప్రక్రియ చెప్పాడు.

ఈ జగత్తును నీవు చూస్తున్నావు. ఇది ఇప్పుడు వుంది. స్వప్నంలో నీవు ఒక జగత్తును చూశావు. అది అప్పుడు వుంది. అది ఏమై పోయింది? సుషుప్తిలో లయించి పోయింది. అలాగే, ఇప్పుడు నువ్వు చూస్తున్న ఈ జాగ్రత్ప్రపంచం కూడా కల్పాంతంలో లయించి పోతుంది.

స్వప్న జగత్తు సుషుప్తిలో లయించిపోగా, ఏమి మిగిలింది? నువ్వు మిగిలావు. అలాగే, జాగ్రత్ప్రపంచం కల్పాంతంలో లయించిపోగా, ఒకానొక సత్పదార్థం మిగులుతుంది.

స్వప్నం లయించిపోగా నువ్వు మిగిలావు గదా! నీ స్వప్న ప్రపంచంతో పోల్చి చూస్తే, నువ్వు ఎటువంటివాడివి? ఆ స్వప్నలోకపు పంచభూతాల నుంచి వచ్చినవాడివా? స్వప్నలోకపు వెలుగువా? స్వప్నలోకపు చీకటివా? కాదు. స్వప్నలోకపు ఏ పేరూ నీకూ అన్వయించదు. నువ్వు ఆ లోకంకంటే అన్ని విధాలా భిన్నుడివి. అది నశించిపోయాక కూడా అస్తిత్వం మిగిలి వున్న ఏకైక పదార్థానివి. అంతే గదూ!

అలాగే, ఈ జాగ్రత్ప్రపంచమంతా లయించిపోగా, మిగిలిపోయే పదార్థం వుందే, అది ఈ లోకపు వెలుగు కావటానికి వీల్లేదు, ఈ లోకపు చీకటి కావటానికీ వీల్లేదు. ఈ లోకపు పంచభూతాలవల్ల పుట్టింది కావటానికీ వీల్లేదు. ఈ లోకపు పేర్లేవీ దానికి పెట్టటానికి వీల్లేదు. ఈ లోకంలో అది అభివ్యక్తం కావటానికి వీల్లేదు. ఈ లోకానికి అస్తిత్వం లేకపోయినా, దానికి మాత్రం అస్తిత్వం వుండితీరాలి. అంటే, అది సత్పదార్థం అయివుండాలి.

**తతః స్తిమిత గంభీరం న తేజో న తమస్తతమ్।**

**అనాఖ్య మనభివ్యక్తం సత్కించి దవశిష్యతే॥** (ఉ.ప్ర.స.1, శ్లో.11)

అలాంటి ఆ సత్పదార్థానికి శాస్త్రకారులు కొన్ని పేర్లు పెట్టారు 1.ఋతం 2.ఆత్మ 3.పరం 4.బ్రహ్మ 5.శాస్త్రము – ఇలాంటివన్నీ ఎవరో పెట్టిన పేర్లే. అ వస్తువుకు వున్న పేర్లు కాదు.

ఈ సత్పదార్థమే క్రమంగా అవివేకంలో పడి, హిరణ్యగర్భుడు అనే జీవుడు తయారవుతాడు. దీనికి కారణం అవిద్య. అనగా మనోభ్రాంతి. ఇదే హిరణ్యగర్భునియొక్క ఉత్పత్తికీ, ఆ తరువాత ప్రపంచ ఉత్పత్తికీ ఉపాదాన కారణం.

దీనికి కూడా శాస్త్రకారులు చాలా పేర్లు పెట్టారు. 1.అవిద్య 2.సంసృతి 3.బంధం 4.మాయ 5.మోహం 6.మహత్తు 7.తమస్సు.

## 4. మాయ అంటే ప్లస్

పరిశుద్ధంగా వున్న సత్వపదార్థం అవిద్యవల్ల హిరణ్యగర్భుడు లేక బ్రహ్మ అనే జీవిగా ఏర్పడింది– అని ఇక్కడ చెపుతున్నారు. ఈ అవిద్యయే హిరణ్యగర్భుని బంధిస్తోంది – అని కూడా చెబుతున్నారు. అవిద్య అంటే ఏమిటో చాలా చర్చ రాబోతోంది. దాన్ని అలా వుంచి, అవిద్య అంటే ఏంటో ఆధునిక దృష్టితో అర్థం చేసుకొనేందుకు ప్రయత్నం చేద్దాం.

గణితశాస్త్రంలో + అనే గుర్తు వుంది. మనమంతా రోజూ దీన్ని వాడుతూనే వుంటాం. ఇది మనకు అలవాటైపోయి, దీనిని వ్యాకరణశాస్త్రంలోకి కూడా దించేశాం. రాముడు + అతడు = రాముడతడు – అని పాఠశాలల్లో పాఠాలు చెప్పేస్తున్నారు. ఇంత బాగా అలవాటైపోయిన ఈ (+) కి అర్థం ఏమిటి? ప్లస్ అంటే ఏమిటి?– అని ఎవరైనా అలోచించారా? పోనీ ఇప్పుడు ఆలోచించండి.

1+1=2 అన్నాం, ఒకటి అంటే ఒక అరటిపండు అనుకొందాం. అరటిపండు పక్కన అరటిపండు పెట్టాం. 1+1 అన్నాం. ఇప్పుడు మొదటి అరటిపండులో మార్పు వచ్చిందా? 2వ అరటిపండులో మార్పు వచ్చిందా? దేంట్లోనూ మార్పు రాలేదు. ఏ మార్పూ రాకపోతే, ఈ ప్లస్ అనే సంకేతం ఏమి పని చేసినట్లు? ఇది ఏ పనీ చేయకపోతే, రెండు అనే అంకే ఎలా పుట్టినట్టు? మన కళ్ళ ఎదురుగా రోజూ కనిపించే తర్క విరుద్ధాంశాలలో ఇదొకటి.

దీన్నే మరో రకంగా తిప్పి చెప్పుకుందాం. రెండు అనే అంకె ప్లస్‌వల్ల పుట్టింది. కానీ, ప్లస్ ఒక్కటీ రెండు అనే అంకెను పుట్టించలేదు. అది, ఒకటికీ – ఒకటికీ మధ్య చేరినప్పుడు మాత్రమే, రెండును పుట్టించ గలదు.

ఒకటికీ ఒకటికీ మధ్య ప్లస్ చేరడం అంటే ఏమిటి? అది మొదటి ఒకటినీ ముట్టుకోలేదు. రెండవ ఒకటినీ ముట్టుకోలేదు. అయినా సరే, ఆ రెండు ఒకట్లూ సన్నిధిలో వుంటే చాలు, ఈ ప్లస్ అనే గుర్తు రెండు అనే అంకెను సృష్టి చేయగలదు. ఇదేమిటయ్యా! ఈ ప్లస్ దేనితోనూ సంపర్కం లేకుండానే రెండనే అంకెను సృష్టి చేయగలదా? అలా అంటే నమ్మవచ్చా?

ప్లస్సుకి మొదటి ఒకటితోనూ రెండవ ఒకటితోనూ, సంబంధం లేదన్నాం గానీ, దేనితోనూ సంబంధం లేదన లేదు. ఎవడైతే ఈ గణనక్రియ చేస్తున్నాడో, వాడియొక్క మనస్సుకు ఈ ప్లస్సుతో సంపర్కం వుంది. ఇది అక్కడే, వాడి మనస్సులోనే, రెండు అనే భావాన్ని సృష్టి చేస్తోంది.

రెండు అనేది అంకె గదా! భావమంటారేమిటి? కొంచెం ఆలోచించండి. రెండు అనేది నిజంగానే ఒక పదార్థమై వుంటే, అది దేన్నైనా ఆశ్రయించుకొని వుండాలి. మన ఉదాహరణలో రెండు అనేది మొదటి అరటిపండునూ ఆశ్రయించలేదు, రెండవ అరటి పండునూ ఆశ్రయించలేదు. ఆ పళ్ళు పక్కపక్కన చేరే సరికి, వీడి మనస్సులో రెండు పళ్ళు అనే భావన పుట్టింది. కనుక, రెండు అనేది భావనే తప్పితే నిజమైన పదార్థం కాదు. ఈ భావనకు రేఖారూపం ఇస్తే రెండు అనే అంకె ఏర్పడింది.

ఇంతకూ చెప్పవచ్చిందేమంటే – రెండు అనేది ఒక భావన. అది ప్లస్ అనే భావనవల్ల చూసేవాడి మనస్సులో జన్మిస్తోంది. కాగా, ఈ ప్లస్ అనే భావన కూడా చూసేవాడి మనస్సునే ఆశ్రయించి వుందని చెప్పక తప్పదు.

అరటి పళ్ళేమో ఎదురుగా టేబుల్ మీద వున్నాయి. ఇదొక సెట్ (Set). ప్లస్ అనే భావన, రెండు అనే భావన, చూసేవాడి మనస్సులో వున్నాయి. అది మరొ సెట్ (Set). ఈ రెండు సెట్లను కలగాపులగం చేసి, 1+1=2 అనే ఈక్వేషన్‌ను లోకులు తయారు చేస్తున్నారు.

ఎవరి ప్రభావంవల్ల ఈ కలగాపులగం జరుగుతోంది? అని విచారిస్తే – ఇదంతా ఈ ప్లస్సుయొక్క ప్రభావమే – అని చెప్పక తప్పదు. ఎందుకంటే – రెండు అనే భావన పుట్టక ముందు అక్కడ అరటిపళ్ళు, మనస్సు అనే అంశాలున్నాయి. అవి వేటికవి విడివిడిగా వున్నాయి. ప్లస్ అనే భావన ఉదయించాకే కలగాపులగ వ్యవహారం మొదలైంది. కనుక, ఈ కలగా పులగానికి కారణం ప్లస్సే.

కాగా ఈ ప్లస్సనే భావన రెండు పనులు చేస్తోంది–

1. నిజానికి తను వున్నది చూసేవాడి మనస్సులో అయితే, చూడబడే వస్తువును ఆశ్రయించి తాను వున్నట్టుగా నాటకమాడుతోంది.

2. రెండు అనే భావనను అది ద్రష్టయొక్క మనస్సులో ఉత్పత్తిచేసి, ఈ ఉత్పత్తి ఎదురుగా వుండే దృశ్య పదార్థంలో జరిగినట్లు భ్రాంతి కలిగిస్తోంది.

లోకంలో ఎక్కడైనా సరే భ్రాంతి కలిగించే వస్తువును మాయ అనీ, గారడి అనీ, పిలుస్తుంటారు. గణితశాస్త్రంలో మనం చూసే ప్లస్సు, నిత్య జీవితంలో మనకు కనిపించే మాయే. వేదాంత శాస్త్రంవారు మాయ అనే పదానికి మెలికలు తిప్పి తిప్పి చెప్పే అర్థాలన్నీ, ఈ ప్లస్సుకు సరిపోతాయి. కనుక, మాయ అంటే ఏమిటి? అని గందరగోళపడేవారు, మనం రోజూ వాడుకునే "ప్లస్" అంటే ఏమిటి –అని ఆలోచిస్తే సరిపోతుంది.

## 5. సత్ + సంకల్పం = హిరణ్యగర్భుడు

ఈ ఉదాహరణని మన కథలో అన్వయించుకొందాం. ఇప్పుడున్న సృష్టి అంతా లయించిపోయి, కేవలం పరిశుద్ధ సత్పదార్థం మిగిలింది. ఆ సత్పదార్థమే మాయా సంకల్పస్పర్శవల్ల హిరణ్యగర్భుడుగా రూపొందింది – అని చెప్పారు. ఈ మాటే మనకు సరిగా అర్థం కావడం లేదు. మధ్యలో ఈ మాయ ఎక్కడ్నుంచి వచ్చింది? మాయ అంటే ఏమిటి? – అని ప్రశ్నిస్తున్నాం. దీనికి వేదాంతశాస్త్ర పరిభాషలో సమాధానం చెప్పుకొనే బదులు, గణితశాస్త్ర పద్ధతిలో సమాధానం కోసం అన్వేషిద్దాం.

సత్పదార్థం మాయా సంకల్ప స్పర్శవల్ల హిరణ్యగర్భుడైంది– అన్నారు. అంటే, సత్ + సంకల్పం = హిరణ్యగర్భుడు. దీనిలో సత్ అనేది ఎల్లప్పుడూ వుండేది. సంకల్పమనేది పూర్వసృష్టి సంస్కారంవల్ల వచ్చి చేరేది. కాగా, సత్ + సంకల్పం" అనేది "1+1" అన్నట్టుగా వుంది. గణితంలోని ప్లస్సే, వేదాంతంలోని మాయ. ఏమీ తేడా లేదు.

ఎలాగైతే ప్లస్సు మొదటి ఒకటిని గానీ, రెండవ ఒకటిని గానీ ముట్టుకోదో, అలాగే మాయ కూడా సత్‌ని కానీ, సంకల్పాన్ని కానీ ముట్టుకోదు. అది ద్రష్టను ఆశ్రయించి వుంటుంది. ఉండి సత్‌ని, సంకల్పాన్నీ, ఆవరిస్తుంది.

ప్లస్ అనేది ప్రత్యేకంగా పదార్థం ఎలా కాదో, అలాగే మాయ గూడా ప్రత్యేక పదార్థం కాదు.

ఎలాగైతే ప్లస్ అనేది రెండు అనే భావనను ద్రష్టయొక్క మనస్సులోనే సృష్టి చేస్తోందో, అలా చేసి కూడా రెండు అనేది మనస్సుకంటే వెలుపల వున్నట్టుగా భ్రాంతి కలిగిస్తోందో, అదే రీతిగా, మాయ హిరణ్యగర్భుడు అనే ఒక దృశ్యాన్ని ద్రష్టయొక్క హృదయంలోనే సృష్టి చేసి, ఆ హిరణ్యగర్భుడు ఎక్కడో దూరంగా ఏడులోకాలకూ అవతల వున్నట్టుగా భ్రమ కలిగిస్తూ వుంటుంది.

ఇలా మాయాసంబంధంవల్ల పుట్టిన హిరణ్యగర్భుడు, ఈ ముల్లోకాలనూ మళ్ళీ సృష్టి చేస్తున్నాడు. ప్రపంచ సృష్టి జరిగే విధానం ఇదే – అని ఈ ప్రకరణంయొక్క మొదటి సర్గలో వశిష్ఠమహర్షి తేల్చి చెప్పాడు.

ఈ విషయం స్పష్టంగా వున్నట్టు కనిపించటం లేదు. కొంత వరకు అర్థమైంది అనిపించినా కూడా,

నమ్మబుద్ధి కావటం లేదు. ఇది ఇలా వుంటుందని వశిష్ఠ మహర్షికి తెలుసు. అందుకనే ఈ విషయాన్నే మొదటి 12 సర్గలలో వివరించి, 13వ సర్గలో అసలు విషయం బయట పెట్టాడు. మనం ముందుగా 13వ సర్గలోని విషయాన్న అందుకొని, తరువాత వెనుక సర్గలకు వస్తే విషయం తేలికగా వుంటుంది.

మొదటి సర్గలో వశిష్ఠమహర్షి ఏమన్నాడంటే –

క. మొదట కేవలం సత్పదార్థం వుంది.

ఖ. దానికి మాయా స్పర్శవల్ల పూర్వ సంకల్పం మేల్కొంది.

గ. దానివల్ల హిరణ్యగర్భుడనే మొదటి జీవి పుట్టాడు.

ఘ. ఇతనే ముల్లోకాలూ సృష్టి చేశాడు.

ఙ. హిరణ్యగర్భోత్పత్తికి మూలమైన మాయ ఈ సృష్టిలోని జీవుల బుద్ధులను ఆశ్రయించుకొని వుంది.

ఇదీ వశిష్టమహర్షి చెప్పింది. దీన్ని గణితశాస్త్రపరంగా మార్చి మనం ఏమన్నామంటే – సత్+ సంకల్పం = హిరణ్యగర్భసృష్టి అన్నాం. దీనిలో వున్న ప్లస్ ద్రష్టయొక్క మనస్సును ఆశ్రయించి వుంది అన్నాం.

ఇక్కడ ద్రష్ట అంటే ఎవరు? సృష్టిలో వున్న మనమే. మాయ మన మనస్సును అశ్రయించి వుండి సృష్టికర్తను సృష్టి చేసిందా? ఇదెక్కడి మాట? సృష్టికర్త ఏదో మాయను ఉపయోగించి నన్ను సృష్టి చేశాడు– అంటే బాగుంటుంది గానీ, నేను మాయతో కలసి, లేదా మాయ నాతో కలసి, సృష్టికర్తనే సృష్టించామంటే – అదెలా కుదురుతుంది? ఇదే మన ప్రశ్న. అంతే గదూ!

### 6. స్వప్నరాజు

దీనికి సమాధానం 13వ సర్గలో వశిష్ఠమహర్శి చెపుతున్నాడు. ఆయన ఏమంటున్నాడంటే "ఒక్క సారి నీవు నీ స్వప్నలోకంలోకి వెళ్ళవయ్యా! వెళ్ళి, అక్కడ కూర్చొని ఆలోచించు."

నీ స్వప్నలోకంలో నువ్వే రాజువి. నీకో రాజ్యము, పంచభూతాలు, గుళ్ళూ, దేవుళ్ళూ, ఊర్ధ్వ లోకాలూ, అథో లోకాలూ అన్నీ ఆ స్వప్నప్రపంచంలో వున్నాయి. అక్కడ నీతో పాటు అనేక మంది జీవులున్నారు. ఈ లోకమూ, ఈ జీవులూ, అందరూ ఎక్కణ్ణించి వచ్చారు. నిద్దరపోతున్న నీలోంచి వచ్చారనే చెప్పాలి.

ఇప్పుడు స్వప్నలోకంలో వున్న రాజుగా కాసేపు ఆలోచించు. ఆ రాజు అక్కడ కూర్చొని ఈ సృష్టి ఎట్లా వచ్చింది? – అని ఆలోచిస్తున్నాడు. ఆ ఆలోచన తెగక ముందే నీకు మెలుకువ వచ్చేసింది. నీకు ఆ స్వప్నలోకం, ఆ స్వప్నరాజు, స్వప్నరాజు ఆలోచనలు, అన్నీ గుర్తున్నాయి. ఒక వేళ ఏదో విచిత్రం జరిగి, ఆ స్వప్నరాజు బ్రతికి, నీ దగ్గరకు వచ్చి "అయ్యా! మా స్వప్నలోక సృష్టి ఎలా జరిగింది?" – అని నిన్ను అడిగాడనుకో, నువ్వేమి చెపుతావు?

ఏం చెప్పగలవు? "అంతా నా మనస్సులోనే జరిగిందయ్యా! అంతకంటే వేరే ఎక్కడా ఏ సృష్టీ జరగలేదు" అని నీవు చెబుతావు.

స్వప్నరాజు "నీ మనస్సు యొక్క పరిమాణం ఎంత?" అని అడుగుతాడు. అప్పుడు నువ్వేంచెప్పాలి? ఈ మహాసృష్టితో పోల్చి చూస్తే నీ మనస్సు యొక్క పరిమాణం అణుతుల్యం అని చెప్పక తప్పదు. ఆ మాటే చెబుతావు.

వెంటనే స్వప్నరాజు "అయ్యా! మా లోకం కోట్ల కోట్ల మైళ్ళు వుంది. అంతటి విశాలమైన ఆ లోకం అణుతుల్యమైన మీ మనస్సుయొక్క గర్భంలో వుందా? ఇదెక్కడి మాటండీ?" అని అడిగాడు.

నువ్వేం చెపుతావు? "ఓరి వెర్రివాడా! ఎన్ని కోట్లమైళ్ళున్నా, నీ ప్రపంచము, నువ్వూ, లేనివాళ్ళేనయ్యా! ఆ వైశాల్యమంతా నీ భ్రాంతి. నీ స్వప్నలోకపు కోట్ల కోట్ల సంవత్సరాల చరిత్రంతా భ్రాంతే. అదంతా నా

మనస్సులో నిమిషంలో జరిగింపోయింది. కనుక, నీ స్వప్నలోకంలో నువ్వు అనుభవించిన మూడు డైమన్షన్లూ అబద్ధమే. నాల్గవ డైమన్షన్ కాలమూ అబద్ధమే. అంటే, నీ స్వప్నలోకంలో నువ్వు చూసిన ప్రదేశమూ, నువ్వు అనుభవించిన కాలమూ – రెండూ లేనివే" అని చెప్పాల్సిందే నువ్వు.

ఆ స్వప్నరాజు ఒప్పుకొంటాడా? "మరీ అంత అన్యాయంగా మాట్లాడకండి. నా లోకంలోని దేశము, కాలము, రెండూ అబద్ధాలైతే నేనెట్లా వుంటానండి? నేను నా కళ్ళతో చూశాను– ఆ దేశాన్నీ, ఆ కాలాన్ని. మీకు నన్ను కలలో చూసిన గుర్తు వుందా, లేదా? మీరు స్వయంగా నన్ను చూసి కూడా నేనూ, మా లోకమూ మీకు గుర్తుండి కూడా, నువ్వూ లేవు, నీ లోకమూ లేదు పొమ్మంటారు – ఇదేం ధర్మమండీ?" అని ఆ స్వప్నరాజు మళ్ళీ నిగ్గదీశాడు.

అప్పుడు నువ్వు ఏం చెప్పాలి? "నిన్నూ, నీ లోకాన్నీ చూసిన మాట నిజమే. ఆ మాట నాకు గుర్తున్న మాట కూడా నిజమే. అయినా సరే నువ్వూ, నీ లోకమూ లేనివే. ఎందుకంటే, కోట్ల మైళ్ళ వైశాల్యం గల నీ లోకం, నా మనస్సనే అణువులోనే పుట్టి జీవించింది. కోట్ల సంవత్సరాల చరిత్ర గల నీ లోకం, నా మనస్సులో నిమిషంలో పుట్టి, జీవించి, లయించింది. మీ లోకంలోని ఒక అణువును తీసుకో, ఆ అణువులోకి చిన్న చిల్లి పెట్టు. ఆ చిల్లిలోంచి లోపలకు వేలుపెట్టు. " లోపల మైళ్ళ కొద్దీ వైశాల్యం గల గుహ వుంది" అని అనిపిస్తే, దాన్ని నువ్వు నమ్ముతావా? ఏదో పిచ్చి ఊహలే అని వదిలేస్తావా? ఆ ఊహ నీకు వచ్చినా సరే. అణువు యొక్క గర్భంలో మహా గుహ వుండటం అసాధ్యం. కనుక, ఆ ఊహే తప్పు – అని నిర్ణయం చేస్తావు కదా? అలాగే నేనూ చెపుతున్నాను. నా మనస్సనే అణువులో బ్రహ్మాండమైన నీ స్వప్నలోకం నాకే కనిపించింది. ఆ కనిపించినపుడు ఇది నా మనస్సనే అణువులో వుంది – అనే విషయం నాకు గుర్తు లేదు. అందువల్ల, ఆ లోకమంతా సత్యమే అని అప్పుడు నేనూ నమ్మాను. నువ్వు కూడా అట్లాగే నమ్మావు. నువ్వు ఇంకా నమ్ముతున్నావు. కానీ, నేను మాత్రం ఇప్పుడు – ఆ స్వప్నలోకమంతా నా మనస్సనే అణువులో జన్మించి, జీవించి, లయించింది – అని తెలుసుకొన్నాను. ఇలా తెలుసుకొన్నాను కనుక, ఇక నాకు దానిమీద సత్యత్వబుద్ధి లేదు. అంటే, అది సత్యమనే ఆలోచన లేదు. నీకు ఆ జ్ఞానం ఇంకా కలగలేదు కనుక, నీకు నీ లోకం సత్యమనే ఆలోచన పోవడం లేదు" అని, నువ్వు బోధిస్తావు.

ఇది విని, ఆ స్వప్నరాజు కొంచెం ఆలోచించి ఇలా అడుగుతాడు. "అయ్యా! మా లోకంలో కొండలు, నదులు, రాజ్యాలు, సముద్రాలు, నిప్పు, గాలి, ఆకాశము ఇవన్నీ వున్నాయండీ. ఇవన్నీ ఎక్కడ్నుంచి పుట్టాయంటారు? కోట్ల కొలది జీవులున్నారు. జంతువులున్నాయి, జడ పదార్థాలున్నాయి, అవన్నీ ఎక్కడి నుంచి పుట్టాయంటారు?"

దానికి నువ్విలా సమాధానం చెపుతావు. "స్వప్నరాజా! నీ లోకంలోని చేతన పదార్థాలూ, జడపదార్థాలూ, అన్నీ కూడా నేనే. నాలోంచే పుట్టాయి. నాలోనే కలిసిపోయాయి."

స్వప్నరాజు మళ్ళీ అడుగుతున్నాడు. "అయ్యా! మీరివన్నీ సృష్టి చేశారు కదా. ఈ సృష్టికి ముడిసరుకులు మీకు ఎక్కడ్నుంచీ వచ్చాయి?"

దానికి నువ్వేలా సమాధానం చెపుతావు? " ముడిసరుకూ లేదు, మన్నూ లేదు. ఉన్నది నా మనస్సొకటే . అదే స్వప్నలోక సృష్టంతా చేసేసింది. వేరే ఏ సహాయమూ లేదు."

స్వప్నరాజు మళ్ళీ అడుగుతున్నాడు. "అయ్యా! మీ మనస్సేమో చేతన స్వరూపంగా వుంది. దానిలోంచి నాలాంటి స్వప్నలోక చేతన జీవులు జన్మించారంటే కొంత నయం. మా లోకంలోని జడపదార్థాలు కూడా చేతనాత్మకమైన మీ మనస్సులోంచే పుట్టాయంటే నమ్మడమెలా?"

దానికి సమాధానం నువ్విలా చెబుతావు. " స్వప్నరాజా! నీ స్వప్నలోకం సత్యలోకమైతే, దాంట్లో చేతనాలెట్లా పుట్టాయి, జడాలెట్లా పుట్టాయి? – అని ఆలోచించవచ్చు. నా మనస్సనే అణుగర్భంలో కనిపించిన నీ బ్రహ్మాండమే బ్రహ్మాండమైన అబద్దం. అక్కడ కనిపించిన జడచేతనాలు రెండూ లేనివే. కనుక, అవి చేతనాత్మకమైన నా మనస్సులోంచి భ్రాంతిరూపంగా దర్శనం ఇవ్వటంలో ఇబ్బంది ఏమీ లేదు. భ్రాంతి అనేక విచిత్రాలు చెయ్యగలదు కదా!"

స్వప్నరాజు చాలా లోతుగా ఆలోచించి చివరికి ఇట్లా అంటున్నాడు– "అయ్యా! మీకు మెలకువ వచ్చాక మా లోకమంతా అసత్యమని మీకు తెలిసింది. మీకు మెలుకువ రాక మునుపు సంగతి ఆలోచించండి. ఆ సమయంలో మా లోకంలోని కోట్ల కొలది జీవుల పరిస్థితి ఏమిటి?".

అప్పుడు నువ్వు కొంచెం జాలిపడి ఇట్లా చెబుతావు– "స్వప్నరాజా! నిజం చెప్పక తప్పదు. మీ లోకంలో వుండే కోటానుకోట్ల జీవుల మనస్సులన్నీ కలిపితే, ఆ సమష్టి మనస్సే నేను. నిజానికి మీ సమష్టి మనస్సంతా కలిపినా సరే నాలో ఒక అంశమవుతుందేమో కానీ, పరిపూర్ణంగా నేను అని చెప్పేందుకు వీలు లేదు. మీ లోకంలోని సమష్టి మనస్సేకాదు, అక్కడి జడపదార్థం మొత్తం కలిపిన జడసమష్టిని కూడా నేనే. మీ చేతనసమష్టి, మీ జడసమష్టి, రెండు కలిపినా కూడా నాలో అంశ మాత్రమే. మీరంతా దాన్ని అనుభవించే సమయంలో కూడా అదంతా లేని పదార్థమే. నిజంగా వున్న పదార్థమైతే, అంతటి బ్రహ్మాండమైన లోకం నా మనస్సనే అణుగర్భంలోకి దూరి కూర్చోవటం సాధ్యం కాదు గదా! అయితే నీ దృష్టినుంచి చూసినప్పుడు, నేను నీ లోకానికి సృష్టి కర్తని, నీ లోకానికి పరిపాలకుడ్ని, నీ లోకం చివరికి లయించే లయస్థానం కూడా నేనే. నా దృష్టినుండి చూస్తే మాత్రం – నువ్వూ నేనే, నీ శత్రువూ నేనే; నీ ఆలోచనా నేనే, నీ శత్రువు యొక్క ఆలోచనా నేనే, నా పేరు A అనుకో, నీ పేరు B అనుకో, నీ శత్రువు పేరు C అప్పుడు నా దృష్టిలోA=B, A=C. ఈ రెండూ ఈక్వేషన్లూ నిజమైతే, B=C అని చెప్పితీరవలసిందే. కనుక, నా దృష్టిలో నీ లోకంలోని జీవులందరూ ఒక్కటే. నువ్వు కూడా ఈ విషయాన్ని అర్థం చేసుకోగలిగితే, నువ్వూ నా కంటే వేరుగా లేవు. నీ లోకం కూడా నాకంటే వేరుగా లేదు. నువ్వూ, నీ లోకంలోని జీవులు, నీ లోకం, ఈ మొత్తం కలిపి నేనే. నా కంటే భిన్నంగా మీకు అస్తిత్వం లేదు. ఉన్నట్లు కనిపిస్తోంది గదా అంటే, ఆ కనిపించడమే భ్రాంతి. నీ లోకంలో ఒక దేశం వున్నట్లు, ఒక కాలం వున్నట్లు, కొంత జడం వున్నట్టు, కొంత చేతనం వున్నట్టు – ఇలా భిన్న భిన్నంగా కనిపించడమే భ్రాంతి. సమ్యగ్ విచారణవల్ల నీకు ఈ భ్రాంతి తొలగిపోతే, నీలోకంలో దేశమూ లేదు, కాలమూ లేదు, జడమూ లేదు, జీవులూ లేరు. నీ లోకమే లేదు లేదంటే, నా కంటే భిన్నంగా లేదు. ఈ స్థితిని నువ్వు పొందడమే మోక్షం."

## 7. స్వప్నరాజుకు నువ్వు-నీకు హిరణ్యగర్భుడు

ఈ భోధలో తప్పేమైనా వుందా? ఎంత మాత్రమూ లేదని ఖాయంగా చెప్పుకోవచ్చు. ఇప్పుడు నువ్వు నీ స్వప్నరాజుని వదిలేసెయ్, నీ పైన సృష్టికర్తగా వున్న హిరణ్యగర్భుడ్ని గూర్చి ఆలోచించు. నీ స్వప్నలోకానికి నువ్వు ఎటువంటి వాడివో,నీ జాగ్రత్ లోకానికి నీ హిరణ్యగర్భుడు అటువంటి వాడు. ఆ హిరణ్యగర్భుడియొక్క మనస్సు అనే అణువుయొక్క గర్భంలో నీ ముల్లోకాలూ వున్నాయి, నీ పధ్నాలుగు లోకాలు వున్నాయి, నీ శతకోటి బ్రహ్మాండాలూ వున్నాయి, గెలాక్సీలు వున్నాయి. నువ్వు ఎన్నిరకాల లెక్కలు చెపుతావో అన్నీ వున్నాయి. దేంట్లో? హిరణ్యగర్భుడియొక్క మనస్సనే అణువుయొక్క గర్భంలో నీ స్వప్నరాజుకి నువ్వు చేసిన బోధనే నీకు

అన్వయించుకో. హిరణ్యగర్భుడి మనస్సనే అణువుయొక్క గర్భంలో వున్న ఈ బ్రహ్మాండంలో కనిపించే మూడు డైమన్షన్లు గల దేశానికి నిజమైన అస్తిత్వం వున్నదా? వుంది అంటే, నీ స్వప్నంలో కనిపించే దేశానికి కూడా అస్తిత్వం వుండాలి. నీ ప్రపంచంలో కనిపించే కాలానికి అస్తిత్వం వుందా. వుంది అంటే, నీ స్వప్నంలో కనిపించే కాలానికి కూడా అస్తిత్వం వుండాలి. అది సాధ్యం కాదు. కనుక, నీ లోకంలో నువ్వు ఇంత స్పష్టంగా అనుభవించే ఈ దేశము, ఈ కాలమూ లేనివే అని గుర్తించు. ఈ గుర్తింపు కలిగితే, నీ లోకంలో కనిపించే జీవులంతా ఆ హిరణ్యగర్భుడి యొక్క రూపాంతరాలే అవుతారు. అప్పుడు ఇందాక నువ్వు చెప్పినటువంటి, A= B, A= C, కనుక B= C, అనే సూత్రం ప్రకారం, నీ లోకంలో కనిపించే సమస్త జీవులూ ఒకటే. ఎవరికీ ఏ భేదమూ లేదు – అని తేలిపోతుంది. మరి ఇది నిత్యానుభవంలో లేదే అంటే – నీ లోకంలో దేశమూ, కాలము అనేవి సత్యంగా వున్నాయని భావిస్తున్నావు కనుక, దాన్ని బట్టి నువ్వు వేరు, నీ పక్కవాడు వేరు – అని అనుకుంటున్నావు. ఆ భావనే తప్పు. అది భ్రాంతి. దాన్ని తొలగించుకొంటే, నీలో భేదభావనకు చోటే లేదు. ఆ స్థితే మోక్షస్థితి.

ఇక పోతే హిరణ్యగర్భుడిలోంచి ఈ సృష్టి ఎలా వచ్చింది? – అనే ప్రశ్న ఒకటి మిగిలి వుంది. నీ లోంచి స్వప్నలోకం ఎలా వచ్చింది? స్వప్నానికి ముందు నువ్వు నిర్వికారంగానే వున్నావు. అలా వుండగా వెనుకటి సంఘటనలయొక్క సంస్కారమేదో నీలో ప్రవేశించి, నీలో ఒక విధమైన మార్పును తెచ్చింది. తక్షణమే బ్రహ్మాండమైన స్వప్నలోక సృష్టి జరిగింది. కాగా, ఈ స్వప్నలోక సృష్టికి కారణం ఎవరంటే, స్వచ్ఛమైన నువ్వు + వెనుకటి సంస్కారం. ఈ ప్లస్ ఏమిటి? ఇదే మాయ. ఇది ఎవరిని ఆశ్రయించి వుంది? ఎవరిని ఆవరించింది? స్వప్నలోకజీవి అనేవాడు ఒకడు లేకపోతే, ఈ మాయకు అస్తిత్వమే లేదని చెప్పవలసి వస్తుంది. ఉన్నాడంటే వాడు సత్యస్వరూపుడవైన నీ కంటే భిన్నంగా వుండటానికి వీలు లేదు. ఈ మాట ఇప్పటికే రెండు సార్లు నిరూపణ అయింది. కనుక, స్వచ్ఛస్వరూపుడవైన నీకంటే భిన్నమైన అస్తిత్వం లేని స్వప్నజీవుని ఈ మాయ ఆశ్రయించుకొని వున్నది – అని చెప్పాలి.

మాయకంటే ముందే నువ్వు వున్నావు. మాయ పోయాక నువ్వు వున్నావు. కనుక, మాయ నిన్ను పూర్తిగా అవరించగలదు అంటే కుదరదు. కానీ, నీ కంటే అభిన్నుడైన స్వప్నజీవిని అశ్రయించుకొని ఈ మాయ జీవిస్తోంది కనుక, ఈ మాయ నిన్నే ఆశ్రయించికొని వున్నదని చెప్పినా తప్పు లేదు. అంటే, ఈ మాయ ఒక విధంగా నిన్ను ఆశ్రయించుకొని లేదు. ఒక విధంగా నిన్నే ఆశ్రయించుకొని వుంది. ఇది ఏలా కుదురుతుందంటే, అసలు మాయనేదే లేదు కనుకనే ఇది కుదురుతుంది.

మాయ లేనిదైతే ఇంత చర్చ ఎందుకండీ? – అంటే, దీనికి వేదాంతపరమైన సాంకేతిక పదాలతో చాలా చర్చ వుంది. మనకు విషయం అవగాహన కావటం ముఖ్యం కనుక, చర్చను మరో రకంగా చేద్దాం.

ప్లస్ గురించి చెప్పుకొన్నాం కదా. ప్లస్ అనేది సత్యవస్తువా? భావనామాత్ర వస్తువా? అది కేవలం భ్రాంతిభావన అనేటట్లయితే, లోకంలో గణితశాస్త్రమే లేకుండా పోతుంది. లోకవ్యవహారమే లేకుండా పోతుంది. అది సర్వాత్మనా సత్యవస్తువు అనేటట్లయితే, ప్లస్ అనే ప్రయోగం చేసినప్పుడల్లా, సంబంధిత పదార్థాల్లో మార్పు కనిపించవలసి వస్తుంది. ఇది అసంభవం. కనుక, ప్లస్ అనేది సత్యపదార్థమనీ చెప్పలేము. అసత్య పదార్థమనీ చెప్పలేము. మాయ కూడా ఇటువంటిదే.

లోకంలో "ఇది నిజమైతే నిజం కావాలి. లేకపోతే అబద్ధం కావాలి" అని మామూలుగా వ్యవహారం వుంది. అలాంటి వ్యవహారం ఈ ప్లస్, భ్రాంతి, మాయ ఇలాంటివాటి విషయంలో పని చెయ్యదు. అందువల్ల ఈ జాతివాటికి ఒక కొత్త పేరుపెట్టారు– మిధ్య అని. మిధ్య అంటే సత్యమూ కాదు. అసత్యమూ కాదు.సత్తూ కాదు. అస్తమా కాదు. అస్తి కాదు, నాస్తి కాదు. సంస్కృతంలో చెప్పాలంటే **"సద సద్విలక్షణం"**.

ఇట్టి ఈ మాయవల్ల పరిశుద్ధుడవైన నీకు వెనుకటి సంస్కారంతో సంపర్క మేర్పడగా, వున్నట్టుండి స్వప్నలోకం పుట్టింది. అలాగే పరిశుద్ధమైన సత్పదార్థానికి మాయవల్ల సంకల్పం ఏర్పడగా, హిరణ్యగర్భుడనే ప్రథమజీవుడు ఏర్పడి అతని ద్వారా ఈ ప్రపంచ సృష్టి జరిగింది. నీ స్వప్నజీవికి నువ్వు ఎటువంటి వాడివో, నీకూ, నీ లోకజీవులకు, హిరణ్యగర్భుడటువంటివాడు. నీ స్వప్నజీవి నీకంటే భిన్నుడు ఎలా కాదో, అలాగే నువ్వూ, నీలోక జీవులు, హిరణ్యగర్భుడి కంటే భిన్నులు కారు. ఈ అభేదాన్ని తెలుసుకోవటమే నీ స్వప్న జీవికి మోక్షం. నీకూ అదే మోక్షం.

నీ స్వప్నజీవికి మోక్షం లేకపోవడానికి కారణం ఏమిటంటే, భేదదర్శనం. దానికి కారణమేమిటంటే, తన స్వప్నలోకంలో దేశము, కాలము, సత్యంగా వున్నాయనుకోవటం. అలాగే నీకు మోక్షం లేకపోవటానికి కారణం ఏమిటంటే, నీ జాగ్రత్ప్రపంచంలో దేశము, కాలము, అనేవి సత్యంగా వున్నాయనుకోవడమే.

కనుక, రామా! నీ కళ్ళకూ, మనస్సుకూ, కనిపించే ఈ దేశ కాలాల మీద సత్యత్వబుద్ధిని వదిలిపెట్టు. అది పోతే ఈ ప్రపంచం ఎలా పుట్టింది? అనే ప్రశ్న పోతుంది.

**ఆకాశ ఏవ పరమే ప్రథమః ప్రజేశో**
**నిత్యం స్వయం కచతి శూన్యతయా సమో యః।**
**సహ్యాతివాహికవపు ర్నతు భూతరూపీ**
**పృథ్వ్యాది తేన న సదస్తి యథా న జాతమ్॥** (ఉ.ప్ర.స.13, చివరి శ్లోకం)

ఆ పరబ్రహ్మలోనే హిరణ్యగర్భుడు జన్మించాడు. ఎలా జన్మించాడు? శూన్యాకారంగా జన్మించాడు. సర్వసముడైన పరమాత్మ శూన్యరూపియైన హిరణ్యగర్భరూపంగా ప్రకాశిస్తున్నాడు. ఎందుకంటే, ఆ హిరణ్యగర్భుడనేవాడు ఆతివాహిక శరీరుడు. అంటే మనోమయ శరీరుడు. అంతే గానీ అతనికి నిజమైన భౌతిక శరీరం లేదు. అట్టి శూన్యరూపియైన హిరణ్యగర్భుడివల్ల సంకల్పమాత్ర రూపంగా ఆకాశాది పంచభూతాలు పుట్టాయి. కనుక, ఈ పంచభూతాలు కానీ, వాటివల్ల కలిగే భౌతికలోకాలు కానీ, సద్వస్తువులు కావు. సత్యవస్తువులు కావు. అందుకే అవి పుట్టలేదు. కుందేటి కొమ్ము పుట్టనట్టే అవీ పుట్టలేదు – అని ఇప్పటి దాకా నేను నీకు వివరించాను. అని వశిష్ఠ మహర్షి ఈ 13 వ సర్గను పూర్తి చేశాడు.

మనం ఒకటో సర్గనుంచి 13వ సర్గకు దూకి మాట్లాడుతున్నాం. ఒకటో సర్గలో అయన మాయసంబంధంవల్ల హిరణ్యగర్భుడు జన్మించాడనీ, ఆయన ఈ ప్రపంచసృష్టి చేస్తున్నాడనీ, చెప్పాడు. ఇలా చెప్పడంలో గల అసలైన ఉద్దేశ్యాన్నీ, ఉపపత్తినీ, 13 వ సర్గలో లింకు చేశాడు.

మొదటి సర్గలో సత్పదార్థానికి పేర్లు, మాయకు పేర్లు, చెప్పి దృశ్యమనేది ద్రష్టలోనే వుంది అన్నాడు. దాని వివరణ కూడా 13వ సర్గలో వచ్చింది. అందుకనే మధ్య సర్గలను వదలిపెట్టి, ఈ 13వ సర్గను మనం ప్రస్తావించుకొంటున్నాం.

ఇక మధ్య సర్గల్లో, అనగా 2వ సర్గనుంచి 12వ సర్గదాకా,ఈ విషయాలనే ఆయన విభిన్నకోణాలనుంచి చర్చ చేశాడు.

రెండవ సర్గలో ఆయన "ఆకాశజోపాఖ్యానము" అనే పేరుతో ఒక చిన్న కథ చెప్పాడు.

### 8. ఆకాశజోపాఖ్యానము

పూర్వం ఆకాశజుడు అనే బ్రాహ్మడు వుండేవాడు. ఆకాశజుడు అంటే ఆకాశంనుంచీ పుట్టినవాడు. అంటే, సాక్షాత్తూ పరమాత్మనుంచి పుట్టినవాడు, హిరణ్యగర్భుడు అని ఒక అర్థం. ఆకాశంనుంచీ పుట్టాడు అంటే అసలు పుట్టనివాడు అని మరో అర్థం.

ఈ బ్రాహ్మడు ధార్మికుడు, తపస్వి. అందుచేత ఎన్నాళ్ళికీ చావడం లేదు. సత్యలోకంలో మకాం పెట్టుకొని కూర్చున్నాడు. అది చూసి మృత్యుదేవతకి చాలా అసూయ కలిగింది. "ఒరే ఒరే! ఎంతెంత వాళ్ళనో మింగేస్తున్నాను. ఈ బక్క బ్రాహ్మణుడ్ణి మింగలేక పోతున్నాను. ఇదేం కర్మం రా! దీని విషయమేదో తేల్చుకొందాం" అని ఆలోచించి సరాసరి సత్యలోకానికి బయలుదేరాడు.

సాధారణంగా మృత్యువుకి సత్యలోకంలో ప్రవేశం వుండదు. మృత్యువు ఆ లోకంలో ప్రవేశించకుండా చుట్టూతా ఒక అగ్నిప్రాకారం ఏర్పాటై వుంటుంది. మృత్యువు ఈ రోజు పట్టుబట్టి ఆ లోకం దగ్గరకు వెళ్ళే సరికి, ఆ అగ్ని ప్రాకారంలోని అగ్ని జ్వాలలు మృత్యుదేవతను పట్టి దహించసాగాయి. అయినా సరే, అతను పట్టుదలగా పెనుగులాడి, ఎలా గోలా ఆ ప్రాకారం దాటి, సత్యలోకంలోకి ప్రవేశించాడు.

అక్కడ ఆకాశజుడు కనిపించాడు. వెంటనే మృత్యుదేవత వంద చేతులు సృష్టించుకొని, వంద చేతులతోనూ ఆకాశజుడ్ణి పట్టి గుంజాడు. చిత్రమేమిటో, ఆ బ్రాహ్మణుడు కనిపిస్తూనే వున్నాడు. ఆయనేమీ పెనుగులాడటం లేదు, పారిపోవటం లేదు. అయినా సరే, మృత్యుదేవత ఆయన్ను అంటుకోను కూడా అంటుకోలేకపోతున్నాడు. దాంతో భయం వేసి, మృత్యుదేవత పారిపోయి, సరాసరి యముడి దగ్గరకు వచ్చాడు. వచ్చి"యమధర్మరాజా! నేనా ఆకాశజ బ్రాహ్మణుడ్ణి మింగలేకపోవటానికి కారణం ఏమిటి?" – అని అడిగాడు.

యముడు ఇలా చెప్పాడు– "మృత్యుదేవా! నీవు చాలా సమర్థుడివే. కానీ, నువ్వు ఏ పనీ వంటరిగా చెయ్యలేవు. నువ్వు ఎవరిని మింగాలనుకుంటున్నావో, ఆ జీవుల కర్మలు నీకు సహాయం చెయ్యాలి. చేస్తేనే నువ్వు ఆ జీవిని మింగగలవు. లేకపోతే నీవల్ల ఏమీ కాదు. నువ్వు ఆకాశజుడి విషయంలో ఒక పొరపాటు చేశావు. వాడి కర్మలేమిటో వెతకలేదు. ఇప్పుడు వెతుకు. వాటి సహాయం తీసుకో, వాడ్ణి మింగు."

మృత్యుదేవత నాలిక కరుచుకొని " అరెరే! తెలిసి తెలిసి పొరపాటు చేశానే!"
అనుకొని, ఈ ఆకాశజుడు ఆచరించిన కర్మలు ఏమున్నాయో వెతుకుదామని బయలుదేరాడు. భూలోకమంతా తిరిగాడు, మిగిలిన లోకాలూ తిరిగాడు. ఎక్కడా ఈ ఆకాశజుడు చేశాడనే కర్మ కనిపించలేదు. చివరికి కాళ్ళు పీక్కుపోయి, మళ్ళీ యమధర్మరాజు దగ్గరకు చేరి " దేవా! వాడు తన కర్మలు ఎంత రహస్యంగా చేశాడో గానీ, ఎంత వెతికినా ఒక్కటి కూడా కనిపించలేదు. తమరే చెప్పాలి" – అని అడిగాడు.

యమధర్మరాజు వీడికి సమాధానం చెపుదామా, వద్దా, అని చాలాసేపు ఆలోచించి, చివరకి కనికరించి, ఇలా అన్నాడు –"మృత్యుదేవా! ఈ ఆకాశజుడు సాక్షాత్తుగా పరమాత్మ నుంచి పుట్టాడయ్యా! పరమాత్మే నిజమైన ఆకాశం. ఆకాశం నుంచి పుట్టినవాడు ఆకాశమే అవుతాడు గదా! ఆకాశానికి కర్మలుంటాయా? గొడ్రాలి బిడ్డకి కర్మలుంటాయా? ఆకాశంలో చెట్టు పుడుతుందా? కనుక వీడికి ఏ రకమైన కర్మ సంబంధమూ లేదు.

"మరి హిరణ్యగర్భ శరీరంకంటే భిన్నమైన వీడికి వేరే శరీరం కనిపిస్తోంది గదా, అంటావేమో. అది వేరే శరీరమనే బుద్ధి మనకు వుంది గానీ, వాడికి లేదు. వీడు పూర్వమూ కర్మలు చెయ్యలేదు. ఇప్పుడూ కర్మలు చెయ్యటం లేదు. ఎందుకంటే వాడికి సంకల్పమే లేదు. వాడు పుట్టాను అనుకోవడం లేదు. కనుకనే, మరణిస్తాననే ఊహ కూడా వాడికి లేదు. వాడు ఎప్పుడైనా, ఒక్క సారైనా, ఒక క్షణమైనా, మరణాన్ని గూర్చి సంకల్పం చేసి వున్నట్లైతే, వాడు ఎప్పుడో ఒకప్పటికి నీ నోట్లో పడి వుండేవాడు. వాడికి అలాంటి సంకల్పమే లేదు. వాడి శరీరమూ, వాడి ప్రాణధారణ, మొదలైనవన్నీ మన దృష్టిలో వున్నాయి. తప్పితే, వాడి దృష్టిలో లేనే లేవు. అందుచేత, వాడి స్వరూపం అచ్చమైన ఆకాశం. ఎంత బలవంతుడైతే మాత్రం ఆకాశాన్ని తాళ్లతో కట్టగలడా? అసాధ్యం. అందుకే నువ్వు ఆ ఆకాశజుడ్ణి పట్టుకోలేవు. ఆ ప్రయత్నం మానుకో."

యమధర్మరాజు సమాధానం వినేసరికి, మృత్యుదేవతకు కొత్త సందేహం వచ్చి ఇలా అడిగాడు– "స్వామీ! ఆకాశమేమో శూన్యాకారమాయె, నిరాకారమాయె. దాన్నుంచి సాకారమైన ఆకాశజుడు ఎలా పుట్టాడు?

ఇది అడిగేసరికి, మరో ప్రశ్న తోస్తోంది. నిరాకారంనుంచి సాకారమైన పంచభూతాలు ఎలా పుట్టాయి? అలా పుట్టడం అసంభవమనిపిస్తోంది. మరి కనిపిస్తున్నాయి కదా. ఈ పంచభూతాలు నిజంగా వున్నాయా, లేవా, తేల్చి చెప్పండి?" –అని.

యమధర్మరాజు చెపుతున్నాడు–

**"న కదాచన జాతోఽసౌ న చ నాస్తి కదాచన।**

**ద్విజఃకేవలవిజ్ఞాన భామాత్రం తత్తథా స్థితః॥** (ఉ.ప్ర.స.2, శ్లో.35)

"మృత్యుదేవా! ఈ ఆకాశజుడు అంటే ఏమనుకొంటున్నావు? హిరణ్యగర్భుడేనయ్యా. ఈయన ఎప్పుడూ పుట్టలేదు. అయినా ఎప్పుడూ లేకుండా పోలేదు. ఎందుకంటే, ఆయన విజ్ఞానమాత్రస్వరూపుడు. అందువల్ల ఎల్లప్పుడూ వున్నాడు. అలాగే వుంటాడు.

"ప్రళయమైపోయి అంతా లీనమైపోయి వున్న దశలో, ఆ లీనమైపోయి వున్న జీవులయొక్క అవిద్య అంతా కలసి, నిర్వికారమైన పరబ్రహ్మలో ఒక పెద్ద కొండంత తేజస్సు కనిపించే లాగా చేసింది.

"నిర్వికార పరబ్రహ్మలో వెలిగిన ఆ తేజస్సును చూసి , అది ఒక ఆకారమని మనబోటి జీవులు భ్రమించారు. ఆ భ్రమలో దానికి హిరణ్యగర్భుడనీ, ఆకాశజుడనీ, బ్రహ్మ అనీ, చతుర్ముఖుడనీ, విరాట్టు అనీ, ఇలాంటి పేర్లు పెట్టారు.

"నిజానికి అక్కడ ఆకారమనేది లేనే లేదు. వున్నదనే భ్రాంతి వీరికి కలగడానికి కారణం లీనస్థితిలో వున్న పూర్వ సృష్టిజీవుల అవిద్యలే. ఆ అవిద్యలవల్ల ఒక చిత్తవృత్తి, లేదా ఒక వికారం, కలిగిందే అది కూడా అణిగిపోతే ఈ హిరణ్యగర్భుడికి ఈ ప్రాతిభాసికరూపం కూడా వుండదు. ఇలాంటి వాడికి కర్మలతో సంబంధం వుంటుందా? చిత్తవృత్తులతో సంబంధం వుంటుందా? పంచభూతాలతో సంబంధం వుంటుందా? సంబంధమే లేనివాడిలోంచి పృథివ్యాది పంచభూతాలు ఎలా జన్మిస్తాయి?

"కనుక, ఓ మృత్యుదేవతా! నువ్వు ఆలోచించింది నిజం. ఈ పంచభూతాలనేవి నిజంగా వున్నవి కావు. ఆ హిరణ్యగర్భుడు, ఆదే ఆకాశజుడు, దేంతోనూ సంబంధం వున్నవాడు కాదు. అందుకే నీకు ఆయన్ని పట్టుకోవడం సాధ్యం కాదు. ఆ ప్రయత్నం వదులుకో."

యమధర్మరాజు ఇలా చెప్పేసరికి మృత్యుదేవత ఆలోచించి, సంతోషపడి, తన దోవన తాను వెళ్ళిపోయాడు.

ఈ కథ ఎందుకు చెప్పినట్టు? ఈ జగత్తే లేనిదనీ, అందువల్ల దీనికి జన్మ అసలే లేదని చెప్పటం ఒక ఉద్దేశం. లేనిదయితే వున్నట్టెలా కనిపిస్తోంది? పుట్టుక లేనిదైతే, పుట్టుక కలది లాగా ఎందుకు కనిపిస్తోంది? అనే ప్రశ్నలకు సమాధానం చెప్పాలనేది రెండవ ఉద్దేశ్యం. పూర్వసృష్టిలోని జీవులయొక్క అవిద్యాబలంవల్లే ఈ భ్రాంతి సంభవిస్తోందని ఈ కథ ద్వారా వశిష్టమహర్షి సమాధానం చెపుతున్నారు.

అయితే, ఏ రూపమూ లేని ఆ నిర్వికార బ్రహ్మలోంచి ఈ జగద్రూపం ఎలా వచ్చింది? అనే శంక మిగిలిపోతుంది. దానికి వశిష్టమహర్షి కళాత్మకమైన సమాధానం చెపుతున్నాడు.

**యథాచిత్ర కృదంతస్థా నిర్దేహా భాతి పుత్రికా।**

**తథైవ భాసతే బ్రహ్మ చిదాకాశాచ్ఛ రంజనమ్॥**(ఉ.ప్ర.స.2, శ్లో.55)

(చిదాకాశ– అచ్ఛ– రంజనమ్॥)

ఓ చిత్రకారుడు బొమ్మ వేస్తున్నాడు. ఎలా వేస్తున్నాడు? వాడి వనస్సులో ముందు ఒక ఆకారం ఏర్పడుతోంది. ఆ మనస్సులోని ఆకారానికి శరీరం వుందా? శరీరంలేని ఆ ఆకారం లోంచి గోడమీద గీతల శరీరంతో ఒక బొమ్మ జన్మిస్తోంది.కనుక, శరీరం లేని రూపం లోంచి శరీరం గల రూపం వస్తోంది. అలాగే, చిదాకాశానికి ఒక అచ్ఛరంజనం – స్వచ్ఛమైన ప్రతిబింబాన్ని గ్రహించగల శక్తి, అనగా అలాంటి సంకల్పం

– ఏర్పడుతోంది. అదే హిరణ్యగర్భ శరీరంగా రూపొందుతోంది. వివర్తరూపంగా ఈ రూపం ఏర్పడుతోంది – అని వశిష్ఠమహర్షి రెండో సర్గను ముగించాడు.

వేదాంతశాస్త్రంలో పెద్ద చిక్కేమిటంటే ఏ విషయాన్ని ప్రతిపాదించబోయినా, ప్రతిపాదించే ప్రక్రియ కొత్త సందేహాలను ఎగదోస్తూ వుంటుంది. వశిష్ఠమహర్షి అంతటివాడు చెప్పినా ఈ చిక్కు తప్పదు. అందుకే రాముడు ఈ కథ విని ఒక కొత్త సందేహం లేవదీశాడు.

## 9. జాగ్రత్ ప్రపంచం గూడా మనోరాజ్యమే

**రాముడు:** వశిష్ఠమహర్షీ! మీరు హిరణ్యగర్భుడికి పాంచభౌతిక దేహం లేదని, కేవలం మనోమయ దేహం వుందని, చెప్పారు. మనస్సు అంటే సంకల్పాలే కదా! పూర్వవాసనలే కదా! అలాంటప్పుడు ఈ హిరణ్యగర్భుడికి పూర్వకర్మలేవీ లేవనీ, అందువల్లే ప్రస్తుత కర్మలు కూడా లేవని, అందువల్లే మృత్యుదేవత ఆయన్ని పట్టుకోలేక పోయిందనీ, ఎలా చెప్పారు?

**వశిష్ఠుడు:** రామా! ఇక్కడ రెండు రకాల దృష్టికోణాలున్నాయి. మామూలు అజ్ఞజనుల దృష్టికోణం ఒకటి. వారి దృష్టిలో హిరణ్యగర్భుడనేది ఒక పదవి. ఒకానొక పుణ్యజీవి చేసుకున్న పుణ్యాలకు ఫలితంగా ఈ పదవి వస్తుంది. నీ ప్రశ్న కూడా ఈ దృష్టికోణానికి చేరిందే.

దీనికి భిన్నంగా ఆ హిరణ్యగర్భుడి దృష్టికోణం ఒకటుంది. ఆ దృష్టి తత్త్వజ్ఞాన పరిపూతమైనది. ఆ దృష్టిలో ప్రపంచానికి ఎంత మాత్రమూ ఉనికి లేనే లేదు. అందుచేత ఆయన దృష్టిలో ఈ కనిపించే జగత్తూ, దాని వెంట వచ్చే సంస్కారాలు, వాసనలు, సంకల్పాలు, మనస్సు, ఇటువంటివన్నీ కూడా కాలిన గుడ్డల వంటివి. దీనినే 'దగ్ధ పటన్యాయము' అంటూ వుంటారు.

దగ్ధపటన్యాయము అంటే ఏమిటంటే – పెద్ద మంటలో పెద్ద చీర పడేశామనుకోండి. చీర కాలిపోయినా అ బూడిద చీర మడతల ఆకారంలో అలాగే వుంటుంది. అది చీర లాగా కనిపిస్తుంది. కానీ, చీర కాదు. బూడిదే. దూరం నుంచి చూసే చిన్నపిల్లలు, అది చీరే అని భ్రమపడుతూ వుంటారు. అనుభవం గల పెద్దలకు మాత్రం అది బూడిద గానే కనిపిస్తూ వుంటుంది. అదే **దగ్ధపటన్యాయము** (దగ్ధ పటం= కాలిన వస్త్రము).

హిరణ్యగర్భుడి దృష్టిలో తనయొక్క మనోమయ శరీరం కూడా దగ్ధపటం వంటిదే. కనుక, ఆయన దృష్టిలో దానికి అస్తిత్వం లేదు. నేను నీకు బోధించింది ఈ దృష్టే.

ఏ విషయాన్నైనా, ఏ దృష్టితో మాట్లాడుతున్నామో ఆ దృష్టితోనే పరిశీలించాలి గానీ, చెప్పేవాడిది ఒక దృష్టి, వినేవాడిది ఒక దృష్టిగా వుండకూడదు. అజ్ఞానదృష్టి. జ్ఞానదృష్టి అని రెండు రకాల దృష్టులుంటే, వాటిలో జ్ఞానదృష్టే ప్రశస్తమైనది కనుక, నేను ఆ దృష్టితోనే నీకు బోధించాను.

**రాముడు:** గురుదేవా! హిరణ్యగర్భుడంటే ప్రథమజీవి కదా! ఈ సృష్టిలో మిగిలిన జీవులందరికీ స్థూలదేహం ఒకటి సూక్ష్మదేహం ఒకటి, అని రెండు రకాల దేహాలుండగా, ఈ హిరణ్యగర్భుడికి మాత్రం ఒక్క సూక్ష్మదేహం మాత్రమే వుండటానికి కారణం ఏమిటి?

**వశిష్ఠుడు:** రామా! ఈ సృష్టిలోని జీవులన్నీ ఎలా జన్మిస్తున్నాయి? అవిద్యవల్ల జన్మిస్తున్నాయి. అవిద్య పంచీకృత పంచమహాభూతాలను సృష్టి చేస్తోంది. కనుక, అవిద్యవల్ల పుట్టిన జీవులందరికీ పాంచభౌతిక శరీరం ఒకటి, సూక్ష్మ శరీరం ఒకటి, అని రెండు వుంటున్నాయి. హిరణ్యగర్భుడియొక్క జన్మకు ఆయన అవిద్య కారణం కాదు. వెనుకటి సృష్టిజీవుల సమష్టి అవిద్య కారణం. అందువల్ల, ఆయనకు అవిద్యా జన్యమైన పాంచభౌతికశరీరం లేదు. సూక్ష్మమైన మనోమయ శరీరం మాత్రమే వుంది. దీనినే 'ఆతివాహిక శరీరం' అని కూడా అంటూ వుంటారు.

నీ స్వప్నలోకంలో వుండే పంచభూతాలు నీ యొక్క ఉత్పత్తికి కారణం కాలేవు. నీ స్వప్నంలోకంలో వుండే పంచభూతాలు నీకు శరీరాన్ని కల్పించలేవు. ఎందుకంటే, ఆ స్వప్నలోక పంచభూతాలన్నింటికీ మూలమైనవాడివి నువ్వే. అలాగే, ఈ జాగ్రత్ ప్రపంచంలోని పంచభూతాలకు హిరణ్యగర్భుడు మూలం. కనుక, ఈ పంచభూతాలు ఆయనకు శరీరాన్ని కల్పించలేవు. అందువల్లే ఆయన మనోమాత్ర శరీరుడు అని చెప్పాం.

ఇంతకూ, హిరణ్యగర్భుడియొక్క ఉత్పత్తిని గూర్చి ఎందుకు చెప్పాం? నీ స్వప్న ప్రపంచమంతా ఎలాగైతే నీయొక్క మనోరాజ్యంలో వుందో, అలాగే ఈ జాగ్రత్ప్రపంచమంతా కూడా నీ మనోరాజ్యంలోనే వుంది – అని చెప్పడం కోసమే చెప్పాం.

ఈ చివరి వాక్యం శ్రీరాముణ్ణి కొంచెం ఆలోచనలో పడేసింది. మొదట్లో ఈ జాగ్రత్ప్రపంచమంతా హిరణ్యగర్భుడి స్వప్నమని చెప్పారు. ఇప్పుడేమో ఇది నీ మనోరాజ్యమే అంటున్నారు. ఇదొక చిక్కు. హిరణ్యగర్భుడి యొక్క జన్మకు ఆయన అవిద్య కారణం కాదన్నారు. వెనుకటి సృష్టిలోని జీవుల సమష్టి అవిద్యే దానికి కారణం అన్నారు. అంటే, హిరణ్యగర్భుడియొక్క మనోమయ శరీరం ఏదైతే వుందో, అది ఆ జీవుల అవిద్యలోంచి పుట్టిందై వుండాలి. ఆ జీవుల్లో కొందరు ఇప్పుడు జన్మించి వుండాలి. కనుక, వీరి అవిద్య కూడా హిరణ్యగర్భుడియొక్క మనోమయ శరీర నిర్మాణానికి కారణమే అయి వుండాలి. ప్రస్తుతం ఇక్కడ వున్న జీవులయొక్క మనస్సులన్నీ వీళ్ళ అవిద్యవల్ల ఏర్పడినవే. కనుక, ఇప్పటి ఈ జీవుల మనస్సులన్నీ కలసి, సమష్టి మనస్సుగా చేస్తే, అది హిరణ్యగర్భుడి యొక్క శరీరం అయ్యే అవకాశం కనిపిస్తోంది. ఇది నిజమైతే, ఇప్పుడు, హిరణ్యగర్భుడియొక్క మనోరాజ్యంలో, తనయొక్క మనోరాజ్యం ఒక అంశ అవుతుంది. అంతే గానీ, అదే ఇది అనటం కుదరదు. అయినా వశిష్ఠమహర్షి ఈ జాగ్రత్ప్రపంచమంతా నీ మనోరాజ్యమే అంటున్నారు. కనుక, మనస్సంటే ఆయన ఉద్దేశ్యం ఏమై వుంటుది? ఆయన్నే అడిగి చూద్దాం– అని, శ్రీరాముడు సూటిగానే అడిగేశాడు. **"భగవన్! మనసో రూపం కీదృశం వద మే స్ఫుటం"** (ఉ.ప్ర.స.4, శ్లో.37) (భగవన్! – మనస్సుయొక్క స్వరూపం ఏమిటి? నాకు స్పష్టంగా చెప్పండి.) అని అడిగాడు. ఈ ప్రశ్నతోనే 4వ సర్గ ప్రారంభమైంది.

## 10. మనస్సుయొక్క స్వరూపం

వశిష్ఠమహర్షి విచిత్రమైన సమాధానం చెప్పాడు.

***వశిష్ఠుడు:***

**రామాస్య మనసో రూపం న కించిదపి దృశ్యతే।**
**నామమాత్రా దృతే వ్యోమ్నో యథా శూన్య జడాకృతేః॥** (ఉ.ప్ర.స.4, శ్లో.38)

రామా! ఆకాశం అనేది వుందా, లేదా? వుంది. వుంటే దానికి రూపం ఏమిటి? దానికి పేరే గానీ, రూపం వుండదు. ఈ మనస్సు కూడా అలాంటిదే. ఇది కూడా ఆకాశం లాగానే జడం. పేరే తప్ప ఆకారం శూన్యం. రామా!

**సంకల్పనం మనో విద్ధి సంకల్పాత్తన్న భిద్యతే।**
**యథా ద్రవత్వాత్ సలిలం తథా స్పందో యథా నిలాత్॥** (ఉ.ప్ర.స.4, శ్లో.43)

సంకల్పమే మనస్సు. సంకల్పంవల్లే మనస్సు జన్మిస్తుంది. రెండు రకాల మాటలు మాట్లాడుతున్నాను అనుకోకు. ద్రవత్వమే నీరు. వాయువే స్పందము. అయినా సరే, లోకంలో ద్రవత్వంలోంచి జలం వచ్చిందనీ,

వాయువులోంచి స్పందం వచ్చిందనీ, అంటూ వుంటారు. మట్టే కుండ. అంతకన్నా వేరే ఏమీ లేదు. అయినా సరే, మట్టిముద్దలోంచి కుండ వచ్చింది అంటూ వుంటారు. ఇలాగే నేను "సంకల్పమే మనసు, సంకల్పంనుంచే మనస్సు పుట్టింది" అంటున్నాను.

రామా! నువ్వీ ప్రశ్న ఎందుకు అడిగావో నాకు తెలుసు. హిరణ్యగర్భుడి శరీరంయొక్క స్వరూపం ఏమిటా అని నువ్వు ఆలోచిస్తున్నావు. అది మనస్సే. హిరణ్యగర్భుడి శరీరం సమష్టి మనస్సు కనుక, దానిలో నీ మనస్సు ఒక అంశ మాత్రమే కదా అని నువ్వు ఆలోచిస్తున్నావు.

నీ స్వప్నలోకంలో కనిపించిన విభిన్న వస్తువులకు ఒక తాత్కాలికమైన ఉనికి వుంది కదా! ఆ ఉనికి ఎక్కడ్నుంచి వచ్చింది? నీ మనస్సుకు వున్న ఆ ఉనికియే నీ స్వప్నరాజ్యంలోని ప్రతి వస్తువుకీ సంక్రమించింది. అంతకు మించి ఆ వస్తువులలో స్వతంత్రమైన ఉనికి ఆవగింజంత కూడా లేదు. నీ మనస్సు యొక్క సత్తయే నీ స్వప్నలోకంలోని ప్రతి వస్తువులోనూ వ్యాపించి వుండగా, అక్కడ వేరు వేరు సత్తలుగా కనిపిస్తున్న సత్త అంతా, ఒకే సత్తయే గానీ, సత్తలోని అంశలు కావు. సత్తలో అంశాలుండవు గదా! స్వప్నలోకంలో వున్న తరంగపు సత్త వేరు, సముద్రపు సత్త వేరు అనుకోవటం నీ భ్రాంతే గానీ, ఆ రెండింటిలోనూ సమంగా వ్యాపించి వున్నది నీ మనస్సుయొక్క సత్తయే కదా! కనుక, నీ స్వప్నరాజ్యంలో గల సత్తలు నీ మనస్సత్వంయొక్క అంశలంటే బాగుండదు. అదీ ఇదీ ఒకటే అంటేనే బాగుంటుంది. అలాగే హిరణ్యగర్భుడియొక్క మనస్సత్తవల్లనే ఈ జాగ్రత్ప్రపంచంలోని ప్రతి వస్తువుకీ సత్త సంక్రమిస్తోంది. దీనికి వేరే సొంత సత్త లేదు. నీ మనస్సుయొక్క పరిస్థితి కూడా అటువంటిదే. కనుక, హిరణ్యగర్భుని మనోరాజ్యమన్నా, నీ మనోరాజ్యమన్నా భేదమేమీ లేదు. నీ మనోరాజ్యంలో వుండే దృశ్యపదార్థాలు ఏవైతే వున్నాయో, అవన్నీ ఎక్కడ వున్నాయి అంటే, నీలోనే వున్నాయి. ఎవరివల్ల తయారయ్యా అంటే నీవల్లే తయారయ్యాయి. అవి ఎక్కడ లయిస్తాయి అంటే, నీలోనే లయిస్తాయి. కనుక నీ స్వప్నరాజ్యంలోని దృశ్యాలయొక్క ఉనికి (సత్త) నీయొక్క సత్తకంటే ఎంత మాత్రమూ భిన్నమైనది కాదు.

ఇదే యుక్తిని నీ జాగ్రత్ప్రపంచానికి అన్వయించు. ఇక్కడ దృశ్యాలు కనిపిస్తున్నాయి. వీటి సత్త వీటియొక్క ద్రష్టకు గల సత్త కంటే భిన్నమైనది కావటానికి వీలు లేదు.

ఇదే విషయాన్ని మరో రకంగా ప్రతిపాదన చెయ్యవచ్చు. ఒక దానియొక్క సత్త ఇంకొక దానికి సంక్రమించిందంటే బాగుండదు. ఎందుకంటే, సత్త అనేది సంక్రమించే వస్తువు కాదు. కనుక, రెండో వస్తువులోకి పరాయిసత్త సంక్రమించినట్లు కనిపిస్తోంది అనాలి. అలా అంటే, ఈ రెండవ వస్తువుకి సత్తయే లేదు– అని ఖాయమే కదా! సత్త లేదంటే వస్తువే లేదని అర్థం. కాగా, ఈ కనిపిస్తున్న దృశ్యమంతా లేని పదార్థమే అని కూడా మనం చెప్పవచ్చు.

దృశ్యం లేనిదే అయిపోతే, ద్రష్ట దేన్ని చూస్తాడు? చూసేందుకేమీ లేదు కనుక, వాడు ద్రష్ట కాకుండా పోతాడు. అంటే ద్రష్టృత్వం తొలగిపోయి, కేవలాత్మగా మిగులుతాడు. ఈ స్థితినే కైవల్యం అనీ, అద్వితీయత్వం అనీ, పిలుస్తూ వుంటారు.

### 11. కలలో కల

ఇది విని రాముడు మరో సూటి ప్రశ్న వేశాడు.

***రాముడు:*** గురుదేవా! మీరు రెండు విభిన్న ప్రతిపాదనలు చేసి, ఆ రెండూ ఒకటే పొమ్మంటున్నారు. ఈ దృశ్య పదార్థమంతా నిజంగా వుందంటారా? లేదంటారా? లేదనే టట్టయితే, ఈ దృశ్యంమీద వ్యామోహం పోగొట్టుకో

– అని మీరు బోదించకూడదు. లేని దానిగూర్చి బోధనెందుకు? దృశ్యం వుందనేటట్లయితే, మీరు ఎన్ని చెప్పినా అది పోదు. ఎందుకంటే, సత్త వున్నదానికి నాశం అసంభవం. కనుక, ఈ దృశ్యం వుందనే నేను అనుకొంటున్నాను. ఇది ఒక వ్యాధి వంటిది అనుకొంటున్నాను. ఈ వ్యాధి ఎలా ఉపశమిస్తోందో, ఆ ఉపాయం చెప్పండి?

**వశిష్ఠుడు:** శ్రీ రామా! నువ్వు చెప్పింది నిజం. దృశ్యమనేది వున్నట్లయితే, అది చచ్చినా పోదు. అది నిజంగా వున్నట్లయితే. ఆత్మకు మోక్షమనేదే అసంభవం. మోక్షమనే మాటే లేదందామంటే, కొందరు పెద్దలు జీవన్ముక్తులై మోక్షదశను స్వయంగా అనుభవిస్తున్నామని చెబుతున్నారు. కనుక, నిశ్చయమైన సత్యమేమంటే, ఈ కనిపించే దృశ్యం పరిపూర్ణంగా లేనిదే. సద్రూపమైన దృశ్యం లేనే లేదు.

**రాముడు:** (బాణం లాగా మరో ప్రశ్న వేశాడు) – గురుదేవా! లేని ప్రపంచం కనిపించి సుఖదుఃఖాలను కలిగిస్తోంది – అంటున్నారు మీరు. గొడ్రాలి కొడుకు కొండల్ని పిండి చేశాడని చెబితే, నమ్మమంటున్నారు. నమ్మాలా?

**వశిష్ఠుడు:** (అంతే వేగంగా సమాధానం చెప్పాడు.) రామా! నమ్మటం కాదు. తెలుసుకో. ఈ ప్రపంచం లేనే లేదు. పుట్టనే లేదు. అయినా కనిపిస్తొంది. ఇది ఇలా కనిపించటానికి కారణం నీ మనస్సే. నీ మనస్సుకు ఇలా చేసే గుణం వుంది. అది నీకు స్వప్నాలను చూపించడం లేదా?

రామా! మరో మాట విను.

**మనో దృశ్యమయం దోషం తనోతీమం క్షయాత్మకమ్।**

**అసదేవ సదాకారం స్వప్నః స్వప్నాంతరం యథా॥** (ఉ.ప్ర.స.4, శ్లో.78)

నీ కల అసత్యమని నువ్వు తేలికగానే అంగీకరిస్తున్నావు. ఒక్కొక్క సారి కలలో కల వస్తుంది. అంటే నువ్వే కలలో మరో శరీరం ధరించి వుండి కలగంటున్నావు. ఆ రెండవ కల మాటేమేటి? దాన్ని సత్యమంటావా? అసత్యమంటావా? నీ రెండవ స్వప్నరాజుకు ఆ రెండవ స్వప్నలోకం స్పష్టంగా కనిపిస్తోంది. కనుక దాన్ని అసత్యమంటే ఆయన ఊరుకోడు. కానీ సత్యమందామంటే ఆ రెండవ కల మొదటి కలలోనుంచి పుట్టింది. మొదటి కలేమో అసత్యమని నువ్వు ఒప్పుకొంటున్నావు. మొదటి కల అసత్యమైతే, అసత్యంవల్ల పుట్టిన రెండవ కల అసత్యమే కావాలి. కనుక నువ్వేమో రెండవ కల అసత్యమంటావు. నీ రెండవ స్వప్నరాజుగారు, అది నాకు కనిపిస్తోంది కనుక సత్యమంటాడు. ఆ రెండవ స్వప్నరాజు సత్యమైన ద్రష్ట అయితే, అప్పుడు ఆయన చూసే దృశ్యం సత్యమయ్యే అవకాశం వుండేది. కానీ ఆయనే సత్యం కాదే. ఆయన ద్రష్టృత్వమూ సత్యం కాదే. ఇంక ఆ దృశ్యం సత్యమెలా అవుతుంది?

కానీ మీ రెండవ స్వప్నరాజు గారు – "నా ప్రపంచం సత్యమండీ! సత్యమైన నా ప్రపంచం అసత్తులోంచి ఎట్లా జన్మిస్తుంది?" అని దబాయిస్తే చెల్లుతుందా? భ్రాంతివల్ల కూడా అసత్తులోంచి సత్తు వచ్చినట్లు కనిపిస్తూ వుంటుంది. అలాంటి ఇంద్రజాలాన్ని చేసేది మనస్సే.

కనుక రామా! నీ రెండవ స్వప్నానికి అన్వయించిన తర్కాన్ని నీ ప్రస్తుత ప్రపంచానికి అన్వయించి చూసుకో. ఇది గూడా లేని మనస్సులోంచి పుట్టిందే. అందువల్ల ఇది కూడా లేనిదే. కనుకనే ఈ ప్రపంచం స్వప్నంవలే మిథ్య అని మేము చెపుతున్నాం. ఈ గారడీ చేసేది మనస్సే అని గూడా చెపుతున్నాం.

శ్లో– **స్ఫురతి వల్గతి గచ్ఛతి యాచతే**

**భ్రమతి మజ్జతి సంహరతి స్వయమ్।**

**అపరతాముపయాత్యపి కేవలం**

**చలతి చంచల శక్తితయా మనః॥** (ఉ.ప్ర.స.4, శ్లో.80)

రామా! ఈ మనస్సుకి చంచల శక్తి వుంది. ఆ శక్తివల్ల ఎన్నో వేషాలు వేస్తుంది. తాను ప్రత్యేకంగా వున్నట్లు కనిపిస్తుంది. గుర్రం లాగా గంతులు పెడుతుంది. ఇటూ అటూ తిరుగుతుంది. అది కావాలి ఇది కావాలని దేవిరిస్తుంది. తనే స్వయంగా భ్రమలో పడుతుంది. ఇదే స్వప్నం. తనే స్వయంగా మునిగిపోయి, తనే లేకుండా పోతుంది. ఇదే సుషుప్తి. తనే సంసారిత్వాన్ని పొంది, సుఖదుఃఖాలలో గిలగిలా కొట్టుకుంటుంది. ఇదే జాగ్రత్తు. తనే కైవల్యాన్ని పొంది అన్నిటి కన్నా మిన్నగా వుంటుంది. ఇదే మోక్షం. ఇన్ని నాటకాలూ ఆడేది మనస్సే – అని వశిష్ఠ భగవానుడు నాల్గవ సర్గ పూర్తి చేశాడు.

రాముడికి ఈ తర్కం బాగా నచ్చింది. ఈ ప్రపంచం మిథ్య అని నిశ్చయమైంది. అయితే ఎక్కడైనా మిథ్యా పదార్థం కనిపిస్తూ వుంటే, దానికి ఒక అధిష్టానం వుండాలి. కనుచీకట్లో తాడుముక్క వుంటే, సర్పం అనే భ్రాంతి కలుగుతుంది. ఈ తాడే అధిష్ఠానం. తాడుముక్కే లేకపోతే భ్రాంతే కలిగేది కాదు. కనుక, భ్రాంతి కలిగిన చోట అధిష్ఠానం వుండి తీరాలి. ఈ జగత్తనే భ్రాంతికి అధిష్ఠానం ఏమై వుంటుంది? – అని శ్రీరాముడు ఆలోచించి ఆ మాటే అడిగేశాడు.

**వశిష్ఠుడు:** రామా! బాగా అడిగావు. ఆ అధిష్ఠానాన్నే పరమాత్మ అంటారు. సర్వదృశ్యపదార్థాలూ ఉపసంహారమైపోగా ఏది మిగులుతుందో, అదే పరమాత్మ. అతని లక్షణం ఇలా వుంటుందని వేదాలే చెప్పలేక పోతున్నాయి. జీవన్ముక్తులు మాత్రం ఆ పరమాత్మను సాక్షాత్కరింప చేసుకొంటున్నారు.

ఈ ప్రపంచానికి అధిష్ఠానం ఏమిటని నువ్వడిగావు – అంటే ఒకానొక అధిష్ఠానంనుంచి వివర్త రూపంగా ఈ జగత్తు పుట్టినట్లు కనిపించే అవకాశం వుందని నువ్వు గ్రహించావు. అది మంచి ఊహ. ఈ ప్రపంచం మొత్తానికీ వివర్తోపాదాన కారణం ఆ పరమాత్మే. వివర్తోపాదాన కారణం అంటే ఏమిటో పూర్వమే నీకు చెప్పాను. తాడు వున్న చోట పాము కనిపించటమే వివర్తం. సర్పమనే భ్రాంతికి మూలకారణమైన తాడే ఇక్కడ వివర్తోపాదాన కారణం – అని పూర్వం చెప్పుకొన్నాం. ఈ ప్రరంచానికి అధిష్ఠానమూ, వివర్తోపాదన కారణమూ కూడా, ఆ పరమాత్మే.

వశిష్ఠుడిలా చెప్పి 5వ సర్గ పూర్తి చేసి, అక్కడితో ఆగక 6వ సర్గలోకి ప్రవేశించి, తనే కొనసాగించాడు – "రామా! ఈ ప్రపంచం పరమాత్మ నుంచి వివర్తంగా పుట్టిందని తెలిసింది కదా! వివర్తంగా జన్మించడం అంటే ఏమిటి? భ్రాంతివల్ల జన్మించడమే. భ్రాంతి ఎప్పుడూ కూడా తత్త్వజ్ఞానంవల్ల నశిస్తుంది. దేనియొక్క తత్త్వం? అధిష్ఠానంయొక్క తత్త్వం. కనుక, ఇక్కడ అధిష్ఠానమైన పరమాత్మయొక్క తత్త్వం తెలిస్తే ప్రపంచమనే భ్రాంతి పూర్తిగా తొలగిపోతుంది. ఇదే ముక్తి. దీనికి సత్సాంగత్యము, సచ్ఛాస్త్రాభ్యాసము ఉపకరిస్తాయి" – అని వశిష్ఠుడు ముగించాడు.

## 12. తత్త్వజ్ఞాన సాధనము

**రాముడు:** ఆ తత్త్వజ్ఞానం త్వరగా కలగాలంటే ఏ తపస్సు చెయ్యాలి?

**వశిష్ఠుడు:** రామా! ఏ కర్మలూ దానికి పని చెయ్యవు. శాస్త్రోక్త కర్మలు నిష్కామంగా చేస్తే ఆత్మజ్ఞానం కలగాలనే కోరిక గట్టిగా కలుగుతుంది. కర్మలకూ, తపస్సులకూ ఫలితం అంతవరకే. ఆ పైన జ్ఞానప్రాప్తికి సత్సాంగత్యమూ, సచ్ఛాస్త్రాభ్యాసము, శ్రవణ మననునిదిధ్యాసలు, కావలసిందే!

వశిష్ఠమహర్షి చెప్పదలుచుకొన్న ప్రధాన విషయమేమిటో మొదటిసర్గలో చెప్పేశాడు. దానియొక్క అసలైన ఉపపత్తిని 13వ సర్గలో చెప్పేశాడు. మనకు విషయం సులభంగా అర్థం కావడం కోసం ఆ 13వ సర్గను

ముందుగానే చెప్పుకొన్నాం. అయితే రాముడికి వశిష్ఠమహర్షి ఆ సర్గను ముందుగానే ఎందుకు చెప్పలేదంటే, రాముడు స్వయంగానే విషయాన్ని మథనం చేసుకోవాలని గురువుగారి అభిప్రాయం. అందుకే 13 వ సర్గ విషయం అయన ముందుగా చెప్పలేదు. అందుకే శ్రీ రాముడు మరి కొన్ని ప్రశ్నలు వేస్తున్నాడు. 7 వ సర్గలో శ్రీరాముడు వేసిన ప్రశ్నేమిటంటే – "గురుదేవా! పరమాత్మ తత్త్వజ్ఞానంవల్ల మోక్షం వస్తుందన్నారు గదా! ఆ పరమాత్మ ఏ ఉపాధిలో బాగా అభివ్యక్తమౌతాడు? ఏ ఉపాధిద్వారా ఆ పరమాత్మను నేను తేలికగా పొందగలను?" – అని.

వశిష్ఠుడిట్లా చెప్పాడు– " రామా! అతడు నీ శరీరంలోనే హృదయ పద్మంలో విశేషంగా అభివ్యక్తమౌతూ వుంటాడు. ఇలా అన్నామని ఆయన పరిచ్ఛిన్నుడు, పరిమితుడు, అనుకోకు. నిజానికి ప్రపంచమంతా ఆయనే. ఇలా అన్నామని ఆయన దృశ్య స్వరూపుడని అనుకోకు. ఆయన చైతన్యమాత్రుడు. ఆయన కంటే భిన్నంగా ప్రపంచం లేదు. ఈ బ్రహ్మ, ఈ విష్ణువు, ఈ శివుడు, ఈ మొత్తం ప్రపంచం అంతా ఆ చిన్మాత్రుడే."

వశిష్ఠమహర్షి ఇలా ఆవేశంగా చెప్పుకుపోతుంటే, రాముడు తటాలున అడ్డుతగిలాడు – "మహర్షీ! ఈ ప్రపంచమంతా చేతనమయమని చిన్నపిల్లలకు కూడా తెలుసు. చేతనులంటే జీవులే కదా! జీవులు లేని ప్రపంచం వుంటుందా?" అన్నాడు.

వశిష్ఠమహర్షి వెంటనే అందుకొన్నాడు– "ఈ ప్రపంచం అంతా జీవమయమని నీకు అర్థమైందంటే, నీకు అసలు విషయం బుర్రకెక్కలేదని అర్థం. నువ్వు చిత్ అనే పదాన్నీ, జీవుడనే పదాన్నీ, కలగాపులగం చేసి, సమానార్థకాలుగా వాడేస్తున్నావు. జీవుడంటే జనన మరణాది దుఃఖ సంబంధం కలవాడు. చిత్ అంటే ఏ వికార స్పర్శా లేనిది. ఈ రెండూ ఒకటి కాదు. సుఖదుఃఖ స్పర్శ గల జీవుడు, విషయాలకు బహిర్ముఖుడై, శుద్ధచైతన్యానికి అభిముఖుడైనప్పుడు, చిత్స్వరూపాన్ని పొందుతాడు. అంతే గాని సంసారి అయిన జీవుడు చిత్ స్వరూపి కాలేదు. అందుకనే శ్రుతిలో–

**భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యంతే సర్వ సంశయాః।**
**క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥** – అని చెప్పారు"–

అంటూ వశిష్ఠమహర్షి కఠోపనిషద్వాక్యాన్ని ఉదహరించాడు.

యోగవాశిష్ఠంలో అనేక చోట్ల ఉపనిషద్వాక్యాలను శ్లోకాలుగా మార్చి చెప్పేయటం కనిపిస్తూ వుంటుంది. కొన్ని చోట్ల ఉపనిషద్వాక్యాలను వాల్మీకిమహర్షి యథాతథంగా దించేసుకొన్నాడు. ఇది అలాంటి ఘట్టమే.

ఈ ఉపనిషద్వాక్యానికి అర్థమేమిటంటే, పరావరే–కారణ కార్యరుపమైన ఆ పరమాత్మయొక్క దర్శనం లభిస్తే, అప్పుడు, ఈ జీవుడియొక్క హృదయగ్రంథి ఊడిపోతుంది. హృదయగ్రంథి అంటే గుండె ముడి. అంటే ఈ అంతఃకరణమే. నేను అనే తాదాత్మ్యబుద్ధి. అది పగిలిపోతుంది. కారణ రూపి, కార్యరూపి కూడా ఆ పరమాత్మే అనే తత్త్వజ్ఞాన దర్శనం లభిస్తే, ఆ జీవికి మూలాజ్ఞానం తొలగిపోతుంది. దానితో పాటు మూలావిద్య యొక్క కార్యమైనట్టి అంతఃకరణ తాదాత్మ్యబుద్ధి రూపమైన హృదయగ్రంథి విడిపోతుంది. ఎప్పుడైతే గుండెముడి ఊడిపోయిందో, అంతకు ముందు దాకా ఆ గుండెలో మూటకట్టుకొని వున్న సందేహాలన్నీ తునాతునకలైపోతాయి. దానితో పాటే ఆ జీవియొక్క కర్మలన్నీ నశించిపోతాయి.

ఈ ప్రమాణవాక్యంవల్ల జీవుడికి గుండెముడి తెగిపోవటమనే దశ పరమాత్మజ్ఞానంవల్ల మాత్రమే కలుగుతుంది, అని తెలుస్తోంది. అయితే, సమాధి యోగసాధన ద్వారా ఇటువంటి స్థితిని పొందరాదా? – అని సందేహం కలుగవచ్చు. కానీ, రామా! సమాధి అనేది చిత్తనిరోధంవల్ల వస్తుంది. దానివల్ల జీవుడికి వుండే విషయాభిముఖ్యం, అంటే ఇంద్రియాలు విషయాల వెంట పడే గుణం, తొలగుతుంది. అంతవరకూ నిజమే గానీ, ఈ కనిపించే చేత్యములు, అనగా దృశ్యములు, అసత్య స్వరూపములు– అనే జ్ఞానం లేకుండా

సమాధి సాధన చేస్తే, ఆ యోగికి సమాధిలోంచి బయటికి రాగానే, మళ్ళీ మనస్సు దృశ్యాల మీదకే పోతుంది. ఎంత సేపు సమాధిలో వున్నా సరే, దృశ్యం అసత్యమనే జ్ఞానం కలుగదు. అది కలిగితే గానీ, మోక్షం రాదు. అందువల్ల పరిపూర్ణ మోక్షసిద్ధికి చిత్తనిరోధ రూపమైన యోగసాధనవల్ల లభించే సమాధి ఒకటి మాత్రమే చాలదు, దానికి తత్త్వజ్ఞానం కావలసిందే!

## 13. పరబ్రహ్మే సంసారి

ఈ వివరణ విని రాముడు లోతుగా ఆలోచించి, ఇలా అడిగాడు– గురుదేవా! జీవుడు, బ్రహ్మ, వీరిలో సంసారి ఎవరు? జీవుడికే సంసారం వుందని చెపుదామంటే, సిద్ధాంతంలో చివరికి జీవుడు బ్రహ్మలో ఐక్యమై పోతున్నాడు. కనుక, ఆ దశలో ఆ పరబ్రహ్మ సంసారి అయిపోవలసి వస్తుంది. జీవుడు బ్రహ్మలో ఐక్యం కాదందామంటే, జీవుడికి మోక్షమే లేదని చెప్పినట్టవుతుంది. అదీ గాక, జీవికి ఆధారమెవరు? ఈ పరబ్రహ్మ ఆధారమా? అలా అయితే, బ్రహ్మజ్ఞానం రాగానే, ఈ పరబ్రహ్మలో అధ్యస్తమైన దృశ్యప్రపంచమంతా ఎగిరిపోతుంది. జీవుడు దృశ్యప్రపంచంలో భాగమే కనుక వాడూ లేకుండా పోతాడు. జీవుడే లేకుండా పోతే మోక్షమెవరికి?

"పోనీ, ఈ జీవుడికి పరబ్రహ్మ ఆధారం కాదయ్యా! వేరే ఇంకేదో ఆధారం వుందని చెపుదామా? అలా చెపితే, పరబ్రహ్మతో పాటు మరొక సత్యమైన అధిష్ఠాన వస్తువును అంగీకరించినట్లవుతుంది. అలా అంగీకరిస్తే, బ్రహ్మ అద్వితీయుడనే మాట దెబ్బతింటుంది. కనుక, జీవుడికి ఆధారం బ్రహ్మ అని చెప్పేందుకు వీల్లేదు. బ్రహ్మ కాకుండా వేరే ఆధారమేదో వుందని చెప్పేందుకూ వీల్లేదు.

గురుదేవా! ఇలా ఎటు చూసినా చిక్కులే కనిపిస్తున్నాయి కనుక సంసారం జీవికా? పరమాత్మకా? – అనేది మీరే తేల్చిచెప్పండి?"

వశిష్ఠుడు ఇలా సమాధానం చెప్పాడు– "రామా! జీవుడికే సంసారం అనుకొంటే ఏ చిక్కులొస్తాయో నీవు చెప్పావు. అవన్నీ నిజమే. కనుక బ్రహ్మకే సంసారం. బ్రహ్మ తనను గురించిన అజ్ఞానంవల్ల సంసారి అవుతున్నాడు. తనను గురించిన జ్ఞానంవల్ల ముక్తుడవుతున్నాడు. పరబ్రహ్మయే అనాత్మలైన దేహేంద్రియాలలో ప్రవేశించి, జీవుడై, భ్రాంతిలో పడి, శరీరేంద్రియాలు నేనే అనుకొంటూ, ఈ సంసారాన్ని పొందుతున్నాడు. అప్పుడు జీవుడే సంసారి అనే లోకవ్యవహారం ఏర్పడుతోంది.

"ఇలాంటి దశలో ఆ పరబ్రహ్మకు స్వజ్ఞానం కలుగుతుంది. దానివల్ల ఆయనమీద ఆరోపణ చేయబడిన పదార్థాలన్నీ ఎగిరిపోతాయి. వాటితో పాటు జీవుడూ ఎగిరిపోతాడు. కానీ, దానివల్ల పరబ్రహ్మకు ఏ రకమైన లోటూ గాదు. అయన ముక్తస్థితిలో వుంటాడు."

## 14. పరమాత్మ స్వరూప లక్షణం

ఇది విని రాముడు "మీరు చెప్పే పరమాత్మ యొక్క స్వరూపాన్ని సూటిగా వివరించి చెప్పండి" అన్నాడు.

ఇక్కడ వశిష్ఠమహర్షి ఒక అందమైన ప్రతిపాదన చేశాడు.

**దేశాద్దేశాంతరం దూరం ప్రాప్తాయా స్సంవిదో వపుః।**

**నిమేషేణైవ యన్మధ్యే తద్రూపం పరమాత్మనః॥** (ఉ.ప్ర.స.6, శ్లో.19)

పరమాత్మయొక్క స్వరూపలక్షణాన్ని చెప్పటానికి ఈ యోగవాశిష్ఠంలో ఇదే భావాన్ని, ఇంచుమించు

ఇదే పదాలతో, అనేక మార్లు చెప్పాడు వాల్మీకిమహర్షి. రాబోయే లీలోపాఖ్యానంలో గూడా ఇలాంటిశ్లోకం మరొకటి వస్తుంది. కనుక ఈ శ్లోకాన్ని కొంచెం జాగ్రత్తగా పరిశీలన చేద్దాం.

ఒక చిత్తవృత్తిలో గల జ్ఞానం ఒక దృశ్యంనుంచి మరొక దృశ్యానికి వెళుతూ, ఆ మధ్యలో గల దూరాన్ని ఒక్క క్షణ కాలంలో దాటి వెళ్ళినప్పుడు ఈ దృశ్యానికీ ఆ దృశ్యానికీ మధ్యలో దానికి ఏ రూపం వుంటుందో, అదే పరమాత్మయొక్క అసలైన రూపం– ఇదే ఈ శ్లోకానికి సూటి తాత్పర్యం.

అది మనకేమీ అర్థం కావటం లేదు. ఆనంద బోధేంద్ర సరస్వతీస్వామి వ్రాసిన తాత్పర్య ప్రకాశ వాఖ్యానంలో ఆయన దీన్ని చక్కగా వివరించారు. దాన్నే మనం చెప్పుకొందాం. శాఖా చంద్ర న్యాయమని సంస్కృతంలో ఒక సామెత వుంది. ఒక కుర్రవాడు చంద్రుడెక్కడని అడిగాడు. ఆకాశంలో వున్నాడు అని చెప్పారు. వాడు పడమరకి, దక్షణానికి, ఉత్తరానికి చూసి 'నాకు కనిపించడం లేదు' అన్నాడు. అప్పుడు ఆ తల్లి – "ఆ మామిడిచెట్టు కొమ్మ వంక చూడరా. ఆ కొమ్మమీద చంద్రుడు వున్నాడు." అంది. ఆ కుర్రవాడు మామిడికొమ్మకేసి చూశాడు. చంద్రుడు కనిపించాడు. ఆ చంద్రుడేమన్నా ఈ చెట్టుకొమ్మ మీద కూర్చున్నాడా? చంద్రుడెక్కడో ఆకాశంలో వున్నాడు. కొమ్మ భూమికి దగ్గరగా వుంది. ఎప్పుడైతే కుర్రావాడియొక్క కన్ను ఆ చెట్టు కొమ్మమీద పడ్డదో, అప్పుడు ఆ కుర్రావాడియొక్క అంతఃకరణంలోంచి ఒక ఆంతఃకరణ వృత్తిబయటకు బయలుదేరి, ఆ చూపు వెంటే ఆ కొమ్మ దాకా వచ్చింది. ఆ అంతఃకరణ వృత్తిలో ఒక చైతన్యం అభివ్యక్తమై వుంది. అందువల్ల అంతఃకరణ వృత్తితో పాటు, దానిలో అవచ్ఛిన్నమై వున్న చైతన్యం కూడా, చెట్టుకొమ్మ దాకా వచ్చింది. ( అవచ్ఛిన్నము =కూడి వున్న)

కానీ, కుర్రవాడి చూపు కొమ్మమీద ఆగిపోలేదు. అది కొమ్మమీది నుంచీ ఒక్క సారిగా, ఒక్క క్షణంలో, ఆకాశంలో వున్న చంద్రుడి దాకా ప్రయాణం చేసింది. ఆ చూపుతో పాటు, ఆ కుర్రవాడి అంతఃకరణవృత్తి కూడా ప్రయాణం చేసింది. దానితో పాటు దానిలో అవచ్ఛిన్నమై వున్న చైతన్యం కూడా ప్రయాణం చేసి చంద్రుడి దగ్గరకు చేరింది. ఇదంతా ఒక్క క్షణంలో జరిగి పోయింది. అందువల్ల ఆ కుర్రవాడు ఇటు కొమ్మనీ, అటు చంద్రుణ్ణీ, రెండింటినీ ఒకే సారి చూడగలుగుతున్నాడు. దీనిని బట్టి ఆ కుర్రవాడియొక్క అంతఃంకరణంలో అవచ్ఛిన్నమైన చైతన్యం నేలమీది కొమ్మనుంచి నింగిలోని చందమామ దాకా, ఒకే క్షణంలో, అనుస్యూతంగా వ్యాపించింది – అని చెప్పాలి. అంటే కంటిన్యువస్‌గా, మధ్యలో విచ్ఛేదాలు లేకుండా, వ్యాపించి వుంది అని చెప్పాలి. లేకపోతే, కొమ్మ, చంద్రుడూ, ఒకే సారి ఎట్లా కనిపిస్తాయి? చైతన్యం కనుక మధ్యలో ఎక్కడన్నా విచ్ఛిన్నమైపోతే, పైనున్న చంద్రుడు ఈ కుర్రవాడికి కనిపించేవాడు కాదు. కనుక అంతఃకరణవృత్తి చైతన్యం కొమ్మనుంచీ చందమామ దాకా అఖండంగానే వ్యాపించిందని చెప్పాలి.

కాగా, ఈ అంతఃకరణ– అవచ్ఛిన్న చైతన్యానికి కింది భాగంలో కొమ్మ విషయంగా వుంది. చిటారు భాగంలో చందమామ విషయంగా వుంది. కనుక ఈ రెండు ప్రదేశాలలోనూ, ఈ చైతన్యం సవిషయంగా వుంది.

కానీ, ఈ రెండింటికీ మధ్య ప్రదేశంలో ఈ చైతన్యానికి విషయం ఏమిటి? ఏమీ లేదు. అది అక్కడ నిర్విషయం అని అంగీకరించక తప్పదు.

ఇలాంటి నిర్విషయమైన, అపరోక్షమైన, జ్ఞానరూపం ఏదైతే వుందో, ఆ చిద్రూపమే పరమాత్మయొక్క స్వరూపం –అని ఈ శ్లోకం నిర్వచనం చేస్తోంది.

ఇక్కడ బాగా అర్థమవటం కోసం కొమ్మ అని, చంద్రుడని, దూరపు వస్తువులను ఉదాహరణగా తీసుకొన్నాం. అంతే గాని, అలా దూరంగా వున్న వస్తువులకే ఈ నిర్వచనం వర్తిస్తుందనుకోకూడదు. ఇలాంటి

స్థూలవస్తువులకే ఈ నిర్వచనం పరిమితమని గూడా అనుకోకూడదు. మనస్సులోకి ఒక ఆలోచన వచ్చింది. అది పోయి రెండవ ఆలోచన వచ్చింది. ఈ రెండు ఆలోచనల మధ్యలో ఏముంది అంటే, అక్కడ గూడా నిర్విషయమైన చిత్తే వుంది. అదే పరమాత్మయొక్క స్వరూపం – ఇలా మనం ప్రతి చోటా అన్వయించుకోవాలి.

## 15. తత్త్వజ్ఞానానికి ప్రతిబంధకం

వశిష్ఠమహర్షి పరమాత్మయొక్క స్వరూపాన్ని ఈ విధంగా చెప్పేటప్పటికి, శ్రీ రాముడు మరో కీలకమైన ప్రశ్న లేవదీశాడు.

**రాముడు:** మహర్షీ! లోకంలో ఏదైనా విషయాల గురించి తెలుసుకోవాలంటే ఇంద్రియాలు గాని, అనుమాన ప్రమాణాదులు గాని, ప్రమాణంగా పని చేస్తున్నాయి. ఇలాంటి ప్రమాణాలేమో కొమ్మ, చందమామ, వంటి దృశ్య పదార్థలను సత్పదార్థాలని చెపుతున్నాయి. కానీ మీరు అవన్నీ అసత్పదార్థాలనేస్తున్నారు. కొమ్మకీ, చందమామకీ మధ్యలో వున్న పరమాత్మ స్వరూపం వుందే, అది ఏ ప్రమాణానికీ దొరకదు. అందుచేత మనకు తెలిసిన ప్రమాణాలన్నీ అలాంటి పరమాత్మ స్వరూపం అనేది లేనిదే (అసత్తే) అంటున్నాయి. కానీ, మీరు మాత్రం ఇదొక్కటే సత్యమైన సత్త కలది అంటున్నారు. ఇది లోకవిరుద్ధంగా లేదా?

**వశిష్ఠమహర్షి:** రామా! పరామాత్మ స్వరూపం ఏ ప్రమాణానికీ దొరకదని చెప్పడం కుదరదు. ఉపనిషత్తులలోని మహావాక్యాలు అనే ప్రమాణంవల్ల పరమాత్మ స్వరూపం గ్రహింపబడుతుంది. అయితే,వినే వాళ్ళకు కొన్ని పాప ప్రతిబంధకాలు వుండటంవల్ల, వాళ్ళకు ఆ మహావాక్యాలు వినంగానే పరమాత్మ జ్ఞానం కలగటం లేదు. కనుక, ముందుగా మానవులు ఆ ప్రతిబంధకాలను పోగొట్టుకోవాలి. ఈ ప్రపంచం సత్యం అనుకోవటమే ఆ ప్రతిబంధకం. దృశ్యమంతా మిథ్యయే– అనే జ్ఞానమే ఈ ప్రతిబంధకాన్ని తొలగించే ఉపాయం. కనుక, ప్రతిబంధకాన్ని తొలగించుకొంటే "తత్వమసి" మొదలైన మహావాక్యాలు ప్రమాణభూతములై నీకు పరమాత్మజ్ఞానాన్ని కలిగిస్తాయి.

**రాముడు:** గురుదేవా! దృశ్యం సత్యమనే జ్ఞానం వుంటే అది బ్రహ్మజ్ఞానానికి ప్రతిబంధకం ఎందుకు కావాలి? వెంకయ్యను గురించి జ్ఞానం వుంటే, పుల్లయ్యను గురించిన జ్ఞానం కలగకూడదా?

**వశిష్ఠుడు:** ఒక విషయం గురించిన జ్ఞానం కలగాలంటే, ఆ విషయం మన అంతఃకరణంలో ప్రతిబింబించాలి. కనిపించే దృశ్యమంతా సత్యమే అనే జ్ఞానం కనుక ఒక అంతఃకరణానికి వుంటే, అలాంటి అంతఃకరణంలో పరబ్రహ్మ ప్రతిబింబించటం సాధ్యం కాదు. పరబ్రహ్మ ఏ అంతఃకరణంలో ప్రతిబింబిస్తుందో, ఆ అంతః కరణంలో వున్న అజ్ఞానాన్ని పరబ్రహ్మ తగలబెట్టి తీరుతుంది. ఈ విధంగా, దృశ్యానికీ, పరబ్రహ్మకీ, పరస్పరం విరోధం వుండటం వల్ల, ఈ రెండింటి జ్ఞానం ఏక కాలంలో కలగటం అసంభవం.

**రాముడు:** గురుదేవా! నా సందేహం తీరలేదు. వెలుగూ, చీకటీ, పరస్పర విరోధులు. అ రెండూ ఒకే సారి కనిపించటం సాధ్యం కాదు. కానీ, ఈ రెంటింటినీ గుంరించిన జ్ఞానం ఒకే మనస్సులో వుండటం సాధ్యమే కదా! అలాగే, ఒక బుద్ధిలో దృశ్యజ్ఞానం వున్నప్పటికీ, అంటే దృశ్యము సత్యమే అనే భావం వున్నప్పటికీ, ఆ బుద్ధిలో ద్వైతం ప్రతిబింబించని దశలు కొన్ని వుంటాయి. సుషుప్తి దశ వుంది. ఉదాసీనదశ వుంది. ఇలాంటి దశలలో ఏ ద్వైత దృశ్యప్రతిబింబమూ వుండదు. అలాంటి సమయాల్లో ప్రతిజీవికీ స్వచ్ఛమైన పరబ్రహ్మ స్వరూపం అనుభవంలోకి రావాలి కదా! ఎందుకు రావటం లేదు?

**వశిష్ఠుడు:** రామా! తెలిసిన విషయంలోనే పొరపాటు పడుతున్నావు. ఈ దృశ్యం అంతా కలసి అసత్యం అనే స్థిర నిశ్చయం లేనివాడికి, ఒక్క క్షణం గూడా బుద్ధిలో ద్వైత దృశ్య ప్రతిబింబంలేని దశ వుండదు. ఒక అద్దం

వుందనుకో, దానిలో ప్రతిబింబంలేని దశను నువ్వు వూహించగలవా? ఏమీ లేకపోతే ఆకాశంలోని మబ్బులైనా ప్రతిబింబిస్తాయి. సూర్యకిరణాలైనా ప్రతిబింబిస్తాయి. బుద్ధి గూడా అద్దం లాంటిదే! సుషుప్తిదశలోనూ, ఉదాసీనదశలోనూ కూడా, దానిలో అజ్ఞాన ప్రతిబింబం వుంటుంది. కనుకనే దానిలో అద్వైతమైన పరమాత్మ స్వరూపం ప్రతిబింబించదు.

**రాముడు:** గురుదేవా! మరో ప్రశ్న వుంది. మీరు ఇందాకటినుంచి పరబ్రహ్మ పరమ సూక్ష్మమైనదని, దానిమీద ఈ విస్తారమైన ప్రపంచమంతా అధ్యస్తమైందని చెపుతున్నారు. ఇదెలా కుదురుతుంది? ఆవగింజ పొట్టలో మేరుపర్వతం ఇముడుతుందా?

**వశిష్ఠుడు:** (ఈ ప్రశ్న దగ్గర కొంచెం ఆలోచించి, ఇలా అన్నాడు.) రామా! వేసిన ప్రశ్నలే మళ్ళీ వేస్తున్నావు. అణువు వంటి నీ మనస్సులోకి విస్తారమైన స్వప్న ప్రపంచం ఏలా వచ్చిందంటావు? విషయం అర్థమైనా కూడా మనస్సుకు పట్టకపోవటంవల్ల ఇలా వచ్చిన ప్రశ్నలే వస్తూ వుంటాయి. దీనికి సచ్ఛాస్త్ర శ్రవణమే విరుగుడు.

ఇక్కడ రాముడు ఏ గ్రంథాలు చదివితే సచ్ఛాస్త్రం చదివినట్లౌతుంది? అని అడిగాడు. వాల్మీకి కవి మాత్రమే కాదు, మంచి మనస్తత్వవేత్త కూడా. ఈ సందర్భాన్ని ఉపయోగినిచుకొని, ఆ మహాకవి వశిష్ఠుడిచేత యోగవాశిష్ఠమే దీనికి ఉత్తమ గ్రంథం అని చెప్పించాడు. అంతే గాక, ఈ గ్రంథ ప్రాశస్త్యాన్ని కొంచెం వివరించాడు కూడా. చెప్పి చెప్పి,చివరికి వశిష్ఠుడు – "రామా! ఈ యోగావాశిష్ఠ పఠనం ద్వారా తదేక నిష్ఠతో ఆపకుండా ఆత్మవిచారణ చెయ్యాలి" అన్నాడు.

**రాముడు:** ఎప్పటిదాకా చెయ్యాలి?

**వశిష్ఠుడు:** జీవన్ముక్తి కలిగే దాకా చెయ్యాలి. జీవన్ముక్తి వచ్చేస్తే, విదేహముక్తి అదే వస్తుంది.

**రాముడు:** జీవన్ముక్తి వచ్చినట్లు ఎలా తెలుస్తుంది?

**వశిష్ఠుడు:** అది స్వయంగానే తెలుస్తుంది. నిద్రనుంచి మెలుకువ వచ్చినట్లు నీకు మరొకరు ఎవరైనా చెప్పాలా? అలాగే ఇదీనూ! అయినా జీవన్ముక్తుడి లక్షణాలు ఎలా వుంటాయో తెలిస్తే, వాటిని అందుకోవటానికి నువ్వు ప్రయత్నించవచ్చు. అంటే, జీవన్ముక్తుడికి ఏవి సహజ లక్షణాలో, సాధకుడికి అవే సాధనా మార్గాలు. కనుక, నీకు జీవన్ముక్తుడి లక్షణాలు, విదేహ ముక్తుడి లక్షణాలు కూడా చెపుతాను విను – అని వశిష్ఠుడు 9వ సర్గలో ఇలా చెప్పసాగాడు.

## 16. జీవన్ముక్త లక్షణాలు

1.అతడు ప్రపంచ వ్యవహారంలో వుండి కూడా, లోపల పరమాత్మ దృష్టితో వుంటూ, ప్రపంచం లేనట్లు భావిస్తూ వుంటాడు.

2. అతడు మెలుకువగా వుండగానే, గాఢనిద్ర (సుషుప్తి)లో వుంటాడు. (**జాగ్రత్యేవ సుషుప్తవాన్**)

3. సుఖంవల్ల వాడి ముఖం వెలగదు. దుఃఖంవల్ల మాడదు.

4. సుషుప్తిలో కూడా వాడు మెలకువలో వుంటాడు. వాడికి మెలకువే లేదు. ఇదొక విచిత్ర స్థితి. (**యో జాగర్తి సుషుప్తస్థో యస్య జాగ్రన్నవిద్యతే**)

5. **రాగద్వేషభయాదీనా మనురూపం చరన్నపి।**
**యోంతర్ వ్యోమవదచ్ఛస్థః స జీవన్ముక్త ఉచ్యతే॥** (ఉ.ప్ర.స.9, శ్లో.8)

వాడు రాగద్వేషాదులకు అనుకూలంగానే పని చేస్తూ వుంటాడు. లోపల మాత్రం ఆకాశంలా దేనితోనూ

సంపర్కం లేకుండా వుంటాడు.
6. వాడు పని చేస్తున్నా, మానినా, వాడికి అహంకారం లేదు. వాడి మనసుకి ఏదీ అంటదు.
7. వాడు కళ్ళు తెరిస్తే ప్రళయం. కళ్ళు మూస్తే సృష్టి. (కళ్ళు తెరవటమంటే జ్ఞానదశ. మూయటమంటే అజ్ఞానదశ.)
8. ఎవ్వరివల్లా వాడికి భయం లేదు. వాడివల్లా ఎవ్వరికీ భయం లేదు.
9. వాడికి మనస్సున్నా ఆలోచన లేదు. **(య స్సచిత్తోపి నిశ్చిత్తః)**
10. వాడు కోపంలో కూడా చల్లగానే వుంటాడు.

**17. విదేహముక్త లక్షణాలు**

1. **జీవన్ముక్త పదం త్యక్త్వా దేహే కాలవశీకృతే।**
**విశత్యదేహముక్తత్వం పవనోఽ స్పందతామివ॥** (ఉ.ప్ర.స.9, శ్లో.14)

విదేహ ముక్తత్వం అనేది మరో స్థితి కాదు. ఆ జీవన్ముక్త స్థితికే మరో పేరు. కదలే గాలి జీవన్ముక్తి. కదిలే దశలో గాలి వుందని మనకు తెలుస్తుంది. కదలిక ఆగిపోతే, గాలి వున్నా, మనకు తెలిదు. విదేహముక్తి అలాంటిదే. జీవన్ముక్తుడికి కర్మ క్షయం అయిపోయి, దేహం రాలిపోతే, ఆ జీవన్ముక్తుణ్ణే విదేహ ముక్తుడంటారు.

2. **విదేహముక్తో నోదేతి నాస్తమేతి న శామ్యతి।**
**న సన్నాసన్న దూరస్థో న చాహం న చ నేతరః॥** (ఉ.ప్ర.స.9, శ్లో.15)

వాడు ఉదయించడు, అస్తమించడు. నశించడు. వున్న వాడు కాదు, లేనివాడు కాదు. దూరంవాడు కాదు, దగ్గరవాడుకాదు. నేనూ కాదు, నువ్వూ కాదు.

3. వాడే సూర్యుడై వెలుగుతాడు. విష్ణువై రక్షిస్తాడు. రుద్రుడై సంహరిస్తాడు. బ్రహ్మై సృష్టిస్తాడు.
4. ఆకాశమై వాయువును ధరిస్తాడు. భూమియైఅందరినీ మోస్తాడు. నీరై ప్రవహిస్తాడు. నిప్పై దహిస్తాడు.
5. ఇంతెందుకు రామా! ఇప్పుడు కనిపించేది, మునుపు కనిపించింది, రేపు కనిపించబోయేది – ఇదంతా వాడే.

ఇది విన్న రాముడు, ఒక కొత్త మెలిక ప్రశ్న వేశాడు –

**రాముడు:** గురుదేవా! విదేహముక్తుడు అంటే త్రిలోకస్వరూపుడు అంటున్నారు. దీన్నిబట్టి చూడగా, ఈ ముక్త జీవులే మళ్ళీ మాములు సంసారజీవులై జన్మిస్తున్నారా, అనిపిస్తోంది. ఎందుకంటే, ఒకడు విదేహ ముక్తుడయ్యాడంటే, వాడు త్రిలోక స్వరూపాన్ని పొందాడు. కనుక, ఇప్పుడు ముల్లోకాలూ ముక్తి పొందాయి. ముల్లోకాలు మునుపే ముక్తి పొందిపోతే ఇప్పుడు, ఈ లోకం ఎలా కనిపిస్తోంది? కనిపింస్తోంది కదా! కనుక, ఆ విదేహముక్తులే మళ్ళీ ఈ నాటి సంసారజీవులుగా జన్మించి వుండాలి. అలా జన్మించారంటే, ముక్తి శాశ్వతమైనదనే మాట తప్పిపోతుంది. వారు మళ్ళీ జన్మించలేదంటే, ఈ నాటి లోకం లేకుండా పోవలసి వస్తుంది. ఈ సందేహం తీర్చండి.

**వశిష్ఠుడు:** రామా! ముల్లోకాలే నిజంగా సత్యవస్తువులైతే, నువ్వు చెప్పే గందరగోళం అంతా నిజమై వుండేది. ముల్లోకాలే లేవు. ఎంత వెతికినా, నాకు బంగారమే కనిపిస్తోంది. కానీ, దానికంటే భిన్నంగా కంకణం కనిపించటం లేదు. నేను ఎంత వెతికినా, అలలో నీరే కనిపిస్తోంది కానీ, వేరేమీ కనిపించటం లేదు. ఎంత చూసినా, గాలిలో చలనమే కనిపిస్తోంది గానీ, మరొకటి కనిపించటం లేదు. అలాగే బ్రహ్మకంటే భిన్నంగా ఈ జగత్తు లేదు.

**రాముడు:** కనిపించే, ఈ ప్రపంచం లేదనుకుంటే ముక్తి వస్తుందని మీరు అంటున్నారు. స్పష్టంగా కనిపించే దాన్ని లేదనుకోవటం ఎట్లా? దానికి ఏదైనా ఉపాయం వుంటే చెప్పండి?
**వశిష్ఠుడు:** రామా! ఈ లోకభ్రాంతి ఒక కలరా వ్యధి. ఇది చాలా కాలంగా వుంది. ఇది త్వరగా పోయే వ్యాధి కాదు. ఆత్మవిచారణే దీనికి సరియైన మంత్రం.కొండ ఎక్కినవాడు మెల్లిగా దిగాలి గానీ, దూక కూడదు. అలాగే బ్రహ్మజ్ఞానం కూడా అభ్యాసక్రమం చేత సాధించాలి. ఈ అభ్యాసక్రమం కోసం నేను నీకు 'లీలోపాఖ్యానము' అనే చక్కటి కథ చెపుతాను.

## 18. ఈ ప్రపంచం పుట్టనే లేదు

రామా! లీలోపాఖ్యానం ద్వారా నీకు నేను ఏమి చెప్పబోతున్నానో, ఆ సిద్ధాంత భాగాన్ని నువ్వు ముందుగానే అవగాహన చేసుకొని వుండటం మంచిది. ఈ కథ ద్వారా నేను చెప్పబోయే ముఖ్యాంశం ఏమిటంటే – "ఈ ప్రపంచం పుట్టనే లేదు" – అని. పుట్టకపోతే ఎలా కనిపిస్తోంది అంటావా? ఈ కనిపించటమే భ్రాంతి.

దీన్ని నిరూపించేందుకు, ఒక ప్రక్రియ చెపుతా, విను – ఈ ప్రపంచమంతా ప్రళయంలో కనిపించకుండా పోతోంది కదా! ఎక్కడికి పోతోంది? ఎవరికి తెలీదు కానీ, ఆ స్థానం పరిశుద్ధమైన సత్స్వరూపమై వుండాలి. మళ్ళీ సృష్టి వచ్చినప్పుడు, దానిలోంచే వచ్చి వుండాలి. నిర్వికారమైన సత్పదార్థములోంచి ఒక సృష్టి వస్తోందంటే, అది భ్రాంతిరూపమై వుండాలి.

రామా! నీటిలో తరంగాలు పుట్టాయంటే, అవి నీటికంటే వేరు కాదు. కాకపోయినా, వేరుగా వున్నట్టు కనిపిస్తాయి. కొత్తగా పుడుతున్నట్లు కనిపిస్తాయి. అలాగే ఈ ప్రపంచం కూడా సద్రూపంలోంచి పుట్టినట్లు కనిపిస్తోంది. అంతే గానీ, దీనికి నిజమైన పుట్టుక లేదు.

ఇక 10వ సర్గలో రాముడు దీని మీద పై ప్రశ్న వేశాడు.
**రాముడు:** మహర్షీ! ఈ జగత్తు లయించి పోగా, మిగిలే వస్తువు నిరాకారమనటంలో సందేహం లేదు. కానీ, శూన్యం కాదనటం ఎలా కుదురుతుంది? ఒక వేళ శూన్యం కాకపోతే, ఈ సద్వస్తువు నిర్వికారమంటే ఎలా కుదురుతుంది? అది వున్నదీ కాదు, లేనిదీ కాదు. వెలుగూ కాదు, చీకటీ కాదు. చేతనమూ కాదు, జడమూ కాదు – అంటే ఎలా కుదురుతుంది? ఏదీ కాకపోతే తాను ఈ ప్రపంచాకారంగా ఎలా మారింది?
**వశిష్ఠుడు:** రామా! నా భావన నీకు సరిగ్గా అర్థం కాలేదు. మళ్ళీ విను.

**అనుత్కీర్ణా యథా స్తంభే సంస్థితా శాలభంజికా।**
**తథా విశ్వం స్థితం తత్ర తేన శూన్యం న తత్పదమ్॥** (ఉ.ప్ర.స.10, శ్లో.7)

ఈ స్తంభంమీద బొమ్మ వుంది. దీన్ని చెక్కక ముందు, ఈ బొమ్మ ఎక్కడ వుంది? ఈ రాతిస్తంభంలోనే వుందని చెప్పాలి. అప్పుడు బయటపడ లేదు. పక్కనున్న రాతి పెళ్ళలు కొన్ని చెక్కేస్తే, ఇప్పుడు బయటపడ్డది. ఇప్పుడు చెప్పు? ఈ రాతి స్తంబంలో వున్న బొమ్మ బయటపడిందా, కొత్తబొమ్మ పుట్టిందా? వున్న బొమ్మ బయటపడిందనటమే యుక్తియుక్తంగా వుంటుంది. ఉన్న బొమ్మ బయటపడిందంటే, అది బయట పడకముందు వున్న స్థితి శూన్యస్థితి కావటానికి వీల్లేదు. ఈ ప్రపంచం వ్యక్తం కాకముందు వున్న స్థితి కూడా అలాంటిదే. స్తంభంలో బొమ్మ వున్నట్లే. సద్రూపంలో ప్రపంచం వుంది. అందుచేత ఆ సద్రూపం శూన్యమనటానికి వీల్లేదు. బొమ్మలు చెక్కని స్తంభం శూన్యం కాదు. అలాగే ప్రపంచం లేని ప్రళయస్థితి శూన్యం కాదు.
**రాముడు:** స్థంభంలోంచి బొమ్మ పుట్టడంలో ఎవ్వరికీ అభిప్రాయ భేదం లేదు. మరి మీ బ్రహ్మలోంచీ ప్రపంచం పుట్టటం విషయంలో మాత్రం అనేక అభిప్రాయ భేదాలు వున్నాయి, ఎందుకని?

**వశిష్ఠుడు:** రామా! స్తంభం వుండే చోటు, స్తంభం మీద బొమ్మలు చెక్కేవాడు, వాడి చేతిలోని ఉలి, సుత్తి,అన్నీ ప్రత్యక్ష విషయాలు. అంటే స్తంభం విషయంలో దేశకాలక్రియలన్నీ లోకులకు ప్రత్యక్షాలు. అందుచేత ఎవ్వరికీ అభిప్రాయ భేదం వుండదు. ఇక బ్రహ్మ దగ్గరికి వస్తే, పరబ్రహ్మకు దేశకాలక్రియలే లేవు. బ్రహ్మ విషయంలో సాధనసంపత్తీ లేదు. అందుచేత బ్రహ్మ విషయంలో అభిప్రాయ భేదాలు వస్తున్నాయి.

**రాముడు:** అయితే, స్తంభంలో బొమ్మ సాధన సామగ్రివల్ల పుట్టింది. బ్రహ్మలో జగత్తు ఏ సాధన సామగ్రీ లేకుండానే పుట్టింది. ఈ రెంటికీ ఇంత భేదం వుండగా, బొమ్మకీ, జగత్తుకీ, పోలిక ఎలా చెప్పారు మీరు?

**వశిష్ఠుడు:** దృష్టాంతం చెప్పినప్పుడు, ఏ అంశంలో పోలిక చెప్పామో దాన్ని గ్రహించాలని ఇది వరకే చెప్పాను. స్తంభంలో వున్న బొమ్మకి స్తంభంయొక్క సత్త కంటే భిన్నంగా వేరే సత్త లేదు. అలాగే ఈ ప్రపంచానికి బ్రహ్మయొక్క సత్తకంటె భిన్నంగా వేరే సత్త లేదు. ఈ అంశంలో బొమ్మకూ, ప్రపంచానికీ పోలికను నేను చెప్పాను. నువ్వు ఆ దృష్టితోనే చూడు. ఇప్పుడాలోచించు. బ్రహ్మలో జగత్తు వ్యక్తమైంది. తరువాత లయించింది. ఇప్పుడు శూన్యత్వమంటే ఏమిటి? ఏ వస్తువూ కనిపించకపోతే దాన్ని శూన్యమని లోకులు అంటున్నారు. కనిపించకపోవటం శూన్యమా? లేకపోవటం శూన్యమా? ఎవరు తేల్చి చెప్పగలరు? లేకపోవటమే శూన్యమయ్యేటట్లయితే, బ్రహ్మ శూన్యం కాదు. కనిపించక పోవటమే శూన్యమయ్యేటట్లయితే, బ్రహ్మ అశూన్యం కాదు. కనుకనే బ్రహ్మ శూన్యమూ కాదు, అశూన్యమూ కాదు, అని చెప్పాం. బ్రహ్మకు శూన్యత్వాలు, అశూన్యత్వాలూ, లేవు అన్నాం. ఇవన్నీ భాషలో చమత్కారాలు. బ్రహ్మ వెలుగూ కాదు. చీకటీ కాదు. ఇలాంటి చోట్ల కూడా పై విధంగానే అర్థం చేసుకోవాలి.

ఇంతకూ మనం ఎక్కడ్డించి పక్క దారి పట్టామంటే, లీలోపాఖ్యానం ద్వారా నీకు నేను చెప్పబోయే దేమిటో, ఆ సిద్ధాంత భాగాన్ని చెపుతున్నాను. నీటిలో తరంగాలు పుట్టినట్లుగా, బ్రహ్మలో ప్రపంచం పుడుతోందనీ, ఇది పుట్టినట్లు కనిపించటమే గాని, నిజమైన పుట్టటం కాదనీ, అందువల్ల ఈ ప్రపంచం అసలు పుట్టనే లేదని ప్రతిపాదిస్తున్నాను. లీలోపాఖ్యానం ద్వారా దాన్నే నిరూపించబోతున్నాను.

## 19. రెండు రకాల పరబ్రహ్మ లక్షణాలు

ఇక్కడ వాల్మికిమహర్షి బ్రహ్మయొక్క స్వరూపలక్షణాలను–

1. యోగులకు తెలిసే బ్రహ్మ స్వరూపమని –

2. యోగులు కానివారికి తెలిసే బ్రహ్మ స్వరూపమని రెండు రకాలుగా విభజించి చెప్పదలచుకొన్నాడు. అందుకోసం చర్చను ఇక్కడ ఒక మలుపు తిప్పాడు.

**రాముడు:** వశిష్ఠుడి సిద్ధాంత వాక్యాలను విని రాముడడిగాడు – మహర్షీ! మీరు పరబ్రహ్మ, పరబ్రహ్మ, అంటున్నారే. దాని స్వరూపం కొంచెం వివరంగా చెప్పండి.

**వశిష్ఠుడు:** రామా! నిర్వికల్ప సమాధి సాధన చేసే యోగులు ఈ బ్రహ్మ స్వరూపాన్ని స్వచ్ఛంగా గ్రహించగలరు. వారు గ్రహించే స్వరూపలక్షణాలను చెపుతాను విను –

1. యోగం అంటే చిత్తవృత్తి నిరోధం. ఈ నిరోధరూపమైన సమాధిని సాధిస్తే, మనోవృత్తులన్నీ నశిస్తాయి. అవన్నీ నశించాక యోగికి ఒకానొక స్వయంప్రకాశమైన సద్వస్తువు సాక్షాత్కరిస్తుంది. అదే పరబ్రహ్మ.

2. యోగి నిర్వికల్ప సమాధిని సాధిస్తే అతనికి ధ్యాతా, ధ్యేయము, ధ్యానము, అనే త్రిపుటి లయించిపోతుంది. ఈ లయానికి ఒక సాక్షి మిగులుతాడు. ఆ సాక్షే బ్రహ్మ.

3. యోగి సమాధిలోకి వెళ్ళాడు. ఇంకా బయటికి రాలేదు. అతనిలో వుండే చైతన్యం విషయాల వైపు తిరగాలంటే, ఆ చైతన్యం ఇంకా జీవత్వాన్ని పొందాలి. అటువంటి సమయంలో, ఆ యోగి చైతన్యం ఒకానొక నిర్మలమైన, ప్రశాంతమైన, స్థితిలో వుంటుంది. అదే బ్రహ్మ స్వరూపం.

4. ఒక యోగి బ్రహ్మసమాధిలో వున్నాడు. అతని చిత్తం బ్రహ్మాకారాన్ని పొంది వుంది. వాడు జీవించి వున్నాడు. అయినా సరే, వాడి వంటికి గాలి స్పర్శగానీ, పుష్పాల వాసన గానీ, ఇవేమీ తెలియటం లేదు. ఇలాంటి దశలో అతని చిత్తానికి, ఏ రూపం అనుభవంలోకి వస్తుందో, అదే పరబ్రహ్మయొక్క స్వరూపం.

రామా! ఇక యోగులు కానివారికి తెలిసే బ్రహ్మ స్వరూపం చెపుతా విను–

1. ఒకడు నిద్రపోతున్నాడు. కలలు రావటం లేదు. ఆ సమయంలో వాడి మనసుకి జడత్వం లేదు. అలా వుంటే, వాడికి ఏ తత్త్వం గోచరిస్తుందో, జగత్ప్రళయంలో మిగిలే తత్త్వం అదే. అదే పరబ్రహ్మ స్వరూపం.

2. ఆకాశానికి తత్త్వమేమిటి? శూన్యత్వమే. రాతికి తత్త్వమేమిటి? ఘనత్వమే. అలాగే పరబ్రహ్మయొక్క తత్త్వమేమిటి? చిద్రూపత్వమే. అదే బ్రహ్మయొక్క స్వరూపం.

3. ఒక మనిషి సమస్త విషయాలను, చివరికి మనస్సును, విడిచి పెట్టాడనుకో. అప్పుడు ఏమి మిగిలి వుంటుందో వూహించు. అదే పరబ్రహ్మ స్వరూపము.

4. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయాలు అనే పంచకోశాలు వున్నాయి కదా! వీటిలో సూక్ష్మతమమైనది అనందమయ కోశం. దాని లోపల వుండేది కూడా పరబ్రహ్మ స్వరూపమే.

5. జీవుల సూక్ష్మదేహాలు అన్నీ కలిపితే ఏర్పడే సమష్టి సూక్ష్మశరీరం ఒకటి వుంటుంది. దానిలో సూక్ష్మాకాశం వుంటుంది. అట్టి సూక్ష్మాకాశంలో వుండేది పరబ్రహ్మరూపము.

6. పంచేంద్రియాలవల్ల ప్రత్యక్షజ్ఞానాలు కలుగుతున్నాయి. ఆ జ్ఞానాలలో అనుగతమై ఒక చైతన్యం వుంది. అదే పరబ్రహ్మ స్వరూపం.

7. మానవుడికి మనస్సు వుందని తెలుస్తోంది. ఆ మనస్సు పని చేస్తోందని, చేయటం లేదని, తెలుస్తోంది. ఇలా వీటన్నిటిలోనూ తెలుసుకొనే సాక్షిచైతన్యం ఒకటి వుండి వుండాలి కదా! అదే పరబ్రహ్మ స్వరూపం.

8. ప్రపంచానికి పుట్టుక లేదని నిరూపించాం. మళ్ళీ నిరూపించబోతున్నాం. పుట్టుక లేకపోయినా, అది పుట్టినట్టు కనిపిస్తోంది. ఎవరివల్ల అలా కనిపిస్తోంది? పరబ్రహ్మ వల్లే. నిజానికి ఈ ప్రపంచం ఆ బ్రహ్మ కంటే భిన్నం కాదు. అయినా, భిన్నం లాగా కనిపిస్తుంది. ఇలా ప్రపంచ జన్మకీ, ప్రపంచ స్మరణకీ, ఆధారమైందే పరబ్రహ్మ.

9. ప్రపంచ వ్యవహారం ప్రచండ వేగంతో సాగిపోతోంది. దీన్నంతా జరిపే పరబ్రహ్మ మాత్రం బండరాయి లాగా నిశ్చలంగా వుంది. అలా వుండటమే పరబ్రహ్మకు స్వరూప లక్షణం.

10. ఈ కనిపించే ఆకాశం పరిపూర్ణంగా వుంది. అయినా కొన్ని కోట్ల వస్తువులు వుండటానికి అవకాశం ఇస్తోంది. అవకాశం ఇస్తూ వుండటంవల్ల అది శూన్యం లాగా కనిపిస్తోంది. ఈ ఆకాశంతో సహా స్థూల సూక్ష్మ ప్రపంచాలన్నిటికీ అవకాశం కలిపిస్తోంది బ్రహ్మ. అలా అవకాశం కల్పిస్తూనే, తాను పరిపూర్ణమై వుంటూనే, శూన్యం లాగా కనిపిస్తూ వుండటమే పరబ్రహ్మ స్వరూపం.

11. తెలుసుకోదగినది, తెలుసుకోవటం, తెలుసుకొనేవాడు –ఇది ఒక త్రిపుటి. దీనినే వేద్యము, వేదనము, వేత్త అంటారు. ఇలాంటి త్రిపుటులు అనేకం పుడుతున్నాయి, పోతున్నాయి. దీనికి వివర్తకారణమైన ఆధారం ఒకటి వుండి వుండాలి, అదే పరబ్రహ్మ స్వరూపం.

12. **స్థావరాణాం హి యద్రూపం తచ్చేద్బోధ మయం భవేత్।**
**మనోబుద్ధ్యాది నిర్ముక్తం తత్పరేణోపమీయతే॥** (ఉ.ప్ర.స.10, శ్లో.53)

లోకంలో జడవస్తువులు వున్నాయి కదా! వాటికి మనో బుద్ధ్యాదులు లేకుండానే జ్ఞానం కలిగేటట్లయితే,

అప్పుడవి పరబ్రహ్మతో సమానమౌతాయి.

కనుక, రామా! ఇలాంటి పరబ్రహ్మయే సత్యమని, దానిలోనుండి జన్మించినట్టు కనిపిస్తున్న ఈ ప్రపంచానికి ఉత్పత్తే లేదని, లీలోపాఖ్యానంలో నేను నిరూపించబోతున్నాను.

ఇక 11వ సర్గలో శ్రీరాముడు ఇంచుమించు వేసిన ప్రశ్నలనే మళ్లీ మనోహరంగా వేసి, వశిష్ఠమహర్షినుండి సమాధానాలు రాబట్టాడు. ఇలా చేయటంలో ఉద్దేశ్యమేమిటంటే తర్కపరంగా విషయం దృఢపడటమే.

వశిష్ఠమహర్షి ఇప్పటిదాకా చెప్పిన వివరణ ప్రక్రియలో రెండు రకాల మాటలొచ్చాయి. తత్త్వదృష్టితో ఈ జగత్సృష్టి లేనే లేదు అంటున్నాడు. వ్యవహారదృష్టితో ఈ జగత్తు స్తంభంలో బొమ్మ లాగా వ్యక్తమైందంటున్నాడు. తత్త్వజిజ్ఞాస గలవాడు ఈ రెండు దృష్టులను విస్పష్టంగా అర్థం చేసుకోవాలి.

తత్త్వదృష్టితో జగత్తు పుట్టనే లేదని అంగీకరిస్తే, మిగిలి వుండేది శుద్ధమైన పరబ్రహ్మమే. దాని లక్షణాలను వశిష్ఠమహర్షి 10 వ సర్గలో చెప్పేశాడు. యోగులకు తెలిసే పరబ్రహ్మము ఎలా వుంటుంది? సామాన్యులకు తెలిసే పరబ్రహ్మము ఎలా వుంటుంది?  అని ఆయిన అక్కడ వివరించాడు.

## 20. సృష్టిక్రమము

ఇక వ్యవహారదృష్టిని అంగీకరించి జగత్తు స్తంభంలోని బొమ్మ లాగా వ్యక్తమైందంటే అలా వ్యక్తం కావటానికి ఒక ప్రక్రియ వుండాలి. దానినే సృష్టిక్రమము అంటారు. ఈ సృష్టిక్రమాన్ని వశిష్ఠమహర్షి 12వ సర్గలో వివరించాడు.

దీన్ని వర్ణించే ముందు కొన్ని ప్రధానాంశాలను వశిష్ఠుడు రాముడికి మళ్ళీ గుర్తు చేశాడు. అవి ఏమంటే –

1. ప్రళయకాలంలో పరబ్రహ్మ మన సుషుప్తాత్మ లాగా వుంటాడు.

(అంటే మనం సుషుప్తిలో ఎలా వుంటామో, అలా వుంటాడు.)

2. సృష్టి సమయంలో పరబ్రహ్మ మన స్వప్నాత్మ లాగా వుంటాడు. ఆయన స్వప్నమే మన ప్రపంచం.

3. వ్యష్టి స్వప్నం ఆ వ్యక్తి వాసనలవల్ల తయారవుతుంది.

4. బ్రహ్మయొక్క స్వప్నరూపమైన ఈ ప్రపంచం, జీవులందరియొక్క సమష్టి సంస్కారంవల్ల పుట్టింది.

5. అందుకే ఇది అబద్ధమని ఎవరూ అనుకోరు, చెప్పినా నమ్మరు.

6. తన ఒక్కడి సంస్కారమే ఈ ప్రపంచానికి కారణమై వుంటే, ఇది అసత్యమని సులభంగానే తెలిసి వుండేది. స్వప్నం విషయంలో అలా తెలుస్తూనే వుంది. ఇతరుల సంస్కారాలు కూడా కలిసి వుండటంవల్ల, వాటన్నిటివల్ల జన్మించిన ఈ ప్రపంచాన్ని అసత్యమని జీవులు గ్రహించ లేకుండా వున్నారు. స్వప్న ప్రపంచానికీ, జగ్రత్ప్రపంచానికీ, మధ్య తేడా ఇదే.

ఇలా వెనుకటి విషయాలు గుర్తు చేశాక వశిష్ఠ మహర్షి సృష్టిక్రమాన్ని ఇలా వివరించాడు.

సుషుప్తి సమయంలో, ఇంకా స్వప్నం మొదలు కాక ముందు, నీ సంస్కారాలన్నీ నీలోనే కలిసిపోయి, నీరూపం గానే వుంటాయి. వ్యక్తం కాబోయే సంస్కారాల దృష్టితో చూస్తే అప్పుడు నువ్వు సర్వాత్మకుడివి. ఇదే రీతిగా ప్రళయకాలంలో బ్రహ్మ సర్వాత్మకుడు, సన్మాత్ర స్వరూపుడు.

సుషుప్తిలో నిశ్చలంగా వున్న నీలో ఏదో ఒక చలనం ప్రారంభమైతే, దానిలోంచి స్వప్నం మొదలవుతుంది. అలాగే, ప్రళయదశలో వున్న బ్రహ్మకు ఒక “ఈక్షణం” బయలుదేరింది. ఈక్షణం అంటే చూపు, అంటే సంకల్పం, అంటే ఊహ, అంటే ఆలోచన.

దానివల్ల ఆ బ్రహ్మకు ఈశ్వరుడనే పేరు వచ్చింది.(ఈశ్వరుడంటే మాయోపాధికమైన చైతన్యం.)

క్రమంగా ఈ "ఈక్షణం" అనే వృత్తి ముదిరి, గట్టిపడి, జీవత్వాన్ని పొందింది. ఇతడే ప్రథమ జీవుడు. ఇతనికి హిరణ్యగర్భుడు అని పేరు పెట్టారు.

ఇతనినుంచి ఇంద్రియాధిదేవతలు పుట్టారు. (సూర్యుడు మొదలైనవారు.)

తరువాత పంచమహాభూతాలు పుట్టాయి.

తరువాత అహంకారం పుట్టింది.

దీనితో పాటే కాలం పుట్టింది.

ఆకాశంనుంచీ శబ్దము, వేదాలు పుట్టాయి.

తరువాత పంచమహాభూతాలు పంచీకృతాలై బ్రహ్మాండాలుగా ఏర్పడ్డాయి.

ఇలా సంగ్రహంగా సృష్టిక్రమాన్ని చెప్పిన తరువాత వశిష్ఠమహర్షి మళ్ళీ వెనక్కి అన్వయం చేసి చూపించాడు. ఎలాగంటే–

ఈ జగత్తుకి అణుగుచ్ఛాలు కారణం. (త్రసరేణువులు అనే పదాన్ని అణుగుచ్ఛము అని మనం అర్థం చేసుకోవాలి. ఇది ఈనాటి వైజ్ఞానికులు చెప్పే 'మాలిక్యూలు' వంటిది అని కూడా మనం గ్రహించాలి.)

అణుగుచ్ఛాలకి అణువులు కారణం.

అణువులకు పంచభూతాలు కారణం.

వాటికి తన్మాత్రలు కారణం.

వాటికి పరమాత్మను ఆవరించిన మాయా శక్తి కారణం.

ఇదీ వరుస. అంటే ఏమి తేలింది ? పరమాత్మతత్త్వమే మాయాశక్తి ద్వారా ప్రపంచానికి మూల కారణమవుతోంది.

**బీజం జగత్సు నను పంచకమాత్రమేవ**
**బీజం పరావ్యవహితస్థితి శక్తిరాద్యా ।**
**బీజం తదేవ భవతీతి సదానుభూతం**
**చిన్మాత్రమేవ మజమాద్య మతో జగచ్ఛ్రీః॥** (ఉ.ప్ర.స.12, శ్లో.32)

పరావ్యవహిత స్థితి శక్తి అంటే, పరమాత్మను సాక్షాత్తుగా ఆవరించి వున్న జగత్స్థితి కారకమైన శక్తి. అదే జగత్తుకి అసలైన కారణం.

దీన్నిబట్టి ఏమి తేలుతోంది ? మాయను తొలగించుకొంటే, ప్రపంచం బ్రహ్మస్వరూపంగా మిగులుతుంది అని తేలుతుంది.

రామా! సృష్టి క్రమమంతా వర్ణించి చెప్పడంలో ఉద్దేశ్యం ఇదే ! సృష్టి నిజంగా ఉందని మా ఉద్దేశ్యం కాదు. లేని సృష్టికి క్రమాన్ని వర్ణించటం ద్వారా, ఇది పరబ్రహ్మ కంటే భిన్నంగా లేదని నిరూపించాలనేదే మా ప్రయత్నం– అన్నాడు వశిష్ఠుడు.

ఈ విధంగా సృష్టి క్రమాన్ని పూర్తి చేసిన వశిష్ఠుడు, 13వ సర్గలో, అసలు కిటుకును బయట పెట్టేశాడు. 1వ సర్గకు, 13వ సర్గకు, దగ్గర సంబంధం వుందంటూ ఈ విషయాలను మనం ఇదివరకే చెప్పుకొన్నాం. కానీ, ఆ చెప్పుకోవటంలో విషయాన్ని కొంత ఆధునికీకరించి చెప్పుకొన్నాం. ఇప్పుడు ఆ విషయాలను చాలా సంగ్రహంగా, గ్రంథంలో వున్న వరుసలో చెప్పుకుపోదాం.

## 21. 13వ సర్గ విషయాలు

1. రామా ! ప్రళయకాలంలో పరమాత్మ తెలివి రూపంగా వున్నాడు. అంటే చిద్రూపంగా నున్నాడు.
2. తరువాత ఆయన తెలుసుకొనుట అనే వికారాన్ని పొందాడు. బ్రహ్మ జీవుడవటమంటే ఇదే.
3. ఈ జీవుడినుంచే బ్రహ్మాండాలన్నీ పుట్టాయి. ఇతర జీవులందరూ పుట్టారు. ఆ సృష్టి క్రమమంతా నీకు చెప్పాను.
4. రామా ! నీకు రెండు లోకాలున్నాయి. ఒకటి నీ స్వప్న లోకం. రెండు నీ జాగ్రత్ లోకం.
5. వీటిలో నీ స్వప్నలోక గత జీవులకు నువ్వు ఎలాంటి వాడివో ఈ జాగ్రత్ లోక గత జీవులకు హిరణ్యగర్భుడు అలాంటివాడు.
6. పెద్ద మంటనుంచీ చిన్న నిప్పురవ్వలు బయలుదేరినట్లుగా, హిరణ్యగర్భుడినుంచీ కోటానుకోట్ల జీవులు బయటకి వచ్చి, ఎవరికి వారు – నేను వేరు, అంటున్నారు
7. నిప్పురవ్వ వంటి ఈ భావమే క్రమంగా గట్టిపడి, వాడు విడిగా ఒక జీవుడవుతున్నాడు
8. అందుకే జీవుడు మనోమయుడు అని పెద్దలు నిశ్చయం చేశారు
9. నేను వేరే జీవుడ్ననే భావం ఇంకా ముదిరి, వాడికి ఒక శరీరం ఏర్పడుతోంది.
10. ఇతడు చూడాలి అనుకోగానే కళ్ళు ఏర్పడతాయి. వినాలి అనుకోగానే చెవులు ఏర్పడతాయి.
11. ఈ జీవుల్లో కొంతమంది సంస్కారబలంచేత అధికార పురుషులవుతారు.
12. రామా! ఈ రకమైన వివరణవల్ల నువ్వు అర్థం చేసుకోవలసిన ముఖ్యాంశాలేమంటే–
హిరణ్యగర్భుడూ మనోమయుడే. అయితే, అతను జీవుల సమష్టిమనోమయుడు
నీ జాగ్రత్ప్రపంచమంతా అతని సంకల్పం మాత్రమే.
అందుచేత ఈ జగత్తు లేనిది.దీనికి పుట్టుకే లేదు.

ఈ విధంగా వశిష్ఠమహర్షి మళ్ళీ మరో సారి మరొక ప్రక్రియలో జగత్తుకి ఉత్పత్తే లేదని తేల్చేసరికి, రాముడు కొంచెం ఆలోచించి, ఈ సృష్టి ప్రక్రియ మీద ఒక ప్రశ్న వేశాడు. ఈ ప్రశ్నతోనే 14వ సర్గ ప్రారంభమైంది.

## 22. జగజ్జీవ హిరణ్యగర్భులు ముగ్గురూ సంకల్ప స్వరూపులే

**రాముడు:** మహర్షీ ! ఆది జీవుడనే హిరణ్యగర్భుడు చాలా పెద్ద స్వరూపం కలవాడని మీరు వర్ణించారు. అంటే, ఆయన అపరిచ్ఛిన్నుడు. పంచభూతాలకంటే ముందే ఆయన జన్మించాడు కనుక, ఆయన పరిమితికి కొలతలు వేయటానికి వీల్లేదు. కానీ, వ్యష్టిజీవుడో? వీడు పంచభూతాల తరువాత జన్మించిన వాడు. వీడికి కొలతలు వెయ్యవచ్చు. వీడు పరిచ్ఛిన్నుడు. ఇలా హిరణ్యగర్భుడికి, వ్యష్టిజీవికీ, బ్రహ్మాండమైన భేదం వుండగా స్వప్నలోకానికి వ్యష్టిజీవుడు ఎట్లాంటివాడో, జాగ్రత్ లోకానికి హిరణ్యగర్భుడు అలాంటివాడని మీరు చెబుతారేమిటి? జీవ హిరణ్యగర్భులకు పోలిక ఎలా కుదురుతుంది?

**వశిష్ఠుడు:** రామా! పరిశుద్ధ చైతన్యవస్తువులో ఒక సంకల్పం, ఒక ఈక్షణం, ఏర్పడి అది గట్టిపడగా, హిరణ్యగర్భుడు జన్మించాడు అని చెప్పుకొన్నాం. అంటే హిరణ్యగర్భుడు సంకల్పంవల్ల జన్మించినవాడు. వాడిలోంచి నిప్పురవ్వలు లాగా సంకల్పాలు లేచి, గట్టిపడి, అహంకారరూపం పొంది, వ్యష్టిజీవులుగా ఏర్పడుతున్నారు

అని గూడా చెప్పుకొన్నాం. అంటే వీళ్ళూ సంకల్పం వల్ల జన్మించినవారే. కాగా, హిరణ్యగర్భుడూ సంకల్ప స్వరూపుడే. వృష్టి జీవీ సంకల్ప స్వరూపుడే. వీళ్ళ సంకల్పాలవల్ల ఏర్పడే జగత్తూ సంకల్ప స్వరూపమే.

రామా! అన్నిటికీ మూలం సంకల్పమే. అందరికీ మూలం సంకల్పమే. ఆ సంకల్పం గట్టిగా వుంటే స్థూలపదార్థం తయారవుతుంది. అది సామాన్యంగా వుంటే సూక్ష్మ వస్తువు తయారవుతుంది. అంతే తేడా. అంతకు మించి ఏమీ లేదు.

కనుక, జగత్తూ, జీవుడూ, హిరణ్యగర్భుడూ ఈ ముగ్గురూ సంకల్ప స్వరూపులే. ఏమీ తేడా లేదు.

కనుక, వీరిలో ఒకడు పరిచ్ఛిన్నుడనీ, మరొకడు అపరిచ్ఛిన్నుడనీ ఎలా విడదీస్తావు?

ఇందాక నేను చెప్పేటప్పుడు మంటల్లోంచి రవ్వలు లేచినట్లుగా, హిరణ్యగర్భుడిలోంచి జీవులు బయలుదేరుతున్నారని చెప్పాను. దీనినిబట్టి జీవులనేవాళ్ళు ఒక చోటునుంచీ బయలుదేరి ఇంకొకచోటుకి వెళుతున్నారని నువ్వు అర్థం చేసుకున్నావనుకొంటాను. అది పొరపాటు. అలా వెళ్ళేందుకు వేరే చోటు లేదు. జీవులందరూ కూడా శుద్ధ చైతన్యంయొక్క సంకల్ప వృత్తులలో ఉదయించి, మళ్ళీ అక్కడే లయిస్తున్నారు.

కనుక, రామా! జీవుడికీ, హిరణ్యగర్భుడికీ, ఏ విధమైన భేదమూ లేదు, ఉండటానికి వీల్లేదు.

**రాముడు:** గురుదేవా! ఒప్పుకొన్నాను. వృష్టిజీవికీ, సమష్టిజీవికీ తేడా లేదు. అయితే వృష్టిజీవులకు భోగేచ్ఛ కనిపిస్తోంది. దీన్నిబట్టి సమష్టిజీవి కూడా భోగేచ్ఛ గలవాడే అని చెప్పాలి. దీనికి ఒప్పుకొంటారా? మీ సమష్టిజీవుడనే హిరణ్యగర్భుడు అనంత శక్తి సంపన్నుడు, సత్యకాముడు, సత్య సంకల్పుడు. ఇలాంటి గుణాలు ఆయనకు చాలా వున్నాయని వేదాలలో వుంది. మరి వాడూ, జీవుడూ, ఒక్కటే అయితే, సామాన్యజీవుడికి కూడా ఈ సత్యకామాది లక్షణాలన్నీ సరిపోతాయని మీరు వాదిస్తారా?

**వశిష్ఠుడు:** రామా ! అలాంటి వాదాలు మేము చెయ్యం. చెప్పింది సరిగ్గా నువ్వే వినలేదు. మళ్ళీ చెబుతాను విను. బ్రహ్మ మొదట ఒక రకమైన సంకల్పం చేసి, దానివల్ల సత్యకామాది గుణవిశిష్టుడైన హిరణ్యగర్భుడిగా ఏర్పడ్డాడు. ఆ తరువాత ఆ బ్రహ్మయే హిరణ్యగర్భుడి ద్వారా వృష్టిజీవుడిగా కావాలని సంకల్పించాడు. సమష్టిజీవుడు కావాలనుకున్నప్పుడు వున్న సంకల్పం వేరు. వృష్టి జీవుడు కావాలనుకున్నప్పుడు వున్న సంకల్పం వేరు. సంకల్పాలు వేరు వేరుగా వుంటే, ఫలితాలు ఒకే రకంగా వుంటాయా? అసంభవం. అందుకే సమష్టిజీవి ఆ గుణాలతో పుట్టాడు. వృష్టిజీవి ఈ గుణాలతో పుట్టాడు. అందుచేత ఒకడికి భోగేచ్ఛ వుంటే, మరొకడికి కూడా అదే వుండి తీరాలని నియమం లేదు. అలాగే ఒకడికి మహాశక్తి వుంటే, రెండవ వాడికి కూడా అలాగే వుండాలని నియమం లేదు.

రామా! సమష్టిజీవుడి పనులు సంకల్పం మాత్రం చేతనే నెరవేరుతాయి. వృష్టిజీవుల పనులు సాధనాలచేత, ప్రయత్నంచేత నెరవేరుతాయి. ఎందుకంటే,వారి వారి సంకల్పాలు అలా వున్నాయి.

**రాముడు:** కొందరు మహానుభావులు ఏ ప్రయత్నమూ లేకుండానే పనులు చేసి చూపిస్తున్నారే?

**వశిష్ఠుడు:** అక్కడ సమష్టిజీవుడి సంకల్పమే పని చేసిందని గ్రహించాలి. “ఈ మహర్షియొక్క సంకల్పం సిద్ధించుగాక!” అని సమష్టిజీవుడు సంకల్పిస్తే, అలా జరుగుతుంది. రామా!నిజానికి వృష్టిజీవ, సమష్టిజీవులకు భేదం లేదని నేనంటే, సంకల్పభేదం వుందని నువ్వు నిరూపించాలనుకొంటున్నావు. సంకల్పభేదం వుంది కానీ, ఇది వారిలో వస్తు భేదాన్ని కల్పించలేదు. ఇది అర్థం కావాలంటే నీకు జీవుడంటే ఏమిటో, ప్రాణమంటే ఏమిటో, ఇంద్రియమంటే ఏమిటో తెలియాలి, చెపుతా విను.

1. రామా! చైతన్యంలో అహంకారం చేరితే, అప్పుడా చైతన్యం జీవుడవుతుంది. వీడు కర్త.
2. చైతన్యంలో స్పందం (కదలిక) ఏర్పడితే అప్పుడది ప్రాణమవుతుంది. ఇది క్రియ.
3. కర్తయొక్క ధర్మమే క్రియ. ధర్మానికీ, ధర్మికీ తేడా వుండదు. అందుచేత జీవుడికీ, ప్రాణానికీ తేడా లేదు.

4. జీవత్వాన్ని పొందిన చైతన్యానికి ఉపాధి మనస్సు.
5. ఈ మనస్సే ఆయా గోళాలలో వున్నప్పుడు ఆయా ఇంద్రియంగా పిలవబడుతూ వుంటుంది.

రామా! ఉపాధిభేదాన్ని బట్టి పై వాటిలో గుణభేదం ఏర్పడుతుంది. అంతేగానీ, వస్తుభేదం లేదు, లేని భేదం ఉన్నట్టు కనిపిస్తోంది.

**పల్లవాంతర లేఖౌఘ సన్నివేశపదాతతమ్॥** (ఉ.ప్ర.స.14, శ్లో.81)

ఒక చిగురుటాకుని తీసుకొని, దాన్ని బోర్లించు. అది మొత్తం ఆకే. కానీ, దాని వెనకాల వున్న ఈనెలు చూపించి, ఇదేమిటి అంటే, ఈనెలు అంటారు గానీ, ఆకు అనరు. అలా అన్నంతమాత్రం చేతనే– ఈనె వేరు, ఆకు వేరు, అని చెప్పేందుకు వీల్లేదు. బ్రహ్మ ఆకైతే, ప్రపంచం ఈనె. ఇవి వేరుగా కనిపిస్తాయి గానీ, వేరు కాదు.

ఈ విషయాలు వాదన ద్వారా కంటే కథ ద్వారా బాగా తెలుస్తాయి. కనుక, లీలోపాఖ్యానము అనే చక్కని కథ చెపుతాను, జాగ్రత్తగా విను–

## 23. లీలోపాఖ్యానము

ఇది 46 సర్గల పాటు సాగిన పెద్ద కథ. దీనికి లీలోపాఖ్యానమని, మండపోపాఖ్యానమని, రెండు పేర్లు. ఇందులో చాలా సొగసైన, కవితామయమైన వర్ణనలున్నాయి. మంచి పట్టయిన తత్త్వచర్చలున్నాయి. మనం విషయ ప్రధానంగా, సంగ్రహంగా ఈ కథ చెప్పుకొందాం–

పద్ముడనే గొప్ప రాజు ఒకడు వుండేవాడు. అతని భార్య పేరు లీల. వారిద్దరూ రతీమన్మథుల్లాగా చాలా కాలం సుఖంగానే వున్నారు.

కొంచెం వయస్సు మళ్ళుతూ వుండగా, లీలకు ఒక కొత్త చింత పట్టుకుంది. "నా భర్తా, నేను, ఎంతో అన్యోన్యంగా వున్నాం. క్రమంగా మేము ముసలివాళ్ళమైపోతే ఏమి సుఖం? దానికి మించి నా భర్త మరణిస్తే, నేనెట్లా తట్టుకోవాలి?"– అని.

మహారాణి లీల దేశంలోని గొప్ప గొప్ప బ్రాహ్మణులందరినీ పిలిచి, సమావేశపరచి– "మానవులకు మరణం లేకుండా వుండే ఉపాయం చెప్పండి?" అని అడిగింది.

వాళ్ళు ఆమె చేసిన సత్కారాలకు చాలా మొహమాట పడ్డప్పటికీ, అసుల విషయం మాత్రం కుండ పగులగొట్టినట్లు  తేల్చి చెప్పారు. "మహారాణీ! పుట్టినవాడు గిట్టక తప్పదు.ఏ తపస్సులూ దాన్ని ఆపలేవు" అన్నారు.

అది విని లీల కొత్త ఆలోచనలు మొదలు పెట్టింది. ఆమె ఇలా ఆలోచించసాగింది–

"నా భర్తకంటే ముందర నేనే మరణిస్తే, నాకే దుఃఖమూ వుండదు. ఒక వేళ నా భర్త నా కంటే ముందుగా మరణిస్తే, ఆ మరణించిన జీవుడు నా ఇంటినుంచి బయటకు పోకూడదు. ఆ జీవుడు నా ఇంట్లోనే తిరుగుతూ వుంటే, మేమిద్దరమూ ఒకరినొకరు చూసుకొంటూ వుంటాం. ఇలా నా మరణం దాకా జరిగితే నా కోరిక తీరుతుంది. ఇలాంటి శక్తిని నా ఇష్టదైవమైన సరస్వతీదేవి మాత్రమే ఇవ్వగలదు. కనుక, ఇవ్వాళ్టి నుంచే ఘోర నియమాలతో ఆ దేవిని ఆరాధిస్తాను. నా భర్తకు తెలిస్తే, ఈ వ్రతాలు చెయ్యనీయడు. కనుక, రహస్యం గానే ఆయన క్షేమం కోసం ఈ వ్రతాలు చేస్తాను."

లీలాదేవి ఇలా ఆలోచించి, ఇక నియమాలు ప్రారంభించింది. ఉపవాసాలు, దానాలు, ధ్యానాలు, పెరిగి పోయినాయి. ఇలా 300 రోజులు గడిచేసరికి, సరస్వతీదేవి ప్రత్యక్షమై వరం కోరుకోమన్నది.

లీల ఇలా కోరుకుంది–

"అమ్మా! నా భర్త మరణించినాక ఆ జీవుడు నా అంతఃపురం దాటి బయటకు పోకూడదు. ఈ విషయంలో నేను కోరినప్పుడల్లా, నువ్వు వచ్చి దర్శనమిస్తూ వుండాలి."

జ్ఞానస్వరూపిణి అయిన సరస్వతీదేవి ఏమీ పేచీ పెట్టకుండా తథాస్తు అనేసి, మాయమైపోయింది. మహారాణి ఆనందంతో పొంగిపోయింది.

కొంత కాలం గడిచింది. ఒక రోజున ఆ పద్మరాజు మరణించనే మరణించాడు. లీలాదేవి విలవిలలాడిపోయింది. ఆమెకు సరస్వతీదేవిని ప్రార్థించాలని కూడా తోచలేదు. కానీ, కరుణామయురాలైన సరస్వతీదేవే జాలిపడి, ఆకాశవాణి రూపంలో ఇలా చెప్పింది. "లీలాదేవీ! నీ భర్త శరీరాన్ని పూలరాశిలో దాచి వుంచు. పూలు వాడిపోతాయి గానీ, ఆ శరీరం వాడిపోదు. అతడు మళ్ళీ నీకు భర్తవుతాడు. ఆ జీవుడు నీ అంతఃపురం విడిచిపోడు."

ఈ ఆకాశవాణి పలుకులు లీలాదేవికి మాత్రమే కాదు, అక్కడ వుండే మంత్రులకూ, బంధువులకూ, అందరికీ వినిపించాయి. పద్మరాజు శరీరాన్ని పూలలో పెట్టారు. ఏం జరుగుతుందో అని అందరూ ఎదురుచూస్తూ కూర్చున్నారు. క్రమంగా అందరికీ నిద్రలు పట్టాయి.

లీలాదేవికి మాత్రం నిద్రపట్టక సరస్వతీ ధ్యానంలో పడిపోయింది. కొంతసేపయ్యాక ఆ ధ్యానంలో సరస్వతీదేవిని రమ్మని పిలిచింది. వరం ప్రకారం సరస్వతీదేవి వెంటనే వచ్చింది. వస్తూనే సరస్వతీదేవి "ఎందుకమ్మా! ఏడుస్తున్నావు? ఈ సంసార భ్రాంతులన్నీ ఎండమావి నీళ్ళే కదా! ఇందులో ఏడ్చేదేముంది?"– అంది.

లీలకు ఈ వేదాంతం ఏమీ పట్టలేదు. ఆమె భోరుమంటూ "అమ్మా! ఇప్పుడు నా భర్త ఎక్కడ వున్నాడు? ఎలా వున్నాడు? ఏమి చేస్తున్నాడు? నేనొక్కత్తినే బ్రతకలేను. నన్ను ఆయన దగ్గరకు తీసుకుపో"– అంది.

## 24. మూడు ఆకాశాలు

సరస్వతీదేవి ఏమీ చలించిపోలేదు. ఆమె గంభీరంగా ఇలా చెప్పసాగింది.

"వరాననా! మూడు రకాల ఆకాశాలున్నాయి. ఒకటి– చిత్తాకాశము, రెండు– చిదాకాశము, మూడు– మామూలు ఆకాశము. ఇదే లోకాకాశము. లోకాకాశమే శూన్య రూపమైనది. అంటే ఖాళీగా వుండేది. చిత్తాకాశం దానికంటే శూన్యతరమైనది. చిదాకాశం దానికంటే గూడా అధికంగా శూన్యతరమైనది. నీ భర్త ఇప్పుడు ఈ చిదాకాశంలో ఉన్నాడు."

ఇక్కడ సరస్వతీదేవి చెప్పిన మాటలకు కొద్దిగా వివరణ చెప్పుకోవాలి. ఆమె మూడు రకాల ఆకాశాలున్నాయన్నది. ఆకాశమంటే ఏమిటి? పదార్థాలు వుండటానికి అవకాశం ఇచ్చేది ఆకాశం. ఆ లక్షణం మనకు లోకంలో కనిపించే ఈ లోకాకాశానికి బాగా పడుతుంది.

ఈ ఆకాశం ఎక్కడ వుంది? మొత్తం జగత్తంతా జీవియొక్క మనస్సులోనే వుందని ఇప్పటికి చాలా సార్లు నిరూపణ చేసి చెప్పారు. అంటే ఈ ఆకాశం గూడా మన చిత్తంలోనే వుంది. అంటే మన చిత్తం ఈ ఆకాశం వుండటానకి అవకాశం ఇస్తోంది. అందుచేత పదార్థాలు వుండటానికి అవకాశం ఇచ్చేది ఆకాశం– అనే నిర్వచనం ప్రకారం, మన చిత్తం కూడా ఒక ఆకాశమే అవుతుంది. అందుచేత చిత్తాన్ని చిత్తాకాశము అంటారు.

ఇప్పుడు రెండాకాశాలు తేలాయి. 1. లోకాకాశము, 2. చిత్తాకాశము. వీటిలో లోకాకాశం వెళ్ళి చిత్తాకాశంలో వుంటుంది. కనుక, లోకాకాశం కంటే చిత్తాకాశం అధికంగా సూక్ష్మమని, అధికంగా శూన్యమని చెప్పాలి.

మన చిత్తం ఎక్కడ వుంది? అది శుద్ధ చైతన్యంలోనే వుంది. కనుక, శుద్ధచైతన్యం చిత్తమనే పదార్థం వుండటానికి అవకాశం ఇస్తోంది. కాబట్టి, మన నిర్వచనం ప్రకారం చైతన్యం కూడా ఒక ఆకాశమే అవుతుంది. దాన్ని చిదాకాశం అంటారు. ఇది చిత్తాకాశాన్ని ధరిస్తోంది కనుక, దానికంటే కూడా అధిక సూక్ష్మమూ, అధిక శూన్యమూ అవుతుంది.

ఈ వివరణను మనస్సులో పెట్టుకొనే సరస్వతీదేవి నీ భర్త చిదాకాశంలో వున్నాడు అని చెప్పింది. సరస్వతీదేవి మళ్ళీ తన బోధను ఇలా కొనసాగిస్తోంది–

"లీలా! నా భర్త ఎక్కడున్నాడు? ఏమి చేస్తున్నాడు? అని చాలా అడిగావు. అన్నిటికీ ఒకటే సమాధానం– చిదాకాశం అని. నీ భర్త చిదాకాశంలో వున్నాడు. చిదాకాశంగా వున్నాడు. ఆ చిదాకాశాన్నే ఏకాగ్రంగా భావన చెయ్యి. అది నీకు కనిపిస్తుంది. నువ్వు దాంట్లోకి వెళ్ళి దాన్ని అనుభవించ గలుగుతావు. లీలా! చిదాకాశమంటే ఏమిటని అడుగుతావేమో! విను–

## 25. చిదాకాశ నిర్వచనం

**దేశాద్దేశాంతర ప్రాప్తౌ సంవిదో మధ్యమేవ యత్।**
**నిమేషేణ చిదాకాశం తద్విద్ధి వరవర్ణిని॥** (ఉ.ప్ర.స.17, శ్లో.12)

"లీలా! దీనికి కొంత వివరణ చెప్పుకోవాలి. ఇది వేదాంత విద్యలో ప్రధానమైన శ్లోకాలలో ఒకటి. దీనిలో చిదాకాశాన్ని విస్పష్టంగా నిర్వచిస్తున్నారు.

సంవిత్ అంటే చిత్తవృత్తి. అంటే మనస్సు, ఆలోచన. మనస్సులో మొదట కుండ గురించి ఒక ఆలోచన వచ్చిందనుకొందాం. ఇంతలో చెట్టు గురించి మరో ఆలోచన వచ్చిందనుకుందాం. చిత్తవృత్తి కుండ నుంచి చెట్టు దగ్గరకు పోవటానికి ఎంత సమయం కావాలి? ఒక్క నిమిషం చాలు. ఇక్కడ నిమిషం అంటే చాలా అల్ప సమయమని భావం. ఇలా అత్యంత అల్పసమయంలో చిత్తవృత్తి కుండ దగ్గరనుంచీ, చెట్టు దగ్గరకి పోయేటప్పుడు మధ్యలో ఏముంది? ఆలోచనకీ ఆలోచనకీ, మధ్యలో మామూలు ఆకాశం వుందని చెప్పడానికి వీల్లేదు. ఎందుకంటే– మనస్సు మధ్యలో మామూలు ఆకాశం వుండేందుకు వీల్లేదు కదా! కనుక, కుండ అనే ఆలోచనకీ, చెట్టు అనే ఆలోచనకీ, మధ్యలో ఏది వుంటుందో అదే చిదాకాశం.

ఒకడికి ముందు దుఃఖం వచ్చింది. అంతలోనే సంతోషం వచ్చింది. ఈ దుఃఖానికీ, సంతోషానికీ, మధ్యలో దుఃఖమూ సంతోషమూ, రెండూ కానిది ఏదో ఒకటి వుండి వుండాలి కదా! అదే చిదాకాశం.

"దీన్నే మరో రకంగా కూడా చెప్పవచ్చు. ఒకడు వేసవి కాలంలో రాత్రిపూట డాబామీద పడుకొన్నాడు. అర్థరాత్రి మెలుకువ వచ్చి కళ్ళు తెరిచే సరికి, ఆకాశంలో చందమామ కనిపించాడు. కళ్ళు తెరచిన తరువాత చందమామను చూడటానికి ఎంతసేపు పట్టింది? ఒక్క క్షణం పట్టింది. ఈ క్షణకాలంలో పరబ్రహ్మయొక్క పరిస్థితి ఏమిటి? అది ఇటు నీ హృదయంలో చిత్తవృత్తి ఆకారంలో వుంది. అటు ఆకాశంలో చంద్రుడి ఆకారంలో గూడా అదే వుంది. మరి చంద్రునికీ, నీ చిత్తానికీ మధ్యలో, ఆ క్షణంలో, పరబ్రహ్మయొక్క స్థితి ఏమిటి? అక్కడ బ్రహ్మ నిరాకారంగా వుంది. ఆ నిరాకార బ్రహ్మస్వరూపం పేరే చిదాకాశం.

"లీలా! ఇలాంటి చిదాకాశాన్ని నువ్వు అందుకోవాలనుకుంటే, దానికి ఒకటే ఉపాయం వుంది. నీలో గల సంకల్పాలన్నీ తొలగించు. అంటే చిత్తవృత్తులన్నీ తొలగించు. అప్పుడు నీ పరిస్థితి ఏమిటి? నీలో కుండ చిత్తవృత్తీ లేదు. చెట్టు చిత్తవృత్తీ లేదు. ఇక మిగిలిందేమిటి? చిదాకాశం ఒక్కటే. అదే నువ్వైపోతావు.

"లీలా! ఈ మాటనే మరో రకంగా చెప్పవచ్చు. నీకు చిదాకాశంలో సుస్థిరమైన స్థితి లభించాలంటే, ఈ జగత్తు బొత్తిగా లేకుండా పోవాలి. జగత్తంటే ఏమిటి? నీ సంకల్పాలే జగత్తు. నీ సంకల్పాలు నీ వాసనలవల్ల వస్తాయి. వాసనలు అవిద్యవల్ల వస్తాయి. కనుక, నీలోని అవిద్యను తొలగించుకొంటే, నీకు జగత్తు అనేది పూర్తిగా లేకుండా పోతుంది. దానికోసం కృషి చెయ్యి.

"లీలా! చిదాకాశంలోకి వెళ్ళాలంటే ఇదొక్కటే మార్గం. వేరే మార్గం లేనే లేదు. ఈ మార్గం అంత తేలిక కాదు. కానీ, వరప్రభావంవల్ల నీకు సులభంగా లభిస్తుంది. ప్రయత్నించు."

## 26. చిదాకాశ ప్రపంచ దర్శనము

ఇలా చెప్పి సరస్వతీదేవి అంతర్థానమై పోయింది. లీలాదేవికి సమాధి కొనసాగింది. క్షణాలలోనే అది నిర్వికల్ప సమాధిగా మారిపోయింది. క్షణాలలో ఆమెకు తన స్థూలదేహం మీద వున్న "నేను" అనే భావం (అభిమానం) ఎగిరిపోయింది. ఆమె కొమ్మమీది నుంచి ఎగిరిన పక్షి లాగా చిదాకాశంలోకి చేరింది.

ఆ చిదాకాశంలో ఆమెకు తన భర్త కనిపించాడు.

అది తన యిల్లే, అది తన రాజసభే, తన సింహాసనమే. దానిలో పద్మరాజు కూర్చొని వున్నాడు. చుట్టూతా మంత్రులూ, సామంతులూ, పరిచారకులూ, పౌరులూ అంతా వున్నారు.

లీల ఆ సభలోకి ప్రవేశించింది. సభంతా తిరిగింది. ఆమెకు వాళ్ళంతా కనిపిస్తున్నారు. కానీ, వాళ్ళెవరూ తనను గుర్తు పడుతున్న జాడ ఆమెకు కనిపించలేదు. ఎవరి పనులు వాళ్ళు చేసుకొంటూ వున్నారు.

చుట్టూతా వున్న పరివారమంతా తన పరివారమే, తన పౌరులే. ఏమీ తేడా లేదు. కానీ చిత్రం! ఈ పద్మరాజు ఒక్కడు మాత్రం 16 ఏళ్ళ పిల్లవాడిగా కనిపిస్తున్నాడు. అయినా సరే, రాజ్యశాసనం చేసిపారేస్తున్నాడు.

ఆ సభంతా కలయ తిరుగుతున్న లీలకు కొత్త సందేహం బయలుదేరింది. "వీళ్ళెవరూ తనను గుర్తుపట్టడం లేదు. అసలు వీళ్ళకు తను కనిపించడం లేదు. 60 ఏళ్ళ తన భర్త మరణించి, మళ్ళీ 16 ఏళ్ళవాడిగా పుట్టినట్టున్నాడు. మరి ఈ పరివారమంతా ఎవరు? కొంపముంచి వీళ్ళంతా గూడా మరణించారా? మరణించి మళ్ళీ ఇలా పుట్టారా?" ఇదీ ఆమె సందేహం.

సమాధిలో వున్న లీలకు సంస్కారబలంవల్ల ఈ ఆలోచన వచ్చేసరికి, సరస్వతీదేవి అనుగ్రహంతోడై, సమాధి భంగం జరిగింది. మెలకువ వచ్చేసరికి చుట్టూతా నిద్రపోతున్న పరివారం కనిపించింది. పూలల్లో వున్న భర్త శవం కనిపించింది. ఇల్లూ వాకిలీ కనిపించింది.

లీల మనస్సు చాలా గందరగోళమై పోయింది. "ఇదేమిటి? నేను నిద్రపోలేదు కనుక నాకు కల రాలేదు. ఇందాక అలా కనిపించింది. ఇప్పుడు ఇలా కనిపిస్తోంది. ఏది నిజం? ఈ నా పరివారం నిజంగా బతికి వుందా? లేక మరణించి మరో చోట జన్మించిందా?" లీలాదేవి ఇలా ఆలోచించి, ఎటూ తేల్చుకోలేక, వున్నట్టుండి ఒక కొత్త నిశ్చయం చేసుకుంది.

లీలాదేవి తన ప్రధాన పరిచారికలను నిద్రలేపి "వెంటనే తక్షణమే రాజసభను సమావేశపరచండి. మంత్రుల్నీ, సామంతుల్నీ, పరివారాన్ని ఒక సారి నేను చూడాలి" అని హుకుం జారీ చేసింది.

పరిచారికలు ఈ ఆజ్ఞకు ఆశ్చర్యపోయారు. అయినా, ఇప్పుడు సర్వాధికారిణిగా వున్న రాణిగారి

ఆజ్ఞను ఎవరు కాదనగలరు? కొద్ది ఘడియల్లోనే అందరూ రాజసభలో సమావేశమై రాణిగారు ఏమి చెపుతారో అని ఎదురు చూడసాగారు.

రాణి వచ్చింది. పెద్దసింహాసనం పక్క చిన్న సింహాసనం వేయించుకొని కూర్చుంది. అందర్నీ తేరిపార చూస్తోంది. ఏదో ఆలోచిస్తోంది. సభలో కూర్చున్న పెద్దలకు రాణిగారు ఇవ్వబోయే సందేశం ఏదీ లేదని అర్థంమైంది. ఆవిడకేదో మనస్సు వికలమైందని, అందుకే ఇలా ప్రవర్తిస్తోందని, వాళ్ళు ఊహించుకొని, జాలిపడ్డారు.

ఇంతలో లీలాదేవి వున్నట్లుండి సభ చాలించి అంతఃపురంలోకి వెళ్ళి పోయింది.

అక్కడ ఆమె తన భర్త శవం పక్కన కూర్చొని ఇలా ఆలోచించ సాగింది– " ఇందాక సరస్వతీదేవి అనుగ్రహంవల్ల చిదాకాశంలోకి వెళ్ళాను. ఆ సమాధిలో చిదాకాశంలోనూ వీళ్ళే కనిపించారు. సమాధి వదిలి బయటికి వస్తే, ఈ స్థానంలోనూ వీళ్ళే కనిపిస్తున్నారు. అదే ఇల్లు. ఆవే ఊళ్ళు, అదే మనుషులు. ఇక్కడా అక్కడా ఒక్కటే. అద్దంలో బొమ్మల్లాగా వున్నారు. అయితే వీటిలో ఏది బింబం? ఏది ప్రతిబింబం? ఏది సత్యప్రపంచం? ఏది భ్రాంతి ప్రపంచం? ఏమీ అర్థం కావటం లేదు. సరే ఆ సరస్వతీ దేవినే అడుగుతాను."

## 27. ఏది నిజం?

లీల ఇలా అలోచించి, సరస్వతీ దేవిని రమ్మని ప్రార్థించింది. కొద్ది క్షణాల్లోనే సరస్వతీదేవి వచ్చింది. కానీ, ఈ మాటు పదేళ్ళ పిల్లగా వచ్చింది. అయినా లీలాదేవి వెంటనే గుర్తుపట్టి ఆమెకు నమస్కరించి ఇలా అడిగింది –

"అమ్మా! నాకు కొత్త సందేహాలు కలుగుతున్నాయి. నేను వినయంతో అడుగుతున్నాను. దయచేసి, నా సందేహాలు తీర్చు. నీ అనుగ్రహబలంవల్ల నేను చిదాకాశాన్ని దర్శించాను. అది ఆకాశమంత పెద్దదిగా అద్దం వలె స్వచ్ఛంగా వుంది. దిక్కులు, కాలం, లోకాలు, నియతి, అన్నీ ఆ చిదాకాశంలో అవకాశాన్ని పొందాయి. అయితే, అవన్నీ ప్రతిబింబాలు లాగా వున్నాయి. లోపలా, బయటా కూడా ఆ ప్రతిబింబం వున్నట్టు కనిపిస్తోంది. ఈ రెండు బొమ్మల్లో ఏది అసలు బొమ్మ? ఏది ప్రతిఫలించిన బొమ్మ? తల్లీ! తేల్చి చెప్పు."

చర్చ అర్థవంతంగా వుండాలంటే మనం ఉపయోగించే పదాలను స్పష్టంగా నిర్వచించుకోవాలి. చాలా మటుకు సందేహాలు, నిర్వచనాలలో స్పష్టత లేకపోవటంవల్లే వస్తాయి. అందుకే సరస్వతీదేవి ఒక ఎదురు ప్రశ్న వేసింది – "లీలా! సత్య ప్రపంచం, అసత్య ప్రపంచం, అంటున్నావు కదా! ఇక్కడ సత్యమంటే ఏమిటి? అసత్య మంటే ఏమిటి"?– అని.

లీల ఆలోచించి చెప్పింది– " అమ్మా! ఇప్పుడు మనిద్దరం ఇక్కడ వున్నాం కదా! మన చుట్టూతా ఈ పదార్థాలున్నాయి కదా! ఇదంతా సత్యప్రపంచం. నేనిందాక సమాధిలో నా భర్త వున్న ప్రపంచాన్ని చూశాను కదా! అదంతా కృత్రిమం, అసత్యం. ఎందుకంటావా? అక్కడ ఆ వస్తువులు వుండటానికి తగిన దేశకాలాదులు లేవు. దీన్నే నిర్వచనంగా చెప్పమంటావా? అనుకూలమైన దేశకాల క్రియాదులవల్ల ఒక పదార్థం జన్మిస్తే, అప్పుడు ఆ పదార్థం సత్యం. దేశాకాలాదులు అనుకూలంగా లేని చోట జన్మించిన పదార్థం అసత్యం."

***సరస్వతీ దేవి:*** లీలా! బాగా చెప్పావు. ఇక విచారించు.

నువ్వు చిదాకాశంలో నీ భర్త వున్న ప్రపంచాన్ని చూశావు. ఆ ప్రపంచానికి కారణం వుందా, లేదా? లేదంటే, కారణం లేకుండా కార్యం పుట్టిందని ఒప్పుకోవాల్సి వస్తుంది. అది కుదరదు కదా! కనుక, ఆ

ప్రపంచానికి కారణం వుంది అనాలి. వుంటే, అది సత్యకారణమా? అసత్య కారణమా? అది అసత్యకారణమే అనుకొని చూద్దాం. ఆ అసత్య కారణం ఏమై వుండాలి? మన దగ్గర వున్నవి రెండే ప్రపంచాలు. చిదాకాశ ప్రపంచము, ఈ మాములు ప్రపంచము. ఈ రెండూ కాకుండా మరో ప్రపంచం ఏదైనా వుండి, అది చిదాకాశ ప్రపంచానికి కారణంగా వుందీ అనుకుందామా? అలాంటి మూడో ప్రపంచం ఎవరూ కన్నదీ, విన్నదీ కాదు. అది మన ఊహకోసం కల్పించుకొన్న ప్రపంచమే అని చెప్పాలి. దాన్ని కారణంగా చూపిస్తే ఎవరు నమ్ముతారు? కనుక అది కుదరదు. కాబట్టి ఈ మాములు ప్రపంచమే చిదాకాశ ప్రపంచానికి కారణం అని చెప్పాలి. చిదాకాశ ప్రపంచానికి కారణం సత్యమా, అసత్యమా? అని మనం విచారిస్తున్నాం. ఆ కారణం మాత్రం ఈ మాములు ప్రపంచమే అని తేలింది. ఇప్పుడది సత్యమా, అసత్యమా అని తేలాలి?

మాములు ప్రపంచం కారణం. చిదాకాశ ప్రపంచం కార్యం. కారణామూ, కార్యమూ, ఒకే జాతివై వుంటాయి గానీ, వేరే వేరే జాతివి కావటానికి వీల్లేదు. అంటే కారణం అసత్యమైతే దాంట్లోంచి సత్యకార్యం పుట్టదు. అలాగే కారణం సత్యమైతే, దాంట్లోంచి పుట్టే కార్యం అసత్యం కావటానికి వీల్లేదు.

రెండు వస్తువులుండి వాటిల్లో ఒకటి సత్యమూ, మరొకటి అసత్యమూ అయ్యేటట్లయితే, వాటి మధ్య కార్యకారణ సంబంధం కుదరదు. నువ్వేమో మాములు ప్రపంచం సత్యమనీ, చిదాకాశ ప్రపంచం అసత్యమనీ చెపుతూ, ఈ రెంటికీ కార్యకారణ భావాన్ని కలపాలని చూస్తున్నావు. ఇదెలా కుదురుతుంది?

ఆ రెంటికీ కార్యకారణ భావాన్ని మనం కాదనలేం. కనుక, అయితే రెండూ సత్య ప్రపంచాలే కావాలి. లేకపోతే రెండూ అసత్యలే కావాలి. అంతే గానీ ఒకటి సత్యం మరొకటి అసత్యం అనటం కుదరదు."

ఇలా అని సరస్వతీదేవి కొంచెం ఆగింది.

చిన్న పిల్లగా కనిపిస్తున్న సరస్వతిదేవి ఇన్ని మెలికలుగా మాట్లాడే సరికి, లీలాదేవి అశ్చర్యపోయింది. కానీ, కంగారుపడలేదు. ఆమె కొంచెం ఆలోచించి ఇలా అడిగింది.

**లీల:** సరస్వతీ మాతా! కార్యమూ, కారణమూ, ఒకే రకంగా వుండాలనే మాట కుదరదు. మట్టిముద్దలోంచీ కుండ పుడుతోంది. మట్టిముద్దకు నీటిని మోసే శక్తి లేదు. కుండకు ఆ శక్తి వుంది. అంటే, కారణంయొక్క శక్తి వేరు, కార్యంయొక్క శక్తి వేరు. ఇది లోకంలో కనిపిస్తోంది కదా! అలాగే కారణంయొక్క సత్త వేరు. కార్యంయొక్క సత్త వేరు – అని ఎందుకు అనుకోకూడదు?

***సరస్వతీ దేవి:*** లీలా! మట్టిముద్ద శక్తి వేరు. కుండ శక్తివేరు. అది నిజమే, కానీ, ఒకే మట్టిముద్దనుంచీ రెండు కుండలు పుడితే, ఆ కుండల శక్తులు వేరు వేరు కావు. అంటే, ఒకే ఉపాదాన నిమిత్త కారణాలనుంచీ విభిన్న కార్యాలు జన్మించినట్లయితే, ఆ కార్యాలన్నీ ఒకే జాతివిగా వుండి తీరుతాయి. ఇక మన ప్రపంచాల గురించి ఆలోచిద్దాం. ఇందాక నువ్వు చేసిన వాదన ప్రకారం, ఈ మాములు ప్రపంచం చిదాకాశ ప్రపంచానికి కారణమని తేలింది. అది నిజమైతే, ఇక్కడి భూమిలోంచీ అక్కడి భూమి ఏర్పడాలి. ఇక్కడి భూమి కాస్తా అక్కడి భూమిగా మారి ఎగిరిపోతే, ఇక్కడేం వుంటుంది? ఆ సన్నివేశం సాధ్యమా? సాధ్యం కాకపోతే చిదాకాశంలో భూమి ఎలా పుడుతుంది? పుట్టిందిగా? దానికి కారణం మనం ఊహించుకోవాలి. ఆ ప్రపంచం మాట అలా వుంచు, ఈ ప్రపంచమూ, ఈ పంచభూతాలూ, అవన్నీ అవిద్యలోంచే పుట్టాయి. అందులో సందేహం లేదు కదా!

ఇక ఆ ప్రపంచానికి కారణమేమిటో మనకు తెలియటం లేదు. ఈ ప్రపంచానికీ, దానికీ, సజాతీయత్వం కనిపిస్తోంది. కనుక, ఆ ప్రపంచం కూడా ఈ ప్రపంచం యొక్క కారణంలోంచే పుట్టిందని చెప్పక తప్పదు. అంటే, చిదాకాశ ప్రపంచం కూడా అవిద్య వల్లే జన్మించింది. రెండూ అవిద్యవల్లే జన్మించాయి కనుక, రెండూ ఒకే జాతికి చెందుతాయి.

**లీల:** సరస్వతీ దేవీ! చిదాకాశంలో నేను చూసిన ప్రపంచం స్మృతిరూపం. స్మరించేటప్పుడు వస్తువుల ఆభాస మనస్సులో వుంటుందే కానీ, నిజంగా వస్తువులు ఆక్కడ వుండవు. ఒక స్మరణ జరుగుతోందంటే, దాని వెనకాల, సత్యమైన వస్తువులయొక్క అనుభూతి వుండాలి. అంటే, దానికి సత్యమైన కారణం వుండాలి. అదే ఈ బాహ్యప్రపంచం. అందుకే ఈ మాములు ప్రపంచం సత్యమనీ, దీని సంస్కారం రూపమైన స్మరణవల్ల పుట్టిన ఆ చిదాకాశ ప్రపంచం అసత్యమనీ, నేనంటున్నాను.

**సరస్వతీ దేవి:** లీలా! ఈ బాహ్యప్రపంచం కూడా పూర్వసృష్టిలోని సంస్కారం వల్ల జన్మింస్తోంది. అందుచేత ఇదీ అసత్యమే, మిథ్యే.

**లీల:** దేవీ! అర్థమైంది. నువ్వు చెప్పింది నిజం. రెండు ప్రపంచాలూ అసత్యాలే.

**సరస్వతీ దేవి:** ఒట్టి అసత్యాలు కావు. లేకపోయినా వున్నట్లు కనిపించే అసత్యాలు. అంటే మిథ్యలు.

**లీల:** దేవీ! రెండు ప్రపంచాలూ భ్రమాత్మక ప్రపంచాలే అయి వుండగా, బాహ్యప్రపంచం నుంచీ నా భర్తృప్రపంచం ఎలా జన్మించిదో, ఆ క్రమాన్ని కొంచెం వివరించు.

**సరస్వతీ దేవి:** లీలా! ఇప్పుడు నీకు 'మండపోపాఖ్యానము' అనే చిన్న కథ చెపుతాను విను.

## 28. మండపోపాఖ్యానము

చిదాకాశంలో ప్రపంచం అనే మండపం ఒకటి వుంది. దాని పైకప్పు గాజు రేకులుగా వుంది. ఆ రేకే ఆకాశం. ఆ మండపంలో 14 గదులున్నాయి. అవే 14 లోకాలు.

ఆ మండపంలో ఒక ముసలి బ్రహ్మణుడున్నాడు. ఆయనకు అంతులేని సంతానం. ఆయన పేరు ప్రజాపతి.

ఆ మండపంలోనే ఒక మూల ఒక చిన్న పల్లె వుంది.

**తస్మిన్ నదీశైలవనోపగూఢే**
**సాగ్నిస్సదారస్సుతవా నరోగః ।**
**గోక్షీరవాన్ రాజభయాదిముక్తః**
**సర్వాతిథి ర్ధర్మపరో ద్విజోఽభూత్॥** (ఉ.ప్ర.స.18, శ్లో.38)

ఆ ఊళ్ళో ఓ బ్రహ్మణుడు వుండేవాడు. ఆయన సంతానవంతుడు, గోసంపద గలవాడు. ఆయన అతిథులను ఆదరంగా ఆహ్వానిస్తూ వుండేవాడు.

## 29. వశిష్ఠ బ్రాహ్మణ కథ

ఆయనపేరు వశిష్ఠుడు. తపస్సులోనూ, సత్ప్రవర్తనలోనూ, నిజంగానే వశిష్ఠుడంతటివాడు. ఆయన భార్య చాలా ఉత్తమ ఇల్లాలు. ఆవిడ పేరూ అరుంధతే. గుణాలలో అరుంధతి వంటిదే.

ఒక రోజున ఆ దంపతులిద్దరూ, ఒక కొండచరియ మీద కూర్చుని వున్న సమయంలో, ఆ ప్రాంతాలకు ఒక రాజు వేటకోసం వచ్చాడు. ఆ గుర్రాలు, ఆ పరివారం, ఆ ఛత్ర చామరాలు, ఆ వైభవమూ, ఆ దర్పమూ, చూసేసరికి ముసలి బ్రాహ్మణుడికి పళ్ళు పులిశాయి. ఆ పులకరింతలో ఆ బ్రాహ్మణుడు తనూ ఒక రాజైనట్టూ, అంతఃపుర స్త్రీలతో విహరిస్తున్నట్టూ, ఊహించుకోసాగాడు.

ఆ తరువాత ఆ బ్రాహ్మణుడు చాలా కాలం పాటు జీవించాడు. ఒక రోజు కూడా ఆయన ధర్మం తప్పలేదు. కానీ, రాజు కావాలనే ఆశ మాత్రం మనస్సులోంచీ పోలేదు.

మరణకాలం వచ్చింది. ఆ మాట ఆయన భార్య గుర్తు పట్టింది. లీలా ఆవిడ ఎప్పటి నుంచోనన్ను (సరస్వతీ దేవిని) ఉపాసిస్తూ వుండేది. ఇప్పుడు భర్తకు మరణం దగ్గరకు వచ్చేసరికి, భయపడిపోయి, నన్ను ప్రార్థించింది. నేను ప్రత్యక్షమై ఏమి కావాలని అడిగాను?

లీలా! ఆమె నీకంటే కొంచెం తెలివి గలది. అమె ఇలా అంది – "దేవీ! మానవులకు మరణం తప్పదు కదా! నా భర్త మరణించనీ, కానీ, ఆ జీవుడు తన ఇంట్లోంచీ బయటికి పోకుండా అనుగ్రహించు" అని. నేను సరే అన్నాను.

ఆ తరువాత కొద్ది కాలానికి ఆ బ్రాహ్మణుడు మరణించాడు. అతని జీవచైతన్యం ఆ ఇంట్లోనే, బ్రహ్మాభావంతో వుండిపోయింది. కానీ, పూర్వపు సంకల్పబలంవల్ల, అతను అక్కడే మహాశక్తి సంపన్నుడైన రాజుగా మారిపోయాడు.

బ్రాహ్మణుడి శవం అక్కడే వుంది. భార్య భోరుభోరున ఏడుస్తోంది. ఆ దుఃఖం తట్టుకోలేక, ఆమె గుండె ఆగిపోయింది. తన భర్త మీదుండే ప్రేమతో అమె, తన భర్తను వెతుక్కుంటూ ఆ భర్త దగ్గరికే వెళ్ళిపోయింది.

లీలా! ఆ దంపతులిద్దరూ మరణించి ఇవాల్టికి ఎనిమిదవ రోజు. వాళ్ళ ఇల్లూ వాకిళ్ళూ, పొలాలు, అన్నీ ఆ లోయలో అట్లాగే వున్నాయి. ఆ దంపతుల జీవాలు ఆ ఇంట్లోనే వున్నాయి.

లీలా! గొప్ప రహస్యం చెపుతున్నా విను – ఆ అరుంధతివి నువ్వే! ఆ వశిష్ఠుడే నీ భర్త పద్మరాజు. అది నీ పూర్వ ప్రపంచం.

ఇంతకు ముందు నువ్వు రెండు ప్రపంచాలు చూశావు. ఇది మూడో ప్రపంచం. ఇదీ మిథ్యే. ప్రపంచం అనేది ఎక్కడ వున్నా మిథ్యే అని తెలుసుకో. అంతే గానీ, వాటిలో ఒకటి సత్యమనీ, మరొకటి అసత్యమనీ అనుకోరాదు.

అని చెప్పి సరస్వతీ దేవి కొంచెం ఆగింది.

## 30. ఆ వూరి గుడిసెలోనే ఈ రాజ్యం వుంది

లీల ఈ కథ విని కొంతసేపు తనలో తనే గుణించుకొని ధైర్యం తెచ్చుకొని ఇలా అంది. –

**లీల:** తల్లీ! నువ్వు చెప్పే మాటలు ఏ మాత్రమూ అతకటం లేదు. అలా జరగాటానికి వీల్లేదు. చిన్న బ్రాహ్మణ గుడిశలో, మా మహారాజ్యం ఇమిడి వుందా? నేను చూసిన నా భర్త ప్రపంచం, ఈ నా పడకింట్లో ఇమిడి వుందా? ఆ చిదాకాశలోకంలో కొండలూ, నదులు, దిక్కులూ ఇవన్నీ చూశానే, అవన్నీ నా గదిలో ఇమిడిపోయాయా? నాకు సరిగా అర్థమయ్యేటట్లు చెప్పు.

***సరస్వతీ దేవి:*** లీలా! ఎవరూ అబద్ధమాడకూడదనే నియమం నేనే ఏర్పాటు చేశాను. నేనే దాన్ని దాటుతానా?

ఆ బ్రాహ్మణుడి జీవాత్మ, ఆ గ్రామంలోనే, ఆ ఇంట్లోనే, చిదాకాశ రూపాన్ని పొంది. ఆ చిదాకాశరూపంతోనే, అక్కడే, అయన ఒక మహా సామ్రాజ్యాన్ని చూస్తున్నాడు. బ్రాహ్మణ రూపంలో వున్న మీకు, మరణమనే నిద్ర కమ్మింది. అందువల్ల మీకు వెనుకటి జన్మ గుర్తుకు రావటం లేదు. స్వప్నంలో వుండగా జాగ్రదవస్థ విషయాలు గుర్తుకు వస్తాయా?

కలలో అనేక లోకాలు కనిపిస్తాయి. ఆలోచించేవాడి మనస్సులోనూ కనిపిస్తాయి. ఎడారిలో నది

కనిపిస్తుంది. ఈ కనిపించడానికి ఆ వస్తువులు అక్కడ వుండాలా? అక్కర్లేదే! ఇలాగే ఆ బ్రాహ్మణుడు తన ఇంట్లోనే విశాలమైన మహా సామ్రాజ్యాన్ని చూస్తున్నాడు. చూస్తున్నంత మాత్రాన ఆ పదార్థాలు అక్కడ సత్యంగా వుండవలసిన పని లేదు.

పంచకోశాల మధ్యలో చిదాత్మ వుంది. అది సత్యమైనది. అది సత్యం కనుకనే, ఆ చిదాత్మ మీద అసత్యమైన ఈ ప్రపంచం భాసిస్తోంది.

కాబట్టి, ఆ బ్రాహ్మణ గృహంలో తిరిగే బ్రాహ్మణ జీవాత్మ చిదాకాశంలో – ఈ సముద్రాలు, ఈ భూమి, ఈ ప్రపంచమూ, ఈ మొత్తం అంతా ఇమిడిపోయి వుంది.

లీలా! ఇందులో ఆశ్చర్యపడవలసినది ఏమీ లేదు. పైగా దీన్నే కొంచెం పెంచి ఆలోచించు. ఈ నాటి ఈ ప్రపంచం, నీ క్రిందటి జన్మలోని ఇంటి గదిలో ఇమిడి వుంది. ఆ గది, ఆ నాటి ప్రపంచమూ కలపి, ఆ క్రిందటి జన్మలోని మరో ఇంటి గదిలో ఇమిడి వున్నాయి. అవి ఆ క్రిందటి జన్మ తాలుకు గదిలో ఇమిడి వుంటాయి.

**పరమాణౌ పరమాణౌ సంతి వత్సే చిదాత్మని ।**
**అంతరంతర్జగంతీతి కిం త్వేతన్నామ శంక్యతే ॥** (ఉ.ప్ర.స.20, శ్లో.26)

ఇలా ఎంతవరకు పోవాలి?దీనికి అంతే లేదు. కాబట్టి, ప్రతి పరమాణువులోనూ ఒక చిదాత్మ (చైతన్యం) వుంది. దానిలో ఈ ప్రపంచాలన్నీ ఇమిడి వున్నాయని ఒప్పుకోవాలి, తప్పదు. ఇదే సత్యం. దీనిలో సందేహించవలసిన పని లేదు.

## 31. క్షణంలోనే యుగం వుంది

**లీల:** అమ్మా! ఆ బ్రాహ్మణుడు మరణించి 8 రోజులైందని నువ్వే చెపుతున్నావు. మేమిద్దరం పుట్టి 60 సంవత్సరాలు దాటింది. అది మా పూర్వ జన్మైతే, ఈ కాలభేదం ఎలా కుదురుతుంది?

**సరస్వతీ దేవి:** లీలా! తెలివిగల దానివనుకున్నాను. ఇదేం ప్రశ్న? అణుగర్భంలో మహా ప్రపంచాలు ఇమిడి వున్నాయంటే, తర్కించి తర్కించి చివరికి ఒప్పుకొన్నావు.

అణుగర్భంలో ప్రపంచాలు ఇమిడి వుండడం సాధ్యమైతే, క్షణగర్భంలో సంవత్సరాలూ, యుగాలు, కల్పాలూ, ఇమిడి వుండటం సాధ్యం కాదా?

చిదాత్మలో దేశానికి సంబంధించిన కొలతలు పట్టకపోతే, కాలానికి సంబంధించిన కొలతల పట్టుబడతాయా?

ఇంతకూ అణుగర్భంలో గల చిదాత్మ మీద, ప్రపంచాలు ఇమడటం ఎలా సాధ్యమైంది? ఎండమావి నీళ్ళు లాగా అవన్నీ ప్రాతిభాసికాలు(అంటే – భ్రాంతి జనితాలు) కనుక, సాధ్యమైంది. ప్రపంచంలోని లోకాలన్నీ ఎలా భ్రాంతి జనితాలో, అలాగే ప్రపంచంలోని కాలాలు కూడా భ్రాంతి జనితాలే,

"నేను ఫలానావాడి కొడుకుని" అనుకోవటం ఎంత భ్రాంతో, "నా వయస్సు ఇంత" అనుకోవటం కూడా అంతే భ్రాంతి.

చిదాత్మదృష్టితో చూస్తే, స్వప్నలోకానికీ, ఇహలోకానికీ, పరలోకానికీ, ఏమీ భేధం లేదు. అలాగే, స్వప్న కాలానికీ, ఇహకాలానికీ, పరకాలానికీ, ఏమీ భేదం లేదు.

ఈ లోకంలో కూడా కాలమనేది అందరికీ ఒకే విధంగా అనుభవంలో లేదు. భార్యా విరహంలో వున్న కొత్తపెళ్ళి కొడుకు ఒక రోజును ఒక సంవత్సరంగా భావిస్తాడు. కనుక, కాలం విషయంలో నీకు సందేహం అనవసరం.

## 32. సంస్కారము - స్మృతి- భ్రాంతి

అదీ గాక, లీలా! ఈ ప్రంచం భ్రాంతి రూపం అని చెప్పుకొన్నాం కదా. ఈ భ్రాంతి ఎలా కలిగింది? లోకంలో రజ్జు సర్పమూ, శుక్తి రజతమూ, వంటి భ్రాంతులు కనిపిస్తున్నాయి. వీటన్నిటికీ వెనకాల ఆయా వస్తువులను చూసిన స్మృతితోసంబంధం వుంది. కనుక, ఈ ప్రపంచం కూడా సంస్కారంతోనూ, స్మృతితోనూ, సంబంధించిన భ్రాంతి అనుభవ రూపమే – అని కొందరు అనుకొంటూ వుంటారు. కానీ, అది నిజం కాదు.

ఈ ప్రపంచం కొందరి విషయంలో స్మృతి రూపమని, మరికొందరి విషయంలో నూతన భ్రాంతి అనుభవ రూపమని, మరికొందరి విషయంలో ఈ రెండింటి మిశ్రమమని తెలుసుకో.

కొన్ని ఉదాహరణలు చెపుతాను విను. ఒకడికి స్వప్నంలో తన మరణం కనిపించింది. వాడు అంతకుముందే తన మరణాన్ని చూశాడని, దాని స్మృతిగానే ఈ స్వప్నం వచ్చిందనీ, చెప్పలేం.

మరొకడికి తాను వేరొకడి కొడుకుగా వున్నట్టు కల వచ్చింది. ఇక్కడ కూడా వీడు ఎప్పుడో ఒకప్పుడు వాడి కొడుకై వున్నాడని, ఆ స్మృతిగానే ఈ కల వచ్చిందని, చెప్పలేం.

లీలా! నీకు మరింత విస్పష్టమైన ఉదాహరణ ఒకటి ఇస్తా. సృష్టికర్త అయిన ప్రజాపతిని గూర్చి ఆలోచించు. ఆయనకు స్వప్నరూపంగా ఈ ప్రపంచం వచ్చిందని పెద్దలు చెబుతున్నారు గదా. ఈ ప్రపంచ స్వప్నరూప భ్రాంతి ఆయనకు స్మృతిరూపంగా కలుగుతోందా? నూతన అనుభవరూపంగా కలుగుతోందా? కాసేపు స్మృతిరూపమే అనుకొందాం. అంటే ఆయన అంతకు ముందే కొన్ని సృష్టులు చేసి వున్నాడని, వాటి స్మరణవల్ల ఇప్పుడు ఈ సృష్టిరూప స్వప్నం కలుగుతోందని అర్థం వస్తుంది. కానీ, వేదమేమో వెనుకటి సృష్టికర్త ఆ కల్పాంతంలో ముక్తి పొందాడని చెబుతోంది. ఆయన అప్పుడు ముక్తి పొందితే, ఈ కొత్త బ్రహ్మగారికి పూర్వం సృష్టి చేసిన అనుభవం వుందని చెప్పేందుకు వీల్లేదు.

కనుక, ఈ కల్పంలో ఒకా నొక పుణ్యాత్ముడు ప్రజాపతి పదవికి వస్తే, అయనకు ఈ సృష్టి అంతా నూతన అనుభవమే అవుతుంది గానీ, పాత స్మృతి కావటానికి వీల్లేదు.

ఇంతకూ ఈ ఉదాహరణలన్నింటివల్ల నేను చెప్పదలచు కొన్నదేమిటంటే – కొందరికి ఈ సృష్టి పూర్వం అనుభవించిన పాతస్మృతి, మరికొందరికీ పూర్వానుభవం లేని కొత్త స్మృతి. ఇక్కడ స్మృతి అంటే, మనస్సులో నిలిచిన అనుభవం. ఏ రకంగా తిప్పినా ఇది వాసనగా మారి స్మృతి రూపంగా వుండి, మనస్సుకు బంధమవుతుంది.

కనుక, స్మృతి రూపమైన ఈ ప్రపంచ సంస్కారాన్ని పూర్తిగా విస్మరించటమే మోక్షం. విస్మరించటమంటే స్మరణ తొలగిపోవటం. స్మరణ అవిద్యవల్ల కలుగుతుంది. కనుక, అవిద్య తొలగిపోతే స్మరణ తొలగిపోతుంది.

అవిద్య ఎలా తొలుగుతుంది? ఇక్కడ రెండు రకాల అభిప్రాయాలు వున్నాయి. తత్త్వజ్ఞానంవల్ల అవిద్య తొలగుతుందని కొందరు, చిత్తవృత్తి నిరోధరూపమైన యోగంవల్ల అవిద్య తొలగుతుందని కొందరు, అంటున్నారు.

చిత్తవృత్తి నిరోధం చేస్తే మనోవృత్తులు శాంతిస్తాయి. అంటే అణిగిపోతాయి. అప్పుడు ప్రపంచం

పూర్తిగా మరుపుకు వస్తుంది. అదే ముక్తి– అని చిత్తవృత్తి నిరోధవాదుల అభిప్రాయం. కానీ, ఇది పట్టిన దెయ్యాన్ని వదిలించుకోవడం వంటిది. ఒక దయ్యాన్ని వదిలించుకొంటే మరో దెయ్యం పట్టుకోదని నమ్మకమేమిటి? అలాగే ఒకసారి చిత్తవృత్తి నిరోధం చేసి మళ్ళీ బయటకు వస్తే మరో చిత్తవృత్తి పుట్టదని నమ్మకమేమిటి? కనుక, ఈ పద్ధతి లాభం లేదు.

ఇక పోతే తత్త్వజ్ఞానమార్గం వుంది. తత్త్వజ్ఞానం కలిగితే అవిద్య పోతుంది. అవిద్య పోతే ప్రపంచస్మృతికి మూలకారణం పోయినట్లే. కనుక, ఇక మళ్ళీ ప్రపంచస్మృతి కలిగే అవకాశం లేదు. కాబట్టి మోక్షప్రాప్తికి తత్త్వజ్ఞానమే ముఖ్యం.

కనుక, లీలా! దేశకాలాలు రెండూ కూడా భ్రాంతి జన్యాలే, అని గ్రహించి నువ్వు తత్త్వజ్ఞానం సంపాదించు.

ఈ సుదీర్ఘోపదేశం విని, లీలాదేవి ఒక కొత్త ప్రశ్న లేవదీసింది.

**లీల:** సరస్వతీదేవీ! సంస్కారం జన్మకు కారణం అని చెప్పారు. సంస్కారం అనుభవంవల్ల కలుగుతుంది. అనుభవం లేకపోతే సంస్కారం కలుగదు. అంతే కదా? మేము క్రిందటి జన్మలో బ్రాహ్మణ దంపతులం. ఆ జన్మలో వుండగా, రాజదంపతీ జీవితానుభవం వాళ్ళకు లేదు. వుండటం అసంభవం. కనుక, రాజదంపతీ జన్మకు కారణమైన సంస్కారం వాళ్లకు లేదు. సంస్కారమే లేకపోతే, ఈ జన్మ ఎలా వచ్చింది? దేశమూ, కాలమూ, భ్రాంతిజన్యాలు అయినప్పటికీ, సంస్కారం లేనిదే జన్మ రాదు గదా?

(ఇక్కడ ఆనంద బోధేంద్ర సరస్వతీ వ్యాఖ్యానంలో మూలాన్ని మించి కొన్ని విశేషాలు వున్నాయి. అవి కూడా కలిపి చెప్పుకొందాం.)

**సరస్వతీ దేవి:** లీలా! సంస్కారమన్నా, వాసనన్నా ఒకటే. ఇది పూర్వానుభవంవల్ల మాత్రమే కలుగుతుందని చెప్పలేము. ఇది అనాది అవిద్యవల్ల కూడా కలుగవచ్చు. అంటే సంస్కారం రెండు రకాలు. 1. అనుభవ జన్యము, 2. అనాది అవిద్యా జన్యము. ఈ రెండింటిలో ఏదైనా సరే, కొత్త జన్మను కలిగించవచ్చు.

లీలా! మీరు వెనుకటి జన్మలో – రాజును చూసి, మేము కూడా రాజులం కావాలని గట్టి సంకల్పం చేశారు. ఇదే అనాది అవిద్యా జన్మసంస్కారం. దీనివల్ల మీకు ఈ రాజ జన్మ వచ్చింది.

లీలా! దీన్ని మరో రకంగా కూడా సమన్వయించవచ్చు. సృష్టికర్త అయిన పితామహుడు వున్నాడు కదా! ఆయన సర్వజ్ఞుడు. బ్రాహ్మణజన్మలో మీకు కలిగిన కోరికా, దానివల్ల మీకు రాబోయే జన్మా, ఇవన్నీ ఆయనకు ముందే తెలుసు. అంటే, రాబోయే మీ జన్మ బ్రహ్మగారికి ముందే అనుభవంలో వుంది. ఆ అనుభవంవల్ల అయనకు ఒక సంస్కారం ఏర్పడింది. ఆ సంస్కారమే మీ రాజ జన్మకు కారణమైంది.

**లీల:** అమ్మా! ఇలా చెప్పేటట్లయితే, ఆ బ్రహ్మగారియొక్క జన్మకు కూడా అయనయొక్క సంస్కారమే కారణమని చెప్పవచ్చు కదా? అయన సర్వజ్ఞుడు కనుక, తనకు రాబోయే జన్మ, తనకు ముందే తెలుసని చెప్పవచ్చుకదా?

**సరస్వతీ దేవి:** అలా చెప్పేందుకు వీల్లేదు. ఎందుకంటే, పూర్వబ్రహ్మ పూర్వకల్పాంతంలోనే ముక్తి పొందాడు. ఇప్పుడు ఆయనా లేడు, ఆయన సంస్కారమూ లేదు. ఈ బ్రహ్మ కొత్తగా వచ్చాడు. కొత్తగా వచ్చేవాడికి పాత అనుభవం ఎలా వుంటుంది? అనుభవం లేనిదే సంస్కారం ఎలా వుంటుంది? కనుక, ఈయన తన సంస్కారంవల్ల జన్మించేందుకు వీల్లేదు. మరైతే ఎలా జన్మించాడంటే, కేవలం కాకతాళీయంగా, భ్రాంతిమయంగా జన్మించాడు. కనుకనే, ఈయన అకారణమైన భ్రాంతిమయంగా, జన్మించాడు. కనుకనే, ఈయన సృష్టి చేసిన ఈ ప్రపంచం కూడా భ్రాంతిమయంగా వుంటోంది.

## 33. కార్యకారణ భావం సత్యమా?

లీలా! నీకు మరో ముఖ్య విషయం చెప్పాలి. మన ఆలోచనలన్నీ కార్యకారణ భావం మీద ఆధారపడి నడుస్తున్నాయి. అసలు ఈ కార్యకారణ భావం సత్యమైనదా? బాగా ఆలోచిస్తే, ఇది మాయా కల్పితం. అంటే, విమర్శనాజ్ఞానం లేకపోవటంవల్ల కలిగే భావం. గట్టిగా విమర్శించి చూస్తే కార్యకారణ భావమనేదే లేదు.

లీలా! కారణభావాన్ని గురించి బాగా ఆలోచించు మట్టీ, కుండా అనేవి తీసుకో. మట్టి వేరు, కుండ వేరు అని, నీకు తెలియకుండానే, నీకు ఒక భ్రాంతిజ్ఞానం మనస్సులో కలుగుతోంది. అది కలిగిన తరువాత మట్టి కుండకు కారణము అనే భావం కలుగుతోంది.

దీనికి భిన్నంగా ఈ కుండంతా మట్టే అనే జ్ఞానం నీకు కలిగిందనుకో. అప్పుడు ఇది కార్యమనీ, ఇది కారణమనీ, ఊహించే ప్రసక్తి నీ మనసుకు వస్తుందా? రానే రాదు. కనుక, కార్యకారణ భావమనేది మనం కల్పించుకున్న భావం. సత్యమైన భావం కాదు.

లీలా! ఈ సూత్రాన్ని ప్రపంచానికీ, పరమాత్మకీ అన్వయించు. ప్రపంచమూ, పరమాత్మ, వేరనుకుంటే. అప్పుడవి ఒకదానికొకటి కార్యకారణాలు. అక్కడ రెండు లేవనుకుంటే, కార్యకారణ ప్రసక్తి కూడా లేదు.

ఈ చర్చతో లీలాదేవికి సందేహాలు పూర్తిగా తొలగిపోయాయి. ఆమె సరస్వతీదేవికి మనసారా కృతజ్ఞతలు చెప్పుకుంది. అయితే, ఆమెకు ఆనాటి బ్రాహ్మణ గృహాన్ని చూడాలని గట్టి కోరిక కలిగింది. "తల్లీ! నన్ను అక్కడికి తీసుకు పో" అని సరస్వతీ దేవిని ప్రార్థించింది. అప్పుడు సరస్వతీదేవి మరో ఉపదేశం చేసింది.

***సరస్వతీ దేవి:*** లీలా! నీ కోరిక తీరటానికి, నీ స్థూలదేహమే అడ్డు. గుర్తున్నంత సేపే ఈ స్థూలదేహం నీది. మరచిపోతే ఇది నీది కాదు. దీన్ని మరిచిపోవడానికి ఉపాయం సమాధి. ఇందాకటి లాగే మరో సారి సమాధిలోకి పో. సమాధిలోకి వెళితే చిన్మయ శరీరం లభిస్తుంది. అది లభిస్తే, చిదాకాశంలో వున్న ఆ బ్రాహ్మణ ప్రపంచాన్ని దర్శించగలుగుతావు.

***లీల:*** అమ్మా ఈ స్థూలదేహంతో ఆ ప్రపంచాన్ని నేనెందుకు చూడలేను?

***సరస్వతీ దేవి:*** లీలా! ఈ ప్రపంచమైనా, మరో ప్రపంచమైనా, స్వప్న ప్రపంచమైనా. ఏదైనా సరే, ప్రపంచమంటే భ్రాంతి రూపమే అని ఇందాకనే నిరూపించుకున్నాం.

ఇది నీ ఉంగరం. "ఇది ఉంగరం" అంటూ బంగారాన్ని చూపిస్తున్నావు. దీనిలో బంగారం వుందా? ఉంగరం వుందా? బంగారమే వుంది. మరి ఉంగరమో? వుంగరమనేది వ్యవహారం మాత్రమే, వేరే వస్తువు కాదు. అలాగే, ఇక్కడ ప్రపంచం లేదు. పరబ్రహ్మే వుంది. ప్రపంచమనే వ్యవహారం మాత్రం వుంది. కనుక, ఈ ప్రపంచం మిథ్య, బ్రహ్మ సత్యం.

**అత్ర ప్రమాణం వేదాన్తా**

**గురవో నుభవస్తథా॥** (ఉ.ప్ర.స.21, శ్లో.35)

ఇందుకు ప్రమాణాలు మూడు – 1. ఉపనిషత్తులూ, 2. పూర్వపు పెద్దలు, 3. సొంత అనుభవం.

ఇలా మొత్తం ప్రపంచమంతా కల్పితమే అయినా, దీనిలో కొన్ని అంతర్గత భేదాలున్నాయి. సృష్ట్యారంభంలో, బ్రహ్మగారి సంకల్పంవల్ల ఈ భేదాలు ఏర్పడ్డాయి. ఉదాహరణకు స్థూలదేహంతో స్థూలప్రపంచాన్ని చూడవచ్చు. సూక్ష్మదేహంతో సూక్ష్మప్రపంచాన్ని చూడవచ్చు. చిన్మయదేహంతో చిదాకార ప్రపంచాన్ని చూడవచ్చు. ఇదే నియమం. దీన్ని ఎవ్వరూ మార్చలేరు.

అయితే, అభ్యాసబలంచేత పరిపూర్ణమైన బ్రహ్మజ్ఞానం కలవారు, ఇటు ప్రపంచాన్ని, అటు పరబ్రహ్మని

ఏకకాలంలో ఏకరూపంగా సాక్షాత్కరించుకోగలరు. నేనూ, హిరణ్యగర్భుడూ, ఇలాంటి వాళ్ళం ఆ కోవలోకి వస్తాం.

మరి నువ్వో? నువ్వు కనీసం సూక్ష్మ ప్రపంచ రూపాలైన గంధర్వ లోకాదులను కూడా, ఈ దేహంతో చూడలేకుండా వున్నావు. ఇక ఇతరుల సంకల్పంవల్ల చిదాకాశంలో ఏర్పడ్డ సంకల్ప నగరాన్ని ఈ శరీరంతో నువ్వు చూడగలవా? కనుక లీలా! సమాధిలోకి వెళ్ళి చిన్మయశరీరాన్ని సంపాదించు.

## 34. ఆతివాహిక దేహము

**లీల:** సరస్వతీ దేవీ! ఇద్దరం కలసి ఆ గిరి గ్రామానికి వెళదామంటివి కదా! సరే, నేనేమో, ఈ స్థూలదేహాన్ని ఇక్కడే వదిలేసి, శుద్ధసాత్త్వికమైన చిన్మయశరీరంతో, బయలుదేరుతాను. మరి నువ్వు ఈ శరీరంతో ఎట్లా వస్తావు?

**సరస్వతీ దేవి:** లీలా! నీకొక పాంభౌతికమైన శరీరం వుంది. అదేదో గట్టి శరీరమని నువ్వు అనుకుంటున్నావు. ఇది నీ దృష్టి మాత్రమే. నిజానికి, నీ శరీరం కూడా శూన్యమే. అయితే, నీకు ఆ దృష్టి, ఆ జ్ఞానమూ, లేవు. నా శరీరం మీద నాకలాంటి దృష్టి లేదు. కనుక, నేను ఈ శరీరాన్ని ప్రత్యేకంగా విడిచి పెట్టవలసిన పని లేదు. నీరు నీటిలో, నిప్పు నిప్పులో, గాలి గాలిలో, తేలికగా కలిసి పోతుంది. అలాగే, ఈ నా దేహం మనోమయ దేహంలో కలసి పోతుంది.

**లీల:** వాస్తవానికి నా శరీరం శూన్యమే అయితే, అది కూడా నీ శరీరం లాగానే మనోమయ శరీరంలో సులభంగా కలసిపోవాలి కదా! ఎందుకు కలవటం లేదు?

**సరస్వతీ దేవి:** లీలా! ఇందాకనే చెప్పా. నీకూ నాకూ భేదం వుంది. నాకు నా శరీరం మీద పాంచభౌతికమనే దృష్టి లేదు. పైగా అది చిన్మాత్రమనే దృష్టి వుంది. దీనికి కారణం నా చిరకాల భావన ఇలా వుండటమే.

నీకు దీనికి వ్యతిరేక దృష్టి వుంది. నీ దృష్టిలో, నీ శరీరం చిన్మయం కాదు. అది భౌతికం. దీనికి కారణం, నీ చిరకాల భావన ఇలా వుండటమే.

నా శరీరం అద్దంలోని కొండ లాంటిది. నీ శరీరం నేల మీద కొండ లాంటిది. ఈ రెండూ ఒకదానికొకటి ఢీ కొట్టుకోవటం సాధ్యం కాదు.

నీ చిరకాల భావన భౌతికమయంగా వుంది. కనుక, నువ్వు సమాధి ద్వారా దాన్ని వదలి పెడితే గానీ, అ గిరి గ్రామానికి రాలేవు.

క్రమంగా నీ భావనాక్రమం మారి, నీకు నీ శరీరం మీద చిన్మాత్రదృష్టి దృఢపడితే, అప్పుడు నీ దేహం కూడా, నా లాగానే, ఆతివాహికం అవుతుంది. ఆతివాహికం అంటే సూక్ష్మం. అంటే మనోమయం.

**లీల:** సరస్వతీ దేవీ! వాసనాక్షయం జరిగి, ఈ దేహం, ఆతివాహికమే – మనోమయమే – సూక్ష్మమే – అనే దృష్టి దృఢపడింది అనుకో, అప్పుడీ స్థూలదేహం ఏమయి పోతుంది? అది సూక్ష్మ మానసిక శరీరంగా మారిపోతుందా? లేక పూర్తిగా నశించిపోతుందా?

**సరస్వతీ దేవి:** లీలా! సమాధిని బాగా అభ్యాసం చేస్తే, వాసనలు క్షీణిస్తాయి. అప్పుడు స్థూలదేహం సూక్ష్మత్వాన్ని పొందుతుందే గాని, నశించదు.

ఐనా, ఇక్కడ నాశమనే మాట అతకదు. తాడు వుండే చోట పాము కనిపించిందనుకో, ఆ తరువాత దీపంవల్ల తాడు సరిగా కనిపించిందనుకో, అప్పుడు అక్కడ పాము చచ్చిపోయిందని కానీ, నశించిందని కానీ,

చెప్పగలమా? పోనీ, పాము, నశించ లేదనగలమా? ఏదీ అనలేము. ఎందుకంటే, అక్కడ పామనేది వుంటే కదా! అది నశించిందనో, నశించలేదనో, చెప్పేందుకు. అలాగే, వాసనలు క్షీణించటంవల్ల, స్థూలదేహం నశించిందని కానీ, నశించలేదని కానీ, చెప్పలేము. అది కనిపించదు, అంతే.

తత్త్వజ్ఞానం కలిగాక, ఆ దేహం కాలిన వస్త్రం లాగా వుంటుందని చెప్పవచ్చు. అంటే అది వస్త్రం లాగా కనిపిస్తున్నా, బూడిదే. అలాగే, దేహం లాగా కనిపిస్తున్నా శూన్యమే.

**లీల:** సరస్వతీ దేవీ! మీలాంటివాళ్ళంతా, మీ దేహమే చిన్మయం అనే దృష్టితో వున్నారు. అలాంటి శుద్ధమైన చైతన్యానికి దృశ్యసంబంధం ఏ మాత్రం వుండదు. అలాంటి ఆ శుద్ధచిత్పదార్థం ఈ ప్రపంచ రూపంగా మారటం ఎలా కుదురుతుంది?

***సరస్వతీ దేవి:*** లీలా! సృష్టి ప్రారంభంలో హిరణ్యగర్భుడు ఆవిర్భవించాడు. అప్పుడు చైతన్యానికి చిత్తత్వం(తెలుసుకొనుట) అనే ధర్మం ఏర్పడింది. క్రమంగా హిరణ్యగర్భుడు స్థూలసృష్టి చేశాడు. దానితో పాటు దాన్ని తెలుసుకుంటూ చైతన్యం కూడా, భ్రాంతివల్ల స్థూలదృశ్యరూపాన్ని పొందింది.

**లీల:** – అమ్మా! శుద్ధచైతన్యానికి దేశ కాలాది సంబంధమే లేదు కదా! దేశమూ, కాలమూ, రెండూ లేకపోతే, మొదట హిరణ్యగర్భుడు పుట్టాడు అంటూ, చైతన్యానికి ప్రథమ వికార కల్పనం చేయటం ఎలా కుదురుతుంది? ఇది మొదటిది అని చెప్పామంటే, కాలంతో సంబంధం వున్నట్టే కదా!

***సరస్వతీ దేవి*** – బంగారంలో కంకణం వేరే వుందా? నీటిలో తరంగం వేరే వుందా? లేదు కదా? అలాగే, చైతన్యంలో దృశ్యం లేదు. అయినా బంగారంలో కంకణం లాగా, నీటిలో అల లాగా, వున్నట్టు కనిపిస్తోంది. అంటే, అది కనిపించినా లేనిదే. లేని దాని విషయంలో, ఇది మొదటిది అన్నంత మాత్రంచేత, ఆ చైతన్యానికి కాల సంబంధం వచ్చి పడుతుందంటావా? అది అసంభవం. కనుక, నీ సందేహానికి తావు లేదు.

### 35. అవిచారానికి ఔషధం సద్వి చారణే

**లీల:** మాతా! నువ్వు చెప్పిన సమన్వయం బాగుంది. మేమంతా ఈ ద్వైత భ్రాంతిలో పడి కొట్టుకుంటున్నాం కదా! ఈ ద్వైతాద్వైత వికల్పాలలో మమ్మల్ని పడేసి, ఇంతకాలం నుంచీ గిలగిల తిప్పుతున్నవాడు ఎవడు?

***సరస్వతీ దేవి:*** లీలా! ఎవరో కాదు. నీ అవిచారమే. అవిచారమంటే, సరిగా విచారణ చెయ్యకుండా వుండటం. అవివేకం అన్నమాట. అవిద్య అని కూడా చెప్పవచ్చు.

ఇది అవిచారంవల్ల పుట్టింది కనుక దీనికి విరుగుడు విచారమే. బాగా విచారణ చేస్తే, ఏమి తేలుతుందంటే – అవిచారము – విచారము, అవిధ్య – విధ్య, బంధము – మోక్షము ఇవి ఏవీ లేవని తెలుస్తుంది.

లీలా! ఇక నీవు సద్విచారణ ప్రారంభించు. నీకు త్వరలోనే నిర్వికల్పసమాధి స్థిరపడి, సంసారానికి విత్తనాల వంటివైన, రాగద్వేషాలు నశిస్తాయి. నీకు నిర్వికల్ప సమాధి స్థిరపడుతుంది.

లీలా! మరో విషయం గూడా వుంది. జాగ్రత్తగా విను. మెలకువ వచ్చింది. ఇప్పటిదాకా కనిపించింది కల అని తెలిసింది. ఇప్పుడు ఆ స్వప్న ప్రపంచం ఏమైంది? ఆ స్వప్నదేహం ఏమైంది? లేనివే అని తేలిపోయింది. అలాగే తత్త్వజ్ఞానం కలిగి వాసనలు క్షీణిస్తే, ఈ జాగ్రత్‌దేహం కూడా, లేనిదే అయిపోతుంది.

స్వప్నదేహం పోయిన తరువాత ఈ స్థూలదేహం కనిపిస్తుంది. అలాగే, ఈ జాగ్రత్‌దేహభావన నశించాక, ఆతివాహిక దేహం కనిపిస్తుంది.

**స్వప్నే నిర్వాసనా బీజే యథోదేతి సుషుప్తతా ।**
**జాగ్రత్యవాసనా బీజే తథోదేతి విముక్తతా ॥** (ఉ.ప్ర.స.22, శ్లో.4)

స్వప్నవాసనలన్నీ తొలగిపోతే, సుషుప్తి వస్తుంది. జాగ్రత్ వాసనలన్నీ నశించిపోతే, ముక్తి లభిస్తుంది.

లీలా! ఇక్కడ నీకు కొన్ని నిర్వచనాలు తెలియటం మంచిది.

1. వాసనలు చెలరేగుతున్న నిద్రే స్వప్నం.
2. వాసనలు అణగారిన నిద్రే సుషుప్తి
3. వాసనలు అణగారిన జాగ్రత్ పేరు మూర్ఛ, లేక మోహం.
4. వాసనలు పూర్తిగా, సమూలంగా, నశించిన స్థితి పేరు తురీయం. ఈ స్థితి తత్త్వజ్ఞానంవల్ల కలుగుతుంది.
5. ఈ స్థితిలో వుండి, జీవించివున్నవారిని జీవన్ముక్తులంటారు. ఈ స్థితి ముక్తులు కానివారికి తెలీదు.
6. జీవన్ముక్తుల మనస్సే ఆతివాహిక మనస్సుగా మారుతుంది.

ఇలాంటి మనస్సే, ఇతర సృష్టులలోని మనస్సులతోనూ, ఇతర జన్మలలోని మనసులతోనూ, సిద్ధులతోనూ, దేవతలతోనూ, కలిసిపోగలుగుతుంది.

కనుక, లీలా! వాసనాక్షయం కోసం ప్రయత్నించు. అప్పుడు జీవన్ముక్తురాలవుతావు. అప్పుడు, చిన్మయశరీరం పొందుతావు. అప్పుడు, నాతో కలసి లోకాంతరాలకు రాగలుగుతావు. దీనికి భిన్నంగా ఎవరు వరమిచ్చినా జరగదు. ఎవరు శాపమిచ్చినా జరగదు.

లీలా! మరో ముఖ్య విషయం విను. మరణం తరువాత ప్రతిజీవికీ ఆతివాహిక దేహం వస్తుంది. దాంతోనే వాళ్ళు ఇతర లోకాలకు వెళతారు. కానీ, వాళ్ళే దాన్ని గుర్తించలేరు. ఇక వాళ్ళ బంధువులేం గుర్తిస్తారు? వాళ్ళు ఈ శవాన్ని చూస్తూ ఇక్కడే కూర్చొంటారు.

## 36. జ్ఞానం లేని వైరాగ్యం నిరుపయోగం

**లీల:** తల్లీ! నాకు మంచి జ్ఞానోపదేశం చేశావు. అయితే వాసనాక్షయం కోసం అభ్యాసం చెయ్యమన్నావు కదా, అభ్యాసం అంటే ఏమిటి? అది ఎలా పెరుగుతుంది. దయచేసి ఆ వివరాలన్నీ చెప్పు.

***సరస్వతీదేవి:***

**తచ్చింతనం తత్కథనం అన్యోన్యం తత్ప్రభాషణమ్।**

**ఏతదేక పరత్వం చ తదభ్యాసం విదుర్బుధాః॥** (ఉ.ప్ర.స.22, శ్లో.24)

(ఈ శ్లోకమే కొద్దిపాటి మార్పుతో భగవద్గీతలో కూడా వుంది. వేదాంత శాస్త్రంలో ఒకే విషయాన్ని ఇంచుమించుగా ఒకే పదాలతో, వివిధ గ్రంథాలలో వివిధ రచయితలు చెప్పడం మనకు కనిపిస్తూ వుంటుంది. ఇది కాపీ కొట్టటం కాదు. ఒకే విషయాన్ని భావన చేసేటప్పుడు ఇంచుమించు ఒకే వాక్కు వెలువడుతుంది అనటానికి ఇది నిదర్శనం. ఆ విషయం అలా వుంచి, అసలు విషయంలోకి వెళితే, ఈ శ్లోకంలో సరస్వతీదేవి, అభ్యాసానికి నిర్వచనం చెపుతోంది.) లీలా! అభ్యాసంలో నాలుగు మెట్లు వున్నాయి.

1. దాన్ని గురించే ఆలోచించటం.
2. దాన్ని గురించే మాట్లాడటం
3. ఒకరికి ఒకరు దాన్ని గురించే బోధించుకోవటం.
4. అది తప్పితే మరో పని లేకపోవటం.

ఈ నాలుగింటిలో ప్రతి ఒక్కటీ అభ్యాసమే. ఈ నాలుగూ కలిపితే అది సరైన అభ్యాసం. అంతే కాదు. ఈ నాలుగూ, ఒక దానికి ఒకటి నిచ్చెన మెట్లు లాగా, పనిచేస్తాయి కూడా.

1. వీటిలో చింతనవల్ల, అంటే మొదటి మెట్టువల్ల, విషయం మనస్సుకి విస్పష్టంగా పడుతుంది.
2. కథనంవల్ల, అంటే రెండవ మెట్టువల్ల, విజ్ఞులైనవారి ఏకీభావం తెలుస్తుంది. మనం అనుకునే విషయంతో విజ్ఞులు ఏకీభవిస్తున్నారంటే, మనకు ఆ విషం మీద విశ్వాసం ఇంకా పెరుగుతుంది.
3. ఒకరికి ఒకరు బోధించుకోవటంవల్ల, అంటే మూడవ మెట్టువల్ల, తెలియని కొత్త విషయాలు తెలుస్తాయి. తెలిసిన విషయాలలో స్పష్టత పెరుగుతుంది. దీనివల్ల విషయంమీద అసంభావన తొలగిపోతుంది. అసంభావనంటే, ఆ విషయం మీద వున్న సందేహ బుద్ధి.
4. తదేక నిష్ఠవల్ల, అంటే నాల్గవ మెట్టువల్ల, విపరీత భావన తొలగిపోతుంది. విపరీత భావన అంటే, తలకిందుల ఆలోచన.

లీలా! అభ్యాసం కావాలనుకునేవారు, విరక్తిని కూడా సాధించాలి.

వేదాంత విషయాలను శ్రవణం చెయ్యాలి.

దృశ్యమంతా మిథ్య అని తెలుసుకోవడం ద్వారా, ఆత్మయందు ఆసక్తి పెంచుకోవాలి.

లీలా! కొందరు రాగద్వేషాలను తొలగించుకోకుండానే, దృశ్యం మిథ్య అనే విషయాన్ని మనస్సుకు సరిగ్గా పట్టించుకోకుండానే, మొండితనంగా వైరాగ్యాన్ని అభ్యసిస్తూ , తపస్సులూ, నియమాలూ చేస్తూ వుంటారు. అలాంటి తపస్సులవల్ల మంచి ఫలం లేకపోగా, వ్యతిరేక ఫలమే వుంటుంది. వాళ్ళ సంస్కారంలో వున్న రాగద్వేషాలు ఏదో ఒక నాడు, పెట్రేగి, వారికి తీవ్రమైన దుఃఖాలను కలిగిస్తాయి. కనుక, దృశ్యం మిథ్య అనే జ్ఞానం ద్వారా, రాగద్వేషాలను తొలగించుకోవటమే ముఖ్యం.

ఈ విధంగా సరస్వతీదేవి బోధించగా, లీలాదేవి సంతోషపడి, వెంటనే సమాధి అభ్యాసం ప్రారంభించింది. సరస్వతీ దేవి కూడా తనకు సహజస్థితిగా వున్నటువంటి సమాధిస్థితిలో నిశ్చలంగా వుండి పోయింది.

## 37. ఆ గదిలోనే బ్రహ్మాండాలున్నాయి

కొద్ది సేపట్లోనే లీలాదేవి సమాధిజనితమైన జ్ఞాన దేహాన్ని ధరించింది. సరస్వతీ దేవి తన సహజజ్ఞాన దేహంతో ఆమె పక్కన నిలిచింది. ఇక వారిద్దరూ, చిదాకాశంలో యథేచ్ఛగా సంచరించ సాగారు.

ఇలా లీలా సరస్వతుల సంవాదాన్ని వినిపిస్తున్న వశిష్ఠమహర్షి, ఆ కథారీతిని ఇలా వివరిస్తున్నాడు.

రామా! వీరిద్దరూ, ఆ ఇంట్లోనే, ఆ గదిలోనే, ఆ చిన్న ఆకాశంలోనే, తిరుగుతున్నారు. మరెక్కడికీ పోలేదు. కానీ, చిద్వృత్తి యొక్క సామర్థ్యంచేత, కోట్ల కోట్ల మైళ్ళ దూరం సంచరించినట్లుగా, అనుభూతి వారికి కలుగుతోంది.

వాళ్ళిద్దరి శరీరాలూ ఆకాశమయములే అయినప్పటికీ, వాళ్ళిద్దరూ ఒకరినొకరు చూసుకొంటున్నారు. స్నేహితుల్లాగా సంతోషపడుతున్నారు. చేయి చేయి పట్టుకొని ఉల్లాసంగా పరుగులు తీస్తున్నారు. ఎగురుతున్నారు. దూకుతున్నారు.

వాళ్ళకి విశాలమైన ఆకాశం కనిపించింది. చల్లని గాలులు వీచాయి. మేఘమండలం కనిపించింది. ఆకాశగంగ కనిపించింది. కొన్ని చోట్ల పర్వతాలు కనిపించాయి. కొన్ని చోట్ల దేవజాతులవారు కనిపించారు. వాళ్ళ నగరాలు కనిపించాయి. కొన్ని చోట్ల సూర్యోదయాలు, కొన్నిచోట్ల సూర్యాస్తమయాలు, కనిపించాయి. (ఇక్కడ వాల్మీకి మహర్షి చిదాకాశాన్ని 65 శ్లోకాలలో అతి మనోహరంగా వర్ణించాడు.)

లీలా సరస్వతులు అలా చాలా సేపు తిరిగి, తిరిగి మళ్ళీ భూలోకం వైపు వచ్చారు. పైనుంచీ చూసేసరికి ఈ భూమండలంయొక్క స్వరూపమంతా, వారికి విస్పష్టంగా కనిపించింది. మధ్యలో భూమి, దాని చుట్టూ సప్తసముద్రాలు, పెద్ద పెద్ద పర్వతాలు, నదులు, అన్నీ కనిపించాయి. అవన్నీ చూసుకుంటూ, వాళ్ళిద్దరూ

గిరిగ్రామం వైపు దిగారు. అంటే వాళ్ళు పద్మరాజుగారి బ్రహ్మాండం నుంచి బయటికి వచ్చి, ఆ వశిష్ఠ బ్రాహ్మణుడి బ్రహ్మాండంలోకి ప్రవేశించారు. దానిలో గిరి గ్రామంలోకి ప్రవేశించారు.

## 38. సత్యసంకల్ప సిద్ధి

వీళ్ళిద్దరూ అక్కడ ఎవ్వరికీ కనిపించడం లేదు. వీళ్ళకు మాత్రం అక్కడ యజమాని లేని యిల్లూ, కన్నీళ్ళు కారుస్తూ వుండే స్త్రీలు, దిగులుగా వున్న మగవాళ్లు, అంతా కనిపించారు.

ఇంతలో లీలకు ఒక కొత్త ఆలోచన వచ్చింది. "ఇక్కడ వున్న నా బంధువులంతా నన్నూ, ఈ సరస్వతీ దేవిని, మామూలు మానవస్త్రీలను చూసినట్లు చూడాలి" అని. అప్పటికే లీలాదేవి సమాధి అభ్యాసఫలంచేత సత్యసంకల్ప స్థితిని సంపాదించింది. ఆ విషయం ఆమెకే తెలీదు. ఇప్పుడు ఆమెకు ఈ సంకల్పం వచ్చేసరికి, తక్షణమే అది సత్యమైపోయి, వాళ్ళిద్దరూ అక్కడున్న మానవులకు కనిపించసాగారు.

ఆ మానవులంతా వీళ్ళు ఎవరో వనదేవతలని భావించి, ఎంతో ఆనందపడ్డారు. ఇంతలో వాళ్ళంతా చూస్తూ వుండగానే, అక్కడి ఎండిపోయిన చెట్లు మళ్ళీ చిగురించాయి. వాడిపోయిన పూలు మళ్ళీ కళకళలాడాయి.

ఇలాంటి గుర్తులన్నీ చూసి, వశిష్ఠబ్రాహ్మణుడి జ్యేష్ఠ పుత్రుడు 'జ్యేష్ఠశర్మ' అనేవాడు చాలా సంతోషపడి, వీళ్లిద్దరికీ ఎదురు వెళ్ళి, పాదాలమీద పూలు జల్లి, నమస్కరించి, స్వాగతం పలికాడు.

అప్పుడు లీల ఆ జ్యేష్ఠశర్మను పలకరించి, "నాయనా మీరంతా దుఃఖంగా కనిపిస్తున్నారు ఎందుకని?" అని దయగా అడిగింది.

జ్యేష్ఠశర్మ ఇలా చెప్పాడు– "అమ్మా! మా తల్లితండ్రులిద్దరూ ఇంచుమించు ఒకే సారి మరణించారు. వాళ్ళు మాకే కాక, మా చుట్టుపక్కల గ్రామాలన్నిటికీ పూజనీయులు. వారిమీది ప్రేమవల్ల మేమే కాక, మా చుట్టు పక్కల గ్రామాలన్నీ దుఃఖంలో మునిగిపోయినాయి. మీరు మహాత్ములు. మీ దర్శనం వ్యర్థం కాదు. మీరు మా దుఃఖం పోగొట్టండి."

జ్యేష్ఠశర్మ ఇలా ప్రార్థించేసరికి, లీల మందస్మితం చేస్తూ అతని తలను మృదువుగా తాకింది. వెంటనే అతనికి మాత్రమే గాక, అక్కడున్న వారందరికీ దుఃఖం మటుమాయమై, మనసులు చల్లబడ్డాయి.

కథా కథనం ఈ దశకు వచ్చేసరికి రాముడు ఒక ప్రశ్నవేశాడు–

**రాముడు:** గురుదేవా! జ్యేష్ఠశర్మ లీలాదేవి సొంతపుత్రుడే కదా! ఆమె ఆ పాతరూపంతోనే దర్శనమిచ్చి, కొడుకుని ఓదార్చితే బాగుండేది కదా? అలా చేయలేదేమి?

**వశిష్ఠుడు:** రామా! మామూలు మానవులకు తన పాంచభౌతిక శరీరం సత్యమనే దృష్టి వుంటుంది. అలాంటి వాళ్ళకి వీళ్ళు మా బంధువులని, వీళ్ళు మా శత్రువులని, ఇలాంటి భావాలు వుంటాయి. జ్ఞానులకు ప్రపంచమంతా చిన్మయమనే దృష్టి వుంటుంది. ఈ ప్రపంచం మిథ్య అనే దృష్టి వుంటుంది. అలాంటి వాళ్ళకు, వీళ్ళు మాకు బంధువులని, వాళ్ళు మాకు శత్రువులని, ఇలాంటి ఆలోచనలు వుండవు. ఇప్పుడు, లీల జ్ఞాని అయింది. అందువల్ల ఆమెకు పుత్ర వ్యామోహం, బంధు వ్యామోహం లాంటివి లేవు. అయితే, జ్యేష్ఠశర్మ తలను ఎందుకు తాకిందంటే, అతడు చేసిన తపస్సుకు సంతోషించి, అతనికి జ్ఞానం అనుగ్రహించదలచుకొని, కరుణతో తాకిందంతే! పుత్రవ్యామోహంతో కాదు. ఇక ఆ పై కథ విను.

ఈ సంఘటన జరగంగానే లీలా సరస్వతులిద్దరూ మళ్ళీ అంతర్ధానమైపోయారు. మళ్ళీ వారిద్దరికీ చిన్మాత్ర శరీరాలు ఏర్పడ్డాయి. ఆ దశలో వారిద్దరికీ ఇలా సంభాషణ జరిగింది.

**సరస్వతీ దేవి:** లీలా! దేన్ని తెలుసుకోవాలో అది నీకు బాగా తెలిసింది. నీకు అపరోక్షజ్ఞానం కలిగింది.

పరోక్షజ్ఞానం ఇదివరకే వుంది. బ్రహ్మసత్త ఎలా వుంటుందో, ఇప్పుడు నీవు స్వయంగా చూస్తున్నావు. ఇక నీకు ఏమి కావాలో అడుగు.

**లీల:** తల్లీ!నా భర్త మరణించిన తరువాత, ఆయన వున్న లోకానికి నేను వెళ్ళాను. ఆ లోకంలో వాళ్ళకి నేను కనిపించ లేదు. మరి ఈ గిరిగ్రామంలో నా పుత్రుడు నన్ను చూశాడు, నేను అతడ్ని చూశాను. ఈ తేడాకు కారణం ఏమిటి?

**సరస్వతీ దేవి:** లీలా! అప్పుడు నీకు జ్ఞానాభ్యాసబలం చాల్లేదు. అప్పుడు నీకు ప్రపంచం మిథ్య అనే నిశ్చయం సరిగా కలగలేదు. బ్రహ్మ అద్వితీయమనే జ్ఞానం కలగలేదు. అవన్నీ కలిగితే కాని, సత్యసంకల్పత్వస్థితి రాదు.

భేదజ్ఞానంలో వుండటమంటే, ఎండలో వుండటం. దానిలో వున్నప్పుడు నేను లీలను అనే భేదదృష్టి వుంటుంది. అప్పుడు సత్యసంకల్ప సిద్ధి వుండదు.

నేను బ్రహ్మను అనే జ్ఞానంవుంటే, నీడలో వున్నట్టు. ఇప్పుడు భేదదృష్టి వుండదు. సత్యసంకల్పసిద్ధి లభిస్తుంది. జ్ఞానాభ్యాసబలంవల్ల నీకది ఇప్పుడు సిద్ధించింది.

అందువల్ల నీ సంకల్పం ఫలించి, నీ పుత్రుడు నిన్ను చూశాడు. ఇప్పుడు నువ్వు నీ భర్తృలోకానికి వెళ్ళినా అక్కడ కూడా, నీ సంకల్పాలు ఫలించి, అనుకున్నట్టు జరుగుతుంది.

**లీల:** సరస్వతీ దేవీ! ఇప్పుడు నాకు స్పష్టంగా తెలుస్తోంది.

1. ఈ ఇంట్లోనే ఆ బ్రాహ్మణుడు నాకు భర్త అయ్యాడు.
2. ఇక్కడే ఆయన మరణించి రాజయ్యాడు.
3. ఆయన రాజ్యమంతా ఇక్కడే వుంది.
4. నేనిక్కడే రాణి నయ్యాను.
5. రాజైన నా భర్త మళ్ళీ ఇక్కడే మరణించాడు.
6. ఇప్పుడిది అంతఃపుర ఆకాశమైంది.
7. ఇప్పుడా రాజు, ఇక్కడే బ్రహ్మస్వరూపాన్ని చెందాడు.
8. ఇక్కడే, అతడు మరో రాజయ్యాడు.
9. ఇక్కడే, అతని రెండో రాజ్యం వుంది.
10. చూడగా, చూడగా, బుట్టలో ఆవాల్లాగా, ఈ గిరిగ్రామ గృహాకాశంలోనే, ఈ ఇంటి ఆకాశంలోనే, బ్రహ్మాండాలన్నీ వున్నాయని నాకు తెలుస్తోంది.
11. ఇది నాకు విస్పష్టంగా కనిపించేటట్లు అనుగ్రహించు.

**సరస్వతీ దేవి:** నా కూతురా! ఓ భూతల అరుంధతీ! నీకు వందలకొద్దీ భర్తలున్నారు. అందులో ఇటీవలివారు ముగ్గురు.

వారిలో బ్రాహ్మణ భర్త బూడిదయ్యాడు. పద్మడనే భర్త శవంగా వున్నాడు. మూడవభర్త రాజ్యం చేస్తున్నాడు. వీరిలో ఎవరి దగ్గరికి తీసుకుపొమ్మంటావో చెప్పు?

లీలా! సంసారం వేరు, బ్రహ్మాండ మండపం వేరు, వ్యవహార పరంపర వేరు.

**అన్యఏవ హి సంసారః సోఽన్యో బ్రహ్మాండ మండపః।**

**అన్యా ఏవ తథా వత్సే- వ్యవహార పరంపరాః॥** (ఉ.ప్ర.స.27, శ్లో.26)

ఇవన్నీ మన ప్రక్కనే వున్నట్టు కనిపిస్తున్నా, అవి ఒక్కొక్కటీ మనకీ కోట్ల కోట్ల మైళ్ళ దూరాలే.

చైతన్యదృష్టితో చూస్తే ఇవన్నీ మర్రి గింజంత కూడా కావు. అయినా వ్యవహారదృష్టితో వాటి దూరాలంతే. కనుక, మనం ఇపుడు ఎటు పోదామో చెప్పు?

## 39. లీలాదేవి పూర్వజన్మలు

**లీల:** తల్లీ నువ్వు చెప్పింది నిజం, ఇది ఇంతే. నాకిప్పుడు గుర్తుకు వస్తోంది. చతుర్ముఖ బ్రహ్మనుంచీ అవతరించిన నాకు, ఇప్పటికి 800 జన్మలు గడిచాయి. అవన్నీ ఇప్పుడు గుర్తొస్తున్నాయి. ఇప్పుడు ఈ జన్మ వుందే, అది సాత్విక జన్మా కాదు. తామసిక జన్మా కాదు. మధ్యలో రాజసిక జన్మ.

అమ్మా! నా జన్మలు కొన్ని చెపుతాను. నేను మొదట ఒక విద్యాధర స్త్రీని. ఆ పైన పుణ్యం తగ్గి మనుష్య స్త్రీని అయ్యాను. ఆ పైన నాగకన్యను అయ్యాను. తరువాత బోయదాన్ని అయ్యాను. ఆ తరువాత కొంచెం పుణ్యం పెరిగి, రాజకుమారుణ్ణి అయ్యాను. ఆ రాజ్యపాలన సమయంలో కొన్ని ఘోర కృత్యాలు చేశాను. ఫలితంగా నీళ్ళు తక్కువ వున్న చోట ఆడ మొసలినై నానా కష్టాలూ పడ్డాను. ఆ తరువాత ఆవునయ్యాను. ఆ తరువాత పక్షినయ్యాను. తుమ్మెదనయ్యాను. లేడినయ్యాను. చేపనయ్యాను. ఆ తరువాత మళ్ళీ బోయదాన్ని అయ్యాను. ఆ తరువాత అప్సరస స్త్రీగా వుట్టాను. ఆ తరువాత తాబేలును, రాజహంసను, దోమను, గడ్డిపరకను అయ్యాను. ఆ తరువాత విద్యాధర స్త్రీని అయ్యాను. అన్ని జన్మలలోనూ ఎన్నో కష్టాలనుభవించాను.

ఈ దశలో రాముడు మరో ప్రశ్న వేశాడు.

**రాముడు:** గురుదేవా! ఈ బ్రహ్మాండం చుట్టూ వజ్రం వంటి గోడలుంటాయని పెద్దలంతా చెపుతూ వుంటారు కదా. ఈ ఆడవాళ్ళిద్దరూ ఒక బ్రహ్మాండాన్ని దాటి ఇంకొక బ్రహ్మాండంలోకి వెళ్ళారని మీరు చెపుతున్నారు కదా. బ్రహ్మాండానికి బ్రహ్మాండానికీ మధ్య అంత గట్టి గోడలుంటే వీళ్ళు ఎట్లా వెళ్ళి రాగలిగారు?

**వశిష్టుడు:** విని విని మళ్ళీ అడుగుతావేమిటయ్యా? నిజానికి వీళ్ళిద్దరూ ఎక్కడున్నారు? ఆ అంతఃపురంలోనే వున్నారు. అందులోనే గిరిగ్రామం, దాంట్లోనే రాజ్యం, అక్కడే మరో బ్రహ్మాండం– అని చెప్పాం కదా. ఇంక బ్రహ్మాండం ఎక్కడ? గోడలు ఎక్కడ? ప్రయాణమెక్కడ?

ఒకడు ఇంట్లో మంచంమీద పడుకొని, ఒక స్వప్నం తరువాత మరొక స్వప్నం చూస్తున్నాడు. వాడు ఎంత దూరం వెళ్ళాడు? ఏ దూరమూ వెళ్ళ లేదు. ఐనా దూర దూరపు స్వప్నలోకాలన్నీ కనిపించాయా లేదా? అదంతా వట్టి కనిపించడం మాత్రమే కదా!

అలాగే ఇక్కడ కూడా బ్రహ్మాండమూ లేదు, సంసారమూ లేదు. గోడలూ లేవు, దూరమూ లేదు. అజ్ఞానంవల్ల అవన్నీ వున్నట్టు మనస్సుకు కనిపిస్తాయి.

కలగనేవాడు కలలో పెద్ద రాజ్యం చూశాడు. ఆ రాజ్యమంతా ఎక్కడ వుంది? ఆ గదిలోనే వుందని చెప్పాలి. చిన్న గదిలో పెద్ద రాజ్యం పడుతుందా? ఆ గదిలో నిజంగా రాజ్యం వుందా? అలాంటివే ఈ బ్రహ్మాండాలూనూ.

బ్రహ్మాండము అంటే బ్రహ్మగారి సంకల్పము అని అర్థం. అదే సంకల్పం, అదే వాసనతో, వీళ్ళక్కూడా కలిగేసరికి వీళ్ళకు ఆ బ్రహ్మాండం కనిపిస్తోంది. ఇంతకంటే మించి అక్కడ గోడలేమీ లేవు. ఇక పై కథ విను.

ఇలా మాట్లాడుకుంటూనే లీలా సరస్వతులిద్దరూ కూడా వశిష్ఠబ్రాహ్మణుడి ఇంట్లోనుంచి బయటకు వచ్చి, ఆ చుట్టుప్రక్కల్లో తిరగసాగారు. ఆ పరిసరాలన్నీ చూసేసరికి, లీలకు తన వెనకటి బ్రాహ్మణ జన్మ సంఘటనలన్నీ గుర్తొచ్చాయి. ఆమె సరస్వతీ దేవికి ఆ విషయాలన్నీ వివరించి చెప్పసాగింది. ఈ సందర్భంలో వాల్మీకిమహర్షి పాతకాలపు బ్రాహ్మణ గ్రామీణ జీవనాన్ని చాలా సుందరంగా వర్ణించాడు.

## 40. బ్రాహ్మణ లీల

లీలాదేవి ఇలా చెపుతోంది –

సరస్వతీదేవీ! అప్పుడు నేనొక బ్రాహ్మణ స్త్రీని. చిక్కి, నరాలు బయటపడి వుండేదాన్ని. చేతులు దర్భపుడకల్లాగా వుండేవి. అయినా, ఎప్పుడూ అతిథులంటే ఇష్టంగా వుండేది. ఎంత మంది వచ్చినా, విసుక్కోకుండా వంటచేసి పెట్టేదాన్ని.

నాకు సంతానం ఎక్కువ. ఎప్పుడూ నా భర్తకు కీర్తి పెరగాలని ఆలోచిస్తూ వుండేదాన్ని.

ఇంటి పనుల్లో నేను చురుకు. ఎప్పుడూ ఏదో ఒక పని చేస్తు వుండేదాన్ని. చల్ల చిలకటమో, అంట్లు తోమటమో, ఏదో ఒకటి చేస్తూ వుండేదాన్ని. రాత్రింబవళ్ళు నాకు పనులే. ఇంట్లో మావాళ్ళు ఎవరు ఏ పని చేసినా, "ఇంత ఆలస్యమా?" అని విసుక్కొంటూ వుండేదాన్ని.

ఈ సంసారమేమిటి? ఈ లోకమేమిటి? నేనంటే ఏమిటి? అని ఇలాంటి ఆలోచనలు నాకు కలలో కూడా వచ్చేవి కావు.

నేనెంత మొద్దునో, నా మొగుడూ అంత మొద్దే. అయనకు ఎప్పుడూ దర్భలూ, సమిధలూ, కూరగాయలూ, కట్టెపుల్లలు, వీటితోనే సరిపోయేది.

నాకు కాస్త ఖాళీగా వుంటే, పిల్లల చెవులలో గుబిలి తీస్తూ వుండేదాన్ని. ఇంటి ముందర అలికి ముగ్గులు పెడుతూ వుండేదాన్ని.

ఎప్పుడు చూసినా ఇంట్లో వాళ్ళకు నీతులు నూరిపోస్తూ వుండేదాన్ని. ఇలాంటి నీతిగల ఇంట్లో, ఇలాంటి మనుషులు చేరారేమిట్రా? అని ఎగిరిపడుతూ వుండేదాన్ని.

నాకు ముసలితనం వచ్చింది ఎడమచెవికి చెముడు వచ్చింది. తల వణికింది. నడుము ఒంగింది. చేతికి కర్ర తోడైంది.

మాతా! నేను పెంచిన మొక్కలన్నీ ఇక్కడే వున్నాయి. నేను పోషించిన పశువులన్నీ ఇక్కడే వున్నాయి. ఇదిగో వీళ్ళంతా నా బంధువులే.

తల్లీ! ఇప్పుడు నాకు గుర్తొస్తోంది. మా ఆయన, తాను రాజు కావాలని ఎప్పుడూ అనుకొంటూ వుండేవాడు. ఆయన నిజంగానే రాజయ్యాడు. ఆయన జీవుడు ఇప్పడు ఇక్కడే ఆకాశంలో గాలి లాగా, గాలిలో పరిమళం లాగా, వున్నాడు.

తల్లీ! ఇక్కడ ఈ వేలెడి ఆకాశంలో కోటి యోజనాల రాజ్యం ఇమిడి వుంది. ఇదంతా ఏదో మాయ లాగా కనిపిస్తోంది నాకు. సరే, తల్లీ! మళ్ళీ నా భర్తగారి రాజ్యానికి వెళదాం పద.

## 41. చిదాకాశంలో బ్రహ్మాండాల దూరం

లీలా సరస్వతులిద్దరూ మళ్ళీ ప్రయాణం సాగించారు. మేఘమార్గం, వాయుమార్గం, సూర్యమార్గం, చంద్రమార్గం, ధ్రువమార్గం అన్నీ దాటారు. ఆ తరువాత స్వర్గలోకం, త్రిమూర్తుల లోకాలు అన్నీ దాటారు.

అప్పుడు లీల ఒక సారి వెనక్కు తిరిగి చూసింది. ఎక్కడా ఏ వెలుగూ లేదు. అంతా చీకటి. అది చూసి లీల ఇలా అడిగింది.

**లీల:** సరస్వతీదేవి! సూర్యచంద్ర నక్షత్రాదులన్నీ ఏమైపోయాయి? ఇంత చీకటిగా వుందేమిటి?

**సరస్వతీ దేవి:** లీలా! నువ్వు సూర్య చంద్రాదులను దాటి చాలా దురం వచ్చేశావు. అందువల్ల నీకు ఏ వెలుగూ కనిపించడం లేదు.

**లీల:** అలాగా! సూర్యుడు చిన్న చుక్కంతైనా కనిపించటం లేదు. అంతదూరం వచ్చేశామన్నమాట. అది సరే గానీ, ఇక్కడ ఉత్తరం పక్క ఏదో దారి కనిపిస్తోంది అదేమిటి? ఎటు పోతుంది?

**సరస్వతీ దేవి:** లీలా! అది దారి కాదు. బ్రహ్మాండంయొక్క పైడిప్ప. నువ్వింరాక చూసిన సూర్య చంద్రాదులంతా ఆ బ్రహ్మగారియొక్క ధూళిలో లేశాలు.

**వశిష్ఠుడు:** అలా మాట్లాడుకుంటూ లీలా సరస్వతులిద్దరూ, బ్రహ్మాండంయొక్క పై డిప్పకు మరింత దగ్గరగా వెళ్ళారు. అక్కడ లీలకు పంచభూతాల ఆవరణలు ఒకదానిమీద ఒకటి కనిపించాయి. ఆపైన పరిశుద్ధమైన చిదాకాశం కనిపించింది. దాని వైశాల్యానికి అంతే లేదు.

**ఆకల్పముత్తమ బలేన శిలా పతేచ్చేత్**
**తస్మిన్ బలా త్పతగరాడపి చోత్పతే చ్చేత్।**
**తద్యోజనం న లభతే విమలేఽ౦ బరేంత**
**రా కల్పమేక జవగోప్యథ మారుతోఽపి ॥** (ఉ.ప్ర.స.29, శ్లో.60)

చిదాకాశం అనంతం అని చెప్పడానికి, వాల్మీకి మహాకవి ఇక్కడ ఒక చక్కటి కల్పన చేశాడు. పై నుంచీ ఒక పెద్ద బండరాయి మహావేగంగా కిందపడుతోంది. కింద భూమినుంచీ గరుత్మంతుడు అంతే వేగంతో సూటిగా పైకి ఎగురుతున్నాడు. అలా ఆ రాయి, ఈ పక్షీ, ఒక కల్పకాలం పాటు ప్రయాణం సాగించారు. ఈ రెంటి మధ్యలో అంతే వేగంతో వాయుదేవుడు ఇటూ అటూ కూడా కల్పకాలం పాటూ పరుగులు తీశాడు. అయినా సరే ఇటు రాయిని గానీ, అటు గరుత్మంతుడ్ని గానీ, ముట్టుకోలేక పోయాడు. చిదాకాశం వైశాల్యం అంతటిది. చిదాకాశం పూర్తిగా అపరిచ్ఛిన్నం అని చెప్పటమే ఇక్కడ వుద్దేశ్యం.

**వశిష్ఠుడు:** రామా! చిదాకాశంయొక్క స్థితి అది. అదే నిజమైన వస్తువు. అయితే ఇందాక చాలా బ్రహ్మాండాలు, వాటి వ్యవహారాలు, చెప్పాం. అదంతా అజ్ఞుల దృష్టిని అనుసరించి చెప్పాం, అంత మాత్రమే. అయితే, అజ్ఞులకు మాత్రం ఇవన్నీ ఎలా కనిపిస్తున్నాయి అంటావేమో?

**ఉత్పత్త్యో త్పద్యతే తత్ర**
**స్వయం సంవిత్ స్వభావతః।**
**స్వసంకల్పై శ్శమం యాతి**
**బాల సంకల్ప జాలవత్॥** (ఉ.ప్ర.స.30, శ్లో.8)

సంకల్పం వుంటే, దాన్నిబట్టి ఈ చిదాకాశం అనే అధిష్ఠానం మీద ఏదైనా కనిపిస్తుంది. ఆ సంకల్పం పోతే, కనిపించేది పోతుంది. ఇదే సత్యం.

**రాముడు:** గురుదేవా! మీరు మాటిమాటికీ చిదాకాశం అనబడేటువంటి పరమాత్మమీద, అధ్యాసరూపంగా ఈ ప్రపంచం ఏర్పడుతోందని చెపుతున్నారు. మళ్ళీ ఆ పరమాత్మకు దిక్కులూ, కాలాలూ, లేవంటూన్నారు. ఏ దిక్కూ లేకపోతే, 'మీద' అనే మాట ఎలా కుదురుతుంది? పరమాత్మ మీద ప్రపంచం ఆరోపితమైంది – అంటే, క్రింద పరమాత్మ, ఆయనమీద ప్రపంచమూ, వున్నట్టే గదా? ఇలా అంటే పరమాత్మలో "పైనా, క్రిందా" అనే దిక్కులు వున్నట్టే గదా?

అదీగాక, గురుదేవా! ఆ పరమాత్మలో నిజంగా దిగ్విభాగం లేకపోయినట్లైతే, ఆయనలోంచి పుట్టిన ఈ ప్రపంచానికి అవి ఎట్లా వస్తాయి? అందువల్ల కూడా పరమాత్మలో దిక్కులు వున్నాయని చెప్పాలి. దీనికి మీరేమంటారు?

**వశిష్ఠుడు:** రామా! ఒకడికి కొంచెం కంటి దోషం వుంది. వాటికి ఆకాశంలో ఏవేవో వెంట్రుకలు వుండలు వున్నట్లు కనిపిస్తున్నాయి. అకాశంలోకి వెంట్రుకల వుండలు ఎక్కడ్నుంచీ వచ్చాయి? అవి లేనే లేవు. వీడి

భ్రాంతివల్ల అవి ఆకాశంలో వున్నట్లు కనిపిస్తున్నాయి. ఈ విషయాన్ని చెప్పేటప్పుడు మనం "వాడు కంటిదోషంవల్ల ఆకాశం మీద వెంట్రుకల వుండలను ఆరోపించుకున్నాడు" అని చెపుతాం. ఇలా చెప్పినంత మాత్రం చేత, క్రింద ఆకాశం వుందనీ, దాని మీద వెంట్రుకల వుండ వుందనీ, అర్థం చెప్పవచ్చా?

చెప్పరాదు. ఎందుకు చెప్పరాదంటే, అక్కడ నిజంగా వెంట్రుకల వుండలే లేవు. అవి నిజంగా వుండి వుంటే అవి క్రింద వున్నాయా, మీద వున్నాయా, అని చర్చ. నిజంగా లేని వాటి గురుంచి ఆ చర్చేమిటి?

అలాగే, పరమాత్మ మీద ఆరోపింపబడిన ఈ ప్రపంచం సత్యమైతే, అప్పుడు పరమాత్మ ఆధారమని, అందువల్ల ఆయన క్రింద వుంటాడనీ, ప్రపంచం ఆయనమీద ఆధారపడివున్న ఆధేయమని, అందువల్ల అది మీద వుంటుందనీ, నువ్వు వాదించవచ్చు. ప్రపంచం సత్యమే కాదే, ఇక క్రిందా, మీదా వాదనలు ఎలా చెల్లుతాయి?

ఇక పరమాత్మలో లేని దిగ్విభాగం, ప్రపంచంలోకి ఎలా వచ్చిందని నువ్వు అంటున్నావు. భ్రాంతి అంటే ఏమిటి? మూలవస్తువులో లేని కొత్త అంశాలు కనిపించటమే భ్రాంతి. ప్రపంచం భ్రాంతివల్ల పుట్టింది. కనుక, పరమాత్మలో లేని దిక్, కాలాదులు దీనిలో కనిపించవచ్చు.

ఇక ఈ ప్రపంచంలో మనకు కనిపించే దిగ్విభాగం కూడా సాపేక్షికమే గానీ, శాశ్వతం కాదు. మనం వుండే భూమినిబట్టి ఇది క్రిందని, అది మీదని, మనం చెప్పుకుంటున్నాం. అంతే గానీ, నిజమైన క్రింద దిక్కూ లేదు. నిజమైన మీద దిక్కూ లేదు. పరమేశ్వరుడు సంకల్పిస్తే ఏది ఎటైనా మారవచ్చు.

## 42. భూమ్యాకర్షణ సిద్ధాంతం

ఇక్కడ వాల్మీకి మహర్షి వ్రాసిన చిన్ని శ్లోకం ఒకటి, ఈనాటి మన భూమ్యాకర్షణ సిద్ధాంతాన్ని కొంచెం పరామర్శిస్తోంది. భూమికి ఆకర్షణ శక్తి వుందనే సిద్ధాంతం, అధూనాతన విజ్ఞాన శాస్త్రం కనిపెట్టిన నూతన సిద్ధాంతమని నమ్మేవాళ్ళు చాలా మంది వున్నారు. ఇక్కడ ఈ సందర్భంలో వాల్మీకి మహర్షి రాసిన ఒక శ్లోకంలో ఆ ప్రసక్తి వచ్చింది. ఆ శ్లోకమేమంటే–

**అస్వాతంత్ర్యాత్ ప్రధావంతి పదార్థాస్సర్వఏవ యత్ ।**

**బ్రహ్మాండే పార్థివో భాగః తదధస్తూర్ధ్వ మన్యథా ॥** (ఉ.ప్ర.స.30, శ్లో.11)

ఈ శ్లోకం మామూలు సాహిత్య దృష్టితో చూస్తే, ఏమీ అన్వయం కాదు. ఎందుకంటే, దీంట్లో గురుత్వ సిద్ధాంత ప్రసక్తి వుందని వెంటనే అర్థం కాదు. వ్యాఖ్యాత ఆనందబోధేంద్ర సరస్వతి దీన్ని చక్కగా వివరించారు. ఆయన ఏమన్నారంటే–

వాస్తవంగా కింద దిక్కు అనేది లేనే లేదనుకొంటే, "చెట్టు మీదినుంచి రాలిన పండు కిందికే పడుతుంది"– అని నియమం ఎలా కుదురుతుంది?– అని ఒకడు ప్రశ్నించాడనుకోండి. దాన్నిబట్టి కింద దిక్కు అనేది ఒకటి వాస్తవంగా వుంది, దాన్ని చెట్టుమీది పండు గుర్తించగలుగుతోంది– అన్నాడనుకోండి. దాంట్లో తప్పేముంది?

తప్పుంది. ఎలాగంటే– ప్రతి వస్తువులోనూ గురుత్వము అనే గుణం ఒకటే వుంది. గురుత్వం అంటే ఏమిటి? బరువు అని అందరూ అనుకుంటూ వుంటారు. అది కాదు. ప్రతి పదార్థానికీ తనయొక్క అంశలను ఆకర్షించే శక్తి ఒకటి వుంది. దాని పేరే గురుత్వము. ప్రతి ఇంద్రియమూ, తనకు సంబంధించిన శబ్దాది గుణాలను ఆకర్షించుకోగలదు. అలాగే పృథివ్యాది పంచభూతాలు కూడా తమ తమ అంశలను తాము ఆకర్షించుకోగలవు. ఇదే గురుత్వము.

ఈ నాటి ఆధునిక విజ్ఞానం– ప్రతి అణువూ మరొక అణువును ఆకర్షిస్తుందని, లేదా వికర్షిస్తుందని, చెబుతోంది. పరమాణువులో వున్న అణుఖండాలకు కూడా ఆకర్షణ వికర్షణలు వున్నాయని చెబుతోంది.

ఇప్పుడు వాల్మీకి మహర్షి ప్రస్తావించిన గురుత్వ సిద్ధాంతంలో – ఈ మాటలు లేవు గానీ, భూతాలు– వాటి అంశలు అని వుంది. అంశలు అంటే, అణువులు, అణుఖండాలు అని మనం తేలికగా అర్థం చేసుకోగలం. ఆ దృష్టితో చూసినప్పుడు, ఆ నాటి గురుత్వ సిద్ధాంతం ఈనాటి భూమ్యాకర్షణ సిద్ధాంతానికీ, అణ్వాకర్షణ సిద్ధాంతానికీ, ఎంత దగ్గరగా వుందో మనం అర్థం చేసుకోగలం. ఇక మన చెట్టు, కాయ, చర్చలోకి పోదాం.

చెట్టుమీది కాయ భూమిలోని ఒక అంశ. అందుచేత భూమిలోని గురుత్వగుణం ఆ కాయను ఆకర్షిస్తోంది. అందువల్ల భూమి ఎటుంటే, కాయ అటు వస్తుంది. అంతే గానీ, కింది దిక్కు అని తెలిసి కాయ కిందికి రాదు.

లోకంలో కూడా ఇది కింది దిక్కు అని, ఒక దిక్కుకు బోర్డువేసి పెట్టడం కుదరదు. దీనికి వాల్మీకి మహర్షి ఒక మంచి ఉదాహరణ ఇచ్చాడు. ఈ ఉదాహరణనే, తరువాత సూర్య సిద్ధాంత గ్రంథకర్త కూడా స్వీకరించాడు.

ఈ భూమిని ఒక బంతి అనుకుందాం. దీని చుట్టూతా వందల కొద్దీ చీమలు, అడ్డదిడ్డంగా తిరుగు తున్నాయనుకోండి. అప్పుడు ఏ చీమ కింద వున్నట్టు? ఏ చీమ పైన వున్నట్టు? ఎవ్వరూ తేల్చి చెప్పలేరు. ఎక్కడిక్కడ ఏ చీమకు ఆ చీమకు దాని కాళ్ళు వున్న దిక్కు కింద దిక్కు. దాని వీపు వున్న దిక్కు పై దిక్కు. ఇంతే మనం చెప్పగలిగింది. కనుక, ఎవ్వరికీ కూడా ఈ దిక్కు ఇదే అని నిర్ణయించి చెప్పడం సాధ్యం కాదు.

రామా! ప్రతి బ్రహ్మాండమూ ఎంత బరువు వుందంటావు? దాని చుట్టూ వున్న నీటి ఆవరణ ఎంత బరువు ఉందంటావు? కింది దిక్కనేది ఒకటి ఖాయంగా వున్నట్లయితే చెట్టుమీది పండు రాలినట్లుగా ఈ బ్రహ్మాండాలూ, ఈ నీళ్లూ, రాలి ఆ కింది దిక్కు వెంట పడిపోవాలి. అలా జరుగుతోందా? జరగటం లేదు. జరగదు. ఎందుకంటే, కింది దిక్కనేదే లేదు. ఈ బ్రహ్మాండం మొత్తం కలిపి మరో బ్రహ్మాండంలో అంశం కాదు. అందువల్ల, ఇది దేని గురుత్వాకర్షణకూ లోను కాదు. కనుక, ఈ బ్రహ్మాండం ఎటూ కదలదు.

రామా! ఈ విధంగా ఈ బాహ్య ప్రపంచంలోనే, వాస్తవమైన దిగ్విభాగం లేదు. కనుక, దీనికి అధిష్టానమైన ఆ పరమాత్మలో దిగ్విభాగం వుండవలసిన అవసరం లేదు.

రామా! అదీగాక, బ్రహ్మాండాలన్నీ ఒకే రకంగా వుండవు. కొన్ని బ్రహ్మాండాల్లో జీవులుంటారు. కొన్ని బ్రహ్మాండాల్లో చెట్లే ఉంటాయి. కొన్ని బ్రహ్మాండాలు కేవలం శూన్యంగా వుంటాయి. కొన్ని బ్రహ్మాండాల్లో నామరూప వికారాలు కూడా వుండవు. కొన్నిటికి బ్రహ్మ సృష్టికర్త, కొన్నిటికి విష్ణువు సృష్టికర్త. ఇలా రకరకాల దేవతలు సృష్టించిన బ్రహ్మాండాలు మరికొన్ని. ఇలా బ్రహ్మాండాలు ఎన్ని రకాలు వున్నాయో, లెక్క తేల్చి చెప్పడం బ్రహ్మ, విష్ణు, రుద్రుల తరం కూడా కాదు.

**ప్రత్యేకస్యాదగోళస్య స్థితః కటక రత్నవత్‌।**

**భూతాకృష్టి కరోభావః పార్థివః స్వస్వభావతః॥** (ఉ.ప్ర.స.30, శ్లో.32)

ఈ శ్లోకంలో వశిష్ఠమహర్షి మరో వైజ్ఞానిక విషయాన్ని ప్రస్తావిస్తున్నాడు. దీంట్లో ఆకర్షణ సిద్ధాంతాన్ని సూటిగా ప్రస్తావించటాన్ని మనం గమనించవచ్చు. **భూతాకృష్టికరో భావః** – అంటే పంచభూతాలకూ వుండే ఆకర్షణ శక్తి అని అర్థం. ఇక్కడ వశిష్ఠ మహర్షి ఒక మంచి ప్రశ్న లేవదీశాడు ఏమనంటే–

ప్రతి బ్రహ్మాండంలోనూ పంచభూతాలున్నాయి. అక్కడి దాకా ఎందుకు, మన భూమిలోనే వున్నాయి. ఇవి ఒకదానికి ఒకటి శత్రువులు. ఒక భూతం మరో భూతాన్ని ఎందుకు నాశనం చేయటం లేదు? నిప్పు ప్రక్కనున్న నీటిని ఆవిరి చేసెయ్యాలి. నీరు మట్టిగడ్డను కరిగించేయాలి. గాలి వీటన్నింటినీ దూరానికి విసిరేయాలి. అయినా అలా ఎందుకు జరగటం లేదు? ఈ ప్రశ్నకు ఆయనే సమాధానం చెబుతున్నాడు.

రామా! "**కటకరత్నవత్‌**" గుండ్రని బంగారపు గాజు వుంది. దాని చుట్టూతా రత్నాలు పడిపోకుండా ఎవరు పట్టుకుంటున్నారు? బంగారంలో వుండే శక్తే పట్టుకుంటోంది. అలాగే **"భూతా కృష్టికరో భావః"**

భూత– పంచభూతాలను, ఆకృష్టికరః– ఆకర్షణ చేసేటటువంటి, భావః– ఒకానొ శక్తి, ఈ పంచభూతాలను, పొదిగిన రాళ్ళ లాగా, దేని హద్దుల్లో దాన్ని నిలబెడుతోంది. అందుకే ఏ బ్రహ్మాండమూ, పంచభూతాల విరోధంవల్ల కూలి పోవటం లేదు.

వశిష్ఠమహర్షి ఈ విధంగా ప్రసంగవశాత్తుగా బ్రహ్మాండాలయొక్క వైశాల్యాన్ని, పంచభూతాల ఆకర్షణ సిద్ధాంతాన్ని, ప్రస్తావించి, మళ్ళీ అసలు విషయంలోకి ప్రవేశిస్తూ ఇలా అన్నాడు.

రామా! ఇంతకూ చెప్పవచ్చిందేమంటే, ఇన్ని రకాల విచిత్ర బ్రహ్మాండాలున్నా వీటిలోగాని, వీటికి అధిష్ఠానమైన పరమాత్మలో గానీ, దిగ్విభాగం వుండే అవకాశం లేదు. ఇంతకూ, మనం ఎక్కడ్నించి వచ్చామంటే, లీలాదేవి బ్రహ్మాండపు పైకప్పు దగ్గరకు వెళ్ళి, అక్కడి ఉత్తరం పక్కన ఒక దారిని చూసిందని చెప్పేసరికి, చిదాకాశంలో దిక్కులుంటాయా– అనే ప్రశ్న వచ్చింది. దానిమీద ఇంత చర్చ జరిగింది.

ఇక కథలోకి వెళితే, బ్రహ్మాండం చిట్టచివర పంచభూత ఆవరణల పైన, పరిశుద్ధ చిదాకాశంలోకి ప్రవేశించిన లీలా సరస్వతులు ఇంకా ముందుకు నడిచారు. అక్కడ వారికి చాలా బ్రహ్మాండాలు కనిపించాయి. వాటిల్లో, ఒకానొక బ్రహ్మాండంలోకి ఇద్దరూ ప్రవేశించారు. అది పద్మరాజు వుండిన బ్రహ్మాండం.

లీలా సరస్వతులిద్దరూ, ఆ బ్రహ్మాండంలో క్రమంగా భూమి దగ్గరకు వచ్చి, పద్మరాజు అంతఃపురంలోకి ప్రవేశించారు. అక్కడ పూలరాశిలో పద్ముడి శవం వుంది. దాని పక్కన సమాధిలో వున్న లీల వుంది. ఆ పక్కన పరివార జనులు నిద్దర రాక, ఇబ్బందిపడుతూ కూర్చొని వున్నారు.

ఈ పరిస్థితి చూసిన లీలకు, మరణించి వున్న తన భర్తగారి మనస్సులో ఇప్పుడు వున్న సంకల్ప సంసారంలోకి, అంటే ఆయనగారియొక్క సంకల్పమయమైన బ్రహ్మాండంలోకి, ప్రవేశించాలనే వింత కోరిక కలిగింది.

వెంటనే లీలా సరస్వతులిద్దరూ, పద్మరాజ బ్రహ్మాండ కటాహాన్ని చీల్చుకొని, మరో కొత్త బ్రహ్మాండంలోకి ప్రవేశించారు. అక్కడ కూడా కొండలూ, నదులు, సముద్రాలు, ఆకాశము, లోకాలు అన్నీ కనిపించాయి. వెతుక్కుంటూ ముందుకు వెళ్ళగా, అంతకు ముందు సమాధిలో తాను చూసిన భర్తగారి నూతన రాజ్యం లీలకు కనిపించింది.

## 43. యుద్ధము

కానీ, ఇప్పుడా రాజ్యం చుట్టూ, సింధురాజు అనే శత్రురాజుయొక్క సేన ముట్టడించి వుంది. చూడగా, ఇరువాగుల వారూ యుద్ధానికి అన్ని విధాలా సిద్ధమైనట్లే వున్నారు. అటు ఆకాశంలో అప్సరస స్త్రీలు, గంధర్వ స్త్రీలు, స్వర్గానికి రాబోయే వీరుల కోసం అప్పుడే ఆదుర్దాగా ఎదురు తెన్నులు చూస్తున్నారు.

రెండు పక్కలా సేనాపతులు తమ సేనలను వ్యూహాలుగా ఏర్పాటు చేసుకుంటున్నారు. అటు ఆకాశంలో దేవజాతులవారు దేవవిమానాలతో వచ్చి ఆకాశంలో నిలబడి, యుద్ధం చూడటానికి సిద్ధపడుతున్నారు.

ఇది చూసిన లీలా సరస్వతులు, తాము కూడా ఒక విమానాన్ని కల్పించుకొని, ఇతర దేవతలలో కలిసిపోయి, అక్కడే వుండిపోయారు.

ఈ జన్మలో లీలయొక్క భర్తపేరు విదూరథుడు. శత్రురాజు పేరు సింధురాజు. చూస్తుండగానే, రెండు సైన్యాలూ తలపడ్డాయి. రణభూమి చుట్టూ చేరిన జనసందోహం కోలాహలంగా మాట్లాడుకుంటున్నారు. యుద్ధరంగంలో వీరులు భయంకరంగా అరుచుకుంటున్నారు.

ఆ పగలల్లా భయంకరమైన యుద్ధం జరిగింది. చీకటి పడేసరికి యుద్ధం ఆగిపోయింది. దానితోపాటే భూతప్రేత పిశాచాల కోలాహలం మొదలైంది.

యుద్ధం ఆగిన కొద్దిసేపటికే, లీల భర్త అయిన విదూరథుడు సేనాపతులను సమావేశపరచి, మర్నాడు యుద్ధతంత్రాన్ని గూర్చి చర్చ చేసి, ఆ తరువాత నిద్రకు ఉపక్రమించాడు.

లీలా సరస్వతులు ఆ పడకింటికి వున్న ఒక రంధ్రం ద్వారా లోపలకు ప్రవేశించారు.

## 44. శరీరమే కాదు ప్రపంచమంతా మనోజన్యమే

ఇక్కడ రాముడు ఒక ప్రశ్నవేశాడు.

**రాముడు:** మునీంద్రా! వీళ్ళిద్దరూ ఇప్పుడు స్థూల శరీరాన్ని ధరించి, విమానంపై తిరుగుతూ వున్నారు గదా! వాళ్ళ స్థూల శరీరం రంధ్రం లోంచి ఎట్లా పోగలిగింది?

**వశిష్ఠుడు:** రామా! ఎవరికైతే "నాకు భౌతిక శరీరం వుంది" అనే భ్రమ వుంటుందో, వారు రంధ్రాల గుండా దూరిపోలేరు. కానీ, ఎవరికైతే తమ స్థూలదేహం మీద "ఇది నేను" అనే అభిమానం వుండదో, వారికి తమయొక్క ఆతివాహిక దేహం మీద "నేను" అనే అభిమానం వుంటుంది. అలా సూక్ష్మమైన ఆతివాహిక దేహం మీద, నేననే అభిమానం కలవారు, తమ వాసనా బలంచేత, సూక్ష్మ ప్రదేశాలకు వెళ్ళగలరు, రాగలరు.

రామా! అన్ని శరీరాలకూ అధిష్ఠానం చైతన్యమే. అది స్థూలమూ కాగలదు. సూక్ష్మమూ కాగలదు. వాసనాబలాన్ని బట్టి, అది రెండు రకాలు గానూ అవుతూ వుంటుంది.

దేహం స్థూలంగా వుంటే, దానిలో వుండే మనస్సు కూడా స్థూలంగానే వుంటుంది. దేహం సూక్ష్మంగా వుంటే, దానిలో వుండే మనస్సు కూడా సూక్ష్మం గానే వుంటుంది.

వీటిల్లో చిత్తమేమో చైతన్యానికి అధీనమై వుంటుంది. జీవి చేసే చేష్టలేమో చిత్తానికి అధీనమై వుంటాయి. చిత్తం సూక్ష్మంగా వుంటే, వాటి చేష్టలు కూడా సూక్ష్మంగా వుంటాయి. సూక్ష్మ శరీరధారులైన యోగులంతా, సూక్ష్మంగానే వ్యవహరిస్తూ వుంటారు.

యోగుల సంగతి మనకేమి తెలుస్తుందంటావా?– అక్కడి దాకా ఎందుకు? నీ స్వప్నంలో కనిపించే మనిషి, నీ ఊహల్లో కదలాడే మనిషి, ఎక్కడికైనా పోగలడు, దేనిలోనైనా దూరగలడు. వీళ్లని ఎవరు అడ్డుపెట్టగలరు? ఎందుకంటే, వీళ్ళు సూక్ష్మ స్వరూపులు.

అలాగే, మనోమాత్ర స్వరూపులైన ఆతివాహిక శరీరధారులను ఎవరూ ఆపలేరు. అందువల్ల లీలా సరస్వతులు ఆ చిల్లిలోంచి సులభంగా దూరగలిగారు. ఇందులో ఆశ్చర్యమేమీ లేదు.

రామా! ఇక్కడ నీకు మరో ముఖ్య విషయం గుర్తు చేయాలి. జ్ఞానబలం బాగా పెరిగితే, ఈ భౌతిక శరీరం కూడా మనోరూపాన్ని పొందుతుంది. జ్ఞానబలం ఇంకా పెరిగితే, చిత్తం పంచభూత రూపాన్ని పొందుతుంది. ఎందుకంటే, పరమాత్మ మొదట్లో సృష్టి చేసేటప్పుడు తన చిత్తవృత్తుల ననుసరించే, ఈ పంచభూతాలను సృష్టి జేశాడు. అజ్ఞానం కలిస్తేనే చిత్తవృత్తి ఏర్పడుతుంది. అంటే అజ్ఞానంలోంచి చిత్తవృత్తీ, దానిలోంచి పంచభూతాలూ, వాటిలోంచి సూక్ష్మదేహాలూ, వాటిలోంచి స్థూలదేహాలూ, ఉద్భవిస్తున్నాయి.

అంటే, మట్టి పొడిలోంచి మట్టి ముద్ద, దానిలోంచి మట్టి పెంకులు, వాటిలోంచి కుండ, ఏర్పడినట్టుగా, చిత్తమూ, దేహాలూ, అజ్ఞానంలోంచి ఏర్పడుతున్నాయి.

ఈ అజ్ఞానానికి అధిష్ఠానం (ఆధారం) చైతన్యం. కనుక, చైతన్యమే అజ్ఞానంతో కలిస్తే చిత్తం, అదే సూక్ష్మదేహం, అదే స్థూలదేహం.

చైతన్యమే చిదాకాశం. చిత్తమే చిత్తాకాశం. భూతాలూ, భౌతికాలూ అన్నీ కలిపితే భూతాకాశం. ఈ మూడు ఆకాశాలూ ఒకటే. దీన్ని బట్టి మనస్సే సమస్త ప్రపంచము. అని అర్థమవుతోంది గదా! దీన్ని బట్టి చూసినా, లీలా సరస్వతులు చిన్న చిల్లిలోంచి దూరటంలో ఆశ్చర్యమేమీ లేదు.

**రాముడు:** గురుదేవా! అందరి చిత్తాలకూ ఇలాంటి శక్తి వుంటుందా? కొందరి చిత్తాలకే వుంటుందా? అందరి చిత్తాలకూ ఒకే రకమైన శక్తి వుందీ అంటే, ఎవరికి వారికి వేరే వేరే ప్రపంచం కనిపించాలి. కొందరి చిత్తాలకు ఇలాంటి శక్తి లేదంటే, వాళ్ళకు కనిపించే ప్రపంచం, మనస్సువల్ల జన్మించింది కాదు అని, చెప్పవలసి వస్తుంది. ఆలోచించి చూడగా ఈ పక్షమే బావుందనిపిస్తోంది. ఎందుకంటే లోకానుభవంలో మనస్సూ, ప్రపంచమూ, వేరు వేరు గానే కనిపిస్తున్నాయి. మనస్సులోంచి ప్రపంచం పుట్టినట్లుగా, ఎవ్వరికీ అనుభవం కలగటం లేదు. కనుక, బహుశా ఎవరో కొందరు అదృష్టవంతులకు మాత్రమే, మీరు చెప్పిన మనశ్శక్తి వుంటుందని నేననుకుంటాను.

**వశిష్ఠుడు:** రామా! తొందరపడకు. నువ్వన్నట్లు ప్రపంచం మనోజన్యం కాకపోయినట్లైతే, బ్రహ్మజ్ఞానం కలిగి మనస్సు లయించిపోయినా, ప్రపంచభ్రాంతి అలాగే వుంటుంది. అంటే మోక్షమనే మాటే వుండదు. అప్పుడు వేదశాస్త్రవాక్యాలన్నీ గాలిలో కొట్టుకుపోతాయి. కనుక, నీ ఊహ తప్పు.

అందరి మనస్సుకూ ఆ శక్తి వుండేటట్లయితే, ఎవరి ప్రపంచం వారికి వేరు వేరుగా కనిపించాలి కదా?– అని నువ్వు ప్రశ్నిస్తున్నావు.

సరిగా గమనించు, ఈ ప్రపంచంలో ఎవరి ప్రపంచం వారిదే. ఏ ఒక్కడూ ప్రపంచాన్ని రెండవవాడి ప్రపంచం మాదిరిగా చూడటం లేదు. కొంతమందికి కొన్ని ప్రపంచాలు, క్షణంలో పుట్టి క్షణంలో పోతున్నాయి. కొంతమందికి కల్పాంతరం వరకూ వుంటున్నాయి.

సృష్టిలో ఎవడి జన్మ వాడికి సృష్టి. ఎవడి మరణం వాడికి ప్రళయం.

సమష్టి మనోరూపుడైన హిరణ్యగర్భుడు ప్రపంచాన్ని ఎలా సృష్టి చేస్తున్నాడో, అలాగే వ్యష్టిలో, వ్యష్టి మనోరూపుడైన జీవుడు, స్వప్న ప్రపంచాలను సృష్టి చేస్తున్నాడు.

కనుక, రామా! ఎన్ని రకాల ప్రపంచాలు వున్నాయో, అన్నీ మనోజన్యాలే, మనో రూపాలే, సందేహించాల్సిన పని లేదు. కనుక, మనస్సు లయించిపోతే, ప్రపంచ భ్రాంతి పోతుంది. అదే మోక్షం.

## 45. పదార్థము - అనుభవము - స్మృతి

(ఇక్కడ వాల్మీకి మహర్షి వ్రాసిన ఒక చిన్న శ్లోకానికి వ్యాఖ్యాత పెద్ద అర్థం చెప్పాడు. దాన్ని గూడా ప్రశ్న సమాధానాలు గానే చెప్పుకుందాం)

**రాముడు–** మహర్షీ! ఎవడైనా సరే, మనస్సులో ఏమి ఆలోచిస్తాడో, మాటల్లో అదే చెబుతాడు. అదే చేతల్లో చేస్తాడు. మనస్సులో వుండటం అంటే స్మృతి. చేతల్లో వుండటం అంటే క్రియ. కనుక, స్మృతి–క్రియ, ఇవి ఒకే రకంగా వుంటాయి అనేది లోకానుభవం. వేదం కూడా–

**యద్ధి మనసా ధ్యాయతి**

**తద్వాచా వదతి – తత్కర్మణా కరోతి"** అంటూ పై విషయాన్నే బలపరుస్తోంది.

స్మృతి అనుభవంవల్ల కలుగుతుంది. అనుభవం పదార్థాలవల్ల కలుగుతుంది. కనుక, పదార్థం సత్యమైతే, దానివల్ల కలిగే అనుభవమూ, ఆ అనుభవంవల్ల కలిగే స్మృతి– సత్యమవుతాయి. పదార్థం అసత్యమైతే,

అనుభవమూ, స్మృతీ కూడా, అసత్యమవుతాయి.

దీన్ని వెనక్కి తిప్పితే – స్మృతి సత్యమైతే అనుభవం సత్యం, పదార్థం సత్యం, స్మృతి అసత్యమైతే అనుభవమూ, పదార్థమూ, రెండూ అసత్యం. ఇంతవరకూ ఒప్పుకున్నారు కదా.

మాబోటి సామాన్యజీవులు అజ్ఞానులు. వీళ్ళ స్మృతులు అసత్యాలు. కనుక, వీళ్ళ అనుభవాలు, వీళ్ళ పదార్థాలూ, వాటితో ఏర్పడే ప్రపంచమూ, అసత్యమే కావచ్చు. అంటే, ఈ వ్యక్తులు సృష్టి చేసి స్వప్న ప్రపంచాలన్నీ అసత్యాలే కావచ్చు.

కానీ, హిరణ్యగర్భుడున్నాడే, ఆయన సత్యసంకల్పుడు, సర్వజ్ఞుడు. అలాగని వేదమే చెబుతోంది. కనుక, ఆయన స్మృతి సత్యం. ఆయన అనుభవం సత్యం, ఆయన సృష్టిచేసిన ప్రపంచమూ సత్యమే. ఇక ప్రపంచం మిథ్య అని మీరెలా అనగలరు? అది మిథ్య కానప్పుడు తత్త్వజ్ఞానంతో మోక్షం వస్తుందని ఎలా చెప్పగలరు?

గురుదేవా! మరొక విషయం కూడా చెబుతాను. ప్రతివాడూ తను మరణించగానే ఈ ప్రపంచాన్ని స్మరించి అనుభవిస్తున్నాడు. అందువల్లే పై లోకాలకీ, కింది లోకాలకీ, ప్రయాణాలు చేస్తున్నాడు. అలాగే హిరణ్యగర్భుడు కూడా మహా ప్రళయానంతరం , ఈ ప్రపంచాన్ని స్మృతిరూపంగా అనుభవిస్తున్నాడు. దీన్ని బట్టి ఆ హిరణ్యగర్భుడి స్మృతిలో పూర్వకల్పానికి సంబంధించిన పదార్థాలన్నీ వున్నాయి. అవన్నీ సత్యాలే. ఆ స్మృతివల్లే ఇప్పుడు ఈ సృష్టి చేస్తున్నాడు. కనుక, ఆ కల్పంలోని సత్య పదార్థాలే, ఈ కల్పంలోని పదార్థాలకు కారణాలు. కనుక ఈ కల్పంలోని పదార్థాలకు కారణం లేదని గానీ, అవి అసత్యాలని గానీ, చెప్పటం చెల్లదు. నాకిలా తోస్తోంది. గురుదేవా! నా సందేహం తీర్చండి.

***వశిష్ఠుడు:*** రామా! ముందు హిరణ్యగర్భుడినుంచీ వద్దాం. నువ్వు హిరణ్యగర్భుడికి పూర్వ సృష్టికి సంబంధించిన స్మృతి వుందనుకొని, పై వాదనంతా చేశావు. కానీ, అది సత్యం కాదు. వెనుకటి కల్పంలోని ప్రజాపతి ఆ కల్పం చివరలో ముక్తి పొందాడు. ఇక ఆయనా లేడు, ఆయన స్మృతీ లేదు. కొత్తగా ఒక పుణ్యాత్ముడు ఇప్పుడు ఈ పదవిలోకి వచ్చాడు. పాతవాడి స్మృతి ఈయనకెట్లా వస్తుంది? అయితే ఈయన మానస సృష్టి ఎట్లా చేశాడు? అని నీ ప్రశ్న. విను–

ఈయనకూ ఒక స్మృతి కలిగింది. కానీ, అది ఈయన యొక్క ఉపాసనవల్ల ఈయనకు లభించిన మానసిక జ్ఞానం మాత్రమే. అంతే గానీ, పూర్వానుభవంవల్ల కలిగిన స్మృతి కాదు.

ఆయన చేసిన ఉపాసన ఏమిటంటావా? విను– వ్యష్టి వస్తువే సమష్టి వస్తువని భావించి, ధ్యానించాడు. అదే ఆయన ఉపాసన. అది భావనే కానీ, యదార్థ అనుభవం కాదు.

అలాంటి ఉపాసనవల్ల కలిగిన స్మృతిచేత, ఆయన తన మొదటి రోజు సృష్టి ప్రారంభించాడు. ఇలా ఈ సృష్టి యథార్థ అనుభవం ద్వారా కలిగినది కాదు. కనుక, ఇది కూడా యథార్థం కాదు. ఈ అయాథార్థ అనుభవం తాలూకు స్మృతులతో ఆయన తరువాతి సృష్టులు చేశాడు. కనుక, అవన్నీ గూడా అసత్యాలే. కనుక, ఆయన చేసే సృష్టి ఏదీ సత్యం కావటానికి వీలు లేదు.

రామా! ఇక వ్యష్టి జీవి విషయంలో, నీ ఆలోచన సరిగానే వుంది. సమష్టి సృష్టికీ, వ్యష్టి సృష్టికీ, భేదమే లేదు. కనుక, ఏ ప్రపంచమైనా మనస్సంకల్ప స్వరూపమే. దీనికి నేను నీకు ఒక నిదర్శనం చూపిస్తాను చూడు.

నీ అనుభవంలో చూసుకో. మనస్సు ప్రసన్నంగా వుంటే, ప్రపంచం ప్రసన్నంగా వుంటుంది. మనస్సు మలినంగా వుంటే, ప్రపంచమూ మలినంగా వుంటుంది. దీనిని బట్టి మనస్సే లోకమని తెలియటం లేదా?

అసలు సూక్ష్మదృష్టితో విచారిస్తే, ఈ మనస్సే చిదాకాశం. చిదాకాశమే సాక్షి. నదిలో నీరే సుడిగుండం. సుడిగుండమంటే నీరు కాకుండా వేరే ఏమీ కాదు. అలాగే ద్రష్టయే దృశ్యం, మనస్సే సాక్షి.

సాక్షి ఒక్కడే వుండగా, ఇంత ప్రపంచం కనిపించడమే గారడీ. గారడీవాడు ఒక్కడే నిలబడి చేతి కర్ర తిప్పేసరికి, పెద్ద గంధర్వ నగరం కనిపిస్తోంది. అలాంటి గారడీయే ఈ ప్రపంచం.

ఒక దృష్టితో చూస్తే ఈ ప్రపంచమంటే "నేనూ- నువ్వు" అంతే. నేను కానిదంతా నువ్వే. వీటిలో నేనంటే అర్థమేమిటి? అధిష్ఠానమైన సత్పదార్థమే "నేను". ఆరోపితమైన ఈ ప్రపంచమే నువ్వు.

"నేను- నువ్వు" అనే ఈ పదాలను ఉపయోగించేవాడు ఎవడు? నేను అనే మాటకు ఎవడు అసలైన అర్థమో, వాడే ఈ రెండు పదాలూ వాడుతున్నాడు. నేను యొక్క అసలు స్వరూపం "సత్" మాత్రమే. జీవుడు కాదు. కనుక, సత్ కంటే భిన్నమైన ఈ ప్రపంచం మనోమయం అనటంలో సందేహం లేదు.

రామా! మన చర్చ చాలా దూరం వచ్చింది. లీలా సరస్వతులు చిన్ని చిల్లిలోంచీ మందిరంలోకి ప్రవేశించటం ప్రవేశించటం కుదురుతుందా, కుదరదా?- అని మనం చర్చిస్తున్నాం. వాళ్ళు మనోమయ శరీరాలు ధరించి వున్నారు గనుక, అలా జరగవచ్చు అని, మనం తేల్చుకున్నాం.

అంతే గాక, వాళ్ళు చిన్మయ శరీరాలతో సంచరిస్తున్నారు. కనుక, వాళ్ళ సంకల్పం ప్రకారం కావాలనుకున్నప్పుడు కనిపిస్తున్నారు. వద్దనుకున్నప్పుడు కనిపించకుండా మాయమై పోతున్నారు- అని కూడా మనం అర్థం చేసుకోవాలి. ఇక అసలు కథలోకి ప్రవేశిద్దాం.

### 46. మరణ క్షణంలోనే రాబోయే జన్మంతా జన్మిస్తుంది

అలా ఆ విదూరథ శయనమందిరంలోకి ప్రవేశించిన లీలా సరస్వతులిద్దరూ అక్కడి చెరో ఆసనం మీద కూర్చున్నారు. వాళ్ళ దివ్యతేజస్సుతో ఆ గది నిండిపోయి, ఆ కాంతికి నిద్ర చెదిరి విదూరథుడు లేచి కూర్చున్నాడు. ఇద్దరు దేవతా స్త్రీలను చూసి, నివ్వెరపోయాడు. నిమిషంలోనే తేరుకొని, ఒంటిమీది బట్టలు సవరించుకొని, లేచి నిలబడి, సాష్టాంగవందనం చేసి, నేల మీద పద్మాసనం వేసుకొని కూర్చొని, "దేవతలారా! మీకు జయం జయం" అంటూ, వారి పాదాల మీద పూలు చల్లాడు.

ఇంతలో "ఈ రాజుయొక్క వంశ వృత్తాంతాన్ని ఈ లీలకు తెలియజేయాలి. అది తెలిస్తే ఈమెకు తత్త్వం మరింత స్పష్టం అవుతుంది." - అని, సరస్వతీదేవికి తోచింది. దాంతో, ప్రక్కనే నిద్రిస్తున్న మంత్రి మేలుకోవాలని ఆమె సంకల్పించింది.

వెంటనే ఆ మంత్రి ఎవరో లేపినట్లుగా లేచి, ఈ దేవతలను చూసి ఆశ్చర్యపోయి, తాను కూడా వారి పాదాల మీద పూలు వేసి, నేల మీద చతికిల పడ్డాడు.

అప్పుడు సరస్వతీదేవి "ఓవిదూరథ మహారాజా! నువ్వు ఎప్పుడు పుట్టావు? నీ వంశమేమిటి? నీ కథేమిటి?"- అని అడిగింది. వెంటనే మంత్రిగారు అందుకుని, పది తరాల ముందునుంచి రాజుగారి వంశ చరిత్రంతా, మంచి ఆర్భాటంగా చెప్పాడు. చెప్పి చెప్పి, "ఇతను 10వ యేటే రాజ్యంలోకి వచ్చాడు. ఇప్పటి దాకా బ్రహ్మాండంగా రాజ్యం చేశాడు. ఇప్పుడు మీ దర్శనం అయింది కనుక, మా రాజు పవిత్రుడయ్యాడు" - అన్నాడు.

అప్పుడు సరస్వతీదేవి "విదూరథ మహారాజా! నువ్వు నీ పూర్వజన్మను గుర్తుచేసుకో"- అంటూ అతని తల తాకింది.

వెంటనే విదూరథుడికి కొత్త వెలుగు కనిపించినట్లై, పద్మరాజుగా తన కథంతా కంటికి కనిపించింది. ఆ రాజు ఆశ్చర్య సముద్రంలో మునిగిపోయి, ఇలా ఆలోచించ సాగాడు.

"ఆహా! ఈ ప్రపంచం ఎంత మాయ! ఈ దేవతల అనుగ్రహంవల్ల నాకు ఇప్పుడు ఈ మాయ తెలుస్తోంది!

"అక్కడ నేను మరణించి ఒక్క రోజా! ఇక్కడ నా వయస్సు 70 సంవత్సరాలా! ఇదెలా? ఎలాగేమిటి? నాకంతా గుర్తుంది. మా అమ్మ, నాన్న, తాత, ముత్తాత, నా బాల్యము, నా రాజ్యము, ఈ లెక్కలన్నీ ఎలా తప్పుతాయి?"

విదూరథ మహారాజు తనకు తెలియకుండానే తన ఆలోచనలన్నీ బయటకు మాట్లాడేశాడు.

ఆ మాటలు విని సరస్వతీదేవి సుదీర్ఘంగా ఇలా బోధించసాగింది.

**సరస్వతీ దేవి:** రాజా! కొన్ని సూక్ష్మ విషయాలను గమనించు. నువ్వు ఎక్కడికీ పోలా. ఎక్కడికీ రాలా. నీకు అధిష్ఠానమైన చిదాత్మలోనే నువ్వు వున్నావు. అక్కడే వుండి నీ కథలను నీవు స్మరిస్తున్నావు.

చిదాత్మలోనే నువ్వు వున్నావు. అదే నీ అసలు స్వరూపం. దాంట్లోనే గిరిగ్రామం వుంది. అందులోనే వశిష్ఠ గృహం వుంది. అందులోనే పద్మరాజుగారి రాజ్యం వుంది. అందులోనే ఆయన అంతఃపురం వుంది. దానిలోపలే నువ్వు చూస్తున్న ఈ బ్రహ్మాండ మండలమంతా వుంది.

అక్కడ పద్మరాజుగా నువ్వు మరణించిన వెంటనే, నీకు అధిష్ఠానమైన చైతన్యం మాయచేత ఆవరించబడింది. ఆ వెను వెంటనే నీకు ఈ బ్రహ్మాండం కనిపిస్తోంది. ఈ బ్రహ్మాండంలో నీ జీవిత చరిత్రంతా, నీకు కల లాగా కనపిస్తోంది.

ఈ కల వంటి జీవితంలోనే, నువ్వు ఎప్పట్నుంచో నన్ను ఉపాసిస్తున్నావు.

ఆ నాటి పద్మరాజు అంతఃపురం లోపల ఇమిడి వున్న ఈ మహా బ్రహ్మాండంలోనే, నీ వ్యవహారమంతా నీకు కనిపిస్తోంది, గుర్తువస్తోంది.

"నేను ఫలానా వంశంలో పుట్టాను. ఫలానా విధంగా రాజ్యం చేశాను. ఫలానా యుద్ధాలు గెలిచాను. ఫలానా యజ్ఞాలు చేశాను. ఇప్పటికి నాకు 70 ఏళ్ళు వచ్చాయి. ఇప్పుడు సింధురాజు నా మీదకు యుద్ధానికి వచ్చాడు. ఒక రోజు యుద్ధమైంది. ఈ రాత్రి నిద్రపోతుండగా ఇద్దరు దేవతలు నా దగ్గరకు వచ్చారు. వీరిలో ఒకామె నాకు పూర్వజన్మజ్ఞానం ఇచ్చింది. నాకు ఇప్పుడు జ్ఞానం కలిగింది. నేనిక కేవల నా స్వస్వరూపంతో వుంటాను"– అని నువ్వు ఇప్పుడు అనుకొంటున్నావు. ఈ అనుకోవటంతో సహా, మొత్తం అంతా భ్రాంతే.

నువ్వు పద్మరాజుగా మరణించిన మరుక్షణంలోనే, నీ హృదయంలో ఈ జ్ఞానమంతా ఉదయించింది.

**యస్మిన్నేవ ముహూర్తేత్వం మృతి మభ్యాగతఃపురా।**

**తదైవ ప్రతిభైషా తే స్వయమే వోదితా హృది ॥** (ఉ.ప్ర.స.41, శ్లో.46)

ఒక నదిలో రెండు సుడిగుండాలున్నాయి. ఎగువ నొకటి, దిగువ నొకటి. ఎగువ గుండంలో పడ్డ నీరే, దిగువ గుండంలో గూడా పడుతుంది. అలాగే నీ చిత్తవృత్తి ప్రవాహం గూడా ఒక దృశ్యాన్ని వదిలిపెట్టి, మరొక దృశ్యాన్ని చేరింది. గుండమనేది వేరే సత్యవస్తువు కాదు. జలమే సత్యవస్తువు. అలాగే దృశ్యం సత్యవస్తువు కాదు. చిత్తవృత్తిలోగల చైతన్యమే సత్యవస్తువు.

ఈ సృష్టిలో మెలకువ, కల, అని రెండున్నాయి. అందులో మెలకువలో అనుభవించే సృష్టి, జీవులందరికీ ఇంచుమించు ఒకటిగానే వుంటుంది. స్వప్నంలో మాత్రం ఎవరి సృష్టి వారిదే. విచారించి చూస్తే ఈ రెండూ భ్రాంతులే.

మెలకువలో ఒక నిమిషం, స్వప్నంలో కొన్ని సంవత్సరాలు అవుతోంది. ఒక నాటి స్వప్నంలోనే అనేక జన్మలు కనిపిస్తాయి. ఒకోసారి, తన తల తెగిపోయినట్టు కనిపిస్తుంది. ఇవన్నీ కలలో భ్రాంతులు.

మెలకువలో కూడా అనేక భ్రాంతులున్నాయి. ఉదాహరణకు–

అ. ఒకో సారి మెలకువలో వుండగానే ఆకాశంలో ఊళ్ళు కనిపిస్తాయి. ఇది ఆలోచనలు ఎక్కువైతే వచ్చే భ్రాంతి.

ఆ. పడవలో పోతూంటే, ఒడ్డుమీది చెట్లు పరుగెత్తుతాయి. (రైల్లో పోతూంటే చెట్లు పరుగెత్తుతున్నట్టు

కనపిస్తాయి.) ఇది తన పరుగును చెట్లమీద ఆరోపించే భ్రాంతి.

ఇ. పైత్యం తలకెక్కితే, కొండలు నాట్యమాడుతున్నట్లు కనిపిస్తుంది. ఇది శరీర వికారంవల్ల కలిగే భ్రాంతి.

ఈ భ్రాంతులు ఎట్లాంటివో, ఈ మొత్తం ప్రపంచ భ్రాంతి అట్లాంటిది. కాకపోతే ఇవన్నీ చిన్న చిన్న భ్రాంతులు. ప్రపంచ భ్రాంతేమో పెద్ద భ్రాంతి. అంతే తేడా.

అసలు సత్యం ఏమిటంటే-

**వస్తుతస్తు న జాతోఽసి న మృతోఽసి కదాచన।**

**శుద్ధవిజ్ఞాన రూపస్త్వం శాంత ఆత్మని తిష్ఠసి॥** (ఉ.ప్ర.స.41, శ్లో.54)

నువ్వు అసలు పుట్టలేదు. మరణించనూ లేదు. నువ్వు పరిశుద్ధ విజ్ఞాన స్వరూపుడివి. ఏ కల్లోలాలూ లేని ప్రశాంతుడివి. నీలోనే నువ్వున్నావు. ఈ ప్రపంచం అంతా చూస్తున్నావు. అయినా నువ్వు చూసేవాడివి కాదు. ఎందుకంటే- చూడబడే ఈ ప్రపంచరూపంలో వున్నది నువ్వే.

ఈ దేహం పేరు విదూరథుడు. ఇదీ లేదు. ఈ కొండలూ లేవు. ఈ ఊళ్ళూ లేవు. ఈ జనాలూ లేరు. మేమూ లేము. అలాగే, ఆ వశిష్ఠ బ్రాహ్మడి గృహంలో పద్మరాజు ప్రపంచం ప్రకాశిస్తోంది. అందులోనూ ఏమీ లేదు. ఇందులోనూ ఏమీ లేదు. అంతా శూన్యం.

## 47. సత్యాసత్యాలు రెండూ కానిది మిథ్య

**విదూరథుడు -** ఓ దేవీ! నేను సద్రూపుణ్ణి - అన్నావు. మరి నా పరివారం మాటేమిటి? వీళ్ళూ జీవులే గదా! వీళ్ళూ నా లాగా సద్రూపులేనా? వీళ్ళకి వేరే ఆధారమేదైనా వుందా?

ఈ ప్రపంచమూ, దీనిలో వుండే మానవులూ అంతా కల వంటి వారు అన్నావు. అంతా మిథ్య అన్నావు. అలా అయితే, వీళ్ళందరి ఆత్మకూడా మిథ్యే కావాలి గదా?

అయితే ఈ ప్రపంచంలో సత్యమైన ఆత్మ కూడా లేదన్నమాట.

***సరస్వతీ దేవి:*** రాజా! రెండు దృష్టులున్నాయి- అజ్ఞ దృష్టి, తత్త్వదృష్టి. అజ్ఞదృష్టితో ఆలోచిస్తే, జీవులుగా కనిపించేవారంతా సత్యమేనా? అని అడగాలి. తత్త్వదృష్టితో ఆలోచిస్తే చిద్రూపంలో వీళ్ళంతా సత్యమేనా?- అని అడగాలి.

జీవరూపంలో అయితే - నువ్వూ సత్యం కాదు, నీ పరివారమూ సత్యం కాదు. అంటే, ప్రపంచ భ్రాంతి వున్నంతవరకూ అందరూ అబద్ధమే.

చిద్రూపంలో అయితే నువ్వూ సత్యమే, నీ పరివారమూ సత్యమే. అంటే, ప్రపంచ భ్రాంతి పోతే, అందరూ సత్యమే.

సరస్వతీ, విదూరథుల సంభాషణ విన్న శ్రీరాముడు ఏదో సందేహంలో పడ్డాడు. అది గ్రహించిన వశిష్ఠుడు, జగత్తత్త్వాన్ని గురించి మరికొంత వివరణ ఇవ్వాలనుకొని ఇలా అన్నాడు.

***వశిష్ఠుడు:*** రామా! ఈ ప్రపంచం తత్త్వవేత్తలకు ఎంత మిథ్యో, అజ్ఞులకు అంత సత్యం. పిచ్చిపట్టిన పిల్లవాడికి కనిపించే పిశాచం, వాడు చచ్చే దాకా పీడిస్తూనే వుంటుంది. అజ్ఞులను ఈ ప్రపంచం కూడా అలాగే పీడిస్తుంది. బాగా ఆలోచించి చూస్తే ఈ ప్రపంచం ఒక దీర్ఘస్వప్నం. (దీర్ఘస్వప్న మిదం విశ్వం) (ఉ.ప్ర.స.42, శ్లో.8)

అయితే, ఈ ప్రపంచం పూర్తిగా అసత్యం- అని మేమనటం లేదు. ఇది బొత్తిగా లేనిదే అని కూడా అనటం లేదు.అలాగే స్వప్నం కూడా సర్వాత్మనా అసత్యమనీ, లేనిదనీ, మేము అనటం లేదు. కలలోనూ, మెలకువలోనూ కూడా కొంత సత్యాంశ వుంది.

కలగంటున్న మనిషి స్వప్న ప్రపంచంలో ఏవేవో వ్యవహారాలు చేస్తుండగా, అక్కడే ఏవేవో సుఖదుఃఖాలు కలుగుతూ వుంటాయి. అవి కొంచెం మిక్కుటమైనప్పుడు, వాడు పైకి నిజంగా నవ్వడమో, ఏడవటమో, చేస్తూ వుంటాడు. కలలోని సుఖ దుఃఖాలలో సత్యాంశ లేకపోతే, వాడు పైకి ఎందుకు నవ్వుతాడు? ఎందుకు ఏడుస్తాడు?

అదీ గాక, కల అయినా, మెలకువ అయినా, రెండూ కూడా, చిదాత్మ మీద అధ్యాసవల్లే ఏర్పడుతాయి గదా! అధ్యాస అంటే సత్యానికి, అసత్యానికీ పెళ్ళి. కనుక, అధ్యాస వలన ఏర్పడిన పదార్థాలలో కొంత సత్యము, కొంత అసత్యము, సంక్రమించటం సహజం.

కనుక, రామా! మేము స్వప్నాన్ని, జాగ్రత్తును కూడా సత్యము, అసత్యము రెండూ కానివి– అంటున్నాము. అందుకే వాటికి మిథ్య అని కొత్త పేరు పెట్టాము.

**రాముడు:** గురుదేవా! మెలకువలోని పదార్థాలకు ఎంతో కొంత సత్యత్వాన్ని అంగీకరించకపోతే, లోకవ్యవహారమే సాగదు. సత్కర్మలు ఆచరించాలని చెప్పే కర్మశాస్త్రానికి కూడా ఇబ్బంది వస్తుంది. కనుక, జాగ్రత్ పదార్థాలకు సత్యత్వాన్ని ఎంతో కొంత సాధించడంలో అర్థం వుంది. కానీ, స్వప్న పదార్థాలు పూర్తిగా మాయామయాలే, అసత్యాలే, లేనివే– అనేస్తే మనకు ఏమిటి ఇబ్బంది?

**వశిష్ఠుడు:** రామా! గొడ్రాలి కొడుకు అన్నాం. వీడికి అస్తిత్వం రవ్వంతైనా వుందా?ఒక్క క్షణమైనా వుందా? వీడితో మనమేదైనా వ్యవహారం చేస్తున్నామా? లేదు గదా! ఇలాంటి పదార్థాలు పూర్తిగా అసత్య పదార్థాలు, అసత్పదార్థాలు, బొత్తిగా లేని పదార్థాలు.

దీనికి భిన్నంగా, స్వప్నంలో కనిపించే పదార్థాలు కనిపించే కాలం వుంది. ఆ సమయంలో వాటితో వ్యవహారం వుంది. కనుక, వాటికి ఆ కాస్త సమయంలోనూ సత్యత్వం వుంది. ఆ సత్యత్వాన్నే ప్రాతిభాసిక సత్యత్వం అంటారు.

నువ్వు చెప్పినట్లుగా, స్వప్న ప్రపంచానికి ఆ మాత్రపు ప్రాతిభాసిక సత్యత్వం కూడా లేకపోతే, జాగ్రత్ప్రపంచం కూడా అలాంటిదే కావలసి వస్తుంది. ఎందుకంటే జాగ్రత్ప్రపంచం హిరణ్యగర్భుడి స్వప్నమే కదా!

జాగ్రత్ప్రపంచం వ్యవహార కాలంలో సత్యమనే అనుభవం అందరికీ వుంది. కనుక, జాగ్రత్ప్రపంచంచానికి వ్యావహారిక సత్యత్వాన్ని, స్వప్న ప్రపంచానికి ప్రాతిభాసిక సత్యత్వాన్నీ, అంగీకరించక తప్పదు.

మరో దృష్టి కూడా వుంది. నీ స్వప్నంలో నువ్వున్నావా? లేవా? అక్కడి నువ్వు సత్యమే గదా! అలాగే నా స్వప్నంలో నేనూ సత్యమే. ఈ అనుభవం అందరికీ వుంది. కనుక, స్వప్నం సర్వాత్మనా శూన్యం అనటం ఎలా కుదురుతుంది?

**సంసారే విపులే స్వప్నే యథా సత్యమహం తవ।**

**తథా త్వమపి మే సత్యం సర్వం స్వప్నేష్వితి క్రమః ॥** (ఉ.ప్ర.స.42, శ్లో.20)

ఈ జాగ్రత్ప్రపంచంలో నీకు నేను సత్యం. నాకు నువ్వు సత్యం. అలాగే స్వప్న ప్రపంచంలో స్వప్న ద్రష్టకి (అంటే, అక్కడి నేనుకి) అక్కడి దృశ్యాలు (అంటే, అక్కడి నీవులు) సత్యాలు.

**రాముడు:** గురుదేవా! మీరు చెప్పినట్టు కల, మెలకువ, రెండూ సమానమే అయ్యేటట్లయితే, కలలో కనిపించిన వస్తువులు మెలకువ వచ్చాక కూడా అలాగే వుండాలి కదా.ఎందుకంటే స్వప్నం వచ్చిన సమయంలో జాగ్రత్ లోకంలోని వస్తువులు అలాగే వుంటున్నాయి కదా!

**వశిష్ఠుడు:** రామా! కలలో గానీ, మెలకువలో గానీ, పదార్థాలు ఏ అంశలో సత్యాలో, ఏ అంశలో అసత్యాలో , దాన్ని వివరిస్తున్నాను నేను. మళ్ళీ విను–

కలలోని వస్తువులు, మెలకువలోని వస్తువులు, కూడా అధిష్ఠానమైన సన్మాత్రము అనే స్వభావంతో సత్యాలే. కనిపించే రూపంతో మాత్రం అవీ సత్యం కాదు, ఇవీ సత్యం కాదు. ఎందుకంటే, మెలకువలో వస్తువులు అదే రూపంతో కలలో కనిపించవు. కలలోని వస్తువులు అదే రూపంతో మెలకువలో కనిపించవు.

స్వప్నపదార్థాలు జాగ్రదాకాశంలో లేవు. జాగ్రత్పదార్థాలు స్వప్నాకాశంలో లేవు.

రామా! స్వప్నపదార్థాలు, జాగ్రత్పదార్థాలూ కూడా, అన్ని కాలాల్లోనూ సమంగా వుండటం లేదు. అన్ని దేశాల్లోనూ సమంగా వుండటం లేదు.

అన్ని కాలాల్లో, అన్ని దేశాల్లో సుస్థిరంగా వుండేదే సత్యం– అని నిర్వచనం చేసుకొన్నాం కనుక, జాగ్రత్పదార్థాలు ఏవీ సత్యపదార్థాలు కావటానికి వీలు లేదు.

అయినా, అధిష్ఠాన సత్తా స్వరూపంచేత వాటిలో సత్యాంశ వుంది. కనుక, వాటిని మిథ్య అని నిశ్చయం చేస్తున్నాం.

రామా! అందుకనే విదూరథుడు "నా పరివార జీవులు సత్యస్వరూపులా? అసత్య స్వరూపులా?" అని అడిగినప్పుడు సరస్వతీదేవి– ఈ దృష్టిభేదాన్నే ఆ రాజుకు ఉపదేశం చేసింది.

రామా! సరస్వతీదేవి తన ఉపదేశాన్ని ఇంకా కొనసాగిస్తూ ఇలా అన్నది–

***సరస్వతీ దేవి:*** రాజా! స్వప్నానికీ, జాగ్రత్తుకీ కూడా అధిష్ఠానమైన చిత్ వుందే, అది సత్యమూ, ప్రకాశరూపమూ కూడా. ధనాగారంలో వుండే ధనాన్ని ధనస్వామి అనుభవించినట్లుగా, చిదాకాశంలో వుండే ప్రపంచాన్ని చిదాకాశమే అనుభవిస్తూ వుంటుంది.

రాజా! నీ భార్య లీలయొక్క తృప్తి కోసం ఈ తత్త్వమంతా నీకు చెపుతున్నాను. ప్రపంచం మిథ్య అని నిరూపించడం కోసం నేను చెప్పిన దృష్టాంతాలన్నింటినీ ఈ లీల ఇక్కడే, నీ ఇంట్లోనే, చూసింది. అన్ని బ్రహ్మాండాలనూ ఇక్కడే ప్రత్యక్షం చేసుకొంది. రాజా! నువ్వు కూడా ఈ తత్త్వాన్ని ఆకళించుకో. నువ్వు కోరింది నెరవేరుతుంది. నీకు శుభమగు గాక! సెలవు.

***విదూరథుడు:*** తల్లీ! నా దగ్గరకు ఎవరన్నా వస్తేనే, వారికి కోరికలు తీరకుండా వుండవు. ఇక నీ దర్శనం చేశాక తీరని కోరికలు వుంటాయా? నీ భోధతో నాకు జ్ఞానం కలిగింది. ఒక స్వప్నంనుంచీ రెండవ స్వప్నంలోకి వెళ్ళినట్లుగా, ఇక నేను ఈ దేహాన్ని విడిచి నా స్వీయలోకానికి వెళ్ళిపోతాను. అనుమతి ఇవ్వు.

నేను వెళ్ళే చోటికి నా మంత్రీ, పెళ్ళికాని నా కూతురూ, వీళ్ళిద్దరూ మాత్రం వచ్చేటట్లు అనుగ్రహించు.

***సరస్వతీ దేవి:*** రాజా! మాబోటివాళ్ళం భక్తుల కోరికలను కాదనం. నువ్వు కోరుకున్నట్లే జరగనీ. ఈ లీల భక్తికి తగినంత వైభవంగా రాజ్యం చెయ్యి. అయితే నువ్వు పూర్వం కోరుకున్న వరాలు కొన్ని వున్నాయి. కనుక, జరగబోయేది చెపుతాను విను.

ఈ యుద్ధంలో నువ్వు మరణించవలసి వుంది. ఆ తరువాత నీ పాతజన్మ శరీరాన్నే పొందవలసి వుంది.

నీ మంత్రీ, నీ కూతురూ, వారి వారి పాత శరీరాలను పొందవలసి వుంది. ఇదంతా నువ్వే స్వయంగా చూస్తావు.

మీరు ముగ్గురూ వాయురూపంతో అక్కడికి ప్రయాణం చెయ్యాలి. నేను, ఈ లీల మనోరూపంతో ప్రయాణం చెయ్యాలి. కనుక, ఇక ఎవరి దారులు వారివే.

## 48. అద్దంలోని బొమ్మలా, నిజమైన జీవులా?

ఇలా వారి సంభాషణ జరుగుతూ వుండగానే, ఒక వార్తాహరుడు రొప్పుకుంటూ పరుగెత్తుకువచ్చి– "మహారాజా! మహారాజా! శత్రుసైన్యం రాత్రిపూట దండెత్తి మన పట్టణాన్ని ముట్టడించింది. మనవాళ్ళు ఎదురు దాడికి సిద్ధమవుతున్నారు. నేను మేడమీదినుంచి చూసి వస్తున్నాను"– అని చెప్పాడు.

వాడు అలా చెపుతూ వుండగానే యుద్ధం మొదలైపోయిన ఘోర శబ్దాలు వినిపించసాగినాయి.

ఇంతలోనే మహారాణి హడావిడిగా అక్కడికి వచ్చింది. ఆమె వెంట వున్న ఒక పరిచారిక "మహారాజా! శత్రువులు అంతఃపురంలోకి ప్రవేశించారు. నీ భార్యను జుట్టుపట్టుకొని ఈడ్చుకుపోతున్నారు. మహారాణిగారు ఎలాగో తప్పించుకొని మీ దగ్గరికి వచ్చింది. రక్షించండి" అని ఏడుస్తూ చెప్పింది.

విదూరథుడు ఒక్క ఉదుటున లేచి, లీలా సరస్వతులకు నమస్కరించి, "దేవతలారా! నేనిక యుద్ధానికి పోతున్నాను. నా భార్యను మీ పాదాల దగ్గర అప్పజెప్పుతున్నాను. మీరే కాపాడాలి" అంటూనే సింహం దూకినట్లుగా యుద్ధరంగంలోకి దూకేశాడు.

సరస్వతీదేవి పక్కన కూర్చున్న లీల, మహారాణి వంక తేరిపార చూసి ఆశ్చర్యపోతూ, ఇలా అంది–

**లీల:** దేవీ! ఇదేమిటి, ఈవిడ అచ్చంగా నా ప్రతిబింబం లాగా వుంది. ఎక్కడి నుంచి వచ్చింది? ఈవిడే కాదు, ఈ మంత్రీ, ఈ పరివారమూ, ఈ చెలికత్తెలు, వీళ్ళంతా గూడా అచ్చం మా ఇంట్లో మనుషుల్లాగానే వున్నారు. తల్లీ! వీళ్ళంతా అద్దంలోని బొమ్మలా నిజమైన జీవులా?

***సరస్వతీ దేవి:***

**యథా జ్ఞప్తి రుదేత్యంతః తథా నుభవతి క్షణాత్।**

**చితిశ్చేత్యార్థతామేతి చిత్తం చిత్తార్థతామివ॥** (ఉ.ప్ర.స.44, శ్లో.18)

లీలా! మనస్సులో జ్ఞానం క్షణంలో కలుగుతుంది. అనుభవమూ అంతే.

మనస్సు క్షణంలో జాగ్రత్పదార్థాల రూపాన్ని పొందుతుంది.

అలాగే, చిత్తు క్షణంలో చేత్య విషయాకారంగా మారిపోతుంది. (చేత్యము– దృశ్యము)

ఈ పనులు జరగటానికి, విశాలమైన ప్రదేశం కానీ, సుదీర్ఘమైన కాలం కానీ, అవసరం లేదు.

ఇటు చిత్తులోగాని, అటు చిత్తంలోగాని రెండు ప్రపంచాలు కనిపిస్తున్నాయి. చిత్తులో కనిపించే ప్రపంచం పేరు జాగ్రత్తు. చిత్తంలో కనిపించే ప్రపంచం పేరు స్వప్నం. ఈ రెండు ప్రపంచాలూ లోపలే వున్నాయి. కానీ, బయట వున్నట్టుగా కనపిపిస్తాయి. రెండింటిలోనూ చైతన్యం ఆభాసరూపంలో అనుగతమై వుంది కనుక, రెండూ సత్యం లాగానే కనిపిస్తాయి. అందుకే, ఈ ప్రపంచాలన్నీ చిత్రంగా కనిపిస్తాయి.

అక్కడ నీ యింట్లో మరణించిన నీ భర్త ఏ సంస్కారంతో ప్రాణం విడిచి పెట్టాడో, ఆ సంస్కారబలంవల్ల ఇక్కడ అదే ఆకారంతో పుట్టాడు.

లీలా! అక్కడ, ఇక్కడ అనే పదాలకు అర్థం లేదు. ఎక్కడ మరణించాడో అక్కడే పుట్టాడు. ఏ సంస్కారంతో మరణించాడో ఆ సంస్కారంతోనే పుట్టాడు.

ఇక మంత్రులూ మొదలైన వాళ్ళంతా వున్నారే, వీళ్ళంతా ఇతని సంస్కారంవల్ల పుట్టిన జీవులే. వీళ్ళు వెనకటి జన్మలోని మనుషుల్లాగా కనపిస్తున్నారే గానీ, వాళ్ళూ, వీళ్ళూ ఒకటి కాదు.

మరి వీళ్ళంతా ఎక్కణ్ణించి వచ్చారు? ఎలా మనకు కనిపిస్తున్నారు? అంటే, ఈ రాజుయొక్క సత్తలోంచే వీళ్ళు వచ్చారు. ఆ సత్తయే వీళ్ళలో వుంది. ఆ సత్తచేతనే మనకు కనిపిస్తున్నారు.

ఒక మనిషియొక్క సత్తలోంచే ఇంత మందికి సత్త ఎలా వస్తుంది– అని సందేహించవలసిన పని లేదు. స్వప్నంలో, నీ సత్తలోంచే అనేక మంది జీవులకు సత్త వస్తోంది గదా.

**లీల:** తల్లీ! నా మెలకువలో కనిపించే మనుషులంతా, నాకే కాక ఇతరులందరికీ కనిపిస్తున్నారు. నా స్వప్నంలో కనిపించే మనుషులేమో నా ఒక్కదానికే కనిపిస్తున్నారు. అందుచేత, నా స్వప్నజీవులు అసత్యజీవులు అని సులభంగానే తెలుస్తోంది. జాగ్రత్ జీవులు అలా కాదు. వారు సత్య జీవులు అనిపిస్తోంది. నేను అడిగేది ఇలాంటి జాగ్రత్ జీవుల గురించే కాని, స్వప్న జీవుల గురించి కాదు.

***సరస్వతీ దేవి:*** లీలా! అందరికీ కనిపిస్తున్నాయి కనుక, జాగ్రత్పదార్థాలన్నీ సత్యమే అనేటట్లయితే, గారడీవాడు సృష్టి చేసే వస్తువులు కూడా సత్యవస్తువులే అనాలి.

**లీల:** పోనీ, మరో కారణం చెపుతాను. స్వప్న వస్తువులన్నీ మెలకువ వచ్చేటప్పటికి మాయమై పోతాయి. వాటికి కారణమైన ముడిసరుకులు కూడా కనిపించవు. కనుక, అవి అసత్యాలు. జాగ్రద్వస్తువులు అలా మాయమైపోవు కనుక, అవి సత్యాలు – అంటాను.

***సరస్వతీ దేవి:*** లీలా! జాగ్రద్వస్తువులు మాయం కాకపోవడమేమిటి? తత్త్వజ్ఞానం కలిగితే, అవీ మాయమవుతాయి. అందుచేత, జాగ్రద్వస్తువులూ అసత్యాలే. అయితే, జాగ్రత్ దశాకాలంలో ఒక్కొక్క వస్తువుకి, దాని అవయవాలు నశిస్తే, అది గూడా నశిస్తుంది. నశించటమంటే, దానియొక్క కారణ రూపాన్ని పొందుతుంది. ఉదాహరణకు కుండ పగిలితే మట్టి అవుతుంది. తత్త్వజ్ఞానం కలిగితే మొత్తం బాధింపబడుతుంది. బాధ అంటే, దానికి కారణం కూడా లేకుండా పోవటం. కుండ బాధింపబడితే మట్టి కూడా కనిపించదు. నాశానికీ, బాధకు తేడా ఇది.

లీలా! ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే, స్వప్నం ఎలా అసత్యమో అలాగే, ఈ జాగ్రత్తు కూడా అసత్యమే. స్వప్నంలో నీ సత్తను బట్టి అనేకమందికి సత్త ఎలా కలుగుతుందో, జాగ్రత్తులో కూడా అలాగే కలగవచ్చు. అలాగే, ఈ మంత్రీ మొదలైన జీవులకు రాజుయొక్క సత్త వల్ల సత్త ఏర్పడుతోంది.

లీలా! నీకు ఈ విషయంలో బాగా విశ్వాసం కలిగినట్టుగా లేదు. అందుచేత మరికొంత వివరిస్తాను. ఇంటి కప్పుకి చిల్లి వుండి దాంట్లోంచి ఎండ లోపలికి పడితే, ఆ ఎండలో ధూళి రేణువులు కదలాడుతూ వుండటం మనకు కనిపిస్తూ వుంటుంది. ఆ రేణువులు అంతకు ముందే అక్కడ వున్నాయి. ఈ ఎండ పడ్డప్పుడు కనిపిస్తున్నాయి. అలాగే పరమాత్మ అనే ఆకాశంలో, ఈ బ్రహ్మాండాలనే రేణువులు కదలాడుతున్నాయి. ఇలాంటి బ్రహ్మాండాలలో జీవులు జన్మిస్తున్నారు. జన్మించడమంటే ఏమిటి?

ఒక ఉపాసకుడు "నేనే అగ్నిదేవుణ్ణి'– అని ఉపాసన చేస్తే, వాడి ఒళ్ళంతా వేడెక్కిపోతోంది. వాడి భావన సంస్కారంగా మారి, వాడికి వేడి స్వయంగా అనుభవంలోకి వస్తోంది. అలాగే, పరమాత్మ చైతన్యం కూడా వాసనాబలం చేత ఈ ప్రపంచాన్ని చూస్తోంది, తెలుసుకుంటోంది. జీవులుగా ఏర్పడి, నేను నేను అంటోంది. అదే జన్మించటం.

కనుకనే, ఈ కనిపించే ప్రపంచమంతా పూర్తిగా సత్యమూ కాదు. పూర్తిగా అసత్యమూ కాదు. ఇది అనిర్వచనీయం, ఇది మిథ్య.

దీనికంతటికీ కారణం జీవులయొక్క భోగేచ్ఛయే. ఈ భోగేచ్ఛలు రకరకాలుగా వుంటాయి. కొన్ని పూర్వానుభవం లాగానే వుంటాయి. కొన్ని కొత్తగా వుంటాయి. కొన్ని వుండి కూడా అసమర్థంగా వుంటాయి. ఆ వైచిత్రివల్లనే నీకు ఇప్పుడు నీ పాత మంత్రులూ, పౌరులూ, కనిపిస్తున్నారు.

పరమార్థ స్వరూపంగా చూసుకుంటే వారిలో వున్న సత్తా, వీరిలో వున్న సత్తా, ఒకటే. కనుక వారూ వీరు ఒకటే.

కానీ, వ్యావహారికంగా చూసుకుంటే, వీరు వారు కాదు. వారిలాంటి వారు. వారిని పోలినవారు. అంత మాత్రమే.

లీలా! ఇక్కడ మరొక మంచి సృష్టి రహస్యం వుంది. ఇక్కడ విదూరథుడు అనే ఈ రాజుయొక్క ఆత్మలో – ఒక ప్రతిభ, ఒక భ్రాంతి, ఒక స్వప్నం వంటి దృశ్యం, ఏర్పడి, ఈ లోకమంతా కనిపిస్తోంది. దీనికి కారణం ఇతనియొక్క సంస్కారం. సరిగ్గా అదే పద్ధతిలో, జీవుల అందరియొక్క సంస్కారమూ కలిసి, సద్రూపుడైన హిరణ్యగర్భుడియందు, సత్యసంకల్పము అనే ప్రతిభ ఏర్పడింది. ప్రతిభ అంటే చెప్పాను కదూ! ఒక భ్రాంతి, ఒక స్వప్నం వంటి దృశ్య కల్పన.

ఆ హిరణ్యగర్భుడియొక్క సంకల్పమూ, రాజు అనే ఈ జీవుడియొక్క సంకల్పమూ, రెండూ ఏకమై ఇక్కడ అచ్చం నీలాగానే వున్న రెండవ లీల తయారైంది. కనుక, లీలా!

**ఏషా త్వమంబర మహం భువనం ధరా చ**
**రాజేతి సర్వమహమేవ విభాతమాత్రమ్ ।**
**చిద్వ్యోమ బిల్వ జఠరం విదురంగ విద్ధి**
**త్వం తేన శాంతమలమాస్వ యథా స్థితేహ॥** (ఉ.ప్ర.స.44, శ్లో.52)

ఈ రెండవ లీల, నువ్వూ, నేనూ, ఈ ఆకాశమూ, దీనిలో కనిపిస్తున్న ప్రపంచం, ఈ భూమీ, ఈ రాజు, ఇదంతా కూడా నేనే. అంటే ఆత్మరూపమే. ఆత్మరూపంలోనే ఇది ప్రతిభగా వచ్చింది. చిదాకాశమే ఒక మారేడు పండైతే, దాని పొట్టలో వుండే గింజల వంటివి ఈ లోకాలన్నీ. లీలా! ఈ మాట పెద్దలందరికీ తెలుసు. నువ్వు కూడా తెలుసుకో. తెలుసుకొని నీ స్వస్వరూపంతో హాయిగా వుండు.

### 49. పద్మలీల-విదూరథలీల

ఇక నుంచీ, సౌకర్యం కోసం మొదటి లీలను పద్మలీల అని, రెండవ లీలను విదూరథలీల అని వ్యవహరించుకుందాం.

సరస్వతీదేవి పద్మలీలతో ఆ విధంగా మాట్లాడి, విదూరథ లీలవంక తిరిగి “లీలా! నీ భర్త ఈ యుద్ధంలో శరీరం వదలి పెట్టి, మళ్ళీ ఆ పద్మరాజు శరీరంలోకి ప్రవేశిస్తాడు”– అంది.

విదూరథలీల ఆ మాటలు విని కంగారుపడి, దోసిలి ఒగ్గి సరస్వతీదేవి ముందు నిలబడి – “అమ్మా! నేను సరస్వతిదేవిని నిత్యమూ ఉపాసిస్తూ వుంటాను. ఆమె అప్పుడప్పుడు కలలో దర్శనమిస్తూ వుంటుంది. నువ్వు అచ్చం ఆమె లాగానే వున్నావు. అసలు నీవు ఆవిడవేనేమో! తల్లీ! దయతో నాకు వరమివ్వు” అంది.

***సరస్వతీ దేవి:*** లీలా! నీ ఉపాసనకు నేను సంతోషించాను. వరం కోరుకో ఇస్తాను.

***విదూరథ లీల:*** దేవీ! నా భర్త యుద్ధంలో శరీరం వదలి ఎక్కడికో పోతాడంటివి కదా, నేను ఇదే శరీరంతో ఆయన దగ్గరికే పోవాలి, ఆయనకి భార్యనై వుండాలి. ఈ వరం ఇవ్వు.

***సరస్వతి దేవి:*** తథాస్తు.

ఈ మాటలు విని విదూరథలీల చాలా పొంగిపోయింది. పద్మలీల మాత్రం ఎందుకో సందేహంలో పడిపోయింది.

**పద్మలీల:** సరస్వతీదేవీ! మీరంతా సత్యకాములు, సత్యసంకల్పులు, బ్రహ్మస్వరూపులు. మీరు అనుకున్నది జరిగి పోతుంది. ఈవిడకి ఈ శరీరంతోనే, మరో బ్రహ్మాండంలోకి వెళ్ళేటట్టుగా వరం ఇచ్చావు. నేను పూర్వం గిరిగ్రామ లోకంలోకి వెళ్ళాలంటే, అప్పుడు మాత్రం నేను ఆతివాహిక శరీరం స్వీకరించ వలసిందే అని– అన్నావు. ఈ తేడాకి కారణం ఏమిటి?

**సరస్వతీ దేవి:** పద్మలీల!

**న కించత్కస్యచిదహం కరోమి వరవర్ణిని ।**

**సర్వం సంపాదయత్యాశు స్వయం జీవస్స్వమీహితమ్॥** (ఉ.ప్ర.స.45, శ్లో.12)

నేను ఎవరికీ ఏమి చెయ్యను. ప్రతివాడూ తన కోర్కెలను తనే తీర్చుకుంటాడు.

ప్రతివాడిలోనూ ఒక 'సంవిత్' వుంది. అంటే చిత్తవృత్తి వుంది. దానిలో మాయతో కూడిన చిచ్ఛక్తి వుంది. ఆ సంవిత్తుకు నేను అధిదేవతను. అందుచేత జీవులకు వరమనే పేరుతో, రాబోయే శుభాశుభాలను వ్యక్తం చేస్తూ వుంటాను.

నేను చెప్పిన సంవిత్ వుందే, అది బీజం వంటిది. అదే అన్ని కార్యాలనూ క్రమంగా ఉత్పత్తి చేయగలదు. దాన్ని అనుసరించే నేను వరాలు ఇస్తూ వుంటాను.

నువ్వు నన్ను ఆరాధించినప్పుడు, నీలో వున్న జీవశక్తి ముక్తి పొందాలి– అనే కోరికతో వుంది. అందువల్ల, దానికి అనుకూలంగానే నేను నీతో వ్యవహరించాను. వరాలిచ్చాను, జ్ఞానం ఇచ్చాను, ముక్తి ఇచ్చాను. ఈ వరాలన్నీ ఎవరి మహిమ? నీలో వున్న చిచ్ఛక్తి అనే విత్తనం యొక్క మహిమే.

**యస్య యస్య యథోదేతి స్వచిత్ప్రయతనం చిరమ్**

**ఫలం దదాతి కాలేన తస్య తస్య తథా తథా॥** (ఉ.ప్ర.స.45, శ్లో.28)

ఎవడి చిచ్ఛక్తి ఏ రకంగా ప్రయత్నం చేస్తుందో, ఆ రకంగానే ఫలితం వస్తుంది. ఈ ప్రయత్నం అప్పటికప్పుడు జరగమంటే జరగదు. ఎప్పటినుంచో జరుగుతూ వస్తూ వుంటుంది. చివర్లో అది తపస్సు గానో, దేవతగానో, ఏర్పడి, వాడి ప్రయత్నానికి అనుగుణంగా ఫలితం ఇస్తూ వుంటుంది.

నువ్వు గుర్తించవలసింది ఏమిటంటే, నీ చిచ్ఛక్తీ మిథ్యే, దేవతా మిథ్యే, ఫలమూ మిథ్యే. అయినా, ఫలసిద్ధి కావాలని అనుకొన్నప్పుడు పురుషప్రయత్నం చేసి తీరాలి.

మొదట శాస్త్రవిహితమైన కర్మను గురించి పురుషకారం చెయ్యాలి. (పురుషకారం – పురుషప్రయత్నం – మానవులు చేసే కృషి. క్రమంగా దానికి తగిన ఫలితమే లభిస్తుంది. నిషిద్ధకర్మ చేస్తే, చెడు ఫలితమే కలుగుతుంది. ఈ రకమైన విచారణ ప్రతి జీవికీ అవసరము.

కనుక, లీలా! నువ్వు చేసిన ప్రయత్నానికి అనుగుణంగా నీకు ఆ వరం ఇచ్చాను. ఈవిడ ప్రయత్నానికి అనుగుణంగా ఈ వరమిచ్చాను. ఇదే భేదం.

## 50. విదూరథుడి లోకాంతర ప్రాప్తి

**వశిష్ఠుడు:** రామా! వీరిక్కడ ఇలా మాట్లాడుకుంటూ వుండగా, అక్కడ విదూరథుడు యుద్ధంలోకి దూకాడు. ఇక్కడ ఇద్దరు లీలలూ, విదూరథుని కూతురు, ఆ యుద్ధాన్ని చూసే దివ్యదృష్టిని ఇమ్మని సరస్వతీదేవిని ప్రార్థించారు. ఆమె సరే అంది. దాంతో వారు ముగ్గురూ కూడా ఆ ఇంట్లోనే కూర్చొని యుద్ధాన్ని కళ్ళారా చూడసాగారు.

యుద్ధం చాలా ఘోరంగా జరుగుతోంది. క్రమంగా విదూరథుడు ఓడిపోయే లక్షణాలు కనిపిస్తున్నాయి. అది గమనించి లీలలిద్దరూ "సరస్వతీదేవీ! మా భర్తకు నీ అనుగ్రహం వుంది కదా. అయినా, ఆయనకు జయం కలగటం లేదేమిటి?" అని అడిగారు.

**సరస్వతీదేవి:** "పుత్రికలారా! మీ భర్త యొక్క శత్రువైన సింధురాజు జయం కోసం నన్ను బాగా ఆరాధించాడు. మీ భర్త నన్ను మోక్షం కోసం ఆరాధించాడు. అందువల్ల నేను విదూరథుడికి జయం ఇవ్వలేను. సింధురాజుకి మోక్షం ఇవ్వలేను." అంది.

ఇంతలో సూర్యోదయమైంది. యుద్ధం మరింత వేగం పుంజుకుంది. ఇక్కడ వాల్మీకి మహర్షి– ఆయుధ యుద్ధాన్నీ, అస్త్రయుద్ధాన్నీ, రెండు సర్గల్లో విస్తారంగా వర్ణించాడు.

అస్త్రయుద్ధం కూడా పూర్తయిన తరువాత, మళ్ళీ విదూరథ సింధురాజులు కత్తి యుద్ధానికి తలపడ్డారు. ఆ యుద్ధంలో సింధురాజు బాగా దెబ్బలు తిని, మూర్ఛబోయాడు.

అది చూసి, విదూరథుడు కొంచెం ఏమరికగా వుండగా, సింధురాజు మూర్ఛనుంచి తేరుకొని, ఒక్క దూకు దూకి, విదూరథుడి రెండు చేతులూ నరికేశాడు.

ఈ దృశ్యాన్ని దివ్యదృష్టితో చూస్తున్న పద్మలీల తాను జ్ఞాని అయివుండి కూడా మూర్ఛపోయింది. విదూరథలీల ఆదుర్దాగా చూస్తూ అలాగే వుంది.

విదూరథ రథసారథి తన యజమాని పరిస్థితిని గమనించి, యుద్ధరంగంనుంచి రథాన్ని పక్కకు పరుగులు తీయించి, తన మహారాజును సరస్వతీదేవి ఎదుటకు తెచ్చి పడుకోబెట్టాడు. అప్పటికే ప్రాణం పోయింది.

బయట సింధురాజుకు జైజైకారాలు పెట్రేగి పోతున్నాయి. ఇక్కడ అంతఃపురంలో ఏడుపులు చెలరేగుతున్నాయి.

ఇంతలో విదూరథలీల సరస్వతీదేవిని చూసి, "అమ్మా! నా భర్త ప్రాణాలు పోబోతున్నాయి"– అంది, వెక్కి వెక్కి ఏడుస్తూ. సరస్వతీదేవి ఈ లీలకు కూడా తత్త్వబోధను చేయాలని సంకల్పించింది. అందుచేత ఇలా అంది.

**సరస్వతీదేవి:** విదూరథలీలా! నువ్వు ఇప్పుడు దివ్యదృష్టితో చూసిన మహాయుద్ధంలో ఆవ గింజంత కూడా నిజం లేదు. ఇదంతా ఒక కలను మించిన కల. నీకు కనిపించే మీ రాజ్యమంతా కలిపి ఈ గదిలోనే వుంది.

ఈ గదితో సహా కలిపి, ఇదంతా పద్మరాజు గదిలో వుంది. ఆ గదీ, ఆతని రాజ్యం మొత్తం కలిపి, వశిష్ఠుడనే బ్రాహ్మణుడి ఇంట్లో ఉంది.

అంటే, నేను, నువ్వు, ఈ పద్మలీల, ఈ విదూరథుడు, ఈ రాజ్యం, ఈ భూమి, ఈ బ్రహ్మాండం – ఈ మొత్తమంతా కలిపి ఆ గిరిగ్రామంలో వుంది.

ఇలా ఇన్ని రకాలుగా కనిపించేది ఎవరు? నీ ఆత్మే. నీ ఆత్మే ఒకప్పుడు ఇలా లేని పదార్థాలను చూపిస్తోంది. ఆ పదార్థాల రూపంగా తనని తనే చూపించుకుంటోంది. ఒకప్పుడు తను ఏ మాత్రమూ తెలియకుండా వుంటోంది.

కనుక, వాస్తవమైనది నీ ఆత్మే. ఈ ప్రపంచం భ్రమ.

భ్రమను చూసేవాడు ఒకడు వుంటే గానీ, భ్రమ వుండదు. కనుక, భ్రమను చూసే నువ్వు నిత్యం. నువ్వు చూసే భ్రమ అనిత్యం.

అలాగే ద్రష్ట వుంటే గానీ, దృశ్యం వుండదు. ద్రష్ట, దృశ్యము ఒకటి కాదు. నువ్వు ద్రష్టవి. నువ్వు సత్యానివి.

ఆయా జీవుల సంకల్పాలకు అనుసారంగా, ఆయా ప్రపంచాలు స్ఫురిస్తున్నాయి. అక్కడ నిజంగా పుట్టిందీ లేదు, పోయిందీ లేదు.

ఇలాంటి మాయా ప్రపంచాల్లో, ఒక దాంట్లో, పద్మడనే రాజు శవం వుంది. నీ భర్త జీవం అప్పుడే ఆ శవం దగ్గరికి వెళ్ళిపోయింది.

నీ సవతి అయిన పద్మలీల, ఇందాక నీ ముందు మూర్ఛ పోయిందే, అప్పుడే ఆమె జీవం కూడా అక్కడికి పోయింది.

**విదూరథలీల:** సరస్వతీదేవీ! ఈ పద్మలీల అక్కడ దేహాన్ని ఏ విధంగా ధరించింది? ఆమెకు నేను సవతిని ఎట్లా అయ్యాను? ఇప్పుడామె మళ్ళీ ఆ ఇంటికి పోతే, అక్కడి వాళ్ళు , ఆమెను ఎలా చూస్తున్నారు?

**సరస్వతీదేవి:** ఇక్కడ నీ భర్తగా వున్న విదూరథుడే అక్కడ పద్ముడు. ఆ పద్ముడు ఆ శవ గృహంలోనే, తన ప్రపంచాన్ని చూస్తున్నాడు. నువ్వు చూస్తున్న ఈ ప్రపంచం ఎలా మిథ్యయో, అతను చూస్తున్న ఆ ప్రపంచమూ మిథ్యే. రెండూ భ్రాంతి వల్లే కనపడుతున్నాయి.

ఆ జీవికి ఒక భ్రాంతివల్ల ఆమె భార్యగా కనిపించింది. మరో భ్రాంతివల్ల నువ్వు భార్యగా కనిపించావు. అది ఒక కల, ఇది ఒక కల. నువ్వూ మిథ్యే. ఆవిడా మిథ్యే.

నీ భర్తకు ఇదంతా స్వప్నమైనట్లే, మీకు కూడా ఇది స్వప్నమే. ఇద్దరి స్వప్నాలూ కలిశాయి. కనుకే మీ మధ్యలో వ్యవహారం నడిచింది.

ఈ తత్త్వం తెలుసుకుంటే, స్వప్నం వంటిది అయిన ఈ దృశ్యం అంతా నశిస్తుంది. సత్యమైన ఆత్మ మిగులుతుంది. ఆ ఆత్మే ఇన్ని ప్రపంచాల ఆకారాలుగా గోచరిస్తోందని అర్థమవుతోంది. ఈ ఆత్మనుంచే నువ్వూ, నేను, నీ భర్తా, నీ పరివారం అంతా జన్మించాం. ఆ పద్మలీల కూడా అలాగే జన్మించింది.

నీ భర్త మరణించిన వెంటనే, ఆయన సంకల్ప శరీరానికి ఎదురుగా, ఈ పద్మలీల నీ ఆకారం వంటి ఆకారంతో కనిపించింది.

మానవుడి చిత్తం పాంచభౌతిక శరీరాన్ని ధరిస్తే, అప్పుడు ఆ శరీరమే సత్యమని, ఆ చిత్తం అనుకొంటూ వుంటుంది. అదే చిత్తం, సూక్ష్మ శరీరాన్ని ధరించినప్పుడు, భౌతిక శరీరం సత్యం కాదని, సూక్ష్మ శరీరమే

సత్యమనీ అనుకొంటూ వుంటుంది. అంటే, ఆ చిత్తానికి ఎదుట ఏ శరీరం కనిపిస్తే, అదే నిజమని ఆ చిత్తం అనుకొంటూ వుంటుంది.

కనుక, మరణించిన నీ భర్త జీవుడు, ఆతివాహిక రూపంతో వున్న ఈ లీలను చూసి, తాను పునర్జన్మ ఎత్తాననీ, తన ప్రియ భార్యను తాను కలుసుకున్నాననీ, భ్రాంతివల్ల భావించాడు.

ఈ పద్మలలీ పూర్వం నన్ను పూజించి, తనకు వైధవ్యం రారాదని కోరుకొంది. అందువల్ల భర్త కంటే ముందే మరణించింది.

నువ్వు భర్త వున్న చోటికి పోవాలని కోరావు. మీ ఇద్దరికీ వరాలిచ్చాను నేను. మిగిలిన విషయాలు నువ్వు స్వయంగానే తెలుసుకున్నావు.

సరస్వతీదేవి ఇలా అంటూ వుండగానే, విదూరథలీల జీవుడు ఆమె దేహం నుంచి పైకి లేచి, ప్రాణవాయువుతో కలసి, ఒక వాసనామయ శరీరాన్ని ధరించి, ఆకాశంలో తిరుగుతూ తన భర్త వెళ్ళిన మార్గాన్ని వెతకసాగింది.

ఈలోగా సరస్వతీదేవి విదూరథుడి కూతురికి కూడా అదే విధంగా ప్రాణం బయటకు తెప్పించి, ఒక వాసనామయ శరీరాన్ని కల్పించి, ఆకాశంలోకి పంపింది.

వాసనామయ శరీరంతో ఆకాశంలో తిరుగుతున్న విదూరథ లీలకు, "అమ్మా" అనే కేక వినిపించింది. ఎవరా అని చూస్తే, అదీ తన కూతురే, తనను రమ్మని పిలుస్తోంది. ఆ బాలిక శరీరం ఏదో దేవతా శరీరం లాగా కనిపిస్తోంది.

విదూరథలీల పరుగు పరుగున కూతురు దగ్గరకు వెళ్ళి, "అమ్మాయీ! నీకు దేవతా శరీరం వచ్చినట్టుంది. కనుక, దేవతల్లో వుండే జ్ఞానం కూడా నీకు వచ్చే వుంటుంది. పైగా నా కంటే ముందుగా ఇక్కడకు వచ్చినట్టున్నావు. కనుక, మీ నాన్నగారు వెళ్ళిన దారి నీకు తెలిసే వుంటుంది. కొంచెం నన్ను అక్కడికి తీసుకుపో"– అంది. కూతురు సరే అని, దారి చూపిస్తూ ముందుకు దారి తీసింది.

ఆ కూతురు చూపే దారి ఎలా వుందంటే–

**నిర్మలం కరమాలాగ్రం యథాలక్షణ రేఖికా** (ఉ.ప్ర.స.53, శ్లో.7)

మనుషుల అదృష్టాల్ని సూచించే సాముద్రికల రేఖలు వారి వారి అరచేతుల్లో చేరినట్లుగా, వుందట!

వాళ్ళిద్దరూ వాయుమార్గంలో నడచి మేఘాలనూ, సూర్యమండలాలను, దేవతా లోకాలను, దాటి బ్రహ్మాండపు డిప్పదగ్గరికి చేరారు. దాన్ని చీల్చుకుని, దాని చుట్టూతా వున్న పంచభూత ఆవరణలను దాటారు. చివరికి చిదాకాశంలోకి ప్రవేశించారు. గరుత్మంతుడు మహావేగంతో కోట్ల కోట్ల కల్పాలు తిరిగినా పూర్తి కానంత దూరం నడచి వచ్చారు.

ఆ చిదాకాశంలో అంతులేనన్ని బ్రహ్మాండాలున్నాయి. ఆ లీల అందులో, ఒకానొక బ్రహ్మాండాన్ని పగులగొట్టుకొని, లోపలికి ప్రవేశించింది. అది ఎలా వుందంటే, పండులోకి పురుగు ప్రవేశించినట్లుగా వుంది.

మళ్ళీ బ్రహ్మ, విష్ణు, రుద్రాది లోకాలు దాటింది. భూమి దగ్గరకు వచ్చింది. చివరికి పద్మరాజు ఇంట్లోకి వెళ్ళింది. అక్కడ పూలరాశి మధ్య వున్న శవం దగ్గర ఆగింది.

ఆగి వెనక్కి చూసే సరికి, కూతురు కనిపించలేదు. ముందున్న కూతురు ఎప్పుడు వెనక్కి పోయిందో, ఎప్పుడు మాయమై పోయిందో, తల్లికి గుర్తురాలేదు.

విదూరథలీలకు ఆ శవాన్ని చూసేసరికి కొత్త ఊహలొచ్చాయి. "ఈయన నా భర్త. యుద్ధంలో మరణించి, ఇప్పుడు ఈ శరీరంలో చేరి, సుఖంగా నిద్రపోతున్నాడు. సరస్వతీ దేవి అనుగ్రహంవల్ల నేను సశరీరంగా ఇక్కడి వచ్చాను. నా అంతటి అదృష్టవంతులు ఈ లోకంలో ఎవరూ లేరు." అని ఆమె అనుకోసాగింది.

## 51. స్థూల ప్రపంచం గూడా వాసనామయమే

నిజానికి, ఆమె వాసనామయ శరీరంతోనే ఇక్కడికి వచ్చింది కానీ, ఆ పాత శరీరంతో సహా, తాను ఇక్కడికి వచ్చానని, ఆమె ఇప్పుడు భావిస్తోంది. ఆ భావనాబలంవల్ల, ఆమె నిజంగానే శరీరంతో వున్న దాని లాగా, వ్యవహరించ సాగింది. ఆమె ఆ పక్కనే వున్న వింజామరలు తీసుకొని, భర్తకు విసర సాగింది.

ఇక్కడ వాల్మీకి మహర్షి కథలో కొంచెం వెనక్కు వెళ్ళి, విదూరథ జీవుడి ప్రాణం పైకి లేచి ప్రయాణం చేసే సన్నివేశాన్ని, ఆ సమయంలో పద్మలీలా సరస్వతులకు జరిగిన సంభాషణను, వివరించాడు.

విదూరథ ప్రాణప్రయాణ సమయానికి సూక్ష్మరూపాలలో వున్న పద్మలీలా, సరస్వతీ దేవులు విదూరథ లోకంలోనే కూర్చొన్ని ఏదో సంభాషించుకో సాగారు. ఆ సంభాషణ ఇలా సాగింది.

**పద్మలీల:** దేవీ! ఈ విదూరథ జీవుడూ, విదూరథలీలా జీవుడు, వాళ్ళ పుత్రికా జీవుడు, అంతా పద్మరాజు లోకానికి వెళ్ళారు కదా! అక్కడ ఈ విదూరథజీవి పద్మరాజు శవంలోకి ప్రవేశిస్తాడు కదా! ఆ విధంగా మెల్కొన్న ఆ రాజు, అక్కడ అంతకు ముందే వున్న దాస దాసీలు, భృత్యులు, ఒకరితో ఒకరు ఎలా ప్రవర్తిస్తారు? ఇక్కడ్నుంచీ వెళ్ళిన ఈ విదూరథలీలను చూసి వాళ్ళు ఎలా భావన చేస్తారు? ఆ రాజు ఈమెను తన భార్యగానే స్వీకరిస్తాడని నువ్వన్నావు కదా! అది ఎలా కుదురుతుంది?

**సరస్వతీదేవి:** ఏమీ లేదు పద్మలీలా! అక్కడ నిద్ర లేచిన రాజు, అక్కడున్న పరివారము, వీరందరూ కూడా, చిదాకాశంతో ఏకత్వాన్ని చెంది వున్నారు కనుక, "ఈమె నాకు సహజమైన భార్య" "ఈమె నాకు సహజమైన సఖి" "వీళ్ళు నాకు సహజమైన సేవకులు" "ఈయన మాకు సహజమైన రాజు" అని ఈ విధంగా ఒకళ్ళని చూస్తే ఒకళ్ళకి అనిపిస్తుంది. ఎందుకంటే, ఆ చిదాకాశంలో ఆ రకమైన సంస్కారం వుంది.

ఇక నువ్వు, నేను, విదూరథ లీల, ఈ ముగ్గురికీ మాత్రం జరిగిందంతా స్పష్టంగా తెలుసు. మనం తెలిసి వ్యవహరిస్తాం. మిగిలిన వాళ్ళు తెలియకుండా వ్యవహరిస్తారు.

ఇది ఇలా జరగటానికి మూడు కారణాలున్నాయి.

1. ఇదంతా చైతన్యంయొక్క ప్రతిభాసం (భ్రాంతిజన్య దృశ్యం) కావటం
2. ఇది ఇలాగే జరగాలని హిరణ్యగర్భ సంకల్పంలో నియతి వుండటం.
3. మనిద్దరి మహిమ.

## 52. శాపాలు- వరాలు - చేసేదేమిటి?

***పద్మలీల:*** తల్లీ! మరి ఈ విదూరథలీలకు నువ్వు వరమిచ్చావు కదా! ఆ వరం ప్రకారం, స్థూలశరీరంతో భర్త దగ్గరకు ఎందుకు వెళ్ళలేదు?

***సరస్వతీదేవి:*** ఇతర లోకాలకు వెళ్ళాలంటే ఆత్మజ్ఞానమూ, పుణ్యమూ, వరమూ, వుండాలి. ఇవి వున్నా కూడా, స్థూలదేహంతో వెళ్ళటం సాధ్యం కాదు. సత్య సంకల్పులైన హిరణ్యగర్భాదులు, ఈ నియమాన్ని ఏర్పాటు చేశారు.

నాకు దయ్యం పట్టింది అనుకున్నంత సేపు అది పోనే పోదు. అలాగే "నాకు పాంచభౌతిక శరీరం వుంది. నేను ఆకాశంలో ఎగరలేను" అనుకుంటున్నంతసేపూ ఆకాశంలో తిరగటం సాధ్యంకాదు. పైన చెప్పిన ఆత్మజ్ఞానము, పుణ్యము, వరము, అనేవి ఆతివాహిక శరీరాన్ని అందిస్తాయి. ఆతివాహిక శరీరం అంటే, అహంకార వాసనతో కూడిన మానసిక శరీరం. ఇది వచ్చేటప్పటికి స్థూలదేహం నశించి పోతుంది.

వరము, శాపము అనేవి వాడు అంతకుముందే చేసుకొన్న కర్మకు మేలుకొలుపు చేస్తాయి. అంతే గానీ, కొత్త కర్మను పుట్టించవు. ఎలాగంటే – ఒకడు ఒక పద్యం కంఠస్థం చేశాడు. ఒక రోజున చెప్పబోతే అది సాగలేదు. పక్కనే వున్న ఒక పెద్దమనిషి మరచిపోయిన చోట, ఒక పదం అందించాడు. అంతే, వెంటనే వాడు గుర్తు అందుకొని పద్యం మొత్తం దంచేశాడు. ఇక్కడ అందించిన పదం ఎటువంటిదో, వరశాపాలు అలాంటివే.

కనుక, పద్మలీలా! నా వరంవల్ల విదూరథలీలకు "స్థూలశరీరంతో నేనున్నాను" అనే అనుభూతి మాత్రమే కలిగింది.

***పద్మలీల:*** దేవీ! ఇన్ని పనులు చేసే ఈ స్థూలదేహం. తత్త్వజ్ఞానం కలగగానే ఎలా పోతుంది?

***సరస్వతీదేవి:*** పోక ఏం చేస్తుంది? తాడు మీద కనిపించే పాము కరుస్తుందా?

***పద్మలీల:*** ఆ పామును చూసేవాడికి, చెమటలు పట్టినాయి కదా!, కనుక, ఆ పాము ఎంతో కొంత పనిచేసినట్టే కదా!

***సరస్వతీదేవి:*** అవి పాము చేసిన పనులు కావు. వీడి భ్రాంతి చేసిన పనులు. వెలుతురు వస్తే, ఆ పామే ఎగిరి పోతుంది. ఇంక చెమటలెందుకు పడతాయి? స్థూలదేహం పరిస్థితీ అంతే!

***పద్మలీల:*** దేవీ! తాడు మీద కనిపించిన పాము చచ్చిపోయిందని ఎవడూ అనటం లేదు. కానీ, శరీరం చచ్చిపోయింది అంటున్నారు. నిజంగానే దేహమనేది పూర్తిగా శూన్యవస్తువైతే, దేహం మరణించిందీ అనే వ్యవహారం ఎలా పుడుతుంది?

***సరస్వతీదేవి:*** అదీ ఒక భ్రాంతే. ఈ భ్రాంతికి కారణం పూర్వ సంస్కారం. ఈ ప్రపంచంలో మనకు కనిపించే సంసార భ్రమలన్నీ గూడా, మన పాత సంస్కారంవల్ల మనం కల్పించుకున్నవే. అంతే గానీ, వాటికి వరాలు, శాపాలు, హిరణ్యగర్భుడు, ఇలాంటివి కారణం కాదు.

***పద్మలీల:*** దేవీ! ప్రపంచం అంతా సంస్కారాలవల్లే వస్తుంది అంటున్నావు. అలా అయితే, అది స్వప్నం లాగానే, మనస్సు లోపలే కనిపించాలి. బయట ఎలా కనిపిస్తోంది?

**సరస్వతీదేవి:** బయట కనిపిస్తోందనుకోవటమే భ్రాంతి. నిజానికి ఈ ప్రపంచమంతా బయటిది కాదు. లోపలిదే.

బయటిదిగా కనిపించినంత మాత్రాన బయటిది కానక్కర్లేదు అనటానికి, ఒక ఉదాహరణ చెబుతా విను– కంటికి జబ్బు చేసి, ఆకాశంలో ఇద్దరు చంద్రులు కనిపించారు. ఈ రెండవ చంద్రుడు ఎక్కణ్ణించి వచ్చాడు? లోపలనుంచే వచ్చాడు. లోపలే ఉన్నాడు కూడా, కానీ బయట ఆకాశంలో వున్నట్టుగా కనిపిస్తున్నాడు. కనుకనే, తత్త్వజ్ఞులు, పుణ్యవంతులు, మాత్రమే సూక్ష్మలోకాలను పొందగలరు– అని చెప్పాను.

స్థూలదేహాలేమో అసత్యాలు, ఆతివాహిక దేహాలేమో సత్యాలు. ఈ రెండూ కలిసి ఒక చోట ఎట్లా వుంటాయి? విదూరథలీల నా ఉపదేశంవల్ల తత్త్వజ్ఞురాలయింది. అందువల్లనే, తన భర్త కల్పించుకున్న ప్రపంచానికి తాను వెళ్ళగలిగింది.

## 53. జీవుల సుఖదుఃఖాలను నియమించేది ఏది?

**పద్మలీల:-**

అదంతా బాగానే వుంది. ఇప్పుడు ఇక్కడ ఈ విదూరథ శరీరంతో నా భర్త మరణిస్తున్నాడు. ఇతనికి ఈ దుఃఖం రావటానికి కారణం ఏమిటి? అసలు జీవులకు సుఖదుఃఖాలు ఎలా వస్తాయి? ఎలా పోతాయి? దీనికి ఏదైనా నియమం వుందా? "ఏ నియమమూ లేదు. ఏ వస్తువు స్వభావం ప్రకారం ఆ వస్తువు పని చేస్తూ వుంటుంది. "అనేటట్లయితే " ఈ వస్తువుకి ఈ స్వభావం" అని నియమం చేసింది ఎవరు? ఆ నియమం తప్పిపోకుండా వుండటానికి కారణం ఏమిటి? అంటే, నిప్పు కాసేపు వేడిగా కాసేపు చల్లగా వుండకుండా ఎప్పుడూ వేడిగానే వుండటానికి కారణమేమిటి?

**సరస్వతీ దేవి:** పద్మలీలా! సృష్టి ప్రారంభంలో హిరణ్యగర్భుడికి కొన్ని సంకల్పాలు కలిగాయి. వాటిలో కొన్ని మారని సంకల్పాలు వున్నాయి. కొన్ని మారే సంకల్పాలున్నాయి. మారనివి ఎప్పటికీ మారవు. మారేవి ఎప్పుడూ మారుతునే వుంటాయి. ఆ సంకల్పాలకి అనుసారంగానే, సృష్టిలో పదార్థాలన్నీ జన్మిస్తున్నాయి. అంటే, మారనివి అలాగే వుండటం, మారేవి మారుతూనే వుండటం – అనే నియమానికి మాత్రం, ఎప్పుడూ భంగం లేదు. అందుచేతనే సృష్టి ఒక నియమం ప్రకారం జరుగుతోందని పెద్దలు చెపుతారు.

ఒకే మూలవస్తువులోంచీ వస్తూ వుంటే, ఇన్ని గుణాలు, ఇన్ని ఆకారాలు, ఎలా వస్తాయి? – అని సందేహించవలసిన పని లేదు. సృష్టికి ముందు ప్రళయం వుంది. ఆ సమయంలో అన్ని రకాల పదార్థాలూ సూక్ష్మరూపంలో కలిసిపోయి ఓ బంగారం ముద్ద లాగా ఏర్పడ్డాయి.

బంగారం అనేది వుంటే గాజు గానో,దుద్దులు గానో, గిన్నె గానో, లేదా కనీసం ముద్ద గానో, ఏదో ఒక ఆకారంలో వుంటుంది. ఏ ఆకారమూ లేకుండా బంగారం ఎట్లా వుండగలదు? అలాగే, సూక్ష్మరూపం గూడా లేకుండా, సర్వశూన్యమైన ప్రళయం వుండటం సంభవం కాదు.

బంగారం ముద్దలోంచే గాజు ఆకారము, గిన్నె ఆకారము బయటికి వచ్చినట్టు, ప్రళయకాలంలో వున్న సూక్ష్మచిద్రూపంలోంచే అగ్ని, జలము, మొదలైన పదార్థాలన్నీ వచ్చాయి.

ఏ పదార్థాలుగా చైతన్యం వ్యక్తమైందో, ఆ పదార్థాల గుర్తులు ఇప్పటికీ అట్లాగే వున్నాయి. ఎప్పటికీ

వుంటాయి. అంటే, సృష్ట్యాదిలో చల్లగా వున్న చైతన్యం ఇప్పటికీ చల్లగానే వుంటుంది. వెచ్చగా వున్న చైతన్యం ఇప్పటికీ వెచ్చగానే వుంటుంది.

ఈ ప్రపంచానికి, అప్పటికీ ఇప్పటికీ కూడా అధిష్ఠానం చైతన్యమే. అది మారే ప్రసక్తిలేదు. అందువల్ల దానియందు వ్యక్తమయ్యే, ప్రపంచానికి నియమబద్ధత తప్పదు.

పంచభూతాలకు లాగానే, జనన మరణాలకు కూడా నియమబద్ధత వుంది. కర్మే ఆ నియమం. కర్మ అనుభవించవలసి వస్తే, పుట్టుక వస్తుంది. కర్మ క్షయించిపోతే, మరణం వస్తుంది.

పద్మలీలా! ఇప్పటిదాకా చెప్పిందంతా వ్యావహారిక దృష్టి. ఇక పరమార్థ దృష్టితో సమాధానం చెబుతా విను –

పరమార్థదృష్టిలో ప్రపంచమే లేదు. లేనిదానికి నియమం ఏమిటి? ద్రష్ట అయిన ఆత్మయందు, దృశ్యాలను కల్పించుకొని చూడటం మనకు నిత్యానుభవంలో వుంది. అదే స్వప్నం. అలాగే, మాయయొక్క చాతుర్యం చేత, ఈ జాగ్రత్ప్రపంచాన్ని మనం చూస్తున్నాం.

పద్మలీలా! ఈ తత్త్వదృష్టిలో ప్రశ్నకూ అవకాశం తక్కువే. సమాధానానికీ అవకాశం తక్కువే. మన విచారణ అంతా ప్రధానంగా వ్యవహార దృష్టితోనే సాగాలి. అందుచేత కర్మఫల తత్త్వాన్ని వ్యవహార దృష్టితో మరో సారి వివరిస్తాను, విను.

పదార్థాలకు నిబద్ధత వున్నట్టే, జీవులకు కూడా వుంది. ఆ నియమం ఆ జీవికి జీవత్వం వున్నంత వరకూ వుంటుంది. ఆ మధ్యలో వాడు ఎన్నిసార్లు మరణించినా, ఆ నియమానికి భంగం కలగదు.

జీవుల నియమం కర్మ. అది ప్రధానంగా రెండు రకాలు – ప్రారబ్ధకర్మ, సంచిత కర్మ. వీటిలో ప్రారబ్ధ కర్మ బలవత్తరమైనది. ఇది మరణం వరకూ సంచిత కర్మను ఫలితంలోనికి రానీయకుండా అడ్డం పడుతూ వుంటుంది. మరణం వచ్చేసరికి మాత్రం ప్రారబ్ధకర్మకు పట్టు జారిపోతుంది. సంచితకర్మకు అడ్డం తొలగిపోతుంది. ఇక అది ఫలితాలను ప్రారంభిస్తుంది. సంగ్రహంగా ఈ కర్మలయొక్క గమనం ఎలా వుంటుందో చెపుతా విను

1. కృతయుగంలో సగటు ఆయుర్దాయం 400 సంవత్సరాలు.
2. త్రేతాయుగంలో సగటు ఆయుర్దాయం 300 సంవత్సరాలు.
3. ద్వాపరయుగంలో సగటు ఆయుర్దాయం 200 సంవత్సరాలు.
4. కలియుగంలో సగటు ఆయుర్దాయం 100 సంవత్సరాలు.
5. మళ్ళీ ఈ ఆయుర్దాయం కూడ శిలా శాసనం లాంటిది కాదు. దానికీ హెచ్చు తగ్గులుంటాయి. ఎలాగంటే
6. స్వధర్మానుష్ఠానం తగ్గితే, ఆయుర్దాయం తగ్గుతుంది.
7. నిషిద్ధ కర్మానుష్ఠానం పెరిగితే, ఆయుర్దాయం తగ్గుతుంది.
8. ఏ కర్మలకు ఎంత ఆయుర్దాయం పెరుగుతుంది, లేక తరుగుతుంది, అనేది శాస్త్రాన్ని బట్టి తెలుసుకోవాలి.

అలాంటి ఆయుర్దాయం తీరిపోతే, శరీరంలో వుండే నాడులలోంచి ప్రాణాలూ, ఇంద్రియాలూ, హృదయస్థానంలోకి చేరుకుంటాయి. అలా అన్నీ ఒక చోటుకి చేరే సరికి, ప్రాణాలకు పట్టయిన స్థానాలు

తెగిపోయి, వెయ్యి తేళ్ళు కుట్టినంత బాధ కలుగుంతుంది. దాంతో ప్రాణం ఎగిరిపోతుంది. ఇదే మరణం.

***పద్మలీల:*** సరస్వతీదేవీ! ఈ మరణబాధ యోగులకు కూడా ఇలాగే వుంటుందా? మరణబాధ అందరికీ సమానమయ్యేటట్లయితే, మరణానంతర గమనం కూడా అందరికీ సమానమేనా?

***సరస్వతీ దేవి:*** పద్మలీలా! అలా కాదు. మరణించబోయేవారు మూడు రకాలు. 1. మూర్ఖుడు 2. ధారణాభ్యాసి 3. యోగి.

మూర్ఖుడు అంటే – మనస్సు స్వాధీనంలో లేనివాడు. వీడికి మరణదుఃఖం అధికం. వీళ్ళల్లో కూడా జీవించిన సమయంలో పాపాలు చేసినవారికి మరణ దుఃఖం మరింత అధికం. వీడి ఇంద్రియాలు కమిలిపోతాయి. గొంతులో గురక వస్తుంది. మతి పోతుంది. ఆయాసం వస్తుంది. అలా నానాయాతనా పడి మరణిస్తాడు.

ధారణాభ్యాసి అంటే – కొంతకాలం యోగాభ్యాసం చేసినవాడు. వీడు ప్రాణవాయువును, తన మనస్సునూ భ్రూమధ్యంలో గానీ, హృదయంలో గానీ, నిలబెట్టటానికి అభ్యాసం చేసి వుంటాడు. అయితే, పట్టుకొంచెమే చిక్కి వుంటుంది. ఇలాంటి వాడికి మరణ సమయంలో బాధ మధ్యమం.

యోగి అంటే, తన ఇష్టం వచ్చిన నాడి ద్వారా ప్రాణాన్ని నడిపించ గల శక్తి కలవాడు. ఇతడు పరకాయ ప్రవేశం కూడా చేయగలడు. వీడి ప్రాణోత్క్రమణం సుఖంగా వుంటుంది.

### 54. ప్రాణం పోయే తీరు

***పద్మలీల:*** దేవీ! మూర్ఖుడికి కూడా అవయవాలన్నీ యథాతథం గానే వుంటాయి. అయినా కూడా వీడు ముందు మూర్ఛబోయి, అంటే తెలివితప్పి, మరణించవలసిన పని ఏమి వచ్చింది?

***సరస్వతీ దేవి:*** పద్మలీలా! సృష్టియొక్క మొదట్లో పరమేశ్వరుడు కర్మ నియమాలను ఏర్పాటు చేశాడని ఇదివరకే చెప్పాను. ఆ నియమాల ప్రకారం, ఎవ్వరికి ఏ సమయంలో ఎలాంటి దుఃఖం రావాలో, అది వచ్చితీరుతుంది. ఆ నియమాన్ని ఎవరూ తప్పించలేరు.

ఈశ్వరుడు జ్ఞానపూర్వకంగా, బుద్ధిపూర్వకంగా, కావాలని తయారు చేసుకొన్న చిత్తకల్పన ఈ సృష్టి, దానిలో ఆయన తనే జీవరూపంగా ప్రవేశించి, తన సంకల్పం ప్రకారం ఏర్పడిన దుఃఖాలను, తనే అనుభవిస్తున్నాడు. అందువల్ల శరీర అవయవాలన్నీ సమానంగానే వున్నా, ఆ జీవుడు అంతకు ముందు చేసుకున్న కర్మలను బట్టి, మరణదుఃఖం మారిపోతూ వుంటుంది.

అది అలా వుంచితే, మరణ దశలో శరీరంలోపలి నాడుల్లో కొన్ని మార్పులు సంభవిస్తాయి.

1. వాత,పిత్త, శ్లేష్మాలు విషమస్థితికి చేరుకుంటాయి.
2. అంతకు ముందు వాడు తీసుకున్న అన్న పానాలను అవి ఎగుడు దిగుడుగా గ్రహిస్తాయి.
3. శరీరంలో సమస్థితిని నిలబెట్టవలసిన సమాన వాయువుయొక్క పట్టు జారిపోతుంది.
4. దానివల్ల నాడుల్లో జరగవలసిన వాయుసంచారం సరిగ్గా జరుగదు.

5. అందువల్ల లోపలి మనస్సు పనిచేస్తున్నా బయటి ఇంద్రియాలు పని చేయవు.

6. ప్రాణవాయువు సంచారం కూడా దుర్భరమవుతుంది. ముక్కుల్లోంచి మాత్రమే గాక, నోట్లోంచి కూడా గాలి ఆడదు.

7. ఈ దెబ్బతో లింగశరీరం (సూక్ష్మశరీరం) స్థూలశరీరం నుంచి బయటకు నడుస్తుంది. ఇదే మరణం.

పద్మలీలా! ఇలా మరణం అనే నియమం లేకపోతే ప్రపంచమనే వ్యవస్థ కుదరదు. ఎందుకంటే – ప్రపంచానికి మూలమైన చైతన్యంలో మార్పులనేవే కుదరవు. మార్పు లేకపోతే ప్రపంచం ఏముంది? మార్పే మరణం.

చెరకుగడ మధ్యలో కణుపులున్నట్లుగా, చైతన్యం మధ్యలో జనన మరణాలు వుంటాయి. కణుపు గూడా చెరుకే. జనన మరణాలు కూడా చైతన్యంలో భాగాలే. గుర్తుపెట్టుకో. ఈ చెప్పేవన్నీ వ్యవహారదృష్టితో సమన్వయాలు.

తత్త్వదృష్టితో చూస్తే, జీవుడంటే ఎవరు?

చేతనమందామా? (చైతన్యమందామా?) అలా అనేటట్లయితే వాడికి చావు పుట్టుకలే లేవు.

పోనీ, దేహం అందామా, ప్రాణం అందామా? ఇంద్రియాలు, మనసు, బుద్ధి, అహంకారం, అవిద్య – ఏది అందాం?ఇందులో ఏది జీవుడన్నా, వాడు జడమే అవుతాడు. జడానికి మరణమేమిటి?జన్మేమిటి? పైగా వాడు జడమైతే, వాడికి కర్మలెలా వుంటాయి?

జీవుడు జడం గావటం బొత్తిగా కుదరని మాట గనుక, చేతనమే అందాం. అయినా సరే, వాడికి మరణం వుంది అందాం. కానీ, చైతన్యంయొక్క మరణాన్ని చూసిన సాక్షి ఎవడు?

ఒక జీవి మరణానికి మరో జీవి సాక్షి అందామంటే చైతన్యమంతా ఒకటేనని ఇది వరకే నిరూపించుకున్నాం. కనుక, చైతన్యంయొక్క మరణాన్ని చూసిన సాక్షి ఎవడన్నా గనుక వుంటే, వాడు జడం కావాలి. జడుడు సాక్షి ఎలా అవుతాడు? చైతన్యమరణానికి సాక్షే లేడు. గనుక, ఆ మరణమే లేదని చెప్పాలి.

### 55. మరణమంటే యేమిటి?

### సరస్వతీ దేవి:-

మరో దృష్టితో చూస్తే (వ్యావహారిక దృష్టితో చూస్తే,) చేతనుడియొక్క (చైతన్యంయొక్క) మరణం అంటే ఏమిటి? ఒక దేహం విడిచిపెట్టి ఇంకో దేహంలోకి చేరటమా, లేక పూర్తిగా నాశనమై పోవడమా?

పూర్తి నాశనమే మరణం అనుకుందాం. మరి ఈ నాశనం ఎవరు చేశారు? తనకు తనే నాశనం చేసుకున్నాడా? పైవారెవరన్నా నాశనం చేశారా? తనను తాను ఎవరూ నాశనం చేసుకోరు కనుక, పై వారే నాశనం చేసి వుండాలి. కానీ, చైతన్యం అద్వితీయమని ఇదివరకే చెప్పుకొన్నాం. అద్వితీయుడికి పైవాడు ఎక్కడ దొరుకుతాడు? కనుక, నాశరూపమైన మరణం చైతన్యానికి వుండటానికి వీలులేదు.

చైతన్యానికి నాశనం వుందనుకుంటే, మరో చిక్కు కూడా వస్తుంది. కుండకు మట్టి ఎలాంటిదో, జగత్తుకు చైతన్యం అలాంటిది. మట్టి నశించిపోతే కుండ ఏమైపోతుంది? అదీ నశించి పోవలసిందే. అలాగే చైతన్యం నశించిపోతే, ప్రపంచమనేది కనిపించకుండా పోవాలి. ఇదెలా కుదురుతుంది? కనుక, ఈ కారణంవల్ల

కూడా చైతన్యానికి నాశనం లేదు అని నిశ్చయం అవుతోంది.

పూర్తిగా నాశనమై పోవటమే మరణమనే పక్షం కుదరటం లేదు గనుక, ఇక, జీవుడు ఒక దేహంనుంచి మరొక దేహనికి మారటమే మరణం అని నిశ్చయం చేసుకోవాలి. అలా అంటే లోకంలో ఏ జీవుడూ మరణించటం లేదనీ, అలాగే, ఎవడూ జన్మించటం లేదనీ, కేవలం పై తొడుగులు మాత్రమే మారుతున్నాయనీ, ఒప్పుకున్నట్లే.

కనుక, జన్మ అనేదీ, మరణమనేదీ, కూడా భ్రాంతి రూపాలే. ఈ భ్రాంతికి కారణం వాడి వాసనలే. ఈ వాసనలూ, ఈ ప్రపంచమూ కూడా, భ్రాంతి రూపాలే–అనే తత్త్వం తెలిస్తే అదే ముక్తి

***పద్మలీల:*** సరస్వతీదేవీ! లోకవ్యవహారంలో కనిపించే జననమరణాల గురించి ఇంకా కొంచెం వివరంగా వివరించు. మరణించిన జీవులు ఏ రకంగా మళ్ళీ మరో శరీరాన్ని తీసుకుంటారు? వారు సంచరించే లోకాల సత్యత్వం ఎటువంటిది?

***సరస్వతీ దేవి:*** పద్మలీలా! మరణ సమయం వచ్చేసరికి, వాక్కు మొదలైన ఇంద్రియాలు వచ్చి మనస్సులో లీనమవుతాయి. మనస్సు ప్రాణంలో లీనమవుతుంది. ప్రాణం జీవచైతన్యంలో లీనమవుతుంది. జీవచైతన్యం పరమాత్మలో లీనమవుతుంది.

కానీ, ఆ సమయంలో జీవచైతన్యానికి అంతఃకరణమనే ఉపాధి వుంటుంది. నిజానికి ఆ ఉపాధికే జీవుడని పేరు. మనోరూపమైన ఉపాధి వుంటుంది కనుక, ఆ జీవుడు పూర్వ వాసనా బలంచేత తను వున్న చోటనే, పెద్ద ప్రయాణం చేసినట్లుగా అధ్యాస చేసుకొంటాడు. అంటే కల్పన చేసుకుంటాడు. ఇలాంటి దశలో వున్న జీవుణ్ణి, లోకులు, "ప్రేత" అంటారు.

**తతో –సాఽప్రేత శబ్దేన ప్రోచ్యతే వ్యవహారిభిః।**

**చేతనం వాసనా మిశ్రం ఆమోదానిలవత్ స్థితమ్॥** (ఉ.ప్ర.స.55, శ్లో.7)

అపుడు చైతన్యంలో పూర్వవాసనలు ఎలా వుంటాయి అంటే, గాలిలో సువాసనలు వున్నట్టు వుంటాయి. గాలి వేరు. సువాసన వేరు. అయినా వాటిని మనం విడిగా గుర్తు పట్టలేం

జీవుడు ప్రతిరోజూ కలలో తనకు తనే మరో శరీరాన్ని కల్పించుకొని, దాంతో రకరకాల వ్యవహారాలు చేసినట్లుగా, మరణానంతరం గూడా పరలోకమనే లోకాన్నీ, అక్కడికి గమనాన్నీ, అక్కడ తనకో శరీరాన్ని, భోగాలనూ, కల్పించుకొని, అనుభవిస్తూ వుంటాడు. మరణించిన జీవులు చేరే పరలోకాల సత్యత్వం ఇంత మాత్రమే.

పద్మలీలా! మరణించిన జీవులు రెండు రకాలు. 1.పాపాత్ములు. 2.ధర్మాత్ములు. (పుణ్యాత్ములు) వీరిలో ప్రతి ఒక్కడూ సామాన్యుడు, మధ్యముడు, ఉత్తముడు – అని మూడేసి రకాలు. కాగా. వీళ్ళు మొత్తం ఆరు రకాలు. 1.సామాన్య పాపి 2.మధ్యమ పాపి 3.అధమ పాపి 4.సామాన్య పుణ్యాత్ముడు 5.మధ్యమ పుణ్యాత్ముడు 6.ఉత్తమ పుణ్యాత్ముడు.

ఐతే, ఇవి శాశ్వత పదవులు కాదు. ఉదాహరణకు అధమ పాపి కొన్ని తీవ్రశిక్షలను అనుభవించి, మధ్యమపాపిగా మారవచ్చు. తరువాత క్రమంగా నానా జన్మలూ ఎత్తి, ఆ పరంపరలో ఎక్కడో అదృష్టం

కలిసొచ్చి, మోక్షమే పొందవచ్చు.

సామాన్యంగా అధమ పాపులు రాళ్ళుగా గానీ, చెట్లుగా గానీ పుడతారు. మధ్యమ పాపులు చెట్లుగానే పుట్టి, క్రమంగా జంతుజన్మలను పొందుతారు. ఇక సామాన్య పాపి మనిషిజన్మ ఎత్తుతాడు. ఉత్తమ పుణ్యాత్ములు దేవలోకాల్లో జన్మిస్తారు. మధ్యమ పుణ్యాత్ములు కిన్నర కింపురషాది లోకాల్లో జన్మిస్తారు. సామాన్య పుణ్యాత్ములు మానవులలోనే ఉత్తములుగా జన్మిస్తారు.

## 56. మళ్ళీ జన్మించే తీరు

ఇతర లోకాలకు చేరిన జీవులు అక్కడ కర్మఫలం అనుభవించడం పూర్తయినాక,

1. గాలి ద్వారా వర్షంలోకి వస్తారు.

2. వర్షం ద్వారా ఏదో ఒక చెట్టులోకి చేరుతారు.

3. చెట్టుద్వారా గింజలోకి చేరుతారు.

4. గింజ ద్వారా దాన్ని తినే పురుష జీవుల్లోకి చేరుతారు.

5. వారి ద్వారా స్త్రీ జీవుల్లోకి చేరుతాయి.

6. ఆ తల్లి ద్వారా ఆ తల్లిదండ్రుల జాతికి చెందిన శరీరాన్ని పొందుతారు.

ఇది మరణించిన జీవుల శారీరిక పరిణామ క్రమం.

ఇక మరణించిన జీవులయొక్క మానసిక పరిణామము ఎలా వుంటుందో చెపుతాను.

1. మొట్ట మొదట నేను మరణించానని గుర్తిస్తాడు.

2. తరువాత "నా బంధువులు చేసిన ప్రేతకర్మలవల్ల నాకు కొత్త శరీరం తయారైంది" అనుకొంటాడు.

3. యమభటులు నన్ను తీసుకుపోతున్నారు అనుకుంటాడు.

4. నేను యమ పట్టణం చేరాను అనుకుంటాడు.

5. పుణ్యాత్ముడైతే, అక్కడకు దేవ విమానాలు వచ్చి తనను దేవలోకాలకు తీసుకుపోయాయి అనుకొంటాడు. దారంతా అందంగా, సుఖంగా, వుంది అనుకొంటాడు.

6. అదే పాపాత్ముడైతే, దీనికి భిన్నంగా– తనను క్రూర యమభటులు నరకలోకానికి లాక్కుపోతున్నట్టు, దారంతా సంకటంగా వున్నట్టు, అనుకొంటాడు.

7. మధ్యముడైతే, యమధర్మరాజు తనను గురించి పాపపుణ్యాలు విచారణ చేస్తున్నట్లుగా అనుకొంటాడు.

8. ఇది అంతా ఎవడికి వాడు వాడి సంస్కారాలను బట్టి, తన మీద తనే ఆరోపణ చేసుకుంటూ వుంటాడు. అందువల్ల ఎవడి కల వాడిదే అయినట్లు, ఈ లోక కల్పనలు కూడా ఎవడివి వాడివే.

9. ఇక మరో జన్మకు చేరబోయే ముందు ఏ వరిగింజలోనో ప్రవేశించినప్పుడు మొదట "ఈ గింజను నేనే" అనుకుంటాడు. ఆ తరువాత క్రమంగా "ఈ మొలకను నేనే" "ఈ కాడను నేనే" ఈ కంకిని నేనే" "ఈ ధాన్యం

నేనే" "ఈ మొత్తం మొక్కను నేనే" అనుకొంటూ వుంటాడు.

10. మనిషి గర్భంలోకి ప్రవేశించినప్పుడు మాత్రం గర్భంలో వుండగా, వెనకటి జన్మలన్నీ వాడికి గుర్తువస్తాయి.

11. ఈ గింజగా వుండటం, మొక్కగా వుండటం, మొదలైనవి జీవికి స్వర్గ నరకాల లాగా భోగస్థానాలు కావు. ఎందుకంటే వాడికి ఈ దశలో శరీరం గానీ, ఇంద్రియాలు గానీ వుండవు.

12. మొత్తం మీద జన్మించాక, మళ్ళీ ఈకష్ట సుఖాలూ, ముసలితనమూ, మరణమూ, మళ్ళీ పరలోక ప్రయాణమూ, మళ్ళీ భూలోక జననమూ, ఈ చక్రం తప్పదు, ఈ చక్రం మోక్షం వచ్చేదాకా ఆగదు.

**పద్మలీల:** దేవీ! మామూలు జీవుల విషయంలో ఇదంతా బాగానే వుంది. కానీ, మొట్టమొదటి జీవి అయిన హిరణ్యగర్భుడు కూడా జీవుడే కదా! ఆయనకు కూడా ఈ రకమైన చక్రం వుంటుందా?

**సరస్వతీదేవి:** పద్మలీలా! ఆ హిరణ్యగర్భుడికి భ్రాంతి లేదు. మామూలు జీవుడు తనమీద ప్రపంచాన్ని ఆరోపించుకున్నప్పుడు తన స్వరూపాన్ని తను మరచిపోతున్నాడు. హిరణ్యగర్భుడు ఆరోపించుకుంటున్నాడు గానీ, తన స్వరూపాన్ని మరచిపోవడం లేదు. తన స్వరూపాన్ని మరచిపోకపోతే, అది భ్రమ కాదు. హిరణ్యగర్భుడికి ఆరోపితమైన ప్రపంచమంతా కనిపిస్తూనే వుంటుంది గానీ, అది సత్యమని ఆయన అనుకోడు. అందువల్ల ఆయనకు ఈ రకమైన చక్రం వుండే వీలు లేదు.

ఆయనా జీవుడే కదా, అన్నావు నువ్వు. జీవుడంటే ఏమిటి? ఉపాధితో కూడి వుండటం. దీన్నే ఉపాధిలో ప్రతిబింబించడం అంటారు. కాగా, ఉపాధిలో రెండు భాగాలుంటాయి. 1. చైతన్యం 2. ఆరోపితమైన అచేతనాంశ. ఈ చైతన్యాంశ బుద్ధి ద్వారా స్థూల శరీరాన్ని చేరుతుంది. ఆ బుద్ధి, చైతన్యంతో సహా ఇద్రియ గోళాలకు చేరుతుంది. ఇంద్రియ గోళాల ద్వారా విషయ జ్ఞానం కలుగుతుంది. కాగా విషయాలు, ఇంద్రియాలు, బుద్ధి ఉపాధి, ఇవన్నీ జడాలే. వీటన్నిటిలో వ్యాపించి వున్నది చైతన్యం.

ఈ చైతన్య స్వరూపమే తనయొక్క నిజస్వరూపమనే విషయం మరచిపోయినవాడు సామాన్య జీవుడు. అది ఏ మాత్రమూ మరచిపోకుండా వున్నవాడు హిరణ్యగర్భుడు. ఈ భేదాన్ని మనం మరచిపోరాదు. దీనివల్లనే ఆయనకు జనన మరణ చక్రం సంక్రమించదు.

## 57. చర్చ తిరిగిన మెలికలు

పద్మలీలా! మన చర్చ చాలా మెలికలు తిరిగింది.

1. మొదట నువ్వు ఇక్కడ్నుంచి వెళ్ళిన విదూరథలీలను చూసి పద్మరాజు మందిరంలోని మనుమలు ఎలా భావిస్తారు? అని అడిగావు. అందరూ అధ్యాసలోనే వున్నారు. గనుక, వ్యవహారమంతా సహజంగానే వుంటుంది. –అని నేను చెప్పాను.

2. ఆ తరువాత నువ్వు విదూరథలీల స్థూలశరీరంతో భర్త దగ్గరకు ఎందుకు వెళ్ళలేదు– అని అడిగావు. అప్పుడు నేను ఆతివాహిక శరీరం వస్తే స్థూలదేహం వుండదని చెప్పాను.

3. అక్కడనుంచి చర్చ మలుపు తిరిగింది. స్థూలదేహమంటే ఏమిటి? ఆతివాహిక దేహమంటే ఏమిటి?

ఈ ప్రపంచం మనస్సు లోపల వుందా, బయటవుందా? అనే చర్చ జరిగింది.

4. ఆ చర్చలో, కల్పితమైన ఈ ప్రపంచంలో గల నియమబద్ధత గురించిన ప్రశ్న వచ్చింది. హిరణ్యగర్భ సంకల్పంవల్లే ఆ నియతి ఏర్పడ్డదని నేను చెప్పాను.

5. ఆ నియతి జడపదార్థాలకే కాక జీవులకు, వారి జనన మరణాలకు కూడా వుంటుందా? – అనే ప్రస్న వచ్చింది. వుంటుందన్నాను.

6. అక్కడ్నించీ మరణతత్త్వాన్ని గూర్చిన చర్చ వచ్చింది. మరణదుఃఖం అందరికీ ఒకటేనా? లేక వేరు వేరా? మరణం శరీరానికా? చైతన్యానికా? మరణసమయంలో శరీరంలో జరిగే ప్రక్రియ ఏమిటి? మరణానంతరం ప్రేత జీవులు ఎలా వ్యవహరిస్తారు? అనే విషయాలను చర్చించాము.

7. దానిమీదనుంచీ, జనన మరణచక్రం హిరణ్యగర్భుడికి వుంటుందా, వుండదా? అని నువ్వు ప్రశ్నించావు. వుండదని నేను నిరూపించాను.

8. పద్మలీలా! ఈ విధంగా మలుపులు తిరిగిన మన చర్చలో అసలు విషయం, జీవులు అనుభవించే రకరకాల లోకాల తత్త్వం ఏమిటి?– అనేదే.

9. మన చర్చను ఇక ఈ ప్రధానాంశంతో సమన్వయించుకుందాం.

పద్మలీలా! జీవుడు, ప్రపంచము, అనే పదాలు మనం ఉపయోగిస్తున్నాం. మన ఉద్దేశ్యంలో జీవుడంటే చేతన పదార్థం, ప్రపంచమంటే జడ చేతన పదార్థాల మిశ్రమం. ఈ భావం సత్యమేనా?– అని ఆలోచించాలి.

మనం జడమని పిలిచేది, మన బుద్ధిచేత చైతన్యం మీద ఆరోపింపబడినదే. మనం చేతనమని పిలిచేది అలాంటిదే! అంటే, రెండింటికీ అధిష్ఠానం చైతన్యమే. పైన ఆరోపింపబడిన నామరూపాలు మాత్రమే వేరు.

ఇలా ఈ రెండింటికీ మూల పదార్థం ఒకటే అయినా, ఆ రెండూ ఒక దాన్ని ఒకటి తెలుసుకోలేకుండా వున్నాయి. ఈ పరిస్థితి ఎలా వుందంటే,

**యథా శిలాంతస్సంస్థానాం బహిష్ఠానాం చ వేదనమ్।**

**అసజ్జడం చ భేకానాం మిథోంతస్తస్థుషాం తథా॥** (ఉ.ప్ర.స.55, శ్లో.63)

రాతిలో వున్న కప్ప బయటి కప్పను తెలుసుకోనట్టుగా వుంది.

**యథోత్తరాబ్ధి జనతా! దక్షిణాబ్ధి జనం స్థితమ్॥** (ఉ.ప్ర.స.55, శ్లో.61)

ఉత్తర సముద్రతీరాన వున్నవాడికి, దక్షిణ సముద్రతీరాన కూడా తనలాంటి మనుషులే వుంటారనే విషయంతెలీదు– అలా వుంది.

సృష్టి మొదట్లో సమష్టి ప్రత్యగాత్మ అయిన చిదాకాశం చేసిన సంకల్పాల ప్రకారం, ఆయా వస్తువులు జడాలుగా, ఆయా వస్తువులు చేతనాలుగా, అనుభవానికి వస్తున్నాయి. ఆ నాడు ఆ హిరణ్యగర్భుడు చేసిన నియమం ఇప్పటికీ చెక్కు చెదరకుండా అలాగే వుంది.

ప్రాణవాయువు కలదిగా కనిపిస్తే లోకులు దాన్ని సజీవ పదార్థం అంటున్నారు. అది కనిపించక పోతే జడపదార్థం అంటున్నారు. ఇంతకంటే, తేడా ఏముంది వాటికి?

పద్మలీలా! ప్రపంచంలో కనిపించే వస్తువుల్లో ఈ భేదం ఒక విలాసం. ఇది సత్యం లాగా కనిపించే అసత్యం. దీనిలో జరిగే ఘటనలన్నీ పూర్వవాసనల బట్టే జరుగుతాయి.

పద్మలీలా! ఇక ఈ విదూరథ జీవుడు పూలరాశిలో వున్న నీ భర్తగారి శవంయొక్క హృదయగోళంలో ప్రవేశించబోతున్నాడు. గమనించు.

## 58. వాసనామార్గం

**పద్మలీల:** దేవీ! ఈ విదూరథజీవుడు ఏ మార్గంలో వెడుతున్నాడు? మనం కూడా ఆయన్ని చూస్తూ, ఆ దారినే పోవాలి గదా!

**సరస్వతీ:** పద్మలీలా! జీవుడు ఏ లోకానికి పోయినా, వాసనామార్గంలోనే పోవాలి. వేరే దారే లేదు. ఇతనికి పద్మరాజు శరీరంమీద నేను అనే సంస్కారం వుంది. ఆ సంస్కారం అనే మార్గంలోనే ప్రయాణం చేస్తున్నాడు. మనమూ, అలాగే వెళదాం.

వారిద్దరూ ఇలా మాట్లాడుకుంటూ వుండగానే, విదూరథుడి చిత్తం మొద్దుబారిపోయింది. అతను మూర్ఛలో పడ్డాడు. గుడ్లు వెనక్కి తిరిగాయి. ఎగశ్వాస బయలుదేరింది. శరీరం బిగుసుకు పోయింది. కూలుతున్న చెట్టుమీద నుంచి పక్షి లేచి పోయినట్లుగా అతడి ప్రాణం లేచిపోయింది. ఆ జీవుడు ఆకాశంలో పరుగులు తీస్తున్నాడు.

పద్మలీలా సరస్వతులు తమ దివ్యదృష్టితో ఆ జీవుడి గమనాన్ని గమనిస్తున్నారు.

ఆ జీవుడి వెంటే, అతని చిత్తవృత్తి అనుసరించింది. ఆ రెండూ కలసి జీవసంవిత్తు అయినాయి. అంటే జీవచైతన్యమయినాయి. అది సూక్ష్మరూపంలో వుంది. అంటే ఆతివాహికరూపంలో వుంది. ఆ ఆతివాహిక జీవచైతన్యంలో పూర్వ సంస్కారాలున్నాయి. ఆ సంస్కారాలకు అనుసారంగా అది ఆకాశంలో ప్రయాణం చేస్తోంది.

ఇంతలోనే అతని మరణకాలపు తొట్రుపాటంతా సర్దుకుంది. అతనికి యమభటులు కనిపించారు. తన వారసులిచ్చిన తర్పణాలవల్లా, పిండప్రదానాలవల్ల, తనకు ఒక శరీరం ఏర్పడ్డట్టు అతనికి తోచింది. ఆ శరీరంతో అతను యమనగరానికి వెళ్ళాడు.

యమనగరం జీవులతో కిటకిటలాడుతోంది. యముడు ఇతన్ని చూస్తూనే "అతను పుణ్యాత్ముడు. సరస్వతీదేవి వరం చేత ఇతన పూర్వశరీరం పూలరాశిలో సురక్షితంగా వుంది. ఇతడు మళ్ళీ ఆ శరీరంలోకే పోతాడు. ఇతడ్ని విడిచి పెట్టండి" అన్నాడు.

వెంటనే యమభటులు అతన్ని వదలిపెట్టారు. మరుక్షణంలో అతను తుపాకి గుండు లాగా ఆకాశంలో పరిగెత్తాడు. (యంత్రోపల ఇవ చ్యుతః) (ఉ.ప్ర.స.56, శ్లో.25)

ఆ జీవుడికి పక్క నున్న లీలా సరస్వతులు కనిపించటం లేదు. వాళ్ళకు అతను కనిపిస్తున్నాడు.

వాళ్ళు ముగ్గురూ క్రమంగా, లోకాలన్నీ దాటి, బ్రహ్మాండాన్ని దాటి, మరో బ్రహ్మాండంలోకి ప్రవేశించారు. దానిలోని పద్మరాజు మందిరంలోనికి ప్రవేశించారు. ఆ ప్రవేశించడం ఎట్లా వుందంటే– సూర్య కిరణం పద్మంలోకి ప్రవేశించినట్లుగా వుంది. (సూర్యా భాసో యథాంభోజం) (ఉ.ప్ర.స.56, శ్లో.19)

ఇక్కడ శ్రీరాముడు ఒక ప్రశ్న వేశాడు.

**రాముడు:** గురుదేవా! ఈ విదూరథ జీవుడికి దారి చూపించిందెవరు? ఎవరూ చూపించక పోతే దారి ఎలా తెలిసింది?–

**వశిష్ఠుడు:** రామా!

ప్రయాణం వుంటే గదా, దారి చూపించేందుకు! జన్మల పరంపరలలో అనేక విచిత్రాలు జరుగుతూ వుంటాయి. ఒకప్పుడు ఒకానొక వాసనవల్ల, ఒక జన్మవచ్చి నడుస్తూ వుండగానే, అది పూర్తిగాక ముందే మధ్యలో మరో బలవత్తర ప్రారబ్ధంవల్ల మరో జన్మ వస్తుంది. ఈ మధ్యలో వచ్చిన జన్మను అనుభవించేశాక, వెనుక పూర్తి కాకుండా ఆగిపోయిన వాసన మళ్ళీ పొటమరిస్తుంది. ఆ వాసనచేత ఆ జన్మకు సంబంధించిన విషయాలన్నీ గుర్తుకు వస్తాయి.

ఇప్పుడు విదూరథుడి విషయంలో జరిగింది అదే! పద్ముడనే జన్మ నడుస్తూ వుండగా, ఆ కర్మ పూర్తి కాకుండానే, మధ్యలో విదూరథ జన్మ వచ్చింది. అందువల్ల ఈ జీవికి, పద్మరాజ శరీరం మీద అభిమానం పోలేదు. కానీ, ఈ విదూరథ శరీరంవల్ల అది తాత్కాలికంగా మరుగున పడింది. ఇప్పుడీ విదూరథ శరీరం తొలగిపోవడంవల్ల, పద్మరాజ శరీరం మీద వున్న అభిమానం మళ్ళీ మొలకెత్తింది. ఆ అహంభావ వాసనలోనే పద్ముడనే శరీరం వుంది. అందుచేతనే, ఆ వాసన మొలకెత్తగానే, ఆ జీవి ఆ శరీరం దగ్గరికి రాగలిగాడు.

ఆ శరీరము, ఈ శరీరము, ఈ రెండింటి తాలూకు వాసనలు ఇవన్నీ గూడ వాడి మనస్సులోనే వున్నాయి. ఇంక ఎక్కణ్ణించో రాలేదు.

నీకిదివరకే చెప్పాను. ఈ జగత్తంతా జీవుడి కడుపులోనే వుందీ అని, భ్రాంతివల్ల ఇది సాధ్యమవుతూ వుంది అని. ఇక్కడ నీకది స్పష్టంగా కనిపిస్తోంది. దీనికి ఒక ఉదాహరణ చెపుతా విను–

ఒకడు దాచుకోవటం కోసం ఎక్కడో అడవిలో ధనం పాతిపెట్టి వచ్చాడు. వచ్చి వూళ్ళో ఉన్నాడు. కాని వాడి మనస్సు ఎప్పుడూ ఆ చెట్టుకిందే వుంది. ఆ నేలలో మూట వీడికి ఎప్పుడూ కనిపిస్తూనే వుంటుంది. ఇది ఎలా సాధ్యమైంది? "అది నా ధనము" అనే సంస్కారంవల్లే సాధ్యమైంది. వాడి మనస్సు ఏ మార్గాన ప్రయాణం చేస్తోంది. 'ఇది నాది' అనే సంస్కార మార్గంలోనే ప్రయాణం చేస్తోంది. దీన్ని బట్టి ప్రపంచం మనోవాసనల మీద ఆధారపడి వుందని మనం తెలుసుకోవాలి.

ఇప్పుడు విదూరథ జీవుడు కూడా మనోవాసనా మార్గంలోనే, పద్మరాజ శవం దగ్గరకి చేరాడు. ఎన్ని జన్మలు గడచినా, ఎంత దూరంలో వున్నా, వాసనలో వున్న వస్తువు, ఆ జీవికి ప్రత్యక్షంగా కనిపిస్తూనే వుంటుంది. ఎప్పటి దాకా? అది ఇవ్వవలసిన ఫలం అంతా ఇచ్చేదాకా! అప్పటి దాకా ఆ వాసనపోదు. వాసన పోయే దాకా వస్తువు పోదు.

## 59. పిండప్రదాన ఫలం

**రాముడు:** గురుదేవా! బంధువులు ఇచ్చే పిండాలవల్ల మరణించిన జీవకి కొత్త శరీరం ఏర్పడుతుందన్నారు కదా! బంధువులు పిండాలు ఇవ్వలేదనుకోండి. అప్పుడా జీవి ఏమవుతాడు.

***వశిష్ఠుడు:*** రామా! బంధువులు ఇచ్చారా, ఇవ్వలేదా, అనేది ముఖ్యం కాదు. "వాళ్ళు నాకు పిండాలు ఇచ్చారు" అనే భావన ఈ మరణించిన జీవికి వుంటే చాలు. వాడికి దానికి తగ్గవాసనలు ఏర్పడతాయి. వాసనలను బట్టి కొత్త శరీరం ఏర్పడుతుంది.

పిండ ప్రదానాలవల్ల ఫలితాలు రెండు–

1. ఇచ్చినవాడికి పుణ్యం. 2. మరణించినవాడికి వాసన.

వీటిలో బంధువులు నిజంగా పిండాలిస్తే, మొదటిది కలుగుతుంది. రెండవది మరణించినవాడి భావనలను బట్టి పని చేస్తుంది.

జీవి బ్రతికి వున్నా, మరణించినా, ఫలితాల నిచ్చేది భావనే–

**యచ్చిత్తం తన్మయో జంతుః భవతీ త్యనుభూతయః।**

**సదేహేషు విదేహేషు న భవత్యన్యథా క్వచిత్॥** (ఉ.ప్ర.స. 56, శ్లో. 28)

జీవి మనోమయుడు. మనస్సునుబట్టే అనుభూతులు. స్థూలదేహం వున్నా, వూడినా, అది అంతే. అందుకే నాకు మా వాళ్ళు పిండాలు ఇచ్చారు అనే భావన వుంటే చాలు, శరీరం వచ్చేస్తుంది.

సామాన్యంగా భావన పదార్థాలనుబట్టి ఏర్పడుతూ వుంటుంది. కనుక, బంధువులు పిండాలు ఇస్తే, మరణించిన జీవికి, ఆ భావన తప్పకుండా కలుగుతుంది. కొందరికి ఇవ్వకపోయినా కలుగుతుంది.

***రాముడు:*** గురుదేవా! ఒకడు మరణించాడు. వాడు పాపాత్ముడు. అందువల్ల వాడికి, నా దగ్గర పుణ్యం లేదు అనే వాసనే వుంది. ఈ దశలో వాడి స్నేహితుడు వాడి కోసం ఒక పుణ్యం చేసి, వాడికి ధారాదత్తం చేశాడు.

ఇప్పుడు స్నేహితుడికేమో "నేను పుణ్యంచేసి పుణ్యం దానంగా ఇచ్చాను" అనే వాసన వుంది. మరణించిన వాడికేమో "నా దగ్గర పుణ్యం లేదు" అనే వాసన వుంది. ఈ రెండిటిలో ఏది ఫలిస్తుంది?

అనుభవించేవాడి వాసనే ముఖ్యం అనేటట్లయితే, ఆ స్నేహితుడు చేసిన పనికి ఏ ఫలితమూ లేదని అనాల్సి వస్తుంది. ఫలితం లేని పని వుంటుందా?

"అనుభవించటం,అనుభవించక పోవటం ముఖ్యం కాదయ్యా! వాసన వెనకాల వున్న పదార్థం సత్య పదార్థమైతే, ఆ వాసన ప్రబలం కనుక, ఇక్కడ స్నేహితుడి వాసనే ఫలిస్తుంది" అని మీరు అనేటట్లయితే, " ఫలితం పుట్టడానికి భావనే చాలు" అని మీరిందాక చెప్పిన మాటలకు విరోధం వస్తుంది.

కనుక ఇక్కడ సమన్వయం ఏమిటో చెప్పండి?

***వశిష్ఠుడు:*** రామా! ఆ స్నేహితుడు శాస్త్రంలో చెప్పిన ప్రకారంగా పుణ్యంచేసి, ధారాదత్తం చేసి వుంటే,అప్పుడు వాడి వాసనే ప్రబలం. దానికి కారణం శాస్త్ర ప్రమాణం. అంతే గాని వాసన వెనకాల వున్న వస్తువు కాదు.

'నా దగ్గర పుణ్యం లేదు' అనే మరణజీవి వాసన కేవలం వాడి ఊహవల్ల వచ్చింది. దానికేమీ శాస్త్రబలం లేదు. అందువల్ల అది దుర్బలం.

"స్నేహితుడు పుణ్యాన్ని ధారాదత్తం చేసినప్పుడు వాడు శాస్త్రం ప్రకారం చేశాడు. కనుక,ఆ శాస్త్రబలంవల్ల మరణించినవాడి మనసులో నాకు పుణ్యం వచ్చింది" అనే సంస్కారం పుడుతుంది. ఆ శాస్త్రబలమే వాడికి ఫలం కూడా ఇస్తుంది.

ఇలా కాకుండా వాసనకి వెనకాల వున్న పదార్థాన్ని బట్టే ఫలితం వస్తుంది అనేటట్లయితే, శాస్త్ర ప్రామాణ్యం లేని నాస్తికుడికి కూడా, సత్ఫలితం లభించాలి. "నేనేదో పరీక్ష చేయడం కోసం సత్కర్మ చేస్తున్నాను"

అనే నాస్తికుడికి ఫలితం రాదు. ఇది శాస్త్రసిద్ధం. ఇది అనుభవసిద్ధం కూడా. కనుక, వాసనల విషయంలో శాస్త్రబలమే బలం.

**రాముడు:** గురుదేవా! మీరు శాస్త్ర ప్రకారంగా చేసే పనివల్ల మాత్రమే వాసనలు పుడతాయంటున్నారు. శాస్త్రప్రకారం చేయటమంటే దేశకాలాలకు అనుగుణంగా చేయటం. కనుక, ఏ వాసన పుట్టాలన్నా, దాని వెనకాల దేశ కాలాలుండాలి. ఈ సృష్టి మొత్తం కలిపితే ఒక వాసన. ఇది పుట్టాలంటే దీనికి వెనకాలే దేశకాలాలుండాలి. సృష్టికి వెనకాల అద్వితీయమైన పరబ్రహ్మం వుంటుంది కానీ, దేశకాలాలుంటాయా? అవి లేకపోతే, ఇప్పుడు ఈ సృష్టే వుండరాదు కదా! ఈ చిక్కుని ఎలా విడదీస్తారు?

**వశిష్ఠుడు:** నేను చెప్పేదీ అదేనయ్యా! సృష్టికి వెనకాల దేశకాలాలు లేవు. అవి లేకుండా, ఈ సృష్టి పుట్టరాదు. కానీ, అది ఇప్పుడు కనిపిస్తోంది. ఒక వస్తువు పుట్టటానికి అనుకూలమైన దేశకాలాలు లేకుండా, ఆ వస్తువు జన్మిస్తే, అది మాయ వస్తువు, గారడీ వస్తువు, మిథ్య వస్తువు, అని లోకంలో అంతా పిలుస్తున్నారు. అందుకే వేదం ఈ సృష్టి అసత్యమని, మిథ్య అని నొక్కి చెపుతోంది. ఈ లీలోపాఖ్యానం ద్వారా నేను నీకు నిరూపించబోయే విషయం కూడా అదే! పై కథ విను.

పద్మలీలా సరస్వతులు పద్మపురం చేరారు. అక్కడ పూలలో వున్న పద్ముడి శవం చూశారు. ఆ శవానికి పక్కనే విదూరథలీల వింజామరలు వీస్తోంది. ఆమె అచ్చం పూర్వపు పద్మలీల లాగానే వుంది.

విదూరథలీల ముఖం కొంచెం వాడినట్టుగా వుంది. ఎడమ చేతికి చెంప ఆనించుకొని, భర్త శవం వంకే చూస్తూ మౌనంగా నిలబడి వుంది.

పద్మలీలా సరస్వతులు సత్యసంకల్పులు కనుక, వాళ్ళకి ఆమె బాగా కనిపిస్తోంది. ఆమె అలాంటిది కాదు కనుక, ఆమెకు వాళ్ళు కనిపించటం లేదు.

## 60. యోగులకు ఉండేది సూక్ష్మశరీరం మాత్రమే

**రాముడు:** గురుదేవా! ఇదే ఇంట్లో పూర్వం పద్మలీల ధ్యానం చేస్తూ కూర్చొని, సూక్ష్మశరీరంతో బయటికి వెళ్ళింది కదా! ఇప్పుడామె స్థూలశరీరం ఇక్కడ వుండి వుండాలి కదా! దాని మాట చెప్పరేమి?

**వశిష్ఠుడు:** ఒకడికి తాను లేడిపిల్లగా పుట్టినట్లు కల వచ్చిందనుకో, వాడు మెలకువ వచ్చిన తరువాత కూడా, తన లేడి శరీరం ఎక్కడ వుందని వెతుక్కుంటాడా? వెతుక్కోడు కదా! అలాగే, పద్మలీలకు ఇప్పుడు బ్రహ్మజ్ఞానం అబ్బింది. అందువల్ల ఆమెకు, ఈ జాగ్రత్ప్రపంచం అంతా స్వప్నంగా లాగా కనిపిస్తూ వుంటుంది. అంటే, ఇప్పుడు ఆమె ఏ ప్రపంచాన్ని చూస్తోందో, అది పూర్వం ఆమె దృష్టిలో సత్యప్రపంచంగా వుండేది. మరి ఇప్పుడో? ఇప్పుడు, రూపాలు కనిపిస్తున్నాయి, పేర్లు వినిపిస్తున్నాయి. కానీ అంతా బ్రహ్మమయమే. కనుక ఆమె దృష్టిలో ఆ పూర్వశరీరానికి అస్తిత్వమే లేదు.

**రాముడు:** గురుదేవా! అంటే యోగులకు సూక్ష్మదేహమే తప్ప భౌతికదేహం లేనే లేదని మీరు తేలుస్తున్నారు. కానీ, యోగులు జీవించి వుండి, స్థూలశరీరాలతో తిరుగుతూ వుండటం మనకు కనిపిస్తోంది కదా!

**వశిష్ఠుడు:** రామా! యోగులకు శరీరము, మరణము కూడా రెండు రకాలు–

1. తన ప్రారబ్ధం త్వరగా నశించటం కోసం యోగి అనేక దేహాలను ఒకే సారి ధరిస్తాడు. వాడు పాత దేహాన్ని వదిలి, యీ కొత్త దేహాలను ధరిస్తున్నాడు కనుక, ఇది ఒక రకం మరణమే. ఇలాంటివాడికి పూర్వపు స్థూలదేహం లేనే లేదు కదా! కొత్తగా వచ్చినవి కల్పిత దేహాలే కదా!

2. యోగికి ప్రారబ్ధం పూర్తిగా నశించిపోతే, విదేహ కైవల్యం వస్తుంది. ఇదీ ఒక మరణమే. దీంట్లో కూడా

పూర్వపు స్థూలదేహం మిగలదు.  ఇలాంటి రెండు రకాల మరణాల్లో, ఏదో ఒక మరణాన్ని పొందినవాడే అసలైన యోగి. వాడికి స్థూలదేహం వుండే అవకాశమే కనిపించడం లేదు.

వీళ్ళల్లో విదేహ కైవల్యం పొందినవాడి విషయంలో ఒక విశేషం వుంది. వాడికి విదేహ కైవల్యం కలగగానే పిడుగు పడ్డట్టుగా శరీరం ఎగిరిపోదు. ఎండవల్ల మంచుగడ్డ కరిగి పోయినట్టుగా, క్రమంగా క్షీణించిపోతుంది. అందుచేత అది కొద్ది కాలం నిలబడి వున్నట్టుగా, ఇతరులకు భ్రమ కలుగుతుంది.

నిజానికి, నిజమైన యోగిశరీరాన్ని సామాన్యజనులు చూస్తున్నారంటే, అది ఆ యోగి యొక్క సంకల్ప బలమే. వీళ్ళు నన్ను చూడాలి అని ఆయన సంకల్పించుకుంటే, వాళ్ళు చూస్తారు. ఆ దేహం స్థూలదేహం అవటంవల్ల వాళ్లు చూడటం లేదు. ఆ యోగి సంకల్పంవల్ల చూస్తున్నారు.

యోగికి అలాంటి సంకల్పం లేకపోతే అతని దేహం ఇతర యోగులకు కూడా కనిపించదు.

మరో విధానం కూడా వుంది. యోగియొక్క స్థూల శరీరం మంచుగడ్డ లాగా కరిగిపోయేలోపల, ఆ యోగి దృష్టిలో అది పూర్తిగా లేనిది. ఇక సామాన్యజనుల్లో పుణ్యాత్ములైనవారి పుణ్యవాసనలవల్ల, వాళ్ళకి ఆ యోగి సజీవంగా కనిపిస్తూ వుంటాడు. చూసేవారి పుణ్యం క్షీణిస్తే, ఆ యోగి మరణించినట్టు కనిపిస్తాడు.

ఇందుకు సరియైన ఉదాహరణ ఈ సభలో వున్న వ్యాసుడి పుత్రుడు శుకుడే. ఆ శుకుడు విదేహముక్తిని పొందిన తరువాత పరీక్షిత్తు పుణ్యంవల్ల, పరీక్షిత్తు సభలో మళ్ళీ కనిపించి, భాగవతం ఉపదేశించాడు.

కనుక, రామా! యోగులకు స్థూలదేహం లేకపోయినా, అది వున్నట్టు లోకులకు కనిపించడంలో దోషమేమీ లేదు.

***రాముడు:*** గురుదేవా! యోగులకు అంతకు ముందున్న స్థూలదేహమే ఆతివాహిక దేహంగా మారుతుందా? లేక కొత్తగా అది తయారౌతుందా?

ఎందుకడుగుతున్నానంటే, తత్త్వజ్ఞానంచేత పాత దేహం బాధిత మౌతుంది. అనగా కారణంతో సహా తొలగిపోతుంది.

పోనీ, కొత్తగా ఆతివాహిక దేహం పుట్టిందంటే, జ్ఞానం కలిగిన యోగికి, సూక్ష్మమే అగుగాక, మళ్ళీ మరో దేహం పుట్టిందంటే, అతని జ్ఞానం నాశనమైనట్టే.

అందువల్ల ఏ పక్షమూ కుదరక అడుగుతున్నాను.

***వశిష్ఠుడు:***

**బహుశో హ్యుక్తమేతత్తే న గృహ్ణాసి కిముత్తమ।**

**ఆతివాహిక ఏవాస్తి నాస్త్యేవేహాధి భౌతికః ॥** (ఉ.ప్ర.స.57, శ్లో.29)

రామా! ఎన్నిసార్లు చెప్పానయ్యా! అర్థం చేసుకోవేం? స్థూలశరీరం అనేది లేనే లేదు. వున్న సూక్ష్మశరీరమే అభ్యాసబలంచేత స్థూలమైపోతుంది. వివేకం కలిగి అది స్థూలమనే భ్రాంతి తొలగిపోతే, సూక్ష్మ శరీరమే మిగులుతుంది.

***రాముడు:*** సూక్ష్మమే స్థూలంగా మారుతుంటే, సూక్ష్మ శరీరంలో లేని బరువు, గట్టిదనం, వంటివి స్థూల శరీరంలోకి ఎలా వచ్చాయి? వచ్చినవి తత్త్వజ్ఞానంవల్ల ఎలా పోతున్నాయి?

***వశిష్ఠుడు:*** నీ సూక్ష్మ శరీరమే కదా, నీ కలలో బరువైన గట్టి శరీరంగా తయారౌతోంది. మెలకువ వచ్చేసరికి, ఆ శరీరంతో పాటు ఆ గట్టిదనమూ, ఆ బరువూ, అన్నీ పోతున్నాయి గదా! అలాగే ఇదీనూ.

అదీగాక, మామూలు అజ్ఞుల విషయంలోనే స్థూలదేహం శవమై కట్టెల్లో కాలిపోతే, వాళ్ళకి సహజంగా వున్న సూక్ష్మ దేహం బయటపడి, దానితో పరలోకాలకు ప్రయాణాలు చేస్తున్నారు. అలాంటప్పుడు ఏ వాసనలూ లేని తత్త్వజ్ఞానులకు స్థూలదేహం పూర్తిగాబాధితమైపోతే, ఇక సహజసిద్ధమైన సూక్ష్మశరీరం మిగలటంలో

అభ్యంతరం ఏమిటి? (ఇక్కడ సూక్ష్మశరీరం అంటే చిచ్ఛరీరము అని అర్థము)

జ్ఞానం పరిపక్వమైన యోగులకు జీవించి వుండగానే ఇలాంటి ఆతివాహిక దేహం లభిస్తుంది. (ఆతివాహిక దేహం–సూక్ష్మదేహం,చిద్దేహం)

ప్రతివాడికీ మెలకువలో వుండగా, నేను స్థూలస్వరూపుడ్ణి అనే భావం వుంది. అందువల్ల స్వప్నంలో వాడు, తనను స్థూలస్వరూపుడుగానే చూసుకొంటున్నాడు. అలా కాక, ఎవడికైనా ఒకడికి మెలకువ వుండగా, "నేను స్థూలస్వరూపుడ్ణి కాదు" అనే జ్ఞానం కలిగితే, అప్పుడు వాడికి స్వప్నంలో కూడా అదే స్మృతి కలిగి, ఆ కలలో వాడి శరీరం సూక్ష్మంగానే వుంటుంది. స్మృతికి అలాంటి శక్తి వుంది.

ఇలాంటి స్మృతి మామూలువాళ్ళకి స్వప్నంలో గూడా కలుగదు. ధ్యాననిష్ఠలో పట్టుచిక్కినవారికి మాత్రం, అది మెలకువలోనూ, కలలోనూ గూడా కలుగుతుంది.

***రాముడు:*** గురుదేవా! తత్త్వజ్ఞానం కలగంగానే వున్న దేహం పోతుందంటే, మరీ అనర్థం కాదా?

***వశిష్ఠుడు:*** రామా! ఎంతమాత్రమూ కాదు. ముత్యపుచిప్ప మీద కనిపించిన వెండి పోయిందని జ్ఞానం కలిగినవాడు ఏడుస్తాడా?

## 61. పద్మరాజ పునరుత్థానం

***రాముడు:*** గురుదేవా! పద్మలీలయొక్క పూర్వదేహాన్ని గూర్చిన సందేహాలన్నీ పూర్తిగా తొలగిపోయాయి. ఇక పై విషయాన్ని చెప్పండి. లీలలిద్దరూ పద్మరాజు గృహంలో కలిశారు గదా! అప్పుడు ఆ ఇంట్లో వుండే పరివారమంతా, పద్మలీలయొక్క సంకల్పబలంచేత ఆమెను గుర్తించినట్లయితే, ఆ లీల పాత లీల అని గుర్తుబట్టారా? అలాగే అనుకున్నారా? ఎవరో కొత్త దేవత అనుకొన్నారా?

***వశిష్ఠుడు:*** పాత లీలే అనుకొన్నారు. విదూరథ లీలను ఈమె స్నేహితురాలనుకొన్నారు. అంతకంటే వాళ్ళకు సందేహాలు ఏమీ కలగలేదు. వాళ్ళంతా అవివేకులు. వాళ్ళు కనిపించేదాన్ని కనిపిస్తున్నట్టుగా తీసేసుకుంటారు. లోతుగా విచారించడం వారికి చేత కాదు.

అవివేకులు మట్టిగడ్డల్లాంటి వాళ్ళు. మట్టిగడ్డను చెట్టుకేసి కొడితే, అది బాణం లాగా లోపలికి దూరదు. బురద లాగా అతుక్కోదు. రాయి లాగా చెట్టుకు గాయం చేయదు. పాపం, తనే పొడిపొడై క్రిందకు రాలిపోతుంది. అవివేకుల పరిస్థితీ ఇంతే.

ఈ ప్రపంచం సత్యమా, అసత్యామా – అని వాళ్ళు విచారించలేరు. అది సత్యమే అని వాళ్ళు అనుకొంటూ వుంటారు. ప్రపంచం సత్యం కాదనడానికి పూర్వమే, కొన్ని కారణాలు నీతో చెప్పాను. ఇప్పుడు మరికొన్ని చెబుతాను, విను–

ప్రపంచం సత్యమనుకుంటే, అది చిత్తు (జ్ఞానం) కావాలి. విషయం కావటానికి వీల్లేదు. కానీ, అనుభవంలో ప్రపంచం అంతా జ్ఞానానికి విషయం గానే వుంది. కనుక, ప్రపంచం సత్యం కావడానికి వీల్లేదు.

జ్ఞానం సత్తని (ఉనికిని) విడిచిపెట్టి వుండదు. ప్రపంచంలోని వస్తువులు అప్పుడప్పుడూ సత్తని వదిలి పెట్టి వుండటం మనం చూస్తున్నాం. కనుక అవి జ్ఞాన రూపాలు (చిద్రూపాలు) కావు. కనుక, సత్యాలు కావు. కనుక అసత్యాలు.

నిజంగా, వున్న పదార్థం ఏదీ జ్ఞానంవల్ల పోదు. ఈ ప్రపంచం తత్త్వజ్ఞానంవల్ల పోవటం యోగుల

అనుభవంలో కనిపిస్తోంది. అందువల్ల ఇది సత్యం కాదు.

రామా! ప్రసంగవశాన ఈ విషయాలు కొంచెం పెంచి చెప్పాను. ఇక అసలు కథలోకి పోదాం.

ఆ విధంగా పద్మలీలా సరస్వతులూ, విదూరథుడూ, పద్మరాజు గృహంలో చేరిన తరువాత, విదూరథజీవుడు పద్మరాజ శవంలోకి దూరబోయాడు. కానీ, సరస్వతీదేవి తన సంకల్పబలంతో అతన్ని ఆపింది. ఇంతలో పద్మలీల "ఈ ఇంట్లో నేను సమాధిలో కూర్చొని ఎంత కాలమైంది?" అని సరస్వతీదేవిని అడిగింది.

***సరస్వతీ దేవి:*** పద్మలీలా! నీ పాత శరీరం కథ చెబుతా విను. నీ భర్త శవం పక్కన నీవు కూర్చొని, సమాధిలో ప్రవేశించి, ఇప్పటికే నెలైంది. నీ రక్షణ కోసం ఏర్పాటైన నీ దాసీలిద్దరూ ఇప్పుడు నిద్రబోతున్నారు.

నువ్వు ప్రాణవాయువును బంధించి సమాధిలో ప్రవేశించి 15 రోజులయ్యాక, నీ ఒళ్ళు బాగా వేడెక్కి చెమటలు పట్టింది. క్రమంగా అది ప్రక్కకు వొరిగి పోయింది.

మంత్రులంతా వచ్చి చూసేసరికి, ఒళ్ళంతా చల్లబడిపోయి, ప్రాణం ఎగిరిపోయి వుంది. ఇక వాళ్ళంతా దుఃఖించి, మహారాజోచితంగా నీకు దహనం చేసి, అపరకర్మలు చేశారు. పద్మరాజు మళ్ళీ బ్రతుకుతాడని పూర్వం ఆకాశవాణి వినిపించడంవల్లా, అతని శవంలో జీవకళ తగ్గిపోకుండా వుండటంవల్ల, మంత్రులు ఆ శవాన్ని అలాగే రక్షించుకొంటూ వస్తున్నారు. అతనికి అపర కర్మలు కూడా చేయలేదు.

ఇప్పుడు నువ్వు మళ్ళీ అదే శరీరంతో ఇక్కడకు రావడం చూసి, నువ్వు స్వర్గలోకంనుంచీ వచ్చావని మీ వాళ్ళంతా అనుకొంటున్నారు.

నువ్వు మాత్రం ఇతరులెవరికీ కనిపించని, స్వచ్ఛమైన, ఆతివాహిక దేహంతో వున్నావు. అయినా నీ సంకల్పబలం వల్ల వాళ్ళకలా కనిపిస్తున్నావు. అదే చిత్రం.

నీకు సత్యసంకల్పసిద్ధి లభించింది. అందువల్లే నీకు ఏ రూపం కావాలంటే ఆ రూపం వస్తోంది. నువ్వు నీ వెనుకటి శరీరం వంటి రూపం కావాలని సంకల్పించావు. నీకు ఆ రూపమే వచ్చింది.

నీకు తత్త్వజ్ఞానం వచ్చింది. అందువల్ల ఆతివాహిక దేహం వచ్చింది కానీ, పూర్తిగా వాసనాక్షయం కాలేదు. పూర్వదేహ వాసన కొంచెంగా వుంది. అందువల్ల, ఆ రూపం నీకు వచ్చింది.

ఆతివాహిక భావం బాగా గట్టిపడితే, ఆ జ్ఞానికి ఆధిభౌతికభావం వుండదు. అతనికి ఆధిభౌతికశరీరం వున్నట్టు ఎదుటి వారికి కనిపించినా, ఇతని దృష్టిలో వుండదు.

నువ్వు సమాధిలోకి వెళ్ళి ఈ రోజు 31వ రోజు. ఇప్పుడు మనం చిదాకాశంలో వున్నాం. నీ దాసీలిద్దరికీ ఈ పొద్దుటి పూట నేనే నిద్ర కలిగించాను.

పద్మలీలా! ఇక మన మిద్దరం ఈ విదూరథలీలకు దర్శన మిద్దాం. ఆ విధంగా సంకల్పించు.

సరస్వతీదేవి ఇలా చెప్పగానే, పద్మలీలా సరస్వతు లిద్దరూ ఆ విధంగా సంకల్పించారు. వెంటనే వాళ్ళు ప్రత్యక్షంగా విదూరథ లీలకు కనిపించారు. వారి కాంతికి విదూరథలీల ఉలిక్కిపడి, వాళ్ళిద్దరి పాదాలమీదా పడి నమస్కరించి, సవినయంగా స్వాగతవాక్యాలు పలికింది. దేవతలిద్దరూ సింహాసనాలమీద కూర్చొన్నారు.

***సరస్వతీదేవి:*** విదూరథలీలా! నువ్వు మాకంటే ముందు ఇక్కడికి ఎలా వచ్చావు? నీకు దారిలో ఏమేమి వింతలు కనిపించాయి?

***విదూరథలీల:*** తల్లీ! మా ఇంట్లో నేను మూర్ఛబోయాను. కొద్దిసేపటికే మరణించాను. వెంటనే ఆకాశానికి ఎగిరిపోయాను. అక్కణ్ణించి వాయుమార్గంలో ఈ ఇంటికి చేరాను. ఇక్కడకు వచ్చేసరికి, నా భర్త విదూరథుడు పూలలో నిద్దుర పోతున్నాడు. యుద్ధశ్రమవల్ల ఆయనకు మంచి నిద్దుర పట్టిందని గ్రహించి, ఆయనను లేపకుండా వింజామరలు వీస్తూ నిల్చున్నాను. ఇంతలో మీరిద్దరూ వచ్చారు.

అప్పుడు సరస్వతీదేవి తన సంకల్పబలంచేత అడ్డగించివున్న విదూరథజీవుడ్ణి విడిచిపెట్టింది. ఆ జీవుడు వెంటనే తన పూర్వవాసనలతో సహా ఆ శవంలోకి ప్రవేశించాడు.

అప్పుడు సరస్వతీదేవి, " ఈ రాజును లేవదీద్దాం రండి" – అంటూ, ఇద్దరు లీలలతో కలసి, శవం దగ్గరికి వెళ్ళింది.

ఆ శరీరంలో అప్పటికే జీవుడు ప్రవేశించటంవల్ల, క్రమంగా అవయవాలన్నీ కాంతివంతంగా అయినాయి. శరీరంలో రసాలు పెరిగాయి. మొహం చంద్రుడి లాగా వెలిగింది. పెరుగుతున్న వింధ్య పర్వతం లాగా అతడు లేచి కూర్చున్నాడు. లేస్తూనే 'ఎవరక్కడ?' అని గట్టిగా పిలిచాడు.

లీలలిద్దరూ, 'ఆజ్ఞాపించండి ప్రభూ!' అంటూ వినయంగా వంగి నిలబడి వున్నారు. అక్కడ ఒకే రకంగా వున్న ఇద్దరు లీలల్ని చూసి రాజు గందరగోళపడి, "నువ్వెవరు, ఈమెవరు? ఎక్కడ్నుంచి వచ్చారు?" అని అయోమయంగా అడిగాడు.

ఎవరిని అడిగాడో స్పష్టంగా తెలియక పోయినా, పద్మలీల మాట అందుకొని ఇలా చెప్పింది– "దేవా! నేను మీ మొదటి భార్యను. ఈ రెండవ లీలను మీకోసం నా ప్రతిబింబంగా సంపాదించాను. ఈ సింహాసనంలో కూర్చున్న దేవి జగజ్జనని సరస్వతీదేవి. ఈ తల్లి దయవల్లనే మేమిద్దరం మరో బ్రహ్మాండం నుంచీ ఇక్కడకు రాగలిగాం."

అది విని రాజు వెంటనే సరస్వతీదేవి పాదాలమీద పడి, స్తుతించి, "దేవీ! నాకు పరమార్థాన్ని గ్రహించగల మేధాశక్తిని అనుగ్రహించు, దీర్ఘాయుష్యమూ, ఐశ్వర్యమూ ప్రసాదించు.

**సరస్వతి నమస్తుభ్యం దేవి సర్వహిత ప్రదే ।**

**ప్రయచ్ఛ వరదే మేధాం దీర్ఘమాయుర్ధనాని చ ॥** – అని ప్రార్థించాడు. (ఉ.ప్ర.స.58, శ్లో.51)

అప్పుడు సరస్వతీదేవి – అతని శిరస్సును స్పృశించి వరాలిచ్చింది–

**"సర్వాపదస్సకల దుష్కృత దృష్టయశ్చ**

**గచ్ఛంతు వశ్యమ మనంత సుఖాని సమ్యక్ ।**

**ఆయాన్తు నిత్యముదితా జనతా భవంతు**

**రాష్ట్రే స్థిరాశ్చ విలసంతు సదైవ లక్ష్మ్యః ॥** (ఉ.ప్ర.స.58, శ్లో.53)

పుత్రా! మీకు ఆపదలన్నీ తొలగుగాక! పాప బుద్ధులు నశించుగాక! అనంత సుఖాలు కలుగుగాక! మీ ప్రజలు సుఖింతురు గాక! మీ రాజ్యంలో లక్ష్మిస్థిరంగా వుండుగాక! "– అని సరస్వతీదేవి ఆశీర్వదించి, అక్కడికక్కడే అంతర్థానమైంది.

ఇంతలో పూర్తిగా తెల్లవారింది. జనమంతా మేల్కొన్నారు. అంతః పుర స్త్రీలంతా పద్మలీల పరలోకం వెళ్ళి తిరిగి వచ్చిందని,చచ్చి మళ్ళీ పుట్టిందని, భావించి, ఆనందంతో కౌగలించుకున్నారు. పద్మలీల యోగశక్తులు కలదని, ఆమె తన యోగ శక్తితో భర్తను బతికించుకొని, తన భర్తకు రెండవ భార్యగా మరో లీలను గూడా స్వర్గంనుంచే తెచ్చిందని, పుర జనులు రకరకాలుగా, కథలు కథలుగా, చెప్పుకోసాగారు.

మళ్ళీ పుట్టిన పద్మరాజుకి అంతా అయోమయంగా వుంది. కానీ, పక్కనున్నవారి వల్ల విషయాలు అర్థం చేసుకొని, తాను చచ్చి బ్రతికినందుకు సంతోషించి, పాపపరిహారార్థం స్నానాలు చేశాడు. మంత్రులూ, సామంతులూ, పౌరులూ ఎక్కడెక్కడి వారో బిలబిలా పోగు పడ్డారు.రాజూ, రాణీల మహత్తును అదృష్టాన్ని చూసి ఆనందపడిపోయి, చచ్చి బ్రతికిన మహారాజుకి మళ్ళీ మహా పట్టాభిషేకం చేశారు.

క్రమంగా ఇద్దరు లీలల సాంగత్యంలో మహారాజు జీవన్ముక్తుడయ్యాడు. ఆ ముగ్గురు జీవన్ముక్తులు, ఏకాంతంలో ఆత్మతత్త్వ చర్చలు చేసుకొంటూ శేష జీవితమంతా గడిపారు. బహిరంగ జీవితంలో ఆ రాజు

80 వేల సంవత్సరాలు లోకోత్తరంగా రాజ్యపాలన చేశాడు. చివరికి వారు ముగ్గురూ కైవల్యం పొందారు.

**యదుదయవిశదం విదగ్ధ ముగ్ధం**
**సముచిత మాత్మహితం చ పేశలం చ।**
**తదఖిల జన తోషదం స్వరాజ్యం**
**చిర మనుపాల్య సుదంపతీ విముక్తౌ ॥** (ఉ.ప్ర.స.59, శ్లో.18)

## 62. లీలోపాఖ్యాన కథా విశ్లేషణ

లీలోపాఖ్యానం పూర్తి అయింది. ఇది ఎందుకు చెప్పబోతున్నాడో, దాన్ని గూర్చి వశిష్ఠమహర్షి ముందే కొంత వివరణ చేశాడు. కథ అయిపోయిన తరువాత, "ఈ కథ ఉద్దేశ్యం ఇది" అంటూ మళ్ళీ కొంత వివరణ చేశాడు. అయినా, కథలోని పాత్రల గురించీ, సన్నివేశాల గురించీ, విశ్లేషణ చేసి సమన్వయాలు చేసుకునే పనిని శ్రీరాముడికే వదిలిపెట్టాడు. వాల్మీకి మహర్షి కూడా ఆ పనిని పాఠకులకే వదిలి పెట్టాడు. ఏమీ వివరణ ఇవ్వలేదు. అందువల్ల, మనం సంగ్రహంగా ఆ పని చేసుకుందాం.

(1) ఈ కథలో పాత్రల తీరు ఎలా వుందో మొదట గమనిద్దాం.

1(క). ఈ కథ ఇద్దరు పాత్రలతో ప్రారంభమైంది. వారే, లీలా, పద్ముడు. కథ మొదట్లో, వీరిద్దరూ స్థూలదేహాలు వున్నవారే.

1(ఖ) కథ చివరికి వారు ముగ్గురయ్యారు. పద్ముడు, పద్మలీల, విదూరథలీల.

1(గ) వీరిలో పద్ముడిది స్థూలదేహం. విదూరథలీలది జీవన్ముక్త దేహం. ఇది వాసనామయం. పద్మలీలది చిద్దేహం.

1(ఘ). అంతఃపురజనం దృష్టిలో పద్మలీల స్వర్గానికి వెళ్ళి మళ్ళీ తిరిగివచ్చింది. వచ్చేటప్పుడు తన లాగే వున్న మరో అమ్మాయిని తెచ్చి, తన భర్తకే భార్యగా బహూకరించింది. ఈ లీలలిద్దరూ ఒకరికొకరు మంచి స్నేహితులు.

1(ఙ). పద్ముడి దృష్టిలో విదూరథలీల తనకు భోగపత్ని. పద్మలీల తనకు పాత భార్య. కానీ, ఇప్పుడు యోగిని.

1(చ). విదూరథలీల దృష్టిలో ఇదంతా మిథ్యే కానీ, ఆమెకు కొద్దిగా సంస్కార శేషం వుంది. అందువల్ల భర్తకు అనుకూలంగా వుండాలనే కోరిక వుంది. పద్మలోకంలోకి వచ్చాక, ఆమెకు వేరే సొంత కోరికలంటూ లేవు. ఇదీ ఆ పాత్రల పరిస్థితి.

(2) మరో దృష్టితో కూడా పై పాత్రలను పరిశీలించాలి.

2(క). విదూరథలీల దృష్టిలో తనకు స్థూలశరీరం వుంది. పద్ముడూ, ప్రజలూ కూడా, ఆ దృష్టితోనే చూస్తున్నారు.

2(ఖ) పద్ముడి దృష్టిలోనూ, ప్రజల దృష్టిలోనూ, పద్మలీలకు కూడా స్థూలశరీరం వుంది. కానీ, వారి దృష్టిలో ఆమె యోగిని కనుక, ఆమె స్థాయి వేరు. యోగిని కనుకనే, మరో భార్యను తెచ్చి తన భర్తకు ఒప్ప చెప్పింది.

2(గ) పద్మలీల దృష్టిలో తనకే కాదు, ఎవ్వరికీ శరీరం లేదు. అసలు ప్రపంచమే లేదు.

2(ఘ). విదూరథలీల దృష్టిలో కూడా పద్మలీలకు శరీరం లేనే లేదు. తనకు అభాసరూపమైన శరీరం వుంది. ఈ ప్రపంచమే అభాసరూపం. ఇదీ ఆమె దృష్టి.

(3). ఈ పాత్రల సన్నివేశాన్ని మనస్సులో పెట్టుకొని, ఇక కథను మనం విశ్లేషించాలి.

3(క) ఒక జన్మ తరువాత మరో జన్మ వస్తుందని సామాన్యంగా అందరూ నమ్ముతారు. దీనిలో "తరువాత" అనే మాటకు అర్థం ఏమిటి? ఎవరూ ఆలోచించరు. ఆ మాటకు అర్థమే వేరంటున్నాడు వశిష్ఠమహర్షి.

3(ఖ)  అందుకే, పద్మలీల ఇక్కడ బతికుండగానే, అక్కడ, విదూరథలీల జన్మించింది.

3(గ) ఈ విదూరథలీల, పద్మలీలకు పై జన్మకాదు. పద్మలీలకు మరో దేహమూ కాదు. పద్మలీలలో భాగమూ కాదు. ఈమె మరణించిన పద్ముడి సంస్కారంవల్ల జన్మించిన జీవి.

3(ఘ) లోకంలో ఒక శరీరం పోయి ఇంకొక శరీరం వస్తే, దాన్ని పునర్జన్మ అని పిలుస్తున్నారు. విధూరథలీల తను అదే దేహంతో తన భర్త లోకానికి తాను వెళ్ళాలని వరం కోరుకుంది. కానీ, అలా జరగలేదు.సరస్వతీ దేవి వరమిచ్చినా జరగలేదు.

3(జ) ఆమె పాత శరీరం అక్కడే రాలిపోయింది.ఆమె పద్మ రాజ లోకానికి వచ్చింది. ఆమెకు స్థూలదేహం లేదు. అయినా సరే, తనకు పాత స్థూల దేహమే వుందని ఆమె గట్టిగా నమ్ముతోంది. అది సరస్వతీ వర ప్రభావం.

3(చ) ఆమె ఆ విధంగా నమ్మటంవల్ల, ఆమెకు తన స్థూల దేహం నిజంగానే కనిపిస్తోంది. ఆమెకే కాదు, పక్కవారికి కూడా కనిపిస్తోంది.

(4)  వశిష్ఠమహర్షి ఈ విదూరథ లీల అనే పాత్రను చివరి దాకా ఎందుకు అట్టిపెట్టినట్టు? ఒకరికి ఇద్దరు భార్యలను ఎందుకు తయారు చేసినట్టు? ఎందుకంటే, దేశము, కాలము, దేహము, అనేవి లేనే లేవు అని ఆయన చెప్పాలను కున్నాడు. దానికోసం ఈ కథలో మూడు కల్పనలు చేశాడు.

4(క) వశిష్ఠుడి పాకలోనే పద్ముడి రాజ్యం. పద్ముడి పడక గదిలోనే విదూరథుడి యుద్ధరంగం. ఇది ఒక కల్పన.ఈ కల్పనవల్ల చోటు అనే పదార్థం లేనే లేదని నిరూపిస్తున్నాడు.

4(ఖ) వశిష్ఠ బ్రాహ్మణుడు మరణించి 8 రోజులయింది. అదే కాలం పద్ముడి లెక్కలో 60 సంవత్సరాల 30 రోజులు. అదే కాలం విదూరథుడి లెక్కలో 60 సంవత్సరాలు. మామూలుగా జన్మ తరువాత జన్మ జరిగితే అది 120 సంవత్సరాల 38 రోజులు కావాలి. కానీ ఇదంతా ఒక్క క్షణమే అని కథలో చెప్పటం జరిగింది.ఇది రెండవ కల్పన. దీని ద్వారా కాలం అనేది లేదని మహర్షి నిరూపిస్తున్నాడు.

4(గ) ఇక దేహమనేది లేదని నిరూపించాలి. దానికోసమే ఇద్దరు లీలల కల్పన. ఇది మూడో కల్పన. తార్కికంగా చూస్తే విదూరథలీలకు పద్మలోకంలో దేహం లేదు. కానీ, ఆమె మాత్రమే కాకుండా, ఊరివారంతా కూడా ఆమెకు దేహంవుందని అనుకుంటున్నారు, అంటున్నారు. నిజమైన దేహమే లేని ఈ భార్యతో పద్మరాజు కాపురమే చేస్తున్నాడు. –అని మహర్షి కథాకల్పన చేశాడు.ఈ ఘట్టం ద్వారా దేహం వుండటమంటే, ఉందనుకోవటమే –అని మహర్షి నిరూపిస్తున్నాడు.

(5)  పద్మలోకంలో పద్ముడి శరీరాన్ని చెడిపోకుండా అట్టిపెట్టి, లీల శరీరానికి దహనం చేయించేశాడు మహర్షి. దీని ద్వారా ఆయన ఏమి సాధించాడు?

5(క) పద్మలీలయొక్క సంకల్పబలంవల్ల, పద్మరాజు శరీరం చెడిపోకుండా నిలబడింది. ఆమె – సంకల్పబలమే సరస్వతీ వరంగా వ్యక్తమైంది.

5(ఖ) ఇంతటి గట్టి సంకల్పం చేసిన లీలకు, తన శరీరం తగలబడి పోయినట్టే తెలీదు."నా శరీరం ఏమై పోయిందీ?" అని సరస్వతీ దేవిని అడిగితే అప్పుడావిడ చెప్పింది.

5(గ) ఈ రెండు సంఘటనలవల్ల శరీరం నిలబడటానికి కారణం సంకల్పమే అనీ, శరీరం మీద దృష్టి లేకపోతే, అది వున్నా,పోయినా,ఒకటే అనీ, మహర్షి నిరూపిస్తున్నాడు.

(6) పద్మలీలను కథ చివరిదాకా అట్టిపెట్టడంలో మహర్షికి కొన్ని ప్రయోజనాలున్నాయి.

6(క). ఒక చిద్రూప యోగి, ఒక వాసనా శేషం గల జీవన్ముక్తుడు, ఒక సాధకుడు– ముగ్గురూ కలసి

సహజీవనం చేయటాన్ని చూపిస్తున్నాడు. ఇది ఒక ప్రయోజనం.

6(ఖ) సత్యకామ సత్య సంకల్పాది సిద్ధులను సాధించిన జ్ఞాని పద్మలీల. ఆ స్థితిలో కూడా కొంత వాసనాశేషం మిగిలి వుండే అవకాశం వుంది. పద్మలీలకు వాసనాశేషం వుండబట్టే, వచ్చి పద్మరాజ గృహంలో వుంటోంది. ఇది నిరూపించటం మరో ప్రయోజనం.

6(గ) అలాంటి వాసనాశేషం వున్నా, ఆ యోగులకు ఏమీ ప్రతిబంధకం లేదు. వారు నిత్యముక్త స్థితిలోనే వుంటారు. పద్మలీల ద్వారా ఇది నిరూపించటం మరో ప్రయోజనం.

(7) ఈ కథ ద్వారా సాధకుడి క్రమవికాసాన్ని చూపించ దలచుకొన్నాడు వశిష్ఠమహర్షి. దాన్ని ఆయన ఎలా నిర్వహించాడంటే –

7(క) వశిష్ఠబ్రాహ్మణుడు ఉత్తమ బ్రాహ్మణుడిగా వుండి కూడా, ఐశ్వర్య మోహంవల్ల రాజజన్మ పొందాడు.

7(ఖ) వశిష్ఠ బ్రాహ్మణపత్ని మాత్రం పాతివ్రత్య ప్రభావంవల్ల మరుజన్మలో ఐశ్వర్యాన్నీ, జ్ఞానాన్నీ కూడా పొందింది.

7(గ) పద్ముడు ఆ పై జన్మలో వెనుకటి బ్రాహ్మణ సంస్కారం కలిసి వచ్చి, మోక్ష కాంక్షతో సరస్వతీ ఉపాసన చేశాడు.

7(ఘ) ఆ ఉపాసనవల్ల, మళ్ళీ పద్ముడిగా పునర్జన్మ ఎత్తినప్పుడు, అతనికి సత్సాంగత్యం లభించింది. క్రమంగా జీవన్ముక్తుడయ్యాడు.

7(ఙ) ఈ విధంగా సాధకుడి క్రమవికాసాన్ని ప్రతిపాదించాడు మహర్షి.

7(చ) ఈ కథలో కీలక పాత్రగా సరస్వతీదేవిని ప్రవేశ పెట్టాడు కవి. చాలా చోట్ల ఆమెను 'జ్ఞప్తిదేవి' అని వ్యవహరించాడు. అంటే జ్ఞానదేవి అని అర్థం. ఎక్కడికక్కడ జీవులలో ఉద్బుద్ధమయ్యే జ్ఞానమే వారికి పైపై వికాసాలను అందిస్తుంది–అని నిరూపించటానికే కవి జ్ఞప్తిదేవతను ప్రవేశపెట్టాడు.

ఈ విధంగా కథను గూర్చి, కథాపాత్రలను గురించి, మనం విశ్లేషణ చేసుకున్నాం. ఇక ఈ కథ గురించి వశిష్ఠమహర్షి ఏమంటున్నాడో గమనిద్దాం.

## 63. వశిష్ఠుడు చేసిన కథా విశ్లేషణ

***వశిష్ఠుడు:*** రామా! ఈ లీలోపాఖ్యానం ఎందుకు చెప్పానో స్పష్టంగా తెలిసే వుంటుంది. ఈ కథ మొదలుపెట్టే ముందర నీకా విషయాలు చెప్పాను.

**దృశ్యం నాస్తీతి బోధేన మనసో దృశ్యమార్జనమ్**

**సంపన్నం చేత్తదాప్రాప్తా పరా నిర్వాణ నిర్వృతిః॥**(ఉ.ప్ర.స.60, శ్లో.1– వ్యాఖ్యానంలో)

అని నీకక్కడ చెప్పాను. అంటే 'దృశ్యమనేది లేనే లేదు' అనే జ్ఞానం కలగాలి. ఆ జ్ఞానంవల్ల మనస్సు లోంచీ దృశ్యం తుడిచి పెట్టుకు పోవాలి. అది జరిగితే మోక్షం వచ్చినట్లే– అని చెప్పాను. ఆ విషయం నిరూపించడానికే ఈ కథ చెప్పాను.

పరమాత్మ వాన అనుకుంటే, ఈ ప్రపంచం వడగంటి రాయి. అంటే, వానలో పడే మంచురాయి. అది ఎండకి కరిగితే, మళ్ళీ నీరే అవుతుంది. అలాగే, జ్ఞానం అనే వేడి తగిలితే, ప్రపంచం మళ్లీ పరమాత్మగా

మారిపోతుంది. మొదట్లో ఆ పరమాత్మ ఈ ప్రపంచ కల్పనను వివర్తరూపంగా, తనమీద తనే చేసుకున్నాడు కనుక, మళ్ళీ తనే మిగిలిపోవటంలో ఇబ్బంది ఏమీ లేదు.

**రాముడు:** గురుదేవా! ఆ పని ఎలాగో జరిగి పోతుంది కదా! మధ్యలో నేను మోక్షం కోసం కృషి చేయడం దేనికి?

**వశిష్ఠుడు:** అలా కాదు, మన ప్రయత్నం కొంత అవసరం. దానికి ఒక కారణం వుంది. ప్రపంచం విషయంలో హిరణ్యగర్భచైతన్యమనేది ఒక మహానది. అందులో ఒక పాయ వ్యష్టిజీవచైతన్యము. ఈ పాయ ప్రధాన నదిని వదిలిపెట్టి వేరే దోవన బయలు దేరింది. ఈ దోవ పేరు ప్రవృత్తి మార్గం. ఈ దోవలో అది దేహాన్ని, ఇంద్రియాలను, ధరించి సుఖదుఃఖాలను పొందటానికి అలవాటు పడింది.ఇలాంటి ఈ జీవచైతన్యము అనే పాయ మళ్ళీ పెద్దనదిలో కలవాలంటే, తన దారిని చాలా తీవ్రంగా మార్చు కోవాలి. ఇంచుమించు వెనక్కి వెళ్ళాలి. అందువల్ల, ఈ పాయకు గట్టి ప్రయత్నం కావాలి. ఇది మంచు గడ్డ లాగా, ఏ ప్రయత్నమూ లేకుండానే, పూర్వరూపాన్ని పొందలేదు. కనుక, రామా! ప్రతిజీవీ మోక్షం కోసం ప్రయత్నం చేయక తప్పదు.

**రాముడు:** గురుదేవా! హిరణ్యగర్భుడు కావాలని ఆ నదికి ఎన్నో పాయలను ఏర్పాటు చేశాడు. ఆయన పనిగట్టుకొని అంత పని చేస్తే, సామాన్యజీవుడు ఆయనకు ఎదురుతిరిగి, ఆ పాయను వెనక్కి మళ్ళిస్తాననటం తప్పు కాదా? "తప్పయితే అయింది. నేను అలాగే చేస్తాను" అని ఎవడయినా పట్టుబట్టినా, హిరణ్యగర్భుడి ముందు వీడి ఆటలు సాగుతాయా? మహారాజు వేసిన ఆజ్ఞను బంట్రోతు మార్చేయగలడా?

**వశిష్ఠుడు:** రామా! ఒక చిన్న కిటుకు వుంది. ఈ ప్రపంచాన్ని సృష్టించింది హిరణ్యగర్భుడనేమాట నిజమే కానీ, ఆయనకిది ప్రపంచంగా కనిపించదు. ఎందుకంటే, ఆయనకు అజ్ఞానం లేదు. అజ్ఞానం వున్న ప్రపంచ జీవులకే ఇది ప్రపంచంగా కనిపిస్తుంది. ఈ చిన్న జీవుల పుణ్య పాపకర్మల ఫలితాలను అనుభవంలోకి తెచ్చేందుకోసమే, ఈ సృష్టి ఇలా జరిగింది. అందువల్ల, ఆ జీవులు ప్రయత్నం చేసుకొని జ్ఞానం సంపాయించాలి. అలా సంపాయిస్తేనే వాళ్ళకు ఈ ప్రపంచం నివర్తించి పోతుంది. కనుక, రామా! జీవులు చేసే ఈ ప్రయత్నం హిరణ్యగర్భుడియొక్క సంకల్పానికి వ్యతిరేకం కాదు.

## 64. కాలానికి మార్పిడి జంత్రీ వుందా?

**రాముడు:** గురుదేవా! మీరు నాకు గొప్ప జ్ఞానం కలిగించారు సంతోషంగా వుంది. కానీ, ఒక సందేహం వుంది. ఒక రకంగా మీరు దీనికి ఇదివరకే సమాధానం చెప్పారు కానీ, స్పష్టత కోసం మళ్ళీ అడుగుతున్నాను.

మీరు చెప్పిన కథలో, వశిష్ఠ బ్రాహ్మణుడు మరణించి నాక ఎనిమిది రోజులు. పద్మరాజు మరణించినాక 30 రోజులు. విదూరథరాజు జీవితంలో 60 సంవత్సరాలు– ఈ మూడూ సమానమని తేలింది.

మామూలుగా శాస్త్రాల్లో మానవలోకంలో ఒక నెల, పితృలోకంలో ఒక రోజనీ, మానవలోకంలోని సంవత్సరం, దేవ లోకంలో ఒక రోజనీ, ఇలాంటి లెక్కలున్నాయి. అంటే, ఒక లోకానికీ, ఒక లోకానికీ, కాలమానంలో మార్పిడి జంత్రి (కన్వర్షన్ టేబుల్) వేసి చూసుకోవచ్చు. ఈ లెక్క శాస్త్రసిద్ధమే.

మరి మీ వశిష్ఠలోకానికీ, పద్మలోకానికీ, విదూరథ లోకానికీ మధ్య కాలం విషయంలో ఇటువంటి మార్పిడి జంత్రి ఏదైనా వుందా? లేక ఏ నియమమూ లేకుండా, అడ్డదిడ్డంగా వుందా?

***వశిష్ఠుడు:*** రామా! వస్తువు ఎలాగుందో జ్ఞానం అలాగే కలుగుతుంది – అనే నియమం వుంటే, నువ్వు చెప్పిన జంత్రీ, లేకపోతే విరోధము, ఇవన్నీ ఏర్పడేవి. కానీ, యదార్థం అది కాదే! వస్తువును బట్టి జ్ఞానం ఏర్పడటం లేదు. ప్రతివాడూ తన జ్ఞానాన్ని బట్టి (ఆలోచనను బట్టి) వస్తువును కల్పించుకొంటున్నాడు.

**యేన యేన యథా యద్యత్ యదా సంవేద్యతేనఘ**

**తేన తేన తథా తత్తత్ తదా సమనుభూయతే॥** (ఉ.ప్ర.స.60, శ్లో.16)

ఎవడికి ఏ సమయంలో ఏది ఏలా తోస్తుందో, వాడికి ఆ సమయంలో అది అలా కనిపిస్తోంది. వాడు దాన్ని అలా అనుభవిస్తాడు.

అది అమృతమని గట్టిగా అనుకుంటే, విషమే అమృతమై పోతుంది. విషపు పురుగులు విషమే తిని బ్రతకటం లేదా?

శుద్ధ చైతన్యం వుందే,అది ఏ పదార్థ ఆకారాన్ని పొందాలంటే, ఆ ఆకారాన్ని పొందుతుంది.ఆ పొందటం ద్రష్ట యొక్క సంస్కారాన్ని అనుసరించి వుంటుంది. అంతే గానీ, దానికి సొంత రూపం అంటూ వుండదు.

కాలం విషయంలోనూ అంతే! ఒక జీవి తన సంస్కారాన్ని బట్టి, ఒకానొక చైతన్యంలో క్షణకాలాన్ని ఆరోపించు కుంటాడు. మరో జీవి అక్కడే, ఆ చైతన్యం మీదే, తన సంస్కారాన్ని బట్టి, ఒక సంవత్సర కాలాన్ని ఆరోపించు కుంటాడు. మరొకడు అక్కడే కల్పకాలాన్ని ఆరోపించు కుంటాడు. ఇది అసాధ్యం కాదు. రోజూ జరిగేదే!

అప్పుడు మొదటివాడి క్షణం రెండవ వాడికి సంవత్సరం అవుతుంది. మూడవవాడికి కల్పం అవుతుంది. దీన్నే వెనక్కి తిప్పితే, మూడవవాడి కల్పం మొదటివాడికి క్షణం.

ఒక లౌకిక ఉదాహరణ చెపుతా విను. ఒకే రాత్రి. భార్య ఊరు వెళ్ళిన కొత్త పెళ్ళికొడుకుకి అది సంవత్సరం. భార్య ఊళ్ళో వున్న కొత్త పెళ్ళికొడుకుకి అది ఒక నిమిషం. ఈ భేదం ఆ వ్యక్తుల మానసిక స్థితిని బట్టే వచ్చింది. అలాగే స్వప్నంలో కూడా ఇలాంటి చిత్రాలు జరుగుతూ వుంటాయి.

కనుక, రామా! ఆ ప్రపంచాలే అవిద్యా కల్పితాలు. వాటిలో వుండే కాలాలు కూడా కల్పితాలే అవుతాయి. అలాంటప్పుడు వాటి మధ్య జంత్రీ ఏమిటి? ఆ ప్రసక్తే లేదు.

***రాముడు:*** గురుదేవా! ప్రపంచం ద్రష్టయొక్క మనస్సును బట్టి, సంస్కారాన్ని బట్టి, కల్పింపబడుతోందని అంటున్నారు మీరు. మీ కథలో పద్ముడు అనే ద్రష్ట, తనకు విదూరథుడు అనే దేహం వచ్చినట్టు, దానికి ఒక పెద్ద వంశక్రమం వున్నట్టు, తన సంస్కారంవల్ల దర్శించాడు. అలాంటప్పుడు ఆ వంశవృక్షం ఆ విదూరథుడొక్కడికే కనిపించాలి కానీ, అతని మంత్రులకూ, పౌరులకూ కూడా, అదే రీతిగా కనిపించడ మేమిటి? ఎవరి సంస్కారాలు వారివి కనుక, ఆ వంశవృక్షం అందరికీ ఒకే రకంగా కనిపించటం ఎలా కుదురుతుంది?

***వశిష్ఠుడు:*** రామా! పెద్ద హోరుగాలి వస్తోందనుకో, ఒకడు దానికి ఎదురుగా నిలబడి వుఫ్ అని వూదాడనుకో. వీడు ఊదిన ఈ గాలి, గిర్రున వెనక్కి తిరిగి పెద్దగాలిలో కలిసిపోతుంది గానీ, విడిగా తన సొంత దోవన ప్రయాణం చెయ్యలేదు. అలాగే, ప్రధాన జీవుల జ్ఞానాన్ని బట్టే, ఇతర జీవుల జ్ఞానాలు నడుస్తూ వుంటాయి. సృష్టియొక్క సంకల్పమే ఇలా వుంది.

ఓ పెద్ద రాజు, వాడి మంత్రులూ, పౌరులూ, వీళ్ళందరికీ ఒకే రకపు కర్మశేషం వుంటేనే, వాళ్ళు ఒక చోట కలిసి పుడతారు. ఒకళ్ళను ఒకళ్ళు అనుసరించి వుంటారు. కొద్ది పాటి తేడాలతో ఒకే రకమైన ఆలోచన చేస్తారు.అందుచేత వారంతా ఇంచుమించు ఒకే రకమైన ప్రపంచాన్ని అనుభవిస్తూ వుంటారు. అందుకే

విదూరథ రాజ్యంలోని వంశవృక్షం అందరికీ అలాగే కనిపించింది.

**రాముడు:** వీళ్ళకు సంస్కారాలు వుంటే మాత్రం, అధిష్ఠానంగా వున్న ఆ చైతన్యం ఆయా రూపాలలో, కనిపించ వలసిన పనేమిటి?

**వశిష్ఠుడు:** రామా! ఏది సహజ విషయమో దాని గురించి ప్రశ్నించి ప్రయోజనం లేదు. అది చైతన్యం యొక్క స్వభావం. అది అలాగే ప్రవర్తిస్తుంది.

**రాముడు:** కనుక, జీవుడి సంస్కారంలో ప్రాపంచిక కామనలు వుంటే, ఆ చైతన్యం ప్రాపంచిక విషయాల ఆకారాన్ని పొందుతుంది. లోకంలో జీవులందరికీ, ఎన్నో జన్మలుగా, ప్రాపంచిక విషయాలే అభ్యాసంలో వుంటాయి, కనుక, ఆ సంస్కారాల బలం అంతులేకుండా వుంటుంది. ఇలాంటి స్థితిలో వాడికి 'మోక్షం కోసం కృషి చేయరా!' అని మీరు బోధిస్తారు. వాడు సరే అంటాడు. ఇది కొత్తగా పుట్టిన మోక్ష కామన అనే సంస్కారం. ఇది కొత్తది కనుక దుర్బలం. కనుక, ఎప్పటికప్పుడు పాత ప్రాపంచిక సంస్కారాలే గెలుస్తూ వుంటాయి. కనుక, ఎవడికీ, ఎప్పుడూ, మోక్షమనేది వచ్చే అవకాశమే లేదు– అనిపిస్తోంది.

**వశిష్ఠుడు:** అది తప్పు. పూర్వవాసనలకు ఒక రకమైన బలం వున్న మాట నిజమే కానీ, వాటికోసం ఇప్పుడు ఈ జీవుడు ప్రత్యేక ప్రయత్నమేమీ చేయడు. కొత్తదైన ఈ మోక్ష సంస్కారం కోసం మాత్రం పట్టుదలగా ప్రయత్నం చేస్తూ వుంటాడు. కనుక, క్రమంగా దీని బలం పెరిగి పోతుంది. కొన్నాళ్లకి పాత సంస్కారాలను జయించి తీరుతుంది.

దీనికి మరో కారణం కూడా వుంది. పాత సంస్కారాలకి ఆధారమైన వస్తువు అసత్యం. కొత్తదైన మోక్ష సంస్కారానికి ఆధారం సత్యమైన మోక్షం. అందువల్ల కూడా ఈ సంస్కారంయొక్క బలమే త్వరగా పెరిగి, పాత సంస్కారాలను ఓడిస్తుంది.

కనుక, ప్రయత్నం చేసే వాడికి మోక్షం తప్పకుండా సిద్ధిస్తుంది.

## 65. నియతి-పురుషప్రయత్నము - రెండూ కలిపితే ఈశ్వర సంకల్పం

**రాముడు:** కానీ, గురుదేవా!మోక్షం కోసం తీవ్ర ప్రయత్నం చేసేవారి విషయంలో, మీరు చెప్పింది నిజమే కావచ్చు. అంతంత మాత్రంగా కృషి చేసే మధ్యరకంవాళ్ళ మోక్ష ప్రయత్నాలన్నీ, ఎప్పటికప్పుడు సుడిగాలికి కొట్టుకు పోయినట్టు పోతూనే వుంటాయి కదా! ఇక వాళ్ళకు మోక్షం ఎలా వస్తుంది?

**వశిష్ఠుడు:** ప్రయత్నమంటూ ప్రారంభిస్తే, క్రమంగా ఆ సంస్కారం యొక్క బలం పెరుగుతుంది. ఒకనాటికి వేగం పుంజుకుంటుంది. కాని, వారు కూడా క్రమంగా కృషిని పెంచుకొనే ప్రయత్నం చేస్తూవుండాలి.

**రాముడు:** గురుదేవా! విషయం అర్థమైంది.

ఈ దేహం మీద 'నేను' అనే భ్రాంతి కలగటానికి యోగ్యమైన కారణం లేదు. అయినా కలుగుతోంది.

పరమాణుగర్భంలో విశాలమైన బ్రహ్మాండం వుండేందుకు యోగ్యమైన కారణం లేదు. అయినా మనస్సుయొక్క గర్భంలో ప్రపంచం కనిపిస్తోంది.

అలాగే క్షణకాలంయొక్క గర్భంలో వేల వేల సంవత్సరాలు కనిపిస్తున్నాయి.

వీటన్నిటికీ ఒకటే కారణం భ్రాంతి. భ్రాంతి. భ్రాంతి. మరి ఈ భ్రాంతికి కారణం ఏమిటి? క్రమం ఏమిటి?

**వశిష్ఠుడు:** రామా! ఒక్క మాటలో చెప్పాలంటే, భ్రాంతికి కారణం లేదు.

ప్రపంచంలో భ్రాంతులు చాలా వున్నాయి. వేటి గురించి ఆ భ్రాంతి కలుగుతుందో, అలాంటి పదార్థాలు కూడా చాలా వున్నాయి. కానీ, ఆ పదార్థాలను ఏ జ్ఞానం ద్వారా జీవుడు తెలుసుకొంటున్నాడో, ఆ జ్ఞానం మాత్రం ఒకే ఒకటి. దానిలో, ఏ రకమైన భేదమూ లేదు. ఇలాంటి భేదం లేని జ్ఞానమే, ఈ భ్రాంతులన్నింటికీ అధిష్ఠానంగా వున్న బ్రహ్మ. కాగా, ఆ బ్రహ్మ బంగారం లాంటిది. భ్రాంతివల్ల కనిపించే పదార్థాలు గాజు, గొలుసు, లాంటివి.

ఎప్పటికప్పుడు పాత సంస్కారమే కొత్త భ్రాంతికి కారణం. ఈ భ్రాంతి పరంపరకు ఆది లేదు. కనుక, కారణాన్వేషణకు అంతు దొరకటం సాధ్యం కాదు. కనుకనే, వాసనలకు నిలయమైన మనస్సు వున్నంతవరకూ ప్రపంచ పరంపర వుంటుంది. అభ్యాసబలంచేత మనస్సును తొలగించుకుంటే, ప్రపంచ పరంపర మొత్తం ఒక్క సారిగా తొలగిపోతుంది– అని నేను నీకు ఇది వరకే చెప్పాను.

ఇక భ్రాంతికి క్రమం ఏమిటి అని అడిగావు. ప్రపంచ వస్తువులు సత్యవస్తువులైతే, వాటికి క్రమం వుంటుంది. అవి అసత్యవస్తువులైతే,వాటికి క్రమంతో పనేమిటి? అద్దంలో ఎన్ని అడవులనైనా సమావేశ పరచవచ్చు. ఇదీ అంతే.

**అహంమయీ పద్మజభావనా చిత్**
**సంకల్పభేదా ద్వితనోతి విశ్వమ్**
**అంతర్ముఖైవాను భవత్యనంత**
**నిమేషకోట్యంశ విధౌ యుగాంతమ్॥** (ఉ.ప్ర.స.61, శ్లో.38)

రామా! మాయ గురించి ఏం చెప్పమంటావు? వ్యష్టి జీవులకు మాత్రమే కాదు, సమష్టి జీవి అయిన హిరణ్యగర్భుడికి కూడా అది దేశభేదాన్ని, కాలభేదాన్ని, అంటగడుతూవుంది.

అందువల్ల, భ్రాంతికి కారణం గానీ, క్రమం గానీ వుండవు.

**రాముడు:** గురుదేవా! అలాంటి మాయను అతిక్రమించి బ్రహ్మతత్త్వ జ్ఞానం సంపాదించిన మహాత్ములకు, దేహం ఇంకా నిలిచి వుంటుంది. పద్మలీలకు అలా నిలిచి వుంది కదా!

దైవనియతివల్ల ఆ శరీరాలు నిలిచి వున్నాయని చెపుదామంటే, వాళ్ళ దృష్టిలో దైవానికి కూడా అస్తిత్వం లేదు కదా!

పైగా ఆత్మతత్త్వవేత్తలను, దేవతలు ఏమీ చేయలేరని వేదమే చెపుతోంది కదా! వేదంలో –**"తస్య హ దేవాశ్చ న భూత్యా ఈశతే ఽ ఆత్మాహ్యేషాం భవతి"** అని వుంది గదా!

**వశిష్ఠుడు:** రామా! దైవం వేరు. దేవతలు వేరు. దేవతలు తత్త్వజ్ఞులను ఏమీ చేయలేరని వేదం చెప్పింది. అది నిజమే.

దైవం అంటే నియతి, ఇది హిరణ్యగర్భ సంకల్పం. దీనికి మార్పు వుండదు. ఇది తత్త్వజ్ఞులకు కూడా అన్వయిస్తుంది.

నియతికి సహాయం ప్రాణుల కర్మ. ఈ సహాయంతోనే అది పని చేస్తుంది. ఈ నియతి కర్మల వైచిత్రివల్లనే ఒకప్పుడు తత్త్వజ్ఞులకు కూడా దేహం నిలచి వుంటుంది.

సందర్భం వచ్చింది కనుక ఇంకొక మాట చెపుతాను. ఈశ్వర సంకల్పం రెండు రకాలు– నియతి, పురుష ప్రయత్నము అని.

మొదటి దైన ఈశ్వర సంకల్పం కేవలం రాబోయే కార్యరూపంగా ఉంటుంది. దానికి పురుషప్రయత్నం తోడైనప్పుడు, అది వర్తమాన కార్యరూపాన్ని పొందుతుంది. కనుకనే, సాధనదశలో వున్నవాడు పురుష ప్రయత్నం చేసి తీరాలి. లేకపోతే నియతి రూపమైన దైవం అనుకూలంగా వున్నా ఏమీ ప్రయోజనం లేదు.

జ్ఞానులు అకర్తృత్వ స్థితిలో వుంటారు. అందుచేత వారు తమకు శరీర స్థితిని కలిగించే కర్మను తొలగించుకునే పురుష ప్రయత్నం చెయ్యరు. అందువల్ల వారి కర్మ, నియతితో కలిసి, వారి దేహాన్ని నిలబెడుతుంది.

దీని తరువాత వశిష్ఠ మహర్షి బోక్తృ భోజ్య భోగరూపమైన ఈ ప్రపంచమంతా పరబ్రహ్మయొక్క విలాసమే అని అనుభూతి పరవశుడై వివరించాడు. ఈ సందర్భంలో వాల్మీకి మహర్షి ఎందుకో పద్యాన్ని వదిలిపెట్టి గద్యంలోకి వచ్చాడు. ఇది 63వ సర్గ. దీనిలో వచన వాక్యాలు 11 వున్నాయి. ఇవి చాలా పట్టుగా వున్నాయి. అంత ఆవేశంగా వివరిస్తే, రాముడు అంత శ్రద్ధగానూ విని ఒక ప్రశ్న వేశాడు.

## 66. జీవుడికి అస్తిత్వం ఎలా వచ్చింది?

***రాముడు:***

**స్వానుభూతి ప్రమాణేస్మిన్ బ్రహ్మణి బ్రహ్మ బృంహితే**
**కథం సత్తా మవాప్నోతి జీవకో ద్వైత వర్జితే ॥** (ఉ.ప్ర.స.64, శ్లో.3)

ఎవడికి వాడికి స్వానుభూతివల్ల మాత్రమే తెలిసే ఆ పరబ్రహ్మ అద్వితీయుడై ప్రకాశిస్తూ వుంటే, ఈ జీవుడనే వాడికి అస్తిత్వం ఎలా వచ్చింది?

***వశిష్ఠుడు:*** రామా! జీవుడికి నిజంగా అస్తిత్వం వుంటే, పరబ్రహ్మయొక్క అద్వితీయత్వం గాలికి పోయినట్టే. పరమార్థ స్థితిలో జీవుడనేవాడికి అస్తిత్వమే లేదు.

నిశ్చల పరిపూర్ణ సముద్రం వంటి బ్రహ్మకు, కర్మ సంబంధంవల్ల స్పందం కలగటమే జీవత్వం. ఈ స్పందమే అహంకారం. అంటే నేను అనే ఆలోచన. అహంకార మంటే ఏమిటో సులభంగా చెబుతా విను.

ఒకడు రాత్రిపూట ఆరు బయట మంచం వేసుకొని ఆకాశంలోకి చూస్తున్నాడు. వాడికి చుట్టుపక్కల దీపాలవల్ల కొంత దూరం ఆకాశం కనిపించింది. ఆ పైన నల్లగా కనిపించింది. ఈ నల్లదనం ఎక్కడి నుంచీ వచ్చింది? అది ఆకాశానిది కాదు. వీడి కంటికి వున్న శక్తి మేరకు, వీడు కొంత వరకు చూడగలిగాడు. ఆపైన వీడి కంటి శక్తి అయిపోయింది. కంటికి శక్తి లేకపోవటమే ఆకాశంలో నల్లదనంగా కనిపించింది. ఈ నల్లదనానికి అస్తిత్వం వుందంటావా? లేదంటావా? లేదందామా, అది కనిపిస్తోంది. వుందందామా, దానికి సరియైన ఆధారం లేదు.

ఇదే రకంగా, పరబ్రహ్మకు తన రూపం తనకు గోచరిస్తున్నంత సేపూ, అంతా బాగానే వుంటుంది. ఏదో ఒక కారణంచేత అది గోచరించటం ఆగిపోతే, అహంకారం ఉద్భవిస్తుంది. కొంత దూరం పోయిన తరువాత ఆకాశం కనిపించకపోతే, నాకేమీ కనిపించటం లేదనాలి. కానీ, నల్లగా వుందంటుందేమిటి ఈ మనస్సు? అదే సంస్కారబలం. అదే రీతిగా, ఆత్మ తన స్వరూపాన్ని తెలుసుకో లేనప్పుడు, నాకేమీ తెలియటం లేదు అనక, “నేను” అంటుంది. ఇదే అహంకారం. దీనికి కూడా సంస్కారబలమే కారణం.

అహంకారమన్నా, అహం అనే అధ్యాస అన్నా, అహం భ్రాంతి అన్నా, ఒకటే. ఈ అహంకారం ఒక అధ్యాస కదా!దీనిమీద మరో అధ్యాస కలిగి, అంతఃకరణం ఏర్పడుతుంది. దానిమీద మళ్ళీ అధ్యాసలు జరిగి, పంచభూతాలు ఏర్పడుతున్నాయి. అంతఃకరణం మీదే, మరో రకం అధ్యాసవల్ల హిరణ్యగర్భుడు, విరాట్ పురుషుడూ, ఏర్పడుతున్నారు. ఆ అంతఃకరణం మీదే మరో రకం అధ్యాసవల్ల వ్యష్టిజీవి ఏర్పడుతున్నాడు. ప్రపంచమూ ఏర్పడుతోంది.

జీవుడు పరబ్రహ్మనుంచీ వచ్చాడు. పరబ్రహ్మకు క్రియలు లేవు. కానీ, పరబ్రహ్మలో స్పందం ఏర్పడటంవల్ల వీడు వచ్చాడు. అందువల్ల వీడు సంకల్ప రూపుడయ్యాడు. అంటే, మనస్సే వీడి రూపం. ఈ సంకల్పంవల్ల వీడు కర్మలు చేస్తున్నాడు. కర్మలవల్ల బంధింపబడుతున్నాడు.

జీవుణ్ణి బంధించే కర్మలు, వాడికి మూలరూపమైన పరబ్రహ్మను బంధించవా?– అంటే, బంధించవు. ఎందుకంటే, పరబ్రహ్మ నది వంటివాడు. జీవుడు నురుగు వంటివాడు. కర్మలు, పడవనుంచి ఒడ్డుకు కట్టిన తాడు వంటివి. ఈ తాడు ఏటి నీటి మీద పడి వుంటుంది. పై నుంచీ వచ్చే నురుగు ఈ తాడుకు కొట్టుకొని ఆగిపోతుంది. నీరు మాత్రం క్రింది నుంచి ప్రవహిస్తూనే వుంటుంది. అంటే, ఆ తాడు నురుగును బంధిస్తోంది గానీ, నీటిని బంధించడం లేదు. అలాగే,జీవుడి కర్మలు నురుగు వంటి జీవుణ్ణి బంధిస్తాయి గానీ, నీటి వంటి బ్రహ్మను బంధించవు.

జీవుడు ఈ కర్మల వల్లే, జనన మరణ చక్రంలో చిక్కుకుంటున్నాడు. అస్తిత్వం లేని జీవుడికి మొదట అహంకారంవల్ల అస్తిత్వం రాగా, ఇప్పుడు కర్మలవల్ల జన్మ రూపమైన అస్తిత్వం కనిపిస్తోంది.

కనుక, రామా! ఈ జీవుని విధానమంతా భ్రాంతివల్లే ఏర్పడుతోంది. కనుక, జీవుడికి పారమార్థికమైన అస్తిత్వం లేదని నిరూపణ అవుతోంది. కనుక, పరబ్రహ్మయొక్క అద్వితీయత్వానికి భంగమేమీ లేదు.

***రాముడు:*** గురుదేవా!

**మనస్త్వయోగ్యో జీవోఽయం కోభవేత్పరమాత్మనః**

**కథం వాస్మిన్ సముత్పన్నః కో వాయం వద మే పునః** (ఉ.ప్ర.స.67, శ్లో.1)

జీవుడు మనోమయుడు అంటున్నారు గదా! అలాంటి వీడు పరమాత్మకు ఏమౌతాడు? అంటే పరమాత్మ అంశా? లేక పరమాత్మలోంచి పుట్టిన కార్యమా?

***వశిష్ఠుడు:*** రామా! జీవుడికి అస్తిత్వమే లేదని చెప్పా గదా. మళ్ళీ ఈ ప్రశ్న ఎందుకు వచ్చింది?

***రాముడు:*** పరమాత్మదృష్టిలో జీవుడికి అస్తిత్వం లేదు. వ్యావహారికంలో వుంది కదా! వ్యావహారిక దృష్టితోనే ఈ ప్రశ్న వేస్తున్నాను.

జీవుడు పుట్టాడనుకుందాం. ఆ పుట్టటం కూడా మట్టి లోంచి కుండ పుట్టినట్టు, పరిణామ రూపంగా పుట్టాడనుకుందాం. అలా అంటే, కుండ పుట్టాక మట్టిముద్ద లేకుండా పోయినట్టు, జీవుడు పుట్టాక పరమాత్మ లేకుండా పోవాలి. ఇది కుదరదు గదా!

పోనీ, తాడు మీద పాము పుట్టినట్టుగా, జీవుడు వివర్తరూపంలో పుట్టాడనుకుందాం. అప్పుడు జీవుడు మిథ్యా రూపుడవుతాడు.అప్పుడు తత్త్వజ్ఞానం కలిగిన మరుక్షణమే జీవుడు లేకుండా పోవాలి.కానీ, జీవన్ముక్తులు కనిపిస్తున్నారు గదా! లీల కనిపిస్తోంది కదా! కనుక, ఈ పక్షమూ కుదరదు.

అసలు జీవుడు పుట్టనే లేదందామా ఈ ప్రపంచం ఎందుకు వున్నట్టు? ప్రపంచం భోగ్య రూపం. భోక్త కోసం భోగ్యం వస్తుంది. భోక్తేలేనప్పుడు భోగ్యమైన ఈ ప్రపంచం ఎందుకు వచ్చినట్లు?

కనుక, ఏ పక్షమూ కుదరక ఈ ప్రశ్న వేశా?

ఈ ప్రశ్నలో రాముడు పారమార్థిక దృష్టినీ, వ్యావహారిక దృష్టినీ, విడదీసి గూడా కలగాపులగం చేసి ఆలోచిస్తున్నాడని వశిష్ఠుడికి అర్థమైంది. అందువల్ల వశిష్ఠుడు ఆయనకు వ్యవహార కల్పితమైన బంధమోక్ష వ్యవస్థను వివరించ దలచుకున్నాడు. దానికోసం ఆయన "సూచికోపాఖ్యానం" అనే కథ చెప్పదలచుకున్నాడు. దానికి పీఠికగా 67వ సర్గలో ఆయన మాయాతత్వాన్ని వివరించ దలచుకొన్నాడు. అందుకోసమే ఇలా అన్నాడు–

## 67. మాయ-మాయా కార్యము- ముక్తి

***వశిష్ఠుడు:***

**సమస్త శక్తి ఖచితం బ్రహ్మ సర్వేశ్వరం సదా।**

**యయైవ శక్త్యా స్ఫురతి ప్రాప్తాం తామేవ పశ్యతి॥** (ఉ.ప్ర.స.67, శ్లో.2)

పరబ్రహ్మలో ఒక శక్తి వుంది. ఆ శక్తికి బ్రహ్మకూ నిజానికి భేదం లేదు. కానీ, ఆయన భేదాన్ని కల్పించుకుంటాడు. ఆ శక్తివల్ల బ్రహ్మలో సమస్త శక్తులూ ఏర్పడుతాయి. ఆయన సర్వేశ్వరుడు అవుతాడు. ఆ శక్తి పేరు మాయ.

ఆ శక్తి వల్లనే బ్రహ్మ తనలో తాను భేదాలను కల్పించు కొంటాడు. ఒక వేషంలో జీవుడిగా కనిపిస్తాడు. మరో వేషంలో ఈశ్వరుడిగా వుంటాడు. ఇలా బ్రహ్మ రెండు కావటమే ప్రపంచంయొక్క ఉత్పత్తికి కారణం. తరువాత, ఆ జీవుడు పూర్వ సంకల్పాలతోనూ, పూర్వ వాసనలతోనూ, ప్రభావితుడై జనన మరణచక్రంలో పడతాడు. జీవుడికి, పరమాత్మకు వున్న సంబంధం ఇదే.

***రాముడు:*** గురుదేవా! జీవులయొక్క కర్మలూ, సంస్కారాలూ అనేవే ప్రపంచ ప్రవృత్తికి కారణమంటున్నారు కదా! కర్మంటే ఏమటి? దైవమంటే ఏమటి? కారణమంటే ఏమిటి?

***వశిష్ఠుడు:***

(క) రామా! మాయలో మూడు గుణాలుంటాయి. వాటిలో రజోగుణ ప్రధానమైన మాయతో చైతన్యం కలిసివుంటే అప్పుడా చైతన్యానికి స్పందించే స్వభావం ఏర్పడుతుంది. చైతన్యం చిత్తాకారాన్ని పొందితే దాన్ని స్పందం అంటారు. చైతన్యం దృశ్యాకారాన్ని పొందితే దాన్ని అస్పందం అంటారు.

(ఖ) స్పందంవల్ల చైతన్యం సృష్టివైపు నడుస్తుంది. అస్పందం వల్ల ప్రళయం వైపు నడుస్తుంది. చైతన్యస్పందమే సృష్టివైపు నడుస్తోంది గనుక, సృష్టికి మూలమైన దైవము,కర్మ, కారణమూ, మూడూ అదే!

(గ) చైతన్యం ప్రాణమై, ప్రాణస్పందం కలిగితే, దాన్ని కారణము అంటారు.

(ఘ) చైతన్యం శరీరేంద్రియాది రూపాన్ని పొంది, అక్కడ స్పందం ఏర్పడితే, దాన్ని కర్మ అంటారు.

(ఙ) ఆ కర్మ, ఫలాన్ని ఇవ్వడానికి సిద్ధమైతే దైవం అంటారు.

(చ) కనుక, రామా! దైవ, కర్మ, కారణ రూపాలలో చిత్స్పందమే అంతటికీ కారణమవుతోంది.

(ఛ) ఈ చిత్స్పందంవల్లే జీవులు వివిధ జన్మలెత్తుతున్నారు. ఆ పరంపరలోనే ఒక్కొక్కసారి శాస్త్రీయమైన ప్రవృత్తిలోకి వచ్చి, ముక్తికి దగ్గరవుతున్నారు. వాళ్ళల్లో కొందరు క్రమంగా కొన్ని జన్మల్లో ముక్తిని అందుకుంటున్నారు.

(జ) చైతన్యం ఏ ఉపాధిలో వుంటుందో, ఆ ఉపాధి లాగానే అది కనిపిస్తూ వుంటుంది. కనుక, భేదం ఉపాధులదే గానీ చైతన్యానిది కాదు.

(ఝ) లేని భేదం కనిపించటానికి కారణం "నువ్వూ- నేనూ" అనే భేదకల్పన. దానికి కారణం ఆత్మస్వరూపం తెలియకపోవటం. దానికి కారణం భోగాలమీది కోరిక. దానికి కారణం వాసన.

(ఞ) రామా! ఈ విషయాన్ని రాబోయే లవణోపాఖ్యానంలో ఇంకా వివరిస్తాను.

(ట) ఇక రామా! మాయావిలాసం ఎలా వుంటుందో, విను-

1.చైతన్యమే మాయలో ప్రతిబింబించి, ఆ చిదాభాసం వల్ల జీవుడవుతాడు.

2. ఆ చైతన్యమే సంకల్పంలో ప్రవేశించి మనస్సవుతుంది.

3. నిశ్చయాత్మక వృత్తిలోకి ప్రవేశించి బుద్ధి అవుతుంది.

4. స్మరణాత్మక వృత్తిలోకి ప్రవేశించి చిత్తమవుతుంది.
5.అభిమానాత్మక వృత్తిలోకి ప్రవేశించి అహంకార మవుతుంది.
(ఠ) ఇక జగత్కల్పన ఎలా వుంటుందో చూడు–
1. ఇంద్రియాల ద్వారా బాహ్య ప్రపంచం కనిపిస్తే, అది 'జాగ్రత్'.
2. లోపల అహంకారం వుండి ఇంద్రియాలతో పని లేకుండానే ప్రపంచం కనిపిస్తే, అది "స్వప్నం."
3. వాసన మాత్రమే హృదయంలో మిగిలి వుంటే, అది "సుషుప్తి."
4.ఈ స్థితి గూడా దాటిపోతే, అది "తురీయం."
5. ఆ తరువాత జీవుడు బ్రహ్మలో ఐక్యాన్ని పొందితే, అది "తురీయాతీతం"

(డ) రామా! నిర్వచనాలడిగావు గనుక, అనేక నిర్వచనాలు చెప్పాను. ఈ సందర్భంలోనే మరో మాట విను. ఇంతకూ పరమేశ్వరుడే అసంగుడు కదా! ఆయన జగత్తుకి కారణం అవునా, కాదా?– అని కొందరు గందరగోళపడుతూ వుంటారు.

ఒక చెట్టు పెరగడానికి ఆకాశం ఎంత కారణమో, ఈ ప్రపంచం పుట్టటానికి బ్రహ్మ కూడా అంతే కారణం. చెట్టు పెరగడాన్ని అడ్డగించకుండా వుండటంవల్ల చెట్టుకి ఆకాశం కూడా కారణమే అవుతోంది. అలాగే మాయవల్ల జరిగే జగత్ సృష్టిని ఆపకుండా వుండటంవల్ల బ్రహ్మ జగత్కారణం అవుతోంది.

అద్దంలో ప్రతిబింబం ఎటువంటిదో, బ్రహ్మలో ఈ జగత్తు అటువంటిదే. కానీ, తేడా ఏమిటంటే, గింజలోంచి చెట్టు వచ్చినట్టుగా క్రమంగా వికసిస్తుంది.

**రాముడు:** గురుదేవా! అంతా బాగానే వుంది కానీ, ఏదో కారణం చేత చైతన్యంలో స్పందం కలిగి ఈ ప్రపంచం వచ్చినా, మళ్ళీ ప్రళయంలో అన్ని స్పందాలూ పోయి, చైతన్యం నిశ్చలంగా వుంటుంది గదా! ఆ వున్నది అల్లా వుండి పోక, మళ్ళీ సృష్టి ఎందుకు చేసింది?

**వశిష్ఠుడు:** రామా! ఈ కారణాన్వేషణకు అర్థం లేదని పూర్వమే చెప్పాను. ప్రళయంలో ఆ చైతన్యం ప్రశాంతంగా స్వస్థంగా వుండదు. ఉన్నట్టు కనిపిస్తుంది. దానిలో జీవ వాసనలన్నీ అణిగి వుంటాయి. అందువల్ల అది మళ్ళీ ప్రపంచంగా ఉద్బుద్ధమవుతుంది. మొలకెత్తుతుంది. అది దాని స్వభావం. వేసవికాలంలో ఎండిపోయిన బీడు వర్షాకాలంలో చినుకు పడేసరికి మొలకెత్తుతుంది. అలాగే చైతన్యమూ!

**రాముడు:** గురుదేవా! చాలా ఆశ్చర్యంగా వుంది. సంతోషంగా వుంది. కానీ –

**యథాసౌ యాతి వైపుల్యం యథా భవతి చాత్మభూః**
**యథా స్వభావ సిద్ధార్థాత్ తథా కథయ మే ప్రభో ॥** (ఉ.ప్ర.స.67, శ్లో.39)

ఒకే చైతన్యం సమష్టిగా, వ్యష్టిగా ఎలా అయింది? ఎలా అయిందో ఆ వివరాలన్నీ చెప్పండి?

**వశిష్ఠుడు:** రామా! ఆ సృష్టిక్రమమంతా నీకు పూర్వమే చెప్పాను. అదంతా చైతన్యం మీద చేసిన ఆరోపణల పరంపర మాత్రమే అని కూడా పూర్వం చెప్పాను.

**రాముడు:** గురుదేవా! నిజమే, చెప్పారు. కానీ, ఇదంతా కల్పనే అయినప్పుడు, బ్రహ్మకు అజ్ఞానస్పర్శే లేనప్పుడు, జీవుడు బ్రహ్మ ఒకడే అయినప్పుడు, ఇంక మోక్షం కోసం ప్రయత్నమేమిటి? ఆత్మ విచారమేమిటి? అదే నాకు అర్థం కావటం లేదు.

**వశిష్ఠుడు:** రామా! సిద్ధాంతం దాకా వచ్చాక నువ్వు ఈ మాట అంటే బాగుండేది. వసంతంలో పూయవలసిన పూలు హేమంతంలోనే పూసేస్తే, చూసే వాళ్ళకి భయంగా వుంటుంది.

పరమార్థంలో నువ్వు చెప్పింది సత్యమే. కానీ, నువ్వు ఇంకా వ్యవహారదశలోనే వున్నావు. ఈ దశలో నీకు ప్రపంచం వుంది. కనుక, అజ్ఞానం వుంది. కనుక, బంధం వుంది. కనుక, ఆత్మ విచారణ చెయ్యాలి,

ముక్తి పొందాలి. ఈ దశలో ఇదే సత్యం.

తత్త్వదృష్టిలో హిరణ్యగర్భుడూ జీవుడే. పురుగూ జీవుడే. వ్యవహార దశలో ఇద్దరికీ ఎంత తేడా వుంది? కనుక, ఈ రెండు దృష్టులనూ కలగా పులగం చెయ్యరాదు. ఈ విషయంలో నీకు "సూచికోపాఖ్యానము" అనే కథ చెపుతా విను.

## 68. సూచికోపాఖ్యానము

పూర్వం హిమవత్పర్వతానికి ఉత్తరం వైపున కర్కటి అనే ఆడరాక్షసి వుండేది. కర్కటి అంటే కటికది. దీనికి ప్రజలలో విషూచిక అనే మారు పేరు (నిక్‌నేమ్) వుండేది. విషూచిక అంటే, కలరా రోగం.

దాని ఆకారం కొలతలోనూ, రంగులోనూ కూడా కాటుక కొండ లాగా వుండేది. దాని ఆకలికి అంతుండేది కాదు. ఎంతమంది జీవులను పీక్కుతిన్నా ఆకలి తగ్గేది కాదు.

చివరికి అది ఆకలికి తట్టుకోలేక, భూమి మీద వుండే జీవులందరినీ పీల్చి పిప్పి చేసేందుకు, అపూర్వ శక్తులు సంపాదించాలని సంకల్పించి, ఘోర తపస్సు ప్రారంభించింది.

వెయ్యి సంవత్సరాలు అయినాక బ్రహ్మగారు వచ్చి వరం కోరుకోమన్నాడు. తీరా ఆయన వచ్చేసరికి వరం ఎలా కోరాలో తోచలేదు. దాని కోసం చాలా సేపు ఆలోచనలో గిలగిలా కొట్టుకుంది. ఒక పక్క వచ్చిన బ్రహ్మగారు వెళ్ళిపోతారేమో అని భయం.

ఈ ఆదుర్దాలో ఆలోచనలను ఓ తీరుకు తెచ్చుకొని అది ఇలా వరం కోరింది.

"బ్రహ్మదేవా! నాకు నా పేరుకు తగ్గట్టుగానే , విషూచి అనే వ్యాధి రూపం రావాలి. విషూచి అంటే కలరా వ్యాధి.

"విషూచి అంటే చిన్న సూది అని కూడా అర్థం. ఆ రూపం కూడా నాకు రావాలి.

"ఈ రెండు రూపాలూ వుంటే, నేను జీవులందరినీ పీల్చుకు తినగలుగుతాను. నా ఆకలి తీరుతుంది."

బ్రహ్మగారు ఆ వరానికి ఒప్పుకొని అక్కడితో ఆగక ఇలా అన్నాడు–

"పుత్రీ! నువ్వు పాపాత్ములను హింసిస్తే కొంతవరకూ నయమే. కానీ, నువ్వు అక్కడితో ఆగవు. పుణ్యాత్ములను కూడా పీడిస్తావు. కనుక, పుణ్యాత్ముల కోసం నిన్ను నివారించే మంత్రం ఒకటి తయారు చేశాను. నువ్వు కూడా అది విను. (అంటూ మంత్రం చెప్పాడు.) ఈ మంత్రం జపించేవారి జోలికి నువ్వు పోకు" అలా చేప్పి బ్రహ్మగారు అంతర్ధానమైపోయారు.

ఇంతలో చూస్తూ వుండగానే, పెద్ద కొండలాగా వున్న రాక్షసి సన్నబడిపోసాగింది. చూస్తుండగానే, చెట్టంతయింది, ఏనుగంతైంది. మనిషంతైంది. బారెడంతైంది, వేలెడంతైంది. చివరికి సూదిమొనంతైంది.

రామా! ఇదంతా ఆ రాక్షసి యొక్క సంకల్పంవల్ల తయారైన రూపమే. అని గుర్తుంచుకో. ఆ రాక్షసి ఇప్పుడు చిన్న ఇనుప సూది లాగా కనిపిస్తోంది. అందులో ఇనుము మాత్రం లేదు. ఇది గూడా ఒక రకమైన భ్రాంతే.

ఈ సూది రూపానికి తోడు, సూక్ష్మమైన రోగరూపం కూడా దానికి వచ్చింది. అందులో ఆకారం వున్న రూపం సూది రూపమే.

ఎంతో ఆశపడి ఆ రూపాన్ని సంపాదించుకున్న ఆ కర్కటీ రాక్షసికి, తీరా చూస్తే, ఆ శరీరంవల్ల ఏమీ ఉపయోగం కనిపించటం లేదు. ఆ సూదికి నోరూ లేదు. కడుపూ లేదు. తినాలనే కోరిక మాత్రం వుంది. ఆకలుంది. అవి రెండూ మనస్సుని బట్టి వుంటాయి కదా!

ఆకలి వుండి కూడా తినలేని ఆ బతుకు ఆ రాక్షసికి చాలా దుర్భరమైంది.

ఈ స్థితిలో వేరే గతి లేక, ఆ రాక్షసి విషూచికా వ్యాధి రూపంతో మానవ శరీరాల్లోకి ప్రవేశించి, సూది రూపంతో వాళ్లను గుచ్చి, దానితోనే ఒక రకమైన సంతోషం పొందుతూ, ఆకలి మాత్రం తీరక, నానా బాధా పడుతూ వుండేది.

మానవుల్లో కొంత దుర్బుద్ధి వుంటే గానీ, విషూచికా వ్యాధి వారిలో ప్రవేశించడం సాధ్యం కాదు. అందువల్ల, ఈ రాక్షసి ముందుగా వారిలో దుర్బుద్ధులు పుట్టించి, ఆ వెనకాలే తను రోగంగా లోపలకు దూరుతూ వుండేది.

కొన్ని చోట్ల మంత్రగాళ్ళు, కొన్ని చోట్ల వైద్యులూ, దీనికి అడ్డు తగులుతూ వుండేవారు. అలాంటి చోట పారిపోతూ వుండేది. వీలైనంత వరకూ అపవిత్ర ప్రదేశాలు చూసుకొని, అక్కడ మకాం వుండేది. ఈ సందర్భంలో వాల్మీకి మహర్షి అంటువ్యాధులు (ఇన్‌ఫెక్షన్) వుండే చోట్లను విస్తారంగా వర్ణించాడు. ఆ చోట్లు ఇలా వున్నాయి-

1. వ్యభిచారంతో చెడిపోయిన ఇంద్రియాలు. 2 మకిలిగా వున్న ఇంద్రియాలు. 3. రక్తం క్షీణించిన అవయవాలు 4. రాలిన వెంట్రుకలు 5. దరిద్రుల శవాలు 6. తేజస్సు లేని అవయవాలు. 7. దుర్గంధ వాయువులు వీచే బయళ్ళు. 8. పాపిష్ఠి చెట్లు. 9. ఎముకలు. 10. ఈదురు గాలి. 11. అజ్ఞానులు వుండే ఇల్లు. 12. మురికి గుడ్డలు. 13. అవి ధరించే మనుషులు, వాళ్ళ ఇళ్ళు. 14. చెట్ల తొర్రలు. 15. నరికిన కొమ్మలు. 16. తేనెపట్టులు. 17. పక్షుల గూళ్ళు. 18 వడ గాలులు. 19. మంచు ప్రదేశాలు 20. కుష్టురోగులు. 21. వికలాంగులు వుండే చోట్లు 22. పుట్టలు. 23. చవుడు ప్రదేశాలు. 24. పులులు, ఎలుగుబంట్లు, కొండ చిలువలు వంటి జంతువులు వుండే చోట్లు. 25. అడవులు, 26 పిశాచ గృహాలు. 27. ఎండుటాకులు రాలి కుళ్ళిపోయి వున్న నీటి మడుగులు. 28. మురికి కాలువలు. 29. జనం అతిగా గుమిగూడే చోట్లు. 30. పేలు తినే కోతులు. 31. పిప్పి గోళ్ళు.

ఇలాంటి చోట్లన్నీ విషూచికా రాక్షసికి విహార భూములుగా వుండేవి. ఇక సూది రూపంలో కూడా అది వూళ్ళన్నీ తిరుగుతూ, ప్రజలను పీడిస్తూ వుండేది.

ఇక్కడ వాల్మీకి మహర్షి సూది రాక్షసిని మామూలు సూదితో పోలుస్తూ, మామూలు సూది చేసే పనులన్నిటినీ సూది రాక్షసికి అన్వయిస్తూ, కవితామయంగా సుందరమైన వర్ణన చేశాడు. దానిలో నీచుల ప్రవృత్తిని కూడా కలిపి చూపించాడు.

### 69. సూచికా ద్వితీయ తపస్సు

ఇలా లోహసూచికా, జీవసూచికా, అనే రెండు శరీరాలతో ఆ రాక్షసి ప్రజలను పీడిస్తూ, కొన్ని వేల సంవత్సరాలు గడిపింది. కానీ, నానాటికీ దాని అసంతృప్తి పెరిగిపోతోంది. అది ఈ విధంగా పశ్చాత్తాప పడసాగింది.

“అరెరే! ఎంత పొరపాటు చేశాను?! ప్రత్యేకంగా పనిగట్టుకొని తపస్సు చేసి మరీ, బంగారుకొండ లాంటి శరీరం నాశనం చేసుకొన్నానే! ఈ సూదిరూపంలో గుప్పెడు మాంసమైనా తినలేను కదా! ఈ రూపంలో నాకు చుట్టాలా, పక్కాలా? చద్దామనుకున్నా వీల్లేదు. మూర్ఖులు వెనకాముందు చూడకుండా వెధవ పనులు చేస్తారు. నేను సరిగా అలాంటి తపస్సే చేశాను. శాంతిహోమం చేస్తే, దాంట్లోంచీ దయ్యం పుట్టిందట! అలా వుంది నా తపస్సు. అయ్యో! మళ్లీ కొండ గుహ వంటి నా కడుపు నాకు ఎప్పుడొస్తుందో కదా! కుండల కొద్దీ నెత్తురు ఎప్పుడు తాగుతానో కదా!”

అని ఈ విధంగా ఆ రాక్షసి రోజు రోజుకూ కుమిలిపోతూ వుండేది.

మహాకవి ఏ విషయం పట్టుకున్నా బంగారమే అవుతుంది. వాల్మీకి మహాకవి ఈ సర్గలో రాక్షసి దిగులునూ, దాని రూపాన్నీ కలిపి కవిత్వంలో ముంచేసి, హాస్య రసం పొంగులెత్తించాడు.

కొన్నాళ్ళు అలా మథనపడి, మథనపడి, చివరికి మళ్ళీ తపస్సు చేసి తన పూర్వ రూపాన్ని పొందాలని ఆ రాక్షసి నిశ్చయం చేసుకొంది.

వెంటనే, రోగ వాయురూపంలో వున్న జీవశూచి లోహ రూపంలోకి (దోమ ముక్కు వంటి రూపంలోకి) ప్రవేశించింది. ఇలా ఆ రెండూ పరస్పర ఆధ్యాస చెందిన రూపంలో, ఆ రాక్షసి హిమాలయానికి వెళ్ళి, ఒక అపవిత్ర ప్రదేశం ఎన్నుకొని, ఘోరతపస్సు ప్రారంభించింది.

ఆ తపస్సు చూసి అడవిలోని చెట్లూ, పక్షులూ, కూడా ఆశ్చర్యపోయాయి. అవి దానికి చల్లటి గాలినీ, కమ్మని పుప్పొడినీ, తియ్యటి పళ్ళనూ కానుకగా ఇచ్చాయి. అయినా ఆ సూది వాటిని ముట్టకోనైనా ముట్టుకోలేదు.

దేవేంద్రుడు దీని తపస్సు భంగం చేయాలని మాంసపు రేణువులను విరివిగా పంపించాడు. ఆ రేణువులు సూది బెజ్జంలోకి దూరాయి గానీ, అంతకన్నా లోపలికి పోలేదు. దాంతో దేవేంద్రుడు ఆగ్రహించి, సుడిగాలులను, జోరు వానలను, కారు చిచ్చులు, ఇలా ఎన్నో పంపాడు. అయినా ఆ సూది రాక్షసి చలించలేదు. క్రమంగా దాని చుట్టూ పుట్టలు పెరిగాయి. అయినా అది కదలలేదు.

కానీ, ఆ విషూచి హృదయంలో ఊహకందని ఒక వింత మార్పు కూడా వచ్చింది.

**విచారయంత్యాస్తస్యాస్స్వ మాత్మసత్యం సుచేతనమ్।**

**జ్ఞానాలోకస్సముదభూత్ సా పరాపర దర్శినీ॥** (ఉ.ప్ర.స.72, శ్లో.24)

ఒక తపస్సుతో వున్న శరీరం పోగొట్టుకొని, కొత్త శరీరం సంపాదించుకొని, అదీ నచ్చక, మళ్ళీ ఈ శరీరం పోవాలనీ, పాత శరీరం రావాలనీ, తపస్సు చేస్తున్న ఈ రాక్షసికి, ఈ తపస్సు మధ్యలో "అరెరే! ఈ శరీరాలు వస్తున్నాయి, పోతున్నాయి కదా! ఈ శరీరం ఎవరు? నేనెవరు?" – అని ఆత్మ విచారణ ప్రారంభమైంది. దాంతో 'నేను' అంటే చేతనమే, జడం కాదు." (ఆత్మ, సత్యం, సుచేతనమ్) అనే ఆలోచన వచ్చింది. ఇక జ్ఞానమనే వెలుగు ఆమెలో ఉద్భవించింది. పరమంటే ఏమిటి? అపరమంటే ఏమిటి? అనే తెలివి కలిగింది.

ఇక క్రమంగా తపస్సువల్ల ఆమె పాపాలన్నీ క్షీణించగా, ఆ విషూచి ఇప్పుడు నిర్మల సూచి అయింది. ఆమెకు స్వచ్ఛమైన ఆత్మజ్ఞానం కలిగింది. (సూచి– సూది)

అయినా ఆమె తపస్సు కొనసాగించింది. 7 వేల సంవత్సరాలు గడిచాయి. అప్పటికి ఆమె తపస్సు జ్వాలగా మారి, హిమాలయ పర్వతం మాత్రమే కాక, 14 లోకాలూ వేడెక్కాయి.

అప్పుడు దేవేంద్రుడు నారదమహర్షిని పిలిచి, ఈ వేడికి కారణమేమిటి? అని అడిగాడు. అప్పుడు నారదమహర్షి విషూచి రాక్షసియొక్క చరిత్ర అంతా వివరంగా చెప్పాడు. ఈ సందర్భంగా కవి, ఏ ఏ పక్షుల ద్వారా, ఏ ఏ జంతువుల ద్వారా, విషూచి వ్యాధి ఇతరులకు వ్యాపిస్తుందో, ఆ వివరాలను విషూచీ రాక్షసికి అన్వయిస్తూ, ఆ రాక్షసి కథ చెప్పాడు. దానిలో చివరి ఘట్టం తత్త్వదృష్టితో మనకు ముఖ్యం.

రెండవ సారి తపస్సు కోసం హిమాలయానికి వెళ్ళాలని విషూచీ రాక్షసి నిర్ణయించుకున్నప్పుడు, ఎలా వెళ్ళాలీ అని అది ఆలోచించింది. అప్పటికే ఆ రాక్షసి రోగరూపాన్నీ, లోహ రూపాన్నీ, ఒక దానిలో ఒకటి కలిపేసి, ఒకే రూపంలోకి వచ్చి వుంది. ఇప్పుడా రాక్షసి ఆ రూపంతో హిమాలయానికి చేరటం కష్టం. అందుకని అది ఒక ఉపాయం చేసింది.

ఆ రాక్షసి ఒక గద్దని ఎన్నుకొని, దాని హృదయంలో ప్రవేశించింది. రాక్షసి ఆవహించే సరికి, గద్ద

దానికి వశమై పోయింది. ఆ రాక్షసి సంకల్పం ప్రకారం ఆ గద్ద హిమాలయానికి వెళ్ళి, ఒక నిర్జన ప్రదేశంలో ఆగింది.

ఆ గద్ద అక్కడ ఆగేసరికి, అక్కడి దుమ్ములో చిన్న నిప్పు మంట లేచినట్లుగా ఒక ఇనుప సూది పైకి లేచింది. గద్ద హృదయంలో వున్న జీవ సూచిక దాన్ని చూసి, వెంటనే గద్ద నుంచీ బయటికి వచ్చి, ఆ సూదిలో ప్రవేశించింది.

గద్దకు బరువు దిగినట్టై హాయిగా వెళ్ళిపోయింది.

ఇక ఆ జీవసూచి లోహసూచికను ఆధారంగా చేసుకొని, తపస్సు మొదలుపెట్టింది.

ఈ ఘట్టాన్ని పూర్వం వశిష్ఠ మహర్షి మాటల్లో ఒక తీరుగానూ, ఇప్పుడు నారదమహర్షి మాటల్లో మరో తీరుగానూ, చెప్పించాడు– వాల్మీకి కవి. ఇలా చేయటం ద్వారా కథా సౌందర్యంతో పాటు, జీవులయొక్క శరీరధారణా ప్రక్రియను కూడా మేళవించడం కుదిరింది. మొదట్లో వశిష్ఠమహర్షి ద్వారా కాకుండా, ఇప్పుడు ఇంద్ర నారద సంవాద రూపంగా శరీరధారణ ప్రక్రియను వివరించటం వల్ల, ఆ విషయానికి ప్రామాణికత పెరిగినట్లయింది.

ఈ వివరాలన్నీ చెప్పిన నారదుడు, "నువ్వు వెళ్ళి ఆ రాక్షసికి త్వరగా వరం ఇచ్చిరా" అని దేవేంద్రుణ్ణి ప్రోత్సహించాడు.

అప్పుడు దేవేంద్రుడు వాయు దేవుణ్ణి పిలిచి, ఆ విషూచి రాక్షసి ఎక్కడుందో చూసి రమ్మని పంపాడు. వాయుదేవుడు ఏడేడు లోకాలూ తిరిగి, చివరికి దాన్ని పట్టుకున్నాడు. కానీ, దాని దివ్య తేజస్సును చూసి భయపడ్డాడు. దానితో మాట్లాడటానికి భయపడి, నమస్కారం పెట్టేసి వెనక్కి వెళ్ళిపోయాడు.

ఆ వాయువును చూసేసరికి ఇతడు సూచీ దర్శనం చేత పవిత్రుడయ్యాడని దేవేంద్రుడికి తోచింది. దాంతో ఆయన వాయుదేవుణ్ణి కౌగిలించుకొని, ఏం జరిగిందో చెప్పమన్నాడు.

వాయుదేవుడు సూచి తపస్సును మరో సారి వర్ణించి, దానికి వరం మనం ఇవ్వలేం, ఇస్తే బ్రహ్మదేవుడే ఇవ్వాలన్నాడు. దాంతో దేవతలంతా కలసి బ్రహ్మగారి దగ్గరికి వెళ్ళి, విషయం విన్నవించారు. బ్రహ్మదేవుడు సూచికి వరమిస్తానని అంగీకరించి, హిమాలయానికి వెళ్ళాడు.

బ్రహ్మదేవుడు వెళ్ళి సూచికి ప్రత్యక్షమై, వరం కోరుకోమన్నాడు. సూచికి ఆ విషయం తెలిసింది. బదులు చెప్పాలనుకుంది. కానీ ఇంద్రియాలు లేకపోవటంవల్ల చెప్పలేక మనస్సులోనే ఇలా అనుకుంది.

బ్రహ్మదేవా!

**పూర్ణాస్మి గత సందేహా కిం వరేణ కరోమ్యహమ్।**

**శామ్యామి పరినిర్వామి సుఖమాసే చ కేవలమ్।।** (ఉ.ప్ర.స.75, శ్లో.3)

"నేనిప్పుడు పరిపూర్ణంగా వున్నాను. సందేహాలు లేవు. నాకు వరాలెందుకు? నేను చలించను. నాకు కదలిక లేదు. నేను కేవలం సుఖంగా వున్నాను. తెలుసుకోవలసింది తెలిసింది. నేను పరమార్థ సత్య స్వరూపురాలిని. నాకు మిథ్యా వస్తువుతో పని లేదు.పూర్వం నేను అవివేకంవల్ల దుఃఖపడ్డాను. ఆత్మ విచారణ చేత అవివేకం పోయింది. ఇప్పుడు నాకు ఇష్టమూ లేదు. అయిష్టమూ లేదు."

సూచి హృదయంలోని ఆలోచనలను బ్రహ్మదేవుడు గ్రహించి, అనుగ్రహంతో ఇలా అన్నాడు.

"పుత్రీ! నువ్వు ఇంకా కొంత కాలం భూలోకంలో భోగాలు అనుభవించి, ఆ పైన పరమపదానికి చేరు. ఈశ్వర నియతి అలా వుంది. ఏ సంకల్పంతో నువ్వు ఈ తపస్సు ప్రారంభించావో,అది నీకు సిద్ధిస్తుంది.

"మళ్ళీ నువ్వు కొండంత శరీరంతో ఈ హిమాలయ పర్వతం మీద సంచరించు.

"చూడు పుత్రీ! అంతటి ఆ స్థూలశరీరం ఎక్కడో లేదు. విత్తులో చెట్టు ఇమిడి వున్నట్టుగా, అది నీ సూక్ష్మ రూపంలో ఇమిడి వుంది.

"నీకిప్పుడు బ్రహ్మ జ్ఞానం కలిగింది . కనుక రాక్షసివైనా కొండంత శరీరం వున్నా, ప్రజలను పీడించవు. నువ్వు ఎప్పుడూ నిర్వికల్ప సమాధిలోనే వుంటావు. ఎప్పుడైనా సమాధిలోంచీ బయటికి వస్తే, అప్పుడు నీకు అందరూ ఆత్మ స్వరూపులుగా కనిపిస్తారు. వ్యవహార దశలో నువ్వు ఎప్పుడూ ధారణా ధ్యానాల్లో వుంటావు. నీవు న్యాయంగా నీ ఆకలి తీర్చుకుంటావు. న్యాయాన్ని అతిక్రమించిన ప్రాణుల్నే హింసిస్తావు. జీవన్ముక్తురాలవై జీవిస్తావు."

ఆ విధంగా బ్రహ్మదేవుడు చెప్పి అంతర్థానమై పోయాడు.

## 70. యక్ష ప్రశ్నలు

బ్రహ్మదేవుడి మాటలమీద కర్కటికి ఇష్టమూ కలగలేదు. అయిష్టమూ కలగలేదు. విని వూరుకుంది.

ఇక ఆమె శరీరం క్రమక్రమంగా పెరిగి పెరిగి, పూర్వం లాగానే కొండంత ఆకారంగా తయారయింది. ఆమె ఆ శరీరంతో అక్కడే కూర్చొని, ఆరు మాసాల పాటు ధ్యానంలో వుండి పోయింది. అప్పుడామెకి ఆకలి వేసింది. కానీ, ఆమెకు అన్యాయంగా బ్రతకటం ఇష్టం లేక పోయింది. ఏం చేయాలా అని మథనపడుతూ వుండగా, ఆకాశంలో వున్న వాయుదేవుడు గమనించి, ఇలా అన్నాడు.

"ఓ కర్కటీ! నువ్వు మూఢులకు జ్ఞానబోధ చెయ్యి. మహాత్ముల స్వభావం అదే కదా! నువ్వు ఆత్మ తత్త్వం బోధించినా సరే ఎవడికి అది పట్టదో, ఎవడికి దానిమీద అభిరుచి పుట్టదో, వాడు ఆత్మనాశనం కోసమే పుట్టాడు. అందువల్ల వాణ్ణి తినటం న్యాయమే. అదే నీకు న్యాయమైన ఆహారం."

వాయుదేవుడి మాటలకు కర్కటి చాలా సంతోషించింది. ఆ చుట్టుపక్కల్లో మనుష్యుల కోసం వెతక సాగింది. కొంత దూరం పోయేసరికి సస్యసమృద్ధంగా వున్న కిరాతరాజ్యం ఒకటి కనిపించింది. ఇంతలో చీకటి పడింది.

ఆ నగరంలో విక్రముడనే కిరాతరాజు వున్నాడు. వాడా రాత్రి మంత్రిని వెంటబెట్టుకొని, ఊరెంబడి తిరుగుతున్నాడు. వాళ్ళే దొంగతనానికో బయలుదేరినట్టు కర్కటికి అనుమానం తోచింది.

కర్కటి వాళ్ళను చూసి ఇలా అనుకుంది.

"వీళ్ళు మూర్ఖులు. ఆత్మజ్ఞానం లేనివాళ్ళు. వీళ్ళు బతకటం కంటే చావటం మేలు. ఇలాంటి వాళ్లను చంపటం కోసమే బ్రహ్మ మమ్మల్ని సృష్టి చేశాడు. కనుక, వీళ్ళని తప్పక మింగాలి.

"కొంపముంచి వీళ్ళకి ఆత్మజ్ఞానం వుంటే? అమ్మో! అప్పుడు వీళ్లను చంపరాదు. కనుక, ముందరే పరీక్షించడం మంచిది."

కర్కటి ఇలా ఆలోచించి, పెద్దగా గర్జించి, ఇలా అంది–

"ఒరేయ్! ఎవర్రా మీరు? చూడగా అజ్ఞానుల్లాగా వున్నారు. నాకు ఆహారం కాబోతున్నారు, జాగ్రత్త".

అది విని ఆ రాజు ఇలా అన్నాడు– "ఏయ్, భూతమా! నువ్వెవరివి? ఎక్కడుంటావు? నీ రూపం చూపించు. నీ మాటలకెవడు భయపడతాడు? నీ శక్తి చూపించు. బయటకు రా. నీకేదన్నా కావలసి వుంటే కోరుకో ఇస్తాను".

రాజు మాటలు కర్కటికి నచ్చాయి. దాంతో తన రూపం బయటపెట్టి, వికటాట్టహాసం చేసింది. కానీ, ఆ రాజూ, మంత్రీ కూడా, ఏ మాత్రం భయపడలేదు.

మంత్రి ఇలా అన్నాడు– "ఓమహారాక్షసీ! ఎందుకీ ఆర్భాటం? ఈ కోపం ఎందుకు? మా ధైర్యం అనే గాలి ముందర నీ లాంటి పురుగులు చాలా ఎగిరి పోయాయి. ఆడంబరాలు ముఖ్యం కాదు. కార్యసాధన ముఖ్యం. కార్యసాధన కావలసినవాడు మొదట సామోపాయంతోనే మొదలుపెట్టాలి. అదే తెలివి. కనుక, నీకు ఏం కావాలో చెప్పు? ఇంత వరకూ మా దగ్గర కోరికలు కోరిన వారు ఎవరూ వ్యర్థంగా పోలేదు."

కర్కటి ఈ మాటలు విని లోలోపలే ఆశ్చర్యపోయింది. "వీళ్ళకి చావంటే భయం లేకుండా వుంది. వీళ్ళకి ఆత్మజ్ఞానం వున్నట్టుంది. కనుక, వీళ్ళతో మాట్లాడి కొన్ని సందేహాలు తీర్చుకోవడం మేలు."– అనుకొంది. పైకి మాత్రం "మిమ్మల్ని చూస్తేస్నేహ బుద్ధి కలుగుతోంది. కనుక, మీరు ఎవరో వివరాలు చెప్పండి?" అంది.

**మంత్రి:** ఈయన కిరాతరాజు. నేను మంత్రిని. నీలాంటి దుర్మార్గులను సంహరించడం కోసం రాత్రిపూటలు ఇలా తిరుగుతూ వుంటాం. దుష్ట శిక్షణ రాజులకు స్వధర్మం కదా!

**రాక్షసి:** రాజా! నీ మంత్రి చాలా దుర్మార్గుడు లాగా వున్నాడు. ఇలాంటి మంత్రి వుంటే రాజుకే అప్రతిష్ఠ. రాజు కీర్తి మంత్రి మీద ఆధారపడి వుంటుంది. రాజు ఎలా వుంటే ప్రజలు అలా వుంటారు. కనుక, రాజు సద్గుణవంతుడై వుండాలి. అలాంటి మంత్రినే పెట్టుకోవాలి.

"గుణాల్లో ఆత్మజ్ఞానమే ఉత్తమ గుణం. అసలు ఆత్మ విద్యే రాజ విద్య. అది వుంటేనే రాజు సమదృష్టితో రాజ్యపాలన చేయ గలుగుతాడు. కనుక, ఆత్మ విద్యలేని రాజూ, మంత్రీ కూడా, ఆ పదవులకు పనికి రారు. మీకు ఆత్మవిద్య వుందో లేదో నాకు తెలియదు. వుంటే మీకూ, మీ ప్రజలకు కూడా శ్రేయస్సే. లేకపోతే ఇద్దరికీ అనర్థమే. ఒక వేళ మీకు ఆత్మ జ్ఞానం లేదని ఖాయమైతే, నేను మీ ఇద్దర్నీ మింగేస్తాను.

"మీకు నేను కొన్ని ప్రశ్నలేస్తాను– సరిగ్గా ఆలోచించుకొని సమాధానాలు చెప్పండి.కోరికలు తీరుస్తా మంటున్నారుగా! ఇదే నా కోరిక."

ఈ మాటలు విని,కిరాతరాజు "అడుగు" అనేశాడు వెంటనే కర్కటి72 ప్రశ్నలు వరుసగా వేసి పారేసింది. వేసి, "రాజా! నా ప్రశ్నలకు సరైన సమాధానాలిచ్చి, నిన్నూ,నీ ప్రజలనూ కూడా కాపాడుకో" అని బెదిరించింది.

ఆమె వేసిన ప్రశ్నల ప్రవాహం ఇలా సాగింది–

**ఏకస్యానేక సంఖ్యస్య కస్యాణో రంబుధే రివ।**
**అన్తర్బ్రహ్మాండ లక్షాణి లీయన్తే బుద్బుదా ఇవ॥** (ఉ.ప్ర.స.79, శ్లో.2)

ఒకే వస్తువు వుంది; కానీ అదే అనేక సంఖ్యల వస్తువులుగా కనిపిస్తూ వుంటుంది. అది అణువు లాగా సూక్ష్మమైనది; కానీ సముద్రం లాగా అఖండమైనది. లక్షల బ్రహ్మాండాలు బుడగల్లాగ దానిలో కలిసి పోతూ వుంటాయి. ఆ వస్తువేది?

ఇలా ప్రారంభమైన ప్రశ్న ప్రవాహం గడగడ గడా సాగిపోయి,మొత్తం కలిపి 72 ప్రశ్నలు తేలాయి. చివరి ప్రశ్న.

**కేనేద మాతత మనేక చిదేవ విశ్వం**
**కింసార ఏవ మతివల్గసి హంసి పాసి ।**
**కిందర్శనేన న భవస్యథవా సదైవ**
**నూనం భవస్యమల దృగ్వద న స్స్వశాన్త్యై ॥** (ఉ.ప్ర.స.79, శ్లో.32)

తా॥ కోటాను కోట్ల జీవులు గల ఈ విశ్వాన్ని విస్తరింప చేసినవాడెవడు? నువ్వు బ్రతుకంతా వ్యవహారాలు చేస్తూనే వున్నావు. కొందరిని చంపుతున్నావు, కొందరిని రక్షిస్తున్నావు. ఇదంతా ఏ సారం నీలో వుండబట్టి చేయగలుగుతున్నావు? ఎవరి దర్శనం నీకు లభించబట్టి, నువ్విలా నిర్మల దృక్స్వరూపుడవై, తద్భిన్నుడవు కాకుండా, జీవిస్తున్నావు? నువ్వు బ్రతికి వుండాలనుకుంటే ఆ రహస్యం నాకు చెప్పు.

ఇలా అడ్డూ ఆపూ లేకుండా 72 ప్రశ్నలు వెయ్యటంలో కర్కటీ రాక్షసి హృదయంలో ఒక నిగూఢ ఆలోచన వుంది. ఏమిటంటే, ఒకడు బ్రహ్మవిద్యా నిష్ణాతుడైతే, వాడు కేవలం వేదాంతిగా మాత్రమే వుండడు. వాడి బుద్ధిశక్తి, ధారణాశక్తి, కార్యనైపుణ్యమూ, అపారంగా వృద్ధి చెంది వుంటాయి– అనేది శాస్త్ర రహస్యం.

బ్రహ్మవిద్యోపదేశం పొందే అర్హత వుండాలంటేనే, అలాంటి మేధాసంపద, అలాంటి కార్యదక్షత, వుండి తీరాలి. అందుకనే, బ్రహ్మవిద్యా విద్యార్థియై వచ్చిన నచికేతోముని కుమారుడికి, యమధర్మరాజు మునుముందుగా నాచికేతచయన మనబడే క్లిష్టాతిక్లిష్టమైన యజ్ఞప్రక్రియను ఏకధాటిగా ఉపదేశించాడు. నచికేతసుడు ఆ యజ్ఞ విధానాన్నంతటినీ ఒకే వినికిడిలో ఏకసంథాగ్రాహిగా ధారణ చేసి, మళ్లీ ఏకరువు పెట్టేసరికి, యమధర్మరాజు తృప్తిపడి, ఇక కాదన లేక, బ్రహ్మవిద్యోపదేశం చేసేశాడు– అని కఠోపనిషత్తులో వున్నది.

కర్కటీ రాక్షసి గూడా అదే ప్రక్రియలో ఈ కిరాతరాజు గారి బ్రహ్మవిద్యా సిద్ధి ఎంతటిదో తెలుసుకోవాలనే సంకల్పంతో 72 ప్రశ్నల బాణాలను ఏకధాటిగా సంధించేసింది. అలా ప్రశ్నల శరవర్షం కురిపించి, చివరికి ఆ రాక్షసి మరో సారి ఇలా గర్జించింది–

"రాజా! సమాధానాలతో నా సందేహాలు తీర్చి, నీ ప్రాణాలు దక్కించుకో. నా సందేహాలు తీరలేదో, ఇక నువ్వూ లేవు, నీ ప్రజలూ లేరు. గుర్తుంచుకో."

ఈ పిడుగులకు ఎదుటివాళ్లిద్దరూ ఏమీ జంకినట్లు కనిపించ లేదు. కానీ, వాళ్లలో మంత్రిగారు మాత్రం కొంచెం విసుగుపడ్డట్లుగా కనిపించాడు. అందువల్లనేమో రాజుగారి కంటే ముందుగా తనే గొంతు విప్పాడు. ఆయన ఇలా అన్నాడు–

**మంత్రి:** రాక్షసి తల్లీ! ఈ పాటి ప్రశ్నలకు మా రాజుగారి దాకా ఎందుకమ్మా? నేనే చెప్పేస్తా, విను. ఏది ఏమైనా, అన్నీ పరమాత్మ తత్త్వానికి సంబంధించిన ప్రశ్నలే వేశావు. అందుకు సంతోషిస్తున్నాను.

72 ప్రశ్నలు వేశావనే పేరే గానీ,చాలా చోట్ల వేసిన ప్రశ్నలే మళ్లీ వేశావు. కొన్ని చోట్ల మాటలు మార్చి పాత ప్రశ్నలే వేశావు. మరికొన్ని చోట్ల ఒక సిద్ధాంతం కింద ఉపసిద్ధాంతాలుగా గతార్థాలైన ప్రశ్నలే వేశావు. అలాంటి ఒకే రకపు ప్రశ్నలన్నీ ఒకే చోటుకి చేర్చి, సమాధానాలు చెప్పేస్తాను, జాగర్తగా విను.

మొదటి ప్రశ్నలో నువ్వు ఇలా అడిగావు–

**శ్లో॥ ఏకస్యానేక సంఖ్యస్య కస్యాణోరంభుధే రివ ।**
**అన్తర్బ్రహ్మాండ లక్షాణి లీయన్తే బుద్బుదా ఇవ॥** (ఉ.ప్ర.స.79, శ్లో.2)

ఒకానొక పదార్థం వుంది. అది అణువంత సూక్ష్మమైనది.ఎందుకంటే,అది ఏ ఇంద్రియానికీ దొరకదు. కానీ దానిలోంచి లక్షలకు లక్షల బ్రహ్మాండాలు నీటిబుడగ ల్లాగా జన్మించి, మళ్లీ దాంట్లోకే లయిస్తున్నాయి. ఆ విధంగా చూస్తే, అది సముద్రం లాగా అనంతమైనది అనిపిస్తోంది. దానిలో అలల లాగా,బుడగల లాగా, నురుగుల లాగా, యీ బ్రహ్మాండాలన్నీ జన్మించి, లయిస్తున్నాయి గనుక,దానికి అనేకానేక ఉపాధులు ఉన్నాయనిపిస్తోంది. ఇలా అణువై వుంటూ గూడా సముద్రం లాగా సర్వాధారంగా వుండే వస్తువేది? అని నువ్వు ప్రశ్నిస్తున్నావు.

ఈ ప్రశ్నలో అణువు–అనంతము అనే పదాలను చాలా తెలివిగా వాడావు. అణువు ఏ ఇంద్రియానికీ దొరకదు. పరమాత్మ ఇంద్రియాలకు మాత్రమే గాక, మాటకు గానీ, మనస్సుకు గానీ, దొరకదు. అందువల్ల పరమాత్మ అణువు కంటే కూడా సూక్ష్ముడు. మనకు అణువు కంటే చిన్న వస్తువు లేదు కనుక, పరమాత్మను అణువు అని వ్యవహరించడంలో తప్పు లేదు.

ఈ పరమాత్మ నుంచే సమస్త బ్రహ్మాండాలూ జన్మిస్తున్నాయి. అందువల్ల పరమాత్మ ఒక సముద్రమనీ, అందులోని తరంగాలే బ్రహ్మాండాలనీ, వర్ణించడంలో కూడా తప్పు లేదు.

ఐతే పరమాత్మలోంచి బ్రహ్మాండాలు ఎలా పుడుతున్నాయి? పుట్టక ముందు అవి ఎక్కడ వున్నాయి? ఎలా వున్నాయి? అనే ప్రశ్నలు వస్తాయి. ఈ ప్రశ్నలకు విత్తు–చెట్టు ఉదాహరణే బాగా సమాధానం చెపుతుంది. విత్తులోంచి చెట్టు వచ్చింది. ఇది అందరికీ తెలుసు. చెట్టు బయటకు రాక ముందు అది ఎక్కడ వుంది? విత్తులోనే వుంది అని చెప్పాలి. ఆవగింజ వంటి మఱ్ఱివిత్తులో చిన్న కొండ వంటి మఱ్ఱిచెట్టు దాగి వుంది– అంటే నమ్మశక్యమా? నమ్మకపోతే ఆ చెట్టు ఎక్కడ నుంచి వచ్చిందని చెప్పాలి? అందుచేత ఆ చెట్టు విత్తులోనే వుంది కానీ, చెట్టు రూపంలో లేదు,సూక్ష్మరూపంలో వుంది– అని చెప్పాలి. అంటే ఆ చెట్టు విత్తనంలో కేవలం సద్రూపంగానూ లేదు. అంటే చెట్టు రూపం గానూ లేదు; కేవలం అసద్రూపంగానూ లేదు, అంటే లేకుండా పోలేదు. ఈ మొత్తం భావాన్ని సంగ్రహంగా చెప్పాలంటే,చెట్టు విత్తనంలో సదసద్రూపంగా వుంది– అని చెప్పాలి. అంటే,మామూలు మాటల్లో చెప్పుకోవాలంటే, వుండి కూడా లేనట్టుగా వుంది.

కనుక, ఉపాధి భేదంచేత అనేక రకాలుగా వుంటూ కూడా,సముద్రం లాగా అనంతంగా వుంటూ, అణువు లాగా సూక్ష్మంగా వుంటూ కూడా, కోట్ల కోట్ల బ్రహ్మాండాలకు ఆధారంగా వుండగలిగేది, ఈ జగత్తనే మహావృక్షానికి బీజంగా వుండ కలిగేది, పరమాత్మ ఒక్కడే.

ఇది నీ మొదటి ప్రశ్నకు సమాధానం. నువ్వే 58వ ప్రశ్నలో ఈ లోకాలనే మహా వృక్షం అణు మాత్రంగా వున్న ఏ బీజంలో దాగి వున్నది? **"అణౌ జగన్తి తిష్ఠన్తి కస్మిన్ బీజ ఇవ ద్రుమః"** (ఉ.ప్ర.స.79, శ్లో.21)– అని అడిగావు. పై సమాధానంలోనే దీనికి కూడా సమాధానం వచ్చేసింది. చూసుకో.

మళ్లీ నీ 16వ ప్రశ్నలో– **"సత్తాయాః కః స్వభావదః"** (ఉ.ప్ర.స.79, శ్లో.8)– అని అడిగావు. ఈ ప్రపంచంలో కనిపించే పదార్థాలన్నింటికీ ఒక సత్త, ఒక ఉనికి, ఇవి వున్నాయి అనే లక్షణం, కనిపిస్తోంది కదా! ఈ సత్తయొక్క స్వభావం ఏమిటి? ఇది ఎక్కడి నుంచి వచ్చింది? ఎలా వచ్చింది? అని అడిగావు. దానికి కూడా ఇప్పుడు సమాధానం వచ్చేసినట్లే లెక్క.

ఎలాగంటావా? సముద్రపు అలలకు ఉనికి ఎక్కడి నుంచి వస్తుంది? సముద్రంలోంచే వస్తుంది.చెట్టుకు ఉనికి ఎక్కడి నుంచి వస్తుంది? విత్తులోంచే వస్తుంది. అలాగే ఈ లోకాలకు, లోకాలలోని పదార్థాలకు, ఉనికి, సత్త, అస్తిత్వం, ఎక్కడినుంచి వస్తుంది? వాటన్నిటికీ మూలమైన పరమాత్మలోంచే వస్తుంది.అంతకంటే వేరే దారి లేదు.అస్తిత్వం పరమాత్మదే.అదే దానిలోంచి పుట్టిన పదార్థంలో కూడా ఉన్నట్టు కనిపిస్తూ వుంటుంది. ఈ సమన్వయం కూడా ఇప్పుడు మనం చెప్పుకున్న ఉదాహరణల లోంచే వస్తుంది. కనుక నీ ఒకటో ప్రశ్నకు, 58వ ప్రశ్నకు 16వ ప్రశ్నకు కూడా, ఒకే సారి సమాధానం వచ్చేసింది.

మంత్రి ఈ విధంగా ప్రారంభించి, కర్కటీ రాక్షసి వేసిన ప్రశ్నలన్నింటినీ విశ్లేషించి, దూరదూరంగా వున్నవాటిని కూడా ఒకే జాతి ప్రశ్నలను ఒక చోటికి తెచ్చేసి, అన్నింటికీ పరమాత్మతో సమన్వయం కల్పించి చూపించేసరికి, కర్కటీ రాక్షసి నివ్వెరబోయి, ఆనందంతో కేరింతలు కొట్టింది.

అది గమనించి మంత్రి ముగింపు మాటగా ఇలా అన్నాడు.

"రాక్షసీ! తాత్త్విక ప్రశ్నలు వేశావు. పరమాత్మ తత్త్వ సిద్ధాంతం చెప్పేశాను. నన్ను గందరగోళం పెట్టాలని ఒకటి రెండు చోట్ల వేసిన ప్రశ్నలే వేశావు. వాటి సమాధానాలు కూడా నా మాటల్లోనే వున్నాయి. వెతికి చూసుకో. మొత్తం మీద ఈ 72 ప్రశ్నలూ కలిపితే వచ్చే సారాంశం ఏమిటంటే, అద్వితీయము, చిన్మాత్రము, ఐన పరమాత్మ తత్త్వాన్ని నువ్వు లోపల భావన చేస్తున్నావు. రెండో మాట లేదు."

ఈ ముగింపు మాట వినే సరికి కర్కటీ రాక్షసికి మహా సంతోషం అయిపోయి–

"రాజా!నీ మంత్రి వాక్ప్రవాహం చాలా పవిత్రంగా వుంది. ఇంతకూ నాకు కావలసింది నీ అభిప్రాయం. నా ప్రశ్నలకు నువ్వేమంటావో చెప్పు?" అన్నది.

రాజు ఇలా చెప్ప సాగాడు–

"రాక్షసీ! నీ చిత్తం, చిత్పదార్థాన్ని ఆశ్రయించుకొని వున్నది. జాగ్రత్తు, స్వప్నము,సుషుప్తి, అనే మూడు అవస్థలను దాటి వుంటూనే, ఈ మూడు అవస్థలలోనూ అనుగతంగా వుండేదీ, అలా వుంటూనే వాటికి సాక్షిగా ఉండేదీ, ఐన పదార్థాన్ని 'తురీయము' అంటారు. అదే చిత్పదార్థం. ఏ చిత్తం ఇలాంటి చిత్పదార్థాన్ని ఆశ్రయించుకొని వుంటుందో,అలాంటి చిత్తం అన్ని రకాల సంకల్పాలను విడిచి పెట్టేస్తుంది.

"ఇలాంటి చిత్తం కొంచెం సంకోచం చెందితే, సత్త్వము– అసత్త్వము (వుండుట–లేకపోవుట), భావము –అభావము (కనిపించుట–కనిపించక పోవుట) వంటి అంచులు రెండేసి ఏర్పడతాయి. అదే సృష్టి.

"అదే చిత్తం పరిపూర్ణంగా వికాసాన్ని పొందితే, ఇక దానిలో అంచులు లేవు. ఖండాలు లేవు. అది శాశ్వతం.అది సన్మాత్రం. అది పరబ్రహ్మము. దాన్ని గురించి నువ్వు అడుగుతున్నావు.

"రాక్షసీ! మా మంత్రి నీ ప్రశ్నల్లో కొన్నింటికి సమాధానాలు చెప్పి, మిగిలినవాటికి కూడా సమాధానాలు వాటితో వచ్చినట్టే– అని చెప్పాడు. ఐనా నేను వాటికి కూడా విడిగా సమాధానాలు చెపుతాను.

"కర్కటీ! నువ్వు చాలా ప్రశ్నల్లో పరమాత్మను గురించి మాట్లాడుతూ, "అణువు అణువు" అంటూ శబ్ద ప్రయోగం చేశావు. మా మంత్రి దీనికి అర్థం చెపుతూ "పరమాత్మ ఆకాశం కంటే కూడా సూక్ష్మమైన వాడు కనుక, అంటే పరమాత్మ ఏ ఇంద్రియాలకూ అందడు కనుక, ఆయనను అణువనవచ్చును" అని చెప్పాడు. నువ్వు తెలివి తక్కువతనంగా ఈ మాట ఒప్పేసు కున్నావు. ఆవ గింజా సూక్ష్మమైనదే, ఆకాశమూ సూక్ష్మమైనదే. అంత మాత్రంచేత ఆకాశాన్ని ఆవగింజతో పోల్చ వచ్చునా?

"ఆకాశం ముందు ఆవగింజ ఎటువంటిదో, పరమాత్మ ముందు ఆకాశం అటువంటిది.ఇక ఆయన ముందు అణువు అనేది ఎటువంటిదో నువ్వే ఆలోచించుకో. అలాంటి అణువును తెచ్చి దానికి పరమాత్మతో పోలిక పెడుతున్నావే, అది సముచితమా?

"మరైతే వేదంలో "అణో రణీయాన్" అనీ, "ఏషః అణుః ఆత్మా" అనీ, ఇలాంటి వాక్యాలున్నాయి గదా, వాటిల్లో పరమాత్మ అణువు కంటే అణువనీ, పరమాత్మే అణువనీ, పద ప్రయోగాలు చేశారు కదా, వేదమే స్వయంగా పరమాత్మను పరమాణువుతో పోల్చి చెపుతుంటే, నువ్వు ఆక్షేపిస్తావేమిటి?–అంటావేమో?! విను.

"నువ్వు చెప్పిన వాక్యాల్లో వేదమాత పరమాత్మను అణువుతో పోల్చలేదు. మాయవల్ల పరమాత్మ అణువు కంటే అణువుగా కనిపిస్తాడని చెప్పింది. కనుక 'అణు' పదాన్ని నువ్వు ఉపయోగించిన సందర్భం వేరు– వేదమాత ఉపయోగించిన సందర్భం వేరు. పరమాత్మను అణువుతో పోల్చడం మాత్రం తగదు.

"ఐనా, నువ్వు ఆ ప్రయోగం చేశావు కనుక, దానిని ఏదో రకంగా సమర్థించాలని మా మంత్రి అలా చెప్పి వుంటాడు. నిజానికి పరమాత్మ స్థూలమూ గాదు, సూక్ష్మమూ గాదు."

రాజు ఈ విధంగా ప్రారంభించి, కర్కటి ప్రశ్నకు మళ్లీ మరో రకమైన ప్రక్రియతో సమాధానాలు చెప్పుకొంటూ వచ్చాడు. చిట్టచివరికి కర్కటి అడిగిన 72వ ప్రశ్నను తీసుకున్నాడు. దీనిలో రెండు భాగాలున్నాయి.

**శ్లో॥ కేనేద మాతత మనేక చిదేవ విశ్వం**
**కింసార ఏవ మతివల్గసి హంసి పాసి౹**

కోటాను కోట్ల జీవులు గల ఈ విశ్వాన్ని విస్తరింప చేసిన వాడెవడు? నువ్వు బ్రతుకంతా వ్యవహారాలు చేస్తూనే వున్నావు. కొందరిని చంపుతున్నావు. కొందర్ని రక్షిస్తున్నావు. ఇదంతా ఏ సారం నీలో వుండబట్టి చేయ గలుగుతున్నావు?– ఇది ప్రశ్నలో మొదటి భాగం. ఇక రెండ భాగంలో–

**కిం దర్శనేన న భవస్యథవా సదైవ**

**నూనం భవస్య మలదృగ్వద న స్స్వశాన్త్యై ॥** (ఉ.ప్ర.స.79, శ్లో.32)

అని వుంది. "నువ్వు నిర్మల దృక్స్వరూపుడవై వున్నావు గదా! దాని కంటే భిన్నుడవు కాకుండా జీవిస్తున్నావు గదా! ఎవరి దర్శనంవల్ల నీకీ స్థితి లభించింది?" అని దాని భావం.

దానికి రాజు సూటిగా ఇలా సమాధానం చెప్పాడు.

**ద్వైతేన సుందరతరం స్వమనుజ్ఝితేన**

**రూపం సుషుప్తి సదృశేన యథావబోధాత్**

**ఐక్యం గతం స్థితి గమాగమ ముక్త మేవ**

**మిత్థం స్థితం తను జగత్ పరమార్థ పిండః॥** (ఉ.ప్ర.స.81, శ్లో.107)

ఇది ఒక ప్రౌఢమైన శ్లోకం.

అవబోధాత్– యథా– ఐక్యం –గతం– సుందరతరం– స్థితి గమాగమ ముక్తం– స్వం– అనుజ్ఝితేన– సుషుప్తి సదృశేన ద్వైతేన – ఏవం– ఇత్థం– స్థితం– తను జగత్– పరమార్థ పిండః

"ఇప్పుడు ద్వైతం కనిపిస్తోంది, నానాభేదాలు గల ప్రపంచం కనిపిస్తోంది. కానీ ఇప్పుడు కూడా యీ ద్వైతం నా ఆత్మతత్త్వాన్ని వదిలిపెట్టి విడిగా లేదు.ఎలాంటి ఆత్మ తత్త్వాన్ని? ఏకస్వరూపంగా వున్నదీ, ఆనంద స్వరూపమైనదీ, సృష్టి స్థితిలయలు లేనిదీ, అయిన ఆత్మతత్త్వాన్ని అది వదిలిపెట్ట లేదు. అందుకే ఈ ప్రపంచం నాకు మెలకువ వచ్చినాక కూడా నిద్ర లాగా వుంది. ఈ కనిపించే ప్రపంచద్వైతం ఇలా వుంది గనుక, ఈ క్షుద్రమైన జగత్తంతా నాకు పరమాత్మ పిండం గానే వుంది. గడ్డ కట్టిన పరమాత్మగానే వుంది"– అన్నాడు రాజు.

ఇదే ఆ రాజుకు లభించిన దర్శనం. ఇట్టి దర్శనం లభించింది కనుక, నేను అద్వితీయ బ్రహ్మైక స్వరూపుణ్ణే అని తేల్చి చెప్పినట్లయింది.

కిరాతరాజు ఇంత ధాటిగా ఆత్మ తత్త్వ ప్రతిపాదన చేసేసరికి, కర్కటీరాక్షసికి ఆశ్చర్యం పట్టరానిదై పోయింది. అంతటి ఆనందమూ కలిగింది.ఆమె రాజును, మంత్రిని అభినందించింది.

"రాజా! మీ ఇద్దరి బుద్ధీ ఎంత పవిత్రమైనది! అది అస్తమయమే లేని సూర్యుడి లాగా ప్రకాశిస్తున్నది. మీ బోటి సత్పురుషుల సాంగత్యంవలన సంసార బంధాలనే చీకట్లు తొలగి పోతాయి. మీరు ఎంతో పూజనీయులు. కనుక మీకు వరాలు ఇవ్వదలుచు కుంటున్నాను, కోరుకోండి."అనేసింది.

## 71. రాక్షసి దేవత

అది విని రాజు వెంటనే ఇలా అడిగేశాడు.

"రాక్షసీ! మా ప్రాంతాల్లో ఈ మధ్య విషూచికా వ్యాధి (కలరా వ్యాధి) బాగా వ్యాపించేసింది.చాలా మంది జనం మరణిస్తున్నారు. ఎవరైనా సత్పురుషులు కనిపిస్తారేమో, ఈ వ్యాధి నివారణకు మంత్రోపదేశం ఏదైనా చేస్తారేమో, అని నేను అన్వేషిస్తూ ఇటు అటూ తిరుగుతున్నాను. ఇప్పుడు ఆ వ్యాధి స్వరూపిణివి నువ్వే దొరికావు.

"అజ్ఞులై పొరపాట్లు చేసే వాళ్ళని పొట్టన పెట్టుకోవడం నీ పని, అదుపు లేకుండా పెచ్చు పెరిగి పోయే నీ బోటి వాళ్ళకు అంకుశం వేయడం నా పని. ఇప్పుడు నువ్వు నాకు దొరికావు. కనుక ఇక నుంచీ ఏ జీవినీ హింసించనని వరం ఇవ్వు."

ఆ మాటలు విని రాక్షసి ఏమీ కోపగించు కోలేదు. సంతోషంగా 'తథాస్తు' అనేసింది.

ఆశ్చర్య పడటం రాజు వంతైంది. ఆయన త్వరగానే తేరుకొని "రాక్షసీ! ఇన్నేళ్ళుగా పరుల రక్తమాంసాలు పీల్చుకు తింటూ బ్రతికావు కదా! ఇప్పుడు ఉన్నట్టుండి అహింసా వ్రతం చేపడతానని ప్రతిజ్ఞ చేస్తే, అది ఎలా కుదురుతుంది? నువ్వు బ్రతికే మార్గమేమిటి?" అని అడిగాడు.

రాక్షసి ఇలా సమాధానం చెప్పింది.

"రాజా! 6 నెలలుగా ఈ కొండమీద సమాధిలో కూర్చొని ఇప్పుడే లేచి వచ్చాను. పూర్వ కర్మ బలంవల్ల ఇప్పుడు ఆహారం తిందామనే సంకల్పం కలిగింది. పుణ్య బలం లేకపోవడం వల్ల ఆ కోరిక తీర లేదు. కానీ నీలాంటి సత్పురుషుల సాంగత్యం లభించింది. కనుక ఇక ఆహార చింత మానేసి, మళ్ళీ కొండమీదకు వెళ్ళిపోయి, మళ్ళీ ధ్యానంలోకి ప్రవేశిస్తాను. అలా ధ్యానంలో వుంటూనే ఏదో ఒక రోజున ఈ శరీరాన్ని వదిలేస్తాను. అంతే గాని, మళ్ళీ పరహింస మాత్రం చేయనే చేయను.

"ఇంతకూ, రాజా! నువ్వు దివ్యదృష్టితో నేను విషూచికా వ్యాధి దేవతనని గ్రహించినట్లున్నావు తప్పితే, నా విషయం పూర్తిగా గ్రహించినట్లు లేదు. నేనే చెపుతాను విను. నా పేరు కర్కటి."

అని ఇలా మొదలు పెట్టి, ఆ రాక్షసి తన చరిత్ర అంతా వివరించి చెప్పింది. చెప్పి చెప్పి, చివరికి రాక్షసి–

'రాజా! బ్రహ్మదేవుడు విషూచికా మంత్రం అనుగ్రహించాడని చెప్పాను కదా! ఆ మంత్రాన్ని మీ ఇద్దరికీ ఉపదేశిస్తాను. నదీతీరానికి రండి" అంది.

ముగ్గురూ కలిసి నదీ తీరం చేరారు. రాజు, మంత్రి నదీ స్నానం చేసి, మంత్రోపదేశం తీసుకున్నారు. ఉపదేశం అయిన వెంటనే కర్కటీ రాక్షసి వెళ్ళొస్తాను అంటూ సెలవు తీసుకోసాగింది.

అప్పుడు రాజు ఇలా అన్నాడు. "అమ్మా! నువ్విప్పుడు మాకు స్నేహితురాలివి మాత్రమే కాక, గురువు కూడా అయ్యావు. కనుక మా ఆతిథ్యం తీసుకోకుండా వెళ్ళటానికి వీల్లేదు. ఐతే ఒక చిన్న విన్నపం. నువ్వు మా దేశపు పెద్ద ముత్తైదువు లాగా రూపం మార్చుకొని మా ఇంటికి రావాలి."

అది విని కర్కటి పకపకా నవ్వి ఇలా అంది.

"రాజా! అందమైన ఆడదాని వేషం వేసుకుంటే అన్నం పెడతారు. కానీ నా అసలు రూపం ఏమై పోతుంది? అది లోపలే వుంటుంది. ఆ రూపానికి రక్తమాంసాలే రుచిస్తాయి. నేను రాక్షసిగా జన్మించాను. నాకు మధ్యలో జ్ఞానం వచ్చినా, నా శరీర స్వభావం మారదు. నేను మరణించే దాకా రాక్షసిగానే వుంటాను.ఆ ఆహారమే తింటాను. వద్దనుకుంటే పస్తులుంటాను. అంతే గానీ ఈ అన్నసంతర్పణలతో నాకు ప్రయోజనం ఏమీ వుండదు. పుట్టుకతో వచ్చిన రాక్షసి స్వభావం, చచ్చే వరకూ మారదు. అది అంతే!"

ఈ సమాధానం విని, కిరాతరాజు ఆలోచించి ఇలా అన్నాడు–

"రాక్షసీ! నువ్వు చెప్పింది నిజం. జ్ఞానం కలిగిన తరువాత బుద్ధిలో గల దుస్సంస్కారాలు తొలగి పోతాయి. సత్సంస్కారాలు మొలకెత్తుతాయి. అంతే గానీ శరీర సంస్కారాలు మారవు. అంటే జ్ఞానం కలిగిన తర్వాత పొట్టిమనిషి పొడుగు అయిపోడు. అలాగే వరి తినేవాడు గోధుమ తినేవాడుగా మారడు. కనుక నువ్వు బ్రహ్మ జ్ఞానివైనా, నీకు మాంసాహారమే కావాలి.

"మాంసాహారి అయినా సరే, బ్రహ్మవేత్త పూజ్యుడే. కనుక నీకు నేను అతిథి మర్యాదలు చేసి తీరాలి. నీకు నరమాంస భోజనం లభించేందుకు నేను ఒక ఉపాయం చెపుతాను. విను.

"నువ్వు పెద్ద ముత్తైదువుగా వేషం మార్చుకొని, కొన్నాళ్ళు మా ఇంట్లో వుండిపో. ఈ లోగా నేను మా రాజ్యంలో మరణదండన పడ్డ నేరగాళ్ళందరినీ పోగేసుకొస్తా. నువ్వు వాళ్ళందరినీ నీ కొండగుహలోకి చేర్చి, అక్కడే ఆరగించు. నా మరణదండన నెరవేరినట్లూ అవుతుంది. నీ ఆకలి తీరనూ తీరుతుంది.

“ఇలా ఆకలి తీర్చుకొని, వెంటనే బ్రహ్మ సమాధిలోకి వెళ్ళిపో. మళ్ళీ ఆకలి పుట్టినప్పుడు, సరాసరి ఇక్కడికే వచ్చేసెయ్యి. మరణశిక్ష పడ్డ వాళ్ళందరినీ ఉరితీయ కుండా నీ కోసం అట్టి పెడతాను. అలాంటివాళ్ళను చంపుకుతింటే పాపమేమీ లేదు. కనుక, నువ్వు నిష్పాపంగా నరమాంస భక్షణ చేయవచ్చు.

“ధర్మబద్ధమైన హింస దయతో సమానమని పెద్దలు అంటారు. తప్పులు చేసినవారిని వట్టిగా ఉరితీసే బదులు, నీకు ఆహారంగా వేస్తే, దానివల్ల వాళ్లకు కూడా కొంచెం పుణ్యం లభిస్తుంది. ఆ విధంగా అది నాకూ మంచిదే.

“కనుక కర్కటీ! ఇలా మన స్నేహం కొనసాగించుకుంటూ వుందాం.”

రాజు ఆ విధంగా చెప్పేసరికి, కర్కటి అంగీకరిం చేసింది. పట్టుచీర, ముత్యాల హారాలు, దండ కడియాలు, ధరించిన పెద్ద ముత్తైదువుగా రూపం మార్చుకొని, ఆ రాజు అంతఃపురంలో ఆరు రోజుల పాటు మకాం చేసింది. ఈ లోగా రాజు, మంత్రీ కలిసి, మరణదండన పడ్డ నేరగాళ్లను మూడు వేల మందిని పోగేసుకు వచ్చారు.

అది చూసి, కర్కటి రాక్షసి తన రాక్షస రూపంలోకి వచ్చేసింది. అది మామూలు రూపమా?! ఆ రాక్షసి కొండ లాగా పెరిగిపోయి, రెండు చేతులూ చాచి, ఒక్క సారి పట్టు పట్టేసరికి, మూడు వేల మంది నేరగాళ్లూ దాని కౌగిట్లో కోతిపిల్లల్లాగా ఇరుక్కుపోయి, గిలగిల లాడారు. క్షణాలలో ఆ రాక్షసి వాళ్లందరినీ హిమవత్పర్వత గుహకు చేర్చి, కసకసా నమిలి మింగేసింది.

ఆ దెబ్బతో రాక్షసికి మత్తు ముంచుకు వచ్చి, మూడు రోజులపాటు ఒళ్లు తెలీకుండా నిద్రపోయింది. లేచాక స్నానం చేసి, సమాధిలో కూర్చొంది. ఆ కూర్చోవడం కూర్చోవడం, ఆరు సంవత్సరాల తరువాత కళ్లు తెరిచింది. కొంచెం ఆకలి అనిపించి, కిరాతరాజ్యానికి వచ్చింది. అక్కడ పూర్వం లాగానే నేరగాళ్లను పోగేసుకొని వచ్చి ఆకలి తీర్చుకుంది.

ఈ విధంగా కిరాత రాజ్యానికీ, కర్కటీరాక్షసికీ, స్నేహ సంబంధాలు చాలా కాలం కొనసాగాయి.

## 72. బ్రహ్మజ్ఞానానికి చేసే పూజ సకల కామప్రదం -

ఇది ఇలా జరుగుతూ వుండగా, ప్రజలకు కొన్ని వింత అనుభవాలు కలుగుతూ వచ్చాయి.

1.కర్కటీరాక్షసి వచ్చి వెళ్లినప్పుడల్లా, ఆ రాజ్యంలో పిశాచబాధలన్నీ ఎగిరిపోతూ వుండేవి.

2.ఆవిడ వచ్చినప్పుడు, ఆవిడ ఆశీస్సులు పొందినవారికి రోగాలు తగ్గేవి.

3.ఏ నేరగాళ్లను ఆవిడ ఆరగిస్తూ వుండేదో, వాళ్లకు ఉత్తమగతి కలగడం వల్ల ఆ నేరగాళ్ల వంశంలో ఉత్తమజీవులు జన్మిస్తూ వుండేవారు.

4.ఈవిడ వచ్చి వెళ్లే రాజ్యంలో ప్రకృతి వైపరీత్యాలు తలెత్తేవి కావు.

ఇలాంటి అనుభవాలవల్ల మెల్లిగా కర్కటీకథ ఇతర రాజ్యాలకు కూడా వ్యాపించింది. దాంతో ఆ రాజులు కూడా కర్కటీ రాక్షసిని తమ తమ రాజ్యాలకు ఆహ్వానించి, తమ తమ నేరగాళ్లను ఆ మహాతల్లికి నైవేద్యంగా పెట్టసాగారు. దీనితో కర్కటీకీర్తి విస్తరించింది గానీ, ఆవిడకు ఆకలి తక్కువైపోయి, సమాధులు ఎక్కువైపోయి, ఆవిడ రాజ్యాలకు రావడమే తగ్గిపోయింది. దాంతో ప్రజలకు వ్యాధులు, ప్రకృతి ఉపద్రవాలు, పెరిగిపోయాయి. క్రమంగా ప్రజలే దీనికి ఉపాయం కనిపెట్టారు.

ఆవిడ తమ రాజ్యాలకు రావడం ఆలస్యమైతే, ప్రజలే ఆవిడ వుండే గుహ దగ్గరకు వెళ్లి, ఆ గుహ వాకిట్లోనే కూర్చొని, అక్కడే కర్కటీ పూజలు చేసేవారు. అందువల్ల ఈ పూజలకు "కందరా పూజలు" అనే పేరు వచ్చింది. 'కందరా' అంటే గుహ. ఆ పూజవల్ల ప్రజల ఉపద్రవాలన్నీ శాంతిస్తూ వుండేవి.

క్రమంగా ప్రజలు మరో అడుగు ముందుకు వేశారు. వాళ్లకు ఉత్పాతాలు మరీ పెరిగినప్పుడు, ఇళ్లల్లోనే కర్కటీ విగ్రహాలు పెట్టుకొని పూజలు చేసేవారు. దీనికీ సత్ఫలితాలే వచ్చాయి. ఈ పూజలనూ 'కందరా పూజ'లనే పిలిచారు. క్రమంగా ఆ దేవత పేరే **'కందరాదేవి'గా** మారిపోయింది.

క్రమంగా **'కర్కటీదేవి'** పేరు **'కందరాదేవి'** గా మారిపోయేసరికి, కందరా అంటే అర్థమేమిటనే విచారణ మొదలైంది. గుహలో వుండే దేవి కనుక కందరా దేవి – అని కొందరు అర్థం చెపితే, మరికొందరు పండితులు, దుష్టుల తలలను చీల్చే దేవి, **'కం దారయతీతి కందరా'** – అని నిర్వచనాలు చెప్పారు.

కర్కటికి కొత్త పేర్లు అక్కడితో ఆగలేదు. కొందరు ఆమెను మంగళాదేవి అన్నారు. మంగళాలను కలిగిస్తుంది కనుక ఆమెను మంగళా అన్నారు. మరి కొందరు ఆమెను అమంగళా దేవి అన్నారు. ఆమె పాపులను హింసిస్తూ వుంటుంది కనుక, హింస అమంగళం కనుక, ఆమె అమంగళాదేవి అని వాళ్లు వ్యాఖ్యానించారు.

క్రమంగా, ఏ గ్రామంలో కందరాదేవి పూజలు జరగటం లేదో, ఆ గ్రామంలో ప్రజలకు పీడలు పెరిగిపోతున్నాయనే వార్త నాలుగు ప్రక్కలా వ్యాపించింది. దాంతో ఊరూరా కందరా దేవి దేవాలయాలే వెలశాయి. అదేమి విచిత్రమో, ఆ దేవాలయాల్లో పూజలు చేసిన కొద్దీ, ఆ ప్రాంతాలకు సకల సంపదలూ పెరుగుతూ వుండేవి.

ఈ కథంతా చెప్పి, చివరికి వశిష్ఠుడు శ్రీరాముడితో ఇలా అన్నాడు–

రామా! నేను నీకు కల్పిత కథ చెప్పలేదు. కిరాతరాజ్యంలో కర్కటీ విగ్రహాలు ఇప్పటికీ వున్నాయి. బ్రహ్మజ్ఞాని ఐన కర్కటీ రాక్షసి ఆ విధంగా కిరాత గ్రామదేవతగా మారింది.

తెలిసి చేసినా, తెలియక చేసినా, బ్రహ్మవేత్తలకు చేసే పూజ సత్ఫలితాలను ఇవ్వకమానదు. బ్రహ్మవేత్త సాక్షాత్తుగా బ్రహ్మస్వరూపుడు కనుక, ఆయనకు చేసే పూజవల్ల కోరిన కోరికలన్నీ సిద్ధించటంలో ఆశ్చర్యం లేదు.

ఇంతకూ, రామా! నేను నీకు ఈ కర్కటీ కథను ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే, ఈ జగత్తుకు ఈ రూపం ఎలా వచ్చింది? అనే ప్రశ్నను గురించి చర్చించే సందర్భంలో ఈ కథ గుర్తుకు వచ్చింది.

గమనిక– లీలోపాఖ్యానం తరువాత వశిష్ఠుడికీ రాముడికీ మధ్య పెద్ద చర్చ జరిగింది. ఆ చర్చ చివరలో **శ్రీరాముడు** – "ఈ కనిపించేదంతా కల్పనే అయినప్పుడు, బ్రహ్మకు అజ్ఞానస్పర్శే లేనప్పుడు, జీవుడూ– బ్రహ్మే ఒక్కడే అయినప్పుడు, ఇంకా మోక్షం కోసం ప్రయత్నమేమిటి? ఆత్మ విచారణమేమిటి?" అని ప్రశ్నించాడు. దానికి సమాధానంగా వ్యవహార కల్పిత బంధమోక్ష వ్యవస్థా వివరణ రూపంగా, వశిష్ఠమహర్షి ఈ సూచికోపాఖ్యానాన్ని మొదలు పెట్టాడు. ఈ విషయాన్నే వశిష్ఠ మహర్షి ఇక్కడ గుర్తు చేస్తున్నాడు.

రామా! ఈ కర్కటీ కథలో కర్కటికి సూది ఆకారం ఎలా వచ్చింది? మళ్లీ కొండంత ఆకారం ఎలా వచ్చింది? ఈ ఆకారాలు కర్కటి కంటే భిన్నాలా, అభిన్నాలా? రెండూ కాదు. కర్కటియొక్క సంకల్పమే ఆయా ఆకారాలుగా మారింది. అలాగే జీవుల సంకల్పాలే ఈ లోకాలుగా పుడుతున్నాయి. కాలత్రయ సృష్టులు, లోకత్రయ సృష్టులు, అన్నీ ఇలాగే జరుగుతున్నాయి.

సముద్రంలోని అలలు సముద్రం కంటే భిన్నాలూ కావు, అభిన్నాలూ కావు. అలాగే ఈ లోకాలన్నీ పరబ్రహ్మముకంటే భిన్నాలూ కావు, అభిన్నాలూ కావు.

## 73. భావనవల్లే జన్మ - భావనవల్లే నాశం

వశిష్ఠుడు ఇంత ధాటిగా ముందుకు పోతుంటే, శ్రీరాముడు ఆయనను ఆపి, ఇలా ప్రశ్నించాడు– " గురుదేవా! భిన్నమూ, అభిన్నమూ, రెండూ కాకపోతే, ఈ లోకాలన్నీ ఇంత స్పష్టంగా ఎలా కనిపిస్తున్నాయి? ఇన్ని రకాల పనులను ఎలా చేయ గలుగుతున్నాయి"? అని.

వశిష్ఠమహర్షి 'అదే చెప్పబోతున్నాయ్యా!' అంటూ తన సమాధానాన్ని కొనసాగించాడు.

**అజ్వలన్నేవకాష్ఠేషు వహ్నిరర్థ క్రియాం యథా ।**

**కరోతి మర్కటాదీనాం శీతాపహరణాదికమ్ ॥** (ఉ.ప్ర.స.84, శ్లో.8)

(తా॥ కట్టెలలో వుండే నిప్పు మంటలు మండకుండానే, కోతులకు చలిపోగొట్టటం వంటి యథార్థక్రియలను ఎలా చేయగలుగుతోందో, అలాగే నిజంగా లేని యీ సృష్టి యిన్ని పనులూ చేస్తోంది)

రామా! జంతుశాస్త్రంలో కోతుల మనస్తత్వాన్ని గురించి చదువుకున్నావు, గుర్తుంది కదా! కోతులకు బాగా చలివేస్తే కొన్ని రకాల చెట్టుకొమ్మలను గట్టిగా కౌగలించుకుంటాయి. ఆ చెట్టుకొమ్మలు ఒక దానికొకటి ఒరుసుకున్నప్పుడు కారుచిచ్చు పుట్టటాన్ని అవి చూసి వున్నాయి కనుక, ఆ కట్టెల లోపల నిప్పు వుందని వాటికి గట్టి విశ్వాసం ఏర్పడుతుంది. అలాంటి విశ్వాసంతో అవి ఆ కొమ్మలను కౌగలించుకుంటాయి కనుక, వాటి చలి నిజంగానే పోతుంది. ఇది ఎలా జరుగుతుంది?

ప్రపంచంలో ఎక్కడైనా సరే, ఒక వస్తువు నిజంగా వుండటం ముఖ్యం కాదు. అది వుందని ఒకానొక వ్యక్తి భావించటమే ముఖ్యం. ఆ భావన దృఢంగా వుంటే, ఆ వస్తువు అక్కడ వున్న ఫలితం లభించి తీరుతుంది– అని పై ఉదాహరణ నిరూపిస్తోంది.

దీన్నే కొంచెం శాస్త్ర పరిభాషగా చెప్తే " ఒక వస్తువు వుండటమంటే, అది వున్నట్టు మనం భావించటమే" అని చెప్పవచ్చు. అలాగే ఒక వస్తువు నశించడమంటే, దాని గూర్చిన భావన నశించడమే– అని కూడా చెప్పవచ్చు.

మరి కొన్ని ఉదాహరణలు చెపితే బాగుంటుంది. ఒక శిల్పి చెక్కముక్క మీద బొమ్మ చెక్కాడు. వాడి దృష్టిలో అక్కడ ఒక కళాఖండం వుంది.

ఇంటికి వచ్చిన దొంగ మంచి వస్తువుల కోసం వెతుక్కుంటూ, దీనిని పనికిరాని చెక్కముక్కగా ప్రక్కన పారేశాడు. వాడి దృష్టిలో అక్కడ చెక్కముక్కే వుంది.

చలికి తట్టుకోలేని కోతి అదే చెక్కను కౌగలించుకొని "ఆహా! ఎంత వెచ్చగా వుంది" అనుకొంది. దానికి ఆ చెక్కలో నిప్పు కనిపిస్తోంది.

ఒక బోయ స్త్రీ ఆ చెక్కముక్కను చూసి, మంచి కట్టెపుల్ల దొరికిందని పొయ్యిలో పెట్టింది. ఆవిడ దృష్టిలో అక్కడ కట్టెపుల్లే వుంది.

ఇంతకూ అక్కడ వున్న వస్తువేది? చెక్కముక్కా? కట్టెపుల్లా? కళాఖండమా? నిప్పురవ్వా? అగ్గిపుల్లా? ఎవరి అనుభవాన్ని మనం తిరస్కరించగలం? కనుక, ప్రపంచంలో మనం ఏదీ తేల్చి చెప్పలేం. కనుక, వస్తువు వుండటమంటే, వున్నదని భావించడమే– అని అంగీకరించక తప్పదు.

అలాగే, చిన్న విత్తు తెచ్చాం. నేలలో పాతాం. నేల నేలగానే వుంది. చెట్టు మాత్రం పెరిగిపోతోంది. కాండము, కొమ్మలు, రెమ్మలు, ఆకులు,పూలు, పిందెలు, పళ్లు ఒకదాని మీద ఒకటి పేరుకు పోతున్నాయి. ఇప్పుడు చూడు, విత్తులోంచి కాండం పుట్టింది. కనుక, విత్తూ కాండమూ ఒకటే. కాండంలోంచి కొమ్మ

పుట్టింది కనుక, కాండం–కొమ్మా ఒకటే. కాబట్టి విత్తూ– కొమ్మా –రెమ్మా ఒకటే. ఇలాగే ఆలోచించుకుంటూ పోతే విత్తు– పండు ఒకటే. ఇది తర్క సమ్మతంగానే వుంది కదా! ఇప్పుడు చెప్పు. మనం దేన్ని చూసి పండు అంటున్నాం? విత్తును చూసి. మనం దేన్ని చూసి కాండం అంటున్నాం? విత్తును చూసి. అంటే మనం విత్తునే చూసి, ఒక సారి కాండం అంటున్నాం, ఒక సారి కొమ్మ అంటున్నాం, ఒక సారి కాయ అంటున్నాం.

మనం నిజంగా విత్తును చూసే ఈ మాట అంటున్నామా? అదీ లేదు. విత్తు లేకుండా చెట్టు రాదని మనకో దృఢ విశ్వాసం వుంది. దానివల్ల, విత్తును కూడా చూడకుండానే, దానిమీద కాండాన్ని, కొమ్మలను, పూలను, పిందెలను, పళ్లను, ఆరోపణ చేసేస్తున్నాం. ఇదంతా దేనివల్ల జరుగుతోంది? భావనవల్లే జరుగుతోంది.

కనుక, రామా! ఒకానొక ద్రష్టయొక్క భావనాబలంచేత ఈ ప్రపంచమనేది ఏర్పడుతోంది. కొన్ని పనులు చేస్తోంది, లేదా చేస్తున్నట్టు కనిపిస్తోంది. ఇలా ఏలా జరుగ గలుగుతోంది?

చెక్కముక్క మీద ఒకడు కళాఖండాన్ని, మరొకడు నిప్పురవ్వని, మరొకడు కట్టెపుల్లను, ఆరోపించినట్టుగా, అలాగే విత్తుగింజమీద ఒకడే ఒక సారి కాండాన్ని, ఒక సారి కొమ్మను, ఒక సారి పిందెను, ఒక సారి పండును, ఆరోపించినట్లుగా, పరిశుద్ధమైన చైతన్యం మీదనే మనం ఈ ప్రపంచాన్ని ఆరోపిస్తున్నాం.

భావనాబలం వల్ల వస్తువు ఉత్పన్నమైనట్టే, భావనానాశం వల్ల అది నశిస్తుంది. అలాగే మనం ఆరోపించడం మానేస్తే, ఈ ప్రపంచం కనిపించటం ఆగిపోతుంది.

కనిపించే సమయంలో అది అధిష్ఠానమైన చైతన్యం కంటే భిన్నంగా కనిపిస్తుంది. కోతికి చెక్క వున్న చోట, దాని కంటే భిన్నమైన నిప్పు కనిపిస్తోంది కదా! ఇదీ అలాగే!

కాని కొంచెం నిదానించి ఆలోచించ కలిగితే, ఆ భేదం స్థిరంగా నిలబడదు. అందేకే ఈ ప్రపంచం భిన్నమూ కాదు, అభిన్నమూ కాదు– అని చెప్పాం.

నిదానించి ఆలోచించడం అన్నామే, దాన్నే ఆత్మ విచారణ అని అంటారు. రామా! నేను ఉపదేశించే యుక్తుల ఆధారంగా నువ్వు ఆలోచించటం మొదలు పెడితే నీకు ఆత్మవిచారణ పరిపుష్టమై, మూలభూతమైన పరబ్రహ్మ సాక్షాత్కరిస్తుంది.

ఈ జగత్తత్త్వాన్ని నిరూపించడానికే నీకు కర్కటీ చరిత్రను కథగా చెప్పాను.

***రాముడు:*** గురుదేవా!

**"తస్మాద్వా ఏతస్మా దాత్మనః ఆకాశ స్సంభూతః"**

ఆ పరమాత్మ నుంచీ ఆకాశాదిగా ఈ ప్రపంచం పుట్టింది.

**"యతో వా ఇమాని భూతాని జాయన్తే"**

ఎవరి నుంచి ఈ భూతాలన్నీ జన్మిస్తున్నాయో అదే పరబ్రహ్మ–

అని ఇలాంటి వేదవాక్యాలు చాలా వున్నాయి. వీటిలో "పరమాత్మ నుంచి ప్రపంచం పుట్టింది" అని పంచమీ విభక్తి వేసి చెపుతున్నారు. మీరు కూడా మీ మాటల్లో "శుద్ధ చైతన్యం నుంచి ప్రపంచం జన్మించింది" అని పంచమీ విభక్తినే ఉపయోగిస్తున్నారు. మట్టి ముద్ద నుంచి కుండ పుట్టిందంటే, మట్టిముద్ద– కుండ రెండూ ఒకటే అవుతాయా? కావు గదా? అలాగే మీరు చెప్పే శుద్ధ చైతన్యం, ఈ కనిపించే ప్రపంచం, రెండూ ఒకటే అవటం ఎలా కుదురుతుంది?

***వశిష్ఠుడు***: రామా! భాషలో అంతకన్నా చెప్పేందుకు వీలు లేదు. లోకవ్యవహారంలో మట్టిముద్ద వేరు, కుండ వేరు, అనే విశ్వాసం వుంది. దాన్ని ఆధారం చేసుకునే, ఆ పై తత్త్వాన్ని ఉపదేశించాలి. అందుకనే శ్రుతి పంచమీ విభక్తిని ఉపయోగించి ఉపదేశించింది. అంటే, వ్యావహారిక భేదాన్ని పురస్కరించుకొని, ఆ వాక్యాన్ని

ప్రయోగించింది. నేనూ అలాగే చేశాను.

విషయం పూర్తిగా అర్థమైతే, ఈ వ్యావహారిక భేదం వుండదు. అందుకనే శాస్త్రంలో **"జ్ఞాతే ద్వైతం న విద్యతే"** (ఉ.ప్ర.స.84, శ్లో.25) అన్నారు. అంటే, తెలిస్తే భేదమే లేదు- అని అర్థం.

తెలియక ముందు, వాడికి భేదం వుంది కనుక, దాన్ని ఆధారం చేసుకుంటూనే, పై బోధ చేయాలి. అంతకన్నా వేరే మార్గం లేదు.కనుక, విభక్తుల వాదాలు ప్రక్కన పెట్టి, వేదతాత్పర్యాన్ని అర్థం చేసుకో. అలాగే, మా తాత్పర్యాన్ని గూడా అర్థం చేసుకో.

ఈ ప్రపంచం అంతా మనస్సువల్లే తయారవుతోంది - అని చెప్పటమే నా తాత్పర్యం. అందుకోసమే కర్కటీ కథ చెప్పాను.

రామా! సంసారం, మోక్షం అనే మాటలకు శాస్త్రకారులు చాలా లోతైన నిర్వచనాలు చెపుతూ వుంటారు. వాటన్నిటి సారాంశం ఒక్క మాటలో చెపుతాను విను.

**చిత్తమేవ హి సంసారో రాగాది క్లేశ దూషితమ్ ।**

**తదేవ తై ర్వినిర్ముక్తం భవాన్త ఇతి కథ్యతే ॥** (ఉ.ప్ర.స.84, శ్లో.36)

రాగము, ద్వేషము, మొదలైన క్లేశాలతో కలసి వున్న చిత్తమే సంసారం. అవి లేని చిత్తమే మోక్షం.

ఈ చిత్తం యొక్క తత్త్వం నీకు బాగా అర్థం కావడం కోసం, **"ఐందవోపాఖ్యానం"** అనే అందమైన కథ చెపుతాను, విను.

## 74. కర్కటీ కథా సింహావలోకనం

ఈ విధంగా వశిష్ఠమహర్షి కర్కటీ కథను ముగించి, ఐందవ కథలోకి ప్రవేశించబోతున్నాడు. మనం కూడా దానిలోకి ప్రవేశించే ముందు కర్కటీ చరిత్రను ఒకసారి నెమరు వేసుకుందాం.

ఈ కర్కటీ కథకు ముందు లీలోపాఖ్యానం వచ్చింది. ప్రదేశమూ లేదు, కాలమూ లేదు, దృశ్యమూ లేదు, అని చెప్పటానికి ఆ కథ వచ్చింది. ఆ కథ అయిన తరువాత శ్రీరాముడు కీలకమైన చర్చ చేశాడు. ఆ చర్చలో కేంద్రబిందువు ఏమిటంటే "ఏమీ లేకపోతే మోక్షం కోసం కృషి ఎందుకు?" అని.

ఈ ప్రశ్నకు శాఖా ప్రశ్న ఏమిటంటే - "ఏమీ లేని చోట ఇంత ప్రపంచం దేనివల్ల కనిపిస్తోంది?"అని.

ఇవి రెండు ప్రశ్నలు. మొదటిది "మోక్షం కోసం కృషి ఎందుకు చేయాలి?" అని. ఇది పారమార్థిక దృష్టితో వేసిన ప్రశ్న. రెండవది "ఏమీ లేని చోట ఇంత సృష్టి కనిపించట మేమిటి?"అని. ఇది వ్యావహారిక దృష్టితో వేసిన ప్రశ్న. వశిష్ఠుడు ఈ రెండు ప్రశ్నలలో పారమార్థిక దృష్టి ప్రశ్నకు పారమార్థిక దృష్టితో సమాధానం చెపుతున్నాడు. వ్యవహారిక దృష్టి ప్రశ్నకు ఆ దృష్టితోనే సమాధానం చెపుతున్నాడు.

ఐనా చర్చ ఎంతకూ తెమలడం లేదు. రాముడు వేసిన ప్రశ్నలనే రూపాంతరంలో మళ్లీ మళ్లీ వేస్తున్నాడు. దానికి కారణమేమంటే, రాముడు ఆ రెండు దృష్టులను కలగాపులగం చేసేసుకొని, గందరగోళంలో పడిపోతున్నాడు. అందుకే, ఎన్ని రకాల సమాధానాలను చెప్పినా, రాముడికి తృప్తి కలగటం లేదు.

వశిష్ఠుడు ఈ గందరగోళాన్ని గుర్తించాడు. రాముడికి పారమార్థిక దృష్టిని, వ్యవహారికదృష్టిని, విడదీసి చూపించాలనీ, అందులో వ్యవహార కల్పితమైన బంధ మోక్ష వ్యవస్థను వివరించాలనీ నిశ్చయించుకున్నాడు. దాని కోసం గాను ముందుగా ఒక సర్గలో (67వ సర్గలో) మాయా తత్త్వాన్ని వివరించాడు.

వశిష్ఠమహర్షి చెప్పదలుచుకున్న సిద్ధాంతం ఏమిటంటే- ఏమీ లేని చోట ప్రపంచం కనిపించటం భ్రాంతి. దానికి కారణం పూర్వ సంస్కారం (పూర్వవాసన). దీనికి ఆది లేదు. అంతం మాత్రం వుంది. ఈ అంతం పేరే మోక్షం. ఇదే వ్యావహారిక బంధ-మోక్ష వ్యవస్థ.

దీనికి భిన్నంగా పారమార్థిక దృష్టి వేరే వున్నది. ఆ దృష్టిలో బ్రహ్మకు అజ్ఞానస్పర్శే లేదు. జీవుడు లేడు. దృశ్యం లేదు. ఇంకా మోక్షమెక్కడిది? కనుక, మోక్ష ప్రయత్నమూ లేదు.

ఈ రెండు దృష్టులనూ విడదీసి చూడాలి. అలా చూపించేందుకోసమే సూచికోపాఖ్యానం వచ్చింది.

ఈ కథలో ఒక రాక్షసి బ్రహ్మ వేత్తగా మారిపోయింది. అలా మారటానికి కారణం– దీనికి ఒకే జన్మలో దేహాలు మారటమే. ఇలా దేహాలు మారటంవల్ల, తాను శరీరం కంటే భిన్నంగా వున్నాననే జ్ఞానం ఆమెకు కలిగింది.

చివరికి, ఆ రాక్షసికి ఎవరి వరంతోనూ పని లేకుండానే ఆత్మజ్ఞానం కలిగింది. ఐనా రాక్షసి శరీరం అలాగే మిగిలి వుంది. అందువల్ల ఆకలి వేసింది. కానీ పూర్వం లాగా జీవుల్ని హింసించ బుద్ధి కాలేదు.

ఈ కల్పనవల్ల– బ్రహ్మజ్ఞానం కలిగినా, ప్రారబ్ధం మిగిలి వున్నంత వరకూ దేహము, దేహధర్మాలు, యథాతథంగా మిగిలే వుంటాయని, మనస్సంస్కారం మాత్రం మారిపోతుందని, వశిష్ఠుడు నిరూపిస్తున్నాడు.

దీనివల్ల, కర్కటీ రాక్షసిలో పారమార్థికమైన బ్రహ్మ– ఆత్మల ఐక్యం, వ్యావహారికమైన శరీర ధారణా, దానికి అనుబంధించిన శరీర సంస్కారాలూ, వేటికవి సాగిపోతున్నాయని మహర్షి నిరూపిస్తున్నాడు.

వ్యావహారిక దృష్టి, పారమార్థిక దృష్టి, అనేవి రెండూ కలగాపులగం కాకుండా వున్నప్పుడు మాత్రమే ఆత్మ విచారణ సఫలమవుతుందని చెప్పటానికే ఈ కథ మొదలైందని మనం మరచిపోరాదు.

ఐతే, పనిలో పనిగా మహర్షి ఈ కథలో మరి కొన్ని అంశాలను కలిపేశాడు. ఏమిటంటే–

1. బ్రహ్మజ్ఞాన ప్రాప్తికి రాక్షసులవంటి అధములు కూడా అర్హులే.

2. బ్రహ్మజ్ఞానమనేది ఒకరు వరం ఇస్తే వచ్చేది కాదు.

3. జీవులలోని పాపాల ప్రక్షాళనకు తపస్సే మార్గం.

4. శరీరం నేను కాదనే అనుభవం లభించకపోతే వేదాంతవిద్యలో ప్రవేశించినట్లే కాదు.

5. అలాంటి ప్రవేశం లభించాక ఆ పై సాధనకు విచారణ ఒక్కటే మార్గం.

6. అధమజాతివాడైనా సరే, బ్రహ్మవేత్త పూజ్యుడే.

7. బ్రహ్మవేత్తను పూజిస్తే, ఆయన సంకల్పంతో నిమిత్తం లేకుండానే, పూజించే వారికి శుభఫలాలు లభిస్తాయి. దీనికి కారణాన్ని గ్రంథంలో సూటిగా చెప్పలేదు. ఇక్కడ శాస్త్ర రహస్యాలు రెండున్నాయి.

క) బ్రహ్మవేత్త సకల దేవతా స్వరూపుడవుతాడు కనుక, ఆయనకు చేసే పూజ సంబంధిత దేవతలకు చేరి, ఫలితాలు వచ్చేస్తాయి.

ఖ) బ్రహ్మవేత్తకు మిగిలి వున్న పుణ్యఫలమంతా ఆయనను అభినందించే వారికి చెందుతుందనీ, ఆ కర్మ శేషంలో మిగిలి వున్న పాపం అంతా ఆయనను నిందించే వారికి చేరుతుందనీ, వేద ప్రమాణం వుంది. ఈ రెండు కారణాలనూ దృష్టిలో పెట్టుకొని వశిష్ఠుడు కందరా పూజల వివరణ చేశాడు.

8. ఈ సందర్భంలో వశిష్ఠుడు ఉత్తమ గ్రామదేవతలు ఏర్పడే విధానాన్ని వర్ణించడం గమనార్హం.

9. అలాగే, పండితులు పదాలకు కొత్త అర్థాలు చెపుతూ వుండటం, వున్న దేవతలకే కొత్త పేర్లు పెడుతూ వుండటం, మొదలైన అంశాలను గూడా ఇక్కడ మనం గమనించవచ్చు.

10. విషూచి వ్యాధి వర్ణన సందర్భంలో ఇనెఫెక్షన్‌ను వ్యాపింపచేసే స్థానాల వర్ణన ఎంతో విజ్ఞాన శాస్త్ర సమ్మతంగా వుండటాన్ని కూడా మనం గమనించవచ్చు.

11. వీటన్నింటికీ మించి వశిష్ఠమహర్షి నొక్కి చెప్పిన అంశం మరొక్కటి వుంది. అది కర్కటీ రాక్షసి కొత్త కొత్త శరీరాలను ధరించే సందర్భాలలో వుంది. కర్కటి కొత్త శరీరాలను ఎలా ధరించ గలిగిందంటే, తన మనః సంకల్పం వల్లనే– అని వశిష్ఠమహర్షి అక్కడ వర్ణించాడు. తద్ద్వారా వశిష్ఠమహర్షి చెప్పదలచుకున్నది

ఏమిటంటే, ప్రపంచంలో అన్ని దేహాలనూ సృష్టించేసేది మనస్సే– అని. ఈ తర్కాన్నే ఇంకొంచెం పెంచితే, ఈ ప్రపంచాన్ని మొత్తం సృష్టి చేసేది మనస్సే– అనే సిద్ధాంతం వస్తుంది. దీనిని నిరూపించటం కోసమే మహర్షి "ఐందవోపాఖ్యానం" అందుకో బోతున్నాడు.

ఈ సిద్ధాంతం ఇప్పుడెందుకంటే, లీలో పాఖ్యానంలో దేశ, కాల, దృశ్యాలు లేవని తేల్చాడు. ఆ పైన జరిగిన చర్చలో లేనివి ఎలా కనిపిస్తున్నాయి?– అనే ప్రశ్న వచ్చింది. దానికి భ్రాంతి, పూర్వ సంస్కారాలు, అనే సమాధానాలు వచ్చాయి. సంస్కారం అనేది మనస్సును ఆశ్రయించుకొని వుంటుంది. ఇంకా శాస్త్రీయంగా చెప్పాలంటే, సంస్కారాల సమూహమే మనస్సు. అదే భ్రాంతిని కలిగిస్తుంది. భ్రాంతే ప్రపంచ సృష్టి చేస్తుంది. ఇదీ వరస. ఈ వరుసలో ప్రపంచ కర్తృత్వం పరంపరగా మనస్సుకే పట్టింది. దాన్ని నిరూపించాలి. దాని కోసమే ఐందవోపాఖ్యానం మొదలవుతోంది.

## 75. ఐందవోపాఖ్యానం

వశిష్ఠమహర్షి ఇలా చెప్పసాగాడు.

***వశిష్ఠుడు:*** రామా! ఒకప్పుడు నేను మా నాన్నగారి దగ్గరికి వెళ్ళి "ఈ ప్రపంచ సృష్టులు ఎలా జరుగు తున్నాయి?" అని అడిగాను. దానికి సమాధానంగా ఆయన ఒక వింత కథ చెప్పాడు.

***బ్రహ్మదేవుడు:*** పుత్రా! వశిష్ఠా! పూర్వం ఒక సారి నా ఆయుర్దాయంలో ఒక పగలు పూర్తయింది. రాత్రి మొదలైంది. నా రాత్రి అంటే నీకు తెలుసు కదా! ఈ ప్రపంచం అంతా లయించి పోయింది? నేనొక్కణ్ణే మిగిలి వున్నాను. నాకు నిద్ర పట్టింది. కొంత సేపటికి తెల్లవారిందనిపించింది. మెలకువ వచ్చింది. లేచాను. పూర్వపు అలవాటు చొప్పున సృష్టి చేయాలనిపించింది. కళ్ళు తెరిచాను. ఇటూ అటూ చూశాను. ఏమీ కనిపించటం లేదు. వెలుతురూ లేదు. చీకటీ లేదు.అది శూన్యమా? అలాగే వుంది.

ఏమీ సాధన సంపత్తి లేకపోయినా, సృష్టి చేద్దామనే సంకల్పం ఆగలేదు. దానిని గురించి ఆలోచించిన కొద్దీ ఏదో ఒక అవ్యక్తమైన ఆకాశం లాంటిది కనిపించింది. అందులో కొన్ని బ్రహ్మాండాలు కూడా కనిపించాయి.

"అరే! బ్రహ్మాండాలా? ఎవరు సృష్టి చేశారు వీటిని?"

అని ఆశ్చర్యంగా వెతక సాగాను. ఒకరు కాదు, పదిమంది బ్రహ్మలు కనిపించారు. ప్రతివాడూ పద్మంలోనే వున్నాడు. ప్రతి వాడికీ రాజహంసే వాహనంగా వుంది. ప్రతివాడికీ నాలుగేసి ముఖాలున్నాయి. ఇంతెందుకు? పదిమందీ కూడా అచ్చం నాలాగే వున్నారు. నా ఆశ్చర్యం పెరిగిపోయి, ఇంకా వెదికాను.

ఈ బ్రహ్మాండాలన్నింటినీ పరిపాలించే విష్ణువొకడు కనిపించాడు. ఈ బ్రహ్మాండాలలో జీవులు కనిపించారు. నదులు, సముద్రాలు, సూర్యులు, పైన దేవతలు, మధ్యలో మానవులు, కింద దానవులు కనిపించారు. కొందరు భోగాసక్తులై వున్నారు. కొందరు మోక్షకాములై వున్నారు. వెలుగు– చీకట్లు పెనవేసుకొని కనిపిస్తున్నాయి. ఇలా ఎన్నో ఎన్నో కనిపించాయి.

నాకేం చేయాలో తోచలేదు. ఈ ప్రపంచాలేమిటో, ఎలా వచ్చాయో, అర్థం కాలేదు. ఎవరిని అడగాలో, ఎలా పలకరించాలో, తెలియలేదు. ఆ ప్రపంచాలలో నేనొక ఒంటరివాడి లాగా, వెఱ్ఱివాడి లాగా, తిరుగుతూ వుండి పోయాను.

వశిష్ఠా! గమనించావా? మొదట ఆ ప్రపంచాలలో అన్వేషణ మొదలు పెట్టింది నా మనస్సు. ఎప్పుడు వెళ్ళానో, ఎలా వెళ్ళానో, నాకే తెలియదు. ఇప్పుడు ఆ లోకాలలో అన్వేషిస్తున్నది నేనే, స్వయంగా నేనే!

కొంతసేపటికి, ఒక చోట ఒక సూర్యుడు కనిపించాడు. ఎందుకో అతను కొంచెం తీరిగ్గా వున్నాడు.

నేను కొంచెం ధైర్యం చేసి, ఆయన దగ్గరకు వెళ్ళి– "దేవదేవా! భాస్కరా! ఎవరివి నువ్వు? ఈ ప్రపంచాలెలా పుట్టాయి? నువ్వెలా పుట్టావు?" అని వినయంగా అడిగాను.

ఆ భాస్కరుడు నా వంక ఎగాదిగా చూసి, ఎప్పుడో  చాలా కాలం క్రిందట చూసిన మనిషిని చూసినట్లుగా గుర్తుపట్టి, చటుక్కున నమస్కరించి, వినయంగా ఇలా అన్నాడు.

***సూర్యుడు:*** బ్రహ్మదేవా! సృష్టికర్తలు, మీకే తెలియదా? నేను చెప్పాలా? సరే, నా మాటలు వినాలని మీకు సరదాగా వుంటే, అలాగే కానీయండి.

బ్రహ్మదేవా! పూర్వం మీరు సృష్టి చేసిన ఒకానొక బ్రహ్మాండంలో, జంబూద్వీపంలో "సువర్ణ జటము" అనే ప్రాంతం వుండేది. అక్కడ అందరూ మహర్షులవంటి వారే వుండేవారు. వాళ్లలో "ఇందువు" అనే బ్రాహ్మడు ఒకడు ఉండేవాడు. అతనికి ఎన్నాళ్ళకీ సంతానం కలగలేదు. అందువల్ల అతను భార్యతో కలసి కైలాసపర్వతం దగ్గరకు వెళ్ళి, అక్కడ శివుడి గురించి తపస్సు ప్రారంభించాడు. ఒక రోజా? రెండు రోజులా? ఆ దంపతులు రెండు యుగాలపాటు వరుసగా తపస్సు చేశారు.

అప్పుడు శివుడు ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. "ఉత్తములైన పుత్రులు పదిమంది కావాలి" అన్నాడు ఇందువు. 'తథాస్తు' అన్నాడు శివుడు. పదిమంది పుత్రులు పుట్టారు. వాళ్ళు ఏడు సంవత్సరాల వయసుకే పండితులై పోయారు. తల్లిదండ్రులిద్దరూ పరిపూర్ణమైన తృప్తితో బ్రహ్మధ్యానపరులై శరీరాలు చాలించారు.

ఉన్నట్టుండి తల్లిదండ్రులు పోయే సరికి, సోదరులు పదిమందికీ ఏమి చెయ్యాలో తోచలేదు. ఉన్న చోట వుండలేక పూర్వం తమ తల్లిదండ్రులు తపస్సు చేసిన చోటుకే వెళ్ళిపోయారు. అక్కడ తాము కూడా తపస్సు చేయాలని వారికి కోరిక కలిగింది.ఐతే, ఎలా చెయ్యాలి? ఎందుకు చెయ్యాలి? అని చర్చ మొదలైంది. ఆ చర్చ విచిత్రంగా సాగింది.

***ఒకడు:*** అన్నిటి కంటే గొప్ప సుఖాన్ని ఇచ్చే తపస్సు ఏది?

***మరొకడు***: గొప్ప ముఖ్యం కాదు. పరిణామంలో దుఃఖాన్ని ఇవ్వకుండా వుండే సుఖం కావాలి. దానికి ఉపాయం చెప్పు.

***మరొకడు:*** అలా ఐతే, గృహాధిపతి సుఖమే గొప్పది.

***మరొకడు:*** కాదు, గ్రామాధిపతి సుఖం మంచిది

***మరొకడు:*** దానికంటే మండలాధిపతి సుఖమే నయం.

***మరొకడు:*** గ్రామాధిపతి, మండలాధిపతి, దేశాధిపతి, సమ్రాట్టు, చక్రవర్తి, అని ఇలా వీళ్ళ సుఖాల కొలతలు మనకెందుకయ్యా? ఆ వరుసలో సర్వోన్నతుడు దేవేంద్రుడు. ఇంద్రైశ్వర్యం గొప్పది.

***పెద్దవాడు:*** తమ్ముళ్ళూ! నాకేవో పూర్వపు సంస్కారాలు గుర్తుకు వస్తున్నాయి. నేను పూర్వం ఏవో ఉపాసనలు చేసి, విఘ్నాలకు పడిపోయాను అనుకుంటాను. అది అలా వుంచండి. ఏ సుఖం గొప్పది, ఏ ఐశ్వర్యం గొప్పది? అని మీరు విచారిస్తున్నారు. ప్రాకృత లయందాకా ఏది నశించి పోకుండా వుంటుందో, అదే అసలైన ఐశ్వర్యం. అది హిరణ్యగర్భ పదవీ ప్రాప్తే కానీ, మరొకటి కాదు.

***మిగిలిన తమ్ముళ్ళు:*** చాలా బాగా చెప్పావు.ఆ ప్రాప్తి కోసం ఏ ఉపాసన చెయ్యాలో చెప్పు. నీకేదో గుర్తుకొస్తున్నట్లుగా వుంది గదా!

**పెద్దవాడు:**

**పద్మాసన గతో భాస్వాన్ బ్రహ్మాహమితి తేజసా!**

**సృజామి సంహరామీతి ధ్యానమస్తు చిరాయ నః॥** (ఉ.ప్ర.స.86, శ్లో.35)

తేజస్సుతో వెలిగిపోతూ, పద్మాసనంలో కూర్చొన్న బ్రహ్మను నేనే. నేనే సృష్టిస్తున్నాను. నేనే పరి పాలిస్తున్నాను. నేనే సంహరిస్తున్నాను-అని ఈ విధంగా సంవర్గ విద్యావిధానంలో దీర్ఘకాలం ఉపాసన చేద్దాం. ఈ అహంగ్రహోపాసనవల్ల భ్రమర కీటకన్యాయంతో మనమంతా బ్రహ్మలమై పోతాం.

ఈ ఉపదేశంతో చర్చ పూర్తైపోయింది. సోదరులందరూ ధ్యానాలలో మునిగిపోయారు. క్షణాలలో శిలా ప్రతిమల్లాగా ఐపోయారు. ఏళ్లే గడిచాయో, యుగాలే గడిచాయో, ఎవరికీ తెలియదు. క్రమంగా ఆ పది దేహాలూ ఎండుటాకుల్లాగా రాలిపోయాయి. రాలిపోయిన పీనుగులను అడవి మృగాలు తినేశాయి. ఐనా ఐందవులు (ఇందు పుత్రులు) పదిమందీ అలాగే అక్కడే వుండిపోయారు.

యుగాల చక్రాలు గిర్రున తిరిగాయి. సృష్టులు, ప్రళయాలు సాగాయి. చివరికి కల్పాంతమే జరిగింది. సృష్టి అంతరించి పోయింది. బ్రహ్మ ఒక్కడే మిగిలి వున్నాడు. కాదు, కాదు ఒక్కడ్నే వున్నానని అనుకొన్నాడు. ఆయనకు తెలియదు. సృష్టి అంతా నశించి పోయినా సరే, ఈ ఐందవులు పదిమందీ మాత్రం తమ సంకల్ప బలంవల్ల తపోమయులై అక్కడే, అలాగే, నిలబడి వున్నారు.

ఓ బ్రహ్మదేవా! ఇలా అనేక కల్పాలు గడిచాయి. కాలక్రమంలో ఎప్పుడో ఒక సారి, వాళ్లు పదిమందీ బ్రహ్మలై పోయారు. ఎవరి చిత్తంలో వాళ్లు తమ తమ బ్రహ్మాండాలను సృష్టి చేయడం మొదలు పెట్టారు. అలాంటి బ్రహ్మాండాలలో, ఒకానొక బ్రహ్మాండంలో, నేను సూర్యపదవికి అధిపతిగా నియమింపబడ్డాను. కాల విభాగం చేయటం నా పని.

అంతా చెప్పి, ఆ సూర్యుడు చివరికి ఒక విచిత్రమైన మాట చెప్పాడు-

**వివిధ కల్పనయా వలితాంబరం**

**యదిదముత్తమ! జాగత ముత్థితమ్।**

**కరణ జాలక మాహిత మోహనం**

**తదఖిలం నిజ చేతసి విభ్రమః ॥** (ఉ.ప్ర.స.87, శ్లో.12)

ఓ ఉత్తమజీవా! నేను సృష్టించ లేదే, ఈ లోకాలన్నీ నా ఆకాశంలో ఎక్కడ వున్నాయి అనుకోకు. ఇవన్నీ మనస్సు చేసే కల్పనలయ్యా! వీటిలో నిజం వుంటే గదా, ఆలోచించవలసింది. ఈ కనిపించే జగద్రూపమైన దృశ్యమంతా,ఇంద్రియాలకు వల వంటిది. స్నేహం చేసిన కొద్దీ మోహపెట్టేది. అనేక కల్పనలతో, ఆకాశపు పొరలకే మడతలు పెట్టినట్లుగా పొడుచుకు వచ్చినది. ఇదంతా మనస్సులో కలిగే భ్రాంతి మాత్రమే. సత్యం కానే కాదు. నువ్వు నీ సంకల్పబలం వల్ల ఐందవుల చిత్తాలలో దూరి చూస్తున్నావు గనుక, నీకివన్నీ కనిపిస్తున్నాయి- అన్నాడా సూర్యుడు.

ఇది విని, బ్రహ్మదేవుడికి మతిపోయినంత పనైంది. ఆలోచించి ఆలోచించి, చివరికి- " ఓ సూర్యా! పదిమంది బ్రహ్మలు! తలో పక్కా సృష్టి చేసి పారేస్తున్నారు!! ఇంకా నా సృష్టెందుకయ్యా? దానికి ఏమిటి ప్రయోజనం?" అనేశాడు.

అది విని, ఆ సూర్యుడు కొంచెం నిదానంగా ఆలోచించి చివరికిలా అన్నాడు-

**సూర్యుడు:** దేవదేవా! కాలాన్ని విభజించటం నా పని, ప్రజల కోసం పగటిని, రాత్రిని, తయారు చేస్తాను నేను. ఏమిటి దీంతో నాకు ప్రయోజనం?

నాకేమీ ప్రయోజనం లేదు. అయినా ఇది నా కర్తవ్యం. కనుక నిష్కామంగా, నిస్స్వార్థంగా, నేనీ పనిచేస్తున్నాను.

అలాగే, నావల్ల చెరువుల్లో ప్రతిబింబాలు తయారువుతున్నాయి. ఆ ప్రతిబింబాలకు నేను సృష్టికర్తనా? వాటివల్ల నాకేమైనా ప్రయోజనం వుందా? అయినా ఆ పని జరిగిపోతోందే!

అలాగే, మీరూ సృష్టి చేస్తున్నారు. నిజం చెప్పాలంటే, ఈ సృష్టి మీ నుంచి వ్యక్తమౌతోంది. ఈ జీవులు శరీరాలు ధరించినా, విడిచినా, మీకేమీ ప్రయోజనం లేదు. మీరేమీ కోరుకోవటం లేదు. మీకీ సృష్టి ఒక విలాసం,ఒక వినోదం,ఒక కర్తవ్యం.

మీరు గానీ, నేను గానీ, మన పనులు మానుకుంటే కర్తవ్యాన్ని పరిత్యజించిన వారమవుతాం. నిత్యకర్మను విడిచి పెట్టినవారం అవుతాం. అది మంచి పని కాదు.

మంచి సంగతి అలా వుంచండి. వదలుకుందామనుకున్నా వదలగలమా మనం? అద్దం ప్రతిబింబాన్ని తయారు చేయకుండా వూరుకోగలదా?

అదీగాక, కొన్ని పనులు వద్దని వదిలిపెట్టేవారికి, వదిలి పెట్టడంలో ఒక ప్రయోజనం వుంది. మనకు అలాంటి ప్రయోజనం ఏదైనా వున్నదా? ప్రయోజనం లేదు కనుక, అలాంటి కోరిక గూడా మనకు వుండటానికి వీలు లేదు.

కనుక, మన బోటివాళ్లం చెయ్యటమైనా, మానటమైనా, ఏదైనా సరే, పరమార్థదృష్టితో చేయనే గూడదు. ఏది చేసినా మిథ్యాదృష్టితోనే చెయ్యాలి.

మీరు ఇతర బ్రహ్మల సృష్టిని మీ మనోనేత్రంతోచూడగలరు గానీ, చర్మ చక్షువులతో చూడలేరు. అదే మీరు చేసుకున్న సృష్టి అయితే, మీ చర్మ చక్షువులతోనే చూడగలరు. ఇది ఒక భేదం.

ఐందవ బ్రహ్మలు చేసిన సృష్టిని మీరు సంహరించాలనుకొన్నా సంహరించలేరు. ఎందుకంటే, ఒకడు తన కర్మేంద్రియాలతో చేసిన పనిని మరొకడు చెడగొట్టితే చెడగొట్టవచ్చు. అంతే గానీ, ఒకడు స్థిరచిత్తుడై చేసిన మనోనిశ్చయాన్ని ఎవ్వడూ చెడగొట్టలేడు. శరీరం రాలిపోయినా సరే, మనస్సు చేసుకున్న నిశ్చయం మటుకూ రాలిపోదు. దీనికి నిదర్శనం ఈ ఐందవ బ్రహ్మలే.

సంసార నివృత్తిని కోరే ముముక్షువు గూడా తన మనోబలంచేతనే పరబ్రహ్మ స్వరూపాన్ని పొందుతున్నాడు. సంసార కూపంలో బడే సామాన్యజీవి కూడా, తన మనోబలం చేతనే ప్రపంచ భ్రాంతిలో పడుతున్నాడు.

బ్రహ్మదేవా! చిత్రాతి చిత్రమైన ఈ మనోబల మాహాత్మ్యాన్ని వివరించేందు కోసం మీకొక వాస్తవ కథను వినిపిస్తాను వినండి–

## 76. కృత్రిమ ఇంద్రాహల్యోపాఖ్యానం

బ్రహ్మదేవా!పూర్వం మగధదేశానికి ఇంద్రద్యుమ్నుడనే రాజుండే వాడు. ఆయన భార్య అహల్య చాలా అందగత్తె. ఆ ఊళ్లోనే ఒక బ్రాహ్మణ యువకుడు అందగాడుగా ప్రసిద్ధి చెందాడు.అతని పేరు ఇంద్రుడు.

ఒక సారి మహారాణి అహల్య పురాణం వింటూ, గౌతమమహర్షి భార్య ఆయన అహల్య ఇంద్రుడ్ని మోహించిందని విన్నది. అదేం కర్మమో, ఈ మాట విన్న దగ్గరి నుంచీ, ఈ అహల్యకు కొత్త ఆలోచన మొదలైంది– “నేను అహల్యను. ఈ ఊళ్లో అందగాడైన ఇంద్రుడున్నాడు. వాడు నన్నెందుకు మోహించడు?

నా కోసం సాహసించి ఎందుకు రాడు?" అని.

తన భర్త పేరూ ఇంద్రద్యుమ్నుడే. అందులోనూ ఇంద్రపదం వుంది. ఐనా, ఆ పేరు గానీ, ఆ భర్త అందం గానీ, ఆవిడకు నచ్చడం లేదు. ఊళ్లో వున్న ఇంద్రుడ్నే తలచుకొంటూ మనస్సులో మథనపడిపోతూ వుండేది. క్రమంగా ఆ మథనం దుఃఖం ఐంది. ఏడుపూ ఐంది. చివరికి అరుపుల్లోకి దిగింది. ఈవిడ పిచ్చి చూసి, అంతఃపురదాసి జాలిపడి, రాయబారాలు చేసి, ఊరి ఇంద్రుడ్ని, అంతఃపుర అహల్యను, కలిపింది.

మెల్లిగా రాజుగారికి రాణి ప్రవర్తన గురించి తెలిసింది. చివరికి ఆ వార్త వీధిన పడ్డది. రాజుగారి బెదిరింపులు పని చెయ్యలేదు. చివరికి పరిస్థితి దండనలలోకి వచ్చింది.

మంచి చలికాలంలో వీళ్లిద్దర్నీ కలిపి, నీళ్లల్లో పడుకోబెట్టారు. అయినా సరే, వాళ్లల్లో ఏమీ దుఃఖం కనిపించలేదు. చాలా సేపయ్యాక, రాజుగారు ఇద్దర్నీ లేవదీయించి, విడివిడిగా తీసుకువెళ్లి ఒకే ప్రశ్న అడిగాడు–"ఒళ్లు బిగిసిపోయే ఈ చలిలో కూడా మీరు ఆనందంగానే కనిపిస్తున్నారు. ఎందుకని?" అని.

ఆశ్చర్యం! ఇద్దరూ ఒకే సమాధానం చెప్పారు–

"రాజా! మేము ఒకరినొకరు ప్రేమించుకున్నాం. ఒకరినొకరు నిరంతరం స్మరించుకొంటున్నాం. ఈ స్మరణకు మొదట్లో మా శరీరాలు, అందాలూ, ఆధారంగా వుండేవి. కానీ ఇప్పుడు మేము మా శరీరాలే మరచిపోయాం. మా మనస్సులు పెనవేసుకొని వున్నాయి. ఆ కలయిక మాకు చాలు. మమ్మల్ని నరికి పోగులు పెట్టినా మాకు బాధ లేదు."

రాజుగారి కోపం గుగ్గిలం వేసిన అగ్గి లాగా పెరిగిపోయింది. వారిద్దరినీ నిజం గానే, నిప్పుల్లో పొర్లించాడు. ఏనుగులతో తొక్కించాడు. కొరడాలతో కొట్టించాడు. ఐనా సరే, వాళ్ల ముఖాలలో కాంతి తగ్గలేదు. వాళ్ల సమాధానాలు మారలేదు. రాజు హింసలు పెడుతున్నకొద్దీ, వాళ్ల ప్రేమ మరింత పెచ్చు పెరిగిపోయింది. ఇంద్రుడ్ని అడిగితే, "నాకు లోకమంతా అహల్యామయంగా కనిపిస్తోంది" అంటున్నాడు. అహల్యనడిగితే, "నాకు ప్రపంచమే ఇంద్రమయంగా వుందం"టోంది. దీనికి కారణమేమిటో రాజుకర్థం కాలేదు. ఒక సారి తిట్లతో ఆ మాటే అన్నాడు ఇంద్రుడితో.

ఇంద్రుడిలా సమాధానం చెప్పాడు–

"రాజా! నేనంటే ఎవరు?మనస్సే నేను. ఈ మనస్సే ఈ శరీరాన్ని సృష్టి చేసింది. ఈ శరీరం ముక్కలైనా మనస్సు ముక్కలు కాదు. శాపాలు గూడా దీన్ని తాక లేవు. ఇది మనస్సుయొక్క స్వభావం.

"గుడిలో విగ్రహం లాగా, నా మనస్సులో అహల్య ప్రతిష్ఠింపబడి వుంది. ఈ ప్రతిష్ఠకు కారణం నా తీవ్ర అభిలాషే. అందుచేతనే ఈ రూపాన్ని నా మనస్సులోంచి ఎవరూ తొలగించలేరు.

"మనస్సులో ఏదైనా ఒక సంకల్పం దృఢంగా నాటుకొంటే, దానివల్ల ఒక లాభం వుంది. అది ఇక రెండో ఆలోచనను దగ్గరకు రానీయదు. అందుకే నాకిప్పుడు ఏ దుఃఖాలూ సోకవు.

"మహారాజా! జీవుడంటే ఎవరు? ఎవడికి మనస్సనే మొలక మొలిచిందో, వాడే జీవుడు.మనస్సే వాడి మొదటి శరీరం. అదే కాండం. వాడికి కలిగే స్థూల శరీరాలన్నీ ఆ కాండానికి మొలిచిన కొమ్మలు, రెమ్మలు. కొమ్మలు పోయినా, కాండం పోదు. కాండం పోతే కొమ్మలుండవు. కనుక, రాజా! మనస్సు ప్రధానమని గుర్తుంచుకో. దాన్ని కాపాడుకో. దానిలో మంచి సంకల్పం నాటుకో. అంతే గానీ, నా సంకల్పం చెడగొట్టాలని చూడకు. నువ్వూ, నీ మంత్రులూ కలిసి పెట్టే చిత్రహింసలు, నా మనఃసంకల్పాన్ని మార్చలేవు."

ఈ మాటలు విని రాజు మరింత మండిపడ్డాడు. కానీ, ఇంకా ఎలా హింసించాలో తోచ లేదు. దాంతో దగ్గరే వున్న భరతుడనే మునిని చూసి– "మహాత్మా! ఇక లాభం లేదు. ఈ పాపిని దండించాలి. మీరు

వీడ్ణి శపించండి”– అన్నాడు.

ఆ మహర్షి రాజంత తొందర పడలేదు. కానీ రాజు మాటకాదన లేదు. కొంచెం ఆలోచించి, చివరికి “ఓరీ దురాత్మా! ఈ దుష్టురాలితో సహా నువ్వు నశించిపో” అని శపించాడు.

ఆ శాపం విని ఇంద్రాహల్యలు–

“భరతమహర్షీ! తెలివితక్కువతనంతో మీ తపశ్శక్తిని మంట కలుపుకున్నారు. మీ శాపంతో మా స్థూలదేహాలు నశిస్తాయే గానీ, మనోదేహాలు నశించవు. కనుక మీ శాపంవల్ల మాకేమీ నష్టం లేదు” అన్నారు.ఇలా మాట్లాడుతుండగానే వాళ్లు అక్కడికక్కడే నేల మీద పడి మరణించారు.

కానీ, వెనువెంటనే లేడి దంపతులై జన్మించారు. ఆ మరుజన్మలో పక్షి దంపతులయ్యారు. బ్రహ్మదేవా! వాళ్లు మా సృష్టిలో, అంటే ఐందవ బ్రహ్మల సృష్టిలో బ్రాహ్మణ దంపతులుగా జన్మించారు. ఆ జీవులిద్దరూ ఇప్పటికీ ఎక్కడ పుట్టినా సరే, దంపతులుగానే జన్మిస్తున్నారు. కనుక, బ్రహ్మదేవా! మనస్సును శాపాలు గూడా ఏమీ చెయ్యలేవు.

**77. మనస్సే గట్టిపడితే దేహము, ప్రపంచము-**

బ్రహ్మదేవా! ఈ నాటి ఐందవబ్రహ్మల సృష్టిక్రమం కూడా వారి మనోబలంవల్ల జరిగేదే. కనుక, దానిని నాశనం చేయటం ఎవరికీ సాధ్యం కాదు. అదీగాక, అలాంటి పని మీబోటి పెద్దలకు తగినది కాదు.“తగినదో, తగనిదో, అది అలా వుంచు. ఎందుకు సాధ్యం కాదు?” అది అంటారేమో?! ఎవడైనా ఒక మణిని పగలగొట్ట గలడేమో గాని, దాని ప్రతిబింబాన్ని పగలగొట్టగలడా? మనస్సంకల్పమూ ప్రతిబింబం లాంటిదే..

కనుక బ్రహ్మదేవా! ఐందవ బ్రహ్మల సృష్టులను అలా వదిలేసి, మీ సృష్టి మీరు చేసుకోండి. “ఆకాశం నిండా వాళ్ళ సృష్టే వుంది కదయ్యా! ఇక నా సృష్టికి చోటెక్కడ?” అంటారేమో, అది పిచ్చిమాట.

ఆకాశం మూడు రకాలు. చిదాకాశం, చిత్తాకాశం, భూతాకాశం–అని. ఈ మూడూ అనంతాలే. మీ చిత్తాకాశం మీది. వాళ్ళ చిత్తాకాశం వాళ్లది. ఈ రెండూ చిదాకాశంలో ఒదిగిపోయే వున్నాయి. మీ చిత్తాకాశంలో మీకు తోచిన సృష్టులు చేసుకొంటూ, మీరు మీ చిత్తాకాశ స్వరూపులై నిశ్చలంగా వుండిపోండి. నన్నడిగారు కనుక నా సలహా ఇదే– అని ఐందవ సృష్టిలోని సూర్యుడు తన ప్రసంగం ముగించాడు.

ఆ తరువాత బ్రహ్మదేవుడు వశిష్ఠుడితో తన ప్రసంగాన్ని ఇలా కొనసాగించాడు–

వశిష్ఠా! ఐందవ సూర్యుడి ప్రసంగం విని, నేను చాలా సేపు ఆలోచించి, చివరికి అతను చెప్పిందే నచ్చి, భూతాకాశ, చిత్తాకాశ, చిదాకాశాలు, అనంతాలు కనుక, నా కర్తవ్యం నేను నిర్వహించుకొంటూ పోవాలనే నిశ్చయానికి వచ్చాను.

ఐతే, నాకీ సలహా చెప్పి ఉపకారం చేసినవాడు ఐందవ సూర్యుడు గనుక, అతనినే నాకు మొదటి మనువుగా వుండమని కోరాను. మనువు అంటే నీకు తెలుసు కదా! నా మనస్సులోని ఆలోచనల ప్రకారం సృష్టి ప్రక్రియ నడిపించేవాడే మనువు. అలాంటి గొప్ప పదవి లభించే సరికి, ఐందవ సూర్యుడు పొంగిపోయి, తన రూపాన్ని రెండు రూపాలుగా చేసుకొని, ఒక రూపంతో ఐందవ బ్రహ్మాండంలో సూర్యపదవిని నిర్వహిస్తూ, మరో రూపంలో నా బ్రహ్మాండంలో మనువు పదవిని నిర్వహించ సాగాడు.

పుత్రా, వశిష్ఠా! ఈ సంఘటనలన్నిటి ద్వారా నేను చెప్ప వచ్చిందేమిటంటే, ఐందవులు పదిమందీ మనోబలం వల్లనే బ్రహ్మలయ్యారు. ఇంద్రాహల్యలు మనోబలం వల్లనే దంపతులుగా మళ్ళీ మళ్ళీ జన్మిస్తున్నారు.

మనోబలంవల్లనే నేను నా బ్రహ్మాండ సృష్టి చేస్తున్నాను. మనోబలంవల్లనే ఆ సూర్యుడు అటు ఆ బ్రహ్మాండంలోనూ, ఇటు ఈ బ్రహ్మాండంలోనూ కూడా, పదవులు నిర్వహిస్తున్నాడు.

కనుక, ఏమి తేలిందంటే, ఈ సృష్టి అంతటినీ మనస్సే చేస్తోంది. దీన్నే తిప్పి చెపితే, ఈ మనస్సే సృష్టిగా కనిపిస్తోంది.

నీళ్ళు గడ్డకడితే మంచవుతుంది. పలచగా వుంటే నీళ్ళంటారు. గట్టిగా వుంటే మంచంటారు. పేర్లు మారినా, వున్న పదార్థం ఒక్కటే. అలాగే ఒకే చైతన్యం సూక్ష్మ వాసనలతో కలిసి, సూక్ష్మస్వరూపంగా వుంటే, దాన్ని జీవుడంటారు. (మనస్సంటారు.) అదే కొంచెం గట్టిపడితే, దాన్ని దేహం అంటారు. మనస్సు ఇంకా పరిపరివిధాలుగా సాంద్రీకృతమైతే (చిక్కబడితే), అది ప్రపంచం అవుతుంది. ఈ సాంద్రత, ఈ వాసనలు, రెండూ పోతే, అది సాక్షాత్తుగా శుద్ధ పరమాత్మ స్వరూపమే అవుతుంది.

వశిష్ఠా!జాగ్రత్తగా గమనించు. సత్యంగా వున్నది చైతన్యం ఒక్కటే. అది ఒక్కటిగా వున్నప్పుడు దాని పేరు శుద్ధ చైతన్యం. దానిలోకి సంస్కారాలు చేరితే, అప్పుడది మనస్సు. అదే జీవుడు. అదే గట్టిపడితే, అప్పుడది దేహమూ, ప్రపంచము. ఈ చెప్పిన వరుస ఎలా వుందంటే– పొడిపొడిగా వున్నప్పుడు దాని పేరు మట్టిపొడి. తడి తడిగా వున్నప్పుడు దాని పేరు మట్టిముద్ద. కొంచెం వెడల్పుగా వుంటే, దాని పేరు పెంకు. బొజ్జలాగా గుండ్రంగా తయారైతే, దానిపేరు కుండ– అని చెప్పినట్లుగా వుంది. ఇన్ని రూపాల్లోనూ వున్నదేది? మట్టి కదూ! అలాగే మనస్సుగా, జీవుడుగా, శరీరంగా, ప్రపంచంగా, వున్నది శుద్ధ చైతన్యమే (పరమాత్మే).

కనుక, వివేకం కలవాడు ఏమి చెయ్యాలంటే, ప్రస్తుతం తనకున్న ఈ మనస్సుతోనే మనస్సుయొక్క తత్త్వాన్ని గూర్చి విచారణ చెయ్యాలి. దానికి వున్న గట్టితనాన్ని, పలుచటి తనాన్ని, వాసనామయత్వాన్నీ కూడా గుర్తించి, తన వివేకంతోనే ప్రక్షాళన చెయ్యాలి. చేస్తే పరిశుద్ధమైన చైతన్యం మిగులుతుంది. అదే ముక్తి.

## 78. మనస్సుయొక్క తత్త్వం

బ్రహ్మగారి సుదీర్ఘ ప్రసంగం విని, వశిష్ఠమహర్షి తృప్తి పడలేదు. ఆయన ఇట్లా అడిగాడు–

***వశిష్ఠుడు:*** తండ్రీ! బ్రహ్మదేవా! మీరు చెప్పేది పరస్పర విరుద్ధంగా వుంది. తపశ్శక్తికీ, శాపశక్తికీ, తిరుగులేదని మీరు పూర్వం చాలా సార్లు చెప్పారు. ఇప్పుడేమో శాపాలు శరీరాలమీదనే పనిచేస్తాయి గాని, మనస్సుల మీద పనిచెయ్యవంటున్నారు.

పూర్వం నేను నా శిష్యుడైన సౌదాసుణ్ణి శపిస్తే, అతని మతి చెడిపోయి, రాక్షసబుద్ధి పుట్టి, నా కొడుకునే చంపేశాడు.

ఇంద్రపదవి ఎక్కిన నహుష చక్రవర్తిని అగస్త్యమహర్షి శపిస్తే, అతడు కొండచిలువగా మారి పోవటం మాత్రమే గాక, మతి భ్రమించి, తన వంశీకుడైన భీముణ్ణి మింగబోయాడు.

ఇలా నిదర్శనాలు కనిపిస్తుంటే, శాపాలు మనస్సుల మీద పని చేయవంటారేమిటి?

అదీ గాక, మనస్సే గట్టిపడితే దేహమైందంటున్నారు. అలాంటప్పుడు శాపం దేహం మీద పని చేస్తే, మనస్సు మీద పని చేసినట్టు కాదా? మంచు మింగేస్తే నీళ్ళు తాగినట్టు కాదా? కనుక, శాపాలు మనస్సు మీద ఎందుకు పని చెయ్యవు? తేల్చి చెప్పండి?

***బ్రహ్మదేవుడు:*** వశిష్ఠా! ఒకడికి రెండు కళ్ళున్నాయి. బయటికి రెండూ ఒక రకంగానే కనిపిస్తున్నాయి. కానీ వాటిలో ఒకటి గుడ్డిది. రెండవది మంచిది. దీన్ని తెరిస్తే వాడు దృశ్యాలను చూడగలడు. గుడ్డికన్ను తెరిచినా ఒకటే, మూసినా ఒకటే. మనస్సు మంచికన్ను లాంటిది. శరీరం గుడ్డికన్ను లాంటిది.

మనస్సు, శరీరం, రెండూ అశాశ్వతాలే. కాని ఆ రెండిట్లో పరిశీలించి చూస్తే, శరీరం మరీ క్షణికం. తామరాకు మీద నీటి బొట్టు లాంటిది. దీన్ని శాపాలే గాదు, మామూలు చేతబడులు, అంతకంటే మామూలు రాజ దండనలూ కూడా, బాధ పెట్టగలవు. మరి మనస్సో? అది అజ్ఞానం పోయే దాకా పోదు. అది కొంత వరకూ స్వతంత్రం. మరి కొంత అస్వంతంత్రం. ఇది స్వతంత్రించి పౌరుషంగా ప్రయత్నాలు చేయగలదు. దీనికి శరీర సహకారం అక్కర లేదు. శరీరం మనస్సుయొక్క సహకారం లేనిదే ఏ పని చెయ్యలేదు. ఇప్పుడు నేను చెప్పిన కథలో బ్రాహ్మణేంద్రుడు శరీర సహకారం లేకుండానే మనోబలంచేత సంతోషంగా వున్నాడు.

ఇది నేను కల్పించిన కథ అనుకుంటావేమో? పూర్వం దీర్ఘతపుడు అనే మహర్షి పాడునూతిలో పడిపోయి, ఏమీ చేయటానికి చేత గాక, అక్కడే కూర్చొని, మానసిక యజ్ఞాలు వందకు పైగా చేసి, ఆ పుణ్యబలంవల్ల సూటిగా దేవేంద్ర పదవినే పొందాడు–నీకు తెలుసు గదా!

సౌదాసుడో, మరొకడో, శాపంవల్ల పిచ్చివాళ్లయ్యారంటే, వాళ్లకు తగినంత మనోబలం లేదని తెలుసుకోవాలి. వివేక విజ్ఞానానికి తగిన యోగ్యత ఆ మనస్సులకు లేదు.

శాపశక్తికి తిరుగులేదని పూర్వం నేను చెప్పానంటే అది గూడా మనోబలాన్నే ధ్రువపరుస్తుంది. శాపం పెట్టేవాడి మనోబలం, శాపం పొందేవాడి మనోబలం, అని రెండున్నాయి. వాటిలో ఏది ప్రబలమైతే అది జయిస్తుంది.

మట్టిముద్ద కుండగా మారినంత మాత్రాన, ఆ రెండింటి లక్షణాలూ ఒకటిగా వుండవు. కుండ నీళ్లలో తేలుతుంది. మట్టిముద్ద నీళ్ళలో కరుగుతుంది. అలాగే మనస్సులోంచే దేహం వచ్చినా, దేని లక్షణాలు దానివే. కనుక, దేహాన్ని గూర్చిన చింతను వదిలేసి, మనస్సుయొక్క తత్త్వాన్ని పరిశీలించు. ఆ మనస్సునే ప్రక్షాళన చేసి, శుద్ధచైన్యస్థితిని అందుకో.

ఇప్పటివరకూ ఈ కథ చెప్పిన వశిష్ఠుడు శ్రీరాముడితో తన ప్రసంగాన్ని కొనసాగిస్తూ–

"రామా! దేశకాల దృశ్యాలు లేవని చెప్పటానికే లీలోపాఖ్యానం చెప్పాను. మనస్సు చేసే భ్రాంతి వల్లనే ప్రపంచ సృష్టి జరుగుతుందని చెప్పటానికే సూచికో పాఖ్యానం చెప్పాను. మనస్సుకు అంతటి శక్తి వుందని నిరూపించటానికే ఐందవోపాఖ్యానాన్ని, దాని మధ్యలో కృత్రిమ ఇంద్రాహల్యోపాఖ్యానాన్ని, చెప్పాను. వీటన్నిటినీ చక్కగా భావన చెయ్యి"– అన్నాడు.

ఇక్కడికి 92వ సర్గ పూర్తైంది. ఇక 93వ సర్గలో మొదటి భాగాన్ని వాల్మీకిమహర్షి గద్యంలో నడిపాడు. ఆ తరువాత శ్లోకాలలోకి వచ్చాడు.

***వశిష్ఠుడు:***(అంటున్నాడు) రామా! మనస్సుయొక్క తత్త్వాన్ని నేనే వివరిస్తాను, విను.

నామరూపాలు వ్యాకృతం(వ్యక్తం) కాకుండా వున్న పరబ్రహ్మనుంచి అటువంటి ప్రపంచమే పుట్టింది. అంటే, ఒక ప్రపంచం ఏర్పడింది గానీ, అది ఎంత సూక్ష్మంగా వుందంటే, దాని నామరూపాలను ఎవరూ గ్రహించ లేరు. కాలక్రమంలో అది కొంచెం గట్టిపడి మనస్సైంది. దాన్నుంచీ తన్మాత్రలు (సూక్ష్మ పంచభూతాలు) పుట్టాయి. వాటిల్లోంచి సమష్టి సూక్ష్మ శరీరాభిమాని అయిన తేజోమయ జీవిఒకడు జన్మించాడు. ఇతడే సృష్టికర్త బ్రహ్మ. కాబట్టి బ్రహ్మదేవుడంటే, మనస్తత్వంయొక్క ఆకారమే. అందుకే ఆయన ఏది సంకల్పిస్తే అది జరుగుతుంది. అందుకే ఆయన్ను సిద్ధ సంకల్పుడనీ, సంకల్ప సిద్ధుడనీ, అంటూ వుంటారు.

రామా! ఇంతకూ ఈ బ్రహ్మదేవుడు ఎలా ఉదయించాడో, గమనించావా? అనాత్మ పదార్థాలైన పంచతన్మాత్రలమీద ఆత్మాభిమానంవల్ల ఉదయించాడు. అందుకే ఈయన ముమ్ముందుగా అనాత్మలమీద ఆత్మాభిమానాన్ని కలిగించే అవిద్యను సృష్టి చేశాడు.

ఆ అవిద్యయొక్క సహాయంతో దృశ్యప్రపంచాన్ని సృష్టి చేశాడు.

ఇక, పూర్వ కల్పాలనుంచీ అనుగతంగా వస్తున్న వ్యష్టి చిదాభాసాలు కొన్ని జీవులుగా ఈ దృశ్య ప్రపంచంలో వ్యక్తమౌతున్నాయి. ఈ జీవులంతా తమ తమ కామాల కారణంగా పై లోకాలకు, క్రింది లోకాలకు తిరుగు తున్నారు. వీరిలో కొందరు శుభకర్మ తత్పరులై ముక్తికి దగ్గరగా వస్తున్నారు. మరికొందరు తత్త్వజ్ఞాన సంపన్నులై పరబ్రహ్మలో చేరిపోతున్నారు.

కనుక, రామా! సారాంశమేమంటే, సమష్టి మనస్తత్త్వమే హిరణ్యగర్భుడు లేక బ్రహ్మదేవుడు. అతడి సంకల్పంవల్ల ఈ సృష్టి జరుగుతోంది. అంటే మనస్సువల్ల సృష్టి జరుగుతోంది. కనుక, ఎవడైనా సరే, తనలో గల మనస్సును తొలగించుకుంటే, వాడికి ఈ ప్రపంచం లేదు.

## 79. ఉపాధులలో రకాలు

రామా! ఈ సృష్టిలోని జీవోపాధులు ప్రధానంగా మూడు రకాలు. ఒకటి, సాత్విక జీవోపాధులు. రెండు, రాజస జీవోపాధులు. మూడు తామస జీవోపాధులు.

వీటిని ఇంకా విభాగం చేస్తే, పద్నాలుగు రకాలుగా విభజించవచ్చు. అవి

1. ఇదం ప్రథమతా (అత్యంతోత్తమ సత్త్వా)
2. గుణ పీవరీ (ఉత్తమ సత్త్వా)
3. ససత్త్వా (మధ్యమ సత్త్వా)
4. అధమ సత్త్వా
5. అత్యంత తామసీ (అత్యంతాధమ సత్త్వా)

ఈ ఐదూ సాత్వికంలో రకాలు. అత్యంతాధమ సత్త్వమే అత్యంత తమోగుణమవుతుంది గనుక, దాన్ని అత్యంత తామసీ అన్నారు.

6. రాజసీ
7. రాజస సాత్త్వికీ
8. రాజస రాజసీ
9. రాజస తామసీ
10. రాజసాత్యంత తామసీ

ఈ ఐదూ రాజసంలో రకాలు.

11. తామసీ
12. తామస సత్త్వా
13. తమో రాజసీ
14. అత్యంత తామసీ

ఈ నాలూగూ తామసంలో రకాలు. వీటిలో తామస తామసి లేదు.

ఇకపోతే, సత్త్వ విభాగంలో 5వదీ, తమో విభాగంలో నాల్గవదీ, ఒకటే ఐపోయాయి. అలాగే రజోగుణంతో తమోగుణం కలిసినా, తమోగుణంలో రజోగుణం కలిసినా, ఫలితం ఒకటే! కనుక, 9వదీ, 13వదీ ఒకటే అయిపోయాయి. కనుక మొత్తంమీద పన్నెండే విభాగాలు తేలాయి. రామా! ఇక ఈ విభాగాలయొక్క అర్థాలు చెపుతా విను.

1. ఇదం ప్రథమతా (అత్యంతోత్తమ సత్త్వా)-

పూర్వకల్పంలోనే సాధన అంతా ఇంచుమించుగా అంత పూర్తైపోయి, ఈ కల్పంలో మొదటి జన్మలోనే ముక్తి పొందేవారు. ఉదాహరణ- సనకసనందనాదులు.

2. గుణ పీవరీ (ఉత్తమ సత్త్వా)- ఈ కల్పంలో 5 లేక 6 జన్మల్లో ముక్తి పొందేవారు. ఉదా- నారదాదులు.

3. ససత్త్వా(మధ్యమ సత్త్వా)- ఈ కల్పంలో జన్మ జన్మకూ సత్వసంపత్తిని పెంచుకుంటూ వంద జన్మల్లో ముక్తిని పొందేవారు. ఉదా- అనేకమంది మహర్షులు.

4. అధమసత్త్వా- అనేక వేల జన్మలకు మోక్షం పొందుతారు. వీరిని చూస్తే జ్ఞానులని గుర్తు పట్టటం కష్టం. సుఖ దుఃఖాలలో కొట్టుకుపోతున్నట్లు కనిపిస్తారు. ఉదా- అనేకమంది సాధకులు

5&14. అత్యంత తామసీ (అత్యంత అధమసత్త్వా)- వీళ్ళకు ఆధ్యాత్మిక వాసన వుండదు. ఈ కల్పంలో మోక్షం రావడం కష్టం. అత్యంత అధమసత్వమన్నా, అధమ తామసమన్నా, ఫలితం ఒకటేనని మనం గ్రహించాలి. ఇప్పటికి సాత్విక విభాగాలు ఐదు పూర్తయినాయి. ఇక రాబోయేవి రాజసిక విభాగాలు.

6. రాజసీ- వీళ్ళకి ఈ కల్పంలో మానవజన్మ వచ్చే సరికే రెండు మూడు జన్మలు పడుతుంది. ఆ తరువాత జన్మల్లో పైనా కిందా పడుతూ వుంటారు. ఈ కల్పంలో వీరికి మోక్షం లభించటం సందేహమే. వీళ్ళల్లో రజోగుణం ఒక్కటే ప్రధానంగా వుంటుంది.

7. రాజస సాత్త్వికీ- వీళ్ళ రజోగుణంలో సత్త్వగుణం కూడా చెప్పుకోదగినంతగా వుంటుంది. వీళ్ళు సంసారంలోనే వుంటారు గానీ, ఈ సంసారం దుఃఖ మయమని గుర్తిస్తారు. జ్ఞానప్రాప్తికి అనుకూలమైన పనులు చేస్తూ వుంటారు. ఉదా- రాజర్షులు.

8. రాజస రాజసీ- వీళ్ళు రజోగుణ ప్రధానంగా ధార్మిక జీవనం గడిపి యక్షగంధర్వాది లోకాలను చేరిన జీవులు. వీళ్ళు కృషి చేస్తే కొద్ది జన్మలలోనే ముక్తి లభించవచ్చు. ఉదా- గంధర్వ రాజైన చిత్రరథాదులు.

9. రాజస తామసీ- తమోగుణ విభాగంలో (13వది గా) కూడా ఈ తెగ వస్తుంది. వీరిలో రజస్, తమోగుణాలు సమపాళ్ళలో వుంటాయి. వీళ్ళకు మోక్షంమీద దృష్టి వుంటుంది. ప్రయత్నం మాత్రం చాలా స్వల్పం. మోక్షం రావటానికి కొన్ని వందల జన్మలు పడుతుంది. ఉదా- సామాన్య సాధకులు.

10. రాజసాత్యంత తామసీ- వీరిలో రజోగుణం స్వల్పంగా వుండి, తమోగుణం అధికంగా వుంటుంది. సత్కర్మలు మంచివని ఒప్పుకుంటూనే వుంటారు గానీ, త్వరగా చేయలేరు. మోక్షం పొందటానికి కొన్ని వేల జన్మలు పడతాయి. ఉదా- సాంప్రదాయిక కుటుంబాలలోని సామాన్యులు.

ఇక్కడికి రజోగుణ విభాగాలు అయిదు పూర్తి అయ్యాయి. తమోగుణంలో నాలుగే విభాగాలు చేశారు. తామస తామసీ అనే విభాగాన్ని చేయలేదు. తామస తామసికీ, అత్యంత తామసికీ, చెప్పుకోదగ్గ భేదంలేదు. కనుక దాన్ని వదిలేశారు. అందుచేత తమోగుణ విభాగంలో నాలుగు రకాలే వచ్చాయి.

11. తామసీ- అనేక కల్పాలు దాటాక వీరికి మోక్షం లభిస్తుంది. అల్పజీవులు.

12. తామస సత్త్వా- జన్మించింది తామస జాతే అయినా, సత్త్వప్రధానులై ఆ జన్మలోనే మోక్షం సంపాదించుకొనే వారు. ఉదా- ప్రహ్లాదుడు, కర్కటీ.

13. తమోరాజసీ- ఇది రజోగుణ విభాగంలో రాజస తామసీ అనే పేరుతో వచ్చింది. ఫలితము అదే. వీళ్ళు సామాన్యంగా సాధకులు లాగానే పుడుతూ, కొన్ని వందల జన్మలకు ముక్తిని అందుకుంటారు.

14. అత్యంత తామసీ- వీరికి మోక్షార్హతే వుండదు.

రామా! ఈ విభాగమంతా ఎందుకు చెప్పానంటే- జీవులకూ బ్రహ్మకూ భేదమల్లా ఉపాధులవల్ల మాత్రమే

(శరీరాలవల్ల మాత్రమే). ప్రపంచమంతా కలిపితే, ఉత్పత్తికి ముందు, అది బ్రహ్మ స్వరూపంలోనే వుంది. లయానికి తరువాత, అది బ్రహ్మ స్వరూపంలోనే వుంది– అని చెప్పటానికే. ఇదే నువ్వు గుర్తించవలసిన సత్యం.

## 80. కర్త కర్మలు అభిన్న వస్తువులు

***రాముడు:*** గురుదేవా! జీవభావానికి కారణమేమిటి?

***వశిష్ఠుడు:*** జీవోత్పత్తి క్రమం అంతా ఇప్పుడే వర్ణించాను కదా! – మళ్ళీ ఎందుకడుగుతున్నావు?

***రాముడు:*** గురుదేవా! పరబ్రహ్మనుంచి హిరణ్యగర్భుడూ, జీవులూ కూడా ఆవిర్భవించారని చెప్పారు. అంటే, పరబ్రహ్మే ఉపాధులలో ప్రవేశించి జీవుడయ్యాడన్న మాట. అంటే, జీవత్వం పరబ్రహ్మకు నిత్యలక్షణం కాదు. ఆగంతుక లక్షణం. ఆగంతుకమైతే, దానికి కారణం వుండాలి. అది ఏమైనా వుంటుందా అని ఆలోచిస్తున్నాను.

పాత కర్మే ఆ కారణమని చెప్పాలి. అంతకంటే మరో కారణం కనిపించడం లేదు.

జీవుడు పుట్టకముందే పాత కర్మ వుందంటే, ఆ కర్మను చేసిన కర్త ఒకడుండాలి. ఒక కర్త అంటూ లేకపోతే కర్మ జరగదు కదా!

జీవుడి కంటే ముందరే ఒక కర్త వుంటే, వాడెవడు? మరో జీవుడా? పరబ్రహ్మేనా? పరబ్రహ్మ కర్తంటే, అతని నిష్క్రియత్వం ఎగిరిపోతుంది. వాడు మరో జీవుడంటే, వాడెలా పుట్టాడనే ప్రశ్న అలాగే మిగిలిపోతుంది.

ఈ చిక్కు తప్పించు కోవాలంటే, జీవుడు అనాది అని చెప్పాలి. అలా చెపితే, ఆ జీవుడు కొంతసేపు అవ్యక్తంగా వుండి, మళ్ళీ ఇప్పుడు వ్యక్తమవుతున్నాడని సమర్థించుకోవచ్చు.

కానీ, అలా చెపితే జీవత్వం అనేది ఆగంతుక లక్షణమని మొదట్లో మనం చెప్పుకున్న దానికి విరోధం వస్తుంది. అంటే, ఉపాధులవల్లే బ్రహ్మకు జీవత్వం వస్తుంది– అని మనం మొదట్లో చెప్పుకున్న మాట కుదరదు. కనుక, ఎటు చూసినా, జీవభావానికి కారణమేమిటో అర్థం కావటం లేదు. అందుకోసం అడుగుతున్నాను.

***వశిష్ఠుడు:***

**అభిన్నౌ కర్మ కర్తారౌ సమమేవ పరాత్ పదాత్।**
**స్వయం ప్రకటతాం యాతౌ పుష్పామోదౌ తరో రివ॥** (ఉ.ప్ర.స.95, శ్లో.1)

రామా! చెట్టుకు పువ్వు పూసింది. సువాసన వచ్చింది. ఈ రెంటిలో ఏది ముందు పుట్టినట్లు? ఏది ముందన్నా చిక్కే. వాటిల్లో ఏదీ ముందు పుట్టలేదు. రెండూ ఒకే సారి పుట్టాయి. అలాగే, కర్మ, కర్త, అనేవి విడివిడిగా పుట్టలేదు. రెండూ ఒకే సారి పుట్టాయి. రెండూ అవిద్యవల్లే పుట్టాయి. జీవుల ఉత్పత్తికి అసలైన కారణం అవిద్యే. మరేదీ కాదు.

***రాముడు***: మీరేదో కవితాపరమైన ఉపమానం చెప్పినంత మాత్రాన, కర్త కర్మ అనేవి ఒకేసారి పుట్టాయనీ, అందువల్ల అవి అభిన్న వస్తువులనీ నిరూపించటమెలా?

***వశిష్ఠుడు:*** రామా! నిరూపణ కావాలా? అయితే విను. నువ్వు చెప్పే కర్త, కర్మ కంటే భిన్నంగా వుంటే, వాడు అనాదా? సాదా? ఏది అనుకుంటే ఏమవుతుందో చూద్దాం.

అక్కడ 95వ సర్గలో వశిష్ఠమహర్షి విజృంభించి తర్కవాదం చేశాడు. అతి జటిలంగా వున్న ఆ వాదం సులభంగా అర్థం కావడం కోసం మొదట ఆ వాదాన్ని ఒక పట్టికగా తయారు చేసి, తరువాత ఆ పట్టికను వివరించుకుందాం.

ఈ చిక్కులు తప్పింకొనేందుకు కర్త కర్మల తాదాత్మ్యం అంగీకరించాలి. రెంటికీ కలిపి– అవిద్య కారణం

## 81.పట్టిక







## 82. పట్టిక వివరణ-

కర్మకంటే భిన్నమైన కర్త ఒకడు వున్నాడను కొందాం. వుంటే వాడు అనాది ఐనా కావాలి. లేదా సాది ఐనా కావాలి. అనాది పక్షానికి సంకేతంగా (ఎ) అని పెట్టాం. సాది పక్షానికి సంకేతంగా (జెడ్) అని పెట్టాం. మొదటి అనాది (ఎ) పక్షాన్ని పరిశీలిద్దాం.

కాగా, ఇప్పుడు మన కర్త అనాదిగా వుండే కర్త.

వీడికి కర్తృత్వం స్వాభావికమా (సహజ సిద్ధమా)? ఔపాధికమా? (ఏదైనా ఉపాధివల్ల అప్పుడప్పుడూ వచ్చే గుణమా?)

స్వాభావికమే (బి) అనుకొందాం. కర్త అనాదియై, వాడికి కర్తృత్వం సహజసిద్ధమైతే, ఇక ఆ కర్తృత్వం ఎప్పటికీ పోనే పోదు. అంటే, వాడికి ఎప్పటికీ మోక్షం అనేది రానే రాదు. అంటే, ప్రపంచంలో జీవుడికి

మోక్షమే లేదు. ఇది మోక్ష సిద్ధాంతానికి వ్యతిరేకం. కనుక ఈ పక్షం కుదరదు.

కనుక, కర్త అనాదే గానీ, వాడికి కర్తృత్వం ఔపాధికమే అనే (సి) పక్షాన్ని తీసుకుందాం. ఈ పక్షంలో ఏదైనా ఉపాధి వచ్చినప్పుడు వాడికి కర్తృత్వం వస్తుంది. ఉపాధి రాకపోతే కర్తృత్వం లేదు.

ఉపాధి వచ్చింది అంటే, దాని వెనకాల ఏదైనా కారణం ఉండి వుండాలి గదా! ఆ కారణం ఏమై వుంటుంది? అవిద్యా? అది కాకుండా మరేదైనానా?

అవిద్య (డి) అనుకొని చూద్దాం. అవిద్యే ఈ ఉపాధికి కారణమైతే , అది స్వతంత్ర (ఎఫ్) కారణమా? లేక మరొ సహకార కారణాన్ని కూడా అపేక్షించే సాపేక్షిక (జి) కారణమా?

స్వతంత్రమే (ఎఫ్) అనుకొని చూద్దాం. అనాది కర్తయొక్క ఉపాధియొక్క అవిద్య స్వతంత్ర కారణమైతే, అవిద్య వున్న ప్రతిచోటా వాడికి కర్తృత్వం వుండాలి. సుషుప్తి సమయంలో అవిద్య వుంది. గనుక అప్పుడు కూడా వాడికి కర్తృత్వం వుండి తీరాలి. అంటే, సుషుప్తి సమయంలో కూడా వాడు ఏవో పనులు చేస్తూనే వుండాలి. ఇది స్వానుభవ విరుద్ధం కనుక ఈ పక్షం కుదరదు.

పోనీ, సాపేక్షిక (జి) పక్షాన్ని పరిశీలిద్దాం. అంటే, అనాది కర్తకు గల ఉపాధికి వెనకాల, అవిద్యతో పాటు, మరో కారణం గూడా వుందన్నమాట. అంటే, అవిద్యకు వెనకాల, అవిద్య కంటే భిన్నంగా ఒక కారణం వుంది. ఇలా చెప్పటంవల్ల, ఆ కారణమే అవిద్యకు ఉపాధి– అని చెప్పినట్లు అయింది. మనం ఒక ఉపాధి గురించి ఆలోచిస్తూ వుంటే, ఇప్పుడు ఆ ఉపాధి కంటే ముందు, అవిద్యకంటే కూడా ముందు, మరో ఉపాధి వున్నట్లు తేలుతోంది. ఒక ఉపాధికి వెనకాల మరొక ఉపాధి ఉందనటం అసంగతం కనుక, ఈ పక్షమూ కుదరదు.

కాగా, అనాది కర్తయొక్క ఉపాధికి అవిద్య కారణమనే పక్షమే కుదరలేదు.

కనుక, అనాది కర్తయొక్క ఉపాధికి అవిద్య కాకుండా మరేదో కారణం (ఇ) అయి వుండవచ్చు. ఈ పక్షాన్ని పరిశీలిద్దాం. ఆ కారణం ఏదైనా కానీయండి, అవిద్యయొక్క కార్యరూపమైనదా? పూర్తిగా స్వతంత్రమైనదా?

స్వతంత్రం (ఐ) అనుకొనే ఆలోచిద్దాం. అనాది కర్తకు గల ఉపాధికి కారణం అవిద్య కంటే భిన్నమైనది, అవిద్యతో సంబంధం లేనిది. ఇదీ మన పక్షం.

అలాంటి కారణం సాదియా? అనాదియా?

సాదే (జె) అని అనుకొనే ఆలోచిద్దాం. అంటే, అనాది కర్తయొక్క ఉపాధికి గల కారణం సాది కర్తయొక్క ఉపాధి సాది ఐతే, కర్త గూడా సాది కావలసిందే. కర్త అనాది అనుకొని, ఈ వాదమంతా మొదలు పెట్టాం. ఇప్పుడు దానికే విరోధం వస్తోంది. కనుక ఈ పక్షం కుదరదు.

ఇక అనాది కర్తయొక్క ఉపాధికి కారణం అవిద్యలో సంబంధం లేని స్వతంత్ర కారణమని, అది అనాది కారణమని, చెప్పే (కె) పక్షాన్ని తీసుకొందాం.

ఆ కారణం అనాది గనుక, స్వతంత్రం గనుక (ఇతర సహకారి కారణాలు అక్కర లేదు గనుక). సుషుప్తి సమయంలో గూడా ఆ కారణం అక్కడే వుంటుంది. కనుక ఆ సమయంలో కూడా వాడి కర్తృత్వం అలాగే వుంటుంది. అంటే, వాడు సుషుప్తి సమయంలో కూడా పనులు చేస్తూ వుండాలి. ఇది అనుభవ విరుద్ధం కనుక, ఈ పక్షం కుదరదు.

కాగా మొత్తం మీద, ఉపాధికి గల ఇతర కారణం స్వతంత్రమని (ఐ) చెప్పటమే కుదరదు.

కనుక, ఆ కారణం అవిద్య కంటే భిన్నమైన అవిద్యా కార్యమే (హెచ్) అనే పక్షాన్ని ఆలోచిద్దాం.

అంటే, అనాది కర్తయొక్క ఉపాధికి కారణం అవిద్య కంటే భిన్నమైన, అవిద్యకు కార్య రూపమైన, కారణం. ఎలాంటి కారణమైతేనేమి. అది సాదియా? అనాదియా? అని ఆలోచించాలి. సాది అనుకొంటే ఇందాకటి (జె పక్షం) అవుతుంది. అనాది అనుకొంటే ఇందాకటి (కె పక్షం) అవుతుంది. ఆ రెండూ కుదరవని తేలిపోయింది గదా! కనుక, ఈ (హెచ్) పక్షం కూడా కుదరదు.

కాగా ఉపాధికి గల కారణం ఇతరమే (అవిద్యకంటే భిన్నమే అనే (ఇ) పక్షం మొత్తం కుదరదు.

ఉపాధికి గల కారణం అవిద్య అన్నా (డి) కావాలి. ఇతరమన్నా (ఇ) కావాలి. ఈ రెండు పక్షాలూ కుదరలేదు. కనుక, అనాది కర్తయొక్క ఉపాధికి కారణమే లేదన్నమాట. కనుక, వాడి కర్తృత్వం ఔపాధికం (సి) కావటానికే వీలు లేదు.

అది స్వాభావికం (బి) కావటానికి వీలులేదని ఇందాక నిరూపించాం. అది స్వాభావికమూ కాకపోతే, ఔపాధికమూ కాకపోతే, ఆ కర్త అనాది ఎలా అవుతాడు? కనుక, కర్త అనాది అనే (ఎ) పక్షం కుదరలేదు.

కనుక, కర్త సాది అనుకొనే (జెడ్) పక్షాన్ని చూద్దాం.

కర్త సాది అయితే వాడికి మొదలు వుంది. వాడు ఒకప్పుడు లేడు, తరువాత పుట్టాడు. ఆ పుట్టటానికి కారణమేమిటి? వాడి కర్మే అని చెప్పాలి. మరో గతి లేదు. అలా చెబితే, ఆ కర్మకు వెనకాల ఒక కర్త వుండి వుండాలి. అంటే, ఈ కర్తకు వెనకాల మరో కర్త వున్నాడన్నమాట. ఇదెలా కుదురుతుంది? కనుక కర్త సాది అనుకొనే (జెడ్) పక్షం కుదరదు.

కర్త అనాది అన్నా కుదరదు. సాది అన్నా కుదరదు.

ఈ చిక్కు తప్పించుకోవాలంటే, కర్మ కంటే భిన్నంగా కర్త వున్నాడనే మొండి వాదన వదిలెయ్యాలి. కర్త కర్మల తాదాత్మ్యాన్ని అంగీకరించాలి. ఈ రెంటికి కలిపి కారణం అవిద్యే అని గ్రహించాలి.

రామా! అవిద్యా కార్యం మనస్సు. మనస్సుయొక్క కార్యం కర్మ. అవిద్య కొమ్మ వంటిది. మనస్సు పువ్వు. కర్మేమో వాసన. మామూలు లోక పరిభాషలో కొమ్మలోంచి పువ్వు వచ్చింది. పువ్వులోంచి వాసన వచ్చింది. అని లోకులంటారు. అది ఒక విధంగా సత్యమే. కానీ పూర్తిగా సత్యం కాదు. పువ్వు, వాసనా కూడా కొమ్మలోంచి వచ్చాయి. ఒకే సారి వచ్చాయి. ఇదే అసలైన సత్యం.

అలాగే అవిద్యలోంచి మనస్సు వచ్చింది. మనస్సే కర్త. ఈ మనస్సులోంచి కర్మలు వచ్చాయి. కనుక, అవిద్య– మనస్సు –కర్మ– ఇదీ వరస అనేది లోక సామాన్యపు మాట. ఈ పక్షంలో ఇవి మట్టిపొడి– మట్టిముద్ద– కుండ అన్నట్టుగా వున్నాయి. ఇప్పుడు గూడా ఒక దృష్టిలో మట్టే కుండ. కుండే మట్టి అనే విధంగా మనస్సే కర్మ. కర్మే మనస్సు. కర్తే కర్మ. కానీ, నేను చెప్పే ప్రక్రియ ఇంతకంటే సూక్ష్మమైనది.

మట్టిముద్దకు, కుండకు, మధ్య కొంత కాలవ్యవధానం వుంటుంది. పువ్వుకు, వాసనకు, మధ్య అలాంటి వ్యవధానం వుండదు. వాసనకు పువ్వుకంటే భిన్నమైన రూపం గూడా వుండదు. కనుకనే కొమ్మ నుంచి పువ్వు. వాసనలు ఒకే సారి జన్మిస్తున్నాయని, పువ్వు, వాసనలు అభిన్న స్వరూపాలని అంగీకరించక తప్పదు.

మనస్సు– కర్మ అనేవి గూడా ఇలాంటివే. రెండూ కలిసి అవిద్యలోంచి ఏక కాలంలో జన్మిస్తున్నాయి. అభిన్న తాదాత్మ్య రూపంతో వుంటున్నాయి.

కనుక, రామా! జీవభావానికి (జీవుడు ఏర్పడటానికి) అసలైనన కారణం అవిద్యే. ఇక కర్త కర్మ అనేవి విడిగా లేవు గనుక, నువ్వు చేసిన వాదనకు ఆధారం లేదు.

## 83. కర్మ నశించినా చాలు- మనస్సు నశించినా చాలు-

**రాముడు** – గురుదేవా! మీరు తర్కంతో కర్త–కర్మ ఒక్కటే అని సాధించారు. కాని వేదశాస్త్రాలలో కర్మ సిద్ధాంతం వుంది. పెద్దలందరూ దీన్ని అంగీకరించారు.

**సాధు కారీ సాధుర్భవతి పాపకారీ పాపో భవతి**

**పుణ్యోవై పుణ్యేన కర్మణా– పాపః పాపేన (శ్రుతిః)**

మంచి చేసినవాడు మంచిగానే పుడతాడు. పాపం చేసినవాడు పాపిగానే పుడతాడు –అని ఇలాంటి వేద వాక్యాలున్నాయి. దీనిని బట్టి కర్త ఐన జీవుడియొక్క ఉత్పత్తికి కర్మే కారణమని స్పష్టంగా తెలుస్తోంది. మీరు చెప్పిన ఏకకాలోత్పత్తి వాదంవల్ల, పై వేద సిద్ధాంతం దెబ్బతింటోంది గదా!

**వశిష్ఠుడు**– రామా! మంచి ప్రశ్న వేశావు. ఐతే నేను ఏ దృష్టితో ఏక కాలోత్పత్తి వాదాన్ని చెప్పానో, ఏ దృష్టితో నువ్వు చెప్పిన వేదవాక్యాలు బయలుదేరాయో, ఆ దృష్టిభేదాలను నువ్వు సరిగ్గా గమనించాలి.

నేను ఏకకాలోత్పత్తి వాదాన్ని ఎందుకు చెప్పానంటే–కర్మ అనేది మనోధర్మమే గానీ, ఆత్మ ధర్మం కానే కాదు, అని నిరూపించడం కోసం చెప్పాను. ఈ దృష్టిలో బోధించే వాక్యాలు కూడా కొన్ని వున్నాయి.

ఉదా॥ **యద్ధి మనసా ధ్యాయతి తద్వాచా వదతి॥**

**తత్కర్మణా కరోతి (శ్రుతిః)**

(దేన్ని మనస్సుతో ఆలోచిస్తాడో, దాన్నే మాటతో పలుకుతాడు, దాన్నే కర్మేంద్రియాలతో చేస్తాడు)– ఇత్యాదులు.

ఈ మంత్రంవల్ల, మనస్సే కర్మలకు కారణమని తేలుతోంది. నువ్వు చెప్పిన వేదవాక్యాలున్నాయే, (సాధుకారీ సాధుర్భవతి వంటివి), అవి చేసిన కర్మకు ఫలం ఉండి తీరుతుంది –అని చెప్పే ప్రకరణలో వచ్చాయి. వేరు వేరు ప్రకరణాలలో వున్నాయి గనుక, ఈ రెంటికీ ముడి పెట్టకూడదు. కనుక, మనం గ్రహించవలసిన తాత్విక సత్యమేమిటంటే–(క) అవిద్యలోంచి మనస్సు పుట్టింది. (ఖ) ఈ మనస్సే క్రియాశక్తికి ఆశ్రయం. (గ) ఈ మనస్సే చిదాత్మకు ఉపాధి. (ఘ) అందుచేతనే ఈ మనస్సే కర్త. ఈ మనస్సే భోక్త.

**త్రీణ్యాత్మనే ఒ కురుత మనో వాచం ప్రాణం** (మనస్సు, వాక్కు, ప్రాణము – అనే మూడిటినీ ప్రజాపతి తన కోసమై సృజించు కొనెను)– ఇత్యాది శ్రుతులు ఈ విషయాన్ని స్పష్ట పరుస్తున్నాయి.

రామా! నువ్వు "మంచిపని చేసినవాడు మంచి జన్మ ఎత్తుతాడు" (సాధుకారీ సాధుర్భవతి) అనే వేదవాక్యం చెప్పి, దాన్ని బట్టి ముందు కర్మ, తరువాత జీవుడు, అని సిద్ధాంతీకరించాలని చూస్తున్నావు.

జీవుడంటే ఎవరు? మనస్సులో ప్రతిబింబించిన చైతన్యమే జీవుడు. ఈ మనస్సు నిత్యమా? అనిత్యమా?

ఒక విధంగా చూస్తే నిత్యం, మరో విధంగా చూస్తే అనిత్యం. అసలైనా నిత్యమంటే ఏమిటి? అనిత్యమంటే ఏమిటి?

ఎండవేళ గోడకు నీడ పడ్డది. రాత్రికి నీడ లేదు. మరునాడు పగలు మళ్లీ నీడ పడ్డది. "ఇది మా గోడ నీడే" అన్నావు. నిన్నటి నీడ నిన్నే పోయింది. మరి ఆ నీడా, ఈ నీడా, ఒక్కటే అన్నట్లు మాట్లాడతావేమిటి? అవి ఒకటే అంటే, ఆ నీడ నిత్యం. అవి వేరు వేరు అంటే, ఆ నీడ అనిత్యం.

అద్దంలో నీ ముఖం చూసుకున్నావు. ఎదురుగుండా ముఖ ప్రతిబింబం కనిపించింది. అద్దం పక్కకు తప్పించావు. ప్రతిబింబం పోయింది. అద్దం ముందుకు తెచ్చావు. మళ్ళీ ప్రతిబింబం వచ్చింది. ఇందాకటి ప్రతిబింబం, ఇప్పటి ప్రతిబింబం, ఒకటేనా? కాదా? ఒకటే అంటే ప్రతిబింబం నిత్యం అవుతుంది. కాదంటే అనిత్యం అవుతుంది. కానీ, కాదంటే తేడా ఏమిటో చూపించాలి.

మన మనస్సు కూడా ఇటువంటిదే. ఇప్పుడు మనస్సు వుంది. పని చేస్తూ వుంది. సుషుప్తి సమయంలో అది లయించిపోయింది. నిద్ర లేచాక మళ్ళీ పనిచేస్తోంది. ఆ మనస్సూ, ఈ మనస్సూ ఒకటేనా, వేరా? మొదటి మనస్సు అప్పుడే నశించి పోయింది. కనుక, నిద్ర లేచిన తరువాత కొత్త మనస్సు పుట్టిందనాలి. లేదా పాత మనస్సులోనూ, కొత్త మనస్సులోనూ కూడా ఉపహితమై ప్రతిబింబించినది, ప్రతిబింబిస్తున్నది, ఒకే చిదాత్మ కనుక, ఈ రెండు మనస్సులూ ఒకటే అనాలి.

ఈ రెండింటిలో ఏది నిజం? ఇది తేలాలంటే నశించటం అంటే ఏమిటో తేలాలి.

నశించడమంటే ఏమీ లేకుండా శూన్యమై పోవడమని, పుట్టడమంటే శూన్యంలోంచి కొత్తది పుట్టడమని, అజ్ఞులు అనుకొంటూ వుంటారు. అలా జరిగే అవకాశం లేనే లేదు కనుక విజ్ఞులు అలా అనుకోరు. నశించడమంటే కనబడకుండాపోవటం అనుకుంటారు. పుట్టటమంటే అది వ్యక్తం అవటం అనుకుంటారు. నేను గూడా ఆ పదాలను అలాగే ప్రయోగిస్తున్నాను.

నీడ గాని, ప్రతిబింబం గానీ, మనస్సు గానీ, ఏదైనా సరే, నశించింది అంటే, కనిపించకుండా పోతోంది. అవ్యక్తమవుతోంది. మళ్ళీ పుడుతోంది అంటే, అభివ్యక్తమౌతోంది.

మనస్సు వ్యక్తమైతే, ప్రపంచం కనిపిస్తోంది. మనస్సు లయిస్తే ప్రపంచం కనిపించకుండా పోతోంది.

మనస్సు మొలకెత్తడానికి కారణం ఏమిటంటే, తనయొక్క అసలు స్వరూపాన్ని మరచిపోవటమే. దీన్నే ఆత్మ విస్మరణ అంటారు. అవిద్య అంటారు.

కనుక, రామా! నువ్వు కర్మ–కర్తలు, విత్తు–చెట్టు వంటివి అనుకోవడం మానేసి, ఆ రెండూ పువ్వూ వాసనా వంటివని తెలుసుకొంటే మనస్సుయొక్క స్వరూపం నీకు సులభంగా అవగతమవుతుంది.

**రాముడు–** గురుదేవా! మీరు చెప్పింది బాగున్నది. ఈ ప్రపంచ రూపమైన సంసార భ్రాంతి నశించాలంటే, కర్మ నశించినా చాలు. లేదా మనస్సు నశించినా చాలు– అని నాకు తెలుస్తోంది. ఐతే ఈ రెండింటిలో ఏది నశించాలంటే ఏమి చెయ్యాలి?

**వశిష్ఠుడు–** రామా! సూర్యకిరణాలలో గల వెలుతురు నశించడానికి ఒక ఉపాయము, వేడి నశించటానికి మరొక ఉపాయమూ, వేరు వేరుగా వుండవు. ఈ రెండింటిలో ఒకటి నశిస్తే రెండవది నశించి తీరుతుంది. అలాగే అవిద్యలో మనస్సు, కర్మ అనేవి కలిసే వున్నాయి. వాటిలో ఏది పోయినా, రెండవది దానంతటదే పోతుంది.

ఈ పనికి రెండు ఉపాయాలున్నాయి. ఒకటి హఠయోగం. ఇక్కడ హఠయోగమంటే, ప్రాణ నిరోధరూపమైన అష్టాంగ యోగం. రెండవది రాజయోగం. ఇది సాక్షాత్తుగా మనోనిరోధ రూపమైనది. ఈ ఉపాయాలవల్ల కర్మ గానీ, మనస్సు గానీ ఏ ఒక్కటీ నశించినా సరే, రెండవది నశించడమే కాక, ఈ రెంటికీ మూలమైన అవిద్య కూడా తొలగిపోతుంది.

## 84. మనస్సుయొక్క పేర్లు

రామా! ఐందవోపాఖ్యానం తరువాత, మనస్సుయొక్క స్వరూపాన్ని గూర్చి చర్చిస్తున్నాం. ఆ సందర్భంలో మనోనిరోధానికి ఉపాయాల గురించిన ప్రసక్తి వచ్చింది. వాటి గురించి తరువాత వివరిస్తాను. మనస్సు గురించి తెలుసుకోవలసింది ఇంకా కొంత వున్నది విను.

ఆత్మదర్శన ప్రక్రియలో మనస్సే కీలకమైంది. అంతుపట్టనిది గూడా మనస్సే. కనుకనే దీని తత్త్వాన్ని వివిధ దృక్కోణాలతో పరిశీలించిన పెద్దలు దీనికి 15 పేర్లు పెట్టారు. మనస్సుయొక్క తత్త్వాన్ని తెలుసుకోవడానికి

ఈ పేర్లు ఉపకరిస్తాయి. కనుక వాటిని విను.

1. మనస్సు 2. బుద్ధి 3. అహంకారం 4. చిత్తం 5. కర్మ 6. కల్పన 7. సంస్మృతి (స్మృతి) 8. వాసన 9. విద్య 10. విస్మృతి 11. మలము 12. ఇంద్రియము 13. ప్రకృతి 14. మాయ 15. క్రియ

ఈ పేర్లను వివరిస్తాను విను.

**1. మనస్సు** – శుద్ధ చైతన్యం అవిద్యచేత కలుషితమైనది లాగా వుండి, అనేక వికల్పాలను పొంది, వాటిచేత అనేక రూపాలను పొందినట్లు గూడా కనిపిస్తూ వుంటే, అప్పుడది మనస్సు అనబడుతుంది.

**2. బుద్ధి–** వికల్పాలు కలిగిన తరువాత భావనానుసంధానం చేసి, ఇది భూమి, ఇది నీరు, ఇత్యాదిగా నిర్ణయాలు చేస్తే, అప్పుడు ఆ చైతన్యానికి బుద్ధి అనే పేరు వస్తుంది.

**3. అహంకారము** – ఆ భూమి, ఆ నీరు, మొదలైనవి విడిగా పడి వుండక, వాటివల్ల ఏర్పడిన దేహాదులమీద ఆత్మాభిమానం కలిగి, "నేను ఈ దేహంగా ఉన్నాను. ఈ ఇంద్రియంగా ఉన్నాను"– అని ఈ రకంగా ఒక ప్రత్యేక సత్తను గుర్తించే స్థితి వస్తే, అప్పుడు దానికి అహంకారము అనే పేరు వస్తుంది. భవబంధాలను కలిగించేది ఇదే.

**4. చిత్తము–** పూర్వాపర విచారణ మానేసి, సత్యాసత్యాలను, నిత్యానిత్యాలను, కలగా పులగం చేసుకొంటూ, కొన్నింటిని వదిలేసి, కొన్నిటిని స్మరించుకొంటూ వుంటే, ఆ దశలో ఆ సంవిత్తునే చిత్తం అంటారు.

**5. కర్మ–** ఆ సంవిత్తు లేని వస్తువులను చూపిస్తూ, వాటిని పొందచేసేందు కోసం ఇంద్రియాలను, శరీరాన్నీ, ఇటూ అటూ కదలిస్తూ అక్కడికీ ఇక్కడికి తిప్పుతూ వుంటే, అప్పుడు దాని పేరు కర్మ.

**6. కల్పన–** నిజానికి ఆ చిత్పదార్థం అఖండమైనది, పరిపూర్ణమైనది. కాని, అది తన పరిపూర్ణత్వాన్ని తనే వదులుకొని, తనకొక దేహంతో పరిమితతత్వాన్ని తనే కల్పించుకొంటూ వుంటే, అప్పుడు దాని పేరు కల్పన.

**7. సంస్మృతి (స్మృతి) –** ఈ ప్రపంచంలో భోగ్యపదార్థాలు వుంటాయి. వాటిల్లో కొన్నిటిని ఇప్పటికే అనుభవించి వుంటుంది. వాటినే మళ్లీ అనుభవించాలనీ గానీ, లేదా కొత్త కొత్తవి అనుభవించాలని గానీ, తపన పడే దశలో, ఆ సంవిత్తును సంస్మృతి అంటారు.

**8. వాసన–** భోగాలను అనుభవించేసినాక, వాటియొక్క సంస్కారం అంటుకుంటుంది. ఐనా కూడా ఆ సంవిత్తు సూక్ష్మ రూపంతో వుంటూ, తనకంటూ ప్రత్యేక క్రియలు ఏమీ లేకుండా వుంటే, అప్పుడు దాన్ని వాసన అంటారు.

**9. విద్య–** ఆలోచనలు అనేక రకాలుగా సాగుతూ వుంటాయి. వాటిలో ఒక్కోసారి ఈ కనిపించే భేదాలన్నీ అసత్యాలనీ, అవిద్యవల్లే కలిగాయనీ, జ్ఞానం కలుగుతూ వుంటుంది. అలాంటి దశలో ఆ చైతన్యం పేరు విద్య.

**10. విస్మృతి–** తనను తానే మరచిపోయేటట్లు చేసే దశలో దాని పేరు విస్మృతి, అంటే ఆవరణ శక్తి ప్రధానంగా వున్న దశలో దాని పేరు విస్మృతి.

**11. మలము–** లేని పోని కల్పనలు చూపించే దశలో దాని పేరు మలం. అంటే, విక్షేపశక్తి ప్రధానంగా వుండే దశలో మలం.

**12. ఇంద్రియము–** అదే చైతన్యం శ్రవణ, స్పర్శన, దర్శనాదుల చేత జీవుడుగా వున్న పరమేశ్వరుణ్ణి ఆనంద పరుస్తూ వుంటే ఆ దశలో దాని పేరు ఇంద్రియం.

**13. ప్రకృతి–** లోకంలో కనిపించే పదార్థాలన్నిటికీ ఉపాదాన కారణము, నిమిత్త కారణము కూడా, ఆ

చైతన్యమే. అందువల్ల దృశ్యపదార్థాలను నిర్మించే దశలో ఆ చైతన్యాన్ని ప్రకృతి అంటారు.

**14. మాయ–** అక్కడ వున్నది చైతన్యం అయితే, మనకు దృశ్యపదార్థాలు కనిపిస్తున్నాయి. చైతన్యం కనిపించడం లేదు. ఇలా వున్నది లేనట్టూ, లేనిది వున్నట్టూ చేసే దశలో, ఆ చైతన్యాన్నే మాయ అంటారు.

**15. క్రియ–** చూడటం, వినటం, తాకటం, రుచి చూడటం, వాసన చూడటం, అనే కర్మల ద్వారా, లోకంలో కార్య కారణ సంబంధాన్ని నెలకొల్పే దశలో, ఆ చైతన్యాన్ని క్రియ అంటారు. అంటే, ఒకడు మట్టిముద్దను చూసి, కుండను గూడా చూసి, ఈ రెంటిలోనూ గల ధర్మాలను చూసి, ఈ దర్శనం చేత కుండకు మట్టే కారణం అని కార్యకారణ భావాన్ని నెలకొల్పుతున్నాడు. ఈ దశలో వున్న చైతన్యానికి క్రియ అని పేరు. (అందువల్ల లోకంలో వీడు దర్శన క్రియ చేస్తున్నాడు అనే వ్యవహారం ఏర్పడుతోంది).

రామా! పండితులు ఆయా లక్షణాలను పురస్కరించుకొని, మనస్సుకు ఇంకా అనేక పేర్లు పెట్టారు. ప్రాధానత దృష్టితో ఈ పదిహేనూ నీకు చెప్పాను.

## 85. మనస్సు జడాజడం

**రాముడు–** గురుదేవా! మీరు ఈ 15 పేర్లనూ వివరించిన పద్ధతిలో చైతన్యానికే మనస్సని పేరు వచ్చింది. కాని లోకంలో మనస్సు జడం అనే ప్రసిద్ధి వుంది. శాస్త్రాలలో కూడా అనేక చోట్ల అదే వుంది. ఇంతకూ మనస్సు జడమా, చైతన్యమా? తేల్చి చెప్పండి?

**వశిష్ఠుడు–** అది రెండూ కాదు. రెండింటికంటే విలక్షణమైనది.

**చిన్నిస్పందో హి మలినః కలంక వికలాంతరమ్**
**మన ఇత్యుచ్యతేరామ న జడం న చ చిన్మయమ్॥** (ఉ.ప్ర.స.96, శ్లో.41)

చైతన్యానికి ఉపాధి సంపర్కంవల్ల చలనం ఏర్పడితే అప్పుడు ఆ చైతన్యం బయటకు ఉపాధిచేత మలినం అవుతుంది. ఆ ఉపాధి లోపల వున్న చైతన్యం మాత్రం, మాలిన్యం లేకుండా శుద్ధంగా వుంటుంది. ఇలా లోపల శుద్ధంగానూ, బయటికి మలినం గానూ, వుండే చైతన్యమే మనస్సు అనబడుతుంది. లోపల ఇది శుద్ధచైతన్య స్వరూపం గనుక, దీన్ని జడం అనటానికి వీలు లేదు. బయట ఇది ఉపాధి చేత కళంకితమైంది కనుక, దీన్ని చేతన మనటానికి వీలు లేదు.

రామా! అందుకనే ఈ మనస్సును సదసత్ విలక్షణమని, చిదచిత్ విభిన్నమని, జడాజడమని, ఇలాంటి పారిభాషిక నామధేయాలతో పిలుస్తూ వుంటారు.

ఈ మనస్సు గురించి అనేకమంది అనేక రకాలుగా ఆలోచనలు చేశారు. వాళ్ళు ఈ మనస్సును ఇంకా విభాగాలు చేసి మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము ఇలాంటి పేర్లు చాలా పెట్టారు.

నైయాయికులు, సాంఖ్యులు, జైమినీయులు, ఆర్హతులు, బౌద్ధులు, వైశేషికులు, పాంచరాత్రులు, ఇత్యాదిగా అనేక మార్గాల వారు మనస్సును గురించి అనేక విధాలుగా నిర్ణయాలు చేశారు. రామా! శాస్త్రాలలో మనస్సు జడమని వుందన్నావు గనుక, ఈ శాస్త్రాల ప్రసక్తి తెస్తున్నాను. అన్నీ శాస్త్రాలే, వాటిలో ఏది ప్రామాణిక శాస్త్రమో విచారించుకోవాలి.

**(గమనిక–** సామాన్యంగా శాస్త్రవాక్యాల జోలికి పోని వాల్మీకిమహర్షి, ఇక్కడ వివిధ వాదాలను పేర్లు పెట్టి చూపించడం గమనార్హం. ఈ పేర్లను బట్టి ఈ గ్రంథంయొక్క కాల నిర్ణయం చేయాలని కొందరు ఆలోచన చేస్తున్నారు. ఇది అంత సులభం కాదు. ఈ విషయాన్ని గురించి మొదటి ప్రకరణంలోనే చర్చ జరిగింది. గమనించండి**)**.

రామా! మనస్సుకు ఎవరు ఎన్ని పేర్లు పెట్టినా అవి నటకుడు వేసే వేషాలనుబట్టి పెట్టిన పేర్లే. ఈ పేర్లలో కొన్ని పేర్ల గురించి నేను నీకు ఇది వరకే చెప్పాను.

ఈ సిద్ధాంతాలవారు వేరు వేరు సిద్ధాంతాలను చేశామనుకొని, కొత్త కొత్త పరిభాషలు తయారు చేసినా,వీరంతా వేరు వేరు దారులలో ఒకే నగరానికి చేరుకొనే బాటసారుల లాంటి వంటి వారే. వీరు చేరేది పారమార్థిక పురం.

తూర్పునుంచి చేరిన బాటసారి ఆ ఊరి కోటగుమ్మం చాప కన్ను లాగా వుందంటున్నాడు. పశ్చిమంనుంచి నగరానికి చేరిన బాటసారి అది గిరిదుర్గం అంటున్నాడు. దక్షిణంనుంచి చేరినవాడు, అది అరణ్య ప్రాంతమంటున్నాడు. ఉత్తరం నుంచి చేరినవాడు, అది నదీతీరమంటున్నాడు. అందరూ ఆ నగరాన్ని గురించే చెపుతున్నారు. నిజమే, చెబుతున్నారు, కానీ ఎవడూ పూర్తిగా చెప్పటం లేదు.

రామా! మతి తప్పినవాడు లోకాన్ని చూసినా చూడనట్టే లెక్క. మూర్ఛపోయినవాడికి కళ్లు తెరుచుకున్నా లోకం కనిపించటం లేదు. కనుక, మనస్సు వున్న వాడికే ప్రపంచం కనిపిస్తోంది. మనస్సు లేకపోతే ప్రపంచమే లేదు. కనుక మనస్సే ప్రపంచం. ప్రపంచంలో జడమూ వుంది, చేతనమూ వుంది. కనుక దానికి కారణమైన మనస్సులో గూడా జడత్వం , చేతనత్వం, రెండూ వుండి తీరాలి. అందుకే, మనస్సు జడమూ కాదు, చైతన్యమూ కాదు, అని మేము అంటున్నాం.

మరో కారణం కూడా వుంది. రామా! మనస్సు కేవలం జడమైతే, ఏ విషయాన్నీ గ్రహించజాలదు. కేవలం చేతనమైతే, సుషుప్తి స్థితిలో స్తబ్దంగా వుండజాలదు. కనుక, మనస్సు జడా జడము అని చెప్పాలి.

మరో కారణం గూడా వుంది. ఈ మనస్సువల్లే సుఖ దుఃఖరూపమైన సంసారం ఏర్పడుతోంది. మనస్సు కేవలం పరిశుద్ధ చైతన్యమైతే, అది దుఃఖరూపమైన సంసారానికి హేతువు అవటానికి వీలు లేదు. అది రాయి లాగా శుద్ధ జడమైతే కూడా, అనుభూతి మయమైన సంసారానికి హేతువు కావడానికి వీలు లేదు. కనుక మనస్సు చిదచిత్ విలక్షణం కావలసిందే.

**రాముడు–** గురుదేవా! ఒక సందేహం. మనస్సు జడాజడం కాకపోతే, దానిలోంచి జడాజడమైన ప్రపంచం ఎలా వచ్చిందని మీరు ప్రశ్నిస్తున్నారు. అలాగే నేను మరొక ప్రశ్న వేస్తాను. జడత్వ స్పర్శలేని పరిశుద్ధ చైతన్యంలోంచి, జడత్వ చేతనత్వ మిశ్రితమైన మనస్సనే పదార్థం ఎలా పుటింది?

**వశిష్ఠుడు** – రామా! చేతనస్వరూపమైన సాలెపురుగులోంచి జడ స్వరూపమైన బూజు పుడుతోంది. ఇదెలా కుదురుతోంది? ప్రత్యక్షంగా కనిపిస్తుంటే కుదరటమేమిటి? కుదరకపోవటమేమిటి? దీన్ని బట్టి మనం ఏమి తెలుసుకోవాలంటే, జడంనుంచి చేతనం పుట్టజాలదు గానీ, చేతనంనుంచి చేతనం పుట్టవచ్చు, జడం పుట్టవచ్చు, చేతనాచేతనాలూ పుట్టవచ్చు.

**రాముడు**–ఇది మీ తర్కవాదమా? దీనికి ఏదైనా ప్రమాణం వుందా?

**వశిష్ఠుడు–** సాక్షాత్తుగా ఉపనిషత్తే ఈ మాట చెపుతోందయ్యా!

**యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ**

**యథా పృథివ్యా మోషధయ స్సంభవన్తి।**

**యథా సతః పురుషాత్ కేశలోమాని**

**తథాఽ_క్షరాత్సంభవతీహ విశ్వమ్॥ (శ్రుతిః)**

ఎలాగైతే సాలెపురుగు దారాలను తనే సృష్టిచేసి తనే మింగేస్తోందో, ఎలాగైతే భూమిలో మొక్కలు మొలుస్తున్నాయో, ఎలాగైతే జీవించి వున్న మనిషిలోంచి గడ్డాలు, మీసాలు వస్తున్నాయో, అలాగే అక్షరుడైన పరమాత్మనుంచి (జడాజడమైన) ఈ ప్రపంచం ఉద్భవిస్తోంది. ఈ శ్రుతి తాత్పర్యాన్ని తెలుసుకొంటే, నీ

సందేహానికి గాని, ఇతర వాదానికి గాని, తావే వుండదు.

**రాముడు–** గురుదేవా! శుద్ధ చైతన్యంనుంచి మనస్సు పుట్టిందని మీరు మాటిమాటికీ చెపుతున్నారు. అంటే శుద్ధచైతన్యం మనస్సును సృష్టి చేసింది అన్నమాట. మనస్సు లేనివాడు సృష్టి చేయగలుగుతాడా? కనుక, ఈ మనస్సు పుట్టకముందే, ఆ శుద్ధచైతన్యానికి మరో మనస్సు వుండి వుండాలి. మనస్సుకు ముందే మనస్సు వుంది అనటం అసంగతంగా వుంటుంది. మనస్సు లేకుండానే శుద్ధచైతన్యంగారు సృష్టి చేశారనటం, అంతకన్నా అసంగతంగా వుంటుంది. ఈ చిక్కులోంచి బయటపడటం ఎలా?

**వశిష్ఠుడు–** రామా! ఇట్లాంటిదే మరో చిక్కు గూడా వున్నది. నీకది తోచినట్టు లేదు. నేను చెపుతా, విను.

మనస్సు బ్రహ్మనుంచి పుట్టలేదనుకో, అప్పుడది శూన్యంనుంచే పుట్టి వుండాలి. ఇది అసంభవం. పోనీ మనస్సు బ్రహ్మనుంచే పుట్టిందే అనుకో, అప్పుడు బ్రహ్మకు సక్రియత్వం పడుతుంది. ఇదీ అసాధ్యమే. ఈ చిక్కు తప్పించుకోవడం ఎలా?

రామా! ఉపనిషత్తులలో చెప్పిన దానిని చెప్పినట్లు తీసుకుంటే మనకిలాంటి చిక్కులు ఏవీ వుండవు. శుద్ధచైతన్య రూపమైన పరబ్రహ్మకు మాయా సంపర్కం ఏర్పడింది. మాయ సదసత్ భిన్నమైనది. దానితో సంపర్కం పొందిన బ్రహ్మవల్ల మనస్సు జన్మిస్తోంది. ఇదీ సిద్ధాంతం.

మాయ సదసత్ భిన్నం గనుక, అది ఎలా వచ్చింది? ఎక్కడి నుండి వచ్చింది? అనే ప్రశ్నలు వుండవు. మాయతో కలిసిన బ్రహ్మవల్ల మనస్సు సృష్టింపబడుతుంది కనుక, బ్రహ్మకు సూటిగా సక్రియత్వం పట్టదు. విచిత్రశక్తిగల మాయయొక్క సంపర్కం బ్రహ్మకు వున్నది గనుక, ఇక ఆ బ్రహ్మకు, మనస్సును సృష్టి చేయటానికి, వేరే మనస్సు యొక్క సహాయం అక్కర లేదు. కనుక, రామా! ఉపనిషద్బోధ స్వీకరిస్తే అన్ని చిక్కులూ పరిష్కారం అయిపోతాయి.

రామా! మనస్సుయొక్క ఉత్పత్తి గురించి నువ్వు లోతుగా ఆలోచిస్తున్నావు. నేను భోదిస్తున్నాను. కానీ ఒక్క మాట మాత్రం మనం మరచిపోరాదు. మనస్సు, పంచభూతాలు, ప్రపంచం, మొదలైనవాటి సృష్టి క్రమాన్ని గురించి మనం విస్తరించి ఎందుకు చెప్పుకుంటున్నా మంటే "ఈ సృష్టి అనేది అసలు లేనే లేదు. ఇది అంతా మాయా సంపర్కంవల్ల కలిగిన భ్రాంతి మాత్రమే. నిజంగా ఏదీ పుట్ట లేదు. ఏదీ పోలేదు. ఆ శుద్ధ చైతన్యమే అంతటా నిండి వుంది"– అని నిరూపించటానికి మాత్రమే. కనుక, ఈ మాట మరచి పోకుండా తక్కిన ఆలోచనలు చెయ్యి.

## 86. చిత్తోపాఖ్యానం

రామా! నీకో ఉపాయం చెపుతాను. "ఈ మనస్సు ఎవరి నుంచి పుట్టింది? దీని స్వరూపమేమిటి?" ఇలాంటి గొడవల్లో నువ్వు ఎక్కువగా పడబోకు. నీ మనస్సును పరమాత్మ మీద లగ్నం చెయ్యి.

**సంయోజితం పరే చిత్తం శుద్ధం నిర్వాసనం భవేత్।**

**తతస్తు కల్పనా శూన్యం ఆత్మానం యాతి రాఘవ॥** (ఉ.ప్ర.స.98, శ్లో.2)

మనస్సును పరమాత్మ మీద లగ్నం చేస్తే, ఆ మనస్సు పరిశుద్ధం అవుతుంది. అంటే, దానిలోని వాసనలు తొలగిపోతాయి. వాసనలు పోతే, అది ఇక ఈ ప్రపంచ కల్పనలు చేయదు. ఈ కల్పనలు లేకపోతే అది స్వస్వరూపమైన శుద్ధ చైతన్యమే అయిపోతుంది.

రామా! ఈ చరాచర ప్రపంచమే కాదు, బంధమోక్షాలు గూడా మనస్సు మీదే ఆధారపడి వున్నాయి. దీన్ని నిరూపించేందుకు నీకు 'చిత్తోపాఖ్యానం' అనే కథ చెపుతాను విను.

ఒక చోట ఒక పెద్ద అడవి వుంది. అది మైళ్ళకు మైళ్ళ వైశాల్యంలో వుంది. అయినా చూస్తుంటే, అణువంత చిన్నదిగా కనిపిస్తుంది. దాంట్లో క్రూరజంతువులేవీ లేవు. అయినా అది భయంకరంగానే వుంటుంది.

ఆ అడవిలో ఒక వింత మనిషి వున్నాడు. వాడికి వెయ్యి చేతులు, వెయ్యి కళ్ళు, భయంకరమైన ఆకారం. వాడు వెయ్యి చేతుల్లోనూ, వెయ్యి దుడ్డుకర్రలు పట్టుకొని, తన వీపుమీద తనే బాదుకొంటున్నాడు. ఆ బాధకు తట్టుకోలేక తనే పరుగులు తీస్తున్నాడు. పరుగెత్తి పరుగెత్తి ఆ అలసటకు తెలివితప్పి పడి పోతున్నాడు. ఒక్కొక్కసారి చీకటి బావిలో పడిపోతున్నాడు. ఆ పాటుకి మూర్ఛ పోతున్నాడు. కొంతసేపటికి తెప్పరిల్లి, లేచి, దేక్కుంటూ ఒడ్డుమీదకి వచ్చి, మళ్లీ తన వీపుమీద తనే బాదుకొంటూ పరుగులు తీస్తున్నాడు.

ఈ మాటు ఒక చల్లటి అరటి తోటలోకి వెళ్ళాడు. వెళ్ళినవాడు అక్కడ వుండక, మళ్ళీ వెనక్కు తిరిగి, వచ్చిన దోవనే పరుగులు తీశాడు. మళ్ళీ నూతిలో పడ్డాడు. మళ్ళీ లేచాడు. మళ్ళీ మరో పక్కకు పరుగులు తీశాడు.

ఈ మాటు మంచి నీడ గల చెట్లల్లోకి పోయాడు. అక్కడో బావిలో పడ్డాడు. మళ్ళీ లేచి, మళ్ళీ తనను కొట్టుకొంటూ, అరటి తోటలోకి , పాడుబావిలోకి, చెట్లనీడలోకి, ఆపు లేకుండా పరుగులు తీస్తూనే వున్నాడు.

ఒక రోజున ఆ పరుగులు నా కంట పడ్డాయి. వీడికి మతి వుందా పోయిందా? నాకు అర్థం కాలేదు. కొంతసేపు ఆలోచించి, చివరికి నేనే వాడి దారికి అడ్డం వెళ్ళి, వాణ్ణి పట్టి, బలవంతాన నిలబెట్టి "ఎవడివిరా నువ్వు? ఎందుకురా నీకీ పరుగులు? " అని అడిగాను. వెంటనే వాడు వలవలా ఏడుస్తూ, నన్ను తిట్టసాగాడు. తిడుతూ తిడుతూ వాడిలా అన్నాడు– "నేను ఎవణ్ణీ కాదు. నేను ఏమీ చెయ్యడం లేదు. నువ్వు నన్ను చెడగొట్టావు. నువ్వు నాకు శత్రువువి. నువ్వు నన్ను చూడంగానే నేను సుఖానికి, దుఃఖానికీ గూడా పనికి రాకుండా పోయాను."

వాడిలా మాట్లాడుతూ ఏడుస్తూ వుండగానే, వాడి అవయవాలు క్రమక్రమంగా రాలి కిందపడసాగాయి. మొదట వాడి తల పడ్డది. తరువాత చేతులు రాలిపోయాయి. ఆ తరువాత ఛాతీ, ఆ తరువాత పొట్ట, కింద పడ్డాయి.

ఇవిలా రాలుతున్న కొద్దీ, వాడు ఏడుపు తగ్గి, నవ్వసాగాడు. అవయవాలన్నీ రాలిపోగానే సంతోషంగా ఎటో వెళ్ళిపోయాడు.

నేను ఆశ్చర్యపోయి, నా దోవన నాలుగడుగులు ముందుకు వేశానో, లేదో, ఇందాకటిలాంటి వాడే మరొకడు కనిపించాడు. వీడి పద్ధతీ అచ్చం ఇలాగే వుంది. నేను ఆశ్చర్యపోయి, వాడొక పాడునూతిలో పడబోతుండగా, పట్టుకొని ఆపి, ఇందాకటి లాగానే, నేను ప్రశ్నలు వేశాను.

వీడూ నన్ను నానా తిట్లూ తిట్టాడు. నా మాటలు పూర్తిగా వినకుండానే 'నీ వెధవ బోధలు నాకు వద్దు' అని అరుస్తూ, మరో పక్కకు పోయాడు.

నేను అడవిలో అలాంటివాళ్ళను వేలమందిని చూశాను. అందరికీ ఇలాంటి బోధలే చేశాను. వాళ్ళల్లో కొందరు నా మాటలు నిదానంగా విన్నారు. వాళ్ళకి మిథ్యాదేహం తొలగిపోయి, ఆనందంగా వెళ్ళిపోయారు. మిగిలినవాళ్ళు నా మాటలు పట్టించుకోలేదు. కొందరు బావుల్లో పడ్డారు. కొందరు అరటి తోటల్లో పడ్డారు. కొందరు చెట్ల నీడల్లో పడ్డారు. మళ్ళీ పరుగులు తీస్తూనే వున్నారు.

రామా! ఆ అడవి అలాగే వుంది. ఆ మనుషులు ఇప్పటికీ అలాగే వున్నారు. నువ్వు కూడా వాళ్ళను చూశావు కానీ, చూశానని గుర్తు పట్ట లేకుండా వున్నావు.

## 87. చిత్తోపాఖ్యానంలోని సంకేతాలు

**రాముడు:-** మీ కథ సంకేతాత్మకంగా వున్నట్టుంది. దయచేసి వివరించండి.
**వశిష్ఠుడు:-** రామా! విను.
ఆ అడవే సంసారం. భ్రాంతిదశలో సంసారం చాలా పెద్దదిగా కనిపిస్తుంది. కనుక, ఆ అడవి పెద్దదన్నాను. జ్ఞానదశలో అక్కడ ఏమీ లేదు కనుక, అది అణువంత అన్నాను.
వెయ్యి చేతుల మనిషంటే, మనస్సు.
నేను (వశిష్ఠుడు) అంటే, వివేకం- ఆత్మవిచారం.

వివేకంవల్ల కొన్ని మనస్సులకు శాశ్వత శాంతి లభించింది. మరి కొన్ని మనస్సులు వివేకాన్ని తిరస్కరించి, పరుగులు కొనసాగించాయి. ఇలాంటి మనస్సులు మునిని తిట్టటమంటే, వివేకాన్ని తిరస్కరించటం.

పాడుబావి అంటే, మహాపాతకం.

అరటితోట అంటే, స్వర్గాభిలాష. దాంట్లోంచి బయటికి రానివారంటే, స్వర్గకాంక్షతో పుణ్యాలు చేసేవారు. చెట్లనీడలంటే ఇహలోక సుఖాలు.

ఇటూ అటూ పరుగులంటే, జన్మ నుంచి జన్మకు, లోకం నుంచి లోకానికి, ప్రయాణాలు.

'నువ్వు నాకు శత్రువువి. నిన్ను చూడంగానే నేను పనికిరానివాణ్ణి అయిపోయాను' అంటే, వివేక జ్ఞానంవల్ల మనస్సు నశిస్తుందని అర్థం.

బిగ్గరగా ఏడవటం అంటే, సాధకుడు భోగాలను విడచి పెట్టేప్పుడు దుఃఖించడం- అని అర్థం.

అవయవాలు రాలిపోవడం అంటే, ఇంద్రియాల కోర్కెలు నశించాయని అర్థం.

వెయ్యి చేతులు, వెయ్యి కళ్ళు, అంటే, అనేక కోరికలని అర్థం. తనకు తాను కొట్టుకోవడం అంటే, కోరికలు తీరుతున్నకొద్దీ ఇంకా కోరికలు పెరిగి దుఃఖపడటం.

కొట్టుకుంటూ పరుగెత్తడమంటే, తనలో వున్న వాసనలు తననే తరుముకుంటూ పోవటం.

రాలిపోయే సమయంలో మొదట తల రాలిందంటే, ఆలోచనలు స్థిరపడ్డాయని అర్థం. చేతులు, కాళ్ళూ రాలాయంటే, కోరికలు పోయాయని అర్థం. ఛాతీ పోయిందంటే, ఆయుష్యంమీద కోరిక పోయిందని అర్థం. పొట్ట పోయిందంటే, తిండియావ పోయిందని అర్థం. అన్నీ రాలిపోయాక ఆనందంగా వెళ్ళడమంటే, ఇంద్రియాతీతమైన బ్రహ్మానందాన్ని అందుకొని, దానిలో లయించి పోయాడని అర్థం.

నువ్వు కూడా చూశావంటే, పూర్తిగా జ్ఞానం కలగక పోయినా, శాస్త్రవిచారణ చేసే సాధకులు కూడా మనస్సుయొక్క తత్వాన్ని గుర్తిస్తారని అర్థం.

నువ్వు గుర్తు పట్టలేక పోతున్నావు అంటే, కేవల శాస్త్ర విచారణవల్ల పరమ ప్రయోజనం లేదని అర్థం.

రామా! సంకేతాలు చెప్పాను. ఇక కథ తాత్పర్యం చెపుతాను. ఈ మనస్సు ఎంత తెలివిగలదైనా సుఖాలనుకొంటూ, తన కష్టాలను తనే కొని తెచ్చుకొంటుంది.

అడవిలో కొందరు రాజోద్యోగులు పెద్ద చెట్లను కొట్టి, వాటిని దూలాలుగా చెయ్యటంకోసం రంపాలతో కోస్తూ, అలసిపోయి, చీలికల మధ్యలో మేకు దింపి, భోజనాలకు వెళ్ళారు. ఇంతలో ఒక కోతి అక్కడకు వచ్చి, ఈ దూలపు చీలికల మధ్యలో కాలు పెట్టుకొని కూర్చొని, నా బలం చూసుకో అంటూ మధ్యలో పెట్టిన మేకును బలంగా పీకేసింది. ఇంకేముంది. కాలు నలిగి ఆ కోతి గిలగిలా తన్నుకొని చచ్చిందట. మనస్సు చేసే పనులు కూడా అలాగే వుంటాయి.

కనుక, రామా! మనస్సును దార్లో పెట్టాలంటే, సమాధి అభ్యాసం, ఒక్కటే మార్గం.

రామా! మనస్సుయొక్క తత్త్వాన్ని విచారించేటప్పుడు నువ్వు మరొక విషయాన్ని గట్టిగా గమనించాలి. ఏమిటంటే మనస్సుకు బ్రహ్మేమో వివర్తకారణం. మాయయేమో పరిణామ కారణం. అంటే, మనస్సు బ్రహ్మ యొక్క వివర్తము, మాయయొక్క పరిణామము. రెండూ అవుతుంది. ఇది బాగా అర్థమయ్యేందుకు, ఒక ఉదాహరణ చెపుతాను. సముద్రంలో అలలు, బుడగలు, నురుగులు, అన్నీ నీళ్ళే అనే గుర్తింపు వున్నవాడికి అవన్నీ నీటియొక్క వివర్తాలు.

వివర్తమంటే ఏమిటో పూర్వం చెప్పాను. కారణం యొక్క సత్త, కార్యంయొక్క సత్త, రెండూ ఒకటిగా వుంటే, అప్పుడా కార్యాన్ని వివర్తం అంటారు. తాడే పాముగా కనిపిస్తే, అప్పుడా పాము వివర్తం. నీళ్ళే అలలుగా, బుడగలుగా, నురుగులుగా, కనిపిస్తే అప్పుడు అలలు, బుడగలు, నురుగులు, వివర్తాలవుతాయి.

చిన్న కుర్రాడికి సముద్రంలో నీళ్ళుంటాయని తెలిసినా, అలలు, బుడగలు, నురుగులు, అనేవి నీళ్ళే తప్ప మరోటి కాదని గుర్తింపు ఉండదు. అవన్నీ వేరు వేరు వస్తువులు అని భావించుకొని, ఆనందపడి పోతుంటాడు. అలాంటివాడి దృష్టిలో మట్టి కుండగా మారినట్టుగా, నీరు అలలుగా, బుడగలుగా, నురుగులుగా, మారింది. ఈ రకమైన మార్పునే పరిణామం అంటారు. దీనిలో కార్యసత్తకు, కారణసత్తకు, భేదం వుంటుంది.

ఇప్పుడు ఆలోచించు, అలలు మొదలైనవి నీటియొక్క వివర్తాలా, పరిణామాలా? గుర్తింపు గలవాడి దృష్టిలో అవి వివర్తాలు. గుర్తింపు లేనివాడి దృష్టిలో అవి పరిణామాలు.

అలాగే, అంతా బ్రహ్మమయమనే గుర్తింపు గలవాడి దృష్టిలో మనస్సు బ్రహ్మయొక్క వివర్తం. అలాంటివాళ్ళకు ఈ మనస్సు బంధాన్ని కలిగించేది కాదు. అంతా బ్రహ్మమయమే అనే గుర్తింపు లేనివాడికి, ఈ మనస్సు మాయయొక్క పరిణామం. అలాంటివాళ్ళకి ఈ మనస్సు నిత్యమూ బంధాలను కలిగిస్తుంది.

**రాముడు:-** మాయయొక్క పరిణామం అనటం దేనికి?నీటియొక్క పరిణామం అన్నట్లుగా, బ్రహ్మయొక్క పరిణామం అనరాదా?

**వశిష్ఠుడు:-**అవయవాలు, (అంటే విభాగాలు), గల పదార్థాలకే పరిణామం కుదురుతుంది. మట్టిముద్దలో కణాలనే విభాగాలు వున్నాయి కనుక, వాటి అమరికను మార్చటం ద్వారా, కుండ అనే పరిణామం కుదురుతుంది. అవయవాలు లేని పదార్థాలకు పరిణామం కుదరదు. ఆకాశంలో అవయవాలు లేవు గనుక, దానికి పరిణామం కుదరదు. అలాగే బ్రహ్మలో అవయవాలు లేవు కనుక, అక్కడ గూడా పరిణామం కుదరదు. కనుక, బ్రహ్మయొక్క పరిణామం అనటానికి వీలు లేదు. బ్రహ్మను ఆశ్రయించుకొని వున్న మాయలో పరిణామం ఏర్పడి, కొన్ని బ్రహ్మ లక్షణాలు, కొన్ని మాయా లక్షణాలు కలుపుకొని, మనస్సు ఏర్పడుతుంది. కనుక, అది మాయయొక్క పరిణామం అని చెప్పవలసిందే.

రామా! ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే, జ్ఞానం గల వారి దృష్టిలో, మనస్సనేది ప్రత్యేకంగా లేదు.తాడు మీద కనిపించే పాము వంటిది. అందువల్ల మనస్సు కల్పించే ఈ ప్రపంచం కూడా అటువంటిదే. మనస్సు కల్పించే బంధమోక్షాలు కూడా అటువంటివే. వాళ్ళకి సృష్టిక్రమం గానీ, మోక్షోపాయం గానీ, అక్కరలేని విషయాలే.

ఇక అజ్ఞానుల దృష్టిలో, మనస్సు మాయయొక్క పరిణామం. అది వున్నదా, లేదా అని తేల్చి చెప్పలేరు. అందుచేత వారు దాన్ని సదసద్విలక్షణమని, అనిర్వచనీయమని, జడాజడమని, ఇలాంటి పేర్లు పెట్టుకుంటారు. కాబట్టి మనస్సు కల్పించే ప్రపంచానికీ, బంధమోక్షాలకీ కూడా, ఈ పేర్లే అన్వయిస్తాయి. వీళ్ళకి సృష్టి క్రమం,

బంధలక్షణాలు, మోక్షోపాయాలు, ఇలాంటివన్నీ కావాలి.

కానీ, జ్ఞానుల దృష్టిలో ఇవన్నీ గూడా బాలకాఖ్యాయిక (ఆఖ్యాయిక– మరీ చిన్నకథ) వంటిదే. ఆ కథ చెపుతా విను.

## 88. బాలకాఖ్యాయిక

రామా! రాజుగారి పసివాడొకడు నిద్రపట్టేందు కోసం మంచి కథ చెప్పమని దాదిని అడిగాడు. ఆ దాది హాస్యం కోసం ఒక కథ చెప్పింది.

బాబూ! ఒక నగరం వుంది. అది ఉత్త శూన్యం.

ఆ రాజుగారికి ముగ్గురు కొడుకులు. వారిలో ఇద్దరు ఇంకా పుట్టలేదు. మూడవవాడు తల్లి కడుపులోకే చేరలేదు.

ఇంతలో, వాళ్ళ దగ్గర బంధువులు మరణించారు. దాంతో ఆ ముగ్గురూ ఈ వూరు అచ్చిరాలేదని మరో వూరికి బయలుదేరారు. దారిలో మూడు చెట్లు కనిపించాయి. అందులో రెండు మొలకెత్త లేదు. మూడవదానికి విత్తనమే నాటలేదు. వాటిల్లో ఒక చెట్టు కింద ముగ్గురూ కూర్చున్నారు. ఆ చెట్టు పూలే కోసుకొని, మాలలు కట్టుకొని, మెడలో వేసుకున్నారు. ఆ చెట్టు పళ్ళే కోసుకొని, రసాలు పిండుకొని తాగారు.

మళ్ళీ ప్రయాణం సాగించి, ముందుకు పోతుండగా, మిట్ట మధ్యాహ్నం అయ్యేసరికి, మూడు నదులు కనిపించాయి. అందులో రెండు ఎండిపోయి వున్నాయి. మూడవ దాంట్లో నీళ్ళు లేవు. రాజకుమారులు ముగ్గురూ ఆ నదుల్లో జలకాలాడి, సేదదీరి, మళ్ళీ ప్రయాణం సాగించారు. అలా ప్రయాణం చేసి చేసి, ఒక నగరానికి చేరారు. అది భవిష్యన్నగరం. అంటే, ఇంకా పుట్టవలసిన నగరం.

ఆ నగరంలో మూడు భవనాలు కనిపించాయి. వాటిల్లో రెండింటిని ఇంకా నిర్మించలేదు. మూడవదానికి గోడలు లేవు. రాజకుమారులు గోడలు లేని ఇంట్లో మకాం పెట్టారు.

అక్కడ వాళ్ళకి మూడు బంగారపు గిన్నెలు కనిపించాయి. వాటిల్లో రెండు ముక్కలు ముక్కలై వున్నాయి. మూడవది పొడి పొడి అయి వుంది. రాజకుమారులు ఈ చూర్ణపాత్ర తీసుకొని పది పిడికిళ్ళు తక్కువగా పది గుప్పెట్ల బియ్యం పోసి, అన్నం వండారు. అన్నం ఉడికినాక, ముగ్గురు బ్రాహ్మణులను భోజనానికి పిలిచారు. వాళ్ళలో ఇద్దరికి శరీరం లేదు. మూడవవాడికి నోరు లేదు. నోరు లేని బ్రాహ్మణుడు పది గుప్పెళ్ళ అన్నం తిన్నాడు. మిగిలిన దాన్ని రాజకుమారులు తిన్నారు.

భోజనాల తరువాత రాజకుమారులు వేటకు వెళ్ళారు. వాళ్ళు ఇప్పటికీ ఆ పుట్టబోయే నగరంలో, హాయిగా వేటాడుతూనే వున్నారు.

రాజకుమారా! ఈ కథను మరచిపోకుండా మనస్సులో పెట్టుకుంటే, నువ్వు మంచి పండితుడివతావు.

రామా! ఈ కథ విని పిల్లవాడు కిలకిలా నవ్వి, నిద్ర పోయాడు. ఈ కథ నీ కెందుకు చెప్పానంటే, మనస్సు సృష్టి చేసే ఈ ప్రపంచం కథ అంతా ఇలాంటిదే– అని చెప్పటానికే.

ఈ కథ విని, ఆ పిల్లవాడు ఎలా సంతోషించ గలిగాడు? ఈ కథలోని పదార్థాలన్నీ శూన్యవస్తువులే అని గుర్తించక, తన ఆలోచనలతో (సంకల్పంలో) ఆయా పాత్రలను, పదార్థాలను ఊహించుకొని, దాన్నే సత్యంగా దృఢపరచుకొని, దాని ద్వారా సంతోషం పొందాడు.

ఈ కథ లాగానే ఈ ప్రపంచం అంతా కూడా సంకల్ప మాత్రమే. అంతకన్నా అధికంగా ఏమీ లేదు. సంకల్పాన్ని సమూలంగా తొలగిస్తే ఈ ప్రపంచమే లేదు. బంధాలే లేవు. మోక్షమూ లేదు. తాడు మీద

కనిపించే పాము మొదలైన మిథ్యా పదార్థాలు కంటికి కనిపిస్తాయి. మనస్సుకు స్ఫురిస్తాయి. నిజమే గానీ, వాటికి నిర్మాణక్రమం ఏదైనా వుంటుందా? వుండదు. మనస్సువల్ల పుట్టే ఈ ప్రపంచంయొక్క సృష్టిక్రమం కూడా అలాంటిదే.

కనుక, రామా! ఈ సృష్టి ప్రక్రియమీద దృష్టిని వదిలేసి, మనోనాశనం కోసం ప్రయత్నించు.

## 89. ఇంద్రజాలోపాఖ్యానం (లవణోపాఖ్యానం)

రామా! మనోనాశనం చేసుకోమని ఎందుకు చెపుతున్నానంటే మనస్సే సంసారం. మనస్సే త్రిపుటి, మనస్సే ఈ ప్రపంచం. ఈ మనస్సే ఒక ఇంద్రజాలం, గారడి. ఇది బాగా అర్థమయ్యేందుకు ఒక కథ చెపుతాను, విను. (దీని ప్రసక్తి మాయ–మాయా కార్యము– ముక్తి అనే 67వ ఖండికలో వుంది. గమనించండి.)

పూర్వం ఉత్తర పాండవ రాజ్యాన్ని లవణుడు అనే రాజు పరిపాలిస్తూ వుండేవాడు. ఒక రోజు ఆయన నిండుసభలో కూర్చొని వుండగా, మంచి ఆర్భాటంగా అలంకరించుకొని వున్న ఐంద్రజాలికుడొకడు (గారడీ వాడొకడు) సభలోకి ప్రవేశించి, తన చేతిలో వున్న నెమలి పింఛం కట్టను అటూ, ఇటూ ఊపాడు.

ఇంతలో, ఆ సభలోకి ఒక పంచకళ్యాణిని వెంట బెట్టుకుని, ఒక అశ్వపాలుడు ప్రవేశించాడు. ఆ గుఱ్ఱాన్ని చూసేసరికి, సభలో వున్న వీరులందరికీ "ఇది నాకు దొరికితే బాగుండు. ఇది నాకు దొరికితే బాగుండు" అని ఆశ పుట్టసాగింది. ఇంతలో అశ్వపాలుడు రాజుకు నమస్కరించి "మహారాజా! తమకు సామంతుడైన మాళవరాజు ఈ గుఱ్ఱాన్ని తమకు కానుకగా పంపించాడు. తమబోటి వీరులు ఒక సారి ఎక్కి స్వారీ చేస్తే, దీని విశేషమేమిటో తమకు తెలుస్తుంది" అని అన్నాడు.

ఇంతలో పక్కన్ను గారడివాడు, ఆ గుఱ్ఱపు సాముద్రిక లక్షణాలను తెగ మెచ్చుకొని, "మహారాజా! మీలాంటివారు ఇలాంటి గుఱ్ఱంమీద తక్షణం స్వారీ చేయవలసిందే" అని ప్రోత్సహించాడు.

దీంతో రాజుగారికి ఉబలాటం పెరిగి, ఆ గుఱ్ఱం మీద స్వారీ చేయాలనే ఆశతో సింహాసనంమీద నుంచి లేవబోయాడు.

ఇంతలో ఏమి జరిగిందో గానీ, లేవబోయిన రాజుగారు అట్లాగే బిగిసిపోయాడు. ఆయనకు స్పృహ ఉన్నట్టు లేదు.

సభలో ఉన్నవాళ్ళందరికీ రాజుగారు బిగిసిపోయారని తెలుస్తూనే వుంది. మంత్రులకీ, సేనాపతులకీ, ఇంకా స్పష్టంగా తెలుస్తూనే వుంది. ఒక పక్క దుఃఖం వస్తోంది. అయినా, అదేం చిత్రమో! వాళ్ళెవరూ నోరు మెదపలేక పోతున్నారు. బుఱ్ఱలు కూడా పూర్తిగా పనిచేయటం లేదు.

ఇలా రాజుగారు, సభాసదులు, స్తబ్ధ స్థితిలో వుండగా నాలుగు ఘడియల కాలం. అంటే, సుమారు గంటా నలభై నిమిషాల కాలం, దొర్లిపోయింది.

నాలుగు ఘడియలు అయ్యాక, రాజుగారికి మామూలు స్పృహ వచ్చింది. కానీ ఆయన మత్తుగా సింహాసనం మీంచి కిందికి తూలబోయాడు. పక్కనున్న అంగరక్షకులు ముందుగా తేరుకొని, రాజుగారు పడిపోకుండా పట్టుకున్నారు.

రాజుగారు కొంచెం కొంచెం తేరుకుని, సింహాసనంలో సర్దుకొని కూర్చొని "ఈ సభేమిటి, ఈ జనమేమిటి? నేను ఎక్కడ వున్నాను?" అన్నాడు దీనంగా.

మంత్రులు ఆ సరికి బాగా తేరుకొని, రాజుగారి దైన్యాన్ని చూసి ఆశ్చర్యపడి, రాజును ఇలా ఓదార్చ సాగారు– "మహా రాజా! మీకేమైందోనని చాలా భయపడ్డాం. దేవుడి దయవల్ల మీరు హాయిగా వున్నారు.

మీకీ మత్తేమిటి? ఈ మరుపేమిటి? ఈ దైన్యమేమిటి? మీబోటి వీరులకు తొట్రుపాటు తగదు. మీరు ప్రశాంతంగా వుండండి".

అప్పటికి మహారాజు పూర్తిగా తేరుకొని, విశాలంగా నవ్వుతూ, అభినందన పూర్వకంగా గారడీవాడి వంక చూసి, ఇలా అన్నాడు.

"సెహభాష్, ఇంద్రజాలికుడా! సెహభాష్. అద్భుతమైన మాయాశక్తులు సంపాదించావు. ఎవరికీ లొంగని మనోబలం మాకుందని అందరూ చెప్పుకుంటూ ఉంటారు. అలాంటి మమ్మల్నే సమ్మోహనంలో పడేశావ్. ఆపదలలో వుంచి దీనత్వం పాలు చేశావ్.

"సభాసదులారా! పూర్వం ఒకప్పుడు దేవ దానవ యుద్ధంలో బలిచక్రవర్తి దేవేంద్రుణ్ణి బంధించి తీసుకుపోయాడు. దారిలో దేవేంద్రుడు తన ఇంద్రజాలశక్తితో కొంత మాయా సైన్యాన్ని సృష్టిచేసి, బలిచక్రవర్తిని కంగారు పెట్టేశాడు. అప్పుడు బలి సమ్మోహితుడై, ఈ ఆపదనుంచి తనను గట్టెంకించమని బ్రహ్మదేవుణ్ణి ప్రార్థించాడు. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమయ్యే సరికి, దేవేంద్రుడు సూక్ష్మరూపంలో ఆయనకు అడ్డంబడి, 'నా కొంప ముంచకండి, మహాప్రభో' అని లబోదిబో మన్నాడు. బ్రహ్మదేవుడికి ఏమి చేయాలో పాలుబోక, అలాగే నిలబడిపోయి, దేవేంద్రుడి మాయాసృష్టి వైపు వెఱ్ఱి చూపులు చూస్తూ, ఒక క్షణం పాటు కాలం గడిపేశాడట! ఇప్పుడు మా పరిస్థితి గూడా అలాగే అయిపోయింది."

రాజుగారిలా అనే సరికి సభికులందరికీ ఆదుర్దా తగ్గిపోయి, ఉత్సాహం పెరిగిపోయి, "ఏమైంది, ఏమైంది, మీరే మేమి చూశారు? చెప్పండి. చెప్పండి?" అంటూ రాజుగారిని బలవంత పెట్టారు. రాజుగారు గొంతు సవరించుకొని తన కథను ప్రారంభించారు.

## 90. మాయ బోయ సంసారం

సభికులారా! ఈ సభలోకి ఈ ఐంద్రజాలికుడు, ఈ గుఱ్ఱమూ, రావడం మీరూ చూశారు కదా! ఇతను నెమలి పింఛం తిప్పాడు. అంతే, ఆ తరువాత ఈ సభ, ఈ జనం, నాకు గుర్తు లేదు.

నేను ఆ గుఱ్ఱం మీద మోజుపడి, వీరావేశంతో స్వారీ చేస్తూ, ఒక మహారణ్యంలోకి వెళ్లిపోయాను. అక్కడ క్రూర జంతువులు కనిపించేసరికి , సమర్థమైన గుఱ్ఱం చేతిలో వుండేసరికి, ఉత్సాహం పెరిగిపోయి, వేట తమకంలో పడ్డాను. గుఱ్ఱమూ పరిగెత్తలేక, నా చేతులూ కదలలేక, సొమ్మసిల్లి పడబోయే దశ వచ్చే దాకా, నా వేట మత్తు కిందికి దిగలేదు.

మండు వేసవి. మిట్టమధ్యాహ్నం. చెవులు గింగురులెత్తే వడగాలులు. నాలిక మెలికలు తిరిగే దాహం. నడవలేక కాళ్ళీడుస్తున్న గుఱ్ఱం–ఇదీ నా పరిస్థితి.

ఈ దశలో నీళ్ళకోసం వెతుక్కుంటూ ఇటూ అటూ తిరుగుతున్నాను. ఆ తిరగటంలో ఒక చోట ఒక పెద్దచెట్టు కొమ్మల కింద నుంచి పోతుంటే, పైనున్న అడవి తీగలు నా గొంతుకు పట్టుకున్నాయి. నేను గాలిలో వేళ్లాడసాగాను.

నా బరువు తగ్గేటప్పటికి ఆ గుఱ్ఱానికి అంత శక్తి ఎలా వచ్చిందో, మెరుపల్లే ముందుకు దూసుకుపోయింది. మరి కనిపించలేదు.

ఆ తీగల ఉరికి అక్కడే ప్రాణాలు పోతాయేమో అనిపించింది. కానీ, నా బరువుకి ఆ తీగలు తెగటంవల్ల, నేను కింద పడ్డాను. ఆ దెబ్బకు నాకు నిద్ర పట్టింది.

మెలకువ వచ్చేసరికి, చీకటి ముదురుతోంది. ఆ భయంకరారణ్యంలో నేను ఒంటరి జీవిని. స్నానం లేదు.పూజ లేదు. నాలిక తడుపుకొనేందుకు నీళ్ళైనా లేవు. పైగా భయంకరమైన చీకటి. ఏమి చెయ్యాలో

తెలియక, ఎలాగో ఓపిక తెచ్చుకొని, పక్కనే వున్న చెట్టు తొర్రలో దూరి, రాత్రి గడిపాను.

తెల్లవారింది. దాహం కొంచెం తగ్గింది. నీరసం పెరిగింది. ఏం చెయ్యాలో తెలియక, ఎక్కడైనా చెట్లమీద పళ్ళు దొరుకుతాయేమోనని, వెతుకుతూ తిరగసాగాను. అది వేసవి మొదలు. చెట్లకు పిందెలే గానీ, పళ్ళెక్కడా లేవు. ఆ కీకారణ్యంలో నరసంచారమే లేదు.

ఇక ఈ ప్రాణాలు ఎక్కువ సేపు వుండవని నేననుకుంటూ వుండగా, దూరంలో మెరుపులాంటి బోయపిల్ల ఒకతె కనిపించింది. దాని చేతిలో అన్నపు కుండ కనిపిస్తోంది. అది నడుస్తూనే ఆ కుండలో చెయ్యి పెట్టి తీసుకు తింటోంది.

నాకు అరిచే ఓపిక లేక, నోట మాట పెగలక, ఎలాగో దాని దారికడ్డంగా వెళ్ళి, బిచ్చం పెట్టమని దోసిలి ఒగ్గి ప్రార్థించాను.

దాని వంటిమీద వుండీ లేనట్టుగా గుడ్డపీలికలు వున్నాయి. నావి మహారాజా దుస్తులు. కానీ, నీరసపు మొహం. నన్ను చూసేసరికి, దానికి ఏమనిపించిందో ఏమో, 'లేదు పో' అనేసి, కిసుక్కున నవ్వేసి, చురుక్కున పారిపోయింది.

నాకు ఒక పక్క ప్రాణం పోతోంది. మరో పక్క ఆశ పీకుతోంది. మరో పక్క దాని నవ్వు, దాని కులుకులు, నన్ను కలవర పెడుతున్నాయి.

నాకు వేరే గతిలేక, దాన్ని వదిలి పెట్టి పోబుద్ధికాక, దాని వెంటే బడి, మెల్లిగా గొంతు పెగల్చుకొని "పిడికెడు అన్నం పెట్టు. నువ్వు చెప్పినట్లు చేస్తాను" అంటూ, రకరకాలుగా బతిమాలసాగాను.

ఆ బోయది పారిపోతోంది. కానీ పూర్తిగా పోవటం లేదు. గిరుక్కున వెనక్కు తిరుగుతోంది. ఫక్కున నవ్వుతోంది. "నేను పీలికల గుడ్డల దాన్నిగా! బోయదాన్నిగా! మీబోటి మహారాజుకు నేను పనికొస్తానా?" అంటోంది. మళ్ళీ పరుగులు తీస్తోంది.

మెల్లిగా దాని భావం నాకర్థమైది. నాకూ దానిమీద మోజు పుట్టింది. 'నువ్వు చెప్పినట్టే చేస్తాను. అన్నం పెట్టు' అన్నాను. అది నా చేత ప్రమాణం చేయించుకొని , ఉన్న అన్నంలో సగం పెట్టింది. మిగతాది పొలంలో వున్న తండ్రికి ఇవ్వాలంది.

నా ప్రాణాలు నిలిచాయి. నా మోజు కొంచెం పెరిగింది. కొంతసేపటికి ఆ బోయది వెళ్ళి తన తండ్రిని తీసుకు వచ్చింది. తరువాత ముగ్గురం కిలిసి వాళ్ళ గూడెం చేరాం.

అక్కడికి వెళ్ళేసరికి అది పచ్చిమాంసం తిని, పచ్చి నెత్తురు తాగే గూడెం అని తెలిసింది. ఎక్కడ చూసినా దోమలు, చీమలు, అంతా అసహ్యంగా వుంది. అయినా ఆ గూడెం వాళ్ళందరూ నాకు గొప్ప గౌరవం చేసి, డప్పులు వాయించి, సారాలు పంచి, మా ఇద్దరికీ పెళ్ళి చేశారు. వాళ్ళ ఉత్సాహం ఏమిటో గానీ, ఆ సంబరాలు ఏడు రోజులు సాగాయి. ఈ ఏడు రోజుల్లో నా రాజదుస్తు లెటుపోయాయో, వంటిమీదికి అడవి గుడ్డ పీలికలు ఎలా వచ్చాయో, నాకు గుర్తులేదు.

ఏడాది తిరిగేసరికి, మాకొక ఆడపిల్ల పుట్టింది.

నేను అక్కడి బోయవారితో కలిసి అడివి పందుల మాంసాలు తింటూ, బోయ వ్యవసాయం చేసుకొంటూ, అత్తవారింట్లోనే కొన్నాళ్ళు వున్నాను.

క్రమంగా వాళ్లతో పడక వేరే కాపురం పెట్టాను. సంతానం పెరిగింది. భార్యాభర్తలం ఇద్దరం కష్టపడి పని చేసినా, పిల్లలకు సరిగా తిండి పెట్టలేక పోతున్నాం.

ఈ దరిద్రంవల్ల నాకూ, నా భార్యకూ పడక, ఒక రోజున విడిపోయి, నేను కొంతమంది పిల్లలను

వెంటబెట్టుకొని మరో స్నేహితుడింట్లో మకాం పెట్టాను. ఇలా భార్యాభర్తలం చాలా సార్లు విడిపడ్డాం, చాలా సార్లు కలిశాం.

క్రమంగా, నాకు గూడా అక్కడివారి లాగానే బూతులు తిట్టడం, పాడుపనులు చేయటం, నీచాహారాలు తినటం, అలవాటై పోయింది.

ఇలా 60 సంవత్సరాలు గడిచాయి. ముసలితనం బాగా మీద పడ్డది. ఇలాంటి దశలో మా ప్రాంతానికి అంతులేని కరువు వచ్చింది. ఆ కరువు ముదిరి, మానవ సంబంధాలే తెగిపోయి, సందు దొరికితే తల్లీ పిల్లలు ఒకరినొకరు పీక్కు తింటున్నారు.

చాలా మంది వలస పోయారు. ఆ వయస్సులో గూడా, మాకు చిన్న పిల్లలున్నారు. నేను చంటివాడ్ణి భుజాలమీద పెట్టుకొని ముందు నడుస్తుంటే, నా ముసలి భార్య మరి కొంతమంది పిల్లలను చేత్తో పట్టుకొని నడుస్తోంది. కొంత నడిచాక ఒక చెట్టుకింద విశ్రాంతి కోసం ఆగాం.

ఇంత జరుగుతున్నా నా భార్యకు చీమ కుట్టినట్టుండేది కాదు. పిల్లలు ఆకలితో గగ్గోలు పెడుతున్నా, అది దొరికిన ఎండాకులు తినేసి, రాళ్ళముక్కలు నమిలేసి, హాయిగా గుర్రు పెట్టి నిద్రపోయింది. నాకు నిద్ర పట్టలేదు. పిల్లవాడు ఆకలి తట్టుకోలేక "కొంచెం మాంసం ఇవ్వు, కొంచెం రక్తం ఇవ్వు" అని ఏడుస్తున్నాడు. నేను వాడ్ణి బుజ్జగిస్తూ 'కొంచెం ఓపిక పట్టరా బాబూ!' అని బ్రతిమాలుతున్నాను.

వాడు ఏడుపు ఆపటం లేదు. చివరికి నా గుండె తరుక్కుపోయి "పోనీ, నా దగ్గరే కొంచెం మాంసం పీక్కు తినరా!" అని అనేశాను. వాడు దానికే సిద్ధపడ్డాడు.

అప్పుడు నాకు పుత్రప్రేమ మరీ పెరిగిపోయి, "నేను చస్తే నా మాంసమైనా వీళ్ళకి పనికొస్తుంది గదా' అనిపించింది. వెంటనే నేను ఎండుకట్టెలు పోగేసి, చితి పేర్చి, నిప్పంటించి, దాంట్లోకి దూకేశాను.

అక్కడ ఆ నిప్పులోకి దూకేశాను. ఇక్కడ సింహాసనం మీంచి కిందకు పడబోయాను. ఇక్కడ మీ జయ జయ ధ్వానాలు వినిపించేసరికి, నా భ్రాంతి, మత్తు, వదిలిపోయి, నేను మళ్ళీ ఈ లోకంలోకి వచ్చాను.

ఈ అద్భుతమైన మాయ అంతా ఈ ఐంద్రజాలికుడి వల్లే జరిగింది. ఇతనిని సముచితంగా సత్కరించాలి.

లవణమహారాజు తన ఉపన్యాసం ముగిస్తుండగానే, సభలోని ఐంద్రజాలికుడు అక్కడికక్కడే మాయమై పోయాడు.

ఇది చూసి సభికులంతా ఆశ్చర్యంలో మునిగిపోయారు. వాళ్ళలో పెద్దలు మాత్రం –

"మహారాజా! మామూలు ఐంద్రజాలికులైతే సన్మానాల కోసమే మాయలు చేసి చూపిస్తారు. ఇతను సన్మానం పేరెత్తేసరికి మాయమైపోయాడు. కనుక ఇతను మామూలు ఐంద్రజాలికుడు కాడేమో అనిపిస్తోంది.

"ఆ దైవమాయే మీకు ప్రపంచతత్త్వాన్ని బోధించ తలచి, ఈ రూపంవో వచ్చిందేమో?!

"మాయవల్ల ఈ ప్రపంచం అంతా మనోవిలాసమే! మనస్సు తప్ప మరేమీ లేదు. **'మనోవిలాసః సంసారః'** (ఉ.ప్ర.స.109, శ్లో.25) అని మనకు అర్థమౌతోంది. అది యుక్తమే. ఎందుకంటే **'సర్వ శక్తేరనంతస్య విలాసో హి మనో జగత్'** (ఉ.ప్ర.స.109, శ్లో.25) అనంత శక్తి సంపన్నుడైన హిరణ్యగర్భుడి మనస్సే గదా ఈ జగత్తు!

"కనుక, రాజా! ఇతనెవడో దివ్య బోధకుడే గానీ, మామూలు గారడీవాడు కాదనిపిస్తోంది" అన్నారు.

## 91. మనోజయానికి వరస

ఇంతవరకూ లవణోపాఖ్యాన కథను చెప్పిన వశిష్ఠుడు తన బోధను ఇలా కొనసాగించాడు–

రామా! ఇది కట్టుకథ అను కొంటున్నావేమో! కాదు. ఆ సభలో నేను స్వయంగా వుండి, ఈ సంఘటన చూశాను. ఈ కథ పూర్తి కాలేదు. చెప్పవలసింది ఇంకా వుంది. కానీ, ఇంతవరకు చెప్పిన కథ ఎందుకు చెప్పానో అంశాలవారిగా చెపుతాను, గమనించు.

1. మనస్సును అజ్ఞానం ఆవరిస్తే, అప్పుడా మనస్సు విషయ సుఖాల వెంట పడుతుంది.

2. పూర్వవాసనలకు పరవశమైన మనస్సు, భయానికి తావులేని చోట భయాన్ని పుట్టించగలదు. భయానికి నిలయమైన చోట ఆనందాన్ని పుట్టించ గలదు. మెలకువలోనే కలను చూపించ గలదు.

3. మనస్సు కావాలనుకొంటే వెలుతురు సహాయం లేకుండానే వస్తువులను చూపించగలదు. దూరదూరంగా వున్న సన్నివేశాలను నీ ఎదుటే జరుగుతున్నట్లు చూపించ గలదు.

4. అదే మనస్సు వద్దనుకుంటే వందమంది సూర్యులు వున్నా, వస్తువును కనిపించనీయదు. నీ కళ్ళకిందే సన్నివేశం జరుగుతున్నా నీకు కనిపించనీయదు.

5. ఒకరికి కలిగిన అనుభవాలను ఇంకొకరికి అతికించ గలదు.

6. జరిగిన వాటిని మరిపించగలదు. జరగనివాటిని జరిగినట్లుగా స్మృతికి తీసుకు రాగలదు.

7. మామూలు దశలో ఇంద్రియాలు మనస్సుకు ఉపకారం చేస్తూ వుంటాయి. మనస్సు గూడా ఇంద్రియాలకు ఉపకారం చేస్తుంది. కానీ స్వప్నం వచ్చేసరికి మనస్సు యొక్క స్వతంత్రశక్తి బయటపడిపోతుంది. కనుక, ఇంద్రియాల కన్నా మనస్సే గొప్పది. స్వతంత్రమైనది.

8. ఈ మనస్సు తలచుకుంటే మెలకువలో వుండగానే, స్వప్నం లేకుండానే, వింత వింత దృశ్యాలను చూపించ గలదు. లవణమహారాజుకు కలిగిన బోయ జీవితానుభవమంతా ఈ మనస్సుయొక్క శక్తివల్ల కలిగిందే కదా!

9. ఇలాగే ఈ మనస్సు దేవజన్మలనూ ఇవ్వగలదు. నరక జన్మలనూ ఇవ్వగలదు. ఆయా జన్మలు లేకుండానే వాటి అనుభవాలనూ ఇవ్వగలదు.

10. హరిశ్చంద్ర మహారాజుకు ఒక్క రాత్రిలో 12 సంవత్సరాల జీవితం గడిచిందన్నారు. ఇది మనస్సు మహిమే. ఇంద్రద్యుమ్న మహారాజుకు ఒక్క క్షణంలో ఒక్క యుగం గడిచిన అనుభవం కలిగింది. ఇదీ మనస్సు మహిమే.

11. రామా! మనస్సు మహిమను గురించి ఇంతగా ఎందుకు చెపుతున్నానంటే, మనస్సును ఒక్క దానిని జయిస్తే సమస్త లోకాలను జయించినట్టే అని నిరూపించడానికే.

12. దారాన్ని ఎక్కడ తెంపినా మాలలో పూసలన్నీ రాలిపోతాయి. మనస్సే దారం. ఇంద్రియాలే పూసలు. కనుక, రామా! ఎవడు తన మనస్సులో విషయ చింతనలకు చోటివ్వడో, అలాంటివాడి మనస్సు క్రమంగా శాంతి పొందుతుంది. అంటే శమించి పోతుంది.

13. కనుక, రామా! తమకు ప్రియమైన వస్తువులను గురించి ఆలోచించడం మానేసి, నిశ్చింతగా వుండటం నేర్చుకుంటే, మనస్సును జయించినట్లే, ఇదే మనస్సుకు చేయవలసిన మొదటి చికిత్స. సంకల్ప రహితస్థితి అంటే ఇదే. ఇదే ముక్తికి ముఖ్యోపాయం.

14. శుద్ధ చైతన్యానికి మాయతో సంపర్కం ఏర్పడితే, అప్పుడు ఒక స్పందం (కదలిక) ఏర్పడుతుంది. ఆ స్పంద శక్తే మనస్సు. అందువల్ల చలనం పోతే మనస్సు పోయినట్లే.

15. మనస్సును మనస్సుతోనే జయించాలి. రాజును రాజే ఓడించగలడు. మరో ఉపాయం లేదు.

16. మనస్సును మనస్సుతో జయించడానికి ఒక వరస వుంది.

**భోగౌఘ వాసనాం త్యక్త్వా త్యజ త్వం భేదవాసనామ్।**

**భావాభావౌ తతస్త్యక్త్వా నిర్వికల్ప స్సుఖీభవ॥** (ఉ.ప్ర.స.112, శ్లో.23)

క) మొదట భోగాలు కావాలనుకొనే వాసనలు వదిలి పెట్టు.

ఖ) తరువాత భేదాలను గురించిన వాసనలు వదిలిపెట్టు.

గ) ఆ తరువాత మనస్సుని, మనస్సుతో తెలుసుకోదగిన జ్ఞేయాన్ని, వదిలిపెట్టు.

ఘ) ఆ తరువాత సమస్త వికల్పాలను (ఆలోచనలను) వదిలిపెట్టు.

ఙ) ఇలా చేస్తే, ఇదే మనోనాశనం. ఇదే అవిద్యా నాశనం.

ఈ ఉపదేశమంతా విని రాముడిలా ప్రశ్నించాడు.

**రాముడు:-** గురుదేవా! మనోనాశనానికి కృషి చేస్తే, అవిద్యానాశనం అదే ఐపోతుందా? లేక అవిద్యానాశనం కోసం వేరే ప్రయత్నం చెయ్యాలా?

**వశిష్ఠుడు:-** రామా! రెండు ప్రయత్నాలూ ఏక కాలంలో జరగాలి. ఆత్మ సాక్షాత్కారమే అవిద్యా నాశనానికి సూటి ఉపాయం.

**ఇచ్ఛామాత్ర మవిద్యేహ తన్నాశో మోక్ష ఉచ్యతే।**

**స చాసంకల్ప మాత్రేణ సిద్ధో భవతి రాఘవ॥** (ఉ.ప్ర.స.114, శ్లో.7)

రామా! కోరికే అవిద్య. అది పోవటమే మోక్షం. ఆలోచనలు పరిత్యజించటమే దానికి మార్గం.

**రాముడు:-** అవిద్యానాశనానికి ఆత్మసాక్షాత్కారమే సూటి దారి అన్నారు కదా! అయితే ఆత్మ స్వరూపం ఎలాంటిది?

**వశిష్ఠుడు:-** సర్వవ్యాపియైన చైతన్యమే ఆత్మ. ఆ సర్వవ్యాపి చైతన్యాన్ని (బ్రహ్మను) నేను కాదనుకోవటమే బంధం. ఆ బ్రహ్మను నేనే అనుకోవటం మోక్షం. ఆ బ్రహ్మ నేను కాకపోతే, నేనెవరో నాకు తెలియటం లేదనాలి. కానీ అవిద్య అలా అననీయదు. "నేనీ దేహాన్ని. నేను కష్టసుఖాలు అనుభవించేదాన్ని" అని అనిపిస్తుంది. రాత్రిపూట సుదూరాకాశం కనిపించకపోతే, కనిపించటం లేదనాలి. నల్లగా వుందని చెప్పేస్తుంది ఈ అవిద్య. ఈ మాట నీకు పూర్వమే చెప్పాను. కనుక, ప్రయత్నించి అవిద్యను జయించాలి. వాసనలను పరిత్యజించడమే దీనికి మార్గం.

**రాముడు:-** వాసనలంటే ఏమిటి?

**వశిష్ఠుడు: -** ఆశాపాశాలను పెంచేదే వాసన. రామా! నువ్వు వాసనలను జయించి, ఆత్మవిచారణయందు ఆసక్తి కలిగి ముక్తుడివికా.

## 92. రెండవవిడత లవణ చరిత్ర-

**రాముడు-** గురుదేవా! నాకు నాలుగు ప్రశ్నలు మిగిలి వున్నాయి.

1. దేహము, ఆత్మ, వీటిలో కర్మఫల భోక్త ఎవరో చెప్పండి.
2. మాయయొక్క స్వరూపాన్ని ఇంకా వివరించండి?
3. లవణచక్రవర్తి ధర్మాత్ముడు కదా! ఆయనకు ఇలాంటి దుఃఖం ఎందుకు కలిగింది?
4. ఆ ఐంద్రజాలికుడు ఏమైపోయాడు?

**వశిష్ఠుడు -** రామా! ముందు కర్మఫలభోక్త గురించి చెపుతాను. చిదాకాశంతో తాదాత్మ్యాన్ని పొందిన మనస్సే కర్మఫల భోక్త.

కర్తృత్వ భోక్తృత్వాలే మాయయొక్క స్వరూపం.

ఇక నీ మూడు. నాలుగు ప్రశ్నలకు సమాధానం చెప్పాలంటే, లవణచరిత్ర కథ కొంత మిగిలిపోయి వుందన్నానే, అది చెప్పాలి. విను.

రామా! ఈ లవణచక్రవర్తి మీ వంశంవాడే. ఇతని తాత పేరు హరిశ్చంద్రుడు. ఆయన చాలా సమర్థుడు. ఆయన రాజసూయయాగం చేశాడు.

ఈ లవణుడు అంత సమర్థుడు కాదు. ఐనా తాతగారి లాగానే రాజసూయ యాగం చెయ్యాలనే ఆశ పుట్టింది. రాజసూయయాగం అంటే అప్పటికి భూమిమీద వున్న రాజులందరినీ జయించి, తనకు సామంతులుగా చేసుకొన్నాక చేయవలసిన యాగం. అది తన వల్ల అయ్యే పని కాదు. ఇప్పుడు తను ఏం చెయ్యాలి? ఎలా చెయ్యాలి? అని ఆలోచించి, చివరికి మానసికయాగం చేసినా కూడా అంతటి ఫలితం వస్తుందని తెలుసుకొని, అందుకు సిద్ధపడ్డాడు.

రాజ్యభారం మంత్రులమీద పెట్టి, ఒక్క సంవత్సరం పాటు ఏకాంతంగా కూర్చొని, మనస్సును ఏకాగ్రం చేసి, పరిపూర్ణమైన శ్రద్ధతో రాజసూయ యాగం అంతా మానసికంగా నిర్వహించేశాడు. చివరికి యజ్ఞదీక్షగా తన రాజ్యం అంతా ఋత్విక్కులకు పంచి ఇచ్చేశాడు– ఇదీ మానసికం గానే. ఇలా సంవత్సరం పాటు మానసిక యాగం చేసి, ఆ తరువాత మామూలు వ్యవహారాల్లోకి వచ్చాడు.

ఆ తరువాత కొంతకాలానికి నేను చెప్పిన ఇంద్రజాల సంఘటన జరిగింది. ఆ రోజు ఆ సభలో నేను గూడా వున్నానని చెప్పాను కదా!

ఆ సభలో వున్న పెద్దలంతా ధర్మాత్ముడైన ఆ రాజుకి, ఇలాంటి చేదు అనుభవం కలగటానికి కారణమేమిటని నన్నడిగారు. నేను సమాధిలోకి వెళ్ళి దివ్యదృష్టితో చూసి ఇలా చెప్పాను.

"సభికులారా! మీ రాజు ఒక సంవత్సరం పాటు అవిచ్ఛిన్నంగా మానసిక రాజసూయ యాగం చేశాడు. రాజసూయ యాగం చేసినవాడు 12 సంవత్సరాల పాటు నానా కష్టాలు అనుభవిస్తాడని శాస్త్రంలో వుంది.

మీ రాజు మానసిక యాగం చేశాడు కనుక, ఆ కష్టాలు కూడా మానసికంగానే అనుభవించ వలసి వుంది. ఆ కష్టాన్ని అందించేందుకే దేవేంద్రుడు తన దూతను ఐంద్రజాలికుడి రూపంలో పంపాడు. అందుకే మీ రాజు మానసికంగా దుఃఖాన్ని అనుభవించటం పూర్తి కాగానే అతడు మాయమైపోయాడు."

రామా! ఇప్పుడు చెప్పిన సన్నివేశంతో నీ మూడు, నాలుగు ప్రశ్నలు తేలిపోయాయి. లవణ చరిత్ర ఇంకా కొంత మిగిలి వుంది. అది చెప్పే ముందు ఈ సన్నివేశాలను తాత్వికంగా సమన్వయించి చూపిస్తాను, చూడు.

రామా! మనస్సే అన్ని పనులకూ కర్త, అన్ని కర్మఫలాలకూ భోక్త– అని పూర్వం చెప్పాను. ఇప్పుడు చెప్పిన ఘట్టాలు దీనిని నిరూపిస్తున్నాయి. లవణుడి మనస్సే గదా, ఆ 60 సంవత్సరాలకు కర్త. ఆ మనస్సే గదా, ఆ సుఖదుఃఖాలకు భోక్త.

కనుక, దానిని లొంగదీసుకో దలచుకున్నవాడు మొదట దాన్ని హఠయోగంతో పదును పెట్టాలి. రాజయోగంతో శుద్ధి చెయ్యాలి. చివరికి నిర్వికల్ప సమాధితో లయం చెయ్యాలి. ఇదే జ్ఞాన స్థితి. (ఈ 116వ సర్గలో వాల్మీకి కొంత పద్యాన్ని, కొంత గద్యాన్ని వ్రాశాడు.)

## 93. స్వస్వరూప నిర్వచనాలు

రామా! ఈ జ్ఞానస్థితిని అందుకోవడంలో ఏడు భూమికలు (మెట్లు) వున్నాయి. అలాగే అజ్ఞాన స్థితిలో కూడా ఏడు భూమికలు వున్నాయి.

ఏడు అజ్ఞాన భూమికలు అధో లోకాల వంటివి. ఏడు జ్ఞానభూమికలు ఊర్ధ్వలోకాల వంటివి. వీటిలో ముందుగా అజ్ఞాన భూమికలను గూర్చి తెలుసుకుందాం.

అజ్ఞాన భూమికలను తెలుసుకొనే ముందు, అజ్ఞానం దేన్ని ఆశ్రయించుకొని వుంటుందో దాన్ని తెలుసుకోవాలి. అజ్ఞానానికి ఆశ్రయం స్వస్వరూపమే.

రామా! స్వస్వరూపమంటే ఏమిటో తెలుసుకోవటం చాలా ముఖ్యం. కనుక, నేను నీకు మూడు నిర్వచనాలు చెపుతాను. జాగర్తగా విను.

**అర్థాదర్థాంతరం చిత్తే యాతే మధ్యే హి యా స్థితిః**
**నిరస్త మననా యాఽసౌ స్వరూపస్థితి రుచ్యతే॥** (ఉ.ప్ర.స.117, శ్లో.8)

రామా! ఇది మొదటి నిర్వచనం.

రెండు వేళ్ళు దూరం దూరంగా పెట్టామనుకో. మధ్యలో ఏం వుంటుంది? ఆకాశం వుంటుంది.

రెండు ఆలోచనలు పక్కపక్కనే కొంచెం దూరంగా వున్నాయనుకో. అంటే, మనస్సుయొక్క ఆలోచన ఒక విషయం నుంచి ఇంకో విషయం మీదకి వెళ్ళింది. ఈ ఆలోచనకీ, ఆ ఆలోచనకీ మధ్య ఏం వుంది?

ఆ మధ్యలో ఆకాశం లేదు. గాలి లేదు, నిప్పు లేదు, నీరు లేదు, నేల లేదు, పంచభూతాలలో ఏమీ లేకపోతే అక్కడ ఏం వున్నట్టు?

మధ్యలో ఏమీ లేదందామా? ఏమీ లేకపోతే, ఆ రెండూ వేరు వేరు ఆలోచనలని మనకెలా తెలుస్తోంది?

ఆ మధ్యలో వున్నది మరో ఆలోచన కావటానికి వీలు లేదు. అది మరో ఆలోచన అయితే, దానికొక విషయం వుండాలి. విషయం వుంటే, నాకీ ఆలోచన వచ్చిందని తెలిసి వుండేదే. అలాంటి అనుభవం ఎవరికీ లేదు కదా!

కనుక, పక్క పక్కనే వున్న ఆలోచనకి మధ్యలో వేరే ఎవ్వరూ లేరు. నేనే వున్నాను (అంటే ఆలోచన చేసేవాడే వున్నాడు)

ఇలా ప్రపంచంలోని ఏ పదార్థంతోనూ సంబంధం లేకుండా, ఆలోచనలతో గూడా సంబంధం లేకుండా, స్వచ్ఛంగా విడిగా వుండేదే నాయొక్క స్వస్వరూపం.

రామా! పూర్వం లీలోపాఖ్యానంలో, చిదాకాశంయొక్క నిర్వచనం వచ్చింది. గుర్తుందా?

**దేశాద్దేశాంతర ప్రాప్తౌ సంవిదో మధ్యమేవ యత్‌**
**నిమేషేణ చిదాకాశం తద్విద్ధి వరవర్ణిని॥** (ఉ.ప్ర.స.117, శ్లో.12)

ఓ లీలా! చిత్తవృత్తి ఒక క్షణకాలంలో ఒక ప్రదేశం నుంచి మరొక ప్రదేశానికి ప్రయాణం చేసినప్పుడు, ఆ మధ్యలో ఏది వుంటుందో అదే చిదాకాశం– అని సరస్వతీదేవి అక్కడ చెప్పింది. ఈ రెండు నిర్వచనాలకీ వున్న సామ్యాన్ని గమనించు. దాన్ని బట్టి చిదాకాశమే స్వస్వరూపమని తెలుసుకో.

రామా! ఇక రెండవ నిర్వచనం విను–

**సంశాంత సర్వ సంకల్పా యా శిలావదవస్థితిః**
**జాడ్య నిద్రావినిర్ముక్తా సా స్వరూపస్థితి స్స్మృతా॥** (ఉ.ప్ర.స.117, శ్లో.9)

అక్కడ ఏ సంకల్పాలూ లేవు. పరిస్థితి ఏకాండీశిల లాగా వుంది. కానీ, అది మూర్ఛ గాదు. నిద్ర గాదు.

అక్కడ జడత్వమే లేదు. అదే స్వరూప స్థితి.

రామా! మొదటి నిర్వచనంలో చిత్తవృత్తిమీద ఆధారపడి, స్వస్వరూపాన్ని గుర్తుపట్టే విధానాన్ని చెప్పాం.

రెండవ నిర్వచనంలో సర్వచిత్తవృత్తులను పరిత్యజించడం ద్వారా, చైతన్యాత్మకమైన స్వరూపస్థితిని గుర్తుపట్టే విధానం చెప్పాం.

ఇక అహం వృత్తి పరిత్యాగం ద్వారా స్వస్వరూపాన్ని గుర్తు పట్టేందుకు వీలుగా మూడవ నిర్వచనం చెపుతాను విను.

**అహంతాంశే క్షతే శాంతే భేదే నిస్పందతాం గతే।**

**అజడా యా ప్రచకతి తత్స్వరూపమితి స్థితమ్॥** (ఉ.ప్ర.స.117, శ్లో.10)

లోపల నేననే స్ఫురణ అణిగిపోవాలి. బయట భేదభావన చల్లారి పోవాలి. లోపలా బయటా కూడా మనస్సులో కదలిక ఆగాలి. అప్పుడు స్వయం ప్రకాశ మానమైన ఒక చైతన్యం వికసిస్తుంది. అదే స్వస్వరూపం.

## 94. అజ్ఞాన భూమికలు

రామా! ఇటువంటి స్వస్వరూపం మీద అజ్ఞానం ఆరోపించబడింది. (తాడు మీద పాము లాగా ఆరోపించబడింది.) ఈ అజ్ఞానానికి భూమికలు ఏడు. భూమిక అంటే అవస్థ లేక మెట్టు.

1. బీజ జాగ్రత్తు
2. జాగ్రత్తు
3. మహాజాగ్రత్తు
4. జాగ్రత్స్వప్నం
5. స్వప్నం
6. స్వప్నజాగ్రత్తు
7. సుషుప్తము

1) బీజజాగ్రత్తు - ఇది జాగ్రదవస్థకు కారణమైన అజ్ఞాన దశ. సమష్టిలో సృష్టికి మొదట, మాయతో కూడిన చైతన్యం తీసుకున్న మొట్టమొదటి అసత్యరూపం ఇదే. అంటే, సృష్టికి మొదటి బీజం ఇదే. అలాగే వ్యష్టిలో మెలకువ అనే వ్యవస్థకు (జాగ్రదవస్థకు) ప్రారంభంలో వుండే బీజం ఇదే. మొత్తం మీద– శుద్ధంగా , సత్యంగా, వుండే చైతన్యానికి కొత్తగా పుట్టిన అసత్యావస్థ ఇదే.

2) జాగ్రత్తు –"ఈ స్థూలదేహమే నేను. ఇవన్నీ నేననుభవించ దగిన భోగాలు. ఇవి నావి"– అనే ఆలోచనే (ప్రత్యయమే, జ్ఞానమే) ఈ భూమిక. జాగ్రత్తులో (మెలకువలో) కదా ఇలాంటి ఆలోచనలు వచ్చేది.

3) మహాజాగ్రత్తు– నాది, నేను, అనే భావాలు అందరికీ వున్నాయి. ఇవి రెండవ అజ్ఞాన భూమికకు చెందిన భావాలు. ఇవి జన్మజన్మల నుంచి బాగా నాటుకుపోయి, ఈ జన్మలో గూడా అవి ఆ రూపంగా వ్యక్తమౌవుతుంటే, అదే ఈ భూమిక.

ఉదాహరణకు– ఒకడికి చిన్నప్పటినుంచీ నేను వీరుడ్ననీ, సాహసిననీ, ఒకటే అభినివేశం వుంటుంది. ఇది వాళ్ళింట్లోనే అందరికీ వుండదు. వీడికి ఇలాంటి అభినివేశం ఎందుకు కలుగుతోందంటే, పూర్వజన్మల వాసన అంత గట్టిగా వుండటంవల్లే. ఇలాంటి దృఢాభినివేశం గల ప్రత్యయమే మహాజాగ్రత్తు. ఇప్పటి వరకూ చెప్పిన మూడు భూమికలూ, జాగ్రదవస్థతో వున్న పోలికలనుబట్టి చెప్పిన విభాగాలు.

4. జాగ్రత్స్వప్నము– ఒక్కొక్కప్పుడు మెలకువగా వుండగానే, మనస్సు విజృంభించి తన నూతన సృష్టి సామ్రాజ్యాన్ని మనకు చూపిస్తూ వుంటుంది.

ఉదాహరణకు– తాడు మీది పాము, ఎండమావులు, ఆకాశంలో ఇద్దరు చంద్రులు, మొదలైనవి ఈ మనోరాజ్యానికి తార్కాణాలు. ఇంద్రియాలలో దోషం గానీ, అభ్యాసంలో లోపం గానీ, మరింక ఏదైనా గానీ,

దీనికి కారణం అవచ్చు గాక, కారణమేదైనా, ఇలా మెలకువలో వుండగానే అసత్య సృష్టిని చూపించేదే ఈ భూమిక.

5. స్వప్నం– జీవి నిద్రలో పడినప్పుడు, ఇంద్రియాల సహాయం లేకుండా దృశ్యానుభవాలను కలిగించే భూమికే ఈ స్వప్నం. ఇది స్థూల శరీరంలో కంఠం నుంచి హృదయం దాకా వుంటుందని యోగులు నిర్ణయించారు.

6. స్వప్నజాగ్రత్తు – ఒకప్పుడు దృఢమైన అభిమానంవల్ల గానీ, మానసికమైన కల్పనవల్ల గానీ, స్వప్నతుల్యమైన ఒక్క ప్రత్యయం (అనుభవం) దీర్ఘకాలం నిలబడి పోతుంది. అలాంటి దశను కలిగించే అజ్ఞానమే స్వప్నజాగ్రత్తు. అంటే వాడు స్వప్నావస్థలో చాలా కాలం మేలుకొని వుంటాడన్నమాట!

ఉదాహరణకు– హరిశ్చంద్ర మహారాజుకు ఒకే రాత్రి 12 సంవత్సరాల జీవితం అనుభవించినట్లు అనుభూతి కలిగింది. అలాగే లవణ మహారాజుకు నాలుగు ఘడియల్లో 60 సంవత్సరాల జీవితం అనుభవించిన అనుభూతి కలిగింది.

ఈ మూడు భూమికలూ స్వప్నాన్ని ఆధారం చేసుకొని  ఏర్పరచిన విభాగాలు. వీటిలో జాగ్రత్ స్వప్నమనీ, స్వప్న జాగ్రత్తనీ, రెండు పేర్లు వచ్చాయి. వీటికి పేర్లలో పోలిక వున్నా అర్థంలో మాత్రం భేదం వుంది. మొదటిది స్వల్పకాలికం. పైగా భ్రాంత్యాత్మకం. రెండవది దీర్ఘకాలికం. జాగ్రద్దశా జీవితానికి సమానంగా వుంటుంది.

7. సుషుప్తము– ఇది మామూలు సుషుప్తి అవస్థను పోలిన భూమిక. ఇప్పటి వరకూ చెప్పుకొన్న 6 భూమికలూ కర్మఫలభోగాన్ని కలిగించేవే. అందుకనే ఇవి కర్మవల్ల జన్మించేవి (కర్మజములు) అని పెద్దలంటారు. వీటికి భిన్నంగా, పూర్వకర్మలన్నీ భోగంచేత నశించి పోగా, పై కర్మలు ఇంకా పుట్టకపోగా, మధ్యకాలంలో కొంత స్థితి వుంటుంది. ఈ స్థితిలో స్థూల సూక్ష్మ ప్రపంచాలు రెండూ లయించి పోయి, అజ్ఞానమూ, దానికి ఆలంబనమైన ఆత్మ, మిగిలి వుంటాయి. ఈ అజ్ఞానంలో, రాబోయే కాలంలో అనుభవించబోయే సుఖదుఃఖాలకు కారణమైన కర్మవాసనలు మాత్రం మిగిలి వుంటాయి. ఇలాంటి అజ్ఞానస్థితే సుషుప్తి భూమిక. ఈ భూమికలో జీవుడు జడరూపంగా పడి వుంటాడు.

రామా! ఈ ఏడు భూమికలను బట్టి ఈ విభాగాలను ఇంకా పెంచుకుంటూ పోవచ్చు. నువ్వు ఈ విభాగాల సహాయంతో ఆత్మవిచారం చేసుకుంటే ఈ అజ్ఞాన భూమికలన్నింటినీ సులభంగా దాటగలుగుతావు. ఇక జ్ఞానభూమికలను వివరిస్తాను విను.

### 95. జ్ఞానభూమికలు–

జ్ఞానభూమికలు ఏడు –

1. శుభేచ్ఛ     4. సత్వాపత్తి   7. తుర్యగ

2. విచారణ     5.అసంసక్తి

3. తనుమానస   6. పదార్థాభావన

1) శుభేచ్ఛ– శుభేచ్ఛ అంటే మంచి కోరిక. లౌకికమైన కోరికలన్నీ వదిలి, వైరాగ్యాన్ని సాధించడం దీనికి ప్రారంభదశ. దీని సహాయంతో తాను అజ్ఞాన దశలో వున్నానని గుర్తించి, శాస్త్రవిచారణపట్ల,సత్సాంగత్యం పట్ల, కోరికలు పెంచుకోవటమే అసలైన శుభేచ్ఛ.

2) విచారణ– శుభేచ్ఛ ఇచ్ఛామాత్రంగా మిగిలి పోకుండా శ్రవణ మననాలయందు నిజంగా ప్రవర్తించడం పేరు విచారణ. వైరాగ్యం, సత్సాంగత్యం, లేకుండా చేసే శ్రవణాదులు విచారణ భూమికలోకి రావు. వైరాగ్యాదులు వున్నా, శ్రవణ మననాదులు నిష్ఠగా చేయకపోతే, అది విచారణ భూమిక కాదు.

3) తనుమానస– మానస అంటే ఇక్కడ కోరిక, లేక ఆసక్తి. తను అంటే స్వల్పం. ఆసక్తి తగ్గిపోవడమే తనుమానస. లౌకిక విషయాలపై ఆసక్తి అనేక కారణాలవల్ల తగ్గవచ్చు. అవన్నీ తనుమానసలు కావు. శుభేచ్ఛ, విచారణలవల్ల లౌకిక విషయాలమీద అనాసక్తి పెరిగితే, అదే తనుమానస, లేక తనుమానసి, వైరాగ్యము, శ్రవణ మననాదులు వుండి కూడా సుఖభోగాలమీద ఆసక్తి తగ్గకపోయినట్లైతే, ఆ జ్ఞానం సఫలం కాదు. అందుకే దీనిని మూడవ భూమికగా స్వీకరించడం జరుగుతోంది.

4. సత్త్వాపత్తి– సత్త్వం అంటే సన్మాత్రమైన పరమాత్మ. ఆపత్తి అంటే పొందటం. పై మూడు భూమికలను బాగా సాధించడం ద్వారా, సన్మాత్ర పరమాత్మను గురించిన నిర్వికల్ప సమాధి స్థితి కుదిరితే, అప్పుడు ఆ భూమిక యొక్క పేరు సత్త్వాపత్తి లేక పరమాత్మ ప్రాప్తి. మూడవ భూమిక కుదిరిన తరువాత నిర్వికల్ప సమాధికోసం కృషి చెయ్యకపోతే, జ్ఞాన సాధన సఫలం కాజాలదు. అందుకే ఇది నాలుగవ భూమికగా రూపొందింది.

5. అసంసక్తి– పై నాలుగు భూమికలను అభ్యసించడం ద్వారా, సమాధి సమయంలో మాత్రమే కాక, ఇతర సమయాలలో గూడా మనస్సుకు బాహ్య విషయాలు అంటకుండా నిరంతరమూ బ్రహ్మభావన స్థిరంగా వుంటే, అప్పుడు ఆ భూమికను అసంసక్తి అంటారు. అసంసక్తి అంటే అంటక పోవడం. ఈ భూమికలోకి వచ్చిన వాణ్ణి "బ్రహ్మవిద్వరుడు" అంటారు.

6. పదార్థాభావన– ప్రాపంచిక పదార్థాలను భావించకుండా ఉండటం అని దీనికి సామాన్యార్థం. పై ఐదు భూమికలూ బాగా గట్టిపడి, నిరంతరమూ ఆత్మ స్వరూపుడుగా, ఆత్మారాముడుగా, వుంటూ, వుంటూ, ఎప్పుడైనా పరుల ప్రేరణ చేత ఐహిక పదార్థాలు కొద్దిగా స్ఫురణలోకి వస్తూవున్నట్లైతే, అలాంటి భూమికను పదార్థాభావన అంటారు. దీన్ని అందుకున్నవాణ్ణి "బ్రహ్మవిద్వరీయాన్" అంటారు.

7. తుర్యగ– తుర్యం అంటే తురీయావస్థ. దాన్ని పొందినది తుర్యగ. ఆరవ భూమికను చేరి, దాన్ని బాగా సాధించి, అప్పుడప్పుడూ బయటకి రావటం గూడా తొలగిపోయి, అఖండంగా, నిరంతరంగా, స్వస్వరూప స్థితిలో వుండిపోతే, అది తుర్యగా భూమిక. దీనినే జీవన్ముక్తావస్థ, తురీయావస్థ, అని పిలుస్తూ వుంటారు. దీన్ని పొందినవాణ్ణి "బ్రహ్మవిద్వరిష్ఠుడు" అంటారు.

ఆరవ భూమికకూ, ఏడవ భూమికకూ భేదం గుర్తించడం కష్టం. ఆరవ భూమికలో వున్నవాళ్ళు దేహరక్షణ కోసం కొద్దిపాటి ప్రయత్నం చేస్తూ వుంటారు. ఏడవ భూమిక వాళ్ళు అది గూడా చేయరు. ఈ భూమికను దాటిపోతే, ఆ పై స్థితి పేరు విదేహ కైవల్యం. అంటే శరీరాన్ని వదిలిపెట్టి బ్రహ్మాకారంగా మిగిలి పోవటం.

**రాముడు–** ఏడవ భూమికలోనివారు శరీరరక్షణ గూడా చేయకపోతే వాళ్ళు జీవించి ఏమి చేస్తారు? యథేచ్ఛగా ఏమి తోస్తే అది చేస్తారా?

**వశిష్ఠుడు–** రామా! పొరపాటున గూడా అలా చెయ్యరు. వర్ణాశ్రమ ధర్మాల మీద వాళ్ళకు ఆసక్తి వుండదు. కానీ, పూర్వాభ్యాసబలంవల్ల వాటిని యథాతథంగా అనుసరిస్తూనే వుంటారు. ఎప్పుడైనా పొరపాటుపడ్డా, ఇతరులు హెచ్చరించినప్పుడు, ధర్మం ప్రకారమే నడుస్తారు. అంతే గానీ, యథేచ్ఛగా సంచరించరు. ఈ విషయంలో పెద్దలు చెప్పే సూక్తి ఒకటి వుంది.

**విదిత బ్రహ్మ తత్త్వస్య యథేష్టాచరణం యది।**
**శునాం తత్త్వవిదాం చైవ కోభేదోశుచి భక్షణే॥** (ఉ.ప్ర.స.118, శ్లో.19 దగ్గర వ్యాఖ్యలో)

బ్రహ్మతత్త్వవేత్తలు యథేచ్ఛగా సంచరిస్తారని చెప్పేటట్లైతే, వారికీ కుక్కలకూ భేదమేమిటి? వారు కూడా కుక్కలు లాగానే అశుచి పదార్థాలను తింటారని చెప్పినట్లవుతుంది- అని.

కనుక, రామా! బ్రహ్మవిద్వరిష్ఠులు యథేచ్ఛా సంచారులు కాదు. అనాసక్త సంచారులు. అంతే! ఎందుకంటే, లోకంలో వుండే పాప పుణ్యకర్మలు ఏవీ వాళ్ళను సుఖపెట్టజాలవు. దానికి కారణమేమిటంటే, వాళ్ళు ఆత్మారాములై వున్నారు.

రామా! ఈ ఏడు జ్ఞానభూమికలు ఉత్తమ మానవులకే లభిస్తాయి. పశుపక్షులకు, చెట్టు చేమలకు, నీచ మానవులకు, లభించవు.

ఒక ముఖ్యవిషయం వుంది. రామా! ఒక వేళ ఏ కారణం చేతనైనా, నీచజాతిలో పుట్టినవారికి ఏడవ భూమిక అందితే, వారు తప్పకుండా ముక్తి పొందుతారు. అలాంటి వారిని మనం గౌరవించి తీరాలి. ఇందుకు మనం చెప్పుకున్న కర్కటీ రాక్షసే మంచి ఉదాహరణ.

ఈ జ్ఞానభూమికలన్నీ ఒకడికి ఒకే జన్మలో అందుతాయనే నియమం లేదు. సనకసనందనాదుల వంటి ఉత్తమజీవులు జన్మతోనే ఏడవ భూమికను సాధించేశారు. మిగిలిన జీవులు యథాశక్తిగా ఆ భూమికను సాధిస్తూ వుంటారు.

## 96. ఉంగరం వంటిదే అహంస్ఫురణ

ఈ సాధన చేసేది ఎవరంటే, జీవులు. జీవుడంటే ఎవరంటే పరబ్రహ్మమే. పరబ్రహ్మమే నేను దుఃఖంలో పడ్డానని ఏడుస్తోందా?- అవును అది అలాగే జరుగుతోంది. ఒక బంగారపు ముద్ద ఉంగరంగా మారాక "అయ్యో! మునుపు నేను బంగారంగా వుండే దాన్ని, ఇప్పుడిలా ఉంగరాన్ని అయిపోయాను" అని ఏడ్చిందట. పరమాత్మ పని గూడా అలాగే వుంది. ఆయన తన చిదానంద స్వరూపాన్ని మరచిపోయి, అహంకార స్వరూపాన్ని కల్పించుకొని, దుఃఖంలో పడిపోయి, ఏడు జ్ఞానభూమికలనూ సాధించి, చివరికి మళ్ళీ తన చిదానందస్థితిని చేరుకుంటున్నాడు.

**రాముడు-** గురుదేవా! బంగారపు ముద్దకి 'నేను ఉంగరాన్ని' అనే భావన ఎలా వచ్చింది? ఎవడో ఉంగరం చేయబట్టి వచ్చింది. మరి పరమాత్మ అహం స్ఫురణ గల (నేను నేననే స్ఫురణగల జీవిగా) ఎట్లా అయ్యాడు?

**వశిష్ఠుడు-** రామా! చాలా చిక్కు ప్రశ్న వేశానను కుంటున్నావు. ఉంగరానికి కంసాలి అనే కర్త వున్నట్టుగానే, జీవుడికి కూడా ఎవడో కర్త వుండాలి గదా, అని నువ్వు ఆలోచిస్తున్నావు. ఏ కర్తా లేకపోతే, ఈ మార్పు ఎలా సంభవిస్తుంది- అని వాదించాలని నువ్వనుకొంటున్నావు. అదంతా బాగానే వుంది కానీ, నిజంగా వున్న వస్తువును చూపించి, "ఇది ఎప్పుడు పుట్టింది, ఎలా పుట్టింది, ఎప్పుడు పోతుంది, ఎలా పోతుంది?" అని అడుగుతారా? అసలు లేనే లేని వస్తువును గురించి అలాంటి ప్రశ్నలు వేస్తారా? లేని వస్తువు గురించి అలాంటి ప్రశ్నలు వేయడం తగదని అందరూ అంగీకరిస్తారు.

ఉంగరము, అహం (నేననే) స్ఫురణ, అనేవి, నిజంగా వున్న వస్తువులు కానే కావు. బంగారపు ఉంగరాన్ని పట్టుకెళ్ళి దుకాణంలో ఇచ్చి, దీనికి ఖరీదు కట్టమని అడిగామనుకో. వాడు దాన్ని బంగారమనుకొని ఖరీదు కడతాడా? కాదనుకొని ఖరీదు కడతాడా? బంగారమనుకొనే ఖరీదు కడతాడు. అక్కడ బంగారం వుంటే, వాడు దాన్ని బంగారం అనుకున్నాడా? లేకుండానే బంగారం అనుకున్నాడా? బంగారం వుంటేనే బంగారం

అనుకొన్నాడు.

కనుక, ఉంగరంలో నిజంగా వున్నది బంగారమే. ఉంగరమనే రూపం కల్పితం. ఇది విడిగా అస్తిత్వం లేని పదార్థం. కంసాలి ఇలా అస్తిత్వం లేని రూపానికే కర్త. ఆ రూపం వున్నా, లేకపోయినా, అక్కడ వున్నది బంగారమే. దానికెవడూ కర్త లేడు. నేను అనే స్ఫురణ గూడా ఉంగరం లాంటిదే. దీనిలో నిజంగా వున్నది చిదానంద రూపమైన పరమాత్మే.

**రాముడు–** గురుదేవా! అమ్మకంవల్ల ఉంగరంలో వున్నది బంగారమేనని నిరూపిస్తానంటున్నారు. అలా అయితే, ఉంగరమనే మాటకు అర్థమేమిటి? ముద్దగా వున్నప్పుడు దాన్ని ఉంగరం అనటం లేదు. మరొకప్పుడు అంటున్నాం. అనే సమయంలో, దేన్ని ఉంగరం అంటున్నాం?

**వశిష్ఠుడు–** రామా! అనేక మాటలు అంటున్నాం. గొడ్రాలి కొడుకు అంటున్నాం. వీడి ఆకారం, వీడి గుణాలు, ఎలా వుంటాయో చెప్పు? చెప్పలేవు. ఎందుకు చెప్పలేవు? ఎందుకంటే వాడిది భ్రాంతి స్వరూపం, మిథ్యాస్వరూపం, మాయా స్వరూపం, అసత్స్వరూపం. ఈ పేర్లన్నిటికీ అర్థమేమిటి? సరిగ్గా విచారించక ముందు "గొడ్రాలి కొడుకు. గొడ్రాలి కొడుకు," అనంగానే అవునేమో అనుకొని పై కథ చెప్పేసుకుంటున్నాం. కొంత దూరం పోయాక, కొంచెం నిలబడి, "ఇదేమిట్రా? గొడ్రాలికి కొడుకంటాడేమిటి?" అని నిదానంగా విచారిస్తే, అక్కడ గొడ్రాలి కొడుకనేవాడు లేనే లేడు. ఇప్పుడు చెప్పుకున్న మాటలన్నిటికీ, అంటే భ్రాంతి మొదలైన మాటలన్నిటికీ, అర్థం ఇదే.

అవిచారణ కాలంలో మాట్లాడే మాటను నువ్వు విచారణ కాలంలో గూడా మాట్లాడేస్తానంటున్నావు.

ఎండమావుల నదిలో, ఒక రూపం వుంది. కంటిదోషంవల్ల కనిపించే రెండో చంద్రుడిలో, ఒక రూపం వుంది. ముత్యపు చిప్ప వున్న చోట కనిపించే వెండి ముద్దలో, ఒక రూపం వుంది. ఈ రూపాలన్నీ ఎటువంటివో, 'నేననే' స్ఫురణలో వున్న రూపం గూడా అటువంటిదే. అది అజ్ఞాన దశలో కనిపిస్తుంది. జ్ఞాన దశలో పత్తా లేకుండా పోతుంది. కనుక, ఇది నిశ్చయంగా లేని వస్తువే.

లేకపోయినా అది వున్నట్టుగానే పని చేస్తుంది. దానికి కారణం ఆ వస్తువులోని సత్యత్వం కాదు. చూసే వాడి హృదయంలో వున్న భావనాబలం. భావనాబలం చేత విషం గూడా అమృతమౌతుంది గదా! ఇదీ అలాంటిదే. కనుక, ఇవేవీ లేవు. ఉన్నదల్లా చిదానంద స్వరూపమైన పరమాత్మ ఒక్కడే.

**రాముడు–** గురుదేవా! మీరు చెప్పారు. నాకు జ్ఞానం కలిగింది. మాయా వస్తువులన్నీ జ్ఞానం కలగగానే నశించిపోవాలి. నాకిప్పుడు జ్ఞానం కలిగింది కనుక, నాకు ఎదురుగుండా కనిపించే మాయా ప్రపంచం అంతా నశించిపోవాలి. మరి ఇది కనిపిస్తోందేమి?

**వశిష్ఠుడు–** రామా! అజ్ఞానం సమూలంగా నశించాలి. అంటే, మనస్సులో వున్న వాసనలతో సహా నశించాలి. అప్పుడే ఈ ప్రపంచభ్రాంతి నశిస్తుంది. అప్పటిదాకా అవిద్య తన పరాక్రమాన్ని చూపిస్తూనే వుంటుంది. ఇది నీకు నిరూపణకు కావాలంటే, లవణ చక్రవర్తి చరిత్రలో మిగిలిన భాగాన్ని నువ్వు వినాలి. చెపుతాను విను.

## 97. లవణచరిత్రలో మూడవ భాగం

రామా! ఇంద్రజాలానుభవం కలిగిన మరునాటికి కూడా, లవణ చక్రవర్తికి ఆ జ్ఞాపకాలు మనస్సులోంచి పోలేదు. మాటి మాటికీ ఆ అడవి, ఆ గూడెం, ఆ మనుషులు, ఆ దారులు, గుర్తుకు వస్తూనే వున్నాయి. అది వింధ్యపర్వత ప్రాంతమని మాటిమాటికీ గుర్తొస్తోంది. దాంతో వింధ్య పర్వత ప్రాంతానికి వెళ్ళి, అలాంటి బోయగూడెం ఏదైనా దొరుకుతుందేమో వెతకాలని బుద్ధి పుట్టింది.

వింధ్యపర్వత ప్రాంతమంటే సామాన్యమా?! ఇంచుమించు దండకారణ్యానికి దగ్గర. అది భయంకర ప్రదేశం. అక్కడికి వెళ్ళటం ప్రమాదం. అయితే ఏమి? రాజు తలచుకొంటే దెబ్బలకు కొదవా? దిగ్విజయయాత్రకు బయలుదేరినట్లుగా మహాసైన్యాన్ని వెంటబెట్టుకొని, కలలోని గూడెం ఇలలో దొరుకుతుందేమోనని వెదకటానికి బయలుదేరాడు లవణరాజు.

ఆశ్చర్యం! ఆశ్చర్యం!! తిరగ్గా తిరగ్గా, ఒక చోట ఆ బోయగూడెం మనుషులు కొంతమంది తగిలారు. చివరికి ఆ బోయ గూడెమూ దొరికింది. అవే గుడిసెలు. అవే డొంకలు, అవే అడవులు. అవే మనుషుల రూపాలు! రాజు ఆశ్చర్యానికి అంతు లేదు.

ఒక చోట తన అత్తగారైన బోయ ముసలిది ఏడుస్తూ కనిపించింది. ఆవిడ తన కూతురూ అల్లుడూ చచ్చిపోయారని ఏడుస్తోంది. రాజు ఆవిడ దగ్గరకు వెళ్ళి “అవ్వా! ఎందుకు ఏడుస్తున్నావు, నీకేమైంది?” అని అడిగాడు. ఆ అవ్వ ఏడుస్తూ కథంతా చెప్పింది. “ఎవడో రాజుకొడుకు వచ్చి నా కూతురును పెళ్ళి చేసుకున్నాడు. ఈ కరువుకు తట్టుకోలేక వాళ్ళంతా ఆత్మహత్య చేసుకొన్నారు.” అని ఆవిడ తేల్చి చెప్పింది.

ఆవిడ కథనంలో ఒక్క పొరపాటు కూడా లేదు. పేర్లు, గుర్తులు, రోజులు, అన్నీ సరిగ్గా చెప్పింది. రాజుకు మతి పోయినంత పనైంది. రాజూ, మంత్రులూ, ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

చివరికి రాజే తేరుకొని, వాళ్ళకి తగిన బహుమానాలు ఇచ్చి, కరువు నివారణకు కొన్ని ఏర్పాట్లు చేసి, వెనక్కి వచ్చేశాడు.

ఆ తరువాత ఒక రోజున సభలో కూర్చొని “మహర్షీ! కలలో చూసింది ఇలలో ఎలా కనిపించింది?” అని నన్నడిగాడు. అతనికేదో చెప్పి సమాధాన పరిచాను.

**రాముడు–** గురుదేవా! ఈ చివరిభాగం నమ్మడం కష్టంగా వుంది. ఇది కల్పనేమో అనిపిస్తోంది.

**వశిష్ఠుడు–** రామా! నువ్వందుకుంటావేమోననే ఆశతో, నేను లవణరాజుకు చెప్పిన సమాధానం నీకు చెప్పలేదు. కానీ, దీనికి కావలసిన కిటుకును మనస్సుయొక్క మహిమను వర్ణించే ఘట్టంలోనే చెప్పాను. ఐనా మళ్ళీ ఇప్పుడు చెపుతాను విను.

రామా! చెప్పాను కదా, మాయకు అసాధ్యం లేదు. అది నందిని పంది చేయగలదు, పందిని నంది చేయగలదు. అది గాదు ఆశ్చర్యం! అది చూసే వాడ్నే పందిని చెయ్యగలదు, లేదా నందిని చెయ్యగలదు.

దానికున్న శక్తులలో జ్ఞాపకం, మరపు, అనేవి రెండు. నిజంగా జరిగినదాన్ని మరచిపోతారు. నిజంగా జరిగి, నిజంగా మరిచిపోయినదాన్నే కొంతకాలానికి మళ్ళీ జ్ఞాపకం చేసుకుంటారు. ఇది మామూలుగా జరిగే పని.

కానీ దీన్ని ఇలాగే చెయ్యాలని మాయను శాసించగలిగే వారెవ్వరూ లేరు. అది నిజంగా జరగని దానిని కూడా జ్ఞాపకం చెయ్యగలదు.

అనుభవించిన దాన్ని మరిపించడం ఎలా సాధ్యమో, అలాగే, అంతకుముందు జరగని దానినీ, అనుభవించని

దానినీ, జ్ఞాపకం చేయటం కూడా మాయకు సాధ్యమే. పెట్టెలో డబ్బు పెట్టకుండానే పెట్టినట్లు గుర్తొచ్చి, పెట్టె తీసి చూస్తే అది కనిపించక, ఇంట్లో భార్యను అనుమానించే పీనాసి వాళ్ళను మనం చూస్తూనే వుంటాం.

తను అనుభవించినవి తనకే గుర్తు రావటం మామూలు పద్ధతి. కానీ, మాయ తలచుకుంటే, ఒక మనస్సుయొక్క అనుభవాన్ని, మరో మనస్సులో జ్ఞాపకంగా స్ఫురింప చేయగలదు. అంటే, భ్రాంతివల్ల కలిగే ఒకానొక అనుభూతిని, ఈ వ్యక్తి స్మృతిగా అనుభవిస్తున్నాడు. అంటే, ఈ స్మృతి (జ్ఞాపకం) మామూలు లోక సిద్ధమైన స్మృతి గాదు. భ్రాంతియొక్క అనుభవమే స్మృతిగా గోచరిస్తోంది. ఇది గూడా మాయయొక్క విలాసమే.

సామాన్యంగా ఒక భ్రాంతి ఒకరికే కలుగుతుంది. కానీ, ఇది నియమం కాదు. ఒకే భ్రాంతి అనేకమంది మనస్సులలో ఒకేసారి భాసించవచ్చు. ఉదాహరణకు– గారడీవాడు చేసే కనికట్టువల్ల కనిపించే దృశ్యాలు చుట్టు పక్కల వారందరికీ సమంగానే కనిపిస్తూ వుంటాయి.

ఒక్కొక్కసారి దూర దూరంగా వున్న ఇద్దరు వ్యక్తులకు ఒకే రకమైన భ్రాంతి కలగవచ్చు. ఉదాహరణకు– దూరదూరంగా వున్న ఊళ్ళల్లో ఇద్దరు కవులకు ఒకే సమస్య ఇస్తే,ఇద్దరూ ఇంచుమించుగా దగ్గర దగ్గరగా వుండే పదాలతో సమస్యా పూరణం చేస్తారు.

లవణ చక్రవర్తికి కలిగిన అనుభవంలో మాయయొక్క విశేషశక్తులు కొన్ని పని చేశాయి.

ఆ బోయగుడెం అనేది బోయ వాళ్ళందరికీ కలిసి ఏర్పడిన భ్రాంతి. దాంట్లోకి ఎవడో రాజకుమారుడు ప్రవేశించాడు. బోయదాన్ని పెళ్ళి చేసుకున్నాడు. మరణించాడు.ఇదంతా వాడి అనుభవం.

ఆ అనుభవం లవణ మహారాజు మనస్సులో స్మరణగా (జ్ఞాపకంగా) మొలకెత్తింది. ఒక అపరిపక్వ యోగి, తనది కాని పూర్వజన్మను తనదిగా స్మరించినట్లు, ఈ లవణచక్రవర్తి తనది గాని అనుభవాన్ని తనదిగా స్మరించాడు.

ఈ స్మరణ వినిమయానికి కారణం, ఇంద్రదూత యొక్క మాయాశక్తి.

స్మరణకు, కలకు, కొన్ని పోలికలు, కొన్ని తేడాలు, వున్నాయి. స్మరణ పాత విషయాన్ని అనుభవానికి తెస్తుంది గానీ, ఆ రూపాదులను స్పష్టంగా చూపించదు. స్వప్నం రూపాదులను చూపిస్తుంది గానీ, జరిగిన దాన్ని యథాతథంగా చూపించదు. ఇంద్రజాలం ఈ రెంటికీ మధ్యలో నడుస్తుంది. ఇది కల లాగా రూపాదులను చూపిస్తుంది. స్మరణ లాగా జరిగిన సంఘటనలనూ చూపిస్తుంది. అంతకు మించి, కనీ వినీ ఎరగని సంఘటనలను కూడా చూపిస్తుంది.

ఇప్పుడు లవణరాజు మరొకడియొక్క అనుభూతిని, ఐంద్రజాలరూపమైన స్మరణగా అనుభవించాడు. అందుచేత ఈ అనుభూతి ఏమిటో అతనికి అంతు పట్టకుండా వుంది.

ఇది ఒకానొకడికి జరిగిన అనుభవం కనుక, ఈ రాజు వెళ్ళి వెతికి చూడగా, ఆ వూరు నిజంగా దొరికింది. కానీ, ఆ నాడు బోయ పిల్లను పెళ్ళి చేసుకున్నవాణ్ణి 'నేనే' అనే భ్రాంతి ఇతనిలో నాటుకుపోవడంవల్ల, ఆ నాడు ఆ రాజకుమారుడు అనుభవించిన సుఖదుఃఖాలన్నీ ఈనాడు, ఈ లవణరాజు కూడా అనుభవించాడు. రామా! ఇదీ దీంట్లోని రహస్యం.

కనుక, రామా! ఈ కథలో నేను చేసిన కల్పన ఏదీ లేదు. నువ్వు నమ్మరానిదీ ఏదీ లేదు. అసలు ఈ కథ నీకు ఎందుకు చెప్పానంటే, ప్రపంచ రూపకంగా కనిపించే ఈ సంసారమంతా మనస్సు చేసే ఇంద్రజాల మేననీ, అందువల్ల ఈ మనస్సును పూర్తిగా నశింప చెయ్యడమే ఆత్మానుభవానికి సూటి దారి అనీ, నిరూపించడానికే చెప్పాను. కనుక నువ్వు మనస్సుయొక్క తత్త్వాన్ని గురించి బాగా ఆలోచించుకో.

కనుక రామా! నువ్వు ఈ కింది అంశాలను చక్కగా గుర్తించు–

1. ఈ ప్రపంచం అంతా మనస్సు చేసే కల్పనే.

2. మనస్సంటే శుద్ధచైతన్యంలో మాయా సంపర్కం వల్ల కలిగిన స్పందనే (కదలికే).

3. కనుక, మనస్సు యొక్క మూలస్వరూపం చైతన్యమే.

4. కనుక, ప్రపంచంయొక్క అసలు స్వరూపం గూడా చైతన్యమే (సన్మాత్రమే).

5. కనుక, కనిపించే దృశ్యపదార్థాలలో వేటిమీదా ఆసక్తి పెట్టుకోకు.

6. నీకు కనిపించే దృశ్యాలలో నీ మనస్సు కూడా వుంది. దాని మీద నువ్వు అసలే ఆశ పెట్టుకోకు. దాన్ని దూర దేశం వెళ్ళిపోయిన చుట్టం అనుకో. ఎందుకూ పనికి రాని రాయి అనుకో.

7. రామా! మనస్సనేది అసలే లేదని తెలుసుకోవటం ముఖ్య పక్షం. లేకపోయినా ఉన్నట్టు కనిపించే మిథ్యా వస్తువుని గుర్తించటం రెండవ పక్షం. ఈ రెండిట్లో ఏదో ఒక దాన్ని పట్టుకో.

8. ఈ సాధనకు పరిశుద్ధమైన మనస్సు కావాలి. మనశ్శుద్ధి కోసం నిష్కామ కర్మలు చేయాలి. నువ్వా పని వెనుకటి జన్మల్లోనే పూర్తి చేశావు. నీ మనస్సు ఇప్పుడు శుద్ధమై వుంది.

9. ఆ పైన సత్సాంగత్యం, శాస్త్రాభ్యాసం, కావాలి. వీటిని నువ్విప్పుడు సంపాదించుకొంటున్నావు.

10.ఇవి ఉన్నవాడు కొంచెం ప్రయత్నం చేస్తే, శుభేచ్ఛ అనే జ్ఞాన భూమికను అందుకొంటాడు.

11. ఇక వరుసగా నేను ఇందాక చెప్పిన ఏడు భూమికలనూ అందుకోవటానికి కృషి చెయ్యి. వీటిలో ఏడవ భూమికే ముఖ్యం.

12. ఇది లభిస్తే, నువ్వు సమాధిలో అయినా వుండవచ్చు. లేదా లోకం మీది అనుగ్రహంతో లోక వ్యవహారంలో అయినా వుండవచ్చు. ఎలా వున్నా, నిన్ను సుఖదుఃఖాలు తాకవు.

రామా! ఈ విధంగా నీకు నేను ప్రపంచంయొక్క ఉత్పత్తి అంటే ఏమిటో నిరూపించాను. ఈ ప్రపంచంయొక్క ఉత్పత్తికి పరబ్రహ్మే 'వివర్తోపాదాన' కారణమని నిరూపించాను.

కేవల సచ్చిదానంద స్వరూపమైన పరబ్రహ్మను సూటిగా తెలుసుకోవడం కుదరదు. అందుకే వేదమాత

'యతో వా ఇమాని భూతాని జాయన్తే'

(ఎవరి నుంచీ యీ పంచభూతాలూ జన్మిస్తున్నాయో అదే పరబ్రహ్మ)

అని ప్రపంచోత్పత్తికి హేతువుగా బ్రహ్మను ప్రతిపాదించింది.

సృష్టి, స్థితి, లయలనేవి పరబ్రహ్మయొక్క తటస్థ లక్షణాలు. వీటిలో సృష్టి అనే లక్షణం ద్వారా పరబ్రహ్మ చిన్మాత్రమనీ, ఈ ప్రపంచంయొక్క ఉత్పత్తి అంతా ఇంద్రజాలం వంటిదనీ, దీనిలో కనిపించే దేశకాల దృశ్యాలన్నీ నిజానికి లేనే లేవనీ, ఈ ఉత్పత్తి ప్రకరణంలో నేను నీకు నిరూపించాను.

1. ఈ ప్రకరణంలో మొదట లీలోపాఖ్యానం చెప్పాను. దానివల్ల దేశకాలాలు రెండూ అసత్యాలనే- అని నిరూపించాను.

2. ఆ తరువాత సూచికోపాఖ్యానం చెప్పాను. దీనివల్ల శరీర ధారణమనేది ఎవడికి వాడు తన సంకల్ప తీవ్రతవల్ల చేసుకొనే పనే - అని నిరూపించాను.

3. ఆ తరువాత ఐందవోపాఖ్యానం చెప్పాను. దీనివల్ల ఈ ప్రపంచ సృష్టి అంతా హిరణ్య గర్భ జీవుడియొక్క సంకల్ప మాత్రమే- అని నిరూపించాను.

4. ఆ తరువాత చిత్తోపాఖ్యానం చెప్పాను. దీనిలో మనస్సువల్ల కలిగే అనర్థాలను వివరించాను.

5. ఆ తరువాత బాలకోపాఖ్యానం చెప్పాను. దీనివల్ల వేదాలలోనూ, పురాణాలలోనూ కనిపించే సృష్టి క్రమమంతా, పిల్లల కోసం చెప్పే కల్పిత కథ వంటిదే- అని నిరూపించాను.

6. ఆ తరువాత ఇంద్రజాలోపాఖ్యానం చెప్పాను. ఇదే లవణోపాఖ్యానం. పప్పు ఉడికిన తరువాత ఉప్పు వేసినట్లుగా, ప్రపంచోత్పత్తి విజ్ఞానం నీకు పరిపక్వమైనాక ఈ లవణోపాఖ్యానం చెప్పాను. దీని ద్వారా ఈ ప్రపంచోత్పత్తి అంతా మనస్సు చేసే గారడీయే అనీ, దీనికి నిజమైన అస్తిత్వం లేదనీ, మళ్ళీ మరొక సారి నిరూపించాను.

ఈ నిరూపణలవల్ల, ప్రపంచోత్పత్తి పరిశీలనల ద్వారా పరమాత్మయొక్క నిష్క్రియ స్వచ్ఛ స్వరూపాన్ని మనం గ్రహించ గలిగాం. ఇక్కడితో ఈ ఉత్పత్తి ప్రకరణం ముగిసింది.

ఇక, ప్రపంచంయొక్క స్థితి విచారణ ద్వారా కూడా మనం ఇదే సత్యాన్ని గ్రహించవలసి వుంది. దీని కోసం ఇక మనం 'స్థితి ప్రకరణం' లోకి ప్రవేశిద్దాం.

## 98. సింహావలోకనము

యోగవాశిష్ఠ గ్రంథంలో అసలైన విషయ ప్రవేశం జరిగిన మొదటి ప్రకరణం ఇదే. ఈ గ్రంథంలోని విచారణ అంతా **"యతో వా ఇమాని భూతాని జాయన్తే"**.. ఇత్యాదిగా తైత్తిరీయోపనిషత్తులో చెప్పిన సృష్టిస్థితిలయాల పరిశోధన క్రమంలో సాగబోతోంది. అందుకే ఈ విచారణ క్రమం "ఉత్పత్తి"తో ప్రారంభమైంది.

దేశకాలాలు రెంటికీ సరియైన అస్తిత్వమే లేదని నిరూపించటం ద్వారా ఈ కనిపించే జగత్తుకు గల ఉత్పత్తి గూడా శూన్యప్రాయమే అని నిరూపించటమే యీ ప్రకరణానికి అంతిమ సారాంశం.

ఐతే ఈ అంశాన్ని రూఢిచేయటం కోసం వశిష్ఠమహర్షి తీసుకున్న ప్రధాన సూత్రం ఏమిటంటే "నీకు నీ స్వప్న ప్రపంచం ఎటువంటిదో, హిరణ్యగర్భుడికి (సృష్టికర్తకు) నీ జాగ్రత్ప్రపంచం అటువంటిది"– అని.

అంటే, "నేను మరో జీవికి స్వప్నంలోని వ్యక్తిని" అని నేను ఒప్పుకోవాలి. ఇది అంత తేలికైన పని కాదు. ఈ కష్టతరమైన కార్యాన్ని సాధించేందుకు వశిష్ఠ మహర్షి ఈ ప్రకరణంలో చర్చలతో పాటు అత్యధిక సంఖ్యలో ఉపాఖ్యానాలను గూడా స్వీకరించాడు.

వీటిలోకల్లా పెద్దది, ముఖ్యమైనది, "లీలోపాఖ్యానం". దీని తరువాతది "కర్కటీ ఉపాఖ్యానం" లేక సూచికోపాఖ్యానం. ఆపైది "ఐందవో పాఖ్యానం." ఆ మీదట "కృత్రిమ ఇంద్రాహల్యోపాఖ్యానం". మరికొన్ని చిన్న చిన్న కథల తరువాత "లవణో పాఖ్యానం"తో ఈ ప్రకరణం ముగింపుకు వస్తుంది.

వీటిలో మొదటిదైన లీలోపాఖ్యానం 46 సర్గల పెద్ద కథ. దీన్ని అవతరింప చేయటానికి వశిష్ఠమహర్షి 14 సర్గల పూర్వ రంగాన్ని కట్టుదిట్టంగా ఏర్పాటు చేశాడు. వీటిలో 13వ సర్గ కీలకమైనది. ఈ సర్గలో చెప్పిన విషయాల గురించిన లఘు సింహావలోకనాన్ని మనం మూల గ్రంథంలోనే చేసుకొని వున్నాం. ఈ పీఠికాభాగంలో ఆ మహర్షి, శుద్ధ చిద్రూపంనుంచీ బద్ధజీవుల దాకా గల ఉత్పత్తి క్రమాన్ని, మెట్లు మెట్లుగా వివరించాడు.

ఈ విషయాలను కథా రూపంగా ప్రదర్శించేందుకోసమే ఆయన లీలోపాఖ్యాన్ని చేపట్టాడు.

ఈ గ్రంథంలో సామాన్యంగా ఆయన ఏ కథను ప్రారంభించినా, తాను ఎందుకోసం ఈ కథను చెప్పబోతున్నాడో ముందుగానే వివరిస్తాడు.

కథ అయిపోయినాక ఈ కథవల్ల ఏమి తేలిందో మరో సారి చెపుతాడు. కానీ ముందు చెప్పిన మాటలకు, చివర చెప్పిన మాటలకు కొంత వ్యత్యాసం వున్నదనే భ్రాంతిని కలిగిస్తాడు. అక్కడ పాఠకుడు తన బుద్ధి శక్తితో సమన్వయాన్ని దర్శించాలి. దానికి సహాయంగా వుండటం కోసం కథలోని సాంకేతికాంశాలను కొంత వరకు ఆయనే వివరిస్తాడు గానీ, కొంత పాఠకుడి ఊహకు వదిలిపెడతాడు. అందుకే, మూలగ్రంథంలో మనం "లీలోపాఖ్యాన కథా విశ్లేషణ" "వశిష్ఠుడు చేసిన కథావిశ్లేషణ" అనే శీర్షికల క్రింద ఈ కథా సారాంశాన్ని

చర్చింటమే గాక, లీలా సరస్వతుల సుదీర్ఘ చర్చ చివరిలో "చర్చ తిరిగిన మెలికలు" అనే పేరుతో చర్చా సింహావలోకనం గూడా చేసుకొని వున్నాం. వీటిల్లో జాగ్రత్ప్రపంచ, స్వప్న ప్రపంచ, ఊహాప్రపంచాలకు గల సామ్యవైషమ్యాలను గమనించుకున్నాం.

ఈ ఉపాఖ్యానంలో ప్రతినాయక పాత్రగా(విలన్‌గా) వచ్చిన సింధురాజుయొక్క పూర్వజన్మల సాధనా పరంపరల గురించి నిర్వాణ ప్రకరణంయొక్క ఉత్తరార్ధపు చివర్లో విపులంగా చర్చింబోతున్నాడు. కానీ, ఈ సూచనలేమీ ఇక్కడ ఇవ్వడు. ఎందుకంటే, ఈ లీలోపాఖ్యానం ద్వారా వశిష్ఠ మహర్షి నొక్కి వక్కాణించ దలచుకున్నవి రెండే రెండు ప్రధానాంశాలు.

(1) అణువుగర్భంలోనే అనంత బ్రహ్మాండాలు ఎన్నో ఇమిడి వున్నాయి.

(2) క్షణం గర్భంలోనే అనంత యుగ పరంపరలు దాగి వున్నాయి – అని.

ఈ ప్రపంచం మాయామయమైనప్పుడే ఇది సాధ్యమౌతుంది. మాయ అనేది మనస్సంకల్పాత్మకంగా వుంటుంది.

దీన్ని మరింత విస్పష్టం చేయటంకోసమే "కర్కటీ ఉపాఖ్యానం" (సూచికోపాఖ్యానం) అనే వింత కథను ఆ మహర్షి స్వీకరించాడు. ఈ కథలో ఒకే జీవికి ఒక జన్మలోనే మొదట కొండంత దేహం, తరువాత సూది అంత దేహం తరువాత మళ్ళీ కొండంత దేహం వచ్చాయి. ఈ పరిణామాల అంతరార్థాలు ఏమిటో మనం ఈ కథాంతంలో "కర్కటీ కథా సింహావలోకనం" అనే శీర్షిక క్రింద చర్చించుకున్నాం. ఈ కథలో కర్కటీ రాక్షసి కేవలం తన మనస్సంకల్పబలంవల్ల కొత్త కొత్త శరీరాలను పొందేసిందని చెప్పారు. "దీనిని నమ్మవచ్చునా" అనే ప్రశ్నకు సమాధానంగా వశిష్ఠ మహర్షి "ఐందవోపాఖ్యానం" అనే కథను స్వీకరించాడు.

ఈ కథలో ఐందవులనే సోదరులు 10 మంది, తమ తపోబలంవల్ల ఎవడికి వాడే బ్రహ్మదేవుడుగా మారిపోయి, ఏకకాలంలో తమ తమ సంకల్పానుసారంగా బ్రహ్మాండ పరంపరలను సృష్టిచేశారు.

రాబోయే ప్రకరణాలలో చాల సందర్భాలలో వశిష్ఠ మహర్షి మళ్ళీ మళ్ళీ ఈ ఐందవుల ప్రసక్తి తీసుకురాబోతున్నాడు. కథ చిన్నదే అయినా, ఈ కథకు ఇంత ప్రాముఖ్యం రావటానికి కారణమేమిటంటే– "మనోబలం తీవ్రంగా వుంటే, ఒక జీవి తనకు వేరు వేరు శరీరాలను నిర్మించుకోవటం మాత్రమే గాక, బ్రహ్మాండ పరంపరనే కేవల సంకల్పబలం ఆధారంగా నిర్మించి వేయగలడు. అందువల్లనే మనకు కనిపించే ఈ ప్రపంచమంతా కేవలం హిరణ్యగర్భుడి మనోరాజ్యం మాత్రమే" అనే నిరూపణ ఈ కథలో ప్రబలంగా వుండటమే.

ఇంతటి మహిమాన్వితులైన ఐందవుల కథ చెప్పిన వశిష్ఠ మహర్షి, దాని పక్కనే "కృత్రిమ ఇంద్రాహల్యోపాఖ్యానము" అనే పేరుతో సామాన్య కాముకుల కథ ఒకటి చెప్పాడు. దీనిలో ఇంద్రుడు, అహల్య అనే పేర్లు గల ఇద్దరు కాముకులు కేవలం తమ కామ సంకల్ప బలంవల్ల అనేక జన్మల పాటు దంపతులుగా జన్మించారు.

ఇలా మనోబల మహత్త్వాన్ని వివరించినాక, జీవుల శరీరాలలో గల భేదాలనుబట్టి, వారి మనోబలాలలో ఎలా భేదాలు ఏర్పడుతూ వుంటాయో వివరించేందుకోసం, జీవోపాధులను 14 రకాలుగా విభజించి వర్ణించాడు. ఆ సందర్భంగా జరిగిన జటిల తర్కవాదాలను మనం యీ మూల గ్రంథంలో పట్టికా రూపంగా ప్రదర్శించుకున్నాం. ఇంత విస్తారంగా జరిగిన యీ చర్చకు సారాంశ మేమిటనే విషయాన్ని ఆ మహర్షి – "కర్మ నశించినా చాలు, మనస్సు నశించినా చాలు" అనే శీర్షికలో విస్పష్టం చేశాడు.

ఆ సందర్భంగానే మనస్సుయొక్క స్వరూప స్వభావాలను విశ్లేషించటం కోసం ఆయన మనస్సుకు 15 పేర్లు కల్పించి, వాటి వివరణ ద్వారా మనస్సుయొక్క స్వరూపాన్ని విశదం చేశాడు. ఇక్కడే చిత్తోపాఖ్యాన, బాలకాఖ్యాయికలనే లఘుకథానికలను సంకేత వివరణ పూర్వకంగా ప్రస్తావించాడు.

మనస్సుయొక్క తత్త్వాన్ని గూర్చి ఇంత విపులంగా వివరించినాక, కొస మెరుపు లాగా, లవణోపాఖ్యానం అనే కథను ప్రవేశపెట్టి, దాన్ని ఒక్క విడతలో కాకుండా, మూడు విడతలలో పూర్తి చేశాడు. ప్రతివిడతకీ మధ్యలో కొంత చర్చను చొప్పించాడు.

రాబోయే స్థితి ప్రకరణంలో దీనికి సమాంతరంగా 'గాధి చరిత్ర' అనే కథను తీసుకురాబోతున్నాడు. ఆ కథలో కల– స్మరణ– సత్యం– అనే అంశాలలో గల మెలికలను వివరించబోతున్నాడు. దానికి పూర్వరంగంగా ఈ ప్రపంచం ఒక ఇంద్రజాల తుల్యం అని లవణోపాఖ్యానం ద్వారా నిరూపిస్తూ, మహర్షి ఉత్పత్తి ప్రకరణానికి ముగింపు పలికాడు. ఈ కథ చివర్లో గూడా మనం ఒక లఘు సింహావలోకనం చేసుకొని వున్నాం గనుక, ఆ విషయాలను నెమరు వేసుకొంటూ ఇక స్థితి ప్రకరణం వైపు అడుగులు వేద్దాం.

జయగురుదత్త

# యోగవాశిష్ఠ హృదయము IV

## స్థితి ప్రకరణము

# యోగవాశిష్ఠ హృదయము IV
## స్థితి ప్రకరణము

ఏ వస్తువు గురించి అయినా తెలుసుకోవాలంటే దాని లక్షణాలను అధ్యయనం చేయాలి. లక్షణాలు రెండు రకాలు. ఒకటి స్వరూప లక్షణము, రెండు తటస్థ లక్షణము.

**1. స్వరూపలక్షణము:**

ఒక పదార్థానికి స్వస్వరూపంగా వుండే లక్షణం స్వరూప లక్షణం. ఉదాహరణకు – ఆకాశంలో కనిపించే వెలుగు చుక్కల్లో పెద్ద వెలుగు ముద్దే చంద్రుడు.

ఇక్కడ వెలుగు ముద్దతనమనేది చంద్రుడికి స్వస్వరూపం. అంటే, చంద్రుడు ఉన్నంతసేపూ అది వుంటుంది. అది లేకపోతే చంద్రుడు లేడు.

**2. తటస్థలక్షణము:**

ఆ పదార్థంలో అప్పుడప్పుడూ వచ్చిపోయే లక్షణంపేరు, అనగా అప్పుడప్పుడూ అన్వయించే లక్షణంపేరు, తటస్థలక్షణం. ఉదాహరణకు "అదుగో, ఆ కాకి వాలిన ఇల్లే వెంకయ్యది!"

ఇక్కడ ఆ కాకి ఎల్ల కాలమూ ఆ ఇంటి మీదే కూర్చోదు. ఒకే రకంగా వున్న అనేక ఇళ్లల్లో వెంకయ్య ఇంటిని చూపించడంకోసం, ఆ సమయానికి అక్కడ వాలి వున్న కాకిని చూపించారు. ఆ కాకి ద్వారా ఆ ఇంటిని గుర్తు పట్టిస్తున్నారు. ఇలా గుర్తు పట్టిన బాలుడు, ఆ కాకి ఎగిరిపోయిన తరువాత కూడా, వెంకయ్య ఇంటిని గుర్తు పట్ట గలుగుతాడు.

ఏదైనా ఒక నూతన పదార్థాన్ని గురించి, తెలుసుకోదలచుకున్నప్పుడు, దాని స్వరూప లక్షణాలనూ తెలుసుకోవాలి, దాని తటస్థలక్షణాలనూ తెలుసుకోవాలి.

పరబ్రహ్మయొక్క స్వరూపలక్షణం సత్, చిత్, ఆనందాలు, ఆయనయొక్క తటస్థలక్షణాలు సృష్టి స్థితి లయలు. పరబ్రహ్మను తెలుసుకోవాలంటే, ఈ రెండు రకాల లక్షణాలను తెలుసుకోవాలి.

పరబ్రహ్మ విషయంలో సూటిగా స్వరూపలక్షణాలను తెలుసుకోవటం, బోధించటం, చాలా కష్టం. అందుకే, వేదమాత అనేక స్థలాలలో తటస్థలక్షణాల ద్వారా బ్రహ్మ స్వరూపాన్ని ముందుగా బోధించి, ఆ తరువాత స్వరూపలక్షణాల ద్వారా బోధించింది.

వేదంలో పరబ్రహ్మయొక్క తటస్థలక్షణాలను చెప్పే ఘట్టాలలో తైత్తరీయ ఉపనిషత్తులోని ఘట్టం ముఖ్యమైనది.

అక్కడ,

"**యతో వా ఇమాని భూతాని జాయన్తే**

**యేన జాతాని జీవన్తి**

**యత్ప్రయన్త్యభి సంవిశన్తి**" – అని వుంది.

అంటే,

దేని నుంచి ఆకాశాది మహా భూతాలన్నీ జన్మిస్తున్నాయో, అలా జన్మించినవన్నీ దేనిచేత జీవిస్తున్నాయో, అలా జీవించేవన్నీ దేనిలోకి ప్రవేశించి ఏకీభావాన్ని పొందుతున్నాయో అదే పరబ్రహ్మ – అని అర్థం.

సృష్టి స్థితి లయలనేవి బ్రహ్మకు ఎల్లకాలం ఉండే లక్షణాలు కావు. అవి వస్తూ పోతూ వుంటాయి కనుక అవి బ్రహ్మకు తటస్థలక్షణాలు. ఈ లక్షణాలను దృష్టిలో ఉంచుకొనే వశిష్ఠ మహర్షి, వాల్మీకిమహర్షి కూడా, తమ ప్రబోధ ప్రణాళికను తయారు చేసుకొన్నారు.

### 3. గ్రంథ ప్రణాళిక

ఉత్పత్తి ప్రకరణ ప్రారంభంలో ఈ గ్రంథ ప్రణాళిక ఏమిటి అని మనం ప్రశ్నించుకొన్నాం. కానీ, సమాధానం మున్ముందు వస్తుంది అని అక్కడ చెప్పుకొన్నాం.

ఉత్పత్తి ప్రకరణంయొక్క చివరలో ఆ ప్రకరణానికి సారాంశమేమిటని విచారణ చేశాం. ఈ ప్రపంచోత్పత్తి అంతా మనస్సు చేసే గారడియే అని, ఈ ప్రపంచానికి నిజమైన అస్తిత్వం లేదనీ, కనుక పరమాత్మయొక్క స్వచ్ఛస్వరూపం నిష్క్రియమని, నిరూపించడమే ఉత్పత్తి ప్రకరణానికి సారాంశమనీ, అక్కడ మనం తేల్చుకొన్నాం. అంతేగాక ప్రపంచస్థితియొక్క పరిశీలనద్వారా గూడా ఈ సత్యాన్ని మనం నిరూపించవచ్చునని కూడా అక్కడ చెప్పుకొన్నాం.

ఈ మాటలనుబట్టి యోగవాశిష్ఠగ్రంథ ప్రణాళిక ఏమిటో మనం గ్రహించవచ్చు. మొదట వైరాగ్య ప్రకరణం, ముముక్షు వ్యవహార ప్రకరణం చెప్పారు. ఈ రెండూ ఈ గ్రంథానికి పీఠికాప్రాయాలే. వీటిలో అసలు విషయం మొదలు కానే లేదు.

అసలు విషయం ఉత్పత్తి ప్రకరణంతో ప్రారంభమైంది. దీనిలో ప్రపంచోత్పత్తి మనస్సు చేసే గారడీయే అని నిరూపించారు. ఆ తరువాత స్థితిప్రకరణం చెప్పబోతున్నారు. దీంట్లో గూడా ప్రపంచస్థితి అంతా గారడీ వంటిదే అని చెప్పబోతున్నారు. దీని తరువాత ఉపశమ ప్రకరణం చెపుతారు. దానిలో గూడా ఇలాంటి నిరూపణే చేస్తారు.

కాగా, ఈ మూడు ప్రకరణాలూ కలిపి పరబ్రహ్మయొక్క తటస్థ లక్షణాలైన సృష్టి స్థితి లయలను వరుసగా చర్చిస్తున్నాయి. ఆ తరువాత రాబోయే నిర్వాణ ప్రకరణంలో పరబ్రహ్మయొక్క స్వరూపలక్షణాలనూ, బ్రహ్మవిద్యా ప్రయోజనాన్నీ, నిరూపిస్తారు.

ఇదే గ్రంథ ప్రణాళిక. మొదటి రెండు ఉపోద్ఘాత ప్రకరణాలు పోతే, ఆ పై మూడు ప్రకరణాలు, 'యతోవా ఇమాని భూతాని' అనే మంత్రం చెప్పిన వరుసలోని తటస్థలక్షణాలనూ, ఆ తరువాత ఆరవదైన నిర్వాణ ప్రకరణంలోని స్వరూలక్షణ విద్యా ప్రయోజనాలనూ, నిరూపిస్తారు.

కాగా, మొదటి రెండు ప్రకరణాలు ఒక గుంపు. తరువాత మూడు ప్రకరణాలు ఒక గుంపు. మిగిలిన ఒక్కటి ఒక గుంపు. ఇదీ ఈ గ్రంథంలో వరుస.

మనం రెండవ గుంపులో మొదటి ప్రకరణం పూర్తి చేసుకొన్నాం. ఈ గుంపులో గడ్డు అయిన ప్రకరణం ఇదే. అసలు విషయమంతా ఉత్పత్తి ప్రకరణంలో చాలా మటుకూ చెప్పేశారు. స్థితి ప్రకరణ, ఉపశమ ప్రకరణాలలో ఈ విషయాలనే మళ్లీ తిప్పి తిప్పి చెప్పబోతున్నారు. తిప్పి తిప్పి చెప్పడం ఎందుకంటే, వచ్చిన సందేహాలే మారువేషాలలో మళ్ళీ వస్తూ వుంటాయి, అందుకోసం!

అదీ గాక, సంగీతం పాడేవారు పాడిన పల్లవినే పదిసార్లు మళ్ళీ మళ్ళీ పాడుతూ వుంటారు.

ఇదేమిటయ్యా మళ్ళీ పాడుతున్నావంటే, దానికీ దీనికీ సంగతిలో తేడా వుంది అంటారు. ఆ తేడాలేమిటో, వాటిల్లో ఉండే కష్టాలేమిటో సంగీత శాస్త్రజ్ఞులకే తెలుస్తుంది. అలాగే, తత్వశాస్త్రానుబంధియైన తర్కశాస్త్రంలో కూడా స్వల్పభేదాలతో వచ్చిన వాదనలే మళ్ళీ వస్తూ వుంటాయి. ఆ భేదాలు స్వల్పంగదా అని అశ్రద్ధచేస్తే, అవి అసలు సిద్ధాంతానికే ఎసరు పెట్టగలవు.

శ్రీరాముడు స్వయంగా మేధావి. పైగా బహుశాస్త్రాలు చదివినవాడు. అలాంటివాడికి ఎక్కడలేని సందేహాలూ పొడుచుకువస్తూ వుండటం సహజమే. అందువల్లే, వశిష్ఠమహర్షి భిన్న భిన్న కోణాలలో సమాధానాలను చెప్పుకొంటూ, ఈ ప్రకరణాలను పెంచుకొంటూ వెళ్ళాడు. ఆ ప్రక్రియలో ఈ స్థితి ప్రకరణం 3000 శ్లోకాల గ్రంథంగా రూపొందింది.

మనం ఈ వాదభేదాలను తగ్గించుకొంటూ, వీలైనంత సంగ్రహంగా ఈ ప్రకరణాన్ని మననం చేసుకొందాం.

## 4. ప్రకరణ ప్రారంభం

వశిష్ఠులవారు తన బోధను ఇలా ప్రారంభించారు.

**వశిష్ఠుడు:** రామా! ఈ ప్రపంచం అంటని పదార్థమే పరబ్రహ్మ – అని పరబ్రహ్మకు ఒక లక్షణం చెప్పవచ్చు. అలాగే సచ్చిదానంద స్వరూపమైనదే పరబ్రహ్మ – అని మరొక లక్షణం గూడా చెప్పవచ్చు. నిజానికి ఈ రెండూ వేరు వేరు లక్షణాలు కావు. ఐనా మన మనస్సు నిండా ఈ ప్రపంచ వాసనలు నాటుకుపోయి వున్నాయి గనుక, మొదట ఈ వాసనలను తొలగిస్తే గానీ బ్రహ్మస్వరూపం పట్టుబడదు. దీని కోసం "పరబ్రహ్మ ప్రపంచాతీతమైనది" అనే లక్షణం ద్వారా బ్రహ్మపరిశీలన చేయటమే ఎక్కువ మంచిది. దీనినే సంగ్రహంగా నిష్ప్రపంచబ్రహ్మానుసంధానం అంటారు. ముందర దీన్ని స్వాధీనం చేసుకొంటే, బ్రహ్మ సచ్చిదానంద స్వరూపమనే విషయం సులభంగా అవగతమవుతుంది.

నిష్ప్రపంచబ్రహ్మబోధ కలగటం కోసమే శ్రుతి '**యతోవా ఇమాని భూతాని జాయన్తే**' ఇత్యాది వాక్యాలను చెప్పింది. ఆ వరుసలోనే నేను నీకు ఉత్పత్తి ప్రకరణం బోధించాను.

రామా! వేదమాత "**యతోవా ఇమాని భూతాని జాయన్తే**" అని వూరుకోలేదు. "**యేన జాతాని జీవన్తి**" అని గూడా అంది. అంటే, జన్మించిన భూతాలన్నీ ఆ పరబ్రహ్మవల్లే జీవిస్తున్నాయి– అంది. అలాంటి వాక్యాలు ఇంకా చాలా వున్నాయి.

ఉదాహరణకు–

1. "**యేన ద్యౌః పృథివీ దృఢా**" – ఈ భూమి ఆ పరమాత్మ వల్లే గట్టిగా వుంది.
2. "**కోహ్యేవాన్యాత్ - కః ప్రాణ్యాత్ - యదేష ఆకాశ ఆనందో నస్యాత్**" – ఆ పరబ్రహ్మ కనుక లేక పోతే, ఈ లోకంలో ఎవడు బ్రతుకుతాడు?
3. "**భీషాస్మాద్వాతః పవతే**" – ఆ పరమాత్మకు భయపడి గాలి కదులుతోంది, సూర్యుడు ఉదయిస్తున్నాడు, అగ్ని, ఇంద్రుడు, యముడు, మొదలైన వారంతా తమ తమ విధులు నిర్వహిస్తున్నారు.

ఇలాంటి వాక్యాలన్నీ జగత్తు యొక్క స్థితిని ధ్రువ పరుస్తున్నాయి.

వీటికితోడు–

1. "**సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్**"

ఈ ప్రపంచం అంతా సృష్టికి పూర్వం సద్రూపంగానే వుంది.

2. “**ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్**”

ఈ ప్రపంచం అంతా సృష్టికి పూర్వం అద్వితీయమైన ఆత్మగానే వుండింది– అని ఇలాంటి వాక్యాలన్నీ ప్రళయ సమయంలో గూడా ఈ ప్రపంచం సద్రూపంగా వుందని బోధిస్తున్నాయి.

ఇలా అనేక శ్రుతి వాక్యాలు ప్రస్తుతకాలంలో ఈ జగత్తు ఉన్నదనీ, ప్రళయం తరువాత గూడా సూక్ష్మరూపంగా, సద్రూపంగా దీనికి సత్త వున్నదనీ బోధిస్తూవుంటే, మనం ఉత్పత్తి ప్రకరణంలో 'జగత్తుకు ఉత్పత్తే లేదు, అసలు జగత్తే లేదు' అని నిరూపించాం. మానవబుద్ధి మీద ఆధారపడేవాళ్లకు దీనిమీద అనేక సందేహాలు తోస్తూ వుంటాయి. కొందరు ఏవేవో సిద్ధాంతాలు కూడా చేస్తూవుంటారు. కానీ, రామా! అవి ఏవీ మంచి సిద్ధాంతాలు కావు, ఈ దృశ్య జగత్తంతా –

**భవిష్యత్పుర నిర్మాణం**

**చిత్తసంస్థమివోదితమ్।**

**మర్కటానలతాపాన్త**

**మసదేవార్థ సాధకమ్॥** (సర్గ 1, శ్లో 4)

ఈ ప్రపంచమంతా మనస్సులోంచి బయటకు పొడుచుకు వచ్చిన భవిష్యత్పట్టణ నిర్మాణం మాత్రమే! చెట్టు కొమ్మలో కోతి కల్పించుకొన్న నిప్పువేడి వంటిది. (ఈ దృష్టాంతం ఉత్పత్తి ప్రకరణంలో వచ్చింది. చెట్లకొమ్మలు రాసుకోగా కారుచిచ్చు పుట్టటం చూసిన కోతులకు, కొన్ని కొమ్మల్లో నిప్పు ఉంటుందనే విశ్వాసం కలుగుతుంది. అందువల్ల, వాటికి చలి వేసినప్పుడు ఆ కొమ్మలను గట్టిగా కౌగిలించుకొంటాయి. వాటి భావనాతీవ్రతవల్ల ఆ కొమ్మలు నిజంగానే వేడి అనిపించి, వాటికి చలిపోతుంది – అని అక్కడ చెప్పిన విషయాన్నే ఇక్కడ పరామర్శిస్తున్నారు.) ఆ కోతికి కొమ్మలోని నిప్పు లాగా ఈ ప్రపంచమంతా లేనిదిగా వుంటూనే, అజ్ఞులకు సుఖ దుఃఖాది కార్యాలను సాధించి పెడుతుంది. రామా! ఇదే అసలైన సిద్ధాంతం.

## 5. విత్తు చెట్టు

***రాముడు:*** గురుదేవా! గింజలో చెట్టువుంది. అలాగే, మహాప్రళయంలో ఈ ప్రపంచమంతా బీజరూపంగా వుందంటే యుక్తియుక్తంగా ఉంటుంది – “**మహాకల్పక్షయే దృశ్యమాస్తే బీజ ఇవాంకురః**”. అంతేగాక, అనేకమంది పెద్దలు గూడా ఇలాంటి సిద్ధాంతాలే చెపుతున్నారు. వాళ్లు అంత తెలివితక్కువ వాళ్ళా?

***వశిష్టుడు:*** రామా!

“**బ్రూతే య ఏవమజ్ఞత్వ మేతత్తస్యాస్తి శైశవమ్**”

ఇలా చెప్పేవాళ్ళకి అజ్ఞానంతోపాటు పిల్లతనం గూడా లేకపోలేదు అని తెలుసుకో. నువ్వు చెప్పిన విత్తూ, చెట్టూ ఉదాహరణలో విత్తుకు ఆకారం వుంది. అందువల్ల దానిలో సాకారమైన చెట్టు సూక్ష్మంగా ఉండవచ్చు. మరి పరబ్రహ్మకు ఆకారం లేదే!

**మనష్షష్ఠేంద్రియాతీతం**

**యత్ స్యాదతితరామణు ।**

**బీజం తద్భవితుం శక్తం**

**స్వయంభూర్జగతాం కథమ్॥**

ఆ బ్రహ్మ ఇంద్రియాలకూ, మనస్సుకూ గూడా అందదు. అంత సూక్ష్మమైనది. పైగా అది స్వయంభువు. అంటే అది చెట్టునుంచో పుట్టే గింజ లాంటిది కాదు. అది ఏ వికారాలూ లేని అద్వితీయ వస్తువు. అది మరొక

పదార్థానికి విత్తు ఎలా అవుతుంది? కనుక బ్రహ్మలో ప్రపంచం లేదనటమే సత్యం.

అదీ గాక రామా! ఈ ప్రపంచం పరిణామ విధానంలో జన్మించడం లేదు. వివర్త విధానంలో జన్మిస్తోంది. అంటే, భ్రాంతివల్ల తాడు మీద పాము జన్మించినట్లుగా జన్మిస్తోంది. భ్రాంతి కలుగక ముందు పాము సూక్ష్మరూపంలో తాడులో లేదు కదా! అలాగే, ఈ ప్రపంచం కూడా ప్రళయకాలంలో బ్రహ్మలో లేదు.

***రాముడు:*** గురుదేవా! ఈ ప్రపంచం హిరణ్యగర్భుడి మనో రాజ్యమని మీరు పూర్వం చాలాసార్లు చెప్పారు. అందువల్లే ఈ ప్రపంచోత్పత్తికి సహకార కారణాలు ఏమీ అవసరం లేదని కూడా మీరు చెప్పారు. కాబట్టి ప్రళయసమయంలో ఈ ప్రపంచం అంతా హిరణ్యగర్భుడి మనస్సులో స్మృతి అనబడే సంస్కార రూపంగా నిలబడే వుందని చెప్పక తప్పదు. కనుకనే ప్రళయం పూర్తికాగానే ఈ ప్రపంచం హిరణ్యగర్భ స్మృతిరూపంగా మళ్లీ మొలకెత్తుతోంది – అనటంలో తప్పేమిటి?

***వశిష్ఠుడు:*** నీకు స్వప్నం కలిగిందయ్యా! ఆ స్వప్నంలో కనిపించే వస్తువు స్వప్నకాలంలోనే లేదు. అలాగే నీ సంకల్పంలో ఒక వస్తువు కనిపించింది. అది నీ సంకల్ప సమయంలోనే లేదు. నీకు ఒక స్మృతి కలిగింది. స్మరింపబడే వస్తువు స్మృతిసమయంలోనే లేదు. నీ అనుభవాలు ఇలా వుంటే, వీటిని ఆధారం చేసుకుని హిరణ్యగర్భుడి స్మృతిరూపమైన ప్రపంచం ప్రళయకాలంలో సత్యంగా వుందని ఎలా కల్పన చేస్తావయ్యా?

***రాముడు:*** అదేమిటండీ? నేను సుషుప్తిలోకి వెళ్లాను. అజ్ఞానంలో పడిపోయాను. అంతమాత్రంచేత నా సంస్కారమంతా నశించిపోయిందా? లేదే! జాగ్రదవస్థ వచ్చేసరికి మళ్లీ సంస్కారాలు మొలుస్తున్నాయి. స్మృతి కలుగుతోంది. అలాగే ప్రళయసమయంలో హిరణ్యగర్భుడు మాయలో లీనమైపోయాడు.కానీ, ప్రళయం పూర్తయ్యేసరికి అతని స్మృతి అతనికి వచ్చేసింది – ఇందులో తప్పేమిటి?

***వశిష్ఠుడు:*** రామా! నువ్వు సుషుప్తిలోకి వెళ్ళి మళ్లీ జాగ్రత్తులోకి వచ్చే లోపల మధ్యలో నీకు మోక్షం వచ్చేసెయ్యలేదు. అక్కడా ఇక్కడా నువ్వే వున్నావు. అందువల్ల నీ స్మృతి నీకు మళ్లీ వచ్చేసింది. కానీ హిరణ్యగర్భుడియొక్క మహాప్రళయ సందర్భంలో పరిస్థితి ఇది కాదు. నేను చెప్పేది హిరణ్యగర్భుడి దైనందిన ప్రళయం గురించి కాదు. అతడి మహాప్రళయం గురించి చెపుతున్నాను. ఆ సమయంలో ఆ హిరణ్యగర్భుడికి ముక్తి వచ్చేసింది. ఇక ఆయన లేడు. అంటే అప్పటి స్మృతికర్త ఇక లేడు. పై సృష్టికి కొత్త హిరణ్యగర్భుడు వచ్చాడు. ఆయన వేరు, ఈయన వేరు. ఆయన స్మృతి ఈయనకెలా కలుగుతుంది? అందుకే నీ సిద్ధాంతం కుదరదు. అందుకే ఇందాక ఉదహరించుకొన్న ప్రళయ ప్రతిపాదక స్మృతి వాక్యాలన్నింటికీ, అంటే, "**సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్**"– వంటి వాక్యాలన్నిటికీ, తాత్పర్యం ఏమిటంటే, ప్రళయ సమయంలో ప్రపంచం బ్రహ్మస్వరూపంగా వుంది – అని చెప్పడమే.

## 6. జగజ్జీవేశ్వరులు

ఇలా చెప్పడంవల్ల బయటకు వచ్చే మరో ఉపసిద్ధాంతం ఏమిటంటే – జగత్తు, జీవుడు, ఈశ్వరుడు, అనే ఈ ముగ్గురూ కూడా చిన్మాత్ర స్వరూపులే – అని. వీటిలో ప్రపంచాన్ని ప్రపంచంగా చూడటం బంధం. ప్రపంచాన్ని బ్రహ్మగా చూడటం ముక్తి. జీవుణ్ణిగానీ, ఈశ్వరుణ్ణిగానీ, పట్టుకొని వీళ్ళలో వున్న సత్యాంశ ఏమిటని పరిశోధన చేస్తే, మిగిలేది పరిశుద్ధ పరబ్రహ్మమే.

కనుక రామా! బంధ మోక్షాలనేవి మనం చూసే చూపునిబట్టి వున్నాయి. ఈ దృశ్యప్రపంచం లేదనుకుంటే గానీ, మనస్సు అనే పిశాచం పోదు. అయితే మనస్సేమో లోపల వుండేది. దృశ్య ప్రపంచమేమో బయట

వుండేది. బయట వుండే దృశ్యప్రపంచానికి చికిత్స చేస్తే లోపల వుండే మనస్సనే వ్యాధి ఎలా తొలుగుతుంది? – అని సందేహపడతావేమో. నీకు పూర్వమే చెప్పా, లోపలా బయటా అనే భేదం మనస్సు చేసే గారడీ మాత్రమే. లోపలా బయటా అనేవి లేనే లేవు.

**మనోజగజ్జగదఖిలం తథా మనః**

**పరస్పరం త్వవిరహితే సదైవ హి ।**

**తయోర్ద్వయోర్మనసి నిరంతరం క్షితే**

**క్షితం జగ-న్నతు జగతి క్షితే మనః ॥** (సర్గ 4, శ్లో 15)

మనస్సే ప్రపంచం. ప్రపంచమే మనస్సు. అవి విడివిడిగా లేనే లేవు. ఐనా, ఆ రెండింటిలో మనస్సు నశిస్తే ప్రపంచం నశిస్తుంది. ప్రళయాదులవల్ల ప్రపంచం నశిస్తే మనస్సు మాత్రం నశించదు.

***రాముడు:*** ఇందుకు దృష్టాంతం చెప్పండి.

***వశిష్ఠుడు:*** దృష్టాంతాలకు ఏమిలోటయ్యా? ఇదివరకటిలో చెప్పుకొన్న 'ఐందవోపాఖ్యానం' దీనికి దృష్టాంతమే! ఇంద్రజాలోపాఖ్యానం' అనే పేరు గల లవణచరిత్ర దీనికి దృష్టాంతమే!! ఐనా, ఆ రెండూ ఉత్పత్తి అనే దృష్టిలోంచి చెప్పినవి గనుక, ప్రపంచస్థితి అంతా మనస్సుమీదే ఆధారపడి వుంది అని చెప్పేందుకు ప్రత్యేక దృష్టాంతంగా'భార్గవోపాఖ్యానం' చెబుతాను విను.

## *7. భార్గవోపాఖ్యానం*

కల్పాలు, ప్రళయాలు, మహాప్రళయాలు, ఎలా వస్తాయో నీకు తెలుసు గదా! ఆ వరుసలోనే ఒక మహాప్రళయం జరిగిపోయింది. ఒక బ్రహ్మగారి ఆయుష్యం తీరిపోయింది. కొత్త బ్రహ్మగారు వచ్చాడు. ఆయనగారి మొదటిరోజు సృష్టి ప్రారంభం అయింది. ఆ సృష్టిలో భృగువు అనే మహోత్తమ జీవి పుట్టాడు.

నీకు తెలుసుగదా, రామా! వెనుకటి కల్పాలలో ఉత్తమోత్తమ తపస్సాధనలు చేసి, కైవల్యస్థితిని అందుకోబోతూ వుండగా, కల్పాంతం రావడంవల్ల తపస్సు ఆగిపోయిన జీవులు కొందరుంటారు. అలాంటి జీవులు పై కల్పాలలో మనువులు, సప్తర్షులు, దేవతలు, మొదలైన అధికార పురుషులుగా జన్మలెత్తుతూ వుంటారు. ఇలాంటివారి జన్మలు, వీరి జీవిత చరిత్రలు, మామూలు సంసారపక్షపు సాదా జీవితాలుగా వుండవు. వాళ్ల తీరే వేరుగా వుంటుంది. ఆ కోవకు చేరినవాడే భృగువు. అతడు ఆ కల్పంలో రాబోయే రోజుల్లో సప్తఋషులలో ఒకడు కావలసి ఉన్నవాడు.

భృగువు అంటేనే కొండ చరియ అని అర్థం. ఈ భృగువు మందర పర్వతపు చరియలమీద భార్యాసహితుడై ఎక్కువకాలం తపస్సమాధిలోనే కాలం గడుపుతూ వుండేవాడు.

తపోమయ జీవనులైన ఆ దంపతులకు శుక్రుడు అనే కొడుకు పుట్టాడు. యౌవనదశ వచ్చేసరికి ఆ కుఱ్ఱవాడు మన్మథుడి అంత అందగాడుగా, బృహస్పతి అంత మేధావిగా, తన తండ్రి అంత తపస్విగా, తేలాడు.

వాళ్ళది ఏకాంత జీవనం! అడవిలో నివాసం !! తండ్రి ఎప్పుడు చూసినా రాతిబొమ్మ లాగా సమాధిలో వుంటూ వుండేవాడు. ఎప్పుడైనా ఆయన సమాధి విడిచి బయటకు వస్తే, శుక్రుడు ఎంతో ప్రేమగా ఆయనకు శుశ్రూష చేసేవాడు. ఆ సమయంలో తండ్రి చేసే బోధలవల్ల పరమాత్మ తత్వం పట్టుబడి, అతను గూడా తపస్సమాధుల్లోకి ప్రవేశిస్తూ వుండేవాడు.

అతని సమాధి ఎక్కువసేపు నిలిచేది కాదు. అతను సమాధిలోంచి బయటకు వచ్చేసరికి, తండ్రి

రాతిబొమ్మ లాగా బిగుసుకుపోయి ఉండేవాడు. ఈ కుర్రవాడు, శుక్రుడు, చేసే పని ఏమీ లేక కొండ చరియల వెంట, సెలయేళ్ల వెంట, అలా అలా తిరిగి వస్తూ వుండేవాడు.

శుక్రుడు సహజంగా భావుకుడు, సరస హృదయుడు, కవి. ఆ అడవిలోని ప్రకృతి సౌందర్యాలకు అతని మనస్సు పొంగిపోతూ వుండేది. ఆ నెమలి కూతలు, ఆ పూల పాన్పులు, ఆ వెన్నెల జల్లులు, అతనికి మత్తెక్కిస్తూ వుండేవి.

కానీ, ఇంతలో తండ్రిగారు చెప్పిన తత్త్వజ్ఞానం గుర్తు వచ్చేది. "ఇంత సుస్థిరంగా కనిపించే పర్వతమే నిత్యం కాదంటుంటే, ఈ పూలపాన్పుల విలువెంత? మరో మగ నెమలి గనిపిస్తే చిర్రుబుర్రులాడే ఈ నెమళ్ల కూతల విలువెంత? రోజు రోజూ క్షీణించిపోయే ఈ చంద్రుడు కురిపించే వెన్నెల విలువెంత?" – అని అతడు ఊగిసలాడిపోయేవాడు.

ఒక పక్క సౌందర్యతృష్ణ, మరో పక్క తత్త్వజిజ్ఞాస. ఒక పక్క ప్రపంచం సత్యమనే ఊహ, మరో పక్క ఆత్మతత్త్వ వివేకం. ఒక పక్క సౌందర్యం కోసం తపన, మరో పక్క సమాధి కోసం ఆరాటం. ఇలా నిరంతరమూ మనస్సులో ఊగులాటలై, ఆ శుక్రకుమారుడికి మనశ్శాంతి దక్కక, అతని పరిస్థితి ఎటూ కాని త్రిశంకు స్వర్గంలా అయిపోయింది.

శుక్రుడు ఇలా గిల గిలా కొట్టుకొంటున్న రోజుల్లో, ఒక నాడు, అతను తన తండ్రి ప్రక్కనే కూర్చొని, సమాధి కోసం కృషి చేస్తున్నాడు. తండ్రి అప్పటికే సమాధిలోకి వెళ్ళిపోయాడు. కొడుకుకు సమాధి కుదిరీకుదరకుండా వుంది. ఈ దశలో ఆకాశంలో కిలకిలరావాలేవో వినిపించాయి. శుక్రకుమారుడు తల ఎత్తి చూశాడు.

అప్పటికే కొన్ని దివ్యశక్తులు సాధించి ఉండటం వలన, శుక్రుడికి ఆకాశంలో సంచరిస్తున్న దేవకన్యలు కనిపించారు. వాళ్ళు వట్టి కన్యలు కాదు. దేవ వేశ్యలు. అప్సరసలు. ఆ అందాలకు, ఆ విలాసాలకు, శుక్రకుమారుడు పరవశించిపోయాడు. సంస్కార విశేషంవల్ల వారిలో ఒక పిల్లదాని సౌందర్యం ఇతనికి మరీ మత్తెక్కించింది.

ఆ పిల్ల ఎంత ఎత్తులో, ఎంత దూరంలో వుందో ఏమో గానీ, ఈ కుర్రవాడికి ఆ పిల్ల తన కళ్ళముందే తిరుగుతున్నట్లు, ఆ శరీర సువాసనలు తన ముక్కులకు తగులుతున్నట్లూ, ఆ అందెల చప్పుళ్ళు తన చెవులకు సోకుతున్నట్లూ, తోచసాగింది.

ఇలా చూస్తుండగానే అప్సరసల గుంపు ముందుకు వెళ్ళిపోయింది. అప్రయత్నంగా శుక్రకుమారుడు గూడా లేచి ఆ దారినే నడవబోయాడు.

ఇంతలో శుక్రుడిలోని తత్త్వజ్ఞుడు నిద్ర లేచాడు. ఆ తత్త్వజ్ఞుడు బలాత్కారంగా వివేకాన్ని లాక్కు వచ్చేశాడు. దానికి నిగ్రహాన్ని తీసుకువచ్చి ముడిపెట్టాడు. వెళ్ళబోయిన శుక్రకుమారుడ్ణి వెనక్కు నడిపించి, మళ్ళీ తండ్రి ప్రక్కనే కూర్చోబెట్టి, మనస్సును ఏకాగ్రం చేసుకోమని నిర్బంధించాడు.

శక్రుడు ఏకాగ్రతా ప్రయత్నం మళ్ళీ మొదలు పెట్టాడు. ఇతర ఆలోచనలన్నీ త్వరలోనే తొలగపోయాయి. ఇంకేముంది, మనస్సు ఖాళీ అయిపోతోంది అనుకొంటూ వుండగా, ఎప్పుడు వచ్చిందో, ఎలా వచ్చిందో, తెలియదుగానీ, ఇందాకటి ఆ కులుకులాడి వచ్చేసి, మనస్సులోకి దూరి, మనసంతా తనే అయిపోయి, నిండి కూర్చుంది. కొద్ది క్షణాలు అయ్యేసరికి పరిస్థితి ఎలా వుందంటే, ఆ శుక్రుడు తనను తానే మరచిపోయాడు. మరచిపోయి ఊరుకోలేదు. తనే ఆ కులుకులాడి అయిపోయాడు. తన్మయుడు అయిపోయాడు.

## 8. ఇక్కడే వున్నాడు కాని అక్కడ తిరుగుతున్నాడు

ఆ దశలో శుక్రుడు ఎంతసేపు వున్నాడో అతనికే తెలియలేదు. క్రమంగా అతని ఊహలు తీగలు సాగుతున్నాయి.

ఆ అప్సరసల బృందం ముందుకుపోతోంది. కొంతసేపయ్యేసరికి బృందం లేదు. తను వలచిన పిల్ల ఒక్కతే వుంది. ఆమె ముందు నడుస్తోంది, వెనకాల శుక్రుడు నడుస్తున్నాడు. ఆమె స్వర్గలోకంలోకి ప్రవేశించింది. ఆ లోకం, ఆ మనుషులు, అద్భుతంగా వున్నారు. ఆ పూదోటలు, ఆ భవనాలు, ఆ క్రీడాసరస్సులు, అద్భుతంగా ఉన్నాయి. ఒక్కొక్కటీ స్పష్టంగా కనిపిస్తున్నాయి. క్రమంగా దిక్పాలకులు, వాళ్ళ ఇళ్ళు, వాళ్ళ వాహనాలు, వాళ్ళ విలాసాలు, వాళ్ళ విహారాలు, వాళ్ళ గానాలు, వాళ్ళ గానాలు, వాళ్ళ నాట్యాలు, వాళ్ళ విమానాలు, వాళ్ళ కల్పవృక్షాలు అందరూ కనిపిస్తూ వున్నారు.

అప్సరస ఇంకా ముందుకు సాగుతోంది. సాగి సాగి ఆమె ఇంద్రసభలోకి ప్రవేశించింది. దేవరాజ సింహాసనంలో కూర్చున్న దేవేంద్రుడ్ని చూడగానే, అప్సరస వెనుక నడుస్తున్న శుక్రుడు ఆదరంగా నమస్కరించాడు. దేవేంద్రుడు అంతే ఆదరంతో ఎదురు వచ్చి, స్వాగతం పలికి, తన అర్ధ సింహాసనంలో కూర్చోబెట్టుకున్నాడు.

శుక్రుడి ఆనందానికి అంతు లేకుండా వుంది. ఇంతలో దేవేంద్రుడు శుక్రుడికి ఒక విడిది ఏర్పాటు చేశాడు. ఆ విడిదిలో కొంచెంసేపు విశ్రమించిన శుక్రుడు, ఊరు చూడటానికి బయలు దేరాడు. దారిలో ఎందరెందరో సుందరాంగులు కనిపించారు. ఒక చోట తాను వలచిన ఆ అప్సరస మళ్ళీ కనిపించింది. ఇద్దరూ పరస్పరం మోహంలో పడ్డారు.

తక్షణమే చీకటి పడాలని శుక్రుడు సంకల్పించాడు. చిత్రం, అలాగే జరిగింది. ఆ చీకటిలో, ఆ తోటలో, దేవేంద్రుడు పంపిన అమృతం కానుకగా అందింది. ఆ తరువాత శుక్రుడు ఆ అప్సరసతో విహరిస్తూ ఇంచుమించు కృతయుగంలో సగం కాలంపాటు ఆనందంగా గడిపేశాడు.

ఆ దీర్ఘరాత్రి గడిచాక, శుక్రుడు మళ్ళీ ఇంద్రపురం చేరాడు. అక్కడ మరో నాలుగు యుగాలపాటు సుఖంగా విహరించాడు.

**పుణ్యక్షయానుసంధానాత్ తతశ్చావని మండలే।**

**తయైవ సహ మానిన్యా పపాతోపహతాకృతిః॥ (సర్గ 8-శ్లో. 15)**

ఇప్పటివరకూ మనోరాజ్యంలో సుఖభోగాలనుభవిస్తున్న శుక్రుడికి పుణ్యక్షయం అయిపోయినట్లుగా ఒక భావన మనస్సులో అనుసంధానమైంది. దానితో అతను తన ప్రియురాలితో కలిసి భూమిమీద పడ్డాడు. ఆ పడిన విధానం ఏమిటంటే– పుణ్యం నశించిపోయిందనే అనుసంధానం వుండటంవల్ల, అతని దివ్యశరీరం కూడా చితికిపోయింది. దాంతో ఆ జీవులిద్దరూ సూక్ష్మశరీరాలతో, గూడు లేని పక్షుల్లాగా, ఆకాశంలో తిరుగుతూ, మెల్లిగా చంద్రకిరణాలలోకి చేరారు. ఆ కిరణాలద్వారా ఆహారయోగ్యమైన గింజలలోకి చేరారు. వాటిల్లో ఒక గింజ దశార్ణదేశానికి చేరింది. అక్కడ ఒక బ్రాహ్మణుడు గింజను అన్నంగా వండుకు తిన్నాడు. ఆ గింజలోని జీవుడు, ఆ బ్రాహ్మడిద్వారా అతని భార్య గర్భంలోకి చేరి కొడుకై పుట్టాడు. ఈ జన్మలో గూడా అతని పేరు శుక్రుడే.

జన్మలు జన్మలుగా సాగే జీవుల చరిత్రలను చెప్పుకొనేటప్పుడు, పురాణాలలో, సామాన్యంగా ఆ జన్మలన్నింటి లోనూ, ఆ జీవుడ్ని, ఒకే పేరుతో వ్యవహరిస్తూ వుంటారు. కథా సౌకర్యం కోసం ఇలా చేస్తారు. వేరే వేరే జన్మల్లో వేరే వేరే పేర్లు ఉండి ఉండవచ్చు. కానీ, ఒకే జీవుడి జన్మాంతర ప్రయాణం ఎలా సాగుతోందో చూపించటానికి వచ్చే కథలు గనుక, ఇలాంటి కథల్లో ఆ జీవుడికి అన్ని జన్మల్లోనూ అదే పేరు

ఉన్నట్లుగా మహర్షులు చెపుతూ వుంటారని మనం గమనించాలి. ఇంతకూ భృగుకుమారుడైన శుక్రుడు, దశార్ణదేశంలో బ్రాహ్మణ కుమారుడిగా జన్మించాడు. అక్కడ అతనికి మళ్ళీ తపస్వి జనుల సాంగత్యం లభించింది. ఆ సహవాసంబలంవల్ల అతను తపోవిధులను నేర్చుకొని, తపోనిష్ఠుడై, ఒక మన్వంతర కాలం పాటు జీవించాడు. కానీ, ఇంత తపస్సులో ఉన్నవాడికీ ఒక విచిత్రమైన సన్నివేశం ఎదురైంది. ఆ నాడు స్వర్గంనుంచి రాలిపడిన అప్సరస ఈ నాడు ఒక ఆడ లేడై పుట్టి, ఈ శుక్రుడు తపస్సు చేసుకొనే వనంలో ఇతని ముందు తిరగ సాగింది.

మన్వంతర కాలంపాటు, అంటే 71 దివ్యయుగాలపాటు, తపోనిష్ఠలో ఉన్న నూతన శుక్రుడికి మనస్సు చలించింది, ఆ లేడికి మానాకారంలో ఉన్న కొడుకు ఒకడు పుట్టాడు.

ఈ పిల్లవాడు పుట్టిన దగ్గరినుంచీ నూతన శుక్రుడి పద్ధతే మారిపోయింది. వాడిమీద అంతులేని మోహంతో తన ఆస్తులన్నీ ఎక్కడ ఉన్నాయని విచారణ మొదలు పెట్టాడు. వాడికి అంతులేని డబ్బు ఉండాలనీ, సాటిలేని పాండిత్యం ఉండాలనీ, మచ్చలేని సద్గుణాలు వుండాలనీ, శాశ్వతమైన ఆయుష్యం ఉండాలనీ, ఒకటే తపన బయలు దేరింది. ఈ మనశ్చింతతో అతని తపోనిష్ఠంతా భ్రష్టుపట్టి, తపోబలం అడుగంటింది. ఇలా నూతన శుక్రుడు పుత్రచింతలో మునిగి ఉండగానే మృత్యువు అతన్ని మింగేసింది.

పుత్రుడి కోసం భోగచింతనలో పడ్డ నూతన శుక్రుడు, పై జన్మలో మధుర దేశపు రాజుగా పుట్టాడు. అక్కడ చాలా కాలం భోగాలనుభవించి, కీర్తిని సంపాదించి, చివరికి వానప్రస్థధర్మంలో వుంటూ శరీర త్యాగం చేశాడు.

ఈ తపోవాసనవల్ల ఆ పై జన్మలో అతడు 'సమంగా' మహానదీ తీరాన తాపసపుత్రుడై జన్మించాడు.

రామా! ఈ జన్మలో మాత్రం అతనికి పూర్వపు చెడు సంస్కారాలన్నీ తొలగిపోయి, సుస్థిరమైన వైరాగ్యం కలిగి, సమాధిస్థితి అంది, ఆ నదీతీరంలోని చెట్టు లాగానే నిశ్చలంగా ఉండిపోయాడు.

### ౨. అసలు శరీరం

రామా! ఈ కథా పరంపరలో మొదటి మాట మరచి పోయావో ఏమో, ఈ జన్మ పరంపర అంతా ఎక్కడ జరిగింది? మందర పర్వతం మీద తండ్రి ప్రక్కన కూర్చొని చిత్తైకాగ్రత కోసం కుస్తీ పడుతున్న శుక్రుడి మనోరాజ్యంలో జరిగింది. ఆ నాటి ఆ శుక్రకుమారుడు అలా ఆలోచిస్తూ, ఒళ్ళు మరచిపోయి కూర్చోగా, వేలకు వేల సంవత్సరాలే దొర్లిపోయాయి. ఇన్ని వేల ఏళ్ళ మధ్యలోనూ తిండీ, నీళ్ళూ లేక, ఆ శరీరం శుష్కించి పోయి, ఒక రోజున ఎండుటాకల్లే రాలిపోయింది. మొదలు నరికిన చెట్టల్లే పక్కకు ఒరిగిపోయింది.

ఈ శరీరం ఇలా కూలిపోయినా, అతని మనస్సు మాత్రం కోడెవయస్సులో ఉన్న లేడిపిల్ల లాగా గంతులు వేస్తూనే వుంది. అది అలా లక్షల సంవత్సరాలు గంతులు వేసి వేసి, చివరికి 'సమంగా' నదీతీరంలో విశ్రాంతి చెందింది.

**అనంత వృత్తాంత ఘనాం పేలవాం సుదృఢా మపి।**
**తాం సంసృతిదశాం శుక్రో విదేహోఽ నుభవన్ స్థితః॥**

(సర్గ 9–శ్లో 5)

ఎన్ని లక్షల సంవత్సరాలుగానో ఆ శుక్రుడు దేహం లేకుండానే, ఇన్ని జన్మల సంసార దశనూ అనుభవిస్తూ వచ్చాడు. దేనివల్ల ఇలా చేయగలిగాడు అంటే, జీవులు ప్రస్తుతదేహమే సత్యమనే భ్రాంతి వల్ల పాత దేహాలను మరచిపోతూ వుంటారు. ఆ మరపువల్లే ఈ సంసారం ఇంత దృఢంగా ఉంటుంది. దీంట్లో ఉండే సంఘటనలన్నీ ఇంత ఘనంగా ఉంటాయి. అయినా ఇవన్నీ మనస్సు చేసే కల్పనలు మాత్రమే గనుక, ఈ మొత్తం

సంసారమంతా కలిపితే అది నిస్సారమే. ఇప్పుడు భృగు కుమారుడు చేసినది కూడా మానసిక కల్పన మాత్రమే గనుక, అతడు శరీరం లేకుండానే ఇన్ని జన్మలూ అనుభవించగలిగాడు.

ఇంతటి సంసార కల్పనకు మూలకారణమైన అతని మనస్సుకు ఒకనాడు ఆధారంగా వున్న ఆ భృగుపుత్ర శరీరం, ఆ నాటి స్థూలదేహం, ఇప్పుడు పూర్తిగా శిథిలం అయిపోయి వుంది. దానిలోని రక్తమాంసాలు ఎండిపోయాయి. ఎముకలు, చర్మం, మాత్రం మిగిలాయి.

ఇలాంటి నీచదశలో దిక్కులేని శవం పడి వున్నా, అక్కడ వున్న పశుపక్ష్యాదులేవి ఆ శరీరాన్ని పీక్కు తిననే లేదు. దానికి కారణమేమిటంటే, ప్రక్కన సమాధిలో కూర్చొని వున్న భృగువు. ఆయన రాగద్వేషాలు లేని మహాతపశ్శాలి. ఆయన తపోబలం వల్ల అక్కడ వుండే పశువులు, పక్షులు, కీటకాలు గూడా ఆ శరీరం పట్ల స్నేహభావంతో ప్రవర్తించాయి.

ఇలా ఉండగా, భృగుమహర్షి లెక్కలో వేయి సంవత్సరా లయ్యాక, ఒక రోజున, భృగుమహర్షి తపస్సమాధినుంచి లేచాడు. లేచేటప్పటికి, ఎముకలు, చర్మమూ మిగిలి, ఎండిపోయి ఉన్న కొడుకు శవం తన ప్రక్కన కనిపించింది. అంత మహా తపస్వి అయిన భృగుమహర్షికి కూడా, పుత్రశోకం ముంచెత్తు కొచ్చేసింది. ఆ శోకం క్రోధంగా మారి – “అరెరే! నా తపస్సుకు భయపడి ఇక్కడి పశువులు, పక్షులు, కీటకాలూ కూడా, నా కొడుకు శవాన్ని ముట్టుకోవడానికి సాహసించలేదే! ఆ పాడు మృత్యుదేవతకి ఎంత ధైర్యం? నేను బ్రతికి వుండగానే నా కొడుకు ప్రాణాలు తీసుకుపోతాడా? వాడ్ణి ఇప్పుడే శపించి పారేస్తాను” – అని తనలో తనే ఉగ్రంగా ఆలోచించసాగాడు.

## 10. మృత్యుబోధ

మహర్షి ఆలోచనా తరంగాలు మృత్యుదేవతను తాకాయి. వెంటనే ఆ మృత్యుదేవత భృగుమహర్షి ఎదుట సాక్షాత్కరించి ఇలా ప్రసంగించసాగాడు–

“మహర్షీ! లోకస్థితి తెలిసినవాళ్ళు, తత్త్వజ్ఞానాన్ని అందుకున్నవాళ్లు, ఇతరుల దగ్గర తప్పులు వున్నా కోపం తెచ్చుకోరు. తప్పు లేని చోట కోపం తెచ్చుకోరని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. మీరు తపస్వులు, మేము పదవులలో వుండి విధి నిర్వాహణ చేసే అధికారులం. ఒకరికి భయపడి మా విధులు మానుకోము. పెద్దలంటే గౌరవిస్తాం గానీ భయపడం. ఓ తెలివితక్కువ మహర్షీ! నన్ను శపించాలనుకొని నీ తపస్సు పాడు చేసుకోకు.

“నేనెవరిని అనుకుంటున్నావు? నేను కాలాన్ని. ఇప్పటికి కొన్ని కోట్ల బ్రహ్మాండాలను మింగేశాను. కోట్ల కోట్ల బ్రహ్మలను, విష్ణువులను, మహేశ్వరులను, మింగేశాను. మీ బోటివాళ్ళు నాకో లెక్కా? వాళ్ళెవరూ నన్ను శపించలేదే! నువ్వు శపిస్తావా?

“ఇందరిని మింగుతున్నానంటే ఇది నా రాగద్వేషాలవల్ల గాదు. ఇది సృష్టిలో నాకొరకు ఏర్పడ్డ నియతి. నీరు పల్లానికి పోయినట్టుగా జీవులు కాలం నోట్లో పడతారు. నీకూ ఒక నియతి వుంది. నాకూ ఒక నియతి వుంది. అజ్ఞానంలో పడి నీ నియతిని నువ్వు పాడు చేసుకోకు.

“ఐనా, నీ తెలివి ఏమైంది? నీ తపస్సు ఏమైంది? నీ దివ్యదృష్టి ఏమైంది? నీ తత్త్వజ్ఞానం ఏమైంది? కొడుకు మరణించాడని ఇంత గందరగోళపడతావేమిటి? నీకు తెలియదా, జీవికి స్థూలదేహంకన్నా సూక్ష్మదేహమే ప్రబలమని? సూక్ష్మదేహ మంటే ఏమిటి? సంకల్పమే సూక్ష్మదేహం. మనస్సే సూక్ష్మదేహం.

“నువ్వు తపస్సమాధిలో వుండగా, నీ కొడుకు యొక్క సంకల్ప శరీరం, మనోరథాలనే మార్గంలో చాలా దూరం వెళ్ళింది. అలా వెళ్ళేటప్పుడు మొదట కొంత సేపు భృగుపుత్ర శరీరంతోనే వెళ్ళింది.

"ఆ తరువాత అది స్వర్గలోకానికి చేరి, దేవతా శరీరాన్ని ధరించింది. ఆ శరీరంతో నాలుగు యుగాల కాలం గడిపింది. అక్కడినుంచి భూమి మీదపడి, దశార్ణదేశంలో బ్రాహ్మణశరీరాన్ని ధరించింది. ఆ పై జన్మలో కోసలదేశ రాజశరీరాన్ని ధరించింది. ఆ పై జన్మలో అడవిలో పల్లెటూరివాడు అయింది. ఆ తరువాత గంగాతీరంలో హంస అయింది. ఆ తరువాత సూర్యవంశంలో ఒక రాజైంది. ఆ తరువాత సౌర సాళ్వ దేశాలలో మంత్రాలు ఉపదేశించే గురువైంది. ఆ తరువాత విద్యాధరలోకంలో ఒక విద్యాధరుడైంది. తరువాత భూమి మీద ఒక మునిపుత్రుడైంది. ఆ తరువాత మద్రదేశ రాజైంది. ఆ తరువాత ఇప్పుడు నీ కొడుకు వాసుదేవుడనే ఋషికి పుత్రుడై 'సమంగా' నదీ తీరాన తపస్సు చేసుకొంటున్నాడు.

"మహర్షీ! నీ కొడుకు మానసికంగా ఎత్తిన జన్మలన్నీ చెప్పలేదు. కొన్ని మరచిపోయాను. ఒకసారి వింధ్యపర్వతంమీద కిరాతుడయ్యాడు. మరో సారి సౌవీర దేశంలో మండలేశ్వరుడయ్యాడు. మరోసారి త్రిగర్తదేశంలో గాడిదగా పుట్టాడు. మరోసారి కిరాత దేశంలో వెదురు పొదగా పుట్టాడు. మరో సారి నీళ్ళు లేని చోట జింకగా పుట్టాడు. మరో సారి తాటిచెట్టు మీద పాముగా పుట్టాడు. మరొక సారి మద్దిచెట్ల దగ్గర అడవికోడిగా పుట్టాడు. మరొకసారి మాంత్రికుడిగా పుట్టి విద్యాధరత్వాన్ని సాధించాడు.

" ఆ విద్యాధర శరీరంతో ఒక కల్పకాలం పాటు వెలిగిపోయి, కల్పాంత సమయంల ప్రళయాగ్నిలో పడి మిడత లాగా భస్మమై పోయాడు. ఆ తరువాత మళ్లీ సృష్టి ప్రారంభమైనప్పుడు, వాసుదేవుడనే బ్రాహ్మడికి పుత్రుడిగా పుట్టాడు. అంటే, నీ పుత్రుడి మనస్సు ఇప్పుడు వాసుదేవపుత్రుడిగా రూపొంది, తపస్సు చేసుకొంటోంది. నీకు కావాలనుకొంటే నీ దివ్యదృష్టితో ఒకసారి చూసుకో."

**గమనిక:** ఇందాక వశిష్ఠమహర్షి స్వయంగా భృగుకుమారుడి కథ చెప్పేటప్పుడు ఇన్ని జన్మలు చెప్పలేదు. ఇప్పుడు మృత్యుదేవత ద్వారా చాలా జన్మలు చెప్పిస్తున్నాడు. ఈ కథా గమనంలో ఈ వివరాలు అవివక్షితాంశాలు. అంటే అప్రధానాంశాలు. అనేక జన్మలు, సుదీర్ఘకాలమూ, గడిచాయి అన్నంతవరకే ఈ వాక్యాల తాత్పర్యంగా మనం స్వీకరించాలి. ఇక ఆ కాలానికీ, ఈ కాలానికీ , పొంతన లేదు. ఇక్కడే కీలకాంశం వుంది. భృగుమహర్షి లెక్కలో అది వెయ్యేళ్ళు, కాగా ఈ శుక్రుడి మనో రాజ్యపు లెక్కల్లో అది లక్షల యేళ్ళు – అనేది ఇక్కడి కీలకాంశం. ఈ విషయాన్ని ఉత్పత్తి ప్రకరణంలో లీలోపాఖ్యానంలో బాగా వివరించారు. గమనించండి. ఇక మనం మళ్లీ కథలోకి ప్రవేశిద్దాం.

అప్పటిదాగా హుంకరించిన భృగుమహర్షి ఈ మాటలతో మెత్తబడిపోయి, చేతులు జోడించేసి, కాలదేవతను 'భగవన్' అని పిలిచి, ఇలా అన్నాడు–

"భగవన్! మృత్యుదేవా! నీముందు మేమెంత? నియతి బలం వల్లనే నేను పుత్రవ్యామోహంలో పడిపోయాను. నీ నియతిని గమనించక నిన్ను శపించాలని చూశాను. తప్పు చేశాను. నేను శిక్షార్హుణ్ణి. నువ్వు చెప్పినట్లుగానే దివ్యదృష్టితో చూశాను. సమంగా నదీతీరంలో నా కొడుకు తపస్సు చేసుకొంటున్నాడు. ఇప్పుడు నాకు బాగా నిశ్చయమవుతోంది. ఈ శరీరంవల్ల మనస్సు రావటం లేదు. మనస్సువల్లే శరీరం వస్తోంది. పంచభూతమయంగా ఇంత గట్టిగా కనిపించే ఈ శరీరం మనస్సువల్లే తయారు అవుతోంది.

**మనో జగతి భూతానాం**

**ద్వే శరీరేత్ర సర్వగమ్।**

**మన ఏవ శరీరం హి**

**యేనేదం బావ్యతే జగత్॥** (సర్గ11– శ్లో18)

"కనుక ప్రతిమనిషికీ ఒకటికాదు రెండు శరీరాలు వున్నాయి. ఒకటి ఈ స్థూలశరీరం. రెండవది ఆ మనస్సు. ఈ స్థూలశరీరం పరిమితమైనది. మనస్సనే శరీరం సర్వవ్యాపకమైనది. ఈ జగత్తు మొత్తాన్నీ

సృష్టించేది అదే! ఇలా రెండు శరీరాలున్నట్లు కనిపిస్తున్నా, ఈ రెండు శరీరాలూ గూడా మనస్సే. మనస్సుకంటే వేరు కాదు. కాలదేవా! ఈ విషయం చాలా అద్భుతంగా వుంది."

**మృత్యుదేవత:** మహర్షీ ! బాగా చెప్పావు. కానీ, జీవుడికి మనస్సు, శరీరము, అనేవి రెండు దేహాలన్నావే, అది అంత గట్టి మాట కాదు. నిజమైన గట్టి మాట ఏమిటంటే, ఈ మనస్సు చేసే మననంవల్ల జరిగే నిర్మాణమే లోకత్రయం–

**"మనో మనన నిర్మాణ మాత్ర మేతజ్జగత్త్రయమ్"** (సర్గ11– శ్లో23)

దీన్నిబట్టి ఏమి తెలుతోందంటే, ఈ ప్రపంచంలో "జడంగా కనిపించేదీ, చేతనంగా కనిపించేదీ,"– రెండూ కూడా మనస్సు చేసే నిర్మాణాలే. అంటే మనస్సు యొక్క రూపాంతరాలే. ఇది ఎలా కుదురుతోందంటే, జడాలనీ చేతనాలనీ ఇలా భేద వాసనలన్నీ రూపుగట్టిన ఈ మనస్సు యొక్క అసలైన శక్తి , దానికి అధిష్ఠానమైన సన్మాత్రం కావటం వల్లనే. అంటే, మనస్సుకు అధిష్ఠానంగా వున్న సన్మాత్రమే జడవస్తువుగానూ అస్తిత్వాన్ని పొందుతోంది. చేతన వస్తువుగానూ అస్తిత్వాన్ని పొందుతోంది. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, అడుగున ఉన్న విత్తే కాండంగా, కొమ్మలుగా, ఆకులుగా, పువ్వులుగా, పళ్ళుగా, రూపాంతరం చెందినట్లే, అధిష్ఠానమైన ఆ సన్మాత్రమే, ఆ పరబ్రహ్మ పదార్థమే, సువిశాలమైన ఈ ప్రపంచంగా విజృంభిస్తోంది.

ఉన్నది ఒక్కటే అధిష్ఠానం. అదే సన్మాత్రం, అదే పరబ్రహ్మ. ఆ ఒక్కదాంట్లోంచే చిత్రవిచిత్రాలైన మనశ్శక్తులు కోటానుకోట్లుగా ఉద్భవిస్తున్నాయి. ఆ మనశ్శక్తుల్లో కొన్ని దేవతలైనాయి. కొన్ని మనుష్యులైనాయి. కొన్ని కీటకాలైనాయి. ఇలా జీవులలో అనేక రకాల తరగతులు ఏర్పడ్డాయి. క్రమంగా గురువులూ, శిష్యులూ ఏర్పడ్డారు.

## 11. కొసరు శరీరం

మహర్షీ! ఇవన్నీ మనస్సు చలించటంవల్ల ఏర్పడిన వికారాలే. ఆ వికారాల్లో ఒక వికారం ఇప్పుడు సమంగా నదీతీరాన వుంది . పద, ఇద్దరం వెళ్ళి చూసి వద్దాం.

భృగు కాలదేవులిద్దరూ సరే అంటే సరే అనుకొని, ఆకాశమార్గాన ప్రయాణం చేసి, సమంగా నదీతీరానికి వచ్చి, కొంచెంసేపు వెతికి, నవీన భృగుపుత్రుడి దగ్గరికి చేరారు.

నిర్వికల్పసమాధిలో వున్న ఆ కుర్రవాడ్ణి చూస్తూనే మృత్యుదేవత ఊరంత గొంతు చేసుకొని, "ఏమయ్యో! ఇదిగో నీ కొడుకు"– అని బిగ్గరగా అరిచాడు. ఆ గావుకేకలకి సమాధి భంగమై, ఆ మునికుమారుడు మెల్లగా కళ్ళు తెరిచాడు.

ఎదురుగా పవిత్రులైన బ్రాహ్మణులిద్దరు కనిపించేసరికి, మునికుమారుడు సగౌరవంగా నమస్కరించి, దగ్గరలో వున్న ఒక రాతిబండమీద కూర్చోబెట్టి, ఇలా మనవి చేసాడు–

"బ్రాహ్మణోత్తములారా! మిమ్మల్ని చూస్తుంటే నాకు ఎంతో ఆనందంగా వుంది. ఎన్ని వేల సంవత్సరాలుగానో తపస్సు చేస్తున్నా తొలగిపోని మనోమోహం మీ దర్శనంతో తొలగిపోయిన అనుభవం కలుగుతోంది. ఇంతకూ తమరు ఎవరు?"

ఈ మాటలు వినేసరికి భృగుమహర్షికి కళ్ళల్లో నీళ్ళు తిరిగినంతపనైంది. ఆయన త్వరగానే తేరుకొని–

"నాయనా! వెనుకటి జన్మలో నువ్వు నా పుత్రుడివి. నువ్వూ తపస్వివే కదా! ఒక సారి దివ్యదృష్టితో చూసుకో" అన్నాడు.

ఈ మాటలతో ఆ మునికుమారుడికి కళ్ళు లోపలికి తిరిగి, వాటిల్లో తన గత చరిత్రంతా చక్రాలు

తిరిగినట్టుగా తిరిగిపోగా, గబగబా చూసేసుకొన్నాడు. కొంతసేపటికి మామూలు స్థితికి వచ్చి, సంతోషంగా తండ్రికి నమస్కరించాడు. ఆశ్చర్యంవల్ల అతని నోటివెంట త్వరగా మాట రావటం లేదు. అతను మెల్లగా తనను తానే సంబాళించుకొని, ఇలా అన్నాడు–

"ఔరా! పరమాత్మ యొక్క నియతి చేసే పనులు ఎంత విచిత్రమైనవి?! నియతివల్ల కదా ఈ ప్రపంచం అంతా చక్రం తిరిగినట్లు తిరుగుతోంది. ఆహా! ఎన్ని జన్మలను అనుభవించాను?! అన్నీ గుర్తు వున్నాయో, లేదో! ఎక్కడెక్కడో తిరిగాను. ఏమేమో అనుభవించాను. మంచీ, చెడూ, రెండూ చూశాను. ఇక ఇప్పుడు తిరుగుళ్ళు ఆగిపోయాయి. భ్రమలు తొలగిపోయాయి.

నాన్నగారూ! ఇంక లేవండి. మందర పర్వతం మీద ఆ నాడు నేను వదలివచ్చిన శరీరాన్ని చూద్దామని వుంది. ఇప్పుడది ఎండుటాకు లాగా ముడుచుకుపోయి వుండి వుంటుంది. నాకిప్పుడు ఏదీ కావాలనీ లేదు, వద్దనీ లేదు. కేవలం నియతిచేసే ఈ రచనను చూస్తున్నాను అంతే. అది చూడటం కోసమే ఉన్నాను. అంతకు మించి వేరే పని లేదు. పదండి బయలుదేరుదాం".

## 12. అదిగో పాత దేహం

ముని కుమారుడిలా అనడంతోటే భృగు కాలదేవులు సంతోషించి, సరే అని బయలుదేరారు. ముగ్గురూ జగత్తత్త్వాన్ని గురించి మాట్లాడుకొంటూ, ఆకాశమార్గాన ప్రయాణంచేసి, మందరపర్వతం మీద వున్న భృగుమహర్షి ఆశ్రమానికి చేరారు. అక్కడ శుక్రుడికి తన పాతశరీరం కనిపించింది.

అస్థిపంజరమై పడివున్న పాతశరీరం కనిపించేసరికి, అప్పటిదాకా వేదాంత వాక్యాలు వల్లిస్తున్న నవీన శుక్రుడికి ఎక్కడలేని దుఃఖమూ పొంగుకువచ్చింది. అతను కళ్ళనీళ్ళు కుక్కుకుంటూ, "నాన్నగారూ ! ఇదే నా పాతదేహం. ఎలా అయిపోయిందో చూడండి" – అన్నాడు ఏడుపు గొంతుతో.

భృగువు, కాలదేవుడు, ఔననలేదు, కాదనలేదు. నవీన శుక్రుడే దుఃఖం ఆపుకోలేక మళ్ళీ తనే మాట్లాడసాగాడు–

"నాన్నగారూ! చూశారా! ఆ నాడు మీరు ఆటపాటలతో ఆలించి, లాలించి, పెంచిన ఈ దేహం, ఇప్పుడెలా వుందో చూస్తున్నారా? మీ పెంపకంలో ఆ నాడు ఈ దేహం మదగజం లాగా పెరిగింది. ఆ తరువాత దేవలోకంలో దేవతాస్త్రీలతో విహరించింది కూడా ఈ దేహమే. ఆ తరువాత ఇది ఎప్పుడు మారిపోయిందో గుర్తు రావడం లేదు.

"ఓ శరీరమా! ఎన్ని దశలు అనుభవించావు? నేను నీతో ఎన్ని విలాసాలు చేశాను? అలాంటి నువ్వు ఈ నాడు అస్థిపంజరమై పడి ఉన్నావా?

" నిన్ను చూస్తేనే వైరాగ్యం పుట్టేటట్లుగా వుంది. కానీ ఇప్పుడు నాకు వైరాగ్యం ఎందుకు? నేను ఇప్పుడు చిత్తమనే పిశాచాన్ని వదలగొట్టుకొని ఆనందంగా ఉన్నాను. నాకు దుఃఖాలు లేవు, సుఖాలు లేవు, సందేహాలు లేవు, సంకల్పాలులేవు, నేను మనోనాశస్థితిలో వున్నాను. నేను జీవన్ముక్తస్థితిలో వున్నాను. ఇప్పుడు నువ్వు కూడా మననక్రియ లేకుండా, ఆలోచనా స్పందన లేకుండా, పడివున్నావు. అందుకు సంతోషంగా వుంది.

**"దిష్ట్యా పశ్యామ్యమననాం- వనే తను మిమామహమ్ "** (సర్గ 15–శ్లో26)

ఈ కథనం వింటున్న శ్రీరాముడు కొద్దిగా మొహం చిట్లించి, ఇలా అడిగాడు–

**రాముడు**: గురుదేవా ! ఈ శుక్రుడు బాధపడుతున్నాడా? సంతోష పడుతున్నాడా? అదీగాక, అతనికిప్పటికి

చాలా శరీరాలు గడిచినాయి గదా! ప్రస్తుతం జీవించి వున్న శరీరం ఒకటి బాగానే వుంది గదా! ఎప్పుడో రాలిపోయి, ఎండిపోయిన, ఆ పాతశరీరం మీద ఇంత ప్రేమ ఎందుకు? భృగుమహర్షి అంతటి గొప్పవాడికి పుట్టిన దేహమనే అభిప్రాయంతోనేనా?

**వశిష్ఠుడు:** అదేమీ కాదు. జీవుల రాగద్వేషాలన్నీ కర్మలను బట్టే నడుస్తూ వుంటాయి. ఈ శుక్రుడు అనే జీవుడు పూర్వకల్పంలో గొప్ప తపస్సుచేసి,పై కల్పంలో గ్రహాధిపత్యాన్ని,రాక్షస గురుత్వాన్ని, పొందాలని ఆశించాడు. ఆ నాటి ఆ కర్మలన్నీ ఈ కల్పంలో భృగు శరీరం ద్వారా, శుక్రకుమార శరీరంగా రూపొందాయి. వెనుకటి కల్పం నాటి శుక్రజీవుడు, ఈ నాటి భృగుపుత్ర శరీరంద్వారా, ఆ కర్మఫలాలు అన్నీ అనుభవించవలసి వుంది.

ఆ ఫలాలు, రేకులు విచ్చుకున్నట్టుగా విచ్చుకొనే లోపలే యువశుక్రుడికి మానసిక సంక్షోభం కలిగి, ఆ సంక్షోభంలలో కలిగిన మనోబలంవల్ల పాతదేహం రాలిపోయి, కొత్తదేహాలు బోలెడన్ని పుట్టాయి.

అయితే, ఈ కొత్తగా పుట్టిన దేహపరంపరకు వెనుకటి కల్పం నుంచి తరుముకొని వస్తున్న కర్మపుంజాల బలం లేదు. ఇవన్నీ ఇప్పుడిప్పుడే కొత్తగా పుట్టిన కర్మలవల్ల తయారై, వాటికి తగ్గ ఫలితాలను అనుభవింపజేసేసి, అంతటితో ఆయువు తీరిపోయి, రాలిపోతూ వచ్చాయి.

'సమంగా' నదీతీరాన మునికుమార శరీరం ఒకటి వుంది. అది ఇంకా జీవించే వుంది. అది ఇంకా కొంచెం కర్మ ఫలాన్ని ఇవ్వవలసి గూడా వుంది. కానీ ఇది చాలా స్వల్పఫలం.

అల నాటి భృగుకుమార శరీరం వుందే , అది ఇవ్వవలసిన కర్మఫలాలు ఇంకా కోటానకోట్లుగా వున్నాయి. ఈ కల్పాంతం దాకా అది కర్మఫలాలు అందించవలసి వుంది. ఆ కారణంవల్లే దాంట్లోంచి ప్రాణం ఎగిరిపోయినా, అది పూర్తిగా చివికిపోలేదు. పురుగులు గూడా దాన్ని కొరకలేదు.

అంత ప్రబలమైన కర్మఫలం దాంట్లో వుండటం చేతనే, శుక్రజీవుడికి దానిమీద మోహం వదిలిపోకుండా వుంది. ఎంతటి విరాగులకైనా, ఎంతటి జ్ఞానులకైనా, దేహధారులకు ఇది సహజం. దీన్ని ఎవ్వరూ అతిక్రమించలేరు. అజ్ఞానులకే కాదు, జ్ఞానులకు కూడా దేహం విషయంలో ఈ నియమం తప్పదు.

ఆకాశంలో వుండే సూర్యబింబం సుస్థిరంగా వున్నా, చెరువులో ప్రతిబింబంగా వుండే సూర్యబింబం కదులుతున్నట్టు కనిపిస్తుంది. అలాగే, జ్ఞాని అయినవాడు లోకవ్యవహారంలోకి వచ్చేసరికి, అజ్ఞాని లాగా, చలిస్తున్నవాడి లాగా, కనిపిస్తాడు.

'ఐతే ఎవడు జ్ఞాని? ఎవడు అజ్ఞాని వాళ్ళను గుర్తు పట్టడం ఎలా? అని అడుగుతావేమో, చెపుతా విను. ఎవడికి కర్మేంద్రియాలు పనిచేస్తున్న సమయంలో కూడా జ్ఞానేంద్రియాలు నిస్సంగంగా వుంటాయో వాడు జ్ఞాని. వాడు జీవన్ముక్తుడు. ఎవడికి కర్మేంద్రియాలు పని చేయని సమయంలో కూడా, జ్ఞానేంద్రియాలు సంగసహితంగానే వుంటాయో, వాడు అజ్ఞాని. వాడు బద్ధుడు. దీనిని బట్టి ఏమి తేలుతోందంటే, సుఖదుఃఖాలకు, బంధమోక్షాలకు, కారణం జ్ఞానేంద్రియాలే కానీ కర్మేంద్రియాలు కావు.

కనుక, అప్పటికి శుక్రుడు ముక్తుడైనప్పటికీ, అతని జ్ఞానేంద్రియాలకు విషయాలతో సంగం లేనప్పటికీ, కర్మఫల శేషాన్ని బట్టి పూర్వదేహం మీద అభిమానమనే వ్యవహారం నడిచిపోతోంది. రామా! ఇక పై కథ విను.

## 13. కొత్త దేహంలోంచి పాత దేహంలోకి

మునికుమారుడి రూపంలో వున్న శుక్రుడు తన పాత దేహాన్ని చూసి, ఆ విధంగా తొట్రుపడుతుండటం గమనించిన కాలదేవత గంభీర స్వరంతో ఇలా అన్నాడు–

"భృగుపుత్రా! సమంగా నదీతీరాన తపస్సుకు పనికి వచ్చిన ఈ శరీరంతో పని అయిపోయింది. ఇక

దాన్ని విడిచిపెట్టి ఈ పాతశరీరంలోకి ప్రవేశించు. ఇది సుదీర్ఘతరమైన తపస్సులకు అర్హ మైనది. దీనితో తపస్సు చేసి, రాక్షసగురు పదవిని పొంది, జీవన్ముక్తుడవై కల్పాంతం వరకూ జీవించి, అప్పుడు ఈ శరీరాన్ని కూడా పరిత్యజించి, విదేహకైవల్యం పొందు. మీ ఇద్దరికీ శుభమగుగాక! నేను వెళ్లి వస్తాను."

ఇలా అంటూనే కాలదేవత అంతర్ధానమైపోయాడు. ఈ జరిగిన సంఘటనల పరంపరలో కాలదేవుడి కరుణాబుద్ధిని తలచుకొని , తండ్రీకొడుకులిద్దరూ ప్రేమతో కంటతడి పెట్టుకున్నారు.

అంతలోనే ఇద్దరూ తేరుకున్నారు. నవీన శుక్రుడు అప్పటికే యోగసిద్ధులను సాధించినవాడు గనుక, తన మనస్సును బంధించి, పరకాయ ప్రవేశ విద్యను ఆశ్రయించి, మునిపుత్ర దేహాన్ని వదిలిపెట్టి, తన పాతదేహంలోకి ప్రవేశించాడు. సరిగ్గా అదే సమయానికి భృగుమహర్షి నీళ్ళు అభిమంత్రించి, తన కుమారుడి పాత శరీరంపై చల్లాడు. దాంతో ఎండుకట్టె వున్నట్టుండి చిగురించినట్లుగా, శుక్రుడి పురాతన శరీరంలోని నాడులన్నీ ప్రాణశక్తితో నిండి, రక్త మాంసాదులన్నీ సమంగా పేరుకొని, ఆ శరీరం నవనవలాడుతున్న యువక శరీరంగా మారిపోయింది.

ఒక పక్క ప్రాణం తొలగిపోయిన మునికుమారుని శరీరం పక్కకి ఒరిగిపోతూ వుండగా, మరో పక్క కొత్తగా ప్రాణం పోసుకొన్న భృగుకుమార పురాతన శరీరం చిరునవ్వులు చిందిస్తూ లేచి నిలబడి, తండ్రికి సాష్టాంగ వందనం చేసింది.

పుత్రప్రేమ ఎంతటి వారినైనా ఊపేస్తుంది. భృగుమహర్షి అంతటివాడిని కూడా అది తలక్రిందులు చేసేసింది. ' ఈ శరీరం నా వల్ల పుట్టిందనుకోవటం ఏమి తెలివిరా!' అనుకొంటూ ఆయన తనలో తనే నవ్వుకుంటున్నాడు. ఐనా! 'వీడు నా కొడుకు' అనే ప్రీతి ఆయనను ముంచెత్తేసింది. ఆయన పుత్రుడ్ని గట్టిగా కౌగిలించుకొని దీవించాడు.

## 14. తన దేహాన్ని తనే తగలబెట్టాడు

త్వరలోనే వారిద్దరూ తేరుకొని మామూలు స్థితికి వచ్చేశారు. వచ్చేసరికి ఒక సమస్య వారి ఎదురుగా వుంది. సమంగా నదీతీర మునీశ్వరుడి పీనుగే ఆ సమస్య!

ఆ శవాన్ని చూసేసరికి, ఇద్దరి ప్రేమల పొంగూ కొంచెం తగ్గింది. ఒక్క క్షణం ఇద్దరూ ఆలోచించారు. ఇద్దరూ ఒకే నిర్ణయానికి వచ్చారు. లోకాచారాన్ని పాటించి తీరవలసిందే అనుకొన్నారు. ఇద్దరూ కలిసి ఎండు పుల్లలు పోగేసి, ఆ శరీరానికి దహనం చేశారు.

ఆ తరువాత తండ్రీ కొడుకులిద్దరూ తపస్సు చేసుకొంటూ అక్కడే వుండిపోయారు. క్రమంగా భృగుమహర్షి సప్తర్షులలో ఒకడైనాడు. శుక్రుడు రాక్షస గురువయ్యాడు.

ఇక్కడితో భార్గవోపాఖ్యానం పూర్తయింది. ఈ కథలోని సంకేతాల గురించి, సిద్ధాంతాల గురించి వశిష్ఠమహర్షే వివరణ ఇవ్వబోతున్నాడు. బాగా అర్థం కావడంకోసం ఈ కథను మన పద్ధతిలో మనం కొంత విశ్లేషణ చేసుకొందాం.

ప్రపంచంయొక్క స్థితి మనస్సు మీద ఆధారపడి వుంది– అని నిరూపించటానికి వశిష్ఠుడు ఈ కథ మొదలు పెట్టాడు. ఈ నిరూపణకు వెనుక చెప్పిన లీలోపాఖ్యాన, లవణోపాఖ్యానాలే చాలు. ఐనా కొత్తది చెబుతాను అంటూ, ఈ కథ చెప్పాడు. ఆ రెండు కథలకు మించి ఈ కథలో విశేషమేమిటి?

భృగువు అంటే కొండ చరియ. అంటే బండరాతి పలక. దాంట్లోంచి ఏ మొక్కా మొలవదు. కానీ, చిత్రంగా అక్కడ శుక్రుడు జన్మించాడు. శుక్రం అంటే వీర్యం. అంటే విత్తు. విత్తు మొలవటానికి తల్లి గర్భమో

, నేలగర్భమో అలాంటిది ఏదైనా కావాలి. కానీ, ఈ శుక్రుడు అలాంటి గర్భాలతో పని లేకుండానే, ఒక స్వర్గలోకాన్ని ఉనికిలోకి తెచ్చాడు. చివరికి వేల సంవత్సరాలు తపస్సుచేసి సమంగా నదీతీర మునికూమారుడి శరీరాన్ని ఉనికిలోకి తెచ్చాడు.

కథాగమనంలో వీటికి ఉత్పత్తి ఎక్కడ వుందో కనిపించదు. ఉనికి మాత్రం కనిపిస్తుంది. ఎంత గట్టి ఉనికి అంటే, చివరికి సమంగా నదీతీర మునికుమారుడి శరీరం అనేది తగలబెడితేగానీ పోలేదు. ఎవరు తగులబెట్టారు? ఎవడు దాన్ని సృష్టి చేశాడో వాడు, వాడిని సృష్టి చేసినవాడు. ఇద్దరూ కలసి తగులబెట్టేశారు అంతటి ఉనికిని, అంతటి స్థితిని, సాధించగలిగింది ఎవరంటే శుక్రుడి మనస్సే.

కథాగమనంలో మనం గమనించవలసిన మరో ముఖ్యాంశం, పాతశుక్రుడి మరణం. మరణమంటే ఏమిటి? అందరూ చెప్పేమాట నిజమైతే శరీరంలోంచి ప్రాణం లేచిపోవటమే మరణం. ఇక్కడ శుక్రకుమారుడు పాతశరీరంలో వుండే స్వర్గసుఖాల భావన మొదలుపెట్టాడు. ఒక స్వప్న ప్రపంచం లాగా, ఒక పగటి కలల గాలిమేడ లాగా, ఆ స్వర్గలోకంయొక్క ఉనికి ప్రారంభమైంది. అతడు దాన్ని సృష్టి చెయ్యాలని సంకల్పించలేదు. అందుచేతనే దాన్ని సృష్టి చెయ్యలేదు. అప్పటికే వున్న అప్సరస వెంటబడి నడుస్తూ, అప్పటికే వున్నదని తను భావిస్తున్న స్వర్గలోకంలోకి ప్రవేశించాడు. సుఖాలను అనుభవించాడు. ఈ ప్రక్రియలో ఆ భావన ఎప్పుడు గట్టి పడ్డదో, దానికి యే యే పాత సంస్కారాలు జోడై జన్మ పరంపర ఏర్పడిందో అతనికే తెలియదు. అక్కడ ఆ భావన గట్టిపడుతున్న కొద్దీ ఆ మనస్సుకీ, దానిని ఆశ్రయించుకొని ఉన్న ప్రాణానికీ, పాత శరీరంతో పని తగ్గిపోయింది. అందువల్ల అది మరుపున పడిపోయింది. ఆ ప్రాణం ఎప్పటికప్పుడు కొత్త శరీరాలవెంటే పరుగులు తీసింది. అందువల్ల ఆ ప్రాణం పాత శరీరాన్ని పట్టించుకోకుండా వదిలేసింది.

మామూలు లోక పద్ధతి ప్రకారం జీవికి కాలం తీరిపోయాక మృత్యుదేవత వచ్చి ప్రాణాలు తీసుకెళ్ళే ప్రయత్నం చేస్తుంది. కానీ ఆ జీవికి పాత శరీరం వదిలి పెట్టటం ఇష్టంలేక గింజుకొంటూ వుంటాడు. చివరికి మృత్యుదేవతే గెలిచి ప్రాణాలను పీక్కుపోతుంది. ఈ లెక్కలో ఆలోచిస్తే శుక్రకుమారుడి పాత శరీరం దగ్గర జరిగింది మరణమా? కాదా?

ప్రాణం పోవటమే మరణమయ్యేటట్లైతే అది మరణమే. కానీ, ప్రాణం వట్టిగా ఎందుకు పోతుంది? మృత్యుదేవతో, కాలదేవతో, ఎవరో ఒకరు లాక్కుపోతేనే పోతోంది– అనేటట్లైతే అది మరణం కాదు. కానీ, మృత్యువూ, కాలమూ, దేవతా, అనే పదాలు ఉపయోగించారే, వాటికి అర్థం ఏమిటి?

ఈ విచారణ ఎవరూ చేయరు. భృగుమహర్షి చేయలేదు. కానీ, అక్కడ జరిగింది మరణమే అని ఖాయం చేసుకొని, దానికి కారణం మృత్యుదేవతే అని నిశ్చయం చేసుకొని, ఆ దేవతను శపిస్తానని బయలుదేరాడు. ఇది క్రోధక్రియ. ఇది పుత్రశోకంవల్ల పుట్టింది. పుత్రశోకం ప్రేమవల్ల పుట్టింది. కాగా ప్రేమ, శోకము, క్రోధము అనే వాటికి భృగుమహర్షి యొక్క పూర్వపుణ్యంతోడై, మృత్యువు అనే శక్తి అక్కడ సాకారంగా ప్రకాశించింది. అలా ప్రకాశించింది గనుక అది దేవత (దేవత= స్వయంగా ప్రకాశించేది) అదే మృత్యుదేవత. అదే కాలదేవత.

ఆ కాలదేవత వచ్చి "నీ కొడుకుది మరణం కాదంది. నీ కొడుకు ఫలానా చోట బ్రతికే వున్నాడు, చూసుకో" అంది. తీరా చూస్తే అది నిజమే. భృగుమహర్షి ఆశ్చర్యపోక తప్పలేదు.

బ్రహ్మదేవుడు శరీరాలను సృష్టిచేస్తాడనీ, జీవులు వాటిలోకి ప్రవేశిస్తారనీ, ప్రవేశించిన జీవులను కొంతకాలానికి కాలదేవుడు జుట్టు పట్టుకొని బయటికి లాగేస్తే, అప్పుడు అది మరణం అవుతుందనీ, లోకంలో అందరూ చెప్పుకొనే సిద్ధాంతం. ఇక్కడ అది కదిలిపోయింది.

ఇక్కడ ఈ సమంగా నదీతీర మునికుమారుడి శరీరాన్ని బ్రహ్మ దేవుడు తన పంచభూతాలతో సృష్టి

చేశాడనేందుకు వీలులేదు. పోనీ ఇది శుక్రకుమారుడి స్వప్నలోక శరీరమనీ, ఊహామాత్రమనీ తీసి పారేసేందుకు వీలులేదు. ఇది స్వప్నం వంటిదే, కానీ స్వప్నం కాదు. ఇది ఇంద్రజాలం వంటిదే. కానీ ఇంద్రజాలం కాదు. తర్కం ప్రకారం ఇది స్థూలశరీరం కావటానికి వీలులేదు. కానీ, ఇది పూర్తిగా స్థూలమే. దీని వెనకాల జన్మపరంపరను పరిశీలిస్తే, దానికి ఆది ఎక్కడో, ఆ మొదటి జన్మను ఎవరు సృష్టించారో అర్థం కావటం లేదు. ఐనా దీని ఉనికి సుస్థిరమైనదే.

ఈ పరస్పర వైరుధ్యాలకు భృగుమహర్షి దగ్గర తాత్త్విక సమాధానాలే తప్ప, లౌకిక సమాధానాలు లేవు. అందుకే ఆయన తత్త్వదృష్టితో తోకముడిచి కాలదేవుడి వెంట నడిచాడు.

ఒక జీవి తను విడిచిపెట్టిన శరీరాన్ని తానే తగల బెట్టుకోవడమనేది ఈ కథలో పతాక దృశ్యం. నిజానికి అది తను సృష్టి చేసిన శరీరం అనడం కన్నా, తనవల్ల స్థితిలోకి వచ్చిన శరీరం అనడం మేలు. ప్రతివాడూ, ప్రతిరోజూ తన స్వప్న శరీరాన్ని మాయం చేసేస్తున్నాడు గానీ, తగులబెట్టటం లేదు.

శుక్రకుమారుడు మునికుమారుని శరీరాన్ని మాయం చేయలేక తగలబెట్టవలసి వచ్చింది. ఎందుకంటే, దాని స్థితిలోని స్థూలత్వం అంత గట్టిగా వుంది.

పూర్వం లీలోపాఖ్యానంలో సూక్ష్మ శరీరానికీ, స్థూలశరీరానికీ మధ్య పెద్ద తేడా లేదనీ, ఏ భావనైతే సూక్ష్మప్రపంచాన్ని కలిగిస్తుందో, ఆ భావనే ఇంకా ఇంకా దృఢపడితే, ఆ ప్రపంచం క్రమంగా స్థూలమైపోతోందని చెప్పారు. ఆ సిద్ధాంతాన్నే ఇక్కడ మునికుమార శరీరానికి కూడా మనం అన్వయించుకోవాలి.

ఐతే, ఇలాంటి స్థూలశరీరాలను సృష్టి చేయగలిగినంతటి మనోబలం శుక్రుడు లాంటి కొద్దిమందికే వుంటుందా? మనబోటి సామాన్యులందరికీ వుంటుందా? అనే ప్రశ్న ఒకటి వుంది. దానికి వెంటనే మనం “ఆ శక్తి అందరికీ వుండదు. ఎవరో కొందరు తపశ్శాలులకు మాత్రమే వుంటుంది”– అని సమాధానం చెప్పాలని ఉరకలు వేస్తాం. అయితే, ఈ ప్రశ్న రామ వశిష్ఠుల చర్చలో రాబోతోంది గనుక, వశిష్ఠదేమంటాడో అక్కడ గమనిద్దాం. ఇప్పుడు మనం రామా వశిష్ఠుల చర్చలోకి ప్రవేశిద్దాం.

## 15. సంకల్ప సిద్ధి

**రాముడు:** గురుదేవా! కథంతా విన్నాను, చాలా బాగుంది. మీ శుక్రుడు చాలా గొప్పవాడు. అప్సరస కనిపిస్తే దాని వెనకాల స్వర్గంలోకే వెళ్ళిపోయాడు. స్వర్గలోక సుఖాలను అనుభవించాలనుకొంటే అనుభవించేశాడు. రాజ్యాలు ఏలాలనుకుంటే ఏలేశాడు. చివరికి తపస్సు చేయాలనుకొంటే అదీ చేసి, జీవన్ముక్తుడైపోయాడు. అతను ఏది సంకల్పిస్తే అది జరిగిపోయింది. అందరి సంకల్పాలూ అలా ఫలించవేమిటి?

**వశిష్ఠుడు:** రామా! సంకల్పాలు ఫలించటానికి రెండు పద్ధతులున్నాయి. ఒకటి చిత్తశుద్ధివల్ల లభించే సంకల్పసిద్ధి. దీనినే సత్య సంకల్పసిద్ధి అంటారు. రెండవది ప్రాణం గొంతులోంచి పైకి లేచే సమయంలో ఏ కర్మవాసన పైకి పొంగుకు వస్తుందో అది సత్యం అవుతుంది. వీటిలో మొదటిది సత్యసంకల్పసిద్ధి. ఇది శుక్రుడి లాంటి ఉత్తమ జీవులకు లభిస్తుంది. మరణకాలంలోని సంస్కారాన్నిబట్టి, పరిమితమైన సత్యసంకల్పత్వం ఇతరులకు లభిస్తుంది.

**రాముడు:** శుక్రుడూ అందరిలాగే పుట్టాడు, అతనికి ప్రత్యేకసిద్ధి కలగటానికి కారణమేమిటి?

**వశిష్ఠుడు:** ఈ శుక్రుడు జరిగిపోయిన కల్పంలో తీవ్రమైన కర్మోపాసనలు చేశాడు. అందువల్ల అతని చిత్తంలోని దోషాలన్నీ అడుగంటిపోయాయి. అటువంటి మనస్సుతో ఆ జీవి ఈ కల్పంలో మొట్టమొదటిసారిగా పుట్టాడు. అందుచేత ఇప్పుడు ఈ జీవికి కొత్తగా దోషాలేమీ అంటలేదు. ఈ జీవి జన్మలో బీజదోషాలు లేవు.

అంటే, తండ్రివల్ల వచ్చే దోషాలు లేవు. జాతి దోషాలు లేవు. అంటే, వంశంవల్ల వచ్చే దోషాలు లేవు. కాబట్టి ఈ జన్మ పవిత్రమైనది. అందుకే ఇతనికి సత్య సంకల్పసిద్ధి లభించింది. ఇప్పటి బ్రహ్మగారు ఇతనికి గ్రహాధికార పదవికి, రాక్షసగురు అధికార పదవికి ఎంపిక చెయ్యటానికి కారణం కూడా ఇదే. అందువల్ల ఇతను సంకల్పించినది ఏదీ అసత్యం కావటానికి వీలులేదు.

ఇక సామాన్య మానవులంటావా, వాళ్ళ జన్మల్లో ఇందాక చెప్పిన దోషాలలో కనీసం ఒక్క దోషమైనా వుంటుంది. అందువల్ల వాళ్ళు సత్యసంకల్పులయ్యే సావకాశం లేదు.

వాళ్ళల్లో కొంతమంది మళ్ళీ తపస్సాధనలు చేసి, రాగద్వేషాలు పోగొట్టుకొని, చిత్తశుద్ధిని సాధించుకుంటారు. అప్పుడు వాళ్ళు సత్యసంకల్పులౌతారు.

ఇక సామాన్యమానవులు వున్నారే, వాళ్ళకు మరణకాలంలో ఏ సంస్కారాలు మొలకెత్తుతాయో, అంటే స్మరణకు వస్తాయో అలాంటి వాసననుబట్టి, పై జన్మలో సుఖదుఃఖాలను అనుభవిస్తూ వుంటారు. శుక్రుడు కల్పించుకొన్న జన్మ పరంపరలో ఇలాంటి జన్మలు కూడా వున్నాయి.

దీన్నిబట్టి ఏమి తెలుస్తుందంటే –

**స్వప్న సంకల్పనగర వ్యవహారాః పరస్పరమ్।**

**పృథగ్యథా న దృశ్యన్తే తథైతే సంసృతి భ్రమాః ॥**(సర్గ 17–శ్లో10)

ఈ కనిపించే సంసార రూపమైన ప్రపంచాలన్నీ స్వప్నలోకాలవంటివి. పగటి కలల గాలిమేడల వంటివి. అందువల్లే ఎవడి ప్రపంచం వాడిదే. ఎవడి భ్రాంతి వాడిదే. ఎవడి సుఖదుఃఖాలు వాడివే.

## 16. సైనికుల స్వప్న సైన్యాలు

**రాముడు:** గురుదేవా! అన్నీ భ్రాంతులే. ఒప్పుకొన్నాం. కానీ ఈ భ్రాంతులు ఎలా వస్తాయి? వాసనలవల్ల వస్తాయి. వాసనలు ఎలా వస్తాయి? పూర్వానుభవాలవల్ల వస్తాయి. మీ శుక్రుడు ఈ కల్పంలో పుట్టింది ఇదే మొదటిసారి గదా! అతను ఇంతకు ముందు స్వర్గలోకాన్ని చూడలేదు గదా! కనుక, అతనికి స్వర్గలోకానికి సంబంధించిన వాసనలు ఉండటానికి వీలులేదు గదా! అలాంటప్పుడు అతడు ఊహా ప్రపంచంలో స్వర్గలోకానికి వెళ్ళటం, అక్కడ స్వర్గభోగాలు అనుభవించటం, అక్కడి పుణ్యం క్షీణించి, జన్మ పరంపరలను పొందటం– ఇది అంతా ఎలా కుదురుతుంది?

**వశిష్ఠుడు:** రామా! వాసనలు పూర్వానుభవాలవల్ల మాత్రమే కాదు, విన్నమాటలవల్ల, చదివిన గ్రంథాలవల్ల గూడా కలిగే సావకాశం వుంది. శుక్రుడి విషయంలో తండ్రి చెప్పేమాటలు, ఆయన బోధించిన శాస్త్రాలు అతనికి స్వర్గవాసనను, జన్మ పరంపర వాసనను కలిగించాయి. లోకంలో అనుభవం గూడా ఇలాగే వుంది. మనం కంటితో చూడకపోయినా, చెవితో విన్న విషయాల గురించి కలలు కంటూనే వున్నాం గదా !

అదీగాక, ప్రతివాడూ మెలకువలో ఒక ప్రపంచాన్ని చూస్తున్నాడు. ఇలా చూసేవాళ్ళందరూ కలిసి మేమంతా ఒకే ప్రపంచాన్ని చూస్తున్నాం – అనుకుంటున్నారు. ఇది నిజానికి సైనికుల స్వప్న భ్రాంతి లాంటిది. అంటే–

పెద్ద యుద్ధం నడుస్తోంది. రాత్రిపూట సైనికులందరూ నిద్ర పోతున్నారు. అందరికీ యుద్ధం గురించిన కలలే వస్తున్నాయి. ప్రతివాడి కలలోనూ ఒక సైన్యం యుద్ధం చేస్తోంది. నిజానికి ఎవడి స్వప్నసైన్యం వాడిదే. కానీ మెలకువలోకి వచ్చి, వాడు పక్కవాళ్ళతో "మన సైన్యం యుద్ధం చెయ్యటం నాకు కలలో కనిపించిందరా" అంటాడు. వీడికి కలలో కనిపించింది మన సైన్యం కాదు. మన సైన్యం వంటి మరో సైన్యం. కానీ, ఆ

సైనికుడు ఆ భేదాన్ని గుర్తించడు. లోకంలో జనమంతా చూసే ప్రపంచ పరిస్థితి కూడా అదే. అందుకే 'ఈ ప్రపంచం ఒక దీర్ఘ స్వప్నం' అని పెద్దలు అంటూ వుంటారు – **"దీర్ఘస్వప్నస్త్విదం జగత్",** (సర్గ 17–శ్లో 23)

**రాముడు:** గురుదేవా! ఈ మాట మీరు పూర్వం గూడా అన్నారు. ఇది నన్ను ఆలోచనలో పడేస్తోంది. ప్రతివాడూ తన ప్రపంచాన్ని వేరు వేరుగా కల్పించుకొంటున్నాడు. ఎవడి కల వాడిదే. అలాగే ఎవడి ప్రపంచం వాడిదే. అని గదా మీరంటున్నారు. అలా ఐతే ఇద్దరు వ్యక్తుల ప్రపంచాలు ఎప్పుడైనా, ఒక్క సారైనా, ఒకదానితో ఒకటి కలుసుకుంటాయా? కలుసుకోవా? ఈ మాట ఎందుకు అడుగుతున్నానంటే, ఈ ప్రపంచం కలలాంటిదైతే, ఈ ప్రపంచంలో నాకు తారసపడి నాకు జ్ఞానోపదేశం చేసే గురువు కూడా, ఆ కలలోని భాగమే గదా! అలాంటప్పుడు ఆ గురువు, ఆయన చేసే ఉపదేశం సత్యం ఎలా అవుతాయి? ఆ ఉపదేశమే అసత్యం అయితే నాకు మోక్షం ఎలా వస్తుంది? నాకే గాదు ప్రపంచంలో ఎవరికీ మోక్షం రావడానికి వీలులేదు. మీ సిద్ధాంతం ఒప్పుకొంటే ఇదీ చిక్కు.

## 17. రెండు మనోరాజ్యాలు కలుస్తాయా

**వశిష్ఠుడు:** రామా! నీ ప్రశ్నకు సమాధానం మెట్లు మెట్లుగా చెబుతాను. నీ ప్రశ్నకు సారాంశమేమిటంటే, రెండు మనో రాజ్యాలు కలుస్తాయా, కలవవా?– అని. రెండు మనస్సులు పూర్తిగా కలసపోవటం మనకు ప్రపంచంలో ఎక్కడైనా కనిపిస్తోందా? ఎక్కువగా కనిపించవు గానీ, నూటికి నూరుపాళ్ళు శుద్ధంగా వున్న మనస్సులు రెండు దొరికితే, అవి మాత్రం కలిసి తీరుతాయి. ఎందుకంటే, ఆ రెండు చిత్తాలలోనూ ప్రపంచాలే వుండవు. రెండూ పరిశుద్ధ పరమాత్మ స్థితిలోనే వుంటాయి.

ఇక మలిన చిత్తులు పక్కవారి మనోరాజ్యాలను గుర్తించేందుకు రెండు ఉపాయాలు వున్నాయి. ప్రతిజీవి అంతఃకరణలోనూ, అంతర్గతంగా, అధిష్ఠానరూపంగా పరమాత్మ చైతన్యమే వుంది. కనుక ఒకడు తనలో గల పరమాత్మ చైతన్యం మీద ఏకాగ్రతను సాధిస్తే, అప్పుడు ఆ చైతన్నాన్ని ఇతర మనస్సులలో గల చైతన్యాలతో అనుసంధానం చేయవచ్చు. అలా చేస్తే ఆయా మనస్సులలో వుండే మనోరాజ్యాలు వీడికి గోచరిస్తాయి.

అలా అన్ని ఉపాధులతోనూ అనుసంధానం చేతకాకాపోతే, తను కోరిన ఒక ప్రత్యేక ఉపాధితో అనుసంధానం చేసుకోవచ్చు. ఇది రెండవ ఉపాయం.

ఈ రెండూ ఎవరో యోగీశ్వరులు మాత్రమే అనుసరించే ఉపాయాలేనేమో అనుకుంటున్నావేమో?! యోగీశ్వరులు అనుసరించేదీ ఈ ఉపాయాలే! మామూలు జీవులు అనుసరించేదీ ఈ ఉపాయాలే!!

మామూలు సామాన్య జీవుల విషయంలో ఏం జరుగుతోందంటే, ఒక జీవికి ఏ వస్తు సముదాయం కర్మానుభవాను గుణంగా వుటుందో, అలాంటి లోకము, అలాంటి ప్రదేశము, అలాంటి వస్తువులు, మాత్రమే అతని చుట్టూ రూపొందుతాయి. అంటే అలాంటి ప్రపంచం మాత్రమే అతనికి గోచరమవుతోంది. అంటే, అలాంటి ప్రపంచాన్ని మాత్రమే అతను తన జ్ఞానేంద్రియాలతో తెలుసుకోగలుగుతాడు. మిగిలిన లోకాలూ, ప్రదేశాలూ, వస్తువులూ, లేవని గాదు. ఉన్నా వీడికి తెలియదు.

మరో జీవికి ఇలాంటి లోకము, ఇలాంటి ప్రదేశము, ఇలాంటి వస్తువులు అనుభవానికి పనికి వచ్చే కర్మశేషం వుంటే, అప్పుడు ఆ జీవి గూడా ఈ ప్రపంచంలోకే చేరుతాడు. అంటే, ఆ ఇద్దరు జీవులూ తమ కర్మశేషాలలో వుండే సామాన్యాన్నిబట్టి, ఒకరి ప్రపంచంలోకి ఒకరు ప్రవేశిస్తున్నారు. అంటే, ఆ రెండు మనస్సులకు పరస్పర సంబంధం ఏర్పడుతోంది. ఐతే, ఇది పాక్షిక సంబంధమే గానీ పరపూర్ణ సంబంధం కాదు.

ఇలాంటి సామాన్య జీవుల్లోనే కొందరు పై తరగతి వాళ్ళుంటారు. వాళ్ళు హఠయోగాది అభ్యాసంచేత మనస్సును కొంత శుద్ధం చేసుకొని పరకాయ ప్రవేశాది విద్యలను సాధిస్తారు. ఆ విద్యవల్ల వాళ్ళు ఇతరుల శరీరంలోనూ, ఇంద్రియాలలోనూ, మనస్సులలోనూ, ప్రవేశించి వాళ్లు చూడదగ్గ ప్రపంచాన్ని వీళ్ళు చూస్తారు.

ఇన్ని రకాలుగా రెండు మనస్సులు ఏకీభావాన్ని పొందే సావకాశం వుంది. గనుక, జీవన్ముక్తుడైన ఒక గురువుకి కర్మశేషంచేత మిగిలివున్న ఒక ప్రపంచము, ఒక బద్ధజీవుడి యొక్క ప్రపంచము, ఏకీభావాన్ని పొందే సావకాశం తప్పకుండా వుంది. అప్పుడు ఆ రెండు ప్రపంచాలూ మిథ్య అయినప్పటికీ, గురువు మనస్సులోగల పరిశుద్ధి శిష్యుడి మనస్సుకి సంక్రమించి, అది పరిపూర్ణంగా పరిశుద్ధమయ్యే సావకాశం నిశ్చయంగా వుంది.

## 18. నాలుగు అవస్థలు

**రాముడు:** గురుదేవా! బ్రహ్మ చైతన్యమే సత్యమనీ, దానిమీద వివర్త విధానంలో ప్రపంచం ఉత్పన్నమైందనీ, వివేకమూ, ఇంద్రియ జయమూ, వైరాగ్యమూ, అనే వాటిద్వారా సాధకుడు చిత్తాన్ని పరిపక్వం చేసుకోవాలని, ఆ చిత్తపరపాకాన్నిబట్టి, జ్ఞానసిద్ధి లభిస్తుందనీ, మీరు చాలా సార్లు చెప్పారు. ఈ సిద్ధాంతాలేవీ నేను కాదనను. కానీ, మనం భార్గవోపాఖ్యానం ద్వారా ప్రపంచస్థితి యొక్క తత్త్వాన్ని పరిశీలిస్తున్నాం గదా! భార్గవుడికి కలిగిన జన్మపరంపరానుభవమంతా జాగ్రత్తులోకి వస్తుందా? స్వప్నంలోకి వస్తోందా? ఎందుకడుగుతున్నా నంటే, పదార్థాలన్నీ జాగ్రద్దశలో ఎలా ప్రత్యక్షంగా కనిపిస్తాయో, అలాగే స్వప్న దశలో గూడా కనిపిస్తూ వుంటాయి. ప్రత్యక్ష దర్శనం రెండు చోట్లా సమానంగా వున్నప్పుడు, ఇవి రెండూ వేరు వేరు అవస్థలని చెప్పటం ఎట్లా? అందులోనూ ఒకటి సత్యమనీ, మరొకటి అసత్యమనీ, భేదం చెప్పటం ఎట్లా? ఇది తేలితేగానీ భార్గవుడి అనుభవాలలో ఏది సత్యానుభవమో చెప్పలేం. అందుకోసం అడుగుతున్నా!

**వసిష్ఠుడు:** రామా! ముందు జాగ్రత్, స్వప్నాలను పరిశీలిద్దాం. నిజానికి ఆ రెంటికీ పెద్దగా భేదం లేదు. అవి కొంచెం ఎక్కువసేపు స్థిరంగా వుంటే వాటిని జాగ్రత్ వస్తువులు అంటాం. అంత ఎక్కువసేపు స్థిరంగా లేకపోతే వాటిని స్వప్న వస్తువులు అంటాం.

అలాగే ఇది నిన్న చూసిన వస్తువే అని గుర్తు పట్టేందుకు వీలుంటే (ప్రత్యభిజ్ఞకు వీలుంటే), అప్పుడు వాటిని జాగ్రత్ పదార్థాలు అంటాం. అలాంటి గుర్తుకు సావకాశం లేకపోతే వాటిని స్వప్న పదార్థాలు అంటాం.

అంతకు మించి భేదమేమీ లేదు. వీటివల్ల కలిగే సుఖదుఃఖానుభవాలన్నీ సమానమే.

ఐతే, అవస్థలు జాగ్రత్స్వప్నాలని రెండు మాత్రమే కాదు. జాగ్రత్ – స్వప్న – సుషుప్తి – తురీయాలనే పేర్లతో అవస్థలు నాలుగు వున్నాయి. ఇవి జీవుడికి సంబంధించినవి. దేహానికి కాదు. ఈ అవస్థలని గురించి కూడా కొంచెం చెపుతాను విను.

ఈ శరీరం ఉంది. దానిలో ఇంద్రియాలు వున్నాయి. వాటి వెనకాల నాడులు వున్నాయి. వాటి వెనకాల మనస్సు వుంది. దానిలో జీవచైతన్యం వుంది. దీన్ని పూర్వకర్మవాసనలు ప్రేరేపిస్తూ వుంటాయి. ఆ ప్రేరేపణకు ప్రాణాపానాది పంచవాయువులు సహకారం చేస్తూ వుంటాయి. ఇదీ మన శరీరంలో వుండే సామాన్య స్థితి.

పూర్వకర్మలు, ప్రాణాదివాయువులు కలిసి జీవచైతన్యాన్ని కొద్దిగా ప్రేరేపిస్తే, అప్పుడు అది మనస్సును దాటి, ఇంద్రియాల వెనుక వున్న నాడులదాకా వెళ్ళి, అక్కడ ఆగిపోతుంది. ఆ దశలో ఒక ప్రపంచం కనిపిస్తుంది. సుఖదుఃఖాలు అనుభవానికి వస్తాయి. కానీ, ఇది ఎక్కువ సేపు వుండదు. ఈ దశ పేరు

స్వప్నం.

పై ప్రేరణ ఇంకొంచెం పెరిగి జీవచైతన్యం నాడులను దాటి ఇంద్రియాలలోకి వచ్చేస్తే, అప్పుడు మళ్ళీ కొన్ని దృశ్యాలు కనిపిస్తాయి. ఒక ప్రపంచం, సుఖదుఃఖాలు అనుభవంలోకి వస్తాయి. ఇవి కొంచెం ఎక్కువ సేపు వుంటాయి. ఈ దశ పేరు జాగ్రత్.

ఈ తిరుగుడుతో జీవచైతన్యానికి విసుగు పుడుతుంది. లోపలి ప్రేరణ గూడా తగ్గుతుంది. పూర్వకర్మవాసనలేవీ తల ఎత్తవు. ప్రాణాది వాయువులేవీ కదలవు. ఆ దశలో జీవచైతన్యం పూర్తిగా స్తబ్ధం లాగా పడి వుంటుంది. ఇంచుమించు చైతన్యమాత్రంగా వుంటుంది. ఆ దశ పేరు సుషుప్తి.

ఈ జీవచైతన్యమే జాగ్రద్దశాకాలంలో కొంత తత్త్వ విచారణ చేస్తుంది. కొంత యోగాభ్యాసం చేస్తుంది. అదృష్టం కలిసివచ్చినప్పుడు ఆత్మసాక్షాత్కారాన్ని అందుకుంటుంది. ఇది అందుకొంటే, ఆ తరువాత ఆ జీవచైతన్యం కర్మ శేషవశాన జాగ్రద్దశలో వున్నా, లేదా, స్వప్నదశలో వున్నా, లేదా, సుషుప్తి దశలో వున్నా గూడా, ఆ ఆత్మసాక్షాత్కారస్థితి చెదరదు, చెరగదు. ఇలా నిలబడి వున్న ఆత్మసాక్షాత్కారదశ పేరే తురీయావస్థ. ఇదే ఉత్తమావస్థ.

ఈ నాలుగు అవస్థలు ఒకదాంట్లోంచి ఒకదాంట్లోకి మారే విధానాన్ని మరో రకంగా కూడా వర్ణించుకోవచ్చు.

మొదట సుషుప్తి దశ తీసుకో. ఈ దశలో ప్రాణాది వాయువులకు చలనం వుండదని చెప్పా గదా. చలనానికి తగిన పూర్వ కర్మసంస్కారం ఉద్బుద్ధం కాకపోవటమే దానికి కారణం. కొంతసేపటికి ఆ పూర్వసంస్కారం మొలకెత్తుతుంది. దానివల్ల ప్రాణాదివాయువుల్లో ఒక విషమస్థితి ఏర్పడుతుంది. దానివల్ల జీవచైతన్యంలో ఒక సంచలనం ఏర్పడుతుంది. దానివల్ల ఆ జీవచైతన్యం చిత్తం అనే రూపాన్ని పొందుతుంది. ఆ రూపాన్ని పొందినప్పుడు ఆ జీవచైతన్యానికి 'నేను' అనే ఒక స్ఫురణ ఏర్పడి, కొత్తగా ఏర్పడిన చిత్తాన్ని తనకంటే భిన్నంగా దర్శిస్తుంది. ఈ నేను అనే స్ఫురణనే 'అహంకారం' అంటారు. నేను అనే స్ఫురణ చిత్తాన్ని భిన్నవస్తువుగా దర్శించటాన్నే 'సంక్షోభం' అంటారు.

ఈ సంక్షోభం క్రమక్రమంగా పెరుగుతుంది. అది పెరిగిన కొద్దీ ఆకాశం వున్నదనే భావన ప్రారంభం అవుతుంది. దీనినే 'ఆకాశ విహారం' అంటారు.

ఆకాశం వుందనుకొనే సరికి, ఇటూ అటూ తిరిగేందుకు చోటు ఏర్పడుతుంది. తిరుగుడు ప్రారంభం అవుతుంది. ఆ తిరుగుడు మెల్లిగా నాడుల్లోకి వ్యాపిస్తుంది.

ఆ నాడుల్లో ఏవేవో రసాయనాలుంటాయి. అక్కడ వుండే శ్లేష్మద్రవాన్ని చూసినప్పుడు నీరు అనే స్ఫురణ కలుగుతుంది. చీము, నెత్తురు వగైరాలను చూసేసరికి ఎండలు, వానలు వగైరాలు అనుభవానికి వస్తాయి. ఇలాంటి అనుభవాలన్నీ కలిపితే అది స్వప్నావస్థ అవుతుంది. అప్పటికి జీవుడు ఇంకా నాడులను దాటి ఇంద్రియాలలోకి ప్రవేశించడు. ప్రవేశిస్తే ఇంద్రియాల బలంవల్ల బయటి విషయాలు అనుభవంలోకి వస్తాయి. ఇదే జాగ్రదవస్థ.

ఈ చెప్పిన వరుసనుబట్టి ఏమి జరుగుతోందంటే, స్వప్నానుభవాలు, జాగ్రత్ అనుభవాలు కూడా, స్ఫురణలే తప్ప సత్యాలు కావు. ఈ మాట బుద్ధికి బాగా పట్టితే అది తురీయావస్థ.

రామా! ఈ అవస్థల గురించి ఇంత ఎందుకు చెప్పానంటే మనస్సు యొక్క స్వరూపం ఏమిటో తెలియటం కోసం చెప్పాను.

ఈ మనస్సే స్వప్న వస్తువులను తయారు చేస్తోంది. జాగ్రద్వస్తువులను తయారు చేస్తోంది. తయారైన ఈ వస్తువులు కనిపించి సుఖదుఃఖాలను ఇస్తున్నాయి గనుక, లేవనడానికి వీలులేదు. అసత్తులనడానికి

వీలులేదు. వీటి తయారీకి వేరే ముడి సరుకు లేదు గనుక, ఇవి వున్నాయనడానికి వీలులేదు. సత్తులు అనడానికి వీలు లేదు. అందుచేత ఈ పదార్థాలను, వీటికి కారణమైన ఈ మనస్సును కూడా, పెద్దలు 'సదసద్ విలక్షణం' అన్నారు. అంటే, సత్తూ కాదు, అసత్తూ కాదు పొమ్మన్నారు. ఆ రెండిటికంటే విభిన్నమైన విచిత్రస్థితి అన్నారు.

## 19. అవస్థలకు మూలం మనస్సే

అంతేగాక, ఇనుపగుండును తీసుకువెళ్ళి నిప్పులో పారవేస్తే అది నిప్పుగుండే అయిపోతుంది. అలాగే జీవుడు మనస్సును తీసుకువెళ్ళి బలంగా దేనిలో పారవేస్తున్నాడో, ఆ మనస్సు తద్రూపమయిపోతుంది. మనస్సే జీవుడు గనుక అదే వీడు అయిపోతున్నాడని చెప్పవచ్చు. అంటే, దేన్ని భావన చేస్తున్నాడో ఆ రూపాన్ని వీడు పొందుతాడు.

ఇలాంటి ఈ మనస్సులో రెండు అంశలు వున్నాయి. ఒకటి వ్యష్టిఅంశ. రెండు సమష్టిఅంశ. వ్యష్టిఅంశ అంటే వ్యక్తిగత మనస్సు. సమష్టిఅంశ అంటే సృష్టిలోని మనస్సులన్నీ కలిపిన సామూహిక మనస్సు. చిత్రమేమిటంటే, ఈ ప్రపంచమనే భ్రాంతిమయ ఘటానికి, సమష్టి మనస్సు మట్టిముద్ద ఐతే, వ్యష్టి మనస్సు కుమ్మరివాడు. అంటే, వ్యష్టి మనస్సు కర్త, సమష్టి మనస్సు ఉపాదాన కారణం. ఆ కర్తవల్ల ఈ కారణంలోంచి పుట్టే కార్యమే ప్రపంచం.

మనింట్లో కుండలు ఎక్కువ అయిపోయినాయి అనుకొంటే, మట్టిముద్దతో పోట్లాడి లాభం లేదు. కుమ్మరివాడిని గదమాయిస్తే కుండల తయారీ పద్ధతి మారిపోతుంది. అలాగే, జీవుడు మనస్సును నియమిస్తే, అదుపులో పెడితే, ఈ ప్రపంచ భ్రాంతి తగ్గి, యోగసిద్ధులు పెరుగుతాయి. ఆత్మతత్త్వజ్ఞానం కలుగుతుంది.

మనస్సును నియమిస్తే ఆత్మతత్త్వజ్ఞానం ఎలా కలుగుతుందని సందేహిస్తావేమో?! అలాంటి అవసరం లేదు. మనస్సే జీవుడు (లేక పురుషుడు లేక ఆత్మ) పురుషుడే మనస్సు. అంతేగానీ పురుషుడంటే దేహం కాదు.

సత్యం ఇది గనుకనే శుక్రుడు తన మనస్సుతో అనేక జన్మలను పొందగలిగాడు. అతను వాటిని తన శరీరంతో పొంతలేదు. మనస్సుతో పొందిన అనుభవం ఏదైనాసరే చిదచిద్విలక్షణమే! భ్రాంతిమాత్రమే!!

భార్గవుడి అనుభవం 'స్వప్నమా? జాగ్రత్తా?' అని అడిగావు. ఆ రెంటికీ కాలపు పొడుగుని బట్టి తప్ప వేరే భేదమేమీ లేదని చెప్పుకొన్నాం గనుక, ఆ చర్చ అనవసరం. అది స్వప్నమైనా మిధ్యే, జాగ్రత్ ఐనా మిథ్యే, నీ మనస్సును సత్యవస్తువుమీద లగ్నం చెయ్యి.

**రాముడు:** గురుదేవా ! మీ చర్చ అంతా మనస్సును కేంద్రం చేసుకొని నడుస్తోంది. మొట్టమొదట వున్నది పరిశుద్ధ ఆత్మ ఒక్కటే గదా! దానిలో ఏ రకమైన కాలుష్యాలు లేవు కదా. దాంట్లోంచి ఈ మనస్సు అనే మచ్చ ఎలా పుట్టింది?

ఈ ప్రశ్నను బట్టి రాముడికి భార్గవోపాఖ్యానం మీది ప్రశ్నలు ఐపోయాయనీ, అందువల్ల చర్చను మరో పక్కకు మళ్ళిస్తున్నాడనీ అర్థమైంది. కానీ, రాముడు ఆశించిన చర్చను వశిష్ఠుడు రాబోయే నిర్వాణ ప్రకరణంలో చేయదలచుకొన్నాడు. అందువల్ల ఆయన ఒక ఎదురు ప్రశ్నతో తన సమాధానాన్ని ప్రారంభించాడు.

**వశిష్ఠుడు:** రామా! నీకు ఒక్కసారైనా పరిశుద్ధ ఆత్మ అనుభవం కలిగినాక ఈ ప్రశ్న వేస్తే బాగుండేది. అది నీ అనుభవంలో లేనే లేదు. అనుభవంలో లేని దాన్ని ఆధారం చేసుకొని ప్రశ్న వేయటం దేనికి? నీకు ప్రస్తుతం అనుభవంలో వున్నది మలిన చైతన్యమే. కనుక ఈ అనుభవాన్ని ఆధారం చేసుకొనే మన చర్చ సాగాలి.

ఈ చర్చకు కేంద్రం మనస్సు, ఇది ఎలా వచ్చిందని మనం విచారిద్దాం.

మాలిన్యంతో కూడిన చైతన్యం జనసామాన్యానికి అనుభవంలో వుంది. అంటే, చైతన్యం వికారాన్ని చెంది (మార్పును చెంది), ప్రకృతిరూపంగా మారింది. ప్రకృతి రూపం అంటే ఏమిటి? రాబోయే వికృతులన్నింటికీ మూలమైన మొదటి వికారమే ప్రకృతి.

అదే చైతన్యం మనన ధర్మానికి ఆశ్రయం ఇస్తే, అప్పుడు ఆ చిత్తు మనస్సు అవుతుంది. (మనన ధర్మమంటే ఆలోచించుట).

చూచుట అనే ధర్మానికి ఆశ్రయమిస్తే, అది నేత్రేంద్రియం అవుతుంది. వినుట అనే ధర్మానికి ఆశ్రయమిస్తే , అది కర్ణేంద్రియం అవుతుంది. ఇలాగే ఇతర ఇంద్రియ ధర్మాలకు ఆశ్రయం ఇవ్వటంవల్ల, ఆ చైతన్యం ఆయా జ్ఞానేంద్రియాలుగా, కర్మేంద్రియాలుగా తయారు అవుతోంది.

అంతేకాదు, ఒక్కొక్క వ్యక్తి ఈ చైతన్యం గురించి ఒక్కొక్క రకంగా భావన చేస్తాడు. భావనలన్నిటికీ మూలమైనది పరిశుద్ధ చైతన్యమే. కానీ, ఎవరు ఏ రకంగా భావన చేస్తే, వారికి ఆ రకంగా కనిపిస్తుంది అది. మల్లె తోటలోకి వెళ్ళిన గాలి మల్లెల వాసనే కొడుతుంది. పారిజాతాల తోటలోకి వెళ్ళిన గాలి పారిజాతాల వాసనే కొడుతుంది. గాలి ఒకటే. దానికి ఏ వాసనా లేదు. అలాగే ఈ చైతన్యం కూడాను! చైతన్యం ఇలాంటిది గనుకనే, ఈ చైతన్య తత్త్వాన్ని గురించి రకరకాల సిద్ధాంతాలు ఏర్పడ్డాయి.

## ౨౦. వివిధ సిద్ధాన్తాలు

**రాముడు:** ఉన్న వస్తువు ఎవరికైనా ఒకే రకంగా కనపడాలి. అలా కనిపిస్తే సిద్ధాంతం ఒకే రకంగా వుండాలి. ఇన్ని సిద్ధాంతాలు ఎలా వచ్చాయి?

**వశిష్ఠుడు:** రామా! ఉన్న వస్తువు అందరికీ ఒకే రకంగా కనపడాలనే నియమం లేదు. ప్రతివాడికీ వాడి పూర్వజన్మ కర్మ వాసనలబట్టి వాడి జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు తయారవుతాయి. ఆ ఇంద్రియాలను బట్టే వాడి ఆలోచనలు, వాడి పనులు, రూపుదిద్దుకుంటాయి. దానివల్ల మళ్ళీ పుణ్యపాపాలు ఏర్పడుతూ వుంటాయి. అంటే, మొదట మనస్సుకు కారణం కర్మ అయింది. తర్వాత కర్మకు కారణం మనస్సు అయింది. ఇది ఎలా కుదురుతుందంటే కర్మ, మనస్సు, అనేవి పువ్వు, వాసనల వంటివి. వాటికి విడివిడిగా సత్త(ఉనికి) లేదు. అందువల్ల కర్మ ప్రేరితమైన మనస్సులు గల జీవులు తమ కర్మలకూ, మనస్సులకూ, అనుగుణంగానే వస్తువులను దర్శిస్తూ వుంటారు. తాము దర్శించిందే ధర్మమనే పట్టుదలతో, ఆ వస్తువులను దర్శిస్తూ వుంటారు. తాము దర్శించిందే ధర్మమనే పట్టుదలతో, వస్తువు కోసం వాళ్ళు మరింత కృషి చేస్తూ వుంటారు. ఆ కృషివల్ల వారికి అదే రకం కర్మ ఇంకా పెరిగిపోతుంటుంది. దానివల్లే పట్టుదల కూడా పెరుగుతుంది . దానివల్లే కొత్త సిద్ధాంతాలు, కొత్త ప్రచారాలు మొదలవుతూ వుంటాయి. ఇవన్నీ కూడా వారి వారి మనస్తత్త్వాన్నిబట్టి ఏర్పడిన సిద్ధాంతాలే అనటానికి కొన్ని ఉదాహరణలు చెపుతాను విను.

ఇలాంటి వాదాలలో, ఉన్నంతలో, కపిలమతం కొంత పవిత్రమైనది. (కపిలమతమంటే సాంఖ్యం.) ఆ మతం వారియొక్క మనస్సు వివేకం గలది. అది తత్త్వమసి అనే వాక్యంలోగల తత్ (అది), త్వం (నీవు) అనే పదాలయొక్క అర్థాన్ని గురించి విచారణచేసి, నీవు అనే పదానికి అర్థం మాత్రం వేదానుసారంగానే నిర్ణయించారు. అది (తత్) అనే పదం దగ్గరికి వచ్చేసరికి వాళ్ళు వేదమార్గాన్ని పూర్తిగా అంగీకరించలేక దాంట్లో కొద్దిగా మార్పులుచేసి, ప్రకృతి వేరనీ, పురుషుడు వేరనీ, ఆ రెండూ సత్యమే అనీ, ఈ విషయం గ్రహించడమే మోక్షం అనీ నిర్ణయాలు చేసుకొని సిద్ధాంతాలు తయారు చేశారు.

ఇక వేదాంతవాదులున్నారు. వీరికి వేదమే పరమ ప్రమాణం. తమస్వంత ఆలోచనలు ప్రమాణం కాదు. వారు ఈ వేదాన్ని ఆధారం చేసుకొని, ఈ కనిపించే ప్రపంచమంతా బ్రహ్మే అని నిశ్చయం చేశారు. ఈ సత్యాన్ని అనుభవ పూర్వకముగా తెలుసుకోవటమే ముక్తి అనీ, వేరే బ్రహ్మలోక ప్రాప్తి అంటూ లేదనీ, వీరు సిద్ధాంతాలు చేశారు. వీళ్ళదాంట్లో స్వంత సిద్ధాంతమంటూ ఏమి వుంది?– అంటావేమో. గమ్యమైన పరబ్రహ్మ విషయంలో స్వంత సిద్ధాంతం లేదు. కానీ, దాన్ని పొందే ఉపాయాల విషయంలో ప్రక్రియా భేదాలు, వాటిల్లో మతభేదాలు, ఇలాంటివన్నీ వీరు రూపొందించినవే.

ఇక విజ్ఞానవాదులున్నారు. వీరు బుద్ధభగవానుడి బుద్ధిధారలలోకి ప్రవేశించటమే మోక్షం అన్నారు. దానికి అంతరింద్రియ, బాహ్యేంద్రియ నిగ్రహమే మార్గమన్నారు.

ఇక ఆర్హతులు మొదలైన వారున్నారు. ఆర్హతులు అంటే జైనులు. వీళ్ళందరూ ఎవరికి తోచిన మోక్ష నిర్వచనాలను వారు చెప్పి, మోక్షోపాయాలను గూడా తమ సిద్ధాంతాను సారంగా నిర్ణయించి సిద్ధాంతాలు చేశారు.

గమనిక: ఇక్కడ మూలంలో కపిల, వేదాంత, విజ్ఞానవాద, ఆర్హత మతాల పేర్లు చెప్పి, ఇవన్నీ గూడా మానవులు కల్పించిన మతాలే అని తేల్చి చెప్పారు. దేనిమీదా పక్షపాతం చూపించలేదు.

**స్వాం దృష్టిం ప్రవివృణ్వన్తి**
**స్వైరేవ నియమభ్రమైః ॥** (సర్గ 21– శ్లో 29)

తమతమ భ్రాంతులవల్ల ఏర్పడిన నియమాలతో, తమ తమ స్వంత దృష్టులనే వాళ్లంతా సిద్ధాంతాలుగా వివరిస్తున్నారు – అని పల్లవిగా మళ్ళీ మళ్ళీ పాడారు. దీన్నిబట్టి మూలకర్తకు వేదాంతమతంలోని ప్రక్రియా భేదాలపట్ల గూడా పక్షపాతం ఏమీ లేదని మనకు స్పష్టం అవుతోంది.

ఇదిలా వుండగా ఈ 21 వ సర్గలో మూలకర్త నాలుగు మతాల పేర్లు ప్రస్తావన చేసినప్పటికీ, ఆ మతాల మూల సిద్ధాంతాలను ప్రస్తావించ లేదు. అందువల్ల వ్యాఖ్యాత శ్రీశ్రీ ఆనంద బోధేంద్ర సరస్వతీ స్వామివారు ఆయా మత సిద్ధాంతాలను సంగ్రహంగా వివరించారు. మనం వాటిని గూడా తెలిసికోవటం మంచిది.

**కపిలమతము (సాంఖ్యము)** :

వీరి మతంలో పురుషుడు, ప్రకృతి, జీవుడు, అని ప్రధాన తత్త్వాలు మూడు. వీరిలో పురుషుడు జ్ఞానస్వరూపుడు, చేతనుడు, కానీ నిష్క్రియుడు, సాక్షి. ప్రకృతి త్రిగుణమయము, జడము, కానీ సృష్టి చేసేది ఇదే. ఈ రెండూ గూడా నిత్యపదార్థాలే. జీవుడు ప్రకృతి సంబంధంచేత తాను వేరుగా ఉన్నాను అనుకొంటూ వుంటాడు. ఇట్టి జీవులు అనేకులు. యోగాదిసాధనల ద్వారా వివేక జ్ఞానాన్ని పొందిన జీవుడు, ప్రకృతిబంధాన్ని వదిలి, తాను పురుషుడికంటే అభిన్నుడిననీ, పూర్వకంగా గ్రహించటమే మోక్షం.

**వేదాంతమతము:**

దీనిలో పరబ్రహ్మ ఒక్కటే నిత్య సత్యవస్తువు. దానినే ఆశ్రయించుకొని, దానినే కమ్మివేసేది అజ్ఞానం, లేక అవిద్య, లేక మాయ. ఈ మాయ సత్తు కాదు, అసత్తూకాదు. సదసద్విలక్షణం. ఈ మాయవల్లనే వివర్త విధానంలో జగత్తు, జీవుడు, ఈశ్వరుడు, అని ముగ్గురు ఏర్పడుతున్నారు. వివేకజ్ఞానంవల్ల అజ్ఞానం తొలగిపోతే, జగజ్జీవేశ్వరులు ముగ్గురూ ఒకే సారి తొలగిపోయి, జీవుడు పరబ్రహ్మలో పరిపూరణంగా ఏకీభావాన్ని పొందుతాడు.

ఇదే మోక్షం. జ్ఞానమే దీనికి సాధనం. జ్ఞానానికి సాధనం ఆత్మవిచారణ. దానికి సాధనం చిత్తశుద్ధి. చిత్తశుద్ధికి సాధనం సత్కర్మలు, యోగం.

**విజ్ఞానవాదము (బౌద్ధవాదము)** :

ఈ వాదంలో విజ్ఞానమే పరమార్థ సత్యం. ఇతర పదార్థాలన్నీ క్షణికాలు. ఈ సత్యాన్ని గ్రహించక పోవటమే బంధం. బుద్ధ భగవానుని బుద్ధిలో (జ్ఞానంలో) ప్రవేశించటమే మోక్షం. తీవ్రసాధనలే ఇందుకు మార్గం. ఈ సిద్ధాంతాంలో అనేక మత భేదాలున్నాయి. వైభాషికులు, సౌత్రాంతికులు, యోగాచార్యులు, మాధ్యమికులు, హీనయానులు, మహాయానులు, విజ్ఞానవాదులు, మొదలైనవారంతా బౌద్ధంలోని శాఖలే.

**ఆర్హత వాదము:**

వీరి సిద్ధాంతంలో ఏడు ప్రధాన భాగాలున్నాయి. అందుచేత వీరు తమ సిద్ధాంతాన్ని 'సప్తభంగీనయము' అని పిలుచుకొన్నారు. ఆ ఏడు ఏమిటంటే–

1) జీవుడు – ఇతడు శరీరం ఎంత పరిమాణంలో వుందో అంతపరిమాణంలో వుంటాడు.
2) అజీవము – అనగా రాళ్ళు మొదలైనవి.
3) ఆస్రమము – అనగా ఇంద్రియాలు.
4) సంవరము – అనగా యమ నియమాదులు.
5) నిర్జరము – అనగా గుండు గీయించుకొనుట మొదలైన తపస్సులు.
6) బంధము – అనగా జనన మరణాలు.
7) మోక్షము – అనగా లోకాతీతమైన ఆకాశంలో ఎప్పుడూ పైకి వెళ్ళిపోతూ వుండటం.

వీళ్ళదే మరొక సప్తభంగీనయం వున్నది.

1) స్యాదస్తి – అనగా ఉండవచ్చు, లేదా అతికష్టం మీద ఉండవచ్చు.

(ఇక్కడ 'స్యాత్' అనేది క్రియా పదం కాదు. అవ్యయం. దీనికి కొంచెం అని గానీ, ఎలాగోలా అని గానీ, అతికష్టంగా అని గానీ, అర్థం. స్యాదస్తి అంటే పైన చెప్పిన జీవాది సప్తభంగులలో దేన్ని గురించీ గూడా స్పష్టంగా చెప్పలేమనీ, ఉంటే ఉన్నది కావచ్చు, లేకపోతే లేనిది కావచ్చు, అని వారి భావం. ఇలాగే రాబోయే పదాల దగ్గర గూడా అన్వయం చేసుకోవాలి.)

2) స్యాన్నాస్తి – అనగా లేకపోవచ్చును.
3) స్యాదస్తి చ నాస్తి చ – అనగా ఉండవచ్చును. లేక పోవచ్చును.
4) స్యాదవక్తవ్యః – అనగా చెప్పటానికి వీలు లేక పోవచ్చును.
5) స్యాదస్తి చా వక్తవ్యశ్చ – అనగా ఉండవచ్చును, కానీ చెప్పటానికి వీలులేక పోవచ్చును.
6) స్యాన్నాస్తి చా వక్తవ్యశ్చ – అనగా లేకపోవచ్చును, కానీ చెప్పటానికి వీలులేక పోవచ్చును.
7) స్యాదస్తి నాస్తి చా వక్తవ్యశ్చ – ఉండవచ్చును, లేకపోవచ్చును, అయినా చెప్పటానికి వీలులేక పోవచ్చును.

ఈ వాదాలన్నీ తత్త్వం అతి సూక్ష్మమనీ, దానిని గ్రహించటం కష్టమనీ చెప్పటం కోసం బయలుదేరినవే కానీ, వీటి ప్రతిపాదనలన్నీ పై విధంగా రకరకాలుగా ఉండటంవల్ల , ఇవన్నీ చిత్రవిచిత్రాలైన బుద్ధికల్పనలు అని వశిష్ఠమహర్షి అంటున్నాడు.

ఇలాంటి వాదాలన్నీ అనాదిగా వస్తున్నవేననీ, కొంతకాలం మరుగున పడిపోయి, మళ్ళీ కొంత కాలానికి కొన్ని వాదాలు పైకి లేస్తుంటాయనీ, మొదటి ప్రకరణంలోనే వివరంగా చెప్పుకొని ఉన్నాం కనుక, ఇప్పుడు ఆ చర్చ అవసరం లేదు. ఇలాంటి బుద్ధికల్పితవాదాలను గురించి ప్రస్తావించిన తరువాత వశిష్ఠమహర్షి తన బోధను ఇలా కొనసాగిస్తున్నాడు.

## 21. చిత్తశుద్ధికి ఏడు మెట్లు

**వశిష్ఠుడు** : రామా!

**స్వాం దృష్టిం ప్రవివృణ్వన్తి**

**స్వైరేవ నియమ భ్రమైః ॥** (సర్గ 21–శ్లోకం 29)

వీళ్ళంతా తమ తమ భావాలనే సిద్ధాంతాలుగా చేసి, ఇతరుల నెత్తిమీద రుద్దుతున్నారని నేను నీకు పూర్వమే చెప్పాను. ఇవన్నీ మతిభ్రమలని గూడా నిరూపించాను. ఈ మతిభ్రమలన్నింటికీ కారణం ఏమిటంటే, మలినమైన చిత్తంతో చైతన్యాన్ని భావన చెయ్యటమే. చిత్తం మలినంగా వుంది గనుక, చైతన్యం స్వతహా శుద్ధమే అయినప్పటికీ, వీళ్ళకు మలినంగా కనిపిస్తుంది. అందుచేత శుద్ధ వస్తువును శుద్ధంగానే దర్శించాలని కోరుకొనేవాడు ముందుగా తన చిత్తాన్ని శుద్ధం చేసుకోవాలి.

కనుక రామా! నీ మనస్సును నువ్వు శుద్ధం చేసుకో దానికి మెట్లు ఏమిటంటే–

1) చిత్తవృత్తులను తగ్గించుకోవాలి.
2) అజ్ఞానభూమికలను విడిచిపెట్టాలి.
3) జ్ఞానభూమికలను అందుకోవాలి.
4) కనిపించే దృశ్య ప్రపంచమంతా చిన్మాత్ర స్వరూపమని స్మరిస్తూ వుండాలి.
5) చైతన్యంకంటే భిన్నవస్తువు లేదని గ్రహించాలి.
6) భోగాసక్తి పూర్తిగా పోవాలి.
7) వీటన్నిటి ద్వారా వాసనాక్షయాన్ని సాధించు కోవాలి.

రామా! ఇలాంటి స్థితికి చేరినవాడు జ్ఞాని అవుతాడు. వాడికి జననమరణాలు గూడా ఉండవు.

**వాలాగ్ర సూక్ష్మభాగాత్తు**

**కోటిశః పరికల్పితాత్।**

**అహం సూక్ష్మ ఇతి వ్యాపీ**

**యః పశ్యతి స పశ్యతి ॥** (సర్గ22–శ్లో26)

తోకవెంట్రుక చివరిముక్కను లక్షభాగాలుచేసి, అందులో ఒక ముక్కను కోటిభాగాలు చేస్తే ఎంత సూక్ష్మమైన పదార్థం వస్తుందో, నేను అంత సూక్ష్మమైనవాణ్ణి, అలా సూక్ష్మంగా వుంటూనే, సర్వత్ర వ్యాపించి వుండేవాణ్ణి అని ఎవడు చూస్తున్నాడో, వాడే నిజంగా చూస్తున్నాడు. అంటే ఎవడికి ఇలాంటి జ్ఞానం వుందో, ఎవడికి ఇలాంటి అనుభవం వుందో, వాడే నిజమైన జ్ఞాని– అని భావం.

ఇక్కడ వశిష్టమహర్షి "**యః పశ్యతి స పశ్యతి**" అనే మకుటంపెట్టి, జ్ఞాని లక్షణాలను సర్గ చివరి దాకా వర్ణించేశారు. ఈ విషయాలను ముముక్షు వ్యవహార ప్రకరణంలో శమవర్ణన దగ్గర గూడా చెప్పి వున్నారు. గనుక, మనం ఇప్పుడు వాటిని చెప్పుకోవటం లేదు.

ఆ తరువాత 23వ సర్గలో జీవన్ముక్తుడియొక్క లక్షణాలను వర్ణించిన సందర్భంలో, జీవన్ముక్తుడనే

రాజుకి ఈ శరీరమే నగరం అంటూ, శరీరాన్ని నగరంతో పోలుస్తూ, ఎక్కడికక్కడ జీవన్ముక్త లక్షణాలతో సమన్వయం చేస్తూ, కవితామయంగా అద్భుతమైన వర్ణన జరిగింది.

ఆ తరువాత 24వ సర్గలో వశిష్ఠమహర్షి మళ్లీ మామూలు సాధకుడి దగ్గరకు వచ్చాడు. జీవన్ముక్తి లేని మామూలు మనిషికి ఈ శరీరమే ఒక మహా నరక సామ్రాజ్యమనీ, ఇంద్రియాలే అక్కడ శత్రువులనీ, వర్ణన ప్రారంభించాడు. ఈ వర్ణన మొత్తానికీ తాత్పర్యం ఏమిటంటే, పరిశుద్ధమైన మనస్సే సాధకుడికి మిత్రుడు, మలినమైన మనస్సే సాధకుడికి శత్రువు– అని.

స్థితిప్రకరణంలో భార్గవోపాఖ్యానం 16వ సర్గతోనే పూర్తయి పోయింది. 17వ సర్గ నుంచి 24వ సర్గదాకా– ఈ కథను విశ్లేషిస్తూ వశిష్ఠమహర్షి చాలా రకాల చర్చలు చేశాడు. ఈ చర్చ మొత్తానికి సారాంశంగా–24వ సర్గ చివరికి వచ్చేసరికి, వశిష్ఠుడు సూటిగా రాముడ్ని సంబోధిస్తూ, “రామా ! మామూలు పామరుడి లాగా మనస్సుకు పరాధీనుడవు కాబోకు. ఇంద్రియాలనే శత్రువులను జయించి, మనస్సునే నీ స్వాధీనంలోకి తెచ్చుకో. ఈ ప్రయత్నంలో ‘నీకు దామవ్యాలకటోపాఖ్యాన న్యాయం’ పట్టకుండుగాక! ‘భీమ భాసదృఢోపాఖ్యాన న్యాయం’ నీకు పట్టుగాక !” – అన్నాడు.

ఆ నాటి రచనల్లో రాబోయే విషయాన్ని ప్రవేశబెట్టే ప్రక్రియల్లో ఇది ఒకటి. ఈ ప్రక్రియ ప్రకారం ఆ ఉపాఖ్యానాలేమిటని రాముడు అడగటం, ఇదిగో చెపుతున్నానని వశిష్ఠుడు అందుకోవటం జరుగుతుంది. ఈ పద్ధతిలోనే 25వ సర్గలో దామవ్యాల కటోపాఖ్యానం ప్రారంభమైంది.

## 22. దామవ్యాలకటోపాఖ్యానం

సాధనలో ఒక స్థాయికి చేరి మనస్సు చాలా మటుకూ నిర్మలమైన తరువాత కూడా, సాధకుడు అహంకారానికీ, ఇంద్రియ వ్యామోహానికీ చోటు ఇస్తే, వాడు క్రమంగా అట్టడుగుదాకా పతితుడైపోతాడనీ, అహంకారస్పర్శ లేకుండా ఎన్ని పనులు చేసినా చిత్తానికి మాలిన్యం అంటదనీ, రెండు పరస్పర విరుద్ధాంశాలను నిరూపించేందు కోసం వశిష్టమహర్షి ఈ కథను చెప్పబోతున్నాడు. అది దృష్టిలో పెట్టుకొనే మనం ముందుకు సాగాలి.

పూర్వం పాతాళలోకంలో “శంబరాసురుడు” అనే రాక్షసుడు వుండేవాడు. శంబరం అంటే నీరు అని అర్థం. మాయలే మణులు అనుకొంటే, ఆ మణులకు వీడు సముద్రం వంటివాడు. వాడి బలానికీ, ఐశ్వర్యానికీ, సుఖభోగాలకూ అంతు లేదు.వాడిదగ్గర ఒక చందన వృక్షాల తోట వుండేది. దాంట్లో పాములు మాత్రం లేవు. వాడి పట్టణంలో అమావాస్యనాడు గూడా పూర్ణచంద్రుడు ఉదయించ
వలసిందే.

ఇతడు ఒక సారి దేవతల మీద దండెత్తి వెళ్ళి, వాళ్ళను చిత్తుగా ఓడించి, అక్కడి సంపదలన్నీ గూడా దోచి తెచ్చుకొని, ఆ ఐశ్వర్యంతో తన రాక్షస సైన్యాన్ని పెంచుకొని, నిర్భయంగా సుఖభోగాలలో మునిగిపోయాడు.

శంబరుడు సుఖభోగలాలసుడై ఏమరుపాటుగా ఉన్న సమయం చూసి. దేవతలు ఎదురుదాడి చేశారు. దేవతలు దాడి చేసినా శంబరుడికి మత్తు దిగక, సేనాపతులను యుద్ధానికి పంపించి, తాను విలాసంగా కాలక్షేపం చేశాడు. దానితో దేవతలు రెచ్చిపోయి, శంబరుడి సేనాపతులందరినీ సమూలంగా నిర్మూలించేశారు.

అప్పటికి కళ్ళు తెరుచుకొన్న శంబరాసురుడు మహోగ్రుడై, వంటరిగా, సరాసరి స్వర్గరాజ్యం మీదికి దూకాడు. అప్పటిదాకా రాక్షస సేనాపతులమీద పేట్రేగి పోయిన దేవతలు, శంబరాసురుడు తమ ఊరిమీద పడ్డాడనేసరికి గడగడలాడిపోయారు. ఎందుకంటే, వాడి మాయాసముద్రపు లోతెంతో రాక్షసులకన్నా దేవతలకే

బాగా తెలుసు.

దేవతలు 'ఏంచేయాలా?' అని ఆలోచించి, ఊర్లో ఒక్క పురుగు కూడా కనిపించకుండా అంతా మాయమైపోయారు. శంబరాసురుడికి ఏం జరిగిందో అర్థం కాలేదు. ఇల్లిల్లూ తిరిగాడు. ఒక్క దేవతా కనిపించలేదు. దాంతో శంబరాసురుడికి ఒళ్ళు మండిపోయి. ఇళ్ళల్లో విలువగల వస్తువులన్నీ దోచుకొని, ఆ తరువాత ఇళ్ళన్నీ తగుల బెట్టేశాడు. అప్పటికి వాడి కోపం కొంత చల్లారింది.

ఆ తరువాత కొన్నాళ్ళు చూశాడు. ఎక్కడా దేవతల జాడ కనిపించలేదు. దాంతో శంబరుడు తన సైన్యంలోనే కొత్త సేనాపతులను తయారుచేసి, వాళ్ళకు దేవతల పట్టణాలను అప్పచెప్పి, తాను పాతాళానికి పోయాడు.

అతను అలా పోయాడో, లేదో, ఇక్కడ దేవతలు మూకుమ్మడిగా స్వర్గపట్టణాల మీదకు దాడిచేసి, అక్కడ అధిపతులుగా ఉన్న రాక్షస సేనాపతులను సంహరించి మళ్ళీ పారిపోయారు.

శంబరాసురుడికి ఈ వార్త తెలిసి, ఒళ్ళు మండిపోయి గొంతంతా చించుకొని, దేవతల కోసం గాలింపు చర్యలు మొదలుపెట్టాడు. ఏమీ ఫలితం కనిపించలేదు. కొంత కాలం చూసి, మళ్ళీ రాక్షస సేనాపతులను దేవపట్టణాలలో నియమించాడు. మళ్ళీ దేవతలు అదనుచూసి, వాళ్ళందరినీ నరికేశారు. ఈ తంతు చాలా సార్లు జరిగింది. ఈ సంక్షోభంలో శంబరాసురుడి సైన్యం క్రమక్రమంగా క్షీణించిపోతోంది.

ఈ పరిస్థితిని గమనించిన శంబరాసురుడు బాగా ఆలోచించి, తన శక్తి అంతా కేంద్రీకరించి, తన మాయా విద్యలబలంతో ముగ్గురు కొత్త రాక్షసులను సృష్టి చేసేశాడు.

1) మొదటి వాడికి దాముడు అని పేరు పెట్టాడు. దామ అంటే తాడు. వీడు శత్రువులను తాడుతో కట్టినట్టు కట్టిపడేసి నిర్వీర్యులను చేస్తాడని, శంబరుడి అభిప్రాయం. **"దమయతీతి దామసిః"** – అని వ్యుత్పత్తి.

2) రెండవ వాడికి వ్యాలుడు అని పేరు పెట్టాడు. వ్యాలం అంటే పాము. వీడు పాము లాగా తన శత్రువులందరినీ కరిచి చంపేస్తాడనీ శంబరుడి భావం. **"విశేషేన ఆ సమంతాత్ ఆలతీతి వ్యాలః– ఆల పరివ్యాప్తే"**–అని వ్యుత్పత్తి.

3) మూడవ వాడికి కటుడు అని పేరు పెట్టాడు. కటం అంటే చాప. లేక జల్లెడవంటి డాలు. వీడు శత్రువుల ఆయుధాలనుంచి తనవాళ్ళను కమ్ముకొని కాపాడుతాడని శంబరుడి భావం. **"కటతి ఆవృణోతీతి కటః"** – అని వ్యుత్పత్తి.

శంబరుడు వీళ్ళ ముగ్గురినీ తన సేనకు కొత్త సేనాపతులుగా నియమించాడు.

రాక్షససేనలో ఇప్పటికే చాలా మంది సేనాపతులు వున్నారు. కానీ, వాళ్ళకీ,దోమకు ఏనుగుకూ ఉన్నంత భేదం వుంది ఎలాగంటే–

1) వీళ్ళకు పూర్వకర్మలూ లేవు, కర్మవాసనలూ లేవు.

2) మరైతే వీళ్ళు ఎలా జన్మించారు? అంటే – పూర్వకర్మల శేషంవల్ల శంబరుడు జన్మించాడు. వాడి మాయా విద్యా బలంవల్ల వీళ్ళు జన్మించారు. అంటే వీళ్ళు ఐంద్రజాలకుడు సృష్టి చేసిన మానవులవంటి వాళ్ళు. ఐంద్రజాలిక జీవుల ఆయుష్యం స్వల్పం. వీళ్ళు ఆయుష్యం కొంచెం ఎక్కువ. అంతే తేడా. కాగా, వీళ్ళు శంబరాసురుడనే నిప్పుమంటలలోంచి లేచి వచ్చిన రవ్వల వంటివారు.

3) పూర్వకర్మ శేషం లేకపోతే వీళ్లు ఈ జన్మలో పనులు ఎలా చేస్తారు? అంటే, అంధపరంపరా న్యాయంగా చేస్తారు. అంటే, చుట్టూతా వున్నవాళ్ళు ఏది చేస్తే అది చేస్తారు. కాకతాళీయంగా చేస్తారు. అంటే , ఇంగ్లీషులో 'Fluke (ఫ్లూక్) అంటారే, అలా చేస్తారు. అరనిద్దరలో చిన్నపిల్లలు లేచి నడుస్తారే, అలా చేస్తారు.

4) వీళ్ళకి యుద్ధాలు, దాడులు, ఎదురుదాడులు, పారిపోవటాలు, చంపుకోవటాలు వంటివి తెలియవు.

జయాపజయాలు, ధర్మాధర్మాలు, అవునా, కాదా, అనే సందేహాలు, భయాలు, ఇలాంటివేవీ వీరికి లేవు. కానీ, శంబరాసురుడి యొక్క మనస్సులో ఏ సంకల్పం ఉందో, దానికి అనుగుణంగా ప్రవర్తించటం అనేది వీరికి జన్మసిద్ధమైన గుణం గనుక, శంబరాసురుడి శత్రువులు ఎవరైనా కనిపిస్తే మాత్రం వాళ్ళలో వైరభావన మొలకెత్తి, మాయా విద్యలు గుర్తువస్తాయి.

5) యోగులు యోగబలంచేత అనేక శరీరాలను సృష్టి చేసుకొని, వాటిద్వారా ఏకకాలంలో కర్మక్షయం చేసుకొంటూ వుంటారు. శంబరాసురుడు ఇప్పుడు చేసింది గూడా అటువంటి ప్రక్రియే. కానీ, ఇవి క్రోధద్వేష వాసనలవల్ల పుట్టిన దేహాలు కావటంవల్ల, ఇవి కర్మక్షయానికి ఉపయోగపడవు. కర్మల వృద్ధికే ఉపయోగపడతాయి.

శంబరాసురుడు తాను సృష్టి చేసిన మహావీరులు ముగ్గుర్నీ చూసుకొని, వాళ్ళ శక్తులను కూడా పరీక్షించి చూసుకొని, చాలా సంతోషపడ్డాడు.

వెంటనే సేనా విభాగంచేసి, దామవ్యాలకటులను ప్రధాన సేనాపతులుగా ఏర్పాటుచేసి, మొత్తం రాక్షస సైన్యాన్ని దేవలోకం మీదకి యుద్ధానికి పంపించాడు.

అనుకొన్నట్టుగానే దాముడు దేవతా సైన్యాన్ని చుట్టచుట్టి, కట్టకట్టి పడవేశాడు. తరువాత వ్యాలుడు కత్తులతో కాట్లు వేశాడు. కటుడు తన సైన్యం నష్టపోకుండా కాపాడుకొన్నాడు.

దేవతలు ఓడిపోయి పరుగు లంకించుకొన్నారు. దామవ్యాలకటులు వెంటపడ్డారు. కానీ, దేవతలు వాళ్ళకు అందకుండా మాయమైపోయారు. కొంత కాలం వాళ్ళకోసం వెతికి రాక్షసులు పాతాళానికి వెళ్ళిపోయారు.

చావు తప్పి కన్నులొట్టబోయిన దేవతలు 'ఏం చేయాలా' అని ఆలోచించి, బ్రహ్మగారి దగ్గరకి వెళ్ళారు. బ్రహ్మగారు వాళ్ళగోడు విని, ఇలా చెప్పాడు.

## 23. బ్రహ్మదేవుడి ఉపాయం

**బ్రహ్మదేవుడు** : దేవతలారా! మీరు జాగ్రత్తగానే యుద్ధం చేస్తున్నారు. ఐనా దామవ్యాలకటులు ఓడిపోవటం లేదు. దానికి కారణమేమిటో అర్థం అయితే గానీ, వాళ్ళను జయించే ఉపాయం మీకు అర్థం కాదు. కనుక, ఆ కారణమేమిటో చెపుతాను వినండి.

ఎవడికి హృదయంలో వాసనలనే దారాల ముళ్ళు లేవో, అలాంటివాళ్ళ బుద్ధి సర్వసమంగా వుంటుంది. వాళ్ళకు సంతోషం ఉండదు. విషాదం ఉండదు. అలాంటివారిని జయించటం ప్రపంచంలో ఎవరి తరమూ కాదు. దీనికి భిన్నంగా వాసనలనే దారాల ముళ్ళలో బిగుసుకుపోయినవాడు, ఎంత పండితుడైనా సరే, వాడ్ని పసిపిల్లవాడు కూడా అల్లల్లాడించి పారేస్తాడు. అలాంటివాడ్ని జయించటం ఎప్పటికో ఒకప్పుడు సాధ్యం అవుతుంది.

పూర్వ జన్మలనుంచి వచ్చే వాసనలలో "దేహమే నేను" అని తోచే వాసన చాలా గొప్పది. దీన్నే 'దేహాతాదాత్మ్య వాసన' అంటారు. 'దేహాత్మాధ్యాస' అంటారు. పేర్లు ఎన్ని చెప్పినా విషయం ఇదే. ఈ దేహమే నేను అనుకోవటం. ఇదే పునాది వాసన. దీనిని ఆధారంగా చేసుకొని, ఈ ఇంద్రియాలు నేనని, ఈ భార్యా పిల్లలు నావారని, ఇలాంటి వాసనలన్నీ పెరిగిపోతూ వుంటాయి.

వాసనలు ఉంటే తప్పేమిటండీ – అంటారేమో?! పరమాత్మ కంటే భిన్నంగా వేరే ఏదైనా సత్యవస్తువు ఉండి ఉంటే, దాని మీద "అదే నేను" అనే వాసన కలిగితే, తప్పు ఏమీ ఉండి ఉండేది కాదు. కానీ పరిస్థితి అలా లేదే. పరమాత్మకంటే భిన్నమైన సత్యవస్తువే లేదు. కనుక వాటిమీద నేను అనే వాసన తప్పుకాక ఒప్పు ఎలా అవుతుంది?

ఇంతకూ చెప్పవచ్చింది ఏమిటంటే, అసత్యాన్ని ఆధారంగా చేసుకొన్న వాసనలు ఎవరికి ఉంటాయో, వాళ్ళకి మాత్రమే ఓటమి సాధ్యమవుతుంది.

మీరు చెప్పిన దామవ్యాలకటులున్నారే వాళ్ళకు పూర్వ వాసనలు ఇంచుమించుగా లేనే లేవు. అందువల్ల వాళ్ళకు నేను, నాది, అనే భావాలే లేవు. ఎప్పుడు ఏ సన్నివేశం వస్తే, ఆ సన్నివేశానికి తగ్గట్టుగా వాళ్ళ ఇంద్రియాలు ప్రవర్తించేస్తున్నాయి. వాళ్ళు సాక్షి మాత్రులుగా చూస్తూ ఉండిపోతున్నారు. అందువల్ల వారి అంతఃసారానికి అవధి లేకుండా పోతోంది.

ఈ పరిస్థితి మారాలంటే ఉన్న ఏకైక ఉపాయం ఏమిటంటే, మీరు పైనా క్రిందా పడి, ఏద్దైనా ఒక ఉపాయం చేసి, వాళ్ళ ముగ్గురికీ వాసనలు కలిగేటట్లు చెయ్యాలి రెండో మార్గమే లేదు. దానికి ఉపాయం ఏమిటంటే, మీరు ఇకనుంచి దామవ్యాలకటులకు లోకవ్యవహారం గురించి, లోకులు దేహరక్షణ కోసం తీసుకొనే జాగ్రత్తల గురించి, ఇంద్రియ సుఖాలవల్ల కలిగే లాభాల గురించి, కొత్త కొత్త ఆలోచనలు వచ్చేటట్లుగా, యుద్ధాలు ఆపకుండా చేస్తూ వుండండి.

వాళ్ళల్లో కొత్త ఆలోచనలు గట్టిగా పుట్టటానికి, మరో లక్ష సంవత్సరాలు పడుతుంది. శంబరాసురుడి ఆయుష్షు కూడా అప్పటిదాకా గట్టిగానే వుంది. ఆ సమయం వచ్చేసరికి వీళ్ళ ముగ్గురిలో కొత్త ఆలోచనలు బలిసి, వాళ్ళ వాసనలు ప్రబలం అవుతాయి. ఆ తర్వాత ఏం జరుగుతుందో మీకు అర్థం అయింది కదా!

ఇలా వివరిస్తూనే బ్రహ్మదేవుడు అంతర్ధానం అయిపోయాడు. దేవతలు విషయం బాగా అర్థం చేసుకొని, కొంతకాలం విశ్రాంతి తీసుకొని, ఆ తరువాత సరియైన సమయం చూసుకొని, రాక్షసులమీదకు విరుచుకు పడ్డారు. ఈ మాటు చాటుగా కాదు – బహిరంగంగానే యుద్ధభేరి మ్రోగించారు.

ఎక్కడెక్కడి రాక్షసులూ పోగై, దామవ్యాలకటుల నాయకత్వంలో ఎదురు దాడికి దిగారు. యుద్ధం బ్రహ్మాండంగా సాగుతోంది. నెత్తురు వరదలై పారుతోంది. దేవతలదే పైచేయిగా ఉందేమో అనిపిస్తున్న తరుణంలో, దేవతలు ఉన్నట్టుండి యుద్ధం ఆపేసి తెల్లజెండా ఎత్తేసి, సంధి సంధి అంటూ గొప్ప గొప్ప కానుకలను దామవ్యాలకటుల దగ్గరకు పంపించారు.

దామవ్యాలకటులు సంధికి సుముఖంగా స్పందించారు. కానీ, సంధి చర్చలు త్వరలోనే వాగ్యుద్ధాలుగా మారిపోయి, మళ్ళీ అసలు యుద్ధం మొదలైపోయింది.

ఈ మాటు దేవతలు ప్రచ్ఛన్నయుద్ధాలు మొదలు పెట్టారు. దాంట్లో కూడా ఓడిపోయి పారిపోయారు. పారిపోయారు గదా అనుకొంటుంటే , మళ్ళీ అప్సర స్త్రీలను కానుకలుగా పంపించారు.

కొంతకాలం యుద్ధం ఆగిపోయింది. మళ్ళీ అనుకోకుండా మొదలైంది. ఒకరినొకరు మోసం చేసుకొనే ప్రయత్నాలు జరిగాయి.

## 24. పులిని చూసి నక్క వాత

ఇలా వేలకు వేల సంవత్సరాలు యుద్ధాలు ఆగకుండా సాగుతుండే సరికి, దామవ్యాలకటుల్లో నిజంగానే కొత్త ఆలోచనలు మొదలైనాయి. దేవతలంతటి వాళ్ళు, అమృతం తాగినవాళ్ళు, తమ శరీరాల రక్షణ కోసం ఎన్ని జాగ్రత్తలు తీసుకొంటున్నారో అర్థమైంది. దాంతో " మనం గూడా అలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి" అనే ఆలోచన వీళ్ళకు మొదలైంది.

దేవతలు ఇంద్రియ సుఖాల కోసం ఎంత వెంపర్లాడుతున్నారో అర్థమైంది. వీళ్ళకి గూడా అలాంటి కోరికలే పుట్టాయి. దేవతలు ఎలా మోసం చేస్తున్నారో అర్థమైంది. వీళ్ళకు గూడా మోసపు బుద్ధులు మొదలైనాయి.

ప్రాణభయంతో దేవతలెలా పారిపోతున్నారో అర్థమైంది. వీళ్ళకు కూడా మరణ భయం మొదలైంది.

ఇలా కొంతకాలం జరిగేసరికి దామవ్యాలకటులు ఇతర రాక్షస సేనాపతులతో సమానమైపోయారు. అందువల్లే ఈ మాటు జరిగిన యుద్ధంలో వాళ్ళూ ఓడిపోయి ఎటో పారిపోయారు. వాళ్ళ సైన్యం చెల్లాచెదరైపోయింది. బ్రహ్మదేవుడు చెప్పిన లక్ష సంవత్సరాల కన్నా ఎంతో ముందుగానే దామవ్యాలకటుల్ని జయించగలిగామని దేవతలు మురిసిపోయారు.

దామవ్యాలకటుల పరాజయవార్త తెలిసిన శంబరాసురుడు మండిపడ్డాడు. తన మాయాశక్తులన్నీ ధారపోసి సృష్టిచేసిన ముగ్గురు వీరులూ ఇలా వెఱ్ఱివాళ్ళై పోయారని తెలిసేసరికి, అతను మహోగ్రుడై "ఎక్కడ? వాళ్ళెక్కడ? ముందు వాళ్ళను బంధించండి" అని పెడబొబ్బలు పెడుతూ, దిక్కుల వెంబడి పరుగులెత్తాడు.

ఈ అరుపులకు బెంబేలెత్తిపోయిన దామాదులు మరింత వేగంగా పరిగెత్తారు. ఎటుపోవాలో వాళ్ళకు అర్థం కాలేదు. కానీ, చిరకాల రాక్షస సాంగత్యంవల్ల కలిగిన సంస్కారంతో, వాళ్ళు నరకలోకం వైపు పరిగెత్తారు.

అక్కడ తమ లాగానే భయంకరాకారులుగా ఉన్న యమకింకరులు, వీళ్ళకు ఆత్మబంధువులు లాగా తోచారు. వీళ్ళు వెళ్ళి వాళ్ళ కాళ్ళు పట్టకొని శరణువేడారు. వాళ్ళు వీళ్ళకి అభయమిచ్చి తమ ఇళ్ళల్లో దాచేసి, వీళ్ళను శంబరాసురుడి నుంచి రక్షించారు.

ఆ తరువాత దామవ్యాలకటులకు ఎలా జీవించాలనే సమస్య ఎదురైంది. ఈ లోగా దైవం కలిసి వచ్చి, యమకింకరులకు వీళ్ళు బుద్ధిమంతులుగా తోచారు. అందువల్ల వాళ్ళల్లో ముగ్గురు పెద్దమనుషులు తమ కూతుళ్ళను వీళ్ళకిచ్చి వివాహంచేసి, ఆ లోకంలోనే వృత్తి ఏర్పాటు చేశారు.

ఇలా పదివేల సంవత్సరాలు గడిచేసరికి, దామవ్యాల కటులకు దేహబంధాలకు తోడు సంసార బంధాలు, దేశ బంధాలు, బంధు బంధాలు, వంటి దుర్వాసనలన్నీ తామర తంపరగా పెరిగిపోయాయి.

ఇలా వుండగా, ఒక రోజున యమధర్మరాజు రాజ లాంఛనాలు లేకుండా, మారువేషంలో నగర పరిశీలన కోసం వచ్చాడు. అంటే, ఇన్స్పెక్షన్ కోసం వచ్చాడు. ఆ సమయానికి మామగార్ల స్థానంలో దామవ్యాలకటులు విధి నిర్వహణ చేస్తున్నారు. కాన్నీ , వచ్చింది యమధర్మరాజని తెలియక, వీళ్ళు మామూలు ప్రకారంగానే తలపొగరుగా మాట్లాడారు.

దాంతో యమధర్మరాజు అగ్గిమీద గుగ్గిలమై, వీళ్ళెవరని ఆరాతీసి, వీళ్ళు చేసిన తప్పులకి వీళ్ళనీ, వీళ్ళ బంధువులనీ గూడా, రౌరవ నరకంలో పారేయించాడు.

ఆ శిక్షలు ఒక రకమా? నడుములోతు నిప్పులగుంటల్లో శరీరాలను తగులబెట్టేవారు. ఇంత జరిగినా చావు వచ్చేది కాదు. మరిగే నూనెల్లో వేయించారు. రాళ్ళ మీద వేసి కొట్టారు. ఇలా ఎంతకాలం జరిగిందో లెక్కే తెలియదు.

పుట్టటమే రాక్షస వంశంలో పుట్టారు. యమకింకరులకు బంధువులయ్యారు. చివరికి యమలోక శిక్షలూ అనుభవించారు. ఈ అనుభవాల వాసనలు ఊరికే పోలేదు. దామవ్యాలకటులు ముగ్గురూ పై జన్మలో ఖైదీలను శిక్షించే రాజభటులుగా జన్మించారు.

ఆ జన్మలో కొన్ని అన్యాయపు పనులుచేసి పై జన్మలో కాకులయ్యారు. ఆ పై జన్మలో గ్రద్దలయ్యారు. ఆ పై జన్మలో చిలకలయ్యారు. ఆ పైన పందులయ్యారు.ఆ పైన గొర్రెలయ్యారు. ఆ మీద పురుగులయ్యారు.

రామా! ఈ విధంగా వాళ్ళు ఎన్నో జన్మలు ఎత్తి ఎత్తి, ఇప్పుడు కాశ్మీర దేశంలో, ఒక కీకారణ్యంలో, తరుచుగా కారుచిచ్చులు పుట్టే చోట, ఒక బురదనీటి గుంటలో చేప పిల్లలుగా, బతికీ బతకక, చచ్చీ చావక, జీవచ్ఛవాలుగా జీవిస్తున్నారు.

రామా! దామవ్యాలకటులకు ఇలాంటి దుర్దశ ఎందుకు వచ్చిందంటే, వివేకానుసంధానం లేకపోవటం

వల్లే! ఇంచుమించు వాసనా రహిత స్థితిలో, జీవితం ప్రారంభించిన దామాదులకు ఎలాంటి దుర్గతి పట్టిందో, చూపించటం కోసమే ఈ కథ చెప్పాను.

దేవతలనే గడగడలాడించిన రాక్షస సేనాధిపత్య మెక్కడ? బురదగుంటలో చేపజన్మ ఎక్కడ? అహంకారమే లేని అంతఃకరణ సత్త్వం ఎక్కడ? అహంకారపరులై పాపిష్టి జన్మలను తెచ్చుకొన్న దుర్బుద్ధి ఎక్కడ?

ఇలాంటి పతనానికి కారణం ఏమిటంటే, వివేకానుసంధానం లేకపోవటమే! ఏమటా వివేకం? అహంకారమనే మొలకలోంచే సంసారమనే మహావృక్షం జన్మిస్తుంది – అని తెలియటమే వివేకం.

**అహంకార పిశాచార్తా దామ వ్యాళ కటాస్త్రయః।**

**గతా స్సత్తా మసన్తోఽపి మాయామాహాత్మ్యదానవాః ॥**

(సర్గ 31–శ్లో 9)

దామాదులు ముగ్గురికీ మొదట ఉనికే లేదు. వాళ్ళకు స్థితి లేదు. కానీ, మాయా మహిమవల్ల , వాళ్ళ ముగ్గురికీ సత్త వచ్చింది. ఒక స్థితి కలిగింది. కానీ, అహంకారమనే పిశాచం ఆవరించటంవల్ల వాళ్ళు ముగ్గురూ ఆర్తిలో పడిపోయారు. అంటే సంసార ప్రవాహంలో పడిపోయారు. కనుక, నీకు రామా! అలాంటి పరిస్థితి అలా కలగరాదని హెచ్చరించటానికే ఈ కథ చెపుతున్నాను. అందుకే నీకు దామవ్యాలకట న్యాయం కలుగకుండు గాక ! – అని దీవిస్తున్నాను.

## 25. లేని సత్త

**రాముడు:** గురుదేవా ! మీరు మాట్లాడుతూ–**గత స్సత్తా మసన్తోఽపి మాయా మాహాత్మ్యదానవాః ॥** అన్నారు. అంటే, మొదట సత్తే లేని ఆ రాక్షసులకు తర్వాత సత్త వచ్చిందన్నారు. ఇదెలా కుదురుతుంది?

**నాసతో విద్యతే భావః నాభావో విద్యతే సతః ॥**

అని కదా, మీ సిద్ధాంతం?

అంటే, సత్తు లేని దానికి ఎప్పటికీ సత్తు లేనే లేదు. సత్త ఉన్నదానికి ఆ సత్త ఎప్పటికీ రాదు. ఇంకా తేలికగా చెప్పాలంటే, లేనిది ఎప్పటికీ లేదు. ఉన్నది ఎప్పటికీ పోదు– అని గదా మీ సిద్ధాంతం. అలాంటప్పుడు సత్త లేని ఆ రాక్షసులకు సత్త ఎలా వచ్చింది?

**గమనిక: "నా సతో విద్యతే భావః నా భావో విద్యతే సతః",**

అనే వాక్యం భగవద్గీతలో కూడా యథాతథంగానే వుంది. త్రిమతాచార్యులకూ ఈ వాక్యం గద్దైన వ్యాసఘట్టాలలో ఒకటి కూడా . ఐనా వీరి దగ్గరి నుంచి వారు గానీ, వారి దగ్గరి నుంచి వీరు గానీ, ఈ వాక్యాన్ని కాపీ కొట్టారనుకొనే వీలులేదు. ఒకే రకమైన వాక్యాలు వస్తూ వుండటం వేదాంత గ్రంథాలలో మామూలే. ఇక వశిష్ఠ మహర్షి రాముడి ప్రశ్నకు చెప్పే సమాధానంలోకి ప్రవేశిద్దాం.

**వశిష్ఠుడు**: నిజమేనయ్యా! అదే మా సిద్ధాంతం. ఉన్న వస్తువే మొదట సూక్ష్మంగా వుండి, తర్వాత కొన్ని కారణాలవల్ల అది స్థూలమైతే, అప్పుడు దానికి పుట్టింది అనే వ్యవహారం వస్తుంది. మొదట స్థూలంగా ఉన్న వస్తువు కొన్ని కారణాలవల్ల సూక్ష్మంగా మారిపోతే, అప్పుడు దానికి పోయిందనే వ్యవహారం వస్తుంది. మా ఉద్దేశ్యంలో " పుట్టింది, పోయింది" అనే మాటలకు ఉన్న అర్థం ఇంత మాత్రమే. దీనికి భిన్నంగా నిజంగా లేనిది కొత్తగా ఏదైన పుట్టి వుంటే, నువ్వు ఏదైనా ఉదాహరణ చూపించు. లేదా ఉన్నది పూర్తిగా నశించిపోయి ఉంటే, ఉదాహరణ చూపించు, ఒప్పుకొంటాను.

**రాముడు:** ఉదాహరణ నేను చెప్పటం దేనికి? మీరే చెపుతున్నారు కదా! ఎలాగంటే మనబోటి వాళ్ళమంతా

ఉన్నవాళ్ళమనీ, దామవ్యాలకటులు మాత్రం మాయా రాక్షసులనీ, అంటే లేనివాళ్ళనీ, మీరే కదా చెప్పారు. మీరు చెప్పింది గూడా న్యాయంగానే వుంది. మనమందరం ఉన్నామనే మాట ప్రత్యక్షంగా తెలుస్తున్న విషయం. దామవ్యాలకటులు మాయవల్ల పుట్టారు అంటే, లేనివాళ్ళని అర్థమే కదా! లేనివాళ్ళ పుట్టుకను మీరు కథలోనే చూపించారు కదా! దీనివల్ల మనకూ వాళ్ళకూ తేడా ఉందని తేల్చినట్లే అయింది కదా! కనుక, మీ స్వంత ఉదాహరణ కన్నా వేరేమి కావాలి?

**వశిష్ఠుడు:** రామా! దామవవ్యాలకటులు మాయవల్ల జన్మించారని నేను చెప్పినమాట నిజమే. కానీ, మనబోటివాళ్ళమంతా ఎలా జన్మించామో నేను ప్రస్తావించ లేదే? ఎండమావుల్లోకి నీరు ఎలా వచ్చిందో అలాగే ఈ ప్రపంచంలోకి వచ్చారు దామవవ్యాలకటులు. నువ్వూ, నేనూ కూడా అలాగే వచ్చాం.

ఐతే ఈ మాట నేను ప్రస్తావన చేయలేదు. ఎందుకంటే , తత్త్వజ్ఞానం మీద సరియైన అవగహన కుదిరే లోపున గురువు తొందరపడి " బ్రహ్మసత్యం, జగం మిథ్య" అని ఉపదేశం చెయ్యరాదు. అలా చేస్తే అజ్ఞాని దశలో ఉన్నవారు తలకెక్కించుకోరు సరి కదా, అపహాస్యం చేస్తారు.

ఇప్పుడు మనం చేస్తున్న తత్త్వచర్చవల్ల నీకు ప్రశ్న పుట్టుతోంది. ఏమని? "దామవ్యాలకటులు మాయవల్ల పుట్టినవాళ్ళైతే, మనం దేనివల్ల పుట్టిన వాళ్ళం?"– అని .

నీకు ఈ ప్రశ్న పుట్టింది గానీ, సమాధానం తెలియలేదు. ఈ దశలో ఉన్నవాణ్ణి 'కించిద్జ్ఞుడు' అంటారు. అంటే కొంచెం తెలిసినవాడు. ఇలాంటివాళ్ళ కోసమే నేను ప్రస్తుతం ఈ భోధ చేస్తున్నాను. ఈ విషయాన్ని నీకు వైరాగ్యప్రకరణంలోనే చెప్పాను. అక్కడ ఏమన్నానంటే, **"న్యాంత మజ్ఞో నోతజ్ఞః సో-స్మిన్, శాస్త్రేధికారవాన్"** – అన్నాను. అంటే, పూర్తిగా తెలియనివాడూ గాదు, పూర్తిగా తెలిసినవాడూగాదు. అలాంటి వాడికే ఈ బోధ– అన్నాను.

నీకు ప్రశ్న పుడుతోంది గనుక సమాధానం చెపుతాను విను. దామవ్యాలకటులు ఎటువంటివారో మనమూ అటువంటి వారమే. మనం ఎంత మాత్రం పుట్టామో, వాళ్ళు అంత మాత్రమే పుట్టారు. శ్రుతులు, యుక్తులు, బ్రహ్మర్షుల అనుభవాలు – ఈ సత్యాన్ని నిరూపిస్తూనే వున్నాయి.

**రాముడు:** మనమందరం దామవ్యాలకటుల లాంటి వాళ్ళమే అయితే, మనకు నిజంగా పుట్టుకలేకపోతే, ఈ ప్రపంచం, ఇంతమంది జీవులు, ఇన్ని వంశవృక్షాలు, ఇన్ని జన్మ పరంపరలు, ఇవన్నీ ఎలా కనిపిస్తున్నాయి.

**వశిష్ఠుడు:** ఒకడికి నిద్రలేచి కళ్లు తెరిచిన దగ్గరనుంచీ ఆకాశంలో ఏవేవో వెంట్రుకల ఉండలు గాలిలో తేలిపోతున్నట్లు, తన చుట్టూతా అలాంటి ఉండలే ఉన్నట్లు కనిపించింది. ఇంట్లో ఉన్న ఆడవాళ్ళు జడలు వేసుకొని వెంట్రుకల ఉండలను ఇంటి నిండా వదలిపెడుతున్నారని వాడు తిట్టిపోయసాగాడు. వాళ్ళు వీడి పిచ్చి అరుపులు వినీ వినీ, చివరరికి వీణ్ణి కంటి వైద్యుడి దగ్గరికి, తీసుకుపోయారు. వైద్యుడు వీడి కళ్ళకు ' రేచీకటి' వచ్చిందనీ, అందుకనే వీడికి ఆకాశంలో వెంట్రుకల ఉండలు తేలిపోతున్నట్టుగా కనిపిస్తోందనీ నిగ్గ దేల్చాడు.

ఇప్పుడు ఈ అనుభవాన్ని ఆ నేత్రరోగి కోణంలోంచి విశ్లేషించు. వాడికి చుట్టూతా వెంట్రుకల ఉండలు ప్రత్యక్షంగా కనిపిస్తున్నాయి. కనుక అవి సత్యాలని వాడంటాడు. కానీ, వైద్యుడి వంటి ఆప్తులు దాన్ని అంగీకరించరు. ఆకాశంలో ఉన్నట్టుండి వెంట్రుకల ఉండలు పుట్టుకురావడమనేది యుక్తికి కూడా సమ్మతం గాదు. చుట్టుప్రక్కల ఉన్న ఆరోగ్యవంతుల అనుభవం కూడా దాన్ని ఆమోదించటం లేదు. కనుక , నేత్రరోగికి ప్రత్యక్షానుభవంలో ఉన్నా సరే, వాడికి కనిపించే వెంట్రుకల ఉండలు అసత్యాలని చెప్పక తప్పదు.

అలాగే, అజ్ఞానమనే వ్యాధిలో పడి వున్న సామాన్య మానవులందరికీ, ఈ ప్రపంచం ప్రత్యక్షంగా అనుభవంలో ఉన్నప్పటికీ, అందరికీ అత్యంత ఆప్తమైన వేదం దాన్ని అంగీకరించటం లేదు. దాని అస్తిత్వం

యుక్తికి గూడా అనుకూలంగా లేదు. ఆత్మజ్ఞుల అనుభవం గూడా అలా లేదు. కనుక, ఈ ప్రపంచం లేని వస్తువై ఉండి గూడా ఉన్నట్టు కనిపిస్తోందని అంగీకరించక తప్పదు.

కనుక , రామా! దామవ్యాలకటులు ఎటువంటి వాళ్ళో మనం కూడా అటువంటి వాళ్ళమే.

## 26. మనమూ అటువంటి వాళ్లమే

మనం దామవ్యాలకటులనే ముగ్గురినీ ఒక గుంపుగాను, రామ వశిష్ఠులనే వారిని మరో గుంపుగా చేసి, ఈ రెండు గుంపుల్లో ఏది సత్యమని విచారణ చేస్తున్నాం. ఈ విచారణను నీకు ఇంకా దగ్గరగా తెచ్చుకో. రాముడు, వశిష్ఠుడు అని ఇద్దరున్నారు. రాముడు ఏమనుకొంటాడంటే " ఒక వేళ అబద్ధమైతే వశిష్ఠుడు అబద్ధం కావాలి, నేను మాత్రం నిజమే" – అనుకొంటాడు. వశిష్ఠుడూ ఇట్లాగే అనుకొంటాడు. ప్రపంచంలో ప్రతి జీవీ ఇట్లాగే అనుకొంటే, సత్యాన్ని నిగ్గుదేల్చేదెలా? ఇక్కడే యుక్తిని ఉపయోగించాలి.

అది మండు వేసవి. అది ఎడారి భూమి. అది మిట్టమధ్యాహ్నం. దూరాన నది లాగా కనిపిస్తోంది. అనుభవజ్ఞుడైన బాటసారి అది నది కాదనీ, ఎండమావనీ, నిశ్చయం చేశాడు. కాని కంటికి జలప్రవాహం కనిపిస్తూనే ఉంది. పక్కనవున్న కుర్రవాడు" ఈ ఎండమావిలోకి నీళ్ళెలా వచ్చాయి? "– అని ప్రశ్నించాడు. వాడికేమి సమాధానం చెపుతావు నువ్వు? "అక్కడ నీళ్ళనేవి లేనే లేవురా. ఉన్న ఎండే నీళ్ళు లాగా కనిపించింది. అంతే" – అని చెపుతావు. అంతే గదా.

అలాగే, ఈ ప్రపంచంలో రాముడుగా, వశిష్ఠుడుగా, వెంకయ్యగా, పుల్లయ్యగా, నేనుగా, నువ్వుగా, ఇన్ని రకాలుగా కనిపిస్తున్నది శుద్ధచైతన్యమే గానీ, మరో వస్తువు లేనే లేదు. ఆ శుద్ధచైతన్యమే బాహ్య పదార్థాలుగా కనిపిస్తే , అప్పుడు దానికి ' ప్రపంచం' అని పేరు పెట్టాం. ఆ కనిపించే దశను బంధం అన్నాం.

అదే శుద్ధచైతన్యం ఏ బాహ్యరూపాలూ లేకుండా, కేవలచిదాకారంగా వున్నప్పుడు, దానికి శుద్ధ చైతన్యమనీ, అధిష్ఠాన చైతన్యమనీ పేర్లు పెట్టాం. ఈ దశను మోక్షం అన్నాం.

ఈ చెప్పిన వరుసనుబట్టి, బంధమోక్షాలు నిజంగా రెండు దశలా? కావు. అవి కల్పిత దశలు. ఎందుకీ కల్పన? ఎండమావిలో నిజంగా ఉన్నది ఎండే– అని బోధించటం కోసం! ఎలాగైతే ఎండ, నీరు అని విభాగం చేసి చెప్పామో, అలాగే ఇక్కడ కూడా అవస్థా కల్పనచేసి, ఆత్మబోధ చేస్తున్నాం. కనుక రామా !

**సర్వత్ర సర్వమిదమస్తి యథానుభూతం**

**నో కించన క్వచిదేహాస్తి న చానుభూతమ్।**

**శాన్తం సదేక మిదమాతత మిత్థ మాస్తే**

**సంత్యక్త శోకభయ భేద మతస్త్వమాస్స్వ॥** (సర్గ 31–శ్లో 47)

సత్యవస్తువును దర్శించటానికి రెండు దృక్కోణాలు వున్నాయి. ఆ పరబ్రహ్మే మనకు కనిపించే ఈ ప్రపంచంగా ఉంది అనేది ఒక దృష్టి . అంటే, పరమాత్మ మీద మాయా సంసర్గం వల్ల అవ్యక్త మహదహంకార పంచభూతాది పరంపరను ఆరోపణ చేసుకొంటూ పోగా, ఈ ప్రపంచం ఏర్పడుతోంది. అంటే, ఈ ప్రపంచరూపంగా అన్ని చోట్లా, అన్ని విధాలా, మనచేత అనుభవింపబడేది పరబ్రహ్మే. దీని పేరు అధ్యారోపదృష్టి .

రెండో దృక్కోణంలో ఎక్కడా ఏ వస్తువూ లేనే లేదు. ఏ అనుభవమూ లేనే లేదు . అంటే, దృశ్య ప్రపంచంగా కనిపించే భౌతిక పదార్థాలన్నింటికీ కారణం పంచభూతాలనీ, కార్యంతో పోలిస్తే కారణం సత్యం గనుక, దృశ్య ప్రపంచం అసత్యమనీ, పంచభూతాలు సత్యమనీ ఒక మెట్టు అపవాద చేస్తారు. అపవాద అంటే అసత్యాన్ని వదిలి సత్యం దగ్గరకు రావటం. పంచభూతాలతో పోలిస్తే, ' హిరణ్యగర్భ అహంకారం' సత్యం

. ఇది రెండో మెట్టు. ఇలాగే వరుసగా మహత్తు, అవ్యక్తం అనే వాటిని గూడా తొలగించు కొంటూపోతే చివరికి నిర్వికారమైన (మార్పులు లేని) పరిశుద్ధ పరబ్రహ్మ మిగులుతుంది. దీనీ పేరు అపవాదదృష్టి .

కాగా అధ్యారోపదృష్టితో చూసినా, అపవాదదృష్టితో చూసినా, ఎలా చూసినా, చిట్టచివరికి మిగిలేది ఒకే ఒకటి. అదే పరబ్రహ్మ. అదే సర్వవ్యాపకం . అదే పరిపూర్ణం. అదే ఉన్నది. కనుక, రామా! నువ్వు శోక, భయ భేదాలను వదిలిపెట్టి, ఆ పరిపూర్ణభావంతో ఉండటం నేర్చుకో.

**రాముడు:** గురుదేవా ! ఈ ప్రపంచం ఎలా కనిపిస్తోంది? అని అడిగితే , తిరుగులేని సమాధానాలు చెప్పారు. అయితే, ఈ నాడు దామవ్యాలకటులు ఏ దశలో ఉన్నారో , నేనూ అలాంటి దశలోనే ఉన్నాను. ఇలాంటివాళ్ళకు ఈ సంసార దుఃఖం తొలగిపోయే ఉపాయం ఏమైనా ఉంటుందా? ఉండదా?

**వశిష్ఠుడు:** నేనూ ఈ విషయం చెప్పాలనే అనుకొంటున్నాను. దీని కోసమే దామవ్యాలకటుల చరిత్రలో ఒక భాగాన్ని చెప్పకుండా అట్టేబెట్టేశాను. ఇప్పుడు ఆ కథా భాగం చెపుతాను విను.

## 27. కథా శేషం

యమధర్మరాజు ఆగ్రహానికి గురై దామవ్యాలకటులు ముగ్గురూ రౌరవ నరకంలో పడి, నానాయాతనలూ అనుభవిస్తున్న రోజుల్లో, వీళ్ళ మామగార్లకి వీళ్ళ మీద జాలిపుట్టి , యమధర్మరాజు ప్రసన్నంగా ఉన్న సమయం చూసుకొని, దగ్గరకు చేరి " మావాళ్ళు ముగ్గురికీ కష్టాలు పోయే ఉపాయం చెప్పండి స్వామీ" – అని ప్రార్థించారు.

యమధర్మరాజు కొంచెం ఆలోచించి, " మీ వాళ్ళు ముగ్గురూ తమ స్వంత జన్మ కథను పూర్తిగా ఎప్పుడు వింటారో, అప్పుడు వాళ్ళకు మోక్షం వచ్చి తీరుతుంది. ఆ పైన ఇక వాళ్ళకు కష్టాలే ఉండవు"– అన్నాడు. అది విని ఆ మామగార్లు సంతోషించి వెళ్ళిపోయారు.

**రాముడు:** మహర్షీ ! దామవ్యాలకటులు ముగ్గురూ ఇప్పటికి కొన్ని వేల జన్మలెత్తి బురదగుంటలో చేప పిల్లలుగా ఉన్నారని మీరే చెప్పారు. ఇలాంటి ఈ జీవులకు తమ కథ వినిపించేదెవరు? విన్నా వీళ్ళకు తెలిసేదేమిటి?

**వశిష్ఠుడు:** రామా ! జన్మ పరంపర అప్పుడే అయిపోయిందనుకోకు. ఇక పై జన్మలో వాళ్ళు హంసలై పుడతారు. అక్కడ వివేకంతో ఆలోచించే గుణం వాళ్ళకు అబ్బుతుంది.

ఆపై జన్మలో వాళ్ళు అధిష్ఠానము అనే నగరంలో జన్మిస్తారు. ఆ నగరం ప్రక్కన ప్రద్యుమ్నము అనే చిన్న కొండ ఉంటుంది. ఆ కొండమీద చిన్న ఇల్లు . ఆ ఇంటి ఈశాన్యపు గోడలో ఒక చిన్న గూడు. ఆ గూట్లో ఒక పిచ్చుకై పుడతాడు వ్యాలుడు .

ఈ ఇంట్లోనే ఒక స్తంభం. ఆ స్తంభం చివర్లో ఒక చిన్న పగులు. ఆ పగులులో కొన్ని దోమలు నివసిస్తూ వుంటాయి. వాటిలో ఒక దోమగా పుడతాడు దాముడు.

కటుడు ఎక్కడో గోరువంకగా పుట్టి దైవవశాన ఆ ఇంటి పంజరంలో చేరుతాడు.

ఆ ఇంట్లో యశస్కరుడనే రాజు దగ్గర పనిచేసే మంత్రి నివసిస్తూ ఉంటాడు. ఆ మంత్రి పేరు నరసింహుడు. అతను దివ్యజ్ఞాన సంపన్నుడు, తత్త్వవేత్త, అతను ఒక రోజున పంజరంలో ఉన్న గోరువంకను చూసి, తన దివ్యదృష్టితో దాని చరిత్రంతా తెలుసుకొని, ఆ చరిత్రనే పాటగా కట్టి పాడతాడు. దామవ్యాలకటులు ముగ్గురూ మాయాకల్పిత జీవులనీ, వాళ్ళ జీవత్వం కల్పితమనీ, ఏ వాసనలులేని అద్వితీయ చైతన్యమే వాళ్ళయొక్క అసలు స్వరూపమనీ, ఈ జన్మపరంపర అంతా భ్రాంతి కల్పితమనీ ఆ పాటలో ఆ మంత్రి స్పష్టం చేస్తాడు.

ఆ పాటను రోజూ వింటున్న గోరువంక రూపంలో ఉన్న కటుడికి, క్రమంగా తన జన్మ కథంతా

గుర్తుకు వచ్చి, దాన్నే భావనచేస్తూ, తద్భావనా భావితుడై, పరబ్రహ్మ మయుడై ముక్తి పొందుతాడు.

ఇంతలో ఆ పాట ఆ ఇంటి పరివారానికంతటికీ నోటికి వచ్చి, అందరూ పాడుకొంటూ ఉండగా, గోడ గూటిలోని పిచ్చుక, స్తంభపు తొర్రలోని దోమ గూడా ఆ పాటను విని, తమ కథను గుర్తు తెచ్చుకొని మోక్షస్థితికి చేరుతారు.

కనుక, రామా! మంత్రి అనే సత్పురుషుడి సాంగత్యం వల్ల. తమ జన్మ కథలను నెమరువేసుకోవడమనే రూపంలో జరిగిన ఆత్మవిచారణవల్ల, వాళ్ళ ముగ్గురికీ మోక్షం లభించబోతోంది.

ఇలాంటి శుభప్రయత్నం చేసేవాళ్ళ కృషి ఎన్నటికీ వ్యర్థం కాదు. దీనికి మంచి నిదర్శనాలు ఎన్నేన్నో ఉన్నాయి.

శుభప్రయత్నాలలో ఉత్తమోత్తమమైనది ఆత్మజ్ఞాన ప్రయత్నం. దీనికి మొదటి మెట్టు వైరాగ్యం. వైరాగ్యమంటే భోగ్య వస్తువులలో గల దోషాలను కనిపెట్టటం.

ప్రతి చోటా దోషాలను కనిపెట్టి, అప్పటిదాకా అనుభవిస్తున్న వస్తువులను వదిలిపెట్టమంటే, అది ఒక దుఃఖమే. మొదట ఈ దుఃఖానికి తలవొగ్గితే గానీ వైరాగ్యం పట్టుబడదు. వైరాగ్యం పట్టుపడ్డాక, భోగ వస్తువుల పరిత్యాగం కష్టంగా వుండదు గానీ, మొదట్లో ఈ కష్టాన్ని సహించుకోక తప్పదు. ఈ సహనం కావాలంటే, శమము అనే గుణాన్ని సాధించాలి.

శమము అనేది మనస్సు యొక్క ధర్మాలలో (గుణాలలో) ఒకటి. అందుచేత ఇది పరబ్రహ్మ స్వరూపమైనది కాదు. ఆ దృష్టితో చూస్తే శమము, అశమము (శమం లేకపోవటం) రెండూ కూడా దృశ్యకోటిలో చేరినవే. సమానమైనవే. కానీ, బ్రహ్మానందాన్ని అభివ్యక్తంచేసే శక్తి శమానికి మాత్రమే వుంది.

ఈ శమము కలగటానికీ, వృద్ధి పొందటానికీ కూడా ముఖ్యసాధనం సజ్జన సాంగత్యం. సజ్జనులంటే అహంకారాన్ని జయించినవారే. అహంకారమే జీవులను సంసారంలో పడదోసే శత్రువు. అలాంటి అహంకారాన్ని జయించినవారే సత్పురుషులు.

**రాముడు:** మహర్షీ ! అహంకారాన్ని జయించే ఉపాయం ఏమిటి?

**వశిష్ఠుడు:** ఆత్మానుసంధానమే.

## 28. అహంకారాలు మూడు

**రాముడు :** మహర్షీ ! అహంకారం రెండు రకాలుగా వుంటుందని నేను విన్నాను. స్థూలశరీరం మీద నేను అనే భావన ఏర్పడితే అది సశరీరాహంకారమనీ, సూక్ష్మంగా వుండే బుద్ధి మొదలైన వాటి మీద నేను అనే భావం ఏర్పడితే అది అశరీరాహంకారమనీ, నేను విన్నాను. ఈ రెండూ పోవలసినవేనా?

అలాగే, జాగ్రద్దశలో వుండే అహంకారమే సశరీర అహంకారమనీ, స్వప్నాలలోనూ, పగటికలలలోనూ, కోరికల పొంగులలొనూ, వుండే అహంకారాన్ని అశరీర అహంకామనీ, కొందరంటున్నారు. దీని మాటేమిటి?

**వశిష్ఠుడు :** రామా ! ఈ విభాగాలేవీ మన చర్చకు పనికి వచ్చేవి కావు.

**త్రివిధో రాఘవాస్తీహ త్వహంకారో జగత్త్రయే**

(సర్గ33–శ్లో49)

మన లెక్కలో మూడు రకాల అహంకారం వుంది. మనం పైనుంచి క్రిందికి వద్దాం. ఒకటి, రెండు అహంకారాలు మంచివే. మూడవది చెడ్డది. దాన్ని తొలగించుకోవాలి.

**అహం సర్వమిదం విశ్వం**

**పరమాత్మాహ మచ్యుతః।**

**నాన్యదస్తీతి పరమా**

**విజ్ఞేయా సాహ్యహంకృతిః ॥** (సర్గ33–శ్లో50)

ఈ దృశ్య ప్రపంచమంతా నేనే. చ్యుతి లేని పరమాత్మను నేనే. నాకంటే భిన్నంగా ఎక్కడా ఏదీ లేదు – అనే భావం కూడా ఒక అహంకారమే. కాని ఇది ఉత్తమ అహంకారం. ఇది జీవన్ముక్తులకు వుంటుంది. ఇది వస్తే మోక్షం వచ్చినట్లే. దీన్ని పోగొట్టుకోమని ఎవరూ చెప్పలేదు.

దీనికి భిన్నంగా మరో అహంకారం వుంది.

**సర్వస్మాద్వ్యతిరిక్తోఽహం**

**వాలాగ్రశత కల్పతః।**

**ఇతి యా సంవిదేషాసా**

**ద్వితీయాహంకృతిశ్శుభా ॥** (సర్గ33–శ్లో52)

ఈ దృశ్యప్రపంచంలో ఏదీ నేను కాను. దేనికీ అంటను. నేను అన్నిటికంటే సూక్ష్మణ్ణి, అణువుకంటే అణువుని– అనే భావన గూడా ఒక అహంకారమే. ఇది రెండవది. ఇది గూడా మంచిదే. ఇది గూడా మోక్షాన్ని ఇచ్చేదే. కొందరు జీవన్ముక్తులు ఇలా గూడా భావన చేస్తారు, దీన్ని గూడా పోగొట్టుకోవలసిన పని లేదు.

**రాముడు:** ఈ రెండు భావాలనూ " అహంకారాలు" అనవచ్చునా?

**వశిష్ఠుడు:** మంచి ప్రశ్నే ఇది. ఈ రెండు అహంకారాలూ సప్తజ్ఞాన భూమికల్లో వుండేవారి అనుభవాలే. నిజానికి ఏడవ భూమికలో వున్న జ్ఞానుల దృష్టితో చూస్తే, అహంకారమనేది సత్యవస్తువు కాదు. కానీ, ఆరవ భూమికలో వున్నవారికి ఇంకా దేహం మిగిలి వుంటుంది. అంటే, వారింకా జీవించే వుంటారు. ఏదో ఒక రకమైన అహంకార బంధం లేకపోతే, వాళ్ళకు ప్రాణబంధం నిలిచి వుండటం కుదరదు గనుక, ఆ దశలో వాళ్ళకు వున్న అనుభూతికే అహంకారమని పేరు పెట్టారు. ఇది పేరు మాత్రమే! నువ్వు గమనించవలసినది ఏమిటంటే, అంతా నేనే అన్నవాడిది, ఏదీ నేనుకాదన్నవాడిది, వేరు వేరు దారులు కావు. ఒకే అనుభూతిని ఇద్దరూ విభిన్న భాషలతో వ్యక్తం చేస్తున్నారు, అంతే.

**రాముడు:** చక్కగా చెప్పారు మహర్షీ ! ఇంక మూడవ అహంకారాన్ని గురించి చెప్పండి.

**వశిష్ఠుడు:** ఇది లౌకిక అహంకారం . ఈ దేహమే నేనని బోధించే అహంకారం. నువ్వు దాన్ని సశరీర అహంకారమను, లేదా అశరీర అహంకారమను. ఎన్ని పేర్లు పెట్టినా, దేహమే నేననే తాదాత్మ్యస్థితిని కల్పించే అహంకారం మానవులకు పరమ శత్రువు. దీనిచేతనే గదా, దామవ్యాలకటులు ఉచ్ఛస్థితినుంచి నీచస్థితికి దిగజారారు!

**రాముడు:** ఈ మూడవ అహంకారాన్ని పోగొట్టుకొనే ఉపాయం ఏమిటి?

**వశిష్ఠుడు:** మొదటి రెండు అహంకారాలను బాగా భావన చేసి, వాటిల్లో ఏదో ఒక దానిని సంపాదించుకోవటమే దీనికి మంచి మార్గం. ఇదే బ్రహ్మ నిష్ఠులకు సమ్మతమైన మార్గం.

**రాముడు:** గురుదేవా! లౌకిక అహంకారాన్ని పోగొట్టుకొన్న వాడి స్వరూపం ఎలా వుంటుంది? అతడు పొందే ఫలం ఏమిటి?

**వశిష్ఠుడు:** ఆరవ భూమికలో వున్న జీవన్ముక్తులెలా వుంటారో వీడలా వుంటాడు. ఫలితం మాట వేరే చెప్పాలా? పరమాత్మలో ఐక్యమే ఫలం.

**నాహం న తేన మమ కించిదపీతి మత్వా**

**సర్వం చ మే సకలమస్త్వహమేవ చేతి।**

**లబ్ధాస్పదం మనసి సంవిదమేవనమీడ్యాం**

**నీత్వా స్థితిం పరముపైతి పదం మహాత్మా ॥** (సర్గ33-శ్లో 71)

ఈ దృశ్యప్రపంచం నేను కాదు. ఈ దేహం అసలే నేను కాదు. వీటితో నాకేమాత్రం ప్రయోజనం లేదు- అని మొదట భావించాలి. ఆ తరువాత ఈ ప్రపంచమంతా నాదే, అందరూ నావాళ్ళే అనుకోవాలి. అది గూడా దాటిన తరువాత ఇది అంతా నేనే అనుకోవాలి. ఇలా భావన చెయ్యగా చెయ్యగా, మనస్సులో ఒక ప్రశస్తమైన జ్ఞానం చోటు చేసుకొంటుంది. అప్పుడు దానికి దృఢమైన స్థితిని కల్పించాలి. అలా చేసిన మహాత్ముడు పరమ బ్రహ్మపదాన్ని చేరుతాడు.

రామా! ఇదీ క్రమం- ఈ దారిలో నువ్వు నడువు.

## 29. భీమభాసదృఢులు

ఇక పోతే, దామవ్యాలకటోపాఖ్యానంలో నేను చెప్పదలచు కొన్నది కొంత వుంది. అది కూడా వింటే గానీ, నీకు నా భావం స్పష్టం కాదు.

మనం దామవ్యాలకటుల జన్మల వెంట పరుగెత్తుకు పోయి, అసలు నాయకుడు శంబరాసురుడి మాట మరచి పోయాం. మనమే కాదు. ఆ నాటి దేవతలూ అదే తప్పు చేశారు. ఆ తప్పే శంబరుడికి వరమైంది.

తన సైన్యం అంతా చెల్లాచెదురై, తన రాజ్యం విచ్ఛిన్నమై, తాను పరాజయం పాలైన తరువాత, శంబరుడు మొదట మండిపడ్డా, క్రమంగా చల్లబడి, తన పరాజయానికి కారణాలేమిటిని విశ్లేషణ మొదలుపెట్టాడు. దామవ్యాలకటులు చేసిన తప్పేమిటో అతనికి అర్థమైంది.

వెంటనే అతడు కసితో రెచ్చిపోయి, ఇలా ఆలోచించాడు-

" ఇప్పుడు మళ్ళీ మరో ముగ్గురు మాయా రాక్షసులను సృష్టి చేస్తా. వీళ్ళ పుట్టుకకీ కారణం మాయే. వాళ్ళ పుట్టుకకీ కారణం మాయే. కానీ, ఈ కొత్తవాళ్ళ మాయలో కొంచెం తత్త్వజ్ఞానం, కొంచెం వివేకం కలుపుతాను. అందుచేత ఇప్పుడు పుట్టబోయే వాళ్ళకి మిథ్యా భావనలు (తల్ల క్రిందుల ఆలోచనలు) రావు. దురహంకారం పుట్టదు. కానీ, ప్రాప్తకాలులై ప్రవర్తిస్తారు. అంటే, ఎప్పటికి ఏ సన్నివేశం ఎదురైతే, దానికి అనుగుణంగా ప్రవర్తిస్తూ వుంటారు. వాళ్ళ జీవసంపుటిలో నా ద్వారా ప్రవేశించిన యుద్ధ సంస్కారం, వాళ్ళచేత సమయానుకూలంగా యుద్ధాలు చేయించేస్తూ వుంటుంది. దేవతలు వీళ్ళను మోహపెట్టటానికి ప్రయత్నించినా, వీళ్ళల్లో వివేక సంస్కారం వుంది గనుక, వాళ్ళు దానికి లోబడరు. అప్పుడు దేవతలు నశించి తీరుతారు," శంబరుడు ఇలా ఆలోచించి-

**మాయయోత్పాదయామాస**

**బుద్బుదానివ వారిధిః ॥** (సర్గ34-శ్లో7)

మళ్ళీ మాయతో ముగ్గురు కొత్త రాక్షసులను సృష్టి చేశాడు- ఎలా? సముద్రం బుడగలను సృష్టి చేసినట్లుగా సృష్టి చేశాడు. రామా ! ఈ ఉపమానం ముఖ్యమైనది. గుర్తు పెట్టుకో . తరువాత ఉపయోగిస్తుంది.

కొత్తగా పుట్టిన ఆ రాక్షసులకు భీముడు, భాసుడు, దృఢుడు అని పేర్లు పెట్టాడు శంబరాసురుడు. భీముడు అంటే శివుడు. భాసుడు అంటే కాంతి. దృఢుడు అంటే ఎల్లకాలం స్థిరంగా వుండేవాడు.

శంబరుడు ఆశించినట్టుగానే ఈ ముగ్గురూ తత్త్వవేత్తలై, మహావీరులై, వెలుగొందారు. అనుకున్నట్లుగానే

దేవదానవ యుద్ధం మళ్ళీ మొదలైంది. దేవతలు మొదట్లో దిమ్మెర పోయినా, త్వరలోనే తేరుకొని, పూర్వం బ్రహ్మగారు ఉపదేశించిన ఉపాయాలనే ప్రయోగించటం మొదలు పెట్టారు.

భీమభాసదృఢులకు కూడా కొత్త ఆశలు చిగురించేవి . కానీ ఇంతలోనే వాళ్ళలో దాగి వున్న వివేకం మేలుకొని "ఇది నాకు కావాలి. ఇది నాది. వీడు నా శత్రువు . వీడు నాకు వద్దు" – అంటున్నావు కదరా? "ఇది" అన్నావే ఆ 'ఇది' ఎవరు? "నేను" అన్నారే ఆ 'నేను' ఎవరు?– అని ప్రశ్నించటం మొదలు పెట్టేది.

వెంటనే లోలోపలే విచారణ ప్రారంభమయ్యేది. ఆ విచారణలో ఏ ఒక్క పదార్థము సత్యంగా కనిపించేది కాదు. అందువల్ల కోరికలూ, భయాలూ, మొదలైనవన్నీ తుడిచి పెట్టుకు పోతూ వుండేవి. నిత్యశుద్ధమైన చైతన్యం ఒక్కటే 'సత్యం' అనే అనుభవం ఎప్పటికప్పుడు మళ్ళీ నవనవలాడుతూ చిగురులెత్తుతూ వుండేది.

ఇంతలో దేవతలు విరుచుకు మీద పడేవారు. భీమభాసదృఢులు ప్రాప్తకాలులు కనుక, వెనుకాముందూ ఆలోచించకుండా, జయాపజయాల శంకలు లేకుండా, శంబరుడిమీద రాగం గానీ, దేవతల మీద ద్వేషం గానీ లేకుండా, ఎదురు దాడికి దిగేవారు. ఏది ఎలా జరుగుతోందో దాన్ని అలాగే జరుగనివ్వటమే వీళ్ళ ప్రధాన లక్ష్యంగా వుండేది. ప్రాప్తకాలత్వం అంటే ఇదే.

రాక్షసుల పక్షాన యుద్ధం చేయటం కోసం తాము పుట్టారు గనుక, ఆ పక్షాన యుద్ధం చేయటం తమ కర్తవ్యం అనే భావనతో ఆ ముగ్గురు రాక్షసులూ యుద్ధం చేస్తుంటే, దేవతలకు దిమ్మతిరిగిపోయి, తలోపక్కకూ పారిపోవలసి వచ్చేది. మెల్లిగా అందరూ ఒక చాటు ప్రదేశానికి చేరి విచారించుకొంటే, బ్రహ్మగారు చెప్పిన లక్ష సంవత్సరాలూ ఇంకా పూర్తి కాలేదనీ, తాము తొందరపడి దామావ్యాలకటులను పారద్రోలటం పొరపాటైందని అర్థమైంది. ఇక ఈ సారి బ్రహ్మగారి దగ్గరికి వెళ్ళటానికి మొహం చెల్లక, దేవతలంతా కలిసి, విష్ణుమూర్తి కాళ్ళమీద పడి శరణు వేడారు.

విష్ణుమూర్తి వాళ్ళను సన్న సన్నగా మందలించి, "పుట్టిన మాయా దానవులను చంపితే లాభం లేదయ్యా . అసలైన మొదటి మాయ ఆ శంబరాసురుడు. వాడ్ణి సంహరిస్తే గానీ, మీ సమస్య తీరదు. అది మీకు మించిన పని. కనుక, మీ కోసం నేనే ఆ పని చేసి పెడతాను, అప్పటిదాకా నా లోకంలోనే దాక్కొని ఉండండి" – అని ఓదార్చి, తనే స్వయంగా బయలుదేరి, సరాసరి శంబరాసుడితో తలపడ్డాడు.

ఆ యుద్ధంలో భీమభాసదృఢులు ముగ్గురు వచ్చి, శంబరుడికి అండగా నిలబడ్డారు. కానీ, విష్ణుమూర్తి పరాక్రమం ముందు వాళ్ళంతా మిడతల్లాగా అయిపోయారు.

ఆ యుద్ధంలో తన పరివారంతో సహా శంబరుడు శమించి పోయాడు. అంటే అణగారి పోయాడు. రామా! ఈ పదం గుర్తు పెట్టుకో.

గాలిలో వెలిగే దీపాలు గాలివల్లే ఆరిపోయినట్లుగా, భీమభాసదృఢులు ముగ్గురూ ఆ యుద్ధంలలో,విష్ణుమూర్తి వల్ల ఆరిపోయారు. వీళ్ళలో ఏ వాసనలూ మిగిలి లేవు గనుక, ఆరిపోయిన దీపాల కాంతి ఆ చుట్టు పక్కల్లోనే అణగారి పోయినట్లుగా, వీళ్ళ ముగ్గురుకీ గమనమనేదే లేకుండా పోయింది. వాళ్ళకు లోకాంతర గమనం లేదు. జన్మాంత గమనంలేదు.

వాళ్ళు దేహం పోకముందు ఏ సర్వాత్మ భావనలో వున్నారో, అలాంటి సర్వాత్మ స్థితిలోనే దేహం పోయిన తరువాత కూడా వున్నారు.

రామా! వాసనా రహితులైన జీవన్ముక్తుల మరణం ఇలా వుంటుంది. దీనిబట్టి తెలుసుకో–

**తస్మాద్వాసనయా బద్ధం**

**ముక్తం నిర్వాసనం మనః॥** (సర్గ 34– శ్లో 27)

వాసన వుంటే, మనస్సుకు బంధం వస్తుంది. వాసన పోతే, మనస్సుకి ముక్తి వస్తుంది.

నిజానికి మనస్సనే దీపానికి వాసనలే నూనే. సత్యమైన, సమీచీనమైన (కపటాలు లేని) ఆలోచనలు చేస్తే, ఈ వాసనా తైలం ఇంకిపోతుంది. అదిపోతే మనస్సనే దీపం అణగారి పోతుంది.

ఈ కనిపించే ప్రపంచంలో సత్యం అణువంతైనా లేనే లేదని భావించటమే సత్యభావనం. ఆ కారణంవల్ల, అసలు భావించవలసిన అవసరమే లేదని గ్రహించటమే సమీచీన భావన, ఇదే సమ్యగీక్షణం. ఇదే చక్కటి చూపు.

రామా! శంబరాసురుడికి మాయాశక్తులు, వివేకజ్ఞానం, రెండూవున్నా కూడా, ఈ చక్కటి చూపు లేక పోవటంవల్ల, అతనికి ఇలాంటి సర్వాత్మ భావన లభించలేదు. కానీ, సాక్షాత్తుగా విష్ణువు చేతిలో మరణించాడు గనుక, విష్ణులోక ప్రాప్తి మాత్రం దక్కింది. విష్ణుమూర్తి యొక్క ప్రభావం ఏమిటో నీకు తెలుసు కదా!

కనుక రామా! పిల్లవాడు పిశాచాన్ని  చూశానని భ్రమలోపడితే, వాడికి పిశాచం అనే ఆలోచనను క్రమక్రమంగా తొలగించుకొంటూ రావాలి. దాని కోసం ఆ పిల్లవాడి వివేకాన్ని పెంచుంటూ రావాలి. అలాగే, మనస్సుకు వాసనలు, అహంకారము, పడితే వాటిని దామవ్యాలకటాదుల చరిత్రను బోధించటం ద్వారా తొలగించుకొంటూ రావాలి. అసలైన శుద్ధ చైతన్యం ఎలా వుంటుందనే విషయాన్ని భీమభాసదృఢాదుల చరిత్రల ద్వారా బోధించాలి. అహంకారంవల్లే దామాదులు నరకానికి పోయారనీ, అహంకారరాహిత్యం వల్లనే భీమాదులు ఎన్ని వ్యవహారాలు చేసినా చివరికి ముక్తినే పొందారనీ, మన మనస్సుకు మనమే బోధించుకొంటూ వుండాలి. ఈ మాట చెప్పటం కోసమే నీకు ఇంత కథ చెప్పాను –  అంటూ, వశిష్ఠుడు ఈ  ఉపాఖ్యానాన్ని ముగించి, పై చర్చలోకి  ప్రవేశించబోతున్నాడు.

## ౩౦. సింహావలోకనం

ఇక్కడ మనం ఒక్క క్షణం ఆగి, ఈ ఉపాఖ్యానం మొత్తాన్నీ సింహావలోకనం చేసుకోవలసి వున్నది.

ఈ కథ పేరు దామవ్యాలకటోపాఖ్యానం. దామ అంటే దారం. వ్యాలం అంటే పాము. కటము అంటే చాప. వేదాంతంలలో భ్రాంతికి రెండు ఉదాహరణలు ప్రధానాలు. తాడు వున్న చోట పాము కనబడితే అది ఒక పెద్ద భ్రాంతి. అదే రజ్జు సర్పభ్రాంతి. దానికే మాటలు మారిస్తే దామవ్యాలభ్రాంతి.

ఈ దామాన్నే (దారాన్నే) పడుగు పేకలుగా అల్లితే వస్త్రం వస్తుంది.  లేదా చాప (కటం) వస్తుంది. ఈ వస్త్రం అంటే ఏమిటి? అని విశ్లేషణ ప్రారంభించాం. చర్చ తేలక మళ్ళీ దారాలన్నీపీకి చూశాం. పీకితే ఏముంది? వస్త్రం లేదు పడుగులు  లేవు. పేకలు లేవు. వట్టి దారం వుంది. ఈ దారాన్నే పోగులు పోగులుగా వుంటే దారం అంటున్నాం . ఉండగా వుంటే, దారపు ఉండ అంటున్నాం. పడుగు పేకలుగ మలచుకొంటే  వస్త్రం అంటున్నాం. కనుక, వస్త్రం అనేది ఎక్కడినుంచో కొత్తగా వచ్చిన సత్యవస్తువు గాదు. తాడు మీద పాము లాగానే ఇది గూడా ఒక భ్రాంతే . ఇది దామకటభ్రాంతి (దారమే చాప అయిన భ్రాంతి).

మనం చూసే ఈ ప్రపంచం అంతా, ఈ రెండు రకాల భ్రాంతిమయ పదార్థాలతోనే నిండి వుంది. అందుచేత ఈ దృశ్య ప్రపంచం యొక్క తత్త్వాన్ని బోధించటానికి, వశిష్ఠమహర్షి దామవ్యాలకటులనే  ముగ్గురు మాయా జీవులను తీసుకున్నాడు.

ఇప్పుడు చెప్పుకొన్న భ్రాంతులలో దారం (దామ) సత్యం అన్నట్లుగా మనం  మాట్లాడాం. ఇది ఎలా వచ్చింది? ఈ ప్రశ్నకు సమాధానంగా ఒక మంచి ఉదాహరణ చెప్పుకోవచ్చు. నీళ్ళు– అలలు– బుడగలు– నీళ్ళు. ఇదే ఆ ఉదాహరణ. సామాన్యుల దృష్టిలో నీరు వేరు, బుడగ వేరు. దేని ఆకారం దానిది. ఐనా, లోతుగా చూస్తే నురగే బుడగ. బుడగే అల. అలే నీరు. కనుక అన్నింటికీ మూలకారణమైనది జలం. జలానికి మరో

పేరు శంబరం. వశిష్ఠమహర్షి తన కథానాయకుడికి ఈ పేరే పెట్టాడు. తను ఈ దృష్టిలోనే పేర్లను పెట్టాననే విషయాన్ని–

**మాయాముత్పాదయామాస**

**బుద్బుదానివ వారిధిః ॥**

సముద్రం బుడగలను సృష్టించినట్లుగా, శంబరుడు భీమాదుల సృష్టి చేశాడు అనే చోట వ్యక్తం చేశాడు. అలాగే–(?)....

**దామ వ్యాల కటాకారై**

**శ్వేతః పరిణతం యథా ॥** (సర్గ34–శ్లో 34)

(మనస్సే తాడుగా, పాముగా, చాపగా పరిణామం చెందినట్లుగా, ఆత్మే దృశ్యరూపంగా కనిపిస్తోంది) – అనే చోట గూడా వ్యక్తం చేశాడు.

నీరు అనటానికి సంస్కృతంలో అనేక పదాలుంటే వశిష్ఠమహర్షి 'శంబరం' అనే పదాన్ని తీసుకొన్నాడు. ఎందుకంటే– **"శం వృణోతి ఆవృణోతీతి శంబరః"** అని వ్యుత్పత్తి.

శం అంటే శాంతి. దాన్ని ఆవరించేవాడు శంబరుడు. శాంతిని ఆవరించేది మాయే. అందుకే శంబరుడు మాయావి.

ఈ శంబరుడు తొలగిపోతే ఏం మిగులుతుంది అంటే, "శం" మిగులుతుంది. అంటే శాంతి మిగులుతుంది. దీన్ని సూచించటానికే కవి శంబరాసుర సంహార ఘట్టంలో శమించి పోయాడు (శశామ) అని ప్రయోగించాడు.

ఇంద్రియ విషయాల జ్ఞానం, తత్త్వవిషయాల జ్ఞానం– ఈ రెండూ కూడా మాయలో భాగాలే. ఎందుకంటే బంధమోక్ష వ్యవస్థ అనేది అవిద్యలో వున్నప్పుడు మాత్రమే వుంటుంది కనుక. అందుకే శంబరాసురుడు దామవ్యాలకటులను మాత్రమే గాక, భీమభాసదృఢులను గూడా సృష్టించ గలిగాడు.

భీముడంటే శివుడు. కవి ఇక్కడ ఈ పదాన్ని సత్యవస్తువు అనే అర్థంలో ఉపయోగించాడు. భాసుడు అంటే వెలుగు. కవి ఈ పదాన్ని జ్ఞానం అనే అర్థంలో ఉపయోగిచాడు. దృఢుడు అంటే ఎల్లకాలం వుండేవాడు. కవి ఈ పదాన్ని అనంతం అనే అర్థంలో ఉపయోగించాడు. **"సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ"** అనే వేదవాక్యం ఏర్పడుతుంది.

'సత్యమూ, జ్ఞానమూ, అనంతమైనదే పరబ్రహ్మ' అని ఆ వాక్యం చెబుతోంది. అందువల్లనే భీమభానదృఢులు దేహం చాలించినప్పుడు, ఏ లోకానికీ వెళ్ళలేదనీ, ఎక్కడ వున్నారో అక్కడే వుండిపోయారనీ చెప్పారు.

పరబ్రహ్మతో తాదాత్మ్యాన్ని పొందిన బ్రహ్మవిద్యాద్వరిష్ఠులకు ప్రాణోత్క్రమణం వుండదనీ, వాళ్ళు సర్వాత్మ భావాన్ని పొందుతారనీ, ఉపనిషత్తులలో పలుచోట్ల నిరూపించిన విషయాన్నే వశిష్ఠమహర్షి ఇక్కడ కథారూపంగా పెట్టాడు.

ఇక విష్ణువు అనే పదానికి సర్వవ్యాపియైన పరమాత్మ అని అర్థం. ఆయన శంబరుడితో తలపడ్డాడు అంటే, మాయతో తలపడ్డాడు. మాయ పరమాత్మని ఆశ్రయించుకొని వుండి పరమాత్మనే కమ్మి వేస్తుంది. అది మాయ స్వభావం. అందుకే ఉత్పత్తి ప్రకరణంలో బంధం ఈశ్వరుడికే అని వశిష్ఠమహర్షి చెప్పాడు.

ఈశ్వరుడి కృప ఎవరిమీద ప్రసరిస్తుందో, ఆ జీవుల విషయంలలో మాయ పూర్తిగా లేనిదైపోతుంది. వాళ్ళు పూర్తిగా ముక్తులౌతారు. భీమాదులకు జరిగింది అదే.

మరి ఆ పెద్ద మాయ ( అనగా శంబరాసురుడు ) ఏమౌతుంది? అది పూర్తిగా పోదు. అణగి

ప్రళయంగా పడి వుంటుంది. అందుచేతనే కవి శంబరుడు శమించాడు అన్నాడు. తరువాత మళ్ళీ కొత్త కల్పం వచ్చినప్పుడు మాయ మళ్ళీ తల ఎత్తుతుంది. ఈ చక్రం అనాది.

ఈ కథలో దేవతలంటే ఇంద్రియ శక్తులు. బ్రహ్మ అంటే సృష్టి చెయ్యాలనే ఆసక్తిలో వున్న రజోగుణం. అందువల్లనే రజోగుణ సహకారంతో ప్రవర్తించిన ఇంద్రియ శక్తులు కొంతవరకే జయాన్ని సాధించి, తరువాత ఓడిపోయాయి. ఆ తరువాత తప్పు తెలుసుకొని, విష్ణుమూర్తి రూపంలలో వున్న సత్త్వగుణాన్ని ఆశ్రయించినప్పుడు, విష్ణుమూర్తే వాళ్ళ కోసం శ్రమచేసి విజయం సాధించి పెట్టాడు.

కాగా, సామాన్యంగా రజోగుణ తత్పరులై వుండే సామాన్య మానవులు మొదట భక్తితో సత్త్వమూర్తియైన భగవంతుడిని ఆరాధించాలనీ, ఆ తరువాత ఆయననే విశ్వవ్యాపియైన పరమాత్మగా గుర్తించాలనీ, దీనికి ఆత్మవిచారణే మార్గమనీ, మనస్సుకు గల బంధాలను పోగొట్టే మోక్షోపాయం ఇదేననీ, వశిష్ఠమహర్షి ఈ కథలో సంకేతపరుస్తున్నాడు.

ప్రతి జీవీ మాయవల్లే జన్మ ఎత్తుతున్నాడు. వాడి వంశవృక్షానికి మొదటి విత్తు మాయే. కానీ ప్రతివాడూ ఆ మాట మరచి, తన శరీరం పుట్టిన దగ్గరినుంచీ, అది మరణించేదాకా వుండే కథను తన కథ అనుకొంటున్నాడు. అలా కాక, తనకు మొదటి బీజమైన మాయ దగ్గరనుంచీ ఇప్పటి దాకా కథను తెలుసుకొంటే, అదే నిజమైన ఆత్మకథ అవుతుంది. ఈ కథ తెలిసినవాడికి మాయవల్లే తనకు ఇన్ని శరీరాలు వచ్చాయనీ, తనయొక్క అసలు స్వరూపం శుద్ధచైతన్యమేననీ, తెలుసుకొంటాడు. అదే మోక్షం. ఈ విషయాన్నే దామ కథలో యమధర్మరాజు ఇచ్చిన వరంగా వశిష్ఠమహర్షి సంకేత పరచాడు.

"మీ వాళ్ళు ముగ్గురూ తమ స్వంత జన్మ కథను పూర్తిగా ఎప్పుడు వింటారో, అప్పుడు వాళ్ళకు కష్టాలు పోతాయి" అన్నాడు, యమధర్మరాజు.

పూర్తిగా కష్టాలు పోవడమంటే మోక్షమే. పూర్తిగా జన్మకథను వినటం అంటే, ఇప్పుడు చెప్పుకొన్న ఆత్మవిచారమే. ఇలాంటి ఆత్మవిచారణ చేస్తే, ఎంతటి నీచుడికైనా సరే, మోక్షం వచ్చి తీరుతుంది– అని చెప్పటానికే వశిష్ఠమహర్షి పిచ్చుకకు, దోమకు, గోరువంకకు, మోక్షం వచ్చినట్లుగా వర్ణించాడు. దోమకే ఆత్మవిచారణ వల్ల మోక్షం లభిస్తే, మానవజాతిలో ఒక జాతికి లభించి, మరొక జాతికి లభించక పోవటం ఉంటుందా?– అనేదే వశిష్ఠమహర్షి ఆకూతం. (ఆకూతం అంటే, మనసులోని మాట).

అలాగే, ఆ జీవులకు తమ జన్మ కథలు చెప్పినవాడు మంత్రి కుమారుడు అన్నారు. మంత్రి అంటే మంత్రం కలవాడు, మంచి ఆలోచన గలవాడు, జ్ఞాని అని అర్థం. అతడే సద్గురువు అనేది ఇక్కడి సంకేతం.

ఇవి గాక కథలో ఎక్కడికక్కడ కొన్ని సంకేతాలను ప్రస్తావించుకోవటం జరిగింది. పాఠకులు మరొక్క సారి వెనుకటి కథను ఈ సంకేతాల దృష్టితో మననం చేస్తే , కథ హృదయానికి బాగా హత్తుకొంటుంది.

ఈ విధంగా సంకేతమయమైన కథను వినిపించిన వశిష్ఠమహర్షి తన చర్చను ఇలా ముందుకు సాగిస్తున్నాడు.

**వశిష్ఠుడు:** రామా! పరిశుద్ధాత్మలోంచి మనస్సనే మాలిన్యం ఎలా పుట్టిందని నువ్వడిగావు. ఆ చర్చకు ఇది సమయం కాదనీ, ముందు మనస్సనేది ఎలా వచ్చిందో విచారించాలనీ, నేనన్నాను. దానిమీద ఈ విషయంలో వివిధ మతాలవారు ఏమి చెబుతున్నారో తెలుసుకొని, వారి దృష్టులన్నీ భ్రమలనీ, వేదమార్గం ఒక్కటే సత్యమార్గమనీ, మనం నిర్ణయించుకొన్నాం. ఆసందర్భంలో సామాన్య మానవుడికి జీవన్ముక్తి సాధనలో నిజమైన సాధనం మనస్సే అనీ, దాన్ని అజాగ్రత్తగా ఉంచుకొంటే పైకి వెళ్ళినవాడు గూడా పడిపోతాడనీ, అదే మనస్సును జాగ్రత్తగా ఉంటుకొంటే సూటిగా మోక్షమే వస్తుందనీ, చెప్పుకొన్నాం. అందుకు నిదర్శనంగా దామవ్యాలకటోపాఖ్యానాన్ని, భీమభాసదృఢోపాఖ్యానాన్ని గూడా చెప్పుకొన్నాం

రామా! ఇక బంధ మోక్షాలకు రెండింటికీ కారణమైన ఈ చిత్తం శమించి పోయే ఉపాయాలేమిటో విచారించవలసి ఉంది. ఇక ఆ ప్రయత్నం చెద్దాం . – అన్నాడు వశిష్ఠ మహర్షి .

ఇక వశిష్ఠ మహర్షి, తన బోధను "దాశూర వర ప్రదానము" – అనే ఒక కథవైపు నడిపించ దలచుకున్నాడు. దానికి పూర్వ రంగంగా, ఆయన 35 వ సర్గ నుంచి 46 వ సర్గ దాకా, అంటే 12 సర్గల పాటు సుదీర్ఘమైన సైద్ధాంతిక చర్చ జరిపాడు. ఈ చర్చ ఒకింత సాంకేతిక పద సమ్మిశ్రితమై, ఒకొక్క చోట పునరుక్తి లాగా కనిపిస్తూ, కొంచెం జటిలంగా సాగింది. అందువల్ల, ఈ సర్గల సారాంశాన్ని కొంచెం వెనుక ముందులకు అన్వయించుకొంటూ వీలయినంత సంగ్రహంగా చెప్పుకుందాం.

## 31. బంధమోక్ష చర్చ

ఈ చర్చను వశిష్ఠుడే ప్రారంభించాడు. ఆయన ఇలా అన్నాడు –

**వశిష్ఠుడు:** రామా బంధం తొలగిపోయి మోక్షం రావాలంటే, చిత్తం (అనగా మనస్సు) శమించి పోవాలని నేను చెప్పాను.

బంధ మోక్షాలకూ – మనస్సుకూ సంబంధం ఏమిటంటా వేమో! ఇక్కడే జ్ఞాన సారాంశం వుంది.

**శ్రూయతాం జ్ఞాన సర్వస్వం**

**శృత్వా చై వావధార్యతామ్ ।**

**భోగేచ్ఛా మాత్రకో బంధః**

**తత్త్యా గో మోక్ష ఉచ్యతే ॥** (సర్గ 35 శ్లోకం 3)

**భోగాలమీద కోరికే బంధం ।**

**ఆ కోరికను వదిలి పెట్టడమే మోక్షం ॥**

కోరిక, కోరికను వదిలి పెట్టడం – ఇవి రెండూ మనస్సు పనులే. కనుక మనస్సుకూ బంధమోక్షాలకూ ఉన్న సంబంధం యిదే. రామా! ఈ విషయాన్నే మరో రకంగా గూడా చెప్పుకోవచ్చు.

**సర్వగే స్వాత్మని స్వచ్ఛే**

**ఏషోహ మితి భావనా!**

**ఏతత్ తత్ బంధనం లోకే**

**స్వ వికల్పోప కల్పితమ్ ॥** (సర్గ 35 శ్లోకం 39)

ఆత్మ సర్వవ్యాపి అయివుండగా ఆ మాట మరచిపోయి, తనలో తనే ఏవో వికల్పాలు కల్పించుకుని, "ఇదిగో ! ఈ దేహంలో వున్న వాడ్డే నేను" – అనే భావన ఏదైతే వుందో అదే బంధం.

రామా! గమనించావు గదా ! ఈ నిర్వచనంలో గూడా భావనేబంధమని చెబుతున్నాం ! దీనికి వ్యతిరేకమైన భావనే మోక్షం!

**"అనంతోస్మీ శ్వరోస్మీతి**

**నిశ్చయేన విలీయతే** "(సర్గ 35,శ్లోకం 38)

అనంతుణ్ణి నేనే!

సర్వేశ్వరుణ్ణి నేనే! – అనే నిశ్చయంతో పరిమితత్వ కల్పనా రూపమైన బంధం నశిస్తుంది. అంటే – మోక్షం లభిస్తుంది.

ఇప్పుడు గూడా, బంధ మోక్షాలనేవి, మనస్సుకు సంబంధించినవే అని చెప్పినట్లే అవుతోంది.

**రాముడు**: ఇంతకూ మనస్సంటే ఏమిటి గురుదేవా?

**వశిష్ఠుడు:**

**దృశ్య దృష్టిః స్ఫుటా యేయం**

**సాహ్యావశ్య మసన్మయీ।**

**తన్మయత్వం చ మనసః**

**స్వరూపం విద్ధి నేతరత్॥** (సర్గ 35, శ్లోకం 47)

మన చుట్టూతా రకరకాల దృశ్యాలు కనిపిస్తున్నాయి. "ఈ కనిపించేవన్నీ నిజంగా వున్న వస్తువులా, లేక అవి లేకపోయినా మనకు కనిపిస్తున్నాయా? నిజంగా లేకపోతే ఎలా కనిపిస్తాయి?" – అంటావా ? నిజంగా లేకపోయినా స్వప్నంలో పర్వతాలు కనిపించటంలేదా? ఇవి అలాంటివి కాదండీ స్థిరంగా చాలా కాలం కనిపిస్తున్నాయి – అంటావా? చాలా కాలం కనిపిస్తున్న మాట నిజమే గానీ, వీటికి ఒక మొదలు, ఒక చివర, ఉన్న మాట ఖాయమే గదా! అంటే, మొదటికి వెనకాల అవి లేవు – చివరికి తరువాత అవి లేవు. ఇటూ అటూ లేక, మధ్యలో మాత్రం కనిపించేవి సత్యం కావటానికి వీలు లేదు! కనుక, మనకు కనిపించే ఈ దృశ్యాలన్నీ "దృశ్య దృష్టులే" గానీ, సత్యమైన దృశ్య పదార్థాలు కావు! దృశ్య రూపంలో వుండే ఈ దృష్టులన్నీ – "అసన్మయములు"! అంటే – లేని పదార్థాన్ని ఉన్నట్లు చూపించేవి!

అయితే చిత్రమేమిటంటే – లేని పోని ఈ దృష్టులవల్ల, ద్రష్టకు ఒక "తన్మయత్మం" ఏర్పడుతుంది. అంటే – ఆ దృశ్య దృష్టులతో తాదాత్మ్యం ఏర్పడుతుంది. అంటే ఆ దృశ్య దృష్టులయొక్క వాసనలు గడ్డ కట్టినట్లవుతుంది. ఈ దృశ్య దృష్టి తాదాత్మ్యమే మనస్సు యొక్క అసలైన స్వరూపం।

– ఇదే మనస్సు యొక్క నిర్వచనం॥

అంటే తేలిందేమిటంటే – వెనుకటి జన్మలలో ఈ జీవికి ఏర్పడిన వాసనలు గడ్డ కడితే, ఆ గడ్డ పేరే మనస్సు – అని తేలింది.

నువ్వు మేల్కొని వుండగా, నీకు కొన్ని అనుభూతులు కలిగాయి. వాటిలో కొన్ని గడ్డ కట్టగా, నీ కొక స్వప్నం వచ్చింది. ఆస్వప్నంలో నీవొక రాజువయ్యావు. ఆ రాజుకొక మనస్సు వుంది. నిజంగా మాట్లాడితే, ఆ మనస్సే ఆ రాజు! ఆ స్వప్నమనస్సు ఎక్కణ్ణించి వచ్చింది.? మెలకువలోని నీ వాసనల గడ్డే ఆ రాజు మనస్సు అయింది. అలాగే – వెనుకటి జన్మల ద్వారా సంక్రమించిన వాసనల గడ్డే ఇప్పటి నీ మనస్సు అవుతోంది! కనుక రామా! "నీ వాసనలే నీ మనస్సు" అని గ్రహించు!

ఇందాక బంధం అంటే రెండు నిర్వచనాలు చెప్పుకున్నాం. ఆ నిర్వచనాలకూ సారాంశం ఏమిటంటే, వాసనలను పెంచు కోవటమే బంధం – వాటిని తుంచు కోవటమే మోక్షం – అని!

మనస్సొక విత్తనం వంటిది. విత్తనాన్ని మామూలుగా నాటితే, ఏ విత్తనం నాటావో ఆ చెట్టే వస్తుంది. కానీ, నాటేముందు, ఆ విత్తనానికి కొంత సంస్కారం చేస్తే, దానివల్ల పుట్టే చెట్టు మామూలు చెట్టు లాగా వుండదు.

**అమ్లం మధురసాసిక్తం**

**మధురం మధురంజితమ్ ।**

**బీజం ప్రతివిషాకల్క**

**సిక్తం చ కటు జాయతే ॥** (సర్గ 35, శ్లోకం 29)

పుల్లగావుండే చింతగింజను చెరుకు రసంలో బాగా నానబెట్టి, అనగా కొన్ని రకాల ప్రక్రియలు చేసి తర్వాత దానిని నాటితే, అప్పుడు పుట్టే చెట్టు చింత చెట్టు లాగానే వున్నా, దాని పళ్ళు మాత్రం పుల్లగా కాక

తియ్యగా వుంటాయి. అలాగే , అదే చింత విత్తును, చేదుగా వుండే వేప రసంలో నాన బెట్టి (కొన్ని రకాల ప్రక్రియలు చేసి) నాటితే, అప్పుడు పుట్టే చెట్టు చింత చెట్టులాగే వున్నా, దాని పళ్ళు పుల్లగా గాక చేదుగా వుంటాయి.

రామా! వృక్ష శాస్త్రంలో ఈ వివరాలన్నీ నువ్వు చదువుకున్నావు. ఈ అనుభవం కూడా నీకు వుంది.

వాసనల గడ్డ అయిన ఈ మనస్సు కూడా చింత గింజ లాంటిదే! దీన్ని సద్భావనా రసాలలో నానబెడితే, అది ఉత్తమ మనస్సు అవుతుంది. అప్పుడది మోక్షానికి కారణం అవుతుంది.

పాఠకులు (శ్రోతలు) ఇక్కడ ఒక వైజ్ఞానిక విషయాన్ని గమనించ వచ్చు. హైబ్రీడు మొక్కల తయారీని పోలిన ఒకానొక బొటానికల్ టెక్నిక్ ఏదో ఒకటి ఇక్కడి దృష్టాంతంలో ప్రసక్తమయింది. ఇది వృక్ష శాస్త్రం కాదు కనుక ఇంతకన్నా వివరాలు చెప్పే సావకాశం యోగవాశిష్ఠంలో వుండదు. కాని, ఆనాటివారికి ఇలాంటి సీడ్ మానిప్యులేటివ్ టెక్నిక్కులు తెలుసునని దీనివల్ల మనకు తెలుస్తోంది. దీన్నిలా వుంచి అసలు విషయంలోకి వెళదాం. వశిష్ఠుడు అంటున్నాడు–

కనుక రామా! నువ్వు సద్భావనం అభ్యసించు! ప్రతివాడికీ, నేను పరిమితుణ్ణి అనీ, నాకు మార్పులు వున్నాయనీ, ఒక తప్పుడు నిశ్చయం అప్రయత్నంగానే ఏర్పడుతోంది. దాన్ని మళ్లీ మనస్సుతోనే తిరగ దిప్పుకోవాలి.

నేను అనంతుణ్ణి! నేను సర్వేశ్వరుణ్ణి ! అని భావన చేయాలి. ఇదే సద్భావన!!

ఈ సద్భావనవల్ల క్రమంగా మనస్సనేదే లేకుండా పోతుంది!

**మనసోభ్యుదయో నాశః**

**మనో నాశో మహోదయః।**

**జ్ఞమనో నాశమభ్యేతి**

**మనో-జ్ఞస్య వివర్ధతే ॥** ( సర్గ 35 , శ్లోకం 18)

రామా! ఈ మనస్సు ఒక విచిత్రమైన పదార్థం. మనస్సు వృద్ధి పొందిందంటే – అది నశించిపోయినట్లే! మనస్సు నశించిందంటే – అది నిజంగా పెరిగినట్లే !!

నిజంగా తెలిసిన జ్ఞాని మనస్సు నశించిపోతుంది. ఏమీ తెలియని అజ్ఞాని మనస్సు తెగ పెరిగి పోతుంది.

**రాముడు**: గురుదేవా! మీ మాటలు చిత్రంగా వున్నాయి. పరస్పర విరుద్ధంగా వున్నాయి. మీరేదో భావాన్ని మనస్సులో వుంచుకొని "పొడుపుకథ" లాగా ఈ మాటలు చెబుతున్నారు. దయచేసి కొంచెం వివరించండి.

**వసిష్ఠుడు:** రామా! పెద్ద రహస్యమేమీ లేదు. మనస్సంటే వాసనల గడ్డ అని చెప్పాం ! వాసనలంటే సంకల్ప వికల్పాలు! అవి వుంటే ఆ మనస్సుకు ప్రశాంతి వుండదు. ప్రశాంతి లేక పోవటం – నాశనమే గదా! (నాశనం అంటే, యథాపూర్వస్థితి లేక పోవటం)

అలాంటి మనస్సు ఇంకా వృద్ధి పొందితే, అశాంతి ఇంకా పెరిగిపోతుంది. అంటే, ఆ మనస్సు మరింత పాడైపోతుంది. అందుకే మనస్సు వృద్ధి పొందటమే – దానికి నాశం అన్నాను.

ఇక – మనస్సు నశించటమంటే "సంకల్ప వికల్పాలు" అణిగి పోవటం! అవి అణగిపోతే, ఇక మనస్సనే దేముంది? అది లేదు! కానీ సంకల్ప వికల్పాలు లేవు గనుక, ఆ దశలో అపారమైన ప్రశాంతి వుంది. ఆ ప్రశాంతియే నిజమైన అభివృద్ధి! కనుక, మనస్సు నశించటమే అభివృద్ధి అన్నాను.

ఈ విషయం చెప్పడం కోసమే జ్ఞానికి మనస్సు ఉండదని చెప్పాను. వాడిలో అది నశించి పోతుందన్నాను. అజ్ఞానికి మనస్సు మరింత పెరిగి పోతుందన్నాను. ఈ ఉదాహరణను బట్టి వెనుకటి నా మాటలను సమన్వయించుకుంటే, ఏ విరోధమూ వుండదు.

కనుక రామా! నువ్వు సంకల్ప వికల్పాలను తొలగించుకునే కృషి చెయ్యి.

## 32. లేని ప్రపంచానికి ఉనికి ఎలా వచ్చింది?

**రాముడు:** గురుదేవా ఈ దృశ్యదృష్టులన్నీ అసన్మయాలు, అసలే లేనివి, అంటున్నారు గదా! అంటే, ఈ కనిపించే ప్రపంచం అంతా, బొత్తిగా లేనిది. ఆ పరమాత్మేమో నిజంగా ఉన్న పదార్థం. లేని ప్రపంచానికి ఉన్న పరమాత్మలో స్థితి ఎలా వచ్చింది? ఇది పూర్వం మీరు చెప్పిన విషయమే. కానీ ఇప్పటి మీ చర్చ వల్ల మళ్లీ కొత్త ప్రశ్నలు తలెత్తుతున్నాయి. కనుక, దయతో మళ్లీ వివరించండి.

**వశిష్ఠుడు:** రామా! పరమాత్మ అనేవాడు చైతన్య రూపుడు. ఈ చైతన్యం రెండు రకాలుగా వుంటూ వుంటుంది. జ్ఞానులలో ఈ చైతన్యం శుద్ధ ప్రకాశ రూపంగా వుంటుంది. ఇదే చైతన్యం అజ్ఞానుల దగ్గరకు వచ్చేసరికి, ఈ సంసార చక్రాన్ని కల్పిస్తుంది.

**రాముడు:** శుద్ధ చైతన్య రూపమంటే యేమిటి? సంసారమంటే యేమిటి?

**వశిష్ఠుడు:** జ్ఞానులకు, అజ్ఞానులకూ ఇద్దరికీ గూడా ఈ సువిశాల ప్రపంచం కనిపిస్తూనే వుంటుంది. తాతకీ మనవడికీ ఇద్దరికీ అలలు, బుడగలు , నురగలు కనిపిస్తూనే వుంటాయి. కాని, తాత మాత్రం ఆ కనిపించే అలలు, బుడగలు, నురగలు, అన్నీ నీరే అని గ్రహించ గలుగుతాడు. మనవడు ఆ మాట గ్రహించలేక అవన్నీ వేరు వేరు అనుకొంటూ వుంటాడు.

అలాగే, జ్ఞానికి ఇన్ని రకాల ప్రపంచ పదార్థాలు కనిపిస్తున్నా వాటన్నింటిలోనూ, ఒకే శుద్ధ చైతన్యం అనుస్యూతంగా, సర్వ వ్యాపిగా, కనిపిస్తూ వుంటుంది. ఇది తాతయొక్క దృష్టివంటి దృష్టి. "చైతన్యం శుద్ధ ప్రకాశ రూపంగా వుండటం" అంటే ఈ స్థితి అనుభవంలోకి రావటమే .

ఇక, బాలుడికి అలలు, బుడగలు, నురగలు – అన్నీ వేటికవే వేరని తోచినట్లుగా, ఈ ప్రాపంచిక పదార్థాలన్నీ వేటికవే (విభిన్న) సత్య పదార్థాలుగా అనుభవంలోకి వస్తే – ఆ స్థితి పేరే సంసారం.

ఇంతకూ, చెప్ప వచ్చిందేమిటంటే, జ్ఞానుల దృష్టిలో శుద్ధ చైతన్యంగా వున్న పరమాత్మే, అజ్ఞానుల దృష్టిలో సృష్టికర్త అవుతున్నాడు. కాని, విశేషమేమిటంటే, ఇది మామూలుగా కుమ్మరివాడి కుండల కర్తృత్వం వంటి కర్తృత్వం కాదు. ఇక్కడ ఆ శుద్ధ చైత్య రూపుడైన పరమాత్మే పృథివ్యాది పంచ భూతాలుగా, వాటిలోంచి వచ్చే భౌతిక పదార్థాలుగా, విజృంభిస్తున్నాడు. కుమ్మరివాడు తనే కుండ అయిపోడు. పరమాత్మ మాత్రం తనే ప్రపంచం అయిపోతున్నాడు. కుమ్మరివాడి కర్తృత్వానికీ పరమాత్మకు ఉన్న కర్తృత్వానికీ గల భేదం ఇదే.

ఐతే , తనే దృశ్య పదార్థంగా మారిపోవటాన్ని కర్తృత్వం అనవచ్చునా? అనరాదా? – అంటే, అది నీ యిష్టం. అది దృష్టి భేదం! అది గూడా ఒక మార్పే గనుక, ఆ మార్పుకు కర్త అతడే గనుక, పరమాత్మే ఈ ప్రపంచానికి కర్త అంటావా? అను. కానీ, ఈ రకమైన కర్తృత్వము, కుమ్మరివాడి కర్తృత్వము, ఒకటి కాదు.

కర్త అంటే, వాడికి ఒక సాధనం ఉండాలి. ఉపాదాన పదార్థం వుండాలి. సంకల్పం వుండాలి. క్రియ వుండాలి. ఇంకా ఏవేవో వుండాలి. అప్పుడే వాడు కర్త కాగలుగుతాడు. పరమాత్మకు ఇవేవీ లేవు. కనుక ఆయనను కర్త అనటానికి వీలు లేదు. ఆయనకు కర్తృత్వం వుండే వీలు లేదు, అంటావా?– అను. ఆ దృష్టిలో పరమాత్మ కర్త కాదు.

ఇవి రెండు దృష్టులు. విభిన్న దృష్టులు. కానీ, ఈ రెండిటికీ ఒక సమన్వయం గూడా వుంది. ఎలాగంటే –

అకర్త అయిన చిదాత్మ ప్రతి పదార్థంలోనూ అంతర్యామిగా వుండి, ఆయా పదార్థాలచేత ఆయా

పనులు చేయిస్తూ, తాను ఏదీ అంటకుండా ప్రకాశిస్తునే వుంటాడు.

ఒక ఉదాహరణ తీసుకుందాం. నేలలో ఒక విత్తు పడ్డది. ఆ విత్తులో ఒక చిదాత్మ ఉన్నాడు. అందువల్ల ఆ విత్తులో గల మొక్క బయటకు రావాలని ప్రయత్నం చేస్తుంది. ఆ విత్తు చుట్టూ మట్టి ఆవరించుకొని వుంటుంది. కానీ, ఆ మట్టి రేణువుల సందుల్లో చిల్లులు చిల్లులుగా ఆకాశం వుండి, ఆ మొక్క బయటకు రావటానికి అవకాశం ఇస్తుంది. అవకాశం ఇచ్చేదే ఆకాశం అని నిర్వచనం కదా! అంటే, ఆ చిదాత్మే ఆకాశంలో అంతర్యామిగా వుండి ఆ మొక్క బయటకు వచ్చేందుకు సహాయం చేస్తున్నాడన్నమాట.

ఇక గాలివుంది. దానిలో అంతర్యామిగా వున్న చిదాత్మ స్పందాత్మకుడై, ఆ మొక్కను ఆకర్షిస్తాడు – అంటే, పైకి లాగుతాడు. ఇక్కడ గాలి అంటే, చెట్లు చేసే శ్వాస ప్రక్రియలో ప్రాణ రూపంగా వున్న వాయువు. ఆయన ఆ మొక్కను బయటకు గుంజుతున్నాడని మనం అర్థం చేసుకోవాలి.

తరువాత జలం వుంది. అది జడమే అయినా, దానిలో అంతర్యామిగా వున్న చిదాత్మ ఈ మొక్కలో రసత్వాన్ని ప్రవేశపెట్టి, దాన్ని మెత్తబడేటట్లు చేస్తున్నాడు.

ఇక భూమిలో వున్న అంతర్యామి తన గట్టితనాన్ని ఆ మొక్క వేళ్లకు అందించి, అది పడిపోకుండా నిలబెడుతున్నాడు.

ఇక మిగిలింది అగ్ని. ఈ అగ్ని సూర్య కిరణాల ద్వారా మొక్కలోకి ప్రవేశిస్తుంది. ఆ అగ్నిలో వున్న అంతర్యామి ఆ మొక్కకు ఒక రూపాన్ని – షేప్‌ను – కల్పిస్తాడు. ఆ రూపంవల్ల , "ఇది ఫలానా మొక్క" అనే వ్యవహారం ఏర్పడుతోంది.

ఈ విధంగా, పంచభూతాలలో ప్రతిభూతమూ, ప్రపంచంలోని ప్రతి కార్యానికీ తన వంతు సహకారం అందిస్తూనేవుంది.

అలాగే "కాలం"అనే అంశం గూడా తన వంతు సహకారాన్ని జోడిస్తూనే వుంటుంది. కాలాత్మకుడైన అంతర్యామియొక్క ప్రభావం మరింత ప్రబలమైనది. ఇది యుగ యుగాలుగా, కల్ప కల్పాలుగా, వివిధ సృష్టి ప్రక్రియలను ఆవిష్కరిస్తూనే వుంటుంది.

రామా! ఈ చెప్పిన ప్రక్రియవల్ల తేలుతున్న విషయమేమిటంటే – ప్రతిచోటా అంతర్యామిగా వున్న చిదాత్మే ఇన్ని రూపాలనూ పొందుతున్నాడు. అంటే, చిదాత్మలోనే ఈ సృష్టి దృష్టులన్నీ కనిపిస్తూ వున్నాయన్నమాట! ఎవరికి కనిపిస్తున్నాయి? చిదాత్మకే కనిపిస్తున్నాయి. ఇది ఎలా కుదురుతుందంటావేమో! బాగా తాగి మత్తెక్కినవాడికి, తనే మరో మనిషి లాగా కనిపిస్తూ వుంటాడు. అలాగే, మాయావృతుడైన చిదాత్మ తనకు తనే జడ పదార్థం లాగా కనిపిస్తున్నాడు. అందువల్లే దీన్ని సృష్టిదృష్టి అనీ, దృశ్య దృష్టి అనీ, నేను వ్యవహరిస్తున్నాను. దీన్నే మామూలు వేదాంత పరిభాషలో చెప్పాలంటే, ఈ దృశ్య ప్రపంచం అంతా చిదాత్మయొక్క వివర్తం! వివర్తం అంటే ఏమిటో చెప్పాను కదా – తాడు పాముగా కనిపించినట్లు , చిదాత్మే ఈ ప్రపంచంగా కనిపిస్తోందన్నమాట!

కనుక, మొత్తంమీద తేలిందేమిటంటే, ఈ ప్రపంచం మొత్తంలో ఆత్మకంటే భిన్నంగా వేరే వస్తువేదీ లేదు. నీకంటే భిన్నమైన వస్తువే లేకపోతే, నీవు దేన్నయినా కోరటమనేది ఎలా కుదురుతుంది? దేన్నయినా సృష్టి చేయటమనేది ఎలా కుదురుతుంది? దేన్నయినా ఫలంగా పొందటం ఎలా కుదురుతుంది? కాబట్టి రామా! నువ్వే పని చేసినా , కర్తృత్వాభినివేశాన్ని వదిలిపెట్టి, ఆ పని చెయ్యి. అప్పుడు నీకు ఏ దుఃఖమూ అంటదు.

### 33. కర్తృత్వం అంటే ఏమిటి?

**రాముడు:** గురుదేవా! అసలే లేనిదైన ఈ ప్రపంచం ప్రపంచాతీతుడైన చిదాత్మ యందు ఏ విధంగా స్థితిని పొందింది – అని నేనడిగాను. ఇది పాత ప్రశ్నే ! దీనికి మీ సమాధానం కూడా పాత సమాధానమే! కానీ, నేనీ ప్రశ్న ఎందుకు వేశానో దాన్ని కనిపెట్టి, దానికి తగిన ప్రక్రియలో మళ్లీ పాత సమాధానాన్నే లాక్కొచ్చారు. దానికి పొడిగింపుగా అకర్తృత్వాన్ని సాధించమని నాకు బోధిస్తున్నారు. ఇంతకూ అకర్తగా వుండటం ఎవరికైనా సాధ్యమా? అదీగాక ఉత్తమ తత్వవేత్తలైన పెద్దలు కూడా కొన్ని లౌకిక కర్మలు, కొన్ని సాధనా పరమైన కర్మలు, చేస్తూనే ఉన్నారు కదా. చేస్తున్నారంటే వారికి కర్తృత్వం ఉన్నట్లే గదా! వాళ్లే వదిలి పెట్టని కర్తృత్వాన్ని నేనెందుకు వదిలి పెట్టాలి?

**వశిష్ఠుడు:** రామా! కర్తృత్వం అంటే ఏమిటి? నిద్దర పోతున్నవాడు నిద్రలో ఇటూ అటూ దొర్లగా, అనుకోకుండా నేలమీద మట్టి కదిలి, ఏదో ఒక బొమ్మ ఆకారం ఏర్పడింది. వీడా బొమ్మకు కర్త అవుతాడా? అవుతాడని నువ్వు అనేటట్లయితే, వాడు మళ్లీ మళ్లీ అలాటి బొమ్మ వెయ్యమంటే వెయ్యగలగాలి. అది సాధ్యం కాదు. కనుక, కేవలమూ శారీరికమైన క్రియను బట్టి కర్తృత్వం అంటదు. ఒకానొక ఫలితం మీది కోరికతో, ఇచ్ఛా పూర్వకంగా, చేసే పని వలన మాత్రమే కర్తృత్వం అంటుతుంది. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, ఒక క్రియకు వెనకాల జ్ఞానము, ఇచ్ఛ, ప్రయత్నము అనే మూడు మెట్లు వుంటేనే, ఆ క్రియవల్ల ఆ వ్యక్తికి కర్తృత్వం అంటుతుంది.

జ్ఞానము అంటే ఫలానా ఫలితము వున్నది అనే ఎరుక! ఇచ్ఛ అంటే దాన్ని పొందాలి అనే కోరిక! ప్రయత్నము అంటే దానికోసం జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలను కదిలించటం!

ఈ మూడు మెట్లూ వుంటే, ఒక క్రియ ఏర్పడుతుంది.

ఇంకా కొంచెం లోతుగా ఆలోచిస్తే, బయటకు క్రియ కనిపించక పోయినా, ఈ జ్ఞానేచ్ఛా ప్రయత్నాలు మూడూ మనస్సులో గనక వుంటే, ఆ మనస్సులో క్రియ జరిగినట్లే లెక్క! కనుక వాడికి కర్తృత్వం అంటినట్లే లెక్క!

ఈ మూడు మెట్లూ లేకుండా, ఒక బహిరంగ క్రియ జరిగినా సరే, ఆ వ్యక్తికి కర్తృత్వం అంటే సావకాశమే లేదు.

జ్ఞానుల విషయంలో జరిగేదిదే! వాళ్లు లౌకిక కర్మ చేసినా, యోగపరమైన కర్మ చేసినా, ఏమి చేసినా, ఆ క్రియ వెనకాల జ్ఞాన, ఇచ్ఛలలో ఏ ఒక్కటీ ఉండదు. ఇంద్రియ చలన రూపమైన ప్రయత్నం మాత్రం పూర్వాభ్యాస బలంవల్ల జరిగిపోతుంది. అందువల్ల వాళ్లకు కర్తృత్వం రవ్వంత కూడా పట్టదు.

ఇక అజ్ఞానులు బైటకు కదలకుండా కూర్చునివున్నా, లోపల జ్ఞానేచ్ఛలు నిరాఘాటంగానే సాగిపోతుంటాయి. ప్రయత్నం గూడా మానసిక స్థాయిలో జరుగుతూనే వుంటుంది. కనుక, కదలకుండా కూర్చున్నప్పటికీ గూడా కర్తృత్వం వాళ్లని వదిలి పెట్టదు.

కర్తృత్వం వున్నవాళ్లకి, భోక్తృత్వం తప్పదు!

కనుక రామా! మనస్సులో జ్ఞానేచ్ఛలు లేకుండా తుడిచేసుకుంటే అదే అకర్తృత్వం! ఇది సాధ్యమే! తత్వవేత్తలయిన పెద్దలు సాధించిన అకర్తృత్వం ఇదే! దీన్నే నువ్వు సాధించాలి!

**గమనిక:** ఇది 38వ సర్గ. ఇక్కడ వాల్మీకిమహర్షి పద్యం పక్కనపెట్టి– గద్యంలో చక్కటి శాస్త్ర చర్చను నడిపాడు.

**"మనో యత్కరోతి, తత్కృతం భవతి। యన్న కరోతి తన్న కృతం భవతి। అతో మన ఏవ కర్తృ-న దేహః"** ఇత్యాదిగా ఆ వాక్యాలు సాగాయి. సరే, ఇక వశిష్ఠుడి బోధ విందాం!

## 34. దుఃఖాన్ని కలిగించేవి ఏవి

**వశిష్ఠుడు**: రామా! ఇంతకూ నువ్వీ ప్రశ్న ఎందుకు వేశావో నాకు తెలుసు!

అకర్తృత్వం అనేది పరమాత్మకు గూడా అసాధ్యమే – అని చెప్పాలన్నది, నీ ఉద్దేశం! దాన్ని అలా వుంచి, నేనొక ప్రశ్న వేస్తాను, సమాధానం చెప్పు.

ఈ ప్రపంచంలో ఉన్న పదార్థాలలో కొన్ని స్వీకరించ దగినవి– కొన్ని పరిత్యజించదగినవి ! ఇది నిజమేగదా? ఈ రెంటిలో దుఃఖాన్ని కలిగించేవి ఏవి? చెప్పు!

**రాముడు:** పరిత్యజించవలసిన వస్తువులవల్ల దుఃఖం వచ్చే ప్రసక్తిలేదు. పరిత్యజించవలసిన వస్తువు అంటే ఏమిటి? ఒకప్పుడు అది మనదగ్గర వుండి, అది మనకు దుఃఖాన్ని కలిగిస్తుంటే, అప్పుడది పరిత్యజించవలసిన వస్తువవుతుంది! ఇది పరిత్యజించవలసిన వస్తువు అని తెలిసిందంటే ఇక దాన్ని ముట్టుకోము. కనుక, దానివల్ల ఇకమీదట మనకు దుఃఖం వచ్చే సావకాశం లేదు.

ఇది పరిత్యజించ దగినది అని తెలియక ముందు, మన దృష్టిలో అది స్వీకరించదగినదే! కనుక, స్వీకరించదగిన వస్తువులు రెండు రకాలు. 1. నిజంగా స్వీకరించదగిన వస్తువులు, 2. మనకు తెలియక పోవటంవల్ల స్వీకరించిన వస్తువులు.

వీటిలో మొదటివాటివల్ల దుఃఖం వస్తే రావచ్చునేమో గానీ పరిత్యజించ దగిన వస్తువులవల్ల దుఃఖం వచ్చే వీలు లేదు.

**వశిష్ఠుడు:** అదీ కుదరదు. ఎందుకంటావా? నువ్వు చెప్పే రెండు రకాల స్వీకరింప దగిన వస్తువులూ గూడా, నశించే శీలం కలిగినవా, లేక శాశ్వతంగా వుండేవా? రెండు పక్షాలుగా ఆలోచిద్దాం.

అవి నశించి పోయేవే అనుకుందాం. తనను తనే కాపాడుకోలేని వస్తువు, మరొకరికి స్థిరమైన దుఃఖాన్ని తెచ్చిపెట్టగలదా? అసంభవం! కనుక, స్వీకరింపదగిన వస్తువులలో, నశించిపోయే స్వభావం గలవి, దుఃఖాన్ని కలిగింపజాలవు!

పోనీ స్వీకరింపదగిన వస్తువు శాశ్వతమే అనుకుందాం. వేదం ఏం చెపుతోందంటే "అతోన్యదార్తం" అంటోంది. అంటే, ఆత్మకంటే భిన్నమైనదంతా నశించిపోయే శీలం కలది – అని అర్థం! కనుక, స్వీకరించదగిన వస్తువులలో నాశరహితమైన జాతి ఉండడమే అసాధ్యం! కాబట్టి, స్వీకరించ దగిన వస్తువులలో నీవనుకున్నట్లుగా రెండుజాతులు లేవు! నశించిపోయే జాతి ఒకటే వున్నది! అది దుఃఖాన్ని కలిగింపజాలదని తేల్చుకున్నాం గదా.

కాగా, పరిత్యజిందగినదీ దుఃఖాన్ని కలిగించ జాలదు – స్వీకరించ దగినదీ దుఃఖాన్ని కలిగించ జాలదు!

అంటే, లోకంలో దుఃఖాన్ని కలిగించే వస్తువే లేదు– అని తేలుతోంది

ఆత్మకు దుఃఖం కలగడం లేదంటే అతనికి కర్తృత్వం లేదని వేరే చెప్పనక్కర్లేదు. దాన్ని బట్టి భోక్తృత్వం కూడా లేదు – అని నిశ్చయమౌతోంది. "మరి కర్త లాగా కనిపిస్తున్నాడే" – అంటే, ఆ కర్తృత్వం ఆత్మయందు అజ్ఞానుల చేత ఆరోపింపబడింది – అని మనం అర్థం చేసుకోవాలి.

ఈ ఆరోపిత కర్తృత్వం జ్ఞానులకైనా తప్పదు. అది ఉన్నంత మాత్రాన జ్ఞానియొక్క తాత్విక స్థితిలో మార్పురాదు.

కనుక రామా! పరమాత్మకు కూడా అకర్తృత్వం అసాధ్యమనుకోబోకు. పరమాత్మలోనూ, తత్వవేత్తల లోనూ, కనిపించే కర్తృత్వం ఆరోపిత కర్తృత్వం అని గుర్తించు.

**రాముడు:** గురుదేవా! మీరు అటు తిప్పీ ఇటు తిప్పీ పరమాత్మే పరిపూర్ణుడై అంతటా నిండి వున్నాడనీ, బంధ

మోక్షాలనేవి అజ్ఞానావస్థలో వుండే మానసిక కల్పనలనీ, నిరూపిస్తున్నారు. మీరు చెప్పింది నిజంగా నిజమైతే – బంధ మోక్షాలు కూడా లేని వస్తువులే అయితే – ఏమీ లేని చోట ఇంతటి సృష్టి ఎక్కడి నుండి వచ్చింది? ఎలా వచ్చింది? ఎందుకు వచ్చింది.? గోడే లేని చోట బొమ్మకు స్థితి రాగలదా?

ఈ ప్రశ్న విని వశిష్ఠుడు కొంచెం ఆలోచించాడు. వచ్చిన ప్రశ్నలే మళ్లీ వస్తునాయి. "తాను చెప్పే నిర్గుణ పరబ్రహ్మ విషయం అందుకోలేక ఇలా మాట్లాడుతున్నాడా? నచ్చక ఇలా మాట్లాడుతున్నాడా? ఇటూ , అటూ ఊగిసలాడుతున్నాడా? – ఏది ఏమైనా, ఇతని స్థితి ఏమిటో తెలుసుకోకుండా, సమాధానం చెప్పరాదు" – అని ఆలోచించి, ఆయన ఇలా అన్నాడు.

**వశిష్ఠుడు** : రామా! పరబ్రహ్మ సర్వ శక్తి సంపన్నుడు. ఆయన ఎలా కావాలంటే అలా పరిణామం పొందగలడు. ఆయనకున్న అనంత శక్తులలో ఒక శక్తి ఏమిటంటే, పరస్పర విరుద్ధ ధర్మాలు ఆయనను ఆశ్రయించి, ఏక కాలంలో, ఏక స్థానంలో, సహజీవనం చేయగలవు.

"ఉనికి – లేకపోవుట, ఏకత్వము–బహుత్వము, ఆదిత్వము– అంతత్వము," మొదలైనవన్నీ ఆయనలో అవిరోధంగా నిలబడి వుంటాయి. అలాంటి విచిత్ర శక్తివల్లనే, ఈ ప్రపంచం తయారు అవుతోంది. ఆయన శక్తి చిత్రాతి చిత్రం, కనుక "గోడ లేకుండా బొమ్మలు ఎలా గీస్తాం?" అనే ప్రశ్న ఆయన దగ్గర కుదరదు.

**రాముడు:** గురుదేవా! మీరు పరిణామ మార్గాన్ని ఆశ్రయించి సమాధానాన్ని చెబుతున్నారు. ఈ పద్ధతిలో ఏ పదార్థానికి ఏది గుణమో, అది మాత్రమే దానిలో వుండాలి. నిప్పులో ఉష్ణత్వమే వుంటుంది గానీ శీతత్వం ఉండదు. మంచులో శీతత్వమే వుంటుందిగాని ఉష్ణత్వం వుండదు – అది అసాధ్యం!

అలాగే, మీరు చెప్పే ఇంద్రియాతీత పరబ్రహ్మ తత్వంలో, నశించిపోయే గుణం వుండటానికి వీల్లేదు. ఇంద్రియాలకు కనిపించే పదార్థాలలో శాశ్వతత్వం వుండటానికి వీల్లేదు. ఒక కారణంనుంచీ ఒక కార్యం పరిణామ రూపంగా పుట్టింది అంటే, కారణంలోని గుణాలు కార్యంలోకి రావాలి. మట్టిలోని గుణాలు కుండలోకి రావటం లేదూ– అలాగే, పరిశుద్ధ చిదాత్మలోనించి ఈ ప్రపంచం పుట్టింది అనేటట్లయితే, చిదాత్మలో వుండే "నిత్యత్వం" ఈ ప్రపంచానికి కూడా పట్టాలి! చిదాత్మలో వుండే "నిర్వికారత్వం" ఈ ప్రపంచానికి కూడా పట్టాలి – ఇది లోకానుభవ విరుద్ధం!

కనుక, ఈ ప్రపంచం పరమాత్మలోంచి పరిణామ ప్రక్రియలో జన్మించిందనటం కుదరదు. కుదరక పోతే "పరబ్రహ్మ వేరు, ప్రపంచం వేరు"–అని చెప్పాలి! అలాగయితే, పరమాత్మకంటే భిన్నంగా ఒక జడసత్య పదార్థం వుందని చెప్పినట్లు అవుతోంది. అలా చెబితే, సర్వవ్యాపి అయిన పరమాత్మకు ఒక కళంకం అంట గట్టినట్లే గదా!కనుక మీ సమాధానం ఏ రకంగానూ కుదరటంలేదు.

**వశిష్ఠుడు:** రామా! బాగా చెప్పావు. నువ్వు ఏ స్థాయిలో వున్నావో తెలుసుకుందామని పరిణామ వాదాన్ని ఆశ్రయించి సమాధానం చెప్పా! దానిలో వున్న లొసుగులు నువ్వు పట్టేశావు. కనుక అసలు విషయం చెబుతా విను! ఈ ప్రపంచమూ, ఆ బ్రహ్మ , అనే రెండు పదార్థాలు లేవు. ఆ రెండూ కలసి ఒకటే! నిప్పు వేరు, వేడి వేరు కాదు! అలాగే, ప్రపంచం వేరూ, పరమాత్మ వేరూ కాదు!

**రాముడు:** దీనివల్ల మాత్రం తేలిందేముంది ? మీరు చెప్పే పరబ్రహ్మలో దుఃఖ స్పర్శ లేదు – ద్వంద్వ స్పర్శ లేదు! ఈ ప్రపంచంలో ఆ రెండూ వున్నాయి. ఆ బ్రహ్మమూ, ఈ ప్రపంచమూ ఒకటే ఎలా అవుతాయి?

**వశిష్ఠుడు:** రామా! ఇది నీ అనుభవంతో నువ్వే తేల్చుకోవాల్సిన ప్రశ్న! ఒకవేళ శాస్త్ర పద్ధతిలో దీనికి సమాధానం చెప్పాలనుకున్నా చిట్ట చివరికి సిద్ధాంతం చెప్పే సమయంలో దీనికి సమాధానం చెప్పాలి గానీ – యిప్పుడు కాదు. ప్రస్తుతానికి పరమాత్మను ఒక గొప్ప ఐంద్రజాలకుడిగా ఊహించుకో! గారడీవాడు చెట్టును పుట్టగానూ మార్చ వచ్చు, పుట్టను చెట్టుగానూ మార్చవచ్చు!! అలాగే పరమాత్మ కూడా – ఏదైనా చేయగలడు.

సముద్రం తరంగాలను సృష్టి చేయటం లేదు, సముద్రజలమే ఒక భంగిమలో వుంటే దాన్ని తరంగం అని మనం అంటున్నాం. అలాగే పరమాత్మే ఒక భంగిమలో వుంటే – దాన్ని ప్రపంచం అని మనం అంటున్నాం. అందువల్ల, ఈ ప్రపంచ నిర్మాణానికి కర్తా లేదు, భోక్తా లేదు.

### 35. జీవుల ఉత్పత్తి ప్రక్రియ

**రాముడు:** గురుదేవా! మీరు మళ్లీ సగుణ బ్రహ్మ మార్గంలో సృష్టి ప్రక్రియను భావించమంటున్నారు. అలా అయితే, ఆ పరబ్రహ్మనుంచి ఎంతమంది జీవులు పుడుతున్నారు? ఎలా పుడుతున్నారు? ఎప్పుడెప్పుడు పుడుతున్నారు? ఈ వివరాలు కొంచెం చెప్పండి.

**వశిష్ఠుడు:** ఈ రకమైన జీవులయొక్క ఉత్పత్తి ప్రక్రియను వర్ణించేది కూడా, ఈ సమస్త ప్రపంచమూ, దానిలో వుండే జీవులూ, అందరూ కూడా పరమాత్మ స్వరూపులే – అని నిరూపించేందుకోసమే ! అంతే గానీ, అది వేరు , ఇది వేరు అని చెప్పేటందుకోసం కాదు. దాన్ని దృష్టిలో పెట్టుకొని, జీవోత్పత్తి ప్రకారాన్ని విను.

మొదట పరిశుద్ధమైన చిచ్ఛక్తి వుంది. ఆ చిచ్ఛక్తికి సృష్టి జరగాలనే సంకల్పం ఉదయిస్తోంది.

ఈ సంకల్పానికి కారణం పూర్వ కల్పంలోని కర్మ శేషాలే. అవి రక రకాలు – చిత్ర చిత్రాలు! అందువల్ల, ఈ సంకల్పం, ఎప్పుడు ఏలా ఉద్బుద్ధమౌతుందో నిర్ణయించి చెప్పడం కష్టం! అందుకనే పెద్దలు, దైవికంగా,(యథాలాపంగా– అనుకోకుండా) “యదృచ్ఛయా” ఆ సృష్టి సంకల్పోద్బోధం జరుగుతుందని చెప్పారు.

ఆ సంకల్పం గడ్డకట్టి, నేననే స్ఫురణ ఏర్పడుతుంది. దీని పేరే “అహంస్ఫురణ” లేక “అహంకారం”!

ఈ “అహంస్ఫురణ” గట్టిపడి “మనస్స” నేది రూపొందుతుంది.

ఈ మనస్సు జీవుడికి “ఉపాధి”గా ఏర్పడుతుంది.

జీవుడితో కలిసిన ఈ మనస్సు, క్షణాలలో గాలిమేడలు కట్టినట్లుగా, ఈ మహా ప్రపంచాన్ని కల్పన చేస్తుంది. ఈ కల్పనలో మొదట తన శుద్ధ చైతన్య స్థితిని, తన దృగ్రూప స్థితిని, విడిచిపెట్టినట్లు నటిస్తుంది.

ఆ స్థితిలో ఆ జీవుడికి తన శుద్ధ చైతన్యం ఏమిటో అవగతం గాక, అర్థంగాక, శూన్యం లాగా కనిపిస్తుంది. దాన్నే అతడు “ఆకాశం” అంటాడు.

ఆ “ఆకాశం”లో ఒక సృష్టికర్త, ఒక చతుర్ముఖ బ్రహ, తన సంకల్ప బలంతో సృష్టి చేస్తున్న అనుభూతి ఈజీవికి కలుగుతుంది. ఇక అక్కడ్డించి ఈ పధ్నాలుగు లోకాలు పెరిగిపోతాయి. ఇదంతా ఎక్కడ్డించి వచ్చింది.? కేవలం మనస్సులోనుంచి వచ్చింది. అది గుర్తు పెట్టుకో!

ఇక ఈ సృష్టిలోని జీవుల సంగతి చూద్దాం. ఈ జీవులను ప్రస్తుతం మన చర్చకోసం మూడు రకాలుగా విభజిస్తున్నాను.

1. మహా మోహులు, 2. జన్మ వివేకులు, 3.వైరాగ్య రహితులు

మహా మోహులంటే, నూటికి నూరుపాళ్లు అజ్ఞానులు. జన్మ వివేకులంటే, పుట్టుకతోనే పరిపూర్ణ వివేకం కలవారు. వైరాగ్య రహితులంటే మోక్షం కోసం సాధన చేస్తూ వున్నా , ఎప్పటికప్పుడు ఊగిసలాడుతూ వుండేవాళ్లు. వీళ్లలో మొదటి రెండు తరగతులవాళ్లకీ జ్ఞానంతోనూ, సాధన తోనూ పనిలేదు. మొదటివారికి అవి వచ్చినా అంటవు! కనుక వాళ్లకు వాటితో పని లేదు. రెండవ వారికి అవి అంటడం పూర్తి అయింది గనుక ఇక వాటితో పనిలేదు!

ఇక మూడవ వారున్నారే, ఊగిసలాడే వారు, వారికోసమే జ్ఞాన బోధలూ, సాధన ప్రక్రియలూ!

వీళ్లకు వైరాగ్యం కలిగేందు కోసమే భగవంతుడు సుఖదుఃఖ పరంపరలను కల్పిస్తున్నాడు. వాటి

ఆటు పోట్లవల్ల వీళ్లలో సాత్విక రాజసిక తామసిక ప్రవృత్తులు రకరకాలుగా రూపు దిద్దుకుంటున్నాయి. ఈ గందరగోళమంతా మహా సముద్రంలో మహాతరంగాల కల్లోలం లాగా వుంటుంది. అఖండ మహా సముద్రం లాగానే అఖండమైన సత్త , అతుకులు లేని ఉనికి –ఒకటి వుంది! దానిలో కొంత భాగం జీవభావాన్ని పొందితే ఈ సృష్టి అనే చలనం ఏర్పడుతుంది. ఈ విషయం అంతా ముందు ముందు ఇంకా ఎక్కువగా వివరిస్తాను.

## 36. మాటల గారడీ (వాక్ప్రపంచం)

**రాముడు:** గురుదేవా! కొంచెం ఆగండి! ఒక ప్రక్క అతుకులు లేని ఉనికి – అఖండ సత్తా – అంటున్నారు. మళ్లీ దాంట్లో కొంతభాగానికి చలనం అంటున్నారు. ఈ రెండు మాటలూ ఎలా కలుస్తాయి.?

**వశిష్ఠుడు:** బాగా అడిగావు రామా! ఉన్నమాట చెబుతా! ఏమీ అనుకోకు! ఆ రెండు మాటలూ ఎన్నటికీ అతకనే అతకవు. కానీ శాస్త్రాలు అలాంటి మాటలు చెబుతూనే వుంటాయి. ఇది అసత్యమని తెలిసినా సరే, శాస్త్రాలు ఇలాటి మాటలు చెబుతూనే వుంటాయి – ఇలాంటి కల్పనలు చేస్తూనే వుంటాయి.

పూర్వం ఒక చోట నేను “ఒక దీపంనుంచి మరొక దీపం పుట్టినట్లుగా పరమాత్మనుంచి ఈ ప్రపంచం పుట్టిందని” చెప్పాను. అది కూడా ఇలాంటి కల్పనలో ఒకటే!

రెండు దీపాలున్నట్లుగా రెండు పదార్థాలున్నాయా అక్కడ? పరమాత్మ దేనినైనా పుట్టించే జనక పదార్థం కాగలదా?

“అయితే ఇలాంటి మాటలు ఎందుకు చెప్పారు?” – అంటావేమో!

శిష్యుడు మందస్థాయిలో వున్నప్పుడు, వాడి దృష్టిని తత్వం వైపు లాగడం కోసం ఇలాంటి వాక్ప్రవాహం అవసరం.

**వాక్ప్రపంచం వినా త్వేతత్**
**అజ్ఞానమతులం తమః।**
**భేత్తు మన్యోన్యముదితం**
**యత్నం కర్తుం న శక్యతే॥** (సర్గ 41, శ్లోకం 12)

రెండు రకాల అజ్ఞానాలున్నాయి. ఒకటి సాధనల గురించిన అజ్ఞానం, రెండవది హృదయ సంపుటిలో వున్న మూలాజ్ఞానం ! ఈ జంట ఒకదాన్ని ఒకటి పోషించుకుంటూ, పెంచుకుంటూ వుంటుంది! ఈ జంటను ఒకేసారి నరికే ప్రయత్నం చెయ్యాలి. ఆ ప్రయత్నం నా వాక్ప్రవాహం లేనిదే సాగదు.

**రాముడు:** గురుదేవా! మీ వాక్ప్రవాహం అసత్యమని మీరే చెబుతున్నారు. ఈ అసత్యంవల్ల ఏదైనా జ్ఞానం పుడితే, అది కూడా అసత్యమే అయి తీరాలి! అజ్ఞానంలో భాగమే అయి తీరాలి!!

ఒక అజ్ఞానం , మరొక అజ్ఞానానికి విరోధి ఎలా కాగలదు? కనుక మీ వాక్ప్రవాహంవల్ల అజ్ఞాన నాశనం ఎలా జరుగ గలదు?

**వశిష్ఠుడు:** లోకంలో పతివ్రతలు కొందరు భర్తతో సహగమనం చేస్తూ వుంటారు. ఇలా చెయ్యటంవల్ల తమ శరీరం నశించిపోతుందని వాళ్లకు తెలియదా? తెలుసు! తమ శరీరం నశించిపోయినా, తమ ఆత్మకు హితం జరుగుతుందనే నమ్మకంతో వాళ్లు అలా చేస్తున్నారు. అలాగే, అవిద్యలలోనే (అజ్ఞానాలలోనే) కొన్ని ఉత్తమ – అవిద్యలుంటాయి. ఇవి ఆ జీవి బహు జన్మలలో చేసుకున్న పుణ్యాల పరిపాకంవల్ల వాడి హృదయంలోకి ప్రవేశిస్తాయి. ఇవే సాత్విక – అవిద్యలు! వీటికి తమ యజమానియైన ఆ జీవుడికి మేలు చెయ్యాలనే కోరిక ప్రబలంగా వుంటుంది. అందువల్ల ఆ జీవుడి హృదయంలోకి పరిశుద్ధమైన విద్య రావాలని గట్టిగా కోరుకుంటూ

వుంటాయి. అక్కడికి విద్య ప్రవేశించకుండా అడ్డుపడేది ఎవరు? తామే! అవిద్యలే విద్యకు అడ్డం! అందువల్ల, ఈ సాత్విక- అవిద్యలు మహా పతివ్రతల లాగా తమ శరీరాన్ని పూర్తిగా తగలబెట్టేటటువంటి ఆ పరిశుద్ధ విద్యను ఆహ్వానించి కోరి తెచ్చుకుంటాయి. ఇలాటి సాత్విక అవిద్యలు, నా వాక్ప్రవాహంవల్ల పుట్టి పెరుగుతూ వుంటాయి.

**రాముడు:** గురుదేవా ! అవిద్య, మాయ, అంటున్నారు గదా - మాయ అంటే ఏమిటి?

**వశిష్ఠుడు:** **అప్రేక్ష్యమాణా స్ఫురతి**

**ప్రేక్షితాతు వినశ్యతి ॥** (సర్గ 41-శ్లోకం 17)

రామా! నువ్వు చూడకుండా వుంటే ఇది కనిపిస్తుంది. నువ్వు దాని వంక చూస్తే అది కనిపించకుండా పోతుంది! ఈ మాయ చాలా చిత్రమైనది. దాన్ని గురించి ఎంత తక్కువ మాట్లాడితే అంత మంచిది.

**కుతో జాతేయమితి తే**

**రామ మాస్తు విచారణా।**

**ఇమాం కథమహం హన్మీ**

**త్యేషా తేస్తు విచారణా ॥** (సర్గ 41, శ్లోకం 31, 32)

రామా! ఈమాయ ఎక్కణ్ణుంచి పుట్టింది? ఎందుకు పుట్టింది? ఎలా పుట్టింది - అనే విచారణ నీకు వద్దు. దీనిని నేను పోగొట్టుకునేదెలాగా? అనే విచారణ మాత్రమే నువ్వు చెయ్యి !

**"అవిద్యా వితతవ్యాధేః**

**ఔషధం శృణు రాఘవ!"** (సర్గ 42, శ్లో 1)

రామా! ఇక అవిద్యా వ్యాధికి మందేమిటో చెబుతా విను.

వశిష్ఠమహర్షి ఇక ఆరు సర్గలలో అవిద్యా వ్యాధి నివారణోపాయాలను విస్తారంగా వివరించాడు. ఈ విషయాలన్నీ ఇంచుమించు పూర్వం చెప్పినవే. అయినా ఎక్కడికక్కడ కొద్ది కొద్ది మార్పులు చేస్తూ ప్రపంచ స్థితి యొక్క అవగాహనలో కొత్త కోణాలను సూచిస్తూ ఈ బోధను ఆయన కొనసాగించాడు.

## *37. జీవావతరణం*

42వ సర్గలో ఆయన జీవావతరణ ప్రక్రియను వివరించాడు. దీనిలో కేంద్రబిందువు ఈ శ్లోకంలో వుంది.

**క్రమేణ పాకవశతః**

**ఫలమేతి యథాన్యతామ్।**

**అవస్థయైవ నాకృత్యా**

**జీవో మలవశాత్తథా ॥** (సర్గ 42, శ్లోకం 27)

చెట్టుమీద పిందె పుట్టింది. అది క్రమక్రమంగా పరిపాకం పొంది పండు అయింది. ఇక్కడ ఒక వస్తువు పోయి కొత్త వస్తువు రాలేదు. ఉన్న వస్తువుకే అవస్థ మారింది - అంతే! అయినా పిందె వేరు, పండు వేరు అనే వ్యవహారం ఏర్పడుతోంది. అలాగే! జీవుడికి కూడా అజ్ఞాన సంపర్కం చేత అవస్థ మారిపోతోంది, వస్తువు మారడం లేదు. అయినా మారిపోయినట్టు లోకవ్యవహారం యేర్పడుతోంది. ఎలాగంటే -

ఒకే చైతన్యం వుంది. ఆ చైతన్యానికి వాసనాబలం వల్ల ఒక క్షేత్రంమీద, అంటే ఒక శరీరం మీద,

"నేను" అనే అభిమానం యేర్పడుతుంది. అప్పుడు ఆ చైతన్యాన్ని క్షేత్రజ్ఞుడు అంటారు. వాడిలో వాసనలు మరింత గట్టి పడితే, అప్పుడు అదే చైతన్యాన్ని 'అహంకారము' అంటారు. ఆ అహంకారమే నిశ్చయాత్మక వృత్తితో గట్టి పడితే, దాన్ని 'బుద్ధి' అంటారు. దీనిలో సంకల్ప వికల్పాలు చేరితే, అప్పుడు దాన్ని "మనస్సు" అంటారు. దానిలోని సంకల్పాలు మరింత గట్టి పడితే, అప్పుడు అదే ఇంద్రియాల ఆకారాన్ని చెందుతుంది. అది ఇంకా గట్టి పడితే, స్థూల దేహం యేర్పడుతుంది. ఇది అంతా "పిందె" – "పండు" గా పరిణామం చెందటం వంటి ప్రక్రియే కాని మరొకటి కాదు – అని వశిష్ఠమహర్షి ఈ సర్గలో నిరూపించాడు.

ఇలా నిరూపించడంలో ఆయనకు జీవపరిణామం అంతా వాసనాబలం వల్లనే జరుగుతూ వుంటుందని ప్రతిపాదించడం కుదిరింది. ఆ వరసలోనే ఆయన 43 వ సర్గలోకి ప్రవేశించి – అక్కడ జీవుల యొక్క కర్మ గతినీ, దానివల్ల వాళ్లకు కలిగే జన్మల గతినీ, ప్రతిపాదించాడు. ఆ వరసలో చివరకు జీవులంతా ప్రళయ సమయంలో బీజభూతమైన ప్రకృతిలో లీనమైపోతారని ఆయన చెప్పాడు.

దీనివల్ల 44వ సర్గ ఒక కొత్త ప్రశ్నతో మొదలైంది. "ప్రళయంలో జీవులంతా ప్రకృతిలో లయించిపోతే, వాళ్లకు మోక్షం వచ్చినట్లే గదా, ఇక మళ్లీ సృష్టి ఎలా జరుగుతోంది" – అని!

ఈ ప్రశ్నకు వశిష్ఠుడు కొంచెం విసుక్కున్నాడు. "దీనికి సమాధానం పూర్వమే చెప్పాగదయ్యా! చెప్పకపోతే మాత్రం నువ్వర్థం చేసుకోలేవా? "శేముషీ క్వ గతా తవ" "నీ తెలివి ఎటు పోయింది?"అన్నాడు. అని కూడా, తను వివరించదలుచుకున్న వరసలో మళ్లీ వివరణ మొదలుపెట్టి, ఈ మాటు ప్రపంచావతరణం ఎలా జరిగిందో ఆ ప్రక్రియను ప్రతిపాదించాడు. ఆ వరసలో ఆయన– "పూర్వ కల్పంలోని ఒకానొక ఉత్తమ జీవికి కర్మ పరిపాకం జరిగి, ఈ కల్ప ప్రారంభంలో అతనికి చతుర్ముఖ బ్రహ్మ శరీరం యేర్పడింది. అతని సంకల్ప బలం చేతనే ఈ ప్రపంచమంతా క్రమంగా రూపొందింది," – అని ప్రతిపాదించాడు.

దీనిమీద "ఏ జీవికైనా సరే దేహ నిర్మాణం జరిగే ప్రక్రియ ఏమిటి?" – అనే ప్రశ్న వచ్చింది. దానిమీద వశిష్ఠమహర్షి సమాధానం చెబుతూ, లింగ శరీరాన్ని పుర్యష్టకంగా వర్ణించాడు. "పుర్యష్టకము" అంటే ఎనిమిది భాగాలు కలిగిన పురము! ఈ భాగాలను వ్యాఖ్యాత ఇలా వివరించాడు.

**కర్మ జ్ఞానేంద్రియగణౌ భూతప్రాణ మనో గణాః।**

**అవిద్యా కామ కర్మాణి లింగైః పుర్యష్టకం విదుః ।।**

అంటే 1. కర్మేంద్రియాలు 2. జ్ఞానేంద్రియాలు 3. సూక్ష్మ పంచమహాభూతాలు 4. పంచ ప్రాణాలు 5. మనోబుద్ధి, చిత్తాహంకారాలు 6. అవిద్య 7. కామము 8. కర్మము

ఈ ఎనిమిదీ కలిస్తే 'సూక్ష్మ దేహం' లేక 'లింగదేహం' వుతుంది. ఇలా చెప్పటంవల్ల ఈ లింగ శరీరంలోని సూక్ష్మభూతాలే పంచీకరణ ప్రక్రియ ద్వారా ఘనీభవించి స్థూలదేహం ఏర్పడుతోందని చెప్పటం సులభమయింది. అంతేగాక సూక్ష్మభూతాల పంచీకరణం వల్ల ఏర్పడే స్థూల ప్రపంచం మిథ్య అని నిరూపించడం కూడా సులభమయింది. వశిష్ఠమహర్షి ఈ నిరూపణను 45వ సర్గలో చేశాడు.

ఇలా చెప్పడం వల్ల ఈ ప్రపంచం రజ్జుసర్పభ్రాంతి వంటిది అని, ఈ విషయాన్ని గుర్తించిన జీవన్ముక్తులు జన్మ జరామరణాది దుఃఖాలను దాటిపోతారని చెప్పటం కూడా సులభమయింది. అందువల్ల వశిష్ఠమహర్షి 46వ సర్గలో జీవన్ముక్తుల గుణాలను 32 శ్లోకాలలో మనోహరంగా వర్ణించాడు.

శ్రీరాముడు ఆ వర్ణన విని దానిలో కొట్టుకు పోలేదు. ఆయన ఇలా అడిగాడు– "గురుదేవా! మీరు పూర్వం హిరణ్యగర్భుడి ఉత్పత్తిని గురించి వర్ణిస్తూ అతని సంకల్పం ప్రకారమే ఈ ప్రపంచ సృష్టి అంతా జరుగుతుంది అన్నారు. కానీ ఆ మాటను అంతగా వివరించలేదు. దయచేసి వివరించండి".

## ౩౮. ఎందరో హిరణ్యగర్భులు

ఈ ప్రశ్న వశిష్ఠుడికి చాలా అనుకూలంగా అంది వచ్చింది. దాంతో ఆయన 47వ సర్గలో 90 శ్లోకాలు తీసుకుని కల్పకల్పంలోనూ సృష్టులు ఎలా మారిపోయే అవకాశం వుందో వివరించి తద్వారా కూడా ఈ ప్రపంచం మిధ్యే అని మరోసారి నిరూపించాడు. ఈ విషయాలను కొంచెం విపులంగా చెప్పుకోవడం అవసరం.

**వశిష్ఠుడు:** రామా! హిరణ్యగర్భుడు అంటున్నావు. ఏ హిరణ్యగర్భుడి ఉత్పత్తిని గురించి చెప్పేది? ఏ హిరణ్యగర్భుడి సంకల్పాలను గురించి చెప్పేది?

ఇప్పటికి కొన్నివేల బ్రహ్మలు గడిచి పోయారు. కొన్ని వందల విష్ణువులు, శివులు గడిచిపోయారు. కొన్ని లక్షల ఇంద్రాదులు గడిచిపోయారు. ఇక వీరికి సంబంధించిన బ్రహ్మాండాలు ఎన్ని కోట్లు గడిచిపోయాయో! వాటిల్లో ఎన్ని కోట్ల కోట్ల జీవులు, కోటాను కోట్ల తరాలు గడిచిపోయాయో!

వీళ్లందరూ గారడీలో జన్మించిన పదార్థాల్లాంటి వాళ్లే! గారడీలలో పదార్థాల ఉత్పత్తికిగానీ, స్థితికి గానీ, ఒక క్రమమేమిటి?

ఇదీ అంతే ! ఈ సృష్టుల్లో కొన్ని బ్రహ్మ సృష్టులు. ఒక్కొక్కప్పుడు అవి విష్ణు సృష్టులు – మరొకప్పుడు అవి శివసృష్టులు! ఇంకా గట్టిగా మాట్లాడితే, కొన్నిసార్లు అవి మునుల సృష్టులు!

ఇలాటి సృష్టులు ఎన్ని వున్నాయంటావు?

**యథాతరంగా జలధౌ**

**మృగతృష్ణా మరౌ యథా ।**

**కుసుమాని యథా చూతే**

**తథా విశ్వశ్రియః పరే ॥** (47వ సర్గ, శ్లోకం 15)

సముద్రంలో ఎన్ని తరంగాలో, ఎడారిలో ఎన్ని మృగ తృష్ణలో, విరగబూసిన మామిడి చెట్టుమీద ఎన్ని పువ్వులో, అన్ని బ్రహ్మాండా లున్నాయి ఆ పరమాత్మలో .

వీటిలో బ్రహ్మసృష్టులైనా అన్నీ ఒకే రకంగా ఉంటాయనే నియమం వుందా? అదీ లేదు! ఒకప్పుడు బ్రహ్మ పద్మంలోంచి పుట్టాడు. మరోసారి నీటిలోంచి పుట్టాడు. ఇంకోసారి ఒక గుడ్డులోంచి పుట్టాడు. వేరొకసారి వట్టి ఆకాశంలో పుట్టాడు.

ఒక బ్రహ్మాండంలో శివుడే సర్వాధికారి. మరో బ్రహ్మాండంలో విష్ణువే సర్వాధికారి. ఇంకో బ్రహ్మాండంలో ఇంద్రుడే వీళ్లిద్దర్నీ మించిన అధికారి.

ఒక సృష్టిలో భూమినిండా మొదట్లో చెట్లు వుండేవి. మరో సృష్టిలో భూమి పర్వతాలతో ప్రారంభమై క్రమంగా జీవులతో నిండింది. ఇలా ఎన్ని రకాల తేడాలో చెప్పలేం. ఇలా ఎన్నిరకాల సృష్టులున్నా వాటిల్లో శాశ్వతంగా నిలిచివుండేది ఒక్కటీ లేదు.

**యథా మశక జాలాని**

**వర్షా దిష్వాకులాని తు ।**

**ఉత్పత్త్యోత్పత్య నశ్యంతి**

**తథేమా లోకసృష్టయః ॥** (47 సర్గ, 17 శ్లోకం)

"వర్షాకాలంలో దోమలు ఏ రోజుకారోజే పుట్టి ఏరోజుకారోజే పోయినట్లు, ఈ లోక సృష్టులన్నీ పుడుతూ, గిడుతూ వుంటాయి.

"ఒకోసారి, ఒకో కల్పంలో, మొదట ఆకాశం జన్మిస్తుంది. దాంట్లోంచి ఇతర రూపాలు వస్తుంటాయి. మరో కల్పంలో మొదట వాయువు ఏర్పడి, దాంట్లోంచి ఇతర భూతాలు జన్మిస్తుంటాయి. ఇలా భూతాల ఉత్పత్తిక్రమం గూడా మారిపోతూనే వుంటుంది.

"ఒకోసారి ప్రజాపతి యొక్క నోటినుండి శబ్దం వెలువడి, దానిద్వారా సృష్టి జరుగుతుంది. మరొకసారి ఆయన కాలినించి సృష్టి జరుగుతుంది. మరోసారి కంటినించి జరుగుతుంది.

ఇన్ని రకాల భేదాలు ఎందుకు వస్తున్నాయంటే, ఈ సృష్టిలో బ్రహ్మ కాదగిన ఉత్తమ జీవుడు, వెనుకటి సృష్టిలో జరిపిన ఆలోచనలలో ఉపాసనలలో, వుండే భేదాలను బట్టి వస్తున్నాయి."

**రాముడు:** "గురుదేవా! నారాయణుడి యొక్క నాభి కమలంనుంచి బ్రహ్మదేవుడు పుట్టాడని ఎక్కువగా వింటూ వుంటాం. ఒక్కొక్కసారి అలా గూడా జరుగ వచ్చునని మీరంటున్నారు. నారాయణుడంటేనే పరిశుద్ధ సత్పదార్థ స్వరూపుడు గదా! ఆ సత్పదార్థానికి 'నాభి' ఏమిటీ – దాంట్లో కమలం యేమిటి? దాంట్లో బ్రహ్మ పుట్టడమేమిటి? ఇదంతా పరస్పర విరుద్ధంగా లేదా?"

**వశిష్ఠుడు:** "స్వప్నానికి నియమాలేమిటయ్యా? ఈ సృష్టి అంతా ఒక స్వప్నం! ఏనాటి స్వప్నం ఆనాటిదే! అందుకే పురాణాలు బ్రహ్మాండోత్పత్తులను అనేక రకాలుగా వర్ణించాయి. ఒక చోట శ్రీ మహావిష్ణువు యొక్క సంకల్ప బలం చేత బంగారు గుడ్డు ఒకటి యేర్పడిందని, దానిలోంచి హిరణ్యగర్భుడు జన్మించాడనీ చెప్పాయి. మరోచోట ఆ పరమ పురుషుడే అంతటా వ్యాపించి వున్న నీటిలో సారాన్ని విడిచి పెట్టాడనీ , దాంట్లోంచి బ్రహ్మాండం పుట్టిందనీ చెప్పాయి. మరోచోట పూర్వ కల్పంలోని సూర్యుడే ఈ కల్పంలో బ్రహ్మ అయ్యాడన్నాయి. మరోచోట వెనుకటి వరుణుడే ఇప్పటి బ్రహ్మ అన్నాయి.

"ఈ వాక్యాలన్నీ సమన్వయం చేస్తే మనకు తెలిసేదేమిటంటే, ఈ ప్రపంచం అంతా, మనో విలాసమే తప్ప మరొకటి కాదని! దీన్ని నిరూపించడానికే ఈ సృష్టి క్రమబోధ అంతా చేస్తున్నాను.

"కనుక రామా! ప్రతి కల్పంలోనూ సృష్టి తర్వాత ప్రళయం, ప్రళయం తర్వాత సృష్టి, ఇలా ఈ చక్రం తిరుగుతూనే వుంది. ఇది ఒక పెద్ద గారడీ చక్రం!

**కిమేతస్మిన్ మహామాయా-**

**డంబరే దీర్ఘ శంబరే।**

**రామ సత్యమసత్యం వా**

**నిర్ణేయం యది హోచ్యతే ॥** (47 సర్గ, 88 శ్లోకం)

ఈ గారడీ చక్రంలో, ఈ దీర్ఘ భ్రమలో రామా, సత్యమని అసత్యమని నిర్ణయించేందుకు ఏముంది? ఏమీ లేదు! ఈ విషయం విస్పష్టం కావటం కోసం నీకు "దాశూరోపాఖ్యానము" అనే కథ చెబుతాను విను.

### ౩౭. దాశూరోపాఖ్యానము

రామా! మగధ దేశంలో ఒకప్పుడు కడిమి చెట్లు ఎక్కువగా వుండేవి. ఆ దేశంలో ఒక కొండమీద ఒక కడిమిచెట్టు క్రింద "శరలోమ" అనే మహర్షి తపస్సు చేస్తూ వుండేవాడు.

ఆయనగారి ఏకైక పుత్రుడు దాశూరుడు. ఇతనుగూడా తండ్రిలాగానే మరో కడిమి చెట్టు క్రింద కూచుని తపస్సు చేస్తూ వుండేవాడు.

కొంతకాలానికి "శరలోమ" మరణించాడు. ఆయన భార్య సహగమనం చేసింది. దీంతో ఆ పెద్ద అడవిలో ఒంటరి వాడుగా మిగిలిపోయాడు – దాశూరుడు! ఆ దుఃఖం తట్టుకోలేక, అతను బావురుమని

ఏడవసాగాడు.  అలా చాలా కాలం ఏడ్చాడు.

చాలా రోజుల తర్వాత ఆకాశమార్గాన పోతున్న ఒక దేవత ఈ కుర్రముని ఏడుపులకు జాలిపడి , దగ్గరకు వచ్చి, అదృశ్యరూపంలో ప్రక్కన నిలబడి ఇలా ఓదార్చింది–

"ఓ మహర్షి పుత్రా! ఎందుకయ్యా ఈ ఏడుపు? ఈ సృష్టిలో బ్రహ్మకే నాశనం తప్పదు! నీ తండ్రికి తప్పుతుందా? ఈ ప్రపంచమే అస్థిరమని నీకు తెలియదా? తెలివి తెచ్చుకో! ఏడుపు ఆపు!

ఈ మందలింపుకీ, ఈ బోధకీ, దాశూరుడి మనస్సు తేలికపడింది.  చదివిన శాస్త్రాలు గుర్తుకు వచ్చాయి. అందువల్ల దుఃఖాన్ని ప్రక్కకు నెట్టి, తల్లిదండ్రులకు చేయవలసిన ఉత్తర క్రియలన్నీ చేసి, మళ్లీ తపస్సు మొదలు పెట్టాడు.

తండ్రిగారి సలహా సంప్రదింపులు లేకపోయేసరికి, అతనికి తపస్సు సరిగా సాగలేదు.  కానీ పట్టుదలగా వేద పారాయణం చేసుకుంటూ, దాని అర్ధ విచారణ చేసుకుంటూ కాలం గడపసాగాడు.  ఆ విషయంలో అతనికి మంచి నిష్ఠ కూడా కుదిరింది.  కాని వేదాల అంత భాగాలలో వుండే ఆత్మ తత్వం అంతు బట్టేది కాదు. అందు వల్ల అతని మనస్సు శమించలేదు.

తన మనస్సు శమించి పరమాత్మలో లయించిపోకుండా వుండటానికి కారణం ఈ స్థలంలో వున్న అపవిత్రతే అని అతనికి తోచింది.  దాంతో అతను చోటు మార్చి చూద్దామని భూమి అంతా తిరిగి వచ్చాడు. ఎక్కడా పవిత్ర ప్రదేశమే కనిపించలేదు.  మళ్లీ తన పాత కడిమి చెట్టు దగ్గరకే చేరాడు.

అతను చాలా ఆలోచించాడు "ఈ భూమే పవిత్రమైనది కాదు. ఇది అపవిత్రం! దీనిమీద నివాసమే అపవిత్రం! కనుక, ఆకాశంలో పక్షిలాగా ఈ చెట్టు చివర నేను నివాసం వుండి అక్కడే తపస్సు చేస్తాను " – అని అతను ఒక నిశ్చయానికి వచ్చాడు.

ఏ మనిషికైనా భూమిమీద స్థితి వుంటుంది.  గానీ, చెట్టు చివరన వుంటుందా? స్థితి వుండటానికి వీలులేని చోట, తనకు స్థితి కావాలని ఆ జీవి కోరు కున్నాడు.

అందువల్ల అతను ఘోరంగా ఆలోచించి, తీవ్రమైన సాధన మొదలు పెట్టాడు.  నేలమీద అగ్నిని వెలిగించి, తన మాంసమే కోసి అందులో హోమం చేయసాగాడు.  కండరాలు వుంటే మనిషి వుంటాడు. మనిషంటూ వుంటే వాడికి  ఎక్కడో అక్కడ స్థితి వుంటుంది.  చెట్టుచివర తనకు స్థితి కావాలని కోరుకునే  ఈ మనిషి, తన కండరాలే తగలబెట్టు కుంటున్నాడు.

ఈ ఘోర సాధనకు అగ్నిదేవుడే కంగారు పడ్డాడు.  ఈ బ్రాహ్మణోత్తముడి మాంసం తీసుకెళ్లి దేవతలకందిస్తే , దాన్ని వాళ్లు తింటే,  ఆ దేవతలే మాడిపోతారేమో అని భయపడ్డాడు.  అందువల్ల ఆయన  దాశూరుడి ఎదుట ప్రత్యక్షమై "నీకేం కావాలో కోరుకో, పెట్టెలోంచి సొంత మణిని తీసుకున్నట్లుగా నా దగ్గరనుంచి వరం పుచ్చుకో –, "**కోశాకాశాత్ మణిం యథా** " – అన్నాడు.

ఇక్కడ కవి అందమైన ప్రయోగం చేశాడు.  వట్టిగా పెట్టెనుంచి మణి తీసుకో అనలేదు. పెట్టెలోపలి ఆకాశంలోనుంచి మణిని తీసుకో అన్నాడు. పెట్టెలోనిదైనా, బైటదయినా, ఆకాశంలో మణికి స్థితి వుంటుందా, ఎక్కడైనా? కానీ కవి ఈ ఉపమానం ద్వారా మళ్లీ స్థితి ఉండటానికి వీల్లేని చోట వస్తు స్థితిని మనకు ప్రదర్శిస్తున్నాడు.  ఈ దాశూరోపాఖ్యానంలో అడుగడుగునా కనిపించే కేంద్ర బిందువు ఇదే! ఇక కథలోకి పోదాం –

దాశూరుడు చాలా సంతోషించి, ఇలా అన్నాడు – "అగ్నిదేవా! ఈ భూమిమీద పవిత్రమైన ప్రదేశమే కనిపించటంలేదు.  అందువల్ల "వృక్షాణాముపరి స్థితిరస్తుమే" చెట్లపైన నాకు స్థితి లభించుగాక !"

అగ్నిదేవుడు తక్షణమే 'తథాస్తు' అనేసి అంతర్ధానమై పోయాడు.

వెంటనే దాశూరుడు అక్కడే వున్న కడిమి చెట్టు చివరకు చేరాడు. అక్కడ స్థితి ఎలా వుందంటే, ప్రళయకాలంలో సృష్టి అంతా జలమయమై వున్నప్పుడు బాలకృష్ణుడు వట వృక్షాగ్రానికి చేరినట్లుగా వున్నది.

ఇక దాశూరుడు ఆ చిటారుకొమ్మన ఒక చిగురాకు చివర పద్మాసనం వేసుకొని తపస్సాధన మొదలు పెట్టాడు. కడిమిచెట్టు మీద కూర్చోటంతో క్రమంగా అదనికి “కదంబ దాశూరుడు” అన్నపేరు స్థిరపడిపోయింది. “కదంబం” అంటే కడిమి చెట్టు.

తపస్సాధనలో అతని మనస్సు ఆత్మ తత్వం మీద లగ్నం అయ్యేది కాదు. కర్మ మార్గం మీదే మనస్సు నిలిచేది. కానీ కర్మలు చేద్దామంటే తను నేల మీద లేడే ! ఏం చెయ్యాలి? అందువల్ల అతను మానసిక యజ్ఞాలు మొదలు పెట్టాడు. మానసిక దేవతా పూజలు మొదలు పెట్టాడు.

ఇది చాలా ప్రబలమైన సాధనామార్గం. నిజాయితీగా ఈ మార్గాన్ని అనుసరించేసరికి, కొంతకాలానికి అతని మనస్సు నిర్మలమై , పాత జన్మలలో పొందిన గురూపదేశాలు గుర్తుకు వచ్చి, ఆత్మజ్ఞానం సాక్షాత్కరించింది.

అతను ఈ స్థితిలో వుండగా, ఒకనాడు ఒక వనదేవత ఆయన దగ్గరకు వచ్చి, ఆ కడిమి చెట్టుకు ప్రాకుతున్న ఒక తీగను ఆధారంగా చేసుకుని దీనంగా నిలబడింది.

అది చూసి ఆ ముని “ఎవరివి నువ్వు? ఎందుకిలా దీనంగా వున్నావు?” – అని అడిగాడు.

ఆ సుందరాంగి ఇలా చెప్పింది. –

“ ఓ ముని శ్రేష్ఠా! మహాత్ములను దర్శిస్తే అసాధ్యమైన కోరికలు కూడా తీరుతాయని పెద్దలు చెబుతారు. నేను కొత్తగా ఇక్కడకు రాలేదు. ఈ చెట్టు చివర నువ్వుంటున్నావు. ఈ చెట్టుతీగ మీద నేను ఎప్పటినుంచో వుంటున్నాను.

“మొన్న చైత్ర శుద్ధ త్రయోదశినాడు దేవలోకంలో నందనవనంలో వన మహోత్సవం జరిగింది. అక్కడికి నేనూ వెళ్లాను. నా స్నేహితురాళ్ళందరూ వచ్చారు. నా స్నేహితురాళ్లలో పుత్రసంతానం లేని గొడ్రాలిని నేనొక్కతెనే. ఈ విషయాన్ని గమనించేసరికి నాకు దుఃఖం పొంగు కొచ్చింది. కడిమిచెట్టుమీద కల్పతరువులాగా మీరు నా పక్కనే వుండగా నేను అనాథనెలా అవుతాను? పుత్రుడు లేనిదాని నెలా అవుతాను.? అనే ఆశతో ఇక్కడికి వచ్చాను. కనుక నాథా! నాకో పుత్రుడ్ని ప్రసాదించు! లేకపోతే నీకు మల్లే కండలు కోసి నిప్పులో వేయటం కాదు. – ఈ దేహం మొత్తాన్ని ఒకేసారి హోమం చేస్తాను”.

ఈ మాటలు విన్న కదంబ దాశూరుడు చలించలేదు. కోపగించుకోనూ లేదు. నవ్వి , తన చేతిలోవున్న పువ్వు ఒకటి సుతారంగా ఆమె చేతిలోకి విసిరి, ఇలా అన్నాడు– “సుందరీ! ఏడవకు! ఈ పువ్వు తలలో పెట్టుకో. ఒక్క నెలయ్యే సరికి నీకు కొడుకు పుడతాడు. కానీ, నువ్వు మరణావేశంతో నాదగ్గరకు వచ్చావు. అందువల్ల నీకు పుట్టే కొడుకు తత్వజ్ఞుడౌతాడు”

ఆవిడ సంతోషించి , ఇక నుంచి మీకు పరిచర్యలు చేస్తానంది. అయినా ఆ ముని అందుకు అంగీకరించక ఆమెను పంపించేశాడు.

ఆ తర్వాత 12 సంవత్సరాలు గడిచాయి. ఈ మధ్య కాలంలో ఆమె ఆలోచనే రాలేదు ఈయనకు! ఆ తర్వాత ఒకనాడు ఆ వనదేవత 12 సంవత్సరాల కుర్రవాడ్ణి తన వెంటపెట్టుకుని ముని ఎదుటకు వచ్చి నమస్కరించి ఇలా విన్నవించింది.

“భగవన్ ! వీడు మనిద్దరి పుత్రుడు. వీడికి వేదశాస్త్ర విద్యలన్నీ నేర్పించాను. కానీ సంసార దుఃఖ నిర్మూలనంచేసే బ్రహ్మవిద్య మాత్రం ఇంకా అబ్బలేదు. దయతో మీరే ఉపదేశించాలి.

**“కో హి నామ కులేజాతం పుత్రం మౌర్ఖ్యేణ యోజయేత్ ”**

(51 సర్గ, శ్లోకం 28)

ఏ తండ్రి అయినా సొంత కొడుకును మూర్ఖుడుగా వుంచుతాడా?"   దాశూరుడు గంభీరంగా చూసి, "ఈ శిష్యుణ్ణి ఇక్కడ వదిలిపెట్టి నువ్వు వెళ్లిపో" అన్నాడు. ఆ తరువాత దాశూరుడు ఆ పిల్లవాణ్ణి శిష్యుడిగా చూశాడే గాని పుత్రుడిగా చూడనేలేదు. ఆ పిల్లవాడు కూడా తండ్రిని గురువుగానే భావిస్తూ , మిక్కిలి శ్రమకు ఓరుస్తూ, గురు శుశ్రూష చేస్తూ ఉండి పోయాడు. ఇలా చాలాకాలం గురు శుశ్రూష చేసినాక, ఆ తండ్రి మెల్లిగా నోరు విప్పటం మొదలు పెట్టాడు. ఆ బోధలవల్ల కుర్రవాడికి క్రమంగా శాస్త్రాల వల్ల కలిగే పరోక్ష జ్ఞానం కలిగింది.

దాశూరుడు ఇంత కాలంగా ఏకాంతవాసమే చేస్తున్నాడు. కాని, బహుకాలంగా వేదార్థభావన చేస్తున్నాడు కనుక ఆత్మ తత్వజ్ఞానాన్ని చిన్న చిన్న కథలుగా చెప్పటం ఆయనకు కుదిరింది. ఆయన వందల కొద్దీ కథలు చెబుతూ వుండేవాడు. ఆ కథల ప్రభావం వల్ల ఆ కుర్రవాడికి క్రమంగా అపరోక్ష ఆత్మ జ్ఞాన నిష్ఠ కూడా కుదిరింది.

రామా! నేనేదో కల్పిత కథ చెబుతున్నాను– అని నువ్వను కుంటున్నావేమో – అది నిజం కాదు! నేను చూసిన కథే చెబుతున్నాను.

ఒక సారి నేను హిమాలయ పర్వతం మీద వున్న గంగోత్రిలో స్నానం చేయడానికి వెళుతూ, ఒక నాటి రాత్రి ఒక కడిమి చెట్టు క్రింద ఆగాను. ఆ రాత్రి కొంత సేపు అయినాక చక్కటి తుమ్మెద ఝుంకారం వంటి మానవ కంఠస్వరం ఒకటి నాకు వినిపించసాగింది. నాదం బాగుండే సరికి, "ఏమిటా" అని జాగ్రత్తగా విన్నాను. ఆ చెట్టుమీద, ఎవడో మరొకడికి , ఒక వింత కథ చెబుతున్నాడు. ఆ కథేమిటంటే–

## 40. కథలో కథ

ఒక గొప్ప రాజుగారుండేవాడట! ఆయన పేరు "స్వోత్థుడు." స్వోత్థుడు అంటే తన నుంచి పుట్టినవాడు అని అర్థం. అతని పరాక్రమం ఎంత గొప్పది అంటే, అతని ఆజ్ఞను మానవులేకాదు, బ్రహ్మేంద్రాది దేవతలు కూడా శిరస్సులమీద పెట్టుకుని మోసేవారు. అష్ట దిక్పాలకులు గూడా అతన్ని ఎదిరించలేకపోయేవారు.

దీనికి కారణం ఏమిటంటే, అతనికి ఒకటి గాదు మూడు దేహాలుండేవి. ఆ దేహాలతో అతడు ముల్లోకాలనూ ఆక్రమించేవాడు. ఈ మూడు శరీరాలతోనూ అతను ఎల్లప్పుడు ఆకాశంలోనే తిరుగుతూ వుండేవాడు. నిజానికి అతను పుట్టింది కూడా అక్కడే అంతే కాదు – అదే ఆకాశంలో అతను ఒక పెద్దనగరం నిర్మించాడు. ఆ నగరంలో విషయ వ్యామోహాసక్తులైన సంసార జీవులను కొంతమందిని సృష్టి చేశాడు. వాళ్లను తలొక చోటా పెట్టాడు. వాళ్లల్లో కొంతమందిని దీర్ఘకాల జీవులుగానూ, కొంతమందిని అల్పకాల జీవులుగానూ, చేశాడు. వీళ్లలో అల్పకాల జీవులకు "అపవరకులు" అని పేరు పెట్టాడు. వీళ్లను కాపాడేందుకు కొంతమంది రక్షకులను ఏర్పాటు చేశాడు. దీర్ఘకాల – అల్పకాల జీవుల మధ్య వ్యాపార లావాదేవీలను ఏర్పాటు చేశాడు.

అయితే ఈ రాజుగారు ఇన్ని రకాల వ్యవస్థలు చేస్తున్నా , దేన్నీ స్థిరంగా ఉండనిచ్చేవాడు కాదు. అతను సహజంగానే చపలచిత్తుడు. ఎప్పుడు ఏమి ఆలోచన వస్తుందో ఎవరూ చెప్పలేరు. ఉన్నట్లుండి కొత్త కొత్త పట్టణాలు కట్టించాలని సంకల్పించేవాడు. వెనువెంటనే, ఆ కట్టబోయే పట్టణాల్లోకి ప్రవేశించేసేవాడు. కొంతకాలం వాటిల్లో వుండేవాడు. కొంతకాలం అయ్యాక వాటిని తనే కూలగొట్టిస్తూ వుండేవాడు.

ఒకో పట్టణంలో తను మహారాజుగా వుండేవాడు. మరో చోట ముష్టివాడుగా వుండేవాడు. మరో చోట రోగిష్టివాడుగా వుండేవాడు. మరో చోట ఆడుతూ పాడుతూ కేరింతలు కొడుతూ వుండేవాడు. చివరికి

ఆయన ఒకసారి పూర్తిగా నశించిపోయి , ఎవరికీ కనిపించలేదు.

ఒక ముదురు గొంతు ఇలా కథ చెప్పుకు పోతూవుంటే, ఒక లేతగొంతు మధ్యలో అడ్డంపడి, ఇలా ప్రశ్నించింది. – "నాన్నగారూ! మీరు చెప్పే ధోరణి చూస్తుంటే , ఈ కథ వెనకాల ఏదో అంతరార్థం ఉన్నట్లు తోస్తోంది. అసలు మీకు ఈ కథ మీద గాక ఆ అంతరార్థం మీదే మక్కువ వున్నట్లు కూడా తోస్తోంది. ఎందుకంటే– ఆ రాజు "కట్టబోయే పట్టణాల్లోకి ప్రవేశించేవాడు" అంటున్నారు మీరు. "ప్రవేశించేవాడు" అనేది వర్తమాన కాలాన్ని బోధిస్తోంది. "కట్టబోయే పట్టణం" అంటే భవిష్యత్ కాలాన్ని బోధిస్తోంది. ఈ రెంటికీ ముడిపెట్టేస్తున్నారు. దీని వెనకాలవున్న మీ అసలైన తాత్పర్యం ఏమిటో బయట పెట్టండి.".

ఆ ప్రశ్నకు తండ్రి సంతోషించి,ఇలా సమాధానం చెప్పాడు– "నాయనా! ఆ రాజు పేరు స్వోత్థుడు అన్నాను. **"స్వాత్ ఉత్థః స్వోత్థః"** – తననుంచి తనే పుట్టినవాడు. సృష్టిలో తననుంచి తనే పుట్టేది ఏది? – మనస్సు ఒక్కటే! అది అవ్యాకృత ఆకాశం నుంచి జన్మించి, మళ్లీ అక్కడే లయిస్తుంది. ఆ మనస్సునే "రాజు" అన్నాను. ఈ ప్రపంచమంతా మనోమయం. సంకల్పం వుంటే ప్రపంచం వుంది – సంకల్పం లేకపోతే ప్రపంచం లేదు! బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులతో సహా జీవులందరూ ఈ సంకల్పం అనే మహా వృక్షపు కొమ్మలను పట్టుకు వేళ్లాడుతున్న వారే!

ఇలాంటి ఈ ప్రపంచాన్ని మనస్సు దేనిమీద ఆధారపడి నిర్మించింది? ఆ పరిశుద్ధ పరబ్రహ్మ చైతన్యాన్ని అధిష్ఠానంగా చేసుకునే మనస్సు ఈ ప్రపంచ రచన చేస్తోంది. అధిష్ఠాన చైతన్యానికే మరోపేరు "శూన్యాకాశం"! అందుకే ఈ కథలో రాజు ఆకాశంలో పట్టణం కట్టాడని చెప్పాను. ప్రపంచం మొత్తానికి సరిపోయేటట్లుగా ఆ నగర వర్ణన చేశాను.

సృష్టిలో అల్పకాల జీవులు మానవులు! దీర్ఘకాల జీవులు దేవతలు! వీరిలో మానవులను "అపవరకులు" అన్నాను. "అపవరకం" అంటే "గది"! గది ఆకాశాన్ని కప్పి వేస్తుంది. మానవుడు తను పరమాత్మలోనే వుంటూ, పరమాత్మ తనకు కనిపించకుండా తన నెత్తిన తనే ముసుగు వేసుకుంటాడు. అందుకే వాడిని "గది" అన్నాను.

మానవుడు దేవతోపాసన చేసిన ఫలితాలు పొందాలని చూస్తూ వుంటాడు. దేవతలు మానవుల ద్వారా యజ్ఞయాగాదులు చేయించి హవిస్సులను పొందాలని ప్రయత్నిస్తూ వుంటారు. అందుకే దీర్ఘకాల అల్పకాల జీవుల మధ్య వ్యాపార లావాదేవీలు ఉన్నాయి అన్నాను.

"వత్సా! ప్రతి జీవి శరీరంలోనూ ఒక అహంకారం వుంటుంది. కాని ఇది అన్ని వేళలా ఒకే రకంగా వుండదు.

**యథా కుసూలే మార్జాలో**
**భస్త్రాయాం భుజగో యథా!**
**ముక్తాఫలం యథా వేణౌ**
**అహంకారస్తథా తనౌ॥** ( 53 సర్గ, 23 శ్లోకం)

ఒక్కొక్కసారి ఈ అహంకారం గాదెలో పిల్లి లాగా పడివుంటుంది. ఈ పిల్లిలోపల ఆలోచనలు ఉంటాయి గానీ, అవి పని చెయ్యవు. ఇది తామసాహంకారము. ఇదే సుషుప్తిలో వుండే అహంకారము. ఇక్కడ అహంకారమంటే గర్వమని కాదు సుమా– అహంకారమంటే నేననే స్ఫురణ– అని గుర్తుంచుకో!

ఒక్కొక్కసారి ఈ అహంకారం కొలిమితిత్తిలో పాములాగా చాటుగా వుండి చేయివేసి వత్తంగానే కాటు వేస్తుంది. కొలిమితిత్తి అంటే ఈ రోజుల్లో వాళ్లకు వెంటనే తెలియకపోవచ్చు. పాతకాలంలో ఇనప పని చేసే కమ్మరివాడు తన బొగ్గుల కుంపటి క్రింద గొట్టానికి ఒక తోలు సంచీని తగిలించి, దానిని నొక్కడం ద్వారా

కుంపటి లోకి గాలిని వేగంగా పంపేవాడు. దీనినే కొలిమితిత్తి అని, తిత్తి అని, పిలిచేవారు. కొలిమి అంటే నిప్పుల కుంపటి. రాత్రిపూట పనివాళ్లు వెళ్లిపోయాక పాములు ఈ తిత్తిలో చేరికూర్చునే సావకాశం వుంది. ప్రొద్దున వచ్చిన పనివాళ్లు చూసుకోకుండా తిత్తిని నొక్కితే, లోపలి పాము బుస్సునలేచి, కస్సున కాటువేసే ప్రమాదం వుంది. అలాటి అహంకారాన్ని రాజసాహంకారం అంటారు. స్వప్నదశలో సుఖదుఃఖాలను కలిగించే అహంకారం ఇలాటిదే!

ఒకొక్కప్పుడు ఈ అహంకారం వెదురు బొంగులో ముత్యం వున్నట్లు ఉంటుంది. వెదురు బొంగు అంటే విలువ తక్కువ పదార్థం. కానీ ఒకోసారి దాని కణుపుల్లో ముత్యాలు మొలుస్తూ వుంటాయి. వాటి విలువ గొప్పది. అలాగే విలువలేని శరీరంలో, ఒకోసారి విలువైన సాత్వికాహంకారం మొలకెత్తుతూ వుంటుంది. సామాన్యంగా జాగ్రద్దశలో వుండే అహంకారం వివేకాన్ని కలిగించటానికి సమర్థమైనది కనుక, దాన్ని స్వచ్ఛమైన అహంకారం, లేక సాత్వికాహంకారం అంటూ వుంటారు. ఈ మూడు రకాల అహంకారాలూ మారుతూ మారుతూ వుండటాన్నే నేను ఈ కథలో రాజుగారి చపలచిత్తంగా వర్ణించాను.

ప్రతి జీవీ ఈ ప్రపంచాన్ని చూస్తున్నాడు. అందరూ ఒకే ప్రపంచాన్ని చూస్తూ ఉన్నట్లు కనిపిస్తూ వుంటుంది. కానీ ఎవడికి వాడు తాను సంకల్పించిన పదార్థాలనే చూస్తున్నాడు. ఎలా సంకల్పిస్తే అలాగే చూస్తున్నాడు. ఎప్పుడు సంకల్పిస్తే అప్పుడే చూస్తున్నాడు. అందుకే ఈ రాజు క్షణకాలంలో భవిష్యన్నగరంలోకి ప్రవేశించాడని నేనన్నాను.

**భవిష్యన్నవ నిర్మాణం**

**స వ్యాప్నోతి తథా పురం।**

**యథా సంకల్పితం వస్తు**

**క్షణాదేవ ప్రపశ్యతి ॥** (53 సర్గ, 25 శ్లోకం)

నీ స్వప్నమే నీ భవిష్యన్నగరమనుకుంటే,దాంట్లోకి నువ్వు ప్రవేశించటం లేదా? అలాగే, ఈ ప్రపంచమే స్వప్నమని అంగీకరిస్తే, దీంట్లోకి నువ్వు ప్రవేశించటంకూడా ఒక భవిష్యన్నగర ప్రవేశమే! ఇక్కడ వర్తమాన కాల, భవిష్యత్ కాలాలు విరుద్ధంగా ఉన్నాయి. నిజమే! కానీ ఆ ప్రవేశం జరిగి పోతూనే వున్నది. సంకల్పించడం నిర్మించడం, ప్రవేశించడం, అన్నీ ఒకే ఒక క్షణంలో జరిగి పోతున్నాయి కనుక అందరూ ఈ కాలవిరోధాన్ని అంగీకరించేస్తున్నారు. దీనినే నీ కథలో రాజుగారి భవిష్యన్నగర ప్రవేశంగా వర్ణించాను.

జీవుడిలా సాత్విక రాజసిక తామసిక అహంకారాలలో చక్రం తిరిగినట్లు తిరుగుతూ తిరుగుతూ వుండగా, రాజుగా, మధ్యముడిగా, ముష్టివాడిగా, అనేకరకాల జన్మలు వస్తూ వుంటాయి. దీనినే నేను కథలో ఆ రాజు వివిధ పట్టణాలలో వివిధ రూపాలతో ఉండటంగా వర్ణించాను.

ఈ చక్రం ఇలా తిరుగుతూ వుండగానే ఎక్కడో ఒకచోట అదృష్టం కలిసి వచ్చి, వైరాగ్యం అందుకుని, సమాధి కుదిరి, ఆత్మజ్ఞానం వంటబట్టి, ఆ జీవికి మోక్షం లభిస్తుంది. కథలోని రాజుగారు నశించిపోయి ఎవరికీ కనిపించలేదు అంటే – దాని అర్థం యిదే! మోక్ష గతికి చేరుకున్న జీవుడు, పరమాత్మలో లీనమైపోతాడు గనుక, వాడు విడిగా ఎవరికీ కనిపించడు. కనిపించక పోటాన్నే “నాశం” అంటారు. “నశ అదర్శనే” అని ధాతువు. అంతేగానీ, నశించడం అంటే చావటం కాదు.

## 41. సంకల్పాలను తుడిచి వేసుకో

కనుక వత్సా! నా కథకు సారాంశం యేమిటంటే , నీ మనస్సే నా కథలోని రాజు! ఈ మనస్సుయొక్క సంచారం ఎలా వుంటుందో ఈ కథలో చెప్పాను. ఈ మనస్సుకి సంకల్పంవుంటే సంసారం వస్తుంది. జాగ్రత్ సంసారమైనా, స్వప్నసంసారమైనా – ఏదైనా సంసారమే! సంకల్పాలు తాత్కాలికంగా పోతే, సుషుప్తి లభిస్తుంది. ఇది సంసారం లాగా కనిపించదు. కానీ యిది కూడా సంసారమే! ఈ మూడింటికీ భిన్నంగా, నీ మనస్సులోగల సంకల్పాలను సంపూర్ణంగా కోసివేసినట్లయితే, అప్పుడు శాశ్వతమైన ముక్తి లభిస్తుంది. ఆ ప్రయత్నం చేసుకో!"

"సంకల్పనాశం చాలా కష్టమండీ – సులభోపాయం యేదైనా చెప్పండి అంటావేమో! హరిహర బ్రహ్మాదులు దిగి వచ్చినా, సంకల్పనాశం మినహా మోక్షానికి రెండో ఉపాయం చెప్పలేరు. నువ్వు నిప్పులో దూకినా కూడా, నీకు మరో ఉపాయం దొరకదు. కనుక పిచ్చి ఆలోచనలు మాని, సంకల్పనాశంకోసం కృషి చెయ్యి!"

"రామా! ఈ ఉపదేశం విని కొడుకు చాలాసేపు ఆలోచించి, చివరికి ఇలా అడిగాడు– "హే ప్రభో! సంకల్పం అంటే ఏమిటి? అది ఎలా పుడుతుంది? ఎలా పెరుగుతుంది? ఎలా నశిస్తుంది?"

గంభీరమైన ఈ ప్రశ్నవిని, తండ్రి అంతకంటే గంభీరమైన సమాధానం ఇలా చెప్పసాగాడు.

**తండ్రి:** (దాశూరుడు) వత్సా!

**అనంతస్యాత్మ తత్వస్య**

**సత్తా సామాన్య రూపిణః।**

**చితశ్చేత్యోన్ముఖత్వం యత్**

**తత్సంకల్పాంకురం విదుః ॥** (54 సర్గ 2శ్లోకం)

పరమాత్మ తత్వం ఒకటి వుంది. అది అనంతమైనది. ఈ ప్రపంచంలోని పదార్థాలన్నింటిలోనూ గల ఉనికియే దానికి స్వరూపం! ఇలాంటి వునికినే సత్తాసామాన్యం అంటారు. దీని యొక్క అసలైన స్వరూపం చైతన్యం! దీనికే మరోపేరు చిత్తు! మరో పేరు దృక్!

చైతన్యాన్ని "దృక్" అనేటట్లయితే ఈ ప్రపంచం అంతా దృశ్యం. చైతన్యాయన్ని "చిత్" అనేటట్లయితే ప్రపంచానికి మరో పేరు "చేత్యం". దృక్ – దృశ్యాలు, చిత్ – చేత్యాలూ – ఇవి జంట పదాలు! వీటిలో దృక్ – దృశ్యాలకు యథార్థమైన సంబంధం లేదు. కొంచెం మాటలు మారిస్తే, దీనినే చిత్ –చేత్యాలకు సంబంధం లేదు అని చెప్పవచ్చు.

నిజంగా సంబంధంలేని "**చిత్**"– "**చేత్యం**" వైపు అంటే "**దృశ్యం**" వైపు మొగ్గు చూపిస్తే, ఆ మొగ్గుదలపేరే "సంకల్పం"!

ఈ దశ సంకల్పానికి మొలకవంటి దశ! అది పుట్టే విధానం కూడా ఇదే!

"చిత్" సత్యమైనది. "చేత్యం" తద్భిన్నమైనది. అంటే అసత్యమైనది. చిత్తు చేత్యంవైపు మొగ్గుచూపింది అంటే, సత్యం అసత్యంవైపు మొగ్గు చూపింది. అప్పుడు జన్మించేది అసత్యమే అవుతుందిగాని, సత్యం కావాటానికి వీల్లేదు. కనుక, సంకల్పం అనేది ఏదైనా సరే, అసత్యమే కాని సత్యం కావటానికి వీల్లేదు! అలాటి సంకల్పపు మొలకే పెరిగి పెద్దదై "నువ్వు–నేను–వీడు–వాడు" అనే భేదాలను కల్పించి, ఈ మహా ప్రపంచాన్నే నీకు చూపిస్తోంది. కనుక ఈ ప్రపంచమంతా అసత్యమే!

ఇప్పుడు నీకు నేను సంకల్పం వృద్ధి చెందే విధానం కూడా చెప్పినట్లయిపోయింది! ఇక అది నశించే ఉపాయాలు చెప్పాలి.

**సంకల్పే నైవ సంకల్పం**
**మనసా స్వమనో మునే।**
**ఛిత్వా స్వాత్మని తిష్ఠ త్వం**
**కిమేతావతి దుష్కరం ॥** ( 54 సర్గ, 18 శ్లోకం)

సంకల్పం ఏదైనా సరే , అది అసత్యమని గుర్తించు. ఇకపైన దేన్నీ సంకల్పించకు! పూర్వం అనుభవించిన సుఖ దుఃఖాలను స్మరించకు! – ఇదే సంకల్ప క్షయానికి మంచి ఉపాయం!

"నేనింకా ఏమీ సంకల్పించను" – అనేది కూడా ఒక సంకల్పమే! దీన్ని "అసంకల్పన సంకల్పం" అంటారు. ఇది ఇతర సంకల్పాలను అన్నింటినీ నశింపచేయగలదు. అంతే కాదు. ఇది తనను తానే నశింప చేసుకోగలదు.

కొద్దిపాటి తేడాతో మరో ఉపాయం వుంది. నీకు మనస్సుంది గదా. మనస్సంటే, మననం చేసేది! నీ మనస్సులో నువ్వు ఆపకుండా ఆత్మ తత్త్వమననం చెయ్యి. ఈ మననం మనస్సును తుడిచిపెట్టివేయగలదు. ఇందులో కష్టమేముంది?

సంకల్పాలను ఆపుకునేందుకు మరొక ఉపాయం వుంది. మొదట ఈ జగత్తు మిథ్య అని బాగా భావించు. ఎందుకంటే పూర్వం నువ్వు ప్రపంచం సత్యమని సంకల్పించావు. ఈ ప్రపంచం ఉన్నదని సంకల్పించావు. అందుకే అది నిజంగా వున్న పదార్థం అయిపోయింది. నిన్ను నానా బాధలూ పెడుతోంది. ఇప్పుడు లేదనుకోవటం మొదలు పెట్టు. లేదని గట్టిగా అనుకో – చాలు ! అది లేనిదై పోతుంది.

ఎక్కువ దూరం పోవక్కర్లేదు. ఈ ప్రపంచం మిథ్య అని వేద వాక్యాల ద్వారా, యుక్తుల ద్వారా, అనుభవాల ద్వారా, నువ్వు అనుసంధానం చెయ్యటం మొదలుపెడితే చాలు! నీలో రాగ ద్వేషాలు తగ్గి పోతాయి. సుఖ దుఃఖాల తీవ్రత తగ్గుతుంది. చివరికి ఈ ప్రపంచం లేనిదే అయిపోతుంది".

**దాశూరపుత్రుడు:** గురుదేవా! ఈ ప్రపంచాన్ని తయారు చేసేదీ, తుడిచిపారేసేదీ కూడా మనస్సే అయితే, నా మనస్సు ఈ ప్రపంచం మొత్తాన్ని తనకు అనుకూలంగా మాత్రమే వుండేటట్లు ఎందుకు తయారు చేసుకోదు? ఎవరైనా తమకు అపకారం చేసే కల్పనను తామే చేసుకుంటారా?

**దాశూరుడు:** ఎందుకు చేసుకోరు? చపలచిత్తులు అలాగే చేసుకుంటారు! అడవిలో కోతి, కొమ్మల మధ్యలో తనే కాలు ఇరికించుకుని, తనే కుంటిది కావడం లేదూ? నీ మనస్సుందే, దానికి పూర్వ జన్మల వాసనలు కమ్ముకున్నాయి. అందువల్ల నీ మనస్సు మకిలి బట్టిన అద్దంలాగా తయారు అయింది. కానీ, దానికి సహజ సిద్ధంగానే అధిష్ఠాన చైతన్యంతో సంబంధం వుంది. అయితే ఏం ప్రయోజనం? పట్టిన మాలిన్యం యొక్క ప్రభావంవల్ల ఈ చైతన్య సంబంధం విషయాలు స్ఫురించే శక్తిగా మారి, నీ మనస్సుకి చాంచల్యం అనే కొత్త దోషాన్ని అంటగడుతోంది. అందువల్ల నీ మనస్సు అడవిలో కోతిలాగా చపల చిత్తంగా వ్యవహరిస్తూ, తనకు తనే అపకారం చేసుకుంటోంది.

రాగి చెంబుకు పట్టిన చిలుము, తోమితే పోతుంది. అలాగే మనస్సు పట్టిన మాలిన్యం సంకల్ప నిర్మూలనాభ్యాసంచేత పోయి తీరుతుంది.

నాయనా! ఇది పెద్ద కష్టమైన పనికూడా కాదు. ఎందుకంటే నువ్వు నిజంగా ఉన్నదాన్ని పోగొట్టాలని ప్రయత్నం చెయ్యటం లేదు. నిజంగా లేకుండానే, ఉన్నట్టు కనిపించే దానిని పోగొట్టాలని ప్రయత్నం చేస్తున్నావు. "క్వాసద్వస్తు చిరం స్థితం" (సర్గ 54, 39 శ్లోకం) లేని వస్తువు ఎక్కువ కాలం ఉండటం ఎక్కడైనా కద్దా? కనుక సంకల్ప నాశం కోసం గట్టిగా ప్రయత్నించు".

**వశిష్ఠుడు:** రామా! ఈ విధంగా ఆ రాత్రిపూట చిటారు కొమ్మలమీద కూర్చుని తండ్రీ కొడుకులు చేసుకుంటున్న

ఆ చర్చ విని నేను సంతోషపడి దాశూరుడికి ఎదురుగా వెళ్లి నుంచున్నాను. దాశూరుడు నన్ను చూసి సగౌరవంగా స్వాగత వచనాలు పలికాడు. ఇక నేను కూడా ఆ యిద్దరితో చేరి కొన్ని వింత వింత తత్త్వ కథలు చెప్పి ఆ రాత్రల్లా సత్కాలక్షేపం చేసి, తెల్లవారు ఝాము కాగానే నా దోవన నేను వెళ్లాను.

రామా! దాశూరుడు తన కొడుకుకి చెప్పిన కథ చెప్పాను. ఏ తండ్రైనా కొడుకులకు అబద్ధంచెప్పడు కదా. ఆయన తన అనుభవాన్నే తన కొడుక్కి చెప్పాడు. అదే సిద్ధాంతం!

**తస్మాద్వికల్పం మలమాత్మనస్త్వం**

**నిర్ధూయ పశ్యామలమాత్మతత్త్వమ్**

**ఆసాదయిష్యస్యచిరాత్పదం తత్**

**భవిష్యసీజ్యో భువనేషు యేన ॥** (సర్గ 55, 40 శ్లోకం)

కనుక రామా! సంకల్పమే నీ మనస్సుకి పట్టిన మాలిన్యమని గుర్తించు. దాన్ని తొలగించుకొని నిర్మలమైన ఆత్మతత్త్వాన్ని దర్శించు. దాన్ని దర్శిస్తే చాలు – అదే నువ్వైపోతావు!

ఆ స్థితి లభిస్తే నువ్వు లోక పూజ్యుడివవుతావు.

ఇక్కడితో వశిష్ట మహర్షి ప్రపంచ స్థితిని గురించి చెప్ప దలుచుకున్న విషయాలు పూర్తి అయినాయి. కానీ ప్రపంచంయొక్క ఉపశమం గురించి ఇంకా చెప్పవలసి వుంది. అంతేగాక సంకల్ప రహిత తత్త్వ స్థితిని సాధించే విధానాల గురించి ఇతోధికంగా బోధించి ప్రపంచోపశమంతోపోటు మనస్సు యొక్క ఉపశమంకూడా లభించేటట్లుగా పై ప్రకరణంవైపు తన బోధను అనుసంధానం చేయవలసివుంది. దీనికోసం వశిష్ఠమహర్షి ఏడు సర్గలు తీసుకున్నాడు. 56వ సర్గ నుంచి 62 వ సర్గ దాకా ఈ చర్చనే నడిపాడు. వీటిలో ఎక్కువగా పూర్వోక్త విషయాలనే శాస్త్ర సాంకేతిక భాషలో చర్చించాడు. అందువల్ల మనం వీటిని వీలైనంత సంగ్రహంగా చెప్పుకుందాం.

మొదటగా 56వ సర్గలలో వశిష్టుడే ఒక ప్రశ్నను లేవదీశాడు.

## 42. శాస్త్రచర్చ

**వశిష్ఠుడు:** "రామా! ఈ ప్రపంచంమీద నీకు అనురాగం వుంది కదా? ఏ దృష్టితో దీనిని నువ్వు ప్రేమిస్తున్నావు? ఇది "సత్" అనా? "అసత్" అనా? "సదసత్" అనా? ఏది అనుకుంటే ఏమౌతుందా! చూద్దాం.

ఈ ప్రపంచం "సత్'. అనుకో – అంటే అది సత్య పదార్థం – నువ్వూ సత్య పదార్థానివే! నువ్వు ద్రష్టవు – అది దృశ్యము! ఈ రెండూ సత్యాలే అయితే – ఈ దృశ్య ప్రపంచం నీ మీద ఆధారపడి వుందా? స్వతంత్రంగా వుందా? నీ మీద ఆధారపడి వుంటే దానిని స్వతంత్రమైన సత్పదార్థం అనటానికి వీల్లేదు. స్వాతంత్ర్యం లేని సత్యత్వం సత్యత్వమే కాదు! అసత్యమైన దానిమీద అనురాగ మెందుకు?– అనుబంధమెందుకు? అన్నీ వదిలి పెట్టు!

పోనీ, దృశ్య ప్రపంచం నీకంటే భిన్నంగా స్వతంత్రంగా సత్యమైనదే అనుకుందాం ! ఇదే నిజమైతే నీకూ దానికీ ఏ సంబంధమూ లేదు. సంబంధం లేనిదానిమీద అనురాగమెందుకు? దానిలో కొంతభాగం మీద "నేను" అని, మరికొంత భాగంమీద "నాది" అని, అభిమానాలు ఎందుకు? కనుక ఈ పక్షంలో అవన్నీ వదిలేసెయ్యి!

ఇక ఈ ప్రపంచం "అసత్" – అసత్యమైనది – అని ఒప్పేసుకుంటావా? అయితే దీనిమీద అనురాగం వ్యర్థమే గదా – వదిలిపెట్టు!

పోనీ ఈ ప్రపంచం "**సదసత్**" - "**సత్యాసత్యం**"– అంటావా? దాని స్వభావమే అనిశ్చితంగా వుంటే దానిమీద నీకు ప్రేమ ఏమిటి? కనుక ఈ పక్షంలోనూ ప్రపంచానురాగం తగనిదే!

ఇక పోతే, ఈ ప్రపంచానికి కర్త ఉన్నాడా ?కర్త లేడా? అంటే, ఇది సకర్తృకమా – అకర్తృకమా? లేక కర్త్ర కర్తృ సాధారణమా? ఇక్కడ గూడా పైన చెప్పుకున్నట్లుగానే ఏ పక్షంలోనూ ప్రపంచంమీద అనురాగం తగదు!

**రాముడు:** గురుదేవా! ఇక్కడ అంత తేలిగ్గా విషయం తెగటంలేదు. ఎందుకంటే "యతో వా ఇమాని భూతాని జాయంతే", "విశ్వస్య కర్తా భువనస్య గోప్తా"– ఇత్యాదిగా శ్రుతులు పరమేశ్వరుడే ఈ ప్రపంచానికి కర్త అని చెపుతుంటే ఈ ప్రపంచం అకర్తృకం అనటం ఎలా కుదురుతుంది?

**వశిష్ఠుడు:** శ్రుతి ఆ రెండు వాక్యాలే చెప్పి ఊరుకోలేదు.

**"యత్తదద్రేశ్యమగ్రాహ్య మవర్ణమచక్షుఃశ్రోత్రం**
**తదపాణిపాదం నిత్యం విభుం**
**సర్వ గతం సుసూక్ష్మం తదవ్యయం**
**తద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః ॥**

అని ఇలాటి వాక్యాలు కొన్ని వందలు చెప్పింది. వీటిల్లో పరమాత్మ అసంగుడు, ఉదాశీనుడు, అకర్త అని స్పష్టంగా వుంది.

**రాముడు:** ఈ రకం వాక్యాలు ముఖ్యమని చెప్పాలా? ఆరకం వాక్యాలు ముఖ్యమని చెప్పాలా?

**వశిష్ఠుడు:** ఏ ప్రకరణంలో ఏ వాక్యం వచ్చిందో చూసుకోవాలి. ఆ పరిశీలన చేస్తే , నువ్వు చెప్పిన "విశ్వస్య కర్తా" మొదలైన వాక్యాలన్నీ ఈ ప్రపంచం మిథ్య అనే సత్యం నిరూపించటం కోసం ఔపచారిక విధానంలో చెప్పిన మాటలే అని నిరూపణ అవుతుంది. కనుక ప్రపంచం అకర్తృకమని నిర్ణయించటమే సముచితం. అలాటి ప్రపంచంమీద అనురాగం పెంచుకోవటం ఏమి తెలివి?

**రాముడు:** పరమాత్మ ప్రకాశ స్వరూపుడని మీరే చెబుతూ వుంటారు గదా. వస్తువులు ప్రకాశించటానికి సూర్యుడు కర్త అయినట్లుగా ఈ సృష్టి జరగటానికి పరమాత్మ ఎందుకు కర్త కాకూడదు.

**వశిష్ఠుడు:** లోకంలో సూర్యుడు ప్రకాశకుడు అనే వ్యవహారం వుంది. అంటే సూర్యుడు ప్రకాశన క్రియా కర్త అని వాళ్ల ఉద్దేశం. కానీ అది ఎంతవరకూ సత్యమో విచారిద్దాం.

**సర్వేచ్ఛారహితే భానౌ**
**యథా వ్యోమని తిష్ఠతి।**
**జాయతే వ్యవహారశ్చ**
**సతి దేవే తథా క్రియా ॥** (56 సర్గ, 29 శ్లోకం)

వస్తువును ప్రకాశింప చేయటంలో, సూర్యుడి కేదైనా ప్రయత్నం వుందా? పోనీ దీన్ని ప్రకాశింప జేయాలనే కోరిక వుందా? దీన్ని ప్రకాశింప జేసేవాడిని నేనే అనే అహంకారం వుందా ? ఈ వస్తువున్నది. దీన్ని ప్రకాశింప జేయాలి అనే మమకారం వుందా? – ఇవేవీ లేవు. అహంకార, మమకార, ఇచ్ఛా, ప్రయత్నాలేవీ లేని సూర్యుడు ఆ వస్తువును ప్రకాశింప జేయటంలో కర్త యెలా అవుతాడు?

సూర్యుడు తన దోవన తను వున్నాడు. ప్రక్కన వస్తువు చేరింది. వెంటనే అజ్ఞులు కొందరు సూర్యుడు ప్రకాశకుడయ్యాడని వ్యవహరిస్తున్నారు. అంటే ప్రక్కన వుండి ప్రకాశిస్తున్న వస్తువుని బట్టి, వారు సూర్యుడికి ప్రకాశకత్వాన్ని ఆరోపిస్తున్నారన్నమాట!

సరీగా అదే విధంగా, ఆత్మ విషయంలో గూడా జరుగుతోంది. ఆత్మ స్వయం ప్రకాశకం. గమనికే

దాని స్వరూపం (దీన్నే దృగ్రూపం అంటారు.) దానికి ఏ రకమైన మార్పులూ లేవు. అది సమస్త బుద్ధులకూ సాక్షిగా వుంటుంది. అయినా సరే, ప్రక్కన బుద్ధి వంటి ఒక దృశ్యం చేరేసరికి "ఆత్మే దానికి కర్త" అని వ్యవహరిస్తారు, అజ్ఞులు! అంటే ఇది గుణాల అధ్యాసవల్ల కలిగిన వ్యవహారమే నన్నమాట! అంటే పరమాత్మకు పరమార్థతః కర్తృత్వం లేనే లేదన్నమాట!

కనుక నువ్వు ఈవిధంగా నేర్పుగా ఆలోచిస్తే , ఈ ప్రపంచం మీద అనురాగం వుండటానికి తగిన కారణమే కనిపించదునీకు!

కనుక ఓ రామా! నువ్వు మూడు రకాలుగా అనుసంధానం చేసే సావకాశం వుంది.

**కర్తా నాస్మి న చాహమస్మి స ఇతి జ్ఞాత్వైవమంతః స్ఫుటం**

**కర్తా చాస్మి సమగ్రమస్మి తదితి జ్ఞాత్వాథవా నిశ్చయమ్।**

**కోప్యేవాస్మి న కించిదేవమితి వా నిర్ణీయ సర్వోత్తమే**

**తిష్ఠ త్వం స్వపదే స్థితాః పదవిదో యత్రోత్తమాః సాధవః ॥**

(సర్గ 56 శ్లోకం 49)

**"కర్తా నాస్మి న చాహమస్మి స ఇతి జ్ఞాత్వైవమంతః స్ఫుటం"**

"నాకు కర్తృత్వాన్ని అంటగట్టే దేహాదులు నేను కాదు. ఈ ప్రపంచంలో ఏ పదార్థమూ నేను కాదు" – అని భావించవచ్చు.

**"కర్తా చాస్మి సమగ్రమస్మి తదితి జ్ఞాత్వాథవా నిశ్చయమ్"**

ఈ వాక్యంలో కవి ఒక మెలిక బెట్టాడు. "సమగ్రం" అనే పదాన్ని రెండు సార్లు అన్వయించేటట్లుగా వాడాడు. **"సమగ్రమ్ కర్తా చాస్మి"** అని ఒక అన్వయం. ఇక్కడ సమగ్రమనే పదం ద్వితీయా విభక్తి ఏకవచనం– "సమగ్రం తదస్మి" అని మరో అన్వయం. – ఇక్కడ సమగ్రం అనే పదం ప్రథమా విభక్తి ఏక వచనం ! దీనివల్ల వచ్చే విశేషార్థం ఏమిటంటే, రామా! ఈ ప్రపంచంలో కొంత భాగానికే గాదు – మొత్తానికీ నేనే కర్తను! అంతే కాదు – సర్వ సమష్టి స్వరూపమైన ఈ బ్రహ్మాండమంతా నేనే! అనేనిశ్చయంలో వుండు, ఇది రెండో పద్ధతి!

**"కోప్యేవాస్మి న కించిదేవమితి వా నిర్ణీయ సర్వోత్తమే"**

లేదా, నేను అదీ కాదు ఇదీ కాదు. నేనిలాటివాడ్నని నిర్ణయించి చెప్పేందుకు వీల్లేదు – అని భావించు! ఇది మూడో పద్ధతి.

రామా! ఈ మూడిట్లో ఏ రకంగా భావన చేసినా సరే, నువ్వు సర్వోత్తమమైన పరిపూర్ణ ఆనంద చిదాత్మ స్వరూపంలోనే వుంటావు. పూర్వం సాధన చేసిన బ్రహ్మవేత్తలైన ఉత్తమ సాధకులంతా యిలాగే భావన చేశారు. నువ్వు గూడా అలాగే చెయ్యి.

వశిష్ఠమహర్షి ఈ విధంగా 56 వ సర్గను పూర్తి చేసే సరికి, శ్రీ రాముడు ఆత్మ తత్వభావనలో కొంత కొంత లీనమై ఇలా ప్రశ్నించాడు.

## 43. వాసనాక్షయోపాయాలు

**శ్రీరాముడు:** గురుదేవా! నాకిప్పుడు స్పష్టంగా తెలుస్తోంది. మీరు చెప్పిందే సత్యం! ఈ ప్రపంచంలో సత్యత్వం ఎంత మాత్రమూ లేదు. కానీ నిత్య సత్య స్వరూపుడైన పరమాత్మ విషయంలో ఆయన ఉన్నాడనీ, లేడనీ, కర్త అనీ, అకర్త అనీ, పరిమితుడనీ, వ్యాపకుడనీ, ఇలాటి పరస్పర విరుద్ధ కల్పనలు ఎలా మొదలయ్యాయి.? సూర్యుడిలో మంచు వుండదు కదా! పరమాత్మలో భేదకల్పన వుండగలదా? – ఈ సందేహం తెగటంలేదు. తమరే తీర్చాలి.

**వశిష్ఠుడు:** రామా! నాకు సంతోషంగా వుంది. నీకు విషయం అర్థమైంది. కానీ వాసనాక్షయం ఇంకా కాలేదు. అందుకే ఈ ప్రశ్న నీకు కలుగుతోంది. అందుచేత దీనికి సరియైన సమాధానం రాబోయే నిర్వాణ ప్రకరణంలో, సిద్ధాంతోపదేశ సమయంలో, చెబుతాను. కనుక ఇప్పుడు వాసనాక్షయం లభించే ఉపాయాల గురించి మాట్లాడుతా.

రామా! **"బంధో హి వాసనా బంధో మోక్షస్స్యాత్ వాసనాక్షయః॥"** (57 సర్గ 19 శ్లోకం) వాసనా బంధమే బంధము! వాసనాక్షయమే మోక్షము!!

యోగశాస్త్రంలో చెప్పిన "మైత్రీ, కరుణా ముదితా, ఉపేక్ష"లనే నాలుగు వాసనలను అలవాటు చేసుకో. సుఖంగా వుండేవారి విషయంలో మైత్రిని భావన చేయాలి. దుఃఖంగా వుండేవారి విషయంలో కరుణను భావన చేయాలి. పుణ్యాత్ముల విషయంలో సంతోషాన్ని భావన చేయ్యాలి. పాపాత్ముల విషయంలో ఉపేక్షను భావన చేయాలి! ఉపేక్ష అంటే పట్టించుకోకపోవటం! ఈ విధంగా భావన చేస్తే మనస్సుకు ఒక ప్రసన్నత ఏర్పడుతుంది. దానివల్ల సమాధి నిష్ఠ కుదురుతుంది. అది బాగా కుదిరినాక, ఈ భావనలనుకూడా విడచిపెట్టి, స్థిరమైన అసంప్రజ్ఞాత సమాధిలో వుండు! **"శేషే స్థిరసమాధానే యేన త్యజసి తత్త్యజ"** (22 శ్లోకం 57 సర్గ) అప్పుడు నీయొక్క పరమార్థ స్వరూపం యేమిటో నీకే గోచరమవుతుంది.

రామా! దీన్ని సాధించేందుకు మరో ఉపాయం వుంది. ఇంద్రియ జయాన్ని సాధించిన మహానుభావులను మనం ఉపాసించాలి.

మరో ఉపాయం వుంది. ఎన్ని ప్రపంచాలున్నా , వాటిల్లో వుండేవి పంచభూతాలే! ఆరోది లేనే లేదు! ఈ పంచభూతాలు కూడా వాటికి అధిష్ఠానంగా వున్న బ్రహ్మ మీద అధ్యాసగా యేర్పడినవే! ఈ విషయాన్ని విచారణ మార్గం ద్వారా అనుసంధానం చేస్తే, భూలోక సుఖాలమీద గాని, స్వర్గలోక సుఖాలమీదగాని, పాతాళలోక సుఖాలమీదగాని, ప్రీతి పుట్టనే పుట్టదు.

వశిష్ఠమహర్షి ఈ విధంగా శ్రీరాముడు చేయవలసిన సాధన గురించి కొంత వివరించి, ఇక 58వసర్గలో ఇలా అన్నారు.

**వశిష్ఠుడు:** రామా! ఇలాంటి బంధరహితమైన, సర్వాత్మ భావ సహితమైన, అనుభూతి అసలు ఎవరికైనా ఉంటుందో వుండదో అని నువ్వు సందేహిస్తావేమో!

పూర్వం బృహస్పతి కుమారుడైన కచుడు ఈ రకమైన అనుభూతిని పొంది, అప్రయత్నంగా పాడిన పాటలు ఎలా వున్నాయో చూడు.

బృహస్పతి కుమారుడైన కచుడు "సంజీవినీ" విద్యకోసం పడిన పాట్లన్నీ కథలు కథలుగా అందరూ చెప్పుకుంటూనే వున్నారు. ఆ తరువాత అతడు ఏమయ్యాడో ఎవరూ పట్టించుకోరు. ఆ మహానుభావుడు గురుకులం వదిలిపెట్టినాక, అరణ్యంలో ఏకాంత వాసం చేస్తూ , చాలా కాలం బ్రహ్మ విద్యా సాధన చేశాడు. కొంతకాలానికి, అతనికి అద్భుతమైన ఆత్మ సాక్షాత్కారానుభూతి లభించింది. ఆనందం అగ్గలమై, గొంతు గద్గదమై, ఒక విధమైన ఆవేశంతో ఆయన అప్పుడు కొన్ని పాటలు పాడాడు.

**కిం కరోమి క్వ గచ్ఛామి**

**కిం గృహ్ణామి త్యజామి కిమ్।**

**ఆత్మనా పూరితం విశ్వం**

**మహా కల్పాంబునా యథా॥** (58సర్గ 5వ శ్లోకం మొదలుగా)

**"ఏమిచేసెద ఎందుపోయెద**

**ఏమి పట్టెద ఏమి విడిచెద**

**విశ్వమంతయు నేనె నిండితి**

**ప్రళయకాలపు నీటిలా"**

**"సుఖము దుఃఖము రెండు నేనే**

**అనుభవించెడి జీవి నేనే**

**జగతి సాధనలన్ని నేనే**

**అన్ని విధముల నేను నేనే"**

**"పైన నేనే క్రింద నేనే**

**వెనుక ముందులయందు నేనే**

**ఇచట నేనే అచట నేనే**

**నేను కలుగని చోటు లేదో"**

**"అణువు అణువు నేనే ఉంటిని**

**జగము లన్నీ కలవు నాలో**

**నిండు సంద్రపు పొంగు లాగా**

**నేను పూర్ణానందమైతిని"**

రామా! ఆ కచుడు ఈ విధంగా తన అనుభవాన్ని పాటలుగా పాడేవాడు. కనుక ఇలాంటి అనుభవం సత్యం అనటంలో నువ్వు సందేహించ నవసరం లేదు.

కనుక నువ్వు నిశ్చిత బుద్ధితో భోగ ప్రీతిని వదిలి పెట్టి, సర్వాత్మ భావాన్ని అభ్యసించు".

ఇది విని రాముడు కొంచెం ఆలోచించాడు. తను పరమార్ధ ౨6౨త్యమైన పరబ్రహ్మను గురించి సిద్ధాంత భాగ ప్రశ్నను వేస్తే, గురువుగారు నీకింకా ఆ సమాధానం వినే అర్హత రాలేదని తేల్చారు. కనుక వ్యావహారిక బ్రహ్మ గురించి మరిన్ని వివరాలు సేకరిద్దామనే ఉద్దేశంతో ఒక ప్రశ్న వేశాడు.

## 44. సూక్ష్మత్వం లోంచి స్థూలత్వం లోకి

**రాముడు:** గురుదేవా! హిరణ్యగర్భుడు అంటే పూర్వ కల్పంలో వున్న ఒకానొక మనస్సే గదా! మనస్సు అంటే సూక్ష్మ పదార్థం గదా. అది ఈ కల్పంలో హిరణ్యగర్భత్వాన్ని పొంది సృష్టి చేస్తోంది గదా! ఇలాంటి సూక్ష్మ పదార్థంలోనించి స్థూలపదార్థమయమైన ఈ ప్రపంచం ఎలా ఏర్పడుతోంది.? ఆ హిరణ్యగర్భుడు పదార్థాలకు సూక్ష్మత్వంనుంచి స్థూలత్వాన్ని ఎలా తీసుకు రాగలుగుతున్నాడు.? ఆ వివరాలు కొంచెం చెప్పండి.

**వశిష్ఠుడు:** అంతా సంకల్ప బలంయొక్క ప్రభావమేనయ్యా!

**సంకల్ప జాలరూపస్య**

**మనసా కల్పితాకృతేః।**

**అకరోత్తస్య సంకల్ప**

**లక్ష్మీః పదమథోత్తరే॥** (సర్గ 59 శ్లోకం 15)

రామా! పూర్వ కల్పంలోని సంకల్పాలే ఆయన స్వరూపం. వాటి వల్ల ఆయన మనస్సుతో కల్పించుకున్నదే ఇప్పటి ఈ రూపం. అందువల్ల ఆయనకున్న సంపదే సంకల్ప సంపద. ఆ సంకల్ప లక్ష్మియే ఎప్పటికప్పుడు పైమెట్టులో అడుగులు వేసింది.

ఉదాహరణ చెప్పు కోవాలంటే, ఆయనకు తేజస్సును గురించిన సంకల్పం వచ్చింది. ఆ సంకల్పంలోకి తనే ప్రవేశించాడు. దాంతో ఆ సంకల్పానికి ఒక ఆకారం యేర్పడింది. అదే సూర్యుడు! ఆ సూర్యుడే ఇప్పటికీ ప్రతి రోజూ మనకు కనిపిస్తున్నాడు. ప్రతి పదార్థం విషయంలోనూ సూక్ష్మత్వంనుంచి స్థూలత్వం వికసించే విధానం ఇదే!

అని ఈ విధంగా మొదలుబెట్టి వశిష్ఠ మహర్షి , మళ్లీ సృష్టి విధానాన్ని వర్ణించాడు. ఈ మాటు త్రిగుణాత్మకంగా సృష్టిని విశ్లేషించటం కోసం ఈ వర్ణనను రెండున్నర సర్గలకు పైగా పెంచాడు.

వీటిల్లో మళ్లీ ఎక్కడికక్కడ సాధానోపాయోలను కూడా ప్రస్తావించాడు. ఈ విషయాలన్నీ పూర్వం చెప్పుకున్నవే గనక ఆ వివరాల్లోకి పోవటం లేదు.

త్రిగుణాల సృష్టిలో చేసిన సృష్టి వర్ణనను, సాధనా వర్ణనను కూడా 62 వ సర్గలో వశిష్ఠమహర్షి ఏకీకృతం చేస్తూ, దాంతోనే ఈ స్థితి ప్రకరణాన్ని కూడా ముగింపుకు తెస్తూ , చివరికి ఇలా అన్నాడు.

**హితం మహాసత్వతయాత్మతత్వం**

**విధాయ బుధ్యా భవ వీతశోకః।**

**తవ క్రమేణైవ తతో జనోయం**

**ముక్తో భవిష్యత్యథ వీతశోకః॥** ( శ్లోకం 20 సర్గ 62)

రామా! నీలో సత్వగుణం పెంచుకో. నీ చిత్తం సత్వమయమైతే, నీకు ఆత్మ తత్వమే అత్యంత హితం అవుతుంది. సన్నిహితమౌతుంది. అనుభవ సిద్ధమౌతుంది. శోకం తొలగిపోతుంది. నువ్విలా చేస్తే , నిన్ను ఆదర్శంగా పెట్టుకుని ఇతరులు కూడా ఇలాగే శోకరహిత ముక్తి స్థితిని చేరు కుంటారు.

ఈ విధంగా వశిష్ఠమహర్షి స్థితి ప్రకరణాన్ని ముగించి, ఉపశమ ప్రకరణంలోకి ప్రవేశించబోతున్నాడు. మనంకూడా ఆయనతోపాటు ఆ ప్రకరణంలోకి ప్రవేశించే ముందు, ఒక్కసారి ఈ స్థితి ప్రకరణంలో వశిష్ఠమహర్షియొక్క ప్రబోధ సోపానాలు ఎలా పేర్చ బడ్డాయో సింహావలోకనం చేద్దాం!

## 45. స్థితిప్రకరణము- సింహావలోకనము

ప్రపంచంలో ఏ వస్తువుకైనా సరే ఆరు రకాలైన వికారాలు ఉంటాయని, ఇంచుమించుగా అందరు శాస్త్రకారులూ అంగీకరించారు. వీటినే “షడ్భావ వికారాలు” అని, వ్యవహరిస్తూ వుంటారు. అవి ఏమిటంటే, 1.జాయతే, 2.అస్తి 3.వర్ధతే 4.విపరిణమతే 5.అపక్షీయతే 6.వినశ్యతి”

వీటినే తెలుగులో చెప్పాలంటే

1.పుడుతోంది 2.ఉంది 3. పెరుగుతోంది 4.మార్పు చెందుతోంది 5.క్షీణించిపోతోంది 6.నశిస్తోంది

ఈ ఆరురకాల వికారాలు (మార్పులు) ఏపదార్థానికైనా తప్పవు. సులభంగా అర్థమయేందుకోసం ఒక ఉదాహరణ చెప్పుకుందాం.

చెట్టుమీద ఒక పువ్వు పూచింది. మర్నాటికి అది ఎండిపోయి, అక్కడ కాడలో కొంచెం ఉబ్బు వచ్చింది. దాన్ని గమనించిన రైతు “ఏదో పుడుతోంది –పుడుతోంది” అంటాడు. ‘జాయతే’ అంటే ఇదే!

ఆ మర్నాటికి కొంచెం పిందె వంటి ఆకారం తేలింది. రైతు దాన్ని ‘ఇదిగో పిందె వుంది’ అంటాడు. ‘అస్తి’ అంటే ఇదే!

ఇక రోజు రోజూ రైతు దాన్ని గమనిస్తూనే వున్నాడు. ఏ రోజు కారోజు అది పెరుగుతోంది. “వర్ధతే” అంటే ఇదే!

కొంతకాలానికి పెరగడం ఆగి పండుతుంది. 'విపరిణమతే' అంటే ఇదే.ఇంకా కొంత కాలం పోయేసరికి, అది క్రమంగా ఎండి, దాని ఆకారం కృశించిపోతోంది. "అపక్షీయతే" అంటే ఇదే!
చివరికో రోజున అది రాలిపోతుంది. "వినశ్యతి" అంటే ఇది!

ఈ ఉదాహరణలో లాగా ఇంత స్పష్టంగా కనిపించకపోయినా, ప్రపంచంలోని ఏ పదార్థానికైనా ఈ ఆరు రకాల మార్పులూ తప్పనే తప్పవు.

వీటిలో 'జాయతే' అన్న స్థితిని, "ఉత్పత్తి" గానూ, "నశ్యతి" అనే స్థితిని 'సంహారం' గానూ లోకంలో అందరూ గుర్తిస్తూనే వుంటారు. ఈ మధ్యలో నాలుగు దశలున్నాయి. "అస్తి –(ఉన్నది) వర్ధతే (పెరుగుతోంది) విపరిణమతే(పండుతోంది) అపక్షీయతే(తగ్గిపోతోంది) – అని! ఈ నాలుగింటినీ కలిపి, లోకులు సామాన్యంగా "స్థితి" అనేస్తూ వుంటారు. వశిష్ఠమహర్షికూడా ఈ పదాన్ని ఈ అర్థంలోనే తీసుకున్నాడు.

ప్రపంచంలో ఏ పదార్థానికైనా సరే, ఉత్పత్తి లేనిదే, స్థితి ఉండదు! నాశనం అయిపోయిన తరువాత, మళ్లీ వెనకాల దానికి స్థితి వుండదు! ఇది లోకంలో అందరూ గట్టిగా విశ్వసించే విషయం!

ఈ విశ్వాసం ఎంతవరకు సత్యం?– అనేదాన్ని చర్చించేందుకు మాత్రమే వశిష్ఠమహర్షి ఈ స్థితి ప్రకరణం మొదలు పెట్టాడు.

వెనుకటి ప్రకరణంలో ఈ ప్రపంచానికి ఉత్పత్తే లేదు అని ఆయన నిరూపించాడు. ఉత్పత్తే లేనిదానికి "స్థితి" ఎక్కడ నుంచి వస్తుంది? లేని దానికోసం చర్చ ఏమిటి? –అనే ప్రశ్నకు సమాధానంగా ఆయన ఈ ప్రకరణాన్ని "భార్గవోపాఖ్యానం" తో ప్రారంభించాడు.

ఈ కథలో శుక్రకుమారుడు భూలోకంలో కొండమీద తపస్సు చేసుకుంటూ వుండగా, స్వర్గ లోకంలో అతనికి రెండో శరీరంతో భోగానుభవం ప్రారంభమైంది. ఈ రెండవ శరీరానికి ఉత్పత్తి ఎప్పుడు జరిగింది? దానికి ఉత్పత్తి లేదు. "జాయతే" అనే మాట లేదు. "అస్తి"తో ప్రారంభమైపోయింది. "స్థితి" కొనసాగింది. ఈ స్థితి ఏమైనా కలవంటిదా? "గారడీ" వంటిదా? కాదే! ఆ శరీర స్థితికి కొన్ని జన్మల కథ నడిచింది. చివరికి శుక్రకుమారుడు
మృత్యు దేవతయొక్క ఉపదేశబలంవల్ల, తన పాత శరీరంలోకి ప్రవేశించి, తన కొత్త శరీరాన్ని తనే తగలబెట్టాడు. అంటే–'**అస్తి**' తో ప్రారంభమైన శుక్ర కుమారుడి రెండవ శరీరం **"వర్ధతే"** – **"విపరిణమతే"**, **"అపక్షీయతే"** అనే దశలను దాటి, **"నశ్యతి"**– నశించిపోయింది– అనే చివరి దశ దాటి నాక కూడా, అసలు శుక్ర కుమారుడు ఇంకా "అస్తి", లోనే. వున్నాడు. అంటే, నాశనం తర్వాత మళ్లీ స్థితి కనిపిస్తోంది. ఇది మేధావులంతా ఆలోచించవలసిన చిక్కు సమస్య.

వేదాంతులు ఈ ప్రపంచం "మిథ్య" అని చెప్పడం కోసం, ఎంతసేపటికీ, స్వప్నాన్నీ, గారడినీ, భ్రాంతినీ, ఉదాహరణలుగా చూపిస్తూ వుంటారు. ఎప్పుడు చూసినా ఇవే ఉదాహరణలా అని ఒకోసారి శిష్యులకు సందేహం కలుగుతూ వుంటుంది. అలాటి సందేహాలకు తావు లేకుండా వుండటం కోసమే వశిష్ఠమహర్షి ఈ కల్ప ప్రారంభంలో జరిగిన ఒక యథార్థ సంఘటనను, ఉదాహరణగా తెచ్చి శ్రీరాముడి ముందు ఉంచాడు. కల్పం ప్రారంభంలో ప్రప్రథమ కృతయుగ ప్రారంభంలో, అనేకమంది విచిత్ర జీవులు జన్మించారనీ, అందులో శుక్రకుమారుడి విచిత్ర జీవిత చరిత్ర ఇలా వుందనీ ఆయన చెప్పాడు.

ఈ కథ ద్వారా ఆయన మనకు "కెమేరా"ను "జూమ్" చేసి, ఒక విచిత్రమైన స్థితిని "ఫోకస్" చేసి, "ఎన్‌లార్జ్" చేసి, పెద్దదిగా చూపిస్తున్నాడు. అదే "ఉత్పత్తి" లేని "స్థితి". ఉపశమం తరువాత కూడా కొనసాగుతున్న స్థితి. వెనకా ముందూ కూడా లేని స్థితిని ఏమనాలి? "మిథ్యా స్థితి" అనాలి– అంతకంటే మరో మార్గం లేదు. ఈ "స్థితి ప్రకరణం" మొత్తానికి సారాంశమైన భాగమంతా ఈ కథలోనే ఇమిడ్చేశాడు వశిష్ఠమహర్షి.

ఆయన ఇమిడ్చినంత మాత్రాన ప్రశ్నలాగుతాయా? ఇలాటి స్థితి ఎలా సంభవిస్తుంది? అది ఎలా సాధ్యం అవుతుంది? అనే ప్రశ్నలు శిష్యుణ్ని వేధిస్తూనే ఉంటాయి.

ఈ ప్రశ్నలకు సమాధానంగానే వశిష్ఠమహర్షి "దామవ్యాల కటోపాఖ్యానం" చెప్పాడు. ఈ కథలోగల అంతరార్థాలగురించి అప్పుడే వివరంగా చెప్పుకున్నాం.తాడుమీద వ్యాళానికి (పాముకు) స్థితి వచ్చింది. మరోసారి, అదే దారం మరొరకంగా మెలికలు పడ్డప్పుడు, దానిమీద కటానికి (చాపకు) స్థితి వచ్చింది. దీనినే ఆయన దామవ్యాల కటోపాఖ్యానంగా చెప్పాడు. కానీ ఇక్కడ కూడా కల్పించిన కథ చెప్ప లేదు. జరిగిన కథే చెప్పాడు. ఈ కథలో ఆయన మళ్లీ ఉత్పత్తిలేని స్థితినే వర్ణించాడు. అయితే ఇది పరాధీనమైన స్థితి . శంబరుడనేవాడి యొక్క స్థితిమీద ఆధారపడి దామ, వ్యాల, కటులనే ముగ్గురియొక్క స్థితి యేర్పడింది. అదే శంబరుడియొక్క స్థితి మీద ఆధారపడి, రెండవసారి భీమ, భాస, దృఢులు అనే వారి స్థితి ఏర్పడింది.

అయితే ఈ కథలో వశిష్ఠమహర్షి ఉత్పత్తి లేని స్థితిని నాశనం తరువాత కొనసాగే స్థితిని ఫోకస్ చెయ్యలేదు. ఇలాటి ఉత్పత్తిలేని స్థితి ఎంతకాలం కొనసాగుతుంది? అది ఎప్పుడు పోతుంది?అది ఎలా పోతుంది? అనే అంశం మీద ఆయన ఫోకస్ చేశాడు. అందుకనే ఈ కథ తరువాత జరిగిన చర్చలో ఆయన శ్రీరాముడికి ఇలా బోధించాడు.

**కుతో జాతేఽ యమితి తే**

**రామ మాస్తు విచారణా।**

**ఇమాం కధమహం హన్మీ**

**త్యేషా తేస్తు విచారణా॥** (సర్గ 41, శ్లోకం 31,32)

రామా! ఈ మాయ ఎక్కడ్ణించి పుట్టింది? ఎందుకు పుట్టింది? ఎలా పుట్టింది ? అనే విచారణ నీకు వద్దు. దీనిని నేను పోగొట్టుకునేదెలాగ? అనే విచారణమాత్రమే నువు చెయ్యి".

ఈ బోధకు అనుగుణంగానే "దామవ్యాళ కటుల" యొక్క దుఃఖ పరంపర సమూలంగా నశించిపోవాలంటే, వారియొక్క చరిత్రంతా ఆమూలాగ్రంగా తెలిస్తే చాలు– అని యముడి చేత చెప్పించాడు. చరిత్ర ఆమూలాగ్రంగా తెలియటమంటే –"తమయొక్క స్థితి అంతా ఆ "శంబరుడి" మీద ఆధారపడివున్న స్థితి మాత్రమే అని, ఆ మాట మధ్యలో మరిచిపోవటంవల్లనే తమకు ఇన్ని జన్మలూ వచ్చాయనీ" – అని అర్థం!

దామవ్యాలకటులయొక్క స్థితి శంబరుడిమీద ఆధారపడివుంది. మరిమనలాటి సామాన్య జీవుల స్థితో?! అది "మూలావిద్య" మీద ఆధారపడి వుంది. అంటే "అజ్ఞానం" మీద ఆధారపడివుంది. ఈ మాట తెలుసుకుంటే చాలు, ఆజ్ఞానం తొలగిపోతుంది! మనం సంసార బంధ నిర్ముక్తులమై పోతాం. ఇదే వశిష్ఠమహర్షి దామవ్యాళ కటోపాఖ్యానంలో కేంద్రీకరించి చెప్పిన మాట!

అందుకే ఈ కథానంతర చర్చలో, ఆయన మనస్సు శమించపోయే ఉపాయాల గురించి ఎక్కువగా వివరించాడు. మనస్సు శమించి పోవటం అన్నా, మూలావిద్య శమించి పోవటం అన్నా – ఒకటే! దీనికి ఉపాయం, ఆత్మ విచారణమే! ప్రపంచ మిథ్యాత్వ విచారణమే! దీనిని నొక్కి చెప్పేందుకే వశిష్ఠమహర్షి "కదంబ దాశూరోపాఖ్యానం " చెప్పాడు.

కదంబ దాశూరుడు– ఈ పేరే విచిత్రమైన పేరు! **"కమ్ - వాయుమ్- దమయతీతి కదంబః"** వాత రోగాలను కుదిర్చేది కదంబవృక్షం! ఇది మామూలు అర్థం! వాతం అనగా వాయువును శమింప జేసేవాడు. అంటే, ప్రాణాయామం ద్వారా ఉచ్ఛ్వాస నిశ్వాసలను తగ్గించుకునేవాడు – అని ఇక్కడ ప్రకరణార్థం.

**"చలే వాతే చల చిత్తం - నిశ్చలే నిశ్చలం భవేత్"** – అని యోగశాస్త్ర సిద్ధాంతం! అంటే, మనిషిలో గాలి కదులుతుంటే, మనస్సుగూడా కదులుతుంది, గాలి నిలిచిపోతే మనస్సు గూడా నిశ్చలమౌతుంది – అని అర్థం.

ఈ దాశూరుడు అటువంటి నిశ్చల మనస్థితిని సాధించినవాడు కనుక, ఆయన "కదంబ దాశూరుడు". కథలో ఆయన కదంబ వృక్షంమీద కూర్చున్న దాశూరుడు.

దాశూరుడు అంటే ఏమిటి? ఇక్కడ కవి కొంచెం మెలిక పెట్టాడు. **"దాశ దానే"** అనే ధాతువు వుంది. దాన్ని బట్టి **"దాశః"** అంటే దానము అని అర్థము. దీన్ని బట్టే, విష్ణువుకు "దాశార్హుడు" అనే పేరు వచ్చింది. **"దాశార్హఃసాత్వతాంపతిః"** అని విష్ణుసహస్రనామం! దానమునందు శూరుడు "దాశశూరుడు" అతడే "దాశూరుడు"

దానమంటే ఏమిటి? తనకు ఉన్నదాన్ని వదిలి పెట్టడమే దానము! దీనికే మరోపేరు త్యాగము! మరో పేరు సన్న్యాసము! అన్నిటినీ పరిత్యజించటంలో శూరుడు దాశూరుడు! మన కథలోని దాశూరుడు, కామంతోపాటు క్రోధాన్ని కూడా పరిత్యజించిన శూరుడు! అందుకే వనదేవతవచ్చి సంతానం ఇమ్మని ప్రార్థించినప్పుడు కోప పడనూ లేదు, వ్యామోహపడనూ లేదు. అందుకే అతను త్యాగశూరుడు. అతడే దాశూరుడు.

దానం అంటే విద్యోపదేశం కూడా! విద్యలలో గొప్పది బ్రహ్మవిద్య! దానిని కథలు కథలుగా, నేర్పుగా, ఉపదేశించగల విద్యా దానశూరుడు, దాశూరుడు!

ఈ ఉపాఖ్యానం చివరి భాగంలో అతని విద్యా దాన విధానాన్ని చూసి వశిష్ఠ మహర్షే మెచ్చుకున్నాడని కథలో ప్రస్తావించడం జరిగింది.

ఈ కథ ద్వారా వశిష్ఠమహర్షి స్థితికి సావకాశంలేని వృక్షాగ్రభాగంమీద దాశూరుడి యొక్క స్థితిని ప్రస్తావించినా, ఆ అంశాన్ని ఇప్పటికే రెండు సార్లు బోధించాడు గనుక, ఈ మాటు దానిమీద కేంద్రీకరణం పెట్టుకోలేదు. మూలాజ్ఞాననివృత్తి కోసం సాధకుడు అనుసరించవలసిన చిత్త శమన ఉపాయాల గురించి, జగన్మిథ్యాత్వ విచారణ గురించి, మాత్రమే కేంద్రీకరణ చేశాడు – అంటే ఫోకస్ చేశాడు.

ఇలాటి అజ్ఞాన రహిత జీవన్ముక్త స్థితి పెద్దల అనుభవంలో వుంది అని చెప్పటం కోసం, వశిష్ఠమహర్షి, బృహస్పతి పుత్రుడైన కచుడియొక్క బ్రహ్మవిద్యాసాధనను ప్రస్తావించి, అక్కడ్నించి మళ్ళీ జగత్ స్థితి యొక్క వరుసను సత్వరజస్తమోగుణాలనే త్రిగుణాల దృష్టితో మరోసారి విశ్లేషణచేసి, చిత్తానికి సత్వగుణాన్ని వృద్ధి పొందించు కోవటం ద్వారా, చిత్తరహిత స్థితిని, శోకరహిత స్థితినీ, అందుకోమని బోధిస్తూ , ఈ స్థితి ప్రకరణాన్ని ముగించి ఇక

"ఉపశమ ప్రకరణం" లోకి ప్రవేశిస్తున్నాడు.

మనం కూడా వెనుకటి కథా ఘట్టాలను గ్రంథాలద్వారా మరొకసారి పర్యాలోచన చేసుకుని, ఈ సింహావలోకనాన్ని కూడా బాగా మననం చేసుకుని, ఇక వశిష్ఠ మహర్షితోపాటు "ఉపశమ" ప్రకరణంలోకి ప్రవేశిద్దాం.

జయగురుదత్త

# యోగ వాశిష్ఠ హృదయము

## పంచమ భాగము

## ఉపశమ ప్రకరణము



శ్రీ కుప్పా వేంకట కృష్ణమూర్తి

విషయసూచిక

ఓం

# యోగవాశిష్ఠ హృదయము

## ఉపశమ ప్రకరణము

ఇంత వరకు జరిగిన వసిష్ఠబోధ అంతా– "యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి,"–అనే వేద వాక్యాన్ని ఆధారంగా చేసుకుని జరిగిందనీ, ఆ వరసలోనే జగదుత్పత్తిని, జగత్ స్థితినీ గూడా విశ్లేషించుకుంటూ వచ్చారనీ, పూర్వమే చెప్పుకున్నాం.

ఆ వరసలోనే "ఉత్పత్తి–స్థితి ప్రకరణాలు" వచ్చాయి. "ఉత్పత్తి ప్రకరణం"లో జగత్తుయొక్క ఉత్పత్తి అంతా చూసేవాడి మనస్సు మీద ఆధారపడి వుందని నిరూపించారు. "స్థితి ప్రకరణం"లో జగత్తు యొక్క స్థితి అంతా చూసేవాడి మనస్సు మీద మాత్రమే ఆధారపడివుందని నిరూపించారు. ఇక యిప్పుడు ఏం చెప్పాలి? జగత్తు యొక్క నాశం కూడా చూసేవాడి మనస్సు మీదే ఆధారపడి వుందని చెప్పాలి.

జగత్తు యొక్క నాశం మనస్సు మీద ఎలా ఆధారపడి వుండగలదు? మనస్సు అంటూ వుంటే, దానివల్ల ఏదో ఒక రకమైన జగత్తుయొక్క ఉత్పత్తో స్థితో; జరిగే తీరుతుంది. అలాంటి జగత్తుకు మనస్సువల్ల నాశం వచ్చే ప్రసక్తే లేదు.

అందువల్ల మనస్సు లయించిపోతేనే జగత్తు లయించి పోతుందనీ, దానికి మరొక ఉపాయం లేదనీ, పూర్వమే చాలా సార్లు చెప్పారు. మనోలయంకోసం గట్టి ప్రయత్నం చేసుకోమని కూడా శ్రీ రాముడికి వసిష్ఠుడు అనేక సార్లు ఉపదేశం చేశాడు. ఆ ఉపదేశం గూడా జరిగిపోతే యిక జగత్తు యొక్క నాశం గురించి చెప్పవలసినది ఏమి మిగిలి వుంటుంది?– ఏమీ వుండదు.

అందుకే వసిష్ఠ మహర్షి జగన్నాశం గురించి మాట్లాడ దలుచుకోలేదు. ఆయన మనస్సు యొక్క నాశం గురించి మాట్లాడదలుచు కున్నాడు. ఆ మాట కొస్తే ఆయనకు "నాశం" అనే మాటే నచ్చలేదు. మనస్సుయొక్క "ఉపశమం" అన్నాడు. "ఉపశమం" అంటే అణిగిపోవటం. పిడకలోని నిప్పు వెలిగినంతసేపు వెలిగి చల్లారిపోవటం! మనస్సు అలా చల్లారిపోతే, ఈ జగత్తు కాలిన పిడక లాగా, వుండి కూడా లేనిదే అయిపోతుంది,అణగారిపోతుంది, ఉపశమించిపోతుంది!.

అయితే, ఈ మనస్సు ఉపశమించేది ఎలా? దానికి ఉపాయాలేమిటి? అవి ఎన్ని రకాలు? అది ఉపశమించే తీరులు ఎన్ని?– అనే అంశాలను తీసుకోదలుచుకున్నాడు వసిష్ఠ మహర్షి అంటే ఇప్పటి దాకా జరిగిన సిద్ధాంత చర్చను, ఇక మెల్లిగా సాధనామార్గాల చర్చల్లోకి మళ్లించదలుచుకున్నాడు. అందు కోసమే ఈ ఉపశమ ప్రకరణాన్ని ఆయన అందుకున్నాడు. ఇది 5000 శ్లోకాల ప్రకరణం.

### 1. కలం మెరుపు

వాల్మీకి మహర్షి గొప్ప కవితాశిల్పి . ఆయన వసిష్ఠుడి బోధనా ప్రవాహంలో వచ్చే మలుపును తన రచనలో అందంగా చూపించాడు. ఎలాగంటే– ఇప్పటికి పది రోజుల చర్చ జరిగింది. ప్రతిరోజూ, పొద్దునా సాయంత్రం ఉపదేశాలు జరుగుతూనే వున్నాయి. ఈ పదకొండో రోజున మాత్రం వసిష్ఠ మహర్షి మధ్యాహ్నం

పన్నెండు గంటలకే సభ చాలించేశాడు.

'మళ్ళీ రేప్పొద్దున కలుద్దాం' – అన్నాడు.

వాల్మీకి కలం ఇక్కడో మెరుపు మెరిపించింది. ఇంత వరకూ లేనిది ఆయన ఇప్పుడు వసిష్ఠుడి ఆహ్నిక కృత్యాలనూ, రాజుల అనుష్ఠానాలనూ, విశేషించి రాజ పుత్రులైన శ్రీరామ సోదరులు– ఆ మధ్యాహ్నామూ, ఆ సాయంత్రమూ కూడా చేసిన అనుష్ఠానాలనూ వివరంగా వర్ణించాడు.

అందరితో కలిసి శ్రీరాముడు కూడా ఆ అనుష్ఠానాలన్నీ యథా విధిగానే చేశాడు. కానీ ఆయన మనస్సు మాత్రం ప్రతి క్షణమూ వసిష్ఠుడి మాటలనే తలచుకుంటోంది ఎంత తదేకంగా ఆయన ఆ మాటలను తలుచుకుంటోందంటే– **"కరిణీం కలభో యథా"**–

యవ్వనారంభంలో వున్న గున్న ఏనుగు ఆడ ఏనుగును తలుచుకున్నంత గట్టిగా తలుచుకుంటోందట! ఇక్కడ కలభ శబ్దానికి యవ్వనారంభంలో వున్న గున్న ఏనుగని చెప్పటమే సముచితం! మగ ఏనుగులు తదేక దృష్టితో ఆడ ఏనుగుల వెంటపడతాయనేది ప్రసిద్ధమేగదా! రాముడు కూడా, అలాగే, తదేక దృష్టితో వశిష్ఠుడి వాక్యాలను మళ్లీమళ్లీ నెమరువేసుకుంటూనే వున్నాడు.

రాత్రి అయింది. మిగిలిన సోదరులకు పెందలాడే నిద్ర పట్టింది. కాని రాముడికి మాత్రం కంటిమీదికి కునుకైనా రాక, మంచం మీద లేచికూర్చున్నాడు.

ఆ బాల రాముడి ధారణ ఎంత గొప్పదో! మొదటి ప్రకరణం దగ్గర్నించీ, యిప్పటివరకూ వసిష్ఠ మహర్షి చెప్పిన ప్రతి విషయాన్నీ అదే వరసలో ఒక సారి ఆవృత్తి చేసుకున్నాడు. ప్రతివిషయాన్నీ తరచి తరచి చూసుకున్నాడు.

అది చాలక తన సొంత మార్గంలో మళ్లీ తను కొంత తత్త్వ చర్చ చేసుకున్నాడు.

**కి మిదం నామ సంసార**

**భ్రమణం కి మిమే జనాః ।**

**భూతాని చ విచిత్రాణి**

**కి మాయాంతి ప్రయాంతి కిమ్ ॥** (2సర్గ, శ్లోకం14)

ఈ సంసారం యేమిటి? ఈ జనాలేమిటి? ఈ పంచ భూతాలేమిటి? ఇవన్నీ ఎక్కణ్ణించి వస్తున్నాయి? ఎలా వస్తున్నాయి? ఎక్కడికి పోతున్నాయి? ఎలా పోతున్నాయి?

ఈ విధంగా కొంత సొంత చర్చ అయినాక, మళ్లీ వసిష్ఠుడి వాక్యాలను వరుస ప్రకారంగా, అధ్యాయాల ప్రకారంగా, మననం చేశాడు.

ఆ రాత్రి అలాగే తెల్లవారిపోయింది. తెల్లవారు జామునే రాజులను నిద్రలేపే మంగళ వాద్యాలు మొదలైనాయి. శ్రీరాముడు ఎలాగూ లేచేవున్నాడు గనుక, వెంటనే స్నానం చేశాడు. ప్రాతరనుష్ఠానాలన్నీ చేశాడు. ఆయన తమ్ముళ్లు ఆయన్ను అనుసరించారు. అనుష్ఠానాలు త్వరగా పూర్తి చేసుకుని శ్రీరాముడు వసిష్ఠాశ్రమానికి వెళ్లాడు. ఈయన వెళ్లే సరికి ఆయన సమాధిలో వున్నాడు. శ్రీరాముడు దూరంగానే నిలబడిపోయాడు.

పూర్తిగా తెల్లవారింది. చాలామంది రాజులూ, రాజపుత్రులు, మునులూ, మునిపుత్రులూ, అక్కడికి చేరుకున్నారు. దాంతో వసిష్ఠుడు సమాధి చాలించి, అందర్నీ పలకరించాడు. ఆ తరువాత తన ఆశ్రమంలోనే

బసచేసివున్న విశ్వామిత్రమహర్షిని వెంట బెట్టుకుని, దశరథ సభకు రథంమీద బయల్దేరాడు. శ్రీరామాదులంతా ఆయనకు స్వాగతాలు చెబుతూ ముందు నడిచారు.

అందరూ సభలో కూర్చున్నారు. దశరథ మహారాజు వసిష్ఠ మహర్షిని, అనేక విధాలుగా కుశల ప్రశ్నలడిగాడు. మీరు మాట్లాడి మాట్లాడి అలసిపోతున్నారన్నాడు. ఆయన బోధనారీతిని స్తోత్రం చేశాడు. మంచి ప్రశ్నలు వెయ్యమని శ్రీరాముణ్ని ప్రోత్సహించాడు.

ఈ విధంగా ఈ పదకొండవరోజునాటి బోధదగ్గర ఆహ్నిక కృత్యాలనూ, అనుష్ఠానాలనూ వర్ణించడం మాత్రమే కాక, శ్రీరాముడి మనన ప్రక్రియను గూడా విస్తారంగా వర్ణించడంలో కొన్ని ప్రత్యేక సూచనలున్నాయి.

ఎంతటి వేదాంతనిష్ఠులైనాసరే, తత్త్వజ్ఞాన స్థిరులైనాసరే, శాస్త్రవిహితమైన నిత్యానుష్ఠానాలను మానరాదు.– అని వసిష్ఠ మహర్షి తన ఆచరణతో నిరూపిస్తూన్నాడు. అలాగే తత్త్వాసక్తులైన సాధకులకు ఎంత వైరాగ్యం వున్నా, తత్వమననం మీద ఎంత శ్రద్ధ వున్నా, ఏ కాలానికి చేయవలసిన అనుష్ఠానాలను ఆ కాలంలో చేయక తప్పదు. ఈ విషయాన్ని శ్రీరాముడి ద్వారా కవి నిరూపిస్తున్నాడు.

ఇక పోతే, వసిష్ఠుడు ఆ నాటి సాయంత్రం బోధ ఎందుకాపినట్టు?

ఎందుకంటే, తత్త్వబోధ వింటూ పోతే చాలదు. విన్నదానిని వంట పట్టించుకోవాలి. ఎప్పటి కప్పుడు మననం చేసుకోవాలి. కొత్త ప్రశ్నలు లేవనెత్తుకుని, తనే సమాధానం చెప్పుకుంటూ వుండాలి. గురువైనవాడు దానికి సమయం యిచ్చి, తరువాత పాఠాలు చెప్పాలి.

నిన్నటి వరకూ, సిద్ధాంత భాగ చర్చ జరిగింది. ఇక యివాళ్టి నించీ, చెప్పుకున్న సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టించే అనుష్ఠాన భాగ చర్చ జరగవలసి వుంటుంది. అందువల్ల వసిష్ఠుడు ఇక్కడ రాముడికి కొంత అధిక సమయాన్ని మననం కోసం వదిలిపెట్టదలచాడు. అందుకే బడికి ఒక పూట శెలవిచ్చేశాడు.

ఇది మనం ఊహించి చెప్పుకునే మాటగాదు. వసిష్ఠుడే స్వయంగా చెప్పాడు. పదకొండో నాటి ఉదయసభలో, దశరథుడు శ్రీరాముణ్ని మంచి ప్రశ్నలు వెయ్యమని ప్రోత్సహించాడు. కానీ వసిష్ఠుడు, రాముడికి ఆ సావకాశం యివ్వలేదు, ఆయనే ప్రశ్నించటం మొదలుపెట్టాడు.

**“కచ్చిత్ స్మరసి వాక్యార్థమ్**
**పూర్వాపర విచారితమ్**
**..........................**
**.......................**
**కచ్చిత్ స్మరసి సర్వాసాం**
**విభాగమరిమర్దన**
**..........................**
**..........................**
**వాక్యార్థశ్చాఖిలః కశ్చిత్**
**త్వయా రామ విచారితః**
**హ్యస్తనస్య విచారస్య**
**రాత్రౌ హృదినివేశితః ”** (4వ సర్గ, 11వ శ్లోకం)

"రామా! నేను చెప్పిన మాటలన్నీ పూర్వాపర విచారణ చేసుకుంటూ స్మరించావా? నేను విషయాన్ని ఎన్ని రకాలుగా విభాగాలు చేశానో గుర్తు చేసుకున్నావా? నేను చెప్పిన వాక్యాల అర్థమంతా పూర్తిగా విచారణ చేసుకున్నావా? ఎటువంటి బోధ అయినా హృదయంలో మళ్లీ మళ్లీ మననం చేసుకున్నవాడికే ఫలితాలనిస్తుంది సుమా!" అన్నాడు వసిష్ఠుడు. అంతే గాదు, వసిష్ఠుడు కూడా తను ఏ వరసలో విషయాలను చెప్పాడో ఆ విషయాలను సూత్రప్రాయంగా ఏకరువు పెట్టి ఇవన్నీ గుర్తున్నాయా? అని రాముణ్ని నిగ్గదీశాడు.

అంత మాత్రమే గాక " హ్యస్తనస్య విచారస్య రాత్రౌ హృది నివేశితః" – ఏ రోజుకారోజు నిన్న చెప్పిన విషయాన్ని ఆ రాత్రికి మననం చేసి హృదయంలో నిలుపుకున్నావా?– అని అడిగాడు. దీనిని బట్టి ఒక పూట బోధ ఆపటంలో వసిష్ఠుడి ఉద్దేశం ఏమిటో స్పష్ట మౌతోందిగదా?

శ్రీ రాముడు వసిష్ఠుడి ప్రశ్నకు మంచి సమాధానం యిచ్చాడు.

**అపాస్త నిద్రేణ మయా ,**
**వాక్యార్థో హృది చింతితః** (సర్గ 4, శ్లోకం 26)
" రాత్రల్లా నిద్రమాని మరీ మననం చేశానండీ"– అన్నాడు.

## 2. పుట్టేది పెరిగేది మనస్సే

అక్కడి వరకూ చెప్పిన సిద్ధాంతంలో ప్రశ్నించాల్సిందేమీ కనిపించలేదు కనక శ్రీరాముడేమీ ప్రశ్నించలేదు. అందువల్ల వసిష్ఠుడే అందుకున్నాడు. ఆయన యిలా అన్నాడు.–

"శ్రీ రామా! ఇక నీకు ఉత్తమమైన ఉపశమ ప్రకరణం చెబుతాను, విను.

రాజస తామస జీవులు సుదీర్ఘ మైన ఈ సంసారమాయను, స్తంభాలు భవనాన్ని మోసినట్లుగా, నెత్తి మీద పెట్టుకు మోస్తూవుంటారు. నీ లాంటి సాత్త్విక జీవులు మాత్రం, పాము కుబుసాన్ని విడిచినంత తేలిగ్గా దాన్ని విడిచిపెట్టేస్తారు. అలావిడిచి పెట్టడానికి తత్త్వ విచారణ ఒక్కటే ఉపాయం! మొదటా చివరా గూడా ఏదిలేదో, అది మధ్యలో కనిపించినా కూడా సత్యం కాదు. మూడు కాలాలలోనూ నిత్యంగా వుండేదే సత్యం! లేని వస్తువు మధ్యలో పుట్టినట్లు, ఉన్నట్లు, ఎలా కనిపిస్తోంది? ఏదీ పుట్టటం లేదు! ఏదీ పెరగటం లేదు. ఇదంతా మనస్సు చేసే గోలే!.

**జాయతే మన ఏవేహ**
**మన ఏవ వివర్ధతే ।**
**సమ్యగ్దర్శన దృష్ట్యా తు**
**మన ఏవ హి ముచ్యతే!॥** (సర్గ 5 , శ్లోకం11)

ఇక్కడ పుట్టేది మనస్సే! పెరిగేదీ మనస్సే! తెలివి గల చూపుతో చూస్తే, ముక్తిని పొందేది గూడా మనస్సే!

**రాముడు**: గురుదేవా! ఈ విషయం మీరు పూర్వమే స్పష్టంగా చెప్పారు. సంసారమోహంలో పడే సంసారి ఎవరంటే అది మనస్సే. జరామరణాలను పొందేది కూడా మనస్సే–ఇది ఖాయం! ఈ మాట అర్థమయింది,

ఇక  ఈ మనస్సును దాటిపోయే ఉపాయమేమిటో చెప్పండి.

**వసిష్ఠుడు**: రామా! విను.

1. మొదట మంచి శాస్త్రాలను అభ్యసించాలి.
2. సజ్జనుల సాంగత్యం చేసి సాధన చతుష్టయ సంపత్తిని  సంపాదించుకోవాలి.
3. మనస్సును పరిశుద్ధం చేసుకోవాలి,అంటే, స్వచ్ఛమైన వైరాగ్యాన్ని తెచ్చుకోవాలి.
4. అది కలిగినాక, ఏ రకమైన ఆత్మాభిమానమూ లేకుండా ఒక జ్ఞాన గురువు నాశ్రయించాలి.
5.  వారు మొదట సగుణమైన ఈశ్వరోపాసన చెయ్యమని ఉపదేశిస్తే, అలా చేస్తూ, ధ్యానార్చనాదుల ద్వారా ఆ దేవతను ఉపాసించి, ఆ దేవతానుగ్రహం పొందాలి.
6. అప్పుడు ఆత్మ తత్త్వ విచారణ చెయ్యాలి.
7. అప్పుడు, నిధి శాస్త్రజ్ఞుడు మట్టిలో కలిసి పోయివున్న  బంగారు రేణువులను గుర్తు పట్టినట్లుగా, ఈ జీవుడు తనలో  అతి సూక్ష్మంగా అణిగిపోయివున్న పరమాత్మ తత్త్వాన్ని గుర్తించగలుగుతాడు.

రామా! ఇవి మెట్లు !  ఈ వరసలో ముందుకుసాగితే " పరమాత్మ వేరు– దేహధారి అయిన సంసారి వేరు", అనే విషయం స్పష్టమవుతుంది. తామరాకు నీటి మీద వున్నా, దాని మీద మళ్లీ నీటి బిందువు వున్నా, ఇవి  ఒక దానికి ఒకటి అంటవు. అలాగే పరమాత్మకు జీవత్వం అంటదు. సంసారిత్వం అంటదు.అవి రెండూ పరస్పర విభిన్న పదార్థాలు!  ఐనాసరే ఆ పరిపూర్ణ పరమాత్మకు దేహ ధారణం జరిగినట్లు, ఆయన సంసారి అయిపోయినట్లు, భ్రాంతి కలుగుతోంది. దీని కారణం పాపిష్ఠి మనస్సే. ఈ విషయం నేను ఎంత మందికో ఎన్నోసార్లు చెబుతున్నాను. "పృథగాత్మా  పృథగ్దేహీ...   జల పద్మలవోపమా"

**ఊర్ధ్వ బాహుర్వి రౌమ్యేష**
**న చ కశ్చి చ్ఛృణోతి మే ।** (సర్గ 5,  శ్లోకం 26)

చేతులెత్తుకొని అరుస్తున్నా. అయినా ఎవడూ నా మాట వినటం లేదు.

(ఈ వాక్యం వ్యాస మహర్షిదిగా లోకంలో ప్రసిద్ధివుంది. ఇక్కడా  కనిపిస్తోంది. ఉత్తమ మేధావులు ఒకే రకంగా స్పందిస్తారనటానికి ఇది కూడా ఒక నిదర్శనమేమో! )

**వసిష్ఠుడు** :  రామా! జనమంతా ఈ సంసారంలో పడి, సుఖ    దుఃఖాలను అనుభవిస్తున్నామనుకుంటున్నారు. సుఖ దుఃఖాలు ఎవరికి? జడమైన దేహానికా? సర్వాతీతుడైన ఆత్మకా? దేహం జడం గనక దానికి  సుఖదుః ఖాలంటే ప్రసక్తి లేదు. ఆత్మ అన్నిటికీ అతీతం గనుక దానికీ  సుఖదుఃఖాలంటే ప్రసక్తి లేదు.

కనుక రామా! ప్రపంచంలో ఎవడికీ సుఖం లేదు, ఎవడికీ దుఃఖం లేదు! ఈ ప్రపంచం అంతా పరమాత్మమయం. పరమాత్మ అనంతం! అది శాంతం! ఈ విషయాన్ని నువ్వు దృఢంగా భావన చెయ్యి.

పూర్వం నీకు " సృష్టి–దృష్టులు"  అని ఒక మాట చెప్పాను. ఈ కనిపించే  "సృష్టి" అంతా చూసేవాడి దృష్టే తప్ప, నిజమైన సృష్టి అంటూ ఏదీ లేదని అప్పుడు చెప్పాను. కనుక ఈ కనిపించే "సృష్టి దృష్టు" లన్నీ నీటిలో తరంగాలవంటివి. తలతిరిగేవాడికి  ఆకాశంలో కనిపించే కాంతి చక్రాల వంటివి.

రామా! ఈ జగత్తూ, ఆ బ్రహ్మా, భిన్నమా అభిన్నమా– అని గింజుకోకు. అవి రెండూ కాదు. ఎందుకంటే, కనిపించే ఈ జగత్తు భ్రాంతి మాత్రమే. తాడున్నచోట పాము కనిపిస్తే, తరువాత దీపం వచ్చాక ఆ పాము

పోతే, ఇప్పుడు తాడూ పామూ ఒకటే అనాలా? వేరు వేరు అనాలా? తాడు తాడుగా కాక పాముగా కనిపించింది గనక, అవి వేరు వేరు అని ఒకడి వాదన. తాడు కన్నా భిన్నంగా విడిగా పాము దొరకటం లేదు గనక, అవి రెండూ ఒకటే అనాలని మరొకడి వాదన. ఈ రెండు వాదాలూ దృష్టివాదాలే! నిజానికి తాడూ పాము అనేవి రెండూ కాదూ, ఒకటీ కాదు. అలాగే "బ్రహ్మ-జగత్తు" అనేవి కూడా రెండూ కాదు -ఒకటీ కాదు! అందుకే వేదం "సర్వం ఖల్విదంబ్రహ్మ" "ఆత్మై వేదం సర్వం" "బ్రహ్మైవేదం సర్వం" మొదలైన వాక్యాలను బోధించింది.

కనుక రామా ! "నేను వేరు-ఇది వేరు" అనే భ్రాంతిని విడిచిపెట్టు. ద్వంద్వాలను విడిచిపెట్టు! నిత్యమూ సత్వగుణంలో వుండు. యోగక్షేమాల కోసం కృషి చెయ్యబోకు. దుఃఖాన్ని దగ్గరకు రానీకు. శాంతుడవై, మౌనివై ఏకాంతంలో నివసించు సంకల్పాలను శమింప జేసుకో.

రామా ! ఏ సమయానికి ఏది ప్రాప్తిస్తే, దాన్ని అనుభవించు.
అనుభవించేటప్పుడు దుఃఖ పడబోకు. దేనిమీదా కోరిక పెట్టుకోకు. దేనికోసమూ శ్రమపడబోకు. ఏ కల్పనలూ చేసుకోకు. దేన్నీ తీసుకోకు, దేన్నీ వదిలిపెట్టకు.

రామా ! ఇలా చేస్తే నీకు విశ్వాతీతమైన పరమపదం లభిస్తుంది. లౌకిక కార్యాలు చేసినా, ఇక మాయలో మునగవు.

**ఏకాతపత్ర మవ నౌ గురుణోపదిష్టమ్**
**సమ్యక్సుపాలయ చిరం సమయేహ దృష్ట్యా ।**
**రాజ్యం సమస్త గుణ రంజిత రాజలోకః**
**త్యాగో న యుక్త ఇహ కర్మసు నా పిరాగః ॥** (సర్గ 5, శ్లోకం 54 )

రామా ! నీ తండ్రి నీకు రాజ్యం అప్పజెబితే, దాన్ని చక్కగా పాలించు. అయితే, సమమైన దృష్టి పెట్టుకుని పాలించు. నీ సద్గుణాలతో ఇతర రాజులందర్నీ రంజింప చేస్తూ పరిపాలించు. అంతే గానీ వద్దన బోకు. ఎందుకంటే, ఆత్మతత్త్వవేత్త అయినవాడికి, కర్మప్రాప్తమయిన ఈ జీవితంలో, ఒకదానిని వద్దని వదిలిపెట్టటమూ తగదు, మరోదానిని కావాలని స్వీకరించటమూ తగదు.

అయిదవ సర్గ చివర వసిష్ఠుడు మెరిపించిన కొసమెరుపు ఇది. అందుకే ఆయన దీన్ని సమర్థించుకుంటూ ఆరవసర్గ మొదలుపెట్టాడు.

### 3. కర్త ను కానని తెలుసుకో

**వసిష్ఠుడు**:- రామా !

**ఇమం విశ్వ పరిస్పందం**
**కరోమీత్యస్తవాసనమ్ !**
**ప్రవర్తతే యః కార్యేషు**
**స ముక్త ఇతి మే మతిః ॥** (సర్గ 6, శ్లోకం 1)

"రామా ! పనులంటే ఏమిటి?" "చలనమే పని" - అని నీకు మొదటి ప్రకరణంలోనే చెప్పాను. అక్కడ "సంవిత్స్పందము, మానస స్పందము, ఇంద్రియ స్పందము" అని మూడు రకాల చలనాలు చెప్పాను.

ఈ మూడూ కలిపితే, అది ప్రపంచం అవుతుంది. ఈ ప్రపంచంలో జరిగే కొన్ని స్పందాలకు, అంటే కొన్ని క్రియలకు, నేను కర్తను అనుకుంటున్నాడు అజ్ఞ జీవి. దీనికి కారణం ఆ జీవికి గల పూర్వజన్మ వాసనలే! దీనికి భిన్నంగా, ఒకడు వాసనలన్నీ వదిలేశాడనుకో. అప్పుడు వాడి చుట్టూతా పరిస్పందాలు ఉంటాయా వుండవా? వుంటాయి ! కానీ వాడు వాటిల్లో వేటికీ తను కర్త అనుకోడు. అయస్కాంత సన్నిధిలో ఇనపముక్కలు కదిలిపోతున్నట్లుగా, ఈ స్పందాలన్నీ జరిగిపోతూ వున్నాయని వాడు భావిస్తూ వుంటాడు. ఈ విధంగా వాసనలను వదిలిపెట్టి, నేను చేస్తున్నాననే కర్తృత్వాన్ని వదిలిపెట్టి, ఎవడైతే ప్రపంచ క్రియలలో ప్రవృత్తుడై ఉంటాడో, వాడే ముక్తుడని నా అభిప్రాయం.

కనుక రామా, నువ్వేపని చేసినా, ఇలాటి భావనతోనే చెయ్యి. అలా కాకుండా కర్తృత్వ బుద్ధితో 'ఇది కావాలి, అది కావాలి' అనుకుంటూ కామ్య కర్మలు చేసేవారు స్వర్గ నరకాల మధ్య గిరగిరా తిరుగుతూ వుంటారు. వీరు తామసజీవులు.

సాత్త్విక జీవులైతే తత్త్వవిచారం చేసి ఆశాపాశాలను తెంచుకుని, 'యాంతి నిష్కేవలం పదమ్' –ఆ కైవల్యాన్ని అందుకుంటారు.

(ఇక్కడ వాల్మీకి మహర్షి, ' కైవల్యం' అంటానికి "నిష్కేవలం" అని వాడాడు 'నిష్కేవలం పదం' – అంటే – " నితరాం కేవలమ్"– ' మిక్కిలి కేవలమైన స్థానము' అని అర్థము.)

**వశిష్ఠుడు**: ఇక రాజస సాత్త్విక జీవులున్నారే, వాళ్లు మొదట్లో కొన్ని మామూలు జన్మలు ఎత్తినా, క్రమంగా సత్త్వగుణం పెంచుకుని, ముక్తిని అందుకుంటారు.

రామా ! సామాన్యంగా జీవులకు మోక్షం లభించే క్రమం యిది ! అయితే ఒక్కొక్కప్పుడు కొన్ని విశేషాలు జరుగుతూ వుంటాయి. ఒక్కొక్క జీవికి జన్మాంతర సాధనాబలం వల్ల, ఈ జన్మలో ప్రత్యేకంగా గురువంటూ లేక పోయినా, ఏదో విచిత్ర సంఘటనవల్ల, ఆకాశంనుంచి వున్నట్లుండి పండు రాలిపడినట్లుగా, తత్త్వజ్ఞానం లభిస్తూ వుంటుంది. ఇందుకు నిదర్శంగా జరిగిన కథ ఒకటి చెబుతానువిను.

## 4. సిద్ధ గీత

పూర్వం విదేహ దేశానికి జనకుడనే రాజు వుండేవాడు. అతను చాలా ఉత్తముడుగా పేరు తెచ్చుకున్నాడు. అతనొకసారి వసంతఋతువులో దగ్గరే వున్న హిమవత్ పర్వతం మీదికి విహారం కోసం వెళ్లాడు. అతను అలా అలా కొండ గుహల వెంట సరదాగా తిరుగుతూ వుండగా, ఒక చోట కొంత మంది సిద్ధులు చెట్ల చాటుగా కూర్చుని ఏవో పాటలు పాడుకోవటం వినిపించింది. ఆ రాగాలు చాలా బాగున్నయ్. అందుకోసమని ఇతను అక్కడే చాటుగా నిలబడిపోయి వాళ్ల పాటలు వినసాగాడు.

ఆ పాటలు ఇలావున్నాయి.

**ఒకటవ పాట** : –

**"చక్షురాదులు – విషయ పాళితో**
**సంగ మందగ – పుట్టు వృత్తిలో**

**మోదలవముగా - వెలుగు తెలివియే**

**ఆత్మతత్త్వము -అరసి చూడగ "**

ఒకడు మంచి పద్మం చూశాడు. ఆనందం కల్గింది. ఇక్కడ ఏం జరుగుతోంది? అతని నేత్రమనే ఇంద్రియానికీ, పద్మమనే విషయానికీ, సంబంధం ఏర్పడింది. దాని వల్ల అతని అంతః కరణంలో ఒక చిత్తవృత్తి ఏర్పడింది. ఒక అలవంటి మార్పు ఏర్పడింది. ఆ చిత్తవృత్తిలో ఆనందం స్ఫురించింది. ఇది ఎక్కడనుంచి వచ్చింది? ఎక్కడి నుంచో రాలేదు-అంతటావున్నది అదే ! మామూలు దశలో అది మాయవల్ల మరుగున పడిపోయివుంది. ముసుగులో మూసుకుపోయి వుంది. ఇప్పుడు ఈ పద్మాకారమైన చిత్తవృత్తి ఆముసుగును పాక్షికంగా, తాత్కాలికంగా, తొలగించింది. అందువల్ల అక్కడే వున్న ఆనందం రేఖామాత్రంగా తళుక్కున మెరిసింది. కానీ ఈ జీవుడు అది అఖండ పరమాత్మానందంలో భాగమని గ్రహించక, ఈ ఆనంద పద్మంవల్ల వచ్చిన పద్మానందం అనుకుంటున్నాడు. అందువల్ల, తొలగిన ముసుగు మళ్లీ కమ్ముకు పోతోంది. ఈ విషయాన్ని గ్రహించినవాడు, ఎక్కడ ఏ ఇంద్రియానికి ఏ విషయానందం కలిగినా,అందులో ఆ విషయభాగాన్ని పక్కకు తోసేసి, ఆనంద భాగాన్ని ఆశ్రయించి, ఇది ఆ అఖండ పరమాత్మానందమే అని అనుసంధానం చేసుకుంటాడు. దానివల్ల, ప్రపంచంలోని ప్రతి విషయం దగ్గరా అతనికి ఆనంద రూపమైన ఆత్మరూపమే దర్శన మిస్తుంది. ఆత్మాను సంధానం చేసుకునే విధానం యిదే- అని ఈ పాటకు భావం.

**రెండవ పాట : -**

**ద్రష్టృ దర్శన దృశ్యాని**
**త్యక్త్వా వాసనయా సహ ।**
**దర్శన ప్రథమాభాసం**
**ఆత్మానం సముపాస్మహే ॥** (సర్గ 8, శ్లోకం 10)

ఇది చాలా గొప్ప శ్లోకం. అందువల్ల దీన్ని పాటగా అనువదించకుండా అర్థంచేసుకునే ప్రయత్నం చేద్దాం. బద్ధ జీవులందరికీ, "త్రిపుటులు" వుంటాయి. వాటిలో ద్రష్ట , దర్శనము,దృశ్యము-అనే త్రిపుటిముఖ్యమైనది.నేను చూసేవాణ్ని,
నేను చేసే పని దర్శనము, ఇది చూడబడేది-ఇవే ద్రష్టృ దర్శన దృశ్యాలు. ఈ భావాలు ఎవరికయినా వుంటాయి. దీనికి కారణం పూర్వజన్మ వాసనలే ! కనుక త్రిపుటులు పోవాలంటే, వాసనలు పోవాలి. వాసనలు ఎలా పోతాయి?

లోకంలో రకరకాల చూపులున్నాయి. నేను చూస్తున్నాను, నేను తింటున్నాను, నేను వింటున్నాను,-ఇలాటివన్నీ చూపులే! ఈ వాక్యాలన్నింటిలో మొదట ఏముంది? "నేను-నేను-నేను" అని వుంది. నేను నిజంగా ద్రష్టనైతే, నేను మొట్టమొదటగా దేనిని దర్శించాలి? అన్నిటికన్న దగ్గరగా వున్న "నేను"ను దర్శించాలి. అన్ని క్రియలకూ ఆదిలో వున్న నేనును దర్శించాలి. జీవులందరూ ఒక్కటే పొరపాటు చేస్తున్నారు. మొదటగా,దగ్గరగా, అన్నిచోట్లా, వున్న "నేనును" విడిచిపెట్టి-, దూరంగా వున్న విషయాలను దర్శిస్తున్నారు. దీనిని సరిచేసుకుని, దర్శన క్రియలో మొట్టమొదటగా భాసించే నన్ను నేను చూసుకోవటం మొదలుపెడితే, అన్ని వాసనలూ పొతాయి: అలా దర్శన క్రియలో ప్రథమంగా దర్శన మిచ్చేవాడే పరమాత్మ- అని మేము ఉపాసన చేస్తున్నాము,"-అని ఈ పాటకు భావం.

**మూడవ పాట :-**

**"కలడు లేడని వాదులాడెడి**

**వారి మధ్య తటస్థుడై**

**కలిమి లేముల సాక్షి యగుచును**

**చాటి చూపెడి దాత్మ సుమ్మా "**

ఆత్మ ఉన్నదనీ లేదనీ రెండు పక్షాలవారు తగాదాలాడుకుంటున్నారు. ఒక పక్షంవారికి ఆత్మ లేనిదిగా కనిపిస్తోంది. మరొక పక్షంవారికి ఆత్మ ఉన్నదిగా కనిపిస్తోంది. కాని, ఈ ఆత్మ ఏ పక్షంలోనూ చేరకుండా తటస్థంగా వుండి, వుండటానికీ లేకపోవటానికీ, రెంటికీ గూడా తానే సాక్షిగా వుంటూ, వుందనేవారికి వుండటాన్ని చూపిస్తోంది, లేదనేవారికి లేక పోవటాన్ని చూపిస్తోంది. కనుక ఈ ఉనికికీ, లేమికీ, వెలుపల నిత్యసాక్షిగావుండేదే ఆత్మ అని మేము ఉపాసిస్తున్నాం- అని ఈ పాట భావం.

**నాలుగవ పాట : -**

**ఎవనియందున - ఎవని దగుచును**

**ఎవని వల్లను -ఎవని కొరకై**

**ఎవని చేతను - ఎవని గూరిచి**

**విశ్వమేర్పడె - నదియె బ్రహ్మము**

ఈ పాటలో సప్తమినించి ప్రథమ దాకా అన్ని విభక్తులూ, వరసగా వెనక్కునడచి వచ్చాయి చూడండి. ఇది "యతోవా ఇమాని భూతాని జాయంతే- యేన జాతాని జీవంతి యత్ప్రయంత్యభి సంవిశంతీతి" -వంటి వేదవాక్యాలకు అనువాద ప్రాయం. దీన్ని బట్టి సృష్టిలో ఏ పదార్థాన్ని చూసినా, దానికి వెనకాలా, దానికి తర్వాతా, వుండే నిత్యసత్య పదార్థాన్ని అనుసంధానం చేసుకోవటం నేర్చు కోవాలని ఆ సిద్ధుల అభిప్రాయం.

**అయిదవ పాట : -**

**'అ'కారమే తల- 'హ'కారమే తుద,**

**అన్నివర్ణము-లందు కలిసెను.**

**తనను చెప్పు - ' నహం' పదంబది**

**ఆ అహమ్మే - బ్రహ్మ నిజమిది.**

ఇది కొంత వరకు వ్యాకరణ శాస్త్రం మీద ఆధారపడిన అనుసంధాన విధానం. వ్యాకరణ శాస్త్రంలో, వర్ణమాలలో ఒక మొదటి అక్షరాన్నీ, దాని తర్వాత వచ్చే మరో అక్షరాన్నీ, కలిపి పలికితే, ఆ రెండూ కలిపి మధ్యలో వుండే అక్షరాలన్నిటినీ గూడా సంకేత పరుస్తాయి. ఉదాహరణకు- 'బాల' అనేపదం వుంది. బకారం దగ్గర్నించీ లకారం దాకా వుండే అన్ని వర్ణాలూ కలిపి "బాల" అని పేరు. ఈ ఆరూ స్వాధిష్ఠాన చక్రంలో వుండే బీజాక్షరాలు. కనుక ఈ చక్రానికి బాల చక్రమని ఒక పేరు.

ఇలాగే "అ-హ" అనే అక్షరాలను కలిపితే "అహం" అనేశబ్దం వస్తుంది.

ఇది 'అ'- నుంచి "హ" -దాకా వున్న యాభై అక్షరాలకు సంకేతం అవుతుంది. అక్షరాలే శబ్దం, శబ్దమే ప్రపంచం, అనే సిద్ధాంతాన్ని ఒప్పుకుంటే, అహం అనేది ప్రపంచంలోని ప్రతి పదార్థానికీ సంకేతం అవుతుంది. అందుకే ప్రపంచంలోని ప్రతిజీవుడూ,తనను గురించి తాను చెప్పుకోవాల్సివస్తే 'అహం-అహం"

(నేను-నేను) అనే అంటున్నాడు. ఇలా అహం (నేను) అనే శబ్దం ప్రతి పదార్థానికీ పేరే అయినప్పటికీ, ఎవడికివాడు "ఇది నన్ను మాత్రమే బాధిస్తోంది", అని అనుకుంటున్నాడు.

ఇలా ప్రతివాడిలోనూ పరిమితంగా వున్నట్లు కన్పిస్తూ, అన్ని పదార్థాలలోనూ, అంతటా వ్యాపించి వున్నట్టి తత్త్వమే ఆత్మ-అని మేము ఉపాసిస్తున్నాము ! అని ఈ సిద్ధుల అభిప్రాయం.

**ఆరవపాట** : -

**"ఎడద నుండిన - ఈశు విడచుచు**
**వేరు దైవము - వెదకు వారలు**
**కరగతంబగు -కౌస్తుభంబును**
**విడచి గులకల - వెదకు వీరులు."**

ఆస్తికులై దేవతాపూజలుచేసేవారు చాలామంది, దేవుడు విగ్రహంలో వున్నాడనీ, గుడిలోవున్నాడనీ, కాశీవంటి క్షేత్రాలలో వున్నాడనీ, వైకుంఠం వంటి లోకాలలో వున్నాడనీ వెతుక్కుంటూ వుంటారు. నిజానికి అసలైనదేవుడు మన హృదయంలోనే వున్నాడు. "నా హృదయంలో వున్నవాడు-నేనుగాక మరొకడు ఎట్లా అవుతాడు? కనుక నేనే పరమాత్మను" అనేమాట తెలుసుకోలేక, దేవతలకోసం ఎక్కడెక్కడో వెతుక్కునేవాళ్లు శ్రీమహా విష్ణువు ధరించే కౌస్తుభమణి చేతిలోకి వచ్చి పడితే, ఏదో అనుకుని పక్కన పారేసి,రత్నాల కోసం గులక రాళ్ళలో వెతుక్కుంటున్నారు. వాళ్లు అంతటి మూఢులు కనుక మేము మా హృదయంలో వుండే జీవాత్మనే పరమాత్మగా ఉపాసిస్తున్నాం అని ఈ సిద్ధుల భావం.

**ఏడవ పాట** : -

**"ఆశలన్నియు - విడిచి నప్పుడు**
**దొరకు ఫలమిది - బ్రహ్మ మనగా**
**అద్ది తగిలిన - ఆశలని యెడు**
**లతల పాదులు- తునిగిపోవును "**

ఇది - ఉపనిషత్తులో గల

**"యదాసర్వే ప్రతీయంతే**
**కామా యేఽ స్య హృదిస్థితాః**
**అథ మర్త్యో ఽ మృతో భవతి**
**అత్ర బ్రహ్మ -సమశ్నుతే "**

వంటి మంత్రాలకు అనువాద ప్రాయమైనది. హృదయంలో గల ఆశలన్నీ వాసనలతో సహా తొలగిపోతే, పరబ్రహ్మమనే ఫలం లభిస్తుంది. ఆ పరబ్రహ్మ భావన హృదయానికి తగిలిన కొద్దీ ఆశలనే లతల మొదళ్లన్నీ తెగిపోతాయి. కనుక, ఆశలు లేని స్థానంలో గల శుద్ధ వస్తువునే పరబ్రహ్మగా ఉపాసిస్తున్నాము- అని వీరి అభిప్రాయం.

**ఎనిమిదవ పాట : –**

**జగతి పదార్థము లన్నియును**
**విరసములనుచును తెలిసియును**
**వాటిని మరి గో– రెడువాడు**
**నరుడా? కాదొక గాడిదయే ॥**

ఇక్కడ ఈ సిద్ధులు శాస్త్ర జ్ఞానం చేతా, గురుబోధ చేతా, తత్త్వజ్ఞానాన్ని సంపాదించి,జగత్తులో కనిపించే పదార్థాలన్నీ కూడా, 'లేనివే' అని బౌద్ధికంగా తెలుసుకుని కూడా, వ్యామోహ బంధాల నుంచి బయటపడలేక పోతున్నవారిని నిందిస్తున్నారు. అలాంటి వాళ్లు– ' గాడిదలే' అనటం ద్వారా, వైరాగ్యాభ్యాసం లేనిదే, తత్త్వ జ్ఞానం ఫలించదని వారు సూచిస్తున్నారు.

**తొమ్మిదవ పాట: –**

**" మరల మరల లేచునీ –ఇంద్రియాలనే**
**పాములన్ వివేక –మనెడు కర్రతో**
**వజ్ర మూని దేవవిభుడు – పర్వతాలనే**
**కొట్టినట్లు కొట్టవలెను – లేవనట్లుగా**

ఇదికూడా శమ దమ సాధన ద్వారా, అంటే అంతరింద్రియ, బహిరింద్రియ నిగ్రహంద్వారా, వైరాగ్య సాధననే బోధిస్తోంది. సాధకుడు, తనలో కోరిక మొలిచినప్పుడల్లా, ఆయా ఇంద్రియాలకు ఆయావిషయాల యొక్క అసత్యత్వాన్ని గుర్తుచేసి, తద్ద్వారా వాటిని విషయలోలత్వంనుంచి మళ్లించాలని, ఈ సిద్ధుల అభిప్రాయం.

**పదవ పాట : –**

**"శమదమ సుఖమే పవిత్రము**
**మనః ప్రశాంతిని తెచ్చునది**
**మనసు శమించిన సుఖమయమౌ**
**స్వరూప మందున స్థితి గలుగు."**

ఈ చివరిపాటలో ఈ సిద్ధులు సాధన సారాంశాన్ని చెప్పేస్తున్నారు. లోకంలో యజ్ఞయాగాది రూపాలైన కర్మలూ, పూజోత్సవాది రూపాలైన వ్రతాలూ,మంత్రానుష్ఠాన ప్రాణాయామాది రూపాలైన యోగాలూ–ఇలాంటివన్నీ ఎన్నివున్నా, అవన్నీ మంచివే అయినా,–శమ దమాలే ముఖ్యమయినవి.! శమ దమాలంటే, అంతరింద్రియ బహిరింద్రియ నిగ్రహాలు, వాటిని బలవంతంగా సాధిస్తే చాలదు. ఆ సాధనవల్ల ఒక ఆనందం కలగాలి. అలాంటి శమదమాలే పవిత్రమైనవి. ఎందుకంటే అవి మాత్రమే మనశ్శాంతిని తీసుకురాగలవు. ఇక్కడ మనశ్శాంతి అంటే మనస్సులో కల్లోలాలు తగ్గటంకాదు. మనస్సులో ఆలోచనలనే అలలు అణగారిపోవటం! అలా మనస్సు శమించిపోతే, ఇందాకటి శమదమానందంకన్న మించిన, పరమానంద స్వరూపమైన, స్వస్వరూపస్థితి దర్శన మిస్తుంది – ఆ స్థితి సుస్థిరమై నిలబడిపోతుంది.

ఈ పదిపాటలూ వినేసరికి జనకమహారాజుకు క్రమక్రమంగా సంగీతానందంపోయి, ఏడుపు ఎగదన్నుకొచ్చింది. ఎలాగో దానిని దిగమింగుకొని, మెల్లిగా వెనక్కి వచ్చి ఇంటికి చేరి, మేడ మీదకు వెళ్లి, ఒంటరిగా కూర్చున్నాడు.

ఆ సిద్ధుల గానాలు చెవులల్లో గింగురు మంటున్నాయి. గింగురు మనేది నిజానికి ఆ రాగాలు కావు. వాటిలోని తత్త్వార్థాలు.దాంతో ఆ రాజు ఇక తనగురించీ తనతెలివిగురించీ ఆలోచించుకోవటం మొదలుపెట్టాడు. వెంటనే మొదటి మాటగా–

**హా కష్ట మతికష్టాసు**
**లోక లోల దశా స్వయమ్ ।**
**పాషాణే ష్వివ పాషాణా**
**ఆలుఠామి బలా దహమ్ ॥** (సర్గ 9, శ్లోకం 5 )

"అరెరే! ఎంత కష్టం ? నాకు ఎన్ని సంసార దశలు గడిచి పోయాయి? ఆ దశలన్నీ ఎలా గడిచిపోయాయో ఆలోచించుకుంటే, గుండ్రాళ్ల మీద నుంచి దొర్లిపోయే గుండ్రాయి లాగ వుంది ఇప్పుడు నా పరిస్థితి !" – అనిపించింది.

వాల్మీకి మహర్షి ఈ తొమ్మిదవ సర్గలో అయిదవ శ్లోకంలో ప్రారంభించిన ఆత్మ గతమైన అంతర్మథనాన్ని, అనగా "సాలిలక్వీ"ని, అరవై శ్లోకాలకు పెంచి, అరవైఅయిదవ శ్లోకంతో ఈ సర్గను పూర్తి చేశాడు. ఈ సర్గలో అడుగడుగునా వైరాగ్యసాధకుల మీద స్థిరముద్రలు వేయగల మెరుపుల కొరడాల వంటి కవితా చమత్కారాలెన్నో వున్నాయి. అంతేగాక తాను అధికారిననీ, రాజుననీ, వీరుణ్ననీ, ఈ రకంగా భావించే వాడు వైరాగ్య సాధకుడైతే, అతడు చేయవలసిన భావనా ప్రక్రియను గూడా చక్కగా వివరించాడు. సాధన దృష్టి కలవారికి ఇది ఎంతో ముఖ్యమైన సర్గ అయినప్పటికీ, ఈ విషయాలన్నీ పూర్వం వచ్చినవే గనుక, మనం ముందు కథా భాగంలోకి వెళ్లి పోదాం.

జనకమహారాజు చేస్తున్న ఆలోచనా పరంపరలో సిద్ధుల గీతాలు గిరగిరా తిరిగి, అవి మళ్లీ మళ్లీ మననమై, ఆమనన బలంచేత అతని హృదయంలోని ఆశావాసనలన్నీ తొలగిపోయి, వివేకం ఉదయించి, "ఇక నేను నాలో స్థిరంగా ఉండిపోతున్నాను", అని దృఢ నిశ్చయానికి వచ్చేశాడు.

కొద్ది గంటల కాలపు మననప్రక్రియా బలంచేతనే, ఆ మహారాజు యోగ భూమికలలో సప్తమ భూమికను చేరుకున్నాడు. అలా చేరుకుని ఆ రాజు శిలా ప్రతిమలాగా నిశ్చలంగావుండిపోగా, ఇంతలో దైవ ప్రేరితుడై ఒక ముసలి ద్వారపాలకుడు అక్కడకు వచ్చి, నిత్యానుష్ఠానాలు మానుకుని ఏకాంతంగా కూర్చున్న రాజును చూసి, ఆశ్చర్యపోయి,వయసులో పెద్దవాడు గనుక ఇలా ఉపదేశంచేయటం ప్రారంభించాడు–

**"దేవ! దోస్తంభ విశ్రాన్త సమస్తవసుధా భర!** (సర్గ 10, శ్లో 2)

"సమస్త భూ భారాన్నీ భుజస్కంధాల మీద మోస్తున్న ఓ మహారాజా! లే. రాజరికానికి తగిన దినచర్యకు పూనుకో. ఇదుగో ఈ సుందరాంగులు కుసుమ కర్పూర కుంకుమ మిశ్రిత జల కుంభాలను శిరస్సుల మీద ధరించి, అవతరించిన నదీ దేవతల లాగా నీస్నాన గృహం దగ్గర నీ రాకకై ఎదురు చూస్తున్నారు. ఒక వేళ నీవు మనోహరమైన సరస్సులో స్నానం చేయదల్చుకుంటే , ఇదిగో ఈ కమల కల్హార కాననభ్రాంత షట్పదాలు తామరతూళ్ళ దారాలతో నీకోసం దేరాలు నిర్మించి ఉంచాయి, చూసుకో. ఇదిగో ఈ సరోవర తీరప్రాంతాలన్నీ విలాసపు గొడుగులతో, వీరుల రథాలతో, భటుల గుజ్జాలతో, నిండిపోయి, నీ స్నాన సమయానికి సేవ చేయాలని ఎదురు చూస్తున్నాయి.

"ఇదిగో బ్రాహ్మణోత్తములు ముందుగా స్నానాలు చేసి, మడికట్టుకొని, నీకు దేవ పూజలో సహాయం చేయడానికి సిద్ధంగా ఉన్నారు. నువ్వు స్నానం చేస్తూ మలాపకర్షణ మంత్రాలు చెప్పమంటే చెప్పటానికి కూడా సిద్ధంగా ఉన్నారు. ఇదిగో ఈ సేవకులు, నువ్వు భోజనశాలకు వస్తే నీకు వింజామరాలు వీద్దామని సిద్ధంగా నిలబడి ఉన్నారు. కనుక రాజా! చురుకుగా కదులు. నీలాంటి ఉత్తములు కాలం దాటి పోయాక పనులు చేయటానికి ఇష్టపడరు".

## 5. జనకుడి మననం

అని ఈ విధంగా ఆ ప్రతీహారి కవితామయమైన శైలిలో మహారాజ వైభవాన్ని ఒక్క సారిగా వొలకబోశాడు. ఇక్కడ వాల్మీకి మహాకవి కూడా ధనవంతుల పలుకు తీరు, వారి పరిచారకుల దర్జా తీరు, ఆ వైభవానికి వారు పొంగిపోయే తీరు, ఇవన్నీ కూడా చక్కగా అనుకరించి చూపించాడు. జనక మహారాజు విన్నాడు. అవుననలేదు. కాదనలేదు. మళ్ళీ ఆలోచనలో పడ్డాడు –

" రాజ్యం! రాజరికం! రాజవైభవం! ఎంత గొప్పగా చెబుతున్నాడు వీడు?!

**కియన్మాత్రమిదం నామ**

**రాజ్యం సుఖమితి స్థితమ్॥** (సర్గ 10, శ్లో10)

"ఈ రాజ్యం, ఈ రాజ్య సుఖం, దీని పొడుగెంత? దీని బతుకెంత? ఇది క్షణభంగురం. ఈ వైభవానికా నేను పొంగి పోవలసింది? ఎన్నేళ్ళనించీ అనుభవిస్తున్నాను ఈ భోగాలు?! ఏం మిగిలింది నాకు, ఎండమావుల నీళ్ళుగాక?! కనుక, ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకుంటా. ఈ గారడీ గిరిడీలకు పొంగిపోవటాలు తగ్గించుకుంటా. అలలు అణగారిపోయిన సముద్రం లాగా ప్రశాంతంగా, ఏకాంతంగా, ఉండటం నేర్చుకుంటా.

" కాని, ఓ మనస్సా! నీ టక్కరితనం చాలా గొప్పది. వద్దు వద్దంటూనే సుఖాల వెంట పరుగెత్తే నేర్పు నీకు చాలా ఉంది. ఇప్పటికైనా తగ్గు. నువ్వు తగ్గినట్టు నటిస్తావు నిజంగా తగ్గవు. నీకు సుఖ భోగాలే కావాలి. పాపపుణ్యాలక్కరలేదు. కానీ పాపపుణ్యాలు కావలసినదాని లాగా నటిస్తావు. ఎందుకంటే, అటు యమలోక బాధకో, ఇటు జనలోక నిందకో, భయపడి నువ్వు కొంచెం భోగేచ్ఛను తగ్గించుకుంటావంతే గానీ, నిజంగా భోగాల మీద వైముఖ్యం కలిగి కాదు.

"మనసా! నువ్వు సుఖభోగాల కోసం ఎంతగా వెంపర్లాడినా, నీకెప్పుడైనా తృప్తి అనేది కలిగిందా? కలగలేదే ! కనుక నోరు మూసుకో. ఈ భోగాలను వదిలేసి శాశ్వత పరతత్త్వాన్ని ఆశ్రయించు".

ఇలా అనుకుంటూ జనక మహారాజు కొంత సేపు ఆ తత్త్వ భావనలో లీనమై శిలాప్రతిమ లాగా ఉండి పోయాడు. వచ్చిన ద్వార పాలకుడికి రాజుగారి పరిస్థితంతా అయోమయంగా కనిపించింది. ఏమనాలో తోచలేదు. రాజుల దగ్గర మెలగటం నేర్చినవాడు కనుక, భయం చేత కొంత, గౌరవంచేత కొంత, అతను మౌనంగా ఉండి పోయాడు.

కొద్దిసేపయ్యేసరికి జనక మహారాజు మనస్సులో ఆలోచనలు మళ్ళీ మొలకెత్తాయి. కాని ఈ మాటు ఆలోచనలు శమగుణ యుక్తంగా సాగాయి – " అవునూ! కావాలని వెంట పడి నేను తీసుకోవలసిన వస్తువు ఏముంది? " ఈ ప్రపంచంలో ప్రతిదీ నశించేదే కనిపిస్తోంది. ఇక దేని కోసం నేను ఆశపడాలి?

" అదేమిటి? కర్తృత్వబుద్ధే కదా నీ కొంప ముంచుతోంది. దీన్ని పారద్రోలి, అకర్తృత్వబుద్ధిని

సంపాదించుకోవద్దా? – అంటావేమో! అకర్తృత్వాన్ని సంపాదించే దేమిటి? క్రియ ఎవరిది? దేహానిది. మరి అక్రియ ఎవరిది? అంటే క్రియ లేక పోవటం ఎవరిది? అదీ దేహానిదే కావాలి. మరి నేనో? నేను దేహాన్ని కానే. దేహంతో సంబంధమే లేదే. మరి సక్రియత్వం గానీ, అక్రియత్వం గానీ, నాకెలా అంటుకుంటాయి? సక్రియత్వం అంటే కర్తృత్వం. అక్రియత్వం అంటే అకర్తృత్వం. ఈ రెంటికీ నన్నంటుకోవటం చేతకానే చేతకాదు. మరి ఇక నేను అకర్తృత్వాన్ని సాధించడం ఎలా కుదురుతుంది?

"కనుక నాకు క్రియా వద్దు, అక్రియా వద్దు. కర్తృత్వమూ వద్దు, అకర్తృత్వమూ వద్దు. నేను శుద్ధ చిత్ స్వరూపాన్ని. నాకు పతనం ఎలా ఉంటుంది? నాశనం ఎలా ఉంటుంది.?

కనుక,

**నాభినందామ్యసంప్రాప్తం**
**సంప్రాప్తం న త్యజామ్యహమ్ ।**
**స్వస్థ ఆత్మని తిష్ఠామి**
**యన్మమాస్తి తదస్తు మే ॥** (సర్గ10, శ్లో 24)

రానిది కావాలనుకోను. వచ్చింది పోవాలనుకోను. పోయింది సుఖమైనా, వచ్చింది దుఃఖమైనా, నేను నాలోనే ఉంటాను. ఏది వస్తుందో రానీ. ఇక నాకే భయమూ లేదు".

జనక మహారాజు ఆలోచనలు కొంతసేపలా సాగాయి. ఈ ఆలోచనాధోరణివల్ల, మౌనంగా ఏకాంతంగా ఉండి పోవాలన్న ఇందాకటి ఆలోచన మారిపోయింది. స్థూల దేహాభిమానాన్ని విడిచిపెట్టి, ఇష్టానిష్టాలనే మనోవాసనలు లేకుండా, ఆ శరీరానికి అలవాటుపడ్డ పనులు అలాగే కొనసాగించాలని ఇప్పుడు నిశ్చయించుకున్నాడు. ఆ రకమైన నిశ్చయంతోనే, ద్వార పాలకుడు చెప్పినట్టుగా స్నాన జపాదులన్నీ పూర్తి చేసుకున్నాడు.

ఆ రాత్రి మళ్లీ ఏకాంతంలో కూర్చుని, తన మనసుకి తానే తత్త్వ బోధ చేసుకున్నాడు. ఈ బోధను "11వ" సర్గలో వాల్మీకి మహర్షి, సుమారు 30 శ్లోకాలలో వర్ణించాడు. ఈ వర్ణనలో ప్రధానంగా జీవన్ముక్తి లక్షణాలను చిత్త బోధరూపంగా ప్రతిపాదించాడు. ఆ తరువాత 12వ సర్గలో ఆ రాజుయొక్క జీవన్ముక్త స్థితిని కవి ఇలా ప్రతిపాదించాడు –

**భవిష్యం నానుసంధత్తే**
**నాతీతం చిన్తయత్యసౌ ।**
**వర్తమాననిమేషం తు**
**హసన్నేవానువర్తతే ॥** (సర్గ 12, శ్లో14)

ఆ రాజు జరగబోయే దేమిటని ఆలోచించటం లేదు. గడిచిపోయిన దేమిటని వెనక్కి తవ్వుకోవటం లేదు. ఈ వర్తమాన కాలక్షణంలో ఏది వస్తే దాన్ని ఆనందంతో అనువర్తిస్తున్నాడు! అనుభవిస్తున్నాడు కాదు, అనువర్తిస్తున్నాడు! అంటే ఆనంద స్వరూపుడై అలాగే ఉండిపోతున్నాడు. ఈ విధంగానే అతను రాజ్య వ్యవహారాలన్నీ చూస్తూ కూడా, మోహవశం కాకుండా చిత్ స్వరూపంగానే ఉండిపోయాడు.

జనక మహారాజు జీవన్ముక్త వ్యవహారాన్ని వర్ణించే ఈ 12వ సర్గను వాల్మీకి మహర్షి 40 శ్లోకాలకు పెంచాడు. ఈ శ్లోకాలలో జీవన్ముక్తుడికి ఉండవలసిన ఆలోచనా సరళిని మనోహరంగా ప్రతిపాదించాడు.

జ్ఞాన రూపమైన ఆ ప్రజ్ఞను నిలబెట్టు కోవాలని మళ్ళీ మళ్ళీ నొక్కి చెప్పాడు.

**య ఏవ యత్నః క్రియతే**

**బాహ్యార్థోపార్జనే జనైః ।**

**స ఏవ యత్నః కర్తవ్యః**

**పూర్వం ప్రజ్ఞావివర్ధనే ॥** (సర్గ12, శ్లో 26)

ఒక పెద్ద వ్యాపారస్థుదున్నాడు. అతనికి భక్తి, పూజలు, ఇవేవీ పట్టవు. కళలు, కవిత్వాలు, ఇలాంటివి కూడా పట్టవు. కాని, అతను తెల్లవారు ఝామునే లేచి, తెల్లవారక ముందే లెక్కలు చూడటం పూర్తి చేసుకొని, అందరికంటే ముందు తన కార్యాలయం తెరచి, రాత్రి పొద్దుపోయేదాకా అక్కడే పనిలో నిమగ్నమై పోయి ఉంటాడు. ఇది ఒక తపస్సు గాక మరేమిటి? వాడు అంతటి ఏకాగ్రతతో, అంతటి దీక్షతో, అంతటి నియమంతో, అలాటి తీవ్ర తపస్సు చేస్తున్నాడు కనుకనే, వాడి తపస్సు ఫలించి కోటీశ్వరు డవుతున్నాడు. లోకంలో ఏ రంగంలో శిఖరాగ్రానికి చేరినవారిని చూసినా ఇలాంటి పద్ధతే కనిపిస్తోంది. ఎవడైనా సరే, లౌకికంగా గొప్ప విజయం సాధిస్తున్నాడంటే, ఆ విజయం వెనకాల ఇంతటి తీవ్ర ప్రయత్నం ఉండి తీరుతోంది. ఆధ్యాత్మిక సాధకుడు దీన్ని గుర్తించాలి. గుర్తించి, లౌకిక విజయ సాధన కోసం లౌకిక జీవుడు ఎంత కష్టపడుతున్నాడో, ఎంత తీవ్ర ప్రయత్నం చేస్తున్నాడో, అంతటి ప్రయత్నాన్నీ ఆధ్యాత్మిక సాధకుడు చేసి తీరాలి. అప్పుడే ఆత్మ తత్త్వాన్ని అందుకో గల ప్రజ్ఞ వికసిస్తుంది.

ఈ ప్రజ్ఞను మందగింపచేసే సోమరితనాన్ని నశింప చేసుకోవాలి. ఈ ప్రజ్ఞ గుండెలలో దాచుకున్న చింతామణి వంటిది. అది దగ్గర ఉంటే చాలు, కోరిన ప్రతి కోరికా తీరుతుంది.

ఈ రకమైన వాక్యాలతో ఈ సర్గ 40 శ్లోకాల దాకా పెరిగింది. ఇక 13వ సర్గలో వశిష్ఠ మహర్షి ఇలాంటి ప్రజ్ఞ ఉదయించటానికి మూలకారణమైన చిత్త ప్రశమనోపాయాలను, రకరకాలుగా, సంగీతంలో పల్లవుల లాగా, మళ్ళీ మళ్ళీ చెప్పాడు. చిత్తానికి ఎటువంటి అనుసంధానాన్ని నేర్పాలో, మనస్సును మనస్సుతోనే ఎలా కోసెయ్యాలో, విస్తారంగా వివరించాడు. సాధకులకు సాధన పరంగా అవసరమైన అనేక రకాల మనన విధానాలు ఈ సర్గలో ఉన్నాయి. అందువల్ల ఈ సర్గ నూట పదిహేడు (117) శ్లోకాలకు పెరిగిపోయింది. అయినా వశిష్ఠ మహర్షికి తృప్తి కలగక, 14వ సర్గలో అదే విషయాన్ని కొనసాగిస్తూ, మరో అరవై ఆరు (66) శ్లోకాల బోధ చేశాడు. దీనిలో ఆత్మ ధ్యాన విధానాలను కొన్నిటిని ప్రస్తావన చేశాడు.

## 6. తృష్ణా పరిత్యాగము (ధ్యేయము – జ్ఞేయము

అప్పటికీ తృప్తి కలగలేదు వశిష్ఠ మహర్షికి . మనస్సంటే ఏమిటనే ప్రశ్నను లేవదీసి, ఆత్మే మనస్సుగా పరివర్తన చెందిందని, కనుక దీన్ని వెనక్కి తిప్పితే పరమాత్మలోకి ప్రవేశం లభిస్తుందని, అలా గాక మనమే వెనక్కు తిరిగి మనస్సు వెంట పరుగులు తీస్తే , మనం దీనికి లొంగిపోయి, తృష్ణకు దాసులమై పోతామని, అదే అనర్థాలకు మూలమని, వివరించడం కోసం, ఆ మహర్షి 15వ సర్గలోకి ప్రవేశించి, ఇరవై ఏడు (27) శ్లోకాలు ఉపదేశించాడు. అలా చెబుతూ చెబుతూ చివరి శ్లోకంలో ఆయన ఇలా అన్నాడు–

**ఏతామహంభావమయీ మపుణ్యాం**

**ఛిత్వానహంభావ శలాకయైవ ।**

**స్వభావనాం భవ్య ! భవాన్త భూమౌ**

**భవాభిభూతాఖిల భూతభీతిః ॥** (సర్గ 15, శ్లో 27)

హే భవ్యా! రామా! తృష్ణ అనేది అహంకారం యొక్క రూపాంతరం. అందుకనే అది అపవిత్రం. దాన్ని ఆహంభావ రాహిత్యమనే కత్తెరతో కత్తిరించు. అలా చేస్తే, నువ్వు భవాంత భూమికి చేరుతావు. అంటే సంసారానికి అంతం కలిగించే సప్తమ యోగ భూమికలోకి చేరుతావు. అలా చేరగలిగితే ఏ జీవి వల్లా నీకు భయం లేదు. నీ వల్ల ఏ జీవికీ భయం లేదు. రామా! అటువంటి సప్తమ భూమికకు చేరి, అక్కడే ఉండిపో – అన్నాడు.

ఇలా అనే సరికి రాముడో ప్రశ్న లేవదీసాడు. ఆ ప్రశ్నతోనే 16వ సర్గ ప్రారంభమైంది.

**రాముడు:** గురుదేవా! చెట్టుకు కాండం ఎటు వంటిదో, జీవుడికి అహంకారం అటువంటిది. కాండమే లేకపోతే చెట్టు కూలిపోతుంది. అహంకారమే లేకపోతే జీవి కూడా కూలిపోతాడు. వాడిక జీవించడమే ఉండదు. ఏ సాధకుడూ నేను చచ్చి పోవాలని కోరుకోడు. కనుక గురుదేవా! నేను అహంకారాన్ని పరిత్యజించి జీవించేదెలా? నా మనుగడకే ప్రమాదం తెచ్చిపెట్టే సాధనలు చేసెదెలా?

**వశిష్టుడు:** రామా! తృష్ణా పరిత్యాగమన్నా, ఆశలను విడిచి పెట్టడమన్నా, మనస్సును అమనస్సుగా చేయడమన్నా, వాసనలను తుడిచి వేయటమన్నా, అన్నీ ఒకటే. ఈ వాసనా పరిత్యాగం రెండు రకాలు–

1 ధ్యేయము 2 జ్ఞేయము – అని

ఈ భేదం ఎందుకు వచ్చిందంటే, వాసనలకు మూలమైన అహం వృత్తి కూడా రెండు రకాలుగా వుంది. 1. దేహేంద్రియాది సంఘాతం మీద ఆధారపడిన అహంకారం ఒకటి. 2. చిదేక రసస్వభావమైన అహంకారం మరోటి.

ముందుగా దేహేంద్రియాదుల మీద ఆధారపడిన అహంకారమంటే ఏమిటో చెబుతా విను.

ఈ దేహము, ఈ ఇంద్రియాలు, వీటిని పోషించే అన్నపానాది పదార్థాలు, ఇవన్నీ కలిపితే "నేను" అవుతాను. ఇవి లేక పోతే నేనెక్కడుంటాను? నేనేమి చేస్తాను? అలాగే ఈ అన్న పానాది పదార్థాలన్నిటికీ నావల్లనే సార్థకత్వం లభిస్తోంది. అవి నాకోసం పుట్టాయి. నేను వాటి కోసం పుట్టాను. అవి లేనిదే నేను లేను. నేను లేనిదే అవి లేవు.– అని ఈ విధంగా సామాన్య మానవ జీవి మొదట్లో అనుకుంటూ ఉంటాడు. ఇలా అనుకుంటున్న పెద్ద మనిషికే, క్రమంగా, సత్ సాంగత్యాది లాభం వల్ల కొత్త తెలివి వికసించి, 'ఈ పదార్థాలు నావెట్లా అవుతాయి? నాకూ వాటికీ సంబంధం ఏమిటి? అవి జడ స్వరూపాలు, నేను చేతన స్వరూపాన్ని గదా! అవీ నేనూ ఒకటెట్లా అవుతాము?' – అని ఈ విధంగా కొత్త ప్రశ్నలు మొలకెత్తుతాయి. సద్విచారణ ప్రారంభమవుతుంది. దాని ఫలితంగా పంచభూతాల దగ్గరనుంచి మనస్సు దాకా అన్నీ అసద్రూపాలే అనే నిశ్చయానికి వస్తాడు. దాంతో ఇప్పటి దాకా వాడు 'నేను' అనే పదానికి చెప్పుకున్న అర్థం మారిపోతుంది. ఇప్పుడు వాడి దృష్టిలో "నేను" అంటే పంచభూతాలనుంచి మనస్సు దాకా అన్నీ తొలగిపోగా మిగిలిన శుద్ధ చిత్స్వరూపం ఏదైతే ఉందో, అదే అవుతుంది. నేనిందాక రెండవ రకమైన అహంకారాన్ని చెప్పానే, అదే ఇది! అక్కడ "చిదేక రసస్వభావమైన అహంకారము" అని చెప్పా. మాటల తేడాయే గానీ, వస్తువులో తేడా లేదు.

ఇంతకూ చెప్ప వచ్చిందేంటంటే, మొదట దేహమే నేననే అజ్ఞాన దశలో కథ ప్రారంభించిన జీవి, క్రమంగా "ఇవేవీ 'నేను' కాదు, ఇవేవీ నేను కాదు" – అని జ్ఞాన పూర్వకంగా భావన చేసే దశకు వస్తాడు.

అంటే వాడు భావనా పూర్వకంగా దేహాది వాసనాత్యాగం చేస్తున్నాడు. అందుచేత ఈ రకమైన భావననే "ధ్యేయవాసనాత్యాగము" అని పెద్దలన్నారు.

ఒక ధ్యాన ప్రక్రియను పోలినటువంటి భావనా ప్రక్రియ దీనిలో ఉంది కనుక, దీన్ని "ధ్యేయవాసనాత్యాగము" అన్నారు.

ఈ స్థితి నందుకున్నవాణ్ణి జీవన్ముక్తుడు అంటారు. సుప్రసిద్ధులైన జనకాదులు దీనికి ఉదాహరణ. వీరు వాసనాత్యాగం చేసి, ఏమీ అంటకుండా లోక వ్యవహారం చేసేస్తూ ఉంటారు. అదీ విశేషం.

ఇక రెండవ అహం వృత్తి, చిదేక రసస్వభావమైన అహంవృత్తి, అంటే ఏమిటో ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు. ఆ విషయం ఇప్పటికే వచ్చేసింది. ఇందాక చెప్పిన విధంగా ధ్యేయ వాసనా త్యాగం చేసి, ఆ రకమైన భావనా పరంపరలో మనస్సును లగ్నం చేసి చేసి, ఆ అభ్యాసం బలపడి పోవడం వల్ల ఒకడు నిర్వికల్ప సమాధిలోకి వెళ్ళిపోతాడు. ఆ సమాధిలో ఉండగానే వాడికి ప్రారబ్ధ కర్మ కూడా పూర్తయిపోతుంది. అందువల్ల వాడి దేహం రాలిపోతుంది. అంటే, వాడి యొక్క అహంకారం అంతా జ్ఞానంచేత బాధితమై పోతుంది.

బాధ అంటే తెలుసుకదూ! కారణంతో సహా కార్యం నశించిపోతే, దాన్ని బాధ అంటారు. వీడి అహంకారానికి మూలకారణమైన మూలవిద్య కూడా నశించి పోతుంది కనుక, వీడి అహంకారానికి బాధ ఏర్పడుతోంది. అంటే, వీడి వాసనలు నశించిపోతున్నై. దీన్నే కొంచెం మార్చి చెపితే, వీడి వాసనలు జ్ఞానం చేత బాధిత మవుతున్నాయి. అందుచేతనే, ఈ రకమైన వాసనాత్యాగాన్ని "జ్ఞేయవాసనాత్యాగము" అన్నారు. జ్ఞానానికి సంబంధించిన వాసనాత్యాగం అన్నమాట. ఇక్కడ జ్ఞానంచేత నశించడమే, జ్ఞానానికీ, వాసనాత్యాగానికీ మధ్య గల సంబంధం.

దాన్నిబట్టి ఈ రకమైన జ్ఞేయవాసనాత్యాగం, దేహాన్ని కూడా వదిలేసిన విదేహ ముక్తుడికి మాత్రమే ఉంటుంది. ఇతడు ఎల్లప్పుడూ పరబ్రహ్మలోనే ఉంటాడు. ఇతనికి వ్యవహార స్పర్శ లేనేలేదు.

రామా! జాగ్రత్తగా గమనించు. ధ్యేయవాసనాత్యాగం చేసిన వాడు జీవన్ముక్తుడు. జ్ఞేయవాసనాత్యాగం చేసినవాడు విదేహముక్తుడు. మోక్షప్రాప్తి విషయంలో ఇద్దరూ సమానులే. దుఃఖ స్పర్శలేక పోవటం ఇద్దరికీ సమానమే. అయితే, వీరిలో ఒకడు వ్యుత్థితుడు. (అంటే సమాధినుంచి బయటకు వచ్చినవాడు.) రెండవవాడు సమాహితుడు. (అంటే సమాధిలోనే ఉన్నవాడు.) ఒకడు సదేహుడు. అయినా నిర్బాధుడు. రెండవవాడు విదేహుడు.

కనుక రామా! అహంకారత్యాగం చేసినంత మాత్రాన, అందరికీ జ్ఞేయవాసనాత్యాగమే జరిగిపోతుందని, ప్రారబ్ధం నశించిపోయి దేహం రాలిపోతుందని, నిశ్చయంగా చెప్పే వీలు లేదు. ప్రారబ్ధం గనక మిగిలిపోయి ఉంటే, ఆ సాధకుడియొక్క వాసనాత్యాగము, అహంకారత్యాగము, ధ్యేయ స్థితిలోనే ఆగిపోతాయి. వాడు ముక్తుడే. కానీ మరణించడు. వాడే జీవన్ముక్తుడు.

ఎవడికి "ఇది కావాలి, ఇది అక్కరలేదు, ఇది పనికొస్తుంది, ఇది పనికిరాదు" అనే భావాలు ఉండవో, వాడే జీవన్ముక్తుడు. ఎవడు జాగ్రద్దశలోవుంటూ కూడా సుషుప్తిలో లాగా ఏదీ అంటకుండా ఉండగలుగుతాడో, వాడే జీవన్ముక్తుడు.

రామా! కనుక నువ్వు నిర్భయంగా ధ్యేయాహంకారత్యాగాన్ని, ధ్యేయవాసనా త్యాగాన్ని , సాధించి, జీవన్ముక్తిని అందుకోవచ్చును. జీవన్ముక్తుడంటే ఏమిటో నీకింకా వివరంగా చెబుతాను విను.

వశిష్ఠులవారి ప్రసంగం ఇక్కడికి వచ్చేసరికి, సూర్యాస్తమయ సమయం దగ్గరకు వచ్చింది. ఎంత జ్ఞానావేశంలోవున్నా, నిత్యకర్మ విఘాతాన్ని పెద్దలు సహించరు. కనుక వశిష్ఠుడు సభను చాలించి సాయం సంధ్యానుష్ఠానానికి వెళ్ళి పోయాడు. ఆ విధంగా పదకొండవ రోజు ప్రసంగం ముగిసింది.

పన్నెండవ రోజు ఉదయం సభ ప్రారంభం కాగానే, వశిష్ఠుడు అదే ఆవేశంతో జీవన్ముక్తి లక్షణాలను వర్ణించ సాగాడు. వాల్మీకి మహర్షి ఈ బోధను రెండు సర్గలలో తొంభై తొమ్మిది (99) శ్లోకాలలో వర్ణించాడు. అందులో మొదటి సర్గలో, ఏ రకమైన మానసిక నిశ్చయాలు చేసుకుంటే ఒక వ్యక్తి జీవన్ముక్తుడౌతాడో వాటిని, ఏ రకమైన మానసిక నిశ్చయాలు చేసుకుంటే జీవుడు అజ్ఞాన బద్ధుడై దుఃఖితుడౌతాడో వాటిని, ఎక్కడికక్కడ విభాగం చేసి చూపించాడు. రెండవ సర్గలో జీవన్ముక్తుడియొక్క వ్యవహార దశను, అనగా ఏమీ అంటకుండా వ్యవహారాలు చేసే పద్ధతిని, విస్తారంగా వర్ణించాడు. ఇలా చెప్పటంలో వశిష్ఠుడి వుద్దేశ్యం ఏమిటంటే, శ్రీరాముడు జీవన్ముక్త దశకు చేరుకోవాలనేదే! అందుకోసమే ఆయన జీవన్ముక్తుడి వ్యవహార వర్ణనను ముగింపుకు తెస్తూ ఇలా అన్నాడు –

**వశిష్ఠుడు:** రామా! అనాదిసిద్ధమైన ఈ సంసార ప్రవాహంలో ఎన్ని కోట్ల జన్మలెత్తావో?! అందుచేత ఈ ప్రపంచంలో ఉన్న జీవులలో ప్రతి జీవీ ఎప్పుడో ఒకప్పుడు నీ బంధువే. కనుక ఇప్పటి ఈ దేహాన్ని బట్టి ఈ కొద్ది మంది మాత్రమే నాకు బంధువులు అనుకోవడం ఎలా కుదురుతుంది? కనుక, ఒక విధంగా చూస్తే , ఈ లోకంలోని ప్రతి జీవీ నీకు చిరకాల బంధువే. మరో రకంగా చూస్తే , అంటే, దేహానికీ నీకూ సంబంధమే లేదనుకుంటే, నీకు బంధువన్నవాడే లేడు.

**వివిధ జన్మ శతాహిత సంభ్రమే**
**జగతి బంధురబంధు రితీక్షణమ్।**
**భ్రమదశైవ వివల్గతి వస్తుతః**
**త్రిభువనం చిరబంధు రబంధ్వపి॥** (సర్గ 18, శ్లో 65)

ఈ విషయంలో చక్కటి ఉదాహరణగా "పుణ్యపావనో పాఖ్యాన" మనే మంచి కథ వుంది, చెపుతా విను. అంటూ 19వ సర్గలో వశిష్ఠుడు ఆ కథ చెప్పసాగాడు.

## 7. పుణ్యపావనుల కథ(బంధుత్వ చర్చ)

మహేంద్ర పర్వతంమీద, ఆకాశగంగా తీరంలో, దీర్ఘతపుడు అనే మునిశ్రేష్ఠుడు ఉండేవాడు. ఆయనకు ఇద్దరు కొడుకులు. పెద్దవాడి పేరు పుణ్యుడు. రెండోవాడి పేరు పావనుడు. వాళ్ళిద్దరూ కూడా తపస్సు చేస్తూ వుండేవాళ్లు. కొంతకాలానికి పెద్దవాడు పుణ్యుడికి ఆత్మ తత్త్వ జ్ఞానం కలిగింది. రెండో వాడికి, పావనుడికి, శాస్త్ర జ్ఞానం కలిగిందిగానీ అనుభవజ్ఞానం ఇంకా కలగలేదు.

పావనుడిలా మధ్యమ స్థితిలో ఉండగా ఒక రోజున తండ్రి మరణించాడు. ఆయన భార్య మొదట్లో కొంత సేపు దుఃఖించినా, త్వరలోనే తెలివి తెచ్చుకొని, తన యోగశక్తితో దేహత్యాగం చేసి, సహగమనం చేసింది.

చిన్నవాడు, పావనుడు, ఈ విధివిఘాతానికి తట్టుకోలేక పోయాడు. తల్లిదండ్రులిద్దరూ ఒకేసారి పోయేసరికి, అక్కడ వుండలేక, వారికి అంత్యక్రియలు చేయాలనే మాట కూడా మరచిపోయి, అడవిలో

ఎక్కడికో పారిపోయి,  ఒంటరిగా కూర్చొని బోరుబోరున ఏడవసాగాడు.

అన్నగారు పుణ్యుడు తమ్ముడికోసం కొంతసేపు చూసి, తనే తల్లిదండ్రులకు దహన సంస్కారాలు చేసి, తమ్ముడికోసం వెతుక్కుంటూ వెళ్లి,  ఒక చోట పట్టుకున్నాడు. తమ తల్లిదండ్రులకు విదేహ ముక్తి లభించినా, ఆ విషయాన్ని గ్రహించలేక, బోరు బోరున విలపిస్తున్న తన తమ్ముడి అజ్ఞాన దశకు జాలిపడి, అన్నగారు తమ్ముడికి ఇలా బోధించ సాగాడు –

**పుణ్యుడు :** " తమ్ముడూ! ఎందుకలా కన్నీళ్ళు కారుస్తూ ఏడుస్తావు?  నీ తల్లీ తండ్రీ ఇద్దరూ ముక్తిని పొందారు.  మోక్షానికి చేరినవారిగురించి ఏడవవచ్చా? మోక్షం అంటే ఏమిటి? స్వస్వరూపప్రాప్తి.  వాళ్ళిద్దరూ ఇప్పుడు అఖండమైన, అద్వితీయమైన, స్వస్వరూపంలో ఉన్నారు.

" మరి నువ్వో? నువ్వు వాళ్ళ మీద "ఈమె నా తల్లి" "ఈయన నా తండ్రి" అనే మోహబంధంతో నీకు నువ్వే ముడివేసుకు కూర్చున్నావు.

"ఒక మాటడుగుతాను చెప్పు." ఈమె ఒక్కతే నీకు తల్లా? ఈయన ఒక్కడే నీకు తండ్రా? పోనీ వాళ్ళకు నీవు ఒక్కడివే కొడుకువా? ప్రతి ఋతువులోనూ ఒకే చెట్టుకు  వందల కాయలు కాస్తున్నాయి, రాలిపోతున్నాయి. రాలిన వాటిలో కొన్ని మొలుస్తున్నాయి.  వాటికి మళ్ళీ ప్రతి  ఋతువులోనూ వందలకొద్దీ కాయలు కాస్తున్నాయి. అలాగే ప్రతీ జన్మలోనూ నీకో తల్లీ, తండ్రీ, వస్తున్నారు. పిందెల పక్కన ఆకులున్నట్లుగా ప్రతి జన్మలోనూ నీ చుట్టూ బంధువులు చేరుతున్నారు.  ఇప్పటికి ఎన్ని  ఋతువులైనయ్యో? నీకు ఎన్ని జన్మలైనాయో? ఎంతమంది తండ్రులు, తల్లులు, ఇప్పటికి మరణించారో?

"తల్లి తండ్రుల కోసం ఏడవటమే మంచిదని నీ సిద్ధాంతమైతే, పాత తల్లిదండ్రులందరి కోసం కూడా ఏడుస్తూనే ఉండాలి.  అలా నువ్వు ఏడవట్లేదు. ఎందుకని?  నీకు పాత జన్మలున్నాయని నీకు తెలీదా?  నీకు పాత తల్లి తండ్రులుండే వారని తెలీదా?  వాళ్ళు మరణించారని తెలీదా?  వాళ్ళ కోసం ఎందుకు ఏడవవు? వీళ్ళ కోసం ఎందుకేడుస్తున్నావు? కొంచెం ఆలోచించి చెప్పు.

"నాయనా తమ్ముడూ! నువ్వు శాస్త్రం చదువుకున్న వాడివి. నీకు తెలియని విషయం కాదు. ఈ ప్రపంచం అంతా ఒక రకమైన భ్రాంతిగా మనకు కనిపిస్తోంది.  ఇది సత్యమనడానికీ వీలు లేదు, అసత్యమనడానికీ వీలు లేదు.  అందుకే ఇది మిథ్య.  పరమార్థం ఆలోచిస్తే ఈ జగత్తులో సత్యమే లేదు.  అంటే నీకు నిజమైన మిత్రులు లేరు.  జన్మ లేదు. నాశమూ లేదు.

" మరి ఈ ప్రపంచంలో ఇంత కథ కనిపిస్తోందే! వీళ్ళంతా పుట్టటం కనిపిస్తోందే! గిట్టటం కనిపిస్తోందే! – అంటావా?  అవును, కనిపిస్తోంది.  ఎడారిలో ఎండమావి నది కనిపిస్తోంది. దానిలో అలలు కనిపిస్తున్నాయి. సుడులు కనిపిస్తున్నాయి.  అవి ఎంతో ఇవీ అంతే. ఈ ప్రపంచంలో ఇంతకు మించిన పరమార్థం లేదు".

అన్నగారు చేసే బోధ ఇక్కడికొచ్చే సరికి వాల్మీకి మహర్షి సర్గ పూర్తిచేసి, మళ్ళీ అదే బోధతో పై సర్గ కొనసాగించాడు.  ఒక వ్యక్తి చేస్తున్న ఉపన్యాసం మధ్యలో సర్గను ఎందుకు విడగొట్టాడంటే, తక్కిన చర్చను విడదీసేసి, బంధుత్వమనే భ్రాంతి మీద చర్చను కేంద్రీకరించి, జన్మ పరంపరల తీరును వివరించడం ద్వారా బంధుత్వ భ్రాంతిని పోగొట్టాలనే సంకల్పంతో, ఈ రకంగా సర్గ విభాగం చేశాడు –  అనిపిస్తోంది.  అసలు విషయంలోకి వెళదాం.  అన్నగారు పుణ్యుడు తన బోధను కొనసాగిస్తున్నాడు.

**పుణ్యుడు :-** తమ్ముడూ! తల్లీ తండ్రీ అని బాధ పడుతున్నావు. బాగా ఆలోచించు. నిజంగా ప్రపంచంలో తల్లిదండ్రులనే వాళ్ళున్నారా? తల్లిదండ్రులు అనే భావన ఉన్నదా? మన తల్లిదండ్రులెవరో మనకు తెలీదు. ఏవేవో కారణాలచేత వీళ్ళు మన తల్లిదండ్రులని నమ్మేస్తాం, భావిస్తాం.

**బంధు త్వే భావితో బంధుః**
**పరత్వే భావితః పరః ।**
**విషామృతదశేవేహ**
**స్థితిర్భావనిబంధనీ ॥** (సర్గ 20, శ్లోకం 3)

బంధువు అనుకుంటే బంధువు, శత్రువు అనుకుంటే శత్రువు. ఒక పదార్థాన్ని నువ్వు విషమనుకొని వదిలేస్తున్నావు. అదే పదార్థాన్ని మరో పురుగు అమృతమనుకొని తినేస్తోంది. అది హాయిగా బతుకుతోంది. దాన్ని విషపుపురుగు అంటున్నావు నువ్వు. నీ భావన నీది. దాని భావన దానిది. ఈ ప్రపంచంలో ఉన్న బంధుత్వాలన్నీ అలాంటివే. ఇప్పుడాలోచించు నీకు నిజమైన బంధువెవడు?

"ఈ దేహమే నేననే భ్రాంతిలో నువ్వున్నావని నేననుకోవడం లేదు. అయినా కొంచెం చెబుతా.

"ఈ దేహమంటే ఏమిటి? ఒక తోలు, దాని వెనకాల రక్తం, దాని వెనకాల ఎముకలు, వాటి మధ్యలో గుజ్జు. ఇంతే కదా! ఇవన్నీ జడ పదార్థాలు. మరి నువ్వో? నువ్వు చేతన స్వభావుడవు. జడమైన రక్తమాంసాదులు నువ్వెట్లా అవుతావు? మరి నువ్వెవరు? ఆలోచించుకో.

" ఇక్కడ రెండు దేహాలున్నాయి. ఒక దేహం పేరు పుణ్యుడు. మరో దేహం పేరు పావనుడు. ఈ దేహంలో ఒక "నేను" ఉంది. ఆ దేహంలో ఒక "నేను" ఉంది. ఈ దేహంలో ఉన్న "నేను" ఈ రక్తమాంసాదులు కాదు. ఆ దేహంలో ఉన్న "నేను" ఆ రక్తమాంసాదులు కాదు. అలాగే నీ తల్లితండ్రులు వారి శరీరంలో ఉన్న రక్తమాంసాదులు కాదు. అలా అయితే పుణ్యుడు, పావనుడు, తల్లీ, తండ్రీ అనే పేర్లు ఎవరికి సంబంధించినవి? అక్కడి రక్తమాంసాదులకు సంబంధించినవా? వాటిలో ఉండే "నేను" కు సంబంధించినవా? ఆలోచించి చెప్పు".

**పావనుడు :** అన్నా! రక్తమాంసాదులు నేను కాదు. కానీ లోపల ఉండే సూక్ష్మ శరీరం నేను కాదనటం బావుండదు. పుణ్యుడు, పావనుడు, తల్లీ, తండ్రి ఇవన్నీ ఆయా స్థూల శరీరాలలో ఉన్న సూక్ష్మశరీరాలకు సంబంధించినవే.

**పుణ్యుడు :** తమ్ముడూ! అలా అయితే, నీ సూక్ష్మశరీరం జన్మజన్మలుగా ఒక్కటే వస్తోందా? మధ్యలో మారిపోయి కొత్తది వస్తోందా?

**పావనుడు :** అన్నా! లింగ శరీరంలో మార్పేమి ఉంటుంది? అది ఎప్పటినుంచో అలా అనుగతంగా వస్తూనే ఉంది.

**పుణ్యుడు :** మంచిది, అలా అయితే నీ సూక్ష్మ శరీరానికి ఒక్కొక్క జన్మలో ఒక్కొక్క తల్లి తండ్రులున్నారు. పాతజన్మల తల్లితండ్రులంతా మరణించారు. మరి, వారి కోసం నువ్వేడవ్వేమి?

**పావనుడు :** అంటే నేను వెనకటి జన్మలలో ఏ గోత్రాలలో, ఏ తల్లితండ్రులకు, కొడుకునై పుట్టానో తెలుసుకుని దుఃఖించాలంటావా?

**పుణ్యుడు :** గోత్రాలంటావేమిటి? కొన్ని జన్మలలో నువ్వు మృగాలుగా పుట్టావు. అడవులలో చెట్లుగా పుట్టావు. కొండలలో సింహాలుగా పుట్టావు. నదుల్లో చేపలుగా పుట్టావు. కుగ్రామాల్లో కోతులుగా పుట్టావు. కొన్ని సార్లు

రాజకుమారుడిగా పుట్టావు, అడవి కాకిగా పుట్టావు, హైహయ దేశంలో ఏనుగుగా పుట్టావు. తాటిచెట్టు మీద పురుగై పుట్టావు. మేడిచెట్టు మీద దోమై పుట్టావు. భూర్జవృక్షపు తొఱ్ఱలో చీమగా పుట్టావు. అక్కడ్నుంచి సరాసరి నాకు తమ్ముడిగా పుట్టావు, ఇప్పుడు కాదు, ఒకానొక పాత జన్మలో! మరో జన్మలో ఒక పేడ కుప్పలో పేడపురుగై జీవితం గడిపి, పై జన్మలో నాకు తమ్ముడివయ్యావు. మరో జన్మలో ఒక బోయదాని కొడుకువై పుట్టి, ఆపై జన్మలో నాకు తమ్ముడివై పుట్టావు.

" తమ్ముడూ! నువ్వే కాదు, నేనూ అనేక జన్మలెత్తా. చిలుకగా పుట్టాను, కప్పగా పుట్టాను, గద్దగా, మొసలిగా, ఇంకా ఎన్నో రకాలుగా! గత జన్మలో శ్రీశైలంలో ఒక ఆచార్య పుత్రుడిగా పుట్టాను. ఇప్పుడు నీకు అన్నగా పుట్టాను. నాకు నా జన్మలు, నీ జన్మలూ కూడా తెలుసు. తెలిసి నేను ఎవరి కోసం ఏడవాలి? ఏ తమ్ముళ్ళ కోసం ఏడవాలి? ఏ తల్లితండ్రుల కోసం ఏడవాలి?

" తమ్ముడూ! ఈ చిక్కు సమస్య తెగాలంటే, ఒక్కటే మార్గం వుంది. నా బంధువులంటున్నావు కదా, వీటిలో మొదటి పదం 'నేను' కనుక, నేను అంటే ఏమిటో తెలుసుకో.. అది తెలుసుకుంటే 'నేను' అనే భావనే ఎగిరిపోతుంది. దానితోపాటు బంధువులనే భ్రాంతి, దాంతోపాటు, బంధు వియోగ శోకమూ కూడా ఎగిరిపోతాయి.

" కనుక తమ్ముడూ! ముందర ఈ దుఃఖపు పొంగును ఆపుకో. మనస్సులో కోరికల పొంగులు ఆపుకో. హృదయ పద్మంలో ఆత్మసాక్షాత్కారం చేసుకో. అలా చేస్తే సంసారవాసనలన్నీ వాటంతట అవే తుడిచి పెట్టుకుపోయి, నిర్మలమైన స్వచ్ఛమైన స్వస్వరూపంలో నువ్వు మిగిలిపోతావు. దాంతో నీకు శాశ్వతమైన తృప్తి కలుగుతుంది".

ఆ విధంగా అన్నగారు బోధించేసరికి తమ్ముడు పావనుడికి జ్ఞానోదయమై, మనస్సమాధి కుదిరి, ధ్యేయవాసనా త్యాగం చేయగలిగాడు. ఆ తరువాత ఆ సోదరులిద్దరూ జీవన్ముక్తులై చాలా కాలం జీవించి ఉండి, ఆ అడవిలోనే యథేచ్ఛగా సంచరించారు. కనుక రామా! నువ్వు కూడా అదేవిధంగా " నావారు,నా బంధువులు" అనే భావనను పరిత్యజించి, ధ్యేయమైన తృష్ణా త్యాగాన్ని ఆశ్రయించి, జీవన్ముక్తుడవై సంచరించు" అన్నాడు వశిష్ఠుడు.

ఈ ఒక్క ముక్కా అనటానికి వశిష్ఠుడు 30 శ్లోకాలు తీసుకున్నాడు. ఎందుకింత సాగతీసినట్టు? ఈ ప్రశ్న ఉపశమ ప్రకరణంలోకి ప్రవేశించిన ఏ పాఠకుడికైనా కలిగి తీరుతుంది. నిజానికి ఈ వివరణ విధానంలోనే వశిష్ఠుడియొక్క బోధనా ప్రణాళిక అంతా ఇమిడి ఉంది.

ఎలాగంటారా, చూడండి–

ఈ ఉపశమన ప్రకరణంలో 9 కథలున్నాయి. అందులో రెండు కథలు ఇప్పటికి గడిచిపోయాయి. ఒకటి జనక మహారాజు కథ. రెండవది పుణ్యపావనుల కథ. ఈ కథల్లో కథేముంది? ఏదో రెండు పాత్రల పేర్లు అడ్డం పెట్టుకుని, చర్చ పెంచుతూ ఉంటాడు, అంతే.

నిజానికి స్థితి ప్రకరణంతోనే సిద్ధాంత భాగ బోధ అయిపోయింది. ఇక ఆచరణ భాగ బోధ చేయదలచుకున్నాడు. అందుకే దీని పేరు ఉపశమ ప్రకరణం. ఉపశమం అంటే చిత్త ప్రశమనం అన్నమాట. దీనికి ఎన్ని రకాల ఉపాయాలుంటాయో, ఆ ఉపాయాల వెనుక గల హేతుబద్ధత ఏమిటో, వివరించటమే మహర్షికి లక్ష్యం. అయితే, ఈ వివరణ ఆయన మనస్సులో పెట్టుకున్న..

**"యతో వా ఇమాని భూతాని జాయన్తే**

**యేన జాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభి సంవిశన్తి"**

అనే ఉత్పత్తి స్థితి లయల క్రమానికి అతకాలి. అందుకోసం ఆ మహర్షి ఈ ప్రకరణంలో ప్రధానంగా "గాధి బ్రాహ్మణ కథ" అనే కథను ప్రధాన కథగా చెప్పాలని మనస్సులో పెట్టుకున్నాడు. దాని దగ్గరకు చేరే ముందు, దాని తర్వాతా కూడా చిత్త ప్రశమన మార్గాలలో ఉండే రకరకాల భేదాలను చూపించదలచుకున్నాడు. ఈ భేదాలను కూడా అడ్డ దిడ్డంగా కాక, ఒక వరుసలో పేర్చుకుంటూ వచ్చి, గాధి బ్రాహ్మణ కథలోకి ప్రవేశింపచేసి, మళ్ళీ దాంట్లోంచి ఇతర లఘుకథలలోకి ప్రవేశించాలని ఆయన ప్రణాళిక వేసుకున్నాడు. ఆ ప్రణాళికలో భాగంగా ఇప్పటికి జనక కథ, పుణ్యపావనుల కథ పూర్తయ్యాయి.

జనక కథలో, ఏదో ఒక ఊహించని సన్నివేశంవల్ల మంచి మాట చెవిన పడి, అది గుండెకు హత్తుకుని, చిత్తప్రశమనం ఎలా కలగవచ్చునో సూచించాడు. పుణ్యపావనుల కథలో, మధ్యమాధి కారులకు ఉత్తమాధికారులు వెంటపడి ఎలా బోధ చేస్తారో, ఆ విధానం చూపించాడు. ఇక రాబోయే కథలో, అనుకోకుండా సద్విచారణ ప్రారంభమై, దానికి రవ్వంత గురు బోధ తోడై, ఉన్నట్టుండి బుద్ధి వికాసం చెంది, ఆత్మజ్ఞానం కలిగే సావకాశం కూడా ఉందని చెప్పదలుచుకున్నాడు. అందుకు పీఠికగా 22వ సర్గ ప్రారంభంలో వశిష్ఠ మహర్షి ఒక మాట వదిలాడు .... " ఓ రామా! బలి చక్రవర్తికి కలిగినట్లుగా నీకు హఠాత్తుగా బుద్ధి వికాసం కలిగి, ఆత్మ జ్ఞానం కలుగుగాక" అని.

వెంటనే శ్రీరాముడు ఆ "బలి ఎవరు? ఆ బుద్ధి వికాసం ఏమిటి?" అని వివరాలడిగాడు. వశిష్ఠ మహర్షి ఇలా మొదలు పెట్టాడు–

## 8. బలి చక్రవర్తి కథ

రామా! నీకు తెలుసు కదా బలి చక్రవర్తి పాతాళంలో రాజ్యం చేస్తూ ఉండటం. అతను వామనావతార మూర్తి అయిన శ్రీహరివల్ల పాతాళలోకానికి చేరినా, అక్కడ సాటి లేని వైభవంతో రాజ్యం చేస్తూ, అంతు లేని భోగాలనుభవిస్తూ, కాలం గడుపుతున్నాడు. ఇలా చాలా యుగాలు గడిచిపోయాయి.

రామా! పాతాళం అంటే నరకం అనుకునేవ్. నరకం పాతాళంలో ఒక భాగం మాత్రమే. అక్కడ పాపులను శిక్షించే విభాగం ఉంది. ఆ ప్రదేశం దుఃఖమయంగా ఉంటుంది. పాతాళంలో మిగిలిన భాగం మాత్రం ఎంతో సుందరంగా ఉంటుందనీ, అక్కడ స్వర్గాన్ని మించిన సుఖాలున్నాయనీ, పురాణాలు స్పష్టంగా చెబుతున్నాయి కదా.

కనుకనే బలి చక్రవర్తి కొన్ని యుగాల పాటు అక్కడ అంతు లేని సుఖ భోగాలనుభవించి, అనుభవించి, వాటితో విసిగెత్తి పోయాడు. చివరికి వాటిమీద వైముఖ్యం కలిగింది.

అలాంటి దశలో అతనొక రోజున ఇంటి కిటికీలో కూర్చుని, సంసారచక్ర స్థితిని గురించి ఇలా ఆలోచించుకోవటం ప్రారంభించాడు --

"ఇంకా ఎంత కాలం నేనిలా రాజ్యం చేయాలి? ఎంత కాలం ఈ భోగాల వెంట పరుగులు తీయాలి? అవే పగళ్ళు. అవే రాత్రులు. అవే సంసారాలు. అవే పనులు. చూసి చూసి సిగ్గేస్తోంది. పిల్లచేష్టగా కనిపిస్తోంది. ఇది ఇంకా ఎంత కాలం సాగాలి"?

ఇలా మొదలైన ఆలోచనలు క్రమక్రమంగా బలపడి, బరువెక్కి, ఆ బలి చక్రవర్తి తనకు తెలియకుండానే ధ్యాన స్థితిలోకి వెళ్ళిపోయాడు.

కొంతసేపటికి ధ్యానం లోంచి బయటకొచ్చాడు.

అలా బయటకు వస్తూనే, అతనికి తన చిన్నప్పటి సంఘటన ఒకటి గుర్తొచ్చింది. ఆ సంఘటనలో బలి తన తండ్రియైన విరోచనుణ్ణి కొన్ని సందేహాలడిగాడు. అప్పటి తండ్రి కొడుకుల సంభాషణ ఇలా సాగింది--

"తండ్రీ విరోచన దానవేంద్రా! అన్ని భ్రాంతులూ శమించి పోయే హద్దేది? మనో మోహం శమించి పోయే హద్దేది? ఏ స్థానాన్ని పొందితే ఏషణాత్రయం విడిపోతుందో అలాంటి స్థానమేది? పునరావృత్తి లేని శాశ్వత స్థానమేది" అని ఈ రకంగా కొడుకు తండ్రిని ప్రశ్నించాడు.

అడిగేవాడూ, చెప్పేవాడూ, ఇద్దరూ రాజులే కనుక, విరోచన చక్రవర్తి రాజుల పరిభాష లోనే తన సమాధానం ప్రారంభించాడు.

**విరోచనుడు :** నాయనా బలీ ! ఉంది, అలాంటి స్థానం ఉంది. అది చాలా పెద్దది. కానీ అక్కడ అడవులూ లేవు, కొండలూ లేవు, సముద్రాలూ లేవు, అసలు పంచభూతాలే లేవు. మానవులూ లేరు, దానవులూ లేరు, దేవతలూ లేరు. ఇద్దరే ఉన్నారు. ఒక రాజు, ఒక మంత్రి!

ఈ మంత్రి చాలా గట్టివాడు. ఉన్నవి కూల్చగలడు. లేనివి పేర్చగలడు. ఆ రాజుగారికి అన్ని పనులూ చేసిపెట్టేది ఇతనొక్కడే. రాజుగారు మాత్రం ఏకాంతంలో స్వస్థంగా హాయిగా ఉంటాడు. అదే నువ్వు కోరుకునే స్థానం.

**బలి :** ఆ స్థానం ఎక్కడుంది? దాన్ని చేరేదెలా? దాన్ని గెలుచుకునేదెలా?

**విరోచనుడు:** కుమారా! ఆ రాజు ఒంటరివాడే గానీ, ఆ మంత్రి కింద లక్షల కొద్దీ సైన్యం ఉంది. దేవతలు కానీ, రాక్షసులు కానీ, ఎవ్వరూ అతనిని ఏమీ చేయలేక అతనికి లొంగి పోయినవారే. ఈ మంత్రిని జయించాలంటే ఆ రాజుగారొక్కరే జయించాలి. అది కూడా ఆయనకు అనేక జన్మల పుణ్యబలం కలిసివస్తేనే సాధ్యమవుతుంది. ' కుమారా బలీ! నేను గొప్ప వీరుణ్ణని నీలో నువ్వే అనుకుంటున్నావు. నువ్వు ఈ మంత్రిని జయించగలిగితే, అప్పుడు నువ్వు వీరుడివేనని నేను ఒప్పుకుంటా.

**బలి:** తండ్రీ ఆ మంత్రిని జయించే ఉపాయం చెప్పండి.

**విరోచనుడు:** నాయనా! ఒకటే ఉపాయం. అదే రాజయోగం. లోకంలో రాజు మనవాడైతే, మంత్రి తనే మనకు లొంగిపోతాడు. మంత్రి మనవాడైతే, రాజుగారు సులభంగా లొంగిపోతాడు. ఇది అన్ని రాజ్యాలలోనూ ఉన్న తీరే.

ఈ రాజ్యంలో కూడా ఇది ఇంతే. కనుకనే ఇక్కడ రాజుగారిని వశపరుచుకునే ప్రక్రియ, మంత్రిగారిని వశపరుచుకునే ప్రక్రియ, రెండూ ఏకకాలంలో సాగిపోవాలి. అప్పుడే ఆ రాజ్యం నీకు స్వాధీనం అవుతుంది.

కుమారా ! ఏదో సంకేత భాషలో మాట్లాడుతున్నాను. నీకు కొంత అర్థం అయ్యే ఉంటుంది. ఐనా ఆ సందేహమెందుకు? నేనే సూటిగా చెప్పేస్తాను, విను.

నేను చెప్పిన స్థానం ఉందే, అదేదో మామూలు రాజ్యం కాదు. అదే మోక్షం. అక్కడి రాజు అంటే పరమాత్మ. మంత్రి అంటే మనస్సు. అ మనస్సులో పూర్వజన్మ వాసనలు అనే పొగలు ఉన్నాయి. పొగలే మేఘాలుగా మారినట్లుగా, మనస్సులోని వాసనలే ఈ స్థూల ప్రపంచంగా మారాయి, పరిణామం చెందాయి.

కనుక నువ్వు ఆ మనస్సు అనే మంత్రిని జయిస్తే, ముల్లోకాలనూ జయించినట్లే. కానీ, అతణ్ణి జయించాలంటే కేవలం కండబలం చాలదు. కొంచెం ఉపాయం కూడా ఉండాలి.

**బలి :** ఏమిటా ఉపాయం?

**విరోచనుడు:** "నాయనా! విషయ వాంఛలు పనికి రావు. వాటిని తొలగించుకోవటమే మొదటి ఉపాయం. కానీ ఇది అంత తేలిక కాదు. దాన్ని క్రమంగా అభ్యసించాలి. విషయవాంఛా పరిత్యాగమన్నా, ధ్యేయవాసనా త్యాగమన్నా, ఒకటే. కనుక గట్టిప్రయత్నం చేసి దాన్ని సాధించాలి.

"నాయనా బలీ! మా అభిప్రాయం ప్రకారం జీవుడంటే మనస్సే. మనస్సు రెండు రకాల పదార్థాలను సృష్టి చేస్తుంది. ఒకటి నియత పదార్థాలు, రెండు అనియత పదార్థాలు.

" నియత పదార్థాలు అంటే, లోకంలో మనకు కనిపించే వ్యావహారిక పదార్థాలు. చెట్లు, పుట్టలు, వంటివి.

" అనియత పదార్థాలు అంటే, ప్రాతిభాసిక పదార్థాలు. అంటే భ్రాంతివల్ల జన్మించే పదార్థాలు. రజ్జుసర్పం, శుక్తిరజతం, వంటివి.

" ఈ మనస్సు చేసే చిత్రాలలో ఒక గొప్ప విచిత్రమేమిటంటే, అది పదార్థాలతో పాటు, వాటి ఫలితాలకు కూడా ఒక నియమాన్ని సృష్టి చేస్తుంది. ఆ నియమాల పరంపరలో జీవుడు ఒకప్పుడు మోక్షాధికారం గల జన్మ ఎత్తుతాడు. ఎత్తి ఆత్మసాక్షాత్కారమనే నియతిని అందుకుంటాడు. అంటే నిర్వికల్ప సమాధిని అందుకుంటాడు. అప్పుడతడు నిస్సంగుడై స్వస్వరూపంతో ప్రకాశిస్తూ ఉంటాడు.

"ఈ జీవుడే, మరో అప్పుడు, శాస్త్రాలనే నియతిని ఆశ్రయించి, నానావిధ సత్కర్మలు ఆచరిస్తూ ఉంటాడు.

" అప్పుడూ ఇప్పుడూ కూడా లోపలున్న నిజమైన ఆత్మ ఒకే రకంగా ఉంది. అప్పుడు కొత్తగా నిస్సంగమూ కాలేదు, ఇప్పుడు కొత్తగా ససంగమూ కాలేదు. అప్పుడూ ఇప్పుడూ కూడా " స్ఫురతి సానువత్ " (సర్గ 24 – శ్లోకం 34) పెద్ద కొండచరియ ఉంది. దానిమీద చాలా చెట్లున్నాయి. కింద నుంచి చూస్తున్నాడొకడు. " ఆహా! ఆ చరియ నిశ్చలంగా ఉందిరా " అనుకున్నాడు. ఇంతలో గాలి వచ్చింది. చెట్లన్నీ కదిలాయి. ఆ కదలికవల్ల కింద ఉన్న ఈ మనిషికి ఆ కొండచరియే కదులుతున్నట్లనిపించింది. " అరే! కొండచరియ కదులుతోందిరా " అన్నాడు.

" నిజానికి ఆ కొండచరియకు కదలడం గాని, కదలకపోవడం గాని, రెండూ లేవు. ఉన్నట్లు కనిపించడం గాలి లీల. అలాగే ఆత్మకు నిర్వికల్ప సమాధి గానీ, కర్మ ప్రవృత్తి గానీ, రెండూ లేవు. ఉన్నట్లు కనిపించటం మనస్సు చేసే లీల.

" కనుక కుమారా ! మనం అనుకునే దైవం గానీ, నియతి గానీ, నిజానికి లేనే లేవు. ఉన్నదల్లా ఒక్క మనస్సే. అది ఒక్కటి తుడిచిపెట్టుకుపోతే, ఏది ఉంటుందో దాన్ని అలాగే ఉండనీ.

**" మనస్యస్తంగతే సాధో**

**యద్భవత్యస్తు తత్తథా । "** ( సర్గ 24, శ్లోకం 35 )

" కుమారా! జీవుడే శరీరం ధరించాడు. అందువల్లే కర్మ జ్ఞానాలకు అధికారి అయ్యాడు. అందుకే వాడు ఏది సంకల్పిస్తే అదే జరుగుతోంది. సంకల్పం వాడి చేతుల్లో ఉంది. కనుక పౌరుషంతో వైరాగ్యాది సాధనాలను సంపాదించుకొని, " నేనే పరమాత్మను" అనే సంకల్పాన్ని మాత్రమే చేయాలి. వ్యతిరేక సంకల్పాలను రానీకూడదు.

ఇలా " నేనే బ్రహ్మ" ననే సంకల్పాన్ని తీసుకోవటానికి మొదటి అడ్డం భోగతృష్ణ. కనుక, దాన్ని చంపుకో. భోగతృష్ణ ఉన్నంత వరకూ సంసార కూపంలో ఊగులాడతావు. తప్పదు.

**న భోగేష్వరతిర్యావ**

**జ్జాయతే భవనాశినీ ।**

**న పరా నిర్వృతిస్తావత్**

**ప్రాప్యతే జయదాయినీ " ॥** (సర్గ 24, శ్లోకం 38)

**బలి:** తండ్రీ! భోగతృష్ణ ఎలా పోతుంది?

**విరోచనుడు:** ఆత్మజ్ఞానం చేతనే పోతుంది.

**బలి:** ఆత్మజ్ఞానం ఎలా కలుగుతుంది?

**విరోచనుడు:** తత్త్వవిచారణవల్ల మాత్రమే కలుగుతుంది.

**బలి:** తత్త్వవిచారణ అంత సులభమా?

**విరోచనుడు:** " సామాన్యుడికి సులభం కాదు. వికసించని మనస్సును మంచి మార్గాన పెట్టుకోవాలంటే, రోజును నాలుగు భాగాలు చేసుకోవాలి. అందులో రెండు భాగాలు భోగాల కోసం వదిలేసెయ్యాలి. భోగాలు అంతకు మించకుండా చూసుకోవాలి. ఒక భాగంతో శాస్త్రశ్రవణం చేయాలి. శ్రవణం అంటే ఒట్టిగా వినటం కాదు, "ఉపనిషత్ వాక్యాలన్నిటి తాత్పర్యమూ పరబ్రహ్మ తత్త్వమే " అనే నిశ్చయం కలగడానికి అనుకూలమైన మానసిక వ్యాపారమే, అనగా, అట్టి ఆలోచనా పరంపరే శ్రవణం! ఇక నాలుగవ భాగాన్ని గురుశుశ్రూషతో గడపాలి.

" క్రమంగా చిత్తం పరిశుద్ధమవుతున్న కొద్దీ, భోగాల కోసం అట్టిపెట్టుకున్న రెండు భాగాలలోనూ ఒక భాగాన్ని గురుశుశ్రూషకే కేటాయించుకోవాలి. అంటే, ఆ దశలో ఒక భాగం భోగానికి, ఒక భాగం శాస్త్రశ్రవణానికి, రెండు భాగాలు గురుశుశ్రూషకి, వాడుకోవాలి.

" మనస్సు ఇంకా కొంచెం పరిశుద్ధమైతే, ఒక భాగంతో శాస్త్రశ్రవణాన్ని, రెండవ భాగంతో వైరాగ్యసాధననూ, మూడవ భాగంతో ధ్యానాన్ని, నాలుగవ భాగంతో గురుశుశ్రూషను అభ్యసించాలి.

" ఇలాంటి సాధన చేసేటప్పుడు సాధకుడు తన మనస్సుని చంటిపిల్లవాణ్ణి కాపాడుకున్నట్లు కాపాడుకోవాలి.

**శనై శ్శనైః పాలనీయం**

**యుక్తిభిః పావనోక్తిభిః ।**

**శాస్త్రార్థపరిణామేన**

**పాలయేచ్చిత్త బాలకమ్ ॥** (సర్గ 24, శ్లోకం 49)

" మనస్సనే పసివాడికి ఉపాయాలు చూపించాలి. హేతువులు చూపించాలి. మంచి మాటలు చెప్పాలి. మెల్ల మెల్లగా లాలించాలి. శాస్త్రోక్తరీతిలో చిత్తపరిణామాన్ని పరిశీలించాలి. తొందర పడకూడదు. ఆత్మవిచారణ, వైరాగ్యసాధన, ఈ రెండు అభ్యాసాలూ ఏకకాలంలో సాగాలి. ఈ రెండూ పరస్పర ఆశ్రయంగా, పరస్పర పోషకంగా, ఉంటాయి. ఎలాగంటే, భోగాలమీద రుచితగ్గితే, మనస్సు పరబ్రహ్మవైపు మళ్ళుతుంది, అక్కడ విశ్రమిస్తుంది. అలా మనస్సు విశ్రమించిన కొద్దీ, భోగాలమీద ఆశ తగ్గుతుంది.

“ భోగాలను నిందించటం నేర్చుకోవాలి. నిందించటం అంటే తిట్టటం కాదు. భోగాలవల్ల కలిగే దుష్పరిణామాలను గుర్తించటమే భోగనింద. ఇది పెరిగిన కొద్దీ, భోగతృష్ణ తగ్గుతుంది. అది తగ్గిన కొద్దీ తత్త్వవిచారణ పెరుగుతుంది. తత్త్వవిచారణ చేసినకొద్దీ, భోగించడానికి యోగ్యమైన పదార్థమే కనిపించదు. అందువల్ల భోగతృష్ణ తగ్గుతుంది. ఈ విధంగా భోగనింద, తత్త్వవిచారణ, ఆత్మజ్ఞానము, అనే మూడూ ఆప్తమిత్రులవంటివి. అవి ఒకదానికొకటి ఉపకారం చేసుకుంటూ ఉంటాయి.

“ కుమారా! బలీ! నీకు ఇప్పుడు భోగనింద తనంతట తానుగా కలిగింది. అందువల్ల నువ్వు పరిశుద్ధుడవై నాకు సదాశివుడి లాగా కనిపిస్తున్నావు. ‘ నమస్తేస్తు సదాశివ ’ ఓ సదాశివ స్వరూపుడా! నీకు నమస్కారం”.

ఈ బలి విరోచన సంవాదమంతా ఎప్పుడో చిన్నప్పుడు జరిగింది. దాన్ని ఇప్పుడు పాతాళలోకంలో కూర్చున్న బలి గుర్తుచేసుకుని, నెమరు వేసుకుంటున్నాడు. ఆనాడు తన తండ్రి తత్త్వబోధ చేస్తూ చేస్తూనే, తత్త్వంలో లీనమై, కొడుకులోనే సదాశివుణ్ణి చూస్తూ, “ నమస్తేస్తు సదాశివ ” అంటూ కొడుకుకే నమస్కారం పెట్టిన సన్నివేశాన్ని తలచుకొని పులకించి పోతున్నాడు బలిచక్రవర్తి. ఆయన ఆలోచనలు ఇంకా ఇలా సాగాయి.

**బలి :** ఆ నాడు నా తండ్రి చేసిన బోధంతా ఈనాడు గుర్తుకొస్తోంది. అదృష్టం కొద్దీ ఇవాళ నాకు భోగాల మీద విరక్తి కలిగింది. భోగతృష్ణ చల్లారక ముందు, ఎప్పుడూ ఎలా వెంపర్లాడుతూ ఉండేవాణ్ణో గుర్తొస్తోంది. ఇప్పుడు భోగతృష్ణ నశించడం వల్ల ప్రశాంతిగా ఉంది.

**శామ్యామి పరినిర్వామి**
**సుఖమాసే శమే స్థితః ।**
**అయమన్తః ప్రహృష్యామి**
**చంద్రబింబ ఇవార్పితః ॥** (సర్గ 25 , శ్లోకం 8)

“ ముక్తి పొందినట్లుగా ఉన్నా. సుఖంగా ఉన్నా. శాంతిగా ఉన్నా. లోపల ఆనందంతో పొంగిపోతున్నా. సూటిగా చంద్రబింబంలో కూర్చోబెట్టినట్లుగా పులకరించిపోతున్నా.

“ ఇది సుస్థిరం కావడం కోసం ఇప్పుడు మరింత తీవ్రంగా తత్త్వవిచారణ చేస్తా.

**“ కాయం తావదహం కిం స్యాత్ ”** ( సర్గ 25, శ్లోకం 18)

“ఈ ప్రపంచం అంటే ఏమిటి? నేనంటే ఏమిటి? అని ఇలాంటివన్నీ విచారణ చేస్తా.

“కానీ ఈ విషయంలో నా శక్తి చాలదు. నా కులగురువైన శుక్రాచార్యులవారిని పిలుస్తా. ఆయన్నే అడుగుతా. ఆయన ఉపదేశిస్తే నా అజ్ఞానం నశిస్తుంది, నాకు స్వస్వరూపస్థితి లభిస్తుంది”.

బలి ఇలా ఆలోచించి, ఆలోచించి, కళ్ళు గట్టిగా మూసుకుని, తన కులగురువైన శుక్రాచార్యులవారిని చక్కగా ధ్యానించాడు.

### ౨. చిన్మయ చర్చ:

శుక్రాచార్యులవారికి ఈ తరంగాలందాయి. ఇప్పుడు తన శిష్యుడు తత్త్వజిజ్ఞాసతో తన దర్శనం కోరుతున్నాడని అర్థమైంది. తక్షణమే బలిచక్రవర్తి కూర్చున్న రత్నాల కిటికీ దగ్గర ప్రత్యక్షమయ్యాడు. బలిచక్రవర్తి సంతోషంగా లేచి, గురువుగారికి స్వాగతం పలికి, అర్ఘ్యపాద్యాదులిచ్చి, రత్నసింహాసనం మీద కూర్చోబెట్టి ఇలా ప్రశ్నించాడు--

**బలి :** గురుదేవా! మీ అనుగ్రహంవల్ల నాలో ఏదో తెలివి వికసిస్తోంది. భోగాలమీద విరక్తి కలుగుతోంది. తత్త్వం తెలుసుకోవాలనే తపన పెరుగుతోంది. ఈ విషయ సుఖాలకు హద్దేది? వీటికి మూలకారణమేది? నేనెవరు? మీరెవరు? ఈ లోకాలెవరు?

**కియన్మాత్రమిదం భోగ, జాలం కింమయమేవ వా ।**

**కో హం కస్త్వం కిమేతే వా, లోకా ఇతి వదాశు మే ॥** (సర్గ 26, శ్లోకం 9)

గురుదేవా! దయతో ఇవన్నీ నాకు వివరించండి".

**శుక్రుడు:** నేనంత విశ్రాంతిగా లేనయ్యా. ఆకాశమార్గంలో ఎక్కడికో పోవాలనే తొందరలో ఉన్నా. ఐనా దీనికి ఇన్ని మాటలెందుకు? సారం సంక్షేపంగా చెప్పేస్తా, విను.

**చిదిహాస్తి హి చిన్మాత్రం, ఇదం చిన్మయ మేవ చ ।**

**చిత్త్వం చిదహ మేతే చ, లోకాశ్చిదితి సంగ్రహః ॥**(సర్గ 26, శ్లోకం 11)

**శుక్రుడు:** బలీ! సరిగా చూడు. ఈ కనిపించేదంతా చైతన్యమే కదా!

**బలి :** చైతన్యమూ, జడమూ రెండూ కనిపిస్తున్నాయి కదా!

**శుక్రుడు :** అదే పొరపాటు. చైతన్యం ఒక్కటే ఉన్నది.

**బలి :** ఈ కనిపించే జడ ప్రపంచం మాటేమిటి?

**శుక్రుడు :** జడమే లేదు. చైతన్యం మాత్రమే ఉంది. ఇదంతా కేవలం చైతన్య స్వరూపం. జడం లాగా కనిపించేది కూడా చైతన్యమే.

**బలి:** అదేమిటి? నేను చేతనుణ్ణి, కనుక నేను భోక్తను. ఇది జడం. కనుక ఇది నాకు భోజ్యం – అనే అనుభవం లోకంలో వుంది కదా! ఈ భోక్తృ భోజ్యవిభాగం లేనే లేదంటారా?

**శుక్రుడు : " నాన్యతోస్తి ద్రష్టా, నాన్యతోస్తి శ్రోతా "**

ఆ శుద్ధ చైతన్యం కన్నా భిన్నంగా వేరే ద్రష్ట లేదు, వేరే శ్రోత లేదు – అని వేదం చెపుతోంది. ఇలాంటి వేదవాక్యాలు వందల కొద్దీ వున్నాయి. కనుక భోక్తలమని భావించబడే నువ్వూ, చైతన్యమే, నేనూ చైతన్యమే.

**బలి:** పోనీ ఆ మాట ఒప్పుకున్నా, ఈ భోజ్యవస్తువుల మాటేమిటి? భోజ్యవస్తువుల న వ య దా య ం రూపమైన లోకాల మాటేమిటి?

**శుక్రుడు:** ఈ భోజ్య పదార్థాల సత్తా గాని, వాటి స్ఫూర్తి గాని, దేనిమీద ఆధారపడి వున్నాయి? చైతన్యం మీదనే కదూ! కనుక, అవన్నీ చైతన్యంయొక్క రూపాంతరాలే గాని, మరోటి కావటానికి వీలులేదు. అందుకనే శ్రుతి కూడా " బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠం" (కనిపించే యీ ప్రపంచం అంతా ఆ పరబ్రహ్మమే) అంటోంది. కనుక ఈ లోకాలన్నీ చైతన్యమే. బలీ! సంగ్రహంగా చెప్పాలంటే, ఉన్న తత్త్వం ఇంతే!

" శ్రద్ధా వివేకాలుంటే, నేను చెప్పింది చాలు. అవి లేకపోతే ఎంత చెప్పినా బూడిదలో హోమాలు చేసినట్లే. ఐనా మళ్ళీ చెబుతున్నా విను––

**చిత్ చేత్య కలనా బంధః**

**తన్ముక్తి ర్ముక్తి రుచ్యతే ।**

**చిదచేత్యాఖిలాత్మేతి**

**సర్వసిద్ధాన్త సంగ్రహః ॥** (సర్గ 26, శ్లోకం 23)

బలీ! దృక్ అయిన చైతన్యం దృశ్యాకారాన్ని పొందటమే బంధం. అనగా, దృక్ – దృశ్యాల పరస్పరధ్యాసే బంధం. చైతన్యానికి దృశ్యాకార సంబంధం పోయి శుద్ధ చైతన్యంగా మిగిలిపోవటమే ముక్తి. అనగా, చైతన్యం విషయాకారాన్ని విడిచిపెట్టటమే ముక్తి. దృశ్యసంపర్కంలేని చైతన్యమే సమస్త జీవులకూ ఆత్మ. అదే పూర్ణాత్మ. ఇదే సర్వసిద్ధాంత సంగ్రహం.

బలీ! ఈ సిద్ధాంతాన్ని నువ్వు లోపల గట్టిగా భావన చేసినట్లైతే, నీవు స్వయంగానే నాశనం లేని పరమపదాన్ని అందుకుంటావు.

స్వర్గలోకంలో సప్తఋషులు ఒకానొక దేవకార్యం కోసం సమావేశమై ఉన్నారు. నేను కూడా ఆ సమావేశానికి వెళ్ళాలి. ముక్తి పొందినవారికి కూడా దేహం ఉన్నంత వరకూ పూర్వ ప్రారబ్ధంవల్ల వచ్చి పడ్డ పనులను విడిచిపెట్టడం రుచించదు".

ఇలా అంటూనే శుక్రమహర్షి అక్కడ్నించీ ఆకాశమార్గంలో వెళ్ళిపోయాడు.

బలి చక్రవర్తి కులగురువైన శుక్రాచార్యుడి మాటలను జాగ్రత్తగా మననం చేసుకోసాగాడు--

" అవును, గురువుగారు చక్కగా చెప్పారు. అంతా చైతన్యమే. చైతన్యమే లోకాలయింది. చైతన్యమే దిక్కులయింది, భూమి అయింది, పంచభూతాలయింది, నేనుగా మారింది, సమస్త జీవులుగా మారింది.

" నేనంటే ఎవరు? ఈ శరీరాన్ని బలి అంటున్నారు. ఈ శరీరంలో తలకాయ నరికేస్తే ఆ చైతన్యానికి ఏమైనా తగ్గిపోతుందా? చైతన్యంలో నరకబడేందుకు వీలైన భాగమే లేదు. అది ' సర్వలోకావపూరణం '.

**చితశ్చిదితి యన్నామ**
**నిర్నామాయా న నామ తత్ ।**
**శబ్దాత్మికైషా చిచ్ఛక్తిః**
**పరిస్ఫురతి సర్వగా ॥** (సర్గ 27, శ్లోకం 15)

అవును! చైతన్యం చైతన్యం అంటున్నారే, ఆ పదార్థానికి ఈ పేరెవరు పెట్టారు? ఎవరూ పెట్టలా. నిజానికి మూలసత్ పదార్థానికి పేరే లేదు. ఆ మూలసత్ పదార్థంలోంచే ఈ ప్రపంచంలోని సమస్త పదార్థాలకూ నామరూపాలు రెండూ ఏర్పడ్డాయి. ఎలా ఏర్పడ్డాయి? వివర్తరూపంగా ఏర్పడ్డాయి. అంటే భ్రాంతిరూపంగా ఏర్పడ్డాయి. అధ్యాసరూపంగా ఏర్పడ్డాయి. అదే ప్రక్రియలో, ఆ మూలసత్‌పదార్థంలోంచే చైతన్యం అనే పేరుకూడా వివర్తరూపంగానే ఏర్పడింది. ప్రపంచంలోని నామరూప కల్పనలన్నింటికీ అధిష్ఠానంగా (ఆధారంగా) ఉన్న చైతన్యశక్తే (చిత్‌శక్తే) తన స్వంత పేరు రూపంగా కూడా వివర్తం చెంది కనిపిస్తోంది. అందుచేత, ఈ చైతన్యమనే పేరుకూడా అసలు చైతన్యమూల పదార్థంలాగానే సర్వవ్యాపిగా ఉంది. అదేమిటి? ఒక పేరు ఒక పదార్థాన్ని మాత్రమే ఆశ్రయించుకుని ఉండగలదు. కాని అన్ని పదార్థాలనూ ఎలా అశ్రయించగలదు? అంటారేమో! అదేమీ చిక్కు కాదు. చైతన్యమే నానా పదార్థాల రూపాన్నీ పొందింది కనుక, ఒకచోట పదార్థమనేది కనిపించిందంటే అక్కడ చైతన్యం కూడా ఉందన్నమాటే. చైతన్యం ఉందంటే, చైతన్యం అనే పేరు కూడా అక్కడికి అన్వయిస్తున్నట్లే. అంటే ప్రపంచంలో ఎక్కడైనా పదార్థమని పిలవదగ్గది ఏది ఉన్నా సరే, అక్కడ చైతన్యమనే పదార్థమూ ఉన్నట్టే. అది ఉంది కనుక చైతన్యమనే పేరూ ఉన్నట్టే. కనుక చైతన్యంతో పాటు చైతన్యమనే పేరు కూడా సర్వవ్యాపి అవుతోంది.

ఆ చైతన్యాన్ని నేనే. నేనే అజ్ఞానంలో పడితే, నాకు మనస్సనే సంక్షోభం కలిగి, నేనే ఈ జడప్రపంచంగా కనిపిస్తున్నాను. ఆ నాకే తత్త్వబోధకలిగితే, నేను నామరూపభేదాలు లేకుండా శమించి పోతున్నాను. ”

బలిచక్రవర్తి ఇలా ఆలోచిస్తూ ఉండగానే, అతను పరమ వివేకశాలి కనుక, అతని మనస్సు ఓంకారంలో లగ్నమైపోయింది.

**ఇతి సంచింతయన్నేవ**
**బలిః పరమ కోవిదః ।**
**ఓంకారాదర్ధమాత్రార్థం**
**భావయన్మౌనమాస్థితః ॥** (సర్గ 27, శ్లోకం 32)

ఇది ఒక గొప్ప శ్లోకం. వ్యాఖ్యాత – ఆనందబోధేంద్ర సరస్వతి. దాన్ని చక్కగా వివరించాడు.

చైతన్యతత్త్వాన్ని అనుసంధానం చేస్తూ ఉండగా, బలిచక్రవర్తి మనస్సు అప్రయత్నంగా ఓంకారంతో అనుసంధానం చెందింది. ఓంకారానికి, చైతన్యానికి, సంబంధం ఏమిటి? – అంటారేమో. ఓంకారంలో అకార ఉకార మకారాలున్నాయి. ఇవిగాక ఏ వర్ణమూ స్ఫుటంగా వినిపించని ఒక నాదస్థితి ఉంది. దానిపేరే అర్ధమాత్ర. వీటిలో అకారం స్థూల ప్రపంచాన్ని బోధిస్తుంది. అనగా జాగ్రత్ ప్రపంచాన్ని బోధిస్తుంది. ఉకారం సూక్ష్మప్రపంచాన్ని బోధిస్తుంది. అనగా స్వప్నప్రపంచాన్ని బోధిస్తుంది. మకారం కారణప్రపంచాన్ని బోధిస్తుంది. అనగా అజ్ఞానాన్ని బోధిస్తుంది. ఈ మూడు అవస్థలలోనూ చైతన్యమే ఉంది. ఇంకా బాగా చెప్పాలంటే, ఉన్నది చైతన్యం ఒక్కటే. కానీ, అకార ఉకారాలచేత సూచింపబడే చైతన్యం సంక్షోభసహితంగా ఉంది. సంక్షోభం అంటే మార్పు. అకారం దగ్గర స్థూల సంక్షోభంతో కలిసి ఉంది. ఉకారం దగ్గర సూక్ష్మ సంక్షోభంతో కలిసి ఉంది. మకారం దగ్గరకొచ్చేసరికి, అక్కడ సంక్షోభాలు లేవు గానీ, పై రెండు సంక్షోభాలకూ మూలభూతమైన అవిద్య (అజ్ఞానం) ఉంది. అక్కడి చైతన్యం ఈ అవిద్యతో కలిసిఉంది. కనుక ఈ మూడు ప్రదేశాల్లోనూ ఎక్కడా శుద్ధమైన చైతన్యం దొరకడం లేదు. సంక్షోభంతోనో, అజ్ఞానంతోనో, కలిసిన చైతన్యమే దొరుకుతోంది. ఇలాంటి ఈ చైతన్యం మీదికి ఎక్కాలి. మేడమీదకి ఎక్కినట్లుగా ఎక్కాలి. మేడమీదికి ఎక్కినవాడు మేడను చూడడు. మేడచుట్టూతా ఉన్నదాన్ని చూస్తాడు. అలాగే, అకార ఉకార మకారాల నందుకున్నవాడు వాటిని దాటిఉన్న అర్ధమాత్రమును చూస్తాడు. అంటే నాదాన్ని చూస్తాడు. అంటే ఇందాకటి అకార ఉకార మకారాల అస్పష్టావస్థను చూస్తాడు. ఈ అస్పష్టావస్థలో సంక్షోభాలుకానీ, అజ్ఞానంకానీ, లేవు. చైతన్యం సర్వవ్యాపి కనుక, అది ఇక్కడ కూడా ఉండితీరుతుంది. కనుక, ఈ అర్ధమాత్రావస్థలోని చైతన్యం పరిశుద్ధ చైతన్యం అవుతుంది. దాన్నందుకున్నాడు బలి. దాన్ని భావించాడు. అదే నేననే అనుభవాన్ని అందుకున్నాడు. దానివల్ల అతనికి ఒక మౌనస్థితి సిద్ధించింది. అది సర్వేంద్రియ మౌనస్థితి. ఏ ఇంద్రియమూ విషయాలను గుర్తించని స్థితి. అదే నిర్వికల్పసమాధి స్థితి. అదే బలికి అందింది.

అలా నిర్వికల్పసమాధి అప్రయత్నంగా సిద్ధించడంతో, ఆ చక్రవర్తి ఆ రత్నాల కిటికీలో చెక్కిన శిలాప్రతిమలాగా అలాగే కూర్చుండిపోయాడు.

అలా చాలాసేపయిన తరువాత పరిచారకులు చూసి, పై అధికారులతో చెప్పారు. చివరికి మంత్రులూ, సేనాపతులూ, సామంతులూ, అందరికీ ఈ వార్త తెలిసింది. వాళ్ళంతా పరుగు పరుగున వచ్చారు.

రాజుగారికేదో మైకం కమ్మిందని చాలా మంది గొల్లుమన్నారు. మరికొందరు బాధను గొంతులోనే

ఆపుకున్నారు. ఆ ఏకాంతమందిరంలో అందరూ గందరగోళంగా మాట్లాడుకుంటున్నారు. అయినా బలి కదలలేదు.

దాంతో వృద్ధమంత్రులకు కొంతమందికి ఆదుర్దా పుట్టి, ఏం చేయాలో తోచక, శుక్రాచార్యులవారిని ధ్యానించారు. ఆయన " ఏమిటి? ఏమిటి?" అంటూ ప్రత్యక్షమయ్యారు. అందరూ రాజును చూపించి బావురుమన్నారు.

శుక్రాచార్యులవారు బలివంక చూసి, పరమానందపడిపోయి ఇలా అన్నారు ః

" ఓ దానవవీరులారా! ఈ బలిచక్రవర్తికి అందవలసినది అందింది. శాశ్వత బ్రహ్మానందం లభించింది. ఒక వెయ్యి సంవత్సరాలయితే కానీ ఇతనీ ఆత్మసమాధిలోంచి బయటకు రాలేడు. కనుక మీరంతా దానికి సంతోషించాలి. దీనికి మీరు సహకరించాలి. ఈ లోపల రాజకార్యాలన్నీ మీరే చక్కబెట్టండి".

శుక్రుడు ఈ విధంగా ఉపదేశించి, స్వస్థానానికి వెళ్ళిపోయాడు. రాక్షసవీరులు తమ తమ పనులకు వెళ్ళారు.

శుక్రాచార్యుడు చెప్పినట్టుగానే వేయి సంవత్సరాలకు బలిచక్రవర్తి సమాధినుంచి లేచాడు. లేచేటప్పటికి ఎంతో హాయిగా ఉంది. ఆయన మళ్ళీ సమాధిలోకి పోదామని అనుకుంటూ ఉండగానే, మంత్రి సామంతాది పరివారమంతా వచ్చి చుట్టూ చేరారు. బలి మళ్ళీ మరో సారి ఆత్మవిమర్శ చేసుకొని, వీరితో మాట్లాడాలా అక్కర్లేదా అని ఆలోచించాడు. ఆయన ఆలోచనలు ఇలా సాగాయి ః

"వీరందరూ వచ్చారు గదా. వీరితో మాట్లాడాలా వద్దా?

" ఎందుకీ సందేహం?

" అదృష్టంవల్ల ఇప్పుడీ ఆత్మానందస్థితిలో ఉన్నా. ఇలాంటివాళ్ళతో మాట్లాడితే మళ్ళీ బంధంలో పడిపోతానేమో.

" సరే, ఇప్పుడు నువ్వు ముక్త స్థితికి వచ్చావు కదా. అంతకు ముందు బద్ధుడివై ఉంటే కదా, ఇప్పుడు నీకు విముక్తి లభించేది? అప్పుడు నిన్ను బంధించిన వాళ్ళెవరు?"

"ఎవరూ బంధించలా! నన్ను నేనే అజ్ఞానంతో బంధించుకున్నా. కనుక, ఇప్పుడు వీళ్ళవల్ల బంధంలో పడతాననుకోవటం తెలివితక్కువతనం."

" పూర్వం నువ్వు నిజంగా బద్ధుడివి అయినావా?

" నేను శుద్ధచైతన్యస్వరూపాన్ని గనక, నాకు బంధం కలిగే సావకాశమే లేదు. బద్ధుడ్నయ్యాననుకుని బాధపడుతూ వచ్చా. నిజంగా బంధం లేకుండానే, విడుదల కావాలి, మోక్షం కావాలి, అని అఘోరించా. ఇప్పుడు ఆలోచించి చూస్తే, ఇదంతా పిల్లచేష్టగా ఉంది. కనుక, నాకీ ధ్యానాలూ అక్కరలేదు. ఈ వచ్చిన మిత్రులు దూరంగా పోవాలనే కోరికా అక్కరలేదు. నేను నా ఆత్మతత్త్వంలో మునిగి ఉంటాను. వీరితో మాట్లాడితే నాకు రాగల ప్రమాదం ఏమీ లేదు".

బలిచక్రవర్తి ఇలా ఆలోచించి, ధ్యేయవాసనా త్యాగ మయమైన మనస్సుతో వాళ్లతో మాట్లాడి, తన రాజకార్యాలను అలాగే నిర్వర్తిస్తూ వచ్చాడు.

కొంత కాలానికి ఆయన ఒక అశ్వమేధయాగాన్ని సంకల్పించాడు. ఆ యజ్ఞంలో హవిర్భాగాలను స్వీకరించడానికి దేవేంద్ర సహితుడై ఉపేంద్రుడు స్వయంగా విచ్చేశాడు. వచ్చి అనేక వరాలిచ్చాడు.

కానీ, బలి అప్పటికే ఆత్మజ్ఞాన సిద్ధుడై ఉన్నాడు కనుక, ఉన్న పదవి పోయినందుకు దుఃఖమూ పడలేదు, పాతాళలోకభోగాలు లభించినందుకు సంతోషమూ పడలేదు.

బలిచక్రవర్తి కథ ఇంతవరకూ చెప్పి, వశిష్ఠుడు శ్రీరాముడికి ఇలా బోధించాడు--

**వశిష్ఠుడు:–** రామా! రాబోయే కాలంలో నిజంగానే దేవేంద్రుడై ముల్లోకాలనూ ఏలవలసిన ప్రారబ్ధం బలిచక్రవర్తి దగ్గర వుంది. రేపు నిజంగా ఆ పదవి వచ్చినప్పుడు కూడా బలికి కొత్తగా సంతోషమనేది కలుగదు. అయినా, ఆయన ప్రారబ్ధ శేషంవల్ల వచ్చిన వ్యవహారాలను పరిత్యజించడు. ఎందుకంటే, ఆయన అప్పటికే ధ్యేయవాసనా త్యాగం చేసి ఉన్నాడు. కనుక రామా! నువ్వు కూడా బలిచక్రవర్తి లాగా ఆత్మవిచారణచేసి, ఆత్మజ్ఞానం సంపాదించి, అద్వైతసిద్ధిని అందుకో.

"రామా! పూర్వజన్మలలో చేసిన సాధనల బలంవల్ల ఒక్కొక్కప్పుడు ఆత్మజ్ఞానం ఆకాశంలోంచి పండు రాలిపడినట్లుగా చేతికందే సావకాశం ఉందని జనకమహారాజు ఉదాహరణ ద్వారా నిరూపించాను. ఒకప్పుడు శాస్త్రాధ్యయనం జరిగినా, గురుముఖతః ఉపదేశం పొందినా, అది ఫలించక, కొన్ని సన్నివేశాలలో తోటివారి సహకారంతో జ్ఞానం వికసించవచ్చునని పుణ్యపావనుల కథ ద్వారా వివరించాను. చిన్నప్పుడెప్పుడో పొందిన ఉపదేశం, ఎప్పుడో వార్ధక్యంలో బలం పుంజుకొని, విచారోన్ముఖం కాగా, సరియైన సమయంలో సద్గురువు వచ్చి చేసే సదుపదేశం ఎలా సఫలమవుతుందో, బలిచక్రవర్తి కథ ద్వారా నిరూపించాను. ఇక తత్త్వజ్ఞానాన్ని అందుకునేందుకు మరో ఉపాయం కూడా ఉంది. అదే ఈశ్వరారాధన. చిరకాలం చేసిన ఈశ్వరారాధనవల్ల, ఈశ్వరానుగ్రహం లభించి, దానివల్ల ఆత్మతత్త్వసిద్ధి లభించవచ్చు. ఈ మార్గానికి నిదర్శనంగా బలిచక్రపర్తి తాతగారైన ప్రహ్లాదుడి కథ చెబుతాను విను.

## 10. ప్రహ్లాదోపాఖ్యానం

నీకు తెలుసు కదా, పూర్వం హిరణ్యకశిపుడనే రాక్షసుడికి ప్రహ్లాదుడనే పుత్రుడుండేవాడు. హిరణ్యకశిపుడు విష్ణు ద్వేషి. ప్రహ్లాదుడు విష్ణు భక్తుడు. విష్ణు ద్వేషంవల్ల పుత్రుడైన ప్రహ్లాదుణ్ణి తండ్రి అనేకవిధాలుగా హింసించాడు. చివరికి శ్రీహరి నరసింహావతారం స్వీకరించి, హిరణ్యకశిపుణ్ణి సంహరించి, ఎదురుతిరిగిన కొన్ని లక్షల మంది రాక్షసులను కూడా సంహరించి, ప్రహ్లాదుడ్ణి రక్షించాడు.

ఆ రాజవంశంలో ప్రహ్లాదుడొక్కడే వారసుడుగా మిగలడంవల్ల, అతడే రాక్షసరాజయ్యాడు. కానీ, ఆ రాజ్యంలో ఏమీ బలం లేదు. దేవతలు రాక్షసరాజ్య పౌరులను అనేక రకాలుగా పీడించుకు తింటూ ఉండేవారు. ప్రహ్లాదుడు ఏమీ చేయలేక చాలా బాధ పడుతూ ఉండేవాడు.

ఒక రోజున ఆ ప్రహ్లాదుడు ఈ విషయం గురించి ఆలోచించి, ఆలోచించి, చివరికి రాక్షసజాతి భయనివారణ కోసం నారాయణోపాసన చేయాలని నిశ్చయం చేసుకున్నాడు. ఆయన ఇలా ఆలోచించాడు–

**"అవిష్ణుః పూజయన్విష్ణుం**
**న పూజా ఫలభాగ్భవేత్ ।**
**విష్ణుర్భూత్వా యజేద్విష్ణుం**
**అయం విష్ణు రహం స్థితః ॥** ( సర్గ 31, శ్లోకం 40)

"విష్ణువు కానివాడు విష్ణువును పూజిస్తే పూజాఫలం లభించదు. కనుక సాధకుడు తాను విష్ణువై

విష్ణువును పూజించాలి. ఇదిగో నేను ఇప్పుడు విష్ణువునైపోయాను. విష్ణువు ప్రహ్లాదుడై పోయాడు. ఆయన నాకంటే వేరు కాదు. నేనాయనకంటే వేరు కాదు.

"ఆకాశపుటంచులదాకా రెక్కలు పరుచుకున్న ఈ గరుత్మంతుడు నాకు వాహనమైపోయాడు. ఇదుగో, నాకు నాలుగు చేతులు మొలిచాయి. వాటిలో ఆయుధాలు మెరిసిపోతున్నాయి. లక్ష్మీదేవి నాకు వింజామరలు వీస్తోంది. కీర్తిదేవి నా ప్రక్కన నిలబడి వుంది. సమస్త జగన్నిర్మాత్రియైన మాయాదేవి మరో ప్రక్క నిలబడి వుంది. నా శరీరకాంతితో దిక్కులు నల్లబడిపోతున్నాయి. నా చేతిలో పాంచజన్యశంఖం ఓంకార శబ్దాలను ధ్వనిస్తోంది. నా బొడ్డులో పద్మమూ, దానిలో బ్రహ్మ, కనిపిస్తున్నారు. నా చేతులలో గద, ఖడ్గం, శార్ఙ్గధనుస్సూ, ఉన్నాయి. నా ఉదరంలో అంతులేనన్ని లోకాలు కనిపిస్తున్నాయి. కొన్ని నశించిపోతున్నాయి. కొన్ని ఇప్పుడిప్పుడే పుడుతూ పుడుతూ వున్నాయి. ఈ భూమి నాకు పాదాల్లాగా ఉంది. ఈ ఆకాశం శిరస్సు లాగా ఉంది. ఈ దిక్కులు నా పక్కటెముకల్లాగా ఉన్నాయి. దుష్టబుద్ధులుగలవారంతా నానుంచి దూరంగా పారిపోతున్నారు. విరుద్ధబుద్ధులై నా దగ్గరకు వచ్చేవారంతా మంటల్లో పడ్డ మిడతల్లా మాడిపోతున్నారు. నా తేజస్సును ఈ సురాసురులెవరూ తట్టుకోలేకపోతున్నారు. బ్రహ్మేంద్రాగ్నిహరాదులైన దేవతలంతా విష్ణువునైన నన్ను కీర్తిస్తున్నారు. ద్వంద్వాతీతమహిమాన్వితుణ్ణై నేను విజృంభిస్తున్నాను. నా యీ విరాడ్రూపానికి నేనే నమస్కరిస్తున్నాను".

ప్రహ్లాదుడీ విధంగా భావన చేసి, ఆ భావనాబలంచేత తనయందు విష్ణుత్వాన్ని కల్పించుకున్నాడు. ఈ 32వ సర్గలో వాల్మీకిమహర్షి ప్రహ్లాదుడియొక్క విష్ణుత్వభావనా విధానాన్ని 40వ శ్లోకం దగ్గర నుంచి 66వ శ్లోకం దాకా లలితకవితామయంగా వర్ణించాడు. ఉపాస్యదేవతను ఆత్మస్వరూపంగా అనుసంధానం చేసుకునే విధానాలను అభ్యసించదలచుకునేవారు ఈ 26 శ్లోకాలనూ అనునిత్యమూ మననం చేసితీరాలి.

ఆ విధంగా తనలో విష్ణుత్వాన్ని కల్పించుకున్న ప్రహ్లాదుడు, ఇక ఆ స్వామికి మానసపూజ చేయదలచుకున్నాడు.

**"వపుషో వైష్ణవాదస్మాత్**
**మాభూన్మూర్తిః పరావరా ।**
**అయం ప్రాణప్రవాహేణ**
**బహిర్విష్ణుః స్థితో పరః ॥** (సర్గ 32, శ్లోకం 2)

నాలో నేను కల్పించుకున్న ఈ విష్ణుస్వరూపంకన్నా భిన్నంగా, వేరే విష్ణుస్వరూపం ఉండకుండుగాక. దీనికన్నా భిన్నమైన విశాలవిరాడ్రూపమూ ఉండకుండుగాక, సంకుచితమైన వ్యష్టి దేవతాస్వరూపమూ ఉండకుండుగాక. ఇప్పుడు నా ముక్కు పుటాలలోంచి ప్రవహించే ప్రాణశక్తి ప్రవాహం విష్ణుస్వరూపమే గనుక, అది నా ఎదుట మళ్ళీ రూపుగట్టి, మరొక విష్ణుస్వరూపంగా నాకు సాక్షాత్కారించుగాక. అదే నామానసిక పూజకు ఆధారమగుగాక!"

అని ప్రహ్లాదుడీ విధంగా సంకల్పించి, తన ఎదుట రూపుగట్టిన ప్రాణమయ శ్రీవిష్ణుస్వరూపానికి రకరకాలుగా మానసోపచారాలు చేశాడు.

ఆ తరువాత కొంతసేపటికి ప్రహ్లాదుడు తన పూజా మందిరంలోకి ప్రవేశించి, అక్కడ విష్ణువిగ్రహాన్ని స్థాపించి, బహిరంగ పూజలు మొదలుపెట్టాడు.

ప్రహ్లాదుడిలా బహిరంగ పూజలు మొదలుపెట్టేసరికి, దగ్గరలో ఉన్న రాక్షస పరివారమంతా ఆయనతో కలిసి శ్రీహరి పూజలు చేశారు. దూరాన ఉన్నవారు ఎవరిళ్ళలో వారే విష్ణువిగ్రహాలు పెట్టుకుని పూజలుచేయటం ప్రారంభించారు. కొద్ది రోజుల్లోనే రాక్షసరాజ్యమంతా విష్ణుపూజలతో నిండిపోయింది. రాక్షసపౌరులంతా విష్ణుభక్తులైపోయారు. ' యథా రాజా తథా ప్రజా ' కదా!

ఈ విడ్డూరం చూసి, దేవతలు ఆశ్చర్యపడిపోయారు. క్రమంగా కంగారుపడిపోయారు. ఈ విపరీత విష్ణుభక్తి దేనికి దారితీస్తుందో అని భయపడి, సరాసరి శ్రీమహావిష్ణువు దగ్గరకే వెళ్ళి, " స్వామీ! ఇదేమి విపరీతం? ఈ తామసజీవులంతా ఇలా నీ పూజలు చేసేస్తున్నారేమిటి? దీనివల్ల ఎవరికొంప మునగబోతోందో గదా!" అని గోల పెట్టారు.

శ్రీమహావిష్ణువు నవ్వి " ఆశ్చర్యపడకండి. కంగారుపడకండి. ప్రహ్లాదుడికిదే చివరి జన్మ. అతని భక్తి మీకు అపకారంచెయ్యదు". అని దేవతలనోదార్చి పంపేశాడు. ఇక్కడ ప్రహ్లాదుడి భక్తి క్రమ క్రమంగా ముదిరి, వైరాగ్యంలోకి చేరింది. అతను ఇతర వ్యవహారాలన్నీ మాని నారాయణోపాసనలోనే కాలం గడిపేస్తున్నాడు.

ఈ స్థితిని గమనించిన శ్రీహరి, ఒక రోజతనికి పూజాగృహంలో సాక్షాత్కరించాడు. ప్రహ్లాదుడు ఆనందభరితుడై, ఆ స్వామిని మనోహరంగా స్తుతించాడు. ఈ స్తుతికి వాల్మీకిమహర్షి 33వ సర్గలో 19 నుంచి 26 వ శ్లోకం దాకా కేటాయించాడు.

ఆ స్తుతికి శ్రీహరి ప్రసన్నుడై " దానవవంశచూడామణీ! ప్రహ్లాదా! జన్మించడమనే దుఃఖం ఉపశమించిపోయే లాగా మంచి వరం కోరుకో " అన్నాడు.

**ప్రహ్లాదుడు :** దేవా! అందరి సంకల్పాలనూ సఫలం చేసేది నువ్వే. అన్ని లోకాలలోనూ ఉన్నది నువ్వే. కనుక ఏది అత్యంత ప్రశస్తమో దాన్ని నువ్వే అనుగ్రహించు.

**శ్రీమహావిష్ణువు:** ప్రహ్లాదా! సంసారభ్రాంతులన్నీ శమించి, పరమపదమైన మోక్షం లభించాలంటే, బ్రహ్మత్వస్థితిలో విశ్రాంతి లభించే దాకా ఆగని ఆత్మవిచారణ కావాలి. అట్టి ఆత్మ విచారణ నీకు లభించుగాక.

విష్ణుమూర్తి ఇలా వరమిచ్చి, గలగలమంటూ పైకిలేచిన తరంగం అక్కడే నీళ్ళల్లో కలిసిపోయినట్లుగా అంతర్ధానమైపోయాడు. ప్రహ్లాదుడక్కడే కూర్చున్నాడు.

అనందపరవశుడై కొంతసేపు హరి స్తోత్రాలు చేశాడు. కొంతసేపయినాక " నీకు ఆత్మవిచారణ లభించుగాక– అన్నారు గదా స్వామివారు! కనుక నేను ఆత్మవిచారణ చేసితీరాలి. చేస్తాను.

**కిమహం నామ తావత్ స్యాం**
**యోఽ స్మిన్ భువనడంబరే ।**
**వచ్మిగచ్ఛామి తిష్ఠామి**
**ప్రయత్నేనాహరామి చ ॥** (సర్గ 34, శ్లోకం 8)

" 'నేను' అంటే ఏమై ఉంటుంది? నేను మాట్లాడుతున్నా. ఇది వాగింద్రియక్రియ. నేను వెడుతున్నా. ఇది పాదేంద్రియక్రియ. నేను నిలుచున్నా. ఇది ఏం క్రియ? ఇది అసలు క్రియేనా? నేనున్నాను. నేను నిలుచున్నాను. ఈ రెండూ ఒకటి కాదు. ఈ రెండూ వేరే వేరే క్రియాపదాలే. కానీ ఇక్కడ రెండు క్రియలు ఉన్నట్లు కనపడవే! అదలా ఉండనీ. నేనేవేవో విషయాలను తెచ్చుకుంటున్నా. తెచ్చుకోవటమంటే ఏమిటి? అనుభవించటమే తెచ్చుకోవటం. నేను విషయాలను దేనితో తెస్తున్నాను? చేతులతో. ఇది కరక్రియ. కానీ

అనుభవించటం అక్కడితో ఆగిపోలేదు. కళ్ళతో రూపాన్ని తెచ్చుకుంటున్నాను. ముక్కుతో వాసనలను తెచ్చుకుంటున్నాను. ఇలా ఇంద్రియాలతో నానారకాల విషయాలనూ తెచ్చుకుంటున్నా. మాట్లాడుతున్నాను గనుక, వాగింద్రియమే నేనా? నడుస్తున్నాను గనుక, పాదేంద్రియమే నేనా? ఏ పనీ లేకుండా నేనుంటున్నాను గనుక, ఆ ఉండటమే నేనా? అనేక ఇంద్రియాలతో అనేక విషయాలను తెస్తున్నాను. అలా ఇంద్రియాలతో విషయాలను తెచ్చే ముందు నేను మనస్సుతో చాలా ప్రయత్నం చేస్తున్నాను. కనుక లోపల వుండి పని చేసే మనస్సును నేనా? నేనెవర్ని?

" నేను దేహం కావటానికి వీల్లేదు. గంధాన్ని కావటానికి వీలు లేదు. రసాన్ని కావటానికి వీలు లేదు. కనుక నేనెవర్నయ్యే వీలుంది?

" ఆ! ఇప్పుడర్థమవుతోంది. నిర్వికల్పచైతన్యంయొక్క ఆభాసను నేను. (ఆభాస అంటే భ్రాంతివల్ల కనిపించిన పదార్థం). నావల్లే వాక్కు, కన్ను, మొదలైన ఇంద్రియాలు ప్రకాశిస్తున్నాయి. కనుక నేను శుద్ధచైతన్యస్వరూపిని".

అని ఈ విధంగా ప్రారంభించి, ప్రహ్లాదుడియొక్క ఆత్మతత్త్వవిచారాన్ని వాల్మీకిమహర్షి మూడు సర్గల పాటు విస్తరించాడు. అందులో ఈ మొదటి సర్గ (34వ సర్గ)లో 115 శ్లోకాలు, తరువాతి సర్గలో 88 శ్లోకాలు, చివరిగా 36వ సర్గలో 80 శ్లోకాలు, ఉన్నాయి.

వీటిలో 34వ సర్గలో ప్రహ్లాదుడు తన విచారణ బలంచేత అనాత్మ వర్గాన్నీ, ఆత్మనీ, విడదీసి, తాను సత్ చిత్ స్వరూపుడైన అద్వితీయుడైన ఆత్మను అని నిశ్చయం చేసుకున్నాడు. 35వ సర్గలో, ఇలా తను సాక్షాత్కారం చేసుకున్న ఆత్మస్వరూపాన్ని ఓంకార స్వరూపంగా పరిశీలించి చూసుకుని, తనకు తానే నమస్కరించుకుని, ఈ జ్ఞానబలంతో పూర్వపు బంధాలను గురించి ఒక సారి సింహావలోకనం చేసుకుని, ఆనందించాడు. 36వ సర్గలో ప్రహ్లాదుడు ఆత్మప్రాప్తివల్ల ఆనందపరవశుడై తనకు తానే నమస్కారాలు పెట్టుకుంటూ, తనను తనే స్తోత్రం చేసుకుంటూ, భర్తతో భార్య క్రీడించినట్లుగా తనతో తనే ఏకాంతంగా క్రీడించాడు.

ప్రహ్లాదుడిలా ఆత్మచింతన చేస్తూ, చేస్తూనే, నిర్వికల్ప ఆనందసమాధిలో మునిగిపోయాడు. శిలా విగ్రహంలా కూర్చుండిపోయాడు. అలా చాలా కాలం గడిచింది. అతని అసురపరివారం ఈ స్థితిని గమనించి, అతనిని మామూలు స్థితిలోనికి తీసుకురావాలని నానారకాల ప్రయత్నాలూ చేశారు. కానీ అవి ఏవీ ఫలించలేదు.

రాజైనవాడిలా స్తబ్ధుగా పడుండేసరికి, రాజ్యంలో అరాచకం మరింత పెరిగిపోయింది. దొంగలదే రాజ్యమైపోయింది. కండగలవారిదే అధికారమైపోయింది. స్త్రీలకు రక్షణ లేకుండాపోయింది. ఇది ఇలా ఉండగా అసురరాజ్యం మీద దేవతల ఆగడాలు మరీ పెరిగిపోయాయి. అయినా ప్రహ్లాదుడు సమాధిలోంచి లేవలేదు.

## 11 దానవులు పూర్తిగా నశిస్తే - మోక్షక్రమం దెబ్బతింటుంది

కానీ జగద్రక్షాదక్షుడైన శ్రీహరి కార్తీక శుద్ధ ఏకాదశినాడు క్షీరసముద్రంలో నిద్ర లేచి, లోకాల పరిస్థితిని ఒక్క సారి పరిశీలించి చూశాడు. పాతాళలోకంలో, రాక్షస రాజ్యంలో, పరిస్థితి ఆయనకు అల్లకల్లోలంగా

కనిపించింది. ఆయన ఇలా ఆలోచించాడు. --

"అరెరే! నా అనుగ్రహంవల్ల ప్రహ్లాదుడికి ఆత్మానంద నిర్వికల్ప సమాధి చిక్కింది. కాని, రాక్షసరాజ్యం ఛిన్నాభిన్నమైపోయింది. రాక్షసులు బొత్తిగా లేకపోతే దేవతలకు జయేచ్ఛ పోతుంది. దేవతలు సహజంగా సత్త్వగుణప్రధానులు గనక, వారికి ప్రాణభయమూ, జయేచ్ఛా, ఈ రెండూ లేకపోతే రజోగుణం పూర్తిగా అడుగంటి, సత్త్వగుణమే సమృద్ధమై, వైరాగ్యం పెరిగిపోతుంది. వారికి మోక్షం మీది కాంక్ష పెరిగిపోతుంది.

" ఇది దేవలోకం వరకూ మంచి పరిణామమే కానీ, దీనివల్ల మానవలోకంలో వచ్చే పరిణామాలు మంచివి కావు. ఎందుకంటే, దేవతలు మోక్షాసక్తులైతే, వారు తమ భక్తులను ప్రోత్సహించడం తగ్గిపోతుంది. అది తగ్గినకొద్దీ భూలోక మానవులకు సత్కర్మల మీద ఆసక్తి తగ్గిపోతుంది. దానివల్ల వాళ్ళకు రజస్తమోగుణాలు పెరిగిపోయి, ప్రళయం రాకముందే నశించిపోతారు. అంటే నా జగద్రక్షణలీల దెబ్బతిన్నట్లవుతుంది.

" కొందరు ఈ రహస్యం తెలియక, ప్రకృతిలయమే (అనగా ప్రళయంలో లయించిపోవటమే) గొప్ప సిద్ధి అనుకుంటూ ఉంటారు. ఆ రకమయిన ప్రకృతిలయం సుషుప్తి స్థితి వంటిది. అది తాత్కాలికంగా మంచిది లాగానే కనిపిస్తుంది. కానీ స్థిరమైన మంచి కాదు. అది శాశ్వత మోక్షం కాదు. కనుక అది అభిలషణీయం కాదు.

" ఎవరికయినా సరే, సత్కర్మానుష్ఠానం ద్వారా జ్ఞానం మీద ఇచ్ఛ కలగాలి. ఈ జ్ఞానేచ్ఛవల్ల తత్త్వజ్ఞానం కలగాలి. తత్త్వజ్ఞానంవల్ల తత్త్వసాక్షాత్కారం కలగాలి. అప్పుడు పునరావృత్తి రహితమైన శాశ్వత మోక్షం లభించాలి. మోక్షం రావలసిన క్రమం ఇది.

" సృష్టిలో దానవులనేవారు పూర్తిగా నశించిపోతే, ఈ మోక్షక్రమం దెబ్బతింటుంది. అలా జరగనీయరాదు. దీనికేదైనా ఉపాయం చేయాలి.

" ఈ ప్రహ్లాదుడికి ఇది చివరి జన్మ. ఇది పరమేశ్వరుడి సంకల్ప సిద్ధమైన దైవనియతి. దీన్నెవ్వరూ మార్చలేరు. ఇప్పుడు ఈ పవిత్రమైన ఈ ప్రహ్లాద శరీరం ద్వారానే నా జగద్రక్షా కార్యక్రమం సాగాలి. కనుక ఇతడు జీవన్ముక్తుడై కూడా, అసంసక్తి సమాధిలో ఉంటూ రాజ్యపాలన చేయుగాక! ఈ దేహంతోనే ఈ కల్పం చివరిదాకా జీవించి, రాక్షసరాజ్యాన్ని రక్షించుగాక! ఇతని ద్వారా మళ్ళీ దేవాసుర యుద్ధం సంభవించుగాక! తన్మే క్రీడా భవిష్యతి - అది నా ఆటగా సాగుగాక!

" ఈ ప్రపంచం స్థిరంగా ఉన్నా, నశించినా, నాకు రెండూ సమానమే. కాని ఆ రెండూ క్రమబద్ధంగా జరగాలనేదే నా ఆలోచన. నా పనుల వెనకాల బుద్ధి అనేది లేదు. అంటే ఇది ఇలాగే జరగాలనే పట్టుదల లేదు. కనుక, నేను అభినివేశం లేకుండా ఇప్పుడు పాతాళలోకానికి వెళ్ళి, నా కర్తవ్యాన్ని నిశ్చలంగా నిర్వర్తిస్తాను".

శ్రీమహావిష్ణువు ఇలా ఆలోచించి, సరాసరి ప్రహ్లాదుని పూజామందిరంలోకి వెళ్ళి, అక్కడ ప్రత్యక్షంగా నిలబడి, తన పాంచజన్య శంఖం గట్టిగా పూరించాడు.

ఆ మహానాదానికి అక్కడ ఉన్న దానవులంతా భయపడి మూర్ఛపడిపోయారు. ప్రహ్లాదుడికి మాత్రం బ్రహ్మరంధ్రంలో ఉన్న ప్రాణశక్తి వెనుతిరిగి ఇంద్రియాల్లోకి ప్రవేశించింది. దానివల్ల మెల్లిగా అతని మనస్సు బలం కూడదీసుకుని, ఇంద్రియాలలోకి ప్రసరించింది. ఈ స్థితిలో, " మేలుకో " అనే మధుర మధుర కంఠస్వరం అతని మనస్సులోకి దూరింది. అది సాక్షాత్ శ్రీహరి కంఠస్వరం. ఆ స్వరంతో ప్రహ్లాదుడు పులకించిపోయి, ముఖం వికసించి, సమాధిలోంచి బయటకు వచ్చాడు.

అది గమనించిన శ్రీహరి వెంటనే ఇలా అన్నాడు --

**సాధో స్మర మహాలక్ష్మీ**

**మాత్మీయాం స్మర చాకృతిమ్ ।**

**అకాండ ఏవ కిం దేహ**

**విరామః క్రియతే త్వయా ॥** (సర్గ 39, శ్లోకం 22)

" హే సాధు పురుషా ! నీ రాక్షసరాజ్యలక్ష్మిని స్మరించుకో. నీ దేహాన్ని స్మరించుకో. అకారణంగా దేహత్యాగం చేయడమెందుకు?

" న హ వై సశరీరస్య ప్రియాప్రియయో రపహతిరస్తి" (శరీరం ఉన్నంత వరకూ ఇది ప్రియము, ఇది అప్రియము అనే భావన పోనే పోదు) అని ఉపనిషద్వాక్యం ఉంది కదండీ. కనుక ఈ శరీరం మనకెందుకు? – అంటావేమో! అది పొరపాటు. ఇది కావలసినది అని, ఇది అక్కరలేనిదని, ఈ రకమైన సంకల్పాలు ఎవరికి లేవో, అటువంటి నీకు ఈ శరీరంలో ఉండే ప్రియా ప్రియాలతో సంబంధం ఎలా సంభవించ గలదు? కనుక, వెంటనే లే, లే!

" నువ్వు ఈ శరీరంతో ఈ కల్పం చివరి దాకా జీవించి ఉండాలి. ఇది దైవనియతి. అది అలాగే జరుగుతుంది. మాకు తెలుసు. నువ్వు జీవన్ముక్తుడివై ఈ రాజ్యపరిపాలనం చేస్తూ, ఏ ఉద్వేగాలూ లేకుండా ఈ శరీరంతోనే ఈ కల్పాంతం వరకూ కాలక్షేపం చేసి తీరవలసిందే. నీ శరీరం ఈ విధంగా ఉండటానికి తగిన విధంగానే సృష్టిచేయబడింది.

" ఇంకా కల్పాంత సమయం రాలేదు. కనుక శరీరత్యాగం చేయకు.

" అయినా, ఎవడయ్యా మరణించవలసింది? అజ్ఞానం బలిసి, మనస్సు కల్లోలమై, దుఃఖాలు మితిమీరి ఎవడ్ని కొరుక్కుతింటాయో, వాడు మరణిస్తే బాగుంటుంది. ఆశాపాశాలు పెరిగిపోయినవాడు మరణిస్తే బాగుంటుంది. కామక్రోధాలు పెచ్చుపెరిగిపోయినవాడు మరణిస్తే బాగుంటుంది. నీకెందుకయ్యా మరణం?

" అయినా, అసలు మరణమంటే ఏమిటి? ఈ శరీరాన్ని వదిలిపెడితే దాన్ని మరణమంటోంది లోకం. కానీ సద్రూపుడైన ఆత్మకు క్రియలే లేవు. కనుక అతనికి శరీరత్యాగమనే క్రియ ఎలా సంభవిస్తుంది?

" శరీరత్యాగం జరగాలంటే దానికి వెనకాల శరీరంతో సంగం ఉండాలి. మరి ఆత్మ అసంగం. పైగా ఈ శరీరం అసద్రూపం. కనుక ఆత్మస్వరూపుడవైన నీకు ఈ దేహంతో సంగం ఎలా కుదురుతుంది? దేహసంగమే లేకపోతే, దేహత్యాగమెలా కుదురుతుంది? కనుక, నీకు మరణమనేది సాధ్యం కానే కాదు.

" కనుక ప్రహ్లాదా! ఎవడి మనస్సు అత్మతత్త్వదర్శనంనుంచి పక్కకు తొలగిపోదో, అలాంటి యథార్థదర్శికి, అలాంటి జ్ఞానికి, జీవించడమే శోభ. ఎవడికి అహంకారం లేదో, ఎవడి బుద్ధికి ఏదీ అంటదో, ఎవడు సర్వవిషయాల మీదా సమంగా ఉంటాడో, అలాంటివాడు జీవించడమే శోభ. " ఎవడి పేరు వింటే, ఎవడ్ని చూస్తే, ఎవడ్ని తలచుకుంటే, పరిసరాల్లో ఉండే జీవులకు ఆనందం కలుగుతుంతో, వాడు జీవించడమే శోభ.

" అయినా ప్రహ్లాదా! జీవించడమంటే ఏమిటి? ఉన్న దేహం కనిపిస్తూ ఉంటే, దాన్ని జీవించడం అంటున్నారు జనాలు. మరో దేహాన్ని పొందటం కోసం ఉన్న దేహాన్ని వదిలేస్తే, దాన్ని మరణం అంటున్నారు. నీకీ దేహం ఉందా? మరో దేహాన్ని పొందాలనుందా? రెండూ లేవే? మరి నీకు మరణం ఎక్కడుంది? జీవించడం ఎక్కడుంది? నీకా రెండూ లేనే లేవు.

" అద్దం తనకు ఎదురుగా వచ్చిన బింబాల రూపాలను తనలోకి గ్రహిస్తుంది. బింబం పక్కకు తప్పుకుంటే ప్రతిబింబాన్ని వదిలేస్తుంది. బింబాన్ని తీసుకున్నప్పుడుగానీ, వదిలినప్పుడు గానీ, అద్దానికి రాగద్వేషాలు

రెండూ లేనే లేవు. అలాగే జీవన్ముక్తులైన తత్త్వవేత్తలు రాగద్వేషరహితులై వ్యవహారాలు చేస్తూఉంటారు. వారు ఆత్మస్వరూప విషయంలో మేలుకొని ఉంటారు. సంసారవ్యవహారాల విషయంలో నిద్రించి ఉంటారు.

**జాగ్రతి స్వాత్మని స్వస్థాః**

**సుప్తాస్సంసార సంస్థితాః ॥** (సర్గ 40, శ్లోకం 24 )

ప్రహ్లాదా! నువ్వు కూడా అదే పద్ధతిలో ఈ కల్పం చివరివరకూ పాతాళలోక రాజ్యలక్ష్మిననుభవించు. ఆ తరువాత శాశ్వతమైన విదేహకైవల్యాన్ననుభవించు" శ్రీహరి ఈవిధంగా సుదీర్ఘోపన్యాసం చేసేసరికి, ప్రహ్లాదుడనబడే ఆ దేహం సంతోష పూర్వకంగా ఇలా అంది–

" దేవా! మంచి ఏది, చెడు ఏది, అని ఆలోచించి, అలోచించి, అలసిపోయాను. అలసిపోయి ఇప్పుడే ఒక్క క్షణం విశ్రమించాను. దేవా! తమ అనుగ్రహంతో నేనిప్పుడు సమాధిలోనూ, సమాధి వెలుపలా గూడా, సమస్వరూపంగా ఉన్నాను. దేవా! సమాధి లోపలా నువ్వే కనిపించావు. ఇప్పుడు సమాధి వెలుపలా నువ్వే కనిపిస్తున్నావు. నేను దుఃఖంతో గానీ, మోహంతో గానీ, వైరాగ్యచింతతో గానీ, దేహపరిత్యాగ బుద్ధితో గానీ, సంసారభయంతో గానీ, ఈ సమాధిలోకి వెళ్ళలేదు. ఉన్నాయి, రాజ్యబాధలున్నాయి. కానీ, అవి బయట ఉన్నాయి. నేను ఏకైక స్వరూపుణ్ణి. నాకు దేహమే లేదు. సంసారమే లేదు. నాశమూ లేదు, భయమూ లేదు, అభయమూ లేదు. కనుక వాటికోసం నేను సమాధిలోకి పోలేదు. ఆత్మవిచారణవల్ల నాలో విశ్రాంతి మీద ఇచ్ఛ కలిగింది. అందుకోసమే నేను సమాధిలోకి వెళ్ళాను.

" దేవా! కొందరు 'నాకు విరక్తి కలిగింది. నేనీ సంసారాన్ని వదిలేస్తున్నాను' అంటూ ఉంటారు. ఇది తెలివి తక్కువ మాట. ఎందుకంటే, ఈ ఆలోచన వారిలో కొంత సంతోషాన్ని, కొంత విషాదాన్ని, ఎంతో కొంత వికారాన్ని, కలిగిస్తోంది. 'దేహం లేకపోతే కష్టాలు లేవు. దేహం ఉంటే అన్నీ కష్టాలే' అనే పాడు ఆలోచన మూర్ఖుల్ని మాత్రమే పీడించుకు తింటుంది. 'ఇది సుఖకరం. ఇది నాకుంది. ఇది దుఃఖకరం. ఇది నాకు లేదు' అని ఇలా ఉయ్యాలలూగే మనస్సు మూర్ఖుల్ని పీడిస్తుంది గానీ పండితుల్ని కాదు.

" దేవా! నేనిలాంటివాటికి భయపడి సమాధిలోకి పోలేదు. కేవలం స్వభావసిద్ధంగా ద్రష్ట అంటే ఏమిటి? దృశ్యమంటే ఏమిటి? అని విచారణ చేస్తూ చేస్తూ, ఒక్క క్షణకాలం నా ఆత్మలో నేనే విశ్రమించా. ఆ స్థితిలో నాకు భావమూ లేదు, అభావమూ లేదు. దేయమూ లేదు, ఉపాదేయమూ లేదు. ఇప్పుడు సమాధి వదిలినాక కూడా అలాగే ఉన్నాను.

" దేవా! నీకెలా రుచిస్తుందో అలాగే చేస్తాను.

" దేవా! పద్మాలవంటి కళ్ళు నీవి. నువ్వు ముల్లోకాలకీ పూజ్యుడివి. నేను స్వభావసిద్ధంగా భక్తుణ్ణి. నా స్వభావాన్ని బట్టి నీకు పూజచేయాలనే సంకల్పం కలుగుతోంది. దయచేసి స్వీకరించు".

ప్రహ్లాదుడిలా అంటూనే స్వామివారి ఎదురుకుండా పూజపాత్ర తీసుకొచ్చి పెట్టాడు. ఇక స్వామి అనుమతితో ఆయనకు బ్రహ్మాండంగా పూజచేశాడు. ఆ పూజ పూర్తవుతూనే మహావిష్ణువు పరమానందంగా ఇలా అన్నాడు–

" రాక్షసేశ్వరా! ప్రహ్లాదా! ఇక లే. ఆ సింహాసనంలో కూర్చో. నీకు నేను స్వయంగా అభిషేకం చేస్తా. నాతోపాటు వచ్చిన సిద్ధ సాధ్యాది దేవతా సమూహాలన్నీ నీకు స్వయంగా రాజ్యాభిషేకం చేయుగాక."

శ్రీహరి ఇలా సెలవిచ్చేసరికి, ఎక్కడెక్కడి దేవతలూ పరుగు పరుగున వచ్చి, ప్రహ్లాదుడికి రాజ్య పట్టాభిషేకం చేశారు. ఆ తతంగం పూర్తవుతూనే శ్రీహరి ప్రహ్లాదుడ్ని మరో సారి ఆశీర్వదిస్తూ ఇలా అన్నాడు–

**ఇష్టానిష్టఫలం త్యక్త్వా, సమదర్శనయా ధియా ।**
**వీతరాగ భయక్రోధో , రాజ్యం సమనుపాలయ ॥** (సర్గ 42, శ్లోకం 32)

" ప్రహ్లాదా! ఇష్టానిష్టాలు పెట్టుకోకుండా, సమదర్శన బుద్ధి కలిగి, రాగద్వేషభయ క్రోధాలను వదలి, రాజ్యాన్ని పాలించు. వ్యవహార సమయంలో ఎప్పుడేది చెయ్యాలో అది చెయ్యి. ఆ చేసేటప్పుడు మనస్సులో రాగద్వేషాది వైషమ్యాలను పెట్టుకోకుండా ఉండు. నీ రాజ్యంలో రాక్షసులకు పీడలు లేకుండుగాక. దేవదానవులకు యుద్ధం లేకుండుగాక. నీవు చిరకాలం రాజ్యలక్ష్మిని అనుభవింతువుగాక".

శ్రీమహావిష్ణువు ఈ విధంగా వరాలిచ్చి, మళ్ళీ మరోసారి ప్రహ్లాదుడి పూజలందుకొని, సపరివారంగా స్వస్థలానికి వెళ్ళిపోయాడు. అప్పట్నుంచీ దేవేంద్రుడు స్వర్గంలోనూ, ప్రహ్లాదుడు పాతాళంలోనూ, సుఖంగా ఉండిపోయారు.

వశిష్ఠ మహర్షి ఈ విధంగా ప్రహ్లాద కథ ముగిస్తూ ఇలాఅన్నాడు.

" కనుక రామా! నువ్వు కూడా ప్రహ్లాదుడిలాగా ఆత్మవిచారణ బలంచేత జీవన్ముక్తుడివై రాజ్యపాలనం చెయ్యి. ప్రహ్లాదుడికి ఆత్మసిద్ధి లభించిన ఈ ఘట్టాన్ని మననం చేసే మానవులకు ఏడు జన్మల పాపం నశించిపోతుందనడంలో సందేహం లేదు".

## 12. జీవన్ముక్తుల వాసనా శేషం

వశిష్ఠుడిలా అనేసరికి శ్రీరాముడు బుడుంగున ఒక ప్రశ్న వేశాడు.

**శ్రీరాముడు:** గురుదేవా! జీవన్ముక్తుడై సమాధిలో ఉన్నవాడికీ, విదేహముక్తిని అందుకున్నవాడికీ, ఆత్మానందానుభవంలో ఏ భేదమూ లేదని మీరు తేల్చి చెప్పారు. అటువంటప్పుడు ఒక జీవన్ముక్తుడు సమాధినుంచి బయటకు రావటమే అసంభవం. ఎందుకంటే, సర్వోన్నతమై అత్మానందాన్ని వదిలి పెట్టుకుని ఎవడూ దూరంగా పోవాలనుకోడు కదా! అదీ గాక, ప్రహ్లాదుడు పరమాత్మలో లీనమై, ఇంద్రియాలన్నిటినీ పరిత్యజించి ఉన్న సమయంలో, శ్రీమహావిష్ణువు వచ్చి శంఖ ధ్వని చేస్తే, అది విని సమాధిలోంచి బయటకు వచ్చాడని మీరు చెప్పారు. ఇంద్రియసంపర్కమే లేనివాడు శబ్దాన్ని వినటం, సమాధిని వదిలి పెట్టడం, అనేవి ఎలా కుదురుతాయి?

**వశిష్ఠుడు:** రామా! ముక్తులు రెండు రకాలు. ఒకటి సదేహముక్తి. రెండవది విదేహముక్తి. సదేహముక్తి అన్నా, జీవన్ముక్తి అన్నా, ఒకటే. ఈ స్థితిలో ఏషణాత్రయం ఉండదు. ప్రాణం మాత్రం ఉంటుంది. అదే స్థితి అలాగే ఉండి దేహం రాలిపోతే, ఆ స్థితిని విదేహముక్తి అంటారు. దాన్ని పొందినవాళ్ళు ఇక మళ్ళీ ఈ సృష్టిలో కనిపించరు.

ఇక జీవన్ముక్తులున్నారే, వాళ్ళకు ఏషణాత్రయం లేకపోయినా, పునర్జన్మకు సావకాశం లేకపోయినా, కొన్ని శుద్ధ వాసనలు మిగిలి ఉంటాయి. ముఖ్యంగా పవిత్రమైన శుద్ధ బ్రహ్మాత్మభావన ఉండితీరుతుంది. కాబట్టి, నిద్రపోయినవాళ్ళు ఎప్పటికో అప్పటికి మేల్కొన్నట్లుగా, జీవన్ముక్తిని అందుకున్నవాళ్ళు ఎప్పటికో అప్పటికి, వెయ్యి సంవత్సరాల తరవాతైనా సరే, వ్యవహార దశలోకి వచ్చి తీరుతారు. అలా వచ్చేటప్పుడు, లోపల ఉన్న వాసనలతో సహా వస్తారు. ఇక్కడ ప్రహ్లాదుడు కూడా లోపల ఉన్న శుద్ధ వాసనతో మేల్కొన్నాడు. అది జీవన్ముక్తియొక్క స్వభావం.

ఇక ఇంద్రియాలతో సంబంధం లేనివాడికి శంఖధ్వని ఎలా వినిపించింది అని అడిగావు. శ్రీహరియొక్క సంకల్పబలంచేత అలా జరిగింది. శ్రీహరి అంటే ఎవరనుకుంటున్నావు? పరిశుద్ధ పరమాత్మే శ్రీహరి.

**ఆత్మన్యకారణేనైవ**
**భూతానాం కారణేన చ ।**
**సృష్ట్యర్థం వపురాత్తం హి**
**వాసుదేవ మయాత్మనా ॥** ( సర్గ 42, శ్లోకం 20)

తనకంటూ వేరే కారణం లేనిది, తను దేనికీ కారణం కానిది, అయిన పదార్థం ప్రపంచంలో ఒకటే ఉంది. అదే శుద్ధ ఆత్మ. ఈ సమస్త భూతాలకీ కారణం అయినది ఒకటే ఉంది. దాని పేరే అవ్యాకృతం. దీనికి కామకర్మాది సహకార కారణాలు కలిస్తే, ఇందాక చెప్పుకున్న శుద్ధాత్మ తనలో తనే ఒక శరీరాన్ని సృష్టిచేసుకుంటుంది. ఎందుకలా చేస్తుందంటే, జగత్ సృష్టి కోసం చేస్తుంది. అలా జగత్సృష్టి కోసం పరిశుద్ధాత్మ తనలో తాను స్వీకరించిన రూపమే శ్రీహరి. అందువల్ల, ఎవడు వేదాంతసాధనతో పరిశుద్ధాత్మ దర్శనం చేస్తాడో, వాడికి శ్రీహరి దర్శనమిస్తాడు. ఎవడికి మాధవుడి దర్శనం లభిస్తుందో, వాడికి తన పరిశుద్ధాత్మ స్వరూపం తనంతట తనుగానే దర్శనం ఇస్తుంది. అందుకే ప్రహ్లాదుడికి మొదట శ్రీహరి దర్శనం నరసింహ రూపంలో లభించింది. దానివల్ల ఆత్మదర్శనం లభించింది. దానివల్ల మళ్ళీ శ్రీహరి దర్శనమూ లభించింది. అట్టి ఆ శ్రీహరి సంకల్పంవల్ల ప్రహ్లాదుడి ఇంద్రియాలు మళ్ళీ పనిచేసి, శంఖధ్వనిని స్వీకరించాయి.

కనుక రామా! నువ్వు ఈ రకమైన దృష్టిని పెట్టుకుని ఆత్మ సాక్షాత్కారం కోసం ప్రయత్నించు.

**రాముడు :** గురుదేవా! ఇంకొక్క సందేహం ఉంది. పూర్వం మీరు ఒక సందర్భంలో మాట్లాడుతూ పురుషప్రయత్నంవల్ల మాత్రమే జ్ఞానం ప్రాప్తిస్తుందని చెప్పారు. అదే నిజమైతే ప్రహ్లాదుడికి వేరే ప్రయత్నం లేకుండా కేవలం శ్రీహరి వరంవల్ల జీవన్ముక్తి ఎలా ప్రాప్తించింది?

**వశిష్ఠుడు:** రామా! ప్రహ్లాదుడు పురుషప్రయత్నం చేయలేదనటం కుదరదు. ప్రహ్లాదుడు ముక్తి కోసం తపోరూపమైన ప్రయత్నం చేశాడు. అది ఫలించింది. కానీ మధ్యలో శ్రీహరి దర్శనం ఒక ద్వారంలాగా పనిచేసింది. కనుక పురుషప్రయత్నం లేనిదే జీవన్ముక్తి లభించదనే నియమానికి భంగం లేదు.

‘ శ్రీహరి కోసం తపస్సు చేస్తే ఆత్మజ్ఞానం ఎలా కలిగింది?’ అని సందేహిస్తావేమో? ఆత్మ అన్నా, శ్రీహరి అన్నా, ఒక్కటే. నువ్వు గింజన్నా, నువ్వుల నూనె అన్నా, ఒకటే. తెలుపన్నా తెల్లవస్త్రమన్నా ఒకటే. పువ్వన్నా వాసనన్నా ఒకటే. అలాగే ఎవడు విష్ణువో అతడే అత్మ. ఎవడు ఆత్మో వాడే విష్ణువు. ఇంతెందుకు? ఆవు, గోవు అన్నట్టుగా విష్ణువు, ఆత్మ అనే పదాలు పర్యాయపదాలు.

ఆత్మ స్వరూపుడైన ఈ విష్ణువే ప్రహ్లాదుణ్ణి భక్తిలో ప్రవేశపెట్టాడు. ఆ భక్తే అతన్ని ఆత్మవిచారణలోకి ప్రవేశపెట్టింది.

**నావిచారవతో జ్ఞానం**
**దాతుం శక్నోతి మాధవః ।**
**ముఖ్యః పురుషయత్నోత్థో**
**విచారస్స్వాత్మ దర్శనే ॥** (సర్గ 43, శ్లోకం 10)

అత్మ విచారణ లేనివాడికి శ్రీహరి కూడా జ్ఞానాన్ని వరంగా ఇవ్వలేదు. ఆత్మదర్శనం లభించాలంటే పురుషప్రయత్నంతో చేసే ఆత్మవిచారం ఒక్కటే ముఖ్యం. శ్రీహరి ఇచ్చే వరం మొదలైనవన్నీ దాని తరువాతే. కనుక రామా! నువ్వు ముఖ్య హేతువైన ఆత్మవిచారణ మీద శ్రద్ధపెట్టు. దానికోసం పురుష ప్రయత్నం చెయ్యి.

**శాస్త్రయత్న విచారేభ్యో**
**మూర్ఖాణాం ప్రపలాయినామ్ ।**
**కల్పితా వైష్ణవీ భక్తిః**
**ప్రవృత్త్యర్థం శుభస్థితౌ ॥** (సర్గ 43 – శ్లోకం 20)

శాస్త్రాధ్యయనము, సత్కర్మాచరణము, ఆత్మవిచారణము, అనేవి సరిగా చేయలేక పారిపోయే మూర్ఖులు శుభమైన మార్గంలో ప్రయాణం చేసేందుకోసం భగవద్భక్తి అనేది రూపొందించబడింది. కనుక శాస్త్రాభ్యాస సత్కర్మాచరణాదులు జ్ఞానప్రాప్తికి ముఖ్యవిధులు. అవి చేతకానప్పుడు, భగవత్ పూజాది విధులు గౌణవిధులుగా (అప్రధానమైన విధులుగా) రూపొందించబడినాయి.

ఇవి ఎందుకు అప్రధాన విధులయినాయంటే, వాటిల్లో ఒక “ పూజ్య పూజామయక్రమం ” ఉంది. అంటే, మనకంటే భిన్నంగా ఒక పూజ్యదేవత వుందని, ఆ దేవతకు మనకు మధ్య పూజ అనే క్రియా సంబంధం ఉందని, ఈ విధమైన త్రిపుటీ కల్పన ఉంది. అందుకే ఇది (పూజా విధి) గౌణవిధి అయింది.

పూజ చేసేవాడు ఇంద్రియాక్రాంతుడై ఉండిపోతే, ఆ పూజకు ఫలమేముంది? ఒకానొక వ్యక్తికి ఇంద్రియాలవల్ల పరాజయం లేకపోతే, వాడిక పూజలు చేసి పొందగల ఫలం ఏమి ఉంది? అనగా, పూజా క్రియలన్నిటికీ పరమ ఫలం ఇంద్రియ జయమే. దాన్ని ముందే సాధించినవాడికి పూజలవల్ల పెద్ద ప్రయోజనమేమీ ఉండదు. ఎందుకంటే, అసలైన శ్రీహరి శాస్త్ర విచారణ, ఇంద్రియోపశమము, అనేవి లేకపోతే దొరకడు. ఆ రెండూ ఉంటే సగుణ శ్రీహరితో పనే లేదు. కనుక రామా! నువ్వు ఆ రెంటినీ సాధించు.

అదీగాక రామా! పూజ చేసేవారు ఒక రహస్యం గ్రహించాలి. విష్ణువు ఎక్కడో బయట ఉన్నట్టు చేతులెత్తి ప్రార్థనలు చేస్తూ ఉంటారు వారు. నిజానికాయన వాళ్ళ హృదయంలోనే ఉన్నాడు. లోపలున్న హరిని విడిచి, బయటెక్కడో దూరంగా ఉన్న విష్ణువును ఆరాధించేవాళ్ళు మానవాధములే అవుతారు. ఉన్న సత్యమేమిటంటే జీవుల హృదయ గుహలలో ఉండే పరిశుద్ధ చైతన్య తత్త్వ మేదైతే ఉందో అదే శ్రీహరికి ముఖ్య శరీరం. శంఖ, చక్ర, గదా, పద్మాలను ధరించిన చతుర్భుజ రూపం గౌణ రూపం. ముఖ్య రూపాన్ని వదిలిపెట్టి, గౌణ రూపాన్ని అర్చిస్తాననేవాడు, చేతులో అమృతం పోస్తే కాదని పక్కన పారపోసి, ఆహారం కోసం పొలం దున్నుతానని బయలు దేరిన వాడితో సమానం.

ఇంతకూ చెప్ప వచ్చిందేమిటంటే, సూటిగా ఆత్మాను సంధానం చేతకానివాడు పరమేశ్వరారాధన చేయవచ్చు, కష్టపడి తపస్సులూ చేయవచ్చు, ఇతర సాధనలూ చేయవచ్చు. వీటిని జాగ్రత్తగా సమన్వయ పరచుకుంటే, వాడి మనస్సు నిర్మలమౌతుంది. దానివల్ల వాడికి వైరాగ్యం కలుగుతుంది.

ప్రహ్లాదుడు తపోరూపమైన పురుష ప్రయత్నం చేశాడని ఇదివరకే చెప్పాను. దాని ఫలితంగా శ్రీహరి వరం లభించింది. మళ్ళీ దానికి ఫలితంగా అతనికి ఆత్మ విచారణాసక్తి, దానికి ఫలితంగా ఆత్మ స్వరూపస్థితి, లభించాయి. కనుక పురుష ప్రయత్నంవల్ల మాత్రమే జ్ఞానం ప్రాప్తిస్తుందని నేను చెప్పిన మాటలో పొరపాటు లేదు.

రామా! ఆధ్యాత్మిక సాధన చేసేవారికీ, భౌతిక సాధనలు చేసేవారికీ కూడా, మనో నిగ్రహమే విజయ కారణం. వేరే కారణం లేనే లేదు. కనుక బహిరింద్రియ గమ్యమైన దేవతా ఆకారాన్ని వదిలి పెట్టి, అంతరింద్రియ గమ్యమైన జ్యోతి స్వరూపాన్ని కూడా వదిలి పెట్టి, నిర్వికారమైన చిన్మాత్ర స్వరూపాన్ని గురించి చింతించు. నీకు జన్మలు క్షయించిపోయే ఉపాయం ఇదే.

రామా! మానవుల భ్రాంతులన్నింటికీ మూలకారణం మాయే. ఈ మాయ నశించడానికి మనో నిగ్రహం ఒకటే ఉపాయం. సంసార జీవులకుండే ఈ మాయ ఎంత విచిత్రమైనదో తెలపటం కోసం నీకొక మంచి కథ చెపుతా విను -- అంటూ వశిష్ఠ మహర్షి గాధి బ్రాహ్మణ వృత్తాంతంలోకి అడుగు పెట్టాడు.

ఉపశమ ప్రకరణం మొత్తం మీద కేంద్ర బిందువైన కథ గాధి వృత్తాంతమే. ఈ ప్రకరణంలో ఇప్పటి వరకూ మనం కొన్ని చిన్న చిన్న కథలు చెప్పుకున్నాం. కానీ వాటిలో కథా భాగం చాలా తక్కువ. చర్చా భాగం మాత్రం వందలకు వందల శ్లోకాలు పెరిగిపోతూ వచ్చాయి. దీనికంతటికీ కారణం వశిష్ఠ మహర్షి రాబోయే గాధి మహర్షి చరిత్రను మనస్సులో పెట్టుకుని, దానికి భూమికా భాగాన్ని తయారు చేసేందు కోసం (బాక్ గ్రౌండ్ ప్రిపేర్ చేసేందు కోసం) మెట్లు పేర్చుకుంటూ రావటమే- అని ఇదివరకే చెప్పుకొనివున్నాం. అందుకే ఉపశమ ప్రకరణ ఆరంభం నుంచి ఇప్పటి దాకా జ్ఞాన ప్రాప్తికి లభించే విధానాలను రకరకాలుగా వర్ణించుకుంటూ వచ్చి, వాటి చివర సగుణ భక్తినీ, నిర్గుణ భక్తినీ కూడా చర్చించి, చివరికి ఇక జ్ఞాన ప్రాప్తికి ప్రతిబంధకమైన మాయయొక్క తత్వాన్ని వివరించటం కోసం వసిష్ఠ మహర్షి గాధి మహర్షి కథలోకి ప్రవేశిస్తున్నాడు. మనం కూడా ఆయనతో పాటు అద్భుతావహమైన ఈ కథలోకి అడుగులు వేద్దాం.

## 13. గాధి మహర్షి చరిత్ర

రామా! కోసల దేశంలో గాధి అనే మహానుభావుడు వుండేవాడు. గాధి అనగానే విశ్వామిత్రుడి తండ్రి అనుకుంటున్నావేమో! కాదు. ఈ గాధి బ్రాహ్మణుడు. ఆచారపరుడు. పైగా చిన్నప్పటినుంచే విరక్తి కలవాడు.

ఆయన నడివయస్సులో వుండగానే, ఊరూ వాడ వదిలిపెట్టి తపస్సుకోసం అడవులకు వెళ్ళిపోయాడు. ఆ అడవిలో ఒకచోట ఒక మంచి చెరువు కనిపించింది. పూర్వ సంస్కార బలంవల్ల గాధి బ్రాహ్మణుడు, ఆ చెరువులో కంఠంలోతు నీళ్లలో నిలబడి, ఎనిమిది మాసాలు ఏకధాటిగా తపస్సు చేశాడు.

శ్రీ మహావిష్ణువు సంతోషించి, దర్శనమిచ్చి, ఏం కావాలో కోరుకోమన్నాడు. గాధిమహర్షి పరమానందభరితుడై స్వామిని మనసారా స్తుతించి ఇలా వరం కోరాడు-

**మాయామిమాం త్వద్రచితాం**
**భగవన్ పారమాత్మకీమ్ ।**
**ద్రష్టు మిచ్ఛామి సంసార**
**నామ్నీ మాంద్యైక కారిణీమ్ ॥** (సర్గ44, శ్లో 13)

"దేవా! మాయ! నీవు రచించిన మాయ! నిన్నాశ్రయించుకొని వున్న మాయ! ఈ సంసారమనే పేరు

పెట్టుకొన్న మాయ! అందరి కళ్లూ కప్పే మాయ! ఎంత ఆలోచించినా అది ఏమిటో తెలియటం లేదు. దాన్ని చూడాలని అనుకుంటున్నాను స్వామీ! దయచూపు" – అని కోరాడు గాధి మహర్షి.

శ్రీ మహావిష్ణువు సంతోషించి – "గాధీ! నా మాయను నువ్వు చూస్తావు. చూసీ చూడంగానే దాన్ని దాటి పోతావు. తథాస్తు" అనేసి అంతర్ధానమైపోయాడు.

గాధి మహర్షి సంతోషించి, తపోదీక్షను విరమించి, నీళ్లలోంచి బయటకు వచ్చి, అడవిలో ఒక కుటీరం వేసుకొని అక్కడే నివసించ సాగాడు.

ఎదురు చూస్తున్నాడు రోజు రోజూ "ఎప్పుడు స్వామివరం సత్యమవుతుందా, అవుతుందా" అనుకుంటూ! ఎప్పుడూ అదే ఆలోచన, అదే చింత, అదే ధ్యాస. రోజులు గడుస్తున్నాయి. సంవత్సరాలు దొర్లుతున్నై. ఆ చింత అలాగే వుంది.

ఒక రోజున స్నానం కోసం ఆ చెరువులోకి దిగి స్నానం చేయబోయి, మళ్లీ ఆ చింతలోనే పడి మనస్సు కొంచెం వికలమై, మళ్లీ తనను తనే సంభాళించుకొంటూ, శాస్త్రవిధి ప్రకారంగా స్నానానికి ఉపక్రమించ బోయాడు. స్నానవిధి విధానం ప్రకారంగా చేతిలో ఒక దర్భపుల్లను తీసుకొని, దానిని నీటిలో గుండ్రంగా గిర్రున తిప్పుతూ, ఓంకారం ఉచ్చరిస్తూ, స్నాన మంత్రాలను స్మరిస్తున్నాడు.

దర్భపుల్ల కదలిక నీటిలో ఒక సుడిగుండం లాగా కనిపించింది. ఉచ్చరిస్తున్న ఓంకారం గాలిలో సుడిగుండాన్ని లేపింది. ఈ సుడిగుండాల సందడిలో ఎలా తప్పిందో కాని, చెప్పే మంత్రం తప్పి పోయింది. మతి మొద్దుబారి పోయింది. శరీరం స్తంభించి పోయింది. అది నిజంగానే ఒక స్తంభం లాగా ఆ చెరువు మధ్యలో నిలబడి పోయింది. కాని చిత్రం ఆ గాధి మహర్షియొక్క మనస్సుకు మాత్రం ఏవేవో వింత అనుభవాలు కలుగుతూనే వున్నై.

ఆ అనుభవాల ప్రకారం, గాధి చెరువులో లేడు. తన కుటీరంలోనే వున్నాడు. ఆయనకి ఏదో జబ్బు చేసింది. అది వికటించి మొహం నల్లబడిపోయింది. గుడ్లు తేలిపోతున్నై. ఉచ్ఛ్వాస నిశ్వాసలు ఆగి పోతున్నై. తల వాలి పోతోంది.

ఇంతలో ఎక్కడ్నుంచి వచ్చారో, తన చిన్ననాటి బంధువులంతా పరుగు పరుగున వచ్చి తన చుట్టూ చేరారు. అందరూ ఏడుస్తున్నారు. తన భార్య తన కాళ్ళమీద పడి గోల గోలగా ఏడుస్తోంది. తల్లి గడ్డం పట్టుకొని కదిలిస్తూ బావురు మంటోంది.

ఒక పక్క వాళ్లంతా గోల చేస్తుంటే, గాధి కాళ్లూ చేతులూ వేళ్లాడి పోతున్నై. క్రమంగా అవి చల్లబడి పోతున్నై. నోరు తెరుచుకు పోతోంది. ప్రాణాలు పైకి లేచి పోతున్నై. లేచి పోతున్నాయేమిటి? లేచి పోనే పోయాయి. ఆ శరీరం శవమై పోయింది.

బంధువుల్లో కొందరు ఏడుస్తున్నారు. కొందరు పై ఏర్పాట్లు చేస్తున్నారు. కొద్ది సేపట్లోనే ఆ ఏర్పాట్లు పూర్తై శవాన్ని శ్మశానానికి చేర్చారు. అక్కడ గద్దలు, కాకులు, నక్కలు తలో పక్కన కాచుకుని వున్నాయి. బంధువులు వాటన్నిటినీ దూరంగా తోలుతూ చితి పేర్చి శవ దహనం చేసేశారు. ఐపోయింది. శరీరం కూడా బూడిదై పోయింది. ఐనా ఇంకా ఏవో అనుభవాలు కలుగుతూనే వున్నై గాధికి.

శవదహనం చేసిన బంధువులు స్నానాలు చేశారు. మెల్లిగా ఏడుపులు తగ్గించుకొని ఇళ్ళకు వెళ్లిపోయారు.

శరీరం కాలిపోయిన తరువాత ఈ గాధి జీవి ఎక్కడో మారుమూల వున్న ఒక కుగ్రామంలో,

కుక్కమాంసం తినే ఒక బోయదాని గర్భంలో కనిపించాడు, వున్నట్టుండి, తనకు తనే. ఎలా కనిపించాడు? పెంటలో పురుగు లాగా కనిపించాడు. గిలగిల లాడుతూ, విలవిలలాడుతూ, కనిపించాడు. ఆ గర్భంలోంచి బయటకి రావాలని ఆరాటపడుతూ కనిపించాడు.

కొంత కాలానికి నిజంగానే బయటకొచ్చాడు.

వచ్చిన ఆ పసికందు నల్లగా బొగ్గు లాగా వున్నాడు. ఆ బోయవాళ్ల ఇళ్లలోనే పెరిగి పెరిగి పదహారేళ్ల వాడయ్యాడు. అడవిలో వేట కుక్కలను వెంట పెట్టుకొని పరుగులు తీస్తున్నాడు. లక్షల మృగాలను సంహరిస్తున్నాడు. ఓ కోడెవయస్సు కుర్రదాన్ని పెళ్ళి చేసుకొని కన్నూ మిన్నూ కానకుండా విహరిస్తున్నాడు.

సాటివారిలో వీరుడని పేరు పొందుతున్నాడు. తన పిల్లలు కూడా తనంతటి వాళ్ళై పేరు తెచ్చుకొంటున్నారు. ఇంతలోనే, వార్ధక్యం వచ్చి మీద పడింది. ఏం జరిగిందో గాని, ఓపిక తగ్గి, పెళ్ళాన్నీ పిల్లల్నీ వదిలి, ఊరుకు చివరగా వంటరిగా ఒక పూరి పాకలో నివాసం చేస్తున్నాడు. ఆ ఒంటరి తనాన్ని భరించలేక, చావు దగ్గరకు వస్తోందనే ఆలోచనను తట్టుకోలేక, బోరు బోరున ఏడుస్తున్నాడు. అలా ఏడుస్తూనే అక్కడ వుండబుద్ధి కాక, దేశాల వెంబడి తిరగ సాగాడు.

ఐనా గాధికి అనుభవాలు ఆగటం లేదు. అవి కొనసాగుతూనే వున్నాయి.

ఈ మాటు ఆ గాధి కీరదేశం అనే ధనికుల దేశంలో ఒక పెద్ద పట్నంలోకి ప్రవేశించాడు. ఆ పట్టణంలో రాజ మార్గములో కౄరాకారుడైన ఈ గాధి కిరాతుడు, వెర్రి చూపులు చూసుకొంటూ ఇటూ అటూ తిరుగుతున్నాడు.

అది ఏ రకమైన ఉత్సవమో అతనికి అర్ధం కావటం లేదు. జనం తండోప తండాలుగా ఉన్నారు. కానీ, ఎవరూ సంతోషంగా లేరు. అంతా గందరగోళంగా వుంది.

ఆ రాజ వీథిలో ఒక కొండంత ఏనుగు యథేచ్ఛగా ఇటూ అటూ తిరుగుతోంది. అది తొండంతో ఒక పూల మాలను పట్టుకొని వుంది. అది జనం మధ్యలోకి దూసుకు పోతూ నడుస్తోంది. జనం అరుపులు పెడుతూ పక్కలకు వెళ్తున్నారే గానీ, ఎవరూ పారిపోవటం లేదు. అది గూడా ఎవరినీ తొక్కటం లేదు. అంతా చిత్రంగా వుంది.

నడుస్తూ, నడుస్తూ, ఆ ఏనుగు ఈ గాధి కిరాతుడి వైపే వచ్చింది. అది మరీ దగ్గరకు వచ్చే సరికి ముసలి గాధికి వణుకు పుట్టింది. అతను ఓ పక్క భయపడుతూ వుండగానే, ఆ ఏనుగు అతని దగ్గరకు వచ్చి, తన తొండంతో పట్టుకొని వున్న పూలమాలను అతని మెళ్ళో వేసి, అదే తొండంతో అతన్ని చుట్టేసి, ఒడుపుగా పైకెత్తి, తన వీపు మీద కూర్చో బెట్టుకుంది.

అంతే! వున్నట్టుండి రాజ దుందుభులు మ్రోగాయి. ప్రజల చప్పట్లు మారు మోగాయి. జయ జయ ధ్వానాలు మిన్ను ముట్టాయి.

అది ఆ రాజ్యపు పట్టపుటేనుగు. ఆ రాజ్యపు రాజుగారు మరణించారు. ఆయనకు సంతానంగాని, జ్ఞాతులు గాని లేరు. అందువల్ల, ఆ దేశపు ఆచారం ప్రకారం, అక్కడి మంత్రులు పట్టపుటేనుగుకు పూల దండ ఇచ్చి, ప్రజలలోకి వదిలి పెట్టారు. అది ఎవరి మెళ్లో దండ వేస్తే, వాడే రాజు అవుతాడని ఆ దేశవాసుల విశ్వాసం. ఆ తతంగమే ఇప్పుడు జరుగుతోంది. ఆ ఏనుగే గాధి కిరాతుణ్ణి ఇప్పుడు మహారాజుగా మార్చేసింది.అందుకే ఎక్కడెక్కడి పరిచారికా స్త్రీలూ పరుగెత్తుకు వచ్చారు. ఏనుగు మీద వున్న గాధిని సగౌరవంగా దింపి, రకరకాలుగా అలంకరించి, మహారాజు లాగా తయారు చేశారు.

ఇంతలో ఎక్కడెక్కడి పండితులు, మంత్రులు, ముందుకు వచ్చి, ఇతన్ని సగౌరవంగా తీసుకు వెళ్ళి, సింహాసనంలో కూర్చోబెట్టి, బ్రహ్మాండంగా పట్టాభిషేకం చేశారు. అంతే, ముసలి గాధి కిరాతుడు వున్నట్టుండి మహావీర మహారాజై పోయాడు. చండ శాసనంగా సామ్రాజ్య పరిపాలనం చేశాడు. దిగ్విజయాలు సాధించాడు. మహా భోగాలు అనుభవించాడు.

### 14. కల చెదిరింది

ఎలా కుదిరిందో గాని, ఇక్కడ అతని పేరు "గవల మహారాజు" గా సాగిపోయింది. అలా ఎనిమిది సంవత్సరాలు గడిచిపోయాయి.

ఎంతైనా బోయవాడి బుద్ధి బోయ బుద్ధే! వాడికి ఎప్పుడు చూసినా ఆభరణాలు పెట్టుకొంటూ, ఎప్పుడు చూసినా బిగతీసుకొని దర్జాగా నడుచుకుంటూ, ప్రజలలోకి వస్తూ వుండటం విసుగెత్తు కొస్తోంది. ఈ కృతక లక్షణాలన్నీ భరించటం కష్టంగా వుంటోంది.

దాంతో ఓ రోజున వున్న ఆభరణాలన్నీ తీసేసి, చొక్కా కూడా విప్పేసి, తుమ్మ మొద్దు లాగా వళ్ళు విరుచుకుంటూ, వీథిలోకి వచ్చేశాడు. అలా తిరుగుతూ వుండగా ఒక చోట, వాడి కర్మ కొద్దీ, వాడికో కిరాత బృందం కనిపించింది. ఆ బృందం తప్పతాగి మత్తుగా పాటలు పాడుతోంది. ఆ పాటలు వినేసరికి ఈ బోయ మహారాజుకి ప్రాణం లేచొచ్చినట్టై, వాళ్లతో కలిసి తనూ పాడడం మొదలు పెట్టాడు.

ఇంతలో ఆ గుంపులో వున్న ఒక ముసలివాడు ఈ మనిషిని గుర్తు పట్టి, ఆనందం పట్టలేక ఇంత గొంతేసుకొని, "ఒరేయ్ కటంజా! నువ్వు ఈడ వున్నా వేందిరా?" అన్నాడు.

కటంజా అనేది ఎప్పటిదో పాత పేరు. మహారాజుగా వున్న తనను ఆ ముసలాడు అలా పాత పేరుతో పిలవటం ఈ బోయ రాజుకు అంతగా నచ్చ లేదు. ఐనా, అదేమీ పట్టించుకోకుండా, ఆ ముసలాడు తన దోవన తను వాగేస్తూనే వున్నాడు.

"ఒరేయ్ కటంజా! నీ పాటకు మెచ్చి ఈ కీరదేశపు రాజు నిన్ను తన దగ్గర పెట్టేసుకున్నాడా? నిన్ను బాగా చూసుకొంటున్నాడా? అడిగినవన్నీ ఇస్తున్నాడా?"

బోయరాజుకి ఈ పలకరింపులతో చికాకు తల కెక్కింది. కస్సు బుస్సు లాడుతూ, ఇటూ అటూ చూశాడు.

అది మంత్రుల వీథి. అన్నీ పెద్ద మేడలే. పై అంతస్థుల కిటికీలోంచి మంత్రులూ, అధికారులూ చాలా మంది ఈ సన్నివేశం చూశారు. వాళ్లకి ఈ గవల మహారాజు నిజానికి ఓ బోయవాడని, నికృష్ట జాతి వాడని, అర్థమైపోయింది. అందరి మొహాలూ వాడి పోయినై.

గవల మహారాజు మాత్రం గంభీరంగా ఇటూ అటూ చూసి, సరాసరి అంతఃపురంలోకి వెళ్లి పోయాడు. అక్కడ వున్న వాళ్లంతా, వీడ్ని ఓ శవాన్ని చూసినట్టు చూస్తున్నారు. పిలిచినా పలకటం లేదు. దగ్గరకు అసలే రావటం లేదు.

క్రమంగా రాజ్యంలో ఈ విషయం గురించి మంతనాలు పెరిగి పోయాయి. ఎవరికి వారు "ఛీ! ఛీ! నీచ జాతివాడ్ణి తెచ్చి మహారాజును చేసి, వాడికి పాద సేవలు చేశాం. మన వంశాలను మనమే భ్రష్టు పట్టించుకొన్నాం. దీనికేదైనా ప్రాయశ్చిత్తం చేసుకోవాలి." అనటం మొదలు పెట్టారు.

కొందరు ఆవేశ పరులైతే చితులు పేర్చుకొని అగ్ని గుండంలోకి దూకేస్తున్నారు. ఇలా ఆత్మాహుతి చేసుకున్నవాళ్లల్లో కొందరు మంత్రులు గూడా వున్నారు. దాంతో రాజ్యం అంతా అట్టుడికినట్లైపోయింది.

ఎంత కిరాతుడైనా, గత ఎనిమిది సంవత్సరాలుగా నాగరికుల స్నేహము, సజ్జనుల సాంగత్యము చేశాడు కనుక, గవల మహారాజులో కొత్త ఆలోచనలు మొదలైనాయి –

"ఛీ ఛీ, నా వల్ల కదా ఇంత ఘోర ప్రమాదాలు జరుగుతున్నై?! నావల్ల కదా ఇంతమంది మంచివాళ్లు మరణిస్తున్నారు?! ఇలాంటి ప్రళయానికి కారణమై, తిట్లుతింటూ జీవించటం కంటే, నేనే అగ్గిలో పడి చావటం మేలు."

ఇలా అనుకొంటూ గవలమహారాజు ఆవేశంగా లేచి వెళ్ళి, తన రాజ భవనం ఎదురుగా భగ భగా మండుతున్న ఒకానొక ఆత్మాహుతి చితిలోకి తనే దూకేశాడు.

ఇక్కడ ఒక్క ఉదుటున గవల మహారాజు అగ్నిగుండంలోకి దూకాడు. ఆ కుదుపుకి అక్కడ నీటి మడుగులో నిశ్చల స్తంభంలాగా నిలబడిపోయి వున్న గాధి మహర్షి ఒక్క తూలు తూలాడు. ఆ తూలుడికి ఆయన మత్తు వదిలిపోయింది. తల విదిలించుకున్నాడు. కళ్లు నులుముకున్నాడు. కొద్దిక్షణాల్లోనే పూర్తిగా తేరుకొన్నాడు. నిద్దర మెళుకువ వచ్చినట్లు, మత్తు దిగి పోయినట్లు, అనిపించింది.

"నేను గాధిని. నేను మహర్షిని. స్నానాలు తర్పణాలు చేసే విద్వాంసుడ్ని. ఈ కిరాత రాజ్యం, ఈ కీర రాజ్యం, ఇలాంటివన్నీ నా పనులు కావు." అనుకున్నాడు తనలో తనే.

ఎలాగోలా స్నాన సంధ్యాదులు పూర్తి చేశాడు. చెఱువు బయటకొచ్చాడు. ఆలోచనలు మాత్రం ఈగల్లాగ ముసిరి, కందిరీగల్లాగ కల్లోలం చేస్తూనే వున్నాయి.

**కోహం కిమివ పశ్యామి**

**కిమకార్షమహం కిల ।**

**ఏవం విచారయంశ్చిత్రం**

**సభ్రూభంగమభూత్ క్షణమ్ ॥** (సర్గ 47, శ్లోకం 7)

"నేనెవర్ని? నాకేం కనిపిస్తోంది? నేనేం చేస్తున్నాను?" అనుకుంటూ కనుబొమ్మలు చిట్లించుకుంటూ ఆయన ఆలోచనల్లో మునిగి పోయాడు.

"ఇదేమిటి? ఎప్పటి నా తల్లి? ఎప్పటి నా తండ్రి? వాళ్లను చూసిన గుర్తే లేదు నాకు. నేను పుట్టి ఊహ తెలిసే లోపలే వాళ్లు వెళ్లిపోయారు. అలాంటి తల్లిదండ్రులు ఇప్పుడు నాకు కనిపించట మేమిటి?

"అదీగాక, నా భార్య నా కోసం ఏడవటమేమిటి? నాకు అసలు పెళ్లే కాలేదు. ఆడదాని మొహమే తెలియదు నాకు.

"నా బంధువులు ఎవరో నాకు గుర్తే లేదు. నేను ఊళ్ళో వున్న రోజుల్లో కూడా వాళ్లను పట్టించుకోనే లేదు. అలాంటిది, ఇప్పుడు నా మరణ సమయంలో నా తల్లిదండ్రులు, నా భార్యా పిల్లలు , నా బంధువులు, అంతా నా చుట్టూ మూగట మేమిటి? వాళ్ళ మధ్యలో నేను చచ్చి పోవటమేమిటి? కనుక ఇదంతా నా భ్రాంతి గాక మరేమిటి? ఇదంతా నా కల్పన కాక మరేమిటి? ఇదంతా నా మనస్సు చేసిన సృష్టి గాక మరేమిటి? ఇదంతా మాయా మోహం. ఇందులో నిజం ఏ మాత్రమూ లేదు. తెగ మదించిన పులి అడవిలో చెడ తిరిగినట్లుగా, జీవుల మనస్సు ఇలాగే భ్రాంతుల్లో పడి తిరుగుతూనే వుంటుంది. ఈ భ్రాంతుల్ని మనం లెక్క చేయ కూడదు." గాధి మహర్షి ఇలా నిశ్చయం చేసుకొని తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు.

## 15. కల నిజమైంది

కొన్ని రోజులు గడిచాయి.

ఓ రోజున ఒక మహర్షి ఆ ఇంటికి అతిథిగా వచ్చాడు. అడవుల్లో అతిథులు రావటమే అరుదు. అందువల్ల, గాధి మహర్షి వచ్చిన మునికి సాదరంగా సపర్యలు చేసి, తృప్తి పరిచాడు. ఇద్దరూ అనుష్ఠానాలు పూర్తి చేసుకొని, పరిమితంగా కందమూల ఫలాదులు సేవించి, పెందలాడే చాపలేసుకు పడుకున్నారు. అప్పటి దాకా ఎవరి అనుష్ఠానాలు వారికున్నాయి కనుక, మాట్లాడుకోవడానికి కుదరలేదు. పైగా మహర్షులకు అధికంగా మాట్లాడే అభ్యాసం వుండదు. ఐనా, గాధిమహర్షి మర్యాదకోసం కొత్త మహర్షితో మాట కలుపుతూ–

"మహర్షీ! మీరిలా చిక్కిపోయి అలసటగా కనిపిస్తున్నారేమిటి?" అన్నాడు.

వచ్చిన మహర్షి ఉసూరుమని నిట్టూర్పు విడుస్తూ ఇలా అన్నాడు –

"నిజమేనయ్యా, అలాగే వున్నా. అడిగావు గనుక, నీకు నిజం జెబుతా. నేనీ మధ్య తీర్థయాత్రలు చేస్తూ కీర దేశమనే దేశానికి వచ్చా. అక్కడ ప్రజలు నన్ను చాలా గౌరవంగా చూసుకున్నారు. ఆ గౌరవానికి ఆశపడి, నేను ఒక బ్రాహ్మణుడి ఇంట్లో నెలరోజులుండి పోయాను.

"ఒక రోజున మా యింటి బ్రాహ్మణుడు చాలా దిగులుగా కనిపించాడు. ఎందుకలా వున్నావని నేనడిగా. ఆబ్రాహ్మణుడు ఇలా చెప్పాడు –

"అతిథీ! ఏమీ అనుకోకు. ఈ మధ్య ఓ బోయవాడు, కటిక కసాయివాడు, నేను బ్రాహ్మణుడ్ని అని చెప్పుకుని ఎనిమిదేళ్లుగా మాకు రాజై రాజ్యం చేశాడు. మేమంతా వాడి పాద సేవలు చేశాం. ఇంతలో వాడి అసలు రంగు బయట పడింది. దాంతో మా ఊళ్ళో వుండే శ్రోత్రియ బ్రాహ్మణులు ఒక వందమంది అగ్నిలో దూకి ప్రాణాలు వదిలి పెట్టారు. నేనా పని చెయ్యలేక, ఇలా దిగులుగా పడి వున్నా – అన్నాడు నా గృహ యజమాని.

"ఆ మాట వినేసరికి నా గుండె గుభిల్లు మన్నది. ఇలాంటి భ్రష్ట రాజ్యంలో, భ్రష్ట గృహస్థుల గృహాలలో, నెలరోజులుగా చతికిలబడి, తిండి తిన్నానే–అని బాధపడి, అక్కడి నుంచి లేచిపోయి, ప్రయాగ వెళ్లి, సర్వ ప్రాయశ్చిత్తంగా త్రివేణీ స్నానాలు చేశాను. ఐనా తృప్తి కలుగక, ఇప్పటికి మూడుసార్లు కృచ్ఛ్ర చాంద్రాయణ వ్రతం చేశాను. నీకు తెలుసు కదా! ఈ వ్రతంలో తీవ్రమైన ఉపవాస దీక్ష వుంటుంది. మూడోసారి ఉపవాస దీక్షలు పూర్తయినాక, పవిత్రమైనచోట పారాయణ విధి నిర్వహించాలనే ఆశతో నేను ఇవాళ నీ దగ్గరకు వచ్చా. నీ దగ్గర కందమూల ఫలాదులు తిని పవిత్రుడ్నయ్యా. ఇంతకూ చెప్ప వచ్చిందేమిటంటే, ఆ ఉపవాసాలవల్లే ఇలా నీరసంగా వున్నా." అన్నాడు అతిథి ముని.

గాధి మహర్షికి మతిపోయినంత పనైంది. ఆయన తరచి తరచి తన అతిథిని ప్రశ్నలు వేశాడు. గుర్తులన్నీ సరిపోతున్నాయి. అది తను రాజ్యమేలిన కీర దేశమే. సందేహం లేదు.

గాధి మహర్షి మనస్సు కల్లోలమై, నిద్ర పట్టడం లేదు. అవతలి మహర్షి త్వరలోనే నిద్దరలోకి జారుకున్నాడు. తెల్లవారింది. వచ్చిన మహర్షి శెలవు పుచ్చుకొని వెళ్ళిపోయాడు. గాధి మహర్షి మాత్రం ఆలోచనల్లో దిగబడి పోయాడు –

"ఇదేమిటి? నేను మాయ అని, గారడి అని, భ్రాంతి అని, అనుకున్నదంతా ఈ బ్రాహ్మణుడు నిజంగా

చెప్పేస్తున్నాడు. నా అనుభవం భ్రాంతా? ఈ బ్రాహ్మణుడి అనుభవం భ్రాంతా? నేను మరణించాననే అనుభవం సత్యం కావటానికి వీలు లేదు. అందులో సందేహానికి ఆస్కారమే లేదు. కానీ నా మరణాన్ని చూశానన్న అనుభవం నాకే వుంది. నేను బతికి వున్న అనుభవం కూడా నాకే వుంది. వీటిలో ఏది నిజం.?

"ఇక నేను కీర రాజ్యంలో రాజుగా వున్నాననే అనుభవం ఒకటుంది. అదీ నా అనుభవమే. కానీ, అది సత్యమా? భ్రాంతా? ఎలా నిర్ణయించటం? వెళ్ళి ప్రత్యక్షంగా చూడాలి. చూసి నిర్ణయించుకోవాలి. కేవలం ఈ బ్రాహ్మణుడి మాటల మీద ఆధార పడటం మంచి పని కాదు."

ఇలా ఆలోచించుకొని, గాధి మహర్షి అప్పటికప్పుడే బయలు దేరి వెళ్ళి పోయాడు. అతిథి మహర్షి చెప్పిన గుర్తుల వెంబడి కీర దేశం వైపుగా ప్రయాణం సాగించాడు.

చాలా దేశాలు దాటి, చివరికి భూతమండల దేశం చేరాడు. ఆ దేశంలో తాను బోయవాడిగా నివసించిన గూడానికి చేరాడు. ఆశ్చర్యం ! నిజంగానే ఆ దేశం అక్కడ వుంది. ఆ గూడెం వుంది. ఆ గుడిసె వుంది. అవన్నీ చూస్తున్న కొద్దీ గాధి మహర్షికి ప్రాణం లేచి వచ్చినట్టుగా లేదు. ఏది భ్రాంతో ? ఏది సత్యమో ? తెలిసీ తెలియని సందేహపు ఉయ్యాలలో వూగుతూ అతని మనస్సు ఒకరకమైన వైరాగ్యంలో పడిపోయింది.

**తేనైవ సంనివేశేన**
**ప్రాగ్ధృష్టం శ్వపచాస్పదమ్ ।**
**తస్య కామపి వైరాగ్య**
**పదవీ మనయన్మనః ॥** (సర్గ 46, శ్లో.44)

అలాంటి వైరాగ్య భావంతో ఆ గూడేన్ని పరిశీలిస్తున్నాడు గాధిమహర్షి.

ఆ ఇళ్ల గోడలకు మెత్తిన మట్టి జోరు వానలకు కొంతవరకు కరిగి పోయింది. చాలా చోట్ల గోడలమీద గడ్డి చెట్లు మొలిచాయి. అప్పటి తన గుడిసెకు కప్పంతా చిందర వందరగా లేచి పోయివుంది. ఆ లోపల తన ఆ నాటి పాత చింకిరి చాపలు ముక్కలై కనిపిస్తున్నాయి.

ఆ ఇంటి లోపలా, బైటా, పడివున్న రకరకాల ఎముకలు, అది పచ్చి మాంసం పీక్కు తినే బోయవాళ్ల కొంప అని సాక్ష్యం చెబుతున్నై. అంతకు మించి అక్కడ జనం ఎవరూ కనిపించటం లేదు. దానితో గాధి మహర్షి ఆ గూడెం వదిలిపెట్టి, పక్కనున్న మరో గూడానికి వెళ్ళాడు. అక్కడ కొంతమంది జనం కనిపించారు. వాళ్ళ దగ్గరకు వెళ్ళి కటంజడి గురించి, వాడి రాజయోగాన్ని గురించి, రకరకాలుగా విచారణ చేశాడు. వాళ్ళు జరిగినదంతా పూసగుచ్చినట్లు చెప్పారు. ఎక్కడా తేడా లేదు. అవే పేర్లు, అవే ఆకారాలు, అవే సన్నివేశాలు, అవే తేదీలు, తన భ్రాంతి అనుభవంలో తాను దేన్ని చూశాడో, దాన్నే వీళ్ళు వర్ణించి చెబుతున్నారు.

గాధి ఒక నెల రోజులు ఆ గూడెంలో వుండి , వాళ్ళను రకరకాలుగా ప్రశ్నించి చూశాడు. వారి కథనంలో మార్పు రావటం లేదు. ఆయనకు ఎటూ పాలు పోవటం లేదు. ఒకటేమిటి? అన్నీ అక్కడ కనిపిస్తూ వున్నాయి. వెతికిన కొద్దీ ఇంకా కనిపిస్తున్నై.

గాధి మహర్షి అక్కడ్నుంచి బయలుదేరి కీరదేశానికి వెళ్ళాడు. అక్కడ కూడా మళ్ళీ నలుగుర్నీ విచారించాడు. ఆ దేశంలో ఆయన పన్నెండు సంవత్సరాలుండి, రకరకాల మనుష్యుల్ని కలుసుకొని, రకరకాలుగా విచారణ చేశాడు. ఎవ్వరూ తన పాత అనుభవానికి వ్యతిరేకంగా చెప్పటం లేదు. అక్కడ కూడా, తాను

అనుభవించిన వస్తువులు, వ్యక్తులు, అందరూ కనిపిస్తున్నారు. ఇలా చూసి చూసి , ఆలోచించి, ఆలోచించి, గాధి మహర్షికి మతిపోయినంత పనైంది. ఆయన ఆలోచనలు ఇలా సాగాయి –

"ఏమిటి నా పరిస్థితి ? పాత జన్మ మళ్ళీ ప్రత్యక్షమైనట్టుగా వుంది. నిన్నటి కల నేటి మెలుకువగా ఎదుట వాలినట్లుగా వుంది. ఇది ఏం మాయ? ఎవరు చేసిన మాయ? ఎందుకోసం చేసిన మాయ? అరెరే! పక్షి వలలో పడి పరాధీనమై పోయినట్లుగా, నేనీ సుదీర్ఘ మనోమోహంలో పడిపోయి, స్వాతంత్ర్యం కోల్పోయి, బేలనై కొట్టుకు పోతున్నాను. ఛీ, నామనస్సు పూర్వ వాసనలలో కొట్టుకు పోతున్నది. ఆ వాసనా బలానికి లోబడి పసిపిల్లవాడి లాగా ఏవేవో దృశ్యాలను నాలో నేను కల్పించుకున్నానని అనుకుంటున్నాను.

"ఆ......! ఇప్పుడు గుర్తొస్తోంది.

**ఏషా హి మాయా మహతీ, తేన మే చక్రధారిణా ।**

**దర్శితేత్యధునా సాధు, మయా స్మృతమఖండితమ్ ॥** (సర్గ 47, శ్లో.34)

"ఈ మాయ అంతా ఆ శ్రీమహా విష్ణువు కల్పించినదే. నాకు మాయ అంటే ఏమిటో చూపించటం కోసం ఆయన కల్పించినదే ఇది.

"కనుక, ఇప్పుడు నేను ఇక్కడే ఈ కొండ గుహలోనే కూర్చొని మనస్సును ఏకాగ్రం చేసి, ఈ మాయ ఎలా జన్మించిందో, ఎలా జీవిస్తోందో, తెలుసుకొంటాను."

### *16. ఏది కల? ఏది నిజం?*

గాధి మహర్షి ఇలా నిశ్చయించుకొని, దగ్గరే వున్న కొండ గుహలోకి ప్రవేశించి, సంవత్సరంన్నర పాటు శ్రీమహా విష్ణువును ఉద్దేశించి ఘోర తపస్సు చేశాడు. ఈ సంవత్సరంన్నరా కూడా, రోజుకొక్క గుక్కెడు ఆవుపాలు మాత్రమే ఆహారంగా తీసుకొనేవాడు. ఆ దీక్షకు సంతోషించి, శ్రీమన్మహా విష్ణువు ప్రత్యక్షమై ఇలా ఉపదేశించాడు–

"ఓ గాధీ! నా మాయను చూడాలన్నావు. చూశావు. దీనివల్ల నీకు ఈ ప్రపంచం అంతా కేవలం కనిపించేదే తప్ప వాస్తవంగా వున్న వస్తువు కాదని అర్థం అయ్యే వుంటుంది. నువ్వు కోరిన వరం నీకు లభించిన తరువాత గూడ, మళ్లీ తపస్సు చేస్తున్నావెందుకు? ఏం కావాలి నీకు?"

ప్రసన్న వదనుడైన శ్రీ మహావిష్ణువు ఇలా మాట్లాడుతుంటే, సంస్కారబలంచేత ఆ ముగ్ధ మనోహర దర్శనానికి పరవశుడైన గాధిమహర్షి ఆ స్వామికి ఎక్కువగా మాట్లాడే సావకాశం ఇవ్వకుండా, పూజల మీద పూజలు చేశాడు. చాతకపక్షి మేఘం వంక ఆశగా చూసినట్లుగా ఆ స్వామి వంక తనివి తీరా చూస్తూ ప్రదక్షిణలు చేశాడు. ఆలా పూజలు చేసి, చేసి, చివరికి ఇలా అన్నాడు–

దేవా!

**దేవ యైషా త్వయా మాయా**

**దర్శితాతి తమోమయీ।**

**మహీం ప్రాతరివాదిత్య**

**స్తాం మే ప్రకటితాం నయ॥** (సర్గ 48, శ్లో 44)

తా॥ "దేవా! నువ్వు చూపించావు. ఆ కనిపించిందేదో మాయ అని, అది నీ మాయే అని, కొంత కొంత తెలుస్తూనే వుంది. కానీ, ఆ మాయ పూర్తిగా చీకటిమయంగా వుంది. ఆ కటిక చీకటిలో నల్లని నేల ఏదో,

తెల్లని ఆకాశం ఏదో, ఈ రెంటినీ కప్పేస్తున్న చీకటి ఏదో, నాకేమీ అర్థం కావటం లేదు. తెల్లారేసరికి సూర్యుడు వచ్చి నల్లని నేలను స్పష్టంగా చూపించినట్లుగా, నువ్వు నీ మాయను విడిగా, స్పష్టంగా, చూపిస్తే తప్ప నాకేమీ అర్థం కాదు. దేవా! దయచేసి నీ మాయను నాకు స్పష్టంగా చూపించు.

"దేవా! ఎందుకు ఇంత గందరగోళం అంటావా? నిజంగా గందరగోళమే! నా మనస్సును ఏవేవో పాత వాసనలు గొలుసులు గొలుసులుగా అల్లేసుకొంటున్నాయి. దానివల్ల నా మనస్సు ఏవేవో భ్రాంతిమయ సన్నివేశాలను దర్శిస్తోంది. ఆ దృశ్యాలన్నీ స్వప్నం వంటివనిపిస్తోంది. అంతకు మించిన సత్యత్వం వాటికి వుండే సావకాశం లేనే లేదు. ఐనా సరే, అవి నా మెలకువలో కనిపిస్తున్నాయి దేవా! ఎలా కనిపిస్తున్నాయి?

"దేవా! ఇంతా చేస్తే, నేను చెరువులో నిలబడివుండగా నా మనస్సుకు ఏదో మత్తు కమ్మి, స్వప్నాలవంటి దృశ్యాలు కనిపించింది మొత్తం కలిపితే కొద్ది క్షణాలు వుంటుంది. కానీ, ఆ కొద్ది సమయంలో నా బోయ జీవితం ఎనభై ఏళ్లకు పైగా సాగింది. కొద్ది నిమిషాలెక్కడ? ఇన్నేళ్ల జీవితం ఎక్కడ?

"అదంతా మనస్సులో జరిగిన భ్రమకదుటయ్యా! భ్రమలో పుట్టిన కాలానికి పొడుగేమిటి? పొట్టేమిటి?– అంటావు నువ్వు.

"దేవా! నిజమే కానీ, ఆ కాలపు పొట్టి పొడుగులు, ఆ నా బోయ శరీరం పుట్టడం, బూడిదైపోవటం, ఇవన్నీ నా మనస్సులో కలిగిన భ్రాంతులైతే, అవి నా మనస్సు లోపలే వుండిపోవాలి కదా! అవి ఆ మనః పరిధిని దాటి, నా మెలకువలోకి, ఈ జాగ్రత్ ప్రపంచంలోకి, ఎలా ప్రవేశిస్తున్నాయి? ఇక్కడ ప్రత్యక్షంగా ఎలా దర్శనం ఇవ్వగలుగుతున్నాయి?"

గాధి సందేహాలు విని భగవానుడిలా అన్నాడు –

**గాధే! స్వాధి విధూతస్య**
**స్వరూపస్యైతదాత్మకమ్ ।**
**చేతసోఽ దృష్టతత్త్వస్య**
**యత్పశ్యత్యురు విభ్రమమ్ ॥** (సర్గ 48, శ్లో 48)

"గాధీ! నువ్వే చెప్పావు కదా! నీ మనస్సును పూర్వ వాసనలు ఆవేశించాయి. అందుకే దానికి అసలు తత్త్వం అందటం లేదు. అందువల్లే నీకిలాంటి భ్రమ కలుగుతోంది. ఈ భ్రమ మొత్తానికి మూలాధారమైన ఆత్మ నీ మనస్సే.

"గాధీ! మనస్సులోపల వుండవలసింది బైట కనిపిస్తోంది– అంటున్నావు. మనస్సు లోపలిభాగంలో వున్న ప్రపంచం వేరు, దానికంటే భిన్నంగా, మనస్సుకంటే బయటగా, వేరే ప్రపంచం వున్నట్లుగా మాట్లాడుతున్నావు. "బహిర్న కించిదప్యస్తి" (శ్లో. 49) నీ మనస్సు కంటే బయట ఏ చిన్ని పదార్థమూ లేదు. ఆ నింగి, ఈ నేల, ఈ సముద్రాలు, ఈ దిక్కులు, అన్నీ నీ మనస్సులోనే వున్నాయి. మహావృక్షపు ఆకులన్నీ దాని జన్మకు కారణమైన విత్తులోనే అంతర్లీనమై వున్నట్లుగా, అవన్నీ నీ మనస్సులోనే వున్నాయి. ఎలా అయితే విత్తులోంచి కాండం, కొమ్మలు, రెమ్మలు, ఆకులు, పూలు, పిందెలు, వెలుపలకు వచ్చినట్లు, విడివిడిగా వున్నట్లు, కనిపిస్తాయో, అలాగే నీ మనస్సులోంచే, ఈ పంచభూతాలూ వెలుపలకు వచ్చినట్లు కనిపిస్తాయి.

"నిజానికి కొమ్మలు, రెమ్మలు, కాయలు, మొదలైనవి విత్తులోంచి బయటకి రాలేదు. అదే అలా రూపాంతరం చెందింది.

**రూపాలోక మనస్కార**

**తత్తా కాలక్రియాత్మకమ్ ।**

**కుంభకారో ఘటమివ**

**చేతో హన్తి కరోతి చ॥** (సర్గ 48, శ్లో52)

"ప్రస్తుత కాలంలో వుండే పదార్థాలు ఇంద్రియాలకు కనిపిస్తాయి. భవిష్యత్ కాలంలో జన్మించబోయే పదార్థాలను మనస్సు ఊహించి తెలుసుకుంటుంది. గతించి పోయిన పదార్థాలను మనస్సే తాదాత్మ్య భావన చెంది స్మరించుకొంటుంది. కనుక, వర్తమాన భూత భవిష్యత్కాలాలను రూపాలోక కాలమని(రూపాలను ప్రత్యక్షంగా చూపించే కాలం అని), మనస్కార కాలమనీ(మనస్సుతో ఊహించి తెలుసుకొనే కాలమనీ), తత్తాకాలమని (అనగా మనస్సు వాటితో తాదాత్మ్యం చెందే కాలమని), మూడు రకాలుగా చెప్పుకోవచ్చు.

"ఇలాంటి ఈ మూడు రకాలనూ కూడా, కుమ్మరివాడు కుండలు తయారు చేసినట్లుగా మనస్సే తయారు చేస్తోంది. మనస్సే వాటిని కనిపించకుండా చేస్తోంది.

"ఇది అందరి అనుభవంలోనూ వున్న విషయమే. స్వప్నము, భ్రాంతి పడటము, మద్యాలతో మత్తెక్కటమూ, కోరిక పెచ్చుపెరిగి మనస్సు తూలి పోవటమూ, పైత్యాది వ్యాధులు కలగటమూ, ఇలాంటి సన్నివేశాలన్నింట్లోనూ మనస్సుదే ప్రధాన పాత్ర అనేది అందరి అనుభవంలోనూ వున్న విషయమే.

"చెట్టు వేళ్లు భూమిలో సరిగ్గా పాతుకొని వున్నంతకాలమూ, చెట్టు నిండా పూలు, పండ్లు వున్నట్టుగా, వాసనలు వున్నంతకాలమూ, మనస్సులో లక్షల సన్నివేశాలుంటాయి. చెట్టు వేళ్లను భూమిలోంచి పీకేస్తే, ఆ చెట్టుకి మళ్లీ పూలూ రావు, కాయలూ రావు. అలాగే, మనస్సుకి వాసనలు లేకుండా పోతే, ఆ జీవుడికి మళ్లీ జన్మాదులు లేవు.

"ఈ అనంతమైన జగజ్జాలమంతా దేని కడుపులో ఇమిడిపోయి వుందో, అలాంటి మాయ నీకు బోయతనాన్ని అంటగట్టిందంటే, అందులో పెద్ద ఆశ్చర్యమేమున్నది? ఆ మాయ ప్రభావంవల్లనే నీకు భ్రాంతి రూపమైన బోయతనం అనుభవంలోకి వచ్చింది. అలాగే, అతిథి వచ్చాడని, నీ దగ్గర తిన్నాడనీ, పడుకున్నాడనీ, కథలేవో చెప్పాడనీ, నీకు మనోవికార రూపమైన భ్రాంతి కలిగింది.

"అంతే గాదు. ఆ కథ విన్న దగ్గర్నుంచీ, నీ బుర్ర తిరిగి పోయినట్టు, బయలుదేరినట్టు, భూతమండల దేశంలోని బోయ గూడెం చేరినట్లు, అక్కడి జనం సాక్ష్యం చెప్పినట్లు, అక్కడినుంచి కీర నగరం వెళ్లినట్లు, అక్కడి జనం బోయవాడు తమకు రాజయ్యాడని చెప్పినట్లు, ఇలా నీకు కలిగిన ఈ అనుభవాలన్నీ నీ భ్రాంతులే! ఇదంతా నీకు కలిగిన మోహ జాలమే. ఇందులో కొంత భాగం సత్యమనుకోవటము, కొంత భాగం అసత్య మనుకోవటమూ కూడా, నీ భ్రాంతిలో భాగమే.

**ఏవం సర్వం త్వయా దృష్టం**

**మోహజాలం ద్విజోత్తమ ।**

**యత్సత్యమితి జానాసి**

**యచ్చాసత్యమవైషి చ ॥** (సర్గ 48, శ్లో 62)

"ఓ గాధీ! వాసనల వలలో చిక్కుకు పోయిన మనస్సు చెయ్యని చిత్రాలేమున్నాయి? సంవత్సరాలు పట్టే కథను కొద్ది నిమిషాల కలలో నీకు చూపిస్తున్నది ఎవరు? ఈ మనస్సే కాదా?!

"కనుక ఓ మహామేధావీ! గాధీ! మళ్లీ చెబుతున్నా విను, అతిథీ లేదు, భూత మండల వన ప్రదేశమూ లేదు, కీర రాజ్యమూ లేదు, అక్కడి ప్రజలు సాక్ష్యం చెప్పడమూ లేదు, ఆ ప్రదేశాలు నీకు ప్రత్యక్షంగా కనిపించడమూ లేదు, వీటిల్లో ఏ ఒక్కటీ నిజం కాదు. కనుక, ఓ మహర్షీ! లే! మనస్సును ప్రశాంత పరచుకో. నీ నిత్యకర్మలు ఆచరించుకో.

**న స్వకర్మ వినా శ్రేయః**

**ప్రాప్నువంతీహ మానవాః** (సర్గ 48, శ్లో69)

"మనుష్యులు ఎంత జ్ఞానవంతులైనా,స్వకర్మానుష్ఠానం చేయకపోతే శ్రేయస్సును అందుకోవటం సాధ్యమే కాదు." శ్రీహరి ఈ విధంగా ఉపదేశించి ఉన్నట్టుండి అంతర్ధానమై పోయాడు.

స్వామి వచ్చాడు, వెళ్లాడు. సంతోషమే. కానీ, గాధిమహర్షికి మనస్సులో సందేహం తెగటం లేదు.

"నువ్వు చూసింది మొత్తం అంతా కలిపి ఒకే భ్రాంతి– అనేస్తున్నాడు స్వామి. అదెలా కుదురుతుంది? స్వామి తప్పు ఎందుకు చెబుతాడు? ఆయన చెప్పింది నిజమే అయితే, నాకు కలిగిన అనుభవాలలో కొంత మేర భ్రాంతి అని, మిగిలింది సత్యం అని, నాకు అనుభూతి ఎందుకు కలుగుతుంది?" అని గాధి ఆకాశంలో గిరగిరా తిరిగే మబ్బు తునక లాగా చాలా సేపు ఆలోచనలలో గింగిరాలు తిరిగాడు. ఎంత ఆలోచించినా ఏమీ పాలుపోక –

"ఇలా కాదు. నాకు ఆ సమయంలో సత్యం అనిపించిన సన్నివేశాలను మళ్లీ మరోసారి చూసి వస్తాను. అవి మళ్లీ కనిపిస్తే, ఈ కొండలు, ఈ నదులూ, ఈ నక్షత్రాలు లాగానే, నా బోయ రాజ్యానుభవం కూడా సత్యమై తీరాలి." అనుకున్నాడు.

లేడికి లేచిందే ప్రయాణం అన్నట్టు , వెంటనే బయలుదేరి భూతమండలారణ్యపు కోయగూడెము, కీరదేశపు రాజనగరము, వెళ్ళి అందర్నీ మరో వరస విచారించాడు. అవే ప్రదేశాలు, అవే సాక్ష్యాలు, మళ్ళీ లభించాయి.

గాధికి బుఱ్ఱ తిరిగిపోయింది. "ఇంత ప్రత్యక్షంగా, ఇంత స్పష్టంగా కనిపిస్తుంటే, ఈ సత్యానుభవాన్ని మొత్తాన్నీ కలిపి నీ భ్రాంతే పొమ్మంటున్నాడు శ్రీహరి స్వామి. ఎలా, ఆ మాట నమ్మటం? కానీ, శ్రీమహావిష్ణువు అబద్ధం చెప్పే వ్యక్తి కాదు. అబద్ధం చెప్పవలసిన అవసరం ఆయనకు లేదు. అసలు ఆయన నోటి వెంట వచ్చిన వాక్యం అసత్యం అయ్యే సావకాశమే లేదు. నా కళ్లను నమ్మాలా? ఆయన మాటను నమ్మాలా?"

ఆ కల్లోలానికి తట్టుకోలేక ఆయన మళ్లీ పాత గుహకే వచ్చి, మళ్ళీ శ్రీహరి కోసం తపస్సు మొదలు పెట్టాడు.

## *17. నా కల నా సొంతం కాదా!*

ఈ మాటు శ్రీహరి త్వరగానే సాక్షాత్కరించాడు. గాధికి అంత పొంగు లేదు. కానీ, స్వామిని చూస్తే సంతోషంగానే వుంది. ఆయన గూడా ప్రసన్నంగానే వున్నాడు. గానీ –

"ఇంకేముందయ్యా పొందటానికి? ఎందుకు మళ్లీ తపస్సు చేస్తున్నావు? ఎందుకు మళ్లీ పిలుస్తున్నావు?" అన్నాడు, ముక్తసరిగా.

"స్వామీ! నా మోహం పెరిగి పోతున్నట్టుగా వుంది. నా అనుభవం అంతా భ్రాంతి అన్నావు నువ్వు.

నేను మళ్లీ వెళ్లి ఆ భూతమండల దేశము, ఆ కీర రాజ్యము, మొదలైనవన్నీ ఆరు నెలలపాటు తిరిగి వచ్చాను. అందరి సాక్ష్యాలు సేకరించాను. అన్ని సాక్ష్యాలూ ఒకే రకంగా వున్నాయి. నా అనుభవం భ్రాంతి అనుభవం అయితే, ఆ రాజ్యమూ, ఆ కసాయి రాజూ, ఆ భోగాలూ, ఆ యుద్ధాలూ, ఇవన్నీ నాకు ఒక్కడికే కనిపించాలి. కానీ, ఇవన్నీ అక్కడి ప్రజలందరికీ కనిపించాయి. అందరూ ఈ మాటే చెబుతున్నారు. పూర్వం పన్నెండేళ్లు తిరిగి వచ్చా, అప్పుడూ ఈ మాటే చెప్పారు. ఇప్పుడు ఆరు నెలలు తిరిగి వచ్చా,ఇప్పుడూ ఈ మాటే చెబుతున్నారు. ఇంత మందికి ఇంత ప్రత్యక్షంగా కనిపించిన అనుభవం భ్రాంతిజన్యం కాగలదా? నీ మాట అబద్ధం అనేదా? నా అనుభవం అబద్ధం అనేదా? దేవా!–

**మోహనాశాయ మహతాం**

**వచో నో మోహ వృద్ధయే ॥** (సర్గ 49, శోకం 6)

మహాత్ముల వాక్కులు మాలాంటివారి మోహాలను పోగొట్టాలే గానీ, ఇలా పెంచ గూడదు." అన్నాడు దీనంగా.

భగవంతుడైన శ్రీహరి ఇలా బోధించటం మొదలు పెట్టాడు–

"గాధీ! ఇంతమందికి ప్రత్యక్షంగా అనుభవంలోకి వచ్చింది గనుక ఈ అనుభవం అసత్యం ఎలా అవుతుందని నువ్వు ప్రశ్నిస్తున్నావు. ఇది భ్రాంతి కావడానికి వీలు లేదని ఆలోచిస్తున్నావు. అసలు భ్రాంతి అంటే ఏమిటో ఆలోచించు.

**కేనచిత్ శ్వపచేనాంతే**

**గ్రామస్య రచితం గృహమ్ ।**

**తత్త్వయా దృష్ట మావిష్ట**

**మిష్టకా ఖండతాం గతమ్ ॥** (సర్గ 49, శ్లోకం 9)

"ఊరిబైట, బోయ పల్లెకు కూడా చివర, ఒక బోయవాడు ఒక గుడిసె వేసుకొన్నాడు. ఒకప్పుడు కాకతాళీయంగా అది నీ కంట బడింది. ఎందుకో గాని, ఆ యింటి ముద్ర నీ మనస్సులో గట్టిగా పడింది. ఎంత బలంగా పడిందంటే, అప్పటి ఆ గుడిసె ఇప్పుడు నీ కంటి ముందు ప్రత్యక్షంగా కనిపిస్తోంది. ఎలా కనిపిస్తోంది? ఇప్పుడు నీ కంటి ముందు కనిపించే గుడిసెకు ఇటుకలు ఎక్కడి నుంచి వచ్చాయి? 'త్వయా ఇష్టకా ఖండతాం గతం" నువ్వే ఆ ఇంటి ఇటుక ముక్కవయ్యావు, నువ్వే ఆ వాసాలయ్యావు, తాటాకులయ్యావు, మొత్తం కలిపి బోయకొంప వయ్యావు. అక్కడితో ఆగలేదు, నీ మనస్సులోని ముద్రయొక్క ప్రభావం. "తత్ త్వయా దృష్టం ఆవిష్టం" నీ కంటి ఎదురుగా కనిపిస్తున్న ఆ బోయ కొంపను చూస్తూ చూస్తూనే, ఇది నాది అనేశావు. నువ్వే బోయవాడివైపోయి దానిలో ప్రవేశించేశావు.

ఇలా మొదలైంది భ్రాంతి. ఈ భ్రాంతి మొదలైనాక, మళ్లీ ఏదో ప్రత్యేక కారణం వచ్చి, ఈ భ్రాంతికి మూలమైన అజ్ఞానాన్ని చెదరగొడితే తప్ప, అది పోదు.

**ప్రతిభాసో హి నాయాతి**

**పున రప్రతిభాసతామ్ ॥** (శ్లో. 8)

అది పోయేదాకా, అది నీకు భ్రాంతిగా కనిపించదు. సత్యంగానే కనిపిస్తుంది.

"నువ్వు రోజూ ఇలాంటి భ్రాంతిని ఒక దానిని చూస్తున్నావు. దానిని స్వప్నం అని పిలుస్తున్నావు. ఈ

స్వప్న భ్రాంతి నీకొక్కడికే కనిపిస్తోంది. లోకంలో ఎవడి స్వప్నం వాడిదిగా వుంది కనుక, నాకు కనిపించిన భ్రాంతి నా పక్కవాళ్లకు కనిపించటానికి వీలు లేదు– అని నువ్వు అంటున్నావు. కొంచెం ఆలోచించు.

"నలుగురు మిత్రులు సముద్రపు ఒడ్డున నడుస్తున్నారు. సాయంకాలపు టెండ పొదలో నలుగురికీ అల్లంత దూరాన ఒక వెండిముద్ద కనిపించింది. నలుగురూ ఆశగా దగ్గరకు వెళ్లారు. తీరా చూస్తే, అది ఆలుచిప్ప. ఇక్కడ నలుగురికీ ఒకే సారి ఒకే భ్రాంతి కలిగింది.

**కదాచిత్ ప్రతిభై కైవ**

**బహూనామపి జాయతే ।**

**కాకోల తాల స్థితివత్**

**విచిత్రా హి మనోగతిః ॥** (సర్గ 49, శ్లోకం 10)

"నా భ్రాంతి నాకొక్కడికే వుండాలనే నియమం నువ్వు పెట్టలేవు. ఎదుంకంటే, ఈ మనస్సుయొక్క నడకలన్నీ కాకతాళీయ న్యాయం లాగా అడ్డదిడ్డంగా సాగిపోతూ ఉంటాయి.

"కాకతాళీయ న్యాయం అంటే, ఓ తాటిచెట్టు మీద ఓ పండు బాగా పండి రాలబోతూ వుంది. సరిగ్గా ఆ సమయానికి ఆ పండు మీదికి ఒక కాకి వచ్చి వాలింది. అది వాలే సమయానికి ఈ పండు తాటిచెట్టు నుంచి ఊడిపోనే పోయింది, కింద పడటం మొదలు పెట్టనే పెట్టింది. కానీ ఆ విషయం తెలియక పోవటంవల్ల, ఆ కాకి "నా బరువు వల్లే ఈ పండు రాలిపోయింది." అనుకుంటోంది. ఇదో భ్రాంతి. కింద నుంచి చూసే జనం కూడా ఆ మాటే అనుకుంటున్నారు. వాళ్లకీ ఇదే భ్రాంతి. కనుక ఒక్కొక్కప్పుడు ఒకే భ్రాంతి అనేక మందికి కలగవచ్చు. కాదనేందుకు మనకేమీ అధికారం లేదు.

"నీ కల నీ ఒక్కడిదే అని నువ్వు అనుకుంటున్నావు. ఆ నియమం గూడా, గట్టిదేమీ కాదు. ఒకే రకపు కల ఒకేసారి అనేక మందికి రావచ్చు. ఒకేచోట కలిసి పీకల దాకా తాగినవారందరికీ ఒకే సారి నిద్రమత్తు వచ్చి, ఆ నిద్రలో తమ చుట్టూ వున్న పర్వతాలు గిరగిరా తిరుగుతున్నట్లు కనిపిస్తూ వుంటుంది. ఇది ఒకే రకమైన స్వప్నం కాదా?

"అనేక మంది పిల్లలు ఒకే ఇసుకదిబ్బలో ఇళ్లూ, గుళ్లూ, కట్టుకుంటూ ఇది రాజుగారి మేడ, ఇది దేవుడి గుడి, అనుకుంటూ కలిసి కేరింతలు కొడుతూ వుంటారు. ఈ క్రీడానందం అంతా భ్రాంతి కాదా? ఇది వారందరికీ ఒకేసారి వచ్చిన భ్రాంతి కాదా?

"లేడి పిల్లలు ఒకే పచ్చిక బయిళ్లలో కేరింతలు కొడుతూ వుంటాయి. అవి పెద్దగా తినేదేమీ వుండదు. ఆ పెద్ద పచ్చిక బయిలును చూసి, మాకింత మంచి ఆహారం వుంది కదా అని ఆనందంతో పొంగిపోతూ వుంటాయి. ఇది వాటన్నింటికీ సమానంగా వున్న భ్రాంతి కాదా?

"గాధీ! ఇలాగే, ఈ లోకంలో అనేకమైన విచిత్ర భ్రాంతులు అనేక మందికి ఒకే సారి కలుగుతూ వుంటాయి. ఆ సమాన భ్రాంతిబలంవల్లనే వాళ్ళందరూ ఒకే రకమైన ఫలితంకోసం ఒకే రకమైన కృషి చేస్తూ ఉంటారు. ఉదాహరణకు కొన్ని వేల సైనికులు ఒకే రకమైన ఆవేశంతో యుద్ధం చేస్తూ ఉంటారు. ఇది వాళ్ల అందరికీ సమానమైన భ్రాంతి గాక మరేమిటి?

శ్రీహరి ఇలా చెప్పుకుంటూ పోతుంటే, గాధి కొంచెం అడ్డం పడ్డాడు.

**గాధి**: దేవా! క్షమించు. జగత్తులో ప్రతి సన్నివేశమూ మనస్సు చేసే కల్పనే, మనస్సు చూపించే భ్రాంతే, అంటున్నావు నువ్వు. ఈ మాట చిత్రంగా వుంది. లోకంలో కాలానుగుణంగా, ఒక నియమం ప్రకారం, కొన్ని

సన్నివేశాలు జరిగి పోతున్నాయి. చలికాలం బాగా ముదిరితే, వరి పంట పెరగదు. కానీ, అదే కాలంలో యవధాన్యం ఏపుగా పెరుగుతుంది. కనుక, వరిని అడ్డగించేదీ కాలమే, యవలను ప్రోత్సహించేది కాలమే– అని లోకం చెప్పుకుంటుంది. నువ్వు చెప్పినట్టు, ఈ జగత్తు అంతా మానస కల్పనే అయ్యేటట్లైతే, దానికి ఒక వ్యవస్థ ఏమి వుంది, ఒక నియమం ఏమి వుంది. ఏ ఋతువులో అయినా సరే ఏ పంటయినా రావచ్చు, ఏ పంటైనా పోవచ్చు. కానీ, ఈ లోకం అలా లేదే. ఒక కాల నియమం ప్రకారం నడుస్తోంది. దీన్ని భ్రాంతి అని ఎలా అంటాం?!

**శ్రీహరి:**

**విప్ర సంకల్ప మాత్రోసౌ**
**కాలోహ్యాత్మని తిష్ఠతి ।**
**అమూర్తో భగవాన్ కాలో**
**బ్రహ్మైవ తమజం విదుః ॥** (సర్గ 49, శ్లోకం 15)

కాలం కాలమంటున్నావు. కాలం అంటే ఏమిటి? వరిని అడ్డగించేది, యవలను ప్రోత్సహించేది, అయిన శక్తి ఒకటి వుంది, అదే కాలం – అంటావా? ఆ శక్తి గూడా నీ మనస్సు చేసే కల్పనే. ఎందుకంటావా? దిక్కులనే వ్యవస్థను నీ మనస్సు ఏర్పాటు చేసుకుంది. దాని మీద ఆధారపడి సూర్యుడి గమనాన్ని కొలుస్తోంది నీ మనస్సు. ఆ కొలతలను బట్టి పగలనీ, రాత్రనీ, రోజనీ, నెల అనీ, సంవత్సరం అని, పేర్లు పెట్టి శాస్త్రాలు నిర్మించుకుంటోంది. ఈ వ్యవస్థ అంతా నీ మనస్సు చేసే కల్పనే– అని దీనిని బట్టి స్పష్టం కావడం లేదా?

**గాధి:** అలా కాదు స్వామీ! కాలమనేది ఒక అనుభూతి. ఒక సత్యమైన అనుభూతి. అది వుండబట్టే రోజులనీ, సంవత్సరాలనీ, నేను కొలతలు వేస్తున్నాను. ఈ కొలతలు నా కల్పనలైతే కావచ్చు. శాస్త్ర పరిభాషలో చెప్పాలంటే, కొలతలు గల ఈ ఖండ కాలాలన్నీ నా మానస కల్పనలైతే కావచ్చు. కానీ, వీటన్నింటికీ మూల భూతమైనది ఒక అఖండ కాలం వుంది. అది నేను సృష్టి చేసింది కాదు. అది నా కొలతలను బట్టి పుట్టింది కాదు. అది వుండబట్టే, ఈ కొలతలు పుట్టాయి. అలాంటి అఖండ కాలం నా మానస కల్పన కావటానికి వీలులేదు.

**శ్రీహరి:** అలాంటి అఖండ కాలం ఎక్కడ వుందంటావు? దేనిని ఆధారం చేసుకొని వుందంటావు? అవి నీ మనఃకల్పన కాదని నువ్వంటున్నావు గనుక, నీ మనస్సు దానికి ఆధారం కాదు. అది ఖండకాలానికి వెనుకే వుంది గనుక నీ సూర్య చంద్రాదులు దానికి ఆధారం కాదు. ఎవరూ కాకపోతే, ఇంకెవరు మిగిలి వున్నారు? ఆ పరమాత్మే మిగిలి వున్నాడు. అది ఆ పరమాత్మలోనే వుంది – అని చెప్పాలి. అందుకనే నేను "కాలోహ్యాత్మని తిష్ఠతి" అన్నాను.

"కానీ ఆ పరమాత్మలో భేదాలకు తావు లేదు. కనుక నువ్వు చెప్పే ఆ కాలం పరమాత్మలో పరమాత్మగానే ఉండాలి. అంటే, ఆ పరమాత్మే కాలం అని చెప్పినట్లు అవుతోంది. ఆ పరమాత్మకే కాలం అని మరో పేరు పెట్టినట్లు అవుతోంది. అలాంటి పరమాత్మ స్వరూపమైన కాలం ఏ వరిధాన్యాలకూ అడ్డం పెట్టదు. ఏ యవధాన్యాలకూ ప్రోత్సాహమూ ఇవ్వదు. కనుక, ఆ రకమైన కాలంతో, ఏ రకమైన పేచీ లేదు.

"ఇక సూర్య చంద్రాదుల మీద ఆధారపడ్డ సఖండ కాలమంటావా, దాన్ని మనస్సు, సూర్య చంద్రుల వంటి పదార్థాలు, సృష్టి చేస్తున్నాయి. అది బలం పుంజుకొని వరిధాన్యాలు యవధాన్యాలు వంటి వాటిని సృష్టి చేస్తోంది. ఈ మొత్తం వ్యవస్థంతా నీ మనస్సు మీద ఆధార పడి వుంది. అందువల్ల అది నీ మనస్సు

చేసే కల్పన. కనుక అలాంటి కాలాన్ని బట్టి ఈ జగత్తుకు సత్యత్వాన్ని సాధించాలను కోవటం పొరబాటు.

"ఇంతకూ నేను చెబుతున్న మాటేమిటంటే, ఈ సృష్టిలో ఒకే రకమైన భ్రాంతి, ఒకే కాలంలో, అనేక మందికి సంభవించవచ్చు. అలాంటి సన్నివేశమే, నీకు, భూత మండల వాసులకీ, కీర రాజ్యవాసులకీ, ఒకే సారి సంభవించింది. అందుచేత నీకు, వారికీ గూడా ఒకే రకపు సన్నివేశాలు అనుభవంలోకి వచ్చాయి. అలా రావటంవల్ల నీకు అవి సత్యాలేమో, అనే భ్రాంతి మరింత పెరిగింది.

"గాధీ! నేను చెప్పవలసింది చెప్పా. ఇక నువ్వేం చెయ్యాలో నువ్వే ఆలోచించుకో. నేను చెప్పిందాన్ని గురించి నీలో నువ్వు మళ్లీ మళ్లీ ఆలోచించుకో. ఆలోచించుకొని నీ మనో మోహాన్ని నువ్వే పోగొట్టుకో. నేను వెళ్లొస్తా" – ఇలా చెప్పి వున్నట్టుండి మాయమైపోయాడు శ్రీహరి.

గాధికి బుఱ్ఱ బరువెక్కి పోయింది. కొన్ని నెలలపాటు వెర్రెత్తే లాగా ఆలోచించాడు. ఎటూ తేల్చుకోలేక, చివరికి, మళ్ళీ తపస్సే మొదలు పెట్టాడు. త్వరలోనే శ్రీహరి దర్శనమిచ్చాడు. గాధి స్తోత్రాలు, పూజలు, చేశాడు. స్వామి మాట్లాడలేదు. గాధి మహర్షే మొదలు పెట్టాడు –

### *18. నాది కలా? గారడీయా?*

**గాధి:** భగవన్! ఆ నా బోయ జీవితం గురించి, ఈ నీ సంసార మాయని గురించి, ఆలోచించి ఆలోచించి నాకు మతి పోతోంది. కనుక దేవా! నువ్వే ఏదో ఒకటి తేల్చి చెప్పు. చెప్పి బుడుంగున వెళ్లిపోకు. నా మహామోహం తొలగిపోయే దాకా ఇక్కడే వుండి, నన్ను ఒక మంచి మార్గంలో పెట్టి వెళ్లు.

**శ్రీహరి:** బ్రహ్మర్షీ! జాగర్తగా విను. ఈ ప్రపంచం అంతా మాయ అనే గారడి చేసే ఆర్భాటమే తప్ప మరొకటి కాదు. ఈ గారడి మొత్తానికీ మూల కారణం ఒకే ఒకటి వుంది. అది నీ ఆత్మ తత్త్వాన్ని నువ్వు మరచి పోవటమే. ఈ స్వాత్మ తత్త్వ విస్మృతివల్లనే, నీకూ, భూతమండల వాసులకీ, కీరరాజ్య వాసులకీ, ఏవేవో దృశ్యాలు కనిపించాయి. అసలు రహస్యం చెబుతాను, విను.

"ఒకప్పుడు భూత మండల కుగ్రామంలో కటంజుడనే బోయవాడు పుట్టాడు. వాడే కీరదేశపు రాజయ్యాడు. వాడే నిప్పులో దూకి మరణించాడు. వాడి జీవిత చరిత్రే స్నానం కోసం చెరువులోకి దిగిన నీ మనస్సులో ప్రతిఫలించింది.

**దృష్టానుభూత మప్యర్థం**
**కదాచిద్విస్మరత్యలమ్ ।**
**కదాచిదప్యదృష్టం తు**
**చేతః పశ్యతి దృష్టవత్ ॥** (సర్గ 49, శ్లో. 31)

గాధీ! తాను ఒకప్పుడు స్వయంగా విన్న విషయాలను, చూసిన విషయాలను, అనుభవించిన విషయాలనూ గూడా ఈ మనస్సు పూర్తిగా మరచిపోతుంది. చిత్రమేమిటంటే, ఒక్కొక్కప్పుడు, అసలే చూడనివాటిని కూడా, ఇదివరకు ఎప్పుడో చూసినవాటిల్లాగా చూపిస్తుంది మనస్సు.

ఒక త్రికాలజ్ఞాన సంపన్నుడైన యోగి, ఒకానొక భవిష్యత్ కాల సంఘటన పరంపరను తన యోగ దృష్టితో దర్శిస్తున్నాడనుకో. ఆ పరంపరలో పై సన్నివేశాన్ని చూసినట్లు ఒక దాని వెనుక ఒకటి సన్నివేశం

అతనికి భూతకాల సన్నివేశం లాగానే కనిపిస్తుంది. ఆ మొత్తం కలిపి భవిష్యత్కాల సన్నివేశమే అయినా, అందులో ఇది భూతకాల సన్నివేశం కనుక, ఆ యోగికి అది ఆ సమయంలో, భూతకాల సన్నివేశంగా కనిపిస్తుంది. అలాగే, భ్రాంతిమయ దృష్టి కలవాడికి ఒక్కొక్కప్పుడు భూతకాల వృత్తాంతం వర్తమాన కాల సన్ని వేశం లాగా గోచరిస్తుంది.

కటంజుడి కథ విషయంలో నీకు జరిగింది అదే. కథ వట్టిగా కనిపిస్తే పెద్ద చిక్కు లేదు. అందులో మునిగి పోయావు నువ్వు . నీ ఆత్మతత్త్వ మేమిటో నీకు తెలియక పోవటమే దానికి కారణం. ఆత్మతత్త్వ జ్ఞానం కలవాడు ఏ పదార్థంతోనూ నేననే తాదాత్మ్యాన్ని పొందనే పొందడు. నాదనే మమకార బంధం కూడా పెట్టుకోడు. ఆత్మ తత్త్వజ్ఞానం లేనివాడు జడమైన దేహంతో తాదాత్మ్యం పెట్టుకొంటున్నాడు. జడాలైన ఇళ్ల మీద, పొలాల మీద మమకారం పెంచుకుంటున్నాడు. తను కానిదాని మీద తను అనే కల్పన చేసుకొనే దుర్బుద్ధి వున్నవాడికి, ఫలానా వస్తువు మీద మాత్రమే తాదాత్మ్య బుద్ధి పెట్టుకోవాలి. ఫలానా దానిమీద పెట్టుకోరాదు అనే నియమం ఎవడు పెట్టగలడు? పిచ్చివాడి చేతిలో రాయి లాగా, అది ఇప్పటి ఈ దేహం మీదా పట్టవచ్చు; మరొకప్పటి మరో దేహం మీదా పట్టవచ్చు.

నీ విషయంలో నీ మనస్సు కటంజుడి చరిత్రను మనస్సులో స్మరించడంతో పాటు, వాడి శరీరంతో తాదాత్మ్యం గూడా నీకు అంటగట్టింది. దానితో పాటు వాడి భార్యా పుత్ర క్షేత్రాదులమీద ఇవి నావి, ఇవి నావి, అనే మమకార బుద్ధిని కట్టబెట్టింది. ఆ చరిత్ర స్మరణ, ఈ అహంకార మమకార బంధాల అల్లిక, రెండూ ఒకేసారి రాబట్టి, నువ్వు కటంజుడి చరిత్రను బయటవాడి చరిత్రగా కాక, నీ సొంత చరిత్రగా స్మరించటం ప్రారంభించావు.

ఈ స్మృతి భ్రంశం మొత్తానికి కారణం నువ్వెవరో నీకు తెలియక పోవటమే.

**గాధి:** దేవా! ఆత్మతత్త్వజ్ఞుడికి ఇలాంటి భ్రాంతి జన్యమైన అనుభూతి కలగనే కలగదా?

**శ్రీహరి:**

**సర్వమేవాహమేవేతి తత్త్వజ్ఞో నావసీదతి ।**
**న గృహ్ణాతి పదార్థేషు విభాగానర్థ భావనమ్ ।**
**తేనాసౌ భ్రమయోగేషు సుఖ దుఃఖ విలాసిషు ।**
**న నిమజ్జతి మగ్నోపి తుంబీ పాత్రమివాంభసి ॥** (సర్గ 49 శ్లో 35,36)

గాధీ! ఆత్మతత్త్వజ్ఞుడు అంటే ఎవరు? ఈ ప్రపంచంలోని ప్రతి పదార్థమూ నేనే అనే తత్త్వం ఎవడికి అనుభవ సిద్ధంగా ఉందో, వాడే ఆత్మజ్ఞుడు. వాడికి అలాంటి జ్ఞానం వుంటుంది గనుక, వాడు ఈ పదార్థాలలో కొన్ని నేనని, కొన్ని నావని, కొన్ని నావి కావని, ఈ రకమైన, అనర్థకరమైన, సుఖదుఃఖ సంక్షోభకరమైన, విభాగంలో పడడు. అంటే, వాడు సంసారంలో మునగడు.

ప్రపంచంలోని కొద్ది భాగంతో, అంటే, ఏ చిన్ని దేహంతోనో, మనసుతోనో, తాదాత్మ్యభావనను పెట్టుకొన్నవాణ్ణి "పరిచ్ఛిన్న అహంభావి" అంటారు. అలాంటి పరిచ్ఛిన్న అహంభావమే జీవుణ్ణి ముంచుతుంది.

ఈ ప్రపంచంలోని ప్రతి పదార్థమూ నేనే అనే భావన కూడా ఒక అహంకార భావనే. దీనిని సర్వాహంభావమని, అఖండ అహంభావమని, అపరిచ్ఛిన్న అహంభావమని, పిలుస్తారు. ఇలాంటి పరిపూర్ణ అహంభావం వున్నవాడు, సంసార భ్రాంతిలో మునగడు. కానీ, మునిగినట్టు కనిపిస్తాడు. పెద్ద సొరకాయ బుఱ్ఱను నీటిలో వేసి, దానిమీద ఒక కుర్రవాడు కూర్చున్నాడనుకో. అప్పుడు ఆ బుర్ర మునిగినట్టు కనిపిస్తుంది

గానీ, ఆ కుర్రవాణ్ణి మునగనీయదు.

ఎవడైతే సర్వాహంభావనా స్థాయిని కూడా దాటిపోయి, ప్రపంచాతీతమైన చిదాత్మతో తాదాత్మ్య స్థితిని అందుకుంటాడో, వాడు సంసారంలో మునిగినట్లు కనిపించడం కూడా వుండదు. తత్త్వజ్ఞానుల పరిస్థితి ఇలా వుంటుంది.

**గాధి:** దేవా!మరి నా పరిస్థితి ఏమిటి?

**శ్రీహరి:** నువ్వు ఇటు పూర్తిగా సంసారివీ కావు, అటు పూర్తిగా జ్ఞానివీ గావు. మధ్యలో ఊగిసలాడుతున్నవాడివి. పూర్వ జన్మల వాసనలు నీ మనస్సును ఆక్రమించుకొని వున్నాయి. ఐనా నువ్వు వాటికి లొంగిపోలేదు. పెద్ద జబ్బు చేసి, ఇప్పుడిప్పుడే వ్యాధి తగ్గుముఖం పట్టి, వ్యాధి ఇంకా మిగిలివున్నవాడి లాగా వుంది నీ పరిస్థితి. ఎంతో కొంత జ్ఞానం వుంది. కానీ, అది పరిపూర్ణంగా లేక పోవటంవల్ల, మనో భ్రాంతులు వచ్చి మీద పడుతుంటే, ఆపుకోలేక పోతున్నావు. ఇంటి కప్పును బాగు చేయించటం చేతకానివాడు, వాన బాధను తప్పించుకోలేక పోతున్నట్లుగా వుంది నీ పరిస్థితి.

వేసవికాలంలో ఓ పొడుగాటి మనిషి ఎండకి తట్టుకోలేక, ఒక పొట్టి చెట్టు దగ్గరకు వెళ్ళాడు. వాడికి ఆ చెట్టు నీడ దక్కక పోగా, వాడి నీడే ఆ చెట్టును ఆక్రమించేసింది. అలాగే, నిన్నాశ్రయించిన మనస్సు నీకంటే పెద్దదై, దానిలో పుట్టే ఆలోచనలు నిన్నే కమ్మేస్తున్నై.

గాధీ! ఈ మాయ ఒక చక్రం వంటిది. అది ఎప్పుడూ గిరగిరా తిరుగుతూ వుంటుంది. చక్రం ఎప్పుడూ తన బొడ్డు చుట్టూ మాత్రమే తిరుగుతుంటుంది. ఈ మాయా చక్రానికి బొడ్డు నీ మనస్సే. బొడ్డును గట్టిగా పట్టుకుంటే చక్రం ఆగి పోతుంది. అలాగే, నీ మనస్సును గట్టిగా పట్టుకొని నిలబెడితే, మాయ మాయమై పోతుంది.

**గాధి:** దేవా! దానికి ఉపాయం ఏమిటి?

**శ్రీహరి:** తపస్సే ఉపాయం. బాధపడకు. ధైర్యంగా నిలబడు. ఇదే కొండ గుహలో, పది సంవత్సరాలు అఖండ తపస్సు చెయ్యి. నీకు అనంతమైన జ్ఞానం లభిస్తుంది.

ఇలా చెప్పి శ్రీహరి అంతర్ధానమై పోయాడు.

శిశిర ఋతువు వచ్చేసరికి చెట్టులో రసాలు తగ్గిపోయినట్టుగా, శ్రీహరి అనుగ్రహం వచ్చేసరికి గాధిలో సంకల్ప రసాలు తగ్గిపోయాయి. అతను వైరాగ్య పరిపూర్ణ హృదయుడై, కొండ గుహలోకి ప్రవేశించి, చిత్త నిరోధ విధానాన్ని ఆశ్రయించి, సమస్త సంకల్పాలనూ పరిత్యజించి, పదేళ్లపాటు అఖండ తపస్సు చేశాడు. దానివల్ల అతనికి పరిపూర్ణమైన ఆత్మజ్ఞానం లభించింది. స్వాత్మతత్త్వానుభూతి లభించింది. అప్పటినుంచి జీవన్ముక్తుడై ప్రశాంతుడై జీవిత శేషం గడిపాడు.

**వశిష్ఠుడు:** రామా! విన్నావు గదా, గాధి వృత్తాంతం. పరమాత్మను ఆశ్రయించుకుని వున్న ఈ మాయ ఎంత ఎగుడు దిగుడుదో, ఎంతగా ఊహకందనిదో, ఎంత విస్తారమైనదో, తెలిసింది గదా! అందుకనే నేను మళ్లీ మళ్లీ చెబుతున్నాను, ఈ మాయ చాలా చెడ్డది. కానీ, ఏకాగ్ర చిత్తులను ఇది ఏమీ చేయలేదు. ఏకాగ్రత తప్పిన భ్రాంత చిత్తులను మాత్రం ఇది ఎప్పుడూ సంకటాలలోకి తోసి వేస్తూనే వుంటుంది.

**రాముడు:** గురుదేవా! ఈ మాయా చక్ర భ్రమణాన్ని ఆపేదెలా? ఈ ప్రశ్నే పూర్వం గాధి కూడా అడిగాడు. తపస్సు చేయమన్నాడు శ్రీహరి. కానీ, ఈ చక్రం మహా వేగంతో గిర గిరా తిరుగుతూ వుంటే, దానికి తగిలిన ప్రతి అవయవమూ ముక్కలు ముక్కలై పోతూ వుంటే, దాన్ని ఆపటం ఎలా?

## 19. గాధి చరిత్ర సింహావలోకనం

శ్రీరాముడు వేస్తున్న ప్రశ్నను బట్టి చూస్తే, ఆయనకు కథను గురించిన సందేహాలు లేవని తెలిసిపోతోంది. అందుకే ఆయన, ఆ కథను పక్కన పెట్టేసి, మాయా చక్ర నిరోధోపాయాలు అడుగుతున్నాడు. మనం ఆయనతో పాటు ఆ చర్చలోకి ప్రవేశించే ముందు, సుదీర్ఘమైన గాధి చరిత్రను ఒకసారి సింహావలోకనం చేసుకుందాం.

పూర్వం ఉత్పత్తి ప్రకరణంలో, లీలోపాఖ్యానం అనే కథలో, బింబ ప్రతి బింబాలను పోలిన రెండు ప్రపంచాలు ఒకే జీవికి కనిపిస్తాయి. అదే ఉత్పత్తి ప్రకరణం చివరిలో "లవణోపాఖ్యానం" అని ఒక కథ చెప్పారు. దానిలో, లవణుడు అనే రాజుకి భ్రాంతి రూపమైన కలలో కనిపించిన దృశ్యం తరువాత మళ్లీ జాగ్రత్ప్రపంచంలో కనిపిస్తుంది.

ఆ తరువాత స్థితిప్రకరణంలో, భార్గవోపాఖ్యానంలో, శుక్రాచార్యుడు తన పాత శరీరాన్ని తనే తగుల బెట్టుకోవడం కనిపిస్తుంది.

ఈ మూడూ కలగలిపితే గాధి చరిత్ర తయారవుతోంది.

వశిష్ఠ మహర్షి ఈ కలగాపులగపు పునరుక్తికి ఎందుకు పాల్పడ్డట్టు? కొంచెం నిదానంగా ఆలోచిస్తే, ఈ పునరుక్త్యాభాసలో గొప్ప ప్రణాళిక కనిపిస్తోంది.

వశిష్ఠమహర్షి ఈ ఉపశమ ప్రకరణపు ఎత్తుగడనే అనుష్ఠానాలతో ప్రారంభించాడు. ఆ తరువాత 'ఉపశమ ప్రకరణం' అంటే మనస్సుయొక్క ఉపశమాన్ని గురించి చెప్పే ప్రకరణమే అని ప్రతిపాదించాడు. ఆ తరువాత జ్ఞానోదయం కలిగే తీరులు రకరకాలుగా వుంటాయి– అంటూ దానికి నిదర్శనంగా జనక మహారాజుని, బలిచక్రవర్తినీ, ప్రహ్లాదుడ్నీ మన ముందుకి తెచ్చాడు.

ఈ విధంగా జ్ఞానోదయ విధానాలను వర్ణించిన తరువాత సంసారానికి మూల బీజమైన మాయను గురించి ప్రస్తావనను వశిష్ఠమహర్షే లేవ దీశాడు. ఎందుకు లేవదీశాడు?

వెనుకటి కథలో చెప్పిన జ్ఞానోదయం, సాధనయొక్క చివరి స్థాయిలో జరిగే పని. మరి సాధనయొక్క ప్రారంభస్థాయి ఏమిటి? ఆ ప్రారంభ దశలో ఉపాయాలేమిటి? ఆ చర్చలోకి వెళ్లదలుచుకున్నాడు మహర్షి. అలా వెళ్లేముందు, దేనికోసం సాధన చేస్తున్నామో స్పష్టంగా తెలియాలి. అందుకోసమే, వెనక అక్కడక్కడా ముక్కలు ముక్కలుగా జరిగిన మాయా చర్చల ముక్కలను ఒకచోటికి చేర్చదలచుకున్నాడు. ఆయన సమర్థుడైన శిల్పి గనుక, పాత ముక్కలతో కొత్త బొమ్మ తయారు చేశాడు. అదే గాధి చరిత్ర.

లవణ చరిత్రలో దేవేంద్రుడు పంపిన గారడీవాడి మహిమవల్ల లవణ చక్రవర్తికి మత్తులాంటిది కలిగి, ఆ మత్తులో దారి తప్పిపోయి, అడవుల పాలై, బోయవాడిగా జీవించాడు. ఆ మత్తు తీరిపోయాక వెళ్లి వెతికి చూస్తే, తను బోయవాడిగా తిరిగిన ప్రాన్తాలన్నీ మళ్లీ నిజంగా కనిపించాయి. అది ఎలా జరిగింది?– అనే ప్రశ్నకు సమాధానం చెబుతూ –

**విస్మరత్యపి విస్తీర్ణాం**
**కృతాం చేతః క్రియాం యథా।**
**తథా కృతా మప్యకృతా**
**మితి స్మరతి నిశ్చితమ్ ॥** (ఉత్పత్తి ప్రకరణం సర్గ 121, శ్లోకం 23)

ఈ మనస్సు తను చేసిన పనులను తానే మర్చిపోతూ వుంటుంది. ఇది అందరికీ అనుభవంలో వున్నదే. ఇది ఎలా సాధ్యమో, అలాగే చేయని పనిని చేసినట్టుగా స్మరించటం కూడా మనస్సుకు సాధ్యమే – అని అక్కడ సమాధానం చెప్పారు.

ఎవరో ఒక రాజకుమారుడు నిజంగానే ఆ అడవుల్లో తిరిగి, బోయదానితో సంసారం చేసి, పిల్లల్ని కన్నాడనీ, ఆ మనస్సుయొక్క స్మృతి గారడీవాడి మహిమవల్ల లవణమహారాజు మనస్సులోకి సంక్రమించిందనీ, అక్కడ వివరణ కూడా ఇచ్చారు.

ఇప్పుడు ఇక్కడ గాధి మహర్షి చరిత్రలో కూడా అలాంటి వివరణే ఇస్తున్నారు.

**భవతః కేవలం చిత్తే**

**జలాన్తర్వాసిన స్తదా ।**

**ప్రతిభాతా యథాభూతా**

**కటంజాచార సంస్థితిః ॥** (ఉపశమ ప్రకరణం సర్గ 50, శ్లోకం 30)

పూర్వం కటంజుడనే బోయవాడు కీరదేశపు రాజయ్యాడు. ఆనాటి వాడి చరిత్రంతా యథాతథంగా చెరువులో నిలబడ్డ నీ మనస్సులో ప్రతిఫలించింది (ప్రతిభాతా) అని, ఇక్కడ వివరణ యిస్తున్నారు.

ఈ రెంటికీ తేడా ఏముంది?

వివరణలలో తేడా లేదు. కథనంలో తేడా వుంది.

లవణ మహారాజు దగ్గర, ఒకడి అనుభవం మరొకడి స్మృతిగా సంక్రమించడానికి హేతువుగా ఐంద్రజాలికుడి ప్రభావం వుంది. ఇక్కడ అలాంటి ప్రభావం ఏమి వుంది?

ఇక్కడ శ్రీహరి మాయే అలాంటి కారణం అని చెప్పరాదా – అంటే, చెప్పరాదు. శ్రీహరి మాయ ఈ ప్రపంచం మొత్తం మీద వ్యాపించి వుంది. ప్రపంచంలోని సంసార భ్రాంతులన్నిటికీ అదే మూల కారణం. దాన్ని ఈ సంఘటనకు ప్రత్యేక కారణంగా చెప్పే వీలు లేదు. చెప్పినా విశేష ప్రయోజనం ఏమీ వుండదు.

ఇక్కడ ఉన్నట్టుండి ఒక అనుభూతి కలిగింది. కొద్ది నిమిషాల మతిమరుపులో, ఎనభై సంవత్సరాల చరిత్ర జరగటమే ఆ అనుభవం. ప్రతిరోజూ స్వప్నదశలో మన అందరికీ కలిగేది ఇలాంటిదే. దాన్ని మన మందరం అసత్యమనీ, భ్రాంతి అనీ, కొట్టి పారేస్తున్నాం. వేదాంతులు వచ్చి “నీ స్వప్నం అసత్యమైనట్లే, నీ జాగ్రత్తు కూడా అసత్యమే” అంటే, మనం ఒప్పుకోవటం లేదు. దానికి మనం చెప్పే ప్రధాన కారణాలు రెండు.

1. నా స్వప్నం మహా అయితే పది నిమిషాలు. ఆ సమయంలో నా స్వప్న జీవితం కొన్ని సంవత్సరాలు. నా స్వప్న సమయంలో నేనున్నది నా ఇంట్లో, నా స్వప్న కథంతా జరిగింది ఎక్కడో పొరుగూరిలో. ఈ విధంగా ప్రదేశాన్ని బట్టి చూసినా, కాలాన్ని బట్టి చూసినా, నా స్వప్న కథంతా అసంగతం. కనుక, అది అసత్యం.

2. నా స్వప్న కథకు నేనొక్కడినే సాక్షిని. దానికి రెండో సాక్షి లేదు. స్వప్న కథ నిజమైతే, నా కలలో నాతో పాటు సుఖదుఃఖాలను ఎవరైతే అనుభవించారో, వాళ్లందరూ నా స్వప్నకథకు సాక్షులుగా నిలవాలి. అలా ఎవరూ నిలవటం లేదు.

ఈ రెండు కారణాలవల్ల మన స్వప్నం అసత్యమని ఖాయంగా మనం చెబుతున్నాం. మన జాగ్రత్కథకు ఈ రెండు దోషాలూ పట్టవు. జాగ్రత్కథలో ప్రదేశాన్ని బట్టి గానీ, కాలాన్ని బట్టి గానీ, అసంగతంగా వుండే

సన్నివేశాలు వుండవు. మనతో బాటు అనుభవించినవారంతా సాక్ష్యానికి నిలబడతారు. అందుచేత మన జాగ్రత్కథ అసత్యం కావడానికి వీలు లేదు.

స్వప్నకథే కాదు, మన అనుభవంలో వున్న ఏ సంఘటనైనా సరే, అది సత్యమో, అసత్యమో తేలాలంటే, ప్రధానమైన కొలబద్దలు ఈ రెండే. ఆ రెండు కొలబద్దల ప్రకారం, గాధి మహర్షికి చెరువులో వుండగా కలిగిన అనుభవం అసత్యమని నిశ్చయించక తప్ప లేదు.

కానీ, ఇక్కడ ఒక చిన్న మడత పేచీ వచ్చి పడింది. ప్రపంచంలో ఏ జీవికీ, తన శరీరం తగలబడి పోతూ వుండగా, పూర్తిగా బూడిదై పోగా, చూసే అనుభవం ఉండటానికి వీలే లేదు. ఎవరైనా యోగీశ్వరులకి అలాంటి శక్తులు వుండరాదా?– అంటే, వాళ్లకి వుంటే వుంటాయేమో, మన గాధిగారు మాత్రం అంత గొప్ప యోగి ఏమీ కాదు. ఆయనకి– లేని పెళ్లాం కనిపించింది, లేని పిల్లలు కనిపించారు, చిన్నప్పుడు ఎప్పుడో చూసీ చూడని తల్లి కనిపించింది. వీటన్నింటికీ మించి, తన చావు కనిపించింది. తన శరీరం బూడిదవటం కనిపించింది. ఐనా సరే, తను వున్నాను– అనే భావన పోలేదు. ఎలా చేరాడో తెలియదు కానీ, బోయతల్లి గర్భంలో తను వున్నట్టుగా తనకే కనిపించింది.

పూర్వం భార్గవోపాఖ్యానంలో, శుక్రకుమారుడు తన భావనాబలంచేత తను మరో శరీరాన్ని పొంది, కాలక్రమంలో మళ్లీ పాత శరీరం దగ్గరకు వచ్చి, తను మహాయోగి కనుక, కొత్త శరీరాన్ని వదలి పాత శరీరంలోకి ప్రవేశించి, ఆ పాత శరీరంయొక్క సహాయంతో, కొత్త శరీరాన్ని కట్టెల్లో వేసి, తగలబెట్టాడు. ఇదేదో జంతర్ మంతర్ కథ లాగా వుంది! దీన్ని నమ్మవచ్చునో లేదో అని రాముడే సందేహించాడు. కల్ప ప్రారంభ దినాలలో, పాత కల్పపు విశిష్టజీవులు కొందరు జన్మిస్తూ వుంటారనీ, వారి చరిత్రలు ఇలాగే లోకోత్తరంగా వుంటాయనీ, కనుక వాటిని నమ్మాలనీ, అక్కడ వశిష్ఠుడు చెప్పాడు.

ఇక్కడ అలాంటి కథ లేవీ కుదరవు. గాధి మహర్షి సామాన్య సాధకుడు. ఆయనకు తను బూడిదై పోవటం తనే చూసిన అనుభవం కలిగింది. తనకు శరీరం లేక పోయినా తను వున్నానని గుర్తు పట్టిన అనుభవం కలిగింది. ఎక్కడో తల్లి గర్భంలో ఒక చిన్న నెత్తురు కణికగా తాను వున్న అనుభవం కలిగింది. ఇది పూర్తిగా కల గాదు. నిజం కావటానికి వీలు లేదు. అబద్ధానికీ, నిజానికీ మధ్య ఇది ఎక్కడ వున్నట్టు?

గాధి ఈ సమస్యలో కొంచెంసేపు కొట్టుమిట్టాడి, ఈ అనుభవాలన్నీ తాను చదివిన పుస్తకాలవల్ల, విన్న బోధలవల్ల, పుట్టిన పైత్యాలనే నిశ్చయానికి వచ్చి, ఈ మొత్తాన్ని స్వప్నతుల్యంగా భావించి, అసత్యం కింద కొట్టిపారేసి, ప్రశాంత పడ్డాడు. కానీ, ఆయనెవడో అతిథి ముని వచ్చి, తను భ్రాంతి అనుకున్న సన్నివేశానికి సాక్షిగా నిలబడి, గాధి ప్రశాంతిని పూర్తిగా చెడగొట్టేశాడు.

స్వప్నం గానీ, దానికి సమానమైన ఇతర భ్రాంతి అనుభవాలు గానీ, అసత్యాలని నిశ్చయించటానికి కావలసిన రెండు అంశాలలోనూ, ఒకటి దెబ్బ తింది. అంటే, రెండో సాక్షి లేదనే అంశం దెబ్బతింది. దేశ కాలాలకు విరుద్ధంగా, చెరువులో నిలుచున్న తనకు ఎనభై సంవత్సరాల జీవిత కథ జరిగిందనే అంశం మాత్రం చెక్కు చెదరకుండా అలాగే వుంది.

రెండు ప్రధాన కారణాల్లోనూ ఒకటి తప్పి పోయి, రెండోది మిగిలితే, దీన్ని ఏమనాలి? సత్యమైన అనుభవం అనాలా? భ్రాంతి అనుభవం అనాలా? ఇక్కడే గిలగిలా కొట్టుకుంటున్నాడు గాధి మహర్షి. లవణ కథకూ, భార్గవ కథకూ, ఇప్పుడు ఈ కథకూ, వున్న భేదం కూడా ఇక్కడే వుంది.

గాధి మహర్షి మొదట్లో తపస్సు చేసినప్పుడు విష్ణుమూర్తి ప్రత్యక్షమై "నా మాయయొక్క దర్శనం నీకు లభిస్తుంది, అది లభించిన వెంటనే నీకు మాయ లేకుండా పోతుంది" – అన్నాడు.

ఆరు మాసాలు అరణ్యంలోనూ, పన్నెండు సంవత్సరాలు నగరంలోనూ, సాక్ష్యాలను సేకరించి సేకరించి, బుర్రకు పిచ్చెక్కి పోయి, చివరికి గాధి మహర్షి ఓ మాట అనుకున్నాడు – ''బహుశా ఇది విష్ణుమాయే అయివుంటుంది"– అని.

ఇప్పుడీయనకు మాయా దర్శనం లభించినట్టా? లభించనట్టా? అదేమో తెలియదు గానీ, ఆయనకు మాయావరణం మాత్రం తొలగి పోలేదు. తపస్సు చేశాడు. శ్రీహరి దర్శనం ఇచ్చాడు; "ఇది నా మాయేరా బాబూ!" అని నోరు తెరచి చెప్పాడు. ఐనా, ఆ మాయ పోలేదు.

గాధి మహర్షి మళ్లీ సాక్ష్యాలు సేకరించాడు. శ్రీహరి చెప్పింది అబద్ధమే అనే నిశ్చయానికి వచ్చాడు. ఆ నిశ్చయానికి రావలసి వచ్చినందుకు బాధ పడ్డాడు. మళ్ళీ తపస్సు చేశాడు. శ్రీహరి వచ్చి ఒక కొత్త సమన్వయం చెప్పాడు. "నీకు చెరువులో కీరరాజ్యం కనిపించటం వరకు మాత్రమే నీ భ్రాంతి కాదయ్యా, ఆ తరువాత భ్రాంతి తీరిపోయిందనుకోవటం, ఆ తరువాత అతిథిముని నీ ఇంటికి వచ్చాడను కోవటం, నువ్వేదో సాక్ష్యాలు సేకరించానను కోవటం, ఈ మొత్తం అంతా నీకు చెరువులో కలిగిన భ్రాంతిలో భాగమే. పో"! – అన్నాడు.

గాధి మాట్లాడలేక పోయాడు. ఆ క్షణంలో అది నిజమే అనిపించింది. కానీ, మళ్లీ మాయే గెలిచింది. మనస్సు మొరాయించింది. మళ్లీ విచారణ మొదలు పెట్టాడు. మళ్లీ తపస్సు చేశాడు. మళ్లీ శ్రీహరిని పిలిచాడు. ఈ మాటు శ్రీహరి వచ్చి మరో సమన్వయం చెప్పాడు– "కటంజుడనే వాడి చరిత్ర నిజంగానే జరిగింది. ఆ చరిత్ర నీ మనస్సులో స్మృతిగా ప్రతిఫలించింది. కనుక, నీ వరకూ ఇది భ్రాంతి. కటంజుడి వరకూ అది సత్యం. వాడి సత్యంలో భాగమైన సాక్ష్యాలను నువ్వు విచారించ గలుగుతున్నావే తప్ప, నీ అనుభవంలో నిజంగా నీతో వ్యవహరించిన వ్యక్తులను నువ్వు విచారించటం లేదు. అర్థం చేసుకో. కటంజుడి చరిత్ర ఇటీవలే పూర్తైయింది. అది దాటిపోయిన ప్రవాహం. దానికి ఈనాడు అస్తిత్వం లేదు. ఐనా, అది నీలో స్మృతిగా కనిపించింది. కనుక, నీ స్మృతి సమయంలో నీకు కనిపించినవాళ్లు నిజంగా కీర రాజ్య ప్రజలు కారు. వాళ్ల ప్రతిబింబాల లాంటి వాళ్లు. నువ్వు నీ భ్రాంతిలో నుంచి బైటికి వచ్చాక, కీరరాజ్యం వెళ్లి విచారించావు. అక్కడి ప్రజల్ని చూసి నీకు కనిపించిన వాళ్లు వీళ్లే అనుకున్నావు. కానీ, నీకు కనిపించినవాళ్లు ప్రతిబింబ రూపులు. వీళ్లు బింబ స్థానీయులు. నీకు ఆ భేదం తెలీదు. వాళ్ల దగ్గర విషయ సేకరణ చేశావు. వాళ్లు చెప్పేవన్నీ బింబస్థానీయ కథలు. అవి, నీ ప్రతిబింబ స్థానీయ కథలతో సరిపోతున్నాయి. అవీ, ఇవీ ఒకటే అనుకుంటున్నావు నువ్వు. అవి సమాంతరంగా సాగే బింబ ప్రతిబింబాలని గుర్తించ లేక పోతున్నావు. అందుకే ఇంత గందరగోళ పడుతున్నావు"– అన్నాడు.

ఇదేమిటి? విష్ణుమూర్తి మాట మార్చేశాడల్లేవుందే! – అనే సందేహం కలగవచ్చు మనకు. గాధిగారికి ఆ సందేహం కలగలా. ఎంతైనా ఆయన మనకంటే మెరుగైన సాధకుడు కదా! ఆయనకు ఎందుకు కలగలేదంటే, గాధి గారికి చెరువులో జరిగిన భ్రాంత్యనుభవం మొత్తానికి, వాటి సాక్ష్యాల సేకరణ దాకా జరిగిన అనుభవం మొత్తానికి, మూల కారణాన్ని ఇక్కడ వివరిస్తున్నాడు శ్రీహరి. ఏ పూర్వ సంస్కారబలంవల్ల ఈ అనుభవం కలిగిందో దాన్ని వివరిస్తున్నాడు. అందువల్ల ఇది మాట మార్చటం కాదు.

అందుకే ఇది నచ్చినట్టే వుంది గాధికి. కానీ, విష్ణుమూర్తికే విసుగొచ్చింది. "నీకు ఇప్పుడు నచ్చినట్టే వుంటుందయ్యా! కానీ, ఈ మాయ అంత తేలికగా వదలదు. మళ్లీ సందేహాలు రాక మానవు. కనుక ముందు

నీ మనస్సుని పరిశుద్ధం చేసుకో. దాని కోసం పదిసంవత్సరాలు తపస్సు చెయ్యి." అని చెప్పేసి వెళ్లి పోయాడు.

ఇలాంటి బింబ ప్రతిబింబ ప్రపంచాల సన్నివేశాలను వశిష్ఠ మహర్షి "ఉత్పత్తి ప్రకరణంలో" లీలోపాఖ్యానంలోనే చూపించాడు. అక్కడ పద్మరాజ ప్రపంచము, విదూరథ ప్రపంచమూ, అని రెండు ప్రపంచాలు చూపించాడు. పద్మరాజలీలా–విదూరథ లీలలను చూపించాడు. పద్మరాజ రాజ్యంలో ఎలాంటి మంత్రి సామంతాదులున్నారో, విదూరథ రాజ్యంలో గూడా అలాంటి మంత్రి సామంతాదులే వున్నారు– అన్నాడు. పద్మలీల సరస్వతీదేవి సహాయంతో, విదూరథ ప్రపంచానికి వెళ్లి, తమ పరివారమంతా అక్కడ వుండటం చూసి, తన పరివారం తన లోకంలో మరణించి ఆ లోకానికి చేరారేమో అని అనుమాన పడింది. ఆ అనుమానం తీర్చుకోటానికి మళ్లీ తన లోకానికి వచ్చి తన రాజ్యంలో మంత్రి సామంతాదులందరినీ సమావేశ పరచి, వీళ్లందరూ ఇక్కడ బతికే వున్నారని ఖాయపరచుకుంది. తద్వారా పద్మరాజ, విధూరథ ప్రపంచాలు, బింబ ప్రతిబింబ ప్రపంచాలుగా, సమాంతరంగా, సాగిపోతున్నై – అని పద్మలీల గుర్తించింది.

ఇక్కడ అలాంటి సన్నివేశాన్నే గాధి అనుభవిస్తున్నాడు. ఆ కథలో లోకాంతర ప్రయాణం వుంది. సరస్వతీదేవి సహాయం వుంది. సూక్ష్మదేహ ధారణ వుంది. ఇక్కడ గాధికి ఇవేవీ లేవు. తన మామూలు బండ శరీరంతో, తనకు తెలిసిన భూ ప్రపంచంలో, తనంతట తాను వంటరిగా తిరుగుతూ, బింబ ప్రతిబింబ ప్రపంచాలు రెండింటినీ చూస్తున్నాడు. అందుకే వాటి మధ్య భేదాన్ని గుర్తించ లేక పోతున్నాడు.

ఈ గుర్తింపు వరాల ద్వారా సాధ్యమయ్యే విషయం కాదని చెప్పడం కోసమే వశిష్ఠ మహర్షి విష్ణుమూర్తిని మూడు సార్లు తిప్పి "తపస్సు చేసి నీ మనస్సును పరిశుద్ధం చేసుకుంటే తప్ప నీకు ఈ తత్త్వం అంతు పట్టదయ్యా" అని ఆయన చేతే చెప్పించాడు.

గాధి మహర్షి అంతకు ముందు చేసింది తపస్సు కాదా?

అది తపస్సే కానీ, అది ఒకానొక వరం కోసం చేసిన తపస్సు. అది మనస్సును కొంత వరకే పవిత్రం చెయ్య గలదు. మనశ్శుద్ధి కోసం ప్రత్యేకమైన తపస్సు చేసినప్పుడు మాత్రమే పరిపూర్ణ మనశ్శుద్ధి లభిస్తుంది– అని సూచించడమే చివరి పదేళ్ల తపస్సుకు ప్రయోజనం.

ఈ విధంగా లీలోపాఖ్యానం లోని బింబ ప్రతిబింబ ప్రపంచాల సన్నివేశాన్నీ, భార్గవోపాఖ్యానం లోని స్వదేహ దహన సన్నివేశాన్నీ, లవణోపాఖ్యానంలోని ఇంద్రజాలానుభావ సన్నివేశాన్నీ, కలిపి సామాన్యమానవుడి జీవితంతో ముడి పెట్టి, సమన్వయ పరచి చూపించటమే గాధి చరిత్రలోని అంతర్గత రహస్యం.

దీని ద్వారా, మనం నిత్యమూ అనుభవిస్తున్న జాగ్రత్ప్రపంచానికి గూడా ఇలాంటి సమన్వయమే సరిపోతుంది– చూసుకోమని చెప్పటమే ఈ కథలోని ధ్వని.

ఇందాక చెప్పుకొన్నట్లుగా జాగ్రత్ప్రపంచం సత్యమనటానికి మనం చూపించే రెండు కారణాలు – దేశ కాలాల క్రమబద్ధత, అనేక మంది సాక్షుల సామూహిక సాక్ష్యలబ్ధి అనే రెండు కారణాలు– ఈ చర్చ తరువాత ప్రశ్నార్థకమై పోతున్నాయి. మన జాగ్రత్ప్రపంచంలో, మన అనుభవాలకు సాక్షులుగా నిలబడుతున్న మన తోటివారంతా, మనం ఊహించుకునే ప్రతిబింబ ప్రపంచంలోని పాత్రలెందుకు కాకూడదు? – అనే కొత్త ప్రశ్న మన ముందుకు వచ్చి, నిలబడుతోంది.

దానికి తోడు, దేహం కాలిపోయిన తరువాత కూడా తన అస్తిత్వం తనకు తెలుస్తున్న అనుభూతి గాధికి కలిగింది. ఈ దేహం వున్నప్పుడు, ఈ దేహం మెలకువలో చూసే ప్రపంచాన్ని జాగ్రత్ ప్రపంచం అంటున్నాం. దేహమే లేనప్పుడు ఈ జాగ్రత్ప్రపంచాన్ని ఏమనాలి?– అనే ప్రశ్న గూడా మన ఎదుట దయ్యం

లాగా నిలబడుతోంది.

ఈ జాగ్రత్ప్రపంచం కూడా స్వప్న ప్రపంచం లాగా అసత్యమే అని నిర్ధారణ చెయ్యడానికి ఈ ప్రశ్నలు సరిపోక పోయినా, ఇవి ఆ ఆలోచనను రేకెత్తిస్తాయనీ, తపస్సుచేత మనస్సు పరిశుద్ధమైనప్పుడు మాత్రమే ఈ ప్రపంచం అంతా అసత్యమే అనే జ్ఞానం సంభవిస్తుందనీ, తేల్చి చెప్పడమే గాధి చరిత్రకు అసలైన సారం.

ఇక పోతే ఈ కథలోని పేర్లు గురించి కొంచెం ఆలోచించవలసి వుంది. కథానాయకుడి పేరు గాధి. గాధము అంటే లోతు తక్కువగా వున్న ప్రదేశం. లోతు తక్కువైన మనస్సునే ఇక్కడ "గాధం"గా తీసుకున్నారు. అలాంటి మనస్సు గలవాడు "గాధి". ఆయన మనస్సు అంతలోతైనది కాదు కనుకనే, విష్ణుమూర్తి ఆయనకు అన్నిసార్లు బోధ చేయవలసి వచ్చింది. అంతేగాక, ఆయన తపస్సు గూడా ఎక్కువ లోతులేని చెరువులానే సాగింది. ఆవిధంగా కథానాయకుడి పేరు గూడా, ఈకథ నడకకు అనుగుణంగానే వుంది.

ఇక బోయవాడుగా వున్నప్పుడు ఆయన పేరు "కటంజుడు". కటం అంటే శవమనీ, శ్మశానమనీ అర్థాలున్నాయి. "కటం అంజ తీతి కటంజః" అనే వ్యుత్పత్తి ప్రకారం, స్మశానాన్ని అంటుకొని, లేదా శవాన్ని అంటుకొని వుండే వాడు కటంజుడు. గాధిగారి పూర్వ శరీరం కాలి బూడిద అయిపోగా, ఆ వెనువెంటనే స్వయంగా గాధి గారికే కనిపించిన రూపం గనుక, ఆ రూపానికి "కటంజుడు" అనే పేరు సముచితంగానే వుంది గదా!

అతను ఉన్న అడవి పేరు "భూత మండలం " భూతమండలమంటే పంచభూతాల సమూహమే. ఈ కటంజ శరీరానికి నిర్మాణ హేతువులో పంచభూతా లేనా? లేక అది కేవల కల్పిత దేహమా? – అనేదే ఈ కథలోని కేంద్ర బిందువు కదా!

అతడు రాజైన దేశం పేరు కీరదేశం. కీరం అంటే – ప్రసిద్ధంగా చిలుక అని అందరికీ తెలుసు. అర్థం తెలియకుండా పలుకులు పలికేది కీరం. అర్థంలేని ఆచారంతో రాజును ఎంచుకున్న దేశం కనుక అది కీరదేశమే.

అక్కడ రాజుగా వున్నప్పుడు గాధిగారి పేరు గవలుడు. గవలము అంటే దున్నపోతు కొమ్ము. గవలుడు అంటే అడవి దున్నపోతు. అతని ఆకారాన్ని బట్టి బుద్ధి గుణాన్ని బట్టీ ఆ పేరు సరిపోతోంది గదా!

ఈ విధంగా ఈ గాధి చరిత్రలో పేర్లు గూడా అంతరార్థయుక్తాలుగా, సందర్భ సూక్తాలుగా వున్నాయి.

ఈ సమన్వయ రహస్యాలన్నీ శ్రీరాముడు చక్కగా గ్రహించేశాడు. అందుకనే ఆయన ఇలాంటి ప్రశ్నలేవీ లేవదీయక, విష్ణుమూర్తి చివరికి లేవనెత్తిన 'తపస్సు' అనే అంశాన్ని పట్టుకుని, దానిమీదే పై చర్చను కేంద్రీకరిస్తున్నాడు. అందుకే ఆయన ప్రశ్నను కొంచెం ఆపి, మనం ఈ సింహావలోకన ప్రక్రియను పూర్తి చేశాం. ఇక శ్రీరాముడి ప్రశ్నలోకి ప్రవేశిద్దాం.

## ౨౦. చిత్త నిరోధమే అసలైన తపస్సు

**శ్రీరాముడు:** గురుదేవా! ఈ మాయా చక్రభ్రమణాన్ని ఆపేది ఎలా? ఈ ప్రశ్నే పూర్వం గాధి కూడా అడిగాడు. తపస్సు చేయమన్నాడు శ్రీహరి కానీ, ఈ చక్రం మహా వేగంతో గిరగిరా తిరుగుతూ వుంటే, దానికి తగిలిన

ప్రతి అవయవమూ ముక్కలు ముక్కలై పోతూవుంటే, దాన్ని ఆపటం ఎలా?

ఈ ప్రశ్న దగ్గరే పూర్వం మనం ఆగాం.ఇప్పుడు దానికి వశిష్ఠుడు ఏమి చెబుతాడో విందాము.

**వశిష్ఠుడు:** రామా! ఈ ప్రశ్న గాధి వేసిందే. దీనికి సమాధానం శ్రీహరి చెప్పనే చెప్పాడు. ఆయన తపస్సు చెయ్యమన్నాడు. తపస్సు అంటే ఏమిటో కూడా ఆయనే చెప్పాడు. ఆ స్వామి ఏమి అన్నాడో గుర్తుందా?

**చిత్తం నాభిః కిలాస్యేహ**
**మాయా చక్రస్య సర్వతః ।**
**స్థీయతే చేత్త దాక్రమ్య**
**తన్న కించిత్ప్రబాధతే ॥** (సర్గ 49, శ్లోకం 40)

అన్నాడాయన. అంటే, ఈ మాయ ఒక మహా చక్రమైతే, దాని నడిబొడ్డు నీ చిత్తం. ఈ బొడ్డులోనుంచే చుట్టూ చువ్వలు బయలుదేరి, చివరిలో గుండ్రటి చుట్టు కట్టు ఏర్పడితే, అది చక్రమౌతుంది. ఈ చక్రంమీద ఎక్కడ వేలు పెట్టినా వేలు విరిగి పోతుంది. ఆ వేలును అంచునుంచి మెల్లిగా కిందకు దించి బొడ్డుమీద పెడితేనో?! అప్పుడు వేలుకేమీ కాదు. ఆ బొడ్డును గట్టిగా పట్టుకో గలిగితే ఆ చక్ర భ్రమణమే ఆగిపోతుంది.

నువ్వు చక్ర యుద్ధంలో గట్టివాడివే కదా! ఎదుటివాడు చక్రం విసిరినప్పుడు మీరేం చేస్తారు? దాన్ని అంచు దగ్గర పట్టుకుంటారా? పట్టుకోరు. చువ్వల దగ్గర పట్టుకుంటారా?! పట్టుకోరు. ఒడుపుగా బొడ్డు దగ్గర పట్టుకుంటారు. ఆ బొడ్డును గట్టిగా పట్టుకుంటే చక్రం ఆగిపోతుంది. మాయా చక్రం దగ్గర కూడా అంతే.

చక్రానికి బొడ్డు అంటే ఏమిటి? అది తిరుగుతుంది. తనతో బాటు చువ్వల్నీ చట్రాన్నీ కూడా, తిప్పుతుంది. అలాగే, నీ మనస్సు- తను తిరుగుతుంది, నిన్ను కూడా తిప్పుతుంది. కనుక, మాయయొక్క వేగాన్ని ఆపదలకుంటే, నువ్వు చిత్తనిరోధ రూపమైన తపస్సు చెయ్యాలి- అదే శ్రీహరి చెప్పింది. దీని అర్థం ఏమిటి?

**తస్మాద్రాఘవ సంత్యజ్య**
**తీర్థదాన తపః క్రియాః**
**శ్రేయసే పరమాయాస్త**
**శ్చిత్తమేవ వశం కురు ॥** (సర్గ 50 , శ్లోకం 13)

రామా! నువ్వు మాయా నిరోధాన్ని కోరుకుంటున్నావు కనుక, దానికి మార్గమేమిటో శ్రీహరి తేల్చి చెప్పాడు కనుక, నువ్వు చేస్తున్న తీర్థయాత్రలు, దానాలు, పూజలు, ఉపవాసాలు, మొదలైన రూపాలలో వుండే తపఃప్రక్రియలను ఆపేసి, నీ చిత్తాన్ని వశంచేసుకోవటమనే తపస్సు చెయ్యి. సర్వోత్తమమైన శ్రేయస్సు కావాలంటే ఇదొక్కటే ఉపాయం. ఈ మాట ఇంత గట్టిగా ఎందుకు చెబుతున్నానంటే, శ్రీహరి చేసిన ఉపదేశం ప్రకారం-

**చిత్తాంతరేవ సంసారః**
**కుంభాంతః కుంభఖం యథా ।**
**చిత్తనాశే న సంసారః**
**కుంభనాశే న కుంభఖమ్ ॥** (సర్గ 50, శ్లోకం 14)

ఘటంలో ఘటాకాశం వున్నట్లుగా, ఈ సంసార మంతా మనస్సులోనే వుంది. ఘటం పగిలిపోతే ఘటాకాశమే లేదు. చిత్తం నశించిపోతే సంసారమే లేదు.

ఘటం పగిలిపోతే, ఘటాకారం వుండదు; మహాకాశం వుంటుంది. చిత్తం పగిలిపోతే, సంసారం వుండదు; పరమాత్మస్వరూపం వుంటుంది.

ఐతే, మనస్సనే చక్రపు బొడ్డును పట్టుకు నిలిపేస్తే మనస్సు తిరగటం ఆగిపోవచ్చేమో కాని, మనస్సే లేకుండా పోతుందా?! అని సందేహిస్తావేమో?! అలా సందేహింపవలసిన పని లేదు. కదిలితేనే అది మనస్సు. కదలక పోతే అది మనస్సే కాదు.

**శ్రీరాముడు:** తత్త్వవేత్తలైన విద్వాంసులకు మనస్సే వుండదంటారా?

**వశిష్ఠుడు:** వుంటుంది. కానీ, అందులో వుండే వాసనా బీజాలు తత్త్వజ్ఞానం చేత నశించి పోతాయి.(అంటే, బాగా వేగించిన గింజల లాగా మాడిపోతాయి) అందువల్ల, వాళ్లకు ఆశలు గాని, సుఖదుఃఖాలుగాని, రాగద్వేషాలుగాని వుండవు. ఇలాంటి స్థితి అందాలంటే శాస్త్రాభ్యాసం, సజ్జన సహవాసం, యోగాభ్యాసం అనేవి మూడూ వుండాలి. కనుక రామా! వాటిని నువ్వే సాధించి వాటి ద్వారా నీ మనోవేగాన్ని నువ్వే నిలుపుకో.

ఈ విధంగా ప్రారంభించిన వశిష్ఠ మహర్షి బోధ, ఈ 50వ సర్గలో 85 శ్లోకాల దాకా సాగింది. వీటిల్లో 64వ శ్లోకం నుంచి వృత్తం కూడా మారిపోయింది. కవితామయంగా సాగిన ఈ బోధలలో వశిష్ఠ మహర్షి, ఈ మనస్సే ఒక పాము అన్నాడు, గద్ద అన్నాడు, కోతి అన్నాడు, పాశము అన్నాడు, కత్తి వాదర అన్నాడు. ఇలా ఎన్నో చెప్పి, చెప్పి చివరికి ఇలా అన్నాడు-

**చిత్తేన చేత శ్శమమాశు నీత్వా**
**శుద్ధేన ఘోరాస్త్ర మివాస్త్రయుక్త్యా ।**
**చిరాయ సాధో త్యజ చంచలత్వం**
**విమర్కటో వృక్ష ఇవాక్షతశ్రీః ॥** (సర్గ 50 , శ్లో 84)

రామా! శత్రువు వేసిన రాజస బ్రహ్మాస్త్రాన్ని సాత్త్విక బ్రహ్మాస్త్రంతో అణచి పారేసినట్లుగా, సంసార కలుషీ కృతమైన చిత్తాన్ని వైరాగ్య పరిశుద్ధమైన చిత్తంతోనే అణచి వెయ్యాలి. ఈ ప్రక్రియ త్వరగా పూర్తి కాదు. పూర్తై పోయిందని భ్రమపడి మధ్యలో మానేయరాదు. చాలా కాలం ఈ ప్రయత్నం చేస్తే, జ్ఞాన సమాధి లభించి , దానివల్ల మనస్సులో వుండే చలన గుణం తొలగి పోతుంది. అప్పుడు నువ్వు కోతి దిగి పోయిన చెట్టు లాగా, నిశ్చలంగా వుండిపోతావు. నిష్కల్లోలంగా వుండిపోతావు.

ఇలా అనటంలో వశిష్ఠమహర్షికి ఒక ఉద్దేశ్యం వుంది. ఇంతవరకూ నీ మనస్సుయొక్క చలనాన్ని నిలుపుకో, మనస్సు లేకుండా చేసుకో. దానికోసం యోగ సాధన చెయ్యి- అంటున్నాడే కాని, ఆ యోగ సాధనేమిటో చెప్పటం లేదు. పరిపూర్ణ చిత్త నిరోధాన్ని సాధించి పెట్టే యోగ ప్రక్రియలను కొన్నింటిని శ్రీరాముడికి ఇప్పుడు వశిష్ఠుడు అందించ దలచుకున్నాడు. అందుకే 51వ సర్గలోకి ప్రవేశిస్తూనే వశిష్ఠమహర్షి "రామా! నువ్వు ఉద్దాలక మహర్షి లాగా సాధన చేసి, పంచభూతాలనూ తుడిచిపెట్టేసి, మనో జయాన్ని సాధించుకో" అన్నాడు. అలా అని ఇక ఆ కథను ఆయనే వివరిస్తున్నాడు.

## 21. ఉద్దాలక చరిత్ర

రామా! ఒకప్పుడు గంధమాధన పర్వతం మీద, ఒక మద్దిచెట్టు కింద, ఉద్దాలకుడు అనే ముని బాలకుడు తపస్సు మొదలు పెట్టాడు. నూనూగు మీసాలు వచ్చీ రాని వయస్సులోనే, అతనికి వైరాగ్యం కలిగి, కొద్దిపాటి శాస్త్ర జ్ఞానం కూడా కలిసి, వివేకం ఉదయించి, అడవిలో ఉన్న మునిపల్లెను కూడ వదిలేసి, దూరంగా వచ్చి, ఏకాంతంగా తపస్సు మొదలు పెట్టాడు.

ఉద్దాలక కుమారుడికి జ్ఞానసిద్ధి ఐతే లేదు కాని, తత్త్వ విచారణ చెయ్యటంలో మంచి తెలివి, సాధిద్దామనే పట్టుదల, కల్మషం లేని చిత్తమూ, వున్నాయి. అందుచేత, అభ్యాస క్రమంలో, అతని జ్ఞానం త్వరత్వరగానే బలపడుతూ వచ్చింది. అది బలపడుతున్న కొద్దీ అతను ధ్యానం మీద కంటే తత్త్వ విచారణ మీదే ఎక్కువ శ్రద్ధ చూపిస్తూ వచ్చాడు.

ఏకాంతంగా కూర్చొని, తనలో తనే శాస్త్ర వాక్యాలను, తర్క యుక్తులను, సమన్వయ పరచుకుంటూ ఆత్మ తత్త్వాన్ని గురించి ఆలోచిస్తున్న కొద్దీ "ఈ సంసారాన్ని ఎప్పుడు దాటిపోతానా? నిర్వికల్ప సమాధిలోకి ఎప్పుడు ప్రవేశిస్తానా?"- అనే తపన పెరిగి పోయింది.

కానీ, సమాధికోసం ప్రయత్నం చేస్తున్నకొద్దీ మనస్సు మొరాయించటం ఎక్కువైంది. ఐనా, అతను తన పట్టుదల వదల లేదు.

అభ్యాసం చెయ్యగా, చెయ్యగా, మనస్సుకి బాహ్య విషయాల తాకిడి కొంచెం తగ్గింది. ఇహలోక వాంఛలు తగ్గి, పరలోక సుఖాల కోసం ఆలోచనలు మొదలైనాయి. అతను వివేకం చేత వాటిని కూడా తిరస్కరిస్తూ అభ్యాసం కొనసాగించే సరికి, మెల్లిగా మనస్సు తన ధ్యేయ వస్తువు మీద లగ్నం కావటం మొదలు పెట్టింది. ఆ ధ్యాన స్థితి మరి కొంచెం పెరిగే సరికి, ఉదయించే సూర్యుడి లాగా ఉన్న ఎట్టిటి కాంతి ఒకటి దర్శనమివ్వటం మొదలు పెట్టింది.

ధ్యాన స్థితిలో, పొగ మంచులు, ఎండ పొడలు, మిణుగురులు, మెరుపులు, స్ఫటిక శిలలు, చంద్రబింబాలు, ఇలాంటి తేజోమయ రూపాల దర్శనం జరిగితే క్రమంగా బ్రహ్మజ్ఞానం ఉదయిస్తుందని యోగశాస్త్రం చెబుతోంది. దానికి తగ్గట్టు గానే, ఇతనికి క్రమంగా అందీ అందనట్లుగా పరమాత్మ తత్త్వ స్ఫూర్తి లభించటం మొదలైంది.

కానీ, చిత్రం, ఇంతలోనే మనస్సు ఒక్కసారి ఎదురు తిరిగింది. నెత్తి మీద వల పడుతుంటే పక్షి పారి పోయినట్లుగా, జ్ఞాన దీప్తులు మీద పడుతుంటే, అతని మనస్సు భయపడి పక్కలకు పారిపోవడం మొదలు పెట్టింది.

అతను పట్టుబట్టి మనస్సును వెనక్కు లాగుతాడు. అది సందు చూసుకుని పారిపోతుంది. ఈ ఘర్షణలో ఆ మనస్సు అటు పూర్తిగా ఆత్మజ్యోతిలోకి వెళ్ల లేక, ఇటు పూర్తిగా ప్రపంచంలోకీ రాక, ఆ మధ్య భాగంలో నిలచిపోవటం మొదలు పెట్టింది. జ్యోతిర్మయమైన ఆత్మ ప్రపంచానికీ, అజ్ఞానాంధకార మయమైన బాహ్య ప్రపంచానికీ, మధ్యలో వున్న స్థితి అంటే, నిద్రే. ఉద్దాలకుడి మనస్సు ఆ నిద్రలో పడి చాలాకాలం కొట్టుకు పోతూ వుండేది. ఆ మనస్సును నిద్రలేపి, మళ్లీ ధ్యానంలోకి తీసుకురావటం పెద్ద పనిగా వుండేది, ఉద్దాలకుడికి.

ఇలా ధ్యానానికీ, నిద్రకీ మధ్యలో ఊగిసలాడుతున్న ఉద్దాలక చిత్తం క్రమంగా, పూర్వ జన్మ వాసనలకు

లోనై, ఎక్కడా లేని విషయాలూ గుర్తుకు వచ్చి, విషయ వాంఛల సంపర్కంలో పడిపోవటం మొదలు పెట్టింది.

దాంతో ఆ యువ మునీశ్వరుడు ధ్యానం చెయ్యలేక, పిచ్చెక్కినట్లు కొండ, కొమ్మల వెంట అడ్డదిడ్డంగా తిరుగుతూ కాలక్షేపం చెయ్యటం మొదలు పెట్టాడు.

కొన్ని రోజుల్లో, మెల్లిగా అతని మనస్సు కొద్దిగా కుదుట పడింది. అతను ఒక మంచి కొండ గుహను చూసుకొని, దానిలో ఉత్తర ముఖంగా కూర్చొని, ముందుగా తన మనస్సుకు బోధ చెయ్యటం అన్న నెపంతో మళ్ళీ ఆత్మతత్త్వ విచారణ మొదలు పెట్టాడు.

52వ సర్గలో 8వ శ్లోకంలో ప్రారంభించిన ఈ మానస బోధను వాల్మీకి మహర్షి 72 శ్లోకాలకు పొడిగించి, ఆ సర్గను పూర్తి చేశాడు. అక్కడితో తృప్తి పడక, 82 శ్లోకాలున్న 53వ సర్గ మొత్తాన్ని గూడా, దీనికే కేటాయించాడు. ఈ రెండు సర్గలూ కూడా, ఆత్మ తత్త్వాన్ని మళ్ళీ మళ్లీ మననం చేసుకోవాలని అనుకునేవారికి అమృత గుళికల వంటివైనా, మనం ఆ విషయాలను సంగ్రహంగానే చెప్పుకుంటూ ముందుకు పోదాం.

52వ సర్గలో మొదటి భాగం అంతా వైరాగ్య వృద్ధికోసం చిత్త బోధగా సాగిపోయింది.

ఆ తరువాత వైరాగ్యానికి ముఖ్య హేతువులు ఏమిటని విచారణ చేసి, తత్త్వ విచారమే వైరాగ్యానికి ప్రధాన హేతువని నిర్ణయం చేశారు. ఇక అక్కడ్నుంచి, "నేను నిర్వికల్పుడ్ని" అనే అనుసంధానం ప్రధానంగా పెట్టుకొని, ఆత్మ విచారణ ప్రారంభించాడు ఉద్దాలకుడు. ఈ విచారణ పరంపరలో ఆత్మతత్త్వ స్ఫూర్తికి ప్రతిబంధకంగా వుండే వాసనల ప్రసక్తి వచ్చింది. దీనితో వాసనలంటే ఏమిటి? – అనే విచారణ మొదలైంది. ఆ విచారణలో, వాసనలకు మూలం అహంకారమని తేలింది. ఆ పై విచారణలో ఆత్మకు వాసనలు కాని, అహంకారం కాని ఉండే సావకాశం లేదని తేలింది.

ఆ రెండూ మనస్సుకే అంట గలవు. ఆ మనస్సుకు ఆధారం శరీరం. కాని, ఈ మనఃశరీరాలనేవి రెండూ ఒక విధంగా శత్రువులు. ఎందుకంటే, మనస్సు– తనకు బాధ కలిగితే, అది శరీరాన్ని కూడా బాధ పెడుతుంది. అలాగే శరీరానికి బాధ కలిగితే, అది మనస్సును కూడా బాధ పెడుతుంది. ఆ విధంగా రెండింటికీ మధ్య తాప్యతాపక భావం వుంది. ఆ విధంగా వాటికి విరోధం వుంది కానీ, ఆ రెంటికీ మధ్య పరస్పరమూ తాదాత్మ్యాభిమానం గూడా వుంది. అంటే, మనస్సు– నేనే శరీరాన్ని అనుకొని పనిచేస్తూ వుంటుంది. అలాగే శరీరం గూడా నేనే మనస్సుని అనుకుని పని చేసేస్తూ వుంటుంది. ఆ విధంగా ఆ రెంటికీ మధ్యలో పరస్పర ఉపజీవ్య – ఉపజీవక భావం కూడా వుంది. సాధకుడు దీన్ని గుర్తించి ఈ రెండింటిలో ఏ ఒక్కదాని మీద వున్న అభిమానాన్నైనా సరే, పోగొట్టుకో గలిగితే, అంటే, అదే తాననే భావాన్ని పోగొట్టుకో గలిగితే, రెండో దాని మీద అభిమానం కూడా దానంతట అదే పోతుంది – అని ఈ విచారణలో తేల్చారు. ఉద్దాలకుడు ఈ విధంగా విచారణ చేసి చేసి, ఒక నిర్ణయానికి వచ్చాడు.

**విగతమోహతయా విమనస్తయా**
**గత వికల్పన చిత్తతయా స్ఫుటమ్ ।**
**ఉపరమామ్యహ మాత్మని శీతలే**
**ఘనలవ శ్శరదీవ నభస్తలే ।।** ( సర్గ 53, శ్లోకం 82)

"నాకిప్పుడు మోహం లేనే లేదు. అసలు మనస్సే లేదు. అంటే మనస్సు పూర్తిగా నిర్మూలన కాకపోయినా,

దానిలో వుండే వికల్పాలన్నీ పోయాయి. అందువల్ల నా జీవాత్మ ఇప్పుడు, తాపాలన్నీ తీరి చల్లగా వుంది. నాకిప్పుడు దృశ్యభావం లేదు. అందుచేత, శరత్కాలంలో నల్లని ఆకాశంలో తెల్లని మబ్బు తునక లాగా నేను స్వచ్ఛంగా వుండిపోతున్నాను."

## 22. ప్రణవయోగం

ఇలా నిర్ణయించుకొని ఉద్దాలకుడు ఇక యోగం లోకి ప్రవేశించాడు. ఇక 54వ సర్గ మొత్తాన్నీ వాల్మీకి మహర్షి ఉద్దాలకుడి యోగ వర్ణనకే కేటాయించాడు. సాధకులకు ప్రాణ ప్రదమైన ఆ వర్ణన ఇలా సాగింది –

ఉద్దాలకుడు పద్మాసనం వేసుకున్నాడు. కళ్లు సగం మూసుకున్నాడు. ఓంకారాను సంధానం ప్రారంభించాడు.

ఇక్కడ ఓంకారోపాసన విధానాలను వ్యాఖ్యాత ఆనంద బోధేంద్ర సరస్వతీ స్వామి చక్కగా వివరించారు. ఆ విశేషాలు కూడా కలిపి ఇక్కడ శ్లోకాలను అన్వయించుకుందాం.

ఉద్దాలకుడు 'ఓం'కారాన్ని ఉచ్చైస్స్వరంతో ఉచ్చరించటం ప్రారంభించాడు. ఇలా ఓంకార జపం కొనసాగే సరికి, అతని మనస్సులో ఓంకారాకారమైన ఒక చిత్త వృత్తి ఏర్పడింది. ఆ చిత్త వృత్తిలో నిబద్ధమై, ఉపహితమై, వున్న చైతన్యం క్రమంగా అఖండ బ్రహ్మ చైతన్య స్వరూపానికి దగ్గర కాసాగింది.

ఆయన అలా అంతూ పొంతూ లేకుండా ఓంకారోచ్చారణ కొనసాగించే సరికి, అందులో వున్న నాలుగు భాగాలూ క్రమ క్రమంగా సువ్యక్తం కాసాగాయి.

ఓంకారంలో, అకారము –ఉకారము–మకారము– అర్ధమాత్ర అనే నాలుగు భాగాలున్నాయి. అందులో మొదటి భాగమైన అకారం మీద, మహర్షి దృష్టి కేంద్రీకృతమయ్యే సరికి, తారస్థాయితో జరిగే ఆ ప్రణవోచ్చారణ ప్రక్రియవల్ల, ఆయన శరీరంలో ఉన్న మూల ప్రాణవాయువు సంక్షోభాన్ని పొంది, (అంటే, ఒకరకమైన కదలికను పొంది) అది శరీరంలోనుంచి బయటకు రావటం మొదలు పెట్టింది. ఈ ప్రక్రియనే 'రేచనము' అంటారు. ఈ ప్రక్రియలో, ప్రాణవాయువు బైటికి వచ్చేటప్పుడు ఒకరకమైన ఒరిపిడి ఏర్పడుతుంది. దానివల్ల వేడి పుడుతుంది. దానికి తోడు మహర్షి చేసే బ్రహ్మ భావన ఆ వేడిని పెంచింది.

ఆ వేడి పెరిగి పెరిగి, మహర్షి భావనలో జ్వాలలు బయలుదేరి, ఆ జ్వాలలలో ఆయన శరీరం పూర్తిగా తగలబడి పోయింది.

ఇక్కడ వశిష్ఠమహర్షి ఈ ప్రక్రియ అంతా, ప్రణవంలో ప్రథమ భాగమైన అకారంయొక్క ఉచ్చారణ ఫలితమని, ఇది ప్రణవోపాసనలో మొదటి మెట్టనీ, ఇది హఠయోగ ప్రక్రియ కాదని నొక్కి చెప్పాడు –

**యావదిత్థ మవస్థైషా**
**ప్రణవ ప్రథమ క్రమే ।**
**బభూవ న హఠా దేవ**
**హఠయోగో హి దుఃఖదః ။** (సర్గ 54 , శ్లోకం 9)

ఉద్దాలక మహర్షి అనుభవానికి వచ్చిన ఈ స్థితి అంతా ప్రణవోపాసన మొదటి మెట్టులో ఏర్పడినదే. ఇది క్రమ క్రమంగా ఏర్పడిన స్థితి. ఇది హఠాత్తుగా వచ్చింది కాదు. హఠయోగంవల్ల వచ్చింది కాదు.

హఠయోగం దుఃఖప్రదం కదా!– అన్నాడాయన. హఠాత్తుగా ప్రాణ వాయువు బయటకు వచ్చేస్తే మూర్ఛ గానీ, మరణం గాని వచ్చే సావకాశం వుందనీ, అందువల్ల ఈ ప్రక్రియను చాలా నిదానంగా సాగించాలనీ, వ్యాఖ్యాత వివరించాడు.

ఇలా ప్రణవోపాసనలో మొదటిమెట్టు సిద్ధించాక ఉద్దాలక మహర్షి ప్రణవంలో రెండవ భాగమైన 'ఉ'కారాన్ని మంద్ర స్వరంతో ఉచ్చరించటం మొదలు పెట్టాడు. అప్పుడతని ప్రాణవాయువులు నిండు కుండలో నీళ్ల లాగా నిశ్చలంగా వుండిపోయాయి. అవి అలా చాలా సేపు అలా వుండిపోవటాన్నే 'కుంభక ప్రక్రియ' అంటారు. ఈ కుంభకప్రక్రియ ఇంకా కొనసాగగా అప్పటికే తెల్లగా పడివున్న శరీరభస్మం ఆ గాలికి లేచి, ఆకాశాన్ని కమ్మి, ఆకాశంలో శరత్కాల మేఘం లాగా ప్రకాశించింది. ఈ రెండవ మెట్టు స్థితి కూడా ప్రణవోచ్చారణతో కలిసిన బ్రహ్మభావనవల్ల ఏర్పడినదే తప్ప, హఠయోగంవల్ల ఏర్పడినది కాదని వశిష్ఠ మహర్షి మళ్లీ నొక్కి చెప్పాడు.

ఇక ఉద్దాలక మహర్షి ప్రణవోపాసనలో మూడవ భాగమైన 'మ'కారోచ్చారణలోకి ప్రవేశించేసరికి, పూరకమనే ప్రక్రియ అందుకుంది. ఈ ప్రక్రియలో ఆయనయొక్క ప్రాణవాయువులు ఆత్మానందంలో మునిగిపోయి, క్రమంగా అమృతమయ కిరణ ధారలుగా మారాయి. ఆ కిరణధారలు వర్షధారలు లాగా కిందకి పడటం ప్రారంభించాయి. అక్కడ ఉద్దాలక శరీర భస్మం ఇంకా కొంత మిగిలి వుంది. దానిమీద ఈ అమృత కిరణ ధారలు పడ్డాయి. దాంతో, ఆ భస్మంలోంచి ఉద్దాలక మహర్షి శరీరం మళ్లీ మొలిచింది. కానీ, ఈ మాటు నాలుగు చేతులతో నారాయణ స్వరూపంగా, పైకి లేచింది. ఈ శరీరం మిగిలిన యోగప్రక్రియకు మరింత అనుకూలంగా రూపొందింది.

అప్పుడు ఉద్దాలకుడు మళ్లీ మరొకసారి పద్మాసనం బిగించి, ఇంద్రియాలను కట్టేసి, మనస్సును నిలబెట్టి, నిర్వికల్ప సమాధి లోకి ప్రవేశించాలని ప్రయత్నం మొదలు పెట్టాడు. దానికోసం ప్రాణాయామాలు పెంచాడు.

కానీ, ఇంతలో మనస్సు ఎదురు తిరిగింది. ఆంబోతు కట్టు కొయ్యను ఊడ బెరుకుకొని, పొలం మీదికి పరుగెత్తినట్టుగా, అతని మనస్సు ఏవేవో పాతజన్మల స్మృతులలోకి వెళ్లిపోయింది. ఏవేవో సుఖభోగాలను నెమరు వేసుకోవటం మొదలు పెట్టింది.

ఐనా అధైర్య పడకుండా, ఉద్దాలకుడు మళ్లీ తత్త్వ విచారణ మొదలు పెట్టి, వివేక బలంతో చిత్తాన్ని నిరోధించి, దృష్టిని ఏకాగ్ర పరచి, కళ్లు అరమోడ్పులు చేసుకొని, మళ్లీ రాజయోగ ప్రక్రియలోకి వచ్చాడు. దానిలో భాగంగా ప్రాణాపానాలను నిరోధించాడు. ఇంద్రియాలను తమ తమ విషయాలనుంచి ప్రత్యాహారం చేశాడు. ఇక మనోవాసనా రూపమైన లోపలి విషయాలు మిగిలిపోయాయి. అధిష్ఠాన బ్రహ్మ తత్త్వ భావనాబలంతో ఉద్దాలకుడు వాటిని బ్రహ్మతత్త్వంలో విలీనం చేశాడు.

ఇప్పుడు పద్మాసనం మార్చి, ఒక పాదంతో తన గుదస్థానాన్ని నొక్కి పట్టాడు. తరువాత నవద్వారాలలోనూ వున్న వాయువును హృదయ స్థానానికి ఆకర్షించి, అక్కడ బంధించాడు. ప్రత్యాహార ప్రక్రియను బలం చేసుకొని, దాని ద్వారా ధారణయోగం లోకి ప్రవేశించాడు. దానివల్ల, పెనుగాలికి దోమలు చెల్లా చెదురైనట్లుగా, అతని సంకల్ప వికల్పాలు ఎగిరిపోయి, మనస్సు నిర్మలమై పోయింది.

ఈ లోగా విపరీత భావనలు వచ్చి పడటం మొదలు పెట్టాయి. బ్రహ్మాకారమైన ఈ చిత్తవృత్తి ధారలను నిచ్ఛేదన చేసే భావనలే ఈ విపరీత భావనలు. ఉద్దాలకుడు తన భావనా బలంతో వీటిని గూడా

వదిలించుకున్నాడు.

ఇంతలో అతనికి మొత్తమంతా అంధకారాన్ని చూస్తున్న అనుభూతి కలిగింది. అది తన హృదయాకాశంలో వున్న తమోగుణంయొక్క ప్రభావమనీ, లోపల ఉండే వివేక సూర్యుణ్ణి తమోగుణం కప్పి వేయటంవల్ల ఈ చీకటి అనుభూతి కలుగుతోందనీ, ఆయన గుర్తించాడు. వెంటనే, సత్త్వగుణ భావన చేశాడు. దానివల్ల, ఆయనకు ఆ చీకటి తొలగిపోయి అరుణోదయ కాంతి పుంజం వంటి తేజస్సు దర్శనం ఇచ్చింది. కొంతసేపటికి, అది గూడా అణగారిపోయి ఉద్దాలక మహర్షి మనస్సు నిద్దరలోకి జారిపోయింది.

ఇక్కడ ఈ భావనలన్నీ, ఆయా గుణాల భావనా విశేషంవల్ల కలిగిన అనుభూతులేననీ, ఇవన్నీ భ్రాంతిమయ ప్రపంచంలో భాగాలేననీ, వ్యాఖ్యాత వివరించాడు.

నిద్రాదశ యోగ ప్రక్రియలో భంగపాటుకు సూచన. కానీ, ఉద్దాలకుడు కొద్ది సేపటిలోనే దాన్ని కూడా ఛేదించుకొని బయటకు వచ్చాడు. మళ్లీ ఆయన మనస్సును మరికొన్ని రకాల వాసనలు ఆవరించటం మొదలు పెట్టాయి. వీటివల్ల సృష్టి ప్రక్రియల గురించి భావన మొదలై, దానిలో భాగంగా ఆకాశం, ఆ మనస్సుకు కనిపించ సాగింది. ఉద్దాలకుడు దాన్ని కూడా తిరస్కరించాడు. కానీ, ఈ మాటు ఆ మనస్సు మూఢం అయిపోయింది.

మూఢం అంటే, నిద్రా కాదు, మెలకువా కాదు, మరణము కాదు, ఏ ఆలోచనా తోచదు, జడప్రాయంగా వుండే ఒక విచిత్ర స్థితి అది. అది కూడా యోగ భంగాలలో ఒకటే. ఉద్దాలకుడు కొంత సేపటికి దాన్ని కూడా తప్పించుకున్నాడు.

ఈ విధంగా ఉద్దాలకుడు వెలుగు, చీకటి, మూఢత్వము– అనే దశలను దాటి క్రమంగా నిర్వికల్ప సమాధిలోకి ప్రవేశించాడు.

ఇంచుమించు సమానపుటెత్తులో వున్న చెరువులోనుంచి పొలంలోకి నీళ్లు వదిలి పెడితే, పొలంలో నీళ్లు నిండి ఎగతట్టి, ఎదురు తన్ని, మళ్లీ చెరువులోకే ప్రవహించి, చెరువుయొక్క ఆకారాన్నే పొందినట్లుగా, ఉద్దాలకుని మనస్సు కొద్ది సేపట్లోనే మళ్లీ బాహ్య ప్రపంచంలోకి ప్రవేశించింది. కానీ, ఆయన అప్పటికి సమాధ్యానందాన్ని రుచి చూసి వుండటంవల్ల, దానికి తోడు అభ్యాస బలం గట్టిగా వుండటంవల్ల, ఆ మనస్సు మళ్లీ సమాధి కోసమే ఆరాట పడి, సులభంగానే, సవికల్ప సమాధిలోకి ప్రవేశించింది. చాలా సేపటికి దాంట్లోనుంచి నిర్వికల్ప సమాధిలోకి ప్రవేశించింది. మళ్లీ వెనక్కి జారి సవికల్ప సమాధిలోకి వచ్చింది. మళ్లీ పైకి ఎగబాకి నిర్వికల్ప సమాధినందుకుంది. ఇలా పైకీ, కిందకీ ఊగుతూ, మధ్యలో ఒక్కొక్కసారి బాహిర ప్రపంచంలోకి కూడా వస్తూ , ఉద్దాలకమహర్షి దీర్ఘకాల సాధన కొనసాగించాడు.ఎక్కువ భాగం సవికల్ప సమాధిలోనే వుంటూ వుండేవాడు. దానివల్ల, ఆయనయొక్క మనోవాసనలు క్రమక్రమంగా క్షీణించి, నిర్వికల్ప సమాధి సులభంగా అందే పరిస్థితి వచ్చింది. కొద్ది కాలానికే ఆ స్థితి స్థిరపడి అతను సాక్షిచైతన్యంతో సమానస్థాయి కలిగిన సత్తాసామాన్య స్థితికి చేరుకున్నాడు; శిలా ప్రతిమ లాగా నిశ్చలంగా వుండిపోయాడు.

ఇది యోగ భూమికలలో ఆరవ భూమిక. దీనిని అందుకున్నవాళ్లు బైటవాళ్లు గట్టిగా ప్రయత్నం చేస్తే తప్ప సమాధిలోంచి బయటకు రారు. కానీ, ఎందుకో, ఉద్దాలకుడు ఈ సమాధిలోంచి బయటకు వచ్చి కళ్లు తెరిచాడు.

కళ్లు తెరచి చూసే సరికి, అబ్బో, చుట్టూతా అందరూ గంధర్వ స్త్రీలే. అందరూ అతిలోక సుందరులే. వారిలో కొందరు వాద్యాలు వాయిస్తున్నారు. కొందరు పాడుతున్నారు. కొందరు ఆడుతున్నారు. కొందరు

గొడుగులు పడుతున్నారు. కొందరు చామరాలు వీస్తున్నారు. కొందరు ఉద్దాలకుడి పాదాలమీద పడి దండాల మీద దండాలు పెడుతున్నారు. దూరంగా ఒక విమానం కనిపిస్తోంది.

ఉద్దాలకుడు నిదానంగా అందరినీ పరిశీలించి చూశాడు. అందరు చాలా అందంగా వున్నారు. బాగా పాడుతున్నారు. ఆడుతున్నారు. ఆ విషయం అర్థమౌతోంది. అంతకు మించి మనస్సులో ఏ మార్పూ రావటం లేదు. సంతోషమూ కలగటం లేదు. ఏవగింపూ కలగటం లేదు.

అలా మిడిగుడ్లేసుకొని మొద్దు లాగా చూస్తూ వుండిపోయిన ఆ మహర్షిని చూసి, చూసి కొంత సేపటికి కొంతమంది విద్యాధర కన్యకలు ముందుకు వచ్చి, నమస్కారాలు చేసి, మంచి కవితామయంగా స్తోత్రాలు చేసి, చివరికి ఇలా అన్నారు–

"స్వామీ! అదిగో స్వర్గానికి తీసుకువెళ్లే విమానం. అది మీకోసమే వచ్చింది. స్వర్గానికి సారం మేమే. మీకోసమే వచ్చాం. తపస్సులన్నింటికీ చిట్ట చివరి ఫలం స్వర్గమే కదా. అది మీకోసం సిద్ధంగా వుంది. రండి కలసి పోదాం."

ఉద్దాలకుడు ఆ మాటలు విని, ఆ వగలూ వయ్యారాలూ చూసి, నవ్వి ఊరుకున్నాడు. వాళ్లు చాలా సార్లు బతిమాలారు. చివరికి "మీరు వెళ్లి రండమ్మా" అనేసి, ఆయన మళ్లీ సమాధిలోకి వెళ్లిపోయాడు.

ఆ దేవాంగనలు ఆయన చుట్టూ చేరి, చాలా రోజులు ఆటలతో పాటలతో కాలక్షేపం చేశారు. ఆయన సమాధిలోనుంచి బయటకు రాలేదు. వాళ్లకు విసుగు పుట్టి, స్వర్గానికి వెళ్లి పోయారు. ఆయన అలాగే చాలా నెలలు సమాధిలో వుండి పోయాడు.

## 23. సత్తా సామాన్య స్థితి

సమాధిలోనుంచి బయటకు వచ్చినా, మళ్లీ త్వరగా సమాధిలోకి వెళ్లిపోతూ వుండేవాడు. ఒక్కొక్కసారి నెలకి, మరోసారి సంవత్సరానికీ, మరోసారి ఒకటి రెండు రోజులకి, మరోసారి అనేక సంవత్సరాలకీ, ఆయన సమాధిలోనుంచి బయటకు వస్తూ వుండేవాడు. ఇలా చేస్తూ, చేస్తూ వుండగా ఆ పై భూమిక అందింది.

**చిత్సామాన్య చిరాభ్యాసాత్**
**సత్తా సామాన్యమేత్య సః ।**
**దృశ్యేస్మింశ్చిత్ర రవివత్**
**నాస్తమాయా న్న చోదయమ్ ॥** (సర్గ 54, శ్లోకం 92)

నేను అధిష్ఠాన చైతన్య స్వరూపుణ్ణి అని చిరకాలం అభ్యాసం చేయటంవల్ల ఆయన సత్తా సామాన్య స్థితిని అందుకున్నాడు. అందుచేత ఆయన ఉదయాస్తమయాలు లేని బొమ్మ సూర్యుడి లాగా ప్రకాశించాడు. అంటే, ఆయన సమాధిలో వున్నా, వెలుపలకు వచ్చినా, ఒకే రకమైన స్థితిలో వుండి పోయాడు. ఇదే యోగ సప్తమ భూమిక. ఉద్దాలక మహర్షి ఆ భూమికలో స్థిరంగా వుండి పోయాడు.

వశిష్ఠ మహర్షి కథా కథన వేగాన్ని ఆపి, ఇక్కడ శ్రీరాముడు ఒక ప్రశ్న వేశాడు.

**శ్రీరాముడు:** గురుదేవా! ఉద్దాలక సమాధి స్థితిని వర్ణిస్తూ మీరు సత్తా సామన్య స్థితి అని రెండుసార్లు అన్నారు. సత్తా సామాన్యం అంటే ఏమిటి?

**వశిష్ఠుడు:** రామా!ఈ పదానికి నాలుగు రకాల వివరణ వుంది.

1. జీవుల బుద్ధి వృత్తు లన్నింటిలోనూ ప్రతిబింబ చైతన్యం వుంది కదా. అది వుండబట్టే కదా, జీవులు దృశ్య విషయాలను గ్రహిస్తున్నారు. తత్త్వ విచారణాబలంచేత సకల దృశ్యాలూ బాధింప బడినాయి అనుకో. బాధింపబడటం అంటే, వాటి ఉనికికి కారణమైన అజ్ఞానంతో సహా అవి లేనివే అయిపోవటం. అలాంటి స్థితి కలిగిన జీవుడియొక్క బుద్ధిలో ప్రతిబింబించిన చైతన్యం ఏమై పోతుంది? దానికి ఆధారంగా వుండదగిన చిత్త వృత్తులు గాని, ఆ వృత్తులకు ఆధారమైన దృశ్య పదార్థాలు గానీ, ఇప్పుడు లేనే లేవు గనుక, ఆ ప్రతిబింబ చైతన్యం బింబ చైతన్యంలో కలిసిపోతుంది. బింబ చైతన్యం అంటే, సాధకుడియొక్క స్వస్వరూపమే. కనుక, అప్పుడు అలాంటి దశలో బింబ చైతన్యానికి ఏ స్వరూపం సిద్ధిస్తుందో అదే సత్తాసామాన్యము.

2. దీనినే మరో రకంగా చెప్పవచ్చు. వివేకం కలిగిన చిత్తం సత్యాసత్య విచారణ ప్రారంభించి, ప్రపంచంలోని ప్రతి పదార్థాన్నీ పరిశీలన కోసం స్వీకరించి, ఇది సత్యం కాదు, ఇది సత్యం కాదు, అని నిషేధించి పక్కన పారేస్తూ వచ్చిందనుకో, చివరికి ఇంక ఏమి మిగులుతుంది? అఖండ చైతన్యం ఒక్కటే మిగలాలి. ఆ దశలో ఈ నిషేధ ప్రక్రియను కొనసాగించే చిత్తం ఏమౌతుంది? అది ఆ అఖండ చైతన్యంయొక్క ఆకారాన్ని పొందవలసిందే, మరో దారి లేదు. ఆ స్థితి పేరే సత్తా సామాన్యం.

3. దీనినే మరో రకంగా గూడా చెప్పవచ్చు. ఈ దృశ్య ప్రపంచానికి మూలకారణమైన పంచ భూతాలు ఉన్నాయి కదా! లోకజీవులందరికీ అవి పంచభూతాలుగానే కనిపిస్తున్నాయి, సముద్రపు ఒడ్డున వెండి ముద్దలు కనిపించినట్లుగా! అంటే అవి తమ స్వస్వరూపంతో కనిపించటం లేదు. మిథ్యారూపంతో కనిపిస్తున్నాయి. అలా కాక, సముద్రపు ఒడ్డున ఆలు చిప్పలు కనిపించినట్లుగా, ఈ పంచభూతాలూ కూడ తమయొక్క పారమార్థిక రూపంతో భాసించటం మొదలు పెట్టాయనుకో, ఆ స్థితి పేరే సత్తా సామాన్యం.

4. దీనినే మరొక రకంగా చెప్పవచ్చు. లోక జీవులందరికీ దృశ్య పదార్థాలు కనిపిస్తున్నాయి. సాధకుడు గట్టిగా ప్రయత్నం చేసి సద్భావన చేస్తే, అప్పుడవి ఆత్మ స్వరూపంగా కనిపిస్తాయి. అలా ఏ ప్రయత్నమూ లేకుండా, ఏ భావనా లేకుండా, సహజంగానే దృశ్యపదార్థాలన్నీ ద్రష్టయొక్క ఆత్మ స్వరూపంలో లయించి పోయి, ఆత్మ స్వరూపంగా కనిపించటమే సత్తా సామాన్యం.

రామా! ఈ రకమైన సత్తా సామాన్య దృష్టి యోగ భూమికలలోని ఐదు, ఆరు భూమికలలో ఉన్న సాధకుడికి, సమాధి దశలో వున్నప్పుడు, అందుతూ వుంటుంది. సప్తమ భూమికలో చేరినవాడికి సమాధితో పనిలేదు. మామూలు దశలో కూడా ఇది అందుతుంది.

రామా! ఇలాంటి స్థితి ఉందో లేదో అని సందేహించవలసిన పని లేదు. మాబోటి వాళ్లమంతా ఆ స్థితిలో వున్నవాళ్లమే. నారదాది మహర్షులు, బ్రహ్మ విష్ణు మహేశ్వరాది దేవతలు, ఇలాంటి స్థితిలో వున్నవారే. ఈ స్థితినే ఉద్దాలకుడు అందుకున్నాడు. శరీరానికి వున్న ప్రారబ్ధం తీరేవరకు ఆ స్థితిలోనే ఉండిపోయాడు.

రామా! ఇక నీకు ఆ మహర్షి శరీరాన్ని చాలించి విదేహ కైవల్యాన్ని పొందిన విధానాన్ని కూడా చెబుతాను, విను.

ఉద్దాలక మహర్షి ఆరవ భూమికలోంచి, ఏడవ భూమికలోకి ప్రవేశించాక, చాలా కాలం అలానే వుండిపోయాడు. ఆ శరీరానికి జీవించే ప్రారబ్ధం తీరిపోయే సమయం వచ్చేసరికి, "ఇక ఈ దేహం కైవల్యంలోకి వెళ్ళిపోవాలి"– అనే సంకల్పం ఆయనకు వచ్చింది. ఆ మనస్సుకు యోగ ప్రక్రియలు అప్పటికే బాగా అభ్యాసమై

ఉన్నాయి గనుక, శరీర త్యాగానికి అనుకూలమైన యోగ ప్రక్రియ వెంటనే ప్రారంభమై పోయింది.

ఆయన పద్మాసనంలో కూర్చున్నాడు. కళ్లు మూసుకుని గుదద్వారాన్ని మూసి అపాన వాయువును పైకి లాగాడు. ఆ తరువాత మిగిలిన ఎనిమిది ప్రాణద్వారాలనూ కూడా నిరోధించి, ఇంద్రియ వృత్తులన్నింటినీ హృదయ స్థానంలోకి చేర్చాడు. వెన్నును, మెడను, తలను సమాన స్థితిలో నిటారుగా నిలబెట్టి, హృదయ స్థానంలో చేరిన ఇంద్రియ వృత్తులను వృత్తులుగా కాకుండా బ్రహ్మస్వరూపంగా చూడటం మొదలు పెట్టాడు. అలా చూస్తూనే తలను కొంచెం పైకెత్తి, నాలుకను వెనక్కు మడిచి, దాన్ని మెల్లిగా లంబికా స్థానానికి చేర్చాడు. ఆ సమయంలో మనస్సుని ఇటూ అటూ పోకుండా నిలబెట్టి, పరిశుద్ధ చిన్మాత్రం మీద లగ్నం చేశాడు.

అప్పటిదాకా ఈ లంబికాయోగ ప్రక్రియలోని క్లేశానికి కొద్దిగా జంకుతున్న మనస్సు, లంబికానుసంధానం ద్వారా లభించిన మహానందానికి పులకించి పోయింది. ఆ సమయంలో ఆయన మనస్సు చిన్మాత్ర భావన చేస్తోంది కనుక, అది అప్పటికే చిత్స్వరూప స్థితిని అందుకొని ఉంది. ఇప్పుడు ఈ ఆనంద మహాప్రవాహంచేత ఆ చిత్స ్వరూప స్థితినుంచి సత్తా సామాన్య స్థితిని ఆయన అప్రయత్నంగా అందుకున్నాడు.

రామా! ఇక్కడ కొంచెం గమనించు. ఈ యోగ ప్రక్రియలో ఒక రహస్యం వుంది. ఎంత సమర్థుడైన సాధకుడికైనా చిత్త నిరోధమన్నది ఒక క్లేశమే. ఆ క్లేశం వుంటుంది గనుక, సందు దొరికితే చాలు, బయటకి పారిపోదామని చూస్తూ వుంటుంది మనస్సు. కానీ, యోగానందాన్ని అందుకో గలిగితే, ఆ మనస్సు ఇక వెనక్కి రమ్మన్నా రాదు. ఎందుకంటే, యోగానందం అనేది లోకంలోని ఇతర ఆనందాలకంటే ఎన్నో ఎన్నో రెట్లు పెద్దది. దాన్ని అందుకున్న మనస్సు బెల్లాన్ని ముట్టుకున్న చీమలాగా అయిపోతుంది. ఆ చీమను వేలు పెట్టి తోసినా, కదలదు. దీనినే 'గుడ పిపీలికా న్యాయము' – అంటారు.(బెల్లము, చీమ సామెత అన్నమాట) ఈ స్థితికి చేరిన మనస్సు, స్వస్వరూపాన్ని పూర్తిగా కోల్పోయి, ముందు చిత్సామాన్య స్థితికి చేరుతుంది. ఆ స్థితిలో తనయొక్క అస్తిత్వాన్ని గురించిన స్ఫురణ రేఖా మాత్రంగా వుంటుంది. ఆ స్థితి మరింత గట్టిపడితే, ఆ స్ఫూర్తి గూడా లయించి పోతుంది. ఆ స్థితి పేరే సత్తా సామాన్య స్థితి.

రామా! ఇందాక ఉద్దాలకుడు చిత్సామాన్య స్థితినుంచి సత్తా సామాన్య స్థితికి చేరుకున్నాడని చెప్పాను. ఆ మాటకు వివరణ ఇదే. ఇక ఈ దశా పరిణామ ప్రక్రియలో శరీర పరిణామం ఎట్లా వుంటుందో చెబుతా విను.

ఎప్పుడైతే ఉద్దాలకుడికి యోగానందం అంది, మనస్సు పులకించిందో, అప్పుడు దానితో పాటే అతని శరీరం మీద వెంట్రుకలు ఆనందంతో నిక్కపొడుచుకున్నాయి. ఆయన చిత్సామాన్య స్థితి దగ్గర్నుంచీ, సత్తా సామాన్య స్థితి వైపుకు జరుగుతున్న కొద్దీ, లోపల ఉండే ఆనంద స్ఫూర్తి కూడా తగ్గి, ఒంటిమీద వుండే పులకాంకురాలు కూడా తగ్గాయి. ఇదే సమయంలో, ఆ శరీరం నిలబడి వుండటానికి మూలమైన ప్రారబ్ధ కర్మ ఏదైతే వుందో, దాన్ని అనుభవించటానికి హేతువైన అజ్ఞాన శేషం ఏదైతే వుందో, అది కరిగిపోవటం మొదలు పెట్టింది. అది కరుగుతున్న కొద్దీ, వేడినీళ్లలో వేడి తగ్గినట్లుగా, క్రమక్రమంగా ఆయన ప్రాణాలు ఉపశమించి పోవటం ప్రారంభించాయి. శేషించిన అజ్ఞానం పూర్తిగా కరిగి పోయేసరికి, ఆ ప్రాణాలు పూర్తిగా శమించి, బ్రహ్మానంద స్వరూపంలో లయించి పోయాయి.

ఆ శరీరం మాత్రం అలాగే వుండి పోయింది. ఆరు నెలలు అయ్యేసరికి, ఆ శరీరం పూర్తిగా ఎండిపోయి, చర్మ మాంసాదులు గాలిలో కలిసిపోయి, అస్థిపంజరం మాత్రం మిగిలి, ఆ పర్వతదేవత దాచుకున్న వీణ లాగా కనిపించింది.

ఇలా వుండగా ఒక రోజున పార్వతీదేవి బ్రాహ్మీ, మహేశ్వరీ, ఇత్యాది సప్తమాతృకలను వెంట పెట్టుకొని పర్వత విహారానికి వచ్చింది. ఈ కొండవీణ వాళ్ల కంట పడ్డది.

వారిలో చాముండీమాత ఈ అస్తిపంజరాన్ని చూసే సరికి, ఎగిరి గంతేసింది. ఆ తల్లి ఉద్దాలకుడి అస్థిపంజరాన్ని తీసుకొని, తన కిరీటంలో పూలమాలగా అలంకరించేసుకుంది.

చూశావా రామా! బ్రహ్మజ్ఞాన సిద్ధికి పూర్వ రంగంలో ఆశ్రయభూతంగా వున్న ఆ పాడు బొమికలే, అంతటి మహోన్నత పవిత్ర స్థానానికి చేరాయి అంటే, ఇక ఆ పరబ్రహ్మ స్థితి ఎంత సమున్నతమైనదో ఎవరు చెప్పగలరు?

ఇక్కడితో ఉద్దాలకుడి కథ పూర్తైయింది. ఈ కథలో వేరే పాత్రలు లేనే లేవు. మధ్యలో వచ్చిన గంధర్వాంగనలు తప్ప. అసలు ఇది కథ కాదు. కేవలం జ్ఞానయోగ సాధనతో యోగ పరమావధికి చేరుకొనేటప్పుడు సాధకుడు అనుభవించే మెట్లన్నీ, వరసగా చూపించుకుంటూ రావటం కోసం, ఉద్దాలకుడు అనే పేరు అడ్డంపెట్టుకున్నారు, అంతే.

మహాభారతంలో, ఆదిపర్వంలో, ఒక ఉద్దాలకుడి ప్రసక్తి వచ్చింది. ఆయన గురువుయొక్క ఆజ్ఞ చేత, తన శరీరాన్నే చెరువుగట్టు మట్టిలో పాతేసుకుని, మళ్లీ గురువుగారి పిలుపుతోనే ఆ మట్టిని చీల్చుకొని బయటకు వచ్చాడు – అనీ, అందుకనే ఆయనకు ఉద్దాలకుడు అనే పేరు వచ్చిందనీ, అక్కడ వుంది. అయితే, ఆ ఉద్దాలకుడూ, ఈ ఉద్దాలకుడూ ఒకరే ఔనో కాదో తెలియదు. కానీ, ఇక్కడి ఉద్దాలకుడు మాత్రం తన చుట్టూ పేరుకున్న అజ్ఞానపు మట్టిని చీల్చుకొని పైకి వచ్చాడు. ఆ దృష్టితో చూస్తే ఈ పేరు ఇక్కడ సముచితంగానే కనిపిస్తోంది. ఏది ఏమైనా, ఈ కథలో వేరే సంకేతార్థాలు కనిపించటం లేదు కనుక, ఈ నామార్థ విచారణతో పెద్ద ప్రయోజనం లేదనిపిస్తోంది.

అందుకనే, శ్రీరాముడు కూడా ఈ కథ విన్నాక వేరే సందేహాలు అడగకుండా, వశిష్ఠుడు ప్రసంగ వశాన చెప్పిన ఒక చిన్న మాటను పట్టుకొని, ఒక మంచి ప్రశ్న వేస్తున్నాడు.

### 24. *సమాధి ప్రధాన- వ్యవహార ప్రధాన జ్ఞానము*

**శ్రీరాముడు:** గురుదేవా! మీరిందాక ఉద్దాలక మహర్షిగారి జీవన్ముక్త స్థితిని గురించి మాట్లాడుతూ “మేము కూడా అటువంటి వాళ్ళమే”– అన్నారు. ఇక్కడ ఒక చిన్న సందేహం. ఇద్దరు జ్ఞానులున్నారు. ఒకాయన ఎప్పుడూ సమాధిలోనే ఉంటాడు, బయటికి రానే రాడు. రెండో ఆయన వున్నాడు. ఆయన గూడ జ్ఞానే. కానీ, ఎప్పుడు సమాధిలోకి పోనే పోడు. ఎప్పుడు చూసినా వ్యవహారాల్లోనే వుంటాడు. ఈ జ్ఞానులిద్దరిలోనూ ఎవరు ప్రశస్తుడు?

వశిష్ఠమహర్షి ఈ ప్రశ్నకు చాలా విస్తారమైన సమాధానం చెప్పాడు. 56వ సర్గంతా దీనికి సమాధానం చెప్పి, 57వ సర్గలో మరికొంత చర్చను పెంచి, 58వ సర్గలో సురఘు వృత్తాంతం అనే చిన్న కథానికలోకి మనల్ని తీసుకు వెళ్లబోతున్నాడు వశిష్ఠమహర్షి. అందుచేత మనం ఈ రెండు కథల సంధిభాగాన్ని సంగ్రహంగా చెప్పుకుందాం.

రాముడు వేసిన ప్రశ్నకు వశిష్ఠ మహర్షి చెప్పిన సమాధానంలో కేంద్ర బిందువు ఇలా వుంది–

**వ్యవహారీ ప్రబుద్ధో యః**

**ప్రబుద్ధో యో వనే స్థితః ।**

**ద్వావేతౌ సుసమౌ నూన**

**మసందేహం పదం గతౌ ॥** ( సర్గ 56 , శ్లోకం 12)

జ్ఞానం కలిగి వ్యవహారాలు చేసేవాడు, జ్ఞానం కలిగి అడవిలో సమాధిలో వుండి పోయేవాడు, ఇద్దరూ నిస్సందేహంగా ఉత్తమ పదాన్ని చేరిన వారే. ఇద్దరూ పూర్తిగా సమానులే –అన్నాడు వశిష్ఠుడు.

దీనికి మంచి ఉపపత్తి చూపించటం కోసం, సమాధి అంటే ఏమిటో ఆయన నిర్వచనాలు చెప్పాడు.

**చేతసో యదకర్తృత్వం**

**తత్సమాధాన ముత్తమమ్ ।**

**తం విద్ధి కేవలీభావం**

**సా శుభా నిర్వృతిః పరా ॥** (సర్గ 56, శ్లోకం 15)

– అన్నాడాయన. అంటే, మనస్సుకు కర్తృత్వం లేకుండా పోవటమే సమాధి– అన్నాడాయన.

అంతేకాదు, అదే కైవల్యం, అదే బ్రహ్మానంద స్థితి అని కూడ అంటున్నాడు.

ఇదెలా కుదురుతుంది?

దానికి గూడా ఒక ఉపపత్తిని ఆయనే చెప్పాడు.

ఒక మనస్సు, కర్త ఎప్పుడవుతుంది? దానిలో వాసనలు మిగిలివుంటే, అవుతుంది, అంతే కదా! ఒకానొక మనస్సులో వాసనలన్నీ చల్లారిపోయాయి అనుకోండి, ఐనా, ఆ శరీరం ఏదైనా పనులు చేస్తోందనుకోండి అప్పుడు, ఆ మనస్సు కర్త కాగలదా? కాజాలదు.

దీనికి ఉదాహరణ– కథ చెపుతుంటే పరధ్యానంగా వినే శ్రోతే! మంచి కథా ప్రవచనం జరుగుతోంది. ఒక శ్రోత పరధ్యానంలో పడిపోయాడు. ఎదురుగుండా కూర్చునే వున్నా, ఆ ప్రవచన కర్తగారు గొంతు చించుకుని అరుస్తూనే వున్నా, ఆ శ్రోత శ్రోత కానే కాడు.

దీనికి భిన్నంగా మరో ఉదాహరణ చూడండి. ఒకడు మొద్దు లాగా నిద్రపోతున్నాడు. వాడి శరీరం కదలటం లేదు. కాని వాడి కలలో, వాడు పెద్ద గుంటలో పడి లబో దిబో మంటున్నాడు. దీనికి కారణ మేమిటి? వాడి మనస్సులో వున్న వాసనలే !

కనుక, ఒకానొక మనస్సులో వాసనలు మిగిలివుంటే, అది పైకి ఏ పనీ చేసినట్లు కనిపించక పోయినా, ఆ మనస్సు కర్తే.

లోకంలో "సమాధి" అని దేన్ని అంటున్నారు. నిద్రనా? కాదే. సుషుప్తినా? కాదే. మరి దేన్ని? మనస్సు నిశ్చలంగా వుండటాన్ని !

మనస్సు నిశ్చలంగా వున్నట్లు కనిపించటాన్నా? నిజంగా నిశ్చలంగా వుండటాన్నా? నిజంగా నిశ్చలంగా వుండటాన్నే! ఆ స్థితి మనస్సులో వాసనలు మిగిలి వుంటే సాధ్యమవుతుందా? కాదు. కనుక మనస్సులో వాసనలు మిగిలి లేని స్థితే సమాధి స్థితి కావాలి. కానీ, మనస్సులో వాసనలు లేని స్థితి అన్నా, మనస్సు అకర్తగా వున్న స్థితి అన్నా ఒకటే! ఆ స్థితిలో శరీరం కదిలినా, ఆ మనస్సుకు కర్తృత్వం పట్టదు.

కనుకనే, శరీరం కదలినా, కదలక పోయినా, అంటే – ఆ శరీరం వ్యవహార దశలో వున్నా, ధ్యాన స్థితిలో వున్నా, ఎలా వున్నా సరే, ఆ మనస్సుకు కర్తృత్వం పట్టదు. కర్తృత్వం లేని మనస్సంటే – జ్ఞాని మనస్సే. కనుక, జ్ఞాని మనస్సు ఎల్ల వేళలా అకర్తృత్వ స్థితిలోనే వుంటుంది. అంటే, అది ఎల్లప్పుడూ సమాధిలోనే వుంటుంది. కనుక, వ్యవహార దశలో వున్న జ్ఞానికీ, సమాధి దశలో వున్న జ్ఞానికీ, ఏమీ భేదం లేనే లేదు. వారిద్దరిలో ఎవరు గొప్ప? – అనే ప్రశ్నకు సావకాశమే లేదు – అనేదే వశిష్ఠుడు ప్రతిపాదించిన ఉపపత్తి.

ఈ ఉపపత్తి తరువాత వశిష్ఠుడు సమాధికి మరో నిర్వచనం చెప్పాడు–

**ప్రశాన్త జగదాస్థోఽ ంతర్**
**వీత శోక భయైషణః ।**
**స్వస్థో భవతి యేనాత్మా**
**స సమాధిరితి స్మృతః ॥** (సర్గ 56, శ్లోకం 20)

ఈ ప్రపంచం సత్యమనే విశ్వాసం పోయి, దానివల్ల కోరికలు, దుఃఖాలు, భయాలు, లేకుండా పోయి, మనస్సు స్వస్థం అయ్యే విధానం ఏదైతే ఉన్నదో, దాని పేరే సమాధి. – అని పై శ్లోకానికి అర్థం.

దీనికి గూడా వశిష్ఠమహర్షి రెండు ఉదాహరణల ద్వారా ఉపపత్తిని చూపించాడు. ఒకడు మహారణ్యంలో కొండమీద ఏకాంతంగా కూర్చున్నాడు. కానీ వాడి మనస్సంతా సంసారం మీదే. అలాంటివాణ్ణి ధ్యానంలో వున్నాడని అనగలమా? మరొకడు ఇంట్లోనే ఉన్నాడు. కానీ ఇంటి విషయాలేవీ వాడికి పట్టడం లేదు. వాణ్ణి సంసారి అనగలమా?

మరొకడికి ఇంట్లో ఇనుపబీరువా వున్న గదిలోకి పాము వచ్చిందని ఎవరో చెప్పారు. వాడు బంగారము, డబ్బు, పోతే పోయిందని ఇంటికి దూరంగా పారిపోయాడు. వాడిని విరాగి అనగలమా? ఇలా భయంవల్ల గాని, క్రోధంవల్ల గాని, వేరే వస్తువుల మీద అధిక ప్రేమవల్ల గాని, ఐహిక పదార్థాలను ఎవరైనా పరిత్యాగం చేస్తే, అది త్యాగమే కాదు. మరి త్యాగం అంటే ఏమిటి? ఇప్పుడు చెప్పుకున్న కామ క్రోధ భయాదుల ప్రసక్తి లేకుండా ఐహిక పదార్థాలను వదిలి పెడితేనే – అది త్యాగం అవుతుంది. అలాంటి త్యాగం వుంటుందా, ఎక్కడైనా లోకంలో?

ఒకడు సముద్రపు ఒడ్డున వెండి ముద్దలు చూశాడు. ఆశగా పరిగెత్తాడు. కొంత దూరం వెళ్ళేసరికి, అక్కడ వున్నది ఆలుచిప్పలే అనీ, భ్రాంతివల్ల తనకు వెండిముద్ద ల్లాగా కనిపించాయనీ, అతనికి అర్థమైంది. ఇప్పటికీ ఒక ప్రత్యేక కోణంనుంచి చూస్తుంటే ఎండ పొడలో వెండిముద్దలే కనిపిస్తున్నాయి. వాడు నవ్వుకుంటూ వెనక్కు వచ్చేశాడు. ఇప్పుడు ఆలోచిద్దాం. ఆ వ్యక్తి భయంవల్ల ఆ వెండి ముద్దలను వదిలేశాడా? కాదు. ద్వేషంవల్ల వదిలేశాడా? కాదు. అంతకంటే పెద్ద వెండి ముద్దల మీద ఆశవల్ల వదిలేశాడా? కాదు. మరి ఎందుకు వదిలేశాడు? అవి లేనివని ఖాయమై వదిలేశాడు. అవి లేనివైతే వాటిని వదిలి పెట్టడం అనే మాట ఎలా కుదురుతుంది? నిజం. వీటిని పట్టుకోవడమూ కుదరదు; వదిలి పెట్టడమూ కుదరదు. వాడు ఆ సమయంలో పట్టుకోవటాన్నీ విడిచిపెట్టటాన్నీ కూడా దాటి, ప్రశాంతుడౌతున్నాడు.

అలాగే, ఒకానొక మనస్సుకి, ఈ ప్రపంచం అంతా లేనిదే –అని అర్థమైపోయింది. అందుచేత దానికి భయంగాని, దుఃఖంగాని, వేరే ఆశలు గాని, అంటుకునే సావకాశం లేకుండా పోయింది . అందుచేత అది స్వీకరణ పరిత్యాగాలనే పరిక్రియకు దూరమై ప్రశాంతమై పోయింది. ఇప్పుడు ఆ మనస్సు ఎక్కడికి పోవాలి?

ఎక్కడికీ పోయే వీలు లేదు. అది తనలో తనే వుంటుంది. ఆ స్థితినే ఈ శ్లోకంలో వశిష్ఠ మహర్షి "స్వస్థో భవేత్ యేనాత్మా"– అన్నాడు.

ఒకానొక మనస్సు అలాంటి స్వస్థస్థితికి చేరింది అనుకొందాం. అప్పుడు అది వ్యవహార దశలో వుందనగలమా? వ్యవహార దశలో భౌతికమైన ఆదాన ప్రదానాలు ఉంటాయి గనుక, ఈ స్థితిని వ్యవహారం అనటానికి వీలు లేదు. పోనీ ధ్యానం అందామా? ధ్యానస్థితిలో, ధ్యాతృ ధ్యేయ విభాగము, మనస్సును ప్రత్యాహారం చేసే పరిశ్రమ, మొదలైన వన్నీ ఉంటాయి గనుక, ఆ స్థితిని ధ్యానం అని అనటానికి గూడా వీలు లేదు. మరి ఇంకేమనాలి? సమాధి అనవలసిందే. సమాధిలో మాత్రమే మనస్సుకు రాక పోకలుండవు. ఆదాన ప్రదానాలుండవు. భేద ప్రసక్తులుండవు. కనుక, ప్రపంచం లేనిదనే జ్ఞానం ద్వారా వచ్చిన స్వస్థస్థితిని "సమాధి" అనవలసిందే. మరో దారి లేదు.

ఐతే, ఇటువంటి సమాధి స్థితి మనస్సుకు అందినాక, ఆ శరీరం ఏదో ప్రారబ్ధ శేషం చేత వ్యవహారాలలో పడిందనుకుందాం. అప్పుడు ఆ మనస్సు ఈ వ్యవహారాలన్నీ సత్యమనుకొని, వ్యవహారాలు చేస్తుందా? చెయ్యదు. వ్యవహారాలు జరిగేటప్పుడు కూడా దాని జ్ఞానం సుస్థిరంగానే వుంటుంది. అంటే, దాని సమాధి స్థితి కూడా సుస్థిరంగా వున్నట్టే లెక్క. స్వస్థతా రూపమైన సమాధి సిద్ధించిందంటే, ఇక ఆ శరీరం పని చేస్తోందా? చెయ్యటం లేదా? అనే ప్రశ్నకు విలువ లేదు. కనుక సమాధిలో వున్న జ్ఞాని గొప్పవాడా? వ్యవహారంలో వున్న జ్ఞాని గొప్పవాడా? – అనే ప్రశ్నకు అర్థమే లేదు. ఎలా వున్నా సరే, జ్ఞాని జ్ఞానే – అనేదే రెండవ సమాధి నిర్వచనం ద్వారా వశిష్ఠమహర్షి చెబుతున్న సమాధానం.

### 25. ఋరియపు గింజ

ఈ రెండు నిర్వచనాలూ చెప్పి, వాటి ఉపపత్తులను వివరించిన తరువాత, వశిష్ఠ మహర్షి రాముడితో ఒక విచిత్రమైన మాట అన్నాడు.

**వశిష్ఠుడు:** రామా! మనస్సును వాసనలతో నింపుకుంటే, అది రాగ ద్వేషాదులకు లోనై, గిర గిరా తిరుగుతూ వుంటుంది. ఆ తిరుగుళ్ల మధ్యలోనే ఒక్కొక్కసారి కొంత సేపు సుషుప్తిలో పడిపోతుంది. ఆ దశలో ఏ చలనాలూ వుండవు. ఏ కోరికలూ వుండవు. ఐనా, అది సమాధి కానే కాదు. ఎందుకంటే, ఆ సుషుప్తిలోనే మళ్లీ వేల వేల సార్లు మొళకువలు వచ్చేందుకు కావలసిన బీజాలన్నీ దాగి వున్నాయి. సామాన్య జనులు చేసే సాధనలన్నీ, ఈ సుషుప్తి వంటివే. ఇదొక మార్గం. అలా కాకుండా, మనస్సులోని వాసనలన్నింటినీ ప్రక్షాళన చేసుకుంటే, లోపలి రాగద్వేషాదులన్నీ తొలగించుకుంటే, ఒక ఆనంద స్థితి ఏర్పడుతుంది. అదే మోక్షం. ఇది మరో మార్గం. ఈ రెండు మార్గాల్లో నీకు ఏది కావాలంటే దాన్ని పట్టుకో.

ఈ మాట అన్నాక వశిష్ఠుడు ఈ మాటలమీద ఇంచుమించు 50కి పైగా శ్లోకాల వ్యాఖ్యానం చేశాడు. వాసనా నిర్మూలనకు కొన్ని ఉపాయాలను స్థూలంగా ప్రస్తావన చేశాడు. వాసన తొలగినవారు ఎలా వుంటారో కొన్ని గుర్తులు చెప్పాడు. అక్కడ ఒక రత్నం వంటి శ్లోకం చెప్పాడు.

**ఆత్మవత్ సర్వభూతాని**
**పరద్రవ్యాణి లోష్ఠవత్ ।**

**స్వభావాదేవ న భయాత్**

**యః పశ్యతి స పశ్యతి ॥** (సర్గ 56, శ్లోకం 49)

భయంవల్ల గానీ, ఏదో పై పదవి వస్తుందనే ఆశవల్ల గానీ, కీర్తికోసం గానీ, కాకుండా, సహజసిద్ధంగానే ఎవడైతే ఇతర జీవులందరినీ తనతో సమానంగా చూసుకో గలుగుతాడో, ఇతరుల పదార్థాలను మట్టిగడ్డలలాగా చూసుకో గలుగుతాడో, వాడే నిజంగా చూసేవాడు. వాడిదే అసలైన చూపు – అన్నాడు వశిష్ఠమహర్షి. అలాంటి స్థితిని సంపాదించుకోమని ప్రోత్సహిస్తూ వశిష్ఠమహర్షి, అలాంటి స్థితిని అందుకున్న జీవికి పాపము, పుణ్యము, రెండూ అంటవు – అన్నాడు. రాగము, ద్వేషము, వాడిని అంటవన్నాడు.

ఈ స్థితిని అందుకోవాలంటే ఏ రకమైన భావన చెయ్యాలో చెప్పేందుకోసం 57వ సర్గలో వశిష్ఠుడు ఒక కొత్త దారి తొక్కాడు. ఇప్పటివరకూ "ఈ ప్రపంచం లేనిది, లేనిది," అని గొంతెత్తి చెప్పిన వశిష్ఠుడు, లేనిదై కూడా వున్నట్టు కనిపిస్తున్న ఈ ప్రపంచాన్ని, సాధకుడు ఏ దృష్టితో చూడాలో వివరించటంకోసం ఇలా అన్నాడు–

**వశిష్ఠుడు:** రామా! మిరియపుగింజ పంటికింద వేసుకొని నమిలావు. నాలిక చుర్రుమంది. ఇప్పుడు ఆలోచించు. మిరియం అంటే ఇందాక నీకు కనిపించిన నల్లని రూపమా? లేక ఇప్పుడు నీ నాలికను చుర్రుమనిపించిన కారపు గుణమా?

నోటిలో ఉప్పుగడ్డ వేసుకున్నావు. నాలికకు ఉప్పుగా తగిలింది. ఇప్పుడాలోచించు. ఉప్పు అంటే ఇందాకటి గులకరాయి వంటి రూపమా? ఇప్పుడు నాలికకు తగిలిన ఉప్పదనమా?

వాదాలు ఎన్ని చేసినా, ఆ ఉప్పదనమే ఈ రాయి అయింది. ఆ కారమే మిరియపుగింజ అయింది. – అని చెప్పక తప్పదు. తెలివిగల వంటవాడు మిరియంయొక్క ఆకారాన్ని చూసి, కారం అనే గుణాన్ని గుర్తించి, వంటలో ఎన్ని మిరియాలు వెయ్యాలో అన్నే వేస్తున్నాడు. గులకరాళ్లవంటి ఉప్పు రాళ్లను చూసి, ఉప్పదనాన్ని గుర్తించి, ఎంత ఉప్పు వెయ్యాలో అంతే ఉప్పు వేస్తున్నాడు.

అలాగే, సాధకుడైనవాడు ఈ ప్రపంచంలోని ఏ పదార్థాన్ని చూసినా, వాటిలో అంతర్గతంగా, అనుస్యూతంగా, వున్న చిద్రూపాన్ని గుర్తించటం నేర్చు కోవాలి. కనిపిస్తున్న ఈ ప్రపంచమంతా పరమాత్మయొక్క వివర్త స్వరూపమే కనుక, ఇక్కడ కనిపించే ప్రతి పదార్థానికీ, అధిష్ఠానంగా, ఆధారంగా, పరమాత్మ పదార్థం వుండి తీరవలసిందే. కనుక, వంటవాడు గింజను చూసి కారాన్ని గుర్తు పట్టినట్టుగా, సాధకుడు ప్రాపంచిక పదార్థాలను చూసి, వాటికి అధిష్ఠానమైన సత్స్వరూపాన్ని గుర్తించటం నేర్చుకోవాలి. ఒక్క మాటలో చెప్పాలంటే, "అంతా బ్రహ్మమయం" – అనే భావన రావాలి.

అంతా బ్రహ్మమయం అన్నప్పుడు, అంతా అనే పదార్థం ఒకటి వేరుగాను బ్రహ్మ అనే పదార్థం మరొకటి వేరుగాను, ఉన్నట్లుగా ఈ శబ్దప్రయోగం కనిపిస్తోంది. శబ్ద ప్రయోగం అలాగే వుంటుంది. అక్కడ రెండు లేవు; ఉన్నది ఒక్కటే – అని చూడటం నేర్చుకోవాలి.

ఈ నేర్పు రావాలంటే ప్రణవోపాసన చెయ్యాలి.

రామా! ఈ విషయం నీకు స్పష్టంగా తెలిసేందుకోసం సురఘుడు అనే కిరాతరాజు చేసిన సాధన ఎలా సాగిందో చెబుతాను, విను–

## 26. సురఘు చరిత్ర

గాధి చరిత్రకు వెనకాల జ్ఞానప్రాప్తికి కావలసిన రకరకాల సాధనోపాయాలను, జ్ఞానం వచ్చే ప్రక్రియలను, జనక మహారాజు కథగా, బలి చరిత్రగా, ప్రహ్లాద గాథగా, వివరించారు.

గాధి చరిత్రలో జ్ఞానానికి ప్రధాన ప్రతిబంధకమైన మాయా స్వరూపాన్ని వివరించారు. గాధి వృత్తాంతం తరువాత, యోగ ప్రక్రియల సహాయంతో జ్ఞాన సాధనోపాయాలను వరుసగా వర్ణించుకుంటూ వస్తున్నారు. వాటిలో ఉద్దాలక చరిత్ర పూర్తైంది. ఇది నామ మాత్రపు కథ. ఇది మొత్తం అంతా సాధనా ప్రక్రియల వివరణే. ఐతే, దీనిలోని సాధకుడు మీసాలు రాకముందే వైరాగ్యం కలిగిన ఉత్తమ సంస్కారి. ఇలా కాకుండా కొంత కాలం సంసారం చేసి, రాజ్యం చేసి, యుద్ధాలు చేసి, పైనా కిందా పడుతున్న మధ్య వయస్కుడి సాధనా ప్రక్రియ ద్వారా మరికొన్ని రహస్యాలను అందించటం కోసం వశిష్ఠ మహర్షి ఇప్పుడు సురఘు వృత్తాంతంలోకి మనల్ని తీసుకోపోతున్నాడు.

హిమాలయాల్లో, కైలాస పర్వతానికి దగ్గరలో, "హేమజటులు" అనే కిరాత జాతి ఒకటి ఉండేది. వాళ్ల రాజు సురఘుడు. ఇతడు మంచి మేధావి. బహుముఖ ప్రజ్ఞాశాలి. మంచి పరిపాలనా దక్షుడు, మంచి కవి, కళాప్రియుడు, యుద్ధవీరుడు. వీటితో పాటు దైవభక్తి కూడా వుంది. ఇలా అనేక రకాల ప్రజ్ఞలు వుండటంవల్ల ఇతని రాజ్యం పెరిగింది. అతనికి తన ప్రజలమీద అదుపు చాలా గట్టిగా వుండేది. ఇలా జరుగుతూ వుండగానే, వయస్సు పొద్దు కొంచెం పక్కకు వాలింది. జుట్టు కొంచెం తెల్లబడటం మొదలు పెట్టింది. ఆ దశలో ఒక రోజున అతనికి ఒక కొత్త ఆలోచన వచ్చింది–

"నేను చాలా కాలంగా రాజ్యం చేస్తున్నాను. ఈ రాజ్యపాలనలో భాగంగా, కొంతమందిని కష్ట పెట్టవలసి వస్తోంది. కొంత మందిని దండించ వలసి వస్తోంది. కొంత మందిని ఆదేశించవలసి వస్తోంది. కొంతమందిని రక్షించ వలసి వస్తోంది. పరిపాలన అన్నాక ఇవి తప్పవు. ఇవి లేకపోతే ప్రజలు హద్దుల్లో వుండరు. ఈ నాటకంలో నా పాత్ర అలాంటిది. కానీ! ఈ ప్రక్రియలో ప్రజా శిక్షణాదులవల్ల పాపం రాకుండా వుండగలదా? అన్ని శిక్షలూ సరిగానే వేశామని చెప్పగలమా? "రాజ్యాంతే నరకం ధ్రువం" (రాజ్యపాలన పూర్తయ్యాక నరకం ఖాయం) అన్నారు. ఎంతటివాడికైనా రాజ్యం చేశాక నరకం తప్పదు. నా గతీ ఇంతేనా?"

సురఘురాజుకి ఏ సమాధానాలూ దొరకక, ఆ అంతర్మథనం అలా చాలా రోజులు కొనసాగి పోయింది.

ఇలా వుండగా ఒక రోజున ఆ రాజుగారి ఇంటికి మాండవ్య మహాముని వచ్చాడు. రాజుగారు ఆయనకు బాగా సపర్యలు చేసి, తన సందేహాలన్నీ ఆయన ముందు పెట్టాడు. "అయ్యా! కొంత పుణ్యం, కొంత పాపం, అనే ఈ చక్రం నుంచి నేను తప్పించుకునే ఉపాయమే లేదా!" – అని అడిగాడు.

మాండవ్య మహర్షి చిరునవ్వు నవ్వి ఇలా అన్నాడు–

"రాజా! పురుష ప్రయత్నం చేస్తే పరిష్కారం కాని సమస్యే వుండదు. వ్యవహారాల్లో వుండేవారికి ఎవరికైనా సరే, పాప పుణ్యాల చక్రం తప్పదు. దీన్ని తప్పించుకోవాలంటే ఒకటే ఒక ఉపాయం వుంది. అదేమిటంటే, ఒక కొత్త విచారణ మొదలు పెట్టాలి.

**కోఽహం కథమిదం కిం వా**

**కథం మరణ జన్మనీ।**

**విచారయాన్తరేవం త్వం**

**మహత్తామలమేష్యసి ॥** (సర్గ 58, శ్లోకం 32)

"నేనెవడ్ణి? ఈ ప్రపంచం ఎలా వచ్చింది? అసలు ఈ ప్రపంచం అంటే ఏమిటి? నాకు మరణం ఎలా వస్తోంది? జన్మ ఎలా వస్తోంది? ఇవన్నీ ఆలోచించు. నీ లోలోపలే ఆలోచించుకో. ఈ విచారం లేకపోవడంవల్లనే నీకు ఒక పరిమితత్వం వచ్చింది. ఒక అల్పత్వం వచ్చింది. నేను ఆరడుగుల మనిషిని మాత్రమే అనే భావం వచ్చింది. నా వ్యాప్తి నా రాజ్యం వరకే, అనే పరిమితత్త్వం వచ్చింది. ఈ విచారణ చేస్తే, ఆ పరిమితులు పోయి, నువ్వు గొప్పవాడివి అవుతావు. పెద్దవాడి వౌతావు. సర్వవ్యాపివి అవుతావు. ఆ స్థితి నీకు దక్కితే, నీకు పుణ్యమూ అంటదు. పాపమూ అంటదు.

" ఆ స్థితి చిక్కేవరకూ ఈ ప్రపంచంమీద వైరాగ్యాన్ని పెంచుకోవాలి. ఆధ్యాత్మ శాస్త్రాలను అధ్యయనం చెయ్యాలి. ఆ విచారణలో అసత్యమని తేలిన ప్రతిదాన్నీ వదిలి పెట్టాలి. అలా విడిచి పెట్టగా, విడిచి పెట్టగా, ఏది విడవడానికి సాధ్యం కాకుండా మిగిలి పోతుందో, అదే పరమపదం. అది అందితే, నీకు పాప పుణ్యాల సమస్య ఉండదు. దాని కోసం ప్రయత్నించు" – అని చెప్పి మాండవ్య మహర్షి వెళ్లిపోయాడు.

సురఘు మహారాజు వెంటనే విచారణ ప్రారంభించాడు.

"నేనెవర్ని? ఈ ప్రపంచాన్నా? కాదు. ఈ రాజ్యాన్నా? కాదు. ఈ కొండనా? కాదు. ఈ భూమినా? కాదు. ఈ పట్టణాన్నా? కాదు. ఈ శరీరాన్నా? ఔనేమో!

ఈ శరీరం నేనా? ఈ శరీరంలో నేనున్నానా? ఈ చర్మం నేను కాదు. ఈ శరీరంలోవున్న మాంసం నేనా? కాదు. రక్తం నేనా? కాదు. ఎముకలు నేనా? కాదు. ఇవేవీ నేను కాకపోతే, నేను శరీరాన్నెలా అవుతాను?

పోనీ నేను ఈ శరీరంలో వున్నానా? ఉంటే, ఈ శరీరంలో వున్న ఇంద్రియాలు నేనా? మనస్సును నేనా? అవి రెండూ జడాలు. అవి నేనెట్లా అవుతాను? నేను చేతనుడ్ణి కదా!

"ఇవేవీ కాను గానీ, నేనున్నానని, నా అంతట నాకే తెలుస్తోంది. కనుక లోపల సాక్షి ఒకడు వుండి వుండాలి. ఆ సాక్షి నా కంటే భిన్నంగా, నాతోపాటే, వున్నాడనటం కుదరదు. నాలోపలే మరొకడుంటే నాకు తెలియకుండా ఎలా వుంటుంది? కనుక, ఆ సాక్షిని నేనే అయి వుండాలి. అవును, ఆ శుద్ధ సాక్షిని నేనే!

"మరైతే ఈ ప్రపంచం ఎలా వచ్చింది? ఈ సుఖ దుఃఖాలు ఎలా వచ్చాయి? నా భ్రాంతివల్ల వచ్చాయి. ఇవి సత్యంగా లేవు. వున్నట్టుగా కనిపిస్తున్నాయి. లేక పోయినా ఉన్నట్టు కనిపించే ఈ ప్రపంచంలో జరిగే ప్రతి వ్యవహారమూ కూడా లేనిదే. ఇక్కడి రాజ్యాలూ లేనివే. రాజ్య పాలనలూ లేనివే.

"అసత్యాలైన శరీరేంద్రియ మనస్సులవల్ల జన్మించే పాప పుణ్యాలు కూడా అసత్యాలే. ఆ పాపపుణ్యాలు తమ జాతికే చెందిన శరీరేంద్రియాదులనే పీడించ గలవు గానీ, పరమార్థ సత్యస్వరూపుడ్ణి అయిన నన్ను తాక లేవు.

"నాది పరమార్థ సత్యస్వరూపం. పరమానందమే నా స్వరూపం.

**నమో మహ్యా మనంతాయ**

**సమ్యక్ జ్ఞానోదయాయ చ ॥** (సర్గ 59, శ్లోకం 37)

నాకు కలిగిన జ్ఞానానికి నమస్కారం. అఖండానంత స్వరూపుడైన నాకే నమస్కారం."

తన ఆలోచనలు ఈ స్థితికి వచ్చే సరికి, సురఘు మహారాజులో చాలా మార్పు వచ్చింది. అతను

బ్రహ్మర్షిత్వాన్ని పొందిన విశ్వామిత్ర మహర్షి లాగా అయిపోయాడు. ఇక తన అఖండ స్థితిలోంచి ఎప్పుడూ కిందికి జారలేదు. ఆ అఖండ స్థితిలో వుంటూనే, అనేక వందల సంవత్సరాలు రాజ్యం చేశాడు.

ఇంత కథా చెప్పి, చివరికి వశిష్ఠ మహర్షి రాముడికి ఒక సలహా ఇచ్చాడు.

"రామా! సమాధిలోవున్న జ్ఞానికీ , వ్యవహారంలో ఉన్న జ్ఞానికీ భేదమేమిటని అడిగావు. ఉద్దాలక మహర్షికీ, సురఘురాజర్షికీ ఏమైనా భేదం వుందో, లేదో నువ్వే చెప్పు. ఇది అర్థం చేసుకొని నువ్వు కూడా నీ తత్త్వాన్ని పరిశీలన చేసుకో" – అని.

## 27. జ్ఞానం స్థిరమా?

అంతా విని రాముడు చల్లగా ఒక ప్రశ్న వేశాడు.

**శ్రీరాముడు:** గురుదేవా! ఈ మనస్సు నిత్య చంచల శీలం కదా? ఒక సారి విచారణ చేసుకున్నంత మాత్రాన ఆ నిర్ణయం మీద మనస్సు అంత నిశ్చలంగా వుండిపోవటం సాధ్యమే నంటారా?

**వశిష్ఠుడు:** రామా! నీ సందేహం తీరేందుకు సురఘు మహారాజు జీవితంలో ఇందాకటి స్థిరనిశ్చయ స్థితి తరువాత జరిగిన ఓ చిన్ని సంఘటన చెబుతాను విను.

రామా! ఆ రోజుల్లోనే పారశీక దేశానికి, పరిఘుడు అనే రాజు వుండేవాడు. ఆ పరిఘుడికీ, ఈ సురఘుడికీ, చాలా మంచి మైత్రి వుండేది.

ఆ పరిఘుడు సామాన్యుడు కాడు. అతని గొప్పతనం గురించి తెలియడానికి ఒక సన్నివేశం చెబుతాను విను.

ఒకప్పుడు ఆ పారశీకదేశంలో, అనావృష్టి దోషం ఏర్పడి, కరువు వచ్చింది. ఆ దెబ్బకు చాలామంది ప్రజలు మరణించారు. రాజుగా ఉన్న పరిఘుడు కరువు నివారణ చర్యలు చాలా తీసుకున్నాడు. కానీ, ఏవీ ఫలించలేదు. దాంతో తన అసమర్థత మీద తనకే అసహ్యం కలిగి, ఈ పరిఘుడు రాజ్యం విడిచిపెట్టి, అడవులకు వెళ్ళి తపస్సు మొదలు పెట్టాడు. నా ప్రజలకు తిండి లేనప్పుడు నేనూ తిననని ఆహారం మానేసి ఎండుటాకులు తిన్నాడు. ఆ వరస వరస వెయ్యేళ్ళు తపస్సు చేశాడు.

ఈ లోపల రాజ్యం సంగతులు కొడుకులు చూసుకున్నారు. అది ఒక దారికి వచ్చింది. ఐనా సరే, పరిఘుడు తపస్సు ఆపలేదు.

వెయ్యేళ్ళు దాటాక అతనికి శివుడు ప్రత్యక్షమయ్యాడు. అప్పటికి రాజ్య సమస్యలు తీరిపోయాయి. ఇప్పుడిక శివుణ్ణి ఏమని కోరాలి? పరిఘుడు తెలివైనవాడు కనుక, చిత్తశుద్ధి కోరాడు. శివుడి వరంవల్ల అది లభించింది. ఎప్పుడైతే చిత్తశుద్ధి లభించిందో, వెంటనే తత్త్వజ్ఞానం దానంతట అదే కలిగింది. ఆ విధంగా అతడు జీవన్ముక్తుడయ్యాడు. ఆ తరువాత అతను ఇతర మహర్షులతో కలసి యథేచ్ఛగా లోక సంచారం చేస్తూ వుండేవాడు.

అతని కథ అలా నడుస్తుండగా, ఇక్కడ సురఘు మహారాజుకి మాండవ్య మహర్షి అనుగ్రహంవల్ల ఆత్మ జ్ఞానోదయం కలిగి, ఇతను జీవన్ముక్తుడయ్యాడు. కానీ, ఇతను ఇంకా రాజ్యం చేస్తూనే ఉన్నాడు.

ఇలా వుండగా, యథేచ్ఛగా లోక సంచారం చేస్తున్న పరిఘరాజు తన ప్రయాణాల పరంపరలో ఒక

రోజున అనుకోకుండా హేమజటా రాజ్యానికి వచ్చాడు. అక్కడ సురఘుమహారాజును కలిశాడు. వీరిలో ఒకాయన మహారాజు. రెండో ఆయన రాజ్యం విడిచిన రాజర్షి. ఐనా, ఆ భేదాలేవీ వాళ్ల పాత మైత్రిని కళంక పరచ లేదు. ఇద్దరూ ఒకరినొకరు కౌగిలించుకొని, ప్రేమ పూర్వకంగా చాలా సేపు ఇష్టాగోష్ఠిగా మాట్లాడు కున్నారు. ఆ మాటలలో ఒకరి అనుభవాలను ఒకరు పంచుకున్నారు.

నాకు మాండవ్య మహర్షివల్ల తత్త్వజ్ఞానం కలిగిందయ్యా అని సురఘు మహారాజు చెబితే, నాకు సాక్షాత్తుగా పరమేశ్వరుడి అనుగ్రహంవల్లనే ఆత్మ సాక్షాత్కారం జరిగిందని పరిఘు రాజర్షి చెప్పాడు.

పైకి మాట్లాడుతున్నాడు గానీ, పరిఘురాజర్షికి కొంచెం సందేహంగానే వుంది. “ఈ సురఘుడు ఇంకా రాజ్యంలోనే వున్నాడు. వ్యవహారాలు చేస్తున్నాడు. తత్త్వజ్ఞానం అందింది అంటాడు. నిజంగా అందిందా? కొంచెం పరిశీలించి చూద్దాం”– అని లోలోపలే అనుకున్నాడు. ఇక పైకి మాటల మధ్యలో ఓ ప్రశ్న వేశాడు.

“మిత్రమా! సురఘు మహారాజా! నువ్వు తత్త్వజ్ఞానాన్ని అందుకున్నావు. ఒక పక్క సమాధి స్థితిలోనూ వుంటున్నావు; మరో పక్క రాజ్య వ్యవహారాలూ చూస్తున్నావు. సమాధి స్థితిలోకి వెళ్ళినప్పుడు, సంకల్ప రహితమైన సమాధి స్థితిలో వుండటం కుదురుతోందా? ఇబ్బంది ఏమీ లేదు కదా?”–అని.

ఈ ప్రశ్న విని సురఘు మహారాజు–

“మిత్రమా! సంకల్ప రహితమైన సమాధి అంటే ఏమిటి?” అని ఒక చిన్న ప్రశ్న వేశాడు.

పరిఘురాజర్షి ఏమీ మాట్లాడలేదు.

సురఘుమహారాజే మళ్లా అందుకున్నాడు.

**తత్త్వావబోధో భగవన్**
**సర్వాశాతృణ పావకః ।**
**ప్రోక్తః సమాధి శబ్దేన**
**న తు తూష్ణీ మవస్థితిః ॥** (సర్గ62, శ్లోకం 8)

మహర్షీ! సమాధి అంటే, కళ్లు మూసుకొని కదలకుండా కూర్చోవటం కాదు. ఇంద్రియాలు నిశ్చలంగా వుండటం కూడా కాదు. దీనికి భిన్నంగా, హృదయంలో వుండే సమస్త సంస్కారాలూ దహించుకు పోవాలి. ఆ పని జరగాలంటే తత్త్వజ్ఞానం కలగాలి. అప్పుడు మనస్సుని తనయొక్క పరమార్థ స్వరూపంలో ఆధానం చెయ్యటం కుదురుతుంది. అదే సమాధానం. అదే సమాధి.

“అలాంటి తత్త్వ జ్ఞానం కలిగిన తరువాత ఆ వ్యక్తి సమాధిలో కాకుండా మరో స్థితిలో వుండటం ఎలా సాధ్యమౌతుంది? అలాంటివాడు సమాధికోసం వేరే ప్రయత్నం చెయ్యవలసిన అవసరం ఎలా ఏర్పడుతుంది? వాడు పూర్వాభ్యాసం చేత, యోగరూపమైన సమాధిలో వున్నా ఒక్కటే, లౌకిక వ్యవహారంలో వున్నా ఒక్కటే !

“అలా కాకుండా, నిజమైన తత్త్వబోధ కలగనివాడు బలవంతాన ఇంద్రియాలను నిగ్రహించి, కదలకుండా కూర్చుంటే మాత్రం అది సమాధి ఎలా కాగలదు?

“మిత్రమా! “సమాధిలోకి వెళ్లినప్పుడు సంకల్ప రహిత స్థితిని అందుకో గలుగుతున్నావా?” అని నువ్వు అడిగావు. నాకు సంకల్పాలు ఉన్నదెప్పుడు? అవి వుంటే కదా? కాసేపు లేని స్థితిలోకి వెళ్లి, మళ్లీ వెనక్కు రాగలిగేది! సంకల్ప రహిత స్థితే సమాధి అనుకునేటట్లైతే, నేను ఎల్ల వేళలా సమాధిలోనే వుంటున్నాను.

“కాక పోతే, ఇలా అనటంలో నా మనస్సు అనేది ఒకటి విడిగా వుందనీ, అది వెళ్ళి ఆత్మలో కలిసి పోతుందనీ, ఆ స్థితి పేరే సమాధి అనీ, చెప్పినట్లవుతోంది. అది సరియైన మాట కాదు. మనస్సనేదానికి

అస్తిత్వమే లేదు. ఆ దృష్టితో చూస్తే నాకు సమాధే లేదు! ఉన్నదంతా అద్వితీయ ఆత్మే! ఈ కనిపించే ప్రపంచం అంతా నేనే! సత్యం ఇలా వుంటే, ఇక సమాధి ఏమిటి? అసమాధి ఏమిటి?

**అసమాధిర్హి కోఽసౌ స్యాత్**

**సమాధి రపి కః స్మృతః ॥** (సర్గ 62, శ్లోకం 24)"

ఈ సమాధానం విని పరిఘురాజర్షి పరమానంద పడిపోయాడు. ఆయన సురఘు మహారాజుయొక్క జ్ఞాన స్థితిని అర్థం చేసుకొని, "నువ్వు నిజంగా జ్ఞానివయ్యా. పొందవలసిన ఉత్తమ పదాన్ని పొందేశావయ్యా" అని తృప్తిగా అభినందించాడు.

ఆ తరువాత సురఘు పరిఘు లిద్దరు చాలాసేపు తత్త్వప్రసంగం చేసుకొని, సంతోషించి, ఎవరి పనుల్లోకి వారు వెళ్ళిపోయారు.

కనుక రామా! నువ్వు కూడా వారి లాగానే ఆత్మ విచారణ చేసుకో. ఆత్మ విచారణ చేత మనస్సును ఒకసారి నిర్మూలన చేసుకొంటే, అది మళ్లీ పుట్టదు. "ఆవు" అంటే ఏమిటో తెలియాలంటే, దానిని చూడటమే ఉత్తమోపాయం. అలాగే "ఆత్మ" అంటే ఏమిటో తెలియాలీ అంటే, ఆత్మానుభూతిని పొందాలి. అంతకు మించి వేరే ఉపాయం లేదు.

ఈ విధంగా వివరిస్తూ, వశిష్ఠుడు రాముడి మనస్సును ఆత్మానుభూతి వైపు మళ్లించటం కోసం 63, 64 వ సర్గలు రెండింటినీ వినియోగించాడు. వీటిలో ఆత్మతత్త్వాన్ని అనేక రకాలుగా మళ్లీ వర్ణించాడు. ఏడు జ్ఞాన భూమికలనూ మరోసారి ప్రస్తావించాడు. అంతా చెప్పి చివరికి ఆయన ఇలా అన్నాడు –

"రామా! మనస్సును మనస్సుతోనే కోసేయ్యాలి. అప్పుడే ఈ సంసారం నశిస్తుంది. ఆత్మ సాక్షాత్కారం లభిస్తుంది. కానీ, ఈ అభ్యాసం అంత సులభం కాదు. మధ్యలో ఎన్నో చిక్కులు వచ్చిపడుతూనే వుంటాయి. ఐనా పట్టు విడిచి పెట్టకూడదు. ఈ విషయం స్పష్టపడేందుకోసం నీకు ఒక మంచి ఉదాహరణ చెబుతాను, విను."

ఇలా అని, వశిష్ఠమహర్షి 65వ సర్గలో, భాసవిలాసోపాఖ్యానంలోకి ప్రవేశిస్తున్నాడు. ఇది కూడా నామ మాత్రపు కథే.

## 28. భాసవిలాసోపాఖ్యానము

రామా! సహ్యపర్వతంయొక్క ఉత్తర ప్రాంతాలలో ఒకప్పుడు ఇద్దరు మహర్షులు మంచి స్నేహితులుగా వుండేవారు. వారిద్దరికీ చెరొక మగ పిల్లవాడూ పుట్టాడు. ఆ పిల్లల్లో ఒకడి పేరు భాసుడు, రెండవవాడి పేరు విలాసుడు. జనం లేని ఆ అడవిలో, వీళ్లిద్దరూ ఒకరికొకరు స్నేహితులుగా పెరిగారు.

వీళ్లిద్దరికీ యౌవనం వచ్చేసరికి, వారిద్దరి తల్లిదండ్రులూ ఇంచుమించు ఒకే సారి మరణించారు. కుర్రవాళ్లిద్దరూ శ్రద్ధగా పితృకర్మలు చేశారు. ఇక అక్కడ వుండలేక చెరో దిక్కుకీ వెళ్లిపోయారు. ఐనా మనశ్శాంతి కలగలేదు. ఇద్దరూ దేశ సంచారం చేస్తూ చేస్తూ ఒకచోట కలిశారు. ఇద్దరికీ ఆశ్చర్యమైంది, ఆనందమైంది. నువ్వెలా ఉన్నావంటే, నువ్వెలా వున్నావని ఒకరినొకరు ప్రశ్నించుకున్నారు. నీకు తపస్సు కుదిరిందా? నీకు జ్ఞానం కుదిరిందా? నీకు ఆత్మ సాక్షాత్కారం లభించిందా?– అని ఒకరినొకరు ప్రశ్నించుకున్నారు.

రామా! వాళ్లిద్దరి కుశల ప్రశ్నల వరసే ఆత్మ తత్త్వ చర్చగా మారిపోయింది. ఆ పరస్పర పరామర్శే ఆత్మ విచారణ ప్రక్రియగా మారి పోయింది. ఇలా, వాళ్లిద్దరూ ఆత్మ తత్త్వాన్ని పరస్పరమూ ప్రబోధించుకోవటంచేత, ఇద్దరికీ జ్ఞానం కలిగింది. క్రమంగా ఇద్దరికీ  ముక్తి లభించింది.

రామా! వీళ్లిద్దరికీ జ్ఞానం కలగకుండాచేసి, పిచ్చెక్కించి, దేశం వెంబడి తిప్పింది ఏమిటి? కొంచెం ఆలోచించు. వాళ్లకు మనస్సులో గల అంతస్సంగమే అంత పని చేసింది. పరస్పర ప్రబోధంవల్ల వాళ్ల అంతస్సంగం తొలగిపోయి, ముక్తి లభించింది. కనుక, ముక్తి కావాలనుకున్నవాడు ఎవడైనా సరే, అంతస్సంగాన్ని పూర్తిగా తొలగించుకోవాలి. వశిష్ఠుడు భాస విలాసుల ఉదాహరణద్వారా ఈ బోధ చేయటానికి మూడు సర్గలు పట్టింది. 65,66,67 సర్గలంతా ఇదే చర్చ.

## *౨౭. అంతస్సంగము*

68వ సర్గ మొదట్లో రాముడు ఒక చిన్న ప్రశ్న వేశాడు–

"గురుదేవా! అంతస్సంగాన్ని తొలగించుకోవాలంటున్నారు కదా. అంతస్సంగం అంటే ఏమిటి? అది జీవుల్ని ఎలా బంధిస్తుంది? దాన్ని తొలగించుకొనే ఉపాయం ఏమిటి?" – అని.

ఇక వశిష్ఠుడు సమాధానం మొదలు పెట్టాడు. 82వ సర్గదాకా ఈ సమాధాన చర్చ కొనసాగింది. ఇంత చర్చా చేసి, "బృహస్పతి అన్నగారైన సంవర్తుడు ఆత్మ విచారణ చేసుకున్న విధానం ఇదయ్యా. ఆయనే ఒక సారి నాకు ఈ సంగతంతా చెప్పాడు. ఆయన అనుసరించిన విచారణ ప్రక్రియనే నేను నీకు ఇప్పుడు చెప్పాను"– అని 82వ సర్గ మొదట్లో వశిష్ఠ మహర్షి చెప్పబోతున్నాడు. ఈ చర్చ మొత్తాన్ని ఆయన వీతహవ్య మహర్షి చేసిన ఆత్మతత్త్వ చింతనలోకి అనుసంధానం చేయబోతున్నాడు. ఈ విషయాలను దృష్టిలో పెట్టుకొని ఈ 14 సర్గల సారాంశాన్ని సంగ్రహంగా గ్రహిద్దాం.

'సంగం' అంటే ఏమిటి అనేది రాముడి ప్రశ్న.

దానికి వశిష్ఠ సమాధానం ఇలా సాగింది.

**వశిష్టుడు:** రామా!

**అనంతస్యాత్మ తత్త్వస్య**
**సపర్యన్తత్వ నిశ్చయే**
**యత్సుఖార్థిత్వ మంతస్స**
**సంగో బంధార్థ ఉచ్యతే** ॥ (సర్గ 68 శ్లోకం 3)

ఆత్మ అనంత మని మరిచిపోయి, దానికి దేశ కాల వస్తు పరిచ్ఛేదాలున్నాయనే నిశ్చయానికి వచ్చేయటం, అలాగే తను అంఖండానంద స్వరూపుణ్ణి అనే మాట మరచిపోయి, ప్రాపంచిక విషయాల ద్వారా సుఖాన్ని అందుకోవాలని ఆరాట పడటం, అనేది ఏదైతే వుందో , అదే సంగం. ఈ బంధాలను కలిగించేది అదే.

అంతే కాదు, రామా! తాను జీవుడు – తను చేతన స్వరూపుడు. ఈ దేహం జడం. ఈ రెంటికీ పోలికే లేదు. ఐనా, ఆ మాట మరిచిపోయి, తన దేహమే తను అనీ, తనే దేహమనీ, నమ్మేయటమే సంగం.

రామా! ఈ నిర్వచనాలను బట్టి అసంగమంటే ఏమిటో అర్థం చేసుకో.

దేహాదులు నేను కాదని తెలుసుకోవటమే అసంగం. నాకు పరిచ్ఛేదం లేదని గుర్తించటమే అసంగం. నా స్వస్వరూపం ఆనందమే – అనే విషయం తెలియటమే అసంగం.

మానవులకే కాదు, పశుపక్ష్యాదులకు గూడా వుంటుంది సంగం!

గొడ్లకు ముక్కు తాడు వేసి వీథిలో లాక్కుపోతూ వుంటే, మధ్యలో భయం వేసి ముక్కు తెగిపోతున్నా లెక్క చేయకుండా, గంతులేస్తాయవి! దేనివల్ల అవి ఇలా చేస్తాయంటావు? అంతస్సంగంవల్లే సుమా!

చెట్లు ఎండకు ఎండి వానకు తడిసి గూడా బతకాలని ఎందుకు ఆరాట పడుతున్నాయో తెలుసా? అంతసంగంవల్లే!

ఈ సంగం ఎక్కడ వుంటే అక్కడ సంసారం పెరిగి పోతూవుంటుంది.

రామా! ఈ సంగం రెండు రకాలు.

**సంసక్తిర్ద్వివిధా ప్రోక్తా**

**వంద్యా వంధ్యా చ రాఘవ ।**

**వంధ్యా సర్వత్ర మూఢానాం**

**వంద్యా తత్త్వవిదాం నిజా ॥** (సర్గ 68 శ్లో 21)

రామా! అంతస్సక్తి రెండు రకాలు. ఒకటి వంద్య సంసక్తి. ఇది ఆత్మవేత్తలకు ఉంటుంది. రెండవది వంధ్య సంసక్తి. ఇది అజ్ఞులకు వుంటుంది. (వంద్యము అంటే పూజనీయము, వంధ్యము అంటే వ్యర్థము)

త్రిమూర్తులు సృష్టి స్థితి లయ కార్యాలను నిర్వహించటం, లోకపాలకులు, ఇతర ఋషి పుంగవులు, ప్రజలకు సదుపదేశాలందిస్తూ వుండటం, మొదలైనవన్నీ వంద్య సంసక్తివల్లనే జరుగుతాయి.

ఇక వంధ్య సంసక్తికి ఉదాహరణ కోసం వెతుక్కో వలసిన పని లేదు. ఇంద్రాది దేవతాబృందాలు కూడా దీనికి లోబడినవారే.

రామా! నిజానికి చిదాకాశంలో ఈ ప్రపంచమనే బొమ్మ తయారైంది ఈ సంగంవల్లనే. దీనివల్లనే భోగ విభూతులు శాఖోప శాఖలుగా విస్తరిల్లు తున్నాయి.

ఇక ఇది పోయేందుకు ఏం చెయ్యాలని అడిగావు. వివేకి ఐనవాడు ఎన్ని రకాల వ్యవహారాల్లో వున్నా, మనస్సును దేనిమీదా అంటుకోనీరాదు. ఏ వస్తువుల మీద, ఏ సంఘటనలమీద, ఏ దిక్కులమీద, ఏ బంధువులమీద, ఏ ఇంద్రియాల మీద, ఏ గుణాల మీద, ఏ తర్కాల మీద, ఏ భోగాల మీద, ఏ సిద్ధుల మీదా, ఇలాంటి వాటిల్లో వేటిమీదా మనస్సు అంటుకోకుండా జాగ్రత్త పడాలి. మనస్సు అంటుకోకుండా వుండాలంటే ఫలేచ్ఛ లేకుండా పని చెయ్యటం నేర్చుకోవాలి.

ఇలా ప్రయత్నించడాన్ని అసంగాభ్యాసము అంటారు. ఈ అభ్యాసంలో వున్నవాడు అన్ని వ్యవహారాలనూ చేస్తూనే వుంటాడు. ఐనా సరే, వాడికి దుఃఖాలు గానీ, భయాలు గానీ, వుండవు. ఈ సాధనలో పట్టు సాధించినవాడి ముఖంలో ఒక విధమైన కాంతి కనిపిస్తూ వుంటుంది.

ఈ విధంగా సంగ రహితంగా వ్యవహారాలు జరుగుతుంటే, ఆ అవస్థను జాగ్రదవస్థలోని సుషుప్త్యవస్థ–అని పిలవవచ్చు. అలాంటి స్థితిలో ఆ శరీరం ఒక యంత్రపు బొమ్మ లాగా పనిచేస్తూ వుంటుంది. ఇలాంటి సుషుప్తీయ స్థితి ఇంకా పరిపక్వ దశను పొందితే, దాన్ని పెద్దలు 'తురీయావస్థ' అంటారు. ఈ అవస్థను అందుకున్నవాణ్ణి జీవన్ముక్తుడంటారు. దీనిని కూడా దాటి ఆ శరీరం రాలిపోతే, అప్పుడు వాణ్ణి తురీయాతీతుడని, విదేహ ముక్తుడని, అంటారు.

రామా! తురీయాతీతావస్థను గురించిన చర్చ మనకు అక్కర్లేదు. అది వేద వాక్కులకు కూడా అందదు. నువ్వు అసంసక్తి యోగంతో తురీయస్థితి కోసం గట్టి ప్రయత్నం చెయ్యాలి.

ఈ ప్రయత్నంలో నీకు అడ్డం పడేది నీ మనస్సే! నిజానికి జీవులయొక్క అజ్ఞానమే జీవుడియొక్క అంతఃకరణము, చిత్తము, మనస్సు, అనే పేర్లతో ఈ విస్తారమైన సంసారాన్ని సృష్టి చేస్తోంది!

## ౩౦. మనస్సుయొక్క పేర్లు

**శ్రీరాముడు:** గురుదేవా! మనస్సుకు ఇన్ని రకాల పేర్లు ఎలా వచ్చాయి? కొంచెం వివరించండి.

**వశిష్ఠుడు:** రామా! అన్ని పదార్థాలూ ఆత్మతత్త్వ స్వరూపాలే. అన్నీ సమష్టి చిత్తం నుంచే పుట్టాయి. సముద్రంలో ఉన్న నీరు కొంత భాగం తరంగాలుగా వుంటుంది. అక్కడ అది స్పందిస్తూ వుంటుంది. మిగిలిన చోట ఆ నీరు స్పంద రహితంగా వుంటుంది; నిశ్చలంగా వుంటుంది. అలాగే, ఆత్మతత్త్వం గూడా కొన్ని చోట్ల స్పంద రూపంగా వుంటుంది; మరికొన్ని చోట్ల నిస్పందంగా వుంటుంది.

స్పందం ఉన్న ఆత్మతత్త్వమే జీవులు. స్పందంలేని ఆత్మ తత్త్వమే జడ పదార్థాలు. ఇందులో జీవుల రూపంలో ఉన్న ఆత్మతత్త్వం తనలో తాను కల్పించుకున్న అజ్ఞానం చేత, విడివిడి శరీరాలతో విడివిడిగా వున్నట్లుగా కనిపిస్తోంది. జీవులు విడివిడిగా ఉన్నట్లు అనుభవం కలగడానికి కారణం అజ్ఞానమే కనుక, ఆ అజ్ఞానమే జీవుడని చెప్పవచ్చు – మట్టే కుండ అన్నట్లు!

విడివిడిగా వుండటం అనే స్థితి ఈ ఆత్మ తత్త్వానికి ఎందుకు కలుగుతోందంటే, ప్రాణ ధారణమనే క్రియచేత కలుగుతోంది. ఈ దృష్టితో చూసినప్పుడు, అజ్ఞానబలంచేత ప్రాణధారణం చేసిన ఆత్మతత్త్వమే జీవుడు అని మనం అర్థం చేసుకోవచ్చు. "జీవ ప్రాణధారణే " అనే ధాతువు వుంది. దాన్ని బట్టే ప్రాణధారణ క్రియకు ఆధారమైన ఆత్మతత్త్వ భాగానికి "జీవుడు" అనే పేరు వచ్చింది.

అదే అజ్ఞానం, మరి కొంచెం ముదిరి, "నేను, నేను" అనే భావన మొదలు పెడుతోంది. అప్పుడు అదే ఆత్మ తత్త్వ భాగానికి "అహంకార"మనే పేరు వస్తోంది.

అదే అజ్ఞానం, నిశ్చయాత్మక బుద్ధి వృత్తుల్ని ఉత్పాదన చేస్తోంది. అప్పుడు అదే ఆత్మతత్త్వ భాగానికి "బుద్ధి" అనే పేరు వస్తోంది.

అదే అజ్ఞానం, పుట్ట పేరుకున్నట్టుగా పంచభూతాలూ ఒక చోట పేరుకున్న అనుభూతిని కలిగిస్తోంది. "దిహ ఉపచయే" అని ఒక ధాతువుంది. దీనికి పేరుకోవటం అని అర్థం. దీన్నిబట్టి, అదే ఆత్మతత్త్వ భాగానికి "దేహం" అనే పేరు వస్తోంది.

రామా! ఇలా ఒక్కొక్క గుణ విశేషాన్ని బట్టి, భాషలో వున్న ధాతువుల్ని బట్టి, ఒకే ఆత్మతత్త్వానికి అనేక పేర్లు వస్తున్నాయి. అన్ని గుణాలనూ ఒకే సారి ఎవరూ చెప్పలేరు. గుణ ప్రాధాన్యాన్ని బట్టి ఒక్కొక్కసారి ఒక్కొక్క పేరు.

ఆదే ఆత్మ తత్త్వంలో చైతన్యాన్ని ప్రధానాంశంగా తీసుకుంటే దాని పేరు "చేతనం." అజ్ఞానాంశను ప్రధానాంశగా తీసుకుంటే, అప్పుడు దాని పేరు "జడం."

వీటిలో పరిశుద్ధాత్మ తత్త్వానికి సంసార బంధం లేదు. జడానికీ సంసార బంధం లేదు. మధ్యలో

వున్న జీవచేతనానికే సంసార బంధం!

రామా! ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే, ఈ సంసారాన్ని కలిగించేది మనస్సే. దాన్ని నశింపచేసేది ఆత్మతత్త్వ జ్ఞానం ఒక్కటే.

రామా! దేహం పుడితే నువ్వు పుట్టలేదు. దేహం పోతే నువ్వు పోవు. కనుక, నీకూ దేహానికి సంబంధం ఏమిటి? అది లేనప్పుడు ఈ స్త్రీ పురుష ఆకర్షణలేమిటి? స్త్రీకీ, పురుషుడికీ భేదమేమిటి? స్త్రీల శరీరం సుకుమారంగా వుంటుందని, పురుషుల శరీం కఠినంగా ఉంటుందని, అజ్ఞులంటారు. జ్ఞానులైనవారికి అన్ని శరీరాల్లోను పంచభూతాల ముద్దలే కనిపిస్తాయి.

స్త్రీ పురుష భేదమే కాదు, నీకు సుఖదుఃఖాలను కలిగించేది ఏ భేదమైనా ఇంతే. ఈ విషయంలో పూర్వం నీకు నేను చాలా తర్కం చెప్పాను. అసలు నీ సుఖదుఃఖాలు సత్యమైన విషయాన్ని బట్టి వస్తున్నాయా? అసత్యమైన విషయాన్ని బట్టి వస్తున్నాయా? సత్యా సత్యమైన విషయాన్ని బట్టి వస్తున్నాయా?– అని మూడు రకాలుగా విభాగం చేసి, పూర్వం చాలా చర్చ చేసి, సుఖదుఃఖాలకు ఆధారమైన విషయం లేనే లేదని తేల్చి చెప్పాను. గుర్తు చేసుకో.

కనుక, రామా! ఒకటి గట్టిగా తెలుసుకో, ప్రపంచం అంతా ఆత్మే. దానికంటే భిన్నాంగా వేరే పదార్థాలు వున్నట్టు కనిపించటం భ్రాంతి.

దీనికోసం తత్త్వ విచార దృష్టిని పెంచుకో.

**అహం ఖ మహ మాదిత్యో**

**దిశో౽ హ మహమప్యధః।**

**అహం దైత్యా అహం దేవా**

**లోకాశ్చాహ మహం మహః॥** (సర్గ 73, శ్లోకం 3)

నేనే ఆకాశాన్ని, నేనే సూర్యుడ్ణి, నేనే దిక్కుల్ని, పైనా నేనే, కిందా నేనే, నేనే దేవతలు, నేనే రాక్షసులు, అన్ని లోకాలూ నేనే, వెలుగును నేనే, చీకటిని నేనే – అని ఈ రకంగా అద్వితీయాత్మ భావనను అభ్యాసం చెయ్యాలి.

ఆ ఆత్మతత్త్వాన్ని భావన చేసేటప్పుడు, మూడు రకాలుగా చెయ్యవచ్చు.

1. ఆత్మ ప్రపంచాతీతుడు–

ఈ దృష్టితో చూసినప్పుడు, ఆత్మ ప్రపంచంయొక్క సత్తను బాధిస్తాడు. బాధించటం అంటే తెలుసు కదా ! కారణంతో సహా కార్యంయొక్క అభావ నిశ్చయాన్ని కలిగిస్తాడు.

2. ఆత్మ అధిష్ఠాన మాత్ర స్వరూపుడు –

ఇందాక చెప్పిన విధంగా ప్రపంచం మొత్తాన్ని బాధించగా, అనగా, "ప్రపంచం అనేది లేనిది" అనే నిశ్చయం జరుగగా, అద్వితీయుడుగా మిగిలివుండే స్వరూపం.

3. ఆత్మ సర్వ వ్యాపి, సర్వరూపి, సర్వ ప్రకాశకుడు –

ఇలాంటి మాటలన్నింటికీ అర్థం ఒక్కటే. లేనిదై కూడా ఉన్నట్టు కనిపించే ఈ ప్రపంచంలోని ప్రతి పదార్థానికీ అధిష్ఠానంగా వున్నవాడు పరమాత్మే కనుక, ఈ ప్రపంచంలోని ప్రతి పదార్థాన్నీ ప్రకాశింప చేసేవాడు పరమాత్మే. అసలు ఆయా రూపాలలో వున్నది పరమాత్మే.

రామా! ఈ మూడు దృష్టులలో ఏ ఒక్క దృష్టితోనైనా ఆత్మతత్త్వానుసంధానం చేసుకోవచ్చు. లేదా, ఈ మూడింటినీ ఒకదాని తరువాత ఒకటి వాడుకున్నా వాడుకోవచ్చు.

ఇలా చేసి, ఆత్మానుభవాన్ని నీ అంతట నువ్వు సంపాదించుకోవలసిందే గాని, వేద వాక్యాలమీద ,శాస్త్ర వాక్యాల మీద, గురు వాక్యాలమీద, ఆధారపడి ఆగిపోరాదు.

రామా! ఇది మోక్షం, ఇది బంధం, అనేవి కేవలం కల్పన మాటలు. అవి నిస్సారమైనవి. నువ్వే మోక్షానివి. ఈ మాటను అనుభవ పూర్వకంగా గుర్తించు.

ఇక్కడికి 73వ సర్గ పూర్తయింది.

ఆ తరువాత 74వ సర్గలో వశిష్ఠమహర్షి ఈ సంసార రూపమైన భ్రాంతి ఎలా వస్తోందని మరొకసారి విచారణ చేసి, సరిగ్గా విచారించక పోవటమే దానికి మూల కారణమని, సరియైన విచారణ ద్వారా కలిగే జ్ఞానంవల్ల పరిపూర్ణత్వం లభిస్తుందని మరోసారి నిరూపించాడు. దాని తరువాత జీవన్ముక్తియొక్క లక్షణాలను మరో సారి వివరించాడు.

ఆ తరువాత 75వ సర్గలో కొందరు జీవన్ముక్తుల పేర్లు వరుసగా చెప్పి, వాళ్ళు జీవన్ముక్తులై ఉండి గూడా, నిస్సంగంగా వ్యవహారాలు ఎలా చేశారో సంగ్రహంగా చెప్పాడు. ఆ పేర్లలో, జనక మహారాజు, శ్రీరాముడి తాత దిలీప మహారాజు, వాళ్ల వంశంలోనే మాంధాత చక్రవర్తి , పాతాళంలో బలిచక్రవర్తి, భూలోకంలో నహుష చక్రవర్తి, రాక్షసులలో వృత్రాసురుడు, ప్రహ్లాదుడు, శంబరాసురుడు, కుశలుడు, దేవతలలో అగ్ని, బృహస్పతి, శుక్రుడు, బ్రహ్మదేవుడు, విష్ణువు, శివుడు, పార్వతీదేవి, శివ గణాలలో భృంగి, కుమారస్వామి, మునులలో నారదుడు, విశ్వామిత్రుడు, మళ్లీ దేవతలలోనే ఆదిశేషుడు, యముడు, ఇంకా చాలా పేర్లు చెప్పాడు. చెప్పి చెప్పి "నువ్వు కూడా వివేకాన్ని, వైరాగ్యాన్ని, సంపాదించుకొని, జీవన్ముక్తుడవై నిస్సంగంగా విహరించు" – అని బోధించాడు.

ఆ తరువాత సదేహముక్తిని, విదేహముక్తిని, వాటి తారతమ్యాన్ని, వివరించాడు. ఈ సర్గ చిట్టచివరి శ్లోకంలో బౌద్ధవాదాన్ని, సాంఖ్య వాదాన్ని ప్రస్తావన, చేసి,ఆ శాస్త్రాలవాళ్లు చాలా విచారణ చేసినా చివరికి పొరపాటే పడ్డారనీ, వేదమార్గ గాములైన మహాత్ములు మాత్రమే యథార్థ సత్యం గ్రహించ గలిగారనీ, చెప్పాడు.

ఆ తరువాత 76వ సర్గకు వచ్చే సరికి, కవితామయంగా ఈ సంసారాన్ని సముద్రంతో పోలుస్తూ, దాన్ని దాటే ఉపాయాలను గురించి ప్రస్తావించి, రాముడు చిన్నతనంలోనే తత్త్వ విచారణ చేస్తున్నందుకు అభినందించాడు.

ఇక 77వ సర్గలో జీవన్ముక్త లక్షణాలను మరో సారి చెప్పమని శ్రీరాముడు అడుగగా, వశిష్ఠుడు ఆనంద పరవశుడై జీవన్ముక్త లక్షణాలను రకరకాలుగా గానం చేశాడు. ఈ సర్గలో శ్లోకాలన్నీ సాధకులకు నిత్య పారాయణ యోగ్యాలుగా ఉన్నాయి.

ఇలా చెప్పి చెప్పి, చివరికి వశిష్ఠుడు ఒక మాట అన్నాడు – "చిత్తంలో స్పందం కలగటంవల్లనే ఈ ప్రపంచం అంతా స్పందం కనిపిస్తోందయ్యా"– అని.

వెంటనే శ్రీరాముడు పట్టుకున్నాడు. "అయ్యా చిత్తానికి స్పందం దేనివల్ల వస్తుంది? వచ్చిన స్పందం దేనివల్ల పోతుంది? – అని.

"వశిష్ఠుడు దీనికొక విచిత్రమైన సమాధానం చెప్పాడు.

**వశిష్ఠుడు:** రామా! అనడం ఐతే, "చిత్తంలో స్పందము" అని అన్నాం గానీ, వున్నది ఒకటే. చిత్తమే స్పందం.

స్పందమే చిత్తం. నిప్పులో వెచ్చదనం వుంది అంటారు లోకంలో. అలా అన్నంత మాత్రాన, నిప్పు వేరు, వేడి వేరునా? కాదు. అలాగే చిత్తం వేరు, స్పందం వేరు, కాదు. చిత్తం బతికి వున్నంత కాలం స్పందం ఆగదు. చిత్తాన్ని నశింప చేయటానికి పెద్దలు రెండు మార్గాలను చెప్పారు.

**ద్వౌ క్రమౌ చిత్తనాశస్య**
**యోగో జ్ఞానం చ రాఘవ ।**
**యోగస్తద్వృత్తిరోధో హి**
**జ్ఞానం సమ్యగవేక్షణమ్ ॥** (సర్గ 78, శ్లోకం 8)

రామా! చిత్త నాశానికి, మార్గాలు రెండు. ఒకటి యోగము, రెండు జ్ఞానము. యోగము అంటే, చిత్తంలో వచ్చే వృత్తులను నిరోధించటం. జ్ఞానం అంటే చక్కగా పరిశీలించి ఉన్నది ఉన్నట్టుగా చూడటం.

## 31. యోగం ద్వారా చిత్తనాశము

**శ్రీరాముడు:** గురుదేవా! ముందు మొదటి ఉపాయాన్ని గురించి ఆలోచిద్దాం. లోకంలో ప్రాణాయామాది ప్రక్రియలను యోగము అని పిలుస్తున్నారు. మీరు చెప్పే యోగం అదేనా? దాంతో చిత్తస్పందం శాశ్వతంగా నిలుస్తుందా?. అఖండానందం లభిస్తుందా?

ఈ ప్రశ్నకు వశిష్ఠుడు విస్తారంగా సమాధానం చెప్ప దలచుకున్నాడు. అందులో ముందుగా చిత్తంయొక్క చలనం ప్రాణంయొక్క చలనం మీద ఆధారపడి వుంటుంది– అని చెప్పదలచుకున్నాడు. దానికోసం, ముందు, ప్రాణం అంటే, శరీరావయవాల సారమనీ, అది శరీరంలోని వివిధ నాడుల్లో సంచరించేటప్పుడు దానికి ప్రాణమనీ, అపానమనీ, ఇలా రకరకాల పేర్లు వస్తాయనీ, చెప్పాడు. చెప్పి చెప్పి ఇలా అన్నాడు–

**అంతః ప్రాణ పరిస్పందాత్**
**సంకల్ప కలనోన్ముఖీ ।**
**సంవిత్సంజాయతే యైషా**
**తచ్చిత్తం విద్ధి రాఘవ ॥** (సర్గ 78, శ్లోకం 13)

రామా! లోపల ప్రాణం చలిస్తుంది. దానివల్ల శరీరంలో నిబద్ధమైయున్న (అవచ్ఛిన్నమైయున్న) చైతన్యంలో ఒక కొత్త మార్పు వస్తుంది. ఆ మార్పు పేరే సంకల్పం. ఇలా సంకల్పమనే పేరుగల కొత్త మార్పును పొందుతూ పొందుతూ వున్న చైతన్యం పేరే చిత్తం.

అందుచేత, లోపల వుండే ప్రాణాన్ని నిరోధిస్తే, చిత్తం కూడా నిరోధింప బడుతుంది. చిత్తంలో స్పందం లేకుండా పోతే, సంసార బంధం లేకుండా పోతుంది.

ప్రాణస్పంద నిరోధానికి కొన్ని ఉపాయాలున్నాయి– అంటూ వశిష్ఠుడు ఇక్కడ అష్టాంగ యోగానికి సంబంధించిన రాజయోగ విధానాలు కొన్నింటిని ఉపదేశించ దలచు కున్నాడు. వాటిల్లో సాలంబ, నిరాలంబ, రాజయోగోపాయాలను గూడా చెప్పదలచుకున్నాడు. ఈ పదాలను ఇట్లానే వాడక పోయినా విషయాలను మాత్రం ఆ పద్ధతిలోనే చెప్పాడు. ప్రాణ స్పంద నిరోధానికి ఆయన చెప్పిన ఉపాయాలు ఇలా వున్నాయి –

1. శాస్త్రాభ్యాసము, సజ్జన సాంగత్యము, వైరాగ్యాభ్యాసము, ఈ మూడింటినీ బాగా పెంచుకుంటే, సంసార వ్యవహారాల మీద నిరాదరణ ఏర్పడుతుంది. ఆ నిరాదరణ పెరిగిన కొద్దీ ప్రాణ స్పందం దానంతటదే తగ్గుతుంది.

2. ఏదో ఒక పదార్థాన్ని తీసుకో. ఏదైనా ఫరవాలేదు, నీకు ఏది ఇష్టమైతే అది తీసుకో. ఒక కొండ శిఖరమో, ఒక చంద్ర బింబమో, ఒక దేవతారూపమో, ఏదో ఒక దానిమీద నీ మనస్సుని ఏకాగ్రపరచటం నేర్చుకో. దీన్ని "ఏక తత్త్వఘన ధ్యానము" అంటారు. ఇది బాగా గట్టిపడితే ప్రాణస్పందం తగ్గిపోతుంది.

3. ఈ రెండు ఉపాయాలకీ కొంచెం మనోబలం ఎక్కువ కావాలి. అది చాల్లేదు అనుకుంటే, పూరక కుంభక రేచకాలతో కూడిన ప్రాణాయామాభ్యాసం చేస్తూ, దానితో పాటు ఏకాంతంలో ధ్యానాభ్యాసం చెయ్యాలి. దానివల్ల కూడా ప్రాణస్పందం తగ్గుతుంది.

4. లేకపోతే, ఓంకారాన్ని ఉచ్చరించే క్రమాన్ని తెలుసుకుని, దాన్ని అభ్యసిస్తూ, క్రమంగా ఓంకారంయొక్క నాలుగవ భాగమైన అర్ధమాత్రం మీద మనస్సు లగ్నం చెయ్యటం నేర్చుకోవాలి. అప్పుడు కూడా ప్రాణ స్పందం తగ్గుతుంది. (అర్ధమాత్ర అంటే, అకార, ఉకార, మకారపు పొల్లులయొక్క విస్పష్టోచ్చారణ తగ్గిపోయి, కేవలం నాదమాత్రంగా శబ్దం వినిపిస్తున్న పరిస్థితి.)

5. మరొక ఉపాయం వుంది. రేచకంతో ప్రాణవాయువును పూర్తిగా బైటికి పంపించెయ్యాలి. వెంటనే లోపలికి గాలి పీల్చరాదు. అలా వుంచేసి, శరీర అవయవాల్లో వాయు సంచారం లేకుండా చెయ్యాలి. ఇలా దీర్ఘకాలం చేస్తే, ప్రాణస్పందం తగ్గిపోతుంది.

6. అలాగే పూరకంతో లోపలికి గాలి బాగా పీల్చేసి, శరీరం అంతా ప్రాణ వాయువుతో నింపేసి, ఇక గాలి లోపలికి వచ్చే సావకాశం లేని పరిస్థితిలో, లోపలి గాలిని లోపలే దీర్ఘకాలం నిలిపివుంచితే, ప్రాణస్పందం తగ్గిపోతుంది.

7. అలాగే పూరణం చేసిన తరువాత, కుంభకంలో వున్న సమయంలో,లోపలి ప్రాణవాయువుతో పాటు ప్రాణాన్ని కూడా దీర్ఘకాలం స్తంభిప చెయ్యటం కుదిరితే ప్రాణ స్పందం తగ్గిపోతుంది.

(**గమనిక:** ఇక్కడ ప్రాణవాయువు వేరు, ప్రాణం వేరు అనే విషయాన్ని సూచిస్తున్నారు. ప్రాణం శరీరాంతర్గతమైన, ఇంద్రియాల సారరూపమైన శక్తి. ప్రాణవాయువు దాని బహిరంగరూపం)

8. నోరు తెరిచి, నాలుకను వెనుకకు తిప్పి, అంగట్లో గంట లాగా కిందికి వేళ్లాడుతున్న కొండనాలికకు తాకించి, ఆ తరువాత నాలుకను ఇంకా ముందుకి జరిపి, కొండనాలుకను నొక్కి పట్టి, ప్రాణవాయువును బ్రహ్మరంధ్రంలో ప్రవేశ పెట్టి, అక్కడ నిలపగలిగితే ప్రాణస్పందం తగ్గిపోతుంది.

9. ఇలాంటి ప్రాణాయామ ప్రక్రియలు ఏవీ లేకుండానే ధ్యానబలంవల్ల, హృదయాకాశంలో గల వృత్తులన్నీ కరిగిపోయేటట్లు చేసినట్లైతే, అదే నిర్వికల్ప సమాధి. దానివల్ల గూడా ప్రాణ స్పందం తగ్గిపోతుంది.

10. ముక్కు రంధ్రాలకు బైట, పన్నెండు అంగుళాల దూరంలో ఆకాశంలో గల బిందువు మీద, తన చూపును మనస్సును గూడా, మేకు కొట్టినట్టు నిలబెడితే ప్రాణ స్పందం తగ్గిపోతుంది.

11. ఇందాక చెప్పిన లంబికాయోగంవల్ల కాకుండా ప్రాణాయామబలంచేతనే ప్రాణవాయువును బ్రహ్మరంధ్రంలోకి ప్రవేశ పెట్టి, బ్రహ్మరంధ్రం వెలుపల పన్నెండు అంగుళాల దూరంలో కదలకుండా స్థిరంగా నిలప గలిగితే, అప్పుడు కూడా ప్రాణస్పందం తగ్గిపోతుంది.

12. అలాగే, రెండు కనుగుడ్లనూ దగ్గరకు చేర్చి, భ్రూమధ్యమంలో నిలబెట్టి, ఆ కళ్లలోని వెలుగును, అనగా లోపల వున్న చక్షురింద్రియాన్ని, భ్రూమధ్యంలో నిలబెడితే ప్రాణస్పందం తగ్గిపోతుంది.

13. మనస్సును హృదయాకాశంలోకి తీసుకెళ్లి, అక్కడ వాసనారహితమైన ధ్యానం చేస్తే, ప్రాణస్పందం తగ్గిపోతుంది.

14. గురువుల అనుగ్రహంవల్ల గానీ, ఈశ్వరుడి అనుగ్రహంవల్ల గానీ, ఒకొక్కప్పుడు ఊహించని రీతిలో తత్త్వజ్ఞానం కలుగుతూ వుంటుంది. అలా జరిగితే, ప్రాణస్పందం దానంతట అదే తగ్గిపోతుంది.

ఇలా వశిష్ఠమహర్షి ఉపాయ పరంపరను చెప్పుకుంటూ పోతుంటే, ఇక్కడ రాముడు ఒక ప్రశ్న వేశాడు.

**శ్రీరాముడు:** గురుదేవా! హృదయాకాశం అంటున్నారు కదా. హృదయం అంటే ఏమిటి? కొన్ని చోట్ల పద్మపు మొగ్గ లాగా వుండే ఒక మాంస పిండాన్ని హృదయం అంటున్నారు. కొన్ని చోట్ల మనసే హృదయం అంటున్నారు. కొన్ని చోట్ల హృదయం అంటే పరమాత్మ అంటున్నారు. మీరు దేనిని హృదయం అంటున్నారు?
**వశిష్ఠుడు:** రామా! జీవుల హృదయం రెండు రకాలు. ఒకటి ఉపాదేయము, రెండు హేయము. ఉపాదేయము అంటే స్వీకరించ దగినది. హేయము అంటే వదిలిపెట్ట దగినది.

మానవ శరీరంలో, ఛాతిలో తామర మొగ్గ లాగా వుండే మాంసపిండం అన్నావే, అదే హేయ హృదయం. మనస్సనేది కూడా పరిచ్ఛిన్నమైనది. అంటే మాంసఖండం లాగానే కొలతలు కలదే. కనుక, అది కూడా హేయ హృదయమే.

ఇక "హృది అయం" (లోపల వుండే వీడు) అనే అర్థంలో, హృదయంలో నివసించే పరమాత్మనే హృదయం అనటం కూడా వుంది. ఇది ఉపాదేయ హృదయం. ఈ హృదయం లోపలా, బైటా కూడా, వుంటుంది.

కనుక రామా! ఈ ఉపాదేయ హృదయంలో వుండే వాసనలను విడిచి పెట్టి, అక్కడ మనస్సును నిలబెడితే, ప్రాణస్పందం తగ్గిపోతుందనేదే నా అభిప్రాయం. రామా! ఇదే కాదు, ఇంకా చాలా మంది పెద్దలు చాలా ఉపాయాలు చెప్పారు. యోగ శాస్త్రంలో ఇంకా చాలా విశేషాలున్నాయి. వీటిని అభ్యాస క్రమంతో సాధించాలి. తొందరపడి సాధిస్తే వ్యాధులు వస్తాయి. వైరాగ్యం లేకుండా ఈ సాధనలు చేస్తే, భోగ లంపటులౌతారు. ఈ జాగ్రత్తలు తీసుకొని పై సాధనలు చేస్తే జీవన్ముక్తు లౌతారు.

## 32. జ్ఞానం ద్వారా చిత్తనాశము

**శ్రీరాముడు:** గురుదేవా! చిత్తస్పంద శాంతికి రెండు ఉపాయాలున్నా యన్నారు. వాటిలో మొదట ఉపాయమైన యోగాన్ని గురించి వివరించారు. ఇక సమ్యగవేక్షణమే రెండో ఉపాయం అన్నారు. అంటే జ్ఞానమే కాదా! దాన్ని వివరించండి.
**వశిష్ఠుడు:** రామా!

**ఇమా ఘట పటాకారాః**
**పదార్థ శత పంక్తయః ।**
**ఆత్మైవ నాన్యదస్తీతి**
**నిశ్చయస్సమ్యగీక్షణమ్ ॥** (సర్గ 79, శ్లోకం 3)

రామా! ఈ ప్రపంచంలో కనిపించే కోటాను కోట్ల పదార్థాలన్నీ నీ ఆత్మే. అంతకన్నా మరొకటి లేదు– అనే నిశ్చయమే సమ్యగవేక్షణం, చక్కని చూపు. దీన్ని అభ్యాసం చేస్తే ప్రాణ స్పందం దానంతట అదే తగ్గిపోతుంది.

వశిష్ఠమహర్షి ఈ విషయాన్ని 20 శ్లోకాలలో వివరించి, 79వ సర్గను పూర్తి చేశాడు.

ఇక 80వ సర్గలో ఆయన ఒక విధమైన తత్త్వానుసంధాన పారవశ్యంలో పడిపోయి ఒక్కొక్క ఇంద్రియాన్నీ సంబోధిస్తూ, "నువ్వు అబద్ధాన్నే చూపిస్తున్నావు, నువ్వు అసత్యాన్నే చూపిస్తున్నావు"– అని యుక్తులతో నిరూపిస్తూ, ఇంద్రియాలవల్ల కలిగే జ్ఞానం సమ్యగ్ జ్ఞానం కాదని నొక్కి చెప్పాడు.

ఆ తరువాత 81వ సర్గలో, అసలు చిత్తం అనేది లేనే లేదని అనేకరకాల యుక్తులతో మళ్ళీ నిరూపించాడు. ఇవన్నీ పూర్వం అనేక సార్లు చెప్పినవే అయినా, వశిష్ఠ మహర్షి చెప్పే విధానంలో మాత్రం ఎక్కడికక్కడ కొత్తదనం కనిపిస్తూనే వుంటుంది.

ఇంత పారవశ్యంతో జ్ఞాన తత్త్వాన్ని మననం చేసిన వశిష్ఠ మహర్షి, చివరికి వచ్చే సరికి, "ఇదంతా బృహస్పతియొక్క అన్నగారైన సంవర్తమహర్షి చేసుకొన్న అను సంధాన మయ్యా! ఆయనే ఒక సారి నాకు చెప్పాడు. అదే నీకు చెప్పా"– అని తన జ్ఞానావేశాన్ని అలవోక మాటగా చెప్పి తప్పించేసుకున్నాడు.

ఐనా, లోపల వుండే జ్ఞాన ప్రీతి చల్లారక –

"పూర్వం వీతహవ్యుడు అనే మహర్షి కూడా ఇలాగే ఇంద్రియాలకు బోధ చేసుకుంటూ తత్త్వాను సంధానం చేశాడయ్యా! ఆయన చేసిన అనుసంధానం కూడా నీకు వినిపిస్తాను, విను" – అంటూ 82వ సర్గలో ఆయన ఆ విషయాన్ని ప్రారంభించాడు. ఈ బోధ 82,83 సర్గలు రెండింటా కొనసాగింది. ఇక్కడ వశిష్ఠ మహర్షి ఒక అద్భుతమైన ప్రజ్ఞ ప్రదర్శించాడు.

అదేమిటంటే, సరిగా దీనికి వెనకాలే సంవర్త మహర్షి చేసిన ఆత్మ విచారాన్ని , ఇంద్రియ ప్రబోధాన్ని, వర్ణించాడు. దాని వెంటనే వీతహవ్యుడి తత్త్వబోధను ప్రారంభించాడు. దీంట్లో కూడా, ఇంద్రియ ప్రబోధం వుంది. రెండూ సమాంతరంగానే సాగుతాయి. విషయంలో మార్పు లేదు. ఐనా సరే, పునరుక్తి అనిపించనీయడు. ఆ విధంగా వీతహవ్యుడి ఆత్మానుసంధాన విధానాన్ని వర్ణించి, వర్ణించి, చివరికి ఆయన ఆత్మసిద్ధిని పొందిన విధానాన్ని 84వ సర్గలో ఇలా చెప్పాడు.

## 33. కాలం ఎలాంటిదో దేశమూ అలాంటిదే

**వశిష్ఠుడు:** రామా! వీత హవ్యమహర్షి వింధ్యపర్వత గుహల్లో ఈ విధంగా ఆత్మ విచారణ చేసుకొని, చేసుకొని చివరికి మూడు వందల ఏళ్లపాటు ఏక ధాటి సమాధిలో వుండిపోయాడు.

ఈ మధ్యలో వానలొచ్చాయి, వరదలు వచ్చాయి, ఉరుములు వచ్చాయి, రాజుల వేటలు వచ్చాయి, ఏనుగులు , సింహాలు, అడవిగోలలు, ఇలా చాలా వచ్చాయి. వరదలకు కొట్టుకు వచ్చిన బురదలో ఆయన కూరుకు పోయాడు. ఆ తరువాత వచ్చిన ఎండలకు ఆ బురద ఎండిపోయి, ఆయన దాంట్లో బిగుసుకు పోయాడు. ఇంత జరిగినా ఆయనకు మెలకువ రాలేదు.

మూడువందల సంవత్సరాలైనాక, ప్రారబ్ధ శేషం వెంటబడింది. సమాధి సడలింది. మళ్లీ మనస్సు మొలకెత్తింది. ఏవేవో కల్పనలు ప్రారంభించింది. ఆ కల్పనలు మూడు వందల ఏళ్లపాటు సాగాయి.

ఆ కల్పనల్లో ఆయన ఒక వందేళ్లు కైలాస పర్వతం మీద మహర్షిగా ఉన్నాడు. ఆ తరువాత మరో వంద ఏళ్లు విద్యాధర లోకంలో విద్యాధరుడుగా వున్నాడు. ఆ తరువాత ఐదు యుగాలపాటు స్వర్గలోకంలో దేవేంద్రుడిగా ఉన్నాడు.

**శ్రీరాముడు:** గురుదేవా! అదేమిటి? మూడువందల ఏళ్లపాటు మాత్రమే సాగిన కల్పనలో ఐదు యుగాల ఇంద్రపదవేమిటి? ఇదెలా కుదిరింది?

**వశిష్ఠుడు:** రామా! సంకల్పంలో పుట్టే ప్రపంచానికి నియమా లేమిటయ్యా? సంకల్పోన్ముఖమైన చిచ్ఛక్తే మనస్సు– అని నీకు చెప్పాను. తనకు ఎక్కడ ఎలాంటి ఆలోచనలు వస్తే, అలాంటి కొలతలను, అలాంటి నియమాలను, కల్పించుకుంటుంది చిచ్ఛక్తి! వీతహవ్యుడికి సమాధినుంచి వెలుపలకు రావటం ఒక కల్పన. ఆ కల్పనలోని కొలతల ప్రకారం, అది మూడు వందల ఏళ్ల కాలం. ఆ కల్పనలో వివిధ లోకాల దర్శనం మరో కల్పన. ఈ రెండవ కల్పనలోని చిత్త వృత్తులయొక్క కొలతలు వేరు. ఆ కొలతల ప్రకారం అది ఐదు యుగాల కాలం. అంతే కాదు, నిజానికి ఆయన ఆ కల్పనలోనే మరో కల్పకాలం పాటు శివలోకంలో వుండే గణపతుల్లో ఒక గణపతియై ఈశ్వర సేవ చేశాడు. అసలు విచిత్రం ఏమిటంటే, ఇన్ని కల్పనలు సాగుతున్నా, ఆయన జీవన్ముక్తుడుగానే వుండిపోయాడు. దాంట్లో ఏ మార్పూ లేదు.

**శ్రీరాముడు:** అదేమిటండీ, జీవన్ముక్తులు కూడా కల్పనలు చూస్తున్నారంటే వారికి కూడా బంధమోక్షాలున్నట్టే కదా! బంధమోక్షాలుంటే ఇక జీవన్ము క్తి ఏమిటి?

**వశిష్ఠుడు:** జీవన్ముక్తులకు ప్రపంచం కనిపించదను కోవటం పొరపాటు. కనిపిస్తుంది. కానీ, ప్రపంచం అంతా నిర్మలమైన బ్రహ్మస్వరూపంగా కనిపిస్తుంది. జీవన్ముక్తులకు కూడా పూర్వం అనుభవించిన సుఖదుఃఖాలు మళ్ళీ అనుభవానికి వస్తూ వుంటాయి. కానీ, తేడా ఏమిటంటే, ఈ మాటు అవి మాడిపోయిన గింజల్లాగా వుంటాయి. అవి కొత్త సంస్కారాలను పుట్టించ లేవు. ఆ విధంగానే, వీత హవ్యుడు అనేక లోకాలను దర్శించాడు. సుఖదుఃఖాలను అనుభవించాడు. అంతే గాదయ్యా, ఆ నాడు ఐదు యుగాల పాటు దేవేంద్రుడిగా వున్న జీవుడే, ఇప్పుడు ఒక చిన్న దేశంలో చిన్న రాజుగా వున్నాడు. అతను ఈ క్షణాన ఎవరితోనో యుద్ధానికి బయలు దేరబోతున్నాడు. పూర్వం కల్పకాలం పాటు శివలోకంలో వున్న గణాధిపతి దగ్గర ఆడుకొన్న హంసే ఇప్పుడు నిషాధ దేశానికి రాజుగా వుంది.

**శ్రీరాముడు:** మళ్లీ ఇదేమిటండీ? ఇందాక ఆ లోకాలు, ఆ కాలము, అన్నీ కూడ వీతహవ్యుడియొక్క మానసిక సృష్టే అన్నారు కదా! ఒకానొక జీవియొక్క మానసిక ప్రపంచంలోని జీవులు, ఇప్పుడు ఈ లోకంలో దేహధారులెట్లా అయ్యారు?

**వశిష్ఠుడు:** రామా! ఈ కనిపించే ప్రపంచం కూడా ఒకానొక మానస సృష్టే – అని నీకు అనేక సార్లు చెప్పాను కదా! ఈ సృష్టికి మూల భూతమైన మనస్సు కూడా ఒక కల్పనే అని చెప్పాను కదా!.అలాంటప్పుడు, ఇక్కడి ఈ ప్రపంచం ఏదో గట్టి ప్రపంచం లాగా నీకెందుకు అనిపిస్తోంది? ఎందుకు అనిపిస్తోందంటే, ఈ కనిపించే ప్రపంచం మనస్సు చేసే కల్పన– అనే విషయం నీకు గట్టిగా పట్టలేదు. అది పట్టనంత కాలమూ ఈ ప్రపంచం ఎంతో గట్టిది లాగా అనిపిస్తుంది. దీనిలోకి ఇతర ప్రపంచాల జీవులు ప్రవేశించటానికి వీలు లేదని అనిపిస్తుంది. ఇది కూడా ఒక కల్పనే అని నిశ్చయ మైననాడు, ఈ ప్రశ్నలే వుండవు.

**శ్రీరాముడు:**గురుదేవా! సరిపోయింది. కాలం విషయంలో ఎలాంటి సమన్వయం కుదిరిందో, అలాంటి సమయాన్నే దేశానికి కూడా వర్తింప చేస్తే, మీరు చెప్పిన సమన్వయం చక్కగా సరిపోతుంది. ఇంతకూ ఇన్ని

కల్పనలు చేసుకొన్న వీతహవ్యుడు ఏమి చేశాడు?

**వశిష్ఠుడు:** రామా! వీతహవ్యుడు శివలోకంలో ప్రమథ గణపతిగా వున్న సమయంలో, ఒక సారి, తనకు పూర్వం గడిచిన జన్మలన్నింటినీ చూడాలనే సంకల్పం కలిగింది. చూడటం మొదలు పెట్టాడు. ఆ వరుసలో, బురదలో పాతుకు పోయి గడ్డి మొలచివున్న వీతహవ్య శరీరం కనిపించింది.

అది కనిపించే సరికి కల్పనలన్నీ వెనక్కు మళ్లాయి. ఇప్పుడు మళ్లీ ఆ శరీరంలోకి ప్రవేశించాలని సంకల్పం కలిగింది. కానీ ఇప్పుడు ఆ శరీరం పూర్తిగా శిథిలమై పోయి వుంది. అది మళ్లీ ప్రవేశించటానికి తగినదిగా కనిపించటం లేదు. ఇక విదేహ కైవల్యంలోకి వెళ్ళి పోవాలని అనిపిస్తోంది. కానీ, కొంచెం ప్రారబ్ధ శేషం అడ్డంగా కనిపిస్తోంది. ఏమి చెయ్యాలా అని అలోచించాడు. ఆకాశంలో సూర్యుడు, ఆయన పక్కన పింగళుడు అనే సూర్య సేవకుడు, కనిపించారు.

మట్టిలో పాతుకు పోయివున్న వీతహవ్య శరీరాన్ని పైకి లాగాలంటే వీళ్లిద్దరూ సహాయం చెయ్యగలరు అని తోచింది.

వెంటనే వీతహవ్యుడు సూక్ష్మ శరీర ధారియై, సూర్య బింబంలోకి ప్రవేశించాడు.

సూర్య భగవానుడు ఇది గమనించి, మహర్షి ఆలోచనలను గ్రహించి, తన సేవకుడైన పింగళుడికి సంజ్ఞ చేశాడు. వెంటనే వీతహవ్యుడు సూర్యబింబాన్ని వదిలిపెట్టి పింగళుడి శరీరం లోకి ప్రవేశించాడు. ఇప్పుడు పింగళుడి స్థూలశరీరంలో రెండు సూక్ష్మ శరీరాలున్నాయి. అలాంటి దశలో, పింగళుడు భూమికి దిగి, వింధ్య పర్వతం మీద వీతహవ్యుడి శరీరం పాతుకు పోయి ఉన్న చోటికి వెళ్ళి, తన వేళ్లతో, గోళ్లతో, అక్కడి మట్టిని పెళ్ళగించి, వీత హవ్యుడి పాత శరీరాన్ని బయటకు తీసి, తన యోగశక్తితో దానికి మళ్లీ పూర్వ స్థితిని కల్పించాడు.

వెంటనే పింగళుడి శరీరంలో వున్న వీతహవ్యుడి సూక్ష్మ శరీరం బయటకు వచ్చేసి, వీతహవ్య స్థూల శరీరంలోకి ప్రవేశించింది. వెంటనే అది లేచి నిలబడింది.

వీతహవ్యుడు, పింగళుడు, ఒకరికొకరు నమస్కారాలు చేసుకున్నారు. పింగళుడు ఆకాశంలోకి ఎగిరిపోయాడు. వీత హవ్యుడు స్నానానికి వెళ్లిపోయాడు. ఆ పగలంతా ఆయన ఆ కొండలమీద అలా అలా తిరుగుతూ కాలక్షేపం చేశాడు.

సాయంత్రం అయ్యేసరికి మళ్లీ సమాధిలోకి వెళ్లాలనే తపన బయలుదేరింది. అదే సత్సంస్కారబలం! వెంటనే ఆయన ఒక మంచి కొండగుహ చూసుకొని, దానిలో పద్మాసనంలో కూర్చొని, సమాధి ప్రయత్నం మొదలు పెట్టాడు.

ఈ మాటు ఆయన సమాధి ప్రయత్నం అంతా కేవలం విచారణ మార్గంలోనే సాగింది. ఆ విచారణ ఆరు రోజుల పాటు దేహస్మృతి లేకుండా సాగిపోయింది.

ఆరు రోజులైన తరువాత దేహ స్మృతి వచ్చింది. చిత్రమేమిటంటే, ఇది మెలకువ లాగా లేదు. నిద్ర లాగా వుంది. వేసవి కాలంలో సుదూర ప్రయాణం చేసే బాటసారి ఎండవేళ ఒక చెట్టు కింద కొద్ది నిమిషాల పాటు కునికినట్లు వుంది అతని మెలకువ స్థితి.

ఆయన అలా చాలా సార్లు జ్ఞాన సమాధిలోకి వెళ్ళి, అప్పుడప్పుడు బయటకి వస్తూ వుండేవాడు. ఆ విధంగా ఆయన జీవన్ముక్తుడుగా ముప్పై వేల సంవత్సరాలు జీవించాడు. ఈ జీవితకాలంలో కొంత సేపు ధ్యానంలో వుండేవాడు. కొంత సేపు ఇటూ అటూ తిరుగుతూ వుండేవాడు. ఎలా వున్నా గూడా, మనస్సులో

ఏ వస్తువునూ కోరేవాడు కాదు. దేన్నీ నిందించేవాడు కాదు. ఆయనకు సంతోషమూ లేదు; దుఃఖమూ లేదు. ఆయనకెప్పుడూ ఒకటే సరదా. తన ఇంద్రియాలతో తనే మాట్లాడుకుంటూ వుండేవాడు. తాను అనుభవిస్తున్న ఆత్మానంద స్థితిని ఆ ఇంద్రియాలకే బోధిస్తూ ఉండేవాడు. ఒక్కొక్కసారి వాటితో వాదిస్తున్నట్టుగా ఉండేవాడు.

ఇలా చాలా కాలం గడిచాక, ఆయన ప్రారబ్ధ శేషం తీరిపోయింది. దాంతో శరీరాన్ని విడిచిపెట్టి విదేహ కైవల్యంలోకి ప్రవేశించాలనే సంకల్పం కలిగింది.

వెంటనే ఆయన పద్మాసనం వేసుకుని కూర్చొని, తన ఇంద్రియాలను ఒక్కొక్క దానిగా పిలిచి, కొంత జ్ఞానబోధ చేసి, "ఇక నువ్వు నీ కారణంలో కలిసిపో, ఓ నేత్రేంద్రియమా! నువ్వు సూర్యుడిలో కలిసిపో, ఓ నాసికేంద్రియమా! నువ్వు భూమిలో కలిసిపో, ఓ ప్రాణవాయువులారా! మీరు మహావాయువులో కలిసిపోండి. ఓ కర్ణేంద్రియమా! నువ్వు ఆకాశంలో కలిసిపో. ఓ జిహ్వేంద్రియమా! నువ్వు నీళ్లలో కరిగిపో. ఇంతకాలమూ ప్రతిబింబ రూపంగా వున్న నేను, ఇక నా బింబ రూపమైన మహా చైతన్యంలో లీనమై పోతున్నాను" – అని ఈ విధంగా ఇంద్రియబోధ చేస్తూ చేస్తూనే, మెల్లిగా అది కూడా మానేసి, ఓంకారాన్ని మెల్లిగా, బిగ్గరగా, దీర్ఘంగా ఉచ్చరించటం ప్రారంభించాడు. అలా ప్రణవోపాసన చేస్తూనే, అధ్యారోపవాద విధానాలతో తన మీద ఆరోపించుకున్న మిథ్యా భ్రాంతులను తొలగించుకుంటూ, పరిశుద్ధ బ్రహ్మ స్వరూపం దగ్గరికి వచ్చాడు. దానిలోనే స్థిరంగా నిలబడి పోయాడు. మెల్లిగా ఆ ఓంకార ధ్వని కూడా ఆగిపోయింది. (అధ్యారోపము అంటే, ఆత్మ మీద అవ్యక్తము, మహత్తు, అహంకారము, పంచభూతాలు, ఇత్యాది క్రమంలో ఒక దానిమీద మరొకటిగా ఆరోపణలు జరిగిపోయిన క్రమాన్ని అనుసంధానం చేసుకోవటం. అపవాదం అంటే – దీనికి తల్లకిందులు క్రమంతో ఒక్కొక్క దాన్నీ తీసుకుని, ఇది లేదు, ఇది లేదు, అని నిశ్చయం చేసుకుంటూ రావటం.)

ఇలా చేస్తూ వుండగా ఉన్నట్టుండి ఒక ఆత్మతేజస్సు ప్రకాశించిన అనుభవం కలిగింది. అంతలోనే వెలుగునూ, చీకటినీ కూడా, దాటిపోయిన అనుభూతి! అదే మనస్సును దాటి పోయిన స్థితి! ఈ స్థితిని –చలనాన్ని వదిలిపెట్టిన గాలియొక్క స్థితితో పోల్చవచ్చు. ఇదే సాక్షి మాత్ర స్థితి.

ఇంతవరకూ ఆ మహర్షి అందుకున్నవి 6,7 జ్ఞాన భూమికలు. అవి ఇంకా గట్టిపడి ఆయన తురీయ స్థితిలోకి ప్రవేశించాడు.

అక్కడ స్వరూపానందమే కాని, విషయానందమే లేదు. అక్కడ తనకు సద్రూపత్వమే కాని తనకంటే భిన్నమైన వేరే సత్తా రూపం లేదు. అక్కడ పరిపూర్ణమైన చిన్మయత్వమే కాని, అచిత్ అనేది లేనే లేదు.

ఇదే చివరి స్థితి. శూన్యవాదులు చెప్పే శూన్యమిదే. బ్రహ్మవాదులు చెప్పే బ్రహ్మమిదే. విజ్ఞానవాదులు చెప్పే విజ్ఞాన మిదే. సాంఖ్యులు చెప్పే పురుషుడు ఇదే. యోగులు చెప్పే ఈశ్వరుడిదే. శైవులు చెప్పే శివుడిదే. కాలవాదులు చెప్పే కాలం ఇదే. ఆత్మ వేత్తలు చెప్పే ఆత్మ ఇదే. సౌతాంత్రిక వైభాషికులు చెప్పే నైరాత్మ్యం ఇదే. (నైరాత్మ్యం అంటే, క్షణిక విజ్ఞాన ప్రవాహము. అది ఎన్నటికీ స్థిరంగా వుండదనేది వారి సిద్ధాంతం.) మాధ్యమికులు చెప్పే చిదచిన్మధ్య శూన్యమిదే. సర్వసమతా వాదులైన జీవన్ముక్తులు చెప్పే సర్వ పరిపూర్ణ పదార్థం ఇదే.

ఇక్కడ వీతహవ్య మహర్షియొక్క విదేహ కైవల్య స్థితిని వర్ణించటానికి, వాల్మీకి మహర్షి ఆత్మవాదుల మతాలన్నింటినీ పేరు పేరునా స్వీకరించాడు. అంతేగాక, వాటిని ఒక క్రమంలో అమర్చాడు కూడా. ముందుగా శూన్యవాదులుయొక్క శూన్యంతో ప్రారంభించి, చిట్ట చివరిగా జీవన్ముక్తుల పరిపూర్ణ వాదంతో ఈ వరసను పూర్తి చేశాడు. ఇవి రెండూ రెండు కొసలు. మిగిలినవన్నీ శూన్యానికీ, పరిపూర్ణానికీ , మధ్యలో వుండే

తారతమ్యస్థాయీ  విశేషాలు మాత్రమే– అనే విషయాన్ని కూడా కవి ఇక్కడ శిల్ప సుందరంగా మనకు అందిస్తున్నాడు.

మళ్లీ మన కథా ప్రసంగంలోకి వస్తే, వీతహవ్యుడు ఈ విధంగా తురీయ స్థితిని దాటిపోయే స్థితి వచ్చేసరికి, అతని శరీర నాడుల్లో వుండే ప్రాణాలన్నీ హృదయ స్థానానికి వచ్చి చేరాయి. అక్కడ్నుంచి అవి పంచభూతాల్లో కలిసిపోయాయి. స్థూల దేహం మాత్రం అలాగే వుండి పోయింది.

ఈ విధంగా వీతహవ్యుడి విదేహ కైవల్య కథను ముగిస్తూ వశిష్ఠమహర్షి చివరికి ఇలా అన్నాడు –
**వశిష్ఠుడు :** రామా! వీతహవ్యుడు కేవలం జ్ఞానాన్ని మాత్రమే సాధనంగా పెట్టుకొని ముక్తిని సాధించాడు. ఆ వివరాలన్నీ నీకు చెప్పాను. కనుక, నువ్వు గూడా జ్ఞానాభ్యాసం పెంచుకో.

## 34. కలలో కల- కల్పనలో కల్పన

**శ్రీరాముడు:** గురుదేవా! ఆయన తన హృదయంలో సంకల్ప మయమైన ప్రపంచాన్ని నిర్మించుకున్నాడు కదా! ఆ కల్పనా ప్రపంచంలో  యోగవిద్యను ఆధారంగా చేసుకొని, సూర్యుడిలోకి ప్రవేశించి, అక్కడ ఉండే పింగళుడి ద్వారా తన పాత శరీరాన్ని పైకి తీయించి, దానికి మరమ్మత్తులు చేయించి, మళ్లీ అందులోకి ప్రవేశించాడు కదా! అంటే, ఆయన తనయొక్క మనఃకల్పిత ప్రపంచంలో చేసిన సాధన ఈ ప్రపంచంలో సత్ఫలితాలను ఇచ్చిందని చెప్పినట్లవుతోంది కదా! ఇదెలా కుదురుతుంది?
**వశిష్ఠుడు:** మనమందరమూ అనుభవించే ప్రపంచం వేరు, వీతహవ్యుడు కల్పించుకున్న ప్రపంచం వేరు– అనే అభిప్రాయంలో నువ్వు వున్నావు. అది పొరపాటు. సరిగ్గా చూస్తే, మనం మన కంటితో చూస్తున్నామనుకుంటున్న వీతహవ్యుడు మన మనస్సు చేసే కల్పనలో భాగం మాత్రమే. అందుచేత, ఆ వీతహవ్యుడు నీ మనస్సే అని చెప్పవచ్చు. నిజానికి నీ మనస్సే నువ్వుగా, నేనుగా, ఈ సమస్త ప్రపంచంగా భాసిస్తోంది. ఇందులో ఒక దానికీ మరో దానికీ మధ్య భేదం వుందని కాని, భేదం లేదని కాని, చెప్పే వీలు లేదు. భేదాభేదాలను సత్య పదార్థాల విషయంలో ప్రస్తావించగలం గానీ, అసత్య పదార్థాల విషయంలో ప్రస్తావించలేం కదా! కనుక, వీతహవ్యుడియొక్క మనస్సు కల్పించిన ప్రపంచం కూడా, మన బోటివాళ్ళందరం కల్పించుకొని చూసుకొనే దృశ్య ప్రపంచంలోని భాగమే కాని, అది వేరే కొత్త ప్రపంచం కాదు. కనుక నీ ప్రశ్నకు సావకాశమే లేదు.
**(గమనిక** గాధి చరిత్రలో గూడా రెండు మనో రాజ్యాలు ఒక దానిలో ఒకటి కలిసిపోయిన సందర్భం వుంది. కానీ, ఇతరుల మనోరాజ్యం గూడా మన మనోరాజ్యంలోని భాగమే అని అక్కడ నొక్కి చెప్పలేదు. దాన్ని విస్పష్ట పరచేందుకే వశిష్ఠమహర్షి ఇక్కడ ఈ సన్నివేశాన్ని ప్రత్యేకంగా వివరిస్తున్నాడని మనం గ్రహించాలి.)
**శ్రీరాముడు:** గురుదేవా! మరో సందేహం వుంది. ఆత్మవేత్తలైన జీవన్ముక్తులలో ఎక్కువ మందికి ఆకాశ గమనాది దివ్యశక్తులు కనిపించవు. ఎందుకని?
**వశిష్ఠుడు :** రామా! ఈ శక్తులు రకరకాలుగా వస్తాయి. కొందరు దేవజాతులవారికి, ఇవి సహజ సిద్ధమైన శక్తులు. వాళ్లు ఆ శరీరంలో వున్నంత కాలమూ అవి వుంటాయి. ఆత్మ వేత్తలైన మానవులకు ఇవి సహజ సిద్ధమైన శక్తులు మాత్రం కావు. కావాలంటే వాటిని సాధించుకోవచ్చు. మణులు, మంత్రాలు, ఓషధులు,

మొదలైనవి ఇందుకు ఉపయోగిస్తాయి. వీటిని సాధించుకోవడానికి ఆ వ్యక్తి జీవన్ముక్తుడు కావాలనే నియమం లేదు. అసలు కొన్ని శక్తులకు మనుష్యులై పుట్టాలనే నియమం కూడా లేదు. ఉదాహరణకు, దోమలకు ఆకాశగమన శక్తి ఉన్నట్టు కనిపిస్తూనే వుంది కదా! ఇక ఆత్మజ్ఞానం కోసం సాధన చేసే సాధకుడు, ఈ దివ్యశక్తులను గురించి ఆలోచించనే ఆలోచించడు. అతనికి ఇవన్నీ అవిద్యలో భాగాలే అని తెలుసు. అందుచేత అతను వాటిని తుచ్ఛమైన వాటిగా చూస్తాడు. తుచ్ఛము అంటే, కుందేటి కొమ్ము లాగా, పేరు మాత్రం వుండి, వేరే అస్తిత్వం లేని పదార్థం. అవిద్యను మొత్తాన్నీ తుడిచిపెట్టే ప్రయత్నంలో అతను వుంటాడు గనుక, మధ్యలో ఈ తుచ్ఛ దివ్య శక్తుల కోసం అతను ప్రయత్నం చెయ్యడు.

ఒక వేళ ఎవడైనా ఒక ఆత్మజ్ఞుడు, ప్రారబ్ధ శేషంచేత, ఇలాంటి శక్తులు కావాలని సంకల్పిస్తే, అతను కూడా మణులను, మంత్రాలను, ఓషధులను, యోగాలను, పట్టుకొని సాధించుకోవచ్చు. అప్పుడు అతనికి అవి లభిస్తాయి.

ఐతే, సామాన్యంగా జీవన్ముక్తుడు దేనినీ కోరడు. దేనినీ తిరస్కరించడు. పైగా ఈ శక్తులు మోక్షపదవికి ఉపకరించవు. కనుక, జీవన్ముక్తులలో ఎక్కువ మందికి వీటిని ఆదరించే అవసరం వుండదు. మన కథలో వీతహవ్యుడికి కూడా శక్తులు సంపాదించాలనే కోరిక లేదు గనుక అవి సిద్ధించ లేదు. మోక్షం కావాలనే కోరిక వుంది గనుక, దాని కోసం కృషి చేశాడు. అదే సిద్ధించింది.

**శ్రీరాముడు:** గురుదేవా! అలాగయితే, బురదలో కూరుకుపోయి బిగుసుకు పోయిన వీతహవ్య శరీరాన్ని ఏ నక్కలో, రాక్షసులో, ఎందుకు పీక్కు తినలేదు.? కనీసం అది ఎందుకు కుళ్లి పోలేదు? పింగళుడు వచ్చి దాన్ని పైకి తీసే సరికి, అది అంత తేలికగా ఎందుకు బాగు పడింది? వెనకటి శరీరాల్లో కల్పాల కొద్దీ సాధన చేసినా సిద్ధించని మోక్షం, ఈ వీతహవ్య శరీరంలోకి ప్రవేశించిన తరువాత కొద్ది కాలానికే ఎలా సిద్ధించ గలిగింది?

**వశిష్ఠుడు:** రామా! వీతహవ్య శరీరాన్ని పురుగులూ, పులులూ, పిశాచాలు, ఎందుకు తినలేదు? – అనేది నీ మొదటి ప్రశ్న. చెబుతా విను. నువ్వు పొరుగూరికి పోవాలని దారిలో నడుస్తున్నావు. దారిలో నీకు గిట్టని వాడొకడు కనిపించాడు. నీ మనస్సు క్రోధంతో కుత కుత లాడింది. కొంత దూరం పోయే సరికి, ఓ మిత్రుడు కనిపించాడు. నీ మనస్సు సంతోషంతో కిల కిల లాడింది. ఇంకా కొంత దూరం పోయేటప్పటికి, ఒక కొండ శిఖరం కనిపించింది. ఇప్పుడు నీ మనస్సులో క్రోధం కలిగిందా? స్నేహం కలిగిందా? రెండూ లేవు. దానికి కారణం ఏమిటి? నీ శత్రువులో ద్వేష భావం వుంది. ఆ భావం దగ్గరకి నీ మనస్సు వెళ్లేసరికి, ఇది కూడా ద్వేష భావంతో నిండిపోయింది. నీ మిత్రుడిలో స్నేహ భావం ఉంది. దాని దగ్గరకు వెళ్లేసరికి, నీ మనస్సు స్నేహంతో నిండిపోయింది. కొండ శిఖరంలో ద్వేషమూ లేదు, స్నేహమూ లేదు. అందువల్ల, అక్కడికి వెళ్లిన మనస్సులోకి, ఏ వికారమూ ప్రవేశించే సావకాశం లేదు. అందువల్ల కొండ శిఖరాన్ని చూసినప్పుడు అది రాగ ద్వేష రహితమైపోతుంది. అలాగే, ఒక మామిడి పండుని చూసినప్పుడు, నీకు దాని మీద ఒక ప్రేమ ఏర్పడుతుంది. ఎందుకంటే , అది తినదగినది అనే భావం నీకు ముందే వుంది. ఒక కుంకుడు పండును చూసినప్పుడు నీకు ద్వేష భావం పెరుగుతుంది. ఎందుకంటే, అది చేదు పండు – అని నీకు ముందే తెలుసు. నీకు ఏమీ తెలియని కొత్త పండు కనిపించిందనుకో, నీ మనస్సుకు దానిమీద రాగమూ పుట్టదు, ద్వేషమూ పుట్టదు. ఇది మనస్సుయొక్క స్వభావం.

ఉత్తములైన యోగీశ్వరులు రాగ ద్వేషాతీతమైన స్థితికి చేరిపోతారు. అలాంటివాళ్ల దగ్గరకు ఒక కొత్త మనస్సు చేరితే, ఆ మనస్సు లోకి, రాగమూ ప్రవేశించదు; ద్వేషమూ ప్రవేశించదు. కోరికా ప్రవేశించదు;

అసహ్యమూ ప్రవేశించదు. ఈ విషయాన్ని యోగశాస్త్రం కూడా నిర్ధారణ చేసి చెబుతోంది. తత్సన్నిధౌ వైరత్యాగః – అనేది యోగసూత్రం యోగుల సన్నిధిలో క్రూర జంతువులు కూడా పరస్పర విరోధాన్ని విడిచిపెడతాయి– అని అర్థం.

రామా! ఇక్కడ వీతహవ్యుడి విషయంలో ఇదే జరిగింది. ఆయన రాగ ద్వేషాతీత స్థితికి చేరాడు కనుక, పురుగులకు గాని, జంతువులకు గాని, రాక్షసులకు గాని, ఎవరికీ ఆయనను హింసించాలనే భావమే కలుగ లేదు. అందుకనే ఆ దేహం అలా వుండి పోయింది.

ఇక "ఆ దేహం ఎందుకు కుళ్లి పోలేదు?" అనేది నీ రెండవ ప్రశ్న. వీతహవ్యుడు సమాధియోగంచేత సామ్యావస్థ నందుకున్నాడు. ఆ తరువాత కొంత కాలం ఆ శరీరాన్ని వదిలి పెట్టి వేరే శరీరాలను ధరించాడు. సూక్ష్మ శరీరం వదిలేసిన తరువాత స్థూల శరీరం నశించాలి గదా, ఎందుకు నశించలేదు? అనేది నీ ప్రశ్న.

నశించటం అంటే, ఏమిటి? స్పందమే చలనం. చలనమే నాశం. ఈ స్పందం రెండు రకాలు. అంతస్స్పందము,
బాహ్యస్స్పందము. అంతస్స్పందము అంటే మానసిక స్పందము. మనస్సువల్ల కలిగే ప్రాణాది వాయుస్పందం కూడా అంతస్స్పందమే. ప్రాణాది వాయువులయొక్క స్పందంవల్ల కలిగే స్థూలేంద్రియ స్పందమే బాహ్య స్పందం. ఈ రెండు రకాల స్పందాలూ ఏ శరీరంలో వున్నాయో, ఆ శరీరం క్రమంగా నశిస్తుంది. ఆ రెండు రకాల స్పందాలూ లేని శరీరం, శిలాఖండం లాగా వెయ్యి సంవత్సరాలైనా అలాగే పడివుంటుంది. ఇది కూడా యోగ శాస్త్రప్రసిద్ధమే.

ఇక వీతహవ్యుడియొక్క సూక్ష్మ శరీరం అతని స్థూల శరీరాన్ని వదిలి పెట్టడమూ, కొత్త శరీరాలను ధరించటమూ, మళ్లీ పాత శరీరంలోకి ప్రవేశించటమూ, ఇవన్నీ అతని మనస్సు చేసే విలాసాలలో భాగాలే. కానీ, ఆ మనస్సు అప్పటికే రెండు రకాల వాయు స్పందనలనూ దాటి పోయింది కనుక, ఆ శరీరంలో ఏ రకమైన మార్పులూ లేకుండా, అలా రాయి లాగా వుండి పోయింది.

రామా! "వీతహవ్యుడికి పాత శరీరంలోకి ప్రవేశించగానే త్వరగా విదేహ ముక్తి రావటానికి కారణమేమిటి?" – అనేది నీ మూడవ ప్రశ్న.

రామా! విదేహకైవల్యం విషయంలో త్వరగా వచ్చింది, ఆలస్యంగా వచ్చింది – అనే మాటలకి అర్థం లేదు. సంసార బద్ధమైన మనస్సు అనేక ప్రయత్నాలను చేస్తూ చేస్తూ వుండగా, అనుకోకుండా, తత్త్వ జ్ఞానాన్ని పట్టుకుంటుంది. వీతహవ్యుడికి విదేహ ముక్తి విషయంలో అదే జరిగింది.

పెద్దలు ఒక మాట చెబుతూ వుంటారు –

**తుషేణ బద్ధో వ్రీహిస్స్యాత్**

**తుషాభావేతు తండులః ।**

**పాశబద్ధస్సదా జీవః**

**పాశముక్త స్సదా శివః ॥** (సర్గ 89, శ్లోకం 37 దగ్గర వ్యాఖ్యానంలో)

పైన పొట్టుంటే, అవి వడ్లు; పొట్టు లేకపోతే అవి బియ్యం. అలాగే బంధం వుంటే వాడు జీవుడు; బంధం పోతే వాడూ సదాశివుడు– అని అర్థం. కనుక, బంధముక్తిని అందుకున్న జీవన్ముక్తుడు సాక్షాత్తుగా శివుడితో సమానుడే. "తస్య హ వా దేవాశ్చ న భూత్యా ఈశతే, ఆత్మాహ్యేషాం స భవతి" (జీవన్ముక్తుడుయొక్క మహిమను దేవతలు గూడా అందుకోలేరు. ఆ దేవతలలోవుండే ఆత్మ ఇతడే అవుతున్నాడు) అనే వేద వాక్యం

కూడా దీన్నే సమర్థిస్తోంది. అందువల్ల సదాశివ సముడైన జీవన్ముక్తుడు ఎప్పుడు సంకల్పిస్తే అప్పుడే విదేహముక్తి లభిస్తుంది. ఆయన ఎప్పుడు సంకల్పిస్తాడనేది ఎవరూ చెప్పలేరు. అది కాకతాళీయంగా జరిగిపోతుంది. కనుక, విదేహముక్తికి కాల నిర్ణయం ఎవరూ చెయ్యలేరు. అందుకనే, వీతహవ్యుడికి బంధ రూపమైన మనస్సు నశించి పోయేటప్పటికల్లా, ఆత్మ విచారణ పెరిగి, మైత్రి మొదలైన యోగశాస్త్రోక్త సద్గుణాలు ఆవిర్భవించాయి.

## 35. సరూప మనోనాశం - అరూప మనోనాశం

**రాముడు:** అదేమిటి గురుదేవా? ఒక పక్క మనస్సు నశించి పోయిందంటున్నారు. మరో పక్క మైత్రి మొదలైన సద్గుణాలు ఆవిర్భవించాయి అంటున్నారు. మనస్సనేదే లేకపోతే, ఈ గుణాలు ఎక్కడ పొటమరిస్తాయి?
**వశిష్ఠుడు:** రామా! మనోనాశం రెండురకాలు. ఒకటి సరూప మనోనాశము, రెండవది అరూప మనోనాశము. సరూప మనోనాశము అంటే, జీవన్ముక్తులకు కలిగేటువంటి మనో నాశము. అరూప మనోనాశము అంటే, విదేహముక్తులకు కలిగేటువంటి మనో నాశము. ఇక్కడ వీతహవ్యుడికి కలిగింది సరూప మనో నాశం. అందువల్ల, ఆ మనస్సులో మైత్ర్యాది గుణాలు ప్రభవించాయి.
**శ్రీరాముడు:** గురుదేవా! సరిగా అర్థం కాలేదు. మనస్సుకి నాశనం అంటే ఏమిటి? నశించిన మనస్సుకి ఆకార మేమిటి? ఆ మనస్సు మళ్లీ పని చేసే విధాన మేమిటి? కొంచెం వివరంగా చెప్పండి.
**వశిష్ఠుడు:** రామా!

**సుఖ దుఃఖ దశా ధీరం**
**సామ్యాన్న ప్రోద్ధరన్తి యమ్ ।**
**నిశ్శ్వాసా ఇవ శైలేంద్రం**
**చిత్తం తస్య మృతం విదుః ॥** (సర్గ 90, శ్లో 12)

మనుషుల ఉచ్ఛ్వాస నిశ్వాసలు మహా పర్వతాన్ని కదిలించ జాలనట్లుగా, బైట నుంచీ వచ్చే సుఖ దుఃఖ దశలు, ఎవడియొక్క సమత్వ స్థితిని చెడగొట్ట జాలవో, అటువంటి ధీరుడియొక్క చిత్తాన్ని నశించినచిత్తం అంటారు.

అలాగే, "వాడు వేరు, నేను వేరు"– అనే ఆలోచన ఎవడివైశాల్యాన్ని కుంచింప చేయదో, అలాంటివాడి మనస్సు నశించిన మనస్సు.

అలాగే, సంపదలు గానీ, ఆపదలు గానీ, ఉత్సాహం గానీ, నిరుత్సాహం గానీ, ఎవడి ముఖ కవళికల్లో ఎటువంటి మార్పునూ తీసుకు రాలేవో, అలాంటివాడి మనస్సు నశించిన మనస్సు.

రామా! అర్థమైందనుకుంటా! ఇదే సరూప మనో నాశనంయొక్క స్వరూపం. ఇదే జీవన్ముక్తుడి మనోనాశ స్థితి. ఈ దశలో ఈ ప్రపంచం సత్యమనే భావం తొలగిపోతుంది. అప్పుడు ఆ మనస్సు శుద్ధ స్వభావంతో, సత్త్వ గుణంతో, ప్రకాశిస్తూ వుంటుంది. చిత్తం సరూప నాశాన్ని పొంది, ఈ రకంగా మిగిలి వుండటాన్నే "చిత్త సత్త" అని కూడా కొందరంటారు. ఇలాంటి చిత్తంలోనే మైత్ర్యాది సద్గుణాలు అంకురిస్తాయి.

ఇలాంటి చిత్తాన్ని నశించిన చిత్తమని ఎందుకన్నారంటే, దీనిలోని వాసనలు దాదాపు పూర్తిగా నశించి పోయాయి గనుక ఆలా అన్నాడు.

దీనిలో కొన్ని వాసనలు మిగిలి ఉన్నప్పటికీ, అవి పునర్జన్మ ఇవ్వటానికి సమర్థమైనవి కావు. ఐనా, కొన్ని వాసనలు మిగిలి వున్నాయి గనుక అవి ఆ జీవన్ముక్తుడియొక్క వ్యుత్థాన దశలో, అంటే సమాధి లేని దశలో, అనుభవానికి వస్తూవుంటాయి గనుక, ఆ చిత్తానికి ఎంతో కొంత రూపం వున్నట్టే లెక్క. అందుకనే, ఈ నాశాన్నే సరూపమనోనాశం అన్నారు. ఇలాంటి సరూపమనో నాశాన్ని అందుకున్న మనస్సుకే, మళ్ళీ కొంత వ్యవహార సామర్థ్యం ఏర్పడుతుంది. అప్పుడు జరిగే వ్యవహారానికి ఉపకరించేవే మైత్ర్యాది గుణాలు.

ఇక అరూప మనోనాశం వుంది. ఇది విదేహముక్తి దశలో లభిస్తుంది. ఇక్కడ కొన్ని సంస్కారాలు మిగిలి వుండటమనే మాటలేదు. అందువల్ల, ఆ చిత్తంలో మళ్ళీ మైత్ర్యాది గుణాలు మొలకెత్తటం గానీ వాటికి సంబంధించిన వ్యవహారాలు గానీ వుండవు.

రామా! చిత్తనాశం అంటే ఏమిటో నీకు పూర్తిగా అర్థమైందనుకుంటా.

### 36. *సంసార వృక్షబీజం*

**శ్రీరాముడు:** గురుదేవా! మనోనాశమంటే అర్థమైంది. మనస్సు దగ్గర ఇంకా కొంచెం సందేహం ఉంది. ఈ సంసారమే వృక్షమనుకుంటే, దానికి బీజమేమిటి? ఏదో ఒక బీజం వుందనుకుంటే, దానికి వెనకాల ఇంకొక బీజం, దానికి వెనకాల ఇంకొక బీజం, అలా వరుసగా వుండాలి కదా! ఏమిటవి?

**వశిష్ఠుడు:** రామా! ఈ స్థూల శరీరం కనిపిస్తోంది కదా! ఈ స్థూల శరీరం రావటానికి కారణం, లోపల వుండే లింగ శరీరం. ఎందుకంటే, దానిలోనే రకరకాల కర్మవాసనలూ దాగి వుంటాయి. వాటివల్లే, ఆ లింగశరీరం ఎప్పటికప్పుడు కొత్త కొత్త శరీరాలను తయారు చేసుకుంటోంది.

ఇలా వాసనలతో నిండివుండే లింగ శరీరానికి కారణం, ఆశలు గల చిత్తం. "అదేమిటండీ మనస్సు శరీరానికి కారణం కాగలదా!" అంటావేమో? మనస్సే కదా స్వప్నాలలో రకరకాల శరీరాలను తయారు చేస్తున్నది? కనుక, మనస్సు లింగ శరీరానికి బీజం.

ఈ చిత్తానికి బీజాలు ఒకటి కాదు, రెండు. 1) ప్రాణపరి స్పందము – అంటే, ప్రాణవాయు చలనము 2) దృఢ భావన – అంటే, వాసనలు లేక సంస్కారాలు.

ప్రాణవాయువు డెబ్భైరెండువేల నాడులలో తిరిగినప్పుడు, చిత్తం వ్యక్తమౌతుంది. ఆ వాయువు చలించక పోతే, సంకల్పం అనేదే లేదు. ప్రాణానికి స్పందన వున్నదా లేదా అనే విషయం చిత్తం ద్వారా మాత్రమే గుర్తింప బడుతుంది. చిత్తంలో సంకల్పం వుంటే, ప్రాణంలో స్పందం వున్నట్టే.

హిరణ్యగర్భుడి విషయంలో కూడా ఇది ఇంతే. సమిష్టి ప్రాణస్పందనవల్లనే హిరణ్యగర్భుడియొక్క చిత్తం ప్రపంచంయొక్క ఆకారాన్ని పొందుతోంది. (హిరణ్యగర్భుడు అంటే ప్రథమ జీవుడు) సమష్టి ప్రాణస్పందన ఆగితే, ప్రపంచానికి ప్రళయం వస్తుంది. అది పూర్తిగా పోతే, మోక్షం వస్తుంది. అందువల్లనే, ప్రాణస్పంద నిరోధంవల్ల మోక్షం వస్తుందని పెద్దలు చెబుతున్నారు. అందుకోసమే యోగులు ప్రాణాయామాది యోగ సాధనలు చేస్తున్నారు.

ఇక చిత్తానికి రెండో బీజం దృఢ భావన అని చెప్పాను కదా! దృఢ భావన అంటే వాసన.

**దృఢ భావనయా త్యక్త**
**పూర్వాపర విచారణమ్ ।**
**యదాదానం పదార్థస్య**
**వాసనా సా ప్రకీర్తితా ॥** (సర్గ 91 శ్లోకం 29)

సరిగా పూర్వాపర విచారణ చేస్తే, ఈ ప్రపంచంలో ఏ వస్తువూ సత్యంగా కనిపించదు. అలా సరిగా విచారణ చెయ్యకుండా, జ్ఞానేంద్రియాదులను నమ్మేసి, ఈ ప్రాపంచిక పదార్థాలు సత్యమేనని అంగీకరించేసి, వాటిలో కొన్ని నావని, కొన్ని నేనని, ఒప్పేసుకొని మాట్లాడుతున్నాడు జీవుడు. ఈ ఒప్పుకోవటానికి కారణం పూర్వ జన్మలలో చేసిన గట్టి భావనే– ఇవి సత్యాలు అనే భావనే. ఆ భావనే ఆ పదార్థాలకు కొత్త రంగులను అంట గడుతోంది. నాది అనే రంగును, నేను అనే రంగును, పనికి వచ్చేది అనే రంగును, పనికి రానిది అనే రంగును, ఇలా రకరకాల రంగులను అంటగడుతోంది. కనుకనే, దీనికి "వాసన" అని పేరు. "వాసయతీతి వాసనా" అనేది వ్యుత్పత్తి. (వాసన కలిగించేది వాసన)

ఒకానొక జీవికి శరీరము, ఇల్లు, మొదలైనవి వున్నా, పూర్వాపర విచారణ బాగా చేయటంవల్ల, వాటికి నేను, నాది– అనే రంగు తగులుకోక పోయినట్లైతే, వాడికి వాసనలు లేనట్లే. లోకంలో మనిషి దేన్ని గట్టిగా భావన చేస్తే, వీడు అలాంటివాడే అయిపోతున్నాడు. ఇది లోక ధర్మం.

**అసమ్యగ్దర్శనం యస్మాత్**
**అనాత్మన్యాత్మ భావనమ్ ।**
**యదవస్తుని వస్తుత్వం**
**తచ్చిత్తం విద్ధి రాఘవ ॥** (సర్గ 91 శ్లోకం 34)

దేనివల్లై తే సరియైన చూపు తొలగి, తను కానిదాని మీద తను అనే భావన కలుగుతుందో, సత్యం కానిదాని మీద సత్యం అనే భావన కలుగుతోందో, అదే చిత్తం. రామా! మరోసారి చెబుతున్నాను. ప్రాపంచిక పదార్థాలు నిజమైనవని భావించడమే చిత్తం. కనుకనే, చిత్తానికి దృఢ భావన రెండవ బీజమని నేను చెప్పాను.

రామా! ఈ రెండు బీజాలకీ ఒక విచిత్రమైన పరస్పర సంబంధం వుంది. ఏమిటంటే, వీటిల్లో ఏ ఒక్కటి నశించినా, రెండవది కూడా వెంటనే నశిస్తుంది. ఎందుకంటే, మనస్సు ఉద్భవించటానికి ఈ రెండు బీజాలూ కలిపి కారణం. విడిగా ఏ ఒక్కటీ అందుకు సరిపోదు. కుండలోకి నీళ్ళు తీసుకోవాలంటే, కుండలో ఆకాశమూ వుండాలి, చెరువులో నీళ్ళూ వుండాలి.

అలాగే, చిత్తం పుట్టాలి అంటే, ప్రాణ స్పందమూ వుండాలి; దృఢ భావనా వుండాలి. కనుకనే, వీటిల్లో ఏ ఒక్కటి నశించినా రెండవది నశించి తీరుతుంది. మరో విధంగా చెప్పాలంటే, ఈ రెండూ ఒకదానికొకటి బీజాలు. దీన్నే బీజాంకుర న్యాయము అంటారు. అంటే, విత్తుమొలక సామెత – అన్నమాట.

ఈ రెంటికీ కలిపి శబ్ద స్పర్శాది విషయాలు బీజం. విషయ పరిత్యాగం చేస్తే, ప్రాణస్పంద దృఢభావనలు రెండూ నశిస్తాయి. విషయ పరిత్యాగం అంటే, ఏమిటో తెలుసా? శబ్ద స్పర్శాది విషయాలన్నీ చిత్స్వరూపాలే. అనీ, అవి చిత్తు కంటే భిన్నమైనవి కావు – అనీ, భావించటమే. దీనినే "సంవేద్యత్యాగము" అని కూడా అంటారు.

విషయం జడం కదా! చిత్ అంటే చేతనం కదా! విషయం చిదభిన్నం ఎలా అవుతుంది? – అని సందేహిస్తావేమో! ఒకడు కలలో తన మరణాన్ని తనే చూశాడు. తాడు పాముగా కనిపించింది. ఇలాంటివన్నీ

ఎలా సంభవిస్తున్నాయి? నీ చిత్తంలో ఒక చైతన్యం వుండబట్టి, దాన్ని ఆధారం చేసుకొని, ఒక ప్రతిభాస కనిపిస్తోంది. అంటే ఒక దృశ్యం అనుభవానికి వస్తోంది. ఈ దృశ్యాలకు వేరే ఆధారం లేదు. కనుక ఇవన్నీ నీ చిత్తంలో వున్న చైతన్యంయొక్క రూపాంతరాలే అని చెప్పటంలో తప్పు లేదు. ఇదే తర్కాన్ని ఈ ప్రపంచానికి పట్టించు. ఈ జగజ్జాలమంతా గూడా ఒక ఆభాసే. కనుక, ఇది కూడా హిరణ్యగర్భుడియొక్క చిత్తంలోని చైతన్యంయొక్క రూపాంతరమే. కనుక విషయాలు చిదభిన్నాలు అనటంలో తప్పు లేదు. ఏ సంవేద్యాన్ని ( ఏ విషయాన్ని) చూసినా, ఇది సంవిత్తుయొక్క (చిత్తంలోని చైతన్యంయొక్క) రూపాంతరమే అనే అనుసంధానం పెరగాలి. ఇది పెరిగిన కొద్దీ సంవేద్యం (విషయం) కనిపించటం తగ్గి, సంవేదన (చైతన్యం)యొక్క స్ఫూర్తి పెరుగుతూ వుంటుంది. అలా విషయాలన్నీ తుడిచి పెట్టుకుపోతే, మిగిలేదే మోక్షం.

కనుక రామా!

**అసంవిత్తి రజాద్యస్థా**
**సుఖాయాజననాత్మనే ।**
**అజడో గలితానందః**
**త్యక్తసంవేదనో భవ॥** ( సర్గ 91, శ్లోకం 77)

వేద్యాలు కనిపించకపోవటం అనేది చిదేక రసంలో ప్రతిష్ఠింపబడినట్లైతే, అంటే, జడత్వం అంటని చిదేక రసస్వభావం గట్టిగా సుప్రతిష్ఠితమైనట్లైతే, శాశ్వత ఆనందం లభిస్తుంది. అందువల్ల ఓ రామా! నువ్వు జడత్వాన్నీ వదిలి పెట్టు; సంవేదనాన్ని కూడా పరిత్యజించు. దానివల్ల పరిపూర్ణ ఆనంద స్వరూపుడివికా.

(గమనిక: ఈ శ్లోకంలో "గళితానందః" అనే పదం వుంది. మామూలుగా ఐతే, ఈ పదానికి ఆనందం లేనివాడు అని అర్థం చెప్పాలి. అలా చెప్పదలచుకున్నట్లైతే, ఇంద్రియ జనితమైన ఆనందాల స్పర్శ లేనివాడు అని చెప్పుకోవాలి. దానికన్నా గళిత శబ్దానికి లక్షణావృత్తిచేత "ఏకరసీభూతః" పరిపూర్ణుడుగా అయినవాడు – అనే అర్థం చెప్పడమే సముచితమని వ్యాఖ్యాత అభిప్రాయం)

**శ్రీరాముడు:** గురుదేవా! "అజడో గళితానందః – త్యక్త సంవేదనో భవ" అంటున్నారు. జడత్వమూ పనికిరాదు,. చేతనత్త్వమూ పనికి రాదు– అంటున్నారు. ఒక్క పదార్థం– అయితే జడం కావాలి, లేకపోతే చేతనం కావాలి. అదీ కాకూడదు, ఇదీ కాకూడదు, అంటే ఎలా కుదురుతుంది?

**వశిష్ఠుడు:** "త్యక్తసంవేదనో భవ" అనే చోట సంవేదన శబ్దాన్ని నువ్వు సరిగ్గా అర్థం చేసుకోలేదు. బాహ్య విషయాలను సత్యత్వ బుద్ధితో గ్రహించటం పేరే సంవేదనం. అంతే గానీ, నువ్వు అనుకున్నట్లుగా శుద్ధ చేతనత్వం కాదు. తత్త్వాన్ని గ్రహించిన జీవన్ముక్తుడికి బాహ్య పదార్థాలమీద సత్యత్వ బుద్ధివుండదు. అందుచేత జీవన్ముక్తుడు త్యక్త సంవేదనుడు (సంవేదనను వదిలి పెట్టినవాడు) అవుతున్నాడు. ఇలా సంవేదనను వదిలిపెడితే, మిగిలి వుండేవాడు కేవల చిత్స్వరూపుడే అవుతాడు. అంటే, వాడు అజడుడు అవుతాడు.

**శ్రీరాముడు:** అలాంటి జీవన్ముక్తులకు బ్రహ్మాకార వృత్తి రూపమైన సంవేదనం వుంటుంది కదా! ఆ సంవేదనం మిగిలి వుంటే, వాళ్లకు త్యక్తసంవేదనత్వం ఎలా పడుతుంది?

**వశిష్ఠుడు:** వాళ్లకు బ్రహ్మాకార చిత్త వృత్తి గూడా క్రమంగా బ్రహ్మ జ్యోతిలో లీనమై, బ్రహ్మకంటే భిన్నమైన చిత్తవృత్తి లేనిదై పోతుంది. (బాధితమైపోతుంది.) అందువల్ల వాళ్లకు ఆ రకమైన సంవేదనం గూడా మిగలదు. కనుక రామా! నువ్వు అలాంటి స్థితిని సాధించు.

ఇంతకూ ఒకదానికొకటి బీజాలు చెప్పుకుంటూ వస్తున్నాం కదా! ఆ వరుసలో ప్రాణస్పంద దృఢభావనలు రెండిటికీ కలిపి, విషయాలు బీజము– అని చెప్పాను. వీటినే సంవేద్యాలు అంటారు – అని కూడా చెప్పాను. ఈ సంవేద్యానికి మూల కారణం సంవిత్తు (చిత్తంలో వుండే చైతన్యం) అని కూడా నిరూపించాను.

ఇక ఈ సంవిత్తుకు బీజం సన్మాత్రం. సన్మాత్రము అంటే, కేవలమైన అస్తిత్వం. శుద్ధ సత్త.

ఈ సత్త రెండు రకాలు. ఒకటి, అనేకరూప సత్త, రెండు, ఏకరూప సత్త.

అనేకరూప సత్త అంటే, కుండగా ఒక సత్త, బండగా ఒక సత్త, చెట్టుగా ఒక సత్త, పుట్టగా ఒక సత్త ,అని ఇలా అనేక రకాల ఆకారాలతో వుండే సత్త.

ఏకరూప సత్త అంటే, దాంట్లో ఏ రకపు భేదాలూ వుండవు. అంతా ఒకే ఏకాండీ స్వరూపంగా వుంటుంది.

వీటిల్లో అనేకరూప సత్త నిజమైన సత్త కాదు. ఏకరూప సత్తయే నిజమైన సత్త. అదే శాశ్వతమైన సత్త. మరో దృష్టితో చూస్తే, ఈ సత్తను కాలసత్త అని, వస్తుసత్త అని ఒక విభాగం చేయవచ్చు. భూత భవిష్యద్వర్తమాన కాలాలను బట్టి సత్తను విభాగం చేస్తే, అది "కాలసత్త". వీటిలో వర్తమాన సత్త నిజమైన సత్త. ఇక పదార్థాలను ఆధారం చేసుకొనివున్న సత్త, "వస్తుసత్త". వాటిలో ఆత్మసత్తయే నిజమైన సత్త.

ఇలా మరికొన్ని రకాల సత్తావిభాగాలను కూడా చెప్పారు. తెలుసుకోవలసిన మాట ఏమిటంటే, ఎన్ని విభాగాలున్నా, వాటన్నింటినీ వదిలేసి, అన్నిరకాల సత్తలలోనూ అనుగతంగా వున్న సత్తాసామాన్యాన్ని పట్టుకోవాలి. దాన్నే అనుసంధానం చెయ్యాలి. దానివల్లే పరిపూర్ణ ఆనందం. ఈ సత్తాసామాన్యానికి మూలకారణం పరబ్రహ్మయే. నిజానికి అది పరబ్రహ్మకంటే భిన్నమైనది కాదు. దానికంటే సారమైన వస్తువు వేరే మరేదీ లేదు.

రామా! అర్థమైంది కదా! ఈ సంసారానికి కారణ పరంపర ఏమిటి?– అని ప్రశ్నించావు. సంసారానికి కారణం లింగ శరీరమనీ, దానికి కారణం చిత్తమనీ, దానికి కారణం ప్రాణస్పంద దృఢ భావనలనీ, వాటికి కారణం సంవేద్య విషయాలనీ, దానికి కారణం నిర్గుణ బ్రహ్మమనీ, దీనికి వేరే కారణం లేదనీ, ఇది అన్ని కారణాలకు మూలమైన పరమ కారణమనీ, మన చర్చలో తేల్చుకొన్నాం.

## *37. సంసార బీజ నిర్మూలనము*

**శ్రీరాముడు:** గురుదేవా! ఈ కారణ పరంపరలో ఏది ప్రధానం? దేన్ని తొలగించుకుంటే, సంసారం త్వరగా నశిస్తుంది?

**వశిష్ఠుడు:** ఈ కారణాల వరుసలో కిందిదానికంటే పైది గొప్పది. చేతనైనంతలో, ఎక్కడి కక్కడ పైపై కారణాన్ని పట్టుకుని, దాన్ని నిర్మూలించాలి.

చిట్టచివరి కారణం – శుద్ధ పరబ్రహ్మం అన్నాం. చాతైతే, దానిమీద మనస్సును లగ్నం చెయ్యాలి. ఎప్పటిదాకా? తత్త్వసాక్షాత్కారం కలిగే దాకా!

అది చేతకాకపోతే, దానికి వెనుక మెట్టైన సత్తా సామాన్యాన్ని పట్టుకోవాలి. దాన్ని ధ్యానించాలి.

అదీ కుదరకపోతే, సంవేద్య విషయ ధ్యానం చెయ్యాలి. ఇక్కడో చిక్కుంది. సంవిత్తుయొక్క ఆధారం

లేని సంవేద్యం దొరకనే దొరకదు. కనుక, కేవల సంవేద్య ధ్యానం అసంభవం. కనుక సంవేద్య పదార్థాలకు కారణమేమిటో శోధించి (విచారణ ద్వారా నిర్ణయించి), ఆ జగత్కారణమైన తత్త్వం మీద మనస్సు నిలపాలి.

అంటే, ఇది కుండ, ఇది బండ, ఇత్యాది ప్రయోగాలు అన్నింటిలోనూ వున్న "ఇది" అనే అంశమేమిటో విచారణ చేసి, దానిమీద ధ్యానం చెయ్యాలి.

లేదా, "తత్త్వమసి"(అదే నువ్వు అయివున్నావు) అనే వాక్యంలో వున్న "నువ్వు" అనే పదానికి గల అర్థమేమిటో విచారణ చేసి (శోధించి) – ఆ శోధితార్థంమీద మనస్సు లగ్నం చెయ్యాలి.

ఇదీ కుదరకపోతే, "ప్రాణస్పంద–దృఢభావనల" మీద ధ్యానం పెట్టవచ్చు. అంటే–ప్రాణ స్పందాన్ని ఆపాలి, దృఢభావనను, అనగా వాసనలను, పరిత్యజించాలి.

ఈ రెంటిలో ఏది జరగాలన్నా, వీటి వెనుక మెట్టైన చిత్తాన్ని నిరోధించక తప్పదు.

కాబట్టి, సాధన దగ్గరకు వచ్చే సరికి, ప్రాణస్పంద నిరోధము, వాసనా త్యాగము, చిత్త నిరోధము – అనే మూడూ కలిసి ఒకే మెట్టుకిందికి వస్తాయి.

ఈ మూడింటిలోనూ చూస్తే, వాసనాత్యాగం మరీ దుష్కరం. మేరు పర్వతాన్ని పెకలించటం వంటిది ఈ పని. ఇందులో వున్న చిక్కేమిటంటే – వాసనక్షయమైతే గానీ మనోనాశం లభించదు; మనోనాశమైతే గానీ వాసనాక్షయం లభించదు. పిచ్చి కుదిరితే గానీ పెళ్ళి కుదరదు; పెళ్ళి కుదిరితే గానీ పిచ్చి కుదరదు – అన్నట్టుంటుంది వీటి వరస!

ఈ రెండింటినీ కలిపి లొంగదీయ గలది – తత్త్వజ్ఞానం. తత్త్వజ్ఞానం మొదట శాస్త్రజ్ఞానంతో ప్రారంభమై, కొంత చిత్తశాంతిని కలిగిస్తుంది. చిత్తం చల్లారిన కొద్దీ, వాసనా త్యాగం జరుగుతుంది. అది జరిగిన కొద్దీ, తత్త్వజ్ఞానం గట్టి బడుతూ వుంటుంది.

అందుచేత రామా! ఈ మూడింటినీ కలిపి అభ్యసించాలి. ఐతే, ఒకటే షరతు. ముందు సుఖభోగేచ్ఛను దూరంగా వదిలిపెట్టాలి.

**తత్త్వజ్ఞానం మనోనాశో**
**వాసనాక్షయ ఏవ చ ।**
**మిథః కారణతాం గత్వా**
**దుస్సాధ్యాని స్థితాన్యతః ॥**
**తస్మాద్రాఘవ యత్నేన**
**పౌరుషేణ వివేకినా ।**
**భోగేచ్ఛాం దూరతః కృత్వా**
**త్రయమేతత్సమాశ్రయేత్ ॥** (సర్గ 92, శ్లోకం 14,15)

రామా ! మరోసారి చెప్పుతున్నా , విను–

**వాసనాక్షయ విజ్ఞాన**
**మనోనాశా మహామతే ।**
**సమకాలం చిరాభ్యస్తా**
**భవన్తి ఫలదా మునే ॥** (సర్గ 92 , శ్లోకం 17)

రామా! వాసనాక్షయము, తత్త్వజ్ఞానము, మనో నాశము, అనే ఈ మూడూ – ఏకకాలంలో సమంగా అభ్యాసం చేస్తేనే ఫలితాలనిస్తాయి. వీటిని విడివిడిగా అభ్యసిస్తే – సైనికుల్లో ఒక్కొక్కడూ విడివిడిగా వెళ్లి శత్రువుల కోటమీద పడినట్లే లెక్క. అది మంచి పని కాదు. కనుక, ఈ మూడింటినీ కలిపి, ఎల్లవేళలా – తింటున్నా, తిరుగుతున్నా, వస్తున్నా, పోతున్నా, పడుకున్నా , మేలుకుని వున్నా, ఎలా వున్నా, ఏం చేస్తున్నా– ఆపకుండా అభ్యసించాలి.

రామా! ప్రాణస్పంద, దృఢ భావనల మీద ధ్యానం పెట్టే విధానాన్ని గురించి చర్చిస్తున్నాం. అందులో ప్రాణస్పంద నిరోధ, వాసనా త్యాగ, చిత్త నిరోధాలు మూడూ కలిపి ఒకే మెట్టన్నాం. వీటిలో వాసనాత్యాగం కావాలంటే, వాసనాక్షయ, తత్త్వజ్ఞాన, మనో నాశాలను కలిపి అభ్యసించాలని చెప్పాం.

ఇక ప్రాణస్పంద నిరోధం మిగిలి వుంది. ఇది వాసనా త్యాగంతో సమానం.

**వాసనా సంపరిత్యాగాత్**
**చిత్తం గచ్ఛత్యచిత్తతామ్ ।**
**ప్రాణస్పంద నిరోధాచ్చ**
**యథేచ్ఛసి తథా కురు ॥** (సర్గ 92, శ్లో 26)

రామా! చిత్తం అనేది చిత్తం కాకుండా పోవాలంటే, రెండు ఉపాయాలున్నాయి – వాసనా త్యాగము, ప్రాణస్పంద నిరోధము – అని. నీకేది కావాలనుకొంటే, అదే అభ్యసించు.

ప్రాణస్పందాన్ని నిరోధించాలనుకుంటే, ప్రాణాయామ అభ్యాసాలు చెయ్యాలి. అవి చాలవు. గురువుల దగ్గర మరిన్ని యోగ విధానాలను గూడా నేర్చుకోవాలి. ఆహారనియమాలు గట్టిగా పాటించాలి.

వాసనాత్యాగం చెయ్యాలనుకుంటే కొన్ని ఉపాయాలున్నాయి.

1. పదార్థాలయొక్క ఆది లోనూ, మధ్య లోనూ, అంతంలో గూడా, ఏ మార్పూ లేకుండా వెన్నంటి వుండే సన్మాత్ర స్వరూపాన్ని ఉన్నదున్నట్లుగా చూడటం నేర్చుకోవాలి.

రామా!

**నిస్సంగ వ్యవహారత్వాత్**
**భవ భావన వర్జనాత్ ।**
**శరీర నాశ దర్శిత్వాత్**
**వాసనా న ప్రవర్తతే ॥** (సర్గ 92, శ్లో 30)

రామా! ఈ విధానంలో మూడు మెట్లున్నాయి–

1) వ్యవహారాలు చేసేటప్పుడు నిస్సంగంగా వుండాలి. అంటే, లౌకిక జనులతో, స్నేహం పనికిరాదు. సంకల్పాలూ పనికిరావు.

2) సంసారంలో జరిగిపోయిన విషయాలను మళ్లీ మళ్లీ భావన చెయ్యరాదు. కిళ్లీ నమిలినట్లు నములుతూ కూర్చోరాదు. కోరికలు తవ్వుకుంటూ గూడా కూర్చోరాదు.

3) ఈ శరీరం నశించి పోయేదనే మాట మరిచిపోరాదు.

ఇలా చేస్తే, వాసనలు నిలువవు.

రామా! ఇన్ని ఉపాయాలున్నా, ఉపాయంగా వాటిని వాడుకోక పోతే , మనస్సును లొంగ దీసుకోవటం సాధ్యం కాదు –

"న శక్యతే మనో జేతుం – వినా యుక్తిమనిందితామ్" (సర్గ 92, శ్లో 34)

ఆ ఉపాయం ఏమిటంటే –

**అధ్యాత్మవిద్యాధిగమః**
**సాధు సంగమ ఏవ చ ।**
**వాసనా సంపరిత్యాగః**
**ప్రాణస్పంద నిరోధనమ్ ॥**
**ఏతాస్తా యుక్తయః పుష్టాః**
**సన్తి చిత్తజయే కిల ॥** (సర్గ 92 శ్లో 36)

1) వేదాంత శాస్త్రాధ్యయనం

2) సజ్జన సాంగత్యం

3) వాసనా పరిత్యాగం

4) ప్రాణ స్పంద నిరోధం

ఈ నాలుగూ ఒకదాన్ని ఒకటి పరిపుష్టం చేసుకునే ఉపాయాలు. అన్నీ కలిపి మనోనాశాన్ని సాధించి పెడతాయి. వీటన్నింటినీ కలిపి అభ్యసించటమే ఉపాయం. మరో ఉపాయం లేనే లేదు. హఠయోగం దీనికి పనికి రాదు.

కనుక రామా! నువ్వు ఈ నాలుగు ఉపాయాలనూ చక్కగా అభ్యసించు. ఐతే, ఇవి బాగా పట్టు బడాలంటే, "సంగం" పోవాలి. కనుక నువ్వు ముందుగా "సంగ పరిత్యాగం" నేర్చుకో –

**శ్రీరాముడు:** గురుదేవా! సంగం అంటే ఏమిటి?

**వశిష్ఠుడు:** రామా! సంగం అనేది ఒక "వాసన".

**భావాభావే పదార్థానాం**
**హర్షామర్ష వికారదా।**
**మలినా వాసనా యైషా**
**సా సంగ ఇతి కథ్యతే ॥** (సర్గ 93, శ్లోకం 84)

రామా! ఒకానొక మలిన వాసన చిత్తంలో వుంటే, కొన్ని పదార్థాలతో కలిసి నప్పుడు సంతోషము, మరికొన్ని పదార్థాలతో కలిసినప్పుడు విషాదమూ, కలుగుతూ వుంటాయి. ఈ రకమైన వికారాలను (మార్పులను) కలిగించే మలిన వాసన పేరే "సంగం"! దీని ద్వారా జరిగే పనులు కర్తకు బంధాన్ని కలిగిస్తాయి.

జీవన్ముక్తుల చిత్తంలో మరో రకం సంస్కారం వుంటుంది. దానివల్ల వాళ్ళకు సంతోష విషాదాలనే భేదాలే అంటవు. అలాంటి పరిశుద్ధ వాసనను "అసంగం" అంటారు. ఈ అసంగమనే వాసనద్వారా జరిగే పనులు కర్తకు బంధాన్ని కలిగించవు.

కనుక రామా! నువ్వు మలినసంగాన్ని పరిత్యజించి, పరిశుద్ధసంగంతో (అసంగంతో) వ్యవహారాలు

నడుపుతూ, జీవన్ముక్తి కోసం ప్రయత్నించు. దాని కోసం నువ్వు ఆత్మ విచారణ, సమాధియోగము, వాసనాక్షయము, అనేవాటిని ఏకకాలంలో అవలంబించు. దానివల్ల నీకు ఆత్మ సాక్షాత్కారం లభిస్తుంది. శాశ్వతానంద రూపమైన బ్రహ్మ పదాన్ని అందుకుంటావు–

అని ఆశీర్వదిస్తూ వశిష్ఠమహర్షి ఉపశమ ప్రకరణాన్ని ముగించాడు.

ఇక ఆ మహర్షి వెంట పై నిర్వాణ ప్రకరణంలోకి ప్రవేశించే ముందు, ఇప్పటివరకు జరిగిన ఉపశమ ప్రకరణాన్ని ఒక సారి సింహావలోకనం చేసుకుందాం.

## 38. ప్రకరణ సింహావలోకనము

దీనికి వెనకాలి ప్రకరణాలు "యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవన్తి" అనే వేదవాక్యంయొక్క క్రమంలో ఉత్పత్తి, స్థితి ప్రకరణాలుగా వచ్చాయి. వాటిలో ప్రపంచంయొక్క ఉత్పత్తి, స్థితుల గురించి చర్చించారు.

పై వేదవాక్యం ప్రకారం ముందుకు పోతే, "యత్ప్రయన్త్యభిసంవిశంతి" (లోకాలు దేనిలో లయిస్తాయో అది)– అనే వాక్యం వస్తుంది. దాని ప్రకారం, ఈ ప్రకరణంలో ప్రపంచంయొక్క ఉపశమాన్ని (లయాన్ని) గురించి చర్చించ వలసివుంది. కాని మనస్సు వున్నంతవరకూ ప్రపంచం శమించదని, అందువల్ల మనస్సుయొక్క ఉపశమమే సాధించదగి వుందని, కనుక ఈ ప్రకరణంలో మనస్సు ఉపశమించే విధానాలను వశిష్ఠ మహర్షి వివరించబోతున్నారని, ఈ ప్రకరణంయొక్క పీఠికా భాగంలో చెప్పారు. అంతేగాక సిద్ధాంత చర్చ స్థితిప్రకరణంతోనే ఇంచుమించు పూర్తైపోయిందని, ఇక సాధనా విధానాల బోధనే మిగిలి వుందని కూడా, ఈ పీఠికలో చెప్పారు. అందుకే ఈ ప్రకరణం ప్రారంభంలో వశిష్ఠమహర్షి తనయొక్క బోధనను "పుట్టేది, పెరిగేది మనస్సే" అనే అంశంతో ప్రారంభించాడు.

ఆ తరువాత అకర్తృత్వాన్ని గురించి కొద్దిగా వివరించి, ఆ పైన రాజస, సాత్త్విక జీవులకు మోక్షం లభించే క్రమాలను ప్రస్తావించాడు.

ఆ సందర్భంగా, కొందరు జీవులకు జన్మాంతర సాధనాబలంవల్ల, ఈ జన్మలో ప్రత్యేకంగా గురువంటూ లేక పోయినా, ఏదో విచిత్ర సంఘటనవల్ల, ఆకాశం నుంచి వున్నట్టుండి పండు రాలి పడినట్లుగా, తత్త్వజ్ఞానం లభిస్తూ వుంటుందని చెప్పి, దీనికి ఉదాహరణగా, "సిద్ధగీత" అనే కథ చెప్పాడు.

ఈ కథలో, విదేహరాజైన జనకుడికి విహార యాత్రా సమయంలో ఎవరో సిద్ధులు పాడిన పది పాటలు అనుకోకుండా వినిపించి, ఆలోచనలను రేకెత్తించి, జీవన్ముక్తిని ప్రసాదించాయి.

ఈ కథ తరువాత వశిష్ఠమహర్షి మనస్సంటే ఏమిటనే ప్రశ్నను లేవదీసి, వాసనా పరిత్యాగం రెండు రకాలుగా ఉంటుందనీ, వాటినే ధ్యేయవాసనా పరిత్యాగము, జ్ఞేయవాసనా పరిత్యాగము, అంటారనీ, అందులో ధ్యేయవాసనా పరిత్యాగం జీవన్ముక్తుడికీ, న్యేయవాసనా పరిత్యాగం విదేహముక్తుడికీ, వుంటాయనీ, వివరించాడు.

ఆ సందర్భంగానే వశిష్ఠమహర్షి ప్రపంచంలోని జీవులంతా ఏదో ఒక జన్మలో మనకు బంధువులై వుంటారనీ, అందువల్ల ఈ జన్మలో మన చుట్టూ కనిపించే జీవుల్లో కొద్దిమంది మాత్రమే మనకు బంధువులనుకుంటూ, బంధుత్వ బంధాన్ని పెంచుకో కూడదనీ, వివరిస్తూ, దీనికి నిదర్శనంగా "పుణ్య పావనులు" అనే సోదరుల కథ చెప్పాడు. నిజానికి ఇది పెద్ద కథేమీ కాదు. తమ తల్లిదండ్రులు ఒకే సారి ఆకస్మికంగా గతించగా, తపో జీవనులైన ఇద్దరు సోదరులు చేసుకున్న తత్త్వ విచార చర్చనే చిన్న కథగా మలిచాడు

వశిష్ఠమహర్షి. దీనిద్వారా బంధుత్వ బంధాలకు అతీతంగా ఆలోచించ గలగడం కూడా ఒక మోక్షసాధనోపాయమేనని ఆయన నిరూపించాడు.

ఆ తరువాత ఒక్కొక్కప్పుడు అనుకోకుండా సద్విచారణ ప్రారంభమై, దానికి రవ్వంత గురుబోధ తోడై, ఉన్నట్టుండి బుద్ధి వికాసం చెంది, ఆత్మజ్ఞానం కలిగే సావకాశం కూడా వుందని చెబుతూ, దానికి నిదర్శనంగా పాతాళ లోకంలో బలి చక్రవర్తి చేసిన తత్త్వ చింతనను, శుక్రాచార్యుల తత్త్వబోధను, విస్తారంగా వివరించాడు.

ఇక, తత్త్వజ్ఞానాన్ని అందుకునేందుకు ఈశ్వరారాధన ఒక మంచి ఉపాయమని చెబుతూ, దానికి తార్కాణంగా నృసింహ సాక్షాత్కారానంతర "ప్రహ్లాద చరిత్ర"ను వివరించాడు.

"బలిచక్రవర్తి" కథలో కేవలం తత్త్వానుసంధాన విధానాలను అనన్యమైన రీతిలో ప్రతిపాదన చేసిన వశిష్ఠమహర్షి, ప్రహ్లాద కథలోకి వచ్చేసరికి భక్తిమార్గ, తత్త్వమార్గాలకు గల అనేక అంతస్సంబంధాలను సున్నితంగా వివరించాడు.

ఇక్కడే దేవతావిగ్రహ పూజ చేసేవారు సోஉహం భావంతో దేవపూజ చేయవలసిన విధానాన్ని వివరించాడు.

ఈ సందర్భంలోనే మానవజాతిలో ముక్తిప్రయత్న వికాసానికి, దానవ జాతియొక్క అస్తిత్వం కూడ ఒక అవసరమే అని నిరూపించాడు.

ఆపైన, సగుణ భక్తి నిర్గుణ భక్తిగాను, నిర్గుణ భక్తి నిర్మల జ్ఞానంగాను, నిర్మలజ్ఞానం నిర్వికారాత్మానుభవంగాను, పరిణతి చెందే ప్రక్రియను కూడ చక్కగా వివరించాడు.

ఈ విధంగా జ్ఞాన సాధనోపాయాలను కథారూపంగా ప్రస్తరించిన తరువాత, ఇన్ని సాధనల ద్వారానూ దేన్ని జయించాలని సాధకుడు ప్రయత్నం చేస్తున్నాడో, అలాంటి మాయను గురించి చర్చ ప్రారంభించాడు వశిష్ఠ మహర్షి.

ఈ చర్చకు ఫలితమే "గాధిమహర్షి" చరిత్ర. ఇదే ఈ ప్రకరణం మొత్తానికి కేంద్ర బిందువు.

ఈ కథలో గాధి అనే మహర్షికి చెరువులో స్నానం చేస్తూ వుండగా చిన్న తూగు లాగా వచ్చింది. ఆ తూగులో ఆయనకు తానొక బోయవాడుగా పుట్టినట్లు, వాడి ముసలితనంలో వాడొక మహారాజ్యానికి రాజై రాజ్యమేలినట్లు, చివరికి కొన్ని సంకట పరిస్థితులలో అగ్నిలోకి దూకి ఆత్మహత్య చేసుకున్నట్లు, కల లాంటిది వచ్చింది. అది సుమారుగా 80 సంవత్సరాల చరిత్ర. తనకు పట్టిన తూగు మహా అయితే నాలుగు నిముషాలు వుంటుందేమో! ఈ నాలుగు నిమిషాల్లో అంత పెద్ద కల ఎలా వచ్చిందా, అని గాధి మహర్షి ఆశ్చర్యపడి పోయాడు. ఎంతైనా అది కలే కదా అని, దాన్ని కొట్టి పారేసి, తన తపస్సులో తను పడిపోయాడు.

కానీ అనుకోని రీతిగా తను కలలో చూసిన ఆ రాజ్యాన్ని, ఆయన ఈ భూమి మీద నిజంగా చూడటం సంభవించింది. ఆ రాజ్యంలో ఎవరినడిగినా, మొన్న మొన్నటి దాకా బోయవాడొకడు రాజుగా వుండేవాడనీ, వాడు ఆత్మహత్య చేసుకు మరణించాడనీ, చెబుతున్నారు.

ఇదేమిటి? తనకు కలలో కనిపించిన రాజ్యం ఇప్పుడు ఇలలో ఎలా కనిపిస్తోంది? దానికి ఈ ప్రజలంతా సాక్ష్యం ఎలా చెబుతున్నారు? అని ఆలోచించి, ఆలోచించి, ఏమీ అర్థంకాక, విష్ణుమూర్తి గురించి తపస్సు చేశాడు.

ఆ స్వామి ప్రత్యక్షమై, కాలాన్ని రూపాలోక కాలమని, మనస్కార కాలమని, తత్తాకాలమని, విభాగం చేసి, దానికి పెద్ద తర్కం జోడించి, "నువ్వు బోయవాడిగా రాజ్యం చేయడం మాత్రమే కాదయ్యా, నువ్వు మళ్ళీ వెళ్ళి ఆ రాజ్యాన్ని చూశాననుకోవడం కూడా నీ కలే"– అని చెప్పి మాయమై పోయాడు.

గాధిమహర్షి ఈ మాటలను పూర్తిగా నమ్మలేక, మళ్ళీ మరోసారి ఆ రాజ్యానికి వెళ్ళి చూసొచ్చాడు.

"పూర్వం తను చూసిరావడం కలలో భాగమైతే, ఇప్పుడు తనకు అది మళ్ళీ ఎలా కనిపిస్తుంది?" – అని ఆలోచించి, అర్థం కాక, మళ్ళీ తపస్సు చేశాడు. ఈ మాటు విష్ణుమూర్తి కనిపించి "ఒకే భ్రాంతి ఒకే కాలంలో అనేక మందికి కలిగే అవకాశం వుందయ్యా! నువ్వూ, నువ్వనుకునే రాజ్య ప్రజలూ ఒకే రకమైన భ్రాంతిని అనుభవిస్తున్నారు. కనుక నీదంతా భ్రాంతే." – అని చెప్పి మాయమై పోయాడు.

గాధిమహర్షి మళ్ళీ తపస్సు చేశాడు. విష్ణుమూర్తి మళ్ళీ వచ్చి "భ్రాంతిమయ దృష్టి గలవాడికి ఒక్కొక్కప్పుడు భూతకాల వృత్తాంతం, వర్తమాన కాల సన్నివేశం లాగా గోచరిస్తుందయ్యా! నీ మనస్సు ఒకానొక బోయవాడి చరిత్రను స్మరించడం మాత్రమే కాక, ఆ బోయవాడితో నీకు తాదాత్మ్యాన్ని కూడా అంటగట్టింది. ఈ సత్యం నీకు తార్కికంగా అర్థమైనా, అనుభవ పరంగా నమ్మబుద్ధి కావడం లేదు. ఇది మనస్సు చేసే మోసాల్లో మరొకటి. దీన్ని అధిగమించాలంటే, నువ్వు తపస్సు చేసి, నీ మనస్సును పరిశుద్ధం చేసుకోవాలి"– అని చెప్పాడు. గాధిమహర్షి తపస్సు చేసి భ్రాంతులన్నింటినీ దాటి జీవన్ముక్తుడయ్యాడు.

సంగ్రహంగా ఇదీ కథ. పూర్వం ఉత్పత్తి ప్రకరణంలోని లీలోపాఖ్యానంలో బింబ ప్రతిబింబాలను పోలిన రెండు ప్రపంచాలు ఒకే జీవికి కనిపించాయి. ఆ ప్రకరణంలోనే లవణోపాఖ్యానంలో ఒక రాజుకి కలలో కనిపించిన దృశ్యాలు ఆ తరువాత ఇలలో కనిపించాయి. ఇక స్థితి ప్రకరణంలోకి వచ్చేసరికి, భార్గవోపాఖ్యానంలో శుక్రాచార్యుడు తన శరీరాన్ని తనే తగలబెట్టుకున్నాడు. ఇక్కడ ఈ గాధి చరిత్రలో ఆ మూడు కథలనూ కలిపేశాడు వశిష్ఠమహర్షి.

లీలోపాఖ్యానంలో లీలాదేవికి బింబ ప్రతిబింబాలవంటి ప్రపంచాలు కనిపించటానికి కారణం సరస్వతీదేవియొక్క వర ప్రభావం– అన్నారు.

లవణ చరిత్రలో, ఎక్కడో అడవిలో నిజంగానే జరిగిన ఒకానొక సన్నివేశం లవణ మహారాజుగారికి కలగా వచ్చిందనీ దానికి కారణం దేవేంద్రుడు పంపిన గారడీవాడి ప్రభావమే నన్నారు.

భార్గవోపాఖ్యానంలోని సంఘటనలకు ఆయనగారి అద్భుత తపస్సే కారణమన్నారు.

గాధి చరిత్రలోకి వచ్చేసరికి, విష్ణుమూర్తి మూడుసార్లు వచ్చి, మూడు రకాల సమాధానాలు చెప్పాడు. మొదట, నువ్వు బోయవాడుగా రాజ్యం చేయటం మాత్రమే కాదు, మళ్ళీ వెళ్ళి చూసిరావటం కూడా కలే అన్నాడు. రెండవసారి, నీకూ, ఆ రాజ్య ప్రజలకూ ఒకే కాలంలో, ఒకే రకమైన భ్రాంతి కలిగిందన్నాడు. మూడోసారి, ఎక్కడో జరిగిన బోయవాడి కథను నీ కథగా నీ మనస్సు నీకు చూపించింది. ఇది నీ మనస్సు చేసిన మోసం. తపస్సుతో నీ మనస్సును పరిశుద్ధం చేసుకో – అన్నాడు.

ఎంతైనా గాధి తపశ్శీలి గనుక, విష్ణుమూర్తి మాట మార్చేస్తున్నాడని పోట్లాడలేదు. ఆయన చెప్పింది అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాడు. వెనుకటి కథల్లో ఉన్నట్టుగా, గాధి కథలో సరస్వతీదేవి, దేవేంద్రుడు, వంటి దేవతల ప్రవేశం లేదు. అతను మనవంటి సామాన్య సాధకుడు. అలాంటివాడికి మాయ అంటే ఏమిటో తెలియాలి. అలాంటి తెలివి, అలాంటి అవగాహన, వరాల ద్వారా సాధ్యమయ్యే విషయం కాదని చెప్పడం కోసమే వశిష్ఠమహర్షి విష్ణుమూర్తిని మూడుసార్లు తిప్పి "వరాల కోసం కాకుండా మనశ్శుద్ధికోసం తపస్సు చేయవయ్యా!" అని చెప్పించాడు.

ఆ తపస్సువల్ల విష్ణుమూర్తి సమాధానాల్లోని సమన్వయం ఆ మహర్షికి అర్థమైంది. మనమంతా మన జీవితంలో కొంత భాగం మెలకువ అనీ, అది సత్యమనీ, మరికొంత భాగం కల అనీ, అది అసత్యమనీ, నమ్ముతున్నాం. ఈ నమ్మకం తప్పు గనుకనే మనకు తత్త్వం అనుభవంలోకి రావడం లేదు. అందుకే విష్ణుమూర్తి "నీ అనుభూతులన్నీ, నువ్వు ఆ రాజ్యానికి వెళ్ళి చూసి రావటం అనే అనుభూతితో సహా, అన్నీ భ్రాంతులే" అని చెప్పాడు. అందుకో లేదు గాధి. అందుకే విష్ణుమూర్తి రెండోసారి వచ్చినప్పుడు, ఆ విషయాన్నే కొంచెం

మార్చి, "నీకూ ఆ బోయవాడి రాజ్యం వాళ్ళకీ, అందరికీ ఈ ప్రపంచం సత్యం లాగానే కనపిస్తోందయ్యా! ఇది అందరికీ కలిపి కలుగుతున్న భ్రాంతి. కనుక ఈ ప్రపంచంలో ప్రతి అనుభవమూ భ్రాంతే" – అని చెప్పాడు.

మళ్ళీ అందలేదు గాధికి. ఈ మాటు విష్ణుమూర్తి ఇంకొంచెం క్రిందికి దిగివచ్చి, "నువ్వు కాని దేహాన్ని, నువ్వుగా భావించడమే భ్రాంతికి మూలమయ్యా! అందువల్లే నువ్వు కాని బోయవాణ్ణి, నువ్వుగా భావన చేసేసుకున్నావు" అని చెప్పాడు.

గాధికి అర్థమయ్యీ కాకుండా వుంది. ఈ దుస్థితికి మందుగా తపస్సు చేసి మనశ్శుద్ధిని సాధించమన్నాడు విష్ణుమూర్తి.

ఈ విధంగా వెనుకటి లీలోపాఖ్యాన, లవణోపాఖ్యాన, భార్గవోపాఖ్యానాల పునరుక్తి లాగా కనిపించే ఈ కథలో, ఆ మూడు కథల సమన్వయాన్నీ, మూడు సమాధానాల సమన్వయాన్నీ వశిష్ఠ మహర్షి శిల్పసుందరంగా ప్రదర్శించాడు. దీని ద్వారా మనం నిత్యమూ అనుభవిస్తున్న జాగ్రత్ ప్రపంచానికి కూడా ఇలాంటి సమన్వయమే సరిపోతుందని వశిష్ఠ మహర్షి నిరూపించాడు. ఈ నిరూపణకోసం, ఏ దివ్యశక్తులూ లేని సామాన్య సాధకుడైన గాధిని ఆయన స్వీకరించాడు. తద్వారా ఈ బోధ అంతా మనబోటి సామాన్యులందరికీ సమంగా సమన్వయిస్తుందని సూచించాడు.

అంతేగాక, ఈ కథలోని పాత్రల పేర్లన్నీ అంతరార్థ గర్భితంగా వుండేటట్టే పెట్టాడు. ఆ విశేషాలను ఆ కథ చివర్లో చెప్పుకున్నాం కనుక, ఇప్పుడు మళ్లీ ఆ ప్రస్తావన చేయటం లేదు.

ఇలా ఈ ఉపశమ ప్రకరణానికి కేంద్ర బిందువువంటి గాధి చరిత్రలో మాయ అనే వ్యాధికి తపస్సే మందని వశిష్ఠ మహర్షి తేల్చి చెప్పాడు. అందుకే ఆ పైన ఆ మహర్షి చిత్త నిరోధమే అసలైన తపస్సు అని వివరిస్తూ "ఉద్దాలక చరిత్ర" అనే చిన్న కథ ద్వారా ఓంకారోపాసన విధానాన్ని విస్తారంగా వివరించాడు. ఆ సందర్భంలోనే "సత్తాసామాన్య స్థితి" అంటే ఏమిటో వివరించాడు.

ఆ తరువాత, ఆ సత్తా సామాన్య స్థితిని అందుకున్న జీవన్ముక్తులు సమాధి ప్రధానులుగా వుంటారా? వ్యవహార ప్రధానులుగా ఉంటారా? అనే చర్చ లేవదీసి, వారు ఎలా వున్నా ఒకటే అని తీర్మానం చేశాడు. అందుకు నిదర్శనంగా సురఘు, పరిఘులనే రాజుల జీవన్ముక్త వ్యవహారాన్ని చిన్న కథగా చెప్పాడు.

ఆ తరువాత, మనస్సును మనస్సుతోనే జయించుకునే ప్రక్రియలో సాధకుడికి మంచి పట్టుదల కావాలి అని చెపుతూ, దానికి నిదర్శనంగా భాస విలాసోపాఖ్యానమనే కథకాని కథను చెప్పాడు.

ఆ తరువాత మనస్సు మానవులకు అంతస్సంగాన్ని ఎలా కలిగిస్తుందో, మనస్సుయొక్క విలాసాలు ఎలా వుంటాయో, వివరించి, దాన్ని లొంగ దీసుకునేందుకు యోగము, జ్ఞానము, అనే రెండు ఉపాయాలు వున్నాయి అన్నాడు. యోగ ప్రక్రియల్లో భాగంగా 14 ధ్యాన ప్రక్రియలను, తద్వారా ప్రాణస్పంద నిరోధాన్ని, బోధించాడు.

ఆ తరువాత, జ్ఞాన సాధన ప్రక్రియలను వివరిస్తూ, వాటికి ఉదాహరణగా "వీతహవ్య మహర్షి" సాధనా కథను చెప్పాడు. ఈ కథలో కాలం ఎలాంటిదో, దేశం అలాంటిదే– అనీ ఈ ప్రపంచమంతా ఒక కల్పనలో మరో కల్పన లాగా, ఒక కలలో మరో కల లాగా సాగుతూ వుంటుందనీ, అందువల్ల, ఈ ప్రపంచంలో సత్యత్వం లేశమాత్రంగా కూడా ఉండటానికి వీల్లేదనీ , నిరూపించాడు.

ఈ సందర్భంగానే మనోనాశమనేది రెండు రకాలుగా వుంటుందనీ, అందులో జీవన్ముక్తులది సరూప మనోనాశమనీ, విదేహముక్తులది అరూప మనోనాశమనీ వివరించాడు.

ఆ తరువాత సంసార వృక్షానికి గల బీజ పరంపరను విశ్లేషిస్తూ, ఆత్మ విచారణ, ప్రాణస్పంద నిరోధము, వాసనా పరిత్యాగము, అనే ఉపాయాల ద్వారా సంసార బీజాలను నిర్మూలించుకోవాలనీ, దానివల్లే

మనస్సు పరిపూర్ణంగా ఉపశమిస్తుందనీ, వివరించాడు. దీనితో ఉపశమ ప్రకరణం ముగిసింది.

ఈ సింహావలోకనాన్ని బట్టి, ఈ గ్రంథంయొక్క ప్రారంభంలో వచ్చిన వైరాగ్య ప్రకరణము, ముముక్షు వ్యవహార ప్రకరణము, అనేవి ఈ గ్రంథానికి పీఠిక వంటివనీ, ఆ తరువాత వచ్చిన ఉత్పత్తి ప్రకరణ, స్థితి ప్రకరణాలలో సిద్ధాంత భాగ చర్చ జరిగిందనీ, ఇక ఈ ఉపశమ ప్రకరణంలో సాధన భాగ చర్చ కూడ పూర్తైందని, మనకు స్పష్టంగా తేలుతోంది. ఇప్పటికి ఇంచుమించు పదిహేడువేల శ్లోకాల గ్రంథం పూర్తైంది. చెప్పవలసిన విషయమంతా ఐపోయినట్టే కనిపిస్తోంది. కాని ఇంకా పదిహేను వేల శ్లోకాల నిడివి గల నిర్వాణ ప్రకరణం ఎదర మిగిలిపోయి వుంది. ఇంకా మనకు తెలియకుండా మిగిలిపోయిన విషయమేమిటి? రాబోయే ప్రకరణంలో దాన్ని మహర్షి ఎలా వివరిస్తాడు? అనే విషయాలు తెలుసుకునేందుకు మనం ఇక ఆ నిర్వాణ ప్రకరణంలోకి ప్రవేశిద్దాం.

# యోగ వాశిష్ఠ హృదయము

## ఆరవ భాగము

## నిర్వాణ (పూర్వార్థ) ప్రకరణము



శ్రీ కుప్పా వేంకట కృష్ణమూర్తి

## విషయసూచిక

# యోగవాశిష్ఠ హృదయము

## నిర్వాణ ప్రకరణ - పూర్వార్ధము

### 1. నిర్వాణమంటే

ఇప్పటికి ఈ గ్రంథంలో పూర్వభాగం పూర్తైంది. ఈ భాగంలో మొదటి రెండు ప్రకరణాలూ ఉపోద్ఘాత ప్రకరణములుగా ప్రక్కన పెట్టేస్తే, మిగిలిన మూడు ప్రకరణాలలోనూ ఉత్పత్తి, స్థితి, లయలు వరుసగా చర్చించబడినాయి. లయమైపోయిన తరువాత జగత్తు గురించి చర్చించేందుకు ఏముంది?

విషయ విన్యాస పరంగా చూస్తే ఉత్పత్తి, స్థితి ప్రకరణాలలో సిద్ధాంతభాగ చర్చ చేశారు. ఆ పై ప్రకరణానికి లయ ప్రకరణమని కాకుండా ఉపశమ ప్రకరణమని పేరు పెట్టారు. దీనిలో చిత్తం ఉపశమించేందుకు కావలసిన సాధనోపాయాలను విస్తారంగా చెప్పారు. ఏ దృష్టితో చూసినా గూడా సిద్ధాంత భాగం ఐపోయింది. సాధన భాగమూ ఐపోయింది. మరి ఇంకేం మిగిలి వుంది?

సాధన భాగమైన ఉపశమ ప్రకరణంలో వశిష్ఠమహర్షి మోక్షసాధన సామాగ్రిలో ప్రణవోపాసనకు పెద్దపీట వేశాడు. ఆ ప్రణవంలో అకార, ఉకార, మకార అర్ధమాత్రలు అనే నాలుగు భాగాలుంటాయన్నాడు. ఇందులో అకారము– ఉత్పత్తి స్థానీయమనీ, ఉకారము–స్థితి స్థానీయమనీ, మకారము – ఉపశమన స్థానీయమనీ, మిగిలిన అర్ధమాత్ర భాగం ఈ మూడు వర్ణాల అస్ఫుటావస్థా స్వరూపమైన నాదాకారంగా ఉంటుందనీ, ప్రణవోపాసకులైన సంప్రదాయ వేత్తలు చెబుతున్నారు. ఈ దృష్టితో చూసినప్పుడు మాత్రం, ఇప్పటికి అకార ఉకార మకార స్థానీయాలైన ఉత్పత్తి స్థితి ఉపశమన ప్రకరణాలు గడిచాయి గాని, అర్ధమాత్రాస్థానీయమైన ప్రకరణం ఇంకా రావలసి వుంది.

అంతే గాక, ప్రణవోపాసనలో ఈ అర్ధమాత్రే శబ్దాన్ని నిశ్శబ్దంలోను, సాధకుని సాధ్యంలోను, లయింపజేసి, ఏకత్వాన్ని తీసుకొస్తుంది. ఈ విద్యలో సాధ్యం – మోక్షం. దానికి సంబంధించిన ప్రకరణం ఇంకా రావలసి వుంది.

అంతే గాక, ఉత్పత్తి, స్థితి, లయలనేవి పరబ్రహ్మయొక్క తటస్థ లక్షణాలనీ, అవి పరబ్రహ్మకు ఎల్లప్పుడూ ఉండే లక్షణాలు కావనీ, ఆయనయొక్క అసలైన స్వరూప లక్షణం సచ్చిదానంద స్వరూపమనీ, మనం స్థితి ప్రకరణంయొక్క ప్రారంభంలో చెప్పుకొని ఉన్నాం. ఆ దృష్టితో చూస్తే, ఆ స్వరూప లక్షణాన్ని వివరించే ప్రకరణం ఇంకా రావలసి ఉంది. అందుకే వాల్మీకి మహర్షి చివరి ప్రకరణంగా ఈ నిర్వాణ ప్రకరణాన్ని ప్రారంభిస్తున్నాడు.

ప్రణవోపాసనలో అకార ఉకార మకారాల కన్నా మిగిలిన నాద భాగాన్ని సుదీర్ఘంగా ఉచ్చరిస్తారు గనుక, ఆ మహర్షి ఈ ప్రకరణాన్ని పదిహేనువేల శ్లోకాల సుదీర్ఘ గ్రంథంగా రూపొందించాడు. అర్ధమాత్ర భాగంలో పూర్వం ఉన్న అక్షరాలే అస్ఫుటావస్థలో ఉండి, కొత్త శక్తిని ఉత్పాదన చేస్తున్నాయి. అందుకే ఈ ప్రకరణంలో కూడా పూర్వోక్త విషయాలే మళ్ళీ చర్చింప బడుతాయి. కాని అది పునరుక్తి మాత్రం కాదు. పూర్వం కలిగించిన స్పష్టత్వం మీద ఇతోధికమైన స్పష్టతను, నిర్దుష్టతను, ఇక్కడ సాధకుడు అందుకో గలుగుతాడు.

అందుకే ఈ ప్రకరణాన్ని పూర్వపు పెద్దలంతా విశేష గౌరవంతో ఆదరించారు.

ఐతే, ఈ ప్రకరణానికి మోక్ష ప్రకరణమని పేరు పెట్టకుండా, నిర్వాణ ప్రకరణమని ఎందుకు అన్నారు?

"వా–గతి గంధనయోః" – అని ఒక ధాతువు. కదలుట, సూచించుట – అనేవి దాని అర్థాలు. దానిమీద భావార్థక ప్రత్యయం చేరిస్తే, 'వానం' అనే రూపం వస్తుంది. దానికి వెనకాల 'నిర్' అనే ఉపసర్గను చేరిస్తే, నిర్వాణం అనే రూపం ఏర్పడి, ఉపసర్గ బలంచేత అర్థం మారిపోయి, 'ఆనందము' అనే రూఢ్యర్థం ఏర్పడుతుంది.

విష్ణుసహస్ర నామాలలో నిర్వాణం, భేషజం, భిషక్ అనే చోట (శ్లోక సంఖ్య 75) నిర్వాణమనే పదం పరమాత్మకు పర్యాయ పదంగా వాడబడి వుంది. అక్కడ శ్రీశంకర భగవద్పాదుల భాష్యంలో "సర్వ దుః ఖోపశమ లక్షణం పరమానంద రూపం నిర్వాణం" అని వ్రాశారు. కనుక నిర్వాణమనే పదానికి సర్వదుః ఖాతీత స్థితియైన మోక్ష దశలో లభించే పరమానందము అనే అర్థం సంప్రదాయ సిద్ధంగా వాడుకలో వున్నదని విస్పష్టమౌతోంది.

"వా–గతి గంధనయోః" – అనే ధాతువుకు 'చలనం' అనే అర్థం ఉంది గనుక, నిర్వాణమనే పదానికి 'నిశ్చల నిష్పంద స్థితి' అనే అర్థం కూడా లభిస్తుంది. ప్రపంచంలో సర్వ పరిపూర్ణమైన, సర్వ వ్యాపకమైన, అనంతమైన, పరబ్రహ్మ మాత్రమే నిశ్చల పదార్థం కాగలదు. ఆ దృష్టితో చూచినా కూడా నిర్వాణం అనే పదానికి పరమాత్మ, లేక పరబ్రహ్మ, అనే అర్థం లభిస్తోంది.

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" – అనీ, "నిత్యం విజ్ఞానమానందం బ్రహ్మ"– అనీ, రెండు వేదవాక్యాలున్నాయి. ఈ రెంటినీ కలిపి చదివితే, ఏది అనంతమో అదే ఆనందం, అదే పరబ్రహ్మం, అనే అర్థం లభిస్తుంది. ఆ అర్థాన్ని నిర్వాణమనే పదం సూచిస్తోంది.

ఈ స్థితి మోక్షదశలో మాత్రమే సాధ్యమౌతుంది గనుక, నిర్వాణ శబ్దాన్ని మోక్షమనే అర్థంలో ప్రయోగించడం గూడా ఉంది. ఉదాహరణకు –

"సుఖం నిర్వాతి వేదవిత్" – అని గౌడపాదులవారి ప్రయోగం.

నిర్వాతి అనేది, నిర్వాణంయొక్క రూపాంతరమే! దాటి పోతున్నాడు, మోక్షాన్ని పొందుతున్నాడు, అనే అర్థంలోనే దాన్ని వారక్కడ ప్రయోగించారు.

కనుకనే పరబ్రహ్మయొక్క స్వరూప లక్షణాన్ని, సాధనలయొక్క పర్యవసానమైన సాధ్య స్వరూపాన్ని, ప్రణవోపాసనలో అర్ధమాత్రా స్వరూపం లయించే స్థానాన్ని, వేదాంత గ్రంథాలు ప్రతిపాదించే మోక్షాన్ని, అన్నిటినీ కలుపుకొని మహాకవి వాల్మీకి ఈ ప్రకరణానికి నిర్వాణ ప్రకరణమని పేరు పెట్టాడు – అని మనం గ్రహించ వచ్చు.

కొందరు పరిశీలకులు ఈ నిర్వాణ పదం బౌద్ధుల సొంత సొత్తనీ, ఈ గ్రంథంలో నిర్వాణ పదాన్ని ప్రధానంగా ఉపయోగించారు గనుక, ఇది బౌద్ధ ప్రభావానంతరం జనించిన గ్రంథమనీ భావిస్తున్నారు. ఈ గ్రంథంయొక్క రచనా కాల చర్చ మనకు ముఖ్యమైనది కాదు. ఐనప్పటికీ, ఇది బౌద్ధ ప్రభావానంతర రచన అని నిరూపించ దలచుకొనేవారు నిర్వాణ పదాన్ని వదిలేసి వేరే కారణాలు చూసుకుంటే మేలు. ఎందుకంటే, పాపం, ఆ బౌద్ధులు నిర్వాణమనే క్రొత్త పదాన్ని సృష్టి చేయలేదు. అంతకు ముందునుంచీ మహాభారతాది గ్రంథాలతో సహా పండిత వర్గంలో ప్రహతంగా వున్న పదాన్నే వాడుకున్నారు. ఉదాహరణకు – "బ్రహ్మ నిర్వాణ మృచ్ఛతి"– అని భగవద్గీతలో వున్నదని మనం గమనించ వచ్చును.

## 2. పునరుక్తులా? కావు

ఈ విధంగా తటస్థ లక్షణాదుల ద్వారా దేన్ని ప్రతిపాదించారో, ఆ తత్త్వాన్నే స్వరూప లక్షణాదుల ద్వారా మళ్ళీ ప్రతిపాదించ బోతున్నారు గనుక, ఈ ప్రకరణంలో సర్వ సామాన్యంగా అన్నీ పునరుక్తులే వుంటాయి. కానీ వాల్మీకి వశిష్ఠుల గొప్పతన మేమిటంటే, పునరుక్తిని ఎక్కడా పునరుక్తి లాగా కనపడనీయరు. చాలా సందర్భాలలో, శ్రీరాముడు ప్రశ్న వేసేటప్పుడే "ఈ విషయాన్ని మీరు పూర్వం ఒకసారి చెప్పారు ఐనా మళ్ళీ మరోసారి చెప్పండి" – అని అడుగుతాడు.

కొన్నిచోట్ల వశిష్ఠమహర్షే "రామా! ఈ విషయం పూర్వమే చెప్పాను. ఐనా మళ్ళీ చెబుతాను. జాగ్రత్తగా విను. ఎందుకంటే, వేదాంత విషయం చాలా గహనమైనది. అనేక కోణాల్లోంచీ మళ్ళీ మళ్ళీ పరిశీలిస్తే గాని, విషయం గట్టి పడదు." – అని అంటాడు. ఇలా అంటూ ఆ మహర్షి ఈ ప్రకరణాన్ని పదిహేను వేల శ్లోకాల దాకా పెంచడం మాత్రమే గాక, ఈ భాగాన్ని మళ్ళీ పూర్వార్ధ ఉత్తరార్ధాలనే పేరుతో రెండు భాగాలు చేశాడు.

సమాధియోగం ద్వారా ఆత్మసాక్షాత్కార రూపమైన పరమ విశ్రాంతిని అందుకునేదాకా అనుసరించ వలసిన సోపాన పరంపరను పూర్వార్ధంగాను, ఆ దశనుంచి మళ్ళీ ఉత్థానం కలిగినప్పుడు అలాంటి చిత్తాన్ని మళ్ళీ ఆత్మ సమాధిలోకి ప్రవేశ పెట్టి, ఆ స్థితి శాశ్వతంగా నిలిచిపోయేటట్టుగా చేసుకోవడానికి కావలసిన సోపాన పరంపరను ఉత్తరార్ధంగాను, మహర్షి ఏర్పాటు చేశాడు.

ఈ రెండు భాగాలలోనూ ప్రతిచోటా పాఠకులకు ఒక గట్టి పరీక్ష ఎదురౌతూ ఉంటుంది. అదేమిటంటే, ఈ విషయాన్ని పూర్వం ఏ ప్రకరణంలో, ఏ సందర్భంలో, ఏ రకమైన పద్ధతిలో, ప్రతిపాదించారో ఒక సారి వెనక్కి వెళ్ళి జాగ్రత్తగా చూసుకోవాలి. దానిమీద ఇప్పుడు, ఈ ప్రతిపాదనలో, ఏమి మార్పులు చేస్తున్నారో, ఆ మార్పులవల్ల ఏ మెరుగుదలను సాధిస్తున్నారో, శ్రద్ధగా గమనించాలి. అప్పుడే ఈ ప్రకరణ పఠనం సార్థకమౌతుంది. సద్గురువుల అనుగ్రహంతో చేతనైనంతవరకు పూర్వాపర సమన్వయం చేసుకుంటూ, ఇక ఈ నిర్వాణ ప్రకరణంయొక్క పూర్వార్ధంలోకి మనం ప్రవేశిద్దాం.

ఉపశమ ప్రకరణ ప్రారంభంలో, వశిష్ఠమహర్షి మధ్యాహ్న సమయానికే సభ చాలించి, మిగిలిన సమయాన్ని శ్రోతలంతా మననం చేసుకోవడం కోసం విడిచి పెట్టాడనీ, శ్రీరాముడు రాత్రంతా నిద్ర పోకుండా వశిష్ఠోపదేశాన్ని అదే క్రమంలో గుర్తుకు తెచ్చుకొని మననం చేశాడనీ, చెప్పారు. అలాగే ఆ సమయంలో అటు వశిష్ఠుడు, ఇటు రాముడు, ఆచరించిన ఆహ్నికానుష్ఠానాలను వివరంగా వర్ణించారు.

ఈ ప్రకరణం కూడా ఇంచుమించు అలాంటి సన్నివేశంతోనే ప్రారంభ మౌతుంది. ఐతే వశిష్ఠమహర్షి ఇక్కడ సభను సాయంకాలం ఆపాడు. అనుష్ఠానాదులన్నీ అయ్యాక మరునాడు ఉదయం అందరూ సమావేశమయ్యారు. సభ ప్రారంభం కాగానే వశిష్ఠ మహర్షి "నేను చెప్పిందంతా జాగ్రత్తగా మననం చేసుకున్నావా?" అంటూ ప్రారంభించి, ఆయనే మళ్ళీ మరోసారి తను చెప్పిన దానికి సంగ్రహ సింహావలోకనం చేశాడు. ఈ సింహావలోకనంలో రకరకాల మెరుపులు మెరిపించాడు. ఉదాహరణకు –

**జీవన్ముక్తా మహాత్మానో**
**యే పరావర దర్శినః ।**
**తేషాం యా చిత్తపదవీ**
**సా సత్త్వమితి కథ్యతే ॥**
**జీవన్ముక్త శరీరేషు**

**వాసనా వ్యవహారిణీ ।**
**న చిత్తనామ్నీ భవతి**
**సా హి సత్త్వపదం గతా ॥** (నిర్వాణ – సర్గ 2 శ్లో. 42,43)

రామా! మానవుడు సాధనలు చేసి, జీవించి ఉండగానే చిత్తాన్ని ఉపశమింప జేసికొని, జీవన్ముక్తుడు కావాలి. పరమాత్మ దర్శనం చేయాలి. మహాత్ముడు కావాలి. అలాంటి జీవన్ముక్త దశలో కూడా కొంత వ్యవహారం ఉంటుంది. వ్యవహారం ఉందీ అంటే, చిత్తం మిగిలి ఉన్నట్లు కాదా అని అంటావేమో, అప్పటి చిత్తం ఎలా ఉంటుందంటే, శరత్కాలం వచ్చి వరదలు తగ్గాక లంక నేల మీద అలల గుర్తులుంటాయి. అవి ఇసుకలో అలల లాగానే కనిపిస్తాయి. కానీ అవి నిజమైన అలలా? అలాంటిదే వీరి చిత్తమూ! అందుకనే జీవన్ముక్తులయొక్క చిత్తానికి చిత్తమనే పేరు పోయి 'సత్త్వం' అనే పేరు వస్తుంది. ఇంతకూ చిత్తమంటే ఏమిటి? వ్యవహారాలు చేసే వాసనల మూట పేరే చిత్తం. మళ్ళీ చెబుతున్నా విను. వ్యవహారాలు చేసేవారిలో ఉండే వాసన పేరు చిత్తం. విజ్ఞులైనవారిలో మిగిలి ఉండే వాసనా శేషం పేరు సత్త్వం – అని వశిష్ఠమహర్షి పునరుక్తిగా చెప్పాడు.

ఈ విషయం పూర్వం చెప్పిందే, ఐనా చిత్తము, సత్త్వము, అనే పదాలలో ఉండే విశేషాన్ని నొక్కి చెప్పడం ఇక్కడి ప్రత్యేకత.

ఈ విధంగా వశిష్ఠమహర్షి నాల్గవ సర్గ చివరిదాకా తన సింహావలోకనాన్ని కొనసాగించాడు.

ఐదవ సర్గలో శ్రీరాముడు తనకు సంసార మోహం శాంతించిందనీ, తత్త్వ దర్శనం లభించిందనీ, విస్పష్టంగా ప్రకటించాడు.

**అనుభవ వశతో హృదబ్జ కోశే**
**స్ఫుటమలితాం సముపాగతేన నాథ।**
**తవ వర వచసేహ వీతశోకాం**
**చిరముదితాం చ దశాం గతోస్మి ॥** (సర్గ 5. శ్లో. 16)

గురుదేవా! మీ వాక్కులు నా హృదయ కమలం మీద తుమ్మెదల్లాగా అతుక్కు పోయాయి. దానివల్ల నాకు దుఃఖాతీతమైన, సుస్థిరమైన, ఒకానొక దశ అనుభవంలోకి వచ్చింది. ఈ దశ "చిరం ఉదితాం" శాశ్వత వికాస రూపంగా ఉన్నది. "చిర– ముదితాం" శాశ్వత ఆనంద రూపంగా ఉన్నది. ఇట్టి దశ "అనుభవ వశతః " నా అనుభవంలోకి వచ్చింది – అని శ్రీరాముడు విస్పష్టంగా ప్రకటించాడు. ఇదే ఈ సర్గలోని చివరి శ్లోకం.

### 3. మళ్ళీ విను

ఇక ఆరవ సర్గతో ఈ ప్రకరణం నిజంగా ప్రారంభమౌతుంది. మరో గురువైతే శ్రీరాముడి ప్రకటన విని ఆనందంతో గంతులేసేవాడే! కాని వశిష్ఠమహర్షి మాత్రం

**భూయ ఏవ మహాబాహో**
**శ్రుణు మే పరమం వచః ।**
**యత్తేఽహం ప్రీయమాణాయ**
**వక్ష్యామి హితకామ్యయా ॥**
**భేద మభ్యుపగమ్యాపి**
**శ్రుణు బుద్ధి వివృద్ధయే ।**

**భవేదల్ప ప్రబుద్ధానా**

**మపి నో దుఃఖితా యథా ॥** (పూర్వార్ధం–సర్గ 6, శ్లో. 1,2)

అంటూ మళ్ళీ ప్రబోధం ప్రారంభించాడు.

***వశిష్ఠుడు***: రామా! నీమీద ప్రీతితో, నీ హితం కోరి, మళ్ళీ మరో మంచి మాట చెప్పబోతున్నా! జాగ్రత్తగా విను. "వినవలసినదంతా వినేశాను, రావలసిన అనుభవం వచ్చేసింది, ఇంకా నాకు బోధలెందుకు?" అనుకుంటావేమో, అది తప్పు.

"నాకు ప్రపంచంలో భేదమే కనుపించడం లేదు. గురువు, శిష్యుడనే తేడా కనుపించడం లేదు. చెప్పేవాడు, వినేవాడు, అనే తేడా కనుపించడం లేదు. అసలు వినబడే శబ్దం వినే నా కన్నా భిన్నంగా కనుపించడం లేదు." అంటావేమో! నీకు ఆ అనుభవం ఉన్నా సరే, లేనిది ఉందనుకొని,(బాధితాను వృత్తితో) భేదాన్ని అంగీకరించి, నేను చెప్పేది విను. ఎందుకోసమంటే, జ్ఞానం ఇంకా పెరగాలి(బుద్ధి వివృద్ధయే).

(ఇక్కడిదాక చెప్పాక, పాపం, వశిష్ఠమహర్షికి అసలు విషయం దాచుకోబుద్ధి కాక, పై పాదంలో పైకి చెప్పేశాడు.) రామా! నీకు అక్కరలేక పోయినా నీవు వినాలయ్యా! ఎందుకంటే, అల్ప ప్రబుద్ధులు కొందరు ఉన్నారు ఈ శ్రోతల్లో. వాళ్ళకు బుద్ధి వృద్ధి పొందాలి. వాళ్ళకు మళ్ళీ దుఃఖం అంటకూడదు. అందుకోసం మళ్ళీ చెబుతా! మళ్ళీ విను.

ఇంత విన్నాక అల్ప ప్రబుద్ధులు ఎవరుంటారని అనుకోకు. ఈ దేహం మీద ఆత్మ అనే భావం తొలగి పోకుండానే, విశాలమైన వేదాంత భావన ప్రారంభించేసరికి, ఈ ప్రపంచమే నేనని గోల ప్రారంభించే సరికి, ఆసాధకుల దేహంలో ఉన్న ఇంద్రియాలు పగబట్టి పెట్రేగి వారిని ఎదిరిస్తాయి; దీనికి భిన్నంగా దేహం మీద ఆత్మభావనను పూర్తిగా తొలగించుకొని, అప్పుడు విశాల బ్రహ్మ భావన చేసేవాడికి తన శరీరంలో ఉన్న ఇంద్రియాలు ఆప్త మిత్రులై సహకారం చేస్తాయి. అందువలన మధ్యమాధికారి ఐనవాడు ఉపదేశ శ్రవణంవల్ల జ్ఞానం కలిగిన తరువాత కూడా అనుక్షణం శ్రవణ మననాలను కొనసాగిస్తూనే ఉండాలి. దేహాత్మలయొక్క తారతమ్యాన్ని విస్పష్టంగా విచారణ చేస్తూ వివేచన చేస్తూనే వుండాలి.

ఇలా ప్రారంభించిన వశిష్ఠమహర్షి 7,8 సర్గలు రెండింటిలోనూ దేహంయొక్క, దృశ్యజగత్తుయొక్క, అల్పత్వాన్ని, నిరర్థకత్వాన్ని, అసత్యత్వాన్ని, విస్తారంగా ప్రతిపాదించాడు. అలా ప్రతిపాదిస్తూ 8వ సర్గ చివరికి వస్తూవుండగా ఇలా అన్నాడు–

**మహా విషలతైషా హి**

**సంసార విష మూర్ఛనామ్ ।**

**దదాతి రభసాశ్లిష్టా**

**పరామృష్టా వినశ్యతి ॥** (పూర్వార్ధం – సర్గ 8 , శ్లో. 25)

రామా! ఈ అజ్ఞానం ఒక వింత విషలత. దీన్ని పట్టుకుంటే సంసారమననే విషం వ్యాపిస్తుంది. ముట్టుకోకుండా దూరం నుంచి పరిశీలించి చూస్తే పూర్తిగా నశించిపోతుంది. చూడు, ఇటు చూస్తే నీరు, అటు చూస్తే కొండ; ఇటు వెన్నెల, అటు ఎండ; ఇటు కదిలే ఆకు, అటు కదిలించే గాలి; ఇటు నరకం, అటు స్వర్గం; ఒకచోట విష్ణువు, ఒకచోట బ్రహ్మ; ఒకచోట రుద్రుడు, ఒకచోట యముడు – ఏమిటీ ఈ భేదమంతా? ఇదంతా అవిద్యావిలాసం గాక మరేమిటి? కనుక రామా! నువ్వు ఈ భేదాన్ని దాటిపో, అవిద్యను దాటిపో, అప్పుడే ఆత్మకు మోక్షం సుస్థిరం.

**యత్కించనాంగ భువనేషు మహామహిమ్నా**
**వ్యాప్తం, జరత్తృణలవత్త్వ ముపాగతం వా।**
**దృశ్యం స్ఫురన్నను హరాద్యపి తామవిద్యాం**
**విద్ధి, క్షయాయ, తదతీతయాత్మలాభః ॥** (పూర్వార్ధం సర్గ 8, శ్లో. 32)

రామా! ప్రపంచంలో ఏదైనా సరే, బ్రహ్మాండంగా పెరిగిపోయి పెద్దగా కనిపించినా సరే, ఎండిన గడ్డి పోచ లాగా క్షీణించి స్వల్పంగా కనిపించినా సరే, అది దృశ్యమే! మనస్సుతో సహా ఏ ఇంద్రియానికి స్ఫురించినా సరే, అది దృశ్యమే! ఈశ్వరాదులలో సహా అది నశించి పోయేదేనని తెలుసుకో! దాన్ని దాటిపోతేనే నిజమైన ఆత్మతత్త్వం లభిస్తుందని తెలుసుకో!

### 4. త్రిమూర్తులు గూడా అవిద్యలో భాగమే

***శ్రీరాముడు:*** అదేమిటి గురుదేవా? "స బ్రహ్మ స శివస్సహరిస్సేంద్ర స్సోక్షరః పరమస్స్వరాట్" ( ఆ పరబ్రహ్మే చతుర్ముఖ బ్రహ్మ, ఆయనే శివుడు, ఆయనే విష్ణువు, ఆయనే ఇంద్రుడు, ఆయనే అక్షరుడు, ఆయనే స్వరాట్) అని ఈ విధంగా వేద వాక్యాలు బ్రహ్మ విష్ణు శివాదులంతా పరమాత్మ స్వరూపమని చెబుతూవుంటే మీరు "దృశ్యం స్ఫురన్నను హరద్యపి తామవిద్యాం" అంటూ వాళ్ళను కూడా అవిద్యా స్వరూపులుగా లెక్కగట్టేస్తున్నారేమిటి? ఆ మాట వింటుంటే నాకు బుర్రతిరిగి పోతున్నట్లుగా వుంది.

***వశిష్ఠుడు:*** రామా! ఈ తత్త్వశాస్త్రంలో వాక్యాలను వినేటప్పుడు మనం ఏ స్థాయిలో ఏ వాక్యాన్ని మాట్లాడుతున్నామో మరిచిపోకూడదు. మనం శుద్ధ సద్రూప పరబ్రహ్మను గూర్చి మాట్లాడుతున్నాం. ఇది సృష్టికి పూర్వం ఈ జగత్తంతా ఆకారం లేని దశలో సత్ –చిత్ – ప్రకాశ స్వరూప మాత్రంగా ఉన్న స్థితి.

దానిలోంచి చిదాభాసస్ఫూర్తి ఏర్పడింది. చిదాభాస స్ఫూర్తి అంటే– నేననే స్ఫురణం. ఇది శుద్ధ సద్రూప బ్రహ్మలోంచి ఏర్పడింది. ఎలా ఏర్పడింది? నీటిలో సుడిగుండంలా ఏర్పడింది.

సుడిగుండమంటే ఏమిటి? కొత్తగా వచ్చిన పదార్థమేదీ లేదు. నీటికే ఒక ఆకార మేర్పడింది. అంతకు మించి మరేమీ లేదు. ఆకార మంటే ఏమిటి? అదీ నీరే! అంతకుమించి క్రొత్త పదార్థమేదీ లేదు. కొత్త పదార్థం లేకుండానే కొత్త పేరు వచ్చింది. అదీ నేననే పేరు. అదే అవిద్యకు ప్రారంభ స్వరూపం. దాని పేరే చిదాభాస స్ఫూర్తి.

మన పరిశీలన కోసం దీని వికాసాన్ని సూక్ష్మ –మధ్య – స్థూలాలని మూడు భాగాలుగా విభజన చేసికోవచ్చు.

అందులో మధ్యభాగం మనోరూపాన్ని పొందింది. అది మరింత వికసించి హిరణ్యగర్భుడైంది. అతను మరింత వికసించి స్థూల విరాడాకారంగా మారాడు. అదే ఈ ప్రపంచం.

ఇది ఒక రకమైన విభాగం.

మళ్ళీ మరో విభాగం వుంది. దీని ప్రకారం అవిద్యలో సత్త్వరజస్తమస్సులనే మూడు గుణాలున్నాయి. వీటిలో ప్రతి దానికీ మళ్ళీ సూక్ష్మ మధ్య స్థూలాలనే మూడు భాగాలున్నాయి. కనుక మొత్తం మీద ఈ అవిద్య (ప్రకృతి) 9 రకాలయిం దన్నమాట. ఈ కనిపించే ప్రపంచంలోని ప్రతి పదార్థమూ ఆ 9 రకాల అవిద్యయొక్క సమ్మేళనమే–అని గుర్తించు.

ఇప్పుడు హిరణ్యగర్భుడి దగ్గర్నించీ రాళ్ళు రప్పల దాకా ఈ ప్రపంచమనే పదార్థాలను విభజించుకుంటూ వద్దాం. అలా వస్తే–

నువ్వు చెప్పిన హరిహర బ్రహ్మాదులున్నారే వాళ్ళ సత్త్వంలో సత్త్వంలో సత్త్వంయొక్క స్వరూప విశేషాలు.

**శ్రీరాముడు**: మూడు భాగాలూ సత్త్వమే ఐతే, నీళ్ళలో నీళ్లలో నీళ్లుగా ఉన్నట్లుంటే ఇంకా భేదమేముంది? ఏ భేదమూ లేక పోతే హరిహర బ్రహ్మాదులనే భేదమెలా వచ్చింది?

**వశిష్ఠుడు:** మూడవ సత్త్వభాగంలో కొంచెం రజస్సు కలిస్తే, అతడు బ్రహ్మ. అక్కడ కొంచెం తమస్సు కలిస్తే, అతడు రుద్రుడు. ఏమీ కలవకుండా ఉంటే అతడు విష్ణువు. రజస్సు, తమస్సు, కలిసినాయని చెప్పుకున్నా, అవి రేఖామాత్రాలే! అది కూడ వారు తమవలన జరుగ వలసిన కార్యాల కోసం వారు స్వయంగా స్వీకరించిన రేఖలే! అవి స్వేచ్ఛాప్రాప్తాలు గనుకనే ఆ రేఖా మాత్ర భాగాన్ని లెక్క చేయనక్కర లేదనీ, వారి ముగ్గురికీ ఏ రకమైన భేదమూ లేదనీ, వారిలో ఒకరు గొప్ప, ఒకరు తక్కువ, అని భావించేవారు ఘోర నరకాలకు పోతారనీ శ్రుతి స్మృతులు చెబుతున్నాయి.

ఋషులు, మునులు, సిద్ధులు, ఇలాంటివారు సత్త్వంలో సత్త్వంలో రజస్సుకు సంబంధించినవారు.

భోగలోలురైన విద్యాధర గాంధర్వాదులు సత్త్వంలో సత్త్వంలో తమస్సుకు సంబంధించినవారు.

ఇలా విభాగం చేసుకుంటూ పోతే, తమస్సులో కొద్దిగా రజస్సు, కొద్దిగా తమస్సు, కలసినవారు భూత ప్రేత పిశాచాదులు. ఇలా సృష్టిలోని పదార్థాలన్నిటినీ కూడ మనం విభాగం చేసుకుంటూ రావాలి.

ఒక జాతి, సత్త్వంలో రజస్సులో తమస్సుకు సంబంధించింది అన్నామనుకోండి. ఆ జాతిలో కొన్ని కోట్ల జీవులు, స్థావరాలు, జంగమాలు, జడ పదార్థాలు, ఉండవచ్చు. అన్నీ అచ్చు గుద్దినట్లు ఒకే రకంగా ఉండవు. వాటిలో మళ్ళీ సత్త్వరజస్తమో గుణాల పాళ్ళు మారిపోతూ ఉంటాయి.

ఈ విధంగా శుద్ధ సత్త్వ పదార్థంలో ప్రారంభమైన చిదాభాసస్ఫూర్తి దగ్గర్నుంచీ రాళ్ళూ రప్పల దాకా వచ్చిన పదార్థాలన్నీ కూడా, అవిద్యలో క్రమ క్రమంగా వచ్చిన మార్పుల ఫలితాలే– అని మనం మరచి పోకూడదు.

నీటిలో ఓ సుడిగుండం లాగ వచ్చింది. దాంతో ప్రక్కనున్న నీరంతా అలలు, అలలుగా మారింది. అలల మీద బుడగ లొచ్చాయి. బుడగల లోంచి నురుగు లొచ్చాయి. అవన్నీ వేటికవి విడి విడిగా ఉన్నట్టు కనిపిస్తున్నాయి. కాని పరిశీలించి చూస్తే, ప్రతి చోటా ఉన్నది నీరే! అలాగే అవిద్యలోను, చిదాభాస స్ఫూర్తిలోను, త్రిగుణాల్లోను, వాటిలోంచి పుట్టిన పదార్థాల్లోను, అన్నిట్లోను నిజంగా ఉన్నది శుద్ధ సత్పదార్థమే!

ఈ దృష్టితో చూసినప్పుడు త్రిమూర్తులు గూడా అవిద్యలో భాగమే అవుతారు. ఆ దృష్టితోనే నే నిందాక అవిద్యా పరంపరలో త్రిమూర్తులను కూడా చెప్పాను.

**శ్రీరాముడు**: ఈ అవిద్యకు కారణం ఏమిటి?

**వశిష్ఠుడు**: కార్య కారణాలనే భావన ప్రపంచాన్ని బట్టి కలుగుతోంది మీకు. ఈ ప్రపంచంలో కార్యంగా కనిపించే రాళ్ళు రప్పలు మొదలైనవాటికి భూమి మొదలైన భూతాలు కారణాలు. అంటే అవిద్య ఒక చోట కార్య రూపంగా ఉంటోంది. అదే అవిద్య మరొక చోట కారణ రూపంగా ఉంటోంది. మనం చెప్పుకున్న ఉదాహరణలో రాయి కార్యావిద్య. భూమి కారణావిద్య. భూమికి కారణం జలం. కనుక ఇప్పుడు భూమి కార్యావిద్య. జలం కారణావిద్య. ఇలా వెనక్కి వెనక్కి పోతే, మనం చిదాభాస స్ఫూర్తి దాకా పోతాం. ప్రళయ కాలం వచ్చేసరికి కార్యారూపావిద్యలన్నీ కరిగి పోయి, కారణ రూపమైన అవిద్య మాత్రమే మిగిలి ఉంటుంది.

అంతకంటే వెనక్కు పోదామంటే కుదరదు. మళ్ళీ సృష్టి వస్తుంది. అప్పుడు ఈ కారణ రూపమైన అవిద్యయే కార్యావిద్యగా మారిపోతుంది. ఈ చక్రం ఇలా తిరుగుతూనే ఉంటుంది.

## 5. విద్య గూడా అవిద్యలో భాగమే

**శ్రీరాముడు**: మరి కారణా విద్యకంటె వెనక్కు వెళ్ళి చూడాలంటే ఎలా?

**వశిష్ఠుడు**: దానికి విద్య కావాలి. విద్య అంటే సత్యమైన జ్ఞానం. దానివల్ల చిదాభాస స్ఫూర్తికి హేతువైన భ్రాంతి నశిస్తుంది. అది నశిస్తే శుద్ధ సన్మాత్ర పరబ్రహ్మ మాత్రమే మిగులుతుంది.

**శ్రీరాముడు**: అదెలా? శుద్ధ సన్మాత్ర బ్రహ్మతోపాటు ప్రక్కన విద్య కూడ మిగలాలి.

**వశిష్ఠుడు**: అక్కడే కొంచెం జాగ్రత్తగా ఆలోచించాలి. విద్యకూడా అవిద్యలో భాగమే! కనుక అది కూడా పోతుంది.

**శ్రీరాముడు**: మీ వాదన మరీ వింతగా వుంది. పరస్పర విరుద్ధ పదార్థాలను ఒకదానిలో ఒకటి భాగమంటున్నారు. అవిద్యలో విద్య భాగమైతే , విద్య అవిద్యను ఎలా పోగొట్ట గలదు?

**వశిష్ఠుడు**: కట్టెకు నిప్పంటుకుంది. కట్టె, నిప్పు, పరస్పర విరుద్ధ పదార్థాలే! నిప్పువల్ల కట్టె కాలిపోయింది. కట్టె పూర్తిగా కాలిపోయిన తరువాత నిప్పు ఏమైపోయింది? కనుపించకుండా పోయింది.

వ్యాధి, ఔషధం, పరస్పర విరుద్ధ పదార్థాలు. ఔషధంవల్ల వ్యాధి నశిస్తుంది. వ్యాధి పూర్తిగా నశించిన తరువాత ఔషధం ఏమౌతుంది? అక్కర లేనిదై వెనక్కి పోతుంది. ఆ వ్యక్తివరకూ దానిలోని ఔషధత్వమే పోయిందని చెప్పవచ్చు.

అలాగే, విద్య అనేది ప్రవేశించి, అవిద్యను క్రమ క్రమంగా కాల్చివేస్తూ, చివరికి తనే అణగారి పోతుంది. ఎందుకంటే, హత్య చేయబడడానికి తగిన మనుష్యులు చుట్టుపక్కల ఎవరైనా ఉంటే, ఒకడు హంతకుడు కాగలుగుతాడు. చుట్టుప్రక్కల ఎవరూ లేక పోతే, వీడికి హంతకుడనే పేరు ఎలా కలుగుతుంది? అవిద్యను నశింప చేసేది విద్య అని నిర్వచనం. కనుక అవిద్య పూర్తిగా నశించిపోయిన తరువాత ఏది మిగిలి ఉంటుందో, దానిని విద్య అనడానికి వీలు లేదు. విద్య అనే పేరు అవిద్యతో పాటే నశించిపోతుంది.

**శ్రీరాముడు**: మరి ఏమి మిగిలి ఉంటుంది?

**వశిష్ఠుడు**: "కుండ" అనే పేరు పోతే, మట్టి మిగిలి వుంటుంది. సుడి గుండమనే పేరు పోతే, నీరు మిగిలి ఉంటుంది. ఘటాకాశమనే పేరు పోతే, ఆకాశం మిగిలి వుంటుంది. ఇప్పుడైనా సరే, పేరు పోతే అంతకుముందు ఏది ఉందో అదే మిగిలి వుంటుంది. అది ఒక్కటే మిగిలి ఉంటుంది. విద్య అనే పేరు, అవిద్య అనే పేరు, రెండూ పోతే, ఏమి మిగిలి ఉంటుందో నువ్వు ఆలోచించు.

**శ్రీరాముడు**: శుద్ధ సన్మాత్ర పరబ్రహ్మం మిగిలి ఉంటుందా?

**వశిష్ఠుడు**: అవును! అది ఒక్కటే మిగిలి ఉంటుంది.

**శ్రీరాముడు**: 'ఆ దశలో సన్మాత్రము ఒక్కటే మిగిలి ఉంటుంది' అనడాన్ని బట్టి, సృష్టి దశలో మాత్రం సత్పదార్థము, దాని ప్రక్కన అవిద్యాపదార్థము, రెండూ సత్యంగా ఉన్నాయని మీరు అంగీకరించినట్లేనా?

**వశిష్ఠుడు**: మట్టిగింజలోంచి మట్టి చెట్టు వచ్చింది – అని గమనించాం. ఇప్పుడు విచారణ ప్రారంభించాం. ఈ మట్టిచెట్టు ఎక్కడి నుంచి వచ్చిందని ప్రశ్నించాం. చర్చించి, చర్చించి, ఈ చెట్టు ఆ గింజలో అవ్యక్త రూపంగా మొదట్లోనే ఉందని తేల్చాం. ఇలా అన్నాం కాబట్టి, ఇంత చెట్టూ నిజంగానే మరుగుజ్జైపోయి, ఆ గింజలో కూర్చుందని అర్థమా? కానే కాదు. కొమ్మలుగా, రెమ్మలుగా, ఆకులుగా, కాయలుగా, రకరకాలుగా, నామరూప విభేదాలను పొందడానికి తగిన సామర్థ్యం ఆ గింజలో దాగి ఉందని మాత్రమే మన ఉద్దేశ్యం. అలాగే, సృష్టి దశలో ప్రకృతిగా, అవిద్యగా, నామ రూపాలుగా, ఏది కనిపిస్తోందో, అది నిజంగా సత్య

పదార్థమే ఐతే, అది సృష్టికి పూర్వం లేనిదై పోవడానికి వీలు లేదు. అది అప్పుడూ, ఇప్పుడూ, కూడా లేనిది కనుకనే, ఇప్పుడు ఉన్నట్లు కనిపిస్తున్నా అప్పుడు లేనిదిగా గుర్తింప బడుతోంది. దానిని బట్టి అది కనిపించే సమయంలో కూడా లేనిదే అని గుర్తించడం మనం నేర్చుకోవాలి.

**అవిద్యే త్యుచ్యతే లోకే**
**చిచ్చేత్య మలమాశ్రితా ।**
**చేత్యాతీతాత్మతామేతి**
**సర్వోపాధి వివర్జితా ॥** (పూర్వార్థ. సర్గ10, శ్లో. 5)

రామా! చెప్పాను కదా! పరిశుద్ధ పదార్థం పేరు 'చిత్'. దానిమీద ఆరోపితమై భూత భౌతిక రూప విశేషాలుగా కనిపిస్తున్న పదార్థాల పేరు 'చేత్యం' (చైత్యము కాదు.) చిత్తు, చేత్యమూ కలసి ఉన్నట్లు మనకు కనిపిస్తున్నాయనుకో. అప్పుడు నిజంగా ఉన్న పదార్థం ఏది? చిత్తే!

లేకపోయినా ఉన్నట్లే కనిపిస్తోంది గనుక, చేత్యానికి మరో పేరు 'మలం'. చేత్యమనే మలంలో కలిసి ఉన్నప్పుడు 'చిత్తు'నే 'అవిద్య' అని పిలుస్తున్నాం. ఆ మలం తొలగిపోయి నానారకాల రూపాలు (ఉపాధులు) లేనివనే గుర్తింపు కలిగిందనుకో, అప్పుడు నువ్వేమంటావు? చిత్తు, చేత్యాన్ని దాటి పోయిందంటావు. ఇక్కడ దాటి పోవడమంటే ఏమిటి? నిజంగా ఉన్న రెండవ వస్తువు లేదు. ఆ రెండవ వస్తువు కొంత కాలం ఉన్నట్లు కనుపించింది. దానికి కారణమేమిటంటే అవిద్యకు కార్యాలైన మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు, చిత్తును చుట్టేశాయి. సాలీడు పొట్టలోంచి బైటికి వచ్చిన దారాలు సాలీడునే చుట్టేసినట్లుగా, అవి చిత్తును చుట్టేశాయి. తరువాత కొంత కాలానికి ఆ దారాలు హరించుకు పోయాయి. అంతే గాని, చిత్తు ప్రత్యేకంగా ఎగిరి దేనినీ దాట లేదు. ఐనా సరే, 'అవిద్య పోతే, చిత్తు చేత్యాన్ని దాటి శుద్ధ చిత్తుగా మిగులుతోంది' – అని మనం అంటున్నాం. దీనికి కారణం జీవులయొక్క చిత్తంలో వివేకం లేకపోవడమే. దీనివల్లే వారు చిత్తును, చేత్యాన్నీ, విడదీసి చూసుకో లేక పోతున్నారు. దానివల్లే సృష్టి దశలో సత్పదార్థము, అవిద్యాపదార్థము, రెండూ నిజంగానే వున్నాయేమో అనిపిస్తూ వుంటుంది.

**6. స్థావర జీవులు - యోగులు**

***శ్రీరాముడు***: గురుదేవా! నిండు చైతన్యం గల మానవ జీవుల పరిస్థితే ఇలా ఉంటే, ఇక పశువుల స్థితి, అంతకంటే మూఢంగా ఉండే స్థావర జీవుల స్థితి, ఎలా ఉంటుంది? వాటి చిత్త పరిస్థితి ఏమిటి? వాటికి గతి ఏమిటి?

***వశిష్ఠుడు***: రామా! విషయం అర్థం కావడం కోసం మానవ జీవులను, చెట్టూ చేమల వంటి స్థావర జీవులను, పోల్చి చూద్దాం. మానవుల సుషుప్త చిత్త స్థితి బండరాయి వంటిది, మెలకువ స్థితి నీటి వంటిది, అనుకుంటే, వృక్షాదుల చిత్త స్థితి ఈ రెంటికీ మధ్యలో ఉంటుంది. అటు రాయీ గాదు, ఇటు నీరూ గాదు. ఇంచు మించు ఊబిలాంటిది అనుకోవచ్చు. దాంట్లో పూర్వాపర విమర్శకు సావకాశం లేదు. కర్మేంద్రియాలకు సమగ్రమైన స్థానం లేదు. మనస్సుయొక్క ప్రసారం కూడా అంతంత మాత్రమే. చైతన్యం కేవలం సత్తా మాత్రంగా ఉంటుంది. అందుచేత వాటికి ముక్తి లభించే ప్రసక్తే లేదు.

***శ్రీరాముడు***: అదేమిటి, గురుదేవా? ఇంద్రియ వ్యాపారాలు లేకనే పోతే, మనస్సంచారం కూడా నామ

మాత్రమే ఐతే, ఆ జీవుల పరిస్థితి మానవులలో యోగుల వంటిదే కదా! అంతే గాక, వాటికి తప్పుడు పనులు గాని, తప్పుడు ఆలోచనలు గాని, లేవు గనుక పాపపు ప్రసక్తి లేనే లేదు గదా! కనుక అవి ముక్తికి బాగా దగ్గరగా ఉన్నాయని చెప్పాలి. మరి మీరు ఇలా అంటున్నారేమిటి?

***వశిష్ఠుడు***: రామా! ముక్తికి కొంచెం దగ్గర, కొంచెం దూరం, ఇలాంటి భేదాలతో సంబంధం లేదు. ముక్తి, బంధము – రెండే మెట్లు. బంధం కర్పూరం లాగా హరించుకుపోతే, అప్పుడు ముక్తి. కర్పూరం ముద్ద చాలా వరకు హరించుకు పోయిందండీ, చివరికి చిన్న పలుకు మత్రం రవ్వ లాగ మిగిలి పోయింది, అది మాత్రం ఇక హరించదు – అంటే ఇక ముక్తికీ, దానికీ దూరమే! స్థావర జీవులలో మిగిలిపోయిన అవిద్యా శేషం హరించుకుపోయే అవకాశం ఏ రకంగానూ లేదు. అది హరించాలంటే మనస్సు కదలాలి. జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలు కదలాలి. శ్రవణ మనన నిదిధ్యాసలు జరగాలి. వాటివల్ల వాసనాక్షయం జరగాలి. వాసనా క్షయం అంటే ఏమిటి? దృశ్య ప్రపంచం అసత్యమని తెలుసుకొని వదిలి పెట్టడమే వాసనాక్షయం. అసలు తెలివే లేకపోతే, నాకు వాసన అంటే ఏమిటో తెలయదంటే, అది వాసనాక్షయం ఎలా ఔతుంది? కనుక, ఆ స్థితివల్ల ముక్తి వచ్చే ప్రసక్తి లేదు.

ఇక జ్ఞానేంద్రియ కర్మేంద్రియ ప్రసారాలు లేవు గనుక పాపస్పర్శ లేదు కదా అంటున్నావు. ప్రస్తుతం పాప స్పర్శలేదు. మరి, పూర్వం సంపాదించుకున్న పాప పుణ్య సంస్కారాల మాటేమిటి? అవి స్థావర జీవి చిత్తంలో దాగి ఉండనే ఉన్నాయి. హిమాలయాలలో చలికాలంలో రక రకాల విత్తనాలు మంచురాళ్ళ కింద పేరుకొనిపోయి వుంటాయి. అవి ఉన్నట్లే కనిపించవు. కాని వేసవి కాలంలో ఎండకు మంచు కరిగిపోతే అవి మళ్ళీ మొలకెత్తనే ఎత్తుతాయి. స్థావర జీవుల మనస్సులో దాగి ఉన్న సంస్కార బీజాల పరిస్థితి కూడా ఇదే. కనుక, ఇప్పుడు పాప స్పర్శ లేనంత మాత్రాన, ముక్తి విషయంలో వాటి కొచ్చిన ప్రత్యేక ప్రయోజనమేదీ లేదు.

పాపపుణ్యాలు రెండింటికీ అవకాశంవున్న మానవ జీవులలో కూడా, అందులోనూ పాపాలను పరిహరించి పుణ్యాలను మాత్రమే ఆచరించాలని కృషి చేసే సాధకులలో కూడా, అందులోనూ ఆత్మ విద్యా బోధన పొంది కొంత పట్టును సాధించినవారిలో కూడా, మళ్ళీ మళ్ళీ భావన చేస్తూ అనేక సార్లు అభ్యాసం చేయక పోతే, ఆత్మ భావన సుస్థిరం కాజాలదు. అందుకే, నీకు చెప్పిన విషయాలనే మళ్ళీ చెబుతున్నా!

ఇట్టి పరిశుద్ధాత్మ భావన నిజంగా సుస్థిరమైతే, అలాంటి జీవి జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలతో ఎన్ని పనులు చేసినా, వాడికి ఏ రకమైన సంబంధమూ ఉండదు. శ్రీ మహావిష్ణువు అనేక అవతారాలెత్తాడు. కొన్ని సార్లు గర్భవాసాది క్లేశాలు గూడా అనుభవించాడు. ఐనా సరే, ఆయనకు బంధం గాని, సుఖదుఃఖాల స్పర్శగాని, ఉందా? అవి అంటవు. అలాగే, అర్ధనారీశ్వరుడై శృంగార మూర్తిగా ఉండే శివుడూ అంతే! విరాగియై నిత్య వేద పాఠకుడుగా ఉండే బ్రహ్మో అంతే! బృహస్పతి, శుక్రుడు, నారదుడు, శుకుడు, మొదలైన జీవన్ముక్తులు అందరూ అంతే! వారియొక్క ఆత్మ తత్త్వ నిశ్చయానికి చలనం లేదు. అలాంటి నిశ్చయమే నీకు కలుగు గాక!

***శ్రీరాముడు***: గురుదేవా! ఆ మహానుభావులందరికీ అలాంటి దుఃఖాతీత స్థితి ఏ నిశ్చయంవల్ల లభించిందో, దాన్ని మరొక్కసారి చెప్పండి?

***వశిష్ఠుడు***: రామా! ఈ విషయాన్ని పూర్వం ఉపశమ ప్రకరణంలో సిద్ధగీత సందర్భంలోను, మళ్ళీ ఉద్దాలక సంవర్త వీతహవ్యాదుల మనన ప్రక్రియలను వర్ణించే సందర్భంలోను, వివిధ రీతులుగా నీకు ఉపదేశించి ఉన్నాను. సారాంశమైన విషయమేమంటే,సామాన్య మానవులకు 'సర్వమూ బ్రహ్మమే' అనే భావన కలుగక పోవడానికి ప్రధాన కారణాలు రెండు. 1. వైరాగ్యం లేకపోవడం 2. ఈ దేహం నేను కాదనే నిశ్చయం

లేకపోవడం. ఈ రెండు కారణాలనూ గుర్తించిన సాధకుడు మొదట ఈ ప్రపంచమంతా ముత్యపు చిప్పమీద కనుపించే వెండి ముద్ద వంటిదని మళ్లీ మళ్లీ భావన చేయాలి. దానివల్ల వైరాగ్యం కలుగుతుంది. అది ముదిరిన కొద్దీ ఈ దేహం నేను కాదనే తెలివి పెరుగుతుంది. ఆ తెలివి పెరుగుతున్న కొద్దీ, చైతన్యం అంటే ఏమిటి? ఉపాధి అంటే ఏమిటి? సాక్షి అంటే ఏమిటి? మొదలైన సూక్ష్మ విషయాలమీద అవగాహన పెరుగుతుంది.

ఉదాహరణకు – నేలమీద మనిషి ఉన్నాడు. ఆకాశంలో సూర్యుడున్నాడు. కన్ను సూర్యుడ్ని చూస్తోంది. ఎలా చూస్తోంది? ఈ వ్యక్తిలో ఉపహితమై (కుండలో ఆకాశ ంలాగా అంతర్గతమై, పరిమితమై) వున్న చైతన్యం అతని నేత్రం ద్వారా బయటికి ప్రసరించి, సూర్యుడి దాకా ప్రవహించి, సూర్యుణ్ణి ఆవరిస్తే, అప్పుడు ఈ వ్యక్తి 'నేను సూర్యుణ్ణి చూస్తున్నాను' అనే అనుభూతిని పొందుతున్నాడు. (ఈవిషయాలను ముముక్షు వ్యవహార ప్రకరణంలో 'ఇంద్రియం ద్వారా జ్ఞానం కలిగే విధానం' అనే శీర్షిక క్రింద చెప్పుకొని వున్నాం.) ఇక్కడ భూమి మీద ఆ చైతన్యానికి ఉపాధి కన్ను. పైన ఆకాశంలో దానికి ఉపాధి సూర్యుడు. మధ్యలో ఉపాధి ఎవరు? ఎవరూ లేరు గనుక అక్కడ చైతన్యం నిరుపాధికం అని చెప్పక తప్పదు. ఈ విషయం అర్థమైతే, చైతన్యం సోపాధికంగా కనిపిస్తున్న సమయంలో కూడా అది నిజానికి నిరుపాధికమేననీ, ఆ నిరుపాధిక చైతన్యం నేనేననీ, ఒక నిశ్చయం పెరుగుతుంది.

ఇది పెరిగిన కొద్దీ "తత్త్వమసి" (అది నువ్వే) మొదలైన మహావాక్యాలలో అది అంటే ఏమిటి? నువ్వు అంటే ఏమిటి? ఈ రెంటికి ఏకత్వం ఎలా సంభవిస్తుంది, అనే విషయాల మీద పరిశోధన ప్రబలమౌతుంది. దీనినే 'తత్త్వం పదార్థ శోధన' అంటారు. ఈ శోధన ఉత్తమ స్థాయికి చేరినందువల్లే పూర్వం జనకాదులు జీవన్ముక్తులయ్యారు. దేహంతో సహా ఈ ప్రపంచమంతా ఆభాస రూపంగా కనిపిస్తోందే తప్ప, ఇది సత్య వస్తువు కాదనీ, నిరుపాధిక చైతన్యమే నేననీ, అనుభవ పూర్వక నిశ్చయం కలవాడే జీవన్ముక్తుడు.

(వశిష్ఠ మహర్షి ఈ విషయాలను వివరించడానికి రెండు సర్గలు తీసికున్నాడు. పదమూడవ సర్గ శ్రీరాముడి ప్రశ్నతో ప్రారంభమౌతుంది.)

## 7. యోగ -జ్ఞానాలు

**శ్రీరాముడు**: గురుదేవా! మీరు ఉపశమ ప్రకరణంలో, ఇలాంటి సుస్థిర నిశ్చయం కలగడానికి వాసనాక్షయమూ, చిత్తోపశాంతీ, కలగాలని చెబుతూ, దానికి రెండు ఉపాయాలు చెప్పారు–

**"ద్వౌ క్రమౌ చిత్తనాశస్య**
**యోగో జ్ఞానం చ రాఘవ"** అన్నారు. (ఉపశమ ప్రకరణం, సర్గ.78, శ్లో.8)

యోగ జ్ఞానాలే ఆ ఉపాయాలన్నారు. వీటిలో జ్ఞానం ఉత్తమాధికారులకు, యోగం మధ్యమాధికారులకు, ఉపాయం అన్నారు. నాకైతే జ్ఞాన విధానంలోనే వాసనాక్షయం లభించి జీవన్ముక్త పదవిలో విశ్రాంతిగా ఉన్నాను. మరి ప్రాణ స్పంద నిరోధ రూపమైన యోగ విధానంలో ఇలాంటి అనుభూతి ఎలా లభిస్తుందో కొంచెం వివరించండి. అంతే గాక, ఈ రెండింటిలోనూ దేనివల్ల కలిగే ఫలితం శాశ్వతంగా నిలబడి ఉంటుందో కూడా చెప్పండి.

(**గమనిక**: ఉపశమ ప్రకరణంలో 92వ సర్గలో వశిష్ఠ మహర్షి జ్ఞానము, యోగము, అనే రెండూ కూడా చిత్త నిర్మూలనకు మార్గాలే అనే విషయం తేల్చి చెప్పాడు.)

**వాసనా సంపరిత్యాగాత్**
**చిత్తం గచ్ఛత్య చిత్తతామ్ ।**
**ప్రాణస్పంద నిరోధాచ్చ**
**యథేచ్ఛసి తథా కురు ॥** (ఉపశమ . సర్గ 92, శ్లో. 26)

రామా! చిత్తం అనేది చిత్తం కాకుండా పోవాలంటే, రెండు ఉపాయా లున్నాయి– వాసనాత్యాగము, ప్రాణస్పంద నిరోధము– అని ఆయన అక్కడ వివరించడమే గాక, 'యథేచ్ఛసి తథా కురు' (ఏది కావాలంటే దానినే అనుసరించు) అని కూడా చెప్పాడు. రాముడికిప్పుడు వాసనా సంపరిత్యాగ మార్గం ద్వారా జీవన్ముక్త స్థితి అనుభవంలోకి వచ్చింది. ఐనా సరే, మళ్ళీ ఉపదేశం వినమంటున్నాడు వశిష్ఠ మహర్షి. కనుకనే జ్ఞాన మార్గ యోగమార్గాలవల్ల లభించిన జీవన్ముక్తి స్థితులలో ఏది సుస్థిరంగా ఉంటుంది?– అని శ్రీరాముడు ఇక్కడ ప్రశ్నిస్తున్నాడు.)

***వశిష్ఠుడు***: రామా! నిజానికి ఈ రెండు మార్గాలకూ కూడా యోగమనే పేరుంది. జీవాత్మ పరమాత్మలను ఏకం చేసే లక్షణం ఈ రెండు మార్గాలలోనూ ఉంది కనుక, రెండింటినీ యోగం అని పిలవ వచ్చు. అయినా సరే, ప్రాణ నిరోధాది రూపమైన మార్గానికి యోగమనే పేరు ఎక్కువగా రూఢిలో వుంది. అందుచేతనే ఒక దానిని జ్ఞాన మార్గమనీ, ఇంకొక దానిని యోగ మార్గమనీ, పెద్దలంటున్నారు.

ఈ రెండింటిలో ఏది గొప్పదని నువ్వు ప్రశ్నిస్తున్నావు. అలాంటి తేడా ఎంత మాత్రమూ లేదు. కాని కొందరికి యోగమార్గమే సాధ్యం. మరి కొందరికి జ్ఞాన మార్గమే సాధ్యం. నా మటుకు నాకు జ్ఞాన మార్గమే సులభంగా ఉంటుంది.

తన మనస్సులో వున్న రుచి భేదాన్ని బట్టి గాక, నిష్పక్షపాతంగా, తర్క బద్ధంగా, విశ్లేషణ చేస్తూ, ఆ విశ్లేషణ ఫలితాలకు కట్టుబడి ఉండగల మానసిక స్వభావం గలవాడికి జ్ఞాన మార్గమే సులభం. ఈ మార్గంలో బాహ్య నియమాల బెడద కూడా తక్కువ.

ఇలా తర్కానికి పూర్తిగా కట్టుబడి ఉండటం కొందరికి సులభ సాధ్యం కాదు. అలాంటి వాళ్ళకు యోగ మార్గమే సులభం. దీనిలో నియమాలు కొంచెం ఎక్కువ. దీనిని దీర్ఘకాలం పాటు నిరంతరాభ్యాసంగా సాగించాలి. ఆ దృష్టితో చూస్తే ఇది కొంచెం కష్టతరమైన మార్గంగా చెప్పాలి.

కానీ ఇలా అన్నాం కదా అని ఈ దేహం నేను కాదనే తార్కిక నిర్ణయానికి కట్టుబడి ఉండకుండా, అంతర్గతంగా ఐహిక సుఖాల కోసం ఆరాట పడుతూ, పైకి మాత్రం నాది జ్ఞాన మార్గమే నని ఆర్భాటం చేసేవారికి అణువంత కూడా ప్రయోజనం వుండదు. అటువంటివారు యోగ మార్గాన్ని అనుసరించినట్లైతే, అంతర్గతంగా ఉండే ఆశాలేశాలు గూడా అడుగంటి, దీర్ఘకాలాభ్యాసం మీద ఆత్మ సమాధిని అందుకోగలుగుతారు.

నీకు ఇంత వరకూ ఎక్కువగా జ్ఞాన మార్గ సాధకుల కథలే చెప్పాను. ఉద్దాలకుడు, వీతహవ్యుడు, మొదలైనవారి కథలలో యోగ మార్గ ప్రసక్తి కూడా కొంత తెచ్చాను. గాధి చరిత్రలో మధ్యమాధికారియైన జిజ్ఞాసువునకు నిష్కామమైన తపస్సు ఎంత ముఖ్యమో చెప్పాను. ప్రహ్లాద ప్రసక్తిలో భక్తి ప్రాధాన్యాన్ని కూడా వర్ణించాను. ఐనా, ప్రధానంగా యోగ మార్గం ద్వారా పరమ చరమ స్థితిని అందుకొన్న మహానుభావుల ప్రస్తావన మన మాటల్లో ఇంత వరకూ రాలేదు. ఒక సారి అలాంటి మహానుభావుడ్ని ఒకడ్ని చూసి నేనే ఆశ్చర్యంలో మునిగిపోయా! ఆయనే భుశుండుడనే కాకి. ఆయన చరిత్ర సంగ్రహంగా చెబుతా విను.

8. భుశుండోపాఖ్యానము

శ్రీరామా! నేనొక సారి దేవేంద్ర సభలో ఉండగా, మహర్షి మండలిలో దీర్ఘకాలంగా జీవించి వున్న చిరంజీవులెవరు? వారిలో మహానుభావులెవరు?– అనే చర్చ వచ్చింది. ఆ సందర్భంలో శాతాతపుడనే ఒక మహర్షిగారు ప్రసంగిస్తూ, "కాకభుశుండుడు" అనే కాకి మహర్షిగారు ఒకాయన ఉన్నారనీ, ఆయన మార్కండేయాదుల కంటే కూడా చాలా పెద్ద చిరంజీవి అనీ, ఆత్మ విద్యలో ఆయనకు సాటి లేనే లేరనీ, యోగ సిద్ధులలో కూడా ఆయనతో పోటీ పడగలవారు మరొకరు లేరనీ, ఇలా అనేక రకాలుగా గొప్పలు చెప్పడం ప్రారంభించాడు.

నాకు నమ్మబుద్ధి కాలేదు. కొరగాని కాకి, మహర్షిగా మారడమేమిటి? అంత గొప్పవాడైపోవడమేమిటి? ఐనా ఏ సభలకూ రాకపోవడమేమిటి? అంత దీర్ఘ జీవి ఐతే, ఆయన పేరైనా ఎక్కడా వినిపించక పోవడ మేమిటి?–అని ఇలా అనేక రకాల సందేహాలు కలిగాయి. ఆ శాతాతప మహర్షి అబద్ధం చెప్పేవాడు కాదు. కనుక, ఆయన మాటను తేలిగ్గా కొట్టిపారేయలేం. ఐనా సరే, ఎందుకైనా మంచిది, మనమే ఒక సారి వెళ్ళి పరిశీలించి చూసుకుంటే మంచిది అనిపించింది. అందుచేత ఆ శాతాతపుడుగారి దగ్గర కాకిగారి ఇంటి గుర్తులన్నీ అడిగి తెలుసుకొని, వెంటనే బయలుదేరి వెళ్ళాను.

మేరు పర్వతం మీద, ఈశాన్య భాగంలో, పద్మరాగ మణిశిలలతో కూడిన మహా శిఖరం ఒకటి వుంది. దాని మీద పెద్ద మామిడి చెట్టుంది. దానికి చూతమనీ, కల్పవృక్షమనీ, ఆ ప్రాంతాలలో ప్రసిద్ధి వుంది. దాని కొమ్మలే యోజనాల పొడుగు వున్నాయి. వాటిల్లో దక్షిణపుప్రక్కన ఉన్న కొమ్మలో, పెద్ద కొండ గుహ అంత తొఱ్ఱ వుంది. దాంట్లో ఉంటున్నాడు, ఈ కాకి మహర్షి గారు. నేను వెతుక్కొని, వెతుక్కొని, ఆ తొఱ్ఱ దగ్గరికి చేరాను.

వెళ్ళి చుట్టూ చూద్దును కదా, అక్కడ ఏ విశేషాలూ కనిపించటం లేదు. ఆ చుట్టు పక్కల కొమ్మలలో కొన్ని వందల జాతుల పక్షులు గూళ్ళు కట్టుకొని గోల గోలగా జీవనం చేస్తున్నాయి. ఈ కాకి గోలలో మహర్షులుండటం ఏమిటబ్బా అనుకుంటూ కనిపిపంచిన ప్రతి పక్షినీ భుశుండ కాకిగారి గురించి అడగ సాగాను. ఎవరికీ ఆ చుట్టు పక్కలలో ఒక కాకి మహర్షిగారు ఉన్నట్లు ఊహైనా లేదు. ఎవరూ చెప్పలేక పోతున్నారు. ఐనా సరే, నేను పట్టుదలగా వెతుకుతూనే ఉన్నాను.

చివరికి ఒక చోట గాజు ముక్కలలో ఇంద్రనీల మణి లాగా, ఆ కాకుల గుంపులోని ఒక కాకి ఎందుకో నన్ను ప్రత్యేకంగా ఆకర్షించ సాగింది. ఆ కాకి గూడా నా వంక ఎగా దిగా చూస్తూ "స్వాగతం వశిష్ఠ మహర్షీ! రండి, దయ చేయండి" అంది సాదరంగా.

నేను ఆశ్చర్య పోయాను. పక్క కాకులు కొంచెం బెదరి కొద్దిగా దూరం జరిగాయి. ఆ స్వాగతం పలికిన కాకే భుశుండ మహర్షి అని నాకు అర్థమైంది. నేను సాదరంగా నమస్కారం పెట్టి, ఆయన వైపుకు నడిచాను. ఆయన ఒక పెద్ద మామిడాకును తెచ్చి నాకు ఆసనంగా వేశాడు. ఆదరంగా కూర్చోబెట్టి అర్ఘ్య పాద్యాలిచ్చాడు.

నేను ఆశ్చర్యంవల్ల నోట మాట లేకుండా కూర్చున్నాను. ఆయనే ప్రసంగం ప్రారంభించాడు.

***భుశుండుడు***: మహాత్మా! వశిష్ఠ మహర్షీ! మా పుణ్యాలు పండి, మీరే స్వయంగా వచ్చి దర్శనం అనుగ్రహిస్తున్నారు. మీ రాకతో మా పుణ్యం పెరిగింది. సర్వ సమచిత్తులై నిరంతరం బ్రహ్మ నిష్ఠలో వుండే తమబోటి మహానుభావులకు, ఈ ప్రపంచం మొత్తం అవిద్యా విలాసమే అని గుర్తించిన జ్ఞానమూర్తులకు, దేశ కాలాదులను దాటిన దివ్యర్షులకు,

చిరంజీవులెవరన్న ఆలోచన రావడం, ఆ ప్రసక్తిలో మా పేరు గుర్తు రావడం, అంత మాత్రం చేత నామీద అనుగ్రహం కలిగి ఇంత దూర ప్రయాణం చేసి వచ్చి నాకు దర్శనాన్ని అనుగ్రహించడం, ఇదంతా నా భాగ్యం కాక మరేమిటి? మహాత్మా! దర్శనంతో ఎలాగూ అనుగ్రహించారు. తమ వాక్యామృతంతో గూడా ఈ జీవుణ్ణి అనుగ్రహించండి. మహాత్ముల ఉపదేశం సులభంగా దొరికే భాగ్యం కాదు గదా!

రామా! ఆ మాటలు విని నేను ఆశ్చర్య పోయాను. మొత్తం కథంతా తనే చెప్పేస్తున్నాడు. ఐనా ఎంత వినయం? ఎంత శ్రద్ధ? ఇలాంటివాడి ముందు నేనేమి మాట్లాడాలి?– అని లోలోపల సందేహిస్తూనే, పైకి మాత్రం గంభీరంగా ఇలా అన్నాను.

***వశిష్ఠుడు***: పక్షిరాజా! మీరన్నది నిజం. పవిత్రమైన మీదర్శనం కోసమే నేనొచ్చాను. మీరీ సంసారపు వలలో చిక్కుకో లేదని మిమ్మల్ని చూడగానే అర్థమైపోయింది. ఐనా సరే అడుగుతున్నాను. మీ కులమేమిటి? ఇలాంటి ఆత్మ తత్త్వజ్ఞానం మీకెలా లభించింది? దానితో పాటు దీర్ఘాయుష్యం ఎలా లభించింది? మీ వయస్సు ఎంత? ఎన్ని దివ్య శక్తులు లభించినా ఈ కాకి రూపం వదిలి పెట్టకుండా, ఈ కాకుల గుంపులో ఇలా మారుమూలగా పడి వుండడానికి కారణమేమిటి? దయచేసి ఈ వివరాలన్నీ చెప్పండి.

## 9. పూర్వాశ్రమ వృత్తాంతం

***భుశుండుడు***: మహాత్మా! మీరడగడమే మా అదృష్టం! మా పాప ప్రక్షాళన కోసమే మీరిలా అడుగుతున్నారు. కనుక నా కథంతా సంగ్రహంగా వివరిస్తాను. దయచేసి వినండి.

తమకు తెలుసు కదా, సకలలోక పూజ్యుడైన పరమేశ్వరుడికి అవతార స్వరూపులుగా ఏకాదశ రుద్రులున్నారు. వారి పరివారంలో అష్టమాతృకలున్నారు. వారిలో ఏడవది 'అలంబుసా' మాత. ఈవిడకు వాహనం కాకి. ఈ కాకి పేరు "చండుడు"

ఒకసారి అష్టమాతృకలూ కలసి తుంబురుడనే రుద్రుడి దగ్గరకు చేరి, ఒక మహాశ్మశానంలో వామాచార విధానంలో మహోత్సవం ఒకటి చేశారు.

ఆ ఉత్సవంలో వామాచార విధానం ప్రకారం వాళ్ళు ఒంటినిండా ఎర్రగంధం పూసుకొని, పీకల దాకా మద్యం తాగి, నాట్యాలు చేశారు.

కొంత సేపయ్యాక ఏవో చర్చలు మొదలయ్యాయి. ఆ సందర్భంలో "ప్రధాన రుద్రుడైన ఈశానుడియొక్క భార్య ఉమాదేవి మనందరి మీదా అధికారాలు చెలాయిస్తోంది. దాని పొగరు తగ్గించాలి" అనే మాట వచ్చింది.

తాగిన మత్తులో వాళ్ళు వెనకా ముందు ఆలోచించకుండా పెట్రేగిపోయి, తమ ఎనిమిది శక్తులూ కలిపి, ఉమాదేవిని కొట్టి, లాక్కొచ్చి, తమ దగ్గర పడేసు కున్నారు. ఐనా కోపం చల్లారక, తమ మంత్ర శక్తులతో ఆ ఉమాదేవిని రక రకాల పిండి వంటలుగా మార్చేసి, కరా కరా నమిలి తినేశారు. అలా తిని, మళ్ళీ తాగి, ఒళ్ళు మరిచి నాట్యాలు చెయ్యడం మొదలు పెట్టారు.

ఈ నాట్య వాద్య ధ్వనులకు ఆకర్షితులై సరస్వతీ దేవియొక్క వాహనాలైన ఆడ హంసలక్కడికి వచ్చాయి. ఆ నాట్యానికి చాలా సంతోషించాయి. అమ్మగార్లు చాలా సేపు నాట్యం చేస్తూ వుండటంవల్ల, అలంబుసా దేవికి వాహనమైన చండుడనే కాకి తను గూడా కొంచెం మద్యం తాగి, పిండి వంట ముక్కలు నమిలి, గంతులు వేయడం ప్రారంభించాడు. అది చూసి సరస్వతీదేవి హంసలకు కూడా చాపల్యం పుట్టి, అవి గూడా

తాగి, తిని, గంతులు వేయడం మొదలు పెట్టాయి.

అమ్మగార్లు ఉపాసనా రూపంగా గంతులు వేస్తుంటే, హంసలు ఏమీ తెలియకుండా, ఒళ్లు మరిచి, కాకితో కలిసి గంతులేసి, జాతి భేదం కూడ మరిచి పోయి, ఉచ్చనీచాలు లేకుండా క్రీడించాయి. దానివల్ల ఆ హంసలు గర్భవతులయ్యాయి.

తెల్లవారేసరికి మాతృకా దేవతలు నాట్యోపాసనలు చాలించి, ప్రధానుడైన ఈశాన రుద్రుడి దగ్గరకు చేరారు. ఆయనకు తాము తెచ్చిన పిండి వంటలను నైవేద్యంగా సమర్పించారు. ఆయన ఆ పిండి వంటలను చూస్తూనే అష్టమాతృకలు చేసిన అకృత్యాన్ని గుర్తించి, అగ్గిమీద గుగ్గిలమై మండి పడ్డాడు. దాంతో అష్ట మాతృకలు భయపడి, తమ శరీరాలలోని మాంస ఖండాలను కోసి, వాటితో ఏవేవో హోమాలు చేసి, మళ్ళీ ఉమాదేవిని యధాతథంగా సృష్టిచేసి, ఈశాన రుద్రుడికి సమర్పించి, వాళ్ళిద్దరికీ మళ్ళీ కళ్యాణం చేసి, ఎలాగోలా వాళ్ళిద్దరి అనుగ్రహమూ సంపాదించుకొని, ఎవరి దోవన వారు వెళ్లిపోయారు.

మాతృకా దేవతలు మహాశక్తి సంపన్నలు గనుక, తప్పు చేసినా దిద్దుకో గలిగారు. హంసలు మాత్రం తమ తప్పు ఎలా దిద్దుకోవాలో తెలియక, మొహం చెల్లక , గతిలేక, చివరికి వాలిన మొహాలతో సరస్వతీ దేవి దగ్గరకు చేరాయి. ఆ తల్లి వీళ్లను చూస్తూనే మండిపడి "నా దగ్గర ఇన్నాళ్ళుండి కూడా, నీరక్షీర వివేక జ్ఞానం సంపాదించి కూడా,ఇలాంటి నీచపు పనికి పాల్పడతారా? ఇక మీరు నాకు పనికి రారు. మీరు బయటకు పోయి తోచినట్టు బ్రతకండి" అని గెంటి పారేసింది.

ఈ హంసలకు దిక్కు తోచక, బ్రహ్మ లోకంలో ఉండడానికి మొహం చెల్లక, విష్ణు లోకానికొచ్చేసి, విష్ణుమూర్తియొక్క నాభి సరస్సులో చాటు జీవనం చేయసాగాయి. ఆ ఏడుగురు హంసలకూ ముగ్గురేసి చొప్పున 21 మంది కాకి సంతానం కలిగింది. వాళ్ళలో పెద్దవాణ్ణి నేను.

మేము కొంచెం పెద్దవాళ్ళమై రెక్కలొచ్చాక, మా తల్లులతో సంప్రదించి, మెల్లిగా ధైర్యం చేసి, వారిని వెంట బెట్టుకొని, మళ్ళీ బ్రాహ్మీ లోకానికే చేరాం. అక్కడ బ్రాహ్మీదేవిని రక రకాలుగా స్తుతించి, అనుగ్రహించమని ప్రార్థించాం. ఆ తల్లి కరుణించి, మా తల్లులకు మళ్ళీ ఉద్యోగాలిచ్చి, మాకు జ్ఞాన భిక్ష పెట్టింది.

ఆ విధంగా సరస్వతీదేవి అనుగ్రహాన్ని సంపాదించిన తరువాత, మేము మా తండ్రిని చూడాలనే కోరికతో అలంబుసా దేవి రాజ్యానికి బయలు దేరాం. ఆమె వింధ్య పర్వతంలో వుంటుంది. అక్కడ మా తండ్రిని కలిశాం. ఆయన మమ్మల్ని చాలా ఆదరించాడు. ఆయన జాతికి కాకి జాతివాడైనా, అలంబుసా దేవి అనుగ్రహంతో జ్ఞానంలో పండి ఉన్నాడు. మేము బ్రాహ్మీదేవి అనుగ్రహంతో సంపాదించిన జ్ఞాన లేశపుబలంవల్ల చేస్తున్న ఆత్మ విద్యా సాధనను చూసి ఆయన చాలా సంతోషించాడు.

ఒక రోజున ఆయన మమ్మల్ని దగ్గరకు పిలిచి-

"అబ్బాయిలూ! మీకు సరస్వతి దేవి అనుగ్రహంవల్ల ఎంతో కొంత జ్ఞానం లభించినట్లే కనిపిస్తోంది. అది సంతోషమే! కాని నిజమైన ఆత్మజ్ఞానం లభించిందా, లేదా ? అది లభించక పోతే ఇతర విద్యలవల్ల ప్రయోజనం లేదు. మీకు ఆ తల్లి ప్రథమ గురువు కనుక, మళ్ళీ ఆమె దగ్గరికే పోదాం రండి. ఆమె చల్లని తల్లి. ప్రార్థిస్తే త్వరగా కరుణిస్తుంది. పరిపూర్ణ జ్ఞానాన్ని అనుగ్రహిస్తుంది. " - అన్నాడు.

నాన్నగారు అలంబుసాదేవి భక్తుడనీ, మేము సరస్వతిదేవి శిష్యులమని తెలిస్తే ఆయన మరో రకంగా అనుకుంటాడేమోననీ, లోలోపల భయపడుతున్న మాకు చాలా సంతోషం కలిగింది. మేము ఆయనకు నమస్కరించి -

"నాన్నగారూ! బ్రాహ్మీ మాత అనుగ్రహంవల్ల తెలియ వలసిన దంతా తెలిసింది. మా ఇంద్రియాలను ఏ విషయాలూ ఆకర్షించడం లేదు. సాంసారికమైన కోరికలేవీ కలగడం లేదు. ఇక ఏకాంత వాసం చేద్దామని ఉంది. శరీరమిచ్చిన తల్లిదండ్రులకు సేవ చెయ్యాలి గనుక, మీ సేవకోసం ఇక్కడ ఉండి పోయాము. ఇక మీరు అనుమతించి ఏదైనా మంచి ఏకాంత ప్రదేశాన్ని సూచిస్తే, అక్కడ నిరంతరం ఆత్మ ధ్యానంలో ఉండాలని ఉంది" అన్నాము.

ఆయన ఆ మాటలకు ఆనందంతో పొంగి పోయి, మమ్ములను కౌగిలించుకొని, ముద్దులు పెట్టుకొని, తను అలంబుసాదేవి దగ్గరనుంచీ ప్రత్యేక ప్రసాదంగా తెచ్చుకొని దాచి పెట్టుకొని వున్న మాంసపు ముక్కలను మాకందరికీ పెట్టాడు. అప్పుడాయన మా కిలా చెప్పాడు–

"నాయనలారా! నిజమైన ఏకాంత ప్రదేశం కావాలనుకుంటే, ఎగిరి మేరు పర్వతం చివరికి చేరి పొండి. (మేరు పర్వత మంటే వెన్నుముక). చాలా దూరం వెళ్ళాక పదహారువేల ఆమడల వైశాల్యం వున్న శిఖరం ఒకటి కనిపిస్తుంది. (16,000 అంటే 16 దళాలు గల విశుద్ధ చక్రం). దానిని గూడా దాటిపోతే, ఇంకా పైన, పద్మరాగ శిలామయమైన శిఖరం ఒకటుంది. (పద్మరాగ మణులంటే పద్మాలవంటి కన్నులు.) దానిలో ఈశాన్య భాగపు చివరిలో, ఒక పెద్ద కల్పవృక్షం వుంది. (ఈశాన్యభాగమంటే ఈశ్వరుడు అధిపతిగాగల ఆజ్ఞా చక్రం). అది ఎంత పెద్దదంటే, ఈ బ్రహ్మాండం మొత్తానికి ప్రతిబింబమేమో అనిపించేటంత పెద్దది. (కల్ప వృక్షం అంటే సహస్రారం). దాని దక్షిణపు కొమ్మలో ఉన్న తొర్రలో నేను పూర్వం ఒక సారి ఒక గూడు గట్టుకొని కొంతకాలం ఉండి వచ్చేశాను. (దక్షిణపు కొమ్మంటే నిర్మలమైన జ్ఞాన మార్గం.) ఇప్పటికీ ఆ గూడు అక్కడ భద్రంగానే వుంది. మీరు నిజంగా ఏకాంత ప్రదేశంకావాలనుకుంటే అక్కడికి వెళ్ళండి. అక్కడ మీకు దేవతలవల్ల గాని, మానవులవల్ల గాని, ఏ రకమైన సందడీ వుండదు. ఇబ్బందులూ ఉండవు. మీకిది నచ్చితే సుఖంగా బయలు దేరండి."

మేము ఆ మాటలకు సంతోషించి, మా తండ్రిగారికి నమస్కరించి, మా తల్లుల దగ్గరికి వచ్చేశాం. అక్కడ బ్రాహ్మీ మాతకు కూడా మా నాన్నగారు చెప్పిన మాటలు విన్నవించాం. ఆమె గూడా అనుమతించి ఆశీర్వదించింది. అప్పుడు మా తల్లుల అనుమతిని స్వీకరించి, మేమందరం ఈ మేరు శిఖరానికి వచ్చేసి, అప్పటి నుండి ఇక్కడే వుండిపోయాం.

మహర్షీ! తమకు ఒక చిన్న మాట మనవి చెయ్యాలి. నిజానికి ఈ జరిగిన సంఘటన అంతా ఈ కల్పంలోది కాదు. ఎప్పుడో వెనకటి కల్పాలలో ఒక కల్పంలోనిది. ఆ కల్పమూ పోయిందీ, ఆ శిఖరమూ పోయిందీ, ఆ వృక్షమూ పోయింది. కాలక్రమంలో అలాంటివే మళ్ళీ పుట్టాయి. మళ్ళీ నేను ఇక్కడే ఉంటున్నాను. అంచేత, ఆ పాత చెట్టూ, ఈ చెట్టూ ఒక్కటే అన్నట్లుగా మాట్లాడాను. దయచేసి అబద్ధం చెబుతున్నాననుకోకండి. ఇన్ని కల్పాల తరువాత తమబోటి మహాత్ములు ఇంత దూరం నడచి స్వయంగా విచ్చేసి దర్శనం అనుగ్రహించడం నా భాగ్యం. ఇదిగో ఈ అర్ఘ్యం స్వీకరించండి. ఈ పూజా ద్రవ్యాలు స్వీకరించండి. అనుగ్రహించండి.

***వశిష్ఠుడు***: రామా! జ్ఞాన తపోవృద్ధుడైన భుశుండుడు ఇలా రెండో సారి కూడా అర్ఘ్యపాద్యాలు తెచ్చేసరికి, ఆయన వినయానికి విస్తుపోయి, "ఓ మహాత్మా! మీ సోదరులలో ఒక్కరూ కనిపించరేమి?" అని అడిగాను. ఆ తరువాత మా సంభాషణ ఇలా కొనసాగింది.

***భుశుండుడు***: మహర్షీ! మీకు తెలియనిదేముంది? ఎంత జీవన్ముక్తుడైనా ఆయుర్దాయం ప్రారబ్ధానికి అధీనం కదా! క్రమ క్రమంగా ఒక్కొక్క కల్పంలో ఒక్కొక్కరుగా, వాడి వాడి ఆయుర్దాయాన్ని బట్టి, నా సోదరులు విదేహ కైవల్యంలోకి వెళ్ళిపోయారు. కాలంమింగలేని వస్తువుంటుందా ప్రపంచంలో?

***వశిష్ఠుడు***: భుశుండ మహర్షీ! ఇంత జ్ఞానివయ్యావు. అనుభవ వేత్తవయ్యావు. వృద్ధుడ వయ్యావు. ఈ వార్ధక్యంలో ఏమి సుఖముందని ఇక్కడ పడి ఉన్నావు?
ఇక్కడ నీళ్ళు లేవు, నిప్పులు లేవు. ఈ పర్వతం ఇంత ఎత్తుగా వుండటంవల్ల పన్నెండుమంది సూర్యుల ఎండా ఒకే సారి తగులుతోంది. దాంతో పగటి పూట రాళ్ళు గూడా పగిలి పోతున్నాయి. రాత్రిపూట పదహారుమంది చంద్రులూ ఒకే సారి కనిపిస్తున్నారు. దాంతో మంచుగడ్డలు కూడా కుదించుకు పోతున్నాయి. ఇలాంటి చోట ఏమి సుఖం వుందని స్థిరనివాసం పెట్టుకున్నావు?
***భుశుండుడు***: మహాత్మా! నుదుటి గీతను ఎవరు తప్పించ గలరు? నీచ జాతిలో పుట్టమనీ, ఆకాశంలో తిరగమనీ, అడవులలో తిరగమనీ, చెట్లమీద బ్రతకమనీ, బ్రహ్మదేవుడు ముందే మా ముఖాన వ్రాశాడు. అలాంటి వాళ్ళకు ఇలాంటి జీవితం గాక మరొకటి లభిస్తుందా? ఐతే నేమి? ఆత్మానంద మహిమవల్ల నాకివేమీ పట్టడం లేదు. మీరు పగలు పూట ఎండనీ, రాత్రిపూట మంచనీ, చెబుతున్నారు. నేను ముసలి వాడిని. నా కంటికి ఆ వెలుగూ, ఈ వెలుగూ, ఒకటిగానే వుంది. రాత్రేదో, పగలేదో తెలియడంలేదు. ఐనా సరే, చిరకాలాభ్యాస బలంవల్ల మూలాధార చక్రంనుంచీ ఆజ్ఞా చక్రందాకా ప్రసరించే ఉచ్ఛ్వాస నిశ్శ్వాసల సంఖ్యనుబట్టి కాలాన్ని లెక్కేసు కుంటున్నాను. ఈ విధానాన్ని అజపజపం అంటారు. ప్రతి మనిషికీ రోజు మొత్తం మీద 21,600 ఉచ్ఛ్వాస నిశ్శ్వాసలు జరుగుతాయి. వాటిలో మూలాధారంలో 600, స్వాధిష్ఠానంలో 6000, మణిపూరంలో 6000, అనాహతంలో 6000, విశుద్ధంలో 1000, ఆజ్ఞా చక్రంలో 1000, సహస్రారంలో 1000, జరుగుతాయి. వీటిని అనుక్షణమూ గుర్తించుకుంటూ, ఆ యా చక్రాలలో గల వం,శం,షం,సం– వంటి బీజాక్షారాలను, హంసః – ఇత్యాది మంత్రాలను, ఆ యా చక్రాధిపతులైన గణపత్యాది దేవతలను, ఆత్మాభిన్నంగా అనుసంధానం చేసుకుంటూ రావడమే అజపజప విధానం. దీనిని రహస్యవేత్తలైన గురువుల వద్ద ఉపదేశం పొంది,అవిచ్ఛిన్నమైన జాగరూకతతో అనుష్ఠించే యోగులకు కాల తత్త్వం స్వయంగా సాక్షాత్కరిస్తుంది. కనుక, వారు కాల గణన కోసం సూర్య చంద్రాదుల మీద ఆధారపడవలసిన అవసరం వుండదని యోగ శాస్త్రం చెబుతోంది కదా!

ఇక సుఖం అంటావా, విచారణాబలంచేత నా బుద్ధి ప్రపంచంలో గల సారమేదో, అసారమేదో, గ్రహించింది. అందుచేత మామూలు కాకులకు వున్నట్లుగా నాకు సుఖదుఃఖాదులవల్ల సంక్షోభం కలగటం లేదు. నేనీ సంసారాన్ని వదిలి పెట్టనా అంటే, వదిలి పెట్టనూ లేదు! పట్టుకున్నానా అంటే, పట్టుకోనూ లేదు! మీలాంటి ఉత్తమ పురుషులు అనేకమంది అనుగ్రహించడంవలన, నా మనస్సు జీవయాత్రకు కావలసినంత వరకూ వ్యవహారాలు చేస్తున్నా, రాగ ద్వేషాది వృత్తులలోకి జారిపోవడం లేదు. ఇప్పుడు సాక్షాత్తుగా మీ దర్శనం అయింది గనుక, నా పాపాలన్నీ పూర్తిగా పటాపంచలయ్యాయనీ, ఇక నా జన్మ సఫలమైందనీ, నేను భావిస్తున్నాను.

ఇక స్థిర నివాసమెందుకు పెట్టుకున్నావని మీరడుగు తున్నారా? ముసలివాణ్ణి గదా! మాటి మాటికీ గూళ్ళు మార్చు కోమంటే మార్చుకోలేను. ఆ శక్తి పోయింది. ఈ చెట్టైతే కాస్త స్థిరంగా పడి వుంటుంది.

పూర్వం హిరణ్యాక్షుడు కింద ఉండే భూలోకాన్ని చాప చుట్టగా చుట్టడం చూశాను. అప్పుడు గూడా ఈ చెట్టు కదలలేదు.

మరొకప్పుడు శ్రీ మహావిష్ణువు, పై రెండు చేతులతోను మేరు పర్వతాన్ని గట్టిగా పట్టుకొని, క్రింది రెండు చేతులతోనూ మంధర పర్వతాన్ని పెకలించి, క్షీర సముద్రంలో మహాకూర్మం మీద పెట్టాడు. సముద్ర మథనం జరిగింది. అప్పుడు గూడా ఈ చెట్టు కదలలేదు.

సంకర్షణ రుద్రుడు ఆదిశేషుడి ఆకారాన్ని ధరించి, భూమిని మోస్తానని మొదలు పెట్టి, చివరికి

మొయ్యలేక, తన వేయి పడగలలోంచి ప్రళయాగ్ని జ్వాలలను కక్కి, ముల్లోకాలను భస్మీపటలం చేసినప్పుడు కూడా, ఈ చెట్టు కదల లేదు.

అందుచేతే ఈ చెట్టుమీద, ఈ పాత గూటిలో, ఇలా పడి ఉన్నాను.

### 10. బ్రహ్మప్రళయ సన్నివేశాలు

***వశిష్ఠుడు***: మహాత్మా! ముసలమ్మ కథలు చెబుతున్నట్లే చెబుతూ, సంకేతాత్మకంగా మాట్లాడుతున్నావు. నువ్వు చెప్పిన వన్నీ బ్రహ్మదేవుడి జీవితకాలంలో, ఆయనకు ఒక పగటి కాలం పూర్తైనపుడల్లా వచ్చే కల్పాంత ప్రళయాల సన్నివేశాలకు కొంచెం వెనకా ముందుగా ఉన్నాయి. మరి బ్రహ్మ దేవుడికే ఆయుర్దాయం చెల్లిపోయినప్పుడు వచ్చిపడే బ్రహ్మ ప్రళయ సమయంలో ఈ చెట్టు ఏమై పోయింది? చెట్టు లేకపోతే నువ్వేమైపోతావు? అలాంటి పరిస్థితి నీ కెప్పుడైనా తారస పడిందా?
***భుశండుడు***: మహర్షీ! తమరికి తెలియని దేముంది? అలాంటి బ్రహ్మ ప్రళయంలో ఈ చెట్టు నామరూపాలు లేకుండా పోతుంది.

**ఆకాశ ఏవ తిష్ఠామి**
**విగతాఖిల కల్పనః ।**
**స్తబ్ధ ప్రకృతి సర్వాంగో**
**మనో నిర్వాసనం యథా॥** (నిర్వాణ॥పూ॥ సర్గ 21. శ్లో 16)

అప్పుడు నాకు ఆకాశమే ఆధారం. నా మనస్సులో ఉండే కల్పనలన్నీ అప్పుడు మటు మాయమౌతాయి. నా అవయవాల స్వభావాలన్నీ నిశ్చలమైపోతాయి. అప్పుడు నేను వాసనలు లేని మనస్సు లాగా ఐపోతాను.

ఇలాంటి బ్రహ్మ ప్రళయం వచ్చి పడేటప్పుడు, ఎక్కడెక్కడి సూర్యుళ్ళూ రాలి పడిపోతూ వుంటారు. అప్పుడు నేను "వారుణీం ధారణాం బద్ధ్వా" నేనే వరుణ దేవుణ్ణి అనే చిత్త ధారణలో నిశ్చలంగా ఉండిపోతాను.

ప్రళయ వాయువు పెట్రేగి పోతుంటే "పార్వతీం ధారణాం బధ్వా" – నేనే పర్వతాన్ని అనే చిత్త ధారణతో నిశ్చలంగా ఉంటాను.

ప్రపంచమంతా జలమయమై అంతా ఒకే మహా సముద్రం లాగా కనిపిస్తున్నప్పుడు "వాయవీం ధారణాం బధ్వా" – నేను వాయువుననే చిత్త ధారణతో ఆకాశంలో తేలిపోతూ వుంటాను.

పంచభూతాది సమస్త తత్త్వాలూ పూర్తిగా అంతరించి పోయినపుడు,

**సుషుప్తావస్థయా తావత్**
**తిష్ఠామ్యచల రూపయా** (అదే సర్గ –శ్లో 20)

చివరికి మిగిలే భూమాఖ్య స్థానంలో, సుషుప్తావస్థలో లాగా ఏకరసీభూత స్థితిలో, నిర్వికల్ప సమాధిలో, నిశ్చలంగా ఉండిపోతాను. మళ్ళీ కొంత కాలానికి క్రొత్త బ్రహ్మ అనేవాడు పుట్టి, మళ్ళీ సృష్టి మొదలవుతుంది. అప్పుడు మళ్ళీ ఇక్కడ ఇలాంటి చెట్టే మొలుస్తుంది. ఆసమయానికి ప్రారబ్ధ బలంవల్ల నేను నిర్వికల్ప సమాధిని విడిచి పెడతాను. మళ్ళీ నా మనస్సు, ఇంద్రియాలు, పని చేయడం ప్రారంభిస్తాయి. నేను వచ్చి ఈ చెట్టుమీద మళ్ళీ మకాం పెడతాను. ఇలా చాలా సార్లు జరిగింది.

***వశిష్ఠుడు***:  భుశుండా! నీ ధారణాయోగం అద్భుతంగా ఉంది. దాని బలంవల్లే నువ్వు ఎన్నో బ్రహ్మ కల్పాలను దాటి, ఇలా చిరంజీవిగా ఉంటున్నావు. ఇలా ఇతర యోగులు ఎందుకు ఉండరు?

***భుశుండుడు***: బ్రహ్మర్షీ! యోగ సిద్ధులలో ఒకరిని ఒకరితో పోల్చడం సాధ్యం కాదు. ఎవరి భవితవ్యం వారిది. అది నియతియొక్క బలం. 'నియతి' అంటే పరమేశ్వరుని సంకల్పం. ఆ సంకల్పంచేత  నా సంకల్పానికి బలం కలుగుతోంది. ఈ బలంచేత బ్రహ్మలు మారినా, ఈ కొండమీద ఈ చెట్టు ఇలాగే వుడుతోంది. ఇది పరమేశ్వరుడు నాకు నిర్ణయించిన నియతి.

***వశిష్ఠుడు***: భుశుండా! అనేక బ్రహ్మ ప్రళయాలు చూశావు గదా! వాటిలో నీకు ఆశ్చర్యకరంగా కనుపించిన సన్నివేశాలేమిటి?

***భుశుండుడు***: బ్రాహ్మణోత్తమా! ఎన్నని చెప్పేది?

1. భూమి అంతా సముద్రంలో మునిగిపోయి, బ్రహ్మ విష్ణు మహేశ్వరులు తప్ప మరో జీవి లేని సన్నివేశాన్ని చూశాను.

2. జీవులే గాదు, గడ్డి పరకలు గూడా లేకుండా నాలుగుంబావు యుగాల పాటు  రాళ్ళ మయమై  వున్న భూమిని చూశాను.

3. 11,000 వేల సంవత్సరాలపాటు ఈ భూమి మొత్తాన్ని బూడిద వంటిదేదో కప్పి వుండటం నేను చూశాను.

4. భూమి చుట్టూ తిరిగే కాంతి వలయాలు గడ్డకట్టి సూర్య చంద్రులుగా తయారు కాకుండా వున్న పరిస్థితిని చూశాను.

5. నాలుగు యుగాల పాటు భూమి మొత్తాన్ని రాక్షసులే ఆక్రమించి ఉండటం చూశాను.

6. ఆ రాక్షసులు మొత్తం భూమి చుట్టూ ఉన్న ఆకాశాన్ని ఆక్రమించడం చేత భూమి అంతా అంధకార బంధురమై పోవడం చూశాను.

7. 10 వేల సంవత్సరాల పాటు భూమి మొత్తం ఆ రాక్షసుల ఎముకలతో నిండిపోవడం చూశాను.

8. రెండు యుగాల పాటు అడవులే తప్ప వేరే జీవులు లేని భూమిని చూశాను.

9. ఇక జీవుల వద్దకువస్తే, మహా మహిమాన్వితులైన మానవుల నెందరిని చూశానో లెక్క లేదు.

10. వారిలోంచి వచ్చిన మానవులు క్రమంగా కలియుగం వచ్చేసరికి దిగజారి, ధర్మ భ్రష్ఠులై, దీనులై,జీవించడం అనేకసార్లు చూశాను.

11. ఈ సృష్టి క్రమంలో స్త్రీ పురుష సంబంధం లేకుండా కేవలం మానసిక సృష్టిగా మనుష్యులు పుట్టడం చూశాను.

12. రకరకాల బ్రహ్మల సృష్టులు రకరకాలుగా ఉండడం చూశాను. ఒకేబ్రహ్మ చేసే సృష్టులలో కూడా, కల్పకల్పానికీ భేదాలుండటం చూశాను. ఉదాహరణకు,  ఒక సృష్టిలో భూమే లేదు. మరో సృష్టిలో వెలుగే లేదు. ఇంకొక సృష్టిలో భూమి వుంది గాని పర్వతాలు లేవు. ఇలా రకరకాల భేదాలు!

13. ఇక పోతే సామాన్య విశేషాలు కొన్ని వున్నాయి. హిరణ్యాక్షుడు భూమి నాక్రమించడం, విష్ణుమూర్తి అవతారాలు ధరించడం, సముద్ర మథనం, గరుత్మంతుడు స్వర్గానికెగరడం, ఇలాంటివన్నీ మీబోటి (వశిష్ఠులవారు) చిన్నవాళ్ళు గూడా చూసినవే!

14. నేనైతే విష్ణువే బ్రహ్మ పదవిగూడా ఆక్రమించి సృష్టి చేయడం చూశాను. బ్రహ్మదేవుడు తనే రుద్రుడై సంహారం చేయడం చూశాను. రుద్రుడు గరుత్మంతుడి  మీదికెక్కి  సృష్టి పరిపాలన చేయడం చూశాను.

15. బ్రహ్మర్షీ! మీ జన్మలలో 8 జన్మలు చూశాను. ఈ 8వ జన్మలో మీరు బ్రహ్మ పుత్రులు. వెనకటి జన్మలలో

ఒకప్పుడు మీరు ఆకాశంలోంచి పుట్టారు. మరో జన్మలో నీటిలోంచి పుట్టారు. మరో జన్మలో గాలిలోంచి పుట్టారు.

మరో జన్మలో రాతిలోంచి పుట్టారు. మరో జన్మలో నిప్పులోంచి పుట్టారు. ఇలా పంచభూతాలలోంచి మీరు పుట్టడం నేను చూశాను. ఎప్పటి రూపం అప్పటిదే! వాటిల్లో కొన్ని పోలికలున్నాయి. కొన్ని తేడాలున్నాయి. అవి గూడా నాకు గుర్తున్నాయి.

16. మీరే గాదు దేవతల పరిస్థితి గూడా ఇంతే! సముద్రంలో మునిగి వున్న భూమిని వరాహమూర్తి గాకుండా, కూర్మావతారమే ఉద్ధరించడాన్ని ఐదు సార్లు చూశాను.

17. కొన్ని కల్పాలలో పరశురామావతారమే లేదు.

18. బుద్ధావతారం కలియుగాలలో రావడం 100 సార్లు చూశాను.

19. తప్పు చేసిన దేవేంద్రులను శివుడు పదవి నుంచీ తప్పించి, కొండగుహలలో బంధించడం 9 సార్లు చూశాను.

20. మాహేశ్వర జ్వర వైష్ణవ జ్వరాలను అణచి వేయడం కోసమై, బాణాసురుడ్ని నిమిత్తమాత్రంగా చేసికొని, హరి హరులు యుద్ధం చేసుకోవడం ఎనిమిది సార్లు చూశాను.

21. ప్రతి ద్వాపరాంతంలోనూ వ్యాసుడు పురాణాలను మళ్ళీ మళ్ళీ వ్రాయడం చూశాను.

22. వాల్మీకి అనేవాడు 32వేల శ్లోకాలతో మహా రామాయణమనే గ్రంథాన్ని ఈ కల్పంలో రచించ బోతున్నాడు. దానిని దివ్య దృష్టితో చూస్తున్నాను. (మహారామాయణ మంటే యోగవాశిష్ఠమే!) దీనిని ఇతను ఇంతకు పూర్వం 11సార్లు రచించాడు.

23. పూర్వం కొన్ని కల్పాలలో మహాభారతాన్ని వ్యాసుడే రచించాడో, వాల్మీకే రచించాడో, సరిగా గుర్తు రావడం లేదు.

24. ఇలా సృష్టులన్నీ చూడగా చూడగా మనకు ఏమి తెలుస్తోందంటే, ఇవన్నీ సముద్ర తరంగాల మీది బుడగల వంటివి. బుడగలన్నీ ఒకే రకంగా ఉన్నాయా అంటే ఉన్నాయనీ చెప్పలేం! లేవనీ చెప్పలేం! సృష్టుల పరిస్థితీ అంతే!

25. నేనుండే ఈ కల్పవృక్షం మాత్రం అన్ని కల్పాలలోనూ చెక్కు చెదరకుండా ఉంటోందని నీకు చెప్పాను. అదీ గూడ వట్టి మాటే! ఎందుకంటే, బుడగ పోయి మళ్ళీ బుడగ వచ్చినట్లుగా, ఒక చెట్టు పోయి మరొక చెట్టు వస్తోంది. అదీ ఇదీ ఇంచుమించుగా ఒకే రకంగా ఉన్నాయి గనుక, అదే ఇది అంటున్నానంతే!

26. ఇక నా శరీర పరిస్థితీ అంతే! నా యోగధారణాబలం చేత ఏ కల్పానికా కల్పంలో దీనిని మార్పు చెందనీయకుండా నిలబెడుతున్నాడు.

27. వశిష్ఠమహర్షీ! ఇంకా చాలా చెప్పవచ్చు. ఈ బ్రహ్మదేవుడే గాక, ఐందవ బ్రహ్మలు చేసిన సృష్టి గూడా చూశాను. (ఐందవ బ్రహ్మలయొక్క సృష్టి కథను వశిష్ఠమహర్షి ఉత్పత్తి ప్రకరణంలో చెప్పాడు. అనేకమంది హిరణ్య గర్భులున్నారని స్థితి ప్రకరణంలో 47వ సర్గలో చెప్పారు).

28. నిజంగా ఏ మార్పులేకుండా ఉన్నదీ ఏదీ అంటే–అది నేనే!

## 11. మృత్యువు నన్ను ముట్టుకోదు

**వశిష్ఠుడు**: ఓ భుశుండా! ఇన్ని చెబుతున్నావు గదా! అంటే, ఈ సృష్టిలో నువ్వు భాగమై ఉండి ఏవేవో వ్యవహారాలు చేస్తున్నట్లే గదా! అలాంటివాడి దేహానికి మృత్యువు లేకుండా ఎలా వుంటుంది?

**కథం విహగ రాజేంద్ర**

**దేహం మృత్యుర్న బాధతే ။** (పూర్వ. సర్గ. 23. శ్లో. 2)

**భుశుండుడు**: మీరు ప్రభువులు, మేము భృత్యులము. దాసులచేత మాట్లాడిస్తూ వుండడం ప్రభువుల సరదా! కనుక మీరడిగింది చెబుతా వినండి.

**దోషముక్తా ఫలప్రోతా**

**వాసనా తంతు సంతతిః॥**

**హృది న గ్రథితా యస్య**

**మృత్యుస్తం న జిఘాంసతి॥** (పూర్వ. సర్గ 23. శ్లో 5)

జన్మజన్మల వాసనలే దారాలు. కామ క్రోధాధి దోషాలే ముత్యాల పూసలు. ఈ రెండూ కలిపిన ముత్యాల గొలుసును గుండెకు తగిలించుకోకుండా ఉంటే, మృత్యువు వాడ్ణి మింగాలను కోదు.

మనస్సు చింతలలో మగ్గి వేడి నిట్టూర్పులనే రంపాలు ఎవడి శరీరాన్ని పరాపరా కోయవో, వాడ్ణి మృత్యువు మింగాలనుకోదు.

ఆశలనే సర్పాల విషాగ్నులు దహించకుండా ఉంటే, మృత్యువు వాడ్ణి మింగాలనుకోదు.

రాగద్వేష లోభాదులు లేని వాడ్ణి మృత్యువు మింగాలనుకోదు.

(**గమనిక**:ఇక్కడ వాల్మీకి మహర్షి "మృత్యుస్తం న జిఘాంసతి" అనే వాక్యాన్ని పల్లవిగా పెట్టి, వరుసగా ఎనిమిది శ్లోకాలు వ్రాశాడు. పూర్వం ఉపశమ ప్రకరణంలో 39వ సర్గలో ప్రహ్లాద చరిత్ర సందర్భంలో మరణ మంటే ఏమిటి? జీవించడమంటే ఏమిటి? అనే చర్చ ఉంది. ఇక్కడ ఆ చర్చకు కొంచెం రూపం మార్చి, ఏ ఏ దోషాలను పోగొట్టుకుంటే మృత్యువు అనేది మనలను అంటుకోదో, ఆ దోషాలు తొలగాలంటే మన మనస్సును దేనిమీద లగ్నం చేయాలో, వివరిస్తూ చర్చను ముందుకు తీసికొని వెడుతున్నాడు. అందులో మొదటి భాగం ఇప్పుడు చెప్పుకుందాం. రెండవ భాగానికి "చిత్తం యస్య సమాహితమ్" అనే వాక్యాన్ని పల్లవిగా తీసికున్నాడు వాల్మీకి మహర్షి. భుశుండుడు ఇలా కొనసాగిస్తున్నాడు) –

**భుశుండుడు**: బ్రహ్మర్షీ! చిత్తాన్ని సమాహితం చేసికుంటే (ఏకాగ్రం చేసుకుంటే, అనగా సమాధి కలిగేటట్లుగా చేసికొంటే) ఈ దోషాలంటవు.

మనస్సును సమాహితం చేసికొని ఎన్ని వ్యవహారాలు చేసినా, వాడు కర్త కాడు. కనుక భోక్త కూడా కాడు.

చిత్తం సమాహితం కావాలంటే, భేద బుద్ధి పనికిరాదు. భేద బుద్ధి తొలగాలంటే, చిత్తాన్ని జ్ఞానానికి అభిముఖంగా చేయాలి. అది జరగాలంటే, ఇహలోక పరలోక సుఖాల పట్ల వైరాగ్యాన్ని పెంచుకోవాలి. శాశ్వతమైన పదార్థమేమిటో ఆలోచించుకొని, నిగ్గు దేల్చుకొని, మనస్సును దానిమీద విశ్రమించేటట్లు చేసుకోవాలి. దానికి ఆత్మ విచారమే మార్గం.

"అది మాలాంటి వేదవేత్తలకే కష్టసాధ్యం కదా! నీలాంటి అల్పుడికి అది ఎలా సాధ్యమైంది?" అని మీరు సందేహిస్తారేమో?

ఆ కిటుకు చెబుతా వినండి. ఆత్మ విచారణ కష్టమే. కాని దానికి కొంతమంది చెలికత్తెలున్నారు.

వాళ్ళను పట్టుకుంటే, వాళ్ళ ద్వారా ఈమెను లొంగదీసుకొనవచ్చు. అలాంటి చెలికత్తెలలో ప్రాణచింత అనే చెలికత్తెను పట్టుకున్నా. దాని ద్వారా నాకు విజయం లభించింది.

12. ప్రాణచింతన వ్రతం

**వశిష్ఠుడు**: భుశుండా! నువ్వు చాలా అందంగా మాట్లాడుతున్నావు. ప్రాణచింత అంటే ఏమిటో వివరించు.
**భుశుండుడు**: మహామునీ! మీకు తెలిసే అడుగుతున్నారు. ఐనా నాకు పోయిందేమిటి? చెబుతా వినండి.

మహర్షీ! ఈ దేహాన్ని ఒక సారి పరిశీలించి చూడండి. ఇది ఒక చిన్న భవనం లాగా కనిపించడం లేదూ? ఈ ఇంటికి వాత పిత్త కఫాలే మూలస్తంభాలు. లోపలి ఎముకలే ఈ ఇంటి ఇటుకలు. కళ్లే దీని కిటికీలు. నోరే దీనికి సింహద్వారం. జీవాత్మ వెలుగే ఈ ఇంటిలోని దీపం. ఈ ఇంట్లో కాపురం వుండే గృహస్థు పేరు అహంకారం. పంచభూతాలు, పంచ జ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, అంతఃకరణ చతుష్టయం, అవిద్య, కామము, కర్మ, అనే పుర్యష్టకమే ఇక్కడి బంధువులు.
**(గమనిక –**

**భూతాంతఃకరణ ప్రాణ–జ్ఞాన కర్మేంద్రియైర్యుతమ్ ।**
**అవిద్యా కామ కర్మాఢ్యం – లింగం పుర్యష్టకం విదుః ॥)**

ఈ ఇంటికి కుడి ఎడమలలో ఇడా, పింగళ, అనే రెండు పక్క గదులున్నాయి. కాని అవి సూక్ష్మంగా ఉండి త్వరగా కనిపించవు. ఆ రెండు గొట్టాలవంటి గదులు, ఇంటి మధ్యలో ఉన్న ఒక యంత్రంలోకి అమర్చబడి వున్నాయి.

ఆ యంత్రం చాలా కోమలంగా కనుపిస్తున్నా, చాలా చురుకుగా పని చేస్తుంది. దానిలో మృదువైన ఎముకలు, కండరాలు, ఉన్నాయి. ఆ కండరాల గుత్తులతో అది మొత్తం ఆరు పద్మపు మొగ్గలు కలిసిన మొగ్గల గుత్తి లాగ ఉంటుంది. దాని పేరే హృదయం. దానికే మరో పేరు పురీతత్.

దాంట్లోంచి 72 వేల సూక్ష్మ నాడులు పైకీ, క్రిందికీ, ప్రక్కలకు, అన్ని వైపులకు వ్యాపించి సాగుతూ ఉంటాయి. అందువల్ల ఆ పద్మపు మొగ్గల గుత్తి, ఆకుల మధ్యలో ఉన్న పద్మపు మొగ్గ లాగ కనిపిస్తుంది.

ఇందాక చెప్పిన ఇడా పింగళలనే నాడులలో, ఇడా నాడి చంద్రుడికి స్థానం. పింగళానాడి సూర్యుడికి స్థానం. ప్రాణాపాన వాయువులు ఇడా మార్గంలో ప్రసరించినపుడు, అక్కడి చంద్రామృత రసం చింది హృదయ యంత్రం చుట్టూతా ఉన్న ఆకుల మీద పడుతుంది. ఆ అమృత స్పర్శచేత అవి కొంచెం విచ్చుకున్నట్లవుతాయి. పింగళానాడిలోంచి వాయు సంచారం జరిగినపుడు, అక్కడి సూర్యాగ్ని వేడి తగిలి ఆ ఆకులు కొంచెము ముడుచుకున్నట్లవుతాయి. ఈ సంకోచ వ్యాకోచాలవల్ల, నాడీమయమైన ఆ ఆకులలో నిరంతర స్పందన ఏర్పడుతుంది. దానివల్ల మనిషి పీల్చే ప్రతి ఉచ్ఛ్వాస నిశ్వాసకూ హృదయం చుట్టూ ఉన్న నాడుల కదలిక పెరిగి, అక్కడ ప్రాణశక్తి అనే వాయువు మరింత వృద్ధి చెందుతుంది. ఇది శక్తి రూపం గనుక, అక్కడి సూక్ష్మ నాడులన్నింటిలోకీ ప్రవేశించి, శరీరంలోని అన్ని వైపులకూ ప్రసరిస్తుంది.

ఆ శక్తి హృదయస్థానాన్ని చేరినపుడు దానిని ప్రాణవాయువు అంటారు. మలద్వారాన్ని చేరినపుడు దానిని అపాన వాయువు అంటారు. నాభిస్థానంలో ఉన్నప్పుడు, దానిని సమాన వాయువు అంటారు. కంఠ స్థానంలో ఉన్నప్పుడు దానిని ఉదాన వాయువు అంటారు. శరీరంలో అన్ని వైపులకూ, 72వేల నాడుల వెంటా, విచ్చలవిడిగా వ్యాపించి వున్న శక్తి భాగాన్ని వ్యాన వాయువు అంటారు.

మనిషి తినే ఆహారంలో ప్రాణశక్తి అంతర్లీనమై వుంటుంది. జీర్ణమైన అన్నరసంలో ఉన్న ఆ ప్రాణశక్తిని నాడులలో సంచారం చేసే ప్రాణశక్తి ఆకర్షించి, తనతో పాటు శరీరమంతటా వ్యాపింప చేస్తుంది. అంటే, నాడులలో ఉండే ప్రాణ శక్తి అన్నరసంలో వుండే ప్రాణశక్తిచేత ఎప్పటికప్పుడు పరిపుష్టమై, ప్రవాహ రూపంగా ముందుకు సాగి పోతూ వుంటుందన్న మాట!

ఇలా ప్రాణశక్తి ప్రవహించే నాడులు శరీరంలోని రకరకాల ఇంద్రియ గోళాలకూ అనుసంధానం చేయబడి ఉంటాయి. అందువల్ల ఆ గోళాలలోకి ప్రాణశక్తి ప్రవేశించి, వాటికి చైతన్యం కలిగించి, వాటిచేత రకరకాల పనులు చేయిస్తుంది. కనుకనే, శరీరంలో గల అవయవాలలో హృదయానిదే ముఖ్య స్థానం. రకరకాల పనులు చేసే ఇంద్రియాలలో ప్రాణానిదే ముఖ్యస్థానం. నిజానికి ప్రాణవాయువే వివిధేంద్రియాలుగా పని చేస్తుందని చెప్పవచ్చు. లేదా తోలు బొమ్మలాటలో తోలు బొమ్మలను దారం ఆడించినట్లుగా, ఇంద్రియ గోళాలన్నిటినీ ప్రాణవాయువనే దారం ఒకటే ఆడిస్తుందని చెప్పవచ్చు. అందుకే దీనికి సూత్రాత్మ అనే పేరు గూడా వచ్చింది.

ఇలా శరీరమంతటా వ్యాపించివున్నది ఒకే ప్రాణశక్తే అయినప్పటికీ, ఆ శక్తి ఊర్ధ్వ గమనం చేస్తునప్పుడు దాని పేరు ప్రాణవాయువు. అది అధోగమనం చేస్తుంటే, అప్పుడు దాని పేరు అపాన వాయువు. ఇలా పేర్లు పెట్టుకుంటే, శరీరంలో ఈ రెండు వాయువులే ముఖ్యాలు. నేను వీటి గమనాన్నే ఎప్పుడూ పరిశీలిస్తూ వుంటాను.

ప్రాణాపానాలనేవి ప్రాణశక్తియొక్క ఆధ్యాత్మిక స్వరూపాలు. (అంటే, దేహానికి సంబంధించిన రూపాలు). వాయువు దాని ఆధిభౌతిక స్వరూపం (అంటే, పంచభూతాలకు సంబంధించిన రూపం.) ఇందాక చెప్పిన సూత్రాత్మ లక్షణం దాని ఆధి దైవిక స్వరూపం. మహర్షీ! నేను ఆధ్యాత్మిక ఆధిభౌతిక భావాలను వదిలిపెట్టి, ప్రాణవాయువును ఆధి దైవిక సూత్రాత్మ స్వరూపంగా నిరంతరం ధారణ చేస్తున్నాను. ఇదే ప్రాణవాయు వ్రతం.

సామాన్య జీవులంతా ఇంద్రియ వ్రతం చేస్తూ వుంటారు. జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలలో ప్రతి ఇంద్రియానికీ ఒక్కొక్క విషయం మీద వ్యసనం ఉంటుంది. ఆ వ్యసనంవల్ల ఆయా ఇంద్రియాలు పాప పంకిలంలో పడిపోతాయి. అందువల్ల అవి తరచుగా శ్రమకు లోనవుతూ వుంటాయి. శ్రమే మృత్యువు. ఆ విధంగా అవి చస్తూ, పుడుతూ, ఉంటాయి.

ఇలాంటి ఇంద్రియాలతో కలిసిపోయి, అవే నేననుకుంటూ, వాటితోపాటు విషయ సుఖాలను అనుభవిస్తూ, మళ్ళీ వాటితోపాటే శ్రమ రూపమైన దుఃఖాన్ని అనుభవిస్తూ, ఇలా వాటితో పాటే మళ్ళీ మళ్ళీ చస్తూ పుడుతూ జీవించడం పేరే ఇంద్రియ వ్రతం.

నేను ప్రాణవాయు వ్రతబలం చేత ఇంద్రియ వ్రతాన్ని పూర్తిగా వదిలేశాను. ప్రాణమే అసలైన ఇంద్రియమని ఇందాక నేను చెప్పాను. కనుక ఈ వ్రతంలో గూడా చావు పుట్టుకలుంటాయేమోనని సందేహం రావచ్చు. కాని ప్రాణమనే ఇంద్రియంయొక్క విశేషమేమంటే, దానికి ప్రత్యేకంగా ఏ విషయం మీదా వ్యసనం లేదు. అసలు దానికి విషయ సంపర్కమే లేదు. కేవలం నిస్సంగంగా, నిష్కామంగా, ముఖ నాసికాది నాళికలలో సంచరిస్తూ వుంటుంది. కనుకనే దానికి పాప స్పర్శ లేదు. కనుకనే శ్రమ లేదు. కనుకనే మృత్యువు లేదు. కనుకనే ఈ ప్రాణవ్రతానికి ఒక్క క్షణం కూడా భంగం లేదు. ఇలా సూత్రాత్మ స్వరూప ప్రాణ వ్రతాన్ని నేను ధారణ చేస్తూ వుండటం చేత నాకు కూడా మృత్యువు లేదు. ఇదే నేను చెప్పిన ప్రాణ చింతన వ్రతం.

మహర్షీ! ఇది చాలా ప్రశస్తమైన వ్రతం. ఈ ప్రాణాపానాలలో ప్రాణం కొంచెం చల్లగా ఉంటుంది. అపానం కొంచెం వెచ్చగా వుంటుంది. ఈ దేహమనే యంత్రాన్ని ఏ అలసటా లేకుండా హాయిగా యుగాల

తరబడి నడుపుతున్న. కార్మికులు వీరే! తక్కిన ఇంద్రియాలు జాగ్రదవస్థలో ఒక లాగానూ, స్వప్నావస్థలో మరో లాగానూ, సుషుప్తి అవస్థలో వేరే లాగానూ, ప్రవర్తిస్తూ ఉంటాయి. ఈ ప్రాణాపానాలు మాత్రం మూడు అవస్థలలోనూ ఒకే రకంగా ఉంటాయి. ఐతే, వీటిని గమనించడం మాత్రం చాలా కష్టం. ఎందుకంటే వీటి గమనం (నడక) చాలా సూక్ష్మంగా ఉంటుంది.

**యథా కేశస్సహస్రధా భిన్నః**

**తావతాణిమ్నా తిష్ఠతి –**

అని శ్రుతి చెప్పినట్లుగా ఒక వెంట్రుకను నిలువుగా వెయ్యి భాగాలు చేస్తే ఒకొక్క చీలిక ఎంత సూక్ష్మంగా ఉంటుందో అంత సూక్ష్మంగా ఉంటాయి ఈ ప్రాణాపానాలు. అందువల్ల మనస్సును పూర్తిగా ఏకాగ్రం చేస్తేనే గాని, వాటిని పట్టుకోవడం సాధ్యం కాదు.

**అవిరతగతయోర్గతిం విదిత్వా**

**హృది మరుతోరనుసృత్య చోదితాం తామ్।**

**న పున రిహ హి జాయతే మహాత్మన్**

**ముదితమనాః పురుషః ప్రణష్టపాశః ॥** (నిర్వా.పూర్వ. సర్గ. 24, శ్లో.38)

మహాత్మా! ఐనా హృదయాది స్థానాలలో నిరంతర సంచారం చేసే ఈ ప్రాణాపానాల గతులను (నడకలను) నేను జాగరూకుడనై ఉపాసన చేస్తున్నాను. ఎందుకంటే శ్రుతి ప్రాణోపాసన ప్రకరణాలలో అనేక చోట్ల ఈ వ్రతం నిర్దోషమనీ, గత శ్రమమనీ, అభగ్నవ్రతమనీ, ప్రశంసిస్తోంది. ఈ విషయం తెలిసి ప్రాణాపానాలను ఇలా ఉపాసన చేసేవాడి మనస్సు ఆనందంతో నిండి పోతుంది. వాడి పాశాలు తెగిపోతాయి. వాడు మళ్ళీ పుట్టడు. మహాత్మా! నేను కూడా అలాగే వున్నాను.

(**గమనిక–** ఈ 24వ సర్గలలో చెప్పిన విషయాలన్నీ బృహదారణ్యా కోపనిషత్తులో –

**"అథాతో వ్రత మీమాంసా"** – అని ప్రారంభించి

**"తస్మాదేకమేవ వ్రతం చరేత్**

**ప్రాణ్యాచ్చై చ్వాపాన్యాచ్చ**

**నేత్పాప్మా మృత్యురాప్నువత్ "** – అంటూ కొనసాగించి,

**యద్యుచ్చరేత్ సమాపిపయిషేత్**

**తేనో ఏతస్యై దేవతాయై**

**సాయుజ్యం సలోకతాం జయతి "** – అనే వాక్యం వరకు గల మంత్రాలనుంచి స్వీకరించి వివరించారని మనం గ్రహించాలి)

***వశిష్ఠుడు***: భుశుండా! **"అవిరత గతయోర్గతిం విదిత్వా"** (ఆ ప్రాణాపానాల నిరంతర గమనాన్ని తెలుసుకొని) అంటున్నావు గదా, ఆ నడక ఎలా ఉంటుందో కొంచెం చెప్పు?)

### 13. ప్రాణాపానాలంటే ఏమిటి?

ఈ రోజులలో ఆధునిక విజ్ఞాన సంపర్కంవల్ల, మన చుట్టూతా ఉండే వాతావరణంలో ఆక్సిజనే ప్రాణవాయువనీ, దానిని పీల్చాక మన ముక్కుల లోంచి బైటికి వచ్చే వాయువులో బొగ్గు పులుసు వాయువు (కార్బన్ డై ఆక్సైడ్) ఎక్కువగా ఉంటుంది గనుక అది అపాన వాయువనీ వ్యవహరిస్తున్నారు.

ఆయుర్వేద శాస్త్ర పరిభాషలో –

**హృది ప్రాణో గుదేఽపాన స్సమానో నాభి సంస్థితః॥**

హృదయ స్థానంలో ఉంటూ పైకి పోయేది ప్రాణవాయువు. మల విసర్జన స్థానంలో ఉంటూ క్రిందికి పోయేది అపాన వాయువు. ఈ రెండూ కలిసి పోకుండా మధ్యలో నాభిస్థానంలో ఉండి నిల బెట్టేది సమాన వాయువు–అని వ్యవహరిస్తున్నారు.

ఇలాంటి పరిభాష లేవీ ఇక్కడ అన్వయించవు. యోగ శాస్త్రానుసారంగా ఈ సర్గలో వాల్మీకి మహర్షి అనుసరించబోయే పరిభాష ప్రకారంగా, ప్రాణం అంటే చేతన్యాత్మకమైన జీవ శక్తి. శరీరంలో దాని ప్రధాన స్థానం హృదయం. మనచుట్టూ వుండే వాయువు అచేతనము, జడము. కనుక అది అపానము. అప + అనం = చైతన్య శక్తి లేనిది. ఇది మన ముక్కుల ద్వారా లోపలికి ప్రవేశించి, హృదయ స్థానానికి జేరి అక్కడ ఉండే ప్రాణ శక్తితో కలిసి, దాని సంపర్కబలంచేత ప్రాణ వాయువు అవుతుంది. అలాంటి ప్రాణవాయువే మన ముక్కులలోంచి బయటికి వస్తుంది.

చైతన్య శక్తితో కూడిన ఈ ప్రాణవాయువు బయటికి వచ్చేస్తుంటే, ఈ శరీరం ఒక విధమైన తాపాన్ని పొందుతుంది. ఆ విషయం, మళ్ళీ లోపలికి గాలి పీల్చు కోకుండా కొంత సేపు బిగ బడితే బాగా స్పష్టంగా తెలుస్తుంది. నిశ్వాస రూపంగా ముక్కుల లోంచి బయటికి వచ్చే ఈ ప్రాణవాయువుయొక్క స్పర్శ కూడా నులి వెచ్చగా ఉంటుంది. అందుకే యోగ పరిభాషలో ప్రాణవాయువు సూర్యాత్మకం, లేక అగ్న్యాత్మకం. ఇది ఒక అగ్ని జ్వాల లాగానే హృదయం నుంచి పైపైకి ప్రసరిస్తూ ఉంటుంది.

ఇక బైట వుండే అపాన వాయువును మనం ముక్కుల ద్వారా లోపలికి పీల్చుకొంటున్న కొద్దీ మన శరీరానికి ఒక హాయి కలుగుతుంది. ఆహ్లాదం కలుగుతుంది. చల్లగా ఉందనిపిస్తుంది. కనుక యోగ పరిభాష ప్రకారం అపాన వాయువు చంద్రాత్మకం, లేక జలాత్మకం. వానధారలు నూతిలోకి పడినట్లుగా, ఇది అధోముఖమై హృదయ స్థానానికి చేరుతుంది.

ఈ పరిభాషను వాల్మీకి మహర్షి ఈ ప్రకరణంలో ఉపయోగించ బోతున్నాడు. భగవద్గీతలో నాల్గవ అధ్యాయంలో 29వ శ్లోకంలో –

**అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాపరే ।**

**ప్రాణా పాన గతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః ॥**

(తాత్పర్యము – కొందరు ప్రాణ వృత్తిని అపాన వృత్తిలో హోమం చేస్తారు. కొందరు అపాన వృత్తిని ప్రాణవృత్తిలో హోమం చేస్తారు. కొందరు ప్రాణాపానాల గతులను అరికట్టి ప్రాణాయామంలో ఆసక్తి కలవారౌతారు.) అనేచోట అనుసరించిన పరిభాష గూడా ఇదే.

ప్రాణాపాన శబ్దాలను ఈ విధంగా గుర్తు పెట్టుకుంటేనే గాని, ఈ ప్రకరణం మనకు సరిగా అర్థం కాదు. నిజానికి వాల్మీకి మహర్షే, ఈ విషయాలను ఈ సర్గ చివరలో చెప్పాడు. మన సౌకర్యం కోసం వాటిని కొంచెం ముందుగా చెప్పుకుంటున్నాం.

ఇక భుశుండ యోగీశ్వరుడి సమాధానంలోకి ప్రవేశిద్దాం!

## 14. ప్రాణోపాసన

***భుశుండుడు***: మహర్షీ! తమరు తెలిసే అడుగుతున్నారు. అయినా, విన్నవిస్తాను. వినండి.

ప్రాణమన్నా, ప్రాణ గమనమన్నా, ప్రాణగతి అన్నా ఇంచుమించు ఒకటే. వీటిలో ప్రాణగతి, ప్రాణ

గమనము వంటి శబ్దాలు యౌగికాలు అంటే వాటియొక్క పదోత్పత్తిలోంచి స్పష్టంగా అర్థం చెప్పే వీలుంటుంది. వాయువుకి సదాగతి అనే మరో పేరు వుంది. ఎప్పుడూ చలిస్తూ ఉండడం దాని స్వభావం గనుక, దానికి ఆ పేరు వచ్చింది. ప్రాణశక్తి కూడా నిత్య చలన శీలమైనదే! ప్రాణగతి అనే పదం ఆ విషయాన్ని స్పష్టంగా సూచిస్తోంది కనుకనే అది యౌగిక శబ్దమన్నారు. ఇది ఈ శరీరంలో నాభికంటె పై భాగాన హృదయ స్థానంలో ఉంటుంది.

అపాన వాయువుకు గూడా స్పంద శక్తి వుంది. కాని అది ఈ శరీరంలో  ఐతే నాభి కంటే కింది భాగాన, శరీరానికి వెలుపల ఐతే ముక్కుకంటే కింది భాగాన, వుంటుంది.

ఈ ప్రాణాపానాలు రెంటినీ నిగ్రహించడం ద్వారా మానవుడు ప్రాణాయామాన్ని సాధించాలి. ఎంత బాగా సాధించాలంటే, మేలుకున్నప్పుడు మాత్రమే కాదు, నిద్రపోతున్నప్పుడు గూడా ఈ ప్రాణాయామం సహజంగా జరిగి పోవాలి. అలా ప్రాణాయామం సాగించే విధానాన్ని చెబుతాను, వినండి.

హృదయంనుంచి గాలి బయటికి రావడాన్ని సామాన్యంగా రేచక మంటారు. కాని, దీనిలో హృదయం నుంచి మూర్ధ్వస్థానం (మాడు లోపల వాయువు తగిలే స్థానం) దాకా ఉండే భాగాన్ని "ఆంతర రేచకం" అంటారు. అక్కడనుంచి ముక్కుల వెలుపల దాకా ఉండే భాగాన్ని "బాహ్య రేచకం" అంటారు.

అలాగే ముక్కుల వెలుపల ద్వాదశాంగుళ స్థానం నుంచి అపాన వాయువు పైకిసాగి ముక్కుల ద్వారా మూర్ధ్వస్థానం వరకు చేరడాన్ని బాహ్యపూరకం అంటారు. అది అక్కడ నించి హృదయ స్థానం వరకు జేరటాన్ని "ఆంతర పూరకం" అంటారు.

(ద్వాదశాంగుళ స్థానం అంటే ముక్కు వెలుపల పంన్నెండు అంగుళాల దూరంలో ఉండే స్థానం. అంగుళం అంటే ఆ వ్యక్తియొక్క బొటన వ్రేలు పెద్ద కణుపు. అలాంటి పంన్నెండు అంగుళాల దూరంనుంచీ మనిషి సామాన్యంగా గాలిని ముక్కుల లోకి గుంజుకో గలుగుతాడు. కనుక ముక్కు నుంచి పంన్నెండు అంగుళాల దూరంలో ఉండే బిందువును అపాన వాయువుయొక్క ఉత్పత్తి స్థానంగా యోగ శాస్త్రంలో వ్యవహరిస్తూ వుంటారు. దీనినే సంగ్రహంగా ద్వాదశాంగుళ స్థానం అంటారు.)

బైటినుంచి లోనికి ప్రసరించిన అపాన వాయువుయొక్క వేగం ప్రశాంతమై, మళ్ళీ హృదయం నుంచి ప్రాణ వాయువుయొక్క వేగం ఇంకా మొదలు కాకుండా ఉండే స్థితిని కుంభకం అంటారు.

కనుక ప్రాణాయామంలో రేచకము, కుంభకము, పూరకము అని మూడు అవస్థలు ఉంటాయి.

ఇక్కడ హృదయస్థానాన్ని ప్రధానంగా చేసుకొని, దానిని బట్టి రేచక కుంభక పూరకాలను నిర్వచించడం జరిగింది. ముక్కుకు వెలుపల ఉండే ద్వాదశాంగుళ స్థానాన్ని ప్రధాన కేంద్రంగా తీసికొని కూడా రేచక కుంభక పూరకాలను నిర్వచనం చేయవచ్చు. ఈ పద్ధతిలో లోపలినుంచి బైటికి వచ్చిన ప్రాణవాయువు ద్వాదశాంగుళ స్థానం దాకా చేరి, అక్కడ దాని వేగం శమించిపోయి, ఇంకా అపానంయొక్క వేగం ప్రారంభం కాకుండా ఉండే దశను కుంభకం అంటారు. ఇది బాహ్య కుంభకం.

ఈ పద్ధతిలో హృదయం నుంచి బయటకు వాయువు బయలుదేరినప్పుడు, దానిలో హృదయం నుంచి ముక్కు చివరి దాకా ఉండే భాగం ఆంతర పూరకం అవుతుంది. అక్కడి నుంచీ ద్వాదశాంగుళ స్థానందాకా వుండే భాగం బాహిర పూరకం ఔతుంది.

అలాగే ద్వాదశాంగుళ స్థానం నుంచీ అపానం బయలు దేరి, ముక్కు చివరి దాకా చేరే భాగం బాహ్య రేచకం అవుతుంది. అక్కడ నుంచి హృదయం దాకా అపానం చేరే భాగం ఆంతర రేచకం అవుతుంది.

ఈ విధంగా ప్రాణాయామంలో మొత్తం పది భాగాలున్నాయి. హృదయ కేంద్రమైన అంతః కుంభకాన్ని బట్టి ఆంతర రేచక, బాహ్య రేచకాలు, బాహ్య పూరక, ఆంతర పూరకాలు అనేవి నాలుగు భాగాలు.

ద్వాదశాంగుళ స్థానం కేంద్రంగా ఆంతర పూరక, బాహ్య పూరక, బాహ్య రేచక, ఆంతర రేచకాలు నాలుగు భాగాలు. 4+ 4+2 కుంభకాలు కలిపితే మొత్తం పది. వీటిలో కుంభకాలు రెండూ కలిపి ప్రాణాయామంయొక్క ప్రధాన స్వరూపం అవుతాయి గనుక వాటిని విడదీస్తే, ఎనిమిది భాగాలు మిగులుతాయి. కనుకనే ప్రాణాయామానికి అంగాలు ఎనిమిది అని పెద్దలు చెబుతూ ఉంటారు.

ఈ ఎనిమిది అంగాలూ ప్రతి జీవికీ, బ్రతికున్నంత కాలమూ, నిరంతరంగా, సాగుతూనే ఉంటాయి. దీనికి వేరే ప్రయత్నం అక్కర లేదు.

ఐతే, ఇవి ఇలా జరుగుతున్నాయనే గమనిక పెరిగిన కొద్దీ, వీటిని గురించిన భావన పెరుగుతుంది. ఈ భావనవల్ల క్రమంగా ప్రాణాపానాల గతిని నిరోధించే అభ్యాసం ఏర్పడుతుంది. దానివల్ల కుంభకాలయొక్క కాల పరిమితి పెరుగుతుంది. దానివల్ల చిత్తం శుద్ధమై "నేను కర్తను, నేను భోక్తను" అనే భావం తగ్గుతుంది. దానివల్ల బాహ్య విషయాసక్తి పోతుంది. చివరికి పరమపదం అందుతుంది.

కనుక మహర్షీ! ప్రాణాపాన గతులను ఈ విధంగా గుర్తించి అభ్యసించేవాడికి ఈ ప్రాణాయామమే మోక్షసాధనం అవుతుంది.

ప్రాణానికి అధిపతి సూర్యుడు. అపానానికి అధిపతి చంద్రుడు. చంద్రుణ్ణి సూర్యుడు మింగినా, సూర్యుణ్ణి చంద్రుడు మింగినా, ఆసాధకుడికి ఇక సంసార దుఃఖం ఉండదు.

నిజానికి ప్రాణాపానాలనేవి మనం పెట్టుకున్న పేర్లు. సూర్య చంద్రులనేవి వాటినిబట్టి వచ్చిన పేర్లు కనుక, అవి గూడ మనం పెట్టుకున్న పేర్లే! ఈ మాట మరచి పోకూడదు.

సూర్యుణ్ణి చంద్రుడు మింగాడు – అంటే, ప్రాణ వాయువు వచ్చి అపానంలో కలిసిందని అర్థం. ఇది బాహ్య కుంభకం. ఇది శరీరానికి వెలుపల ద్వాదశాంగుళ స్థానంలో జరుగుతుంది. కనుక ఇక్కడ దేహాది పరిచ్ఛేద రహితమైన స్థితి అనుభవానికి వస్తుంది. అలాగే సూర్య చంద్రులు కలసిపోతారు, కనుక ఇక కాలానికి కూడా ప్రసక్తి ఉండదు. కనుక ఆ యోగి దేశ కాలాతీతుడౌతాడు.

ఇక చంద్రుణ్ణి సూర్యుడు మింగడం అంటే, అపాన వాయువు ప్రాణంలో లయించడం. ఇది హృదయస్థానంలో జరుగుతుంది. ఇది సూర్యస్థానం. అంటే ఇది చైతన్యానికి స్థానం. ఇది శాశ్వత జ్యోతి. ఈ జ్యోతిస్సే బైటికి వ్యాపించినపుడు దానిని అపానం అంటున్నాం. చంద్రుడు అంటున్నాం. కనుక ఉన్నది ఒక్కడే!అదే సూర్యుడు. వాడే అపానంగా, వ్యానంగా, సమానంగా, ఉదానంగా, వివర్తం చెందుతున్నాడు. (వివర్తం అంటే ఏమిటో పూర్వం చాలా సార్లు వచ్చింది)

ఈ విషయాన్ని అంతఃకుంభకంలో అనుసంధానం చేసినందువల్ల, జీవుడికి ఉండే లోపలి చీకటి తొలగిపోతుంది.లోపలి చీకటి అంటే అజ్ఞానాంధకారమే! అది పోతే ఇక బాహ్యాంధకారం లెక్క ఏముంది?

ఈ ప్రపంచంలో ప్రతి పదార్థాన్నీ ఒక అజ్ఞానపు తెర ఆవరించి ఉంటుంది. అదే హృదయాంధకారం. దానియొక్క రూపాంతరమే రాత్రిపూట కనిపించే బయటికి అంధకారం. ఇదే పదార్థాలను కనిపించకుండా చేస్తుంది. కాని జీవుడి అంతఃకరణంలో వుండే చైతన్యం ఇంద్రియం ద్వారా బయటికి ప్రసరించి, ఆ పదార్థం దగ్గరికి చేరినప్పుడు దానిని ఆవరించి వున్న అజ్ఞానాంధకారపు తెల తొలగి పోతుంది. అప్పుడే ఆ పదార్థం ద్రష్టయొక్క అనుభవానికి వస్తుంది. (ఈవిషయాలను ముముక్షు వ్యవహార ప్రకరణంలో "వృత్తి వ్యాప్తి ఫలవ్యాప్తి" అనే శీర్షిక కింద వివరించడం జరిగింది.)

కనుక మహర్షీ! బయటి అంధకారాన్ని తొలగించేది కూడా లోపలి వెలుగే! అందువల్లే, అంతః కుంభకం ద్వారా అంతర్జ్యోతిని సాక్షాత్కరించుకుంటే, లోపలి చీకటీ, వెలుపల చీకటీ, రెండూ ఒకే సారి

పోతాయి. అందువల్ల అంతఃకుంభక భావన కూడ క్రమంగా మోక్షసాధనమౌతుంది. ఇక లోపల, వెలుపల, అనే కల్పనలు ఉన్నాయి. వీటి సంగతేమిటో కొంచెం ఆలోచిద్దాం.

ఎండ తగ్గితే నీడ పెరుగుతుంది. నీడ తగ్గితే ఎండ పెరుగుతుంది. అలాగే ప్రాణవేగం శమించిపోతే అపానం బయలుదేరుతుంది. అపానవేగం శమించి పోతే ప్రాణం బయలుదేరుతుంది. ఎక్కడ ప్రాణం ఉత్పన్నమౌతుందో, అక్కడ అపానం నశిస్తుంది. ఎక్కడ అపానం ఉత్పన్నమౌతుందో, అక్కడ ప్రాణం నశిస్తుంది. దీనిని కొంచెం మార్చి చెప్తే, ద్వాదశాంగుళ స్థానంలో ప్రాణం అపానంగా వివర్తన చెందుతుంది. హృదయస్థానంలో అపానం ప్రాణంగా వివర్తన చెందుతుంది. కనుక ఈ రెండు స్థానాలలో ఎక్కడ కుంభకం చేసినా ఆ సాధకుడు ఒకే వస్తువును ఉపాసన చేస్తున్నాడు. అదే పరిశుద్ధ చైతన్యం.

ఎందుకంటే, పుష్పంలో పరిమళం ఉన్నట్లుగా, ప్రాణవాయువులో అధిష్టాన చైతన్యం వుంది. నీటిలో మాధుర్యం ఉన్నట్లుగా అపానంలో కూడా అధిష్ఠాన చైతన్యమే వుంది. కనుక ఈ రెండు స్థానాలలోనూ ఆ సాధకుడు నిజంగా ఉపాసించేది అధిష్ఠాన చైతన్యాన్నే!

**ప్రాణస్య ప్రాణనం ప్రోచ్చైః**
**పరం జీవస్య జీవనమ్ ।**
**దేహస్య ధారణం ధుర్యం**
**చిదాత్మాన ముపాస్మహే ॥** (పూర్వ, సర్గ 25 శ్లో.64)

ప్రాణానికి ప్రాణం, జీవానికి జీవనం, దేహానికి దేహం– అదే చిదాత్మ. దానినే మేము ఉపాసిస్తున్నాము. మహర్షీ! మేము చేసే ప్రాణోపాసన ఇదే!

### 15. చైతన్యోపాసన

అక్కడ భుశుండుడు భావనా పరవశుడై

**"చిదాత్మానముపాస్మహే, తచ్చిత్తత్త్వముపాస్మహే"** – అంటూ పల్లవి లాగా పెట్టుకొని పన్నెండు శ్లోకాలు చెప్పాడు. అప్పటికీ తృప్తి కలగక, 26వ సర్గలో ఆయన ఇలా కొనసాగించాడు.

***భుశుండుడు***: మహర్షీ! ఈ రకమైన ప్రాణ సమాధిచేత నాకు చిత్త విశ్రాంతి లభించింది. ఈ దృష్టిని నేను ఒక్క క్షణం కూడా వదలి పెట్టడం లేదు. కూర్చున్నా, లేచినా, నడచినా, మెలకువతో ఉన్నా, కలలో ఉన్నా, నిద్రపోతున్నా, నాకు ఈ ఆత్మ సమాధి చెదరటం లేదు. ఇలా అంతర్ముఖుడ్నై ఈ జగద్వ్యవహారాలను నేను పట్టించుకోకుండా వదిలేస్తున్నాను.

**న భూతం న భవిష్యం చ**
**చింతయామి కదాచన ।**
**దృష్టిమాలంబ్య తిష్ఠామి**
**వర్తమాన మిహాత్మనా ॥** (పూర్వ – సర్గ 26 శ్లో.8)

నేను జరిగిపోయిన దాని గురించి గాని, జరగబోయేదాని గురించి గాని, ఆలోచించను. కేవలం వర్తమాన కాలంలో ఏది వుందో దానిమీదే నా మనోదృష్టిని ఉంచుతాను. అందుచేత నా బుద్ధి ఎల్లప్పుడూ సుషుప్తితో సమానమై వుంటుంది. ఈ దశలో సత్యాసత్య విమర్శ వుంటుంది గానీ, దేనిమీదా అభిమానం

మాత్రం వుండదు. అందుచేతనే, వ్యాధిగాని, మృత్యువు గానీ, లేకుండా ఇలా చిరంజీవినై వున్నాను.

**ప్రాణాపాన సమాయోగ**
**సమయం సమనుస్మరన్ ।**
**స్వయమాత్మని తుష్యామి**
**చిరంజీవామ్యనామయః ॥** (పూర్వ. సర్గ 26. శ్లో 11)

ప్రాణాపానాలయొక్క సంధి సమయంలో స్ఫురించే చిత్పదార్థాన్నే స్మరిస్తూ, ఆ స్మరణ బలంచేత నాలో నేనే పరితృప్తి పొందుతూ, ఇలా చిరంజీవినై ఉన్నాను. దీనివల్ల నాకు సమస్త భేదాలు, సమస్త వాంఛలు, సమస్త వాసనలు, తొలగి, సమస్తమూ చిన్మయమనే దృష్టి పెరిగింది.

**ఘటశ్చిత్ చిత్పటశ్చిత్ ఖం**
**చిద్వనం శకటం చ చిత్ ।**
**చిత్సర్వమితి మే భావః**
**తేన జీవామ్యనామయః ॥** (పూర్వ. సర్గ 26. శ్లో.38)

కుండ చిత్తు, వస్త్రం చిత్తు, అడవి చిత్తు, బండి చిత్తు, ఈ కనిపించేదంతా చిత్తే! ఇదే నా భావన. దీని బలంతోనే నేను మరణం లేకుండా చిరంజీవినై ఉన్నాను.

ఇక్కడ భుశుండ మహాయోగి ఆనంద పరవశుడై 'తేన జీవామ్యనామయః' (అందువల్ల నేను మృత్యువు లేకుండా చిరంజీవినై ఉన్నాను.)– అనే మాటను పల్లవిగా పెట్టుకొని, ఇంచుమించు 25 శ్లోకాలు గానం చేశాడు. ఆత్మ తత్త్వాన్ని అనుసంధానం చేసుకొనేవారికి అవన్నీ నిత్య పారాయణార్హాలు. ఐనా గూడా గ్రంథ విస్తర భయంచేత మనం వాటిని దాటుకుంటూ, ఆ యోగి పలికే తుది పలుకులలోకి వెళ్ళి పోదాం.

***భుశుండుడు***: బ్రహ్మర్షీ! నేను చిరంజీవినై ఎలా వున్నానో, కార్య కారణ సంఘాత స్వరూపంగా కనుపించే ఈ దృశ్య పదార్థ జాలంలో నేను ఏదిగా వున్నానో, అదంతా నీ ఆజ్ఞవల్ల ఇలా వివరించాను, అంతే గాని జ్ఞాన సిద్ధుడవైన నీ ముందు పాండిత్యం చూపించాలని గాదు.

***వశిష్ఠుడు***: భగవన్ భుశుండా! అహో! నీ చరిత్ర ఎంత చిత్రంగా ఉందయ్యా! అది వేదానికే భాష్యంగా ఉంది. నువ్వు రెండవ బ్రహ్మ లాగా కనిపిస్తున్నావు. నేను ముల్లోకాలలోనూ నలుదిక్కులా తిరిగి రకరకాల జ్ఞానైశ్వర్య సంపన్నులను దర్శించాను గానీ, నీలాంటి మహాత్ములను ఇంతవరకు చూడనే లేదు. నీ దర్శనంచేత నాకు మహా పుణ్యం లభించింది. నీకు కళ్యాణమగు గాక! ఇక నీవు నీ గుహలోకి ప్రవేశించు. మధ్యాహ్న సమయమైపోయింది గనుక, నేనిక నా సప్తర్షిలోకానికి పోవలసి వుంది. నాకు శెలవిప్పించు.

రామా! ఈ మాట వింటూనే, భుశుండుడు కంగారుగా లేచి నిలబడ్డాడు. ఆయన సంకల్పంచేత ఆయనకు రెండు చేతులు మొలిచాయి. ఆ చేతులలోకి బంగారు చిగురుటాకులు వచ్చాయి. అవి దొప్పలుగా మారి వాటిల్లోకి కల్పవృక్షపు పుప్పొడులు, మంచు బిందువులు, ముత్యాల పూసలు, క్షణాల్లో చేరుకున్నై. అలాంటి ఆ దొప్పలను పూజా పాత్రలుగా పెట్టుకొని, నఖశిఖ పర్యంతము భక్తిలో మునిగిపోయి, ఆ మహాయోగి శివార్చన చేసినట్లుగా నాకు అర్చన చేశాడు.

జ్ఞాన సిద్ధుడైనవాడి భక్తి వినయాలు ఇంత విశుద్ధంగా వుంటాయి గదా!– అని నేను గుర్తించి, అతని పూజ పూర్తైయ్యేదాకా ఆగి, "అయ్యా! నీవు పెద్దవాడివి. నన్ను సాగనంపడానికి శ్రమపడి వెంటరానవసరం లేదు." అని చెబుతూ ఆకాశంలోకి ఎగిరిపోయాను.

ఒక ఆమడదూరం ఆకాశంలోపోయి వెనక్కి చూసే సరికి, ఆ కాకి ఆర్ద్రమైన చూపులతో నా వెనకాల వస్తూనే వుంది. నేను అప్పుడు వెనక్కి తిరిగి, ఆ మహాయోగి చేతులు రెండూ గట్టిగా పట్టుకొని, వెన్ను నిమిరి, బలవంతంగా వెనక్కు పంపించాను. సత్పురుషుల సాంగత్యాన్ని వదిలిపెట్టడం ఎవరికైనా కష్టమే కదా!

రామా! ఇదంతా ఎప్పుడు జరిగిందనుకుంటున్నావు. కృతయుగంలో రెండు వందల సంవత్సరంలో మేరు శిఖరంమీద నేను ఆయనను మొదటిసారిగా కలిశాను.

ఇప్పుడు కృతయుగం వెళ్ళిపోయి, త్రేతాయుగం కూడా సగం దాటింది. మొన్నా మధ్యే, ఎనిమిది సంవత్సరాల కిందట, ఆయన దగ్గరికి మరో సారి వెళ్ళి వచ్చాను. ఆయన అప్పుడు ఎట్లా వున్నాడో ఇప్పుడూ అట్లాగే ఉన్నాడు.

కనుక రామా! నువ్వు కూడా ఆ భుశుండ మహాయోగి లాగానే ప్రాణ నిరోధమనే యోగాన్ని అభ్యసించి, జ్ఞానసిద్ధుడవై, ఆయన పొందిన స్థితినే పొందు.

**(గమనిక: ద్వౌ క్రమౌ చిత్తనాశస్య యోగో జ్ఞానం చ రాఘవ ॥**

చిత్త నిర్మూలనానికి యోగము, జ్ఞానము, రెండూ మార్గాలేనని ఉపశమ ప్రకరణంలో చెప్పారు. వాటిల్లో యోగమార్గ ప్రసక్తిలో, ఉద్దాలక మహర్షివంటి ఘట్టాలు కొంతవరకూ చెప్పారు. ఉపశమ ప్రకరణంలో, 78వ సర్గలో, దజనుకు పైగా యోగ ప్రక్రియలను కూడా ప్రస్తావించారు. ఆ తరువాత అక్కడి 80వ సర్గ నుంచి 84వ సర్గ దాకా సంవర్త, వీతహవ్య మహర్షులు చేసిన ఇంద్రియ ప్రబోధాన్ని పఠించారు. వీటిల్లో శరీరాన్ని ఒక ఇల్లు లాగా వర్ణించడం మొదలైనవన్నీ ఉన్నాయి. ఐతే, ఆ విషయాలన్నిటినీ ఒకే చోటికి తెచ్చి, ప్రాణాయామ సాధనలో పరాకాష్ఠ స్థితి ఎలా వుంటుందో, దాని ద్వారా జ్ఞానం ఎలా అప్రయత్నంగా సిద్ధిస్తుందో, ఈ సాధనకు సర్వ వర్ణాలవారూ ఎలా అర్హులౌతారో , చెప్పడం కోసం వశిష్ఠమహర్షి కాకభుశుండోపాఖ్యానాన్ని చెప్పారు.

దీనిలో నీచాతి నీచమైన సంకరజాతి కాకికి శ్రేష్ఠమైన యోగ మార్గం ద్వారా తత్త్వజ్ఞానం లభించి, అది సుస్థిరంగా నిలబడి, చివరికి ఆ సాధకుడే బ్రహ్మ కల్పాలను దాటిపోయిన చిరంజీవిగా చూపించడం ద్వారా, యోగం జ్ఞానంలోకి ఎలా పరిణమించి స్థిరపడుతుందో, యోగ మార్గలబ్ధమైన ఫలితానికీ, కేవల జ్ఞాన మార్గ లబ్ధమైన ఫలితానికీ భేదం లేకపోవడం అనేది ఎలా సాధ్యమౌతుందో, నిరూపిస్తున్నాడు వశిష్ఠమహర్షి!

ఇలా యోగజ్ఞానాల పరస్పర పరిపూరకత్వాన్నీ, ఏకోన్ముఖత్వాన్నీ, నిరూపించినాక వశిష్ఠమహర్షి మళ్ళీ తనకూ, శ్రీరాముడికీ, సహజమైన జ్ఞానమార్గ వివరణలోకే ప్రవేశించ బోతున్నాడు. దానికి అనుకూలంగా శ్రీరాముడు ఒక చక్కని ప్రశ్న వేశాడు.)

***శ్రీరాముడు*** గురుదేవా! ఈ భుశుండ వృత్తాంతం చాలా ఆశ్చర్యకరంగా వుంది. కాని ఒక చిన్న ప్రశ్న వుంది. ఈ కథలో మీరు శరీరమనే గృహం ఎముకలనే స్థంభాలమీద చర్మమనే తాటాకులు కప్పుగా ఏర్పడిందని చాలా విపులంగా వర్ణించారు. దానిలో నాడులున్నాయి. వాటిలో ప్రాణవాయు సంచారం జరుగుతోంది. దానిని నిగ్రహించి ప్రాణాయామం చేస్తే చివరికి మోక్షం దాకా వెళ్లవచ్చని చెప్పారు. ఇంతకూ ఈ దేహగృహాన్ని నిర్మించిందెవరు? అందులో ఉన్నదెవరు?

***వశిష్ఠుడు***: రామా! ఈ విషయంమీద ఉత్పత్తి ప్రకరణంలో విపులంగా చెప్పి ఉన్నాను. ఇది ఎవరూ నిర్మించింది కాదనీ, ఇది ఆభాసమాత్రమనీ (భ్రాంతి మాత్రమనీ), కంటి దోషం గలవాడికి ఆకాశంలో కనిపించే రెండవ చంద్రుడి లాగా, ఇది కనిపిస్తూ వుంటుందనీ, అందుచేతనే ఇది సదసదాత్మకమనీ, (అంటే ఉన్నదనీ, లేదనీ రెండు రకాలుగానూ చెప్పదగినదనీ,) అక్కడ నేను వివరించాను.

నువ్వు మెలకువలో కనిపించే ఈ దేహం గురించి అడుగుతున్నావు. మరి కలలో నీకొక దేహం

కనిపిస్తోంది గదా! అదెక్కడి నుండి వచ్చింది? కలలో నీ శరీరం మాత్రమే గాదు, దాని పక్కన మరికొన్ని శరీరాలు కనిపించాయి. వాటితో నువ్వు యుద్ధం కూడా చేశావు. అవి ఎక్కడి నుంచి వచ్చాయి?

ఈ ప్రశ్నలన్నింటికి నువ్వు ఒక్కటే సమాధానం చెబుతావు – అవన్నీ నా సంకల్పంయొక్క మారు రూపాలు – అని. నీ ప్రశ్నకు నా సమాధానమూ అదే! హిరణ్యగర్భుడు అనే సమష్టి మనస్తత్త్వ స్వరూపుడైన ప్రథమ జీవుడు చేసిన సంకల్పంవల్ల అతనికో స్వప్నం వచ్చింది. ఆ స్వప్నంలో మొలిచిన మొక్కలలో ఒక మొక్క ఈ భుశుండ శరీరం!

***శ్రీరాముడు***: ఈ కాకి ఆకారమే ఎందుకు రావాలి?

***వశిష్ఠుడు***: దానికి పూర్వ వాసనలే కారణం. పూర్వ వాసనల బలంచేత జీవుడు ఎలాంటి సంకల్పాలు చేస్తాడో వాడికి అలాంటి దేహాలే కలుగుతాయి. ఆ భావనాబలంచేతనే దేశకాలాలయొక్క కొలతలు మారిపోతూ వుంటాయి. అంటే చిన్న ఇరుకు గదిలో పడుకున్నవాడికి విశాలమైన ఆకాశంలో విహరిస్తున్నట్లుగా కల వస్తుంది. ఐదు నిమిషాల నిద్రలో 50 సంవత్సరాల కథ నడుస్తుంది.

ఇలాంటి వికారాలన్నింటికీ కారణం ఒక్కటే! అదే వాసన! అది జీవుణ్ణి ఒక పట్టాన వదిలి పెట్టి పోదు.

## 16. మంచి చూపు

***శ్రీరాముడు***: మరి ఆత్మను శుద్ధి చేసుకొనే ఉపాయమేమిటి?

***వశిష్ఠుడు***:

**సమ్యగాలోకమాత్రేణ స్వభావశ్శుద్ధి మృచ్ఛతి ॥** (పూర్వ. సర్గ28.శ్లో.46)

సమ్యక్ జ్ఞానమే! సరియైన చూపే! ఆత్మశుద్ధికి అదే ఉపాయం. (ఇక్కడి శ్లోకంలో వున్న స్వభావ శబ్దానికి జీవాత్మ అని అర్థం చెప్పుకోవాలి).

సరిగా చూడడం చేతగాని పిల్లవాడు అది రాగి ముద్ద అనుకున్నాడు. తండ్రి చెప్పినా వినలేదు. చివరికి తండ్రి వచ్చి దాన్ని కరిగించి చూపించాడు. అప్పుడది మేలిమి బంగారమని కుఱ్ఱవాడికి అర్థమైంది. అలా ఒకసారి అర్థమైతే, మళ్ళీ రాగి అనే భ్రాంతి పుట్టమన్నా పుట్టదు. అలాగే ఆత్మ విషయంలో కూడ సమ్యక్ దర్శనాభ్యాసం చెయ్యాలి.

లోకంలో కనిపించే జనన మరణాలు, స్వర్గనరకాలు, జ్ఞానాజ్ఞానాలు, ఇట్లాంటివన్నీ కూడా చిత్ప్రకాశం కంటే వేరుగా లేనే లేవు, అని చూడగలగడమే సరియైన చూపు. అదే సమ్యక్ జ్ఞానం. దీనిని అభ్యసించాలి.

***శ్రీరాముడు***: ఈ అభ్యాసానికి ఉపాయమేమిటి?

***వశిష్ఠుడు***: దానికి ఉపాయాలు రెండు –

**నాహమస్మి న మే భోగా**
**స్సత్యా ఇత్యభి భావితే ।**
**నేదమాడంబరం వ్యర్థ**
**మనర్థాయావభాసతే ॥**

**అహమేవ హి వా సర్వం**
**చిదిత్యేవం విభావితే ।**

**నేద మాడంబరం వ్యర్థ**
**మనర్థాయావభాసతే ॥**
**దర్శనద్వయమప్యేత**
**త్సత్య మత్యన్త సిద్ధిదమ్।**
**యదేకమేతయోర్వేత్సి**
**రమ్యం తద్రామ సంశ్రయ ॥**
**ద్వాభ్యామేవాథవైతాభ్యాం**
**దర్శనాభ్యామిహానఘ ।**
**విహరన్కురు కల్యాణ**
**రాగద్వేష పరిక్షయమ్ ॥**
(పూర్వ. సర్గ - 28, శ్లోకం 70,71,72,73)

రామా! అసలు నేననేదే లేదు. ఈ కనిపించే సుఖదుఃఖ భోగాలు సత్యాలు కావు. అని భావన చేయవచ్చు. ఇది ఒక పద్ధతి.

లేదా, ఈ కనిపించేదంతా నేనే! ఈ కనిపించేదంతా శుద్ధ చైతన్యమే. అని భావన చేయవచ్చు. ఇది మరో పద్ధతి.

ఈ రెండింటిలో ఏ భావన చేసినా ఈ జగదాడంబరం మనకు సంసార బంధాన్ని కలిగించ జాలదు.

రామా! ఈ రెండింటిలో ఏది బాగుందనుకుంటే దానిని ఆశ్రయించు. లేదా రెండింటినీ యథా సౌకర్యంగా వాడుకుంటూ రాగ ద్వేషాలను దాటి వెళ్ళిపో! సర్వ సంకల్పాలను విడిచిపెట్టి ఆత్మ స్వరూపంలో ఉండిపో.

**న తే జన్మ న తే దుఃఖం**
**న దోషస్తే న తే భ్రమాః ।**
**సర్వం సంకల్ప ముత్సృజ్య**
**తిష్ఠాత్మని సుసంస్థితః ॥** (పూర్వ. సర్గ 28, శ్లోకం 94)

నీకు జన్మ లేదు, దుఃఖం లేదు, దోషాలు లేవు, భ్రమలు లేవు. అన్ని సంకల్పాలనూ వదిలివేసి నీవు నీ పరమాత్మ స్వరూపంలో సుస్థిరంగా ఉండిపో.

అని ఈ విధంగా వశిష్ఠమహర్షి ఆత్మానందావేశంలో 90 శ్లోకాలకు పైగా మహోపదేశం చేసేసరికి, సభలో ఉన్నవారందరికీ మనస్సు లయించి పోయింది. శ్రీరాముడు పూర్తిగా సమాధిలోకే వెళ్ళిపోయాడు. అది గమనించిన వశిష్ఠ మహర్షి ఒక అరగంట సేపు మౌనంగా ఉండిపోయాడు. అప్పుడు రాముడు కళ్ళు తెరిచాడు. వశిష్ఠుడు మళ్ళీ తన ప్రసంగం కొనసాగించాడు.

తన బోధబలంచేత శిష్యుడు సమాధిలోకి వెళ్ళిపోయాడు గదా అని వశిష్ఠుడు పొంగి పోలేదు. ఒక రకమైన తీవ్ర చిత్తవృత్తి కలవారికి, ఏ విషయాన్ని గురించి విస్తారంగా విన్నా, దానిలో లయించి పోవడమనేది ఒక స్వభావ లక్షణంగా ఉండిపోతూ వుంటుంది. ఆధ్యాత్మ విద్యలో అది చాలదు. తీవ్ర భావనవల్ల ఏ సమాధి లభిస్తుందో, అది సర్వకాల సర్వావస్థలలోనూ స్థిరంగా నిలబడాలి. అప్పుడే ఈ తాత్కాలిక సమాధులకు సార్థక్యం!

ఈ విషయాన్ని పూర్వం శివుడివల్ల వశిష్ఠమహర్షి తెలుసుకోగలిగాడు. ఆ విషయాలను శ్రీరాముడికి కూడా చెప్పాలని వశిష్ఠుడు సంకల్పించాడు. అందుకే ఆయన తన బోధను ఇలా కొనసాగించాడు.

### 17. శివోపదేశోపాఖ్యానము

***వశిష్ఠుడు***: రామా!

**ఏవమేవావలంబ్యార్థం**

**తిష్ఠ నేహ పదం కృథాః ॥** (పూర్వ. సర్గ 29. శ్లో. 5)

నీకు మంచి జ్ఞానం కలిగింది. సంతోషం, కాని మళ్ళీ వెనక్కు వచ్చి సంసారంలో అడుగు పెట్టకు. ఈ స్థితిని ఇలాగే నిలబెట్టుకో. అదేదో కష్టమైన పని అని అనుకోకు. పూర్వం నీకు ఒక సారి చెప్పా. ఈ సంసార చక్రభ్రమణాన్ని ఆపాలంటే చక్రాన్ని చివరిలో పట్టుకోకూడదు. మధ్యలో బొడ్డు దగ్గర పట్టుకోవాలి. ఈ సంసార చక్రానికి బొడ్డు సంకల్పం. (చిత్త వృత్తి). దాన్ని గట్టిగా పట్టుకో, కదలనీకు. ఈ పనికి అభ్యాస వైరాగ్యాలే ఉపాయం. దీనిలో ఒక రకమైన పౌరుషం కావాలి. ఆ పౌరుషంలో నేర్పుండాలి. ఆ నేర్పుతో సౌజన్యం ఉండాలి. వీటన్నిటికీ శాస్త్ర సమ్మతి ఉండాలి.

ప్రపంచమంతా మిథ్య అన్నాం కదా అని, పైన ఈశ్వరుదున్నాడు కదా అని, జ్ఞాన సాధనలో నీ పురుష ప్రయత్నాన్ని రవ్వంత గూడా తగ్గనీకు.

**దైవైక పరతాం త్యక్త్వా**

**బాలబోధోప కల్పితామ్ ।**

**నిజం ప్రయత్నమాశ్రిత్య**

**చిత్తమాదౌ నిరోధయేత్ ॥** (పూర్వ. సర్గ 29, శ్లో. 9)

ప్రపంచం దైవాధీనమనేది కేవలం పిల్లలకోసం కల్పించి చెప్పే మాట. అందుచేత దాన్ని వదిలేసి, గట్టిప్రయత్నం చేసి, చిత్తవృత్తి నిరోధాన్ని సాధించాలి.

దీనికి మొదటి అడ్డంకి ఈ దేహం మీది ప్రేమే! నిజానికి ఈ బతికున్న దేహంకంటే చిత్రపటంలో వున్న దేహం నయం. ఎందుకంటే, ఈ దేహాన్ని రోజూ పోషిస్తున్నా రోజూ వాడిపోతూనే వుంటుంది. చిత్రపటంలోని దేహం వందేళ్లపాటు నిగనిగలాడుతూనే వుంటుంది.

మరో చిత్రం వుంది. మనం పూర్వజన్మల్లో బహుదీర్ఘకాలం సంకల్పాలు చేయగా చేయగా ఇవాళ ఈ దేహం పుట్టింది. ఒక్క పగటి పూట ఏదో దృశ్యం చూస్తే, దాని ప్రభావంచేత రాత్రికి స్వప్నంలో ఒక కొత్త దేహం పుట్టింది. దానికీ, దీనికీ తేడా ఏమిటి? అదీ సుఖదుఃఖాలనిస్తోంది. ఇదీ ఇస్తోంది. అదీ పోతోంది. ఇదీ పోబోతోంది. నిజానికి పెద్ద కష్టమేమీ లేకుండా సంపాదించుకో గలిగాం కనుక, స్వప్న శరీరమే మెరుగనాలి.

ఇలా రకరకాల ఊహలు చేసి, ఈ శరీరం నశించేదనీ, విలువ లేనిదనీ, పనికి రానిదనీ, మనస్సుకు బాగా పట్టించుకోవాలి. దీని ద్వారా చలించని , నశించని, ఆత్మ మీద దృష్టిని పెంచుకోవాలి.

ఈ ప్రయత్నం జరుగుతున్నంత మాత్రాన ఈ దేహం నశించిపోదు. ఈ దేహంద్వారా జరిగే పనులూ ఆగిపోవు. ఐతే, ఈ దేహంతో మనకు ముడిపెట్టి బంధించి పడేసేవి పనులు గావు. వాటి వెనకాల ఉన్న అహంకారం, అంటే కర్తృత్వ భావన, నేనే చేస్తున్నాననే అభిమానం. మొదట ఈ అహంకారం వెంటపడి తిరగటం మానుకోవాలి. అసలు దాని మాటే మరచిపోవాలి. రహస్యమేమిటంటే, అహంకారం నిజంగా

ఉందో, పోయిందో, ఆ విచారణ వద్దు. దానిని మనస్సుతో స్మరించబోకు. అలా అహంకారాన్ని అవమానించుకుంటూ పోతే, చివరికి అదే నిన్ను వదలిపెట్టి పోతుంది.

నువ్వు ఆత్మవు, పరమాత్మవు, సర్వవ్యాపివి. ఐనా సరే, నీకు అహంకారంతో సంబంధమే లేదు. ఈ మాటను ఎప్పుడూ మర్చిపోకూడదు.

**శ్రీరాముడు**: గురుదేవా! మరైతే –

**కేనేషితం పతతి ప్రేషితం మనః ॥**

(ఈ మనస్సును ఎవరు కదిలిస్తున్నారో అతడే ఆత్మ) అనీ,

**ఊర్ధ్వం ప్రాణమున్నమయతి ।**

**అపానం ప్రత్యగస్యతి॥**

(ఆ ఆత్మయే ప్రాణవాయువును పైకి, అపానవాయువును కిందకీ, నడుపుతున్నాడు) అనీ, ఇలా అనేక శ్రుతి వాక్యాలున్నాయి కదా! వీటివల్ల ఇంద్రియాలకూ, ప్రాణాపానాది వాయువులకూ ప్రేరణకర్త ఆత్మేనని తెలుస్తోంది కదా! మరి ఆత్మ దేనికీ కర్త కాదని అంటే శ్రుతి విరోధం రాదా?

**వశిష్ఠుడు**: రామా! శ్రుతి ఏ దృష్టితో ఆ వాక్యాలను పలికిందో అర్థం చేసుకుంటే ఏ విరోధమూ రాదు. ఎలాగంటే, "చెట్టు పుట్టడానికి ఆకాశం కారణం" అని వాక్యం వుందనుకో. దీన్ని బట్టి ఆకాశమే కర్త అని కర్తృత్వాన్ని అంట గట్టగలమా? ఆకాశం కర్త కాకపోతే ఈ వాక్యమే తప్పౌతుంది గదా– అని వాదించ గలమా? చెట్టు పుట్టడానికి అనేక కారణాలున్నాయి– విత్తు, మట్టి, నీరు, మొదలైనవి. ఇవన్నీ ఉన్నా, వాటి నెత్తిన ఒక బండరాయి పెడితే, చెట్టు మొలిచేందుకు సందే వుండదు కనుక అది పుట్టదు. అవన్నీ వుండి, దానిపైన కొద్దిగా ఖాళీ వుంటే, అప్పుడు చెట్టు పుడుతుంది. కనుక ఆకాశం కూడా చెట్టు పుట్టడానికి గల కారణాలలో ఒకటి అని చెప్పవలసి వస్తోంది. ఆ దృష్టితో పై వాక్యం సత్యమే! అది సత్యమైనంత మాత్రాన ఆకాశానికి కర్తృత్వాన్ని ఎవరూ అంటగట్టలేరు. కనుక, పై వాక్యాన్ని అర్థం చేసుకొనేటప్పుడు "ఆకాశంయొక్క సన్నిధిలో చెట్టు పుడుతోంది" అనే అర్థం చేసుకోవాలి. అలాగే, వేదమాత "పరమాత్మే మనస్సును ప్రేరేపిస్తోంది" అని చెప్పినప్పుడు కూడా ఈ ప్రకారంగానే అర్థం చేసుకోవాలి. అంటే పరమాత్మ సన్నిధిచేత మనస్సు పని చేస్తోందని అర్థం చేసుకోవాలి.

నిజానికి పరమాత్మ సన్నిధి చేతనే మనస్సుకు ఒక రూపం అంటూ ఏర్పడుతోంది. భూమి, ఆకాశము, ఎప్పుడు చూసినా ఒకదానికొకటి అంటుకొనే కనిపిస్తాయి. అంత మాత్రంచేత రెండూ ఒకటి కాదు. అలాగే చిత్తైన ఆత్మ, జడమైన మనస్సు, ఎప్పటికీ ఒకటి కావు.

**శ్రీరాముడు**: ఐతే, ఆత్మకు చిత్తేంద్రియాదులతో సంబంధం లేదు కదా! అలాంటప్పుడు చిత్తేంద్రియాదులకు సత్తాస్ఫూర్తి (ఉన్నది అనే స్ఫురణ) ఎలా కనిపిస్తోంది? దీన్ని తప్పించుకోవడానికి ఆత్మకు చిత్తేంద్రియాదులతో సంబంధం వున్నదంటారా? అలా అంటే, ఆత్మకు అసంగత్వం ఎగిరిపోతుంది. రెండూ చిక్కులే.

**వశిష్ఠుడు**: పూర్వం రెండు మూడు సార్లు ఈ చర్చ వచ్చింది. సంబంధం లేకపోయినా తాదాత్మ్య ధ్యాసంవలన, సంబంధం వున్నట్లుగానూ, ఆత్మ చిత్తేంద్రియాదులను ప్రేరిపిస్తున్నట్లుగానూ, కనిపిస్తోంది. అంతే! (తాదాత్మ్యము అంటే అదే నేను ఐపోవడం, అధ్యాస అంటే భ్రాంతి – తాదాత్మ్యాధ్యాస అంటే అదే నేను అనే భ్రాంతి)

కనుక రామా! నువ్వు సర్వజ్ఞుడవైన పరమాత్మవే గానీ, చిత్తానివి కావు. నువ్వు చిత్త తాదాత్మ్యాధ్యాసంలో పడబోకు!

ఇప్పుడు చెప్పుకున్న వరుసను బట్టి చూస్తే, ఆత్మ అనే చైతన్యం, చిత్తాదులనే జడం – అని రెండు సత్య పదార్థాలు వున్నాయని చెప్పినట్లవుతోంది– అనుకుంటావేమో! నా ఉద్దేశ్యం అది కాదు. 'రాయి గట్టిగా వుంది' అన్నామనుకో, దాని అర్థం గట్టితనమనేది వేరే విడిగా ఉందని గాదు. రాయిని విడిచి గట్టితనానికి వేరే అస్తిత్వం లేదు. కాని 'గట్టితనమే రాయి' అని చెప్పలేం. ఆ రెండూ వేరు వేరు అన్నంతమాత్రం చేత గట్టితనానికి వేరే అస్తిత్వం ఉందనీ చెప్పలేం. ఆత్మకూ, చిత్తేంద్రియాది ప్రపంచానికీ మధ్య వున్న సంబంధం కూడా ఇలాంటిదే! అవి రెండూ ఒకటి అని అనుకోరాదు. కాని ప్రపంచానికి వేరే అస్తిత్వం వుందని కూడ అనుకోరాదు. ప్రపంచంమీద వ్యామోహం పెట్టుకోకుండానే, దానిమీద ఉన్న మోహాన్ని చంపుకుంటూనే, ప్రపంచంలోని ప్రతి పదార్థాన్నీ ఆత్మ స్వరూపంగా చూడడం నేర్చుకోవాలి.

### 18. మానసపూజ

***శ్రీరాముడు***: ఇది చాలా కష్టమైన పని కాదా?

***వశిష్ఠుడు***: దానికో సులభోపాయం వుంది. దానినే శివమానస పూజా విధానమంటారు. దాన్ని సాక్షాత్తూ పరమశివుడే నాకు ఉపదేశించాడు. అది చెబుతా విను.

పూర్వం ఒకప్పుడు నేను శివపూజ చేసుకుంటూ కైలాస పర్వతంమీద కొంతకాలం నివాసం చేశాను. అక్కడ నేను నిరంతరం అనేక ప్రాయశ్చిత్తాలను చేసుకుంటూ, తపస్సు చేసుకుంటూ, అక్కడ వుండే సిద్ధులతో శాస్త్ర చర్చలు చేసుకుంటూ, పవిత్రంగా కాలం గడుపుతూండే వాడిని.

అలా వుండగా శ్రావణ బహుళాష్టమి వచ్చింది. ఆరోజు ప్రదోషకాలం. శివపూజకు చాలా ప్రశస్తం. కనుక సూర్యాస్తమయం అవుతుండగానే శివధ్యానం మొదలు పెట్టాను.

(**గమనిక:** శ్రావణ బహుళాష్టమి అంటే, ఇప్పుడు మన లెక్కలో శ్రీకృష్ణాష్టమి. శ్రీకృష్ణ పరమాత్మ జన్మించిన తరువాత అది మనకు కృష్ణాష్టమి అయింది. కాని అంతకు ముందే అనాదిగా ఇది మహాపర్వం. శివ పూజకు ప్రశస్తమైన శుభ ముహూర్తం. అందుకే శ్రీకృష్ణ పరమాత్మ ఆ రోజును తన అవతారానికి తగిన పర్వంగా ఎంచుకున్నాడు అని మనకు ఈ ఘట్టాన్ని బట్టి అర్థమౌతోంది.)

ఆ ధ్యానంలో ఒక ఝాము సేపు నాకు వొళ్ళు తెలియలేదు. తెలివి వచ్చి కళ్ళు తెరిచే సరికి, చుట్టూ అంతటా చీకటిగా వుంది. ఆ కటిక చీకటిలో ఎక్కడో దూరంలో అడవిలోంచి తెల్లటి వెలుగు పొడుచుకువస్తూ కనిపిస్తోంది. బయటి కళ్ళకు కనిపించే ఈ వెలుగు ఏమిటా అని లోపలి కళ్ళతో వెతకడం ప్రారంభించాను.

అంతే! వెంటనే నందీశ్వరాది పరివార సమేతుడై, పార్వతీ సహితుడై, వున్న ఈశ్వరుడు నా ఎదుట ప్రత్యక్షమయ్యాడు.

నేను ఆనందంతో పొంగిపోయి, కంగారు పడుతూ, నిద్రపోతున్న నా శిష్యులను లేపి, అర్ఘ్యపాద్యాదులను తీసుకెళ్ళి, ఆ స్వామికీ, ఆ తల్లికీ, తగిన సపర్యలు, పూజలు, చేశాను.

స్వామిగూడా ఏమీ తొందరపడకుండా, నేను చూపించిన పుష్పాసనం మీద విశ్రాంతిగా కూర్చున్నాడు. నేను భక్త్యావేశంతో చాలాసేపు పూజలు చేశాను. స్తోత్రాలు పాడాను. వేదాలు వల్లించాను. ఏమేమో చేశాను. నా భక్తి పొంగు కొంత తగ్గినాక స్వామి ప్రసన్నంగా చూస్తూ ప్రశాంతంగా ఇలా అన్నారు.

***శివుడు***: బ్రహ్మర్షీ! నీ చిత్తవృత్తులు పరమాత్మ వస్తువును చేరి, అక్కడ నిలిచిపోయి, విశ్రాంతిగా ఉన్నాయా? దొరకవలసింది దొరికిందా? భయాలు తొలగి పోయాయా?

***వశిష్ఠుడు***: దేవా! సాక్షాత్తు పరమశివుడే ఒకణ్ణి మరిచిపోకుండా గుర్తు పెట్టుకున్నాడంటే, అలాంటి భాగ్యశాలికి దొరకని అదృష్టమూ వుండదు, పోని భయమూ వుండదు. దేవా! నీ స్మరణం అనే చింతామణిని చేతితో పట్టుకొని, నేను ఆపదలన్నింటినీ కాలితో తన్నేశాను. ఐనా, దేవేశా! తమరు అనుమతిస్తే ఒక ప్రశ్న అడుగుతాను.
***శివుడు***: అడుగు.
***వశిష్ఠుడు***: ప్రభూ! సర్వపాపాలనూ పోగొట్టేదీ, అన్ని శుభాలనూ కలిగించేదీ, ఐన దేవ పూజా విధానమేమిటి? దయచేసి నిర్ణయాత్మకంగా తేల్చి చెప్పండి.

***19. దేవుడంటే?...***

***శివుడు***: బ్రహ్మర్షి శ్రేష్ఠా! బాగా అడిగావు. కానీ అసలు దేవుడంటే ఏమిటో తెలుసా నీకు? దేవుడంటే విష్ణువు కాదు, శివుడు కాదు, బ్రహ్మకాదు, దేవేంద్రుడు కాదు. సూర్యుడు , అగ్ని, బ్రాహ్మణుడు, నువ్వు, నేను, వీళ్ళెవ్వరూ దేవుళ్ళు కారు. ఇంతెందుకు – శరీరము, మనస్సు మొదలైన పరిమితులు గల ఏ పదార్థమూ దేవుడు కానే కాదు!

**అకృత్రిమ మనాద్యన్తం**
**దేవనం దేవ ఉచ్యతే ॥** (పూర్వ. సర్గ. 29, శ్లో. 121)
దేవ శబ్దం దివు ధాతువు నుంచి నిష్పన్నమైంది.

**"దివు– క్రీడా, విజిగీషా, వ్యవహార, ద్యుతి, స్తుతి, మోద, మద , స్వప్న, కాన్తి, గతిషు"** అనే ప్రమాణం చేత, 'దివు' అనే ధాతువుకు క్రీడించుట, గెలువ గోరుట వ్యవహరించుట, వెలుగుట, స్తుతించుట, ఆనందించుట, మదించుట, నిద్రించుట, కోరుట, కదలుట – అని ఇన్ని అర్థాలున్నాయి. కానీ, వీటిల్లో 'ఆనందించుట' అనే అర్థం తప్పితే మిగిలినవన్నీ ఏదో ఒక క్రియకు ఫలితంగా సంభవించే పనులే! ఆనందం కూడా ఇంద్రియాది సాధ్యమైన ఆనందమైతే, అది కూడా క్రియా సాధ్యమే. కనుక ఇవన్నీ కృత్రిమాలు. ఇలాంటి కృత్రిమత్వం అంటని ఆనందం ఒకటి వుంది. అదే చిదానందం. అదే చిచ్ఛివం. (చిత్ + శివం= చిచ్ఛివం). దానికి ఆద్యంతాలు లేవు. అలాంటి చిదానందమే అసలైన దేవుడు. దాన్నే పూజించాలి. నిజానికి అదొక్కటే వుంది. మిగిలిన పదార్థాలన్నీ, వున్నాయో లేవో చెప్పడానికి వీలు లేని సదసద్రూపధారులే!

పదిమైళ్ళు నడువలేనివాడిని పది బారలైనా నడవరా అని ప్రోత్సహించినట్లుగా, ఆద్యంత రహితమైన, అకృత్రిమమైన, చిదానందాన్ని ఉపాసించడం చేతకానివారికోసం, దేశకాలాది పరిమితులు కలిగిన రుద్రాది స్వరూపాలను ఉపదేశించి, వీటిని పూజించండిరా బాబూ అని వేదాలు ప్రోత్సహిస్తున్నాయి. ఆ రూపాలు పరిమితి గలవి గనుక, వాటి ఉపాసనవల్ల వచ్చే ఫలితాలు కూడా పరిమితంగానే ఉంటాయి.

దీనికి భిన్నంగా, అనాద్యంతమైన చిదానందాన్నే ఉపాసించ గలిగితే, దాని ఫలితం గూడా అకృత్రిమంగా (క్రియాసాధ్యం కానిదిగా), నిత్య సిద్ధంగా, శాశ్వతంగా, వుంటుంది. అలాంటి ఫలితం ఆత్మానందమే!

నిజం చెప్పాలంటే, ఇలాంటి శాశ్వత ఫలితాన్ని విడిచిపెట్టి, కృత్రిమ ఫలితాన్ని కోరుతూ, పరిమితమైన రూపాలను ఉపాసన చేసేవాడు, సువాసనలు వెదజల్లే మందారాల తోట వదిలిపెట్టి, జిల్లేడు అడవిలోకి పోయినట్లే! ('మందారం' అంటే దేవ లోకంలోని కల్ప వృక్షాల జాతిలో ఒకటి.) ఓ వశిష్ఠ మహర్షీ 'దేవపూజ' అంటే ఈ చిదానంద శివపూజే!

ఈ పూజకు ముఖ్యమైన పుష్పాలు మూడు. 1. జ్ఞానము 2. సామ్యము, అంటే, సర్వసమతా

దర్శనము, అంటే నేను ఎలా చేతన స్వరూపుడ్ణో అలాగే ఈ ప్రపంచంలో కనిపించే ప్రతి పదార్థమూ శుద్ధ చైతన్య స్వరూపమే అనే దృష్టి), 3. శమము (శాంతి లేక అంతరింద్రియ నిగ్రహము). ఈ మూడు పుష్పాలతోను పూజించవలసిన దేవుడు చిన్మాత్ర శివుడు. ఈయనకే మరోపేరు పరమాత్మ. కనుక ఆత్మార్చనమే, నిజమైన దేవార్చన. ఇలాంటి ఆత్మార్చనను విడిచిపెట్టి సరూప దేవార్చన చేసేవాళ్లు సంసార చక్రంలో కొట్టుమిట్టాడక తప్పదు.

ఐతే మహర్షీ! కొందరు తత్త్వజ్ఞానవేత్తలు గూడా విగ్రహార్చనాదులు చేయడం కనిపిస్తోందే, అని సందేహిస్తావేమో, విను. ముసలివాళ్లు పిల్లల కోసం పిల్లలతో కలిసి పిల్లాటలు ఆడినట్లుగా, వాళ్ళు ఇలాంటి పూజలు చేస్తున్నారని తెలుసుకో! అంతే గాని సాంసారిక భోగాలను ఆశించి వాళ్ళు అలా చేస్తున్నారని అనుకోకు. మళ్ళీ చెబుతున్నా విను. ఆత్మే దేవుడు! ఆత్మే శివుడు! కారణాలన్నిటికీ కారణం ఆత్మే. అదే చిదాకాశం. అలాంటి ఆత్మ దేవుడికి నిరంతరంగా జ్ఞానార్చన చేయాలి. (ఉత్పత్తి ప్రకరణంలో లీలోపాఖ్యాన ప్రారంభంలో చిదాకాశం అంటే ఏమిటో వివరణ వుంది.)

***వశిష్ఠుడు***: ప్రభూ! చైతన్యాకాశమే జడ చేతనాత్మకమైన ఈ ప్రపంచం మొత్తానికి కారణమని మీరంటున్నారు కదా! అంటే, చైతన్యమే జడరూపంగా ఉందనీ, చైతన్యమే జీవుడై సంసారంలో పడుతోందనీ, చెప్పినట్లౌతోంది గదా, ఇది ఎలా కుదురుతుంది?

***శివుడు***: ఈ ప్రపంచాన్ని నువ్వు 'చిత్' అనీ, 'చేత్యం' అనీ, రెండు భాగాలు చేసి చూస్తున్నావు. 'చిత్' అంటే చైతన్యము గల ద్రష్ట! 'చేత్యము' అంటే ఆ ద్రష్ట చేత అనుభవించబడే పదార్థాలు. వీటిలో 'చిత్' అనేది ఒకటి స్వయంగా ప్రకాశిస్తూ ఉంటే, దానిని బట్టి చేత్యాలు ప్రకాశిస్తూ వుంటాయి కనుపిస్తూ ఉంటాయి అంటే చేత్యం యొక్క ప్రకాశం (భానం) 'చిత్' ప్రకాశంమీద ఆధారపడి వుంటుంది.

ఇప్పుడు కొంచెం ఆలోచించు. చిత్ స్వయంగా ప్రకాశిస్తోంది అన్నా,చిత్ స్వయంగా ఉంటోంది అన్నా, తేడా ఏమిటి?ఉన్నవస్తువే కనిపిస్తుంది. కనిపించే వస్తువే వుంటుంది. కనుక ఇక్కడ మాటల తేడాయే తప్ప అసలైన తేడా లేదు. అందువల్ల ప్రపంచంలోని పదార్థాలన్నింటియొక్క సత్త(ఉనికి) 'చిత్'యొక్క సత్త మీదే ఆధారపడి వుంది. అందుకనే నేను సమస్త ప్రపంచానికీ 'చిత్తే' కారణం అన్నాను.

దీనినే మరో రకంగా చెప్పవచ్చు. చిదాత్మ త్రివిధ పరిచ్ఛేద రహితమని శ్రుతి ప్రసిద్ధమే కదా! అంటే, చిదాత్మలో దేశభేదంగాని, కాల భేదం గాని, వస్తు పరిచ్ఛేదం గాని, లేనట్లే గదా!అలాగే సజాతీయ, విజాతీయ, స్వగత పరిచ్ఛేదాలు గూడా లేనట్లే గదా! చిదాత్మకంటే భిన్నంగా పదార్థాలనేవి ఉంటే, ఈ పరిచ్ఛేద రాహిత్యం ఎలా సంభవిస్తుంది? అది అసంభవం గదా! కనుక పైన చెప్పిన పరిచ్ఛేద రాహిత్యం కుదరాలంటే, జగత్తులోని పదార్థాలకు ఉనికే లేదని చెప్పాలి. తప్పదు. లేని ఉనికి ఉన్నట్లు కనిపిస్తోంది కనుకనే, ఇలాంటి ఉనికియొక్క ఉనికి చిత్‌సత్త మీద ఆధారపడి ఉందని నేనంటున్నాను.

***వశిష్ఠుడు***: జగత్పదార్థాలకు బొత్తిగా ఉనికే లేకపోతే, ఈ ప్రపంచం వున్నట్లు ఎలా కనిపిస్తోంది?

***శివుడు***: ఆకాశంలో సూర్యుడు ఒక పళ్ళెం లాగా స్వయంగా ప్రకాశిస్తున్నాడు. ఇక్కడ మనం కూర్చున్న చోట వెలుతురు కనిపిస్తోంది. ఈ వెలుతురు ఎవరు? నిజానికి ఇది ఆ సూర్యుడియొక్క స్పందనే! కాని సామాన్య జనులు ఆ మాటను గ్రహించలేక, అది సూర్యుడు, ఇది ఎండ, అంటున్నారు. అలాగే చిదాత్మ స్వయంగా సూర్యబింబం లాగా ప్రకాశిస్తోంది. దానిలోంచి పొంగి బైటకి వచ్చిన ఎండ లాంటిదే ఈ ప్రపంచం! నిజానికి అదీ ఇదీ ఒక్కటే! కానీ అజ్ఞానులు దీన్ని గుర్తించలేక, రూప రహితంగా వున్నది చిదాత్మ, నామ రూప సహితంగా ఉన్నది ప్రపంచం- అనుకుంటున్నారు. అలా అనుకోవడంవల్లనే, ఈ జగత్పదార్థాలు చిదాత్మకంటే

భిన్నంగా వున్నట్లు కనిపిస్తున్నాయి.

***వశిష్ఠుడు***: అలా ఐతే చిదాత్మే జగత్పదార్థాలుగా పరిణమించిందని అనుకోవచ్చునా?

***శివుడు***: అనుకోరాదు. పరిణామం సంభవించాలంటే ఆ వస్తువులలో స్వగత భేదం వుండాలి. చిదాత్మలో అలాంటి భేదం లేదని చెప్పుకున్నాం కనుక, ఇక్కడ పరిణామం అనే మాట కుదరదు. తాడున్న చోట పాము కనిపిస్తే, దానిని పరిణామమని అనడానికి వీలు లేదు. దానిని అన్యథా భానము (ఒకటి ఉంటే మరొకటి కనుపించడం) అనవలసిందే! ఇక్కడి పరిస్థితి కూడా అంతే. కనుక ప్రపంచంలో ఉన్నది చిదాత్మ ఒక్కటే. రెండవది లేనే లేదు. కాబట్టి పంచభూతాలన్నా, జీవాత్మ అన్నా, కొండలన్నా, నదులన్నా, ఏదన్నా సరే, అన్నిటికీ చిదాత్మ అనే అర్థం. ఈ పదాలన్నీ పర్యాయపదాలే! వృక్షము, చెట్టు, పాదపము, భూజము, తరువు ఇవన్నీ ఎలా పర్యాయ పదాలో, అలాంటివే పైవి కూడా.

***వశిష్ఠుడు***: ఇది మరీ వింతగా వుంది ప్రభూ! మీరు కొండ, నది, ఆకాశం వంటివన్నీ పర్యాయ పదాలనేస్తున్నారు. మరి గ్రంథాలలో చూస్తే ఒక్క ఆకాశంలోనే భూతాకాశం వేరు. అవ్యాకృతాకాశం వేరు, చిదాకాశం వేరు, అని కనిపిస్తోంది. ఇది ఎలా కుదురుతుంది?

***శివుడు***: కుదురుతుంది. ఆ శబ్దాల ఉత్పత్తి దగ్గరికి వెళ్ళి చూస్తే కుదురుతుంది. నువ్వు మూడు ఆకాశాల పేర్లు చెప్పావు. వాటిల్లో 'ఆకాశ' పదం అనుగతంగా వుంది. ఆ పదంలో "కాశ్రు దీప్తౌ' అనే ధాతువు వుంది. దీనికి 'వెలుగుట' అని అర్థం. స్వయంగా వెలిగే లక్షణం ఒక్క చిదాత్మకే వుంది. కనుక నువ్వు చెప్పే మూడు ఆకాశాలూ చిదాత్మయొక్క రూపాంతరాలే! అంతే గాదు వశిష్ఠా! ఆకాశంకంటే అన్ని విధాలా భిన్నమైన 'జగత్తు' అనే పదం తీసుకో. ఇది "గమ్‌ల్ గతౌ" అనే ధాతువు నుంచి వచ్చింది. 'కదలిక' అని దీని అర్థం. "యే గత్యర్థాః తే జ్ఞానార్థాః" అని మరో సూత్రం వుంది. కదలికను చెప్పే పదాలన్నీ జ్ఞానాన్ని గూడ చెబుతాయి – అని దీని అర్థం. దీన్ని బట్టి 'జగత్తు' అనే పదంలో జ్ఞానం అంతర్లీనంగా వుంది. జ్ఞానం అంటే చిదాత్మే! కనుక జగత్తు మొత్తమంతా కలిపి చిదాత్మయొక్క రూపాంతరమే. అందుకనే ప్రపంచంలోని పదాలన్నీ చిదాత్మకు పర్యాయ పదాలే అని నేనన్నాను.

ఇలా అనటంవల్ల నేను చెప్పదలచుకున్న దేమిటంటే, చిదాకాశం ఒక్కటే పరమార్థ సత్యం అనీ, నీ స్వప్నంలో చిదాకాశమే స్వప్న ప్రపంచంగా కనిపించినట్లుగా, నీ జాగ్రత్తు అనే స్వప్నంలో కూడా అదే చిదాకాశం ఈ జాగ్రత్ ప్రపంచాకారంగా కనిపిస్తోందనీ, మాత్రమే!

(**గమనిక**: ఈ విషయాలు ఉత్పత్తి ప్రకరణంలో విస్తారంగా వచ్చాయి.)

ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే, ఈ ప్రపంచమంతా కేవలం చిదాత్మ స్వరూపం గనుక, ఆ చిదాత్మే, ఆ పరమాత్మే, ఆ పరబ్రహ్మే, మనకున్న ఏకైక దేవుడు. మనం పూజిస్తే అతన్నే పూజించాలి. అదే మీబోటి వాళ్ళకు యోగ్యమైన పూజ. ఈ పూజకు పుష్పధూపాది బాహ్యసాధనలు అక్కరలేదు.

## ***20. దేవుడెక్కడ ఉన్నాడు***

***వశిష్ఠుడు***: ఆ దేవుడు ఎక్కడ ఉన్నాడని పూజించాలి?

***శివుడు***:

**న స దూరే స్థితో బ్రహ్మన్**
**న దుష్ప్రాపస్స కస్యచిత్ ।**

**సంస్థిత స్స సదా దేహే**

**సర్వత్రైవ చ ఖే యథా ॥** (పూర్వ. సర్గ. 30, శ్లో.21)

మహర్షీ! ఆ దేవుడెక్కడో దూరంగా లేదు. ఆయనను పట్టుకోవడం కష్టం కాదు. ఈ ఆకాశం అంతా నిండి వున్నట్లే , నీ శరీరం మొత్తం అంతా నిండి వున్నవాడు ఆ చైతన్య దేవుడే. ఎందుకంటే, ఈ దేహంలోకి జీవుడై ప్రవేశించినవాడు ఆయనే!

ఈ శరీరంలో గహనాతి గహనంగా పెనవేసుకొనిపోయి వున్న ఇంద్రియ పరంపరను, అంతకంటే గహనంగా ఒకదాని లోపల ఒకటిగా వున్న పంచకోశ పరంపరను, వ్యాపించి, వాటిని తెలుసుకుంటూ, వాటి ఆధారంతోనే ఆరోప దశలో ప్రపంచాన్ని కల్పించుకుంటూ, అపవాద దశలో దానిని తొలగించుకుంటూ, సంచరించేది ఈ చైతన్య దేవుడే.

ఈ చైతన్య దేవుడే ముల్లోకాలనూ నిర్మిస్తాడు. వాటిలో తానే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులై క్రీడిస్తాడు. ఆ లోకాలలోని వెలుతురు తానే. చీకటీ తానే. కనుక ఈ ప్రపంచమంతా చిన్మయం. ఇక్కడ చిత్తే వుంది. మరొకటి లేనే లేదు. ఈ కనిపించేదంతా చిన్మాత్రమే.

***వశిష్ఠుడు***: దేవా! ఈ ప్రపంచమంతా చైతన్యమే ఐతే, అందులో ఈ శరీరం కూడా చైతన్యమే ఐతే, దీనికి నిద్రా, మరణ మూర్ఛాది అవస్థలు ఎలా వున్నాయి? వాటిల్లో ఏమీ తెలియదనే అజ్ఞానం వుంటోంది గదా! అదీ గాక ఈ దేహంలో పూర్వం చైతన్యం ఉండేది, ఇప్పుడు చైతన్యం దీంట్లో లేదు, ఇప్పుడు ఇది శవం– అనే అనుభవం లోకంలో అందరికీ వుంది కదా! ఇది ఎలా కుదురుతోంది?

***శివుడు***: బ్రహ్మర్షీ! మంచి ప్రశ్న వేశావు.

**జడగతేరవలోకయ శక్తతాం**

**నిజపదస్మరణేన వినేహ చిత్ ।**

**వ్రజతి కష్టమధః పతనాయ యా**

**యదర ఘట్ట ఘటీ ఘనపీఠవత్ ॥** (పూర్వ. సర్గ. 31, శ్లో.109, చివరిశ్లోకం)

వశిష్ఠా!ఈ చిత్తు ఆరోపదశలో ప్రపంచాన్ని కల్పించుకుంటూ, అపవాద దశలో దానిని తొలగించు కొంటూ, వుంటుందని పూర్వమే చెప్పాను. ఇది ఎలా జరుగ గలుగుతోందో కొంచెం ఆలోచించు. జడమైన అవిద్యయొక్క శక్తి ఇదేనని అర్థం చేసుకో! అవిద్యాబలంచేతనే చిత్తు తన స్వస్వరూపాన్ని మర్చిపోయి, ఏతాము కుండలోని ఆకాశం లాగా మాటి మాటికీ పైనా కిందా పడుతూ వుంటుంది.

నిజానికి ఆకాశానికి పరిమితి వుందా? అది అనంతం. కాని కుండలో ఇరుక్కుపోయి తన్ను తాను పరిమితమైన దానిగా భావించుకోవడం వలన ఆ కుండలోని ఆకాశం ఘటాకాశమనే పేరును పొంది, ఏతాము కర్రకు లొంగిపోయి, పైకీ కిందికీ తిరుగుతూనే వుంటుంది. దానివలననే నువ్వు చెప్పిన నిద్రామరణ జడ చేతనాద్యవస్థలు ఆ చైతన్యానికి కలుగుతూ వుంటాయి.

అవిద్యవల్ల కామము, కామంవల్ల కర్మ, చిదాత్మకు అంటుకొని, తత్ఫలితంగా ఆ చిదాత్మ పై లోకాలకూ, కింది లోకాలకూ తిరుగుతూ వుంటాడు. ఈ విషయాన్ని

**"యథాకారీ యథాచారీ తథా భవతి ।**

**సాధుకారీ సాధుర్భవతి ।**

**పాపకారీ పాపో భవతి ।**

**పుణ్యో వై పుణ్యేన కర్మణా భవతి ।**

**పాపః పాపేన ॥** " – అనే ఉపనిషద్వాక్యం గూడా ధ్రువ పరుస్తోంది.

ఎలాంటి శరీరాలను ధరిస్తాడో, అలాంటి పనులనే చేస్తాడు. అంటే, మనిషిగా పుడితే, మనిషి చేసే పనులే చేస్తాడు. పశువుగా పుడితే, పశువు చేసే పనులే చేస్తాడు. మనిషిగాపుట్టినవాడు మంచి పనులు చేస్తే, మంచివాడై పుడతాడు. పాడు పనులు చేస్తే, పాపాత్ముడై పుడతాడు. పుణ్యకర్మలవల్ల పుణ్యం లభిస్తుంది. పాపకర్మవల్ల పాపం లభిస్తుంది. అని పై శ్రుతివాక్యం పునరుక్తిగా నొక్కి చెబుతోంది.

చిత్తం హి కారణం త్వస్యాః

సంసారానుభవే చితేః ।

న చ తత్కారణం కించిత్

చిత్త్వాన్యత్వాత్యసంభవాత్ ॥ (పూర్వ. సర్గ. 31, శ్లో. 4)

కనుక వశిష్ఠా! అవిద్యాబలంవల్ల చిత్తులో చిత్తం ఏర్పడుతోంది. చిత్తు చేత్యాన్ని అనుభవించడానికి కారణం చిత్తమే! కానీ ఆ చిత్తానికి వెనకాల కారణమేమీ లేదు. ఎందుకంటే చిత్తుకంటే భిన్నమైన సత్యపదార్థమే లేదు కనుక.

ఇలా కారణం లేకుండా పుట్టిన చిత్తం చేత్యాన్ని కలుగజేస్తోంది. గనుక దానికి కూడా సరియైన కారణం లేదనే చెప్పాలి. సరియైన కారణం లేదు గనుక చిత్తము, చేత్యము అనేవి రెండూ లేనివే అని చెప్పాలి. అవి రెండూ లేకపోతే, చిత్తు శుద్ధంగానే వుందని చెప్పాలి. ఇదే సత్యం. చైతన్యం ఒక్కటే ఉంది. భేద ప్రపంచం అనేది లేనే లేదు.

**21. సుఖదుఃఖప్రాప్తి జీవుడి దోషమే**

***వశిష్ఠుడు***: పరమేశ్వరా! మీరు ఇంతకు ముందు చిత్తే సర్వాత్మకమనీ, అదే భోక్త ఐన జీవదశను పొందిందనీ, చెప్పారు. ఇప్పుడు అసలు జీవత్వమనేదే లేదనీ, ఉన్నది శుద్ధమైన చిత్తే అనీ, అంటున్నారు. దీనినిబట్టి నాకు ఏమి అర్థమౌతోందంటే, సృష్టిలోని ఈ చిత్తాలకన్నిటికీ వెనకాల సమష్టి చిత్తం ఒకటి వుంది– అని . ఉపనిషత్తులు చెప్పే హిరణ్యగర్భుడూ ఇదే. ఆ హిరణ్యగర్భుడి సంకల్పంవల్లనే చైతన్యం రకరకాల దేహాలలో ప్రవేశించి రకరకాల సుఖదుఃఖాలను అనుభవిస్తోంది. ఇంతవరకు తర్కం బాగానే వుంది. కానీ, సుఖదుఃఖాలనే ఈ అనర్థాలన్నిటినీ తొలగించుకోవడం ఎలా? అవి మనకు మించిన హిరణ్యగర్భుడి ప్రబల సంకల్ప ఫలంగా ఏర్పడుతున్నాయి గనుక, వాటిని తొలగించుకోవడం జీవులకు అసాధ్యం అనిపిస్తోంది.

***శివుడు***: అది పొరపాటు. సుఖదుఃఖప్రాప్తి హిరణ్యగర్భుడి దోషం కాదు. అది నీ దోషమే. ఎలాగో చెబుతాను విను.

(**గమనిక:** ఇక్కడ వాల్మీకి మహర్షి వ్యాసఘట్టం వంటి శ్లోకం ఒకటి వేశాడు. శ్రీఆనంద బోధేంద్ర సరస్వతీ స్వామివారి వ్యాఖ్యాన సహాయం లేకపోతే ఆ శ్లోకం కొరుకుడు పడటం చాలా కష్టం. కనుక ఆ మూల శ్లోకం చెప్పుకొని వ్యాఖ్యాత అనుగ్రహంతో అర్థ గ్రహణం చేద్దాం.)

**న చిత్తాత్ కస్య చిద్దోషాత్**

**జాతయైతదవాప్యతే ।**

**తత్సర్వ భావనామాత్రే**

**ణానర్థఃప్రకృతస్థి స్తతః ॥** (పూర్వ. సర్గ. 31, శ్లో. 12)

(ఇక్కడ 'కస్య' అంటే హిరణ్య గర్భునియొక్క అని అర్థం. 'చిద్దోషాత్' అంటే చైతన్యానికి పట్టిన దోషం అని అర్థం.)

వశిష్ఠా! శుద్ధచైతన్యానికి అవిద్య అనే దోషం పట్టిందనీ, తత్ఫలితంగా హిరణ్యగర్భుడు ఉద్భవించాడనీ, ఆ హిరణగర్భుడి చిత్తంలోంచి (సంకల్పంలోంచి) ఈ సృష్టి పుట్టిందనీ, దానివల్ల సుఖదుఃఖాలు నాకు కలుగుతున్నాయనీ, నువ్వు అనుకుంటున్నావు. అది పొరపాటు. ఆ హిరణ్యగర్భుడు సృష్టించిన దేహేంద్రియాదు లన్నిటిలోనూ ఇవి సత్యాలనీ, వీటిలో కొన్ని నేననీ, కొన్ని నావనీ, కొన్ని నావి కావనీ, భావన చేయడంవల్ల మాత్రమే నీకు సుఖదుఃఖ పరంపరా రూపమైన ఈ సంసారానర్థం సంక్రమిస్తోంది.

కనుక ఈ అనర్థం తొలగిపోవాలంటే, దేహాదులయందు 'నేను నాది' అనే అభిమానాలు తొలగిపోవాలి. అది తొలగాలంటే తత్త్వం తెలియాలి. అది తెలియాలంటే, దేహాదులయందు నువ్వు పెట్టుకున్న సత్యత్వభావనను వదలిపెట్టాలి. దాన్ని వదిలిపెడితే శుద్ధచైతన్యమే మిగులుతోంది.

అలాంటి చైతన్యానికి జీవుడే రథం. జీవుడికి అహంకారమే రథం. అహంకారానికి బుద్ధే రథం. బుద్ధికి మనస్సే రథం. మనస్సుకు ప్రాణమే రథం. ప్రాణానికి జ్ఞానేంద్రియాలే రథం. జ్ఞానేంద్రియాలకు దేహమే రథం. దేహానికి కర్మేంద్రియాలే రథం. ఈ రథాలన్నింటికీ సంసార చక్రంలో తిరగడమే పని. (రథం అంటే బయటకు తీసుకు పోయి తిప్పేది)

వశిష్ఠా! రథ పరంపరను చెప్పాను గదా! దీనిలో మనస్సు, ప్రాణము అనే రథాలు ప్రబలమైనవి. వీటిలో మనస్సును తీసుకు వెళ్ళి హృదయాకాశంలో విలీనం చేస్తే, ఇక ప్రాణం ఏ ఇంద్రియంచేతా పనిచేయించ లేదు. అలాగే ప్రాణవాయువును తీసుకొని వెళ్ళి భూతవాయువులో లయింపజేస్తే (అంటే కుంభకం చేస్తే), మనస్సు కూడా ఏ పనీ చేయలేదు. కనుక మనస్సు ద్వారా ప్రాణాన్ని గాని, ప్రాణం ద్వారా మనస్సును గాని, అదుపులోకి తెచ్చుకోవచ్చు. ఆ రెండూ అదుపులో వుంటే, వాటి ద్వారా వాటిని వ్యాపించి వున్న శుద్ధ చైతన్యాన్ని సులభంగా పట్టుకోవచ్చు.

మహర్షీ! నిజానికి శుద్ధ చైతన్యం సృష్టి అంతటా వ్యాపించే వుంది. అన్నిచోట్లా ఎండ వ్యాపించే వున్నా, అది కొండమీద ప్రతిఫలించదు. అద్దంమీద మాత్రమే ప్రతిఫలిస్తుంది. అలాగే శుద్ధ చైతన్యం గూడా పుర్యష్టకంలో బాగా ప్రతిఫలిస్తుంది. పంచభూతాలు, అంతఃకరణము, పంచప్రాణాలు, పంచజ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, అవిద్య, కామము, కర్మ, అనే ఎనిమిదింటితో కూడిన లింగ దేహానికే పుర్యష్టకమని పేరు.

(**గమనిక**: ఈ విషయం ఈ ప్రకరణంలోనే భుశుండోపాఖ్యానంలో 23వ సర్గలో వచ్చింది.)

నిజానికి ఈ పుర్యష్టకంలో ముఖ్యమైనది మనస్సే. కనుక శుద్ధచైతన్యం మనస్సులోనే బాగా ప్రతిబింబిస్తుంది. అలా ప్రతిబింబించి, ఆయా దేహాలను చలింపజేస్తూ, రకరకాల పనులు చేయిస్తుంది.

ఈ మొత్తానికి కారణమైన అవిద్యలో ఆవరణశక్తి వుంది. కమ్మివేయడమే దాని పని. అందువల్ల ముమ్మందుగా అది తనకు ఆశ్రయమైన శుద్ధ చైతన్యాన్ని (పరబ్రహ్మాన్ని) కమ్మివేస్తుంది. తద్ద్వారా ఆ పరబ్రహ్మ లేనే లేదనీ, మనోరూపమైన నేనే ఉన్నాననీ, స్ఫురింప జేస్తుంది. ఆపైన అదే మాయాశక్తి తనకు ఆధారమైన చైతన్యంలో ఉండే సత్తాబలంవల్ల కొంత చిద్రూపంగానూ, తనలో ఉన్న జడతా భావంవల్ల కొంత జడంగానూ, జడ చేతన మిశ్ర స్వరూపంగా ఈ ప్రపంచాన్ని మనకు చూపిస్తుంది. దానివల్లే, ద్రష్ట- దృశ్యము- దర్శనము మొదలైన త్రిపుటులు ఏర్పడతాయి.

కనుక వశిష్ఠా! ఈ దేహం కదలటానికి (పనులు చేయటానికి) కారణం దీనిలోపల వుండే మనస్సులో చిత్తు ప్రతిబింబించడమే. చిత్ ప్రతిబింబం పేరే జీవుడు. ఈ జీవచలనానికి కారణం మనస్సు. దానికి

కారణం ఆవరణ శక్తి. దానికి కారణం పూర్వజన్మలలోని కర్మపరంపర. కనుక మొత్తం మీద తేలిందేమిటంటే, ఈ పరంపర మొత్తానికి ఆధారం పూర్వ కర్మే. ఈ విషయాన్ని బృహదారణ్య కోపనిషత్తు కూడా

**"కర్మ హైవ తదూచతుః**

**కర్మైవ తత్రప్రశశంసతుః"** – అంటూ ధ్రువ పరుస్తోంది.

కనుక వశిష్ఠా! ఈ సంసారం నువ్వు చేసిన పూర్వజన్మ కర్మ ప్రవాహంవల్ల నీకు చుట్టుకున్నదే. కనుక అది నీ దోషమే. కనుకనే అది నిన్ను మించినది కాదు. కనుకనే నువ్వు కృషి చేస్తే దాన్ని తొలగించుకోవచ్చు.

***వశిష్ఠుడు***: దేవా! శుద్ధ చిత్తు (పరబ్రహ్మ) మనస్సులో ప్రతిబింబించిందని మీరంటున్నారు. ఈ మనస్సు లింగ శరీరంలో ఒక భాగం. ఈ లింగ శరీరం పంచభూతాదులవల్ల తయారైంది. ఈ పంచభూతాలు ద్రవ్యజాతిలోనికి చేరినవి. కనుక లింగ శరీరం కూడ ద్రవ్య జాతిలోకే చేరుతుంది. పరబ్రహ్మమో అద్రవ్యం (ద్రవ్యం కానిది) అని పెద్దలు చెబుతున్నారు. ద్రవ్యజాతికి చెందిన మనస్సు అద్రవ్యమైన చిత్తుయొక్క ప్రతిబింబాన్ని ఎలా గ్రహించగలదు?

***శివుడు***: ఇది గట్టి ప్రశ్న గాదు. మామూలు అద్దం ద్రవ్యజాతిలోనిదే గదా. అది నువ్వు చేసే క్రియలను ప్రతిబింబిస్తోంది గదా. నీ క్రియలు ద్రవ్యాలు కావు గదా. కనుక ద్రవ్యం ద్రవ్యాన్ని మాత్రమే ప్రతిబింబించాలనే నియమం లేదు.

***వశిష్ఠుడు***: దేవా! సూర్యుడు నీళ్ళలో ప్రతిబింబిస్తే కొంచెం కాంతి తగ్గుతుందేమో గాని, అసలు మెరవకుండానే వుంటాడా?

***శివుడు***: ఇక్కడ జరిగేది ప్రతిబింబాన్ని మించిన పని. పరబ్రహ్మ ఒక మనస్సులో ప్రతిబింబించి "నేను చిత్తుయొక్క ప్రతిబింబాన్ని" అని గుర్తించ గలిగితే, అందులో పెద్ద చిక్కేమి లేదు. కాని పరబ్రహ్మ ఆ మాట మరచిపోయి "నేనే జీవుణ్ణి" అంటోంది. బోయవాడితో స్నేహం చేసిన బ్రాహ్మణుడు కొంత కాలానికి "నేను బోయవాడ్ణే' అంటున్నాడు. అలా వుంటుంది ఈ ప్రతిబింబ చిత్తుయొక్క పరిస్థితి.

పరబ్రహ్మ చిత్తంతో తాదాత్మ్యాన్ని తనమీద ఆరోపించుకొని, చిత్తుయొక్క ధర్మాలను పొందింది. అక్కడితో ఆగలేదు. ఆపైన ప్రాణవాయువుతో తాదాత్మ్యాన్ని తనమీద ఆరోపించుకొని (తాదాత్మ్యా ధ్యాస చేసుకొని) వాయు ధర్మాలైన చలనహేతుత్వాదులను కూడా పొందింది. (చలన హేతుత్వము=కదిలించే గుణము). దానివల్లనే జీవ చైతన్యం శరీరానికి చలనాన్ని కలిగిస్తోంది.

(**గమనిక:** చలనము అంటే పనే. ఈ విషయాన్ని ముముక్షు వ్యవహార ప్రకరణంలో "క్రియ అంటే" అనే శీర్షిక క్రింద చెప్పుకున్నాం.)

ఈ శరీరమనే బండిని లాగడానికి మనస్సు, ప్రాణము, అనే ఎడ్లను ఏర్పరచాడు బ్రహ్మదేవుడు.

నీరు పెరిగితే అలలు వస్తాయి. అలలు పెరిగితే నురుగులు వస్తాయి. అలాగే శరీరం ముదిరితే వ్యాధులు వస్తాయి, అవి ముదిరితే మరణం వస్తుంది.

మరణం అంటే ఏమిటి? విసన కర్ర ఆడకపోతే గాలి ఆడదు. ఇంద్రియాలు, మనస్సు ఆడకపోయే సరికి లోపలి పుర్యష్టకం కదలదు. అది చచ్చుబడి పోతుంది. దాంతో బయటి దేహం కూడా ఒరిగిపోతుంది. ఇదే చిచ్ఛక్తికి దేహత్యాగం. ఇదే మరణం.(మరణం అంటే ఏమిటి అనే చర్చ ఉత్పత్తి ప్రకరణంలో 'మరణమంటే ఏమిటి' అనే శీర్షిక కింద వచ్చింది.)

అప్పుడు లోపల వుండే జీవుడు తన అజరామరత్వాన్ని మరచిపోతాడు. కాని తనలో దాగివున్న వాసనల బలంచేత మళ్ళీ మరో దేహాన్ని పొందుతున్నాడు. చెట్లకు ఆకులు పుట్టి, రాలి, మళ్ళీ పుడుతున్నట్లుగా, జీవుడికి శరీరాలు పుట్టి, రాలి, మళ్ళీ పుడుతున్నాయి. ఇదే జన్మ పరంపర.

## 22. ద్విత్వం వుంటేనే ఏకత్వం

**వశిష్ఠుడు**: దేవా! చంద్రార్ధశేఖరధరా! అద్వితీయమైన చిత్తత్వం ద్విత్వాన్ని ఎలా పొందిందో నాకర్థం కావడం లేదు. నాకంతా గందరగోళంగా వుంది. ఎందుకంటే – చిత్తత్వం ఒకే ఒకటని, దానిలో సజాతీయ విజాతీయ, స్వగత భేదాలు లేవనీ, పెద్దలు అంటున్నారు. ఇవేవీ లేకపోతే ఆ చిత్తులోంచి ఇంతమంది జీవులెలా వచ్చారు.? ఇంత పెద్ద జడ ప్రపంచం ఎలా వచ్చింది?

1. చిత్తత్వమే స్వయంగా, తనంతట తానుగా, ఇటు జీవరూపం గానూ, అటు జగద్రూపంగానూ, మారిందంటారా? అది కుదరదు. ఎందుకంటే, అలా మారడానికి (పరిణామం చెందడానికి) మూల పదార్థంలో అవయవాలుండాలి. మీ చిత్తత్వంలో అవేవీ లేవు. కనుక ఈ రకమైన పరిణామం సాధ్యం కాదు.

2. పోనీ ఇతర కారణాలవల్ల వేటివల్లై నా చిత్తత్వం ఇలా మారిందంటామా? అదీ కుదరదు. ఎందుకంటే చిత్తత్వం అద్వితీయం, 'రెండో వస్తువు లేనే లేదు' అని మీరంటున్నారు గదా!

3. పోనీ చిత్తత్వం అకారణంగానే ఇలా మారిపోతుందయ్యా – అంటారా? అలా అంటే, ఆ మార్పు చిత్తత్వానికి సహజ సిద్ధమైనదౌతుంది. అంటే సంసారం పరబ్రహ్మకు సహజలక్షణమన్న మాట. అలాంటి సహజలక్షణం మధ్యలో ఏ గురూపదేశంవల్లో వచ్చిన, ఆగంతుకమైన, తత్త్వజ్ఞానంవల్ల నశించడం అసాధ్యం. కనుక ప్రపంచంలో ఎవరికీ ఈ సంసారం పోదు. కనుక ఈ వేదాంత చర్చ అంతా నిరర్ధకం.

4. పోనీ ఆ పరబ్రహ్మకు 'మాయ' అనే శక్తి ఒకటి ఉందయ్యా, అదే ఈ సంసార బంధానికి కారణం, అనుకుందామా? ఇలా అంటే, మళ్ళీ ప్రశ్నలు వచ్చి పడుతున్నాయి. ఎలాగంటే–.

5. ఈ మాయాశక్తి సహజ సిద్ధమా? ఆగంతుకమా? సహజసిద్ధమైతే అది ఎప్పటికీ పోనే పోదు.

6. పోనీ అది ఆగంతుకమని అనుకుందామా? అప్పుడు అది ఎలా వచ్చింది? అనే ప్రశ్న వెంటబడుతుంది.

7. అది దానంతట అదిగానే వచ్చింది అంటే, మాయాశక్తి బ్రహ్మకు సహజ సిద్ధమే అని చెప్పినట్లౌతుంది. అలా ఐతే మోక్షం ఎప్పటికీ రానే రాదని ఇప్పుడే చెప్పుకున్నాం.

8. పోనీ, మాయాశక్తికి వేరే కారణం వుందనుకుందామా? అలా అనుకుంటే 'ఆ కారణం ఎక్కడి నుండి వచ్చింది?" అనే ప్రశ్న వస్తుంది. ఏదో ఒక సమాధానం చెబితే, అదెక్కడినుంచి వచ్చింది అనే ప్రశ్న వస్తుంది. ఈ ప్రశ్న పరంపరకు అంతే వుండదు. కనుక సత్యమేమిటో తేలనే తేలదు. దీనినే 'అనవస్థా దోషం' అంటారు.

9. ఇది ఇలా వుండగా, అసలీ మాయా శక్తి మిథ్యా? సత్యమా? ఇదో పెద్ద ప్రశ్న.

10. మిథ్య అందామంటే, మాయ అనేది లేనివస్తువు ఐపోతుంది. లేని వస్తువులోంచి ద్వైత ప్రపంచమంతా పుట్టిందా?పుట్టిందిలే అనుకుంటే, పరబ్రహ్మలోంచి ద్వైత ప్రపంచం నిష్కారణంగానే వచ్చిందని చెప్పినట్లౌతుంది. అంటే, అది పరబ్రహ్మకు సహజ ధర్మమన్న మాట. అలా అంటే, ఇక ఈ బంధం పోయే ప్రసక్తే లేదు.

11. పోనీ మాయాశక్తి సత్యమందామా? అది సత్యమైతే దానివల్ల పుట్టే ప్రపంచం కూడా సత్యమే. సత్యమైన పదార్థమేదీ జ్ఞానంవల్ల పోదు. కనుక, ఆత్మ జ్ఞానంవల్ల మోక్షం రాదని చెప్పినట్లౌతుంది.

12. పోనీ మాయాశక్తి, సత్యమూ కాదు, అసత్యమూ కాదు, సదసద్భిన్నం– అందామా? అలాంటి పరిస్థితే అసాధ్యం.

కనుక దేవా! ఈ చిక్కులు ఎలా తీరుతాయో అర్థం కావటం లేదు.

(**గమనిక**: ఇలాంటి శాస్త్ర చర్చలు ఉత్పత్తి ప్రకరణంలో 95వ సర్గ ప్రాంతంలో 'పట్టిక' అనే శీర్షిక దగ్గర, స్థితి ప్రకరణంలో 56వ సర్గ ప్రాంతంలో 'శాస్త్రచర్చ' అనే శీర్షిక దగ్గర, వచ్చాయి.)

నిజానికి మూలంలో ఈ ప్రశ్న అంతా కలిపి కేవలం రెండు శ్లోకాలుగా వుంది. వ్యాఖ్యాత ఆ రెండు శ్లోకాల భావాన్నీ పెంచి చర్చగా రూపొందించాడు. ఇక్కడ శివుడు ఈ చర్చను ఎలా మలుపు తిప్పుతాడో ఇక చూద్దాం.

ఈ సమాధానం దగ్గర కూడా వ్యాఖ్యాత మూలంలో వున్న సూక్ష్మభావాలను బాగా పెంచి, విస్పష్టం చేసి, చూపించాడు. ఆ విషయం గూడా కలిపి సంగ్రహంగా ఇక్కడ చెప్పుకుందాం.

***శివుడు***: వశిష్ఠా! ఒకటి రెండుగా ఎలా మారిందని అడుగుతున్నావు. ఒకటి అంటే ఏమిటి? రెండు అంటే ఏమిటి?

**సతి ద్విత్వే కిలైకం స్యాత్**

**సత్యేకత్వే ద్విరూపతా ॥** (పూర్వ. సర్గ. 33, శ్లో.4)

చిత్రం చూడు. రెండుంటేనే ఒకటి అనే మాట వస్తుంది. ఒకటి ఉంటే, రెండోది వచ్చి తీరుతుంది. ఈ మాట చిత్రంగా వుంది గదూ!

"ఆకాశం మొత్తంమీద ఈ నక్షత్రం ఒకటే వుంది, రెండవ వస్తువు లేనే లేదు" అని ఒకడు చెప్పాడనుకో. ఇప్పుడు ఈ ఆకాశంలో మొత్తం ఎన్ని వస్తువులున్నట్లు? నక్షత్రం ఒకటి, చెప్పేవాడు ఒకటి. మొత్తం కలిపితే రెండు. నిజానికి ఇద్దరుండబట్టి, చెప్పేవాడు తన మాట మర్చిపోయి, ఒకటే వుందంటున్నాడు. కనుకనే "రెండు వుంటేనే ఒకటి వస్తుంది" అని నేనన్నాను.

ఒకడు, "నేనొక్కడినే ఉన్నాను" అన్నాడు అనుకో. ఆ వాక్యానికి పరిసమాప్తి లేదు. "మా ఇంట్లో నేను ఒక్కడినే వున్నాను". అంటే, ఆ వాక్యానికి పరిసమాప్తి వుంది. ఈ వాక్యంలో ఇల్లు, నేను అనే రెండు పదార్థాలు స్పష్టంగానే కనిపిస్తున్నాయి కదా! అలా కాక వాక్య సమాప్తి లేకపోయినా సరే "నేను ఒక్కడినే ఉన్నాను" అని ఒకడన్నాడనుకో. ఎవరో ఒకరు వినేవారు ఉండబట్టే కదా ఈ వాక్యం బయటికి వచ్చేది. కనుక రెండోవాడు ఉన్నట్టే లెక్క. అందుకే, "ఒకటుంటే రెండోది వచ్చి తీరుతుంది' అని నేనన్నాను.

అందుకే పరబ్రహ్మను 'ఒంటిది' అని చెప్పి ఊరుకో లేదు శ్రుతి. "ఏకమేవాద్వితీయం" అంది. కనుక పరబ్రహ్మస్థితి ఏకత్వం కాదు. అద్వితీయత్వం మాత్రమే. అంటే బ్రహ్మ "రెండు లేని ఒకటి" అని అర్థం.

లోకంలో ఉండే "ఒకటి", "రెండు"తో సంబంధం లేనిది కాదు. దానిని తెచ్చి బ్రహ్మతో ముడి పెట్టరాదు. నువ్వు అలా ముడిపెట్టి "ఒకటి రెండు ఎలా అయింది?" అని ప్రశ్నిస్తున్నావు. కనుక నీ ప్రశ్నలోనే దోషం వుంది.

మళ్ళీ చెబుతున్నాను. నీ ప్రశ్నలో వున్న "ఒకటి" లోక సంబంధమైనది. దానికి రెండుతో సంబంధం తప్పని సరి. "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" అన్న చోట వుండే "ఒకటి", "రెండు"తో సంబంధం లేనిది. కనుక, ఈ రెంటినీ, అంటే లౌకికమైన "ఒకటి"ని, బ్రహ్మకు సంబంధించిన "ఒకటి"ని, కలిపేసి నువ్వు గందరగోళంలో పడుతున్నావు. అందుకే ఆ ప్రశ్న వేస్తున్నావు.

ఈ సమాధానం బాగా అర్థమయ్యేందుకోసం మరి కొంత వివరణ ఇస్తాను, విను.

సత్యమంటే ఏమిటో విస్పష్టం కావడంకోసం, సత్యాన్ని మూడు భాగాలు చేసుకో.

1. పారమార్థిక సత్యము 2. వ్యావహారిక సత్యము
3. ప్రాతిభాసిక సత్యము – అని.

వీటిలో పారమార్థిక సత్యం అంటే పరబ్రహ్మ. వ్యావహారిక సత్యమంటే ఈ కనిపించే దృశ్య ప్రపంచం. దీనికే మరో పేరు ద్వైత ప్రపంచం. ఇంకొక పేరు ద్విత్వం. ప్రాతిభాసిక సత్యమంటే, శుక్తిరజతం మొదలైనవి.

(శుక్తిరజతం అంటే ముత్యపు చిప్ప వున్న చోట కనిపించే వెండి.)

సత్యం ఇన్ని రకాలుగా వుండే వీలు లేదు. కనుక వీటిల్లో నిజమైన సత్యమేది? – అని విచారించ దలచుకున్నాం.

ప్రాతిభాసిక సత్యం నిజమైన సత్యం కాదని తేలికగానే అర్థమౌతుంది. ఇక ద్విత్వరూపమైన వ్యావహారిక సత్యం నిజమైన సత్యమే అని సాధారణంగా లోకం నమ్మేస్తోంది. కాని బాగా విచారించి చూడగా, ప్రాతిభాసిక సత్యాలైన శుక్తి రజతాదులకూ, వ్యావహారిక సత్యాలైన పంచభూతాది పదార్థాలకూ, భేదమేమీ కనిపించటం లేదు. అందువల్ల ద్విత్వ రూపమైన వ్యావహారిక సత్యం కూడా అసత్యమే – అని తేలింది.

కాగా, ఇతర ప్రమాణాల సహాయం కూడా కలుపుకొని, పారమార్థిక సత్యమైన పరబ్రహ్మ ఒక్కటే నిజమైన సత్యమని తేలింది.

అదొక్కటే సత్యమైతే, మరి ఈ ద్విత్వం ఎక్కడినుంచి వచ్చింది?– అనే ప్రశ్న బయలుదేరింది. ఈ ప్రశ్నకు అర్థమేమిటంటే, ద్విత్వ ప్రపంచము, ప్రాతిభాసిక ప్రపంచము, సత్యాలు లాగా ఎందుకు కనిపిస్తున్నాయి? – అని.

ఈ విషయాన్ని మనస్సులో పెట్టుకొనే, వేదమాత పరబ్రహ్మలోంచే మిగిలిన రెండు ప్రపంచాలూ వచ్చాయి– అని చెప్పింది. ఈ మాటకు అర్థమేమిటంటే, పరబ్రహ్మలో వున్న సత్యత్వాన్ని, సత్తను, ఉనికిని, తెచ్చి ద్విత్వంలో మనమే ఆరోపించుకున్నందువల్ల,ఆ ద్విత్వం సత్యంలాగా కనిపిస్తోంది– అని.

నువ్వు కూడా "ఒక్కటే సత్యమైతే, ద్విత్వమెలా వచ్చింది?" అనే ప్రశ్నే వేశావు. కానీ ఆ ప్రశ్నకు గల అసలైన అర్థాన్ని మర్చిపోయావు. 1,2 అనే అంకెలను మాత్రమే పట్టుకున్నావు. అందుకే నీకు శ్రుతి వాక్యాలన్నీ అతకని బొంతల్లాగా కనిపిస్తున్నాయి.

ఇప్పుడు మళ్ళీ ఆలోచించు. "ఒకటి లోంచి రెండు ఎలా వచ్చింది?"– అని నీ ప్రశ్న. ఈ ప్రశ్నలోని ఒకటి, పరబ్రహ్మకు సంబంధించినది. నీ మనస్సులో వున్న ఒకటి ద్విత్వ ప్రపంచానికి సంబంధించినది. రెండు అనేది లేకపోతే ఈ ఒకటికి అస్తిత్వం లేదు. పరబ్రహ్మలో వున్న ఒకటి ఇది కాదు. దానికీ, దీనికీ ఒకే పేరు పెట్టుకుంటే గందరగోళం వస్తుందనే దృష్టితోనే వేదమాత పరబ్రహ్మలో వున్న ఒకటికి పేరు మార్చి "అద్వితీయమ్" అంది. ఈ విషయం బాగా అర్థమైతే, నువ్వు చేసిన చర్చ మొత్తం నిరర్థకమే.

## 23. అధ్యారోప-అపవాద ప్రక్రియ

దీనిని బాగా అర్థం చేయించేందుకోసం మేము అధ్యారోప– అపవాద ప్రక్రియను ప్రవేశపెట్టాం.

'అధ్యారోపం' అంటే– 'అవిద్య' అనే ఉపాదాన కారణానికి కామకర్మ వాసనాది నిమిత్త కారణాలు జతకావడంతో, ఆకాశ, వాయు, అగ్ని, జ్వల, భూములు అనే క్రమంలో సూక్ష్మ సృష్టి జరిగిందని చెప్పాం. ఆ తరువాత పంచీకరణం జరిగి స్థూల సృష్టి ఏర్పడిందని చెప్పాం.

ఇక్కడితో ఆగలేదు. మళ్లీ అపవాద ప్రక్రియ చెప్పాం. ఈ ప్రక్రియలో, నీ ఇంద్రియాలకు ఏ స్థూల పదార్థం అనుభవానికి వచ్చినా, దాని మూల రూపమేమిటో విచారించమన్నాం. స్థూల పదార్థాలన్నీ స్థూల పంచభూతాల్లోంచి వచ్చాయి. అవి సూక్ష్మ భూతాల్లోంచి వచ్చాయి. అవి అవిద్యలోంచి వచ్చాయి. అవిద్యకు ఆధారమే లేదు. అవిద్య అసలే లేదు. కనుక నిజంగా వున్నది పరబ్రహ్మ ఒక్కటే – అన్నాం. అధ్యారోపంయొక్క మొదట్లో పరబ్రహ్మతో బయలుదేరాం. అపవాదం చివర్లో మళ్ళీ పరబ్రహ్మ దగ్గరికే వచ్చాం. అదొక్కటే సత్యమన్నాం. అంటే, ఈ మధ్యలో ఉన్నమెట్లన్నీ కల్పితమైనవి అనే గదా అర్థం!

అధ్యారోపంలో కొన్ని మెట్లను కట్టి, అపవాదంలో వాటిని కూలగొట్టుకుంటూ వచ్చాం. నిజానికి ఈ కట్టడం, కూల్చడం, కూడా కల్పనే. ఇది సాధకుడియొక్క భావనాదార్ఢ్యం కోసం ఏర్పాటు చేసిన కల్పన. వివరణ కోసమూ, సాధన కోసమూ, ఏర్పాటు చేసిన కల్పనను పట్టుకొని, అంత చర్చ చేశావే! అదేం తెలివి?

కనుక వశిష్ఠా! పారమార్థిక, వ్యావహారిక, ప్రాతిభాసిక, సత్యవ్యవస్థను అంగీకరించిన తరువాత, అలాగే అధ్యారోప అపవాద ప్రక్రియను భావనా సౌకర్యంకోసం అంగీకరించిన తరువాత, "బ్రహ్మలోంచి జగత్తు వచ్చింది" అనే మాటకు అపార్థ కల్పనం చేసే సావకాశం లేదు. పరబ్రహ్మ (శుద్ధ చిత్తు) ఒక చక్కటి తీగ అనుకుంటే, ఈ ప్రపంచమంతా దానిలోని రెమ్మలు, కొమ్మలు, చిగుళ్ళు, పూలు, మాత్రమే.

ఇక పోతే, అధ్యారోప ప్రక్రియలో కల్పన చేసి చెప్పిన జగజ్జీవేశ్వర భేదం నీ మనస్సులో ప్రబలంగా నాటుకొని వుంది గనుక, ఆ మొత్తమంతా కల్పనే అనే వివేకం కలిగించడం కోసం, ఆ ప్రక్రియను మరికొంత వినిపిస్తాను, విను.

**మహావిద్యోపనయనా**
**చిద్భవత్యభిధా సతీ।**
**సా జీవత్వేన బాహ్యత్వం**
**తదా ద్వీంద్వివ పశ్యతి ॥** (పూర్వ. సర్గ. 33, శ్లో.20)

ఏ భేదాలూ లేకుండా అద్వితీయంగా వున్న పరబ్రహ్మ, అవిద్య అనే కళ్ళజోడును పెట్టుకొనేసరికి, ఆకాశంలో వున్న చంద్రుడ్ని ఇద్దరు చంద్రులుగా చూసినట్లుగా, తనను తనే రెండుగా చూసుకుని, అందులో ఒక రూపానికి జీవుడు అనే పేరు తనే పెట్టుకుంటుంది. అక్కడితో ఆగదు. తన అసలు పరబ్రహ్మ రూపాన్ని తనే మర్చిపోయింది. అలా జీవుడనే బాహ్యరూపంలోకి వచ్చేసరికి దానికి ప్రపంచమంతా తన కంటే భిన్నంగా కనిపిస్తోంది.

(**గమనిక:** ఇక్కడ వాల్మీకి 'ఉపనయనమ్' అనే పదాన్ని ఉపయోగించాడు. దానికి వ్యాఖ్యాత విచిత్ర వర్ణరంజితోపనేత్రం, రంగురంగుల కళ్ళజోడు, అని అర్థం చెప్పాడు. ఈ రోజులలో కొందరు ఆ పాతకాలంలో కళ్ళజోళ్ళు ఎక్కడ వున్నాయి? కనుక ఉపనయనమనే పదానికి కళ్ళ జోడు అనే అర్థం చెప్పరాదు అని వాదిస్తున్నారు. అది పొరపాటు. చరక సుశ్రుతాది పురాతన ఆయుర్వేద గ్రంథాలలో స్ఫటికాభ్రాదులతో చేసిన ఉపనేత్రాలను (కళ్ళ జోళ్ళను) వివరంగా చెప్పి ఉన్నారు. మధ్యకాలంలో మన విద్యలు నశించిపోవడంవల్ల మనకు అవి తెలియకుండా పోయాయి. కనుక 'వాల్మీకి కాలం నాటికి కళ్ళ జోళ్ళు తెలియవు' అని చెప్పే వీలు లేదు.)

అంతే గాదు, తను పరబ్రహ్మకంటే వేరనుకుంటోంది. అక్కడితో ఆగక, తన చుట్టూ పుర్యష్టకాన్ని కల్పించుకొని, సంసార సాగరంలోకి ప్రవేశిస్తోంది.

ఆ పుర్యపుష్టంతో (సూక్ష్మ శరీరంతో) తాదాత్మ్య భ్రాంతిని పొంది, జీవుడై, ప్రాణనాది క్రియలను ప్రారంభిస్తుంది. (ప్రాణనాది క్రియలు –అంటే జీవించుట, బ్రతికుండుట, ఉచ్ఛ్వాస నిశ్వాసాది క్రియలు చేయుట మొదలైనవి)

తరువాత అది సూక్ష్మ శరీరం మీది ధృఢభావనతో స్థూల శరీరాన్ని పొందాలనే కోరికను పెంచుకుంటుంది. దానివల్ల తనే స్వయంగా రకరకాల ధాన్యాల రూపాన్ని పొందుతుంది.

ఈ విషయాన్ని –

**"త ఇహ వ్రీహి యవాస్తిలా మాషా ఇతి జాయన్తే"**

(జీవరూపాన్ని పొందిన ఆ పరబ్రహ్మమే తను పొందబోయే దేహానికి అనుకూలంగా ఉండే వరి,

యవలు, నువ్వులు, మినుములు, మొదలైన ధాన్యాల రూపాన్ని పొందుతుంది)– అనే వేద వాక్యం గూడా బలపరుస్తోంది.

అలా ధాన్యరూపాన్ని పొందిన ఆ జీవి, అంతకు ముందే స్థూల శరీరాన్ని పొంది వున్న మరొక పురుష జీవియొక్క స్థూల శరీరంలోకి ఆహారం ద్వారా ప్రవేశించి, అక్కడ రేతోరూపమై, సమయం కలిసి వచ్చినప్పుడు తల్లిగర్భంలోకి ప్రవేశించి, అక్కడ స్థూల దేహంగా మారుతుంది. అప్పటినుంచీ ఆ జీవుడు, ఆ స్థూలదేహమే నేననుకొంటాడు. అలా అనుకొని, తన ఇంద్రియాల ద్వారా ప్రపంచాన్ని తనకంటే బాహ్యంగా చూడడం ప్రారంభిస్తాడు. అక్కడినుంచీ జన్మ పరంపరకు పాలౌతాడు. (ఈ జన్మ పరంపర అనాది గనుక దీనికి ఎప్పటికప్పుడు పూర్వ పురుషుడు వుంటూనే వుంటాడు.)

***వశిష్ఠుడు***: దేవా! ఒక జీవి దోమగా పుట్టాడని అనుకొందాం. వాడియొక్క భావన దోమ అనే శరీరానికి, దానికి అనుకూలమైన ఆహారానికి, అలవాటుపడి వుంటుంది కదా. అలాంటప్పుడు, అలవాటు పడ్డ శరీరం పోయి, అలవాటులో లేని ఏ గజశరీరమో రావడం ఎలా సాధ్యమౌతుంది?

***శివుడు***: అలవాటు అనేది జీవుడి ప్రారబ్ధ కర్మలో భాగం. దాని వెనకాల సంచిత కర్మ వుంది. ప్రారబ్ధంలో భాగంగా మరణాన్ని కలిగించే ఒకానొక కర్మయొక్క ఫలం అనుభవంలోకి వచ్చేసరికి, మరణం అనే అనుభవం పిడుగు లాగా జీవి నెత్తిన పడుతుంది. దాంతో ఉన్నట్టుండి పాత అనుభవం అంతా మరుపున పడిపోయి, సంచిత కర్మ భాగంలో ఎప్పటినుంచో దాగివున్న ఏనుగు శరీర సంస్కారం మొలకెత్తుతుంది. ఇది కర్మజీవియొక్క లక్షణం.

***వశిష్ఠుడు***: ఎన్నో సంవత్సరాలుగా వున్న సంస్కారం ఒకే ఒక్క క్షణంలో ఎగిరిపోవడం సాధ్యమా?

***శివుడు***: కాకేమి? ఎన్నో సంవత్సరాలుగా "ఆకాశంలో చంద్రుడు ఒక్కడే" అనే సంస్కారం, కంటికి జబ్బు వచ్చేసరికి ఒక్క సారిగా పోయి "ఇప్పుడు ఇద్దరు చంద్రులు ఉన్నారు", అనే అనుభవం కలగడం లేదా? కనుక విరోధి సంస్కారంవల్ల ప్రబలమైన పూర్వ సంస్కారం క్షణాల్లో తొలగిపోవడం కొత్త విషయమేమీ కాదు. అలాగే, అద్వైత భావనను దృఢంగా చేసినట్లైతే, ప్రపంచంమీద ఎంతో కాలంగా తను ఆరోపించుకుంటూ వస్తున్న ద్విత్వం తొలగి పోతుంది. అలాగే అకర్తృత్వ భావన చేత చాలా కాలంగా తన మీద తనే ఆరోపణ చేసుకుంటున్న కర్తృత్వ బుద్ధి పోతుంది.

అదీ గాక, ఎవడికైనా సరే, తన సంకల్పబలంచేత తను తయారు చేసుకున్న ప్రపంచం ఎంత పెద్దదైనా సరే, ఆ సంకల్పం నశించిన క్షణంలోనే నశించి తీరుతుంది. సంకల్పించడం అనేది ఒక మానస ప్రయత్నం. దానికి కొంత్ర శ్రమ, సమయం కావాలి. సంకల్ప నాశానికి అంత శ్రమ అక్కర లేదు. సమయమూ అక్కర లేదు. సుదీర్ఘమైన స్వప్న ప్రపంచం ఒక్క క్షణంలో ఎగిరిపోవడం మనం చూస్తూనే వున్నాం కదా. అలాగే ఈ సుదీర్ఘమైన సంసార ప్రపంచం ప్రబలమైన, ప్రయత్న పూర్వకమైన, సంకల్పం చేత ఏర్పడుతోంది. ఆ సంకల్పాన్ని మార్చి అసంకల్పం చేస్తే చాలు, ఇంత లావు ప్రపంచమూ ఒక్క క్షణంలో ఎగిరి పోతుంది.

***వశిష్ఠుడు***: మీరు చెప్పేదాని సారాశం ఎలా వుందంటే, తాను బ్రహ్మ అనే విషయాన్ని మర్చిపోవడంవల్ల జీవుడికి సుదీర్ఘమైన సంసార దుఃఖం కలుగుతోంది. శ్రవణ మనన నిదిధ్యాసనాది రూపమైన మానసిక ప్రయత్నంవల్ల బ్రహ్మ స్మృతిని తెచ్చుకుంటే (నేనే పరబ్రహ్మను అనే గుర్తింపును తెచ్చుకుంటే), తక్షణమే సంసార దుఃఖం పోతుంది – అని చెప్పినట్లుగా వుంది. మరపు ఒక మానసిక వ్యాపారం. గుర్తింపు మరో మానసిక వ్యాపారం. ఈ రెండింటిలోనూ గుర్తింపుకే బలం ఎక్కువ అని మీరు ఎలా చెప్పగలరు?

***శివుడు***: బ్రహ్మస్థితి ప్రబలమైన శ్రవణాది మానసిక వ్యాపారాలచేత మహా ప్రవాహం లాగ ఏర్పడుతోంది

గనుక, ఇదే ప్రబలం. అందువల్ల ఇదే విస్మృతిని మింగి వేయగలదు. వీణా తంత్రులలో తారస్థాయిలో పుట్టే నాదం మంద్రస్థాయి నాదాన్ని మింగివేయడం మనం చూస్తూనే వున్నాం గదా. కనుక మహర్షీ!

**అహమేకోஉహమాత్మాస్మీ**
**త్యేకాం భావయ భావనామ్ ।**
**తయా భావనయా యుక్తః**
**స ఏవ త్వం భవస్యలమ్ ॥** (పూర్వ సర్గ. 33, శ్లో. 49)

"నేను ఒక్కడినే, అద్వితీయుణ్ణి. నేనే పరమాత్మను" అనే భావన ఒక్కటే పెట్టుకో. అది ఒక్కటీ బలంగా వుంటే, నువ్వు ఆ పరమాత్మవే ఐపోతావు. ఇదే ఆంతర పూజ. పూజ్య పూజక పూజన రూపమైన త్రిపుటి గల బాహ్య పూజ నీలాంటివారికి తగదు.

ఇలాంటి దేవపూజ చేస్తున్నప్పుడు ఈ ప్రపంచాన్ని చూసేందుకు రెండు రకాల దృష్టులున్నాయి. ఒకటి అధిష్ఠానదృష్టి. ఆ దృష్టితో చూస్తే ఈ ప్రపంచమంతా సద్రూపమే. మరొకటి బాధ దృష్టి. ఈ దృష్టిలో ఈ ప్రపంచమంతా అసద్రూపమే.

ఇలాంటి దృష్టులతో సంపర్కం లేకుండా, నిష్కలంకంగా వున్న శుద్ధ చిదాత్మ సత్యాసత్యాది శబ్దార్థాలతో సంబంధం పెట్టుకోదు. అది సృష్టి దశలో కూడా, కేవలం ఆకాశం లాగా, దేనితోనూ సంపర్కం లేకుండా వుంటుంది.

**24. మూడు భూమికలు**

మహర్షీ! ఈ నిష్కలంక చిదాత్మ స్థితిని దృఢ పరిచేందుకోసం నీకు కొన్ని రకాల భూమికలను (జీవ దశలను) చూపిస్తాను, చూడు.

తత్వసాక్షాత్కారంచేత మనస్సు నశిస్తే, ఈ ప్రపంచమంతా నశిస్తుంది. ఇలా కాలిన విత్తులా వుండే జీవుడి స్థితికి (భూమికకు) "ఇతి" అని పేరు. ఇది మొదటి భూమిక.

**భృష్టబీజోపమా సత్తా జీవస్య ఇతి నామికా** (పూర్వ.సర్గ. 34, శ్లో 8)

(**గమనిక:** ఇక్కడ వ్యాఖ్యాతగారు (ఆనందభోదేంద్ర సరస్వతి) "ఇతి" అనే శబ్దానికి "స్వపితి" అని అర్థం చెప్పాడు. ఛాందోగ్యోపనిషత్తులో స్వం+అపి+ఇతి కలిపితే "స్వపితి" అనే వ్యుత్పత్తి కనిపిస్తోంది గనుక, ఈ వ్యుత్పత్తిలో "ఇతి" అనే పదమే ముఖ్యం గనుక, 'ఇతి' అంటే 'స్వపితి' అనే అర్థం చెప్పాలనే యుక్తిని ఆయన చూపించారు. దీనికి శ్వేతాశ్వతరోపనిషత్తు, కఠోపనిషత్తులనుంచి గూడా ఆయన ప్రమాణాలను అన్వయించి చూపించారు. "ఇతి భూమిక" అనే చోట 'ఇతి' శబ్దానికి వేరే అర్థం కుదరడం లేదు గనుక వ్యాఖ్యాత చెప్పినది సముచితంగానే కనిపిస్తోంది.

స్వం+అపి+ఇతి అనే చోట 'తనను అధికంగా పొందుట', 'అదే గాఢ నిద్రావస్థ' అని ఛాందోగ్య భాష్యంలో వివరణ వుంది. ఇక్కడ పరమేశ్వరుడు మాత్రం ఈ పదం ద్వారా తత్వజ్ఞానంచేత పరిశుద్ధమైన స్వస్వరూపాన్ని అధికంగా పొందడాన్నే సూచిస్తున్నాడని మనం గమనించాలి.)

***శివుడు***: వశిష్ఠా! ఈ దశకే "పశ్యంతీ భూమిక" అని మరో పేరు.

**పశ్యన్తీ నామకలితో – త్స్రుజన్తీ చేత్య చర్వణామ్ ॥** (పూర్వసర్గ. 34 శ్లో. 9)

దృశ్య పదార్థాల పునఃపునః స్మరణను పూర్తిగా పరిత్యజించి, కేవలం ద్రుజ్మాత్రస్థితిలో జీవుడు వుంటాడు గనుక, ఈ భూమికకు "పశ్యన్తి" అని పేరు.

ఈ భూమికకే "సౌషుప్త భూమిక" అని మరో పేరు.

**అపునర్భవ సౌషుప్త - పదపాండిత్యపీవరీ॥** (పూర్వ. సర్గ. 34, శ్లో 11)

మళ్ళీ మెలకువ లేని సర్వోత్తమానంద రూపమైన సుప్తి (నిద్ర) గనుక, ఈ దశపేరు "సౌషుప్త" పదవి లేక మహాసుప్త పదవి. దీనికి కావలసిన స్వప్రకాశ రూపమైన పాండిత్యం ఈ దశలో బలిష్ఠంగా వుంటుంది. అందుచేత ఈ దశను అందుకున్న జీవుడు పరమానందంలో విశ్రాంతుడై వుంటాడు.

ఇక రెండవ భూమికను చెబుతాను, విను.

ఇదే చిచ్ఛక్తి(జీవుడు ) ఆభ్యాసబలంచేత సంకల్ప వికల్పాలను పూర్తిగా పరిత్యజించి జడము, చేతనము, రెండూ కాకుండా, మాటలకందని స్వప్రకాశ స్వరూపంలో వుంటే, ఆ స్థితిని తురీయ భూమిక అంటారు.

**తుర్య తుర్యాంశ కలితా**

**మకలంకా మనామయామ్ ॥** (పూర్వ. సర్గ. 34, శ్లో 17)

జాగ్రత్ స్వప్న సుషుప్తులకు వెలుపల నాలుగవదిగాను, అలాగే విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృతులకు పైన నాలుగవదిగాను, వుంటుంది గనుక దీనికి తురీయ భూమిక అని పేరు. ఇది సంప్రజ్ఞాత సమాధివల్ల లభించే దశ.

ఇక మూడవ భూమికను చెబుతాను, విను.

నీళ్లు పాలలో కలసినట్లుగా అఖండ బ్రహ్మాకార చిత్త వృత్తి రూపమైన చరమవృత్తి పరబ్రహ్మాలో పూర్తిగా కలిసిపోతే, ఇక జీవాత్మ, పరమాత్మ, అనే పదాలకు అర్థమే వుండదు. అట్టి ఆ దశ, షడ్భావ వికారాలకు అతీతమై, సుస్థిరమై, అవిద్యా కళంకం లేనిదై, పరమ మోక్ష స్వరూపమై, వుంటుంది. ఆ దశ పేరే తురీయాతీత భూమిక. అది అసంప్రజ్ఞాత సమాధిచేత లభించే దశ. (ఇది వ్యాఖ్యాత వాక్యము) కనుక మహర్షీ! ఇది నాకు కూడా మాటలకందటం లేదు. ఇదే ఓంకారంలోని తుర్యతుర్య భాగానికి పరమగతి.

ఓంకారంలో 'అకార, ఉకార, మకార, అర్ధమాత్రలు' అనే నాలుగు భాగాలున్నాయి. వీటినే విరాట్, హిరణ్యగర్భ, అవ్యక్త, శుద్ధ చిద్భాగాలు అంటారు. వీటిలో నాల్గవదైన అర్ధమాత్ర అంటే, 'అకార ఉకార మకారాలు అనే అక్షరాలు స్పష్టంగా వినిపించడం ఆగిపోయి, ఒక అస్ఫుట ధ్వనిగా వినిపించే దశ' అని అర్థం. ("వర్ణానామస్ఫుటావస్థా")

దీనికే తన్మాత్ర అని మరొక పేరు.

ఓంకారంలో నాల్గవ భాగమైన ఈ తన్మాత్రలో మళ్ళీ నాలుగు భాగాలున్నాయి - నాదము, బిందువు, శక్తి, శాంతము - అని. వీటిలో నాల్గవదైన శాంత స్థితే, తురీయ తురీయ స్థితి. ( నాలుగులో నాల్గవ స్థితి.) నృసింహ ఉత్తర తాపినీ ఉపనిషత్తులో చెప్పిన ఓత, అనుజ్ఞాతృ, అనుజ్ఞా, అవికల్పములనే నాలుగు స్థితులలో చిట్టచివరి స్థితి ఇదే.

**ఓమిత్యస్య చ తన్మాత్రా**

**తుర్యా సా పరమా గతిః ॥** (పూర్వ. సర్గ. 34, శ్లో. 30)

మహర్షీ! నువ్వు దాంట్లోనే వుండిపో!

***వశిష్ఠుడు***: రామా! ఇక్కడికి వచ్చేసరికి శివుడు నిజంగానే ఆ తుర్యతుర్యంలో లీనమై పోయాడు. ఆయన సన్నిధి బలంచేత నేను, ఆయన చుట్టూతా ఉన్న పరివారమూ కూడా, ఆ స్థితిలోనే లీనమై పోయి, దేహాలు మర్చిపోయి, శిలాప్రతిమల లాగ కొంతసేపు వుండి పోయాము. కాని, శివుడు నా మీది అనుగ్రహంతో త్వరలో తేరుకొని, కళ్ళు తెరిచి కరుణతో నావంక చూస్తూ, ఇలా అన్నాడు.

**శివుడు**:

**మునే మనన మాహూయ**

**స్వసత్తైవాశు మీయతామ్ ।**

**త్వమర్థం మాహరానర్థం**

**పవనః స్పన్దతా మివ ॥** (పూర్వ.సర్గ, 35 శ్లో. 3)

మునీ! మననాన్ని పిలుచుకో. నిన్ను నువ్వే కొల్చుకో. నువ్వు అనే అర్థాన్ని దగ్గరకు రానీయకు. అదే అనర్థం. దానిని తెచ్చుకున్నావో చలనాన్ని తెచ్చుకున్న వాయువుకి పట్టిన గతే నీకూ పడుతుంది.

చలనం ఉంటేనే అది వాయువు, చలనం లేకపోతే అది పరబ్రహ్మా! అలాగే నువ్వు అనేది ఉంటేనే, నేను అనేది జీవుడు అవుతుంది. నువ్వు అనేదే లేకపోతే, నేను అనేది పూర్తిగా పరబ్రహ్మే. ఆ స్థితిలోనే వుండిపోవాలి.

ఒకవేళ బాహ్యస్మృతి వస్తే, ఆ దశలో మళ్ళీ శ్రవణ మననాదులు చేస్తూ ఆత్మస్థితినే అందుకోవాలి.

ఏముంది, మహర్షీ! ఈ శరీరం ఒక యంత్రం లాంటిది. దీనిలోకి ప్రాణం ప్రవేశిస్తే, ఇది కదులుతుంది. ప్రాణం పోతే, ఇది మొద్దు లాగా పడివుంటుంది. కనుక ఈ చలన శక్తి ఎవరిది? అది ప్రాణవాయువుది. కాని, ఈ ప్రాణశక్తి ఇప్పుడు ప్రవేశించిందనీ, ఇప్పుడు పోయిందనీ, తెలుసుకొనే సంవేదన శక్తి ఎవరిది? అది వాయువుది కావడానికి వీలు లేదు. అది పరి శుద్ధ చిత్తుదే.

క్రియాశక్తికి మూలమైన ప్రాణవాయువూ నశిస్తుంది, క్రియాశక్తికి ఆశ్రయమిచ్చిన దేహమూ నశిస్తుంది, కాని, సంవేదనాన్ని ('ప్రాణం వచ్చింది, పోయింది' అనే తెలివిని) కలిగించే చిచ్ఛక్తి మాత్రం ఎప్పటికీ పోదు. అది లింగ దేహాన్ని అంటిపెట్టుకొనే వుంటుంది.

చిచ్ఛక్తిలోని చైతన్యం సర్వవ్యాపకమే ఐనా, అది అన్ని చోట్లా వ్యక్తం కాదు. అద్దం ఉన్న చోట ఎండ ప్రతిఫలించినట్లుగా లింగదేహం ఉన్న చోటే అది ప్రతిఫలించి, తన అస్తిత్వాన్ని ప్రకాశింప చేసుకొంటుంది.

అదే చైతన్యం బుద్ధి వృత్త్యాదుల ద్వారా బయటికి ప్రసరిస్తే, అప్పుడది చెట్టూ పుట్టా మొదలైన బాహ్య పదార్థాలను కనిపింప జేస్తుంది.

(**గమనిక**: ఈ విషయాలను ముముక్షు వ్యవహార ప్రకరణంలో ప్రత్యక్ష ప్రమాణము అనే శీర్షిక కింద స్పష్టంగా వివరించారు.)

## 25. రుద్రేశ్వరుడు

అదే బుద్ధి వృత్తిలో పరబ్రహ్మను ప్రవేశపెడితే? అప్పుడా బుద్ధి వృత్తి పరబ్రహ్మయొక్క ఆకారం వంటి ఆకారాన్ని పొందుతుంది. అప్పుడు బుద్ధివృత్తిలో వున్న మాయాకళంకం తొలగిపోతుంది.

ఇలా బుద్ధివృత్తి ద్వారా శుద్ధ చైతన్యం వ్యక్తమౌతున్న దశలలోని భేదాలనే, శివుడు , విష్ణువు , బ్రహ్మ, ఇంద్రుడు, హిరణ్యగర్భుడు, అగ్ని, వాయువు, సూర్యుడు, మొదలైన పేర్లతో పెద్దలు వ్యవహరిస్తున్నారు.

**స హరిస్స శివ స్సోజ**

**స్స బ్రహ్మే స సురేశ్వరః ॥** (పూర్వ. సర్గ. 35, శ్లో. 14)

ఈ శివ విష్ణు బ్రహ్మాదులలో అందరూ సర్వ వ్యాపక శుద్ధ చైతన్యాన్ని సాక్షత్కరించుకున్నవారే. వీరిలో ఎవరికీ మిథ్యా మోహాలు లేవు. ఐనా, సృష్టి స్థితి సంహారాది కార్య నిర్వహణకోసం, వీరు త్రిగుణాలలో ఒక్కొక్క గుణం మీద అభిమానాన్ని నిలబెట్టుకొని, ఆయా కార్యాలను నిర్వహిస్తూ వుంటారు. కనుక వీరంతా అలల మీది నీటి బిందువుల వంటివారు.

అభేద స్థితితో ప్రారంభించి మళ్ళీ భేదాన్ని చెబుతున్నా ననుకోకు. ఇదంతా వ్యవహార దృష్టిని అనుసరించి చెప్పిన మాట. పరమార్థ దృష్టితో చూస్తే సృష్టీ లేదు, సృష్టి క్రియలూ లేవు. వాటికోసం బ్రహ్మ రుద్రాది అధికార పురుషులూ లేరు. ఇదంతా అవిద్య విసిరే గొలుసుల వల. ఈ వల మళ్ళీ మళ్ళీ వ్యాపిస్తూనే వుంటుంది.

**తతస్తస్యా అనంతాయాః**
**ప్రసృతాయాః పునః పునః।**
**సంపన్న దేశకాలాయాః**
**క్రమస్స్యాద్వర్ణనాసు కః॥** (పూర్వ. సర్గ. 35, శ్లో 20)

ఇలా ఎప్పటి కప్పుడు విస్తరించి, తనకు తనే దేశకాలాదులు కల్పించుకొని, రకరకాల సృష్టులను చూపించే ఈ మాయయొక్క విలాసాలను వర్ణించడానికి ఒక వరుస అంటూ ఏమి వుంటుంది? ఈ సృష్టింపబడిన జీవులలో ఎవరుముందు, ఎవరు వెనుక, అనడానికి ఏమి ఆధారం వుంటుంది?

అలాంటి సృష్టిక్రమాలు ఎలా వున్నా, అన్ని రకాల బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులందరికీ తండ్రి శుద్ధ చిదాత్మ ఒక్కడే. ఆ చిదాత్మకే మరో పేరు మహాదేవుడు. ధ్యానిస్తే, ఆయననే ధ్యానించాలి. సృష్టిలోని సమస్త పదార్థాలకూ సత్తాను (ఉనికిని) ఇచ్చేవాడు ఆయనే. కనుక ఈయన సర్వగతుడు. నిత్య స్ఫూర్తి స్వరూపుడు. అందువల్లే, ఈయనను పూజించడానికి ఆవాహనలు, ఉపచారాలు, మంత్రాలు, పూజా ద్రవ్యాలు, ఉద్వాసనలు, ఇలాంటి వేవీ అక్క ర్లేదు. ఆయనను గురించి ఆలోచిస్తే చాలు, అదే పూజ. ఆయనలో మునిగి పోవడమే పూజ. నువ్వు ఏ పదార్థాన్ని చూసినా, ఆయన దానిలోంచి తన స్వస్వరూపాన్నే చూపిస్తాడు. కనుక, ఓమునీ!

**ఆద్యం పూజ్యం నమస్కార్యం**
**స్తుత్యమర్ఘ్యం సురేశ్వరమ్ ।**
**ఏనం తం విద్ధి వేద్యానాం**
**సీమాన్తం మహతామపి ॥** (పూర్వ.సర్గ 35, శ్లో. 26)

సమస్త పూజ్య పదార్థాలకూ మొదటి హద్దు , మధ్యహద్దు, చివరి హద్దు గూడా ఆయనే. (సీమాంతము.) నువ్వు ఆయననే పూజించు!

ఇట్టి ఈ శుద్ధ చిద్రూప, సత్తారూప, అనుభూతిరూప, తత్త్వాన్నే 'రుద్రేశ్వరుడు' అంటారు. ఈ సమస్త విశ్వానికి జన్మకారణం ఆయనే! ఈ దృశ్య పదార్థాలన్నిటి రూపాలలోనూ ఉన్నది ఆయనే. ఐనా సరే, ఆయన దేనినీ అంటుకోడు, సర్వాతీతుడుగా వుంటాడు.

ఈ ప్రాపంచిక పదార్థాలన్నింటికీ సత్త ఏ మాత్రమూ లేక పోయినప్పటికీ, వాటన్నిటిలోనూ సద్రూపుడైన శివుడే అనుస్యూతుడై వున్నాడు గనుక, వాటన్నిటికీ గూడా సత్త సంక్రమిస్తోంది. ఆ మహేశ్వరుడిలో వికసించని మాయా విలాస శక్తి లేనే లేదు. గింజను మెతుకుగా మార్చేది ఆయన శక్తే! అదే గింజను పూవుగా, సువాసనగా, మార్చి, ముక్కులలోకి చేర్చేదీ ఆయనే! ఈ శక్తులను ఉపసంహరించేది గూడా ఆయనే! ఇలా ప్రవృత్తి నివృత్తి రూపాలైన శక్తులన్నీ ఆ సదాశివుణ్ణి ఆశ్రయించి వున్న నియతియొక్క మహిమలే!

రాత్రిపూట ఇంట్లో దీపం వుంటేనే, పనులన్నీ జరిగిపోతూ వుంటాయి. ఐనా సరే, దీపానికి కర్తృత్వం అంటదు. అది కేవలం సాక్షి గానే వుంటుంది. అలాగే ఈ పరమ శివుడు గూడా, నియతి చేసే కార్యాలకు కేవలం సాక్షి మాత్రమే!

***వశిష్ఠుడు***: దేవా! శివుడికి ఈ శక్తులు ఎన్ని రకాలుగా వున్నాయి? ఎలా పనిచేస్తాయి? ఇన్ని పనులు తనవల్ల

జరుగుతుంటే, ఈ శివుడికి సాక్షిత్వం ఎలా పట్టింది?

**శివుడు**: నాయనా! అప్రమేయుడు, చిన్మాత్ర స్వరూపుడు, ఐన ఆ పరమేశ్వరుడియొక్క శక్తులు అనంతాలు. వాటిని గురించి ఎంతని చెప్పగలం?

**వశిష్ఠుడు**: ఐతే దేవా! ఈ శక్తులన్నీ ఎక్కడి నుంచి వచ్చాయి? వీటికి బహుత్వం ఎలా వచ్చింది? ఈ శక్తులన్నీ వేరు వేరుగా ఉన్నట్లైతే, అవన్నీ ఒకే కారణంలోంచి ఎలా వచ్చాయి? ఒకే కారణంలోంచి వచ్చి వుంటే, అవి వేరే వేరే అని ఎలా చెబుతాం?

**శివుడు**: నాయనా!

**యైషాఽ పర పరాభాసా**
**సైషా నియతి రుచ్యతే ।**
**క్రియాథ కృతి రిచ్ఛా వా**
**కాలేత్యాది కృతాభిధా ॥** (పూర్వ. సర్గ 36, శ్లో. 21)

ఈశ్వర మాయకే 'నియతి' అని మరో పేరు. ఇది అపరానియతి, పరానియతి – అని రెండు రకాలు. అందులో హిరణ్యగర్భుడియొక్క జీవిత కాలం అంతా వ్యాపించి ఉండేది పరానియతి. ఈ మధ్యలో, హిరణ్యగర్భుడి దైనందిన కల్పాలలో వ్యాపించి వుండేది అపరానియతి. దానినే, 'ఈశ్వరుడి క్రియ' అని కొందరు, 'ఈశ్వరుడి ప్రయత్నం' అని కొందరు, 'ఈశ్వరుని ఇచ్ఛ' అని కొందరు, 'కాలం' అని కొందరు, రక రకాలుగా పేర్లు పెట్టుకున్నారు. ఇదంతా మాయా స్వరూపం గనుక, ఈ నియతి విలాసానికి పరమేశ్వరుడు అద్వితీయ సాక్షిగా ఉంటున్నాడు. ఆ కారణంవల్లనే ఆయన మాయకంటె భిన్నుడూ కాదు, అభిన్నుడూ కాదు!

## 26. బాహ్యపూజ

కనుక వశిష్ఠా! పూజిస్తే, ఈ పరమ శివుణ్ణే పూజించాలి. బయటా లోపలా గూడా, ఈయననే పూజించాలి. మొదట బాహ్య పూజా క్రమం చెబుతా విను.

ఎప్పుడైనా సరే, పూజాక్రమాన్ని ప్రారంభించేటప్పుడు, మొదట దేహాన్ని పవిత్రం చేసుకోవాలి. అటు తర్వాత గట్టిగా ప్రయత్నం చేసి, మనస్సు నిలిపి, ఈశ్వరధ్యానం చేస్తూ, దాని బలంతో శరీర స్పృహను దాటి పోవాలి.

నిజానికి, ధ్యానమే అసలైన పూజ. అందుచేత, ఎలా ధ్యానం చేయాలో చెబుతాను, విను.

ఈశ్వరుడు అంటే ఏదో చిన్న బొమ్మ అనుకోకూడదు. బాగా పొడుగున్న మనిషి ఆకారం అనుకోకూడదు. ఆయనను కోటి సూర్యుల వంటి తేజః పుంజంగా భావించాలి. ఆకాశం అంతా వ్యాపించి వున్న అనంత మూర్తిగా భావించాలి. బ్రహ్మ, ఇంద్ర, హరి, రుద్ర ఈశ్వరాదులైన దేవతలంతా ఆ శరీరంలో భాగాలుగా భావించాలి. సమస్త జీవులనూ ఆయన ఒంటి మీద వెంట్రుకలుగా భావించాలి. ఇచ్ఛాశక్తి, జ్ఞాన శక్తి, క్రియా శక్తి, మొదలైన శక్తులన్నీ ఆ శరీరంలోనే ఒదిగి వున్నట్లుగా భావించాలి.

ఇలా బ్రహ్మాండ వ్యాప్తంగా వున్న ఆ చిన్మాత్ర మూర్తి సమస్త పదార్థాలలోనూ సమంగా వ్యాపించి వున్నాడని భావించాలి. కొండలోను, కుండలోను, రాతిలోను, నూతిలోను, మానవులలోను, దానవులలోను, అన్నిటా ఆయనే వ్యాపించి వున్నాడని గుర్తించాలి. శివుడు, హరుడు, హరి, బ్రహ్మ, ఇంద్రుడు, కుబేరుడు, యముడు అని ఇలా రకరకాలైన పేర్లకు, రక రకాలైన రూపాలకు, ఆధారమైన సత్తా మాత్ర స్వరూపుడూ

ఆయనే అని గుర్తించాలి. సృష్టి స్థితి  లయలను కల్పించే కాలం, ఆయన ద్వారపాలకుడని అనుకోవాలి.

పురుష సూక్తంలో చెప్పినట్లుగా ఆయనను సహస్ర శీర్షుడుగా , సహస్ర పాదుడుగా, సహస్ర నేత్రుడుగా, భావించాలి. అంటే ఏమిటి? లోకంలో వుండే తలలన్నీ ఆయనవే! చేతులన్నీ ఆయనవే! కాళ్ళన్నీ ఆయనవే! ఇంతెందుకు? సృష్టిలోని చింతన శక్తీ ఆయనదే! సృష్టిలోని గమన శక్తీ ఆయనదే! శ్రవణ శక్తీ ఆయనదే!అన్ని శక్తులూ ఆయనవే! అన్నీ చేసేదీ ఆయనే, ఐనా సంకల్పాలు లేనివాడూ ఆయనే!

అని ఈ విధంగా తెంపు లేకుండా చింతన చేస్తూ వుండాలి. ఇలాంటి చింతన పేరే ధ్యానం. ఇలా కొంత సేపు ధ్యానం చేశాక మిగిలిన అర్చన చేసుకోవాలి.

ఈ దేవుడు జ్ఞాన స్వరూపుడు గనుక, ఈయనకు ధూప దీపాది బహిరంగ సమర్పణలతో పని లేదు. ఆత్మబోధ రూపమైన ఈ విరాట్ రూప ధ్యానంలోనే ఆయన పూజింప బడతాడు. ఆయనకు ఈ ధ్యానమే అర్ఘ్యం, ఈ ధ్యానమే పాద్యం, ఈ ధ్యానమే నైవేద్యం.

తత్త్వసాక్షాత్కారం ఇంకా లభించక పోయినా, కేవలం సామాన్యుడైనా, ఇలాంటి ధ్యానం ఒక్క పదమూడు నిమిషాలు చేస్తే చాలు, వాడికి గోదాన ఫలం లభిస్తుంది.

వంద నిమిషాల సేపు ఈ ధ్యానపూజ చేస్తే, అశ్వమేధఫలం లభిస్తుంది. (ఇక్కడ నిముషం అంటే ఇంగ్లీషువారి  మినిట్ కాదు. నిమిషం అంటే రెప్పపాటు కాలం.) అరఘడియ సేపు ఇలాంటి ధ్యానం చేస్తే వెయ్యి అశ్వమేధాల ఫలం. గడియసేపు ధ్యానిస్తే, రాజసూయ యజ్ఞఫలం. అరపూట ఇలా ధ్యానం చేస్తే, లక్ష రాజసూయాల ఫలం. ఒక పగలల్లా ఈ అఖండ ధ్యానం కుదిరితే, ఆ సాధకుడు పరతత్త్వంలో లీనమైపోతాడు.

మహర్షీ! నా ఉద్దేశ్యంలో బాహ్య పూజ అంటే ఇదే! ఇక అంతః పూజా విధానం చెబుతాను విను.

(**గమనిక**– మనం ప్రస్తుత కాలంలో వాడే గంటలు మొదలైనవి ఇంగ్లీషువారి కొలమానాలు. దీనిలో నిమిషం అంటే, గంటలో అరవైయవ వంతు. దీనికి 'మినిట్' అని పేరు పెట్టుకుంటే, దీనిలో అరవైయవ వంతు సెకండు. దీనిలో సుమారు ఇరువది నాల్గవ వంతు పేరు 'రెప్పపాటు కాలం'.  పై శ్లోకాలలలో చెప్పిన నిమిషం అంటే ఇదే! కాగా, పదమూడు నిమిషాలు అంటే, సుమారు అరసెకండు అని అర్థం. వందనిమిషాలు అంటే, సుమారు నాలుగు సెకండ్లు అని అర్థం. అరగడియ అంటే, సుమారు పన్నెండు ఇంగ్లీషుమినిట్లు. అరపూట అంటే, ఆరు ఇంగ్లీషు గంటలు – అని మనం అర్థం చేసుకోవాలి. దీనిని బట్టి ఈ ధ్యానం ఎంత మహత్తరమైనదో మనం అర్థం చేసుకోవచ్చు.)

### 27. అంతఃపూజ

***శివుడు***: వశిష్ఠా! నడుస్తున్నా, నిలుచున్నా, మెలకువలలో వున్నా, నిద్రపోతున్నా, నిరంతరంగా సాగే శివధ్యానమే అంతః పూజ! దీనికి ఏ రకమైన ఆచార నియమాలూ లేవు. ఇక్కడ శివుడు అంటే ఎవరు? ఈ శరీరంలో వుండి, తన సన్నిధి మాత్రం చేతనే, నిత్యమూ రక రకాల ఇంద్రియాలద్వారా, రక రకాల జ్ఞానాలను కలిగించే శుద్ధ చైతన్యమే శివుడు! ముట్టుకోదగిన వాటినన్నిటినీ ముట్టుకునేదీ ఈయనే! వదలదగినవాటి నన్నిటినీ వదిలేదీ ఈయనే! రక రకాల సుఖదుఃఖభోగాలను పొందేదీ ఈయనే, విడిచేదీ ఈయనే.

**దేహలింగేషు శాన్తస్థం**
**త్యక్త లింగాంతరాదికమ్ ।**

**యథాప్రాప్తార్థ సంవిత్త్యా**
**బోధ లింగం ప్రపూజయేత్ ॥** (పూర్వ. సర్గ. 39. శ్లో. 6)

నీ దేహం పద్మాసనంలో కూర్చొని, రెండు చేతులను నమస్కారముద్రలో ముడిచి పట్టుకొని, నిటారుగా, స్థిరంగా కూర్చొని వుంటే, అప్పుడది శివలింగం లాగా కనిపిస్తుంది. అందుచేతనే శివుణ్ణి లింగ రూపంగా పూజించాలనుకుంటే, నీకు వేరే లింగాలూ, విగ్రహాలూ, అక్కర్లేదు. నీ శరీరమే నీకు శివలింగం. దానిలో నానా రకాల విషయ జ్ఞానాలనూ కలిగించే జ్ఞానమనే లింగం ఒకటి అంతర్గతంగా వుంది. ఈ రక రకాల జ్ఞానాలూ వస్తూ పోతూ వుంటే, లోపల వున్న ఆ మూల జ్ఞానం మాత్రం రాకపోకలు లేకుండా, స్థిరంగా ప్రశాంతంగా వుంది. కనుక, ఆ జ్ఞాన లింగమే అసలైన శివలింగం. దానిని పూజించాలి.

**ప్రవాహ పతితార్థస్థః**
**స్వబోధస్నాన శుద్ధిమాన్ ।**
**నిత్యావబోధార్ఘణయా**
**బోధ లింగం ప్రపూజయేత్ ॥** (పూర్వ. సర్గ. 39. శ్లో. 7)

నీ ఇంద్రియాలన్నింటికీ ఏది జ్ఞానాన్ని అందిస్తోందో, అలాంటి ఆ మూల జ్ఞానాన్ని తెంపు లేకుండా గుర్తిస్తూ వుండటమే, జ్ఞానలింగానికి నువ్వు చేయదగిన పూజ. ఒక వేళ, ఆ గుర్తింపు అనే పూజనుంచి జారిపోయి, ఇంద్రియ జన్య జ్ఞానాల ప్రవాహంలో పడిపోయావనుకో, అప్పుడు దానికి ఒకటే ప్రాయశ్చిత్తం. నిన్ను నీవు గుర్తించడం అనే జ్ఞానంలో నువ్వు స్నానం చెయ్యాలి. ఆ స్నానం చేస్తే, నువ్వు పవిత్రుడివి అవుతావు. తక్షణమే నువ్వు జ్ఞాన లింగ లగ్నుడవు ఔతావు. అంటే, లింగపూజ మళ్ళీ మొదలైపోతుంది.

అలా లింగపూజ జరిగిపోతూ వుంటే, ఒకో సారి మనస్సు తమస్సులో మునిగి పోతూ వుంటుంది. (తమస్సు అంటే నిద్ర, ఏమీ తోచని మూఢ స్థితి.) అలాంటప్పుడు, లోపల హృదయాకాశంలోనూ, బయట భూతాకాశంలోనూ, మధ్యందిన సూర్య మండలం లాగా, తనే వెలిగి పోతున్నట్లుగా భావించాలి.

ఒకొక్కప్పుడు మనస్సు ఏదో తెలియని పరితాపంలో పడిపోతుంది. అప్పుడు, లోపలి వెలుపలి ఆకాశాలలలో, తనే నిండు చందమామ లాగా, వెన్నెలలను పొంగిస్తున్నట్లు భావించాలి.

ఆ విధంగా, అంతరంగాన్ని శుద్ధి చేసుకుంటే –

నీ ఇంద్రియాలకు కనిపించే సమస్త దృశ్య పదార్థాలలోనూ సర్వానుస్యూతంగా వున్న సంవిత్తును గుర్తించ గలుగుతావు. ఆ సర్వానుస్యూత శుద్ధ సంవిత్తే శివలింగం!

నీ ఇంద్రియాలనే ద్వారాల గుండా, విషయ స్థానాలకు ప్రసరించే చైతన్యాన్ని గుర్తించ గలుగుతావు. ప్రాణ రూపమైన ఆ చైతన్యమే శివలింగం!

నువ్వు అనుభవించే ఇంద్రియ జ్ఞాన రసాలన్నిటినీ ఆత్మానంద రసంలో కలిపివేసి, నీ ప్రాణాపాన వాయువులనే రథానికి ప్రాణశక్తి, మనస్సు, అనే గుర్రాలను కట్టి, నీ లోపలికి నువ్వే ప్రయాణం చేస్తే, నీ హృదయ గుహలో దాక్కొన్న శుద్ధ జ్ఞాన శివుడు కనిపిస్తాడు.

దృశ్య పదార్థాలన్నిటినీ చూసేది ఆయనే! జ్ఞేయ విషయాలను తెలుసుకునేది ఆయనే! అన్ని పనులకూ కర్త ఆయనే. అన్ని భోగాలకూ భోక్త ఆయనే. రకరకాల స్మృతులను స్మరించే స్మర్త ఆయనే. నీ ఇంద్రియాల వునికిని గుర్తించేది ఆయనే. పదార్థాల కలిమి లేములను తెలుసుకునేది ఆయనే. ఆభాస జ్యోతిస్సులైన సూర్య చంద్రులకంటె అధికంగా ప్రకాశిస్తూ, సర్వ వ్యాపిగా వుండేదీ ఆయనే! అలాంటి ఆ శివుణ్ణే ధ్యానించాలి.

వశిష్ఠా! ఆ శివుణ్ణి గురించి ఏమని చెప్పేది? సకలుడూ ఆయనే, నిష్కలుడూ ఆయనే! ఈ శరీరంలో

ఉన్నదీ ఆయనే, ఆకాశమంతా వ్యాపించి ఉన్నదీ ఆయనే. ఏదీ అంటని నిరంజనుడూ ఆయనే, అన్నీ అంటే రంజితుడూ ఆయనే. వచ్చీ పోయే అవయవ జ్ఞాన స్వరూపుడూ ఆయనే, నిత్య జ్ఞాన స్వరూపుడూ ఆయనే. మనస్సుకు మననం చేసే శక్తీ ఆయనే, ప్రాణాపాన శక్తులకు మధ్య మొలకెత్తే శుద్ధ శక్తీ ఆయనే. హృదయానికీ, కంఠానికీ, చెక్కిళ్లకూ మధ్యగల ఖేచరీముద్రాస్థానం ఆయనే. ముక్కు పుటాలకూ, కనుబొమ్మలకూ, మధ్య ముడిలో గల ఆజ్ఞాచక్రాధిపతీ ఆయనే. శైవాగమాలు చెప్పే ముప్పై ఆయారు తత్త్వాల కొసలో మెరిసేదీ ఆయనే. శివయోగులు చెప్పే ఉన్మన్యాది దశలను దాటి ఉన్నవాడూ ఆయనే. మనస్సుకు శబ్దాది విషయాలు అందించేవాడూ ఈయనే. పక్షిని లేపినట్లుగా ఆ మనస్సును లేపి, విషయాల మీదకు తోలేదీ ఈయనే. ఇటు సవికల్ప సమాధిలోనూ, ఇటు నిర్వికల్ప సమాధిలోనూ సమంగా వ్యాపించి వున్నది ఈయనే. అలాగే, వాక్కు బయటికి వెలువడి ఉదిత వాక్కుగా వున్న దశలోనూ, అది సంస్కార రూపమై, అనుదిత వాక్కుగా వున్న దశలో గూడా, నికరంగా నిలబడి వున్నవాడూ ఈయనే.

వశిష్ఠా! ఎన్నని చెప్పేది? ఈ ఆధ్యాసిక వికల్పాలన్నింటికీ అధిష్ఠానం ఆయనే. దాన్ని మర్చిపోయి, భోగలాలసుడైన జీవుడూ ఆయనే. కనుక, ద్విత్వానికి స్థానమిచ్చి, కాళ్ళు, చేతులు, మొదలైన ఆకారాలను ధరించిన ప్రతిరూపమూ ఆయనే. నిజానికి, ఎక్కడ ఏ అవయవం కనిపించినా, ఏ రూపం కనిపించినా, ఏ ఆలోచన కనిపించినా, ఇది ఆ శివుడి రూపమే అని గుర్తించి ధ్యానించాలి.

వశిష్ఠా! నేనే ఆ శివుణ్ణి. రక రకాల శక్తులు అనంత రీతులుగా వచ్చి నన్ను సేవిస్తున్నాయి. ఐనా సరే, నేను వాటినన్నిటినీ విడిచి పెట్టి, పరిమితులు లేని పరిపూర్ణ స్వరూపంగా వుండి పోతున్నాను.

ఈ నా తత్త్వాన్ని ఎవడైతే గ్రహిస్తాడో, వాడిక మరణించడు. అందుకే ఇక వాడు మళ్ళీ పుట్టడు. వాడు ఇక మీదట సంతోషించడు, దుఃఖించడు. అందుకే వాడికిక కోపం రాదు. వాడిక తృప్తినీ పొందడు అతృప్తినీ పొందడు. అందుకే ఇక క్షోభ పడడు. వాడు దేనినీ కోరడు. అందుకే దేనినీ విడువడు. వాడి పూజకు తెంపు లేదు. వాడి దేహం వున్నంత కాలమూ, వాడి పూజ సాగుతూనే వుంటుంది. ఎందుకంటే, ఈ దేహాన్ని నడిపించేదీ, నిలబెట్టేదీ, చిత్తత్త్వమే. ఆ చిత్తే వాడికి దేవుడు. మిగిలిన ప్రతి వస్తువూ వాడికి పూజా ద్రవ్యమే. అందుచేత, ఏది దొరికితే, దానితో పూజ చేస్తాడు.

వశిష్ఠా! ఈ పూజను అందుకున్నవాడు పూజాద్రవ్యాల కోసం వేరే ప్రయత్నం ఇసుమంత కూడా చేయరాదు. దేహధారణకు కావలసినంతవరకు మాత్రమే అన్నపానాదులను సేవిస్తూ, మిగిలిన పనులేవీ పెట్టుకోకుండా, ఈ పూజ కొనసాగిస్తూ వుండాలి.

మిన్ను విరిగి మీద పడ్డా, అన్ని రకాల దుఃఖాలూ ఒకే సారి విరుచుకు పడ్డా, లేదా మహాసామ్రాజ్యమే మీద పడ్డా, పోట్లాటలు, రాగ ద్వేష విలాసాలు, మొదలైనవి మనస్సులో ముసురుకున్నా, ఎలా వున్నా సరే, ఈ శివధ్యానం మానరాదు.

## 28. వైరాగ్య సాధన

ఐతే, వశిష్ఠా! సాధకుడైనవాడు వీలైనంతవరకూ వ్యవహారాలకు దూరంగా వుంటూ, భోగాసక్తి విడిచిపెట్టి, మైత్రీ, కరుణా, ముదితా, ఉపేక్షా, వంటి యోగ శాస్త్రోక్తమైన లక్షణాలను పెంచుకుంటూ, వైరాగ్య తత్పరుడై, ఈ ఆత్మార్చన రూపమైన శివార్చన చేస్తూ వుండాలి.

ఒక వేళ ఈ వైరాగ్యం గట్టిగా కుదరకపోతే, నిషేధం లేని విషయాలను పరిమితంగా సేవిస్తూ, శివార్చన కొనసాగించాలి.

సుఖదుఃఖాలకు కారణమైన ద్వంద్వాలను సహించుకుంటూ, నాదీ నీదీ అనే భేదాలను విడిచిపెడుతూ, వైరాగ్య ప్రధానంగా ఈ పూజ సాగాలి.

వశిష్ఠా! వైరాగ్యం అంటే చాలా జటిలమైనది సుమా!

**అనీహితం పరిత్యజ్య**
**పరిత్యజ్య తథేహితమ్ ।**
**ఉభయాశ్రయణేనాపి**
**నిత్యమాత్మాన మర్చయేత్॥** (పూర్వ. సర్గ. 39, శ్లో. 50)

అక్కర్లేని పదార్థాన్ని వదిలేటప్పుడు, ఇది మిథ్య అని భావిస్తూ, దానిని పరిత్యజించాలి. కావలసిన పదార్థాన్ని స్వీకరించేటప్పుడు, ఇది నా ఆత్మ స్వరూపమే అని భావిస్తూ, ఇది స్వీకరింపబడుతోంది అనే భావనను పరిత్యజించాలి. ఈ విధంగా, అక్కర్లేని దానినీ వదిలిపెట్టాలి, కావలసిన దానినీ వదిలిపెట్టాలి. ఇది ఒక పద్ధతి.

లేదా, అక్కర్లేనివీ, కావలసినవీ – రెండూ కూడా మిథ్యా పదార్థాలే గనుక, అలాంటి మిథ్యార్థ భావన ద్వారా, ఆ రెంటినీ విడిచి పెట్టవచ్చు. లేదా, అక్కర్లేనివీ, కావలసినవీ, రెండూ ఆత్మ స్వరూపాలే గనుక, తన ఆత్మను తను స్వీకరించడం కుదరదు గనుక, ఆ రెంటినీ ఈ భావనతో పరిత్యజించవచ్చు.

ఇలా, సమస్త విషయాలనూ పరిత్యజించడమే ఆత్మ శివార్చన. దీనిని, నిరంతరంగా ఆచరించాలి. కాని వశిష్ఠా! పరిత్యజించడం కూడా ఒక అనుభవమే. (ఒక భోగమే.) "నాకిది వద్దు, వద్దు" అని గింజుకోవడం ద్వారా నువ్వు దానిని ఒక రకంగా అనుభవిస్తున్నావు. అది కూడా పనికి రాదు.

**న వాంఛతా న త్యజతా**
**దైవప్రాప్తాః స్వభావతః ।**
**సరిత స్సాగరేణేవ**
**భోక్తవ్యా భోగభూమయః॥** (పూర్వ. సర్గ 39, శ్లో 51)

దైవ ప్రాప్తంగా నువ్వు కోరకుండానే సముద్రంలోకి నదులొచ్చి పడ్డట్లుగా, కొన్ని విషయాలు నీ దగ్గరికి చేరుతూ వుంటాయి. వాటిల్లో కొన్ని సుఖకరాలూ వుంటాయి, కొన్ని దుఃఖకరాలూ వుంటాయి. వీటిల్లో వేటినీ కావాలనుకోకూడదు. వద్దనీ అనుకోకూడదు. ఒక్కొక్కసారి అవి తగ్గిపోతూ వుంటాయి. అప్పుడూ అంతే. తగ్గాలనుకోకూడదు. పెరగాలనుకో కూడదు. సముద్రుడు నదులను అనుభవించినట్లు గానే, సుఖదుః ఖకరాలైన సమస్త విషయాలనూ, పట్టుకోకుండా, వదిలిపెట్టకుండా, అనుభవించాలి.

మంచి చెడులు వచ్చి మీద పడ్డప్పుడు, వికారం చెందకూడదు. సర్వ సమత్వ దృష్టితో, మనస్సును ఆత్మలో లయం చేసికొని వుండటమే ముఖ్యమైన శివార్చన.

**దేశకాల కరణ క్రమోదితైః**
**సర్వవస్తు సుఖదుఃఖ విభ్రమైః ।**
**నిత్యమర్చయ శరీరనాయకం**
**తిష్ఠ శాన్త సకలేహయా ధియా॥** (పూర్వ. సర్గ.39, చివరి శ్లోకం)

దేశం, కాలం, సాధన సంపత్తి – ఇది ఒకరకమైన వస్తు పరంపర. ఈ వస్తువులవల్ల వచ్చే సుఖాలు, దుః ఖాలు, కల్లోలాలు – ఇవన్నీ మరొక పరంపర. ఇవన్నీ నీకు పూజా పుష్పాలే. ఎప్పుడు? ఇవి కావాలనీ, ఇవి

అక్కరలేదనీ, ఇలా నీ మనస్సులోకి వచ్చే ఊహలన్నీ అణగారి శమించి పోతే, అప్పుడు నీకు పైవన్నీ పూజా పుష్పాలే. ఓ వశిష్ఠా! అలా శాంత మనస్కుడవై, ఆ పూజా పుష్పాలతో నీ శరీరానికి నాయకుడైన (శరీరాన్ని నడిపించే) శివ పరమాత్మను నిత్యమూ అర్చించు. ఇదే ముఖ్యమైన శివపూజ.

**(గమనిక –** ఈ 39వ సర్గలో వైరాగ్య సాధకులకు కావలసిన రత్న గుళికలు పుంఖాను పుంఖాలుగా వున్నాయి. వైరాగ్య సిద్ధులైన ఉత్తమ యోగులను పరిశీలించి చూసినప్పుడు మాత్రమే, మనకా శ్లోకాలు సరిగా సమన్వయమౌతాయి. శివార్చన గురించి, దానిలోని ఆంతర పూజా ప్రక్రియ గురించి, ఇంత చెప్పినా తృప్తి లేక, పై సర్గను శివుడే ప్రారంభిస్తున్నాడు. శివుడి మాటలే కొనసాగుతూంటే, సర్గ మార్చడం దేనికి? 39వ సర్గలో ఆత్మ శివపూజ గురించి ఎంత చెప్పినా, పూజ్య పూజక పూజా భేదాన్ని అంగీకరించే మాట్లాడుతున్నాడు. ఆ భేదాన్ని గూడా తొలగిస్తేనే గాని, అసలైన శివతత్త్వం చెప్పినట్లు గాదు. దేవతా తత్త్వాన్ని ఆ విధంగా ప్రతిపాదించేందు కోసమే వాల్మీకి మహర్షి సర్గను మార్చి, శివ వాక్యాన్ని కొనసాగిస్తున్నాడు.)

***శివుడు***:

**యథాకాలం యథారమ్యం**
**న కరోషి కరోషి యత్ ।**
**చిన్మాత్రస్య శివస్యాన్త**
**స్తదేవార్చన మాత్మనః ॥** (పూర్వ సర్గ. 40 శ్లో. 1)

వశిష్ఠా! ఆయా కాలాలకు తగినట్లుగా, నీకు నచ్చినట్లుగా, నువ్వు ఏ పని చేసినా, లేదా ఏ పని మానినా, అదంతా నీ ఆత్మ స్వరూపుడైన చిన్మాత్ర శివుడికి నువ్వు చేసే ఆంతరార్చనమే.

"అదేమిటండీ, మానవులు చేసే పనులన్నీ రాగద్వేషాలవల్ల జరుగుతూ వుంటాయి గదా!కనుక అవి అనర్థ రూపాలు గదా! అవి శివ పూజా పుష్పాలు ఎలా అవుతాయి?"– అనుకుంటావేమో! అలా అనుకోకు.

ఎందుకంటే, రాగద్వేషాదులనేవి శివుడి కంటే భిన్నమైనవి కావు. నిప్పు మంటల్లోంచి చెలరేగిన నిప్పు రవ్వలు నిప్పుకంటే భిన్నాలు కావు. అలాగే, ఆత్మ స్వరూపం నుంచీ ఆకాశాది క్రమంగా ఈ ప్రపంచం ఏర్పడుతోంది. అందుచేత ఈ ప్రపంచంలోని ఏ పదార్థమూ, ఏ భావమూ, ఆత్మకంటే భిన్నమైనది కాదు. ఈ దృష్టితో చూసుకుంటే, "నేను పూజించేవాడిని, శివుడు పూజింప బడేవాడు, నేను చేసేది పూజ" అనే త్రిపుటి ఎగిరిపోతుంది.

ఇలా, త్రిపుటిని వదిలి పెట్టడం చేతకానివాళ్లకి మేము ఉపదేశాలు చేస్తూ వుంటాం. త్రిపుటిని దాటిన విజ్ఞానులకు, భోధ చేసే వీలే లేదు. కనుక వశిష్ఠా! నువ్వు త్రిపుటిని దాటిన విజ్ఞాన దృష్టిని అవలంబించు. అప్పుడు, స్ఫటిక శిలలో పూల రంగులు సంక్రమించినా ఆ రంగులు దానికి అంటనట్లుగా, మాయా కళంకం నీకు అంటదు.

***వశిష్ఠుడు***: దేవా! పూజ్య పూజక భేదమే లేదంటున్నారు. ఏ భేదమూ లేకపోతే, శివుడనే పేరు ఎందుకు వస్తుంది? ఒక్కొక్క గుణాన్ని పట్టి కదా, ఒక్కొక్క పేరు వచ్చేది? ఆయనను ఒక్కొక్కసారి మీరు పరబ్రహ్మ అంటున్నారు. ఆత్మ అంటున్నారు. పరమాత్మ అంటున్నారు. ఏదో ఒకటి అంటున్నారు. ఏదీ కాదు అంటున్నారు. శూన్యం అంటున్నారు. విజ్ఞానం అంటున్నారు. ఆయన గుణాలలో ఏదో ఒక భేదం లేకపోతే, ఇన్ని పేర్లు ఎలా వస్తాయి? ఒక్కొక్క పేరూ ఒక్కొక్క గుణాన్ని వ్యక్తం చేస్తోంది కనుకనే, ఈ పేర్లన్నీ వచ్చి వుండాలి. లేకపోతే, తమరే ఇన్ని రకాల శబ్ద ప్రయోగాలు చేయడానికి కారణం ఏమిటి?

***శివుడు***: ఆదీ– అంతమూ లేని, రూపమూ–గుణమూ లేని, సత్పదార్థం ఒకటి వుంది. అది ఇంద్రియాలకు అందదు. ఇద్రియాలకు అందితే కదా నువ్వు పేరు పెట్టేది. నీకు అందనిదానికి నువ్వు పేర్లు పెడితే, ఆ పేర్లమీద చర్చేమిటి?

## 29. శుద్ధ సాత్త్విక వృత్తి

***వశిష్ఠుడు***: ఆ సత్పదార్థం ఇంద్రియాలకూ, మనస్సుకూ కూడ అందనిదైతే, మీరు ఉపదేశిస్తే మాత్రం దానిని తెలుసుకోవడం ఎలా సంభవమౌతుంది? అసంభవమైతే ఉపదేశం ఎందుకు?

***శివుడు***: వశిష్ఠా! తెల్లటి బట్టకు మరకలు అంటాయి. మరక అంటే ఏమిటి? వస్త్రం కాని పదార్థం వస్త్రానికి అంటుకుంది. కనుకనే దాని పేరు మలం. దానిని పోగొట్టాలి అంటే చాకలివాడు మరో మలద్రవ్యాన్ని (వస్త్రం కంటె భిన్నమైన ద్రవ్యాన్ని)తెచ్చి రుద్దుతాడు. ఆ మలంవల్ల ఈ మలం పోతుంది. వస్త్రం వస్త్రంగా మిగిలిపోతుంది. ఈ ప్రక్రియనే నువ్వు "వస్త్రాన్ని శుభ్రపరచుట" అని పిలుస్తున్నావు.

అలాగే, 'నీకు అవిద్యావరణం' – అనే మలం పట్టింది. మా ఉపదేశ వాక్యాలవల్ల నీలో 'శుద్ధ సాత్త్విక మనోవృత్తి' అనే మరో మలం కలిగింది. దీంతో దాన్ని (అవిద్యావరణాన్ని) రుద్దుతావు. దాంతో అవిద్యావరణమూ, సాత్త్విక మనోవృత్తీ – రెండూ కరిగిపోతాయి. నువ్వు నువ్వుగా ప్రకాశిస్తావు. అంటే, స్వయం ప్రకాశరూపుడైన పరమాత్మ యథార్థ స్వరూపంతో ప్రకాశిస్తాడు. ఇలా ప్రకాశించడంలో, నీ బుద్ధికి గానీ, ఇంద్రియాలకు గానీ, ప్రసక్తి ఏముంది?

***వశిష్ఠుడు***: 'శుద్ధ సాత్త్విక వృత్తి' అంటే ఏమిటి?

***శివుడు***: అనేక జన్మలలో చేసుకున్న పుణ్యాలకు ఫలితంగా, ఈ జన్మలో మనస్సుకి శమదమాది సద్గుణాలు చేరతాయి. ఇలాంటి మనోవృత్తినే, 'శుద్ధ సాత్త్విక వృత్తి' అంటారు. దీనిలోకి గురూపదేశం, సత్సాంగత్యం, శాస్త్ర మననం, మొదలైన పేర్లుగల అవిద్యా భాగాలు వచ్చి చేరతాయి. శ్రవణ, మనన, నిధిధ్యాసలనే వృత్తులు, వీటన్నిటి మధ్యా ఒరిపిడి లాగా పని చేస్తాయి. ఈ ఒరిపిడివల్ల, ఇందాక చెప్పుకున్న చాకలివాడి ఉదాహరణలో లాగా, సాత్త్విక గుణాలు, సత్సాంగత్యాది అవిద్యా వృత్తులు, ఒక దానితో ఒకటి కలిసి, రెండూ ఒకే సారి రాలిపోతాయి. అదే, నేనిందాక చెప్పింది.

***వశిష్ఠుడు***: ఇలా అనడంవల్ల, 'గురూపదేశం వ్యర్థం' అని చెప్పినట్లు కాలేదా?

***శివుడు***: ఎలా అవుతుంది? గురువు, శాస్త్రం, మొదలైన భేదాలు ఆత్మ స్వరూపం కావనే చెప్పాను. అంత మాత్రం చేత, అవి వ్యర్థాలని నేను చెప్పలేదే. ఒకావిడ బంగారపు గొలుసును మెడలోనే వేసుకుని, ఆ మాట మరిచిపోయి, ఇల్లంతా వెతుకుతోంది. కొంత సేపటికి, ఎదుటివాడు ఒకడు వచ్చి, గొలుసు నీ మెడలోనే వుందని చూపించాడు. ఆవిడకి, గొలుసు నిజంగానే పోయి, దొరికినంత ఆనందమైంది. ఇక్కడ ఎదుటివాడు, పోయిన గొలుసు తెచ్చి మెడలో వేశాడా? లేదే! ఐనా సరే, ఆవిడయొక్క దుఃఖ నివృత్తికి వీడు కారణ మయ్యాడా? లేదా? అయ్యాడనే చెప్పాలి. కారణం ఐనంత మాత్రాన, గొలుసు తన దగ్గరే వుందనే జ్ఞానం కలిగిన తరువాత, గుర్తు చేసినవాడితో అవసరం లేదు. అలాగే, గురువు, గురూపదేశం, శాస్త్రం – మొదలైనవన్నీ పరంపరా కారణాలుగా, తాత్కాలిక కారణాలుగా, ఉపయోగపడతాయి కనుక, అవి కావలసిందే. ఐతే, ఆత్మజ్ఞాన ప్రాప్తి కలిగిన తరువాత, భేద ప్రసక్తే మిగలదు గనుక, గురూపదేశాదులు వేటికీ ఆ దశలో అస్తిత్వం మిగలదు.

***వశిష్ఠుడు***: ఆ పరబ్రహ్మ అప్పుడూ వుంది, ఇప్పుడూ వుంది. దానిలో ఏ భేదాలూ లేవు. కానీ, మనకు ఈ ప్రపంచం ఇంత విస్తారంగా కనిపిస్తోంది. దీనికి కారణ మేమిటి?

***శివుడు***: వశిష్ఠా! పూర్వమే చెప్పాను. ఈ ప్రపంచం గంధర్వ నగరం వంటిది. స్వప్న సామ్రాజ్యం వంటిది. దీని నిర్మాణానికి మనస్సే కారణం.

**వశిష్ఠుడు**: దేవా! మీరీ మాట చెప్పారు. నాకు అర్థమైంది. ఒప్పుకున్నాను. కానీ, ఈ ప్రపంచం కనిపించకుండా పోవడం లేదు. ఈ దుఃఖం తగ్గడం లేదు. కనుక, శాశ్వత దుఃఖ నివారణ కోసం, ఈ జ్ఞానం అనే ఉపాయం చాలదనీ, వేరే ఏదో ఉపాయం వుంటుందనీ, నాకు అనిపిస్తోంది. దయచేసి ఆ రహస్యం చెప్పండి.

**శివుడు**: వశిష్ఠా! వేరే రహస్యం ఏమీ లేదు. బుద్ధి పరంగా, 'ప్రపంచం మిథ్య' అనే జ్ఞానం కలిగితే చాలదు. స్వప్న రూపమైన ఈ ప్రపంచంయొక్క ఉత్పత్తికి మూల హేతువులై, మనస్సులో దాగివున్న వాసనలన్నీ తొలగిపోయే దాకా, నీకు కలిగిన జ్ఞానాన్ని నువ్వు దృఢపరచుకోవాలి. నిజానికి, అలాంటి వాసనా రహితమైన జ్ఞానానికే జ్ఞానమని పేరు.

**వశిష్ఠుడు**: దేవా! పరిశుద్ధ చైతన్య రూపమైన పరమాత్మ మొదట్లో వాసనా రహితుడి గానే వుండేవాడు గదా! అలాంటి ఆ పరమాత్మ మొదటి సారిగా జీవుడై ఈ శరీర భ్రాంతిని ఎలా పొందాడు?

**శివుడు**: హిరణ్యగర్భుడియొక్క ప్రథమ సంకల్పమే దీనికి కారణం. (ఈ విషయాన్ని ఇంతకుముందు స్థితి ప్రకరణలో 38వ సర్గ ప్రాంతాలలో విస్తరించి చెప్పారు.)

**వశిష్ఠుడు**: దేవా! అలా అనటంవల్ల మీరు ఈ ప్రాపంచిక పదార్థాలకు వేరే స్వంత ఉనికి లేదనీ, బ్రహ్మసత్త మీదే వీటి సత్త ఆధారపడి వుందనీ, చెప్పినట్లౌతోంది. ఈ ప్రాపంచిక పదార్థాలకు స్వంత సత్త వుందని ఎందుకు అనుకోకూడదు?

**శివుడు**: అలాంటి స్వంత సత్త వుండి వుంటే, పరమార్థ తత్త్వ సాక్షాత్కారంచేత (మాబోటివారికి) ప్రపంచోపశమం (అంటే ఈ ప్రపంచం లేక పోవడం) అనుభవంలోకి వచ్చి వుండేది గాదు.

**అనుభవ కలనామృతేస్య మాతా**
**భవతి న సర్వ వికల్పనేష్వసత్సు।**
**ఫలదురు విభవా ప్రమాణ మాలా**
**స్థితి ముపయాతి న వారిణీవ వహ్నిః ॥** (పూర్వ.సర్గ. 42, శ్లో. 29)

వశిష్ఠా! ఈ కనిపించే వికల్ప పదార్థాలన్నీ అసత్ పదార్థాలు గనుక, వీటి విషయంలో ప్రవర్తించి ఫలించే ప్రమాణాలన్నీ, ఆత్మానుభవం దగ్గరికి వచ్చేసరికి, నీళ్లలో వేసిన నిప్పు రవ్వ లాగా ఐపోతాయి. ఇందుకు ఆత్మానుభవానికి మించిన ప్రమాణం లేనే లేదు.

**వశిష్ఠుడు**: రామా! స్వామి ఉపదేశం ఈ దశకు వచ్చేసరికి, నాలో ప్రశ్నలు మిగల లేదు. నేను మౌనంగా వుండిపోయాను. అది గమనించి పరమేశ్వరుడు, "మునీ! నీకు శుభమగుగాక! పార్వతీ! రా! పోదాం." అన్నారు. అది గమనించి నేను భక్తితో ఆ స్వామి పాదాలమీద పూలు చల్లే లోపలే, ఆయన ఆకాశంలోకి ఎగిరి పోయాడు.

రామా! అప్పటినుంచీ నేను ఆయన మాటే స్మరించుకుంటూ, మననం చేసి చేసి, నా మనస్సును పవిత్రం చేసుకొని, అంతరింద్రియ నిగ్రహాన్ని వహించి, ఆయన చెప్పిన ఆత్మ దేవార్చన చేస్తూనే వున్నాను.

ద్రవ్యరహితమైన ఈ అర్చనవల్ల, నేనిన్ని యుగాలుగా, ఇన్నిన్ని వ్యవహారాలు చేస్తున్నా, ఏ రకమైన దుఃఖం లేకుండా, రోజులు గడిపేస్తున్నాను.

ఎప్పుడెప్పుడు ఏ ఏ ఆలోచనలు వస్తే, ఆ ఆలోచనలనే పుష్పాలుగా, ఏ పనులను చేస్తే ఆ పనులనే పుష్పాలుగా, చేసుకొని, రాత్రింబగళ్ళు తెంపు లేకుండా ఈ పూజ చేస్తున్నాను. సుషుప్తి సమయంలో మాత్రం, ఆలోచనలు, పనులు, లేవు గనుక, ఈ పూజ ఆగిపోయినట్లు కనిపిస్తుంది. నిజానికి, అప్పుడు గూడా అది ఆగదు. ఎందుకంటే, అంతకుముందు (సుషుప్తికి ముందు) నేనున్నానని, సుషుప్తిలో నాకేమీ తెలియదనీ, సుషుప్తినుంచి బయటికి వచ్చాక, అప్పుడు నేను సుఖంగా వున్నాననీ, మొత్తం కలిపితే, "నేను బాగా నిద్రించాను,

నాకు ఇంకేమీ తెలియదు, నాకు హాయిగా వుంది" అనే మూడు చిత్త వృత్తులు, సుషుప్తిని అంటి పెట్టుకొనే వుంటాయి. వాటినే నేను పుష్పాలుగా చేసుకొని ఆత్మ శివార్చన చేస్తున్నాను. కనుక సుషుప్తి దశలో గూడా నా శివార్చనకు భంగం లేదు.

**శ్రీరాముడు**: ఇలాంటి పుష్పత్రయం సామాన్య మానవులకు గూడా వుంది కదా. మరి మీ విశేషమేమిటి?

**వశిష్ఠుడు**: వాళ్ళకు సావధానత్వం లేదు. నాకు సావధానత్వం వుంది. సావధానత్వము అంటే, ఆసక్తి లేకపోవడం. ఆసక్తి లేకపోవడం అంటే, పని సరిగ్గా చేయకపోవడం గాదు. ఫలితం మీద కోరిక లేకుండా వుండడం. కనుక రామా! నీవు సావధానుడవై, అసంగుడవై, నిష్కాముడవై, ఈ సంసారారణ్యంలో విహరించు. నీకు దుః ఖం అంటదు.

ఇలాంటి ఆత్మార్చనకు, 'ఈ జగత్తు తుచ్ఛము' అనే నిశ్చయం వుండాలి (తుచ్ఛము అంటే ఎండమావి లాగా లేకపోయినా కనిపించేది.) ఒక వేళ, ఇలాంటి నిశ్చయం సరిగా కుదరకపోతే, ఈ జగత్తు మొత్తం నువ్వే అనుకో.

**త్వమిహాసి జగద్రూపం**
**చిన్మాత్ర వితతాకృతే।**
**నిజావయవకావృత్తౌ**
**కః క్రమో హర్షశోకయోః ॥**(పూర్వ సర్గ, 43 శ్లో.15)

నువ్వు నిజంగా పరిపూర్ణ చిద్రూపుడవు గనుక, ఈ జగద్రూప పొందిన వాడవు నువ్వే. నీశరీరంలో అవయవాలు రోజు రోజుకీ కొద్ది కొద్దిగా మార్పు చెందుతూనే వున్నాయి. దానికి నువ్వు సంతోషిస్తున్నావా? దుఃఖిస్తున్నావా? రెండూ లేవు. అలాగే, నీ రూపమైన ఈ జగత్తులో కలిగే మార్పులకు కూడా, హర్ష శోకాల ప్రసక్తి లేదు. ఈ విషయాన్ని గ్రహించి, నువ్వు ఆత్మ పూజా నిరతుడవై, నిండు సముద్రం లాగా నిశ్చలంగా వుండిపో. ఇంకా ఏమైనా సందేహాలు మిగిలి వుంటే అడుగు.

**శ్రీరాముడు**: గురుదేవా! సందేహాలన్నీ తొలగిపోయాయి. తృప్తి కలిగింది. సత్యాసత్య జ్ఞానం మనస్సుకు పట్టింది. నా మనస్సు పరిపూర్ణానందంతో సర్వోత్తమంగా వుంది.

### 30. చిత్తం-సత్త్వం

శ్రీరాముడు అలా అన్నా గూడా, వశిష్ఠ మహర్షికి తృప్తి కలుగక, స్థూణా నిఖనన న్యాయాన్ని ఆశ్రయించి, 'బిల్వోపాఖ్యానం' అనే పేరుతో ఒక చిన్న కథ కాని కథ ద్వారా మళ్ళీ తత్త్వభోద చేయ దలచుకొని, దానికి ఉపోద్ఘాతంగా, 44వ సర్గలో అసంగాద్యుపాయాలను మళ్ళీ భోదించడం ప్రారంభించాడు.

(పందిరికోసం ఒక గుంట తీసి స్తంభాన్ని పాతినవాడు, అది గట్టిగా వుందో లేదో అని గట్టిగా ఊపి చూస్తాడు. దానిని ఊడపీకాలని అతని వుద్దేశ్యం కాదు. కానీ, ఊడబీకే ప్రయత్నం చేస్తాడు. ఎందుకంటే, దాన్ని ఊడబీకడం సాధ్యం కాదు అని తనకు తనే నిరూపించుకొనేందుకోసం. దీనినే 'స్థూణానిఖనన న్యాయం' అంటారు. ఈ సర్గ నుంచీ వశిష్ఠ మహర్షియొక్క ఉపదేశం కూడా ఆ పద్ధతిలోనే జరుగుతోంది.)

**వశిష్ఠుడు**: రామా! సామాన్య మానవులంతా పనులు చేసేటప్పుడు, కర్తృత్వాభిమానాన్ని, ఫలవాంఛను, మనస్సులో పెట్టుకొని, ఇంద్రియాలతో పనులు చేస్తూ వుంటారు. అందువల్ల సుఖదుఃఖ రూపమైన అనర్థంలో పడతారు. దీనికి భిన్నంగా, మనస్సును భూత భవిష్యత్తుల్లోకి పోనీకుండా వర్తమానంలోనే నిలిపి, మనస్సులో

సంగాన్ని విడిచి, కేవలం ఇంద్రియాలతో నువ్వు ఎన్ని పనులు చేసినా, అసలు చేసినట్టే కాదు. కనుక నువ్వు అసంగుడవై వ్యవహరించు.

నీకీ మాట మళ్ళీ మళ్ళీ ఎందుకు చెబుతున్నానంటే, మళ్ళీ ఎప్పటికో అప్పటకి చెడుకాలం వచ్చి, మళ్ళీ అహంకార పంకంలో పడతావేమోననే భయంతో చెబుతున్నా. "మళ్ళీ మళ్లీ చెబితే మాత్రం నేను జారిపోననే నమ్మకమేమిటి?" అంటావేమో! అలా కాదు. ఆత్మజ్ఞానం ఒక శిఖర స్థితికి చేరితే, వాడు ఇక తల్లి గర్భంలోకి పడమన్నా పడడు.

నీకు అలాంటి శిఖరస్థితి లభించిందనే అనుకుంటున్నా.

**ఆశా యాతు నిరాశత్వం**

**అభావం యాతు భావనమ్ ।**

**అమనస్త్వం మనో యాతు**

**తవాసంగేన జీవతః ॥** (పూర్వ. సర్గ.44, శ్లో. 10)

కనుక, అసంగుడవై జీవించే నీకు, ఆశ నిరాశై పోవుగాక! భావన అభావమై పోవుగాక! మనస్సు అమనస్సై పోవుగాక.

వాసనా త్యాగము, తత్వజ్ఞానము, ప్రాణ నిరోధము, అనే వాటివల్ల చిత్తంలో వుండే స్పందనలను తొలగించుకుంటే, ప్రపంచంలోనే స్పందన లేకుండా పోతుంది. అసలు ప్రపంచమనే స్పందం లేకుండా పోతుంది. అప్పుడా యోగియొక్క చిత్తానికి 'చిత్తం' అనే పేరు పోతుంది. దానికప్పుడు 'సత్త్వం' అనే పేరు వస్తుంది.

**జ్ఞస్య చిత్తం న చిత్తాఖ్యం**

**జ్ఞ చిత్తం సత్త్వ ముచ్యతే ॥** (పూర్వ సర్గ. 44, శ్లో.30)

ఇలాంటి సత్త్వ స్థితిని పొందిన చిత్తం కొద్దికాలం పాటు తురీయావస్థలో వుంటూ ప్రపంచంలో విహరించి, తరువాత తురీయాతీత స్థితికి చేరుకుంటుంది. ఈ స్థితిలో అసలు చిత్తమూ లేదు, జగత్తూ లేదు.

ఈ విషయం నీకు సులభంగా బోధ పడటంకోసం బిల్వోపాఖ్యానమనే చిన్న కథ చెబుతాను, విను – అంటూ వశిష్ఠ మహర్షి 45వ సర్గలో ఈ కథ ప్రారంభించాడు.

### 31. బిల్వోపాఖ్యానం

***వశిష్ఠుడు***: రామా! పూర్వం ఒక పెద్ద బిల్వఫలం (మారేడు పండు) వుండేది. దాని వైశాల్యము, ఎత్తు ఎంత గొప్పగా వుండేవంటే, ఆకాశంలోని బ్రహ్మాండ గోళాలన్నీ దాని ముందర ఆవగింజల్లాగా వుండేవి.

ఆ పండు ఎప్పుడు చూసినా తీయని పండు లాగా కనిపించేది. ఐనా సరే, ఎన్ని కల్పాలు పోయినా, అది రాలి కింద పడేదీ కాదు, చెట్టుమీద ఎండి పోయేదీ కాదు.

మరో విచిత్రం ఏమిటంటే, బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులు వెతికినా సరే, ఆ పండు ఏ కొమ్మకు కాసిందో, ఆ కొమ్మ కనిపించేది కాదు. ఇక, ఆ పండుయొక్క పుట్టుకకు కారణమైన విత్తు సంగతి చెప్పేదేముంది? అంతే గాదు, ఈ పండులో మరో విత్తు వున్న దాఖలా గూడా కనిపించేది గాదు. ఐనా సరే, దానిని చూస్తూంటూనే, బ్రహ్మానంద ఫలం కంటే గూడా, దీని సారం ఎంతో తీయగా వున్నట్లు అనుభూతి కలుగుతూ వుండేది. ఇలాంటి పండు ప్రపంచంలో మరొకటి లేనే లేదు.

ఈ పండు ఇలా వుంటూనే, ఏదో ఒక చమత్కారం చేసి, తన స్థూలత్వాన్ని విడిచి పెట్టకుండానే, చిన్ని చిన్ని రూపాలను పొందడం ప్రారంభించింది. ఆ చిన్న రూపాలే ఈ బ్రహ్మాండ గోళాలు. అంతే గాదు, ఆ స్థూల బిల్వ ఫలమే అవిద్యకు స్థానం కల్పించుకొని, తనలో "నేను" అనే భావాన్ని తయారు చేసుకుంది. ఆ అహంభావంవల్ల ఆ బిల్వ ఫలంలో క్రమక్రమంగా వ్యష్టి సమష్టి శరీరాలు రూపొందాయి. ఏ ఏ రూపాలు ఏర్పడ్డాయో, వాటన్నిటినీ 'ఇది నేనే, ఇది నేనే' అని అనుకోవడం ప్రారంభించింది ఆ బిల్వఫలం.

ఇంత చేస్తున్నా, ఆ బిల్వఫలం తనయొక్క అసలు స్వరూపాన్ని మాత్రం పొగొట్టుకోలేదు. ఎందుకంటే, దానిలో కనిపించే విశాలమైన సృష్టి అంతా దాని సంకల్ప స్వరూపం మాత్రమే. అందుకే, ముందూ వెనకా, పైనా క్రిందా, దగ్గరా దూరం, భూతమూ భవిష్యత్తూ, మొదలైన భావాలన్నీ, దాని కల్పనలో భాగాలే.

ఆ పెద్ద బిల్వఫలం, ఈ రకరకాల భావాలను చూసి, ఈ అవిద్యా విలాసాలను గమనించి, ఇదంతా చైతన్యంయొక్క చమత్కార విశేషమే అని గ్రహించి, స్వస్థంగా, సంతోషంగా, నిర్వికారంగా వుండేది. నిజానికి ఏకమూఅదే, ఏకత్వమూఅదే, అనేకత్వమూ అదే.

**శ్రీరాముడు**: (46వ సర్గ ప్రారంభంలో) గురుదేవా! మీరు మహా చైత్యన్యంయొక్క ఉనికినే, మారేడు పండు రూపంలో వర్ణించారని నాకనిపిస్తోంది.

### 32. శిలోపాఖ్యానం

**వశిష్ఠుడు**: రామా! గమనించవలసిన విషయం ఏమిటంటే, బిల్వఫలం పరిణామం చెంది, బ్రహ్మాండ గోళాలుగా ఏర్పడ లేదు. అలా ఏర్పడి వుంటే, ఆ బిల్వఫలం కనిపించకుండా పోయి వుండవలసింది.

ఒక పెద్ద మామిడి చెట్టును నరికి, దాని కాండంతో ఏనుగు బొమ్మను చేశాం అనుకో. ఇప్పుడా కొయ్య ఏనుగు మామిడి చెట్టుయొక్క పరిణామంగా ఏర్పడింది. ఇలా ఏనుగు ఏర్పడినాక, ఆ మామిడి చెట్టు యథాతథంగా కనిపిస్తుందా? అసంభవం!

కానీ, మన బిల్వఫలం కోటానుకోట్ల బ్రహ్మాండాలు ఏర్పడిన తరువాత కూడా యథాతథంగా వుంది. కనుక, ఈ ప్రపంచం అంతా దానిలో ఎలా వుందీ అంటే

**స్థితా సౌషుప్త సౌమ్యాన్తః**
**శిలాన్తః సంనివేశవత్ ॥** (పూర్వ. సర్గ. 46, శ్లో. 5)

సుషుప్తి సమయంలో, లోపల సుఖమనే భావన వున్నట్లుగా వుంది. సమర్థుడైన శిల్పి, శిలాగర్భంలో ఒక పెద్ద కథా సన్నివేశాన్ని మనస్సులో ఊహించుకున్నట్లుగా వుంది. (అంటే, పెద్ద శిలా ఖండాన్ని చూసిన శిల్పి, దీనిలో ఏ గజేంద్ర మోక్ష సన్నివేశాన్నో చెక్కవచ్చు – అనుకున్నాడనుకోండి. నిజంగా చెక్కకముందే, ఈ శిలలో ఏ బాగంలో ఏ ఆకారం రావాలో ఒక ఊహ చేసేసుకుంటాడు. అలాంటి ఊహా కల్పితమైన శిల లోపలి పొరల చెక్కడం లాగా వుంది ఈ ప్రపంచం!) అంటే, ఈ ప్రపంచం అంతా, వివర్త రూపంగా ఏర్పడింది.

('వివర్తం' అంటే, భ్రాంతి రూపమైన మానసిక కల్పనచేత ఏర్పడిన రూపమని పూర్వమే చెప్పుకున్నాం. ఇక్కడ మూలకర్త పరిణామం, వివర్తం అనే పదాలను వాడకుండానే ఆ అర్థాన్ని విస్పష్టంగా తెచ్చాడని మనం గమనించాలి)

రామా! ఈ విషయం మరింత స్పష్టంగా తెలిసేందుకోసం గాను, శిలోపాఖ్యానమనే చిన్న కథ చెబుతాను, విను.

పూర్వం ఒక చోట, ఒక పెద్ద రాయి వుండేది. అది చాలా లావుగా వుండేది. కానీ, ముట్టుకుంటే, చాలా మెత్తగా వుండేది. ఆ రాయి లోపలే, కొన్ని వందల పద్మాలు, విస్పష్టంగా కనిపిస్తూండేవి.

**శ్రీరాముడు**: ఔను, గురుదేవా! నేను తీర్థ యాత్రలు చేసేటప్పుడు, సాలగ్రామ మనే క్షేత్రంలో అలాంటి శిలను నేను చూశాను.

**వశిష్ఠుడు**: మంచిది. నేను మాత్రం అలాంటి శిలను ఎక్కడా చూడలేదు. నేను చెప్పే ఈ శిలలో సమస్త ప్రపంచమూ వుంది. బాగా విచారించి చూస్తే, అసలు ఏమీ లేదు. నేను చెప్పేది చిచ్ఛిల (చిత్ + శిల= చిచ్ఛిల; శుద్ధ చైతన్యమనే శిల) ఈ చైతన్య శిల అద్వితీయం.

శిల్పి మనస్సులో 'ఏనుగు' అనుకోగానే, రాతిలో ఏనుగు ఆకారం వచ్చింది. 'శంఖం' అనుకుంటే, శంఖాకారం వచ్చింది. 'చక్రం' అనుకుంటే చక్రాకారం వచ్చింది. ఎక్కడ? రాతిలో! రాయి ఎక్కడ వుంది? అతని ఊహలో! ఈ చైతన్య శిలలో ప్రపంచ సృష్టి పరిస్థితి గూడా అదే. ఏ మాట అనుకుంటే, ఆ రూపం వచ్చేస్తుంది.

అందుకే ఈ ప్రపంచమంతా మాట ద్వారానే వచ్చిందని వేదం చెపుతోంది. ఎలాగంటే –

**స భూరితి వ్యాహరన్ – భువమసృజత।**
**ఏత ఇతి వై ప్రజాపతి ర్దేవానసృజత ।**
**అసృగ్రమితి మనుష్యాన్ –**
**ఇందవ ఇతి పితౄన్** (ఆ ప్రజాపతి "భూః" అని పలుకుతూ భూమిని సృష్టి చేశాడు. "ఏతే" అంటూ దేవతలను, "అసృగ్రం" అంటూ మనుష్యులను,"ఇందవః" అంటూ పితృ దేవతలను, సృష్టి చేశాడు) – అని వేదంలో వుంది.

**ఉక్త్యా సంపద్యతే యచ్చ**
**తల్లయేన విలీయతే ।**
**బ్రహ్మైవేదం వికారాది**
**వికారాద్యర్థ వర్జితమ్ ॥** (పూర్వ. సర్గ. 47, శ్లో.28)

రామా! మాటవల్ల పుట్టిన పదార్థం మాట పోతే తనూ పోతుంది. అందుకనే, ప్రజాపతియొక్క (హిరణ్యగర్భుడియొక్క) మాటవల్ల పుట్టిన ఈ ప్రపంచం, మాటతోనే లయించి పోయింది. ఏ వికారాలూ లేని పరబ్రహ్మే మిగులుతోంది. అందుకే, కనిపించే సమయంలో గూడా, ఈ వికారాలన్నీ పరబ్రహ్మయొక్క రూపాంతరాలే అవుతున్నాయి.

ఈ విషయాన్ని 46వ సర్గలో వివరించిన వశిష్ఠ మహర్షి ఇప్పుడు తను చెప్పిన బిల్వోపాఖ్యాన, శిలోపాఖ్యానాలు – రెండింటికీ కలిపి తాత్పర్యం ఏమిటో 47వ సర్గలో తనే వివరించడం ప్రారంభించాడు. వశిష్ఠ మహర్షి ఇక్కడి నుంచి ఐదు సర్గల తరువాత, రాబోయే యుగంలో శ్రీకృష్ణ పరమాత్మ అర్జునుడికి చేయబోయే గీతోపదేశంయొక్క సారాన్ని అందించ దలచుకున్నాడు. దానికి ఉపోద్ఘాతంగా, ఈ ఐదు సర్గల చర్చనూ నిర్వహిస్తున్నాడని మనస్సులో పెట్టుకొని, మనం ఇక ముందుకు సాగుదాం.

**వశిష్ఠుడు**: రామా! నీకు రెండు కథలు చెప్పాను. మారేడు పండు కథలో, పండు –గుజ్జు– రసం, ఉన్నాయి. ఐనా సరే, అవి ఏవీ మార్పు చెందకుండానే, సృష్టి వచ్చిందన్నాను. బండరాతి కథలో, ఇలాంటి గుజ్జు, రసం మొదలైనవి లేకుండానే ప్రపంచ సృష్టి ఏర్పడిందన్నాను. ఇప్పుడు మరో ఉదాహరణ చెబుతాను, విను.

ఒక నెమలి గుడ్డు పెట్టింది. ఆ గుడ్డులో రసం వుంది.రసంలో ఏ రంగూ లేదు. కొంత కాలానికి ఆ రసమే మార్పు చెంది, గుడ్డు పగిలి, నెమలి, నెమలి పింఛమూ, పుట్టాయి. పింఛం వచ్చాక చూస్తే, ఏడు రంగులూ కనిపించాయి.ఈ రంగులన్నీ, ఎక్కడి నుండి వచ్చాయి?

అంతే గాదు. నెమలి పింఛంలో కొంత మెత్తటి భాగం వుంది. ఈనెల రూపంలో కొంత కఠిన భాగం వుంది. ఈ మృదుత్వ కఠినత్వాలు ఎక్కడినుంచి వచ్చాయి?

ఇవన్నీ, నెమలి గుడ్డు రసంలోంచి వచ్చాయనే చెప్పాలి. మరో దారి లేదు. అందుచేత గుడ్డు రసం పైకి రసం లాగా కనిపిస్తున్నా, దానిలోనే మృదుత్వ కఠినత్వాలు, రకరకాల రంగులూ, మొదలైనవన్నీ దాగి వున్నాయని చెప్పాలి. కనుక వివేక దృష్టితో చూస్తే, నెమలి పింఛంలో కనిపించే రంగులన్నీ దాని రసం కంటే భిన్నమైనవి కావు. అలాగే, ఈ కనిపించే ప్రాపంచిక పదార్థాలన్నీ పరబ్రహ్మ రసం కంటే భిన్నం కావు.

**శ్రీరాముడు**: గురుదేవా! 'మారేడు పండు వేరు, పండు రసం వేరు' అన్నట్టుగా 'పరబ్రహ్మ వేరు, జగత్తు వేరు' అని నేనంటానేమో, అలా అంటే, 'జగత్తుకు స్వతంత్రమైన ఉనికి వచ్చి పడిపోతుందేమో' అని ఆలోచించి, మీరీ నెమలి గుడ్డు ఉదాహరణ చెబుతున్నారు. కానీ, ఇలా చెప్పడంవల్ల సత్తా రహితమైన ప్రపంచాన్నీ, శాశ్వత సత్తా సహితమైన పరబ్రహ్మనూ, ఒకే గాడిన కట్టేసినట్లు కాలేదా!

**వశిష్ఠుడు**: జగత్తు 'అసత్తు' అన్నామే గాని 'శూన్యం' అనలేదు. బ్రహ్మ సత్యం – జగత్తు 'శూన్యం' ఐతే, నువ్వు చెప్పిన దోషం వచ్చేది. జగత్తు శూన్యం కాదు.

ఎడారిలో ఎండే నీరుగా కనిపించినట్లుగా, బ్రహ్మే జగత్తుగా కనిపించింది. సరిగ్గా చూసినప్పుడు ఆ నీరే ఎండ ఐపోయినట్లుగా, తత్త్వ వేత్తకు ఈ జగత్తు బ్రహ్మగా కనిపిస్తుంది. కనుక, ఇక్కడ ఏ దశలోనూ శూన్యమనే ప్రసక్తి లేదు. కనుక విరుద్ధ పదార్థాలను ఒకే గాటను కట్టడమనే ప్రసక్తి లేదు.

**శ్రీరాముడు**: గురుదేవా! మీరు చెప్పే పరతత్వం , మళ్ళీ మళ్ళీ మొలక లెత్తించగల బీజ శక్తి కలిగింది. దానిలో ఆ చిత్తు, అచిత్తు అనేవి నెమలి గుడ్డు రసంలో రంగులు లాగా, కలిసి పోయి వున్నాయి – అనిపిస్తోంది. మీ ఉద్దేశ్యం అదేనా?

**వశిష్ఠుడు**: (48వ సర్గ) కానే కాదు. నువ్వు చెప్పే బీజశక్తి పేరు 'అవ్యాకృతం'. నేను చెప్పే పరబ్రహ్మ దానిని దాటింది. అవ్యాకృతాన్నే, 'మాయా శబల బ్రహ్మ' అని కూడా అంటారు. నేను చెప్పేది దాన్ని దాటిన శుద్ధ పరబ్రహ్మ. యోగభూమికలలో, సత్త్వ భూమికకు వచ్చినవారు మాత్రమే, దీనిని విస్పష్టంగా దర్శించగలరు. ఈ పరిశుద్ధ పరబ్రహ్మలో ఏ రకమైన భేదాల ప్రసక్తీ లేదు.

### 33. కార్యోత్పత్తి విధానాలు ఐదు

**శ్రీరాముడు**: (49వ సర్గ) గురుదేవా! భేదాలు మూడు రకాలని పెద్దలు చెబుతున్నారు. ఒకటి, సజాతీయ భేదం(ఆవులలో తెల్లావు.) రెండు, విజాతీయ భేదం(ఆవు వేరు, మేక వేరు.) స్వగత భేదం (ఆవులో, ఆవు కొమ్ములు) – అని. వీటినే 'త్రివిధ పరిచ్ఛేదాలు' అంటున్నారు. మీరు ఒక పక్కేమో పరబ్రహ్మలో ఈ త్రివిధ పరిచ్ఛేదాలలో ఏ ఒక్కటీ లేదంటున్నారు. మరో పక్క, ఈ భేదాలన్నీ వున్న ప్రపంచం దాంట్లోనే కనిపిస్తుంది అంటున్నారు. ఈ భేదాలు మూల పదార్థంలో లేనే లేక పోతే, భేదాలున్న ప్రపంచం మనకెలా కనిపిస్తోంది?

**వశిష్ఠుడు**: రామా! ఈ జగత్తుకు పరమకారణం పరబ్రహ్మే అని, నేను మాట వరుసల్లో, ఎక్కడో అన్నాను. అందువల్ల, నీకీ సందేహం కలుగుతోంది. ఒక కారణంలోంచి, ఒక కార్యం పుట్టడం ఎన్ని రకాలుగా వుంటుందో, కొంచెం ఆలోచించు. అది ఐదు రకాలుగా వుంటుంది.

అతిరోహిత ప్రాగవస్థము. మట్టి ముద్ద కుండగా తయ్యారైంది. ఇక్కడ మట్టిముద్ద ప్రాగవస్థ, కుండ ఉత్తరావస్థ. కుండ ఏర్పడినంత మాత్రాన మట్టిదనం పోలేదు. తిరోహితం కాలేదు. కనుక, ఈ రకమైన కార్యోత్పత్తి ప్రక్రియపేరు అతిరోహిత ప్రాగవస్థం.

రెండు – ప్రతిబద్ధ ప్రాగవస్థము. నీరు మంచు గడ్డగా మారింది. ఇప్పుడు నీటి ఆకారం కనిపించనే కనిపించదు. మంచుగడ్డలో నీటితనం లేదని చెప్పలేం. నీటి తనం అడ్డగింప బడింది. (ప్రతిబద్ధమైంది) – అని మాత్రమే అనగలం. అందుకే, ఈ పద్ధతి పేరు ప్రతిబద్ధ ప్రాగవస్థం.

మూడు – ప్రచ్ఛన్న ప్రాగవస్థము. తాడు, పాముగా కనిపించింది. ఇక్కడ ప్రాగవస్థ ఐన తాడుతనం కప్పివేయబడింది. (ప్రచ్ఛనమైంది). అందుచేత ఇది ప్రచ్ఛన్న ప్రాగవస్థం.

నాలుగు–అప్రచ్ఛన్న ప్రాగవస్థం. నీరు, తరంగంగా మారింది. ఇక్కడ, తరంగ రూపం కనిపిస్తున్నప్పుడు కూడా, ప్రాగవస్థ ఐన నీటియొక్క స్వరూపం, స్పష్టంగా, (అప్రచ్ఛన్నంగా) కనిపిస్తూనే వుంది. అందువల్ల ఈ పద్ధతి పేరు అప్రచ్ఛన్న ప్రాగవస్థం.

ఐదు– వినష్ట ప్రాగవస్థం. పాలు పెరుగుగా మారాయి. ఇక్కడ ప్రాగవస్థ ఐన పాలు పూర్తిగా లేకుండా పోయాయి. (వినష్టమైపోయాయి.) అందువల్లే ఈ పద్ధతి పేరు వినష్ట ప్రాగవస్థ.

రామా! ప్రపంచంలో ఎక్కడ కార్యోత్పత్తి జరిగినా, ఈ ఐదింటికీ మించి వేరే పద్ధతి లేనే లేదు.

ఈ ఐదింటిలో చిట్టచివరిదైన వినష్ట ప్రాగవస్థకే మరో పేరు పరిణామం. మరో పేరు సంస్కారం. మరో పేరు వికారం. దీనిలో, మూల పదార్థం ఇక మళ్ళీ కనిపించదు. మిగిలిన నాలుగు రకాలకూ కలిపి వివర్తమని పేరు.

ఇప్పుడు పరబ్రహ్మలోంచి 'జగత్తు' అనే కార్యం పుట్టిందని మనం అన్నప్పుడు, ఈ ప్రక్రియల్లో ఏ ప్రక్రియ ద్వారా పుట్టిందో కొంచెం ఆలోచించు.

ఆది మధ్యాంతాలలో ఎప్పుడూ ఎక్కడా గూడా పరబ్రహ్మలో ఏ రకమైన వికారమూ లేదు. కనుక మధ్యలో కనిపించే ఈ ప్రపంచార్భాటం అంతా కేవలం వివర్తం మాత్రమే – అందువల్లే ఇది భ్రాంతి మాత్రమే.

కనుకనే ఈ ప్రపంచం బ్రహ్మకు అంటదు.

**శ్రీరాముడు**: మధ్యలో వచ్చింది ఐతే మాత్రం అంటదని ఎలా చెప్పగలం?

**వశిష్ఠుడు**:

**యాదృగాద్యన్తయోర్వస్తు**
**తాదృగేవ తదుచ్యతే ।**
**మధ్యే యస్య యదన్యత్వం**
**తదబోధ విజృంభితమ్ ॥** (పూర్వ. సర్గ. 49, శ్లో. 7)

లోకంలో ఎక్కడైనా చూడు. ఒక వస్తువు మొదట్లోనూ, చివర్లోనూ, ఒకే రకంగా కనిపించి, మధ్యలో కొంచెం సేపు మార్పు చెందినట్లు కనిపిస్తే, ఆ మార్పు అవిద్యవల్ల మాత్రమే ఏర్పడుతుంది. అందువల్ల, ఆ మార్పు అసలు వస్తువును ఏ మాత్రమూ అంటుకోజాలదు. రజ్జు సర్పభ్రాంతి మొదలైనవన్నీ దీనికి ఉదాహరణలే! కనుకనే, బ్రహ్మ అద్వితీయమూ, నిర్వికారమూ, అని మేము అంటున్నాం.

34. అవిద్య లేనే లేదు

**శ్రీరాముడు**: అలాంటి బ్రహ్మయందు అవిద్యకు ప్రసక్తి ఎలా వచ్చింది?

**వశిష్ఠుడు**:

> **బ్రహ్మ తత్త్వమిదం సర్వ**
> **మాసీదస్తి భవిష్యతి ।**
> **నిర్వికార మనాద్యన్తం**
> **నావిద్యాస్తీతి నిశ్చయః ॥**
> **యస్తు బ్రహ్మేతి శబ్దేన**
> **వాచ్య వాచకయోః క్రమః**
> **తత్రాపి నాన్యతాభావ**
> **ముపదేష్టుం క్రమోహ్యసౌ ॥** (పూర్వ. సర్గ. 49, శ్లో 11,12)

రామా! అవిద్య అనే సత్య పదార్థం ఒకటి నిజంగా వుండి వుంటే, నీ ప్రశ్న కుదిరి వుండేది. కానీ, ఈ పరబ్రహ్మ పరిపూర్ణం. అది నిన్నా వుంది, ఇవాళ్ళా వుంది, రేపూ వుంటుంది. అందువల్ల, అది నిర్వికారం. అది ఆద్యంత రహితం. అందువల్ల, అవిద్య అనేది లేనే లేదు. ఇది నిశ్చయం. మరైతే "బ్రహ్మ అనీ, దాని పక్కన అవిద్య అనీ, శబ్దాలు ప్రయోగించి మాట్లాడుతున్నారు గదా" – అని నువ్వు అంటావు. ఈ మాటలు గూడా, అవిద్య అనేది వేరుగా లేదని చెప్పడం కోసమే! ఇది బోధించడం కోసం ఏర్పాటు చేసిన పద్ధతి. అంటే, బ్రహ్మ ఒక్కటే వున్నదనీ, అది నిర్వికారంగా వుందనీ, అర్థమయ్యేటట్లు చెప్పడంకోసం, మధ్యలో అవిద్య అనే పదాన్ని సృష్టి జేసి, దాని ద్వారా కొంత ప్రక్రియను బోధించి, దాని ద్వారా బ్రహ్మయొక్క అద్వితీయత్వాన్ని స్థాపిస్తున్నాం. మేము పదాన్ని కల్పిస్తే, నువ్వు అదొక పదార్థం అనుకొని ఆలోచిస్తే ఎలా?

**శ్రీరాముడు**: గురుదేవా! మీరు ఉపశమ ప్రకరణంలో ప్రధాన భాగమంతా అవిద్యా స్వరూపాన్ని వర్ణించడానికి వినియోగించారు. ఆ ప్రకరణంలో కేంద్ర బిందువైన గాధి చరిత్రలో గాధిమహర్షి మాయను నాకు చూపించమని విష్ణుమూర్తిని వరం కోరితే, ఆయన సరే అన్నాడు. అదే ప్రకరణంలో నిన్న మీరు మాట్లాడుతూ

**"యథా భ్రాన్తి రవిద్యేయం –తథేత్థం చ విచార్యతే"**

(భ్రాంతి స్వరూపమైన ఈ అవిద్య ఎలా వుంటుందో, దానిని విచారణ చేసి చెబుతున్నాను.) అన్నారు. అంటే, అక్కడ మీరు అవిద్య ఉన్నదని అంగీకరించినట్లే గదా! ఇప్పుడు, ఇక్కడ ఇలా మాట్లాడుతున్నా రేమిటి?

**వశిష్ఠుడు**: రామా! అప్పటికి నీవు అజ్ఞాన స్థితిలో ఉన్నావు. అలాంటి నీకు తత్వాన్ని బోధించవలసిన స్థితి మాకు పట్టింది. అందుచేత, నీ బుద్ధిని అనుసరించి మేము కొన్ని కల్పనలు చేయవలసి వచ్చింది. అందుకోసమే ఇది అవిద్య, ఇది జీవుడు, అంటూ కొంత యుక్తి జతచేసి, నీకు బోధించాము.

ఒక ఊళ్ళో, ఒక శుద్ధ వెర్రిమొద్దున్నాడు. నాబోటి గురువొకడు వాడి దగ్గరకు వెళ్ళి, " ఈ ప్రపంచంలో ప్రతి వస్తువూ పరమాత్మేరా!" అని బోధించాడు. కొంత కాలానికి, ఆ తెలివి తక్కువవాడికి, ఓ వంద రూపాయిలు అప్పు కావాలసి వచ్చింది. వాడు ఊరు బయట వున్న ఎండు మోడు దగ్గరికి వెళ్ళి, "ఓ దుంగా! నువ్వు పరమాత్మవే గదా!" అంటూ తన కష్టాలన్నీ చెప్పుకొని, ఓ వంద రూపాయలు అప్పివ్వమని అడిగాట్ట!

తెలివి తక్కువవాళ్ళకు సాక్షాత్తుగా మహా వాక్యాలు ఉపదేశిస్తే పరిస్థితి ఇలాగే వుంటుంది. అందుకనే, పెద్దలు ఉపదేశానికి కొన్ని క్రమాలు ఏర్పాటు చేశారు. 'ఏర్పాటు చేశారు' అంటే ఏమిటి? కల్పించారు అన్నమాట. కల్పించామన్నవారు ముందరే కల్పించామని చెబుతారా? ఆ కల్పనల ద్వారా తాము సాధించ దలచుకున్నది అంతా సాధించిన తరువాత, ఇది కల్పన అని చెప్పకుండానే శిష్యుడికి అర్థమైపోతుంది. అందుకే, ఉపశమ ప్రకరణంలో, నేను మాయాతత్వాన్ని గురించి అంత చర్చ చేశాను. కనుక రామా! నువ్వు అవిద్యను సత్యం అనుకోవడం మానేసెయ్యి. మనస్సులో గల అవిద్యాసంస్కారాలను తొలగించుకొని, అద్వితీయాత్మానంద స్థితిలో వుండిపో.

***శ్రీరాముడు***: గురుదేవా! మీ అనుగ్రహంవల్ల నాకు పరిపూర్ణ స్థితి లభించింది. సందేహాలు లేవు. లోకులకోసం సందేహాలు అడగమన్నారు గనుక, ఒకటి అడుగుతాను.

ఒకడికి ఇప్పుడే ప్రాణం పోయింది. ఇంద్రియ గోళాలన్నీ బాగానే వున్నాయి. కానీ, ఆ ఇంద్రియాలు ఏ విషయాన్నీ గ్రహించడం లేదు. కన్ను చూడదు, చెవి వినదు. అన్నీ ఇంతే. వాడు బ్రతికి వున్నప్పుడు అంత బాగా పని చేసిన ఆ ఇంద్రియాలు ఇప్పుడు ఇలా ఎందుకు ఐపోయాయి?

### 35. పుర్యష్టకము

***వశిష్ఠుడు***: రామా! ఇంద్రియాలు, చిత్తం, ఘట పటాది పదార్థాలు, ఇలాంటివి ఏవీ గూడా నిర్మలమైన చైతన్యంకంటే భిన్నంగా వేరే అస్తిత్వం కలవి కావు. ఆకాశం కంటే సూక్ష్మమైనది 'చిత్' తత్వం. అలాంటి ఆ చిత్తు, తన పూర్వపూర్వ వాసనలను అనుసరించి, పుర్యష్టకంగా రూపొందింది. (జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, ప్రాణపంచక, భూత పంచక, అంతఃకరణ చతుష్టయ, అవిద్యా కామ కర్మలు – ఎనిమిందిటికి కలిపి పుర్యష్టకమని పేరు.) ఆ పుర్యష్టకమే ప్రకృతిగా, దానిలో వుండే అవయవాల సంయోజన విశేషంచేత ఇంద్రియాది ఘటాది రూపమైన ఈ ప్రపంచమంతా పుట్టింది. ఈ విషయాన్నే –

**మాయాం తు ప్రకృతిం విద్యాత్**
**మాయినం తు మహేశ్వరమ్ ।**
**అస్యావయవ భూతైస్తు**
**వ్యాప్తం సర్వ మిదం జగత్ ॥** (ఉపనిషద్వాక్యం)

(మాయయే ప్రకృతి. దానికి ఆశ్రయం పరమాత్మ. మాయయొక్క అవయవాల చేతనే ఈ ప్రపంచమంతా వ్యాపింపబడి వుంది.)– అనే శ్రుతి నిరూపిస్తోంది. అందువల్ల, ఆ పుర్యష్టకంలో భాగమైన చిత్తంలో పుట్టే చిత్తవృత్తి, దానిలో భాగమైన ఘటపటాది బాహ్య పదార్థాలను మాత్రమే ప్రతిబింబిస్తుంది. అలా ప్రతిబింబిస్తే, ఆ ఇంద్రియాలు ఆ పదార్థాలను చూస్తున్నాయని మనం అంటాము.

మృత శరీరం దగ్గరికి వచ్చేసరికి, అక్కడి పుర్యష్టకంతో కూడిన జీవాత్మ, ఆ శరీరాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోయాడు కనుక, ఈ వెళ్ళి పోవడమనేది గూడా వాడు చేసుకొనే కల్పనలలో ఒక కల్పనే గనుక, అప్పటి వాడి చిత్త వృత్తి తను కల్పించుకున్న నూతన పదార్థాలను ప్రతిబింబిస్తుందే గాని, పాత పదార్థాలను ప్రతిబింబించదు. అందు చేత, వాడి పాత శరీరంలో వున్న ఇంద్రియాది గోళాలకు దర్శనాది క్రియలను చేసే సామర్థ్యం వుండదు.

ఇంద్రియం వేరు, ఇంద్రియ గోళం వేరు. మృత శరీరంలో ఇంద్రియ గోళం వుంటుంది. ఇంద్రియం, పుర్యష్టకంలో భాగం కనుక వెళ్ళి పోయింది. కనుకనే, మృత శరీరంలో ఏ రకమైన క్రియలూ కనిపించవు.

**శ్రీరాముడు**: గురుదేవా! మీరు చెప్పిన దానిని బట్టి, వేల వేల ప్రపంచాలను సృష్టించే మహిమ గల దర్పణమే పుర్యష్టకం! దాని స్వరూపాన్ని మరి కొంచెం వివరించండి. ఇలా ఎందుకు అడుగుతున్నానంటే, ఈ ప్రపంచం స్థూల పంచభూతాలవల్ల ఏర్పడింది. మీరు చెప్పే పుర్యష్టకంలో భాగమైన 'చిత్తం' సూక్ష్మ పంచ భూతాలవల్ల ఏర్పడింది. సూక్ష్మమైన చిత్తం, స్థూలమైన ప్రపంచాన్ని ప్రతిబింబిస్తుందని మీరంటున్నారు. అందుచేత, అసలు ఆ పుర్యష్టకం ఏమిటో కొంచెం వివరించమని అడుగుతున్నాను.

**వశిష్ఠుడు**: రామా! ఉత్పత్తి ప్రకరణం ప్రారంభంనుంచీ 14వ సర్గ దాకా, జగదుత్పత్తి క్రమాన్ని వివరించి వున్నాను. నిర్గుణ పరబ్రహ్మలోంచి సూక్ష్మ పంచభూతాలు పుట్టాయనీ, వాటిలో పంచీకరణ ప్రక్రియ జరిగి తద్వారా స్థూల పంచభూతాలు పుట్టాయనీ, వాటిలోంచి బ్రహ్మాండం అంతా పుట్టిందనీ, ఆ బ్రహ్మాండం మొత్తం నా శరీరమే అని అభిమానించే చైతన్యానికి సూత్రాత్మ, ప్రాణాత్మ, హిరణ్య గర్భుడు వంటి పేర్లు ఏర్పడతాయనీ, ఆ బ్రహ్మాండంలో భాగంగా వుండే దేవతా మనుష్యాది శరీరాలను 'నేను' అని అభిమానించే చైతన్యానికి 'జీవుడు' అనే పేరు ఏర్పడుతుందనీ, అక్కడ చెప్పాను. అంతేగాక, ఆ చైతన్యమే నేను అనే అహంకార భావనచేత అహంకారమనే పేరునీ, ఆలోచించడం అనే భావనచేత (మనన భావనచేత) మనస్సు అనే పేరునీ, నిశ్చయ భావనచేత బుద్ధి అనే పేరునీ, ఇంద్రియ భావనచేత ఇంద్రియమనే పేరునీ, దేహభావనచేత దేహమనే పేరునీ, "కుండ" భావనచేత కుండ అనే పేరునీ, బండ అనే భావనచేత 'బండ' అనే పేరునీ, పొందుతుంది. ఈ ప్రక్రియలో చైతన్యానికి మధ్యలో జీవుడనే పేరు వచ్చింది గనుక, ఇక ఆ పేరుతోనే వ్యవహారం చేసుకుంటూ పోతే, జ్ఞానేంద్రియాలు పని చేసినప్పుడు ఈ జీవుడినే 'జ్ఞాని' అంటారు. కర్మేంద్రియాలు పని చేసినప్పుడు, వీడినే 'కర్త' అంటారు. తత్ఫలితంగా, సుఖదుఃఖాలను అనుభవించినప్పుడు 'భోక్త' అంటారు. ఇవేవీ పట్టించుకోకుండా పోయినప్పుడు వీడినే 'సాక్షి' అంటారు.

సామాన్య జీవులంతా సముద్రాల తరంగాల మీద తేలియాడే కట్టెపుల్లల్లాగా, సుఖదుఃఖ ప్రసంగాలలలో పైకీ కిందికీ తిరుగుతూనే వుంటారు. సనకాది విశిష్ట జీవులు మాత్రం ఈ కల్పంలోని మొదటి జన్మలోనే ఆత్మ జ్ఞానాన్ని సంపాదించుకొని, సుఖదుఃఖ స్పర్శ లేకుండా నిశ్చలంగా వుంటున్నారు. మరికొందరు మధ్యమస్థాయి జీవులు అనేక వేల జన్మల కృషి చేసి ముక్తిని అందుకుంటున్నారు. ఇలా క్రమముక్తికి కారణమైన అజ్ఞాన భూమికలను, జ్ఞాన భూమికలనూ గూడా, నేను ఉత్పత్తి ప్రకరణంయొక్క చివరి భాగంలో (116వ సర్గ ప్రాంతంలో) బాగా వివరించాను.

స్థూలమైన ఈ ప్రపంచం, సూక్ష్మమైన చిత్త దర్పణంలో ఎలా ప్రతిబింబిస్తుందని నువ్వు సందేహిస్తున్నావు. నీ ప్రశ్నకు భావం ఏమిటంటే- లోపల వుండే జీవుడు చైతన్య స్వరూపుడు. బైట వుండే కుండా, బండా వంటి పదార్థాలు పూర్తిగా జడాలు. వీటిని చూపించే ఇంద్రియాలు కూడా జడాలే. కనుక ఈ జడ చేతనాలకు సంబంధం ఎలా కుదురుతుంది- అని.

రామా! జాగ్రత్తగా ఆలోచించు. నేను చెప్పిన ప్రక్రియ ప్రకారం సర్వ వ్యాప్తమైన చైతన్యం ఒకానొక పుర్యష్టకాన్ని కల్పించుకొని, దానిలోకి తాను ప్రవేశించానని కల్పించుకొని, ఆ పుర్యష్టకాన్ని మాత్రమే తనకు కొలత పాత్రగా పెట్టుకొని, "నేను దీనిలో ఆపాదమస్తకం వ్యాపించి ఉన్నాను. దీన్ని దాటి లేను" అనే భ్రాంతిలో పడిపోయింది. అందుచేత, ఈ దేహాంతర్గతమైన చైతన్యం జీవించటం అనే ఒక నూతన ధర్మానికి ఆశ్రయం ఇచ్చింది. ఈ జీవ ధర్మంచేత నేను బ్రతికి వున్నాను అని భావిస్తోంది. ఈ భావన నిలిచి వున్న సమయంలో, తనకు సంక్రమించే సుఖదుఃఖాలను దేహం లోపల వుండే అనుభవిస్తోంది. సుఖదుఃఖ అనుభవాల కోసం ఇది దేహాన్ని దాటి, బయటికి రావడం లేదు.

కానీ, సుఖదుఃఖాలు లేకుండా, ఇది వట్టిగా కూర్చోలేదు. దీనికి సంస్కార బలమే కారణం.అందువల్లే, అప్పుడప్పుడు ఈ దేహాంతర్గత చైతన్యం, ఇంద్రియాలనే కాలువల ద్వారా బయటికి ప్రవహించి, కుండా బండా వంటి పదార్థాలను చేరి, ఆయా పదార్థాలను నేను చూస్తున్నాననే భావాన్నీ, తద్వారా సుఖదుఃఖాలను, శరీరం లోపల కట్టుబడి వున్న జీవ చైతన్యానికి అందిస్తోంది. ఈ ప్రక్రియను నేను ముముక్షు వ్యవహార ప్రకరణంలో, ప్రత్యక్ష ప్రమాణం అనే శీర్షిక క్రింద విస్తారంగా వివరించాను.

కనుక జీవించి వున్నాననే భావం గల జీవియొక్క శరీరంలో వుండే ఇంద్రియాలు) చైతన్య సంపర్కాన్ని పొంది, జడాలైన ఘటాదులకు కూడా చైతన్య సంపర్గం కలిగించి, ఘటాది విషయాలను అనుభవింప జేస్తున్నాయి. ఇది నేను జీవించి వున్నాను అనే భావం ఉన్నంతవరకే సాగుతుంది. నేను మరణించానని అనుకున్నాక, ఈ ప్రక్రియ సాగదు.

### 36. స్వప్న సుషుప్తులు రెండే అవస్థలు

**శ్రీరాముడు**: గురుదేవా! మీ సమాధానం అంతా బింబ ప్రతిబింబ భావంమీద ఆధారపడి వుంది.లోకంలో చూస్తే, అద్దంలో, నీళ్లలో, రత్నాలమీద, అనేక చోట్ల బింబ ప్రతిబింబాలు కనిపిస్తున్నాయి. ఇంతకూ "బింబం" అంటే ఏమిటి? "ప్రతిబింబం" అంటే ఏమిటి? వాటి స్వరూపం వివరించండి.

**వశిష్ఠుడు**: రామా! నీ ఆలోచన లోతుగా వుంది. బింబం సత్యమైతే ప్రతిబింబం కూడా ఎంతో కొంత సత్యమే కావచ్చు గదా అని ఆలోచిస్తున్నావు! అది ఎప్పటికీ కుదరదు. సందర్భం ఏదైనా సరే, ప్రతిబింబం అనేది మిథ్య మాత్రమే. దానిమీద సత్యమనే ఆలోచనను పెట్టుకోబోకు.

ఈ సృష్టి క్రమాన్ని గురించి నీకు ఉత్పత్తి ప్రకరణం 12,13 సర్గలలో వివరించి వున్నాను. జగజ్జీవ హిరణ్యగర్భులు ముగ్గురూ సంకల్ప స్వరూపులే అని అక్కడ నిరూపణ చేసి వున్నాను. ఈ సృష్టి సంకల్పానికి కారణమైన అవిద్యయొక్క స్వరూపాన్ని స్థితి ప్రకరణంలో బహుముఖాలుగా వివరించి, ఈ ప్రపంచం అంతా, క్రమబద్ధమైన బ్రహ్మ వివర్తమని నిరూపించాను.

ఆ క్రమంలో వాసనాబలంచేత, వాసనల వైచిత్ర్యంచేత, జీవుడు ఒక స్వప్నంలోనుంచి మరో స్వప్నంలోకి వెళ్లినట్లుగా, ఒక దేహంలోంచి మరో దేహంలోకి వెళ్తున్నాడు. ఇదంతా వివర్తంలో భాగమే గనుక, జన్మ పరంపరలతో కూడిన ఈ జాగ్రత్ప్రపంచమంతా స్వప్న తుల్యమే అని నేను పూర్వమే ప్రతిపాదించాను. అదీ గాక, ఈ జాగ్రత్ప్రపంచమంతా హిరణ్యగర్భుడి మనోరాజ్యమే అని కూడా నేను ఉత్పత్తి ప్రకరణం ప్రారంభంలో (మూడవ సర్గలో) వివరించాను.

లోకంలో జాగ్రత్ స్వప్న సుషుప్తులనే అవస్థలు వున్నాయనే ప్రసిద్ధి వుంది. కానీ బాగా ఆలోచించి చూస్తే, రెండే అవస్థలు – స్వప్నము, సుషుప్తి అని.

**వస్తు దృష్టమదృష్టం చ**
**స్వప్నే సమనుభూయతే ।**
**జీవస్వప్నే జగద్రూపం**
**విద్ధి వేద్యవిదాం వర ॥** (పూర్వ.సర్గ. 51, శ్లో. 44)

నువ్వు చూసే ఈ ప్రపంచమంతా కూడా ఒక స్వప్నమే! దానిలో భాగంగా మరో స్వప్నం వుంది. ఈ

రెండింటికీ తేడా తెలియడం కోసం మొదటి దాన్ని 'జాగ్రత్తు' అన్నారు. అలా అనడంవల్ల అది నిజంగానే 'సత్యమేమో' అన్న భ్రాంతి కలుగుతోంది. కనుక నేను ఆ జాగ్రత్తును 'జీవ స్వప్నం' అంటున్నాను. దానిలో అంతర్భాగమైన స్వప్నాన్ని 'మృత స్వప్నం' అంటున్నాను. నిద్ర అనేది సగం మరణం కనుక, నిద్రలో వచ్చే స్వప్నాన్ని మృత స్వప్నం అంటున్నాను. దానితో కలిపి ప్రపంచం మొత్తం అంతా ప్రథమ జీవుడైన హిరణ్య గర్భుడి స్వప్నం గనుక, దానిని జీవస్వప్నం అంటున్నాను. కనుక రామా! నీకు కనిపించే ఈ ప్రపంచం అంతా జీవస్వప్నంలో అంతర్భాగమని తెలుసుకో. కనుకనే, ఇంతకుముందు చూసిందే , చూడనిదీ – అన్నీ దీంట్లో కనిపిస్తూ వుంటాయి. వేదం గూడా –

**దృష్టం చ అదృష్టం చ**
**శ్రుతం చ అశ్రుతం చ**
**అనుభూతం చ అననుభూతం చ**
**సర్వం పశ్యతి ॥**

(అంతకుముందు చూసినదానినీ, చూడనిదానినీ, వినినదానినీ, విననిదానినీ, అనుభవించినదానినీ, అనుభవించని దానినీ, అన్నింటినీ ఈ స్వప్నంలో చూస్తాడు) అని చెబుతోంది. కనుకనే, శరీరం పోయిన తరువాత అంతకుముందు చూసెరుగని దేవ శరీరం పుట్టడం లాంటివి ఎన్నో జరిగి పోతున్నాయి. ఇవన్నీ వాసనల ప్రభావాలే. ఇక్కడ 'అదృష్టం' అంటే ఈ జన్మలో చూడబడనిది అని మాత్రమే అర్థం చెప్పాలి. ఎందుకంటే ఈ అనాది జన్మ పరంపరలో ఎప్పుడో ఒకసారి అనుభవింప బడని పదార్థం అంటూ వుండదు. అనుభవింప బడక పోతే అది వాసనగా మొలకెత్తే సావకాశం లేదు. కనుక ఈ మంత్రంలో "అదృష్టం" మొదలైన పదాలకు ఇలాగే అర్థం చెప్పుకోవాలి.

***శ్రీరాముడు***: ఐతే, గురుదేవా!ఈ వాసనలలో భాగంగా వుండే వేదాంత వాక్యాల శ్రవణంవల్ల కలిగే మోక్షం గూడా, ఇలాంటి స్వప్నంలో భాగమే అవుతుంది గదా! అలాంటప్పుడు 'మోక్షం సత్యం' అనే మాట ఎలా కుదురుతుంది?

***వశిష్ఠుడు***: అది సరి గాదు. మోక్షం అంటే బ్రహ్మ భావం. అది ఎప్పుడైనా ఒక సారి జీవ స్వప్న దశలో అనుభవింప బడి వుంటే, అప్పుడది వాసనా రూపంగా ఉద్బుద్ధమై, మోక్ష రూపంగా ఆవిర్భవించిందనీ, అందువల్ల అది స్వప్న రూపమనీ చెప్పవచ్చు. కానీ, బ్రహ్మానుభవ స్థితి ఏ జన్మలోనూ, ఏ దశలోనూ, ఏ ఒక్కడికీ, అనుభవంలోకి వచ్చిన విషయం కాదు. ఒక సారి అనుభవించ బడిన విషయం రెండవ సారి వాసనగా తలెత్తితే ఎత్తవచ్చు. కానీ, ఎప్పుడూ అనుభవంలోకి రానిది వాసనగా రూపొంద జాలదు. అందువల్ల బ్రహ్మమయత్వం అనేది వాసనారూపం కావడానికి వీలు లేదు. కనుకనే అది స్వప్నం కావడానికి వీలు లేదు. అందువల్ల మోక్షం సత్యమూ, శాశ్వతమూ అనడంలో సందేహం లేదు.

మోక్షం వస్తే తప్ప, జీవుడికి ఈ దేహాదులతో సంబంధం తప్పదు. కష్టపడి స్థూల దేహాన్ని వదిలించుకున్నా, పుర్యష్టకం మాత్రం వదిలి పెట్టదు.

**మనో బుద్ధి రహంకార**
**స్తథా తన్మాత్ర పంచకమ్।**
**ఇతి పుర్యష్టకం ప్రోక్తం**
**దేహోఽసావాతివాహకః ॥** (పూర్వ. సర్గ. 51, శ్లో.50)

మనస్సు, బుద్ధి, అహంకారం, పంచతన్మాత్రలు – ఈ ఎనిమిది కలిస్తే పుర్యష్టకం. ఇదే లింగ శరీరం. ఇదే ఆతివాహిక దేహం. దీనికి మోక్షం వచ్చే దాకా నాశనం లేదు.

(గమనిక – ఉత్పత్తి ప్రకరణంలో లీలోపాఖ్యానంలో ఆతివాహిక దేహం అనే మాట చాలా సార్లు వచ్చింది. ఈ వివరణను అక్కడకు సమన్వయించుకోవాలి)

***శ్రీరాముడు***: గురుదేవా! ఇదేమిటి? శాస్త్రంలో, లోకంలో, అందరూ చెప్పే పుర్యష్టకం వేరుగావుంది.మీరు చెప్పేది వేరుగావుంది. లోకంలో అంతా – (1) జ్ఞానేంద్రియ పంచకం (2) కర్మేంద్రియ పంచకం (3) ప్రాణ పంచకం (4)స్థూల భూత పంచకం (5) అంతఃకరణ చతుష్టయం (6) అవిద్య (7) కామం (8) కర్మ – ఈ ఎనిమిదీ కలిస్తే 'పుర్యష్టకం' అంటున్నారు. మరి మీరు మరోలా చెబుతున్నారు. ఇదేమిటి?

***వశిష్ఠుడు***: రెండూ ఒకటేనయ్యా! నేను చెప్పింది పుర్యష్టకంయొక్క "అమూర్తావస్థ" అంటే, సూక్ష్మావస్థ. దాని పేరే లింగ రూపావస్థ. వీటిలో వుండే తన్మాత్రలు గట్టిపడి స్థూలమైన కొద్దీ, నువ్వు చెప్పిన పుర్యష్టకం ఏర్పడుతుంది.

***శ్రీరాముడు***: కోటి ఆకాశాలను కలిపితే మాత్రం బండరాయి తయారవుతుందా? మీరు చెప్పే సూక్ష్మ పుర్యష్టకానికి, స్థూలత్వం ఎలా సంభవిస్తుంది?

***వశిష్ఠుడు***: సంభవించే సావకాశం లేదు గనుకనే, సూక్ష్మ పుర్యష్టకం మీద స్థూల పుర్యష్టక భావన, దాని మీద స్థూల దేహ భావన, ఇలాంటివన్నీ ప్రాతిభాసికాలని మేము అంటున్నాము. మోక్షంవల్ల నశించవలసినది సూక్ష్మ బంధమే కానీ, స్థూలబంధం కాదు. అందుకనే, పుర్యష్టకాన్ని నేను అలా నిర్వచించాను.

***శ్రీరాముడు***: బంధాలలో కూడా భేదాలున్నాయా?

***వశిష్ఠుడు***: లేకేమి? బంధాలు రెండు రకాలు. ఒకటి కారణావస్థా రూపం. అవిద్యయే దీని స్వరూపం. రెండు, కార్యవస్థా రూపం. నేను చెప్పిన లింగ దేహమే దీని స్వరూపం.

నువ్వు చెప్పే స్థూల దేహాత్మకమైన స్థూలతమ బంధం వుందే, దానిని గురించి మనం చర్చలు చేయనక్కర్లేదు. ఎందుకంటే, ఆ స్థూల దేహం ఎప్పటికప్పుడు బూడిదవుతూనే వుంది. ఐనా, మోక్షం రావడం లేదు. అంతే గాక, ఒకడికి మోక్షం వచ్చినా, స్థూల దేహానికి కారణమైన స్థూల ప్రపంచం నశించి పోదు. నశించేది బంధం మాత్రమే. కనుకనే, మోక్ష శాస్త్రంలో స్థూల దేహాన్ని గురించిన చర్చ పెద్దగా వుండదు.

ఈ విధంగా నిష్కర్ష చేసుకుంటూ వెడితే, జీవుడికి అవస్థలు రెండే. 'స్వప్నం, సుషుప్తి' – అని. ఈ విషయం నీకు పూర్వమే వివరించాను.

ఈ స్వప్న సుషుప్త్య వస్థలలో, స్థావర జంగమాకారాలతో తిరిగేది, ఆతివాహిక దేహమే. అందుకే, నేను దీనిని అలా నిర్వచించాను.

ఇక తత్వజ్ఞానంవల్ల కలిగే ముక్తి గూడా, రెండు రకాలు. ఒకటి జీవన్ముక్తి. దీనికే మరో పేరు తురీయావస్థ. రెండవది విదేహముక్తి. తురీయాతీతావస్థ ఇదే.

ఈ రకమైన ముక్తులు కలగాలంటే వాసనలవల్ల పుట్టిన ప్రపంచంమీద వుండే ఆసక్తిని పరిత్యజించాలి.

దీనినే 'అసంసక్తియోగం' అంటారు. రాబోయే ద్వాపర యుగాంతంలో అర్జునుడికి శ్రీకృష్ణ పరమాత్మ దీనినే ప్రధాన యోగంగా ఉపదేశించ బోతున్నాడు.

(**గమనిక** –ఈ 51వ సర్గలో సిద్ధాంత చర్చ చేసిన వశిష్ఠమహర్షి, 52వ సర్గనుంచి రాబోయే భగవద్గీత మీద చర్చ చేయబోతున్నాడు. దానిలోకి మనం ప్రవేశించే ముందర, 51వ సర్గలో జరిగిన చర్చల మెలికలు ఎలా వున్నాయో ఒకసారి సింహావలోకనం చేసుకోవడం మంచిది.)

## 37. లఘు సింహావలోకనం

50వ సర్గలో శ్రీరాముడు పుర్యష్టకం గురించి మరికొంత వివరించమని అడిగాడు. వశిష్ఠమహర్షి దానికి సమాధానం చెబుతూ, వుండగా 'బింబ ప్రతిబింబాలలో ఏది సత్యం' అని అడిగాడు. ఈ ప్రశ్నకు సమాధానం చెబుతూ వుండగా 51వ సర్గ ప్రారంభమైంది. ఈ సర్గలో వశిష్ఠమహర్షి ప్రతిబింబం ఎప్పుడూ అసత్యమేననీ, ఈ ప్రపంచమంతా ప్రతిబింబ స్థానీయమనీ, వివరించాడు. అలా ఐతే, ఈ ప్రపంచంలో భాగమైన వేదాంత బోధ, దానికి ఫలితమైన మోక్షం, అసత్యం ఎందుకు కావని శ్రీరాముడు ప్రశ్నించాడు. దానిమీద వశిష్ఠ మహర్షి మోక్ష మనేది ప్రతిబింబంలో భాగం కాదని నిరూపిస్తూ, శ్రీరాముడు పూర్వం అడిగిన పుర్యష్టక వివరణను కొనసాగిస్తూ, పుర్యష్టకాన్ని స్థూల సూక్ష్మ పుర్యష్టకాలుగా విభాగాలు చేసి చూపించాడు. ఆ తరువాత, సూక్ష్మ పుర్యష్టకంలోంచి, స్థూల పుర్యష్టకం రావడం అనేది కేవలం వివర్త రూపం అని కూడా వివరించాడు. అలా వివరించడంలో జీవులకు వుండే బంధం కూడా రెండు రకాలుగా వుంటుందని, స్థూల బంధంకన్నా సూక్ష్మ బంధమే ఎక్కువ ప్రమాదకారి అని, ప్రసక్తి వచ్చింది. దానిని కొన సాగించడంలో నిజానికి 'సుషుప్తి, స్వప్నాలని' రెండే రెండు అవస్థలనీ, 'జాగ్రత్తు' అనేది స్వప్నంలో భాగమేననీ, వశిష్ఠ మహర్షి వివరించాడు.

ఈ స్వప్న సుషుప్తులను దాటి, సుస్థిరంగా తురీయ స్థితిలో వుండిపోవాలంటే, దానికి అసంసక్తి యోగమే మంచి ఉపాయం అంటూ, వశిష్ఠ మహర్షి రాబోయే యుగంలో జన్మించబోయే కృష్ణార్జునుల గురించి ప్రసక్తి తెచ్చాడు. దీనితోనే 52వ సర్గ ప్రారంభమైంది. ఇక ముందుకు సాగుదాం...

**శ్రీరాముడు**: గురుదేవా! అర్జునుడు ఎవరు? శ్రీకృష్ణుడు ఎవరు? వాళ్ళు ఎప్పుడు జన్మించ బోతున్నారు? వారిలో శ్రీకృష్ణుడు అర్జునుడికి అసంసక్తి యోగాన్ని ఎందుకు ఉపదేశించాడు? ఎలా ఉపదేశించాడు?

**వశిష్ఠుడు**: రామా! ఇప్పుడు త్రేతాయుగం చివరికి వస్తోంది కదా. మరో యుగం దాటి ద్వాపర యుగం చివరికి వచ్చేసరికి, మితి మీరిన భూభారం తగ్గించడం కోసం, శ్రీమహావిష్ణువు రెండు రూపాలలో భూమి మీదికి దిగి రాబోతున్నాడు. వాటిలో మొదటిది పరిపూర్ణంగా విష్ణ వ్వంశతో కూడిన శ్రీకృష్ణ శరీరం. ఇది వసుదేవుడు అనే యదువంశ రాజు ద్వారా జన్మించ బోతున్నది. ఇక రెండవ శరీరం కొంత దేవేంద్రాంశతో కలిసి అర్జునుడు అనే పేరుతో, పాండురాజు అనే కురువంశరాజు ద్వారా జన్మించ బోతోంది.

వీరిలో అర్జునుడియొక్క అన్నగా యమధర్మరాజుయొక్క అంశ అవతరించ బోతున్నది. వీళ్లకు పెద తండ్రి కుమారుడు దుర్యోధనుడనేవాడు పుట్టబోతున్నాడు.

వారికీ, వీరికీ, రాజ్య విషయంలో అభిప్రాయ భేదాలు కలిగి, 18 అక్షౌహిణీల సేనతో మహా యుద్ధం ఒకటి జరుగబోతోంది.

ఆ యుద్ధ ప్రారంభంలో విష్ణువుయొక్క రెండవ శరీరమైన అర్జునుడిలో సామాన్య మానవ స్వభావం ప్రవేశించి, అది ధర్మభావన చేత ఉద్దీప్తమై, యుద్ధంవల్ల కలుగబోయే జీవ హింసను తెలుసుకొని, స్వజన వ్యామోహంతో, అతను దుఃఖంలో పడతాడు.

అప్పుడు కృష్ణ శరీరంలో పరిపూర్ణ జ్ఞానాత్మకుడై వున్న శ్రీమహావిష్ణువు ఆ యుద్ధరంగంలోనే తత్వబోధ చేశాడు.

## 38. భగవద్గీతోపదేశం

ఆయన తన ఉపదేశాన్ని కఠోపనిషత్తులోని రెండు బుక్కులతో ప్రారంభించబోతున్నాడు – అది ఏమిటంటే

అర్జునా! ఈ ప్రపంచంలో ఇంతమంది జీవులున్నారనీ, వీరిలో కొందరు జన్మిస్తున్నారనీ, మరికొందరు మరణిస్తున్నారనీ, నువ్వు అనుకుంటున్నావు. అది సత్యం కాదు. రకరకాలుగా కనిపించే ఈ జీవ శరీరాలన్నింటిలోనూ వ్యాపించి, ఒకే పరమాత్మ ఉన్నాడు. అతడు నిత్యుడు, నాశరహితుడు. అతడు శరీరి. ఈ కనిపించే శరీరాలన్నీ అతనివే! ఇవి మాత్రం అనిత్యాలు. ఇవి జన్మిస్తూ నశిస్తూ వుంటాయి. ఈ విషయాన్ని కఠోపనిషత్తు ఎంత స్పష్టంగా చెబుతోందో చూడు.

**న జాయతే మ్రియతే వా కదాచిత్**
**నాయం భూత్వా భవితా వా న భూయః।**
**అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో**
**న హన్యతే హన్యమానే శరీరే ॥**
**య ఏనం వేత్తి హంతారం**
**యశ్చైనం మన్యతే హతమ్ ।**
**ఉభౌ తౌ న విజానీతో**
**నాయం హన్తి న హన్యతే ॥** (పూర్వ ప్రకరణ సర్గ.52, శ్లో.36,37)

ఆ పరమాత్మ ఎప్పుడూ జన్మించనూ జన్మించడు, మరణించనూ మరణించడు. కొంతసేపు వుండి, కొంత సేపు లేకపోవడం అనేది ఆయనకు లేదు. ఎందుకంటే, ఆయనకు జన్మే లేదు! ఆయన నిత్యుడు. శాశ్వతుడు. వృద్ధిక్షయాలు లేని పురాణ పురుషుడు. ఈ శరీరంలో ఎన్ని మార్పులు వచ్చినా, ఆయనలో ఏ మార్పూ వుండదు.

సత్యం ఇలా వుంది గనుక, ఈ శరీరి సంహారక్రియాకర్త ఐన హంతకుడని గానీ, లేక సంహార క్రియకు గురియైన హతుడు అని గానీ, ఎవరైనా భావిస్తే, వాళ్ళు అజ్ఞానులే. ఎందుకంటే, ఆ పరమాత్మ ఎవరినీ సంహరించనూ సంహరించడు, ఎవరి చేతనూ సంహరింప బడనూ బడడు.

ఆ పరమాత్మ అనంతుడు. ఏకరూపుడు. ఆకాశం కంటే కూడ సూక్ష్మమైన సత్యరూపుడు. అలాంటి ఆ పరమేశ్వరుడికి నాశం ఎలా సంభవించ గలదు?

ఓ అర్జునా! " ఏ దోషాలూ లేని ఆ పరమాత్మను నేనే" అని నువ్వు తెలుసుకో. జన్మ లేని అజుడవు నువ్వే! నాశం లేని నిత్యుడవు నువ్వే! దుఃఖస్పర్శ లేని నిరామయుడవు నువ్వే!

(**గమనిక– "న జాయతే న మ్రియతే" "యే ఏనం వేత్తి"** అనే శ్లోకాలు భగవద్గీతలో రెండవ అధ్యాయంలో 20,19 శ్లోకాలుగా వున్నాయి. ఆ రెండు శ్లోకాలకు గల అన్వయక్రమాన్ని బట్టి, ఈ శ్లోకాల వరుసను మార్చి, వశిష్ఠ మహర్షి అందిస్తున్నాడు. మూలమైన కఠోపనిషత్తులో ఈ వరుస ఇలాగే వుంది. అక్కడి మంత్రాలనే, కొద్దిగా పదాలు మార్పు చేసి, శ్లోకాలుగా తయారు చేశారు. మహర్షుల శైలిలో ఇది మామూలే!)

***శ్రీకృష్ణుడు:*** కనుక అర్జునా! నువ్వు హంతకుడవు కాదు. 'సంహార క్రియా కర్తను నేనే' అనే అహంకార మాలిన్యాన్ని వదిలిపెట్టు. ఎందుకంటే, జనన మరణాలు లేని శాశ్వత పరమాత్మవు నువ్వే!

**యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే ।**
**హత్వా పి స ఇమాన్ లోకాన్ న హన్తి న నిబధ్యతే॥** (పూర్వ.సర్గ 53,శ్లో.17)

(భగవద్గీతలో ఇది 18వ అధ్యాయంలో 17వ శ్లోకం)

అహంకార పరిత్యాగంవల్ల వచ్చే ఫలితం ఏమిటో చెబుతా విను. ఎవడైతే, నేను కర్తననే అహంకారం పెట్టుకోకుండా వుంటాడో, ఎవడి బుద్ధిలో ఈ కర్మవల్ల వచ్చే ఫలితాలైన సుఖదుఃఖాలు అంటవో, అలాంటివాడు ఈ లోకాలను అన్నిటినీ చంపినా సరే, వాడు ఎవడ్నీ చంపడం లేదు. వాడికి ఏ రకమైన బంధమూ లేదు.

లోపల ఏ చిత్తవృత్తి జన్మిస్తుందో, బయట అదే అనుభవింప బడుతుంది. కనుక, "నేను ఇలాంటి వాడిని", "ఇది నాది", "అది నాది" "ఇది వచ్చి కలిసింది, ఇది తొలగి పోయింది" అని ఈ రకమైన చిత్త వృత్తులను పరిత్యజించు.

**స్వాత్మాంశైః క్రియమాణాని**
**గుణైః కర్మాణి భాగశః।**
**అహంకార విమూఢాత్మా**
**కర్తాహమితి మన్యతే॥** (పూర్వ. సర్గ 53, శ్లో5)

(ఈ శ్లోకం కొద్ది మార్పులతో భగవద్గీతలో 3వ అధ్యాయంలో 27వ శ్లోకంగా వుంది. భగవద్గీతలో – **ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః** – అని వుంది. ప్రకృతేః, సర్వశః – అనే రెండు పదాల దగ్గరే మార్పు)

తన ఆత్మలోని అంశల లాగా వుండి, ఆత్మకు భేదాలను కల్పించే సత్వాది గుణాలచేతనూ, దేహేంద్రియాది పరికరాల చేతనూ, ఏవేవో పనులు చేయబడుతూ వుంటే, ఆ సత్వాది గుణాలు, ఇంద్రియాదులు, 'నేనే' అనే భ్రాంతిలో పడిపోయి, జీవి "నేనే కర్తను" అని అనుకొంటున్నాడు.

కన్ను చూస్తోంది, చూడనీ. చెవి వింటోంది, విననీ. చర్మం స్పృశిస్తోంది, స్పృశించనీ. ముక్కు వాసన చూస్తోంది. చూడనీ. నాలుక రుచి చూస్తోంది, చూడనీ. ఇందులో నేనెక్కడున్నాను. నాకు వీటితో ఏ సంబంధమూ లేదు– అనేదే వాస్తవం!

ఇక మనస్సుంది. అది ఎప్పుడూ రకరకాల సంకల్పాదులను చేస్తూ వుంటుంది. దీనిలో మాత్రం, మహాత్ముడవైన నీకు ప్రవేశం ఎక్కడుంది? దాని క్లేశ భాగంతో నీకు సంబంధం ఏముంది?

అనేకమంది కలిసి ఓ పని చేశారు. వాళ్ళలో ఒకడు మాత్రం లేచి, ఇదంతా నేనే చేశానంటే, లోకం ఒప్పుకుంటుందా! అలాంటప్పుడు ఏ సంబంధమూ లేని నువ్వు లేచి, ఇదంతా నేనే చేశానంటే, లోకం నవ్వి పోదా?!

**కాయేన మనసా బుద్ధ్యా**
**కేవలై రింద్రియై రపి**
**యోగినః కర్మ కుర్వన్తి**
**సంగం త్యక్త్వాత్మ శుద్ధయే ॥** (పూర్వ. సర్గ.53, శ్లో.9)

(ఇది భగవద్గీతలో 5వ అధ్యాయంలో 11వ శ్లోకంగా వుంది)

సాధకులైన యోగులు సంగాన్ని పరిత్యాగం చేసి, శరీరంతోనూ, మనస్సుతోనూ, బుద్ధితోనూ, ఇంద్రియాలతోనూ, రకరకాల కర్మలు చేసి, తద్వారా, ఆత్మశుద్ధిని పొందాలని ప్రయత్నం చేస్తూ వుంటే, స్వధర్మంగా వచ్చి పడిన ఈ కర్మ కోసం ఇంత గగ్గోలు పడతావేమిటయ్యా? అహంకారమనే విషం శరీరంలోనికి ప్రవేశించకుండా వుంటే, అలాంటివాళ్ళు ఏ పని చేసినా ఆరోగ్యవంతులే! అంటే, వాళ్ళు లౌకికంగా గాని, శాస్త్రీయంగా గాని, ఏవైనా పనులు చేసినా, దానివల్ల వచ్చే ఫలితాలను వారు అనుభవించరు. అందుచేత, వారు పనులు చేస్తున్నా సరే, చేయని వారికిందే లెక్క!

**నిర్మమో నిరహంకారః**

**సమదుఃఖ సుఖః క్షమీ ।**

**య స్సకార్య మకార్యం వా**

**కుర్వన్నపి న లిప్యతే ॥** (పూర్వ.సర్గ. 53, శ్లో.12)

(దీనిలోని చివరిపాదం 'కుర్వన్నపి న లిప్యతే' అనేది భగవద్గీతలో 5వ అధ్యాయంలో 7వ శ్లోకంలో వుంది. మిగిలిన పదాలు భగవద్గీతలో అక్కడక్కడా వచ్చినవే!)

ఇది నాదనే మమకారాన్నీ, నేను చేస్తున్నాననే అహంకారాన్నీ, పరిత్యజించి, సహనశీలుడై, సుఖదుఃఖాల పట్ల సమంగా ప్రవర్తించేవాడు మంచి పని చేసినా సరే , చెడు పని చేసినా సరే, చేస్తున్న సమయంలో కూడా, వాడికేమీ అంటదు.

అదీ గాక ఓ అర్జునా! ఈ యుద్ధం నీకు, నీ క్షత్రియ స్వధర్మంగా వచ్చిపడింది. స్వధర్మం కుత్సితమే ఐనా, అధర్మ మయమే ఐనా సరే, శ్రేష్ఠమే ఔతుంది. అది పుణ్యాన్నీ, అభ్యుదయాన్నీ కలిగిస్తుంది. అందుచేత నువ్వు నీ స్వకర్మను ఆచరించి, అమృత స్వభావుడవు కా.

రహస్యమేమిటంటే, స్వధర్మాన్ని మూర్ఖంగా ఆచరించినా సరే, అది శ్రేయస్సునే కలిగిస్తుంది. ఇక వివేకవంతుడై, సద్బుద్ధితో స్వకర్మను ఆచరిస్తే, దాని ఫలితం ఎలా వుంటుందో చెప్పాలా?

వివేకం అంటే ఏమనుకుంటున్నావ్? అహంకారాన్ని వదిలి పెట్టడమే వివేకం! అహంకారాన్ని వదిలిపెట్టిన బుద్ధి కింద పడ్డా సరే, దేనికీ అంటుకోదు. ఇలాంటి నిరహంకార స్థితి పేరే యోగం!

**యోగస్థః కురు కర్మాణి**

**సంగం త్యక్త్వా ధనంజయ।**

**నిస్సంగస్త్వం యథాప్రాప్త**

**కర్మావాన్న నిబధ్యసే ॥** (పూర్వ. సర్గ.53, శ్లో. 16)

(ఈ శ్లోకంలో మొదటి భాగం భగవద్గీతలోని 2వ అధ్యాయంలో 48వ శ్లోకంలో వుంది.)

కర్మాచరణ చేసేటప్పుడు, సిద్ధి అసిద్ధులయందు సమంగా వుండడమే యోగం. ఓ! ధనంజయా! నీవు కర్మఫలాసంగాన్ని పరిత్యజించి, యోగంలో వుంటూ, కర్మలను ఆచరిస్తూ వుండు. అలా నిస్సంగత్వాన్ని సాధించి, దేనినీ కోరకుండా, ఆయా కాలాలకు వచ్చే కర్మలను ఆచరిస్తూ వుంటే, నీకు ఏ బంధమూ వుండదు.

అలా కుదరకపోతే, ప్రశాంత బ్రహ్మ స్వరూపుడవై, శాస్త్రీయమైన కర్మలను బ్రహ్మార్పణ బుద్ధితో (దీని ఫలాన్ని నిర్గుణ పరబ్రహ్మకే సమర్పిస్తున్నాననే ఆలోచనతో) ఆచరిస్తూవుండు. అప్పుడు గూడా నువ్వు నిర్గుణ పరబ్రహ్మవే ఐపోతావు.

ఈ నిర్గుణ పరబ్రహ్మజ్ఞానం కష్టంగా వుందనుకుంటే, సగుణ పరబ్రహ్మ భావన చేయి. సగుణ పరబ్రహ్మకే మరో పేరు ఈశ్వరుడు. ఈ సమస్త కర్మలనూ ఈశ్వరుడికి సమర్పణ చేసి, నువ్వు సుఖదుఃఖాతీతుడవై, ఈశ్వర స్వరూపుడివైపో. అప్పుడు సృష్టిలోని సమస్త జీవులకూ నువ్వే ఆత్మవైపోతావు. నీ ఉనికివల్ల భూమికి ఒక అందం ఏర్పడుతుంది. నీకు ఏ కర్మ బంధమూ ఉండదు.

అదీ కుదరకపోతే, సర్వ సంకల్పాలనూ పరిత్యజించు. సంకల్ప పరిత్యాగం పేరే సంన్యాసయోగం. అటువంటి సంన్యాస యోగాన్ని అవలంభించి (సంన్యాస యోగ యుక్తాత్మా) సుఖదుఃఖాదులయందు సముడవై, శాంతుడవై, తత్త్వమనన శీలివై, నువ్వు ఎన్ని కర్మలను చేసినా, నీకు కర్మ బంధం వుండదు.

(**గమనిక** – ఈ సందర్భంలో వశిష్ఠమహర్షి ప్రయోగించిన **"సంన్యాసయోగ యుక్తాత్మా"** అనే పాదం భగవద్గీతలో 9 అధ్యాయంలో 28వ శ్లోకంలో వుంది.)

**39. నాలుగు ఉపాయాలు**

**అర్జునుడు**: భగవంతుడా! నువ్వు నాకిప్పటికి నాలుగు ఉపాయాలు చెప్పావు. 1.సంగత్యాగం, 2.బ్రహ్మార్పణం, 3.ఈశ్వరార్పణం, 4.సంన్యాసము. ఈ నాలుగింటి లక్షణాలను నాకు వివరించి చెప్పు. అంతే గాక, యోగం అనే పదాన్ని, తత్వ మననం అనే పదాన్ని, ఉపయోగించావు. కనుక యోగం అంటే ఏమిటో, జ్ఞానం అంటే ఏమిటో, ఈ రెంటికీ గల భేదమేమిటో, దయ చేసి వివరించు.

**శ్రీభగవానుడు**: నిర్వికల్ప సమాధి పరిపాకంవల్ల, నీలోని సంకల్పాలన్నీ శమించి పోగా, హృదయంలో గూడు కట్టుకొని వున్న పాత వాసనలు కూడా తొలగిపోగా, ఏ భావనకూ చోటు లేని ఒకానొక అనుభూతి కలుగుతుంది. అదే పరబ్రహ్మ!

ఆ బ్రహ్మకోసం చేసే ప్రయత్నం రెండు రకాలు. ఒకటి జ్ఞానం, రెండు యోగం.

చిత్తవృత్తి బ్రహ్మాకారాన్ని పొందిన స్థితిని జ్ఞానం అంటారు.

ఇలాంటి స్థితికి అనుకూలంగా చేసే ధారణాప్రక్రియను యోగం అంటారు.

"నాతో కలిపి ఈ జగత్తు మొత్తమంతా బ్రహ్మే" అనే భావన పేరే బ్రహ్మార్పణం. (అంటే , నేను నేను అని అభిమానించే అహంకారం ఒకటి వుంది. అభిమానింప బడేది ఎవరు? ఈ జగత్తే! ఈ రెండూ కూడా బ్రహ్మకంటే భిన్నంగా లేవు, అనే జ్ఞానమే బ్రహ్మార్పణం! ఇది నీ రెండవ ప్రశ్నకు సమాధానం)

ఈ రకమైన బ్రహ్మార్పణ కుదరాలంటే అహంకారమూ, జగత్తూ, రెండూ కూడా మిథ్యలేననీ, వాటికి స్వతంత్రంగా అస్తిత్వం లేదనీ, స్వతంత్రమైన అస్తిత్వం కలది పరబ్రహ్మ ఒక్కటేననీ, తెలియాలి. దానికోసం పరబ్రహ్మ అంటే ఏమిటో కొంచెం వివరిస్తాను, విను.

లోపలా శూన్యమే, బయటా శూన్యమే! అది బండరాతి గుండె వంటిది. ప్రశాంతమైనది. (ఏ మార్పులూ లేనిది.) ఆకాశం లాగా స్వచ్ఛమైనది. అది ఏ దృశ్యమూ కాదు. చూసే దృక్కు కంటే భిన్నమైనదీ కాదు. (దృశ్యాలేవీ లేని దశలో ద్రష్టకు గల పేరు దృక్.)

ఏమీ లేని శూన్యం ఆకాశంగా గోచరించినట్లుగా, ఏమీ లేని ఆ పరబ్రహ్మలోంచి, కొంచెం ఏదో మార్పు కనిపిస్తోంది. కొత్తది ఏదో పుట్టినట్లు కనిపిస్తోంది. అదే ఈ జగత్తు అనే ప్రతిభాస. (ముత్యపు చిప్పమీద వెండి లాగా లేని వస్తువు వున్నట్లు కనిపించడమే ప్రతిభాస)

అఖండ మహాసముద్రం లాగా విస్తరించి వున్న ఆ బ్రహ్మ చైతన్యంలోని కోటిలో కోటోవంతు ప్రతిభాసగా పైకి లేవగా, నేను నేను అనే విచిత్రమైన భావం ఒకటి జీవులలో పొటమరిస్తోంది. జగత్ప్రతిభాసలో భాగమై, దానిలో కోట్ల కోట్లవంతులై, మిణుగురు లాగా మిడిసిపడే ఈ అహంభావాన్ని మనం ఎందుకు స్వీకరించాలి?

నేననే ఈ భావన పరబ్రహ్మకన్నా వేరుగా, విడిగా, వున్నట్లు కనిపిస్తున్న సమయంలో గూడా, అది పరబ్రహ్మలో కలిసే వుంది. ఎందుకంటే, పరబ్రహ్మలో భిన్నత్వము, కొలతలు – అనే వాటికి చోటే లేదు.

కనుక, అహంకారం అనబడే ప్రత్యగాత్మ, అఖండ చైతన్యమనబడే పరమాత్మకంటే భిన్నం కాదు. అలాగే, నాది అనే మమకారం కూడా జీవాత్మకంటే భిన్నమైనది కాదు. కనుక అహంకార, మమకారాలు రెండూ గూడా, పరిపూర్ణ పరబ్రహ్మాత్మకాలే!

అర్జునా! ఇక్కడ ఒక విచిత్రం వుంది. అహంకార మమకారాల రూపంగా చిత్ర విచిత్రమైన భేదాలు కన్పిస్తున్నాయి గనుక, జీవుడు ఈ భేదాన్ని గ్రహిస్తున్నాడు. కానీ, ఆ భేదాలతో పాటు, "వున్నది, కనిపిస్తోంది" – అనే సత్తా స్ఫూర్తులు ప్రతిపదార్థంలోనూ అనుగతంగా వ్యాపించి కనిపిస్తూనే ఉన్నాయి. ఈ సత్తా స్ఫూర్తుల ఏకత్వాన్ని బట్టి, ఇన్ని జీవాత్మలు వేరుగా లేవనీ, ఉన్న ఆత్మ ఒక్కటేననీ గ్రహింపుకు రావాలి. ఆ గ్రహింపు మాత్రం ఎవరికీ కలగదు. అదే చిత్రం!

ఈ విధంగా, సత్యాసత్యాలను విభాగం చేసి చూసుకునే వాడికి మనస్సులో అహంకార మమకారాలన్నీ క్షీణిస్తాయి. దానివల్ల కర్మఫలాల మీద ఆశ తగ్గిపోతుంది. ఇలాంటి కర్మఫల పరిత్యాగం పేరే సంన్యాసం. (ఇది నీ నాల్గో ప్రశ్నకు సమాధానం)

ఫలాసక్తి తగ్గిపోయిన కొద్దీ సంకల్పాలే తగ్గిపోతాయి. ఇలా సంకల్పాలను పరిత్యాగం చేయడం పేరే అసంసంగం. లేక అసంగం (ఇది నీ మొదటి ప్రశ్నకు సమాధానం.)

ఇక ఈ కనిపించే ద్వైత జాలానికి, ఉపాదాన కారణమేమిటా అని విచారించి, ఆ కారణం ఈశ్వరుడే అని నిశ్చయించి, కార్యం కారణం కంటే అభిన్నం గనుక, రక రకాలుగా కనిపించే ఈ ద్వైత ప్రపంచమంతా ఈశ్వర స్వరూపమే – అని భావన చేయడం పేరే ఈశ్వరార్పణ. (ఇది నీ మూడో ప్రశ్నకు సమాధానం)

ఓ అర్జునా! ఈ భేదభావన అంతా అజ్ఞానంచేత కలుగుతోంది. నిజానికి ప్రపంచం అనే పదార్థం లేదు. ఆ పదం మాత్రం వుంది. ఆ పదానికి అర్థం పరమాత్మే! ఇందులో సందేహం లేదు. అందుకనే, ఈ దిక్కులు నేనే, ఈ కదిలే జగత్తును నేనే, ఈ కదలని ఆకాశాన్ని నేనే, కర్మ నేనే, కాలం నేనే, ద్వైతాన్నీ–అద్వైతాన్నీ నేనే! కనుక ఓ అర్జునా!

**మన్మనా భవ మద్భక్తో**
**మద్యాజీ మాం నమస్కురు ।**
**మామేవైష్యసి యుక్త్వైవ**
**మాత్మానం మత్పరాయణః॥** (పూర్వ సర్గ. 53, శ్లో. 34)

( ఈ శ్లోకం భగవద్గీతలో 9వ అధ్యాయంలో 34వ శ్లోకంగా వచ్చింది. ఈ శ్లోకాంలోని మొదటి భాగం 18వ అధ్యాయంలో 65వ శ్లోకంలో మొదటి భాగంగా కూడా వచ్చింది)

నా మీదే మనస్సు పెట్టు, నా మీదే ప్రేమ పెంచుకో, నన్నే పూజించు, నాకే నమస్కరించు, ఇదే యోగం! ఈ యోగంతో నేనే పరమలక్ష్యంగా నువ్వు గనుక వున్నట్లైతే, నువ్వు నన్నే పొంద గలవు.

ద్వైతాద్వైత రూపాలు రెండూ నావే అని చెప్పాను కదా! నీ వీలును బట్టి వాటిలో ఏదో ఒకదాని మీద నీ మనస్సుని లగ్నం చెయ్యి. చేసి, ఆ రూపం మీదే శ్రవణ కీర్తనాది నవవిధ భక్తులనూ పెంచుకో. అక్కడితో ఆగక, ఆ నా రూపాన్ని మనస్సులో ఉంచుకొని జ్ఞానయజ్ఞాన్ని గానీ, కర్మయజ్ఞాన్ని గానీ చేసి, తద్వారా నన్ను ఆరాధిస్తూ వుండు. వాటిద్వారా నాలో కలిసిపోయేందుకు ప్రయత్నించు. ఇలా చేస్తే, జ్ఞానమార్గంలో ఐతే సాక్షాత్తుగానూ, ఇతర మార్గాలలో ఐతే పరంపరగానూ, నువ్వు నన్నే పొందుతావు.

**అర్జునుడు**: ఓ దేవేశ్వరా! నీకు రెండు రూపాలు వున్నాయని నువ్వే చెబుతున్నావు. అందులో ఒకటి పరం(శ్రేష్ఠం), రెండవది అపరం (శ్రేష్ఠము కానిది) పరోక్షంగా అంటున్నావు. నేను వాటిల్లో, ఏ రూపాన్ని ఎప్పుడు ఆశ్రయిస్తే, సిద్ధి త్వరగా లభిస్తుంది?

**శ్రీభగవానుడు**: ఓ అనఘా! నా రూపాలలో ఒకటి సామ్యామైనది, రెండవది పరమ శ్రేష్ఠమైనది. చతుర్భుజాలు, శంఖ చక్ర గదా పద్మాలు, మొదలైనవి కలిగినది సామాన్య రూపం. ఆది మధ్యాంత రహితమై, దోషరహితమై,

అద్వితీయమై, ప్రకాశించేది పరమ రూపం. దీనినే బ్రహ్మ అనీ, ఆత్మ అనీ, పరమాత్మ అనీ, ఇలాంటి శబ్దాలతో వ్యవహరిస్తూ వుంటారు.

ఆత్మజ్ఞానం కలుగక, అజ్ఞానిగా నువ్వు ఉన్నంతవరకూ, నువ్వు చతుర్భుజాకార దేవ పూజయందు ఆసక్తి కలిగి ఉండు. దానివలన నువ్వు క్రమంగా నా పరమ స్వరూపాన్ని తెలుసుకోగలుగుతావు. అప్పుడు నీకు మళ్ళీ జన్మ వుండదు.

ఒక వేళ నీవు తత్వజ్ఞాన వేత్తవే ఐనట్లైతే, అప్పుడు నీకు ఆత్మభూతమే ఐన నా పరమాత్మ స్వరూపాన్ని మాత్రమే ఆశ్రయించు.

ఇందాక నేను, 'అది నేను, ఇది నేను' అనుకుంటూ కొన్ని పేర్లు చెప్పాను. (ఈ దిక్కులు నేనే, ఈ జగత్తు నేనే ఇత్యాదిగా.) ఆ చెప్పడంలో నా ఉద్దేశ్యమేమిటంటే, వాటన్నింటికీ అధిష్ఠానమైన 'శుద్ధ చైతన్యాన్ని నేనే' అనేదే. నా ఉపదేశాన్ని నువ్వు సరిగ్గానే గ్రహించావనుకుంటున్నాను. సరిగ్గా గ్రహించావు గనుక నువ్వు స్వస్వరూపంలో విశ్రాంతి చెందావనుకొంటున్నాను. సంకల్పాలను విడిచి పెట్టేశావనుకుంటున్నాను. కనుక, ఇక సత్యమైన ఏకాత్మ స్వరూపుడవు అయిపో!

### 40. యోగము-కౌశలము

**సర్వభూతస్థ మాత్మానం**
**సర్వభూతాని చాత్మని ।**
**పశ్య త్వం యోగయుక్తాత్మా**
**సర్వత్ర సమదర్శనః ॥** (పూర్వ.సర్గ. 53, శ్లో. 43)

(ఇది భగవద్గీతలో 6వ అధ్యాయంలో 29వ శ్లోకం)

సర్వ పదార్థాలలోనూ సమానంగా వుండే సామాన్యాంశం ఒకటి వుంది. అదే అధిష్ఠాన చైతన్యం! ఆ సమానాంశం మీద దృష్టిని చెదరకుండా పెట్టుకున్నవాడే సమదర్శనుడు. ఇలాంటి సమదర్శన ప్రక్రియ పేరే యోగం! (సమత్వం యోగ ఉచ్యతే –భగవద్గీత)

ఇట్టి యోగాన్ని మనస్సులో ధరించి, అన్ని చోట్లా సమత్వాన్ని దర్శిస్తూ, నేను అన్ని భూతాల్లోనూ అధిష్ఠాన చైతన్య రూపంగా వున్నాననీ, అన్ని భూతాలూ నాలో అధిష్ఠాన చైతన్య రూపంగా వున్నాయనీ, అనుభవ పూర్వకంగా గుర్తించు.

(**గమనిక**: కొందరు కర్మలయందు నేర్పు కలిగి వుంటమే యోగమని నిర్వచనం చెబుతూ దానికి ప్రమాణంగా 'యోగః కర్మసు కౌశలమ్' అనే భగవద్గీతా వాక్యాన్ని చూపిస్తున్నారు. అది పొరపాటు. ఎందుకంటే, భగవద్గీతలో ద్వితీయాధ్యాయంలో 48వ శ్లోకంలో **'సమత్వం యోగ ఉచ్యతే'** అంటూ సిధ్యసిద్ధులయందు సమత్వాన్ని దర్శించడమే యోగము అని నిర్వచనం చేశారు. ఆ తరువాత 50వ శ్లోకంలో **'యోగః కర్మసు కౌశలమ్'** అన్నారు. యోగ శబ్దానికి నిర్వచనం పూర్వమే చెప్పారు కనుక మళ్ళీ ఆ నిర్వచనం చేయవలసిన పని లేదు. ఇక్కడ 'కౌశలమ్' అనే పదానికి నిర్వచనం చెబుతున్నారు. స్వధర్మ రూపమైన కర్మలను ఆచరించేటప్పుడు, సమత్వ బుద్ధి కలిగి వుండటమే కౌశలం (నేర్పు) అని ఇక్కడ భగవానుడు నిర్వచనం చేస్తున్నాడు. శ్రీ శంకర భగవద్పాదులు ఈ విషయాన్నే స్పష్టం చేస్తూ,

**తద్ధి కౌశలం, యత్ బంధస్వభావాణ్యపి కర్మాణి**

**సమత్వ బుద్ధ్యా స్వభావాత్ నివర్తంతే –**

కర్మలు సహజంగా బంధాన్ని కలిగించే స్వభావం కలిగినవే ఐనప్పటికీ, సమత్వ బుద్ధితో వాటిని ఆచరిస్తే, అవి వాటి స్వభావాన్ని వదిలిపెట్టి, బంధాన్ని విడిపిస్తాయి. కనుక, కర్మలను ఆచరించడంలో నేర్పు అంటే ఇదే – అని వివరించారు. కనుక, 'యోగం' అనే పదానికి 'సమత్వం' అని అర్థం చెప్పడం మాత్రమే సముచితంగా వుంటుంది. ఇక అసలు విషయంలోకి వెళదాం.)

ఇలా సర్వ భూతాలలోనూ అనుస్యూతంగా (సామాన్యాంశగా) వుండే, ఏకాత్మ స్వభావాన్ని ఎవడైతే చూడ గలుగుతాడో వాడు–

**సర్వథా వర్తమానోఽపి**

**న స భూయోఽభిజాయతే॥** (పూర్వ.సర్గ.53, శ్లో.44)

(ఈ వాక్యం భగవద్గీతలో రెండు సార్లు వచ్చింది– 6వ అధ్యాయంలో 31వ శ్లోకంగా, 13వ అధ్యాయంలో 23వ శ్లోకంగా.)

ఎలా వ్యవహరించినా సరే, ఇక మళ్ళీ పుట్టడు.

'సర్వత్ర సమదర్శనం' అనేదానికి తాత్పర్యం ఏమిటంటే – అన్ని పదార్థాలు అనే చోట, అన్నీ అంటే ఒకటే అని అర్థం. ఒకటే అంటే, అది నీ ఆత్మ అని అర్థం. మరి ఆత్మ అంటే ఏమిటి? అది సత్తూ కాదు, అసత్తూ కాదు. 'సత్' అంటే ఇక్కడ పృథివీ జలతేజస్సులనే మూర్త భూత త్రయం. 'అసత్' అంటే వాయు, ఆకాశాలనే అమూర్త భూత ద్వయం. ఈ రెండు రకాలలో ఏదీ కాదు ఆత్మ. కానీ, అది దేని రూపాన్ని పొందితే, అది తనే ఐపోతుంది. (ముత్యపు చిప్పే వెండి ముద్ద ఐపోయినట్లు).

అలాంటి ఆత్మ మాకెప్పుడూ అనుభవంలోకి రాలేదే అని అనుకుంటావేమో! అది పొరపాటు. ముల్లోకాలలోనూ వుండే జీవులందరికీ లోపల వుంటూ 'నేను, నేను' అనే ప్రకాశాన్ని అనుభవ రూపకంగా చూపిస్తోందే, అదే ఆత్మ!

భూమి మీద నీళ్ళున్నాయి. ఆవుల్లో పాలున్నాయి. సముద్రంలో ఉప్పుంది. చెఱుకు రసంలో తీపి వుంది. ఇలాంటివన్నీ నాలుక చివర తగిలే సరికి, ఒక రసానుభవం కలుగుతోంది. ఆ రసానుభవమే ఆత్మ! కనుక ఆత్మ మనకి ఎవరికీ అనుభవంలోకి రాలేదే అనుకోవడానికి వీలు లేదు.

అంతే గాదు. నాకిప్పుడీ అనుభవం కలిగింది అనే జ్ఞానం కలిగినట్లే, నాకు ఇప్పుడీ అనుభవం తొలగి పోయింది అనే జ్ఞానం కూడా కలుగుతోంది. లోపల సుసూక్ష్మమైన ఆత్మ వుండబట్టే, ఈ అనుభవం కలుగుతోంది.

ఐతే, శరీరంలో ఈ ఆత్మ ఎక్కడ వుందని అడుగుతావేమో? పాలలో అంతటా నెయ్యి వ్యాపించి వున్నట్లుగా, సమస్త పదార్థాలలోనూ అంతటా అధిష్ఠానంగా వ్యాపించి వున్నదీ ఆత్మ! తేజస్సు అనేది రత్నం అంతటా వ్యాపించి వుండి, బైటికి కూడా ప్రసరించినట్లుగా, ఈ ఆత్మ, దేహం అంతటా వ్యాపించి, "నేనున్నాను" అనే భావన రూపంలో, బయటికి కూడా ప్రసరిస్తోంది. రత్నంలో తేజస్సు ఉన్నా, రాయి, తేజస్సు, ఒకటి కావు. అవి ఒకదాని నొకటి అంటుకోవు. దేహం, ఆత్మ కూడా అంతే!

వేల వేల కుండలున్నాయి. వాటికి బైటా, లోపలా, ఆకాశం వుంది. అలాగే, ఈ ముల్లోకాలలోని శరీరాలన్నిటికీ లోపలా వెలుపలా గూడా, ఆత్మే వుంది.

పూసలన్నిటిలోనూ గుచ్చిన దారం కనిపించకుండా వున్నట్లుగా, దేహాలన్నిటిలోనూ, ఆత్మ అనే దారం సుసూక్ష్మంగా వుంది.

దీనిని బట్టి ఏమి తేలుతున్నదంటే, పర్రబహ్మ దగ్గరినుంచీ, పరక గడ్డి దాకా వుండే పదార్థాలన్నిటిలోనూ, సత్తా సామాన్య రూపంగా వుండేదే ఆత్మ! దానికి జన్మ అనేది లేనే లేదు.

అధిష్ఠాన స్వరూపంగా, నిర్వికారంగా, ఉండటం ఆ బ్రహ్మకు వాస్తవమైన స్థితి. పూసలలో దారం లాగానూ, రత్నాలలో కాంతి లాగానూ, ఒక జీవ స్థితి వ్యక్తం కావడం అనేది అధ్యస్త పదార్థ సాపేక్ష స్థితి. (అధ్యస్త పదార్థాలంటే, భ్రాంతి కల్పిత పదార్థాలు.) ఇలా ఆ రెండు రూపాలు దానివే గనుక, చంపేది ఎక్కడుంది? చచ్చిపోయేది ఎక్కడుంది? జగత్తులో వుండే శుభాశుభాలు గాని, సుఖదుఃఖాలు గాని, దానికి ఎలా అంటుతాయి?

ఈ జగత్పదార్థాలన్నీ, అద్దంలో బొమ్మ లాగా, ఆత్మలో కొంత సేపు కనిపిస్తున్నాయి. కొంత సేపు పోతున్నాయి. మధ్యలో వుండే అద్దానికి ఏమీ అంటదు. అది సాక్షి లాగా నిశ్చలంగా వుంటుంది. అలాగే, ఈ పదార్థాలన్నీ పుడుతూ గిడుతూ వుంటే, అద్దం లాంటి ఆత్మ మాత్రం ఉత్పత్తి వినాశాలు లేకుండా, అలాగే వుండి పోయింది. ఈ సత్యాన్ని ఎవడైతే దర్శిస్తాడో, వాడే నిజంగా చూసేవాడు.

(**గమనిక –** ఇక్కడ వశిష్ఠ మహర్షి "యః పశ్యతి స పశ్యతి" అన్నాడు. ఈ మాట భగవద్గీతలో రెండు సార్లు వచ్చింది. 5వ అధ్యాయంలో 5వ శ్లోకంలోనూ, 13వ అధ్యాయంలో 27వ శ్లోకంలోనూ)

ఐతే, అధిష్ఠాన చైతన్యమైన చిదంశం మాత్రమే నేననీ (అంటే పరమాత్మ అనీ), దేహేంద్రియాది స్వరూపమైన జడాంశం నేను కాదనీ (అంటే పరమాత్మ కాదనీ), నేనే ఒక సారి అన్నాను. అప్పుడు అలా అని, ఇప్పుడు ఇలా అంటున్నానని సందేహిస్తావేమో! అప్పుడు ఆ మాట ఎందుకు చెప్పానంటే, కేవలం విభాగం చేసి చూపించడానికి చెప్పా!

అద్దాల గది మధ్యలో ఒక కుండ పెట్టామనుకో. మనం ఎటు చూసినా, కుండ వెనకాల అద్దం, అద్దం వెనకాల కుండ, ఇలా వరుసగా కనిపిస్తూనే వుంటాయి. ఇప్పుడు వీటిలో ఏది అసలు అద్దమో, ఏది కొసరు అద్దమో, ఏది అసలు కుండో, ఏది కొసరు కుండో, అయోమయమై పోతుంది. ఎందుకంటే ప్రతి ఒక్క బింబానికీ ప్రతిబింబంగా, అక్కడ ప్రతిబింబ పరంపర ఏర్పడి వుంది. అలాంటప్పుడు విభాగం చేసి చూపించడం కోసం, మూడవ ప్రతిబింబం దృష్టితో రెండవ ప్రతిబింబం సత్యమనీ, మూడవ ప్రతిబింబం అసత్యమనీ, అలాగే రెండవ ప్రతిబింబ దృష్టితో మొదటి ప్రతిబింబం సత్యం అనీ, రెండవ ప్రతిబింబం మాత్రం అసత్యం అనీ, ఒకటవ ప్రతిబింబం దృష్టితో చూస్తే, అసలు బింబం మాత్రమే సత్యమనీ, మిగిలిన ప్రతిబింబ పరంపర అంతా అసత్యమనీ వివరించవలసి వస్తోంది. ఇక్కడ ఈ వివరణ ప్రక్రియలో కొంత సేపు రెండవ ప్రతిబింబాన్ని సత్యం అన్నాం. కొంత సేపు మొదటి ప్రతి బింబాన్ని సత్యం అన్నాం. చివరికి ఏ ప్రతిబింబమూ సత్యం కాదన్నాం. ఇది మాట మార్చడం కాదు. విభాగాన్ని చేస్తూ వివరించడం, అంతే! నేను చెప్పిన జడ చైతన్య విభాగం కూడా ఇలాంటిదే! నిజమైన సత్య దృష్టితో చూచినప్పుడు, సముద్రంలో నీటి కదలికల్లాగా, ఈ సృష్టి ప్రళయాది వికారాలన్నీ నాలోనే జరుగుతున్నాయి.

కొండలన్నీ రాళ్ళే! చెట్లన్నీ చెక్కలే! అలలన్నీ నీళ్లే! అలాగే జగత్తులో కనిపించే పదార్థాలన్నీ నేనే.

**సర్వభూతస్థ మాత్మానం**
**సర్వభూతాని చాత్మని ।**
**యః పశ్యతి తథాత్మాన**
**మకర్తారం స పశ్యతి ॥** (పూర్వ. సర్గ. 53, శ్లో. 60)

(ఇందులో మొదటి భాగం ఈ సర్గలోనే 43వ శ్లోకంగా వచ్చింది. భగవద్గీతలో 6వ అధ్యాయంలో 29వ శ్లోకంగా వచ్చింది. ఈ శ్లోకంలోని ఉత్తరార్థం 'యఃపశ్యతి' అనే భాగం భగవద్గీతలో 13వ అధ్యాయంలో 29వ శ్లోకంగా వచ్చింది.)

కనుక, అన్ని భూతాలలోనూ నేనున్నాననీ , అన్ని భూతాలూ నాలో ఉన్నాయనీ, ఐనా సరే, నేను కర్తను కాననీ, ఎవడు చూస్తున్నాడో, వాడే నిజంగా చూస్తున్నాడు.

ఓ! అర్జునా! రకరకాల తరంగాలలో, నీరే వుంది. రకరకాల ఆభరణాలలో బంగారమే వుంది. అలాగే రకరకాల జీవులలోనూ ఆత్మే వుంది. దీనినే వెనక్కు తిప్పు. నీళ్ళలోనే అలలున్నాయి. బంగారంలోనే భూషణాలున్నాయి. అలాగే పరమాత్మలోనే సర్వ భూతాలూ వున్నాయి. ఆ రెంటికీ భేదం ఏ మాత్రమూ లేదు. ఎందుకీ విషయంలో ఊరికే మోహ పడుతున్నావ్? పూర్వపు పెద్దలంతా ఈ తత్త్వాన్ని విని, అభయ స్వరూపమైన బ్రహ్మను అనుభవించి, హృదయంలో సమరస భావం కలిగి, జీవన్ముక్తులై వ్యవహరించారు. అలాంటివారికి అవ్యయ పదం అవలీలగా అందింది.

(**గమనిక** – వశిష్ఠుడు భోదించిన భగవద్గీతలో, ఇది రెండవ సర్గ. ఇక మూడవ సర్గను భగవద్వాక్యంగానే ఆయన ప్రారంభిస్తున్నాడు.)

***శ్రీభగవానుడు***:

**భూయ ఏవ మహాబాహో**
**శ్రుణు మే పరమం వచః ।**
**యత్తేఽహం ప్రీయమాణాయ**
**వక్ష్యామి హితకామ్యయా ॥** (పూర్వ.సర్గ. 54, శ్లో.1)

(ఇది భగవద్గీతలో 10వ అధ్యాయంలో మొదటి శ్లోకంగా వుంది.)

ఓ మహాబాహూ! ఓ అర్జునా! నువ్వు ప్రేమతో శ్రద్ధతో వింటున్నావు గనుక నీ హితం కోరి, ఒక ముఖ్యమైన మాట చెబుతా, విను.

పూర్వపు పెద్దలు సమరస భావంతో ముక్తిని పొందారని చెప్పాను. సమరస భావం అంటే ద్వంద్వాలనుంచి విముక్తిని పొందడమే! ద్వంద్వ విముక్తి కలగాలంటే, ఆ ద్వంద్వాలకూ, నీకూ ఉన్న సంబంధం ఏమిటి? ఆ సంబంధం ఎలా కలిగింది? దేనిని ఆలంబనంగా చేసుకుంటే, ఆ సంబంధాన్ని వదిలించుకోవచ్చు?– అనే విషయాలు తెలియాలి. అందుకోసం, నీకు కొంత ఉపదేశించ దలచుకున్నాను.

**మాత్రాస్పర్శా హి కౌంతేయ**
**శీతోష్ణ సుఖ దుఃఖదాః।**
**ఆగమాపాయినోఽనిత్యా-**
**స్తాం స్తితిక్షస్వ భారత॥** (పూర్వ.సర్గ. 54, శ్లో.2)

(ఇది భగవద్గీతలో 2వ అధ్యాయంలో 14వ శ్లోకంగా వుంది)

ఎంత జ్ఞానం కలిగితే మటుకు సుఖదుఃఖాలు పోతాయా? – అని సందేహించ వద్దు. ఎందుకంటే, లోకంలో సుఖ వియోగంవల్ల కలిగేది మోహం. దుఃఖ సంయోగంవల్ల కలిగేది శోకం. ఆయా పదార్థాలవల్ల మోహ శోకాలు కలగడం లోకంలో వుండనే వున్నది గదా– అని నువ్వు ఆలోచిస్తున్నావ్. అది పొరపాటు. పదార్థాలు వేరు, సుఖదుఃఖాలు వేరు. చెవి మొదలైన ఇంద్రియాలకు మాత్రలని పేరు. శబ్దాది విషయాలకు స్పర్శలని పేరు. ఈ రెండూ కలసి జీవులకు సుఖదుఃఖాలను ఇస్తూ వుంటాయి. కాని, ఆ సుఖదుఃఖాలను

ఎల్లప్పుడూ ఒకే రీతిగా ఇవ్వవు. వేసవిలో చల్లని పదార్థం సుఖకరం. అదే చల్లని పదార్థం చలికాలంలో దుఃఖప్రదం. కనుక, ఒక పదార్థం సుఖ రూపమని గాని, దుఃఖరూపమని గాని, నిర్భయంగా చెప్పేందుకు వీలు లేదు. అవి మారిపోతూ వుంటాయి. ఈ శీతోష్ణాలు కేవలం ఉదాహరణలు మాత్రమే! ఇవి మారుతూనే వుంటాయి. సుఖదుఃఖాల స్వరూపం మాత్రం మారదు. కనుక అర్జునా! నువ్వు ఈ విషయాన్ని గ్రహించి, మాత్రలు గానీ, స్పర్శలు గానీ, నియతాలు కావనీ, వచ్చే పోయే స్వభావాలు కలవనీ, అందువల్లననే అవి అనిత్యాలనీ, అర్థం చేసుకో! కనుకనే వాటివల్ల కలిగే సుఖదుఃఖాలను పట్టించుకోకు. నీకు ప్రియకరమైన విషయాలు వుంటే, వాటిమీద విరక్తి పెంచుకో. అలాగే నీకు అప్రియమైన పదార్థాలుంటే, వాటిని సహించడం నేర్చుకో.

ఎందుకంటే, ఆత్మ అద్వయుడు, పరిపూర్ణుడు,ఆనంద స్వభావుడు. అలాంటి లక్షణాలేవీ మాత్రలకు గాని, స్పర్శలకు గాని, లేవు. కనుకనే అవి అనాత్మ పదార్థాలు. ఈ విషయాన్ని మరచిపోకుండా వుంటే, ధన పుత్రాది ప్రియ పదార్థాలు కలిసినప్పుడు నేను వృద్ధి పొందానని అనుకోవడం గానీ, వాటితో వియోగం వస్తే, నేను తరిగి పోయానని అనుకోవడం గానీ, సుఖదుఃఖాలు పొందడం గానీ, ఎలా కుదురుతుంది? కనుక, ఓ అర్జునా! నువ్వు అలాంటి భ్రమలను త్యజించు.

**సంస్థితా స్పర్శ మాత్రాఖ్యా**
**మాత్రా స్పర్శ భ్రమాత్మకః ।**
**సమదుఃఖ సుఖో ధీరః**
**సోఽమృతత్వాయ కల్పతే ॥** (పూర్వ సర్గ. 54, శ్లో. 4)

(దీనిలో చివరి రెండు పాదాలు కొద్ది మార్పుతో భగవద్గీతలో 2వ అధ్యాయంలో 15వ శ్లోకంగా వచ్చాయి. "సమదుఃఖ సుఖః" అనే పదం మాత్రం 12వ అధ్యాయంలో 13వ శ్లోకంలోనూ, 14వ అధ్యాయంలో 24వ శ్లోకంలోనూ కూడా వచ్చింది.)

ఎవడికైతే విషయాలు, ఇంద్రియాలు సత్యాలనే ప్రతీతి ఉపశమించి పోతుందో, ఎవడికైతే ఆ మాత్రాస్పర్శలు భ్రమలు మాత్రమే అనే జ్ఞానం కలుగుతుందో, వాడే నిజమైన ధీరుడు! ఎందుకంటే, 'ధీ' గలవాడే ధీరుడు. ('ధీ' అంటే తెలివి.) అటువంటి ధీరుడు, సుఖదుఃఖాలపట్ల సమభావం కలిగి, అమృతత్వానికి అర్హుడౌతున్నాడు.

**41. సదసత్తులు**

ఓ అర్జునా! ఈ స్థితిని పొందడం పెద్ద కష్టమైన పనేమీ కాదు. ఆత్మ ఒక్కటే సత్యమని తెలుసుకున్నాక, అనాత్మ పదార్థాలకు ఉనికి ఎక్కడి నుంచి వస్తుంది?

**నాసతో విద్యతే భావః**
**నాభావో విద్యతే సతః।**
**నాస్త్యేవ సుఖదుఃఖాది**
**పరమాత్మాస్తి సర్వగః** (పూర్వ.సర్గ.54, శ్లో. 7)

**(గమనిక** –ఇందులో 'నాసతో విద్యతే భావః, నాభావో విద్యతే సతః' అనేది భగవద్గీతకు ప్రాణనాడి వంటి ఘట్టాలలో ఒకటి. అక్కడ ఇది 2వ అధ్యాయంలో 16వ శ్లోకంలో వస్తుంది. భగవద్గీతలోని ఈ శ్లోకం 'సత్' అంటే ఏమిటి? 'అసత్' అంటే ఏమిటి? అనే నిర్వచనాలను ప్రదర్శించి, ఈ రెంటికీ గల అంతరాన్ని గుర్తు పట్టడం తత్వవేత్తలకు మాత్రమే సాధ్యమౌతుందనీ, అల్పులకు అది అందడం కష్టమనీ చెబుతోంది. అలా చెప్పి 'సత్తు' నిత్యమనీ, 'అసత్తు' అనిత్యమనీ బోధించి, ఈ లెక్కన చూసుకుంటే, దేహాలు అనిత్యాలనీ, దేహి ఐన ఆత్మ నిత్యుడూ శాశ్వతుడూ అనీ, కనుక నిర్భయంగా యుద్ధం చేయమనీ, సమన్వయించుకుంటూ వెళ్ళింది భగవద్గీత. వాశిష్ఠ భగవద్గీతలో ఈ శ్లోకం మరో సారి రాబోతోంది.

ఇక్కడ యోగవాశిష్ఠ శ్రీకృష్ణుడు ఇదే సిద్ధాంత వాక్యాన్ని స్వీకరించి, సుఖ దుఃఖాలు అనాత్మ పదార్థాలనీ, అందువల్ల వాటికి అస్తిత్వమే లేదనీ, సమన్వయించుకుంటూ ముందుకు సాగుతున్నాడు. ఈ విషయాన్ని గమనించుకుంటూ ఇక మనం యోగవాశిష్ఠ శ్రీకృష్ణుడి వెంట వెడదాం.)

ఓ అర్జునా! 'సత్' పదార్థమంటే ఏమిటి? 'అసత్' పదార్థం అంటే ఏమిటి? జాగ్రత్తగా ఆలోచించు. నిజమైన ఉనికి గల 'సత్' పదార్థానికి భూత భవిష్యద్వర్తమాన కాలాలలో ఒక్క క్షణమైనా లేకపోవడం అనేది లేదు. త్రికాలాబాధ్యంగా వుండ గలిగితేనే దానికి 'సత్' అని పేరు. ఇది గాక మిగిలినదంతా "అసత్తే". అది కొంత సేపు ఉన్నట్టు కనిపిస్తుంది. అలా కనిపించే సమయంలో గూడా దానికి ఉనికి లేనే లేదు. కొన్ని కోట్ల సంవత్సరాలు వుందండీ, మధ్యలో ఒక్క క్షణం లేదండీ, తర్వాత మళ్ళీ చాలా కోట్ల సంవత్సరాలు వుందండీ – అన్నా సరే, మధ్యలో ఒక్క క్షణం దానికి అస్తిత్వం లేదు గనుక, మిగిలిన సమయంలో దానికి ఉన్నట్టు కనిపించే అస్తిత్వం భ్రాంతి మాత్రమే! లేనిదానికి నిజమైన ఉనికి వుండనే వుండదు. ఇదే సిద్ధాంతం. దీనిని కాదనాలని అనేకమంది అనేక విధాలుగా ప్రయత్నించారు. కానీ, ఏమీ ప్రయోజనం లేదు. ఉన్నది ఎప్పుడూ వుంటుంది. లేనిది ఎప్పుడూ వుండనే వుండదు. ఇది ఖాయం. అందుకే సుఖదుఃఖాలనేవి లేనే లేవు! వాటికి అస్తిత్వమే లేదు. అస్తిత్వం ఉన్నది ఒక్క పరమాత్మకు మాత్రమే. నిజమైన ఉనికి లేక పోయినా, ఉన్నట్లు కనిపించే ఈ సమస్త పదార్థాలలోనూ వ్యాపించి వుండి, వాటికి తాత్కాలిక అస్తిత్వాన్ని ప్రసాదిస్తున్నవాడు ఆ పరమాత్మ ఒక్కడే!

కాబట్టి అర్జునా! ఈ ప్రపంచం, 'సత్యం' అనే ఆలోచన విడిచిపెట్టు. ఆత్మ, 'అసత్యం' అనే ఆలోచన కూడా విడిచి పెట్టు. ఈ రెంటికీ ముడిపెట్టే మనస్సును కూడా విడిచిపెట్టు. అప్పుడు చిదాత్మ ఒక్కటే మిగిలి వుంటుంది. దానిలో నువ్వు సుస్థిరంగా వుండిపో.

ఆత్మ సుఖాలతో సంతోషించేవాడూ గాదు, దుఃఖాలలో వాడిపోయేవాడూ గాదు. ఇతడు చైతన్య స్వరూపుడై శరీరంలో ఉంటూ కూడా, దృశ్య పదార్థాలన్నిటికీ సాక్షిగా వుంటున్నాడు.

ఈ దేహాది దృశ్య పదార్థాల స్వరూపాలను పొందేది చిత్తమే. అది జడం. అది నశించినా, ఆత్మకేమీ లోటు రాదు.

అజ్ఞానంవల్ల తాడును చూస్తే పామనిపించి భయం కలిగింది. ఈ భయం ఎలా పోతుంది? 'అక్కడ వున్నది తాడు' అనే జ్ఞానంచేత పోతుంది. అలాగే, అజ్ఞానంవల్ల ఆత్మయందు దేహాదులు, సుఖదుఃఖాదులు, అనే భ్రాంతులు కలిగాయి. ఈ భ్రాంతులు పోవాలంటే ఆత్మజ్ఞానం ఒక్కటే మార్గం. వేరే దారి లేదు.

కనుక ఓ అర్జునా! నువ్వు ఉత్పత్తి వినాశాలు లేనట్టి పరమాత్మను గురించి తెలుసుకో. తదేకత్వాన్ని పొందు. తద్భిన్నమైన ద్వైత పదార్థ సమూహాన్ని పరిత్యజించు. లాభాలాభాల విషయంలో సముడవై, గుహలో బిగిసిపోయిన గాలి లాగా, కదలిక లేని వాడవై, తొణకక బెణకక, మీది కొచ్చి పడిన ప్రస్తుత కర్మను ఆచరించు.

**యత్కరోషి యదశ్నాసి**
**యజ్జుహోషి దదాసి యత్ ।**
**యత్కరిష్యసి కౌంతేయ**
**తదాత్మేతి స్థిరో భవ ॥** (పూర్వ.సర్గ. 54, శ్లో.22)

(దీంట్లో మొదటి భాగం భగవద్గీతలో, 9వ అధ్యాయంలో 27వ శ్లోకంలో వచ్చింది.)

ఓ కౌంతేయా! నువ్వు ఇప్పుడు ఏది చేస్తున్నావో, ఏది తింటున్నావో, ఏది హోమం చేస్తున్నావో, ఏది దానం చేస్తున్నావో, ఇక ముందు ఏమి చెయ్యబోతావో, అవన్నీ ఆత్మ స్వరూపాలే అనే నిశ్చయంలో స్థిరంగా ఉండు.

(భగవద్గీతలో ఈ ఘట్టంలో 'నువ్వు చేసేవన్నీ నాకే సమర్పించు' అన్నాడు పరమాత్మ. ఇదే బ్రహ్మార్పణం అన్నాడు. అక్కడితో ఆగలేదు. దీనివల్ల నీకు కర్మ సంన్యాసయోగం లభించి, దానివల్ల నీకు విముక్తి లభిస్తుంది, అన్నాడు – పై శ్లోకంలో. యోగవాశిష్ఠ శ్రీకృష్ణుడు ఈ బ్రహ్మార్పణ సోపానాన్ని పక్కన పెట్టేసి, "తదాత్మేతి స్థిరోభవ"– నువ్వు చేసే పనులన్నీ ఆత్మస్వరూపాలే అంటూ సూటిగా సంన్యాసయోగంతో ముడిపెట్టేస్తున్నాడు. కనుక ఇక్కడ సిద్ధాంత భేదం లేదనీ, మధ్యలో కొన్ని మెట్లను సంగ్రహం చెయ్యటం మాత్రం జరిగిందనీ గ్రహించి ముందుకు సాగుదాం.)

జీవుడు, లోపల తన్మయత్వంతో దేనిని భావన చేస్తాడో, బయట దానినే పొందుతాడు. ఇది ఖాయం. కనుక, నువ్వు సత్యమైన బ్రహ్మ స్వరూపాన్ని పొందాలనుకుంటే, లోపలి బ్రహ్మ సత్యాన్ని తన్మయంగా భావన చెయ్యి.

అలా భావన చేసి సిద్ధులైన బ్రహ్మజ్ఞులు గూడా, స్వధర్మంగా వచ్చి మీద పడిన పనిని చేస్తూనే వుంటారు. కాని అందరి లాగా లాభం కోసం చేయరు. లాభాలాభాలను వదిలేసి, సర్వ కామ పరిత్యాగమే పరమార్థమని నిశ్చయించి, పరబ్రహ్మ నిష్క్రియమని గ్రహించి, కేవలం పైపై చేష్టలుగా కర్మలను ఆచరిస్తూ వుంటారు.

### 41. కర్మ – అకర్మ

**కర్మణ్యకర్మ యః పశ్య**
**త్యకర్మణి చ కర్మ యః ।**
**స బుద్ధిమాన్మనుష్యేషు**
**స చోక్తః కృత్స్న కర్మకృత్ ॥** (పూర్వ.సర్గ. 54, శ్లో.25)

(ఇది భగవద్గీతలో 4వ అధ్యాయంలో 18వ శ్లోకంగా వుంది. ఒకటే భేదం అక్కడ 'పశ్యేత్' అని వుంది. దీనికి శంకర భగవత్పాదులు 'పశ్యతి' అని అర్థం వ్రాశారు. ఆపదమే ఇక్కడ యోగవాశిష్ఠంలో వుంది. ఇది గూడా భగవద్గీతలోని ప్రాణనాడి వంటి ఘట్టాలలో ఒకటే. అందుకేనేమో, ఈ ఘట్టంలోంచి మూడు శ్లోకాలు ఈ సందర్భంలో ఇక్కడ రాబోతున్నాయి.)

ఓ అర్జునా! వెనుక చెప్పిన రీతిగా బ్రహ్మ అనేది నిష్క్రియం. కనుక ఎవడైతే స్వధర్మ విహిత విధి రూపాలైన కర్మలన్నిటినీ నిష్కామంగా ఆచరించడం ద్వారా, ఆ కర్మలలో అకర్మను మాత్రమే, అనగా పరబ్రహ్మను మాత్రమే, దర్శిస్తున్నాడో, అలాగే అకర్మయందు (బ్రహ్మయందు) సతత ప్రవాహరూపమైన నియత కర్మను దర్శిస్తున్నాడో, వాడే అసలైన బుద్ధిమంతుడు. వాడే వివేకి. వాడే నిజంగా సమస్త కర్మలను ఆచరించిన సమర్థుడని పెద్దలంటారు.

**మా కర్మఫలహేతుర్భూః**
**మా తే సంగోఽ_స్త్వకర్మణి।**
**యోగస్థః కురు కర్మాణి**
**సంగం త్యక్త్వా ధనంజయ॥** (పూర్వ.సర్గ.54, శ్లో.26)

(ఇది భగవద్గీతలో రెండవ అధ్యాయంలో 47వ శ్లోకంలో ఉత్తరార్థంగాను, 48వ శ్లోకంలో పూర్వార్థంగాను వచ్చింది. సందర్భం మాత్రం ఒకటే.)

కనుక ఓ అర్జునా! నువ్వు అలాంటి వివేకాన్ని సంపాదించు. లోకంలో కర్మలు చేసేవారంతా లాభాలాభాలను దృష్టిలో పెట్టుకొని, వాటి కోసం పని చేస్తూ వుంటారు. కనుక, వాళ్ళు చేసే కర్మలకు హేతువులు కర్మ ఫలితాలే! నువ్వు అలాంటి వాడివి కాబోకు. లోకంలో లాభాలాభాల మీద దృష్టిలేనివారు అసలే పని చేయకుండా సోమరులై పడివుంటారు. నువ్వు అట్లా కూడా కాబోకు. మరైతే ఎలా వుండాలంటావా? యోగస్థుడవై కర్మల నాచరించు. సిద్ధ్యసిద్ధుల యందు సమత్వమే యోగమని పూర్వమే చెప్పాను. అలాంటి సమ దృష్టి రావాలంటే, ఆసక్తిని విడిచి పెట్టాలి. కనుక ఓ ధనంజయా! నువ్వు సంగాన్ని పరిత్యజించి, యోగస్థుడవై కర్మలను ఆచరిస్తూ వుండు.

ఈ మాటే మళ్ళీ మరోసారి చెబుతా విను. నువ్వు కర్మలమీద ఆసక్తిని పెట్టుకోకు. అలాగే తత్వదృష్టి విషయంలో పొరపాటు రానీయకు. విహిత కర్మలను అశ్రద్ధ చేసే సోమరితనాన్ని అంటనీయకు. ఈ జాగ్రత్తలు తీసుకుంటూ యథోచితంగా ముందుకు సాగు.

(**గమనిక**: ఈ సందర్భంలో శ్రీకృష్ణ పరమాత్మ అకర్మ అనే పదాన్ని రెండు అర్థాలలో ఉపయోగిస్తున్నాడు. అకర్మ అంటే ఏది కర్మ కాదో అది. కాదు అనడానికి 'న' అనే పదాన్ని ఉపయోగిస్తారు. ఈ పదానికి అనేకార్థాలు ఉన్నాయి. చేయవలసిన కర్మను చేయకుండా ఎగగొడితే, ఎగగొట్టడం అనేది ఒక దుష్కర్మ. అప్పుడు గూడా దానిని అకర్మ అనే అంటారు. అలా కాక తను చేసే కర్మ ఫలాసక్తి లేనిది గనుక, అది లోక సిద్ధమైన కర్మలకంటె భిన్నమైనది. అది బ్రహ్మ స్వరూపం. అప్పుడు గూడా దాని పేరు అకర్మే! కనుక అకర్మ అనే పదాన్ని ఏ సందర్భంలో ఎలా అన్వయించుకోవాలో తెలుసుకొని సమన్వయం చేసుకోవాలి.)

**త్యక్త్వా కర్మఫలాసంగం**
**నిత్యతృప్తో నిరాశ్రయః।**
**కర్మణ్యభిప్రవృత్తోఽ_పి**
**నైవ కించిత్కరోతి సః॥** (పూర్వ.సర్గ. 54, శ్లో. 28)

(ఇది భగవద్గీతలో 4వ అధ్యాయంలో 20వ శ్లోకం)

కర్మ చేసేటప్పుడు, ఈ కర్మకు నేను కర్తను అనే అభిమానాన్ని వదిలి పెట్టాలి. ఈ కర్మవల్ల ఈ ఫలం రావాలనే ఫలాసక్తిని వదిలి పెట్టాలి. ఆత్మజ్ఞానంచేత ఒక శాశ్వత తృప్తి కలగాలి. దానివల్ల విషయాల పట్ల ఆసక్తి తొలగాలి. రకరకాల ఫలితాలను సాధించుకునేందు కోసం, సాధన సంపత్తిని పోగు చేసుకొనే గుణం పోవాలి. ఇలాంటి పరిస్థితి వచ్చినవాడు, కర్మ సన్యాసం చేసినట్లే లెక్క. కాని కర్మలనుంచి బయటపడే దారి లేక, లోకానికి ఉపకారం చేద్దామని గానీ, శిష్టులకు సమ్మతంగా వుందామని గానీ, ఆ జ్ఞాని పూర్వం లాగే కర్మలను చేసినా గూడా, అతనికి నిష్క్రియమైన ఆత్మ దర్శనం సిద్ధించింది గనుక, అతను ఏ ఒక్క పనీ చేయనట్లే లెక్క. అతను పూర్తిగా అకర్తే!

“అదేమిటయ్యా, ఒక చెంపన అతను కర్మలను చేస్తూ వుంటే, అతన్ని అకర్త అంటావేమిటి?” అని సందేహిస్తావేమో! కర్తృత్వం అంటే, కేవలం కర్మలను చేయడం మాత్రమే కాదు.

ఫలాసక్తి మాత్రమే నిజమైన కర్తృత్వం. ఇది శాస్త్రవేత్తల సిద్ధాంతం. ఇక్కడో చిత్రం వుంది. మనస్సులో గనుక తత్వదృష్టి పట్టుబడక పోతే, అంటే మనస్సు మూర్ఖంగా వుంటే, ఏమీ పని చేయనటువంటి అకర్తకు గూడా ఫలాసక్తి వుంటుంది. కనుక, నువ్వు ఈ రకమైన మూర్ఖత్వాన్ని పూర్తిగా పరిత్యజించాలి. పునరుక్తి అనుకోకు. మళ్ళీ చెబుతున్నా విను. పరిశుద్ధమైన తత్వజ్ఞానాన్ని ఆశ్రయించి, ఫలాసక్తిని పరిహరించినవాడు మహాత్ముడు. అలాంటి మహాత్ముడు ఎన్ని రకాల కర్మలు చేసినా సరే, వాడికి కర్తృత్వం రవ్వంత గూడా పట్టదు.

వాడు కర్త కాకపోతే భోక్త కాడు. వాడు భోక్త కాకపోతే, వాడికి భేద ప్రసక్తి వుండదు. వాడు సర్వసముడై ఏకత్వ స్వరూపుడౌతాడు. దానివల్ల వాడికి అనంతత్వం సిద్ధిస్తుంది. ఇవి భూమికలు. ఈ క్రమంలో వాడు చివరికి, దేహాతీత పరబ్రహ్మ స్వరూపాన్ని అందుకుంటాడు.

**42. అసంసక్తి యోగము**

కనుక, ఓ అర్జునా! భేదభావం అనే ప్రమాదాన్ని పరిత్యజించి, పరమాత్మ దృష్టియందు స్థిరత్వాన్ని సాధించినవాడు, మంచి చేసినా, పొరపాటున చెడు చేసినా కూడా, వాడు కర్త కానే కాడు.

**యస్య సర్వే సమారంభాః**
**కామ సంకల్ప వర్జితాః ।**
**జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం**
**తమాహుః పండితం బుధాః॥** (పూర్వ సర్గ. 54, శ్లో33)

(ఇది భగవద్గీతలో 4వ అధ్యాయంలో 19వ శ్లోకంగా వచ్చింది)

ఎవడు చేసే పనుల వెనకాల కోరికలు గాని, ఇవి విజయవంతం కావాలనే సంకల్పాలు గాని, వుండవో, అలాంటివాడు లోకోపకారార్థం గాని, జీవనార్థం గాని, ఏమైనా పనులు చేసినా సరే, ఆ కర్మలన్నీ వాడికి వున్న జ్ఞానమనే అగ్నిలో దగ్ధమైనట్టే లెక్క. వాడే నిజమైన పండితుడని బ్రహ్మవేత్తల నిశ్చయం.

**నిర్ద్వన్ద్వో నిత్య సత్త్వస్థో**
**నిర్యోగక్షేమ ఆత్మవాన్ ।**
**యథాప్రాప్తానువర్తీ త్వం**
**భవ భూషితభూతలః॥** (పూర్వ.సర్గ.54, శ్లో. 35)

(దీనిలో పూర్వార్థం మాత్రం భగవద్గీతలో 2వ అధ్యాయంలో 45వ శ్లోకంలో వుంది. అర్జునుణ్ణి నిష్కాముడవు కమ్మనీ, తద్వారా జ్ఞాన సమాధిని అందుకోమనీ, బోధించే సందర్భంలో అక్కడ ఈ శ్లోకం వుంది. ఇక్కడ గూడా సందర్భం అదే గాని, ప్రతిపాదించే విధానం మాత్రం కొద్దిగా మారింది.)

కనుక ఓ అర్జునా! సుఖదుఃఖ హేతువులైన, పరస్పర విరుద్ధాలైన, విషయాలనుంచి బైటపడు. ఎల్లప్పుడూ సత్వగుణాన్నే ఆశ్రయించుకొని వుండు. ఇంతకు ముందు దొరకనిది కొత్తగా దొరికితే దాని పేరు యోగం. ఉన్న దానిని కాపాడుకోవడం పేరు క్షేమం. ఈ యోగక్షేమాలు రెండింటి మీదా చింత వదిలిపెట్టు. నిత్యమూ అప్రమత్తుడవై వుండు. స్వధర్మాన్ని ఆచరించేటప్పుడు నువ్వు తీసికోవలసిన జాగ్రత్తలు ఇవే! ఈ జాగ్రత్తలతో, నువ్వు దేనినీ కోరకుండా, దేనినీ తిరస్కరించకుండా, యథా ప్రాప్తంగా, కర్మలను ఆచరిస్తూ వుండు. నువ్వు

అలా వుంటే, అప్పుడు నువ్వు ఈ భూమికే ఒక అలంకారానివి ఔతావు.

**కర్మేంద్రియాణి సంయమ్య**
**య ఆస్తే మనసా స్మరన్ ।**
**ఇంద్రియార్థా న్విమూఢాత్మా**
**మిథ్యాచార స్స ఉచ్యతే ॥**
**యస్త్వింద్రియాణి మనసా**
**నియమ్యారభతేఽర్జున।**
**కర్మేంద్రియైః కర్మయోగ**
**మసక్త స్స విశిష్యతే ॥** (పూర్వ. సర్గ. 54, శ్లో.36,37)

(ఇది భగవద్గీతలో 3వ అధ్యాయంలో 6,7 శ్లోకాలుగా వచ్చాయి)

అర్జునా! ఈ జాగ్రత్తలు తీసుకోకుండా ఎవడైతే కర్మేంద్రియాలను మాత్రం కట్టేసుకొని, మనస్సుతో మాత్రం ఆయా విషయాలను స్మరించుకుంటూ వుంటాడో, వాడు బుద్ధి హీనుడు, డాంబికాచారుడు, అని పెద్దలంటారు. దీనికి భిన్నంగా జ్ఞానేంద్రియాలను మనస్సుతోనే నియంత్రించి, కర్మ ఫలం మీద ఆసక్తిని పరిత్యజించి, ఎవడైతే కేవలం కర్మేంద్రియాలతో కర్మలను చేసుకుపోతూ వుంటాడో, వాడే కర్మయోగి, వాడే గొప్పవాడు.

**ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠం**
**సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్ ।**
**తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే**
**స శాన్తిమాప్నోతి న కామ కామీ ॥** (పూర్వ.సర్గ. 54, శ్లో. 38)

(ఇదే ఈ సర్గలో చివరి శ్లోకం. భగవద్గీతలో ఇది 2వ అధ్యాయంలో 70వ శ్లోకంగా వచ్చింది)

మనస్సుతో జ్ఞానేంద్రియాలను నియంత్రించడమంటే పైపై నియంత్రణ గాదు. అన్ని వైపులనుంచీ నదీ జలాలు వచ్చి పడుతున్నా, ఎలాగైతే సముద్రం నిశ్చలంగా, నిండుగా, వుంటుందో, అలాగే, ఇంద్రియార్థాలైన విషయ వాంఛలన్నీ ఎవడిలోకి చేరినా సరే వాడిలో ఏ విధమైన వికారాన్నీ కలిగించలేక, వాడిలో లీనమై పోతాయో, అంటే వాడిని లొంగ దీసుకోవడం చేతగాక వాడికే లొంగిపోతాయో, అలాంటివాడే శాశ్వతమైన శాంతినీ, శాశ్వతమైన మోక్షాన్నీ, పొందుతాడు. అంతే గానీ, కోరికలను కోరుకుంటూపోయేవాడు కాదు.

వశిష్ఠమహర్షి ఇక్కడికి ఈ సర్గను పూర్తి చేసి పై సర్గను భగవద్వాక్యంగానే కొనసాగిస్తున్నాడు. ఈ సర్గలో రెండు చోట్ల తన శ్లోకాలను తనే పునరుక్తి చేసుకోబోతున్నాడు.

**శ్రీభగవానుడు**: ఓ అర్జునా!భోగాలను విడిచిపెట్ట కూడదు. అదే సమయంలో ఆ భోగాలను భావించ కూడదు. ఏది ఎలా ప్రాప్తిస్తే అలా వుంటూ, సమభావంతో వుండాలి. అంటే, దేహధారణకు కావలసినంతవరకూ అన్న పానాది భోగాలను విడిచి పెట్టరాదు. కానీ హాయిగా భోగాలను అనుభవించడం అనే వ్యసనం మాత్రం పనికి రాదు. అవి వచ్చినా, పోయినా సరే, సమ బుద్ధితో వుండాలి.

కనుక, జనన మరణ శీలమైన ఈ దేహాన్ని నేననుకోబోకు. సత్యస్వరూపమైన ఆ పరమాత్మే నేననే భావనలో వుండు.

ఓ మహావీరా! ఈ దేహం పోతే పోయేదేమీ లేదు. ఆత్మ పోతే అంతా పోతుంది. కాని, ఆత్మ నశించేది కాదు.

**న హి శీర్యత్యచిత్తాత్మా**
**త్యక్త సర్వ పరిగ్రహః ।**
**కర్మణ్యభి ప్రవృత్తోఽపి**
**నైవ కించిత్కరోతి సః॥** (పూర్వ.సర్గ.55, శ్లో.4)

(దీనిలో ఉత్తరార్థం భగవద్గీతలో 4వ అధ్యాయంలో 20వ శ్లోకంలో వచ్చింది.)

ఈ దేహాదులన్నిటినీ నేననే భావనతో స్వీకరించడానికి కారణమైనది చిత్తం. అలా స్వీకరించినవన్నీ వదిలేస్తే, మిగిలిపోయిన వాడు అచిత్తాత్మ. దేహాదుల పరిగ్రహం వున్నంతవరకూ, వాటికి నాశం వస్తే, ఆ నాశం తనదే అనే భ్రాంతి కలుగుతూ వుంటుంది. ఆ పరిగ్రహాన్ని పరిత్యజించేస్తే, మిగిలిన అచిత్తాత్మకు నాశ ప్రసక్తే లేదు. అందుకనే వేదం గూడా అచిత్తాత్మను "అశీర్యో న హి శీర్యతే" (అతడు నాశానికి లొంగడు, అవినాశి) అంటోంది. అలాంటి అచిత్తాత్మ స్థితిలో వున్నవాడు ఎన్ని రకాల పనులు చేసినా ఏమీ చేసినట్లు కానే కాదు.

ఎందుకంటే, ఫలాసక్తి మాత్రమే నిజమైన కర్తృత్వం. ఇది శాస్త్రవేత్తల సిద్ధాంతం. ఇక్కడో చిత్రం వుంది. మనస్సులో గనుక తత్వదృష్టి పట్టుబడకపోతే, అంటే మనస్సు మూర్ఖంగా వుంటే, ఏమీ పని చేయనటువంటి అకర్తకు గూడా ఫలాసక్తి వుంటుంది. కనుక, నువ్వు ఈ రకమైన మూర్ఖత్వాన్ని పూర్తిగా త్యజించాలి. పునరుక్తి అనుకోకు. మళ్ళీ చెబుతున్నాను. విను. పరిశుద్ధమైన తత్వజ్ఞానాన్ని ఆశ్రయించి, ఫలాసక్తిని పరిహరించినవాడు మహాత్ముడు. అలాంటి మహాత్ముడు ఎన్ని రకాల కర్మలు చేసినా సరే, వాడికి కర్తృత్వం రవ్వంత కూడా పట్టదు. (ఈ వాక్యాలు 54వ సర్గలో 29,30 శ్లోకాలుగా వచ్చాయి. అవే శ్లోకాలను వాల్మీకి మహర్షి 55వ సర్గలో 5,6 శ్లోకాలుగా పునరుక్తి చేశాడు. దాని ద్వారా "ఇది పూర్వం చెప్పిన విషయమేనయ్యా, అర్థం కావడం కోసం మళ్ళీ చెబుతున్నాను" అనే స్ఫూర్తిని కలిగిస్తున్నాడు.)

ఆత్మకు వినాశం లేదు. ఆద్యంతాలు లేవు. ముసలితనం లేదు– అని పెద్దలకు తెలుసు. ఆత్మకు ఇలాంటి వికారాలున్నాయనే భావం ఒక అపార్థం. ఈ అపార్థమే సమస్త దుఃఖాలకూ మూలం. నీకు ఇలాంటి అపార్థం లేకుండు గాక! ఆత్మ వేత్తలైన ఉత్తములు ఆత్మ నశిస్తుందనుకోరు. వాళ్ళు పరమాత్మ మీద నేననే భావాన్ని పెట్టుకొని వున్నవారు గనుక, అనాత్మ పదార్థాలను 'నేను' అనే దృష్టితో చూడరు.

### 43. మరణమనేదే లేదు

**అర్జునుడు**: ఓ త్రిలోకనాథా! ఓ జ్ఞాన ప్రదా! ఇలా ఐతే , అజ్ఞానులకు మాత్రం దేహం పోయినప్పుడు పోయేదేముంది? ఎందుకంటే, ఆత్మ ఎవరికైనా సమానమే కదా!

**శ్రీభగవానుడు:** నేను చెప్పేదీ ఇదేనయ్యా! ఈ ప్రపంచంలో నశించేదంటూ ఏదీ లేనే లేదు. నిజమైన అస్తిత్వం వున్న ఏకైక పదార్థం ఆత్మ. దానికి నాశం లేదు. ఇక నశించేది ఎక్కడ వుంది? ఐతే లోకమంతా, "ఇది పుట్టిందీ – అది పోయింది" అని గోల చేస్తోంది. ఈ గోలంతా మోహ భ్రాంతి తప్పితే మరొకటి కాదు. ఆత్మకంటే భిన్నంగా, ఈ ప్రపంచంలో ఏదీ నాకు కనిపించడం లేదు. లోకులు చెప్పే పదార్థాలన్నీ నాకు 'గొడ్రాలి కొడుకులు' అన్నట్లుగా వుంది. ఎందుకంటే,

**నాసతో విద్యతే భావో**
**నాభావో విద్యతే సతః।**
**ఉభయోరపి దృష్టోఽన్త**
**స్త్వనయో స్తత్త్వదర్శిభిః ॥**(సర్గ.55, శ్లో.12)

(ఇది భగవద్గీతలో 2వ అధ్యాయంలో 16వ శ్లోకంగా వుంది. దీనిలోని ప్రథమ భాగాన్ని ఇక్కడ 54వ సర్గలో 7వ శ్లోకంలో వాల్మీకి మహర్షి వాడుకున్నాడు. అదే భాగాన్ని ఇక్కడ పునరుక్తి చేస్తున్నాడు. అక్కడ భగవద్గీతలోని అర శ్లోకాన్ని మాత్రమే వాడుకోగా, ఇక్కడ వరుసగా మూడు నిండు శ్లోకాలు వాడుకోబోతున్నాడు.)

లేనిదానికి ఉనికి ఎప్పుడూ లేనే లేదు. ఉన్నదానికి లేకపోవడం లేదు. ఉన్నది ఉన్నదే! లేనిది లేనిదే! వాటి స్వభావం ఎప్పటికీ మారదు. ఇది తత్త్వవేత్తల నిర్ణయం. ఇది మూఢులకు తెలియదు.

**అవినాశి తు తద్విద్ధి**
**యేన సర్వమిదం తతమ్ ।**
**వినాశమవ్యయస్యాస్య**
**న కశ్చిత్కర్తు మర్హతి ॥** (పూర్వ.సర్గ.55, శ్లో.13)

(భగవద్గీతలో ఇది 2వ అధ్యాయంలో 17వ శ్లోకం)

ఏది ఈ ప్రపంచం అంతటా వ్యాపించి వుందో, అది నాశనం లేనిది అని తెలుసుకో. నాశమే కాదు, మార్పు కూడా లేదు. అలాంటి ఈ సర్వ వ్యాప్త సత్పదార్థానికి, ఎవడూ నాశనం కలిగించ లేడు.

**అన్తవన్త ఇమే దేహా**
**నిత్యస్యోక్తా శ్శరీరిణః ।**
**అనాశినోఽప్రమేయస్య**
**తస్మాఽద్యుధ్యస్వ భారత॥** (పూర్వ.సర్గ.55, శ్లో. 14)

(ఇది భగవద్గీతలో 2వ అధ్యాయంలో 18వ శ్లోకం.)

వినాశ రహితమైన ఆ నిత్య సత్య పదార్థమే ఈ లోకంలో వున్న ఏకైక శరీరి. (శరీరాలు కలవాడు.) అతనికి వున్న ఈ శరీరాలన్నిటికీ, అంతం వుంది. ఆ శరీరికి మాత్రం కొలతలూ లేవు, నాశాలూ లేవు.

నువ్వు నా బంధువులు అనుకునేవన్నీ దేహాలు మాత్రమే! అవి అసత్తు అని తేలిపోయింది గనుక, అవి యుద్ధంలో నశించి పోయినంత మాత్రంచేత ఎవరికీ ఏ అనర్థమూ రాదు. అందువల్ల నిస్సంకోచంగా యుద్ధం చెయ్యి.

ఆత్మ ఒక్కడే! వాడికి రెండో తోడు లేదు. ఎందుకంటే, కనిపించే ఈ దేహాదులన్నీ 'అసత్' పదార్థాలే గనుక, వాటికి పుట్టుకే లేదు. అనంతమైన, సత్స్వరూపమైన ఆత్మకు నాశమే లేదు.

**ద్విత్వైకత్వ పరిత్యాగే**
**శేషం యత్పరిశిష్యతే ।**
**శాన్తం సదసతోర్మధ్యం**
**తదస్తీహ పరం పదమ్ ॥** (పూర్వ. సర్గ. 55, శ్లో. 16)

అర్జునా! ఆత్మ అద్వితీయం అంటున్నా. అంతమాత్రం చేత ఆత్మకు ఏకత్వం వుందనుకుంటున్నావేమో! అది కుదరదు. ఎందుకంటే, ఏకత్వం కారణం. దానిని 'సత్' అంటారు. ద్విత్వం కార్యం. దీనిని 'అసత్' అంటారు. ఈ రెంటికీ మధ్య, ఈ రెంటికీ అధిష్ఠానంగా, ఒక శుద్ధ సన్మాత్ర వుంది. అదే పరమ పదం. అదే

ఆత్మ. అదే వున్నది.

**అర్జునుడు**: హే ప్రభూ! నువ్వు చెప్పినట్లుగా, ఆత్మ అలాంటి అపరిచ్ఛిన్నుడే ఐతే, లోకంలో మానవులకు నేను మరణించాననే అనుభవం ఎలా కలుగుతోంది? వాడు బ్రతికుండగా గూడా సుఖ దుఃఖానుభవాలు వాడికి ఎలా కలుగుతున్నాయి?

**శ్రీభగవానుడు**:

**భూమిరాపోఽనలో వాయుః**
**ఖం మనో బుద్ధిరేవ చ।**
**ఏతత్తన్మాత్ర జాలాత్మా**
**జీవో దేహేషు తిష్ఠతి ॥** ( పూర్వ.సర్గ.55, శ్లో. 18)

(దీనిలో పూర్వార్థం భగవద్గీతలో 7వ అధ్యాయంలో 4వ శ్లోకంలో వచ్చింది. అక్కడ అహంకారాన్ని గూడా కలుపుకొని అష్ట ప్రకృతులను చెప్పారు. ఇక్కడ సప్త (7) ప్రకృతులను చెపుతున్నారు. ఈ శ్లోకంలో అన్వయం గూడా కొంచెం జటిలంగా వుంది.)

ఓ అర్జునా! 'భూమి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం' అనే పంచభూతాల తన్మాత్రలవల్ల మనస్సు, బుద్ధి అనేవి ఏర్పడుతున్నాయి. వాటితో సమష్టి, వ్యష్టి, స్థూల, సూక్ష్మ, శరీరాలు తయారవుతున్నాయి. పరమాత్మకు వాటితో తాదాత్మ్యం కలిగే సరికి, జీవభావం రూపొందింది. ఆ జీవ భావమే జన్మ మరణాలకూ, సుఖదుః ఖాలకూ, కారణమౌతోంది.

### 44. ప్రపంచం వాసనామయం

జన్మాంతర వాసనలు ఈ జీవుణ్ణి సంసారంలోకి లాగేస్తున్నాయి. అవే వాడ్ణి ఒక శరీరంలో కట్టిపడేస్తున్నాయి. కొంత కాలానికి ఆ దేహం శిథిలమై పోతుంది. అప్పుడు, జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలను తీసుకొని, ఆ జీవుడు ఆ శరీరం నుంచి లేచి వెళ్ళి పోతున్నాడు.

స్థూల దేహం ఒక రకమైన వాసన. సూక్ష్మ దేహం మరొక రకమైన వాసన. ఇందులో సూక్ష్మ దేహానికి కారణమైన వాసనలు నశించిపోతే, సూటిగా మోక్షమే లభిస్తుంది. స్థూల దేహానికి మూలమైన వాసనలు నశించిపోతే, ఆ దేహం రాలిపోతుంది. అప్పుడు, సూక్ష్మ దేహం, మరో స్థూల దేహాన్ని వెతుక్కుంటుంది. అలా వెతుక్కోవటానికి జీవుడు పాత దేహంలోంచి లేచిపోయినప్పుడు, ఆ పాత దేహం నిశ్చలమై పోతుంది. అప్పుడు లోకులు దానిని 'శవం' అంటారు. ఆ అనుభవాన్ని 'మరణం' అంటారు.

లేచి వెళ్లిపోయిన జీవుడు వాసనావశంచేత మరో శరీరాన్ని పొంది, దాని ద్వారా సుఖదుఃఖాలను అనుభవిస్తూ వుంటాడు.

ఆది సృష్టిలో హిరణ్యగర్భుడు కూడా కేవలం వాసనాబలం చేతనే ఈ ప్రపంచాన్ని సృష్టి చేశాడు. కనుక, శుభ వాసనాభ్యాసం చేత బ్రహ్మాకార చిత్తవృత్తిని సాధించుకొని, దాని ద్వారా జగదుత్పత్తికి మూలమైన పాత వాసనలను దహింప జేసుకోవాలి.

**అర్జునుడు**: దేవా! ఈ ప్రపంచం ఉత్పత్తి సమయంలో వాసనా మయం గనుక, అప్పుడు అది మిథ్య ఐతే అగు గాక. ప్రస్తుతం వున్న స్థితి కాలంలో మాత్రం, అది ఎన్నో పనులను చేసి చూపిస్తోంది. సుఖదుఃఖాలను కలిగిస్తోంది. అదీ గాక, మానవులందరికి 'ఇది సత్యమే' అనే అనుభూతిని కలిగిస్తోంది. కనుక ఈ ప్రస్తుత

దశలో ఇది 'సత్యమే' అని చెప్పడం బాగుంటుందేమో!

**శ్రీభగవానుడు**: అదేం మాటయ్యా? ఏ వస్తువైనా పుట్టిన క్షణంలో ఎలా వుంటే, తరువాత దాని జీవితకాలం అంతా అలాగే వుంటుంది. ఉత్పత్తి సమయంలో అది సత్యమైతే, దాని జీవితకాలం అంతా అది సత్యమే. ఉత్పత్తి సమయంలో అది మిథ్య ఐతే, మధ్యలో దానికి సత్యత్వం ఎక్కడినుంచి వచ్చి పడుతుంది? అది అసాధ్యం. కనుకనే,పూర్వ వాసనలవల్ల జన్మించిన ఈ ప్రపంచాన్ని, నూతనమైన సద్భావనా వాసనచేత తొలగించుకోవాలని నేను చెబుతున్నాను.

**అర్జునుడు**: మిథ్యాత్వ సత్యత్వాల విషయంలో మీరు చెప్పింది బాగానే వుంది. కాని, నూతన వాసనవల్ల పూర్వ వాసన పోతుందనే నియమం ఏముంది? పూర్వ వాసనే ప్రబలంగా వుంటే, ఎప్పటికైనా అదే జయిస్తుంది. ఇక్కడ పూర్వ వాసన హిరణ్యగర్భుడిది. అది మహా ప్రబలమైనది. నేను ఇప్పుడు కొత్తగా ప్రారంభించే సదభ్యాస వాసన దాన్ని ఎలా జయించ గలదు?

**శ్రీభగవానుడు**: అది నీలో వుండే అభినివేశ తీవ్రతను బట్టి వుంటుంది. పట్టుదల తీవ్రంగా వుండే సాధకుడు, వింధ్యపర్వతం పైకి ఎగిరినా, ప్రళయవాయువులు వీచినా, తన ప్రయత్నాన్ని మానడు. అలాంటివాడి ప్రయత్నం ఎప్పుడూ జయించి తీరుతుంది.

**అర్జునుడు**: మీరు చెప్పేది వ్యాసాదులైన పెద్దలు చెప్పే మాటలకు భిన్నంగా వుంది.

**అజ్ఞో జంతు రనీశోఽయ**
**మాత్మన స్సుఖదుఃఖయోః।**
**ఈశ్వర ప్రేరితో గచ్ఛేత్**
**స్వర్గం వా నరకం తు వా॥** (వ్యాఖ్యాత ఉదహరించిన శ్లోకం)

(జీవుడు అజ్ఞుడు. వాడు తన సుఖదుఃఖాల విషయంలో అస్వతంత్రుడు. ఈశ్వరుడు ఎటు పంపిస్తే అటు –స్వర్గానికో , నరకానికో పోతాడు.) – అని వాళ్లు చెబుతున్నారు. స్వర్గ నరకాలకు ఈశ్వరుడే కారణమని వాళ్ళు చెబుతూ వుంటే, పురుష ప్రయత్నమే కారణమని మీరు చెబుతున్నారు.

**శ్రీభగవానుడు**: ఈ ప్రపంచాన్ని సృష్టించేవాడు ఈశ్వరుడే ఐతే, నీ స్వప్న ప్రపంచాన్ని సృష్టించేవాడు కూడా ఆయనే కావాలి. కానీ ఆయన స్వప్న ప్రపంచాన్ని నిరాధారంగా సృష్టి చేస్తున్నాడా? నువ్వు చాలా కాలంగా పోగు చేసుకున్న జాగ్రద్వాసనాబలం చేతనే ఆయన స్వప్న సృష్టి చేస్తున్నాడు. కనుక, ఈ స్వప్న సృష్టికి వాసన కారణమని సులభంగా తెలుస్తోంది. దీనిని బట్టే, జాగ్రత్ప్రపంచ సృష్టి దగ్గర గూడా, ఈశ్వరుడికి నీ పాత వాసనలే ఉపకరణాలని గ్రహించాలి. కనుక, ఈ సంసార భ్రాంతికి, నీ పాత వాసనలే నిజమైన కారణమని చెప్పక తప్పదు. అందుచేతనే, వాసనాక్షయం చేసుకోమని నేను చెబుతున్నాను.

**అర్జునుడు**: దేవదేవేశ్వరా! ఈ వాసన ఎలా పుడుతోంది? ఏం చేస్తే పోతుంది?

**శ్రీభగవానుడు**: సత్యం కంటికి కనిపిస్తున్నా పట్టించుకోని మూర్ఖత్వం, విషయం అర్థమైనా మాటిమాటికీ మరపును కలిగించే మోహం, ఇవే ఈ వాసనకు మూలాలు. అనాత్మ పదార్థాలమీద ఆత్మ అనే భావనను కలిగించడమే ఇది చేసే పని. ఆత్మజ్ఞానాన్ని విస్తరింప జేసుకోవడంవల్ల మాత్రమే ఇది నశిస్తుంది. ఓ కౌంతేయా! ఇప్పటికి నీకు ఆత్మ అంటే ఏమిటో పరిచయం చేశాను. నీకు సత్యం తెలిసింది. ఇక నువ్వు వాసనాక్షయం చేసుకోవాలి. "నేను ఇలాంటి వాడిని. వీళ్ళు నావాళ్ళు" అనే అహంకార మమకారాలను ఇక విడిచి పెట్టు.

**అర్జునుడు**: దేవా! ఏ వస్తువైనా సరే, దేంట్లోంచి పుట్టిందో ఆ మూల పదార్థం నశిస్తే, తను గూడా నశిస్తుంది.

కుండలోంచి మట్టిని తీస్తే కుండ వుంటుందా? జీవుడనేవాడు వాసనలవల్ల జన్మించాడు. ఆ వాసనలను పూర్తిగా లేకుండా చేస్తే, ఆ జీవుడే లేకుండా పోతాడు. జీవుడే నశించిపోతే, ఇక వాడు పొందే పరమపురుషార్థం ఏముంది?

**శ్రీభగవానుడు**: జీవుడంటే ఏమిటనుకుంటున్నావ్? పరబ్రహ్మకంటే భిన్నమైన వేరే పదార్థం అని అనుకుంటున్నావా? అలా ఐతే నీ ప్రశ్న సరిపోతుంది. కాని సత్యం అది గాదే! ఓ మేధావీ! సంకల్పాల బలంచేత కలుషీకృతమైన పరమాత్మ స్వరూపమే జీవుడని తెలుసుకో. ఇలాంటి కలుషీకృత ఆత్మ స్వరూపానికి పట్టిన కాలుష్యం తొలగిపోయి, అవ్యయమైన స్వస్వరూపం బైటపడితే, అదే మోక్షం. కనుక, ఓ వీరా! నువ్వు జీవించి వుండగానే యథార్థమైన తత్త్వాన్ని ప్రత్యక్షంగా దర్శించు. వాసనలనే వలనుంచి బైట పడితే, వాడే ముక్తుడు. ఇలాంటి వాసనాక్షయం లభించనివాడు, ఎంత పండితుడైనా, ఎంత ధర్మ తత్పరుడైనా, పంజరంలోని పక్షి వంటి వాడే. వాడు బద్ధుడే. కనుక సారాంశం ఏమిటంటే, వాసనే బంధం. వాసనాక్షయమే మోక్షం.

(**గమనిక**: ఇక్కడితో 55వ సర్గ పూర్తైయింది. యోగవాశిష్ఠ భగవద్గీతలో 3వ సర్గ పూర్తైయింది. ఇక అర్జునుడికి శ్రీకృష్ణ భగవానుడు జీవన్ముక్తి విశేషాలను చెప్పదలచుకున్నాడు. అందుకోసం వాల్మీకి మహర్షి ఇక్కడ సర్గను మార్చి 56వ సర్గను భగవద్వాక్యం గానే కొనసాగిస్తున్నాడు. వేదాంత శాస్త్రంలో జీవన్ముక్తి అనే మాట ఉన్నదా లేదా అనేదానికి కొన్ని వాదాలున్నాయి. అలాంటి వాదాలకు తెర దించుతూ ఈ సర్గలో వాల్మీకి మహర్షి శ్రీకృష్ణుడి ద్వారా జీవన్ముక్తిని సూటిగా, వాచ్యంగా ప్రతిపాదించ బోతున్నాడు. ఈ సర్గలో ఇప్పటి భగవద్గీతా వాక్యాలేవీ కనిపించడం లేదు.)

**45. గోడలేని బొమ్మ**

**శ్రీభగవానుడు**: అర్జునా! ఈ విధంగా నీ మనస్సులోని వాసనలను తుడిచివేసు కోవడం ద్వారా జీవన్ముక్తిని సాధించు. దానివల్ల మనస్సును చల్లబరచుకొని బంధుదుఃఖమనే మాలిన్యాన్ని పరిత్యజించు.

జరామరణాలను గురించి సందేహాలను పెట్టుకోకు. అసలు మనస్సులో ఆలోచనలే వద్దు. దానిని ఆకాశం లాగా స్వచ్ఛంగా వుంచుకో. ఇలా వుంటూ నీ మీదికి వచ్చిపడే ఏ కర్మలను నువ్వు చేసినా, నీకు పోయేదేమీ లేదు.

**ప్రవాహ పతితం కర్మ**
**స్వమేవ క్రియతే తు యత్।**
**జీవన్ము క్త స్వభావోఽయం**
**సా జీవన్ము క్తతా తథా॥** (పూర్వ.సర్గ.56, శ్లో.4)

ప్రవాహ రూపంగా తన మీద వచ్చి పడే కర్మను, స్వధర్మంగా అనుష్ఠించుకుంటూ పోతూ వుండటమే జీవన్ముక్తుల స్వభావం. అలా వుండటమే జీవన్ముక్తి అంతే గాని, కట్టె లాగా బిగుసుకు పోవడం కాదు.

అలా ఐతే మూఢుడూ కర్మ చేస్తాడు, జీవన్ముక్తుడూ కర్మ చేస్తాడు గదా, మరి వారిద్దరికీ తేడా ఏమిటి? – అని అడుగుతావేమో! మూఢుని మనస్సు ఇది నాకు కావాలి, ఇది నాకు వద్దు అని నిర్ణయాలు తీసుకుంటూ వుంటుంది. జీవన్ముక్తుడు అలాంటి నిర్ణయాలు తీసుకోడు. ఆయన మనస్సు అన్నిటిపట్లా సమంగా వుంటుంది. ఇదే తేడా! జీవన్ముక్తులు సుషుప్తి దశలో వున్నట్లుగా మనశ్శరీరేంద్రియాలతో సంపర్కం లేకుండా, కేవలం ఆత్మమాత్ర స్వరూపులుగా మిగిలి వుంటారు.

జీవన్ముక్తునికి కొంచెం మనశ్శేషం మిగిలి వున్నా, అది విక్షేపాలను సహించ లేదు. ఏ మాత్రం విక్షేపం తగిలినా, అది పరబ్రహ్మలోకే వెళ్ళిపోయి కూర్చుంటుంది. అందుచేత, ఆ మనస్సు ఈ ప్రపంచం అనేది అసలు గోడే లేని బొమ్మ అని ఎప్పుడూ గుర్తిస్తూనే వుంటుంది.

ఆ సత్య దృష్టితో చూస్తే, నీ బంధువులూ లేరు. విడిగా నువ్వు అనేవాడూ లేడు. ఉన్నది ఒకటే ఆత్మ! ఇక చంపేది ఎవరూ చచ్చేది ఎవరు? కనుక ఆభ్రాంతిని వదిలిపెట్టు. ఈ మనస్సుకు గల సామర్థ్యం అసామాన్యమైనది. ఇది క్షణాన్ని కల్పంగా చూపించ గలదు. అణువును పర్వతంగా చూపించ గలదు. అసలు అణువు గూడా లేకుండానే, లేని ప్రపంచాన్ని సృష్టించ గలదు.

కనుక, ఈ మనస్సుయొక్క సామర్థ్యాన్ని గుర్తించి ఈ ప్రపంచం అంతా మనోరాజ్యం మాత్రమే అని గ్రహించు.

(**గమనిక**: ఈ విషయాన్ని వివరించ డానికి వాల్మీకి మహర్షి 37 శ్లోకాలు తీసుకున్నాడు. ఇలా జీవన్ముక్తిని దృఢంగా ప్రతిపాదించిన తరువాత, ఇలాంటి స్థితిని సాధించడానికి సాధకుడు ఏ రకమైన దృష్టిని అభ్యాసం చేయాలో చెప్పవలసి వుంది. శ్రీకృష్ణ భగవానుడు ఆ విషయాన్నే కొనసాగించ బోతున్నాడు. భగవద్వాక్యం కొనసాగుతున్నా విషయ బేధం వుంది గనుక సర్గను మార్చి 57వ సర్గలోకి ప్రవేశిస్తున్నాడు వాల్మీకి మహర్షి.)

***శ్రీభగవానుడు***: అర్జునా! చెప్పా గదా. ఈ ప్రపంచం అంతా గోడ లేని బొమ్మ. ఉన్నది ఆకాశం ఒక్కటే.

**సర్వం వ్యోమకృతం వ్యోమ్నా**
**వ్యోమ్ని వ్యోమ విలీయతే ।**
**భుజ్యతే వ్యోమని వ్యోమ**
**వ్యోమ వ్యోమని చాతతమ్॥** (పూర్వ.సర్గ 57, శ్లో.4)

ఉన్నది చిదాకాశం ఒక్కటే! ఆ ఆకాశమే అన్నీ చేస్తోంది. ఆకాశంతోనే చేస్తోంది. ఆకాశం ఆకాశంలో కలిసి పోతోంది. ఆకాశంలో ఆకాశాన్ని ఆకాశం అనుభవిస్తోంది. ఆకాశంలో ఆకాశమే విస్తరించి వుంటోంది. ఇదే ప్రపంచం.

ఇదంతా ఎలా జరుగుతోందంటే పూర్వ వాసన అనే దారంవల్ల జరుగుతోంది. సన్నని దారం ఏనుగుతొండం అంత పూమాలలు అల్లినట్లుగా సన్నని వాసన ఇంతటి ప్రపంచాన్ని సృష్టిస్తోంది.

ఎలా సృష్టిస్తోందంటే అద్దంలో ప్రతిబింబాన్ని సృష్టించినట్లు సృష్టిస్తోంది. అద్దంలోని కొండను పిండి చేయగలవా? కాల్చగలవా? తడపగలవా? ఏమీ చేయలేవు. ఎందువల్ల? ఆ ప్రతిబింబం అద్దంకంటే భిన్నం కాదు. అందుకే, అద్దం వున్నంత వరకూ దానిని నువ్వు ఏమీ చేయలేవు. అలాగే, చిదాకాశమనే అద్దంలో ప్రతిబింబం లాగా ఏర్పడిన ఈ ప్రపంచాన్ని ఎవరు మాత్రం ఏమి చేయగలరు.

దాన్ని నశింప చేయడానికి ఒక్కటే మార్గం వుంది. ఏ వాసనలవల్ల ఈ ప్రపంచం అనే ప్రతిబింబం పుట్టిందో, అలాంటి వాసనలు కూడా పరబ్రహ్మకంటే (చిదాకాశం కంటే) వేరైనవి కావు అనే జ్ఞానంవల్ల మాత్రమే, వాసనలవల్ల ఏర్పడిన ఈ బంధం తొలగి పోగలదు. వాసనాబంధం తొలగనివాడు ఎంతటి ధర్మాత్ముడైనా, యోగీశ్వరుడైనా, బోనులో వున్న సింహం వంటివాడే.

కనుక ఓ అర్జునా! వాసనా బీజాన్ని ఏ మాత్రమూ మిగుల్చుకో కూడదు. అది ఏమాత్రం మిగిలి వున్నా, సంసార మహారణ్యాన్ని తయారు చెయ్యనే చేస్తుంది. కనుక సత్యమైన పరబ్రహ్మ జ్ఞానమనే అగ్నిచేత ఆ బీజాన్ని మాడ్చాలి. అప్పుడది ఇక మొలకెత్త లేదు. అలా మాడిపోయిన వాసనాబీజం నీటిలో తామరాకు లాగా తేలిపోతుంది గాని, దేనితోనూ కలవదు. కనుక నా ఉపదేశం విని, నువ్వు ఆ స్థితిలో వుండు.

(**గమనిక:** ఇక్కడ వాల్మీకి మహర్షి 'పద్మపత్ర మివాంభసి' –తామరాకు నీళ్ళలో మునుగునట్లు – అని ఉపమానం ప్రయోగించాడు. భగవద్గీత 5వ అధ్యాయం 10వ శ్లోకంలో, "పద్మపత్ర మివాంభసా" – తామరాకు నీటిని అంటనట్లు – అని ప్రయోగం కనిపిస్తోంది. నిస్సంగ కర్మాచరణంవల్ల పాపం అంటదు అనేది అక్కడి సందర్భం. దీనితో 57వ సర్గ పూర్తైయింది.)

***అర్జునుడు:***

**నష్టో మోహః స్మృతిర్లబ్ధాత**
**త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత।**
**స్థితోఽస్మి గత సందేహః**
**కరిష్యే వచనం తవ ॥** (పూర్వ.సర్గ.58, శ్లో.1)

(ఇది భగవద్గీతలో 18వ అధ్యాయంలో 73వ శ్లోకంగా వుంది. ప్రసిద్ధ భగవద్గీతలో ఈ వాక్యం తరువాత ఇక కృష్ణోపదేశం లేదు. ఇక్కడ మాత్రం దీని తరువాత గూడా, కొద్దిగా కృష్ణోపదేశం రాబోతోంది. అంతే తేడా.)

ఓ అచ్యుతా! నీ అనుగ్రహంచేత వాసనలవల్ల కలిగిన మోహం తొలగి పోయింది. మెడలో వేసుకొని మరిచిపోయిన కంఠహారం గుర్తు వచ్చినట్లుగా, నా ఆత్మ తత్త్వం నాకు గుర్తు వచ్చింది. ఇక నాకు ఏ సందేహాలూ లేవు. నువ్వు చెప్పినట్లే చేస్తాను.

***శ్రీభగవానుడు:*** ఓ అర్జునా! హృదయంలో వుండే రాగ ద్వేషాది వృత్తులు, నిద్రాదులవల్ల కాకుండా, తత్త్వజ్ఞానంచేత శాంతించాలి. అప్పుడే చిత్తం శాంతిని పొందుతుంది. అప్పుడు అది వాసనలు లేనిది ఔతుంది. అప్పుడు జీవాత్మ అనబడే శుద్ధ చైతన్యానికి చేత్య సంపర్కం లేకుండా పోతుంది. అదే పరమార్థ స్థితి. ఈ విషయాన్నే శ్రుతి గూడా ఇలా చెబుతోంది.

**యదా సర్వే ప్రలీయన్తే**
**కామా యేఽస్య హృది స్థితాః ।**
**అథ మర్త్యోఽమృతో భవ**
**త్యత్ర బ్రహ్మ సమశ్నుతే ॥** (కఠోపనిషత్తు)

(జీవుడి హృదయాన్ని ఆశ్రయించుకొని వుండే వాసనా రూపమైన చిత్త వృత్తులన్నీ ఎప్పుడైతే నశించి పోతాయో, అప్పుడే మరణశీలియైన ఈ జీవుడు అమృత స్వరూపుడైన పరబ్రహ్మ అవుతున్నాడు. ఈ జన్మలో , ఇప్పుడే, ఇక్కడే, బ్రహ్మత్వాన్ని పొందుతున్నాడు – అని)

కనుక అర్జునా! నువ్వు కామనా రాహిత్యం అనే మంత్ర యోగాన్ని ఆశ్రయించి, నీ అంతఃకరణంలో వున్న విషయ వాసనలనే విష విషూచికా వ్యాధిని పోగొట్టుకో! సంసార భయాలను తొలగించుకో! నువ్వే స్వయంగా భగవంతుడైపో.

***వశిష్ఠుడు***: రామా! భగవానుడైన శ్రీకృష్ణుడు అలా పలికేసరికి పాండు పుత్రుడైన అర్జునుడు తన సందేహాలన్నీ తీరిపోయాయని మరోసారి ఉద్ఘాటించి, లేచి గాండీవం చేత ధరించి, శ్రీకృష్ణుని సారథిగా పెట్టుకొని, నిస్సందేహంగా యుద్ధం చేయబోతున్నాడు.

(**గమనిక –** ఈ విధంగా 58వ సర్గలో భగవద్గీతా బోధను ముగించిన వశిష్ఠమహర్షి తన బోధ ప్రవాహాన్ని యథాపూర్వంగా కొనసాగించ బోతున్నాడు. ఇంతవరకూ జరిగిన ఈ గీతోపదేశాన్ని ఒకసారి సింహావలోకనం చేసుకుంటే, ఇప్పుడు మనకు లభిస్తున్న భగవద్గీతలోంచి 2,3,4,5,6,9,10,12,13,14,18 అధ్యాయాల లోంచి శ్లోకాలు, శ్లోకభాగాలు,

కలుపుకుంటే, ఒక ఇరవై లోపుగా యథాతథంగా దిగాయి అనుకోవచ్చు. వీటిలో ఎక్కువ భాగం రెండవ అధ్యాయంనుండి కనిపిస్తోంది. మొత్తంమీద పర్యాలోచన చేస్తే, భగవద్గీతకు అద్వైతపరంగా చక్కని సమన్వయం చూపిస్తున్న సంగ్రహ వ్యాఖ్యగా యోగవాశిష్ఠ భగవద్గీతను మనం భావించ వచ్చు. కవికాలాదుల చర్చ వదిలేస్తే, ఈ ఘట్టం భగవద్గీతాధ్యయనానికి క్రొత్త మెరుగులను అందించ గలదనటంలో సందేహించాల్సిన పని లేదు. భగవద్గీత లోకంలో సుప్రసిద్ధం కనుక, ఈ ఘట్టాన్ని మనం ఒకింత వివరంగా చెప్పుకున్నా, మనం ఆమూలాగ్రంగా చెప్పుకోలేదు. భగవద్గీతాభిమానులు ఈ రెండు గీతాలకూ తులనాత్మక పరిశీలన చేసేటట్లైతే ఎన్నో మంచి విషయాలు బైటికి వచ్చే సావకాశం వుంది. ఇక మనం వశిష్ఠ బోధలోకి మళ్ళీ ప్రవేశిద్దాం.)

ఈ నిర్వాణ ప్రకరణంలో వశిష్ఠమహర్షి ఇప్పటికి, భుశుండోపాఖ్యానం ద్వారా యోగోపదేశాన్ని, శివోపాఖ్యానంద్వారా పూజోపదేశాన్ని, అర్జునోపాఖ్యానం ద్వారా అసంగ యోగోప దేశాన్ని, పూర్తి చేశాడు. ఇక ఈ నిర్వాణ ప్రకరణ పూర్వభాగంలో చూడాలోపాఖ్యానం అనే కథను ప్రధాన కథగా ఆయన పెట్టుకున్నాడు. దాని దగ్గరికి తీసుకొని పోవడంకోసం కొన్ని చిన్ని చిన్ని ఉపాఖ్యానాలతో సహా 18 సర్గల సుదీర్ఘ పీఠికను నిర్మించుకో దలచుకున్నాడు. అందులో భాగంగా, 59వ సర్గలో జీవన్ముక్తి సిద్ధికి ఉపయోగపడే దృష్టులను వివరించాడు. దానికోసం ఈ సర్గలలో చిదాత్మయొక్క రూపాన్ని రెండు రకాలుగా విభాగం చేస్తూ ఆయన ఇలా అన్నాడు.

### 46. జీవన్ముక్తికి కావలసిన దృష్టి

***వశిష్ఠుడు***: రామా! చిదాత్మను రెండు రకాలుగా విభజించవచ్చు.

1. చేత్యార్థ ప్రధాన రూపము,
2. కేవల సంవిద్రూపము – అని.

చేత్యార్థ ప్రధాన రూపం అంటే శుద్ధ చిత్తు, చిత్తంగా, చిత్త వృత్తిగా , చిత్తవృత్తి ప్రబింబిత విషయంగా, భాసించడం. కేవల సంవిద్రూపం అంటే, అదే చిత్తు పై వాటన్నింటికి కేవలం సాక్షిగా వుండడం.

ఈ రెండు రూపాలలోనూ ఏకరూపంగా వున్న అంశం మీద దృష్టి అవిచ్ఛిన్నంగా వుండటమే జీవన్ముక్తి సిద్ధికి కావలసిన ప్రధాన దృష్టి.

గమనించ వలసిన ముఖ్య విషయమేమిటంటే ఈ దృష్టి– భావనలో వుండవలసిన దృష్టిగాని, క్రియలో వుండవలసిన దృష్టి గాదు. ఈ దృష్టి భావనలో వుంటే, దానిని భావాద్వైతం అంటారు. క్రియలో వుంటే, క్రియాద్వైతం అంటారు. వీటిలో భావాద్వైతాన్ని అవిచ్ఛిన్నంగా ఆశ్రయించాలి. క్రియా ద్వైతాన్ని పొరపాటున గూడ ముట్టుకో కూడదు. ఈ విషయంలో పెద్దలైనవారు ఒక ప్రమాణ శ్లోకాన్ని ఉదహరిస్తూ వుంటారు.

**భావాద్వైతం సదా కుర్యాత్**
**క్రియాద్వైతం న కర్హిచిత్ ।**
**అద్వైతం త్రిషు లోకేషు**
**నాద్వైతం గురుణా సహ ॥** (పూర్వ సర్గ.59 లో 16వ శ్లోకం వద్ద వ్యాఖ్యాత ఉదహరించిన శ్లోకం)

అంటే భావనామాత్రమైన అద్వైత రూపాన్ని ఎల్లప్పుడూ స్వీకరించాలి. తను చేసే క్రియలలో అద్వైతాన్ని ఎప్పుడూ ఆదరించకూడదు. ముల్లోకాలలోను వుండే సమస్త పదార్థాలతోనూ అద్వైతాన్ని అనుసంధానం చేసుకోవాలి. గురువుతో మాత్రం అద్వైతాన్ని అనుసందానం చేసుకోరాదు. (అద్వైతం అంటే అభేదం)

శుద్ధ పరబ్రహ్మ తప్పితే మరో పదార్థం ప్రపంచంలో లేదు గనుక, చెట్లుగా, పుట్టలుగా, కనిపించే నానా రకాల ప్రాపంచిక పదార్థాలూ కూడా పరమాత్మయొక్క రూపాంతరాలే అన్న భావన నిరంతరం కొనసాగాలి. అది సాగుతోంది గదా అని చెట్టు దగ్గరికెళ్ళి పుట్టతో లాగాను, పుట్ట దగ్గరకెళ్ళి చెట్టుతో లాగాను ప్రవర్తించ కూడదు. పూర్తిగా భావాద్వైతంలో మునిగి పోయినవాడు సమాధిలోనే వుండి పోతాడు. వాడు ఏ క్రియలూ చేయడు. క్రియలు చేస్తున్నాడంటే, వాడిలో చిత్త వృత్తి కనీసం కొంతవరకూ బాహ్య వస్తువులను దర్శిస్తోంది. అలాంటివాడు క్రియలలో అన్ని కలగాపులగం జేసి, 'ఇదంతా బ్రహ్మమే' అంటే, అది మాట మాత్రమే ఔతుంది. వాడిలో బేధ దర్శన బీజం మిగిలి వుంది గనుక, క్రియా సాంకర్యంవల్ల అది వృద్ధి చెంది వాడు భ్రష్టుడై, పక్కవాడిని గూడా భ్రష్టు పట్టిస్తాడు. కనుక క్రియాద్వైతం పనికి రాదు.

ఇక ముల్లోకాలలోనూ వుండే పదార్థాలన్నీ ఆత్మ స్వరూపాలే గనుక, 'బ్రహ్మ నేనే, విష్ణువు నేనే, శివుడు నేనే' అనే భావన చెయ్యాలి. కానీ, ఆ బ్రహ్మ దేవుడు ఎదురుగా వస్తే, ఆయన బ్రహ్మదేవుడు అని గుర్తింపు కలిగితే, వెంటనే ఆయనకి ఈ సాధకుడు నమస్కరించాలి గాని, "నువ్వూ పరబ్రహ్మవే, నేనూ పరబ్రహ్మమే. గనుక, నువ్వే నాకు నమస్కారం చెయ్యి" అని అనకూడదు. ఇది క్రియాద్వైతం ఐపోతుంది.

ఇక గురువు దగ్గరికి వచ్చేసరికి, సాధకుడు మరింత జాగ్రత్త పడాలి. భావనలో గూడా, గురువుతో అభేదాన్ని అనుసంధానం చేసుకోకూడదు. గురువు అనే ఉపాధి తనకు విడిగా స్ఫురిస్తున్నంత వరకూ, ఆయనను ఉన్నతమైన పూజ్యస్థానంలోనే వుంచుకోవాలి. దీని విషయంలో ఏమరుపాటు పడితే, మనస్సు పాప పంకిలమై, జ్ఞానం అడుగంటే ప్రమాదం వుంది.

ఈ జాగ్రత్తలు, తీసుకుంటూ, ఆత్మ తత్త్వాన్ని తెలుసుకుంటూ వెడితే చాలు, ఆ జ్ఞాన మాత్రంచేతనే భోగ వాసనలు క్షీణిస్తూ వస్తాయి. భోగాలను మనస్సులో కూడా ఆలోచించకుండా వుండడమే జీవన్ముక్తికి ప్రధాన లక్షణం.

భోగదృష్టి పోవాలంటే 'అందరిలోనూ వున్న ఆత్మను నేనే' అనే సర్వాత్మ భావ దర్శనం కలగాలి. అది కలగాలంటే "నేనీ దేహాన్ని, నేనీ ఇంద్రియాన్ని" అనే పరిచ్ఛిన్న దృష్టిని వదులుకోవాలి.

***శ్రీరాముడు***: అలా ఐతే, ఒకడు సాహసించి తన కాళ్ళూ చేతులూ వరుసగా నరికేసుకుంటూ వచ్చాడనుకోండి. వాడికి సర్వాత్మ భావన దర్శనం పెరిగి పోతుందంటారా?

***వశిష్ఠుడు***: అది పిచ్చి పని. సర్వాత్మ భావం వుండాలని చెప్పాం కాని, భేద బుద్ధిని వుంచుకొని, వ్యవహారాలు చేసుకుంటూ పోతే, సర్వాత్మ భావం లభిస్తుందని చెప్ప లేదు. నువ్వు చేప్పే మనిషి "ఇది నా కాలు, ఇది నా సర్వాత్మ భావనకు అడ్డు వస్తోంది, కనుక దీనిని నరికేస్తాను" అని కాలు నరికేశాడనుకో, అప్పుడు ఆ పని క్రియాద్వైతంలోకి వస్తుంది గాని, భావాద్వైతంలోకి రాదు. క్రియా ద్వైతం పనికి రాదని ముందే చెప్పాం.

చిత్తవృత్తి స్పందం వుంటే క్రియ వుంటుంది. ఆ స్పందం వుంటే, సంకల్పం కూడా వుంటుంది. కేవల స్పంద రహితమైనది శుద్ధ సంవిత్తు. స్పంద రూపాలైన చిత్తవృత్తులన్నీ ఎక్కడ లయిస్తున్నాయో, ఆ స్థానమే శుద్ధ సంవిత్తు. రామా! దాని మీద దృష్టిని పెంచుకో.

ఇదే సత్తాసామాన్యం అంటే. ఈ సత్తాసామాన్య రూపమే ఈ ప్రపంచంలోని చీమ దగ్గరినుండి బ్రహ్మ విష్ణు మహేశ్వరులు దాకా రకరకాల రూపాలను పొంది, రకరకాల ఆనందాలను అనుభవిస్తోంది. ఈ విషయాన్నే తైత్తిరీయ శ్రుతి మానుషానందం, గంధర్వానందం, మొదలైన పదాల ద్వారా వివరించింది. ఇవన్నీ ఆ సత్తాసామాన్యంయొక్క విభూతులే. అలాంటి సత్తాసామాన్యాన్ని నువ్వు ఒక్క నిమిషం ధ్యానం చేసినా చాలు, నీకు ముక్తి లభిస్తుంది. ఆ పైన నువ్వు ఎన్ని రకాలుగా వ్యవహారాలు చేసినా నీకు దుఃఖం వుండదు.

**శ్రీరాముడు**: గురుదేవా! మీరు చెప్పే సత్తాసామాన్యం మనోబుద్ధి చిత్తాది విశేషాలన్నీ తొలగిపోయిన నిర్విశేష పదార్థమా? లేక అవన్నీ వున్న సవిశేష పదార్థమా? ఇలా ఎందుకు అడుగుతున్నానంటే, అది నిర్విశేషమైతే, మీరు చెప్పే విభూతులు దానికి వుండడానికి వీలు లేదు. అది సవిశేషమైతే, మీరు చెప్పిన అత్యంతిక దుఃఖాభావ స్థితి సాధ్యం కాదు. అందుకోసం అడుగుతున్నా.

**వశిష్ఠుడు**: ఈ కనిపించే సృష్టి అంతా నశించి పోయాక మిగిలేది నిర్విశేష సత్తా. ఈ ప్రపంచం వుండగా ఇందులో వుండే నానా జీవ రూపాలను పొంది వుండేది సవిశేష సత్తా! అందులో విభిన్న మనస్సులు గల జీవులుగా వుండేది జీవసత్తా. సమష్టి మనస్స్వరూపంగా వుండేదే ఈశ్వరసత్తా. దీని దగ్గర సవిశేషమనీ, నిర్విశేషమనీ విభాగాలు సాగవు.

సముద్రంలో తుంపురులున్నాయి. చిన్ని అలలున్నాయి. పెద్ద తరంగాలున్నాయి. వాటిమీద బుడగలున్నాయి. వాటి పక్కన నురగలున్నాయి. ఇవన్నీ జల స్వరూపాలే కదా! వీటిల్లో వుండే జలం సవిశేషం అంటావా? నిర్విశేషం అంటావా? అది రెండూ గాదు. అది జలసమాన్యం. అలాగే, విషయాలుగా, ఇంద్రియాలుగా, భూతాలుగా, గుణాలుగా, కాలంగా, రకరకాలుగా కనిపించేది సత్తాసామాన్యం మాత్రమే! ఇటువంటి సత్తాసామాన్యాన్ని భావిస్తూ, ముక్తిని అందుకోమని నేను అంటున్నాను.

### 47. ప్రపంచానుభూతికి కర్మశేషమే కారణం

**శ్రీరాముడు**: గురుదేవా! మీరు మొత్తంమీద ఈ ప్రపంచం అంతా పరమాత్మయొక్క విభూతి అని అంటున్నారు. విభూతి అంటే భ్రాంతి కల్పితమే కదా! భ్రాంతి కల్పితం అంటే స్వప్న సదృశమే కదా! ఇది నిజంగా స్వప్నం వంటిదైతే, అందరికీ ఇది స్వప్నం అనే అనుభూతి వుండాలి. మీరు పూర్వం చెప్పిన మాటల ప్రకారం, బ్రహ్మాది దేవతలకు అలాంటి అనుభూతి వుంటుంది. నాబోటి సామాన్య జీవులకు అలాంటి అనుభూతి లేదు. మేమంతా ఇది సత్యమే అనుకుంటున్నాము. దీనికి కారణం ఏమిటని అడిగితే "నువ్వు చిరకాలంగా ఈ ప్రపంచాన్ని చూస్తున్నావు గనుక, ఆ చిరకాలాభ్యాసబలంవల్ల ఈ ప్రపంచం నీకు సత్యం లాగా కనిపిస్తోంది" అంటున్నారు. నేనేనని ఏమిటి? ఆ బ్రహ్మగారు నాకంటే ఎక్కువగా చాలా చాలా దీర్ఘ కాలంగా ఈ ప్రపంచాన్ని చూస్తున్నాడు. కనుక ఆయన దగ్గర చిరకాలాభ్యాస బలం అత్యధికంగా వుంది. కనుక ఈ ప్రపంచం ఆయనకు మరింత సత్యంగా కనిపించాలి. అలా ఎందుకు కనిపించడం లేదు?

**వశిష్ఠుడు**: రామా! ఈ ప్రపంచం 'సత్యం' అనే భ్రమ కలగడానికి, ఒట్టిగా దీన్ని చూస్తూ వుండడం సరిపోదు. ఇది సత్యం అనే భావానికి చిరకాలాభ్యాసం వుండాలి. అది సామాన్య జీవులలో వుంది. బ్రహ్మగారు ఈ ప్రపంచాన్ని చూస్తున్నాడు గానీ, సత్యం అనుకుంటూ చూడడం లేదు. ఇది బాధితము, "ఇది ఇలా అనిపించడానికి కారణమైన అజ్ఞానం గూడా అసత్యమే" అని తెలుసుకుంటూ దానిని చూస్తున్నాడు.

ఇది తాడే గాని, పాము గాదని తెలిసి పోయింది. ఐనా సరే, ఒక కోణంలోంచి పాము లాగానే కనిపిస్తోంది. అంతమాత్రంచేత ఆ పాము సత్యం అనే భ్రాంతి వుంటుందా?

అలాగే, బ్రహ్మగారు బాధితాను వృత్తిభావంతో (ఇది అసత్యమైనా కనిపిస్తోందీ అనే గుర్తింపుతో) ఈ ప్రపంచాన్ని చూస్తున్నాడు. ఇలా ఎంత దీర్ఘంగా చూసినా సరే, ఆయనకు భ్రాంతి కలిగే సావకాశం లేదు.

**శ్రీరాముడు**: బ్రహ్మాదులకు అలాంటి తత్త్వ జ్ఞానమే వుంటే – 'ఈ ప్రపంచం లేనే లేదు' అనే అనుభవం ఎందుకు రావడం లేదు?

**వశిష్ఠుడు**: సుఖదుఃఖానుభవానికి కారణమైన కర్మ శేషమే ఇందుకు కారణం.

నీ స్వప్నంలో, నీ స్వప్న రాజుగారికి తన జీవితం ఎంతసేపు కనిపిస్తుంది? అతనికి ఆ సుఖదుఃఖాలు అనుభవించే కర్మశేషం వున్నంతవరకూ, ఆ స్వప్న ప్రపంచం కొనసాగుతుంది. దీనినే మరోరకంగా చెబితే, ఆ స్వప్న ప్రపంచం కుప్పకూలి పోకుండా వుండడానికి నీ స్వప్న రాజుగారి కర్మ శేషమే అడ్డం!

(ఈ స్వప్నరాజుయొక్క ప్రసక్తి ఉత్పత్తి ప్రకరణంలో 13వ సర్గ ప్రాంతంలో "స్వప్న రాజు" అనే శీర్షిక కింద వచ్చింది.)

అలాగే బ్రహ్మ దేవుడికి గూడా, ఆయన ప్రారబ్ధ శేషమే ఆయనకు అడ్డం.

**శ్రీరాముడు**: ఐతే మామూలు జీవుడికీ, బ్రహ్మ దేవుడికీ తేడా ఏమిటి?

**వశిష్ఠుడు**: ఒక్కటే తేడా! ఆయన ఇది 'మిథ్య' అని గుర్తించుకుంటూ కర్మ శేషాన్ని అనుభవిస్తాడు. సామాన్య జీవుడు ఇది 'సత్యం' అని అనుకుంటూ అనుభవిస్తాడు.

ఇక్కడ మరో ముఖ్యాంశం కూడా వుంది. ఇప్పటివరకూ చెప్పిన సమాధానాలన్నీ బ్రహ్మయొక్క సృష్టి చాలాకాలం వుండేది అని అంగీకరించి మాట్లాడుకుంటున్నాం. నిజానికి ఈ కాలం అనే మాట అజ్ఞానికి అన్వయిస్తుంది గాని, జ్ఞానికి కాదు. అజ్ఞాని విషయంలో గూడా, స్వల్పకాలంలో దీర్ఘకాల స్వప్నం కనిపిస్తోంది. ఈ విషయాన్ని ఉత్పత్తి ప్రకరణంలో లవణ చరిత్రలో బాగా వివరంగా చెప్పాను.

ప్రజాపతి దృష్టిలో ఒక్కక్షణకాలం, మన దృష్టిలో ఒక మహాకల్పం కావచ్చు. ఆ దృష్టితో చూస్తే, బ్రహ్మ దేవుడికి చిరకాలాభ్యాసబలం వుందని చెప్పే వీలే లేదు. అందుకనే శ్రుతి –

**న నిరోధో న చోత్పత్తిః**
**న బద్ధో న చ సాధకః ।**
**న ముముక్షు ర్న వై ముక్త**
**ఇత్యేషా పరమార్థతా ॥**

ప్రళయం లేదు, ఉత్పత్తి లేదు. బద్ధుడు లేడు, సాధకుడు లేడు, మోక్షాన్ని కోరేవాడు లేడు, మోక్షాన్ని పొందినవాడు లేడు. ఈ మాటే పరమార్థ సత్యం అని చెబుతోంది.)

**శ్రీరాముడు**: ప్రపంచం అంత బొత్తిగా లేనిదైతే, ఈ వ్యవహారం అంతా ఎలా జరుగుతోంది?

**వశిష్ఠుడు**: ఈ ప్రశ్నకు తావే లేదు. స్వప్నంలో అదెలా కనిపించిందీ? ఇదెలా కనిపించిందీ? అనే ప్రశ్నలకి సమాధానం ఏమి వుంటుంది? భ్రాంతి ఇలాగే వుండాలనే నియమం ఏం వుంటుంది?

ఈ భ్రాంతిలో భాగమే కల్పవృక్షమూ, చింతామణి వంటివి. మనం దేనిని కోరుకుంటే దానిని ఇచ్చేస్తాయివి. కాని "నాకు మోక్షం కలుగు గాక, పరబ్రహ్మ నశించు గాక, ప్రపంచం మార్పు లేకుండా అలాగే వుండుగాక, సుఖభోగాలు శాశ్వతంగా వుండుగాక" అని ఇలాంటి వరాలు కోరితే, ఇవి ఇవ్వలేవు.

కాని, లోకంలో కనిపించనివి గూడా భ్రాంతిలో కనిపిస్తూనే వుంటాయి.

**అచేతనోఽపి కురుతే**
**కర్మ యంత్రపుమానిన ॥** (పూర్వ. సర్గ.61, శ్లో. 25)

మామూలుగా ఐతే చేతన పదార్థాలే పని చేయాలి. కాని భ్రాంతిలో మర మనిషి లాగా (రోబోట్ లాగా) జడ పదార్థాలు గూడా పని చేస్తాయి.

(**గమనిక** – ఇక్కడ "యంత్రపుమానివ" అంటూ మర మనిషి ప్రసక్తి తెస్తున్నారు. ఈ గ్రంథం భగవద్గీతానంతర కాలందని అనుకున్నా, ఆ నాటికి మరమనుషుల (రోబోట్‌ల) ప్రసక్తి ఎలా వచ్చింది? ఆనాటికి మన దేశంలో విజ్ఞాన శాస్త్రం వికసించి వుందనడానికి ఇదే మరో నిదర్శనం కావచ్చు.)

రామా! ఇంతకూ చెప్పవచ్చినదేమిటంటే, జీవుల భ్రమ రకరకాలుగా కొనసాగుతూనే వుంటుంది.

**భ్రమాద్భ్రమాన్తరం గచ్ఛన్**
**స్వప్నాత్స్వప్నాంతరం వ్రజన్ ।**
**అతిస్థిర ప్రత్యయభా**
**గిహ జీవో విముహ్యతి ॥** (పూర్వ.సర్గ.61, శ్లో. 30)

జీవుడు ఒక భ్రాంతిలోంచి మరొక భ్రాంతిలోకి, ఒక స్వప్నంలోంచి మరొక స్వప్నంలోకి, నిరంతరం ప్రయాణాలు చేస్తూనే, 'నేను సుస్థిరంగా వున్నాను" అనే విశ్వాసంలో వుంటున్నాడు. ఈ విశ్వాసమే ఒక మహామోహం. ఈ విషయం బాగా అర్థం కావడంకోసం, ఒక చిన్న కథ చెబుతా విను.

## 48. జీవటోపాఖ్యానం లేక శతరుద్రీయోపాఖ్యానం

(**గమనిక** – చిత్ర విచిత్రంగా సాగే ఈ కథ కొంచెం లోతుగా పరిశీలించ దగినది. మళ్లీ దీని ప్రసక్తిని వశిష్ఠుడే నిర్వాణ ప్రకరణ ఉత్తరార్థంలో తీసుకు రాబోతున్నాడు. కనుక, ఇది జాగ్రత్తగా గమనించ దగిన కథ.)

***వశిష్ఠుడు***: రామా! పూర్వం ఒక మంచి యతీశ్వరుడు వుండేవాడు. ఆయన శమదమాది సంపత్తి కలవాడై, యతి ధర్మాలను పాటిస్తూ, సమాధి స్థితిని అభ్యాసం చేస్తూ వుండేవాడు. కొంతసేపు సమాధిలో వుంటూ, మళ్లీ విక్షేపం పొందుతూ, ఇలా కుస్తీ పడుతూ వుండేవాడు.

ఇలా చాలా కాలం గడిచింది. ఒక రోజున ఆయనకో వింత ఆలోచన వచ్చింది. "మనకంటే సామాన్య సాంసారికులే హాయిగా వున్నారు. నేను గూడా అలా వుంటే, ఈ పీకులాట లేకుండా పోయేది" – అని.

అప్పటికే ఆయన చిత్తం పరిశుద్ధమై, ఏకాగ్రత పెరిగి, భావనాబలం తీవ్రంగా వుండటంవల్ల, ఆయన మనస్సులో ఆయనే ఒక సంసారి ఆకారాన్ని చెందాడు. ఆ రూపానికి "జీవటుడు" అని తనే పేరుపెట్టుకున్నాడు.

ఆ జీవటుడు వుండడానికి ఒక ఊరు కావలసి వచ్చింది. దాని కోసం ఒక పట్టణాన్ని నిర్మాణం చేశాడు. అందులో ఒక భవనంలో జీవటుడు మకాం పెట్టి, బాగా తిని, తాగి, మత్తెక్కి నిద్ర పోయాడు.

ఆ నిద్రలో ఓ కల వచ్చింది. వెనుకటి సంస్కారబలం తీవ్రంగా వుండటంవల్ల, ఆ కలలో తానొక వేదాధ్యయన తత్పరుడైన సద్బ్రాహ్మణుడుగా వున్నట్లు జీవటుడికి కనిపించింది.

ఆ పేద బ్రాహ్మణుడు ఒక రోజు, వేద పారాయణ చేసి చేసి, అలసిపోయి, నిద్రపోయాడు. దారిద్ర్య బాధలను తట్టుకోలేక పోతున్న ఆ బ్రాహ్మణుడికి తానొక చిన్న సామంత రాజైనట్లుగా కల వచ్చింది.

ఆ రాజుకు ఎప్పుడు చూసినా చక్రవర్తితోనే పోటీ! అందువల్ల ఒకనాడు నిద్రలో తను చక్రవర్తి ఐనట్లు కల వచ్చింది.

ఆ చక్రవర్తికి తిరుగు లేదు. యుద్ధభయం కూడా లేదు. నిరంతరమూ విలాసాలలో తేలిపోతూ వుండేవాడు. అతనిస్థాయికి మానవ కాంతల అందాలు చాలక దేవతా స్త్రీలను గురించి ఆలోచిస్తూ వుండేవాడు. ఆ ఆలోచనా బలంవల్ల అతను ఒక నాటి కలలో తనే ఒక అప్సరసగా మారిపోయాడు.

ఆ అప్సరసకు ఎంతసేపటికీ అందాల పోటీ. ఎవరి విలాసాలూ నచ్చేవి కావు. ఆడ లేళ్ళ కళ్ళను చూసి, తను కూడా అలా కళ్ళు తిప్పాలని కృషి చేస్తూ వుండేది. ఆ భావనా బలంవల్ల ఒక నాటి కలలో ఆమె తనే ఆడ లేడి ఐపోయింది. ఆ లేడికి, అడవిలో అందీ అందని ఆకుతీగలంటే అంతు లేని పిచ్చి. ఆ మోహంవల్ల

ఆ లేడి నిద్రలో తనే ఒక తీగగా మారిపోయింది.

రామా!'జంతువులకు కూడా కలలు వుంటాయా'? అని సందేహించకు.

**తిర్యంచోఽపి ప్రపశ్యన్తి**
**స్వప్నం చిత్త స్వభావతః ।**
**దృష్టానాం చ శ్రుతానాం చ**
**చేతస్స్మరణ మక్షతమ్ ॥** (పూర్వ.సర్గ.62, శ్లో.18)

జంతువులకు కూడా స్వప్నం వుంటుంది. ఎందుకంటే, అది మనస్సుయొక్క స్వభావం. చూచినవాటిని, విన్నవాటిని స్మరించే గుణం జంతువులలో కూడా మానవులలో లాగే, యథాతథంగా వుంటుంది. స్వప్నం అంటే, ఒక రకమైన స్మరణమే కదా!

ఆ తరువాత, అది కొంత సేపు సుషుప్తావస్థలోకి వెళ్ళిపోయి, ఆ దశలో రాయి లాగా జడంగా వుండిపోయి, ఆ తరువాత లోపల వుండే సంస్కారబీజం మొలకెత్తడంవల్ల ఒక కల కన్నది.

లతగా వుండగా ఆ జీవికి రెండు సంస్కారాలున్నాయి. (1) తను తునిగి పోతాననే భయం (2) తన మీద వాలే తుమ్మెదల అందాల మీది మోహం. వాటిలో మొదటి సంస్కారంవల్ల తను తునిగిపోయినట్లు, ఇంచుమించు, చచ్చిపోయినట్లు ఒక కల వచ్చింది. ఆ కలలలో తనకు రూపం లేదు గనుక, అయోమయం ఐపోయి, సుషుప్తిలోకి వెళ్ళి పోయింది. కొంత కాలానికి మళ్లీ రెండో సంస్కారం తలెత్తింది. దానివల్ల మరో స్వప్నం వచ్చింది. ఆ స్వప్నంలో అది ఒక తుమ్మెద ఐంది.

ఆ తుమ్మెదకు పద్మాలంటే మోజెక్కువ. ఆ మోజువల్ల అది ఒక పద్మంమీద వాలి,వొళ్ళు మరచి మకరందం పీలుస్తూ వుండగా, ఒక బండ ఏనుగు వచ్చి, ఆ పద్మాన్ని తొండంతో పట్టేసి కరకరా నమిలేసింది. ఈ తుమ్మెదకు పారిపోయే సందుకూడా దొరకనే లేదు. అది పద్మంతోపాటు ఏనుగు పళ్ళలో నలిగి పోయింది. అది అలా మరణించే సమయానికి, దాని మనస్సు నిండా భయంకరమైన ఆ ఏనుగే వుంది.

**భ్రమరో వారణాలోకాత్**
**వారణాలోక భావనాత్ ।**
**దదర్శాత్మానమామోద**
**మత్తహస్తితయోదితమ్ ॥** (పూర్వ.సర్గ 62, శ్లో. 27)

ఆ గజభావనా బలంవల్ల ఆ తుమ్మెదకు మరుక్షణంలో తాను ఏనుగై పోయినట్లు కనిపించింది.

ఆ ఏనుగు ఒక రాజుగారికి యుద్ధ గజమైంది. ఎప్పుడూ మదం కారుస్తూ వుండేది. అందువల్ల తుమ్మెదలు వచ్చి తెగ వాలుతూ ఇబ్బంది పెడుతూ వుండేవి. అందువల్ల ఈ ఏనుగు మనస్సులో తుమ్మెదలను గురించిన ఆలోచనే వుండేది. ఈ ఏనుగు ఒక సారి ఓ యుద్ధంలో చచ్చిపోయింది. దాని మనస్సులో తుమ్మెద సంస్కారమే ప్రబలంగా వుండటంవల్ల మరుజన్మలో అది తుమ్మెదైపోయింది.

ఈ మాటు ఈ తుమ్మెద ఒక సరస్సు తీర ప్రాంతాలలో తిరుగుతూ వుండగా, ఒక ఏనుగు కాలు కింద పడి నలిగి చచ్చి పోయింది. ఆ మరణించే సమయానికి దాని మనస్సు ఆ సరస్సులో దూరంగా విహరిస్తున్న హంసల మీదలగ్నమై వుంది. దానివల్ల మరుజన్మలో అది హంసగా పుట్టింది.

హంసగా వుండగా బ్రహ్మ వాహనమైన హంసల గొప్పతనాన్ని గురించి చాలా విన్నది. ఆ వినికిడి బలంవల్ల తనూ అలాగే అవ్వాలని ఆశపడుతూ వుండేది! కొంత కాలానికి దానికో వ్యాధి వచ్చి, అది మరణించింది.

మరణించే సమయానికి బ్రహ్మ హంసల ఆలోచన తీవ్రంగా వుండడంవల్ల, మరు జన్మలో అది బ్రహ్మగారి వాహన హంసగా ఐంది.

అక్కడ బ్రహ్మగారి తత్త్వ బోధలన్నీ విన్నది. దానివల్ల వివేకం కలిగింది. దానివల్ల జీవన్ముక్తి లభించింది. ఇక అది అక్కడే వుండి పోయింది. బ్రహ్మగారితో పాటు బ్రహ్మ కల్పాంతంలో విదేహముక్తిని పొందడానికి సిద్ధంగా వుంది.

ఇలా బ్రహ్మదేవుడి సామీప్య ముక్తిని అందుకున్న ఆ హంస, ఒక రోజున బ్రహ్మగారితో కలిసి కైలాసానికి వెళ్ళింది. అక్కడ రుద్రుడి ఐశ్వర్యం చూసే సరికి దాని కళ్ళు తిరిగి పోయాయి. తాను గూడా రుద్రుడైతే బాగుండు నని పించింది. అనిపించడమే తడవుగా, అద్దంలో బొమ్మ పడ్డట్టుగా, తాను రుద్రుడై పోయింది.

**శ్రీరాముడు**: ఐతే గురుదేవా! ఆ హంసకు ఇంతకు ముందే జీవన్ముక్తి వచ్చిందన్నారు గదా? జీవన్ముక్తులకు కోరికలేమిటి? సంస్కారా లేమిటి? జన్మలేమిటి? "అదికాదయ్యా, ఆ హంసకు పూర్వమే అలాంటి ప్రారబ్ధం వుంది. ఈ రుద్రజన్మ ఎత్తితే గానీ, ప్రారబ్ధం తీరదు. అందువల్లే, దానికిప్పుడు రుద్రజన్మ వచ్చింది. జీవన్ముక్తి కలిగాక కూడా, ఇలా కొన్ని జన్మలు మిగిలి వుండడం ఇతర మహాత్ముల చరిత్రలో కూడా వుంది. "భరతస్య త్రిజన్మభిః" (అంటే, భరతుడికి జీవన్ముక్తి లభించినాక, మూడు జన్మలలో విదేహ ముక్తి లభిస్తుంది) అన్నారు. అలాగే ఇక్కడ గూడా జరిగింది" అన్న సమాధానం చెప్పదలచుకున్నారా? అది కుదరదు. ఎందుకంటే, అదే నిజమైతే, " ఆ రుద్రుణ్ణి చూసి, ఆ హంస నేను గూడా అలా కావాలను కుంది. అందువల్లే రుద్రుడిగా మారిపోయింది." అని మీరెందుకు చెబుతారు? అదీ గాక, రుద్రుడంటే ఏమైనా మామూలు మానవుడా? మానవత్వ దైవత్వాదులు కర్మఫలంగా వస్తే రావచ్చు. కానీ రుద్రత్వం అలాంటిది కాదే! రుద్రత్వం అంటే ఈశ్వరత్వం. అది కర్మ ఫలంగా లభించేది కాదు. కనుక మీరు చెప్పే కథ ఎలా కుదురుతుంది?

**వశిష్ఠుడు**: రామా! హంసకు లభించిన రుద్రత్వం మరో జన్మ అనుకోవడంవల్ల నీకు ఈ చిక్కులన్నీ వచ్చాయి. ఇదో జన్మ కాదు. ఇది సారూప్య ముక్తి. పూర్వం ఆ హంసకు బ్రహ్మ సామీప్య ముక్తి లభించింది. ఇప్పుడు రుద్ర భావనవల్ల రుద్ర సారూప్య ముక్తి లభించింది.

జీవన్ముక్తుడైన ఒక యోగి, తన ప్రారబ్ధబలంచేత, ఒకానొక కోరికను ఆదరించి, తన మనోబలంచేత తనకు రూపాంతరం కల్పించుకుంటాడు. అది మరో జన్మ అవుతుందా? ఇదీ అలాంటిదే!

ఈశ్వరత్వం కర్మఫలంగా పొందేది కాదంటున్నావు. అది నిజమే! కర్మవల్ల పూర్తి ఈశ్వరత్వం రాదు. ఈశ్వర సారూప్యం వస్తుంది. అందుకే వేదం కూడా

**"దేవో భూత్వా దేవా నప్యేతి"**

(వాడు దేవతై, దేవతలలో కలిసి పోతున్నాడు.) అని చెబుతోంది.

**శ్రీరాముడు**: ఈశ్వరత్వానికీ, ఈశ్వర సారూప్యానికీ బేధం ఏమిటి?

**వశిష్ఠుడు**: జగత్సంహారం మొదలైన ఆధికారిక పదవీ కృత్యాలతో కూడినది ఈశ్వరత్వం. ఈశ్వర సారూప్యంలో ఈశ్వరుడితో సమానమైన జ్ఞానైశ్వర్యాలు వుంటాయి గానీ, ఆధికారిక పదవీ కృత్యాలు వుండవు. ఇక్కడ ఈ హంసకు వచ్చినది, ఈశ్వర సారూప్యం మాత్రమే!

**శ్రీరాముడు**: సందేహం తీరింది. పైకథ చెప్పండి.

**వశిష్ఠుడు**: అలా రుద్రసారూప్యాన్ని పొందిన ఆ హంస, ఆ రుద్రలోకంలోనే వుంటూ, ఒక రోజున తన దివ్యదృష్టి బలంతో తనకు కలిగిన పూర్వ స్వప్నాలన్నిటినీ తిరగదోడుకొని, తనలో తనే ఇలా అనుకున్నది –

**అహో ను చిత్రా మాయేయం**

**తతా విశ్వ విమోహినీ।**

**అసత్యైవాపి సద్రూపా**

**మరుభూమిషు వారివత్ ॥** (పూర్వ.సర్గ. 63, శ్లో. 7)

అరెరే! ఈ మాయ చాలా చిత్రమైనది గాదా! అది పూర్తిగా అసత్యమైనదే ఐనా, ఎడారిలో ఎండమావి లాగా, సద్రూపమైనట్లు కనిపిస్తూ, ప్రపంచం మొత్తాన్నీ మోహపెడుతూ, వ్యాపించి వుంటోంది గదా!

నేను మొదట్లో ఎలా వున్నాను? పారమార్థిక చిద్రూపంగా వున్నాను. ఆ తరువాత ఈ మాయయొక్క సంపర్కంవల్ల చిత్తాన్ని అయ్యాను. అక్కడ్నుంచి సంకల్పానయ్యాను. ఆ సంకల్పబలంచేతే నేను ప్రపంచ స్వరూపుణ్ణి అయ్యాను. ఆ తరువాత జీవుణ్ణి అయ్యాను. అనాది జన్మ పరంపరలను అనుభవిస్తూ వస్తున్నాను. ఆ పరంపరలో ఒకచోట యతీశ్వరుణ్ణి అయ్యాను. ఆ తరువాత నేనీ జీవటుడినయ్యాను. ఆ తరువాత నానా జన్మలూ ఎత్తి, చివరికి ఈ స్థితికి వచ్చాను. యతీశ్వరుడి దగ్గర్నుంచి ఇక్కడి దాకా రావడానికి నాకు నాలుగువందల యుగాల వెయ్యి సంవత్సరాలు పట్టింది.

(**గమనిక** – ఇక్కడ వ్యాఖ్యాత చెప్పిన కొన్ని విశేషాలను కలుపుకుంటేనే గానీ శ్లోకాలు సరిగా కొరుకుడు పడవు. అందువల్ల ఆ విశేషాలను ప్రశ్నోత్తర రూపంలో కథలోనే కలిపి చెప్పుకుందాం.)

### 49. శుభవాసనే ప్రబలం

***శ్రీరాముడు***: గురుదేవా! శుభవాసన ఎప్పటికో అప్పటికి అనుభవ వాసనను మింగుతోం దంటున్నారు గదా, ఇది తల్లకిందులుగా ఎందుకు జరుగ కూడదు? అశుభవాసనే, ఎప్పటికో అప్పటికి, శుభవాసనలను మింగేస్తుందేమో?

(**గమనిక** – ఈ ప్రశ్న పూర్వం రెండు మూడు సార్లు వచ్చింది. అక్కడ అశుభ సంస్కారం, అసత్తుని ఆశ్రయించి వుంటుంది కనుక దుర్బలమనీ, శుభవాసనకు శాస్త్రబలం వుంది గనుక ప్రబలతరమనీ, సమాధానం చెప్పారు. ఇక్కడ వశిష్ఠుడు మరో యుక్తిని చెప్పబోతున్నాడు.)

***వశిష్ఠుడు***: రామా! ఇక్కడో కిటుకుంది. అశుభవాసనలు కేవలం ప్రతిబంధక మాత్రాలు. అంతేగాని, శుభవాసనకు సమబలమైన విరోధులు గాదు. శుభవాసనలు జీవికి సహజం. అశుభవాసనలు ఆగంతుకంగా వచ్చి, శుభవాసనలకు అడ్డం పెడతాయి. అందుచేత, అశుభవాసనలు సహజంగానే దుర్బలాలు. ఇక శుభ వాసనలంటావా, అవి అశుభవాసనలకు ప్రతిబంధకాలు కావు. సూటిగా విరోధులే! ఎందుకంటే, అశుభవాసనలు సహజాలు కావు గదా! అందుకే ఎప్పటికైనా, శుభా వాసనలే నిలదొక్కుకొని, తలెత్తుకొని, జీవుణ్ణి ఉద్ధరిస్తాయని చెబుతున్నాను.

***శ్రీరాముడు***: శుభవాసనలు జీవుడికి అంత సహజసిద్ధమైతే, ఎప్పటికో అప్పటికి, అవే గెలుస్తాయి గదా! మధ్యలో నా పురుష ప్రయత్నం దేనికి? శాస్త్రాలు నా మీద జులుం చేయడం దేనికి?

***వశిష్ఠుడు***: సద్వాసన ఎంత సహజసిద్ధమైనా, ఎంత ప్రబలమైనా, దానికి పట్టిన ప్రతిబంధకాన్ని అది స్వయంగా వదిలించుకోలేదు. దానికి పురుష ప్రయత్నం కావాలి. లోకంలో దేవతోపాసనాది ప్రయత్నం అంతా మిథ్యాకోటి లోకి చేరిందే! ఐనా సరే, ఆ పురుష ప్రయత్నం సత్ఫలితాలను ఇస్తూనే వుంది. అలాంటప్పుడు సాక్షాత్తుగా పరమార్థ తత్త్వాన్ని ఆవిష్కరించే శ్రవణ మననాది పురుష ప్రయత్నం సత్ఫలితాన్ని ఇవ్వకుండా వుంటుందా? వుండదు. కనుక ఇక అసలు కథలోకి వెళదాం.

అలా ఆలోచించుకున్న ఆ రుద్రుడికి ఒక సారి తన పాత యతి శరీరాన్ని చూడాలనిపించింది. తన యోగబలం చేత అక్కడికి వెళ్లాడు. ఆ భిక్షు శరీరం నిద్రలో వుంది. దానిని ఈ రుద్రుడు "చేతసా చేతనేన చ"

(సర్గ.63, శ్లో 38) తన చిత్తంలోని ఒక అంశతోనూ, తన తత్త్వజ్ఞానంలోని మరో అంశతోనూ, సంయోజన చేశాడు. దాంతో ఆ యతీశ్వర శరీరం లేచి కూర్చుంది. ఆ యతీశ్వరుడు ఎదురుగా వున్న రుద్రుణ్ణి చూశాడు. అతడు తనే అనే విషయం తనకు అర్థమైంది. అప్పటికే రుద్రాంశ తనలో ప్రవేశించడంవల్ల యతీశ్వరుడికి జీవటుడి దగ్గర్నుంచి రుద్రుడు దాకా తన జన్మ పరంపర అంతా గుర్తుకు వచ్చింది.

ఈ స్మరణవల్ల యతీశ్వరుడికి పరిపూర్ణమైన తత్త్వానుభవం లభించింది. అందువల్ల మిథ్యా కల్పితాలైన రూప భేదాల విషయంలో, అతనికి ఆశ్చర్యపడదగినది ఏదీ కనిపించడం లేదు. ఐనా సరే, ఒక పక్క తన యతి శరీరాన్ని, మరో ప్రక్క రుద్ర శరీరాన్నీ, చూసే సరికి, ఆయనకు ఒక రకమైన ఆశ్చర్యం కలగనే కలుగుతోంది.

(**గమనిక**–ఇక్కడ పాఠకులు గమనించవలసిన రహస్యం ఒకటి వుంది. యతీశ్వరుడికి స్వాప్నిక జన్మ పరంపర కలిగింది. ఆ పరంపరలో రుద్ర దేహం ఆ స్వప్నాన్ని చెదర గొట్టేసింది. కలలో కనిపించిన పులి కలను చెదర గొట్టవచ్చు. కాని కల చెదిరి మెలకువ వచ్చాక, ఆ పులిని కనిపించమంటే కనిపించదు. ఇక్కడ యతీశ్వరుడికి మాత్రం మెలకువ వచ్చాక, రుద్రదేహం ఇంకా కనిపిస్తూనే వుంది, జీవటాది దేహాలు గుర్తొస్తున్నాయి. దీనికి కారణం ఏమిటి? దీనికి వ్యాఖ్యాత చక్కటి సమాధానం చెబుతున్నాడు. స్వప్న జన్మపరంపరలో రుద్రజన్మ జీవన్ముక్తిని సాధించింది. అందుచేత దానికి సత్య సంకల్ప సిద్ధి వుంటుంది. ఆ రుద్ర సంకల్పబలంచేతనే రుద్రశరీరం కలలోని పులి శరీరం లాగా మాయమై పోకుండా నిలబడి వుంది. అదీ గాక, ఈ యతీశ్వరుడియొక్క కర్మశేషంలో తనయొక్క బహు శరీరాలను ఒకే సారి చూసుకునే విచిత్రమైన కర్మశేషం మిగిలి వుంది. అది అనుభవిస్తే గాని పోదు. అందువల్లనే, ఆ యతీశ్వరుడు మెలకువ వచ్చాక, జీవటాది శరీరాలను గుర్తు చేసుకున్నాడు, రుద్ర శరీరాన్ని మాత్రం ప్రత్యక్షంగా చూస్తున్నాడు. తన కర్మశేషంలోనూ, తన అనుభవంలోనూ, ఇన్ని మెలికలున్నాయని ఆయనకు అర్థమైంది. అందుకే ఆయన రవ్వంత ఆశ్చర్యపోతున్నాడు.

పూర్వం స్థితి ప్రకరణంలో,15వ సర్గ ప్రాంతంలో, భార్గవ కుమారుడికి ఇలాంటి అనుభవమే కలిగింది. అక్కడ భార్గవ కుమారుడి పాత శరీరం, చచ్చిపోయింది. ఐనా సరే, దాని మీద మోజుతో, దానిలోకే ప్రవేశించి, దాని సహాయంతో కొత్త శరీరాన్ని తగల బెట్టాడు. ఈ యతీశ్వర కథలో, ఈ యతి ఒకే సారి రెండు శరీరాల్లో జీవించి వుంటున్నాడు. ఇది అసాధ్యమని మనకు అనిపిస్తూ వుంటుంది. కానీ, రోజూ మన స్వప్నంలో మనం చేసేదేమిటి? రాజురూపంలో, రాజుగారి శత్రురూపంలో, రెండు రూపాలలోనూ అక్కడ బ్రతికుంది ఎవరు? స్వప్న ద్రష్ట. ఆ జీవి ఒక్కడే కాదా? అదే సన్నివేశాన్ని ఇక్కడ జాగ్రత్ ప్రపంచంలో చూపిస్తున్నాడు వశిష్ఠమహర్షి. పూర్వపు భార్గవోపాఖ్యనం కంటే, ఈ యతీశ్వరో పాఖ్యానంలో వున్న విశేషం ఇదే! ఇక మళ్ళీ అసలు కథలోకి వెళదాం...)

***వశిష్ఠుడు***: రామా! ఆ యతీశ్వరుడూ, రుద్రుడూ, కొంచెం సేపు ఒకరినొకరు చూసుకొన్నారు. వాళ్లిద్దరికీ ఒకే సారి ఒకే ఆలోచన వచ్చింది – జీవటుడి దగ్గరకు పోదాం – అని.

ఇద్దరూ కలిసి వెంటనే ప్రయాణం మొదలు పెట్టారు. ఈ బ్రహ్మాండాన్ని దాటారు. మరో బ్రహ్మాండం లోకి ప్రవేశించారు. అక్కడి భూగోళం, అక్కడి రాజ్యం, అక్కడి వూరు, అక్కడి ఇల్లు, అన్నీ వెతుక్కుంటూ వెళ్ళారు. చివరికి జీవటుణ్ణి చూశారు. (ఇంచుమించు ఇలాంటి వర్ణనే, ఉత్పత్తి ప్రకరణంలోని లీలోపాఖ్యానంలో వస్తుంది.) ఆ జీవటుడు అజ్ఞాని. వీళ్ళిద్దరూ జ్ఞానులూ, జీవన్ముక్తులూ లోకాంతర వాసులు. అందుచేత వీళ్లిద్దరూ, ఆ జీవటుడికి కనిపించ లేదు. వీళ్లు వెళ్లే సరికి ఆ జీవటుడు శవం లాగా పడి వున్నాడు. మరణించబోతూ వున్నాడు. ఇప్పుడు యతీశ్వర రుద్రులిద్దరూ కలిసి జీవటుడి చిత్తాన్నీ, చైతన్యాన్ని (చేతసా చేతనేన చ, శ్లో. 44) ఇందాకటి లాగే, తమ చిత్తంలోనూ, చైతన్యంలోనూ సంయోజనం చేశారు. దాంతో, జీవటుడు జ్ఞానియై లేచి కూర్చున్నాడు. ఇప్పుడతనికి వాళ్ళిద్దరూ కనిపించారు. ఒకరి నొకరు చూచుకొని ఆశ్చర్యపోయారు.

ముగ్గురికీ ఒకే ఆలోచన వచ్చింది. జీవటుడి మరుజన్మ ఐన బ్రాహ్మణుడ్ని చూద్దాం అని. ముగ్గురూ ఇందాకటి లాగే మరో బ్రహ్మాండంలోకి ప్రవేశించి, బ్రాహ్మణ గృహానికి చేరారు. వీళ్లు వెళ్లేసరికి, ఆ బ్రాహ్మణుడు భార్య కంఠాన్ని గట్టిగా కౌగిలించుకొని గాఢంగా నిద్రబోతున్నాడు. వీళ్ళు ముగ్గురూ ఇందాకటి లాగే, తమ చిత్తాన్నీ, చైతన్యాన్నీ బ్రాహ్మణుడితో సంయోజన చేశారు. ఇప్పుడు ముగ్గురు కాస్తా నలుగురయ్యారు.

ఇప్పుడు నలుగురికీ కలిసి ఒకే ఆలోచన వచ్చింది – సామంత రాజు మందిరానికి వెడదాం– అని. అక్కడ గూడా ఇదే ప్రక్రియ. చిత్తచేతన సంయోజనంతో సామంతరాజు మేల్కొన్నాడు. ఇప్పుడు నలుగురు కాస్తా ఐదుగురయ్యారు.

అక్కడినుంచి వాళ్లు చక్రవర్తి భవనానికి వెళారు. అక్కడ ఐదుగురు కాస్తా ఆరుగురు అయ్యారు.

ఇలా క్రమక్రమంగా ఆ జీవులు ప్రయాణాలు చేసి చేసి, చివరికి 100 మంది అయ్యారు. వందమందీ జ్ఞానులే. వందమందీ రుద్రులే. వీరే శత రుద్రులు.

**ఏక సంవిద్భిన్నతను**
**చిత్ర చేష్టిత వేష్టితమ్ ।**
**ఏక రూప మనేకాభం**
**రూపం తత్పారమేశ్వరమ్ ။** (పూర్వ.సర్గ.63, శ్లో.57)

ఒకే చైతన్యం, చిత్రాతి చిత్రమైన ప్రవర్తనలు గల శరీరాలు మాత్రం అనేకం. ఒకే రూపం. దాంట్లోంచి అనేక రూపాలు. ఇదే పరమేశ్వర స్వరూపాల లక్షణం.

కృష్ణ యజుర్వేదంలోని రుద్రాధ్యాయంలో

**"సహస్రాణి సహస్రశో యే రుద్రా అధిభూమ్యాం"**

(భూమి మీద వేలకు వేల రుద్రులు ఉన్నారు – అని వుంది)

వాళ్ల స్థితి గూడా ఇలాంటిదే! చైతన్యం ఒక్కటే!ఉపాధులు అనేకం!

వేద ప్రసిద్ధ రుద్రులు పదివందలనుకుంటే, ఈ యతీశ్వర రుద్రులు పదకొండో వంద ఔతారు.

**శ్రీరాముడు**: బాగుంది గురుదేవా! ఈ యతీశ్వరుడికి తన స్వప్న జన్మలన్నీ కనిపించినట్లుగా నాబోటి వాళ్లందరికీ ఎందుకు కనిపించవు?

**వశిష్ఠుడు**: ఏ సమయంలో ఏ సంస్కారం మొలకెత్తుతుందో, ఆ శరీరమూ, దానికి అనుకూలమైన ప్రపంచ భాగమూ, అనుభవంలోకి వస్తాయి. ఇక్కడ యతీశ్వరుడికి రుద్ర సంకల్పం జత కూడింది గనుక, అన్ని సంస్కారాలూ ఒకే సారి మొలకెత్తు తున్నాయి. తత్త్వవేత్తలకు మాత్రమే అది సాధ్యం.

**శ్రీరాముడు**: గురుదేవా! యతీశ్వరుడికి కలిగిన జీవటాది దేహాలలో, ఆ పైన ఏదైనా సుఖ దుఃఖాదుల అనుభవం జరిగిందా?లేదా?

**వశిష్ఠుడు**: రామా! ఆ రుద్రులు వందమందీ ఒకరినొకరు చూచుకొని ఆనందపడ్డారు. ఈ లీలా వినోదాన్ని ప్రారంభించిన మొదటి రుద్రుడు ఇక మిగిలిన 99 మందినీ తమ తమ స్వస్థానాలకు చేర్చ దలచుకొని, వారితో ఇలా అన్నాడు–

"ఓ జీవులారా! ఇక మీరంతా మీ మీ స్థానాలకు చేరండి. మీ మీ కర్మ శేషాలను పూర్తి చేసుకోండి. చివరికి నా లోకానికి చేరి, నా ప్రమథగణాలలో సభ్యులుగా ఉండండి. మహా ప్రళయ సమయంలో మీరంతా నాతో కలిసి విదేహ కైవల్యాన్ని అందుకుందురు గాని!"

ప్రథమరుద్రుడు ఇలా చెప్పడంతో, మిగిలిన వారందరికీ నిద్ర మెలకువ వచ్చినట్లు అయింది. ఎవరి స్థానాలలో వారున్నారు. తమ తమ జీవితశేషాలను గడిపి రుద్రలోకం చేరారు.

## 50. స్వప్న జీవులెంతో -జాగ్రజ్జీవులూ అంతే

***శ్రీరాముడు***: గురుదేవా! ఇందాకటివరకూ జీవటాదులంతా యతీశ్వరుడియొక్క సాంకల్పిక పురుషులు అని చెప్పారు. ఇప్పుడేమో, వాళ్ళంతా నిజమైన మనుష్యులు అన్నట్లుగా కథ జెబుతున్నారు. సంకల్పంలో పుట్టిన వస్తువులకు సత్యత్వం ఎక్కడి నుంచి వస్తుంది?

***వశిష్ఠుడు***: రామా! జాగ్రత్కాలంలోని పురుషులు సత్యమైనట్లు, సంకల్పకాలం లోనూ, స్వప్న కాలంలోనూ వుండే పురుషులు అసత్యమైనట్లు, భావించి నువ్వు ప్రశ్న వేస్తున్నావు. ఈ భావమే తప్పు! దీన్ని మార్చుకో.

**ఆదావన్తే చ యన్నాస్తి**
**వర్తమానేఽ పి తత్తథా ॥**

(మొదటా చివరా ఏది లేదో, అంటే భూత భవిష్యత్ కాలాల్లో ఏది లేదో, అది వర్తమాన కాలంలో గూడా లేనట్లే!)–

అనేది సూత్రం. ఈ సూత్రాన్ని మర్చిపోకూడదు. ఈ సూత్రం ప్రకారం ప్రపంచంలో జాగ్రత్కాల పురుషులకు గానీ, స్వప్నకాల పురుషులకు గానీ, సంకల్ప కాల పురుషులకు గానీ, ఎవ్వరికీ సత్యత్త్వం పట్టనే పట్టదు. ఇక వీరు సత్య పురుషులు లాగా కనిపించడానికి కారణం ఏమిటంటే, వీరికి అధిష్ఠానంగా వున్న 'సత్' పదార్థమే! నువ్వు ఆ సదాత్మ దృష్టిలో వుండి మాట్లాడే టట్లైతే, లోకంలో ఏ వస్తువుకీ, ఎప్పుడూ అసత్యత్వం లేనే లేదు! అధిష్ఠాన దృష్టితో అన్నీ సత్యాలే!

ఇక పోతే, ఒక్కొక్క జీవికీ ఒక్కొక్క లోకం సత్యమైనట్లుగా కనిపించడానికి కారణమేమిటంటే, వాడి వాసనా శేషమే! ఈ విషయం పూర్వం కూడా చెప్పాను.

***శ్రీరాముడు***: అలా ఐతే, శతరుద్రులకు ఎవడి వాసనా శేషం వాడిది గనుక, ఎవరి లోకం వాడికే కనిపించాలి కదా! వాళ్ళందరూ ఒకరినొకరు ఎలా చూసుకో గలిగారు?

***వశిష్ఠుడు***: రామా! సమష్ఠి వాసనా శేషాల సంకర స్థితిలో ఇలాంటి సన్నివేశం రెండు సందర్భాలలో కుదరవచ్చు (1) యోగ పరిపాకంవల్ల ఇలాంటి సిద్ధి లభించవచ్చు. (2) రుద్రాదులకు సహజ సిద్ధమైన సత్య సంకల్ప బలంవల్ల ఇది సిద్ధించ వచ్చు. వీటిలో యోగాభ్యాసమనేది చిత్తైకాగ్రతవల్ల సాధ్యమౌతుంది. నిజానికి, ఒక జీవికి ఒక ప్రపంచం కనిపించడానికి కారణం కూడా వాడి చిత్తైకాగ్రతే! ఐతే ఈ చిత్తైకాగ్రత వాసనా బలంవల్ల లభిస్తోంది. అందువల్లే, ఆ వాసనకు అనుకూలమైన ప్రపంచం మాత్రమే వాడికి కనిపిస్తోంది.

దీనికి భిన్నంగా ఒక జీవి ఒక జన్మలో తను ప్రత్యేకంగా చిత్తైకాగ్రతను సాధన చేస్తే, వాడికి యోగ సిద్ధి లభిస్తుంది. దానివల్ల వాడు మామూలు జీవులకంటే విశేషమైన కార్యక్రమాలెన్నో చేయ గలుగుతాడు. ఇందుకు కార్తవీర్యార్జునాది యోగీశ్వరుల ఉదాహరణలు ఎన్నో వున్నాయి. అలాగే ఒక యోగి తన సంకల్ప బలంచేత తన స్వప్న పురుషులందరినీ ఒకే సారి సమావేశ పరచవచ్చు.

ఇక్కడ ప్రస్తుతం మన కథలో మాత్రం ప్రథమ రుద్రుడియొక్క సంకల్ప బలంవల్లే, శత రుద్రుల సమావేశం జరిగింది. చివరికి ఆ రుద్రుడి సంకల్పం వల్లే ఎవరి లోకాలకు వారు పోవడం గూడా జరిగింది.

లోకంలో ప్రతి జీవికీ జరిగేది ఇదేనయ్యా. ప్రతి జీవీ మరణ సమయంలో ఏవేవో సంకల్పాలు చేస్తున్నాడు. వాటి బలంతో వాడికేవో లోకాలు కనిపిస్తున్నాయి. అవి అన్నీ నా సత్య జాగ్రత్ప్రపంచాలు అంటున్నాడు వాడు.

వాడే మళ్ళీ నిద్రాసమయంలో ఏవేవో సంకల్పాలు చేస్తున్నాడు. వెను వెంటనే వాడికి ఏవేవో స్వప్న లోకాలు కనిపిస్తున్నాయి. ఒక స్వప్నం నుంచి మరో స్వప్నంలోకి ప్రయాణం చేస్తున్నాడు. కొన్ని స్వప్నాలకు "జాగ్రత్తులని' పేరు పెడుతున్నాడు. ఇదంతా సహజం అంటున్నాడు. ఈ ప్రవాహం మోక్షం దాకా తప్పదు. ఈ విషయాన్నే యతీశ్వర కథ ద్వారా నేను వివరించాను.

## 51. ఆ యతీశ్వరుడు నిజమైన వ్యక్తేనా?

**శ్రీరాముడు**: చాలా ఆశ్చర్యంగా వుంది గురుదేవా! మీరు చెప్పిన యతీశ్వరుడు కల్పిత వ్యక్తా? లేకా నిజమైన వ్యక్తా? నిజమైన వ్యక్తి ఐతే, అతనికిప్పుడు మోక్షం వచ్చిందా? లేక ఇంకా ఎక్కడైనా జీవుడిగా వున్నాడా?
**వశిష్ఠుడు**: రామా! ఈ విషయాన్ని ఈ రాత్రికి సమాధిలో చూచి రేపు చెబుతా. ఇప్పటికే మధ్యాహ్న వేళైంది. అనుష్ఠానాలున్నాయి. మనం మళ్ళీ రేపు పొద్దున కలుద్దాం.

ఇక్కడ గూడా వశిష్ఠ మహర్షి, రాముడి మననానికి వ్యవధానం కలిగించేందుకోసం ఆ సాయంత్రం సభపెట్టలేదు. మరునాడు ప్రొద్దున్నే సభలో వశిష్ఠుడే మొదలు పెట్టాడు.

**వశిష్ఠుడు**: రామా! రాత్రి చాలా సేపు ధ్యానంలోకి దిగాను. చివరికి భారత దేశానికి ఉత్తరంగా 'జినీ' అనే దేశం కనిపించింది. (ఇది ఇప్పటి చైనా కావచ్చు.) దానికి దగ్గర్లోనే 'విహారం' అనే చిన్న దేశం కనిపించింది (ఇది ఇప్పటి 'బుఖారా' కావచ్చు.) ఆఫ్ఘనిస్థాన్ సమీపాలలో బుఖారా అనే పట్టణం వుంది. ఈ 'బుఖారా' పదం 'విహారా' అనే పదానికి వికృతి అని భాషా శాస్త్రవేత్తలు చెబుతున్నారు.)

ఈ విహార దేశంలో ఈ యతీశ్వరుడు నాకు కొంచెం ముసలివాడై ఎఱ్ఱటి వెంట్రుకలతో, సమాధి కోసం ప్రయత్నం చేస్తూ కనిపించాడు.

ఇతడు 21 రోజుల పాటు దీర్ఘ సమాధిలో ఉండదలచు కున్నాడు.అందుకోసం తలుపులు బిగించుకొని గదిలో కూర్చున్నాడు. ఎవరూ తనకు ధ్యాన భంగం చేయరాదని ఇంట్లో వాళ్ళందరికీ ఆజ్ఞలు పెట్టాడు. వాళ్ళు అతనిని జాగ్రత్తగా రక్షిస్తున్నారు.

పూర్వకల్పంలో ఇతను ఇలా వెయ్యి సంవత్సరాలు దీర్ఘ సమాధిని ఆచరించాడు. ఇప్పుడు మళ్ళీ 21 రోజులు సమాధిలో వున్నాడు.

ఇలాంటివాడు ఇంకా ఎక్కడన్నా ఉన్నాడేమోనని వెతకటం మొదలెట్టాను. ఒక బ్రహ్మాండం దాటి, మరో బ్రహ్మాండం దాటి, వెతుకుతూ ఉన్నాను. ఒక చోట మళ్ళీ ఇలాంటివాడే కనిపించాడు.

అప్పటికి తెల్లవారుఝాము ఐపోయింది. దాంతో, నా అన్వేషణ చాలించి వెనక్కు వచ్చేశాను. ఈ అనంత కోటి బ్రహ్మాండాలలో ఇలాంటి యతీశ్వరులు ఇంకా ఎంతమంది ఉన్నారో ఎవరు చెప్పగలరు?

రామా! ఆ యతీశ్వరుడు ఎక్కడ ఉన్నాడని అడిగావు? పూర్వ కల్పంతో కలుపుకుంటే, ఇప్పటికి ఆ రకం యతీశ్వరులు ముగ్గురు కనిపించారు నాకు. వీళ్లు పూర్తిగా ఒకటా? పూర్తిగా వేరా? అదీ తేల్చి చెప్పడం కష్టమే! పోలికలు ఎక్కువగా వుండబట్టి వారే వీరు అని అనవలసి వస్తోంది.

ఆ యతీశ్వరుడే గాదు, ఈ సభలో వుండే నారదుడు, వ్యాసుడు, శుకుడు, పులస్త్యుడు, పులహుడు,

అగస్త్యుడు భృగువు, అంగీరసుడు, మొదలైన వారంతా ఇప్పుడు అనేక కల్పాలలో ఇంచుమించు ఇదే రూపాలతో, ఇదే గుణాలతో జీవిస్తున్నారు.

దీనిని బట్టి ఏమి తేలుతోందంటే, ఈ ప్రపంచం అంతా ప్రతిభాస మాత్రమని (భ్రాంతి మాత్రమని) మరో సారి నిరూపణ అవుతోంది.

**దశరథుడు**: (ఈయన గూడా ఆ సభలోనే ఉన్నాడు) మునీంద్రా! గురుదేవా! మీరు అనుమతి ఇస్తే, నేను నా మనుష్యులను ఆ విహార దేశానికి పంపుతాను. వాళ్ళు అతనిని ఇక్కడికి తీసుకొస్తారు.

**వశిష్ఠుడు**: రాజా! లాభం లేదు. ఇప్పటికే అతని శరీరంలోని అన్నరస భాగం ఎండిపోయింది. ఇంకా ఎక్కువ సేపు అతడు బతకడు. పై జన్మలో అతను బ్రహ్మదేవుడికి వాహన హంసగా మారి జీవన్ముక్తుడు కాబోతున్నాడు. కనుక నీ ప్రయత్నం ఫలించదు.

ఇంతకూ ఈ కథ అంతా నేనెందుకు చెప్పానంటే, జీవులు ఒక భ్రాంతి లోంచి మరో భ్రాంతి లోకి ప్రయాణిస్తూ వుంటారని నిరూపించడానికి చెప్పాను. ఒకే యతీశ్వరుడు శత రుద్రులు కావడం చెప్పాను. ఆ యతీశ్వరుడు ఇప్పుడు ఎక్కడ ఉన్నాడని రాముడు అడిగాడు. ఆ ప్రశ్నకు యోగదృష్టి ఆధారంగా పరిశోధించి, అదే యతీశ్వరుడు ఒకే కాలంలో, అనేక బ్రహ్మాండాలలో, అనేక రూపాలతో, జీవించవచ్చని నిరూపించాను. పూర్వం చెప్పిన భార్గవోపాఖ్యానాదులలో జన్మ పరంపరల మాట వచ్చినా, ఒకే జీవి ఒకే కాలంలో బహు లోకాలలో బహు రూపాలలో ఉండటం రాలేదు. ఇక్కడ అది గూడా వచ్చింది.

ఈ రూపాలలో ఏకత్వాన్నీ నిశ్చయించలేం. భిన్నత్వాన్నీ నిశ్చయించలేం. ఎందుకంటే, ఈ రూపాలన్నీ ప్రతిభాన మాత్రాలు. ప్రతిభానం అంటే, లేనిది ఉన్నట్లు కనిపించడం. కనుకనే ఇన్ని చిత్రాలు ఇక్కడ కనిపిస్తున్నాయి. కనుక రామా! ఇలాంటి కల్పనలకూ, భేదబుద్ధులకూ, మూలమైన చిత్తాస్పందాన్ని నువ్వు పరిత్యజించు.

**స్పన్దాస్పన్దౌ కల్పనా కల్పనా వా**
**చిత్తామ్నాయో విద్ధి నామాభ్దినామ్నా ।**
**సర్వాకారా నిర్వృతి శ్శాన్తిసత్తా**
**పూర్ణాపూర్ణే హ్యేకమేవాస్థితేతి ॥** (పూర్వ.సర్గ. 67, శ్లో.36 చివరి శ్లోకం)

రామా! నువ్వు ఆనంద సముద్ర స్వరూపంగా వుండిపో. అలా వుండి, స్పంద – అస్పందాలూ, కల్పనా –అకల్పనలూ, సంకల్ప వికల్పాలూ, అనే చిత్త విభ్రాంతులన్నీ అఖండానంద రస స్వరూపాలు మాత్రమేననీ, ఆ పరమ ప్రశాంతి ఒక్కటే ఈ రూపాలన్నిటిలోనూ ఉన్నదనీ, గ్రహంచు. అలాగే, పూర్ణ – అపూర్ణ దశలనేవి రెండూ గూడా, నీయొక్క రూపాంతరాలే అని గ్రహించు. దానికోసం సుషుప్తమౌనాన్ని అభ్యసించు.

### 52. సౌషుప్త మౌనం

**శ్రీరాముడు**: గురుదేవా! యతీశ్వరోపాఖ్యానంలో ఇంకా కొన్ని సందేహాలు మిగిలి వున్నాయి. అవి తరువాత అడుగుతాను. ఇప్పుడు మీరు సుషుప్తమౌనం అన్నారే, ఆ మాట కొత్తగా వుంది. నేను వాఙ్మౌనం గురించి విన్నాను. ఇంద్రియ మౌనం గురించి విన్నాను. కాష్ఠమౌనం గురించి విన్నాను. ఈ సుషుప్త మౌనం అనే మాట ఇంతవరకూ వినలేదు. కనుక ముందు అదేమిటో వివరించండి.

**వశిష్ఠుడు**: రామా! మౌనులు రెండు రకాలు (1) కాష్ఠమౌని (2) జీవన్ముక్త మౌని.

కృఛ్ర చంద్రాయణాది వ్రతాల ద్వారా ఇంద్రియాలను నిగ్రహించుకొనేవాడు, కాష్ఠమౌని. ఇతనికి ఆత్మ విచారణ ప్రసక్తి ఎక్కువగా వుండదు.

ఆత్మ తత్త్వ వేత్తయై, లోపల బ్రహ్మానంద మగ్నుడై, బైటికి మామూలు మనిషిలాగా కనిపించే వాడు, జీవన్ముక్తమౌని.

వీళ్లిద్దరిలోనూ, ధృఢమైన చిత్త నిశ్చయం ఒకటి వుంటుంది. అలాంటి ధృఢ చిత్త నిశ్చయం పేరు, మౌనం.

**ఈ మౌనం నాలుగు రకాలు**
**చతుష్ప్రకార మాహుస్తం**
**మౌనం మౌన విదో జనాః।**
**వాఙ్మౌన మక్షమౌనం చ**
**కాష్ఠం సౌషుప్తమేవ చ॥** (పూర్వ.సర్గ. 68, శ్లో.7)

1. వాఙ్మౌనం – అంటే, కేవలం వాక్కులను నిరోధించడం.
2. ఇంద్రియ మౌనం(అక్షమౌనం) – ఇంద్రియాలను నిగ్రహించడం
3. కాష్ఠమౌనం – శరీరంతో చేసే పనులను పరిత్యజించడం.

ఈ మూడు కాష్ఠమునికి సంబంధించినవి. (ముని అన్నా మౌని అన్నా ఒకటే)

4. సుషుప్త మౌనం – ఆత్మ తత్త్వానుభవం కలిగినప్పుడు, మనస్సులో వుండే స్థిర నిశ్చయం ఇదే. దీనినే తురీయ మౌనమనీ, చతుర్థమౌనమనీ, అంటారు. దీనిని జీవన్ముక్తులు మాత్రమే సాధించ గలరు.

ఈ నాలుగూ మౌనాలే ఐనా, మొదటి మూడిటి దగ్గరా వున్న మనో నిశ్చయంలో కొంత అజ్ఞాన మాలిన్యం వుంది. కనుక అవి బంధ ప్రదాలే గాని మోక్ష ప్రదాలు గావు.

**శ్రీరాముడు**: ఐతే కాష్ఠ తాపసుడికి సమాధి వుండదా?

**వశిష్ఠుడు**: ఉంటుంది కాని వాడు బలాత్కారంగా మనో నిగ్రహం చేసుకుంటాడు. వాడి సమాధికి తత్త్వాను సంధానం ఆధారం కాదు. సమాధినుంచి బైటికొచ్చేటప్పుడు ఈ మూడు రకాల మౌనాలలో కూడా చిత్త చలనం వుండి తీరుతుంది.

**శ్రీరాముడు**: నాల్గవ మౌనంలో వుండే జీవన్ముక్త ముని సమాధిలోంచి బైటికి రాడా?

**వశిష్ఠుడు**: అతని దగ్గర చిత్తం బాధితమై పోయింది. అంటే, కారణంతో సహా నశించి పోయింది. కనుక, ఇతను సమాధిలోంచి బైటికి రావడం అనేది ఒక లీలే గానీ, నిజమైన వ్యుత్థానం కాదు.

**శ్రీరాముడు**: మీరు చెప్పిన వరుస బట్టి చూస్తే మనోమౌనం అనే పేరుతో, ఐదవ రకం మౌనం కూడా వుండాలి కదా! ఆ పేరు ఎందుకు పెట్టలేదు?

**వశిష్ఠుడు**: కాష్ఠమునికి పరిపూర్ణమైన మనోమౌనం సుషుప్తి దశలోనూ మూర్ఛదశలోనూ, మరణ దశలోనూ, మాత్రమే సాధ్యం. ఈ దశలు సాధనకు పనికొచ్చేవి కావు. ఇక జీవన్ముక్తుడిలో మనస్సే బాధింపబడి పోయింది కనుక, మనో నిగ్రహానికి ప్రసక్తి లేదు. ఎవరికీ ఉపయోగ పడదు గనుకే, పెద్దలు ఈ ఐదవ విభాగం చేయలేదు. నీలాంటి జ్ఞానాసక్తులకు సుషుప్త మౌనమే ముఖ్యం.

వెనుక చెప్పిన సప్తజ్ఞాన భూమికలలో 5,6,7 భూమికలు మూడూ గూడా సుషుప్త మౌనం కిందికే వస్తాయి. కనక ఓ రామా! నువ్వు మాండూక్యోపనిషత్తులో చెప్పినట్లుగా, ఓంకారానుసంధానం చేస్తూ, దానిలోని

పాదాలతో విరాడాది పాద మాత్రలను ప్రవిలాపన చేసుకుంటూ, చిదేక నిష్ఠుడవై వుండిపో!

### 53. శతరుద్రోపాఖ్యాన ప్రశ్నలు

**శ్రీరాముడు**: బాగుంది గురుదేవా! ఇక యతీశ్వర కథలోని ప్రశ్నవేస్తాను. ఆ కథలో మీరు జీవటాదులంతా కలిసి వందమంది రుద్రులన్నారు కదా, వారు నిజంగా, రుద్రులా? రుద్రుని పరిచారకులైన రుద్రపార్షదులా?

**వశిష్ఠుడు**: రుద్రగణాలకీ, ప్రధాన రుద్రుడికీ, భోగంలో గానీ, ఐశ్వర్యంలో గానీ, తేడా లేదు. వాళ్ళంతా రుద్రాంశ సంభూతులే! ఆ దృష్టితోనే జీవటాదుల వందమందినీ శత రుద్రులన్నాను.

**శ్రీరాముడు**: ప్రధాన రుద్రుడు ప్రభువు. మిగిలినవారు సేవకులు. వాళ్ళు ఒకటే ఎలా ఔతారు? పైగా మీరు చెప్పిన కథలో నూరవవాడు ముఖ్యరుద్రుడు. మిగిలిన వాళ్లు 99 మందే! వీళ్లను శత రుద్రులని ఎలా అన్నారు?

**వశిష్ఠుడు**: ఆ నూరవవాడు గూడా ఆ లోకంలోని అసలు ప్రధాన రుద్రుడికి పరిచారక గణంలోనివాడే! అందుకే వాళ్ళందరినీ కలిపి శత రుద్రులన్నాను.

**శ్రీరాముడు**: దీనికోసమే అడుగుతున్నాను. వాళ్ళు వందమందీ ఒకే స్థాయి వాళ్ళు. కానీ, మీరు చెప్పిన కథలో నూరవవాడైన హంసరుద్రుడు, మిగిలినవాళ్ళ చిత్తానికి చైతన్యం ఇచ్చాడు. ప్రపంచంలో ఎవడైనా ఒకడు మరొకడి చిత్తానికి చైతన్యం ఇవ్వగలడా? "ఇవ్వగలడు" అనేట్లైతే, ఆ వందమందిలో ప్రతివాడూ అలా చేయ గలిగి వుండాలి. మీ కథలో నూరవ రుద్రుడు మాత్రమే ఈ పని చేయ గలిగాడు. ఎందుకు?

**వశిష్ఠుడు**: అజ్ఞానులకు అలాంటి శక్తి వుండదు. జీవన్ముక్తులకు అలాంటి శక్తి వుంటుంది. ఎందుకంటే, వీళ్ళు సత్య సంకల్పులు. సర్వజ్ఞులు. అందువల్ల, జీవన్ముక్తుడైన నూరవ రుద్రుడు మాత్రమే ఆ పని చేయ గలిగాడు.

**శ్రీరాముడు**: రుద్రుడు నిజంగా జీవన్ముక్తుడైతే, బిచ్చగాడై శ్మశానాలలో తిరగాల్సిన పనేముంది?

**వశిష్ఠుడు**: రుద్రుడే కాదయ్యా, హరిహరాదులందరిదీ ఒకటే పరిస్థితి. వాళ్లు విధి నిషేదాలకు కింకరులు కారు. శాస్త్ర సిద్ధమైన మంగళ కృత్యాలనే చెయ్యాలనే నియమం వాళ్ళకు లేదు. సుఖాలను ఇచ్చే పనులను మాత్రమే చెయ్యాలనే నియమం కూడా లేదు. ఎందుకంటే, వీళ్ళ దృష్టిలో ప్రపంచమంతా సుఖ స్వరూపమే! కనుక వీళ్లు ఏ పని చేసినా వీళ్ళకు సుఖమే లభిస్తుంది. కనుకనే, వీళ్ళకు ఇష్టానిష్టాలుండవు. వాసనా శేషాలుండవు. యథా ప్రాప్తంగా పనులు చేస్తూ వుంటారు.

**శ్రీరాముడు**: ఐతే రుద్రుడు స్మశాన వాసమే ఎందుకు చేయాలి? విష్ణువు క్షీరాబ్ధివాసమే ఎందుకు చేయాలి?

**వశిష్ఠుడు**: అది హిరణ్య గర్భుడి అథమ సంకల్పాన్ని బట్టి ఏర్పడని యతి. వీళ్ళకు దానిమీద రాగ ద్వేషాలు లేవు. ఇక మామూలు మనుషులంటావా, వాళ్లు ప్రపంచంలో భేదాలు చూస్తారు. అందుకే బలవంతుడు బలహీనుణ్ణి మింగాలనుకోవడం వాళ్ళ సహజ స్వభావం. అందుకే వాళ్ళకు శాస్త్ర నియమాలు అవసరం. అవి లేకపోతే పూర్తిగా దుఃఖ పరంపరనే పొందేస్తారు.

### 54. సాంఖ్య యోగాలు

**శ్రీరాముడు**: సర్వత్రా సుఖాన్ని చూసే స్థితి ఎలా లభిస్తుంది?

**వశిష్ఠుడు**: ఇందాక నువ్వు ఐదవ మౌనం అంటూ ఒక ప్రస్తావన చేశావు. అది మరణ దశలో కాని సాధ్యం

కాదని నేను అన్నాను. మామూలు అజ్ఞ జీవికి మరణ సమయంలో కూడా మనో మౌనం సంభవించదు. అప్పుడూ గూడా వాడికి మనోవాసన లుంటాయి గదా, మరి? కనుక నీ పంచమ మౌనం విదేహ ముక్తుడికి మాత్రమే సాధ్యం. అది లభించాలంటే ముందు జీవన్ముక్తి లభించాలి. దానికి ఉపాయాలు రెండు (1) సాంఖ్యం (2) యోగం.

**సమ్యక్ జ్ఞానావబోధేన**
**నిత్యమేక సమాధినా ।**
**సంఖ్యయైవావబుద్ధా యే**
**తే స్మృతాస్సాంఖ్యయోగినః ॥** (పూర్వ.సర్గ 69, శ్లో. 18)

జ్ఞాన మార్గంలో లభించే అవిచ్ఛిన్నమైన ఏకాండీ సమాధిని సంఖ్య అంటారు. దీని ద్వారా ఎవరు ఆత్మ తత్త్వాన్ని అందుకుంటారో, వాళ్ళు సాంఖ్య యోగులు.

**ప్రాణాద్యనిల సంశాన్తౌ**
**యుక్త్యా యే పదమాగతాః ।**
**అనామయ మనాద్యన్తం**
**తే స్మృతా యోగ యోగినః ॥** (పూర్వ.సర్గ.69, శ్లో. 19)

ప్రాణాపానాది వాయు నిరోధ రూపమైన యోగ విధానంతో ఎవరైతే శాశ్వతమైన ఆత్మ తత్త్వాన్ని తెలుసుకొన్నారో, వారు యోగ యోగులు.

దేని ద్వారా పొందుతున్నారనేది ముఖ్యం గాదు. దేన్ని పొందుతున్నారు అనేది ముఖ్యం. అదే ఆత్మ తత్త్వాన్ని కొందరు సాంఖ్య మార్గం ద్వారా పొందుతారు, మరి కొందరు యోగ మార్గం ద్వారా పొందుతారు.

**ఏకం సాంఖ్యం చ యోగం చ**
**యః పశ్యతి స పశ్యతి ।**
**యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం**
**పరం యోగై స్తదేవ హి ॥** (పూర్వ.సర్గ 69, శ్లో. 21)

సాంఖ్యం, యోగం – రెండూ ఒక్కటే అని ఎవడు తెలుసుకుంటున్నాడో వాడే అసలైన జ్ఞాని. ఎందుకంటే సాంఖ్యం ద్వారా ఏ పరమ పదం లభిస్తుందో యోగం ద్వారా కూడా అదే లభిస్తుంది.

(**గమనిక** – ఈ విషయాలు భగవద్గీతలో 3వ అధ్యాయంలో చెప్పిన విషయాలకు దగ్గరగా వున్నాయి.

**లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ,**
**జ్ఞాన యోగేన సాంఖ్యానాం కర్మ యోగేన యోగినామ్ ॥**అని అక్కడ శ్రీభగవానుడు అన్నాడు.

ఓ! దోషాలు లేనివాడా! ఈ లోకంలో రెండు విధాలైన నిష్ఠ ఉన్నదని నేను వెనక చెప్పాను – జ్ఞానయోగంచేత సాంఖ్యులు అనుసరించ వలసినది మొదటిది. కర్మయోగంచేత యోగులు అనుసరించవలసినది రెండవది.

అలాగే 6వ అధ్యాయంలో

**యం సంన్యాసమితి ప్రాహుర్యోగం తం విద్ధి పాణ్డవ।**
**న హ్యసంన్యస్త సంకల్పో యోగీ భవతి కశ్చన ॥**

పాండవా! దేనిని సంన్యాసం అంటారో అదే కర్మయోగం అని తెలుసుకో. సంకల్పాన్ని విడువనివాడు ఎవ్వడూ యోగి కాజాలడు– అని గూడా శ్రీ భగవానుడు అన్నాడు.

ఇలా అనే సరికి సాంఖ్యమూ, యోగము, రెండూ కూడా మోక్షసిద్ధికి సహకరించేవి కనుక, అది కొంత, ఇది కొంత, కలిపి ఉపయోగించుకోవచ్చు కదా అనే ఆలోచన వస్తూ వుంటుంది. దీనినే యోగసాంఖ్యసముచ్చయ వాదమనీ,

జ్ఞానకర్మసముచ్చయ వాదమనీ అంటూ వుంటారు.

ఈ రెండూ ఇలా కలిపి వాడుకోవడం సాధ్యంకాదనీ, అవి రెండూ ఒక దానితో ఒకటి కలిసే స్వభావం కలవి కావనీ, ఒకదాని తరువాత ఒకటి ఆచరించుకోవలసిందేననీ, భగవద్గీతా భాష్యంలో శంకరాచార్యులవారు నిర్ద్వంద్వంగా నిరూపించారు. ఆ విషయాన్నే ఇక్కడ వ్యాఖ్యాత మళ్లీ చెప్పాడు. వాద విశేషాలు కావాలనుకునేనా భగవద్గీతాశంకర భాష్యం చూసినట్లైతే విషయం బాగా స్పష్టమౌతుంది. ఇక మళ్ళీ వశిష్ఠ బోధలోకి ప్రవేశిద్దాం.)

***వశిష్ఠుడు***: కనుక రామా! ఎవడైతే సాంఖ్యం ద్వారా గాని, యోగం ద్వారా గాని, మనోలయాన్ని సాధించుకుంటాడో వాడికి ఈ మనోజన్యమైన సంసారం అంటనే అంటదు. వాడికి బంధమోక్షాల ప్రసక్తే లేదు.

### 55. మోక్ష సంగ్రహం

కనుక సమస్త శాస్త్రాలకీ సారభూతమైన మోక్షాన్ని సంగ్రహంగా చెప్పాలంటే ఇలా వుంటుంది.

**ఏకతత్త్వ ఘనాభ్యాసః**
**ప్రాణానాం విలయస్తథా ।**
**మనో వినిగ్రహశ్చేతి**
**మోక్ష శబ్దార్థ సంగ్రహః ॥** (పూర్వ.సర్గ. 69, శ్లో. 27)

(1) ఏకతత్త్వ ఘనాభ్యాసం ( అద్వితీయమైన పరతత్త్వాన్ని తదేకంగా అనుసంధానం చేసుకోవడం) (2) ప్రాణలయం (3) మనస్సును నిగ్రహించుకోవడం.– ఇవే సంగ్రహంగా మోక్ష శబ్దార్థం.

***శ్రీరాముడు***: గురుదేవా! ప్రాణాల లయమే మోక్షమయ్యేటట్లైతే, మరణించిన ప్రతివాడూ ముక్తుడే కావాలి కదా?

***వశిష్ఠుడు***: నేను చెప్పింది నీకు సరిగా అర్థం కాలేదు. ఆ మూడూ వేరే వేరే ఉపాయాలని నా ఉద్దేశ్యం కాదు. అవి మూడు మెట్లు. ఏకతత్త్వ ఘనాభ్యాసంవల్ల ప్రాణాల చలనం ఆగి, అవి మనస్సులో లయిస్తాయి. ఆ తరువాత మనస్సు లయిస్తుంది. అంటే, మొదటి రెండు మెట్లూ, మూడవ మెట్టైన మనోనాశం ద్వారానే మోక్షానికి హేతువవుతున్నాయి

వీటిలో ప్రాణలయం అంటే ఏమిటి? నువ్వు అనుకున్నట్లుగా, ప్రాణాలు స్థూల దేహాన్ని విడిచి పెట్టినంత మాత్రాన అవి నాశనం ఐపోయినట్లు గాదు. అవి ఈ స్థూల శరీరంనుంచి లేచి పోయేటప్పుడు, వట్టిగా పోవు. పంచభూతాల తన్మాత్రలను కలుపుకొని వెడతాయి. ఆ తన్మాత్రల సహాయంతో, బాహ్యాకాశంలో తాత్కాలిక వ్యవహార యోగమైన తాత్కాలిక దేహాన్ని కల్పించుకుంటాయి. దానికి వాసనా కామ కర్మలు సహాయం చేస్తాయి. ఈ విషయాన్నే ఈ క్రింది శ్రుతి విశదరిస్తోంది.

తద్యథా పేశస్కారీ పేశసో మాత్రాముపాదాయ
అన్యన్నవతరం కల్యాణతరం రూపం తనుతే
ఏవమేవాయమాత్మా ఇదం శరీరం నిహత్య
అవిద్యాం గమయిత్వా అన్యన్నవతరం రూపం కురుతే
పిత్ర్యం వా గాంధర్వం వా దైవం వా
ప్రాజాపత్యం వా బ్రాహ్మం వా అన్యేషాం భూతానాం”

(స్వర్ణకారుడు చిన్న బంగారు ముక్కను తీసుకొని, కొత్త కొత్త ఆభరణాలను ఎలా తయారు చేస్తాడో, అలాగే ఈ ఆత్మ కూడా ఈ శరీరాన్ని కనిపించకుండా చేసి, మరో క్రొత్త  అందమైన రూపాన్ని పొందుతుంది. పితృలోక రూపమో, గంధర్వలోక రూపమో, దేవలోక రూపమో, ప్రజాపతి లోక రూపమో, బ్రహ్మ లోక రూపమో, ఇంకా మరేదైనా జీవుల రూపమో ఏదో ఒక దాని ని పొందుతుంది.)–అని

ఈ శరీరంలోని ప్రాణాలతో పాటు పైకి వెళ్ళిన పంచ తన్మాత్రలకు, ఈ జీవి తాలూకు వాసనలతో గట్టి సంపర్కం వుంటుంది గనుక, ఆ ప్రాణాలు ఇతర ప్రాణాలతో ఏకీభావాన్ని పొందవు. కానీ, ఆ జాతి వాసనలలే గల ఇతర మనస్సులు, ప్రాణాలు, ఎక్కడ వుంటాయో, వాటిని మాత్రమే కలుసుకుంటాయి. అలాంటి లోకాన్ని మాత్రమే చేరతాయి.

ఇంతకూ ఈ ప్రక్రియవల్ల మనకు తేలిందేమిటంటే, మరణంలో మనో నాశమూ లేదూ, ప్రాణ నాశమూ లేదు. ఈ రెంటికీ నాశం ఎప్పుడు లభిస్తుందంటే, జ్ఞానంవల్ల వాసనాక్షయం కలిగినప్పుడు మాత్రమే. కనుక నువ్వు అనుకున్నట్లుగా మరణంతో మోక్షం రాదు.

నేను చెప్పినట్లుగా ఏకతత్త్వ ఘనాభ్యాసం చేస్తే, అంటే శ్రవణ మననాదుల ద్వారా, ఆత్మ తత్త్వానుసంధానం గట్టిగా చేస్తే, ప్రాణ వృత్తి నిరోధం ఏర్పడుతుంది. విసినకర్ర కదలడం ఆగిపోతే గాలి ఆగిపోయినట్లుగా, ప్రాణ స్పంద నిరోధం జరిగితే ,మనో నిరోధం గూడా జరుగుతుంది. దానివల్ల జ్ఞానాజ్ఞానాలు రెండూ తొలగిపోతాయి. ఇక్కడ జ్ఞానం అంటే, బ్రహ్మాకారమనోవృత్తి. అజ్ఞానం అంటే, అవిద్యాకార మనోవృత్తి. ఆ రెండూ తొలగిపోతే, ఏ చిన్మాత్రం మిగిలి వుంటుందో, దానిలో నువ్వు స్థిరపడిపో. ఇదే ముక్త స్థితి. ఈ ప్రక్రియలో ముక్తి సులభంగా లభిస్తుందంటానికి నిదర్శనంగా భేతాళ ప్రశ్నోపాఖ్యానం అనే చిన్న కథ వుంది. అది చెబుతా విను.

(**గమనిక–** ఉత్పత్తి ప్రకరణంలో, కర్కటీ ఉపాఖ్యానం (సూచికో పాఖ్యానం)లో, యక్ష ప్రశ్నలు అనే ఘట్టం వుంది. దానిలో కర్కటీ రాక్షసి బ్రహ్మ జ్ఞాన సంపన్నురాలైన తరువాత, ఉదర పోషణ కోసం, ఆత్మ జ్ఞానం లేని వాళ్ళని చంపుకు తినాలని భావించి, దగ్గరలో వున్న కిరాత రాజ్యంలోకి ప్రవేశిస్తుంది. అక్కడ రాజుని, మంత్రిని, చూసి అధ్యాత్మిక విద్యకు సంబంధించి 72 ప్రశ్నలు వేస్తుంది. అక్కడ ఆ ఘట్టాన్ని వశిష్ఠ మహర్షి బాగా పట్టుగా నడిపాడు. ఇక్కడ మళ్ళీ అదే ఘట్టాన్ని వేతాళుడు అనే పేరుతో పునరుక్తి చేయబోతున్నాడు. చెప్పిందే చెబుతున్నాడు గనుక చాలా అశ్రద్ధగా  వదులు వదులుగా, చెబుతున్నాడు. దానిని సూచిస్తూ ముందే,

**"ప్రసంగాత్ శ్రుతి మాగతా"** (సర్గ 70, శ్లో.3)

ఏదో మాటల వరుసలో గుర్తొచ్చి చెబుతున్నా – అనేశాడు. పూర్వం చెప్పిన  విషయమే ఐనా, మనశ్శమనంవల్ల ముక్తి లభిస్తుందనీ, అలాంటివారికి కర్మ బంధాలు అంటవనీ, చెప్పడం కోసం వశిష్ఠ మహర్షి రెండు ఉదాహరణలు తీసికోదలుచుకొని, ముందుగా వేతాళోదాహరణం తీసికున్నాడు. దీని తరువాత భగీరథుడి ఉదాహరణ తీసుకోబోతున్నాడు. మనం గూడా ఈ ఘట్టాన్ని సంగ్రహంగానే చెప్పుకుందాం.)

### 56. భేతాళ ప్రశ్నోపాఖ్యానము

పూర్వం వింధ్యాటవిలో ఒక భయంకర భేతాళుడుండేవాడు. (వేతాళుడు = భేతాళుడు) అతడు ఆత్మజ్ఞాన సంపన్నుడై ఎక్కువగా సమాధిలో వుంటూ, దగ్గరలో గల రాజ్యంలో వుండే, పాపాత్ముల్ని మింగి ఆకలి తీర్చుకుంటూ వుండేవాడు.

కొంత కాలానికి ఆ సమీప రాజ్యంలో చెడ్డ వారే లేకుండా పోయారు. అందువల్ల ఈ వేతాళుడు పక్క రాజ్యంలోకి ప్రవేశించాడు. ఒక రోజు అర్థరాత్రిపూట ఎక్కడైనా దుష్టులు దొరుకుతారేమో మింగుదామని , వేతాళుడు వెతకడం మొదలు పెట్టాడు. ఆ సమయానికి ఆ వూరి రాజుగారే మారు వేషంలో నగర సంచారం చేస్తూ ఈ భేతాళుడి కంట పడ్డాడు.

భేతాళుడు రాజుని గుర్తుపట్టాడు. దగ్గరికెళ్ళి రకరకాలుగా బెదిరించి, "ఓ రాజా! దుష్టులను మింగడమే నా వ్రతం. నేను ఆరు ప్రశ్నలను వేస్తాను. వాటికి నువ్వు సరైన సమాధానాలు చెప్పకపోతే, నువ్వు దుష్టుడివి. కనుక మింగేస్తాను. ముందు నా ప్రశ్నలను విను." అని గడగడా ఆరు ప్రశ్నలూ వేసేశాడు.

ఆ రాజు చిరునవ్వు నవ్వి, వాటన్నింటికీ వరుసగా సమాధానాలు చెప్పుకుంటూ వచ్చాడు. ఈ భేతాళ ప్రశ్నలే రకరకాల కల్పనలతో కూడి వుంటే, ఆ రాజుగారు అంతకన్నా పెద్దకల్పనలను చేసి, తన సమాధానాలను రవత్తరంగా తయారు చేశాడు. ఇక ఆ ప్రశ్నలనూ, సమాధానాలను వరుసగా చెప్పుకుందాం.

***వేతాళుడు***:

**కస్య సూర్యస్య రశ్మీనాం**

**బ్రహ్మాండాన్యణవః కృశాః ॥** (పూర్వ. సర్గ. 70, శ్లో. 13)

ఈ బ్రహ్మాండాలన్నీ ఏ సూర్యుడిలోని కిరణ రేణువులు?

***రాజు***: భేతాళా! మనమంతా నివశిస్తున్న ఈ బ్రహ్మాండం అంతా పెద్ద పండు అనుకో. దీని చుట్టూతా ఒకదానికంటెఒకటి పది రెట్లుగా పంచభూతాల ఆవరణలున్నాయి. ఇవన్నీ కలిపి ఆ పండు మీద తొక్కు అనుకో.

అలాంటి పళ్ళు వేయి వున్న కొమ్మ ఒకటి వుంది.

అలాంటి కొమ్మలు వేయి గల చెట్టు ఒకటి వుంది.

అలాంటి చెట్లు వేయి గల అడవి ఒకటి వుంది

అలాంటి అడవులు వేయి గల కొండ ఒకటి వుంది.

అలాంటి కొండలు వేయి గల ద్వీపమొకటి వుంది.

అలాంటి ద్వీపాలు వేయి గల మహీపీఠ(భూమండలం) ఒకటి వుంది.

అలాంటి పీఠాలు వేయిగల భువనమొకటి వుంది

అలాండి భువనాలు వేయి గల అండమొకటి వుంది.

అలాంటి అండాలు వేయి గల సాగరమొకటి వుంది

అలాంటి సాగరాలు ఒక లక్ష గల మహార్ణవమొకటి వుంది.

అలాంటి మహార్ణవాలు వెయ్యి గలిపితే ఒకాయన పొట్టలోని నీళ్లు అవుతాయి. ఆయన పేరే మహావిష్ణువు.

అలాంటి విష్ణువులను ఒక లక్షమందిని మాలగా గట్టి మెడలో వేసుకొని కూర్చున్నాడు మరో పెద్దాయన. ఆయనే రుద్రుడు.

అలాంటి రుద్రులు వేల వేల మంది మరో పెద్దాయన ఒంట్లో రోమ రూపాల్లాగా ప్రకాశిస్తున్నారు. ఆయనే ఆదిత్యుడు (ఆదిలో ఉన్నవాడు, సూర్యుడు). ఇతడే చిత్సూర్యుడు. ఈయనే నేను చేసిన ఈ మహా కల్పనలోని బ్రహ్మాండాలను ప్రకాశింప చేస్తున్నవాడు. ఈయనే సగుణ బ్రహ్మ. ఈయనకు ఇంతకంటే మూలమైన పారమార్థిక స్వరూపం మరొకటి వుంది. సగుణ బ్రహ్మలో కనిపించే కర్తృత్వ, భోకృత్వ వికారాలు ఆ పరమార్థ

బ్రహ్మకు ఏమాత్రం అంటదు. నువ్వు చెప్పే సూర్యుడు ఈ సగుణ బ్రహ్మే!

2 ప్రశ్న –

**వేతాళుడు**:

**కస్మిన్ స్ఫురన్తి పవనే**

**మహా గగన రేణవః ॥** (పూర్వ.సర్గ. 70, శ్లో.13)

ఈ మహాకాశ రేణువులన్నీ ఏ గాలిలో తేలియాడుతున్నాయ్?

**రాజు**: భేతాళా! గాలి అంటూ స్పందప్రసక్తి తీసికొస్తున్నావ్. గాలిలో రేణువులంటూ సత్తా ప్రసక్తి తీసికొస్తున్నావ్. ఈ సత్త ఎవరిది? ఈ స్పందన ఎవరిది? కాలానికొక సత్త. ఆకాశానికొక సత్త. స్పందానికొక సత్త. వీటన్నింటికీ కలిపి ఉనికిని కల్పించే మహాసత్త ఏది? అది పరమాత్మ సత్త అందామా? అలా అనేందుకు వాటి మధ్య ఆధారాధేయ సంబంధం వుందా? (1. ఆధారం 2. ఆధారాన్ని పొందేది అనే సంబంధం పేరే ఆధారాధేయ సంబంధం.)

అలా కాదయ్యా, పుష్పానికీ సువాసనకూ భేదం లేదు. ఐనా సరే భేదం ఉన్నట్లు కల్పించుకొని, లోకం అంతా పువ్వులో వాసన వుందని అంటోంది. అలాగే పరమాత్మ సత్తలో కాలాది సత్తలు వున్నాయి – అని చెప్పవచ్చు కదా! అంటావేమో?

అలా అనేటట్లైతే అది మంచి మాటే! అది ఈ భేదం అంతా భ్రమాత్మకమనీ నిరూపిస్తుంది. లోకంలో కనిపించే కార్య సత్తలన్నీ కారణ సత్తలయొక్క పరంపరలో క్రమ క్రమంగా లయించి పోతాయి. అరటి బోదెలో మట్టలన్నీ ఒక దానిలో ఒకటి ఒదిగి పోతాయి. ఈ మట్టలన్నీ ఒలిచేస్తే, మిగిలేవాడు పరమాత్మ! ఆయన వీటన్నిటి లోపలా దాగివున్నాడు కనుక, పరమాణువు అనవచ్చు. ఈ మట్టలన్నింటిలోనూ చైతన్య రూపంగా వ్యాపించి వున్నాడు గనుక పర్వతమనీ అనవచ్చు.

నీ మిగిలిన ప్రశ్నలన్నీ ఇలాంటి కల్పనల మీదే ఆధారపడి వున్నాయి. నువ్వు మూడో ప్రశ్నలో –"ఒక స్వప్నంలోంచి మరో స్వప్నంలోకి ఇలా పోతూ వుంటే, కొన్ని వేల స్వప్నాలు గడిచినా, విడవకుండా వుండే స్వచ్ఛ పదార్థం ఏది?– అని అడిగావు. నాల్గవ ప్రశ్నలో – "అరటి బోదెలో మట్టలను వలుస్తున్నకొద్దీ, చిన్న చిన్న మట్టలు వచ్చినట్లుగా, ఈ ప్రపంచంలోని పదార్థాలన్నింటి లోనూ, అంతర్వ్యాపిగా ఇమిడి పోయివున్న పదార్థం ఏది?– అని అడిగావు.

ఐదవ ప్రశ్నలో "చాలా పెద్దవి అనుకునే ఈ బ్రహ్మాండాకాశాదులు కూడా ఏ అనువులోని పరమాణువో" చెప్ప మన్నావు. (**కస్యాణోః పరమాణవః** – సర్గ 70, శ్లో.16)

ఆరవ ప్రశ్నలో – "ఆ పరమాణువే ఒక కొండై, ఈ ముల్లోకాలనూ చిత్రించే శిలా ఫలకమై పోయిందన్నావ్. ఆ పరమాణువేది?" అని అడిగావు.

వేతాళా! కల్పనాత్మకాలైన ఈ ప్రశ్నలన్నింటికీ ఒకే సమాధానం చెప్పేశాను. పిల్లవాడివి లాగా వున్నావు. నేను చెప్పిన సమాధానాలన్నీ మనస్సులో జాగ్రత్తగా భావన చేసుకొని శాంతంగా వుండు.

రాజు చెప్పిన సమాధానాలు వినేసరికి, వేతాళుడు తన ఆకలి మాటను మర్చిపోయి, సమాధిలోకి వెళ్ళిపోయాడు.

కనుక రామా! నీవు కూడా శాంత స్వభావుడవై, పరమాత్మ సమాధిని అలవర్చుకో. ఏది ఎప్పుడు ఎలా ప్రాప్తమైతే , అలా జీవించు. అలా జీవించే వాళ్ళకు అసాధ్యం అంటూ వుండదు. భగీరథుడు దేవ గంగను సాధించినట్లుగా, దేనినైనా సాధిస్తారు. ఆ గంగావతరణ చరిత్ర కూడా చెబుతాను విను.

## 57. భగీరథోపాఖ్యానం

రామా! మీ వంశంలోవాడే భగీరథుడు. ఈయనవల్లే గంగ భూమి మీదికి అవతరించింది. ఆ విషయం చాలా మందికి తెలుసు గాని, అలా గంగనే దింపగలిగిన మహత్త్వం అతనికి ఎలా వచ్చిందో ఆ రహస్యం ఎక్కువ మందికి తెలియదు. అది చెబుతా విను.

రామా! భగీరథుడు కూడా నీలాగే చాలా పవిత్రమైన వ్యక్తి. వీరుడు, దాత, పరిపాలనా దక్షుడు.

మరీ నీ అంత చిన్నవయసులో కాకపోయినా, నడి యవ్వనంలో వుండగానే, యీ ప్రపంచం మిథ్య అనే విషయం అతనికి అర్థమైపోయింది. దానివల్ల వైరాగ్యం కలిగింది. దానివల్ల నీ లాగానే తీర్థయాత్రలు చేశాడు. దానివల్ల తత్వ నిష్ఠ మరింత పెరిగింది.

ఒకరోజున అతను ఇలా ఆలోచించడం ప్రారంభించాడు–

"ఈ లోకంలో సత్పురుషులు అనుకునే వారంతా వేదోక్తమైన పుణ్య కర్మలు చేస్తున్నారు. పుణ్యఫలాన్ని అనుభవిస్తున్నారు. "తెల్లారా, పొద్దూక" అన్నట్టుగా వుంది వీళ్ళ పని అంతా. ఇలా ఎంత కాలం యీ వెర్రి? ఇది వెర్రి కాదనుకొని నడుస్తోందీ లోకం. కాని అంతూ పొంతూ లేని ఈ చక్రభ్రమణాల వెంట పరుగెత్తడం వెర్రి కాక మరేమిటౌతుంది. ఈ వెర్రిని దాటేదెలా?" అతనిలా ఆలోచించు కుంటూ వుంటున్న రోజుల్లోనే అతనికి త్రితలుడనే సద్గురువు దొరికాడు. భగీరథుడు అతనికి చాలా కాలం శుశ్రూష చేసి, తన ఆలోచనలన్నీ ఆయన ముందు పరిచాడు. ఆయన అనుగ్రహించి ఇలా చెప్పాడు–

**త్రితలుడు**: భగీరథా! నువ్వు అనుకున్న వెర్రిని దాటాలంటే కొన్ని మెట్లున్నాయి.

1) సాధన చతుష్టయ సంపత్తిని సాధించాలి (దీన్ని గురించి ముముక్షు వ్యవహార ప్రకరణంలో సాధన చతుష్టయం అనే శీర్షిక కింద విపులమైన వివరణ వుంది)

2) శ్రవణ మనన నిదిధ్యాసలనే మూడు ఉపాయాలను అలవర్చుకోవాలి. (వీటిని గురించి కూడ ముముక్షు ప్రకరణంలో వివరణ వుంది.)

3) సమాధి స్థితిని సాధించాలి.

4) జీవాత్మ పరమాత్మ విషయికమైన జ్ఞానాన్ని సంపాదించాలి.

ఈ మెట్లు సాధిస్తే, హృదయ గ్రంథులు తెగిపోయి (అంటే హృదయంలో వుండే సందేహాల ముడులు తెగిపోయి) కర్మలన్నీ నశిస్తాయి. అప్పుడు పరమాత్మ చిద్రూపుడనీ, సర్వవ్యాపి అనీ, ఉదయాస్తమయాలు లేని నిత్యుడనీ, తెలుస్తుంది.

**భగీరథుడు**: గురుదేవా! నిర్గుణ పరబ్రహ్మం నిఖిల ప్రపంచానికి అధిష్ఠానభూతమని అర్థం ఔతూనే వుంది. కానీ అజ్ఞానులలో వుండే అంశలు నాలో నశించడం లేదు. అజ్ఞానంలో (1) అసత్య – ఆపాదక– అంశ, (2) అభాన –ఆపాదక– అంశ (3) విక్షేపాంశ అనే మూడు అంశలు వున్నాయని పెద్దలు చెబుతున్నారు. 'అసత్యాపాదకాంశ' అంటే , అసలు పరబ్రహ్మమే లేదనే భావన. అది నాలో పోయింది. 'అభానాపాదకాంశ' అంటే పరబ్రహ్మం ఉన్నదని తెలిసినా, అది అనుభవంలోకి రాకుండా చేసే అజ్ఞానాంశ. అది నాలో పోలేదు. 'ఇక విక్షేపాంశ" అంటే గట్టిగా కృషి చేస్తున్నప్పుడు, ఎంతో కొంత అనుభూతి కలిగినట్టు అనిపిస్తున్నా, ఇతర విషయాలమీదికి మనస్సు చెదిరిపోయేటట్టు చేస్తూ, బ్రహ్మానుభూతిని చెడగొట్టే అజ్ఞానాంశ. ఇది కూడా నాలో పోలేదు. గురూపదేశం జరిగినా, యుక్తి సరిపోయినా, (ప్రీతి వున్నా, ఈ రెండు అజ్ఞానాంశలు నాలోంచి

తొలగి పోక పోవడానికి కారణ మేమిటో తెలియటం లేదు. అవి తొలగే ఉపాయం చెప్పండి.

***త్రితలుడు***: రాజా! నువ్వు సమర్థుడివై పరిపాలకుడివి. నీకు రాజ్య వ్యవహారాలమీద వున్న ఆసక్తి ఇంతా అంతా కాదు. అందుచేత నీ మనస్సు ఎప్పుడూ వాటి మీదికే పరిగెడుతూ ఉంటుంది. దీనికి ప్రధాన కారణం నీలో వున్న రాజాహంకారం. అది పోతే గాని, నువ్వు అనుకున్నది నీకు దక్కదు.

**అసక్తి రనభిష్వంగః**
**పుత్రదార గృహాదిషు ।**
**నిత్యం చ సమచిత్తత్వ**
**మిష్టానిష్టోపపత్తిషు ॥**
**ఆత్మనోऽనన్య యోగేన**
**తద్భావన మనారతమ్ ।**
**వివిక్త దేశ సేవిత్వ**
**మరతిర్జన సంసది ॥**
**ఆధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం**
**తత్త్వజ్ఞానార్థ దర్శనమ్ ।**
**ఏతత్ జ్ఞానమితి ప్రోక్త**
**మజ్ఞానం తదతోన్యథా॥** (పూర్వ. సర్గ. 74, శ్లో 28,29,30)

(ఈ శ్లోకాలు మూడు భగవద్గీతలో దొరుకుతాయి. అక్కడ 13వ అధ్యాయంలో 9,10,11 శ్లోకాలుగా ఇవి వున్నాయి. మధ్య శ్లోకంలో ఒక చిన్న మార్పు వుంది. యోగవాశిష్ఠంలో "ఆత్మనోऽనన్యయోగేన తద్భావన మనారతమ్" అని వుంది. భగవద్గీతలో "మయి చానన్య యోగేన భక్తిరవ్యభిచారిణీ" అని వుంది.అంతే తేడా)

1. అమానిత్వాది సద్గుణాలను సంపాదించుకోవాలి. వాటిల్లో మొదటిది భార్యా పుత్ర గృహాదులయందు ఆసక్తిని వదులుకోవాలి. వాళ్ళకు కష్టం కలిగితే తనకే కష్టం కలిగిందని కుమిలి పోయే దురభిమానం తొలగాలి.
2. తనకిష్టమైన సంఘటనలు జరిగినా, అనిష్టమైన సంఘటనలు జరిగినా సమచిత్తంతో వుండడం నేర్చుకోవాలి.
3. 'పరమాత్మకంటె భిన్నంగా , వేరే సద్గతి లేదు' అనే నిశ్చయంతో నిరంతరమైన బ్రహ్మ భావన వుండాలి.
4. పదిమందితో కలిసి వుండాలనే ప్రాకులాట పోయి, ఏకాంతంగా వుండాలనే ప్రీతి కలగాలి.
5. ఆత్మ మొదలైన విషయాలకు సంబంధించిన జ్ఞానాన్ని నిత్యమూ భావిస్తూ వుండాలి.
6. సంగం లేకపోవడం మొదలైనవి పరిపాక దశకు చేరినప్పుడు, తత్త్వజ్ఞానం కలుగుతుంది. దానికి ప్రయోజనం మోక్షమే! అలాంటి మోక్షాన్ని గురించి ఎప్పుడూ ఆలోచిస్తూ వుండాలి.

ఇప్పుడు చెప్పిన సద్గుణాలే జ్ఞానం. వీటికి తల్లకిందులైన దుర్గుణాలే అజ్ఞానం. ఈ సాధన సంపత్తి మొత్తానికి అహంభావం పోవడమే మూల కారణం. కనుక రాజా! నీలో వుండే రాజుననే అహంభావం తొలగించుకో.

***భగీరథుడు***: కొండలో పుట్టిన చెట్టు లాగా, నాలో ఎప్పటినుంచో ఎక్కడెక్కడికో వేళ్లు పాతుకుని పోయివున్న ఈ అహంకార వృక్షాన్ని నిరకేదెలా గురుదేవా?

***త్రితలుడు***: భగీరథా! విను!

1. పట్టుబట్టి భోగవాంఛలు తొలగించుకో!
2. "నేనీ వైభవాన్ని వదిలి పెడితే, నా గౌరవం పోతుంది, పైగా శత్రువులు పరిహసిస్తారు" అనే భావనను వదలి పెట్టు.

3.  సమర్థుడైన మనిషిని ముష్టెత్తుకు బ్రతకరా అంటే, ఒప్పుకోడు. ఎందుకంటే, ఆ పని చేయడానికి, వాడికి ఒక లజ్జ , ఒక రకమైన ఆత్మాభిమానం, అడ్డు వస్తాయి. వీటివల్లే మనిషి స్వగృహాన్ని వదిలి పెట్ట లేడు. అంటే వాడు లజ్జాభిమానాలనే పంజరంలో బందీ ఐపోతున్నాడన్నమాట. ఈ పంజరం పగిలితే గాని, అహంకారం పోదు. కనుక దానిని పగులగొట్టు.

4.  ముందుగా రాజ చిహ్నాలైన చత్ర చామరాలను దూరంగా పెట్టు.

5.  నీ రాజ్యన్ని తీసికెళ్లి, నీ శత్రువులకే అప్పగించు

6.  చివరికి నీ శత్రువుల ఇళ్ళలోనే ముష్టెత్తుకు జీవించు

7. గురువునైన నన్ను కూడా వదిలి పెట్టేయ్.

**భగీరథుడు**:  అదేమిటి గురుదేవా!

**యావదాయు స్త్రయో వంద్యా**
**వేదాన్తో గురు రీశ్వరః ॥**  (వ్యాఖ్యానంలో శ్లోకం)

ఆయుష్యం వున్నంత వరకూ వేదాంతాన్నీ, గురుదేవునీ, ఈశ్వరుణ్ణీ, సేవిస్తూనే వుండాలని ధర్మ శాస్త్రాలు చెబుతున్నాయి గదా, సద్గురువులైన మిమ్మల్ని నేను ఎలా వదిలి పెట్టేది?

**త్రితలుడు**: ఇక్కడ నువ్వు శుశ్రూష చేయలేక నన్ను విడిచి పెట్టటం లేదు. ఇక నా దగ్గర కూర్చొని చేసే పని లేదు గనుక విడిచి పెడుతున్నావ్. కనుక ఇది దోషం కాదు. నేను చెప్పిన మెట్లన్నీ నువ్వు సాధిస్తే , నీ అహంకారం మటుమాయం ఔతుంది. అజ్ఞానం  తొలగి పోతుంది.

ఈ ఉపదేశం విన్న తరువాత భగీరథుడు తన స్వరాజ్యానికి తను వెళ్లి పోయాడు. వెళ్ళినవాడు వేరే పనులు పెట్టుకోకుండా, ఉన్నట్టుండి యజ్ఞ యాగాలు ప్రారంభించాడు. అంతకుముందు అర్హత లేనివాడికి దానాలు చేయకూడదనే అభిని వేశం వున్న భగీరథుడు ఈ యజ్ఞాలలో మాత్రం, అడిగినవారికీ అడగని వారికి, అందరికీ దానాలు చేసేస్తున్నాడు. ప్రజలు ఆశ్చర్యపోతున్నారు. మంత్రులు అవాక్కై పోతున్నారు. చివరికి ఆ రాజు కట్టు బట్టలతో మిగిలి, తన రాజ్యంలో తనే ముష్టివాడై పోయాడు.

### 58.  యథాప్రాప్త జీవి

దేశ ప్రజలంతా కన్నీరు మున్నీరుగా విలపించారు. మంత్రులు బ్రతిమాలారు. ఐనా ఆ రాజు భిక్ష అడగడం మానలేదు సరిగదా, ఒక రోజున సరాసరి తన శత్రురాజు దగ్గరికి వెళ్ళి, తన రాజ్యాన్ని గూడా తీసుకొమ్మని తనే ప్రార్థించాడు. ఆ రాజు భగీరథుణ్ణి పరిపరి విధాల పరిహాసం చేసి, చివరికి అంగీకరించాడు.

దాంతో, భగీరథుడియొక్క ఏషణాత్రయ పరిత్యాగం పరాకాష్ఠకు చేరింది. (దారైషణ, పుత్రైషణ, ధనైషణలు అనేవే ఏషణాత్రయం. ఏషణ అంటే కోరిక.) ఇక భగీరథుడు కట్టు బట్టలతో ఊరు వదలి, అరణ్యాలు దాటి, తన ఊరూ పేరూ తెలియని సుదూర గ్రామాలలో అవధూతగా తిరగడం మొదలు పెట్టాడు.

అలా చాలా ఏళ్ళు గడిచినై. గ్రామైక రాత్రంగా, ఒక లక్ష్యం అంటూ లేకుండా, ఊళ్ళు తిరుగుతున్న ఆ భగీరథుడు ఒక సారి తనకు తెలియకుండానే తన స్వంత రాజ్యంలోకి ప్రవేశించాడు. గుర్తించాడు. ఐనా ఆయనకు ఏ రకమైన మనో వికారాలూ కలుగ లేదు. యథాప్రకారంగా వీథులలో ముష్టెత్తుకు తిరుగు తున్నాడు.

క్రమంగా మంత్రుల పేటకు వచ్చే సరికి, పాత మంత్రులు కొందరు గుర్తించారు. వారు గోల గోలగా ఏడ్చి, ఇక్కడే వుండి పొమ్మని బ్రతిమాలాడారు. క్రమంగా పూర్వపు శత్రురాజుకు కూడా తెలిసింది. అతను

ఏం చేయాలా అని మనస్సులో మథన పడుతున్నాడు. ఇంతలో ఓ రోజున వాళ్ళింటికే భిక్షకు వెళ్ళాడు భగీరథుడు. ఆ రాజు భగీరథుడి మహత్యాన్ని గుర్తించి "మీ రాజ్యం మీరే తీసేసుకోండి" అని బ్రతిమాలాడు.

భగీరథుడు ఎంత మాత్రమూ చలించ లేదు. కొన్నాళ్ళు ఆ పట్టణంలో భిక్షాటన చేసి, ఎప్పుడు వెళ్ళిపోయాడో అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

ఈ మాటు తిరుగుళ్ళలో తన పాత గురువుగారు త్రితలుడు కనిపించాడు. ఇద్దరూ పరమానంద పడ్డారు. ఇద్దరూ గూడా భోగాలనే గాక, దేహాలను కూడా తృణ ప్రాయంగా భావించే మహానుభావులు కనుక, లౌకిక ప్రసంగాలు లేకుండా బ్రహ్మ గోష్ఠులు చేసుకుంటూ కొంత కాలం కలిసి తిరిగారు.

ఇద్దరూ గూడా ప్రారబ్ధాధీన జీవనులు గనుక, తమకంటూ వేరే స్వంత సంకల్పాలు లేనివారు గనుక, ఎప్పుడు విడిపోయారో మళ్లీ విడిపోయారు.

భగీరథుడు ఒక రోజు భిక్షాటన కోసం ఒక రాజ్యంలో ప్రవేశించాడు. మంత్రులంతా ఈ రాజ్యాన్ని ఎవరికి అప్పచెప్పాలా అని గిలగిల లాడుతున్నారు. ఇంతలో ఆ వీధికి ముష్టికి వచ్చాడు భగీరథుడు.

ఆ మంత్రులు భగీరథుడ్ని గుర్తుపట్టారు. వాళ్లకో వింత ఆలోచన వచ్చి "అయ్యా! నీకీ రాజ్యాన్నే భిక్షగా వేస్తున్నాం, తీసుకో" అన్నారు. విషయం అంతా వివరించి బ్రతిమాలారు.

"ఎప్పుడు ఏది ప్రాప్తిస్తే దానిని రాగ ద్వేషరహితంగా అనుభవించాలి" అనే తత్త్వ దృష్టితో జీవనం చేస్తున్న భగీరథుడు, రాజ్య స్వీకారానికి అంగీకరించాడు. కొద్ది రోజులలోనే ఆ రాజ్యం పూర్వాధిక వైభవంతో కళకళలాడ సాగింది.

దైవయోగం చాలా చిత్రం. ఇంతలో భగీరథుడి స్వీయరాజ్యంలో రాజుగా వున్న ఒకప్పటి శత్రురాజు హఠాత్తుగా మరణించాడు. అతనికి కూడా వారసులెవరూ లేరు. అక్కడి మంత్రులు సరాసరి భగీరథుడి దగ్గరకు వచ్చి ఈ రాజ్యాన్ని గూడా స్వీకరించమని పట్టు బట్టారు. యథాప్రాప్త జీవియైన భగీరథుడు దీనికి కూడా అంగీకరించాడు.

భగీరథుడు మరో సారి చక్రవర్తి అయ్యాడు. పొంగు కుంగులు లేని పరిపూర్ణ స్థితికి చేరిన మహానుభావుడు అవడంవల్ల, ఈ మాటు అతని రాజ్య పాలన మరింత లోకోత్తరంగా సాగింది.

ఇలా వుండగా, గరుత్మంతుడు తన భక్తులకు కొందరికి దర్శనమిచ్చి, వాళ్ళతో మాట్లాడుతూ "ఇప్పుడు మీ రాజు భగీరథుడియొక్క ముత్తాతలు పాతాళలోకంలో భస్మరాశులుగా మగ్గి పోతున్నారు, స్వర్గలోకంనుంచి భూలోకానికి, అక్కడినుంచి పాతాళ లోకానికి, దేవ గంగను తీసుకొని వచ్చి ఆ గంగా జలాలతో ఆ భస్మరాసులను ప్రక్షాళణ చేస్తే అతని పితృదేవతలు తరిస్తారు. ఇది అతని కర్తవ్యం. అతను ప్రయత్నిస్తే దేవలోక గంగను పాతాళ లోకానికి తీసుకొని రాగలడు, ఆ పనివల్ల దారిలో భూలోక వాసులు గూడా పవిత్రులౌతారు. సామర్థ్యం వుండి గూడా రాజైనవాడు తన ప్రజలకు తన చేతిలో వున్న ఉపకారం చేయకుండా వుండడం అనచితం గదా!" అని చెప్పాడు.

ఈ మాట క్రమంగా భగీరథ మహా రాజుకు తెలిసింది. ఆయన ఇది తన కర్తవ్యం అని గుర్తించి, సర్వసంగ పరిత్యాగి కనుక, ఏ మాత్రమూ జంకకుండా రాజ్యాన్ని మంత్రుల చేతిలో పెట్టేసి, వెయ్యేళ్ళు పాటు ఘోర తపస్సు చేసి, బ్రహ్మ దేవుణ్ణి, శంకరుణ్ణి, జహ్ను మహర్షిని ఆరాధించి, గంగా ప్రవాహాన్ని భూలోకంలోకి, అక్కడి నుంచి పాతాళ లోకంలోకి, ప్రవేశింప జేశాడు.

రామా! నిష్కామత పరకాష్ఠ చేరుకున్న మహానుభావులు సంగ విహీనులై, ఏది ఏలా ప్రాప్తిస్తే అలా చేస్తూ, ఎలాంటి లోకోపకారం చేస్తారో గమనించావా?! కనుక, నువ్వు కూడా అలాంటి యథా ప్రాప్త కార్యదృష్టిని అలవర్చుకో. దానిని సాధించావంటే, నువ్వు శిఖిధ్వజుడి లాగా నిశ్చలంగా వుండ గలుగుతావు.

## 59. చూడాలోపాఖ్యానం లేక శిఖిధ్వజోపాఖ్యానం

**శ్రీరాముడు**: గురుదేవా! ఈ శిఖిధ్వజుడు ఎవరు? ఆయన నిశ్చలత్వాన్ని ఎలా సాధించాడు?

**వశిష్ఠుడు**: రామా! చూడాల, శిఖిధ్వజుడు అని ఇద్దరు పుణ్య దంపతులు. వాళ్ళు మీ వంశం వాళ్లే! ఇప్పుడు శ్వేత వరాహ కల్పం నడుస్తోంది కదా, దీని వెనకాల ఒకానొక ద్వాపర యుగంలో వాళ్ళు దంపతులుగా జన్మించారు. ఇప్పుడు నడుస్తున్న ఈ కల్పంలో ప్రస్తుతానికి 28వ చతుర్యుగి నడుస్తోంది. దానిలో త్రేతాయుగంలో వున్నది. దీని తరువాత రాబోయే ద్వాపరయుగంలో, వాళ్ళు మళ్ళీ అవే పేర్లతో దంపతులుగా జన్మించ బోతున్నారు.

**శ్రీరాముడు**: గురుదేవా! పూర్వం ఏది ఎలా జరిగిందో అది మళ్ళీ అలాగే భవిష్యత్తులో గూడా జరగడానికి కారణమేమిటి?

**వశిష్ఠుడు**: రామా! ఈ జగన్నిర్మాణం చేసేవాళ్ళు బ్రహ్మాదులు. వాళ్ళు సత్య సంకల్పులు. వాళ్ళకు కొన్ని అనివార్యమైన స్వభావాలున్నాయి. ఆ స్వభావాలే ఈ పునరావృత్తికి కారణం.

ఒక మామిడి చెట్టు వుందనుకో. దానికి చాలా కొమ్మలుంటాయి. అన్ని కొమ్మలూ ఒకే రకంగా ఉన్నాయా అంటే, కాదనీ చెప్పలేం, ఔననీ చెప్పలేం. ఒకే కొమ్మకు 100 కాయలు కాసాయి. కాయలన్నీ ఒకే రకంగా వున్నాయా? ఉన్నట్టే కనిపిస్తుంది. గట్టిగా చూస్తే తేడాలు కనిపిస్తాయి. ఆ కాయలు రాలిపోతూ వుంటాయి. కొమ్మ మాత్రం స్థిరంగా వుంటుంది. ఆ కొమ్మను నరికేస్తే? పక్కన మరో కొమ్మ వస్తుంది గాని, ఈ కొమ్మ రాదు.

దీనికి కారణం ఏమిటి? ఆ వృక్ష బీజంలో వుండే నియతే దీనికి కారణం. (నియతి= ప్రకృతి నియమం)

అలాగే నదిలో అలల వంక చూడు. అలలన్నీ పూర్తిగా ఒకే రకంగా వున్నాయంటావా? పూర్తిగా తేడాగా ఉన్నాయంటావా? ఈ సామ్య వైషమ్యాలకు కారణమేమిటి? గాలే!

అలాగే, ఈ సృష్టిలో, సంఘటనలను పోలిన సంఘటనలు మళ్లీ మళ్ళీ జరుగుతూ వుండడానికి కారణం హిరణ్య గర్భుడి సత్య సంకల్పంలో వున్న సహజ స్వభావమే.

ఇంతకూ అసలు కథ చెబుతా విను.

పూర్వ కల్పంలో, ఎనిమిదవ మన్వంతరంలో, నాల్గవ చతుర్యుగిలో, ద్వాపర యుగంలో, కురు రాజుల వంశంలో, శిఖిధ్వజుడనే రాజు జన్మించాడు. ఇతను ఉజ్జయినీ పట్టణం రాజధానిగా చేసికొని, సద్గుణ సంపన్నుడై, సమర్థుడై, రాజ్య పాలన చేస్తూ వుండేవాడు.

అతను చిన్నప్పుడే రాజ్యానికి రావడంవల్ల, వివాహం చాలా ఆలస్యమైంది. కొంత కాలంపాటు అతను వివాహం మాట పట్టించుకోలేదు. వాని యౌవనం ముదురుతున్న కొద్దీ, స్త్రీ చింత అతనిని ముంచి వేయడం ప్రారంభించింది.

దానిని గమనించిన మంత్రులు సురాష్ట్రరాజ పుత్రికను 'చూడాల'ను తెచ్చి వివాహం చేశారు. కాక కాక జరిగిన పెళ్లేమో, శిఖిధ్వజుడికి భార్యే లోకంగా వుంది. వాళ్ళ అనుకూల్యం గూడా అద్భుతంగా వుంది. ఇద్దరూ విద్యావంతులూ, మేధావంతులూ, అవడంవల్ల, ఒకరి విద్యలు మరొకరు నేర్చుకోవడమే వాళ్ళకు ప్రధాన వినోదంగా వుండేది.

చూడాల భర్త దగ్గర, రాజ విద్యలన్నీ నేర్చుకుంది. శిఖధ్వజుడు భార్య దగ్గర సంగీత నృత్యాది కళలన్నీ నేర్చుకొన్నాడు. రాజ్య వ్యవహార నిర్వహణ కూడా వారికి శృంగార చేష్టే ఐపోయింది. వాళ్లదొక ఆనంద

ప్రపంచంగా  కాలం గడిచి పోతోంది.

ఇలా చాలా యేళ్లు గడిచాయి. కాలాన్ని ఎవరు ఆపగలరు? ఓటి కుండలోంచి నీళ్ళు మెల్లగా కారిపోయినట్లుగా, (భిన్న కుంభాదివాంభసి – సర్గ 78, శ్లో.2) వాళ్ళ శరీరాల్లోంచి యవ్వనం జారిపోవడం ప్రారంభించింది. మేధావంతులైన ఆ దంపతులకు యవ్వనం తగ్గేసరికి, జగత్తత్త్వం మీది ఆలోచనలు మొదలైనాయి.  అప్రయత్నంగానే వాళ్ళు ఇద్దరూ కలిసి అధ్యాత్మ్య శాస్త్ర పరిశీలన ప్రారంభించారు. ఆ శాస్త్రాన్ని చూస్తున్న కొద్దీ, వాళ్ళకీ ప్రపంచం అస్థిరమనీ, క్షణ భంగురమనీ,  అర్థం కావడం ప్రారంభించింది. ఇక వాళ్ళిద్దరూ ఎప్పుడు కలుసుకున్నా అధ్యాత్మ విషయాలమీదే చర్చ సాగుతూ వుండేది. క్రమంగా వాళ్ళకు తెలియకుండానే వాళ్ళిద్దరూ కలిసి, తదేక తత్పరులయ్యారు. అంటే –

**తచ్చింతనం తచ్ఛ్రవణ**
**మన్యోన్యం తత్ప్రబోధనమ్ ।**
**ఏతదేక పరత్వం చ**
**బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః ॥**     (వ్యాఖ్యాత ఉదహరించిన ప్రసిద్ధ శ్లోకం)

(దానినే ఆలోచించడం, దాన్ని గురించే వినడం, ఒకరినొకరు అదే చెప్పుకోవడం ఎప్పుడు చూసినా అదే ఆసక్తి, ఇలా వుంటే దీనినే పెద్దలు 'బ్రహ్మాభ్యాసం' అంటారు.)
– అనే స్థితికి వచ్చారు దంపతులిద్దరూ

**60. చూడాల ఆత్మసిద్ధి**

ఈ స్థితికి వచ్చే సరికి రాజుకి, రాజ్య వ్యవహారాలు పెరిగిపోయాయి. చూడాలకు తీరిక పెరిగింది. పండితులను పిలిపించి, అవిచ్ఛిన్నంగా ఆత్మ తత్త్వ విచారాన్ని చేస్తూ వుండడమే ఆమెకు వినోదంగా మారింది.

అలా పండితుల శాస్త్ర గోష్ఠులు వినగా వినగా, ఆమెకు తన హృదయంలో రాత్రింబవళ్ళు ఆగని ఆత్మ విచారణ  మొదలైంది.

ఆ విచారణలో, 'జడమేది, చేతనమేది' అనే విచారణ మొదట మొదలైంది. ఆ చర్చలో దేహేంద్రియ మనో బుద్ధి చిత్తాహంకారాలన్నీ జడాలేననీ, వీటన్నింటికీ లోపలవున్న జీవుడు మాత్రమే చేతనమనీ తేలింది.

అలా ఐతే, ఈ ఇంద్రియాదులన్నీ చేతనాల్లాగా కనిపించడానికి కారణమేమిటనే ప్రశ్న వచ్చింది. మళ్ళీ విచారించగా దానికి కారణం 'అధ్యాసే' అని తేలింది.

ఇక 'అధ్యాస' అంటే ఏమిటనే విచారణ మొదలైంది. దానితో మూలావిద్య తత్త్వం కొంతవరకూ పట్టు బడింది. దానివల్ల ఆమెకు ఆత్మతత్త్వం ఒకింత విస్పష్టమైంది. దానివల్ల శాంతి విస్తరించింది.

క్రమంగా ఆమె తత్త్వ జ్ఞానాభ్యాసం పెరిగింది. ఏకాంత ధృఢాభ్యాసంవల్ల ఆమెకు అనతి కాలంలోనే ఆత్మ తత్వం పట్టువడింది. ద్వంద్వాలు వీడిపోయాయి. సందేహాలు తొలగి పోయాయి. ఆత్మానందం సుస్థిరమైంది.

మామూలు మనిషికి మనోభ్రాంతి ఎంత సులువుగా వస్తుందో, అంత సులువుగానే తత్త్వజ్ఞానికి భ్రాంతి నశిస్తుంది – అని పెద్దలు చెప్పే మాట ఆమెకు అనుభవంలోకి వచ్చింది. ఆమెకు హృదయాంతర్గత తాపత్రయాలన్నీ తొలగి పరిపూర్ణమైన శాంతి లభించింది. దానివల్ల ఆమెలో ఒక నూతన కాంతి ప్రవేశించి, ఆమె వికశించిన పువ్వులా కళకళ లాడింది.

ఆమెలోని ఈ నూతన వికాసాన్ని గమనించిన భర్త ఒక నాడు ఆమెతో సవిలాసంగా ఇలా అన్నాడు –

"చూడాలా! నీలో ఏదో కొత్త అందం పెల్లుబుకుతోంది. నిన్ను చూస్తుంటే మళ్ళీ నీకు యౌవనం

వచ్చిందా అనిపిస్తోంది. ఏ స్వర్గానికో వెళ్ళి అమృతం తాగి వచ్చావేమో అనిపిస్తోంది.

"నీలో మరో రకమైన మార్పు కూడా కనిపిస్తోంది. నువ్వు పూర్వం లాగా దేనికీ పొంగడం లేదు, దేనికి కుంగడం లేదు. ఇప్పుడు నీకు దేని మీదా ఆసక్తి వున్నట్లు లేదు. సామాన్యంగా నిరాసక్తులు చింతాక్రాంతులై వుంటారు. నువ్వు మాత్రం చాలా ఉల్లాసంగా వున్నావు.

"నాకు తెలిసినంతలో నువ్వు గొప్ప వస్తువు దేనినీ పొంద లేదు. ఉన్న రాజ్యం పూర్వం నుంచీ వున్నదే. మరి నీలో ఈ ఉల్లాసానికీ,ఈ వికాసానికీ,ఈ ప్రకాశానికీ కారణం ఏమిటి?"– అని

భర్త ప్రశ్నలు విన్న చూడాల, మొదట్లో గూఢోక్తిగా ప్రారంభించి, చివర్లో వాచ్యోక్తిగా తన ఆత్మ తత్త్వ సాధన విషయాన్ని వివరించింది. ఇక్కడ వాల్మీకి మహర్షి "తేనాస్మి శ్రీమతీ స్థితా" లేక "తేనాహం శ్రమతీ స్థితా" (అందువల్ల నేను శోభావంతురాలినై ఉన్నాను.) అనే మకుటంతో పది అందమైన శ్లోకాలు పెట్టాడు. వాటి సారాంశం ఇలా వుంది.

**చూడాల**: నాథా! నేను దేనినీ వదిలి పెట్టలా. కానీ అన్నీ వదిలేశా. అందుకే ఇంత శోభగా వున్నాను.

ఈ లోకంలో సత్యమూ వుంది, అసత్యమూ వుంది. ఈ రెంటికీ మించిన దానిని నేను పట్టుకున్నాను. అందుకే ఇంత శోభగా వున్నాను.

సృష్టి సమయంలో ఈ ప్రాపంచిక పదార్థాలన్నీ చిన్న చిన్నవిగా, పరిమితులు కలవిగా కనిపిస్తున్నాయి. ప్రళయ కాలంలో ఇవే వస్తువులు పరిమితులు లేని దివ్య తత్త్వంలో కలిసి పోతున్నాయి. నేనీ ప్రపంచాన్ని సృష్టి దృష్టితోనూ చూస్తున్నాను, ప్రళయ దృష్టితోనూ చూస్తున్నాను. అందుకే ఇంత శోభగా వున్నాను.

భోగాలను అనుభవించకుండానే భోగించినట్లుగా తృప్తిపడుతున్నాను. అనుభవించాననే సంతోషం కలగడం లేదు.అనుభవించలేదనే కోపమూ కలగడం లేదు. అందుకే ఇంత శోభగా వున్నాను.

పూర్వం రాజభోగాలతో క్రీడించేదాన్ని. అప్పట్లో రాజ ప్రాకారమే నా పరిధి. ఇప్పుడు మాత్రం నాహృదయం ఆకాశం అంత పెరిగి పోయుంది. దానిలో నేను తప్పితే మరొకరు ఎవ్వరూ లేరు. నాలో నేనే క్రీడిస్తున్నాను. అందుకే ఇంత శోభగా వున్నాను.

పూర్వం ఇంటికి క్రొత్త క్రొత్త వస్తువులు వచ్చినకొద్దీ పొంగిపోతూ ఉండేదాన్ని. ఇప్పుడు ఆ వస్తువులన్నీ లేక పోయినా నేను నాలోనే వుంటున్నాను. అవన్నీ ఇంటికి వస్తే, వచ్చాయని సంతోషం లేదు, రాకపోతే రాలేదనే దిగులూ లేదు. అందుకే ఇంత శోభగా వున్నాను.

పూర్వం నేనొక దేశానికి రాణిని. అది నా పరిమితి. ఇప్పుడు నాకా పరిమితులు లేవు. ఈ ముల్లోకాలకూ రాజును నేనే అని నాలో నేనే ఆనందిస్తున్నాను. అందుకే ఇంత శోభగా వున్నాను.

ఒక దృష్టితో ఈ కనిపిపించేదంతా నేనే. మరో దృష్టితో ఇదేదీ నేను కాదు. ఒక దృష్టితో నేను సత్యం. మరో దృష్టితో సత్యం కాదు– అని నాకు అర్థమౌతోంది. అందుకే ఇంత శోభగా ఉన్నాను.

నేను సుఖాన్నీ కోరడం లేదు, దుఃఖాన్నీ కోరడం లేదు. దేన్నీ తిరస్కరించడం లేదు. ఏది ఎలా వచ్చినా నేను సంతోషంగా వున్నాను. అందుకే ఇంత శోభగా వున్నాను.

పూర్వం నేను చెలికత్తెలతో క్రీడిస్తూ వుండేదాన్ని. ఇప్పుడు రాగద్వేషాలను తగ్గించే శాస్త్రదృష్టులే నా చెలికత్తెలు. వారితోనే నా క్రీడ. అందుకే ఇంత శోభగా వున్నాను.

**పశ్యామి యన్నయన రశ్మిభిరింద్రియైర్వా**
**చిత్తేన చేహ హి తదంగ న కించిదేవ ।**

**పశ్యామి తద్విరహితం తు న కించిదంతః**

**పశ్యామి సమ్యగితి నాథ చిరోదయాస్మి ॥** (పూర్వ.సర్గ.69, శ్లో. 31)

నాథా! నా కళ్ళలో గానీ, ఇతర ఇంద్రియాలలో గానీ, మనస్సులో గానీ దేనిని చూస్తున్నానో, అదంతా లేనిదే అని నాకు అర్థమైపోయింది. ఈ ఇంద్రియ చిత్తాదులకు అతీతంగా ఒకానొక ప్రపంచం కాని ప్రపంచాన్ని నా లోపల ప్రత్యక్షంగా చూస్తున్నా. అందుకే నా శోబ ఇంత పెరిగి పోతోంది.

ఈ సమాధానాలు విని ఫక్కున నవ్వి శిఖిధ్వజుడు ఇలా అన్నాడు –

"చూడాలా! నీకేదో అయింది. అసంబద్ధ ప్రలాపాలు చేస్తున్నావు." అంటూ చూడాల చెప్పిన ప్రతి సమాధానాన్నీ శిఖిధ్వజుడు ఆక్షేపించాడు. ఈ ఆక్షేపాల కోసం "స కథం కిల శోభతే" (అలాంటివాడు ఎలా శోభిస్తాడు?) అనే మకుటంతో 6 శ్లోకాలను పెట్టాడు వాల్మీకి మహర్షి. వాటి సారాంశం ఇలా వుంది –

"చూడాలా! పరస్పర విరుద్ధ వాక్యాలను పేనుకుంటూ, అదేదో తెలివనుకుంటున్నావు. ప్రపంచం ఇంత స్పష్టంగా కనిపిస్తుంటే, దీనిని వదిలేసి దేనినో శూన్యాన్ని పట్టుకోవాలను కుంటున్నావు. శూన్యాన్ని పట్టుకునేవాడికి సుఖమేమిటి? శోభేమిటి?

"భోగాల ననుభవించకుండానే సుఖంగా వున్నానంటున్నావు. ఒకడికి పెళ్లాంమీద కోపం వచ్చి ఇంట్లో ఉన్న మంచాలు, కుర్చీలు, విరగగొట్టి, నేలమీద పడుకొని, హాయిగా వుందన్నాడట. అలా వుంది నీ తంతు"

"ఒక సారి నేనే దేహాన్నంటావు. ఒక సారి కాదంటావు. ఇవేం పిచ్చిమాటలు.? చివరికి వచ్చేసి ఇంద్రియాలు, మనస్సు, లేకుండా దేనినో చూస్తున్నానంటున్నావు. ఇది మరీ అసంగతం.

"చూడాలా! నా మాట విను. ఇలాటి వెఱ్ఱిలో పడబోకు. నా లాగా హాయిగా రాజ విలాసాలతో, రాజ వ్యవహారాలతో, క్రీడించు."

శిఖిధ్వజుడు ఇలా అనేసి, తనకు సమయమైపోయిందంటూ మధ్యాహ్న స్నానానికి వెళ్ళిపోయాడు.

చూడాల బిత్తరపోయి చూసింది. "అరెరే! నా మాటలు ఈయనకు బొత్తిగా అర్థం కాలేదే!" అని బాధ పడిపోయింది. "న చేదిహావేదీన్మహతీ వినష్టిః" (మనిషి జీవించి వుండగానే ఈతత్త్వ జ్ఞానాన్ని తెలిసి అందుకోక పోతే చాలా పెద్ద నష్టం.) అని స్మృతి చెబుతోంది కదా. ఐనా యీయన పట్టించుకోడేమా– అని విచార పడ్డది. రోజులు దొర్లిపోతున్నాయి. అంతకు ముందు ప్రతి విషయంలోనూ ఏకాభిప్రాయంగా వున్న దంపతులు, ఇప్పుడు ఎవరి అభిప్రాయాలు వాళ్ళవిగా కాలం గడిపేస్తున్నారు.

### 61. చూడాల యోగసిద్ధి

చూడాల ఎక్కువసేపు ఆత్మ తత్త్వ మననంలోనే కాలం గడుపుతోంది. ఐనా సరే, పాత సంస్కారాలు త్వరగా విడిచి పెట్టవు గదా! రాజ భోగాలన్నిటిమీదా కోరికలు విడిచి పెట్టి కూర్చున్న ఆ సాధ్వికి, దేవతల్లాగా ఆకాశ గమనం చేయాలనే కోరిక పుట్టింది. సరిగ్గా అదే సమయానికి శిఖిధ్వజుడికి ఏవో యుద్ధాలు వచ్చి పడి, రెండు మూడేళ్ళపాడు స్వదేశానికి దూరంగా ప్రవాసం చేయవలసి వచ్చింది. చూడాలాదేవి ఈ సమయాన్ని సద్వినియోగ పరచుకో దలచి, ఖేచరీ విద్య కోసం యోగాభ్యాసాలు ప్రారంభించింది.

ఆమె ఏకాంతంలో కూర్చుని, ఆసన బంధం వేసి, ప్రాణవాయువును భ్రూ మధ్యానికి తెచ్చి నిలబెట్టడం ప్రారంభించింది.

వశిష్ఠుడి కథా గమనం ఇలా వేగంగా సాగి పోతూంటే, శ్రీరాముడు అడ్డం బడి, సిద్ధాంత విషయిక ప్రశ్న ఒకటి వేశాడు.

**శ్రీరాముడు**: గురుదేవా! ఈ ప్రపంచమంతా ఒకానొక క్రియవల్ల పుడుతున్నట్టు కనిపిస్తోంది. "క్రియ" అన్నా "స్పందం" అన్నా ఒకటే! ఈ స్పందం ఎలా పుడుతోంది? లోకంలో చూస్తుంటే, ఆత్మ జ్ఞానం లేనివాడు కోరికతో పని చేస్తున్నాడు. ఆత్మజ్ఞానం ఉన్నవాడు ఈ చూడాల లాగే విలాసంగా ఏదో పని చేస్తూనే ఉన్నాడు. మొత్తం మీద పని చెయ్యనివాడే లేడు. కనుక, క్రియలనబడే ఈ స్పందాలు ఎక్కడి నుండి వస్తున్నాయో వివరించండి?

**వశిష్ఠుడు**: రామా! క్రియ ఒకటి, క్రియాఫలం ఒకటి – మొత్తం రెండున్నాయి. క్రియాఫలం సిద్ధించాలంటే, దానికి వెనకాల కొన్ని సాధనాలు, కారణాలు, వుండాలి. క్రియకు వీటికంటె భిన్నమైన కారణాలు గాని, సాధనాలు గాని అక్కర లేదు. కనుక క్రియాఫలం కంటె భిన్నంగా, క్రియకు వెనకాల 'వేరే ఏమున్నాయి?' అనే ప్రశ్నకే అవకాశం లేదు. ఇక పోతే, క్రియాఫలాన్ని గురించి విచారణ చేస్తే, అది మూడు రకాలుగా వుంటుంది.

1. ఉపాదేయము – అంటే స్వీకరించ దగినది. అంటే సాక్షాత్తుగా గానీ, పరోక్షంగా గానీ, తన సుఖానికి అనుకూలమైనది.
2. హేయము – అంటే విడువదగినది. అంటే పైదానికి విరుద్ధమైనది.
3. ఉపేక్ష్యము – అంటే ఉపేక్షించదగినది. పై రెండింటికీ మధ్యలో ఉండేది.

ఈ మూడు రకాల క్రియాఫలాలలో ఏ ఒక్కటైనా ఆత్మజ్ఞానికి అన్వయిస్తుందా అని విచారిస్తే, ఏదీ అన్వయించదని చెప్పాలి. లేదంటే, మూడవదైన ఉపేక్ష్యఫలం అతనికి అన్వయిస్తుందని చెప్పాలి.

మరి, అజ్ఞానికి మూడూ వర్తిస్తాయి.

ఐతే, ఫలాలలో ఉపాదేయత్వాది లక్షణాలు ఫలాన్ని ఆశ్రయించి వుంటాయా? భోక్త నాశ్రయించి వుంటాయా?– అంటే, భోక్తను ఆశ్రయించి వుంటాయనే చెప్పాలి. ఎందుకంటే, ఒకే వస్తువు జ్ఞానికి ఉపేక్ష్యం, అజ్ఞానికి ఉపాదేయం, విరాగికి హేయం.

కనుక జ్ఞానియొక్క క్రియాఫలం వెనుక ఉపేక్ష వుంటుంది. అందువల్ల ఆ క్రియ అతనికి సంబంధించినది కాదు. కనుక అతని దృష్టిలో ఆ క్రియకు పుట్టుకే లేదు.

ఇక అజ్ఞానుల దృష్టిలో క్రియాఫలాలన్నీ దేశ కాల క్రియా ద్రవ్యాలనే నాలుగు అంశాల మీద ఆధారపడి వుంటాయి. శ్రీశైలాది సిద్ధ క్షేత్రాలలో చేసే జప యోగాది సాధనాలు త్వరగా ఫలితాన్నిస్తాయి. అలాగే మణి మంత్రౌషధ తపః క్రియలు రకరకాలుగా ఫలితాన్నిస్తాయి. వాటి వివరాలు చాలా వున్నాయి. కాని ఆత్మ విద్యాసక్తుడవై వున్న నీకు వాటితో పని లేదు. అవి నీకు ప్రకృతార్థ హానికరాలు. అందుచేత అవన్నీ అలా వుంచి, చూడాలా కథాప్రసంగంలో వచ్చిన యోగాభ్యాస సాధనల గురించి కొంత చెప్పుకుందాం!

ఇలా ప్రారంభించిన వశిష్ఠుడు 80 సర్గ 37వ శ్లోకం నుంచి ప్రారంభించి, 82వ సర్గ చివరి దాకా చూడాలా దేవి చేసిన యోగ సాధనల గురించి వివరించాడు. ఈ సందర్భంగా ఆయన మూలాధారం, కుండలినీ శక్తి, 72 వేల నాడులు, ప్రాణగతి, మొదలైన విషయాలను 80వ సర్గలో వివరించాడు.

81వ సర్గలో శరీరంలోకి ఆధులు, వ్యాధులు, ఎలా వస్తాయో చెప్పమని శ్రీరాముడు అడుగగా, దానిని ఆధారంగా చేసుకొని, తత్త్వజ్ఞానం లేకపోవడం, దానివలన ఇంద్రియ నిగ్రహం లేకపోవడం, వీటికి ప్రధాన కారణాలను వివరిస్తూ, మళ్లీ ఆకాశ గమనాన్ని, సిద్ధజన దర్శనాన్ని, పరకాయ ప్రవేశాన్ని, సాధించే ప్రక్రియలను సంగ్రహంగా వివరించారు.

ఆ తరువాత శరీరంలోని చల్లని భాగం చంద్రాంశమనీ, ఆ చల్లదనంలోంచి పుట్టిన వేడి భాగం అగ్న్యంశమనీ ప్రారంభించి, ఈ శరీరం అగ్నీషోమాత్మకమని విపులంగా నిరూపించాడు.

ఆ తరువాత 82వ సర్గలో అణిమా (శరీరాన్ని అణువంత చిన్నదిగా చేసికొనుట) మహిమా (శరీరాన్ని పర్వతమంత పెద్దదిగా చేసికొనుట) వంటి యోగ సిద్ధులను సాధించడానికి కావలసిన యోగ ప్రక్రియలను సంగ్రహంగా వివరించాడు.

అలా యోగ ప్రక్రియల గురించి చెప్పి చెప్పి, చివరికి ఇలా అన్నాడు.

**జ్ఞాత్వా సదాభ్యుదిత ముజ్ఝితదోష మీశో**
**యద్యద్యథా సమభివాంఛతి చిత్ప్రకాశః ।**
**ప్రాప్నోతి తత్తదచిరేణ తథైవ రామ**
**సమ్యక్పదం విదురనావరణత్వ మేవ॥** (పూర్వ.సర్గ.82, శ్లో.34)

రామా! యోగైశ్వర్య సంపన్నుడైన జీవుడు స్వయంప్రకాశ శీలమూ, దోషరహితమూ, ఐన, ఆత్మ తత్త్వాన్ని తెలుసుకొని, ఎప్పుడు ఏది ఎలా కావాలంటే, దానిని తక్షణమే అలా పొందేస్తూ వుంటాడు. ఐనా, నిజమైన ఉత్తమ సిద్ధి అజ్ఞానావరణాన్ని పోగొట్టు కోవడమే అని పెద్దలకు తెలుసు.

ఈ విధంగా యోగ ప్రక్రియల వివరణను ముగించిన వశిష్ఠమహర్షి 83వ సర్గలో చూడాల కథను కొనసాగించాడు.

***వశిష్ఠుడు***: రామా! చూడాల ఆ విధంగా గట్టి ప్రయత్నం చేసి, రకరకాల యోగ సిద్ధులను సాధించింది. ఆ సిద్ధుల ప్రభావంతో ఆమె ఆకాశమార్గాన నడిచింది. సముద్రంలోకి చొచ్చుకు పోయింది. భూమంతా తిరిగింది.

ఇలా చెప్పేసరికి ఆమె బైరాగుల్లో కలిసిందేమో అనుకోకు. అప్పటికి ఆమె ఇంకా నడివయస్సులోనే వుంది. సంస్కారబలం చేత ఆమెకు తన భర్తమీద ప్రేమ తగ్గలేదు. అందువల్ల బంగారు ఆభరణాలు వంటినిండా పెట్టుకుని ఎప్పుడూ తన భర్తతో విహరిస్తూనే వుండేది.

ఐనా సందు దొరికినప్పుడల్లా ఆ ఆభరణాలతోనే ఆకాశంలోకి ఎగిరి పోతూ వుండేది. అందుచేత ఆమె ఆకాశంలో తిరుగుతూంటే, మబ్బులలో మెరుపులు మెరిసినట్లుండేది.

అలా తిరుగుతూ ఆమె దిక్పాలకుల పట్టణాలను చూసింది. పక్షులతో, పిశాచాలతో, విద్యాధరులతో, దేవతలతో, సంభాషించింది. సృష్టిలో గల వింతలన్నీ చూసింది.

ఇంత చేస్తూ కూడా సందు దొరికినప్పుడల్లా తన భర్తకు రకరకాల ఉపాయాలతో ఆత్మవిద్యాబోధ చేస్తూ వుండేది. మొదట్లో ఆమెను పరిహసించిన భర్త క్రమంగా ఆమె తెలివికి సమ్ముగ్ధుడు కావడం మొదలు పెట్టాడు. విషయం వినసాగాడు. అర్థమయ్యేది. కానీ విద్యార్థులు పాఠాలు మర్చిపోయినట్లుగా, ఎప్పటికప్పుడు మర్చిపోతూ వుండేవాడు.

ఇందుకు చూడాల బాధపడుతూ, మళ్లీ మళ్లీ బోధించేదే తప్పు, తన యోగ మహిమలను మాత్రం చూపేది గాదు.

### 62. గురూపదేశ ప్రాముఖ్యము

***శ్రీరాముడు***: గురుదేవా! ఇన్ని యోగసిద్ధులు గల గురువు చెబితేనే విషయం ఎక్క లేదే! ఇక మామూలు గురువులు ఆత్మ విద్యాబోధ చేస్తే ఏం ప్రయోజనం వుంటుంది?

***వశిష్ఠుడు***: ఆత్మవిద్యా ప్రాప్తికి గురువు ప్రధాన కారణం కాదయ్యా. శిష్యుడి ప్రజ్ఞే దానికి కారణం.

***శ్రీరాముడు***: అలా ఐతే, గురూపదేశం లేనిదే ఆత్మజ్ఞానం కలుగదనే ప్రసక్తి ఎలా వచ్చింది?

***వశిష్ఠుడు***: రామా! ఇక్కడో చిన్నకిటుకున్నది. దానికొక కథ చెబుతా విను.

పూర్వం వింధ్యారణ్య ప్రాంతాలలో కిరాటుడనే పిశినారి వర్తకుడుండేవాడు. అతడు మహా కోటీశ్వరుడు. ఐనా వాడికున్న డబ్బు యావ ఇంతా అంతా గాదు.

ఒక సారి వాడొక అడవిలోంచి వెడుతూంటే, ఒక చోట గడ్డి గుబుర్ల సందుల్లోంచి గవ్వలాంటిది ఏదో కనిపించింది.

సముద్ర ప్రాంతాలవారికైతే గవ్వలంటే లెక్క లేదు గానీ, అది వింధ్య పర్వత ప్రాంతమవడంవల్ల అక్కడ గవ్వలు దొరకడం అరుదు. అదువల్ల వాడికి ఆ గవ్వ కనిపించగానే, కొత్త ఆశ పుట్టింది. ఈ గుబురులో చాలా గవ్వలు వుండి వుంటాయి. మనం వీటిని వెతికి పట్టుకుంటే మంచి వ్యాపారం చేసుకోవచ్చు అని అనిపించింది. దాంతో చేసే చేసే ప్రయాణం ఆపేసి, పలుగు పార పట్టుకొని, అడవి దుబ్బులన్నీ తవ్వి, గవ్వలకోసం వెతకడం ప్రారంభించాడు. వాడి ఖర్మం కాలి, ఒక్క గవ్వ కూడా దొరక లేదు. పైగా దారిన పోయే వాళ్లంతా నవ్వి పరిహసించడం ప్రారంభించారు. ఐనా సరే, ఈ పీనాశివాడు పట్టు విడువకుండా మూడు రోజులపాటు రాత్రింబవళ్లూ వెతికాడు.

మూడో రోజు పూర్తైయ్యేసరికి, అనుకోకుండా, వాడికి చంద్రబింబంలా మెరిసిపోతున్న ఒక చింతామణి దొరికింది. దాంతో ఇక వాడి సంపదలకు అంతే లేకుండా పోయింది.

రామా! గురూపదేశ వ్యవహారం కూడా ఇంతే! గురూపదేశంవల్ల శిష్యుడికి పరోక్షమైన శాబ్దబ్రహ్మజ్ఞానం కలుగుంది. మన కిరాటుడి లాగానే శిష్యుడు ఆ పరోక్ష జ్ఞానారణ్యంలో వెతుక్కుంటూ పోగా పోగా, చివరికి వాడికి ప్రత్యక్ష్యానుభూతి లభిస్తోంది. వెతికేది ఒకటి, దొరికేది మరొకటి. ఇదీ ఇక్కడి రహస్యం.

వెతక్క పోతే కిరాటుడికి చింతామణి దొరికేది కాదు. అలాగే, గురూపదేశం లేకపోతే శిష్యుడికి ఆత్మానుభూతి లభించదు. కిరాటుడు చింతామణి కోసం వెతకలా. అలాగే శిష్యుడు గురూపదేశాన్ని శ్రద్ధాపూర్వకంగా మననం చేసుకుంటూ పోతాడు. ఆత్మానుభూతి సంగతి పట్టించుకోడు. కానీ చివరికి ఆత్మానుభూతి చింతామణి వాడికి లభిస్తుంది.

కనుక గురూపదేశం లేనిదే ఆత్మ జ్ఞానం రాదు. కానీ ఆత్మజ్ఞానానికి గురూపదేశం కారణం అవడానికి వీలు లేదు.

### 63. శిఖిధ్వజుడి వైరాగ్యం

ఇక్కడ శిఖిధ్వజుడి విషయంలో, చూడాల అనే గురువు గవ్వలాంటి దానిని చూపించింది. కాని శిష్యుడైన శిఖిధ్వజుడు వెదకడం ఇంకా ప్రారంభించలేదు. అందుకే చూడాల బాధపడుతూ వుండేది. ఐనా ఆమె ప్రయత్నం పూర్తిగా వ్యర్థం కాలేదు. శిఖిధ్వజుడికి మేధా పరంగా విషయం అర్థమయింది. దానివల్ల రాజ్యభోగాలమీద ఇష్టం తప్పింది. వైరాగ్యం పెరిగింది. దానివల్ల దాన ధర్మాలు ఎక్కు వైనాయి. తీర్థయాత్రలు, ప్రయాణాలు, పెరిగాయి. ఏం చేసినా మనస్సు అణగారి పోవటం లేదు. ఆ దిగులుతో అతను చిక్కి పోవడం ప్రారంభించాడు.

ఒక రోజు తను విలాసంగా భార్యతో కబుర్లు చెబుతూ మెల్లిగా ఇలా అన్నాడు.

"చూడాలా! నేను చాలా కాలంగా రాజ్యభోగాలను అనుభవించాను. బాగా పరిశీలించి చూడగా, చూడగా, ఈ రాజ్యభోగాలకంటే, వనవాస సుఖమే మెరుగని నాకు అనిపిస్తోంది. వనవాసులకు మనకుమల్లే లాభనష్టాల గోలలు, యుద్ధ భయాలు, సైన్య నిర్వహణలు, ఇలాంటి గందరగోళాలుండవు గదా! అందువల్ల నాకు అడవికి పోయి తపస్సు చేసుకోవాలని కోరిక కలుగుతోంది. నువ్వు నాకు అడ్డం పడకు. పతివ్రతలు

భర్తకు వ్యతిరేకంగా వ్యవహరించరు కదా!"

"నాథా! ఏ పని ఎప్పుడు చెయ్యాలో, అప్పుడు చేస్తేనే దానికి శోభ. వనవాసం అనేది వృద్ధుడు చేయవలసిన పని. మీకింకా అంత వార్ధక్యం రాలేదు. కొంచెం ఆగండి. వయస్సు ముదిరినాక ఇద్దరం కలిసే తపోవనానికి పోదాం."అంది భార్య.

ఈ మాట భర్తకు నచ్చలేదు. అతను తన విసుగును దాచుకుంటూ ఇలా అన్నాడు–

"నాకడ్డం పడబోకు అని ముందే చెప్పా. నువ్వు చిన్నదానివి. నిజమే. అసలైనా అరణ్యవాసం ఆడవాళ్ళకు చాలా కష్టం. నేనడవికి పోయేది ఖాయం. నా బదులు నువ్వు ఇంట్లో వుండి రాజ్యపాలన చేస్తూ వుండు. భర్త ఊళ్లో లేకపోతే ఇంటి పనులు చూసుకోవడం భార్య విధి కదా! ఐనా మళ్ళీ మాట్లాడుకుందాం. నాకు స్నానానికి సమయమై పోతోంది."

అలా అంటూ శిఖిధ్వజుడు హడావిడిగా వెళ్ళిపోయాడు. ఆ రాత్రికి భార్యా భర్తలిద్దరూ ఒకే మంచం మీద పడుకున్నారు. భార్యకు బాగా నిద్ర పట్టింది. భర్తకు నిద్రే రావడం లేదు. అర్ధరాత్రి దాటాక భార్య గాఢ నిద్రలో వుండగా, అతను ఇంట్లోనుంచి లేచి పోయాడు.

ముందే ఆలోచించి పెట్టుకున్నాడు గనుక, మందర పర్వతం వైపుకు నడక సాగించాడు. అడవి పళ్ళే ఆహారంగా తీసుకుంటూ, రాత్రిపూటే ప్రయాణం చేస్తూ, 12 రాత్రులు ప్రయాణం చేసి, మందర పర్వతానికి చేరాడు. అక్కడో చిన్న పర్ణశాల వేసుకున్నాడు. మెల్లగా, పూజా ద్రవ్యాలు ఎక్కడ దొరుకుతాయో చూసుకున్నాడు. ఇక రోజులో నిమిషం కూడా వ్యర్థం చేయకుండా అనుష్ఠానం ప్రారంభించాడు. తె ల్ల వా ర ం ఝామునే స్నానం, తెల్లవారే సరికే సంధ్యా, అప్పటి నుంచీ జపం, మధ్యాహ్నమయ్యే సరికి మధ్యాహ్నిక స్నానం, పూలు తెచ్చుకోవడం, దేవతార్చన చేయడం, కంద మూలాలాను వెతికి తెచ్చుకొని కొద్దిగా తినడం, మళ్ళీ జపం చేసుకోవడం, రాత్రికి పెందరాడే పడుకోవడం – ఇలా ఇంచుమించు ఒక సంన్యాసిలా కాలం గడిపేస్తున్నాడు.

ఇక్కడ రాజభవనంలో చూడాలకు తెల్లవారు ఝామున మెలకువ వచ్చింది. భర్త లేడు. వెతికింది. పారిపోయడాని అర్థమయింది. కొంత సేపు దిగులు అనిపించింది. కొంచెం సేపు జాగ్రత్తగా ఆలోచించుకొని, ఒక నిర్ణయానికి వచ్చి "కొన్ని కారణాలచేత మహారాజుగారు వంటరిగా దేశాంతరం వెళ్ళారు. వారొచ్చేదాకా రాజ్య వ్యవహారం నన్ను చూడమన్నారు." అని ప్రకటించేసింది. అప్పటినుంచీ, రాజ్య వ్యవహారాలను అపార సామర్థ్యంతో తనే నిర్వహించడం మొదలు పెట్టింది. ఇలా ఒక రోజు, రెండు రోజులు, గాదు, 18 ఏళ్ళు గడిచాయి.

యోగదృష్టి గల చూడాల మరో ప్రక్క తన భర్తను గమనించుకుంటూనే వుంది. అడవిలో అతని అనుష్ఠానం బాగానే సాగుతున్నది. అతనికి వార్ధక్యం బాగానే వచ్చేసింది. మనస్సు కొంత శుద్ధమైంది. ఇక ఇప్పుడు మళ్ళీ అతనికి ఆత్మవిద్యోపదేశం చేయవచ్చునని ఆమె అనుకుంది. ఒక రోజు రాత్రి ఆకాశమార్గంలో బయలుదేరింది. ఎంత యోగీశ్వరురాలైనా, భర్త దగ్గరకు వెళుతున్నాననే సరికి, ఆమెకు మనస్సు పొంగి పోయింది. అందుకు ఆమె కూడా ఆశ్చర్యపోయి, తన మనస్సును తనే నిందించుకుంటూ, ప్రయాణం కొనసాగించింది.

చివరికి శిఖిధ్వజాశ్రమం చేరింది. ఈమె అదృశ్య రూపంలో అక్కడికి వెళ్లేసరికి, శిఖిధ్వజుడు దేవ పూజ కోసం పూలమాల కట్టుకుంటున్నాడు. మనిషి చిక్కిపోయాడు. జడలు పెరిగాయి. నల్లబడ్డాడు. నారచీర కట్టుకున్నాడు. భర్తను అలా చూసే సరికి ఆమెకు చాలా దుఃఖం వచ్చేసింది.

"అరెరే! ఆత్మ వివేకం లేకపోతే మనుషులెంత మూర్ఖులైపోతారు? హాయిగా రాజ్యంలోనే వుండి ఆత్మజ్ఞానం పొందలేక, అడవులకొచ్చి ఇంత తంటాలు పడుతున్నాడు. ఇప్పటికైనా ఆత్మజ్ఞానం కలిగినట్టు లేదు. మొహంలో ఆ కళ లేదు. కానీ ఇప్పుడు ఉపదేశాన్ని పొందే అర్హత వచ్చింది. ఐనా నేను చెబితే ఎక్కదు. నన్ను లక్ష్యం చేయడు. అందువల్ల యోగబలంతో నా రూపం మార్చుకొని ఈయనవద్దకు వెళ్ళడం మంచిది." అని ఆమె తనలో తనే ఆలోచించుకొని, యోగబలంతో ఒక ముని కుమారుడి రూపం ధరించింది.

బ్రహ్మ వర్చస్సుతో నిగనిగలాడిపోయే ఆ ముని కుమారుడు శిఖిధ్వజుడి ఆశ్రమ ప్రాంతంలో ఇటూ అటూ తిరగటం ప్రారంభించాడు.

శిఖిధ్వజుడు ఆ బ్రహ్మచారిని చూసి, ఆ వర్చస్సుకు ముగ్ధుడై, అతనిని ఆహ్వానించి, నమస్కరించి, అతిథి సపర్యలు చేశాడు. క్రమంగా వారి సంభాషణ ఇలా సాగింది.

**64. కుంభ చరిత్ర**

***శిఖిధ్వజుడు***: దేవపుత్రా! తమరెక్కడి నుంచి వస్తున్నారు?

***బ్రహ్మచారి***: రాజర్షివర్యా! మీకు నమస్కారం. నేను భూలోకంలో అనేక గ్రామాలు చూశాను గానీ, నీవంటి వినయమూర్తిని ఎక్కడా చూడలేదు. మీరు ప్రశాంతమైన మనస్సుతో మోక్షార్థమై తపస్సు చేస్తున్నారని నాకర్థమైంది. మీరు దీనికోసం రాజ్య సుఖాలను గూడా పరిత్యాగం చేశారు. ఇది చాలా అపూర్వం.

***శిఖిధ్వజుడు***: దేవపుత్రా! మీ దివ్య దృష్టి అమోఘం. మీ దర్శనం పవిత్రం. మీ ఆకారం సుందరం. నాకు పూర్వాశ్రమంలో అత్యంత ప్రియతమురాలైన భార్య వుండేది. చిత్రమేమిటో గానీ, మీవన్నీ ఆమె పోలికలే. నాకు చాలా సంతోషంగా వుంది. మీరు నాకు అభ్యాగతులు. (అభ్యాగతుడంటే, మధ్యాహ్నవేళ అనుకోకుండా వచ్చిన అతిథి) "అభ్యాగతః స్వయం విష్ణుః" అని శాస్త్రం. కనుక నాకు మీరు విష్ణు స్వరూపులు. కనుక నేను దేవ పూజకోసం కట్టుకున్న ఈ పూలమాలను స్వీకరించండి. నా సందేహాలను తీర్చండి.

***బ్రహ్మచారి***: అడగండి.

***శిఖిధ్వజుడు***: భగవన్! మీరెవరు? ఎవరి పుత్రులు? ఏ అనుగ్రహం అందించడానికి ఇక్కడికి వచ్చారు?

***బ్రహ్మచారి***: మీరెంతో వినయంగా అడిగారు గనుక అన్ని వివరాలూ చెబుతా, వినండి. మహాత్ముడైన నారదమహర్షి గురించి విన్నారు కదా! ఆయన ఒకసారి మేరు పర్వతం మీద, ఆకాశ గంగాతీరంలో, ధ్యానం చేసుకుంటూ కూర్చున్నాడు. ఆయన కళ్ళు తెరిచే సరికి, కొంత మంది దేవాంగనలు నదిలో జల విహారం చేస్తున్నారు. దైవలీలచేత ఆ మహర్షి మనస్సు చలించి, రేతస్సు స్ఖలించింది.

***శిఖిధ్వజుడు***: బ్రాహ్మణ కుమారా! నారదుడు సర్వజ్ఞుడు గదా! దేవర్షి గదా! ఆయనకు మనస్సు ఎలా చలించింది?

***బ్రహ్మచారి***: రాజర్షీ! జీవకోటి ఎక్కడైనా ఒక్కటే! మానవులైనా ఒకటే, దేవతలైనా ఒకటే. ఈ దృశ్య సమూహం స్ఫురించకుండా వుండే లాగా, ఆత్మానుసంధాన రూపమైన సమాధిలో వుండిపోవాలి గానీ, బయటకి వచ్చి ద్వంద్వ ప్రపంచంలో పడితే, ఏ మనస్సు ఎలా తిరుగుతుందో ఎవరు చెప్పగలరు? ఐతే, మూఢుడి చిత్తమైతే కుంకుమ కట్టిన గుడ్డ లాగా, ద్వంద్వాలకు పూర్తిగా అంటుకుపోతుంది. తత్త్వజ్ఞానం కలిగిన మనస్సయితే, గులాబి పూవు పక్కన వున్న స్ఫటిక మణి లాగా తాత్కాలికంగా ఎఱ్ఱబడుతుంది. మూఢుడి మనస్సులోకి విషయం ఒక సారి ప్రవేశిస్తే, ఆ విషయం పోయినా వాసన పోదు. జ్ఞానికి వాసన అంటుకోదు. బంధమోక్షాలంటే ఇవే కదా.

**భావనా తానవం మోక్షో**

**బంధో హి దృఢభావనా ॥** (పూర్వ సర్గ. 85, శ్లో.120)

(భావనలు చిక్కిపోవడమే మోక్షం. భావనలు బలిసి పోవడమే బంధం)

మామూలు మానవులైతే కొన్ని రకాల నాడులు చలిస్తే సుఖం, కొన్ని రకాల నాడులు చలిస్తే దుఃఖం, కలుగుతూ వుంటాయి. అలాగే మరి కొన్ని రకాల నాడులు స్త్రీరూపం వంటి దృశ్యాలచేత ఉత్ప్రేరితాలైనప్పుడు వీర్యస్ఖలనం గూడా జరుగుతూ వుంటుంది. దీనికి కారణం ఆ జీవిలో వున్న వాసనా శేషాలే!

మామూలు అజ్ఞజీవి ఐతే, ఇలాంటి పనులు జరిగినప్పుడు, ఇవి ధర్మానుబద్ధంగా వున్నాయా లేవా, అని ఆలోచించుకుంటాడు. వాసనాక్షయమై జీవన్ముక్తిని పొందిన మహాత్ములకు ఏ లవలేశమో వాసన మిగిలి వుండి ఇలాంటి పనులు జరిగినా, వారు మళ్ళీ ప్రపంచ భావనలోకి రారు. ఇది నేను అనుభవ పూర్వకంగా తెలుసుకొన్న విషయం.

మహాత్ముడైన నారదమహర్షి కూడా ఈ జరిగిన సంఘటనకు వికారం పొందకుండా ప్రశాంతంగా ఆలోచించి, చిరకాలం సురక్షితమైన దేవర్షి వీర్యం వ్యర్థం కారాదని ఆలోచించి, ఒక స్ఫటిక కుంభంలో ఆ రేతోబిందువును జాగ్రత్త చేశాడు. ఆయన సర్వ శాస్త్రవేత్త గనుక, తన సంకల్ప బలంచేత ఆ బిందువును రక్షించగల ఓషధీమయ క్షీరాన్ని సృష్టిచేసి, ఆ కుండలో నింపాడు.

కొంత కాలానికి ఆ కుంభం లోంచి ఒక మగపిల్లవాడు జన్మించాడు. నారద మహర్షి ఆ పిల్లవాడికి చేయవలసిన సంస్కారాలన్నీ చేసి, వేదాది విద్యలన్నీ నేర్పి, ఒక రోజున తనతో పాటు బ్రహ్మలోకానికి తీసుకొని వెళ్ళి, బ్రహ్మగారికి అర్పించాడు.

బ్రహ్మగారు ఈ కుర్రవాడిని పరిశీలించి చూసి, వీడు జ్ఞానపారగుడని గుర్తించి, సంతోషించి, ఆశీర్వదించి, కంభంలోంచి పుట్టాడు గనుక 'కుంభుడు' అని పేరు పెట్టాడు.

రాజర్షీ! ఆ కుంభుడ్ణి నేనే! బ్రహ్మదేవుడి ఆజ్ఞవల్ల, ఆయన సమక్షంలోనే నివసిస్తూ, బ్రహ్మసమాధి నిష్ఠుడనై, కాలక్షేపం చేస్తున్నాను. నాకు విధి నిషేధాలు లేవు. సంస్కార శేషబలంవల్ల ఎక్కడికి కావాలనుకుంటే అక్కడకి పోతూ వుంటాను, వస్తూ వుంటాను. ఈ భూలోకానికి వచ్చినా, నా కాళ్ళు ఈ నేలకు అంటవు. ఈ ధూళి నా కాళ్లకు అంటదు. నేను ఆకాశంనుంచి రావడం మీరు చూస్తూనే వున్నారు కదా! ఇదీ నా కథ!

***శిఖిధ్వజుడు***: దేవపుత్రా! నేను ధన్యుణ్ణి. నా పూర్వ పుణ్యబలంవల్ల మీలాంటి బ్రహ్మలోక నివాసుణ్ణి కలుసుకో గలిగాను. సజ్జన సాంగత్యం రాజ్యప్రాప్తికంటే గూడా గొప్పది కదా!

***బ్రహ్మచారి***: అది సరే! ఇంతకూ మీ కథేమిటి? మీరీ వనవాసం ఎందుకు చేస్తున్నారు? చెప్పండి?

***శిఖిధ్వజుడు***: దేవపుత్రా! మీరు సర్వజ్ఞులు. మీకన్నీ తెలుసు. ఐనా విలాసంగా అడుగుతున్నారు. కనుక సంక్షిప్తంగా చెబుతాను వినండి.

నేనో రాజుని. శిఖిధ్వజుడంటారు నన్ను. నాకు పునర్జన్మ అంటే భయం పట్టుకుంది. ఎన్ని రకాలుగా ఆలోచించినా, ఎన్ని ఆశ్రమాలు తిరిగినా, పునర్జన్మ రాకుండా వుండే ఉపాయం, విశ్వాసపాత్రమైన ఉపాయం, దొరక్క ఏం చేయాలో తోచక, ఏమీ చేయకుండా వుండలేక, ప్రయోజనం కనిపించక పోయినా సరే, ఇలా అడవికి వచ్చేసి, మొండిగా రక రకాల తపస్సాధనలు చేస్తున్నాను.

***బ్రహ్మచారి***: రాజర్షీ! నేనొక సారి బ్రహ్మగారినే సూటిగా అడిగా – "జ్ఞాన కర్మలలో ఏది గొప్పది?" అని.

బ్రహ్మదేవుడు నిష్కర్షగా తేల్చి చెప్పేశాడు. జ్ఞానమే గొప్పదన్నాడు. జ్ఞానంవల్ల మాత్రమే మోక్షం లభిస్తుందన్నాడు. కర్మమార్గం కేవలం కాలక్షేపం మాత్రమే అన్నాడు. "అదేమిటండీ, వేదవేత్తలంతా కర్మమార్గాన్ని ఆచరిస్తున్నారు గదా?" అని అడిగాను. "అదంతా జ్ఞానం పట్టుబడని వాళ్ళ దుర్గతి" అన్నాడాయన. "కర్మలకు

ఫలితాలుంటాయి గదా" అని అడిగానాయనను. "వాసనాబద్ధులైనవాళ్ళకు మాత్రమే కర్మలకు ఫలితం వుంటుందని గట్టిగా తోస్తూ వుంటుంది. దయ్యం కథలు విన్న పిల్లవాడికి దయ్యమే కనిపిస్తుంది."అన్నాడాయన. నేను ఆశ్చర్యపోయాను. నా అనుభవంలో సరి చూచుకోవడం ప్రారంభించాను. ఆయన చెప్పింది నిజమేననిపించింది.

బ్రహ్మదేవుడు ఆపకుండా మళ్ళీ చెప్పాడు.

**సవాసనం మనో జ్ఞేయం**
**జ్ఞానం నిర్వాసనం మనః ।**
**జ్ఞానేన జ్ఞేయ మభ్యేత్య**
**పునర్జీవో న జాయతే ॥** (పూర్వ.సర్గ 87, శ్లో.27)

"కుంభా! మనస్సు రెండు రకాలు. వాసనలతో కూడి వున్న మనస్సు జ్ఞేయ కోటిలోకి చేరుతుంది. వాసనలు పూర్తిగా లేకుండా పోయిన మనస్సు జ్ఞాన రూపమై పోతుంది. జ్ఞానంతో జ్ఞేయాన్ని చూడాలి. అదీ ఉపాయం. అలా చేస్తే పునర్జన్మ ఉండదు" – అని.

కనుక రాజర్షీ! బ్రహ్మాది దేవతలంతా, జ్ఞానమే కైవల్యానికి మార్గం అని ఇంత నిష్కర్షగా చెబుతుంటే, మీరు దానిని వదిలేసి, రకరకాల తపస్సులంటారేమిటి? ఇదిగో దండం, ఇదిగో కమండలం, ఇదిగో దర్భాసనం, అని వీటిని పట్టుకొని వేళ్లాడుతున్నారేమిటి?

**కోహం కథమిదం జాతం**
**కథం శామ్యతి చేతి భోః ।**
**రాజన్నావేక్షసే కస్మాత్**
**కిమజ్ఞ ఇవ తిష్ఠసి ॥**
**కథం బంధః కథం మోక్ష**
**ఇతి ప్రశ్నానుదాహరన్ ।**
**పారావారవిదాం పాదాన్**
**కస్మాద్రాజ న్న సేవసే ॥** (పూర్వ.స.87, శ్లో.30,31)

నేనెవరు? ఈ ప్రపంచం ఎలా వచ్చింది? ఎలా పోతుంది? అని ఎందుకు ఆలోచించడం లేదు? ఎందుకు అజ్ఞాని లాగా పడి వున్నావు? బంధం ఎలా వచ్చింది? మోక్షం ఎలా వస్తుంది? అనే ప్రశ్నలు వేస్తూ జ్ఞాన సిద్ధులైన మహాత్ముల పాదాలను ఎందుకు పట్టుకోవడం లేదు? అనవసరంగా వ్రతోపవాసాది రూపమైన బాహ్య తపస్సులతో కాలం పోగొట్టుకుంటారెందుకు? సమదృష్టి గల సాధువులను సేవించండి. వినయంగా ప్రశ్నించండి? అప్పుడు మీరనుకున్న జన్మరాహిత్యం వస్తుంది గానీ, ఇలా చేస్తే ఏం ప్రయోజనం?

***శిఖిధ్వజుడు***: దేవపుత్రా! ఇప్పటికి నా కళ్ళు తెరుచుకున్నాయి. నా మూర్ఖత్వం వదలిపోయింది. నా పాపం బూడిదయింది. మీ అంతట మీరుగా వచ్చి, నాకు ఇంత జ్ఞాన భోధ చేశారు. మీరే నా గురువులు, నాకు తండ్రి, నాకు మిత్రులు. మీ పాదాలే పట్టుకుంటున్నాను. ఏ జ్ఞానాన్ని పొందితే ఈ సంసార సముద్రాన్ని దాట గలుగుతానో, అలాంటి జ్ఞానాన్ని తమరే ఉపదేశించండి.

***బ్రహ్మచారి***: ఉపదేశించడం కష్టం కాదయ్యా! వినడమే కష్టం. నా మాటమీద నీకు విశ్వాసమే వుంటే, నేను చెప్పిన దానికి ప్రయోజనం వుంటుంది. లేకపోతే, వట్టి కాకిగోలే అవుతుంది. కనుక నీకు నా మీద విశ్వాసం వుందంటే మాట్లాడతా.

**శిఖిధ్వజుడు**: దేవ పుత్రా! మీ మాటలను వేదంలోని విధివాక్యాల లాగా ప్రమాణంగా స్వీకరిస్తాను. ఇది సత్య ప్రతిజ్ఞ.

**బ్రహ్మచారి**: వేదవాక్యం లాగా భయపడుతూ గాదయ్యా, కొడుకు తండ్రి మాటను ప్రేమతో గ్రహించినట్లుగా నా మాటను గ్రహించు. ముందు విను. తరువాత ఆలోచించు. అప్పుడే ఆచరించు. ఈ విషయం నీకు అర్థమయ్యేందుకోసంగాను, రెండు చిన్న కథలు చెబుతాను విను.

### 65. మణికాచోపాఖ్యానం

రాజర్షీ! పూర్వం చాలా సమర్థుడైన ఓ రాజుండేవాడు. అతనికి చింతామణిని సంపాదించాలనే ఆలోచన వచ్చింది. దానికోసం గట్టి కృషి చేశాడు. అనతి కాలంలోనే అతనికి బారెడు దూరంలో చింతామణి కనిపించింది.

చింతామణి ఇంత తేలికగా దొరికిందంటే నమ్మబుద్ధి కాలేదతనికి. "నా లాంటి సామాన్యుడికి చింతామణి దొరకడమే అసాధ్యం. ఒక వేళ దొరికినా ఇంత త్వరగా లభిస్తుందా? కనుక ఇది నిజమైన చింతామణి కాదేమో?" అని కొంతసేపు అనిపించింది. కొంతసేపయ్యాక "ఒకవేళ ఇది నిజమైన చింతామణి ఐనా, నా లాంటి దురదృష్టవంతుడు ముట్టుకుంటే అది మాయమై పోవచ్చు" అని కొంతసేపు అనిపించింది.

ఇలా రకరకాల పనికిరాని ఆలోచనలో పడి, ఆ రాజు చివరికి ఆ చింతామణిని పోగొట్టుకున్నాడు. కొంతకాలం అయ్యాక మళ్లీ చింతామణి కోసం అన్వేషణ మొదలు పెట్టాడు. ఈ మాటు అతనికో గాజు ముక్క (కాచం) దొరికింది. ఎందుకు కుదిరిందో గాని, ఇదే చింతామణి అని విశ్వాసం కుదిరింది ఆ రాజుకు. ఆ వెఱ్ఱిలో ఆ రాజు తనకున్న ఐశ్వర్యాన్నీ, రాజ్యాన్నీ, అన్నిటినీ వదిలేస్తున్నాడు. ఇదేం పనయ్యా అంటే "నా చేతుల్లో చింతామణి ఉంది. నాకేది కావాలంటే అది లభిస్తుంది" అనేవాడు. ఆ ధైర్యంతోనే ఆ మూర్ఖరాజు తనకున్నవన్నీ వదిలేసుకొని, చివరికి ఏమీలేక ముష్టివాడై పోయాడు.

రాజా! ఇది మొదటి కథ. ఇక రెండవ కథ విను.

### 66. హస్తికోపాఖ్యానం

రాజర్షీ! పూర్వం వింధ్యారణ్య ప్రాంతాలలో పెద్ద ఏనుగు వుండేది. దానిని ఒక మావటివాడు (హస్తికుడు) పట్టి, బంధించి, ఆడిస్తూ వుండేవాడు. ఆ మావటివాడు చాలా క్రూరుడు. అందువల్ల, ఆ ఏనుగుని అంకుశంతో కొట్టి, పొడిచి, ఎప్పుడూ బాధ పెడుతూ వుండేవాడు.

ఏనుగుకి ఈ బాధ మరీ భరించరానిదైపోయింది. చివరికి ఒక రోజున అది తన కాళ్ళ గొలుసులను తెంచేసుకోవాలని గట్టిగా కృషి చేసింది.

ఆ సమయానికి మావటివాడు దూరంగా వున్నాడు. ఈ ఏనుగు కట్లు తెంచుకుంటోందని గ్రహించి, వాడు పరుగెత్తుకొచ్చాడు. కానీ ఏనుగు ఎలాగో కష్టపడి మావటివాడు వచ్చే లోపలే కట్లు తెంచేసుకుంది.

దానిని గమనించిన మావటివాడికి కోపం వచ్చి, గబగబా ప్రక్కనున్న తాడి చెట్టు ఎక్కి, ఏనుగు నెత్తిమీదకు దూకాడు. తనలా దూకితే ఏనుగు తల పగిలినంత పనై, అది అదుపులోకి వస్తుందని అతని ఆశ.

కానీ ఏనుగు అదృష్టం బాగుండి, మావటివాడి గురితప్పి, నేలమీద వెల్లికిలా పడ్డాడు. వాడికి నడ్డి విరిగినంత పనైంది. ఏనుగు మావటివాడి వంక చూసింది. ఒక తొక్కు తొక్కేద్దాం అనిపించింది. కానీ

పడిపోయినవాణ్ణి పడగొట్టడంలో పౌరుషం ఏముందిలే అని అనిపించి, వాడిని అలాగే వదిలేసి, అడవిలోకి పారిపోయింది.

చాలా సేపటికి మావటివాడు తేరుకున్నాడు. వాడికి ఎముకలు విరగ లేదు. అందువల్ల, త్వరలోనే కోలుకొని "ఈ ఏనుగు ఎటు పోయిందా" అని అడవిలో వెతకడం ప్రారంభించాడు. చివరికి ఒక రోజున అది దూరాన అడవి పొదలమాటున దాక్కొని వుందని గుర్తించాడు. దాంతో, ఆ పొదల చుట్టూ పెద్ద కందకం తవ్వి, ఆ గుంటను ఆకులతోనూ, గడ్డితోనూ కప్పి, మావటివాడు ప్రక్కనే మాటు వేసుకొని కూర్చున్నాడు.

కొద్ది రోజుల తరువాత ఏనుగు అడవిలో తిరుగుదామని బయలుదేరి, అన్ని ప్రక్కలా గుంట వున్నది కనుక, దాంట్లోకి పడిపోయింది. మావటివాడు వచ్చి, మళ్ళీ బంధించి, కాళ్ళకు ఇనుప గొలుసులు వేసి, తన అదుపులో పెట్టేసుకున్నాడు.

"అరెరే! ఈ మావటివాడిని ఆ రోజే తొక్కేస్తే బాగుండేది!" అని ఆ ఏనుగు చాలా బాధపడింది. ఏం లాభం? అది మావటివాడికి బందీకాక తప్పలేదు.

రాజర్షీ! నేను ఈ రెండు కథలనూ సంకేత్మాకంగా చెప్పాను. నిన్ను చూస్తుంటే, నా సంకేతాలు సరిగ్గా నీకు అర్థమైనట్లు లేదు. అందుచేత నేనే వివరిస్తాను, విను.

మణికాచోపాఖ్యానంలో సమర్థుడైన రాజువు నువ్వే! నువ్వు సంపాదించ దలచుకొన్న చింతామణి సర్వసంగ పరిత్యాగం. దానికోసం నువ్వు వేదాంత శాస్త్రాభ్యాసం చేశావు. సర్వసంగ పరిత్యాగం అందినట్లే అందింది. కానీ అవివేకంతో దానిని వదిలేశావు. మళ్ళీ కృషిచేసి, చివరికి రాజ్యాన్నీ, భార్యను, బంధువులను, వదిలేసి, ఇదే సర్వసంగ పరిత్యాగం అనుకున్నావు. నువ్వు అసలైన అహంకార పరిత్యాగం చేయలేదు కనుక, ఈ దేహాదులమీద నేననే అభిమానాన్ని వదిలి పెట్టలేక పోయావు గనుక, నువ్వు సర్వసంగ పరిత్యాగం చెయ్యలేక పోయావు.

సర్వసంగ పరిత్యాగం అనే చింతామణి చేయిజారిపోయే సరికి, నీకు తపస్సు అనే గాజుముక్క దొరికింది. తపస్సు అనే పేరుతో నిన్ను నువ్వే శ్రమ పెట్టుకుంటూ, ఏదో సాధించాననుకుంటూ, చాలీ చాలని తృప్తితో జీవితం సాగించేస్తున్నావు. దీనికి కారణం నీ అవివేకమే! అవివేకంవల్లనే నువ్వు అహంకార పరిత్యాగమనే చింతామణిని వదిలేసి, తపస్సు అనే గాజు పూసను పెట్టుకొని వేళ్ళాడుతున్నావు. మణికాచోపాఖ్యానం ద్వారా నేను చెప్పదలచుకొన్నదిదే!.

ఇక హస్తికోపాఖ్యానంలో, హస్తివి (ఏనుగువి) నువ్వే! అక్కడి హస్తికుడు (మావటివాడు) నీ అజ్ఞానం. బలిష్ఠమైన ఏనుగు చిక్కి మావటివాడికి లొంగిపోయినట్లుగా మహా విజ్ఞానవంతుడవైన నువ్వు అజ్ఞానానికి లొంగిపోయావు. ఏనుగు కాలి గొలుసులే నీ ఆశలు. వాటిని ఎలాగోలా నువ్వు తెంచుకున్నావు. రాజ్యాన్ని విడిచి పెట్టావు.

దానిని గమనించిన మావటివాడు, చెట్టెక్కి, ఏనుగు మీదికి దూకాలని ప్రయత్నించి, క్రింద పడిపోయాడు. ఒక వ్యక్తికి, జ్ఞాన వైరాగ్యాలు కలుగబోతున్నాయంటే, వాడిని పట్టిన అజ్ఞానానికి భగభగా ఒళ్లు మండిపోతుంది. అలాగే నీ కథలో, నీ అజ్ఞానానికి కూడా ఒళ్ళు మండి, నీ మీదకు విరచుకు పడాలని చూసింది. ఐనా, ఆ సమయానికి అది ఆ పని చేయలేక పోయింది. అంతమాత్రంచేత అది చచ్చిపోలేదు. మావటివాడికి ఎముకలు విరగ లేదు. వాడు మళ్లీ కోలుకున్నాడు. ఏనుగు వెంట పడ్డాడు.

ఏనుగు పొదల మాటున దాక్కుంది. అంటే, నువ్వు సత్సాంగత్యం చాటున తపస్సు మొదలు పెట్టావు.

మావటివాడు పొదల చుట్టూ గుంట తీశాడు. అంటే, నీ అజ్ఞానం నీ చుట్టూతా 'తత్త్వవిచార విముఖత్వం'

అనే వల పన్నింది. దాంట్లో నువ్వు పడిపోయావు. అందుకే తపస్సు తపస్సు అంటూ ఆత్మార్పణానికి దూరంగా అలమటిస్తున్నావు.

రాజా! ఈ కథలో గూడా నీ కథే చెప్పాను.

### 67. శిఖిధ్వజుడి సర్వసంగ పరిత్యాగం

ఈ కథల్ని నీకెందుకు చెప్పానంటే, నువ్వు నీ గురించి చెప్పుకుంటూ ఒక మాట చెప్పావు. 'నీ భార్య చూడాల నీకు జ్ఞానోపదేశం చేసింది' అన్నావు. ఆ ఉపదేశాన్ని నువ్వు ఎందుకు అంగీకరించలేదు? 'ఆడదాని మాటను నేనెందుకు వినాలిలే' అని అనుకున్నావేమో. అనుకుంటే, అనుకున్నావు. నువ్వు అనుకున్న సర్వసంగ పరిత్యాగమైనా సరిగ్గా ఎందుకు చేయలేక పోయావ్?

**శిఖిధ్వజుడు**: దేవ పుత్రా! అలా అంటారేమిటి? రాజ్యాన్ని విడిచిపెట్టా! ఇల్లు విడిచి పెట్టా! ఇల్లాలిని విడిచిపెట్టేశా! ఇక నేను చేసిన సర్వసంగ పరిత్యాగంలో లోపం ఏమిటి?

**బ్రహ్మచారి**: నువ్వు వదిలిపెట్టవలసింది ఇంకా వుంది.

**శిఖిధ్వజుడు**: (ఆలోచించి)ఔను! నిజమే! ఈ తపోవనంమీద నాకు ప్రీతి తీవ్రంగా వుంది. ఇదిగో ఈ వనవాసాభిమానాన్ని, ఇప్పుడే మనసా పరిత్యజించేస్తున్నాను.

**బ్రహ్మచారి**: నువ్వు పరిత్యజించ వలసింది ఇంకా వుంది.

**శిఖిధ్వజుడు**: (మళ్ళీ ఆలోచించి) ఇదిగో ఈ ఆశ్రమం మీద, ఈ పర్ణశాలమీద, నాకున్న అభిమానాన్ని తుడిచి పెట్టేస్తున్నాను.

**బ్రహ్మచారి**: ఇంకా వుంది.

**శిఖిధ్వజుడు**: (ఆలోచించి) అలా ఐతే నేను వాడుకుంటున్న పరికరాలన్నీ వదిలేస్తున్నాను.

ఇలా చెప్పి శిఖిధ్వజుడు దగ్గరలో వున్న ఎండుపుల్లలు పోగు చేసి, మంటపెట్టి, తన పరికరాలు ఒకొక్కటీ తీసి, అవి అంతకుముందు తనకు ఉపకారం చేసినందుకు కృతజ్ఞతలు చెప్పుకుంటూ, ఒక్కొక్క దానినీ మంటల్లో పడేశాడు. ఆ విధంగా అతడు తన జపమాలనూ, కృష్ణాజినాన్నీ, కమండలాన్నీ, దర్భాసనాన్నీ ఇతర పాత్రలను, తగలబెట్టి, అక్కడితో తృప్తి పడక, తన పూరి గుడిసెను గూడా నిప్పంటించి తగల బెట్టేశాడు.

శిఖిధ్వజుడు ఈ పని చేస్తూంటే, బ్రహ్మచారి అడ్డం పెట్టలేదు గానీ, అతని ముఖంలో తృప్తి కనిపించ లేదు. పైగా,

**"మా ముదాభినయం కురు"** (పూర్వ. సర్గ. 93. శ్లో. 12)

"ఒట్టి నాటకాలాడకు. నువ్వు విడువ వలసింది ఇంకా ఉండనే వుంది"– అన్నాడు.

దాంతో శిఖిధ్వజుడు ఆలోచించి –

"ఔను, ఈ రక్తమాంసమయమైన దేహం ఒకటి కనిపిస్తోంది. ఈ కొండ కొప్పునుంచి లోయలోకి దూకి, దీన్ని గూడా ముక్కలు ముక్కలు చేస్తే గానీ, నా సర్వసంగ పరిత్యాగం పూర్తికాదు." అని అంటూనే ఆ రాజు గబా గబా పరుగెత్తి, లోయలోకి దూక బోయాడు.

ఇంతలో తటాలున బ్రహ్మచారి అడ్డంబడి ఇలా అన్నాడు.

**బ్రహ్మచారి**: రాజా! ఆగు, ఏమిటీ పిచ్చి పని? ఎద్దుకు కోపం వస్తే పక్కన వున్న దూడను పొడుస్తుందట! అలా వుంది నీ పని. ఈ శరీరాన్ని నాశనం చేస్తే ఇంక సాధన ఏం చేస్తావ్? నువ్వు విడువ వలసింది, "ఈ దేహమే

నే"ననే అహంకార వృత్తిని! అంతే గానీ, దేహాన్ని కాదు.

**శిఖిధ్వజుడు**: ఈ దేహాహంకారవృత్తి పోయేదెలా?

**బ్రహ్మచారి**: నువ్వు వదిలి పెట్టిన రాజ్యమూ, వదిలి పెడదామనుకున్న దేహమూ, ఇవేవీ మౌలిక పదార్థాలు కావు. వీటిని వదిలి పెట్టినందువల్ల సర్వత్యాగం రాదు. వీటన్నింటికీ మూల కారణమైనది, సర్వ విధ వాసనలకూ మూలస్థానమైనదీ ఐన, ఒక పదార్థం వుంది. దానిని విడిచి పెడితేనే, సర్వ సంగ పరిత్యాగం అవుతుంది.

**శిఖిధ్వజుడు**: అది ఏది?

**బ్రహ్మచారి**:

**చిత్తమేవ భ్రమం విద్ధి**
**విద్ధి చేతో నరం నృప ।**
**చిత్తం విద్ధి జగజ్జాలం**
**చిత్తం సర్వమితి స్మృతమ్ ॥** (పూర్వ.స. 93, శ్లో.33)

రాజా! చెట్టు మొత్తానికీ విత్తనమే మూల కారణమైనట్లుగా, ఈ సమస్త ప్రపంచానికీ మూలబీజం మనస్సే! ఈ మనస్సే భ్రాంతి. ఈ మనస్సే కర్త. ఈ మనస్సే జగత్తు. ఈ మనస్సే సమస్తం. అటువంటి సర్వాత్మకమైన మనస్సును పరిత్యజిస్తేనే, సర్వత్యాగం సిద్ధిస్తుంది. నువ్వు దానిని అట్టిపెట్టుకొని, మిగిలిన వాటిని త్యాగం చేశావు. అందువల్ల నీకు త్యాగఫలం, ఏ మాత్రమూ రాలేదు. నిజమైన సర్వసంగ పరిత్యాగం చేస్తే, నీకు దొరకని సత్ఫలం లేదు. ఈ మాటను వేదవేత్తలే గాక, నాస్తికులైన బౌద్ధులు కూడా అంగీకరిస్తున్నారు.

**సర్వత్యాగ వశాదేవ**
**హతకాలే కలావపి ।**
**శాక్యేన విగతాశంకం**
**మునినా మేరువత్ స్థితమ్ ॥** (పూర్వ. స. 93, శ్లో. 61)

పాడుకాలమైన కలికాలంలో పుట్టబోయే శాశ్యముని గూడా (బుద్ధ భగవానుడు) ఈ సర్వత్యాగంవల్లనే, మేరు పర్వతం లాగా నిశ్చలంగా వుండిపోతాడు. కనుక అలాంటి సర్వత్యాగాన్ని గనుక నువ్వు ఆశ్రయిస్తే, నీకు సర్వోత్తమ లాభం లభిస్తుంది. లోకం తీరు ఎలాగుందో చూడు.

**న గృహ్ణాతి హి యత్కించిత్**
**సర్వం తస్మై ప్రదీయతే ॥** (పూర్వ. స. 93. శ్లో. 62)

ఏదీ తీసుకోనివాడికి, అన్నీ ఇస్తారు. కనుక ఓ రాజా!

**సర్వం పరిత్యజ్య మహాస్వభావ**
**త్యజస్యహో యేన చ తద్విహాయ ।**
**త్యాగాభిమానం చ మలం వముచ్య**
**విముక్త రూపో భవ భూమిపాల ॥** (పూ.స. 93, శ్లో. 64)

నువ్వు మొదట, నీ మనస్సుతో అన్నిటినీ తుడిచిపెట్టు. తరువాత, దేన్ని ఆధారం చేసుకొని ఈ పరిత్యాగం చేశావో, ఆ మనస్సును వదిలి పెట్టు. ఇక నేను సర్వసంగ పరిత్యాగం చేశాననే అభిమానం ఒకటి వుంది. అది ఒక మాలిన్యం. దాన్ని గూడా విడిచిపెట్టు. అప్పుడు నీవు జీవన్ముక్తుడవౌతావు.

**శిఖిధ్వజుడు**: దేవపుత్రా! ఎంత ఆలోచించి చూసినా, ఈ మనస్సు చెట్టుమీది కాకి లాంటిదనిపిస్తోంది. కాకిని తోలితే పోతుంది. మళ్ళీ వచ్చి వాలుతుంది. అలాగే వుంది ఈ మనస్సు పద్ధతి. ఇలాంటి మనస్సును పట్టుకొని

నిగ్రహించడం కొంత వరకు నేర్చుకున్నాను. కానీ, మీరేమో మనస్సును నిగ్రహించడం గాదు, పరిత్యజించాలి అంటున్నారు. అదెలాగో అర్థం కావడం లేదు. కనుక, మనస్సు అంటే ఏమిటో, దానిని వదిలి పెట్టడమంటే ఏమిటో, కొంచెం వివరించండి.

**బ్రహ్మచారి**: రాజర్షీ! మనస్సు అన్నా, వాసనలన్నా ఒక్కటే! అవి పర్యాయ పదాలు. వివేకవంతులకు దానిని విడిచి పెట్టడం అతి సులభం.

**శిఖిధ్వజుడు**: స్వామీ! చిత్తం వాసనామయం అని నాకూ తెలుసు. ఈ చిత్తమే సంసారం మొత్తానికి మూలాధారం. కానీ, దాన్ని పరిత్యజించడం ఎలా కుదురుతుంది?

**బ్రహ్మచారి**: సంసార నాశమే చిత్త త్యాగం. అదే చిత్తనాశం. ఇది దీర్ఘ ద్రష్టలైన పెద్దలమాట.

## 68. సంసార బీజనాశం

**శిఖిధ్వజుడు**: చిత్తనాశమనే మాటే బాగుంది. వ్యాధి లేకుండా చేసుకోవడం మంచిది కదా! కానీ, దీనిని సాధించేది ఎలా?

**బ్రహ్మచారి**: చిత్తం అనే వృక్షానికి, అహంకారమే విత్తు. ఈ వృక్షాన్ని సమూలంగా పీకేసెయ్యి. శరీరం ఇంద్రియాల వంటివి దీని కొమ్మలు.

పెద్ద చెట్టును నరకాలంటే ముందు కొమ్మలను నరకడం మంచిది. కనుక, మొదట ఇంద్రియోపభోగాల మీద ఆసక్తిని పొగొట్టుకో. ఇది మొదటి మెట్టు. ఆ తరువాత అద్వితీయమైన ఆత్మ తత్త్వజ్ఞానాన్ని సంపాదించు. ఆ జ్ఞానంతో అజ్ఞానమనే వేరును నరుకు. ఇది రెండో మెట్టు.

ఇంద్రియ విషయాలమీద ఆసక్తిని విడిచిపెడితే, ముందు ఆ శాఖల పెరుగుదల ఆగిపోతుంది. ఆ తరువాత ఆత్మ విచారణ అనే కత్తితో, ఇంద్రియాలనే కొమ్మలను నరకడం మొదలు పెట్టాలి. ఇది చేతనైన కొద్దీ, అజ్ఞానమనే వేరును నరకడం కూడా చేతవుతుంది.

**శిఖిధ్వజుడు**: మునికుమారా! వేరును నరికినా చాలదు. అసలు విత్తునే కాల్చివేయాలి. చిత్తం అనే వృక్షానికి 'అహంభావమే' విత్తు అనే మీరు చెప్పారు. ఈ విత్తుని తగలబెట్టే నిప్పు ఏది?

**బ్రహ్మచారి**: ఆత్మతత్త్వ విచారమే!

**శిఖిధ్వజుడు**: మహర్షీ! నేనా విచారణ చాలా చేశాను. నేను ఎవరా అని ఆలోచించాను. ఈ కొండలూ, ఈ చెట్లూ, నేను కానట్లే, ఈ చర్మం, ఈ నెత్తురూ, ఈ ఎముకలూ, ఈ ఇంద్రియాలూ, ఈ మనస్సు, ఈ అహంకారం ఇవేవీ నేను కాదు. ఇవన్నీ జడ స్వరూపాలు. నేను చైతన్య స్వరూపుణ్ణి. ఇంతవరకూ తెలుస్తూనే వుంది. కానీ ఈ చైతన్యం ఎవరు? దీనినే పెద్దలు సాక్షి చైతన్యం అంటున్నారు. ఇదేమిటో అర్థం కాకుండా వుంది.

**బ్రహ్మచారి**: శరీరం దగ్గరినుంచీ అహంకారం దాకా అన్నీ జడాలన్నావు. ఇవేవీ నువ్వు కాదన్నావు. ఇంక నీకు, అర్థం కాని దేమిటి?

**శిఖిధ్వజుడు**: అవన్నీ జడాలు. నేను చేతనుణ్ణి. ఇది ఖాయమే! కానీ, వాటిమీద అవే నేననే ఆత్మాభిమానం నాకు పోవడం లేదు.

**బ్రహ్మచారి**: రాజా! నీ బుద్ధికి విచిత్రమైన మాలిన్యం పట్టుకుంది. ఏది జడమో, ఏది అసత్యమో, ఏది మిథ్యాభూతమో, అదే నిన్ను పట్టుకు పీడిస్తోంది. అంతేనా!

**శిఖిధ్వజుడు**: ఔను. అహంకారం నన్ను పీడిస్తోంది. దానికి తోడు అది మమకారాన్ని కూడా తెచ్చుకుంటోంది.

అప్పుడప్పుడు నా వివేక బలంతో దీన్ని తొలగించుకున్నా, అది మళ్లీ వెంటపడుతూనే వుంది.

**బ్రహ్మచారి**: రాజా! సరియైన కారణంలోంచి ఏదైనా కార్యం పుడితే, అది నిజమైన కార్యం అని నమ్మవచ్చు. కారణం సరియైనది కాకపోతే, పుట్టిన కార్యం రెండో చంద్రుడిలాంటిది అనవచ్చు. కనక, నీ అహంభావానికి కారణం ఏమిటో, అది ఎలాంటిదో, విచారించి, నాకు చెప్పు.

**శిఖిధ్వజుడు**: (చాలా సేపు ఆలోచించి) పరిశుద్ధ చిత్తు వేద్య వస్తువులవైపు అభిముఖం అవడమే అహంకారోత్పత్తికి కారణం. కనుక అహంకారం పోవాలంటే, వేద్య వస్తువులన్నీ పోవాలి.

**బ్రహ్మచారి**: అయ్యా! వేద్యాలన్నీ జడ స్వరూపాలని నువ్వే చెప్పావు కదా! కనుక అవి అసత్య స్వరూపాలే కదా! అసత్యమైన వస్తువు, అహంభావానికి కారణం ఎలా ఐంది?

**శిఖిధ్వజుడు**: జడాలైనంత మాత్రం చేత అసత్యాలని చెప్పడం ఎలా? అవి స్పష్టంగా కనిపిస్తూనే వున్నాయి కదా!

**బ్రహ్మచారి**: కనిపించినంత మాత్రాన ప్రతీదీ సత్యమేనా? భ్రాంతిజన్య పదార్థాలు గూడా కనిపిస్తూనే వున్నాయి కదా? అంతమాత్రాన అవి సత్యం అంటామా? సరియైన కారణం వుంటేనే వాటిని సత్యం అనవచ్చు. శరీరాదులకు సరియైన కారణం లేదని మీరు పూర్వమే ఒప్పుకున్నారు. కనుక అవి సత్యాలు కావు. అందువల్లనే, దేహాది దృశ్య పదార్థాలవల్ల పుట్టిన అహంకారం కూడా సత్యం కాదు. ఈ విషయాన్నే శ్రుతి –

**అశరీరం శరీరేషు**

**అనవస్థేష్వవస్థితం ॥**

(అసలు స్థితే లేని ఈ శరీరాలలో శరీర రహితుడైన పరమాత్మ ఉంటున్నాడు) అనే వాక్యంలో వ్యక్తం చేసింది. జ్ఞానుల అనుభవం గూడా ఇలాగే వుంది. కనుక శరీరాది జడ పదార్థాలతో బాటు అహంకారం కూడా 'గొడ్రాలి కొడుకు వంటిదే!' అని గ్రహించక తప్పదు.

**శిఖిధ్వజుడు**: ఈ ప్రపంచం మొత్తానికి హిరణ్యగర్భుడు కారణం అనుకుంటే?

**బ్రహ్మచారి**: ఆ హిరణ్యగర్భుడికి కారణం ఎవరు? అక్కడ కారణం దొరకదు. అందుచేత, అలాంటి కల్పనవల్ల ప్రయోజనం లేదు.

**శిఖిధ్వజుడు**: హిరణ్యగర్భుడికి పరబ్రహ్మే కారణం అందాం.

**బ్రహ్మచారి**: మనం అంటే సరిపోదు. వేదం ఒప్పుకోవాలి.

**తదేతద్బ్రహ్మ – అపూర్వ మనపరం**

(ఆ బ్రహ్మ దేనికీ కారణం కాదు. దేనికీ కార్యమూ కాదు) అన్నది వేదం. మరో చోట "నేహ నానాస్తి కించన" (ఈ పరబ్రహ్మలో ద్వైతమే, రెండో వస్తువే, లేదు) అంది. మరో చోట "అసంగోహ్యయం పురుషః (ఈ పరబ్రహ్మకు ప్రపంచంతో సంబంధమే లేదు) అంది.

ఇలాంటి వాక్యాలు ఇంకా ఎన్నో వున్నాయి. కనుక మీ ప్రతిపాదనను వేదం అంగీకరించదు. ఇక యుక్తి ప్రకారం చూసుకుంటే, నిర్వచనం ప్రకారమే బ్రహ్మ నిరవయవం. కనుక అది దేనికీ కారణం కావడానికి వీల్లేదు. కనుక, ఎలా చూసినా నీ అహంవృత్తికి ఆధారం లేదు.

**శిఖిధ్వజుడు**: మునీంద్రా! మీరు చాలా చక్కగా చెప్పారు. ఇప్పుడు నా సందేహాలన్నీ తొలగి పోయాయి. నా మనస్సు ప్రశాంతమై పోతోంది.

ఇలా అంటూనే శిఖిధ్వజుడు నిర్వికల్ప సమాధిలోకి వెళ్ళిపోయాడు.

ఆ బ్రహ్మచారి ఇందుకు పెద్దగా సంతోషపడక, ఒక అరగంటసేపు ఆగి, శిఖిధ్వజుడ్ని తట్టి లేపి, "నువ్వు జీవన్ముక్తుడివి ఐపోయావయ్యా!" అన్నాడు.

శిఖిధ్వజుడికి ఆ బ్రహ్మచారి ఇంకా ఏమో చెప్పాలని అనుకుంటున్నాడని అర్థమైంది. అందువల్ల మెల్లగా ఆయనతో తత్త్వచర్చకు దిగాడు. ఈ చర్చను వాల్మీకి మహర్షి 96వ సర్గనుంచి 101వ సర్గ దాకా ఆరు సర్గలకు విస్తరింప చేశాడు. అంతకుముందు 95వ సర్గలో, అవిద్య పల్చ బడుతున్నకొద్దీ, భ్రాంతి శమించి, జ్ఞానం పెరిగే విధానం వర్ణించాడు. 96వ సర్గలో, సాధకుడైనవాడు సమాధి లేని దశలో, కనిపించే దృశ్యాలను ఎలా పరిమార్జనం చేసుకోవాలో వివరించాడు. అలా చెప్పడం కోసం, దృశ్య పదార్థాల జన్మకు కారణమే లేదనీ, అందుచేత అవి పుట్టనే లేదనీ అన్నాడు. ఇక 97వ సర్గలో, శుద్ధ చైతన్యానికి దృశ్య జ్ఞానం కలిగే సావకాశం లేదని నిరూపించాడు. ఇక 98లో, అసలు చిత్తమనేదే లేదు అనే విషయాన్ని గట్టిపరచడం కోసం, 'చిత్తానికి అతీతమైనదే పరబ్రహ్మ' అని వివరించాడు.  99వ సర్గలో శిఖిధ్వజుడు నాకింక ప్రశ్నలే లేవన్నాడు. ఐనా,  కుంభ బ్రహ్మచారి తృప్తి పడక, కలిగిన బోధ గట్టిగా నిలిచిందో లేదో అని, కుదిపి చూడడం కోసం, మళ్ళీ కొన్ని ప్రశ్నలు వేస్తూ స్వయంగా కొంత బోధ మొదలు పెట్టాడు. 100వ సర్గలోకి వచ్చేసరికి, శిఖిధ్వజుడు "బ్రహ్మకు సత్త ఉన్నట్టే, జగత్తుకు కూడా సత్త ఉందని ఎందుకు అనరాదు?" అని ఒక ప్రశ్న లేవదీశాడు. కుంభ బ్రహ్మచారి భ్రాంతి జన్య పదార్థాలకు అస్తిత్వం వుంటానికి వీలు లేదని నిరూపించాడు. 101వ సర్గలో శిఖిధ్వజుడు మళ్ళీ సమాధిలోకి వెళ్లగా, కుంభబ్రహ్మచారి మళ్ళీ లేపి, కొంత బోధ చేశాడు. ఆ సందర్భంలో శిఖిధ్వజుడు "అయ్యా! పూర్వం నాకిలాంటి సమాధి ఎందుకు కుదరలేదు?" అని అడిగాడు. దానికి సమాధానంగా  "పూర్వం విషయం కొంత నీకు తెలిసినా, మనస్సులోని మలిన వాసనలు మాడిపోలేదు. అవి మాడినప్పుడే, చిత్తానికి పరిపక్వత వచ్చి, గురూపదేశం ఫలిస్తుంది." అని బ్రహ్మచారి చెప్పాడు.

ఇక 102వ సర్గలో, బ్రహ్మచారి ఇలా అన్నాడు.

"రాజా! నేను చెప్పవలసినదంతా చెప్పాను. నీకు సమాధి స్థితి కూడా అందింది. నీకు పరబ్రహ్మ విస్పష్టంగా కనిపించింది కనుక, ఇక నువ్వు యథేచ్ఛగా విహరించు. సమాధిలో వుండాలను కుంటే సమాధిలో వుండు. వ్యవహారంలో వుండాలనుకుంటే, వ్యవహారంలో వుండు. నేను ఇక దేవేంద్ర సభకు వెళ్లవలసి  వుంది. అక్కడికి బ్రహ్మలోకంనుంచి నారదులవారు వస్తారు. వారు వచ్చేటప్పటికి, నేను అక్కడ లేకపోతే ఆయనకు కోపం వస్తుంది. గురువులకు కోపం తెప్పించడం క్షేమం కాదు. కనుక నేను బయలుదేరుతున్నాను."

ఇలా అని శిఖిధ్వజుడు నమస్కారం పెట్టేలోపలే, బ్రహ్మచారి మాయమై పోయాడు. ఆ తరువాత కొద్ది సేపటికే శిఖిధ్వజుడు నిర్వికల్ప సమాధిలోకి  వెళ్ళిపోయాడు.

చూడాల ఆకాశమార్గాన స్వగృహానికి వెళ్లిపోయి, అక్కడ రాణిరూపంలో రాచకార్యాలు చక్కబెట్టుకుంటూ మూడు రోజులు గడిపి, నాల్గవ రోజున కుంభుడి వేషంలో శిఖిధ్వజుడి ముందు వాలింది.

### 69. శిఖిధ్వజుడికి పరీక్షలు

శిఖిధ్వజుడు శిలా ప్రతిమ లాగా సమాధిలో వున్నాడు. చూడాలకు చాలా సంతోషమైంది. ఇతనిలాగే ఈ సమాధిలో కొంతకాలం వుండి, అటునుంచి అటే, విదేహముక్తిలోకి వెళ్ళిపోతే బాగుండుననుకుంది. అప్పుడు తను గూడా, ఈ దేహాన్ని వదిలేసి, విదేహముక్తిలోకి వెళ్లిపోవచ్చునని ఆలోచించింది.

ఐతే, సాధకుడు సమాధిలోనే వుండి, అటునుంచి అటే, విదేహముక్తిలోకి వెళ్లిపోవాలంటే, వాడికి కర్మశేషం పూర్తిగా అడుగంటిపోయి వుండాలి. తన భర్తకు అలాంటి స్థితి ఉందో లేదో చూద్దామని, చూడాల

తన భర్తను పైనుంచి క్రిందికి కళ్ళతో పరిశీలించి, అది చాలక చేత్తో ముట్టుకొని చూసింది. చేతికి చాలా వెచ్చగా తగిలింది.

ఇక్కడ యోగరహస్యం ఏమిటంటే –

**దేహే యస్మింస్తు నో చిత్తం**

**నాపి సత్త్వం చ విద్యతే ।**

**స తాపే హిమవద్రామ**

**పంచత్వేన విలీయతే ॥** (పూర్వ.స.103, శ్లో.33)

ఏ శరీరంలో ఐతే చిత్తంగానీ, వాసనా శేషం గానీ మిగిలి వుండవో అటువంటి దేహం, ఎండలో మంచుముక్క లాగా కరిగిపోయి, ఐదు భూతాలలో కలిసిపోతుంది.

ఇప్పుడు ఈ శిఖిధ్వజుడి దేహంలో చిత్తం లేదు, గానీ వాసనాశేషం మాత్రం బాగా వుంది – అని ఆ వంటి వేడిని బట్టి చూడాల గుర్తించింది.

(**గమనిక** – పై శ్లోకంలో వాల్మీకి మహర్షి 'సత్త్వం' అనే పదాన్ని వాసనా శేషం అనే అర్థంలో ప్రయోగించాడు.)

వాసనా శేషం మిగిలి వుండగా, మొండిగా సమాధిలో కూర్చుంటే, ప్రయోజనం లేదు. "మిగిలిన వాసనల్లో సుఖం వున్నా, దుఃఖం వున్నా, కామం వున్నా, క్రోధం వున్నా, అన్నిటినీ సమచిత్తంతో అనుభవించడం అభ్యాసం కావాలి. ఈయనను ఇలా వదిలేస్తే, ఎప్పటికో అప్పటికి ఆ జ్ఞానం కూడా ఈయనకు వస్తుంది. కానీ, నేనలా చూస్తూ ఊరుకో కూడదు. నాకు లభించిన స్థితి ఈయనకు కూడా రావాలి. కనుక ఈయనకు ఇప్పుడే ఆ జ్ఞానం కలిగేందుకు కృషి చేస్తాను." అని చూడాల ఆలోచించి, తన యోగబలంతో, భర్తయొక్క అంతఃకరణంలోకి ప్రవేశించి, అక్కడ కదలికను తెచ్చి, వెంటనే బయటకి వచ్చి, దేవపుత్రుడైన కుంభుడి రూపంలో ఒక చెట్టుక్రింద కూర్చొని సామవేదగానం ప్రారంభించింది.

మధురాతి మధురమైన, ఆ సామగాన పరంపరలు శిఖిధ్వజుడి కర్ణాల ద్వారా లోపలికి ప్రవేశించి, అక్కడ చలనాన్ని వృద్ధిచేసి, అతనిని పూర్తిగా సమాధినుంచి బయిటికి తెచ్చేశాయి. కళ్ళు తెరుస్తూనే, ఎదురుకుండా గురువైన కుంభుడు కనిపించేసరికి, శిఖిధ్వజుడు సంతోష పడిపోయి, దగ్గరకు వెళ్ళి, కుశల ప్రశ్నలు వేశాడు. కానీ, ఎందుకో కుంభుడు చాలా దిగులుగా కనిపించాడు. ఎందుకిలా వున్నారని శిఖిధ్వజుడు అడిగాడు. దానికి కుంభుడు ఒక వింత కథ చెప్పాడు.

**కుంభుడు**: రాజా! నాకు స్వర్గంలో వున్నా, మీ గురించిన ఆలోచనే ఎక్కువై పోయింది. అక్కడ సభ పూర్తి కాగానే, మా నాన్నగారి అనుమతి తీసుకొని, మిమ్ములను చూడాలనే ఆత్రంతో, గబగబా తిరిగి వస్తుండగా, దారిలో ఒక వింత జరిగింది. మేఘమండలం దగ్గరికి వచ్చేసరికి, మేఘాల మధ్యన దూరాన దూర్వాస మహర్షి కనిపించాడు. ఎప్పుడూ వికృత వేషంతో వుండే ఆ మహర్షి ఇవాళ్ళ ఎందుకో చాలా అందంగా వున్నట్టు కనిపించాడు. నవ్వుతూ ఆయన దగ్గరకు వెళ్ళి ఆ మాటే చెప్పాను. కొంచెం కవిత్వంలోకి వెళ్ళి, ఆయనతో సరసంగా ఇలా అన్నాను– "దూర్వాస మహర్షీ! మీరు కట్టుకున్న మసిగుడ్డ నల్ల చీర లాగా వుంది. ఈ మబ్బుల్లోని మెరుపులన్నీ మీ వంటిమీది ఆభరణాల్లాగా వున్నాయి. మీ చుట్టూ అలముకొన్న మబ్బులు, ఒంటి వయ్యారాల్లాగా వున్నాయి. మొత్తంమీద ఎవరో విటుడికోసం వెదుతున్న అభిచారికా స్త్రీ లాగా వున్నారు మీరు"– అని.

నేనంత విరసంగా చెబితే, మహర్షి కస్సున ఇంతెత్తు లేచి "ఏమిటా పిచ్చి వాగుడు? నన్ను భోగం దానితో పోల్చావు గనుక, ఇక నుంచి నువ్వు రాత్రిపూట ఆడదానివై పో" అని శపించేసి, నేను తేరుకొని

క్షమాపణలు చెప్పేలోపలే మాయమైపోయాడు.

కనుక రాజా! ఇవాల్టినుంచీ నాకు ప్రతిరోజూ రాత్రిపూట స్త్రీత్వం రాబోతోంది. అసలే నావి ఆడపోలికలంటారు. ఈ నడి వయస్సులో ఆడదాని రూపం గూడా వచ్చేస్తే, నన్ను నేను ఎలా రక్షించుకోవాలో తెలీకుండా వుంది"

కుంభుడు ఈ వింత కథ చెప్పేటప్పటికి, శిఖిధ్వజుడు ఏమీ మాట్లాడలేక పోయాడు. కొద్ది నిమిషాలలో కుంభుడు తేరుకొని –

"ఐనా, రాజా! నాకీ దుఃఖం ఎందుకు? స్త్రీత్వం దేహానికి కదా వచ్చేది. దేహం నేను కాదు కదా! దేహానికి ఏ అనుభవాలు వస్తాయో రానీ, దాంతో నాకు కలిగే నష్టం ఏమిటి?" అన్నాడు.

ఈ మాటతో శిఖిధ్వజుడు కొంచెం తేరుకొని –

"దేవ పుత్రా! మీరు చెప్పినది సత్యం. మీబోటి వాళ్ళే ప్రారబ్ధ ఫలాన్ని గూర్చి దుఃఖిస్తే సామాన్యుల గతి ఏమిటి? మీరు ఏదో లోకాచారం ప్రకారం మాట్లాడుతున్నారు కానీ, నీకు సుఖమేమిటి? దుఃఖమేమిటి?" – అన్నాడు.

ఆ విధంగా మెల్లగా వారు, తత్త్వ ప్రసంగాలు చేసుకుంటూ వుండగానే, ఆ పగలు గడిచిపోయింది.

సూర్యాస్తమయం దగ్గరకు వస్తూండగానే ఇద్దరూ సంధ్యావందనాలు ప్రారంభించారు. ఆ ధ్యానం మధ్యలోనే సూర్యాస్తమయమై పోయింది. అప్పటి నుంచీ కుంభుడిలో క్రమంగా స్త్రీ లక్షణాలు వికసించడం ప్రారంభించాయి. చిత్రమేమిటో గాని, వంటి మీద ఆభరణాలతో సహా మొత్తం లక్షణాలన్నీ మారిపోయాయి. ఈ మార్పులు జరుగుతున్న కొద్దీ, కుంభుడు తెగ బాధపడిపోవడం మొదలు పెట్టాడు. రాజుకు కూడా ఆ మార్పు బాధాకరంగానే వుంది. కానీ, ఇద్దరూ త్వరలోనే తేరుకున్నారు.

ఆ రాత్రికి వారిద్దరూ ఆ చెట్టు క్రిందే కూర్చున్నారు. ఇద్దరికీ సరిగ్గా నిద్ర పట్టలేదు. తను అనుకున్న కామక్రోధ జయ బోధల ప్రణాళికను ఎలా కొన సాగించాలా అని చూడాలకు ఒకటే దిగులు. తన గురువైన కుంభుడికి ఇలాంటి చిక్కు వచ్చి పడ్డది కదా అని శిఖిధ్వజుడి దిగులు.

తెల్లవారింది. కుంభుడు మళ్ళీ మగవాడైపోయాడు. ఆ పగలంతా ధ్యానాలతోనూ, శాస్త్ర చర్చలతోనూ, వనవిహారాలతోనూ, కాలం గడిపారు. రాత్రి అయ్యేసరికి కుంభుడు మళ్ళీ ఆడదై పోయాడు. ఇద్దరికీ దిగులు కొంత తగ్గింది. పరిస్థితికి కొంత అలవాటు పడిపోతున్నారు. ఇలా చాలా రోజులు గడిచాయి.

ఒక రోజు మాటల మధ్యలో ఆడ కుంభుడు మెల్లగా ఇలా అన్నాడు–

"రాజా! దైవ ప్రాప్తంగా స్రీత్వం లభిస్తోంది. ఐతే, ఇది అర రోజు స్త్రీత్వమే. ఐనా సరే, ఈ స్త్రీత్వాన్ని సార్థకం చేసుకోవాలని గట్టిగా అనిపిస్తోంది. కనుక, ఎవరైనా తగినవాడిని పెళ్లిచేసుకోవా లనిపిస్తోంది. ఐతే, ఒక పూట మగ, ఒక పూట ఆడగా వుండే మనిషిని ఎవడు పెళ్ళి చేసుకుంటాడు? అదీగాక నాకు తగిన పవిత్రుడెవడు? ఆలోచించగా, ఆలోచించగా నా మనస్సు అంతా మిత్రుడవైన నీమీదే లగ్నమౌతోంది. కనుక నువ్వంగీకరిస్తే,–

**ఇచ్ఛా నిచ్ఛే ఫలే త్యక్త్వా**
**సమన్తాత్ సర్వ వస్తుషు ।**
**వయం న సేచ్ఛా నానిచ్ఛా ః**
**కుర్మస్తేనేద మీప్సితమ్ ॥** (పూర్వ. స.106, శ్లో 7)

"లోకంలో అందరూ తమ చుట్టూ వుండే పదార్థాలమీద ఇచ్ఛగానీ, అనిచ్ఛగానీ, పెట్టుకుంటారు.

దానివల్ల వారికి సుఖమో, దుఃఖమో, ఏదో ఒకటి ఫలంగా వస్తుంది. కొందరు ఈ బంధాన్ని దాటాలని, ఇచ్ఛా పరిత్యాగం చేస్తూ వుంటారు. కానీ వాళ్ళు తెలయకుండానే, పరిత్యాగం అనే దానిని పట్టుకుంటున్నారు. అందువల్ల వాళ్ళు బంధాన్ని దాటలేక పోతున్నారు. మనం అలా కాక, ఇచ్ఛ వున్నవారమూ, లేనివారమూ కాకుండా, మనస్సులోకి వచ్చిన సంకల్పాలను నిర్వర్తిద్దాం. నాకిప్పుడు స్త్రీ సుఖం అనుభవించాలనే సంకల్పం కలుగుతోంది. నాకు నువ్వు విఘ్నం కలిగించవద్దు" – అని

రాజు గూడా "మిత్రుడా! కర్మలవల్ల శుభాశుభాలను పొందే స్థితిని మనం దాటిపోయాము. కనుక నీకు ఎలా తోస్తే అలా చేయి" అని తన అంగీకారం తెలిపాడు.

"అలా ఐతే, ఈ రాత్రికే మంచి ముహూర్తం వుంది. ఆ ముహూర్తాన మనమిద్దరం శాస్త్రోక్తంగా వివాహం చేసుకుందాం" అన్నాడు కుంభుడు.

సరే అంటే సరే అనుకున్నారు. రాత్రి అయింది. కుంభుడు ఆడదయ్యాడు. అప్పటికే అడవిలో దొరికే పదార్థాలు కొన్నీ, తన తపో మహిమచేత సృష్టించిన పదార్థాలు కొన్నీ, కలిపి వివాహ సంభారాలన్నీ సమకూర్చి వుంచాడు కుంభుడు. వేరే పురోహితుడు లేకుండా వారికి వారే మంత్రాలు చెప్పుకుంటూ, వున్నంతలో శాస్త్రీయంగా వివాహ క్రతువును లఘువుగా పూర్తి చేశారు. ఆ రాత్రికి వాళ్ళు దంపతులుగా జీవించారు.

తెల్లారింది. కుంభుడు మళ్ళీ మగవాడైపోయాడు. పగటి పూట వాళ్ళిద్దరూ మిత్రులే. అడవుల వెంట తిరుగుతూ వుండేవారు. రాత్రిపూట దంపతులుగా గడిపేవారు. కుంభ రూపంలో వున్న చూడాల మధ్యమధ్యలో శెలవు పుచ్చుకొని స్వరాజ్యానికి వెళ్ళి రాజ కార్యాలను చక్కబెట్టుకొని వస్తూ వుండేది. ఇలా చాలా రోజులు గడిచాయి.

ఒక రోజున చూడాల, శిఖిధ్వజుడికి భోగ కాంక్ష మిగిలి వుందో లేదో పరీక్షించి చూడాలనుకొంది. వెను వెంటనే ఆమె యోగమాయను ప్రయోగించింది. ఆ ప్రభావంవల్ల అప్పటికప్పుడే వారి ఎదుట పరివార సమేతుడైన దేవేంద్రుడు ప్రత్యక్షమయ్యాడు.

శిఖిధ్వజుడు దేవేంద్రుడ్ని చూసి, వినయంగా నమస్కరించి, భక్తిగా పూజించి, "ఆర్యా! తమ రాకకు కారణం ఏమిటి?" అని అడిగాడు.

దేవేంద్రుడు ప్రసన్నంగా నవ్వి –

**ఇంద్రుడు**: "రాజర్షీ! మీ గురించి ఎప్పటినుంచో వింటున్నాం. స్వయంగా చూద్దామని వచ్చాం! ఇదిగో దేవ విమానం. జీవన్ముక్తులకు అర్హమైన స్వర్గ సుఖాలన్నీ మీ కోసం ఎదురు చూస్తున్నై. మీబోటి జీవన్ముక్తులు, ఏది ఎలా వస్తే దానిని అలా స్వీకరిస్తారు.

**శిఖిధ్వజుడు**: దేవరాజా! నాకీ ప్రపంచం అంతా స్వర్గంగానే కనిపిస్తోంది. అణువణువునా పరమానందం పొంగుతోంది. కనుక, ఆనందం కోసం ఎక్కడికో రావాలనిపించడం లేదు.

**ఇంద్రుడు**: మీరు చెప్పింది నిజం. కానీ, పూర్వపు జీవన్ముక్తులంతా, దైవవశాన వచ్చిన భోగాలను అనుభవించారు. అదే యుక్తమని నేననుకుంటున్నాను.

**శిఖిధ్వజుడు**: మౌనంగా వుండిపోయాడు.

**ఇంద్రుడు**: మీకిష్టం లేదల్లే వుంది. ఐతే నేనిక్కడ వుండడం దేనికి?

**శిఖిధ్వజుడు**: ఇప్పుడు రాలేను. తరువాత చూద్దాం.

**ఇంద్రుడు**: నీకు శుభమగుగాక!

ఇలా అంటూనే దేవేంద్రుడు మాయమైపోయాడు.

ఈ సన్నివేశంతో చూడాలకు తృప్తి కలిగింది. "ఇతనికి స్వర్గేచ్ఛ లేకపోయినా, ఇంద్రుడిపట్ల వినయంగానే

ప్రవర్తించాడు. కనుక ఇతనికి సమబుద్ధి ప్రాప్తించినట్లే. ఐనా, అసూయా ద్వేషాల విషయంలో ఇతనెలా ప్రవర్తిస్తాడో చూద్దాం." అనుకుంది చూడాల.

ఆ రాత్రికి కుంభుడు మళ్ళీ ఆడది అయ్యాడు. శిఖిధ్వజుడు తన అనుష్ఠానాలు పూర్తి చేసుకొని రోజూ పడుకునే గుహ దగ్గరికి వచ్చేసరికి, ఆడ కుంభుడు ఎవడో అందగాడిని పెనవేసుకొని ఉల్లాసంగా వున్నాడు.

ఆ సన్నివేశం చూసిన శిఖిధ్వజుడికి మనస్సు చెదిరి పోలేదు. వారి సుఖానికి భంగం కలిగించ కూడదనిపించింది. చప్పుడు చేయకుండా వెనక్కు వచ్చేసి, ఒక చెట్టు క్రింద కూర్చొని ధ్యానంలోకి వెళ్ళిపోయాడు.

ఒకటి రెండు నిమిషాలు గడిచేసరికి, ఆడ కుంభుడు తొట్రు పడుతూ లేచి వచ్చి, దిగులుగా ముఖం పెట్టి, "రాజా! వయస్సు పొంగువల్ల కొంచెం తొందరపడ్డాను. నువ్వు కోపం తెచ్చుకోవద్దు" అన్నాడు.

శిఖిధ్వజుడు నవ్వి – "పిల్లా! అనవసరంగా వచ్చి నీ సుఖం చెడగొట్టినందుకు నువ్వే నన్ను క్షమించు. నాకు ఎవరిపై కోపం లేదు. నేను, కుంభుడు, ఇద్దరమూ గూడా రాగ ద్వేషాలను జయించిన వాళ్ళం. నువ్వు కుంభుడివి గాదు. పాపం, శాపగ్రస్తవైన సామాన్య జీవివి. అందుకే నీమీద నాకు కోపమే లేదు. నీ సుఖం నువ్వు చూసుకో. ఐతే, మునికులాల్లో, మునిజనుల మధ్య తిరుగుతున్నాం గనుక, సాధువుల నిందకు నేను జంకాలి. కనుక ఇకనుంచి మనమిద్దరం భార్యా భర్తలుగా గాక, కేవలం స్నేహితులుగా వుండిపోదాం". అన్నాడు.

### 70. శిఖిధ్వజుడి సిద్ధి

ఈ పరీక్షతో, చూడాలకు రాజుయొక్క జ్ఞానసిద్ధిపట్ల పూర్తిగా తృప్తి కలిగింది. అందుచేత, ఆమె ఒక్క క్షణం ఆలోచించి, తన ఆడ కుంభ వేషాన్ని వదిలిపెట్టి, స్వస్వరూపాన్ని బైటపెట్టేసింది.

ఆడ కుంభుడి దేహంలోంచి, తన భార్య బైటికి వచ్చినట్లు కనిపించేటప్పటికి, శిఖిధ్వజుడు నిర్ఘాంతపోయాడు. సరిగ్గా పోల్చుకో లేకపోయాడు, కంగారు పడుతూ.

" నా భార్య పోలికలు నీలో కనిపిస్తున్నాయి. ఎవరు నువ్వు?" అని అడిగాడు.

చూడాల నవ్వి, "ప్రభూ! నేను మీ భార్యనే! సందేహించకండి. మగ కుంభుడుగా, ఆడ కుంభుడుగా రూపాలు మార్చుకున్నది నేనే! మీకు జ్ఞానబోధ చేయాలనే తపనతోనే ఇలా చేశాను. మీకిప్పుడు యోగసిద్ధులు లభించాయి కనుక ఒక్క సారి కళ్ళు మూసుకొని ధ్యాన దృష్టితో చూడండి. మీకే అర్థమౌతుంది." అంది. శిఖిధ్వజుడు వెంటనే పద్మాసనం వేసుకొని, ప్రాణవాయును బిగదీసి, ధ్యానంలోకి వెళ్ళిపోయాడు. కొద్ది సేపట్లోనే, అతడు కళ్ళు తెరచి ఆనంద భాష్పాలు రాలుస్తూ, లేచి వెళ్ళి భార్యను గట్టిగా కౌగిలించుకున్నాడు.

***శిఖిధ్వజుడు***: చూడాలా! నా కోసం ఎన్ని కష్టాలు పడ్డావు? పతివ్రతలు భర్తకోసం ఎంత శ్రమైనా ఓర్చుకుంటారు కదా! నువ్వు పతివ్రతలలో సర్వోత్తమురాలివి.

***చూడాల***: ప్రభూ! మీరెందుకూ పనికిరాని శుష్క తపఃప్రక్రియలతో, వృథాగా శ్రమపడుతుంటే, చూసి నేను తట్టుకోలేకపోయాను. నా బాధ పోగొట్టుకోవాలనే స్వార్థంతోనే, మీవెంటబడి మీకు జ్ఞానబోధ చేశాను. ఇది నా స్వార్ధమే గనుక, మీరు నన్ను మెచ్చుకోవలసినది లేదు.

***శిఖిధ్వజుడు***: చూడాలా! నీలాంటి స్వార్థం ప్రతి ఇల్లాలికి వుండుగాక!

***చూడాల***: నాథా! మీరు తత్వాన్ని గ్రహించారు. రాగద్వేషాలను దాటారు. ఈ స్థితిలో మీరు ఏం కావాలని కోరుకుంటున్నారు? మీ వెనుకటి ప్రవర్తన గురించి మీరేమి అనుకుంటున్నారు?

**శిఖిధ్వజుడు**: చూడాలా! ఒకప్పుడు నేను మోహంలో మునిగి వున్నాను. ఆ మోహానికి కేంద్ర బిందువు నువ్వే! ఇప్పుడు జ్ఞానంలో మునిగి వున్నాను. ఈ జ్ఞానానికి కేంద్ర బిందువూ నువ్వే! నాకిప్పుడు ప్రపంచ భ్రాంతి లేదు.

**న తుష్టోఽస్మి న ఖిన్నోఽస్మి**
**నాయమస్మి న చేతరత్ ।**
**న స్థూలోఽస్మి న సూక్ష్మోఽస్మి**
**సత్యమస్మి చ సుందరి ॥** (పూర్వ.స.109, శ్లో.45)

..................

..................

**యత్తదస్మి తదేవాస్మి**
**వక్తుం శక్నోమి నేతరత్ ॥** (పూర్వ.స. 109, శ్లో. 48)

నాకు సంతృప్తీ లేదు, అసంతృప్తీ లేదు. నేను వీడినీ కాదూ, వాడినీ కాదు. నేను కార్యాన్నీ గాదు, కారణాన్నీ గాదు. స్థూలాన్నీ గాదు, సూక్ష్మాన్నీ గాదు. ఇవన్నీ బాధిత పదార్థాలు. (సత్యం తెలిస్తే నశించి పోయే పదార్థాలు.) నేను అబాధిత సత్యాన్ని. నేనెవణ్ణో వాణ్ణే! మాటలతో ఇంత కంటే చెప్పలేను. నువ్వే నా గురువువి. నీకు నమస్కారం. నీ అనుగ్రహంవల్ల సంసార సముద్రాన్ని దాటాను. నేను మళ్ళీ ఆ మాలిన్యంలోకి అడుగు పెట్టను.

**చూడాల**: ఐతే, మీకిప్పుడేం కావాలి?

**శిఖిధ్వజుడు**: నాకు వద్దనే మాటా లేదు, కావాలనే మాటా లేదూ. నీకేది కావాలంటే, నేనూ అదే కావాలంటాను. నేను మెచ్చుకోను. నిందించను. నీకేది కావాలంటే, అదే చెయ్యి.

**చూడాల**: ఐతే, నా అభిమతం చెబుతా వినండి.

**యాదృగేషణ మస్మాకం**
**తాదృశం తదనేషణమ్ ॥** (పూర్వ. స.109, శ్లో.58)

మీకూ నాకూ కూడా, కోరిక వుండటం ఎలాంటిదో, కోరిక లేకపోవడం గూడా అలాంటిదే! మనలో మార్పు లేదు. ప్రారబ్ధ శేషం ఒక్కదాన్నీ, భోగంతో నశింప చేసుకోవలసి వుంది. కనుక, కొంత కాలం రాజ్యంలో కాలం గడిపి, క్రమంగా విదేహ ముక్తిని పొందుదాం.

**శిఖిధ్వజుడు**: చూడాలా! నీకు భోగేచ్ఛ గనుక మిగిలి వున్నట్లైతే, మనకోసం స్వర్గ భోగాలు సిద్ధంగానే వున్నాయి గదా! వాటిని ఎందుకు కాదన్నట్టు?

**చూడాల**: నాథా! నాకు సుఖభోగాల మీదా కోరిక లేదు. యోగవిభూతులమీదా కోరిక లేదు. స్వభావ వశంవల్ల ఏది వస్తుందో దానిని అంగీకరిస్తాను. అంత మాత్రమే! నేను మాత్రం ఎల్లప్పుడూ నిర్వికారంగానే వుంటాను.

**శిఖిధ్వజుడు**: బాగా చెప్పావు. నీ బుద్ధిద్వంద్వాలను దాటి పోయింది. నువ్వు చెప్పినట్లే యథాప్రాప్తస్థితిలో, జీవిత శేషాలను గడిపేద్దాం.

వారిలా మాట్లాడుకుంటూ వుండగానే సూర్యాస్తమయమైంది. సాయంకాలానుష్ఠానాలు పూర్తి చేసుకొని, ఆ రాత్రికి వారు ఏకశయ్యపై ప్రణయ చేష్టలతో ఆనందంగా కాలం గడిపారు.

తెల్లవారింది. అనుష్ఠాలైనాయి. చూడాల తన యోగ బలంతో ఒక సువర్ణ సింహాసనాన్ని, సమస్త నదీనద సముద్రజల పూర్ణమైవున్న రత్న కుంభాన్ని, సృష్టి చేసింది. భర్తను ఆ సింహాసనంలో కూర్చోబెట్టి, ఈ

పవిత్ర జలాలతో పట్టాభిషేకం చేసింది. రాజు నవ్వుతూ, ఆమెను పట్టమహిషిగా తన ప్రక్కన కూర్చోబెట్టుకొని, "చూడాలా! నీ సంకల్ప బలంతో చతురంగ సైన్యాన్ని సృష్టించు. సపరివారంగానే రాజ్యాన్ని చేరుదాం" అన్నాడు. ఆమె అలాగే చేసింది. వారిద్దరూ ఏనుగు అంబారీ ఎక్కి , సైన్య పరివృతులై మహోర్భాటంగా రాజ్య ప్రవేశం చేశారు.

ఆ తరువాత ఆ దంపతులిద్దరూ, జ్ఞాన స్థితిలో వుంటూనే, పదివేల ఏళ్లపాటు రాజ్యపాలనం చేసి, చివరికి శాశ్వత మోక్షాన్ని పొందారు.

వశిష్ఠుడు, చూడాలోపాఖ్యానాన్ని ఈ విధంగా ముగిస్తూ, ఇలా అన్నాడు.

***వశిష్ఠుడు***: కనుక రామా! నువ్వు గూడా శిఖిధ్వజుడి లాగానే యథాప్రాప్తంగా, వచ్చిన పనులను వచ్చినట్లుగా చేస్తూ, శోకాతీత పదవిలో వుండు. భోగలక్ష్మిని, జ్ఞాన లక్ష్మిని, మోక్షలక్ష్మిని, ఒకే సారి అనుసరిస్తూ జీవితం గడుపు. రాజైన శిఖిధ్వజుడే కాదు, బృహస్పతి కుమారుడైన కచుడు గూడా ఇలాంటి తత్త్వ బోధనే పొందాడు. నువ్వు గూడా ఆ రకంగానే తత్త్వబోధను పొందు.

***శ్రీరాముడు***: గురుదేవా! ఆ కచుని కథను సంగ్రహంగా చెప్పండి.

**(గమనిక** – ఆత్మసాక్షాత్కారమనే పరమ విశ్రాంతిని అందుకునేందుకోసం, సమాధియోగ మార్గంలో అనుసరించ వలసిన సోపాన పరంపరను వర్ణించడం కోసం, వశిష్ఠ మహర్షి నిర్వాణ ప్రకరణ పూర్వార్ధాన్ని కేటాయించాడని ప్రకరణ ప్రారంభంలో చెప్పుకొని వున్నాం. దానికనుగుణంగా, సమాధియోగాన్ని అందుకున్న మహాత్ములయొక్క యోగవిధానాలను, ఇప్పటివరకూ చూపించుకుంటూ వచ్చాడు. ఇక సప్తవిధయోగ భూమికలలోనూ, సాధన ప్రారంభ దశకు సంబంధించినవేవి మధ్యదశకు సంబంధించినవేవి, ఉత్తమ దశకు సంబంధించినవేవి, అనే విభాగం చేసి చూపించి, ఈ విభాగాన్ని ముగించ దలచుకుంటున్నాడు వశిష్ఠుడు. అందుకు పూర్వ రంగంగా, ఈ కచ కథా ప్రసక్తిని తీసుకువస్తున్నాడు.)

పూర్వం స్థితిప్రకరణంలో 58వ సర్గలో కచుడికి కలిగిన ఆత్మానుభూతిని గురించి, ఆ పారవశ్యంలో ఆయన పాడిన పాటల గురించి, సంగ్రహంగా ప్రస్తావన చేశాడు. ఆ విషయాలను మనం అక్కడ వాసనాక్షయోపాయాలు అనే శీర్షిక క్రింద చెప్పుకొన్నాం. అక్కడ మహానుభావుడైన కచుడియొక్క అనుభూతిని వర్ణించాడే గానీ, దాని వెనకాల వున్న సాధన శ్రమను వర్ణించ లేదు. ఇక్కడ వశిష్ఠుడు తన ప్రణాళిక కనుగుణంగా ఆ కచ సాధన ప్రక్రియను వివరించబోతున్నాడు. ఈ వివరణను యోగభూమికలకు అనుసంధానం చేయబోతున్నాడు. ఈ విషయాన్ని మనస్సులో వుంచుకొని వశిష్ఠుడు చెప్పే కచగాథలోకి ప్రవేశిద్దాం.

## 71 .కచప్రబోధము

***వశిష్ఠుడు***: రామా! బృహస్పతి కుమారుడైన కచుడి గురించి నీకు తెలుసు కదా! ఆయన సాధించిన ఆత్మానుభూతి గురించి గూడా నీకు చెప్పాను. ఆ సిద్ధికి వెనకాల గల సాధన గురించి ఇప్పుడు చెబుతా విను.

గురుకులం నుంచి తిరిగి వచ్చిన కచుడు, ఇంటి దగ్గరే వుండి ఆత్మ చింతనే చేస్తూ వుండేవాడు. తెలిసినట్టే వుండేది, అంతుబట్టేది గాదు. చివరికి ఒక రోజు తండ్రి విశ్రాంతిగా వుండగా దగ్గరకు వెళ్ళి "నాన్నగారూ! ఈ సంసారం ఒక పంజరం లాగా కనిపిస్తోంది. దీంట్లోంచి బైట పడేదెలాగు?" అని అడిగాడు.

దేవగురువు బృహస్పతి "నాయనా! ఇది వట్టి పంజరం కాదురా. ఇది మొసళ్లతో నిండిన సముద్రం. దీనిని ఈదటం కష్టం. దీనిని దాటాలంటే ఎగిరి పోవాలి. ఈ ఎగరడానికి ఒకే ఒక మార్గం వుంది. అదే సర్వత్యాగం. ఐతే, కొంత కాలం పోయాక ఒదిలి పెట్టామే అనే పశ్చాత్తాపం కలుగకుండా, ప్రశాంతంగా, నిరుద్వేగంగా ఒదిలి పెట్టాలి" – అన్నాడు.

ఈ మాట విన్నాక, కచుడు మళ్ళీ మాట్లాడలేదు. కొద్దిగా ఆలోచించుకొని, మనస్సులో సర్వసంగ పరిత్యాగం చేసి, స్వర్గరాజ్యంలోని ఇల్లు వదిలిపెట్టేసి, అడవిలోకి వెళ్ళిపోయాడు.

దీనికి బృహస్పతి క్రుంగిపోలేదు. మహాత్ములకు సంయోగ వియోగాలు సమానాలు కదా! ఇలా ఎనిమిదేళ్ళు గడిచి పోయాయి. ఒక రోజున బృహస్పతికి కొడుకు గుర్తొచ్చాడు. ఆయన కొడుకు ఎక్కడున్నాడో అని వెతుక్కుంటూ బయలు దేరాడు. అడవిలో ఒక చోట కొడుకు దొరికాడు. పరస్పర ప్రీతి వచనాలైన తరువాత కొడుకు తండ్రితో "నాన్నగారూ! నేను సర్వత్యాగం చేసి ఇప్పటికి ఎనిమిదేళ్ళు అయింది. ఐనా నా మనస్సు ప్రశాంతం కావడం లేదు"అన్నాడు.

దీనంగా కొడుకు అన్న మాటను విని, "సర్వమేవత్యజ"(సర్వాన్నే పరిత్యాగం చేయి) (పూర్వ.స. 111, శ్లో. 15) అనేసి మరో మాటకు అవకాశం లేకుండా ఆకాశంలోకి ఎగిరిపోయాడు.

కచుడు తీక్ష్ణంగా ఆలోచించాడు. ఒంటిమీద వున్న గోచీ గుడ్డను గూడా పీకి ప్రక్కన పారేశాడు. ఇంకా కేవలం నిర్మమంగా కాలం గడపడం మొదలెట్టాడు. ఐనా గానీ విశ్రాంతి లభించలేదు. మూడేళ్ళు గడిచాయి. బృహస్పతి మళ్ళీ కొడుకును చూడ్డానికి వచ్చాడు.

తండ్రిని చూస్తూనే కచుడు దిగులుగా, "నాన్నగారూ! కౌపీనత్యాగం గూడా చేసేశాను. ఐనా మనస్సు విశ్రమించడం లేదు. ఇంకేం చేసేది?" అన్నాడు.

బృహస్పతి జాలిగా చూసి

**చిత్తం సర్వమితి ప్రాహుః**
**తత్త్యక్త్వా పుత్ర రాజసే ।**
**చిత్త త్యాగం విదుస్సర్వ**
**త్యాగం సర్వవిదో జనాః ॥** (పూర్వ. స. 111. శ్లో. 21)

"సర్వం అటే చిత్తంరా. దానిని విడిచిపెడితే నీకు శోభ. చిత్తత్యాగాన్ని సర్వత్యాగం అంటారు పెద్దలు" అనేసి అప్పటికప్పుడే మాయమైపోయాడు.

కచుడు, తాను గూడా ఆకాశంలోకి ఎగిరి, కొంత దూరం తండ్రికోసం వెతికాడు. ఐనా, తండ్రి కనిపించలేదు. "అరెరె, నా సందేహాలు తీర్చకుండానే నాన్నగారు వెళ్ళిపోయారే!" అనుకుంటూ మళ్ళీ వెనక్కు వచ్చి, పాత అడవిలోనే కూర్చొని, పరిపరి విధాలుగా ఆలోచించడం మొదలు పెట్టాడు.

నాన్నగారు "చిత్తాన్ని" విడిచి పెట్టమన్నారు. నేనిప్పటికి చాలా వదిలి పెట్టాను. ఇల్లు వదిలి పెట్టాను. వస్త్రాలు వదిలి పెట్టాను. దేహాన్ని (అంటే దేహం మీది మమకారాన్ని) వదిలేశాను. ఇంద్రియాలను వదిలేశాను. ఇవేవీ చిత్తం కాదని నాన్నగారు అంటున్నారు. నాకు కూడా అర్ధమౌతూనే వుంది. కానీ చిత్తం అంటే ఏది? అది ఎక్కడ వుంటుంది? అది మాత్రం అర్థం కావడం లేదు.

కచుడి ఆలోచనలు ఇలా సాగాయి. అతను అలా చాలాసేపు ఆలోచించి, ఇక లాభం లేదని తనే నాన్నగారి దగ్గరికి బయలుదేరాడు. పదకొండేళ్ళ తరువాత మళ్ళీ స్వనగరానికి చేరి, ఇంటికి వెళ్ళి, నాన్నగారికి నమస్కరించి, తన ప్రశ్నలన్నీ ఆయన ముందు పరిచాడు.

**బృహస్పతి**: నాయనా! ప్రతిప్రాణికీ 'నేను' అనే ఒక ఆలోచన వుంటుంది. ఈ అహంవృత్తినే, అహంభావాన్నే, అహంకారాన్నే, చిత్తం అంటారు.

**కచుడు**: దాన్ని వదలిపెట్టమంటున్నారు మీరు. 'నేను' అనే వృత్తినే వదిలేస్తే, మనిషి మరణిస్తాడు గదా! మనిషే పోతే, మోక్షం ఎవరికి?

**బృహస్పతి**: నాయనా! అహంకారం అనేది నిజంగా వున్న పదార్థం ఐతే, దానిని తొలగిస్తే మరణిస్తాడనే మాట నిజమే ఔతుంది. కాని సత్యం అది గాదే!

'అహంకారం ' అనేది ఒక మిథ్యాబావన. అది సత్యమూ గాదు, అసత్యమూ గాదు. ఎందుకంటే, నిత్యసత్యమైన చిన్మాత్ర తత్త్వం ఒకటి వుంది. దాన్ని గురించిన జ్ఞానం గూడా నిత్య సత్యమే! చిన్మాత్రం అద్వితీయం గనుక, దాని జ్ఞానం గూడా అద్వితీయమే! అద్వితీయమైన వస్తువునుంచి మరో వస్తువు పుట్టేందుకు వీలు లేదు.కాని 'అహంభావం' అనేది ఒకటి నీకు కనిపిస్తోంది. అది ఎక్కడి నుండి పుట్టింది? ఎలా పుట్టింది?

**కచుడు**: ఏదో ఒక పదార్థం వుందనుకుందాం. దాంట్లోంచి అహంకారం పుట్టిందనుకుందాం.

**బృహస్పతి**: అహంకారానికి వెనకాల వున్న ఏకైక పదార్థం చిన్మాత్ర తత్త్వం. అది ఏక సముద్రం లాగా అంతటా వ్యాపించి వుంది. దాంట్లోంచి ఏమైనా పుడితే, అలాంటిదే పుట్టాలి. దానికి విజాతీయమైనది పుట్టదు. నదిలోంచి ఎండు మట్టి పుడుతుందా? కనుక అహంకారం చిన్మాత్రంలోంచి పుట్టిందంటానికి వీలు లేదు.

**కచుడు**: ఎన్ని తర్కాలు చెప్పి ఏమి ప్రయోజనం? అహంకారం ప్రత్యక్షంగా కనిపిస్తోంది గదా!

**బృహస్పతి**: ఔను. కనిపిస్తోంది. కానీ, పుట్టేందుకు తగిన కారణ సామాగ్రి లేకుండగా, ఒక పదార్థం పుట్టినట్లు, వున్నట్లు, కనిపిస్తే, దానిని నువ్వేమంటావు?

**కచుడు**: మాయా వస్తువంటాను. మిథ్యా వస్తువంటాను. భ్రాంతి వస్తువంటాను.

**బృహస్పతి**: నేనూ అదే అంటున్నాను. అహంకారం మిథ్యా పదార్థం. ఉన్నట్లు కనిపించే లేని వస్తువు. లోకంలో భ్రాంతి జన్య పదార్థమేదైనా సరే, జ్ఞానంవల్ల పోతుంది. కనుక, కచా!

**అయం సోహమితి వ్యర్థం**
**ప్రత్యయం త్యజ పుత్రక ॥** (పూర్వ.స.111, శ్లో. 39)

"వాడు, వీడు, నేను" అనే పరిమితాహంభావాన్ని విడిచి పెట్టు."

**దిక్కాలాద్యనవచ్ఛిన్నం**
**స్వచ్ఛం నిత్యోదితం తతమ్।**
**సర్వార్థ మయమేకార్థ**
**చిన్మాత్ర మమలం భవాన్ ॥** (పూర్వ.స. 111, శ్లో. 40)

దిక్కులు, కాలం, కొలతలు, లేనిదీ, నిత్యమైనదీ, సర్వవ్యాప్తమైనదీ, సర్వపదార్థ స్వరూపమైనదీ, ఏకైక స్వరూపమైనదీ, స్వచ్ఛమైనదీ ఐన, చిన్మాత్ర తత్త్వానివే నువ్వు. కనుక కుమారా! పరిమితాహంకారాన్ని పరిత్యజించి, అఖండాహంకారాన్ని ఆదరించు. చిత్త పరిత్యాగం చేసేందుకు మార్గం ఇదే! ఇదే సర్వ పరిత్యాగం.

ఈ వివరణతో కచుడికి విషయం అర్థమై, చిత్తాన్ని అక్కడికక్కడే పరిత్యజం చేసి, జీవన్ముక్తుడయ్యాడు.

(**గమనిక** – మనస్సుపోతే మనిషిపోడా అనే ప్రశ్నను గురించి వశిష్ఠమహర్షి ఇప్పటికే రెండు మూడు సార్లు చర్చించాడు. ఇది జ్ఞానయోగ సాధకులకు ఇంచుమించు చివరి దశలో భయాన్ని తెచ్చిపెట్టే మెట్టు గనుక, దానిని దాటించడం కోసం, వశిష్ఠ మహర్షి ఈ ప్రశ్నకు ఇంత ప్రాధాన్యం ఇస్తున్నాడు. అదీ గాక, మనస్సు పూర్తిగా పోతే, శూన్యమే మిగులుతుందని కొందరు వాదిస్తున్నారు. మిగిలేది శూన్యం కాదనీ, అది చిన్మాత్ర సత్య పదార్థమనీ నొక్కి చెప్పడం గూడా ఆయన ఉద్దేశ్యాలలో ఒకటి, ఐనప్పటికీ, ఇది ఇప్పటికే పునరుక్తి అయింది గనుక, కచ కథలో ఆ ప్రస్తావన వచ్చినా, ఆ చర్చను, సంగ్రహంగానే ముగించాడు.)

ఈ విధంగా , కచోపాఖ్యాన్ని పూర్తి చేసిన వశిష్ఠ మహర్షి, రాముణ్ణి కూడా ఆ రకంగానే, అహంకార పరిత్యాగం చేసి, మౌనంగా వుండిపొమ్మని ప్రోత్సహించి, తను చెప్పిన విషయాన్ని (అహంకారానికి అస్తిత్వం

లేదనే విషయాన్ని) గట్టిపరచేందుకోసం, మరో కథ కాని కథను మొదలు పెట్టాడు.

### 72. మిథ్యాపురుషోపాఖ్యానం

**వశిష్ఠుడు**: రామా! మాయా యంత్రంతో తయారైన ('మాయాయంత్రమయః పుమాన్' స.112, శ్లో.16) మనిషి ఒకడుండేవాడు. వాడు ఆకాశంలో వెంట్రుక వుండ లాగానూ, ఎండమావిలో నీరు లాగానూ, అందంగా వుండేవాడు.

వాడికి తను శాశ్వతంగా వుండాలనే కోరిక పుట్టింది. దానికి ఏం చేయాలా? అని అలోచించాడు. ఆలోచించగా, ఆలోచించగా "నేను ఆకాశంవల్ల బ్రతుకుతున్నాను కనుక, ఈ ఆకాశం నశించి పోకుండా వుంటే నేను శాశ్వతంగా వుంటాను" – అని వాడికి తోచింది.

ఆకాశాన్ని రక్షించడం ఎలా? వాడు ఆలోచించి, గట్టి గోడలతో ఇల్లు ఒకటి కట్టాడు. అప్పుడా ఇంట్లో గృహాకాశం ఒకటి ఏర్పడింది. ఈ ఇల్లు శాశ్వతంగా వుంటుంది. దానితోపాటు గృహాకాశమూ శాశ్వతంగా వుంటుంది, అని వాడు ఆశ పడ్డాడు. దానితో వాడికి ఆ గృహాకాశంమీద ఒక మమకారం ఏర్పడింది.

కానీ, ఓ వందేళ్ళు దాటేటప్పటికి ఆ ఇల్లు కూలిపోయింది. దాంతోపాటు గృహాకాశమూ కూలిపోయింది. వాడికి ఎక్కడ లేని దుఃఖమూ వచ్చింది. ఐనా తేరుకొని మళ్ళీ ఆలోచించాడు. ఈ మాటు ఇంటికంటే గట్టిగా వుండడానికోసం ఒక బావి త్రవ్వించుకున్నాడు. దానితో అక్కడ కూపాకాశం ఏర్పడింది. దానిమీద మమకారంతో హాయిగా వున్నాడు.

కానీ, ఒక వెయ్యేళ్ళు అయ్యేసరికి, ఆ బావి కూలిపోయింది, పూడిపోయింది. కూపాకాశం లేకుండా పోయింది. మిథ్యాపురుషుడు మళ్ళీ ఏడ్చాడు. ఈ మాటు ఆశపడి ఒక కుండ తయారు చేసుకున్నాడు. కుంభాకాశం ఏర్పడింది. కాని ఆ కుండ త్వరలోనే పగిలిపోయింది. తనను పోషించే ఆకాశానికి, తద్వారా తనకు, రక్షణ లేకుండా పోతోందని అతను వలవలా ఏడ్చాడు.

ఈ మాటు ఒక రాజభవనం కట్టుకున్నాడు. కాని కాలక్రమంలో, అది కూడా కూలిపోయింది.

ఈ మాటు అతడు బాగా ఆలోచించి, ఒక రోలును నిర్మించుకున్నాడు. దానిలో కుసూలాకాశం (రోలులో వుండే ఆకాశం) ఏర్పడింది. ఇది ఇక శాశ్వతం అనుకున్నాడు. కానీ, ఒక వేసవిలో ఆ రోలుగూడా పగిలిపోయింది. అతను మళ్ళీ దుఃఖంలో పడిపోయాడు.

రామా! ఈ విధంగా ఎన్ని సార్లు ప్రయత్నించినా, ఆ మిథ్యాపురుషుడికి, దుఃఖమే మిగిలింది గానీ, కోరుకున్న ఫలితం అంద లేదు.

**శ్రీరాముడు**: గురుదేవా! ఈ కథలోని సంకేతార్థాలను మీరే వివరించండి.

**వశిష్ఠుడు**: అహంకారమే మిథ్యాపురుషుడు. మాయే ఆకాశం. ఆకాశానికి నిజమైన పేరు లేదు. కానీ, మానవులు గృహాకాశమనీ, కూపాకాశమనీ, ఘటాకాశమనీ, భవనాకాశమనీ, కుసూలాకాశమనీ ఇలా పేర్లుపెట్టుకుంటూనే వున్నారు. ఆ పేర్లు ఆయా పదార్థాలను బట్టి, ఆకాశానికి అంటగట్టిన పేర్లు. ఆ పదార్థాలు పోతే గానీ, ఆకాశం పోదు. అలాగే, లోకంలో మానవులు అహంకారానికి జీవుడు, బుద్ధి, మనస్సు, చిత్తం, మాయా, ప్రకృతి, సంకల్పం, కలన, కాలం, కల – అని రకరకాల పేర్లు పెడుతున్నారు. ప్రాణధారణ జరుగుతున్నది గనుక 'జీవు'డంటున్నారు. నిశ్చయం చేస్తోందని 'బుద్ధి' అంటున్నారు. బైటి విషయాలను మననం చేస్తోంది గనుక మనస్సు అంటున్నారు. వెనుకటి విషయాలను చింతనం చేస్తోంది కనుక 'చిత్తం' అంటున్నారు. లేని వాటిని పుట్టిస్తోంది గనుక 'మాయ' అంటున్నారు. పరిణామ స్వభావం వుంది గనుక

ప్రకృతి అంటున్నారు. రాబోయే విషయాలను సంకల్పిస్తోంది గనుక, సంకల్పం అంటున్నారు. ఊహించిన విషయాలను తయారు చేస్తోంది గనుక 'కలన' అంటున్నారు. పరిణామాది ప్రక్రియలకు కారణం కావటంచేత 'కాలం' అంటున్నారు. ఆ కాలాన్ని మామూలు ముక్కలుగా చేసి చూపించడంవల్ల 'కల' అంటున్నారు. ('కల' అనేది కాలంలో ఒక అత్యల్పమైన విభాగం.)

రామా! ఇవన్నీ పేర్లే గానీ నిజమైన వస్తువులు గావు.

మధ్యలో సందే లేని చిత్పదార్థంలోంచి చిల్లివంటి ఆకాశం పుట్టే సావకాశమే లేదు. చిల్లిలా నిశ్చల నిర్జీవమైన ఆకాశంలోంచి చలన స్వరూపమైన వాయువు పుట్టేందుకు వీలు లేదు. రూప రహితమైన వాయువులోంచి, రూప సహితమైన వెలుగు పుట్టేందుకు వీలు లేదు. ఉష్ణ స్వభావం గల వెలుగులోంచి చల్లని నీరు పుట్టేందుకు వీలు లేదు. మెత్తని నీటిలోంచి కఠినమైన భూమి పుట్టేందుకు వీలు లేదు. కనుక ఈ ప్రపంచంలోని ఏ పదార్థానికీ సరియైన కారణ సామాగ్రి లేదు. అందువల్ల మనం ఏం గ్రహించాలంటే –

**న జాయతే న మ్రియతే**
**క్వచిత్ కించిత్ కదాచన ।**
**జగద్వివర్తరూపేణ**
**కేవలం బ్రహ్మ జృంభతే ॥** (పూర్వ. స.113, శ్లో. 20)

ఈ జగత్తులో ఎప్పుడూ, ఎక్కడా, ఏదీ, పుట్టడం లేదు, మరణించడం లేదు. ఈ జగత్తు, అనే వివర్త రూపంలో, పరబ్రహ్మ విజృంభిస్తోంది.

### 73. భృంగీశ్వరోపాఖ్యానం

రామా! ఈ విషయాన్ని గ్రహించి, నువ్వు సుఖంగా వుండు. దీనికోసం నువ్వు సత్పదార్థం ఏదో, అసత్పదార్థం ఏదో, విచారించి విడదీసుకో. వాటిలో అసత్తును వదిలిపెట్టు. సత్తులో స్థిరంగా వుండిపో. నువ్వు కర్తవు, భోక్తవు, త్యాగివి కాకు. కానీ మహాకర్తవు, మహాభర్తవు, మహా త్యాగివి కా. ఈ మూడింటినే వ్రతత్రయం అంటారు. ఈ వ్రతాలను పూర్వం పరమేశ్వరుడు భృంగీశ్వరుడికి ఉపదేశించాడు. అది ఎలా జరిగిందో చెబుతా విను.

పూర్వం ఒకప్పుడు మేరు శిఖరం మీద భృంగీశ్వరుడు ఆత్మజ్ఞాన సాధన చేస్తూ వుండేవాడు. ఒక రోజు అతను పరమేశ్వరుడి దగ్గరకు వెళ్ళి ఇలా అన్నాడు.

**భృంగీశ్వరుడు**: తండ్రీ! ఈ సంసార సాగరంలో తరంగాలు ఎంత ప్రయత్నం చేసినా ఆగడం లేదు. అల తరువాత అలగా వస్తూ మీద పడుతూనే వున్నె ఈ అలల్ని ఆపడానికి సులభోపాయం ఏది?

**పరమేశ్వరుడు**:

**సర్వాః శంకాః పరిత్యజ్య**
**ధైర్యమాలంబ్య శాశ్వతమ్ ।**
**మహాభోక్తా మహాకర్తా**
**మహాత్యాగీ భవానఘ ॥** (పూర్వ.స.115, శ్లో. 9)

నాయనా! ముందు మనస్సులో వున్న సందేహాలు, వాదాలు, పక్కన పెట్టేయి. మనస్సును స్థిరపరచుకో. ఆ తరువాత మహాభోక్తవు కా. మహాకర్తవు కా. మహాత్యాగివి కా. ఈ వ్రతత్రయాన్ని మించి వేరే చేయవలసిన

పని లేదు.

**భృంగీశ్వరుడు**: ప్రభూ! మహాకర్త అంటే ఏమిటి? మహాభోక్త అంటే ఏమిటి? మహాత్యాగి అంటే ఏమిటి?

**పరమేశ్వరుడు**: నాయనా! చేసే పనులలో ధర్మాలుంటాయి, అధర్మాలుంటాయి. ఇది చేయాలి, ఇది మానాలి, అనే సంకల్పంతో గాక, ఏది ఏలా వస్తే అలా, దీనివల్ల పాపం వస్తుందా? పుణ్యం వస్తుందా? సుఖం వస్తుందా? దుఃఖం వస్తుందా? అనే రాగ ద్వేషాల ప్రసక్తి లేకుండా, కేవలం సాక్షి భావంలో వుంటూ, సమభావ స్థితుడై, స్వభావ సిద్ధంగా శాంతుడై, జరిగే మార్పులలో మార్పులేని సన్మాత్రను మాత్రమే దర్శనం చేస్తూ, పనులు చేసేవాడు మహాకర్త.

అలాగే ప్రారబ్ధ కర్మ ఫలితాలను అనుభవించేటప్పుడు, దేనినీ ద్వేషించకుండా, దేనినీ కాంక్షించకుండా, ఇంద్రియాలతో విషయ గ్రహణ చేస్తున్న సమయంలో కూడా, నిష్క్రియాత్మ బుద్ధితో, విక్షేపం చెందని మనస్సుతో, సుఖదుఃఖాలయందు సమబుద్ధితో, అనుభవించేవాడు మహాభోక్త.

ఇక మహాత్యాగం వున్నది. మంచిదనీ, చెడ్డదనీ, పనికి వచ్చేదనీ, పనికి రానిదనీ, ఇలాంటి ఆలోచనలతో గాక, ధర్మమూ మిథ్యే, అధర్మమూ మిథ్యే, సుఖమూ మిథ్యే దుఃఖమూ మిథ్యే, కోరికలూ మిథ్యే, కోరిక లేకపోవమూ మిథ్యే, అనే దృష్టితో దృశ్య ప్రపంచం మొత్తాన్నీ తత్త్వజ్ఞాన దృష్టిచేత బాధింప జేసుకుంటూ, పై చెప్పిన వాటన్నిటినీ విడిచి పెట్టేవాడు మహా త్యాగి.

(**గమనిక** – ఈ సర్గలో 11వ శ్లోకం నుంచీ, 38వ శ్లోకం దాకా, మహాదేవుడు చెప్పిన వ్రతత్రయ నిరూపణ శ్లోకాలున్నాయి. నిజంగా సాధన చేసేవాళ్ళకు ఆ శ్లోకాలు ఎక్కడికక్కడ కరదీపికలు. సాధనపుష్టి లేనివారికి అవి పునరుక్తులు. మనం ఇక్కడ వీలైనంత సంగ్రహంగా వాటిని తీసుకున్నాం.)

**వశిష్ఠుడు**: రామా! సాక్షాత్తుగా మహేశ్వరుడు బోధించిన ఈ వ్రతత్రయాన్ని నువ్వు గూడా బాగా అర్థం చేసుకొని, ఆచరణలో పెట్టుకో. అలా చేస్తే, నువ్వు ఎన్ని పనులు చేస్తున్నా, నీకు దుఃఖం అంటదు.

**శ్రీరాముడు**: గురుదేవా! చిత్తం అన్నా, అహంకారం అన్నా, ఒకటే కదా! అది తొలగిపోతూ వున్నప్పుడు, వాసనలు సన్నగిల్లిపోయి, నామ మాత్రంగా మిగిలివున్న మనస్సును సత్త్వం అంటారు గదా, ఆ సత్త్వానికి లక్షణం ఏమిటి?

**వశిష్ఠుడు**: నీళ్లల్లో వున్నా పద్మానికి తడి అంటనట్టు, బలవంతపెట్టినా సరే, లోభమోహాది దోషాలు అంటకుండా వుండడమే సత్త్వానికి ప్రధాన లక్షణం. ఈ లక్షణం యోగ భూమికలలో నాలుగవ భూమిక నుండి ప్రారంభమై క్రమక్రమంగా వికసిస్తుంది. ఈ స్థితి లభించాలంటే, నేనెవరిని? ఈ జగత్తు ఎలా వచ్చింది? పరమాత్మ తత్త్వం ఏది? అనే ఇలాంటి విచారణ మొదలు కావాలి. మీ వంశానికి మూల పురుషుడైన ఇక్ష్వాకు మహారాజు, ఈ రకమైన మార్గంలోనే ముక్తిని అందుకున్నాడు. ఆ విషయం సంగ్రహంగా చెబుతాను విను.

### 74. ఇక్ష్వాకు - మను సంవాదం

ఇక్ష్వాకు మహారాజు రాజ్య పాలన చేస్తూ వుండగా, ఒక దశలో ఆయనకు ఒక కొత్త ప్రశ్న పుట్టింది. "ఈ ప్రపంచం అంతా జరామరణాలనే సంక్షోభాలతో, సుఖదుఃఖాలనే కల్లోలాలతో, గందర గోళంగా వుంది. ఇలాంటి ఈ దృశ్య ప్రపంచానికి కారణం ఏమిటి?" – అని.

దీనిమీద ఆయన తనలో తనే స్వయంగా చాలా సంవత్సరాలపాటు చర్చలు చేసుకున్నాడు. ఐనా ఏమీ తేలలేదు. ఈ ప్రశ్న, ఈ చర్చ, ఆయన మనస్సును కలవర పెడుతూ వుండేవి.

ఇలా వుండగా, ఒక రోజున, ఆయన సభలో వుండగా, అనుకోకుండా తన వంశమూలపురుషుడైన మను ప్రజాపతి అక్కడికి వచ్చాడు. ఇక్ష్వాకువు సగౌరవంగా అతనికి స్వాగతం పలికి ఎక్కడి నుంచీ వస్తున్నారని అడిగాడు. బ్రహ్మలోకంనుంచీ వస్తున్నానని ఆయన చెప్పాడు. ఆ మాట వినగానే, ఇక్ష్వాకు చక్రవర్తికి తన ప్రశ్న గుర్తుకు వచ్చింది. కానీ, వినయంవల్ల కొంచెం భయం వేసింది. ఐనా, ధైర్యం కూడ బెట్టుకొని, తన ప్రశ్నలన్నీ ఆయన ముందర పరిచాడు.

"ఈ సృష్టి ఎక్కడి నుంచి వచ్చింది? దీని అసలు స్వరూపం ఏమిటి? దీని పరిమితి ఎంత? దీన్ని గురించి వేదాది ప్రమాణాలు ఏమి చెబుతున్నాయి? దీని కారణం మాట ఎట్లా వున్నా, వలలో పడ్డ పక్షి లాగా నేనీ సంసారంలో పడి గిల గిలా కొట్టుకుంటున్నాను. నేను బైట పడే మార్గం ఏమిటి?" – అని.

మను ప్రజాపతి చాలా సంతోషించి, వివరంగా సమాధానం చెప్పాడు.

**మనువు:** ఇక్ష్వాకు చక్రవర్తీ ! నీలో ఈ రకమైన సద్విచారణ ప్రారంభం కావడం నాకు చాలా సంతోషకరంగా వుంది. నువ్వు అడిగిన విషయాన్ని సంగ్రహంగా వివరిస్తాను, విను.

సూటిగా చెప్పాలంటే, నీకు కనిపించే ఈ దృశ్య ప్రపంచం, నిజంగా లేదు. ఆకాశంలో గంధర్వ నగరం లాగా, లేకపోయినా వున్నట్లుగా కనిపిస్తోంది. ఎండమావిలోని నీరు లాగా కనిపిస్తోంది. దానికి స్వరూపమూ లేదు. దానివల్ల నీకు బంధమూ లేదు. బంధమే లేదు గనుక, మోక్షమూ లేదు. నువ్వు చేయవలసినదల్లా ఒక్కటే! 'బంధమూ, మోక్షమూ,' అనే ఆలోచనలు విడిచిపెట్టు. స్వస్థంగా వుండడానికి ఇంతకంటే మంచి ఉపాయం లేదు.

కానీ, ఈ విషయం అత తేలికగా అర్థం కాదు. కనుక కొంచెం వివరిస్తాను. విను.

నిజంగా వున్నది ఒక్క శుద్ధ చైతన్యం. పూర్వ సంస్కారబలంవల్ల ఈ శుద్ధ చైతన్యానికి సంబంధించిన ఆభాసలు (ప్రతిబింబాలు) అంతఃకరణంగా పరిణామం చెందుతాయి. ఆ అంతఃకరణంలో అవచ్ఛినమై వున్న అవిద్యా సంస్కారాలు జీవుడుగా అభివ్యక్తమౌతున్నాయి. అలాటి జీవులు సంసార ప్రవాహంలో పడిపోతున్నారు. వాళ్ళు రాగ ద్వేషాలకు బద్ధులై, ఇతర జీవులతో వ్యవహారాలు చేస్తున్నారు.

మనం ప్రయాణం చేసేటప్పుడు, రహదారిలో అనేకమంది కనిపిస్తారు. వాళ్లను ఒట్టిగా చూస్తూ వుంటాము. అంతే గాని వాళ్ళమీద ప్రత్యేకమైన రాగ ద్వేషాలేమీ వుండవు. ఇదే పద్ధతిగా సంచరించడాన్ని మన ఇంద్రియాలకు మనం నేర్పాలి. ప్రపంచంలో భ్రాంతిమయ పదార్థాలు కనిపిస్తూనే వుంటాయి. ఇంద్రియాలు రాగద్వేషాలతో వాటి వెంట పరిగెత్తడం మాత్రం ఆగాలి.

ఇంద్రియాల పరుగులకు మూల కారణం 'దేహం నేనే' అనే భావం. ముందర దానిని వదిలించుకోవాలి. దానికోసం, మనస్సులోని సంకల్పాలను శాంతింప జేసుకోవాలి. మనస్సులో సంకల్పాలు అణగారి పోతే, ఇంద్రియాలన్నీ చలిస్తున్నా సరే, నువ్వు నిశ్చలంగా వుండిపోతావు. ఆ నిశ్చల స్థితే, పరబ్రహ్మ స్థితి.

**ఇక్ష్వాకువు:** మాయా సంపర్కంతో ఆ పరబ్రహ్మ చలనం ఎందుకు పొందాలి? చివరికి, చిత్త స్పంద నివారణతో, నిశ్చలస్థితి మళ్ళీ ఎలా లభిస్తుంది?

**మనువు:** రాజా! పరమాత్మ సర్వ వ్యాపకుడు. ఆయనకు రెండు శక్తులున్నాయి. అవిద్యాశక్తి, విద్యాశక్తి – అని. అందులలో అవిద్యాశక్తికి ప్రసవ ధర్మం వుంది. అంటే, అది సృష్టి చేస్తుంది. విద్యాశక్తికి సంహార ధర్మం వుంది. అవిద్య చేసిన సృష్టిని, విద్య సంహరిస్తుంది. అవిద్యాశక్తి రాగంవల్ల పెరుగుతుంది. విద్యాశక్తి వైరాగ్యంవల్ల పెరుగుతుంది. సామాన్య మానవులకు సర్వ వ్యాపిగా వున్న పరమాత్మ కనిపించడం లేదు. నిజంగా లేని జగత్తు కనిపిస్తోంది. దీనికిక ఏకైక కారణం అవిద్యాశక్తి! దీనిని తొలగించ గలిగినది, విద్యాశక్తి మాత్రమే! సమతా దృష్టి బలంతో, సమాధ్యాబ్యాసం చేసిన కొద్దీ, విద్యాబలం పెరిగి దృశ్య విస్మృతి లభిస్తుంది.

ఈ స్థితి కోసం, సాధకుడైనవాడు యోగభూమికలను క్రమక్రమంగా సాధించుకుంటూ వెళ్లాలి.

**75. యోగ భూమికలు - పేర్ల మార్పు**

**(గమనిక** – ఉత్పత్తి ప్రకరణంలో 118వ సర్గలో, సప్తజ్ఞాన భూమికలనే పేరుతో 1. శుభేచ్ఛ 2. విచారణ, 3. తనుమానస 4. సత్త్వాపత్తి 5. అసంసక్తి 6. పదార్థాభావన 7. తుర్యగ, అనే ఏడు భూమికలను వశిష్ఠమహర్షి వివరించాడు. ఇక్కడ మళ్లీ యోగభూమికలనే పేరుతో వాటికి ఇంచుమించు సమాంతరంగా సాగే మరో ఏడు భూమికలను మను ప్రజాపతి ప్రతిపాదిస్తున్నాడు. వాటికీ, వీటికీ పెద్దగా భేదం లేకపోయినా, ఇక్కడ మను ప్రజాపతి, సాధన దృష్టితో, ఏడు భూమికలను నిర్వచిస్తూ ముందుకు సాగుతున్నాడు. ఉత్పత్తి ప్రకరణంలోని విభాగం ప్రధానంగా సిద్ధస్థితి మీద ఆధారపడి వుంది. ఇక్కడి విభాగం ప్రధానంగా సాధన స్థితి మీద ఆధారపడి వుంది. ఈ స్వల్ప బేధాలను గమనించుకుంటూ, మను ప్రబోధంలోకి సాగుదాం.

**మనువు:** రాజా! ఆ ఏడు భూమికలయొక్క స్వరూపం ఇలా వుంది.

1. ప్రజ్ఞావృద్ధి – అంటే సజ్జన సాగత్యం చేత శాస్త్రజ్ఞానాన్ని సంపాదించి, సాధన చతుష్టయ సంపత్తి కోసం కృషి చెయ్యాలి. ఇది శ్రవణస్థానీయం. ఇది మొదటి మెట్టు. ఇది శుభేచ్ఛా భూమిక.

**(గమనిక**– సాధన చతుష్టయ సంపత్తి గురించి ఈ గ్రంథ పరంపర మొదటి భాగంలో, ముముక్షు వ్యవహార ప్రకరణంలో 'సాధన చతుష్టయం' అనే శీర్షిక క్రింద వివరించడం జరిగింది.)

2. విచారణ – ఇది మననస్థానీయం. ఇది విచారణా భూమిక.
3. అంసంసక్తి – ఇది నిధిధ్యాసన స్థానీయం. ఇది తనుమానసా భూమిక.
4. విలాపినీ – ఇది వాసనాక్షయ దశ. ఇది సత్త్వాపత్తి భూమిక.
5. శుద్ధ సంవిన్మయి – ఇది వాసనాక్షయ దశ. ఇది అసంసక్తి భూమిక.
6. స్వసంవేదన రూప – ఇది గూడా వాసనాక్షయ దశే. ఇది పదార్థాభావనీ భూమిక.
7. ఆనందైక ఘనాకార – ఇది గూడా వాసనాక్షయ దశే. ఇది తురీయగా భూమిక.

వీటిలో ప్రజ్ఞావృద్ధి, విచారణ, అసంసక్తి అనే మొదటి మూడు భూమికలు 'జాగ్రదవస్థ'తో సమానం. నాలుగవదైన విలాపినీ భూమిక 'స్వప్నావస్థ'తో సమానం. ఐదవదైన శుద్ధ సంవిన్మయీ భూమిక, 'సుషుప్తి' అవస్థతో సమానం. స్వసంవేదన అనబడే ఆరవ భూమిక,తురీయావస్థతో సమానం. ఏడవదైన ఆనందైక ఘనాకార భూమిక తురీయాతీతావస్థతో సమానం. ఇదీ అసలైన జీవన్ముక్తి.

మరో రకంగా చూస్తే, మొదటి మూడు భూమికలు ముముక్షువైన సాధకుడికి సంబంధించినవి. నాలుగవది ముక్తిని పొందుతూ, పొందుతూ వున్న వాడిది. 5,6,7లు జీవన్ముక్త స్థితిలోనే, తరతమస్థాయీ విశేషాలు.

రాజా! ఈ భూమికలన్నిటినీ క్రమక్రమంగా అధిగమిస్తూ, చివరికి సప్తమ భూమికకు చేరి, ఈ దృశ్య జగత్తు నంతనూ తత్త్వబోధచేత బాధింప జేసుకొని (కారణంతో సహా నివర్తింప జేసుకొని) సర్వానుస్యూతమై, పరిశిష్టమై వున్న సత్తాంశను 'నేనే' అని తెలుసుకొని, ఆ అనుభవంలో స్థిరంగా వుండి పోవాలి.

రాజా! ఒకే పదార్థానికి రెండు పేర్లున్నాయి. ఒక పేరు జీవుడు, రెండో పేరు పరమాత్మ. ఈ పేర్లు కలగడానికి కారణం వ్యవహరించేవాడి భావనే! ఏ రకమైన భావన చేస్తే, ఆ మూల పదార్థాన్ని క్రిందకు గుంజేసి, జీవుడు అనవలసి వస్తుందో, ఏ భావన చేస్తే, అదే మూల పదార్థాన్ని పైకి గుంజి పరమాత్మ అనగలుగుతామో, ఆ రెండు రకాల భావననా విశేషాలనూ, విడమరచి విస్పష్టంగా తెలుసుకోవాలి.

**యావద్విషయ భోగాశా**
**జీవాఖ్యా తావదాత్మనః ।**
**అవివేకేన సంపన్నా**
**సాప్యాశా హి న వస్తుతః ॥**
**వివేకవశతో యాతా**
**క్షయమాశా యదా తదా ।**
**ఆత్మా జీవత్వ ముత్సృజ్య**
**బ్రహ్మతామేత్యనామయః ॥** (పూర్వ.స.121, శ్లో 1,2)

రాజా! విషయ భోగాలమీద ఆశ ఎంతవరకు మిగిలి వుంటుందో, అంతవరకూ పరమాత్మకు జీవుడు అనే పేరు మిగిలి వుంటుంది.

***ఇక్ష్వాకువు:*** ఈ ఆశ ఎక్కడి నుంచి వచ్చింది?

***మనువు:*** ఇది అవివేకంవల్ల వచ్చింది. అందుచేతనే ఇది అవాస్తవికమైనది.

***ఇక్ష్వాకువు:*** ఇది పోయేదెలా?

***మనువు:*** అవివేకంవల్ల వచ్చింది గనుక, ఇది వివేకంవల్ల మాత్రమే నశిస్తుంది. ఎప్పుడైతే వివేకంవల్ల ఆశ నశిస్తుందో, అప్పుడు ఆత్మకు జీవుడనే పేరు పోయి పరబ్రహ్మ అనే శాశ్వతమైన పేరు ఏర్పడుతుంది.

**ప్రశాన్త శాస్త్రార్థ విచార చాపలో**
**నివృత్త నానారస కావ్య కౌతుకః ।**
**నిరస్త నిశ్శేష వికల్ప విప్లవః**
**సమః సుఖం తిష్ఠతి శాశ్వతాత్మకః॥** (పూర్వ.స.121, శ్లో.14)

ఆ విధంగా, ఆశను దాటి ఆత్మ సాక్షాత్కారాన్ని అందుకున్నవాడికి, ఆధ్యాత్మిక శాస్త్రార్థ విచారణ చెయ్యాలనే చాపల్యం చల్లారిపోతుంది. నవరసరుచిరమైన లౌకిక కావ్యాసక్తి నశించి పోతుంది. వికల్పాలవల్ల వచ్చే విప్లవాలన్నీ తొలగిపోతాయి. వాడు సముడై, శాశ్వత స్వరూపుడై, సుఖంగా వుండిపోతాడు.

అలాంటియోగి ఎలా వున్నా, వాడు మహారాజే! వాడు పరమ దరిద్రుడుగా వున్నా నిత్య తృప్తుడే. అలాంటివాడి తత్త్వాన్ని పండితులు గూడా అర్థం చేసుకోలేరు. అలాంటి యోగి తన శరీరాన్ని పుణ్యక్షేత్రంలో విసర్జించినా, కుక్క మాంసం తినే వాడి ఇంట విసర్జించినా, దీర్ఘకాలం జీవించాక విసర్జించినా, లేక త్వరగా విసర్జించినా, ఎలా వున్నా సరే, ఏం చేసినా సరే, వాడే ముక్తుడు, వాడే పూజ్యతముడు. ఇలాంటి స్థితి ఏ తపస్సులచేతా , యజ్ఞయాగాదులచేతా అందదు. ఇది కేవలం ఆత్మవేత్తలైన జీవన్ముక్తులను భక్తితో సేవించడం ద్వారా లభించే జ్ఞానంవల్ల మాత్రమే అందుతుంది.

***వశిష్ఠుడు***: రామా! మను ప్రజాపతి ఈ విధంగా బోధించి బ్రహ్మలోకానికి వెళ్ళిపోయాడు. అప్పటినుంచీ ఇక్ష్వాకు చక్రవర్తి అదే దృష్టిని అవలంభించి స్వస్వరూపంతో స్థిరంగా వుండిపోయాడు.

(**గమనిక** – మరొక నాలుగు సర్గలలో వశిష్ఠ మహర్షి ఇవ్వాల్టికి, తన బోధను ఆపబోతున్నాడు. దానికి మరో రెండు సర్గలు చేర్చి వాల్మీకి మహర్షి ఈ నిర్వాణ ప్రకరణ పూర్వార్థాన్ని పూర్తి చేయబోతున్నాడు. దానికి అణుగుణంగా 123 నుంచి 126వ సర్గదాగా వశిష్ఠ రాముల సంభాషణ ఒక సింహావలోకన ప్రాయంగా సాగింది. అందువల్ల ఆ సర్గల

విషయాలను మనం ఇప్పుడు సంగ్రహంగా చెప్పుకుందాం. 122వ సర్గతో ఇక్ష్వాకు ప్రబోధం ముగిసింది. దానినే ఆధారంగా చేసుకొని శ్రీరాముడు వేసిన ప్రశ్నతో 123వ సర్గ ప్రారంభమౌతోంది.)

### 76. జ్ఞానియొక్క గొప్పతనం

**శ్రీరాముడు**: గురుదేవా! మీరు ఇక్ష్వాకు ప్రబోధం చివరలో జ్ఞానియొక్క ప్రవర్తన గురించి మాట్లాడుతూ, వాడు దరిద్రుడైనా, ధనవంతుడైనా, పుణ్యక్షేత్రంలో శరీరం విడిచిపెట్టినా, కుక్క మాంసం తినేవాడి ఇంటిలో విడిచిపెట్టినా, దీర్ఘాయువైననా, అల్పాయువైనా, ఎలా వున్నా సరే పూజ్యుడే అన్నారు. దీనిని బట్టి లోక వ్యవహారంలోకి వచ్చే సరికి జ్ఞాని, అజ్ఞాని ఇద్దరూ ఒకే తీరుగా వుంటారని చెప్పినట్లైంది. శరీరం విడిచిపెట్టడంలో గూడా జ్ఞానికి స్వాతంత్ర్యం లేనట్లైతే, ఇక జ్ఞానిలో ఏం గొప్పతనం వున్నట్లు?

**వశిష్ఠుడు**: నిరతిశయమైన ఆత్మానందానుభూతి తప్పితే, మరో గొప్పతనం ఏదీ జ్ఞాని దగ్గర లేనే లేదు.

**శ్రీరాముడు**: మరి అణిమాది యోగసిద్ధుల మాటేమిటి?

**వశిష్ఠుడు**: అవి గూడా అపూర్వమైన విషయాలేమీ కావు. వాటిని మంత్ర సాధనవల్ల, తపస్సాధనవల్ల, సంపాదించవచ్చు. వాటిని సంపాదించడానికి తత్త్వజ్ఞానం అక్కరలేదు. వాటిని సంపాదించాలంటే కోరిక కావాలి. తత్త్వజ్ఞాని పరిపూర్ణుడు గనుక, అతనికి కోరిక వుండదు. కోరిక లేకపోవడమే జ్ఞానిలోని అసలైన విశేషం.

(**గమనిక** – ఈ విషయాలను వశిష్ఠుడు పూర్వం రెండు మూడు సార్లు ప్రస్తావించి వున్నాడు. ఉపశమ ప్రకరణంలో, 42వ సర్గలో జీవన్ముక్తుల వాసనా శేషం ఎలా వ్యవహరిస్తుందో వివరించాడు. అదే ప్రకరణంలో 56వ సర్గలో సమాధి ప్రధాన, వ్యవహార ప్రధాన, జ్ఞాన నిష్ఠుల తారతమ్యాన్ని వివరించి, ఆ తరువాత దానిని నిరూపించేందుకోసం, 'సురఘుచరిత్ర' అనే కథ గూడా చెప్పాడు. అందుచేత వశిష్ఠమహర్షి, ఆ విషయాలను ఇక్కడ సంగ్రహంగానే ప్రస్తావిస్తూ, ముక్తాయింపుగా ఉపమానాత్మకమైన ఒక చిన్న కథ చెప్పాడు. )

**వశిష్ఠుడు**: రామా! పరమాత్మ స్వస్వరూపాన్ని మర్చిపోవడంచేత జీవుడయ్యాడు. అందుచేత జీవుడికి స్వస్వరూప జ్ఞానం కలిగితే, వాడు మళ్ళీ పరమాత్మే ఐపోతాడు. దీనికో చిన్న ఉదాహరణ చెబుతా విను.

ఒక నైష్ఠికుడైన బ్రాహ్మణుడుండేవాడు. అతనికి కొంతకాలం పోయాక, ఒక శూద్ర స్త్రీమీద కోరిక పుట్టింది. ఆ ప్రియురాలిని భావన చేస్తూ వుండేవాడు. అంతకు మించి చెడు పని ఏమీ జరుగలేదు. ఐనా సరే, ఈ దుర్భావనాబలంవల్ల, అతని అనుష్ఠానం అడుగంటి శూద్రుడైపోయాడు.

పరమాత్మ స్థితి గూడా ఇంతే. ఆయనకు బుద్ధ్యాదులతో సాంగత్య భావన ఏర్పడింది. దానివల్ల భోగాశ ఏర్పడింది. దానివల్ల తన పరిపూర్ణత్వం మరుగున పడిపోయింది. ఆయన జీవుడైపోయాడు.

ప్రతి సృష్టిలోనూ పంచభూతాలు రెండు రకాలుగా జన్మిస్తూ వుంటాయి. ఎలాగంటే ఈ పంచభూతాలతో ఏర్పడిన ఉపాధిని ప్రధానంగా తీసుకుంటే, ఆ పంచ భూతాలను భోజ్య పదార్థాలంటారు. అలాంటి ఉపాధులలో ఉపహితమైన (లోపల పరిమితం చేయబడిన) చైతన్యాన్ని ప్రధానంగా తీసుకుంటే, వాటిని భోక్తలంటారు. ఈ రెండు రకాల పదార్థాలకూ వెనుక వేరే నిజమైన కారణ సామాగ్రి లేదు. అవి కేవలం హిరణ్యగర్భుడి సంకల్పబలంవల్ల జన్మించాయి.

**శ్రీరాముడు**: అదెలా కుదురుతుంది?

**వశిష్ఠుడు**: కుదరకేమి? స్వప్నంలో కనిపించే కుండలకు వెనకాల, మట్టిముద్ద, బండిచక్రం, వంటి కారణ సామాగ్రి వుందా? అలాగే ఇదీను.

**శ్రీరాముడు**: 'పూర్వ కర్మే' కారణం అనకూడదా?

**వశిష్ఠుడు**: సూర్యుడు తరంగాలలో ప్రతిఫలించి కదులుతున్నట్లు కనిపిస్తున్నాడు. ఈ కదలికకు కారణం తరంగాలలో వున్న కదలిక. మరి ప్రతిబింబానికి కారణం? దానికి తరంగ చలనం మాత్రం కారణం కాదు. ప్రతిబింబం ఏర్పడిన తరువాత దాని చలనానికి తరంగ చలనం కారణమైంది. అలాగే, ఈశ్వరుడు జీవుడయ్యాక సుఖదుఃఖాలను అనుభవించడానికి, కర్మ కారణమౌతుంది. ఎందుకంటే, కర్మ గూడా ఒక చలనమే కదా! కనుక అవి నిష్కారణంగా జన్మించాయనే చెప్పాలి.

అందువల్ల సుఖదుఃఖాలకు కారణం కర్మ. దానికి కారణం సంకల్పం. దానికి కారణం గ్రాహ్య గ్రాహక సంబంధం. 'గ్రాహకం' అంటే ఇంద్రియం, 'గ్రాహ్యం' అంటే విషయం. ఈ విషయాన్నే కఠోపనిషత్తు ఇలా చెబుతోంది.

**మా భవ గ్రాహ్యభావాత్మా**
**గ్రాహకాత్మ చ మా భవ ।**
**భావనామఖిలాం త్యక్త్వా**
**యచ్ఛిష్టం తన్మయో భవ॥** (పూర్వ.స. 124. శ్లో.8)

మనిషి ఒక విషయాన్ని అనుభవించేటప్పుడు, ఆ విషయంతో తాదాత్మ్యాన్ని పొందుతాడు. నువ్వు అలాంటి విషయ తాదాత్మ్యాన్ని పొందబోకు. అలాగే, ఇంద్రియ తాదాత్మ్యాన్ని గూడా పొందబోకు. ఈ తాదాత్మ్యానికి కారణం భావనే! ఈ భావనను పూర్తిగా వదిలి పెట్టు. ఆ భావనపోతే, సాక్షి స్వరూపం మిగులుతుంది. నువ్వు ఆ సాక్షి తాదాత్మ్యం పొందు.

**అజస్రం యం యమేవార్థం**
**పతత్యక్షగణోఽనఘ ।**
**బధ్యతే తత్ర రాగేణ**
**తత్రారాగేణ ముచ్యతే ॥** (పూర్వ.స. 124, శ్లో. 9)

ఇంద్రియాలు మాటి మాటికీ ఏ విషయం మీదకు పోతాయో, దానిమీద మనిషికి అనురాగం ఏర్పడుతుంది. ఆ అనురాగాన్ని విరాగం చేసుకుంటే, ముక్తి లభిస్తుంది. కనుక మనస్సును మనస్సుతోనే ఛేదించుకో!

జీవులకు 'స్థూలం, సూక్ష్మం, పరం' అని మూడు రకాల రూపాలుంటాయి. స్థూలరూపం అంటే దేహం. సూక్ష్మ రూపం అంటే సంకల్పం. ఇక మూడవది చిన్మాత్ర స్వరూపం. రామా! నువ్వు ఈ మూడవదానితో మాత్రమే తాదాత్మ్యం పెట్టుకో.

**శ్రీరాముడు**: గురుదేవా! జీవుడియొక్క స్థూలరూపం జాగ్రదవస్థ అనీ, సూక్ష్మరూపం స్వప్నావస్థ అనీ, కారణ రూపం సుషుప్తి అవస్థ అనీ, ప్రసిద్ధి వుంది. మీరు చెప్పే 'పరరూపం. ఈ మూడింటికంటే పైదైన తురీయావస్థ అనిపిస్తోంది. ఈ అవస్థ జాగ్రత్, స్వప్న, సుషుప్తులు మూడింటిలోనూ కలిసిపోయి వుంటుంది. అందుచేతనే దానిని విడిగా గుర్తు పట్టడం కష్టం. అందుచేత దానికి గల సాంకర్యాన్ని తొలగించి, కొంచెం వివరించండి?

**వశిష్ఠుడు**: రామా! పెద్దగా వివరించవలసింది ఏమీ లేదు. సాక్ష్యవస్థే తురీయావస్థ. ఈ అవస్థలో చిత్తం సమతా స్థితిని అందుకొని, నీటిలో కరిగిన ఉప్పు లాగా సర్వావస్థలలోనూ కలిసిపోయి వుంటుంది. ఈ స్థితికి ఒక దృష్టాంతం చెబుతా విను.

ఒక అడవిలో ఒక వేటగాడు ఒక మృగానికి బాణం వేసి కొట్టాడు. బాణం దానికి తగిలింది కానీ, అది పారి పోయింది. వేటగాడు దాని వెంట పరుగెత్తాడు. కొంత దూరం పోయేసరికి, వాడికి ఒక ముని కనిపించాడు. ఆయనను చూస్తూనే వేటగాడు "అయ్యా! నేను బాణంతో కొట్టిన మృగం ఇటు వైపుకే వచ్చింది. ఇక్కడి నుంచి ఎటు పోయిందో మీకు తెలుసా?" అని అడిగాడు.

ఆ ముని అయోమయంగా చూసి "నాయనా! మాకు అహంకారం జారిపోయింది. అది వుంటేగాని ఇంద్రియాల వ్యవహారాలు సాగవు. ఇప్పుడు నాకు జాగ్రత్‌స్వప్న సుషుప్తి దశలు కూడా తెలియడం లేదు. తురీయావస్థ ఒక్కటే కనిపిస్తోంది. అక్కడ దృశ్యమే లేదు" అన్నాడు.

వేటగాడికి ఇదేదో పిచ్చివాగుడు లాగా అనిపించి, ఆ మృగాన్ని వెతుక్కుంటూ ముందుకు వెళ్ళిపోయాడు.

రామా! ఇంతకు చెప్పవచ్చిందేమిటంటే, తురీయావస్థయొక్క అనుభవం ఇలా వుంటుంది.

రామా! ప్రమాణ వాక్యాలను విచారణ చేసేటప్పుడు, ఒక విషయాన్ని మనస్సులో గట్టిగా గుర్తు పెట్టుకోవాలి. స్మృతి శ్రుత్యాదులన్నీ ద్వైత సమూహాన్ని నిషేధించ గలవే గానీ, యథార్థ వస్తువును ప్రకాశింప చేయలేవు. ఈ విషయాన్ని అర్థం చేసుకొని, శాస్త్రాలను అధ్యయనం చేయాలి. శ్రుతిని ప్రమాణంగా తీసుకోకుండా, కేవలం బుద్ధి వైభవంతో పరతత్త్వాన్ని గురించి విచారణ చేసేవాళ్ళు కొందరున్నారు. వారిలో కొందరు 'శూన్యమే బ్రహ్మ' అన్నారు. కొందరు 'విజ్ఞానం మాత్రమే బ్రహ్మ' అన్నారు. కొందరు ఈశ్వరుడే బ్రహ్మ అన్నారు. ఇలాంటి వాదాల జోలికి పోవద్దు. వీటన్నిటినీ వదిలేసి, మహామౌనాన్ని ఆశ్రయించు. అలా వుంటే, ప్రారబ్ధాధీనంగా వచ్చిపడే పనిని చేస్తున్నప్పటికీ, చేసినట్లు గాదు.

### 77. యోగభూమికలను అందుకునే క్రమం

**శ్రీరాముడు**: గురుదేవా! మీరు పూర్వం యోగభూమికలను గురించి ప్రస్తావించారు. వాటిని సాధించే క్రమాన్ని మాత్రం చెప్పలేదు. అలాగే ఆయా భూమికలను అందుకున్న యోగుల చిహ్నాలెలా వుంటాయో గూడా చెప్పలేదు. ఆ రెండూ వివరించండి.

(**గమనిక** – యోగభూమికలను గురించి వశిష్ఠమహర్షి ఉత్పత్తి ప్రకరణంలో 118వ సర్గలో ఒకసారి, మళ్లీ నిర్వాణ ప్రకరణంలో పూర్వార్థంలో 120వ సర్గలో మరోసారీ, ప్రస్తావించాడు. రెండు చోట్లా వేరు వేరు పేర్లు పెట్టాడు. ఆ రెండు రకాల పేర్లకూ గల సంబంధమేమిటో మనం ఈ ప్రకరణంలోనే 120వ సర్గ దగ్గర చెప్పుకున్నాం. 'యోగ భూమికలు, జ్ఞాన భూమికలు" అనే పదాలను ఈ సందర్భంలో పర్యాయ పదాలుగా వాడినట్లుగా గూడా మనం అర్థం చేసుకున్నాం. ఇక ఇప్పుడు రాముడు వేసిన ప్రశ్నకు సమాధానంగా వశిష్ఠుడు ఉత్పత్తి ప్రకరణంలోని జ్ఞాన భూమికల పేర్లను కొంతవరకూ తీసుకొని, కొంత మార్చి, వివరించ బోతున్నాడు. ఈ విషయాలను గమనిస్తూ వశిష్ఠ సమాధానంలోకి ప్రవేశిద్దాం. )

**వశిష్ఠుడు**: రామా! వేదమార్గం రెండు రకాలు. ఒకటి ప్రవృత్తి మార్గం. రెండు నివృత్తి మార్గం. ప్రవృత్తి మార్గంలో వున్నవాడు ప్రాణం పోయినా సరే, మోక్షం మాట ఎత్తుకోడు. వాడు ఎల్లప్పుడూ, నిత్య నైమిత్తిక శ్రౌతస్మార్త కామ్య కర్మలలో నిమగ్నుడై వుంటాడు.

1. అలాగే అనేక జన్మలపాటు వుండగా వుండగా ఏదో ఒక పుణ్యం కలసివచ్చి, వాడిలో వివేకం తలెత్తుతుంది. దానివల్ల వాడిలో వైరాగ్యం పొటమరిస్తుంది. దానివల్ల తృష్ణ క్షీణిస్తుంది. ఆధ్యాత్మిక శాస్త్రంమీద శ్రద్ధ పెరుగుతుంది. మోక్షాన్ని గురించిన విచారణ మొదలౌతుంది. ఇదే మొదటి యోగ భూమిక. దీని పేరు శుభేచ్ఛ. 'శుభం' అంటే మోక్షం. దానిమీద ఇచ్ఛ ఇక్కడ మొదలౌతుంది గనుక దాని పేరు శుభేచ్ఛ.

2. క్రమంగా వాడు శ్రవణ మననాది విచారణ కోసం గురువులను ఆశ్రయించడం మొదలు పెడతాడు.

స్వయంగా తన మనస్సులో తనే మథన కూడా ప్రారంభిస్తాడు. వాడిలో అరిషడ్వర్గాలు అడుగంటి, అసలు విషయం అర్థమవడం ప్రారంభమౌతుంది. ఇది రెండవ భూమిక. దీని పేరు విచారణ. ఈ దశలో మనస్సులోనూ, వెలుపలా విచారణ ప్రధానంగా వుంటుంది గనుక, ఈ భూమిక  పేరు విచారణ.

3. ఆ తరువాత శాస్త్రాల నిర్ణయం విషయంలో సందేహాలు తగ్గిపోతాయి. క్రమంగా అతడు తాపసాశ్రమాలలో నివసించడానికి ఉత్సాహం చూపిస్తాడు. వైరాగ్యం పెరుగుతుంది. వేదాంతాభ్యాసం పెరిగి యథార్థమైన వస్తువు మీద దృష్టి పెరుగుతుంది. ఇదంతా ప్రాపంచిక విషయాల మీద సంసక్తి తగ్గి పోవడంవల్ల వచ్చిన ఫలితం. అందుకే ఈ భూమిక పేరు అసంసక్తి.

ఈ భూమికకు మూలకారణమైన అసంగం రెండు రకాలు. మొదటిది సాధారణ అసంగం. 'నేను కర్తనూ గాదు, భోక్తనూ గాదు'  అనే ఈ రకమైన రూపంలో వుంటుంది ఇది. ఇది సజ్జన సాంగత్యంవల్ల, శ్రవణ మననాదులవల్ల పెరుగుతూ వుంటుంది.

ఈ సాధారణ అసంగం ముదరగా ముదరగా 'నేను కర్తను గాదు, ఈశ్వరుడే కర్త' అనే భావాలు గూడా మరుగున పడిపోయి, కేవలం అకర్తృత్వంతో మౌనంగా వుండిపోతాడు. ఇక్కడ నిదిధ్యాసనం ప్రారంభం అవుతుంది. అది నిర్వికల్ప సమాధిలోకి దారి తీస్తుంది. ఇది శ్రేష్ఠమైన అసంగం. ఇది మూడో భూమిక. ఇదే అసలైన  అసంసక్తి.

రామా! ఈ మూడు భూమికలలోనూ మొదటి భూమిక ఐన 'శుభేచ్ఛ' ఎలా మొలకెత్తుతుందో చెప్పడం కష్టం. అనేక జన్మాల పుణ్యాలు కలిసి వచ్చి ఇది మొలకెత్తుతుంది. ఒకప్పుడు అది వైరాగ్యం ద్వారా మొలకెత్తుతుంది.ఒక్కోసారి శాంతి ద్వారా మొలకెత్తుతుంది. ఒక్కోసారి భక్తి ద్వారా మొలకెత్తుతుంది. ఇలా అనేకరకాలుగా మొలకెత్త వచ్చు. సాధకుడు తనకు శుభేచ్ఛ ఏ మార్గంలో మొలకెత్తుతోందో గమనించుకొని, ఆ అంశాన్ని అభివృద్ధి పరచుకోవాలి. ఆ అంశం పెరిగిన గొద్దీ, ప్రథమభూమిక తనే అందుకుంటుంది. ప్రథమ భూమిక గట్టిపడ్డ కొద్దీ, పై భూమికలు తమే అందుకుంటాయి.

**శ్రీరాముడు**: గురుదేవా! ఒకడు  సద్వంశంలో పుట్టలేదు. సజ్జన సాంగత్యం లేదు. ఆధ్యాత్మిక ప్రసంగాల మీద ఆసక్తీ లేదు. అలాంటివాడికి మోక్షోపాయం ఏదైనా వున్నదా?

**వశిష్ఠుడు**: రామా! అలాంటివాడికి సంసారమే ఖాయం. జన్మ పరంపరా చక్ర పరిభ్రమణంలో ఎప్పుడో అప్పుడు, పుణ్యం కలిసి వచ్చి, మొదటి భూమిక వాడికి అందాలి. అంత కంటే మరో ఉపాయం లేదు.

**శ్రీరాముడు**: సరే !ఒకడికి భూమికలు అందాయి.వాడు  ప్రార్థన మొదలుపెట్టాడు. వాడికి ఒకటో భూమికలోనో,రెండో భూమికలోనో, మూడో భూమికలోనో, నాలుగో  భూమికలోనో, వుండగా మరణం సంభవించిందనుకుంటే, అప్పుడు వాడి గతి ఏమిటి? పై జన్మలలో మళ్ళీ మొదటినుంచీ కొట్టుకోవలసిందేనా?

**వశిష్ఠుడు**: అలా కాదు. యోగభూమిక పెరిగిన కొద్దీ పాపం నశిస్తూ వస్తుంది. అందుచేత యోగభూమికల నెక్కినవాడు, మధ్యలో మరణిస్తే, ఆ యోగభూమిక యొక్క అంశను బట్టి, పుణ్యలోకాలలో జన్మ లభిస్తుంది. అక్కడ కొంత కాలం భోగాలు అనుభవించినాక, ఆ యోగి పరిశుద్ధుడైన శ్రీమంతుల ఇళ్లలో గానీ, లేదా గుణవంతులైన సజ్జనుల గృహాలలో గానీ, మానవ జన్మ ఎత్తుతాడు. అక్కడ  పూర్వ జన్మవాసనా బలంచేత, పూర్వం తాను ఏ రకమైన యోగాభ్యాసం చేశాడో, దానినే  కొనసాగిస్తాడు.

రామా! ఇప్పటి వరకూ చెప్పిన మూడు భూమికలలోనూ, ప్రపంచం భేద బుద్ధితో కనిపిస్తూ వుంటుంది గనుక, ఈ మూడిటినీ కలిపి 'జాగ్రత్ భూమిక'అంటారు. ఈ భూమికల నందుకున్న వారికి లోకంలో కొంత గౌరవం పెరుగుతుంది. వారి గౌరవాన్ని చూసి ఇతరులకు కూడా ఈ మార్గం మీద ఆసక్తి పెరుగుతుంది.

**(గమనిక–** వశిష్ఠ మహర్షి ఉత్పత్తి ప్రకరణతో చెప్పిన పట్టికలలో మూడవ భూమిక పేరు 'తనుమానస'. 5వ భూమిక పేరు 'అసంసక్తి' అన్నాడు. ఇక్కడ ఎందుకో మూడవ భూమికనే అసంసక్తి అని పిలుస్తున్నాడు. రాబోయే 4,5 భూమికలకు పేర్లే పెట్టలేదు. 6వ దానికి పాత పేరు 'పదార్థాభావన'. ఇప్పుడు పెట్టబోయే పేరు "తుర్య". ఏడవ భూమికకు పాత పేరు 'తుర్యగ'. ఇప్పుడు పెట్టబోయే పేరు 'విదేహముక్తత' ఇలా మూడు సార్లు పేర్లు మార్చడాన్ని బట్టి, ఈ పేర్ల మీద ఆయనకు ఆస్థ లేదనీ, కేవలం విషయమే ముఖ్యమనీ, మనకు అర్థమవుతుంది. ఇక్కడ భూమికలను జాగ్రత్ స్వప్న సుషుప్తులుగా విభాగం చేయడం గూడా గమనించ దగ్గ విషయమే.)

4. ఇక నాల్గవ భూమికలో నిర్గుణ చైతన్య సాక్షాత్కారం ప్రారంభమవుతుంది. మూడవ భూమికను గట్టి చేసుకున్న కొద్దీ నాల్గవది అందుకుంటుంది. దీనిని అందుకున్నవాళ్ళు ప్రపంచాన్ని స్వప్న సమానంగా చూస్తారు. అందుకే దీన్ని స్వప్న భూమిక అంటారు. (ఉత్పత్తి ప్రకరణంలోని పట్టీని బట్టి ఈ భూమిక పేరు 'సత్త్వాపత్తి')
5. ఐదవ భూమికలో ద్వైతవాసన ఏ మాత్రం మిగిలి వుండదు. స్వస్వరూప అనుభవం నిశ్చలంగా వుంటుంది. ఈ స్థితిలో వున్నవాడు బాహ్యంగా కొన్ని పనులు చేస్తూ వున్నా, లోలోపల మాత్రం సుషుప్తి స్థితిలో వున్నట్లుగా వుంటాడు. అందువల్లే ఈ స్థితిని సుషుప్తి భూమిక అన్నారు. పాత పట్టిక ప్రకారం, ఈ భూమిక పేరు 'అసంసక్తి'. దీనిని అందుకున్నవాడి పేరు 'బ్రహ్మ విద్వరుడు'
6. ఐదవ భూమిక బాగా గట్టిపడిన కొద్దీ ఆ యోగి, ఆరవ భూమికలోకి ప్రవేశిస్తాడు. దీని పేరు 'తురీయ'. ఇతడు పరిపూర్ణంగా జీవన్ముక్తుడు. కేవలం ప్రారబ్ధ బలం చేత శరీరం ధరించి వుంటాడు. లోపలా వెలుపలా కూడా, ఆనంద పరిపూర్ణుడై వుంటాడు. పాత పట్టీ ప్రకారం ఈ భూమిక పేరు 'పదార్థాభావన'. దీనిని పొందినవాడి పేరు 'బ్రహ్మవిద్వరీయాన్'
7. ఏడవభూమిక పేరు 'విదేహముక్తత'. దీనిని గురించి చెప్పేందుకు మాటలు లేవు. ఈ స్థితిని కొందరు శివుడన్నారు. కొందరు 'పరబ్రహ్మ' అన్నారు. కొందరు 'ప్రకృతి పురుష వివేకం' అన్నారు. కొందరు స్వర్గం అన్నారు. ఇలా అనేక మంది అనేక రకాల పేర్లు పెట్టారు. ఈ స్థితిని అందుకున్నవాడికి ఇక మళ్ళీ దుఃఖం అంటే ప్రసక్తి లేదు. పాతపట్టీ ప్రకారం, ఈ భూమిక పేరు 'తుర్యగ'. దీనిని అందుకున్నవాడి పేరు 'బ్రహ్మ విద్వరిష్ఠుడు'

రామా! ఈ ఏడు భూమికలలో ప్రతి భూమికకూ అడ్డం పడేది కోరిక ఒక్కటే! 'అది కావాలి, ఇది కావాలి' అనే కోరికే పిచ్చెక్కిన మదపుటేనుగు లాగా అడుగడుగునా అడ్డుపడూతూ వుంటుంది. ఈ కోరికే, ఇంద్రియాలుగానూ, వాసనలుగానూ, సంసార దృష్టులుగానూ, రకరకాల రూపాలు తీసుకుంటూ వుంటుంది.

**ఏతావానేవ సంసార**
**ఇదమస్త్వితి యన్మనః ॥** (పూ.స.126.శ్లో.85)
('ఇది కావాలి, ఇది కావాలి' అనే ఆలోచనే సంసారం)

ఇది వుంటే రాగద్వేషాదులు మనస్సును ఆవరిస్తాయి. అప్పుడు ఏ ఉపదేశాలూ మనస్సుకు పట్టవు. ప్రత్యాహార ప్రక్రియలతో ఆశను ఎప్పటికప్పుడు వెనక్కు లాగుతూ వుండాలి. పదార్థాలను భావించకుండా వుండడాన్ని మనస్సుకు నేర్పాలి. సంకల్పాలను ఆపుకోవాలి.

**ఊర్ధ్వ బాహుర్విరౌమ్యేష**
**న చ కశ్చిత్ శృణోతి తత్ ।**
**అసంకల్పః పరం శ్రేయః**
**స కిమన్తర్న భావ్యతే ॥** (పూ.స.126. శ్లో.94)

(చేతులెత్తుకొని అరుస్తున్నా. ఒక్కడూ నా మాట వినడంలేదు. సంకల్పం లేకుండా ఉండడమే ఉత్తమోత్తమమైన శ్రేయస్సు. దానిని ఎందుకు ఆచరించరు?)
రామా! మళ్ళీ చెబుతున్నా విను-

**బహునాత్ర కిముక్తేన**
**సంక్షేపాదిదముచ్యతే ।**
**సంకల్పనంపరో బంధ ః**
**తదభావో విముక్తతా ॥** (పూ.స.126. శ్లో.97)

(ఎక్కువ మాట లెందుకు? సంగ్రహంగా చెబుతా విను. సంకల్పమే బంధం. దానిని వదిలించుకోవడమే విముక్తి.) ఈ విషయాన్ని గ్రహించి, అహంకార మమకారాలను పరిత్యజించు.

**అహం మమేతి సంవిదన్**
**న దుఃఖతో విముచ్యతే**
**అసంవిదన్ విముచ్యతే**
**యదీప్సితం సమాచర ॥** (పూ.స.126. శ్లో102)

రామా! 'నేను నాది' అనే ఆలోచనలు వున్నంత కాలమూ దుఃఖం పోదు. అవి పోతే దుఃఖం పోతుంది. ముక్తి లభిస్తుంది. నీకు ఏది కావాలంటే,అదే చేసుకో!

**(గమనిక-** ఇక్కడితో వాల్మికి మహర్షి ఈ నిర్వాణ ప్రకరణ పూర్వార్థంలో చెప్పదలచు కున్న విషయం పూర్తయింది. కానీ, ఈ విషయం అంతా అవతార పురుషుడైన రాముడికి చెప్పినట్లయింది. గ్రంథ ప్రారంభంలో, వైరాగ్య ప్రకరణంలో

**నాత్యన్తమజ్ఞో నోతజ్ఞః**
**సోऽస్మిన్ శాస్త్రేऽధికారవాన్॥** (వైరాగ్య ప్రకరణం స.2 శ్లో.2)

(బొత్తిగా తెలియనివాడూ కాదు, బాగా తెలిసినవాడూ గాదు, అలాంటి సామాన్యుడే ఈ గ్రంథాన్ని చదవడానికి అర్హుడు) అని వాల్మికి మహర్షే స్వయంగా చెప్పాడు. అందువల్ల, ఇప్పుడు వశిష్ఠుడు చెప్పిన విషయాల్నీ సామాన్య సాధకుడికి ఎలా అన్వయిస్తాయో చెప్పవలసిన బాధ్యత ఒకటి మిగిలి వుంది. దాని కోసం వాల్మీకి భరధ్వాజ సంవాద రూపంగా రెండు సర్గలను వెచ్చించి, వాల్మికి మహర్షి ఈ పూర్వార్థాన్ని ముగించబోతున్నాడు. భరద్వాజుడంటే, వాల్మికి మహర్షి శిష్యుడు, రామాయణాన్ని దేవలోక సభలలో గానం చేసినవాడు, యోగవాశిష్ఠ గ్రంథానికి ప్రథమ శ్రోత. ఈ విషయాలను దృష్టిలో పెట్టుకొని, మనం 127వ సర్గలోకి ప్రవేశిద్దాం.)

### 78. భరద్వాజోపదేశము

***భరద్వాజుడు***: గురుదేవా! వశిష్ఠమహర్షి ఇంత చెప్పాడు గదా! శ్రీరాముడు స్వయంగా అవతార పురుషుడు గదా! ఆయన ఇంకా సందేహాలు అడిగాడా? లేక జ్ఞాన పరిపూర్ణుడై వుండిపోయాడా?

గురుదేవా! శ్రీరాముడు అవతార పురుషుడు. స్వేచ్ఛగా అజ్ఞానాన్ని ఆహ్వానించి, పరుల కోసం ఇంత సంభాషణ చేశాడు. ఆయనకు జ్ఞానం అందుకోవడంలో కష్టం ఏముంది?

మరి నా బోటివాళ్ల గతి ఏమిటి? నా సాధన అత్యల్పం. నా అజ్ఞానం అతి సాంద్రం. అందుచేత, ఆత్రంగా అడుగుతున్నాను.

**వాల్మీకి** : భరద్వాజా! ఇక రాముడికి ప్రశ్నలేవీ తోచలేదు.మౌనంగా నిశ్చలంగా వుండి పోయాడు.

**భరద్వాజుడు** : గురుదేవా! అదే ఆశ్చర్యం. రాముడికీ, వశిష్ఠుడికీ, జరిగిన సంభాషణ అంతా మీ ద్వారా నేనూ విన్నాను. నేను ఇలాగే వున్నాను. రాముడు సమాధిలోకి వెళ్ళిపోయాడు. నాలాంటి అల్పులు తరించేదెలా?

**వాల్మీకి** : భరద్వాజా! ఏదీ దాచకుండా మొత్తం అంతా నీకు చెప్పా. ఇక ఈ విషయాన్ని నీలో నీవే చర్చించుకొని, మథించుకొని, తరచి చూచుకొని, ఒక నిశ్చయానికి రావలసివుంది. అది నువ్వు చెయ్యవలసిన పని. ఐతే, రామ వశిష్ఠుల సంభాషణ అంతా

**"యతో వా ఇమాని భూతాని జాయన్తే**
**యేన జాతాని జీవన్తి-యత్ప్రయంత్యభిసంవిశన్తి"**

అనే వేదవాక్యంయొక్క మార్గంలో నడిచాయి. ఇది గాక అవస్థా త్రయాన్ని విచారణ చేయడం ద్వారా తత్త్వ నిర్ణయం చేసే విధానం ఒకటి వుంది. అది సులభమే కదా అని, వశిష్ఠుడు శ్రీరాముడికి, దానిని ప్రత్యేకించి వివరించకుండా, ప్రాసంగిక వాక్యాలలో కలిపేశాడు. నీ కోసం, ఆ అవస్థాత్రయ విచారణ సంగ్రహంగా చేసి పెడతా, విను.

మిత్రమా! నీకు మహావాక్యాల అర్థం తెలుసు. ఐనా సరే,చైతన్యం కంటే భిన్నంగా ఈ ప్రపంచం వుందని భావిస్తూ, నీకు నువ్వే అడ్డాలు కల్పించుకుంటున్నా వెందుకు? ఇప్పటికైనా నేను చెప్పే ఉపాయాలను అనుష్ఠించి చిత్తశుద్ధి సాధించుకో.

భరద్వాజా! అవస్థాత్రయాన్ని గురించి కూడా నీకు ఎక్కువగా చెప్పనక్కర లేదు. ' ఈప్రపంచం సత్యం' అనే మనో వృత్తిని 'జాగ్రన్నిద్ర' అంటారు. 'మెలకువగా ఉన్నానని' వాడంటాడు. కానీ నిజానికి వాడు అజ్ఞాన నిద్రలో వున్నాడు. అందుకే ఈ స్థితిని 'జాగ్రన్నిద్ర' అంటున్నాను.

అలాంటి హృదయంలో చైతన్యం అనే దీపం వెలిగితే, ఈ అజ్ఞాన నిద్ర పోతుంది. అజ్ఞానం పోతే ప్రపంచమే పోయింది. కనుక నువ్వు అజ్ఞానాన్ని వదిలేసి జ్ఞాన దీపాన్ని వెలిగించుకో.

**ప్రాజ్నా స్తి చరమే నాస్తి**
**వస్తు సర్వమిదం సఖే ।**
**విద్ధి మధ్యేఽపి తన్నాస్తి**
**స్వప్నవృత్త మిదం జగత్ ॥** (పూ. స. 127. శ్లో.19)

సఖా! భరద్వాజా! ఈ ప్రపంచం పూర్వం లేదు. చివర్లో లేదు. అందుచేత మధ్యలో కూడా ఇది లేనిదే! లేకపోయినా కనిపిస్తోంది. అందుకే 'ఈ ప్రపంచం ఒక స్వప్నం 'అని గ్రహించు.

ఈ అధ్యాత్మ శాస్త్రం ఎన్ని సార్లు విన్నా, మనస్సులోకి ఎక్కకపోవడానికి కారణం, పూర్వపాపాలే! కనుక ఆ పాపం పోవడం కోసం, నువ్వు మొదట సగుణేశ్వర ఆరాధన చెయ్యి.

జీవుల పాపాలే ఈశ్వరుడి చేతిలోని పాశాలు. కనుక పాపక్షయం కోసం నువ్వు ఈశ్వరోపాసన చెయ్యి.

ఆ తరువాత వైరాగ్యాన్ని సంపాదించుకొని, గట్టి పరచుకో. నిశ్చలంగా కూర్చొని సంసార నాటకాన్ని పరిశీలించు. అమంగళమైన దుఃఖాన్ని విడిచిపెట్టు. చిదానందఘనుడై, స్వచ్ఛుడై, వున్న పరమాత్మను భావించు.

ఇంతకంటే చేయవలసింది లేదు.

**భరద్వాజుడు**: గురుదేవా! మీ అనుగ్రహంవల్ల నాకు తెలియ వలసిన దంతా తెలిసింది.

**న వైరాగ్యాత్పరో బంధుః**
**న సంసారాత్పరో రిపుః ॥** (పూ.స.127. శ్లో.59)

(వైరాగ్యాన్ని మించిన బంధువు లేడు. సంసారాన్ని మించిన శత్రువు లేడు- అని అర్థమైంది)

ఇప్పుడొక చిన్న ప్రార్థన. ఇంత వరకూ వశిష్ఠుడు చేసిన సువిశాలమైన బోధ మొత్తానికీ సారాంశాన్ని సంగ్రహంగా నాకు చెప్పండి.

**79. సాధన సోపానాలు - ప్రవిలాపనలు**

**వాల్మీకి** : భరద్వాజా! ఏది చెప్పినా పూర్వాపర విచారణ చేసి, నిగ్గు తేల్చే నీ ప్రజ్ఞ ఏమైపోయింది? సరే, నేనే చెబుతాను. మాండ్యూక్యము మొదలైన ఉపనిషత్తులలో శ్రుతి చెప్పిన విషయాన్నే వశిష్ఠ మహర్షి బోధించాడు. ఆయన చెప్పిన విషయాలు మెట్లు మెట్లుగా చెబుతాను విను.

1. శమదమాది షట్క సంపత్తిని సాధించుకొని, దాని ద్వారా నిషిద్ధ కర్మలను, కామ్య కర్మలను, మానుకోవాలి.
2. విషయేంద్రియ సంయోగంవల్ల కలిగే సుఖం మీది మోజును తగ్గించుకోవాలి.
3. మనస్సును మృదువుగా చేసుకోవాలి.
4. ఆసన సిద్ధిని సాధించాలి.
5. శ్రద్ధతో మనస్సును నిర్మలం చేసుకొని, ప్రణవజపం ప్రారంభించాలి. దానితోపాటు ప్రాణాయామాలు చేసి, అంతఃకరణ శుద్ధిని సాధించుకోవాలి.
6. అప్పుడు ఇంద్రియాలను విషయాలనుంచి ప్రత్యాహారం చేయాలి, అంటే వెనక్కు గుంజి వేయాలి.
7. అప్పుడు ప్రవిలాపన ప్రక్రియను ప్రారంభించాలి-

**కారణ వ్యతిరేకేణ**
**కార్యస్యాభావ నిశ్చయః ।**
**ప్రవిలాపన మిత్యేతత్**
**తదనన్యత్వ నిశ్చయః ॥**

అని ఆర్యోక్తి. అంటే, కార్యకారణాల మధ్యలో, కారణాన్ని మించి కార్యానికి వేరే అస్తిత్వం లేదు. మట్టిని మించి కుండకు వేరే అస్తిత్వం లేదు! అదీ ఇదీ ఒకటే అనే నిశ్చయాత్మకమైన భావనను ప్రతి మెట్టులోనూ చేసుకుంటూ వెళ్ళాలి. ఇదే ప్రవిలాపనం.

**"వాచారంభణం వికారో**
**నామధేయం-మృత్తికేత్యేవ సత్యం " ॥**

(కుండ అనేది పేరు మాత్రమే. అది కేవలం వికారం (మార్పు). సత్యపదార్థం మట్టే– అనే ఛాందోగ్యపనిషత్తు వాక్యం కూడా ఈ ప్రవిలాపన ప్రక్రియనే సూచిస్తోంది. కనుక భరద్వాజా, దేహం,ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, క్షేత్రజ్ఞుడు, మొదలైన వాటిని ఒకటొకటిగా తీసుకొని, ఏది ఏ కారణంవల్ల జన్మిస్తోందో ఆలోచించుకొని, కార్య రూపాన్ని క్రింది మెట్టుగానూ, అసత్యమైన దానినిగానూ భావించుకుంటూ, నిశ్చయాత్మకమైన బుద్ధితో ఎప్పటికప్పుడు పై మెట్టుకి వెళుతూ వుండాలి. నీకు సులభంగా వుంటం కోసం ఈ మెట్లను కూడా వర్ణిస్తాను, చూడు–

8. మొదట "స్థూల దేహమే నేను" అని ప్రారంభించాలి. చర్మేంద్రియాది సంఘాత రూపమైన ఈ స్థూలదేహం, దేవతాసమష్టి రూపమైన విరాట్ పురుషుడిలో నుంచే వచ్చింది. కనుక విరాట్ పురుషుడు కారణం. స్థూలదేహం కార్యం. అందువల్ల స్థూలదేహం అసత్యం. అందువల్ల అది నేను కాదు, విరాట్ పురుషుడే నేను – అని భావన చెయ్యాలి. దీనినే సంగ్రహంగా 'స్థూలదేహాన్ని విరాట్ పురుషుడిలో ప్రవిలాపన చేయాలి' అంటారు. ఇక పైన ఈ మాటలను ఇలాగే అర్థం చేసుకో.

9. విరాట్ పురుషుడంటే స్థూలభూత సమష్టి. ఇతనికి కారణం సూక్ష్మ భూత లింగ సమష్టి . ఇతని పేరే హిరణ్యగర్భుడు. నీ స్థూలదేహంలో వుండే జీవాత్మను ఈ హిరణ్య గర్భుడిలో ప్రవిలాపన చేయాలి.

10. హిరణ్య గర్భుడికి కారణం త్రిగుణాత్మకుడై, మాయోపాధి కలిగిన, అవ్యాకృతుడు. కనుక హిరణ్య గర్భుడ్ణి అవ్యాకృతుడిలో ప్రవిలాపన చేయాలి.

11. అవ్యాకృతుడికి కారణం సర్వాధిష్ఠానమైన శుద్ధ బ్రహ్మ. కనుక అవ్యాకృతుడ్ణి శుద్ధ బ్రహ్మలో ప్రవిలాపన చేయాలి.

12. ఈ ప్రవిలాపనభావన దృఢపడినాక, దీనిని ప్రణవ జపంతో అనుసంధానం చేయాలి. ఎలాగంటే

ఎ) ప్రణవంలోని 'అ' కారమే విరాట్ పురుషుడు.

బి) ప్రణవంలోని 'ఉ' కారమే హిరణగర్భుడు.

సి) ప్రణవంలోని 'మ' కారమే అవ్యాకృతుడు.

డి) ప్రణవంలోని అర్థమాత్రమే శుద్ధ బ్రహ్మ.

కనుక ప్రణవోపాసన చేసేటప్పుడు 'అ'కారాన్ని ఉకారంలోనూ 'ఉ' కారాన్ని మకారంలోనూ, 'మ' కారాన్ని అర్థమాత్రలోనూ, ప్రవిలాపన చేయాలి.

ఇ) మరో రకమైన ప్రవిలాపన ప్రక్రియ వుంది. ఈ ప్రక్రియలో దేహంలోని భాగాలతో ప్రవిలాపన ప్రారంభం అవుతుంది. అదెలాగంటే–

i) దేహంలోని మాంస భాగానికి కారణం భూమి కనుక, ఈ మాంసం అంతా భూమయమని భావన చేయాలి. అంటే, మాంసాన్ని భూమిలో ప్రవిలాపన చేయాలి.

ii) శరీరంలోని రక్తానికి కారణం జలం కనుక, రక్తాన్ని జలంలో ప్రవిలాపన చేయాలి.

iii) శరీరంలో వుండే వేడి, శక్తి, వాక్కు మొదలైనవి తైజస భాగాలని ప్రసిద్ధి. వాటిని మహా తేజస్సులో ప్రవిలాపన చేయాలి.

iv) శరీరంలో వుండే ప్రాణాది వాయువులు, చలనం, మొదలైనవి వాయు భాగాలు. వాటిని మహావాయువులో ప్రవిలాపన చేయాలి.

v) శరీరంలో వుండే ఆకాశాన్ని, మహాకాశంలో ప్రవిలాపన చేయాలి.

vi) అలాగే ఇంద్రియాలను గూడా వాటి వాటి కారణాలలో ప్రవిలాపన చేయాలి. ఇంద్రియాలకు కారణాలు సూక్ష్మభూతాలు. వీటినే ఆయా దేవతల పేర్లతో వ్యవహరిస్తూ వుంటారు. కనుక ఆయా ఇంద్రియాలను ఆయా

దేవతలలో ప్రవిలాపన చేయాలి. అదెలా గంటే–

vii) చెవి అనే ఇంద్రియాన్ని 'దిగ్దేవత' అనబడే సూక్ష్మాకాశంలో ప్రతిలాపన చేయాలి.

viii) చర్మేంద్రియాన్ని 'విద్యుద్దేవత' అనబడే సూక్ష్మభూమిలో ప్రవిలాపన చేయాలి.

ix) నేత్రేంద్రియాన్ని 'ఆదిత్యు'డనబడే సూక్ష్మతేజస్సులో ప్రవిలాపన చేయాలి.

x) 'నాలుక' అనే ఇంద్రియాన్ని 'వరుణుడు' అనబడే సూక్ష్మజలంలో ప్రవిలాపన చేయాలి.

xi) ముక్కు అనే ఇంద్రియాన్ని ,అలాగే తనలోని ప్రాణాశక్తిని వాయుదేవత అనబడే సూక్ష్మ వాయువులో ప్రలాపన చేయాలి.

xii) వాక్ఛక్తిని అగ్నిలో ప్రవిలాపన చేయాలి.

xiii) హస్తేంద్రియాన్ని ఇంద్రునిలో ప్రవిలాపన చేయాలి

xiv) పాదేంద్రియాన్ని విష్ణువులో ప్రవిలాపన చేయాలి.

xv) విసర్జనేంద్రియాన్ని మిత్రదేవతలో ప్రవిలాపన చేయాలి.

xvi) ఉపస్థేంద్రియాన్ని కశ్యప ప్రజాపతిలో ప్రవిలాపన చేయాలి.

xvii) మనస్సును చంద్రుడిలో ప్రవిలాపన చేయాలి.

xviii) బుద్ధిని బ్రహ్మయోనిలో ప్రవిలాపన చేయాలి.

13. భరద్వాజా! ఈ దేవతాత్మకమైన ప్రవిలాపనలనన్నిటినీ, నేను వేద ప్రమాణాన్ని బట్టే చెబుతున్నాను. నేను స్వంతంగా కల్పించినవి గావు. సమష్టిలోని దేవతా శక్తులే వ్యష్టిలోని ఇంద్రియ శక్తులుగా దిగివచ్చాయి గనుక, శ్రుతి ఈ విధంగా శాసిస్తోందని నువ్వు గ్రహించు.

14. ఈ రెండవ ప్రవిలాపన ప్రక్రియలో కూడా చివరికి మిగిలేది, 'తాను విరాట్ పురుషుణ్ణ'నే భావనే. ఈ విరాట్ పురుషుడికే అర్ధ నారీశ్వరుడని మరో పేరు. ఇతడే సమస్త పంచభూతాలకూ ఆధారం.

15. ఈ విరాట్ పురుషుణ్ణి హిరణ్య గర్భుడిలో ప్రవిలాపన చేయాలని పూర్వమే చెప్పాను. దానికి మరొక ప్రక్రియ కూడా వుంది. అది కూడా చెబుతాను, విను.

16. ఈ బ్రహ్మాండం వుంది గదా, దానికి రెండు రెట్లు పంచీకృత భూమి వుంది. దానికి రెండు రెట్లు పంచీకృత జలం వుంది. దానికి రెండు రెట్లు పంచీకృత అగ్ని వుంది. దానికి రెండు రెట్లు పంచీకృత వాయువు వుంది. దానికి రెండు రెట్లు పంచీకృత ఆకాశం వుంది.

17. కొన్ని చోట్ల ఈ పంచ భూతాలూ ఒకదానికంటే ఒకటి 'పదేసి రెట్లు ఎక్కువ' అని వాక్యాలున్నాయి. అపంచీకృత పంచభూతాలను దృష్టిలో పెట్టుకొని, ఆ లెక్కలు చెప్పారు. నేను పంచీకృత భూతాలను దృష్టిలో పెట్టుకొని ఈ లెక్క చెప్పాను.

(**గమనిక** – వేదాంతుల సృష్టి ప్రక్రియ ప్రకారం సృష్టి మూడు రకాలు. 1. కారణ సృష్టి 2. సూక్ష్మ సృష్టి 3. స్థూల సృష్టి. వీటిలో కారణ సృష్టి అంటే, మూల ప్రకృతి. దీనిలోంచి వచ్చే ఆవరణ శక్తి, విక్షేప శక్తులే సూక్ష్మసృష్టి. ఆవరణ శక్తి అంటే వున్న సద్వస్తువును కనిపించకుండా చేసే శక్తి. విక్షేప శక్తి అంటే, అసలు వస్తువు స్థానంలో వివిధ పదార్థాలను చూపించే శక్తి. ఈ విక్షేపశక్తి మూల ప్రకృతియొక్క అంశ గనుక, దీనిలో త్రిగుణాలుంటాయి. దీనిలోంచి సూక్ష్మ పంచభూతాలు ఆవిర్భవిస్తాయి. వీటికే అపంచీకృత పంచభూతాలని మరో పేరు. వీటియొక్క సత్త్వగుణాంశలలోంచి పంచ జ్ఞానేంద్రియాలు జన్మిస్తాయి. వీటియొక్క రజోగుణాంశలలోంచి పంచకర్మేంద్రియాలు జన్మిస్తాయి. ఇక వీటిలో మిగిలి వున్న తమోగుణాంశలు అయిదూ గూడా ఒక క్రమంలో ఒక దానితో ఒకటి కలిసి పోతాయి. ఎలాగంటే–)

సూక్ష్మ భూమిని ఉదాహరణగా తీసుకుంటే, దీనిని రెండు భాగాలుగా చేయాలి. అందులో ఒక భాగం అలాగే వుండి పోతుంది. మిగిలిన అర్ధ భాగం నాలుగు ముక్కలౌతుంది. ఆ నాలుగు ముక్కల స్థానంలోనూ, ఈ క్రింది బొమ్మలో చూపించినట్లుగా ఇతర భూతాల అంశలు వచ్చి చేరతాయి.




ఇప్పుడిది పంచీకృత భూమి ఔతుంది. దీనికే మరో పేరు స్థూల భూమి. సూక్ష్మభూమి ఇంద్రియ గోచరం కాదు. స్థూల భూమి ఇంద్రియ గోచరం ఔతుంది. ఇలాగే, మిగిలిన భూతాల విషయంలో గూడా పంచీకరణ ప్రక్రియను ఊహించుకో గలం. మానవులకు ఇంద్రియ గోచరమయ్యే పంచభూతాలలో ఏ ఒక్కటీ స్వచ్ఛం గాదు. ప్రతి దాంట్లోనూ ఇతర చతుర్భూతాల అంశలూ కలిసి వుండనే వుంటాయి. ఇలా పంచ భూతాలు కలిసే ప్రక్రియను పంచీకరణం అంటారు. ఇలా కలవగా ఏర్పడిన పంచభూతాలను పంచీకృత పంచభూతాలు అంటారు.

18. భరద్వాజా! ఈ లెక్కల మాట ఎలా వున్నా, ఈ ప్రవిలాపన ప్రకరణంలో మనకు కావలసింది ఒక భూతానికి మరొకటి కారణం. కారణం పెద్దది, కార్యం చిన్నది. వీటన్నిటినీ ఒకదానిలో ఒకటి ప్రవిలాపన చేసుకుంటూ రావాలి. భూమికి కారణం జలం గనుక, భూమిని జలంలో ప్రవిలాపన చేయాలి. అలాగే జలాన్ని అగ్నిలో ప్రవిలాపన చేయాలి. అగ్నిని వాయువులో ప్రవిలాపన చేయాలి. వాయువును ఆకాశంలో ప్రవిలాపన చేయాలి.

19. ఇలా ప్రవిలాపన చేస్తే, ఆ యోగికి లింగశరీరం మాత్రమే మిగిలి వుంటుంది.

**వాసనా భూత సూక్ష్మాశ్చ**
**కర్మావిద్యే తథైవ చ ।**
**దశేంద్రియ మనోబుద్ధి**
**రేతల్లింగం విదుర్బుధాః ॥** (పూర్వ. స. 128, శ్లో.19)

(ఇక్కడ లింగశరీరం అంటే, పూర్వ వాసనలు, సూక్ష్మభూతాలు ఐదు, కర్మ, అవిద్య, జ్ఞాన కర్మేంద్రియాలు పది, మనస్సు, బుద్ధి ఈ ఇరవై అంశాల గుత్తి)

20. ఈ విధమైన ప్రవిలాపన ప్రక్రియవల్ల ఆ యోగి స్థూలోపాధిని దాటి వైయక్తిక సూక్ష్మ శరీరం దగ్గరికి వస్తాడు. దానివల్ల వాడిలో సగం వదిలిపోయినట్లూ, సూక్ష్మభాగం మాత్రం మిగిలి వున్నట్లూ అవుతుంది. ఈ సూక్ష్మ వైయక్తిక భాగాన్ని సూక్ష్మ సమష్టిఐన హిరణ్యగర్భుడిలో ప్రవిలాపన చేయాలి.

21. భరద్వాజా! నీకొక సందేహం రావచ్చు. హిరణ్యగర్భుణ్ణి చతుర్ముఖ బ్రహ్మ అంటారు గదా, చతుర్ముఖ బ్రహ్మ పద్మంలోంచి పుట్టాడంటారు గదా, అంటే – అతనికి ఒక వైయక్తిక దేహం వున్నట్టే గదా, ఇతడు

సమష్టి స్వరూపుడు ఎలా అవుతాడు?– అని! ఇది పెద్ద చిక్కేమీ గాదు. సూక్ష్మ సమష్టి స్వరూపుడైన హిరణ్యగర్భుడే, ఈ బ్రహ్మాండ కల్పనకోసం, ముందుగా తనకొక చతుర్ముఖ దేహాన్ని కల్పించుకున్నాడు. అది కల్పిత దేహమే గనుక, సాధకుడు దానిని పట్టించుకోకుండా, హిరణ్యగర్భాకారంలోనే, తనను తాను ప్రవిలాపన చేసుకోవాలి.

22. ఈ పట్టికలోనే 10,11 మెట్లలో చెప్పినట్లుగా, హిరణ్యగర్భుణ్ణి అవ్యాకృతం లోనూ, అవ్యాకృతుణ్ణి శుద్ధ చైతన్యంలోనూ, ప్రవిలాపన చేయాలి.

23. పై చెప్పినవాటిల్లో అవ్యాకృత స్థితినే, సాంఖ్యులు 'ప్రకృతి' అంటారు. వేదాంతులు 'మాయ' అంటారు. తార్కికులు 'అణువులు' అంటారు. బౌద్ధులు 'సంవృతిరూపమైన అవిద్య' అంటారు. ప్రళయ కాలంలో ప్రాపంచిక పదార్థాలన్నీ ఈ అవ్యాకృతం లోనే లీనమై పోతాయి. అప్పుడు వాటికి వేరుగా అస్తిత్వం లేదు. మళ్ళీ సృష్టి సమయంలో, అవ్యాకృతంనుంచే బైటికి వస్తాయి. ఆకాశాది క్రమంలో సృష్టి జరుగుతుంది. దానికి తల్లక్రిందులుగా, భూమ్యాది క్రమంలో సంహారం జరుగుతుంది. అందుకే ప్రవిలాపన ప్రక్రియను సంహార విధానంలో ఏర్పాటు చేశారు.

24. ఈ విధానాన్ని మాండూక్యోపనిషత్తులో ఒక మంత్రంలో శ్రుతి మాత సూచించింది.

**"నాంతఃప్రజ్ఞం న బహిః ప్రజ్ఞం**
**న ప్రజ్ఞం నా ప్రజ్ఞం**
**న ప్రజ్ఞాన ఘనమ్"**

(అది లోపలి ప్రజ్ఞా గాదు, బయటి ప్రజ్ఞా కాదు, ప్రజ్ఞ కలదీ కాదు, ప్రజ్ఞ లేనిదీ గాదు. అది ఘనీభవించిన ప్రజ్ఞానమూ కాదు.)

ఈ వాక్యభాగంచేత ఆ ఉపనిషత్తు త్యాగ విధానాన్ని సూచిస్తోంది. అటు తరువాత,

**"అదృశ్య మవ్యవహార్య మగ్రాహ్య**
**మలక్షణ మచింత్య మవ్యపదేశ్య**
**మేకాత్మ ప్రత్యయసారం**
**ప్రపంచోపశమం శివం శాన్త**
**మద్వైతం చతుర్థం మన్యన్తే"**

(అది దృశ్యం గాదు. అది వ్యవహార యోగ్యం కాదు. అది స్వీకార యోగ్యం కాదు. దానికి లక్షణమే లేదు. అది ఊహ కందదు, మాట కందదు. అది అద్వితీయాత్మ బుద్ధికి సారం. అక్కడ ప్రపంచం ఉపశమించి పోతుంది. అది మంగళ స్వరూపం. శాంతం. అద్వితీయం. దానిని నాలుగో అవస్థ అనుకుంటూ వుంటారు.)

– అనే వాక్య భాగంచేత, ఆ మంత్రం ధ్యేయ వస్తువును సూచిస్తోంది. ఇలాంటి శ్రుతులను ఆధారం చేసుకొనే, పై ప్రవిలాపన ప్రక్రియ అంతా మహర్షులచేత ఉపదేశింప బడుతోంది.

25. ఈ విధంగా ధ్యానబలం చేత, ధ్యాన కర్తయైన లింగ శరీరాన్ని గూడా ప్రవిలాపన చేసుకొని, మూలాజ్ఞానాన్ని నివర్తింప జేసుకొని, సర్వోన్నతమైన బ్రహ్మానుభూతిని పొందాలి.

భరద్వాజా! వశిష్ఠమహర్షి చేసిన విశాలమైన ఉపదేశానికి సారం ఇదే.

**భరద్వాజుడు**: గురుదేవా! నాకు విషయం పూర్తిగా అర్థమైంది. నాకిప్పుడు 'లింగదేహం' అనే బంధం లోంచి విముక్తి లభించింది. నేను అద్వితీయ పరబ్రహ్మ స్వరూపుణ్ణనే నిశ్చయం కలిగింది.

**వాల్మీకి**: మిత్రమా! భరద్వాజా! అలా ఐతే, కర్మలనన్నిటినీ సంన్యసించి, పరబ్రహ్మయందు ఆసక్తుడివు కా.

## 80. కర్మసంన్యాసం - ఎవరు - ఎప్పుడు చేయాలి?

**భరద్వాజుడు**: ఒక సందేహం మిగిలి వుంది. జీవన్ముక్తి లభించిన తరువాత ఆ వ్యక్తియొక్క కర్తవ్యం ఎలా వుంటుంది? అతడు కర్మలు చేయాలా? అక్కర్లేదా? ఒకవేళ చెయ్యాలనేటట్లైతే, నిత్య నైమిత్తిక కామ్య కర్మలన్నీ చేయాలా? లేక నిష్కామ కర్మ మాత్రమే చేయాలా?
**వాల్మీకి**: సర్వకర్మ సంన్యాసం గురించి వివరణలన్నీ విన్నాక, ఇదేం ప్రశ్నయ్యా?
**భరద్వాజుడు**: కొన్ని వేద వాక్యాలను బట్టి సందేహం కలుగుతోంది.

**"యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి"** (యజుర్వేదం)
(బ్రతికి ఉన్నంత కాలమూ అగ్నిహోత్రంలో హోమాలు చెయ్యాలి)

**"కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతగ్ం సమాః"**
(ఈశావాస్యోపనిషత్)
(ఈ జన్మలో కర్మలను చేస్తూనే, వందేళ్ళు బ్రతకాలని కోరుకోవాలి.)

అని ఇలాంటి వేద వాక్యాలన్నీ జీవితాంతమూ కర్మలను చేస్తూనే వుండాలని చెబుతున్నాయి. మధ్య మధ్యలో పెద్ద పెద్ద యాగాలు చేస్తూ వుంటారు. ఆ యాగాల సమయంలో నిత్యాగ్ని హోమాదులు చేయనక్కర లేదు. కానీ, ఆ యాగాలు పూర్తైపోయిన తరువాత మళ్ళీ నిత్య విధులు మొదలెట్టాలి. అలాగే, జ్ఞానం కోసం ప్రయత్నం చేస్తున్నంత కాలమూ కర్మలను వదిలి పెట్టినా, జ్ఞానం సిద్ధించిన తరువాత, మళ్ళీ కర్మలను మొదలు పెట్టాలేమోనని సందేహించి, ఈ ప్రశ్న వేస్తున్నాను.
**వాల్మీకి**: భరద్వాజా! మొదట కామ్య నిషిద్ధ కర్మలను విడిచి పెట్టాలి. ఆ తరువాత జ్ఞానానికి విరోధులైన ఇతర కర్మలను గూడా విడిచి పెట్టాలి. అప్పుడు నేను చెప్పిన జ్ఞాన భూమికలలో ఒక్కొక్క మెట్టూ అందుతున్న కొద్దీ, కర్మ పరిత్యాగం విషయంలో ఎప్పుడు ఏం చేయాలో నీ అంతట నీకే తెలుస్తుంది.

ప్రారబ్ధ కర్మ రకరకాలుగా వుంటుంది కనుక, ఒక జ్ఞాన భూమిక నందుకున్న జ్ఞానులందరి ప్రవర్తనా ఒకే రకంగా వుంటుందని చెప్పలేం. అవస్థాత్రయాన్ని దాటి, తురీయ పదవిని అందుకుంటే, ఆ జ్ఞానికి ద్వైత స్ఫూర్తి వుండదు గనుక, అతనికి కర్మ ప్రసక్తి వుండదు. ఐతే, ప్రారబ్ధ ప్రాబల్యం చేత, ఒకానొక జ్ఞాని, జ్ఞాన సిద్ధి తరువాత గూడా కర్మలు చేసినా చేయవచ్చు. అది అతని ఇచ్ఛాధీనం.

ఇక జ్ఞాన సాధన ప్రక్రియలో భాగంగా, వివిదిషా సంన్యాసాన్ని స్వీకరించిన వ్యక్తి విధి పూర్వకంగా కర్మలనన్నిటినీ పరిత్యాగం చేస్తాడు గనుక, అతడు మళ్లీ కర్మలను స్వీకరించే సావకాశం లేదు.

కనుక ఓ భరద్వాజా! నీ మనస్సును జ్ఞానమయం చేసుకో. జ్ఞాన మార్గంలో వెళ్లినా, యోగ మార్గంలో వెళ్ళినా, అదే లక్ష్యాన్ని అందుకో గలవు. అభ్యాసాన్ని మాత్రం వదల కూడదు. అభ్యాసంవల్ల సర్వం సిద్ధిస్తుందని వేద శాసనం. అందు చేత నువ్వు మిగిలిన దంతా విడిచి పెట్టి, అభ్యాసంలో సుస్థిరంగా వుండు.

## 81. శ్రీరామ వ్యుత్థానం

**భరద్వాజుడు**: గురుదేవా! శ్రీరాముడు జ్ఞాన నిష్ఠాబలంతో బ్రహ్మైక స్థితిని సాధించాడు గదా! అలాంటి రాముడిని వశిష్ఠుడు మళ్ళీ వ్యవహారంలోకి ఎలా దింపాడు? ఆ విషయం తెలుసుకుంటే, నేను గూడా జ్ఞాన స్థితిలో వుండి వ్యవహారాలు చేయ గలుగుతానని అనిపిస్తోంది.

**వాల్మీకి**: భరద్వాజా! శ్రీరాముడు ఆ విధంగా, నిర్వికల్ప సమాధి నందుకునే సరికి విశ్వామిత్ర మహర్షి ఇలా అన్నాడు.

**విశ్వామిత్రుడు**: మహాభాగా! వశిష్ఠా! నీ శక్తి అద్భుతం! శిష్యుడికి శక్తిపాతం చేసి తక్షణమే నిర్వికల్ప సమాధిలోకి తీసుకొని పోయి, నీ సామర్థ్యాన్ని నిరూపించుకొన్నావు. దర్శనంవల్ల, స్పర్శనంవల్ల, బోధనంవల్ల, ఇలా జ్ఞానావేశం కలిగించగలవాడే నిజమైన గురువు.

వశిష్ఠ మునీంద్రా! ఈ రాముడు విశుద్ధాత్ముడు. అందుకనే, నీ బోధలను తక్షణమే అందుకున్నాడు. నిజానికి ఇలాంటి జ్ఞానసిద్ధి విషయంలో గురువుయొక్క ప్రబోధ శక్తికంటే, శిష్యుడి ప్రజ్ఞే ప్రధానం. గురుశిష్యులిద్దరూ యోగ్యులైతే ఇక చెప్పవలసినదేముంది? ఇక్కడ జరిగిందదే!

వశిష్ఠ మునీంద్రా! ఇక ఇప్పుడు నువ్వు, మామీద దయతో, రాముణ్ణి సమాధినుంచి బయటికి లేపాలి. ఎందుకంటే, మేము కార్యార్థులమై వున్నాం. ఇతనివల్ల లోకోద్ధరణ చాలా జరుగవలసి వుంది.

నేనితనిని సిద్ధాశ్రమానికి తీసుకుపోతాను. అక్కడ ఇతను రాక్షస సంహారం చేస్తాడు. ఆ తరువాత అహల్యకు శాప విమోచనం చేస్తాడు. ఆ తరువాత శివధనుస్సును విరిచి సీతను వివాహం చేసుకుంటాడు. పరశురాముడి గర్వాన్ని అణగగొట్టేస్తాడు. రాజ్యాన్ని వదిలిపెట్టి వనవాసం చేసి, ఆ వంకతో ఎందరెందరో మహర్షులను, పుణ్య తీర్థాలను పవిత్రం చేస్తాడు. సీతాపహరణం అనే మిషతో రావణ సంహారం చేసి, లోకంలో స్త్రీలోలులకు నాశం తప్పదని నిరూపిస్తాడు. యుద్ధంలో చనిపోయిన వానరులను మళ్ళీ బ్రతికిస్తాడు. సీతచేత అగ్ని ప్రవేశం చేయించి, తద్వారా లోకాన్ని అనుసరించి నడవడంలో తనకున్న ప్రజ్ఞను నిరూపించుకుంటాడు. ఆ తరువాత రాజ్యాభిషేకం పొందుతాడు. తను జీవన్ముక్తుడై నప్పటికీ, నిష్కాముడైనప్పటికీ, లోకులకు కర్మప్రాధాన్యాన్ని బోధించడం కోసం యజ్ఞ యాగాది కర్మ పరాయణుడౌతాడు. జ్ఞాన కర్మ సముచ్చయంలో అధికారం కలవారికి, ఆ మార్గాన్ని గూడా చూపించి, తద్వారా వారికి బ్రహ్మలోకాది రూపమైన ఉత్తమ గతులను ఇప్పించ గలడు. (ఇక్కడ జ్ఞాన కర్మ సముచ్చయం అంటే, ఉపసనా కర్మ సముచ్చయం' అని అర్థం చేసుకోవాలి)

అంతే కాదు వశిష్ఠా! తనను ఎవరు చూశారో, స్మరించారో, విన్నారో ప్రబోధించారో, వాళ్ళందరికీ జీవన్ముక్తిని ఇవ్వగలడు.

వశిష్ఠా! ఈ విధంగా ఈ శ్రీరాముడు నాకే గాదు, ముల్లోకాలకూ మహోపకారం చేయవలసి వుంది.

ఓ జనులారా! మీరంతా ఈ శ్రీరామచంద్రుడికి నమస్కరించండి. ఆ నమస్కారం చాలు. వేరే సాధనలేవీ అక్కరలేదు! మీలో ఎవడైనా సరే, ఇలాగే నిర్వికల్ప సమాధిలో సర్వోన్నతంగా వుండిపోతారు.

**వాల్మీకి**: భరద్వాజా! భక్త్యావేశంతో విశ్వామిత్రుడిలా మాట్లాడుతుంటే, అక్కడుండే మునీంద్రులు, సిద్ధులు, మొదలైనవారంతా, శ్రీరాముణ్ణి ధ్యానించడంలో మునిగి పోయారు. కొందరు నమస్కరించారు. కొందరు స్మరించారు. కొందరు భవిష్యత్ రామకథను మననం చేసుకున్నారు. వారందరూ దివ్యదృష్టులు కలవారే గనుక, రామ కథా విశేషాలను ఒకరితో ఒకరు చెప్పుకొని సంతోషపడ్డారు. ఒక్క వశిష్ఠుడు మాత్రం గంభీరంగా నవ్వుతూ ఇలా అన్నాడు.

**వశిష్ఠుడు**: విశ్వామిత్రా! ఈ రాముడు పూర్వజన్మలో మానవుడా? దేవుడా? చెప్పు.

**విశ్వామిత్రుడు**: వశిష్ఠ మహర్షీ! ఈ మాట గట్టిగా నమ్ము. ఇతడు మానవుడూ కాదు, మామూలు దేవతా కాదు. సాక్షాత్ వాసుదేవుడు. ఉపనిషత్ తత్త్వగోచరుడు. బ్రహ్మావిష్ణు మహేశ్వర స్వరూపుడు. ఈ నాడు ఇతని కన్నతండ్రి దశరథుడు మాత్రమే కాదయ్యా, ఇతను నాకు శత్రువని భావిస్తున్న రావణాసురుడు గూడా ధన్యుడే! ఇతడు సాక్షాత్తుగా క్షీరసాగర శయనుడైన శ్రీమహావిష్ణువు.

వశిష్ఠా! ఇక ఇతనిని లోక వ్యవహారాలలోకి దింపు.

**వశిష్ఠుడు**: రామచంద్రా! మహాబాహూ! మహా పురుషా! చిన్మయా! ఇది నీకు విశ్రాంతి సమయం కాదు. లే! లేచి లోకాలకు ఆనందం కలిగించు. నువ్వు చేయవలసిన లోకోపకార కృత్యాలన్నీ తీరే వరకూ నీకు శాశ్వత సమాధి సాధ్యం కాదు. కనుక, అశాశ్వతాలైన ఈ రాజ్య కార్యాలనూ, దేవకార్యాలనూ, కొంచెం చూడు. ఆ తరువాత సమాధి సుఖాన్ని అనుభవించు.

**వాల్మీకి**: భరద్వాజా! వశిష్ఠుడిలా గట్టిగా చెప్పినా, సమాధిలో వున్న రాముడికి ఈ మాటలు వినిపించలేదు. అప్పుడు వశిష్ఠుడు, తన సంకల్ప బలంతో సూక్ష్మ శరీరం ధరించి, శ్రీరాముడి సుషుమ్నా నాడిలోకి ప్రవేశించి, దానిద్వారా అతని హృదయ పద్మంలోకి చేరి, అక్కడ కరిగిపోయి వున్న శ్రీరామలింగ శరీరాన్ని బయటికి ఆకర్షించి, దానిని నాడులలోకి ప్రవేశ పెట్టాడు.

ఈ విధంగా నాడీ రంధ్రాలలోకి చైతన్య ప్రసారం జరిగే సరికి, శ్రీరాముడు మెల్లగా కళ్ళు తెరచి, ఏ ఆలోచనా లేకుండా, కేవలం స్తబ్ధంగా చూస్తూ వుండి పోయాడు!

ఈ లోగా వశిష్ఠ మహాముని మళ్లీ తన శరీరంలోకి వచ్చి, ఇందాక చెప్పిన మాటలే మళ్ళీ చెప్పాడు. ఈ మాటు శ్రీరాముడికి ఆ మాటలు వినిపించాయి. గురు వాక్యాన్ని దాటకూడదని తలచి, శ్రీరాముడు మెల్లగా ఇలా అన్నాడు.

**శ్రీరాముడు**: గురుదేవా! మీ అనుగ్రహంవల్ల ఈ వ్యక్తి విధికీ సమర్థుడు గాదు, నిషేధానికీ సమర్థుడు గాదు. ఐనా సరే, మీ మాటను దాటేందుకు వీలు లేదు. ఇది వేద శాసనం.

**సర్వే శృణుత భద్రం వో**
**నిశ్చయేన సునిశ్చితమ్ ।**
**ఆత్మజ్ఞానాత్పరం నాస్తి**
**గురోరపి చ తద్విదః ॥** (పూర్వ.స.128, శ్లో. 105)

అయ్యలారా! మీరంతా వినండి. ఇది నిశ్చయాలలో కెల్లా అతి నిశ్చితమైన విషయం. ఏమిటంటే, ఆత్మజ్ఞానం కంటే గొప్పది లేదు. ఆత్మతత్త్వం తెలిసిన వాడికి గురువు కంటే గొప్పవాడు లేదు.

**సిద్ధాదులు**: రామచంద్ర మహారాజా! నీకు నమస్కారం. నువ్వు చెప్పింది నిజం. మా మనస్సులో వున్న మాట అదే! నీ మాటవల్ల అదిప్పుడు మరింత గట్టి పడుతోంది. నువ్వు సుఖంగా వుండు. మేము వశిష్ఠుని అనుమతి తీసుకొని, మా మా ప్రదేశాలకు బయలుదేరి పోతాం.

**వాల్మీకి**: ఇలా అంటూనే వారంతా లేచారు. భరద్వాజా! ఇంతలోనే శ్రీరాముడి శిరస్సుమీద పుష్ప వృష్టి కురిసింది. ఈ విధంగా శ్రీరామ-వశిష్ఠులకు జరిగిన సంవాదం అంతా నీకు చెప్పాను. పరమ గురువు కటాక్షంతో ఈ సంవాదమే శ్రోతలకు ముక్తి మార్గాన్ని అందించ గలదు.

**య ఇమం శృణుయాన్నిత్యం**
**విధిం రామ విశిష్ఠయోః ।**

**సర్వావస్థోఽపి శ్రవణా**

**న్ముచ్యతే బ్రహ్మ గచ్ఛతి ॥** (పూర్వ.స.128, శ్లో.111)

శ్రీరామ వశిష్ఠుల మధ్య జరిగిన ఈ సంవాదాన్ని ఎవడైతే నిత్యం వింటాడో, అలాటివాడు ఎలాంటి నీచావస్థలో వున్నా సరే ముక్తుడై బ్రహ్మైక్యాన్ని పొందుతాడు.

ఈ విధంగా ఒక ఫలశ్రుతి వాక్యంతో వాల్మీకి మహర్షి ఈ నిర్వాణ ప్రకరణ పూర్వార్థాన్ని పూర్తి చేశాడు. ఇక ఆయనతో పాటు ఉత్తరార్థంలోకి ప్రవేశించే ముందు, ఈ నిర్వాణ ప్రకరణ బోధ ప్రణాళికను ఒక సారి నెమరేసుకుందాం.

## 82. నిర్వాణ ప్రకరణ సింహావలోకనం

ఉపశమ ప్రకరణం పూర్తి అయ్యేసరికి చెప్పవలసిన విషయం ఇంచు మించు పూర్తైపోయింది. శ్రీరాముడికి ఆత్మ విశ్రాంతి కలగనూ కలిగింది. ఐనా సరే, మళ్ళీ మరోసారి విషయమంతా చెబుతానంటూ ఆయన (వశిష్ఠమహర్షి) ఈ నిర్వాణ ప్రకరణాన్ని ప్రారంభించాడు. దానికి ఆయన రెండు కారణాలు చెప్పాడు. పూర్తిగా వాసనాక్షయం జరిగే దాకా మళ్లీ మళ్లీ శ్రవణం చేస్తూ వుండవలసిందే – అనేది ఒక కారణం. ఆ సభలో వున్న కొందరు మధ్యమాధికారులకు ఇంకా పూర్తిగా జ్ఞానం సిద్ధించలేదు గనుక, వారికోసం మళ్లీ చెబుతున్నాననేది మరొక కారణం.

అందుకే, ఈ ప్రకరణం రామప్రశ్నతో కాక, వశిష్ఠ బోధతోనే ప్రారంభమైంది. ఆ బోధలో బ్రహ్మ, విష్ణు మహేశ్వరాదులను గూడా అవిద్యలో భాగంగా తేల్చాడు వశిష్ఠమహర్షి.

దానిమీద శ్రీరాముడు అదెలా కుదురుతుందని ప్రశ్నించగా, వశిష్ఠమహర్షి వివరిస్తూ, విద్య గూడా అవిద్యలో భాగమేనని నిరూపించాడు. అందువల్ల అవిద్యను దాటడానికిక గట్టి కృషి చేయాలన్నాడు.

దానిమీద శ్రీరాముడు "ఈ అవిద్యను దాటడానికి యోగం, జ్ఞానం అని రెండు మార్గాలున్నాయని మీరు ఉపశమ ప్రకరణంలో చెప్పాడు, ఈ రెండింటిలో ఏది గొప్పది?" అని అడిగాడు.

దానికి వశిష్ఠుడు సమాధానం చెబుతూ, ఎవరి సంస్కారాన్ని బట్టి వారికి ఏది అనుకూలిస్తుందో, దానిని స్వీకరించాలనీ, రెండింటికీ ఫలితం ఒకటిగానే ఉంటుందనీ చెప్పి, ఇంతవరకు తను ఎక్కువగా జ్ఞాన మార్గ సాధకుల కథలే చెప్పాననీ, కనుక ఒక గొప్ప యోగమార్గ సాధకుడి గురించి చెబుతా వినమంటూ, భుశుండోపాఖ్యానాన్ని విస్తారంగా చెప్పాడు. ఈ ఉపాఖ్యానంలో యోగ విధానాలను, విస్తారంగా వర్ణించడమే గాక, ఈ మార్గాన్ని నీచ వంశ జాతులు గూడా అనుసరించ వచ్చునని, ఇది జ్ఞాన మార్గంలోకి తనే తీసుకుపోతుందని నిరూపించాడు.

ఈ రకమైన బోధ చేస్తూ వుండగా శ్రీరాముడు జ్ఞానావేశానికి లోనై సమాధిలోకి వెళ్ళిపోయాడు. కానీ దానికి వశిష్ఠమహర్షి సంతోషించలేదు. ఒక రకమైన తీవ్ర చిత్తవృత్తి గలవారికి, ఏ విషయాన్ని గురించి విస్తారంగా విన్నా, దానిలో లయించి పోవడమనే స్వభావ లక్షణం వుంటుందని గ్రహించి, ఈ విషయంలో తనకు శివుడు చేసిన ఉపదేశాన్ని చెబుతాను, వినమంటూ – శివోపాఖ్యానాన్ని మొదలు పెట్టాడు వశిష్ఠుడు.

ఈ ఉపాఖ్యానంలో శివ మానస పూజ అనే పేరుతో భక్తి మార్గ, జ్ఞాన మార్గాలకు ఒక అద్భుతమైన సామరస్యాన్ని సాధించి చూపించాడు. చివరికి శివపూజే ఆత్మ పూజ అని వశిష్ఠుడు తేల్చాడు.

ఈ విధంగా యోగమార్గ, భక్తిమార్గ, జ్ఞానమార్గ సమన్వయాలు విన్న శ్రీరాముడు, ఇక నాకు సందేహాలు లేవన్నాడు. ఐనా సరే వశిష్ఠమహర్షి బిల్వోపాఖ్యాన శిలోపాఖ్యాలనే పేరుతో, పరతత్త్వాన్ని మళ్ళీ వర్ణించాడు. ఈ వివరణలో, అసలు అవిద్య అనేది లేనే లేదనీ, కేవలం విషయబోధ కోసమే మొదట అవిద్య వున్నదని అంగీకరించి, తరువాత అది లేదని నిరూపిస్తారనీ, వశిష్ఠుడు చెప్పాడు.

ఆ తరువాత ఈశ్వర జీవులు బింబ ప్రతిబింబ స్థానీయులని అంగీకరించి, ఈ విధానంలో ప్రతిబింబం అసత్యమని నిరూపించాడు. ఈ సందర్భంగానే పుర్యష్టకానికి అమూర్తావస్థ, మూర్తావస్థ – అని రెండు విభాగాలు చేసి, చర్చను కొనసాగించాడు. ఈ చర్చలో వచ్చిన మెలికలను, లఘు సింహావలోకనం అనే పేరుతో  మనం అక్కడ వివరించుకున్నాం కూడా.

ఈ చర్చ ద్వారా వశిష్ఠ మహర్షి 'అసంసక్తి' యోగాన్ని ప్రతిపాదించి, దానికి ఉదాహరణగా, రాబోయే ద్వాపరాంతంలో శ్రీకృష్ణపరమాత్మ చేయబోయే భగవద్గీతోపదేశాన్ని అర్జునోపాఖ్యానమనే పేరుతో వివరించాడు. అక్కడ మనం ప్రసిద్ధ భగవద్గీత శ్లోకాలను, వాశిష్ఠ భగవద్గీత శ్లోకాలనూ, తులనాత్మకంగా పరిశీలించుకుంటూ, ముందుకు సాగాం.

ఇప్పటికి ఈ ప్రకరణంలో భుశుండోపాఖ్యానం ద్వారా యోగోపదేశాన్ని, శివోపాఖ్యానం ద్వారా భక్తి మార్గోపదేశాన్ని, అర్జునోపాఖ్యానం ద్వారా అసంగ యోగాన్ని, వశిష్ఠ మహర్షి పూర్తి చేశాడు. ఇక జీవన్ముక్తియొక్క పరాకాష్ఠ ఎలా వుంటుంది? దానిని అందుకునే తీరుతెన్నులెన్ని రకారలుగా వుంటాయి? నిజమైన జీవన్ముక్తి దశలో, వ్యవహారం ఎలా సాగుతుంది? అనే విషయాలను వివరించడం కోసం, చూడాలోపాఖ్యానం  అనే కథను చెప్పదలచుకున్నాడు. దానికి పూర్వరంగ పీఠికగా, 18 సర్గల బోధ చేశాడు. ఈ పీఠికలో, 'శతరుద్రీయోపాఖ్యానం' అనే వింత కథ చెప్పాడు. ఈ కథ ద్వారా జీవుడు ఒక భ్రాంతినుంచి మరొక భ్రాంతిలోకి, ఒక స్వప్నం నుంచి మరో స్వప్నం లోకి, నిరంతరం ప్రయాణాలు చేస్తూనే వుంటాడనీ, ఐనా సరే, నేను సుస్థిరంగా వున్నాననే విశ్వాసంతో వుంటాడనీ, ఈ విశ్వాసమే మహామోహమనీ, దీనిని దాటడమే జీవన్ముక్తి అనీ, వివరించాడు.

ఈ సందర్భం గానే, వాజ్మౌనం, ఇంద్రియ మౌనం, కాష్ఠమౌనం,  సుషుప్తి మౌనం, లేక జీవన్ముక్త మౌనం, అంటూ మౌనాన్ని విభాగం చేసి వివరించాడు.

ఆ తరువాత మోక్షంయొక్క స్వరూపం, ఏకతత్త్వ ఘనాభ్యాసం, ప్రాణలయం, మనో నిగ్రహం – అనే మూడు  మెట్లుగా వుంటుందని ప్రతిపాదించి, దానిని వివరిస్తూ 'వేతాళోపాఖ్యాన'మని చిన్న కథను వదులు వదులుగా చెప్పాడు. ఇది ఉత్పత్తి ప్రకరణంలోని సూచికోపాఖ్యానంలో వున్న  యక్ష ప్రశ్నలకు నకలుగా సాగింది కనుకనే, దీనిని సంగ్రహంగా చెప్పి, వశిష్ఠ మహర్షి ముందుకు సాగాడు.

ఇప్పుడు వశిష్ఠుడు, నిజమైన జీవన్ముక్తుడే, మళ్ళీ వ్యవహారంలోకి వచ్చినప్పుడు, ఉత్తమోత్తమ విజయాలను సాధించగలడనీ, అందువల్ల ఉత్తమ లక్ష్యాలు కలవాడు ముందుగా జీవన్ముక్తిని సాధించాలనీ, ప్రతిపాదిస్తూ, అందుకు ఉదాహరణగా భగీరథోపాఖ్యానాన్ని చెప్పాడు. ఈ కథలో, గంగావతరణాన్ని సాధించే ముందు భగీరథుడు, ఏ విధంగా జీవన్ముక్తిని, యథాప్రాప్త కార్యత్వాన్ని, స్వాధీనం చేసుకొన్నాడో వివరించాడు.

ఈ విధంగా జీవన్ముక్తి స్వరూపాన్ని సమగ్రంగా చర్చించిన తరువాత, దానిని సాధించడంలో వుండే మార్గ భేదాలను వివరించడం కోసం, చూడాలోపాఖ్యానం ప్రారంభించాడు. ఈ ఉపాఖ్యానంలో, కథతో పాటు చర్చను గూడా విస్తారంగా పెంచాడు. ఈ కథలో, స్త్రీకి మొదట జీవన్ముక్తి లభిస్తుంది. ఆమె గట్టిగా కృషి చేసి తన భర్తకు జీవన్ముక్తి వచ్చేట్లు చేసింది. ఆవిడే ముందుగా యోగ సిద్ధులను సాధించి, తన భర్తకు

గురువై, నిష్పక్షపాతంగా పరీక్షలు చేసింది. చివరికి తన భర్తకు జీవన్ముక్తి స్థితిని సుస్థిరపరచి, అతనిచేతనే రాజ్య పాలన చేయించింది.

ఈ విధంగా విభిన్న మార్గాలలో రాజ దంపతులిద్దరూ జీవన్ముక్తిని సాధించిన కథను చెప్పిన తరువాత, జీవన్ముక్తి సాధనలో మరో మార్గాన్ని చూపించేందుకోసం, వశిష్ఠమహర్షి కచోపాఖ్యానాన్ని చెప్పాడు. బృహస్పతి పుత్రుడైన కచుడు, తపోమయమైన జీవితం గడుపుతూ, తండ్రి ఉపదేశం ద్వారా, జీవన్ముక్తిని సాధించిన విధానాన్ని దీంట్లో వివరించాడు. ఈ కథలో 'సర్వత్యాగం' అంటే ఏమిటో స్పష్టంగా వివరించాడు.

ఈ సందర్భంగానే వశిష్ఠ మహర్షి అహంకారానికి అస్తిత్వం లేదని ఒక ప్రతిపాదన చేశాడు. దానిని సమర్థించేందుకోసం 'మిథ్యాపురుషోపాఖ్యానం' అనే కథకాని కథను చెప్పాడు. దీనికి సారాంశంగా, సాధకుడు కర్త–భోక్త–త్యాగి కాకూడదనీ, మహాకర్త – మహాభోక్త–మహాత్యాగి కావాలనీ చెబుతూ, ఈ పదాల వివరణ కోసం, 'భృంగీశ్వరోపాఖ్యానం' అనే చిన్న కథను చెప్పాడు.

ఆ తరువాత శ్రీరాముడు, "వాసనలు సన్నగిల్లిపోయిన మనస్సును 'సత్త్వం అంటారు" అని ఈ ప్రకరణంలో రెండో సర్గలో వశిష్ఠుడు చెప్పిన మాటలను గుర్తు చేసుకొని, ఆ సత్త్వానికి లక్షణం ఏమిటి అని అడిగాడు. దానికి సమాధానంగా వశిష్ఠ మహర్షి ఇక్ష్వాకు–మను సంవాదమనే కథ కాని చిన్ని కథను చెప్పాడు. ఈ సంవాదంలో సప్తజ్ఞాన భూమికలను మరొక సారి తిరగతోడాడు. పూర్వం ఉత్పత్తి ప్రకరణంలో, 118వ సర్గలో, చెప్పిన విషయాలనే చెప్పినా, ఇక్కడ ఆ భూమికల పేర్లు కొద్దిగా మార్చాడు.

ఇప్పటికి 122 సర్గలు పూర్తైయినాయి. మరొక ఆరు సర్గలలో ఈ పూర్వార్ధాన్ని ముగించ బోతున్నారు. ఆ ముగింపుకు పూర్వరంగంగా, 123 నుంచి 126 దాకా, వశిష్ఠ – శ్రీరాముల సంభాషణ ఒక సింహావలోకన ప్రాయంగా సాగింది. దీనిలో మళ్ళీ యోగ భూమికల ప్రసక్తి వచ్చింది. ఇక్కడ వశిష్ఠమహర్షి మళ్లీ కొద్దిగా పేర్లు మార్చాడు.

ఈ సింహావలోకనంతో శ్రీరాముడు మళ్ళీ మరొక మారు సమాధిలోకి ప్రవేశించాడు.

వాల్మీకి మహర్షికి చెప్పవలసిన విషయం మరి కొంచెం మిగిలిపోయి వుంది. వశిష్ఠుడి బోధంతా, ఉత్తమాధికారి ఐన శ్రీరాముడి కోసం సాగింది. ఈ యోగ వాశిష్ఠ గ్రంథమేమో సామాన్యాధికారులకోసం బయలు దేరినది. అందువల్ల పై విషయాలను సామాన్యాధికారుల స్థాయికి తీసుకు రావలసి వుంది. అందుకోసం వాల్మీకి మహర్షి వశిష్ఠ– శ్రీరాముల సంభాషణను కొంత ఆపి, తనకూ, తనశిష్యుడు భరద్వాజుడికీ, జరిగిన సంభాషణను ఇక్కడ ప్రవేశ పెట్టాడు.

ఈ సంభాషణలో సాధకులు అనుసరించవలసిన ప్రవిలాపన ప్రక్రియను వాల్మీకి మహర్షి విపులంగా వివరించాడు. ఈ వివరణను 25 మెట్లుగా మనం చెప్పుకొని వున్నాం.

ఆ తరువాత భరద్వాజుడు, "జీవన్ముక్తుడు విహిత కర్మలను విడిచి పెట్ట వచ్చునా? విడిచిపెట్ట కూడదా?" అనే ప్రశ్నను లేవదీశాడు. అది ఆ జీవన్ముక్తుడి కర్మ శేషం మీద ఆధారపడి వుంటుందనీ, వివిదిషా సంన్యాసం స్వీకరించిన సాధకుడు మాత్రం మళ్లీ కర్మల జోలికి పోకూడదనీ, వాల్మీకి మహర్షి వివరించి, సాధకుడు అభ్యాస క్రమాన్ని అశ్రద్ధ చేయరాదని నొక్కి వక్కాణించాడు.

అప్పటికి చర్చా విషయం పూర్తైపోయింది. అందువల్ల భరద్వాజుడి ద్వారా "నిర్వికల్ప సమాధిలోకి వెళ్ళిపోయిన శ్రీరాముడు మళ్ళీ వ్యవహారాలలోకి ఎలా వచ్చాడు?" అనే ప్రశ్న వేయించాడు.

వాల్మీకి మహర్షి దానికి సమాధానం చెబుతూ, "విశ్వామిత్రుడి ప్రార్థనవల్ల, వశిష్ఠ మహర్షి సూక్ష్మరూపం ధరించి, శ్రీరాముడి సుషుమ్నా నాడిలోకి ప్రవేశించి, ఆయనను మళ్ళీ లోక వ్యవహారంలోకి తీసుకు వచ్చాడు" అన్నాడు.

ఈ సందర్భంగానే విశ్వామిత్ర వాక్యంగా మంగళకరమైన శ్రీరామ భవిష్యత్కథను సంగ్రహంగా ప్రస్తావించాడు.

ఆ తరువాత శ్రీరాముడి గురుస్తోత్రంతోనూ, వాల్మీకి మహర్షి చెప్పిన ఫలశ్రుతితోనూ ఈ పూర్వార్థాన్ని ముగింపుకు తెచ్చాడు.

ఈ విధంగా సాధకుడు జీవన్ముక్తి దాకా ప్రయాణం చేసే మార్గాన్ని వివరించే నిర్వాణ ప్రకరణ పూర్వార్థం ముగిసింది. ఇక జీవన్ముక్తి సిద్ధులైన మహాత్ములు వ్యుత్థాన దశలో మనస్సును బ్రహ్మమయంగా నిలబెట్టుకొనే విధానాలను వర్ణించడం కోసం, మరో ఏడు వేల శ్లోకాల గ్రంథాన్ని అట్టిపెట్టుకున్నాడు వాల్మీకి మహర్షి. ఆ భాగంలో ఆయన ఏ రత్నాలను దాచి వుంచాడో, వాటిని ఏరుకోడానికి మనం ఇక నిర్వాణ ప్రకరణం ఉత్తరార్ధంలోకి ప్రవేశిద్దాం.

---

# విషయసూచిక

# యోగవాశిష్ఠ హృదయము

## నిర్వాణ ప్రకరణ - ఉత్తరార్ధము

### 1. ప్రవేశిక

పూర్వార్థం చివరిలో శ్రీరాముడికి సమాధి స్థితి కలిగిందని చెప్పారు. దాని ద్వారా ఉత్తమాధికారికి శ్రవణ మననాల ఆవృత్తి పరిపాకంవల్లనే ఆత్మ సాక్షాత్కారం లభిస్తుందనీ, బ్రహ్మసమాధి సిద్ధిస్తుందనీ, చెప్పినట్లయింది. అలాంటి సిద్ధిని అందుకున్న వ్యక్తి మళ్ళీ ఈ ప్రపంచంలోకి వస్తాడా? రాడా? వస్తే వాడి చిత్తం పరబ్రహ్మనుంచి చెదరిపోతుందా? ఒక వేళ చెదిరిపోతే, ఆ చిత్తాన్ని వ్యుత్థాన దశలో కూడా పరబ్రహ్మలో సుస్థిరంగా నిలబెట్టడం ఎలాగ? అనే ప్రశ్నలు మిగిలిపోయి వున్నాయి.

ఈ ప్రశ్నలకు అవకాశం ఎందుకు వచ్చిందంటే, శ్రీరాముడు సమాధిలోకి ప్రవేశించగానే, విశ్వామిత్రాది మహర్షులు ఒక పక్క సంతోషపడుతూనే, మరో పక్క శ్రీరాముడ్ని సమాధిలోంచి బైటికి తీసుకు రమ్మని వశిష్ఠుడ్ని ప్రార్థించారు. శ్రీరాముడికి కలిగిన బ్రహ్మజ్ఞానం చెడిపోవాలని వాళ్ళ ఉద్దేశ్యమా? లేక సమాధిలోంచి బైటికి వచ్చినా, బ్రహ్మజ్ఞానంలో విశ్రాంతి చెంది వుండవచ్చునని వాళ్ల ఉద్దేశ్యమా? ఈ విషయం తేలాలి.

ఈ విషయాలను విస్తృతంగా వివరించేందుకోసమే వాల్మీకి మహర్షి ఈ ఉత్తరార్థాన్ని చేపట్టబోతున్నాడు. ఐతే, ఈ విషయాలు ఇంతకు ముందు బొత్తిగా ముట్టుకోనివి కావు. ఐనా, వాటి ప్రతిపాదనారీతిలోనూ, నిరూపణ రీతిలోనూ, భేదం వుంది. సమాధి అందని సాధకులను దృష్టిలో పెట్టుకొని, పూర్వపు ప్రతిపాదనలు జరిగాయి. ఇక ముందు అవే విషయాలను సమాధి సిద్ధుడి దృష్టికోణం నుంచీ వివరించబోతున్నారు. అందుకే రాబోయే సర్గలలో చాలా చోట్ల పూర్వపు శ్లోకాలను యథా తథంగా దింపాడు వాల్మీకి మహర్షి. అలా దింపినా, నిరూపణ ప్రక్రియలో నూతన మార్గాలను అవలంభించాడు. అదీ గాక, ఉత్పత్తి ప్రకరణం దగ్గరనుంచీ ఇప్పటిదాకా తను ప్రస్తావించిన కొన్ని కథలలోని మర్మాలను ఇక్కడ తవ్వుకొచ్చి మరీ వివరించబోతున్నాడు. కనుకనే ఈ ఉత్తరార్ధ భాగానికి పునరుక్తి దోషం పట్టడం లేదు. ఈ భాగంలో వాల్మీకి మహర్షి కథలను తగ్గించి, సాంకేతిక శాస్త్ర చర్చలనే కొంచెం కొంచెం పెంచుకుంటూ వచ్చాడు. అందువల్ల ఈ చర్చలు ఒకింత శాస్త్రభాగ భరితంగా సాగుతూ వుంటాయి. ఐనప్పటికీ, వీలైనంత సులభంగా వాటిని చెప్పుకునే ప్రయత్నం చేద్దాం.

పూర్వార్థం చివరిలో 126వ సర్గలో శ్రీరామ–వశిష్ఠ సంవాదం ముగిసింది. ఆ తరువాత మరో రెండు సర్గల పాటు వాల్మీకి భరద్వాజుల సంవాదం నడిచింది. ఈ సంవాద ప్రారంభంలో భరద్వాజుడు "శ్రీరాముడికి ప్రశ్నలేమైన మిగిలినాయా?" అని అడిగాడు. సమాధిలో వున్నప్పుడు ప్రశ్నలుండవు. దాంట్లోంచి బైటికి వస్తే, ప్రశ్నలు మళ్లీ మొలకెత్తే సావకాశం వుంది. శ్రీరాముడి విషయంలో అదే జరిగింది. ఆయన సమాధిలోకి వెళ్ళబోయేముందు వశిష్ఠ మహర్షి ఏమన్నాడంటే –

**అహం మమేతి సంవిదన్**

**న దుఃఖతో విముచ్యతే ।**

**అసంవిదన్ విముచ్యతే**

**యదీప్సితం సమాచర॥** (ని.పూ.స. 126, శ్లో.102)

(రామా! 'నేను, నాది' అనే ఆలోచనలున్నంత కాలమూ దుఃఖం పోదు. అవి పోతే దుఃఖం పోతుంది, ముక్తి లభిస్తుంది. నీకు ఏది కావాలంటే, అదే చేసుకో!) – అన్నాడు.

సమాధిలోంచి బైటికి రాగానే, శ్రీరాముడు దీనిమీదే ప్రశ్న వేస్తున్నాడు.

***శ్రీరాముడు***: గురుదేవా! మీరు సంవేదనాన్నే వదిలి పెట్టేయా లంటున్నారు. అంటే, 'నేను, నాది' అనే కల్పనలను వదిలి పెట్టేయాలంటున్నారు. ఈ దేహేంద్రియాదులన్నీ ఆధారపడి వున్నది ఆ కల్పనలమీదే! అలాంటి కల్పనలను పూర్తిగా నిర్మూలిస్తే దేహేంద్రియ ప్రాణాదులకు ఆధారమే లేకుండా పోయి, అవన్నీ ఒకేసారి కూలి పోతాయి. అంటే, ఆ సాధకుడు మరణిస్తాడు. కానీ, మీరేమో సంవేదనా పరిత్యాగంవల్ల ముక్తి లభిస్తుందంటున్నారు. మనిషి జీవించి వుంటే గదా, ముక్తి లభించేది? ముక్తి లభించాలంటే, మరణించి తీరవలసిందేనా!?

**గమనిక** - ఇంచుమించు ఇదే ప్రశ్నను శ్రీరాముడు ఉపశమ ప్రకరణంలో 16వ సర్గలో వేశాడు. అక్కడ వాసనా పరిత్యాగం రెండు రకాలుగా వుంటుందనీ, ఒకటి ధ్యేయవాసనా పరిత్యాగం, రెండు జ్ఞేయవాసనా పరిత్యాగం - అని. అందులో జ్ఞేయవాసనా పరిత్యాగంవల్ల విదేహముక్తి లభిస్తుందనీ, ధ్యేయవాసనాత్యాగంవల్ల జీవన్ముక్తి లభిస్తుందనీ చెప్పాడు. మళ్ళీ అదే ప్రకరణంలో 90వ సర్గలో మనోనాశనాన్ని, సరూప మనోనాశనమనీ - అరూప మనోనాశనమని - రెండుగా విభాగం చేసి, అరూప మనోనాశనంవల్ల విదేహముక్తి లభిస్తుందనీ, సరూప మనోనాశనంవల్ల జీవన్ముక్తి లభిస్తుందనీ చెప్పారు. మళ్ళీ ఇదే ప్రశ్నను నిర్వాణ ప్రకరణంలోని పూర్వార్థంలో, 111వ సర్గలో, కచ సాధన వర్ణన సందర్భంలో తెచ్చి, చాలా సంగ్రహంగానే ఆ చర్చను ముగించారు. ఈ ప్రశ్న ఇన్ని సార్లు పునరుక్తి కావటానికి గల కారణాలను అక్కడ చెప్పుకున్నాం. ఇక్కడ ఈ ఉత్తరార్థంలో ఇదే ప్రశ్నకు మరో దారిలో సమాధానం చెప్పబోతున్నారు.

## 2. కల్పనాత్యాగం

***వశిష్ఠుడు***: రామా! కల్పనలు పోతే శరీరమే పోతుందంటున్నావు. అసలు కల్పనలు అంటే ఏమిటి? దేహేంద్రియాది స్వరూపమైన ఒకానొక మాంసపిండం మీద "నేననే' భావన వుండటమే కల్పన, దానిని విడిచిపెట్టి అఖండ బ్రహ్మభావనలో వుండటమే కల్పనాత్యాగం. అంతే గాదు, ఈ దేహేంద్రియాదులతో సహా దృశ్య పదార్థాలన్నీ 'సత్యమే' అనే భావనే కల్పన. ఈ సమస్తం పరమార్థ సత్య స్వరూపమైన పరబ్రహ్మకు రూపాంతరం అనే భావనే కల్పనాత్యాగం. దీనినే మరో రకంగా చెబితే, పదార్థ స్మరణే కల్పన. పదార్థ విస్మృతే కల్పనాత్యాగం.

ఇప్పుడు ఆలోచించు, ఈ కల్పన నీ దేహానికి ఆధారంగా వుందా? దేహమే కల్పనకు ఆధారంగా వుందా? నిశ్చయంగా దేహాన్ని బట్టి కల్పన వస్తోంది, కానీ, కల్పనను బట్టి దేహం రావడం లేదు. అందుచేత, కల్పన పోతే దేహం పోతుందనుకోవడం హేతుబద్ధం కాదు.

***శ్రీరాముడు***: మరైతే దేహాన్ని కలిగించేది ఎవరు, నిలబెట్టేది ఎవరు?

***వశిష్ఠుడు***: దాని పేరే ప్రారబ్ధం. అనగా పూర్వ కర్మ. అది శరీరాన్ని కలిగిస్తుంది, నిలబెడుతుంది. అది ఖర్చయిపోతే, నువ్వు కల్పనా త్యాగం చేసినా, చేయకపోయినా, దేహం పడిపోతుంది. అది ఉన్నంత కాలమూ, నువ్వు కల్పనాత్యాగం చేసినా శరీరానికి ఏమీ కాదు.

పైపెచ్చు కల్పనాత్యాగం అంటూ చేస్తే, జీవించివున్నవాడే చేయాలి గానీ, మరణించినవాడు చేయలేదు.

నిజానికి, కల్పనాత్యాగం చేస్తే, చిత్తం ప్రశాంతం అవుతుంది. కనుక తద్వారా ప్రాణవాయువు కూడా ప్రశాంతంగా నడుస్తుంది. అందువల్ల ఆ యోగికి ఆయుష్షు పెరుగుతుందే గానీ తగ్గదు.

కనుక రామా! నువ్వు నిస్సంకోచంగా కల్పనాపరిత్యాగం చెయ్యి. నీ మనస్సుకు కొత్తగా సంస్కారాలను కల్గించకుండా, పాత సంస్కారాలవల్ల వచ్చిపడే పనులను నిర్భయంగా చెయ్యి. నేనీ విషయాన్ని చేతులెత్తి అరచి చెబుతున్నాను. పూర్వం కూడ నీకు చెప్పాను–

**ఊర్ధ్వ బాహుర్విరౌమ్యేష**
**న చ కశ్చిత్ శృణోతి మే!**
**అసంకల్పః పరం శ్రేయః**
**సకిమన్తర్న భావ్యతే ॥** (ని.ఉ. సర్గ.1 శ్లో.11)

**గమనిక** - ఇదే శ్లోకం యథాతథంగా పూర్వార్ధంలో 126వ సర్గలో 94వ శ్లోకంగా వచ్చిందని గమనించండి.

చేతులెత్తి అరుస్తున్నాను. గోల పెడుతున్నాను. ఒక్కడూ నా మాట వినడం లేదు. సంకల్ప త్యాగమే పరమ శ్రేయస్సు. దాన్ని లోపలికి ఎందుకు తీసుకోవడం లేదు?

ఇది మోహ మహిమ. ఈ సంకల్ప త్యాగమనేది అతి సులభమైనా, పరాపేక్ష లేనిదైనా, ఏమీ చేయకుండా ఒట్టిగా కూర్చుంటే దొరికేదైనా, ఎవడూ దీనిని పట్టించుకోడు.

**బహునాత్ర కిముక్తేన**
**సంక్షేపాదిద ముచ్యతే ।**
**సంకల్పనం మనోబంధః**
**తదభావో విముక్తతా॥** (ని.ఉ.స.1, శ్లో.27)

రామా! ఎక్కువ మాటలెందుకు? సంగ్రహంగా చెబుతా విను. సంకల్పమే మనోబంధము. సంకల్పం అంటే కల్పన చేయడం. దానిని వదిలించుకోవడమే ముక్తి.

**శ్రీరాముడు**: దీనికి ఉపాయం ఏమిటి?

**వశిష్ఠుడు**: దీనికి చెయ్యవలసిన పని ఏమీ లేదు. మానవలసింది ఏదీ లేదు. ఎలా వున్నావో అలా వుండిపో.

**పశ్యన్ కర్మణ్యకర్మత్వం**
**అకర్మణి చ కర్మతామ్ ।**
**యథాభూతార్థ చిద్రూపః**
**శాన్తమాస్వ యథాసుఖమ్ ॥** (ని.ఉ.స.1, శ్లో. 29)

నువ్వు చేసే పనిలో అకర్మను చూసుకో. అకర్మ అంటే నిష్క్రియ బ్రహ్మ. ఆ అకర్మలో అవశ్య కర్తవ్యమైన కర్మను చూసుకో. ఇలా చూసుకుంటూ నీ స్వస్వరూపమైన చిద్రూపంలో ప్రశాతంగా సుఖంగా వుండిపో.

**గమనిక** - ఇది భగవద్గీతలోని ఒక సుప్రసిద్ధ శ్లోకానికి చాలా దగ్గరగా వుంది.

**కర్మణ్యకర్మయః పశ్యే**
**దకర్మణి చ కర్మ యః ।**
**స బుద్ధిమాన్ మనుష్యేషు**
**స యుక్తః కృత్స్న కర్మకృత్ ॥**

(ఎవడు కర్మలో అకర్మను, అకర్మలో కర్మను, చూస్తాడో వాడే తెలివైనవాడు. వాడే యోగ సంపన్నుడు. వాడే సమస్త సత్కర్మలూ చేసినవాడు.)

అక్కడా ఇక్కడ గూడా, భావం ఒకే రకంగా వుందని మనం గమనిద్దాం.

**వశిష్ఠుడు**: కనుక రామా! నీలో సంకల్పాలు పుట్టకుండు గాక!

**గమనిక-** ఇక్కడ వశిష్ఠమహర్షి "అహం మమేతి సంవిదన్"
అనే పాత శ్లోకాన్ని (పూ.స.126,శ్లో.102) యథాతథంగా పునరుక్తి చేశాడు. ఇలా ఈ ఉత్తరార్థంలో వెనుకటి శ్లోకాలను, మళ్ళీ మళ్ళీ వాడుతూ వుంటారని చెప్పడానికోసం ఒకటి రెండు ఉదాహరణలు మనం ఇచ్చుకున్నాం. ఇక ముందు ఇలాంటి ఉదాహరణలు ఎక్కువగా అక్కర లేదు.

**వశిష్ఠుడు**: రామా!

**అసంసక్త మతి స్తిష్ఠ హే శిలోదరమౌనవత్ ।।**(ని.ఉ.సర్గ.2, శ్లో.5)

(మనస్సులో సంసక్తులు వదిలిపెట్టి బండరాతి మధ్యలో వుండే మౌనం లాగా వుండిపో.)

## 3. కర్మత్యాగం

**శ్రీరాముడు**: గురుదేవా! కేవలం అసంసక్తివల్ల పాత కర్మలన్నీ ఎలా పోతాయి? అందుచేత, అసంసక్తితో పాటు కర్మత్యాగం గూడా వుండాలి. జ్ఞానియై 'నేను, నాది' అనే దుర్భావనలను వదిలి పెట్టేసినవాడికి కర్మ చేస్తే వచ్చే శుభం ఏముంది? మానేస్తే వచ్చే అశుభం ఏముంది? కనుక అన్ని కర్మలూ మానేసి తూష్ణీం భావంతో (ఏమీ చేయకుండా) వుండటమే ఉత్తమం కదా?

**వశిష్ఠుడు**: రామా! కర్మ అంటే ఏమిటి? కర్మకు మూలం ఏది? కర్మను నశింప జేసేదెలా? కొంచెం వివరంగా చెప్పు.

**శ్రీరాముడు**: గురుదేవా! ఎవడైనా సరే, దేనినైనా నశింప చేయదలచుకుంటే, దాని మొదలు నరికి వేయాలి. మనం ఇక్కడ కర్మను నశింప చేద్దామనుకుంటున్నాం. కనుక, కర్మకు మూలం ఏమిటో అన్వేషించాలి. కర్మకు మూలం దేహం. దేహానికి మూలం జీవుడు. విషయోన్ముఖమైన చైతన్యమే జీవుడు. చైతన్యం 'తేజస్సు – జలం– అన్నం' అనే భూత త్రయంలో ప్రవేశించి, జీవుడౌతోందని ఛాందగ్యోపనిషత్తు చెబుతోంది కదా! కనుక ఈ జీవుడిలో 'విషయాంశ, చేతనాంశ'. అనే రెండు అంశలున్నాయి. వీటిలో విషయాంశకు మూలం అవిద్యా సహితమైన చైతన్యం. చేతనాంశకు మూలం శుద్ధ చైతన్యం. దానికి మరో మూలం లేదు.

కాబట్టి గురుదేవా! కర్మలన్నిటికీ అసలైన మూలం చైతన్యం విషయోన్ముఖం కావడమే. దీనినే 'వేదనం' అంటారు. ఈ వేదనం మొదట అహంకారాన్ని పుట్టిస్తోంది. దానివల్ల 'నేను కర్తను' అనే భావం కలుగుతోంది. ఈ భావం కర్మలకు కారణమౌతోంది. కనుక ఈ వేదనను తొలగించుకోగలిగితే, కర్మ పరిత్యాగం సాధ్యమౌతుంది. ఇవన్నీ మీరు చెప్పిన మాటలే! మళ్లీ మీకు మనవి చేశాను.

**వశిష్ఠుడు**: కానీ రామా! నువ్వు చెప్పిన వేదనం తొలగాలంటే, మానవుడు శారీరక మానసిక సమస్త కర్మ పరిత్యాగం చేసి తీరాలి. ఎందుకంటే, శరీరం వున్నంత వరకూ, ఏవేవో దృశ్యాధ్యాసలు వుంటూనే వుంటాయి. నువ్వు చెప్పిన వేదనం ఎప్పటికప్పుడు ఏదో విషయాలను తెలుసుకుంటూనే వుంటుంది. తెలుసుకుంది అంటే కర్మ పుట్టినట్లే!

ఒక్క సుషుప్తి దశలో ఏ భ్రాంతులు, ఏ వేదనలూ వుండవు. కానీ, అది సుస్థిర దశ కాదు. మళ్ళీ జాగ్రత్ స్వప్నాలు వస్తూనే వుంటాయి కనుక, నువ్వు చెప్పే కర్మ పరిత్యాగం ఎప్పటికీ సంభవించనే సంభవించదు.

అందుకే నేను, తూష్ణీంభావాన్ని సాధించమన్నాను. 'తూష్ణీభావం' అంటే మనస్సులో సంసక్తి లేక

పోవటం – అని చెప్పాను. దానిని సాధిస్తే, యథాప్రాప్త వ్యవహార కాలంలో కూడా 'నేను కర్తను కాదు' అనే భావం స్థిరపడుతుంది. అప్పుడు కర్మ జరుగుతున్నా సరే కర్మత్యాగం సంభవిస్తుంది. నువ్వు చెప్పిన కర్మత్యాగానికి ఒక్కటే ఉపాయం. దీనికి ఆత్మ నిష్క్రియమనే జ్ఞానమే మంచి మార్గం.

**శ్రీరాముడు**: గురుదేవా! ఆత్మ నిష్క్రియమనే జ్ఞానం కలిగితే, దృశ్య ప్రపంచ భ్రాంతి నశించవచ్చు. అంతే గాని, వేదనం ఎలా బాధింప బడుతుంది? (అంటే కారణంతో సహా ఎలా నివర్తిస్తుంది?)

**వశిష్ఠుడు**: రామా! 'వేదనం' అంటే విషయోన్ముఖమైన చైతన్యమని నువ్వే చెప్పావు. 'ఉన్ముఖం' అవటం అంటే ఏమిటి? జీవ చైతన్యం దృశ్యాలతో తాదాత్మ్యం చెందటం' అనే కదా! చైతన్యం జీవ రూపంలో వుందీ అంటే, అక్కడ 'విషయాలతో కలిసి పోవటం' అనే క్రియ జరుగుతున్నట్టే కదా! కనుక నీ "వేదనం" అంతా క్రియామయం. ఆత్మ నిష్క్రియమనే జ్ఞానంవల్ల నీ వేదనంలోని విషయ భాగం పూర్తిగా బాధింపబడుతోంది. అది పోతే, దానితో తాదాత్మ్యానికి ప్రసక్తి ఏముంది? కనుక, వేదనమే ఎగిరి పోతోంది. అది పోతే, జీవుడిలో వున్న చిదాభాసత్వం (చిత్ ప్రతి బింబత్వం) పోయి, శుద్ధ చేతనత్వం మిగులుతుంది. అంటే, జీవుడిలోని క్రియ గూడా లేకుండా పోయినట్లే! అంటే, ఆ జీవుడికి కర్మ త్యాగం సిద్ధించినట్లే!

అందుకే నేను, నిష్క్రియాత్మ బోధవల్ల కలిగే అసంసక్తి ద్వారా, కర్మత్యాగాన్ని సాధించమని చెబుతున్నాను.

**శ్రీరాముడు**: గురుదేవా! "ఉన్నదానికి ఎప్పటికీ లేమి లేదు. లేని దానికి ఎప్పటికీ ఉనికి రాదు" ("వాసతో విద్యతే భావః నా భావో విద్యతే సతః" ని. ఉ.స. 3, శ్లో. 1) అని మీరు ఒక సూత్రం చెప్పారు కదా! అలాంటప్పుడు వేదనం కాస్తా, అవేదనం ఎలా ఔతుంది?

**వశిష్ఠుడు**: రామా! నువ్వు చెప్పిన సూత్రం సత్యం. కానీ, నువ్వు చెప్పిన 'వేదనం' సత్యమయ్యేటట్లైతే , అది ఆవేదనం అయి వుండేది కాదు. కానీ, 'వేదనం' అనే శబ్దంలో గాని, దాని అర్థంలో గాని, సత్యం లేదే! అవి అచ్చంగా రజ్జు సర్ప భ్రాంతి వంటివి. సత్యం గాని వేదనం, అవేదనం కాక ఏం చేస్తుంది?

కనుక రామా! నువ్వు వేదనాన్ని పట్టుకోబోకు! దానికంటే, 'జ్ఞప్తి' అనే శబ్దాన్ని, దాని అర్థాన్నీ, పట్టుకోవడం మంచిది. 'జ్ఞప్తి' అంటే శుద్ధ జ్ఞానం. వ్యావహారిక దశలో వుండే జ్ఞానం పేరు వ్యావహారిక జ్ఞప్తి. అది వేరు. వట్టి 'జ్ఞప్తి' అంటే అది కూటస్థ చిన్మాత్ర స్వరూపం. అదే ప్రణవార్థం. అదే మోక్షకరం. ఈ విషయాన్ని గుర్తించి, విక్షేప రహితంగా వుండాలి. ఇలాంటి జ్ఞప్తి కలవాడికి పుణ్య పాపాలు అంటవు.

మారేడు కాయలోని గుజ్జే, అందులోని గింజగా మారుతుంది. అలాగే, చిద్రూపుడైన పరమాత్మే చిత్తంగానూ, త్రిపుటిగానూ రూపొందుతున్నాడు. అందువల్ల ఆ త్రిపుటి ఆత్మకంటే భిన్నం కాదు. ఈ విషయం అర్థమైతే, ఇక నువ్వు ఇందాక చెప్పిన కర్మ బీజానికి ఆధారమే లేదు. కర్మ త్యాగం అప్రయత్నంగా సిద్ధిస్తుంది.

అలా కాకుండా కేవలం కర్మేంద్రియాలను బిగపట్టుకొని కూర్చొని, అదే కర్మత్యాగం అనుకొనేవారు అజ్ఞానులు.

సారాంశం ఏమంటే, కోరిక లేని క్రియ అక్రియే అవుతుంది. అది దగ్ధ బీజం వంటిదే అవుతుంది. కనుక, జ్ఞానం ద్వారానే కర్మత్యాగాన్ని సాధించాలి.

జ్ఞానంవల్ల అహంకార మమకారాలు శాంతిస్తే, మోక్షం సులభమౌతుంది. శుద్ధ చైతన్యం విషయోన్ముఖమైనప్పుడు, మొట్ట మొదటగా జన్మించేది అహంభావమేనని ఇప్పుడు నువ్వే చెప్పావు కదా! ఆ అహంభావానికి తోబుట్టువే మమకారం!. ఆ తరువాతి ప్రపంచం మొత్తానికి ఈ రెండూ కలిసి మూలం ఔతున్నాయి. అందుచేత, ఈ అహంకార మమకారాలను ముందుగా నశింప చేసుకోవాలి. దానికోసం అనుక్షణం,అనహంభావనను వృద్ధి పొందించుకోవాలి (అనహంభావన అంటే, అహంభావానికి వ్యతిరేకం 'ఇది నేను కాదు, ఇది నేను కాదు' అనే భావన.)

***శ్రీరాముడు***: అనహంభావన కూడా ఒక భావనే కదా! భావన అనేది అధ్యాసలో భాగమే కదా! మరి దీనిని వదిలించుకోవడం ఎలా?

***వశిష్ఠుడు***: బురదనీటిలో ఇందుప గింజ గంధం కలిపాం. అంటే బురదలో మరో బురద కలిపాం. అప్పుడు ఈ రెండూ కలిసి కిందికి దిగిపోతాయి కదా! అలాగే అనహంభావాన్ని వృద్ధి చేసుకుంటే, అది అహంభావంతో కలబడి, ఆ రెండూ కలిసి నాశనమై పోతాయి. కనుక, అహంభావం ఉదయించినప్పుడల్లా అనహంభావాన్ని పుట్టించుకో.

దీనికి మొదటి మెట్టు లోభాది జయం.

**లోభో లజ్జా మదో మోహో**
**యేనాదావితి నో జితః ।**
**నిరర్థక మనర్థేస్మిన్**
**స కిమర్థం ప్రవర్తతే ॥** (ని.ఉ.సర్గ 4, శ్లో. 21)

రామా! లోభం (అత్యాశ), లజ్జ (సాధన విషయంలో సిగ్గు పడుట), మదం (గర్వం), మోహం (భ్రాంతి), ఇలాంటివాటిని ఎవడైతే ముందుగా జయించలేడో, వాడికి ఈ వేదాంత మార్గం అంతా ఒక అనర్థమే (కీడే!) కనుక అలాంటివాడు నిష్ప్రయోజనంగా ఈ మార్గంలోకి ప్రవేశించడం దేనికి? కనుక రామా! నువ్వు సరియైన కృషి చేసి, అనహంభావాన్ని సాధించు.

రామా! ఇంతకూ సారాంశమేమిటంటే, బ్రహ్మత్వ ప్రాప్తికి నిష్క్రియాత్మ భావనే ముఖ్య సాధన అని చెప్పాం. నిష్క్రియత్వం అంటే, కర్మేంద్రియాలను బిగదీసికొని కూర్చునే తూష్ణీం భావమని నువ్వనుకున్నావు. అది పొరపాటనీ, దీనికి మూలం అనహంభావమనీ, అనహంభావ సాధనవల్ల అహంభావమూ, అనహంభావమూ రెండు తొలగి పోతాయనీ, అప్పుడు నిష్క్రియాత్మ భావన సులభ సిద్ధమౌతుందనీ నేను తేల్చి చెప్పాను.

ఇలాంటి సాధన మొత్తానికి పూర్వరంగంగా ఇంద్రియ నిగ్రహం చాలా అవసరమని కూడా చెప్పాను. ఇది చాలా ప్రధానమైన విషయం. ఈ విషయంలో, మహాత్ముడైన భుశుండుడు పూర్వం ఒక విషయం చెప్పాడు. అది చెబుతా విను.

## 4. విద్యాధరోపాఖ్యానం

***వశిష్ఠుడు***: రామా! మహాత్ముడైన భుశుండుడి దగ్గరకి నేను అప్పుడప్పుడు వెళ్ళి వస్తూంటానని పూర్వమే చెప్పాను కదా! అలాగే ఒక సారి నేను ఆయన వద్దకు వెళ్ళినప్పుడు, మాటల ప్రసంగంలో–

“మహాత్మా! భుశుండా! మూఢుడై, ఆత్మజ్ఞానం లేనివాడై వుండి గూడా, నీకుమల్లే దీర్ఘకాలం బ్రతికున్న చిరంజీవిని ఎవరినైనా నువ్వు చూశావా?” అని అడిగాను. దానికి ఆయన ఇలా సమాధానం చెప్పాడు –

***భుశుండుడు***: వశిష్ఠమహర్షీ! పూర్వం లోకాలోక పర్వతశిఖరం మీద, ఆత్మజ్ఞానంలేని విద్యాధరుడు ఒకడు వుండేవాడు. (భూమికి చుట్టూతా దిక్కులకు చివరలో వుండే వెలుగుల సరిహద్దును లోకాలోక పర్వతం అంటారు.) అతనికి విద్యాధర జాతివారికి వుండే దివ్య శక్తులన్నీ వుండేవి. ఆ శక్తులతో అతను ఎప్పుడూ ఇంద్రియ సుఖలంపటుడై వుండేవాడు. ఇలా వుండగా అతనికి తన ఆయుర్దాయం ఐపోతోందని తెలిసింది. అందువల్ల భయపడి, అప్పుడు సదాచారాలనూ, నియమాలనూ పాటిస్తూ, దీర్ఘాయుష్షు కోసం మంచి తపస్సు చేశాడు. దానివల్ల అతని ఆయుర్దాయం పెరిగింది. మళ్ళీ ఆయుర్దాయం చివరికొస్తున్న సూచనలు కనిపించగానే, అతను మళ్ళీ తపస్సు చేస్తూ వుండేవాడు. అలా అతను నాలుగు కల్పాలపాటు ఇంద్రియ సుఖ భోగం ప్రధానంగా, తపస్సు అప్రధానంగా, జీవితం గడిపాడు.

ఎంత అప్రధానమైనా, ఆయుర్దాయం కోసం తరచూ తపస్సు చేస్తూ వుండటంవల్ల, నాలుగో కల్పం చివరిలో, అతని మనస్సులో వివేకం మొలకెత్తింది. కొత్త ఆలోచనలు వచ్చాయి–

"అరెరే! ఎన్నెన్ని సార్లు మరణం దగ్గరకొచ్చి పడుతోంది? ఎన్నెన్ని సార్లు తపస్సు చేస్తున్నాను? అంతకు ముందు ఎన్ని సార్లు జనన మరణాలు జరిగిపోయాయి? ఈ చక్రం ఆగేదెలా? అసలు నాకు ముసలితనమే లేకుండా పోయే ఉపాయమే లేదా? అసలు ప్రపంచంలో సుస్థిరమైన వస్తువే లేదా?" అని.

ఆ విద్యాధరుడు ఇలాంటి ఆలోచనలతో చాలా కాలం మథనపడి, ప్రపంచంలో శాశ్వతమైన వస్తువు ఏదీ కనిపించక, సారవంతమైన వస్తువు కూడా కనిపించక, విసుగు పుట్టి, విరక్తి కలిగి, చివరికి ఎవరు చెప్పారో గానీ, నా దగ్గరకు వచ్చాడు. అతను వచ్చేసరికి అతని శరీరం చాలా ముసలిదైపోయి వుంది. నేను అతనికంటే చాలా చిన్నవాడి లాగా కనిపిస్తున్నాను. ఐనా అతను నా దగ్గరకి వచ్చి, వినయంగా నమస్కరించాడు. నేనతనికి సమయోచితమైన అతిథి సేవలు చేశాను. అతను కొంత కాలం నా దగ్గరే వుండిపోయాడు. ఒక రోజు నేను విశ్రాంతిగా వున్న సమయం చూసి ఇలా అడిగాడు–

**విద్యాధరుడు**: భుశుండ యోగీశ్వరా! ఈ ఇంద్రియాలు మెత్తని కత్తుల్లాగా కనిపిస్తున్నాయి. తమ తమ విషయాలమీదకు వెళ్లేదాకా మెత్తగానే వుంటాయి. వెళ్ళాక గట్టిపడిపోయి, కత్తి లాగా మారిపోతాయి. ఇలాంటి ఇంద్రియాలకు లోబడి నాలుగు కల్పాలుగా జీవిస్తున్నాను. నేను విద్యాధర జాతివాడిని గనుక నా భోగాలకు అంతు లేదు. ఐనా ఏం ప్రయోజనం? నాకు శాశ్వత సుఖం కలగడం లేదు. చూడగా చూడగా ఏమనిపిస్తోందంటే, నీచాలైన ఈ ఇంద్రియాలకు లొంగనివాడు, మామూలు మానవుడైనా సరే, దేవతలైన మాకంటే వాడే గొప్పవాడు. తత్త్వవేత్తల సాంగత్యమే ఈ ఇంద్రియాల ఉద్రేకాలను తగ్గించగలదని పెద్దలు చెబుతున్నారు. అందుకే మీ దగ్గరికి వచ్చాను. శరణు వేడుతున్నాను. దయతో తత్త్వోపదేశం చేసి, ఉద్ధరించండి.

**గమనిక** - ఈ మాటలు చెప్పడానికి వాల్మీకి మహర్షి ఇంచుమించు ఒకటిన్నర సర్గలు తీసుకొన్నాడు. ఐదో సర్గ 13వ శ్లోకంతో విద్యాధర వాక్యం ప్రారంభమౌతుంది. అక్కడినుంచి 6వ సర్గ చివరిదాకా విద్యాధర వాక్యమే! ఇంద్రియాలయొక్క ఆగడాలను వర్ణించడమే ఈ శ్లోకాల తాత్పర్యం. వైరాగ్యాన్ని కలిగించడమే దీనికి ప్రయోజనం. ఇలా ఎక్కడికక్కడ వాక్యాలను, వివరణలనూ, పెంచుకుంటూ పోవడం చేతనే ఈ విద్యాధరోపాఖ్యానం 5వ సర్గనుంచి 16వ సర్గదాకా, 12 సర్గలపాటు సాగింది. మనం వీలైనంత సంగ్రహంగా ఈ సర్గల సారాన్ని గ్రహించే ప్రయత్నం చేద్దాం.

## 5. అహంకార త్యాగం

**భుశుండుడు**: విద్యాధరాధీశా! మంచిది. అదృష్టంచేత నీకు మంచి జ్ఞానం కలిగింది. సంసారంలోంచి బైటపడాలనే ఆలోచన వచ్చింది. ఇలాంటివాడికి మంచి బోధ చేస్తే, విషయాన్ని సరిగ్గా గ్రహించ గలుగుతాడు. అందుకే నేను నీకు ఉపదేశం చేయదలచు కుంటున్నాను.

**యదిదం వచ్మి తత్సర్వ**
**మోమిత్యాదాతు మర్హసి ।**
**అస్మాభిశ్చిరమన్విష్టం**
**నాత్ర కార్యా విచారణా ॥** (ని.ఉ.సర్గ.7, శ్లో.5)

నేనిప్పుడేమి చెప్పబోతున్నానో దానిని నువ్వు యథాతథంగా అంగీకరించడం మంచిది. ఎందుకంటే, ఈ విషయంలో మేము బహు దీర్ఘంగా విచారణ చేసివున్నాం. అందువల్ల ఇక ఇందులో నీ స్వంత విచారణ పెట్టవలసిన పని లేదు.

నీ హృదయాన్ని నువ్వే పరిశీలించి చూసుకో. అక్కడ "నేను నేను" అనే స్ఫురణ ఒకటి కనిపిస్తోంది.

దానిపేరే అహంకారం. అది నీకు కనిపిస్తోంది గనుక దానికి నువ్వు సాక్షివి. "నేను" అనేది నువ్వు కాదు. "నేను" కు సాక్షివి నువ్వు. ఈ మాట బాగా అర్థం చేసుకో.

అహంకారమే నువ్వు కానప్పుడు, మనోబుద్ధ్యాదులు నువ్వయ్యే అవకాశమే లేదు. ఈ కనిపించే ప్రపంచం కూడా అంతే. ఇవన్నీ వచ్చే పోయే విషయాలు. అందువల్ల అసత్తులు (లేనివి). కనుక, "నేను" అనేది లేదు. ప్రపంచమనేది లేదు. ఉన్నది పరబ్రహ్మ ఒక్కటే! ఈ నిశ్చయం నీకు కలిగితే, నీకు ఈ ప్రపంచమంతా మంగళప్రదమే! నీకిక దుఃఖం లేదు.

ఐతే, ఈ ప్రపంచం ఎలా పుట్టింది?– అనే ప్రశ్న వస్తుంది. అజ్ఞానంవల్ల జగత్తు పుట్టిందని కొందరు అంటారు. ఈ జగత్తువల్లే అజ్ఞానం పుట్టిందేమో అని ఒకోసారి అనిపిస్తుంది. ఏది దేనివల్ల పుట్టిందో చెప్పడం కష్టం. మనకు ఆ విచారణ అక్కరలేదు. మనకు కావలసింది ఏమిటంటే, ఈ జగత్తు, అజ్ఞానం – రెండూ ఒక్కటే! కనుక, దీనిని భావన చేసేందుకు రెండు మార్గాలున్నాయి.

ఈ ప్రపంచమంతా ఎండమావుల నీళ్ళనుకో. ఎండమావుల్లో నీరుగా కనిపించేదంతా వెలుగే! అలాగే, ప్రపంచంలో ప్రపంచంగా కనిపించేదంతా బ్రహ్మమే! ఇది ఒక దృష్టి. ఎండమావిలో నీరే లేదన్నట్లుగా, 'ఈ ప్రపంచమంతా మిథ్య' (లేకపోయినా కనిపించే వస్తువు) అని భావిస్తే, అప్పుడు ఈ ప్రపంచం లేనిది, అధిష్ఠానంగా ఉన్నది బ్రహ్మ! ఇది రెండో దృష్టి .

ఈ రెండు దృష్టులలోనూ గూడా, లేని ప్రపంచం కనిపిస్తోంది. 'ఇలాంటి ఈ ప్రపంచానికి బీజం ఏమిటి?– అని విచారించు. అహంకారమే ఆ బీజం! ఆ బీజంలోంచి వచ్చిన మహావృక్షమే పదునాలుగు లోకాలు అనే సంసారం.

ఈ చెట్టు ఎంత పెద్దదైనా, దీనికి బీజం అహంకారమే గనుక, దానిని తొలగిస్తే చెట్టుమొత్తం ఎగిరిపోతుంది. అహంకారమనే బీజాన్ని దహించగల అగ్ని 'అనహంకారం' మాత్రమే! కనుక నేననే స్ఫురణను అనహంకార భావనచేత తొలగించుకోగలిగితే, జీవన్ముక్తి లభిస్తుంది. ఈ దశలో ప్రారబ్ధశేషంవల్ల సుఖ దుఃఖ భోగం కొద్దిగా మిగిలి వుంటుంది గనుక, దాని కోసం ఈ సంసారం కనిపిస్తూ వున్నా, దానికి మళ్ళీ మొలక మాత్రం వుండదు.

అనహంకార భావనే జ్ఞానంయొక్క స్వరూపం. దీనిని అందుకుంటే–

**కుతోఽ హంత్వం కుతస్త్వంత్వం**

**కుతోద్విత్వైక్య విభ్రమః** (ని.ఉ.సర్గ.8, శ్లో.5)

నేననేది ఏది? నువ్వనేది ఏది? రెండూ లేవు. ద్విత్వమూ లేదు. ఏకత్వమూ లేదు.

గురూపదేశ పూర్వకంగా సంకల్పత్యాగం కోసం ప్రయత్నం చేస్తే, వారికి విజయం లభిస్తుంది. ముక్తి సిద్ధిస్తుంది.

విద్యాధరా! ఈ ప్రపంచం మిథ్యాత్మకమని అర్థం చేసుకోడానికి అనేక ఉదాహరణలను అన్వయించుకోవాలి. ఉదాహరణకు, ఈ ప్రపంచం గోడమీద గీసిన బొమ్మ వంటిదనుకోవచ్చు. గోడమీద గీసిన ఆవును చూచి పిల్లవాడు "ఆవు" అని సంతోషిస్తాడు. వాడి దృష్టిలో అక్కడ నిజంగా ఆవుంది. అది వాడికి సంతోషాన్నిస్తోంది. కానీ ఆ ఆవు పాలివ్వ గలదా? ఆకలి తీర్చగలదా? కనుక పాలను గురించి ఆలోచించే పెద్దవాడి దృష్టిలో అక్కడ గీతలే వున్నాయి గానీ, ఆవు లేదు. అలాగే, పైపైన చూసేవారికి ఈ ప్రపంచం వుంది. లోతుగా విచారించేవారికి ఇది లేదు. తత్త్వవేత్తలు తమ ఇచ్ఛాధీనమైన సంకల్పాలతో ఈ ప్రపంచాన్ని ఆవిర్భవింప చేసుకొంటారు. తమ అసంకాల్పాలతో, వీటిని అంతర్థానం చేసుకొంటారు. వారి చేతిలో వున్న కిటుకు ఏమిటంటే చిన్మాత్రభావన! నువ్వు కూడా ఆ చిన్మాత్రాన్ని పట్టుకొని, ఈ దృశ్య సమూహాన్ని

తుడిచేసుకో!

చైతన్యాన్ని పట్టుకున్నామంటే చాలదు. చైతన్యమాత్రాన్ని పట్టుకోవాలి. ఆ రెంటికీ తేడా ఏమిటంటావా? విను. చైతన్యం అన్ని వేళల్లోనూ, అన్ని చోట్లా వుంటుంది. సమస్త దృశ్య పదార్థాలకూ అధిష్ఠానంగా అది వాటికి నిత్య సన్నిహితంగానే వుంటుంది. అది అధిష్ఠానంగా అక్కడ లేకపోతే, ఆ దృశ్యవస్తువు ప్రకాశించనే ప్రకాశించదు. కనుక ఆ విధంగా దృశ్య పదార్థాలను ప్రకాశింప చేసే చైతన్యాన్ని ప్రతివాడూ తనకు తెలియకుండా పట్టుకుంటూనే వున్నాడు. దానివల్ల మోక్ష ప్రయోజనం సిద్ధించదు. దృశ్య సంపర్కం లేని శుద్ధ చిన్మాత్రను పట్టుకోవాలి. సూర్యకిరణం నీళ్ళలోకి ప్రవేశిస్తే వేడి చల్లారిపోయి వెలుగు మాత్రం మిగిలి వుంటుంది. అలాగే నీ మనస్సు శుద్ధ చిన్మాత్రలోకి ప్రవేశిస్తే, అప్పుడు దానికి వున్న తాపత్రయాలు తొలగిపోయి, అది కేవలం చిన్మాత్రయైపోతుంది. అదే జీవన్ముక్త స్థితి.

***విద్యాధరుడు***: దృశ్య పదార్థానికీ, చైతన్యానికీ, నిత్య సంబంధం వుందని ఎందుకు అనుకోవాలి? చైతన్య సంబంధం లేని దృశ్య పదార్థం వుండవచ్చునేమో!

***భుశుండుడు***: అలా వుంటే ఆ పదార్థం నీకు తెలిసే మార్గమేమిటి? ఏదీ వుండదు. అదీ గాక చైతన్యం సర్వవ్యాప్తమని మనం అంగీకరించాం గనుక, చైతన్య స్పర్శలేని దృశ్య పదార్థాన్ని మనం అంగీకరించే అవకాశం లేదు.

***విద్యాధరుడు***: తనకంటే విరుద్ధమైన లక్షణాలుగల చైతన్యంలో దృశ్య పదార్థం ఎలా వుండగలదు?

***భుశుండుడు***: ఎందుకు వుండకూడదు? నీటిలో నిప్పులేదా? నీటిలో అంతర్గతంగా నిప్పు వుండబట్టే గదా జల ప్రవాహ ఘర్షణలోంచి వేడి పుదుతోంది. సముద్రంలో బడబాగ్ని వున్నదనే మాట ప్రసిద్ధమే కదా!

***విద్యాధరుడు***: దృశ్య చైతన్యాలు ఈ విధంగా కలిసివుంటే కేవల చైతన్య భావన దృశ్య పదార్థాలను ఎలా నివర్తింప చేయగలదు?

***భుశుండుడు***: అగ్నిజ్వాల పుట్టడానికీ, ఆరిపోడానికీ, వాయువే కారణం! అలాగే దృశ్య పదార్థాల ఉత్పత్తి వినాశాలకు చైతన్యమే కారణమౌతోంది.

***విద్యాధరుడు***: చైతన్యాన్ని పట్టుకునేదెలా?

***భుశుండుడు***: చైతన్యం సచేతన పదార్థాలు గానూ, అచేతన పదార్థాలుగానూ, వివర్తన చెందుతోంది. ఇందులో నువ్వొక సచేతన పదార్థం. దీనిని నువ్వు "నేను" అనే చిత్త వృత్తితో గ్రహిస్తున్నావు. దీనినే అహమాకారవృత్తి అంటారు. దృశ్యపదార్థాలను "ఇది" అనే చిత్తవృత్తితో గ్రహిస్తున్నావు. దీనిని ఇదమాకార వృత్తి అంటారు. వీటిల్లో అహమాకారవృత్తిని తీసుకో. విచారణ బలంతో దీనిలో "నేను" అనే అంశకు "నిజమైన అస్తిత్వమే లేదు" అని గ్రహించడం ద్వారా, దానిని నశింపజేయి. అప్పుడు అహమంశతోపాటు అహమాకారవృత్తి గూడా నశించిపోతుంది. దీనితోపాటే అప్రయత్నంగా, ఇదమాకారవృత్తి గూడా నశించి పోతుంది. అప్పుడు చిన్మాత్రం మిగులుతుంది.

***విద్యాధరుడు***: మీరు చెప్పే పద్ధతిలో, చేతనాంశ–అచేతనాంశ కలిసి వున్నాయి. వాటిలో మీరు అచేతనాంశను నశింప చేస్తున్నారు. అప్పుడు దానితో కలిసివున్న చేతనాంశ గూడా నశించిపోదా?

***భుశుండుడు***: కలిసి వున్నంత మాత్రాన రెండూ ఒకసారి నశించాలనే నియమం ఏమీ లేదు. ఉదాహరణకు పాలు, నీళ్ళు కలిపి మరగబెట్టామనుకో, నీళ్ళు ఆవిరైపోయి, పాలు మిగులుతూనే వున్నాయి గదా! కనుక, నువ్వు నిస్సందేహంగా అహమాకార వృత్తిని నశింపజేసుకొనే ప్రయత్నం చెయ్యి. నువ్వు ప్రయత్నం చేస్తే, వ్యుత్థాన దశలో ప్రపంచ భావనా, సమాధి దశలో బ్రహ్మ భావనా, రెండూ నీకు స్వాధీనంగా వుంటాయి. నీకు ఏది కావాలంటే అది చేసుకో.

**చిచ్చమత్కృతయో వ్యోమ్ని**
**స్ఫురంత్యేతా జగత్తయా ।**
**అర్కాంశువదరోధిన్యః**
**స్వచ్ఛా విదిత వేదినామ్ ॥** (ని.ఉ.సర్గ.9, శ్లో.10)

చిత్రమేమిటంటే, అజ్ఞాన దశలో నీకు బంధాన్ని కలిగించేదీ చైతన్యమే! జ్ఞాన దశలో నీకు ముక్తిని కలిగించేదీ చైతన్యమే! ఎలాగంటే, ఎడారిలో ప్రయాణిస్తున్నవాడికి పెద్ద జల ప్రవాహం కనిపించింది. అది పొంగి తనమీద పడుతుందేమోనని వాడికి భయం వేసింది. ఇక ముందుకు అడుగు వేయలేక పోతున్నాడు. ఇక్కడ నిజంగా,వాడి కాళ్ళకు అడ్డం పెట్టేవి–నీటితరంగాలా? సూర్య కిరణాలా? నిస్సందేహంగా సూర్యకిరణాలే! కొంత సేపటికి ప్రక్కనున్నవాళ్ళు రకరకాలుగా బోధించగా బోధించగా, వాడికి అది జల ప్రవాహం కాదని, కిరణ ప్రవాహమేనని, అర్థమైంది. అప్పుడు వాడు నిస్సంకోచంగా ముందుకు నడవ గలిగాడు. ఇప్పుడు వాడి కాళ్ళకు విదుదల కలిగించింది ఎవరు? సూర్యకిరణాలే! అలాగే ఒకే చైతన్యం బంధానికీ, ముక్తికీ కారణమౌతోంది. తత్త్వజ్ఞానం కలిగితే అదే చైతన్యం ముక్తిని కలిగిస్తోంది. తత్త్వజ్ఞానం లేకపోతే, నిన్ను బంధించేదీ చైతన్యమే గానీ జడపదార్థాలు కావు. ఈ జడపదార్థాలన్నీ కేవలం చైతన్య చమత్కారాలు. అంటే చైతన్యంయొక్క వివర్తాలు. నువ్వు వాటిని పట్టించుకోకు. అపరిచ్ఛిన్న చైతన్యాన్నే పట్టుకో.

**గమనిక- ఈ విషయాన్ని పూర్వం ఉత్పత్తి ప్రకరణంలో**
**లీలోపాఖ్యానంలో ప్రస్తావన చేశారు.**

## 6. అచేతనమనేదే లేదు

***భుశుండుడు***: విద్యాధరా! నువ్వు చైతన్యాన్ని పట్టుకోలేకపోవడానికి ప్రధాన కారణం నీ మనస్సు అచేతన పదార్థాల మీద లగ్నం కావడమే! ఇక్కడ నువ్వు గ్రహించవలసిన రహస్యం ఏమిటంటే, అసలు ప్రపంచంలో అచేతన పదార్థమే లేదు. ఉందనుకోవడం పొరపాటు. నీళ్ళలో ప్రతిఫలించే అగ్నిజ్వాల నీళ్ళే అవుతుంది గానీ, నిప్పు అవుతుందా? అలాగే ఈ కనిపించే జడ పదార్థాలు గూడా చైతన్య స్వరూపాలే. ఎందుకంటే, నీకు అచేతన పదార్థం స్ఫురిస్తోంది కదా! ఈ స్ఫురణ ఎవరి లక్షణం? అది చైతన్యంయొక్క లక్షణం. ఏది వుండబట్టి నీకు ఈ జడపదార్థాలు స్ఫురిస్తున్నాయి? చైతన్యం ఉండబట్టి స్ఫురిస్తున్నాయి. కనుక, నీకు కనిపించేదంతా చేతనమే! ఈ విషయాన్ని నువ్వు గ్రహిస్తే అచేతన ప్రపంచం నిన్ను బంధించదు.

***విద్యాధరుడు***: మీరు జన్మాది వికారాలు లేని చిద్రూప పరమాత్మను అంగీకరించేసి ఈ మాటలు మాట్లాడుతున్నారు. అలాంటి పరమాత్మనే వున్నాడని అంగీకరించకపోతే?

***భుశుండుడు***: అప్పుడు ముక్తికోసం విచారణ చేయడం నిరర్థకం.

***విద్యాధరుడు***: ఒకవేళ అలాంటి పరమాత్మ వున్నాడనుకొంటే, ఆ పరమాత్మకు ఇలా జడ ప్రపంచాలను సృష్టిస్తూ వుండటమే నిత్య స్వభావమని చెప్పుకోవాలేమో!

***భుశుండుడు***: అది మరీ పొరపాటు. పక్కన రెండో వస్తువు వుంటే, దానిని బట్టి ఈ వస్తువుయొక్క స్వభావాన్ని నిర్ణయం చేయవచ్చు. కానీ పరమాత్మ అద్వితీయుడు. కనుక ఆయన విషయంలో స్వభావమనే మాట పొసగదు. కనుక తేలిందేమిటంటే, అచేతన పదార్థమే లేదు. ఉన్నదంతా చేతన పరబ్రహ్మమే! ఉంగరమన్నా, బంగారమన్నా ఒక్కటే! అలాగే జగత్తు అన్నా, బ్రహ్మ అన్నా ఒక్కటే!

కాని విద్యాధరా, ఈ స్థితిని సాధించడం అంత సులభం కాదు. దీనికోసం ముందుగా ఇంద్రియ జయాన్ని సాధించాలి. ఇది గూడా సామాన్యంగా కాదు. బాణాలు మీదబడి గుచ్చుకున్నా, ప్రియపత్ని మీదపడి కౌగిలించుకున్నా, నీ మనస్సులో ఏ రకమైన మార్పూ రాకూడదు. ఆ స్థాయిలో ఇంద్రియ నిగ్రహం సాధించాలి.

ఆ తరువాత చుట్టూతా వుండే కుండ, బండ, వంటి పదార్థాలను ఎలాగైతే తటస్థ దృష్టితో చూస్తున్నావో, అలాగే నీ శరీరాన్ని గూడ చూడడం నేర్చుకోవాలి. దీనికి పూర్వ రంగంగా ఈ దేహం మీద వుండే "నాది, నేను" అనే భావనను తొలగించుకోవాలి. ఆ భావాలు తగ్గాక, సమస్త ప్రపంచాన్ని జ్ఞాన రూపంగా, చైతన్య రూపంగా, చూడడం అభ్యసించాలి. ఇది దృఢపడితే, నువ్వు చైతన్య స్వరూపంగా వుండిపోతావ్

**"యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్**
**తత్కేన కం పశ్యేత్"**

(ఈ సమస్త ప్రపంచమూ తనకు ఆత్మే ఐపోయిన దశలో, ఆ మహాత్ముడు దేనిని దేనితో చూస్తాడు.)

అని ఈ మొదలైన వేదవాక్యాలు పై విషయాన్నే స్పష్టం చేస్తున్నాయి. ఇంతకూ, అపరిచ్ఛిన్న శుద్ధ చైతన్యాన్ని పట్టుకోవడంలో నీకు అడ్డుపడేది అవిద్యే! ఆ అవిద్య ఒక్కటీ పోతే, దాని కార్యాలైన సూక్ష్మ స్థూల ప్రపంచాలు రెండూ దానితోపాటే ఎగిరిపోతాయి. (సూక్ష్మ ప్రపంచం అంటే అహంభావం, స్థూల ప్రపంచం అంటే శరీరేంద్రియాదులు.) ఈ విషయం అర్థం కావాలంటే, నీకు పుట్టే సంకల్పాలన్నీ కూడా చిత్తుయొక్క వివర్తాలే అన్న విషయం అర్థం కావాలి. ఈ విషయం నీకు అర్థమయ్యేందు కోసం ఒక వివరణ ఇస్తాను, చూడు.

ఎవరికీ ఆకాశం అంటే ఏమిటో సరిగా తెలియదు. కానీ తెలిసినట్టు వ్యవహారం జరిగిపోతూ వుంటుంది. ఇది అందరికీ అనుభవంలో వున్న విషయమే! ఇలా వుండగా ఒక ప్రబుద్ధుడికి ఈ ఆకాశంలో రెండో ఆకాశం వున్నట్టుగా ఒక భ్రాంతి కలిగిందట! ఆత్మమీద అహంభావ భ్రాంతి కలగడం కూడా ఇలాంటిదే! ఎందుకంటే, ఆత్మ అంటే ఏమిటో ఎవరికీ తెలియదు. ఐనా తెలిసినట్లే వ్యవహారం జరిగిపోతూ వుంటుంది. కనుక అది ఆకాశం వంటిదే! ఇదే లక్షణం అహంభావానికీ కూడా పడుతుంది. అందువల్ల అది గూడా ఆకాశం వంటిదే. అందుకే ఈ ఉదాహరణ చెబుతున్నాను.

***విద్యాధరుడు***: అయ్యా! మీ ఉదాహరణ సరిపోదు. మీ దృష్టాంతంలో, రెండు ఆకాశాలు, వాటిని కల్పించుకొనే వ్యక్తి, అనే మూడు అంశాలున్నాయి. మీ దార్ష్టాంతికంలో ఆత్మ,అహంభావం,అనే రెండు అంశాలు మాత్రమే వున్నాయి. మూడో అంశమైన వ్యక్తి లేనే లేదు!

***భుశుండుడు***: నా దృష్టాంతంలో కూడా రెండే అంశలున్నాయి. ఒకటి ఆకాశం. రెండవది వ్యక్తి. వాడు భ్రాంతిచేత కల్పించుకున్న రెండో ఆకాశం, వాడి సంకల్పంలో అంతర్భాగం కనుక, అది మూడవ అంశం కాదు. కనుక నీ ఆక్షేపానికి చోటు లేదు.

ఇంతకూ ఈ దృష్టాంతం ద్వారా నేను చెప్పదలచుకున్నది ఏమిటంటే, దృష్టాంతంలోని వ్యక్తి, తన సంకల్పంలోనే అంతర్లీనమై వున్న రెండవ ఆకాశాన్ని, బైటికి తెచ్చేసుకొని, తనకంటే భిన్నంగా రెండు ఆకాశాలు వున్నాయని ఎలా భ్రాంతి పడుతున్నాడో, అలాగే, ప్రతిజీవీ తనలో వున్న అవిద్యనే "నేను" అనే పేరుతోనూ, "ఇది" అనే పేరుతోనూ, తనలోంచి విడదీసుకొని, వేరే వస్తువులుగా కల్పన చేసుకొని, భ్రాంతిలో మునుగుతున్నాడు.

ఇక్కడ నీవు అర్థం చేసుకొనవలసింది ఏమిటంటే, 'నేను' అనీ, 'ఇది' అనీ, కనిపించేది అవిద్యకంటే వేరు గాదు. దీనినే మరో రకంగా చెబితే నేను, ఇది అనేవి ఆ వ్యక్తి అనబడే శుద్ధ చైతన్యంయొక్క వివర్తాలే!

ఇక ఈ అవిద్య ఎవరు? అంటే, అది గూడా చైతన్యంయొక్క వివర్తమే! కానీ, అవిద్యలో వున్న జీవి దానిని అంగీకరించడం కష్టం. ఎందుకంటే, లోకులంతా అవిద్యా దశలో వుండి, అవిద్యకు ఒక సత్య వస్తువుగా భావిస్తూ మాట్లాడుతున్నారు. ఈ దృష్టిని దాటి బ్రహ్మ దృష్టిలోకి వెడితే, అవిద్య అనేది సత్యవస్తువు కానే కాదు! కనుక సాధకుడు ఈ అవిద్యను దాటిపోవడానికి ప్రయత్నం చేయాలి. దానికి ఉపాయం ఏమిటంటే,

అవిద్య కల్పించిన అహంకారము, బుద్ధి, మనస్సు, అనేవాటిని క్రమక్రమంగా నశింప జేసుకోవాలి.

దీనికి ఉపాయం ఏమిటంటే, తత్త్వవేత్తలను శ్రద్ధగా సేవించాలి. దీనివల్ల 'శుభేచ్ఛ' అనే మొదటి యోగభూమిక సిద్ధిస్తుంది. దీనివల్ల భార్యాపుత్రుల మీద మమతా భ్రాంతికి కారణమైన అవిద్య సగం నశిస్తుంది.

ఆ తరువాత వేదాంత శ్రవణం విశేషంగా చేయాలి. మనన నిదిధ్యాసలను అభ్యసించాలి. దీనివల్ల దేహాదులమీద అహంభావాన్ని కలిగించే అవిద్యలోని నాల్గవభాగం నశిస్తుంది. (ఇది అవిద్యలోని విక్షేప శక్తి భాగం)

అప్పటికి బ్రహ్మత్వ భావనా సాక్షాత్కారం మొదలౌతుంది. యోగ భూమికలలో నాల్గవ భూమిక అందుతుంది. ఇక్కడి నుంచీ ఈ భావన దృఢపడి, పై యోగ భూమికలు క్రమక్రమంగా అంది, అవిద్యలో మిగిలిన నాల్గవ భాగం కూడా నశిస్తుంది. (ఇది అవిద్యలోని ఆవరణశక్తి భాగం)

(ఉన్న సత్య పదార్థాన్ని కనిపించకుండా చేసేది ఆవరణ శక్తి. దాని స్థానంలో లేనిపోని కొత్త పదార్థాన్ని చూపించేది విక్షేపశక్తి.)

ఆ విధంగా, అవిద్య పూర్తిగా నశిస్తే, మిగిలేది నామరూప రహితస్థితి. అదే సన్మయ స్థితి. అదే పరమ పురుషార్థం!

***శ్రీరాముడు***: (భుశుండ -విద్యాధర సంవాదం వింటున్న రాముడు మధ్యలో వశిష్ఠుణ్ణి ప్రశ్నిస్తున్నాడు.)

గురుదేవా! మీరు సన్మయస్థితి అంటున్నారేమిటి? 'సన్మయం' అంటే 'సత్తు, అసత్తు' కలసినది అని అర్థం కదా! అవిద్య పూర్తిగా నశించిన స్థితిలో మిగిలిన అసదంశం ఏమిటి?

***వశిష్ఠుడు***: ఇక్కడ 'సన్మయం' అనబడే "మయట్" ప్రత్యయానికి అర్థం అది గాదు. "సత్" ఒక్కటే అక్కడ వున్నది అనే అర్థంలో గూడా 'సన్మయం అని వాడవచ్చు. నేను ఆ అర్థంలోనే వాడాను. ఇక భుశుండుడు ఏమి చెబుతున్నాడో విను.

***భుశుండుడు***: విద్యాధరా! అహంకారంవల్ల ప్రపంచమంతా ఏర్పడుతోందని చెబుతున్నాం గనుక, "ప్రపంచానికి ఆధారభూతంగా కనిపించే దేశకాలాలు ఎక్కడినుండి వచ్చాయి?" అని నీకు సందేహం కలుగవచ్చు. దేశకాలాలు అనే స్తంభం వుంటే గాని, ప్రపంచం అనే భవనం నిలబడ జాలదు గదా! అని నువ్వు ఆలోచించవచ్చు. కానీ, సత్యం అది కాదు. దేశ కాలాలు, ప్రపంచం, అన్నీ ఒకే సారి వచ్చేస్తున్నాయి. అందువల్ల ఈ దేశకాలాలు ప్రపంచానికి ఆధార స్తంభాలు కావు. ఈ విషయం నీకు బాగా అర్థమయ్యేందుకోసం ఒక చిన్న కథ చెబుతాను, విను.

## 7. అణుగర్భంలో ప్రపంచం కథ (ఇంద్రోపాఖ్యానము)

పూర్వం ఒక పరమాణువుయొక్క గర్భంలో ఒక పెద్ద కల్పవృక్షం వుండేది. కల్పవృక్షం అంటే నా సంకేతం నీకు అర్థమౌతోందనుకుంటాను. కల్పనలు చేసే వృక్షమే కల్పవృక్షం! అంటే, మాయా శబల బ్రహ్మ! (సగుణ బ్రహ్మ.)

ఈ కల్పవృక్షంలో రెండు కొమ్మలు కలిసిన చోట, ఒక మేడికాయ పుట్టింది. ఆ మేడి కాయే ప్రపంచం!

అదేమిటి? కల్పవృక్షానికి మేడికాయ పుట్టడమేమిటి? అని అనుకోకు. మాయ చేసే విచిత్రం ఇదే! ఈ చెట్టుకి వాసనా సమూహాలే నీళ్ళు. సుఖదుఃఖాల అనుభవాలే పరిమళాలు. మహా కల్పావసానం దాకా దీనికి దీర్ఘాయువు. దీనికి కాచే మేడిపళ్ళు ఒక్కో సారి కాకుల పాలౌతాయి. మరొక సారి కోకిలల పాలౌతాయి.

ఇక్కడ కాకులంటే, అవిద్య గల జీవులు. కోకిల లంటే విద్య గల జీవులు.

ఈ మేడిపండు మధ్యలో ఒక దేవేంద్రుడు వుండేవాడు. అతను స్వసంస్కార బలంచేత, గురూపదేశంచేత, వివేక వంతుడై రాజ్యం చేస్తూ వుండేవాడు.

ఇలా ఉండగా, రాక్షసులు వచ్చి యుద్ధానికి మీదపడ్డారు. ఆ సమయానికి హరిహరాది ప్రధాన దేవతలు, ఏదో కారణంచేత దూరంగా వెళ్ళి పోయారు. అందువల్ల ఆ యుద్ధంలో ఈ దేవేంద్రుడు ఓడిపోయి, పారిపోవలసి వచ్చింది. అతను పరుగెత్తి పరుగెత్తి ఎలాగో శత్రువుల కళ్లుగప్పి, ఒక అణువుయొక్క కడుపులోకి దూరాడు. ("త్రసరేణుం వివేశ సః" ని.ఉ.స.13, శ్లో.18)

అక్కడ కొంతకాలం విశ్రాంతిగా కూర్చొని, ధ్యానం చేసి, మనోబలంచేత ఒక భవనాన్ని నిర్మించుకున్నాడు. ఆ భవనంలోకి ప్రవేశించి, దానిచుట్టూ ఒక నగరాన్ని నిర్మించుకున్నాడు. నగరం చుట్టూ రాజ్యం నిర్మించుకున్నాడు. అక్కడ రాజ్యం చేస్తూ వుండగా కుందుడనే కొడుకు పుట్టాడు. కొంత కాలం తరువాత ఆ దేవేంద్రుడు కుందుడికి పట్టాభిషేకం చేసి, తన శరీరం వదిలిపెట్టాడు. ఆ వంశంలో ఇప్పటికి వేయ్యిమంది ఇంద్రులు పుట్టారు. ఇప్పుడు రాజ్యం చేస్తున్నవాడి పేరు అంశకుడు. వాళ్ళ రాజ్యానికి మూలమైన త్రసరేణువు జారిపోయింది. ఐనా ఆ రాజ్యం మాత్రం క్షేమంగానే వుంది.

ఆ వంశంలో ఒకానొక దేవేంద్రుడికి బృహస్పతి ఉపదేశం వల్ల, యథార్థ జ్ఞానం కలిగింది. అందువల్ల అతను యథాప్రాప్త కార్యానుసారి అయ్యాడు. వంద అశ్వమేధాలు చేశాడు. యుద్ధాలు చేశాడు. ఓడాడు, గెలిచాడు. ఎన్ని జరుగుతున్నా అతని తత్త్వదృష్టి చెదరలేదు.

ఒకసారి సమయం కలిసివచ్చినప్పుడు అతడు ధ్యానంలో కూర్చొని మాయాశబల బ్రహ్మయొక్క తత్త్వాన్ని తెలుసుకోవాలని ప్రయత్నం చేశాడు. ఆ ప్రయత్నంవల్ల అతనికి ఈ ముల్లోకాలూ చిన్మయత్మంలోనే వున్నాయని అర్థమైంది. ఈ ప్రపంచాలన్నీ ఉత్పత్తి కాలంలో సద్రూపాలు గానూ, వినాశకాలంలో అద్రూపాలుగానూ, వుంటాయినని అర్థం చేసుకొన్నాడు.

ఇలా అతను జ్ఞానసముద్రుడై ఉండగా, పూర్వం చేసిన నూరు అశ్వమేధ యాగాల సంస్కార బలంవల్ల సమాధిలోంచి బైటికి వచ్చాడు. మళ్ళీ నిస్సంగంగా రాజ్యం చేశాడు. మాయా తత్త్వాన్ని అర్థం చేసుకొని, ఈ మాయకు అహంకార తాదాత్మ్యభావనే (అహంకారాధ్యాసమే) కారణమని అర్థం చేసుకొని, ప్రశాంతంగా వుండిపోయాడు. కనుక విద్యాధరా!

**యత్రాహంత్వం జగత్తత్ర**

**పూర్వమాగత్య తిష్ఠతి ॥** (ని.ఉ.సర్గ.15, శ్లో..1)

ఎక్కడ అహంకారం వుంటుందో, అక్కడ అంతకు ముందే వచ్చి కూర్చుంటుంది ఈ ప్రపంచం– అని అర్థం చేసుకో!

***విద్యాధరుడు***: అహంకారానికి ముందే ప్రపంచం ఎలా వస్తుంది?

***భుశుండుడు***: ప్రతివాడూ స్వప్నంలో ఒక ప్రపంచాన్ని చూస్తున్నాడు. చూసినప్పుడు ఎవడికైనా ఇది కొత్తదని, కొత్తగా చూస్తున్నానని, అనుభూతి కలుగుతోందా? లేదే! అందుకే ఈ ప్రపంచం ముందే వచ్చి కూర్చుంటుందని అంటున్నాను. ఇందుకు అణుగర్భంలోని త్రసరేణువులో దేవేంద్రుడికి ఒక పెద్ద ప్రపంచం గోచరించడమే నిదర్శనం.

నిజానికి అహంకారానికీ, ప్రపంచానికీ, భేదమేమీ లేదు! గాలికీ చలనానికీ ఎంత భేదమో, అంతే భేదం అహంకార ప్రపంచాలకు!

కనుక సాధకుడు అహంకారాన్ని తుడిచి పెట్టుకోవాలి. తత్త్వదృష్టితో లేదను కోవడమే తుడిచిపెట్టుకోవడం.

తత్త్వదృష్టిలో అహంభావమనేది కుందేటి కొమ్ము వంటిది.

విద్యాధరా! నీకీ విషయం అర్థమైంది. ఒకటే గుర్తు పెట్టుకో! అధ్యారోప ప్రక్రియలో, అసలు శూన్యమైనది గూడా పర్వతం లాంటిదై పోతుంది. అపవాద ప్రక్రియలో పెద్ద బ్రహ్మాండం గూడా శూన్యమై పోతుంది.

**వశిష్ఠుడు**: రామా! భుశుండుడు ఇలా మాట్లాడుతుండగానే, ఆ విద్యాధరుడు సమాధిలోకి వెళ్ళిపోయాడు. భుశుండుడు ఎన్ని సార్లు మేల్కొల్పాలని ప్రయత్నించినా, అతను సమాధిలోంచి బైటికి రాలేదు.

రామా! పరిశుద్ధమైన చిత్తానికి ఉపదేశం చేస్తే, ఫలితం ఇలాగే వుంటుంది. నేను నీకు చెప్పే పరమోపదేశం కూడా ఇదే!

**నాహమిత్యస్తి తేనాంతర్**
**మౌనం భావయ శాన్తయే।**
**ఏతావదుపదేశోక్తిః**
**పరమా నేతరాస్తి హి ॥** (ని.ఉ. సర్గ.16, శ్లో.5)

అహంకారమనేది లేనే లేదు. (ఉన్నది చిదేకరసమైన ప్రత్యగాత్మే!)

కనుక నీకు నిత్యశాంతి కావాలంటే, మానసిక మౌనాన్ని పాటించు. లేని అహంకారాన్ని భావన చేయకు. ఇదే మేం చేసే ఉపదేశం! దీన్ని మించిన ఉపదేశం లేదు.

రామా! 'ఆత్మజ్ఞానం లేకపోయినా సరే, దీర్ఘ జీవితాన్ని ఎవరైనా సాధించారా?' అని అడిగినప్పుడు భుశుండయోగి ఈ కథంతా నాకు చెప్పాడు. నేను ఆశ్చర్యపోయి నవ్వి "ఆత్మజ్ఞానం లేకుండానే ఆ విద్యాధరుడు నాలుగు కల్పాల పాటు జీవించినా, చివరికి ఆత్మజ్ఞానంవల్లనే చిరంజీవి అయ్యాడు గదా" అని మనస్సులో భావించుకొని, భుశుండయోగి దగ్గర సెలవు తీసుకొని ఆ విద్యాధరుడున్న చోటికి వెళ్ళాను. అక్కడ ఆయన్ని చూసి, భుశుండుడు చెప్పింది సత్యమేనని అర్థం చేసుకొని, తిరిగి నా ఆశ్రమం చేరుకున్నాను.

రామా! ఇదంతా ఎప్పుడు జరిగిందనుకుంటున్నావ్? ఈ కల్పంలోనే పదకొండు మహాయుగాల వెనుక ఇది జరిగింది.

రామా! విద్యాధరుడి కథవల్ల మనకు తేలుతున్న మరో సత్యమేమిటంటే, అహంకారం నశిస్తే, పుణ్యపాప ఫలాలనిచ్చే సంసార వృక్షం నశిస్తుంది. శ్రవణ మననాది రూపమైన ఆత్మ విచారణవల్ల మాత్రమే అహంభావం నశిస్తుంది. అలా అహంభావం నశించిన జీవన్ముక్తుడికి శరీరం వున్నా, దాని నుంచి సంసార వృక్షం ఉద్భవించదు.

## 8. బయటి - లోపలి - ప్రపంచాలు

ఈ తత్త్వం తెలియని పామరులు మరణం అంటే భయపడతారు. మరణంలో మనస్సు, బుద్ధి, అహంకారం మొదలైనవన్నీ పూర్తిగా నశించిపోతాయని వారు అనుకుంటూ వుంటారు. అది పొరపాటు. అది ఎలాగో వివరిస్తాను, విను.

ఒకానొక ప్రారబ్ధశేషంవల్ల ఒకడికి మానవజన్మ వచ్చిందనుకొందాం. ఆ జీవి, ఆ కర్మశేషంవల్ల అనుభవించవలసి వున్న సుఖదుఃఖాలకు అనుగుణంగా, వాడియొక్క శరీరము, కొన్ని పరిసర ప్రాంతాలూ, వీటిని జతపరిచే చిత్త వృత్తులూ, ఇలాంటివన్నీ రూపొందుతాయి. కొంత కాలానికి, ఆ కర్మశేషం ఖర్చైపోయి, మరొక కర్మశేషం అనుభవానికి రావడంకోసం ఎదురు చూస్తూ వుంటుంది. అలాంటి సమయంలో ఆ జీవికి వెనుకటి దేహంమీద అహంభావాన్ని పుట్టించిన చిత్తవృత్తి పూర్తిగా మరపున పడిపోయి, అది రాబోయే దేహంమీద అహంభావాన్ని పుట్టించబోయే చిత్త వృత్తి వైపు దూకుతూ వుంటుంది. ఇలాంటి దశలో వెనుకటి

చిత్తవృత్తిని మర్చిపోవడం పేరే మరణం. దాన్ని వాడు మర్చిపోయాడే తప్ప చిత్తవృత్తి అనేది పోలేదు. అందుకే 'మరపే మరణం' అని పూర్వం నీకు చెప్పాను.

జీవుల చిత్తవృత్తులు చచ్చిపోలేదు. కనుకనే, ఇదిగో చూడు, అవి నాకీ అనంతాకాశంలో, గాలిలో మేరు మందర పర్వతాలు తేలిపోతున్నట్లుగా కనిపిస్తున్నాయి.

**శ్రీరాముడు**: గురుదేవా! నాకేమీ కనిపించడం లేదు.

**వశిష్ఠుడు**: కనిపించడం అంటే కళ్ళకు కనిపించడం కాదయ్యా! అర్థం చేసుకుంటే మనస్సుకి కనిపిస్తాయి. ప్రతిజీవీ పాత శరీరాన్ని విడిచినప్పుడు, సూక్ష్మదేహంతో రాబోయే శరీరానికి పోతాడా లేదా? ఆ శరీరాన్ని అందుకునే లోపల, ఆ ప్రాణం, అంటే సూక్ష్మ శరీరం, ఆకాశంలో తేలియాడుతూనే వుంటుంది గదా. ఆ ప్రాణంలో చిత్తం వుంది. ఆ చిత్తంలో సంకల్పాలున్నాయి. ఆ సంకల్పాలలో మేరు మందరాది పర్వతాలు కూడా వున్నాయి. అవి చిత్తాలతో పాటు గాలిలో తేలియాడుతూనే వుంటాయి, ఆ జీవియొక్క రాబోయే అనుభవం కోసం. ఆ దృష్టితోనే నేను మేరు మందరాది పర్వతాలు గాలిలలో తేలియాడుతూ కనిపిస్తున్నాయి, అన్నాను.

ఈ దృష్టిని అర్థం చేసుకుంటే, ఎంతెంత మంది మృత జీవులున్నారో?! వాళ్ళ చిత్తాలలో ఎన్నెన్ని రకాల ప్రపంచాలున్నాయో?! వాటిలో కొన్ని ఒకదానితో ఒకటి కలిసి, కొన్ని ఏ సంబంధమూ లేకుండా విడిపోయి, మన పరిసరాకాశంలో ఎలా తేలియాడు తున్నాయో ఆలోచించుకుంటే ఆశ్చర్యంగా లేదూ!

రామా! ఈ బయటి కంటికి కనిపించే ఈ ప్రపంచానికి, గాలిలో తేలియాడే ఆ ప్రపంచాలకూ, తేడా ఏమిటి? ఒక్కటే తేడా! బయటి ప్రపంచం మీద నీకు అహంకార మమకారాలు ఏర్పడ్డాయి. అందుచేత నీకు ఈ ప్రపంచం సత్యం లాగా కనిపిస్తోంది. మిగిలిన ప్రపంచాలమీద అలాంటి అహంకార మమకారాలు ఏర్పడలేదు. అందువల్ల అవి సత్యాలనే దృష్టి కలగడం లేదు. దీన్నిబట్టి, నీ అహంకారమే ఈ ప్రపంచంగా భాసిస్తోందని అర్థమౌతోంది కదా! కనుకనే, ఈ అహంకారాన్ని తొలగించుకుంటే, సంసారం తొలగిపోతుందని నేను చెబుతున్నాను.

**శ్రీరాముడు**: గురుదేవా! మీరు బయటి ప్రపంచమనీ, లోపలి ప్రపంచమనీ, విడదీసి మాట్లాడుతున్నారు. వీటిలో జీవుడియొక్క వ్యావహారిక రూపం ఏది? పారమార్థిక రూపమేది? బాహ్య వ్యవహారాలకు ద్వారమేది?

**వశిష్ఠుడు**: రామా! సర్వవ్యాపకమైన చైతన్యం సృష్టిచేయాలని సంకల్పించి, మొదట పంచభూతాలను సృష్టి చేసి, వాటిలోకి తనే ప్రవేశించి, జీవుడనే వ్యవహారాన్ని పొందింది. ఈ విషయాలను చాందోగ్యోపనిషత్తు బాగా వివరించింది. ఇలా జీవుడైన చైతన్యం కన్ను మొదలైన ఇంద్రియాలను స్వీకరించి, వాటి ద్వారా రూపం మొదలైన విషయాలను గ్రహిస్తోంది. ఇలా విషయ గ్రహణం చేసే జీవుణ్ణి 'చేతనుడు' అంటున్నారు. ఇది జీవుడియొక్క వ్యావహారిక రూపం.

దీనికి మూలమైన అసలు చైతన్యం వుందే, అదే పారమార్థిక రూపం. అది సూక్ష్మమూ గాదు, స్థూలమూ గాదు. శూన్యమూ గాదు, అశూన్యమూ గాదు. ప్రపంచంలోని రకరకాల పదార్థాల రూపాలలో భాసించేది ఇదే. తను వ్యావహారిక జీవుడైనప్పుడు, వాడి ఇంద్రియాల ద్వారా బయటకు ప్రసరించి, చెట్టూ పుట్టా మొదలైన పదార్థాల ఆకారాన్ని తనే చెంది, వాటిని ప్రకాశింప చేసేది కూడా ఇదే.

**గమనిక - ఈ విషయాలను ముముక్షు వ్యవహార ప్రకరణంలో "ఇంద్రియం ద్వారా జ్ఞానం కలిగే విధానం" అనే శీర్షిక క్రింద వివరించబడటం జరిగింది.**

బాహ్య వ్యవహారాలకు ద్వారాలు ఇంద్రియాలే! ఈ ద్వారాల ద్వారా జ్ఞానం బయటకు వచ్చి, వివిధ విషయాలను గ్రహిస్తోంది గనుక, గ్రహించే విషయాలను బట్టి జ్ఞానం కూడా చీలిపోయినట్లు కనిపిస్తోంది.

ఉదాహరణకు, కంటివల్ల కలిగే జ్ఞానం వేరు, ముక్కువల్ల కలిగే జ్ఞానం వేరు, అన్న అనుభూతి కలుగుతోంది. ఇవన్నీ భ్రాంతి జనితాలైన అనుభూతులే! ఈ అనుభూతులు గలవాడు వ్యష్టిజీవి. ఇతనికి మూలమైనవాడు సమష్టి జీవుడైన హిరణ్యగర్భుడు. ఇతడే విరాట్పురుషుడు. సృష్టిమొత్తం ఇతనియొక్క శరీరమైనప్పటికీ, చంద్రమండలం ఇతనికి సంకేతం. ఎందుకంటే, చంద్రమండలం ద్వారానే మనస్సు అనేది ఏర్పడి, వ్యష్టి జీవుడి హృదయంలోకి ప్రవేశిస్తుంది. "చంద్రమా మనో భూత్వా హృదయం ప్రావిశత్" ఇత్యాది శ్రుతివాక్యాలు ఈ విషయాన్ని నిరూపిస్తున్నాయి. సృష్టిలో ఇలాంటి చంద్రులు వేలకు వేలు గడిచిపోయారు. అంటే వేలకు వేలు విరాట్పురుషులు గడిచిపోయారు. ఇంకా ఎందరో గడవబోతున్నారు.

ఈ సమష్టి విరాట్పురుషుడు సత్య సంకల్పుడు. కనుక అతను ఏది ఎలా కావాలనుకుంటే, అది అలా రూపొందుతుంది. వ్యష్టి జీవులంతా ఇతని సంకల్పంవల్ల వచ్చిన వారే కనుక, ఇతనికీ, వ్యష్టిజీవులకూ, మౌలిక భేదమేమీ వుండదు. సమష్టిలో వుండే సత్తా, వ్యష్టిలో వుండే సత్తా, రెండూ ఒకటే! కానీ, వ్యష్టి జీవుడు తనలో తనే "నేను" అనే భేదాన్ని కల్పించుకోవడంచేత, బంధాన్ని పొందుతున్నాడు. కనుక రామా! నువ్వు "నేను" అనే పరిమిత అహంభావాన్ని తొలగించుకొని, ఆనందఘన స్వరూపుడవై జ్ఞానిగా వుండిపో.

## 9. జ్ఞాని - జ్ఞానబంధువు

రామా! మానవుడు జ్ఞానిగా వుండాలి గాని, జ్ఞాన బంధువుగా వుండకూడదు. జ్ఞాన బంధువుగా వుండేకంటే, అజ్ఞానిగా వుండటం మేలని నేనంటాను.

**శ్రీరాముడు**: గురుదేవా! జ్ఞాని అంటే ఎవరు? జ్ఞానబంధువంటే ఎవరు? వీళ్లకు లభించే ఫలితాలేమిటి? ఆ వివరాలు చెప్పండి.

**వశిష్ఠుడు**: రామా!

**వ్యాచష్టే యః పఠతి చ**
**శాస్త్రం భోగాయ శిల్పవత్ ।**
**యతతే న త్వనుష్ఠానే**
**జ్ఞానబంధు స్స ఉచ్యతే ॥** (ని.ఉ. సర్గ.21, శ్లో. 3)

ఒకడు ఇతర లౌకిక శిల్పాది శాస్త్రాలను చదివినట్టే, జీవిక కోసం అధ్యాత్మ శాస్త్రాలను చదువుతాడు. బాగా వ్యాఖ్యానం గూడా చేస్తాడు. కానీ దానిలో చెప్పబడిన విషయాలను ఆచరణలో పెట్టాలనే ప్రయత్నం గూడా చేయడు. వాడు జ్ఞాన బంధువు. (జ్ఞానానికి చుట్టం.) అలాంటివాడి వ్యవహారరీతిలో జ్ఞాన ఫలంయొక్క లక్షణాలు ఏమీ కనిపించవు. ఇతర లౌకిక శాస్త్రాలను అధ్యయనం చేసినవారి లాగానే వీడు గూడా ఎంత సేపటికీ తన రాబడి సంగతి చూసుకుంటూ వుంటాడు. పైకి జ్ఞాని లాగా నటిస్తూ వుంటాడు, లోపల మాత్రం జ్ఞానం సంగతి పట్టించుకోడు. అందుకే వీడు జ్ఞాన బంధువు.

ఉన్న మాట చెప్పాలంటే, ఆత్మజ్ఞానం ఒక్కటే జ్ఞానం. మిగిలిన జ్ఞానాలు జ్ఞాన భ్రాంతులు. (జ్ఞానాభాసలు.)

**శ్రీరాముడు**: ఐతే, పరిపూర్ణ జ్ఞాన సిద్ధుడొక్కడే జ్ఞాని. మిగిలిన సాధకులంతా నీచులైన జ్ఞాన బంధువులే – అని మీ ఉద్దేశ్యమా?

**వశిష్ఠుడు**: సాధకులు జ్ఞాన బంధువులే గాని, నీచులు గాదు. నేను చెప్పింది సాధనే చేయకుండా పైకి జ్ఞానులు లాగా నటించే నీచుల గురించి. వీరే అసలైన జ్ఞాన బంధువులు.

మరో రకమైన జ్ఞానబంధువులున్నారు. వారు వేదాంత శాస్త్రాధ్యయనం చేసి, దాన్ని ఆచరణలో పెట్టాలని కృషి చేస్తూ, చేత అయీ కాని పరిస్థితిలో తంటాలు పడుతూ వుంటారు. వీరు సాధువులైన జ్ఞాన

బంధువులు. వీరి విషయంలో జ్ఞాన బంధువులనే మాటకు అర్థం వేరు. "జ్ఞానేన బధ్యతే ఇతి జ్ఞానబంధుః "అని వ్యుత్పత్తి. జ్ఞానం వీడిని బంధిస్తుంది అని దీని అర్థం. జ్ఞానం వీడిని గట్టిగా పట్టుకుంటుంది కనుకనే వీడు పూర్తిగా జ్ఞాని కాలేకపోయినా, కేవలం అజ్ఞానిగా వుండ లేడు. భోగాలనే వ్యాధులతో రమించ లేడు.

కనుక రామా! సాధకుడు మొదట సాధుజ్ఞానబంధువు కావాలి.

**అత్రాహారార్థం కర్మకుర్యాదనింద్యం**

**కుర్యాదాహారం ప్రాణ సంధారణార్థమ్।**

**ప్రాణా ధార్యాస్తత్త్వ జిజ్ఞాసనార్థం**

**తత్త్వం జిజ్ఞాస్యం యేన భూయో న దుఃఖమ్ ॥** (ని.ఉ. సర్గ.21, శ్లో.10)

సాధకుడైనవాడు ఆహారంకోసం నింద్యం కాని పని చెయ్యాలి. ప్రాణాలు నిలుపుకోడానికి ఎంత ఆహారం కావాలో అంతే సంపాదించుకోవాలి. తత్త్వానికి తెలుసుకొనేందుకు ప్రాణాలు నిలుపుకోవాలి. దేన్ని తెలుసుకుంటే మళ్ళీ దుఃఖం కలగనే కలుగదో, అటువంటి తత్త్వాన్నే తెలుసుకునేందుకు ప్రయత్నం చేయాలి. ఇలా ప్రయత్నించేవాడు అచిరకాలంలోనే జ్ఞాని కాగలుగుతాడు. ఇక జ్ఞాని లక్షణాలు చెబుతా విను.

ఎవడైతే క్రమక్రమంగా జ్ఞానభూమికలను స్వాధీనం చేసుకుంటూ, మెట్టు మెట్టుగా పైకెక్కుతూ, చివరికి పరిశుద్ధ పరబ్రహ్మయందు స్థిరపడి, అచిత్తాన్నీ, చిత్తాన్నీ, కర్మఫలాన్నీ కూడా పట్టించుకోకుండా వుంటాడో, అంటే అవి యథార్థం కావని తెలుసుకొని ఉపేక్ష చేస్తాడో, వాడే జ్ఞాని. ఇక్కడ అచిత్తం అంటే, ఇంద్రియ గ్రాహ్యాలైన శబ్దాది విషయాలు. చిత్తం అంటే ఆయా ఇంద్రియాల ద్వారా బయటికి ప్రసరించి ఆయా పదార్థాల ఆకారంగా పరిణామం చెందిన అంతఃకరణ స్వరూపం. కర్మఫలం అంటే సుఖదుఃఖాలు.

ఈ స్థితి రావాలంటే సాక్షిత్త్వం పట్టుబడాలి. పూర్వం జడ భరతాదులు ఇలాంటి స్థితిని పొందడంవల్లే తమ శరీరాన్ని ఇతరులు నరుకుతున్నా చూస్తూ వూరుకున్నారు.

ఇలాంటి స్థితి రాకపోవడానికి కారణం అజ్ఞానం. అజ్ఞానానికి మొదటి ఆవిష్కారం అహంకారం. దాని రెండవ రూపం ఈ ప్రపంచం 'సత్యం' అనే భావన. ఈ ప్రపంచంలో విత్తు, మొలక, వంటి కార్య కారణ భావాలు కనిపిస్తూ ఉన్నాయి గనుక, ఇది సత్యమేనని అనిపిస్తూ వుంటుంది. కానీ, అటు సృష్టి ప్రారంభం దగ్గరకూ, ఇటు సృష్టి చివర ప్రళయం దగ్గరకూ, వెళ్ళి చూస్తే, ఈ కార్య కారణ భావాలకు అస్తిత్వం కనిపించదు. ఐనా, సామాన్య మానవులంతా ఈ ప్రపంచం సత్యమేనని నమ్మి, దానిమీద అహంకార మమకారాలు పెట్టుకుంటున్నారు.

అక్కడి దాకా ఎందుకు? ప్రతివాడూ తన దేహం మీద "నేను" అని అభిమానం పెట్టుకుంటున్నాడు గదా! ఈ దేహం ఎలా వచ్చింది? అది మొదట్లో ఒకానొక పురుషుడి శరీరంలో రేతో బిందువుగా వుంది. అప్పుడు దానిలో వున్న జీవుడు ఆ ఆకారాన్ని నేననుకున్నాడు. అది తల్లి గర్భంలోకి చేరి, నెత్తురు చుక్క ఐంది. ఆ తరువాత చిన్న బుడగ అయింది. ఆ తరువాత మాంసం ముద్ద అయింది. ఆ తరువాత క్రమంగా మానవాకారాన్ని చెందింది. ఆ తరువాత అది బయటికి వచ్చి ఇప్పటి దేహం అయింది. ఈ దశలలో ప్రతి దశలోనూ ఆ జీవుడు ఆ ఆకారాన్ని "నేను, నేను" అని అంటూనే వున్నాడు. ఇప్పుడు మాత్రం 'నువ్వు ఒట్టి మాంసపు ముద్దవురా! నీడి బుడగవురా! నెత్తురు చుక్కవురా' అంటే ఒప్పుకోడు! ఇలాంటి స్థితిలో వీడి దేహాభిమానానికి అర్థం ఏమిటి? ఐనా జీవులను అహంకారం వదిలి పెట్టడం లేదు. ఇదే అజ్ఞానం!

జ్ఞాన బంధుత్వానికి ఫలితాలు ఈ అజ్ఞానమూ, దానివల్ల వచ్చే సంసారమూ. ఇది తొలగిపోవడమే జ్ఞానికి ఫలితం. ఈ జ్ఞానఫలితం దక్కాలంటే, బ్రాహ్మణోత్తముడైన మంకిలాగా వైరాగ్య సాధన చెయ్యాలి. అతడు వైరాగ్య సాధన చేసి, నావల్ల ఉపదేశం పొంది, జీవన్ముక్తిని సాధించాడు. ఆ వివరాలు చెబుతా , విను.

## 10. మంకిచరిత్ర

పూర్వం ఒకప్పుడు మీ తాతగారైన అజమహారాజు నన్ను రమ్మని ధ్యానమార్గంలో పిలిచాడు. ఆ సమయానికి నేను చాలా దూరంలో వున్నాను. నేను అతని కోసం ప్రయాణం చేసివస్తూ వుండగా, ఒక పెద్ద అడవి దాటవలసి వచ్చింది. ఆ అడవి కొన్ని చోట్ల నిర్మానుష్యంగానూ, కొన్ని చోట్ల మంచుమయంగానూ, కొన్నిచోట్ల తట్టుకోలేనంత ఎండగానూ వుంది. నేను ఆ ఎండ ప్రాంతాల దగ్గరికి వచ్చేసరికి, నాకు ఒక బాటసారి కనిపించాడు. అతను ఆ ఎండను తట్టుకోలేక విలవిల లాడిపోతున్నాడు. అందువల్ల అతను, ఆ దగ్గరలో ఏదైనా బోయపల్లి దొరుకుతుందేమో, అక్కడ కాస్తంత విశ్రాంతి దొరుకుతుందేమో, అనే అన్వేషణలో వున్నాడు.

ఆ బాటసారిని చూసేసరికి, అతనొక సద్బ్రాహ్మణుడనీ, అనుష్ఠానాలు తీవ్రంగా చేసి శరీరాన్ని కృశింప చేసుకున్నావాడనీ, నాకర్థమైంది. అందువల్ల అతని మీద జాలి కలిగి, అతనొక బోయపల్లిలోకి ప్రవేశించ బోయే సమయంలో, వెనక్కు పిలిచి ఇలా అన్నాను –

“ఎడారి బాటల తీరు తెన్నులు తెలియని మిత్రమా! నీకు స్వాగతం. తప్పుదారి పట్టిన బాటసారీ! విశ్రాంతి కోసం విరుద్ధ ప్రాంతాలకు పోతున్నావే. ఉప్పునీళ్ళు త్రాగితే దాహం తగ్గుతుందా? మంచి గ్రామాలన్నీ ఉత్తర దక్షిణాలలో వెనుక వుండగా, అవన్నీ వదిలేసి, ఇప్పుడీ కిరాత గ్రామంలోకి ఎందుకు ప్రవేశిస్తున్నావ్? ఇక్కడ వుండే కిరాతులు క్రూరులు. వీరికి వివేక విచారాలంటే పడవు. కొత్త వాళ్ళను హింసించటమే వీరికి క్రీడ!” – అని.

నేను ఊహించినట్లుగానే, అతను నా మాటల్లోని అంతరార్థాన్ని గ్రహించి ఇలా అన్నాడు –

**బాటసారి**: మహాత్మా! ఎవరు మీరు? మిమ్మల్ని పరిశీలించి చూస్తుంటే, మీరు జ్ఞాన స్వరూపుల్లాగా వున్నారు. పరమానంద పరిపూర్ణులుగా వున్నారు. ఈ పరిసరాలే మీకు అంటుతున్నట్లు లేదు. మీరు తలచుకుంటే, సృష్టికి ప్రతి సృష్టి చేయగలరేమో అనిపిస్తోంది. ఐనా, మీకలాంటి సంకల్పాలు ఉన్నట్టు లేవు. మీరు నా మీద కరుణతో ఏదో నర్మగర్భంగా మాట్లాడుతున్నారనిపిస్తోంది. నా పేరు మంకి. నేను బ్రాహ్మణుడ్ని. మాది శాండిల్య గోత్రం. మీరు చెప్పినట్లుగానే నేను ఉత్తరాయణ దక్షిణాయన మార్గాలలో కర్మోపాసనలు చేశాను. ఐనా విశ్రాంతి లభించ లేదు. ఆ తపన తట్టుకోలేక, తీర్థయాత్రలు చేసి, తిరిగి వస్తున్నాను. ఇంటికి వెళ్ళాలని లేదు. ఎక్కడికి పోవాలో తెలియదు. ఇలాంటి దశలో మహాత్ములైన మీ దర్శనం లభించింది. మహాత్ములు అకారణ కరుణామయులు. కనుక మీరు నాకు తత్త్వజ్ఞానాన్ని అనుగ్రహించండి. నేను ఎంతో విచారణ చేశాను. ఐనా నాకు దుఃఖం పోకుండా వుంది. స్వీయ విమర్శ ఎంత వున్నా, గురూపదేశం లేనిదే తత్త్వం పట్టుపడదని నాకు అర్థమౌతోంది. మీరు గురువై నన్ను ఉద్ధరించండి.

**వశిష్ఠుడు**: ఓ బాటసారీ! నన్ను వశిష్ఠుడంటారు. ఆకాశమే నా ఇల్లు. అజమహారాజుగారు యాగానికి పిలిస్తే బయలుదేరి వెళ్తున్నాను. దారిలో నువ్వు తగిలావు. నువ్వు వైరాగ్య సాధన చేసినవాడివని నిన్ను చూస్తేనే తెలుస్తోంది. ఇంతకూ నువ్వు సంసారాన్ని ఎందుకు విడిచి పెట్టాలనుకుంటున్నావ్? ఏమి తెలుసుకోవాలని అనుకుంటున్నావ్? కొంచెం వివరంగా చెప్పు.

రామా! నా పేరు వినేసరికి మంకి బ్రాహ్మణుడు ఆనంద భాష్పాలు రాలుస్తూ నా కాళ్ళమీద పడి నమస్కరించి, ప్రపంచంయొక్క నిస్సారత్వాన్ని, సాంసారిక జీవుల అల్పత్వాన్ని, భౌతిక సుఖాల దుఃఖమయత్వాన్ని, వివరిస్తూ, సుదీర్ఘంగా ప్రసంగించి, చివరికి ఇలా అన్నాడు.

**మంకి**:మహాత్మా! సరియైన సద్గురువు లభిస్తే, మోహం తక్షణమే పటాపంచలౌతుందని, పెద్దలు చెప్పగా

విన్నాను. నా అదృష్టంవల్ల తమ దర్శనం లభించింది. నా అజ్ఞానాన్ని, మోహాన్నీ, దుఃఖాన్నీ, తొలగించగల తత్త్వోపదేశం చేయండి.

**వశిష్ఠుడు**: మంకీ! ఈ సంసారంలో వుండే అనర్థాలన్నీ చక్కగా వర్ణించావు. అవన్నీ పోవాలంటున్నావ్. అవి పోవాలంటే వాటి మూల కారణమేమిటో తెలియాలి.

**సంవేదనం భావనం చ**
**వాసనా కలనేతి చ ।**
**అనర్థాయేహ శబ్దార్థో**
**విగతార్థో విజృంభతే ॥** (ని.ఉ.సర్గ.25, శ్లో. 1)

ఆ మూల బీజాలు నాలుగు –

1. సంవేదనం – అంటే, ఇంద్రియాలతో విషయానుభావం.
2. భావనం – అంటే, గడిచిన విషయాలను మళ్ళీ మళ్ళీ నెమరువేసుకోవటం.
3. వాసన –అంటే, పై చెప్పిన భావనవల్ల మనస్సులో ఆ యా విషయాల ముద్రలు (సంస్కారాలు) పడటం.
4. కలన– అంటే, పై వాసనలవల్ల ఆఖరికి మరణ సమయంలో కూడా ఆ యా విషయాల స్మృతులు వెంటపడటం.

ఈ నాలుగింటిలోనూ చివరి రెండింటికీ మొదటి రెండూ కారణాలు. అంచేత, ఆ సంవేదన భావనలే మరింత ముఖ్యమైనవి.

ఈ నాలుగు బీజాల్లోనూ, వాసనా కలనలను నువ్వు ఏమీ చేయలేవు. ఆప గలిగితే, సంవేదన భావనలనే ఆపాలి. అందుకనే వివేకవంతులు విషయాలలో వున్న దోషాలనే ఎల్లప్పుడూ భావన చేస్తూ వుంటారు. అంతేగాక తాము బ్రహ్మస్వరూపులమని గూడా భావన చేస్తూ వుంటారు. ఈ రెండు భావనలవల్ల, వాళ్ళకు సంవేదనం తగ్గుతుంది. అందువల్ల వాసనా కలనలు గూడా తగ్గుతాయి.

సామాన్య సంసారుల విషయంలో, పూర్వ వాసనలే ప్రధాన పాత్ర వహిస్తూ వుంటాయి. వాసనలే శుద్ధ చైతన్యాన్ని వాళ్ళు గుర్తించకుండా చేస్తూ వుంటాయి. ఈ వాసనలవల్లే దేహేంద్రియాదుల కంటే భిన్నంగా చిద్రూప పరమాత్మ అనేవాడు లేనే లేడనే భ్రాంతి వారికి కలుగుతూ వుంటుంది. ఈ భ్రాంతినే అవిద్య అంటారు. దీనికి ఆది లేదు.

ఈ అవిద్య రెండు రకాలు.

1. అసత్వాపాదకం– అంటే, ఆత్మ లేదనే భావన్ని కలిగించే అవిద్య.
2. అభానాపాదకం– అంటే, ఆత్మ నాకు కనిపించడం లేదనే భావాన్ని కలిగించే అవిద్య.

ఈ రెండు రకాల అవిద్యలకూ గూడా రెండు శక్తులున్నాయి.

1. ఆవరణ శక్తి– అంటే, ఉన్న సత్యవస్తువును కనిపించకుండా కప్పివేసే శక్తి.
2. విక్షేప శక్తి –అంటే, సత్యవస్తువు స్థానంలో మరో లేనిపోని వస్తువును చూపించే శక్తి.

వీటిలో విక్షేప శక్తిని ప్రధానంగా తీసుకున్నప్పుడు, ఈ అవిద్యనే 'భ్రమ' అంటారు. ఆవరణశక్తి ప్రధానంగా వున్న అవిద్యను అవిద్య అనే అంటారు. అవిద్యా, భ్రమలు – రెండూ కలిసి ఈ సంసారాన్ని కల్పిస్తాయి. కనుక, అవిద్యా భ్రమలను తొలగించు కుంటే, సంసారం తొలగి పోతుంది. అది తొలగిపోతే, మిగిలేది శుద్ధ పరమాత్మే!

ఈ దృష్టి స్థిరపడితే, కనిపించే ప్రపంచమంతా చిన్మాత్రమే!

**మంకి**: ఈ ప్రపంచం జడ చేతనాల మిశ్రమ భావం- అనకూడదా?చెక్కకు లక్క అతుక్కుపోతే, ఒకటి లాగానే కనిపిస్తుంది. అంతమాత్రంచేత ఆ రెండూ ఒకటై పోతాయా?

**వశిష్ఠుడు**: లక్కా చెక్కలు ఎంత బాగా అతుక్కున్నా, వాటిని విడదీసి చూడవచ్చు. కానీ ప్రపంచంలో అధిష్ఠానంగా వున్న చైతన్యాన్ని విడదీస్తే, ఇక అక్కడ జడమే లేదు. కదలిక అనే గుణాన్ని తీసివేస్తే, ఇక వాయువే లేదు. చిత్ జడాల పరిస్థితి కూడా అంతే. కనుక, దృశ్యమంతా చిన్మాత్రమే అని చెప్పక తప్పదు.

సత్యం ఇదై వుండగా, జీవుడు కొన్ని పదార్థాలమీద “నేను” అనే అభిమానాన్ని తెచ్చుకుంటున్నాడు. అంటే ‘నువ్వు’ అని పిలువదగినదాన్ని ‘నేను’ అని పిలిచేస్తున్నాడు. ఈ అహంభావమే బంధం. అనహంభావమే దానికి విరుగుడు. అంటే అనహంభావమే ముక్తి.

అనహంభావం రావాలంటే, ఆత్మ చిన్మాత్ర స్వరూపమనే తత్త్వం గట్టిగా పట్టుబడాలి. కానీ ఆత్మ తత్త్వాన్ని గురించి అనేకమంది వాదులు అనేక రకాలుగా ప్రతిపాదనలు చేస్తున్నారు. కొందరు చిత్తు వేరు, జడం వేరు, ఐనా ఆ రెంటికీ ఏకత్వాన్ని సాధించుకోవాలి, ఇత్యాదిగా వాదిస్తున్నారు. ఇవన్నీ వాళ్ళ జన్మాంతర వాసనల చేత వచ్చిన ఊహలే! అసలైనదారి శ్రుతి మార్గమే! కనుక ఓ మంకీ! నువ్వు అలాంటి దుర్వాదాల వలలో పడబోకు! పడ్డావా, నీకిక సంసారం తప్పదు.

చెప్పినదాని సారాంశమే మళ్ళీ చెబుతున్నాను. పూర్వకర్మచేత కలిగిన భావనవల్లే ప్రపంచం ఏర్పడుతోంది. ఈ దుర్భావన పోవాలంటే, వివేక పూర్వకంగా తత్త్వదర్శనం చేయాలి. తత్త్వదర్శనం అంటే కేవలం శాస్త్ర శ్రవణం కాదు. మనస్సులో గూడుకట్టుకున్న కోరికలన్నీ తొలగాలి. అప్పుడే సంసారం పరిపూర్ణంగా ఉపశమిస్తుంది.

రామా! నేనీ విధంగా వివరించి ఉపదేశించే సరికి మంకి మహాశయుడికి, మనస్సులో గూడుకట్టుకొని వున్న మోహమంతా అక్కడికక్కడే అంతరించి పోయింది. ఆ తరువాత అతను కర్మ ప్రవాహ ఫలితంగా వచ్చిపడుతున్న కార్యాలను చేసుకుంటూ ప్రశాంతుడై తత్త్వజ్ఞాన ప్రధానుడై జీవించాడు. ఆ తరువాత వంద సంవత్సరాలకు అతనికి నిర్వికల్ప సమాధి కుదిరింది. అతను ఇప్పటికీ ఒక కొండమీద శిలా ప్రతిమ లాగా సమాధిలోనే వున్నాడు. సమాధి అంటే స్తబ్దత్త్వం అనుకోకు. పిలిస్తే పలుకుతాడు. లేకపోతే ఇక బాహ్య దృష్టి లేనే లేదు. అదీ అతని స్థితి. రామా! నువ్వు కూడా అలాంటి స్థితి కోసం ప్రయత్నించు.

**గమనిక** – మనం సంగ్రహంగా చెప్పుకున్న ఈ మంకి చరిత్ర చెప్పడానికి వాల్మీకి మహర్షి 23 నుంచి 26 దాకా 4 సర్గలు తీసుకున్నాడు. ఆ తరువాత వశిష్ఠుడు మళ్ళీ తన బోధను కొనసాగించాడు.

## 11. ఆత్మ దర్శనం- త్రిపుటి

**వశిష్ఠుడు**: రామా! మేము ఆత్మ సాక్షాత్కారం పొందామని చెబుతుంటే, కొందరు ఒక కొత్తరకం ప్రశ్న లేవదీస్తున్నారు. ఏమంటే ‘ఆత్మ సాక్షాత్కారం అంటే ఆత్మ దర్శనమే కదా! దర్శనం వుందంటే ద్రష్టలు– దృశ్యము– దర్శనము అనే త్రిపుటి వున్నట్టే గదా! త్రిపుటులన్నీ అసత్యాలే అని మీ సిద్ధాంతం గదా. కనుక మీ ఆత్మ దర్శనం గూడా అసత్యమే గదా” – అని.

ప్రశ్న బాగున్నట్టే కనిపిస్తుంది గానీ, దీనిలో ఒక ప్రధానమైన లోపం వుంది. లోకంలో వుండే ఇతర త్రిపుటులకీ, ఆత్మ దర్శన త్రిపుటికీ ఒక పెద్ద భేదం వుంది. లోకంలో వుండే త్రిపుటులకు సంకేతంగా ధ్యాత–ధ్యేయం–ధ్యానం అనే త్రిపుటిని తీసుకుందాం. లోకంలో ప్రతివాడూ ప్రాపంచిక పదార్థాలను చూస్తున్నాడు. ఎలా చూస్తున్నాడు? నిజం చెప్పాలంటే, ఎదురుగుండా నిజంగా పదార్థాలుండి చూడడం లేదు. వాడు ఆ

పదార్థాలను భావన చేస్తున్నాడు గనుక, ఆ భావనా బలంచేత చూస్తున్నాడు. అందుచేత ధ్యానాది త్రిపుటిలో భావనే (ధ్యానమే) తప్పితే వేరే ప్రమాణం లేదు. అక్కడ సత్య వస్తువు లేదు. అందుకే, ఈ ధ్యానాది త్రిపుటిని ప్రమాణజన్యం కాదనీ, వస్తుతంత్రం కాదనీ, అంటారు. ఇది కేవలం ధ్యానించే జీవిడియొక్క ఇచ్ఛమీద ఆధారపడి వుంటుంది. అందుకే దీనిని ప్రరుషేచ్ఛాధీనం అంటారు. అందువల్లే ఇలాంటి త్రిపుటులన్నీ అసత్యాలని మేము నిశ్చయించి చెప్పాము.

ఇక ఆత్మ దర్శన త్రిపుటి వుందే, అక్కడ యథార్థమైన పదార్థం, దానికి ఆత్మానుభూతి అనే ప్రమాణం వున్నాయి. కనుక ఇది వస్తుతంత్రం ఔతుంది. ప్రమాణ తంత్రం ఔతుంది. అందువల్ల ఈ త్రిపుటి ఇతర త్రిపుటులన్నిటికన్నా భిన్నమైంది. అందుకే దీనికి అసత్యం పట్టే అవకాశం లేదు.

కనుక రామా! ఆత్మ దర్శనం అసత్యమయ్యే ప్రసక్తి లేదు. విచారించి చూస్తే, ఈ ప్రపంచం మొత్తం కేవలం మనోమయం. కనుక నా ఉపదేశాన్ని గ్రహించి, అహంభావ రహితుడవై జీవించు. నా ఉపదేశాన్ని మరచి, స్వస్వరూపంనుంచి జారిపోబోకు. నువ్వు ఇప్పటికే బ్రహ్మ సాక్షాత్కారాన్ని పొందావు. కనుక, ఇక హర్షశోకాది దోషాలను విడిచిపెట్టి, సమాధి ప్రధానంగా జీవించినా సరే, లేక యథాప్రాప్తంగా వాటిని స్వీకరించి, వ్యవహార ప్రధానంగా జీవించినా సరే, అది నీ ఇష్టం. (సర్గ 27)

***శ్రీరాముడు***: గురుదేవా! పురుషుడు బీజం అనీ, కర్మలు ఆ బీజానికి అంకురాలనీ, ఈ రెండూ బయటికి కనిపించే కారణాలైనా, అదృష్టం అనే మరొక కారణం కూడా కలిసి జన్మ పరంపరను కలిగిస్తూ వుంటాయనీ, పూర్వం మీరు చెప్పారు. ఆ తత్త్వాన్ని మరొకసారి వివరించండి.

***వశిష్ఠుడు***: రామా! నువ్వు దృష్టకారణాలు రెండు, అదృష్టకారణం ఒకటి, మొత్తం మూడు కారణాలు చెప్పావు. వీటిలో అదృష్ట కారణాన్నే దైవం అనీ, పూర్వకర్మ అనీ, వాసన అనీ, అంటూ వుంటారు. కనుక నువ్వు చెప్పిన అదృష్టంయొక్క సారం కర్మే! కర్మయొక్క సారం పురుషుడే! (జీవుడే.) జీవుడి సారం చైతన్య ప్రతిబింబమే! (చిదాభాసే.) దీని సారం శుద్ధ చిదాత్మే! ఇదే చిట్టచివరిది. తత్త్వదృష్టితో చూస్తే, వీటన్నిటికీ అధిష్ఠానం ఒకటే గనుక, ఇవన్నీ పర్యాయ పదాలే! వీటిలో వేరే వస్తుభేదం లేదు. లేకపోయినా ఈ భేదం కనిపించడానికి జీవుడిలో వున్న వాసనే కారణం. కనుక దానిని తొలగించుకోవాలి. దానికి ఉపాయం 'అసంగం' ఒక్కటే!

పైకి పని చేసినా చేయకపోయినా, మనస్సు ఆ పనులలో మగ్నం కాకుండా వుంటే, అది అసంగమని కొందరంటారు. లోపల ఉండే వాసనలను పోగొట్టుకోవడమే అసంగమని కొందరంటారు. ఎలా అన్నా ఒక్కటే! ఈ రెంటికీ మూలం అహంభావమే! కనుక నువ్వు సాధించవలసింది నిరహంభావమే! దానిని సాధించాక నువ్వు సమాధిలోనే వుంటావో, వ్యవహారంలోనే వుంటావో, అది నీ ఇష్టం (సర్గ28).

రామా! నన్నడిగితే, నిశ్చల సమాధిలో వుంటూ, బయటికి పరిపూర్ణ వ్యవహారంలో వుండు. ఏడవవలసి వస్తే, బయటికి కన్నీళ్లు రాల్చు. లోపల దుఃఖాన్ని అంటనీయకు. స్త్రీలతో వ్యవహరింపవలసి వస్తే, మామూలు అజ్ఞాని లాగానే ప్రవర్తించు. లోపల మాత్రం వికారం కలుగనీయకు. శత్రువులను సంహరించవలసి వస్తే, క్రూరంగా వ్యవహరించు. లోపల మాత్రం చలించకు. మహాత్ములను సేవించవలసి వస్తే, ఉదారంగా వ్యవహరించు. లోపల బేధ బుద్ధిని కలుగనీయకు. ఇలా తక్కినవి నువ్వు ఊహించుకో. ఇలా నువ్వు పైకి జాగ్రవదస్థలో వున్నా కూడా లోపల సుషుప్త స్థితిని సుస్థిరం చేసుకో గలిగితే, నువ్వు సన్మాత్ర స్వరూపుడిగానే వుండిపోతావ్.

**న చ ద్వైతం న చైవైక్యం**
**జగదిత్యేవ నిశ్చయా।**

**పరమామేహి విశ్రాన్తి**

**మాకాశవిశదాశయః ॥** (ని.ఉ. సర్గ. 29, శ్లో. 26)

అప్పుడు ద్వైతమూ లేదు, అద్వైతమూ లేదు. అనే నిశ్చయంలో నువ్వు వుంటావు. అది ఆకాశంవంటి నిర్మల స్థితి. అదే పరమ విశ్రాంతి స్థానం. దాన్ని నువ్వు పొందు.

## 12. భాగత్యాగలక్షణ

***శ్రీరాముడు***: గురుదేవా! తమరు అలాంటి స్థితిని పొందినవారే గదా! మరి అలాంటప్పుడు "నేను వశిష్ఠుణ్ణి, నేను నీకు ఉపదేశం చేస్తున్నాను" అనే అహంభావంతో కూడిన ఈ వ్యవహారం ఎలా కుదురుతోంది?

ఈ ప్రశ్న విని వశిష్ఠమహర్షి విచిత్రంగా చూసి, మౌనంగా వుండిపోయాడు. ఇంచుమించు అరగంట అయింది. సభ అంతా నివ్వెర పోతోంది. సభలోనివారు కదలడానికి కూడా జంకుతున్నారు. ఐనా వశిష్ఠుడు నోరు తెరవలేదు. అప్పుడు రాముడే తేరుకొని మెల్లగా ఇలా అన్నాడు.

***శ్రీరాముడు***: గురుదేవా! అలా మౌనంగా వుండి పోయారేమిటి? తమలాంటి మహాత్ములు సమాధానం చెప్పలేని ప్రశ్న ప్రపంచంలో వుంటుందా?

***వశిష్ఠుడు***: రామా! నాకు సమాధానం తోచక నోరు మూసుకోలేదు. అడిగేవాడి స్థాయిని బట్టి సమాధానం చెప్పాలి. నువ్వు పూర్వం ఇలాంటి ప్రశ్నలు వేశావ్. అప్పటికి నువ్వు అజ్ఞాన దశలో ద్వైత స్థాయిలో వున్నావు. అందువల్ల నేను నీ స్థాయిలోకి దిగి, యుక్తులను ఆశ్రయించి సమాధానాలు చెప్పాను. ఇప్పుడు నువ్వు ముక్త స్థితిలో వుండి ఈ ప్రశ్నలు వేస్తున్నావు. కనుక నీకు అదే స్థాయిలో వుండి సమాధానం చెప్పాలి. ఈ స్థాయిలో కల్పనాకళంకం లేదు. యుక్తులకు కావలసిన ద్వైతం లేదు. కనుక ఇంకేం మిగిలి వుంది? కాష్ఠమౌనం ఒక్కటే వుంది. అందుకనే నేను మౌనంగా వుండి పోయాను.

***శ్రీరాముడు***: గురుదేవా! మాటలకందని మహాతత్త్వాన్ని మాటల్లో చెప్పాలంటే కొన్ని దోషాలను అంగీకరించక తప్పదు. తత్త్వ ప్రసంగాలలో అటువంటి దోషాలను పరిహరించడం కోసం, భాగత్యాగలక్షణను ఆశ్రయించి ప్రసంగించడం అనే పద్ధతి వుంది గదా! తమరు ఆ విధానాన్నే ఆశ్రయించి సమాధానం చెప్పండి.

**గమనిక** – ఇక్కడ మూలంలో

**"ప్రతియోగివ్యవచ్ఛేది పూర్వకాన్**

**దోషకాన్ అనాదృత్య"** (ని. ఉ. సర్గ. 29, శ్లో. 42) అని వుంది.

ఈ మాటకు అర్థం "భాగత్యాగలక్షణ" అని వ్యాఖ్యాత నిర్ణయం చేశాడు. అది సముచితంగా వుంది. "భాగత్యాగలక్షణ" అంటే ఏమిటో నిర్వచనాత్మకంగా కాకుండా ఉదాహరణాత్మకంగా చెప్పుకుందాం.

ఓ వెంకయ్య చిన్నప్పుడే ఇంట్లోంచి వెళ్ళిపోయాడు. ఓ 50 ఎళ్ళయ్యాక వాడు మళ్ళీ కనిపించాడు. ఊళ్ళోవున్న వృద్ధులు వాణ్ణి బాగా పరిశీలించి చూసి "వాడే వీడు" అన్నారు. ఇప్పుడీ వాక్యానికి అర్థమేమిటో విచారణ చేద్దాం.

ఈ వాక్యానికి తాత్పర్యార్థం ఏమిటంటే - వాడు, వీడు అనే ఇద్దరు వ్యక్తులు వేరు వేరుగా లేరు. ఉన్నది ఒక్కడే - అని.

కానీ, వాడూ, వీడూ అనే రెండు పదాలు విడిగా వున్నప్పుడు, ఇద్దరు వ్యక్తులు లేకుండా ఎలా వుంటారు?- అనే ప్రశ్న ఒకటి వుంది. అదీగాక, 'వాడు' అంటే, పది ఏళ్ళ ఆకారంవాడు, పొట్టివాడు, గడ్డాలు మీసాలు లేని లేత మొహం గల వెంకయ్య అని అర్థం. 'వీడు' అంటే 60 ఎళ్ళ వయస్సు, పొడుగాటి రూపం, పెద్ద గడ్డాలు మీసాలు వున్న ఆకారం, అని అర్థం. ఇలా ఈ రెండు పదాలయొక్క అర్థాలు వేరు వేరు ఆకారాలతో, వేరు వేరు వయస్సులతో, వేరు వేరుగా వున్నప్పుడు, ఈ ఇద్దరు వ్యక్తులూ ఒక్కటే అని చెప్పడం ఎలా? -

అనే ప్రశ్న కూడా వుంది.

ఈ ప్రశ్నలకు లోక వ్యవహారంలో వుండే పెద్దలు చెప్పే సమాధానం ఇలా వుంటుంది-

వాడు అన్నప్పుడు పొట్టి ఆకారం, లేత మొహం, ఇలాంటివన్నీ తీసి పక్కన పెడితే, వెంకయ్య అనే జీవుడు ఒకడున్నాడు. వాడికి వయస్సుగానీ, పొడుగు, పొట్టి, లేత, ముదురు, వంటి లక్షణాలు గానీ లేవు. అలాగే, వీడు అనే పదం దగ్గర గూడా వయస్సు, గడ్డాలు, మీసాలు, వంటి లక్షణాలను పక్కల పెట్టేస్తే, అక్కడున్న ప్రధాన అంశం వెంకయ్య అనే జీవుడు మాత్రమే! ఇక్కడ ఇద్దరు జీవులు లేరు! ఉన్నది ఒక్కడే! కానీ వాడు అప్పుడు అలా కనిపించాడు. ఇప్పుడు ఇలా కనిపిస్తున్నాడు- అని ఈ విషయం మనకు అర్థమైంది. కానీ దీన్ని సంగ్రహంగా చెప్పాలంటే, “వాడే వీడు” అనవలసిందే! భాషలో ఇంతకంటే మార్గం లేదు.

మామూలుగా ఐతే, ఏ పదాన్ని తీసుకున్నా, దానికి అర్థం చెప్పేటప్పుడు ఆ పదానికి సంబంధించిన లక్షణాలన్నీ స్వీకరించ వలసిందే! కానీ, “గంగలో గొల్లపల్లె” వంటి సందర్భాలలో అలా అన్ని లక్షణాలనూ తీసుకునేందుకు వీలు లేదు. కొన్ని లక్షణాలు వదిలి పెట్టి, వాటికి దగ్గరగా వుండే వేరే లక్షణాలను తీసుకోవలసిందే లేకపోతే వాక్య సమన్వయం కాదు. ఇలా పదాలయొక్క ప్రధానార్థాన్ని వదిలిపెట్టి, వాటికి దగ్గరగా వుండే వేరే అర్థాన్ని స్వీకరించి,అర్థం చెప్పవలసివస్తే, ఈ రకమైన అర్థ గ్రహణాన్ని లక్షణావృత్తి అంటారు. ఈ లక్షణావృత్తి అనేక రకాలు. “వాడే వీడు” వాక్యంలో కొన్ని భాగాలను వదిలిపెట్టి, మిగిలిన భాగాలకు ఏకత్వాన్ని సాధిస్తూ సమన్వయం చెబుతున్నాం కనుక, ఈ రకమైన లక్షణావృత్తిని “భాగత్యాగలక్షణ” అంటారు.

వేదాంత శాస్త్రంలో “తత్త్వమసి” “అహంబ్రహ్మాస్మి” మొదలైన వాక్యాల దగ్గర ఈ రకమైన భాగత్యాగలక్షణను ఆశ్రయించకపోతే, అర్థం కుదరనే కుదరదు. ఉదాహరణకు ‘తత్త్వమసి’ వాక్యంలో ‘తత్’ అంటే “సర్వజ్ఞత్వం, సర్వవ్యాపిత్వం, సర్వ శక్తిమత్వం,మొదలైన లక్షణాలతో కూడిన చైతన్యం“ అని అర్థం. ‘త్వం’ అంటే “అల్పజ్ఞత్వం, పరిమితత్త్వం, పరిమిత శక్తిమత్వం మొదలైన లక్షణాలు గల చైతన్యం” అని అర్థం. ఈ రెండు అర్థాలలోనూ గల లక్షణ భాగాలను ప్రక్కనపెట్టేస్తే, అక్కడ ఇక్కడా వున్నది చైతన్యమే! అవి రెండు చైతన్యాలు గాదు. ఉన్నది ఒకే చైతన్యం. అది రెండు పదాలచేత వ్యవహరింప బడుతోంది. ఈ రకంగా వేదమాత అనేకచోట్ల భాగత్యాగలక్షణను స్వీకరించి, మాటలకందని తత్త్వాన్ని మాటల ద్వారా అజ్ఞ జనులకు అందించింది ఇదే పద్ధతిని ఆశ్రయించి, తన ప్రశ్నకు మౌనంతో కాక, మాటలతో సమాధానం చెప్పమని శ్రీరాముడు వశిష్ఠుణ్ణి అడుగుతున్నాడు. ఇక వశిష్ఠుడు ఏం చెబుతాడో చూద్దాం.

**వశిష్ఠుడు**: (నవ్వి) అలా ఐతే విను. నేను పరిశుద్ధ చిదాకాశ స్వరూపుడ్ణి. నాకు విషయాలతో సంబంధం లేదు. నువ్వూ అంతే ! ఐనా సరే, మందమతులకోసం నేను భేదాన్ని తెచ్చి పెట్టుకొని, నేను వశిష్ఠుడ్ననీ, నువ్వు రాముడవనీ కల్పించుకొని, ఈ ఉపదేశాలన్నీ చేస్తున్నాను. అంతమాత్రంచేత పాండిత్య ప్రదర్శనే పరమార్థం గాదు. పనులు జరుగుతున్న సమయంలో గూడా, లోపల ఏ సాధనాన్నీ పట్టుకోకుండా, కర్తృత్వ భోక్తృతా ్వలను అంటనీయకుండా, సుఖదుఃఖాలను దగ్గరకు రానీయకుండా, స్వయం ప్రకాశమైన ఆనంద స్వరూపంలో వుండిపోవడమే ముఖ్యం. ఇదే ముక్తి.

## 13. ముక్తి సుఖం - భోగ్య సుఖం

**శ్రీరాముడు**: ముక్తి సుఖాన్ని స్వయం ప్రకాశమైన ఆనందమని ఎందుకనాలి? విషయ సుఖాల లాగానే, అది కూడ భోగ్యం ఎందుకు కాకూడదు?

**వశిష్ఠుడు**: ఒక సుఖం భోగ్యం కావాలంటే, దానికి వెనకాల అహంభావం వుండాలి. అహంభావం పోయాక వచ్చేది ముక్తి. కనుక అది భోగ్యం కావడానికి వీలు లేదు.

**శ్రీరాముడు**: అలాంటి ముక్తి పొందినవాడికి ఈ ప్రపంచం కనిపిస్తుందా, కనిపించదా? కనిపిస్తుందంటే, వాడికీ, మామూలు సంసారికీ, తేడా లేదు. కనిపించదంటే, వాడు బండరాతి వంటివాడౌతాడు. అప్పుడు రాళ్ళకు కూడా మోక్షం వచ్చిందని చెప్పాలి. దీనికి మీరేమంటారు?

**వశిష్ఠుడు**: ముక్తుడికి ప్రపంచం కనిపిస్తుంది గానీ, మామూలు సంసారికి కనిపించినట్లుగా భేదభావ పూర్వకంగా కనిపించదు. అతనికి ప్రపంచం బ్రహ్మమయంగా కనిపిస్తుంది. అందువల్ల నువ్వు చెప్పిన రెండు దోషాలూ పట్టవు.

**శ్రీరాముడు**: అతనికి ప్రపంచం బ్రహ్మమయంగా కనిపిస్తుంటే, అది అసత్యమెలా ఔతుంది?

**వశిష్ఠుడు**: ఆ ముక్తుడు ప్రపంచాన్ని ఏ అధిష్ఠానాంశంతో చూస్తున్నాడో, దానిని అసత్యమని మేమెప్పుడూ చెప్పలేదు. దానిమీద ఆరోపింపబడిన నామ రూపాలు మాత్రమే అసత్యమని చెప్పాం. ఈ ఆరోపాలలో మొట్టమొదటి ఆరోపం 'అహంభావం' అని కూడా చెప్పాం. అదే అసలైన అవిద్య. (సర్గ. 29)

**గమనిక**–ఇక పై సర్గలలలో వశిష్ఠుడు కొంతసేపు శ్రీరాముడ్ణి , కొంతసేపు సూటిగా సభికుల్ని, సంబోధిస్తూ, బోధ చేయబోతున్నాడు. ఆ సంబోధనలలో తత్త్వ విశేషమేదీ లేదు. కనుక మనం విషయం మాత్రం చెప్పుకుంటూ పోదాం.

అదే ముక్తికి ప్రతిబంధకం. తత్త్వజ్ఞాన బలంతో అహంకారాన్ని శమింప చేసుకుంటే, బేధబుద్ధి అనే భ్రాంతి శమిస్తుంది. సాధకుడు ధీరుడై, శరీర భార్యాపుత్రాదులయందు అపేక్షను పరిత్యజించి, తత్త్వ నిష్ఠుడై, ముక్తినందుకోవాలి (స.30)

ముక్తి లభిస్తే సంసారం పోతుందని సామాన్యంగా అంటూ వుంటారు. సరిగ్గా చెప్పాలంటే ముక్తి వస్తే పోయేదేదీ లేదు! సంసారమనేది సత్యమైతే అది పోతుందని చెప్పవచ్చు. అది సత్యమే గాదే! ఇంక పోయేందుకు ఏముంది?

## 14. సాధన చేసి తీరాలి

**శ్రీరాముడు**: ప్రపంచం నిజంగా లేని వస్తువే ఐతే, ఈ ప్రపంచంలో పడబోకు, ఈ ఇంద్రియాల వలలో పడబోకు, అని చెప్పడం దేనికి? వాటిని నిందించడం దేనికి?

**వశిష్ఠుడు**: నిజమే! గగన కుసుమాన్ని ఎవడూ నిందించడు. దానిని ఎవడూ విడిచి పెట్టడు. ఈ సంసారం గూడా అలాంటిదే! ఐనా సరే, దీనిని పరిత్యజించాలని చెప్పే శాస్త్రం వ్యర్థం కాదు. గగన కుసుమం ఎవడినీ బంధించడం లేదు. సంసారం మాత్రం బంధిస్తోంది. అందువల్ల, దాని స్వభావాన్ని వివరించి చెప్పవలసిన అవసరం ఏర్పడింది. అందుకే శాస్త్రం ముందుకు వచ్చి, ఈ ప్రపంచాన్ని విశ్లేషించి, అది అసత్యమనీ, గగన కుసుమంతో సమానమనీ నిరూపిస్తోంది.

ఇంతకూ మనకు తేలిందేమిటంటే, ఉన్న సత్పదార్థం ఎలాగూ వుంటుంది; సంసారం ఎలాగూ అసత్తే. కనుక, ముక్తివల్ల కొత్తగా పోయేదేమీ లేదు, కొత్తగా వచ్చేదేమీ లేదు.

కనుక ఆత్మజ్ఞానాన్ని సప్త భూమికా క్రమంలో వృద్ధి చేసుకుంటూ, అహంకారాన్ని పరిత్యజించి, బ్రహ్మభావాన్ని పొందడం మంచిది. (స. 31)

దీనికోసం ముందుగా పండితులతో సహవాసం చేసి, విద్యాభ్యాసం చేయాలి. దానితోపాటు సొంతంగా ఆత్మ విచారణ చేసుకోవాలి.

**కోహం కథమిదం దృశ్యం**
**కో జీవః కిం చ జీవనమ్ ।**

**ఇతి తత్త్వజ్ఞ సంయోగాత్**
**యావజ్జీవం విచారయేత్ ॥** (ని.ఉ.సర్గ.32, శ్లో.18)

నేనెవరిని? ఈ దృశ్య ప్రపంచం ఎలా పుట్టింది? జీవుడంటే ఎవరు? ప్రాణాలతో జీవించడం అంటే ఏమిటి? అని ఈ విధంగా తనలో తానే విచారణ చేసుకుంటూ వుండాలి.

***శ్రీరాముడు***: గురుదేవా! పెద్దలను సేవించి, సొంతంగా తత్త్వ విచారణ చేసుకోమంటున్నారు. పెద్దలు తలా ఒకళ్ళు, తలకో రకంగా మాట్లాడుతున్నారు. వీళ్ళల్లో ఎవరు నిజమైన తత్త్వజ్ఞులో నేను తెలుసుకునేదెలా?

***వశిష్ఠుడు***: అందరితోనూ విడివిడిగా మాట్లాడి చూడు. ఎవరి వాదనలు వారు చెబుతారు. ఒకరి వాదాన్ని మరొకరు ఖండించు కుంటూ వుంటారు. ఆ మాటలను నిష్పక్షపాతంగా పరిశీలిస్తూ వుంటే వారిలో సరియైన వాదం ఏదో తెలుస్తుంది. అలాంటి సరియైన పండితుణ్ణి ఏకాంతంలో సేవించు. అప్పుడు నీలో విచారణ శక్తి పెరుగుతుంది. దానితో నువ్వే స్వయంగా విచారణ చేసుకో గలుగుతావు. ఇదే ముక్తికి మంచి ఉపాయం (సర్గ.32)

మానవులకు ఇహలోకం, పరలోకం అని రెండు ఘోర వ్యాధులున్నాయి. ఈ రెండు లోకాలలోనూ సుఖభోగాలు లభించాలనే ఆశతో మానవులు రకరకాల ప్రయత్నాలు చేస్తూ వున్నారు. నిజానికి ఈ రెండు లోకాలూ, నరకాలే! ఈ నరక వ్యాధికి, ఇక్కడే, ఇప్పుడే, చికిత్స చేసుకోవాలి. ఎందుకంటే, ఈ వ్యాధికి సత్సంగము, శమము, ఆత్మజ్ఞానం, మొదలైనవి ఔషదాలు. ఇవి ఈ లోకంలోనే దొరుకుతాయి. పరలోకంలో దొరకవు.

**ఇహైవ నరకవ్యాధేః**
**చికిత్సాం న కరోతి యః ।**
**గత్వా నిరౌషధం స్థానం**
**సరుజః కిం కరిష్యతి ॥** (ని.ఉ.సర్గ.33, శ్లో.14)

నరకమనే వ్యాధికి ఇక్కడే ఎవడైతే చికిత్స చేసుకోడో, వాడు పైకి వెళ్ళి ఏమి చేస్తాడు? జబ్బు చేసినవాడు మందులు లేని చోటుకు వెళ్ళి ఏమి చేస్తాడు?

***శ్రీరాముడు***: పరలోక వ్యాధికి తపస్సు, తీర్థయాత్ర, యజ్ఞము, దానం , ప్రాయశ్చిత్తం, మొదలైన ఉపాయాలున్నాయని పెద్దలు చెబుతున్నారు గదా!

***వశిష్ఠుడు***: అవి తాత్కాలికోపశమనాన్ని కలిగిస్తాయే గాని, ఆ వ్యాధిని శాశ్వతంగా రూపుమాప లేవు. దానికి ఆత్మజ్ఞానం ఒకటే ఉపాయం! దానికి పూర్వ రంగం వైరాగ్యం.

**జీవితస్య యథా బాల్యం**
**దృష్టం ప్రథమ కల్పికమ్ ।**
**నిర్వాణస్య తథా భోగ**
**సంత్యాగో రాగశాంతిదః ॥** (ని.ఉ. సర్గ.33, శ్లో. 23)

జీవితానికి బాల్య దశ ఎలా మొదటిమెట్టో, అలాగే మోక్షానికి ఆశాపరిత్యాగ పూర్వకమైన భోగపరిత్యాగం మొదటి మెట్టు.

కనుక రామా! నువ్వు అలాంటి వైరాగ్యాన్ని ఆశ్రయించి, కేవలం చిదాకాశ స్వరూపంగా వుండిపో! (స. 33)

***శ్రీరాముడు***: గురుదేవా! ఏదీ లేదని మొత్తాన్ని తుడిచిపెట్టేస్తే, గురూపదేశం గూడా తుడిచి పెట్టుకు పోతుంది గదా! అది పోతే ఇక ఆత్మబోధకు ఇక ఉపాయం ఏమిటి?

**వశిష్ఠుడు**: రామా! లేని దానిని మాత్రమే నిషేధించగలం. బ్రహ్మ లేదని మనం అనడం లేదు. అందువల్ల బ్రహ్మను నిషేధించడం కుదరదు. అందుకే, దానిని బోధించే ఉపదేశ వాక్యాలను కూడా నిషేధించడం కుదరదు. బ్రహ్మజ్ఞానం కలిగిన తరువాత ఆ వాక్యాలు వాటంతటి అవే తొలగి పోతాయి.

దీనినే పెద్దలు మరో రకంగా గూడా చెబుతున్నారు. శుద్ధ చైతన్యం సంక్షుబ్ధమనీ, అక్షుబ్ధమనీ రెండు రకాలు. 'సంక్షుబ్ధం' అంటే, అహంకారాది వికారాదులు పొందిన స్వరూపం. 'అక్షుబ్ధం' అంటే, ఏ వికారాలు లేని శుద్ధ స్వరూపం. వీటిలో దేనివల్ల శ్రేయస్సు కలుగుతుందో ఆలోచించుకో. దానినే పట్టుకో (స. 34)

రామా! అక్షుబ్ధ స్వరూపమే బ్రహ్మయొక్క శుద్ధ స్వరూపమనీ, దానిని పట్టుకోమనీ చెప్పాం. మరి ఈ సంక్షుబ్ధ స్వరూపం ఎవరిది? 'క్షుబ్ధం' అంటే క్షోభను పొందినది. 'క్షోభ' అంటే మార్పు. ప్రపంచమే మార్పు! కనుక సంక్షుబ్ధం అన్నా, సప్రపంచం అన్నా ఒకటే! అసలైన రహస్యం ఏమిటంటే, నిష్ప్రపంచంగా వున్నదీ, సప్రపంచంగా ఉన్నదీ కూడా, ఒకే అఖండ వస్తువు. ఈ అఖండ వస్తువు మీద దృష్టి నిలవాలి. అంటే, ఈ ప్రపంచం అంతా నిష్ప్రపంచ బ్రహ్మమయంగా కనిపించాలి. అలాంటి దృష్టిని అభ్యసించి శాంతంగా వుండిపో! (స.35)

తత్త్వ దృష్టితో చూస్తే, రూపాలోక మనస్కారాలకు చిన్మాత్రంకంటే మించిన రూపం లేదు.

**గమనిక**–వర్తమాన భవిష్యత్ కాలాలకు వశిష్ఠమహర్షి పెట్టిన కొత్త పేర్లే రూపాలోక మనస్కారాలు. ఈ పేర్లను ఆయన ఉపశమ ప్రకరణంలో, 48వ సర్గలో, గాధిచరిత్ర ఘట్టంలో చెప్పాడు.

**రూపాలోక మనస్కార**
**తత్తాకాల క్రియాత్మకమ్ ।**
**కుంభాకారో ఘట మివ**
**చేతో హన్తి కిరోతి చ ॥** (ఉపశమ ప్రకరణం–సర్గ.48, శ్లో.52)

తాత్పర్యము-ప్రస్తుత కాలంలో వుండే పదార్థాలు ఇంద్రియాలకు కనిపిస్తాయి. కనుక ఇది రూపాలోక కాలము. భవిష్యత్ కాలంలో జన్మించబోయే పదార్థాలను మనస్సు ఊహించి తెలుసుకుంటుంది. కనుక ఇది మనస్కార కాలము. గతించిన పోయిన పదార్థాలను మనస్సే తాదాత్మ్య భావన చెంది స్మరించుకుంటుంది. కనుక ఇది తత్తాకాలము. కాలాన్ని ఇలా మూడు రకాలుగా చెప్పుకోవచ్చు - అని అక్కడ చెప్పిన విషయాన్ని మహర్షి మళ్ళీ అనుసంధానం చేస్తున్నాడు.

**వశిష్ఠుడు**: కనుక రామా! వాటికి ప్రత్యేక వాస్తవ రూపం లేదు. ఐతే, అవి నిన్ను ఎలా బాధించ గలుగుతున్నాయంటే, నీ కోరిక ద్వారా బంధించ గలుగుతున్నాయి. కనుక, కోరికను తుంచేసుకుంటే, బంధం లేదు. హృదయంలో గూడు కట్టుకొని పోయి వున్న వాసనల పుట్టలే కోరికలు. అలాంటి వాసనలు లేకుండా నువ్వు ఏ ఇంద్రియంతో ఏ సుఖాన్ని అనుభవించినా, నీకు ఏ రకమైన ముప్పు లేదు. కనుక నువ్వు ఇచ్ఛాత్యాగాన్ని సాధించి, ముక్తిని అందుకో (స. 36)

**శ్రీరాముడు**: గురుదేవా! సర్వమూ బ్రహ్మే ఐతే, ఇచ్ఛ గుడా బ్రహ్మే కదా! ఇక దానిని నిషేధించడం దేనికి?

**వశిష్ఠుడు**: రామా! ఇచ్ఛ గూడా బ్రహ్మ అనే మాట సత్యమే కానీ, ఆ జ్ఞానం నీకు కలిగిననాడు ఇచ్ఛ ఉదయించనే ఉదయించదు. బ్రహ్మకు ఉదయాస్తమయాలు లేవు గదా! మా నిషేధ శాస్త్రం అంతా ఈ జ్ఞానం కలగని వారికోసమే! జ్ఞానం కలిగిన వాడికి విధి నిషేధాలు అక్కరలేదు. దీనినే వెనక్కు తిప్పి చూస్తే

**ఏతదేవ జ్ఞతాచిహ్నం**
**యదిచ్ఛాస్వతి తానవమ్** ( ని.ఉ. సర్గ.37, శోల.32)

ఒకడికి ఆత్మజ్ఞానం కలిగిందనడానికి వాడిలో కోరికలు బాగా తగ్గిపోవడమే చిహ్నం. అలాంటివాడి దృష్టిలో అసలు అజ్ఞానే లేదు. ఎందుకంటే జగద్భ్రాంతిని పొందేవాడు గూడా మిథ్యాభూతుడే! కాబట్టి జగద్భ్రమలో

చిత్రమేమిటంటే, అసలు భ్రాంతి గలవాడే లేడు. వాడు లేకుండానే ఈ భ్రాంతి కలుగుతోంది. అందుచేత, ఈ జగత్తు పూర్తిగా లేనిదే అని నిరూపణ అవుతోంది.

ఒక దృష్టితో సర్వమూ బ్రహ్మే అంటున్నాము. మరొక దృష్టితో ఏదీ లేదంటున్నాము. అలాగే ఒక దృష్టితో ఇచ్ఛ కూడా బ్రహ్మే! మరో దృష్టితో

**తథాపి శ్రేయసే మన్యే**
**నన్వనిచ్ఛోదయం స్ఫుటమ్ ॥** (ని.ఉ. సర్గ.37, శ్లో.49)

ఇచ్ఛ పుట్టకుండా వుండడమే ఆత్మానందమనే శ్రేయస్సుకు అనుకూలం, అని నేను భావిస్తున్నాను.

ఇంతకూ ఇచ్ఛ అంటే ఏమిటి? చిదాత్మ ఇంద్రియ గోళాల ద్వారా బైటికి ప్రసరించడమే ఇచ్ఛ! ఇదే చిత్తం, ఇదే సంసారం, ఇదే ప్రపంచం. కనుకనే దీన్ని వెనక్కు తిప్పితే వచ్చే ఇచ్ఛారాహిత్యమే మోక్షం!

## 15. గురువు ముక్తిని ప్రసాదించలేడా?

***శ్రీరాముడు***: ఈ ప్రపంచం భ్రాంతి సిద్ధమే ఐనా, దీనిలో వుండే ఏదో ఒక ఉపాయంతో మనం మరొకడి సంసార బాధను తొలగించడం కుదరదా?

***వశిష్ఠుడు***: అది కుదరదు. మనం ఇక్కడ నోరు తెరచి, మరొకడి స్వప్నంలో వున్న కొండలను మ్రింగ గలమా? ఉపాయం అనేది నీ భ్రాంతిలో భాగం. దుఃఖం అనేది వాడి భ్రాంతిలో భాగం. ఈ రెంటికీ సమావేశం కుదరదు. కనుక, ఎవడి తత్త్వజ్ఞానం వాడి దుఃఖాన్ని పోగొట్టవలసిందే.

***శ్రీరాముడు***: ఈ ప్రపంచం మనోభ్రాంతి మాత్రమే ఐతే, అప్పుడు దానికి ఒక ఆకారం అంటూ లేనట్టే గదా! (అమూర్తమే గదా!) ! మరి ఆకారాలు గల దేహాదులు దీనిలోకి ఎలా వచ్చాయి?

***వశిష్ఠుడు***: భ్రాంతికి ఆకారం లేదు, నిజమే! కానీ ఆ భ్రాంతి, చిక్కబడితే, దానికి ఆకారం ఏర్పడవచ్చు. నీటికి ప్రత్యేకమైన ఆకారం లేదు. కానీ చల్లదనం పెరిగిపోతే ఆ నీటికే 'రాయి' ఆకారం వస్తుంది. అలాగే ఇదీనూ!

***శ్రీరాముడు***: ఈ విధంగా శుద్ధ చైతన్యం భ్రాంతికి లోనై, తనలో తనే దేహత్వాన్ని కల్పించుకుంటే, ఇక దాని శుద్ధత్వం పోయినట్లే కదా!

***వశిష్ఠుడు***: అలా పోవాలని నియమం లేదు. ఎలాగంటే, ఒకడికి తను చచ్చిపోయినట్లు కల వచ్చింది. అంత మాత్రం చేత తాను నిజంగా చచ్చిపోతాడా? కనుక, దేహత్త్వంవల్ల శుద్ధ చైతన్యానికి వచ్చిన భంగమేమీ లేదు. నిజానికి ఒకే శుద్ధ చైతన్యంలో అనేక రకాలైన సృష్టులు కలిసి కొన్నీ, విడివిడిగా కొన్నీ, ఇలా అసంఖ్యాకంగా వున్నాయి. ఒక సృష్టిలో వున్న జీవులకు మరో సృష్టి కనిపించదు. కానీ యోగసిద్ధి గలవారు ఇతర సృష్టులను చూడ దలచుకుంటే, తమ లోకాన్ని తమ ఉపాధికి మూల భూతమైన చైతన్యంలో ప్రవిలాపన చేసి, అప్పుడు సంకల్ప పూర్వకంగా, మరొక చిత్తంలోకి, తద్వారా మరో సృష్టిలోకి ప్రవేశిస్తారు. ఇది జ్ఞానులకూ, యోగులకూ వుండే అనుభవం.

**గమనిక** – ఉత్పత్తి ప్రకరణంలోని లీలోపాఖ్యానంలో లీలా సరస్వతుల లోకాంతర ప్రయాణాది వర్ణనలన్నీ ఈ సిద్ధాంతం ప్రకారం చేసినవేనని మనం గ్రహించాలి.

***వశిష్ఠుడు***: ఈ యోగి జనానుభవాన్ని బట్టి గూడా, వివిధ జీవుల దృష్టిలో అనుభవ గోచరంగా వుండే సృష్టులన్నీ బ్రహ్మయొక్క వివర్త రూపాలే అని తేలుతోంది. ఐతే, ఈ విషయంలో అందరి అనుభవమూ ఒకే రకంగా వుండదు. యోగాభ్యాసం చేసేవారిలో కూడా, వారి వారి యోగస్థాయిని బట్టి, వారి వారి అనుభవాలు తలో రకంగానూ వుంటాయి. ఎవరి దృష్టిలో వారి అనుభవం సత్యం. అందుకే రకరకాల సిద్ధాంతాలు ప్రచారంలోకి వచ్చాయి. కానీ, పరమార్థ దృష్టితో చూసినప్పుడు, ప్రపంచ బ్రహ్మలకు భేదం లేదనే పక్షమే

ఉత్తమోత్తమం. ఈ నిశ్చయం కలిగితే , ఇచ్ఛాద్వేషాది దోషాలు కలుగనే కలుగవు! (స. 37)

ఇక్కడ నీకు ఒక సందేహం కలుగవచ్చు. ఏమంటే "బ్రహ్మ పరమసూక్ష్మమైతే, దానిలో ఏకీభావ స్థితే మోక్షమైతే, ఈ మోక్షం గూడా అణిమాది సిద్ధుల వంటి మరో సిద్ధి మాత్రమే గదా" – అని.

ఈ ఆలోచన పొరపాటు. అణిమాది సిద్ధులు ఆశపడి సంపాదించుకునేవి. ఆశలన్నీ చల్లారిపోయిన తరువాత లభించేది బ్రహ్మతో ఏకాత్మతా స్థితి. ఆశలు చల్లారినవాడు, ఆరిపోయిన దీపం లాంటివాడు. వాడిలో అహంస్ఫురణే మిగిలి వుండదు.

మళ్ళీ నీకు సందేహం రావచ్చు. "మీకు అహం స్ఫురణే లేకపోతే, ఈ బోధ ఎలా చేస్తున్నారు? అహంస్ఫురణ వుంటే, జ్ఞాని ఎలా ఔతారు?"– అని. జీవించి వున్న జ్ఞానికి రెండు దశలు వుంటాయి – అవిచార దశ, విచారదశ – అని. అవిచార దశలో అహంబుద్ధి వుంటుంది. అప్పుడే ఈ బోధలన్నీ. విచార దశలో అహంబుద్ధీ లేదూ, వశిష్ఠుడనే వ్యవహారమూ లేదు, అసలు ప్రపంచమే లేదు. నువ్వు గూడా అటువంటి నిర్వాణ స్వరూపాన్ని సాధించుకో. దానికోసం ప్రపంచంలో ప్రతి అణువునూ శివమయంగా భావించు.

**యత్కరోషి యదశ్నాసి**
**యజ్జుహోషి దదాసి యత్ ।**
**యత్తపస్యసి సంస్యేషి**
**తత్సర్వం శివమవ్యయమ్ ॥** (ని.ఉ.సర్గ.38, శ్లో. 37)

**గమనిక**–భగవద్గీతలో 9వ అధ్యాయం 27వ శ్లోకం, ఇంచు మించు ఇలాగే వుంటుంది.

నువ్వు ఏది చేసినా, ఏది తిన్నా, ఏది హోమం చేసినా, ఏది దానం చేసినా, ఏ రకమైన తపస్సు చేసినా, దేన్ని చంపినా, దేన్ని పొందినా, అదంతా నాశ రహితమైన శివ స్వరూపమే! ఈ విషయాన్ని గ్రహించి, ఎలా వున్నావో అలా వుండిపో.

ఇక వ్యవహార దశలోకి వచ్చే సరికి, ఇలాంటి జ్ఞానికి, శాస్త్రంకంటే మంచి వినోద విధానం లేదు. కనుక, జ్ఞాని వ్యవహార దశలో శాస్త్రానుకూలంగా వ్యవహరించాలే గానీ, యథేఛ్ఛగా వ్యవహరించ గూడదు (స.38)

ఇక్కడ రహస్యం ఏమిటంటే, అతను శాస్త్రానుకూలంగా ప్రవర్తిస్తాడే గానీ, అలా ప్రవర్తించాలనే సంకల్పం అతనికుండదు. అతని దృష్టిలో ఈ శాస్త్రీయ వ్యవహారాలు గూడా ఆభాసలే (భ్రాంతిలో భాగమే!) కనుక అతనికి అవి అంటవు.

నేనిక్కడ ఉపదేశిస్తున్నానని లోకులు అంటున్నారు. ఇది వాళ్ళ దృష్టి. ఆ దృష్టితో నాకు పని లేదు. నా దృష్టిలో, ఈ వ్యవహారాలేవీ జరగడం లేదు. నా దృష్టిలో వశిష్ఠ దేహమే లేదు! నీకు కనిపించే ఈ దేహం, నీకోసం పరబ్రహ్మలో వివర్తంగా ఏర్పడింది. ఈ ఉపదేశవాక్కు గూడా అలా ఏర్పడిందే! అవివేకంవల్ల ఏర్పడిన ఈ ప్రపంచ దృష్టి అంతా జ్ఞాన భూమికల అభ్యాసంచేత క్రమక్రమంగా క్షీణిస్తుంది. అప్పుడు నువ్వూ వుండవు, నేనూ వుండను, ఈ వ్యవహారమూ వుండదు. ఉన్న బ్రహ్మ దీపకాంతి లాగా అంతటా వ్యాపించి నిశ్చలంగా వుండిపోతుంది. (స. 39)

ఇక్కడి కిటుకు ఏమిటంటే, బ్రహ్మ స్వరూపంలో వున్నవాడికి ప్రపంచం తెలియదు. ప్రపంచ స్వరూపంలో వున్న వాడికి బ్రహ్మ తెలియదు. జీవన్ముక్తుడికి మాత్రం ఆ రెండూ తెలుస్తాయి. అదే జీవన్ముక్తుడు ఇంకా పై భూమికలలోకి వెళ్ళిపోతే, ద్వైతాన్ని పూర్తిగా పరిత్యజించి, అనిర్వచనీయ బ్రహ్మస్థితికి చేరగలడు. (స.40)

ప్రతిజీవికీ స్వరూప జ్ఞానమే స్వభావం. దానిని మరిచిపోయిన అజ్ఞాన దశే అస్వభావం. జీవులు ఈ అస్వభావ స్థితిలో వున్నప్పుడే, ఈ ముల్లోకాల నృత్యంలో మునిగిపోతూ వుంటారు. వారిని మళ్ళీ స్వస్వభావంలోకి తీసుకొస్తే, ఈ పిచ్చి ఆట ఆగిపోతుంది. (స. 41)

## 16. అహంగ్రహోపాసన

ఈ ఆటకు మూలం చిత్తం. చిత్రం ఏమిటంటే, ఈ చిత్తం సహజ స్థితిలో చైతన్యం కంటే భిన్నం కాదు. ఎందుకంటే, ఛాందగ్యోపనిషత్తులో,

**సేయం దేవతైక్షత**
**హన్తాహ మిమాస్తిస్రో దేవతా**
**అనేన జీవేనాత్మనానుప్రవిశ్య**
**నామరూపే వ్యాకరవాణీతి –**

(ఆ సద్దేవత "నా వాసనారూపంలో వున్న ఈ జీవ స్వరూపంతో అగ్ని, జలము, భూమి, అనే ఈ ముగ్గురు దేవతలలోనూ ప్రవేశించి, వారి ద్వారా నామరూపాలను విడదీసి చూపిస్తాను." అని ఆలోచించింది.) అని వుంది. దీనిని బట్టి, నామరూపాలు విడివిడిగా ఏర్పడడం అనేది జీవభావం ఏర్పడిన తరువాత సంభవిస్తోందని అర్థమౌతోంది. నామరూపాలు విడివిడిగా ఏర్పడినప్పుడే ప్రపంచంలో నువ్వు వేరు, అది వేరు, ఇది వేరు – అనే భేద వ్యవహారం ఏర్పడుతోంది. ఈ భేదభావానికి కారణమైన జీవభావంకంటే వెనకాల, జీవుడికి ఉపాధిగా వుండేది చిత్తం. కనుక, మొదటి ఉపాధిగా చిత్తం ఏర్పడివున్న దశలో, దానికి జీవ సంపర్కం గానీ, దానివల్ల వచ్చే భేద సంపర్కం గానీ, వుండే వీలు లేదు. కనుక చిత్తమనేది తన సహజస్థితిలో భేద మాలిన్య రహితం. అందుచేతనే అది చిత్తుకంటే అభిన్నం! ఇలాంటి చిదభిన్నస్థితిని జీవుడు పొందాలనుకుంటే, సర్వోన్నతుడైన పరిశుద్ధ పరమాత్మను వివేక పుష్పాలతో పూజించాలి. వివేక పుష్పాలతో పూజ అంటే, ఏకత్వానుసంధానమే! దీనికి భిన్నంగా, శివుడు , విష్ణువు వంటి దేవతలను, తనకంటే భిన్నమైన వారినిగా ఏర్పాటు చేసుకొని పూజించడంవల్ల జీవుడికి బంధం ఎప్పటికీ పోనే పోదు. ఈ విషయాన్ని శ్రుతే స్వయంగా చెబుతోంది–

**"అథ యోన్యాం దేవతా ముపాస్తే**
**అన్యోఽ సాఽ వన్యోఽ హ మస్మీతి**
**న స వేద ఽ యథా పశురేవ**
**స దేవానామ్"**

ఎవడైతే తనకంటే భిన్నమైన దేవతను పెట్టుకొని ఆయన వేరు, నేను వేరు, అని ఉపాసన చేస్తున్నాడో, వాడికి ఏమీ తెలియదు. వాడు ఆ దేవతలకు, పశువువంటివాడు– అని శ్రుతి స్వయంగా చెబుతోంది.

కనుక రామా! నువ్వు వివేక ప్రధానుడవై, అభేద బుద్ధితో ఆత్మైకత్వాన్ని అనుసంధానం చేసుకుంటూ, పరోక్ష జ్ఞానాన్ని తిరస్కరించి, అపరోక్ష జ్ఞాన నిష్ఠుడివి కా! (స.42)

అజ్ఞులు భోగాసక్తులై వుంటారు. తత్త్వవేత్తలకు భోగ్యవస్తువుల మీద రుచే లేదు. వీరి పద్ధతికీ, వారి పద్ధతికీ పోలికే లేదు.

**యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ।**
**యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః॥** (ని.ఉ..స.43, శ్లో.31)

(పరమాత్మ తత్త్వం అజ్ఞానులైనవారికి ఏ మాత్రమూ కనిపించదు. అందువల్ల అది వారికి చీకటి రాత్రి వంటిది. కానీ, ఆ ఆత్మతత్త్వం జ్ఞానికి విస్పష్టంగా అనుభవగోచరమౌతూ వుంటుంది. కనుక, అతనికి మాత్రం అది పట్టపగలే! అతను దానిలో నిత్యమూ మెలకువలోనే వుంటాడు. కనుక అజ్ఞులకు ఏది రాత్రో, దానిలో విజ్ఞులు మేలుకొనే వుంటాడు. మామూలు జీవులు ఏఏ భోగ్య పదార్థాలను చూస్తూ వుంటారో, అలాంటి భోగ్య

పదార్థాలతో కూడిన ప్రపంచం వారికి పట్టపగలు వంటిది. కానీ జ్ఞాని దృష్టిలో అది పూర్తిగా మిథ్యాభూతం గనుక, అతని దృష్టిలో అది కటిక చీకటి రాత్రి. నిజానికి నిజమైన చూపు గలవాడు ఈ జ్ఞాని మాత్రమే!)

గమనిక– ఈ శ్లోకం భగవద్గీతలో 2వ అధ్యాయంలో 69వ శ్లోకంగా వుంది.

**వశిష్ఠుడు**: జ్ఞానిది నిజమైన చూపు అని ఎందుకంటున్నానంటే, ఆత్మలో అజ్ఞానానికి ప్రసక్తే లేదు. అజ్ఞానంలో వున్నప్పుడు మాత్రమే, అజ్ఞానం అనే కల్పన జరుగుతోంది.

**గమనిక**– ఈ విషయాన్ని బ్రహ్మసూత్రవార్తికంలో ఇంకా విస్పష్టంగా చెప్పారు.

**అవిద్యాస్తీ త్యవిద్యాయా**
**మేవాసిత్వా ప్రకల్ప్యతే ।**
**బ్రహ్మదృష్ట్యా త్వవిద్యేయం**
**న కథంచన యుజ్యతే ॥**

(అవిద్యలోనే కూర్చొని, అవిద్య వుందని జీవులంతా కల్పన చేస్తున్నారు. బ్రహ్మ దృష్టితో చూస్తే, అవిద్య వుందనే మాట కుదరనే కుదరదు) - అని.

**వశిష్ఠుడు**: కనుకనే మహానుభావులైనవారు అజ్ఞానాన్ని శమింప జేసుకొని, శాంతులై, సమాధి తత్పరులై, వుంటున్నారు (స. 43)

## 17. వైరాగ్యాన్ని పెంచుకోవాలి

**శ్రీరాముడు**: గురుదేవా! సమాధి అంటే మనస్సు విశ్రాంతి చెందే స్థానమే కదా! ఈ మనో విశ్రాంతి ఎలా లభిస్తుందో, కొంచెం వివరంగా చెప్పండి.

**వశిష్ఠుడు**: రామా! మనో విశ్రాంతినే సమాధి అనీ, సమాధానమూ అనీ, అంటూ వుంటారు. దీనికి కారణం పరవైరాగ్యం.

ఈ వైరాగ్యం ఒక్కొక్కరికి ఒక్కొక్క రకంగా వస్తూ వుంటుంది. కొందరికి శత్రువులు చేసే అవమానాలవల్ల వస్తుంది. కొందరికి బంధువులతో తగాదాలవల్ల వస్తుంది. కొందరు అదృష్టవంతులకి సజ్జనుల ఉపదేశంవల్ల వస్తుంది. ఎలా వచ్చినా ఒక్కటే! ఒక్కొక్కసారి ఇది ఏ కారణమూ లేకుండా తనంతట తానే మొలకెత్తినా మొలకెత్తవచ్చు.

ఈ వైరాగ్యాన్ని సత్సంగంతోనూ సచ్ఛాస్త్ర శ్రవణం తోనూ, పెంచుకోవాలి. అలా కాకుండా, భోగాసక్తికి సందు ఇస్తే, పుట్టిన వైరాగ్యం కూడా చచ్చి పోతుంది. కనుక ఆ విషయంలో జాగ్రత్తగా వుండాలి. కలిగిన వైరాగ్యానికి తోడుగా, శారీరక మానసిక వాచిక తపస్సులనూ, అమానిత్వాది గుణ సంపదనూ కూడా జత చేసుకోవాలి.

**గమనిక** – శారీరక, మానసిక, వాచిక తపస్సులను గురించి భగవద్గీతలో 17వ అధ్యాయంలో, 14,15,16 శ్లోకాలలో మంచి వివరణ వున్నది. అమానిత్వాది గుణాలను గురించి భగవద్గీతలోనే 13వ అధ్యాయంలో 7 నుండి 11 దాకా శ్లోకాలలో వివరణ వుంది. ఇక్కడి మూల కర్త ఈ రెంటినీ

**తపః ప్రకార దానేన**
**పదార్థ ఘటనేశితైః** (ని.ఉ. సర్గ.44, శ్లో. 10)

అనే క్లిష్ట పదజాలంచేత కలిపి చెప్పాడు. ఈ పదాలకు పై విధంగా అర్థం చెప్పాలని వ్యాఖ్యాత వివరించాడు.

**వశిష్ఠుడు**: ఈ విధంగా వృద్ధి చేసుకుంటూ వచ్చిన వైరాగ్యాన్ని 'ముదిత –సంతోషము' అనే రెండు జంట భావాలతో రక్షణ చేసుకోవాలి. 'ముదిత' అంటే, పుణ్యాత్ములను చూసి తృప్తి పడటం. 'సంతోషం' అంటే, ఏది దొరికితే దానితోనే తృప్తిగా వుండడం.

ఇలా ఈ వైరాగ్యాన్ని రక్షణ చేసుకుంటూ వెడుతుంటే, పుత్ర మిత్ర భార్యా ధనాదులమీద అనురాగము, గర్వము, మొదలైన విఘ్నాలు వచ్చి పడుతూ వుంటాయి. వాటిని జాగ్రత్తగా తోలేసుకుంటూ వుండాలి. అంతే గాక, యమ నియమాసన ప్రాణాయమ ప్రణవోపాసనాది సత్కర్మానుష్ఠానాదులతో తన వైరాగ్యాన్ని పోషించుకోవాలి.

ఇలా చేసుకుంటూ వెడితే, మెల్లిగా ధ్యానం కుదురుతుంది. ఆ ధ్యానం లోంచి వివేకం మొలకెత్తుతుంది. ఈ వివేకంవల్ల, శాస్త్రాభ్యాసం, సాధు సంగమం, అనే సుగుణాలేర్పడతాయి. అంతే గాక క్రమంగా, అంతకు ముందే వున్న ధైర్యము సంతోషము, వైరాగ్యము, మొదలైన గుణాలు గట్టిపడతాయి.

**ఇవి గట్టిపడుతున్నకొద్దీ,**
**స్ఫుటతా సత్యతా సత్తా**
**ధీరతా నిర్వికల్పతా ।**
**సమతా శాన్తతా మైత్రీ**
**కరుణా కీర్తి రార్యతా॥** (ని.ఉ.సర్గ. 44, శ్లో. 23)

1. స్ఫుటత (ఆత్మ తత్త్వం మరింత స్పష్టం కావడం)
2. సత్యత (అదొక్కటే సత్యమనే భావం)
3. సత్త (అదే తానుగా వుండటం)
4. ధీరత (ఆ విషయంలో చలనం లేకుండా వుండటం)
5. నిర్వికల్పత (కుందేటి కొమ్మువంటి శూన్య పదార్థాలను భావించకుండా వుండటం. అనగా మిథ్యా వస్తువులను భావించకుండా వుండటం)
6. సమత (అందరి జీవులయందుభేదం లేని బుద్ధి ఉండటం)
7. శాంతత (మనస్సులో కల్లోలం లేకుండా ఉండటం)
8. మైత్రి (అందరి జీవులపట్ల స్నేహభావంతో వుండటం)
9. కరుణ (ఇతరుల కష్టాలను చూసి కరిగి పోవడం)
10. కీర్తి (మంచి పనులు చేయాలనే ప్రవృత్తి)
11. ఆర్యత (పూజనీయత్వం)

మొదలైన సద్గుణాలు కలిసివచ్చి, ధ్యానాన్ని మరింత వృద్ధి చేస్తాయి. ధ్యానం పెరుగుతున్న కొద్దీ వివేకం మరింత పెరిగి, ప్రశాంతి ఏర్పడి, ఆ సాధకుడి మనస్సు ధ్యానంవైపే పరుగులు తీస్తూ, ధ్యానంలో విశ్రాంతి చెందుతూ వుంటుంది.

అంతకు ముందు ఈ మనస్సు లౌకిక విషయాల వెంట పరుగెత్తి పరుగెత్తి, చాలా అలిసిపోయి వున్నప్పటికీ, అనేక జన్మల పుణ్యం కలిసి వచ్చి ఇప్పుడు ధ్యానపు ఒడిలో చేరి ప్రశాంతిని అనుభవిస్తుంది. అది అక్కడ బాగా స్థిరమై వుంటే, అంతకు ముందు విని కూడా ఎరుగని మోక్ష సుఖాన్ని కూడా క్రమంగా అందుకోగలదు (స. 44)

## 18. సమాధి

**శ్రీరాముడు**: ఇంత ప్రయత్నం చేసినా, చివరికి ఏడవ యోగభూమిక అందినా, మనస్సు మళ్ళీ మామూలు లోకంలోకి వచ్చేసరికి, లాగి విడిచి పెట్టిన ధనస్సు లాగా వంకరదే అయిపోతుంది గదా! ఆ మనస్సుకు పూర్వపు లౌకిక స్థితి తప్పనే తప్పదు కదా!

**వశిష్ఠుడు**: అది పొరపాటు. మనస్సు, ధనుస్సువంటిది గాదు. అది పూలమాల వంటిది. మనం ఎలా వంచి ఎలా అట్టిపెడితే అలాగే వుండి పోతుంది.

ఇంతకూ అసలు సమాధి అంటే ఏమనుకుంటున్నావ్?

**ద్రష్టృ దృశ్యైకతా రూపః**
**ప్రత్యయో మనసో యదా।**
**స తదేక సమాధానే**
**తదా విశ్రామ్యతి స్వయమ్॥** (ని. ఉ. సర్గ 45, శ్లో. 38)

ద్రష్ట, దృశ్యము, అనేవి అభిన్నాలనే జ్ఞానం మనస్సుకు కలగడమే సమాధి. ఆ జ్ఞానం కలగంగానే మనస్సు, ఆత్మయందు విశ్రాంతిని చెందుతుంది. ఏషణాత్రయాన్ని వదిలి పెట్టినవాడికి ఇలాంటి జ్ఞానం కుదురుతుంది. అందువల్ల వాడికి ఈ జ్ఞానం సహజసిద్ధం.

**గమనిక** – దీనిని పతంజలి మహర్షి సంయమన్నాడు. ఆ సూత్రాలు ఇలా వున్నాయి.

1. దేశబంధశ్చిత్తస్య ధారణా (చిత్తాన్ని ఒక విషయం మీద నిలబెట్టటం ధారణ) 2. తత్ర ప్రత్యైకతానతా ధ్యానం (ఆ లక్ష్యం మీద చిత్తవృత్తి నిలవడమే ధ్యానం) 3. తదేవార్థమాత్ర నిర్భాసం స్వరూప శూన్యమివ సమాధిః ( ఆ ధ్యానంలో సాధకుడు తనను తాను మరచినట్లైపోయి, ధ్యేయ వస్తువు మాత్రమే మిగిలితే అది సమాధి)

4. త్రయమేకత్ర సంయమః (అభ్యాస పాటవంవల్ల ధారణా ధ్యాన సమాధులు విడివిడిగా కాకుండా కలిపి, అదే క్షణంలో, అదే లక్ష్యంలో, ఒకే సారిగా కుదిరితే దానిపేరు సంయమం).

ఇవి పతంజలి యోగ సూత్రాలలో విభూతి పాదంలో 1,2,3,4 సూత్రాలు. ఇక్కడి సంయమం యోగవాశిష్ఠంలోని సమాధితో సమంగా వుందని వ్యాఖ్యాత వివరించాడు.

**వశిష్ఠుడు**: నానా ప్రయాసపడి సమాధిని సాధించినా, అది కొంత సేపటికి మళ్ళీ పోతుంది గదా అని నువ్వు ఆలోచిస్తున్నావు. విశుద్ధమైన జ్ఞానం ఉదయించేవరకే నీ ప్రయత్నం. జ్ఞానం ఒక సారి ఉదయించిందీ అంటే ఇక పొమ్మన్నా పోదు. అందువల్లే జ్ఞానికి అందే సమాధికి భంగం అనేది వుండదు. కనుక మళ్ళీ మళ్ళీ ప్రయత్నం చేయవలసిన అవసరం వుండదు.

ఈ మొత్తం ప్రక్రియకు మూల బంధువు పరవైరాగ్యం. అది కుదిరిందా, దాని వెంట జ్ఞానం, దాని వెంట సమాధి, వచ్చే తీరతాయి. వాటిని ఎవరూ ఆపలేరు. అందుకనే

**పరం విషయవైతృష్ణ్యం**
**సమాధాన ముదాహృతమ్** (ని.ఉ.సర్గ 45, శ్లో.46)

పరవైరాగ్యాన్నే సమాధి అనేస్తూ వుంటారు.

కనుక రామా! ముముక్షువైనవాడు వైరాగ్యాన్నీ, సజ్జన సాంగత్యాన్నీ, సచ్ఛాస్త్రాభ్యాసాన్ని తగిన విధంగా ఉపయోగించుకొని, వాటి సహాయంతో ధ్యాన వృక్షాన్ని ఆరోహించి, ఆత్మానంద ఫలాన్ని అందుకోవాలి. (స.45)

అలా ఆత్మ తత్త్వానుభవం సాక్షాత్తుగా జరిగితే, చరమవృత్తి అనబడే జ్ఞానం గూడా, తనకు ఉపాదాన కారణమైన అజ్ఞానంలో కలిసి నశించి పోతుంది.

ఆత్మ మీద ఆరోపించుకున్న అసత్య పదార్థాలను తిరస్కరించడం ద్వారా మిగిలి వున్న శుద్ధాత్మయే విషయంగా గల చిత్తవృత్తియొక్క పునఃపునరావృత్తిని 'నిదిధ్యాసము' అంటారు. ఇలాంటి నిదిధ్యాసం పరిపాక దశకు చేరుకున్నప్పుడు, ఒక అఖండ బ్రహ్మాకార చిత్తవృత్తి ఏర్పడుతుంది. దాని పేరే చరమ వృత్తి. ఇది బ్రహ్మ విషయకమైన జ్ఞానానికి చరమాంకం. ఇది గూడా అవిద్యలో అంతర్భాగమే! పరిపూర్ణ తాదాత్మ్య స్థితిలో ఇది గూడా రాలిపోక తప్పదు.

రామా! అసలింత వివరణ అక్కరలేదు.

**జ్ఞానాద్విషయ వైరస్యం**

**స సమాధిర్హి నేతరః ॥** (ని.ఉ. సర్గ.46. శ్లో.17)

జ్ఞానం ద్వారా కలిగిన పరమ వైరాగ్యమే సమాధి. ఇతర నిర్వచనాలు అనవసరం. వైరాగ్యం అనేది వుంటే, ధ్యానం అనే పిచ్చి మాట అక్కర లేదు. వైరాగ్యమే లేకపోతే, ధ్యానమనే పిచ్చి మాటతో పని లేదు. కనుక వైరాగ్యమే అన్నింటికంటె ప్రధానం.

**శ్రుతపాఠ జపాన్తేషు**

**సమాధి నిరతో భవేత్ ।**

**సమాధి విరతః శ్రాన్తః**

**శ్రుతపాఠ జపాన్ శ్రయేత్ ॥** (ని.ఉ. సర్గ.46, శ్లో.23)

ఈ వైరాగ్య మార్గం ద్వారా సమాధ్యభ్యాసం కోసం గురువులతోనూ, సహాధ్యాయులతోనూ, కలిసి వేదాంత శ్రవణం చేయాలి. ఉపనిషత్తులను స్వయంగా చదువుకోవాలి. ప్రణవ జపం చేయాలి. ఇవి చేస్తూ చేస్తూ మెల్లగా సమాధిలోకి వెళ్ళిపోవాలి. అలా సమాధిలో వుండగా అలసట కలిగి వెనక్కు వచ్చేస్తే, మళ్ళీ వేదాంత శ్రవణ, ఉపనిషత్ పారాయణ, ప్రణవ జపాలనే ఆశ్రయించాలి. మరో పని పెట్టుకోకూడదు.

ఈ విషయాన్నే స్కాంద పురాణం ఇంకా స్పష్టంగా చెప్పింది

**జపశ్రాన్తః పునర్ధ్యాయేత్**

**ధ్యాన శ్రాన్తః పునర్జపేత్ ।**

**జపధ్యానాభియుక్తస్య**

**ప్రసీదతి పరశ్శివః ॥** (వ్యాఖ్యాత ఉదహరించిన శ్లోకం)

(జపంలో అలిసిపోతే ధ్యానంలోకి వెళ్ళాలి. ధ్యానంలో అలిసిపోతే, జపంలోకి వెళ్ళాలి. ఇలా జప ధ్యానాలను అంటిపెట్టుకుని వుండేవాడికి శివుడు ప్రసన్నుడౌతాడు) (స.46)

**గమనిక** – 47వ సర్గలో వైరాగ్య వృద్ధికోసం వశిష్ఠమహర్షి పూర్వం చెప్పిన సాధనా క్రమాన్నే మళ్ళీ మరో మాటు 56 శ్లోకాలలో సింహావలోకనం చేశాడు. (స.47)

## 19. వైరాగ్యపు వెర్రితలలు

***వశిష్ఠుడు***: రామా! వైరాగ్యం గురించి ఇంత గొప్పగా చెప్పాం కనుక, భార్యా పుత్రాదులను బుడుంగున వదిలిపెట్టేయడమే కర్తవ్యమని సాధకుడు భావించరాదు. ప్రయాణం చేసేవాడు బరువు ఎక్కువైపోయి, పనికొచ్చే వస్తువులను గూడా పక్కన పారవేసి, ఆ తరువాత ఇబ్బంది పడుతూ వుంటాడు. అందువల్ల సాధకుడు తన

భార్యా పుత్రాదులను తన సాధనకు అడ్డంగానే వున్నా, వాళ్ళవల్ల తనకు కొంత ప్రయోజనం లభిస్తున్నంత వరకూ వాళ్ళను విడిచి పెట్టకూడదు. పైగా

**యథాశక్తి యథాకాల**

**ముపచర్యన్త ఏవ చ ॥**(ని.ఉ. సర్గ.48, శ్లో.4)

తన శక్తి మేరకు వాళ్ళకు ఏ సమయానికి చేయాల్సిన ఉపచారాలను ఆ సమయానికి చేస్తూ వుండాలి. అలా చేస్తున్నా, మనస్సుతో ఆ భోగాలను అనుభవించరాదు. సంసార వ్యవహారాదులలో ఉన్నప్పుడు కూడా, ఈ సందులోనే, "ఎక్కడైనా బ్రహ్మవేత్త దొరుకుతాడా, లేకపోతే సాక్షాత్తుగా ఆత్మానుసంధానమే కుదురుతుందా?" అని అన్వేషిస్తూ వుండాలి.

ఇలా ఉండేవాడికి క్రమంగా పరమపదం అందుతుంది. భేదభావం నశిస్తుంది. స్థితప్రజ్ఞత చిక్కుతుంది. ఇలాంటి పరిస్థితి రావాలంటే ఆ పరమేశ్వరుణ్ణి రాత్రింబవళ్లు పరమ భక్తితో సేవించాలి.

***శ్రీరాముడు***: మధ్యలో ఈ పరమేశ్వరుడెవరండీ?

***వశిష్ఠుడు***: ఆయన ఎక్కడో దూరంగా లేడు. దుర్లభుడూ కాదు. నీ ఆత్మే ఆ పరమేశ్వరుడు! ప్రపంచం అంతా అతని ఆధీనంలోనే వుంది. "**నాన్యోఽ తోస్తి ద్రష్టా**" ఆయన్ను మించి వేరే చూసే వాడు గానీ, వినేవాడు గానీ, ఆలోచించేవాడుగాని, అనుభవించేవాడు గానీ లేడు – అని వేదమే స్వయంగా చెబుతోంది గదా! కనుక ఆ రకమైన ఆత్మేశ్వరుణ్ణి ఆరాధించాలి. అప్పుడాయన అనుగ్రహించి, మన దగ్గరకొక దూతను పంపుతాడు.

***శ్రీరాముడు***: నా ఆత్మేశ్వరుడు నా దగ్గరకు దూతను పంపడ మేమిటండీ? ఇంతకూ ఎవరా దూత?

***వశిష్ఠుడు***: వివేకమే ఆ దూత! ఈ దూత ద్వారానే పరమేశ్వరుడు సాధకుడికి జ్ఞానబోధ చేస్తాడు. ఆ జ్ఞానం ద్వారా తను అతనికి అందుతాడు. అలా అందే పరమేశ్వరుడి పేరు 'ప్రణవం'. ఆయన ఆకారం విరాట్ రూపం.

కనుక రామా! సాధకుడు ఇలాంటి పరమేశ్వరుణ్ణి ఉపాసించాలి. పూర్వ జన్మలలో ఇష్టదేవతారాధనలు చేయగా, చేయగా, ఆ యా దేవతల అనుగ్రహాలు కలిసి రాగా రాగా, చివరికి ఒక జన్మలో ఇలా ఆత్మేశ్వరోపాసనం చేసే స్థితి లభిస్తుంది.(స.48)

ఈ ఉపాసనవల్ల వాసనారహిత స్థితి లభిస్తుంది. దానివల్ల స్థితప్రజ్ఞత నిలదొక్కుకుంటుంది. దానివల్ల ఆ వ్యక్తి హృదయానికి ఒక గొప్పతనమూ, ఒక ఉదారత, లభిస్తాయి. దానివల్ల స్వర్గలోక సంపదలు కూడా అతనిని చలింప జేయజాలని పరిస్థితి ఏర్పడుతుంది.

ఇలాంటి స్థితినే వాసనాక్షయమనీ, మనోనాశమనీ, అమనస్క స్థితి అనీ, అంటారు. ఇది సప్తమ భూమికలో అందుతుంది. ఈ భూమిక ఒక సారి అందితే ఇక చెడిపోదు. దీనిని అందుకున్నవాడు నిత్యమూ తురీయ స్థితిలో ఉంటాడు గనుక, అందరికీ వుండే అవస్థాత్రయం వాడికి ఉండదు. అలాంటివాడు బయటివారి దృష్టిలో జాగ్రదవస్థలో వున్నప్పటికీ, తన దృష్టిలో మాత్రం సన్మాత్ర స్వరూపుడిగానే వుంటాడు.

***శ్రీరాముడు***: ఇక్కడ మనస్సు కూడా లయించి పోయిందని చెప్పడంకంటే, చిద్రూపుడైన ఆత్మకే చిత్తం వుందనీ, దానిలో చైతన్యం సులభంగా అభివ్యక్తం అవుతుందనీ, చెబితే బాగుంటుందేమో! ఎందుకంటే అసలు చిత్తమనేదే లేకపోతే, చైతన్యం అభివ్యక్తం అయ్యేదెలా?

***వశిష్ఠుడు***: జీవుడు కొంత సేపు జడ స్వభావంలో వున్న మాట నిజమైతే, ఆ దశలో చైతన్యం కప్పివేయబడిందనీ, జీవుడికి జ్ఞానం కలిగి జడత్వం తొలగిపోయాక, మళ్లీ చైతన్యం అభివ్యక్తమైందనీ చెప్పవచ్చు. అలా అభివ్యక్తం కావడానికి చిత్తం అనేది ఒకటి అవసరం కావచ్చు. కానీ, పరిస్థితి అలా లేదే. జీవుడు యథార్థ స్థితిలో, ఎల్ల వేళలా చిత్ స్వరూపంగానే వున్నాడు. అందువల్ల, నువ్వు అనుకున్నట్లుగా, ఆత్మకే చిత్తం ఉండవలసిన అవసరం లేదు.

**శ్రీరాముడు**: జీవుడు ఎల్లవేళలా చిదేక స్వరూపుడే ఐతే, అందరికీ ఆ అనుభూతి ఎందుకు కలగడం లేదు?
**వశిష్ఠుడు**: దానికి కారణం అజ్ఞదశలో జీవుడికి సంక్రమించిన చిత్తమే! అది చంచల స్వభావం కలదై, పరమాత్మ స్వరూపాన్ని విడిచిపెట్టి, ఇతర విషయాలమీద లగ్నం కావడం చేత, జీవుడికి ఆ అనుభూతి లభించడం లేదు. అందుకనే, శాస్త్రోపదేశాలన్నీ మళ్ళీ అలాంటి అనుభూతిని పునరుద్ధరించేందుకు ప్రయత్నం చేస్తున్నాయి. దానికోసం ఆ శాస్త్రాలు ఒక అభ్యాస క్రమాన్ని నిర్దేశించాయి.

జీవుడియొక్క వాసనా సమూహం మనస్సుగా రూపొంది, వాడికి రాగ ద్వేషాలు అంటగట్టి,తత్ఫలితంగా వాడిని పై లోకాలకూ, క్రింది లోకాలకూ,తిప్పుతూ వుంటుంది గనుక, ఈ వాసనా పంజరాన్ని జీవుడియొక్క ఆతివాహిక దేహం అనవచ్చు.(అతి వహనం అనగా మీద వేసుకుని తిప్పటం. ఆ పని చేసేది ఆతివాహికం.)

మొదట ఈ ఆతివాహిక దేహాన్ని గుర్తించాలి. ఇది జీవుడికి శరీరంగా వుంటోందనీ, అతివహనం చేస్తోందనీ, గుర్తించాలి. ఆ గుర్తింపువల్ల దీనియొక్క అసత్యత్వం బయటబడుతుంది. అప్పుడు దానిని మెల్లగా బ్రహ్మత్వంలోకి తీసుకు రావాలి. ఈ ప్రక్రియలో "తత్త్వమసి" మొదలైన మహావాక్యాలను అనుసంధానం చెయ్యాలి. దీనికోసం సాధకుడు విశ్వజిద్యాగం చేయాలి.
**శ్రీరాముడు**: అదేమిటి? 'విశ్వజిత్' అనేది రాజులు చేసే యాగం కదా! దిగ్విజయం చేసి, ఇతర రాజులనందరనూ ఓడించిన చక్రవర్తి, తాను సంపాదించిన సంపదలన్నిటినీ కలిపి, కట్టుబట్టలతో సహా, నిలువు దోపిడీగా, ఋత్విక్కులకు దక్షిణగా ఇచ్చేసి, తాను ఏమీ లేని పేదవాడిగా మిగిలిపోయే యాగాన్ని విశ్వజిద్యాగం అంటున్నారు. ఇలాంటి మహాయాగాన్ని సామాన్య సాధకులు ఎలా చేయగలరు?
**వశిష్ఠుడు**: ఎందుకు చేయలేడయ్యా? ప్రతి జీవుడూ తనకు చేతనయినంతవరకూ నాలుగు దిక్కులకూ ప్రసరించి, మనోరాజ్యాన్ని సంపాదించుకుంటూనే వున్నాడు.

**జ్ఞానవాన్ జ్ఞానయజ్ఞస్థో**
**ధ్యానయూపం విరోపయన్ ।**
**జగద్విజిత్య జయతి**
**సర్వత్యాగైక దక్షిణః ॥** (ని.ఉ.స.49, శ్లో. 42)

ఇప్పుడు జ్ఞానవంతుడై, జ్ఞానయజ్ఞాన్ని ఆశ్రయించి, ధ్యానమనే యూపస్తంభాన్ని పాతి, ఈ జగత్తు మొత్తాన్నీ తత్త్వజ్ఞానంతో గెలిచి, సర్వత్యాగమే దక్షిణా స్వరూపంగా గల విశ్వజిత్ యాగాన్ని, ఏ జీవిఐనా ఆచరించవచ్చు. (యజ్ఞదీక్షలో యజ్ఞాంగంగా ఒక స్తంభాన్ని పాతుతారు. దాని పేరే యూపస్తంభం) కనుక రామా! ప్రతీ సాధకుడు జ్ఞానబలంతో విశ్వజిద్యాగం చేయాలి. ఇలాంటి మహత్త్వం వాసనా రహితులైన మహనీయులకు అనాయాసంగా సిద్ధిస్తుంది.

## 20. జీవులలో రకాలు

రామా! వాసనల ధృఢత్వ శిథిలత్వాలలో వుండే వైచిత్ర్యాన్ని బట్టి సృష్టిలోని జీవులను ఏడు రకాలుగా విభజన చేయవచ్చు. ఆ భేదాలను వివరిస్తాను, విను.

**1. స్వప్న జాగరులు:** – ఒకానొక గత కల్పంలో, ఒకానొక లోకంలో, ఒకానొక చోట, కొందరు జీవులు జీవించివుండి, అప్పటి నిద్రాసమయంలో కలలు కంటూ వుంటారు. వాళ్ళ కలలో ఇప్పటి ఈ ప్రపంచమంతా కనిపిస్తూ వుంటుంది. వీరే స్వప్నజాగర జీవులు. అంటే, అప్పుడు నిద్రిస్తున్న ఆ జీవులు, ఇప్పుడు ఈ లోకంలో వున్న మనలనందరినీ కలలో చూస్తున్నారు. మనం వాళ్ళకు స్వప్నమానవులం అవుతున్నాం. మాయా శబల

బ్రహ్మ సర్వగతుడు గనుక, ప్రతీదీ ప్రతిచోటా వుండవచ్చును. అందువల్ల స్వప్నం ఎప్పటిదో గత కల్పంలోనిదైనా, ఇప్పటి ఈ జీవులు స్వప్న జీవులు కావచ్చును.

***శ్రీరాముడు***: గురుదేవా! అదెలా కుదురుతుంది? ఆ కల్పంలో కలగన్న జీవులు
అప్పటి ఆ కలలో మనలను చూసి వుంటే వుండవచ్చు. కానీ, వాళ్ళు ఆ కల్పంతో పాటే నశించిపోయారు గదా! ఇప్పుడు వాళ్లు లేరు గదా! ఒక వేళ వాళ్ళిప్పుడు మళ్లీ పుట్టి, మళ్ళీ వారు మనలను కలలో చూస్తున్నారనుకున్నా, వాళ్ళకు మెలకువ వచ్చాక ఆ నాటి పాత జాగ్రత్‌ప్రపంచం చూడడం అసాధ్యం. అటువంటప్పుడు వాళ్ళే వీళ్ళనడం కూడా అసాధ్యం. కనుక మీరు చెప్పేది ఎలా సంభవిస్తుంది?

***వశిష్ఠుడు***: రామా! ఆ గతకల్పజీవులకు తత్త్వజ్ఞానం కలిగి ముక్తే అందిందనుకో, అప్పుడు నీ ప్రశ్నకు అవకాశమే లేదు. తత్త్వజ్ఞానం కలగలేదనుకో, వాళ్ళు కల్పాంతంలో ఆ దేహాన్ని వదిలేసి, అప్పటి వాసనల బలంతో ఈ కల్పంలో మరో దేహాన్ని కల్పించుకుంటారు. ఆ వాసనల బలంచేతనే, మళ్ళీ అలాంటి స్వప్నాలనే పొందుతారు.

ఉత్పత్తి ప్రకరణంలో ఐందవోపాఖ్యానమని నీకొక కథ చెప్పాను. అందులోని ఐందవులు పది మందీ, పది సంకల్ప ప్రపంచాలను సృష్టి చేసుకో లేదా? ఆ సృష్టి వారు ఎలా చేయగలిగారు? వాళ్ళ వాసనాబలంచేత చేయ గలిగారు. కనుక వాసనలనేవి బలంగా వుంటే, ఏ సృష్టైనా జరుగవచ్చు. అందుకనే ఇందాక నేను "**సర్వం సర్వత్ర విద్యతే**" (స. 50, శ్లో. 9) అన్నీ అన్నిచోట్లా ఉన్నాయన్నాను. ఇంతకూ చెప్పవచ్చింది ఏమిటంటే, ఐందవుల లాంటివాళ్లే స్వప్న జాగర జీవులు.

**గమనిక** – ఇక్కడ మహర్షి స్వప్నం అనే పదాన్ని మామూలు స్వప్నం అనే అర్థంలో కాకుండా, ఐందవులు చేసిన ప్రపంచ కల్పనలవంటి కల్పన అనే అర్థంలో వాడుతున్నాడని మనం గ్రహించాలి.

**2. సంకల్ప జాగరులు:** గత కల్పంలో కొందరు జీవులు అసలు స్వప్నాలే లేకుండా ఎల్లప్పుడూ జాగర సంకల్పాలకే అధీనులై, మనోరాజ్యానికి వశమైపోయి, ధ్యానం నుంచి జారిపోయి, ఆ సంకల్పం మీదే అభిమానాన్ని పెంచుకొని, ఆ సంకల్పంతోనే రాలిపోయి, మళ్ళీ జన్మెత్తుతారు. వారికి ఈ దేహంలో "మేము సంకల్ప పురుషులం" అనే జ్ఞానం వుంటుంది. వాళ్ళే సంకల్పజాగర జీవులు. ఉదా ॥ నిర్వాణ ప్రకరణ పూర్వార్ధంలో చెప్పిన జీవటోపాఖ్యానం లోని యతీశ్వరుడి వంటివాళ్లు.

**3. కేవల జాగర జీవులు:** ఈ కల్పంలో, ఈ బ్రహ్మదేవుడియొక్క సృష్టి సంకల్పం లోంచి మొదటిగా అవతరించి, ఇక్కడ శరీరధారులై, ఇక్కడ స్వప్నశూన్యులై వుండేవారు, కేవల జాగర జీవులు. ఉదా॥ స్థితిప్రకరణంలో చెప్పిన దామవ్యాల కటులవంటివారు.

**4. చిరజాగరులు :** మీద మీద జన్మ పరంపరలను పొందుతూ జాగ్రత్ స్వప్న సుషుప్తుల మూడింటిలోనూ సంచరిస్తూ వుండేవారు చిర జాగర జీవులు.

**5. ఘన జాగరులు:** చిర జాగరులలో కొందరు పాపబలంవల్ల వృక్షాది స్థావర జన్మలను పొందుతారు. వాళ్ళకు సంకల్పాత్మకమైన స్వప్నమే వుండదు. (మామూలు లోక సిద్ధమైన స్వప్నమే వుంటుంది. కానీ, అది గూడా సుఃఖదుఃఖానుభవరూపమైనదే కనుక, జాగ్రద్దశతో సమానమే!) అందువల్ల వాళ్ళు ఎప్పుడు చూసినా రకరకాల జాగ్రద్దశలలోనే జీవిస్తూ వుంటారు. అలాంటి వారే ఘనజాగరులు.

**గమనిక :** ఇక్కడ మహర్షి "జాగ్రత్సు ఘనతాం గతాః" (స.50, శ్లో.21) అన్నాడు. అంటే, రకరకాల జాగ్రద్దశలలో ఘనత్వాన్ని పొందారని అర్థం. దీనిని బట్టే, వృక్షాదిస్థావర పదార్థాలకు గూడా లోక సిద్ధమైన స్వప్నాలు వుంటాయనీ, ఆ స్వప్నాలలో వాటికి తాము మనుష్యాది స్వరూపాలను పొందినట్లుగా అనుభూతి కలిగే అవకాశం వుందనీ, మహర్షియొక్క అభిప్రాయం అని మనం గ్రహించాలి. ఇప్పటివరకు చెప్పిన ఐదు రకాలవారూ బద్ధజీవులలో రకాలే. ఇక ముక్తజీవలలో రకాలను ప్రస్తావించబోతున్నారు.

**6. జాగ్రత్స్వప్నులు:** చిరజాగర జీవులలో శాస్త్రాభ్యాసంవల్ల, సత్సాంగత్యంవల్ల, తత్త్వజ్ఞానం పొంది, జాగ్రద్దశను కూడా స్వప్నతుల్యంగా ఎవరు గ్రహించ గలుగుతున్నారో, వారు జాగ్రత్స్వప్న జీవులు. వీరు సామాన్యంగా 4,5,6 యోగ భూమికలలో వుంటూ ఉంటారు.

**7. క్షీణజాగరకులు:** తత్త్వజ్ఞానం ప్రబలమై, అవస్థాత్రయాన్ని దాటిపోయి పరమపదంలో విశ్రాంతి చెందినవారే క్షీణ జాగరకులు. వీరు సప్తమ యోగభూమికకు చెందినవారు.

రామా! సముద్రంలోని నీరే సాంద్రతా భేదాన్ని బట్టి సప్త సముద్రాలనే వ్యవహారాన్ని పొందినట్లుగా, జీవులలో వుండే గుణ భేదాన్ని బట్టి, వారిని ఏడు విధాలుగా విశ్లేషించి చూపిస్తున్నాను. ఈ విశ్లేషణ అంతా ఎందుకంటే, వాసనల వైచిత్ర్యం ఎలా మెలికలు తిరుగుతూ వుంటుందో తెలియడం కోసం మాత్రమే! నీవీ రహస్యాన్ని గ్రహించి, వాసనాతీతుడవై, శూన్యత్వ అశూన్యత్వాలను, ఏకత్వ ద్విత్వాలను, అతిక్రమించి, తత్త్వ స్వరూపుడివైపో ! (స.50)

***శ్రీరాముడు***: గురుదేవా! కొందరు జీవులు ఈ కల్పంలో ఈ బ్రహ్మదేవుడి నుంచి మొదటిగా అవతరించి, శరీరధారులై, ఈ జన్మలో స్వప్న శూన్యులై వుంటారని, వారే కేవల జాగరులనీ మీరు చెబుతున్నారు. అసలు ఇలాంటివాళ్ళు ఎలా జన్మిస్తారు? ఆ పరబ్రహ్మమో నిర్మలాకాశమువంటిది. జీవులేమో చెట్లవంటివారు. వట్టి ఆకాశంలోంచి చెట్లు పుట్టుకొస్తాయా? ఒకవేళ కామకర్మవాసనలవల్ల ఈ జీవులు పుట్టారని మీరంటారేమో! కామకర్మవాసనలనేవి బ్రహ్మకు జీవభావం కలిగిన తరువాత అంటుకునే లక్షణాలు గానీ, ముందే వుండే లక్షణాలు గాదు. కనుక, కేవల జాగరులు ఏర్పడడానికి కారణమేమిటి?

***వశిష్ఠుడు***: రామా! నీ వాక్యాలు మారాయి గాని, ప్రశ్న పాతదే! పుట్టాడని చెబుతున్నా కేవల జాగరజీవుడు నిజంగా సత్యపదార్థమైతే, అప్పుడు వాడికి ఆకాశతుల్యమైన పరబ్రహ్మకంటే భిన్నమైన మరో కారణం కావలసి వచ్చివుండేది. కానీ, సత్యం అలా లేదు. ఈ విషయాన్నే మేము ఉపదేశించ దలచుకున్నాం. దానికి ఉపాయం ఏమిటి? ఒకటే ఉపాయం. ఏమీ లేని ఆ బ్రహ్మకే జీవ శబ్ద జడశబ్దాల ఆకారాన్ని, వాటి అర్థాల ఆకారాన్నీ, ముందు కల్పించి, ఆ తరువాత యుక్తుల ద్వారా ఇది అసంభవం కనుక, జీవుడికీ జగత్తుకీ కూడా అసలు ఉత్పత్తే లేదని నిరూపించాలి. అంతకన్నా మార్గం లేదు. అందుకోసమే, మేము ఈ రకమైన కల్పన చేస్తున్నాం.

## 21. జగత్తు విషయంలో దృష్టిభేదం

***శ్రీరాముడు***: గురుదేవా! మీరు చెప్పింది నిజమైనా, లోకంలో శరీరాలు కనిపిస్తున్నాయి. మోహం కనిపిస్తోంది. మనోబుద్ధ్యాదులతో సహా ఈ శరీరాదులను నిర్మించే కర్త ఒకడుండాలి. ఈ ఇంద్రియాల సహాయంతో రాగద్వేషాది బంధనాల ద్వారా ఆ జీవిని మోహపెట్టే సమ్మోహనకర్త ఒకడు వుండి వుండాలి. కర్త లేనిదే ఏ పనీ జరుగుదు కదా! దీనినిబట్టి మూల పరబ్రహ్మకంటే భిన్నంగా వ్యామోహుడొకడు, వ్యామోహకుడు మరొకడు, వుండి వుండాలి. వ్యామోహ్యుడు అంటే, వ్యామోహపెట్ట బడేవాడు. అంటే జీవుడు. వ్యామోహకుడు అంటే, వ్యామోహ పెట్టేవాడు. అంటే ఈశ్వరుడు. వీరిద్దరూ బ్రహ్మకంటే భిన్నంగా వుండి ఉండాలి. మీరు బ్రహ్మకంటే భిన్నంగా ఏదీ లేదంటారేమి?

***వశిష్ఠుడు***: శ్రుతి ఏమి చెబుతోంది ? "వాచారంభణం వికారో నామధేయం" (ఛందోగ్యము అధ్యాయం 6) –మార్పు అనేది వట్టి మాట మాత్రమే. కొత్త పేరు మాత్రమే – అని చెబుతోంది. ఇందాక నువ్వు చెప్పిన యుక్తి ప్రకారం, కారణం లేనిదే కార్యం పుట్టడానికి వీలు లేదు. ఆకాశంలోంచి చెట్టు పుట్టదు. అలాగే, శుద్ధ పరబ్రహ్మలోంచి జీవుడు గాని, ఈశ్వరుడుగానీ, పుట్టే అవకాశం లేదు. కనుక, శ్రుతివల్ల, యుక్తివల్ల, ఏమి తేలుతోందంటే, శరీరాదుల కర్తృత్వం గానీ, వ్యామోహ్య వ్యామోహక భావం గానీ, సత్యం కానే కావని తేలుతోంది. శ్రుతి యుక్తులు ఇలా ఘోషిస్తుంటే, నువ్వు వేరే కర్త వుంటాడంటావేమిటి? రజ్జు స్థానంలో

కనిపించే సర్పాన్ని సమర్థించడానికి ఒక సృష్టికర్తను వెతుక్కొని తీసుకురానక్కర లేదు. అలాగే, ఈ ప్రపంచాన్ని, జీవులను, వీరి ఉత్పత్తిని, నిర్వహించేందుకు మరొక కర్తను వెతుక్కు రావలసిన పని లేదు. కూటస్థపరబ్రహ్మే వివర్త రూపంతో దీనిని నిర్వహించ గలడు. (కూటస్థము – మార్పు లేకుండా మూల భూతమై ఉన్నది.)

ఈ జగత్తు విషయంలో నువ్వు గ్రహించవలసింది ఏమిటంటే, పరబ్రహ్మ దృష్టిలో అసలది పుట్టనే లేదు. జీవాత్మ దృష్టిలో ఇది అసత్యమైన జన్మ గలది. అదే జీవాత్మకు జ్ఞానం కలిగితే, ఆ తరువాత దీనికి ఆకారమే లేదు. (స.51)

***శ్రీరాముడు***: గురుదేవా! కూటస్థ పరబ్రహ్మమే జగత్తుగా కనిపిస్తున్నదని మీరంటున్నారు. అది ఆ విధంగా కనిపించే క్రమాన్ని మరోసారి వినిపించండి. దానివల్ల నా భేదబుద్ధి బాగా నివర్తిస్తుంది.

***వశిష్ఠుడు***: రామా! అలా ఐతే, కాసేపు కనిపించే ఈ ప్రపంచం అంతా సత్యమనుకొని నేను చెప్పేది విను. మధ్యలో అదెలా ఇదెలా అని అడ్డం పడబోకు. మేము చెప్పేది పూర్తైతే, ఈ ప్రపంచం అసత్యమనే మాట నీకే తెలుస్తుంది.

ఈ ప్రపంచం అంతా పరబ్రహ్మలోంచి వివర్తంగా వచ్చిందని మేమంటున్నాం. దీనిని దృష్టి సృష్టివాదం అంటారు. కొందరు మా వాదంలో కొంత భాగాన్ని మాత్రమే స్వీకరించి, పరబ్రహ్మే జగత్తుగా కనిపిస్తోంది కనుక, చెట్టన్నా కొమ్మలన్నా ఒక్కటే అన్న చందాన, జగత్తే బ్రహ్మ అంటున్నారు. బంగారు ముద్దలోంచి రూపాయి బిళ్ళలు తయారు చేశారు. అప్పుడు రూపాయి బిళ్ళలన్నీ బంగారమే అని అనడం సముచితమే గాని, బంగారపు ముద్దే రూపాయిలనడం సముచితం కాదు. అనేక తర్కవాదాలు ఈ ఔచిత్యానౌచిత్యాలను పట్టించుకోకుండానే సాగిపోతూ వుంటాయి. అలాంటి వితండ వాదాల జోలికి మనం పోవద్దు.

ప్రపంచంలోని పదార్థాలన్నిటిలోనూ జడస్వభావం కొంత, చైతన్య స్వభావం కొంత, కనిపిస్తోంది. అందులో జడస్వభావం కాలక్రమంలో మార్పుకూ, నాశనానికీ, లోనవుతోంది. చైతన్య స్వభావానికి ఏ రకమైన మార్పూ కనిపించడం లేదు. కనుక చివరికి మిగిలేది అద్వితీయ పరబ్రహ్మమే అని తేలుతోంది. దీనినే మళ్ళీ వివరిస్తా. విను.

మహా కల్పాంతంలో, ప్రళయకాలంలో, మనోబుద్ధి కర్మలతో సహా, ఈశ్వరుడితో సహా, దృశ్య ప్రపంచమంతా నశించిపోగా, ఆ దశలో కాలమూ, ఆకాశమూ గూడా అంతరించి పోతాయి. అప్పుడు కూటస్థ పరబ్రహ్మ మాత్రమే మిగులుతుంది. అది కాలమూ గాదు, ఆకాశమూ గాదు, పంచభూతాలూ గాదు, మరేదీ గాదు. అది నిర్వచనాలకు అందదు. అది ఆత్మజ్ఞానుల అనుభవానికి మాత్రమే అందుతుంది. మిగిలిన వారంతా దానిని వేదవాక్యాల ఆధారంతో వర్ణించవలసిందే!

ఇలాంటి ఈ పరబ్రహ్మలోనే దేశకాల పంచభూత పదార్థాలన్నీ అంతర్లీనంగా, వాసనా రూపంగా వున్నాయి. కొయ్య స్తంభంలో రకరకాల బొమ్మలు అంతర్లీనంగా వుండిపోగా, శిల్పి ఉలితో చెక్కినప్పుడు వాటిలో కొన్ని బొమ్మలు బయట పడుతూ వుంటాయి. ఆ బయటపడ్డ బొమ్మలకు స్తంభంకంటే వేరే అస్తిత్వం లేదు. పరిశీలించి చూస్తే, బొమ్మలు వేరుగా వున్నాయనుకోవడం ఒక భ్రాంతి మాత్రమే! ఇలా భ్రాంతి జన్యమైన బొమ్మలు ఎన్ని కనిపించినా, స్తంభం స్తంభమే! అలాగే, ఎన్ని ప్రపంచాలు కనిపించినా, ఆ పరబ్రహ్మ సంగరహితమే! అజరామరమే! (స.52)

**గమనిక** – ఇప్పటికి ఈ నిర్వాణ ప్రకరణం ఉత్తరార్ధంలో 52 సర్గలు పూర్తి అయినాయి. పూర్వార్ధం చివరిలో శ్రీరాముడికి సమాధి సిద్ధించిందనీ, దానిని చెడగొట్టమని విశ్వామిత్రాదులు కోరారనీ, చెప్పడంవల్ల, దీని ఔచిత్యమేమిటనే చర్చతోనే ఉత్తరార్ధం ప్రారంభమైంది. అందువల్లే, ఆ చర్చ ప్రధానంగా సాధనామార్గాలమీద, సాధనా సోపానాలమీద, చివరకు సాధకుల వర్గీకరణ మీద, క్రమంగా సాగింది. ఈ వరుసలోనే విద్యాధరోపాఖ్యానమూ, మంకి ఉపాఖ్యానమూ, అనే చిన్న కథలు కూడా వచ్చాయి.

మనం గమనించ వలసిన ప్రత్యేకాంశం ఏమిటంటే, ఈ ప్రకరణంలో వశిష్ఠమహర్షి సమాధానాలన్నీ 'సర్వమూ చైతన్యమయమే' అనే అంశం చుట్టూ తిరుగుతున్నాయి. నిజానికి ఆయన దృష్టిలో ఇదే ప్రధానాంశం. చతుర్భూతాలే గాక, కాలమూ ఆకాశమూ కూడా చైతన్య స్వరూపాలే అని నిరూపించడం కోసం, 'పాషాణోపాఖ్యానం' అనే చిన్న కథను సుమారు 40 సర్గలకు సాగదీసి చెప్పబోతున్నాడు. 56వ సర్గలో ప్రారంభం కాబోయే ఆ ఉపాఖ్యానానికి పీఠికగా రాబోయే మూడు సర్గలను ఆయన రూపొందించుకుంటున్నాడు. అందుకే 53వ సర్గ ప్రారంభంలో శ్రీరాముడు ఒక విచిత్రమైన ప్రశ్న వేశాడు. ఈ విషయాలను గమనించుకుంటూ మనం ఇక 53వ సర్గలోకి ప్రవేశిద్దాం.

## 22. సర్వమూ చైతన్య మయమే

**శ్రీరాముడు**: గురుదేవా! చేత్య పదార్థాలలో (స్మృతికి విషయమైన దృశ్యపదార్థాలలో) ఒక చేత్యత్వం వుంది. కాలంలో కాలత్వం వుంది. ఆకాశంలో ఆకాశత్వం వుంది. జడంలో జడత్వం వుంది. సహజసిద్ధమైన చలనం వుండి గూడా జడమే ఐన వాయువులో వాయుత్వం వుంది. ఇక, కాలాన్ని విశ్లేషిస్తే, భూత భవిష్యత్తులు ఆధారం లేనివై తెగి పోగా, వర్తమానం ఒకటి సారవంతమై నిలబడుతోంది. ఈ వర్తమాన కాలానికి ఒక ఆకారమూ లేదు, ఒక స్పందనా లేదు. అవి లేవనటానికీ లేదు. దీనిలో వర్తమానత్వం వుంది. ఆకారం గల పదార్థాలలో మూర్తత్వం వుంది. ఆ పదార్థాలలో భిన్నత్వం వుంది. భిన్నత్వం లేని ఆకాశాది పదార్థాలలో అనంతత్వం వుంది. ఆకాశాదులు అదృశ్య పదార్థాలు. మిగిలిన పదార్థాలలో దృశ్యత్వం వుంది. వీటిల్లో కొన్నిటికి సృష్టి (పుట్టుక) కనిపిస్తోంది. ఆ సృష్టిలో సృష్టిత్వం వుంది. చేత్యత్వం దగ్గరినుంచీ సృష్టిత్వం దాకా ఈ వున్న లక్షణా లేమిటి? ఇవి ఎక్కడినుంచి వచ్చాయి?

**వశిష్ఠుడు**: రామా! నువ్వడిగిన వాటన్నిటి స్వరూపమూ ఒక్కటే. అదే మహా చిదాకాశం! మహా ప్రళయకాలంలో బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులు గూడా లయించి పోయినప్పుడు, నామ రూపభేదాలన్నీ లయించి పోగా, పరిశుద్ధమైన చిదాత్మ ఒక్కటే మిగిలి వుంటుంది.

**శ్రీరాముడు**: అలాంటి ప్రళయ సమయంలో ఆ చిదాత్మ కూడా లయించి పోయింది అందాము. నష్టమేమి?

**వశిష్ఠుడు**: అలా అంటే, మళ్ళీ సృష్టి వచ్చేందుకు అవకాశం లేదు. కానీ, మళ్ళీ సృష్టి కనిపిస్తోంది. అందువల్ల శుద్ధ చిదాత్మ లయించిందనడానికి వీలు లేదు. దానిలో కర్మవాసనలనే మాలిన్యం కలిసినప్పుడు, అది వున్నదని తెలుస్తుంది. మిగిలినప్పుడు, అనగా ఆ కర్మవాసనలు దాని నుంచి పూర్తిగా తొలగి పోయినప్పుడు, అది ఉన్నదనే మాటకు చోటు లేదు.

**శ్రీరాముడు**: ఉన్నదనే మాటకు చోటు లేనప్పుడు, లేదనే అందాం.

**వశిష్ఠుడు**: అలా అనడానికీ వీలు లేదు. ఎందుకంటే, ఆకాశంలో చంద్రుడు వున్నాడని పిల్లవాడికి చూపించాల్సి వచ్చినప్పుడు, "అదో, ఆ చెట్టు కొమ్మమీదినుంచి చూడరా" అని మనం చూపిస్తాం. అప్పుడు పిల్లవాడు మొదట చెట్టు కొమ్మను చూసి, ఆ తరువాత చంద్రుణ్ణి తక్షణమే చూస్తాడు. చూస్తాడు అంటే ఏమిటి? చూసేవాడి అంతఃకరణంలో వుండే చైతన్యం (ప్రమాతృ చైతన్యం) కంటి ద్వారా కొమ్మమీదికి, కొమ్మ మీదినుంచి చెట్టు మీదికి, ప్రసరించింది. ఇప్పుడీ చైతన్యానికి మొదట్లో కొమ్మ, చివర్లో చంద్ర బింబమూ, విషయంగా వున్నాయి. కొమ్మకీ చంద్రుడికీ మధ్యలో, ఇన్ని వేల మైళ్ళ పొడవులో, ఆ చైతన్యానికి ఏదీ ఆధారం లేదు. అందుచేత అది అక్కడ ఉందనేందుకు వీలు లేదు. అంత మాత్రం చేత, అక్కడ చైతన్యం లేదని చెప్పగలవా?

ఒక యోగి అర్థరాత్రి దాకా నిద్రపోయి, నిద్దరమత్తు తగ్గగానే లేచి కూర్చొని సమాధిలోకి వెడుతున్నాడు. అలాంటి యోగులకు విషయ స్పర్శలేని నిర్విషయ చిదాత్మ అనుభవంలోకి కనిపిస్తోంది. వాళ్ల అనుభవాన్ని కాదనగలమా?

లోకంలో రకరకాల మొక్కలు మొలుస్తున్నాయి. ఇవి మొలిచే ప్రతి చోటా చైతన్యం రకరకాలుగా వ్యక్తం అవుతోంది. కాని అన్ని చోట్ల వుండే చైతన్యమూ ఒక్కటే! దానిని బట్టి వీటన్నిటికీ మూలమైన సత్తాసామాన్యం ఒకటి ఉన్నదని ఒప్పుకోకుండా వుండ గలమా? (ఉపశమ ప్రకరణంలో 54వ సర్గ ప్రాంతంలో సత్తా సామాన్యంయొక్క వివరణ వచ్చింది.)

**శ్రీరాముడు**: శూన్యంలోంచే ఇవన్నీ వచ్చాయని ఎందుకు అనుకోకూడదు?

**వశిష్ఠుడు**: అంటే శూన్యం జగత్కారణం అవుతుందేమోనని ఆలోచిస్తున్నావు. శూన్యానికి దేశకాల విభాగమే లేదు! అందుచేత శూన్యంలోంచి ఇప్పుడు ఈ పదార్థమే పుట్టాలనే నియమం కుదరదు. అందువల్ల ప్రతిచోటా ప్రతి పదార్థమూ పుడుతూనే వుండవలసి వస్తుంది.

**శ్రీరాముడు**: మీరు చెప్పే పరబ్రహ్మ కూడా అటువంటిదే కదా! అందుచేత, అక్కడ గూడా ప్రతి చోటా ప్రతిదీ పుట్టాలి కదా!

**వశిష్ఠుడు**: పుట్టాలి. పుట్టాలంటే రెండే విధానాలున్నాయి. ఒకటి పరిణామ విధానం, రెండవది వివర్త విధానం. బ్రహ్మ అమూర్తం గనుక, దానిలోంచి మూర్త పదార్థాల సృష్టి పరిణామ ప్రక్రియలో జరిగే అవకాశం లేదు. అందువల్లే మేము వివర్త ప్రక్రియలో సృష్టి జరిగిందంటున్నాము.

**శ్రీరాముడు**: శూన్యంలోంచి వివర్త ప్రక్రియ జరిగిందనకూడదా?

**వశిష్ఠుడు**: వివర్త ప్రక్రియ భ్రాంతిమీద ఆధారపడి వుంది. భ్రాంతి కలగాలంటే ఒక సత్య పదార్థం ఆధారంగా వుండాలి. కేవలం శూన్యం మీద భ్రాంతి కలగడం లోకానుభవంలో ఎక్కడా లేదు. కనుక పరబ్రహ్మ మీదే వివర్త ప్రక్రియ జరిగిందని చెప్పక తప్పదు. అందుకే నువ్వు అడిగిన ప్రశ్నలన్నిటికీ 'మహా చిదాకాశమే సమాధానం' అని అన్నాను. ఈ విషయాన్నే శ్రుతి అనేక రకాలుగా ప్రతిపాదించింది. ఒక చోట,

**"తదేతద్బ్రహ్మ - అపూర్వ మనపరం- అనంతరమబాహ్యం-**

**అయమాత్మాబ్రహ్మ- సర్వానుభూః"**

(అదే ఈ బ్రహ్మ. దానికి కారణమూ లేదూ, కార్యమూ లేదు. దానికి వెలుపలా లేదూ, లోపలా లేదు. అన్నిటినీ అనుభవించే ఈ జీవాత్మే ఆ బ్రహ్మ.) అంది.

మరో చోట

**"పూర్ణమదః పూర్ణమిదం - పూర్ణాత్పూర్ణ ముదచ్యతే - పూర్ణస్య పూర్ణమాదాయ - పూర్ణమేవా వశిష్యతే** "(శుక యజుర్వేద శాన్తిపాఠము)

(ఆ కనిపించని పరలోకమూ పరిపూర్ణమే! ఈ కనిపించే సర్వ ప్రపంచమూ పరిపూర్ణమే! పరిపూర్ణంలోనుంచే పరిపూర్ణమైనదే వ్యక్తమౌతోంది. అలాంటి పరిపూర్ణంలోంచి పరిపూర్ణాన్ని తీసి వేస్తే, పరిపూర్ణమే మిగులుతున్నది.) అన్నది.(స. 53)

అందుకనే జగత్తు అనే పదార్థం వేరుగా లేదనీ, ఉన్నది పరబ్రహ్మ ఒక్కటే అనీ, మేము చెబుతున్నాం.

నిద్రపోయే ముందు నీవు ఉన్నావు. నీకు నిద్ర పట్టింది. కల వచ్చింది. కలలో మరొక నువ్వు తయారయ్యావు. అంటే, నీ లోంచి నువ్వే విడిపడ్డావు! ఇది సంభవమా? కాదు కానీ, అసంభవమైనది సంభవించింది. దేనివల్ల? నిద్ర అనే ఆవరణవల్ల. ఎప్పుడైతే నిద్రవల్ల నీలోంచి నువ్వు విడిపడ్డావో, విడిపడ్డ నీ చుట్టూ ఒక ప్రపంచం ఏర్పడింది. అదే స్వప్న ప్రపంచం. ఇది ఎక్కడి నుండి వచ్చింది? నీలోంచే వచ్చింది.

అంటే, నీయొక్క రూపాంతరమే! అలా ఐతే, స్వప్న జీవుడిగా వున్న నీకు, ఆ స్వప్న ప్రపంచానికీ, భేదమేమిటి? ఏమీ లేదు. ఐనా, ఆ స్వప్న జీవుడు 'నేను వేరు, నా చుట్టూతా వున్న ప్రపంచం వేరు, అంటున్నాడు. అది ఎలా సత్యం కాదో, అలాగే జాగ్రత్‌దశలో కూడా 'నేను వేరు, నా చుట్టూతా వున్న ప్రపంచం వేరు' అనే భావం సత్యం కాదు. స్వప్నానికి ముందర, స్వప్న ప్రపంచంతో సంబంధం లేని నువ్వు శుద్ధంగా ఎలా ఉన్నావో, అలాగే ఈ జాగ్రత్ ప్రపంచ సృష్టికి పూర్వం, ఈ ప్రపంచంతో సంబంధం లేని నిష్ప్రపంచ పరబ్రహ్మ విశుద్ధంగా వుంది. అదే అవిద్యావరణవల్ల జీవుడుగానూ, జీవ ప్రపంచంగానూ విడివడింది. అందువల్ల పరమార్థ దశలో బ్రహ్మకూ, జీవుడికీ, జగత్తుకూ, భేదమే లేదు.

***శ్రీరాముడు***: గురుదేవా! శుద్ధ చైతన్యమే జగత్పదార్థంగా కనిపిస్తుందని ఎందుకనాలి? పుట్టబోయే చెట్టు విత్తులో ముందే సూక్ష్మ రూపంలో వున్నట్లుగా, పరబ్రహ్మ అనే విత్తులో జగత్తు ముందే దాగి వుందనీ, ఆ తరువాత మఱ్ఱి చెట్టు లాగా వ్యక్తమైందనీ ఎందుకు అనుకోకూడదు?

***వశిష్ఠుడు***: విత్తు ఎంత చిన్నదైనా, దానికి ఆకారం వుంది. దానిలో సూక్ష్మంగా దాగివున్న మఱ్ఱిచెట్టు, భూమి అణువులు, నీటి అణువులు, మొదలైన బాహ్య సహకారి కారణాల సహాయం కలిసి వచ్చినప్పుడు వ్యక్తమౌతోంది. పరబ్రహ్మ విషయంలో దానికి విత్తు వంటి ఆకారమూ లేదు, దానికంటే భిన్నంగా వేరే సహకార సామాగ్రీ లేదు. కనుక, నువ్వు చెప్పిన మాట కుదరదు.

***శ్రీరాముడు***: వేదంలో బ్రహ్మను గురించి చెబుతూ –

అణుః పంథాః వితతః పురాణః (అణువు, మార్గము, విస్తృతము, పాతది) అని ఒకచోట "అణోరణీయాన్" (అణువులన్నిటికన్నా చిన్న అణువు) అని మరో చోటా వుంది. కనుక బ్రహ్మకు అణువు వంటి ఆకారం వుందని ఒప్పుకోవాలి. ఇక సహకారి సామాగ్రి అంటారా, అది లేకుండానే ప్రపంచ వృక్షాన్ని పుట్టించగల విచిత్ర శక్తి పరబ్రహ్మమనే అణువుయొక్క గర్భంలో వుందని ఎందుకు అనుకోకూడదు?

***వశిష్ఠుడు***: నువ్వు చెప్పిన వేద వాక్యాలలోనే "అణుః" అన్న చోట "వితతః"(విస్తృతమైనది) అని కూడా వుంది. అలాగే "అణోరణీయాన్" (పెద్దవాటన్నిటికంటే కూడా పెద్దది) అని ఉన్నది. కాబట్టి బ్రహ్మకు అణువువంటి ఆకారం వుందని చెప్పరాదు. ఒకవేళ నువ్వు అలా కల్పన చేయగలిగినా, దాని కడుపులో మహాప్రపంచం అంతా దాగి వుందని అనడం 'ఆవగింజలో మేరు పర్వతం ఉన్నది' అన్నట్లుగా వుంటుంది. ఇది యుక్తి యుక్తం కాదు. దీనికి వేరే ప్రమాణమూ లేదు. కనుక పరబ్రహ్మలోంచి ఈ ప్రపంచం వృక్షం లాగా పరిణామక్రమంలో జన్మించిందని చెప్పడం సాధ్యం కాదు. అందుచేత, వివర్త విధానంలో జన్మించిందనే చెప్పాలి. అలా చెబితే, ఈ ప్రపంచమనేది సన్మాత్రమే తప్ప మరొకటి కాదని అంగీకరించి నట్లే. మేమూ ఆ మాటే చెబుతున్నాం. (స.54)

రామా! నేను చెప్పిన దానికి సారాంశమేమంటే, శుద్ధ చైతన్యమే అవిద్యవల్ల, అన్యభావన చేస్తే , తనను తానే తనకంటే భిన్నంగా చూసుకుంటుంది. అలా వుండే దశలో మళ్ళీ తనను తానే భావన చేసుకుంటే, భిన్నత్వం పోయి, తనే మిగిలిపోతుంది. అదే ముక్తి ( స. 55)

## 23. పాషాణోపాఖ్యానము

రామా! నేను చెప్పేదాని సారాంశం ఏమిటంటే–

**సర్వత్ర సర్వదా సర్వ–మస్తీతి ప్రతిపాదనే।**
**పాషాణాఖ్యాన దృష్టాన్తో మయాయం తవ కథ్యతే ॥** (ని.ఉ.స.58, శ్లో.4)

ప్రతీదీ చిత్తే! ప్రతి చోటా చిత్తే వుంది – అని మాత్రమే. ఈ విషయాన్ని నిరూపించేందుకు నీకు పాషాణోపాఖ్యానం అనే చిన్న కథ చెబుతాను విను.

పూర్వం నాకు బ్రహ్మజ్ఞానం కలిగిన కొత్తల్లో, ఈ సంసార చింతలు వదిలేసి, దీర్ఘ సమాధిలో వుండి పోవాలనే కోరిక కలిగింది. దానికి తగిన ఏకాంత ప్రదేశం ఎక్కడా అని వెతికాను. కొండలు కోనలు, సముద్రాలు, ఆకాశంలో వాయుస్కంధాలు, (వివిధ లోకాలలో వుండే గాలి పొరలు)– అన్నీ చూశాను. ఏదీ నచ్చలేదు. చివరికి ఆకాశంలో చాలా చాలా దూరం పోయి, ఏ లోకస్పర్శా లేని ఏకాంత ప్రదేశం చూసుకొని, అక్కడ నా సంకల్ప బలంతో ఒక కుటీరం నిర్మించుకొని, నిర్వికల్ప సమాధిలోకి ప్రవేశించాను. ప్రవేశించేటప్పుడే అనుకున్నాను– “వంద సంవత్సరాల లోపులో బయటికి రాకూడదు” అని.

అనుకున్నట్టే సమాధిలోకి వెళ్ళాను. వంద సంవత్సరాలూ పూర్తయ్యేసరికి, విచిత్రంగా, నా చిత్తంలో ‘మెలకువ’ అనే విత్తు మొలకెత్తడం మొదలెట్టింది. క్రమంగా నా యింద్రియాలన్నీ పని చేసి, నేను పూర్తిగా సమాధిలోంచి బయటికి వచ్చాను. వచ్చేసరికి ఎక్కడినుండి వచ్చిందో, ఎలా వచ్చిందో, నాకు తెలియదు గానీ, ‘అహంకార’మనే పిశాచం ‘కోరిక’ అనే స్త్రీతో సహా వచ్చి, మీద పడి, నన్ను పట్టేసుకుంది. (స. 56)

***శ్రీరాముడు***: అదేమిటి గురుదేవా! అప్పటికే మీకు బ్రహ్మజ్ఞానం కలిగిందన్నారు గదా! జ్ఞానికి అహంకారం ఆవహించడం ఏమిటి?

***వశిష్ఠుడు***: అజ్ఞానికైనా సరే , జ్ఞానికైనా సరే, అహంకారం లేనిదే, దేహం నిలవదు. ఆధారం లేనిదే ఆధేయం వుండదు. ఐతే విశేషమేమిటంటే, అహంకారం అజ్ఞానిని బాధిస్తుంది, జ్ఞానిని బాధించదు. నాలాంటి జ్ఞానికి సమాధిలో అహంకారాన్ని విడిచిపెట్టినప్పుడూ, మెలకువలోకి వచ్చి, వ్యవహారంలో అహంకారాన్ని స్వీకరించినప్పుడు కూడా, అనుభూతి ఒకే రకంగా వుంటుంది. ఇదే జ్ఞాని దగ్గరుండే విశేషం. (స. 57)

***శ్రీరాముడు***: గురుదేవా! “సర్వత్ర సర్వదా సర్వం” (ప్రతిదీ ప్రతిచోటా ఎల్లప్పుడూ వుంది) అని నిరూపించడానికి కదా ఈ పాషాణోపాఖ్యానం ప్రారంభించారు? ఆ మాట ఎక్కడా మీరు చెప్పిన కథలో రాలేదే!

***వశిష్ఠుడు***: పరబ్రహ్మ పాషాణం వంటిదని చెప్పడానికి నేనీ కథ మొదలు పెట్టలేదు. బండరాతి మధ్యలో కూడా చిదాకాశం వుందనీ, ఆ చిదాకాశంలో అనేక వేల ప్రపంచాలున్నాయనీ చెప్పదలచుకొని ఈ కథ మొదలు పెట్టాను. బండరాతి మధ్యలోనే ప్రపంచాలుంటే, చెట్లల్లో , పుట్టల్లో, పంచభూతాల అణువులలో, ప్రపంచ సృష్టులు ఉన్నాయనీ వేరే చెప్పాలా?

***శ్రీరాముడు***: గురుదేవా! ఈ గోడలో గూడా చిదాకాశం వుంది కనుక, అక్కడ గూడా అధ్యాస జరిగి అనేక ప్రపంచాలు ఏర్పడడం సాధ్యమేనని మీరు చెప్పదలచుకున్నట్లైతే , మీకు ఈ రాళ్ళూ, ఈ చెట్లూ, ఈ పుట్టలూ, ఈ పంచభూతాలూ, వీటన్నిటి ప్రసక్తి ఎందుకు? సూటిగా శుద్ధ చిదాకాశంలోనే ప్రపంచాధ్యాస జరిగిపోతుందని చెప్పవచ్చు గదా! అలా చెబితే, జ్ఞానంవల్ల అధ్యాస పోయినప్పుడు శుద్ధ చైతన్యమే మిగులుతుంది గదా! ఆ మాట మీ సిద్ధాంతానికి అనుకూలమే గదా! మరి ఆ మాట మీరెందుకు అనడం లేదు.

***వశిష్ఠుడు***: నేను చెప్పదలచుకున్నది అదేనయ్యా! ఐతే, సూటిగా శుద్ధ చిదాకాశాన్ని పరిచయం చేయడం కొంచెం కష్టం గనుక, ఆ చైతన్యం ఎక్కడెక్కడైతే ఉపహితమై ఉన్నదో (అంటే ఏ పదార్థాలను ఉపాధులుగా చేసుకొని వున్నదో) ఆ స్థలాలన్నిటిలోనూ ప్రపంచ సృష్టులున్నాయని మొదలు పెట్టాను. ఈ పట్టీని చివరికి హిరణ్యగర్భుడి దాకా తీసుకపోతాను. అతనికి అధిష్ఠానం శుద్ధ చిదాకాశమే గనుక, ఇప్పటికి వచ్చిన అధ్యాస పరంపర అంతా అధిష్ఠాన చైతన్యంకంటే అభిన్నమని నిరూపిస్తాను. దానిని బట్టి ఈ ప్రపంచ సృష్టి ఒక దృష్టితో సాక్షాత్తుగా శుద్ధ చైతన్యమనీ, మరో దృష్టితో భ్రాంతి జన్యం గనుక అసలే లేనిదని, తేలిపోతుంది. అంటే, ‘వుంది –లేదు’ అనే మాటలు దృష్టి భేదంవల్ల పుట్టినవే తప్ప, అసలైన కలిమిలేములు లేనే లేవని

నిరూపించినట్లవుతుంది. ఇదే నేను చెప్పదలచుకున్న విషయం. (స.58)

**శ్రీరాముడు**: సరే! గురుదేవా! ఇంతకూ వందేళ్ళ తరువాత సమాధినుంచి లేచారు గదా! ఆ తరువాత ఏం జరిగింది?

**వశిష్ఠుడు**: రామా! నేను సమాధినుంచి లేచేటప్పటికి ఒక అస్పష్టమైన ఆడగొంతు ఏదో వినిపించింది. వీణానాదం లాగా మధురంగా వున్న ఆ ధ్వనిని విని 'ఏ జీవులూ రావడానికి వీలులేని సుదూరాకాశ ప్రాంతాన్ని వెతుక్కొని నేనిక్కడికి వచ్చాను గదా! ఐనా ఇక్కడికి మరో జీవి కంఠం ఎలా వచ్చింది?' అని ఆశ్చర్యపోయి, ఆ చుట్టు ప్రక్కల అంతా వెతికాను. అక్కడ ఎవరూ కనిపించలేదు.

అప్పుడు నేను యోగబలంచేత చిదాకాశ స్వరూపాన్ని చూసి, భూతాకాశం అంతా వెతికాను. ఐనా ఏమీ కనిపించ లేదు. ఆ తరువాత ఇలా లాభం లేదని, మళ్ళీ పద్మాసనం వేసుకొని మనస్సును నిరోధించడం ప్రారంభించాను. మొదట బాహ్య పదార్థాలను నిరోధించాను (వదిలి వేశాను). ఆ తరువాత మనస్సులో వుండే మననాదులను నిరోధించాను. ఆ తరువాత క్రమంగా చిత్తాన్ని, బుద్ధినీ గూడా నిరోధించి, చిదాకాశంతో అభేదాన్ని పొందాను. అలా సమస్త పదార్థాలకూ ఆధారమైన అధిష్ఠాన స్వరూపాన్ని పొంది, ఆ రూపంతో లోకాలను అన్వేషించడం ప్రారంభించాను. నాకు ఎన్నో చిత్ర విచిత్రమైన లోకాలూ, సన్నివేశాలూ, కనిపించాయి.

**గమనిక–** ఇక్కడ 59,60 సర్గలలో వివిధ సృష్టులయొక్క వైచిత్ర్యాలను విస్తారంగా వశిష్ఠమహర్షి వర్ణించాడు. ఇంచుమించు ఇలాంటి వర్ణనే నిర్వాణ ప్రకరణం పూర్వార్ధంలో, భుశుండోపాఖ్యాన సందర్భంలో, 22వ సర్గ ప్రాంతంలో, వచ్చింది. అక్కడ వశిష్ఠ మహర్షి "నువ్వు చూసిన ఆశ్చర్యకర సన్నివేశాలేమిటి"? అని భుశుండయోగిని అడుగగా, ఆయన ఒక 30కి పైగా విశేషాలను చెప్పాడు. రకరకాల బ్రహ్మసృష్టులను, రకరకాల కల్పభేదాలను, అక్కడ ఆయన వివరించాడు. ఇక్కడ వశిష్ఠమహర్షి కూడా ఇంచుమించు అదే పని చేశాడు. ఐతే పునరుక్తిదోషం పట్టకుండా వుండేందుకోసం వివిధ సిద్ధాంతాలలో చెప్పే తత్త్వాలను, ఆవరణలనూ కూడా సమన్వయించి చూపించాడు. ఉదాహరణకు-

పంచీకృత పంచభూతాలను ప్రధానంగా తీసుకుంటే, ఈ సృష్టిలో ఐదు ఆవరణలు ఉన్నట్లు లెక్క. కొందరు ఇలాగే చెప్పారు. అపంచీకృత పంచ భూతాలను గూడా ముఖ్యమైనవిగా తీసుకుంటే , ఆవరణలు పది. కొందరు ఇలాగే చెప్పారు. సాంఖ్యులు వీటితో పాటు పంచ తన్మాత్రలను ఐదింటిని, అహంకార మహత్తత్త్వాదులతో కూడిన ప్రకృతిని కలిపి లెక్క వేసి పదహారు ఆవరణలన్నారు. మరి కొందరు ఇరవైనాలుగు తత్త్వాలన్నారు. ఇంకా కొందరు ముప్పైఆరు తత్త్వాలన్నారు. ఈ ఆవరణలన్నీ, ఆయా దృష్టులతో చూస్తే తనకు కనిపించాయన్నాడు వశిష్ఠ మహర్షి.

ఇక కల్ప సృష్టుల దగ్గరకు వస్తే, డెబ్బై రెండు త్రేతాయుగాలను, డెబ్బై రెండు మంది శ్రీరాములను, డెబ్బై రెండు మంది వశిష్ఠులను, చూశానన్నాడు.

ఇక విభిన్న సృష్టుల దగ్గరికొస్తే, పగలు కళ్ళు కనిపించని లోకాలను, రాత్రి చీకటిలో మాత్రమే కనిపించే లోకాలను , పాపం చేస్తే స్వర్గం వచ్చే లోకాలనూ కూడా చూశానన్నాడు.

ఇలా చెబుతూ ప్రతి చోటా, ఇదంతా మానసిక కల్పనేననీ, మానసిక కల్పనకు అడ్డూ అదుపూ లేదనీ, అనేక సార్లు వివరించాడు.

ఈ రకమైన వర్ణన, ఈ రకమైన వివరణా కూడా, పూర్వం వచ్చినదే గనుక, మనం ఆ అంశాలను దాటుకొని, అసలు కథలోకి ప్రవేశిద్దాం.

## 24. విద్యాధరి

**వశిష్ఠుడు**: రామా! నేనలా వింత వింత లోకాలను వెతుక్కుంటూ పోగా పోగా, చాలా సేపటికి ఒక చోట, నాకు వినిపించిన శబ్దం మెల్లమెల్లగా స్పష్టం కావడం మొదలైంది. అక్కడ ఎవరో ఒక ఆర్యావృత్తంతో నన్నే స్తుతి చేస్తూ గానం చేస్తున్నారు. ఆ పాట

**అసదుచిత రిక్త చేతన**
**సంసృతి సరితి ప్రముహ్యమానానామ్ ।**
**అవలంబన తటవిటపిన**
**మభినౌమి భవన్తమేవ మునే ॥** (ని.ఉ.స. 60, శ్లో.9)

(అసత్పురుషులకు ఉచితమైన రాగద్వేషాది దోషాలు బొత్తిగా అంటని చిత్తం గల ఓ మహర్షీ! మోహవశాన సంసారమనే నదిలో కొట్టుకుపోయే జీవులచేతికి దొరికిన ఒడ్డుమీది చెట్టు వంటివాడవు నువ్వు. నీకే నా నమస్కారం.)

ఈ పాట విని నేను ఆ దిక్కుగా ఇంకా ముందుకు పోగా, లక్ష్మీదేవి లాగా వున్న సుందరాంగి ఒకామె నాకు కనిపించింది. ఆమె నన్ను చూస్తూనే మందహాసం చేస్తూ నా దగ్గరకి వచ్చి, పక్కన నిలబడి, మళ్ళీ ఈ పాటే పాడింది.

నేను కొంచెం నిలిచి ఆమెను, ఆమె మాటను, గమనించి, "ఆడవాళ్ళతో మనకేం పనిలే" అని అక్కడినుంచి ముందుకు వెళ్ళిపోయాను. ఆ తరువాత ప్రపంచంలో ద్వంద్వమయంగా కనిపించే మాయను గురించి ఆలోచించి, ఆమెను  గూడా లక్ష్యపెట్టకుండా వదిలేసి, ఆకాశంలో ముందుకు వెళ్ళిపోయి, మళ్ళీ రకరకాల ప్రపంచాలను చూడడం మొదలు పెట్టాను.

అలా చూడగా చూడగా నాకేమి అర్థమైందంటే –

**చితి సర్వం చితస్సర్వం**
**చిత్సర్వం సర్వతశ్చ చిత్ ।**
**చిత్సత్ సర్వాత్మికేత్యేతత్**
**దృష్టం తత్ర మయాఖిలమ్ ॥** ( ని.ఉ.స. 60, శ్లో. 23)

అన్నిరకాల ప్రపంచాలూ చైతన్యంలోనే వున్నాయి. అవి చైతన్యంలోంచే వస్తున్నాయి. అవన్నీ చైతన్యమే!అన్ని వైపులా చైతన్యమే వుంది. ఆ చైతన్యమే అసలైన సత్పదార్థం. అదే సర్వస్వరూపం. ఈ విషయాన్ని నేనప్పుడక్కడ ప్రత్యక్షంగా చూశాను.

ఐనా మళ్ళీ ఆకాశంలో తిరిగి చాలా లోకాలను చూశాను. నాకు మళ్ళీ ఆ విషయమే మరింత స్పష్ట పడింది. (స. 60)

***శ్రీరాముడు***: గురుదేవా! ఉన్నదంతా శుద్ధ చైతన్యమే ఐతే, చైతన్యమనబడే ఆ శుద్ధ పరబ్రహ్మే సంసారియైన జీవుడిగా వచ్చాడనీ, వాడికే జ్ఞానం కలిగితే ముక్తి లభించిందనీ, చెప్పాలి. ఆ ప్రథమ జీవుడి పేరు హిరణ్యగర్భుడు గదా! ఆయనకు జ్ఞానం ద్వారా ముక్తి కలిగితే, అప్పుడు ఆయనతో పాటు ఆయన కల్పించిన జీవులందరికీ ఒకేసారి ముక్తి వచ్చెయ్యాలి గదా! అలా ఒక్క హిరణ్యగర్భుడికి ముక్తి వచ్చేస్తే, ఆయనతో పాటు అప్పటి జీవులంతా ముక్తిలోకి వెళ్లిపోతారు గనుక, ఇక అజ్ఞాన జీవి మిగలడు, కనుక మళ్ళీ ఇక సృష్టి రారాదు. కాని సృష్టి కనిపిస్తోంది కదా! ఇది ఎలా వచ్చింది?

***వశిష్ఠుడు***: నీకు ఒకసారి నిద్రవల్ల స్వప్నం వచ్చింది. నీకు నిద్రపోయింది. నీ స్వప్న ప్రపంచం మొత్తానికి మోక్షం వచ్చేసింది. కానీ నీలో సంస్కారాలు మిగిలి వున్నాయి. అందువల్ల మర్నాడే మరో స్వప్న ప్రపంచం వచ్చేస్తోంది. నీ దృష్టిలో గడిచిన స్వప్నమూ సత్యం గాదు, కొత్త స్వప్నమూ సత్యం గాదు. నీ కొత్త స్వప్న జీవుడి దృష్టిలో మాత్రం ఆ ప్రపంచం సత్యమే!

అలాగే, ఈ ప్రపంచమంతా శుద్ధ చైతన్యంలో హృదయ రూపంగా, అంటే సంస్కార రూపంగా, వుంది. ఈ ప్రపంచంలో వుండే జీవుడి దృష్టిలో ఇది సత్యం, ముక్తుడైనవాడు సత్యం తెలుసుకొని, ఇది

అసత్యంరా అని చెబుతాడు. ఐనా వీడు నమ్మడు.

ఇద్దరు మిత్రులున్నారు. ఇద్దరూ ఆకాశంలో జానడంత చంద్రుణ్ణి చూస్తున్నారు. ఇంతలో వాళ్లల్లో ఒకడికి ఏదో యోగశక్తి కలిసి వచ్చి, ఆకాశంలో ఎగరడం చేతనయింది. అతను చంద్రమండలం మీదకు వెళ్లి, పరిశీలించి చూసి, తిరిగి మిత్రుడి దగ్గరికి వచ్చి, "చంద్రుడు జానడంత చిన్నవాడు గాదురా, చాలా విశాలమైన గోళం" అని చెప్పాడు. ఐనా రెండవవాడికి 'చంద్రుడు జానడంతటి వాడే' అనే ఆలోచన పోదు. పైకి వెళ్ళి వచ్చినవాడికి కూడా చంద్రుడు జానెడివాడి లాగానే కనిపిస్తున్నాడు. ఐనా సరే, వాడు చంద్రుడు చిన్నవాడని ఒప్పుకోడు. ముక్తుడికీ, బద్ధుడికీ వుండే తేడా ఇలానే వుంటుంది.

కనుక రామా! హిరణ్యగర్భుడికి ముక్తి కలిగినా, బద్ధజీవుడి దృష్టిలో సృష్టి కొనసాగుతూనే వుంటుంది.

**గమనిక** –ఈ 61వ సర్గలో వాల్మీకి మహర్షి కొంత గద్యమూ, కొంత పద్యాన్నీ కలిపి నడిపాడు. (స. 61)

***శ్రీరాముడు***: సరే! గురుదేవా! మీకు కనిపించిన ప్రపంచాలలో మీరు ఆకాశంలో పక్షి లాగా పరిమిత స్వరూపంతో తిరిగారా? లేకపోతే అపరిచ్ఛిన్న వ్యాపక భావనతో అంతా చూశారా?

***వశిష్ఠుడు***: నేనప్పుడు వ్యాపక స్వరూపంతోనే ప్రపంచాలను చూశాను. అంటే, నాలోనే నేను ఆ ప్రపంచాలను చూశాను.

నేనే గాదు. లోకంలో వుండే సామాన్య జీవుడు కూడా తన్ను తాను కళ్ళతో చూసుకుంటున్నాడా? లేదు! తన మామూలు కళ్ళతో సహా తన శరీరం మొత్తాన్ని తన చైతన్య నేత్రంతో చూసుకుంటున్నాడు.

ఈ విషయం బాగా అర్థం కావడం కోసం చెట్టును ఉదాహరణగా తీసుకో. చెట్టుగా వున్న జీవి తన దేహాన్ని తను గుర్తించుకుంటున్నాడా, లేదా? ఆకులు, రెమ్మలు, కొమ్మలు, కలిగివున్న తన స్వరూపాన్ని ఆ జీవి తన చైతన్య నేత్రంతోనే గుర్తిస్తున్నాడు.

అలాగే నేను గూడా నా చైతన్య నేత్రంతో ఆ లోకాలన్నిటినీ నా అవయవాలుగా చూశాను. అప్పుడేమిటి? ఇప్పుడు గూడా సమస్త ప్రపంచాన్నీ అలాగే చూస్తున్నాను. నేనే కాదు, వివేక జ్ఞాన సంపన్నులంతా ఇలాగే చూస్తున్నారు.

***శ్రీరాముడు***: గురుదేవా! మీరిలా ప్రపంచాలను చూస్తూ వుండగా ఆ పాటపాడిన మహిళామణి ఏమి చేసింది?

***వశిష్ఠుడు***: ఆమె చిదాకాశ స్వరూపురాలై అలా పాటపాడుతూనే నా ప్రక్కకు వచ్చి నిలబడింది. అందుకే ఆమెను నేను మామూలు స్థితిలో చూడలేక పోయాను. సమాధిలోకి వెళ్ళి, నేను కూడా చిదాకాశ రూపాన్ని సంపాదించుకున్నాకే చూడ గలిగాను.

## 25. చిత్స్వరూపులు మాట్లాడుతారా?

***శ్రీరాముడు***: గురుదేవా! ఆమె చిదాకాశ స్వరూపురాలైతే,ఆమెకు నోరు, నాలుక, మొదలైన అవయవాలే వుండవు గదా! ఆమె పాట ఎలా పాడ గలిగింది?

***వశిష్ఠుడు***: అదేమి ప్రశ్నయ్యా? నీ స్వప్నంలో కనిపించే రూపాలన్నీ చిదాత్మకాలు కావా? అవి పాటలు పాడడం లేదా? వేరే పనులు చేయడం లేదా? అదీ గాక, ఇప్పుడు కనిపించే ఈ ప్రపంచం మొత్తం కలిపి చిదాత్మకమే అని అనేకసార్లు నిరూపించుకున్నాం గదా!

**స్వప్నోఽయం జగదాభోగో**
**న కించిద్వా స్వమేవ వా ॥** (ని.ఉ.స.62, శ్లో.39)

అందుకే ఈ ప్రపంచాన్ని స్వప్నమనీ అనవచ్చు, శూన్యమనీ అనవచ్చు. సాక్షాత్తుగా బ్రహ్మమనీ అనవచ్చు! ఇవన్నీ దృష్టి భేదాలే.

రామా! నేను స్వప్న వ్యవహారం లాగానే ఆమెతో మాట్లాడడం మొదలు పెట్టాను. (స.62)

**శ్రీరాముడు**: గురుదేవా! నా ప్రశ్నకు పూర్తిగా సమాధానం రాలేదు. అందుకే మళ్ళీ అడుగుతున్నాను. ఆ సమయంలో మీరు చిదాకాశ స్వరూపులుగా వున్నారు గదా! అప్పుడు మీకు నోరు, నాలుక, వంటి అవయవాలు లేవు కదా! మీరు అక్షరాలను ఎలా ఉచ్చరించ గలిగారు?

**వశిష్ఠుడు**: అక్షరాల ఉచ్చారణకు శరీరం కారణం ఐతే, శవం కూడా మాట్లాడాలి. (శరీరం అక్కడే వుంది గనుక.) స్వప్నలోకంలో సత్యమైన శరీరం లేదు గనుక, అక్కడ మాటలే వుండరాదు. కానీ అక్కడ మాటలు కనిపిస్తున్నాయి కదా! కనుక అక్షరాల ఉచ్చారణకు శరీరం కారణమవడానికి వీలు లేదు.

"ఐతే ఆ ఉచ్చారణకు కారణమేమిటి?" అని నువ్వడుగుతావు. ఆ ఉచ్చారణ అనేది సత్యమైన వ్యవహారమైతే, దానికి సరియైన కారణం వుండి వుండేది. అలా సరియైన కారణం వుంటే, స్వప్న ప్రపంచంలోని మాటలు బైటివాళ్ళందరికీ వినిపించి వుండేవి.

**శ్రీరాముడు**: అదేమిటండీ? జాగ్రత్ప్రపంచం ప్రత్యక్ష ప్రమాణానికి అందుతుంది. స్వప్న ప్రపంచం అలా అందదు. ఈ రెంటినీ సమానం అనేస్తారేమిటి మీరు?

**వశిష్ఠుడు**: జాగ్రత్ప్రపంచం పైపైకి ప్రత్యక్ష ప్రమాణానికందుతున్నట్టు కనిపిస్తుంది గానీ, తత్త్వం విచారించి చూస్తే, అది నిలవదు. అందు చేతనే ఆ రెంటినీ సమానాలని నేనన్నాను.

ఒక కొత్త ఉదాహరణ చెబుతా విను. ఒకడికి తనను ఎవరో చంపేసినట్టు కల వచ్చింది. కలలో చచ్చిపోయిన తరువాత వాడి పరిస్థితి ఏమిటి? వాడు చచ్చిపోయాడు గనుక వాడికి ఆ స్వప్నలోకంలో దేహం లేదు. వాడికి జ్ఞానం లేదు కనుక ముక్తే లేదు! వాడిలో ఆలోచనలు వున్నాయి కనుక, రాయిలాంటి జడత్వమూ లేదు. ఇప్పుడు వాడు కలలో వున్నట్టా? మెలకువలో వున్నట్టా? కలలో చచ్చిపోయాడు కనుక కలలో లేడు. మెలకువలో వాడు కనిపించలేడు కనుక, మెలకువలో లేడు. వాడిని గురించిన ఆలోచన కొనసాగుతుంది గనుక, వాడికి అస్తిత్వమే లేదనడానికి వీలు లేదు!

ఒకడికి అలాంటి కల చాలా సేపు నిలబడి వుండి పోయిందనుకో. అలాంటి స్వప్న జీవికీ, మనలాంటి మామూలు జాగ్రజ్జీవికీ, తేడా ఏమిటి?

ప్రపంచంలో పరిస్థితి ఎలా వున్నదంటే, శుద్ధ పరమాత్మ చైతన్యంలో అంతులేనన్ని చిత్తాలున్నాయి. వాటిలో ప్రతి చిత్తంలోనూ అంతులేని ఆకాశాలున్నాయి. అందులో ప్రతి ఆకాశంలోనూ ప్రపంచాలున్నాయి. ప్రతి ప్రపంచంలోనూ రకరకాల లోకాలూ, జీవులూ వున్నారు. ఈ జీవుల మనస్సులో మళ్ళీ ఆకాశాలున్నాయి. ఈ పరంపర ఇలా కొనసాగిపోతోంది. దీనికి అంతు లేదు. ఈ పరంపర మొత్తానికి కారణం అవిద్య. అవిద్యా దృష్టిలో, అరటిమట్టల్లాగా, ఈ ప్రపంచ కల్పనలు కొనసాగిపోతూ వుంటాయి. ఆ కల్పనల్లో ఒకటి సత్యమనీ, ఒకటి అసత్యమనీ, విడదీసి చూపించేందుకు అవకాశమే లేదు. ఇదంతా అజ్ఞానుల దృష్టి. అందుకే వారికీ ప్రపంచమంతా, సుఖదుఃఖాత్మకమై భయాలను కలిగిస్తోంది.

"**తత్త్వేవ భయం విదుషః అమన్వానస్య**" (అజ్ఞానియైన జీవికి ఈ దృశ్య ప్రపంచమే భయప్రదం) అని వేదం చెబుతోంది.

ఇక బ్రహ్మవేత్తల దృష్టిలోకి వచ్చావా, మొత్తమంతా చిదేక ఘనమే! (గడ్డకట్టిన శుద్ధ చైతన్యమే!)

రామా! ఈ దృష్టిభేదాన్ని నువ్వు గమనించుకుంటే, నీ ప్రశ్నకు సమాధానం సరిపోతుంది. ఇక పై విషయం చెబుతాను విను. (స. 63)

## 26. రాతి కడుపులో ఇల్లు

నేను ఆమె దగ్గరికి వెళ్ళి –

"అమ్మాయి! నువ్వెవరివి? నీ తండ్రి ఎవరు? నీ భర్త ఎవరు? ఇక్కడికి ఎందుకు వచ్చావు? ఎలా వచ్చావు? నీ స్వంత స్థానమేది?" అని అడిగాను.

దానికి ఆ విద్యాధరి ఇలా సమాధానం చెప్పింది.

"మునీంద్రా! సువిశాలమైన ఈ ఆకాశంలో ఏదో ఒక మూల మీకు సంబంధించిన జగత్తు వుంది. దాంతో పాటుగా భూలోక, స్వర్గలోకాలు వున్నాయి. అందులో భూమికి వెలుపల సుప్రసిద్ధమైన లోకాలోక పర్వతం వుంది. (భూమి చుట్టూ వున్న కాంతి కిరణాలు అంతరించే ప్రదేశాన్ని లోకాలోక పర్వతం అంటారు. అందుకే ఆ పర్వతం భూమి అనే స్త్రీకి చేతి కంకణం లాగా వుందని ఇక్కడ కవి వర్ణించాడు. భావనామయమైన ఈ పర్వతానికి ఒక పక్క వెలుగు, మరో పక్క చీకటి, వుంటుందని ప్రసిద్ధి.)

"మహర్షీ! ఆ లోకాలోక పర్వతంలో ఎన్ని రకాల విచిత్రాలున్నాయో నేను చెప్పలేను. ఒక్కొక్క చోట ఒక్కొక విచిత్రమైన సన్నివేశం ఆ పర్వతంలో వుంటుంది. ఒక్కొక్క చోట జనమయంగా వుంటుంది. మరో చోట ఎడారిగా వుంటుంది. వేరొక చోట దేవతామయంగా వుంటుంది. ఇలా ఎన్ని వేల విచిత్రాలో ! అలాంటి ఆ పర్వతానికి ఉత్తరభాగాన ఒక శిఖరం వుంది. ఆ శిఖరంలో తూర్పు ముఖంగా ఒక పెద్ద శిల వుంది. ఆ శిలాగర్భం నా నివాస స్థానం.

"ఆ మహాశిలాగర్భంలో అనేక వేల యుగాలుగా నేను కాపురం వుంటున్నాను. నేనే గాదు, నా భర్త, నా పరివారం అంతా అక్కడే వుంటున్నాం.

"నా భర్త చాలా గొప్పవాడు. చిన్నప్పటినుంచీ వేదాధ్యయన శీలి. ఆయనకు ఇంద్రియ చాపల్యం లేనే లేదు. నాకు మాత్రం ఆయనంటే వల్లమాలిన మోజు.

"ఇంతకూ నేనెలా పుట్టానో చెప్పలేదు కదూ! చెబుతా వినండి. నా భర్త చిన్న వయసులో వుండగానే బాగా శ్రోత్రియంగా వుండేవాడు. ఆ వయస్సులో ఆయన తనకు అనువైన భార్య కావాలని కోరుకొని నన్ను సృష్టి చేశాడు. చూస్తున్నారు గదా! నేనెంత అందంగా వున్నానో! ఇప్పుడే ఇలా వుంటే, ఆ నిండు యౌవనంలో ఎలా వుండేదాన్నో మీరే ఊహించుకోండి.

"కానీ మా ఆయనకు ఏ ఆలోచనా ఒక పట్టాన తెగదు. ఒకటే జాగు మనిషి. ఆయనకు నన్ను పెళ్లి చేసుకోవాలనే ఆలోచన ఒక ప్రక్కా , ఇంద్రియాలను జయించి మోక్షం పొందాలని మరో ప్రక్కా ,వుంటూ వుండేది. ఆ ఊగిసలాటలో మా వివాహం ఎప్పటికప్పుడు వాయిదా పడుతూ వస్తూ వుండేది. ఆయన మామూలుగానే వుండేవాడు. నేను మాత్రం కామబాధకు తట్టుకోలేక గిలగిలా కొట్టుకుంటూ వుండేదాన్ని. ఇంతకంటే వైధవ్యమే బాగుండేదని ఏడుస్తూ వుండేదాన్ని. ఐనా ఆయనను వదిలిపెట్టి వేళ్ళలేక పోయేదాన్ని.

"ఇలా చాలా యుగాలు గడిచాయి. నా భర్త సాంగత్య ఫలమేమో ఏమో, క్రమక్రమంగా నా అనురాగం కాస్తా వైరాగ్యంగా మారడం మొదలైంది. ఈ లోగా నా భర్తకు మోక్షం మీద కోరిక సుస్థిరమై పోయింది. ఐనా ఏదో అజ్ఞానం లేశం మిగిలి వుండడంవల్ల ఆయనకు కూడా మోక్షం చేతికి అందకుండా వుంది.

"ఇక నా పరిస్థితి అంటారా? మోక్షం మీద కోరికతో నేను గూడా రకరకాల యోగ సాధనలు చేశాను. ఖేచరీముద్ర అనే యోగవిధానాన్ని అభ్యసించాను. దాని ఫలితంగా సిద్ధపురుషులతో సాంగత్యం నాకు లభిస్తోంది. సిద్ధలోకాలలో సంచారం చేయ గలుగుతున్నాను. నాయొక్క ధారణాయోగ బలంచేత నాకీ

బ్రహ్మాండ గోళమంతా కరతలామలకం లాగా ప్రత్యక్షంగా కనిపిస్తోంది. అందుకే మహాత్ములైన మిమ్మల్ని చూడ గలిగాను! మీ లోకానికి రాగలిగానను!

"మహాత్మా! మీరు కరుణామయులు. మీరు దయతో నాకూ, నాభర్తకూ కూడా సదుపదేశం చేసి, మా యిద్దరికీ మోక్షాన్ని అనుగ్రహించండి. ఈ కోరికతోనే నేను మీ దగ్గరికి  వచ్చాను."

**వశిష్ఠుడు**: ఇదేం చిత్రమమ్మా? రాతి కడుపులో ఇల్లేమిటి? అక్కడ కాపురమేమిటి? పరివారం ఏమిటి? నమ్మటానికి వీల్లేకుండా వుందే!

**స్త్రీ**: మునీంద్రా! అక్కడ మా ఇల్లూ, మా పరివారమూ మాత్రమేనా? ఇక్కడ మీకు ఎంత ప్రపంచం వుందో, అక్కడ మాకూ అంత  ప్రపంచం వుంది. ఇక్కడ మీకు స్వర్గ మర్త్య పాతాళ లోకాలున్నట్లే, మాకూ అక్కడ స్వర్గ మర్త్యపాతాళ లోకాలున్నాయి. నేను చెప్పింది నమ్మబుద్ధి కాకపోతే, నాతో రండి ఒక సారి మాలోకం చూద్దురు గాని.

**వశిష్ఠుడు**: రామా! విద్యాధరవనిత వంటి ఆ వింత వనిత ఇలా సవాలు చేసేసరికి, నాకు కూడా ఉత్కంఠ పెరిగి, ఆమెతో పాటు ఆకాశ మార్గాన చాలా దూరం ప్రయాణం చేశాను. అక్కడ లోకాలోక పర్వతం కనిపించింది. అక్కడ ఆమె చెప్పిన శిల కూడా కనిపించింది. కాని నాకు ఆ శిలలో ఏ లోకమూ కనిపించ లేదు! ఆ మాటే ఆవిడను అడిగాను. ఆవిడ ఇలా చెప్పింది.

**స్త్రీ**: మునీంద్రా! చిత్రంగా వుంది. నాకు గూడా నా ప్రపంచం పూర్వం లాగా కనిపించడం లేదు. కానీ బొత్తిగా కనిపించకుండా పోలేదు. ఇప్పుడు నా ప్రపంచం అద్దంలోని నగరంలా కనిపిస్తోంది. నాకు ఈ మాత్రమైనా కనిపించడానికి కారణం, నా నిత్యానుభవమే.

మీరు  పూర్వం సమాధిలో కూర్చున్నప్పుడు, కేవలం చిదాకాశ స్వరూపంగా వుండిపోయారు. ఆ దశలో మీకు సమస్త బ్రహ్మాండాలూ కనిపించాయి. నేను కూడా ధారణా యోగంలో వున్నప్పుడు అలాగే అన్ని లోకాలనూ చూశాను. మీరు సమాధిలోంచి బయటికి వచ్చారు. నేను మీతో సంభాషణలో పడి ధారణాయోగం లోంచి బయటికి వచ్చాను. అందువల్ల మనమిద్దరం ఇతర ప్రపంచాలను చూడ లేక పోతున్నాం.

తమరు సర్వజ్ఞులైన గురువులు. నేను అల్పజ్ఞురాలైన శిష్యురాలిని. ఐనా ఈ విషయంలో మనిద్దరి పరిస్థితి ఒకే రకంగా వుంది. అందులో మరో విశేషం ఏమంటే, నాకు నా లోకం గురించి చిరకాలాభ్యాసం వున్నది గనుక, ఆ అభ్యాసబలంవల్ల నా లోకాన్ని కొంతైనా చూడగల్గుతున్నాను. అందుకనే సదభ్యాసాన్ని పెంచుకోవాలని మీ బోటి పెద్దలు మళ్ళీ మళ్ళీ చెబుతూ వుంటారు.

కాబట్టి మునీంద్రా! మనిద్దరం కూడా మళ్ళీ పరమాత్మమీద ధారణాభ్యాసం మొదలు పెడదాం. దానివల్ల చిదాకాశ శరీరం ఏర్పడి, ఈ రాతిలో అంతర్గతంగా వున్న లోకాన్ని చూడ గలుగుతాం.

**వశిష్ఠుడు**: రామా! ఆ వనిత అలా అనేసరికి నేనంగీకరించి, అక్కడే పద్మాసనం వేసుకొని కూర్చొని, సమాధికోసం ప్రయత్నించాను. బాహ్య విషయాలను వదిలేశాను. మానసిక సంకల్పాలను కూడా విడిచిపెట్టేశాను. ఆ మహిళతో నాకు జరిగిన సంభాషణను కూడా మరపులోకి తోసేశాను. క్రమంగా నాకు సమాధి సుస్థిరమైంది. అంతే! నాకు ఆ శిల కడుపులో ఒక మహాప్రపంచం కనిపించడం మొదలైంది. అది స్వప్నం కాదు. అది స్పష్టమైన దర్శనం.

## 27. పరలోకబ్రహ్మ

నాతో పాటు ఆ వనిత కూడా ఆ లోకాన్ని చూచింది. ఆమె ఆ లోకంలోకి ప్రవేశించింది. నేను ఆమెను అనుసరించాను. ఆమె అక్కడి స్వర్గాది లోకాలను దాటుకుంటూ అక్కడి బ్రహ్మ లోకానికి చేరింది. అక్కడ ఒక బ్రహ్మగారు వున్నారు. ఆయనను నాకు చూపించి, ఆమె నాతో ఇలా అన్నది.

**స్త్రీ**: మునీంద్రా! ఈయనే నా భర్త. నన్ను ఈయనే సృష్టి చేశాడు. నన్ను వివాహం చేసుకోవడానికే సృష్టి చేశాడు. ఐనా ఇంతవరకూ వివాహం చేసుకోలేదు. ఇద్దరికీ ముసలితనం వచ్చేసింది. ఇద్దరికీ మోక్షం కావాలనే కోరిక కలిగింది. కనుక మునీంద్రా! మీరు మా ఇద్దరికీ తత్త్వబోధ చేసి మమ్మల్నిద్దరినీ మోక్షానికి చేర్చండి.

**వశిష్ఠుడు**:రామా! ఆ వనిత సూటిగా ఆ బ్రహ్మగారి ఎదుటే ఈ మాట అనే సరికి, నేను కొంచెం తటపటాయిస్తూ చూశాను. ఆవిడ మాత్రం అదేమీ పట్టించుకోకుండా, ఆ బ్రహ్మగారి సమాధికి భంగం చేస్తూ ఇలా అంది.

**స్త్రీ**: నాథా!ఈయన మరో లోకంలోని బ్రహ్మర్షి. మహానుభావుడు. మనింటికి అతిథిగా వచ్చాడు. ఈయనను తగిన విధంగా గౌరవించండి.

**వశిష్ఠుడు**: ఆమె అలా అనేసరికి ఆ అన్యలోక బ్రహ్మ మెల్లిగా కళ్ళు తెరిచి ఇలా అన్నాడు.

**అన్యలోక బ్రహ్మ** : మునీంద్రా! మీకు స్వాగతం! జ్ఞానామృతం మీ సొమ్ము. మీరు చాలా దూరంనుంచి వచ్చారు. అలసిపోయి వుంటారు. ఈ ఆసనం మీద కూర్చోండి.

**వశిష్ఠుడు**: ఓ! అన్యలోక బ్రహ్మా! నీకు నమస్కారం. ఈమె నా దగ్గరికి వచ్చి జ్ఞానోపదేశం చేయమని అడుగుతోంది. నాకు అంతా విచిత్రంగా వుంది. ఏది ఉచితమో, ఏది అనుచితమో, తెలియకుండా వుంది. ఎందుకంటే, మీరా సర్వభూతేశ్వరులు. జ్ఞాన సిద్ధులు. మీకు ఒకరి ఉపదేశం అక్కర లేదు. ఈవిడ సాధన సంపత్తి లేనిది. ఈవిడకు ఉపదేశం ఎక్కదు. అందుకే ఏం చేయాలో నాకు తోచడం లేదు. అదీ గాక, ఓ దేవా! మీరు ఈమెను భార్యకావడం కోసం సృష్టి చేసి, మళ్ళీ ఎందుకు వివాహం చేసుకోలేదో నాకు అర్థం కావడం లేదు.

**అన్యలోక బ్రహ్మ** : మునీంద్రా! అసలు విషయం చెబుతా వినండి. ఈవిడ సృష్టి నా ద్వారా జరిగిన మాట నిజమే! కానీ "ఈయన నన్ను భార్యగా చేసుకోవడం కోసమే నన్ను సృష్టి చేశాడు" అనేది ఆవిడ చేసుకున్న కల్పన. అది ఆవిడయొక్క మనోవాసనల ఫలితం. ఈవిడ కేవలం నా సంకల్ప బలంచేత సృష్టింప బడినది గనుక, ఈవిడకు సరియైన అస్తిత్వం లేదని నాకు తెలుసు. ఈవిడ మిథ్యాస్వరూపురాలని నాకు తెలుసు. ఇక త్వరలో నాకు విదేహ కైవల్యం రాబోతోంది. దానితో పాటే, నా సృష్టి మొత్తానికి ఈవిడతో సహా ప్రళయం రాబోతోంది.

ఇంతకూ ఈవిడ్ని ఎలా సృష్టి చేశానంటారా? వినండి. నేను మొదట్లో చిదాకాశ రూపుడినై చిదాకాశంలోనే వుండేవాడిని. ఐతే కాలవశాన, నా స్వస్వరూపాన్ని రేఖా మాత్రంగా విస్మరించాను. దానివల్ల నా స్వరూపం కొంచెం మలినమైంది. అందువల్ల నాలో స్వల్పంగా "నేను" (అహం) అనే వాసన ఏర్పడింది. ఆ వాసనలకు గల అధిష్ఠాన దేవతే ఇలా ఈ స్త్రీగా రూపాంతరం చెందింది.

నా దృష్టిలో మాత్రం నాకు ఈవిడ నాకంటె భిన్నంగా కనిపించడం లేదు. ఈవిడకూ, మీకూ, ఈవిడ నాకంటే భిన్నంగా వున్నదని అనిపిస్తోంది. ఇది దృష్టిభేదం మాత్రమే! ఈవిడ నా భార్య అనే మాటకూడా, ఈవిడ దృష్టిలో వున్న మాటే! నా దృష్టిలో భేదానికి తావు లేదు.

మునీంద్రా! సారాంశం మళ్ళీ చెబుతా వినండి. నేను శుద్ధ చైతన్యంయొక్క వివర్త స్వరూపుడినై, చిత్తాకాశ రూపంతో నేను సంకల్పించిన ద్విపరార్థ రూపమైన ఆయుఃప్రమాణాన్ని ఇంచుమించు గడిపేశాను. (బ్రహ్మదేవుడియొక్క ఆయుష్య ప్రమాణాన్ని ద్విపరార్థం అంటారు). ఇక ఇప్పుడు ఈ చిత్తాకాశ స్వరూపాన్ని

విడిచిపెట్టి, నిరతిశయానంద రూపమైన, బ్రహ్మాకాశ స్వరూపమైన, కైవల్యస్థితిని అందుకోబోతున్నాను. అందుకే మహాప్రళయం దగ్గరికి వచ్చేసింది. ఈవిడను వదిలి పెట్టాలనే సంకల్పం కూడా నాకు బయలు దేరింది. అందుకే ఈవిడ గూడా నా మార్గాన్ని పట్టుకొని వైరాగ్యంలోకి ప్రవేశించింది.

ఆ వైరాగ్యంవల్లే గురువుల సాగత్యం, శ్రవణ మననాదులు, ఆత్మజ్ఞానానికి అనుకూలమని గ్రహించింది. ధారణాయోగాన్ని సాధించింది. ఆ యోగబలంతోనే మీరు పరమ రహస్యంగా ఏర్పరచుకొన్న సమాధిస్థానాన్ని తెలుసుకో గలిగింది. ఉపదేశించమంటూ మిమ్మల్ని కోరింది. ఇదంతా ఆమెకు వున్న అవిద్యా సంపర్కంవల్ల జరుగుతున్న వ్యవహారమే.

మునీంద్రా! అధ్యారోప దృష్టితో చూస్తే ఇలా అనేక ప్రపంచాలు కనిపిస్తూనే వుంటాయి. అపవాద దృష్టితో చూస్తే, ఏదీ కనిపించదు. అప్పుడూ, ఇప్పుడూ, కూడా వున్నది ఒకటే! అదే చిదాకాశం! (కచత్యేతచ్చిదంబరం - ని.ఉ.సర్గ 70, శ్లో.25)

వశిష్ఠ మహర్షీ! ఇక మీరు మీ లోకానికి వెళ్ళండి. నేను నాచేత కల్పింపబడిన ఈ జగత్తును ఉపసంహారం చేసి , పరబ్రహ్మ స్వరూపాన్ని పొందుతున్నాను.

***వశిష్ఠుడు***: రామా! ఆ అన్యలోక బ్రహ్మ నాతో ఇలా అంటూనే మౌనం వహించి, పద్మాసనం బిగించి, సమాధిలోకి ప్రవేశించాడు. ఆయనగారి అహంకార స్వరూపిణియైన ఆ స్త్రీ గూడా అలాగే చేసింది. నేను చూస్తూ వుండగనే, ఆ బ్రహ్మదేవుడు సంకల్ప రహితుడై కృశించిపోసాగాడు. ఆయన కృశించినకొద్దీ ఆయన విరాట్ శరీరానికి అవయవాలుగా వున్న అక్కడి పృథివ్యాది పంచభూతాలు క్రమంగా ఆయనలోకి లయించడం ప్రారంభించాయి. దాంతో మహా ప్రళయం ప్రారంభమైంది. (స.71)

## 28. వైజ్ఞానిక ప్రళయ వర్ణన

ఆ ప్రళయ క్రమం చెబుతాను, విను.

ఆ లోకానికి విరాట్ స్వరూపుడైన ఆ బ్రహ్మ తన ప్రాణాలను తన హృదయంలోకి ఉప సంహరించుకోవడం మొదలుపెట్టాడు. వెంటనే, అక్కడి ఆకాశంలోని వాయువు తనలో వుండే గ్రహ నక్షత్రాదులను ధరించే లక్షణాన్ని వదిలేసింది. దాంతో చెట్టుమీది నుంచి పూలు రాలి పడినట్లుగా ఆకాశం నుంచి నక్షత్రాలూ, విమానాలూ రాలి కింద పడ్డాయి. మేరు శిఖరాలు కూలాయి.

***శ్రీరాముడు***: గురుదేవా! విరాట్‌స్వరూపుడైన బ్రహ్మకు ఈ ప్రపంచం అంతా స్థూల శరీరమని చెబుతారు గదా! అందులో భూలోకం ఏ అవయవం? స్వర్గం ఏ అవయవం? పాతాళం ఏ అవయవం? వీటితో ఏర్పడిన పెద్ద శరీరం ఒకటి వుండగా, బ్రహ్మలోకంలో వుండి ప్రాణాయామాదులు చేసేందుకు వీలుగా మరో శరీరం ఎట్లా ఏర్పడింది? ఏ జీవికైనా శరీరంలో శరీరం ఉంటుందా? మీరు చేసే వర్ణన అతకకుండా ఉన్నదే?

***వశిష్ఠుడు***: రామా!ఈ ప్రపంచమంతా అధ్యాసవలన అధ్యారోప ప్రక్రియలో విశుద్ధ చైతన్యంమీద ఆరోపింపబడి రూపొందిందని ఇదివరకే నిరూపించాం. స్థూల దేహం ఒక కల్పన. మానసిక దేహం మరో కల్పన. వీటిలో వుండే అహంకారం మరో కల్పన. మొత్తం అంతా కల్పనే అని నిశ్చయమైన తరువాత 'ఈ కల్పనలో ఏది ఏ అవయవంగా మారింది' అనే ప్రశ్నకు విలువేముంది? ఒక శరీరంలోకి మరో శరీరం ఎలా వచ్చిందనే ప్రశ్నకు విలువేముంది? ఒక ఉదాహరణ చెబుతా, విను.

నీకు ఒక స్వప్నం వచ్చింది. ఆ స్వప్న ప్రపంచానికి విరాట్ పురుషుడవు నువ్వే! ఆ స్వప్నం మెలకువలోకి రాబోతోంది. మెలకువలోకి రావాలనే సంకల్పం నీది. నీలో ఈ సంకల్పం రాగానే, స్వప్న ప్రపంచంలో భూతాది లోకాలన్నీ ఉపసంహారం అవుతాయి. ఇదే క్రమంలో ఆ అన్యలోక బ్రహ్మగారి ప్రళయ పద్ధతిని నువ్వు సమన్వయించుకుంటే, నీ ప్రశ్నలన్నింటికీ సమాధానం వచ్చేస్తుంది. (స. 72)

**శ్రీరాముడు**: మీ సమన్వయం బాగుంది గురుదేవా! అధ్యారోప క్రమం గురించి పూర్వం మీరు రెండు మూడు సార్లు ప్రస్తావించారు. నిర్వాణ ప్రకరణం పూర్వార్ధంలో 33వ సర్గ ప్రాంతంలో కూడా వివరించారు. ఐనా, విషయం గట్టి పడడం కోసం దానిని మరోసారి చెప్పండి.

**వశిష్ఠుడు**: రామా! ప్రళయానంతర పరిస్థితిని ముందర ఆలోచించు. అప్పుడు అద్వితీయమైన శుద్ధ పరబ్రహ్మతత్త్వము మాత్రమే మిగిలి వుంటుంది. ఈ స్థితిని నిద్రకు ఉపక్రమించబోయే క్షణంలో వున్న నీ పరిస్థితికి పోల్చవచ్చు. ఆ క్షణంలో నీకు మెలకువ పోయింది. కనుక జాగ్రత్ సంస్కారాలు అంతరించాయి. స్వప్న సంస్కారాలు ఇంకా పుట్టనే లేదు. అందుచేత అప్పుడు నువ్వు నిర్వాసనంగా, నిర్వికల్పంగా, వున్నావు. అప్పుడు నీవు ద్రష్టవూ కాదు, దృశ్యానివీ కాదు, కేవల దృక్కువు! ఇలా వున్న నీకు, ఉన్నట్టుండి, స్వప్నం ప్రారంభమై ద్రష్టృత్వం పట్టింది. అలాగే ప్రళయానంతరం కేవలం దృక్కుగా వున్న పరబ్రహ్మకు ద్రష్టృ దృశ్యత్వ భావాలు పట్టాయి. దానివల్ల ద్విత్వం ఏర్పడింది. దానివల్ల లోపలా బయిటా అనే విభాగం ఏర్పడింది. దానివల్ల దేశ, కాల విభాగం ఏర్పడింది. ఆ తరువాత కర్త, కార్యము, కరణము; భోక్త, భోగ్యము, భోగము వంటి త్రిపుటులు ఏర్పడ్డాయి. ఇక అక్కడినుంచి దేహేంద్రియాత్మకమైన ప్రపంచం కూడా ఏర్పడింది. దానికి అనుగుణంగా ఊర్ధ్వాధోలోకాలేర్పడ్డాయి.

**శ్రీరాముడు**: ఇక్కడ మనస్సు చేసే కల్పననే కదా మీరు చెబుతున్నారు. అలాంటప్పుడు, ఇది సూక్ష్మం గాదనీ, ఇది ఆధిభౌతికమనీ, (పంచభూతమయమనీ), గట్టిదనీ, ఇలాంటి అనుభూతులెలా వచ్చాయి?

**వశిష్ఠుడు**: సూర్య కిరణాల్లోకి నీటి బిందువులెలా వచ్చాయో అలాగే వచ్చాయి. అంటే ఎడారిలోకి ఎండమావి నది వచ్చినట్లుగా వచ్చాయి. అందువల్లే ఇంత అధ్యారోపం జరిగినా, అధిష్ఠానంగా వున్న విరాట్పురుషుడు కేవల చిన్మాత్రుడుగానే వుండి పోతున్నాడు.

ఈ బ్రహ్మాండమంతా ఆ చిన్మాత్రుడి శరీరమే! మొదట ఆ శరీరం ఒక అండం లాగా ఏర్పడింది. అదే బ్రహ్మాండం! ఆ అండం పగిలి రెండు ముక్కలై ఒక ముక్క పైకి పోయింది. మరో ముక్క క్రిందికి పోయింది. వాటి మధ్యభాగమే ఆకాశంగా ఏర్పడింది. దానిలోనే ఇతర లోకాలు ఏర్పడ్డాయి. ఇవన్నీ ఆ విరాట్పురుషుడిలోని అంతర్భాగాలే గనుక, ఈ లోకంలో ఎవరు ఏ పని చేసినా అది నిజానికి విరాట్పురుషుడు చేసిన పనే అని మేము అంటున్నాము.

**శ్రీరాముడు**: అలా ఐతే ఈ లోకాల్లో జీవులు జన్మిస్తూ, మరణిస్తూ వున్నారు కదా! అందువల్ల ఆ విరాట్పురుషుడు కూడా జన్మిస్తూ, మరణిస్తూ వున్నాడని చెప్పాలి గదా?

**వశిష్ఠుడు**: చెట్టులో ఆకు రాలిపోతే, చెట్టు రాలిపోయినట్టు గాదు. ఆకులూ కొమ్మలూ అన్నీ ఒకే సారి రాలిపోతే, చెట్టు రాలినట్టు అవుతుంది. అలాగే ఈ జీవులందరూ ఒకే సారి మరణిస్తే, ఆ విరాట్పురుషుడూ మరణిస్తాడు. అది మహా ప్రళయకాలంలో జరుగుతుంది. దానికి ద్విపరార్ధకాలము అనబడే సుదీర్ఘకాలం పడుతుందని పురాణాలు లెక్కలు చెప్పాయి. ఇంతకూ నేను చెప్పవచ్చింది ఏమిటంటే, విరాట్టూ, జగత్తూ, బ్రహ్మ – అనే మూడూ పర్యాయపదాలే! వాటికి భేదం లేదు – అని.

**శ్రీరాముడు**: విరాట్టువల్లే లోకాలు పుడుతున్నాయి, లోకాలన్నీ పోతే విరాట్టూ పోతున్నాడు. కనుక, విరాట్టూ, ప్రపంచమూ, ఒకటే అని ఒప్పుకోవచ్చు. వాళ్లిద్దరితో పాటు పరబ్రహ్మను కూడా కలిపేశారేమిటి?

**వశిష్ఠుడు**: రామా! నువ్వు మానస పూజ మొదలు పెట్టావు. దానికోసం హృదయంలో ఒక సింహాసనాన్ని కల్పించుకున్నావు. ఆ దేవుడి ఎదురుగుండా స్వయంగా నువ్వే కూర్చున్నావు. ఇక పూజ మొదలు పెట్టావు. అప్పుడు ఆలోచించు. ఆ లోపలి సింహాసంనం ఎవరు? ఆ లోపలి దేవత ఎవరు? ఆ లోపల కూర్చున్న నువ్వెవరు?

ఇవన్నీ ఒకటే కాదా? బయట నువ్వు అనేవాడివి వుండబట్టి, లోపల ఇంత వ్యవహారం జరిగింది. అలాగే, పరబ్రహ్మ వుండబట్టే విరాట్ పురుషుడి వ్యవహారమంతా జరిగింది. అందుకే, ప్రపంచ – విరాట్ – పరబ్రహ్మలు ఒకటే అని నేనన్నాను.

ఇదంతా అధ్యారోప విధానం ద్వారా వచ్చిన నిర్ణయం. అపవాద విధానం ద్వారా కూడా ఇదే నిర్ణయానికి రావచ్చు. దీనిని చూపించేందుకోసం ఆ శిలా జగత్తులో జరిగిన ప్రళయవిధానాన్ని సంగ్రహంగా వివరిస్తాను, విను.

రామా! శిలా జగద్బ్రహ్మ సమాధిలోకి ప్రవేశించాడని చెప్పాను గదా! ఇంతలో పది దిక్కులలోనూ పది మంది సూర్యులు ఉదయించడం నేను చూశాను. ఇదేమిటా అని నేను ఆశ్చర్యపోయే లోపలే భూమిలోంచీ, ఆకాశంలోంచీ, మరో ఇద్దరు సూర్యులు వచ్చారు. పన్నెండు మంది సూర్యులూ కలిసి నిప్పులు కురిపించేశారు. ఆ మంటలకు అక్కడి లోకాలన్నీ మాడి మసై పోయాయి. నేను ఆకాశంలో గబగబా వెనక్కు వెళ్ళి దూరం నుంచే చూడడం ప్రారంభించాను.

ఇంతలో ఆ లోకంలో ప్రళయ వాయువులు బయలు దేరాయి. ఆ సుడిగాలుల దెబ్బకు సముద్రాలలోని నీరంతా ఎగిరి ఇంకి పోయింది. ఇందాకటి మంటలు మరింత పెరిగాయి. ఇంతలో ఎక్కడినుంచి వచ్చాయో పుష్కరావర్తకములు అనే ప్రళయ మేఘాలు వచ్చాయి. మహానదులంతటి ధారలతో బ్రహ్మాండమైన వర్షాలను కురిపించాయి. ఈ వర్షాల దెబ్బకు భూమి అనే మట్టిగడ్డ కరిగి పోయింది. ఆ ద్వాదశాదిత్యులు ఈ నీళ్ళలో మునిగిపోయారు. అప్పుడు ఆ ప్రపంచమంతా కేవలం జలమయంగా నాకు కనిపించింది. (స.73–78)

కింది పాతాళ లోకం దగ్గరినుంచీ, పైన తపోలోకం దాకా మొత్తం అంతా నీళ్ళతో నిండి పోయి కనిపించింది. ఇక సత్యలోకం ఒక్కటే మిగిలి వుంది.

**గమనిక** – అతల వితల సుతల తలాతల మహాతల రసాతల పాతాళాలు అనేవి భూమి దగ్గరినుంచీ వరుసగా కిందికి వున్న ఏడు లోకాలు. భూమి మధ్యమలోకం. భువః సువః మహః జనః తపః సత్యం అనే ఆరు ఊర్ధ్వలోకాలు. ఇవే పధ్నాలుగు లోకాలు. వీటిలో తపోలోకం దాకా నీళ్లలో మునిగి పోయిందని ఇక్కడ చెప్పడాన్ని బట్టి, ఈ నీరు మామూలు భౌతికమైన నీరు గాదని, అపంచీకృత పంచభూతాలలోని జలమని, మనం గుర్తించాలి.

**వశిష్ఠుడు**: ఆ మిగిలిన సత్యలోకాన్ని పరిశీలనగా చూశాను. ఎక్కడెక్కడి దేవతలూ, ఋషులూ, వచ్చి అక్కడ బ్రహ్మగారి చుట్టూతా పద్మాసనాలు వేసుకొని సమాధులలో వున్నారు. ఇందాక ప్రపంచాన్నే కాల్చివేసిన ద్వాదశాదిత్యులూ, ముంచి వేసిన జలదేవతలూ కూడా, అక్కడికే చేరి సమాధూలలో కూర్చున్నారు. నేను దూరంనుంచి చూస్తూ వుండగానే, వారి మధ్యలో వున్న చతుర్ముఖ బ్రహ్మకు చరమ సాక్షాత్కార వృత్తి ఏర్పడింది.

అధ్యారోప ప్రక్రియలో మనస్సు చేసుకుంటూ వచ్చిన ఆరోపణలన్నిటినీ ఒకటొకటిగా నిషేధించుకుంటూ పోతే, చిట్టచివరికి పరిశుద్ధాత్మ మిగులుతుంది. అలాంటి పరిశుద్ధాత్మ మీద చిత్తవృత్తిని లగ్నం చేసి, దానిని పునః పునరావృత్తి చేస్తే, ఆ ప్రక్రియ పేరు నిదిధ్యాసనం.

ఈ నిదిధ్యాసనం పరిపాక దశకు చేరినప్పుడు, చిత్త వృత్తియొక్క ఆవృత్తితో పని లేకుండా ఒక అఖండ బ్రహ్మాకారమైన అంతఃకరణవృత్తి ఏర్పడుతుంది. దాని పేరే చరమ సాక్షాత్కార వృత్తి. అది లభించిందంటే, సమస్త కల్పనలకూ మూలమైన మూలాజ్ఞానం పూర్తిగా నివర్తించి పోతుంది. తక్షణమే అజ్ఞాన కల్పితమైన

సమస్త ప్రపంచమూ తొలగిపోయి విదేహ కైవల్యం కలుగుతుంది.

ఆ శిలాప్రపంచ బ్రహ్మకు అలాంటి విదేహ కైవల్యం లభించడం నేను కళ్ళారా చూశాను. అంతే! తక్షణమే ఆ సత్యలోకం నాకింక కనిపించలేదు. అక్కడి పర్వతాలూ, నదులూ, మహర్షులూ, దేవతలూ– అంతా బ్రహ్మ స్వరూపంగానే నాకు కనిపించారు. నిద్ర అనే దోషం పోయి, మెలకువ వచ్చే సరికి, హఠాత్తుగా స్వప్న ప్రపంచం అంతా మాయమైపోయి, కలగనేవాడు ఒక్కడే మిగిలినట్లు, ఆ హిరణ్యగర్భుడికి అజ్ఞాన మనే దోషం తొలగి, జ్ఞానం అనే మెలకువ వచ్చేసరికి, ఆ ప్రపంచమంతా అంతర్ధానమై శుద్ధ చైతన్యమే మిగిలింది.

## 29. నాస్తికవాదఖండన

**గమనిక –** ఇక్కడి నుంచీ ఈ సర్గలో వాల్మీకి మహర్షి చార్వాకుల నాస్తిక వాదాన్ని ఖండించ దలచుకున్నాడు. దీనికి ఈ సర్గలో 18వ శ్లోకం నుంచీ చిట్టచివరిదాకా వినియోగించాడు. ఈ శ్లోకాలు కొంచెం ప్రౌఢంగా వున్నాయి. అనేక ప్రశ్నలను పూర్వపక్షాలుగా లేవదీసి సమాధానాలు చెప్పాడు. శ్రీరాముడిచేత నాస్తిక ప్రశ్నలు వేయించడం ఇష్టం లేకో, ఏమో, ఈ ప్రశ్నలన్నింటినీ చర్చలో భాగంగానే నడిపేశాడు. ఇక్కడ వ్యాఖ్యాత విజృంభించి శ్లోకాలను బాగా వివరించాడు. మనం ఆ వివరణలు గూడా కలుపుకుంటూ ప్రశ్న సమాధానాలుగానే ముందుకు సాగుదాం.

***ప్రశ్న***: అయ్యా! మీరిచ్చిన స్వప్న దృష్టాంతం బాగా లేదు. ఎందుకంటే, కలగంటున్న శరీరానికి తల్లిదండ్రులున్నారు. దానికో సత్యమైన కారణ పరంపర వుంది. స్వప్న దేహానికి తల్లిదండ్రులూ లేరు, కారణ పరంపరా లేదు. అందువల్ల స్వప్న దేహానికి మెలకువవల్ల నాశనం రావచ్చు. కాని జాగ్రద్దేహం అలాంటిది గాదు. దానికి జ్ఞానంవల్ల నాశం వచ్చిందనటం బాగా లేదు.

***సమా***: యజ్ఞాదులవల్ల స్వర్గ దేహం ఒకటి పుడుతోంది. దానికి కూడా తల్లిదండ్రులు లేరు. అందుచేత అది గూడా స్వప్నదేహం లాగానే అస్తిత్వం లేనిదంటావా? (అత్యంతాసత్తు అంటావా?)

***ప్రశ్న***: అందాము!

***సమా***: అలా అంటే, సూక్ష్మ శరీరాల సమష్టి స్వరూపుడైన హిరణ్యగర్భుడు గూడా స్వప్న శరీరం లాగా అస్తిత్వం లేనివాడే కావాలి.

***ప్రశ్న***: కానీయండి!

***సమా***: అప్పుడు హిరణ్యగర్భుడు చేసే ఈ సృష్టి వ్యవహారమంతా గూడా బొత్తిగా అస్తిత్వం లేనిదైపోతుంది. ఇలాంటి ఈ ప్రపంచం కనిపిస్తోంది. ఈ ప్రపంచం ఒక నాటికి ప్రళయం వచ్చి కొట్టుకు పోతుంది. ఇక్కడ వున్న శరీరాలన్నీ పోతాయి. పూర్వ సృష్టిలో అట్లాగే జరిగింది. ఆ సృష్టిలోనే దేహాలన్నీ పోయాక ఇప్పుడు ఈ సృష్టి వచ్చిందంటే, ఇక్కడ ఈ దేహాలకు మొదట్లో తల్లిదండ్రులు లేరు. తల్లిదండ్రులు లేరు గనుక, ఈ కనిపించే దేహాలన్నీ గూడా స్వప్న దేహాలవంటివే అని చెప్పవలసి వస్తోంది. దీనికీ ఒప్పుకుంటావా?

***ప్రశ్న***: అసలు మీ యజ్ఞాలు, మీరు చెప్పే ప్రళయాలూ, ఇవన్నీ ఎందుకు ఒప్పుకోవాలి? ఇప్పుడు వున్న ఈ తల్లిదండ్రుల పరంపర అనాదిగా వుందని మేమంటాం.

***సమా***: అనండి. కానీ, ఈ సృష్టిలో వుండే పదార్థాలకు పంచభూతాలు కారణమనే మాట ఒప్పుకోక తప్పదు కదా! ఈ పంచభూతాలు కూడా సావయవాలే! అవయవ సంయోగంవల్లే వాటికి రూపం ఏర్పడుతోంది! సంయోగంవల్ల ఏర్పడే రూపం ఎప్పటికో అప్పటికి నశించక తప్పదు. ఇది లోకానుభవ సిద్ధం. పంచభూతాలే నశించిపోతే, ఇక ప్రపంచమేది? కనుక ప్రణయమే లేదనడం సాధ్యం కాదు.

**ప్రశ్న** : పంచభూతాలలో ఆకాశాన్ని ప్రక్కన పెట్టేయండి. మిగిలిన నాలుగు భూతాలూ దేనికది జడంగా వున్నా, ఆ నాలుగూ కలిసి దేహమయ్యే సరికి, వాటిల్లోంచి జ్ఞానం, ఇచ్ఛ, మొదలైన గుణాలు పుడుతున్నాయి. పిండినీళ్ళు, చెఱకుమడ్డి, బెల్లపు ముక్కలు, మొదలైనవాటిలో ఎక్కడా మత్తు అనే గుణం లేదు. కానీ ఇవన్నీ కలిపి కాచితే, మత్తు అనే శక్తి ఏర్పడుతోంది. అలాగే దేహంలోంచి జ్ఞానం అనే శక్తి పుడుతోంది. దీనినే సంవిత్తు అంటారు. సంవిత్తు గల దేహమే ఆత్మ! ఈ మాట ఒప్పుకుంటే, మీరు చెప్పే వేదశాస్త్ర పురాణేతిహాసాలకు పీక పట్టుకుంటుందేమో గానీ, జగత్తత్త్వాన్ని మాత్రం సులభంగా వివరించవచ్చు. మీ ప్రళయాది కల్పనలతో పని లేదు.

**సమా**: నా కల్పన వద్దు గానీ, మీ కల్పన ప్రకారం దేహంలో వున్న అవయవాలన్నీ అత్మలేనా? లేక అన్నీ కలిపిన 'అవయవి' ఐన ఆత్మ ఒకటి వుందా? ఏ ఇంద్రియానికి వుండే జ్ఞానం ఆ ఇంద్రియానికి వేరు వేరుగా వుంటోంది గనుక, అవన్నీ వేరే వేరే ఆత్మలందామా? అలా అనేటట్లైతే , ఈ ఆత్మలకు ఐకమత్యం వుండవలసిన పనిలేదు. ఒకవేళ కాకతాళీయంగా కలిగినా, అది శాశ్వతంగా నిలుస్తుందనే నియమం లేదు. అది లేక పోతే, ఈ దేహం కూలిపోక తప్పదు.

**ప్రశ్న**: పోనీ రెండో పక్షాన్నే ఆశ్రయిద్దాం. అవయవాలన్నీ కలిపి ఒకే ఆత్మ అందాం?

**సమా**: అలా అంటే, వున్న అవయవాలలో ఏ ఒక్క అవయవాన్ని నరికేసినా, ఆత్మ మొత్తం చచ్చిపోవాలి. ఎందుకంటే, దానిలో భాగాలంటూ లేవు గదా! కానీ లోకంలో అలా కనిపించటం లేదు. అదీ గాక, దేహం మొత్తం నశించినప్పుడు దేహంవల్ల వచ్చిన గుణాలన్నీ నశించిపోవాలి. కానీ ఒక్కొక్క సారి, మనిషి తగలబడిపోయిన తరువాత, వాడి పిశాచం లేచి వచ్చి, వాడి బంధువులను పట్టుకొని వెనుకటి విషయాలన్నీ ప్రస్తావిస్తూ వుండడం కనిపిస్తోంది. దీనిని నీ సిద్ధాంతం ఎలా సమర్థిసుంది?

**ప్రశ్న**: అయ్యా, ఈ దయ్యాలు, గియ్యాలు, మేము నమ్మం. మాకు ప్రత్యక్షం ఒక్కటే ప్రమాణం!

**సమా**: ప్రత్యక్షం ఒక్కటే ప్రమాణం అనటానికి అనేక రకాల యుక్తులు చూపిస్తున్నావు కదా! యుక్తులు చూపిస్తున్నావు అంటే, తర్క ప్రమాణాన్ని ఒప్పుకున్నట్టే కదా! ఇంత తర్కమూ చేసి, నా మాట నమ్మనంటున్నావు గదా! వాక్యాల ద్వారా బోధిస్తున్నావు గదా! అంటే శబ్ద ప్రమాణాన్ని కూడా అంగీకరించినట్లైంది గదా! ఇలా చూసుకుంటూ పోతే, నాకేవీ లేవు లేవు అంటూనే, ఇతర ప్రమాణాలను వాడేసుకుంటున్నావు గదా! ఇక నీ మాట నమ్మేదెవరు?

అది అలా వుంచి, దయ్యాలను నమ్మమనే మాటను పరిశీలిద్దాం. కల్లులోని మత్తుశక్తి ప్రత్యక్షంగా నీకు కనిపిస్తోందా? లేదే! అది తాగిన వాడికి కనిపిస్తోందా? అదీ లేదే! తాగినవాడు చేసే చేష్టలను బట్టి, వాడికి మత్తెక్కిందనీ, ఆ మత్తు శక్తి కల్లులో వుందనీ, నువ్వు గ్రహిస్తున్నావ్. ఇది అనుమాన ప్రమాణమే గాని, ప్రత్యక్ష ప్రమాణం కాదు గదా? ఇక్కడ కల్లు తాగినవాడి ప్రవర్తన నీకు యథార్థ జ్ఞానం కలిగిస్తోందని నువ్వు నమ్ముతుంటే, ఇదే తర్కాన్ని దయ్యం పట్టినవాడి దగ్గర అన్వయించు. వాడి ప్రవర్తనను బట్టి వాడికి పిశాచం పట్టిందనీ, ఆ పిశాచం వాడిలోది కాదనీ, తగలబడి పోయిన దేహంలోంచి వచ్చిందనీ, నువ్వు అంగీకరించక తప్పదు.

ఇలా పిశాచంయొక్క అస్తిత్వాన్ని నువ్వు తిరస్కరించలేనప్పుడు, పరలోకాలయొక్క అస్తిత్వాన్ని, సూక్ష్మ శరీరాలయొక్క అస్తిత్వాన్ని ఎలా తిరస్కరించగలవు?

**ప్రశ్న**: అయ్యా! కేవలం అనుభవాన్ని బట్టి వస్తువుల సత్యత్వాన్ని నిర్ణయించేటట్లైతే, "ముత్యపు చిప్ప–వెండి ముద్ద" ఉదాహరణలో, వెండి ముద్ద గూడా సత్యమే అనవలసి వస్తుంది.

**సమా**: ఇక్కడో చిన్న కిటుకుంది. జ్ఞానంలో వుండే స్థాయిని బట్టి, సత్యంయొక్క స్థాయి మారిపోతూ వుంటుంది.

ముత్యపుచిప్ప స్థానంలో వెండి ముద్దను చూస్తున్న సమయంలో ఆ వ్యక్తియొక్క జ్ఞానం భ్రాంతి స్థాయిలో వుంది. ఆ భ్రాంతి స్థాయిలో ఆ వెండి సత్యం. ఆ తరువాత కొంతసేపటికి చూసే దృష్టికోణం మారడంవల్ల భ్రాంతి ఎగిరి పోయింది. అప్పుడు ఇందాకటి వెండిలోవున్న సత్యత్వం కూడా ఎగిరిపోయింది. ఇందాకటి భ్రాంతి స్థాయితో పోలిస్తే, ఇప్పటి వ్యావహారికస్థాయి దృఢతరమైనది గనుక, ఇప్పటి ఈ జ్ఞానాన్ని బట్టి, తనకు వెండిముద్ద కనిపించిన సమయంలో గూడా ఆ వెండికి సత్యత్వం లేదని ఇప్పుడు నిర్ణయిస్తున్నాడు. సూక్ష్మ శరీరాదులయొక్క అస్తిత్వం భ్రాంతిమయ దశలో నిర్ణయించబడడం లేదు. అందువల్ల ఆ నిర్ణయాన్ని ముత్యపు చిప్ప వెండితో పోల్చే వీలు లేదు.

కనుక తేలిందేమిటంటే, ఈ ప్రపంచానికి స్వప్న ప్రపంచంతో పోలిక పెట్టడంలో తప్పు లేదు. జాగ్రత్కాలంలోని సంస్కారాల మోహంవల్ల స్వప్నదేహం ఏర్పడుతోంది. ఆ వాసనలు క్షయించిపోతే, ఆ దేహం పోతోంది. అలాగే, పూర్వ జన్మల వాసనాబలంవల్ల ఈ జాగ్రద్దేహం ఏర్పడుతోంది. జాగ్రద్దేహం అంటే కేవలం బైటికి కనిపించే ఈ రక్తమాంసమయమైన శరీరం కాదు. దీనికి కూడా ఆలంబనమై, అంతర్గతమైన, సూక్ష్మదేహమే అసలైన దేహం! దానినే ఆతివాహిక దేహమనీ, మనోమయ దేహమనీ, అంటారు. అది వుండబట్టే, మన దేహం చుట్టూ, మనకు భోగ్యమైన ఈ ప్రపంచం అంతా ఏర్పడుతోంది. ఈ సూక్ష్మదేహానికి మూలమైన వాసనలన్నీ క్షయించి పోతే, ఈ దేహంతో పాటు, ఈ ప్రపంచం కూడా అంతరించి పోతుంది. అప్పుడు శుద్ధ చైతన్యాత్మకమైన పరబ్రహ్మ మిగులుతుంది.

**ప్రశ్న**: అయ్యా! మీరు మీ సిద్ధాంతం మొత్తాన్నీ వాసనల చుట్టూ తిప్పుతున్నారు. ఈ వాసనలు ఎక్కడినుంచి వచ్చాయని నేనడుగుతున్నాను.

1. ఇవి పరబ్రహ్మలోంచే వచ్చాయంటారా? మీ శ్రుతేమో – "తదేతద్బ్రహ్మ – అపూర్వమనపరం" (ఆ పరబ్రహ్మ దేనికీ కారణమూ గాదు, దేనికీ కార్యమూ కాదు) అంటోంది. అందుచేత మీకీ శ్రుతి అడ్డం పడుతుంది.

2. దీనిని తప్పించుకోవడానికి పూర్వ కల్పంలోని ప్రపంచంనుంచి ఈ వాసనలు వస్తున్నాయని అంటారా? ఆ పూర్వ ప్రపంచం అప్పటి ప్రళయంలోనే నశించిపోయింది గనుక, దానితో పాటే ఆ వాసనలు కూడా పోయాయి గనుక, ఈ కల్పన చెల్లదు.

3. దీనిని తప్పించుకోడానికి పూర్వ ప్రళయంలో కొండలూ, నదులూ మొదలైనవి నశించి పోయినా, సూక్ష్మరూపంగా కొంత ప్రపంచభాగం మిగిలే వుంటుందని అంటారా? అలా అంటే మీకు చాలా చిక్కులొస్తాయి.

4. ఆ మిగిలిన సూక్ష్మ ప్రపంచానికి ఒక అస్తిత్వం (సత్తా) వుండాలి కదా. ఆ సత్తా దానికి ఎక్కడినుంచి వచ్చింది? దానికి అది స్వంతంగానే వుందా? లేకపోతే పరబ్రహ్మయొక్క సత్తను బట్టి, దీనికి సత్తా వచ్చిందా?

5. దానికి స్వంతంగానే సత్తా వుందంటారా? అప్పుడు పరబ్రహ్మ ఒకటి, పూర్వ ప్రపంచం ఒకటి రెండు సత్ పదార్థాలు తేలతాయి. అప్పుడు మీ శ్రుతే మీ పీక పట్టుకుంటుంది. ఎందుకంటే, మీ శ్రుతి "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్" (సృష్టికి పూర్వం ఈ ప్రపంచమంతా కేవలం పరబ్రహ్మ స్వరూపంగా వుంది.) అని చెబుతోంది. అంటే, ఈ సృష్టికి పూర్వం ఒకే ఒక సత్పదార్థం వుందని మీ శ్రుతి చెబుతోంది. మీ శ్రుతికి విరుద్ధంగా రెండు సత్పదార్థాలను మీరెలా ప్రతిపాదించ గలరు?

6. దీనిని తప్పించుకోడానికి పరబ్రహ్మ సత్తలోంచే పూర్వ ప్రపంచానికి సత్త వచ్చిందంటారా? అది మరీ పిచ్చిమాటై పోతుంది. స్వంతంగా సత్త లేని దానికి, పక్కవారి సత్త సంక్రమించేటట్లైతే, ప్రతి లేని పదార్థానికీ మరోదాని రూపంలో సత్త వున్నదని చెప్పవలసి వస్తుంది.

7. దానికీ ఒప్పుకుంటామంటారా? అలా అంటే, సృష్టికీ, ప్రళయానికీ, తేడా ఏమిటి? ప్రళయంలో సృష్టి

కనిపించదు. కనిపించకపోయినా సరే, అది ఉన్నదని మీరంటున్నారు. అలా అంటే, వుండటం అన్నా, లేకపోవడం అన్నా, ఒక్కటే అని చెప్పినట్టయింది. ఈ మాట ఎవరు ఒప్పుకుంటారు?

ఇలా ఎన్ని రకాలుగా చూసినా మీ వాసనలకు అస్తిత్వమే లేదు. అస్తిత్వమే లేని వాసనలకు క్షయమని గోల పెడతారేమిటి?

***సమా***: మేము చెప్పేమాట సరిగా వినిపించుకోక పోయినా, మేము చెప్పవలసిన చివరి మాటలు నువ్వే చెప్పేస్తున్నావు. వాసనలకు నిజమైన సత్తగానీ, క్షయం గానీ వుందని మేము చెప్పటం లేదు. బ్రహ్మ అద్వితీయంగా వుందని మేము బోధించ దలచుకున్నాం. కనిపించే ఈ జగత్తుకు సత్తయే లేదని కూడా మేము బోధించదలచుకున్నాం. దానికి ఉపాయంగా, మధ్యలో వాసనా అనే ఒక మెట్టును కల్పన చేశాం. ఏ దశలో చేశాం? వినేవాడికి ఆత్మజ్ఞానం కలగని దశలో చేశాం. ఈ కల్పన ఎంతవరకూ ఉంటుంది? వినేవాడికి బ్రహ్మజ్ఞానం కలిగేవరకూ వుంటుంది. ఆ బ్రహ్మను గురించి తెలుసుకోకముందు దానిలో వాసనాదులు లేవని నిరూపించబడటం ఎలా? దానికి ఏకైక మార్గం శ్రుతి! శ్రుతి సహాయంతో వాసనా అనే మెట్టును అంగీకరించి విచారణ చేస్తే, చివరికి ఆ వాసన అనేది లేనిదైపోతుంది. శుద్ధ బ్రహ్మ స్వరూపమైన మోక్షమే మిగులుతుంది.

కేవల యుక్తిమార్గంతో ఆలోచిస్తే, పరబ్రహ్మకు రెండు దశలున్నాయి. ఒకటి జ్ఞాత దశ, రెండోది అజ్ఞాత దశ. అజ్ఞాత దశలో వున్న పరబ్రహ్మే జగత్తు! జగద్వాసనలు గూడా అజ్ఞాత బ్రహ్మమే! ఆ వాసనలకు మూలమైన అవిద్య గూడా అజ్ఞాత బ్రహ్మయే! ఈ అవిద్యాదశ తొలగితే, వుండేది విద్య! అదే వాసనా నివృత్తి! అదే జ్ఞాత పరబ్రహ్మ! దీనినే మరో రకంగా చెప్పాలంటే, జ్ఞానాన్ని (సంవిత్తును) బహిర్ముఖం చేస్తే బంధం. దానిని అంతర్ముఖం చేయడం అంటూ ఏమీ వుండదు. బహిర్ముఖత్వం చేయకుండా వుండడమే మోక్షం.

రామా! శిలా ప్రపంచపు హిరణ్యగర్భుడికి ఇప్పుడు లభించింది అదే! ఈ మోక్షాన్నే అజడమనీ, వేదనమనీ, సుప్తమనీ కూడా అంటారు. ఇలాంటి సుప్తికి వ్యతిరేకంగా వుండే ప్రబుద్ధ దశని బంధం అంటారు. నీకు అలాంటి సుప్తే కావాలో, అలాంటి ప్రబుద్ధ దశే కావాలో, నువ్వే తేల్చుకో (స.79)

రామా! ఇంతకూ నీకు వర్ణించి చెప్పిన ప్రళయాన్ని వైజ్ఞానిక ప్రళయము అంటారు. ఇది తత్త్వసాక్షాత్కార దృష్టితో చేసిన ప్రళయవర్ణన. ఇది గాక ఈ ప్రళయాన్ని బద్ధ దృష్టితో చూసే విధానం ఒకటి వుంది. అప్పుడా ప్రళయాన్ని ప్రాకృత ప్రళయం అంటారు. అది యోగులకు స్పష్టంగా కనిపిస్తుంది. ఆ ప్రక్రియలో ఆ యా కార్యాలు తమ తమ కారణాలలో లయించి పోతాయి. ఈ లయ ప్రక్రియ చివరికి మాయా శబల బ్రహ్మదాకా పోతుంది. ఇప్పుడు నీకు ఆ ప్రాకృత ప్రళయాన్ని గూడా వర్ణించి చెబుతాను, విను. (స.79)

## 30. ప్రాకృత ప్రళయ వర్ణన

***వశిష్ఠుడు***: రామా! నేను చూస్తూ వుండగానే ఆ బ్రహ్మ లోకంలో వున్నవారంతా ఆరిపోయిన దీపాల్లాగా కనిపించకుండా పోయారు. ఇంతలో ద్వాదశాదిత్యులు ఆ లోకం చుట్టూ చేరి తమ కిరణజ్వాలలతో ఆ లోకాన్ని తగలబెట్టేశారు. ఆ పని ఐన తరువాత వారు పన్నెండుమందీ ధ్యానమగ్నులై అక్కడి బ్రహ్మలాగానే ముక్తిని పొందేశారు.

ఇంతలో ఆ బ్రహ్మలోకంతో సహా పద్నాలుగు లోకాలూ కూడా, ఒకే మహా సముద్రం లాగా ఐపోయాయి. ఆ సముద్ర తరంగాలు పెచ్చు పెరిగిపోయి తమ ఆవిర్భావానికి మూల హేతువులైన పుష్కరావర్త మేఘాలను కూడా చెల్లా చెదరు చేశాయి. క్రమంగా ఆ మేఘాలు కూడా ఆ నీటిలో కలిసిపోయాయి.

ఇంతలో నాకు అక్కడ నల్లటి బృహద్రూపం ఒకటి కనిపించింది. ఉద్ధతంగా వున్న ఆ రూపాన్ని చూసే సరికి నాకే కొంచె భయం వేసింది.

ఆ రూపం చీకటి కొండ లాగా వుంది. కానీ, దానికి ఒకటి కాదు, ఐదు తలలు వున్నాయి. ప్రతి తలకు మూడేసి కళ్ళు వున్నాయి. ఆ కళ్ళల్లోంచి జ్వాలలు ఎగజిముతున్నాయి. ఆ రూపానికి పది చేతులున్నాయి. ఆ చేతుల్లో ఒక శూలం వుంది.

క్రమంగా నాకు భయం తగ్గింది. అది అఘోర రుద్రుడని నేను గుర్తించాను. దూరంనుంచే నమస్కరించాను.

***శ్రీరాముడు***: గురుదేవా! సర్వవ్యాపకుడైన పరబ్రహ్మకు ఈ పరిమిత రూపం ఎలా ఏర్పడింది? పైగా ఈ రంగు ఏమిటి? ఈ తలలేమిటి? ఈ చేతులేమిటి? ఆ పరబ్రహ్మకు ఛాయారూపమైన మాయాశక్తి ఏమైపోయింది?

***వశిష్ఠుడు***: రామా! సృష్టిస్థితి లయలను చేయాలనే నిశ్చయానికి కారణమైన మాయా వృత్తి ఒకటి వుంది. దానినే 'అహంకారం' అంటారు. దీని ద్వారానే, ఆ పరబ్రహ్మ జగదధ్యాసకు మూల మౌతున్నాడు. అలా అధ్యాసలో పడ్డ జీవులలో కొందరు ఆయనను శరణు వేడుతూ వుంటారు. అలాంటివారి దుఃఖాలను పోగొట్టడం కోసం, ఆయన ఒక రూపాన్ని స్వీకరిస్తూ వుంటాడు. దుఃఖానికే మరో పేరు 'రుక్' పోగొట్టడానికి మరో పేరు 'ద్రావణం'. ఆ రెండూ కలిపితే 'రుద్ర' అనే పదం ఏర్పడింది. రుద్రుడు అంటే దుఃఖాన్ని పోగొట్టేవాడు.

చిత్రమేమిటంటే, దుఃఖాన్ని కలిగించేదీ ఆయనే! పోగొట్టేదీ ఆయనే! దుఃఖాన్ని కలిగించేటప్పుడు ఆయన, విషయాలయందు భిన్నాభిమాన స్వరూపంగా వుంటాడు. దుఃఖాన్ని పోగొట్టేటప్పుడు ఆయన సర్వ విషయాలయందూ ఏకాభిమాన స్వరూపంగా వుంటాడు.

పంచ జ్ఞానేంద్రియాలే ఆయన పంచముఖాలు. పంచ కర్మేంద్రియాలు ఆయన కుడి చేతులు. ఆ కర్మేంద్రియ విషయాలు ఆయన ఎడమ చేతులు. ఆయన ఆకాశ స్వరూపుడు గనుక నల్లగా వున్నాడని చెప్పాను.

ఆయన ఐదు తలలకు మూడేసి కళ్ళు వున్నాయని చెప్పాను (1) సత్త్వ రజస్ తమో గుణాలు (2) భూత భవిష్యద్ వర్తమాన కాలాలు (3) చిత్తాహంకార బుద్ధులు (4) 'ఓం'కారంలోని 'అ'కార 'ఉ'కార 'మ'కారాలు (5) ఋగ్యజుస్సామ వేదాలు అనేవి ఆ కళ్ళు. 'భూః', 'భువః', 'సువః' అనే ముల్లోకాలే, ఆయన చేతిలోని త్రిశూలం.

తాను సమష్టి అహంకార స్వరూపుడు గనుక, ఆయన సృష్టిలోని జీవులందరికీ దేహాత్మాభిమానం సహజసిద్ధంగానే కలుగుతోంది. ఆ జీవులకు ప్రవృత్తి నివృత్తి ఫలాల నందించడం ఆయనకు సహజ స్వభావం. సృష్టి ప్రళయాలకు ఆయనను ప్రేరేపించేది చిన్మాత్రుడైన పరమాత్మే!

అలాంటి ఆ రుద్రుడు వున్నట్టుండి నోరు తెరిచి, అక్కడ వున్న నీటిని పీల్చడం ప్రారంభించాడు. ఆయన నోటి నిండా అగ్నిజ్వాలలు వ్యాపించి వుండడం నాకు కనిపించింది. క్షణాలలోనే పద్నాలుగు లోకాలనూ ముంచిన నీరంతా రుద్రదేవుడి ముఖంలో ఇంకిపోయింది. నాకు అప్పుడు ఆ నల్లటి రుద్రుడు, బురద బురదగా వున్న భూమీ, పైనా కిందా బ్రహ్మాండ కపాలాలూ, మధ్యలో ఆకాశమూ విడివిడిగా కనిపించాయి. (స.80)

ఇంతలో ఆ రుద్రుడు లేచి నిలబడి మహాకాలుడై నాట్యం చేయడం మొదలు పెట్టాడు. వెను వెంటనే, అతనికి ఛాయా రూపంగా వున్న మాయాదేవి గూడా నాట్యం చేయడం మొదలు పెట్టింది.

అప్పుడు అక్కడ సూర్యుడు గానీ, చంద్రుడుగానీ, మరొక వెలుగు గానీ లేదు. ఐనా 'ఈ రుద్రుడికి ఈ నీడ ఎలా ఏర్పడింది?' అని నాకు సందేహం కలిగింది. నా సందేహానికి సమాధానం దొరక లేదు గానీ,మొదట నీడ లాగా కనిపించిన ఆ దేవి మెరుపు లాగా ఒక గంతు గెంతి, ఆ రుద్రుడికి ఎదురుగా నిలబడి, ఘోరమైన

నాట్యం చేయడం ప్రారంభించింది. ఆమె అలా నాట్యం చేస్తున్నప్పుడు సూర్య చంద్రాదులు ఆమెకు కళ్ళుగా కనిపించారు. నదులూ, వృక్షాలూ, కొండలూ, నక్షత్రాలూ, స్వర్గపాతాళాది లోకాలూ,ఆ ఛాయాదేవికి, ఆ కాళ రాత్రికి, అవయవాలుగా నాకు కనిపించాయి. ఆమె మెడలో రకరకాల పూలమాలలే గాక పలుగులూ, పారలూ, గొడ్డళ్ళూ, చేటలూ, రోకళ్ళూ, మొదలైనవాటిని మాలలుగా వేసుకుంది.

**గమనిక** – ఈ 81వ సర్గలో 8వ శ్లోకం నుంచీ 102 వ శ్లోకం దాకా, అంటే సర్గ చివరి దాకా, కాళరాత్రి నాట్య వర్ణనను కవితామయంగా, తత్త్వ సంకేతమయంగా, విస్తరింప జేశాడు కవి. చివర్లో ఒక స్రగ్ధరావృత్తంలో నాట్య ప్రక్రియకు, తత్త్వ విద్యా ప్రక్రియకు, సమన్వయం చూపుతూ ఈ వర్ణనను ముగించాడు. ఇంతటి విశాలమైన ఈ వర్ణనకు తాత్పర్యమేమిటో పై సర్గలో ఆయనే చెప్పబోతున్నాడు. కనుక మనం వర్ణనల విస్తారాన్ని తగ్గించుకొని ముందుకు సాగుదాం (సర్గ.81)

## 31. సృష్టి ప్రళయాలు జోడెడ్లు

***శ్రీరాముడు***: గురుదేవా! ఇదేమిటి? ఒక ప్రక్క ప్రళయం జరిగి పోయిందంటున్నారు. భూమి బురద బురదగా వుందంటున్నారు. పాతాళము, భూమి బ్రహ్మాండ కపాలాలు, మాత్రమే కనిపించా యంటున్నారు. మరో ప్రక్క ఈ కాళరాత్రికి కొండలూ, నదులూ, మొదలైనవి అవయవాలైనాయి అంటున్నారు. పలుగులూ, పారలూ, మొదలైనవి పూలమాలలైనాయి అంటున్నారు. ఇవన్నీ ఎక్కడి నుండి వచ్చాయి?

***వశిష్ఠుడు***: రామా! తత్త్వ దృష్టితో చూస్తే నువ్వు చెప్పిందే నిజం! ఆ భైరవ రుద్రుడు మగవాడు గాదు. ఆ కాళరాత్రి ఆడది గాదు. అసలు వాళ్లిద్దరూ వ్యక్తులు గాదు. అక్కడ జరిగేది నృత్యమూ గాదు. ఇక భ్రాంతి దృష్టితో చూస్తే, ఇది ఇలాగే సాగుతూ వుంటుంది.

**గమనిక**–ఇక్కడ వ్యాఖ్యాత మరికొన్ని విశేషాలు వ్రాశాడు. ఏమిటంటే, భ్రాంతి దశలో నశించిపోయిన పదార్థాలు గూడా మళ్ళీ మొలకెత్తడం అక్కడక్కడ కనిపిస్తూనే వుంటుంది. యోగుల ప్రభావంచేత, చాలా కాలం క్రిందటే బూడిదై పోయిన వ్యక్తులు మళ్ళీ లేచి కూర్చొని మాట్లాడం కనిపిస్తోంది. పిచ్చెక్కినవాడికి చచ్చిపోయినవాళ్ళు గూడా తనతో పోట్లాడుతున్నట్లుగా అనుభవం వుంది. ఇక స్వప్నంలో కనిపించే విచిత్రాలకు అంతే లేదు. కనుక అజ్ఞానం వున్నంత వరకూ చిత్తంలో సమస్త పదార్థాలూ, సంస్కార రూపంగా నిలబడే వుంటాయని మనం అర్థం చేసుకోవాలి.

***వశిష్ఠుడు***: రామా బంగారానికి ఏదో ఒక ఆకారం లేకుండా వుంటుందా? మిరపకు కారం లేకుండా వుంటుందా? అలాగే, అజ్ఞానం వున్నంతవరకూ చైతన్యానికి చేత్యాకారం (విషయాకారం) తప్పదు. శుద్ధ చైతన్యం తెలియబడకుండా వున్నంతవరకూ అది అజ్ఞానంతో కూడి వున్నట్టే లెక్క! ఆ దశలో దానికి ఏదో ఒక విషయాకారం తప్పదు. ఆ ఆకార పరంపరలో నశించినవి గూడా ఒక్కొక్కప్పుడు మళ్ళీ కనిపిస్తూ వుండడం సంభవమే!

కనుక రామా! తత్త్వదృష్టితో చిదాకాశమనీ, పరమాత్మ అనీ, పరమేశ్వరుడనీ, దేన్ని గురించి నేను ప్రస్తావించానో, దానినే కొందరు సదాశివుడిగా, కొందరు విష్ణువుగా, కొందరు బ్రహ్మగా ఉపాసిస్తున్నారు. (స. 82)

అందుకనే ఆ సమయంలో నాకు కనిపించిన ఆ భైరవుడు, ఆ భైరవి – ఇదంతా మాయమాత్రమని నేను గ్రహించాను. ఐనా ఆ ఆకారాలు నాకు మాత్రమే కనిపించాయి. మరెవ్వరికీ కనిపించ లేదు. నిర్విశేష చైతన్యాన్ని బోధించడానికి శబ్దార్థ సంబంధ కల్పన కొంత కావాలి. తప్పదు. అందుకే నేనప్పుడు చూసిన భైరవాకారాన్ని నీకు యథాతథంగా వర్ణించి చెప్పాను.

**శ్రీరాముడు**: గురుదేవా! తత్త్వదృష్టితో చూస్తే, ప్రపంచమే లేదు. వ్యావహారిక దృష్టితో చూస్తే, అది వున్నట్టుగా కనిపిస్తోంది. దానికి ఎంతో కొంత అస్తిత్వం వుంది. కాని ఆ కొద్ది మాత్రపు అస్తిత్వం కూడా ప్రళయంలో నశించి పోతోంది కదా! అది నశించిపోతే, చైతన్యము, చితిక్రియ, చేతయిత (చైతన్యము, స్పందనక్రియ, స్పందించేవాడు) అనే త్రిపుటి వుండనే వుండదు గదా! అది లేకపోతే మీరు చెప్పిన నృత్యం ఎలా కుదురుతుంది?

**వశిష్ఠుడు**: ప్రళయం అంటే ఏమిటి? త్రిపుటి పూర్తిగా నశించిన దశయే ప్రళయమంటావా? అలా అంటే, అది తత్త్వదృష్టే! ఆ దృష్టిలో ప్రపంచమే లేదని నువ్వే ఒప్పుకుంటున్నావు గదా!

"అలా కాదండీ, ప్రళయంలో అవిద్య మిగిలి వుంటుంది. అలా చెప్పకపోతే మళ్ళీ సృష్టి రావడం కుదరదు" అంటావా? అలా అనేటట్లైతే అవిద్యతో పాటు త్రిపుటి గూడా ఎంతో కొంత మిగిలి వుందని ఒప్పుకున్నట్లే! అవిద్య వుంది గనుక దానివల్ల ప్రళయంలో గూడా రుద్రదేవి నృత్య భ్రాంతి ప్రకాశించే వీలు వుండనే వుంది.

నువ్వు గ్రహించివలసినది ఏమిటంటే, తత్త్వదృష్టిలో స్థిరంగా వుండి, లోకదృష్టితో వ్యవహరించడం ఈశ్వరుడు చేసే పని–అని. నువ్వు గూడా అలాంటి దృష్టినే పెంచుకోవాలి.

**శ్రీరాముడు**: గురుదేవా! బాగుంది. లోకదృష్టిలో కాలభైరవీ నృత్యాన్ని వివరించండి. ఆమె మెడలో చాటలూ, జల్లెళ్లూ, రోళ్ళూ, రోకళ్ళూ, పలుగులూ, పారలూ – ఇలాంటివన్నీ పూలమాలలుగా ధరించి నృత్యం కొనసాగించిందా?

**వశిష్ఠుడు**: రామా! 'భైరవీ భైరవులు' – అని ఇద్దరిని గురించి ప్రస్తావించాను. ఇందులో భైరవుడు చిన్మాత్ర స్వరూపుడు, మనోవాగతీతుడు. ఆయన సంకల్పమే స్పందశక్తి. అదే భైరవి. ఈవిడకే జీవచైతన్యము, ఉత్పత్తి, ఆప్తి, సంస్కృతి, వికృతి, శుష్క, జయ, విజయ, చండిక, ఉత్పల, సిద్ధ, అపరాజిత, దుర్గ, ఉమ, సమ, గాయత్రి, సావిత్రి, సరస్వతి, భావ, అనాహత మొదలైన పేర్లు అనేకం వున్నాయి. ఇవన్నీ ఆమె చేసే పనులను బట్టి, ఉపాసనకులు ఆమెను ఉపాసించే విధానాన్నిబట్టి, వచ్చిన పేర్లు.

ఆ దేవి చేసే రకరకాల పనులనే నేను నాట్యమని వ్యవహరిస్తున్నాను. సకల ప్రాణుల సృష్టిస్థితులు, జరామరణ రీతులు, మొదలైనవన్నీ ఆమె చేసే పనులే!

అవిద్యాకల్పితమైన 'జగత్తు' అనే దేహాన్ని ధరించిన ఆ దేవి ఈ విధంగా నృత్యం చేస్తోంది గనుక, ఆమెకు పలుగులూ, పారలూ, మొదలైనవి అలంకారాలని చెప్పాను. నిజానికి కొండలూ, కోనలూ, ఆయుధాలూ, మొదలైనవన్నీ ఆ మాయా శక్తికి అవయవాలు గూడా!

**శ్రీరాముడు**: గురుదేవా! అలా ఐతే, మీరు నా పాత ప్రశ్నను తిరగ దోడుతున్నారు. నేనిందాక "ప్రళయ సమయంలో ఏదీ వుండదు గదా, అక్కడ నృత్యం ఎలా కుదురుతుంది?" అని ప్రశ్నించాను. దృష్టిభేదంతో కుదురుతుందని మీరు సమాధానం చెప్పారు. మీరు మళ్ళీ ఇప్పుడు చెబుతున్న సమాధానం చూస్తే, ప్రళయ సమయంలోనే నృత్యమనే పేరుతో సృష్టి, క్రియ అంతా జరిగి పోతున్నట్లుగా కనిపిస్తోంది. అలా జరిగితే, సృష్టీ, ప్రళయమూ, రెండూ ఏక కాలంలో వున్నాయని, చెప్పినట్లవుతోంది. ఇది ఎలా కుదురుతుంది?

**వశిష్ఠుడు**: రామా! ఈ ప్రపంచానికి ఆత్యంతికమైన అస్తిత్వం గానీ, ఆత్యంతికమైన నా స్తిత్వంగానీ, లేవని పూర్వం చాలా సార్లు చెప్పాను. ఈ జగత్తు సదసద్విలక్షణం అన్నాను. జగత్తు ఆత్యంతికా సత్యం కానప్పుడు, ప్రళయం ఆత్యంతికాసత్యం కాగలదా? కాలేదు. కనుక, సృష్టికి లాగానే ప్రళయానికి కూడా ఆత్యంతికమైన అస్తిత్వంగానీ, ఆత్యంతికమైన నాస్తిత్వం గానీ, లేవు. తత్త్వదృష్టిలో సృష్టి ప్రళయాలు రెండూ లేవని తెలుసుకొన్నప్పుడు, రెండూ ఒకే సారి లేనివై పోతాయి. ఆ తత్త్వదృష్టి లేనప్పుడు, లోకదృష్టితో చూస్తే, ఆ రెండూ కలిసి సంచరిస్తూనే వుంటాయి. అందుకనే పూర్వం ఐందవోపాఖ్యానంలో (ఉత్పత్తి ప్రకరణంలో) ఒక

బ్రహ్మయొక్క ప్రళయ కాలంలో ఐందవ బ్రహ్మలయొక్క సృష్టి నిరాఘాటంగా కొనసాగిపోయిందని నేను చెప్పాను. అన్ని రకాల సృష్టులూ భ్రాంతి మాత్రాలే అని కూడా నేనక్కడ నిరూపించాను. అందువల్లనే భైరవీదేవి నాట్యం చేస్తున్నా, ఆమె అవయవాలైన పృథివ్యాదిలోకాలు ఎగిరి పడడం లేదు. కలగనేవాడి మంచాన్ని ఇటూ అటూ జరిపితే, వాడి కలలోని లోకాలు, ఇటూ అటూ కదులుతున్నాయా?

కనుక సృష్టితో పాటు ప్రళయం గూడా భ్రాంతి అని నువ్వు గమనించినప్పుడు, నీ ప్రశ్నకు తావే వుండదు. అది దృష్టిలో పెట్టుకొని, ఆ భైరవీదేవి నృత్యాన్ని గమనించు (స. 84)

ఆ దేవి తన పొడవైన చేతులను గిరగిరా తిప్పుకుంటూ నాట్యం చేస్తుంటే, ఆకాశంలో ఎక్కడికక్కడ చెట్లు మొలచినట్లై, ఆకాశమంతా అడవిగా కనిపించింది. ఆమెకు చేటలూ, గొడ్డళ్ళూ మాత్రమే గాక, సృష్టిలోని భావాభావ పదార్థాలూ, కాల-అకాల క్రమాదులూ కూడా, భూషణాలుగా మారిపోయాయి. ఆమె గిరగిరా తిరుగుతుంటే, తాడుకు కట్టి తిప్పిన నిప్పు కొరివి నిప్పు చక్రం లాగా కనిపించినట్లుగా, ఆమె తిరుగుళ్ళే ఈ ప్రపంచంగా కనిపించింది. అంచేత అసలైన పరమశివుడంటే ఏమిటో తెలియనప్పుడే, ఈ క్రియాశక్తి కనిపిస్తుందనీ, క్రియాశక్తి స్వరూపురాలైన ఈ దేవికీ, జగత్తుకీ భేదం లేదనీ, నాకు అర్థమైంది.

ఐతే, ఈ దేవి చైతన్య శివుడియొక్క సంకల్ప స్వరూపురాలని పూర్వమే చెప్పాను.

### 32. శివస్పర్శ

***శ్రీరాముడు***: గురుదేవా! సంకల్పం అన్నా, కోరిక అన్నా, ఒక్కటే ! దానికి ఆకారం లేదు. ఆకారం లేని సంకల్పం ఆకారం గల జగత్తుగా ఎలా మారింది?

***వశిష్ఠుడు***: గాలిని ఆశ్రయించుకొని కదలిక వుంది. ఈ కదలికకు రూపం లేదు, శబ్దం లేదు. కానీ, ఆ కదలికే తీవ్రమైనప్పుడు, 'ఘోరు'మనే శబ్దాకారం ఏర్పడుతోంది. అది సహజం. అలాగే, శివుడి ఇచ్ఛకు జగదాకారం రావడం కూడా సహజం. ఇంతకూ నేను చెప్పవచ్చినదేమిటంటే, ఆ దేవి అలా నాట్యం చేస్తూ చేస్తూనే, కాకతాళీయంగా తనకు మూల పురుషుడూ, పరమపురుషుడూ, ఐన ఆ శివుణ్ణి తాకింది. అంతే! ఆ ప్రకృతి దేవియొక్క రూపం క్రమంగా శమించిపోయి, శివుడొక్కడే మిగిలిపోయాడు.

ఆమె శమించిన క్రమం ఇలా వుంది. ఆమె నాట్యంలో తిరుగుతూ వుండగానే శివుణ్ణి ఆవరించివున్న ఆవరణశక్తి కొంచెం తొలగింది. దాంతో ఆమెకు శివుడి స్పర్శ లభించింది. వెంటనే ఆమె భౌతిక పదార్థాల ఆకారాన్ని విడిచిపెట్టి స్థూల పంచభూతాల ఆకారాన్ని పొందింది. ఆ తరువాత పూర్వం చెప్పుకున్న పంచీకరణానికి వ్యతిరేక ప్రక్రియ జరిగి, ఆమెకు సూక్ష్మభూతాకారం ఏర్పడింది. ఆ తరువాత ఆమె వాసనారూపురాలైంది. ఆపైన అవ్యాకృతాకాశ రూపురాలైంది. ఆ తరువాత శివాకారంగా మిగిలి పోయింది.

***శ్రీరాముడు***: అదేమిటి గురుదేవా! అంత పెద్ద ప్రకృతి దేవి శివుణ్ణి ముట్టుకున్నంత మాత్రాన శమించిపోవడమేమిటి?

పురుషుడి(శివుడి)లో లయించిపోవడ మేమిటి?

***వశిష్ఠుడు***: రామా! శివుడియొక్క ఇచ్ఛాశక్తే ప్రకృతి దేవి అని పూర్వమే చెప్పుకున్నాం గదా! లోకంలో ఎక్కడైనా సరే, ఇచ్ఛయొక్క లక్షణం ఏమిటి? కోరినది దొరికే దాకానే ఇచ్ఛాస్పందం వుంటుంది. అది దొరికితే, ఆ స్పందం ఆగిపోతుంది. శివేచ్ఛకు శివుడికంటే ఇష్టతమమైన గమ్యం లేదు. కనుక ఆ ప్రకృతి దేవికి శివుడి స్పర్శ లభించగానే ఆ స్పందం ఆగిపోతుంది. ఆ స్పందం పోతే, జగదాకారం కూడా పోతుంది. అప్పుడు

శివుడొక్కడే మిగులుతాడు.

**శ్రీరాముడు**: అలా ఐతే, ప్రకృతి నశించింది, శివుడు మిగిలాడు– అని చెప్పాలి గానీ, ప్రకృతి పురుషుడిలో లయించిందని చెబుతారేమిటి?

**వశిష్ఠుడు**: ప్రకృతి శివుడియొక్క ఛాయారూపిణి అని కూడా చెప్పుకున్నాం. మండుటెండలో ఒక మనిషి పెద్ద చెట్టుకిందికి చేరాడు. అప్పుడు మనిషి నీడ ఏమైపోయింది? నశించిందని చెప్పాలా? చెట్టునీడలో కలిసిపోయిందని చెప్పాలా? ఆ మనిషిలోనే కలిసిందని చెప్పాలా? నశించిందని చెబితే, ఆ నీడ అంతకుముందు సత్యమైన పదార్థమని చెప్పినట్టవుతుంది. అందుచేత, ఆ మాట కుదరదు. చెట్టు నీడలో కలిసిందంటే, ఆ నీడ మరింత దట్టం కావాలి. అలా జరగటం లేదు. అందుచేత ఆ మాటా కుదరదు. కనుక, నీడ తనకు ఆశ్రయమైన మనిషిలోకే ప్రవేశించిందనటం సముచితం. అందుకే ప్రకృతి పురుషుడిలో లయించిందన్నాను.

**శ్రీరాముడు**: అలా ఐతే, ఆ మనిషి చెట్టు క్రిందినుంచి ఇవతలికి రాగానే, మళ్ళీ నీడ ఏర్పడుతోంది. అలాగే ఒక సారి శివుణ్ణి చేరిన జీవుడు, మళ్ళీ ఎప్పటికో అప్పటికి ఇవతలకు వచ్చి సంసారంలో పడే అవకాశం వుండనే వుంటుంది కదా!

**వశిష్ఠుడు**: ఈ ఉపమానం అక్కడ పని చేయదు. ఉపమానం చెప్పినప్పుడు ఏ దృష్టితో చెప్పామో అంతవరకే దానిని ఉపయోగించాలి గానీ, ఇష్టం వచ్చినట్లు సాగదీయకూడదు. సంసారంలోకి రావాలంటే కోరిక వుండాలి. తత్త్వబోధ కలిగి, శివస్పర్శ కలిగి, శివుడిలో లయించి పోయాక, మళ్ళీ ఆ కోరిక పుట్టమన్నా పుట్టదు. దీనికి మరో దృష్టాంతం చెబుతాను. ఓ మంచివాడు మోసపోయి, మంచివాళ్ళనుకొని, దొంగల గుంపులో చేరాడు. వాళ్ళు మంచివాళ్లు అనే భావంతో వాళ్ళ క్షేమం కోసం కృషి చేశాడు. కొంతకాలం పోయాక, వాళ్ళు పచ్చి దొంగలనే విషయం అర్థమైంది. ఇక ఆ సత్పురుషుడు వాళ్ళతో కలిసి వుండడానికి ఇష్టపడతాడా? అలాగే, తత్త్వజ్ఞానం కలిగినవాడు సంసారంలోకి రమ్మన్నా రాడు. (స. 85)

రామా! అసలు విషయంలోకి వద్దాం. ప్రకృతిదేవి శమించి పోయిందనీ రుద్రదేవుడు మిగిలాడనీ, చెప్పాను గదా! ఆ రుద్రుడు శమించిన విధానం గూడా చెబుతాను విను.

ప్రకృతి దేవి శమించి పోయేసరికి రుద్రదేవుడు, పైనా క్రిందా వున్న బ్రహ్మాండ కపాలాలు, మధ్యలో ఆకాశం, ఇవి మాత్రమే మిగిలి వున్నాయి. ఇంతలోనే ఆ రుద్రుడు రెండు బ్రహ్మాండ కపాలాలనూ బలంగా తన నోట్లోకి పీల్చుకొని మింగేశాడు. ఆ పైన, ఆకాశంలో మరో ఆకాశం లాగా, అతనక్కడ ఒంటరిగా మిగిలిపోయాడు. ఇంతలోనే అతనొక మేఘం లాగా తేలిపోయాడు. ఇంతలోనే జానెడు కట్టె లాగా బిగిసిపోయాడు. ఆ తరువాత చిన్న గాజు నలుసు లాగా అయ్యాడు. అ తరువాత ఇంకా చిన్నవాడై ఇక కనిపించడం మానేశాడు. అక్కడినుంచి నేను దివ్యదృష్టితో చూడవలసి వచ్చింది. ఆ రుద్రుడు క్రమంగా పరమాణువంతై , అంతకంటె గూడా చిన్నవాడై, ఇక అదృశ్యమైపోయాడు. చిత్రం! ఆయన అదృశ్యమయ్యేసరికి, అప్పటివరకూ కనిపించిన ఆకాశం కూడా కనిపించడం మానేసింది. దానిలో దృశ్యం అనేది లేకుండా పోవడంవల్ల ఆ ఆకాశం కేవలం బ్రహ్మాకారాన్ని పొందిందని నేను గ్రహించాను.

నా ఆశ్చర్యానికి అంతు లేదు. నాకు వెనకటి సంఘటనలన్నీ గుర్తుకు వచ్చాయి. ఆ విద్యాధర స్త్రీ నా ద్గరకు రావడం, నేను వచ్చి ఆ శిలా ప్రపంచాన్ని చూడడం, నేను చూస్తూ వుండగానే ఆ ప్రపంచం ఇలా మహా ప్రళయాన్ని పొందడం, లేడిపిల్ల చిగురుటాకులను మింగేసినట్లుగా ఆ రుద్రదేవుడు బ్రహ్మాండ కపాలాలను మింగడం, ఇవన్నీ స్మరించే సరికి, నేను మొదటి సారిగా పట్నానికి వచ్చి రాజ ప్రసాదాన్ని చూసిన పల్లెటూరి బైతు లాగా నివ్వెరపోయాను.

## 33. ప్రతిచోటా ప్రపంచమే

అంతకంటే చిత్రం మరొకటుంది. నాకా చుట్టుపక్కలలో ఇందాకటి శిల వంటి శిలలు చాలా కనిపించాయి. నాకు ఆ శిలలన్నిటిలో గూడా ఇందాకటి కాళీదేవి శరీరంలో లాగానే రకరకాల ప్రపంచాలు కనిపించాయి. ఐతే అవి మామూలు కంటికి కనిపించటం లేదు.

**బుద్ధినేత్రేణ దృశ్యన్తే**

**దివ్యాక్షా వా న తే యథా॥** (ని.ఉ.స.86, శ్లో. 24)

వాటిని చూడాలంటే జ్ఞానమయమైన నేత్రమైనా కావాలి, లేదా దివ్య దృష్టి ఐనా కావాలి. జ్ఞాన నేత్రం అంటే, అహంకార రహితమైన బుద్ధే! అటువంటి దృష్టితో చూసే సరికి, నాకక్కడ వుండే రాళ్ళలో మాత్రమే కాదు, అక్కడ వుండే గడ్డి పరకల్లోనూ, తీగల ఆకుల్లోనూ, చెట్ల గుబురుల్లోనూ కూడా, ఎక్కడ చూస్తే అక్కడ, వింత వింత ప్రపంచాలు కనిపించాయి.

ఈ ప్రపంచాలకు ఒక నిశ్చితమైన న్యాయం (తర్కబద్ధమైన నియమం) ఏదీ నాకు కనిపించలేదు. ఉదాహరణకు, ఒక ప్రపంచంలో ప్రజాపతి ఇప్పుడే పుడుతున్నాడు. మరో ప్రపంచంలో అక్కడి ప్రజాపతి లయించబోతున్నాడు. మరో ప్రపంచంలో సృష్టి నిండుగా వికసించి వుంది. ఒక ప్రపంచంలో దేవతలకు మరణం వుంది. మరో ప్రపంచంలో దేవదానవులు స్నేహంగా వున్నారు. ఇంకో సృష్టిలో శ్రీరాముడు చిన్నవాడుగా వుండగానే రావణాసురుణ్ణి చంపేశాడు. మరో సృష్టిలో రావణాసురుడే రాముణ్ణి చంపేశాడు. ఇలా రకరకాల వింత ప్రపంచాలను నేను చూశాను. దీనిని బట్టి మన ప్రపంచంలో మనకు కనిపించే తర్కబద్ధత మన అలవాట్లను బట్టి ఏర్పడిందే తప్ప దానికి ప్రత్యేకమైన అస్తిత్వం లేదని నేను అర్థం చేసుకొన్నాను.

**గమనిక** – వింత వింత ప్రపంచాల వర్ణనను పూర్వం భుశుండోపాఖ్యానం లోనూ, ఈ ఉత్తరార్థంలోనే మరో చోటా కూడా, వశిష్ఠమహర్షి చేసి వున్నాడు. ఇక్కడ కూడా 23వ శ్లోకం నుంచీ 48వ శ్లోకం దాకా ఈ వివరణ సాగింది. ఇందులో కీలకమైన అంశాలను మాత్రమే మనం ప్రస్తావన చేసుకున్నాం. ఈ వర్ణన చివరి భాగంలో

**క్వచిదల్పేన రామేణ**

**హత రావణ రాక్షసమ్।**

**రక్షసా రావణేనైవ**

**క్వచిద్విహత రాఘవమ్** (ని.ఉ.స. 86, శ్లో. 45)

అనే చోట 'విహత రాఘవం' అనే పదానికి రావణాసురుడే రాముణ్ణి చంపేశాడు అని చెప్పడానికి ఇష్టం లేకో ఏమో, వ్యాఖ్యాత విహత శబ్దానికి కొంచెం అర్థం మార్చి, రావణాసురుడు రాముణ్ణి మోసగించాడు - అని అర్థం చెప్పాడు. ఏది ఏమైనప్పటికీ సృష్టి పరంపరలో నిశ్చితమైన నియమమేదీ లేదని చెప్పడమే ఈ వర్ణనకు ప్రధాన తాత్పర్యం గనుక, దానిని ఆధారం చేసుకొనే శ్రీరాముడు ఒక ప్రశ్న వేయబోతున్నాడు.

***శ్రీరాముడు***: ఇదేం చిత్రం గురుదేవా! నేను పూర్వమే వున్నానా? ఉంటే, ఇలాంటి శరీరంతో, ఇలాంటి మనస్సుతో, ఇలాగే వున్నానా? అప్పటి సన్నివేశం అంతా ఇలాగే వుందా?

***వశిష్ఠుడు***: రామా! మినుములు రాశిగా పోశాం. వాటిని మానికలతో కొలిచి మళ్ళీ ప్రక్కన పోశాం.

**పూర్యమాణా యథా మాషాః**

**క్రమేణాన్యేన తేన వా ॥** (ని.ఉ.స. 86, శ్లో.51)

ఇందాకటి మినుముల సన్నివేశం, ఇప్పటి మినుముల సన్నివేశం, ఒకే రకంగా వుందని చెప్పగలమా? లేదని చెప్పగలమా? వివిధ సృష్టుల పరిస్థితీ ఇంతే!

సముద్రంలో తరంగాలు వచ్చాయి, పోయాయి, మళ్ళీ వచ్చాయి. పోయిన తరంగాలే, వచ్చాయని చెప్పగలమా? ఇవి పూర్తిగా క్రొత్తవని నిరూపించ గలమా?

అలాగే సృష్టి పరంపరలో జీవుల పరివర్తనం గూడా కొన్ని చోట్ల కొద్దిపాటి పోలికతో, కొన్ని చోట్ల కొద్దిపాటి వైవిధ్యంతో, కొన్ని చోట్ల ఎటూగాని విధానంతో, సాగిపోతూ వుంటాయి.

**పునస్త్వం పునరేవాహం**

**పునః పునరిమే జనాః ।**

**న కదాచన నైవాన్యే**

**సంభవన్త్యఖిలం పరే॥** (ని.ఉ.స. 86, శ్లో. 52)

(నువ్వూ మళ్ళీ పుట్టావు. నేనూ మళ్ళీ పుట్టాను. ఈ జీవులందరూ మళ్లీ మళ్లీ పుట్టారు. ఇది వ్యవహార దృష్టి. తత్త్వదృష్టితో చూస్తే ఎప్పుడూ ఆ పరమాత్మ ఒక్కడే వున్నాడు. ఆయనలో ఎప్పుడూ, ఏదీ పుట్టనే పుట్టడం లేదు.)

ఇక ఆ సన్నివేశమూ, ఈ సన్నివేశమూ, ఒకే రకంగా వున్నాయా అని అడిగావు. సన్నివేశం అంటే ఏమిటి? శరీరాకారం, చుట్టూతా వున్న బంధుమిత్రులు, ఆ వ్యక్తికి వున్న తెలివి, శక్తి, సాధించిన కార్యాలు – ఇలాంటివన్నీ కలిపితే సన్నివేశం అవుతుంది. అవి ప్రతి సృష్టిలోనూ కొంత పోలికతోనూ వుంటాయి, కొంత తేడాగానూ వుంటాయి. ఒకప్పటి మానవజీవుడు మరో సృష్టిలో పశుశరీరంతో పుట్టవచ్చు. అప్పుడు వాడే వీడు అనాలా? వాడు వేరే, వీడు వేరే అనాలా? ఏదీ నియమంగా చెప్పేందుకు వీలు లేదు. కనుక జీవ సన్నివేశాలు సదృశంగా వున్నాయా, విసదృశంగా వున్నాయా, అని ఎవడు తేల్చి చెప్ప గలడు? కనుక రామా! అసలు సృష్టి తత్త్వమేమిటో ఆలోచించు(స.86)

దానికోసం అప్పుడు నాకు కలిగిన అనుభవాన్ని మరి కొంత వివరిస్తాను, విను.

ఆ విధంగా ఏ రాతిలో చూసినా, ఏ చెట్టులో చూసినా, ఏ పుట్టలో చూసినా, రకరకాల సృష్టులు కనిపించేసరికి, నేను ఆలోచించి, నా వంకే చూసుకున్నాను. ఆశ్చర్యం! నాలోనే, ప్రతి అవయవంలోనూ, రకరకాల ప్రపంచాలు కనిపించ సాగాయి. ఇవన్నీ ఎక్కడినుండి వస్తున్నాయా అని నిశితంగా పరిశీలించాను. రోటికి ఏర్పడ్డ బీటలో ఇరుక్కున్న గింజ, వానాకాలంలో మొక్కై మొలచినట్లుగా, నా హృదయమనే ఆకాశంలో ఇరుక్కొన్న సంస్కార బీజాల్లోంచి ఈ ప్రపంచ వృక్షాలు మొలకెత్తుతున్నాయని గ్రహించాను.

గాఢ నిద్రలోంచి స్వప్నానికి గానీ, జాగ్రద్దశకు గానీ, చేరుతున్న సమయంలో వున్నట్టుండి ప్రపంచాలు ఎలా కనిపిస్తున్నాయో, అలాగే నా హృదయంలో నాకా ప్రపంచాలన్నీ వికసిస్తున్నాయని నేను గ్రహించాను.

## 34. సృష్టి వికాసం

***శ్రీరాముడు***: ఆ వికాసానికి ఏది క్రమమూ లేదంటారా?

***వశిష్ఠుడు***: జాగ్రత్ప్రపంచ సృష్టిలో ఒక క్రమ వికాసం వున్నట్టు కనిపిస్తోంది. స్వప్న ప్రపంచ సృష్టిలో, అన్ని పదార్థాలూ ఒకే సారి వస్తున్నట్టు కనిపిస్తోంది. ఈ విషయంలో తత్త్వవేత్తలలో కొన్ని అభిప్రాయ భేదాలున్నాయి. ఒక్క క్షణంలో స్వప్న ప్రపంచం ఏర్పడుతోందన్నప్పుడు, క్షణమనేది గూడా ఒక కాలపు కొలతే గనుక, స్వప్న దశలో కూడా సృష్టిలో క్రమ వికాసం వుందని కొందరు అంటున్నారు. ఈ వికాసానికి ఇంత సమయమే

కావాలనే నియమాన్ని ఎవరు ఏర్పర్చ గలరు?- అని వారు వాదిస్తున్నారు. మరికొందరు అణుగర్భంలోనే ప్రపంచం వున్నట్లుగా, క్షణగర్భంలో మహాయుగం వుంది అని. అందువల్ల కాలపు కొలతల గురించి చర్చలు అనవసరమని భావిస్తున్నారు. ఇద్దరి వాదాల్లోనూ సారాంశం ఏమిటంటే, ఈ సృష్టులన్నీ కేవలం భ్రమాత్మకాలైనప్పుడు, వీటియొక్క వికాస క్రమాన్ని గురించి చర్చించడంలో సారం లేదనేదే!

ఐనా నేను బ్రహ్మాండాత్మకమైన ఆత్మను కల్పించుకొని, అంటే కనిపించే ఆ బ్రహ్మాండం మొత్తం నేననే ధారణ చేసి, ఆ బ్రహ్మాండాన్ని చూడడం మొదలుపెట్టేసరికి, ఆ సృష్టి వికాస క్రమం నాకు కనిపించింది.

మొదట దిక్కులనే భావం వచ్చింది. ఆ దిక్కులే ఆకాశం అయ్యాయి. ఆకాశం అనే చింతన వచ్చే సరికి, నాలో చిత్తం ఏర్పడింది. ఇదేమిటా అని చూస్తూంటే, "ఈ ఆకాశాన్ని నేనే అనిపించింది." దీంట్లోంచి, నేననే అహంకారం ఏర్పడింది. ఈ అహంకారమే కొంచెం గట్టిపడేసరికి ఆకాశమే నేననే భావం గట్టిపడి, నా పూర్వస్థితి మరపులో పడటం ప్రారంభించింది. ఆ దశలో నా అహంకారానికి 'బుద్ధి' అనే పేరు ఏర్పడింది. నాలో నిశ్చయాలు మొదలైనాయి.

నా బుద్ధి మరింత గట్టిపడేటప్పటికి, దానిలో ఆకాశమే నేననే నిశ్చయం తగ్గి, సంకల్పాలూ, వికల్పాలూ, సందేహాలూ, మొదలైనవి మొదలైనాయి. ఈ దశలో నా బుద్ధికి మనస్సు అనే పేరు వచ్చింది. ఈ మనస్సు కల్పనలను మొదలు పెట్టింది. వాటిలో మొదట శబ్దాది తన్మాత్రలు, (అంటే ఆకాశాదులయొక్క గుణాలు), ఆ తరువాత వాటిని గ్రహించే పంచేంద్రియాలూ, ఆ తరువాత వాటికి కనిపించే పంచభూతాలూ, ఆ తరువాత భూత సమ్మేళనంతో ఏర్పడిన భౌతిక పదార్థాలూ, రూపొందాయి. దాంతో అంతకు ముందు దుఃఖస్పర్శ లేని నాకు, కొత్తగా దుఃఖస్పర్శ మొదలైంది. వ్యవహారం మొదలైంది. బ్రహ్మాండమంతా నేనే అని భావించిన నాకు ఒక పరిమితి ఏర్పడింది.

ఇది ఇలా ఎందుకు జరిగిందా అని పరిశీలించాను. గాలికి చలనం ఎంత సహజమో, మనస్సుకు శరీరాది కల్పన గూడా అంతే సహజమని గ్రహించాను. మనస్సుకి ఈ శక్తి ఎలా వచ్చిందా అని చూశాను. ఏ శక్తి ఐతే మనస్సును తయారు చేసిందో, ఆ శక్తియొక్క బలంవల్లనే మనస్సు ఇలా ప్రవర్తిస్తోంది. అందుచేత ఈ సృష్టి కల్పనా వికాసాన్ని నియంత్రించే శక్తి మనస్సు చేతుల్లో గూడా లేదు. ఆ శక్తికే నియతి అని మరో పేరు, మాయా శక్తి అని మరో పేరు.

ఇంద్రియాదులు ఏర్పడ్డ విధానాన్ని మరికొంత వివరిస్తాను, విను. మనస్సు ఏర్పడిందని చెప్పాను గదా. దానిలో అప్పటికే, శుద్ధ చైతన్యం ప్రతిబింబిస్తోంది కనుక, ఆ మనస్సు ఒక నిప్పురవ్వ లాగా కనిపించింది. ఆ రవ్వ చూస్తుండాగానే పెద్దదై మంటగా మారింది. ఆ మంటే, స్థూల శరీరం. ఆ శరీరంలో కొన్ని చిల్లులేర్పడ్డాయి. వాటిల్లో రెండు చిల్లులు రూపాలను చూడడానికి పనికివచ్చేవి. వాటికి లోకులు 'కళ్ళు' అని పేరు పెట్టారు. అవి చూస్తాయన్నారు. నిజానికి పదార్థాలు కనబడాలంటే, దేశమూ, కాలమూ, వెలుతురు, మొదలైన సన్నివేశాలెన్నో కలిసి రావాలి. అదీ గాక, చైతన్య ప్రసారం ద్వారా వస్తు దర్శనానికి నిజమైన కారణం నేను గనుక "నేను చూస్తున్నాను' అనే అనుభూతి నాకే కలిగింది.

ఇదే విధంగా నవరంధ్రాల ద్వారా రకరకాల పనులు జరిగినా, అనుభవాల మూట అంతా నా నెత్తిమీదే పడింది. వీటిని అనుభవిస్తున్న కొద్దీ, నా అహంకారం మరింత పెరిగింది. దానివల్ల బుద్ధి, మనస్సు, మరింత గట్టి పడ్డాయి. అంతకు ముందున్న చిత్తం కేవలం నా ఆకాశత్వాన్ని మాత్రమే చింతించింది. ఇప్పుడు చింతించేందుకూ, స్మరించేందుకూ, కొత్త కొత్త విషయాలేర్పడ్డాయి. అందువల్ల నా చిత్తం గూడా గట్టిపడింది. (మళ్ళీ మళ్ళీ ఆలోచించడం పేరు చింతన. జరిగిన విషయాలను గుర్తు తెచ్చుకోవడం పేరు స్మరణం). ఇలా మనోబుద్ధి చిత్తాహంకారలతో నేను అంతఃకరణ స్వరూపుణ్ణి అయ్యాను. దీనినే అతివాహిక దేహం అంటారు.

నిజానికి నాకు ఇంతకు మించిన దేహం లేదు కానీ, నాకు మనస్సుచేత రకరకాల రూపాలు ఆపాదింపబడుతూనే వున్నాయి. ఆ ప్రవాహాన్ని నేను ఆపలేకపోతున్నాను.

ఈ విధంగా చిరకాలం భావన చేస్తూ వుండేసరికి, నాకే ఒక హిరణ్యగర్భ శరీరం ఏర్పడిందనే అనుభూతి కలిగింది. ఆ శరీరం ఏర్పడేసరికి, పసివాడికి ఏడవాలనే ఆలోచన పుట్టినట్లుగా, నాకు కూడా శబ్దం చేయాలనే కోరిక కలిగింది. పసివాడి శబ్దం "ఉంగా, ఉంగా" అని బయటకు వచ్చినట్లుగా , నా శబ్దం "ఓం" అని బయటికి వచ్చింది. కలగనే మనిషి పాత విషయాలను కలలో స్మరించినట్లుగానే, నాకా ఓంకారంలోంచి ఏవేవో స్మరణలు వచ్చి, భూః, భువః, సువః ఇత్యాది వ్యాహృతులను, గాయత్రీమంత్రాన్ని, చతుర్వేదాలను, క్రమంగా ఉచ్చరించాను. అప్పటినుంచీ, సృష్టికర్తయైన చతుర్ముఖ బ్రహ్మను నేనే అయ్యాను. ఈ పద్నాలుగు లోకాలూ నాకు శరీరమయ్యాయి.

ఇలా మనోమయమైన జగత్తు తయారైంది. అక్కడ నిజంగా వున్నదేదీ లేదు. ఐనా ఎడారి నదుల్లాగా అన్నీ కనిపిస్తున్నాయి. జ్ఞానదృష్టితో చూస్తే, అన్ని చోట్లా శుద్ధ చైతన్యమే కనిపిస్తోంది. మరో దృష్టితో చూస్తే ప్రపంచమే కనిపిస్తోంది.

## 35. యోగుల దృష్టిలో సృష్టిక్రమము

తత్త్వజ్ఞులైన యోగులు సృష్టులను దర్శించే విధానాన్ని చెబుతాను, విను.

రామా! నేను మొదట 'భూమినే నేను' అనే ధారణ చేశాను. దానివల్ల నేను భూరూపాన్ని చెందాను. అంతమాత్రంచేత, నా చైతన్య శరీరాన్ని విడిచిపెట్టలేదు. ఒక చక్రవర్తి తన శరీరం మీద అహంభావాన్ని విడిచిపెట్టకుండానే, 'ఈ రాజ్యమంతా నేనే' అనే అహంభావాన్ని (అభిమానాన్ని) ఎలా ధరించి వుంటాడో, అలాగే నేను గూడా, చైతన్య అహంభావాన్ని, (బ్రహ్మాహంభావాన్ని, నేనే పరబ్రహ్మను అనే భావాన్ని) విడిచిపెట్టకుండానే, భూమ్యంహం భావాన్ని ధరించాను. దానివల్ల 'నేనే భూదేవతను' అనే అధిష్ఠాతృ దేవతా తాదాత్మ్యబుద్ధి నాకు ఏర్పడింది. దానివల్ల భూమిలో వుండే ద్వీపాలూ, కొండలూ, తృణాలు, మొదలైనవన్నీ నా అనుభవానికి వచ్చాయి. ఆ భూమి మీదా, లోపలా, జరిగే సన్నివేశాలన్నీ నాకు స్పష్టంగా తెలిశాయి.

**గమనిక** – వాల్మీకి ఇక్కడ భూమి అనటానికి 'భూపీఠము' అనే పదాన్ని తరచుగా వినియోగించాడు. ఈ 87వ సర్గలో 60వ శ్లోకం దగ్గరినుంచీ మిగిలిన 13 శ్లోకాలు, 88వ సర్గలోని 23 శ్లోకాలూ కూడా, ఈ భూపీఠ వర్ణనకే వినియోగించాడు. ఈ సందర్భంగా, భూమి మీద వుండే రకరకాల ప్రకృతి సన్నివేశాలను, జీవిత సన్నివేశాలనూ గూడా, కవితా మయంగా వర్ణించాడు. ఇంత విపుల వర్ణన దేనికంటే, రాబోయే శ్రీరామ ప్రశ్నకు బలం చేకూర్చటానికే! కనుక మనం ఆ ప్రశ్నలోకి ప్రవేశిద్దాం !

***శ్రీరాముడు***: గురుదేవా! మీరింత వివరంగా భూలోకాన్ని పరిశీలించి చూశారు గదా! దానికోసం 'భూమే నేను' అనే ధారణ చేశారు గదా! మీరు ధారణ చేసిన భూమి మాబోటివాళ్ళం మామూలుగా చూసే పంచభూతమయమైన భూమేనా? లేకపోతే మేము స్వప్నాలలో చూసే మనోమయమైన భూమా?

***వశిష్ఠుడు***: రామా! ఈ ప్రశ్న కల్పనా దృష్టితో వచ్చిందా? తత్త్వ దృష్టితో వచ్చిందా? కల్పనా దృష్టితో అంటావా, అప్పుడు నువ్వు చెప్పే పంచభూత మయమైన భూమి కూడా, మనఃస్సంకల్పంవల్ల పుట్టినదే! కనుక 'ఇది గట్టిదా? కల లాగా ఒట్టిదా?' అనే ప్రశ్నకు అర్థం లేదు.

ఇక తత్త్వదృష్టితో ప్రశ్నవేశానంటావా? ఆ దృష్టిలో దృశ్యం సర్వమూ కూడా శుద్ధ సత్తుయొక్క వికారమే! అంతే గాని, దానిలో కొంత భౌతికమనీ, కొంత స్వాప్నికమనీ, విభాగం చేయడంలో అర్థం లేదు. ఈ విషయం అర్థమయ్యేందుకు ఛాందోగ్యపనిషత్తు ఒక ప్రక్రియను బోధించింది.

'సత్' దేవతలోంచి, 'భూమి, అగ్ని, జలము' అనే ముగ్గురు దేవతలు ఆవిర్భవించారు. ఆ ముగ్గురూ త్రివృత్ కరణ ప్రక్రియచేత కలిసిపోవడం ద్వారా 'భూమి, అగ్ని, జలము' అనే భూతత్రయం ఏర్పడింది. వీటిలో భూమిది నల్లని రూపం. జలానిది తెల్లని రూపం. అగ్నిది ఎఱ్ఱని రూపం. అందువల్ల జ్ఞానులైనవారు ఏ పదార్థాన్ని చూచినా, దానిలో వుండే నల్లటి భాగాన్ని భూభాగంగానూ, తెల్లటి భాగాన్ని జలభాగం గానూ, ఎఱ్ఱటి భాగాన్ని అగ్ని భాగంగానూ, గ్రహిస్తారు. భూమి జలంలోంచి వచ్చింది. జలం అగ్నిలోంచి వచ్చింది. అగ్ని సత్ దేవతలోంచి వచ్చింది. కార్యం వికార రూపం. వికారం నామ మాత్రం. కనుక అసత్యం. కారణమే సత్యం. ఇలా మెట్లు మెట్లుగా పైకెక్కి చూస్తే పరమకారణం సద్దేవతే! కనుక వికారాలన్నీ సద్రూపాలే!

**వాచారంభణం వికారో నామధేయం**

**మృత్తికేత్యేవ సత్యం**

**.......................**

**...................**

**అపాగాదగ్నే రగ్నిత్వం**

**త్రీణి రూపాణీత్యేవ సత్యం**

(వికారం అనేది కొత్త పేరు మాత్రమే. కుండ విషయంలో మట్టి అనేదే సత్యం..... అగ్నిలోంచి అగ్నిత్వం ఎగిరిపోయింది. భూమిజలాగ్నులనే మూడు రూపాలే సత్యం)–

ఇత్యాది వాక్యాల ద్వారా ఛాందోగ్య షష్ఠాధ్యాయంలో ప్రదర్శించిన ప్రక్రియను నువ్వు ఒకసారి తలంచుకుంటే, మనోమయమంటూ ప్రత్యేకంగా ఏదీ మిగలదు,

కనుక రామా! తత్త్వదృష్టితో చూచినప్పుడు, దృశ్యం సర్వమూ సన్మాత్రమే గనుక, దీనిలో కొంత భౌతికమూ, కొంత మానసికము అనే విభాగం కుదరనే కుదరదు. ఈ విషయం నీకిప్పటికి చాలా సార్లు చెప్పాను. (శృణోషి యదిదం చిరం– శ్లో. 14)

నేనిందాక నీకు స్పష్టంగా చెప్పనే చెప్పా! నేను నా చిత్ స్వరూపాన్ని విడిచిపెట్టకుండానే భూధారణ చేశానని! కనుక నేను సాక్షి దృష్టితోనే భూలోక విశేషాలన్నీ దర్శించానని గ్రహించు.

(స. 89)

***శ్రీరాముడు***: గురుదేవా! ఆ తరువాత ఇంకేదైనా లోక విశేషాలు చూశారా?

***వశిష్ఠుడు***: రామా! నేను అలా జాగ్రత్కాల భూరూపాన్నీ, స్వప్నకాల భూరూపాన్నీ కూడా ధరించి, సాక్షి దృష్టితో దర్శించే సమయంలో చెట్టునూ నేనే అయ్యాను. చెట్టుమీది ఆకునూ నేనే అయ్యాను. ఆకు మీది ఈనెనూ నేనే అయ్యాను. ఈనె మీది పురుగునూ నేనే అయ్యాను. పురుగు తాగే రసాన్నీ నేనే అయ్యాను.

ఆ తరువాత నేను జలధారణ చేశాను. అప్పుడు రకరకాల నదీనదాల రూపాలను పొంది, కొండ కొమ్ముల్లోంచి లోయల్లోకి జారిపడ్డాను. ఆవిరినై చెట్లమీదకు ప్రాకాను. ఆ జలంలో వుండే రసరూపాన్నై జీవుల జిహ్వలలోకి దూరాను. అక్కడ రసానుభూతిని పొందాను.

అక్కడ గూడా ప్రతి అణువులోనూ ఇందాకటి రాతిముక్కలో లాగానే, ప్రపంచ సృష్టులను చూశాను. అరటి స్తంభంలో మట్ట లాగా , సృష్టిలోపల సృష్టిగా, లక్షల సృష్టులనూ, ప్రళయాలనూ నేనక్కడ చూశాను. ఆ దృశ్యాలవల్ల అధిష్ఠాన చైతన్యానికి ఏ మాత్రమూ మాలిన్యం అంటటంలేదని నేను అర్థం చేసుకొన్నాను. (స.90)

రామా! ఆ తరువాత 'తేజస్సేనేను' అనే ధారణ చేశాను. దానివల్ల నేను తేజో రూపుడన్నయ్యాను. అప్పుడు చంద్రుడూ, సూర్యుడూ, నక్షత్రాలూ, అగ్నిహోత్రుడు, మొదలైన తేజో విశేషాలన్నీ నాకు అవయవాలై పోయి, నాకు ఎక్కడా చీకటే కనపడ లేదు. నా రూపంలోంచే తెలుపు, నలుపు, ఎఱుపు వంటి రంగులన్నీ

బయలు దేరినాయి. నేను సూర్య చంద్రాదుల రూపంలోనూ, దీపాల రూపంలోనూ వుండడంవల్ల ఇంటింటి రహస్య గాథలూ నాకు కనిపించాయి.

పాతాళలోకం సహజంగానే తమోగుణం అధికంగా వుండడంవల్ల, అక్కడ నా తేజో రూపం కొంచమే ప్రకాశించింది. భూలోకం రజోగుణ ప్రధానం గనుక, అక్కడ నా రూపం మరింత మెరుగుగా ప్రకాశించింది. సత్త్వగుణ ప్రధానమైన స్వర్గలోకంలో నా తేజో రూపం పరిపూర్ణంగా ప్రకాశించింది.

ఐతే ఈ ప్రపంచం మొత్తాన్నీ ఒకే రాశిగా ఆలోచిస్తే, ఇది ఒక పాడునూతి వంటిది. దాంట్లో నీళ్ళూ, చీకట్లూ, ఎప్పుడు నిలవ వుంటూనే వుంటాయి. తేజస్సు అనేది వచ్చి, ఆ చీకటిని పారద్రోలుతూ వుంటుంది.

నీకు తెలుసు గదా! ప్రతి పదార్థాన్నీ అజ్ఞానమనే తెర ఆవరించి వుంటుంది. ఆ పదార్థానికి సంబంధించిన మనోవృత్తి ద్వారా ప్రసరించిన చైతన్యం ఆ తెరను తొలగించినప్పుడే ఆ పదార్థం చూసేవాడియొక్క అనుభవంలోకి వస్తుంది. (ఈ విషయాన్ని ముముక్షు వ్యవహార ప్రకరణంలో "ఇంద్రియం ద్వారా జ్ఞానం కలిగే విధానం" అనే శీర్షిక క్రింద వివరించడం జరిగింది.) అలాగే ఈ తేజస్సు చీకటి అనే తెరను తొలగించి, పదార్థాలను కంటికి కనిపించేటట్టు చేస్తుంది. అందుకే ఈ తేజస్సు శుద్ధ చైతన్యానికి సోదరుడివంటిదని పెద్దలంటారు.

నేను ఈ తేజోరూపంలో వుండడంవల్ల రత్నాదులలో కాంతినయ్యాను. మబ్బుల్లో మెఱుపునయ్యను. చంద్రుడిలో వెన్నెలనయ్యాను. యువతీ యువకులలో కామ విలాసాన్నయ్యాను. వాళ్ళ ముఖాల్లో చిఱునవ్వునయ్యాను. క్రూరమృగాల్లో పరాక్రమాన్నయ్యాను. దేవ దానవులలో శత్రుత్వాన్నయ్యాను. జీవులలో ఓజస్సు నయ్యాను. (ఓజస్సు – ప్రాణశక్తి, ఉత్సాహం). సముద్రంలో బడబాగ్ని నయ్యాను. కొన్ని లోకాల్లో ప్రళయాగ్ని నయ్యాను. కొన్ని చోట్ల దావాగ్నినయ్యాను. కొన్ని చోట్ల యజ్ఞాగ్ని నయ్యాను. కొన్ని చోట్ల గడ్డకట్టి బంగారాన్నయ్యాను. (బంగారం అగ్నియొక్క రూపాంతరమని పురాణ ప్రసిద్ధి.) కొన్ని చోట్ల ఆ బంగారాన్ని దాచుకొనే కోశాగారాలను తగలబెట్టి, బూడిద చేసి, ఆ యజమానుల గుండెలలో దుఃఖాగ్ని నయ్యాను. కొన్నిచోట్ల పండితుల వాదాగ్నినయ్యాను. కొన్ని చోట్ల అవమానాగ్ని నయ్యాను.

కొన్ని చోట్ల సూర్యచంద్రాది రూపంగా సర్వోన్నతంగా ప్రకాశించాను. కొన్ని చోట్ల నికృష్టపు నిప్పురవ్వనై ప్రజల కాళ్ళతో తొక్కించుకున్నాను. కొన్ని చోట్ల విలువ గల వజ్ర వైడూర్యాది రూపాలలో వుండి గూడా వేలకు వేల సంవత్సరాలు ఎవరికీ కనిపించకుండా మట్టిలో కూరుకొనిపోయి వున్నాను.

***శ్రీరాముడు***: గురుదేవా! మీరు ఈ తేజోరూపధారణ సమయంలో సుఖం అనుభవించారా? దుఃఖం అనుభవించారా?

***వశిష్ఠుడు***: నేను సాక్షి మాత్రంగా వుంటూ, నా పరబ్రహ్మ రూపాన్ని విడిచిపెట్టకుండానే ఈ ధారణలు చేస్తూ వచ్చానని ఇందాకనే చెప్పాను కదా! సరదా కోసం జగద్భావాన్ని ఆరోపించుకొని చూచినంత మాత్రాన, సాక్షినైన నాకు నా పరబ్రహ్మత్వం తొలగి పోతుందా? పోదు! అందువల్ల, నాకు దుఃఖం అణువంత గూడా అంటే ప్రసక్తి లేదు. ఒక వేళ నేను పరబ్రహ్మ స్వరూపుణ్ణి కాకుండా, కేవలం జడాగ్ని స్వరూపుడ్ణి అయ్యేటట్లైతే, నాకు అనుభూతి అనేది ఎలా వుంటుంది? 'అది అనుభవించాను, ఇది అనుభవించాను' అనే స్మరణ ఎలా వుంటుంది?

***శ్రీరాముడు***: దానికేమి? సుషుప్తి దశ అంటే జడ దశే కదా! అప్పుడు 'నాకేమీ తెలియ లేదు' అనే అనుభవం వుండడం లేదా?

***వశిష్ఠుడు***: "నాకేమీ తెలియ లేదు" అనే అజ్ఞానాన్ని బట్టి, ఆ సుషుప్తి దశను జడదశ అనేస్తున్నావు. ఆ దశలో ఒక అనుభవం వుంది. ఏమని? 'నాకేమీ తెలియటం లేదు', అని. అనుభవం అనేది చేతన దశవల్ల కలుగుతుంది గానీ జడ దశవల్ల కలుగదు. అందుచేత ఆ దశను జడదశ అనడం తగదు.

***శ్రీరాముడు***: తెలియక పోవడం కూడా ఒక అనుభవమేనా?

***వశిష్ఠుడు***: అది అనుభవమే కాకపోతే, జాగ్రద్దశలో దానిని గురించిన స్మరణ ఎలా కలుగుతోంది? కనుక దానిని అనుభవమని అంగీకరించాల్సిదే! అందువల్ల సుషుప్తి దశలో కూడా చైతన్యం వుందని అంగీకరించ వలసిందే!

ఎప్పుడైతే జాగ్రత్ స్వప్న సుషుప్తులు మూడింటిలోనూ, చైతన్యం అనుస్యూతంగా వుందని తేలిందో, అప్పుడు దానికి వ్యష్టి దేహ సంబంధం గానీ, సమష్టి దేహ సంబంధం గానీ, లేదని తేలిపోతుంది. అప్పుడు అనుభవించే నాకు చైతన్య రూపమైన సూక్ష్మదేహమే మిగులుతుంది. అప్పుడు నాకు దుఃఖం అంటే ప్రసక్తే లేదు. అఖండమైన ఆనందమే నా స్వభావం. ఆ అనుభూతితోనే నేను ఆ సమయంలో తేజో రూపధారినై ప్రతిపరమాణువుయొక్క గర్భంలోనూ రకరకాల ప్రపంచాలను చూశాను. (స.91)

రామా! ఆ తరువాత నేను 'వాయువును నేననే' ధారణ చేసి, వాయు రూపాన్ని పొందాను. బాహ్య వాయువునై చెట్లను, తీగలను, కదిలించాను. మేఘాలనూ, విమానాలనూ, మోశాను. అగ్ని లాగా తేమను ఇంకింప జేశాను. వాద్యాలలో దూరి ధ్వనులు చేశాను. దీపాలవంటి చిన్న చిన్న అగ్నులను ఆర్పేశాను. కారు చిచ్చులవంటి పెద్ద అగ్నులను పెంచాను. వాసనలను మోసుకెళ్ళాను. నేను శ్రమపడుతూ గూడా, ఇతరుల శ్రమను పోగొట్టి సేదతీర్చాను. ప్రళయ సమయాలు వచ్చేసరికి మహాపర్వతాలను గూడా ఎండుటాకుల లాగా ఎగుర గొట్టాను.

ఇక జీవుల శరీరాలలోకి నాడీ శక్తి రూపంగా ప్రవహించి, వాళ్ళ చేతులూ, కాళ్ళూ, కదిలింప చేశాను. వాళ్ళ రక్తాన్ని ప్రవహింప చేశాను. వాళ్ళ సప్త ధాతువులకూ పరిణామాలు కలిగించాను. (చర్మము, రక్తము, మాంసము, కొవ్వు, ఎముకలు, ఎముకలలోని గుజ్జు, శుక్రము అనేవి సప్త ధాతువులు)

ఇక బ్రహ్మాండంలో సూర్య చంద్రాదులను తిప్పాను. నదులను పరుగెత్తించాను. ఇంతెందుకు!? (స్పంద పద్మవనాదిత్యః – శ్లో24) క్రియ అనేది వున్న ప్రతి చోటా దానిని నేనే వికసింప చేశాను.

ఈ విధంగా వాయు రూపధారణ చేసినప్పుడు కూడా ప్రతి పరమాణువులోనూ నేను వేరు వేరు ప్రపంచాలను చూశాను. ఆ ప్రపంచాలలో వుండే పరమాణువులలో మళ్ళీ వేరే ప్రపంచాలను చూశాను. ఇలా ప్రపంచంలో ప్రపంచంగా కనిపిస్తున్న ప్రపంచ పరంపరలన్నీ నా విరాట్ రూపం మీద వాలిన దోమలా అన్నట్లున్నాయి. అలాంటి విస్తృతమైన బ్రహ్మాండ రూపాన్ని ధరించి గూడా నేను నా సూక్ష్మ చిన్మాత్ర స్వభావాన్ని విడిచిపెట్ట లేదు. రామా! ఈ విధంగా చతుర్విధ భూతధారణావిధానంచేత ఎన్నెన్నో బ్రహ్మాండాలను పరిశీలించి చూశాను. వాటన్నిటినీ అనుభవించాను. ఇవన్నీ మాయా విలాసాలే అని గ్రహించాను. జ్ఞానదృష్టితో చూస్తే, ఇవన్నీ వున్నాయా? లేవా? అని ఆలోచించాను. అవి వున్నాయంటే వున్నాయి, లేవంటే లేవు. చైతన్య చమత్కార దృష్టితో చూస్తే, అవి వున్నాయి. కేవల చైతన్య దృష్టితో చూస్తే, అవి లేవు.

**సర్వస్సర్వత్ర సర్వాత్మా**
**సర్వగస్సర్వ సంశ్రయః ।**
**ఏతత్ప్రబుద్ధ విషయ**
**మప్రబుద్ధం న వేద్మ్యహమ్॥** (ని.ఉ.స.92, శ్లో.64)

(ప్రతి చోటా వున్న ప్రతిదీ బ్రహ్మే! ప్రతిదీ సర్వాత్మకమే! ప్రతి చోటా వున్నది అదే! ప్రతిదానికీ ఆధారమూ అదే! అదే పరబ్రహ్మ! ఇది జ్ఞాన దశలో వున్న స్థితి. అజ్ఞాన దశ సంగతి నాకు తెలియదు.) (స.92)

## 36. నా పాత దేహం పోయింది

రామా ! ఈ విధంగా ధారణయోగంతో రకరకాల ప్రపంచాలను చూసిన తరువాత ఆ ఉబలాటం తీరింది. ఇక మళ్ళీ నా కుటీరానికి నేను పోదామనే సంకల్పం కలిగింది. ప్రయాణం చేసి చేసి నా పాత కుటీరం దగ్గరికి వెళ్ళాను. కానీ చిత్రం అక్కడ నా స్థూలదేహం నాకు కనిపించలేదు. పైగా ఎవరో క్రొత్త మహర్షి ఒకాయన ధ్యానం చేసుకుంటూ వున్నాడు. ఆయన వాలకాన్ని బట్టి చూస్తే, ఆయన సామాన్యుడు కాదనీ, నిశ్చల సమాధిలో వున్నాడనీ, నాకు అర్థమైంది. నా దేహాన్ని ఈయనే తగల బెట్టేసి వుంటాడులే అనిపించింది. కానీ, నాకేమీ బాధ కలుగలేదు. పోతే పోయిందిలే అనిపించింది. ఇక నాకు ఈ కుటీరంతో కూడా పనిలేదనిపించింది. ఈ సూక్ష్మశరీరంతోనే సప్తర్షిలోకానికి వెళ్ళిపోదాంలే అనిపించింది.

నాకీ సంకల్పం వచ్చీ రావడంతోనే, నేనింకా వెనక్కి తిరిగీ తిరగక ముందే, ఆకాశ మండలంలో వున్న కుటీరం కాస్తా అంతరించి పోయింది. దానిలో కూర్చున్న మహర్షి బుడుంగున భూమి మీదికి పడడం ప్రారంభించాడు.

నాకప్పుడు అర్థమైంది. ఆ కుటీరం కేవలం నా సంకల్పబలంవల్ల పుట్టింది. కనుక, నేను కుటీరం అక్కరలేదనుకోగానే అది కరిగిపోయింది. అక్కడ వట్టి ఆకాశమే మిగిలింది. నా కుటీరాన్ని ఆధారం చేసుకొని కూర్చున్న కొత్త మహర్షికి ఆధారం లేకుండా పోయింది. అందుకే ఆయన కిందికి పడిపోతున్నాడు.

మామూలుగా ఆకాశంలోంచి పడేవాడు తల్ల కిందులుగా పడతాడు. కానీ ఈయన ప్రాణాయామబలంచేత ప్రాణవాయువుతో తన శరీరం మొత్తం నింపుకొని వున్నాడు కనుక, నిటారుగానే కిందకు పడడం మొదలు పెట్టాడు.

నాకు ఉత్సుకత పెరిగి, ఈయన ఏమౌతాడో చూద్దామని ఆయన వెంటే కిందికి దిగాను. నేను చూస్తూ వుండగానే ఆయన భూమి మీద చతికల పడ్డాడు. అది వజ్ర దేహమో, దూదిపింజ దేహమో, నేను తేల్చి చెప్పలేను గాని, అంత ఎత్తు నుంచీ పడ్డా ఆ దేహానికి ఏమీ కాలేదు. ఆయన సమాధి కూడా చెదర లేదు.

నాకు ఉత్సుకత మరింత పెరిగి, నా సంకల్పబలంచేత మేఘ రూపాన్ని ధరించి, వానధారలు కురిపించి, పిడుగు మోతలు మ్రోగించి, ఎలాగోలా ఆయనను సమాధి నుంచి లేపాను. ఆయన ప్రశాంతంగా కళ్ళు తెరిచి, విశ్రాంతిగా కూర్చున్నాక, నేను ఆయన ఎదుట కనిపించి–

"అయ్యా! మీరెవరు? ఏం చేస్తున్నారు? అంత ఎత్తునుంచీ కింద పడ్డా కూడా మీకు తెలివి రాలేదే!" అని అడిగాను.

ఆయన ఒక నిమిషం అయోమయంగా చూసి మెల్లగా తేరుకొని, నాకో నమస్కారం పెట్టి, ఇలా చెప్పాడు –

"బ్రహ్మర్షీ! మిమ్మల్ని ఇప్పుడిప్పుడే గుర్తు పడుతున్నాను. జరిగిన ఆలస్యానికి క్షమించండి. మీకు నమస్కారం. నా సంగతులు కూడా నాకు ఇప్పుడిప్పుడే గుర్తు వస్తున్నాయి. నేను గూడా ఒకప్పుడు సంసార మోహాలలో పడి కొట్టుకుపోయిన సామాన్య జీవినే. ఆ దశలో నేను ఎన్నెన్ని మూఢ కృత్యాలు చేశానో నాకే ఆశ్చర్యంగా వుంది. కానీ, చాలా కాలం గడిచినాక దైవానుగ్రహంవల్ల నాకు వైరాగ్యం కలిగింది."

**గమనిక**–ఆ కొత్త మహర్షిచేత ఈ రెండు ముక్కలూ చెప్పించడానికి వాల్మీకి మహర్షి దాదాపు అరవై శ్లోకాలు తీసుకొన్నాడు. వీటిలో సాంసారిక ప్రవృత్తి ఎంత నీచంగా వుంటుందో, నిరర్థకంగా వుంటుందో, విపులంగా వివరించాడు. ఉదాహరణకు ఒక శ్లోకం చెప్పుకుందాం!

**జీర్యన్తే జీర్యతః కేశాః**
**దన్తా జీర్యన్తి జీర్యతః।**
**క్షీయతే జీర్యతే సర్వం**
**తృష్ణైవైకా న జీర్యతే ॥** (ని.ఉ.స.93, శ్లో. 86)

(మనిషికి ముసలితనం వస్తే, వాడి జుట్టుకీ ముసలితనం వస్తుంది. పళ్ళకీ ముసలితనం వస్తుంది. అవయవాలన్నీ ముసలివై క్షీణించి పోతాయి. ఆశ ఒక్కటీ మాత్రం ముసలిది కానే కాదు.) ఇలాంటి శ్లోకాలు ఇక్కడ కొల్లలు కొల్లలు. మొత్తం కలిపి సారాంశం సంసారంయొక్క అల్పత, వైరాగ్యంయొక్క మహత్తు. ఈ విషయాన్ని గ్రహించి ముందుకు సాగుదాం.

ఆ కొత్త మహర్షి ఇలా కొనసాగించాడు–

"బ్రహ్మర్షీ! ఆ విధంగా వైరాగ్యం కలిగాక, యోగాభ్యాసం ప్రారంభించి, ఏకాంత ప్రదేశం కోసం వెతుక్కుంటూ ఆకాశంలో చాలా తిరిగాను. ఇక్కడ ఒక ఖాళీ కుటీరం, దాంట్లో నిశ్చలంగా వున్న శరీరం, కనిపించాయి. ఎవడో సిద్ధ పురుషుడు తన శరీరాన్ని వదిలేసి ముక్తికి వెళ్ళిపోయాడని నేను భావించాను. అందుకే ఆ శరీరాన్ని ప్రక్కన పారేసి, నేనిక్కడ సమాధిలో కూర్చున్నాను. ఇది మీ కుటీరమనీ, మీరు శరీరాన్ని క్రీడగా విడిచిపెట్టి లోకాంతర సంచారానికి వెళ్ళారనీ, నాకు తెలియదు. ఆ హిరణ్యగర్భుడికైనా సరే, బుద్ధిని ఏకాగ్రం చేసి జాగ్రత్తగా విచారించక పోతే, భూతభవిష్యద్వర్తమాన విషయాలు సరిగ్గా తెలియవు. ఇక నేనెంత? కనుక నేను చేసిన తప్పును క్షమించండి. లేదా మీకు తోచిన శిక్షను విధించండి"–అని (స.93)

***వశిష్ఠుడు***: రామా! ఆ మాటలు విని నేను ఆయనతో ఇలా అన్నాను. "మహర్షీ! ఇందులో నా తప్పు కూడా వుంది. నేను మీరు ఇలా పడిపోతారని ఊహించలేదు. ఊహించి ఉంటే, ఆ కుటీరం స్థిరంగా వుండేటట్టు సంకల్పించి వుండేవాణ్ణి. ఎంతటి యోగులకైనా, జాగ్రత్తగా ఆలోచిస్తే తప్ప, భూతభవిష్యత్తులు ప్రత్యక్షం కావని మీరు చెప్పిన మాట నిజం. ఇద్దరి దగ్గరా తప్పు వుంది. గనుక, ఇద్దరమూ ఒకరి నొకరు క్షమించుకుందాం. లేవండి! ఇద్దరమూ యథేచ్ఛగా సిద్ధలోకాలలో విహరిద్దాం." అని.

ఆయన అంగీకరించాడు. వెంటనే మేమిద్దరం శిలాయంత్రం విసిరిన రాళ్ళు లాగా ఒకే సారి ఆకాశంలోకి ఎగిరాం. కొంత దూరం పోయాక, ఒకరికొకరు నమస్కారాలు పెట్టుకుంటూ, ఎవరి దోవన వాళ్ళం వెళ్ళిపోయాం. నేను నాకు తోచిన లోకాలలో విహరించాను.

## 37. సంకల్పాల బలాబలాలు

***శ్రీరాముడు***: గురుదేవా! మీ స్థూల దేహం నశించి పోయింది గదా! మరి ఏ శరీరంతో సిద్ధ లోకాలలో విహరించారు?

***వశిష్ఠుడు***: ఆఁ.. గుర్తొచ్చింది. విను. నేను ముందుగా ఇంద్రలోకం వెళ్ళాను. నేనప్పుడు కేవలం మనోమయ శరీరంతో వున్నాను కనుక అక్కడి వారెవరూ నన్ను గుర్తు పట్టలేదు. వాళ్ల మాటలు నాకు వినిపించలేదు. నా మాటలు వాళ్లకు వినిపించ లేదు. అక్కడి గోడలు గానీ, స్తంభాలు గానీ నాకు అడ్డం కాలేదు. నావల్ల వాటికీ దెబ్బ తగల లేదు.

***శ్రీరాముడు***: ఇదెలా సంభవం?

***వశిష్ఠుడు***: స్వానుభవం లేనప్పుడు నువ్వు ఇలాంటి విషయాలను ఊహించి తెలుసుకోవలసిందే! వీటిని ఊహించటానికి స్వప్నానుభవాలే మంచి దృష్టాంతాలు.

**శ్రీరాముడు**: అసలు, అనుభవాల విషయంలోనే వాగ్వాదాలు ఉన్నాయి కదా! ఉదాహరణకు, న్యాయశాస్త్రంవారు దేహం లేకపోతే జ్ఞానం కలగదనీ, అందుకే సుషుప్తిలో కలిగేది జ్ఞానం కాదనీ, అంటున్నారు గదా!

**వశిష్ఠుడు**: నీ అనుభూతి నీకే తెలుసు. దాని విషయంలో మొండి వాదాలు చేసే వారితో మౌనంగా వుండడమే మంచిది. (ఈ పై వశిష్ఠవాక్యాలు వ్యాఖ్యాత ఇచ్చిన వివరణలు.) రామా! సుషుప్తి సమయంలో నేను సుఖంగా వున్నాననే స్మృతి నీకుంది. జ్ఞానం లేనిదే, స్మృతి రాదు. కనుక న్యాయశాస్త్రంవారి వాదనను మనం పట్టించుకో నక్కరలేదు. అదీ గాక

**స్వప్నే శారీర మభిప్రహత్య**
**అసుప్తస్సుప్తానభిచాకశీతి ।**
**శుక్రమాదాయ పునరేతి స్థానం**
**హిరణ్మయః పురుష ఏకహంసః॥**

(బృ.ఆ.అధ్యా 4,బ్రహ్మణం-3, మంత్రం-11)

(స్వప్న దశలో శరీర సంబంధాన్ని వదిలేసినప్పటికీ, తన విజ్ఞాన స్వరూపాన్ని వదిలి పెట్టకుండా వుంటూ, వాసనారూపాలైన దృశ్య పదార్థాలను తనే ప్రకాశింప చేస్తూ వుంటాడు. ఆ తరువాత ఇంద్రియ మాత్రలను తీసుకుని మళ్లీ జాగ్రద్దశకు చేరుకుంటాడు. ఇట్టి యీ జీవుడు నిత్య చైతన్య స్వభావుడు. మూడు అవస్థలలోకీ సంచరించేవాడు ఇతడు ఒక్కడే)- అనే శ్రుతివాక్యం శరీరం లేకపోయినా జ్ఞాన సంబంధం వుంటుందని స్పష్టంగా చెబుతోంది.

అదీ గాక, నా స్వానుభవంలో పూర్వం నిమి చక్రవర్తి నన్ను శపించినప్పుడు, నాకు శరీరం లేకుండా పోయింది. అప్పుడు నేను చాలా కష్టాలు పడ్డాను. చివరికి బ్రహ్మదేవుడి సాయంతో మిత్రావరుణులవల్ల పుట్టిన శరీరాన్ని స్వీకరించాను. ఇది నా స్వానుభవం. ఇలా శ్రుతి ప్రమాణం, స్వానుభవం, కలిసి వున్నాయి కనుక, న్యాయశాస్త్రంవారి వాదాన్ని ఉపేక్షించవచ్చు.

**శ్రీరాముడు**: గురుదేవా! మీకు దేహం లేదు గనుక ఇంద్ర లోకంలోనివారు మిమ్మల్ని గుర్తించ లేకపోతే, ఆ కొత్త మహర్షిగారు మిమ్మల్ని ఎలా చూడ గలిగారు?

**వశిష్ఠుడు**: ఆయనా నేనూ కూడా, జ్ఞానయోగ సిద్ధులం గనుక, సత్య సంకల్ప స్థితిని సాధించాం. ఆ సమయంలో "నేను ఈ మహర్షి నన్ను చూడాలి" అని సంకల్పించాను. ఆయన గూడా దానికి అనుగుణంగానే సంకల్పించాడు. అందుకే ఆయన నన్ను చూడ గలిగాడు.

**శ్రీరాముడు**: ఇద్దరు యోగులూ పరస్పర విరుద్ధంగా సంకల్పిస్తేనో?

**వశిష్ఠుడు**: ఎవడి యోగబలం ప్రబలంగా వుంటే వాడి సంకల్పమే గెలుస్తుంది.

**శ్రీరాముడు**: ఇద్దరి బలం సమానంగా వుంటే?

**వశిష్ఠుడు**: అప్పుడు ఇద్దరి సంకల్పాలూ నిజమౌతాయి. ఈ విషయాన్ని రాబోయే సర్గల్లో మరింత వివరిస్తాను. (వరశాప అవిరోధం అనే సర్గ.) ముందు పై కథ విను.

నేను అలా ఇంద్రలోకంలో లోకపాలుర పట్టణాలలో తిరుగుతూ వుండగా వుండగా, నా మనస్సు వ్యవహారపు ఆందోళనలలో పడి, నేను నా ఆతివాహికత్వాన్ని కొద్దిసేపు మరిచిపోయాను. అంటే, 'నేను మనోమాత్ర స్వరూపుణ్ణి' అనే మాట మరచిపోయాను. ఐనా నేను వాళ్ళకెవరికీ కనిపించడం లేదు. అందువల్ల నా పరిస్థితి ఆకాశంలో తిరిగే పిశాచం లాగా అయిపోయింది.

మానవులకంటే సూక్ష్మమైనవి గనుక, పిశాచాలు మానవులకు కనిపించవు. దేవతలకైతే కనిపిస్తాయి. నేను దేవతలకంటే సూక్ష్మమైన మనోమాత్ర శరీరంతో వున్నాను కనుక, వారికి కనిపించక, దేవలోక పిశాచం

లాగా అయిపోయాను.

**శ్రీరాముడు**: గురుదేవా! నిజంగా పిశాచాలనేవి వున్నాయా? ఉంటే వాటి జాతులేమిటి? వాటి ఆచారాలేమిటి? వాటి ఆలోచన లేమిటి? కొంచెం వివరించండి?

**వశిష్ఠుడు**: రామా! ఇది ప్రసంగవశాన వచ్చిన ప్రశ్న కనుక సంగ్రహంగా చెబుతా, విను.

పిశాచాలున్నాయి. నీ స్వప్నలోక శరీరాల్లాగానే, వాటికీ మనోమయ దేహాలున్నాయి. ఐతే, అవి నీ జాగ్రత్ప్రపంచాన్ని చూడగలవు. ఆ ప్రపంచంలోని మనుష్యుల మనస్సుల్లో దూరి, వారికి రకరకాల భయాలూ, భ్రాంతులూ కలిగించ గలవు. ఆ మనస్సుల ద్వారా శరీరాలను గూడా ఆవహించి, వారి వారి ఋణానుబంధాన్ని బట్టి, ఆ రక్త మాంసాలను పీల్చుకో గలవు. ఒకప్పుడు చంపను గూడా చంప గలవు.

ఈ పిశాచాల ఆకారాలూ, శక్తులూ, రక రకాలూగా వుంటాయి.వాటికి సంక్రమించే పూర్వ జన్మ వాసనలే దానికి కారణం. వాటిలో కొన్నిటికి స్థూల శరీరం లేక పోయినా, శీతోష్ణాదులవల్ల బాధ మాత్రం వుంటుంది. అన్నిటికీ కామక్రోధాదులు సహజం.

**మంత్రౌషధ తపో దాన**

**ధైర్య ధర్మ వశీకృతాః ॥** (ని.ఉ.స. 94, శ్లో.38)

వీటిని చూడడానికీ, చూశాక వశపరచుకోడానికీ, రక రకాల మార్గాలున్నాయి. మంత్రాలూ, మందులూ, తపస్సులు, దానాలు, గట్టి ధైర్యము, మంచి ధర్మశీలత, వంటివన్నీ ఆ ఉపాయాలే!

మామూలుగానైతే, పిశాచం అనేది ఆవహించబడినవాడి అనుభవానికి తెలుస్తుంది తప్పితే, ఇతరులకు ఏమీ తెలియదు. (ఈ పిశాచ వివరణకు వాల్మీకి మహర్షి 55 శ్లోకాలు తీసుకున్నాడు.)

ఇంతకూ నా పరిస్థితి ఇంద్రలోక పిశాచం లాగా ఐపోయింది. (స.94)

## 38. నాకు స్థూలదేహం లేనే లేదు

ఆ తరువాత నేను "వీళ్ళంతా నన్ను చూడాలి, నాతో వ్యవహరించాలి" అనే సత్య సంకల్పం చేశాను. దాంతో నేనెక్కడికి వెళితే అక్కడ అందరికీ కనిపించాను. వాళ్ళంతా నన్ను గుర్తించారు. కానీ అక్కడో విచిత్రం జరిగింది.

కొంతమందికి నేను వాళ్ళ ఇళ్ళ ముంగిళ్ళలో భూమిలోంచి మొక్క లాగా మొలుచుకొని వచ్చినట్లు కనిపించాను. అలాంటి వాళ్లు నన్ను పార్థివ వశిష్ఠుడన్నారు. మరి కొంతమందికి సూర్య కిరణాల్లోంచి రాలి పడినట్లు అనిపించింది. వాళ్ళు నన్ను తైజస వశిష్ఠుడన్నారు. మరి కొంతమందికి నేను గాలిలో తేలిపోతూ దిగినట్లు కనిపించింది. వాళ్ళు నన్ను వాయు వశిష్ఠుడన్నారు. మరి కొంతమందికి నేను నీళ్ళలోంచి పైకి తేలినట్లు కనిపించింది. వాళ్ళు నన్ను జల వశిష్ఠుడన్నారు.

ఇలా నాకు తలో చోటా తలో పేరూ వచ్చింది. రకరకాల వ్యవహారాలు జరిగాయి. ఐనా సరే, నేను మాత్రం ఆ దేహాలలో ఏ ఒక్కటీ నాదని అనుకోలేదు. అవే నేననుకోలేదు. నా చిదాత్మ స్ఫూర్తికి భంగం కలుగ లేదు.

అప్పుడే గాదు, ఇప్పటికీ నేనలాగే వున్నాను. నేను విశుద్ధమైన ఆకాశ స్వరూపుడిగా వుంటూనే, మీబోటివాళ్ళ బుద్ధిని అనుసరించి భౌతిక దేహంతో కనిపిస్తున్నాను. నాకు ఈ సృష్టులన్నీ ఏ విధంగా మనో మాత్రలో, అలాగే ఆ హిరణ్యగర్భుడికి ఈ జగత్తు అంతా బ్రహ్మాత్మకం.

ఇలాంటి వివేకం లభించాలంటే, ఈ యోగవాశిష్ఠంవంటి శాస్త్రాన్ని పరిశీలిస్తే చాలు.(మహారామాయణప్రాయ శాస్త్రావేక్షణ మాత్రతః- శ్లో. 29) (స.95)
రామా! నేను చెప్పదలచుకున్న పాషాణోపాఖ్యానం పూర్తైంది.

దీనివల్ల-

**న చ స్థితం కించనాపి**
**క్వచనాపి కదాచన ।**
**స్థితం బ్రహ్మఘనే బ్రహ్మ**
**యథాస్థిత మఖండితమ్ ॥** (ని.ఉ.స.96, శ్లో.2)

ఎప్పుడూ, ఎక్కడా, ఏదీ లేనే లేదు! బ్రహ్మలో బ్రహ్మే అఖండితంగా వుంది. ఉన్నదున్నట్టుగానే వుంది- అని నిరూపించాను.

స్వప్నం చూసేవాడూ చిద్రూపుడే! స్వప్నంలో చూడబడే కొండలూ, కోనలూ చిద్రూపాలే! చిత్‌కంటే భిన్నంగా అక్కడ ఏదీ లేదు. ఏమీ లేకుండానే ఏదో వున్నట్టు కనిపిస్తోంది. ఈ జాగ్రత్ప్రపంచం కూడా అంతే! సృష్టినుంచి మహాప్రళయం దాకా మొత్తం అంతా అంఖండ బ్రహ్మే వుంది.

**చితిరేకాస్తి నో సర్గో**
**హేమాస్తి న తదూర్మికా ।**
**స్వప్నాచలే చిదేవాస్తి**
**న తు కాచన శైలతా॥** (ని.ఉ.స. 96, శ్లో. 8)

శుద్ధ చైతన్యం ఒకటే వుంది. సృష్టి అనేది లేనే లేదు. బంగారమే వుంది. బంగారపు ఉంగరమనేది లేనే లేదు. కలలోని కొండలో చైతన్యమే వుంది. వేరే కొండతనం అంటూ ఏమీ లేదు.

ఈ విషయం చెప్పడానికే నేనీ పాషాణోపాఖ్యానాన్ని ప్రారంభించాను. దానినే నిరూపించాను. దానినే మరి కొంత వినిపిస్తాను, విను.

**గమనిక** - ఈ నిర్వాణ ప్రకరణం ఉత్తరార్థంలో మొదట్లో సాధనా మార్గాలూ, సాధనా సోపానాలూ, వంటివి వివరించిన తరువాత భూమ్యాది చతుర్భూతాలు మాత్రమే కాక, ఆకాశ కాలాదులు కూడా చైతన్య స్వరూపాలే అనే విషయం మీద వశిష్ఠ మహర్షి తన బోధను కేంద్రీకరించి, ఆ విషయాన్ని నిరూపించేందుకోసం, పాషాణోపాఖ్యనమనే కథను రక రకాల సృష్టి ప్రళయ వర్ణన పురస్సరంగా విస్తరించి చెప్పాడు. కథ పూర్తైనాక, కథా సారాంశాన్ని మరో సారి నెమరు వేయడం ఆయన అలవాటు. దాని ప్రకారమే ఈ 96వ సర్గలో జగత్తు అనేది లేనే లేదు- అనే మాటను రక రకాల తర్కాలతో పునరుక్తిగా నిరూపించాడు. పదార్థం లేకుండానే పదార్థం కనిపిస్తోంది అనే మాటను రకరకాలుగా చెబుతాడు గానీ, మూలంలో "వివర్తం" అనే పదాన్ని సామాన్యంగా వాడడు. భావం అదే. ఐతే వివర్తపదం నిర్వాణ ప్రకరణ పూర్వ భాగంలో 113 సర్గలో 205 శ్లోకంలో సూటిగా వచ్చింది.

"ఏమీ లేకుండానే ఏదో ఒకటి వున్నట్టు ఎందుకు కనిపిస్తోంది?" అనే ప్రశ్నకు సమాధానంగా అవిద్యను ఆయన మళ్ళీ వివరించబోతున్నాడు. దానికోసం విపశ్చి దుపాఖ్యానమనే కథను సుమారు 55 సర్గలకు పైగా సాగదీసి చెప్పబోతున్నాడు.
ఆ కథ 108వ సర్గలో ప్రారంభం కాబోతోంది. 96 నుంచీ 107 దాకా గల 12 సర్గలను ఆయన రాబోయే ఆ కథ కోసం పీఠికగా వాడుకో బోతున్నాడు. దానిని దృష్టిలో పెట్టుకొని ఈ పన్నెండు సర్గలను మనం సంగ్రహంగా పరిశీలిద్దాం. అందులో 96వ సర్గలో గల 42 శ్లోకాలలోనూ ప్రధానంగా పూర్వకథా సారాంశాన్నే తిప్పి తిప్పి చెప్పాడు.

ఈ ప్రపంచంలో వున్నదంతా చైతన్యమే గనుక ఎవ్వరూ పుట్టటం లేదు, చావడం లేదన్నాడు. ప్రతివాడికీ 'నేను చైతన్యాన్నే' అనే స్ఫురణ స్వయంగానే కలుగుతోందన్నాడు. కనుక ఒకడు చచ్చిపోయాడని ఒప్పుకుంటే, చైతన్యమే చచ్చిపోయిందని ఒప్పుకున్నట్టు అవుతుంది. అది నిజంగా చచ్చిపోతే, ప్రపంచంలో ఏ ఒక్క జీవీ బ్రతికి వుండడానికి వీలు లేదు. ఇది లోక విరుద్ధం. కనుక ఎవడూ మరణించడం లేదు. అని ఒక విచిత్రమైన తర్కాన్ని ఇక్కడ ప్రవేశ పెట్టాడు. ఎవడూ మరణించడం లేదు గనుక, ఎవడూ పుట్టడం లేదన్నాడు. చివరికి ఒక వింత మాట చెప్పాడు–

**న తదస్తి న యత్సత్యం**
**న తదస్తి న యన్మృషా ।**
**యద్యథా యేన నిర్ణీతం**
**తత్తథా తం ప్రతి స్థితమ్ ॥** (ని.ఉ.స. 96, శ్లో.41)

సత్యం కానిదంటూ ఏదీ లేదు, అసత్యం కానిదంటూ కూడా ఏదీ లేదు. ఎవడు దేనిని ఎలా నిర్ణయించుకుంటే, వాడికి అది అలా వుంటుంది – అని.

దీనిని అవిద్యతో సమన్వయించడం కోసం పై సర్గలలో ఆయన కొంత వివరణ ఇచ్చాడు. దానిని ఆయన మాటలలోనే విందాం (స. 96)

## 39. విపశ్చిదుపాఖ్యాన పీఠిక

***వశిష్ఠుడు***: రామా! లోకంలో ఎవరి అనుభవం వారిది. అందుకే తత్త్వస్థితిని గురించి రకరకాల వాదాలు బయలు దేరాయి. ఎవరినీ కాదనడానికి వీలు లేదు. (ఇక్కడ పేర్లు చెప్పకుండా కణాద, గౌతమ, సౌత్రాంతిక, వైశేషిక, ఆర్హత, చార్వాక, వాదాల ప్రసక్తి తెచ్చారు. బౌద్ధం పేరు వాచ్యంగా చెప్పారు.) ఒక సిద్ధాంతానికి తనను తాను కట్టేసుకుంటే, వాడికి అలాంటి ఫలితమే కనిపిస్తుంది. అందువల్ల సిద్ధాంతాలకు కట్టుబడక, పండితులతో కలిసి లోతుగా విచారించాలి.

"తత్త్వవేత్తలైన పండితులెక్కడ దొరుకుతారు?" అని సందేహంచ వలసిన పని లేదు. వాళ్ళు ఏ జాతిలో ఐనా చాలా అరుదే గాని,ప్రతి జాతిలోనూ ఎందరో కొందరు వుండనే వుంటారు. (స.97)

తత్త్వవేత్తలకు ప్రధాన చిహ్నమేమిటంటే, కామక్రోధాది దోషాలు చాలా మటుకు క్షీణించిపోయి వుంటాయి. వారు ప్రశాంతంగా వుంటారు.

**న నాస్తిక్యా న్నచాస్తిక్యా**
**త్కష్టానుష్ఠాన వైదికాః ।**
**మనోజ్ఞ మధురాచారాః**
**ప్రియపేశల వాదినః ॥** (ని.ఉ.స. 98, శ్లో.3)

నాస్తికత్త్వంవల్లగానీ, ఆస్తికత్త్వంవల్లగానీ, వారు మొండి ఛాందసపు అనుష్ఠానాలలో పడరు. వారి ప్రవర్తన మధురంగా, వారి వాక్కు సుకుమారంగా, వుంటాయి. వారు పరోపకారశీలురుగా వుంటారు. అలాంటివారిని బాగా పరిశీలించి వారితో స్నేహం చేయాలి.

ఇలా అన్నంతమాత్రంచేత, వారిలో అసలు దోషాలే వుండవని చెప్పలేం.

**దోషలేశ మనాదృత్య**
**నిత్యం సేవేత సజ్జనమ్ ।**

**స్థూలదోషం త్వనిర్వాణం**
**శనైః పరిహరేత్క్రమాత్ ॥** (ని.ఉ.స.98, శ్లో.20)

(చిన్న చిన్న దోషాలుంటే వాటిని పట్టించుకోకుండా ఆ సత్పురుషుణ్ణి సేవించాలి. ఒకవేళ తాను ఆశ్రయించిన సత్పురుషుడిలో పెద్దపెద్ద దోషాలున్నాయని, తత్త్వజ్ఞానం లేదని, తేలితే, అతనిని మెల్లమెల్లగా వదిలి వేయాలి.)

***శ్రీరాముడు***: గురుదేవా! మనబోటి మానవులకు ఇలా సత్సంగత్వాది ఉపాయాలు వుండవచ్చు. వాటివల్ల ఆనందం కలుగవచ్చు. మరి క్రిమికీటకాదులకు ఇవేవీ లేవు గదా! వాటికి దుఃఖం ఎలా పోతుంది? సుఖం ఎలా కలుగుతుంది?

***వశిష్ఠుడు***: రామా! సుఖదుఃఖానుభవం వచ్చేసరికి, మానవులకు గానీ, క్రిమికీటకాదులకు గానీ, వృక్షగుల్మాదులకు గానీ, పెద్ద భేదం లేదు.

**సుప్తానాం యాదృగస్మాకం**
**వేదనం స్పష్ట సుత్వచామ్ ।**
**వృక్ష గుల్మాంకురాదీనాం**
**తాదృగుద్దామ వేదనమ్ ॥** (ని.ఉ.స. 99, శ్లో.16)

(మనకు సుకుమారమైన చర్మం వుంది. మనం నిద్రలో వున్నప్పుడు దోమలు కుడితేనో, చల్లగాలులు వీస్తేనో, ఎంతో కొంత సుఖదుఃఖజ్ఞానం కలుగుతోంది. వృక్షాలూ, గుల్మాలూ, మొలకలూ, మొదలైనవాటికి గూడా ఇలాంటి స్వల్ప సుఖదుఃఖజ్ఞానం ఉంటుంది.)

వీటికంటే కొంచెం స్పష్టమైన ఇంద్రియాలు గల పశుపక్ష్యాదుల దగ్గరకు వస్తే, ఇంద్రియ సుఖాలు మనకూ వాటికీ సమానమే! (సుఖతశ్చేంద్రకీటయోః – శ్లో.18 – ఇంద్రుడి సుఖమూ, కీటక సుఖమూ ఒకటే!) ఇక బండరాళ్లు మొదలైన జీవుల పరిస్థితి గాఢ సుషుప్తిలోకి వెళ్ళిన వృక్షాలలాగా వుంటుంది. (నిద్రామయానాం వృక్షాణాం స్వసత్తా మచలాదయః – శ్లో. 21)

గమనించవలసిన విషయం ఏమిటంటే, ఈ రకమైన జీవులందరికీ, ఎంతో కొంత సుఖదుఃఖజ్ఞానం వున్నా, మానవేతర జీవులకు వివేక జ్ఞానం వుండే అవకాశం లేదు.

కనుకనే మానవులకు మాత్రమే "ఈ జగత్తు సత్యమా? అసత్యమా?" అనే విచారణ ఉపదేశింపబడుతోంది(స. 99)

***శ్రీరాముడు***: గురుదేవా! శుద్ధనాస్తికులు కొందరున్నారు. వాళ్ళ దృష్టిలో కంటికి కనిపించదు గనుక మృత్యువనేదే లేదు. ఇక పునర్జన్మలకూ, మోక్షానికీ, ప్రసక్తి ఎక్కడ వుంటుంది? ఇలాంటి నాస్తికులకు ఈ సంసార దుఃఖం శమించే ఉపాయం ఏదైనా వుందా?

***వశిష్ఠుడు***: రామా! ఇక్కడ ఒకటే కిటుకు వుంది. ఎంత నాస్తికులైనా, ఎంత దేహాత్మవాదులైనా, వారి దేహాత్మ భావానికి కారణం దేహం కావడానికి వీలు లేదు. ఎందుకంటే, అది జడం. కనుక వారి దేహాత్మ భావానికి కారణం చైతన్యమే అని ఒప్పుకోవాలి. ఆ విధంగా, వారికి గూడా చైతన్యంతో నిత్య సంబంధం వుండనే వుంది. కనుక ఆ చైతన్య స్వరూపం ఏమిటనే విచారణలోకి వారిని ప్రవేశ పెడితే, అప్పుడు వాళ్లకు కూడా అవిద్య నశించి శాస్వతానందం లభించే అవకాశం వుంది. (స.100)

అలా అవిద్య నశించి, సర్వవ్యాపియైన చైతన్యాన్ని దర్శించేవారికి దుఃఖభయ ప్రసక్తి గానీ, మరణభయ ప్రసక్తి గానీ లేనే లేదు. అలాంటివారు ఎల్లప్పుడూ ఆనంద స్థితిలోనే వుంటారు.

అసలు ఎవరికైనా సరే మరణం అంటే భయం అనవసరం. ఒకడు శుద్ధ నాస్తికుడైతే, వాడి దృష్టిలో

మరణమే చివరి మజిలీ గనుక, దానిని గురించి భయపడవలసిన పని లేదు. ఒకడు జగత్తే శూన్యమని గానీ, క్షణికమని గానీ, అనుకునేటట్లైతే, వాడికీ మరణం అంటే భయపడవలసిన పని లేదు. ఒకడు పునర్జన్మలున్నాయని నమ్ముతుంటే, మరణించినవాడికి కొత్త జన్మ ఖాయం గనుక, వాడు గూడా భయపడవలసిన పని లేదు. మరణిస్తే నరకానికి పోవలసి వస్తుందేమోననే ఆలోచన వస్తే, అప్పుడు నరకాన్ని తప్పించుకున్నా, ఈ లోకంలోనైనా పాపఫలితాలను అనుభవించక తప్పదు. అందువల్ల మరణాన్ని గురించి ఎవరూ కొత్తగా భయపడవలసింది ఏమీ లేదు.

కనుక మరణ చింతన వదిలేసి తత్త్వ చింతన అలవరచుకుంటే, మానవులకు భయ ప్రసక్తే లేదు. (స. 101)

***శ్రీరాముడు***: గురుదేవా! మీరు చెప్పిన తత్త్వజ్ఞానాన్ని సంపాదించుకున్నవాడి లక్షణాలెలా వుంటాయో కొంచెం చెప్పండి.

**గమనిక** – జీవన్ముక్తుల లక్షణాలను గురించి వెనుకటి ప్రకరణాలలో మూడు, నాలుగు సార్లు ప్రసక్తులు వచ్చాయి. ఆ లక్షణాలు స్వంతంగా వాటంతటవి పుట్టకపోయినా, వాటిని పట్టుబట్టి అభ్యాసం చేసుకున్నా, తత్త్వజ్ఞానం సిద్ధిస్తుందనే విషయాన్ని నొక్కి చెప్పడం కోసం జీవన్ముక్త లక్షణాల వర్ణన జరుగుతోందని పూర్వమే చెప్పారు. ఇక్కడ మళ్లీ అదే దృష్టితో అదే ప్రసక్తిని తీసుకొచ్చారు. 62 శ్లోకాలు వున్న ఈ సర్గలో వైరాగ్య సాధనకు ప్రాణం పోసే వాక్యాలెన్నో వున్నాయి. వాటితో పాటు సామాన్య మానవుడికి కూడా కలిగే సందేహం ఒక దానిని దీనిలో ప్రస్ఫుటంగా ప్రస్తావించారు. దానికోసం సంగ్రహంగా ఈ సర్గ విశేషాలను చెప్పుకుందాం.
***వశిష్ఠుడు***: రామా! ఏం చెప్పేది? తత్త్వవేత్తలు చాలా విచిత్రంగా వుంటారు. పైకి అన్నీ చేస్తూనే వుంటారు. కానీ లోపల ఏమీ చేయరు. వాళ్ళకు దయ వున్నట్లే కనిపిస్తుంది. లోపల మాత్రం దయ లేదు. (ద్వంద్వబుద్ధి లేదు గనుక) దయ లేనట్లే కనిపిస్తుంది. కానీ దయ వుంది. (సత్త్వగుణంవల్ల). వారికి ఆశలు లేవు. ఐనా ఆశ గలవారి లాగానే ప్రవర్తిస్తారు. సంసారం కలవారి లాగానూ వుంటారు. లేనివారి లాగానూ వుంటారు.
***శ్రీరాముడు***: గురుదేవా! మీరు చెప్పే లక్షణాలతో ఎవరినైనా గుర్తు పట్టడం సాధ్యమౌతుందంటారా? అదీ గాక మీరు చెప్పిన లక్షణాలను ఏ డాంబికుడైనా నటించ వచ్చు గదా! ఇక తత్త్వజ్ఞానులను గుర్తుపట్టడం ఎలా?

***వశిష్ఠుడు***: రామా! డాంబికుల గురించి చింతపడకు. డాంబికత్వం కోసమైనా సరే, ఈ లక్షణాలను దీర్ఘకాలం అభ్యాసం చేసినట్లైతే, వాడికి క్రమంగా ఈ లక్షణాలు వంటబట్టి తత్త్వజ్ఞానం లభిస్తుంది. డాంబికత్వం లేకుండా ఈ లక్షణాలను బలవంతంగానైనా ఆచరించేవాడికి ఇంకా త్వరగా తత్త్వజ్ఞానం లభిస్తుంది. ఇక నిజమైన తత్త్వజ్ఞానులను గుర్తించడం అంటావా, అది నిజంగా కష్టమే! సామాన్య లక్షణంగా ఒక మాట చెప్పవచ్చు. సర్వ సాధారణంగా, నిజమైన తత్త్వవేత్తలు తమ జ్ఞానాన్ని గానీ, వైరాగ్యాన్ని గానీ, ప్రకటించుకోవాలనే ఉద్దేశ్యంతో వుండరు. పైగా వాటిని దాచుకొనే ప్రయత్నంలోనే వుంటారు.

ఇక లోకాతీతమైన సిద్ధులను బట్టి తత్త్వజ్ఞానిని గుర్తించడం కూడా సాధ్యం కాదు. పట్టుబట్టి కృషి చేసినవాడికి తత్త్వజ్ఞానం లేకపోయినా, సిద్ధులు లభించవచ్చు. నిజమైన తత్త్వజ్ఞానికి ఏ సిద్ధులూ లేకపోవచ్చు. వాళ్ళు తాపసులుగానో, సంన్యాసులుగానో, మాత్రమే వుంటారని చెప్పే వీలు లేదు. వాళ్ళు గృహస్థులుగానో, వ్యాపరస్థులుగానో, వుండవచ్చు. వాళ్ళకు ఇలాగే వుండాలనే నియమం ఏదీ లేదు.(స. 102).

ఈ స్థితి లభించాలంటే, "చిత్" అంటే ఏమిటో విచారణ చేయాలి. చిత్తు నిత్యమనీ, అది సర్వవ్యాపకమనీ, దానిలో అవయవాలు లేవనీ, అది పరాధీనం కాదనీ, ఇప్పటికే చాలా సార్లు నిరూపించాను. ఈ విషయం మనస్సుకు బాగా పట్టాలంటే, మహారామాయణం అనే పేరుగల ఈ సచ్ఛాస్త్రమే మంచి ఉపాయం. ఈ

విషయంలో దీనిని మించిన గ్రంథం లేదు. మీబోటి యోగ్యులైన శిష్యులకు దీనిని బోధిస్తూ వుండడం మా స్వభావం.

దీనిలో నేను చెప్పే సారాంశం ఏమిటంటే,

**స్వయంభ్వాఖ్యం శరీరం స్వం**
**పూర్వః స్వప్నో మహాచితేః ।**
**ఇత ఉత్థానాస్తదను**
**స్వప్నాత్స్వప్నాతరం వయమ్ ॥** (ని.ఉ.స. 103, శ్లో. 85)

మహాచైతన్యంయొక్క ప్రథమ స్వప్నమే హిరణ్యగర్భుడు లేక స్వయంభువు. కలలో కలవచ్చినట్లుగా ఆ స్వయంభువులోంచి పుట్టుకొచ్చిన వాళ్ళమే మనమంతా!

గొంతుమీద గడ్డ కట్టింది. ఆ గడ్డమీద కురుపు లేచింది. దాని మీద సెల మొలిచింది. ఇవన్నీ నిజానికి గొంతుకంటే భిన్నం కావు. ఐనా, దేనికది వేరువేరుగానే వున్నట్లు కనిపించినట్లుగా, మనమంతా వేరు వేరుగా కనిపిస్తున్నాం. అందుకే ఎంత ప్రయత్నించినా మన మనస్సు పరబ్రహ్మలోకి ప్రసరించడం లేదు (స. 103).

మనమే ఒక స్వప్నంలో భాగం. మళ్ళీ మనకో స్వప్నం వుంది. మనం "మన జాగ్రత్తువేరు, మన స్వప్నం వేరు" అనుకుంటున్నాం. నిజానికి ఈ రెండూ , ఒకే తల్లి కడుపులోంచి వచ్చిన కవల పిల్లలాంటివి. ఆ తల్లే అవిద్య. ఆ అవిద్యవల్లే, ఉన్న ఒకే ఒక చిత్తు జాగ్రత్తుగానూ, స్వప్నంగానూ కనిపిస్తోంది. జాగ్రత్స్వప్నాల మధ్యలో అంతకుమించిన భేదం లేదు. (స. 104, 105)

***శ్రీరాముడు***: గురుదేవా! జాగ్రత్తూ, స్వప్నమూ, అనేవి వేరు వేరు ప్రపంచాలు కాకపోతే, లోకంలో అవి వేరు అనే అనుభూతి ఎలా కలుగుతోంది? నాకు తెలిసినంతలో ద్రష్టవేరు, దృశ్యం వేరు. కనుకనే స్వప్న ద్రష్ట వేరు, స్వప్నం వేరు. మళ్ళీ స్వప్న ద్రష్టయొక్క జాగ్రత్ప్రపంచంలో దృశ్యాలు వేరు, ద్రష్ట వేరు. ఇది మాబోటివాళ్ళ అనుభవం. మీరేమో అనేక యుక్తులు చూపించి, ఇలాంటి భేదాలేవీ లేవనీ, ద్రష్టగానూ, దృశ్యంగానూ, జాగ్రత్తుగానూ, స్వప్నంగానూ, కనిపించేది శుద్ధ చిత్తేనని, నిరూపిస్తున్నారు. మాకు అది అలా కనిపించక పోవడానికి కారణం ఏమిటి?

***వశిష్ఠుడు***: రామా! సూటిగా చెప్పాలంటే, ఆ కారణం భ్రాంతే.

**ఆ స్వయంభువ ఏవాయం**
**చిన్మాత్రే భాతి సర్గభాః ।**
**పరిజ్ఞాతా సతీ సా తు**
**బ్రహ్మైవ భవతి క్షణాత్ ।**
**ఏషైవ త్వపరిజ్ఞాతా**
**భ్రాన్తి ర్మాయేతి కథ్యతే ।**
**జగదిత్యుచ్యతేఽ విద్యా**
**దృశ్యమిత్యుపవర్ణ్యతే ॥** (ని. ఉ. స. 106, శ్లో. 49,50)

ఉన్న శుద్ధచిత్తు విషయంలో జగత్తనే భ్రాంతి హిరణ్యగర్భుడి వరకు కూడా వుండనే వుంటుంది. ఐతే, ఈ విషయం తెలిస్తే, ఆ సృష్టిభ్రాంతే పరబ్రహ్మ ఐపోతుంది. తెలియకపోతే, అదే వట్టి భ్రాంతి అవుతుంది. దానినే శాస్త్రాలలో మాయ అంటారు. లోకంలో జగత్తు అంటారు. అజ్ఞానులు అవిద్య అంటారు, దృశ్యం అంటారు.(స.106)

ఈ విషయాన్ని అర్థం చేసుకుంటే, పృథివ్యాది పంచ భూతాలుగా కనిపించేదంతా శుద్ధ చిత్తేనని

తేలిపోతుంది. స్వప్నలోకంలో శుద్ధ చిత్తు అక్కడి పంచభూతాలుగా కనిపిస్తోందని సులభంగానే అర్థం చేసుకోవచ్చు. దీని బట్టి అక్కడా ఇక్కడా కూడా, పంచభూతాలుగా కనిపించేది శుద్ధ చిత్తే అని తేలిపోతోంది. అలాంటప్పుడు ఇక స్వప్నానికీ, జాగ్రత్తుకూ తేడా ఏమిటి? అందుకే ఈ ప్రపంచం అంతా ఒక స్వప్నం అని మేము చెబుతున్నాం. (స. 107)

**శ్రీరాముడు**: గురుదేవా! అవిద్య పోతే గానీ, జగత్తు సత్యమేననే భ్రాంతి పోదని మీరంటున్నారు గదా! మరి ఈ అవిద్య ఎంతకాలం వుంటుంది? ఏ రూపంగా వుంటుంది? ఎప్పుడు పోతుంది? ఎలా పోతుంది?

**వశిష్ఠుడు**: రామా! అవిద్య వున్నంత కాలమూ పంచభూతాలు వుంటాయి. అవి వున్నంత కాలమూ లోకాలన్నీ వుంటాయి. అవిద్యగల అజ్ఞానుల దృష్టిలో, అవిద్యకు నాశమే లేదు. వాళ్ళకు పరబ్రహ్మ లాగానే, అవిద్య గూడా శాశ్వతమైనది. ఈ విషయం బాగా అర్థమయ్యేందుకోసం నీకు 'విపశ్చిదుపాఖ్యానం' అనే కథను చెబుతాను విను.

## 40. విపశ్చిదుపాఖ్యానం

ఈ విశాలమైన ఆకాశంలో ఒక మూల మన ముల్లోకాల సంపుటి వంటి మరో త్రిలోక సంపుటి వుంది. అక్కడ గూడా మన జంబూద్వీపం లాంటి ద్వీపమే ఒకటి వుంది. అక్కడ "తతమితి" అనే పెద్ద పట్టణం ఒకటి వుంది. (తతమితి అంటే, విస్తృతమైన పరిమితి గలది.) దాంట్లో 'విపశ్చిత్' అనే రాజు వుండేవాడు.

'విపశ్చిత్' అంటే విశేషజ్ఞుడైన పండితుడు. "విశేషేణ పశ్యన్ చేతతీతి విపశ్చిత్"

'విశేషంగా చూస్తూ ప్రవర్తించేవాడు' అని వ్యుత్పత్తి. పేరుకు తగ్గట్టుగానే ఆ రాజు మంచి పండితుడు, వీరుడు, సమర్థుడు ఐన చక్రవర్తిగా వుండేవాడు.

అతనికి దేవతలలో అగ్ని అంటే చాలా ఇష్టం. కొంచెం వయస్సు మళ్లుతున్న కొద్దీ, అతని అగ్ని ఉపాసన కూడా బాగా పెరిగింది.

ఇలా వుండగా, ఒక రోజున తూర్పు దిక్కు నుంచి ఒక గూఢచారి వచ్చి –

"మహాప్రభూ! తూర్పు సముద్ర తీరంలో మీరు రాజ్య రక్షకుడిగా ఏర్పాటు చేసిన మీ సామంతుడికి జ్వరం వచ్చి, హఠాత్తుగా మరణించాడు. ఆ విషయం తెలియగానే, దక్షిణ దిక్కుకు రక్షకుడిగా మీరు ఏర్పాటు చేసిన సామంతుడు, తూర్పు దిక్కును కూడా ఆక్రమించుకోవాలని దండెత్తాడు. దానిని తూర్పుదిక్కు ప్రజలు వ్యతిరేకించారు. ఈ సందు చూసుకొని, అంతవరకు అణగి పడివున్న శత్రురాజులు ధైర్యం పుంజుకొని, చాటు దాడులు చేసి, దక్షిణ దిక్కు సామంతుణ్ణి చంపేశారు.

"ఇది తెలిసి, మీరు పడమటి దిక్కుకు ఏర్పాటు చేసిన సామంతుడు, ఈ శత్రువుల నందరినీ నేనే అణగగొట్టేస్తానని ప్రగల్భాలు పలుకుతూ యుద్ధానికి బయలుదేరాడు. కానీ తూర్పు దక్షిణ దిక్కుల్లో వుండే శత్రువులు ఏకమై, ఇతన్ని నడి దారిలోనే చంపేశారు. నేను తప్పించుకు పారిపోయి మీ దగ్గరికి వచ్చాను".

ఈ గూఢచారి మాటలు పూర్తి కాకుండానే, మరో గూఢచారి రొప్పుతూ పరిగెత్తుకొచ్చాడు. అతను వస్తూనే –

"ప్రభూ, ప్రభూ! శత్రుసేనలన్నీ ఏకమై, మీ ఉత్తర దిక్కు సామంతుడి మీదకి దండెత్తాయి. అతను బెంబేలెత్తిపోయి, సేనతో సహా పారిపోయి, మన రాజధానిలోకి వచ్చేస్తున్నాడు." అని చెప్పాడు.

విపశ్చిత్ రాజు మండిపడుతూ గర్జించి, సేనాపతులను పిలిచి, యుద్ధానికి సిద్ధంకండని ఆజ్ఞాపిస్తూ

వుండగానే, ఒంటినిండా గుచ్చుకున్న బాణాలతో, నెత్తురోడుతున్న శరీరంతో, ఉత్తర దిక్సామంతుడు లోపలికి ప్రవేశించి, రాజుకు నమస్కరించి, శత్రుబలగాలు తరుము కొస్తున్నాయని గగ్గోలు పెట్టాడు.

రాజు అతనిని ఓదార్చే లోపలే, మరో వార్తా హరుడు పరుగెత్తుకుంటూ వచ్చి, శత్రుసేనలు పుర ప్రాకారాన్ని దాటి లోపలికి ప్రవేశించేశాయని, ప్రధానమంత్రులు, సేనానులు, అప్పుడే ప్రతిఘటనలో నిమగ్నమై వున్నారని, విన్నవించాడు.

రాజు: అందరికీ ధైర్యం చెప్పి, "మీరంతా వ్యూహరచన చేస్తూ వుండండి. నేనిప్పుడే స్నానం చేసి వచ్చేస్తా" అని చెప్పి లోపలికి వెళ్ళిపోయాడు.

లోపలికి వెళ్ళిన రాజు స్నానం చేసి, సరాసరి అగ్నిహోత్రశాలలోకి వెళ్ళాడు. అక్కడ అగ్నిదేవుడ్ణి అర్చించి, ఇలా ప్రార్థించాడు–

"అగ్నిదేవా! నీ అనుగ్రహ బలంవల్ల వయస్సు వున్న రోజులలో వీరుడ్నై విజృంభించి, ఒంటి చేతితో నాలుగు దిక్కులనూ జయించి, ఏకఛత్రాధిపతినయ్యాను. ఎదిరించిన వాళ్ళను ఇనుప కాళ్ళతో అణగదొక్కేశాను. ఇప్పుడు వయస్సు మళ్ళింది. ఈ తరుణంలో శత్రువులు పెట్రేగిపోయి, సరాసరి నా నగరంలోనే ప్రవేశించారు. ఇప్పుడు జయించడం కష్టం. ఈ వయస్సులో ఓడిపోయి జీవించడం వ్యర్థం. కనుక దేవా! నేను ఒక నిర్ణయానికి వచ్చాను. నా శిరస్సునే నరికి, సమిధగా నీకు ఆహుతి చేస్తాను. నీకు తృప్తి కలిగితే, నీకు దయ కలిగితే, నాకు ఒకటి కాదు, నాలుగు నూతన శరీరాలను ఇవ్వు. ఆ శరీరాలతో నాలుగు దిక్కులకూ వెళ్ళి, నాలుగు సముద్రతీరాల దాకా నా రాజ్యాన్ని పునఃప్రతిష్ఠాపన చేసుకుంటాను."

ఇలా అంటూనే రాజు అగ్నిజ్వాలను బాగా పెంచి, తను ముందుకు ఒంగి నిబ్బరంగా తన తలను తనే కోసేసుకున్నాడు. తెగిన తల సరాసరి అగ్ని గుండంలో పడింది. ఆశ్చర్యం! ఆ మొండెం గూడా అగ్నిలో కాలిపోయింది.

కొద్ది సేపట్లోనే అలా ఆ రాజు శరీరం మొత్తం పవిత్రమైన హోమగుండంలో కాలి బూడిదై పోయింది. ఇంతలో ఆ అగ్నిజ్వాలల్లోంచి నలుగురు విపశ్చిద్రాజులు బయటికి వచ్చారు. వారి నలుగురికీ శస్త్రాస్త్ర శక్తులు మాత్రమే గాక, వివిధ దివ్యాయుధాలు గూడా అగ్ని జ్వాలల్లోంచే సంక్రమించాయి.

ఆ నలుగురూ అగ్నిదేవుడికి నమస్కరించి, సరాసరి రణరంగంలోకి దూకేశారు. వారి ధాటికి శత్రువులు తట్టుకోలేక పోయారు. త్వరలోనే శత్రువులు కోటలోంచి బైటికి వెళ్ళిపోయారు. కోట దాటిన దగ్గరినుంచీ ఏ దిక్కువారు ఆ దిక్కుకు పారిపోవడం ప్రారంభించారు. విశ్చిద్రాజులు నలుగురూ వాళ్ళను తరుముకుంటూ నాలుగు దిక్కులకూ వెళ్ళిపోయారు. నలుగురూ నాలుగు సముద్రతీరాలకు చేరి, అక్కడ మళ్ళీ రాజ్యవ్యవస్థ చేసి, కొంత కాలం స్వయంగా తామే అక్కడ వుంటే మంచిదని భావించి, తామే ఆయా దిక్కులలో రాజ్య నిర్వహణ చేయడం ప్రారంభించారు.

ఆయా ప్రాంతాలలో వున్న విపశ్చిద్రాజులు, ఆయా ప్రాంతాలలో వుండే విశేషాలను స్వయంగా పరిశీలించి, ఆ ప్రకృతి సౌందర్యాలకు పులకించిపోతూ, వినోదించ సాగారు.

**గమనిక–** ఇక్కడ కవి యుద్ధ వర్ణనకు 110, 111 సర్గలను, శత్రుసేనా పలాయనాన్ని వర్ణించాడానికి 112 వ సర్గను, సముద్రాన్ని వర్ణించడానికి 113వ సర్గనూ, ఆ యా దిక్కులలో వుండే విశేషాలను వర్ణించడానికి 114 నుంచి 7 సర్గలను, వినియోగించాడు. వీటిలో కవిత్వాన్ని పొంగించాడు. ఆనాటి దేశాల పేర్లనూ, జాతుల పేర్లనూ, భౌగోళిక స్థితిగతులను, లోకాచారాలను, అధ్యయనం చేయదలచుకున్నవారికి, ఈ సర్గలలో అపారమైన సమాచారం వుంది. మనం వేదాంత దృష్టితో అధ్యయనం చేస్తున్నాం గనుక ఆ వివరాల జోలికి పోవడం లేదు. ఐతే ఈ కవి ఈ వర్ణనల కోసం 11 పెద్ద పెద్ద సర్గలను ఎందుకు వినియోగించినట్టు? అవిద్యవల్ల ఉద్భవించిన ప్రపంచం ఎంత విస్తారంగా

కనిపిస్తుందో, ఎంత వైవిధ్య భరితంగా కనిపిస్తుందో, బాగా వివరించి, వివరించి, చివరికి "ఈ మొత్తమంతా మిథ్యే"- అని నిరూపించడానికే ఈ వర్ణన అంతా చేస్తున్నాడు. పూర్వం లీలోపాఖ్యానంలో యుద్ధ వర్ణన విస్తారంగా చేసి, చివరికి, "ఇంత ఘోరంగా కనిపించిన ఈ యుద్ధమంతా నీ భ్రాంతిలో భాగమే" అని సరస్వతీదేవిచేత చెప్పించాడు. ఆ పద్ధతినే ఇక్కడ గూడా కవి అనుసరించ దలచుకున్నాడు. అందుకే కంటికి కనిపించేటంతవరకు గల భూభాగ విశేషాలను ఇలా వర్ణించి, ఇంకా తృప్తి కలుగక, కంటికి కనిపించని సూక్ష్మలోకాలు గూడా అవిద్యలో భాగాలేనని, అవి గూడా మిథ్యలని నిరూపించడం కోసం, పై కథను ఎలా నిర్వహించ బోతున్నాడో ఇక గమనిద్దాం.

## 41. దిగంత దర్శనేచ్ఛ

***వశిష్ఠుడు***: రామా! ఆ విధంగా ఒకే దేహంలోంచి నలుగురిగా చీలిన ఆ విపశ్చిద్రాజులు నలుగురూ నాలుగు దిక్కులకూ వెళ్ళి, ఒకే రకమైన ఆలోచనలతో, ఒక ప్రక్క రాజ్యస్థాపన చేసుకుంటూ, మరో ప్రక్క సువిశాలంగా వున్న ప్రకృతి సౌందర్యాలను పరిశీలించుకుంటూ, నాలుగు సముద్ర తీరాలకూ చేరారు. ఎవరికి కనిపించే దృశ్యాలు వారివే! ఎవరి ఆశ్చర్యం వారిదే! ఎవరి ఆనందం వారిదే! ఐనా, వాళ్ళ ఆలోచనలలో మాత్రం ఒకే లక్షణం కొనసాగుతోంది.

ఆ సముద్రతీరాలలో కూర్చొని, సుదీర్ఘమైన సముద్రతరంగాల వంక అంతకంటే సుదీర్ఘమైన చూపులతో చూస్తూ కూర్చున్న ఆ రాజులు నలుగురికీ, ఆలోచనలు ఒకే రకంగా సాగాయి–

"అరెరే! అగ్నిదేవుడియొక్క వరప్రభావంచేత, దివ్య ప్రభావ సంపన్నమైన రథం ఎక్కి, ఎంత దూరం వచ్చాం? ఎక్కడి రాజధాని? ఎక్కడి సముద్రతీరం? ఈ మధ్యలో ఎన్నెన్ని వింతలు? ఈ సముద్రపు కొలత ఎంత? ఇది దాటితే ఏముంది?

"పెద్దలు చెప్పే మాటల ప్రకారం, ఈ ఉప్పు సముద్రాన్ని దాటితే, దీనికి రెట్టింపు పరిమాణంలో ప్లక్షద్వీపం వుంది. దాన్ని దాటితే, ఇక్షు రస సముద్రం వుంది. దాన్ని దాటితే, మరో ద్వీపం, ఆ పైన మరో సముద్రం, ఇలా ఏడు సముద్రాలూ, ఏడు ద్వీపాలూ వున్నాయంటున్నారు.

**కియతీ స్యాత్ప్రవిస్తీర్ణా**
**దృశ్యశ్రీరియమాతతా** ॥(ని.ఉ.స. 121,శ్లో. 7)

విస్తరించి విశాలంగా వున్న ఈ దృశ్యసంపద ఎంతటిదై వుంటుంది?
ఈ ద్వీపాలన్నీ దాటితే ఏముంటుంది? అక్కడ

**కియతీ కీదృశీ వా స్యాత్**
**మాయేయం చేత్యరూపిణీ** ॥(ని.ఉ.స. 121, శ్లో. 8)

"దృశ్యాలే స్వరూపంగా గల ఈ మాయ అక్కడ ఎలాంటిదై వుంటుంది? ఎంతటిదై వుంటుంది?
"ఇవన్నీ మనం స్వయంగా చూడాలి. దీనికోసం అగ్నిదేవుణ్ణే ప్రార్థిద్దాం."

ఆ నలుగురు విపశ్చిద్రాజులూ అలా ఒకే రకంగా ఆలోచించి, అగ్ని దేవుడిని ఒకే తీరుగా, ఒకే సారిగా ధ్యానించారు. అగ్నిదేవుడు అనుగ్రహించి నాలుగు రూపాలు స్వీకరించి, నలుగురికీ ఒకే సారి కనిపించి, "ఏం కావాలో కోరుకో నాయనా" అన్నాడు.

చిత్రం! ఆ నలుగురూ ఒకే వరం కోరారు –

"సురేశ్వరా! పంచభూతాత్మకమైన ఈ దృశ్యజాలాన్ని చివరంటా చూడాలని నాకు వుంది. దేవా! ఈ పాంచభౌతిక దేహంతో ఎంతవరకూ చూడడం సాధ్యమౌతుందో అంతవరకూ, ఈ దేహంతోనే చూపించు. ఆ

పైన దీనికి సాధ్యం కాని దానిని, మంత్రమయమైన దేహాన్ని నాకు కల్పించి, దానితో చూపించు. ఆ పైన దానికీ సాధ్యం కాని దానిని, మనోదేహంతో చూపించు. స్థూల ప్రపంచం ఎలా వుంటుందో , సూక్ష్మ ప్రపంచం ఎలా వుంటుందో, కారణ ప్రపంచం ఎలా వుంటుందో, అన్నీ నాకు చూపించు. ఇదే నేను కోరే వరం. దేవా! నీకు తెలియనిది ఏముంది? యోగ సిద్ధులైన మహాత్ములకు ఎంత వరకూ సాధ్యమౌతుందో, అంతవరకూ నాకు ఈ శరీరంతోనే చూడాలని వుంది. ఆ తరువాత, మనస్సుతోనే చూస్తాను. కానీ, అలాంటి సిద్ధ మార్గాలలో పోతుంటే శరీరం రాలిపోతుందనీ, మృత్యువు వస్తుందనీ, చెబుతారు. అలా నాకు మరణం సంభవించకుండు గాక! నా ప్రయాణం కొనసాగు గాక".

అగ్నిదేవుడు నలుగురి దగ్గరా "తథాస్తు" అనేసి అంతర్ధానమై పోయాడు. మర్నాడు తెల్లారేసరికి ఎక్కడి విపశ్చిద్రాజు అక్కడ సముద్రాన్ని దాటుతానని బయలు దేరాడు. మంత్రులంతా అడ్డంబడ్డారు. అది ప్రమాదం అన్నారు. కొందరు ఏడ్చి గోల చేశారు. ఐనా సరే, ఏ విపశ్చిద్రాజూ తగ్గలేదు. అందరినీ ఓదార్చి, త్వరలో వచ్చేస్తామని నచ్చ చెప్పి, వారు నలుగురూ ముందుకు సాగారు.

సముద్రజలం దగ్గరికి చేరేసరికి, అగ్నిదేవుడి ప్రభావంవల్ల, వారి నలుగురికీ దివ్య శక్తులు సంక్రమించాయి. వారు నేల మీద నడిచినట్లే నీళ్ల మీద గూడా నడవడం ప్రారంభించారు. కూడా వచ్చిన పరివారం ఆగిపోయింది. రాజులు సాగిపోయారు. కొండలను దాటినట్లుగా తరంగాలను దాటుకుంటూ ముందుకు వెళ్ళిపోయారు. సుడిగుండాలు వచ్చినప్పుడు గడ్డిపరకల లాగా ముందుకు దూకి గిరగిరా తిరిగి, సాగిపోయారు. కొన్ని చోట్ల పెద్ద మొసళ్ళు వీళ్ళని మింగేశాయి. ఐనా వీళ్ళను జీర్ణం చేసుకోలేక మళ్ళీ కక్కేశాయి. అలాంటప్పుడు కొద్దిగా శ్రమ అనిపిస్తే, నీటి తరంగాల మీదే పడుకొని విశ్రమించారు. ఇలా సాగుతున్న ఆ రాజులకు చిత్ర విచిత్రమైన అనుభవాలు ఎదురైనాయి.

తూర్పు సముద్రంలో ముందుకు సాగిన విపశ్చిద్రాజును ఒక మొసలి పట్టుకుంది. దానితో జరిగిన పెనుగులాటలో ఈ రాజు సముద్రంలో కలిసే గంగానది దాకా కొట్టుకువచ్చి, అక్కడ దానిని నేలకేసి కొట్టాడు. ఈ ఊపులో అతను వెళ్ళి కన్యాకుబ్జంలో పడ్డాడు. అక్కడి నుంచి మళ్లీ ముందుకు సాగి, మళ్ళీ సముద్రాన్ని దాటి, క్రౌంచ ద్వీపానికి వెళ్లాడు. అక్కడొక రాక్షసుడు ఈయనను మింగేశాడు. కానీ ఇతను వాడి పొట్టలోని ఎముకలు విరగొట్టేసి, పొట్ట చీల్చుకొని, బయటికి వచ్చేశాడు. ఆ దెబ్బతో అక్కడి ప్రజలు ఇతనే తమకు రాజు కావాలని కోరుకున్నారు. అక్కడో ఎనిమిది సంవత్సరాలు రాజ్యం చేసి, మళ్ళీ ప్రయాణం సాగించి, ఇతను మేరు పర్వతం దగ్గరికి చేరాడు. ఆ పర్వతానికి ఉత్తర ప్రాంతాలలో ఒక అప్సరస వలలో పడి, పది సంవత్సరాలు గడిపాడు. ఆ మత్తులోంచి తేరుకొని మళ్ళీ ప్రయాణం సాగించి, పాల సముద్రతీరానికి చేరాడు. అక్కడ అప్సరసలను చూసి ఒళ్ళు మరిచిపోయి, డెబ్బై సంవత్సరాలు వారితో గడిపేశాడు.

దక్షిణ సముద్రంలో ప్రయాణం సాగించిన విపశ్చిద్రాజు, ఇక్షు సముద్రం దాకా నిరాటంకంగా ప్రయాణం సాగించేశాడు. కానీ, అక్కడి యక్షనగరం చేరే సరికి, అక్కడ వుండే ఒక యక్షిణికి ఇతనిమీద మోజు పుట్టి, వశీకరణ మంత్ర ప్రయోగం చేసింది. ఇతను దానికి లొంగిపోయి, ఆ మోజులో కన్నూ మిన్నూ కానకుండా తిరుగుతూ, ఒక చోట దక్షప్రజాపతి శాపానికి గురైనాడు. ఆ శాప ఫలితంగా శాకద్వీపంలో యక్షుడిగా వందేళ్ళు జీవితం సాగించాడు. ఆ పైన అగ్ని దేవుడి అనుగ్రహంవల్ల శాపవిమోచనం జరిగింది.

పశ్చిమ సముద్రంమీద ప్రయాణం సాగించిన రాజును ఒక చోట "నేను దేవతను" అనే అభిమానం గల ఒక చేప మింగింది గానీ, జీర్ణించుకోలేక కక్కింది. ఆ తరువాత దైవయోగంవల్ల ఇతనికో గరుడపక్షి చేతికందింది. ఇతను ఒడుపుగా దాని వీపుమీదికెక్కి , లవణ సముద్రాన్ని దాటి, శాల్మలీద్వీపానికి చేరాడు. అక్కడ పక్షి వశీకరణ విద్యను సాధించాడు. అలా పక్షులతో ఆడుకుంటూ పదేళ్ళు గడిపేశాడు. అక్కడినుంచి

ముందుకు సాగి, మంధర పర్వత ప్రాంతానికి వెళ్ళాడు. అక్కడ మంధర అనే అప్సరసకు లొంగిపోయి ఒక రోజు గడిపాడు.

ఉత్తర సముద్రంలో ఉరుకులు పెట్టిన విపశ్చిద్రాజు ఒక ద్వీపానికి చేరి, అది పార్వతీ పరమేశ్వరుల విహార భూమి అని తెలుసుకొని, వారిని ఉపాసించాడు. తత్ఫలితంగా అతనికి అణిమాది సిద్ధులూ, అరమత్వమూ, లభించాయి. అక్కడినుంచి అతను ముందుకు సాగిపోతూ వుండగా, ఒక చోట బంగారు మయమైన నేల కనిపించింది. దానిలో తిరుగుతూ వుండగా, ఆ ప్రాంతాన్ని బంగారు మయం చేసుకున్న సిద్ధుడికి కోపం వచ్చి, ఇతనిని శిలా ప్రతిమగా మార్చేశాడు. అలా వందేళ్ళున్నాక అగ్నిదేవుడి అనుగ్రహం కలిసి వచ్చి, శాపం పెట్టిన సిద్ధుడికే దయ గలిగి, శాప విమోచనం చేసి, ఇతనిని బయటికి పంపించేశాడు. (స. 123)

## 42. ఒకడు-నలుగురు-ఆలోచనలు

**శ్రీరాముడు**: గురుదేవా! ఈ నలుగురు విపశ్చిద్రాజులకూ జీవుడు ఒకటే. వాళ్ళకు మూల భూతమైన శరీరం కూడా ఒక్కటే! అలాంటప్పుడు వాళ్ళకు వేరు వేరు రకాల కోరికలు పుట్టడానికి కారణం ఏమిటి?

**వశిష్ఠుడు**: రామా! ఒకడికి కల వచ్చింది. అక్కడ కనిపించిన దేహాలలో వాడు ఒక దానిని నేననుకుంటున్నాడు. కొన్ని దేహాలను శత్రువులనుకుంటున్నాడు. కొన్ని దేహాలను ఉదాసీను లనుకుంటున్నాడు. ఈ దేహాలలో వుండే జీవులు ఎవరి ఆలోచనలు వాళ్ళు చేస్తున్నారు. ఎవరి వ్యవహారాలు వాళ్ళు చేస్తున్నారు. ఈ జీవులంతా ఎక్కడినుంచి వచ్చారు? ఒక్కడినుంచే గదా! కనుక ఒకే జీవుడినుంచి వచ్చే విభిన్న జీవులకు ఒకే రకమైన కోరికలు వుండాలనే నియమాన్ని మనం పెట్టేందుకు వీలు లేదు. ఐతే, ఈ మూలజీవుడిలోంచి ఈ రకమైన శాఖాజీవులే పుట్టడానికి కారణమేమిటో కొంచెం ఆలోచించు. అది మూలజీవుడియొక్క కర్మశేషమే తప్ప మరోటి కాదు.

మొదటి జీవుడిలో వుండే కర్మ శేషంయొక్క వైచిత్రినిబట్టి, వాడు సృష్టించుకునే జీవులలో కర్మ వైవిధ్యం వుండడం సహజమే!

ఈ సృష్టియొక్క ఆరంభదశలో హిరణ్యగర్భుడనే ప్రథమ జీవియొక్క స్వప్న రూపంగా ఈ ప్రపంచం రూపొందిందని చాలా సార్లు చెప్పుకున్నాం. ఆ హిరణ్యగర్భుడిలో వుండే కర్మశేష వైచిత్రిని బట్టే ఈ లోకంలో రకరకాల జీవులు మనకు కనిపిస్తున్నారు.

ఇంతకూ, జీవులు కనిపించడమంటే ఏమిటి? చైతన్యమనే దర్పణంలో చైతన్యాత్మకుడైన ఆత్మ ప్రతిబింబించడమే!

**శ్రీరాముడు**: గురుదేవా! చైతన్యంలో చైతన్యం ప్రతిబింబించడం ఎలా కుదురుతుంది?

**వశిష్ఠుడు**: అద్దంలో మరో అద్దం ప్రతిబింబించడం లేదా? ఈ అద్దానికి ఒక శరీరం వుంది. ఆ అద్దానికి మరో శరీరం వుంది. ఈ రెండు శరీరాలలోనూ ప్రతిబింబాలను స్వీకరించే ఒక ప్రత్యేక గుణం వుంది. అందువల్ల ఆ అద్దాలు ఇతర వస్తువుల ప్రతిబింబాలనూ స్వీకరిస్తాయి, ఇతర అద్దాల ప్రతిబింబాలనూ స్వీకరిస్తాయి.

ప్రతిబింబించడమంటే ఏమిటి? ఎదుట వున్న రూపాన్ని తనలో వున్నట్లుగా చూపించుకోవడం. అంతే గదా! ఒక అద్దం ఒక కొండను ప్రతిబింబిస్తోందంటే, ఆ ప్రతిబింబ రూపాన్ని తనలో ధరించి వుంచుకోగల ఒక విచిత్రమైన ఆకాశం ఆ దర్పణంలోనే వుందన్నమాట. అలాంటి దర్పణంలో మబ్బులూ, నక్షత్రాలూ, చంద్రబింబమూ, వున్న మామూలు ఆకాశం ప్రతిబింబించిందనుకో. అప్పుడు అద్దంలో వుండే ఆకాశం మామూలు భౌతిక ఆకాశాన్ని కూడా తన గర్భంలో ధరించి వుంచుకోగల శక్తిగలది – అని మనకు అనిపిస్తుంది. ఇక్కడ

ఒక ఆకాశంలో మరో ఆకాశం ప్రతిబింబించి నట్లుగానే, మాయ అనే విచిత్ర శక్తి గల రూపాన్ని (ఉపాధిని) ధరించిన శుద్ధ చైతన్యం, ఊహాతీతమైన చైతన్య ప్రతిబింబాలను ప్రదర్శిస్తూ వుండడం అసంభవం కాదు. అందుచేతనే వస్తుతః చైతన్యంకంటే అభిన్నమైన జగత్తు అనే ప్రతిబింబం, చైతన్యం కంటె భిన్నంగా కనిపిస్తోంది.

**శ్రీరాముడు**: ఎంత మాయవల్ల ఐతే మాత్రం, ఒకే వస్తువు, ఒకే సమయంలో భిన్నమూ, అభిన్నమూ, కావడం ఎలా కుదురుతుంది?

**వశిష్ఠుడు**: శుద్ధ చైతన్య రూపమైన పరబ్రహ్మలో భిన్నత్వాన్ని తిరస్కరించాలని నువ్వు ప్రయత్నం చేస్తున్నావు. అది మంచి మాటే గానీ, ఆ ప్రయత్నంలో నువ్వు బ్రహ్మలో అభేదం వుందని ఒప్పేసుకుంటున్నావు. కాని సత్యమేమిటంటే, పరబ్రహ్మ భేదాభేదాలకు రెండింటికీ అతీతం. అందుచేత, మాయ అనే ఉపాధి ఉన్నప్పుడు బ్రహ్మయొక్క లక్షణం ఇలాగే వుండాలి – అనే నియమం ఏదీ పెట్టడం సాధ్యం కాదు. అందుకనే, ఒకే జీవుడు స్వప్నంలో తనను భిన్నా భిన్న రూపాలలో ఏకకాలంలో దర్శించుకోగలుగుతున్నాడు. ఇలాగే విపశ్చిద్రాజులు కర్మ పరిపాక బలంచేత నానా దిక్కులలోనూ వుండే నానా భోగ్యవస్తువులనూ ఏకకాలంలో అనుభవిస్తూ, ఏకకాలంలో నానా రకాల సుఖదుఃఖాలను అనుభవించారు.

అసలింత సిద్ధాంత చర్చ ఎందుకు? అగస్త్యాదులైన యోగీశ్వరులను చూడు. వాళ్ళు తమ యోగబలం చేత (కాయ వ్యూహవిద్యాబలం చేత) ఏకకాలంలో రకరకాల దేహాలను తమకు తామే సృష్టి చేసుకొని, రకరకాల పుణ్యపాపాలను, రకరకాల సుఖదుఃఖాలను, అనుభవించేస్తున్నారు. విష్ణువు మొదలైన దేవతలు కూడా ఇలాంటి పనులే చేస్తున్నారు. ఇక్కడ మన విపశ్చిద్రాజులు కూడా అలాగే చేస్తున్నారు. ఈ విషయం నీకు మరింత స్పష్టం కావడం కోసం, వాళ్ళ కథలోని మరికొన్ని విశేషాలు కూడా చెబుతాను, విను. ఎందుకంటే, వాళ్ళు ఎవరి దోవన వాళ్ళు కష్టసుఖాలు అనుభవించుకుంటూ పోవడం మాత్రమే కాకుండా, కొన్ని సందర్భాలలో ఒకళ్లకొకళ్లు సహాయాలు కూడా చేసుకున్నారు.

ఉదాహరణకు, తూర్పురాజు శాకద్వీపంలో ఉదయాద్రి శిఖరాలమీద తిరుగుతూ తిరుగుతూ, అక్కడ వుండే ఒక యక్షుడియొక్క సమ్మోహంలో పడిపోయాడు. ఆ సమ్మోహనంవల్ల ఏడు సంవత్సరాల పాటు నిద్రలో గడిపేశాడు. ఆ తరువాత ఆ ప్రాంతాలలోనే వుండే ఒక విచిత్రమైన ద్రావకాన్ని నీళ్ళు అనుకొని త్రాగేశాడు. నీళ్ళు లాగా కనిపించే ఆ ద్రావకాన్ని త్రాగితే, ఎవరైనా సరే రాయై పోతారు. ఆ విషయం తెలియక తూర్పురాజు ఆ నీళ్ళు తాగేసి, రాయైపోయి, మరో ఏడు సంవత్సరాలు పడివున్నాడు.

ఆ తరువాత అతను మళ్లీ మామూలు మనిషై శాంత భయమనే వర్షానికి వెళ్ళి, అక్కడ ఒక ముని శాపానికి గురైపోయాడు. తత్ఫలితంగా ఆయనొక కరక్కాయ చెట్టుగా మారిపోయి, డెబ్బై సంవత్సరాలు వుండిపోయాడు.

ఈ దశలో పశ్చిమ దిక్కు రాజుకు ఈ విషయం తెలిసి, ఇక్కడికి వచ్చి, ఇతనికి శాపం పెట్టిన మునిని బ్రతిమాలి, అనుగ్రహ పరచుకున్నాడు. దాంతో ఆ ముని పశ్చిమరాజుకు ఒక మంత్రం ఉపదేశించాడు. ఆ మంత్రబలంతో అతను తూర్పురాజు యొక్క వృక్షత్వాన్ని పోగొట్టాడు.

ఆ తరువాత తూర్పు రాజు 'దైవతకము' అనే పర్వతం వద్దకు వెళ్లాడు. అక్కడ ఒక యక్షుడు ఇతనిని ఒక సింహంగా మార్చేసి, పది రోజులు అట్టి పెట్టి, మళ్ళీ వదిలేశాడు.

ఆ తరువాత ఇతను మేరు పర్వతానికి చేరాడు. అక్కడ ఒక గుహలో ఒక పిశాచం తన మాయావిద్యతో ఇతన్ని కప్పగా మార్చేసి, పది సంవత్సరాలు అట్టిపెట్టేసింది. ఆ తరువాత అక్కడినుంచి ఇతను కౌమారవర్షానికి వెళ్ళాడు. అక్కడి శాక ద్వీపంలో నీలగిరి అనే పర్వతం వుంది, దాని మీద తిరుగుతూ వుండగా, కాలు జారి, ఒక పాడు బావిలో పడి, గ్రుడ్డివాడై ఒక వంద సంవత్సరాలు గడిపేశాడు.

ఇక పశ్చిమదిగ్రాజు అస్తాద్రి శిఖారాల మీద  తిరుగుతూ ఒక గుహలోకి వెళ్ళి, అక్కడ ఒక కామినీ పిశాచానికి లొంగిపోయి, నెల రోజులు వుండిపోయాడు. ఆ తరువాత ఇతను మరో చోటికి వెళ్ళి, అక్కడ విద్యాధర విద్యను నేర్చుకొని, తనే స్వయంగా విద్యాధరత్వాన్ని పొంది, ఏలకుల తోటల్లో పద్నాలుగు సంవత్సరాల పాటు విలాసంగా వ్యవహరించాడు.

ఆ తరువాత ఇతను శిశిరమనే వర్షానికి చేరాడు. అక్కడ ఒక పిశాచాధిపతి ఇతనికి శాపం పెట్టి, ఇతనిని ఒక రాతి బొమ్మగా మార్చేశాడు. ఈ దశలో దక్షిణ దిగ్రాజు వచ్చి, ఆ పిశాచాధిపతి అనుగ్రహం సంపాదించి, పశ్చిమ రాజుని విడిపించాడు.

ఆ తరువాత ఇదే పశ్చిమరాజు, మరో పిశాచమాయలో పడిపోయి, తనే ఎద్దు రూపంలో వుండే పిశాచంగా మారిపోయాడు. అప్పుడు గూడా దక్షిణరాజే వచ్చి ఇతనికి విడుదల కలిగించాడు.

ఇలాటి దక్షిణరాజు ఒక సారి పిశాచంగా మారిపోగా, పడమటి రాజే వచ్చి, అక్కడ వుండే యక్షుణ్ణి ప్రార్థించి, దక్షిణ రాజుకు విముక్తి కలిగించాడు.

అలాగే, ఒకప్పుడు తూర్పుదేశపురాజు క్షేమకమనే వర్షంలో, కేసరం అనే కొండమీద సింహంగా మారిపోతే, పశ్చిమరాజే వచ్చి విడిపించాడు.

**శ్రీరాముడు**: గురుదేవా! మీరిందాక మాట్లాడుతూ అగస్త్యాదులైన యోగీశ్వరులు ఏక కాలంలో అనేక దేహాలను ధరించి, కర్మక్షయం చేసుకుంటూ వుంటారని చెప్పారు గదా? ఈ విపశ్చిద్రాజులు గూడా అలాగే ప్రవర్తిస్తున్నారంటారా?

**వశిష్ఠుడు**: రామా! అగస్త్యాదులు జ్ఞాన సిద్ధులు, జీవన్ముక్తులు. వాళ్ళు సర్వవిధాల స్వతంత్రులై సంకల్ప మాత్రంతో పనులు చేస్తూ వుంటారు. వాళ్ళకు సుఖదుఃఖాలు అంటవు. విపశ్చిద్రాజులకు అంతటి స్థాయి లేదు. వీళ్ళు కేవలం అగ్న్యుపాసనా బలంవల్ల ఇష్టసిద్ధిని పొందిన ధారణాయోగులు. జ్ఞాన భూమికలలో రెండో భూమికలో వున్నవాళ్లు. వాళ్ళ దృష్టిలో ఈ ప్రపంచం ఒక రంగుల హరివిల్లు. నిజమైన జ్ఞానికి హరివిల్లు అంటే సూర్య కిరణాలే! ఆ కిరణాలకు మించి ఈ రంగులకు వేరే అస్తిత్వం లేదు. ఈ ప్రపంచాన్ని రూపొందించే రకరకాల అణువులన్నీ హరివిల్లు రంగుల వంటివే అని గ్రహించినవాడు జీవన్ముక్తుడు. మిగిలినవారు ఎంత ఉపాసకులైనా సామాన్యులే!(స. 125)

## 43. అవిద్యాదర్శనేచ్ఛ

**శ్రీరాముడు**: సరే గురుదేవా! ఇక ఆ విపశ్చిద్రాజుల చర్యలను మీరు కొనసాగించండి.

**వశిష్ఠుడు**: రామా! క్రమంగా వాళ్ళల్లో ఒక్కొక్కడికి ఒక్కొక్క రకంగా మృత్యువు సంభవించి జన్మలు గూడా మారిపోయాయి. ఎలాగంటే–

వీళ్ళల్లో తూర్పు రాజు క్రౌంచ ద్వీపంలో వర్షసీమ అనే కొండమీద తిరుగుతుండగా, మదం ఎక్కువై దంతాలతో  కొండ కొమ్మలను నుగ్గు నుగ్గు చేస్తున్న ఏనుగు కనిపించింది. ఈ రాజు దానికి అడ్డం వెళ్ళాడు. దాని ధాటికి తట్టుకోలేక, ఇతను ముక్కలు ముక్కలై మరణించాడు.

**శ్రీరాముడు**: అదేమిటి గురుదేవా! వీళ్ళకు మరణం లేదని అగ్నిదేవుడు వరమిచ్చాడు గదా! ఇప్పుడితనికి మరణం ఎలా వచ్చింది?

**వశిష్ఠుడు**: రామా! సరిగ్గా గుర్తు చేసుకో. ఈ రాజులు వరం కోరే సమయంలో "సిద్ధులు సంచరించే దారి వరకు మాకు మరణం లేకుండు గాక" అని కోరారు. అగ్నిదేవుడు తథాస్తు అన్నాడు. ఇప్పుడు వీళ్ళు నలుగురూ సిద్ధులు సంచరించే మార్గాలను ఎప్పుడో దాటిపోయారు. అందుకే ఒక్కొక్కళ్ళకీ మరణం వస్తోంది.

**శ్రీరాముడు**: బాగుంది, పై కథ చెప్పండి.

**వశిష్ఠుడు**: ఇక దక్షిణరాజు ఒక రాక్షసుడితో యుద్ధానికి దిగాడు. వాడు ఇతని ఎముకలు విరుగగొట్టి బడబాగ్నిలోకి విసిరివేశాడు. అక్కడ ఇతను బూడిదైపోయాడు.

పశ్చిమరాజుకి ఒక విద్యాధరుడితో స్నేహం కుదిరింది. అతడు ఇతనిని ఒకసారి స్వర్గలోకానికి తీసుకొని వెళ్లాడు. ఈ రాజు అక్కడ వుండే దేవేంద్రుడికి నమస్కారం పెట్టలేదు. దాంతో దేవేంద్రుడు కోపించి ఇతనిని భస్మం చేసిపారేశాడు.

ఇక ఉత్తరపురాజు ఒక నదిని దాటుతూ వుండగా, ఒక మొసలి పట్టుకొని ఎనిమిది ముక్కలు చేసింది. అందువల్ల ఇతను గూడా మరణించాడు.

ఆ విధంగా వారు నలుగురూ మరణించేసరికి, వారి చైతన్యం ఆకాశరూపాన్ని పొందింది. ఆకాశరూపంలో వున్న ఆ చైతన్యం తన పాత సంస్కారాల బలంచేత అదే ఆకాశంలో ఒక భూమండలాన్ని చూసింది. ఆ భూమండలం గూడా మన భూమండలంగానే వుంది. దానికి గూడా సప్తద్వీపాలూ, సౌరకుటుంబాలూ, నదులూ, అరణ్యాలూ, అన్నీ వున్నాయి. అంతకంటే చిత్రమేమిటంటే, ఆ నలుగురికీ ఆ భూమండలంలో తమ స్వంత శరీరాలు కనిపించాయి. అంటే, పూర్వ సంస్కార బలంవల్ల స్థూల దేహానికి వుండదగిన స్థూలత్వ జడత్వాది భావాలు వాళ్ల అనుభవంలోకి వచ్చాయి. వాళ్ళకిప్పుడు "మేము దేహం కలవాళ్లం అయ్యాము" అనే భావన కలిగింది. ఈ భావం అవిద్యకు ఫలం అని వాళ్ళకు అర్థమౌతోంది. కాని ఆ భావం పోవడం లేదు. పైగా పూర్వ సంస్కారబలంవల్ల ఈ అవిద్య ఎంతటిదో తెలుసుకోవాలనే కోరిక పెరుగుతోంది. దాని కోసం మళ్ళీ వాళ్ళు సంచారం మొదలు పెట్టారు. పూర్వపు వరబలం వుండడంవల్ల ఈ సంచారం అడ్డూ ఆపూ లేకుండా సాగింది.

వీళ్ళల్లో పశ్చిమరాజు సప్తద్వీపాలూ, సప్త సముద్రాలూ, దాటి ముందుకు పోగా, ఒక బంగారు మయమైన నేల కనిపించింది. ఆ ద్వీపంలో సంచరిస్తూ వుండగా అతనికి అదృష్టం కలిసివచ్చి విష్ణుమూర్తి దర్శనం లభించింది. ఇతను వెంటనే, విష్ణూపాసన చేసి, ఆ స్వామి దగ్గరే బ్రహ్మవిద్యోపదేశం పొంది, అక్కడే ఐదు సంవత్సరాలు సమాధిలో వుండిపోయి, చివరికి కైవల్యాన్ని పొందాడు.

ఇక పూర్వదిగ్రాజు తన ప్రయాణంలో చంద్రమండలానికి చేరుకొని, అక్కడ చంద్రోపాసన చేసి, చివరికి చంద్ర తాదాత్మ్యాన్ని కొంతవరకు పొంద గలిగాడు.

**శ్రీరాముడు**: ఇది ఎలా కుదురుతుంది, గురుదేవా! ఒకే విపశ్చిద్రాజు నాలుగు ముక్కలయ్యాడు. అందులో ఒక ముక్కకు మోక్షం వచ్చింది. మరో ముక్కకు చంద్రత్వం వచ్చిందని మీరంటున్నారు. అలా అంటే, ఒకే జీవుడికి కొంతమేర వరకు ముక్తి, మిగిలిన భాగంలో బంధమూ, వున్నాయని చెప్పినట్లవుతోంది. ఇది ఎలా కుదురుతుంది?

**గమనిక** – ఈ ప్రశ్న గాని, దీనికి వశిష్ఠమహర్షి చెప్పబోయే సమాధానం గానీ, మూలంలో ఎంత మాత్రమూ లేవు. ఇక్కడ వ్యాఖ్యాత ఈ ప్రశ్ననూ సమాధానాన్ని గూడా తనే బాగా విస్తారంగా పెంచి, అనేక రకాల సమన్వయాలు చేసి చూపించాడు. మూలంలో లేకపోయినప్పటికీ, విషయం బాగుంది గనుక, ఆ విపుల చర్చయొక్క సారాంశాన్ని మనం చెప్పుకుందాం.

**వశిష్ఠుడు**: రామా! ఒక శనగచెట్టు వుందనుకో. చెట్టు అంటే ఒకడే జీవుడు గదా! దానికి తగిన ఋతువు వచ్చేసరికి, ఆ చెట్టునిండా శనగగింజలు విరగగాచాయి. ఇప్పుడు ఈ గింజలలో ఒకొక్క దాంట్లోనూ ఒక్కొక్క జీవుడున్నాడు. వాటిల్లో కొన్ని నేలమీద రాలాయి. ఒక్కొక్క గింజలోంచి ఒక్కొక్క మొక్క వచ్చింది. ఈ మొక్కలన్నీ వేరు వేరు జీవులే. వీళ్ళల్లో ఎవరి కథ వారిదే.

ఇంతలో ఓ పెద్దమనిషి వచ్చి ఒక గుప్పెడు శనగగింజలను మొదటి చెట్టు మీదినుంచి కోసుకొని నమిలి మింగేశాడు. ఇప్పుడు ఈ గుప్పెడు జీవులు, ఆ ఒక్క జీవిలో కలిసిపోయి ఒకే జీవి ఐపోయారు.

ఇది లోకంలో జరిగే కథ! నువ్వు చెప్పే సిద్ధాంతాన్ని ఒప్పుకుంటే, ఒకే జీవి ఐన పెద్దచెట్టు ఇన్ని వందల జీవులుగా మారటం కుదరదు. ఎలాగో అలా కుదిరిందని ఒప్పుకున్నా, వాళ్ళల్లో కొందరు పుట్టి మొక్కలు కావడం, మరికొందరు చచ్చి మరొకరిలో కలిసిపోవడం – ఇలాంటివేవీ కుదరకూడదు. కానీ, కుదురుతున్నాయి లోకంలో. దీనికి కారణమేమిటంటే, ఉన్నది శుద్ధ చైతన్యం ఒక్కటే! అది ఒకానొక చిత్తంలో ప్రతిబింబిస్తే, అప్పుడు జీవుడు ఏర్పడుతున్నాడు. అ చిత్తం ముక్కలై రెండుగా, మూడుగా, మారితే, జీవులు గూడా ఇద్దరూ, ముగ్గురూ ఔతున్నారు. ఏ కారణంవల్లనైనా, విడిపడ్డ చిత్తాలు కలిసిపోతే, ఆ జీవులు గూడా కలిసి ఒకటే అవుతున్నారు. ఈ సత్యాన్ని నువ్వు గుర్తిస్తే నీ ప్రశ్నకు తావే లేదు.

**శ్రీరాముడు**: సరిపోయింది గురుదేవా! పై కథ చెప్పండి.

**వశిష్ఠుడు**:రామా! దక్షిణదిగ్రాజు శాల్మలి ద్వీపానికి చేరి, అక్కడ రాజ్యం సంపాదించి, శత్రువులను సంహరించి, ఇప్పటికీ అక్కడ రాజ్యం చేస్తూనే వున్నాడు. అతనికి ఇంకా తత్త్వజ్ఞానం కలుగనే లేదు.

ఉత్తరదిగ్రాజు ఒక సముద్రంలో ప్రయాణం చేస్తూ వుండగా, ఒక మొసలి మింగేసింది. కానీ, ఇతను మరణించలేదు. పొట్టలోని పురుగు లాగా, ఇతను ఆ మొసలి కడుపులోనే వెయ్యేళ్లు జీవించాడు. అక్కడ వుండే మాంసాన్నే ఆహారంగా స్వీకరించాడు. చివరికి, ఒక రోజున ఆ మకరం చచ్చిపోయింది. అప్పుడితను, ఆ మొసలి నోటిలోంచి బయిటికి వచ్చి, ఆ సముద్రంలో ఈదడం మొదలుపెట్టాడు. అది తీపినీటి సముద్రం. దానిని ఈది ఈది, ఇతను ఒక బంగారు నేలకు చేరుకున్నాడు. అది దేవలోకానికి పోయే దారి. ఆ దారిలో ప్రయాణం చేస్తూ వుండగానే ఉత్తరదిగ్రాజు ఒక దేవతగా మారిపోయాడు. దేవత్వం వచ్చినా పూర్వవాసన పోక, మళ్ళీ ఆ లోకంలో సంచారం మొదలు పెట్టాడు. అలా తిరుగుతూ తిరుగుతూ, లోకాలోక పర్వతానికి చేరుకున్నాడు.

లోకాలోక పర్వతానికి ఒక పక్కంతా వెలుగు. రెండో పక్కంతా చీకటి. వెలుగు వున్నవైపే జీవుల సంచారం వుంటుంది. చీకటి వైపు అసలు ఏ పదార్థమూ వుండదు. (స. 126)

### 44. ఖగోళ విజ్ఞానము

**శ్రీరాముడు**: గురుదేవా! ఆకాశంలో ఈ భూగోళం, ఏ ఆధారమూ లేకుండా ఎలా నిలబడి వుంది? ఆ నక్షత్ర చక్రం కూడా అలా నిరాధారంగా ఎలా తిరగ గలుగుతోంది? లోకాలోక పర్వతానికి ఆ పేరు ఎలా వచ్చింది?

**గమనిక** – ఇది ప్రాసంగికంగా వచ్చిన ప్రశ్న. ఆ నాటి రచయితల శైలికి అనుగుణంగా ఇలాంటి విషయాలను గూడా ప్రస్తావించి, కొంత వివరణ చేశాడు వాల్మీకి మహర్షి. వశిష్ఠ మహర్షి ఈ వివరణను రెండు స్థాయిల్లో చేశాడు.

**వశిష్ఠుడు**:

**1. వేదాంతస్థాయి** – ఈ స్థాయిలో ఈ సృష్టి అంతా హిరణ్యగర్భుడనే ప్రథమ జీవియొక్క పూర్వ సంస్కారాలవల్ల కలిగిన సంకల్పాల ద్వారా ఏర్పడుతోందనీ, అందువల్లే దీనిలో ఏ మాత్రం సత్యత్వం లేదనీ, కేవలం ఒక కల వంటిదనీ, వశిష్ఠుడు అన్నాడు. కల కనేవాడికి పూర్వ వాసనలవల్ల , కలలో ఏ దృశ్యాలైనా కనిపించవచ్చుననీ, వాటికి వేరే తర్క నిబద్ధత అవసరం లేదనీ, వివరించాడు. ఆ విధంగా జగన్మిథ్యాత్వాన్ని మరోసారి పునరుద్ఘాటించాడు.

**2. ఖగోళస్థాయి** – ఈ స్థాయిలో బ్రహ్మాండ రచననూ, నక్షత్రాల అమరికనూ, దిక్కులయొక్క సాపేక్షత్వాన్ని , నక్షత్ర మండలాలను దాటి పోగా పోగా, బ్రహ్మాండ కర్పరాల(డిప్పల) అమరికను, ఆ డిప్పలను దాటిన

తరువాత గూడా ఆకాశం ఇంకా వుండడాన్ని, వశిష్ఠమహర్షి రెండు సర్గల్లో సుమారు యాభై శ్లోకాలతో వివరించాడు.

వ్యాఖ్యాత ఆనంద బోధేంద్ర సరస్వతి ఈ విషయాలను మరింత పెంచి వ్రాశాడు. ఖగోళ విజ్ఞాన దృష్టి గలవారు ఈ సర్గను, ఆ వ్యాఖ్యానాన్నీ గూడా విశేషంగా పరిశీలించవచ్చును. (స. 127).

***శ్రీరాముడు***: గురుదేవా! ఈ ఖగోళ విషయాలను మీరెలా కనిపెట్టారు?

***వశిష్ఠుడు***: రామా!

**అస్మదాదేర్జనస్యైతత్**
**ప్రత్యక్షం నానుమానికమ్ ।**
**శుద్ధబోధ శరీరేణ**
**నాధిభౌతిక రూపిణా ॥** (ని.ఉ.స. 128. శ్లో.1)

(మా లాంటి యోగులకు ఇవి ప్రత్యక్షంగా తెలిసే విషయాలు. అంతే గాని వట్టి ఊహాగానాలు గాదు. ఐతే ఈ ప్రత్యక్ష జ్ఞానం ఈ ఆధిభౌతిక శరీరంతో కలగదు. శుద్ధమైన సూక్ష్మ శరీరంతోనే కలుగుతుంది.)

ఈ బ్రహ్మాండ విషయం మాత్రమే కాదు, ఈ బ్రహ్మాండపు డిప్పలు దాటిన తరువాత వుండే జలావరణ, ఆ పైన అగ్ని ఆవరణ, దాని మీద వాయు ఆవరణ, దానిమీద ఆకాశావరణ, అక్కడవుండే చీకటీ–వెలుగూ రెండూ కాని స్థితి, ఇవన్నీ మాకు ప్రత్యక్షంగా తెలుసు.

ఇంతకూ లోకాలోక పర్వతం దగ్గర ఉత్తరవిపశ్చిద్రాజుకు జరిగిన సంఘటనలను చెప్పుకుంటూ, మధ్యలో ఈ ప్రసంగంలో పడ్డాం. ఇప్పుడు వాళ్ళ అసలు కథలోకి వెళ్దాం.

## 45. లేడి జన్మ

ఆ విధంగా లోకాలోక పర్వతానికి చేరిన ఆ రాజు ఆ పర్వతాన్ని ఎక్కి, వెలుగు వైపునుంచి చీకటివైపు గల గుంటలోకి పడిపోయాడు. ఆ వైపు ఏ ప్రాణీ వుండదని చెప్పాను గదా, అందువల్ల అతని శరీరం పర్వత శిఖరం దగ్గరే ఆగిపోయింది. ఇతను మాత్రం గుంటలోకి పడిపోతూ పడిపోతూ వెనక్కు చూశాడు. అక్కడ పర్వత శిఖరం మీద తన శరీరాన్ని గద్దలు పీక్కుతింటున్నాయి. "అలా ఐతే, శరీరం లేకుండా నేనెలా వున్నాను?" – అని అతనికి సందేహం కలిగింది. ఆలోచించగా, తన భౌతిక దేహం రాలిపోయిందనీ, మనోదేహం మాత్రం ముందుకు సాగుతోందనీ, అతను అర్థం చేసుకున్నాడు. ఆ విధంగా, మనోమయత్వం అతనిని వదిలిపెట్టనందువల్ల అతనికి శుద్ధ తత్త్వజ్ఞానం అందలేదు.

***శ్రీరాముడు***: గురుదేవా!స్థూలదేహం అనే ఆధారం లేకుండా, మనస్సు ఎలా నిలువ గలదు? ఎలా ప్రయాణం చేయగలదు? ఈ రాజు ఇంతకు పూర్వం దేవ శరీరంతో ఆకాశమార్గంలో అడ్డూ అదుపూ లేకుండా తిరిగాడు గదా, ఇప్పుడు ఆ దేహం రాలిపోయిన తరువాత గూడా, మళ్ళీ ఆకాశంలో తిరుగుతున్నాడు గదా, ఇలా ఆకాశంలో తిరగటం అనే లక్షణం సమానంగా వున్నప్పుడు, వెనుకటి దేవశరీరానికీ, ఇప్పటి మనశ్శరీరానికీ తేడా ఏమిటి?

***వశిష్ఠుడు***: విపశ్చిద్రాజు దాకా ఎందుకయ్యా? భూలోకంలో వుండే మామూలు రాజుగారొకరు రాజ సభలో కూర్చొని వుండగానే, ఆయన మనస్సంకల్పం అంతఃపురంలోకి వెళ్ళిపోయింది. అలా మనస్సు వెళ్ళినంత మాత్రాన, అతని స్థూల దేహం గూడా అంతఃపురంలోకి వెళ్ళిపోతుందా? వెళ్ళదు గదా! కనుక, మనో దేహంయొక్క ప్రయాణానికి, స్థూల దేహ ప్రయాణంతో పని లేదు. ఇక్కడే గాదు, భ్రాంతి కలిగిన సందర్భంలోనూ, స్వప్నంలోనూ, ఊహాలోకంలోనూ, తప్పుడు జ్ఞానం కలిగిన సందర్భంలోనూ, కథ వినే సందర్భంలోనూ,

మనస్సు శరీరాన్ని వదిలిపెట్టి, సంచరిస్తూ వుండటం అందరికీ అందుబాటులో వున్న విషయమే!

స్థూల దేహాన్ని వదిలిపెట్టి, మరో దేహాన్ని దేనినో ధరించడం వల్లనే భ్రమ స్వప్నాదులు కలుగుతున్నాయి. ఏ దేహంవల్ల అవి కలుగుతున్నాయో, దానినే ఆతివాహిక దేహం అంటారు. కొంత కాలం పోయాక, ఈ ఆతివాహిక దేహం మీద వుండే దేహత్వ బుద్ధి (ఇదే నా దేహం అనే ఆలోచన) మరపున పడిపోతుంది. ఆ మరపువల్ల మళ్ళీ ఆధిభౌతిక దేహం మీద దేహత్వ బుద్ధి మొలకెత్తుతుంది. లోకం దృష్టిలో ఇదే మెలకువ.

దీనికి భిన్నంగా ఒకడు ఆధిభౌతిక దేహంలో వుండగానే, ఈ దేహం భ్రమాత్మకం అని అర్థం చేసుకున్నాడనుకో. అప్పుడు ఆధిభౌతిక శరీరం మరపునపడిపోయి, ఆతివాహిక శరీరం మిగులుతుంది. వాడి తత్త్వచింతన యింకా కొనసాగితే, ఆతివాహిక శరీరం గూడా మరపున పడిపోయి, శుద్ధ చిన్మాత్రం మిగులుతుంది.

ఐతే, మన ఉత్తర విపశ్చిద్రాజుకు, ఆతివాహిక దేహం మరపుకు రాలేదు. పైగా, ఈ 'ఆతివాహిక దేహమే నేను' అనే ఆలోచన వచ్చింది. అందుచేతనే అతనికి చిన్మాత్ర జ్ఞానం అందలేదు. అందుచేతనే, అతను ముందుకు సాగిన తన మనస్సును చూశాడు. ఆ దశలో అతను ముందుకు సాగుతూ, పుట్టబోయే జీవి తన తల్లి గర్భాన్ని చూసినట్లుగా, ఒక తీవ్రమైన చీకటిని చూశాడు. ఆ చీకటిలో తిరుగుతూ వుండగానే అతనికి ఒక భూమి కనిపించింది. ఆ భూతలం బంగారు కాంతులతో కోటి యోజనాలు విస్తరించి వుంది. అతను దానిని గూడా దాటి ముందుకు వెళ్ళాడు. అక్కడ జలావరణం కనిపించింది. ఆ తరువాత ఆగ్నేయావరణాన్ని, మారుతా వరణాన్ని, ఆకాశావరణాన్ని, కూడా దాటి, చివరికి అవిద్యా మిశ్రితమైన బ్రహ్మాకాశాన్ని చేరుకున్నాడు.

అవిద్యా మిశ్రితమైన బ్రహ్మాకాశం అంటే, దేనినుంచి అన్నీ వస్తున్నాయో, ఏది ఏదీ కాదో, ఏది అన్నీ ఔనో – అలాంటిది.

ఆ రాజు అక్కడే తిరుగుతూ మళ్ళీ మరో చోట మరో భూమినీ, మరో జలాన్నీ, మరో అగ్నినీ, మరో వాయువునూ, మరో ఆకాశాన్నీ, మరో లోకాలనూ, చూశాడు. అలా మళ్ళీ మళ్ళీ ఎన్నో సార్లు వేరు వేరు లోకాలను చూశాడు.

రామా! ఆ రాజు ఇప్పటికీ అలాగే తిరుగుతూ క్రొత్త క్రొత్త లోకాలను చూసుకుంటూ, ఇంకా జీవించే వున్నాడు. (స. 128)

రామా! మొత్తంమీద సారాంశం ఏమిటంటే, నలుగురు విపశ్చిద్రాజులలోనూ తూర్పువాడు చంద్రమండలానికి చేరాడు. దక్షిణ ఉత్తరాల వాళ్ళు జన్మ పరంపరలలో ఆయా బ్రహ్మాండాలలో తిగుగుతూనే వున్నారు. పశ్చిమ దిక్కువాడు మాత్రం ముక్తిని పొందాడు. వీరిలో చంద్రమండలానికి చేరిన తూర్పురాజు చంద్రోపాసన చేస్తూ, చేస్తూ, మధ్యలో అక్కడుండే కళంకరూపమైన లేడితో స్నేహం చేసి తత్ఫలితంగా తనే ఒక లేడి అయి పుట్టాడు. ఇదీ వాళ్ల కథ.

***శ్రీరాముడు***:గురుదేవా! దక్షిణోత్తర దిక్కుల రాజులు ఏవేవో బ్రహ్మాండాలలో తిరుగుతున్నారన్నారు గదా! వాళ్ళు ప్రస్తుతం ఏ బ్రహ్మాండంలో వున్నారో, మీ దివ్య దృష్టితో చూసి దయచేసి చెప్పండి.

***వశిష్ఠుడు***: రామా! ఈ సంసారంలో వుండే బ్రహ్మాండాల పరంపర అనంతమైనది. వాటిలో కొన్ని నా దివ్య దృష్టికి కూడా అందవు. అలాంటి లోకాలలో ఎక్కడో వాళ్ళు తిరుగుతున్నారు. అందుచేత వాళ్ళ వివరాలు నేను చెప్పలేను.

***శ్రీరాముడు***: అలా ఐతే, లేడి జన్మ ఎత్తిన తూర్పు రాజు ఎక్కడున్నాడో చెప్పండి?

***వశిష్ఠుడు***: అది మనం వున్న ఈ బ్రహ్మాండంలోనే వుంది.

***శ్రీరాముడు***: అదేమిటి?ఆ రాజులంతా బ్రహ్మాండాలను దాటుకుంటూ ఎక్కడికో వెళ్ళి పోయారన్నారు గదా!

మళ్ళీ ఇతను వెనక్కి ఈ బ్రహ్మాండానికి ఎలా వచ్చాడు.

**వశిష్ఠుడు**:బ్రహ్మాండాలకు మధ్య దూరమనే మాట అజ్ఞానులు చెప్పుకునే మాటే! జ్ఞానుల దృష్టిలో మొత్తమంతా అఖండ పరబ్రహ్మమే కనుక, దూరం, దగ్గరా అనే ప్రసక్తి లేదు. ఇక అజ్ఞానుల దూరం వారి సంస్కారాలవల్ల కల్పింపబడినదే కనుక, ఆ సంస్కారాల ప్రాబల్యంవల్ల ఏ బ్రహ్మాండంలోంచి ఏ బ్రహ్మాండానికైనా సరే, మార్గాలు వుండనే వుంటాయి. అటువంటి సంస్కార మార్గాలలో ఒక మార్గాన్ని పట్టుకొని తూర్పురాజు ఈ బ్రహ్మాండంలోకి వచ్చి పడ్డాడు.

**శ్రీరాముడు**:ఈ బ్రహ్మాండంలో అతను ఇప్పుడు ఎక్కడ వున్నాడు?

**వశిష్టుడు**: రామా! త్రిగర్త దేశరాజు ఈ మధ్య నీకు బహుమతిగా ఒక లేడిపిల్లను పంపించాడు, గుర్తుంది కదా! ఆ జింకపిల్లే పూర్వదిక్కు విపశ్చిద్రాజు.

శ్రీరాముడు ఆశ్చర్యపోయి, వెంటనే భటులను ఆజ్ఞాపించి, ఆ జింకపిల్లను సభలోకి తెప్పించాడు. అది అన్ని జింకపిల్ల లాగానే బెదురు చూపులు చూసుకుంటూ, చెంగుచెంగున గంతులేసుకుంటూ, సంతోషంగా వుంది. ఈ లేడిపిల్లే ఆ రాజంటే, అందరికీ ఆశ్చర్యంగా వుంది. శ్రీరాముడు అశ్చర్యంలోంచి మెల్లిగా తేరుకొని, ఇలా అడిగాడు (స. 129)

## 46. విపశ్చిద్రాజ పునర్జన్మ

**శ్రీరాముడు**: గురుదేవా! ఇప్పుడితనికి ఈ పశు జన్మపోయి మళ్లీ పాత మానవ శరీరం లభించే అవకాశం వుందా?

**వశిష్ఠుడు**:రామా! మానవులలో ఎవరు ఏ దేవతను ప్రధానంగా ఉపాసిస్తారో, ఆ దేవత ద్వారానే తమ కష్టాలను పోగొట్టుకోవాలి. అంతే గాని తలో సారి, తలో దేవతను, పట్టుకోవాలనుకోవడం మంచి పద్ధతి కాదు. వేదం గూడా ఒక చోట

**"యః స్వాం దేవతా మతియజతి**
**ప్రస్వాయై దేవతాయై చ్యవతే**
**న పరాం ప్రాప్నోతి**
**పాపీయాన్ భవతి"**

(ఎవడైతే తన ఉపాస్య దేవతనుంచి జారిపోయి, తన స్వంత దేవతను దాటిపోయి, ఇతర దేవ పూజ చేస్తాడో వాడు ఉత్తమ స్థితిని పొందడు. పాపాత్ముడౌతున్నాడు.)–

అని చెబుతోంది. కనుక, ఈ విపశిద్రాజు ఎప్పటికో అప్పటికి మళ్ళీ అగ్ని దేవతోపాసన చేస్తేనే ఇతనికి ఉత్తమ గతి లభిస్తుంది. దానికి మనం కొంచెం సహాయం చేద్దాం. ఇదిగో ఏం జరుగుతుందో చూడు.

ఇలా అంటూనే వశిష్ఠమహర్షి కమండలూదకంతో ఆచమనం చేసి, కళ్ళుమూసుకొని, కొద్ది క్షణాలు ఏదో ధ్యానం చేశాడు. అంతే! ఆ సభాభవనం మధ్యలో కట్టెలు లేకుండానే అగ్నిజ్వాల లేచింది. ఆ జ్వాలకు పొగ లేదు. దాని కాంతిలో మాలిన్యం లేదు.

ఈ హఠాత్పరిణామానికి సభ్యులందరూ ఆశ్చర్యపోతూ, ఆ వేడికి తట్టుకోలేక వెనక్కు వెనక్కు జరుగుతుంటే, ఆ లేడిపిల్ల మాత్రం ఆ అగ్నిజ్వాలను ఒక వింతగా చూస్తూ ఆ మంట వైపు పరుగెత్తుకు రాసాగింది.

ఇంతలో వశిష్ఠ మహర్షి కళ్ళు తెరిచి తన చూపులతో ఆ లేడి పాపాలను ప్రక్షాళన చేస్తూ,

"భగవన్! అగ్నిదేవా! ఈ జీవి పూర్వ జన్మలో చేసిన ఉపాసనను స్మరించి, దయ వహించి, ఈ లేడి రూపాన్ని హరించి, పాత విపశ్చిద్రూపాన్ని ప్రసాదించు" అని ప్రార్థన చేశాడు.

ఆయన అలా ప్రార్థన చేస్తూ వుండగానే, ఆ లేడిపిల్ల విల్లు విడిచిన బాణం లాగా దూసుకు వచ్చి, కట్టెలు లేని ఆ అగ్ని జ్వాలలో దూకేసింది.

అందరూ చూస్తూ వుండగానే, ఆ లేడి శరీరం మలమలా మాడిపోయి, బూడిద కాబోతూ వుండగా ఆగి, క్రమక్రమంగా ఒక బలిష్ఠమైన రాజ శరీరంగా మారింది. ఆ రాజ శరీరం నిగనిగ లాడుతూ, కాంతులీనుతూ, విస్పష్టమౌతున్న కొద్దీ, ఆ అగ్నిజ్వాలలు క్రమక్రమంగా శాంతించ సాగాయి. ఇతడే పూర్వదిక్కు విపశ్చిద్రాజని వశిష్ఠమహర్షి గుర్తించాడు. సభలో వున్న వాళ్ళు మాత్రం అతని తేజస్సుకు ఆశ్చర్యపోతూ, అతణ్ణి 'భాసుడు భాసుడు' అని పిలవసాగారు.

ఇంతలో ఆ విపశ్చిద్రాజు అక్కడే నేలమీద చతికిలబడి, కళ్ళుమూసుకొని ధ్యానం చేశాడు. అతనికి తన పూర్వ వృత్తాంతమంతా గుర్తుకు వచ్చింది. అతను త్వరలోనే లేచి, సరాసరి వశిష్ఠమహర్షి వద్దకు వచ్చి, నమస్కరించి "జ్ఞానం అనే ప్రాణాన్ని ప్రసాదించే ఓ బ్రహ్మర్షి పుంగవా!, నీకు నమస్కారం" అన్నాడు.

వశిష్ఠుడు తన చేత్తో అతని తల నిమురుతూ "రాజా! దేని అంతం చూడాలని చిరకాలంగా నువ్వు కృషి చేస్తున్నావో, ఆ అవిద్య నీకు ఇప్పుడు నాశమగు గాక!" అన్నాడు.

అటు తరువాత విపశ్చిద్రాజు లేచి, "శ్రీరామా, జయ జయ" అంటూ, రాముడికి నమస్కారం చేయబోయాడు.

అది చూచిన దశరథుడు తొట్రుపడుతూ లేచి, నవ్వుతూ – "రాజా! నీకు స్వాగతం, ఇదిగో ఆసనం. మీరు అనేక సంసారాలలో తిరిగి తిరిగి అలసిపోయి వున్నారు. ఈ ఆసనంలో విశ్రమించండి" అన్నాడు.

విపశ్చిద్రాజు హుందాగా నిలబడి, సభలోని విశ్వామిత్రాది మహర్షులందరికి నమస్కరించి, ఆసనంలో కూర్చున్నాడు. (స. 130)

అప్పుడు దశరథుడు "అబ్బా! ఈ అవిద్య ఎంత భయంకర మైనది. దీనివల్ల ఈ రాజు దిగంత దర్శనమనే పేరుతో ఎంత శ్రమ పడ్డాడు. అసలితనికి అవిద్యయొక్క అంతుచూడాలనే పట్టుదల ఎందుకో?" అన్నాడు.

ఇంతలో విశ్వామిత్రమహర్షి అందుకొని – "దశరథ మహారాజా! అవిద్యమీద దృష్టిపడ్డవాళ్ళు ఎవరైనా సరే ఇలా కష్టపడవలసిందే! పూర్వం వటధానములు (మట్టి విత్తు లోపల వుండేగింజలు) అనే పేరుగల దేశంలో,ముగ్గురు రాజపుత్రులు పుట్టారు. వాళ్ళు గూడా ఈ విపశ్చిద్రాజులు లాగానే, ఏక సంకల్పంతో వుండేవాళ్ళు. వాళ్ళు గూడా ఈ సృష్టి అంతం చూడాలని బయలుదేరారు. వాళ్ళిప్పటికీ బంతిమీది చీమలు లాగా సృష్టి చుట్టూ తిరుగుతునే వున్నారు. వాళ్లకి ఆ అంతు ఇంకా దొరక లేదు. అంతు అనేది వుంటే గదా, దొరికేందుకు. సృష్టి అనేది హిరణ్యగర్భుడియొక్క సంకల్పాడంబరం మాత్రమే! ఈ జీవుడు "నేను శుద్ధ చైతన్యాన్ని కాను, నేను జీవుణ్ణి" అనుకుంటున్నంత కాలమూ, ఇది అనంతంగా పెరిగిపోతూనే వుంటుంది. ఓ విపశ్చిద్రాజా! నువ్వు గూడా ఇలాగే అనుకుంటూ చాలా దూరం తిరిగావు. నువ్వు చూసిన దృశ్య ప్రపంచాలేమిటో గుర్తున్నాయా? కొంచెం చెబుతావా?" అన్నాడు.

**విపశ్చిద్రాజ:** మునీంద్రా!చాలా తిరిగాను. చాలా చూశాను. అగ్నిదేవుడి వరంవల్ల దృఢమైన చిత్తంలో , జన్మలకు జన్మలే మారి మారి చూశాను. ప్రతి జన్మలోనూ వేరే వేరే బ్రహ్మాండాలను చూశాను. అగ్నిదేవుడి దయవల్ల అవన్నీ నాకు గుర్తున్నాయి."

**గమనిక** – ఇలా మొదలు పెట్టిన విపశ్చిద్రాజు పశువులుగా, పక్షులుగా, వృక్షాలుగా, మనుషులుగా, దేవజాతులుగా, రాక్షసులుగా, తను ఎత్తిన జన్మలను, వాటిలో కొన్ని ఆశ్చర్యకరమైన ఘట్టాలను 131 వ

సర్గలోనూ, 132వ సర్గలోనూ గూడా వర్ణించాడు. ఇలాంటి జన్మ పరంపరా కథనాలు ఇప్పటికే రెండు మూడు సార్లు వచ్చాయి గనుక, వాటిని సంగ్రహించుకుంటూ అతను చెప్పబోయే శవోపాఖ్యానం దగ్గరకు త్వరత్వరగా అడుగులు వేద్దాం.

జన్మ పరంపరను చెప్పి చెప్పి చివరికి, విపశ్చిద్రాజు తన అనుభవాన్ని ఇలా తేల్చి చెప్పాడు.

**విపశ్చిద్రాజు**:

**నేదం నేదం సదిత్యేవ**
**విచారానుభవే స్థితమ్।**
**తథాపీద మిదం చేతి**
**దుర్‌దృష్టిర్న నివర్తతే ॥** (ని.ఉ.స.132,శ్లో.17)

నేనీ ప్రపంచాన్ని చూస్తున్నప్పుడల్లా, "ఇది సత్యం కాదు, ఇది సత్యం కాదు " అనిపిస్తూనే వుండేది. విచారించిన కొద్దీ ఆ మాటే అనిపించేది. 'ఐనా ఇది వేరు, ఇది వేరు' అనే చెడు దృష్టి నశించేది కాదు.

అందుకే సుఖదుఃఖాల అనుభవాలు ఎప్పటికప్పుడు క్రొత్తగా వుండేవి. ఈ అనుభవ పరంపరలో ఒక ఆశ్చర్యకరమైన అనుభవాన్ని చెబుతాను, వినండి (స.132)

**గమనిక –** భూమికి 'మేదిని' అని ఒక పేరు వుంది. మధుకైటభులు అనే రాక్షసులను శ్రీహరి సంహరించినపుడు, వారి తలలు పగిలి, వారి మెదడులోని కొవ్వు (మేదస్సు) భూమి మొత్తం పరచుకుందనీ, అందువల్లనే భూమికి 'మేదినీ' అనే పేరు వచ్చిందనీ, బ్రహ్మవైవర్తాది పురాణాలలో వుంది. ఆ కథలకు గూడా మూల భూతమైన ఒకానొక వేదగాధను తీసుకుని, వాల్మీకి మహర్షి దానిని విపశ్చిద్రాజు ద్వారా 'శవోపాఖ్యాన'మనే పేరుతో చెప్పించ బోతున్నాడు. ఈ గాథ ద్వారా దృశ్య ప్రపంచంయొక్క అసత్యాన్ని మరొకసారి నిరూపించ దలచుకున్నాడు. ఈ విషయాలను మనసులో పెట్టుకొని మనం అసలు కథలోనికి ప్రవేశిద్దాం.

## 47. శవోపాఖ్యానము

**విపశ్చిద్రాజు**: వశిష్ఠమహర్షీ! ఈ బ్రహ్మాండంలో మీ బోటివారు ప్రవేశించడానికి కూడా సాధ్యం కాని భయంకరమైన భూలోకం ఒకటి వుంది. నేను అగ్నిదేవుడి వర ప్రభావంవల్ల ఒకప్పుడు ఆ లోకానికి చేరాను. అక్కడికి చేరి చుట్టుపక్కల పరిశీలిస్తూ చూసేసరికి, ఆ నేలమీద ఏదో పెద్ద నీడ కదులుతున్నట్టు అనిపించింది. ఈ నీడ ఎక్కడి నుంచి వస్తోందా అని తలెత్తి పైకి చూచేసరికి, సుదూరాకాశంలో, మహాపర్వతం వంటి మానవాకారం ఒకటి కనిపించింది. దాని నీడే భూమి మీద పడుతోంది. ఆశ్చర్యం ! ఆ మానవాకారం ఆకాశంలో నిలకడగా లేదు. గిరగిరా తిరుగుతూ శరవేగంతో క్రిందకు పడుతోంది.

అది అలాగే కింద పడితే, నేను దాని క్రింద పడి, నలిగి, పచ్చడైపోవడం ఖాయం. ఆ భయంలో నేను ఇటూ అటూ చూచేసరికి, దగ్గరలోనే ఒక అగ్నిజ్వాల కనిపించింది. నేను అనేక జన్మలుగా అగ్ని ఉపాసన చేసి వున్న వాణ్ణి కనుక, ఈ పర్వతాకారం క్రిందపడి చచ్చిపోవడం కన్నా, అగ్నిలో దూకడం మంచిదనిపించింది. వెంటనే ఆ జ్వాలలోకి దూకేశాను.

కానీ అగ్నిదేవుడు కరుణామయుడు.నేను చేసిన పూజలు మర్చిపోలేదు. ఆయన నా పట్ల చల్లనివాడై, నన్ను ఓదార్చి, తన వాహనమైన చిలుకమీద నన్ను కూర్చోబెట్టుకొని, "నా లోకానికి పోదం పద" అంటూ పైకి ఎగరసాగాడు.

పైకి ఎగురుతున్న కొద్దీ క్రిందపడుతున్న ఆ మానవాకారం దగ్గరవుతోంది. అది వట్టి శవమని ఇప్పుడు

అర్థమైంది. అది మా నెత్తిన పడుతుందనే భయంతో నేను వణికి పోతున్నాను.

అగ్నిదేవుడు మాత్రం నిర్భయంగా పైకి ఎగిరి, ఆ శవం దగ్గరవుతూ వుండగా తన అగ్ని జ్వాలలను పెంచి,వాటితో ఆ శవంలో ఒక రంధ్రం చేసుకొని, ఆ రంధ్రం గుండా ఆ శవాన్ని దాటి, పైకి వెళ్ళి పోయాడు. ఆయనతో పాటూ నేనూ పైకి చేరాను. నా ప్రాణాలు కుదుట పడ్డాయి. కుతూహలంగా క్రిందికి చూడసాగాను.

చూస్తూ వుండగానే, ఆ మహాశవం భూమి మీద పడింది. భూమి పగిలినంత శబ్దం అయింది. ఆ శవంయొక్క ఆకారం భూమికన్నా చాలా పెద్దదిగా వుంది.

మేము పైకి ఎగిరిపోతూ వున్నాం. దేవతా బృందాలు ఈ చప్పుడు విని నానా దిక్కులనుంచీ భూమి దగ్గరకు వస్తున్నాయి. అంతా గందరగోళంగా వుంది. ఆ సమయంలో నేను అగ్నిదేవుడ్ణి అడిగాను. "దేవా! ఇంత పెద్ద శవం ఎక్కడినుంచి వచ్చింది? ఎందుకు కింద పడింది?" అని.

అగ్నిదేవుడు నవ్వి "ముందు ఏం జరుగుతోందో చూడు. తరువాత వివరాలు చెబుతాను" అన్నాడు.

నేను భూమికేసి చూశాను. భూమి కనపడలేదు. ఆ శవం తాలూకు పొట్టమాత్రమే కనిపించింది. ఆ శవంయొక్క తల, చేతులూ, కాళ్ళూ, అన్నీ ఎక్కడి దాకా వ్యాపించాయో నాకు అర్థం కాలేదు. ఆ మాటే అగ్నిదేవుడ్ణి అడిగాను. "అవి వెళ్ళి లోకాలోక పర్వతంమీద పడ్డాయి. మానవులకు ఆ ప్రాంతాలు కనిపించవు." అన్నాడాయన. ఆయన అలా అన్న దగ్గరనుంచీ ఆయన కరుణవల్ల నాకు ఆ ప్రాంతాలు గూడా కనుపించసాగాయి.

ఇంతలో దేవతాబృందాలు ఆ శవానికి దగ్గరైనాయి. వాటిలో కొన్ని బృందాలు ఆ శవం చుట్టూ నాట్యం చేస్తూ కాళరాత్రి దేవిని ఆహ్వానించ సాగాయి. ఇంతలో ఆ కాళరాత్రి దేవి అక్కడికి వచ్చింది. ఆమె భక్తులంతా కేరింతలు కొడుతూ "తల్లీ, ఈ శవాన్ని మేము నీకు కానుకగా సమర్పిస్తున్నాం. నువ్వు నీ పరివారంతో కలిసి దీనిని భక్షించు" అని ప్రార్థించారు. (ఇదే నిర్వాణ ప్రకరణం ఉత్తరార్థంలో, 81వ సర్గలో, శిలాంతర్గత జగద్వర్ణన ఘట్టంలో, ఈ కాళరాత్రి దేవి ప్రసక్తి వచ్చింది. అక్కడ పెద్ద వర్ణనకూడా వుంది. ఇక్కడ అంత వర్ణన లేకపోయినా ఇంచుమించు అలాంటి వివరాలే వున్నాయి.)

మహర్షీ! తన భక్తులు అలా ప్రార్థించేసరికి, ప్రాణశక్తి స్వరూపిణియైన ఆ దేవి, తన ప్రాణవాయు ప్రభావంచేత, ఆ శవంలోని రక్తాన్ని తాగటం ప్రారంభించింది. ఆ రక్తం త్రాగుతున్న కొద్దీ, ఆ దేవి మరింత లావు అయింది. ఆమె పరివారమైన ఇతర దేవతలు ఆ శవం యొక్క అవయవాలను పీక్కు తినడం మొదలెట్టాయి. లోకాలోక పర్వత శిఖరాలలో ఆ శవంయొక్క అవయవాలులేని చోట్ల మిగిలిన దేవతలు గుంపులు గుంపులై గుమిగూడి భయం భయంగా ఈ దృశ్యాలను చూస్తున్నారు.

అందరూ చూస్తూ వుండగానే, అప్పటివరకూ వృక్ష సంపదతోనూ, పర్వతాలతోనూ, నదులతోనూ, సముద్రాలతోనూ, కళకళలాడిన భూదేవిని శవంలోని కొవ్వు, నెత్తురు, మాంసం, మొదలైనవి పూర్తిగా ఆవరించేశాయి. భూమిని గుర్తుపట్టడమే సాధ్యం కావడం లేదు.

కాళరాత్రి పరివారదేవతలు ఆ మాంసఖండాలను తినగా, తినగా, భూమండలంయొక్క ఆకారం కొంచెం కొంచెం బైటపడసాగింది. అప్పడికి భూదేవి, మేదస్సు అనే వస్త్రపు పొరలను ఒంటినిండుగా చుటుకొని వున్నట్లుగా వుంది. ఆశవంలోని ఎముకలు భూమి మీద క్రొత్త కొండలయ్యాయి.

మహర్షీ! అది గమనించిన నేను కొంచెం తేలికపడి, అగ్నిదేవుడ్ణి మళ్ళీ అడిగాను– ఈ శవం ఎలా వచ్చిందీ అని. అగ్నిదేవుడు అనుగ్రహించి ఇలా వివరించాడు.

**అగ్నిదేవుడు**: విపశ్చిద్రాజా! నీ నిద్రలో నిన్ను నువ్వే మరో బాటసారి లాగా చూసుకున్నట్లుగా, శుద్ధ చిన్మాత్రమైన పరబ్రహ్మ తనను తానే తేజస్సుగా చూసుకుంది. అలా తేజఃపరమాణు రూపాన్ని ధరించిన ఆ పరబ్రహ్మ, తనను ఆవరించిన అజ్ఞానంయొక్క బలంచేత, తను పెరగాలని సంకల్పించింది. నీ సంకల్పమే, నీ స్వప్నంలో

మహానగరంగా మారినట్లుగా, ఆయన సంకల్పమే ఈ ప్రపంచంగా రూపొందింది. ఆ ప్రపంచంలో పర్వతాకారుడైన ఒక రాక్షసుడు, వనవాసియైన ఒక మహర్షి, తలో మూలా జీవనం చేస్తున్నారు.

ఒక రోజున ఆ రాక్షసుడు గర్వంతో మిడిసి పడుతూ వచ్చి, ఈ మహర్షి ఆశ్రమం మీద పడ్డాడు. పర్వతం అంత ఆకారం మీద పడేసరికి మహర్షి గారి పర్ణశాల నుజ్జు నుజ్జు అయిపోయింది. మహర్షిగారు మాత్రం చావు తప్పి కన్ను లొట్టబోయినట్టు, ఎలాగో తప్పించుకొని, బయట పడ్డాడు. ఆ కోపంలో ఆయన వొళ్ళు మరిచిపోయి, "ఓరీ! అధమా! కొండంత శరీరం వుండబట్టే గదా ఇంత ఘోరం చేశావు. కనుక నువ్వు చచ్చి దోమవై పుట్టుదువు గాక." అని శపించాడు.

తక్షణమే కొండవంటి రాక్షస శరీరంలోని అణువులన్నీ పంచ భూతాలలో కలిసి పోయినై. ఆ అణువుల మధ్యలో దాగి వున్న చైతన్యం మాత్రం "నేను దోమను" అనుకోవడం ప్రారంభించింది. అంతే, దానికి చిన్న దోమ శరీరం వచ్చేసింది.

## 48. తల్లి లేని జన్మ

***శ్రీరాముడు***: గురుదేవా! విపశ్చిద్రాజుగారు ఈ కథ ప్రారంభిస్తూ, "ఈ ప్రపంచమంతా స్వప్న ప్రపంచం వంటిదే" అన్నాడు. ఈ మాట మీరు గూడా చాలా సార్లు అన్నారు. స్వప్న ప్రపంచంలోని దేహాలకు జన్మస్థానం (యోని) అంటూ ఏదీ వుండదు కానీ, ఈ జాగ్రత్ ప్రపంచంలోని శరీరాలన్నీ తల్లి కడుపులోంచే జన్మిస్తున్నాయి. వీటికో వంశ వృక్షం వుంది. మరి ఈ రాజు చెప్పే దోమకు తల్లి ఎవరూ వున్నట్లు లేదు. అంటే, ఈ జాగ్రత్ ప్రపంచంలో గూడా కొన్ని శరీరాలు తల్లి లేకుండానే పుడతాయని ఒప్పుకోవాలంటారా?

***వశిష్ఠుడు***: రామా!చతుర్ముఖ బ్రహ్మ దగ్గరినుంచీ చిన్న చీమ దాకా , సమస్త ప్రాణులకు గూడా రెండు రకాల జన్మ వుంటుంది. ఒకటి బ్రహ్మమయ జన్మ, రెండు భ్రాంతి జన్యమైన జన్మ.

**పూర్వ రూఢ జగద్భ్రాన్తి**
**భూత తన్మాత్ర రంజనాత్ ।**
**భూతానాం సంభవః ప్రోక్తో**
**భ్రాంతిజో దృశ్య సంగతః** (ని.ఉ.స. 136 శ్లో. 23)

(తా॥ ఈ జన్మకు పూర్వమే గట్టిగా నాటుకొని వున్న భ్రాంతి పరంపరలవల్ల పంచభూత తన్మాత్రలతో తాదాత్మ్యం ఏర్పడి, దానివల్ల ఒక జీవి జన్మిస్తే, ఆ జన్మ భ్రాంతిమయమైన జన్మ. ఈ జన్మలో దృశ్య సంపర్కం దృఢంగా వుంటుంది. )

**అభాతాయాం జగద్భ్రాన్తౌ**
**భూతభావః స్వయం భవన్।**
**యస్స బ్రహ్మమయః ప్రోక్తః**
**సంభవో న స యోనిజః ॥** (ని.ఉ.స. 136, శ్లో. 24)

(తా॥ పరబ్రహ్మకు ప్రపంచ భ్రాంతి ఏ మాత్రం అంటని దశలో, అంటే, సృష్టికి పూర్వ దశలో, ఆ బ్రహ్మ తన సంకల్ప బలంచేత తనే పంచభూతాలుగా వివర్తం చెందుతుంది. ఆ రకమైన పంచభూత జన్మ, బ్రహ్మమయ జన్మ. ఈ జన్మకు వేరే యోని (తల్లి కడుపు) వుండదు.

రామా! ప్రపంచంలో ఎన్ని జన్మలను పరిశీలించినా ఈ రెండు రకాల జన్మలే కనిపిస్తాయి. పూర్వ భ్రాంతివల్ల జన్మ కనిపిస్తే, దానికి కారణమైన యోని నీకు స్పష్టంగా కనిపించినా కనిపించకపోయినా, అది

యోనిజమైన జన్మే! ఆ దృష్టితో చూసినప్పుడు, స్వప్నజన్మకీ జాగృత్‌జన్మకీ భేదమేమీ లేదు. రెండూ మాయామయ జన్మలే! కనుక యోని జన్యాలైన జన్మలే!

జాగ్రత్‌జన్మకు వంశపరంపర వుంటుంది గదా అంటావేమో! ఆ పరంపర మహాఅయితే చతుర్ముఖ బ్రహ్మ దాకా పోతుంది. ఆ వెనకాల పరంపర ఏదీ? ఆయనకు తల్లి ఎవరు? ఆయన చేసిన మొట్టమొదటి సృష్టి మానస సృష్టి అయి వుండాలి కానీ, దాంపత్య సృష్టి కావడానికి వీలు లేదు. అలాంటి మానస సృష్టిలో పుట్టిన సనక సనందనాదులు జాగ్రజ్జీవులంటావా? స్వప్న జీవులంటావా? వారికి తల్లి లేనంత మాత్రాన వారిని స్వప్నజీవులని అనగలమా? కనుక, వంశవృక్షాన్ని బట్టి జాగ్రత్ జన్మకు ప్రత్యేక స్థాయిని కల్పించలేం. అదీ గాక, ఒక్కొక్కసారి స్వప్నంలో కూడా ఇలాంటి వంశవృక్షం కనిపిస్తూనే వుంటుంది. దాన్ని బట్టి ఆ జన్మ జాగ్రజ్జన్మ అనగలమా? కనుక, ఈ దోమగారి వంశ వృక్షాన్ని వదిలేసి, పై కథ విందాం. ఈ విపశ్చిద్రాజుగారు చెప్పబోయే కథ నేనే చెబుతా, విను.

దోమలకు రెండు రోజులే సామాన్య ఆయుర్దాయం. ఎంతటి మహారాక్షసుడు దోమగా పుట్టినా, ఆ ఆయుర్దాయం పెరగదు గదా! మన దోమగారు ఓ రెండు రోజుల పాటు మురికి గుంటల దగ్గర, గడ్డి గుబుర్లలోనూ, ఆనందంగా స్వేచ్ఛా విహారం చేశారు. రెండో రోజు చివరికి వస్తూ వుండగా ఆ గడ్డి గుబుర్లలోనే ఆడుకుంటున్న లేడిపిల్ల ఒకటి దీని నెత్తిన కాలు వేసింది.

మహా పర్వతం లాగా నెత్తిన పడబోతున్న ఆ లేడి గిట్టను చూస్తూ ఈ దోమ భయంతో వణికి పోతూ తప్పించుకోవాలని చూసింది గానీ, సమయం చాలలేదు. గిట్ట నెత్తిన పడనే పడింది. దోమ పచ్చడై పోయింది.

భయ తీవ్రతవల్ల లేడిని ఏకాగ్రంగా చూస్తూ మరణించి నందువల్ల, పై జన్మలో ఆ దోమ ఒక జింకై పుట్టింది.

ఈ జింకపిల్ల అడవిలో హాయిగా విహరిస్తూ కొంతకాలం గడిపింది. ఒక రోజున ఒక బోయవాడు బాణం వేసి దానిని కొట్టాడు. భయంచేత ఆ బోయవాడినే భావన చేస్తూ మరణించినందువల్ల ఆ లేడి పై జన్మలో ఒక బోయవాడై పుట్టింది.

ఆ బోయవాడి గూడేనికి దగ్గరలో ఒక మునిపల్లె వుండేది. క్రమంగా ఆ ముని వాటికలో వుండే ఒక మునితో ఈ బోయవాడికి స్నేహం కుదిరింది. ఆ ముని వీడికి వీలు చిక్కినప్పుడల్లా వైరాగ్యం గురించీ, అహింస గురించీ, నూరిపోయడం ప్రారంభించాడు. కొన్నాళ్లకు ఆ బోధ ఈ వ్యాధుడికి తలకెక్కింది. కొంచెం ఆలోచించడం మొదలుపెట్టాడు. చివరికి ఒక రోజున ఆ బోయవాడు ముని దగ్గరకు వెళ్ళి "హింసే సకల దుఃఖాలకూ మూలం అంటున్నారు గదా, ఏ దుఃఖమూ లేకుండా వుండాలంటే ఏం చేయాలో చెప్పండి?" అని అడిగాడు.

ఆ మునికి ఉత్సాహం పెరిగింది. ఆయన ఇతనికి శమదమాదుల అభ్యాస క్రమాన్ని, తత్త్వవిచారణ చేసే విధానాన్ని, విపులంగా బోధించి, "ఇక నుంచీ నువ్వు నా ఆశ్రమంలోనే వుండు. ఈ విల్లంబులు విసిరిపారెయ్యి. ఆయాచితంగా ఏది దొరికితే అది తిను. సత్సాంగత్యంలో వుండు" అని బోధించారు.

## 49. స్వప్నం లోపలిదా? బయటిదా?

బోయవాడు అలాగే జీవించడం ప్రారంభించాడు. ఆ బోయవాడి వివేకం క్రమక్రమంగా పెరగసాగింది. అతని అంతరంగంలో క్రొత్త చర్చలు మొదలైనాయి. అవి సాగి సాగి ఎటూ తెగక, చివరికి ఒక రోజున అతను ఆ ముని దగ్గరికి వెళ్ళి–

**"భగవన్ దృశ్యతే స్వప్నః**

**కథ మన్తర్బహిః స్థితః॥** (ని. ఉ. స. 137, శ్లో. 5)

భగవన్! బైటా లోపలా వున్న ఈ స్వప్నం ఎలా కనిపిస్తోంది" – అని అడిగాడు.

**గమనిక** – ఈ వాక్యం కొంచెం సంకటంగా వుంది. అనేక రకాల అన్వయాలకు వీలుగా వుంది. అందుచేత ఇక్కడ వ్యాఖ్యాత మూల గ్రంథంలో రాబోయే సమాధానాన్ని పరిశీలించి, దానిని బట్టి ఈ వాక్యంలో 5 ప్రశ్నలు దాగి వున్నాయని నిర్ణయించాడు.

1. జీవుల మనస్సులో జరిగిన స్వప్నం బయటి ప్రపంచం లాగా ఎలా కనిపిస్తోంది?
2. జీవులకు లోపల జరిగే స్వప్నం ఏ ఉపాయంచేత వాళ్లకు కనిపిస్తోంది? (అక్కడ ఇంద్రియాలు లేవు గదా)
3. బయట వున్న ఈ ప్రపంచం, స్వప్నమై లోపల ఎలా కనిపిస్తోంది?
4. లోపలా వెలుపలా గూడా ప్రపంచం వుంటే, అందులో ఒకటి స్వప్నంగా ఎలా కనపడుతోంది?
5. ఈ కనిపించే ప్రపంచం అంతా స్వప్నమే అయితే, దీనిలో కొంత లోపల వున్నట్టూ, కొంత బయట వున్నట్టూ ఎందుకు కనిపిస్తోంది?

ఈ ప్రశ్నలన్నింటికీ సమాధానాలను వశిష్ఠుడు తన కథనంలో తీసుకు రాబోతున్నాడు గనుక, మనం ఆయన మాటలలోకి ప్రవేశిద్దాం.

***వశిష్ఠుడు***: రామా! ఆ ముని ఈ ప్రశ్నకు సంతోషించి వివరంగా సమాధానం చెప్పాడు.

***ముని***: నాయనా! నాకు గూడా చిన్నప్పుడు వివేకం కలిగీ కలుగని రోజుల్లో, ఇలాంటి సందేహాలే వచ్చాయి. ఐతే నేనప్పటికి యోగాభ్యాసం బాగా చేసి, పరకాయ ప్రవేశాది విద్యలను సాధించి వున్నాను గనుక, యోగధారణ ద్వారా ఈ ప్రశ్నలకు సమాధానం ఏమిటో స్వానుభవ పూర్వకంగా తెలుసుకోవాలనుకున్నాను.

దానికోసం నేను పద్మాసనంలో కూర్చొని, పరకాయ ప్రవేశంలో చేసే ధారణా యోగాన్ని ప్రారంభించి, దాని బలంతో నా ఆత్మ చైతన్యంలో నేను స్థిరంగా నిలబడి, నా చిత్తాన్ని నేనే దూరంగా పంపాను. మళ్ళీ దానిని నేనే దగ్గరికి లాక్కున్నాను. ఇలా కొంతసేపు జీవుడికి ఉపాధియైన చిత్తాన్ని, దానితో కలిసివున్న ప్రాణాన్ని, బయటికీ లోపలికీ నడిపి, వాటిని నా స్వాధీనంలోకి తెచ్చుకున్నాను. ఆ తరువాత వాటని నా ఎదుట వున్న ఒక శిష్యుడి ప్రాణంలో ప్రవేశ పెట్టాను.

అతని ప్రాణమూ, నా ప్రాణమూ కలిసి అతని హృదయంలోకి ప్రవేశించాయి. నా ప్రాణంతో పాటు నా చిత్తమూ, చిత్తంతో పాటు నా జీవుడూ గూడా, శిష్యుడి శరీరంలోకి ప్రవేశించాయి.

ఇంత ఉత్సాహంగా నేను ఆ శరీరంలోకి ప్రవేశిస్తే, అక్కడ నా పరిస్థితి మాత్రం చాలా సంకటంగా మారిపోయింది. నేను మొదట నా శిష్యుడి హృదయ కోశంలోకి చేరాను. అక్కడి నుంచీ హృదయ నాడుల వెంట కొట్టుకుపోవడం మొదలు పెట్టాను. ఆ శరీరంలోపలి సన్నివేశం నానా గందర గోళంగానూ వుంది. ఎటు చూసినా, వేల వేల నాడులు, వాటిలో అన్నరసాల ప్రవాహాలూ, ఇవి గాక ఎముకలూ, కండరాలూ, మొదలైనవన్నీ సంకటంగా వున్నాయి. లోపల వుండే జఠరాగ్ని అవయవాలను వేడి చేస్తోంది. బయటవుండే చల్లదనం ముక్కు లోపలికి ప్రవేశించేసరికి వెచ్చబడి చేతనాత్మకంగా మారిపోతోంది.

ఈ గందరగోళంలో నేను మెల్లిగా తట్టుకొని, నిలబడి, అతని జఠరాగ్ని ద్వారా, అతనిలోని తేజోధాతువు (ఈ స్థూల శరీరానికీ, సూక్ష్మ శరీరానికీ గూడా మూల కారణమైన పంచభూతాలలో ఒకటైన అగ్నితత్వాన్నే ఇక్కడ తేజోధాతువు అంటున్నారు.) దగ్గరికి వెళ్లాను. అక్కడికి వెళ్లేసరికి, అతను ఏ ప్రంచాన్ని చూస్తున్నాడో, ఆ ప్రపంచాన్ని నేను గూడా చూడడం మొదలు పెట్టాను. నా దృష్టికి అది ఒక కల లాగా వుంది కానీ, నేను అప్పుడు నిద్రలో లేను. నిద్రలో లేనప్పుడు కల ఎలా కనిపిస్తోందో నాకు అర్థం కాలేదు. ఆలోచించడం మొదలు పెట్టాను. కొంత సేపటికి ఇలా అర్థమైంది.

నిజంగా వున్న మూల పదార్థం శుద్ధ చైతన్యమే! ఇదే చిద్ధాతువు! ఈ చిద్ధాతువే అనాది సంస్కార సంపర్కంచేత గుణ సహితమైనప్పుడు, దానిని ఈశ్వరుడు అంటున్నారు. ఈ ఈశ్వరుడు మొదట తనను తనే ఆకాశంగా (చోటుగా) తయారు చేసుకొని, దానిలో కొంత భాగానికి భూమి అనీ, కొంత భాగానికి జలమనీ, కొంత భాగానికి అగ్ని అనీ, కొంత భాగానికి వాయువనీ, కొంత భాగానికి జీవుడనీ, కొంత భాగానికి జగత్తు అనీ, పేర్లు పెట్టి వ్యవహరిస్తున్నాడు. ఆ ఈశ్వరుడు శూన్యమైన ఆకాశాన్ని ఇలా భూతాలుగానూ, భౌతిక పదార్థాలుగానూ, చూసేటప్పుడు తన వాస్తవ స్వరూపాన్ని విడిచిపెట్టడం లేదు.

లోకంలో ఎవడైనా సరే, తన వాస్తవ స్వరూపాన్ని విడిచిపెట్టకుండా, తనలో తనే వేరే వేరే రూపాలను గనుక చూచినట్లైతే, ఆ రూపాలన్నిటినీ కలిపి స్వప్నం అంటున్నారు లోకులు.

ఐతే, మనకు కనిపించే స్వప్నాలన్నీ మన ప్రపంచంలో భాగాలౌనా? కాదా? కాదనడానికి కారణం కనిపించడం లేదు. కనుక చిద్ధాతువుయొక్క ప్రకాశంలో కొంత భాగం మన జాగ్రత్తు అనీ, మరికొంత భాగం మన స్వప్నం అనీ, చెప్పక తప్పదు. కనుక మన స్వప్నమూ, మన జాగ్రత్తూ– రెండూ వేరే వేరే కావని తేలిపోతోంది.

అదీ గాక స్వప్నస్థితిలో వుండి ఆ దృష్టితో చూస్తే, అప్పటికి ఆ ప్రపంచం ఒక జాగ్రత్ ప్రపంచమే! దాని దృష్టితో చూస్తే, ఇప్పటి ఈ జాగ్రత్ ప్రపంచం ఒక స్వప్నమే! ఇదంతా నీ అనుభవం. ఉదాహరణకు, ఒక ముష్టివాడికి తాను మహారాజు ఐనట్లు కలవచ్చింది. ఆ స్వప్న సమయంలో వాడి సామ్రాజ్యమే వాడి జాగ్రత్ప్రపంచం. ఆ సమయంలో చెట్టు కింది గూడు, ముష్టి బొచ్చె, మొదలైనవన్నీ వాడికి స్వప్న తుల్యాలే. ఇది వాడి స్వంత అనుభవం. ఇతరుల అనుభవం దీనితో ఏకీభవించక పోవచ్చు. ఐతే నేమి? ఎవడికి వాడు తన స్వంత దృష్టితో చూసుకుంటే, తన జాగరానికీ, తన స్వప్నానికీ, మౌలికమైన భేదమేమీ లేదు. కనుక, తన జాగరమే రెండు రకాలుగా వుంటోందని చెప్పవచ్చు.

ఐతే మరణం అనేది స్వప్నమూ గాదు, జాగ్రత్తూ గాదు. ఆ మరణ దశలో జీవుడి పరిస్థితి ఏమిటి? అని మరో ప్రశ్న రావచ్చు. కానీ లోతుగా ఆలోచించి చూస్తే, మరణం అనేదే లేదు. ఎందుకంటే, జీవుడు అంటే చిన్మాత్రమే గానీ, మరొకటి కాదు. కనుక, వేల వేల శరీరాలు పోయినా, ఆ జీవుడికి మరణం లేదు. మరణం వుందంటే, ఎప్పుడు పోయాడు? ఎలా పోయాడు? వాడు ఎవడికి లేకుండా పోయాడు? అనే విషయాలను తేల్చాలి. వీటిల్లో వేటికీ సమాధానం దొరకడం సాధ్యం కాదు. కనుక మరణం అనేదే లేదు.

అసలీ మరణచర్చ ఎందుకు వచ్చిందంటే, ఈ శరీరమనేది జీవుడి కంటె భిన్నంగా వుంది అనుకున్నాం కనుక వచ్చింది. కానీ, యథార్థ స్థితి ఏమిటంటే, శుద్ధ చిద్ధాతువే ఒకప్పుడు మూర్తమైన శరీరాకారంగానూ, మరొకప్పుడు తద్భిన్నమైన శరీరరహిత జీవాకారంగానూ, భాసిస్తోంది. ఉన్న మూల వస్తువు ఒకటై, అది వేరే వేరే రకాలుగా కనిపిస్తోందంటే, అలా కనిపించడం అంతా భ్రాంతి కాక తప్పదు. కనుక చిద్ధాతువుకు వున్న మూర్తామూర్త స్వరూపాలలో అమూర్త స్వరూపమే దాని నిజమైన స్వభావమనీ, పరమాణువు లాగా అనిర్వచనీయమైన ఆ చిద్ధాతువుయొక్క సారమే భ్రాంతివల్ల ఒక ప్రక్క దేహంగానూ, మరో ప్రక్క జగత్తుగానూ, కనిపిస్తోందని, నాకు అర్థమైంది.

ఇప్పటివరకూ నాకు కలిగిన అనుభవంవల్ల, ఓ బోయవాడా! నీ మొదటి రెండు ప్రశ్నలకూ సమాధానం వచ్చింది. నీ మొదటి ప్రశ్నలో నీ హృదయం, లోపల జరిగిన స్వప్నం, నీకంటె వెలుపలగా వున్నట్టు ఎలా కనిపిస్తోంది?– అని అడిగావు. రెండవ ప్రశ్నలో స్వప్న సమయంలో నా ఇంద్రియాలేవీ పని చేయడం లేదు గదా, ఆ స్వప్నలోకం నాకు ఎలా కనిపిస్తోంది?– అని అడిగావు. ఈ రెండికీ భ్రాంతే మూల కారణమని నా అనుభవంలో నాకు తేలింది.

ఇక నీ మూడో ప్రశ్నలో "నీకంటే బయట వుండే ఈ ప్రపంచం స్వప్నమై, నీ లోపల నీ కెలా కనిపిస్తోందా?" అని ఆలోచించావు. చెబుతా, విను.

**నివృత్తో బాహ్యతో జీవో**
**జీవాధారే హృది స్థితః ।**
**రూపం స్వం స్వప్న సర్గోయ**
**మితి వేత్తి చిదాకచాన్ ॥** (ని.ఉ.స. 137, శ్లో.43)

జాగ్రద్దశ వుంది గదా, అక్కడి సుఖదుఃఖ భోగాలను కలిగించే పూర్వ కర్మ వుంది గదా, అది అప్పుడప్పుడు ఇంద్రియాదుల విశ్రాంతికోసం తాత్కాలికంగా శమించిపోతూ వుంటుంది. అలాంటప్పుడు ఆ జీవుడు బాహ్య ప్రపంచంనుంచి వెనక్కు మళ్ళిపోయి, తన జీవత్వానికి ఆధారమైన హృదయంలోకి చేరి విశ్రమిస్తాడు. కాని అక్కడ కూడా పరిపూర్ణంగా విశ్రమించడం అతనికి చేత కాదు. అక్కడ గూడా కొన్ని చిద్వివర్తాలను (చిదాకచాన్) చూడడం ప్రారంభిస్తాడు. చిద్వివర్తాలు అంటే నిజానికి అవి తనయొక్క రూపాంతరాలే. కానీ, తనకు జాగ్రద్దశలో కలిగిన సంస్కారాలనుబట్టి, ఆ రూపాలను తనకంటే బయట వున్నట్టుగా వాడు భావిస్తాడు. అలా భావించి, ఆ రూపపరంపరను స్వప్న సృష్టి అని పిలుస్తాడు.

దీనిని మళ్లీ చెబుతా, విను. జాగ్రద్దశలో ఐనా, స్వప్న దశలో ఐనా, వున్నది ఒకటే! అదే చిత్కచనం, అదే చిదాభాసం, అదే తనయొక్క రూపాంతరం. ఈ జీవుడి చిత్తం వాడి జీవస్థానంలోంచి బయటికి వచ్చి చిత్కచనాన్ని చూసినప్పుడు, దానిని వాడు జాగ్రద్దశ అని పిలుస్తున్నాడు. అదే జీవుడు. అదే చిత్కచనాన్ని (తనయొక్క రూపాంతరాన్ని), తన చిత్తం హృదయంలో లీనమై వున్న దశలో చూస్తే, దానిని వాడు స్వప్నం అని పిలుస్తున్నాడు.

కనుక బయట వున్న ప్రపంచమూ, లోపల వున్న ప్రపంచము, అంటూ వేరే వేరే ప్రపంచాలు లేవు. నువ్వు చూసే విధానాన్ని బట్టి అదే ప్రపంచం జాగ్రత్తూ అవుతోంది, స్వప్నమూ అవుతోంది. కనుక నీ మూడో ప్రశ్నకు సమాధానం వచ్చింది.

ఇక నీ 4వ ప్రశ్నలో "లోపలా వెలుపలా ఒకే ప్రపంచం వుంటే, అందులో కొంత స్వప్నంగా ఎలా కనిపిస్తోంది?" అని అడిగారు. అలాగే నీ 5వ ప్రశ్నలో "ఒక వేళ లోపలా వెలుపలా వున్నది స్వప్నమే ఐతే, లోపలా వెలుపలా అనే అనుభూతి ఎలా కలుగుతోంది?" అని అడిగావు. అంటే ఈ ప్రపంచం సత్యం అనుకున్నా, అసత్యం అనుకున్నా కూడా, లోపలా వెలుపలా అనే అనుభూతులు ఎక్కడి నుంచి వస్తున్నాయి?– అని నువ్వు ప్రశ్నిస్తున్నావు.

నిజానికి ఈ ప్రశ్నలకి సమాధానం ఇంతకుముందే వచ్చేసింది. జీవుడియొక్క చిత్తం ప్రపంచాన్ని చూసే విధానాన్ని బట్టి, ఈ అనుభూతులు కలుగుతున్నాయని ఇదివరకే చెప్పాను గదా! ఇది నిజం కనుకనే, ఈ సత్యాన్ని గ్రహించిన సాధకులు క్రమక్రమంగా జ్ఞాన భూమికలను అధిగమించి, చివరికి జీవన్ముక్తులవుతున్నారు.

## 50. సుషుప్త తురీయాలు

నాయనా! నువ్వు జాగ్రత్స్వప్నాలను గురించి లోతుగానే ఆలోచించావు. కానీ, వాటిపైన సుషుప్తము, తురీయము అని రెండు అవస్థలున్నాయి. నేను ధ్యానంలో కూర్చున్నప్పుడు వీటిని గూడా పరిశీలించాను. నీకు ఆ విషయాలు గూడా చెబుతా విను.

జాగ్రత్స్వప్న రూపాలైన దృశ్యదర్శనాలను పొందుతూ, సుఖదుఃఖాలను అనుభవిస్తున్న జీవుడికి మధ్య మధ్యలో "ఇవి నాకు ఎందుకు? నేను చిత్తాన్ని వదిలేసి ప్రశాంతిగా వుంటాను" అనే భావం కలుగుతూ వుంటుంది. కానీ ఆ భావం ఎక్కువ సేపు నిలబడదు. ఆ భావం నిలబడి వున్నంతసేపూ వాడు సుషుప్తి దశను అనుభవిస్తాడు. ఆ తరువాత వాడు సుషుప్తినుంచి జారిపోయి, ఇటు స్వప్నంలోకో, అటు జాగ్రత్తులోకో, వచ్చి పడతాడు.

ఒక్కొక్కప్పుడు జాగ్రద్దశలో వుండగా గూడా, జీవుడి మనస్సుకి, ఇలాంటి స్థితి సంభవిస్తూ వుంటుంది. ఆ స్థితిలో ఏ సంకల్పాలూ వుండవు. ఇవే ధ్యానాది స్థితులు.

ఇలాంటి స్థితులు మన మామూలు శరీరంలో వుండే గోళ్లూ, వెంట్రుకలు మొదలైన వాటివంటివి. గోళ్ళు, వెంట్రుకలు, మొదలైనవి సజీవాలా? నిర్జీవాలా? చేతనాలా? జడాలా? అవి మనకు నిత్య జ్ఞాతాలా? అజ్ఞాతాలా?– అని నిగ్గదీస్తే, ఎటూ తేల్చి చెప్పలేం. వాటికి అన్ని లక్షణాలూ ఎంతో కొంత పడుతూనే వుంటాయి. ఏ లక్షణమూ పూర్తిగా పట్టదు. సుషుప్తి, ధ్యానాదుల పరిస్థితి గూడా ఇంతే!

సుషుప్తి గురించి ఈ విషయాలన్నీ అవగతమైనాక, నేనిక ఆ ధ్యానంలో తురీయ స్థితిని గురించి అన్వేషించడం ప్రారంభించాను.

అలా పరిశీలించగా, 'సరియైన జ్ఞానమే తురీయము' అని నాకు తోచింది. ఈ సమ్యక్ జ్ఞానంలో ఒక విచిత్ర పరిస్థితి వుంది.

**యథాస్థిత మిదం విశ్వం**
**సమ్యగ్బోధాద్విలీయతే ।**
**యథా స్థితం చ భవతి**
**న చ కించిద్విలీయతే॥** (ని.ఉ.స. 137, శ్లో.58)

(తా॥ సమ్యక్ జ్ఞానంవల్ల ఇప్పుడున్న ఈ ప్రపంచం మొత్తం అంతా లయించి పోతుంది. (కనిపించకుండా పోతుంది.) కానీ, అదే సమయంలో అది ఎక్కడికి పోదు. ఉన్నది ఉన్నట్టే వుంటుంది.)

దీనికి ఉదాహరణలు దొరకడం కష్టం. కొంతవరకు వెలుగు–చీకటులను ఉదాహరణగా తీసుకోవచ్చు. వెలుగు వస్తే, చీకటి పూర్తిగా పోతుంది. వెలుగు వెళ్ళిపోతే చీకటి మళ్లీ వస్తుంది. ఈ చీకటి ఎక్కడికి పోయి మళ్లీ వచ్చింది? వెలుగు లేని చోటు అంటూ ఒకటి వుంటే, ఈ చీకటి అక్కడికి పోయి మళ్ళీ వచ్చిందని చెప్పవచ్చు. మామూలు వెలుగు విషయంలో అలాంటి చోటు వుండవచ్చు. శుద్ధ జ్ఞాన జ్యోతి విషయంలో మాత్రం అది లేనిచోటు వుండే అవకాశమే లేదు. కనుక శుద్ధ జ్ఞాన దశలో చీకటి వంటిదైన ఈ ప్రపంచం ఉన్నది ఉన్నట్లే వుందని చెప్పాలి. అందుకనే తురీయ స్థితిలో వున్నవాడికి –

**సయథాస్థిత మస్తీదం।**
**నూనం నాస్తి చ కించన ॥** (ని.ఉ.స. 139, శ్లో.59)

జాగ్రత్తూ, స్వప్నమూ, సుషుప్తి, అన్నీ యథాస్థితంగా కనిపిస్తూనే వుంటాయి గాని, అవి లేని వస్తువులే అనే అనుభవం వుంటుంది.

దీనికి మరో ఉదాహరణగా నీటిని తీసుకోవచ్చు. నీరు ఘనంగా వుంటే, 'మంచు' అంటున్నాం. ద్రవంగా వుంటే 'నీరు' అంటున్నాం. వాయు రూపంగా వుంటే 'ఆవిరి' అంటున్నాం. ఘనత్వం, ద్రవత్వం, వాయుత్వం, అనే దశలు నీటిలో యథార్థంగా వున్నాయని చెప్పాలా? లేవని చెప్పాలా? రెండు రకాలుగానూ చెప్పచెప్పవచ్చు. అలాగే, విశుద్ధమైన సమ్యక్ జ్ఞానంలో జాగ్రత్స్వప్న సుషుప్త్యాత్మకమైన ఈ ప్రపంచమంతా వున్నదీ అవుతుంది, లేనిదీ అవుతుంది – అని నేను అర్థం చేసుకున్నాను.

నాయనా, వ్యాధా! ఈ విధంగా జాగ్రత్ స్వప్న సుషుప్త తురీయావస్థల తత్త్వాన్ని పరకాయ ప్రవేశ విద్య ద్వారా అర్థం చేసుకున్న నేను, ఇంకా మరికొంత అన్వేషణ చేయాలని నిశ్చయించుకున్నాను.

## 51. అందరి దీ ఒకే ప్రపంచమా?

పరకాయ ప్రవేశం కోసం, నేను యోగ విధానంలో తేజోధాతు స్వరూపాన్ని స్వీకరించి, నా శిష్యుడి శరీరంలోకి ప్రవేశించాను గదా, ఇప్పుడు అంతకంటే సూక్ష్మమైన స్థితికి వెళ్ళి, నా శిష్యుడనే జీవుడితో సంపూర్ణంగా ఏకత్వాన్ని పొంది, వాడి అనుభవాలు ఎలా వుంటాయో, మరింత లోతుగా పరిశీలించాలనుకున్నాను. దానికోసం నాకున్న తేజోధాతు స్వరూపాన్ని విడిచిపెట్టి, సూక్ష్మతరమైన జీవ స్వరూపాన్ని అందుకోబోయే లోపల, నా ఇంద్రియ జ్ఞానాలన్నీ కలిసి ఒక్క సారిగా కట్టలు తెంచుకొని, బహిర్ముఖంగా పరుగులు తీయడం మొదలు పెట్టాయి.

ఇది గమనించిన నేను, నా అంతర్గత ప్రయత్నంలో, నా ఇంద్రియ జ్ఞానాలను నిగ్రహించి, నీటిమీద తేలిపోయే నూనె బిందువును బలాత్కారంగా నీటి లోపలికి ప్రవేశింప జేసినట్లుగా, నా ఇంద్రియ జ్ఞానాలను జీవతత్త్వంవైపుకి ప్రసరింప చేశాను.

ఐతే, ఈ దశలో ఒక విచిత్రమైన అనుభవం కలిగింది. నా శిష్యుడి జీవ వాసనలు, నా స్వంత జీవవాసనలు, ఒక దానిలో ఒకటి కలగా పులగంగా కలిశాయి. తత్ఫలితంగా, ఆ వాసనలు రెట్టింపయ్యాయి. తత్ఫలితంగా, నాకు ఒకే సమయంలో రెండు రకాల ప్రపంచాలు కనిపించడం మొదలుపెట్టాయి.

ఒకే ప్రాంతంలో కలిసి జీవిస్తున్న జీవులందరూ, "మేమంతా ఒకే ప్రపంచాన్ని చూస్తున్నాం". అనుకుంటూ వుంటారు. కానీ, అది నిజం గాదు. ఈ ప్రపంచాన్ని చూసేటప్పుడు ఎవడి దృక్కోణం వాడిది. అందుచేత ఎవడి ప్రపంచం వాడిది – అనే విషయం నాకు ఇప్పుడు అర్థమైయింది. నాకప్పుడు భూమి రెండు రకాలుగా కనిపించింది. సూర్యుడు రెండు రకాలుగా కనిపించాడు. దిక్కులు రెండు రకాలుగా కనిపించాయి. ఇలా ప్రపంచమంతా రెండు రకాలై, రెట్టింపై నాకు కనపించింది. ఐతే, ఈ రెండు రకాల ప్రపంచాలూ, పూర్తిగా వేరని చెప్పేందుకు వీలు లేదు. అవి పాలూ, నీళ్ళు లాగా, ఒక దానితో ఒకటి కలిసి రెట్టింపై కనిపిస్తున్నాయి.

ఈ స్థితిలో నేను కొంత గందరగోళంలో పడ్డాను. ఐనా, త్వరలోనే తేరుకొని గట్టి కృషి చేసి, నా జీవజ్ఞానాన్ని నా శిష్యుడి జీవ జ్ఞానంలో పూర్తిగా లయింప జేశాను. రెండు మహానదులు సంగమించి ముందుకు సాగినట్లుగా, మా ఇద్దరి జీవ జ్ఞానాలు కలిసిపోయి, ఏక రూపంగా రూపొందాయి. దాంతో, మా వాసనలూ, మా ఉపాధులూ కూడా, ఏకత్వాన్ని పొందిన అనుభూతి నాకు కలిగింది. తత్ఫలితంగా, ఇప్పటి దాకా రెండుగా కనిపించిన ప్రపంచం ఇప్పుడు ఒక్కటిగా కనిపించడం మొదలు పెట్టింది.

ఈ దశలో నేను, నా చిత్తంలో వుండే వివేకాన్ని వదిలి పెట్టకుండానే, నా సంకల్పాలను మాత్రం తగ్గించేసుకొని, మెల్లిగా వాటిని నా శిష్యుడి సంకల్పాలలో కలిపేశాను. ఇప్పుడు నేను అతని చిత్తవృత్తి ద్వారానే, బాహ్య ప్రపంచాన్ని అనుభవిస్తున్నాను. కానీ, నా చిత్తంలోని వివేకాంశను మిగుల్చుకొని వున్నాను గనుక, జరిగే వ్యవహారం మొత్తాన్ని , సాక్షి లాగా పరిశీలిస్తూనే వున్నాను.

ఆ దశలో నా శిష్యుడు, తిన్నాడు, తాగాడు, నిద్రపోయాడు. నిద్ర వచ్చేసరికి, అతని ప్రాణవాయువు పదివైపులకూ పరుగులు తీస్తున్న అతని చిత్తాన్ని పట్టుకొని వెనక్కి గుంజేసింది. ఆ గుంజుడు బలానికి, ఆ చిత్తంతో పాటు, అతని ఇంద్రియ వృత్తులన్నీ గూడా, అతని హృదయ కోశరంలోకి ప్రవేశించాయి. అక్కడికి ప్రవేశించే సరికి, వాటి పరాక్రమం చల్లారిపోయింది. వాటికి ఏ పనీ లేకుండా వుంది. ఆ పరిస్థితి ఇంచుమించు మరణం లాగా వుంది.

నేను నా శిష్యుడి జీవతత్త్వాన్ని ఆవరించి వుండడంచేత, అతని చిత్తవృత్తిని నా చిత్తవృత్తి; అతని ఇంద్రియ వృత్తులను, నా ఇంద్రియవృత్తి, ఆవరించి వుండడం చేత, అతని ఇంద్రియ వృత్తులు, చిత్త వృత్తులు, ఏ ఏ నాడీ మార్గాల ద్వారా, ప్రయాణం చేశాయో, ఆ మార్గాల ద్వారానే నేను గూడా ప్రయాణం చేసి, వాటితో పాటే అతని హృదయ కోశంలోకి చేరాను.

ఆ దశలో అతని నాభిస్థానంలో వుండే సమానవాయువు, ఆ యా నాడులలో, ఇటూ అటూ కదులుతోంది గాని, అన్న రసాలు అడ్డుపడడంవల్ల, బయటికి పోలేకపోతోంది. అతని ప్రాణం మాత్రం అతని హృదయంలో వుండే "పురీతత్", అనే నాడిలో ప్రవేశించి, అక్కడ తనతో కలిసివున్న చిత్తాన్ని లొంగదీసుకొని, మింగేసింది. చిత్తం లేకుండాపోవడంవల్ల, ఆత్మతత్త్వం మాత్రమే మిగిలి, ఒక అనిర్వచనీయమైన సుఖ విశ్రాంతి అనుభవంలోకి వచ్చింది. అదే సుషుప్తిదశ. ఆ దశలో దుఃఖస్పర్శ లేదు.

## 52. ప్రాణ మనస్సుల్లో ఏది గొప్ప?

**శ్రీరాముడు**: గురుదేవా! ఇక్కడ ఒక చిన్న ప్రశ్న. మీరు ప్రాణవాయువు మనస్సును మింగేసిందనీ, అందువల్ల మనస్సు పని చేయడం మానేసిందనీ చెప్పారు గదా! అంటే, మనస్సు, ప్రాణానికి లోబడి మాత్రమే ఆలోచనలను చేయగలుగుతుందని అంటారా? మనస్సుకు వేరే స్వంత స్వరూపం లేదంటారా?

**వశిష్ఠుడు**: రామా! దేహమూ, ప్రాణమూ, మనస్సూ, జగత్తూ, అనే వాటన్నిటికీ ఆధారభూతమైన అధిష్ఠానం సన్మాత్రమేనని నీకు తెలుసుగదా! అధిష్ఠానమైన రజ్జువును విడదీస్తే, సర్పానికి అస్తిత్వం ఏమి వుంటుంది? అలాగే, సన్మాత్రంనుంచి వేరు చేస్తే, చిత్త ప్రాణాదులకు అస్తిత్వమే లేదు. వేరు చెయ్యకపోతే, అధిష్ఠానంలోని సత్తా వీటికి సంక్రమించనే సంక్రమిస్తుంది. కాగా, ప్రాణంలో కలిసివున్న చిత్తానికే అస్తిత్వం అందనప్పుడు, ప్రాణంనుంచి విడదీసిన మనస్సుకు ప్రత్యేకమైన అస్తిత్వం గానీ, స్వరూపం గానీ ఎక్కడినుండి లభిస్తాయి?

బ్రహ్మవేత్తల దృష్టిలో ప్రపంచమంతా బ్రహ్మమే! చిత్తం గూడా బ్రహ్మమే! వారి దృష్టిలో చిత్తంయొక్క మూల స్వరూపం బ్రహ్మమే!

ఇక సామాన్యుల విషయంలో, వారు పరబ్రహ్మను చూస్తూనే ఇది బ్రహ్మ కాదనుకుంటారు. ఈ విషయం అర్థమయ్యేందుకోసం పరబ్రహ్మమీద వాళ్ళు చేసుకునే అధ్యారోప క్రమం ఎలా వుంటుందో చెబుతా, విను.

సృష్టికి పూర్వం శుద్ధ చిన్మాత్రం వుంది. అది తన మీద మనస్సును ఆరోపించుకుంది. ఆ మనస్సు తన మీద చలనాన్ని ఆరోపించుకుంది. ఈ చలనమే ప్రాణం. ఆ మనస్సు మరో ప్రక్కనుంచి తన మీదకు దిక్కులనూ, కాలాన్నీ, ఆరోపించుకుంది. వాటి సహాయంతో ప్రపంచం మొత్తాన్ని తన మీద ఆరోపించుకుంది. దాంతో ఇక ప్రపంచ వ్యవహారం సాగిపోతూ వుంటుంది.

ఇదంతా ఏదో నేను చేస్తున్న కల్పన అనుకోకు.

**ప్రాణీకృతః స్వయమయం నను చేతసాత్మా**
**దేహీకృత స్త్రిభువనీకృత ఏవ నాద్యః।**
**దేహీకృతః స్వవపురేవ గిరీకృతశ్చ**
**స్వప్నేషు కల్పితపురీష్వనుభూత మేతత్ ॥** (ని.ఉ.స.138, శ్లో.37)

ఈ శ్లోకంలో "నాద్యః" అనే చోట్ల వాల్మీకి మహర్షి ఒక మెలిక పెట్టాడు. ఇక్కడ "నా –ఆద్యః" అని పద విభాగం చేయాలి. ప్రథమ జీవి అని అర్థం. నీ స్వప్నానికి ప్రథమ జీవి ఏవరు? నువ్వే! నువ్వు నీ

స్వప్నంలో మరో ప్రాణివయ్యావు. ఎలా అయ్యావు? నీ మనస్సే నిన్ను (నీ ఆత్మను) అక్కడి ప్రాణంగా మార్చింది. ఆ ప్రాణం గల దేహంగా నిన్నే మార్చింది. ఆ దేహం చుట్టూ గల ప్రపంచంగా గూడా నిన్నే మార్చింది. కనుక ఎవడైతే, స్వప్నలోకపు దేహంగా మార్చబడ్డాడో, వాడే అక్కడి కొండగా గూడా మార్చబడ్డాడు. రక రకాల నగరాలను, ప్రజలను, కల్పించి చూపించే స్వప్నాలలో ఇలాంటి పద్ధతి అంతా నీకు అనుభవంలో వున్న విషయమే! దీన్నే, నేను కొంచెం క్రమబద్ధీకరించి అధ్యారోప క్రమంగా వర్ణించాను. అంతే తప్ప, ఇది నా కల్పన కాదు.

కనుక రామా! ఈ ప్రపంచం 'అంతా చిత్త కల్పితం' అని తేలిపోతోంది. ఆ మనస్సు పరబ్రహ్మమీద ఆరోపితమై వుంది. అందువల్ల పరబ్రహ్మకంటే భిన్నంగా చిత్తానికి స్వతంత్ర స్వరూపం ఒకటి వుండడానికి వీలే లేదు.

ఐతే నీ ప్రశ్నలో 'మనస్సుయొక్క మననశక్తి ప్రాణానికి అధీనమై వుంటుందా? వుండదా?" అనే అంశం ఒకటి వుంది. చిత్తం సర్వ సామాన్యంగా ప్రాణానికి అధీనమే! ఐతే, అధ్యారోప క్రమంలో మాత్రం మొదటిది మనస్సే! ఈ మనస్సే ప్రాణాన్ని తెచ్చి తన నెత్తిమీద పెట్టుకుంటుంది. పెట్టుకున్నాక, ఆ ప్రాణం రాజ్యమేలటం మొదలు పెడుతుంది. ఐనా, జాగ్రత్ స్వప్నదశల్లో, మనస్సూ ప్రాణమూ పోటీపడి సమప్రధానంగానే పని చేస్తాయి. సుషుప్తి దశ వచ్చేసరికి మాత్రం, చిత్తం బలహీనపడి ప్రాణమే ప్రధానమై పోతుంది – అని నువ్వు గ్రహించాలి.

**శ్రీరాముడు**: జాగ్రత్ స్వప్నాలలో పట్టుబట్టి పోటీపడ్డ మనస్సు, సుషుప్తి దశలోకి వచ్చేసరికి ఎందుకు ఓడిపోవాలి?

**వశిష్ఠుడు**: అది ఓడిపోవడం గాదు. నిజానికి మనస్సే ప్రాణాన్ని సృష్టి చేస్తుంది. కనుక మనస్సే ప్రధానం. కానీ అది సుషుప్తి దశ ప్రారంభమయ్యే సమయానికి బాగా అలిసిపోయి వుంటుంది గనుక, విశ్రాంతి కోసం తాత్కాలికంగా, ప్రాణానికి ప్రాధాన్యాన్ని అంగీకరిస్తుంది. ఈ విషయం మరికొంత వివరిస్తాను, విను.

**చిత్తమేవ జగత్కర్తృ**
**సంకల్పయతి యద్యథా ।**
**అసత్సత్సదసచ్చైవ**
**తత్తథా తస్య తిష్ఠతి ॥** (ని.ఉ.స.139, శ్లో.1)

రామా! ఈ ప్రపంచం మొత్తానికీ కర్త చిత్తమే! ఇది దేన్ని సంకల్పిస్తే, అది అలా అవుతుంది. ఇది "సత్" అనుకుంటే, అది సత్తే అవుతుంది "అసత్తు" అనుకుంటే అసత్తే అవుతుంది. "సదసత్" అనుకుంటే సదసత్తే అవుతుంది. ఇక్కడ సత్ అంటే జాగ్రత్ప్రపంచం లాగా వ్యావహారికం. "అసత్" అంటే స్వప్నం లాగా అసత్యం. "సదసత్" అంటే ముత్యపు చిప్ప మీది వెండి ముద్ద లాగా ప్రాతిభాసికం.

ఇలా ఎలా కావాలనుకుంటే అలా ప్రపంచ సృష్టి చేసే చిత్తం, "నాకు ప్రాణం కావాలి, ప్రాణం లేకపోతే నేనుండలేను" అని సంకల్పిస్తుంది. అందుచేత అప్పటి నుంచీ అది ప్రాణానికి లోబడి జీవిస్తూ వుంటుంది.

**శ్రీరాముడు**: అలా ఐతే, నిద్రపోయేవాడి ప్రాణం వాడి స్వప్నంలోకి ప్రవేశించ జాలదు గదా! అంటే అక్కడ ప్రాణం లేని మనోవ్యాపారం వున్నట్టే గదా! అలాగే, ఊహాలోకాలలో పగటి మేడలు కట్టే సమయంలో కూడా ప్రాణ సంపర్కం లేని మనోవ్యాపారం కనిపిస్తోంది గదా! మరి మీరు ప్రాణం లేకపోతే మనస్సే వుండ జాలదంటున్నారేమిటి?

**వశిష్ఠుడు**: స్వప్నంలో గాని, మనోరాజ్యంలో గాని, ప్రాణస్పర్శ లేదని ఎందుకు అనుకోవాలి? ఈ జాగ్రద్దశలో వున్న ప్రాణం ఎలా వచ్చింది? చిత్త కల్పనచేతనే గదా! అలాగే, ఈ చిత్తం స్వప్న రూపంలో గాని, మనోరాజ్య

రూపంలోగానీ, ఒక దేహాన్ని సృష్టిచేసుకుందంటే, అలాంటి ప్రతిచోటా ప్రాణాన్ని గూడా సృష్టి చేసుకోనే చేసుకుంటుంది. అందుచేత స్వప్నాది స్థానాలలో ప్రాణం స్పర్శ లేదనుకోవడం తగదు.

అందుచేతనే, జాగ్రత్ జీవుడైనా, స్వప్న జీవుడైనా, మనోరాజ్య జీవుడైనా, ఎవడైనా సరే, చిత్తంచేత సృష్టింపబడినవారందరూ చిత్తానికీ, ప్రాణానికీ, దేహానికీ, బద్ధులయ్యే వుంటారు. అంటే "నేనే దేహాన్ని" , "నేనే ప్రాణాన్ని" "నేనే చిత్తాన్ని" అనే దృఢ నిశ్చయంలో వుంటారు. కనుకనే, ప్రతివాడి మనస్సూ తన ప్రాణాన్నీ, దేహాన్నీ, అమితంగా ప్రేమిస్తుంది. దేహానికి బాధ కలిగితే, వాడి ప్రాణానికి గూడా బాధకలిగినట్లుగా వాడి మనస్సు భావించేస్తుంది. అందువల్లనే, అప్పుడు ప్రాణాధీనమైన ఇంద్రియాలు గూడా విలవిలలాడిపోతాయి. మనస్సుకు లౌకిక విషయ జ్ఞానం కలగాలన్నా, లేక తత్త్వ జ్ఞానమే కలగాలన్నా, చిత్త ప్రాణాలకు సామరస్యం కావాలి. అవి రెండూ పరస్పరం రథ సారథులవంటివి. అంటే, మనస్సు ప్రాణాన్ని రథంగా చేసుకొని తాను సారథై ముందుకుపోతుంది. అలాగే ప్రాణం మనస్సును రథంగా చేసుకొని తాను సారథై ముందుకుపోతుంది.

***శ్రీరాముడు***: అందరి జీవులలోనూ ఇది ఇలాగే ఎందుకు జరగాలి?

***వశిష్ఠుడు***: సృష్టి ప్రారంభంలో హిరణ్యగర్భుడు దానిని అలా సంకల్పించాడు. అందుచేత ఆ నియమం ఈ సృష్టి వున్నంత కాలమూ తప్పదు. దానినే నియతి అనీ, స్వభావమనీ, మనం పిలుస్తున్నాం.

***శ్రీరాముడు***: ఈ చిత్త ప్రాణాలు ఎప్పుడూ సమప్రాధాన్యంతోనే సాగుతూ వుంటాయా?

***వశిష్ఠుడు***: కాదు. చిత్త ప్రాణాలు సమంగా పని చేస్తుంటే, అది జాగ్రదవస్థ. ప్రాణ వ్యాపారం తగ్గి చిత్త వ్యాపారం ప్రబలంగా వుంటే, అది స్వప్నావస్థ. చిత్త ప్రాణాలు రెండూ గన్నగిల్లిపోతే, అది సుషుప్తి అవస్థ.

ఒక్కొక్కప్పుడు దేహంలో వుండే నాడుల్లో అన్న రసాదులు గానీ, పిత్తాది ధాతువులు గానీ, అడ్డంపడి, ప్రాణ సంచారానికి ఇబ్బంది కలుగుతుంది. అప్పుడు ఆ ప్రాణం ఏదో ఒక మూల ఇరుక్కుపోయి, ముద్ద లాగా ఐపోతుంది. అది జడప్రాయమౌతుంది. ఆ దశలో అది చిత్తానికి తన సహాయాన్ని అందించ జాలదు. అందువల్ల, మనస్సు గూడా మొద్దుబారిపోతుంది. అలాంటి స్థితిలో గూడా జీవుడికి సుషుప్తి దశ వస్తూ వుంటుంది. అందుకనే, కడుపు నిండా అన్నం తిన్నా, లేక అసలే అన్నం మాని ఖాళీ కడుపుగా వున్నా కూడా, ఇలాంటి స్థితి సంభవిస్తూ వుంటుంది.

***శ్రీరాముడు***: బాగుంది గురుదేవా! ఇంతకూ ఆ వ్యాధుడికి గురువైన మహర్షి తన యోగానుభవాలను చెబుతున్నాడు గదా! ఆయన సుషుప్తిదశా పరిశీలన దాకా వచ్చాడు గదా! ఆ తరువాత ఏం జరిగింది?

## 53. కలలో మెలకువ

***వశిష్ఠుడు***: ఆ విషయాలను ఆ ముని మాటలుగానే విను.

***ముని***: నాయనా! వ్యాధా! నేను నా శిష్యుడి హృదయంలో ప్రవేశించానని చెప్పాను గదా! ఆ శిష్యుడు ఆ సమయానికి బాగా పీకల దాకా తిని, భుక్తాయసంతో నిద్రపోతున్నాడు. అందువల్ల అతను సుషుప్తి దశలో వున్నాడు. నేను అతని చిత్తంతో ఏకీభావాన్ని సాధించాను గనుక, నేను గూడా సుషుప్తిలోకే కొట్టుకుపోయాను.

ఇంతలో కొంతసేపటికి శరీరంలోని అన్న రసాలు జీర్ణమై, నాడీమార్గాలు తెరుచుకున్నాయి. అతని ప్రాణం ఆ నాడుల వెంట కొద్ది కొద్దిగా కదలడం మొదలు పెట్టింది. దాంతో, అతని సుషుప్తి దశ క్షీణించి స్వప్న దశ ప్రారంభమైంది. నేను గూడా ఆ స్వప్న ప్రపంచాన్ని చూడడం మొదలు పెట్టాను. ఆ ప్రపంచమంతా, అతని హృదయ నాడులలోనే వున్నా, నాకు మాత్రం అది అతని హృదయానికి వెలుపల వున్నట్లుగా అనుభూతి కలగసాగింది.

ఆ స్వప్నలోకం ఒక ప్రళయావస్థలో వున్నట్లు నాకు కనిపించింది. సముద్రాలు పొంగుతున్నాయి. లోకమంతా నీళ్ళల్లో మునిగిపోతోంది.

ఆ సమయానికి నేనొక ఊళ్ళో, ఒక ఇంట్లో, భార్యా పిల్లలతో నివాసం చేస్తున్నాను. ఆ నీటి పొంగులకు మా ఇల్లు గూడా మునిగిపోయింది. మేమంతా ఆ పెనుతరంగాలకు తలోపక్కకీ కొట్టుకుపోయాం. ఆ గందరగోళంలో భార్యా పిల్లల మాట మరచిపోయి, నా ప్రాణాలు దక్కించుకొనే ప్రయత్నంలో నేనున్నాను. ఇంతలో నన్నొక తరంగం ఒక కొండ కొప్పు మీదకు గుంజుకు పోయింది. నేనక్కడ రాళ్ళను పట్టుకొని, అతి కష్టంమీద లేచి నిలబడే ప్రయత్నం చేస్తూ వుండగానే, మరో పెద్ద తరంగం వచ్చి నన్ను మరో వైపుకు గుంజిపారేసింది. ఈ విధంగా నేనప్పుడు నానా కష్టాలూ పడ్డాను.

ఇంతలో వున్నట్టుండి, నాకు నా అసలు స్వరూపం గుర్తుకు వచ్చింది. నేనొక తాపసుడ్ననీ, నేను సమాధి దశలో వున్నాననీ, కావాలని పరకాయ ప్రవేశం చేసి ఇక్కడికి వచ్చి ఈ అసత్య ప్రపంచాన్ని చూస్తున్నాననీ, నాకు గుర్తు వచ్చింది.

దాంతో ఉన్నట్టుండి నా కష్టమంతా ఎగిరి పోయింది. నేను చూసే తరంగాలు తగ్గలేదు. ఊళ్ళు కొట్టుకు పోవడం తగ్గలేదు. చివరికి దేవతలు గూడా ఆ ప్రవాహాలలో కొట్టుకుపోతూనే వున్నారు. నేను గూడా కొట్టుకుపోతూనే వున్నాను. ఐనా, ఇప్పుడు నాకు దుఃఖం లేదు. ఆ నీరు మొత్తాన్ని ఎండమావి నీటిని చూసినట్లుగా చూస్తూ, హాయిగా వుండిపోయాను. (స. 139)

***బోయవాడు***: స్వామీ! మీలాంటి మహాత్ములు అలాంటి భ్రాంతిమయమైన దురవస్థలలోకి ఎలా పడిపోయారు. ధ్యాన ప్రయోగం చేసి ఆ భ్రాంతిని ఎందుకు శమింప చేసుకోలేదు.

***ముని***: నాయనా! ప్రళయం రెండు రకాలు. ఒకటి క్రమిక ప్రళయం. రెండవది ఆకస్మిక ప్రళయం – అని. క్రమిక ప్రళయం అంటే, క్రమక్రమంగా వచ్చే ప్రళయం. అలాంటప్పుడు ధ్యానయోగాదులు చేసేందుకు అవకాశం వుంటుంది. ఆకస్మిక ప్రళయం అంటే హఠాత్తుగా వచ్చి పడేది. దీంట్లో అలాంటి అవకాశం తక్కువ. అదీ గాక, ఆ సమయానికి నాకు ధ్యానం మాట గుర్తే రాలేదు. అది కాల మహిమ గదా! ఇవన్నీ ఇట్లా వుంచు. ఈ జరిగిన సంఘటనలన్నీ ఒక స్వప్నంలో జరిగాయని గదా చెప్పాను. స్వప్నంలో అసంభవం ఏం వుంటుంది?

***బోయవాడు***: ఈ లేని పోని కల్ల బొల్లి కబుర్లను తమరు నాకు ఎందుకు చెప్పినట్లు?

***ముని***: ఇవి వట్టి కథలు కావయ్యా! వీటిలో ఒక గొప్ప సందేశం వుంది. స్వప్న కథలన్నీ అసత్యమనే మాట గట్టిగా తెలిస్తే, దాన్ని బట్టి, ఈ జాగ్రత్ ప్రపంచం గూడా భ్రమాత్మకమేనని నువ్వు అర్థం చేసుకో గలుగుతావు. దానివల్ల స్వప్నంలో ఐనా, మెలుకువలో ఐనా, దృశ్యమైన ప్రతిదీ భ్రమే అని తెలుస్తుంది. ఇది తెలిస్తే, వరుసగా ఈ భ్రమలన్నిటినీ అనుభవించే దృగ్రూపుడు ఒకడు వున్నాడనీ, వాడు సత్య స్వరూపుడనీ, వాడు నువ్వేననీ, తేలిపోతుంది. దీనికోసమే ఈ కథలన్నీ చెబుతున్నాను. కనుక పై కథ విను.

అలా నేను స్వప్న ప్రపంచంలో ఘోరాతి ఘోరమైన జల ప్రళయాన్ని చూస్తూ వుండగానే, క్రమక్రమంగా ఆ నీరు ఎండి పోవడం మొదలు పెట్టింది. నేనొక పర్వత శిఖరం మీదకు చేరి క్షేమంగా వున్నాను. నీరు తగ్గాక, కాస్త ఇటూ అటూ తిరిగి చూడగా, ఆ కొండమీదే ఒక ముని ఆశ్రమం కనిపించింది. నేనక్కడికి వెళ్ళి ఆ ముని అనుమతితో ఆ ఆశ్రమంలో కొంచెం విశ్రమించాను. బాగా బడలిపోయి వుండడంవల్ల వెంటనే నిద్ర పట్టింది. ఆ నిద్రలో నాకు ఒక కల వచ్చింది. వెనుకటి భయభ్రాంతివల్ల ఈ కలలో మళ్లీ జల ప్రళయమే కనిపించింది. దాంతో నాకు దుఃఖం పెరిగిపోయి, కలలోని కల భగ్నమై, మెలకువ వచ్చింది. అది ఒక కలలో అంతర్భాగమైన మెలకువ. ఆ మెలకువలో నేనొక పదహారేళ్ళ కుర్రవాడి లాగా కనిపించాను. కనిపించడమే

గాదు, అప్పటి నా అనుభూతి కూడా అదే! అంతే గాదు, నాకో తల్లి, తండ్రి, వంశ పరంపర – ఇవన్నీ వున్నాయి, ఆ స్వప్న ప్రపంచంలో! కొందరు బంధువులు గూడా వున్నారు. అలాంటి బంధువులలో ఒక బంధువుగారి ఆశ్రమంలో నేను చాలా రోజులు గడిపాను. ఆ సమయంలో నాకు పాత తత్త్వజ్ఞానమేదీ గుర్తుకు రాలేదు. సాంగత్యబలంవల్ల, అభ్యాసబలంవల్ల, దామవ్యాళ కటోపాఖ్యానంలోని జీవుడికి చిట్టచివరికి చేప జన్మ వచ్చినట్లుగా నాకీ గ్రామీణ జీవ జన్మ లభించింది.

**గమనిక–** ఇక్కడ మూలంలో ఒక విచిత్రమైన పదప్రయోగం జరిగింది.

**విస్మృతా తాదృగభ్యాసా**
**దహో తస్యేవ మత్స్యతా॥** (ని.ఉ.స. 140, శ్లో.33)

ఆ నాటి గ్రామీణాభ్యాస బలంవల్ల, వాడి మీనత్వం లాగా పాత విజ్ఞానమంతా మరుపున పడిపోయింది - అని పై వాక్యానికి అక్షరార్థం. ఇది సరిగ్గా అతకటం లేదు. కనుక వ్యాఖ్యాత గారు దీన్ని కొద్దిగా సవరణ చేసి, పై వాక్యంలోని "తస్య" (వాడికి) అనే పదానికి "దామవ్యాళకటోపాఖ్యానం లోని జీవుడికి" అని అర్థం చెప్పాడు. ఈ ఉపాఖ్యానం స్థితి ప్రకరణంలో 25వ సర్గ నుంచి 31వ సర్గ దాకా సాగింది. దానిలో శంబరుడనే రాక్షసుడు దామ వ్యాళ కటులనే ముగ్గురు మాయా జీవులను పూర్వ వాసనలేవీ లేకుండా వుండేటట్లుగా సృష్టి చేశాడు. ఐనా సరే, దేవాసుర సంగ్రామంలో వారికి ఇతర జీవుల సాంగత్యం కలిగి, ఆ సాంగత్య బలంవల్ల కొత్త వాసనలు పోగై, వారు జన్మ పరంపరలకు లోనై, చివరికి బురదగుంటలో చేపపిల్లలై పుట్టారు. సాంగత్యబలం అంతటి అధోగతిని కలిగిస్తుందనటానికి ఈ కథను ఇక్కడ కవి ఉపమానంగా తీసుకున్నాడని మనం భావించవచ్చు. ఇక అసలు కథలోకి వెళదాం.

**ముని**: నేను ఆ గ్రామంలో మామూలు సాంసారిక బ్రాహ్మణుడై, భార్యా పిల్లలూ, ఆస్తులూ, కుటుంబాచారాలూ – ఇవే ప్రాణంగా భావిస్తూ, వందేళ్లు బ్రతికాను.

ఒకనాడు ఆత్మతత్త్వజ్ఞానం కలిగిన ఒక సాధువు మా ఇంటికి అతిథిగా వచ్చాడు. ఆయన ఆ నాడు మా ఇంటిలో పడుకొని, నానా దేశాల కథలూ చెబుతూ, ఆ సందర్భంలో ఒక చోట విస్తారంగా తత్త్వబోధ చేశాడు.

**సర్వం చిన్మాత్రమేవేద**
**మనంత మవికారి చ।**
**జగత్తయేవ కచతి**
**యథాస్థితమపి స్థితమ్॥** (ని.ఉ.స.140, శ్లో.43)

ఈ జగత్తులో ప్రతి పదార్థానికీ ఒక అంతం వుంది. కాగా, ఈ జగత్తు మొత్తానికీ కలిపి ఒక అంతం వుంది. అంతే కాదు, ఈ జగత్తులోని ప్రతిపదార్థమూ మార్పును పొందుతూనే వున్నది. కాగా, ఈ జగత్తు మొత్తం కలిపి వికారశీలమై వుంది. (వికారం అంటే మార్పు). కాని బాగా పరిశీలించి చూస్తే, ఈ జగత్తు అంతా శుద్ధ చిన్మాత్రమే! అంతకు మించి వేరే ఏదీ లేదు. ఆ చిన్మాత్ర స్థితిలో అంతం గానీ, మార్పు గానీ, లేనే లేవు. ఆ చిన్మాత్రం తను యథాతథంగా వుంటూనే, ఈ జగత్తుగా కనిపిస్తోందో అన్నట్టుగా వుంటోంది – అని ఆ వృద్ధ సాధువు నాకు బహువిధాలుగా తత్త్వబోధ చేశాడు.

## 54. విరాట్టుకి పైన విరాట్టు

ఆ మహాత్ముడి మహిమ ఏమిటో గాని, నన్ను ఆవరించిన అజ్ఞానమంతా గడియలలోనే మాయమైపోయి, నా పూర్వ జ్ఞానం అంతా స్మరణకు వచ్చి, మళ్ళీ ధారణాయోగంలోకి ప్రవేశించాను.

నేను పూర్వం ఇలాంటి ధారణాయోగంలోనే మరో ప్రాణి శరీరంలో ప్రవేశించానని నాకిప్పుడు బాగా గుర్తుకు వచ్చింది. నేను ఎవరి శరీరంలో ప్రవేశించి వున్నానో ఆ ప్రాణిని నేనిప్పుడు విరాట్ స్వరూపంగా భావించడం ప్రారంభించాను. అలా భావిస్తూనే, ఆ శరీరంలోంచి బయటికి రావాలని ప్రయత్నించాను. కాని నాకు దారి దొరకలేదు. అందువల్ల నేను ఆ ప్రాణిలో అంతర్గతంగా వుంటూనే, అనంత వైశాల్య భరితమై విస్తరించి వున్న ఆ ప్రపంచంలో తిరుగుతూనే, "నాకు ఈ ప్రాణి ఎలాగైతే విరాట్పురుషుడుగా వున్నాడో, అలాగే ఈ ప్రాణికి వెలుపల మరొక విరాట్పురుషుడు వుండి వుంటాడు. కనుక, ఈ విరాట్ పురుషుణ్ణే కాక ఆ విరాట్పురుషుణ్ణి గూడా నేను చూడాలి" అని ఆలోచించాను. బయటికి వెళ్ళే దారి మాత్రం కనిపిండం లేదు కదా. అందువల్ల కొంచెం ఆలోచించి, "నా విరాట్ పురుషుడి ప్రాణమే నేను' అనే ప్రాణాహంభావ ధారణనను నేను గట్టిగా బిగించాను. దాంతో, నేను నా స్వస్థానాన్ని విడిచి పెట్టకుండానే, ఆ విరాట్పురుషుడి ప్రాణవాయువు వెంబడి ప్రయాణించి బయటికి వచ్చేశాను. పూవును విడిచిపెట్టడకుండానే బయటికి ప్రసరించే సువాసన లాగా వుంది, అప్పటి నా పరిస్థితి.

ఆ విధంగా బయటికి వచ్చిన నేను, నా విరాట్పురుషుడి బయట వున్న మరో ప్రపంచంలో ఇటూ అటూ తిరగడం మొదలుపెట్టాను. అలా తిరగడంలో ఒక కొండ గుహలో వున్న ఒక ముని ఆశ్రమానికి చేరాను. అక్కడ ఒక ముని పద్మాసనంలోనే మరణించినట్లునాడు. అతని శిష్యులంతా అతని చుట్టూ చేరి, ఆ శరీరానికి కాపలా కాస్తున్నారు.

దగ్గరకు వెళ్ళి పరిశీలనగా చూద్దును కదా, అక్కడ పడి వున్నది నా శరీరమే! ఆ చుట్టూతా వున్నది, నా శిష్యులే! నేను పరకాయ ప్రవేశ విద్యతో ఎవడి శరీరంలోకి ప్రవేశించానో, ఆ శిష్యుడు ఒక ప్రక్కన పడుకొని ఇంకా మొద్దు నిద్ర పోతూనే వున్నాడు. నా శిష్యుల లెక్కలో నేను ధారణయోగంలోకి వెళ్ళి, ఒక ముహూర్తం మాత్రమే అయింది. (ముహూర్తం 2 ఘడియలు, అంటే 48 ఇంగ్లీషు మినిట్లు.)

నాకు నా పాత శిషుల్ని పలకరించాలనిపించలేదు. పైగా, నేను పూర్వం నా శిష్యుడి శరీరంలో వుండగా సంపాదించుకున్న బంధువర్గం ఏమైపోయిందో చూడాలనే కుతూహలం కలిగింది. దాంతో నేను మళ్ళీ ఆ శిష్యుడి హృదయంలోకే ప్రవేశించాను. అలా ప్రవేశించాక, నా పూర్వ వాసనలబలం పెరిగి, నా బంధువులకోసం చాలా వెతికాను. ఇలా వెతుకుతూ వుండగానే ఆ లోకానికి ఈ మాటు ఒక అగ్నిప్రళయం దాపురించింది. ఎంతటి అగ్ని అంటే, కొండరాళ్లే కర్పూరపు బిళ్ళల్లాగా మండిపోతున్నాయి. మంటలు మహానదులై ప్రవహిస్తున్నాయి.

నేను ఆ మంటల్లోనే గిరగిరా తిరుగుతున్నాను. ఐనా నేనప్పటికి తత్త్వజ్ఞానాన్ని పొంది వున్నాను గనుక, స్థూల దేహాభిమానాన్ని విడిచిపెట్టి ఆతివాహిక దేహ నిశ్చయంతో వున్నాను గనుక, నన్ను ఆ మంటలు ఏ మాత్రమూ బాధించడం లేదు. కానీ, ఆ భీభత్సమైన అగ్ని ప్రళయంలో తిరిగి తిరిగి నాకు అలసట వచ్చింది. అప్పుడిలా ఆలోచించాను. (సర్గ 140, 141)

"నేను మరొకడి హృదయంలో ప్రవేశించాను. ఆ హృదయంలో ఇదొక స్వప్నం. దీనిలో నేను పరుగులు తీస్తున్నాను. ఆయాసపడుతున్నాను. ఎందుకొచ్చిన ప్రయాస ఇది? కనుక ఈ స్వప్నాన్ని వదిలేసి జాగ్రదవస్థలోకి ప్రవేశించి, హాయిగా వుందాం!"– అని.

**బోయవాడు**: స్వామీ! స్వప్నావస్థయొక్క తత్త్వమేదో తెలుసుకుందామని గదా, మీ శిష్యుడి హృదయంలోకి ప్రవేశించారు. అక్కడ ఏదో నిర్ణయం జరిగి వుండాలి. లేకపోతే మీరు దాంట్లోంచి ఎందుకు వెనక్కు వస్తారు? కనుక దయచేసి ఆ నిర్ణయం ఏమిటో నాకు చెప్పండి. అదీ గాక, ఒక హృదయంలో కొండలూ, సముద్రాలూ, ముల్లోకాలూ, ఇలాంటివన్నీ వుండటం ఏమిటి? ఆ విషయం గూడా వివరించండి?

**ముని**: నాయనా! నేను నా స్వప్నాలనూ పరిశీలించి చూసుకున్నాను. శిష్యుడి హృదయంలోకి ప్రవేశించి, వాడి స్వప్నాలనూ పరిశీలించి చూసుకున్నాను. దానివల్ల అన్వయ వ్యతిరేకాలు రెంటిచేత, స్వప్నం అసత్యమని తేలిపోయింది. (అన్వయ వ్యతిరేకాలు అంటే, ఇది వుంటే అది వుంటుంది, ఇది లేకపోతే అది లేదు అని ఆలోచించే విధానాలు.) ఇంతకూ స్వప్న ప్రపంచం అంటే ఏమిటి? నామ రూపాలే స్వప్న ప్రపంచం. అంతకు మించి అక్కడ వేరే ఏమీ లేదు. ఆ సమయంలో అంత స్పష్టంగా కనిపించిన ఆ నామరూపాలు అప్పుడు గూడా లేనివే అని, అవి వుండడానికి తగిన కారణం లేదనీ, నాకు బాగా అర్థమైంది.

మరైతే జాగ్రత్ ప్రపంచం అంటే ఏమిటి? అది గూడా నామ రూపాల సమూహమే! మరి ఇది ఎలా వచ్చింది?

ఉన్న ఆత్మ చైతన్యమే నామరూపాలు గలదిగా రూపొంది నాకు స్వప్నంగా దర్శనం యిచ్చింది. ఆ సమయంలో నాకది జాగ్రత్తు. ఇప్పటి ఈ జాగ్రత్ ప్రపంచ రూపంలో నాకు కనిపించేది గూడా అత్మ చైతన్యమేనని నాకు అర్థమైయింది. అప్పటి ఆ స్వప్నానికీ, ఇప్పటి ఈ జాగ్రత్‌జగత్తుకీ, ఏమీ తేడా లేదని గూడా నాకు అర్థమైయింది. అప్పుడూ ఇప్పుడూ గూడా వున్నది, అద్వితీయ పరమాత్మ ఒక్కడే! వాడివి నువ్వే.

నీకు ఈ విషయం అనుభవంలోకి రాకపోవడానికి కారణం సంకల్పాలే! ఉన్న సంకల్పాలన్నీ వదిలేస్తే ఎవడు మిగిలి వుంటాడో, వాడే అసలైన నువ్వు! వాడికి దుఃఖం లేదు, లోపలా వెలుపలా అనేవి లేవు, అవధులూ లేవు.

## 55. ఆనందమయకోశ పరిశీలన

**బోయవాడు**: స్వామీ! ఆలోచనే సంసారానికి కారణం అంటున్నారు మీరు. ఆలోచనలకు కారణం పూర్వకర్మ. కనుక, సంసారానికి మూలకారణం కర్మే అని చెప్పాలి. కనుక, కర్మలు పూర్తిగా పోతే ఆలోచనలు పూర్తిగా పోవచ్చేమో! అందువల్ల ఎటువంటి వారికి కర్మ వుంటుంది? ఎటువంటివారికి కర్మ వుండదు? కర్మలేనివారికి గూడా ఆలోచనలు, వాటి పరిత్యాగాలూ వుంటాయా? – అనే విషయాలు నాకు అర్థంకావడం లేదు, దయచేసి వివరించండి.

**ముని**: నాయనా! కొందరు పూర్వకల్పజీవులు మహత్తరమైన ఉపాసనలు చేసి, తత్త్వ జ్ఞానాన్ని పొందేసి, ఇంకా స్వల్పంగా ప్రారబ్ధ శేషం మిగిలి వుండి, ఈ కల్పంలో మళ్ళీ జన్మిస్తూ వుంటారు. అలాంటి వాళ్ళకు ఈ జన్మలో పుట్టుకతోనే తత్త్వజ్ఞానం వంటపట్టేస్తుంది. అలాంటివాళ్ళు సామాన్యంగా ఈ సృష్టిలో అధికార పురుషులుగా నియమింపబడుతూ వుంటారు.బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులు, సనకసనందన కపిలాదులు ఈ కోవలోకి చేరినవారే! ఇలాంటివారికి పూర్వ కర్మ బంధకం కాదు. కనుక ఇలాంటివారికి పూర్వ కర్మ లేనట్టే లెక్క . ఐనా సరే, వారు పూర్వాభ్యాస బలంవల్ల ఆలోచనలు కలిగినవారివలె వ్యవహరిస్తూ వుంటారు. అది జీవన్ముక్తుల లక్షణం.

దీనికి భిన్నంగా "నేను బ్రహ్మను కాను" అని భావించే జీవులందరికీ పూర్వ కర్మ వుంటుంది.

ఐతే, జీవన్ముక్తుల దృష్టిలో కర్మకు గానీ, కర్మబద్ధులైన జీవులకు గానీ, యథార్థమైన అస్తిత్వం లేదు.

మనం తరంగాలనూ, సుడిగుండాలనూ గూడా జలమాత్రాలే అని గుర్తించినట్లుగా, వాళ్ళు ముక్తులూ– బద్ధులూ, స్వప్నమూ– జాగ్రత్తూ , ఇలాంటివన్నీ బ్రహ్మ స్వరూపాలే అని గుర్తిస్తారు.

కర్మ శేషం మిగిలివున్నా కూడా, తత్త్వజ్ఞానులైన సనకాదులకు అది బంధకరం కావడం లేదు. అటువంటి తత్త్వజ్ఞానం లేని ఇతర జీవులకు కర్మ బంధకరం అవుతోంది. అందుకే, బంధానికి మూలకారణం అజ్ఞానమేనని, కర్మ కాదని, పెద్దలు నిర్ణయించారు. కనుకనే తత్త్వజ్ఞానాన్ని కలిగించే సత్‌శాస్త్రాభ్యాసం చేయాలని వారు శాసించారు. (స. 142).

సత్‌శాస్త్రాభ్యాసం చేస్తే, శుద్ధ చిత్తత్త్వ దర్శనం లభిస్తుంది. అది లభిస్తే, సత్య స్థితిలో చిత్తే జగత్తనీ,జగత్తే చిత్తు అనీ అర్థమౌతుంది.

ఈ విషయాలన్నీ నాకు, నా శిష్యుడి ఆనందమయకోశంలో వున్నప్పుడు అనుభవ పూర్వకంగా తెలిశాయి. ఎందుకంటే అక్కడ నాకు నా వాసనలు, నా శిష్యుడి వాసనలు, ఇంతే గాక, మా ఇద్దరికీ సంబంధించిన ఇతరుల వాసనలు – అన్నీ గూడా కలిపి త్రిజగద్రూపంగా కనిపించాయి. అవి వుండేందుకు తగిన చైతన్య భిన్నమైన బాహ్య ప్రదేశమే అక్కడ లేదు. ఐనా సరే అవి కనిపించాయి. అవి అలా కనిపించడానికి కావలసిన కారణ సామాగ్రి కూడా అక్కడ లేదు. ఐనా సరే అవి కనిపించాయి. దానిని బట్టి మూడు లోకాలుగా, వాటిలో మూడు అవస్థలుగా, కనిపిస్తున్న ఈ ప్రపంచం అంతా అసత్ పదార్థమేననీ, నిజానికి ఈ కనిపించేదంతా శుద్ధ చైతన్యమేననీ, నేను అర్థం చేసుకున్నాను. (స. 143,144)

అదీ గాక, జీవుడు దృశ్యాలను చూస్తున్నాడు గదా! ఎలా చూస్తున్నాడో, కొంచెం ఆలోచించు. జాగ్రత్ ప్రపంచంలో వున్నప్పుడు, వాడు జ్ఞానేంద్రియాల ద్వారా దృశ్య పదార్థాలను చూస్తున్నాడు. అవి నిజమనుకుంటున్నాడు. ఈ దశలో అంతరింద్రియమైన మనస్సు పని చేస్తోందా? లేదా? అది పని చేస్తూనే వుంది, బయట దృశ్య పదార్థాలను చూస్తున్న సమయంలోనే, లోపల కొన్ని కొన్ని అనుభవాలను రేకెత్తిస్తోంది కూడా. ఐతే ఈ మానసిక అనుభవాలు అంత ప్రబలంగా వుండవు. వాడిపోయిన పూల లాగా కళాహీనంగా వుంటూ వుంటాయి.

బాహ్యేంద్రియాలు పూర్తిగా ముడుచుకుపోయి, అవి లోపలికి తిరిగిపోయినప్పుడు, అంతరింద్రియమైన మనస్సు బాగా బలం పుంజుకుని, ప్రబలమైన అంతర్ దృశ్యాలనూ, అంతర్ భావోద్వేగాలనూ, అనుభవంలోకి తెస్తుంది. ఈ ప్రబలత్వంలో భాగంగా, అంతరింద్రియమే తన అంతర్లోకంలో బాహ్యేంద్రియాలను గూడా సృష్టి చేస్తుంది. అలాంటి ఆ బాహ్యేంద్రియాల ద్వారా ఆ ప్రపంచాన్ని చూస్తున్న అనుభూతిని ఆ జీవుడికి కలిగిస్తుంది. అందుచేత ఆ జీవుడు ఆ లోకాన్ని తనకంటే బయటవున్న ప్రపంచంగానూ, గట్టిగా వున్న స్థూల ప్రపంచంగానూ, చూస్తాడు.

జాగ్రద్దశలో వుండగా కూడా ఈ జీవుడు చేసిన పని ఇదే! ఇంద్రియాల ద్వారా చూసిన దృశ్యాలు స్థూలమైనవి, స్థిరమైనవి, అనుకున్నాడు. ఆ మాటే స్వప్న సమయంలో కూడా అనుకుంటున్నాడు. కనుక, దృశ్య పదార్థాలలో వాడి అనుభవానికి వచ్చే స్థూలత్వానికి నిజమైన కారణం ఎవరంటే, వాడి ఇంద్రియాలే గానీ, ఆ దృశ్య పదార్థాలు గావు! కనుక నిజమైన స్థూల ప్రపంచం అంటూ లేనే లేదు.

## 56. జీవుడి నాడీసంచార పరిశీలన

***బోయవాడు***: స్వామీ! స్వప్న సమయంలోని ఇంద్రియాలు చిత్తకల్పితాలు కనుక, వాటి ద్వారా కనిపించే ప్రపంచంలో స్థూలత్వం లేకపోతే పోవచ్చు గాక, జాగ్రద్దశలోని ఇంద్రియాలు మనఃకల్పితాలు కావు గదా! వాటిద్వారా కనిపించే ప్రపంచం స్థూల ప్రపంచం కాదనడం ఎలా?

*మం॥శి*: జాగ్రద్దశలో బాహ్యేంద్రియాలు ఎక్కడినుంచి వచ్చాయి? అవి చిదాభాసుడు (జీవుడు) తన మీద తను చేసుకున్న అధ్యారోప పరంపరలో భాగాలేనని పూర్వమే చెప్పుకున్నాం గదా! కనుక, అవి గూడా మనః కల్పితాలే! ఈ విషయం బాగా అర్థమయ్యేందుకోసం స్వప్న దృశ్యాలు కనిపించే విధానాన్ని మరో దృష్టితో వివరిస్తాను, విను.

జాగ్రద్దశలో, బాహ్యేంద్రియాలు బాగా అలసిపోయినప్పుడు, లోపలి జీవుడు తన అంతరింద్రియాన్ని (మనసును) వెనక్కు గుంజుకుని హృదయ స్థానంలో వున్న కొన్ని నాడులలోకి ప్రవేశిస్తాడు. అలా ప్రవేశించేటప్పుడు వాతపిత్త శ్లేష్మాలలోని శ్లేష్మధాతువుతో నిండి పోయిన నాడులలోకి ప్రవేశిస్తే, అప్పుడా జీవుడు సౌందర్యమయాలు, సౌకుమార్య పరిపూర్ణాలు, ఐన ఆహ్లాదక సన్నివేశాలను చూస్తాడు. ఉదాహరణకు, వెన్నెల నిండిన ఆకాశం, కలువలు విచ్చిన కొలను, ఉత్సవాలలో ఉల్లాసంగా వుండే సుందరాంగులు, నోరూరుంచే వంటకాలు, విలాసవంతమైన భవనాలు, కనువిందు చేసే నదీ సంగమాలు– ఇలాంటివన్నీ ఆ సమయంలో కనిపిస్తాయి.

ఇక ఆ జీవుడు పిత్త రసంతో కూడిన నాడులలోకి ప్రవేశిస్తే, అప్పుడతనికిక కనిపించే దృశ్యాలన్నీ ఉగ్రంగా, తీక్షణంగా, వుంటాయి. ఉదాహరణకు, నిప్పుమంటలు, కాళ్లు కాలే ఇసుక దిబ్బలు, మండే సూర్య గోళాలు, భయంకరమైన క్రూరమృగాలు – ఇలాంటివన్నీ అప్పుడు వాడికి కనిపిస్తాయి.

ఆ జీవుడు వాతతత్వంతో నిండిన నాడులలోకి ప్రవేశిస్తే, వాడికి కనిపించే దృశ్యాలన్నీ గందరగోళంగానూ, విచిత్రంగానూ, వుంటాయి. ఉదాహరణకు, కదిలిపోయే భూమి, పిడుగుల మోతలతో మారు మ్రోగే కొండగుహలు, కుమ్మరివాడి చక్రంవంటి సాధనాలు లేకుండానే గిరగిరా తిరిగే కుండలు, గాలిలోకి ఎగిరే గుర్రాలు, పక్షులమీద ప్రయాణం చేసే వింత జీవులు, ఆకాశంలో తిరిగే యక్ష గంధర్వాదులు, భయంతో గడగడ లాడి పోతుండే ఆడపిల్లలూ, తను ఏదో పాడు బావిలో పడిపోయిన సన్నివేశాలు, తను స్వయంగా చెట్లనూ,కొండలను, పెకిలించి పైకెత్తుతున్న దృశ్యాలూ, – ఇలాంటివన్నీ అప్పుడు వాడికి కనిపిస్తాయి.

సామాన్యంగా, ఏ నాడీ గూడా ఒకే ఒక ధాతు రసంతో నిండి వుండడం జరుగదు. ధాతు రసాలు ఎప్పుడు గూడా సంకరంగా సంచరిస్తూ వుంటాయి. ఆ యా సాంకర్యాలతో వుండే పాళ్ల భేదాలను బట్టి, ఆయా నాడులలో సంచరించే జీవుడికి కనిపించే దృశ్యాలు మారిపోతూ వుంటాయి. అవి అంతులేనన్ని రకాలుగా వుంటాయి. ఆ విచిత్రాలను వర్ణించడం కష్టం. పెద్ద కొండలే వర్షధారలలోని వడగళ్ళు లాగా కనిపించవచ్చు. కొండలు మాట్లడుతున్నట్టు, పచ్చని చెట్లే తగలబడిపోతున్నట్లు, సముద్రంలో రాళ్ళ గుట్టలు పేరుకున్నట్లు, సప్తర్షిమండలం పగిలిపోతున్నట్లు, ఇలా రక రకాల స్వప్నాలు కనిపించవచ్చు.

ఇలా కొంత సేపు స్వప్నాల హడావిడి సాగినాక, ఆ జీవుడు, హృదయ ప్రాంతంలోనే వున్న "పురీతత్" అనే నాడిలోకి ప్రవేశిస్తాడు. ఈ నాడి హృదయ కోశానికి చుట్టూతా వుండే పక్కటెముకల కొసలు కలుసుకునే చోట వుంటుంది. (పురీతత్ అనే పేరుమాత్రం మూలకర్త చెప్పలేదు. ఒక బిలం అని మాత్రమే అన్నాడు.) దానిలోకి ప్రవేశించేసరికి ఆ జీవుడికి, ఇటూ అటూ కదిలే చోటు మిగలదు. అందుచేత, అతనికి ప్రాణసంయోగంవల్ల కలిగే చలనం అక్కడ స్తంభించిపోతుంది. అందుచేత, మట్టి ముద్ద లాగా పడివుంటాడు. అదే సుషిప్తి అవస్థ.

ఇలా కొంతసేపు జరిగేటప్పటికి, శరీరం లోపల అన్నరసాలలో కొన్ని మార్పులు వచ్చి, "పురీతత్"లో వున్న జీవుడికి కదిలే సందు దొరుకుతుంది. అప్పుడా జీవుడు ఆ నాడిలోంచి బయటబడి, మళ్లీ ప్రాణ సంపర్కంతో చలనాన్ని పొంది, స్వప్నంలోకి ప్రవేశిస్తాడు. ఇలా జరగడంలో జీవుడు రక రకాల నాడులలో రక రకాల క్లేశాలను అనుభవిస్తూ, రక రకాల దృశ్యాలను చూస్తూ వుంటాడు. ఇదంతా దేనివల్ల? వాత పిత్త శ్లేష్మాల సంచారాల భేదంవల్ల!

జా్గ్రద్దశలో వున్నప్పుడు ఇంద్రియాల ప్రభావాలవల్ల, రక రకాల దృశ్యాలను చూస్తున్నాడు. స్వప్నంలో వున్నప్పుడు వాతపిత్త శ్లేష్మాల ప్రభావాలవల్ల రకరకాల దృశ్యాలను చూస్తున్నాడు. ఇంతే తేడా!

జా్గ్రద్దశలో ఇంద్రియాల ద్వారా జీవుడు చూసే దృశ్యాలలో గారడీ వంటి దృశ్యాలు గూడా వుంటాయి. కొంతమంది జీవులకు వాతపిత్తాది దోషాలు మరీ ఎక్కు వైతే, ఎవడూ గారడీ చేయకుండానే, వారు గారడీ వంటి దృశ్యాలను చూసేస్తూ వుంటారు. వాటివల్ల వచ్చే సుఖదుఃఖాలను అనుభవించేస్తూ వుంటారు. ఇలాంటివాళ్ళను ఇతరులు పిచ్చివాళ్ళు అంటే అనవచ్చు. కానీ వాళ్ళ అనుభవంలో వారికది సత్యం!

దీనిని బట్టి ఏం తేలిందంటే,

**ఏవమేతదసద్భూతం**

**సద్భూతమివ భాసతే ॥** ( ని.ఉ.స. 145, శ్లో. 75)

స్వప్నంలోనూ, జా్గ్రత్తులోనూ కూడా, ఆ జీవుడు వాతాది ధాతువుల ప్రభావంవల్ల వున్నది లేనట్లుగా, లేనిది వున్నట్లుగా చూస్తున్నాడు.

నిజంగా వున్నది చిత్‌తత్త్వం ఒక్కటే! ఇంద్రియాలన్నీ ఆ చిత్‌తత్త్వంమీద మనస్సు చేసిన ఆరోపణలే! కనుక, జా్గ్రద్దశలో ఇంద్రియాల ద్వారా కనిపించే దృశ్యాలకు ప్రత్యేకమైన అస్తిత్వం ఏదీ లేదు. ఈ విషయాలన్నీ నా శిష్యుడి స్వప్నదశను పరిశీలించినప్పుడు నాకు అర్థం అయ్యాయి. (స. 145)

***బోయవాడు***: స్వామీ! ఆపైన ఏమి జరిగింది?

***ముని***: నాయనా! ఆ విధంగా నేనతని జీవ చైతన్యంతో నా సూక్ష్మ శరీరాన్ని కలిపివేసి ముందుకు సాగుతూండగా, వున్నట్టుండి పెద్ద సుడిగాలి మొదలైంది. ఆ గాలి పెరిగి పెరిగి, మొదట్లో చెట్లూ, తరువాత ఇళ్లూ, ఆ తరువాత కొండలూ గూడా, గాలిలో కొట్టుకు రాసాగాయి. ఇదంతా ఏమిటా అని పరిశీలిస్తే, నా శిష్యుడి నాడులలోకి ప్రవేశించిన అన్నరసాలు పొంగులెత్తి, వాటిలో చిన్న చిన్న అన్న కణాలు ఎగిరి పడుతుంటే, నాకది పర్వత వర్షంగా కనిపిస్తోంది – అని అర్థమైంది. కాని నేను ఆ పీడకు తట్టుకోలేక పోతున్నాను. కొద్దిసేపట్లోనే, నేను ఎటూ కదలలేక బిగిసిపోయాను. చీకటి కమ్మేసినట్టు, చైతన్యం బిగిసిపోయినట్లు, ఒక అనుభూతి కలిగింది. అదే సుషుప్తి దశ.

కొంతసేపటికి నాడులలోని అన్న రసాలు జీర్ణమై తగ్గాయి. కొలనులో కలువ విచ్చుకున్నాట్లుగా నాలో చైతన్యం మళ్లీ మెల్లి మెల్లిగా విచ్చుకుంది. అది విచ్చుకుంటున్న కొద్దీ నేను మళ్లీ స్వప్నంలోకి ప్రవేశించసాగాను. అంటే, నేను విశ్రాంతి రూపమైన సుషుప్తిలోంచి స్వప్న రూపమైన నిద్రలోకి ప్రవేశించాను. ఎప్పుడైతే చైతన్యం వికసించిందో, ఆ వెనువెంటనే, చైతన్యానికి సహజసిద్ధమైన జగద్దృశ్యరూపం మళ్లీ మొదలైంది. తల్లి కడుపులో బిడ్డ మొలిచి పెరిగినట్లుగా, సుషుప్తిదృశ్యం అనే కడుపులోనుంచి జగద్దృశ్యం రేకులు విప్పుకోసాగింది.

### 57. పుట్టుట- కనిపించుట-ఉండుట

***బోయవాడు***: స్వామీ! ఇదేమిటి? సుషుప్తిదృశ్యం అని అంటున్నారేమిటి? సుషుప్తిలో దృశ్యాలుంటాయా, ఎక్కడైనా? అదీ గాక, మీ శిష్యుడి నాడులలో మీరు సంచరిస్తున్నప్పుడు కొత్తగా జగద్దృశ్యం పుట్టిందంటున్నారు మీరు. అంటే, యిప్పుడు కనబడుతున్న ఈ జగత్తు, అటు మీ శిష్యుడియొక్క సుషుప్తి దశలోంచి పుట్టే జగత్తుకంటేనూ, ఇటు మీ స్వంత సుషుప్తి దశలోంచి పుట్టే జగత్తు కంటేనూ, కూడా భిన్నంగా పుడుతోందని మీ అభిప్రాయమా?

***ముని***: నాయనా! పుడుతోంది, కనిపిస్తోంది, ప్రకాశిస్తోంది – అనే మాటలకు అర్థమేమిటో ఆలోచించు.

లోకంలో ప్రజలంతా ఈ మాటలను వాడుతున్నారు. వాళ్లంతా ద్వైత భావంలో కొట్టుకుపోతున్నవాళ్లే! వాళ్ళు ఈ మాటలకు అర్థమేమిటని ఆలోచించరు. నువ్వు కొంచెం ఆలోచించు. మాబోటి వాళ్ళం వ్యాకరణశాస్త్ర పరంగా ఆలోచిస్తాం. మీరు లోక వ్యవహార పరంగా ఆలోచిస్తారు. ఎలా ఆలోచించినా లోతుగా చూస్తే, ఈ మాటలన్నిటికీ ఒకటే అర్థం – 'ఉన్నది' అని. ఉన్నది ఎప్పుడూ వుంది. దానికి పుట్టుకా లేదు, నాశమూ లేదు. దానికి పుట్టుక గాని, నాశనము గానీ కనిపిస్తున్నాయంటే, అవి అజ్ఞానంవల్ల కనిపిస్తున్నాయనీ, వాటికి నిజమైన అస్తిత్వం లేదనీ, అర్థం చేసుకోవాలి.

ఈ దృష్టితో చూసినప్పుడు–

**సర్వసత్తాత్మకం బ్రహ్మ**
**సర్వసత్తాత్మకం జగత్ ।**
**విధియః ప్రతిషేధాశ్చ**
**వద తత్ర లగన్తి కే ॥** (ని.ఉ.స. 146, శ్లో.19)

పరబ్రహ్మ సర్వసత్తాత్మకమే, జగత్తూ సర్వసత్తాత్మకమే !
సర్వసత్తాత్మకం అంటే అస్తిత్వం కంటే మరొకటి లేనిది. అలాంటప్పుడు వుంది, లేదా– అనే మాటలు అటు పరబ్రహ్మకు గానీ, ఇటు జగత్తుకు గానీ, ఎలా అన్వయిస్తాయో చెప్పు.

***బోయవాడు***: స్వామీ! మరి, లోకంలో, 'వుంది, లేదు' – అనే వ్యవహారం ఎలా కనిపిస్తోంది?

***ముని***:

**యా నామ శక్తిః కాచిత్సా**
**తత్రైవాస్తి చ నాస్తి చ ।**
**యస్మాత్తదాత్మ తద్బ్రహ్మ**
**తథైవాత్మ తదాత్మకమ్ ॥** (ని.ఉ.స.146, శ్లో.20)

ఆ పని మాయాశక్తివల్ల జరుగుతోంది. అది ఒక విచిత్రమైన శక్తి. అది పరబ్రహ్మలోనే వుందంటే వుంది, లేదంటే లేదు. అజ్ఞాన దృష్టిలోంచి చూసినప్పుడు, ఆ మాయాశక్తికి పరబ్రహ్మ ఆధారం కనుక, ఆ శక్తి పరబ్రహ్మస్వరూపమే! అంటే ఆ మాయాశక్తి విజృంభించినకొద్దీ, ఆ పరబ్రహ్మ ఊహాతీతమైన విచిత్ర శక్తులతో నిండి వున్నట్లు కనిపిస్తూ వుంటుంది. విజ్ఞ దృష్టితో చూస్తే, అప్పుడు ద్వైత బుద్ధి లేదు గనుక, మాయాశక్తికి అస్తిత్వమే లేదు. అందుచేతనే, ఆ శక్తివుందంటే వుంది, లేదంటే లేదు – అని నేనన్నాను. తత్త్వవేత్తల దృష్టిలో జాగ్రదాది దశలు కనిపిస్తున్నప్పుడు గూడా లేనివే! అంటే వాటికి రూపం ఏమాత్రం లేదు. సృష్టి ప్రారంభంలో జగద్రూపంయొక్క పరిస్థితి కూడా అంతే! సృష్టిలో అంతర్భాగంగా వుండే స్వప్నాది దశలకు ద్రష్ట జీవుడు. ఈ సృష్టి మొత్తాన్ని ఒకే ముద్దగా తీసుకుంటే, దీనికి ద్రష్ట పరబ్రహ్మే!

ఈ మాటలన్నీ సృష్టిని అంగీకరించి మాట్లాడుతున్నాం. జ్ఞాన దృష్టి కలిగినప్పుడు, అంటే సృష్టికి అస్తిత్వమే లేదని తేలిపోయినప్పుడు, 'జీవుడు' అనే ద్రష్ట, 'బ్రహ్మ' అనే ద్రష్ట, ఎక్కడ మిగులుతారు? అలా మిగలనప్పుడు నా శిష్యుడి ప్రపంచం, నా ప్రపంచం, ఇప్పుడు క్రొత్తగా పుట్టే ప్రపంచం – అనేవి ఒకటా? వేరా? అని తేల్చి చెప్పడం ఎలా? దీనికి ఏ సమాధానం చెప్పినా, దృష్టి భేదం మీద ఆధారపడి వుంటుందే తప్ప స్వతంత్రమైన సమాధానమే వుండదు. కనుక, ఆ విషయాన్ని అక్కడికి వదిలిపెట్టి, పై సంగతి చెబుతాను విను (స. 146)

**గమనిక** – ఈ సర్గలో వ్యాధుడు వేసిన ప్రశ్నల్లో -"సుషుప్తి దృశ్యంనుంచీ జగద్దృశ్యం వచ్చిందంటున్నారు కదా! సుషుప్తిలో దృశ్యాలు ఎలా వుంటాయి?"అనే ప్రశ్న గూడా వుంది. దానికి మూలంలో సమాధానం

చెప్పలేదు. అది స్పష్టమేనని మూలకర్త భావం అయివుండవచ్చు. సుషుప్తికాలంలో చిదాభాస రూపమైన అహంవృత్తి లయించిపోతుంది గనుక, జ్ఞానం శుద్ధంగా మిగలిపోయి, తన ఎదురుగా వున్న అజ్ఞానాన్ని ప్రకాశింప జేస్తుంది. అంటే - ఏమీ తెలియటం లేదనే అనుభూతిని కలిగిస్తుంది. కానీ అక్కడ వేరే ఇంద్రియాదులు లేవు గనుక ఆ అనుభవం అప్పుడు వ్యక్తం కాకపోయినా, మెలకువ వచ్చాక స్మృతిగా బయటకు వస్తుంది. కనుక, అజ్ఞానమే సుషుప్తి కాలంలోని దృశ్యమనీ, దానిలోనుంచీ జగద్దృశ్యం వికసిస్తోందనీ, మనం అర్థం చేసుకోవాలి. శంకర భగవత్పాదుల లఘువాక్యవృత్తిలోని -

**"జాగరస్వప్నయో రేవ- బోధాభాస విడంబనా।**
**సుప్తౌ తు తల్లయే బోధః శుద్ధో జాడ్యం ప్రకాశయేత్॥"** (శ్లో. 4)

(చిదాభాసుడి ఆడంబరమంతా జాగ్రత్ స్వప్నాలలో మాత్రమే! సుషుప్తి దశలో అతడు లయించిపోతాడు కనుక, శుద్ధ జ్ఞానం అవిద్యను ప్రకాశింప చేస్తుంది)- అనే ఈ వాక్యమే ఇందుకు ప్రమాణం. ఈ విషయాన్ని గ్రహించుకుని, ఇక ముని చెప్పే స్వానుభవ వివరణలోకి మళ్ళీ ప్రవేశిద్దాం.

## 58. మళ్ళీ పాత జన్మ

***ముని***: ఆ విధంగా నేను సుషుప్తిలోంచి బయటికి వచ్చేసరికి, (భూగోళపు ఇరుసు రేఖయొక్క కోణం మారినప్పుడు) సముద్రంలో మునిగిపోయిన పాత పట్టణమేదో పైకి లేచినట్లుగా, వున్నట్టుండి కొత్త ప్రపంచం కనిపించడం మొదలు పెట్టింది. నేను ఆ ప్రపంచాన్ని వింతగా చూస్తూండగానే, దాంట్లో నాకు నా స్వగ్రామం కనిపించింది. అలనాటి నా భార్యా పుత్రులు, బంధువులు, అంతా కనిపించారు. వాళ్ళను చూసేసరికి నాకు ప్రాణం లేచి వచ్చినట్లై, వాళ్ళందరినీ కౌగిలించుకొని మురిసిపోయాను.

నాయనా! చూశావా, అప్పటి నా పరిస్థితి? అప్పటికి నాకు ఇంకా తత్త్వజ్ఞానం స్థిరపడలేదు. అందువల్ల పాత వాసనలు నా మనస్సును జయించేశాయి. ఇప్పటి స్థితిలో అయితే అలా జరిగి వుండేది కాదు. ఇప్పుడు నీ పరిస్థితి ఎలా వుందో, అప్పటికి నా పరిస్థితి అలాగా వుండేది. విడిగా కూర్చొని ఆలోచించుకుంటు నప్పుడు, పరబ్రహ్మ తత్త్వమంతా విస్పష్టంగానే వుండేది. కానీ పాత వాసనలు వచ్చి మీదపడ్డప్పుడు మాత్రం, మనస్సు ఉయ్యాల లాగా వూగిపోతూ వుండేది. నీ పరిస్థితీ అంతే! గట్టి సాధన చేస్తే గాని ఈ స్థితిని దాటలేం.

***బోయవాడు***: స్వామీ! మీరు చెప్పింది నిజం. నా మనస్సు ఉయ్యాలలూగుతోంది. ఇంకా కొన్ని సందేహాలు మిగిలే వున్నాయి. మీరు స్వప్నం అసత్యమనీ, దాని లాగానే, జాగ్రత్ ప్రపంచం కూడా అసత్యమనీ, చాలా సార్లు చెబుతున్నారు. కానీ, ప్రామాణికులైన శాస్త్రాజ్ఞులు వేకువఝామున వచ్చిన స్వప్నాలు ఫలిస్తాయని అంటున్నారు. ఉదాహరణకు, వేకువఝామున వచ్చిన కలలో ఏనుగును ఎక్కినట్లుగా కనిపిస్తే , మరునాడు జాగ్రత్ప్రపంచంలో మంచి లాభం వస్తుందఖీతీ అంటున్నారు. అనుభవంలో గూడా ఇది నిజమేననిపిస్తోంది. మళ్లీ ఏ అర్థరాత్రి సమయంలోనో వచ్చిన కలలకు ఫలితమేమీ లేదని వాళ్లంటున్నారు. దీనినిబట్టి స్వప్నంలో కొంత భాగం సత్యమనీ, కొంత భాగం అసత్యమనీ, స్వప్న శాస్త్రజ్ఞులు చెప్పినట్లవుతోంది గదా! మరి మీరు స్వప్నం మొత్తం అసత్యం అంటున్నారేమిటి?

***ముని***: వేకువఝామున స్వప్నాలే గాదయ్యా, మరి కొన్ని స్వప్నాలు గూడా సత్యాలేనని ప్రసిద్ధి వుంది. ఉదాహరణకు, 'స్వప్నేశ్వరీ ఉపాసన' అనే ఉపాసన వుంది. ఆ ఉపాసన చేసినవాళ్ళకి రాబోయే సంఘటనలన్నీ ముందుగానే స్వప్నంలో కనిపిస్తాయని వుంది. ఆ ఉపాసన చేసేవాళ్ళకు అలాంటి అనుభవాలు గూడా చాలా వున్నాయి.

కానీ లోతుగా ఆలోచిస్తే, అలాంటి అనుభవాలకు అసలైన కారణం, వాళ్ళ విశ్వాసమే! ఎవరికి ఆ ఉపాసనల మీద, ఆ శాస్త్రాల మీద విశ్వాసం అచంచలంగా వుంటోందో, వాళ్ళకు ఆ ఫలితాలు నిశ్చయంగా

కలుగుతున్నాయి. ఎవరి విశ్వాసం కొంచెం వదులు వదులుగా వుంటోందో, వాళ్ళకు వచ్చే ఫలితాలు అనిశ్చయంగా వుంటున్నాయి.

దీనినిబట్టి తేలుతున్న విషయం ఏమిటంటే, స్వప్నలోక జాగ్రల్లోకాలకు మధ్య గల సంబంధం విశ్వాసాధీనమే గాని, స్వత స్సిద్ధం గాదు. నిర్మొహమాటంగా చెప్పాలంటే

**తదేషా కాకతాలీయ**

**న్యాయాదన్యా న లభ్యతే ॥**(ని.ఉ.స.148, శ్లో. 4)

ఇదంతా కాకతాళీయ న్యాయం తప్ప మరొకటి అయ్యేందుకు వీలు లేదు.

**గమనిక –** కాకతాళీయ న్యాయం అంటే, ఇంగ్లీషులో "ఫ్లూక్" అని భావం. తాళి అంటే తాటిపండు. తాటి చెట్టుమీద తాటి పండు బాగా పండి రాలడానికి సిద్ధంగా వుంది. సరిగ్గా ఆ సమయానికి ఒక కాకి వచ్చి దాని మీద వ్రాలింది. ఆ పండు రాలనే రాలింది. దీనిని దూరంనుంచి గమనించిన ఓ పెద్దమనిషి, ఈ బండ కాకి వాలేసరికి ఆ తాటిపండు రాలిపోయింది- అని ప్రకటించాడు. నిజానికి పండు రాలడానికి, కాకి వాలడానికి, కార్యకారణ సంబంధం లేదు. అయినా, అది వున్నట్టు భ్రాంతి కలుగుతోంది. ఇలాంటి సందర్భాన్నే కాకతాళీయ న్యాయం అంటారు.

***ముని***: నాయనా! ఇంతకూ చెప్పవచ్చింది ఏమిటంటే, స్వప్న శాస్త్రాలన్నీ కాకతాళీయ న్యాయంమీద ఆధారపడి నడుస్తున్నాయి. కనుక స్వప్నంలో కొంత భాగం సత్యమనే ఆలోచన సరిగాదు. కనుక–

**న బహిర్నాంతరే సంతి**

**పదార్థాః కేచన క్వచిత్ ।**

**సంవిదేకా జగద్రూపైః**

**యథేచ్ఛతి తథా స్థితా ॥** (ని.ఉ.స.148, శ్లో. 7)

కనుక సిద్ధాంతం ఏమిటంటే, అటు లోపల వుండే స్వప్నంలో గానీ, ఇటు బయటవుండే జాగ్రత్తులో గానీ, సత్యమైన పదార్థాలనేవి, ఎప్పుడూ ఎక్కడా లేనే లేవు. ఉన్నది చైతన్యం ఒక్కటే! అదే ఆ యా జగత్తుల రూపాలుగా ఎలా కావాలనుకుంటే, అలా వుంటోంది.

కాబట్టి, కరిగిన నేతికీ, పేరుకున్న నేతికీ, ఎంత మాత్రం భేదం వుందో, జాగ్రత్ స్వప్న సుషుప్తులకు మధ్య అంతే భేదం వుంది! ఇది మనస్సుకు పడితే, మిగిలిన సిద్ధాంత విషయాలన్నీ మేము నీకు పూర్వం చెప్పినవే కనుక, మళ్లీ చెప్పవలసిన పని లేదు (స. 147,148)

***బోయవాడు***: స్వామీ! బాగా చెప్పారు. ఇక ఆ పైన మీ అనుభవం ఏమిటో చెప్పండి!

***ముని***: నాయనా! నాకు నా భార్యా పిల్లలు కనిపించారు. చెప్పాను గదా, నేను వాళ్ళ మోహంలో పడిపోయి, ఏ రకమైన తత్త్వచింతనా లేకుండా, పదహారు సంవత్సరాలు గడిపేశాను.

ఇలా వుండగా ఒక రోజున ఒక తేజశ్శాలియైన వృద్ధముని మా యింటికి అతిథిగా వచ్చాడు. నేను ఆయనకు సేవచేస్తూ చేస్తూ ఒక ప్రశ్న వేశాను.

## 59. సమష్టి సుఖదుఃఖాలు

***ప్రశ్న***: వృద్ధమునీశ్వరా! సామాన్యంగా పెద్దవాళ్ళు ఎవడి పుణ్యం వారిదే, ఎవడి పాపం వాడిదే, అంటారు గదా! పుణ్యం చేస్తే సుఖం వస్తుందనీ, పాపం చేస్తే దుఃఖం వస్తుందనీ, అంటారు గదా! కానీ, కరువు కాటకాలు మొదలైనవి వచ్చినప్పుడు దేశంలో అందరికీ ఒకే సారి ఒకే రకమైన దుఃఖం వచ్చి మీద పడుతోంది గదా! ఇది జరగాలంటే, ఇన్ని లక్షలమంది గూడా పూర్వం ఎప్పుడో ఒకప్పుడు, ఒకే సమయంలో, ఒకే

రకమైన పాపం చేశారని చెప్పాలి గదా! ఇది అసంభవమైన విషయంగా కనిపిస్తోంది. మరి వీరందరికీ ఒకే సారి ఒకే దుఃఖం రావడానికి కారణం ఏముంది?

వృద్ధముని నా ప్రశ్న విని, నా వంక విచిత్రంగా చూసి, ఓ ఎదురు ప్రశ్న వేశాడు.

**ఎదురు ప్రశ్న**: నాయనా! నీకు సదసద్ వివేకం గల అంతఃకరణం వుంది గనుక, దాని సహాయంతో ఈ దృశ్యమాన ప్రపంచ సన్నివేశాలకు వెనకాల వున్న కారణమేమిటో తెలుసుకోవాలని ప్రయత్నం చేస్తున్నావు. మంచిదే, కానీ ఆ అంతఃకరణాన్ని దేని సహాయంతో తెలుసుకొంటున్నావు?

ఈ ప్రశ్నకు ఏం జవాబు చెప్పాలో తెలియక నేను అయోమయంగా చూశాను. ఆయన ఒక క్షణం ఆగి, మళ్ళీ యిలా అన్నాడు–

**వృద్ధముని**: నాయనా! బాగా గుర్తు తెచ్చుకో. మౌలికంగా నువ్వు ఎవడివో? ఎక్కడి వాడివో? ఇక్కడికి ఎందుకొచ్చావో? ఈ దృశ్యమేమిటో? ఇందులో వున్న సారమేమిటో? అన్నీ గుర్తు చేసుకో. బాబూ! ఏమీ గుర్తు రావడం లేదా? ఇదంతా ఒక స్వప్నమే అనే మాట నీకు గుర్తు రావడం లేదా? నువ్వూ ఒక స్వప్న జీవివే! నేనూ ఒక స్వప్న జీవినే! ఇది నీకు అర్థం కావడం లేదా?

ఈ దృశ్యం అంతా సరిగ్గా చూడు. ఇది చిన్మాత్ర తత్త్వంయొక్క విస్తారం మాత్రమే! చిన్మాత్రంయొక్క లక్షణం విచిత్రమైనది. ఆ చిన్మాత్ర తత్త్వం ఎక్కడ ఏది వుందనుకుంటే, అక్కడ అది వుంటుంది. అందుకనే–

**సకారణత్వ కలనాత్**
**సర్వమస్య సకారణమ్ ।**
**అకారణత్వ కలనాత్**
**అస్య సర్వ మకారణమ్ ॥** (ని.ఉ.స. 149, శ్లో. 17)

అది ఈ దృశ్య వస్తువులన్నిటికీ కారణం వుందనుకుంటే వుంటుంది. లేదనుకుంటే, కారణమే వుండదు. మనం ఇప్పుడు భావించే సమష్టి వ్యష్టి భావన కూడా ఆ చిన్మాత్రం మీదే ఆధారపడి వుంది. ఎలాగంటే, మనమంతా కలిసి ఒకానొకడి స్వప్నలోకంలో జీవిస్తున్న జీవులం. కనుక వాడు మనకు విరాట్పురుషుడు. వాడి స్వంత దృష్టిలో వాడు విరాట్పురుషుడు గాదు. అది మనం మన దృష్టితో చేస్తున్న కల్పన. వాడి దృష్టిలో వాడు వ్యష్టి పురుషుడే! కాగా, ఒక్కొక్క వ్యష్టి పురుషుడూ ఒకానొక జీవ బృందానికి విరాట్ పురుషుడౌతున్నాడు.

ఈ విరాట్పురుషుడి మనస్సులో కలిగే సంకల్పాలను బట్టి, తత్ఫలితంగా వాడి నాడులలో కలిగే ధాతు రస సంచార భేదాలను బట్టి, వాడి లోపల వుండే జీవ బృందానికి వ్యష్టిగా గాని, సమష్టిగా గాని, సుఖదుఃఖాలు వచ్చి పడుతున్నాయి. నువ్వు చెప్పిన కరువు కాటకాది సన్నివేశాలకు కారణాలు ఆ విరాట్పురుషుడి నాడులలోని ధాతువుల కల్లోలాలే!

కనుక స్వప్నమయమైన ఈ ప్రపంచంలో వుండే కుండలు మొదలైన పదార్థాల వెనుక మట్టిముద్ద వంటి కారణాలు వున్నట్టు కనిపిస్తున్నా, ఈ ప్రపంచం మొత్తాన్ని కలిపి చూస్తున్నప్పుడు, దీని వెనకాల సరియైన కారణం కనిపించదు. కారణం లేకుండా పుట్టే పదార్థాన్ని సత్య పదార్థంగా అంగీకరించడానికి వీలు లేదు. కనుక, వున్నది చిన్మాత్ర పరబ్రహ్మమే గాని జగత్తు గాదు!

స్వప్న ప్రపంచం వరకూ ఇది సులభంగానే అర్థమౌతుంది. జాగ్రత్ ప్రపంచం దగ్గరికి వచ్చేసరికి, ఇప్పుడు చెప్పిన యుక్తి సరిపోదేమో అనిపిస్తూ వుంటుంది. కానీ, విచారించి చూస్తే, స్వప్నాన్ని అనుభవించే విధానమూ, జాగ్రత్తును అనుభవించే విధానమూ– రెండూ ఒకటే! దీనిని బట్టి అవి రెండూ జన్మించే విధానాలు గూడా ఒకటే అని బ్రహ్మవేత్తలు గ్రహించారు. దానిని బట్టి, జాగ్రత్ ప్రపంచం కూడా అద్వితీయ పరబ్రహ్మమయమేనని వారు నిశ్చయించారు.

**ముని**: కారణం సత్యమైతే కార్యమూ సత్యమే కావాలి. మట్టిముద్ద ఒక సత్యం. కుండ మరో సత్యం. అలాగే, పరబ్రహ్మ ఒక సత్యం, జగత్తు మరో సత్యం, కావాలి. అప్పుడు బ్రహ్మ అద్వితీయమని మీరెందుకు అంటున్నారు?
**వృద్ధముని**: జగత్తు గూడా సత్యమే అనడానికి మట్టిముద్ద, కుండ, ఉదాహరణ చెప్పావు. బాగానే వుంది. మరి ఈ జగత్తులో ప్రతి పదార్థానికీ ఒక కారణం వుండాలి గదా! మరి ఆకాశానికి కారణం ఏమిటి? అక్కడ ఏ కారణమూ దొరకటం లేదు. కారణం లేకుండా వచ్చింది గనుక ఆకాశం (చోటు, స్పేస్) అసత్యమని చెప్పాలి. ఆకాశమే అసత్యమైతే, దానిలో వుండే, పృథివ్యాది పదార్థాలు సత్యమెలా అవుతాయి? కనుక నువ్వు చెప్పిన యుక్తి కుదరదు. అందువల్ల బ్రహ్మ ఒక్కటే సత్యం, అది అద్వితీయం.
**ముని**: ఐతే, ఈ ప్రపంచ పదార్థాలన్నీ ఎందుకు కనిపిస్తున్నాయి?
**వృద్ధముని**: భ్రాంతివల్ల! భ్రాంతి స్థిరపడ్డకొద్దీ, ఆ పదార్థాలన్నీ స్థూల పదార్థాలనే అనుభూతి కలుగుతూ వుంటుంది. భ్రాంతి మొదట్లో ఎలా ప్రారంభమైందో, అలాగే సాగిపోతూ వుంటుంది. సామాన్యంగా హిరణ్యగర్భుడి మొదటి భ్రాంతి ఏ సంకల్పాలు చేసిందో, అవి యిప్పటికీ అలాగే సాగిపోతూ వుంటాయి. ఎప్పుడో చాలా విశేష సందర్భాలలో తప్ప వాటిలో మార్పు వుండదు. అలాంటి హిరణ్యగర్భ సంకల్ప ఫలంగానే ఒకప్పుడు కొన్ని లక్షల మంది కలిసి ఒకే రకమైన పాప పుణ్యాలను చేయనూ వచ్చు, తత్ఫలితంగా ఒకే రకమైన సుఖదుఃఖాలను పొందనూ వచ్చు. వీటన్నిటినీ బట్టి నువ్వు గ్రహించవలసినదేమిటంటే, ఈ ప్రపంచం మొత్తం అసత్యమనీ, ఒక్క పరబ్రహ్మ సత్యమనీ, మాత్రమే ! (స. 149)
**ముని**: నాయనా! బోయవాడా! ఆ విధంగా అతిథిగా వచ్చిన ఆ వృద్ధముని నాకు రక రకాలుగా తత్త్వబోధ చేసేసరికి, నాకు పరిపూర్ణంగా తత్త్వజ్ఞానం కలిగింది. అప్పటినుంచి నేను మళ్ళీ మునిగా మారిపోయాను. ఆ వృద్ధముని నా మీద దయతో నా వద్దే వుండిపోయాడు. ఇదిగో ఈ ప్రక్క గదిలో పడుకున్నది ఆయనే, చూడు.

## 60. జాగ్రత్తు లాగానే స్వప్నం గూడా అసత్యం

**బోయవాడు**: స్వామీ! మీరు చెబుతున్నదంతా మీ శిష్యుడి హృదయంలోకి మీరు దూరినప్పుడు మీకు కలిగిన స్వప్నానుభవం గదా! అప్పుడు మీకు స్వప్నంలో కనిపించినవాడు యిప్పుడు ఇక్కడ జాగ్రద్దశలో మీ ఇంటిలో ఎలా వుంటున్నాడు? నా కెలా కనిపిస్తున్నాడు?
**ముని**: ఇది తెలియాలంటే నా అనుభవం ఇంకా కొంత నీకు తెలియాలి. ఆ విధంగా వృద్ధముని చేసిన బోధకు నేను సంతోషించి, ఆ విషయాలనే మరింత మననం చేసుకొని, చివరికి ఈ ప్రపంచమంతా భ్రాంతిమయమని, గురుశిష్యులనే భావం కూడా భ్రాంతిలో భాగమేనని, నిజంగా వున్నది ఒక్క పరబ్రహ్మమేననీ, రెండవది లేదు గనుక, విడిచిపెట్ట దగినది కూడా లేదనీ, నిశ్చయానికి వచ్చాను.

అలా కొంతకాలం తరువాత నేను ఆ వృద్ధమునితో నా నూతన అనుభవాలను పంచుకుంటూ మాటల మధ్యలో ఇలా అన్నాను.
**చిన్నముని**: మహర్షీ! నేను పూర్వం మునిగా వుండగా నా శరీరాన్ని పక్కనపెట్టి నా శిష్యుడి హృదయంలో ప్రవేశించాను గదా! ఇప్పుడు ఒక సారి మళ్లీ వెనక్కు వెళ్లి, ఆ నాటి నా పాత శరీరం ఎలా వుందో చూడాలనిపిస్తోంది. అనుమతించండి.
**వృద్ధముని**: ఇంకెక్కడి పాత శరీరమయ్యా? ఆ నాటి నీ శరీరమూ, నీ శిష్యుడి శరీరమూ, నీ ఆశ్రమమూ, అన్నీ ఎప్పుడో కాలి బూడిదైనాయి. కావాలంటే స్వయంగా నువ్వే చూసుకో!

వృద్ధముని ఆ విధంగా చెప్పేసరికి పూర్తిగా నమ్మబుద్ధి గాక, మనమే స్వయంగా చూసుకుందాంలే

అని, యోగధారణలోకి ప్రవేశించాను. అలా ప్రవేశిస్తూ ప్రవేశిస్తూ, “ఓ! మహర్షీ ! నేను మళ్ళీ తిరిగి వచ్చే దాకా తమరిక్కడే వుండాలి” అని మా గురువుగారికి మనవి చేశాను. ఆయన సరే ! అన్నాడు.

నేను వెంటనే యోగాగ్నిలోకి ప్రవేశించి, వాయుస్వరూపాన్ని ధరించి, ఆకాశమంతా వెతికాను పూర్వం నేను ఏ కంఠద్వారంలోంచి శిష్యహృదయంలోకి ప్రవేశించానో, ఆ ద్వారం నాకిప్పుడు కనపడనే లేదు. పోనీ, బైటికి పోయేందుకు మరోదారి ఏదైనా దొరుకుతుందేమో అనుకుంటే, అదీ దొరకలేదు.తిరగి తిరిగి అలసిపోయి, వెనక్కువచ్చి మళ్ళీ మా గురువుగారినే అడిగాను.

**చిన్నముని**: మహర్షీ! ఇదేమిటి? ఎంత వెదికినా, ఈ ప్రపంచంలోంచి ఆ ప్రపంచంలోకి పోయే మార్గమే దొరకదేమిటి?

**వృద్ధముని**: నాయనా! నువ్వు యిప్పుడు ఆ పాత శరీరాన్ని భౌతికంగా ప్రత్యక్షంగా చూడాలనుకుంటున్నావు. అది సాధ్యం గాదు. కావాలనుకుంటే, నీ యోగ నేత్రంతో చూడగలవు.

**చిన్నముని**: ఎందువల్ల?

**వృద్ధముని**: నువ్వు అవస్థాత్రయాన్ని పరిశీలిద్దామనే ఉద్దేశ్యంతో, పరకాయ ప్రవేశ విద్యను ఆశ్రయించి, నీ శిష్యుడి హృదయంలోకి ప్రవేశించి, రక రకాల పరిశీలనలు జరుపుతున్న తరుణంలో, బయట కారుచిచ్చులు క్రమ్మి, నీ ఆశ్రమమంతా కాలిపోయింది. అందులో భాగంగా, నీ శరీరమూ, నీ శిష్యుడి శరీరమూ, కాలి బూడిదైనాయి.

(స. 150)

అందువల్లే నీకు ఆ పాత దేహాల దగ్గరకు వెళ్ళేందుకు తగిన మార్గం ఇప్పుడు కనపడటం లేదు.

అల నాటి ఆ అనుభవ ప్రారంభదశలో నీకు అది అన్యదేహం. అందులోనూ స్వప్న దశ! కానీ, అభ్యాసబలంవల్ల అదే నీకు జాగ్రద్దశగా మారిపోయింది.

**తదేవ స్వప్న ఏవాయం**

**జాగ్రద్భావ ముపాగతః ။** (ని.ఉ.స. 151, శ్లో. 9)

ఈ దశలో నీకు మేము స్వప్న పురుషులం. మాకు నువ్వు స్వప్న పురుషుడివి. నిజంగా ఇక్కడ వున్నది చిదాకాశం మాత్రమే! అది తనలో తనే వుంది. కావాలంటే నువ్వు ధ్యానంలోకి వెళ్ళిచూడు. నీకే అర్థమౌతుంది

(స. 151)

**చిన్నముని**: నాయనా! బోయవాడా! అలా చెప్పి మా గురువుగారు ఆ రాత్రి హాయిగా నిద్రపోయారు. నాకు మాత్రం ఆ రాత్రి నిద్రపట్టలేదు. ఈ విషయాలను గూర్చి ఆలోచిస్తూ కూర్చున్నాను. తెల్లవారింది. మా గురువుగారు లేచి కూర్చున్నారు. వెంటనే నేను

**“ఏవం స్వప్నో విభో సర్వః**

**సద్రూప ఇతి మే మతిః ။** (ని.ఉ.స.152, శ్లో.2)

“మహర్షీ! ఆలోచించగా, ఆలోచించగా, స్వప్నం సత్యమేనేమో అనిపిస్తోంది.” – అన్నాను.

**వృద్ధముని**: నా మొహమల్లే వుంది. నువ్వేమి ఆలోచిస్తున్నావంటే, జాగ్రత్ప్రపంచానికీ, స్వప్న ప్రపంచానికీ, భేదమేమీ లేదు గనుక, ఐతే రెండూ సత్యాలు కావాలి, లేకపోతే రెండూ అసత్యాలు కావాలి. అంతే గానీ, వీటిలో ఒకటి సత్యమై, మరొకటి అసత్యం కావడానికి వీలు లేదు. ఐతే, లోకంలో ప్రతివాడూ స్వప్నం అసత్యమని నమ్మేస్తున్నాడు. దానిని ఆధారంగా చేసుకొని కొందరు శాస్త్రకారులు, జాగ్రత్తు కూడా అసత్యమేనని సిద్ధాంతీకరిస్తున్నారు. నువ్వు ఇప్పుడు రాత్రల్లా ఆలోచించి ఏమి తేల్చావంటే – లోకంలో ప్రతివాడూ జాగ్రత్తే సత్యమని గట్టిగా నమ్మేస్తున్నాడు కనుక, దీనిని బట్టి, స్వప్నం సత్యమేనని ఎందుకు చెప్పకూడదు?– అని. ఈ మాట కూడా నువ్వు నిశ్చయంగా చెప్పలేకపోతున్నావు. అందుకనే “అనిపిస్తోంది” అంటున్నావు.

నీ ఊగిసలాటకు కూడా తగిన కారణం వుంది. ఈ జాగ్రత్ ప్రపంచం సత్యమని ప్రతివాడు నమ్మేస్తున్న మాట నిజమే! కానీ, ఆ నమ్మకం వెనకాల బలమైన నిరూపణ ఏదైనా వుంటే, దానిమీద ఆధారపడి మనం ముందుకు సాగవచ్చు. సరిగ్గా ఆలోచిస్తే, స్వప్నంలో వున్నంతమాత్రపు సత్యత్వం కూడా జాగ్రత్తులో లేదు.

**చిన్నముని**: అదెలా?

**వృద్ధముని**: ఇది గూడా అర్థం కావడం లేదా? అందుకే నువ్వు బోయవాడికి గురువువి కాబోతున్నావు. అదలా వుంచు. అసలు విషయం చెబుతా , విను.

ఇక్కడ 'సత్యం' అంటే నీ ఉద్దేశ్యం ఏమిటి?

**చిన్నముని**: ఒక కార్యానికి వెనకాల సరియైన కారణంవుంటే అది సత్యం. కుండకు వెనకాల మట్టిముద్ద వుంది కనుక కుండ సత్యం. ముత్యపు చిప్ప మీద కనిపించే వెండిముద్ర దగ్గర ఇలాంటి కారణమేదీ కనిపించడం లేదు గనుక అది అసత్యం.

**వృద్ధముని**: ఆ దృష్టితో చూస్తే, స్వప్నానికి వెనకాల ఎంతో కొంత కారణం వుంది. జాగ్రత్ దశలో కలిగే అనుభవాలు సంస్కారాలుగా మారి. ఆ సంస్కారాలు స్వప్నదశలో నూతన పంచభూతాలను సృష్టిచేస్తున్నాయి. అందువల్ల స్వప్నంలోని పంచభూతాలకు వెనకాల, భౌతిక కారణాలు లేకపోయినా, సంస్కార రూపమైన సూక్ష్మకారణం ఏదో వుందని చెప్పుకోవచ్చు. ఆ విధంగా స్వప్నానికి ఎంతో కొంత సత్యత్వాన్ని సాధించవచ్చు. ఈ మాత్రపు సౌభాగ్యం గూడా జాగ్రద్దశకు లేదు.

**చిన్నముని**: అదేమిటి?

**వృద్ధముని**: జాగ్రద్దశలో కలిగే పంచభూతాలకు కారణాలేమిటో ఊహించు.

**చిన్నముని**: భూమికి నీరు కారణం అంటాను. నీటికి నిప్పు కారణం అంటాను. నిప్పుకు గాలి కారణం అంటాను. గాలికి ఆకాశం కారణం అంటాను.

**వృద్ధముని**: మొత్తం మీద జాగ్రత్ పదార్థాలన్నీ ఆకాశంలోంచి రాలి పడుతున్నాయని తేల్చావు. ఇక వాటికి సత్యత్వం ఎక్కడి నుండి తెస్తావ్?

**చిన్నముని**: పూర్వ కల్పంలోని జీవుల సంస్కారాలే ఇప్పటి ఈ కల్ప పదార్థాలకు కారణం అనవచ్చు గదా!

**వృద్ధముని**: అలా అన్నా గూడా ఇప్పటి ఈ జాగ్రత్ పదార్థాల వెనకాల, సరియైన భౌతిక కారణం లేదని ఒప్పుకున్నట్టే అవుతుంది. అదీ గాక, పూర్వ సంస్కారాలు కొంచెంసేపు నిలబడ్డాయంటే బాగుంటుంది కానీ, ఎక్కువ సేపు నిలబడి వున్నాయంటే బాగుండదు. క్రిందటి ప్రళయం తరువాత మళ్ళీ ఒక కల్పకాలం ఆగితే గాని, సృష్టి మొదలు కాదని శాస్త్రాలు చెబుతున్నాయి. అంత దీర్ఘకాలం పాటు పాత సంస్కారాలు యథాతథంగా నిలబడి వున్నాయనడం యుక్తియుక్తం కాదు. కనుక స్వప్నానికి మిగిలినంత మాత్రపు సత్యత్వం కూడా జాగ్రత్తుకు మిగలదు. అందువల్లనే తత్త్వవేత్తలు జాగ్రత్తు అసత్యమనీ, దానిని బట్టి స్వప్నం కూడా అసత్యమనీ, నిర్ణయిస్తున్నారు. అంతే గానీ, స్వప్నాన్ని బట్టి జాగ్రత్తు అసత్యమనడం లేదు.

స్వప్న దశలో వున్నవాడు, స్వప్నం సత్యమనే నమ్ముతాడు. వాడికి సందేహం వుండదు. నువ్వు స్వప్నంలోంచి ధ్యానంలోకి వెళ్ళి, ఏదేదో వెతుక్కొని, మళ్ళీ వెనక్కు వచ్చి, "స్వప్నం సత్యమేనేమో" – అని సందేహం వ్యక్తం చేస్తావేమిటి? నువ్వు ధ్యానంలో వుండి మాట్లాడుతున్నావా? స్వప్నంలో వుండి మాట్లాడుతున్నావా? యుక్తిలో వుండి మాట్లాడుతున్నావా? ఎటు చూసినా నీ ఆలోచన సరి గాదు.

## 61. చిన్నముని భవిష్యత్కథ

**చిన్నముని**: స్వామీ! మీరు చెప్పింది బాగానే వుంది. అది సరే కానీయండి. నన్ను బోయగురువు అంటున్నారేమిటి? అది కేవలం నన్ను ఎత్తి పొడవడానికేనా? వేరే ఏదైనా అంతరార్థం వుందా?

**వృద్ధముని**: ఎత్తిపొడుపు గాదయ్యా! జరగబోయే విషయాన్నే చెబుతున్నాను. ఏమిటంటే, నువ్వు ఒకప్పుడు మునివి. ఇప్పుడు ఇక్కడ గృహస్థుగా వున్నావు. నీకు నేను అతిథిగా వచ్చా. నీకూ నాకూ స్నేహం పెరిగింది. ఆ స్నేహంవల్ల నువ్వు నన్ను ఇక్కడే వుండమని కోరుతున్నావు గదా! నేను నీ మాట మన్నించి ఇక్కడే వుండిపోతాను. నువ్వు నా సాన్నిధ్యంలో మళ్లీ యోగసాధన మొదలు పెడతావు. అలా కొంత కాలం గడిచాక, ఇక్కడ గొప్ప కరువు వస్తుంది. దాంతో ఈ ప్రాంతాలలో వుండే నీ బంధువులు చాలా మంది నశించిపోతారు. ఇంతలో ఇక్కడి రాజులకు యుద్ధం వస్తుంది. ఆ కల్లోలాన్ని తట్టుకోలేక మిగిలిన గ్రామ ప్రజలు పారిపోతారు.

అప్పటికి నీకు గూడా వైరాగ్యం ధృఢంగా కుదురుకొని వుంటుంది కనుక, మనం మాత్రం ఏమీ కలత చెందకుండా ఈ దగ్గరలోనే ఒక అడవిలో నివాసం కొనసాగిస్తాం.

కొంత కాలానికి ఆ ప్రాంతం అంతా పెద్ద కీకారణ్యం ఐపోయింది. (స.152)

చాలా మృగాలూ, కొంత మంది బోయవాళ్ళు, అక్కడ చేరతారు. వాళ్ళలో ఒక బోయవాడికీ, నీకూ, స్నేహం పెరుగుతుంది. నువ్వు వాడికి అనేక విషయాలు బోధించడం మొదలు పెడతావు. వాడు ఒకప్పుడు నిన్ను స్వప్నం అంటే ఏమిటని అడుగుతాడు. దాన్ని ఆధారంగా చేసుకొని, నువ్వు వాడికి ఆత్మతత్త్వం అంతా ఉపదేశం చేస్తావు. ఆ విధంగా నువ్వు బోయవాడికి గురువు కాబోతున్నావు. అప్పటికి నేను నీ పక్కనే వుంటాను. ఇది జరగబోతోంది. ఈ విషయం నాకు యోగబలంవల్ల ముందే తెలుసు. అందుకే నిన్ను "బోయవాడికి గురువువి" అన్నాను.

**చిన్నముని**: నాయనా! బోయవాడా! ఆయన మాటలు విని నేను ఆశ్చర్యపోయాను. ఆ రాత్రి మళ్ళీ నా గురించి నేను ఆలోచించుకున్నాను. ఈ చుట్టూతా చాలా కనిపిస్తున్నాయి. కొండలూ, నదులూ, దిక్కులూ, ఇలా ఎన్నో! ఇవన్నీ గాక, నేనొకడిని కనిపిస్తున్నాను. నేనెవరిని? నేను నేలనా? నీటినా? నిప్పునా? గాలినా? నింగినా? అసలీ పంభూతాలెవరు?నిజంగా చూస్తే, పంచభూతాలనేవే లేవు.

**నేమే ఉద్రయో న చేయం భూః**
**నేదం ఖం నాయమప్యహమ్ ।**
**చిన్మాత్ర వ్యోమ కచనం**
**ఇదమాభాతి కేవలమ్ ॥** (ని.ఉ.స. 153, శ్లో. 16)

ఇవి కొండలు కావు. ఇది భూమి కాదు. ఇది ఆకాశం కాదు. ఈ నేను నేను కాదు. ఇదంతా ఒక చిదాకాశంయొక్క ప్రకాశం మాత్రమే! ఆకాశాన్నిమించిన ఆకాశం వంటి ఆ చిన్మాత్రమే ఇలా ప్రకాశిస్తోంది.

అది ఇలా ఎందుకు కనిపించాలి. భ్రాంతివల్ల! ఆ భ్రాంతికి కారణం ఏమిటి? దానికి అసలు కారణం వున్నదా?

నేను ఎవడి హృదయంలోకి ప్రవేశించి ఏదేది అన్వేషించాలని ప్రయత్నించానో ఆ నా శిష్యుడు కాలి బూడిదైపోయాడు. నేను గూడా కాలి బూడిదైపోయాను. ఐనా ఇప్పుడు నేను ఉన్నాను! ఆలోచిస్తున్నాను!!

**తస్మాదిదమనాద్యన్తం**
**చిదాభామాత్ర మంబరమ్॥** (ని.ఉ.స. 153, శ్లో. 20)

కనుక వాడి దేహమూ అసత్యమే, నా దేహమూ అసత్యమే! అందుకే ఈ కనిపించేదంతా చైతన్యంయొక్క

ఆభాస మాత్రమే. వట్టి ఆకాశం వంటిదే! దీనికి ఆదీ లేదూ, అంతమూ లేదు. కర్తా లేదు, కర్మా లేదు, ఉపకరణమూ లేదు. ఇంతకూ ఈ భాసకు కారణం ఏమిటి? సమాధానం దొరకడం లేదు.

ఔను. దొరకదు. ఎందుకంటే ఇదంతా చిన్మాత్రంయొక్క ప్రకాశం అనుకోవడం నా పొరపాటు. చిన్మాత్రానికి ప్రకాశం అంటూ వేరేమీ లేదు. ప్రకాశమే చిన్మాత్రం.

**నాపి చిన్మాత్ర కచనం**

**చిన్మాత్రం వ్యోమ కేవలమ్ ॥** (ని.ఉ.స. 153, శ్లో.22)

ఆ చిన్మాత్రమే శుద్ధమైన ఆకాశం. అదే ఈ ప్రపంచం!

నాయనా! బోయవాడా! ఆ రాత్రి నాకు ఆలోచనలు అలా సాగాయి. తెల్లవారేసరికి నా మనస్సు తెటపడింది. నేను కర్తనూ, భోక్తనూ, కాదనే విషయం స్థిరపడింది. అప్పటినుంచి ఇప్పటి దాకా, మా గురువుగారూ, నేనూ, అదే అనుభవంతో ఇక్కడ వుండిపోయాం. ఆ తరువాత సంఘటనలన్నీ ఆయన చెప్పినట్టే జరిగాయి. నువ్వు నాకు శిష్యుడివయ్యావు.

***బోయవాడు***: ఐతే స్వామీ! మీరు చెప్పేది ఏమిటంటే, ఇదంతా స్వప్నమని! అంతేనా? మీరు ఎలాగూ దేహాన్ని విడిచిన స్వప్న పురుషులే గదా! నన్నూ ఆ కోవలోకే చేర్చేస్తున్నారు. శాస్త్రాలు చెప్పే దేవతల్ని, ఆ కోవలోకే చేర్చేస్తున్నారు. అందరూ ఒకరికొకరు స్వప్న పురుషులంటున్నారు. ఇది ఇంతేనంటారా? వీరంతా సదసన్మయులే నంటారా? (ఉన్నా కూడా లేనివారికిందే లెక్కేనంటారా?)

***చిన్నముని***: నాయనా! ఇది అంతే! దీంట్లో సందేహం లేదు. వెనక వున్న తర్కాన్ని చెప్పాను. మా గూరుశిష్యుల అనుభవాన్నీ చెప్పాను. ఐనా నీకీ జగత్తు సత్యం అనే భ్రాంతి పోవడం లేదు. గురుసేవ, శాస్త్రాభ్యాసం, సాధనాభ్యాసం – ఈ మూడూ లేనిదే, తత్త్వజ్ఞానం మనస్సులోకి ఎక్కదు. నువ్వు తెలివిగలవాడివి. ఆలోచించుకో. నువ్వే నిర్ణయించుకో.

**గమనిక** – శ్రీరామ సభలో వశిష్ఠ సన్నిధానంలో జీవన్ముక్తి నందుకున్న విపశ్చిద్రాజు తన అనుభవాలను ఆ మహాసభకు వినిపిస్తున్న సందర్భంలో ఈ శవోపాఖ్యానం ప్రారంభమైంది. అందులో ఆకాశంనుంచి పెద్దశవం కిందకు పడుతూ వుండగా, దానికింద పడి నలిగి పోబోయిన విపశ్చిద్రాజు అగ్ని దేవుణ్ణి గురించి ప్రార్థనచేసి, 'ఈ శవం ఎందుకిలా పడుతోంది?" అని ప్రశ్నించాడు. దానికి సమాధానంగా అగ్నిదేవుడు ఈ బోయవాడి కథను విపశ్చిద్రాజుకు చెబుతున్నాడు. అందులో భాగంగా, ఇద్దరు మునులు, ఒక బోయవాడు, వాళ్ల సంభాషణా, ఇప్పటి దాకా జరిగాయి. ఇక పై కథాభాగాన్ని అగ్నిదేవుడి మాటగా కవి కొనసాగిస్తున్నాడు.) (స. 154)

## 62. బోయవాడి భవిష్యత్కథ

***అగ్నిదేవుడు***: విపశ్చిద్రాజా! తన గురువుగారైన ఆ ముని అంత నిశ్చయంగా ఆ మాటలు చెప్పేసరికి, ఆ బోయవాడు కాదనలేకపోయాడు. కానీ, ఇంత స్పష్టంగా కనిపించే ఈ ప్రపంచం అసలే లేదు పొమ్మనడాన్ని కూడా జీర్ణించుకోలేక పోయాడు. చాలా ఆలోచించాడు. పరబ్రహ్మకు, అనగా శుద్ధ చైతన్యానికి, 'అవిద్య' అనే ఒక శక్తి వుందనీ, ఆ శక్తిచేత ఈ ప్రపంచం సృష్టింపబడిందనీ, అందుచేత ఈ ప్రపంచం సత్యమనడమే సముచితమనీ, అతను ఆలోచించసాగాడు.

ఐతే, ఈ ప్రపంచం ఎక్కడి దాకా వుంది? దీనిని దాటిపోతే ఏముంది? అనే ప్రశ్నలు అతని గొంతులో వెలక్కాయల లాగా పడ్డాయి.

ఈ విషయాలను తర్కంతో గాక, తను స్వయంగా వెళ్ళి చూసుకోవడం మంచిదనిపించింది. కనుక, గొప్ప తపస్సు చేసి, ఆ తపోబలంవల్ల

**తస్మాదాకాశమప్యస్తి**

**యత్ర నో తత్ర యామ్యహమ్॥** (ని.ఉ.స. 155, శ్లో.7)

ఎక్కడైతే ఆకాశం గూడా వుండదో అక్కడికి స్వయంగా వెళ్ళి చూస్తాను – అని అతను నిశ్చయించుకున్నాడు.

ఆ పట్టుదలతోనే అతను తపస్సు ప్రారంభించాడు. దానికోసం కొత్త కొత్త తాపసులతో స్నేహాలు చేశాడు. తన తపోబలంతో తన ఆయుష్యం పెంచుకొని, వేలకు వేలు సంవత్సరాలు తపస్సు కొనసాగించాడు. దానికోసం అనేక తపోవనాలు తిరిగాడు.

ఆ తిరగటంలో ఒక సారి తన పాత గురువుగారి దగ్గరికే వచ్చాడు. ఆయనను చూసే సరికి ఒక్క సారి కడుపు దేవినట్టై – "స్వామీ ! మీరు పరమ ప్రశాంతంగా వున్నారు. ఇలాంటి ప్రశాంతత నాకు ఎప్పుడు లభిస్తుందో గదా?" – అన్నాడు.

దానికి ఆ గురువు జాలిపడి ఇలా చెప్పాడు –

"నేను చెప్పాల్సినదంతా ఇదివరకే చెప్పాను. కానీ నీకు సదభ్యాసం లేనందువల్ల అది నీ హృదయానికి పట్టలేదు. అది చాలక అవిద్యయొక్క పరిమాణం ఎంతో తెలుసుకుందామని తపస్సు మొదలు పెట్టావు. వేల సంవత్సరాలు తపస్సు చేశావు. ఇది చాలదు. కానీ, నీ పట్టుదల గొప్పది. ఈ తపస్సును ఇలాగే కొనసాగిస్తావు. ఐతే, నన్ను అడిగావు గనుక, నీ మీద ప్రేమతో, నీకేం జరుగబోతోందో, యోగ దృష్టితో చూసి ముందే చెప్పేస్తాను. నీ భవిష్యత్తును వినడంవలన నీలో సత్త్వగుణం పెరుగుతుందనే ఆశతో ఈ పని చేస్తున్నాను. నీకు జరగబోయే భవిష్యత్ చరిత్రను జాగ్రత్తగా విను.

బోయవాడా! నీ మొండి పట్టుదలతో నీ తపస్సును ఇలా నూరు యుగాలు కొనసాగిస్తావు. అప్పుడు బ్రహ్మదేవుడు ప్రత్యక్షమౌతాడు. అప్పుడు మీ ఇద్దరికీ ఇలా సంభాషణ జరుగుతుంది.

***బ్రహ్మదేవుడు***: వత్సా! ఏం కావాలో కోరుకో!

***బోయవాడు***: దేవదేవా! బ్రహ్మదేవా! ఆత్మతత్త్వం గురించి చాలా విన్నాను. పరబ్రహ్మ అద్దం లాంటివాడని అర్థం చేసుకున్నాను. అద్దంలో ప్రతిబింబం లాగా ఆయనలో ఈ ప్రపంచం కనిపిస్తోంది. ఐతే, అద్దం పెద్దదై వున్నప్పుడు దానిలో ప్రతిబింబంలేని ప్రదేశం కొంత మిగిలి వుండాలి. అలాంటి ప్రతిబింబ స్పర్శలేని, అనగా అవిద్యా స్పర్శలేని, పరబ్రహ్మ స్వరూపం ఎక్కడ వుంటుందో, అక్కడికి నేను స్వయంగా వెళ్లాలని కోరుకుంటున్నాను. దానికోసం ఈ నా శరీరం క్షణానికో యోజనంగా పెరుగు గాక! అలా పెరిగి పెరిగి నేననుకున్న చోటికి నేను చేరాక, నేను కోరుకున్నప్పుడు నాకు మరణం లభించుగాక!

***బ్రహ్మదేవుడు***: తథాస్తు!

***చిన్నముని***: ఆ విధంగా బ్రహ్మదేవుడి వరం పొందిన నువ్వు గరుత్మంతుడి లాగా ఆకాశంలోకి ఎగిరిపోతావు. నువ్వు వెళుతున్నకొద్దీ నీ శరీరం పెరిగిపోగలదు. అలా నువ్వు ఆకాశంలో వేల వేల సంవత్సరాలు ఎగురుతూ ముందుకు పోతావు. నీ శరీరం కోట్ల కోట్ల యోజనాలు పెరిగిపోతూ వుండగలదు.

అలా ఎగిరి ఎగిరి, ఎన్నాల్టికీ అంతుదొరకక, విసుగుపుట్టి, ఒకసారి వెనకకు చూసుకుంటావు. అలా చూసే సరికి కోట్ల కోట్ల యోజనాల వైశాల్యంవున్న నీ శరీరం నీకు కనిపిస్తుంది. నీ శరీరాన్ని చూసి నీకే భయం వేస్తుంది. అప్పుడు నువ్వు ఇలా అనుకుంటావు–

**అవిద్యా బత ఘోరేయ**

**మనన్తా చ ప్రమీయతే ।**

**మీయతే న చ కేనాపి**

**బ్రహ్మజ్ఞానం సమం వినా ॥** (ని. ఉ. స. 155, శ్లో. 43)

"అయ్యయ్యో! ఈ అవిద్య మహా ఘోరం. దీనికి అంతులేదు. దీనిని ఎవడూ కొలవలేడు. సర్వ సమమైన బ్రహ్మజ్ఞానం తప్ప మరొకటి ఏదీ దీనిని దాటలేదు.

"అలాంటి బ్రహ్మజ్ఞానం కలగాలంటే సజ్జన సాంగత్యం చేయాలి. సత్ శాస్త్రాభ్యాసం చేయాలి. ఆ రెంటికీ ఈ దేహం పనికి రాదు. దీనిని ఇప్పుడే విడిచేస్తాను"– అని.

ఈ ఆలోచన రాగానే నువ్వు బ్రహ్మదేవుడిచ్చిన రెండవ వరంయొక్క బలంతో, రేచక ప్రాణాయామ విధానం ద్వారా, నీ శరీరాన్ని వదిలేస్తావు.

తక్షణమే ఆకాశమంతా వ్యాపించి వున్న ఆ శరీరం, కొండల గుంపు క్రింద పడినట్లుగా కింద పడిపోతుంది. నీ జీవుడు మాత్రం ఆకాశంలో వుండి పోతాడు.

నీ దేహం భూమిమీద పడడంవల్ల భూమి మీద వున్న పట్టణాలు, కొండలూ, మొదలైనవన్నీ పిండిపిండైపోతాయి.

అప్పుడు కాళరాత్రిదేవి మాతృగణాలతో సహా వచ్చి, నీ దేహాన్ని భక్షించి వేస్తుంది. దానివల్ల భూమిమీద ప్రాణులు మళ్లీ క్రమక్రమంగా మొలకెత్తుకు రాగలరు.

నాయనా! నీ మహా తపస్సువల్ల రాబోయే వింతఫలం ఇది!

***బోయవాడు***: స్వామీ! ఇదేం తపస్సు! ఇదేం ఫలం! నేనింత తపస్సు చేసేది యిలాంటి దుఃఖం కోసమా? దీనిని తప్పించుకొనే ఉపాయం ఏదైనా వుంటే చెప్పండి.

***చిన్నముని***: నాయనా! కాళ్ళూ వేళ్లూ తెరుచుకోవచ్చు, ముడుచుకోవచ్చు. అంతే గానీ పొట్టివాడిని పొడుగ్గా చేయలేం, పొడుగువాడిని పొట్టివాడిగా చేయలేం.

**జ్యోతిశ్శాస్త్రార్థ విజ్ఞానై**

**రిహ భావ్యర్థ వేదనమ్ ।**

**భవత్యన్యదపూర్వం తు**

**న కించన కదాచన ॥** (ని.ఉ.స.155, శ్లో. 55)

జ్యోతిష శాస్త్రంవల్ల జరగబోయేది తెలుసుకోవచ్చు. కానీ దాన్ని మార్చలేం. అది అలాగే జరుగుతుంది.

దీనికి ఒక్కటే మినహాయింపు. బ్రహ్మతత్త్వజ్ఞానాన్ని సంపాదించిన మహాత్ములు మాత్రం కర్మలన్నిటిని దాటి వెళ్ళిపోతారు గనుక, పాత కర్మలవల్ల వచ్చే దుఃఖాలు వాళ్ళకంటవు.

***బోయవాడు***: స్వామీ! ఆకాశమంతవున్న నా శరీరం రాలి కిందపడిపోయినా నేనక్కడే ఆకాశంలో వుంటానని చెప్పారు గదా! ఆ తరువాత నాకేం జరుగుతుంది?

***ముని***: ఆ దేహం అలా పడిపోగా, ఆ జీవుడు మాత్రం ప్రాణంతో సహా అవ్యాకృత ఆకాశంలోకి వెళ్ళిపోతాడు. (అవ్యాకృతాకాశం అంటే సూక్ష్మ పంచభూతాలలోని ఆకాశం.) విశాలమైన ఆకాశంలో చిన్న గాలి రేణువు లాగా వుంటుంది వాడి పరిస్థితి. ఆ చిన్న రేణువులోనే ప్రాణమూ, చిత్తమూ గూడా ఒదిగి వుంటాయి. అలాంటి ఆ చిత్తంలో ఆ జీవుడికి, తన పూర్వ వాసనల బలంవల్ల ఒక భూప్రదేశమూ, దాని చుట్టూతా పెద్ద ప్రపంచమూ, కనిపిస్తాయి– కలలో కొత్త ప్రపంచం కనిపించినట్టు. వాసనల బలంవల్లే , ఆ జీవుడికి ఈ ప్రపంచం నాదనీ, ఇందులో ఈ భూమండలానికి తనే రాజుననీ, ఒక వెఱ్ఱి ఆవేశం కలుగుతుంది. వాడు అక్కడితో ఆగడు. తన పేరు 'సింధువు' అనీ, తను చక్రవర్తిననీ, తన కింద చాలా మంది సామంతులున్నారనీ, అనుకుంటాడు. అప్పటికీ ఆగడు. తన ఎనిమిదవ సంవత్సరంలో తన తండ్రి గతించాడనీ, తను ఆ చిన్ని

వయస్సులోనే సింహాసనం ఎక్కేశాననీ, తన రాజ్య సరిహద్దులలో విదూరథుడనే బలవంతుడైన రాజు తనకు శత్రువుగా వున్నాడనీ, వాడితో యుద్ధం తప్పదనీ కూడా అనుకుంటాడు.

అతను అనుకున్నవన్నీ కనిపిస్తూనే వుంటాయి. ఆ కనిపించడంలో సింధురాజుకు వందేళ్ళు వస్తాయి. విధూరథుడితో యుద్ధం జరుగుతుంది. విదూరథుణ్ణి సింధురాజు సంహరించేస్తాడు.

**గమనిక** – ఈ కథంతా ఉత్పత్తి ప్రకరణంలో లీలోపాఖ్యానంలో విదూరథుడి దృక్కోణంనుంచి చెప్పిన కథే! అక్కడ సింధురాజు గురించి పెద్దగా వివరాలు చెప్పలేదు. ఇప్పుడు ఆ కథను భవిష్యత్ కథగా తీసుకొచ్చి, సింధురాజు దృక్కోణంనుంచి వివరిస్తున్నారని మనం గమనిస్తూ పై కథలోకి వెళదాం.

## 63. సింధురాజుకు మంత్రిబోధ

**ముని**: నాయనా! బోయవాడా! ఆ విధంగా యుద్ధంలో గెలిచిన సింధురాజును అభినందించడానికి మంత్రులంతా దగ్గరికొస్తారు. వారిలో మహర్షితుల్యుడైన మంత్రి ఒకడుంటాడు. ఆ మంత్రికీ సింధురాజుకూ మధ్య సంభాషణ ఇలా సాగ గలదు–

**మంత్రి**: రాజా! మీరు యుద్ధంలో విదూరథుణ్ణి గెలవడం నిజంగా ఆశ్చర్యమండీ!

**సింధురాజు**: ఇందులో ఆశ్చర్యమేమున్నది? నా బలంముందు వాడెంత?

**మంత్రి**: రాజా! విదూరథుడికి 'లీలా' అని ఒక భార్య వుంది. ఆమె మహర్షివంటిది. ఆమెకు సరస్వతీదేవి నిత్య ప్రత్యక్షురాలు. ఆ దేవి తలచుకుంటే, మనమెంత? మన రాజ్యమెంత? ఐనా సరే మీరే గెలిచారు. అదీ ఆశ్చర్యం!

**సింధురాజు**: ఆ మాట నేనూ విన్నాను. మీరు చెప్పింది నిజమే! సరస్వతీదేవి వాళ్ళను యుద్ధంలో ఎందుకు ఆదుకోలేదో!

**మంత్రి**: రాజా! ఆ విదూరథుడు సరస్వతీదేవిని మోక్షం కావాలని ప్రార్థించాడే గాని, మరో కోరికతో ఉపాసన చేయలేదు. అందుకే అతనికి మోక్షమే దక్కింది.

**సింధురాజు**: సరస్వతీదేవిని నేనూ ఉపాసన చేస్తూ వున్నాను గదా! నాకెందుకు మోక్షం రాలేదు?

**మంత్రి**: మీరా దేవిని ఎప్పుడైనా మోక్షం కోసం ప్రార్థించారా? లేదే! ఎప్పుడు చూసినా శత్రుసంహారం కోసమే దేవతోపాసన చేశారు. అందుకే మీకు ఆ వరమే లభించింది.

**సింధురాజు**: నిజమే మంత్రీ! ఈ విషయంలో మరణించినా గూడా విదూరథుడే గెలిచినట్టు లెక్క! ఔను గానీ, సరస్వతీ దేవి అంటే బుద్ధి ప్రదాత్రి గదా! ఆ తల్లి అతనికి మోక్షకాంక్ష కలిగించింది. నాకెందుకు కలిగించలేదో!

**మంత్రి**: రాజా! దేవతలు ఎప్పుడూ స్వతంత్రించి ఫలితాలివ్వరు. భక్తుల చిత్తవృత్తిని అనుసరించి ఇస్తారు. అది వాళ్ళ నియమం. మీ చిత్తంలో సంహార తత్పరమైన అనుభవ సంస్కారం వుంది. అందుకే మీ మనస్సు ముక్తివైపుకు పోలేదు. (స.156)

**సింధురాజు**: మంత్రీ! పూర్వ జన్మలో నేనెవరిని? ఈ క్రూర సంస్కారం నా కెలా పట్టింది?

**మంత్రి**: రాజా! అది దేవ రహస్యం! ఐనా మీరు అడిగారు గనుక చెబుతాను. దానివల్ల మీకు క్షేమం కలుగ గలుదు.

రాజా! ఈ సృష్టిలో పుట్టే జీవులను పెద్దలు పంన్నెండ్రు రకాలుగా విభాగం చేశారు. వాటిలో 'తామసతామసము' అనే జాతి ఒకటి వుంది. మీరు క్రిందటి జన్మలో ఆ జాతిలో పుట్టారు.

**గమనిక** – ఉత్పత్తి ప్రకరణంలో 93వ సర్గలో 'ఉపాధులలో రకాలు' అనే శీర్షిక క్రింద వశిష్ఠ మహర్షి

జీవోసాధులను మొత్తం పద్నాలుగు రకాలు చెప్పి, వాటిలో రెండు విభాగాలను పునరుక్తులుగా చూపించి, చివరికి పండ్రెండ్రు రకాలుగా తేల్చి చెప్పాడు. వాటినే ఇక్కడ ప్రస్తావించి మళ్ళీ వివరించాడు. కనుక మనం ఆ విషయాలను సంగ్రహించుకొని ముందుకు వెళదాం.

**సింధురాజు**: మంత్రివర్యా! ఒక జాతి మొత్తాన్నీ తామసతామసం అనేస్తున్నారే మీరు. ఇలాంటి పేర్లు పెట్టిన వారెవరు?

**మంత్రి**: ఎవరో మధ్యవాళ్లు పేర్లు పెడితే, అవి సార్థకమైన పేర్లు కాజాలవు. ఈ సృష్టి మొత్తానికి మూల కారణమైన హిరణ్యగర్భుడియొక్క సృష్టి సంకల్పంలో అంతర్భాగంగా, 'ఈ జాతి ఇలా రూపొందాలి,' అనే నియతి ఏర్పడింది. దానివల్లే తామసతామస జాతి గూడా ఆవిర్భవించింది. నీ గడిచిన జన్మలలో ఒక జన్మ ఆ జాతిలో జరిగింది.

**సింధురాజు**: అనేక జన్మలా?

**మంత్రి**: ఔను! చిత్రచిత్రమైన జన్మలెన్నో గడిచాయి నీకు! అవన్నీ నాకు తెలుసు. నీకు తెలియవు! ఆ వరుసలోనే ఒకసారి బోయవాడివిగా పుట్టావు. చాలా క్రూరంగా జీవించావు. దాని ఫలితంగానే నీకిప్పటికీ మోక్షకాంక్ష కలగడం లేదు.

**సింధురాజు**: ఆర్యా! ఆ పాడు సంస్కారాలన్నీ ప్రక్షాళన చేసుకునే ఉపాయమే లేదా?

**మంత్రి**: రాజా! విసుగు లేకుండా కృషి చేసే మనిషికి లభించని పదార్థం ఈ ముల్లోకాలలోనూ ఏదీ లేనే లేదు! ఎవడు దేనిని కోరుతాడో, వాడు దానికోసమే కృషి చేస్తాడు. ఆ కృషిని మధ్యలో ఆపకపోతే, దానిని పొంది తీరుతాడు. సత్కర్మానుష్ఠానంతో నీ పూర్వ దుస్సంస్కారాన్ని నువ్వు పోగొట్టుకోగలవు.

**ముని**: ఈ చర్చల వరుసలో ఆ మంత్రి సింధురాజుకు చాలా తత్త్వబోధ కూడా చేస్తాడు. దానివల్ల సింధురాజు పవిత్రుడై అప్పటికప్పుడే తన రాజ్యాన్ని కొడుకులకు అప్పచెప్పి, అడవులకు వెళ్ళిపోయి, తీవ్రమైన ఆత్మ విచారం ఆరంభించ గలడు. తత్ఫలితంగా మోక్షాన్ని గూడా పొందగలడు. (స.157)

**గమనిక** – విపశ్చిద్రాజుకి ఆకాశం నుంచి రాలిపడిన శవంయొక్క వృత్తాంతాన్ని వినిపిస్తున్న అగ్నిదేవుడు, ఆ కథలో భాగంగా బోయవాడికీ, మునికీ మధ్య జరిగిన సంవాదాన్నీ; అందులో అంతర్భాగంగా సింధురాజుకీ, మంత్రికీ మధ్య జరిగిన సంవాదాన్నీ, వివరించి ఇక ఆ పై కథను ఇలా కొనసాగిస్తున్నాడు.

**అగ్నిదేవుడు**: విపశ్చిద్రాజా! ఈ నాటి తన దుస్సంస్కారం అన్ని యుగాల దాకా తనను పట్టి పీడించబోతోందని తెలుసుకున్న, ఆ బోయవాడు అవాక్కైపోయాడు. ఇక గురుశిష్యులిద్దరూ కొంచెం సేపు మౌనంగా వుండిపోయారు. ఆ తరువాత ఇద్దరూ లేచి స్నానాలకు వెళ్ళిపోయారు. మళ్ళీ ఇద్దరూ ఆశ్రమానికి తిరిగి వచ్చారు. బోయవాడికి మనస్సు కొంచెం తేలిక పడింది. ఆ తరువాత గురుశిష్యులిద్దరూ మళ్లీ వేదాంత చర్చలో పడిపోయారు. అలా ఎక్కువ రోజులు సాగలేదు. త్వరలోనే గురువైన ముని విదేహముక్తిని పొందాడు. బోయవాడు తన తపస్సులో తను మునిగిపోయాడు.

ఆశ్చర్యమేమిటంటే, ఆ తరువాత సంఘటనలన్నీ ముని చెప్పినట్టుగానే జరిగాయి. బోయవాడికి అన్నీ ముందుగానే తెలిసి కూడా దేన్నీ మార్చలేకపోయాడు.

ఇదంతా ఈ సృష్టిలో వున్న అనంతకోటి బ్రహ్మాండాలలో ఒక దాంట్లో జరిగింది. అక్కడే ఆ శవం రాలి పడింది. అక్కడ వుండే భూమిమీద ఈ శవంలోని కొవ్వు చాలా కాలం పేరుకుపోయి క్రమంగా మట్టిలో కలిసిపోయింది. అందుకే ఆ భూమికి "మేదిని" అనే పేరు వచ్చింది. 'మేదిని' అంటే మేధస్సు (లేక కొవ్వు) కలది.

ఇదంతా ఎక్కడ జరిగిందో ఆ జగత్తు మొత్తం నీకు సత్యంగా కనిపిస్తోంది. మాకు స్వప్నపురం లాగా కనిపిస్తోంది. అదీ భేదం. (స.158)

రాజా! సరే! జరిగిందేదో జరిగింది. నీ దృష్టి నీది, నా దృష్టి నాది. స్వర్గ లోకంలో దేవేంద్రుడు నూరవ యజ్ఞం చేస్తున్నాడు. అక్కడికి నన్ను రమ్మని మంత్రులతో కబురుచేస్తున్నాడు. నేను వెళ్ళాలి. నువ్వు గూడా నీ ప్రయత్నంలో ముందుకు సాగు. నీకు తోచిన దిక్కు వెంట ప్రయాణం సాగించు.

**గమనిక** –అగ్నిదేవుడికీ, తనకూ మధ్య జరిగిన కథా ప్రసంగాన్ని శ్రీరామ సభలో వినిపిస్తున్న విపశ్చిద్రాజు ఇక పై కథను తన మాటల్లోనే కొనసాగిస్తున్నాడు.

## 64 విపశ్చిద్రాజుకు లేడి జన్మ

***విపశ్చిద్రాజ***: అగ్నిదేవుడు ఆ విధంగా చెప్పి వెంటనే అంతర్థాన మయ్యాడు. నా పాత సంస్కారాలబలంవల్ల నాకు దిగంతాలవరకూ వెతుక్కుంటూ వెళ్ళాలని, అవిద్యయొక్క అంతం ప్రత్యక్షంగా చూడాలని, మళ్లీ పెరపెరలాడింది. మళ్ళీ తిరగడం మొదలుపెట్టాను. మళ్లీ రకరకాల ప్రపంచాలు కనిపించాయి. ఐనా నాకు అవిద్యయొక్క అంతం కనిపించలేదు.

ఇలా తిరుగుతూ వుండగా వుండగా, ఒక ప్రపంచం దగ్గరికి వచ్చేసరికి నాకు తెగ విసుగు పుట్టింది. ఇక తిరగ˘బుద్ధి కాలేదు. అక్కడే స్థిరంగా కూర్చొని మోక్షసిద్ధి కోసం తపస్సు ప్రారంభించాను.

కొద్ది కాలంపాటు తపస్సు సాగిందో లేదో ఆ లోకపు దేవేంద్రుడు నా దగ్గరకు వచ్చి సంభాషణ ప్రారంభించాడు.

***దేవేంద్రుడు***: (నవ్వుతూ) రాజా! ఎందుకీ శ్రమ! నీకూ నాకూ గూడా మోక్షం రావాలంటే మధ్యలో ఒక మృగజన్మ అడ్డంగా వుంది. అందుచేత ఈ తత్త్వ చింతనకు ఇది కాలం కాదు.

***విపశ్చిద్రాజ***: దేవరాజా! నేను అల్పుడ్ణి. మానవుడ్ణి. నాకు మృగజన్మ ఎత్తే పాపం మిగిలి వుంటే వుండవచ్చు. తమలాంటి మహా పుణ్యాత్ములకు గూడా ఇలాంటి గతి పట్టడమేమిటి? ఇది మరీ ఆశ్చర్యంగా వుంది.

***దేవేంద్రుడు***: ఏం చేస్తాం విపశ్చిద్రాజా! నేను గూడా పూర్వాభ్యాస బలంవల్ల స్వర్గ సుఖాల మోహంలో పడ్డాను. ఆ మోహ ప్రభావంలో ఒక సారి దుర్వాస మహర్షికి అపరాధం చేసాను. ఆయన శాపానికి గురయ్యాను. అందువల్ల నీతో పాటు నాకు గూడా మృగజన్మ తప్పదు. అది అలా వుంచు. నీకేదైనా వరం కావాలంటే కోరుకో.

***విపశ్చిద్రాజ***: దేవా! నేనీ అనంత సంసారంలో తిరిగి తిరిగి అలసిపోయాను. నాకు త్వరగా ముక్తి కావాలి. అదే నేను కోరుకునే వరం.

***దేవేంద్రుడు***: విపశ్చిద్రాజా! ముక్తి అంటే నామరూపాలకు అతీతమైన విశుద్ధాత్మ స్థితిని చేరుకోవడమే! ఇలాంటి విశేషాలన్నీ నువ్వు పూర్వమే బోయవాడి కథలో విని వున్నావు. అది ఒకరు ఇచ్చేది కాదు. కనుక మరో వరం కోరుకో.

***విపశ్చిద్రాజ***: ఐతే, నేను మృగజన్మ నెత్తాక నాకు ఏం జరుగుతుందో చెప్పండి.

***దేవేంద్రుడు***: రాజా! మృగజన్మ అంటే లేడి జన్మే! నీకూ నాకూ జన్మ రావడానికి ఇంకా చాలా కాలం పడుతుంది. ఐతే చిత్రం ఏమిటంటే, నువ్వు లేడిగా వుండగా పరమ పవిత్రమైన శ్రీరామ సభకు చేరుతావు. అక్కడ వశిష్ఠమహర్షి అనుగ్రహంవల్ల "విశుద్ధాత్మను నేనే" అనే తత్త్వజ్ఞానం నీకు కలుగుతుంది. అప్పుడు నువ్వు లేడి జన్మను విడిచి, పూర్వపు పురుషరూపాన్ని పొంది, జ్ఞానాగ్నిచేత నీ శరీరబంధాన్ని దగ్ధం చేసుకోగలవు. శుభమస్తు! నేను వెళ్ళి వస్తా!

**విపశ్చిద్రాజు**: దశరథ మహారాజా! ఇంద్రుడు ఇలా చెప్పి వెళ్ళిపోయిన తరువాత కొంతకాలానికి "నేను జింకనౌతాను" అనే స్థిర సంకల్పం నాకు పుట్టింది. ఆ వెంటనే నేనొక జింకనయ్యాను. నన్ను మీ సామంత రాజులలో ఒకడు అడవిలో చూసి పట్టుకొని నీకు కానుకగా పంపాడు. మహారాజా! సభాసదులారా! ఇదీ నా కథ! ఆత్మజ్ఞానం లేనిదే అవిద్యయొక్క అంతం చూడడం ఎవరికీ సాధ్యం కాదు. ఇదే నా జీవిత చరిత్ర చాటి చెప్పే నీతి.

**శ్రీరాముడు**: విపశ్చిద్రాజా! ఒక చిన్న సందేహం. ఈ లేడి స్వరూపం ఎక్కడో మీ సంకల్ప లోకంలో పుట్టింది. అది ఇప్పుడు మా అందరి కళ్ళకూ కనిపిస్తోంది. దీనిని బట్టి ఒకడి సంకల్పంలో పుట్టిన వస్తువులు ఆ సంకల్పంతో సంబంధం లేని ఇతర జీవులకు కూడా కనిపిస్తాయని చెప్పినట్లౌతోంది. ఇదెలా కుదురుతుంది? (ఒకడి కల మరొకడికి కనిపించడం లేదు కదా)

**విపశ్చిద్రాజు**: రామా! మహర్షులు, దేవతలు, మొదలైనవారి వరాలవల్ల గాని, శాపాలవల్ల గాని, ఒక్కొక్కప్పుడు ఇలాంటి సన్నివేశాలు సంభవిస్తూ వుంటాయి. నా విషయంలోకి వచ్చేసరికి దుర్వాస మహర్షి దేవేంద్రుడికి శాపం పెడుతూ "నువ్వు విపశ్చిద్రాజుతో కలిసి లేడి జన్మనెత్తు" అన్నాడు. అందువల్ల నా సంకల్పలోకంలో పుట్టిన లేడి, ఆ దేవేంద్రుడి లోకంలో గూడా కనిపిస్తోంది. ఇది లోక దృష్టితో చెప్పిన సమాధానం. యథార్థమైన సమాధానం వేరే వుంది. అది చెబుతా విను.

యథార్థంగా ఆలోచించి చూస్తే, పరబ్రహ్మలోనే అన్నీ వున్నాయి. పరబ్రహహ్మలోంచే అన్నీ పుడుతున్నాయి. అన్నీ పరబ్రహ్మ స్వరూపాలే! అన్నిట్లోనూ పరబ్రహ్మే వుంది– అని గదా పరబ్రహ్మను గూర్చి చెబుతున్నారు. ఇలాంటి పరబ్రహ్మ విషయంలో ఇది కుదురుతుందనీ, ఇది కుదరదనీ, నియమం ఎవడు పెట్ట గలడు? ఒకడి సంకల్పంలో పుట్టిన విషయాలు మరొకడి సంకల్పంలో కలవవు అనే మాటా కుదురుతుంది, అవి కలుస్తాయి అనే మాటా కుదురుతుంది.

**అహో ను విషమా మాయా**
**మనోమోహ విధాయినీ।**
**విధయః ప్రతిషేధాశ్చ**
**యదేకత్ర స్థితిం గతాః ।**
**ఇదృశీ బ్రహ్మ సత్తైషా**
**యదేవాత్మాన మాత్మనా ॥** (ని.ఉ.స. 159, శ్లో. 41&42)

జీవులకు మోహాన్ని కలిగించే మాయ ఆశ్చర్యకరమైనది. ఔను– కాదులు రెండూ దాంట్లో ఒకే చోట కలిసిపోతూ వుంటాయి. పరబ్రహ్మ శక్తి గూడా ఇలాంటిదే! అది తనను తనే తనతో సృష్టి చేసుకుంటుంది. (తనతో అంటే తను అనే సాధనంతో)

అంతే గాదు, ఈ బ్రహ్మసత్తవల్లనే బ్రహ్మను కప్పివేసే అవిద్యకు సత్త (ఉనికి) ఏర్పడుతోంది. దాని ద్వారానే పంచభూతాలకు సత్త ఏర్పడుతోంది. వాటి ద్వారా వివిధ ప్రపంచాలకు సత్త ఏర్పడుతోంది.

దీనిని బట్టి ఆలోచిస్తే, వేరు వేరుగా కనిపించే ఈ ప్రపంచాలన్నీ ఒకటే అని చెప్పాలా? దేనికదే వేరని చెప్పాలా? ఈ ప్రపంచాలు గానీ, వాటిని గురించిన జ్ఞానం గానీ, అజ్ఞానం గానీ, సత్యాలని చెప్పాలా? అసత్యాలని చెప్పాలా?

**తజ్జ్ఞతాతజ్జ్ఞతే చేహ న సతీ నాప్యసత్ స్థితీ ।**
**సత్యే సదసతీ చైకం కాష్ఠమౌన మితోఖిలమ్॥** (ని.ఉ.స. 159, శ్లో.60)

జ్ఞానాజ్ఞానాలు సత్యాలూ కావు, అసత్యాలూ కావు. సత్యాసత్యాలు రెండూ సత్యాలే, రెండూ ఒకటే!

ఇక్కడ ఏ మాటలూ అతకవు. కట్టెలాంటి కాష్ఠమౌనమే ఇక్కడ సముచితం.

అలాంటి ఈ సృష్టి విలాసంలో గత జీవుల పరంపరలు, అడుగడుగునా సృష్టులు, అసంఖ్యాకంగా వున్నాయి. వాటిలో కొన్ని ఒకదానితో ఒకటి కలగలసి పోతున్నాయి. కొన్ని విడి విడిగా వుంటున్నాయి. ఇలా కలగూర గంపగా వున్న ఈ సృష్టి పరంపరలో ఒకటి మరొక చోట కనిపిస్తుందని గానీ, కనిపించదని గానీ నియమం ఎక్కడుంది?–అన్నీ ఆ యా జీవుల కర్మశేషాలలో వుండే సామ్య వైషమ్యాలను బట్టి సాగిపోతూ వుంటాయి. ఇందులో ఆశ్చర్యమేమీ లేదు.(స.159)

విపశ్చిద్రాజు ఇలా చెబుతూ వుండగానే సూర్యాస్తమయం దగ్గరికొచ్చింది. ఆనాటికి సభ ముగిసింది. మరునాడు సభలో వశిష్ఠ మహర్షి తన ప్రసంగాన్ని ఇలా ప్రారంభించాడు.

## 65. ఇంద్రియ జయోపాయాలు

**వశిష్ఠుడు**: రామా! సుదీర్ఘమైన ఈ విపశ్చిద్రాజు వృత్తాంతంవలన మనకు తేలుతున్న విషయాలేమిటో కొంచెం ఆలోచించు. అవిద్య అనేది అసలు లేనే లేదు. లేకపోయినా వున్నట్లుగా కనిపిస్తోంది. అందుకనే ఈ విపశ్చిద్రాజు దాని అంతు చూడాలని ఎంత ప్రయత్నం చేసినా విఫలుడే అయ్యాడు. ఉన్న కిటుకు ఏమిటంటే,

**యదా బ్రహ్మాత్మికైవేయ**
**మవిద్యా నేతరాత్మికా ।**
**తదాస్యైషాఽ పరిజ్ఞాతా**
**పరిజ్ఞాతా న భిద్యతే ॥** (ని.ఉ.స. 160, శ్లో. 12)

ఉన్నది పరబ్రహ్మ ఒక్కటే! కనుక అవిద్య గూడా పరబ్రహ్మ స్వరూపమే! దానికి వేరే ప్రత్యేక స్వరూపం లేదు. ఈ మాట తెలియనంతవరకూ అది అజ్ఞానంగా వుంటుంది. తెలిస్తే, అది ఎటూ పోదు. బ్రహ్మ స్వరూపంగా మిగిలిపోతుంది. ఈ కిటుకు తెలుసుకోకుండా అవిద్యకోసం ఎన్ని పరుగులు పెట్టినా, ఆ పరుగులన్నీ ఎండమావుల వెంట పరుగులే! దీనికి ఈ విపశ్చిద్రాజే నిదర్శనం!

ఈ కనిపిస్తున్న ప్రపంచానికి అస్తిత్వం వుండే అవకాశమే లేదు. ఎందుకంటే, ఎవడైనా సరే గట్టిగా సంకల్పిస్తే చాలు, ఆకాశంలో ప్రపంచాలే ఏర్పడతాయి.ఇందుకు నేను పూర్వం చెప్పిన ఐందవోపాఖ్యానమే నిదర్శనం. కనుకనే, ఈ దృశ్య ప్రపంచమంతా మనోమయమేనని నిశ్చయమౌతోంది. (స. 160)

**శ్రీరాముడు**: గురుదేవా! మనకు రోజూ స్వప్నాలు కనిపిస్తున్నాయి. ఆ స్వప్నాలకు మన సంస్కారాలు తప్పితే వేరే కారణాలు లేవు. మీరు పూర్వం లవణోపాఖ్యానం చెప్పారు. అక్కడ లవణ మహారాజుకి స్వప్నతుల్యమైన ప్రపంచం చాలా కనిపించింది. దానికి కారణం ఇంద్రుడు పంపిన ఐంద్రజాలకుడి మంత్ర ప్రభావం. అలాగే మీరు చెప్పిన గాధి చరిత్రలో, గాధి మహర్షికి బోయ జీవితం వంటి విచిత్ర ప్రపంచాలు కనిపించాయి. దానికి కారణం విష్ణుమూర్తి ఇచ్చిన వరం. ఇలా దృశ్య ప్రపంచాలు రెండు రకాలుగా కనిపిస్తున్నాయి–

1. సహజంగా స్వప్నాల లాగా జన్మించే ప్రపంచాలు
2. కారణాంతరాలవల్ల కనిపించే ప్రపంచాలు.

ఇప్పుడు ఈ విపశ్చిద్రాజు వర్ణించిన మునివ్యాధ వృత్తాంతంలో, ఆ ముని చాలా ప్రపంచాలను చూశాడు. అవి ఏ కోవలోకి చేరుతాయి.

**వశిష్ఠుడు**: ఏది ఏ రకమైతే మాత్రం ఏమిటి విశేషం? ఆత్మజ్ఞానం లేనంతవరకూ ఇటువంటి భ్రాంతిమయమైన దృశ్యాలు అనంతంగా సాగిపోతూనే వుంటాయి. విసనకఱ్ఱ కదులుతుంటే గాలి బాగా వీస్తుంది. అది కదలకపోతే

గాలిలో కదలికే వుండదా ఏమిటి? అలాగే, శాపాది నిమిత్తాలు వున్నా, లేకపోయినా, భ్రాంతి ప్రపంచాలు కొనసాగుతూనే వుంటాయి. క్రొత్త భ్రాంతి వచ్చి పాత భ్రాంతిని కొట్టేస్తూ వుంటుంది. వాటిల్లో స్వప్నం ఒక భ్రాంతి. జాగ్రత్తు మరో భ్రాంతి.

స్వప్నంలోంచి మేల్కొన్నవాడు, స్వప్న ప్రపంచం అంతా అసత్యం అనేస్తున్నాడు. ఒకడు జాగ్రద్దశలోంచీ మరణంలోకి వెళ్ళిపోయాడు. వాడు మళ్ళీ మరొక చోట గర్భంలో ప్రవేశించాడు. ఆ గర్భంలో వుండగా వాడికి పూర్వ జన్మలన్నీ గుర్తుకు వస్తాయి. ఆ దశలో వాడు పాత ప్రపంచాలన్నీ అసత్యాలే అంటున్నాడు. కాబట్టి జాగ్రద్దశకూ స్వప్నదశకూ భేదం వుందనడం కుదరదు.

***శ్రీరాముడు***: పోనీ కాలాన్ని బట్టి భేదం చెప్పవచ్చా?

***వశిష్ఠుడు***: అదీ కుదరదు. జాగ్రద్దశ దీర్ఘకాలం వుంటుందనీ, స్వప్నదశ కొద్దికాలం వుంటుందనీ, కనుక జాగ్రత్తు సత్యమనీ, స్వప్నం అసత్యమనీ కొందరు ఆలోచిస్తున్నారు. ఈ ఆలోచన అంతా కవల పిల్లల్లో ఎవడు పెద్దవాడు? ఎవడు చిన్నవాడు? అనే ఆలోచన వంటిదే!

కనుక జాగ్రత్ స్వప్నాలకు ఏ రకమైన భేదమూ చెప్పేందుకు వీలు లేదు. మనస్సులో పెట్టుకోవలసిన విషయం ఒక్కటే! ఏ రకమైన జగత్తైనా సరే, అజ్ఞానంవల్ల మాత్రమే కనిపిస్తోంది. జ్ఞానం కలిగితే, అదే పరబ్రహ్మ స్వరూపమై పోతుంది.(స.161)

> గమనిక – ఇక్కడనుంచీ 19 సర్గల తరువాత 180వ సర్గలో కుందదంతోపాఖ్యానం అనే ఓ కథను తీసుకురాబోతున్నాడు. దానికి పీఠికగా 'బ్రహ్మగీతలు' అనే ప్రసంగాన్ని తీసుకు రాబోతున్నాడు. దానికి భూమికగా ఈ 19 సర్గల చర్చను వశిష్ఠమహర్షి ఇంచుమించు పునరుక్తి ప్రాయంగా నడిపించబోతున్నాడు. వీటిని సంగ్రహంగా చెప్పుకుంటూ మనం ముందుకు సాగుదాం!

***వశిష్ఠుడు***: మరో విషయం నువ్వు గమనించవలసింది వుంది. నీ స్వప్నలోకాన్ని అనుభవిస్తూ "నేను" అనబడే వ్యక్తి ఒకడు వున్నాడు. ఆ జీవుడు కూడా ఆ స్వప్నలోకంలో భాగమే! దానితో పాటే అసత్యమే! అక్కడ సత్యంగా మిగిలేది స్వప్నద్రష్టవైన నువ్వే!

అలాగే జాగ్రత్ ప్రపంచంలో కూడా "నేను" అనబడే వ్యక్తి ఒకడున్నాడు. వీడికి స్వప్నలోకంలోని "నేను" కంటే విశేషమైన అస్తిత్వమేమీ లేదు. ఈ లోకంతో పాటు వీడూ అసత్యమే! ఇక్కడ నికరంగా మిగిలేది పరబ్రహ్మమే! అవిద్యకు కూడా స్థానం లేదు.

ఇలాంటి తత్త్వజ్ఞానం కలగాలంటే ఇంద్రియ జయం వుండి తీరాలి(స.162)

***శ్రీరాముడు***: ఇంద్రియాలను జయించే ఉపాయమేమిటి?

***వశిష్ఠుడు***: తపస్సులు, తీర్థయాత్రలు, యజ్ఞాలు, మొదలైనవి ఎన్ని చేసినా, తత్త్వజ్ఞానం కలుగదు. దానికి తత్త్వచింతన ఒక్కటే ఉపాయం.

మామూలుగా ఐతే ఒక చిత్తం తన ప్రపంచంలోని పదార్థాలను పరబ్రహ్మకంటే భిన్నంగా దర్శిస్తూ వుంటుంది. కనుక, అవి భోగయోగ్యాలుగా దానికి కనిపిస్తూ వుంటాయి.

దీనికి భిన్నంగా ప్రతి పదార్థమూ పరబ్రహ్మకంటే అభిన్నమేనని భావన చేయడం చేతయితే, ఆ చిత్తానికి భోగ్య పదార్థాలు కనిపించవు. అందుచేత అది ఏ పదార్థాన్నీ స్మరించ జాలదు. ఎప్పుడైతే చిత్తం భోగ్యపదార్థాలను స్మరించదో, అప్పుడు ఇంద్రియాలకు పనే వుండదు. ఇంద్రియాలను జయించడానికి ఇదే ముఖ్యోపాయం.

ఇది బాగా చేతకానప్పుడు, శాస్త్రవిహితమైన స్వధర్మానుష్ఠానానికి కట్టుబడి వుంటే వైరాగ్యం త్వరగా లభిస్తుంది. తద్వారా గూడా ఇంద్రియాలను త్వరగా జయించవచ్చు.

ఇదీ కుదరకపోతే, చిత్తవృత్తులను గట్టిగా నిరోధించడం ద్వారా చిత్తానికి ఏకాగ్రతను తీసుకురావచ్చు. ఏకాగ్రత అంటే చిత్తవృత్తులన్నిటికీ అధిష్ఠానంగా వున్న శుద్ధచైతన్యంలో మనస్సు లీనం కావడమే! దీని ద్వారా గూడా ఇంద్రియజయాన్ని సాధించవచ్చు.

**గమనిక –** ఈ సర్గలలో వాల్మీకి మహర్షి కొద్దిపాటి చమత్కారం చేశాడు. ఈ ఇంద్రియ జయోపాయ వర్ణనను పురస్కరించుకొని, తత్త్వవిద్యా ప్రాశస్త్యాన్ని వివరిస్తూ, దానిలోనే ఈ గ్రంథ ప్రశంసను గూడా కలిపేశాడు. ఇందులో వుండే పునరుక్తులన్నీ సామాన్యుల మీది కరుణవల్ల చేసే బోధలే అన్నాడు. (భూయోభూయః పరావృత్త్యా ని.ఉ.స.163, శ్లో. 48) ఇవన్నీ వ్యర్థమనుకొని ఈ గ్రంథాన్ని ఒక సారి చదివి పక్కన పారేసేవాడికి బూడిద గూడా దొరకదు అన్నాడు. (భస్మాప్యాప్నోతి నాధమః శ్లో. 49) అంతే గాక ఈ నాడు భగవద్గీతలో మనకు కనిపించే

'యా నిశా సర్వభూతానాం....'

'మచ్చిత్తా మద్గతప్రాణాః...'

'తేషాం సతత యుక్తానాం....' వంటి సుప్రసిద్ధ శ్లోకాలకు మూలభూతాలైన శ్లోకాలను గూడా మనం ఈ సర్గలో చూడవచ్చు. సాధనంలో వున్నవారికి నిష్ఠను పెంచే శ్లోకాలు ఎన్నో దీనిలో వున్నాయి. ఇంత చెప్పి చివరలో, మొండిగా కర్మసంప్రదాయాలను అనుసరిస్తూ పోయేవారిని గట్టిగా మందలించాడు. దానికోసం ఆయన వ్రాసిన ఈ సర్గ చివరి శ్లోకం కొద్దిగా మార్పులను పొంది, సుభాషిత శ్లోకాల పుస్తకాలలో మంచి స్థానాన్ని కొట్టేసింది. ఆ శ్లోకమిది –

**తాతస్య కూపోయ మితి బ్రువాణాః**
**క్షారం జలం కాపురుషాః పిబంతి ।**
**యథా భవన్తో విచారవన్తః**
**తథానిశం మా భవతాజ్ఞతాప్యై ॥** (ని.ఉ.స. 163, శ్లో. 56)

కొంతమంది ఇది మా తండ్రి తాతల బావి అంటూ, పక్కన వున్న గంగా నదిని వదిలేసి, ఆ ఉప్పునీళ్లలోనే కాలక్షేపం చేస్తూ వుంటారు. అలాంటివారు కాపురుషులు. అలాగే కొందరు 'మా పెద్దలంతా పూజలూ, తీర్థయాత్రలూ, ఇలాంటివే చేశారు గానీ, ఇలాంటి తత్త్వ విచారాలు ఎప్పుడూ చేయలేదు' అంటూ రకరకాలుగా విరుద్ధ వాదాలు చేస్తూ వుంటారు. అలాంటి మొండివారికి అజ్ఞానమే గతి! మీరు అలాంటివారు కాబోకండి.

ఇలా ప్రసంగవశాన సంప్రదాయ దురభిమానాన్ని గూడా నిరసించిన వశిష్ఠమహర్షి తన బోధను ఇలా కొనసాగించాడు (స. 163)

## 66. జాగ్రత్స్వప్న సుషుప్త్యులు సాంకర్యం

***వశిష్ఠుడు***: రామా! ఇంతకూ "నేను" అనబడే జీవుడికి ప్రత్యేకమైన అస్తిత్వమే లేదని నేను చెబుతూ వుండగా, మధ్యలో ఇంద్రియ జయ ప్రసక్తి వచ్చింది. ఇంతకూ నేను చెప్పవచ్చిన మాట ఏమిటంటే, "నేను" అనబడే జీవుడు విడిగా లేడు. చిత్తం అనే ఉపాధివల్ల వాడు విడిగా వున్నట్టు కనిపిస్తున్నాడు. ఆ ఉపాధిని తొలగించి వేస్తే, అక్కడ వుండేది శుద్ధ చైత్యమే! ఆ ఉపాధి సత్యమైనది కాదు, కనుక, దానిని తొలగించవలసిన పని గూడా లేదు. ఈ విషయం అర్థమైతే, జగత్తు, జీవుడు, పరబ్రహ్మ, అనే పదాలకు అర్థమే లేదు. అంటే, అక్కడ మూడు పదాలు వున్నాయి గానీ, వున్నది ఒక్కటే పదార్థం. అదే శుద్ధ చైతన్యం. దీనినే "జగజ్జీవేశ్వర సామరస్యం" అంటారు. (స. 164)

ఈ దృష్టితో చూసినప్పుడు జాగ్రత్ స్వప్న సుషుప్తులనే మూడు అవస్థలకు కూడా ఏ రకమైన భేదమూ

లేదు. సరిగ్గా ఆలోచిస్తే, ఈ అవస్థలు ఒక దానిని వదిలిపెట్టి మరొకటి వుండదు. ఒకదాంట్లోకి మరొకటి చొచ్చుకుపోతూనే వుంటుంది.

ఉదాహరణకు, మెలకువగా వున్న మనిషి ఊహాలోకాలలోకి పోయి, పగటి కలలు కంటూ వుంటాడు. ఆ ఊహాలోకం మెలకువా? కలా?

అలాగే కలలో వున్న మనిషికి తను నిద్రపోయినట్టూ, లేచినట్టూ కనిపించింది. ఆ కలలో వుండేది మెలకువా? కలా?

అలాగే మెలకువలోగాని, కలలో గాని వుండగా, మనస్సు మొద్దుబారి పోయింది. అది సుషుప్తా? మెలకువా? కలా?

సుషుప్తిలోంచి ఒక్క సారిగా, స్వప్నంలోకో, జాగ్రత్తులోకో వస్తున్నాడు. సుషుప్తిలో ఎవడైతే వున్నాడో, వాడే జాగ్రత్తులోకో, స్వప్నంలోకో వస్తున్నాడు. కనుక, సుషుప్తిలో స్వప్న జాగ్రత్తులు కలిసిపోయినట్టే అవుతోంది.

స్వప్న జాగ్రత్తులకు భేదం ఏమాత్రమూ లేదని నీకిదివరకే నిరూపించాను. కనుక, ఈ జాగ్రత్ స్వప్న సుషుప్తుల పరస్పర సాంకర్య ప్రసక్తిద్వారా దానిని మరొక సారి నువ్వు దృఢపరచుకో.(స. 165)

ఉన్న పరమాత్మ దృశ్యరూపంగా కనిపించడాన్ని 'ఖ్యాతి' అని కొందరు పండితులు వ్యవహరిస్తున్నారు. ఈ ఖ్యాతి సత్యమే అని కొందరి మతం. దానిని సత్‌ఖ్యాతి అంటారు. ఇది బొత్తిగా లేనిదని కొందరి మతం. దానిని "అసత్ ఖ్యాతి" అంటారు. అసలీ ఖ్యాతి లేనే లేదని కొందరి మతం. దానిని "అఖ్యాతి" అంటారు. ఉన్నది ఒకటైతే మరొకటి కనిపిస్తున్నదని కొందరి మతం. దానిని "అన్యధాఖ్యాతి" అంటారు. 'ఉన్న ఆత్మే అలా కనిపిస్తోంది' అని కొందరంటారు. ఇది "ఆత్మఖ్యాతి."

ఇలాంటివన్నీ వాదాలకోసం పనికొచ్చే మాటలు మాత్రమే! ఖ్యాతి అంటే కనిపించడం, లేక ప్రకాశించడం. ఇది వేరొక ద్రష్ట వున్నప్పుడు మాత్రమే కుదరే పదం. ఆత్మ అద్వితీయుడు గనుక, ఈ ఖ్యాతి పదం ఆత్మతో ఏ రకంగానూ అతకదు. అది అసంభవం. ఉన్న సత్యం ఏమిటంటే, ఆత్మే ఖ్యాతి! ఆత్మే ప్రకాశం! ఒకే అర్థంలో అవి రెండు పదాలు. అలా అనుకుంటే, వాటిని కొంతవరకు అతికించవచ్చు. ఆ దృష్టితో చూస్తే ఈ ప్రపంచమంతా ఒక పెద్ద స్ఫటికశిల వంటిది. దీనిలో ఉలిని దూర్చేందుకు సందు ఎక్కడా లేదు, కానీ, దీని గర్భంలో మాత్రం రకరకాల గీతలు చిత్ర విచిత్రంగా కనిపిస్తున్నాయి. ఆ గీతల్లో ఒక గీత నేను, ఒక గీత నువ్వు. ఆ మొత్తం రాయి శుద్ధ చైతన్యం. అందుచేత ఈ ఖ్యాతివాదాల జోలికి పోకుండా మూడు అవస్థలనూ దాటి వున్న, ఆత్మ తత్త్వాన్ని అర్థంచేసుకో. (స. 166&167)

ఆత్మతత్త్వం అలాంటిది కనుకనే, ఈ సృష్టిమొత్తం చిన్మాత్రం మీద అధ్యారోప స్వరూపంగా వచ్చిందని పూర్వమే ప్రతిపాదించాను. (స.168)

ఈ విషయం అనుభవంలోకి తెచ్చుకున్నవాడికి సుఖదుఃఖాలు రెండూ అంటవు.

***శ్రీరాముడు***: సుఖదుఃఖాలు రెండూ అంటటం లేదంటే, వాడు బండరాతి లాగా జడుడేమోనండీ?

***వశిష్ఠుడు***:

**జాత్యశ్వవదిహాజాతి**
**రశ్నన్ గచ్ఛన్ శ్వసన్ వదన్।**
**లోకమధ్యే మహారణ్యే**
**హాశేతే సుఖమాత్మవాన్ ॥** (ని.ఉ.స. 169, శ్లో. 26)

రామా! ఉత్తమ జాతిలో పుట్టిన గుఱ్ఱం పరిగెత్తుతున్నా, తింటున్నా, సకిలిస్తున్నా, వాసనలు చూస్తున్నా కూడా, ఒక ప్రక్కనుంచి నిద్రపోతూనే వుంటుంది. ఒక్క యుద్ధ రంగంలో మాత్రమే పూర్తి మెలకువతో వుంటుంది. అలాగే, జన్మను దాటిపోయిన జీవన్ముక్తుడు, జనాల గుంపులో వున్నా, అరణ్యం లాంటి ఏకాంతంలో

వున్నా కూడా 'ఆత్మానుసంధానం' అనే నిద్రాసుఖంలో మునిగి వుంటాడు. అందుకే వాడికీ లోకపు సామాన్య సుఖదుఃఖాలు పట్టనే పట్టవు. అంతే గాని వాడు బండరాతి వంటివాడు కాదు. ఇలాంటి జీవన్ముక్తుల లక్షణాలు ఎలా వుంటాయో నీకు చాలా సార్లు వివరించాను.(స.169)

జీవన్ముక్తుడు అంటే సమస్త కర్మలను తుడిచేసుకున్నవాడు. అలా అన్నంతమాత్రం చేత, జీవన్ముక్తుడు విశృంఖలంగా సంచరిస్తాడనుకోకు. నిజమైన జీవన్ముక్తుడికి తన "స్వకర్మే" మిత్రుడు. 'సమతా','మైత్రి' అనే వారు భార్యలు. "జ్ఞానం" అతని యింటి ద్వారపాలకుడు. "స్నానం, దానం, తపస్సు, ధ్యానం"– అనేవి అతనికి సంతానం.

అతను నిత్యమూ చేసే అసలైన అనుష్ఠానం దృశ్యమార్జనం. వాడికి ప్రపంచమనీ, బ్రహ్మ అనీ భేదం లేదు.

**దేశాద్దేశాంతర ప్రాప్తౌ**
**విద్ధి మధ్యమ సంవిదః ।**
**జగదిత్యపరం నామ**
**స్వరూపా దచ్యుతాత్మనః ॥** (ని.ఉ.స. 171, శ్లో. 23)

రామా! పూర్వం ఉత్పత్తి ప్రకరణంలో, లీలోపాఖ్యాన ఘట్టంలో, చిదాకాశం అంటే ఏమిటో వివరిస్తూ, "చిత్తవృత్తి ఒక పదార్థంనుంచి మరొక పదార్థానికి ప్రయాణం చేస్తున్నప్పుడు, అది మొదటి పదార్థాన్ని వదిలిపెట్టి, రెండవ పదార్థాన్ని చేరే లోపున, మధ్యలో ఏది వుంటుందో, అది శుద్ధమైన చైతన్యం". అని చెప్పాను. ఇది అజ్ఞాన దశలో వున్న లీలకు చేసిన ఉపదేశం.

జ్ఞాన ప్రబోధం కలిగిన జీవన్ముక్తుడి దృష్టి వేరు. వాడి దృష్టిలో చిత్తవృత్తి ఒక చోటు నుంచి మరొక చోటికి వెళ్లేలోపు మధ్యలో కనిపించేదానికి మరో పేరు "ప్రపంచం." ఈ దృష్టిభేదం ఎందుకు వస్తోందంటే, జీవన్ముక్తుడు, స్వరూపంనుంచి ఎప్పుడూ జారిపోడు. అందుచేత, వాడి చిత్తవృత్తి ఎటుపోయినా వాడికి పరబ్రహ్మమే అనుభవంలోకి వస్తుంది. అందుచేత వాడికి, జగత్తనీ, పరబ్రహ్మ అనీ, రెండు పదార్థాలుండవు. వాడి దృష్టిలో ఆ రెండూ ఒకే పదార్థానికి మారు పేర్లు.

మేము ఒక సారి జగత్తు మిథ్య అనీ, మరో సారి జగత్తు బ్రహ్మ అనీ, చెబుతూ వుంటాం. ఇవి దృష్టిభేదాన్ని బట్టి వచ్చే మాటలని నువ్వు గ్రహించాలి. సాధకుడై బ్రహ్మతత్త్వాన్ని అర్థం చేసుకునే ప్రయత్నంలో వున్నప్పుడు, జగత్తును మిథ్యగానే భావించాలి. నిష్ప్రపంచ బ్రహ్మను అనుసంధానం చేసుకునే ప్రయత్నం చేయాలి. సిద్ధుడై, వెనక్కు చూసుకునే దశలో వాడికి కర్మశేషంవల్ల ప్రపంచం మిగిలివుంటే, ప్రపంచం బ్రహ్మమయంగానే కనిపిస్తుంది. (స.171)

నీకు ఈ వివరణ ఇచ్చే ప్రక్రియలో చిత్తవృత్తిని గూర్చి ప్రసక్తిని తెచ్చాం. దానిని బట్టి కొంతమంది పరిశీలకులు ఈ ప్రపంచమంతా స్వప్నం లాగా, స్మృతిజన్యమని వాదిస్తున్నారు. జాగ్రత్తు సత్యం గనుక, దాని స్థితివల్ల స్వప్నం ఏర్పడుతోంది గనుక స్వప్నమూ సత్యమే ననీ; అదే విధంగా పూర్వకల్పాల స్మృతివల్ల ఈ కల్పంలో జాగ్రత్ప్రపంచం సృష్టింపబడుతోంది కనుక, ఈ ప్రపంచం గూడా సత్యం కావచ్చుననీ, వాళ్ళ అభిప్రాయం. కానీ, ఈ జాగ్రత్ ప్రపంచం అసత్యమని వేరే వేరే యుక్తులతో నిరూపించి వున్నాం గనుక, జగత్తు స్మృత్యాత్మకమనే మాట పొసగదు. అది భ్రాంత్యాత్మకమని చెప్పక తప్పదు(స.172)

ఇది భ్రాంత్యాత్మకం కనుకనే ఇక్కడ కొంత భాగం చేతనపదార్థాలున్నట్లు, కొంత భాగం జడపదార్థాలున్నట్లూ, కనిపిస్తోంది.(స. 173)

నీకు స్వప్నంలో గూడా ఇలాంటి దృష్టే కలిగింది. కాని మెలకువ వచ్చాక, స్వప్నంలో కనిపించిన

చేతనాచేతనాలు రెండూ నేనే అనేస్తున్నావు. అలాగే, జ్ఞానం అనే మెలకువ వస్తే, దృశ్యాలన్నీ తుడిచిపెట్టుకొనిపోయి, చిదాత్మ ఒక్కటే మిగులుతుంది. (174)

ఈ స్థితి రావాలంటే నువ్వు శాస్త్రోక్తమైన అభ్యాసం చేయాలి (175) ఈ విషయంలో ఒక సారి మా తండ్రిగారైన బ్రహ్మదేవుడినే ప్రశ్నించాను. ఆయన చైతన్యం అనే అణువులో కోట్ల కోట్ల బ్రహ్మాండాలు ఇమిడి వున్నాయని అనేక ఉపపత్తులతో వివరించి చెప్పాడు. ఆ విషయాలు నీకు నేను ఉత్పత్తి ప్రకరణంలోనే చెప్పాను. (176)

**శ్రీరాముడు**: మీరు అటు తిప్పి, ఇటు తిప్పి, ఈ జగదుత్పత్తికి కారణమే లేదని తేల్చేస్తున్నారు. దానికి స్వప్నాన్ని ఉదాహరణగా తీసుకొస్తున్నారు. ఈ ప్రపంచోత్పత్తికి కారణమే లేకపోతే, ఈ ప్రపంచంలో దేని ఉత్పత్తికీ కారణం వుండవలసిన పని లేదు. అప్పుడు వానలు లేకుండానే పంటలు పండుతాయని చెప్పవలసి వస్తుంది. ఇది ఎవరానా అంగీకరించే మాటేనా?

**వశిష్ఠుడు**: రామా! ప్రపంచం మొత్తానికి కారణం ఏమిటని నేను వివరిస్తుంటే, ప్రపంచంలో అంతర్భాగమైన కార్యకారణ సంబంధం గురించి నువ్వు మాట్లాడుతున్నావు. నీ స్వప్నంలో మాత్రం ఒక కార్యకారణభావ సంబంధం లేదా? ఉన్నంతమాత్రం చేత అది సత్యమై పోయిందా? అలాగే ఈ జాగ్రత్ప్రపంచంలో గూడా ఒక కార్య కారణ భావం వుండవచ్చు. దాన్ని మేము తిరస్కరించడం లేదు. దీనిలో వుండే ఘటపటాదుల వంటి సకారణపదార్థాలూ, ఎండమావులూ, ఇంద్రజాలాల వంటి అకారణ పదార్థాలూ, అన్నీ కలుపుకొని, ఈ ప్రపంచం మొత్తానికి కారణం ఏమిటని విచారణ చేసినప్పుడు మాత్రం, దీనికి సరియైన కారణం కనిపించడం లేదు. ఉంటే ఎందుకు కనిపించదు? కనుక అది లేదని నిర్ధారణ చేస్తున్నాం. దీనికి శ్రుతి వాక్యాలను, జీవన్ముక్తుల అనుభవాలను గూడా ఆలంబనంగా స్వీకరిస్తున్నాం. (స. 177)

అందుకే నీకు పూర్వం ఉత్పత్తి ప్రకరణంలో ఐందవోపాఖ్యానమని ఒక యథార్థగాథ చెప్పాను. ఐందవులనే మహర్షిపుత్రులు పదిమంది కేవలం తమ సంకల్పబలంచేత బ్రహ్మాండ గోళాలనే సృష్టి చేసేశారు. ఇది ప్రత్యక్షానుభవం గనుక, "అమూర్తమైన చైతన్యం మూర్తిమంతమైన జగత్తును ఎలా సృష్టిస్తుంది? ఎలా కదిలిస్తుంది?" వంటి ప్రశ్నలు ఎవరైనా లేవదీస్తే, వాటికి అర్థమే లేదు.(స.178)

ఇలాంటి ప్రశ్నలన్నీ ఎందుకు వస్తున్నాయంటే, నాశరహితమైన చిన్మాత్ర స్థితిని గురించిన అవగాహన లోపించడంవల్ల వస్తున్నాయి. ఆ అవగాహన కలగాలంటే, మేము చెప్పే ఈ సచ్ఛాస్త్రాన్ని పునరుక్తి అనుకోకుండా, మళ్ళీ మళ్ళీ అభ్యాసం చేయాలి.

**గమనిక –** గత పది సర్గలలోనూ వశిష్ఠమహర్షి ఈ మాట మూడు, నాలుగు సార్లు చెప్పాడు. అలాంటి ప్రసక్తి వచ్చినప్పుడల్లా వాల్మీకి మహర్షి దానిని యోగవాశిష్ఠ ప్రశంస కోసం అందంగా వాడుకున్నాడు. అందులోనూ ఈ నిర్వాణ ప్రకరణం, ఉత్తరార్థం, ఇంకా ప్రశస్తమనే సూచనలు చేశాడు. ఇవన్నీ విని శ్రీరాముడికే విసుగుపుట్టింది కాబోలు, ఒక ముక్కుసూటి ప్రశ్న వేస్తున్నాడు (స.179)

**శ్రీరాముడు**: గురుదేవా! మీరు ఈ శాస్త్రంయొక్క ప్రాశస్త్యం గురించి చాలా సార్లు చెబుతున్నారు. ఈ సభలో కూర్చున్న వాళ్ళల్లో నా మిత్రుడు కుందదంతుడు కూడా వున్నాడు. ఆయన సద్బ్రాహ్మణుడు. తత్త్వచింతకుడు. ఆయనకు మీరు చేసే ఈ భోధవల్ల జీవన్ముక్తి కలిగిందంటారా?

**వశిష్ఠుడు**: అతన్ని గురించే ప్రత్యేకంగా ఎందుకు అడుగుతున్నావ్?

## 67. కుందదంతోపాఖ్యానం

**శ్రీరాముడు**: పూర్వం ఈయనకూ నాకు మధ్య ఒక విచిత్రమైన సంభాషణ జరిగింది. ఆ వివరాలు చెబుతా వినండి.

ఒక సారి ఈ ఊళ్ళోనే ఒక పండితుడి ఇంట్లో విద్వత్సభ జరుగుతోందని తెలిసి అక్కడికి వెళ్ళాను. అక్కడ తత్త్వచర్చలు జరుగుతూ వుండగా, మంచి తేజశ్శాలియైన బ్రాహ్మణయువకుడు ఒకడు అక్కడికి వచ్చి సభలో కూర్చున్నాడు.

నాకు ఎందుకో అతన్ని చూసిన దగ్గరినుంచీ ఇతను మంచి సాధకుడని అనిపించసాగింది. అందువల్ల సభావిశ్రాంతి సమయంలో నేనతడి దగ్గరికి వెళ్ళి, మెల్లిగా మాటలు కలిపాను.

**శ్రీరాముడు**: స్వామీ! మీరు చాలా అలసిపోయినట్లు కనిపిస్తున్నారు. ఎక్కడో దూరదేశంనుంచి వస్తున్నారనుకుంటాను. అదీ గాక, మీరు దేనికోసమో గట్టి కృషి చేస్తునట్టుగా అనిపిస్తోంది. అందుకేనేమో ఈ బడలిక అంతా! ఇంతకూ తమరు ఎక్కడినుంచి వస్తున్నారు?

**బ్రాహ్మణుడు**: అయ్యా! మాది విదేహనగరం. నేనక్కడ బ్రాహ్మణపుత్రుడిగా పుట్టాను. నాకు మావాళ్ళు కుందదంతుడని పేరు పెట్టారు. వంశాచారం ప్రకారంగా వేద శాస్త్రాలు అధ్యయనం చేశాను. నాకు కొద్దిగా వైరాగ్యం మొదలైంది. దాంతో ఈ శాస్త్రవిద్యలు చాలవని, ఉత్తములైన సిద్ధపురుషులు ఎక్కడ దొరుకుతారా అని వెతుక్కుంటూ దేశాటన మొదలు పెట్టాను.

అలా తిరుగుతూ తిరుగుతూ శ్రీశైలానికి వచ్చాను. అక్కడ తపస్సు చేసుకుంటూ, ఆ చుట్టు పక్కలలో అడవుల్లో గాని, గుహల్లో గాని, మహాత్ములు ఎవరైనా దొరుకుతారేమోనని వెతుక్కుంటూ వుండేవాణ్ణి. అలా తిరుగుతూ తిరుగుతూ వుండగా ఒక రోజు ఒక వింత దృశ్యం కనిపించింది.

అది విశాలమైన చదును ప్రదేశం. అక్కడ కనీసం గడ్డి కూడా మొలవడం లేదు. కానీ, ఆ మైదానం మధ్యలో ఒక పెద్ద వృక్షం వుంది. దాని కొమ్మలు చాలా పెద్దవిగా వున్నాయి. ఆ కొమ్మల్లో ఒక కొమ్మకు తన రెండు కాళ్లూ తాళ్లతో కట్టుకొని ఒక పెద్దాయన ఎవరో తలక్రిందులుగా వేళ్లాడుతున్నాడు. దగ్గరికి వెళ్ళి చూశాను. ఆయన తపస్సులో వున్నాడని అర్థమైంది. అంతటి అడవిలో, ఇంతటి ఎడారిలో, ఇలా ఎండవానలకు ఎండుతూ, తడుస్తూ, యింత ఘోరమైన తపస్సు ఈయన ఎలా చేయగలుగుతున్నాడా, అని నేను ఆశ్చర్యపోయాను. గుండెలు బాదుకున్నాను.

ఇక ఆయనను వదిలిపెట్టి పోబుద్ధి కాలేదు. అక్కడే వుండి ఆయనకు చేతనైన సేవలు చేయడం మొదలు పెట్టాను. మెల్లిగా ఆయనకు నా మీద విశ్వాసం మొదలైంది. ఒక రోజున ఆయనను “అయ్యా! మీరు ఎవరు? ఎందుకీ ఘోర తపస్సు చేస్తున్నారు?” అని అడిగాను.

ఆయన చాలా కాలం మాట్లాడలేదు. కొన్నాళ్ళయ్యాక విసుక్కున్నాడు. ఇంకా కొన్నాళ్లయ్యాక “నీకెందుకు?” అన్నాడు. చివరికి ఒక రోజున నోరు విప్పాడు.

**తాపసుడు**: నాయనా! మాది మధురానగరం. నేను చిన్నప్పుడే మంచి పాండిత్యం సంపాదించాను. పాండిత్యం ఎంత వుంటే ఏమి? అసలైన భోగం రాజులది. కనుక ఎప్పటికైనా సరే, చక్రవర్తిని కావాలనే కోరిక పుట్టింది. దానికి తపస్సుకంటే వేరే ఉపాయం కనిపించలేదు. వచ్చి ఈ మహాక్షేత్రంలో ఈ తపస్సు మొదలు పెట్టాను. ఇప్పటికి పన్నెండు ఏళ్లు అయింది. ఇంతవరకూ నన్ను పలకరించినవాడు లేదు! ఇప్పుడు ఎక్కడి నుంచి వచ్చావో? ఎందుకు వచ్చావో? ఇన్నాళ్లికి అకారణ మిత్రుడివి నువ్వొకడివి దొరికావు. ఏదో అడిగావు కనుక నా కథ చెప్పాను. నావల్ల నీకేమీ ప్రయోజనం లేదు. నీ దోవన నీవు వెళ్ళిపో!

**కుందదంతుడు**: స్వామీ! తమరు మన్నించాలి. నేను మిమ్మల్ని వదిలిపెట్టి పోలేను. మీ సేవ చేసుకుంటూ ఇక్కడే వుంటాను.

నా మాటలకు ఆయనేమీ సమాధానం చెప్పలేదు. పాషాణం:మౌనంగా వుండిపోయాడు. మనిషి బిగిసిపోయాడు. బతికి వున్నాడో లేడో గూడా అర్థం కాలేదు. మొదట్లో భయం వేసింది. తరువాత ఆయన సమాధిలో వున్నాడని అర్థమైంది. ఆయనతోపాటే శీతోష్ణాలను సహిస్తూ, ఆయనకు సేవచేస్తూ, అక్కడే వుండిపోయాను. ఇలా ఆరు నెలలు గడిచాయి.

ఒక రోజున, ఆ తాపసుడి ఎదుట సూర్యుడి లాగా ప్రకాశించిపోతున్న దేవత ఒకడు ప్రత్యక్షమయ్యాడు. నేను చేసిన సేవలవల్లో, ఏమో, ఆ దేవత నాకు గూడా కనిపించాడు. కానీ, నాతో మాట్లాడలేదు. ఆ తాపసుడి వంకే తిరిగి –

"ఓ తాపసోత్తమా! నీ తపస్సు చాలించు. నువ్వు కోరుకున్నట్టే నువ్వు చక్రవర్తివౌతావు. ఏడు వేల సంవత్సరాల పాటు ఏకచ్ఛత్రాధిపత్యంగా రాజ్యం చేస్తావు" – అని అంతర్ధానమైపోయాడు.

వేళ్లాడే ముని కళ్ళు తెరిచాడు. నేను దగ్గరికెళ్ళి "ఇప్పటికైనా తపస్సు చాలించండి." అని బ్రతిమాలాను. ఆయన ఒప్పుకున్నాడు. నేను చెట్టెక్కి, తాళ్ళు ఊడదీసి, ఆయనను మెల్లిగా క్రిందకు దింపాను. ఆ కొమ్మకే కాచిన పళ్ల రసాలు తెచ్చి యిచ్చి, ఆయన చేత ఉపవాస విరమణ చేయించాను.

ఆయన కాళ్ళ నొప్పులవల్ల ఎక్కువగా కదలలేకపోయాడు. మూడు రోజుల పాటు మేమిద్దరం కబుర్లు చెప్పుకుంటూ ఆ చెట్టుకిందే కాలక్షేపం చేశాం. ఆ తరువాత ఆయన నన్ను గూడా వాళ్ళ ఊరికి రమ్మని పిలిచాడు. మేమిద్దరం బయలుదేరాం. (స. 180)

ఆ ప్రయాణం చాలా రోజులు పట్టింది. రోధగ్రామం, సాలీసనగరం, మొదలైన ఎన్నో ఊళ్ళూ, అడవులూ, దాటుతూ పోతున్నాం. అందులో ఒక అడవి దగ్గరికి వచ్చే సరికి, ఆ తాపసోత్తముడు నాతో –

"నాయనా! కుందదంతా! ఇక్కడకు దగ్గరలోనే గౌర్యాశ్రమమనే ఆశ్రమం ఒకటి వుంది. అక్కడ నా తమ్ముళ్ళు ఏడుగురు తపస్సు చేసుకుంటున్నారు. మేము మొత్తం ఎనమండుగురు సోదరులం. చిత్రమేమిటో, మా ఎనిమిది మందికీ చక్రవర్తులం కావాలనే కోరికే పుట్టింది. అందరం కలిసి తపస్సుకోసం ఈ గౌరీ ఆశ్రమానికి వచ్చాం. ఒక ఆరు నెలలు అయ్యాక నాకక్కడ వుండ బుద్ధి గాక శ్రీశైలానికి చేరాను. నా తమ్ముళ్ళు ఇక్కడే వుండి వుంటారు. ఒక సారి వాళ్లను చూసిపోదాం. కొంచెం ప్రక్క దారైనా, అక్కడికి పోయివద్దాం పద!" అన్నాడు.

సరే అని ఇద్దరం బయలుదేరాం. చిత్రమేమిటో, ఎంత వెతికినా ఆ ప్రాంతంలో ఎక్కడా మనుష్యులు కనిపించ లేదు. మున్యాశ్రమాల ఛాయలూ కనిపించ లేదు. వెతికి వెతికి, ఆ తాపసుడు మొత్తానికి ఆ ప్రాంతాన్ని గుర్తించాడు. కానీ, ఆ ప్రాంతంలో చెట్లే సరిగ్గా లేవు. చాలా మటుకు చెట్లు కొట్టివేయబడి వున్నాయి. చిన్న చెట్లు ఇంకా మొలుస్తున్నాయి. వెతకగా, వెతకగా, వున్నంతలో కొంచెం పెద్ద కడిమిచెట్టు (కదంబ వృక్షం) ఒకటి దొరికింది. ఆ చెట్టు కింద ఒక మహర్షి సమాధిలో వున్నాడు.

మాకు ప్రాణం లేచి వచ్చినట్లైంది. ఆయన్ను పలకరించాలని చూశాం. ఆయన పలకలేదు. మేము ఆయనకు ఎదురుగుండా పచ్చికబీడు మీద చాలా సేపు చతికిలబడి కూర్చున్నాం. ఐనా ఆయనలో చలనం లేదు.

నేను కుర్రవాణ్ణి అవడంచేత, త్వరలోనే సహనం కోల్పోయి, "అయ్యా! లేవండి." అని గట్టిగా అరిచాను. ఆ ధ్వనికి ఆయన మెల్లిగా కళ్ళు తెరిచి, ఆవలించి, ఇటూ అటూ చూసి

"అయ్యలారా! ఎవరు మీరు? నేను గౌరీ ఆశ్రమంలో వుండాలి గదా! ఇక్కడ వున్నానేమిటి? నన్ను

ఇక్కడికి ఎవరు తెచ్చారు? ఎంత కాలమైంది, తెచ్చి? ఇది ఏ సంవత్సరం?" అన్నాడు కొంచెం ఆదుర్దాగా.

మా తాపసుడుగారు ఏమీ మాట్లాడలేదు. నేనే ధైర్యం చేసి "అయ్యా! మీరు అడిగే విషాయలేవీ మాకు తెలియవు. ఐనా మమ్మల్ని అడగడం దేనికి? మీరు గొప్ప సమాధి నిష్ఠులు గదా! మీరే ధ్యానంలో అన్నీ తెలుసుకోవచ్చు గదా!" అన్నాను.

నేను కొంచెం వెటకారంగా మాట్లాడినా, ఆయనేమీ కోపగించకుండా, సరేనని కళ్లు మూసుకొని ధ్యానంలోకి వెళ్ళాడు. వెళ్లినవాడు త్వరలోనే బైటికివచ్చి, ఒక వింత కథ చెప్పాడు.

**కదంబతాపసుడు**: అయ్యలారా!నా కథా కనిపించింది, మీ కథా కనిపించింది! ఈ వింత కథ వినండి. ఒకప్పుడు గౌరీదేవి వాగీశ్వరీదేవియొక్క స్వరూపాన్ని ధరించి ఈ ప్రాంతాలలో పది సంవత్సరాల పాటు తపస్సు చేసింది. అందువల్ల ఈ ప్రాంతానికి గౌరీవనమని పేరు వచ్చింది. ఆమె ఆ రోజులలో ఈ చెట్టు క్రిందే తపస్సు చేసుకుంది. అందుకనే ఆ రోజుల్లో ఆమెకు కదంబవాగీశ్వరి అనే పేరు వచ్చింది. ఆ తరువాత ఆ దేవి ఇక్కడినుంచి వెళ్లిపోయింది. కానీ అప్పటినుంచి ఇప్పటివరకూ ఈ చెట్టుకు ముసలితనం రావడం లేదు. ఆ దేవి వెళ్లిపోయిన తరువాత కొంత కాలానికి, కట్టెలమ్ముకొని జీవించేవాళ్ళు కొందరు ఇక్కడికి చేరారు. అందువల్ల ఈ చుట్టుప్రక్కల వున్న పెద్ద చెట్లన్నీ నరికివేయబడ్డాయి. ఈ కదంబవృక్షం మాత్రం చిన్నదిగా కనిపిస్తూ వుండడంచేత, దీన్ని ఎవరూ ముట్టుకోలేదు. ఇప్పటికీ ఇది బాలవృక్షంగా వుండిపోయింది. ఇదీ, ఈ చెట్టు కథ. ఇక నా కథ వినండి.

నేను మాళవదేశపు రాజును. నేను పెద్దవాడినై, వానప్రస్థాశ్రమం స్వీకరించి, తపస్సు కోసం అడవులకు వచ్చేశాను. మహర్షుల ఆశ్రమాలను వెతుక్కుంటూ చాలా అడవులు తిరిగాను. ఆ వరుసలోనే ఈ గౌరీవనానికి వచ్చాను. అప్పట్లో ఇక్కడ చాలా మంది మహర్షులు వుండేవారు. వాళ్ళు నన్ను ఆదరించి ఈ కదంబవృక్షం క్రింద కూర్చొని తపస్సు చేసుకోమని ప్రోత్సహించారు. నేను ఇక్కడే వుండిపోయాను.

ఆ తరువాత కొంత కాలానికి ఎనిమిది మంది సోదరులు తపస్సుకోసం ఇక్కడికి వచ్చారు. వాళ్ళల్లో పెద్దవాడే ఈ తాపసుడు. ఈయన ఇక్కడ కొద్ది రోజులే వుండి, ఎందుకో, శ్రీశైలం వెళ్లిపోయాడు. రెండవవాడు వేరే చోటుకి (దక్షిణాపథానికి) వెళ్ళి కుమారస్వామిని గురించి తపస్సు చేశాడు. మూడవవాడు కాశీకి వెళ్ళాడు. నాల్గవవాడు హిమాలయాలకు వెళ్ళాడు. మిగిలిన నలుగురూ ఇక్కడే వుండి గొప్ప తపస్సు చేశారు.

చిత్రమమిటంటే, అన్నదమ్ములు ఎనిమిదిమందికీ ఒకటే కోరిక– చక్రవర్తి కావాలని! అందరూ తపస్సుచేసి తమకు కావలసిన వరాలు సంపాందించేసుకున్నారు. అందరిలోనూ ఈ పెద్దవాడికే కొంచెం ఆలస్యమైంది. మిగిలిన ఏడుగురూ తపస్సులు పూర్తై, స్వగృహానికి చేరి, తమ నిత్య వైదిక కర్మలతో జీవనం సాగిస్తున్నారు.

ఆ సోదరులు నలుగురూ ఇక్కడినుంచి వెళ్ళిపోయిన తరువాత, క్రమంగా ఇక్కడ ఫలసంపదా, జలసంపదా, కొంచెం తగ్గింది. మహర్షులు వ్యవసాయం చేసి జీవించరాదనే నియమం కలవారు గనుక, ఇక్కడ వుండే తపస్విలంతా వేరే వేరే చోట్లకు వెళ్ళిపోయారు. ఆ తరువాత కట్టెలు కొట్టేవాళ్ళు ఇక్కడ చేరారు. వాళ్ళు ఈ కదంబ వృక్షానికి గౌరీకదంబమని పేరు పెట్టారు. దీనికి అప్పుడప్పుడు పూజలు చేస్తున్నారు. దానికింద సమాధి నిష్ఠలో వున్న నన్ను గూడా గౌరవంగానే చూస్తున్నారు. నేను ఎక్కువకాలం సమాధిలోనే గడిపేస్తున్నాను. ఇదీ నా కథ.

నా కథలో ఈ తాపసుడి కథ కూడా కొంత వచ్చింది. మీరిద్దరూ మధురానగరంలో ఇతని ఇంటికి వెళ్ళాలనే బయలుదేరారు గదా! త్వరగా వెళ్ళండి. అక్కడ ఇతని తమ్ముళ్ళు, బంధువులు, ఇతని కోసం ఎదురు చూస్తున్నారు. త్వరగా బయలుదేరండి.

## 68. విరుద్ధ వరశాపాలు

**కుందదంతుడు**: ఆర్యా! నాకో చిన్న సందేహం! వీళ్ళు ఎనిమిదిమందీ ఒకే కోరిక కోరారు. ఒకే సారి తపస్సు చేశారు. ఒకే సారి వరాలు పొందారు. కనుక ఒకే సారి చక్రవర్తులు కావాలి. కానీ ఉన్న భూమి ఒక్కటే కదా! దానికి వీరందరూ ఒకే సారి చక్రవర్తులెలా ఔతారు?

**కదంబతాపసుడు**:కుందతంతా! నువ్వు చెప్పింది ఆశ్చర్యమే! కాని ఇంతకంటే పెద్ద ఆశ్చర్యం మరొకటి వుంది. చెబుతా విను.

ఈ ఎనిమిది మందికీ, ఎనిమిదిమంది భార్యలున్నారు. వాళ్ళందరూ పెద్ద ముత్తైదువలు. పతివ్రతలు. తమ భర్తలు తపస్సుల కోసం వెళ్ళిపోయే సరికి, ఆ భార్యలు దిగులుపడి, ఇంట్లోనే కూర్చొని గొప్ప తపస్సు చేశారు. ఒక్కొక్కళ్ళూ వందేసి చాంద్రాయణ వ్రతాలు చేస్తూ, గౌరీదేవిని గురించిన ఉపాసన చేశారు.

(మొదటి రోజు ఒక ముద్ద , రెండవ రోజు రెండు ముద్దలు, మూడవ రోజు మూడు ముద్దలూ – ఇలా శుక్లపాద్యమినుంచి చంద్రకళల సంఖ్య ప్రకారం ముద్దల సంఖ్యను పెంచుకుంటూ ఆహారం తీసుకోవాలి. కృష్ణపక్షంలో ముద్దల సంఖ్యను తగ్గించుకుంటూ రావాలి. అమావాస్యనాడు శుష్కోపవాసం అవుతుంది. ఏ రోజుకా రోజు ఆ ముద్దలను దాటి వేరే ఆహారం స్వీకరించరాదు. ఇలా ఆచరిస్తూ ఉపవాస వ్రతం చేయడం పేరు చాంద్రాయణవ్రతం.)

ఆ ఎనిమిదిమంది పతివ్రతలూ ఎవరి ఇంట్లో వారు ఇలా తీవ్రమైన ఉపాసన చేసేసరికి, గౌరీదేవి ఎనిమిదిమందికీ సాక్షాత్కారించి, వరం కోరుకోమంది.

ఎనిమిదిమందీ ఒకే వరం కోరుకున్నారు.

"నా భర్తకు మృత్యువు లేకుండుగాక" – అని.

గౌరీదేవి చిరునవ్వు నవ్వుతూ–"అమ్మాయి! సృష్టికర్తయొక్క ఆది సంకల్పమనే నియతి చాలా ప్రబలమైనది. దానిని భగ్నం చేయడం ఎవరికీ సాధ్యం కాదు. ఎంత తపస్సు చేసినా, ఆ నియతిని దాటడం అసంభవం. కనుక మరొక వరం కోరుకో!" అని నచ్చ చెప్పింది.

దానికి ఎనిమిదిమంది పతివ్రతలూ అంగీకరించి, "అలా ఐతే, తల్లీ! నా భర్త మరణించినాక, నా భర్తగారి జీవుడు నాయింటిని దాటి బైటికి పోకూడదు. ఈ వరం ప్రసాదించు" – అని కోరారు.

గౌరీదేవి "తథాస్తు" అని అంతర్ధానమైంది.

ఇక్కడితో ఆశ్చర్యం అయిపోయింది అనుకుంటున్నావా? ఇంకా వుంది విను. వీళ్ళు ఎనిమిదిమందీ తపస్సుకోసం ఇళ్ళు వదలిపెట్టి పోయేసరికి, వీళ్ళ తల్లిదండ్రులిద్దరికీ ఒక రకమైన వైరాగ్యం పుట్టి, ఇంట్లో వుండబుద్ధిగాక, తీర్థయాత్రలు మొదలుపెట్టారు. ఆ యాత్రలో వుండగా, కలాపగ్రామమనే చోట ఊరిబయటి దారిలో, దారికి అడ్డంగా ఒక పొట్టిమనిషి కనిపించాడు. వాడు చాలా విచిత్రంగా వున్నాడు. మనిషి పొట్టి, ముఖం వికృతం, నల్లటి నలుపు, ఒంటి నిండా బుడిద పూత, దానికి తోడు ఒళ్ళంతా ముళ్ళపంది లాగా నిక్కపొడుచుకున్న వెంట్రుకలు, మొత్తంమీద వాడు మితిమాలిన ముష్టివాడి లాగా వున్నాడు. ఈ వృద్ధ దంపతులకు వాడ్ణి చూస్తే చిరాకు వేసింది. "పక్కకు పోరా! పోరా!" అని చేతులు విదిలించుకుంటూ వాడి పక్కనుంచే ముందుకు వెళ్ళిపోయారు. ఆ చేతులు విదిల్చడంలో, వీళ్ళచేతికి అంటుకున్న దుమ్మేదో రాలి ఆ ముష్టివాడి నెత్తిన పడ్డది.

అప్పటి దాకా అయోమయపు చూపులు చూస్తున్న ఆ ముష్టివాడు, వున్నట్టుండి కస్సున లేచి –

"ఒరే! ముసలి వెధవా! పెళ్ళాం పక్కన వుండేసరికి ఈ వయస్సులో గూడా ఇంత మదమా? నేను

దుర్వాసుణ్ణి ఎదురుగుండా కనిపిస్తుంటే, నన్ను లెక్కచేయకుండా, కొడుకులూ, కోడళ్ళూ, అనుకుంటూ ఎగురుకుంటూ పోతున్నావా? నువ్వు చేసిన ఈ పాడుపనివల్ల నీ కొడుకులూ, కోడళ్ళూ, సంపాదించిన వరాలన్నీ తల్లకిందులైపోవు గాక". అని తిట్టడం మొదలుపెట్టాడు.

దుర్వాసుడనే పేరు చెవిన పడే సరికి, ఆ వృద్ధదంపతులు గడగడా వణికిపోయి, ఆయన కాళ్లమీద పడబోయారు. కానీ ఆయన అప్పటికే అంతర్ధానమైపోయాడు.

కనుక కుందదంతా! నువ్వు అర్థం చేసుకోవలసినది ఏమిటంటే, మాయా కల్పితమైన ఈ ప్రపంచంలో ఇలాంటి అనూహ్యసన్నివేశాలు ఎన్నో దొర్లిపోతూనే వుంటాయి.

***కుందదంతుడు***: కదంబతాపసా! మీరు నన్ను మరీ గందరగోళ పెట్టేస్తున్నారు. వీళ్లు ఎనిమిదిమందీ పై జన్మలో చక్రవర్తులు కావాలి! కానీ, వీళ్ళ జీవుళ్ళు వాళ్ళ  వాళ్ళ ఇంటి గదిని దాటిపోవడానికి వీలు లేదు. వీళ్ళకు లభించిన వరాలూ ఫలించాలి. శాపాలూ ఫలించాలి. ఇవన్నీ ఒకే సారి జరగాలి. ఇదెలా సాధ్యం?

***కదంబతాపసుడు***: కుందదంతా! నీమీద స్నేహంతో వీళ్ళు ఎనిమిదమందికీ జరగబోయే భవిష్యత్‌కథ ఏమిటో చెబుతా. అది వింటే నీ సందేహాలన్నీ పటాపంచలైపోతాయి.

ఇవాళ్టికి ఎనిమిదవ రోజున మీరు మధురానగరం చేరుతారు. అక్కడ చాలా కాలం సుఖంగా వుంటారు. ఆ తరువాత కొంత కాలానికి క్రమక్రమంగా దగ్గర దగ్గరలోనే ఎనిమిదిమందీ మరణిస్తారు. వెంటనే వారి సూక్ష్మదేహాలలో వున్న చిత్తాకాశాలలో కొన్ని విచిత్రమైన సన్నివేశాలు కనిపిస్తాయి. ఆ దృశ్యాలలో వీళ్లకు లభించిన వరాలన్నీ ప్రశాంతమైన దేవతా స్వరూపాలతోనూ, వీళ్లకు లభించిన శాపాలు రౌద్రదేవతా స్వరూపంతోనూ, దర్శనమిస్తాయి.

ఆ రెండు దేవతా వర్గాలూ "ఈ జీవులకు  మా ఫలితాలను ముందిస్తాము." అంటే, "మా ఫలితాలను ముందిస్తాము" అంటూ పోట్లాడుకుంటాయి. మేము గొప్ప అంటే మేము గొప్ప అని వాదించుకుంటాయి. చివరికి రెండు వర్గాలు గూడా "బ్రహ్మదేవుడి దగ్గరికి వెళ్లి ఆయన చెప్పినట్టు చేద్దాం" అని రాజీకి వస్తాయి. "రెండు వర్గాలూ బ్రహ్మదేవుడివద్దకు వెళ్ళి విషయం విన్నవిస్తాయి.

"దీనికింత గోలెందుకయ్యా? మీలో ఎవరికి ఎక్కువ అంతస్సారముంటే, వాళ్ళు గెలుస్తారు. కనుక ఎవరి సారమెంతో మీరే కొలుచుకోండి" అంటాడు బ్రహ్మదేవుడు. దానిమీదట బ్రహ్మదేవుడి అనుమతితో, శాపదేవతలు వరదేవతల హృదయాలలోకీ, వరదేవతలు శాపదేవతల హృదయాల లోకీ, దూరుతారు. కొంతసేపటికి శాపదేవతలు బయటికి వచ్చి ఇలా విన్నవిస్తారు–

బ్రహ్మదేవా! మాకు గుండెబలం లేదు. వాళ్లు వజ్రస్తంభాలు లాగా వున్నారు. నిజానికి మాకూ వాళ్ళకీ గూడా దేహం ఒక్కటే! ఏ చైతన్యం వరమిస్తుందో, ఆ చైతన్యమే శాపం గూడా ఇస్తోంది. ఐతే, శాస్త్రీయమైన తపస్సును చేసి ఒకానొక జీవి వరాలను పొందుతున్నప్పుడు, ఆ జీవియొక్క చైతన్యం గూడా వరదేవతయొక్క చైతన్యంలో కలుస్తోంది గనుక, ఆ దేవతకు బలం పెరుగుతోంది. దానికి తోడు ఆ జీవుల తపస్సుకు ఆధారమైన శాస్త్రవిధియొక్క బలం కూడా వాళకు కలుస్తోంది. అందుచేత, వరదేవతల సారం మూడు రెట్లుగా పెరుగుతోంది.

ఇక, మా శాపదేవతల దగ్గరకొస్తే, వాళ్ళకు శాపం పొందే జీవుల ఆత్మబలం తోడు కాదు. దానికి తోడు శాపాలకు గురయ్యేవారు సామాన్యంగా పాపం చేసి వుంటారు గనుక, అప్పుడు వారి అంతస్సారం ఇంకా కొంత తగ్గుతుంది. అందువల్ల మా అంతస్సారానికి ఈ జీవుల అంతస్సారం తోడు కాజాలదు. అందువల్ల వరదేవతల బలమే అధికం!

అదీ గాక, ఈ సోదరులకు ముందు వరాలొచ్చి తరువాత శాపాలొచ్చాయి. ముందు వచ్చిన వరం ముందు పుట్టిన చెట్టు లాగా, బాగా నిలదొక్కుకొని ప్రబలమౌతోంది. అదీ గాక, వరం శాస్త్రప్రమాణ బలంచేత

పుట్టింది. శాపం పొరపాటున జరిగిన పాపంవల్ల పుట్టింది. శుక్తిరజత భ్రాంతిలో రజత భ్రాంతి మొదట పుట్టింది. కానీ, అది అల్ప ప్రమాణమైన నేత్రంయొక్క దోషంవల్ల పుట్టింది. తరువాత కలిగిన జ్ఞానం, దోషరహితమైన నేత్రంవల్ల పుట్టింది. అందువల్ల తరువాత పుట్టినా సరే, శుక్తి జ్ఞానమే ప్రబలమౌతోంది.

కనుక ఎన్ని రకాలుగా చూసినా, ఈ జీవులవిషయంలో వరదేవతల అంతస్సారమే అధికంగా వుంది.

కొన్ని సందర్భాలలో ఒకే జీవి విరుద్ధ కర్మలను సమానమైన బలంతో, సమానమైన సాధనంతో, ఆచరిస్తాడు. అలాంటివాడికి వరశాపాలు సమానమై, సుఖ దుఃఖాల మిశ్రమఫలం తప్పదు.

"ఒక్కొక్కపుడు ఒకే జీవికి ఏకకాలంలో విభిన్నప్రాంతాలకు సంబంధించిన సుఖదుఃఖాలను అనుభవింపజేయ వలసిన వరశాపాలు సమానంగా వచ్చిపడతాయి. అలాంటప్పుడు ఆ జీవికి స్వప్నరూపంలో తనే రాజుగానూ, తనే పౌరుడుగానూ, తనే మిత్రుడుగానూ, తనే శత్రువుగానూ, మారి నానా రూపాలతో వున్నట్టు కనిపించి, ఏకకాలంలో సుఖదుఃఖాల అనుభవం జరిగిపోతూ వుంటుంది. ఆ వరశాప సమస్థితి ఇంకా ప్రబలంగా వుంటే, విపశ్చిదుపాఖ్యానంలో లాగా, ఒకే జీవికి అనేక రూపాలు కలిగి, ఏకకాలంలో రకరకాల సుఖదుఃఖానుభవాలు సంభవిస్తూ వుంటాయి.

"ప్రభూ! బ్రహ్మదేవా! మీ ఎదుటే మేము గడుసుదనం వహించి ఉపన్యాసాలు చెప్పామని కోపగించకండి. మమ్మల్ని క్షమించండి. మేము వెళ్ళి వస్తాం, సెలవిప్పించండి"

అలా మనవి చేసి, శాపదేవతలు అక్కడినుంచి వెళ్లిపోతారు.

ఐతే, వాళ్ళు వెళ్ళిపోగానే వరదేవతలు రెండువర్గాలుగా చీలిపోతారు. అందులో ఒక వర్గం భర్తృ వర్గదేవతలు. అంటే భర్తలు సంపాదించుకున్న వరాల దేవతలు. రెండో వర్గం భార్యావర్గ దేవతలు. అంటే భార్యలు సంపాదించుకున్న వరాల దేవతలు. మొదటి వర్గంవారు "ఆ ఎనిమిదిమంది జీవులను వేరే వేరే బ్రహ్మాండాలలోకి తీసుకొనిపోయి, అక్కడ వీళ్ళను ఏకకాలంలో చక్రవర్తులను చేయవలసిందే" అంటారు. రెండో వర్గవారు "ఈ జీవులు ఆ యింటి గడప దాటటానికి వీల్లేదు" అంటారు. వాళ్ళ వాదాలు విని, చివరికి బ్రహ్మదేవుడు ఇలా అంటాడు.

**బ్రహ్మదేవుడు**: ఓ వర దేవతలారా! మీ రెండు వర్గాల కోరికలూ తీరేందుకు ఉపాయాలు నేను చెబుతా వినండి. మీరు ఒకరికొకరు సహాయం చేసుకొని ఆ ఎనిమిది మంది సోదరులనీ ఆ ఇంటి గదులలోనే చక్రవర్తులుగా చేసేయండి.

**వరదేవతలు**: అదెలా కుదురుతుంది, దేవా? వీళ్ళల్లో ప్రతి ఒక్కడు భూమి మొత్తానికీ నేనే చక్రవర్తిని కావాలని కోరుకున్నాడు. ఉన్నది ఒకటే భూమి. దీంట్లోనే ఇంతమందికి ఒకే సారి చక్రవర్తిత్వాన్ని యిమ్మంటే మేము ఎలా ఇవ్వగలం? అదీ గాక వీళ్ళ గదిలోనే ఇంత విశాలమైన భూమిని ఇరికించమంటే ఎలా ఇరికించగలం? పద్మపు మొగ్గలో ఏనుగును దూరమంటే దూరుతుందా?

**బ్రహ్మదేవుడు**: మీరు గూడా ఇలా మాట్లాడటాలేమిటయ్యా? వ్యష్టి స్వరూపులుగా మీరున్నారు. సమష్టి స్వరూపుడిగా నేనున్నాను. మనమంతా కలిపి చైతన్యం అనే పరమాణువుయొక్క గర్భంలో వున్నాము. ఎలా వున్నాం?. స్వప్నద్రష్ట అనే చైతన్యాణు గర్భంలో విశాలమైన స్వప్నలోకం వున్నట్లుగా వున్నాం. జగత్తుయొక్క సత్యస్థితి ఇలాగ వుంటే, భూమిని గదిలో ఎలా దూర్చాలంటారేమిటి? మొత్తం ప్రపంచమే అణుగర్భంలో ఇమిడి వున్నప్పుడు, గదిలో భూమి పట్టడం కష్టమా? ఉన్నది చిన్మాత్రమే! ఈ జగత్తు కనిపించేది మాత్రమే! ఉన్నది కాదు. అంటే వున్న చైతన్యమే జగత్తుగా కనిపిస్తోంది. అలాంటప్పుడు ఈ భ్రాంతిమయ ప్రపంచంలో మీకు అసాధ్యమేముంది?

**వరదేవతలు**: దేవా! అర్థమైంది. ఇదుగో మేము కూడా ఆధిభౌతిక శరీరాలను పరిత్యజించేసి, ఆతివాహిక

దేహాలను ధరించి, ముందు మా మనఃకల్పితమైన మా ఇళ్ళకు వెళ్ళిపోతాం. ఆ తరువాత ఆ ఎనిమిదమంది సోదరులకూ వారి వారి గదులలోనే వారి వారి తపస్సులనే మనఃకల్పనలచేత సృష్టింపబడిన విశాల భూమండలాలను చూపించి, వాటికి వాళ్ళను చక్రవర్తులను చేస్తాం. ఈ కల్పన మొదలైనాక ఈ జీవులలో ఎవడి జీవితం వాడిదే! ఒకడు శాకద్వీపంలో, ఒకడు కుశద్వీపంలో, ఒకడు శాల్మలీద్వీపంలో, ఒకడు క్రౌంచద్వీపంలో, ఒకడు మరొక శాల్మలీద్వీపంలో ఒకడు గోమేధద్వీపంలో, ఒకడు పుష్కరద్వీపంలో, మరొకడు లోకాలోక పర్వత ప్రాంతంలో, సంచరిస్తూ ఎవడికి వాడు చక్రవర్తిగా జీవించేస్తాడు. దేవా! ఇక మాకు సెలవిప్పించు!

***కదంబతాపసుడు***: కుందదంతా! ఆ తరువాత వరదేవతలు చెప్పినట్టే మొత్తం జరుగబోతోంది.

***కుందతంతుడు***: ఇదెలా సాధ్యమో నాకు అర్థంకావడం లేదు. ఇంత సువిశాలమైన భూమి వాళ్ళ వాళ్ళ గదులలో కనిపించబోతోందా?

***కదంబతాపసుడు***: శుద్ధ చిన్మాత్రంయొక్క నైజమే అంతయ్యా! దానికి ప్రపంచమేమీ అంటకపోయినా, ముల్లోకాల రూపంగానూ, జాగ్రత్ స్వప్న సుషుప్త తురీయాల రూపంగానూ, తనే కనిపిస్తుంది. తనే అనుభవిస్తుంది. ఈ పని జరిగేటప్పుడు గూడా తను తనుగానే వుంటుంది. అది దాని స్వభావం.

***కుందదంతుడు***: అంటే అద్వితీయమైన చిత్‌తత్త్వానికి నానారూపత్వం వాస్తవమైన స్వభావమంటారా?

***కదంబతాపసుడు***: చిత్‌తత్త్వంలో కనిపించే నానారూపత్త్వం వాస్తవం అని నేనలేదయ్యా! అది భ్రాంతిజన్యం. ద్విచంద్రోదాహరణంలో రెండో చంద్రుడు కనిపిస్తున్నంత మాత్రాన అసలు చంద్రుడు నానారూపుడౌతాడా? రెండో చంద్రుడనేది కంటి దోషంవల్ల వచ్చే భ్రాంతి. అలాగే ఈ జగత్తు అంతా అజ్ఞానంవల్ల కలిగే భ్రాంతి. ఈ అజ్ఞానం సృష్టికర్తయొక్క ప్రథమ సంకల్పమనే నియతి రూపంలో ఇప్పటికీ ప్రవహిస్తూనే వుంది. దానివల్లే ఈ ప్రపంచానికి ఒక స్థిరమైన రూపమున్నట్లుగా మనకు కనిపిస్తోంది. ఇలాగే, ఎవడి ప్రపంచాన్ని వాడు సృష్టి చేసుకోవచ్చు. కనుకనే ఈ సోదరులు తమ తమ రాజ్యాలను తాము సృష్టి చేసుకోబోతున్నారు. నీకు చాలా మటుకు విషయాలు వివరించాను. మిగిలినవి క్రమంగా తెలుస్తాయి. ఇక మీరిద్దరూ బయలుదేరండి. నేను సమాధిస్థితిని విడిచి ఎక్కువసేపు వుండలేకుండా వున్నాను.

***కుందదంతుడు***: రామా! ఆ కదంబతాపసుడు అలా అంటూనే కళ్ళు మూసుకొని రాయి లాగా మారిపోయాడు. మేమిద్దరం ఆయనను పలకరించాలని చాలా ప్రయత్నాలు చేశాం. ఆయన మరి కదలలేదు. మేము అక్కడినుంచి మెల్లిగా బయలుదేరి మధురానగరం చేరాము.

అక్కడ మా వృద్ధ తాపసుడుగారికి గొప్ప స్వాగతం లభించింది. తమ్ములు పెద్ద ఉత్సవమే చేశారు. కులదేవతారాధనను, సువాసినీపూజ, బ్రాహ్మణ భోజనం, వగైరా చాలా ఉత్సవాలు ఏర్పాటు చేశారు.

ఆ తరువాత నేను వాళ్లింటిలోనే వుండిపోయాను. వాళ్లు నన్ను ప్రేమగా చూసుకున్నారు. ఆ తరువాత కొంతకాలానికి కదంబతాపసుడు చెప్పినట్టే, అన్నదమ్ములందరూ హరీ అన్నారు. నేను ఆ దుఃఖాన్ని తట్టుకోలేకపోయాను. ఎక్కడికి పోవాలో తెలియక, మళ్ళీ ఆ కదంబ తాపసుడి దగ్గరికే పోయాను. ఆయన సమాధిలో వున్నాడు. నేనీమాటు తొందరపడలేదు. ఆయన మూడు నెలలకు కళ్ళు తెరిచాడు. నేను ఆయనకు సాష్టాంగ వందనం చేసి తత్త్వ విషయంలో ఎన్నో సందేహాలు అడిగాను.

ఆయన కొంచెం ఇబ్బందిగా చూసి –

“నాయనా! నేను సమాధి విడిచి ఎక్కువసేపు వుండలేక పోతున్నాను. పరమార్థోపదేశం అంటాలంటే, దానికి అభ్యాసం వుండాలి. నీకిప్పుడు అది చాలదు. కనుక నేను ఇప్పుడు చెప్పినా నీకు ఎక్కదు. నాకు అంత ఓపికా లేదు. నీకు ఒక ఉపాయం చెబుతా. అయోధ్యానగరాధిపతి దశరథుడనే చక్రవర్తి వున్నాడు. అతనికి

రాముడనే కొడుకున్నాడు. అతనికి వైరాగ్యం ఇప్పుడిప్పుడే కలుగుతోంది. వాళ్ళ కులగురువైన వశిష్ఠుడు అతనికోసం మహాసభలో సువిశాలమైన తత్త్వబోధ చేయబోతున్నాడు. సామాన్యంగా తత్త్వబోధలన్నీ ఏకాంతంలో జరుగుతాయి. కానీ, శ్రీరామ వశిష్ఠులు మాత్రం కరుణాబుద్ధితో, మహాసభలోనే తత్త్వోపదేశ ప్రసంగం చేయబోతున్నారు. అది వింటే, నీకు జీవన్ముక్తి లభించడం ఖాయం. కనుక, అయోధ్యానగరానికి వెళ్ళు. ఆ వశిష్ఠసభలో ప్రవేశం కోసం ప్రయత్నించు. బయలుదేరు. నేనిక సమాధిలోకి వెళ్లిపోతాను" అన్నాడు. అంటూనే ఆయన సమాధిలోకి వెళ్ళిపోయాడు గూడా.

రామా! ఆ విధంగా గురుప్రేరణతో నేను మీ నగరానికి వచ్చాను. ఇప్పుడు సూటిగా నీతోనే పరిచయమైంది. దయచేసి, నాకు మీ సభలోకి ప్రవేశం కల్పించు.

**శ్రీరాముడు**: గురుదేవా! వశిష్ఠమహర్షీ! ఆ నాడు ఆ విధంగా నాకు పరిచయమైన కుందదంతుడు ఇవాళ్ళ ఈ సభలో వున్నాడు. ఇన్ని రోజులుగా మీ ఉపదేశం అంతా వింటున్నాడు. అందుకే, ఇతనికి నిజంగా జ్ఞానం కలిగిందా? సందేహాలన్నీ తీరిపోయాయా, లేదా? – అని మిమ్మల్ని అడుగుతున్నాను.

## 69. అవిద్య గూడా బ్రహ్మే

**వశిష్ఠుడు**: నేను చెప్పడం దేనికయ్యా? అతన్నే అడుగుదాం. ఏమి కుందదంతా: నీకు బ్రహ్మ తత్త్వం పూర్తిగా తెలిసిందా? సందేహాలు తొలగి పోయాయా?

**కుందదంతుడు**: మునీంద్రా! వశిష్ఠమహర్షీ! సందేహాలన్నీ తొలగిపోయాయి. తెలియవలసింది పూర్తిగా తెలిసింది. చిత్పదార్థంయొక్క లక్షణం బాగా తెలిసింది. ఆవగింజలో గూడా అఖండబ్రహ్మాండాలు అణిగి వుంటాయని అర్థమైంది. పరమార్థ దృష్టితో చూస్తే, అసలు లోకాలు లేనేలేవని అనుభవానికి వచ్చింది. ఇంటి గదిలో ఇంత భూమి ఎలా ఇముడుతుందనే ప్రశ్న నిస్సారమని అర్థమైంది. ప్రపంచంలో జీవులందరూ అనుభవించేది పరబ్రహ్మనే! వారు అనుభవించే భ్రాంతి గూడా బ్రహ్మే. పరబ్రహ్మను మించి ఎక్కడా, ఎప్పుడూ, ఏదీ లేదు. ఇదే చివరి మాట! (స. 185)

**వశిష్ఠుడు**: ఆహా! ఇతను మహాత్ముడయ్యా! ఇతనికి ఆత్మజ్ఞానంలో శాశ్వత విశ్రాంతి లభించింది. కనుకనే, భ్రాంతితో సహా ఈ ప్రపంచం అంతా పరబ్రహ్మగా కనిపిస్తోంది ఇతనికి. మాయాశబల బ్రహ్మకూ (మాయతో కలిసిన బ్రహ్మకు), శుద్ధ బ్రహ్మకూ, విరోధమేమీ లేదు. ఎందుకంటే, మాయ కూడా బ్రహ్మే కనుక! ఐతే, ఆ జీవుడికుండే వాసనను అనుసరించి బ్రహ్మ జగత్తుగా కనిపిస్తోంది. అలా కనిపించినంత మాత్రాన ద్వైత స్థితి సత్యం కాజాలదు. ఎందుకంటే, పరబ్రహ్మ అన్ని దశలలోనూ నిర్వికారంగా వుంటోంది గనుక. అందుకనే ఈ ప్రపంచానికి ఆద్యంతాలు వున్నాయనడం కూడా తప్పే!

**శ్రీరాముడు**: స్వప్న ప్రపంచానికి సుషుప్తే ఆది అనీ, జాగ్రత్తే అంతమనీ, స్పష్టంగా కనిపిస్తోంది. అలాగే ఈ జాగ్రత్‌ప్రపంచానికి కూడా ఒక ఆది, ఒక అంతము, వుండి తీరాలి. అవి లేవనటం ఎలా?

**వశిష్ఠుడు**: స్వప్నప్రపంచానికి నువ్వు చెప్పిన ఆద్యంతాలను ప్రతిపాదించేవాడు ఎవడు? జాగ్రత్‌దశలో వున్నవాడు! జాగ్రత్‌దశ అనేది అజ్ఞాన నిద్రలో అంతర్భాగమే! దానిని దాటినవాడి దృష్టి గురించి మనం మాట్లాడుకుంటున్నాం. అలాంటివాడి దృష్టిలో సుషుప్తి జాగ్రత్తులకు అస్తిత్వమే లేదు. కనుక, అవి స్వప్న ప్రపంచానికి ఆద్యంతాలు కావడానికి వీలు లేదు. అలాగే వాడి దృష్టిలో ఈ జాగ్రత్ ప్రపంచానికి కూడా ఆద్యంతాలు వుండడానికి వీలు లేదు.

ఈ కుందదంతుడు చెప్పినట్లుగా, నిజానికి బ్రహ్మకూ అవిద్యకూ భేదం లేదు. నీకు నిద్ర ఎటువంటిదో, పరబ్రహ్మకు అవిద్య అటువంటిది. నిద్ర నీకంటె భిన్నమైనది కాదు. అలాగే అవిద్య పరమాత్మకంటే భిన్నమైనది కాదు. కానీ, అజ్ఞుడి దృష్టిలో ఈ అవిద్యయందు ఆవరణశక్తి, విక్షేపశక్తి – అనే శక్తులున్నాయి. వాటిలో విక్షేపశక్తి ద్వారా అది 'చిత్తం' అనేదాన్ని తయారు చేస్తుంది. ఆ చిత్తమే పరబ్రహ్మకు ఉపాధిగా రూపొందుతుంది.

నీ స్వప్నాన్ని నువ్వు ఒక సారి చూసుకో. నీ స్వప్నంలో 'నేను' అనే వాడొకడున్నాడు. వాడు అక్కడి జీవులలో ఒక జీవుడు. వాడికో చిత్తం వుంది. వాడికో దేహం వుంది. ఇవన్నీ ఎవరు? నిజానికి అవన్నీ నువ్వే! కాని వాడిలో వుండే చైతన్యాంశను పురస్కరించుకొని, వాణ్ణి 'జీవు'డంటున్నావు. వాడిలో వుండే సూక్ష్మోపాధి లక్షణాన్ని పురస్కరించుకొని, 'చిత్తం' అంటున్నావు. స్థూలోపాధి లక్షణాన్ని పురస్కరించుకొని 'దేహం' అంటున్నావు. అలాగే ఇతర లక్షణాలను పురస్కరించుకొని, వాడిని 'దేవుడు' అనో 'మనుష్యుడు' అనో, 'రాక్షసుడు' అనో అంటున్నావు. కానీ నిజానికి అవన్నీ నువ్వే! నీకు ఇన్ని రూపాలను సృష్టి చేసేది నీ చిత్తమే! నీకు మెలకువను కలిగించి, ఈ రూపాలనుంచి విముక్తి కలిగించేది కూడా ఈ చిత్తమే!!

అలాగే, అవిద్య కల్పించిన ఈ జాగ్రత్‌చిత్తం, ఈ జాగ్రత్‌ప్రపంచాన్నీ, ఇందులో మళ్ళీ నానాజీవ విభేదాన్నీ, నీకిప్పుడు చూపిస్తోంది. ఈ చిత్తమే తత్త్వజ్ఞానాన్ని పొంది, అజ్ఞానమనే నిద్రను పోగొట్టుకొని, ఈ జాగ్రత్తు అనే స్వప్నాన్ని పరిహరించి నీకు మోక్షాన్ని అందివ్వ గలదు. అందిచ్చేదేముంది? అప్పుడు అదే మోక్షమైపోతుంది.

**శ్రీరాముడు**: గురుదేవా! మరి ఈ చిత్తం వున్నప్పుడు దీని కొలత ఎంత? దీనిలో జగత్తు ఎంత కాలం వుంటుంది?

**వశిష్ఠుడు**: రామా! చిత్తంయొక్క పరిమాణం ఇంత అని చెప్పలేము. అది అణువు దగ్గరినుంచి ఆకాశం దాకా అన్ని వేషాలూ వేస్తుంది. అందుకనే శ్రుతి ఒక చోట–

**వాలాగ్ర శతభాగస్య శతధా కల్పితస్య చ ।**
**భాగో జీవస్య విజ్ఞేయః స చానంత్యాయ కల్పతే ॥**

(తా॥ సన్నని వెంట్రుకయొక్క చివరి భాగాన్ని వంద ముక్కలు చేస్తే, ఎంత చిన్నముక్క వస్తుందో, అంత చిన్నవాడు జీవుడు. కానీ వాడే, అనంతుడు గూడా కాగలడు)– అని చెప్పింది.

అజ్ఞానమనే నిద్ర ఎంత కాలం వుంటుందో, అంతకాలమూ ఇది వుంటుంది.

ఈ చిత్తం చూపించేవన్నీ భ్రాంతిమయ దృశ్యాలు కనుక, ఈ ప్రపంచంలో కనిపించే పదార్థాలు గానీ, స్వప్నాలు గానీ, వరాలు గానీ, శాపాలు గానీ– ఇలాంటివన్నీ నిజానికి శుద్ధ చైతన్య స్వరూపాలే! దానికీ వీటికీ భేదమే లేదు! నీటిచుక్క, నీటి గుంట, చెఱువు, నది, సముద్రం – అనేవాటికి ఎంత మాత్రపు భేదం వుందో, అంత మాత్రపు భేదమే నేను చెప్పినవాటికి కూడా వుంది.

**శ్రీరాముడు**: గురుదేవా! ఇక్కడొక చిన్న సందేహం. ఈ వరశాపాదుల సందర్భాలలో వున్నట్టుండి ఒక కార్యం ఆవిర్భవిస్తోంది. ఉదాహరణకు, నహుషుడు సప్తర్షుల శాపంవల్ల సర్పం అయ్యాడు. ఇక్కడ ఈ సర్పం ఎలా పుట్టింది? దీనికి వెనకాల గుడ్డువంటి ఉపాదాన కారణం ఏదీ లేదు గదా! ఇలాంటి కార్యం ఎలా పుడుతోంది?

**వశిష్ఠుడు**: అదేమిటయ్యా? శుద్ధమైన చిదాకాశంయొక్క ప్రకాశస్వరూపమే జగత్తు అని చాలా సార్లు చెప్పుకున్నాం గదా! చిదాకాశంలో ఇలా అకస్మాత్తుగా జగద్రూపాలు భాసించడాన్నే శ్రుతులు "సోఽకామయత" "తదైక్షత" ఇత్యాది వాక్యాలలో ప్రస్తవించి, దానికి హిరణ్య గర్భుడియొక్క కామమనీ, ఈక్షణమనీ, సత్యసంకల్పమనీ – ఇలాంటి పేర్లు పెట్టాయి. ఆ సంకల్పంలో ఏదనుకుంటే అది జరిగిపోతుంది. అంతకు మించిన ఉపాదాన కారణం అక్కడ ఏముంది? ఆ సంకల్పంలో కొంత మందియొక్క వరశాపాదులు సఫలం కావాలనే భావన

ఒకటి వుంది. ఆ భావన ప్రకారం ఆత్మజ్ఞాన సంపన్నులూ, తపస్సంపన్నులూ, అయిన జీవులు పెట్టే వరశాపాదులు ఫలిస్తూ వుంటాయి. కనుక వాటికి ప్రత్యేకమైన ఉపాదాన కారణాలు అక్కరలేదు.

అందుకనే నేను వరశాపాదులు, స్వప్నాదులు, గూడా శుద్ధ చైతన్య స్వరూపాలే అని చెప్పాను. ఈ రకంగా ఆలోచించుకుంటూ వెడితే, జగత్తులో జడచేతన విభాగం నిరర్థకమే! అలాగే సృష్టి ప్రళయ విభాగం కూడా నిరర్థకమే! నిజమైన తత్త్వదర్శనం జరిగితే యిలాంటి భేదాలేవీ స్ఫురించవు (స. 186)

**గమనిక–** కుందదంతోపాఖ్యానం తరువాత వశిష్ఠమహర్షి తన ఉపదేశాన్ని ఉపసంహారం వైపు మళ్ళించదలచుకున్నాడు. అందువల్ల 186వ సర్గ నుంచి 189వ సర్గ దాకా, 4 సర్గల పాటు, తన సిద్ధాంతం మొత్తాన్ని మరొక సారి సంగ్రహంగా పునరుక్తి చేశాడు. ఆ ప్రసంగంలో నియతిని గురించి విస్తారంగా వివరించి, అది పరబ్రహ్మయొక్క రూపాంతరమే అన్నాడు. పరబ్రహ్మ తన తాత్త్విక స్వరూపాన్ని మరిచిపోయి జగద్రూపాన్ని పొందుతోంది అన్నాడు. అందువల్లే జగత్తుకు సత్యస్థితి లేదన్నాడు. కనుకనే, జీవోత్పత్తి ప్రళయాదులన్నీ భ్రాంతిమాత్రాలే అన్నాడు.సూక్ష్మ భ్రాంతి గట్టిపడి, స్థూల ప్రపంచంగా కనిపిస్తోందన్నాడు. అంతా చెప్పి చెప్పి, చివర్లో

**భ్రాన్తిరేవేదమఖిలం**
**బ్రహ్మైవాభాతమేవవా ॥** (ని.ఉ.స. 189, శ్లో.20)

(తా॥ ఈ సంసారమనేదంతా భ్రాంతి మాత్రమే! లేకపోతే, పరబ్రహ్మే ఇలా జగజ్జీవాది రూపాలతో భాసిస్తోంది.) అన్నాడు.

దీని ద్వారా భ్రాంతే బంధమనీ, స్వస్వరూప విజ్ఞానమే మోక్షమనీ, ఒక నిష్కర్ష చూపించాడు. అది చాలక 190వ సర్గ మొదటి శ్లోకంలో.

**జ్ఞానస్య జ్ఞేయతాపత్తిః**
**బంధ ఇత్యభిధీయతే ।**
**తస్యైవ జ్ఞేయతా శాన్తిః**
**మోక్ష ఇత్యభిధీయతే ॥** (ని.ఉ.స. 191, శ్లో.1)

(జ్ఞానానికి జ్ఞేయత్వం పట్టడమే బంధం. దానికి ఆ జ్ఞేయత్వం అణగారిపోవడమే మోక్షం) –అని పునరుక్తి చేశాడు.

## 70. ప్రశ్న-సమాధానాలు

దీనిని గమనించిన శ్రీరాముడికి, ఇక వశిష్ఠమహర్షి ఇతర సభాసదుల కోసం విషయాలను నిష్కర్ష రూపంగా ప్రదర్శించి చూపదలచుకుంటున్నాడని అర్థమైంది. అందుకే, తను గూడా దానికి అనుకూలంగా ఎక్కడికక్కడ చిన్న చిన్న ప్రశ్నలను సంధించడం ప్రారంభించాడు. దీనిని వాల్మీకి మహర్షి, ఒక శ్లోకంలో ప్రశ్న, మరో శ్లోకంలో సమాధానంగా, 89 శ్లోకాలకు విస్తరింపజేశాడు. ఇది పరిష్కారాలతోనూ, నిష్కర్షలతోనూ, విషయ విస్పష్టతకు అనుకూలంగా సాగిన సంభాషణ కనుక దీనిని మనం ఒకింత సావధానంగా సమీక్షిద్దాం.

***శ్రీరాముడు***: గురుదేవా! జ్ఞానానికి జ్ఞేయత్వం అణగారేదెలా? నేను బద్ధుణ్ణి అనే ఆలోచన బాగా గట్టిపడిపోయింది గదా, అది మరలిపోవడం ఎలా?

***వశిష్ఠుడు***: సరియైన జ్ఞానప్రబోధం కలిగితే, భ్రాంతిని కలిగించే మందబుద్ధి తొలగిపోతుంది. దానివల్ల నిరాకారమూ, శాశ్వతమూ,శాంతమూ, ఐన ముక్తి జ్ఞాన భూమికాక్రమంలో సిద్ధిస్తుంది.

***శ్రీరాముడు***: ఒక పదార్థంలో అనేకమైన అంశలు, గుణాలు వుంటే,దానిని గురించిన జ్ఞానం క్రమక్రమంగా

పెరిగి చివరికి అది సరియైన (సమ్యక్) జ్ఞానం ఐతే కావచ్చు. కాని, మీరు చెప్పేది ఏ అంశలూ, గుణాలూ, లేని కేవల చిత్పదార్థంయొక్క జ్ఞానం. దానికి సమ్యక్జ్ఞానం అనే మాట ఎలా వర్తిస్తుంది?

**వశిష్ఠుడు**: జ్ఞానానికి జ్ఞేయత్వం వుండే వీలే లేదు. శుద్ధమైన కేవల జ్ఞానాన్ని గురించి చెప్పే వీలూ లేదు. అందుచేత అజ్ఞానంవల్ల కలిగిన భ్రాంతులన్నీ తొలగిపోగా, చిట్టచివరికి ఏ జ్ఞానం మిగిలిపోతుందో, దానికే సమ్యక్జ్ఞానం అని పేరు.

**శ్రీరాముడు**: జ్ఞానంలో తనకంటే భిన్నమైన జ్ఞేయత్వం ఏమౌతుంది? ఇంతకూ మీరు వాడే 'జ్ఞానం' అనే పదానికి 'తెలుసుకొనుట' అనే భావార్థమా? లేక 'తెలుసుకొనుటకు సాధనమైనది' అనే కరణార్థమా? దేనిని తీసుకోవాలి?

**వశిష్ఠుడు**: 'జ్ఞానం' అంటే 'తెలుసుకొనుట' అనే భావార్థకమే! ఇలాంటి జ్ఞానం విషయంలో జ్ఞానానికీ, జ్ఞేయానికీ భేదం లేదు. అవి వాయువూ – కదలికా వంటివి.

**శ్రీరాముడు**: అలా ఐతే, భ్రాంతిజన్యమైన ఈ జ్ఞానజ్ఞేయవిభాగం కుందేటి కొమ్ము వంటిది కావాలి. అలాగైతే దానివల్ల ఏ రకమైన వ్యవహారమూ జరగడానికి వీలు లేదు. కానీ లోకంలో జ్ఞానజ్ఞేయ విభాగంవల్లే భూత భవిష్యత్ వర్తమాన వ్యవహారాలన్నీ జరిగిపోతున్నాయి.

**వశిష్ఠుడు**: లేని వస్తువు కనిపించడానికీ వీలు లేదు, దానివల్ల సుఖదుఃఖాలు కలగడానికీ వీలు లేదు– అని నువ్వు ఆలోచిస్తున్నావు. అలా ఐతే, స్వప్నం ఏలా కనిపిస్తోంది? సుఖదుఃఖాలను ఎలా కలిగిస్తోంది? కనుక ఒక పదార్థం వున్నదా, లేదా, అని తేల్చ గలిగేది, కనిపించడమూ గాదూ, సుఖదుఃఖ ప్రదాన సామర్థ్యమూ గాదు. ఆ పదార్థానికి బాధ లేకపోతే అది వున్నట్టు. బాధ వుంటే అది కనిపిస్తున్నప్పుడు గూడా లేనట్టే! (బాధ అంటే రజ్జు సర్పం లాగా కారణంతో సహా తొలగిపోవడం.) ఈ నిష్కర్ష ప్రకారం చూస్తే, నీకంటే భిన్నంగా, నీకంటే బయటగా, ఏ పదార్థం కనిపించినా, అది భ్రాంతివల్ల పుట్టిందే! నీ లోపల నీకంటే వేరే పదార్థం వుండేందుకు వీలు లేదు. కనుక లోపల గాని, బయట గాని, పదార్థమనేది ఏదీ వుండటానికే వీలు లేదు. కనుక వ్యవహారమనేదే లేదు.

**శ్రీరాముడు**: అదెలా కుదురుతుంది? గురుదేవా? నువ్వనీ, నేననీ, పంచభూతాలనీ, ఇలా ఈ ప్రపంచమంతా ప్రత్యక్షంగా కనిపిస్తూ వుంటే, ఇది అసలు లేనే లేదు పొమ్మనడం ఎలా?

**వశిష్ఠుడు**: నువ్వు ఈ సృష్టిలోని పదార్థాలను తీసుకొని, వాటికి గల కార్యకారణ సంబంధాలను విచారణ చేస్తూ, తద్వారా వాటి సత్యత్వాన్ని నిర్ణయించాలని ప్రయత్నం చేస్తున్నావు. ఉదాహరణకు, సత్యమైన మట్టిముద్దలోంచి వచ్చింది గనుక, కుండ సత్యమంటున్నావ్. నీ ప్రయత్నం మంచిదే! కానీ ఇంకా బాగా వెనక్కు వెళ్ళు. సృష్టి మొదటి దాకా వెళ్ళు. అక్కడ, ఈ సృష్టికి వెనకాల, మాయతప్ప వేరే సామాగ్రి ఏమీ లేదు? కనుక సృష్టి ప్రారంభంలో పుట్టిన విరాట్పురుషుడు, పంచభూతాలు, మొదలైనవన్నీ భ్రాంతిమయాలు కాకతప్పదు. అందువల్ల ఇప్పుడు మనకు కనిపిస్తున్న పదార్థాలు గూడా భ్రాంతిమయాలని చెప్పక తప్పదు. అందుచేత ప్రత్యక్షంగా కనిపిస్తున్నా సరే, ఈ లోకమూ, దీని వ్యవహారాలూ – అన్నీ లేనివే అవుతున్నాయి.

**శ్రీరాముడు**: ఇదంతా రోజూ కనిపిస్తోంది. భూత భవిష్యత్ వర్తమానాలన్నీ దీనితోనే జరిగిపోతున్నాయి. అలాంటి ఈ ప్రపంచాన్ని చూపించి "ఇది అసలు పుట్టనే లేదు – ఎందుకంటే తత్త్వజ్ఞానం చేత ఇది బాధింపడుతోంది గనుక" – అనేస్తున్నారేమిటి?

**వశిష్ఠుడు**: అనక ఏం చేసేదయ్యా? స్వప్న ప్రపంచాలు, మృగతృష్ణాదులు, ఇద్దరు చంద్రుల దర్శనాలూ, పగటి కలల గాలి మేడలు, ఆకాశంలో కనిపించే వెంట్రుక చుట్టలు – ఇలాంటివన్నీ భూతభవిష్యత్వర్తమాన వ్యవహారాలుగా నిత్యమూ కనిపిస్తూనే యథార్థ జ్ఞానం కలగంగానే బాధింపబడుతున్నాయి. ఇది లోకానుభవ

సిద్ధం. అందుకే, నువ్వు, నేను, అంటూ వ్యవహారాలు కల్పించే ఈ ప్రపంచమంతా మిథ్య అని నేను అంటున్నాను.

***శ్రీరాముడు***: నువ్వు, నేను, వాడు, వీడు – అనే ఈ వ్యవహారం సృష్టి ప్రారంభం నుంచీ వుంది గదా! అప్పటినుంచీ సుఖదుఃఖానుభవాలను ఇస్తూనే వుంది కదా! అది పుట్టనేలేదని ఏ యుక్తితో చెప్పగలం?

***వశిష్ఠుడు***: నువ్వు చెప్పిన యుక్తే ! కారణం లేకుండా ఏ కార్యమూ పుట్టదు. ఇది ఖాయం గదా! ప్రళయం వచ్చి పంచభూతాదులన్నీ నశించిపోయాక, మళ్ళీ ప్రపంచం పుట్టడానికి వేరే కారణం లేదు గదా! కారణం లేకుండానే ఇది పుట్టినట్లు కనిపిస్తోంది గదా! ఈ యుక్తిని బట్టే, ఇది పుట్టలేదనీ, ఇది జ్ఞానం చేత బాధింపడుతుందనీ, మేము చెబుతున్నాం.

***శ్రీరాముడు***: మహా ప్రళయంలో అన్నీ పోయినా, అజము, అవ్యయము అయిన పరబ్రహ్మ పదార్థం మిగిలి వుంటుంది గదా! అదే, ఆ తరువాత సృష్టికి కారణమని ఎందుకు చెప్పకూడదు?

***వశిష్ఠుడు***: కారణంలో అతర్గతంగా దాగివున్న కార్యం మాత్రమే ఆ కారణంలోంచి పుడుతుంది. కుండలోంచి వస్త్రం పుట్టదు గదా! నువ్వు చెప్పిన అజము, అవ్యయము, అయిన పరబ్రహ్మ పదార్థంలో అంతర్గతాంశాలేవీ లేవు గదా! కనుక దానిలోంచి జగత్తు ఎలా పుట్ట గలదు?

***శ్రీరాముడు***: మహాప్రళయం వచ్చినప్పుడు ఈ జగత్తంతా సూక్ష్మ రూపంలో పరబ్రహ్మలో ఇమిడి వుంటుందనీ, దాంట్లోంచే మళ్ళీ రెండో సృష్టి జరుగుతోందనీ, ఎందుకు చెప్పకూడదు? (సాంఖ్యులు ఇలాగే చెబుతున్నారు గదా!)

***వశిష్ఠుడు***: మహాప్రళయ సమయంలో ఈ సృష్టి పరబ్రహ్మలో యిమిడి వుండడాన్ని చూసిన వాడెవడైనా వున్నాడా? వేరే ప్రమాణం ఏదైనా వుందా?– అని ఆలోచిస్తే, అలాంటివేవీ కనిపించడం లేదు. పైగా వేదప్రమాణం దానికి విరుద్ధంగా వుంది. ఎందుకంటే, పరబ్రహ్మ చిదేక రసస్వరూపమనీ, దానిలో యిమిడివున్న అంశలు వేరే ఏమీ లేవనీ, శ్రుతి చాలా సార్లు చెప్పింది.

***శ్రీరాముడు***: ప్రళయ సమయంలో ఈ ప్రపంచమంతా మాయా స్వరూపంతో లేనిదే అని ఒప్పుకుందాం. అది అప్పుడు జ్ఞాన స్వరూపంతోనే వుంది అందాం. ఆ రకమైన జ్ఞానంలోంచే ఈ జగత్తు వచ్చింది అందాం! ఆ విధంగా ఆ పరబ్రహ్మే ఈ జగత్తుకు కారణం అందాం.ఇలా అంటే తప్పేమిటి?ఇలా ఎందుకు అడుగుతున్నానంటే, బొత్తిగా అస్తిత్వమే లేని అసత్తుకి సత్త్వం రానే రాదు గదా! అందుకోసం అంటున్నా.

***వశిష్ఠుడు***: అలా అయితే, నువ్వు జ్ఞానమే జగత్తు అని చెప్పినట్టైంది. అలాంటప్పుడు జగత్తుకు సృష్టి ప్రళయాలు ఎక్కడినుంచి వస్తాయి? విశుద్ధ జ్ఞానానికి సృష్టి ప్రళయాలు వుండవు గదా!

***శ్రీరాముడు***: ఈ సృష్టి ఒకప్పుడు లేదు. తరువాత వచ్చింది. అంతవరకూ ఖాయం. దీనికి భ్రాంతి కారణం అని మీరంటున్నారు. ఈ భ్రాంతికి కారణమేమిటి?

***వశిష్ఠుడు***: రామా! కార్యకారణభావం ఒకటి సత్యం అనుకొని, నువ్వు ఇన్ని ప్రశ్నలు వేస్తున్నావు. కార్యకారణ సంబంధం అనేదే అస్తిత్వం లేనిది. ఎందుకంటే, వాస్తవమైన కారణం గానీ, వాస్తవమైన కార్యం గానీ, లేనే లేవు. తెలియబడేది (చేత్యం), తెలుసుకునేది (చిత్ లేక చేతనం), తెలుసుకొనుట (చైతన్యం), అనే ఈ మూడూ, నీ ఆత్మయొక్క స్వరూపాలే!

***శ్రీరాముడు***: మీరు చెప్పేది నిజమైతే, వట్టి యంత్రతుల్యమై, జడమైన ఈ శరీరం చేతనం (తెలుసుకునేది) ఐపోతుంది. సర్వవిజ్ఞాననిధియైన ఈశ్వరుడు జడమైపోతున్నాడు. అంటే, కట్టె కాలుస్తోంది, నిప్పు తగలబడిపోతోంది – అన్నట్టుంది మీ మాట.

***వశిష్ఠుడు***: నేను చెప్పింది అది గాదు. ద్రష్ట ఎప్పటికీ దృశ్యం కాదు. ఎందుకంటే దృశ్యం అనేది లేనే లేదు గనుక. చిద్ఘనుడైన ద్రష్ట ఒక్కడే త్రిపుటీ రూపంగా– అంటే, జ్ఞాతృ, జ్ఞేయ, జ్ఞాన రూపంగా – కనిపిస్తోందని

నేను నీకు చెప్పాను.

***శ్రీరాముడు***: సృష్టి ప్రారంభ సమయంలో మొట్టమొదటి సృష్టిని తెలుసుకునే జ్ఞాత ఎవడో ఒకడు వుండే వుండాలి. జ్ఞాత లేని జ్ఞేయం వుండడం అసాధ్యం కదా! ఆ సమయంలో సృష్టికి వెనకాల శుద్ధచిత్తు ఒకటే వుంది కనుక, ఆ ప్రథమ పదార్థాలకు అదే జ్ఞాత అని చెప్పక తప్పదు. అలాంటి స్థితిలో ఆ ప్రథమ దృశ్య పదార్థం ఎట్లా పుట్టింది?

***వశిష్ఠుడు***: రామా! సృష్టి ప్రారంభంలో దృశ్య పదార్థం ఏదో ఒకటి పుడుతుందని మేమంటే, అది ఎలా పుట్టిందని నువ్వు అడగాలి. అలా మేం ఎప్పుడూ అనలేదే! మేం ఎప్పుడూ చెప్పేది ఏమిటంటే, సృష్టిమధ్యలో గానీ, మొదట్లో గానీ, ఎప్పుడైనా సరే, దృశ్యమనేదానికి వెనకాల సరియైన కారణం లేదు. కనుక దృశ్యం అనేది అసలు లేనే లేదు. అది లేదు గనుక, చిత్ అనేది నిత్యముక్తం. అది మాటలకు అందదు.

***శ్రీరాముడు***: అలా ఐతే 'అహం' స్ఫురణ ఎలా వచ్చింది? ఈ జగత్తును చూస్తున్నాననే జ్ఞానం ఎలా వచ్చింది? బతికి వున్నాననే భావం ఎలా వచ్చింది?

***వశిష్ఠుడు***: మొదట్లోనే ఈ సృష్టికి కారణం లేదు. అందుచేత ఏదీ పుట్టనే లేదు. ఈ సృష్టి అంతా భ్రాంతిమాత్రం . కనుక వున్నదంతా భ్రాంతే!

***శ్రీరాముడు***: ఐతే, మీ లెక్క ప్రకారం ఉన్నది పరబ్రహ్మ ఒక్కటే! అది మాటలకు అందదు. దానికి జ్ఞానం లేదు, జ్ఞేయం లేదు. అది నిత్యం, స్వయం ప్రకాశం, నిర్మలం. ఐతే భ్రాంతి ఎవడికి? ఆ భ్రాంతి ఎలాంటిది?

***వశిష్ఠుడు***: రామా! భ్రాంతికి వెనకాల కారణమే లేదు. కనుక భ్రాంతి అనేదే లేదు. "నువ్వు, నేను, అన్నీ" ఈ మొదలైనవన్నీ పరమప్రశాంతమైన పరబ్రహ్మే!

***శ్రీరాముడు***: గురుదేవా! ఏదో గందరగోళంగా వుంది. ఏమి అడగాలో తోచడం లేదు. కానీ పరిపూర్ణంగా జ్ఞానం కలుగలేదు. ఇక నేనేమి అడిగేది?

***వశిష్ఠుడు***: అలా కాదయ్యా! నువ్వు కారణ పరంపరావిచారణ చేస్తున్నావు. ఈ కారణాలన్నిటి సారాన్ని నిగ్గ తేల్చే ఒరిపిడి రాయి వంటిది ఏదో ఒకటి వుండే వుంటుంది. అది తెలిస్తే కారణాలన్నీ క్షయించి పోతాయి. ఉదాహరణకు, ప్రశ్నకు కారణం సందేహం. దానికి కారణం అజ్ఞానం. అది పోతే ఇక సందేహాలూ లేవూ, ప్రశ్నలూ లేవు. అప్పటిదాకా నన్ను అడుగుతూనే వుండు. ప్రశ్నలన్నీ పోతే, పరమ పదంలో నీ అంతట నువ్వే విశ్రాంతిని పొందుతావు.

***శ్రీరాముడు***: గురుదేవా! మీ సిద్ధాంతం ప్రకారం సృష్టి వెనకాల కారణం లేదు గనుక సృష్టి అనేదే లేదు. అంతవరకూ నాకు అర్థమైంది. ఐతే, జ్ఞాత, జ్ఞేయము – అనే విభాగ భ్రాంతి ఎవడికి పుట్టింది? ఎలా పుట్టింది?

***వశిష్ఠుడు***: రామా! నీకు విషయం బుద్ధిపరంగా తెలిసింది. కానీ, ఆ విషయం మీద నీకు అభ్యాసం లేదు. అందుకే, లేని భ్రాంతి నిన్ను పట్టుకుంటోంది.

***శ్రీరాముడు***: గురుదేవా! అలా ఐతే , అభ్యాస రాహిత్యం ఎందుకు కలుగుతోంది? అభ్యాసం ఎందుకు కలుగుతోంది? అదీ గాక ఈ అభ్యాసం గూడా ఒక భ్రాంతే కదా! ఇది ఎక్కడి నుంచి పుట్టింది మళ్లీ?

***వశిష్ఠుడు***:"నేను అజ్ఞాన దశలో వున్నాను. ఇది సత్యం" అనుకుని, నువ్వీ ప్రశ్న వేస్తున్నావు. అది నిజమే అనుకున్నా,

నువ్వు అజ్ఞాన దశలో వున్నంతమాత్రాన అనంతుడైన పరమాత్మయొక్క అనంతత్వం తగ్గదు. అందుచేత ఈ అభ్యాసభ్రాంతి గూడా ఆ మహాచైతన్యమే! కనుక నీ ప్రశ్నలో సారం లేదు!

***శ్రీరాముడు***: జీవన్ముక్తులైన మీబోటివారికి ప్రపంచ భ్రమంతా శాంతించిపోతుంది గదా! ఐనా సరే, మా

బోటివాళ్ళకు ఉపదేశించాలనుకోవడం, దానికోసం శబ్ద సంపదను స్వీకరించడం, ఉపదేశ్య ఉపదేశక భావాన్ని అంగీకరించి మాట్లాడడం – ఇలాంటివన్నీ ఏ కారణం చేత జరుగుతున్నాయి?

**వశిష్ఠుడు**: వాళ్ల దృష్టిలో ఉపదేశాది వ్యవహారం గూడా బ్రహ్మస్వరూపమే! శిష్యుడు, గురువు, ఉపదేశము– మూడూ బ్రహ్మమే! జ్ఞానం కలిగినవాడి దృష్టిలో బంధము, మోక్షము – అనేవి లేనే లేవు.

**శ్రీరాముడు**: మీరు ప్రపంచభ్రమ అసంభవమని తార్కికంగా నిరూపిస్తున్నారు. అది నిజమైతే, లోకంలో వుండే ఈ అజ్ఞానులందరికీ దేశము, కాలము, క్రియ, ద్రవ్యము – మొదలైన భేదజ్ఞానాలు ఎక్కడినుంచి వచ్చాయి? వాటన్నిటికీ అస్తిత్వం ఎక్కడినుంచి వచ్చింది?

**వశిష్ఠుడు**: అజ్ఞానంనుంచే! జీవన్ము క్తి రాకముందు, అజ్ఞానానికి మించి వేరే ప్రపంచ సత్త లేదు.

**శ్రీరాముడు**: మీరు చెప్పే జీవన్ముక్తిలో ద్విత్వమూ లేదు ఏకత్వమూ లేదు. అంటే అక్కడ బోధ్య, బోధకభావం గూడా లేదు. అలా బోధకత్వం లేని బోధకుడు చేసే బోధలో (ఉపదేశంలో) బోధత్వం వుంటుందా? అలాంటి బోధవల్ల ఎవడికైనా మోక్షం కలిగే వీలుందా?

**వశిష్ఠుడు**: తనను గురించి తనకు తెలియని పరబ్రహ్మే జీవుడు. వాడికి బ్రహ్మజ్ఞానం కలిగిస్తే, వాడు బ్రహ్మైపోతున్నాడు. కనుక, ఈ ప్రక్రియలో అజ్ఞాతుడైన బ్రహ్మే బోధ్యుడౌతున్నాడు. బోధ వాడిలోకి చేరుతోంది కనుక, అది గూడా బోధ్యమే అవుతోంది. ఈ విధంగా బోధ, బోధ్యంతోనూ, తద్వారా పరబ్రహ్మతోనూ ఏకత్వాన్ని పొందుతుంది గనుక, బోధలో బోధత్వం లేదనడానికి వీలు లేదు. ఐతే ఈ ప్రక్రియ అంతా నీలాంటి అజ్ఞానుల విషయంలో మాత్రమే సరిపోతుంది. మాబోటి జ్ఞానుల విషయంలో నువ్వు చెప్పిందే నిజం. బోధకు బోధ్యత్వం పట్టే అవకాశమే లేదు.

**శ్రీరాముడు**: మీరు "మాబోటి జీవన్ముక్తులకు" అంటున్నారు. అంటే జీవన్ముక్తుల విషయంలో కూడా 'నేను, మేము' వంటి శబ్దాలతో సంబంధం వుంటుందన్నమాట. అంటే వాళ్ళల్లో గూడా అహంస్ఫురణ వుందన్నమాట. ఐతే, వాళ్ళల్లో అజ్ఞానం అనేది బొత్తిగా లేదు గనుక, ఈ అహంత అజ్ఞానంవల్ల పుట్టిందని చెప్పడానికి వీలు లేదు. కనుక వాళ్ళల్లో వున్న జ్ఞానమే ఇలా మారిందని చెప్పాలి. అప్పుడు బోధ వేరు, అహంత వేరు అని ఒప్పుకోక తప్పదు. అహంత అన్నా, జీవుడన్నా ఒక్కటే! యిలాంటి జీవుడు చిన్మాత్ర స్వరూపుడైన మీలోకి ఎలా ప్రవేశించాడు?

**వశిష్ఠుడు**: గాలినే కదలిక అంటారు. కదలికనే గాలి అంటారు. అలాగే జీవన్ముక్తుల విషయం స్వస్వరూపమైన బోధనే (జ్ఞానాన్నే) అహంత అని కూడా పిలుస్తారు. ఈ అహంత వేరు, అజ్ఞాన రూపంలో వుండే అహంత వేరు. అజ్ఞానుల అహంత, దేహాదులమీద నేననే అభిమానంచేత ఏర్పడింది.

**శ్రీరాముడు**: అలా అయితే, 'ప్రశాంత సాగరమే కల్లోల తరంగం' అన్నట్లుగా జీవన్ముక్తులయొక్క జగత్తంతా చిన్మయమే. బోధ్యము – బోధకుడు – బోధ వంటి త్రిపుటులన్నీ కూడా చిన్మయాలే – అని తేలుతోంది గదా!

**వశిష్ఠుడు**: ఇందాక నువ్వు ఒక ప్రశ్న వేశావు. "ద్విత్వము, ఏకత్వము కూడా లేని జీవన్ముక్తుడి విషయంలో బోధ్యబోధకభావం గూడా లేదు గనుక, వాడు చేసే బోధలో బోధత్వం ఎలా వుంటుంది?"– అని. నువ్వు ఇప్పుడు చెప్పినదానిని బట్టి ఆ ప్రశ్నే కుదరదు. నువ్వు సముద్రము, తరంగము – అని రెండున్నాయని ఆలోచించొద్దు. ఉన్నది ఒక్కటే! అదే అనంతం, శాంతం, పరిపూర్ణం, పరమపదం! అదే శుద్ధ అద్వైతం! దానినే పట్టుకో!

**శ్రీరాముడు**: మీరు, ఇందాక మీబోటివాళ్ళ విషయంలో శుద్ధజ్ఞాన– అహంస్ఫురణలు వాయు–స్పందనల వంటివి అన్నారు. శుద్ధాద్వైత పక్షమే ఖాయమైతే, ఒక సారి జ్ఞానమనీ, ఒక సారి అహంస్ఫురణ (అహంత) అనీ– ఇలా వికల్పంగా కల్పన చేసేవాడు ఎవడు? కల్పించబడిన ఈ అహంతను అనుభవించేవాడు ఎవడు?

ఎవడో ఒకడు వుండి తీరాలి. జీవన్ముక్తులకే ఈ రకమైన వికల్ప కల్పన తప్పలేదంటే, ఇక మామూలువాళ్ళ సంగతి చెప్పేదేముంది? కనుక ఈ కల్పన ఎవరికైనా తప్పదు. ఇది తప్పకపోతే 'జగత్భ్రాంతి' అనే కల్పన కూడా తప్పదు. అది తప్పకపోతే బంధమోక్ష వ్యవహారం గూడా తప్పదు. ఇక శుద్ధాద్వైతంవల్ల మీకు వచ్చిన లాభం ఏమిటి?

***వశిష్ఠుడు***: జ్ఞేయమైన విషయం సత్యమనే అభినివేశం వుంటేనే బంధం ఏర్పడుతుంది. తత్త్వవేత్తలకు అది వుండదు. వారి దృష్టిలో శుద్ధ జ్ఞానమే వివిధ పదార్థాల రూపాలలో కనిపిస్తోంది. కనుక వాళ్ళకి బంధమోక్షాలతో సంబంధం అసంభవం.

***శ్రీరాముడు***: దీపంవల్ల నల్లని వస్తువు నల్లగా కనిపిస్తోంది. తెల్లని వస్తువు తెల్లగా కనిపిస్తోంది. అంతే గాని, దీపమే నల్లవస్తువుగా, తెల్లవస్తువుగా, మారదు. అలాగే, శుద్ధ జ్ఞానంవల్ల ఆ యా పదార్థాలు కనిపిస్తున్నాయంటే, అవి అక్కడ నిజంగా వున్నాయి కనుక కనిపిస్తున్నాయి - అని చెప్పాలి. కాబట్టి, జ్ఞానం అనే సాధనవల్ల పదార్థాల సత్యత్వం నిరూపితమౌతోంది. ఇది లోకానుభవం. మీరేమో, జ్ఞానంవల్ల సమస్త పదార్థాలకూ బాధ కలుగుతుందంటున్నారు. ఇది ఎలా కుదురుతుంది?

***వశిష్ఠుడు***: ప్రాపంచిక పదార్థాలకు అస్తిత్వం లేదనే మాటను వేరే ప్రక్రియ ద్వారా పూర్వమే సాధించేశాం. వాటి వెనకాల సరియైన కారణం లేదు గనుక వాటికి అస్తిత్వం లేదన్నాం. అలాంటి అసత్పదార్థాలు కనిపిస్తున్నాయి అంటే ఆ దర్శనం శుక్తిరజతదర్శనం వంటి దర్శనమే కావాలి. అలాంటి దర్శనం భ్రాంతి వున్నంత వరకే వుంటుంది. ఆ పైన అది వుండలేదు. తత్త్వవేత్తలకు భ్రాంతి లేదు. కనుక వాళ్ళకు బాహ్య పదార్థ ప్రసక్తీ లేదు.

***శ్రీరాముడు***: మీరు చెప్పిన శుక్తి రజతం గానీ, స్వప్నం గానీ, సత్యమో, అసత్యమో, ఆ మాట దేవుడెరుగు. వాటివల్ల దుఃఖం మాత్రం వస్తూనే వుంది. ఈ జగద్భ్రాంతి గూడా అలాగే వుంది. ఆ దుఃఖం పోయే ఉపాయమేమిటి?

***వశిష్ఠుడు***: స్వప్నంవల్ల వచ్చే దుఃఖాలన్నీ మెలకువ వస్తే పోతాయి. అలాగే తత్త్వజ్ఞానం కలిగితే జగద్దుఃఖాలు శమిస్తాయి. దానికి అదే ఉపాయం.

***శ్రీరాముడు***: స్వప్నానికి, ప్రపంచానికి, పోలిక కుదిరినంత మాత్రాన మనకు ఒరిగింది ఏముంది? స్వప్నంలో గానీ, జాగ్రత్తులో గానీ, కనిపించే పదార్థాల ఆకారాలు తొలగిపోయేదెలా?

***వశిష్ఠుడు***: మెలకువ వచ్చాక, పూర్వాపర పరిశీలన చేసుకొని చూసుకుంటే, స్వప్నంలో కనిపించిన బండరాళ్ళకు కూడా అస్తిత్వం లేదని తేలిపోతుంది. అలాగే, తత్త్వజ్ఞానం ద్వారా పూర్వాపరవిమర్శ చేసుకుంటే, జాగ్రత్పదార్థాలు సత్యమనే భావన తొలగిపోతుంది.

***శ్రీరాముడు***: పూర్వాపర విమర్శచేత, ఎవడికి అలాంటి సూక్ష్మ బుద్ధి కలిగిందో, అలాంటి జీవన్ముక్తుడు దేనిని చూస్తాడు. వాడికి సంసార భ్రాంతి ఎలా నశిస్తుంది?

***వశిష్ఠుడు***: వాసనలు క్షయించిన జీవన్ముక్తుడికి ఈ ప్రపంచం అంతా కూలిపోయిన కొంప లాగాను, అసలే లేనిదాని లాగానూ, ఊహలలో కనిపించే గాలిమేడల లాగానూ, వర్షానికి తడిసి చెరిగిపోతున్న గోడమీది బొమ్మ లాగాను, కనిపిస్తుంది.

***శ్రీరాముడు***: అలాంటి జీవన్ముక్తుడికి వాసనలు తగ్గిన తరువాత కలిగే అనుభవం ఏమిటి?

***వశిష్ఠుడు***: వాడికి క్రమేణా ఉత్తరోత్తరజ్ఞానభూమికలు అంది, మిగిలిన కొద్దిపాటి వాసనలు గూడా నశించి, నిర్వాణం లభిస్తుంది.

***శ్రీరాముడు***: ప్రపంచ వాసన అనేది అనేక జన్మలనుంచీ నాటుకొని వస్తోంది కదా! అలాంటిది ఈ జన్మలో

ఎలా నశిస్తుంది?

***వశిష్ఠుడు***: ఉన్న విషయం వున్నట్లు తెలిసే సరికి, భ్రాంతి జన్యమైన ఈ దృశ్య ప్రపంచం మొదట దగ్ధబీజ న్యాయంగా మిగిలిపోతుంది. అప్పటినుంచీ క్రమంగా ప్రారబ్ధశేషాన్ని అనుభవిస్తూ రావడంవల్ల, క్రమంగా అది గూడా లేకుండా పోతుంది.

***శ్రీరాముడు***: అలాంటి జీవన్ముక్తుడికి మొదట దృశ్యపదార్థాలను పదార్థాలుగా స్వీకరించడం పోయిన తరువాత (పిండగ్రహణం పోయిన తరువాత), ఆ స్థితి నుంచి విక్షేపం రాకుండా వుండేందుకు ఉపాయం ఏమిటి? వాడికి సుస్థిరమైన శాంతి ఎలా లభిస్తుంది?

***వశిష్ఠుడు***: వాడి చిత్తం ఆత్మ స్వరూపంగా మారిపోతుంది. కనుక, ఇకపైన చిత్తాన్ని నిరోధించవలసిన శ్రమ వాడికి వుండదు. వాడికి భోగాసక్తి గూడా తుడిచిపెట్టుకు పోతుంది. అంతకన్నా వాడేమీ చేయనక్కర లేదు.

***శ్రీరాముడు***: ఈ ప్రపంచం పసివాడి ఆలోచనలంత నిస్సారంగా వున్నా, దానిమీద ఆసక్తి తగ్గడం మాత్రం ఎక్కడా కనిపించడం లేదు. లోతైన ఆలోచనలు లేని పసివాడు గూడా తనకు కావలసిన పదార్థాలు చెడిపోతే ఏడుస్తూనే వున్నాడు. ఇలాంటి స్థితిలో ఎవడికైనా సరే భోగాసక్తి నశించిపోవడం ఎలా సంభవం?

***వశిష్ఠుడు***: తను వెంటపడుతున్న పదార్థం భ్రాంతిజన్యమని తెలిస్తే, అది పోయినప్పుడు దుఃఖం రాదు. కనుక భ్రాంతి జన్యమైన పదార్థమేదో, సత్యమైన పదార్థమేదో, తెలుసుకునేందుకు గట్టి విచారణ చేస్తే, దానివల్ల భోగాశక్తి పోయి శాంతి లభిస్తుంది.

***శ్రీరాముడు***: భ్రాంతి చిత్తంవల్ల కలుగుతోంది. కనుక భ్రాంతిని గురించి తెలియాలంటే చిత్తాన్ని గురించి తెలియాలి. దానిని తెలుసుకునేదెలా?

***వశిష్ఠుడు***:

**చితశ్చేత్యోన్ముఖత్వం యత్**

**తచ్చిత్తమితి కథ్యతే ॥** ( ని.ఉ.స.190, శ్లో.67)

(చిత్తు చేత్యాల వైపుకి (దృశ్యాల వైపుకి) మొగ్గు చూపడం పేరే చిత్తం.) ఇది అనుభవంలోకి రావాలంటే, విచారణ చెయ్యాలి. నేను చేసే బోధలు వినడమే విచారణ. దీనివలన వాసనలు శమిస్తాయి.

***శ్రీరాముడు***: యోగంతో బిగబట్టి ఎంత నిరోధించినా మనస్సు మరణించదు. అది బ్రతికున్నంత కాలం వాసనాశాంతి లభించదు. కనుక శాశ్వతమైన నిర్వాణం లభించాలంటే మనస్సు, అమనస్సు కావాలి. అలాంటి అమనస్కత లభించేది ఎలా?

***వశిష్టుడు***: దృశ్యమనేది లేనే లేదు. ఈ విజ్ఞానం కలిగితే, ఇక చిత్తం దేనిని పట్టుకు వ్రేళ్ళాడుతుంది. పట్టుకునేందుకు ఏదీ లేకపోతే, చిత్తమే మిగలదు. కనుక దృశ్యమార్జనం చేసుకోవాలి. అంటే, దృశ్యాలనేవి లేనే లేవని అనుసంధానం చేసుకుంటూ రావాలి. అమనస్కత్వానికి ఇదే ఉపాయం.

***శ్రీరాముడు***: అనుభవించేదానిని లేదనటం ఏలా? తుడిచిపెట్టడం ఎలా?

***వశిష్టుడు***: అనుభవించబడేది ఏదయ్యా? అజ్ఞులు అనుభవించేది వేరు, విజ్ఞులు అనుభవించేది వేరు. అజ్ఞులు అనుభవించేదానికి అస్తిత్వం లేదు. విజ్ఞులు అనుభవించేదానికి నామరూపాలు లేవు. అది అద్వితీయ వస్తువు.

***శ్రీరాముడు***: అజ్ఞానులకు కనిపించే జగత్తు ఎటువంటిది? అది సత్యం ఎందుకు గాదు? విజ్ఞులకు కనిపించే జగత్తు ఎటువంటిది? అది మాటలకు ఎందుకు అందదు?

***వశిష్ఠుడు***: అజ్ఞులకు కనిపించే ప్రపంచానికి ఆద్యంతాలు వున్నాయి. అంటే, ఉత్పత్తి, వినాశాలు వున్నాయి. విజ్ఞుల జగత్తుకి అవి లేవు. వారి దృష్టిలో ప్రపంచానికి పుట్టకే లేదు గనుక, అది మొదటినుంచీ లేనిదే! అందుకే అది మాటకు అందదు.

**శ్రీరాముడు**: అసలే పుట్టనిది అనుభవానికి ఎలా వస్తుంది?

**వశిష్ఠుడు**: స్వప్నం లాగానే!

**శ్రీరాముడు**: మీరు చెప్పిన స్వప్నంలో గానీ, గాలి మేడలవంటి సన్నివేశాలలో గానీ, జాగ్రద్దశలో వుండే పదార్థాలవల్ల కలిగే సంస్కారాలవల్లే ఆ యా అనుభవాలు కలుగుతున్నాయి.

**వశిష్ఠుడు**: జాగ్రత్తులో ఏ పదార్థాన్ని అనుభవిస్తున్నావో, దానినే స్వప్నంలో అనుభవిస్తున్నావా? వేరే దానిని అనుభవిస్తున్నావా?

**శ్రీరాముడు**: జాగ్రత్తులో వున్నదానినే సంస్కార రూపంగా అనుభవిస్తున్నాను.

**వశిష్ఠుడు**: ఒకడికి తన స్వంత ఇల్లే కలలో కనిపించింది. కాని అది అక్కడ కూలిపోయింది. నువ్వు చెప్పినదాని ప్రకారం అదీ ఇదీ ఒకటైతే, జాగ్రత్తులోని వీడి కొంప గూడా కూలిపోవాలి. కానీ అదలా జరగటం లేదే?

**శ్రీరాముడు**: నిజమే! అదీ, ఇదీ ఒకటే అనడం కుదరదు.అది వేరే, ఇది వేరే, ఇది గూడా పరబ్రహ్మ స్వరూపమే అని మీ ఉద్దేశ్యం అనుకుంటా. కానీ, ఆ బ్రహ్మ ఇప్పుడు మరో ప్రపంచం లాగా ఎందుకు కనిపించాలి?

**వశిష్ఠుడు**: ఈ జాగ్రత్తులో ఇప్పుడు అనుభవించిన విషయాలే స్వప్నంలో కనిపిస్తాయనే నియమం ఏదీ లేదు. అనుభవించినవీ కనిపిస్తాయి, అనుభవించనివీ కనిపిస్తాయి. ఒకోసారి పూర్వం అనుభవించబడినవే కొత్తవి లాగా కనిపించవచ్చు. ఇలాంటి విచిత్రమైన అనుభావాలన్నీ సృష్టి ప్రారంభంనుంచీ ఇప్పటిదాకా ఆ జీవికి జరిగిన అనుభావాలవల్ల కలుగుతూ వుంటాయి. అంటే, ఆ అనుభవాలవల్లే పరబ్రహ్మ ఇప్పుడు మరో ప్రపంచం లాగా కనిపిస్తోంది. ఒకడికి పరబ్రహ్మ స్వరూపమే బాగా అభ్యాసమైతే, వాడికి స్వప్నంలో గూడా అదే కనిపిస్తుంది.

**శ్రీరాముడు**: దీనిని బట్టి బ్రహ్మాభ్యాసం లేనివాడికి, ఈ జాగ్రత్తు గూడా స్వప్నం లాగానే భాసిస్తోందని నాకు అర్థమౌతోంది. కానీ ఇది పిశాచం పట్టినట్టు పట్టుకుంటోంది. దీన్ని వదిలించుకోవడం ఎలా?

**వశిష్ఠుడు**: జాగ్రత్తు అనే ఈ స్వప్నం దేనివల్ల వస్తోందో, విచారించు. కార్యం కారణంకంటే భిన్నం కాదు. అని గ్రహించు. ఇదే నీకు ఉపాయం.

**శ్రీరాముడు**: స్వప్నవస్తువులకు జాగ్రద్వస్తువులే కారణమని ఇందాక పొరపాటు పడ్డాను. వాటికి నిజమైన కారణం చిత్తమే! కనుక ఈ జాగ్రత్ప్రపంచానికి కారణం గూడా చిత్తమే!

**వశిష్టుడు**: చిత్తం అంటే, చేత్యోన్ముఖమైన చిత్తేనని పూర్వమే చెప్పుకున్నాం. కనుక జగత్తుయొక్క అసలైన రూపం చిత్తే!

**శ్రీరాముడు**: అలా అయితే, బ్రహ్మకూ, జగత్తుకూ, మధ్య వున్న అభేదాన్ని చెట్టుకీ, కొమ్మకీ, మధ్య వున్న అభేదం వంటిదని చెబితే బాగుంటుంది. అంతే గాని వీటిలో జగత్తుకు అసలే అస్థిత్వం లేదనడం దేనికి? దీనినే భేదాభేదం అంటార గదా! జగత్తులన్నీ కలిస్తే సమష్టి చిత్తం అవుతుంది. దానికి పరబ్రహ్మతో ఏకత్వం చెప్పండి. వ్యష్టి జగత్తులూ, వ్యష్టి చిత్తాలూ, దాని శాఖల వంటివి అనండి. తప్పేమిటి?

**వశిష్ఠుడు**: ఈ రకమైన సమన్వయం కుదరదు. ఎందుకంటే, ఈ జగత్తుకు వెనకాల సరియైన కారణం లేదు గనుక దానికి అస్తిత్వాన్ని అంటగట్టడానికి వీలు లేదు. అందుచేత జగత్తు అనేది పుట్టనే లేదు. అందుచేత జగత్తుగా కనిపించేదంతా అజరామరమైన పరబ్రహ్మ మాత్రమే! అసలే పుట్టనిదానికి అవయవ కల్పన చేయడంలో అర్థం లేదు.

**శ్రీరాముడు**: ఔను! మీరు చెప్పిందే నిజం! ఈ సృష్టి ప్రళయాలూ, ద్రష్టృత్వ భోక్తృత్వాలు, మొదలైనవన్నీ కాకతాళీయన్యాయం వంటి భ్రాంతులే!

## 71. మూడు దృష్టులు

**వశిష్ఠుడు**: రామా!

**యా వ్యాపారవతీ రసాద్రసవిదాం కాచిత్కవీనాం నవా**
**దృష్టిర్యా పరినిష్ఠితార్థ విషయోన్మేషా చ వైపశ్చితీ।**
**తే ద్వే అప్యవలంబ్య విశ్వమఖిలం నిర్వర్ణితం నిర్వృతం**
**యావద్దృష్టి దృశో న సన్తి కలితా నో శూన్యతా నో భ్రమః॥** (ని.ఉ.స.190, శ్లో. 89)

(తా॥ లోకదృష్టి, యుక్తి దృష్టి, తత్త్వదృష్టి - అని దృష్టులు మూడు రకాలు. ఇవి ఒకదానికన్నా ఒకటి బలమైనవి. నేను యుక్తి దృష్టిని, తత్త్వదృష్టిని ఆశ్రయించి, ప్రపంచమూలాన్ని విశ్లేషణ చేశాను. యుక్తిదృష్టి అనేది పటిష్ఠమైన తార్కిక విచారణ ద్వారా ప్రమాణ ప్రమేయ పరీక్ష చేయగల కవులు (అనగా శాస్త్రవేత్తలు) ఆదరించేది. తత్త్వదృష్టి అనేది శ్రవణ మనన నిదిధ్యాసల ద్వారా పర తత్త్వాన్ని సాక్షాత్కరింప జేసుకున్న జీవన్ముక్తులు ఆదరించేది. ఈ రెండు దృష్టులనూ ఆశ్రయించి ప్రపంచ మూలాన్ని ఎంతవరకు విశ్లేషించానంటే, ఈ మూడు దృష్టులూ, ఆ దృష్టులు గల జీవులూ, ఎక్కడ లేరో, ఎక్కడ శూన్యత్వం గూడా లేదో, ఎక్కడ భ్రాంతి లేదో, అలాంటి పరబ్రహ్మ వరకు విశ్లేషించాను.) స.190.

**శ్రీరాముడు**: మీరు చెప్పింది నిజం గురుదేవా! యుక్తిదృష్టితో ఆలోచిస్తే, ఈ జగత్తు ఒక భ్రాంతి. తత్త్వదృష్టితో ఆలోచిస్తే, ఇది కేవలం బ్రహ్మసత్త!

**వశిష్ఠుడు**: ఔనయ్యా! ఆ పరబ్రహ్మే జీవుడై, మళ్ళీ విచారం చేసి తనే బ్రహ్మననీ, తనే ఈ జగత్తు గూడా అనీ, తెలుసుకుంటున్నాడు.

**శ్రీరాముడు**: ఇదే ఆశ్చర్యంగా వుంది గురుదేవా! సృష్టి వెనకాల, ప్రళయానికి తరువాత, ఆపైన మోక్షదశలోనూ కూడా, పరమాత్మ ఏకరూపంగా ప్రకాశిస్తున్నాడు. కానీ ఆ సమయాలలో దిక్కు అనేది వుండదు. దిక్కు లేని చోట ఏ దీపం మాత్రం ఎలా ప్రకాశించ గలదు?

**వశిష్ఠుడు**: నిజమేనయ్యా! ఇది ఆశ్చర్యకరమే! ఆ మాటను శ్రుతే ఒప్పుకుంది.

"విభుం చిదానంద మరూప మద్భుతమ్॥"

(ఆ పరమాత్మ సర్వవ్యాపి, చైతన్యానంద స్వరూపుడు, అంతకు మించి వేరే రూపం లేనే లేదు. ఆయన ఆశ్చర్య కరుడు.) అంది.

దీనినే స్మృతులలో గూడా,

**ఆశ్చర్యవత్ పశ్యతి కశ్చిదేనం**
**ఆశ్చర్యవద్వదతి తథేవ చాన్యః ।**
**ఆశర్యవచ్చైనమన్యః శృణోతి**
**శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్ ॥** (భ.గీ. 2-29)

(ఒకడు దీనిని ఆశ్చర్యమన్నట్లుగా చూస్తాడు. దీనిని గురించి చెప్పేవాడు గూడా అలాగే చెబుతాడు. వినేవాడు గూడా అలాగే వింటాడు. ఎంత విన్నా, ఇది ఎవడికీ అర్థం గాదు.) అని చెప్పారు.

**గమనిక** - ఈ రెండు ఉటంకింపులూ వ్యాఖ్యాతవి

రామా! నువ్వు చెప్పే చిద్దీపం నువ్వు రోజూ చూసే సూర్యాదులవంటి దీపం కాదు. వాటన్నిటినీ కూడా ప్రకాశింప జేసే దీపం. అది జ్యోతిస్యులకే జ్యోతిస్సు.

ఒకే చైతన్యం స్పన్దదశలో తను ద్రష్టగానే వుంటూ, మరో ప్రక్క తనే దృశ్యంగానూ, దర్శన క్రియగానూ

వుంటుంది. అంటే, చైతన్యం – ద్రష్టా, దృశ్యము – దర్శనము– అనే త్రిపుటిగా వుండటాన్ని ప్రతివాడూ ప్రతిరోజూ ప్రత్యక్షంగా చూస్తూనే వున్నాడు. ఐనా సరే, జాగ్రత్‌ప్రపంచంలో గూడా ఆ చైతన్యమే త్రిపుటీ రూపంగా వుందంటే ఒప్పుకోలేకపోతున్నాడు. వివరించి చెబితే ఆశ్చర్యపోతున్నాడు. ఈ ఆశ్చర్యం అజ్ఞులకే గాని మాబోటివారికి గాదు.

సృష్ట్యాదిలో దిక్కులు లేనప్పుడు చైతన్యం ఎలా ప్రకాశిస్తుందో గదా అంటున్నావు నువ్వు. సృష్ట్యాదిలో గాని, ప్రళయానంతరంలో గాని, మోక్షంలో గాని, భాస్యాలు తొలగిపోతాయే గాని, భాసకం మాత్రం ఎక్కడికీ పోదు. అప్పటి స్థితి జాగ్రత్ స్వప్న సుషుప్తులలో ఏదీ కాదు. కనుక అప్పుడున్న చిద్దీపమే, 'తురీయం' అనబడుతోంది. రామా! ఆ తురీయాన్ని అందుకో. జ్ఞాన భూమికల పరిపాక క్రమంతో దానిని గట్టిపరచుకొని పాషాణ మౌనంలో వుండిపో. నిర్వికల్ప సమాధిలో వుండిపో. ఎవరైనా దర్మార్గులు దీనికి వ్యతిరేకంగా మాట్లాడితే, దానిని పట్టించుకోకు.

***శ్రీరాముడు***: గురుదేవా!

**బుద్ధే యావదియం నామ**
**జగద్భ్రాంతిర్న కించన ।**
**న చాభూన్న చ వాస్తీయం**
**న చ నామ భవిష్యతి ॥** (ని.ఉ.స. 192, శ్లో. 2)

(మీరు చెప్పిన తత్త్వం తెలిస్తే జగద్భ్రాంతి అనేది లేనే లేదు. అది పూర్వమూ లేదు. ఇప్పుడూ లేదు. భవిష్యత్తులోనూ వుండబోదు.)

**గమనిక 1**: ఇదే విషయాన్ని సురేశ్వరాచార్యులవారు, తమ వార్తిక గ్రంథంలో అందంగా చెప్పారు.

**తత్త్వమస్యాది వాక్యోత్థ**
**సమ్యగ్ధీ జన్మ మాత్రతః ।**
**అవిద్యా సహ కార్యేణ**
**నాసీదస్తి భవిష్యతి ॥**

(తా॥ తత్త్వమసి మొదలైన మహావాక్యాలవల్ల సమ్యక్ జ్ఞానం కలిగితే చాలు అవిద్య తన కార్యంతో సహా వుండలేదు, లేదు, వుండబోదు.)

**గమనిక 2**: శ్రీరాముడు ఈ విధంగా ప్రారంభించి తనకు సందేహాలన్నీ తొలగిపోయాయని ప్రకటిస్తూ, దానికి నిరూపణగా గురువుగారు చెప్పిన సిద్ధాంతం సారమొత్తాన్ని సంగ్రహంగా ఒప్పచెప్పాడు. దీనికి వాల్మీకి మహర్షి మూడు సర్గలను కేటాయించాడు. అందులో మొదటి సర్గలో శ్రీరాముడు ఈ దృశ్య ప్రపంచమంతా చిన్మాత్రమేనని వివరించాడు. రెండవ సర్గలో ప్రపంచంలో ద్వైతమే లేదన్నాడు.

**నావిద్యాస్తి హ న భ్రాంతిః**
**న దుఃఖం న సుఖోదయః ।**
**విద్యావిద్యా సుఖం దుఃఖ**
**మితి బ్రహ్మైవ నిర్మలమ్ ॥** (ని.ఉ.స. 193, శ్లో. 10)

(తా॥ అవిద్య లేదు, భ్రాంతి లేదు, సుఖం లేదు, దుఃఖం లేదు. విద్యా, అవిద్య, సుఖం, దుఃఖం, ఇవన్నీ నిర్మల బ్రహ్మ స్వరూపాలే!) అన్నాడు.

మూడవ సర్గలో, పరమసూక్ష్మమైన పరబ్రహ్మలో జీవులందరూ ఎవరికి వారు, వారి వారి బ్రహ్మాండాలను సృష్టి చేసుకుంటున్నా, ఏ ఒక్కటీ రెండవదానితో ఢీ కొట్టడం లేదన్నాడు.

అధ్యాస మీద అధ్యాసగా సృష్టి పరంపర అంతా సాగిపోతోందన్నాడు. అందుకే, ఈ దృశ్య ప్రపంచాలన్నిటికీ

అధిష్ఠానమైన శుద్ధ చైతన్యంకంటే వేరే అస్తిత్వం లేదన్నాడు. ఇలాంటి సత్తాస్థితిలోనే బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులు గూడా రమిస్తూ వుంటారన్నాడు. తనకిక అందవలసింది అందిందనీ, ఇక చేయవలసింది ఏదీ లేదనీ, ప్రకటించాడు.

అది విని వశిష్ఠమహర్షి, ఆనందించి, ఇది కేవలం సిద్ధాంతబోధ కాదనీ, తాను స్వయంగా సాధించి అనుభవించి చెబుతున్నాననీ, బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులు గూడా ఇటువంటి వ్యవహార-అవ్యవహారతీతమైన దశలో వున్నారనీ, కనుక రాముడు గూడా అలాగే వుండిపోవాలనీ, ఉద్బోధించాడు.

శ్రీరాముడు ఆ మాటలకు స్పందిస్తూ, తనకు ఈ ప్రపంచమంతా కలలోని కొండ లాగా కనిపిస్తోంది అన్నాడు.

ఎంతైనా వశిష్ఠుడు నికార్సయిన ఉపాధ్యాయుడు. అందుచేత శ్రీరాముడు చేసిన ప్రకటన విని, “అలా ఐతే, నేనడిగే ప్రశ్నలకు సమాధానాలు చెప్పు, చూద్దాం.” అన్నాడు. ఇక 195వ సర్గలో 11వ శ్లోకం దగ్గరినుంచీ, సర్గ చివరి దాకా వశిష్ఠుడి ప్రశ్నలూ, శ్రీరాముడి సమాధానాలూ సాగాయి. ఐతే, ఇవి 190వ సర్గలోని ప్రశ్న సమాధానాల లాగా ఒక శ్లోకం ప్రశ్న, ఒక శ్లోకం సమాధానం, అనే పద్ధతిలో సాగలేదు. వీటిల్లో వశిష్ఠుడు వేసినవి రెండే ప్రధాన ప్రశ్నలు. ఆ రెంటికీ శ్రీరాముడు చెప్పిన సమాధానం సుమారుగా 60 శ్లోకాలు. ఈ ప్రశ్నలను శ్రీరాముడు పెంచుకుంటూ ఎలా సమాధానం చెప్పాడో ఇప్పుడు సంగ్రహంగా చూద్దాం!

## 72. శిష్యపరీక్ష

***వశిష్ఠుడు***: నిత్యానుభూతమై నెత్తిమీద కూర్చున్న ఈ జగత్తును ఆభాస అనటం ఎలా? లేనే లేదనడం ఎలా?

***శ్రీరాముడు***: గురుదేవా! కారణం లేకుండా ఏ కార్యమూ పుట్టదు. కారణం నుంచి కార్యం పుట్టేందుకు రెండే విధానాలు– (1) పరిణామం (2) వివర్తం.

జగత్తుకు మూలమైన పదార్థం ఒకటి వుందనుకుందాం. అది అవయవ సహితమన్నా కావాలి, అవయవ రహితమన్నా కావాలి.

అది అవయవ రహితమైతే, దానికి పరిణామం జరిగేందుకు వీలు లేదు. అది అవయవ సహితమైతే, దానికి జగద్రూపంగా పరిణామం సంభవించవచ్చు. కాని, పరిణామ ప్రక్రియలో కార్యం పుడితే, ఇక కారణ స్వరూపం అక్కడ వుండదు. చెట్టును కొట్టి బొమ్మగా చెక్కిన తరువాత, ఇక చెట్టు చెట్టుగా వుండడం సాధ్యం కాదు. కనుక, జగత్తు పుట్టిన తరువాత మూలకారణమైన పదార్థం నశించిపోయిందని చెప్పాలి.

అలా చెబితే, ఆ మూల పదార్థం గూడా నశించేవాటి జాతిలోకే చేరుతుంది. అంటే జగత్తులో భాగమై పోతుంది. జగత్తులో భాగం జగత్తుకు మూలకారణం ఎట్లా అవుతుంది? అది అసంభవం. కనుక ఆ మూల పదార్థం అవయవ సహితమనటానికి వీలు లేదు.

కనుక, ఆ మూల పదార్థం అవయవ రహితమే అయి వుండాలి. అలా అయితే, జగత్తు దానిలోంచి, వివర్త ప్రక్రియ ద్వారానే జన్మించి వుండాలి. ఆ మాట ఒప్పుకుంటే, జగత్తు ఆభాసమనీ, మిథ్య అనీ ఒప్పుకున్నట్టే!

ఇంత కంటే వేరే మార్గం లేదు గనుక, జగత్తు నిత్యానుభూతమై నెత్తిన కూర్చున్నా సరే, అది మిథ్య కాక తప్పదు.

దానికి మూలమైన పదార్థం పేరు బ్రహ్మ. అది జడమా? చేతనమా? అని ప్రశ్న. ‘నేను’ అనబడే చేతనపదార్థం జడంలోంచి పుట్టడం అసంభవం. కనుక బ్రహ్మ జడం కావడానికి వీలు లేదు. అది చేతనస్వరూపమే!

మూలభూతమైన ఆ చేతనస్వరూపమే, ఒకొక్క క్షణంపాటు వివర్తాన్ని పొంది, ఒక ఆతివాహిక (సూక్ష్మ) శరీరాన్ని ధరించినట్లు తనకు తనే కనిపిస్తుంది. ఆ ప్రథమ వివర్తరూపం పేరు హిరణ్యగర్భుడు. ఆ హిరణ్యగర్భుడు ఆ క్షణకాలంలోనే ద్విపరార్ధకాల మనబడే చతుర్ముఖ బ్రహ్మాయుష్య కాలాన్ని దర్శిస్తాడు.

**వశిష్ఠుడు**: ఇది ఎలా సంభవం? దీనిని నమ్మడం ఎలా?

**శ్రీరాముడు**: మీ స్వప్నాన్ని బట్టే దీన్ని నమ్మాలి. మీ స్వప్నానుభవంలో ఒక్క క్షణంలోనే ఏళ్ళ తరబడి కథ నడచిపోతోంది. ఇది సంభవమైనట్టే అదీ సంభవం.

కనుక యథార్థ స్థితి ఏమిటంటే, మిథ్యగా ఏర్పడిన ఈ జగత్తులో మొదటి మిథ్యా జీవుడు హిరణ్యగర్భుడు. వీడిద్వారా జరిగే సృష్టి గూడా మిథ్యగానే కొనసాగుతోంది. అంతకు మించి యిక్కడ ఏమీ లేదు.

**వశిష్ఠుడు**: "మిథ్యా, మిథ్య" అంటున్నావు. 'మిథ్యాత్వం' అనే ఈ ధర్మం జగత్తుకు సంబంధించినది – అనే గదా నీ అభిప్రాయం? జగత్తు నిజంగా లేనిదైతే , దానికి మిథ్యాత్వం అనే ధర్మం మాత్రం ఎలా అతుకుతుంది?

**శ్రీరాముడు**: మీరు వాదాలలోకి వెళుతున్నారు. వాటిలోకి వెళితే, అసలు తత్త్వం వాక్కులకు అందనిది కనుక, దానిని ఎంతో కొంత వివరించడం కోసం అనేక రకాలుగా చెప్పవచ్చు. అధిష్ఠానసత్తాదృష్టిలో జగత్తు సత్యమే అనవచ్చు. ఆరోపితజగ ద్దృష్టితో, జగత్తు మిథ్య అనవచ్చు. మిథ్యాత్వానికి స్థానం లేదనే దృష్టితో జగత్తులో మిథ్యాత్వమూ లేదు, సత్యత్వమూ లేదనవచ్చు. ఏదీ తేల్చి చెప్పలేం కనుక, అనిర్వచనీయం అనవచ్చు.

ఇవన్నీ మూల తత్త్వాన్ని అర్థం చేసుకోవడంలో వుండే దృష్టి భేదాలనుబట్టి వచ్చే పేర్లు. నిజమైన తత్త్వజ్ఞుడు బాహ్య దృష్టిని వదిలి, చరమసాక్షాత్కార వృత్తిలో స్థిరపడిపోయి, తనలో తనే శాంతంగా వుండిపోతాడు.

**వశిష్ఠుడు**: అది గాదయ్యా! పెద్ద మఱ్ఱిచెట్టు చిన్న విత్తులో యిమిడి వుందంటున్నారు గదా! అలాగే, ఈ ప్రపంచమంతా పరబ్రహ్మలో యిమిడి సూక్ష్మంగా వుందని ఎందుకు చెప్పరాదు? అలా చెబితే, ఈ జగత్తు సత్యమే అని సమన్వయం చూపించవచ్చును గదా!

**శ్రీరాముడు**: అసలు చెట్టు విత్తులో యిమిడి వుంటుందనే మాట ఎంతవరకు సమంజసమో ఆలోచించాలి. చెట్టు చెట్టుగానే వుండి, పొట్టిదై విత్తు కడుపులో దాక్కుందని ఎవరూ అనలేరు. ఏదో సూక్ష్మాణువుల రూపంలో అది బీజంలో దాగి వుందని చెప్పాలి. బీజంలో వున్న సూక్ష్మాణువులు, బీజానికే అవయవాలు అవుతాయి. ఆ మొత్తం కలిపితేనే అది బీజం. ఇక అక్కడ చెట్టుకి స్థానం ఏది? కనుక విత్తులో చెట్టు దాగి వుందనడం అంత సముచితం కాదు.

ఈ విచారణను పక్కనపెట్టి, విత్తులో చెట్టు దాగి వుందని అంగీకరించినా, బ్రహ్మ జగత్తుల విషయంలో విత్తు–చెట్టు ఉదాహరణ అతకదు. ఎందుకంటే, చెట్టు విత్తు కడుపులో వున్నప్పుడు సూక్ష్మాణురూపంలోన కనిపించి, ఆ తరువాత జల కణాలనూ, మట్టి కణాలనూ కలుపుకొని, వృక్షంగా పెరుగుతోంది. ఈ జగత్తు, ఈ రూపంలో సృష్టికావడానికి ముందు, పరబ్రహ్మ కడుపులో మరేదో సూక్ష్మ రూపంలో వుందనడానికి సాక్ష్యాలేమీ లేవు. ఒక వేళ వున్నా, అది మళ్ళీ స్థూల రూపంగా పెరిగేందుకు, ఇటు విత్తు స్థానీయమైన పరబ్రహ్మకూ, అటు వృక్ష స్థానీయమైన జగత్తుకూ, భిన్నంగా జలాణువుల వంటి పదార్థాలు వేరే ఉండటం సభవం కాదు. కనుక, బీజాంకురోదాహరణం యిక్కడ పని చేయదు.

**వశిష్ఠుడు**: ప్రళయకాలంలో ఈ జగత్తంతా సూక్ష్మ రూపంలో పరబ్రహ్మలోనే దాగి వుందని ఎందుకు చెప్పరాదు?

**శ్రీరాముడు**: పరబ్రహ్మ అవయవ సహితం కావడానికి వీలు లేదని యిందాకనే నిరూపించుకున్నాం. వికారమే లేని నిరవయవ పదార్థంలోంచి, వికార సహితమైన సావయవ పదార్థం పుట్టడం సాధ్యం కాదు. అలాగే ఆకారం లేనిదానిలోంచి, ఆకారం గలది పుట్టడం గూడా అసాధ్యమే! బ్రహ్మ నిరాకారమూ, నిరవయవమూ,

అని తేలిపోయింది గనుక, సాకారమూ, సావయవమూ అయిన పదార్థం ఎంత సూక్ష్మమైనా దానిలో చేరడానికి వీలే లేదు!

**వశిష్ఠుడు**: పోనీ, మన మనస్సులో నాటుకొన్న కొన్ని ఆలోచనలే, క్షణికంగా సాకారాలై, స్వప్నంగా రూపొందినట్టుగా, ఈ జగత్తు గూడా, క్షణిక విజ్ఞానంయొక్క సాకార స్వరూపమే అనవచ్చు గదా! (ఇది బౌద్ధుల ప్రక్రియ.)

**శ్రీరాముడు**: అలా చెబితే, జాగ్రద్దశలో వున్న ఆలోచనే స్వప్న దశలో స్థూల పదార్థమైందని చెప్పినట్టు అవుతుంది. జాగ్రద్దశలో వుండే ఆలోచనకీ, అక్కడ వుండే స్థూలపదార్థాలకీ, అవినాభావ సంబంధం వుంది గనుక, జాగ్రత్పదార్థాలే స్వప్న పదార్థాలుగా మారాయని చెప్పినట్టవుతుంది. అంటే, జాగ్రత్ప్రపంచమే స్వప్న ప్రపంచంగా మారిందని చెప్పినట్లౌతుంది.

**వశిష్ఠుడు**: అదీ ఒప్పుకుందాం! స్వప్నాలు యించుమించు జాగ్రత్ ప్రపంచాలు లాగానే వుంటున్నాయి గదా!

**శ్రీరాముడు**: నాకు స్వప్నంలో ఒక వెంకయ్య మరణించినట్లు, ఆయనను దహనం చేసినట్లు, కనిపించింది. మరునాడు నిద్రలేచి చూస్తే, వెంకయ్యగారు రాయిలాగానే వున్నాడు. జాగ్రత్తు, స్వప్నము, రెండూ ఒకటే అయితే, వెంకయ్యగారు మళ్ళీ ఎట్లా బ్రతికాడు? కనుక, స్వప్నంలో పుట్టేది క్రొత్త ప్రపంచమేనని ఒప్పుకోవాలి. అందుకే ఈ ప్రపంచం క్షణిక విజ్ఞానంయొక్క సాకార స్వరూపం కావడానికి వీలు లేదు.

**వశిష్ఠుడు**: మొత్తం మీద నీ విచారణ అంతా స్వప్నం మీద ఆధారపడి సాగుతోంది. ఒకడికి స్వప్నాలే లేవనుకో. వాడి దృష్టిలో ఈ జగత్తు ఎలా వుంటుంది?

**శ్రీరాముడు**: స్వప్నమే లేనివాడెవడున్నాడీ లోకంలో?

**వశిష్ఠుడు**: స్థూల శరీరంలో వున్న మనబోటివాళ్ళకి స్వప్నాలు వుంటాయనీ, ఇది పోతే యిక కలలే వుండవని, కొందరంటున్నారు. (ఇది చార్వాకుల మతం.)

**శ్రీరాముడు**: అది యోగుల అనుభవానికి సమ్మతమైనది కాదు. పిశాచలవంటి జీవులు కొన్ని వున్నాయనీ, వాటికి స్థూల శరీరం లేదనీ, అవి సూక్ష్మ పంచభూతాలతో ఏర్పడిన సూక్ష్మ శరీరాలతోనే సంచరిస్తూ వుంటాయనీ, వాటికి కూడా స్వప్నాలు వున్నాయనీ, యోగులు చెబుతున్నారు. వారి మాట కాదనడానికి వీలు లేదు. కనుక, ఎవరికైనా సరే, ఈ ప్రపంచం స్వప్నతుల్యమే. ఇది పరబ్రహ్మలోంచి వివర్త ప్రక్రియలో జన్మించినదే!

అందుకే ప్రపంచంలో కనిపించే ప్రతిదీ పరబ్రహ్మ స్వరూపమే అవుతోంది- అని నాకు అర్థమౌతోంది. ఈ అనుభవం నాకు స్థిరపడింది.

ఐతే, ప్రపంచం విషయంలో నాలుగు రకాల దృష్టులు ఉన్నాయి.

1. అజ్ఞ దృష్టి – దీనిలో జగత్తు సత్యం
2. వివేక దృష్టి – దీనిలో జగత్తు మిథ్య
3. ముక్త దృష్టి – దీనిలో జగత్తు బ్రహ్మ
4. భూమికాక్రమ దృష్టి – దీనిలో సాధకుడు అధిరోహించే జ్ఞాన భూమికనుబట్టి జగత్తు క్రమంగా సత్యత్వ స్థితినుంచి బ్రహ్మత్వ స్థితికి చేరుకుంటుంది. ఈ బ్రహ్మకే మరో పేరు ఆకాశం.

గురుదేవా! మీరూ అదే స్థితిలో వున్నారు. నేనూ అదే స్థితిలో వున్నాను.

**ఖమహం ఖం భవాన్ చిత్ ఖం**

**జగత్ ఖం ఖం ఖమేవ చ ।**

**చిదాకాశైకతామేత్య**

**భజైకాకాశ రూపతామ్ ॥** (ని.ఉ.స.195, శ్లో. 62)

(తా॥ నేనూ ఆకాశాన్నే, మీరూ ఆకాశమే, చైతన్యమూ ఆకాశమే, జగత్తూ ఆకాశమే. ఆ ఆకాశమూ ఆకాశమే! మీరు చిదాకాశ స్వరూపాన్ని పొందండి. ఆ చిత్తనే మాట కూడా అక్క ర్లేదు. కేవలం ఆకాశ స్వరూపాన్ని పొందండి.) (ఆకాశము అంటే ఏ దృశ్యమూ లేని, ఏ మాటలకూ అందని, స్థితి.)

గురుదేవా! మీరు అలాంటి స్థితిలో వుండే నాకు ఈ బోధ చేశారు. అందుచేత మీకు పరబ్రహ్మ భావంతో నమస్కరిస్తున్నాను. మీ అనుగ్రహంవల్ల నాకు ఇది బాగా తెలుస్తోంది. 'రాముడు' అనే నేను లేను. నా యింద్రియాలు లేవు. ఈ ఘటపటాదులేవీ లేవు. ఆకాశం ఒక్కటే వుంది. అదే చిదాకాశం! అదే బ్రహ్మాకాశం!

ఇక్కడ విచిత్రమేమిటంటే, ఈ మాటలన్నీ "నా తల్లి గొడ్రాలు" అన్నట్టున్నాయి. ఇలాంటి వాక్యాలకు వాదసభలలో చాలా వ్యతిరేకత వస్తూ వుంటుంది. ఈ విషయం వాదాలతో తేలేది గాదు. ఈ మాటల సారం ఆత్మానుభవ వేత్తలకే తెలుస్తుంది. అలాంటివారి సభలోనే వీటికి విలువ వుంటుంది.

ఇక్కడ మరో విచిత్రమేమిటంటే, ఈ స్థితి మనోవాక్కులకు అతీతమైనదే ఐనప్పటికీ, దీని విషయంలో కాష్ఠమౌనమే సమంజసమైనప్పటికీ, తగిన చోట దీనిని గురించి వివరించి చెబితే గాని, తత్త్వ జ్ఞానం కలగటం లేదు. ఇక్కడే నాకో చిన్న సందేహం వుంది. మనోవాక్కులకు అందని ఆ పరతత్త్వాన్ని ఈ శాస్త్రవాక్కులు ఎలా అందించ గలుగుతున్నాయా, అని. దీనిని మీరే తేల్చి చెప్పాలి.

## 73. కట్టెల వ్యాపారుల కథ

***వశిష్ఠుడు***: రామా! నువ్వు చెప్పిందే నిజం! శాస్త్రం, ఆత్మజ్ఞానానికి కారణం కాదు. నిజానికి ఈ శాస్త్రం పరమాత్మ తనకు విషయం కాదని ప్రతిపాదిస్తుంది. (విషయం అంటే, పదవాక్యాదులచేత బోధింపబడేది అని అర్థం)

***శ్రీరాముడు***: శాస్త్రానికి పరతత్త్వం విషయం కాకపోతే, ఇంక ఆ శాస్త్రం ఏం చేస్తుంది?

***వశిష్ఠుడు***: అవిద్యచేత కల్పింపబడిన జ్ఞాతృ, జ్ఞేయ, జ్ఞానాది భేదాలన్నిటినీ తొలగిస్తుంది. దాని పని అంతవరకే. ఆ భేదాలన్నీ తొలగిపోగా, ఏది మిగులుతుందో అది నువ్వే గనుక, నీకు ఇక వేరే ప్రమాణాలతో పని వుండదు. (ఇక్కడ ప్రమాణాలు అంటే విషయ నిరూపణ చేసే శాస్త్రాదులు.)

ఐనా ఈ విషయం స్పష్టంగా అర్థం కావడానికి ఒక మంచి ఉదాహరణ చెబుతా, విను. దీనిని "కాష్ఠవైవధికోపాఖ్యానం" అంటారు. (కాష్ఠ = కట్టెలు అమ్ముకునేవారు, వైవధిక = కావడి మోసేవారు)

ఒక దేశంలో నీటి ఎద్దడి ఎక్కువగా వుంది. చుట్టు ప్రక్కల అంతా కొండలూ, అడవులూ, వుండడంచేత, దూరం పోతే గాని మంచి నీరు దొరికేది కాదు. అందువల్ల ఆ ప్రాంతంలో కావడి వేసుకొని నీళ్ళు మోసే వృత్తి ఒకటి బయలు దేరింది.

కొన్నాళ్ళకి, అక్కడ బావుల్లో నీరు పెరిగింది. అందువల్ల, ఈ కావడివాళ్ళకి రాబడి తగ్గింది. వాళ్ళు పేదరికంతో గిలగిలలాడే దశ వచ్చింది. ఆ దశలో ఒక పెద్దమనిషి వాళ్ళ కష్టాలు చూసి జాలిపడి–

"ఒరే! చుట్టుపక్కల అన్నీ కొండలూ, అడవులే గదా, మీరు బలంగానే వున్నారు గదా, ఇలా ఏడుస్తూ కూర్చోవడంకంటే, అలా అడవిలోకి పోయి, కట్టెలు కొట్టుకొచ్చుకొని అమ్ముకున్నా రాబడి బాగుంటుంది గదరా!" అని సలహా చెప్పాడు.

ఆ సలహా నచ్చి కావడివాళ్ళు, గుంపులు గుంపులుగా తలో పక్కకీ అడవుల్లోకి వెళ్ళారు. వాళ్ళకు

కట్టెలు దొరికాయి. తెచ్చి ఊళ్ళో అమ్ముకున్నారు. కొంచెం రాబడి పెరిగింది. దాంతో అడవిలో మరికొంత లోపలికి పోవడం మొదలు పెట్టారు.

అలా పోగా పోగా, వాళ్ళల్లో కొంతమంది అదృష్టవంతులకు రకరకాల పళ్ళ చెట్లు కనిపించాయి. కొంతమందికి పూల చెట్లు కనిపించాయి. కొంతమందికి, కొండగుహల్లో బంగారు గీతలున్న రాళ్లు, రత్నాలు కూడా దొరికాయి. ఎవరికి ఏది దొరికితే , అది తెచ్చి అమ్ముకుని వాళ్ళ వాళ్ల సంపదను పెంచుకుంటూ వుండేవారు. కొందరు దురదృష్టవంతులకి ఎప్పుడూ కట్టెలు మాత్రమే దొరుకుతూ వుండేవి. వాళ్ళు వాటితోనే ఎలాగో అలా జీవితం సాగిస్తూ వుండేవారు.

ఇలా వుండగా, అలా కట్టెల కోసం వెళ్ళిన వాళ్ళల్లో ఒకడికి ఒక రోజున సరాసరి చింతామణే దొరికింది. ఇక చెప్పేదేముంది? వాడు కోరుకున్న ప్రతి కోరికా తీరిపోయింది.

శాస్త్రాలద్వారా ఆత్మ లాభాన్ని పొందటం కూడా ఇటువంటిదే! ఈ కథలోని ఆ సంకేతాలను నేనే వివరిస్తాను.

కావడి వారంటే – సామాన్య మానవులు

అడవులు అంటే – గురువులు, శాస్త్రాలు, ఇటువంటివన్నీ

వృత్తి అంటే – భోగాభిలాష

ప్రతివాడూ భోగాలకోసమే శాస్త్రాలు చదువుతాడు. కానీ క్రమక్రమంగా ఆ శాస్త్రాలలో మరింత లోతుకు పోతాడు. అలా పోయిన కొద్దీ వాడి వాడి అదృష్టాన్ని బట్టి, అంటే యోగ్యతను బట్టి, పై పై జ్ఞానభూమికలు అందుతూ వుంటాయి. కట్టెలవాళ్ళకి, పళ్ళూ, పూలు, రత్నాలు దొరికినట్లు! ఎవడో ఒకడికి చింతామణి లాగా ఆత్మజ్ఞానం గూడా దొరికేస్తుంది.

కాగా, భోగాల కోసం శాస్త్రాల వెంట పడ్డవాడికి, భోగ మోక్షాలు రెండూ అందుతున్నాయి.

దీనినే శాస్త్ర పరిభాషలో చెప్పాలంటే, శాస్త్రాలు ముఖ్యవృత్తితో ధర్మార్థ కామాలను బోధించి, లక్షణావృత్తితో, పరబ్రహ్మని బోధిస్తున్నాయి. ఇందుకోసం అవి పని చేసే విధానాన్ని చెబుతా, విను.

శాస్త్రాలు గూడా మాయలో భాగాలే గానీ, వాటి అధ్యయనంవల్ల, అవిద్యలో వున్న సాత్విక భాగం పెరుగుతుంది. దానివల్ల ఆ వ్యక్తిలోని పవిత్రత పెరుగుతుంది. దానివలన వాడి మనస్సులో పుట్టే వికల్పాలన్నీ ప్రక్షాళనమౌతాయి. స్వచ్ఛమైన ఆత్మ తత్త్వం మిగిలిపోతుంది కనుక శాస్త్రాలవల్ల సూటిగా ఆత్మ జ్ఞానం అందకపోయినా, అది అందేందుకు అవి సహకారం చేస్తాయి. కనుక వాటిని ఆదరించాలి.

ఇక పోతే రామా! తత్త్వజ్ఞానాన్ని పొంద గోరే సాధకుడు ప్రపంచవ్యవహారాలలో ఎలా నడచుకోవాలో ఆ కిటుకులు నీకు చెప్పవలసి వుంది.

1. వివేకాన్ని పొంద గోరినవాడు, నీ లాగానే చిన్నతనంలోనే తత్త్వ విచారణ ప్రారంభించాలి.
2. సమస్త జీవులలోనూ అనుగతంగా వున్న ఏకాత్మను దర్శించడం అభ్యసించాలి.
3. ఇతరులలో వుండే గుణ దోషాలపట్ల వైషమ్యం (హెచ్చు తగ్గులు) పెట్టుకోకూడదు.
4. తన సుఖం ఎటువంటిదో పరుల సుఖం అలాంటిదే అనుకోవాలి.
5. గుణదోషాలపట్ల సమదృష్టితోపాటు, సర్వ జీవులయందూ సమంగా వ్యాపించి వున్న బ్రహ్మయందు గూడా దృష్టిని పెంచుకోవాలి. ఇదే నిజమైన సమదృష్టి.
6. సమతాదృష్టి పెరుగుతున్న కొద్దీ, సర్వభూతమైత్రి పెరుగుతుంది.
7. దానివల్ల మనస్సుకు గొప్ప సుఖం కలుగుతుంది.
8. దానివల్ల శీతోష్ణాది ద్వంద్వాలను సహించే శక్తి గూడా పెరుగుతుంది.

9. క్రమంగా దుఃఖం గూడా సుఖంగానే మారిపోతుంది.

10. మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష, అనే సద్గుణాలు వెంటబడతాయి.

11. చివరికి తత్త్వజ్ఞానం కూడా అందుతుంది.

రామా! వీటిలో సమదృష్టి చాలా ముఖ్యం. పూర్వం శిబిచక్రవర్తి, ధర్మరాజు, జనక మహారాజు, జడభరతుడు, ధర్మవ్యాధుడు మొదైలన మహాత్ములంతా సమదృష్టి వలననే ఉత్తమ స్థితిని అందుకున్నారు. సమదృష్టి గలవాడు ఎలా వుంటాడో ఒక్క మాటలో టూకీగా చెబుతా, విను.

**అభివాంఛే న్న మరణం**
**అభివాంఛే న్న జీవితమ్ ।**
**యథాప్రాప్త సమాచారో**
**విచారే దవిహింసకః ॥** (ని.ఉ.స. 198, శ్లో. 43)

(తా॥ మరణాన్ని కోరకూడదు. జీవితాన్నీ కోరకూడదు. ఏది ఎలా ప్రాప్తిస్తే, దానిని అలా సమదృష్టితో స్వీకరిస్తూ, హింసకు దూరంగా జీవించాలి.)

**గమనిక**: ఈ సర్గలో సమదృష్టియొక్క ప్రాశస్త్యాన్ని వర్ణించడం కోసం వాల్మీకి మహర్షి సుమారుగా 30 శ్లోకాలు తీసుకున్నాడు.

***శ్రీరాముడు***: గురుదేవా! కొందరు జీవన్ముక్తులైన తరువాత గూడా కర్మ పరిత్యాగం చేయడం లేదు. ఎందుకని?

***వశిష్ఠుడు***: రామా! సంగ్రహంగా చెప్పాలంటే, దానికి రెండే కారణాలు!

1. వాళ్ళకు పరిత్యాగదృష్టీ లేదూ, స్వీకరణదృష్టీ లేదు. కనుక వాళ్ళ దృష్టిలో కర్మత్యాగం చేసినా వాళ్ళకు స్వంత ప్రయోజనం లేదు; కర్మ స్వీకరణ చేసినా వాళ్ళకు స్వంత ప్రయోజనం లేదు. కానీ, సత్కర్మ స్వీకరణవల్ల, పక్కవారికి ప్రయోజనం కలుగుతుంది.

2. జీవన్ముక్తి కలిగిందంటే, దాని వెనకాల చాలా కాలం చేసిన సత్కర్మాచరణ ఏదో ఒకటి వుంటుంది. అది తప్పదు. ఆ అలవాటు బలంవల్ల అదే పనిని కొనసాగించడంలో వాళ్ళకు ఏమీ శ్రమ వుండదు.

అందుకే, జీవన్ముక్తులలో చాలా మంది సత్కర్మాచరణను కొనసాగిస్తూ వుంటారు. ఏ సత్కర్మ చెయ్యాలన్నా, దానికి తగిన సాధన సంపత్తిని సంపాదించు కోవాలి. ఆ సంపాదనలో కొన్ని దోషాలు వచ్చిపడుతూ వుంటాయి. జీవన్ముక్తులైన వారికి ఆ దోషాలపట్ల గూడా భయం వుండదు. ఎందుకంటే, వారు అన్ని విధాలా అసంసక్త చిత్తులు.

ఆ స్థితికి చేరని మధ్యమస్థాయి సాధకులు, ఇళ్ళల్లో వుండి కొందరు, తీర్థయాత్రలు చేసి కొందరు, అడవులకు పోయి కొందరు, సమతా సాధనకోసం నానా తంటాలూ పడుతూ వుంటారు. సిద్ధులైన మహాత్ములలో కొందరు మా లాగా యజ్ఞ యాగాదులు చేస్తూ వుంటారు; కొందరు మీ లాగా రాజ్యాలు, యుద్ధాలూ, చేస్తూ వుంటారు. ఎన్ని చేసినా వారి సమతా స్థితికి భంగం లేదు. ఆ సమమైన బ్రహ్మలోనే నువ్వు వున్నావు. అలాగే వుండిపో. ఇంతకంటే చెప్పవలసిన మాట లేదు.

వశిష్ఠమహర్షి బోధ ఈ దశకు వచ్చేసరికి ఇటు రామవశిష్ఠులూ, అటు మహాసభలోని శ్రోతలూ, అందరూ గూడా నిర్వికల్ప సమాధిలోకి వెళ్ళిపోయారు. సభంతా నిశ్చలమై పోయింది.

## 74. గురుపూజ

మున్ముందుగా, విశ్వామిత్రాది మహర్షులు కళ్ళు తెరిచి, ఆనంద పరవశులై "సాధు, సాధు" అంటూ బిగ్గరగా సాధువాదాలు చేశారు. ఇంతలో ఆకాశం నుంచి పుష్పవృష్టి రాలింది. దేవదుందుభులు మోగాయి. ఆకాశంలో వుండే సిద్ధులు–

"మేం ఇంతకు ముందు ఎన్నో తత్త్వ ప్రసంగాలు విన్నాం గానీ, ఇలాంటి మహాబోధను ఎక్కడా వినలేదు. ఈ బోధచేత ఈ చుట్టు పక్కల వుండే పశువులూ పక్షులు గూడా ముక్తిని అందుకున్నాయి" అని రకరకాల పాటలు పాడారు.

అయోధ్యాపురవాసులంతా దేవదుంధులు విని, అక్కడికి చేరి, జయజయ ధ్వానాలు చేశారు. దశరథ మహారాజు లేచి, వశిష్ఠమహర్షికి గురుపూజ చేసి –

"గురుదేవా! మీరు చేసిన మహోపదేశానికి ఏమిచ్చినా చాలదు. నా రాజ్యాన్నే మీకు సమర్పిస్తున్నాను. ఇక మీరే రాజు. నేను మీ బంటును." అన్నాడు.

వశిష్ఠమహర్షి నవ్వి –

"రాజా! మాకు నమస్కారాలు చాలు. రాజ్యాలు చేయడం మాకేమి చేతౌను? అది మీకే చెల్లు. దానిని మీ దగ్గరే వుండనీ" అన్నాడు.

దశరథుడు భయభక్తులతో మరి మాట్లాడలేకపోయాడు. అప్పుడు శ్రీరాముడు గురువుగారి పాదాలమీద పుష్పాలు చల్లి –

"గురుదేవా! మా నాన్నగారే మీ దగ్గర మాట్లడలేకపోతున్నారు. నేనేమి మాట్లాడ గలను? నమస్కరించడంకన్నా యింకేమీ చేయలేను" అంటూ ఆనంద భాష్పాలు రాలుస్తూ, మళ్ళీ మళ్ళీ నమస్కారాలు చేశాడు.

ఆ తరువాత లక్ష్మణ శతృఘ్నులు, ఆ తరువాత ఇతర సభాసదులు, వరుసలు గట్టి వశిష్ఠమహర్షికి పుష్పార్చన చేశారు.

అంతా అయినాక, వశిష్ఠమహర్షి నెత్తిమీద వున్న పూలు దులుపుకుంటూ లేచి నిలబడి, వినయంగా సభకు నమస్కరించి –

"ఓ విశ్వామిత్రా!వామదేవా! నిమీ! క్రతూ! భరద్వాజా!పులస్త్యా! అత్రీ! ఘృష్టీ! నారదా! శాండిలా! భాసా! భృగూ! ధారండా! వత్సా! వాత్సాయనా! ఇతర మహర్షులారా! సభాసదులారా! నా పిచ్చి మాటలు విన్నారు గదా! ఇందులో ఏమైనా అక్కర్లేని మాటలు గాని, అనుచితమైన మాటలు గానీ, అపార్థమైన మాటలు గానీ, వున్నాయా? వుంటే అనుగ్రహించి చెప్పండి" అన్నాడు.

ఆ మహర్షి వినయానికి సభ నివ్వెరపోయింది. సభ్యులందరూ ఏక కంఠంతో వశిష్ఠమహర్షికి నమస్కారాలు చెప్పి, "వశిష్ఠుడి నోటి వెంట నిరర్థకమైన మాట – అనే మాటను ఇప్పుడు కొత్తగా వింటున్నాం. అది అసంభవమైన మాట. మీరే మాకు ఏకాంత గురువు. మీకు నమోనమః" అని మళ్ళీ మళ్ళీ ప్రశంసించారు.

ఆకాశంలో వున్న సిద్ధులు "జీవన్ముక్తుడైన రాముడికి గూడా నమస్కారం" అన్నారు. ఇక అందరూ శ్రీరాముడికి గూడా జయజయధ్వానాలు మొదలు పెట్టారు.

ఇలా ఆ ప్రాంతమంతా గందరగోళంగా వుండగా, వశిష్ఠమహర్షి వున్నట్టుండి శ్రీరాముడివంక చూసి – "రామా! ఇప్పుడు నీకెలా వుంది? ప్రపంచం నీకెలా కనిపిస్తోంది? ఇంకేదన్నా అడగాలని వుందా?" అన్నాడు–

శ్రీరాముడు తుళ్ళిపడలేదు. సౌమ్యమైన స్వరంతో యిలా అన్నాడు–

**శ్రీరాముడు**: గురుదేవా! మీ అనుగ్రహంవల్ల పరమ నిర్మలంగా వున్నాను. భ్రాంతులన్నీ తొలగిపోయాయి. హృదయ గ్రంథులు విడిపోయాయి. ఇంకేమీ అడగాలనీ లేదు, వినాలనీ లేదు. దేనినీ సంపాదించాలనీ లేదు. ప్రపంచమంతా చిదాత్మకంగా కనిపిస్తోంది. ఇక మీరు చెప్పినట్లుగా సమతాదృష్టిలో స్థిరంగా వుంటున్నాను. ఐనా, ఫలాపేక్ష లేకుండా శాస్త్ర విహిత కర్మలను ఆచరించ దలచుకుంటున్నాను. నాకు ఇష్టమూ లేదు, అనిష్టమూ లేదు. మీరు చెప్పారు గనుక మీ ఆజ్ఞగా, శాస్త్రానుసరణం చేస్తున్నాను. మీ అనుగ్రహంవల్ల యిక ఏ సందేహాలూ లేవు.

**వశిష్ఠుడు**: ఆహా! ఎటువంటి ఉన్నత స్థితికి చేరావయ్యా?! చిదాకాశం చిదాకాశంలో చేరింది. నీకిక దుఃఖాలవల్ల భయం లేదు. నీవల్ల మీ వంశమే పవిత్రమైపోయింది. నువ్విక ఈ విశ్వామిత్ర మహర్షి కోరిక తీర్చడం కోసం, ఆయన యాగాన్ని రక్షించి పెట్టు. ఆ తరువాత నీ తండ్రి రాజ్యాన్ని పరిపాలించు. నిన్ను ఆశ్రయించిన వారందరికీ సకల సంపదలూ కలుగు గాక!

ఈ మాటలు విని దశరథుడు పొంగిపోయాడు. శ్రీరాముడు తన బ్రహ్మాత్మ స్థితిని మరొకసారి వివరించి చివరికి–

**నైర్మల్యమభ్యుపగతోఽస్మి నమోఽస్తు మహ్యమ్ ॥** (ని.ఉ.స. 2002, శ్లో.12)

(తా॥ నాకు నిర్మల స్థితి లభించింది. నాకు నేనే నమస్కరించు కుంటున్నాను) అన్నాడు.

ఇంతలో మధ్యాహ్న సమయమైంది. వశిష్ఠుడు ఆనాటికి సభను ముగిస్తూ –

"రామా! ఇవాళ్ళ ఆలోచించుకో! ఏదన్నా అడగవలసింది వుంటే, రేపు పొద్దున అడుగు" అన్నాడు.

అందరూ లేచి వెళ్ళారు. మరునాడు ఉదయం సభ ప్రారంభించగానే, శ్రీరాముడే సంభాషణ ప్రారంభించాడు.

**శ్రీరాముడు**: గురుదేవా! నాకు అడగాల్సింది ఏదీ తోచడం లేదు. చెప్పవలసింది ఏమన్నా వుంటే మీరే చెప్పండి.

**వశిష్ఠుడు**: నీకు జ్ఞానం కలిగింది. అందుకే ఏమీ అడగబుద్ధి గావడం లేదు. ఐనా బాగా ఆలోచించుకొని, నీ లోపల నీ అనుభూతి ఇప్పుడెలా వుందో చెప్పు.

**శ్రీరాముడు**: నేను కృతార్థుణ్ణయ్యాను. నిర్వాణాన్ని పొందాను. మీరు చెప్పవలసిందంతా చెప్పారు. నాకు అర్థమైంది. ఇక మీ వాక్కు విశ్రమించుగాక!

## 75. దృశ్యమార్జన ప్రక్రియ

**వశిష్ఠుడు**: రామా! నువ్వు అలా అన్నా గూడా నేను మళ్ళీ కొంచెం చెబుతా, విను. అద్దాన్ని తుడిచిన కొద్దీ మెరుగెక్కుతుంది. అలాగే, తత్త్వజ్ఞానం విన్నకొద్దీ ఆత్మానుభూతి సుస్థిరమౌతుంది. కనుక విను.

నేను చెప్పే అద్దం నీ మనస్సే! దాంట్లోంచి, ప్రపంచాన్ని తుడిచిపెట్టేయాలి. దానికో ప్రక్రియ చెబుతా విను.

ప్రపంచం అంటే నామ రూపాలే గదా! నామ రూపాలంటే శబ్దార్థాలే గదా! మరి, శబ్దార్థాలంటే ఏమిటి?

"ఆవు" అనే మాట చెవిన పడింది. వెంటనే మనస్సులో ఒక అర్థం స్ఫురించింది. అర్థం స్ఫురించడం అంటే ఏమిటి? మనస్సులోకి నాలుగు కాళ్లు, రెండు కొమ్ములు, వగైరా కల ఒక రూపం వచ్చింది. ఈ రూపమే ఆ శబ్దానికి అర్థం.

ఇంతకూ ఈ రూపం అంటే ఏమిటి? నీకు తత్త్వజ్ఞానం లేకపోవడంవల్ల భ్రాంతి కలిగి, దానివల్ల ఒక దృశ్యం కనిపిస్తోంది. అదే రూపం! కాగా, రూపమనేది భ్రాంత్యాత్మకం, అసత్యం. కనుక ప్రపంచంలో ఏ శబ్దాన్ని తీసుకున్నా సరే, దానికి గల అర్థం అసత్యం– అని తేలిపోతోంది.

"ఆవు" అనే శబ్దానికి గల అర్థం అసత్యమనీ, లేనిదనీ తుడిచిపారేస్తే, అప్పుడక్కడ అర్థం లేని ఒక ధ్వనిమాత్రం మిగిలి వుంటుంది – ఆవు అనే శ్రవణ గమ్యమైన ఆకారంతో– అంటే, చెవులకు మాత్రమే తెలసే ఆకారంతో! అప్పుడు అర్థంలేని ఆవు అనే శబ్దానికీ, నీళ్ళ ధార క్రింద పడుతూ వుంటే వినిపించే 'టపటప' మనే శబ్దానికీ, తేడా ఏమిటి? ఏమీ లేదు. కనుక ఆ శబ్దం గూడా అసత్యమే!

ఈ విధంగా ప్రపంచంలో వుండే శబ్దార్థాలు రెండూ అసత్యమైపోతే, ఇక ఈ లోకానికీ, స్వప్నానికీ తేడా ఏమిటి? ఇక ఈ ప్రపంచం ఎక్కడ వుంది? కనుక ఈ ప్రపంచమంతా కనిపిస్తున్నా సరే లేనిదే!

దృశ్యమార్జనకు (అంటే సాధకుడు దృశ్యాలను తుడిచి వేసుకునేందుకు) ఇది ఒక ప్రక్రియ.

***శ్రీరాముడు***: ఈ ప్రక్రియలో ఈ భూమి, ఈ కొండలూ, ఈ పంచభూతాలూ, ఇవన్నీ పుట్టేదెలా?

***వశిష్ఠుడు***: నీ స్వప్నంలో వీటన్నిటినీ ఎవడు సృష్టించాడో, ఎలా సృష్టించాడో, ఎలా సంహరించాడో, చెప్పు.

***శ్రీరాముడు***: జాగ్రత్ప్రపంచంలో వున్న పంచభూతాలకు అస్తిత్వం వుందనుకుంటే, వాటి సంస్కారాలవల్ల స్వప్న పదార్థాలు పుట్టాయని చెప్పవచ్చు. కానీ జాగ్రత్పదార్థాలకు వెనుక సరియైన కారణం లేదు గనుక, వాటికి అస్తిత్వమే లేదు. కనుక, ఉన్న శుద్ధ చైతన్యమే ఒక సారి జాగ్రత్స్వరూపంతోనూ, మరో సారి స్వప్న స్వరూపంతోనూ కనిపిస్తోంది.

నిజంగా ఆలోచిస్తే, ఇలా కనిపిస్తోందనటం కూడ అబద్ధమే! ఉన్న శుద్ధ చైతన్యం ఎప్పుడూ అలాగే వుంది. యథార్థం తెలిసినవాడు దానిని అలాగే చూస్తాడు. అనగా తత్స్వరూపంగా వుండి పోతాడు. తెలియనివాడు దేనినో చూస్తున్నాడంటే, చూడనీయండి.

అంతా బాగానే వుంది గానీ గురుదేవా! ఏ రూపమూ లేని శుద్ధ చైతన్యానికి, జాగ్రత్ స్వప్నాలలో దేహం ఎలా వస్తోంది? – అనే ప్రశ్న ఒకటి వస్తోంది. దానికి సమాధానం ఎలా చెప్పాలి? (స.204)

***వశిష్ఠుడు***: అదేనయ్యా చెప్పేది. ఏమీ లేని చోట దేహమనేది పుట్టినట్లు కనిపిస్తోంది. కనుక అది లేనిదే అని చెప్పాలి. వివర్తవాదాన్ని అర్థం చేసుకున్న తరువాత నీ ప్రశ్నకి అర్థం లేదు. సృష్టి ప్రారంభంలో పంచభూతాలకే ఉత్పత్తి లేదంటుంటే, భూతజన్యమైన దేహానికి అస్తిత్వం ఎక్కడినుంచి వస్తుంది? ఉన్నది ఒక్కటే, చిత్తత్త్వం! దానిమీద రకరకాల వివర్తాలు ప్రవహిస్తున్నాయి. తత్త్వమింతే!

***శ్రీరాముడు***: మీరు పూర్వం గూడా రకరకాల బ్రహ్మాండాలు వర్ణించారు. (లీలో పాఖ్యానము, భుశుండోపాఖ్యానము వంటి వాటిలో.) వాటిల్లో మనం వుండే ఈ బ్రహ్మాండం ఎలాంటిది?

***వశిష్ఠుడు***: దీనిని గురించి కొత్తగా చెప్పేదేముంది? చెప్పవలసింది పూర్వమే చెప్పాను. బ్రహ్మాండం ఏదైనా, అక్కడ నిజంగా వున్నది అధిష్ఠాన పరబ్రహ్మమే!

***శ్రీరాముడు***: ఆ బ్రహ్మ ఈ బ్రహ్మాండంగా ఎప్పుడు తయారయింది? ఇలా ఎంత కాలం వుంటుంది? ఇప్పుడు దీని కొలత ఎంత?

***వశిష్ఠుడు***: బ్రహ్మ ఎప్పుడూ బ్రహ్మాండంగా తయారు కాలేదు. ఐనట్టు తనను తానే చూసుకుంటుంది– నువ్వు నీ స్వప్న నగరాన్ని చూసుకున్నట్లుగా, లేనిదానికి కొలతలేమిటి? నిద్ర తొలగి పోతే స్వప్ననగరం పోతుంది. అజ్ఞానం తొలగిపోతే, బ్రహ్మాండం పోతుంది.

### 76. ప్రజ్ఞప్తి ప్రశ్నలు

రామా! పూర్వం ఒకప్పుడు 'ప్రజ్ఞప్తి' అనే రాజు నన్ను యిలాంటి ప్రశ్నలతోనే ముంచెత్తాడు. అతని ప్రశ్నలూ, నా సమాధానాలూ వింటే, నీ సందేహాలన్నీ తీరిపోతాయి. మధ్య సముద్రానికి నేతిసముద్రానికీ మధ్య కుశద్వీపం వుంది. అక్కడ 'ఇలావతి' అనే పట్టణానికి రాజు ఈ ప్రజ్ఞప్తి. ఒక సారి పనిబడి నేను అతని దగ్గరకి వెళ్లాను. అతను అప్పటికే తత్త్వచింతన చేస్తూ వున్నాడు కాబోలు, నన్ను కూర్చోబెట్టి ప్రశ్నలమీద ప్రశ్నలు గుప్పించాడు. అతను ఏం అడిగాడో, విను.

**ప్రజ్ఞప్తి** : భగవన్! మునీంద్రా! నన్ను కొన్ని ప్రశ్నలు వేధిస్తున్నాయి. దయచేసి మీరు నా ప్రశ్నలు విని నాకు సమాధానం చెప్పండి.

1. ప్రళయానికి ముందు మనోవాక్కులకు అందని పరమాత్మ ఒక్కడే వున్నాడని అంటున్నారు గదా! మరేమీ లేదంటున్నారు గదా! అలాంటప్పుడు, ఈ సృష్టి ప్రారంభం కావడానికి మూలకారణ మేమిటి? ఈ సృష్టిలోని పదార్థాలకు ఉపాదాన కారణం ఏమిటి? సహకారి కారణాలేమిటి? ఉపాదాన కారణాలు ఒకటా? లేక ఎక్కువా?

2. ఈ బ్రహ్మాండాలు అనేకం వున్నాయనీ, అవి రక రకాలుగా వున్నాయనీ, అందులో కొన్ని ఆకాశంలో వున్నాయనీ, కొన్ని రాతి కడుపులో దూరి వున్నాయనీ, కొన్ని జలరూపాలుగా వున్నాయనీ, కొన్ని వాయురూపాలుగా ఉన్నాయనీ, కొన్ని తేజో రూపాలుగా వున్నాయనీ, చెబుతున్నారు గదా! ఇన్ని భేదాలకు కారణమేమిటి?

3. వీటినీ, వీటిలోని జీవులనీ, వాళ్ళల్లో ఇంద్రియాలనీ – ఇలా వీటన్నిటినీ సృష్టించిన కర్త ఎవరు? వీటిని అనుభవించే ద్రష్ట ఎవరు?

4. "అలా కాదయ్యా! వేదం కర్మకాండనూ, బ్రహ్మకాండనూ చెప్పింది. వాటి రెంటకీ సమన్వయంగా మనం సిద్ధాంతం చెప్పాలి. అందుచేత జీవుల కర్మానుసారంగా ఈ సృష్టి ప్రళయ చక్రం యిలా తిరుగుతూనే వుంటుంది. దానికి ఆపుదల లేదు". అని సమర్థిస్తారా? అలా అయితే, "ఎలా ఆలోచిస్తే అలాంటి అనుభవాలు కలుగుతాయి" అని లోకంలో ఒక ప్రసిద్ధి వుంది. దానిని బట్టి సృష్టి ప్రళయ చక్రానికి ఆలోచనే మూల కారణమని చెప్పవలసి వస్తోంది. దానిని ఒప్పుకుంటారా?

5. ఒప్పుకుంటే, ఆ ఆలోచన, అంటే జ్ఞానం, నిత్యమా? అనిత్యమా? – అనేది తేలాలి. అనిత్యమని అందామంటే, దానికి వెనక గల కారణం ఏమిటి అనే ప్రశ్న వస్తోంది. సమాధానం దొరకదు. "నిత్యం" అందామంటే, నిత్యమైన దానికి మార్పులు గలగటం కష్టం. మరి దీన్ని ఎలా సమన్వయిస్తారు?

6. ఒకడిక్కడ మరణించాడు. వాడ్ని తగలబెట్టేశాము. వాడు పుణ్యపాపాలు అనుభవించడానికి స్వర్గానికో, నరకానికో, పోయాడు. అక్కడ మళ్లీ ఏదో ఒక దేహం ధరిస్తే గానీ, సుఖదుఃఖానుభవం కుదరదు. అక్కడ ఆ దేహానికి తల్లిదండ్రులెవరు? ఎవరో వున్నట్టు ఏ శాస్త్రమూ చెప్పటం లేదు. ఎవరూ లేకుండా ఆ దేహం ఎలా వచ్చింది?

7. "వాడి పుణ్య పాపాలే వాడికి తల్లిదండ్రుయల్యారు. వాటివల్లే వాడికి స్వర్గ నరకాది లోకాలలో దేహం ఏర్పడుతోంది" అంటారా? అలా చెబితే, అమూర్తాలూ, కేవలం భావాత్మకాలూ, అయిన పుణ్యపాపాల్లోంచి, ద్రవ్యమయాలైన దేహాలు పుట్టాయని చెప్పినట్లు అవుతోంది. అది అసంభవం. మరి మూర్తద్రవ్యాల ఉత్పత్తికి కారణం ఏమని చెబుతారు?

8. దీన్ని తప్పించుకోడానికి, అసలు పరలోకమే లేదు పొమ్మని నాస్తికవాదంలోకి వెడతారా? దాంట్లోనూ చిక్కులున్నాయి. పరలోకం అంటే ఏముంది? ఇవ్వాళ్ల ఈ కనిపించే లోకం నిజమని అంగీకరిస్తే, దీని

వెనకాల ఏదో నిజమైన కారణం వుండి వుండాలి. అదే పరలోకం! దాని దృష్టిలో యిది పరలోకం! అందుచేత, పరలోకం లేదనడం కుదరదు. అదీ గాక, అది వేద విరుద్ధం.

9. నేను ఇందాక అమూర్తాలలోంచి మూర్త ద్రవ్యాలు పుట్టవు – అన్నాను గానీ, అక్కడా సందేహం వుంది. రాజు ఎక్కడో రాజధానిలో వున్నాడు. ఎక్కడో మారు మూల గ్రామంలో వున్న ప్రజలు ఆ రాజుగారి ఆజ్ఞకి కట్టుబడి శిక్షలు అనుభవిస్తున్నారు. రాజాజ్ఞ అమూర్తం. శిక్ష మాత్రం శారీరకంగా ప్రత్యక్షంగా కనిపిస్తోంది. అంటే అమూర్తంలోంచి మూర్తం పుడుతోంది. ఇది ఎలా కుదురుతుంది? అలాగే శాస్త్రంలో వుండే విధినిషేధాలను కొందరు లెక్క చేస్తున్నారు. కొందరు లెక్క చేయటం లేదు. అవి పని చేసే తీరు ఏమిటి?

10. ఎవడో ఒక యోగి వచ్చి ఒక రాతి స్తంభాన్ని ఉన్నట్టుండి బంగారు స్తంభంగా మార్చి వేశాడు? ఇది ఎలా సాధ్యమౌతోంది?

11. ఇక వేదవాక్యాలలోకి పోతే,

**అసద్వా ఇదమగ్ర ఆసీత్**
**తతో వై సదజాయత ॥**

(ఇదంతా మొదట్లో అసత్తుగ వుండేది. దానిలోంచే సత్తు పుట్టింది) – అని ఒక వాక్యం.

**అసదేవేదమగ్ర ఆసీత్ ॥**

(సృష్టికి పూర్వం ఇదంతా అసత్తుగానే వుండేది)
అని మరో వాక్యం.

**"సదేవేద మగ్రాసీత్ – ఏకమేవాద్వితీయం"**

(ఇది సృష్టికి పూర్వం సత్తుగానే వుండేది. అది ఒకటే, అద్వితీయం) – అని మరో వాక్యం.

**"నాసదాసీత్ – నో సదాసీత్ తదానీం"**

(అప్పుడు (సృష్టికి పూర్వం) సత్తూ లేదు– అసత్తూ లేదు.) – అని మరో వాక్యం.

ఇలా శ్రుతి వాక్యాలు అనేక చోట్ల పరస్పర విరుద్ధంగా కనిపిస్తున్నాయి. వీటికి సమన్వయం ఎలా?

12. సృష్ట్యాదిలో శుద్ధ చైతన్యం ముమ్మొందుగా హిరణ్యగర్భుడిగా మారిందనీ, ఆయన నుంచి సృష్టి అంతా వచ్చిందనీ, మీబోటివాళ్ళు చెబుతూ వుంటారు. అంటే, హిరణ్యగార్భుడు ఆకాశంలోంచి పుట్టినట్లే గదా! "అది వట్టి ఆకాశం కాదయ్యా! చిదాకాశం! దానికి అలాంటి మహిమ వుంది." అంటారా? ఆ మహిమ వుంటే, మరో హిరణ్యగర్భుడు ఎందుకు పుట్టకూడదు?

13. ఇక ఈ సృష్టిని పరిశీలించి చూస్తే , నిప్పు ఎప్పుడూ వెచ్చగానే వుంటోంది. నీరు చల్లగానే వుంటోంది – ఇలా ప్రతి పదార్థంలోనూ ఒక నియతి కనిపిస్తోంది. ఈ నియతి ఎట్లా వచ్చింది?

14. ఇలాంటి ప్రశ్నలన్నీ అడుగుతుంటే, కొందరు పెద్దలు, "తపస్సు చెయ్యి, ప్రశ్నలన్నీ తీరుతాయి" అంటున్నారు. "తపస్సు చేస్తే, ఏదైనా సిద్ధిస్తుంది" అంటున్నారు. ఇక్కడా కొన్ని సందేహాలున్నాయి.

ఒకడికి ఒక మిత్రుడూ, ఒక శత్రువూ, వున్నారు. మిత్రుడేమో వీడు వెయ్యేళ్ళు బ్రతకాలని తపస్సు చేస్తున్నాడు. శత్రువేమో వీడిప్పుడే చావాలని తపస్సు చేస్తున్నాడు. ఇద్దరూ గట్టివాళ్లే! ఇప్పుడు ఈ తపస్సులు ఎలా ఫలిస్తాయి?

15. పది మంది కవికుమారులు చంద్రుడి సౌందర్యానికి పొంగిపోయి, "మేం, ఆకాశంలో చంద్రులమైపోవాలి" అని ఒకే సారి తపస్సు మొదలుపెట్టారు. వారి తపస్సు ఫలిస్తే, ఆకాశంలో అనేకమంది చంద్రులు ఒకే సారి కనిపిస్తారా?

16. ఇంతకంటే చిక్కు ప్రశ్న మరొకటి వుంది. నాకు తెలిసిన ఒకావిడ చాలా సుందరాంగి. కాని మంచి వైరాగ్యవతి. చిన్నతనంలోనే ఇల్లు వదిలి "నేను యావజ్జీవ బ్రహ్మచారిణిగా వుండాలి" అని తపస్సు మొదలు పెట్టింది. కానీ ఆ వూళ్లోనే అయిదారుగురు యువకులు ఆమె సౌందర్యానికి మనసు పారేసుకొని, ఎవడికి వాడే ఆమె కోసం తపస్సు మొదలు పెట్టాడు. ప్రతివాడూ "ఈమె నా భార్యై పతివ్రతగా నా ఇంట్లోనే వుండాలి" అని కోరుకుంటున్నాడు. వీళ్ళ తపస్సులు ఫలించేదెలా?

17. మరో ప్రబుద్ధుడు తపస్సు చేసేసి, ఇష్టదేవుడు ప్రత్యక్షం కాగానే " నేను కదలకుండా హాయిగా ఇంట్లోనే కూర్చోవాలి. కానీ ప్రళయం దాకా సప్త ద్వీపాలకూ నేనే చక్రవర్తిని గావాలి" అని కోరాడు. ఆ దేవత ఈ వరం ఎలా ఇస్తుంది?

18. మరో చిక్కు ప్రశ్న కూడా వుంది. ప్రజలు దానధర్మాలు చేస్తున్నారు. తద్దినాలు పెడుతున్నారు. వీటన్నిటికీ పరలోకంలో ఫలితం వుందంటున్నారు. ఇదెలా కుదురుతుందయ్యా అంటే, "ఈ దానధర్మాదులవల్ల యిక్కడ ఒక అదృష్టం పుడుతుంది, ఆ అదృష్టమే పరలోకంలో ఫలితాలనిస్తుంది" అంటున్నారు. అదృష్టం అనేది అమూర్తం. అమూర్తమైన పదార్థం మూర్తమైన దేహాలతో కలిసి వేరే ప్రదేశంలో, వేరే కాలంలో, వేరే వేరే ఫలితాలనిస్తుందనటం సమంజసంగా లేదు. దీనిని సమన్వయించడం ఎలా?

***వశిష్ఠుడు***: ప్రజ్ఞప్తి మహారాజా! నీ ప్రశ్నలు బాగున్నాయి. నేను నీ ప్రశ్నల వరుసలో వెళ్ళను గాని, అన్నింటినీ సమన్వయం చేసి చూపిస్తాను. జగ్రత్తగా విను.

కొన్ని చోట్ల "వుంది" అనే జ్ఞానం కలగుతోంది. మరికొన్ని చోట్ల "లేదు" అనే జ్ఞానం కలుగుతోంది. కొంచెం జాగ్రత్తగా చూడు. రెండు చోట్లా కూడా నీకు కలిగేది జ్ఞానమే!

జ్ఞానానికి ఒక స్వభావం వుంది. ఏమిటంటే, అది తను ఏది అనుకుంటే దానిని అలా చేసి చూపిస్తుంది. అది గట్టిగా 'వుంది' అనుకుంటే, ఆ వస్తువు వున్నదవుతుంది. అది గట్టిగా లేదనుకుంటే, ఆ వస్తువు లేనిదౌతుంది. దీనికి మంచి ఉదాహరణ స్వప్ననగరమే! నీలో వున్న జ్ఞానానికి స్వప్న సమయంలో ఈ నగరం 'వుంది' అనిపించింది. అది ఆ సమయంలో నిజంగానే వున్నదైపోయింది. కొంత సేపటికి నీలోవున్న జ్ఞానానికి అది 'లేదు' అనిపించింది. వెంటనే అది మాయమై పోయింది. దీనినే నువ్వు మెలకువ అంటున్నావు.

కనుక తేలిందేమిటంటే, 'వుంది', 'లేదు'లు– రెండూ నీలో గల జ్ఞానానికి రూపాలు మాత్రమే! రెండు చోట్లా నిజంగా వున్నది జ్ఞానమే!

కనుక ఎక్క డైనా సరే, ఎప్పుడైనా సరే, నీలో గల జ్ఞానం తనకు దేహం వుందనుకుంటే వుంటుంది, లేదనుకుంటే పోతుంది. 'ఉంది' అనుకున్నప్పుడు ఆ జ్ఞానం తనే ఆ దేహాన్ని అనుకుంటుంది. అందుచేత దేహ ధర్మాలను జ్ఞానంలో, జ్ఞాన ధర్మాలను దేహంలో, తనకు తనే ఆరోపణ చేసేసుకుంటుంది. దేహాలు పుట్టే తీరు, నడిచే తీరు, ఇదీ!

స్వర్గ నరకాలలో తల్లిదండ్రులు లేకుండా దేహాలెలా పుడతాయని నువ్వు అడిగావు. ఇలా నీ జ్ఞానం చేసే ఆరోపణ ప్రక్రియవల్ల అవి పుడతాయి – అని అర్థం చేసుకో.

ఇక్కడ నువ్వు మరో ముఖ్య విషయాన్ని గమనించాలి. నేను జ్ఞానం అనగానే నువ్వు దానిని పరబ్రహ్మ రూపమైన జ్ఞానం అనుకోరాదు. శుద్ధ జ్ఞానం వేరు, దేహేంద్రియాదులను తెలుసుకొనే జ్ఞానం వేరు. తెలుసుకునే జ్ఞానం తెలుసుకునే వాడియొక్క ధర్మం. (అంటే వాడిలో వుండే గుణం వంటిది.) ఇది భ్రాంతి రూపంగా వుంటుంది.

ఉదాహరణకు, నువ్వు నీ స్వప్నలోకాన్ని చూస్తున్నావు. ఆ సమయంలో నువ్వు "నేను నాకంటే భిన్నమైన నగరాన్ని చూస్తున్నాను" అని అనుకుంటూ వుంటావు. కానీ, నిజానికి నువ్వు చూసేది నిన్నే! అంటే, నిన్ను

నువ్వే తెలుసుకుంటున్నావ్. నీలో నీ ధర్మంగా వుండేది ఈ రకమైన జ్ఞానం.

నీ జాగ్రత్తులో కూడా నీలో వుండే ఒకానొక జ్ఞానమే నీ శరీరరూపాన్ని పొందింది. దానికి మించి నీకు వేరే శరీరమంటూ ఏమీ లేదు. ఈ విషయాలు నీకు అర్థమైతే, నీ ప్రశ్నలలో ఒకటినుంచి ఏడు దాకా అన్నిటికీ సమాధానం వచ్చినట్టే!

ఇక పోతే నువ్వు నీ 8వ ప్రశ్నలో నాస్తిక వాదాన్ని గురించి ప్రస్తావన చేశావు. వాళ్ళు, శరీరమే జ్ఞానానికి కారణం అంటున్నారు. అంటే, జడం లోంచి చైతన్యం వచ్చిందని వారంటున్నారు. అది పూర్తిగా పిచ్చిమాట. ఐతే వాళ్లు, "మీరు అన్నట్లుగా జ్ఞానంలోంచి శరీరం పుట్టేటట్లైతే, మరణించిన తరువాత ఆ శరీరం విషయాలను ఎందుకు తెలుసుకొనడం లేదు?" అని అడుగుతారు. దానికి సమాధానం చెబుతా విను.

నువ్వు చైతన్య స్వరూపుడివే గదా! నీలోంచే స్వప్న నగరం వచ్చింది గదా! కనుక అది అంతా గూడా చైతన్యాత్మకమే కావాలి గదా! కాని అక్కడ రాళ్లూ రప్పలూ  జడాలుగా ఎందుకు కనిపిస్తున్నాయి?

దానికి ఒక్కటే సమాధానం. నీ స్వప్న ప్రారంభ క్షణంలో నువ్వు కొన్ని సంకల్పాలు చేశావు. వాటికి అనుగుణంగానే, స్వప్న నగరంలో కొందరు చేతన జీవులూ, కొన్ని జడపదార్థాలూ, నీకు కనిపించాయి. అంటే, నీ సంకల్పబలంచేత నువ్వే ఒక చోట చేతనంగానూ, ఒక చోట జడం గానూ, కనిపిస్తున్నావు. ఇది నీ అనుభవ సిద్ధం.

ఇలాగే సృష్టి ప్రారంభకుడైన హిరణ్యగర్భుడు, ఆ క్షణంలో చేసిన సంకల్పాలవల్ల మృతశరీరం జడంగా వున్నట్టు నీకు అనుభూతి కలుగుతోంది. ఇది నీ అనుభూతి మాత్రమే! వాస్తవంలో స్వప్న నగరమంతా నీ రూపాంతరమైనట్టుగా, ఈ ప్రపంచమంతా చైతన్యమయమే! నీ శరీరానికి కూడా అదే కారణం. కనుక నాస్తికుడు చెప్పే దాంట్లో సత్యం లేదు. అందుచేత ఆ దారిలోకి మేము ఎప్పుడూ పోము.

ఇక నీ 9వ ప్రశ్నలో మూర్తద్రవ్యాలు, అమూర్త ద్రవ్యాలు, అంటూ కొంత చర్చ చేశావు. సృష్టి అంతా శుద్ధ చైతన్యంలోంచి భ్రాంతిమయంగా ఆవిర్భవిస్తోందని చెప్పాం గనుకనూ, సృష్టికి వెనకాల వాస్తవమైన కారణం ఏదీ లేదని చెప్పాం గనుకనూ, మూర్తమూర్త ద్రవ్య విచారణకు స్థానం లేదు.

బతికి వుండగా నీ చిదాత్మే స్వప్నలోక రూపంగా ఎలా కనిపిస్తోందో, అలాగే నీ మరణానంతరం ఆ చిదాత్మే పరలోక రూపంగా కనిపిస్తోంది. పరిపూర్ణమైన ఆత్మజ్ఞానం కలిగే వరకూ, జీవించి వుండగా జాగ్రత్ స్వప్న దర్శనాలూ, మరణించాక పరలోక దర్శనాలూ– అనే చక్రం కొనసాగుతూనే వుంటుంది. భ్రాంతిమయమైన ఈ చక్రంలో భాగంగానే, దానధర్మాలు, పిండ ప్రదానాలు, మొదలైనవాటికి ఫలితాలు గూడా సంభవిస్తూ వుంటాయి. అందుకే ముక్తి కలిగేవరకూ ధర్మ శాస్త్రాలు సత్యమేని మేము చెప్పుతూ వుంటాము. ఇందులో అతార్కికమైన విషయమేమీ లేదు. దీనితో నీ 18వ ప్రశ్నకు సమాధానం వచ్చింది.

ఇక నీ పదవ ప్రశ్నలో యోగుల మహిమల గురించి అడిగావు. అది గూడా హిరణ్యగర్భుడి ప్రథమ సంకల్పంలోని వైచిత్రివల్లనే అలా జరుగుతోంది. అంటే, "యోగులు మొదలైనవారి వరశాపాదులు ఫలించుగాక" అని హిరణ్యగర్భుడు సంకల్పించడంవల్ల  అవన్నీ అలా జరిగిపోతున్నాయి.

ప్రపంచంలో జరిగే సంఘటనలయొక్క కార్యకారణ సంబంధం కోసం హిరణ్యగర్భుడి సంకల్పాన్ని విడిచి వేరే చోట వెతుక్కోవాల్సిన పని లేదు. అంతెందుకు? అసలే లేని ఈ జగత్తు  కొంతసేపు వున్నట్లు కనిపించి, మళ్లీ కొంత సేపు మాయమై పోవడం గూడా, ఆ సంకల్పంలో భాగమే! దీనినే కవితామయంగా చెప్పాలంటే, ఆ చైతన్యం కన్ను తెరిస్తే సృష్టి, కన్ను మూస్తే ప్రళయం!

***ప్రజ్ఞప్తి:*** బ్రహ్మర్షీ! ప్రపంచం హిరణ్యగర్భుడి సంకల్పంవల్లనే అస్తిత్వాన్ని పొందుతున్నట్లైతే, దానికి మధ్యమధ్యలో

ప్రళయం ఎందుకు వస్తున్నది? ఒక సారి “సృష్టి జరుగుగాక” అని ఆయన సంకల్పం చేస్తే, ఇక ఆ సృష్టి శిలా శాసనం లాగా అలా పడివుండాలి గదా!

**వశిష్ఠుడు**: రాజా! నువ్వు స్వప్న నగరాన్ని సంకల్పిస్తున్నావు. కానీ అది సుస్థిరంగా వుండపోవడం లేదు. ఎందువల్ల? అది నీ సంకల్పంయొక్క స్వభావం! స్వభావానికి కారణం వెతికితే ప్రయోజనం ఏమిటి? ఇది నీ స్వభావమైనట్టే, ఈ సృష్టి సుషుప్తిలోనూ, ప్రళయంలోనూ, మోక్షంలోనూ, లేకుండా పోయేటట్టు సంకల్పం చేయటం హిరణ్యగర్భుడి స్వభావం. ఆ స్వభావంవల్లే నిప్పు వేడిగా, నీరు చల్లగా, వుండడం మొదలైనవన్నీ జరిగిపోతున్నాయి. దీనితో నీ 13వ ప్రశ్నకు కూడా సమాధానం వచ్చింది.

మళ్లీ చెబుతున్నాను, అర్థం చేసుకో. నిత్య సత్య పదార్థమైన ఆ శుద్ధ చైతన్యమే ఈ ప్రపంచంగా కనిపిస్తోంది. అంటే, సత్యంగా వున్నదీ అదే, అసత్యంగా వున్నదీ అదే! అందుకే శ్రుతి –

**“సత్యం చానృతం చ సత్యమభవత్”**

(సత్యమైన పరబ్రహ్మమే సత్యంగానూ, అసత్యంగానూ అయింది) అని చెబుతోంది. అది శుద్ధ చైతన్యంయొక్క స్వభావం. దీనిని బట్టి సృష్టిరీతులను నువ్వు సమన్వయం చేసుకో.

దీన్ని బట్టే నువ్వు 11వ ప్రశ్నలో చూపిన శ్రుతివాక్యాల సమన్వయం కూడా సిద్ధిస్తుంది.

ఇక నీ 14, 15,16,17వ ప్రశ్నలలో పరస్పర విరుద్ధమైన తపస్సుల గురించి చాలా అడగావు. వాటి వివరాలలోకి వెళ్ళే ముందు ధర్మాధర్మాదుల గురించి కొన్ని మౌలిక విషయాలు చెబుతా విను–

**“ధర్మేణ పాప మపనుదతి”**

(మానవుడు ధర్మాచరణతో పాపాన్ని పోగొట్టుకోవాలి) అని శ్రుతి చెబుతోంది. కనుక వరశాపాలు, పాపపుణ్యాలు మొదలైనవన్నీ పరస్పర విరోధులైన శక్తులుగా పనిచేస్తూ వుంటాయి. శత్రుమిత్రులు చేసే విరుద్ధతపస్సులు మొదలైనవి కూడా ఇలాగే పని చేస్తూ వుంటాయి. ఇవి రెండూ సమానబలం కలవి అయితే, ఒకదానినొకటి రద్దు చేసుకుంటాయి. అలా కాకపోతే, తక్కువైన శక్తి ఎక్కువైన దానిలో కొంత భాగాన్ని హరించి వేయగా మిగిలిన ఫలితాంశశక్తి (రిజల్టెంట్ ఫోర్స్) ఫలితంలోకి వస్తుంది.

ఐతే, ఒక్కొక్కసారి పాప పుణ్యాలు గాని, వరశాపాలు గానీ, ఒకదానితో మరొకటి రద్దు చేయబడటానికి కుదరనివిగా వుంటాయి. అలాంటప్పుడు మాత్రం ఫలాన్ని అనుభవింపవలసిన జీవి ఏక కాలంలో రెండు శరీరాలను పొందుతాడు. ఒక్కొక్కప్పుడు ఆ రెండు శరీరాలూ బహిరంగంగానే వుంటాయి. ఒక్కొక్కప్పుడు వాటిల్లో ఒకటి బంధు మిత్రాదులకు కనిపించే బహిరంగ శరీరంగానూ, మరొకటి ఆ జీవికి మాత్రమే కనిపించే అదృశ్య శరీరంగానూ, వుండవచ్చు.

నువ్వు చెప్పన ఉదాహరణలోనే, శత్రువు వీడి మరణం కోసం, మిత్రుడు వీడి దీర్ఘజీవితం కోసం, తపస్సులు చేస్తున్న ఘట్టంలో, ఈ జీవుడు తన మామూలు శరీరంతో మిత్రుడి తపఃఫలాన్ని అనుభవిస్తూ, అదే సమయంలో మరో భ్రాంతి కల్పితమైన దేహంతో, మరో భ్రాంతి కల్పితమైన ప్రదేశంలో, మరణబాధను గూడా అనుభవిస్తూ వుంటాడు.

**ప్రజ్ఞప్తి**: అమూర్తమైన ధర్మాధార్మాలవల్ల మామూలు శరీరం పుట్టడమే కష్టమని నేనంటుంటే, మీరు రెండు శరీరాలు పుడతాయంటున్నా రేమిటండీ?

**వశిష్ఠుడు**: రెండు గాదు, అవసరాన్ని బట్టి వెయ్యి అయినా పుడతాయి. నీ స్వప్న రాజ్యంలో నువ్వు ఒక్కడవే శత్రుసేనగానూ, మిత్రసేనగానూ గూడా తయారు కావడం లేదా? భ్రాంతిమయమై సంకల్పమాత్రంచేత పుట్టే ప్రపంచానికి సంఖ్యల నియమేమిటయ్యా?

**ప్రజ్ఞప్తి** : ఒక ప్రక్క ఈ ప్రపంచం మిథ్య అంటారు. మరో ప్రక్క పరలోకాలూ, వరశాపాలూ, సత్యం

అంటారు. ఇదేం న్యాయమండీ?

**వశిష్ఠుడు**: ఈ ప్రపంచం మిథ్య అని నువ్వు ఒప్పుకునేటట్లైతే, ఇన్ని మాటలు లేవయ్యా! ఈ లోకమూ, పరలోకమూ, అన్నీ మిథ్యలే! కర్మలూ, కర్మ ఫలాలూ, అన్నీ మిథ్యలే! అదే సత్య స్థితి! కానీ, నీ ప్రశ్నలు దానిమీద ఆధారపడి లేవే! ఈ లోకం సత్యం అనే స్థాయిలో వుండి నువ్వు ఈ ప్రశ్నలన్నీ వేస్తున్నావు. అందుచేత ఈ లోకంతోపాటు పరలోకమూ, వరశాపాలూ, ఇలాంటివన్నీ గూడా సత్యమేనని నేను సమాధానం చెబుతున్నాను."మరైతే, దీనిలో ఇన్ని అసంగతమైన సంఘటనలు కనిపిస్తున్నాయేమిటండీ?" – అని నీవు అడిగావు. దానికి సమాధానంగా "ఈ ప్రపంచమంతా స్వప్నతుల్యమయ్యా! ఇది భ్రాంతి కల్పితం. కనుక దీంట్లో ఇలాంటివి ఎన్నైనా జరుగవచ్చు" అని నేను చెప్పాను. నేను చెప్పినదాంట్లో సిద్ధాంత సాంకర్యం లేదు. నువ్వు గూడా దేనిని దానికి జాగ్రత్తగా సమన్వయించుకుంటే నీకు గూడా గందరగోళం వుండదు. (స. 209)

ఇక నీ 15వ ప్రశ్నలో పదిమంది వ్యక్తులు చంద్రత్వాన్ని కోరుతూ తపస్సు చేస్తే ఆకాశంలో ఒకే సారి పదిమంది చంద్రులు వస్తారా అని అడిగావు. ఇక్కడ మాత్రం ఒక కిటుకు వుంది. ఇద్దరు వ్యక్తులు కలిసి ఆకాశంలో చంద్రుడ్ని చూస్తున్నారనుకో. వాళ్లిద్దరూ మేము ఒకే చంద్రుడ్ని చూస్తున్నామని అనుకుంటున్నారు. లోక వ్యవహారమంతా ఇలాంటి విశ్వాసంమీద ఆధారపడే నడుస్తోంది. అది విశ్వాసమే గాని సత్యం గాదు. ఎందుకంటే ప్రతివాడూ వాడు స్వంతంగా కల్పించుకున్న వాడి ప్రపంచంలో వాడు జీవిస్తున్నాడు తప్పితే, ఇతరులు కల్పించిన ప్రపంచంలో జీవించడం లేదు. ఎవడి ప్రపంచం వాడిది. ఈ రెండూ ఒకదాంట్లో ఒకటి, తోలుతిత్తిలోకి తోలుతిత్తి దూరినట్లుగా, కొంతవరకు కలిసిపోతున్నట్టు కనిపిస్తున్నా, అవి రెండూ ఒకటి కాదు. దేనికదే! ఎవడి ఆకాశం వాడిదే! ఎవడి చంద్రబింబం వాడిదే!

కనుకనే పది మంది కవి కుమారులు నేను చంద్రుడ్ని కావాలని కోరుకున్నప్పుడు ఎవడి చిత్త కల్పిత ఆకాశంలో వాడు చంద్రుడగా వెలిగిపోతాడు. వీడి ఆకాశంలో వాడుండడు, వాడి ఆకాశంలో వీడుండడు. పదిమందీ చంద్రత్వాన్ని మాత్రం పొందుతారు (ఇలాంటి విషయాలను పూర్వం ఐందవోపాఖ్యానంలో బాగా వివరించారు.)

ఎవడి ప్రపంచం వాడిది కనుకనే, సంకల్ప బలాన్ని బట్టి ఎవడికి వాడు తన లోకానికి హిరణ్యగర్భుడు కూడా కాగలడు. ఐందవులు అలాగే అయ్యారు. నీ 12వ ప్రశ్నలో హిరణ్యగర్భుడు ఒకడే ఎందుకుండాలని అడిగావు. ఒకడున్నా, వందమంది వున్నా, విశేషమేమీ లేదు. ఎవడి ప్రపంచమైనా సంకల్ప మాత్రజనితమే! స్వప్నతుల్యమే! ఈ మాట గ్రహిస్తే నీ 12వ ప్రశ్నకు పెద్ద సారం లేదు! (ఈ 12వ ప్రశ్నకు సమాధానం మూలంలో సూటిగా లేదు. ఉన్న వాక్యాలను బట్టి మూలకర్త భావం ఇదే అనిపిస్తోంది.)

రాజా! నీ 16వ ప్రశ్నలో బ్రహ్మచారిణీ స్త్రీ విషయంలో నువ్వడిగిన విషయం గూడా దీని ప్రకారమే సమన్వయం చేసుకో.

నీ 17వ ప్రశ్నలో సోమరిపోతు మహారాజుగారి వ్యవహారం గూడా యిలాగే సమన్వయించుకోవాలి. ఆయన తన గదిలోనే సప్త ద్వీపాలనూ కల్పించుకుంటాడు. కనుక ఆయన అనుకున్న కల్పన కుదురుతుంది. (ఈ విషయాలను పూర్వం లీలోపాఖ్యానంలో బాగా వివరించారు.)

రాజా! ఈ విధంగా నీవడిగిన ప్రశ్నలన్నింటికీ సమాధానాలు చెప్పాను. అన్ని సమాధానాలకూ మూలధారం ఒక్కటే! ఈ ప్రపంచమంతా శుద్ధ చైతన్యంయొక్క కల్పనే – అనే సత్యం! దీనిని గమనించి మిగిలిన సమన్వయాలు నువ్వు చేసుకో.

**ప్రజ్ఞప్తి**: బ్రహ్మర్షీ! అంతా బాగానే వుంది గానీ, సృష్ట్యాదిలో భ్రాంతివల్ల హిరణ్యగర్భుడనే దేహం ఏర్పడిందని మీరంటున్నారు. కానీ లోకంలో ఎక్కడ చూసినా ముందు ఒక దేహం అంటూ వుంటే, ఆ దేహాన్ని ఆశ్రయించి

వున్న చైతన్యానికి భ్రాంతి కలిగితే కలుగుతోంది గానీ, దేహం లేని చైతన్యానికి భ్రాంతి కలగడం ఎక్కడా కనిపించడం లేదు. ఈ సూత్రాన్ని హిరణ్యగర్భుడికి అన్వయిస్తే, అతనికి దేహం వచ్చాక గానీ భ్రాంతి ప్రారంభం కావటానికి వీలు లేదు. కానీ భ్రాంతి కలిగితే గానీ దేహం వచ్చేందుకు వీలు లేదు. ఇలా ఆ దేహానికీ, భ్రాంతికీ అన్యోన్యాశ్రయ దోషం పడుతోంది. కనుక మీ సిద్ధాంతాన్ని నమ్మడం ఎలా?

**వశిష్ఠుడు**: రాజా! చైతన్యం దేహాన్ని ఆశ్రయించి వుండటం అనేది జరిగే పని గాదు. చైతన్యం సృష్టికి పూర్వమే వున్న పదార్థం. దేహం సృష్టికి తరువాత వచ్చిన పదార్థం. పైగా అది భ్రాంతి జనితం. తరువాత పుట్టినది వెనకాలదానికి ఆధారం ఎలా అవుతుంది? భ్రాంతిమయపదార్థం సత్య పదార్థానికి ఆధారమెలా అవుతుంది? కనుక దేహాన్ని చైతన్యం ఆశ్రయించుకొని వుంటుంది అనే మాటే తప్పు. అందువల్ల నీ ప్రశ్న కుదరనే కుదరదు. ఐతే, లోకంలో దేహం వున్న చోటనే చైతన్యం వ్యక్తమవుతోంది కదా, ఇతరత్రా కావటం లేదు కదా, అంటావేమో! అంటే దానికి కారణం, ఇతరత్రా చైతన్యం లేకపోవటం కాదు. ఉన్న చైతన్యాన్ని గుర్తించే శక్తి నీలో లేకపోవటమే దానికి కారణం. నీ స్వప్న ప్రపంచం మొత్తం అంతా నీ చైతన్యానికి మారు రూపమైనా, దానిలో కొంత భాగాన్ని నువ్వు చైతన్యంగా గుర్తించక జడమని పిలుస్తున్నావు. నిజానికి నీ స్వప్న లోకంలో వున్న చైతన్యమూ నువ్వే, జడమూ నువ్వే! అలాగే ఈ లోకంలో వున్న దేహమూ చైతన్యమే ! శుద్ధ చైతన్యమూ చైతన్యమే! అవి రెండూ ఒక్కటే, గనుక, వాటికి అన్యోన్యాశ్రయ దోషం పట్టే ప్రసక్తే లేదు.

**ప్రజ్ఞప్తి**: జాగ్రద్దశలోని దేహం బ్రహ్మ స్వరూపమైతే, స్వప్నదశలోని దేహం కూడా బ్రహ్మ స్వరూపమే కావాలి. అది మీ సిద్ధాంతమైతే, ఈ జాగ్రద్దేహం స్వప్న ద్దేహం వంటిదే అని పోల్చి చెపుతున్నారు, ఎందుకని?

**వశిష్ఠుడు**: అది నీకు అర్థం కావడానికి చెప్పే మాట మాత్రమే! కనిపించే ఈ దేహం కనిపిస్తున్నా సరే అసత్యమనీ, అధిష్ఠాన స్వరూపంతో మాత్రం అది బ్రహ్మమాత్రమనీ నీకు అర్థమయ్యేటట్టు చెప్పాలంటే, దానికో ఉదాహరణ కావాలి. నీ స్వప్న దేహానికి ఆ లక్షణాలన్నీ పట్టాయి. నీ స్వప్న దేహం కనిపిస్తున్న సమయంలో గూడా అసత్యమే! అధిష్ఠాన రూపంతో ఆలోచిస్తే, అది నువ్వే! అందుచేత స్వప్నదేహానికీ జాగ్రద్దేహానికీ పోలిక వుంది. స్వప్నదేహంయొక్క అసలు స్వరూపం నువ్వైనట్లుగా, జాగ్రద్దేహంయొక్క అసలు స్వరూపం శుద్ధ బ్రహ్మే! అని వివరించడానికి ఈ ఉదాహరణ బాగుంది. అందుకోసం దానిని తీసుకున్నాం. అంతే గాని, స్వప్న దేహం వేరు, జాగ్రద్దేహం వేరు, అని చెప్పటం మా ఉద్దేశ్యం కాదు. ఉన్న సత్యస్థితి ఏమిటంటే, దృశ్యం ఏదైనా సరే, భ్రాంతివల్లే కనిపిస్తోంది. భ్రాంతివల్ల కనిపించేది సత్యం కాదు. కనుక జాగ్రత్తూ లేదూ, స్వప్నమూ లేదూ, సుషుప్తమూ లేదు, అన్నీ చిదాకాశంయొక్క రూపాంతరాలు మాత్రమే!

శుద్ధబ్రహ్మ శుద్ధబ్రహ్మగా తెలిస్తే, అది మోక్షం. అది తెలియకుండా బోతే, అది బంధం. ఇదే సిద్ధాంత సారం.

**ప్రజ్ఞప్తి**: బ్రహ్మర్షీ! నీ అనుగ్రహంవల్ల నా సందేహాలన్నీ తీరాయి.

## 77. వేరే లోకాలున్నాయా?

**వశిష్ఠుడు**: రామా! ఆ నాడు కుశద్వీపంలో ప్రజ్ఞప్తి మహారాజుకీ, నాకూ జరిగిన సంభాషణ అంతా నీకెందుకు చెప్పానంటే, బ్రహ్మ, బ్రహ్మాండాకారంగా ఎంత దూరం వుంటుంది, ఎంత కాలం వుంటుంది, అని కొలతలు అడిగావు. అలాంటి కొలతలేవీ కూటస్థమైన పరబ్రహ్మ విషయంలో అన్వయించవు – అని చెప్పటం కోసమే చెప్పాను.

**శ్రీరాముడు**: గురుదేవా! మీరు మద్య సముద్ర, ఆజ్య సముద్రాల మధ్య గల కుశద్వీపానికి స్వయంగా వెళ్లినట్లు

చెబుతున్నారు. ఆ మద్య సముద్రం  గానీ, నేతి సముద్రం గానీ, మాబోటివాళ్లెవరికీ కనిపించడం లేదు. ఇలాగే సిద్ధలోకాలనీ, సాధ్యలోకాలనీ, దేవలోకాలనీ, గ్రంథాలలో పేర్లు కనిపిస్తున్నాయి. ఆ లోకాలు గానీ, ఆ లోకవాసులు గానీ, ఎవరికి కనిపిస్తారు? ఎలా కనిపిస్తారు?

***వశిష్ఠుడు***: రామా! ఇటువంటి లోకాలు రెండు రకాలు – స్థిర లోకాలు, చర లోకాలు, అని. మహర్లోకం, జనోలోకం, తపోలోకం, సత్యలోకం, మొదలైనవి స్థిర లోకాలు. అవి మనకు కొంచెం ఎక్కువ దూరంలో వున్నాయి.

**"స యది పితృలోక కామో భవతి**
**సంకల్పాదేవాస్య పితరస్సముత్తిష్ఠన్తి**
**తేన పితృలోకేన సంపన్నో మహీయతే"**

(తా॥ సగుణ బ్రహ్మోపాసకుడు తనకు పితృలోకం కావాలని కోరుకుంటే, వాడి సంకల్పం చేతనే వాడి పితృదేవతలు లేచి వస్తారు. వాడికి పితృలోకం దొరుకుతుంది)–

ఇత్యాది వాక్యాలలో ఛాందోగ్యాది శ్రుతులు కొన్ని లోకాలను చెప్పాయి. వీటినే సంకల్ప లోకాలు అంటారు. ఇవి గాలి లాగా ఆయా జీవులు ఎక్కడెక్కడ వుంటారో అక్కడక్కడల్లా తిరుగుతూ వుంటాయి. అందుచేతనే వీటిని 'చర' లోకాలు అంటారు.

అవీ, ఇవీ గూడా ఎవరో ఒకరి సంకల్పంవల్ల పుట్టిన లోకాలే! యోగధారణ తీవ్రంగా చేసి, తీవ్రంగా సంకల్పిస్తే, వాడి సంకల్ప నగరాలు గట్టిపడి స్థిరత్వాన్ని పొందుతాయి. మీబోటి జీవులు ప్రతి రోజూ స్వప్నాల రూపంలో సంకల్ప నగరాలను సృష్టి చేస్తున్నారు గానీ, వాటిని ఘనీభవింప చేయలేక పోతున్నారు. ధారణాబలం వుంటే ఆ పనీ చేయవచ్చు.

అనేకమంది సంకల్పాలు స్థిరంగా కలవటంవల్ల సత్యలోకాది స్థిర లోకాలు ఏర్పడ్డాయి. ఇతర యోగుల వైయక్తిక సంకల్పాలవల్ల పుట్టిన సంకల్ప లోకాలు వాళ్ళ వెంటపడి తిరుగుతున్నాయి. అంతే భేదం!

మరో విశేషం గూడా వుంది. పుణ్యబలంచేత స్వర్గాది స్థిరలోకాలను పొందిన వారికి, అవి సులభ సాధ్యాలుగా వుంటాయి. మనం భూలోకంలో తిరిగినట్లుగా, వాళ్లు ఆ లోకాలలో చాలా కాలం యథేచ్ఛగా తిరగ గలుగుతారు. యోగధారణను చేసి స్వర్గాదిలోకాలలో ప్రవేశించేవారికి మాత్రం, అక్కడికి ప్రవేశమూ, అక్కడ నివాసమూ గూడా, కొంచెం కష్టసాధ్యంగా వుంటుంది. అందుచేతనే అలాంటి యోగులు త్వరగా వెనక్కి వచ్చేస్తూ వుంటారు.

యోగబలం వున్నవాడు, స్థిరలోకాలలోకైనా, చరలోకాల లోకైనా, యథేచ్ఛగా వెళ్లగలడు. అలాంటివాడు ఇతరుల స్వప్నలోకాల లోకి గూడా ప్రవేశించ గలడు. నువ్వు గూడా అలాంటి ధారణాభ్యాసం చేస్తే, ఏ లోకాన్నైనా చూడగలవు.

కానీ, అంత కష్టపడి ఆ పని చేసినందువల్ల వచ్చిన ప్రత్యేక ప్రయోజనం ఏమీ వుండదు. లోకం ఏదైనా అది సంకల్ప జనితమే! భ్రాంతిమయమే! నిజంగా వున్నది శుద్ధ పరబ్రహ్మ మాత్రమే! ఆ అనుభవం సంపాదించినవాడికి, ఇక ఏ లోకంతోనూ పని వుండదు.

రామా! నేను చెప్పిన ఈ మాటలు నీకు ఇతర మహర్షులు చెప్పిన మాటలతో విరోధిస్తున్నట్టు కనిపించవచ్చు. కొందరు అలాంటి లోకాలన్నీ భూలోకం లాగానే సత్యాలని చెప్పవచ్చు. కొందరు అవి అసలే లేవని అనవచ్చు.

**ఇత్థమస్తు యదివాన్యథాస్తు వా**
**మైవభూ ద్భవతు కోఽత్ర సంభ్రమః ।**

**ముంచ ఫల్గుని ఫలే ఫలగ్రహం**
**బుద్ధవానసి కృతం పరిశ్రమైః ॥** (ని.ఉ.స. 211, శ్లో.30)

(తా॥ అవి నేను చెప్పినట్లు కల్పనామాత్రాలు ఐతే కానీ, కాకపోతే కాకపోనీ. అవి వుంటే వుండనీ, లేకపోతే లేకపోనీ మనకెందుకు కంగారు? నువ్వు చాలా కృషి చేశావు. తెలియవలసిన బ్రహ్మతత్త్వం తెలిసింది. ఇక ఈ అల్పమైన యోగసిద్ధులమీద దృష్టి పెట్టబోకు. వాటిని వదిలేసెయ్యి.)

ఇంతకూ తేలిన పరమార్థం ఏమిటంటే, పరబ్రహ్మ ఒక్కటే వుంది. దానిమీద సమష్టి అహంకార స్వరూపుడైన హిరణ్యగర్భుడు, వాడిమీద జగత్తు, దానిమీద వ్యష్టి జీవులు, ఇలా కల్పన సాగిపోతూ వుంది. కనుక, ఈ మొత్తం అంతా గూడా బ్రహ్మయొక్క వివర్త స్వరూపమే! కానీ ఇది గూడా చివరి మాట గాదు. వివర్తమనేమాట గూడా కల్పనే! ఉన్నది శుద్ధ పరబ్రహ్మే! ఇదే వేదాంత సారం.

***శ్రీరాముడు***: ఈ కల్పన చేసేదెవరు? కల్పనకు వెనకాల వున్నది శుద్ధ బ్రహ్మమే కనుక, చేస్తే అదే ఈ కల్పనలన్నీ చేయాలి. అది ఎల్లప్పుడూ ఏక రూపంగా వుండే శుద్ధ పదార్థమైనప్పుడు, "కొంత సేపు మాత్రమే అహంకారాది కల్పన చేసుకుంటుంది, కొంత సేపు చేసుకోదు" అని చెప్పటం ఎలా?

***వశిష్ఠుడు***: నువ్వు చెప్పిందే నిజం! కానీ విషయాన్ని వివరించి చెప్పాలంటే, దృష్టిభేదాన్ని ఆశ్రయించి చెప్పవలసిందే, తప్పదు.

విద్యాదృష్టి, అవిద్యాదృష్టి, మిశ్రదృష్టి అని దృష్టులు మూడు అని చెప్పాకదా! అవిద్యాదృష్టి అంటే 'ప్రపంచం సత్యం' అనే దృష్టి. విద్యాదృష్టి అంటే, 'ప్రపంచం లేనే లేదనే' దృష్టి . మిశ్రదృష్టి అంటే, మొదట ఈ ప్రపంచం వుందని అంగీకరించి, అలా ఒప్పుకుంటే కొన్ని చిక్కులొస్తాయని గుర్తించి, తత్త్వ విచారణ చేసే దృష్టి. ఈ దృష్టితోనే ఉపదేశాలన్నీ సాగుతూ వుంటాయి. ఈ దృష్టులన్నీ తెలుసుకోవాలని కోరిక వున్న జీవుడికి సంబంధించినవే! శుద్ధబ్రహ్మకు, తను తానుగా ప్రకాశించటానికి గానీ, తను జగద్రూపంగా ప్రకాశించటానికి గానీ, ఈ దృష్టులయొక్క సహాయం అక్కర్లేదు.

నేను ఇందాక వివర్తం గూడా కల్పనే అని చెప్పింది, విద్యాదృష్టితో చెప్పినమాట. బ్రహ్మమీద కల్పనాపరంపర జరుగుతుందనే మాట మిశ్రదృష్టితో చెప్పిన మాటే. ఈ మాటను అర్థం చేసుకుంటే, గాలికీ కదలికకూ తేడా లేనట్లుగా, బ్రహ్మకూ జగత్తుకూ తేడా లేదని అర్థమౌతుంది. అప్పుడు నీ ప్రశ్నే పుట్టదు.

***శ్రీరాముడు***: బాగుంది గురుదేవా! కానీ మీరు ఇందాక కల్పనాపరంపరను ఇంకా చెప్పబోతుంటే, నేను మధ్యలో అడ్డం తగిలినట్లున్నాను. మీరు అనుకున్నది పూర్తి చేయండి?

***వశిష్ఠుడు***: కొత్త విషయమేమీ లేదు. మొదట అహంకారమూ, దానిమీద పంభూతాలూ, దానిమీద దేశకాలాలూ – ఇలా క్రమంగా కల్పన పెరిగి పోతుంది. దీనికి ఇదే వరుస అనే నియమం గూడా లేదు. కనుక బ్రహ్మమే తన మీద తనే జీవత్వాన్ని ఆరోపించుకొని, తద్వారా ఈ ప్రపంచాన్ని చూస్తోంది. మళ్ళీ తనే తత్త్వ జ్ఞానాన్ని పొంది, తనుగా మిగిలి పోతోంది. (స. 212)

## 78. శ్రీరాముడి పూర్వజన్మ

రామా!నువ్వు ఈ ప్రశ్నలు వేస్తుంటే నాకు పాతసంఘటన ఒకటి గుర్తుకొస్తోంది. నువ్వు నీ పూర్వ జన్మల్లో ఒక దాంట్లో నాకు శిష్యుడిగా వుండేవాడివి. అప్పుడు నువ్వు రాజకుమారుడివి గాదు. ఒక అరణ్యంలో నా దగ్గర వేదాధ్యయనం చేస్తూ వుండేవాడివి. అప్పుడు ఒక రోజున ఇలాంటి చెర్చే చేశావు. ఆ చర్చ ఇలా సాగింది–

**శిష్యుడు**: గురువుగరూ! మహా ప్రళయంలో నశించకుండా మిగిలి వుండే వస్తువు ఏది?

**వశిష్ఠుడు**: నాయనా! ఇది అర్థం కావడానికి నీ సుషుప్తిని తీసుకో. నీకు ముందొక స్వప్నం వచ్చింది. తరువాత సుషుప్తి వచ్చింది. అప్పుడు స్వప్న ప్రపంచంలో ఏమి మిగిలింది? అక్కడ వుండే దేశము, కాలము, దిక్కులు, చిత్తము, అహంకారము, చివరికి అక్కడ వుండే ఆకాశము, అన్నీ నశించి పోయాయి. ఎన్ని నశించినా వాటన్నిటికీ సాక్షిగా వున్న నువ్వు మాత్రం మిగిలే వుంటావు.

ప్రళయం దగ్గర కూడా సరిగ్గా ఇదే జరుగుతుంది.సాక్షి వైన నువ్వు ఒక్కడివే మిగులుతావు.మరేదీ మిగలదు. నువ్వు గూడా మిగల లేదు అనుకుంటే, ప్రళయం జరిగిందని చెప్పటానికి కూడా కుదరదు. కనుక సాక్షి వైన నువ్వు మిగలి వున్నావని ఒప్పుకోవాలి.

**శిష్టుడు**: గురువుగారూ!

**నాసతో విద్యతే భావః**

**నాభావో విద్యతే సతః ။**

(లేనిదానికి ఉనికి ఎప్పుడూ లేదు. ఉన్నదానికి లేమి ఎప్పటికీ రాదు) అని ఒక సుప్రసిద్ధ సూక్తి వుంది గదా! మరి ఇంత స్పష్టంగా అస్తిత్వాన్ని పొంది వున్న ఈ ప్రపంచం వున్నట్టుండి ఏమై పోతుంది? ఎక్కడికి పోతుంది?

**వశిష్ఠుడు**: నువ్వు చెప్పిన సూక్తి పూర్తిగా సత్యమే. కానీ, స్పష్టంగా వున్నట్టు కనిపించినా ఎండమావి నీరు వున్నట్టుండి ఎలా పోయింది? దానికి అసలు అస్తిత్వమే లేదు గనుక పోయింది. ఈ ప్రపంచం గూడా అలాగే పోతోంది. అక్కడికే పోతోంది.

**శిష్యుడు**: గురువుగారూ! మీరు చెప్పిన ఉదాహరణలో, సూర్య కిరణాలే నది వేషం వేసుకొని వచ్చాయి. మరి ఈ ప్రపంచం వేషం వేసుకొని వచ్చిన వారెవరు?

**వశిష్ఠుడు**: నాయనా! స్వచ్ఛమైన చిదాకాశమే ప్రపంచం అనే వేషంలో కనిపిస్తోంది.

నువ్వు ఒక్కడివే స్వచ్ఛమైన నీటి మడుగులోకి దిగావు. అప్పుడు నీళ్లలో నీ నీడ కనిపించింది. అంత మాత్రంచేత నువ్వు నిజంగా రెండు అయ్యావా? కాలేదు. ఒడ్డుమీదకి వస్తే నువ్వు ఒక్కడిగానే వుంటావు. అలాగే, శుద్ధపరబ్రహ్మ సృష్టి సమయంలో అనేక రూపాలతో కనిపించినా, ప్రళయంలో ఒక్కడిగానే మిగిలి వుంటాడు.

**శిష్యుడు**: గురువుగారూ! మీరు మొత్తం స్వప్న దృష్టాంతం మీద ఆధారపడి సమాధానాలు లాక్కొస్తున్నారు. నాకు సుషుప్తి వచ్చి, నా ప్రపంచం మునిగి పోయినప్పుడు, మిగిలిన వాళ్లకి ప్రపంచం మామూలుగానే కనిపిస్తోంది. అలాగే ప్రళయ సమయంలో గూడా కొంతమందికి ఈ ప్రపంచం కనిపిస్తుందంటారా?

**వశిష్ఠుడు**: ఈ ప్రపంచం అని చెప్పలేను గానీ, ప్రపంచం కనిపిస్తుంది. ఎందుకంటే, ఎవరి ప్రపంచం వారిదే గదా! ఐందవోపాఖ్యానంలో నేను ఈ విషయాన్ని బాగా వివరించాను.

శుద్ధపరమాత్మ మీద వివర్తరూపంగా సమస్తపదార్థాలూ కనిపిస్తున్నాయి. కనుక, ఈ కనిపించటం అంతా మనస్సులో కలిగే ఆలోచనయొక్క ఫలితమే! ఎవరి ఆలోచన ఎలా వుంటే, వారి సృష్టి అలా జరుగుతూ వుంటుంది. ఒక్కొక్కడూ తన ఆలోచన ప్రకారం ఈ సృష్టికి మూలమైన సృష్టికర్త వీడే అని ఒక సిద్ధాంతం చెప్పి, దానిని రక రకాలుగా సమర్థిస్తూ వుంటాడు. ఎవరి వాదమూ తప్పనడానికి వీలు లేదు. ఎందుకంటే –

**సర్వమేవ పదే తస్మిన్**

**సంభవత్యుత్తమోత్తమే ।**

**విధయః ప్రతిషేధాశ్చ**

**కే తే సంతి న సంతి కే॥** (ని.ఉ.స.213, శ్లో. 45)

(తా॥ ఆ మూలతత్త్వం సర్వోత్తం, దానిలో అన్నీ సంభవిస్తాయి. అక్కడ సంభవించని విధులేమున్నాయి?

నిషేధాలేమున్నాయి?)

ఎవరి దృష్టినిబట్టి వారికి అనుభవం కలుగుతూ వుంటుంది. కనుక వారి దృష్టి వరకూ అవి సత్యాలే! మిగిలినవారికి, అవి కుందేటి కొమ్ములు. కనుక నాయనా, సిద్ధాంతాల వెంట తిరగక, అసలైన మూల తత్త్వాన్ని పట్టుకో.

రామా! ఆ నాడు ఆ విధంగా నీకు ఉపదేశం చేశాను గానీ, నీకు జ్ఞానం కలుగ లేదు. ఇవాళ మళ్లీ ఈ జన్మనెత్తి, మళ్ళీ ఆ ప్రశ్నలే వేస్తున్నావు.

కానీ, ఇప్పుడు నా ఉపదేశం ఫలించింది. నీకు జీవన్ముక్తి లభించింది. ఇక ఆ నిర్వాణ స్థితిలో స్థిరంగా వుండిపోతూ, తృష్ణలను దాటిపోయి వుంటూ, నీ రాజ్యాన్ని ధర్మంగా పాలించు.

వశిష్ఠమహర్షి అలా అనేసరికి ఆకాశం నుంచి మరో సారి పుష్పవృష్టి కురిసింది. దేవ దుందుభులు మ్రోగాయి. సభాసదులు వశిష్ఠ మహర్షికి మరో సారి గురుపూజ చేశారు. దశరథుడూ, రాముడు, లక్ష్మణుడు, విశ్వామిత్రుడు, నారదుడు, మొదలైనవారంతా వశిష్ఠమహర్షిని పరిపరి విధాల స్తుతించారు.

**గమనిక**–ఇక్కడ శ్రీరాముడు మాట్లాడిన మాటలకూ, భగవద్గీత 18వ అధ్యాయం చివర్లో అర్జునుడు మాట్లాడిన మాటలకూ, విస్పష్టమైన పోలికలున్నాయి. రెండు చోట్లా శ్లోకాలు వేరుగా వున్నా
"నష్టో మోహః (అజ్ఞానం తొలగి పోయింది)
"స్థితోస్మి గత సందేహః" (సందేహాలు తీరిపోయాయి)
"కరిష్యే వచనం తవ" (నువ్వు చెప్పినట్లే చేస్తాను) (ని.ఉ.స.214, శ్లో.14,15) వంటి పదగుచ్ఛాలు రెండు చోట్లా సమానమే!

శ్రోతలందరూ ఆ విధంగా ఆనందం వ్యక్తం చేస్తూ వుండగా, వశ్శిమహర్షి దశరథుడివంక చూసి – "మహారాజా! వేదాంత ప్రవచనం జరిగిన తరువాత బ్రాహ్మణ పూజ చేయాలి. దానివల్ల సమస్త శుభాలు కలుగుతాయి. కనుక నువ్వు ఆ పని చేస్తే బాగుంటుంది" అని చెప్పాడు.

దసరథుడు సరే అని, రాజ్యంలో ఏడు రోజుల ఉత్సవం ప్రకటించి, బ్రాహ్మణులకే కాక , ఇతర వర్ణాలకూ, దీనులకూ , దళితులకూ కూడా సంతర్పణలూ, సత్కారాలూ, దానాలూ, యథోచితంగా నిర్వహించాడు.

## 79. గ్రంథోపసంహారం

**గమనిక** - ఇక్కడితో వాల్మీకి మహర్షి రచించ దలచుకున్న గ్రంథం పూర్తైంది. ఐతే గ్రంథ ప్రారంభంలో ఈ గ్రంథాన్ని ఎవరు ఎవరికి చెప్పారో సూచిస్తూ, గురు పరంపరా ప్రస్తావన రూపంగా, కొన్ని ప్రస్తావనలు చేసి వున్నారు. వాటిని మళ్లీ అనుసంధానం చేసి, దానితో పాటు గ్రంథ ప్రశంసను, గ్రంథ ప్రవచన విధినీ కూడా కొద్దిగా ప్రస్తావన చేసి, రెండు సర్గలలో ఈ గ్రంథాన్ని పూర్తిగా ముగించబోతున్నాడు. ఆ విధానాన్ని సంగ్రహంగా గమనిద్దాం!

**వాల్మీకి మహర్షి**: నాయనా! భరద్వాజా! శ్రీరామచంద్రుడికి జీవన్ముక్తిని కలిగించిన వశిష్ఠ బోధను నీకు పూర్తిగా వినిపించాను. నీకు కూడా జ్ఞానం కలిగింది. ఐతే, మళ్లీ భోగాసక్తిలో పడి ఈ జ్ఞానాన్ని చెడగొట్టుకోకు. దానిని కాపాడుకొనే బాధ్యత నీదే!

ఈ మహా గ్రంథాన్ని పారాయణ చేసినా, ప్రవచనం చేసినా, చేయించినా, ప్రతులు వ్రాయించి యోగ్యులకు ఇచ్చినా, స్వర్గఫలం లభిస్తుంది. ఈ పనులు నిష్కామంగా చేస్తే మోక్షం గూడా లభిస్తుంది.

పూర్వం మునిసభలో ఈ మోక్షసంహితను నేను వినిపించినప్పుడు బ్రహ్మదేవుడు స్వయంగా ఆలకించి "ఈ మహర్షి వాక్కులు అసత్యాలు కావు" అని స్వయంగా ప్రకటించాడు.

భరద్వాజా! ఆ సభలో విన్న తరువాతే, అగస్త్యమహర్షి ఈ గ్రంథాన్ని తన శిష్యుడైన సుతీక్ష్ణ మహర్షికి ఉపదేశించాడు.

మరొకప్పుడు అరిష్టనేమి అనే మహారాజు నిష్కాముడై చేసిన తపస్సుకు మెచ్చి, దేవేంద్రుడు అతనిని నా దగ్గరికి పంపించాడు. నేను అతనికి ఈ గ్రంథం ఉపదేశించాను. అతను జ్ఞాన సిద్ధుడైనాడు.

ఆ తరువాత అతను దీనిని ఒక అప్సరస స్త్రీకి ఉపదేశం చేశాడు. ఆమెకు కూడా జ్ఞాన సిద్ధి కలిగింది.

అగ్నివేశ్యుడు అనే గృహస్థుడు కర్మ జ్ఞానాలలో ఏది ప్రశస్తమనే సందేహంలో పడి కొట్టుమిట్టాడుతున్న తన కొడుకుకి ఈ గ్రంథాన్ని ఉపదేశించాడు. దానివల్ల అతని సందేహాలు పూర్తిగా తొలగి జ్ఞాన నిష్ఠను పొందాడు.

సుతీక్ష్ణాది శిష్యులు తమ గురువులకు సాష్టాంగ వందనాలు చేశారు.

**యత్సర్వం ఖల్విదం బ్రహ్మ**
**తజ్జలానితి చ స్ఫుటమ్ ।**
**శ్రుత్యా హ్యుదీర్యతే సామ్ని**
**తస్మై బ్రహ్మాత్మనే నమః ॥** (ని. ఉ. చివరి సర్గ చివరి శ్లోకం)

(తా॥ ఛాందోగ్యపనిషత్తులో "సర్వం ఖల్విదం బ్రహ్మ – తజ్జలానితి శాన్త ఉపాసీత" అని వుంది. అంటే, ఈ కనిపించే దృశ్యం అంతా పరబ్రహ్మమే! ఎందుకంటే ఇదంతా దాంట్లోంచే పుడుతోంది. దాంట్లోనే లయిస్తోంది. దానివల్లే జీవిస్తోంది. అందుచేత సాధకుడు ఆ బ్రహ్మను నేనే అని శాంతుడై ఉపాసన చెయ్యాలి – అని అర్థం. ఆ విధంగా స్పష్టంగా నిరూపింపబడుతున్న బ్రహ్మ స్వరూపమైన నాకు అనగా ప్రత్యక్ చైతన్యానంద ఘనుడనైన నాకు, నమస్కారమగు గాక!)

బ్రహ్మానందం పరమ సుఖదం కేవలం జ్ఞాన మూర్తిం
ద్వంద్వాతీతం గగన సదృశం తత్త్వమస్యాది లక్ష్యమ్ ।
ఏకం నిత్యం విమల మచలం సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణ రహితం శ్రీవశిష్ఠం నతాః స్మః ॥

**గమనిక**-ఈ శ్లోకం మూలంలో చివర వుంది. ఇది గురుస్తుతిగా లోకంలో ప్రసిద్ధమై వుంది. ఇక్కడ వశిష్ఠ స్తుతిగా వుంది. వ్యాఖ్యాత దీనికి వ్యాఖ్యానం చేయలేదు. ఐనా శ్లోకం గొప్పది కనుక, సర్వ గురువందనంగా ఈ శ్లోకాన్ని స్వీకరిస్తూ అర్థం గ్రహిద్దాం.

బ్రహ్మానంద స్వరూపుడూ, సర్వోత్తమ సుఖ ప్రదాత, శుద్ధ జ్ఞాన స్వరూపుడు, ద్వంద్వాలకు అతీతుడు, ఆకాశం లాగా ఏదీ అంటని వాడు, "తత్త్వమసి' మొదలైన మహావాక్యాలకు పరమలక్ష్యమైన అర్థం ఏదైతే వున్నదో అది అయినవాడూ, ఏక స్వరూపుడు, నిత్యుడు, శుద్ధుడు, సుస్థిరుడు, అందరి బుద్ధులకూ సాక్షి అయినవాడు, ఏ బుద్ధికీ అందని వాడు, త్రిగుణములు లేనివాడు, అయిన శ్రీవశిష్ఠమహర్షికి సాష్టాంగ వందనం చేస్తున్నాము.

## 80. నిర్వాణోత్తరార్ధ సింహావలోకనము

అసలీ నిర్వాణప్రకరణ ఉత్తరార్ధమే ఒక సింహావలోకనం వంటిది. నిజానికి ఉపదేశించవలసిన విషయం అంతా ఉపశమ ప్రకరణంతోనే పూర్తైపోయింది. ఆ మాటను ఆ ప్రకరణపు సింహావలోకనంలో ప్రస్తావించుకున్నాం గూడా.

ఐనా సరే, ప్రారంభంనుంచీ ఉపశమ ప్రకరణం వరకూ ఎంత గ్రంథం జరిగిందో, ఇంచుమించు అంత గ్రంథాన్ని (15 వేల శ్లోకాల్ని) నిర్వాణ ప్రకరణంగా మలిచాడు మహాకవి. దాన్ని మళ్లీ రెండు భాగాలు చేసి – పూర్వార్ధము, ఉత్తరార్ధము అన్నాడు.

నిజానికి పూర్వార్ధం చివర్లో ఫలశ్రుతి గూడా చెప్పేసి గ్రంథం పూర్తయి పోయిందన్న భావం చదువరికి కలిగించాడు. అసలు రామాయణంలో గూడా యుద్ధకాండ చివర్లో ఫలశ్రుతి చెప్పేసి, తరువాత మళ్ళీ ఉత్తరకాండ ఎత్తుకున్నట్లుగానే, ఇక్కడ గూడా ఫలశ్రుతి తరువాత మళ్ళీ ఉత్తరార్ధాన్ని రచించాడు.

ఆ పూర్వార్ధంలో పూర్వోక్తమైన పరబ్రహ్మ తత్త్వాన్నే స్వరూప లక్షణాదుల ద్వారా మళ్లీ గట్టిపరచి, సాధకులు జీవన్ముక్తి దాకా కొనసాగించవలసిన ప్రయాణ మార్గాలను విపులంగా వర్ణించాడు.

"ఐపోయింది, ముక్తి వచ్చేసింది. ఇంకేముంది చెప్పేందుకు"? – అనుకునేందుకు వీలు లేదు. సినిమాలలో పెళ్ళితో కథైపోతుంది. జీవితంలో మాత్రం అసలు కథ పెళ్ళితోనే ప్రారంభమవుతుంది. అలాగే, ఆధ్యాత్మిక సాధనలో ముక్తి మార్గం తెలిసినంత మాత్రంచేత గానీ, కొంత సేపు బ్రహ్మసమాధి అందటంతో గానీ, కథ ముగిసిపోదు. ఆ వ్యక్తి ఇంకా జీవించే వుంటాడు. వాడికి ఆకలి దప్పుల వంటి సమస్యలు వుండనే వుంటాయి. ఉపదేశించమని వెంటబడే శిష్యుల బెడద వుంటుంది. సమాధిస్థితిని దీర్ఘకాలం నిలువనీయని ప్రారబ్ధశేషం మిగిలి వుంటుంది.

ఇలాంటి సంకటాలలో సమాధిలోంచి బయటకు వచ్చిన జీవన్ముక్తుడు ఎలా వుంటాడు? ఎలా వుండాలి? ఆ మహాత్ముడు తన బ్రహ్మమయస్థితిని నిలబెట్టుకునే విధానాలేమిటి? ఇది తెలియకపోతే, బ్రహ్మవిద్యోపదేశం పూర్తయినట్టు కాదు.

దానికోసమే ఇంచుమించు 7వేల శ్లోకాల ఉత్తరార్ధాన్ని కేటాయించాడు మహర్షి. దీనికి పునాదిగానే పూర్వార్ధం చివరిలో వశిష్ఠ విశ్వామిత్రులిద్దరూ కలిసి, పనిగట్టుకొని, శ్రీరాముడి సమాధిని చెడగొట్టారని చెప్పాడు. శ్రీరాముడికి ఇంకా చాలా ప్రారబ్ధశేషం వుందని ఆ యిద్దరూ బాహాటంగా ప్రకటించారు. సమాధిలోంచి బైటికి వచ్చిన శ్రీరాముడు గూడా దాన్ని అంగీకరించి, వశిష్ఠుడి భావాన్ని ఆమోదించి, సభలో కూర్చొని వున్న ఇతర శ్రోతల లాభం కోసం, తత్త్వవిషయాల నెమరువేత మొదలు పెట్టాడు.

వశిష్ఠుడు ప్రణాళికాబద్ధుడైన ఉపాధ్యాయుడు. ఆయన ఆ నెమరువేతను యథేచ్ఛగా సాగనీయలేదు. పూర్వప్రతిపాదిత విషయాలనే, ఇప్పుడు జీవన్ముక్తుల దృష్టిలోంచి సమన్వయించి చూపటానికి, ఈ గోష్ఠిని ఆయన వాడుకున్నాడు.

తత్త్వ ప్రతిపాదన ప్రక్రియలు ప్రధానంగా నాలుగు –

(i) తన దగ్గరకు వచ్చిన యోగ్యుడైన శిష్యుడి అర్హతను గమనించి, వాడికి సరిపోయే రీతిగా విషయ ప్రతిపాదన చేయటం (సామాన్యంగా ఉపనిషత్తులది ఈ పద్ధతి)

(ii) తను బ్రహ్మానందానుభూతిలో తేలిపోతూ, ఆ ఆనందాన్ని పారవశ్యంతో వ్యక్తం చేయటం. (ఇది అవధూతగీత, అష్టావక్రగీత, వంటివాటి మార్గం)

(iii) ప్రతివాదుల దాడులకు తమ శిష్యులు పడిపోకండా నిలబెట్టుకుంటూ, వారికి విషయబోధ చేయటం.

(శ్రీశంకరభాష్యాదుల మార్గం ఇదే.)

(iv) ఎక్కువ పాండిత్యం లేనివారికి గూడా విషయావగాహన కలిగించాలనే తపనతో, సులభంగా విషయ ప్రతిపాదన చేయటం (శ్రీశంకరుల ప్రకరణ గ్రంథాదులది యీ త్రోవ.)

యోగవాశిష్ఠశైలిలో విశేషమేమిటంటే – అది ఈ నాలుగు ప్రక్రియలనూ సమాంతరంగా కొనసాగిస్తుంది. అందుకే, వాల్మీకి మహర్షి యీ ఉత్తరార్ధంలో జీవన్ముక్తుల దృక్కోణంనుంచీ విషయం మొత్తాన్ని తనే సింహావలోకనం చేయించాడు. ఈ సింహావలోకనాన్ని చేసింది సాక్షాత్తుగా శ్రీరామ వశిష్ఠయుగళి. అందుకే వాల్మీకి మహర్షి ఇక్కడి ప్రతిసర్గలోనూ పునరుక్తి చేశాడు; ప్రతిచోటా కొత్త మెరుపులు మెరిపించనూ మెరిపించాడు. ఇవన్నీ పునరుక్తులనుకొని వీటిని వదిలిపెట్టి ముందుకు పోయేవాడికి బూడిద గూడా దక్కదని గట్టిగా తిట్టాడు. (భస్మాప్యాప్నోతి నాధమః – ని.ఉ.సర్గ 163, శ్లో. 49)

ముమ్ముందుగా జీవన్ముక్తివల్ల సాధకుడి శరీరం రాలిపోదని మరో సారి, మరో ప్రక్రియలో, నిరూపించాడు.

ఆ తరువాత కర్మత్యాగంకన్నా సంసక్తిత్యాగం ముఖ్యమని బోధించాడు. దాన్నే తూష్ణీం భావమన్నాడు.

దీనికి ఇంద్రియ నిగ్రహం, అహంకారత్యాగం, చాలా ముఖ్యమని చెపుతూ, దానికి రుజువుగా విద్యాధరోపాఖ్యానమనే చిన్న కథ చెప్పి, దానిలో తనకు గౌవరవనీయుడైన భుశుండయోగి ప్రసక్తిని మరో సారి తెచ్చాడు.

ఐతే, ఈ ఇంద్రియ నిగ్రహాదులకు కేవలం పతనభయాదులు కారణం కారాదనీ, ప్రపంచంలో శుద్ధచైతన్యం తప్పితే మరోటి లేదనే సత్యదర్శనం ద్వారా దాన్ని సాధించాలనీ, వివరిస్తూ, దానికోసం లోక ప్రసిద్ధమైన జడచేతన విభాగాన్ని తుడిచిపెట్టేశాడు. దీన్ని మరింత గట్టిపరచేందుకోసం ఇంద్రోపాఖ్యానం (అణుగర్భంలో ప్రపంచం కథ) చెప్పాడు.

సర్వత్ర చైతన్యదర్శనం జరగాలంటే సాధకుడు జ్ఞాని కావాలి గానీ, జ్ఞానబంధువు కారాదన్నాడు. జ్ఞానికి ఉదాహరణగా మంకి అనే సద్బ్రాహ్మణుడి సాధన కథ చెప్పాడు. ఈ కథలోనే సంవేదన, భావన, వాసన, కలన, ఆవరణశక్తి, విక్షేపశక్తి, వంటి పారిభాషిక పదాలను వివరించాడు.

ఇలాంటి ఉపదేశాలను ఆత్మజ్ఞానసిద్ధులైన గురువులే చేయగలరనీ, కానీ ఆ గురువులు అప్పటికే వ్యవహారాతీత స్థితికి చేరారు కనుక, వారు భాగత్యాగలక్షణ అనే ప్రక్రియను ఆశ్రయించి, దాని ద్వారా శిష్యబోధ చేస్తారనీ, వారి బోధల ప్రకారం బంధమనేది అసత్యమే ఐనా, శిష్యుడు మాత్రం సాధన చేసి తీరాలనీ, అనేక యుక్తులతో నిరూపించాడు. ఇక్కడే ఉపశమ ప్రకరణంలోని "రూపాలోక మనస్కారా"లనే స్వీయ సాంకేతిక పదాలను మరో సారి తవ్వుకొచ్చాడు.

ఈ సందర్భాన్నే ఆసరాగా తీసుకొని, తత్త్వజ్ఞాన ప్రాప్తికి గురువు అవసరమే గాని, ముక్తి అనేది గురువులు ప్రసాదిస్తే వచ్చేది కాదని నొక్కి చెప్పాడు. కనుక, శిష్యుడైనవాడు మామూలు కామ్యదేవతారాధనలు మాని, అహంగ్రహోపాసన ప్రక్రియలో, తత్త్వమననాన్ని జోడించి, వైరాగ్యాన్ని పెంచుకొని, ముక్తికోసం ప్రయత్నించాలన్నాడు.

ఈ ఘట్టంలోనే ధ్యాన ప్రక్రియలను, యోగభూమికలను, చివరికి సమాధిస్థితిని, ఒకింత విపులంగా వివరించాడు.

చాలా మంది సాధకులు ఈ ఘట్టంలోనే పెడదోవ పడుతూ వుంటారు గనుక, ఇక్కడ వైరాగ్యపు వెర్రితలల గురించి ప్రత్యేక వివరణ చేశాడు.

ఇక్కడే వాసనల బలాన్నిబట్టి జీవులలో ఏడు రకాలున్నారన్నాడు. ఈ వివరణ సందర్భంలోనే ఈ ఉత్తరార్ధానికి కీలకమైన ప్రశ్న వచ్చింది –"ఈ జగత్తు మిథ్యా? బ్రహ్మస్వరూపమా?"– అని. దీన్ని పరిష్కరించటం

కోసమే జగత్తు విషయంలో వుండే దృష్టిభేదాలను వివరిస్తూ – సాధకుడి దృష్టిలో జగత్తు మిథ్య అనీ, సిద్ధుడి దృష్టిలో అది బ్రహ్మస్వరూపమనీ, పరిష్కారం చేశాడు. దీనికి మద్దత్తుగా, జడచేతన విభాగం లేనే లేదనీ, సర్వమూ చైతన్యమయమేననీ, యుక్తి పరంపరతో నిరూపించాడు.

ఇదే విషయాన్ని కథా రూపంగా ప్రతిపాదించటం కోసం పాషాణోపాఖ్యానమనే చిన్ని కథను వశిష్ఠుడు తన స్వానుభవంలోంచీ తెచ్చి చెప్పటం మొదలుపెట్టాడు. దీనికి కొనసాగింపుగానే, విద్యాధరీచరిత్రను జత చేశాడు. రాతి కడుపులో దాగివున్న ఆమె బ్రహ్మాండానికి కలిగిన ప్రళయాన్ని ఆసరాగా తీసుకొని – తత్త్వజ్ఞుల దృష్టితో వైజ్ఞానిక ప్రళయాన్నీ, యోగజ్ఞుల దృష్టితో ప్రాకృతిక ప్రళయాన్నీ, విపులంగా వర్ణించాడు. ఈ వర్ణనను తత్త్వచర్చాత్మకంగా నడిపి, కథలో నాస్తికవాద ఖండనకు గూడా చోటు కల్పించాడు.

ఇక్కడే ఒక కొత్త మెరుపు మెరిపిస్తూ, సృష్టి ప్రళయాలు జోడెడ్ల వంటివనీ, అవి ఏకకాలంలో సమాంతరంగా సాగిపోతూ వుంటాయనీ, బోధించాడు. అంతే కాదు, తంత్రశాస్త్రాలలో చెప్పే కాళరాత్రి, భైరవుడు, భైరవి, మొదలైన దేవతామూర్తులకు తత్త్వవిద్యతో సమన్వయం చేసి చూపించాడు. దానికి "శివస్పర్శ" అనే పేరుతో ఒక బంగారపు మెరుగిచ్చాడు.

ఇది గాక, "సృష్టిలో ప్రతి చోటా ప్రపంచమే" అనే వింత ప్రతిపాదన చేసి, ఒకానొక ప్రపంచంలో రావణాసురుడి చేతిలో రాముడే ఓడిపోయాడన్నాడు. నువ్వూ నేనూ (రామవశిష్ఠులు) ఎన్నో సార్లు పుట్టామన్నాడు. తత్త్వదృష్టిలో అసలెవరూ పుట్టలేదన్నాడు.

దీన్ని నిరూపించేందుకోసం, పూర్వం ప్రళయ క్రమాలను చెప్పినట్లుగా, ఇప్పుడు తత్త్వదృష్టితోనూ, యోగదృష్టితోనూ, సృష్టిక్రమాలను వర్ణించాడు.

ఇంత సాంకేతిక చర్చ జరిగినాక, మళ్లీ పాషాణోపాఖ్యానంలోని విద్యాధరీ చరిత్రతో లంకె కలుపుతూ, తనకు అప్పటి స్థూలదేహం రాలిపోయిందనీ, ఇప్పటికీ తనకు స్థూలదేహం లేనే లేదనీ, ఆ యా శిష్యజీవుల కర్మశేషాలనుబట్టి వాళ్ళకు తను కనిపిస్తున్నాననీ, ప్రకటించాడు.

కాగా, ఈ పాషాణోపాఖ్యానంవల్ల చైతన్యం ఒక్కటే వుందనీ, సృష్టి ప్రళయాలు అజ్ఞాన కల్పితాలనీ, తేలింది. ఐతే ఈ అజ్ఞానం (అవిద్య)యొక్క స్వరూపమేమిటి– అనేది తెలియాలి. దీని ప్రసక్తి పూర్వం ఉపశమ ప్రకరణంలో గాధి చరిత్ర దగ్గరే వచ్చింది. అంతకంటే విస్పష్టంగా దాన్ని తేల్చటం కోసమే పాషాణోపాఖ్యానం తరువాత దీర్ఘమైన విపశ్చిదుపాఖ్యానం వచ్చింది.

ఇందులో కథలో కథగా తొమ్మిది కథలు పెనవేసుకుపోయి వున్నాయి.

(i) విపశ్చిత్ అనే రాజు అగ్నిదేవుడి వరంవల్ల నలుగురు విపశ్చిత్తులుగా మారి, నాలుగు దిక్కులకూ వెళ్ళి, అవిద్య అంతు చూద్దామని ఆరాటపడ్డ కథ ఒకటి,

(ii) వాళ్ళలో ఒకడు లేడిజన్మెత్తి శ్రీరామ సభలో మనిషిగా మారి, తన పాత అనుభవాలు కొన్ని నెమరువేసుకున్న కథ ఒకటి,

(iii) ఒక రాక్షసుడు ఒక మహర్షి శాపానికి గురై, ఆకాశమంత శవమై, నేలకు రాలి పడ్డ శవోపాఖ్యానం ఒకటి ,

(iv) ఆ శవంలోని జీవుడే దోమై, జింకై, బోయవాడై, ఒక అడవిలో ఒక మహర్షి శిష్యరికం చేసి, యోగాభ్యాసం చేసిన కథ ఒకటి,

(v) దీనిలో అంతర్భాగంగా ఆయా నాడుల్లో సంచరించే జీవుల అనుభవాలను వివరించటం ద్వారా జాగ్రత్స్వప్న సుషుప్తుల మిథ్యత్వాన్నీ, విరాట్పురుష తత్త్వాన్నీ, ప్రపంచ మిథ్యాత్వాన్నీ, ప్రతిపాదించే యోగచర్యల కథ ఒకటి,

(v) బోయవాడి గురువుగారి భవిష్యత్కథ ఒకటి,

(vi) బోయవాడు లీలోపాఖ్యానంలోని సింధురాజుగా పుట్టబోయే భవిష్యత్కథ ఒకటి,

(vii) విపశ్చిద్రాజుకు లేడి జన్మ రావటానకి వెనుక గల కథ ఒకటి,

(ix) అవిద్య అనేది అసలు లేనే లేదని, అది బ్రహ్మమేననీ, వివరించే వశిష్ఠుడి యుక్తి పరంపరల కథ ఒకటి–

ఈ తొమ్మిది కథల జమిలి కథే ఈ ఉత్తరార్ధానికి కేంద్రబిందువు. అందుకే దీనికి వెనకాలా ముందూ గూడా సాధన చర్చలే జరిగాయి. ముగింపులో వశిష్ఠమహర్షి ఇంద్రియ జయోపాయాలను బోధిస్తూ, జాగ్రత్స్వప్న సుషుప్తులనే అవస్థలు పరస్పర సంకరాలన్నాడు.

దీని తరువాత, ఈ ఉత్తరార్ధంలోని రెండో పెద్దకథ – కుందదంతోపాఖ్యానం – వచ్చింది. నిజానికి ఇది దేశకాలాల అసత్త్వాన్ని నిరూపించటం కోసం ఇది వరలో వచ్చిన, లీలోపాఖ్యాన, లవణోపాఖ్యాన, ఐందవోపాఖ్యాన, చూడాలోపాఖ్యానాలలోని కొన్ని కొన్ని ఘట్టాలను పూలుగా తీసుకొని, కొత్తగా అల్లిన పూలమాలే. ఐనా సరే, కథాకధన నైపుణివల్ల, చర్చలలో కొత్త అంశాల మేళవింపువల్ల , ఇది నిండు కొత్త కథగా కనిపించటం మాత్రమే గాక, ఈ యోగవాశిష్ఠ శ్రవణంవల్ల పరిపూర్ణ జ్ఞానం కలుగుతుందని నిరూపించేందుకు మంచి ఉదాహరణగా నిలిచింది.

ఇక వశిష్ఠమహర్షి చేయదలచుకొన్న బోధ చివరికి వస్తోంది. అందుకనే ఆయన 186వ సర్గనుంచీ 189వ సర్గ దాకా తన సిద్ధాంతాన్ని పునరుద్ఘాటించి, 190వ సర్గలలో అనేక నిర్వచనాలు, పరిష్కారాలు, చేసి చూపించాడు. 195వ సర్గలో తనే ప్రశ్నలు వేసి, శ్రీరాముడిచేత సమాధనాలు చెప్పించి, శిష్య పరీక్ష చేసి చూపించాడు.

ఇక్కడే శాస్త్రవాదాల అల్పత్వాన్ని ఎత్తిచూపుతూ, శాస్త్రాలద్వారా జ్ఞానం లభించటమనేది అడవిలో కట్టెలు కొట్టుకునే వారికి చింతామణి దొరకటం వంటిదన్నాడు.

దీని తరువాత గురుపూజా ఘట్టంలో అపార వినయాన్ని ప్రదర్శించిన వశిష్ఠమహర్షి, శ్రీరాముడిమీద పుష్పవృష్టి కురుస్తున్న సమయంలో “ఇప్పుడు నీకెలావుంది”? అని అడిగి, తత్త్వవిద్యకు ఒక కొత్త మెరుగు తెచ్చాడు.

ఐతే, వాల్మీకి శైలిలో విచిత్రమేమిటంటే, ఇంత కథా పూర్తయినాక, 204 వ సర్గనుంచి 213వ సర్గదాకా, 10 సర్గల పాటు మళ్ళీ వశిష్ఠ శ్రీరాముల ప్రశ్న ప్రతివచనాలను నడిపాడు. అందులో ప్రజ్ఞప్తిరాజు కథ అనే కథ కాని కథనే గాక, శ్రీరాముడికీ విష్ణుమూర్తికీ మధ్య మరో జన్మను, దానిలో ఆ జీవి వశిష్ఠుడికి శిష్యుడై తత్త్వ చర్చ చేయటాన్నీ, గూడా చెప్పించాడు.

ఆ తరువాత, మొత్తం గ్రంథాన్ని వెనుక వైరాగ్య ప్రకరణ ప్రారంభంలో ఎవరెవరి పేర్లను ప్రస్తావించాడో, ఆ వాల్మీకి , భరద్వాజ, అగస్త్య, సుతీక్ష్ణ, అరిష్టనేమి, అగ్నివేశ్య, కారుణ్యాదులతో అనుసంధానం చేసి, చిట్టచివరకి పరబ్రహ్మ నమస్కారంతో గ్రంథ పరిసమాప్తి చేశాడు.

## 81. మహాసింహావలోకనము

ఈ విధంగా నిర్వాణప్రకరణపు ఉత్తరార్ధాన్ని సింహావలోకనం చేయటం ద్వారా, ఈ ప్రకరణంలో కథల కన్నా చర్చలకే ప్రాధాన్యం ఇవ్వబడిందని తేలుతోంది. ఈ చర్చా నదీప్రవాహపు ఒంపు సొంపులను గమనించటంవల్ల, ఇతర ప్రకరణలకన్నా యీ ప్రకరణం మరింత ఉత్తమాధికారులకోసం ఉద్దేశింపబడినదని

గూడా తేలుతోంది. ఐనప్పటికీ, వాల్మీకి మహర్షి అసలీ గ్రంథాన్ని మధ్యమాధికారులు ఉత్తమాధికారులుగా మారేందుకోసం రూపొందించాడు గనుక, మొత్తం గ్రంథంలోని ప్రకరణాలలో తత్త్వగంగా ప్రవాహం సాగిన తీరు తెన్నులను రేఖామాత్రంగా ప్రస్తావించుకుందాం.

(i) ఈ గ్రంథం **వైరాగ్యప్రకరణంతో** ప్రారంభమైంది. దీనిలో శ్రీరాముడికి కలిగిన సహజవైరాగ్యం వర్ణింపబడింది. ఇక్కడ వైరాగ్యమనే అంశాన్ని

(అ) నిత్యానిత్యవస్తు వివేకము(ఆ) ఇహాముత్ర ఫలభోగ విరాగము (ఇ) తితిక్ష (ఈ) ముముక్షత్వము– అనే నాలుగు అంశాలకు (సాధన చతుష్టయ సంపత్తికి) ప్రతీకగా ప్రతిపాదించటం జరిగింది.

(ii) దీని తరువాత **ముముక్షు వ్యవహార** ప్రకరణం.

ఒకడికి తీవ్రమోక్షేచ్ఛ కలిగింది. అలాంటివాడు ఎలా జీవించాలి? ఎలా వ్యవహరించాలి? ఎలా సాధన మొదలుపెట్టాలి? ఎలా కొనసాగించాలి? ఇలాంటి విషయాలను సామాన్యంగా ఏ వేదాంత గ్రంథమూ పట్టించుకోదు. ఇక్కడ వాల్మీకి మహర్షి మాత్రం దీనికోసం ఒక పెద్ద ప్రకరణమే కేటాయించాడు.

దీనిలో మొదట విశ్వామిత్రుడే శ్రీరాముడికి విషయ ప్రబోధ చేద్దామని మొదలుపెట్టి, శుకయోగీంద్రుణ్ణి ఉత్తమ సాధనకు ఉదాహరణగా తీసుకున్నాడు. అతనికి తండ్రి చేసిన తత్త్వబోధ, దానిమీద శుకుడికి విశ్వాసం కలగకపోవటం, తరువాత జనకుడు చేసిన బోధ, అనే అంశాలతో కథ మొదలు పెట్టడు. కానీ విశ్వామిత్ర మహర్షికి బోధించటం అలవాటు లేక, ఈ పని నావల్ల కాదులే అనుకొని, ఆ పనిని వశిష్ఠ మహర్షికే అప్పచెప్పాడు.

వశిష్ఠమహర్షి ఆరి తేరిన ఉపాధ్యాయుడు. ఆయన ఒక ప్రణాళిక వేసుకొని, తన ప్రవచనం ప్రారంభించాడు.

ఆయన విధిని తిరస్కరించి, పురుషకారానికి పెద్దపీట వేసి, జ్ఞాన– ఇచ్ఛా– క్రియలకు స్పందత్రయమని పేరుపెట్టి, సాధన చేసి తీరాలని నొక్కి చెప్పి, ముముక్షువుల కర్తవ్యాన్ని విస్పష్టంగా నిర్దేశించి, వేదాంత విద్యావతరణంతో ఈ ప్రకరణాన్ని ముగించాడు.

(iii) మూడవది **ఉత్పత్తి ప్రకరణం** వశిష్ఠుడి ప్రబోధ ప్రణాళిక తైత్తిరీయోపనిషత్తులోని

“యతో వా ఇమాని భూతాని జాయన్తే
యేన జాతాని జీవన్తి
యత్ప్రయన్త్యభిసంవిశన్తి....
తద్బ్రహ్మ”

(ఈ దృశ్యప్రపంచం అంతా ఎక్కడినుంచీ ఉత్పన్నమవుతోందో, దేని మీద ఆధారపడి జీవిస్తోందో, చివరికి దేనిలోకి ప్రవేశించి లయిస్తోందో– అదే పరబ్రహ్మ)– అనే వాక్యం మీద ఆధారపడబోతోంది.

అంటే – జగత్తుయొక్క ఉత్పత్తి , స్థితి, లయల పరిశీలనమీద ఆధారపడి నడవబోతోంది. ఆ ఉపనిషత్తులో ఈ వాక్యంయొక్క తాత్పర్యం ఎక్కడికి పోతోందంటే– అసలు ఉత్పత్తి , స్థితి, లయలనేవే లేవు – అని చెప్పటం దగ్గరకు పోతోంది. దానికి అనుగుణంగానే, ఈ జగత్తుకు ఉత్పత్తి లేదు – అని నిరూపించటం కోసమే వశిష్ఠమహర్షి ఉత్పత్తి ప్రకరణాన్ని ప్రారంభించాడు.

ఈ ప్రకరణంలో కథలు కొంచెం ఎక్కువ. ముందుగా లీలోపాఖ్యానంలో – ఒక అడవిలోని పూరిగుడిసెలోనే ఒక మహాసామ్రాజ్యం ఇమిడివుందని; ఆ రాజ్యంలోని ఒక గదిలో మరో బ్రహ్మాండ గోళమే ఇమిడివుందని, 8 రోజుల్లోనే 80 సంవత్సరాలు ఇమిడి వున్నాయనీ, మనం మామూలుగా అనుకుంటున్నట్లుగా జన్మ పరంపరలన్నీ కాలక్రమ రీతిలో సాగవలసిన పని లేదనీ, వింత వింత నిరూపణలు చేశాడు. దీనివల్ల

దేశకాలాలు రెండూ అసత్యాలేనని నిరూపించాడు. దీనిలో ప్రస్తావించిన సింధురాజు కథను మళ్ళీ నిర్వాణప్రకరణ ఉత్తరార్ధంలో కొనసాగించాడు.

ఆ తరువాత పవిత్రమైన విషూచికా రాక్షసీ చరిత్రలో – జన్మ నాశాలు రెండూ భావనవల్లే కలుగుతాయని తేల్చాడు. ఇక ఐందవోపాఖ్యానంలో, సంకల్ప తీవ్రత కొత్త కొత్త బ్రహ్మాండాలనే సృష్టి చేయగలదన్నాడు. ఈ కథను తరువాతి గ్రంథంలో చాలా సార్లు ఉదహరించాడు.

ఆ తరువాత లవణోపాఖ్యానంలో ప్రపంచోత్పత్తి అంతా మనస్సుచేసే గారడీ మాత్రమే అనీ, ఈ ప్రపంచం అంతా పరబ్రహ్మకు వివర్త రూపంగా ఏర్పడిందేననీ, నిష్కర్ష చేశాడు. ఈ మధ్యలోనే సాధన విధానాలను, అజ్ఞాన భూమికలను, జ్ఞాన భూమికలను గూడా వివరించాడు. ఈ సప్త జ్ఞాన భూమికల ప్రస్తావన ఉత్తర గ్రంథంలో గూడా చాలా చోట్ల వచ్చింది.

ఆ విధంగా జగత్తుకు ఉత్పత్తే లేదని నిరూపించినాక, వశిష్ఠమహర్షి స్థితిప్రకరణంలోకి వెళ్ళాడు.

(iv) ఈ **స్థితిప్రకరణం** శుక్రకుమారుడి కథతో ప్రారంభమవుతుంది. ఇది ఉత్పత్తి ఎక్కడ జరిగిందో తెలియని శుక్ర కుమారుడి జన్మ పరంపరను చూపిస్తుంది.

ఆ తరువాత దామవ్యాలకటోపాఖ్యానంలో శంబరుడనేవాడి అస్తిత్వంమీద ఆధారపడ్డ అస్తిత్వం గల దామ వ్యాల కటుల జన్మ పరంపరను చెప్పాడు.

ఇక కదంబ దాశూరిడి కథలో స్థితికి వీలే లేని వృక్షాగ్రంలో స్థితి యేర్పరచుకున్న దాశూరముని కథ చెప్పాడు.

ఈ విధంగా ఉత్పత్తి లేని స్థితికి వుండే అస్తిత్వం భ్రాంతిజన్యమే అని నిరూపించి, ఇక కచ కుమారుడి బ్రహ్మవిద్యా సాధనతో సాధనోపాయాల ప్రసక్తి తెచ్చి, మహర్షి ఈ ప్రకరణాన్ని ముగించాడు.

(v) ఇక 5వదైన **ఉపశమ ప్రకరణం** వచ్చే సరికి మహర్షి తన దారి మార్చేశాడు. మనస్సు అనేది నిలిచి వున్నంత కాలమూ ప్రపంచానికి నాశం లేదు కనుక, మనస్సు యొక్క ఉపశమమే ప్రపంచానికి ఉపశమమన్నాడు. చిత్త ప్రశమన విధానాలు రక రకాలుగా వుంటాయనటం కోసం , జనకుడి సిద్ధగీత కథ, బలిచక్రవర్తి తత్త్వ చింతన కథ, ప్రహ్లాదుడి తత్త్వదర్శన కథ చెప్పాడు.

ఆ తరువాత గాధిమహర్షి కథలో వింత వింత మెలికలు పెట్టి, మాయా తత్త్వ వివరణకు శ్రీకారం చుట్టాడు. నిర్వాణప్రకరణపు ఉత్తరార్ధంలో విపశ్చిదుపాఖ్యానంలో ఈ మాయా వివరణకు నిండు రూపం ఇవ్వబోతూ, ఇక్కడ కథారూపంలో మాయ నిర్వచనాలకు అందదని తేల్చాడు. మాయా స్వరూపమేమిటని గింజుకునే దానికన్నా, దాన్ని దాటటమెలాగో ఆలోచించుకోవటం మంచిదని సలహా ఇచ్చాడు.

ఈ మాయ అనే వ్యాధికి తపస్సే ఔషధమంటూ ఉద్దాలకుడు, వీతహవ్యుడు, మొదలైనవారి కథల ద్వారా సాధనోపాయాలను విజృంభించి వివరించాడు. కాగా, ప్రకరణాలు ముందుకు సాగుతున్నగొద్దీ సాధన విధానాల వివరణ పెరగటం ఈ ప్రకరణం చివరిభాగాల్లో విస్పష్టంగా కనిపిస్తుంది.

(vi) ఇక చివరిది, 6వది, **నిర్వాణప్రకరణం.** దీన్నే మహర్షి రెండు భాగాలు చేసి పూర్వార్ధాన్ని సాధకదృష్టితో తత్త్వ పునశ్చరణకూ, ఉత్తరార్ధాన్ని సిద్ధదృష్టితో తత్త్వరోమంథానికీ (నెమరువేతకూ), కేటాయించాడు.

**పూర్వార్ధంలో** అవిద్యను దాటటానికి యోగ జ్ఞానాలు రెండూ తగిన మార్గాలేనంటూ, రెండు మార్గాలనూ వివరించాడు. యోగమార్గానికి ప్రతీకగా భుశుండోపాఖ్యానాన్నీ, యోగజ్ఞానాల సమన్వయమైన భక్తి మార్గంగా శివమానస పూజా విధానాన్నీ, జ్ఞానమార్గానికి ప్రతినిధిగా భవిష్యత్తులో జరగబోయే భగవద్గీతోపదేశాన్నీ, స్వీకరించాడు.

ఆ తరువాత శతరుద్రీయోపాఖ్యానంలో జీవులు ఒక భ్రాంతిలోంచి మరో భ్రాంతిలోకి ప్రయాణం చేస్తూనే వుంటారన్నాడు. చూడాలోపాఖ్యానంలోనూ, భగీరథోపాఖ్యానంలోనూ, యథాప్రాప్త కారిత్వాన్ని సోదాహరణంగా ప్రతిపాదించాడు.

ఆ తరువాత శ్రీరాముడివంటి ఉత్తమాధికారికి వశిష్ఠుడు చేసిన ఈ మహోపదేశాన్ని తన శిష్యుడైన భరద్వాజుడి వంటి సామాన్యుడికి సమన్వయించేందు కోసం, ప్రవిలాపన ప్రక్రియలను వాల్మీకి మహర్షే స్వయంగా ఉపదేశించాడు.

ఆ తరువాత శ్రీరాముడు కేవల జ్ఞానబలంతోనే సమాధిలోకి వెళ్ళిపోవటం, విశ్వామిత్రమహర్షి ప్రార్థన మేరకు వశిష్ఠ మహర్షి శ్రీరాముడ్ణి సమాధిలోంచి బయటకు తీసుకురావటం, అనే సంఘటనలతో యీ పూర్వార్ధం పూర్తయింది.

ఇక **ఉత్తరార్ధం** అంతా సిద్ధపురుష దృష్టితో పరతత్వాన్ని పునర్మననం చేసుకోవటంకోసం కొనసాగింది. ఆ వివరాలను ఇప్పుడే చెప్పుకున్నాం గదా!

ఈ విధంగా 32వేల శ్లోకాలలో విస్తృతంగా సాగిన వశిష్ఠబోధ అంతా పక్కా ప్రణాళికతో, క్రమబద్ధమైన నిర్మాణంతో, ఉద్దిష్ట ప్రయోజనాలకోసం సంకల్ప పూర్వకంగా చేసిన పునరుక్తులతో, మొహమాటం లేని ప్రశ్నలతో, తిరుగులేని సమాధానాలతో, సాధన విధానాలమీద ప్రత్యేక శ్రద్ధలతో, ఒక వేదాంత విద్యా సర్వస్వంగా సాగింది.

ఈ గ్రంథాన్ని ఒక్కదాన్నీ సాధనంగా పెట్టుకొని మళ్లీ మళ్ళీ మననం చేస్తే చాలు, ఇంతకన్నా వేరే సాధనలక్కరలేదని ఈ గ్రంథ సందర్భంలోనే అక్కడక్కడ మహర్షి స్వయంగా చేసిన ప్రతిజ్ఞలు మామూలు మాటలు కావు. ఈ గ్రంథాన్ని భక్తితో పఠించేవారికి తానే స్వయంగా గరువుగా నిలుస్తాననీ, అజ్ఞాతంగా మార్గదర్శనం చేస్తాననీ, వారిని తరింపచేసే బాధ్యత తనదేనీ, ఆయన కరుణతో మనకందరికీ ఇచ్చే సత్యవాగ్దానాలవి.

ఈ రహస్యాన్ని గుర్తించి , తత్త్వ తత్పరులమై, ఈ గ్రంథాన్ని నిత్యానుసంధానంలో పెట్టుకోవటం ఇక మన బాధ్యత.

**శ్రీరాముండు వశిష్ఠుడు**
**ధీరుడు వాల్మీకి కవియు తేజోమయులై**
**తీరుగ మన మతి తీరుల**
**తీరిచి తత్త్వార్థసిద్ధి దీప్రతనిడుతన్**

ఓం తత్సత్